..సనముల చూచిన నిట్టి పేరు కలవా
..తెలియును.

**అంఫిపొలి** (Amphipolis = ఇఱుకుపురము). మాసిదోనియలో ఫిలిప్పియికి నైఋతి దిక్కున 33 మైళ్ల దూరముననుండు ఒక పట్టణము. రోమాకుఁ బోయెడి పెద్ద రాచబాట దీని మీఁదుగాఁ బోవుటచే పౌలు తన రెండవ ప్రయాణమున ఈ పట్టణము మీఁదుగా వెళ్లెను (కార్య 17[1]) గాని, యచ్చట పనిఁజేసినట్లు సూచనలును లేవు. (పటము. V, F 2).

**అంబులపొది** ఆయుధములు I,6 చూ॥

**అకయ** (Achaia). ఈ పేరు థెస్సలి యను మండలమునకు తప్ప ప్రసుతము గ్రీసు అనఁబడిన రాజ్యమంతటికి నుపయోగింపఁ బడెను. పౌలు కాలమున అకయ ప్రదేశము రోమా రాజ్యమందుండిన యొక ప్రాంత్యమై యుండెను. గల్లియో యను ప్రసిద్ధి కెక్కిన దేశాధిపతి రోమా మహాసభ పరముగా ఆభూభాగము నేలుచుండెను. పౌలు ఆ ప్రాంతమందుండిన ఏథెన్సు, కొరింథు, కెంక్రియ యను పట్టణములను దర్శించి కొరింథులో సంఘమును స్థాపించి ఒక సమయమున పద్దెనిమిది నెలలును, మరియొక సమయమున మూఁడు నెలలును అందులో కాపురము చేసెను (రోమా 15[26] II కొరి 1[1] I థెస్స 1[7,8]). M.

**అకాను** (Akan = మెలి!). శేయీరు వంశస్థుఁడు. ఏసెరు కుమారుఁడు (ఆది 36[27]). ఈ పేరునకు ముందు ఉపసర్గమునుంచుటవలన వేఱుపేరు లేర్పడినవి. అవేవనిన,

**1. యహకాను**. ఏసెరు కుమారుఁడు (I దిన 1[42]).

**2. యహకానీయుల** యొక్క పితరుఁడు (ద్వితీ 10[6]).

**3. బెనేయాకాను** చూ॥

**అకాయికు** (Achaicus = అకయ నుండి వచ్చినవాఁడు). కొరింథు పట్టణస్థులలో నొకఁడు. ఇంక నిద్దరితోఁగలసి ఎఫెసులో పౌలును దర్శించెను (I కొరి 16[17]).

**అకుల** (Aquila = గ్రద్ద). పొంతులో పుట్టిన ఒక యూదుఁడు. వృత్తినిబట్టి అపొస్తలుఁడైన పౌలువలె డేరాలు కుట్టువాఁడు (కార్య 18[1-3]) అతఁడును అతని భార్యయైన ప్రిస్కిల్లయును రోమాలో క్రైస్తవులైనట్లు కనఁబడుచున్నది క్లౌదియు చక్రవర్తి యూదులందఱు రోమాను విడిచివెళ్లవలెనని ఆజ్ఞాపించినప్పుడు వారు కొరింథుకు వచ్చి నివాసముచేసిరి (18[1-3]). తరువాత వారు పౌలుతోఁగలిసి యతని పనులలో సహాయులైరి. పౌలుతోఁగూడ ఎఫెసుకుఁ బోయి అచ్చట నివాస మేర్పరచుకొని సువార్తను ప్రకటించి (18[18-26]). తరువాత మఱల రోమాకు వెళ్లి యచ్చట దైవపని చేయుచుండిరి. వారుచేసిన పని నిమిత్తము పౌలు వారిని మెచ్చుకొనెను (రోమా 16[3,4] II తిమో 4[19]).

**అకెల్దమ** (Akeldama = రక్తభూమి) యూదా ఇస్కరియోతు యేసును అమ్మి తెచ్చి దేవాలయములోఁ బారవేసిన సొమ్ముతో (మత్త 27[3-5]) యాజకులు పరదేశులను పాతిపెట్టుటకు కొన్న స్మశానభూమి (కార్య 1[19] మ 27[8]). నేఁటికిని దానిని హక్ ఎద్దుం (*Hakk-ed-dum*) అని పిలుచుచున్నారు. అది హిన్నోము లోయకు దక్షిణముగా నున్నది.

**అక్కదు** (Accad=దుర్గము). షినారు దేశములో నిమ్రోదు స్థాపించిన రాజ్యములో నాలుగు ముఖ్యపట్టణములలో నొకటి (ఆది 10[10]) మొదట అదియొక పట్టణపు పేరైయుండి; తరువాత బాబెలు దేశపు ఉత్తరభాగ మంతటి పేరయ్యెను. బాబెలు దేశపు దక్షిణభాగము సుమెరు (*Sumer*) అను పేరు కలదు. బాబెలు రాజ్యము నేలిన మొదటివారు అక్కదు సుమెరు రాజులు అను బిరుదు పొందిరి.

**అక్కూబు** (Akkub = యుక్తిగల).

1. దావీదు సంతతిలోని ఒకఁడు (I దిన 3[24]).

2. ఒక లేవీయుఁడు. ఇతని సంతతివారు ఆలయపు ద్వారపాలకులైయుండిరి (I దిన 9[17] ఎజ్రా 2[42] నెహె 11[19] 12[25]). ఎజ్రా శాస్త్రమును చదువుచుండఁగా ప్రజలకు అర్థము చెప్పిన వారిలో ఈ అక్కూబు ఒకఁడైయుండెను (నెహె 8[7]).

3. నెతీనీయులలో నొకఁడు (ఎజ్రా 2[45]) (నెతీనీయులు చూ॥).

**అక్కో** (Acco = కాకగానుండు ఇసుక). ఇది తూరు అను పట్టణమునకు 25 మైళ్లు దక్షిణముగా నుండు రేవుపట్టణమై యున్నది. కర్మెలు పర్వతమునకు ఉత్తరముగా 8 మైళ్ల దూరములో నున్నది. ఇది ఆషేరుగోత్రికుల స్వాస్థ్యములో నుండినను ఆషేరీయులు ఆ పట్టణస్థులను జయింపక వారిని తమ మధ్యనివసింప నిచ్చిరి (న్యాయా $1^{31}$). క్రీస్తు శకమునకు ఘుమారుగా 100 సం॥లకు ముందు ఐగుప్తు అధికారులకు గౌరవార్థముగ దానిపేరు మార్చి తొలెమాయి (*Ptolemais*) యను మాఱుపేరు పెట్టిరి. ఇచట ఆది కాలములో క్రైస్తవు లున్నట్లు తెలియును. ఏమనిన, పౌలు తన మూడవమిషనెరీ ప్రయాణాంతమున యెరూషలేమునకు వెళ్లుచుండగా మార్గమధ్యమున ఈ పట్టణమందలి క్రైస్తవులను దర్శించి వారియొద్ద నొక దినమును గడిపినట్లున్నది (కార్య $21^{7}$).

బైబిలులో అక్కోనుగూర్చిన కొన్ని సూచనలు మాత్రముండినను అది యూదులయొక్కయు, క్రైస్తవులయొక్కయు చరిత్రలలో నొక ముఖ్య స్థానముగా నెంచఁబడవలెను. అది గలిలయకును దానిచుట్టుపట్లనుండు ప్రాంతములకును ముఖ్యమైన రేవుపట్టణమై యుండెను. మక్కబ్బీయుఁడైన యోనాతాను అచ్చటనే కుట్రవలన చంపఁబడెను (I మక్క $12^{48}$). ఆదికాలమునుండి తొలెమాయిలో నొక క్రైస్తవ ఓషపుండెను. అరబ్బీయులు పలెస్తీనును స్వాధీనము చేసికొన్నప్పుడు వారు దానికి దాని యసలు పేరు మరలపెట్టిరి. క్రైస్తవులు యెరూషలేమును మరల పట్టుకొనుటకు క్రూసేడులను యుద్ధములను చేసి 1191 వ సం॥లో మొదటి సారిగా దీని జయించిరి. అదిమొదలిది నూఱు సం॥ల కన్న నెక్కువ కాలము వఱకు క్రైస్తవుల స్వాధీనములో నుండినను పిమ్మట మరల తురకలచే పట్టుకొనఁబడి క్రీ॥ శ॥ 1918 వరకు వారి యాధీనములోనుండెనుగాని అప్పటినుండి అది బ్రిటిషువారి క్రింద నున్నది. ప్రస్తుతము దానికి అక్కా (*Akka*) యను పేరుకలదు. అందులో 11,000 మంది జనులున్నారు. అది నేటివఱకు రేవు పట్టణమైయున్నది. ప్రస్తుతము అది ఇశ్రాయేలు వారి వశమున నున్నది. (పటము IV, B 6).

**అక్జీబు** (Achzib = అబద్ధము లేక శూన్యము).

1. యూదా గోత్రములో పల్లపు ప్రదేశమునందలి యొక పట్టణము. కెయీలా మారేషా యను పట్టణములతోఁ గలసియున్నది (యెహో $15^{44}$). మీకా $1^{14}$ నందు దీని శబ్దార్థమునుబట్టి పరిహాసపదముఁగ వాడఁబడెను. ఆది $38^{5}$ లోని **కజీబు** ను, I దిన $4^{22}$ లోని **కోజేబా** యును ఇదేయై యుండవచ్చును. (పటము II, D 1).

2. ఆషేరు గోత్రమందలి యొక పట్టణము (యెహో $19^{29}$). కనానీయులను దీనినుండి వెళ్లఁగొట్టలేదు (న్యాయా $1^{31}$). యూదులు బబులోనులోనుండి తిరిగి వచ్చిన వెనుక దీని పరిశుద్ధదేశపు సరిహద్దుగ నెంచిరి. ప్రస్తుత మిది సముద్రతీరమందలి యొక చిన్న పల్లెగానున్నది. (పటము IV, B 5). H.

**అక్బోరు** (Achbor = చుంచు).

1. ఎదోమునకు రాజై యుండిన బయల్హానాను తండ్రి (ఆది $36^{38}$ I దిన $1^{49}$)

2. యూదా దేశమునకు రాజాగానుండిన యోషీయా యుద్యోగస్థులలో నొకఁడు. ఇతఁడు మీకాయా కుమారుఁడును, యెహోయాకీము రాజోద్యోగస్థుఁడైన ఎల్నాతానుకు తండ్రి. (II రాజు $22^{12-14}$ యిర్మీ $26^{22}$ $36^{12}$). II దిన $34^{20}$ లో ఇతనికి **అబ్దోను** అను మాఱు పేరు కలదు.

**అక్రబ్బీము** (Akrabbim = తేళ్లు). యూదా సరిహద్దులలో నొక స్థానము (సంఖ్యా $34^{4}$ యెహో $15^{3}$ న్యాయా $1^{36}$). అది మృత సముద్రముయొక్క దక్షిణపు కొనకు పడమరగా నుండు పర్వతమునకు ఎక్కుస్థానమును, ఎదోమునకును యూదాకును మధ్య సరిహద్దు నైయున్నది. (పటము II, F 5).

**అక్షరములు** (Alphabet). మన బైబిలులోని పాత నిబంధనను హెబ్రీ అక్షరములతోను, క్రొత్తనిబంధనను గ్రీకు అక్షరములతోను వ్రాసిరి. హెబ్రీ అక్షరముల పేరులు 119-వ కీర్తనలోని భాగములపైన వరుసగా కనఁబడును. ఆ పేరులు హల్లులేకాని అచ్చులుకావు. హిందూస్థానిభాషలోనున్నట్లు హెబ్రీలో అచ్చులకు ఆయా గుణితరూపములున్నవే కాని వేఱు అక్షరములు లేవు. హెబ్రీ భాషలో 22 అక్షరములు

అరబ్బీ యక్షరములకు సంబంధముగా నాటివలెనున్నవి.

గ్రీకు అక్షరములను చూడఁగా, అవి ఇంగ్లీషు పుస్తకములను అచ్చువేయుటయందు వాడఁబడు లాటిన్ అక్షరములకు సంబంధముగానున్నవి. గ్రీకు అక్షరములలో రెండింటి పేరులు మాత్రము క్రొత్తనిబంధనలో నున్నవి (ప్రక 1[8]). అల్ఫా యనునది ఆ యక్షరాలలో మొదటిదియు, ఓమెగ యనునది యందులో చివరిదియునై యున్నవి. గ్రీకు అక్షరములు పెద్దవి, చిన్నవి యను రెండు రకములుగా నున్నవి. అసలు ప్రతులను చూడఁగా వాటిలో మిగుల పురాతనమైనవి పెద్ద అక్షరములతోను, తదనంతరమున వ్రాయఁబడినవి చిన్న యక్షరములతోను వ్రాయఁబడియెను. హెబ్రీ గ్రీకు వాటికి సంబంధించిన తెనుఁగు అక్షరములు ఈ దిగువ జాబితాలో కనఁబడును:—

| హెబ్రీ | తెనుఁగు | గ్రీకు (పెద్దవి) | గ్రీకు (చిన్నవి) | తెనుఁగు |
|---|---|---|---|---|
| א | 'అ | A | α | అ, ఆ |
| ב | బ | B | β | బ |
| ג | గ | Γ | γ | గ |
| ד | డ | Δ | δ | ద |
| ה | హ | E | ε | ఎ |
| ו | వ | Z | ζ | జె |
| ז | జ | H | η | ఏ |
| ח | ఖ | Θ | θ | థ |
| ט | ట | I | ι | ఇ |
| י | య | K | κ | క |
| כ | క | Λ | λ | ల |
| ל | ల | M | μ | మ |
| מ | మ | N | ν | న |
| נ | న | Ξ | ξ | క్స |
| ס | స | O | ο | ఒ |
| ע | 'అ | Π | π | ప |
| | | P | ρ | ర |
| פ | ప | Σ | σ ς | స |
| צ | చే | T | τ | ట |
| ק | ఖ | Υ | υ | ఊ |
| ר | ర | Φ | φ | ఫ |
| | | X | χ | ఖ |
| ש | స, ష | Ψ | ψ | ప్స |
| ת | త | Ω | ω | ఓ |

**అక్షాపు** (Achshaph = భ్రమ). అక్షాపు అను పట్టణపు రాజు యాబీను అను రాజుతో నొడంబడిక చేసికొనిన వారిలో నొకఁడు. ఇతఁడు యెహోషువకు విరోధముగా యుద్ధముచేసి (యెహో 11[1]) ఓడిపోయినందున ఈ పట్టణము యెహోషువ స్వాధీనమై (12[20]) ఆషేరు గోత్రికులకు స్వాస్థ్యముఁగా నియ్యఁబడెను (19[25]). ఇది తూరు అను పట్టణమునకు తూర్పున యానిమిది క్రోసుల దూరములో నున్నది ప్రస్తుతము దానికి ఇక్షాపు (*Iksaf*) లేక కెషాపు (*Kesaf*) అను పేరు కలదు.

**అక్షోటములు** (Nuts). పర 6[11] లో నున్న అక్షోటములు ఒక విధమైన కాయలై యున్నవి. ఇవి క్రిందనుదాహరింపఁబడిన అక్షోట వృక్షపుకాయలు గావు. వేఱొకచెట్టు కాయలు. ఇంగ్లీషు వాల్నట్ (*walnut*) వంటివి. పలెస్తీను దేశమందును దాని చుట్టు ప్రక్కలనుండు దేశములలోను మిక్కిలి పైరగును.

**అక్షోట వృక్షము** (Chestnut or Plane Tree). యెహె 31[8] లో నున్న భాషాంతరము సరికాదు. ఈ పదమును అక్షోటమని వ్రాయుటకన్న పూర్వ భాషాంతరమందున్న **అరమ** వృక్షమని యుండుట మేలు. హెబ్రీ భాషయందు దీని అర్మోను అని వ్రాసిరి. దీనినే ఆది 30[37] లో **జంగి సాలు చెట్టు** అను మాటచే భాషాంతరముఁజేసిరి. ఈ చెట్టు మిగుల యెత్తుగాఁ బెరుగును. కొమ్మలు నలుతట్లను విశాలముగ వ్యాపించును. దాని బెరడును ఒలిచినపక్షమున దానిబోదె బూరగచెట్టువలె కనఁబడును. కాఁబట్టి యాకోబు తన మామ మందలను గాయునప్పు డాతని గొఱ్ఱెలును మేకలును చారలు పొడలు మచ్చలు గల పిల్లలను బెట్టునట్లు దీని కొమ్మల నుపయోగించెను. J. C.

**అక్సా** (Achsah = కడియము). అక్సా కాలేబు కూతురై యుండెను. కిర్యత్సేపెరును పట్టుకొని జయించువానికి తన కుమార్తెయగు అక్సా నిచ్చి వివాహము చేతునని కాలేబు మాట నియ్యగా అతని తమ్ముని కొడుకైన ఒత్నీయేలు కిర్యత్సేపెరును పట్టుకొనెను (దబీరు చూ॥). కనుక కాలేబు తన కుమార్తెయైన అక్సాను అతని కిచ్చి పెండ్లి చేసెను. ఆమె మనవి చేయఁగా

కాలేబు ఆమెకు మెరక మడుగులను పల్లపు మడుగులను కూడ ఇచ్చెను (యెహో $15^{16-19}$ న్యాయా $1^{13-15}$).

**అగగు** (Agag = మండుచున్న?). ఇయ్యది అమాలేకీయుల రాజులలో నిద్దఱికి పెట్టఁబడిన పేరై యుండెను. ఫరో యను పేరు ఐగుప్తు రాజుల కెట్లు బిరుదుగ నుండెనో యట్లు అగగు అను పేరు అమాలేకీయుల రాజులకు బిరుదై యుండెను.

1. ఇశ్రాయేలీయుల జన మెంతటి ఘనమైన దగునో తెలుపుటకు బిలాము, వారి రాజు అగగు కంటె గొప్పవాడగునని చెప్పి, ఆకాలములో గాని, అంతకు ముందుగాని అమాలేకీయుల రాజగు అగగు మహా గొప్పవాఁడని తెలియఁజేసెను (సంఖ్యా $24^{7}$). LXX లోని యీ వాక్యము నందు అగగు అను పేరునకు ప్రతిగా **గోగు** అను పేరుకలదు. అందువలన అది బిలాము వాడిన పేరని కొందఱను కొందురు. ఇది నిజమైన యెడల అగగు అను పేరొకటి మాత్రమే బైబిలులో నుండును.

2. సౌలు కాలమున అమాలేకీయుల రాజు. వీరిని బొత్తుగా నిర్మూలము చేయవలెనని సౌలు ఆజ్ఞ పొందినను ఆలాగున చేయక, పశువులలో శ్రేష్ఠమైనవాటిని అగగు అనువారి రాజును రక్షించెను (I సమూ $15^{9}$) గాని, తరువాత సమూయేలు అతనిని జంపించెను. ($15^{33}$).

**అగబు** (Agabus = మిడుత). ఆది క్రైస్తవ సంఘమందుండిన యొక ప్రవక్త. యేసుక్రీస్తు ఏర్పరచుకొనిన 70 మంది శిష్యులలో నితఁడొకఁడని యనుకొనవచ్చును. క్రీస్తు శకమునందు దాదాపు 43 సం॥ న యెరూషలేము నుండి అంతియొకయకువచ్చి, భూలోకమంతట గొప్ప కఱవు రాఁబోవుచున్నదని ఆత్మద్వారా సూచించెను (కార్య $11^{28}$). అది తరువాతి సంవత్సరమందు సంభవించెను. అంతియొకయలోని సహోదరులు యెరూషలేము సహోదరులకు సహాయము నంపిరి (కార్య $11^{29,30}$). దాదాపు 15 సం॥ లైన పిదప కైసరయలో ఈ అగబు పౌలును చూచి అతనికి కలుగఁబోవు హింసలను కష్టములను బయలుపరచి ప్రవచించెను (కార్య $21^{10,11}$). C.

**అగరు, అగురు** (Aloes). ఒకచెట్టు. పూర్వమిది పలెస్తీనునందుఁ బెఱిగినను ప్రస్తుత మక్కడ కనఁబడదుగాని ఉత్తర హిందూదేశ మందును చీనా దేశమందును బెఱుగుచున్నది. ఇది మిగుల యెత్తుగా నుండును. కొన్ని దాదాపు 120 అడుగుల యెత్తువఱకుఁ బెఱుగుచున్నవి. దాని కఱ్ఱ మిగుల పరిమళముగలది. కొంతకాలము వఱకు భూమియందు పాతిపెట్టి తీసినయెడల మంచి పరిమళమిచ్చును (సంఖ్యా $24^{6}$ కీర్త $45^{8}$ సామె $7^{17}$ యోహా $19^{39}$). (గంధవర్గము I 9 చూ॥). J. C.

**అగాగీయుడు, హాగాగీయుడు** (Agagite). ఎస్తేరు అను రాజ్ఞి కాలములో యూదుల నందఱిని చంప దలఁచిన హామానుయొక్క బిరుదై యున్నది (ఎస్తే $3^{1,10}$ $8^{3-5}$). యోసీఫస్ అను చరిత్రకారుఁడు,హామాను అమాలేకీయుఁడై నందున అతని కీబిరుదు కలిగెనని వ్రాసినను (పురా 11, 6.5), అతఁడట్టి జాతివాఁడనుట సందేహాస్పదముగా నున్నది. అగగు (పైన చూ॥) అను వాఁడు సౌలు కాలములో ఇశ్రాయేలీయులకు విరోధియై యుండినట్లు ఎస్తేరు కాలములో హామానువారికి విరోధియను దానికి సూచనగా ఈ బిరుదు అతని కియ్యబడెనని కొందఱనుకొందురు. LXX చేసిన వారు విరోధమును సూచించు మాటలచే దాని తర్జుమా చేసినందున వారి యభిప్రాయము నిదే యని మన మనుకొనవచ్చును. (హామాను చూ॥)

**అగాధము** పాతాళము చూ॥

**అగురు** అగరు చూ॥

**అగ్నిగుండము** (Furnace, Oven, Lake of fire). తెనుఁగున ఈ మాటచే తర్జుమ చేయఁబడినది అసలులో మూఁడు వేర్వేఱు హెబ్రీ మాటలకును రెండు ప్రత్యేకమైన గ్రీకు మాటలకును తర్జుమాయైయున్నది. ఆ మాటలన్నిఁటిని చూడఁగా అవి శిక్షకు సాధనములుగాను (దాని $3^{11}$ మొ॥) సూచనలుగా నున్నవి (కీర్త $21^{9}$ మ $13^{11}$ ప్రక $19^{20}$). ప్రక $19^{20}$ $20^{10,14,15}$ $21^{8}$ మ $13^{41,50}$ లో అది నరకమునకు సూచనయై, దాని యమిత కష్టములను తెలియఁజేయుచున్నది. అది క్రీస్తు చెప్పిన **ఆరని అగ్ని** యను పదము వంటి పదమై యున్నది (మా $9^{48}$). మలా $4^{1}$ లో ఇట్టి తీర్పు కొలిమి యను మాటచే సూచింపఁ

ఇదియును దుష్టులకు కలుగు నాశమును సూచించు పదమై యున్నది. **ఇనుపకొలిమి** యను మాటను ఐగుప్తులో కలిగిన గొప్ప కష్టములను సూచించుటకు వాడుకొనిరి (ద్వితీ $4^{20}$ I రాజు $8^{51}$ యిర్మీ $11^{4}$). ఇట్టి కష్టములు బంగారమును శుద్ధిచేయు **కొలిమి, మూస** యను మాటలవలన తెలియఁజేయఁబడును (సామె $17^{3}$ $27^{21}$ యెహె $22^{18,22}$).

**అగ్నిగుండముల గోపురము** యెరూషలేము BV 2 చూ॥

**అగ్నిపాత్ర** గుడారము 6 (1) (a) చూ॥

**అగ్రిప్ప** హేరోదు 6, 7 చూ॥

**అజజ్యాహు** (Azaziah = యెహోవా శక్తిమంతుఁడు).

1. దావీదు కాలములో ఆరాధన సమయమందు సితారాను వాయించుటకు నియమింపఁబడిన యొక లేవీయుఁడు (I దిన $15^{21}$).

2. దావీదు కాలములో అధిపతిగానుండిన హోషేయకు తండ్రి. ఇతఁడు ఎఫ్రాయిము వాఁడైయుండెను (I దిన $27^{20}$).

3. రాజైన హిజ్కియా కాలములో ఆలయమును కనిపెట్టు వారిలో నొకఁడు (II దిన $31^{13}$).

**అజనోత్తాబోరు** (Aznoth Tabor = తాబోరు చెవులు). ఇది నఫ్తాలీ గోత్రపు సరిహద్దులలో నొక స్థానము (యెహో $19^{34}$). అది తాబోరు కొండప్రక్క యొక్క అడుగు భాగమని యూహింపఁదగును గాని దాని యునికిని గూర్చి అంత సూటిగా తెలియదు.

**అజన్యా** (Azaniah = యెహోవా చెవి యొగ్గి వినెను). నెహెమ్యా కాలమున నిబంధన చేసిన లేవీయులలో నొకఁడు. ఇతఁడు యెహోషువకు తండ్రి (నెహె $10^{9}$).

**అజరేలు** (Azarel = దేవుఁడు సహాయము చేయును).

1. దావీదు సౌలుయొద్దనుండి పారిపోఁగా, దావీదును కలిసికొనవచ్చిన వారిలో నొక లేవీయుఁడు (I దిన $12^{6}$).

2. దావీదు కాలములో దేవాలయమునందు పాడుటకు నియమింపఁబడిన 24 వంతులలోని పదునొకండవ వంతునకు ముఖ్యుఁడు (I దిన $25^{18}$). I దిన $25^{4}$ లో ఇతనికి **ఉజ్జీయేలు** (*Uzziel*) అను మాఱుపేరు కలదు. ఇతఁడు హేమాను వంశములో పుట్టినవాఁడు.

3. దావీదు కాలములో దాను గోత్రమునకు అధిపతిగానున్నవాఁడు. అతఁడు యెరోహాము కొడుకు (I దిన $27^{22}$).

4. ఎజ్రా కాలములో అన్యస్త్రీలను ఉంచుకొని యతఁడు ప్రేరేపింపఁగా వారిని విడనాడిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{41}$).

5. నెహెమ్యా కాలములో యెరూషలేము నందు నివసించిన వారిలో నొక యాజకుఁడు. ఇతఁడు ఇమ్మేరు వంశములో పుట్టినవాఁడు (నెహె $11^{13}$). ఇమ్మేరు 1 చూ॥

6. నెహెమ్యా కాలములో యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించిన కాలమునందు పాడిన లేవీయులలోనొకఁడు (నెహె $12^{36}$). చివరగాఁ జెప్పఁబడిన యిద్దఱును ఒక్కఁడే యని కొందఱనుకొందురు.

**అజర్యా** (Azariah = యెహోవా సహాయము చేసెను).

1. యూదా గోత్రపు జెరావంశస్థులలోని ఏతాను కుమారులలో నొకఁడు (I దిన $2^{8}$).

2. లేవి గోత్రపు కహాతీయులలో నొకఁడు (I దిన $6^{36}$). ఇతని వంశములో ప్రవక్తయైన సమూయేలును, గాయకుఁడైన హేమానును గలరు ($6^{33}$). II దిన $29^{12}$ లో నున్నట్లు హిజ్కియా కాలములో దేవాలయమును పవిత్రపఱచిన కహాతీయుఁడైన అజర్యా ఇతఁడే యని కొందఱను కొందురు. అతఁడు మఱియొకఁడని తలంచు వారును గలరు. (క్రింద 15 చూ॥).

3. సొలొమోను ఉద్యోగస్థులలో నొకఁడు యాజకుఁడైన సాదోకు కుమారుఁడు (I రాజు $4^{2}$).

4. సాదోకు మనుమఁడు, అహీమయస్సు కుమారుఁడు (I దిన $6^{9}$).

5. సొలొమోను కాలములో నతనికి ఆహారము సంగ్రహముచేయు 12 మంది యధికారులమీది యధిపతి. ఇతఁడు నాతాను కుమారుఁడు (I రాజు $4^{5}$). II సమూ $5^{14}$ చూడఁగా ఇతఁడు సొలొ

మోను తోడఁబుట్టిన వాని కుమారుఁడై యున్నట్లున్నది.

6. రాజగు ఆసా దేశములోని యక్రమములను దిద్దుచుండఁగా అతనికి ధైర్యముచెప్పిన యొక ప్రవక్త. ఇతఁడు ఓదేదు కుమారుఁడు (II దిన $15^{1-8}$).

7,8. రాజైన యెహోషాపాతు కుమారులలో ఇద్దఱి పేరు (II దిన $21^{2}$).

9. జ్ఞానమునకు ప్రసిద్ధుఁడైన ఏతాను (I రాజు $4^{31}$) యొక్క కుమారుఁడు (I దిన $2^{8}$).

10. యూదా వారిలో నొకఁడు (I దిన $2^{38,39}$). ఇతని తాత పేరు ఓబేదు. అతల్యాను రాజ్యమునుండి తొలగించి, యోవాషును రాజుగ నియమించుకొనినవారికి సహాయముచేసిన ఓబేదు కుమారుఁడగు అజర్యా యితఁడే (II దిన $23^{1}$) యని నమ్మఁదగును గాని ఇతఁడు మఱియొకఁడని కొందరి యభిప్రాయము.

11. యెహోరాము కుమారుఁడు (II దిన $23^{1}$). ఇతఁడు అతల్యాను రాజ్యమునుండి తొలగించుటలో సహాయముచేసిన మఱియొక అజర్యా.

12. ఇశ్రాయేలీయుల రాజగు పెకహు యూదా వారిని జయించి, వారిలో రెండు లక్షల మందిని చెఱఁబట్టఁగా వీరిని విడిపింపవలెనని బుద్ధి చెప్పిన నలుగురు పెద్దలలో నొకఁడు. అతఁడు ఎఫ్రాయిమీయుఁడును యోహానాను కొడుకునై యుండెను (II దిన $28^{12-15}$).

13. యూదా రాజగు ఉజ్జియాకు అజర్యా యను మాఱు పేరు గలదు (II రాజు $15^{1}$ II దిన $26^{1}$ సరిపోల్చి చూ॥. ఉజ్జియా చూ॥).

14. ఒక ప్రధాన యాజకుఁడు (I దిన $6^{10}$). ఉజ్జియా ధూపము వేయుటకై ఆలయములోనికి వెళ్లఁదెగింపగా అతనిని గద్దించిన వారిలో నొకఁడు (II దిన $26^{16-20}$). రాజైన హిజ్కియా కాలములో కూడ ఈ పేరుగల ప్రధాన యాజకుఁడుండెను ($31^{9,13}$). ఉజ్జియా కాలములోని వాఁడును ఇతఁడు నొక్కఁడేయై యుండును.

15. మఱియొక లేవీయుఁడు (II దిన $29^{12}$). మెరారీ గోత్రపువాఁడు. హిజ్కియాకాలములో ఆలయమును పవిత్రపరచుటలో సహాయముచేసిన వాఁడు.

16. చెఱకాలమునకు కొంచెము ముందుగా హిల్కీయాకు పుట్టినవాఁడు. అతఁడు ప్రధాన యాజకుఁడాయెను (I దిన $6^{13}$ $9^{11}$).

17. యిర్మీయాను విరోధించినవారిలో నొకఁడు (యిర్మీ $43^{2}$). ఇతఁడు హోషేయా కుమారుఁడు.

18. అగ్ని కొలిమిలో వేయఁబడిన అబెద్నెగో యొక్క అసలు పేరు (దాని $1^{7}$).

19. నెహెమ్యా కాలములో యెరూషలేము పట్టణపు గోడను మరమ్మతుచేసిన వారిలో నొకఁడు. ఇతఁడు మయశేయా కుమారుఁడు (నెహె $3^{23,24}$).

20. నెహెమ్యా కాలములో యెరూషలేము గోడలను ప్రతిష్ఠించు సమయమున ఊరేగిన ప్రధానులలో నొకఁడు (నెహె $12^{32,33}$).

21. ఎజ్రా ధర్మశాస్త్రమును వినిపించిన సమయములో దానికి అర్థము చెప్పిన వారిలో నొకఁడు. ఇతఁడు లేవీయుఁడని యనఁదగును (నెహె $8^{7}$).

22. నెహెమ్యా కాలములో ఇశ్రాయేలీయులు చేసిన నిబంధనను ముద్రించిన వారిలో నొకఁడు (నెహె $10^{2}$). ఇతఁడు యాజకుఁడును పెద్దయునై యుండెనని నమ్మఁదగును.

23. చెఱకాలమునకు తరువాత దేవునిమందిరములో అధిపతియై యుండిన యొకఁడు. ఇతఁడు హిల్కీయా వంశములో పుట్టినవాఁడు. (I దిన $9^{11}$).

**అజల్యా** (Azaliah = యెహోవా కాపాడెను). యోషీయా ప్రధాన మంత్రియగు షాఫాను తండ్రి. (II రాజు $22^{3}$ II దిన $34^{8}$).

**అజాజేలు** (Azazel = ప్రత్యేకింపఁబడిన!). పాప పరిహారము నిమిత్తమైన ప్రాయశ్చిత్త దినమున రెండు మేఁకపిల్లలను తీసికొనివచ్చి ప్రత్యక్షగుడారపు ద్వారమునొద్ద వాటినుంచి, వాటిమీఁద చీట్లువేసి యెహోవాపేరట చీటి దేనిమీఁద పడునో దానిని పాపపరిహారార్థబలిగా నర్పించిరి. రెండవ దానిని ప్రాయశ్చిత్తము కలుగునట్లుగా అరణ్యములోనికి విడిచిపెట్టిరి. ఈలాగు విడిపింపఁబడిన యా రెండవ మేఁక అజాజేలు పేర్లట విడిచిపెట్టినట్లుగ నున్నది (లేవీ $16^{8,10,26}$). అజాజేలు అను మాట బైబిలులో ఈ యొక్క సందర్భ

ంందు మాత్రముండుటచే దాని సరియైన యర్థమును తెలిసికొనుటకు తగిన యాధారములు లేవు. శబ్దార్థమునుబట్టి చూడఁగా అది వేఱుపఱచఁబడుట యను నర్థమిచ్చునని కొందఱనుకొందురు. అట్లయినయెడల ఈ మాట అలంకార రీతిఁగా వాడఁబడినదనియు ఆ మేఁక వేఱుపఱచుటను సూచించుననియు ననుకొనువారుగలరు. అయితే సాధారణముగా నీ అజాజేలు అరణ్యవాసియైన యొక దయ్యము పేరనుకొందురు. ప్రధాన యాజకుఁడు ఆ మేఁక తలమీఁద తన చేతులనుంచి ప్రజల పాపము లన్నిఁటి నొప్పుకొని ఆ మేఁక తలమీఁద వాటినిమోపి, దానిని అరణ్యమునకు పంపఁగా (లేవీ 16[21,22]) అది యా పాపము లన్నియు తీసివేయఁ బడుటను సూచించుచున్నది. ఇట్టి పాపము లీదయ్యమునకు సంబంధించి యున్నం దున దానియొద్దకు పంపఁబడవలెనను సంగతి యిందులో సూచింపఁబడినట్లున్నది.

**అజాను** (Azzan = బలముగలవాఁడు). మోషేకాలములో ఇశ్శాఖారు గోత్రమునకు ప్రధానియైన పల్తీయేలు తండ్రి (సంఖ్యా 34[26]).

**అజీజా** (Aziza = బలిసిన). ఎజ్రాకాలములో అన్యస్త్రీలను వివాహముచేసికొని అతని ప్రేరేపణవలన వారిని పరిత్యజించిన వారిలో నొకఁడు (ఎజ్రా 10[27]).

**అజీయేలు** (Aziel = దేవుఁడు బలపఱచును). దావీదు కాలములో మందసము ఓబేదెదోము ఇంటియొద్ద నుండి యెరూషలేమునకు తీసికొనివచ్చి నప్పుడు సంగీత వాద్యములను వాయించిన వారిలో రెండవ వరుసయందున్న యొకఁడు (I దిన 15[18-20]). I దిన 16[5] లో నున్న జాబితాలోని యెహీయేలు అను పేరు అజీయేలు అను నామమునకు మాఱురూపమై యుండవచ్చును. అట్లయిన యెడల గుడారము విషయమై స్థిరమైన యేర్పాటులైన పిదప నితఁడా యుద్యోగమున నుండెను.

**అజూబా** (Azubah = విడువఁబడినది).

1. కాలేబుయొక్క భార్య (I దిన 2[18,19]).

2. రాజైన యెహోషాపాతుతల్లి (I రాజు 22[42]).

**అజేకా** (Azekah = క్రొత్త ద్రాక్ష తోఁట). ఇది పలెస్తీనులోని యున్నతమైన కొండల కును, సముద్రతీరమందలి బయలునకును మధ్య నుండు మన్య ప్రదేశము (షెఫేలా) లో నున్న ఒక యూరిపేరు. గిబియోనీయులమీఁద యుద్ధము చేసిన వారిని యెహోషువ జయించినపుడు ఈ యూరివఱకు తఱిమెను (యెహో 10[10,11]). ఇది యూదా వారి స్వాస్థ్యములో చేరినది (యెహో 15[33-35]). ఫిలిష్తీయులు గొల్యాతుతోఁ గలసి ఇశ్రాయేలీయుల మీఁద యుద్ధము చేయుటకు వచ్చినపుడు ఇచ్చటనే మకాముచేసిరి (I సమూ 17[1]). రెహబాము కోటలను గట్టించిన యూళ్లలో నిదియొకటియై యుండెను (II దిన 11[8-11]). నెబుకద్నెజరు దానిమీఁద యుద్ధము చేసినట్లున్నది. అతఁడు దాని జయించినటుల వ్రాయఁబడక పోయినను నిజముగా జయించి యుండునని నమ్మవచ్చును (యిర్మీ 34[6,7]). నెహె 11[30] చూడఁగా ఈ యూరు చెఱకాలమునకు పిమ్మటను నిలిచి యుండెనని తెలియును. దాని యునికి యెచ్చటనో తెలియదు.

**అజోతు** అష్డోదు చూ॥

**అజోరు** (Azor). క్రీస్తువంశావళికిచేరిన వారిలో నొకఁడు. ఇతఁడు చెఱకాలమునకు పిమ్మట జీవించినవాఁడు (మత్త 1[13,14]).

**అజ్గాదు** (Azgad = గాదు లేక అదృష్టమే బలము). చెఱనుండి జెరుబ్బాబెలుతో (ఎజ్రా 2[12] = నెహె 7[17]) వచ్చినయొక గొప్ప కుటుంబము (ఎజ్రా 8[12]) నకు పూర్వికుఁడు. నెహెమ్యా కాలములో చేయఁబడిన నిబంధనను ముద్రించిన వారిలో ఈ కుటుంబికుల ప్రధానియునై యుండెను (నెహె 10[15]).

**అజ్జూరు** (Azzur = సహాయకరము).

1. యిర్మీయాను ఎదిరించిన అబద్ధ ప్రవక్తయగు హనన్యాయొక్క తండ్రి (యిర్మీ 28[1]).

2. యెహెజ్కేలు గద్దించిన ప్రధానులలో నొకఁడగు యజన్యాయొక్కతండ్రి (యెహె 11[1]).

3. నెహెమ్యా కాలములో చేయఁబడిన నిబంధనను ముద్రించిన వారిలో నొకఁడు (నెహె 10[16-18]).

**అజ్ఞానము** (Ignorance). దేవుని నెఱిఁగి ఆయనకు లోఁబడుటయే జ్ఞానమని బైబిలు

బోధించుచున్నది (సామె $1^7$ $15^{33}$ హోషే $6^6$). ఇట్లుండ, దానికి వ్యతిరేకముగ ఆయనకు అవిధేయులగుట యజ్ఞానమని యెంచఁబడును (I సమూ $2^{12}$ హోషే $4^1$). ఈ యజ్ఞానము గొప్ప పాపముగ నెంచఁబడుచున్నది. అయితే బైబిలులో నింకొక విధమగు అజ్ఞానమును గూర్చి కూడ చెప్పఁబడును. ఒకఁడు తెలియక పాపము చేసినయెడల అతఁడు అజ్ఞానమువలనఁ గాని పొరబాటువలనఁ గాని పాపము చేసెనందురు. ఇట్లు చేయఁబడినవి కూడ పాపములై తగిన ప్రాయశ్చిత్తములేనిది క్షమాపణ నొందనేరక యున్నవి (లేవీ 4 సంఖ్యా $15^{22-31}$). అయినను అవి బుద్ధిపూర్వకముగఁజేసిన పాపములతో సాటియైన దోషము కలవి కావు.

బైబిలును చూడఁగా అజ్ఞానమను పదమును నుతియొక రీతిగా వాడిరి. ఎట్లనఁగా, మొదటనే సంపూర్ణముగ గాక, మానవుల శక్తి సామర్థ్యముల కనుగుణ్యముగా దేవుని గూర్చిన బోధ క్రమ క్రమేణ బయలు పఱచఁబడెను కావున, ఈ బోధలు తేటఁగా బయలు పఱచఁబడని పూర్వ కాలములు అజ్ఞాన కాలములు అనఁబడెను (కార్య $17^{30}$). అట్టి కాలములలో దేవుఁడు ఆ యజ్ఞాన స్థితిలో నున్నవారి పాపములనుబట్టి తీర్పు చేయక వారి పాపమును చూచియు చూడనట్లుగనుండెను. ఈ విధముగ తెలియక పాపము చేసినవారు తక్కువ శిక్షను పొందెదరని బోధించువాక్యము లున్నవి (కార్య $3^{17}$ లూ $23^{34}$ $12^{18}$). అయితే దేవుఁడు సంగతులను బయలుపఱచిన పిమ్మట మనము మనస్వంత దుర్బుద్ధివలన వాటిని తెలిసికొనక పోయినయెడల మనము నిర్దోషులము కాము (రోమా $1^{18-21}$ ఎఫె $4^{19}$).

అజ్ఞాని బుద్ధిహీనుఁడు చూ॥

**అజ్బూకు** (Azbuk). యెరూషలేము గోడలను కట్టించుటలో సహాయముచేసిన నెహెమ్యా యను నొకని తండ్రి (నెహె $3^{16}$). ఈ నెహెమ్యా ఆ గోడలను కట్టించిన అధికారి యగు నెహెమ్యా కాఁడు.

**అజ్మావెతు** (Azmaveth = మరణము బలము గలది).

1. సౌలు సంతతివారిలో నొకఁడు. ఇతఁడు సౌలు కొడుకైన యోనాతాను వంశములో పుట్టెను (I దిన $8^{36}$ $9^{42}$).

2. దావీదుయొక్క ముప్పదిమంది ముఖ్య యోధులలో నొకఁడు (II సమూ $23^{31}$ I దిన $11^{33}$). ఇతఁడు బహరూమీయుఁడు లేక బర్హుమీయుఁ డనఁబడును. I దిన $12^3$ లో బెన్యామీనీయుఁడగు అజ్మావెతు కొడుకులు సౌలు యొద్దనుండి పారిపోయిన దావీదును అరణ్యములో కలిసికొన్నట్లుగ నున్నది. I దిన $27^{25}$ లో ఈ పేరుగలవాఁ డొకఁడు దావీదు బొక్కసముల మీద నియమింపబడెనను సంగతి యున్నది. ఈ మూడువాక్యములును ఒకనిగూర్చినవే యని కొందఱును, అటులగాక ఇవి వేర్వేఱు మనుష్యులను గూర్చినవని మఱికొందఱు ననుకొందురు.

3. యెరూషలేమునకు సమీపముగ నుండు నొక యూరు. ఆయూరివారిలో 42 రు చెఱకాలమునకు తరువాత బబులోనునుండి తిరిగి వచ్చిరి (ఎజ్రా $2^{24}$ నెహె $7^{28}$). ఈ రెండవ వాక్యములో ఆయూరి పేరు **బేతజ్మావెతు** అని యున్నది. యెరూషలేము గోడలను ప్రతిష్ఠించిన సమయమున సంగీతములను వాయించినవారిలో కొందఱు అజ్మావెతు చుట్టునుండు పొలములలో ఇండ్లను కట్టించుకొనిరి (నెహె $12^{29}$). ఇప్పుడు ఆ యూరిపేరు హిజ్మె (*Hizmeh*) యనునదై యుండవచ్చును. ఇది అనాతోతు గెబా అనెడి యూళ్లకు మధ్యనున్నది.

**అజ్రీకాము** (Azrikam = సహాయము కలిగెను).

1. దావీదు సంతతి వాఁడైన నెయర్యా కుమాళ్లలో నొకఁడు (I దిన $3^{23}$).

2. సౌలుసంతతివారిలో నొకఁడు. ఇతఁడు యోనాతాను వంశములో పుట్టెను (I దిన $8^{38}$).

3. మెరారీ సంతతివాఁడైన యొక లేవీయుఁడు (I దిన $9^{14}$ నెహె $11^{15}$).

4. రాజైన ఆహాజు కాలములో సభా ముఖ్యుఁడనఁబడిన యొక అధికారి. అతఁడు ఎఫ్రాయిమీయుఁడగు జిఖ్రీవలన హతము చేయఁబడెను (II దిన $28^7$).

మార్గము అనఁగా ప్రయాణికులు సాధారణముగా వెళ్లిన ఆ దేశపుమార్గము అని యందురు. ఇది నిజమైన యెడల సంఖ్యా $13^{22-25}$ లో ఆ మార్గ వివరమున్నది.

**అతారోతీయులు.** అతారోతు 4 చూ॥

**అతారోతు, అతారోతు అద్దారు** (**Ataroth, Ataroth-Addar** = కోటములు, అద్దారు కోటములు).

1. ఇశ్రాయేలీయులు యొర్దాను తూర్పున నుండు ప్రదేశమును జయింపక పూర్వము అచట నుండిన యొక యూరు (సంఖ్యా $32^{3}$). ఇశ్రాయేలీయులు దానిని జయించినట్లు మోయాబు రాతిశాసనమువలన తెలియును. ఆదేశము విభాగింపఁబడిన పిమ్మట గాదీయులు దానిని మఱల కట్టించిరి ($32^{34}$). ప్రస్తుతము నందున్న ఖిర్బేతు అతరూసు (*Khirbet-Attarus*) అను స్థలమిదే యనుకొందురు (పటము II, J 2).

2. ఎఫ్రాయిమునకు దక్షిణముగా నుండు నొక యూరు (యెహో $16^{2}$). ఇది $16^{3}$ లో **అతారోతు** అద్దారు అనఁబడెను (పటము III, E 5).

3. పైన 2 లో చెప్పఁబడిన దానికి తూర్పుగా నుండు నొక యూరు (యెహో $16^{1}$).

4. ఒక కుటుంబపు పేరు. ఆ కుటుంబపు వారు యూదా గోత్రములోని వారు (I దిన $2^{54}$).

**అతిథి** ఆతిథ్యము చూ॥

**అతిపరిశుద్ధ స్థలము** గుడారము 6 (3), దేవాలయము I 4 (2) చూ॥

**అతిశయాస్పదమైన ఓడలు** ఓడలు 3 చూ॥

**అత్తయి** (**Attai** = సమయోచితమైన, సమయానుకూలమైన!).

1. ఒక యూదుఁడు. ఇతని తల్లి యూదురాలేగాని తండ్రి ఐగుప్తీయ దాసుఁడు (I దిన $2^{35,36}$).

2. దావీదు సౌలునొద్దనుండి పారిపోఁగా అతనియొద్దకువచ్చి అతని పరివారములో చేరిన యొక గాదీయుఁడు (I దిన $12^{11}$).

3. రాజైన రెహబాము కుమారులలో నొకఁడు. ఇతఁడు అబ్షాలోము కుమార్తెయగు మయకాకు పుట్టెను (II దిన $11^{20}$).

**అత్తరు** గంధవర్గము I 6 చూ॥

**అత్తరు బుడ్డి** (**Alabaster**). మ $26^{6}$ (= మార్కు $14^{3}$) లోను లూ $7^{37}$ లోను క్రీస్తును అభిషేకించుటకు సుగంధ ద్రవ్యములను దెచ్చినవారు వాటిని సున్నపురాతితోఁ జేయఁబడిన బుడ్లలోఁ బెట్టి తెచ్చిరి. అట్టి బుడ్ల నావనికే యుపయోగించుట పలెస్తీనులో వాడుక.

**అత్తలియ** (**Attaliah**). చిన్నాసియలోని పంఫులియ అను పరగణా యందలి రేవుపట్టణము. ఇది క్రీస్తుశకమునకుఁబూర్వము రెండవ శతాబ్దమున కట్టఁబడి, చిన్నాసియ దక్షిణమున ముఖ్య రేవుపట్టణమాయెను. ప్రస్తుతము దానికి అడలియ (*Adalia*) అను పేరు గలదు. పౌలు తన మొదటి మిషనెరీ ప్రయాణమునుండి తిరిగివచ్చుచుండగా నీ రేవుపట్టణమున నోడ యెక్కి అంతియొకయకు వచ్చెను (కార్య $14^{25}$). (పటము V J 4).

**అత్రోతుషోపాను** (**Atroth—Shophan** = షోపాను కోటములు) యొర్దానుకు తూర్పుననుండిన యొక యూరు. ఆ దేశము ఇశ్రాయేలీయులకు పంచిపెట్టఁబడిన తరువాత గాదీయులు దానిని తిరిగి కట్టుకొనిరి (సంఖ్యా $32^{35}$). దాని యునికి ఎచ్చటనో నూటిగా తెలియదు.

**అదల్యా** (**Adalia**). యూదులను సంహరింప యత్నించిన హామాను యొక్క పదిమంది కుమారులలో ఐదవవాఁడు. యూదులు ఇతనిని ఇతని సహోదరులందఱినిచంపిరి (ఎస్తే $9^{8}$).

**అదాదా** (**Adadah** = పండుగ). నెగెబు అనఁబడిన యూదయ దక్షిణభాగములోని యొక యూరు (యెహో $15^{22}$). LXX నందు దీనికి **అరారా** యను పేరున్నది. కావున, ఇది అరోయేరుకు మాఱు పేరు అని యనుకొను వారుకూడ కలరు. ఇది నిజమైన యెడల అదాదా యనునది పొరబాటుగ వ్రాసిరనవలెను. ఇది పొరబాటు కానియెడల అదాదాయను నూరొకటి

యుండవలెను గాని దాని యునికిని గూర్చి తెలియదు. (అరోయేరు 3 చూ॥)

**అదామా** (Adamah = నేల). ఇది నఫ్తాలీ గోత్రపు దేశములోని యొక కోట. (యెహో $19^{35-38}$). అది తిబెరియపట్టణమునకు నైరుతి దిక్కున 5 మైళ్ల దూరముననున్న ఎద్దామియా (*ed-Daamieh*) అని కొందఱనుకొందురు గాని రూఢిగాఁ జెప్ప వీలుకాదు.

**అదామి** (Adami = మానవులయొక్క). ఇది నఫ్తాలీ గోత్రపు సరిహద్దులలో నుండు నొక యూరు. అది అదామి యను కనమ యనఁబడును (యెహో $19^{33}$). ఆదామ యను రేఫు పట్టణమునుండి ($3^{16}$) దీనిని వేఱుపఱచుటకు ఈ పేరు దానికి కలిగియుండవచ్చును. పైదానివలె నిదియును తిబెరియకు వాయవ్య దిక్కున 5 మైళ్ల దూరములోనున్న అద్దమియా (*ad-Damieh*) యై యుండవచ్చును.

**అదాయా** (Adaiah = యెహోవా అలంకరించెను).

1. రాజైన యోషీయా యొక్క తాత (II రాజు $22^{1}$).

2. ఒక లేవీయుఁడు (I దిన $6^{41}$). ఈ వచనమునకు I దిన $6^{21}$ లో ఇద్దో అను మాఱుపేరుపము కలదు.

3. బెన్యామీనీయుఁడగు షిమీయొక్క కుమారుఁడు (I దిన $8^{21}$).

4. యాజకులలోని యెరోహాము అను నొకని కుమారుఁడు (I దిన $9^{12}$). నెహె $11^{12}$ లో చెప్పఁబడిన వాఁడితఁడే యని కొందఱనుకొందురు గాని వాఁడు వేఱొకఁడైయుండవచ్చును.

5. అతల్యాయను రాజ్ఞిని సింహాసన భ్రష్టురాలినిగా చేయుటకు సహాయపడిన శతాధిపతియగు మయశేయాయొక్క తండ్రి (II దిన $23^{1}$).

6, 7. ఎజ్రా కాలములో అన్యస్త్రీలనుం దుకొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నిద్దఱు. ఈ యిరువురును బానీ కుటుంబమునకు చేరినవారైయుండిరి (ఎజ్రా $10^{29,39}$).

8. యూదా సంతతివారిలో నొకఁడు (నెహె $11^{5}$).

**అదారు** కాలమానము VI, 12 చూ॥

**అదీతాయిము** (Adithaim = విస్తారనోపులుగల యూరు?). యూదయలోని యొక యూరు (యెహో $15^{36}$). ఇది షెఫేలాలో నున్నది గాని సరియైనయునికి తెలియదు.

**అదీనా** (Adina = మృదువైన). దావీదు యొక్క పరాక్రమశాలురలో చేరిన యొక రూబేనీయుఁడు (I దిన $11^{42}$).

**అదీయేలు** (Adiel = దేవుని యలంకారము).

1. షిమ్యోను సంతతి వారిలో నొకఁడు (I దిన $4^{36}$).

2. యహజేరా యను యాజకుని యొక్క తండ్రి (I దిన $9^{12}$).

**అదుమ్మీము** (Adummim = ఎఱ్ఱనివి). అదుమ్మీముకు బదులుగా అదుమ్మీమున కెక్కుబాటు అను మాట రెండు మాఱులు కనఁబడును (యెహో $15^{7}$ $18^{17}$). అది యెరికో నుండి యెరూషలేమునకుఁబోవు మార్గమునకు దగ్గఱగానున్నది. ప్రస్తుతము దానికి టలత్ ఎద్దుమ్ (*Talat-ed-Dumm*) అని పేరు. దీనికి నెత్తురు దిబ్బ అని యర్థము. బందిపోటు దొంగలనేకులచట నివసించి చేసిన హత్యలవలన దీనికీపేరు కలిగెనని ఆదికాలమందున్న జెరోము (*Jerome*) నువాఁడు చెప్పెను. ఆ ప్రదేశమందలి యెఱ్ఱని మట్టినిబట్టి యీపేరు కలిగెనని సాధారణముగా ననుకొందురు. సామ్య మాటలను ప్రభువు చెప్పఁగా మంచి సమరయుఁడెవని పరామర్శించెనో వాఁడిచటనే దొంగలచేఁ జిక్కెనని తెలియును (లూకా $10^{30-37}$). ప్రస్తుత మచట మంచిసమరయుని పేరున సత్ర మొకటి యున్నది. (పటము II, G 1).

**అదుల్లాము** (Adullam = దొడ్డి).

1. కనానీయుల రాజులలో నొకఁడేలిన ముఖ్యమైన పట్టణము. యెహోషువయును ఇశ్రాయేలీయులును నా దేశమును జయించిన పిదప దీనిని యూదా గోత్రమున కిచ్చిరి (యెహో $15^{35}$). దీని రాజును యెహోషువ జయించెను ($12^{15}$). డెబ్బది సంవత్సరముల వఱకు బబులోనులో చెఱయుండుండి

నెహెమ్యా వెంటఁదిరిగి యూదయ దేశమునకు వచ్చిన వారిలోఁ గొందఱు అదుల్లామను నీ గ్రామమునకువచ్చి యచ్చట నివసించిరి (నెహె $11^{30}$). అది బేత్లెహేమునకు నైర్రుతి దిక్కుగా నున్నది (పటము II, E 2).

2. బేత్లెహేమునకు కొన్ని మైళ్లు దక్షిణ ముగానున్న కొండ ప్రదేశములోని యొక పెద్ద గుహ. రాజైన సౌలు దావీదును జంపవలెనని యతని తఱిమినప్పుడు దావీదీగుహను తన కాశ్రయ స్థానముగాఁ జేసికొనెను. అతని యొద్దకుఁజేరిన 400 మంది యుద్ధవీరులు ఆ గొప్ప గుహలో నుండుటకు కావలసినంత స్థలమందుం డెను (I సమూ $22^{1,2}$). అనేకసంవత్సరములు గడచిన పిదప దావీదు మహారాజు ఫిలిష్తీ యులతో యుద్ధమాడినప్పుడు తన యుద్ధ వీరు లతోగూడ నీ యదుల్లాము గుహలోఁ జేరెను (II సమూ $23^{13}$). అతనితో నుండిన ముగ్గురు బలాఢ్యులు ఫిలిష్తీయుల దండు వారి నోడించి దారి చేసికొనిపోయి బేత్లెహేము గుమ్మము దగ్గిరనున్న బావినీళ్లు చేది దావీదునొద్దకుఁ దీసి కొని వచ్చిరి. కొందఱిది పైనుదాహరింపఁబడిన పట్టణమునకు దగ్గరగానున్న అదే పేరుగల గుహ యందురు గాని II సమూ $23^{14-17}$ చూచిన యెడల నిది బేత్లెహేమునకు సమీపముగ నున్న టులఁ దెలియుచున్నది. అట్టి గొప్ప గుహలు ఇప్పటి వఱకును బేత్లెహేమునకు దక్షిణమున నుండు కొండలమయమైన యడవిలో కనుబడు చున్నవి. వాటిలో కొన్ని 1000 మంది సహా నివసించుటకు వీలగునంత పెద్దవి.

**అదృష్టదేవి** (Meni = అదృష్టము). అదృష్టదేవి యని తర్జుమాచేయఁబడిన అసలుమాట బైబిలునందు యెష $65^{11}$ లో మాత్రము కనఁ బడును. ఇంగ్లీషు బైబిలును సవరణఁజేసినవారు దాని నొక దేవత పేరుగా నెంచక అదృష్టమను పదముచే తర్జుమాచేసిరి. ఇది దేవతయైన యెడల హిందువుల లక్ష్మీదేవివంటిదనవచ్చును.

**అదోనీకాము** (Adonikam = దేవుఁడు లేచెను). చెఱకాలమునకు తరువాత నుండిన యొక కుటుంబ పెద్ద. ఇతని కుటుంబికులలో కొందఱు జెరుబ్బాబెలుతోను, మఱికొందఱు ఎజ్రా వెంటను యెరూషలేమునకు వచ్చిరి (ఎజ్రా $2^{13}$ $8^{13}$ నెహె $7^{18}$). ఇతఁడు నెహెమ్యా కాలములో నిబంధనను ముద్రించినవారిలో నొకఁడైయున్నట్లు నెహె $10^{16}$ వలన తెలియును గాని యచట నితనిపేరు పొరబాటున **అదోనీయా** యని వ్రాసిరి. (అదోనీయా 3 చూ॥)

**అదోనీబెజెకు** (Adonibezek = బెజెకు ప్రభువు). కనానీయుల రాజులలో నొకఁడు. యూదా షిమ్యోను గోత్రముల యోధు లతని జయించి, యతని కాలుసేతుల బొటనవ్రేళ్లను కోసివేసిరి. పిమ్మట అతఁడు యెరూషలేములో చనిపోయెను (న్యాయా $1^{3-7}$).

**అదోనీయా** (Adonijah = యెహోవా నా ప్రభువు).

1. దావీదురాజు నాల్గవ కుమారుఁడు. తల్లి హగ్గీతు (II సమూ $3^{4}$). అన్నలగు అమ్నోను కిల్యాబు అబ్షాలోములు చనిపోయిన తరువాత రాజ్యమున కితఁడే వారసుఁ డాయెను. ఇతఁడు రాజుగ నుండఁగూడదని దావీదు బహిరంగముగ జెప్పుచుండినను సింహాసనాసీనుఁడు కావలయునని ప్రయత్నించెను (I రాజు $1^{5-7}$). సెరూయా కుమారుఁడగు యోవాబుతోను యాజకుఁడైన అబ్యాతారుతో నాలోచన చేయఁగా వారితని పక్షము వహించి సహాయముఁ జేసిరి. దావీదంతకు పూర్వమే తన మరణానంతరము సొలొమోను రాజ్యము నేలవలయునని నియమించి యుండెను. (I దిన $22^{9,10}$ $28^{5}$ I రాజు $1^{13,17}$). సొలొమోను పుట్టినప్పుడు యెహోవా అతని ప్రేమించెనని ప్రవక్తయగు నాతాను ద్వారా దావీదు తెలిసి కొనెను (II సమూ $12^{24,25}$). అదోనీయా చేసిన దాని, సొలొమోను తల్లియగు బత్షెబద్వారా దావీదు తెలిసికొని, సొలొమోనును రప్పించి వెంటనే యతని శిరస్సున కిరీటముంచి యతని రాజుగ నభిషేకించెను. జనులంద అధికముగ సంతోషించిరి. అదోనీయాకిది తెలిసినప్పుడు భయపడి పారిపోయి యజ్ఞవేదిక కొమ్ములను పట్టుకొని తన్ను చంపవలదని సొలొమోనును వేడుకొనెను. సొలొమోనతని మన్నించి విడిచెను (I రాజు $1^{50-53}$). అయినను దావీదు మరణము నకుఁ బిమ్మట, అదోనీయా దావీదు భార్యయగు అబీషగును పెండ్లికిమ్మని మనవి చేయుటవలన రాజ్యమును గోరుటకు సమమగు అపరాధముగా

అది రొయింపఁబడి మరణమునొందెను (I రాజు $2^{13-25}$).

2. యెహోషాపాతు కాలమందు జీవించి ప్రజలకు బోధించుటకు అతనిచేత పంపఁబడిన యొక లేవీయుఁడు (II దిన $17^{8}$).

3. బాబెలు చెఱనుండి వచ్చిన తరువాత నిబంధనకు ముద్రవేసిన యొక ప్రధాని (నెహె $10^{16}$). అదోనీకాము అను మాటకు పొరపాటుగా వ్రాయఁబడి యుండును (అదోనీకాము చూ॥) H.

**అదోనీరాము, అదోరాము, హదోరము** (Adoniram, Adoram, Hadoram = దేవుఁడు సర్వోన్నతుఁడు). దావీదు సొలొమోను అను రాజుల కాలములో నితఁడు వెట్టి పనివారి మీఁదను, పన్ను వసూలుచేయువారి మీఁదను అధికారియై యుండెను (II సమూ $20^{24}$). పది గోత్రములవారు తిరుగుబాటుచేసిన పిమ్మట వారితో పన్నువిషయమై విచారణ చేయుటకు రెహబాము ఇతనిని పంపఁగా వారితనిని రాళ్లతోఁ గొట్టి చంపిరి (I రాజు $4^{6}$ $12^{18}$ II దిన $10^{18}$).

**అదోనీసెదకు** (Adonizedek = నీతికి ప్రభువు). యెహోషువ కనాను దేశముమీఁదికి దండెత్తి వచ్చినపు డితఁడెరూషలేమునకు రాజై యుండెను. యెహోషువ గిబియోనీయులతో సంధిచేసిన పిమ్మట ఇతఁడు మఱి నలుగురు రాజులతో సంధిచేసికొని గిబియోనీయులమీఁద యుద్ధముచేయఁగా గిబియోనీయులు సహాయము నిమిత్తము యెహోషువకు మొఱబెట్టిరి. యెహోషువ యిది విని హఠాత్తుగావచ్చి వారిమీఁదపడి జయించి అదోనీసెదకును తక్కిన నలుగురు రాజులతోకూడ చంపించెను (యెహో $10^{1-27}$). LXX లో ఇతని పేరు అదోనీబెజెకు అని యున్నది. కావున అదోనీబెజెకును అదోనీసెదకును ఒకఁడేయని కొందఱనుకొందురు (అదోనీబెజెకు చూ॥)

అదోను అద్దాను చూ॥

**అదోరయీము** (Adoraim = రెండు దిబ్బలు?). యూదయ మన్యప్రదేశములోని యూరు. రెహబాము కోటలు కట్టించుకొనిన యూళ్లలో నొకటి (II దిన $11^{9}$). ప్రస్తుతము హెబ్రోనుకు పడమరగా 5 మైళ్ల దూరములో నుండు దూర (*Dura*) యనునదే ఆ యూరు అని సాధారణముగా ననుకొందురు. (పటము II, E 2).

అదోరాము అదోనీరాము చూ॥



అద్దము

**అద్దము** (Looking Glass, Mirror).

పూర్వకాలమందు అద్దముల నిత్తడితోగాని (నిర్గ. $38^{8}$) రాగితోగాని, తగరముతోగాని చేసెడివారు. గొప్ప భాగ్యవంతులు వెండితోఁ జేయఁబడిన యద్దముల నుపయోగించిరి. ఆకాశము ఇత్తడితో పోఁత పోయఁబడిన యద్దమని పూర్వికు లనుకొనిరి (యోబు $37^{18}$). యెషయాచే గద్దింపఁబడిన భాగ్యవంతులైన యూదురాండ్రు చేతి యద్దములను వాడిరి (యెష $3^{23}$). క్రొత్తనిబంధనలో I కొరి $13^{12}$ II కొరి $3^{18}$ యాకో $1^{23}$ నందు అద్దములను గూర్చి చెప్పఁబడినది. J. C.

**అద్దాను, అదోను** (Addan, Addon). ఇది బాబెలు దేశములోని యూరు. ఇచ్చట నుండి కొందఱు చెఱకాలమునకు తరువాత జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు వెళ్లిరి (ఎజ్రా $2^{59}$ నెహె $7^{61}$). గాని వారికి తమ పితరుల పేరులు తెలియక పోవుటచే ఇశ్రాయేలీయుల లెక్కలో చేర్చఁబడలేదని ఎజ్రా 10, నెహె 10 అధ్యాయములలోని జాబితాలో వారి పేరులు లేకయుండుటవలన తెలిసికొనవచ్చును.

**అద్దారు** (Addar = విశాలత!)

1. పలెస్తీనుకు దక్షిణపాద్దులోనున్న యొక స్థలము (యెహో $15^{3}$).

2. బెన్యామీను వంశస్థులలో బెల యను వాని కుమారులలో నొకఁడు (I దిన $8^{3}$). ఇతనికి ఆది $46^{21}$ లో **అర్దు** యను మాఱుపేరు కలదు. (అర్దు చూ॥)

**అద్ది** (Addi). క్రీస్తువంశావళి క్రమమునకు సంబంధించిన యొకఁడు (లూ $3^{28}$).

**అద్నా** (Adna, Adnah = సంతోషము).

1. ఎజ్రాకాలములో అన్యస్త్రీని వివాహము చేసికొని ఎజ్రాప్రేరేపణవలన ఆమెను విడనాడినవాఁడు (ఎజ్రా $10^{30}$).

2. నెహెమ్యాకాలములో హారీము ఇంటివారగు యాజకులకు పెద్ద (నెహె $12^{15}$.)

3. దావీదు సిక్లగులోనుండఁగా అతని సహాయమునకై వచ్చిచేరిన మనష్షేగోత్రపు అధిపతులలో నొకఁడు (I దిన $12^{20}$).

4. యెహోషాపాతుకాలములో నుండిన సేనాధిపతి. ఇతఁడు యూదాగోత్రికుఁడు (II దిన $17^{14}$).

**అద్బయేలు** (Adbeel = దేవుని మహాశ్చర్యము!). ఇష్మాయేలు పుత్రులలో మూఁడవవాఁడు. తరువాతికాలములో ఇదియొక గోత్రమునకు పేరయ్యెను (ఆది $25^{13}$ I దిన $1^{29}$). క్రీ॥ శ॥ ముందు 8-వ శతాబ్దపు రాతిశాసనముల వలన అరబ్బీదేశములో **ఇదిబేయిలు** (*Idibail*) అను జాతివారుండినట్లు తెలియుచున్నది. వారది యిదేగోత్రమని యంగీకరింతురు.

**అద్భుతములు** (Miracles). ఇవి దేవుని శక్తిని గనపఱచు అసాధారణమగు పనులని చెప్పఁదగును. అట్టివి ఊరకయేగాక ఏదోయొక మేలుకార్యము చేయుటకుగాని ఒక బోధను స్థిరపఱచుటకుగాని జరిగియుండును. వీటిని తెలుపుటకు క్రొత్త నిబంధనయందు మూఁడుపదములు వాడిరి. ఒక పదమును శక్తిని కనబఱచు **అద్భుతము**, రెండవదానిని ఆశ్చర్యము పుట్టించు **మహాశ్చర్యము**, మూఁడవదాని ఆత్మీయ బోధలను సూచించు **సూచకక్రియ** అను మాటలచే భాషాంతరముచేసిరి (కార్య $2^{22}$). బైబిలు నందిట్టి యద్భుతములు నిరంతరము జరుగక, నాలుగు చరిత్ర సమయములయందు ముఖ్యముగా జరిగినట్లు చూడవచ్చును.

ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి వచ్చుట మొదలుకొని వారు కనానులో ప్రవేశించి దానిలో స్థిరపడునంతదనుక యున్నకాలము మొదటిది. (మొత్తము మీఁద నిర్గమ, సంఖ్యా కాండములు యెహోషువ గ్రంథములను, ప్రత్యేకమైన అద్భుతములకొఱకు నిర్గమ $10^{13,19}$ $16^{13}$ సంఖ్యా $16^{31}$ మొ॥). రెండవకాలము ఇశ్రాయేలుదేశము భ్రష్టమైపోవనున్న ఏలీయా ఎలీషాలకాలము. నిజమైన మతము నప్పుడు నిలుపఁబెట్టుటకు ఇట్టి యద్భుతములు విశేషముగా జరిగెను (I రాజు 17-II రాజు 8). మూఁడవది ప్రవక్తలకాలము. మఱి విశేషముగా బాబెలు చెఱకాలము (యెష 37-39, దానియేలు గ్రంథము, యోనా గ్రంథము మొ॥). నాలుగవది క్రీస్తు, ఆయన అపొస్తలులకాలము (నాలుగు సువార్తలు, కార్యములు). వీటియందే కాలమందైనను అద్భుతములు ఊరకయే తమాషాగా జరిగినవింతలుగాక దేవుని రక్షణకరమైన కార్యములను స్థాపించుటకును, ఉద్ధరించుటకును జరిగి యున్నవి.

బైబిలునందలి యద్భుతములనుగూర్చి విచారించునప్పుడు సాధారణముగా క్రీస్తుచేసినవాటిని గూర్చి తలంతుము. అవి అయా విధములుగా నున్నవి. క్రీస్తు దయ్యములను వెళ్లఁగొట్టెను (మ $8^{28}$ $15^{28}$ $17^{18}$ మా $1^{25}$ మొ॥). పక్షవాయువుగల వారిని (మ $8^{13}$ $9^{5}$ యోహా $5^{9}$), ఊచచేయిగలవానిని (మ $12^{13}$), బలహీనపఱచు ఆత్మ పట్టిన స్త్రీని (లూ $13^{12}$), రక్తస్రావరోగముగల స్త్రీని (మ $9^{22}$), జలోదర రోగము గలవానిని (లూ $14^{2}$), జ్వర పీడితులగు వారిని (మ $8^{15}$), మూగచెవిటి గుడ్డివారిని (మ $9^{33}$ $12^{22}$ మా $7^{35}$ మ $9^{29}$ $20^{34}$ మా $8^{25}$ యో $9^{7}$), కుష్ఠరోగులను (లూ $17^{19}$) బాగుచేసి, మృతులను సహా బ్రతికించెను (మ $9^{25}$ లూ $7^{15}$ యోహా $11^{44}$). స్పష్టపఱచునట్టి యద్భుతములనేగాక తుఫానును నిమ్మళింపఁజేసి (మ $8^{26}$), 5000 మందికి (మ $14^{19}$), 4000 మందికి (మ $15^{36}$), ఆహారముపెట్టుట, సముద్రముమీఁద నడుచుట (మ $14^{26}$), నీళ్లు

ద్రాక్షారసముగా మార్చుట (యోహా 2[9]) అను ప్రకృతికి సంబంధించిన యద్భుతములనుజేసెను. ఇట్లు అంజూరపుచెట్టు ఎండిపోవునట్లుజేయుట (మ 21[19]), ఒక్కచేపను (మ 17[27]), అనేక చేఁపలను (లూ 5[6] యోహా 21[6]) పట్టించుటయు అందులోచేరి యున్నవి. క్రీస్తు మృతులలో నుండి లేచుటయే అన్నిఁటిలో గొప్ప యద్భుతమై యుండి, అన్నిఁటికి నాధారముగా నెంచఁదగును (I కొరి 15[1-11]).

అపొస్తలులును ఇట్టి యద్భుతములను జేసిరి గాని వారు తమ స్వశక్తిచేతఁగాక క్రీస్తు శక్తివలన వాటినొనర్చిరి (కార్య 2[43] 5[12,16] 6[8] 14[9] 16[18] 28[8] మొ॥). అద్భుతములుచేయుట ఆత్మవరములలో నొకటి (I కొరి 12[10]). క్రొత్తనిబంధనలోని యద్భుతముల నన్నిఁటిని తొలగించి, అవిలేని గ్రంథమగునట్లు దాని సవరించుటకు కొందరెంతో యత్నించిరిగాని వారియత్నములన్నియు నిష్ఫలములయ్యెను. ఈ యద్భుతములు మొదటి నుండియుండుట మాత్రమేగాక, అవి క్రీస్తు బోధయందెంతో ముఖ్యములైన వగుటచేవాటిని లోపింపవీలుపడదు.

అద్భుతములనుగుఱించి యీ దిగువ విషయములను గుర్తింపవలసియున్నాము.

1. క్రీస్తు అద్భుతములను జేసినను, అవి తన బోధ లన్నిఁటిలో మిగుల ముఖ్యవిషయమని ఆయన యేమాత్రము బోధింపలేదు. అద్భుతములను చూడఁగోరినవారి నెల్లప్పుడు ఖండించెను. (యోహా 4[48] మ 16[4]). సత్యమును వెల్లడిచేయుటకును దానిని నిర్ధారణచేయుటకును అవసరమగుటచే అవి జరిగెను. అందు ముఖ్యమైనది బైలుపరచబడిన సత్యమేగాని, దాని యందలి వింతకాదు. అద్భుతములు చేయువారందఱిలో నెక్కువ వరముపొందియున్నారను బోధ ఆత్మీయ వరములనుగూర్చి చెప్పఁబడిన దానియందు కనఁబడదు (I కొరి 12[28]).

2. అద్భుతములు దేవునిచట్టములకు భిన్నముగా నున్నవి కావున వాటిని నమ్మవీలులేదని కొందఱాక్షేపింతురు. అయితే దేవుని చట్టములకు భిన్నముగానున్న వాటిని మనుష్యులు సహా ఒక విధముగా చేయఁగలరు. నీళ్లు కొండమీఁదకు పోవుట దేవునిచట్టము ననుసరించునదిగాక దానికి భిన్నముగానున్నది. అయితే నీటిని కొండమీఁదకు పోవునట్లు మరలనమర్చి అట్లు చేయుచున్నారు గదా. దీనియందే చట్టమైనను రద్దుపఱచఁబడుచున్నదా? నీటిని క్రిందికాకర్షించు భూమ్యాకర్షణశక్తికన్న, నీరుపైకి యెక్కునంత వఱకు దానిని పైకి నడుపు మరశక్తి యెక్కువబలముగా నున్నదని తెలిసికొనవలెను. అట్లే ప్రకృతిశక్తి కన్న బలమైనదగు దేవునిశక్తి ప్రయోగమువలన అద్భుతములు జరుగగానే చట్టమునకైనను భంగముకలుగుట లేదని స్పష్టమగు చున్నది. దేవుఁడు సర్వశక్తుఁడని తెలిసికొనువారు, ఆ యద్భుతములు జరగనేరవని యే మాత్రమును తలంచఁజాలరు.

3. మఱియొక విషయమును ఆలోచింపవలసి యున్నది. ప్రతివిధమైన అద్భుతమును నమ్మఁదగిన దేనాయని మరికొందఱాక్షేపించుచున్నారు. తగిన కారణములున్న దేవుఁడు అద్భుతములను చేయునని నమ్మఁదగునుగాని క్రీడార్థమును మానవుల కాశ్చర్యమును పుట్టించుటకును వాటిని చేయునని నమ్ముటకు వీలులేదు. మానవులరక్షణయు నీతిస్థాపనయును, ఆత్మీయసంగతుల దృఢపఱచుటయు దేవుఁడు మహాత్కార్యములు చేయుటకు తగిన కారణములై యున్నవి. అవి యన్నిటిలో ముఖ్యములైనవి గాన మానవులు వాటి నెఱుంగకపోవుట తటస్థించిన పక్షమున, అట్టి సంగతులను తెలుపుటకై తనశక్తిని విశేషరీతిగా కనపరచుట ప్రేమాస్వరూపుఁడగు తండ్రియైన దేవునికి తగినకార్యమని ఒప్పుకొనక తీరదు. బైబిలునందలి యద్భుతములట్టివగుటచే వాటిని నమ్మవలెనుగాని అట్టివికానివాటిని నమ్మవీలులేదు.

**అద్మా** (Admah = ఎఱ్ఱనిది ?). సొదొమ గొమొఱ్ఱాయను పట్టణములకు సమీపముననున్న యొక పట్టణము (ఆది 10[19] 14[2,8]). ఇది వాటితో కూడ నశించెను (ద్వితీ 29[23] హోషే 11[8]). ఆది 19-వ యధ్యాయమున దీని పేరులేకున్నను, 25 వచనములో ఆ మైదానమంతను . . . నాశము చేసెను అని చెప్పుటవలన, సొదొమ గొమొఱ్ఱాలతోపాటు నిదియును నాశనమాయెనని తెలియుచున్నది.

**అద్మాతా** (Admatha). చక్రవర్తియగు అహష్వేరోషు సన్నిధిని అగ్రపీఠములమీఁద

కూర్చుండు పారసీక మాదీయ ఆలోచనకర్తలైన ఏడుగురు జ్ఞానులలో నొకఁడు (ఎస్తే 1$^{15}$).

**అద్రముత్తియ** (Adramyttium). చిన్నాసియాలో వాయువ్య దిక్కుననున్న మూసియ (*Mysia*) అను పరగణాలోనుండు రేవుపట్టణము. అది నేటివఱకునున్నదిగాని ప్రస్తుతము సముద్రమునకు ఆరుమైళ్లదూరముననున్నది. రోమాకు ఖైదీగాఁ బోవుచుండినపౌలు అద్రముత్తియ పట్టణపు ఓడనెక్కి మూర (*Myra*) వఱకుఁ బ్రయాణముచేసెను (కార్య 27$^{2-5}$). ఈ పట్టణపు పేరు ఓడకు సంబంధముగా నుండుటదప్ప దీని గూర్చి మఱేట్టి ప్రశంసయులేదు. (పటము V, H 3).

**అద్రమ్మెలెకు, అద్రెమ్మెలెకు** (Adrammelech = అదారు రాజు).

1. క్రీ॥ ము॥ 721 సం॥ ము అష్షూరురాజైన సర్గోను ఇశ్రాయేలు పదిగోత్రముల వారిని చెఱగొనిపోయిన పిదప, వారి నీ దేశమునందు గాపురముండుటకై దెచ్చిన సెపర్వయీము ప్రజలారాధించుచుండిన దేవతలపేర్లు (II రాజు 17$^{31}$). ఈ దేవతయే జలప్రళయమునకు కారకుఁడని పురాతన కాలపు అష్షూరీయులు తలఁచెడివారలు. కల్దీయులును, పారశీకులు నారాధించుచుండిన సూర్య దేవత యిదియైయుండవచ్చును. అద్రమ్మెలెకు సూర్యునియొక్క పురుషశక్తి యనియు, అనెమ్మెలెకు సూర్యుని స్త్రీశక్తి యనియు కొందఱి యభిప్రాయము. మొలెకు దేవత ఘనత నిమిత్తము బిడ్డలను దహించుటద్వారా దాని నారాధించినట్లే, ఈ దేవతనుకూడ నారాధించెడివారు. దీని నిషేధింపవలెనని దేవుఁడిశ్రాయేలీయులకు ఖండితమైన ఆజ్ఞ నిచ్చెను (లేవీ 18$^{21}$).

2. అష్షూరురాజైన సన్హెరీబును జంపిన అతని కుమారులలో నొకఁడు (II రాజు 19$^{37}$). B.

**అద్రియ** (Adria). మధ్యధరా సముద్రములోని యొకభాగముపేరు. ఏడ్రియాటిక్ (*Adriatic*) సముద్రపు ఉత్తర భాగమునకు మొదట ఈ పేరుండెనుగాని క్రమక్రమేణ ఇది యా సముద్రమునకు మాత్రమేగాక దానికి, దక్షిణముగానున్న మాల్టా (*Malta*) క్రేతు, (*Crete*) అను దీవులసరిహద్దువఱకు వ్యాపించిన సముద్రభాగమంతటికిని వాడిరి (కార్య 27$^{27}$). రోమాకు పౌలును ఖైదీగాదీసికొనిపోవుచుండిన యోడ ఈ సముద్రములోఁబడి, అటునిటు తుఫానుచే కొట్టఁబడెను.

**అద్రీయేలు** (Adriel = దేవుని మంద). సౌలుయొక్క అల్లుఁడు. సౌలుదావీదున కిత్తునని మాటనిచ్చిన మేరబును అతనికియ్యక ఆమెను ఇతనికిచ్చివివాహముఁజేసెను. ఇతఁడు మెహోలతీయజాతివాఁడు (I సమూ 18$^{19}$). ఇతని అయిదుగురు కుమారులను ప్రాయశ్చిత్తార్థముగా గిబియోనుపట్టణస్థులకు నప్పగించిరి (II సమూ 21$^{8}$).

**అద్లయి** (Adlai = న్యాయము లేక యెహోవా న్యాయము). దావీదు పశువుల మీఁద నుండువారిలో నొకఁడైన షాపాతను వానికి తండ్రి (I దిన 27$^{29}$).

**అధరము** పెదవి చూ॥

**అధికారదండము** రాజదండము చూ॥

**అధికారమందిరము** ప్రేతోర్యము చూ॥

**అధికారి, అధిపతి, ప్రధాని** (Governor, Procurator, Deputy, Proconsul, Captain, Ethnarch, Prince).

ఇవి హెబ్రీ గ్రీకు భాషలయందలి వెవ్వేరు పదములకు భాషాంతరముచేయఁబడిన మాటలు. I రాజు 22$^{47}$ నందువాడిన ప్రధాని యను పదమును రాజునకున్నంత యంతస్థులేనివానిఁ దెలుపుట కుపయోగించిరి. మొత్తముమీఁద ఆ మూలభాషా పదములను అధికారులు, అధిపతులు, ప్రధానులు అనుమాటలచే భాషాంతరీకరించిరి. వీరందఱును రాజుకంటె హోదాయందు తక్కువైన వివిధ యధికారములు గలవారు. సంఖ్యా 2$^{5,10}$ లో కుటుంబపెద్దలు ప్రధానులనఁబడిరి. గాన నీ పదములను విచారించుట యంత అగత్యముగాఁ దోఁచదు. ఈ శీర్షికయందు రెండు విధములగు పదములనుగూర్చి చెప్పెదము.

### I. పారసీక రోమను చక్రవర్తుల క్రింద కొలువుజేసిన పరిపాలకులను దెల్పెడి పదములు.

1. పారసీక గవర్నరులు (*pahah*). తెలుఁగు బైబిలునందు అధికారులనఁబడిరి. ఈ మూల పదము ఎస్తే $8^{9}$ హగ్గ $1^{1}$ $2^{21}$ మలా $1^{8}$ ఎజ్రా $5^{3,6,10,15}$ మొ॥ నెహె $2^{7}$ మొ॥ కనఁబడును. ఎస్తే $9^{3}$ నందీమూల పదమునే **ప్రభువులు** అని భాషాంతరము చేసిరి. తమ పేరట దేశము నేలుట కిట్టి గవర్నరులను పారసీకరాజులు నియమించిరి. జెరుబ్బాబె లీతరగతికి జేరినవాఁడు.

2. క్రొత్త నిబంధనయందు రోమను ప్రభుత్వములో నిట్టి యేర్పాటే యొకటిగలదు. రోమా పట్టణమందలి చక్రవర్తిగాని, మహాసభ (*Senate*) గాని, ఆయా పరగణాల నేలుటకిట్టి గవర్నరుల నేర్పఱచిరి. దీనికిని వేర్వేరు పదము లుపయోగించిరి. చక్రవర్తిచే నియమింపఁబడిన వారికొక పదమునువాడిరి. అది మ $27^{2,14}$ లూ $20^{20}$ కార్య $23^{33}$ నందుగలదు. పిలాతు, ఫేలిక్సు, ఫేస్తు అనువారీతరగతికిఁ జెందినవారలు. తెలుఁగు బైబిలునందు దీనిని **అధిపతి** యని తర్జుమాజేసిరి. అసలునందున్న మఱియొక మాటను అధిపతియనియే తర్జుమాజేసిరి. అది కార్య $13^{7,8,12}$ $18^{12}$ $19^{38}$ నందు జూడవచ్చును. వీరాయా పరగణాలకు రోమను చక్రవర్తిచేగాక, మహాసభ (*Senate*) వారిచేత నియమింపఁబడిరి. సెర్గిపౌలు (కార్య $13^{7}$), గల్లియో ($18^{12}$) ఈ తరగతికిఁజెందిరి. రోము ప్రభుత్వమునందు బహు తరుచుగ మార్పులు జరిగినందున పలెస్తీను యేలుబడి చాల కష్టముగ నుండెను. (పలెస్తీను VI చూ॥).

II. **దూతలను వారిశక్తులను దెలుపుటకు వాడిన పదములు.** మానవశక్తికి మించిన శక్తిగలవైయున్నందున వాటికాపేరు గలిగెను. దూతలలో మంచివి చెడ్డవియను రెండు తరగతు లుండెను. వీటియందును అధికారము లున్నట్లు తెలియుచున్నది. యూదులు యేసు దయ్యముల అధిపతియని దేవదూషణఁజేసిరి (మ $9^{34}$ $12^{24}$). మనలను శోధించు దుష్టాత్మలు, ప్రధానులు, అధికారులు, లోకనాధులు అని పౌలు వారికి పేరులు పెట్టెను (ఎఫె $6^{12}$). రోమా $8^{38}$ లోని ప్రధానులు ఇట్టివారేయని తోచును. సాతాను దయ్యముల కధికారియై యున్నట్లు క్రీస్తుకూడ బోధించెను (మ $12^{26}$). పౌలువానిని వాయుమండల సంబంధమైన **అధిపతి** యని పిలిచెను (ఎఫె $2^{2}$). ఈమాట దురాత్మలను తెలియజేయుటకు మాత్రమేగాక మంచియాత్మలకును వాడిరి. రోమా $8^{38}$ లో నున్న **దూతలు** అట్లువాడఁబడెను. యూదా 9 లో మిఖాయేలు **ప్రధానదూత** యని తెలియుచున్నది. ఇది గాక యేసుకును అధిపతియను మాటను వాడిరి (కార్య $5^{31}$). హెబ్రీ $12^{2}$ లో ఆయనను రక్షణకు **కర్త** యని పిలిచినను ఇక్కడ అధికారిని సూచించు అసలుపదము వాడఁబడెను. ఈ **అధిపత్య** మెట్టిదో మ $28^{18}$ ఫిలి $2^{9-11}$ I కొరి $15^{25-28}$ మొ॥వచనములలోఁ గనుపడును. (దేవదూతలు, యేసుక్రీస్తు IV 3 (1) చూ॥).

**అధ్యక్షుడు** (Bishop). బైబిలు నందీ పదము క్రొత్త నిబంధనయందే గలదు. ఆ మాటకు **విచారణకర్త** యని అర్థము. క్రొత్త నిబంధనయందు దాని 5 మారు లుపయోగించిరి (కార్య $20^{28}$ ఫిలి $1^{1}$ I తిమో $3^{2}$ తీతు $1^{7}$ I పేతు $2^{25}$). I పేతు $2^{25}$ నందది క్రీస్తుకును ఇతర వాక్యములలో సంఘోద్యోగస్థులకును వాడఁబడెను. కార్యములందు పెద్దలు ($20^{17}$), **అధ్యక్షులు** ($20^{28}$) ఒకరినిగూర్చియే వాడిరి. ఫిలి $1^{1}$ లో సంఘపు ఉద్యోగస్థులు అధ్యక్షులు, **పరిచారకు**లని పిలువఁబడిరి. I తిమో $3^{1-13}$ నందీ విభజనయేగలదు (వచ 1, 8 చూ॥). తీతు $1^{5-9}$ చూడఁగా, ఒక యేయుద్యోగముగలవారికి మొదట పెద్ద అనియు (వచ 5,6), తరువాత **అధ్యక్షుఁడు** అని బిరుదులు గలిగినట్లు తెలియును. ఈ వచనములన్నింటిని సరిపోల్చుట వలనను, బైబిలు నందులేని ఆదిక్రైస్తవగ్రంథములలో నున్నట్లు మొదటి సంఘపు యేర్పాటులను లక్షించుటవలనను, మొదటినుండి యున్న ఉద్యోగములు, అధ్యక్షులు పరిచారకులు అనెడి ఈ రెండేయని పండితుల సాధారణ యభిప్రాయమై యున్నది. విచారణకర్తలను వారి స్థితినిబట్టి పెద్దలనియు, ఉద్యోగమునుబట్టి అధ్యక్షులనియు బిలిచిరి. క్రైస్తవ సంఘమునందు ప్రస్తుతము అధికముగా వ్యాపించి యున్న అధ్యక్షులు, గురువులు, పరిచారకులను మూఁడు తరగతుల ఉద్యోగములు క్రొత్త నిబంధనకు తరువాతి కాలమున వచ్చినవై యున్నవి. (పెద్దలు చూ॥).

**అననీయ** (Ananias=యెహోవా దయ).

1. యెరూషలేమునందుండిన నొక యూదుఁడు. ఇతని భార్యపేరు సప్పీరా. వీరిద్దఱును క్రైస్తవులై ఆది సంఘమునఁ జేరిరి. అప్పుడు విశ్వసించుచుండినవారందఱును జేయుచున్నట్లు (కార్య $4^{32}$), వీరును తమ పొలమును అమ్మిరి ($5^{1}$). భార్య యెఱుకనే దానివెలలోఁ గొంత దాచుకొని కొంత తెచ్చి అంతయును తెచ్చుచున్న వానివలె నటించి దాని నపొస్తలుల పాదముల యొద్దఁ బెట్టెను ($5^{2}$). పేతురీ సంగతిని పరిశుద్ధాత్మవలనఁ దెలిసికొనినవాఁడై, వానిని గద్దింపఁగా నతఁడు పడి ప్రాణములు విడిచెను ($5^{4,5}$). అతని భార్యపెనిమిటి సంగతి నెఱుఁగకయే లోనికి వచ్చి, అబద్ధమాడి ఆమెయు మరణమాయెను ($5^{6-10}$). దేవుఁడబద్ధమును సహించఁడను సంగతి దీనివలన ఆది సంఘపువారికి విశదమాయెను.

2. దమస్కు నందలి భక్తిగల క్రైస్తవుఁడు. దమస్కులోని క్రైస్తవులను హింసించుటకు ప్రధాన యాజకునివలన అధికారమును పొంది, అచ్చటకుఁ బోవుచున్న సౌలు ప్రయాణాంతమున క్రీస్తు దర్శనము నొంది గుడ్డివాఁడయి దమస్కు చేరినప్పుడతనిని ఈ అననీయ దర్శించెను. అతనితో మాటలాడి, శిష్యునిఁగా నంగీకరించి, అతనిపై చేతులుంచి దృష్టికలుగునట్లు చేసెను. పిదప అతనికిబాప్తిస్మమిచ్చెను (కార్య $9^{10-18}$ $22^{12-16}$). తరువాత నితఁడు దమస్కులోని సంఘమున కధ్యక్షుఁడై హతసాక్షియాయెనని అనేకు లనుకొందురు.

3. యెరూషలేము నందలి యొక ప్రధాన యాజకుఁడు. రాజైన హేరోదు క్రీ॥ శ॥ 48 సం॥ న ప్రధాన యాజకుఁడుగా నియమించిన నెదెబీయుని కుమారుఁడు. 52 వ సం॥ న నితనిపై సమరయులు మోపిన నేరముల నిమిత్తము రోమాపురమునకుఁ బోయి, విచారణాంతమున నేరస్థుఁడు కాఁడని తీర్మాన మయినందున తిరిగి యెరూషలేమునకువచ్చి తన యుద్యోగమును మరల వహించెను. మూఁడవ ప్రయాణాంతమున యూదులు పౌలును పట్టుకొనినప్పుడు సహస్రాధిపతి పౌలును అననీయ యెదుట విచారణకు నిలువఁబెట్టెను. నిష్కారణముగా నతఁడు పౌలును కొట్ట నాజ్ఞాపించినప్పుడు పౌలతనిని గద్దించెను (కార్య $23^{2,3}$). ఇతనికి మంచిపేరు లేదు. పన్నులను అన్యాయముగా వేసి, బలవంతముగా వాటిని జమచేసి, తన యాధీనమున నుండిన యాజకుల భాగము నియ్యక తానే దాని నపహరించెనని చెప్పెదరు. యూదులు రోమక చక్రవర్తికి విరుద్ధముగా తిరుగఁబడి కఠిన యుద్ధముచేయు సమయమున చోరు లితని యింటిని కాల్చివేయఁగా నితఁడు పారిపోయి ఒక వారధిక్రింద దాగుకొనెను గాని వారతని కనుఁగొని చంపివేసిరని యూదుల చరిత్రకారుఁడగు యోసీఫసు దెలుపుచున్నాఁడు. C.

**అనన్యా** (Ananiah = యెహోవా కప్పివేసెను).

1. నెహెమ్యాకాలములో యెరూషలేము గోడలుకట్టు వంతుగల పెద్దలలో నొకఁడగు అజర్యా యనువాని తాత (నెహె $3^{23}$).

2. హనన్యా 4 చూ॥

3. చెఱకాలమునకు తరువాత బెన్యామీనీయులు నివసించిన యొక యూరు (నెహె $11^{32}$). అది ప్రస్తుతము బెయిట్ హనీనా (*Beit Hanina*) యను పేరట యెరూషలేమున కుత్తరముగా రెండుమైళ్ల దూరములో నున్నది. (పటము IIF 1).

**అనహరాతు** (Anaharath = ముక్కురంధ్రము లేక కొండలసందు?). ఇశ్శాఖారీయుల సరిహద్దులలో నుండు ఒక యూరు (యెహో $19^{19}$). ప్రస్తుతము యెజ్రెయేలుకు ఈశాన్య దిక్కున 5 మైళ్ల దూరములో నున్న ఎనీనయూర (*en-Na'urah*) అనునదే ఆ యూరి పేరై యున్నట్లు కొందఱనుకొందురు.

**అనా** (Anah = ఆలకించుట?).

1. సిబ్యోను అనువాని కుమార్తెయొక్క పేరు (ఆది $36^{2}$). ఈమె ఏశావు భార్యలలో నొకదాని అనఁగా అహోలీబామాయొక్క తల్లి (ఆది $36^{14,18,25}$). కొన్ని తర్జుమాలలో ఈ అనా కుమార్తె గాక కుమారుఁడై యున్నట్లు వ్రాసి యున్నారు. ఇది సరియైనయెడల ఇతఁడును ఈ దిగువ (2) లో వివరింపఁబడిన యతఁడును ఒకఁడే యని తెలిసికొనవలయును.

2. సిబ్యోను అనువాని కుమారుఁడు (ఆది 36[24] I దిన 1[40,41]). ఇతఁడు అరణ్యములో వెచటనో ఉష్ణధారలు కనుఁగొనినవాఁడు.

3. సిబ్యోను అను వాని సహోదరుఁడును హోరీయుల నాయకులలో నొకఁడు నైనవాఁడు (ఆది 36[20,29] I దిన 1[38]).

పైన వేర్వేరుగా వివరింపఁబడిన ముగ్గురును ఒకఁడేయని కొందఱందురు.

**అనాకు, అనాకీయులు, అనాకు వంశకులు** (Anak, Anakim = పొడుగు మెడ గలవారు). వీరు ఆదికాలమందు యూదయ ప్రదేశములో నివసించిన దీర్ఘదేహులై యుండిరి. అనాకు అనునది యొకని పేరు మాత్రమే గాక ఒక జాతికిఁ జెందిన పేరై యున్నది (యెహో 15[13,14]). ఆజాతికి మూల పురుషుఁడగు అనాకు యొక్క ముగ్గురుకొడుకులగు షేషయి, అహీమాను, తల్మయి యనువారలు మూఁడు గోత్రములకు పూర్వికులైరి. వీరిని కాలేబు ఓడఁగొట్టి జయించెను (న్యాయా 1[20]). యెహో 11[21] చూడఁగా అనాకీయులు యూదయ దేశమంతటిలో నుండినట్లు తెలియును. వీరు నశించినను యెహోషువ కాలమునకు పిమ్మట వీరిలో కొందఱు గాజాగాతు అష్డోదులలో నుండిరి (యెహో 11[22]). గొల్యాతు అను రాక్షసుఁడు వీరి వంశములో పుట్టినట్లుగా నున్నది.

**అనాతు** (Anath = ఆలకించుట). ఇతఁడు న్యాయాధిపతియైన షమ్గరు తండ్రి (న్యాయా 3[30] 5[6]).

**అనాతోతీయుడు, అన్నెతోతీయుడు, అనాతోతువంశస్థుడు** (Anathothite) అనాతోతు అను ఊరినివాసి (II సమూ 23[27] I దిన 11[28] 27[12] ఎజ్రా 2[23]). (అనాతోతు చూ॥)

**అనాతోతు** (Anathoth = అన్యదేవత యగు అనాతు ఊరు?).

1. బెన్యామీనీయులలోని బేకరు సంతతి వారిలో నొకఁడు (I దిన 7[8]).

2. నెహెమ్యా కాలమునందు నిబంధనను ముద్రించినవారిలో నొక పెద్ద. ఇతఁడు అనాతోతు ఊరివారి ప్రతినిధియై యుండెను (నెహె 10[19]).

3. బెన్యామీనీయుల ప్రదేశములో నొక యూరు. అది యెరూషలేమునకు ఉత్తరముగా రెండు మైళ్ల దూరములో నున్నది. ప్రస్తుతము దానికి అనాట (*Anata*) యని పేరు. ఈ యూరు మొదట లేవీయుల కియ్యఁబడెను (యెహో 21[18] I దిన 6[60]). ప్రధాన యాజకుఁడైన అబ్యాతారును (I రాజు 2[26]) ప్రవక్తయైన యిర్మీయాయును (యిర్మీ 1[1]), ఈ యూరివారే. ఈ యూరివారు యిర్మీయాను జంప వెదకిరి (యిర్మీ 11[21]). చెఱకాలమునకు తరువాత యూదులు నివసించిన గ్రామములలో నొకటియై యుండెను (ఎజ్రా 2[23]). (పటము II, F 1)

**అనాని** (Anani = మబ్బుగా లేక నా మేఘము). దావీదు సంతతిలోని ఎల్యోయేనై కుమారులలో నొకఁడు (I దిన 3[24]).

**అనాబు** (Anab = ద్రాక్షాపండ్ల సమృద్ధి). యూదా మన్యప్రదేశములో నున్న యొక యూరు (యెహో 11[21] 15[50]). నేటిదినము వరకు ఈ పేరుగల పాడు శేషములు హెబ్రోనుకు నైరృతిదిక్కున ఆమడ దూరములో నున్నవి. (పటము II, D 3).

**అనామీయులు** (Anamim). ఆదికాలమందు ఐగుప్తు దేశములోనున్న యొక జనము (ఆది 10[13] I దిన 1[11]). ఈ జనమును గూర్చి యీ వచనములలోనున్న సంగతి తప్ప మఱియేమియు తెలియదు.

**అనాయా** (Anaiah = యెహోవా ప్రత్యుత్తరమిచ్చెను). 1. ఒక లేవీయుఁడు. ఎజ్రా ధర్మశాస్త్రమును చదివించిన సమయమున అతని దగ్గఱ నిలిచిన వారిలో ఈ అనాయా యొకఁడు (నెహె 8[4]).

2. దేవునినే సేవింతుమని ప్రజలు చేసిన నిబంధనను ముద్రించినవారిలో నొకడు (నెహె 10[22]). ఇతఁడును పై అనాయా యనువాఁడు నొకఁడే యని కొందఱును, వేఱువాఁడని మఱికొందఱు ననుకొందురు.

**అనివి** ఓడ[illegible] చూ॥

**అనీయాము** (Aniam = ప్రజల నిట్టూర్పులు). మనష్షే సంతతి వారిలో నొకఁడైన షెమీదా యనువాని కుమారుఁడు (I దిన 7[19] సంఖ్యా 26[29-32] చూ॥).

**అనుగ్రహము** కృప చూ॥

**అనుపదగీతము** రసిక కావ్యము చూ॥

**అనుమానము** సందేహము చూ॥

**అనురాగము** కృప చూ॥

**అనెమ్మెలెకు** (Anammelech = అను యను దేవతయొక్క రాజు). ఇది యొక దేవత పేరు. పది గోత్రములవారిని చెఱపట్టఁబడిన తరువాత షోమ్రోనులో నుంచఁబడిన సెఫర్వీయులు ఈ దేవతను ఆరాధించిరి. వారు దానికి తమ పిల్లల నర్పించిరి (II రాజు 17[31]). అను (*Anu*) యను దేవత హిందువుల వరుణునివలె ఆకాశ విశాలతకు దేవతయై యున్నది (అద్రమ్మెలెకు 1 చూ॥).

**అన్న.**

1. (Anna = కృప, దయ). యేసుక్రీస్తు పుట్టినప్పుడు యెరూషలేమునందుండిన యొక ప్రవక్త్రి. ఆషేరు గోత్రికుఁడైన పనూయేలు కుమార్తె. యౌవనురాలై యున్నప్పుడే వివాహమాడెను. ఏడు సంవత్సరములైన పిదప విధవరాలయ్యెను. అదిమొదలు దేవుని బహు ఆసక్తితో సేవించి, దేవాలయమునందు జరుగు ఆరాధనకు ప్రతిదినము వచ్చెను. యేసును నలుబదవదినమున అర్పించుటకు దేవాలయములోనికిఁ దెచ్చినప్పుడు ఆమె శతవృద్ధయయుండెను. ఆమె లోనికివచ్చి, ఆ శిశువునుజూచి, రావలసిన మెస్సీయ ఈయనే యని గ్రహించుకొని, దేవుని కొనియాడి యెరూషలేములో విమోచన కొఱకు కనిపెట్టుచున్న వారందఱితోను ఆయనను గూర్చి మాటలాడుచుండెను (లూ 2[36-38]).

2. (Annas = దేవునికృప). యూదుల ప్రధాన యాజకులలో నొక ముఖ్యుఁడు. సిరియ దేశమున కధిపతియైన కురేనియు వలన క్రీ॥ శ॥ 7 లేక 8 సం॥ ప్రధానయాజకుఁడుగా నేర్పరచఁబడెనుగాని 15 సంవత్సరములైన పిదప నా యుద్యోగమును వదలుకొనవలసివచ్చెను. తరువాతి మూఁడు సంవత్సరములలో నింక ముగ్గురాపనికి నియమింపఁబడిరి గాని వారికి నిదే ప్రాప్తిసంభవించెను. క్రీ॥ శ॥ 25 సం॥ అన్నయొక్క అల్లుఁడగు యోసేపుకయపను రోమీయులు ప్రధాన యాజకునిగా నియమించినందున అతఁడు 12 సం॥ల వఱకు ఆ యుద్యోగమున నుండెను. అయినను యూదు లతని మామయగు అన్నను మిగుల యభిమానించినందున, ఇద్దఱు నాపనిని నిర్వహించిరి. ప్రజలిద్దఱిని ప్రధానయాజకులనుగా గణించిరి (లూ 3[2]). బంట్రౌతులు గెత్సెమనే తోఁటలో యేసును పట్టుకొని ఆరాత్రిలోనే ఆయనను మొదట అన్న యింటికిఁగొని తెచ్చిరి (యోహా 18[13]). అతఁడాయనను విచారించి, తనకు పూర్ణాధికారము లేనందున, ప్రధానయాజకుని పట్టముగల కయపయొద్దకుఁ బంపెను. (18[24]) పేతురు యోహానులను సన్హెడ్రినను యూదుల మహాసభకుఁ దెచ్చి వారి యెదుట నిలువఁబెట్టినప్పుడు అన్న సభానాయకుఁడుగా నుండినట్లు కనఁబడుచున్నది (కార్య 4[6]). ఇతని కుమారులలో నైదుగురు ఒకని వెంబడి నొకఁడు ప్రధాన యాజకులైనప్పుడు, వారందఱితనికి లోఁబడినవారై నందున నితఁడు 50 యేండ్లవఱకు ముఖ్యాధికారిగా నుండెను. క్రీస్తును మరణమునకు అప్పగించిన ద్రోహము ముఖ్యముగా అన్న మీఁదనిలుచుచున్నది (యాజకులు చూ॥). C.

**అన్నెతోతీయుడు, అనాతోతీయుడు** చూ॥

**అన్యజనుల సమూహము** మిశ్రిత జనము చూ॥

**అన్యాగ్ని** నాదాబు చూ॥

**అన్యాయపు సాక్ష్యము** అబద్ధము చూ॥

**అన్యులు, అన్యజనులు, అన్యజనములు** (Gentiles, Strangers). ఇశ్రాయేలీయులు దేవుఁ డేర్పఱచు కొనిన జనులగుటచే (నిర్గ 19[5] యెష 43[20]) వారు ఇతర జనములను తమకంటె తక్కువవారినిగా నెంచిరి. దీనికి సంబంధముగా ఇశ్రాయేలీయులకు యెహోవాచేసిన కార్యములను బట్టి వారి కిట్టి యౌన్నత్యదశ కలిగియున్నదని తెలియఁజేయు వాక్యములనేకములు కలవు (II స[illegible] I [illegible]) అన్యులు

ఇశ్రాయేలీయులకు విరోధులగుటచే ఈ విరోధ భావము మరెక్కువ యాయెను. చెఱకు తరువాతి కాలములోను అప్రమాణిక గ్రంథములలోను (I మక్క $1^{15}$ II మక్క $15^{11}$ మొ॥) ఇశ్రాయేలీయులు అన్యుల నిట్లు హీనపఱచుటనుగూర్చి మరెక్కువగా కనఁబడును. క్రొత్తనిబంధన కాలములో యూదులందరితోని ఒకటేరీతిగా నెంచక నాగరికులగు గ్రీకువారు అనాగరికులగు ఇతరులు అనుభేదముఁ జూపిరి (రోమా $1^{14}$). కార్య $28^{4}$ లో నున్న ద్వీపవాసులు I కొరి $14^{11}$ లో నున్న **పరదేశి** అను పదములచే భాషాంతరముచేసిన అసలు మాటయు నిదే పదమై అనాగరిక స్థితియందుండువారిని సూచించును. ఇశ్రాయేలీయులకును అన్యులకునుండు భేదమును తెలుపుటకు సున్నతిపొందినవారు సున్నతిపొందనివారు అను నీ మాటలు పాఁత నిబంధనలోను క్రొత్త నిబంధనలోను వాడిరి (ఆది $17^{14}$ న్యాయా $14^{3}$ $15^{18}$ I సమూ $31^{4}$ కార్య $11^{3}$ రోమా $2^{25}$ మొ॥). అన్యులను హీనపఱచుటకు యూదులు వారికి **సున్నతిపొందనివారు** అను పేరు పెట్టిరి.

అన్యులను సూచించునట్టి యీ సామాన్య పేరులుగాక ఇశ్రాయేలీయుల మధ్యనివసించు అన్యులను సూచించు ప్రత్యేకమైన పేరును గలదు. మన తెనుఁగు బైబిలులో నున్నట్లు వారికి అన్యులు పరదేశులు అను రెండు విధములైన పేరులను వాడిరి. అన్యులు ఇశ్రాయేలీయులలో నివసించినను తమస్వంత మతాచారములను విడువకయుండిరి (హోషే $7^{8}$ $8^{8}$ యెష $1^{7}$ యెహె $7^{21}$ $11^{9}$ మొ॥) గనుక వీరినిట్లు విభజించుట న్యాయమే. సామెతలు $2^{16}$ లోని **పరస్త్రీ** అనుమాటలు దేవునికి లోఁబడక దుర్మార్గతలను జరిగించు స్త్రీని సూచించును.

ఇట్టి యన్యులు ఇశ్రాయేలీయులలో నివసించినను వారికి ఇశ్రాయేలీయులలో నే హక్కులును లేకుండెను. వారియొద్ద ఇశ్రాయేలీయులు వడ్డీని పుచ్చుకొనవచ్చును (ద్వితీ $15^{3}$ $23^{20}$). వారు పస్కాను భుజింపరాదు (నిర్గ $12^{43}$). యెహె $44^{7-9}$ ను చూడఁగా వారిని ఆలయము నకు రానియ్యకూడదని యున్నది. ఎజ్రా కాలమందు అన్యులలో వియ్యమొందిన వారు తమ భార్యలను విడిచిపెట్టవలెనని ఆజ్ఞయాయెను (ఎజ్రా 10 నెహె $13^{23-27}$).

కొన్నిచోట్ల అన్యుఁడు అను పదము లేవీయులు కానివారిని (సంఖ్యా $1^{51}$), యాజకులు కాని వారిని (నిర్గ $29^{33}$ లేవి $22^{10,12,13}$ సంఖ్యా $3^{10,38}$) సూచించును. ఇట్లు క్రొత్తనిబంధనలో నిజమైన గొఱ్ఱెలకాపరి కానివానిని సూచించుట కొకసారి యీమాటను వాడియున్నారు (యోహా $10^{5}$). ఒకసారి యిది సమరయుని సూచించును (లూ $17^{18}$) (పరదేశి, మతప్రవిష్టులు చూ॥).

**అపరంజి** బంగారము, లోహములు 1 చూ॥

**అపరాధ పరిహారార్థబలి** అర్పణములు 2 (*b*) చూ॥

**అపరాధము** పాపము చూ॥

**అపర్సత్కాయ్యులు, అపర్సెకాయులు (Apharsathchites, Apharsacites)** ఇది యూఫ్రాతునదికి అవతలనుండు నొక జనమునకు పేరు. ఇది అష్షూరీయులకు లోఁబడిన పదిగోత్రములవారు నశించిన తరువాత అష్షూరీయులచే షోమ్రోనులో నుంచఁబడిన జనములలో నొకటియైయుండెను. (ఎజ్రా $4^{9,10}$ $6^{6}$).

**అపవాది** సాతాను చూ॥

**అపవిత్రత** పవిత్రాపవిత్రములు చూ॥

**అపవిత్రాత్మ** దయ్యము చూ॥

**అపార్సాయులు (Apharsites).** అష్షూరీయుల యాధీనమందుండి వారిచే షోమ్రోనులో నుంచఁబడిన జనములలో నొకటి. (ఎజ్రా $4^{9,10}$).

**అపెల్లె (Apelles).** రోమాపురములో నుండిన యొక క్రైస్తవుడు. క్రీస్తునందు యోగ్యుడైన అపెల్లెకు వందనములు అనుమాట పౌలు వ్రాసెను (రోమా $16^{10}$). ఈ పేరుగల ఒక గొప్ప నాట్యగాఁడా సమయమున రోములో కాపురముండెను. ఒకవేళ యీ నాట్యగాఁడు నమ్మి యీ మంచిపేరు పొందియుండవచ్చును.

E.

**అపొల్లుయోను (Apollyon = నాశకుఁడు).** ప్రక $9^{11}$ లో నున్నట్లు ఇది పాతాళపు దూతకు గ్రీకుభాషలోని పేరు. దీనికి హెబ్రీ భాషలోని పేరు **అబద్దోను** (అబద్దోను చూ॥),

**అపొల్లో** (Apollos = అపొల్లో దేవతకు సంబంధి). ఐగుప్తులోని అలెక్సంద్రియలో పుట్టిన లేవీయుఁడు. లేఖనములయందు గట్టివాఁడై, వాక్చాతుర్యము గలిగి యుండెను. పాత నిబంధనలోని ప్రవచనములను జాగ్రత్తగాఁ జదివి, బాప్తిస్మమిచ్చు యోహాను ప్రసంగములను గురించి విని నజరేయుఁడగు యేసే రావలసిన మెస్సీయ యని గ్రహించి క్రీస్తు శిష్యుఁడాయెను. క్రీ॥ శ॥ 53 సంవత్సరమునందు అతఁడు ఎఫెసుకు వచ్చి, ప్రభువు మార్గవిషయమై ఆత్మయందు తీవ్రపడి సమాజమందిరములో యేసునుగూర్చిన సంగతులు శ్రద్ధగాఁ జెప్పి బోధించుచుండెను. అకులయు ప్రిస్కిల్లయు అతఁడు చెప్పుదానిని విని అతని చేర్చుకొని దేవునిమార్గము మఱి పూర్తిగా నతనికి విశదపఱచిరి (కార్య 18$^{24-26}$). అచ్చటనుండి అకయకు వెళ్లి క్రీస్తునుగూర్చిన సంగతి యావత్తును అతి బలముతో బోధించి, లేఖనము ద్వారా యేసే క్రీస్తని రుజువుపఱచి దైవకృపవలన విశ్వసించిన వారికి చాల సహాయముఁ జేసెను (18$^{27,28}$). కొరింథు పట్టణములో బోధించుచు అపొస్తలుఁడైన పౌలు నాటిన దానిమీఁద నీళ్లు పోసి, అచ్చటనుండిన సఘ అభివృద్ధియగు లాగునఁ జేసెను (19$^{1}$ I కొరిం 1$^{12}$ 3$^{4-6,22}$ 4$^{6}$). కొంత కాలమైన పిదప తిరిగి ఎఫెసుకువచ్చి అచ్చటనుండి పౌలు కొరింథీయులకు మొదటి పత్రికను వ్రాసినప్పుడు అతనితోఁ గలిసికొని సువార్తను బోధించుచుండెను (16$^{12}$). పౌలును అపొల్లోయును మంచిస్నేహితులై, పౌలుమరణమగు పర్యంతము క్రీస్తు సువార్త వ్యాపించులాగున కూడుకొని పనిఁ జేసిరి (తీతు 3$^{13}$).

హెబ్రీయులకు వ్రాయబడిన పత్రిక అపొల్లో వ్రాసెనని అభిప్రాయపడిన వారిలో మొదటివాఁడు లూథరు. ఇప్పటికిని కొందఱి యభిప్రాయ మిదే. C.

**అపొల్లోనియ** (Apollonia = అపొల్లో దేవతకు సంబంధించినది). రోమానుంచి అంతియొకయకు పోవు ఎగ్నేషియను (*Egnatian*) అను గొప్పరాచబాటమీఁదనున్న మాసిదోనియ పట్టణములలో నొకటి. థెస్సలొనీకకు 38 మైళ్లు తూర్పున నున్నది. పౌలు రెండవ మిషనేరి ప్రయాణములో దానిమీఁదుగా వెళ్లెను (కార్య 17$^{1}$). గాని బైబిలునందు దాని విషయమైన మఱి యితర సూచనలు లేవు. (పటము V, F 2).

**అపొస్తలుడు** (Apostle = పంపఁబడినవాఁడు, వార్తావహుఁడు, రాయబారి).

1. తన బ్రతుకునందు జరిగిన సంగతులను, తన పునరుత్థానమును జూచి, వాటిని గూర్చి మానవకోటికి సాక్ష్యమిచ్చుటకై యేసుచేత నియమింపఁబడినవాఁడు (మ 10$^{2-42}$ కార్య 1$^{21,22}$ I కొరిం 9$^{1}$). ప్రభువు తన పని నారంభించిన కొలదిదినములకే నొక్కొక్కరినిగా వీరి నేర్పరచుకొనసాగెను. మొదట అంద్రెయను అతని సహోదరుఁడైన పేతురనఁబడిన సీమోను నేర్పరచుకొనెను (మ 4$^{18-20}$ 10$^{2}$ మా 1$^{16-18}$ లూ 6$^{14}$ యోహా 1$^{35-42}$). జెబెదయి కుమారులగు యాకోబు యోహానులు పిదప వచ్చిరి (మ 4$^{21,22}$ 10$^{2}$ మా 1$^{19,20}$ లూ 6$^{14}$). తరువాత ఫిలిప్పును బర్తొలొమయి యనఁబడిన నతనయేలును వచ్చినట్లు కనఁబడును (యోహా 1$^{43-51}$). అటువెనుక లేవియను మాఱుపేరుగల మత్తయి (మ 9$^{9-13}$ మా 2$^{14-17}$ లూ 5$^{27-32}$), తోమా అల్ఫయి కుమారుఁడగు యాకోబు, జెలోతే లేక కనానీయుఁ డనఁబడిన సీమోను, యాకోబు సహోదరుఁడగు యూదా, ఇస్కరియోతు యూదా (మ 10$^{1-4}$ మా 3$^{16-19}$ లూ 6$^{13-16}$ కార్య 1$^{13}$) అనువారి నేర్పరచుకొనెను. పేతురును యోహానును విచారణ జేసిన యూదుల యధికారులు యీయపొస్తలులను విద్యలేని పామరులని యెంచిరి (4$^{13}$). అనఁగా వీరు కొద్దిగా చదువుకొన్నవారేగాని విద్యా సంపన్నులు గారని వారి యుద్దేశమైయున్నట్లు తోచును. యేసు వారి యాత్మీయ నేర్పునుగూర్చి విశేష శ్రద్ధ చేసెను గాని వారాయన పనియొక్క ఉద్దేశమును గ్రహించఁజాలక ఆత్మీయ రాజ్యమును గాక లోకసంబంధ రాజ్యమును స్థాపింప వచ్చెనని పొరపాటుపడిరి (మ 20$^{20-28}$ మా 10$^{35-45}$ కార్య 1$^{6}$). తోఁటలో నాయన వేదనపడినప్పుడు కునికి నిద్రించిరి (మ 26$^{40}$). సిలువమీఁద నాయన వ్రేలాడుచున్న నాఁడంతయు పారిపోయి ఎక్కడనో దాగిరి (మ 26$^{56}$ మా 14$^{50}$). తరుచుగా వారు శిష్యులనఁబడిరి (మ 11$^{1}$ 14$^{26}$ 20$^{17}$ యోహా 20$^{2}$). తక్కిన వారందరికంటె పేతురును, జెబెదయి కుమా

రులగు యాకోబు యోహానులు ఆయన చేసిన బోధల నెక్కువగా గ్రహించుకొని ఆయన నెక్కువ యభిమానించినట్లు గనుపడుచున్నది. మూఁడు మాఱులు వారి నాయన శిష్యులనుండి ప్రత్యేకించి, గొప్ప కార్యములను గనుపఱచెను. యాయీరు కుమార్తెను బ్రతికించినప్పుడు (మా $5^{37}$ లూ $8^{51}$), రూపాంతర మొందినప్పుడు (మ $17^{1}$ మా $9^{2}$ లూ $9^{28}$) గెత్సెమనె తోఁటలో నాయన వేదన నొందినప్పుడు (మ $26^{37}$ మా $14^{33}$) వారాయనతో నుండిరి. యూదా మరణమైనతరువాత వారు చేసిన దానివలన అపొస్తలుల సంఖ్య పన్నెండుగా దృఢపడి యున్నట్లు గనపడుచున్నది. ఇశ్రాయేలీయుల గోత్రపు సంఖ్య కిది సరిపడవలెనని యిట్లు చేసియుండవచ్చును. ఈ యుద్యోగమున కర్హులగు యూస్తు అను మాఱుపేరు గల బర్సబ్బా యోసేపు, మత్తీయ అను నిద్దరిని నిలువఁబెట్టి చీట్లు వేయఁగా మత్తీయ పేరట చీటి పడినందున అతనిని యూదాకు బదులు నియమించుకొనిరి (కార్య $1^{15-26}$ ను 20 వచ॥ తోను కీర్త $109^{8}$ తోను సరిపోల్చుము). పెంతెకొస్తు దినమున పరిశుద్ధాత్మ వారిపై కుమ్మరింపఁబడినప్పుడు వారాత్మీయ విషయములలో గొప్ప మార్పు నొందిరి. లోకమంతటు సువార్త ప్రకటింపుఁడని తమకు నియమింపఁబడిన గొప్ప పనికి తగినవారైరి (కార్య $2^{1-47}$). వెంటనే వారీకార్యమునకుఁ బూనుకొనిరి. పేతురు యోహానులు వారిని నడిపించిరి (కార్య $3^{1}$-$5^{42}$ $9^{32}$-$12^{18}$). యాకోబును తీవ్రమైన యాసక్తితో బోధించి పని జేసినందున యూదమతాధికారులు తొందరపడి కత్తితో నతని జంపించిరి (కార్య $12^{2}$). అన్యులకే సువార్తను బోధించుట యను గొప్ప కార్యార్థమై పౌలు దేవునివలన నేర్పరచఁబడెను (కార్య $9^{1-31}$ $22^{15-21}$ $26^{1-20}$.) యేసుప్రభువీ లోకమున నున్నకాలమున నతఁడాయనను జూచియుండలేదు గాని ఆయన పునరుత్థానుఁడైన పిదపఁ జూచియున్నందున అపొస్తలుఁ డగుటకు తగినవాఁడాయెను. అతఁడు దమస్కుకుఁ బోవునప్పుడు మార్గమున ప్రభువతనికి ప్రత్యక్షమై అతని విరోధమును వైరాగ్యముగ మార్చెను. నేను అపొస్తలుడను కానా? మన ప్రభువైన యేసును నేను చూడలేదా! యని అతఁడడుగఁగలిగెను (I కొరి $9^{1}$).

2. అప్పుడప్పుడు అపొస్తలులకుండిన వరములను గుణములను గలిగి వారివలె పాటుబడి సువార్తను జయకరముగ వ్యాపింపఁజేసిన వారికిని క్రొత్త నిబంధనయం దీమాట వాడఁబడెను. పౌలుతో కూడఁ బంపఁబడిన బర్నబాను అపొస్తలుఁడని బిలిచిరి (కార్య $13^{3}$ $14^{4-14}$).

3. దేవునియొద్దనుండి నరులయొద్దకు పంపఁబడినవాఁడని తెలియఁజేయు భావముతో నీ పదమును ఒక మారు బైబిలునందు యేసునకు వాడిరి (హెబ్రీ $3^{1}$).

**అపొస్తలుల కార్యములు (The Acts of the Apostles).** సువార్తలుగాక క్రొత్త నిబంధనలో అపొస్తలుల కార్యములు అను చరిత్ర గ్రంథ మొక్కటి మాత్రము గలదు. క్రీస్తు ఆకాశమున కెక్కిన పిమ్మట, తన పరిశుద్ధాత్మను బంపి, ఆయన ద్వారా తన సంఘమును స్థాపించి, దాని సర్వలోకములో వ్యాపింపఁజేసిన విధ మీ గ్రంథమునందు క్లుప్తముగ వివరింపఁబడీ యున్నది దేవుని రాజ్యము సమీపముఁగ నున్నదను మాట సువార్తలలో పదే పదే కనఁబడును. ఆ రాజ్యము పెంతెకొస్తు దినమున, నేలాగు స్థిరపడి, తదనంతరము దేశము లన్నింటిలో వ్యాపించెనో జూడఁగలము. ఇది యపొస్తలుల కార్యముల గ్రంథమనఁబడినను, పరిశుద్ధాత్మ యపొస్తలులచేఁ జేయించిన కార్యము లిందున్నవని దెలిసికొనవలెను. కావున సువార్తలయందలి చరిత్రలో క్రీస్తు నరులలోఁ దిరుగుచు చేసిన కార్యములు వ్రాయఁబడి యున్నట్లు, ఈ చరిత్ర గ్రంథమందాయన తన గద్దెయం దాసీనుఁడై, పరిశుద్ధాత్మ మూలముఁగ తన సంఘము సర్వలోకమును స్వాధీన పఱచుకొనునట్లు దానిని నడిపించుచు నేలుచున్నాఁడనునది ఈ గ్రంథమునందు చెప్పఁబడెను.

I. **గ్రంథకర్త.** ఈ గ్రంథమును వ్రాసినవాఁడు లూకా యని పురాతన కాలము మొదలు నిప్పటివఱకు నందఱు నేకగ్రీవముగ నొప్పుకొనుచున్నారు. లూకా సువార్త పీఠికకును (లూ $1^{1-4}$), కార్యముల గ్రంథ పీఠికకునుగల సంబంధమును బట్టియు, ఆ సువార్త శైలికిని ఈ గ్రంథశైలికిని గల యైక్యతనుబట్టియు, నీ గ్రంథముల రెంటిని లూకాయే వ్రాసెననుటకు లేశమాత్ర సందేహము నుండదు (లూకా చూ॥)

**II. కృతిపతి.** సువార్తవలెనే కార్యములను గూడ థెయొఫిలాకు కృతి నిచ్చెను (లూకా $1^{1}$ కార్య $1^{1}$). (థెయొఫిలా చూ॥).

**III. రచనకాలము.** క్రీస్తు శకము 63-వ సం॥ వఱకు జరిగిన పౌలు చరిత్ర యిందు వ్రాయఁబడియుండుటచే నిది యంతకు పూర్వము వ్రాయఁబడి యుండలేదు. యెరూషలేము నాశనమును గూర్చిన సూచన లిందేవియును గానరాకుండుటచే నిది యంతకు మునుపు అనఁగా క్రీ॥ శ॥ 70-వ సం॥ మునకు ముందే వ్రాయఁబడెనని కొంద ఱనుకొందురు. లూకా నీ గ్రంథమును వ్రాయు నాటికి యెరూషలేము నాశనము అందరికి బాగుగా దెలిసిన విషయమగుటచేతనే గాని, మఱియొక కారణమువలన దాని నాశనమును గూర్చిన సూచనలను లూకా వ్రాసియుండలేదు గావున నతఁడు దీని యెరూషలేము నాశనమునకుఁ బిమ్మటనే వ్రాసెనని నవీన పండితు లభిప్రాయ పడుచున్నారు.

**IV. ముఖ్యోద్దేశము.** ఆదికాల సంఘపు చరిత్ర వ్రాయుటకు లూకా ఉద్దేశించలేదు. అతని గురి మఱియొకటియై యుండెను. మొదట యెరూషలేమందు యూదులలో మాత్రమున్న ఈ మత మెట్లు సర్వలోక మతమాయెనో చూపుటయే అతని గురి. గాన నీ సంగతిని మొదటి నుండి తెలియఁజేయు విషయములను వ్రాసెను. అందుచేతనే క్రైస్తవులను చెదరఁగొట్టిన హింసలు, స్తెఫను చర్య (6,7), ఫిలిప్పు చర్య (8), సౌలు మాఱు మనస్సు నొందుట (9), కొర్నేలి మాఱు మనస్సు నొందుట ($10^{1}$-$11^{18}$), అన్యులలో సువార్తను బ్రకటించుటకు పూనుకొన్న అంతియొకయ సంఘస్థాపనయు ($11^{19-26}$) అను నీ విషయములు ఆ యన్యులలో పౌలు సువార్తను ప్రకటించుటకుఁ బూనుకొనక పూర్వమే జరిగియుండెను. అధ్యా 13 నుండి 28 వఱకున్న విషయ మదేగాని మఱొకటి కాదు. రోమాలోఁ జేరుటతోనే యా యుద్దేశము పూర్తిగా నెఱవేఱుటచేత దానిలో లూకా తన గ్రంథమును ముగించెనని సాధారణముగా ననుకొందురు గాని రోమాలో జరిగినవాటిని గూర్చి ప్రత్యేకముగా నొక గ్రంథము వ్రాయవలెనని యుద్దేశించెను గాని యది నెఱవేఱలేదు కావున నిది యసంపూర్ణ గ్రంథమై యున్నట్లు కొందరనుకొందురు. రోమాలో జరిగిన సంగతులు థెయొఫిలాకుఁ దెలిసి యున్నందున వాటిని వ్రాసియుండక పోవచ్చును. ఎటులనైనను ఈ చర్య అతఁడు రోమా జేరి యూదుల నుండి వేఱుపడుటతోడనే ముగియును. ఆ మతము లోక రాజధానిగా నెంచబడిన రోమా పురమున స్థాపింపబడుటచే గ్రంథకర్త మనస్సునన్న ఉద్దేశము నెఱవేఱెను గావున నతఁడు తన గ్రంథము నింతటితో ముగించెనని తలంచుట మఱి మంచిదిగాఁ దోచును.

**V. చరిత్రవాస్తవ్యత.** నవీన పండితులలోఁ గొందఱు అద్భుత కార్యములను నమ్మరు కావున వారిందులోఁ బురాణ కథలున్న వనుకొనుట యాశ్చర్యము కాదు. అయితే, లూకా దీని గ్రంథకర్త యనియు, అతఁడీ సంగతులను బరిష్కారముగాఁ దెలిసికొని వ్రాసెననియు (లూ $1^{1-4}$) వీటిని దెలిసికొనుటకుఁ దగినసాక్షు లుండిరనియు వేదశాస్త్రు లేకగ్రీవముఁగ నొప్పుకొందురు. రమ్సే (*Ramsay*) అను పండితుఁడు చిన్నాసియాలోని పురాతన సంగతులను దెలిసికొనవలెనని యీ గ్రంథమును పరీక్షింపగాఁ, ఇది ఆ విషయమునందు పురాతన గ్రంథములన్నిటిలో నమ్మఁదగినదని నిశ్చయించెను. నిష్పక్షపాత బుద్ధితో దీనిఁ జదివెడి వారందఱిది సత్యమని యొప్పుకొనక తీరదు. మొదటినుండి క్రైస్తవులందఱివలన నంగీకరింపఁబడిన ప్రమాణిక గ్రంథము. దాని యందలి గొప్ప విషయములనుబట్టికూడ నది ఇట్టి ప్రమాణిక గ్రంథములలోఁ జేర్చికొనుటకుఁ దగియున్నది.

**VI. ముఖ్య భాగములు:** లూకా అపొస్తలులందఱి కార్యములను వ్రాయఁబూనుకొనలేదు. పేతురు చర్యను (అధ్యా 1-12), పౌలు చర్యను (అధ్యా 13-28) తప్ప అపొస్తలులలో మఱి యెవని చరిత్రలనైనను వ్రాయఁడాయెను. ఇంక నితఁడు స్తెఫను (6,7), ఫిలిప్పు (8) బర్నబా (11-13,14) యనువారి చర్యలలోఁ గొన్నింటిని వ్రాసెను. కార్య $1^{8}$ ఈ గ్రంథమునకు క్లుప్త వివరముఁగ నెంచఁదగును. సువార్త మొదట యెరూషలేము లోను (1-7), తరువాత యూదయ సమరయలలోను (8-12), పిమ్మట భూదిగంతముల వఱకును బ్రకటింపఁబడెను (13-28). మొదటి 12 అధ్యా

యములలో వది ముఖ్యముగ యూదులకుఁ బ్రకటింపఁబడుచుండఁగా సున్నతి పొందినవారికి అపొస్తలుఁడగుటకు సామర్థ్యము నొందిన పేతురు (గల $2^{8}$) చర్యను వివరింపవలసి వచ్చెను. పలెస్తీనులోను అన్య దేశములో నున్నట్టి యూదులే అతనిపని యిలాకాలై యుండెను. 13-వ యధ్యాయము మొదలు సువార్త ముఖ్యముగ నన్యులలో వ్యాపించిన విధము చూపఁబడును. కావున నిందులో అన్యజనులకు అపొస్తలుఁడగుటకు సామర్థ్యమునొందిన (గల $2^{8}$) పౌలు చర్య ముఖ్యముగాఁ వ్రాయఁబడెను. పౌలు పని యిలాకా సర్వలోకమనఁదగును. అప్పటి కాలములో సర్వలోకము నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన రోమను రాజ్యములోని ప్రధాన పట్టణములయందు సంఘములను స్థాపించిన విధమిందుఁ జూపఁబడెను, అన్యులలో నిట్టి పనిఁ జేయఁ బూనిన సంఘము అంతియొకయలోని సంఘము గుటచే నా పట్టణము పౌలు పని కిఁకను మధ్యస్థానమాయెను. ఈ గ్రంథమును క్లుప్తముఁగ నిట్లు భాగింపవచ్చును.

I. సువార్తను బ్రకటించుటకు సిద్ధపడుట $1^{1}$-$2^{13}$.

II. సువార్త ముఖ్యముఁగ పేతురుచే యూదులలోఁ బ్రకటింపఁబడుట, అన్యులలోఁ గూడ బ్రకటించుటకు సంఘమును పనివారిని సిద్ధపఱచుట $2^{14}$-12.

1. యెరూషలేములో జరిగిన విషయములు $2^{14}$-7.

2. యూదయ సమరయలలో జరిగిన విషయములు 8-12.

III. సువార్త అన్యులలో ముఖ్యముఁగ పౌలుచేఁ బ్రకటింపఁబడుట 13-28.

1. పౌలు బోధపని 13-$21^{16}$.

(1) మొదటి మిషనెరి ప్రయాణము 13-14.

(2) సున్నతిని గూర్చిన వాదమును తీర్చుట $15^{1-35}$.

(3) రెండవ మిషనెరి ప్రయాణము $15^{36}$-$18^{22}$.

(4) మూఁడవ మిషనెరి ప్రయాణము $18^{23}$-$21^{16}$.

2. పౌలు చెఱలోనుండుట $21^{17}$-$28^{31}$.

(1) యెరూషలేములో పట్టఁబడుట $21^{27}$-$23^{30}$.

(2) కైసరయలోని చెఱకాలమున జరిగిన సంగతులు $23^{31}$-$26^{32}$.

(3) రోమాకు ఖైదీగాఁబోవుట $27^{1}$-$28^{16}$.

(4) రోమాలో జరిగినవి $28^{17-31}$.

**అప్పయీము** (Appaim = నాసికా రంధ్రములు లేక ముఖములు). యూదా సంతతి వారిలో నొకఁడు (I దిన $2^{30-31}$).

**అప్పీయా సంతపేట** (Appii Forum) ఇది రోమానుండి దక్షిణమునకును తూర్పునకును బోవు అప్పీయా రాజమార్గము మీఁదనుండెడి యొక యూరు. రోమాకు దక్షిణమున 43 మైళ్ల దూరమందున్నది. పౌలు ఖైదీగా రోమాకు వెళ్లినప్పుడు అచ్చటి క్రైస్తవులతని నెదుర్కొనుటకు ఇంతవఱకు వచ్చిరి (కార్య $28^{15}$). (పటము V, A 2).

**అప్పు, అప్పులవాడు, అప్పిచ్చువాడు, అప్పుపడినవాడు, ఋణస్థుడు** (Debt, Debtor, Creditor.)

1. **పాఁతనిబంధన.** పాఁత నిబంధనను చూడఁగా ఆ కాలపు ప్రజలు వర్తకము నిమిత్తము అప్పు పుచ్చుకొనియున్నట్లు వారిలోని యేర్పాటులవలన కనఁబడదు. అప్పు పుచ్చుకొనినవాఁడు ఇబ్బందివలనగాక మఱే యే యితర హేతువుచేతనైన అప్పు తీసికొనినట్లు తెలియదు. ఇందుచేతనే అప్పు పుచ్చుకొనువారు దరిద్రులై యుండిరి. వారియెడల దయఁ జూపవలయునే కాని అప్పులవానివలె కఠినముగఁ జూడరాదు. కావుననే అప్పులవారు వడ్డీ తీసికొనకూడదను నియమము వారికి నుండెను (నిర్గ $22^{25}$ లేవీ $25^{36}$ ద్వితీ $23^{19}$). ద్వితీ $23^{20}$ లో ఇశ్రాయేలీయులు అన్యులయొద్ద వడ్డీ పుచ్చుకొనవచ్చును గాని స్వజనులయొద్ద పుచ్చుకొనరాదు అను ఏర్పాటు కలదు. ద్వితీ $15^{1-11}$. చూడఁగా విశ్రాంతి సంవత్సరమను ఏడవ సంవత్సరములో అప్పులవారు తమ స్వజనుల బాకీ

లను బొత్తుగా మన్నింపవలెనను నియమమున్నది. ఆ విశ్రాంతి సంవత్సరమున బాకీలను వసూలు చేయక మఱుసటి సంవత్సరమున వసూలు చేయ వచ్చుననునదే దీని యుద్దేశమని కొందఱను కొందురు గాని ఇది దాని యసలు అర్థము కానట్లున్నది. ఆ సంవత్సరములో బాకీలన్నింటిని పూర్ణముగా క్షమింపవలెనను భావము దాని కున్నట్లు ఆదికాలమందలి యూదులు గ్రహించిరి. పాత నిబంధన చరిత్రయందు యూదులు దయతో గూడిన యీ నియమములను నిర్లక్ష్యము చేసి యున్నట్లు తెలియును. II రాజా $4^{1-7}$ లో బహు స్వల్ప బాకీనిమిత్తము ఒక విధవరాలి యిద్దఱు కుమారులను దాసులనుగాఁ జేయ యత్నించినటుల కనఁబడును. నెహె $5^{1-19}$ లో ఇశ్రాయేలీయులు తమ స్వజనులకు వడ్డీకి బాకీలు పెట్టిరి. అయితే అప్పు పుచ్చుకొనినవారు ఈ కష్టమునకు సహించలేక నెహెమ్యా యొద్దకు వచ్చి మనవిచేయఁగా అతఁడు జనులను ప్రేరేపించుటయేకాక తానును తన బంధువులును తామిచ్చిన అప్పును తిరిగి పుచ్చుకొనమని వాగ్దానము చేసినందున ఇశ్రాయేలీయులా ప్రేరేపణలకు లోఁబడి అప్పు పుచ్చుకొనుటను మాని యున్నట్లు తెలిసికొనవచ్చును. అప్పులను గూర్చిన యిట్టి సూచనలనేకములు పాత నిబంధనలో కలవు (యెష $24^{2}$ కీర్త $15^{5}$ $37^{21}$ సామె $22^{7}$ $28^{8}$).

**2. క్రొత్త నిబంధన.** అప్పుల నిచ్చి పుచ్చుకొనుటలు క్రీస్తు కాలములోకూడ వాడుకయై యుండినట్లు క్రీస్తు చెప్పిన యుపమానము వలన తెలియును (మ $25^{27}$ లూ $16^{5}$). క్రైస్తవులీ విషయములో ఇతరులవలె నుండకూడదని క్రీస్తు బోధించెను ($6^{34,35}$). మనము చేయు పాపములు ఋణములవంటివని ఆయన బోధించెను (మ $6^{12}$ $18^{23,34}$ లూ $7^{41}$). ఇదే విధముగా మనము ఆజ్ఞలను మీఱుట కూడ ఋణమై యున్నట్లు పౌలు వ్రాసెను (కొలా $2^{13-15}$). మన విధులను కూడసూచించుటకిది యలంకార రీతిగా వాడఁబడిన మాటయైయున్నది (రోమా $1^{14}$).

**అప్రమాణిక గ్రంథములు (Apocrypha=దాచఁబడిన).** మన బైబిలులోని గ్రంథములుగాక, LXX లో ఇంక 16 గ్రంథములున్నవి. అవి జెరోము లాటిన్ భాషలోకి తర్జుమా చేసిన బైబిలునందు చేర్చఁబడి రోమన్ కతోలిక్ వారు వాడుకొనుచున్న వల్గేట్ (*Vulgate*) అను బైబిలులో చేరియున్నవి. యూదులు వీటిని ప్రమాణిక గ్రంథములనుగా నెంచనందున తమ హెబ్రీ బైబిలులోనుంచక పోయిరి. ప్రభువైన క్రీస్తును అపొస్తలులును వీటినుండి యొక వాక్యమునైనను ఎత్తి పలుకలేరి. ఆది క్రైస్తవులు వీటిని ప్రమాణికములగా నంగీకరింపక పోయినను చదువుకొనుటకీ గ్రంథము లుపయోగకరములైనవని యెంచి వాటిని చదువుకొనుటకును మతవిషయములను నేర్చికొనుటకును సెలవిచ్చిరి. ఇవి కొన్ని బైబిలులలో నచ్చువేయఁబడినను అవి ప్రమాణిక గ్రంథములని ప్రాటెస్టాంటు వారెవరైనను అంగీకరింపరుగాని క్రీ॥శ॥ 1545-1563 సం॥లలో జరిగిన ట్రెంటు (*Trent*) మహాసభలో నివి ప్రమాణిక గ్రంథములే యని రోమన్ కతోలిక్ వారు తీర్మానించుకొనిరి. ప్రాటెస్టాంటువారు బైబిలులోని గ్రంథములలో కొన్నింటిని కొట్టివేసిరని రోమన్ కతోలిక్ వారందురు గాని ట్రెంటు మహాసభ జరుగువఱకు ప్రమాణికములుగా నంగీకరింపఁబడని గ్రంథములను రోమన్ కతోలిక్ వారే తమ బైబిలునందు చేర్చిరని యీ చర్యవలనఁ దెలియును. మలాకీ గ్రంథములోని చరిత్రకును మత్తయి సువార్తలోని చరిత్రకును మధ్యకాలమందలి చరిత్రను తెలిసికొనుటకు ఈ యప్రమాణిక గ్రంథములలో మక్కబీయుల గ్రంథము లుపయోగకరములుగ నున్నవి. జ్ఞానము (*Ecclesiasticus*) అను గ్రంథములో మంచి నీతులు కలవు. ముగ్గురు బాలుర స్తుతికీర్తన యను గ్రంథము దానియేలు కాలమునందు అగ్ని కొలిమిలో వేయఁబడిన ముగ్గురిచే వ్రాయఁబడక పోయినను చాల గంభీరమైన స్తోత్రగీతమై యున్నది గాని మొత్తానికీ గ్రంథములు పురాణములకు సంబంధమైన కథలుగలవై ఎక్కువ నేర్పులలో గూడినవి కావు. ఈ గ్రంథముల జాబితా యేదియనిన.

## గ్రంథముల జాబితా

| గ్రంథముల పేరులు | గ్రంథ వివరము | రచింపబడిన కాలము |
|---|---|---|
| ఎస్ద్రాసు (1). (1 Esdras) | చరిత్ర గ్రంథము—యోషీయా కాలము మొదలు కుదురుబాటువఱకు. | క్రీ॥ శ॥ ముందు 2-వ శతాబ్దము. |
| ఎస్ద్రాసు (2). (2 Esdras) | దర్శనములు. | క్రీ॥ శ॥ తరువాత 1 లేక 2-వ శతాబ్దము. |
| టోబీతు (Tobit) | నీతితో గూడిన కథ. | క్రీ॥ శ॥ ముందు 3-వ శతాబ్దము. |
| యూదీతు (Judith) | అష్షూరు రాజును చంపిన స్త్రీని గూర్చిన కథ. | క్రీ॥ శ॥ ముందు 2-వ శతాబ్దము. |
| ఎస్తేరు (సశేషము). (Esther) | ఎస్తేరు గ్రంథమునకు చేర్చఁబడిన 6 అధ్యాయములు 7 వచనములు. | క్రీ॥ శ॥ ముందు 2-వ శతాబ్దము. |
| సొలొమోను జ్ఞానము. (Wisdom of Solomon) | నీతులు బోధించు గ్రంథము. | క్రీ॥ శ॥ ముందు 1 లేక 2-వ శతాబ్దము. |
| సైరాక్సు రచించిన జ్ఞాన గ్రంథము. (Ecclesiasticus) | జ్ఞానమును గూర్చిన పెద్ద గ్రంథము. | క్రీ॥ శ॥ ముందు 3-వ శతాబ్దము. |
| బారూకు (Baruch) | యిర్మీయా లేఖికుఁడైన బారూకుచే వ్రాయఁబడి యిర్మీయా గ్రంథమునకు సంబంధముగా నున్నట్లున్నది. | క్రీ॥ శ॥ ముందు 1-వ శతాబ్దము. |
| ముగ్గురు బాలుర స్తుతి కీర్తన. (Song of the Three Children)<br>సూసన్న (Susannah)<br>బేలుదేవత, భుజంగము అనువాటిని గూర్చిన కథ. (Bel and the Dragon) | ఈ మూఁడును దానియేలు గ్రంథమునకు సంబంధముగా నున్నవి. | కాలము తెలియదు. |
| మనష్షే చేసిన ప్రార్థన. (Prayer of Manasses) | II దిన 33[12,13] లో చెప్పఁబడిన రాజగు మనష్షే చెఱపట్టఁబడినపుడు చేసిన ప్రార్థనయై యున్నట్లున్నది. | కాలము తెలియదు. |
| మక్కబేయుల మొదటి గ్రంథము.<br>రెండవ " | చరిత్ర గ్రంథములు. ఇవి యూదులకు కలిగిన హింసలను విడుదలను తెలియఁజేయును. | క్రీ॥ శ॥ ముందు 1 లేక 2-వ శతాబ్దము. |
| మూడవ "<br>నాల్గవ "<br>(1,2,3,4, Maccabees) | నీతి బోధలుగల గ్రంథము. ఇవి మక్కబేయుల చరిత్రవలన దృష్టాంత పఱచఁబడును. | క్రీ॥ శ॥ ముందు 1-వ శతాబ్దము లేక క్రీ॥ శ॥ వెనుక 1-వ శతాబ్దము. |

**అప్రమాణిక సువార్తలు (Apocryphal Gospels).** ఆదికాలమునుండి మనకుండిన నాలుగు సువార్తలుకాక, ఇంకకొన్ని యప్రమాణిక సువార్తలుకూడ వ్రాయఁబడియెను. ఇది మన సువార్తలకే మాత్రమును సాటియైనవి కావని తెలిసికొనఁగలము. రానురాను సంఘములో పుట్టిన విమతబోధలను స్థాపించుటకు కొందఱు వీటిలోని కొన్నిఁటిని కల్పించినట్లు తెలియును. మన యసలు సువార్తలలో ననేక విషయములు లోపించియున్నవి. ఇట్లు లోపించిన సంగతులను, ముఖ్యముగా క్రీస్తు బాల్యమునుగూర్చిన సంగతులను చేర్చుటకు కొన్నిఁటిని వ్రాసిరి. ఈ యప్రమాణిక సువార్తలలో కొన్ని పోయినవి. ఆది క్రైస్తవ గ్రంథకర్తలలో కొందఱు యెత్తి వ్రాసిన విషయములు తప్ప ఈ యప్రమాణిక సువార్తలనుగూర్చి మఱి యేమియు తెలియదు. 16 అప్రమాణిక సువార్తల పేరులే తెలియునుగాని వాటినిగూర్చి అంతగా తెలియదు. ఈ యప్రమాణిక సువార్తలలో ముఖ్యములైన వేవియనఁగా.

1. హెబ్రీయుల సువార్త (*Gospel according to Hebrews*). ఇది చాల మట్టునకు వ్యాపించినదై మన సువార్తలకు సంబంధముగా నున్నది. దీనినుండి యెత్తి పలికిన కొన్ని వాక్యములు మాత్రమే నేటివఱకు నున్నవి.

2. ఐగుప్తీయుల సువార్త (*Gospel according to Egyptians*). ఇది రెండవ శతాబ్దపు చివఱకాలమునందు ఐగుప్తు దేశములో వ్యాపించెను. ఇది పైదానికి సాటియైనది కాదు. దీనిలోనుండి యెత్తి పలికిన కొన్ని వాక్యములు మాత్రమున్నవి. వివాహము చేసికొనఁగూడదని నమ్ము ఒక శాఖవారివలన ఇది కల్పింపఁబడినట్లున్నది.

3. పేతురు సువార్త (*Gospel according to Peter*). ఇది రెండవ శతాబ్దాంతమందు సురియదేశములో వ్యాపించెను. 1886-వ సం॥న దీనిలో నొక భాగమును కనుగొనిరి.

4. నీకొదేము సువార్త (*Gospel according to Nicodemus*). ఇది 5-వ శతాబ్దమందు రచింపఁబడినదై క్రీస్తు శ్రమ మరణాదులను గూర్చి యెక్కువగా తెలియఁజేయునుగాని యిది యొక చరిత్రకాక కల్పనావిషయమై యున్నది. ఈ గ్రంథము నేటివఱకు నున్నది.

5. యాకోబుకు ముందుండిన సువార్త (*Protevangelium of James*). ఇది రెండవ శతాబ్దములో రచింపఁబడి మరియను గూర్చియు క్రీస్తు పుట్టుకనుగూర్చియు తెలియఁజేయును. ఇది నేటివఱకు నున్నది.

6. తోమా సువార్త (*Gospel according to Thomas*). ఇది క్రీస్తు బాల్యమును గూర్చినది. ఈ సువార్తయు నేటివఱకు నున్నదిగాని 6-వ శతాబ్దమునకు పూర్వము రచింపఁబడియుండ లేదని తెలియును.

7. క్రీస్తు బాల్యమునుగూర్చిన అరబ్బీయుల సువార్త (*Arabic Gospel of the Childhood of Jesus*). ఇది అరబ్బీ భాషలోనుండి పైనున్న 5, 6 లకు సంబంధముగా నున్నది. మఱియు నిది 7-వ శతాబ్దమునకు తరువాత వ్రాయఁబడినట్లున్నది.

8. ఫిలిప్పు సువార్త (*Gospel according to Philip*). దీనిని గూర్చిన ఒక్క సూచన మాత్రము కలదు. ఇది ఐగుప్తుదేశములో వ్యాపించినట్లుగా నున్నది.

9. వడ్లవాఁడగు యోసేపు సువార్త (*Gospel according to Joseph the Carpenter*). ఇది అరబ్బీ భాషలో నున్నది. యోసేపును గూర్చియు క్రీస్తు బాల్యమును గూర్చియు తెలియఁజేయును. ఇది 4-వ శతాబ్దమందు రచింపఁబడినట్లున్నది.

10. పన్నెండుగురు అపొస్తలుల సువార్త (*Gospel of the Twelve Apostles*) ఇది 3-వ శతాబ్దమందు వ్రాయఁబడి యుండవచ్చును. నేటివఱకిది కాపాడఁబడి యుండలేదు. కాపాడఁబడిన కొన్ని వాక్యములను చూడఁగా ఇది యజ్ఞములను ఖండించుటకు వ్రాయఁబడియున్నట్లుగా నూహింపదగును.

11. మరియ నిర్గమమునుగూర్చిన సువార్త (*The Passing of Mary*). ఇది మరియ ఈ లోకమును విడుచుటను గూర్చినదై ప్రస్తుతము రోమను కతోలిక్ వారు నమ్ము అనేక కథ

అను తెలియఁజేయును. ఇది 4-వ శతాబ్దమందు వ్రాయఁబడినదై నేటివఱకు నున్నది.

**అఫీయ** (Aphiah=అలసట తీర్చుకొనిన?). రాజైన సౌలుయొక్క పూర్వికులలో నొకఁడు (I సమూ $9^{1}$).

**అఫెకు** ఆఫెకు చూ॥

**అప్ఫియ** (Apphia). ఇది యొక క్రైస్తవ స్త్రీ పేరు. ఈమె ఫిలెమోను కుటుంబములో చేరినది. ఈమె యతని భార్యయని సాధారణముగా నంగీకరింతురు (ఫిలె 2).

**అబగ్తా** (Abagtha). ఎస్తేరు గ్రంథమందున్నట్లు అహష్వేరోషు నొద్ద పనిచేసి వష్తిని పిలుచుకొనివచ్చుటకై నియమింపఁబడిన యేడుగురు నపుంసకులలో నొకఁడు (ఎస్తే $1^{11}$).

**అబద్దోను.** (Abaddon=నాశనము లేక నాశకుఁడు). ఇది మృతుల స్థానమునకు లేక దుర్మార్గులైనవారు మరణమునకు పిమ్మట నుంచఁబడు శిక్షాస్థానమున కొక సార్థక నామము. యోబు $26^{6}$ $31^{12}$ కీర్త $88^{11}$ లలో నున్నట్లు ఈ మాటను **నాశరూపము** లేక **నాశనరూప**మనియు, యోబు $28^{22}$ లో నున్నట్లు **నాశమ**నియు, సామి $15^{11}$ లో నున్నట్లు **అగాధరూపము** అనియు తర్జుమ చేసిరి. ప్రకటన $9^{11}$ లోనిది **పాతాళపు దూత**యొక్క హెబ్రీ పేరుగా నున్నది (అపొల్లుయోను చూ॥). ఆ దూత నాశనమునకు కారకుఁడగుటచే ఈ పేరతనికి పెట్టఁబడెను.

**అబద్ధము, అబద్ధమాడుట, బొంకుట అన్యాయపుసాక్ష్యము, అబద్ధసాక్ష్యము, కూటసాక్ష్యము, లేనివార్త పుట్టించుట (Lie, Lying).**

1. పాతనిబంధన. పాతనిబంధన మొదటినుండియు అబద్ధమాడుటను ఖండించుచున్నట్లు తెలియును. ఆదాము (ఆది $3^{9-12}$), కయీను ($4^{9}$), అబ్రాహాము ($12^{11-20}$ $20^{2-16}$), ఇస్సాకు ($26^{6-10}$) మొదలగువారు చెప్పిన యబద్ధములు వ్రాయఁబడియున్నది. అవి వారి కష్టములకుఁ గారణములైయుండినట్లు చూపి వాటిని ఖండించుచున్నారు. గేహజీయనువాఁడు అబద్ధ మాడినందున కుష్ఠరోగియయ్యెను (II రాజు $5^{20-27}$). మోషే ధర్మశాస్త్రము అబద్ధమాడుటను నిషేధించుచున్నది (లేవీ $19^{11}$). కూటసాక్ష్యము పలుకుట మఱి నిషిద్ధమై యున్నది (నిర్గ $23^{1}$ ద్వితీ $19^{16-20}$). ప్రవక్తల కాలములో అబద్ధములను ముఖ్యముగా ఖండించిరి (హోషే $4^{2}$ $7^{13}$ $12^{1}$ మొ॥). దేవుఁడు సత్యవంతుఁడు గావున ఆయన పేరట యబద్ధము లాడువారు అందఱిలో ఏహ్యులై యున్నారు (యిర్మీ $5^{31}$ $6^{13}$ $29^{22}$). పాతనిబంధన నీతిబోధ లనఁబడు సామెతెల గ్రంథమును బహు ఖండితముగా నీ పాపమును నిషేధించుచున్నది (సామి $19^{22}$ $21^{28}$ $24^{28}$ $25^{18}$ $30^{8}$). విచారణలో కూటసాక్ష్యమును పలుకుట మఱి నిషిద్ధము (నిర్గ $20^{16}$ ద్వితీ $5^{20}$). అట్టి పాపమునకు లోనైనవారికి బహు కఠిన శిక్ష విధించిరి ($19^{15-21}$). (నేరములు శిక్షలు II 4 (3) చూ॥).

కొన్ని వాక్యములను జూడఁగా దేవుఁడు మోసపుచ్చుటకు సెలవిచ్చినట్లు కనఁబడును. (I సమూ $16^{1-5}$ I రాజు $22^{11-23}$). అట్టి వాక్యములలో చరిత్రకారుఁడు తన స్వంతభావమును చూపించినట్లు కొందఱనుకొందురు. అయితే వాటికి మఱియొక విధముగా తగిన సమాధానముఁ జెప్పవచ్చును. మనము సత్యమునే పలుకవలసినది గాని, సత్యము యావత్తు అందఱితోను చెప్పవలెనను నియమమేదియును లేదు. కొందఱి స్వభావమునుబట్టి కొన్ని సమయములలో వారితో నెంత వఱకుఁ జెప్పిన యుక్తముఁగ నుండునో అంతమట్టునకే చెప్పవలయును. మఱియు మానవులు దేవునికి లోఁబడనియెడల వారు అబద్ధములను నమ్మునట్టి యొక భ్రమ వారిని పట్టుకొనును. ఆ భ్రమను పుట్టించినది దేవుఁడే యని పాతనిబంధనను వ్రాసినవారిలో గొందఱు తలంచిరి. ఇట్లనుకొనుట న్యాయమే. మనుష్యులు దేవుని కృప నెదిరించిన యెడల దేవుఁడు వారి పాపములకు వారి నప్పగించును (రోమా $1^{24}$). గాన వారట్లు మోసపోవుదురు. మఱియొక విధముగాఁ జూచిన యెడల అబద్ధములను నమ్ముకొనునట్టి యీ భ్రమ పాపములను జేయువారి స్వంత విపరీత బుద్ధివలననే కలిగిన దనవచ్చును. ఎటులనైనను పాతనిబంధన యావత్తును విచారించి చూడఁగా అబద్ధమాడుట కవకాశ మేదియును లేదు.

2. క్రొత్త నిబంధన. క్రొత్త నిబంధనను చూడఁగా అబద్ధమాడుట మఱి నిషేధమై యున్నది. దానికి మూలకారకుఁడు సాతాను అని క్రీస్తు బోధించెను (యోహా $8^{44}$ ప్రక $12^{9}$). ఆది క్రైస్తవులలోని మొదటి పాపము అబద్ధమునకు సంబంధమైనదై కఠిన శిక్షను పొందెను (కార్య $5^{1-6}$). అబద్ధమాడుట క్రైస్తవులు విడిచిపెట్టవలసిన పురాతన స్వభావమునకు సంబంధించినదైయున్నది (కొలొ $3^{9}$). మన మొకరికొకరము అవయవములమై యున్నాము. కావున అబద్ధ మాడకూడదు (ఎఫె $4^{25}$).

యేసు, క్రీస్తు కాఁడని చెప్పువాఁడు అబద్ధికుఁడనియు (I యోహా $2^{22}$), మనము పాపులము కామనుకొనినయెడల కూడ అబద్ధికులమనియు ($1^{8-10}$) యోహాను వ్రాసెను. దేవుఁడు కాని దానిని దేవునిగా నెంచుట యసత్యమే (రోమా $1^{25}$). ఇది యన్యుల ఘోరపాపము లన్నిఁటికి మూలమై యున్నది. ఇందునుబట్టియే పాతనిబంధన కాలములో దేవతలు అబద్ధములని యనఁబడెను (కీర్త $40^{4}$ ఆమో $2^{4}$).

అబద్ధికులు సత్యవంతుఁడైన దేవుని సన్నిధాన మందుండఁజాలరు గాన మోక్షమునకు వారసులు కానేరరు (ప్రక $21^{8}$).

**అబానా** (Abana = రాళ్లుగల?). దమస్కులోని రెండు నదులలో ముఖ్యమైన దాని పేరు. ప్రస్తుతము దానికి బారద (*Barada*) యను నామము కలదు. ఇది దమస్కునకు వాయువ్యమూలను 23 మైళ్ల దూరములో లెబానోను పర్వతములలో పుట్టి దమస్కున కుత్తరముగా పారి దానికి తూర్పున 18 మైళ్లలో నుండు నొక సరస్సులో పడును. ఆ నీరు చాల లోతుగాను చల్లగానుండి దమస్కు చుట్టునున్న తోఁటలలోకి కాలువలద్వార పారుటచే దమస్కు చుట్టుపట్ల నుండు ప్రాంతములను మిగుల ఫలవంతమైనవిగా చేయుచున్నది. ఇది యొర్దాను నదికంటె మంచి నది యని నయమాను పలికినట్లు చూడఁగలము (II రా $5^{12}$). (పటము I, J 1).

**అబారీము** (Abarim = అవతలి ప్రాంతములు). యొర్దానునదికి తూర్పుగానుండు కొండ వరుస యావత్తునకు పెట్టిన పేరు. ఈ కొండలు సముద్రమట్టమునకు 3000 అడుగులు ఎత్తుగా నున్నవి. ఇశ్రాయేలీయు లిచట మకాముచేసి యిచటినుండి మోయాబు మైదానమునకు వెళ్లిరి (సంఖ్యా $27^{12}$ ద్వితీ $32^{49}$). యిర్మీ $22^{20}$ లో ఇది బాషాను కొండలతోకూడ చెప్పఁబడినది.

**అబిలేనే** (Abilene). లెబానోను పర్వత ప్రాంతములందలి దేశము. బాప్తిస్మ మిచ్చు యోహాను బోధించ నారంభించిన కాలమును నిరూపణము జేయుట కాదినములలో శకము లెవ్వియును లేనందున, లూకా యా కాలమును దెలుపుట కాయా దేశముల నేలుచుండిన యేలికల పేరుల నుదాహరించెను. అతఁ డుదాహరించిన దేశములలో లుసానియ యనువాఁ డేలుచుండిన అబిలేనే యొకటియై యుండెను (లూ $3^{1}$). దీని రాజధాని పట్టణముగా నుండిన అబిలా (*Abila*) వలన దీనికీ పేరు గలిగెను. దమస్కుకు దాదాపుగా నిరువది మైళ్లు వాయువ్య దిక్కుగా నున్నది. ప్రస్తుతమున సుక్వాడి బారదా (*Suk-wadi Barada*) దగ్గరనున్న యొక రాతిశాసనముపై దీని పేరున్నందున దాని యునికి యిదేనని యభిప్రాయ పడుచున్నారు. అది ప్రస్తుతము దమస్కుకుబోవు రైలుమార్గముమీఁద నున్నది. (లుసానియ చూ॥)

**అబీ** (Abi = తండ్రి). హిజ్కియా రాజు యొక్క తల్లి (II రాజు $18^{2}$). II దిన $29^{1}$ లో ఈమె పేరు అబీయా యని యున్నది.

**అబీగయీలు** (Abigail = సంతోషోత్పత్తి).

1. కర్మెలులోని మాయోను నివాసియు, అధిక సంపన్నుఁడునగు నాబాలు భార్య. మిగుల బుద్ధిమతియు సుందరవతియునై యుండెను. దావీదు సౌలుచే తఱుమఁబడినప్పుడు ఆఱువందల మంది భటులతో నీ కర్మెలు ప్రాంతములలోఁ దిరుగులాడుచు నాబాలు సహాయము నపేక్షించఁగా నితఁడు దావీదును తూలనాడి యతని దూషించుటవలన దావీదతనిసంహరింపఁ బోయెను. అబీగయీలీ సమాచారమును విని 200 రొట్టెలను ద్రాక్షారసమును గొఱ్ఱెలను, ద్రాక్ష గెలలను అంజూరపు పండ్ల ముద్దలను తీసికొనివచ్చి దావీదున కిచ్చి, కఠినుఁడును దుర్మార్గుఁడునగు తన పెనిమిటి కొఱకు క్షమాపణనడిగెను. అట్లు మిగుల వినయోక్తులతో నామె వేడుకొనినప్పుడు దావీదు

నాబాలున కీడేమియుఁ జేయక విడిచెను. కొన్నాళ్లకు నాబాలు చనిపోఁగా దావీదీమెను వివాహమాడెను (I సమూ $25^{1-42}$). ఈమె దావీదుకు కిల్యాబు (II సమూ $3^{3}$), దానియేలు (I దిన $3^{1}$) అను కుమారులను కనెను. కొందఱీ రెండు పేరులు ఒకటే నని యందురు.

2. నాహాషు కుమార్తెయు, దావీదు సహోదరియునగు నొక స్త్రీ. ఈమెకు అమాశాయను కుమారుఁడు గలఁడు (II సమూ $17^{25}$ I దిన $2^{13-17}$).

H.

**అబీటలు** (Abital = తండ్రి మంచువలె నున్నాఁడు). ఈమె దావీదు భార్యలలో నొకతెయు షెఫట్యా యను వాని తల్లియునై యుండెను (II సమూ $3^{4}$ I దిన $3^{3}$).

**అబీదా** (Abida = తండ్రి తెలివిగలవాఁడు). మిద్యాను సంతతివారిలో నొకఁడు. ఈ మిద్యానీయులు అబ్రాహామునకు కెతూరావలన గలిగిన సంతానీకులు (ఆది $25^{4}$ I దిన $1^{33}$).

**అబీదాను** (Abidan = తండ్రి న్యాయాధిపతి). ఇశ్రాయేలీయు లరణ్యములో నుండు కాలమందు బెన్యామీయులలో నొక పెద్ద (సంఖ్యా $1^{11}$ $2^{22}$ $7^{60-65}$ $10^{24}$).

**అబీనాదాబు** (Abinadab = తండ్రి దయగలవాఁడు).

1. కిర్యత్యారీము ఊరివారిలో నొకఁడు. ఫిలిష్తీయులు దేవుని మందసమును తిరిగి పంపిన తరువాత ఇతఁడు దానిని తన యింటిలో 20 సంవత్సరముల వఱకునుంచి దాని కాపాడుటకై తన కుమారుఁడైన ఎలియాజరును ప్రత్యేకించెను (I సమూ $7^{1,2}$ II సమూ $6^{3,4}$ I దిన $13^{7}$).

2. యెష్షయి కొడుకులలోను దావీదు అన్నలలోను రెండవవాఁడు (I సమూ $16^{8}$ $17^{13}$ I దిన $2^{13}$).

3. సౌలు కొడుకులలో నొకఁడు. ఇతఁడు సౌలుతోకూడ గిల్బోవ పర్వతముమీఁద చంపఁబడెను (I సమూ $31^{2}$ I దిన $10^{2}$).

4. సొలొమోను అల్లుండ్రలో నొకని తండ్రి (I రాజు $4^{11}$). ఇచట అబీనాదాబు కుమారుడు అని తర్జుమా చేసినది అసలులో బెనాబీనాదాబు అను మాటయై యున్నది. దీని నిట్లు తర్జుమా చేయక ఒక ప్రత్యేకమైన పేరునుగా నెంచవలసిన దనుకొనువారుకలరు. అబీనాదాబు కుమారుఁడన్నను, బెనాబీనాదాబు అనినను ఒకటే. ఇతఁడు దోరు అను ప్రాంతములో పన్ను వసూలు చేయుటకు నియమింపఁబడెను.

**అబీనోయము** (Abinoam = మధురమైన తండ్రి). ఇశ్రాయేలీయుల న్యాయాధిపతులలో నొకఁడైన బారాకుతండ్రి (న్యాయా $4^{6,12}$ $5^{12}$).

**అబీమాయేలు** (Abimael = దేవుఁడు తండ్రి!). యొక్తాను కుమారులలో నొకఁడు. ఇతని సంతతివారు అరేబియా దేశములో నివసించిరి (ఆది $10^{28,29}$ I దిన $1^{22,23}$).

**అబీమెలెకు** (Abimelech = రాజు తండ్రి).

1. ఫిలిష్తీయుల దేశమందలి ముఖ్యపట్టణమగు గెరారు రాజు. అబ్రాహాము తన భార్యయగు శారాతోఁగూడ గెరారులో నున్నపుడు అబీమెలెకు ఆమె యతని చెల్లెలనుకొని తన నగరులోకిఁ బిలిపించి ఆమెను తనకు భార్యగాఁ జేసికొనఁబోవుచుండెను. స్వప్నమందు ఆమె అబ్రాహాము భార్యయని తెలిసికొని, దేవునికి భయపడినవాఁడైనందున, అబ్రాహామును బిలిపించి, ఆమె తనకు చెల్లెలని యతఁడు చెప్పినందు కతనిని గద్దించి శారాను పవిత్రురాలినిగా నతని కప్పగించి, వెలగల పెక్కుబహుమతులిచ్చి వారినంపివేసెను (ఆది $20^{1-18}$).

2. ఇస్సాకుకాలమున గెరారులోనుండిన యింకొక రాజు. ఇతఁడు పైఁజెప్పినవాని కుమారుఁడై యుండవచ్చును. ఇస్సాకుకూడ సుందరవతియగు తన భార్యయగు రిబ్కానుగూర్చి యీమె తనకు చెల్లెలని చెప్పినందున, అబీమెలెకు సంగతి నిజముఁ దెలిసికొనిన వెంటనే అతనిని గద్దించి వారిజోలికెవ్వరును బోకూడదని యాజ్ఞాపించెను (ఆది $26^{6-33}$).

3. న్యాయాధిపతులలో నొకఁడగు గిద్యోనునకు షెకెము పట్టణమందుండిన యతని ఉపపత్నివలన కలిగిన కుమారుఁడు (న్యాయా $8^{31}$). గిద్యోను మరణమైన పిదప నితఁడు షెకెముకేరి తనను రాజుగాఁ జేయుఁడని వారిని ప్రోత్సాహపఱచి,

వారిసహాయముచే తన డెబ్బదిమంది సోదరులను ఒఫ్రాలో హతముచేసి షెకెముకు రాజాయెను (9[1-6]). కనిష్ఠుడగు యోతాము మాత్రమెటు లనో దప్పించుకొనెను. తరువాత దేశమున జరిగిన తిరుగుబాటు నణచివేయుటకు ఒక పట్టణమును ముట్టడించు సమయమున నొక స్త్రీ తిరుగటిరాతి నతని తలమీఁదవేసి అతని గొప్ప ద్రోహమునకుఁ దగినశిక్షగావించెను (9[53] II సమూ 11 [21,7]).

4. I దిన 18[16] లోని అబీమెలెకు అనుపది అహీమెలెకు అనుపదమునకు అసలులోనున్న పొరపాటైయున్నది (అహీమెలెకు 2 చూ॥). H

**అబీయల్బోను** (Abialbon = బలముగల తండ్రి). దావీదు యోధులలో నొకని పేరు (II సమూ 23[31]). LXX లోనిది అబీయేలు అని యున్నది. I దిన 11[32] చూడఁగా హెబ్రీ భాషలోకూడ ఇది **అబీయేలు** అనియే యున్నది (అబీయేలు 2 చూ॥).

**అబీయా, అబీయాము** (Abia, Abijah = యెహోవాతండ్రి, Abijam = సముద్రమునకు తండ్రి).

1. యూదా గోత్రములోని వాఁడైన హెస్రోను భార్య (I దిన 2[24]).

2. అహరోను సంతతివారిలో నొకఁడు. యాజకధర్మము జరిగించుటకు దావీదు నియమించిన యాజకుల 24 వంతులలో నితని సంతతివారు 8-వ వంతునకు చేరియుండిరి (I దిన 24[10]). (క్రొంప 7 చూ॥).

3. బెన్యామీనీయులలో బేకరు అను వానికి పుట్టినయొకఁడు (I దిన 7[8]).

4. సమూయేలుయొక్క ఇద్దఱు కుమారులలో నొకఁడు. వీఁడు బెయేర్షెబాలో న్యాయాధిపతిగా నుండెనుగాని లంచగొండియై యుండినందున ప్రజలితనిని కోరక విసర్జించి యొక రాజును కోరిరి (I సమూ 8[2-5] I దిన 6[28]).

5. ఇశ్రాయేలువారను పదిగోత్రముల రాజైన I యరొబాము కుమారుఁడు. ఇతఁడు కాయిలా పడఁగా ఇతని గతినిగూర్చి తెలిసికొనుటకు యరొబాము ప్రేరేపణవలన అతనిభార్య మాఱువేషము వేసికొని అహీయాయను ప్రవక్తయొద్దకుఁబోయి యడిగెను. అహీయా నీ కుమారుఁడు చని పోయి తన సద్గుణములనుబట్టి పాతిపెట్టఁబడు ననియు, యరొబాము ఇశ్రాయేలీయుల విగ్రహారాధనకు కారకుఁడైనందున అతని సంతతి వారిలో నితరులందఱు పట్టణమునకు వెలుపల పారవేయఁబడుదురనియు చెప్పెను (I రాజు 14[1-18]).

6. రెహబాము కుమారుఁడు. ఇతఁడు రెహబామునకు పిమ్మట యూదావారికి రాజయ్యెను (II దిన 12[16] 13[1-14]). రాజుల గ్రంథములో నితనికి **అబీయాము** అను పేరుకలదు (I రాజు 14[31] 15[1]). ఇతని తల్లిపేరు మయకా. రాజుల గ్రంథమును చూడఁగా ఈ అబీయా మూఁడు సంవత్సరములవఱకు నేలి తన తండ్రివలె పాపము చేసెననియు, పదిగోత్రములరాజైన యరొబాముతో యుద్ధముచేసెననియు తెలిసికొనవచ్చును. అయితే ఈ యుద్ధముచేయక పూర్వము దేవుని యందు నమ్మకముంచినట్లు ఒక ప్రసంగముచేసి ఆయనను నమ్ముకొని యుద్ధములో జయమొంది 5,00,000 మందిని హతముచేసియున్నట్లు II దిన 13[17] వలన తెలిసికొనవచ్చును. దినవృత్తాంతములలోని సంఖ్యలు ఎందుచేతనో చాల యెక్కువగా నున్నట్లు తెలిసికొనవలెను. ఎటులనైనను ఈ యుద్ధములో యరొబాము ఓడిపోయినట్లు స్పష్టమగుచున్నది.

7. జెరుబ్బాబెలుతోకూడ వచ్చిన యాజకులలో నొక ప్రధాని (నెహె 12[3-17]) యై యున్నట్లున్నదిగాని రూఢికాదు. ఏమనిన నెహె 12[17] లో ఈ పేరు ఒక కుటుంబమునకున్నది. 10[7] చూడఁగా అబీయా యనువాఁడు నిబంధనను ముద్రించిన వారిలో నొకఁడై యున్నట్లు తెలియును. ఈ అబీయా పైన 2 లోని వంశపువారిలో నొకఁడు కావచ్చును గాని యిదియును రూఢికాదు. స్నానికుఁడైన యోహాను ఈ వంశములోనే పుట్టెను (లూకా 1[5]).

**అబీయాసాపు, ఎబ్యాసాపు** (Abiasaph, Ebiasaph = తండ్రి కూర్చెను). లేవీయ గోత్రమునందు కోరహు కుటుంబములో పుట్టిన యొకఁడు (నిర్గ 6[24] I దిన 6[23] 9[19]).

**అబీయెజెరు అబీయెజెరీయులు అబీయెజ్రీయుడు** (Abiezer = తండ్రి సహాయకుడు. Abiezrites).

1. మనష్షే గోత్రములో పుట్టినయొకడు. ఇతడొక కుటుంబమునకు పెద్దయాయెను. (I దిన $7^{18}$). సంఖ్యా $26^{30}$ లో ఈ పేరు **ఈజెరు** అని క్లుప్తముగా నున్నది. న్యాయాధిపతియైన గిద్యోను ఈ కుటుంబపువాడే (న్యాయా $6^{11}$). అయితే అబీయెజెరు అనునది గిద్యోనుకు గాక ఇతనికుటుంబపుదారి పేరైయున్నది. వారు **అబీయెజెరీయు** లనబడిరి (యెహో $17^{2}$ న్యాయా $8^{2}$).

2. దావీదు యోధులలో నొకడు (II సమూ $23^{27}$ I దిన $11^{28}$ $27^{12}$).

**అబీయేలు** (Abiel = తండ్రి బలవంతుడు లేక దేవుడు తండ్రి).

1. సౌలుతండ్రియగు కీషుకును, అబ్నేరుతండ్రియగు నేరుకును తండ్రి (I సమూ $9^{1}$ $11^{32}$). కావున ఇతడు రాజైన సౌలు యొక్కయు, సేనాధిపతియగు అబ్నేరు యొక్కయు తాతయైయుండెను.

2. అబీయల్బోను మారుపేరు (అబీయల్బోను చూ॥).

**అబీయెతాము** ఏతాము చూ॥

**అబీరాము** (Abiram = తండ్రి హెచ్చింపబడును).

1. ఒక రూబేనీయుడు. ఇతడు దాతానుతోగలసి మోషేను యెదిరించెను. (సంఖ్యా $16^{1}$ ద్వితీ $11^{6}$ కీర్త $106^{17}$).

2. హీయేలుయొక్క జ్యేష్ఠ పుత్రుడు. యెరికోను గూర్చి యెహోషువ పెట్టిన శాపమును తిరస్కరించి హీయేలు దానినిమరల కట్టించెను గాని యతడు దాని పునాది వేయగా శాపవచనము ప్రకారము ఈ అబీరాము చనిపోయెను (I రాజు $16^{34}$).

**అబీషగు** (Abishag = తిరుగు తండ్రి!). సుందరవతియగు నొక షూనమ్మీయురాలు. దావీదు వృద్ధాప్యమందు దతనిని పరామర్శించుట కీమెను పిలువగా ఈమె వచ్చి దావీదును పరామర్శించి యతని భార్యలలో చేరినదాయెను (I రాజు $1^{1-4}$). దావీదు చనిపోయిన తరువాత అదోనియా యీమెను మోహించి తనకు వివాహమునకిమ్మని సొలొమోనుకు మనవిచేయగా అది తగనిదనియు, ఇట్లడుగుట రాజ్యమునుకూడ అడిగినట్లున్నదనియు నెంచి, యిందు నిమిత్తము సొలొమోను అతనిని చంపించెను (I రాజు $2^{13-25}$).

**అబీషాలోము** అబ్షాలోము చూ॥

**అబీషూరు** (Abishur = తండ్రి గోడ వంటివాడు). యూదా గోత్రపువారిలో నొకడు (I దిన $2^{28-29}$).

**అబీషూవ** (Abishua = రక్షణకుతండ్రి).

1. ఒక బెన్యామీనీయుడు (I దిన $8^{4}$).

2. అహరోను మనుమడైన ఫీనెహాసు అనునతని కుమారుడు (I దిన $6^{4,5,50}$ ఎజ్రా $7^{5}$).

**అబీషై** (Abishai = దానమునకు తండ్రి). రాజైన దావీదు అక్కయగు సెరూయా యొక్క పుత్రుడు. యోవాబు అశాహేలు లితని సోదరులు (I దిన $2^{16}$). దావీదుయొక్క ముప్పదిమంది వీరులకు నాయకుడు (II సమూ $23^{18,19}$). తన మేనమామ యగు దావీదును కష్టసుఖములలో నమ్మకముగా వెంబడించి తోడు నీడగా నుండెను. దావీదు తనను జంప తలచుచున్న సౌలు శిబిరములోకి బోవునప్పుడతనిని వెంబడించెను. గాఢ నిద్రావశుడై యున్న సౌలు నొక్క దెబ్బతో చంపెదనన్నప్పుడు, దావీదతని నాపగా లోబడి అతని యనుజ్ఞచే సౌలు తలగడ యొద్దనున్న యీటెను నీళ్లబుడ్డి నెత్తుకొని తిరిగి వచ్చెను (I సమూ $26^{5-12}$). అబ్నేరు తన తమ్ముడగు అశాహేలును జంపినప్పుడు యోవాబుతోగలిసి యతని తరిమెను గాని యతని పట్టుకొనలేకపోయెను (II సమూ $2^{18,24}$). ఎదోమీయులతోను (I దిన $18^{12,13}$), అమ్మోనీయులు సిరియనులతోను (II సమూ $10^{10-14}$) జేసిన యుద్ధములలో నితడు సేనాధిపతిగా నుండెను. అబ్షాలోమును షెబాయును దావీదుపై తిరుగబడినప్పుడు ఇతడు దావీదును విడువక అతని పక్షముగా బోరాడెను (II సమూ $16^{11}$ $20^{6,10}$). షిమీ దావీదును దూషించినప్పుడును, క్షమాపణనడిగినప్పుడును, అబీషై యతని

సమీపమున నుండి వానిఁ జంప సెలవిమ్మని దావీదు నడిగెను (II సమూ $16^{9}$ $19^{21}$). ఫిలిష్తీయులు దావీదుమీఁద యుద్ధము చేసినప్పుడు అబీషై ఉన్నత దేహుఁడగు ఇష్బిబెనోబను జంపి దావీదును గండమునుండి తప్పించెను ($21^{16,17}$). ఫిలిష్తీయులు బేత్లెహేమును ముట్టడించినప్పుడు ఇతఁడు తన యీఁటెను మున్నూరుమందిమీఁద నెత్తి వారిని హతముచేసెను (II సమూ $23^{14-18}$). H.

**అబీహాయిలు** (Abihail = తండ్రి బలము గలవాఁడు).

1. బాషానులో నివసించిన గాదు గోత్రపు వాఁడు (I దిన $5^{14}$).

2. ఎస్తేరు తండ్రి. మొర్దెకై యను వాని పినతండ్రి (ఎస్తే $2^{15}$ $9^{29}$).

3. యూదా వంశజుఁడైన అబీషూరు భార్య (I దిన $2^{29}$).

4. అహరోను వంశమందలి మెరారి కుటుంబములోని యొకతె (సంఖ్యా $3^{35}$).

5. రెహబాము భార్య యగు మహలతుతల్లి. ఈమె 'దావీదు అన్నయైన ఏలీయాబుకుమార్తె (II దిన $11^{18}$).

**అబీహు** (Abihu = ఆయన (= దేవుఁడు) తండ్రి). అహరోను రెండవ కుమారుఁడు (సంఖ్యా $3^{2}$ $26^{60}$ I దిన $6^{3}$ $24^{1}$). ఇతఁడును తన యన్నయైన నాదాబువలె మోషేతోకూడ సీనాయి పర్వతము నెక్కెను (నిర్గ $24^{1,9}$). యాజకుఁడైన యితఁడు ($28^{1}$) అన్యాగ్ని నర్పించినందున నాదాబుతోకూడ మరణ శిక్షకుఁ బాత్రుఁడయ్యెను (లేవీ $10^{1,2}$ సంఖ్యా $3^{4}$ $26^{61}$ I దిన $24^{2}$).

**అబీహూదు** (Abihud = నా తండ్రి మహిమగలవాఁడు).

1. ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{3}$).

2. క్రీస్తు పూర్వీకులలో నొకడు (మ $1^{13}$).

**అబీహెబ్రోను** హెబ్రోను 2 చూ॥

**అబెసు** (Abez = తెల్లనిది, తగరము). ఇశ్శాఖారు గోత్రమందలి యొక గ్రామము (యెహో $19^{17-23}$). దీనియునికి తెలియదు.

**అబెద్నెగో** (Abednego = నెబో అను దేవతకు సేవకుఁడు). నెబూకద్నెజరు రాజు యొక్క నపుంసకుల పెద్దయగువాఁడు అజర్యాహు అనువానికి పెట్టిన మాఱుపేరు. ఇతఁడు భక్తి పరులగు యూదులలో నొకఁడై యుండెను. నెబూకద్నెజరు చేయించిన బంగారు విగ్రహమునకు మ్రొక్కనందున అతఁడితనిని అగ్నిశాలిమిలో వేయించెనుగాని దేవుఁడితనిని అద్భుత రీతిగా కాపాడెను (దాని $1^{7}$ $3^{12-30}$).

**అబ్దా** (Abda = యెహోవా సేవకుఁడు).

1. సొలొమోను ఉద్యోగస్థులలో నొకఁడగు అదోనీరాము తండ్రి (I రాజు $4^{6}$).

2. ఒక లేవీయుఁడు (నెహె $11^{17}$). I దిన $9^{16}$ నందిది ఓబద్యా అని యున్నది.

**అబ్ది** (Abdi = సేవకుఁడు).

1. లేవీయులలో నొకఁడు. ఇతఁడు మెరారీ వంశజుఁడును, కీషు అనువాని తండ్రియు, ఏతాను అనువాని తాతయునైయుండెను (I దిన $6^{44}$ II దిన $29^{12}$).

2. అన్య స్త్రీల నుంచుకొని ఎజ్రా ప్రేరేపణ వలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{26}$).

**అబ్దీయేలు** (Abdiel = దేవుని సేవకుఁడు). గాదు గోత్రపువారిలో నొకఁడు (I దిన $5^{15}$).

**అబ్దెయేలు** (Abdeel = దేవుని సేవకుఁడు). బారూకును యిర్మీయాను పట్టుకొనుటకు పంపఁబడిన వారిలో షెలెమ్యాయను నొకనికి తండ్రి (యిర్మీ $36^{26}$).

**అబ్దోను** (Abdon = దాసుఁడు).

1. న్యాయాధిపతులలో 11-వ వాఁడు. ఇతఁడు ఇశ్రాయేలీయులను 8 సం॥ లపాటు నేలెను. ఇతఁడు ఎఫ్రాయిము గోత్రీకుఁడును పిరాతోనను ఊరివాఁడునైన హిల్లేలు కుమారుఁడై యుండెను (న్యాయా $12^{13-15}$).

2. బెన్యామీనీయుల కుటుంబమునకు చేరిన యొకఁడు (I దిన $8^{23}$).

3. ఒక బెన్యామీనీయుఁడు. ఇతఁడు గిబియోను ఊరివాఁడును రాజునైన సౌలుయొక్క పూర్వీకులలో నొకఁడు (I దిన $8^{30}$ $9^{36}$).

4. రాజైన యోషీయాకాలములో జీవించిన యొకఁడు (II దిన $34^{20}$). II రాజు $22^{12}$ లో ఇతనికి **అక్బోరు** అను పేరుగలదు. అక్బోరు 2 చూ॥

5. ఆషేరు గోత్రపు స్వాస్థ్యములోనుండి లేవీయుల కియ్యఁబడిన యూళ్లలో నొకటి (I దిన $6^{74}$ యెహో $21^{30}$). ప్రస్తుతమున అది అక్జీబుయను నూరికి తూర్పుగా నున్న అబ్దె (*Abdeh*) అను నూరై యుండవచ్చును (పటము IV, B 5).

**అబ్నేరు** (**Abner** = వెలుఁగుకు తండ్రి). సౌలు పినతండ్రియగు నేరు కుమారుఁడు. (I సమూ $6^{5}$). సౌలు రాజైన పిదప అబ్నేరును సైన్యాధిపతిగా నియమించెను. యువకుఁడగు దావీదు ఫిలిష్తీయుఁడైన గొల్యాతును చంపిన తర్వాత ఇతఁడు దావీదును బిలిచికొని, ఆ ఫిలిష్తీయుని శిరస్సుచేత నుండగనే యతనిని సౌలునొద్దకుఁ దెచ్చి మర్యాదను గనుపఱచెను ($17^{57}$). సౌలు దావీదును జంపవెదకుచుండఁగా అబ్నేరు సౌలుకు మిగుల సహాయముజేసెను. ఒకసారి యితని యజాగ్రతవలన సౌలుదావీదుచేత జిక్కెనుగాని దావీదు యెహోవా యభిషిక్తునిపై తన చెయ్యి యెత్తనని సౌలును విడిచెను ($26^{3-15}$). ఫిలిష్తీయులతో సౌలుయుద్ధమాడి మృతినొందిన తరువాత దావీదిశ్రాయేలీయులందఱిమీఁద రాజుగా నుండి దైవాజ్ఞచే నభిషిక్తుఁడయ్యెనని దెలిసియు, అబ్నేరు సౌలుకుమారుఁడగు ఇష్బోషెతును రాజుగాఁజేసి యేడేండ్లవఱకు దావీదుతోఁ బోరాడుచుండెను. పిమ్మట ఇష్బోషెతును విరోధించి దావీదుకు ఇశ్రాయేలీయుల రాజ్యమంతయు నప్పగించుటకై మిగుల ప్రయత్నములఁ జేసెను (II సమూ $3^{6-21}$). అట్టి ప్రయత్నములలో నుండఁగా, తనతమ్ముఁడగు అశాహేలును చంపెనను క్రోధముతో యోవా బతనిని వంచనఁజేసి చంపెను ($3^{27}$). గాని దావీదబ్నేరును మిగుల మర్యాదతో భూస్థాపితముఁజేసి అతనిగూర్చి యొక అంగలార్పు కీర్తన రచించెను ($3^{31-37}$). H.

**అబ్యాతారు** (**Abiathar** = సమృద్ధికి తండ్రి). ఇశ్రాయేలీయుల ప్రధాన యాజకులలో పదవవాఁడు. ఏలీకి తరువాత నాల్గవవాఁడు (I దిన $6^{4-8}$ ని II సమూ $8^{17}$ తో సరిపోల్చుము). అహీమెలెకు కుమారుఁడు. అహీటూబుకు మనుమఁడు (I సమూ $22^{20}$). సౌలు అహీమెలెకును, ఇంక నెనుబది యైదుగురు యాజకులను హతముజేసినప్పుడు ($22^{9-18}$) అబ్యాతారు అనువాఁడు తప్పించుకొని పారిపోయి, అప్పటినుండి దావీదునొద్ద యాజకుఁడుగా నుండెను ($23^{9}$ $30^{7}$). దావీదు సింహాసనారూఢుఁడైన పిదప అబ్యాతారును ప్రధానయాజకునిఁ జేసెను (II సమూ $8^{17}$). దాదాపు 70 సంవత్సరములవఱకు ఓబేదెదోము ఇంటిలోనుండిన దేవుని మందసమును యెరూషలేమునకుఁ దెచ్చుటలో నితఁడు సహాయపడెను (I దిన $15^{11,12,25}$). దావీదు మంత్రులలో ముఖ్యుఁడాయెను ($27^{34}$). దావీదు నాలుగవ కుమారుఁడగు అదోనీయా తనతండ్రిమీఁద తిరుగుబాటుఁ జేసినప్పుడు అబ్యాతారు దావీదును విడచి అదోనీయాతోఁ జేరుకొనెను (I రాజు $1^{7}$). అందువలన సొలొమోను రాజైన పిమ్మట అతని ప్రధాన యాజకోద్యోగమునుండి తొలగించి అతని స్వగ్రామమగు అనాతోతుకుఁ బంపివేసెను ($2^{26,27}$). అందువలన యెహోవా ఏలీ యింటిని గూర్చి షిలోహులోఁ జెప్పినవాక్యము నెరవేరెను (I సమూ $2^{31-36}$ I రాజు $2^{27}$). సబ్బాతును మీరుటను గూర్చిన సందర్భములో దేవాలయములోని సముఖపురొట్టెలు అబ్యాతారు దినములలో దావీదున కియ్యఁబడెనని క్రీస్తు దాహరించెను (మా $2^{26}$). H.

**అబ్రాము, అబ్రాహాము** (**Abram** = గౌరవనీయుఁడగు తండ్రి, **Abraham** = అనేక జనములకు తండ్రి). తెరహు కుమారుఁడు (ఆది $11^{26}$). హెబ్రీయులకు మూలపురుషుఁడు (రోమా $4^{1}$). విశ్వాసుల తండ్రియు, దేవుని స్నేహితుఁడునైయుండెను (గల $3^{7-9}$ యాకో $2^{23}$). హెబ్రీయుల వంశావళులయందుదాహరింపఁబడిన పేరులు ఒక్కొక్కనికి గాక జనాంగములకుఁ బెట్టఁబడిన పేర్లుగా నున్నవిగాన అబ్రాహామనునదియొక జాతిపేరా లేక అబ్రాహామేదైన నొక ప్రత్యేక జనాంగమును సూచించునా యను ప్రశ్నలు విచారణార్హములు (ఆది 10, $25^{1-4}$). $11^{26,27}$ $12^{1-10}$ యందలి వచనములను ఒకజాతి యారంభమును, ఆ జాతివారు వలసబోవుటను

గూర్చినకథగా ఎంచుటకు వీలున్నది. అబ్రాము లోతులు వేఱైపోవుటయు (13), అతఁడు అబీమెలెకుతోఁ జేసికొనిన సంధియు ($21^{22-32}$) ఇదే రీతిగ జనాంగమునకు సంబంధించినటులఁ గనుపడుచున్నవి. ఇట్టి సంబంధములచ్చటచ్చట కొద్ది గొప్ప గానవచ్చుచున్నను, అబ్రామునుగూర్చిన చరిత్రయంతయు ఒకజాతికిమాత్రమే చెందినదనుటకు వీలులేదు. అట్లయినయెడల అనేక సంగతులలో గొప్ప చిక్కులు తటస్థమగును. అవి ఒక్కనికి మాత్రము సంబంధించినవైయున్నవి ($15^{1-18}$ $16^{1-11}$ $18^{1}$-$19^{28}$ $20^{1-17}$ $22^{1-14}$ 24). పై వాక్యములన్నియు ఇశ్రాయేలీయుల ఆది గ్రంథములయందున్నవని శాస్త్రజ్ఞులందఱు నొప్పుకొనుచున్నారు. అబ్రాహాముకు తరువాతికాలపు హెబ్రీయులందఱు ఆ సంగతులన్నియు ఆ పేరుగల నొకనికి సంబంధించినవే యని యెంచిరి (యెష $29^{22}$ $41^{8}$ $51^{2}$ యిర్మీ $33^{26}$ యెహె $33^{24}$ మ $^{11}$ మొ॥).

**I. కాలక్రమచరిత్ర.** 1. కనానుకురాకపూర్వపు చరిత్ర:—(75 సం॥ లు). ఇతఁడారంభమున కల్దీయుల ఊరు అను పురమున తన తల్లిదండ్రాదులతో జీవించెను. తనమాఱుచెల్లెలగు శారయిని వివాహమాడెను. హారానులో అబ్రాము కాపురముండకమునుపు దేవుఁడతనికి ప్రత్యక్షమాయెనని (కార్య $7^{2}$) స్తెఫను చెప్పుటవలన అతఁడు ఊరును వదలిపెట్టకముందరనే దేవుఁడతనికి కనుపడెనని తెలియుచున్నది. ఆది $15^{7}$ నెహె $9^{7}$ ఈ సంగతిని దృఢపఱచుచున్నవి. తన సహోదరుఁడగు హారాను మరణమైన పిదప అబ్రాము తనభార్యను లోతును తమకు కలిగిన సమస్తమును వెంటఁగొని తండ్రియగు తెరహుతోఁ గలిసి ఊరును వదలిపెట్టి, యూఫ్రటీసునది వెంబడినున్న గొప్ప రాచ బాటమీఁద వాయువ్య దిక్కుగా ప్రయాణముఁజేసెను (ఆది $11^{27-31}$). హారాను జేరిన తరువాత కనానుదేశముకుఁ బోయెడి ఉద్దేశము నప్పటికిమాని, అచ్చటనే కాపురముండిరి. అతఁడు హారానునుండి బైలుదేరి కనానుకుఁ బోయినది ఊరునందతనికి కలిగిన దర్శన ప్రకారమయ్యుండును. అటులకాకున్న $12^{1}$ నందున్న ప్రకారము దేవుఁడు అతనికీయాజ్ఞ నిచ్చియుండును. పైన నుదాహరించినరీతిగా మొదటి దర్శనము ఊరునందు కలిగినదని స్తెఫను అభిప్రాయమైయున్నది. కొందఱు తలంచునటుల $12^{1}$ నందున్న వాక్యములో దీనికి భిన్నమైనదేదియు లేదు. గ్రంథకర్త తెరహు మరణమునుగూర్చి తెలిపిన మీఁదట అబ్రాహాము హారానునుండి బయలుదేరెనని వ్రాసెను. అంతమాత్రమున అబ్రాహాము తన తండ్రి మరణమగునందాక హారానునందేయుండెనని యూహించి చెప్ప వీలులేకపోయినను, అతఁడు హారానునుండి బయలుదేరినప్పుడు మాత్రము తెరహు అతనివెంట కనానుకుఁ బోలేదు. స్తెఫను చెప్పినదియు దీనికి సరిపడును. అబ్రాము కనానుకు వెళ్లెను. దమస్కువాఁడగు ఎలీయెజెరును గూర్చి తరువాత నుదాహరింపఁబడినది ($15^{2}$) గాన, వారు మెసపొతేమియనుండి దమస్కుమీఁదుగా వెళ్లిన గొప్పరోడ్డుమీఁద ప్రయాణము చేసినట్లు కనఁబడుచున్నది. అబ్రాము హారానును వదలినప్పుడు 75 యేండ్లవాఁడు. ఐగుప్తీయురాలగు హాగరును వివాహముచేసికొనక పూర్వము కనానులోనతఁడు 10 యేండ్లవఱకు అక్కడక్కడ తిరుగుచుండెను ($16^{3}$). హాగరతనికి ఇష్మాయేలును కనినప్పుడతఁడు 86 సం॥ ల వయస్సుగలవాఁడు ($16^{16}$). గనుక అతఁడీ దేశమునకు వచ్చుటకు పట్టినకాలము ఒక సంవత్సరముకన్న నెక్కువయైనట్లు కనుపించదు. అతడు తన ప్రయాణమునందెక్కడనైనను యెక్కువ కాలముగడుపక యొకాయెకిని కనానుజేరెను.

2. నిలుకడలేక కనానులో తిరిగినకాలము:—(దాదాపు 10 సం.లు). అతఁడు మొదట ఈ దేశమున దిగినది షెకెమునందు (ఆది $12^{6}$). తరువాత బేతేలు ($12^{8}$) నొద్దను, పలెస్తీను దక్షిణదేశమునందును ($12^{9}$), కొంతకాలము గడిపెను. కరవు వచ్చినందున ఐగుప్తుకుఁబోయి అచ్చట తన భార్య విషయము భయపడినవాఁడై ఆమె తన చెల్లెలైనట్లు నటించెను ($12^{10-20}$). తరువాత పలెస్తీను దక్షిణదేశమునకును ($13^{1}$), బేతేలుకును ($13^{3}$) తిరిగివచ్చెను. మందలు వృద్ధియైనందున లోతును తానును వేరుపడిరి. లోతు యొర్దాను మైదానమును కోరుకొనఁగా అబ్రాము హెబ్రోనులో మమ్రే దగ్గరనున్న సింధూరవృక్షవనము నందుదిగెను ($13^{18}$).

3. మమ్రేసింధూర వృక్షమునందు నివసించిన కాలము (15 సం॥ లకు తక్కువకాదు. కొంద

 అబ్రాము

అతఁడక్కడ దాదాపు 23 లేక 24 సం॥ లుండెనని తలంతురు):—ఇచ్చట నుండఁగా చుట్టు ప్రక్కల నున్న అమోరీయుల నాయకులతో సంధి జేసికొనెను (ఆది $14^{13}$). కదొర్లాయోమెరును కొట్టి తరిమి లోతును విడిపించెను ($14^{1-16}$). మెల్కీసెదెకువలన నాశీర్వదింపఁబడెను ($14^{17-24}$). తన కొక వారసుఁడు కలుగునను వాగ్దానమునొంది దానిని నమ్మెను. కనానతనికి స్వాస్థ్యమగునను వాగ్దానమొక నిబంధనవలన దృఢపరచఁబడెను (15). ఇష్మాయేలీ స్థలమునందే జన్మించెను (16). పదమూఁడు సం॥ లకు పిదప ($16^{16}$ $17^{11}$) అతనికి చేయఁబడిన వాగ్దానము విశదమాయెను. ఆ వాగ్దానము నెరవేరుట కెంతయాలస్యమైనను అది తప్పక నెరవేరెను. దేవుఁ డబ్రాముపేరు అబ్రాహాముగ మార్చి తన నిబంధనకు సూచనగా సున్నతిని నియమించెను (17). ఆ కాలములోనే సొదొమ నాశనమయ్యెను (18, 19).

4. బెయేర్షెబాయొద్దనుండుట:—(దాదాపు 15 సం॥ లు). అబీమెలెకు శారాను తన యింటఁ జేర్చుకొనెను (ఆది 20). అబ్రాహాము నూఱేండ్ల ప్రాయమున నుండఁగా ఇస్సాకు జన్మించెను. కొద్ది కాలములోనే ఇష్మాయేలు వెళ్లఁగొట్టఁబడెను ($21^{1-21}$). అబ్రాహాము తాను త్రవ్వించిన బావి యొద్ద అబీమెలెకుతో సంధి జేసెను. ఆ బావికి బెయేర్షెబా యని పేరు పెట్టెను ($21^{22-34}$). ఇస్సాకు కొంచె మెదిగిన పిమ్మట ($22^{5}$) అతనిని బలిగా నర్పించుమను నాజ్ఞ దేవునివలన నొందెను. దాని ప్రకారమతఁడు ఇస్సాకును వెంటఁగొని మోరియాకొండకు వెళ్లెనుగాని అచ్చట ఇస్సాకుకు మాఱుగా నొక పొట్టేలు నర్పించి దేవుని దీవన లొంది బెయేర్షెబాకు తిరిగివచ్చెను ($22^{1-19}$).

5. హెబ్రోను దగ్గర రెండవమారు నివసించుట:—(20 సం॥ లు). ఈ కాలమున జరిగిన ముఖ్య విషయము లంతగాలేవు. 127 సంవత్సరముల ప్రాయముగలదై శారా చనిపోయెను (ఆది 23).

6. బహుశః బెయేర్షెబాలోనే నివసించుట:—(దాదాపు 38 సం॥ లు). శారా చనిపోయిన పిదప అబ్రాహాము 140 సం॥ ల వయస్కుఁడై యుండునప్పుడు, ఇస్సాకుకు తన బంధుజనుల నుండి యొకతెను భార్యగాఁ దెమ్మని మెసపొతేమియకు ఎలీయెజరును బంపెను. సేవకుఁడు రిబ్కాను దెచ్చునపుడు ఇస్సాకామెను బెయేర్ లహాయిరోయి దగ్గర కలిసికొని వివాహమాడెను (ఆది 24). అబ్రాహాము కెతూరాను పెండ్లి జేసికొనిన సంగతి దీనికి తరువాత ఉదాహరింపఁబడినను ఆకాలమును నిర్ణయించుట కష్టముగా నున్నది (కెతూరా చూ॥). అబ్రాహాము 175 సం॥ ల యీడు గలవాఁడై చనిపోయి మక్పేలా గుహలో పాతిపెట్టఁబడెను ($25^{1-9}$).

## II. అబ్రాహాముతో నున్న ప్రజల సముదాయము.

హారానునుండి అతఁడు తన భార్యను సహోదరుని కుమారుఁడగు లోతును తాము సంపాదించిన సమస్తమైన వారిని దీసికొని బయలుదేరెను (ఆది $12^{5}$). విక్రయము వలనను, వారు వీరను గ్రహించిన కానుకల వలనను, ఉన్న వారి సంతానాభి వృద్ధిచేతను కనానులో నతని సేవకుల సంఖ్య విస్తరిల్లెను ($16^{1}$ $17^{23,27}$ $18^{7}$ $20^{14}$). అతని గొఱ్ఱు గోదలు విస్తరించెను. దాసులు దాసీలుగలవాఁడై బహు భాగ్యవంతుఁడాయెను ($12^{16}$ $13^{2,7}$ $24^{32,34,59}$ $26^{15}$). తన యింట బుట్టి అలవరచఁబడిన 318 మంది నతఁడు వెంటఁబెట్టుకొని వెళ్లి లోతును విడిపించెను ($14^{14}$). చుట్టునున్న జనాంగములచే మహారాజుగ నెంచఁబడెను ($23^{6}$) గాన, వారతనితో సంధిజేసికొని సఖ్యముగానుండిరి ($14^{13}$ $21^{23}$). గాని అతఁడు వీరి సహాయము లేనియెడల తాను నిరాధారుఁడనని తన విషయము తలంచుకొనినట్లు ఐగుప్తునందును, గెరారునందును జరిగిన విషయములే తార్కాణములై యున్నవి. అతఁడు సమాధానమునే కోరెను. సమాధాన కర్తయని యతనిగూర్చి చెప్పవచ్చును ($13^{8}$) గాని సమయము వచ్చినప్పుడెంతమాత్రమును జంకు గొంకులు లేక తన బంధుమిత్రాదులకొఱకై యుద్ధములు చేయుటకు వెనుక దీయలేదు (14).

## III. బైబిలునందున్న యితర గ్రంథములలో అబ్రాహామును గూర్చిన సూచనలు.

పాత నిబంధన నూతన నిబంధన కాలములలో నితఁడు అగ్రస్థానము వహించినవాఁడైయుండెను. స్వాస్థ్యమునుగూర్చిన వాగ్దాన సందర్భములలో నతని పేరు వచ్చును (ద్వితీ $1^{8}$

I రాజు $18^{36}$). భయభక్తుల విషయములందు అతఁ డుదాహరింపఁబడెను (నిర్గ $3^{15}$ I రాజు $18^{36}$). గాని ప్రవక్త లంత తరుచుగ నుదాహరింపక పోయినను అతఁడు జీవించెనను సంగతి అందరు అంగీకరించినట్లై యుండెను. అతఁడు దేవుని స్నేహితుఁడనియు (యెష $41^{8}$ II దిన $20^{7}$), ఒంటరిగాయి యుండెననియు (యెష $51^{2}$ యెహె $33^{24}$), అబ్రాహాము శారాలు తమ పూర్వికులనియు (యెష $51^{2}$=$29^{22}$ $63^{16}$ యిర్మీ $33^{26}$ మీకా $7^{20}$) ఉదాహరించిరి. క్రొత్త నిబంధనయందతఁడు యూదుల జాతికి మూల పురుషుఁడని మాత్రమేగాక (మ $3^{9}$ యోహా $8^{33,37,39}$), విశ్వాసులలో అగ్రగణ్యుఁడనియు (హెబ్రీ $11^{8-11}$ మొ॥), దేవునితో అధిక పరిచయము గలవాఁడనియు (యోహా $8^{56}$ మొ॥), విశ్వాసులకు ఆత్మీయముగా తండ్రి యనియు (లూ $16^{22}$ రోమా $4^{9-11}$ మొ॥) యెంచఁబడెను.

## IV. ఇతర చరిత్రలతోఁగల సంబంధము.

1. ఐగుప్తు చరిత్రము:—ఇశ్రాయేలీయుల నిర్గమమునకు పూర్వము **645**-వ సంవత్సరమున అబ్రాహాము ఐగుప్తునకుఁ బోయినటుల బైబిలు కాల చరిత్ర తెలుపుచున్నది. కరవుకాలమున అబ్రాహామును అతని మనుమఁడగు యాకోబును తమ మందలతోఁ బోయి ఐగుప్తునందు ఆకాలమున నేలుచున్న ఫరోలచే నాదరింపఁబడుటను చూడఁగా ఆ రాజులు ఆసియా ఖండవాసులగు గొల్ల రాజులై యున్నట్లు తేలుచున్నది గాన ఈ చరిత్ర కల్పనా సంగతులు గలది గాక నిజమైన చరిత్ర యనుట కొక మంచి సాదృశ్యమై యున్నది.

**2.** బబులోను చరిత్రము:—ఈ కాలమున యూఫ్రటీసు హైగ్రీసు నదీతీరముల నున్నవారికిని పలెస్తీను నందున్న వారికిని చాల సంబంధముండెను. కదొర్లాయోమెరు జేసిన దండయాత్ర బైబిలునందలి మరియొక సూచనయై (ఆది 14) యున్నది. ఆ చరిత్రలో అమ్రాపేలు అను పేరు కనఁబడును. ఈ కాలమున మిగుల ప్రసిద్ధుఁడైన హామురాబి ఇతఁడే యని అనుకొనుటకు మంచి వీలు లున్నవి. అట్లయినయెడల ఈ దేశములలోని దేశచట్టములును, నియమములును చాల సంబంధముగా నున్నట్లు కనఁబడును (బబులోను III 2 చూ॥). ఏలాములోని యితర రాజులును ఇట్టి దండయాత్రలు జేసియుండినందున పలెస్తీనులోని అధికారులు వారి అనుమతి చొప్పున తమ అధికారమును వహించుకొని యుండిరని చెప్పవచ్చును. భాషలయందును ఈ దేశములకును పలెస్తీనుకును చాల సంబంధ మగుపడుచున్నది గాన, అబ్రాహాము ఊరు హారానుల నుండి దీర్ఘప్రయాణములు చేయుటకును అక్కడక్కడ తిరిగి నివసించుటకును వీలయ్యెను. ఇట్టి చరిత్ర సంబంధములవలన అబ్రాహాము జీవించిన కాలమును నిర్ణయించుటకు వీలు గలుగుచున్నది.

## V. మత విషయములలో అబ్రాహాముకు కలిగిన ప్రాముఖ్యత:—

సర్వలోకము నందా కాలమున వ్యాపించిన బహు దేవతారాధనగల దినములలో ఏకేశ్వరుని గూర్చిన బోధకు అబ్రాహాము ఉద్ధారకుఁడని చెప్పఁదగును. ఏక దేవుని గూర్చిన సిద్ధాంతము ననుసరించెడి క్రైస్తవులు యూదులు మహమ్మదీయులు అందఱును అబ్రాహాము తమ మత స్థాపకులలో నొక ముఖ్యునిగా నెంతురు. ఈ మూఁడు మతములను ఆ మత ఫలితముల నీ లోకము నుండి తీసివేసిన యెడల ఏక దేవుని గూర్చిన బోధయంతయు పూరిగ తీసివేసినట్లుగ నుండును. అబ్రాహాము, బ్రహ్మ అను పదములకు సంబంధము కలదని ఈ దేశస్థులలో గొంద రభిప్రాయపడుచున్నారు గాని దాని నమ్ముటకు తగిన యాధారము లెవ్వియును లేవు. అయినను అబ్రాహాము ఈలోక మతోద్ధారకులలో నొక ముఖ్యుఁడని అందరు నొప్పుకొనవలసి యున్నది.

**అబ్రాహాము రొమ్ము** (Abraham's Bosom). మృతినొందిన నీతిమంతుల నివాసమును తెలియఁజేయ వాడెడు పదము. విశ్వాసుల తండ్రియు దేవుని స్నేహితుఁడునగు అబ్రాహాముతో వీరికుండు అన్యోన్య సహవాసమే వీరియొక్క ధన్యకరమగు స్థితిని తెలియఁజేయుచున్నది. బైబిలునందీపదము ధనవంతుఁడు లాజరు ఉపమానములో మాత్రముదాహరింపఁబడి యున్నది (లూ $16^{22,23}$). పూర్వకాలమున విందునకుఁ బిలువఁబడిన వారిలోని ప్రధానుఁడు తన ప్రక్కనున్న వాని రొమ్ము నానుకొనెడి

యలవాటుండెను. అట్లనుకొనుట మిగుల గౌరవ
మును సూచించెను. W.

**అబ్షాలోము, అబీషాలోము (Absalom, Abishalom** = సమాధానమునకు తండ్రి).

రాజైన దావీదు మూడవ కుమారుడు. పలె
స్తీను కీశాన్యముననున్న గెషూరుదేశపు రాజగు
తల్మయి కుమార్తెయగు మయకా యితని తల్లి
(II సమూ $3^{3}$). అధిక సౌందర్యవంతుడు.
విస్తారమగు శిరోజములు గలవాఁడు ($14^{25-26}$).
అతనికి తామారను సౌందర్యవతియగు తోబుట్టువు
గలదు. ఇతని మారు సోదరుఁడగు అమ్నోనను
రాజపుత్రుఁడు తామారును మోహించి చెరిచి
యవమానించినందున ($13^{14}$) మహా రౌద్రుఁడై
యప్పటికేమియు ననక, తగిన సమయమును
జూచుకొని అమ్నోనును జంపి, తన తాతయగు
తల్మయియొద్దకుఁ బోయెను. మూఁడేండ్లవాఁ
డచట నివసించిన పిదప ($13^{38}$) యోవాబతని పక్ష
ముగ బ్రతిమాలుకొనినందున అతఁడు యెరూష
లేమునకు రావచ్చునని దావీదు సెలవనుగ్రహిం
చఁగా మరల యెరూషలేమునకు వచ్చెను ($14^{28}$).
అబ్షాలోము తన తండ్రి తనను క్షమించి చేర్చు
కొని జూపించిన ప్రేమకు ప్రతి ఫలముఁ జూప
కయే, యతనికి ద్రోహముఁజేయ సమకట్టెను.
ఉపాయముగఁ బ్రజలలో ననేకులను తన పక్షము
జేసికొని తగిన తరుణమునకై వేచియుండి, హెబ్రో
నుకుఁ బోయి తన్ను రాజుగఁ బ్రకటించుకొని,
దండును జేర్చుకొనెను ($15^{1-16}$). దావీదీ సంగతిని
విని ప్రజలందరు నబ్షాలోము పక్షమునఁ జేరి
రనుకొని యెరూషలేమును విడిచి పారిపోయి
యొర్దాను కద్దరినున్న మహనయీము జేరుకొనెను
($15^{17}$-$17^{26}$). అబ్షాలోము దావీదు పక్షమున
నుండిన వారి మాయలోపడి యెరూషలేములోఁ
గొంత యాలస్యముజేసి, పిదప నది యవతలనున్న
దావీదు సైన్యమును ఎఫ్రాయిము వనములో తల
పడి యుద్ధముఁజేసెను. అతని సైన్యము దావీదు
భటులముందర నాగఁజాలక పారిపోయెను. అబ్షా
లోము కంచరగాడిదమీఁదనెక్కి పారిపోవు
చుండఁగా అది యొక పెద్ద మస్తికా వృక్షము
యొక్క చిక్కుకొమ్మల క్రిందుగా వెళ్లినందున
అతని తలవెండ్రుకలా చెట్టు కొమ్మలను తగులు
కొని భూమ్యాకాశములకు మధ్య వ్రేలాడెను.
ఈ సంగతి విని యోవాబు వచ్చి పదిమంది
యాయుధస్థులతో నతని చుట్టు ముట్టి బాణము
లతో గొట్టి చంపెను. పిదప నతని కళేబరమును
తీసి దగ్గరనున్న యొక గోతిలో వేసి అతనిమీఁద
రాళ్ల నొక పెద్ద కుప్పగాఁ బోసిరి ($18^{1-18}$).
I రాజు $15^{2-10}$ లో నితనికి అబీషాలోము అను
పేరు గలదు. H.

**అభిషేక తైలము** గంధవర్గము, నేరములు
శిక్షలు I 7 చూ॥

**అభిషేకము, పట్టాభిషేకము (Anoint).**

1. రాజులను (I సమూ $10^{1}$ $16^{3}$ మొ॥)
గాని, యాజకులను (లేవి $8^{12,30}$ కీర్త $133^{2}$) గాని,
అప్పుడప్పుడు ప్రవక్తలను (I రాజు $19^{16}$) గాని
వారి వారియుద్యోగములకు ప్రతిష్ఠించుటకై వారి
తలలమీఁద నూనెఁబోసి వారి నభిషేకించెడి
యొక వాడుక. మనుష్యులను మాత్రము గాక
పూజాస్థలములను కూడ నిట్లే ప్రతిష్ఠించిరి (ఆది
$28^{18}$). ఇశ్రాయేలీయులకు ఆలయముగా నుండిన
గుడారమును దాని సామగ్రిని ఈశ్వరునికిగాఁ
ప్రతిష్ఠించుటకు ఒక విశేష విధమగు పరిమళ
తైలమును వాడిరి (నిర్గ $30^{22-25}$). ఇశ్రాయే
యుల మొదటి రాజుల నందరిని నభిషేకించి



అభిషేకము

నట్లు సూచనలు గలవు (I సమూ $10^{1}$ $16^{13}$
I రాజు $1^{39}$ II రాజు $9^{6}$ $11^{12}$ $23^{30}$). ఇట్లు
పట్టాభిషేక మొందినవారు తమ పని నిర్వహించు
టకు పొందిన ఆత్మవరమును కూడనిది సూచించును

(I సమూ $16^{13}$). అట్టివా రెక్కువ గౌరవార్హులై యున్నారు (I దిన $16^{21}$).

2. పైన నుదాహరింపఁబడినటులఁగాక అభిషేకమునకు అలంకారరీతిగా ఆత్మీయ యర్థమును బైబిలునందున్నది. ఒక పనిచేయుటకు దేవునిచేఁ బిలువఁబడి, బలపఱచఁబడిన వారీవిధముగా ఆయనచే నభిషేకమొందిన ట్లెంచఁబడెదరు. దేవుఁడిట్లు కోరెషును అభిషేకించినట్లు యెష 45 నందున్నది. కీర్త $89^{38}$ విలా $4^{20}$ హబ $3^{13}$ లో ఇశ్రాయేలీయు లివ్విధముగా నభిషేకమొందుటను సూచించుచున్నదనవచ్చును గాని ఆ వాక్యములు వారి రాజులకుకూడ సరిపడవచ్చును. ఆత్మను పొందిన క్రైస్తవులు దేవునిచే నభిషేకము నొందినవారని యలంకార రీతిగాఁ జెప్పవచ్చును (II కొరి $1^{21}$ I యోహా $2^{20,27}$). యేసుకు అభిషిక్తుఁడను పేరుగలదు. మెస్సీయా, క్రీస్తు అను పదముల యర్థమిదియే (యెష $61^{1}$ లూ $4^{18}$ కార్య $10^{38}$ మొ॥). యేసుక్రీస్తు (IV 3 (1) b చూ॥)

**అభ్యంతరములు, ఆటంకములు (Offences).** మనము పాపములో పడునట్లు మనలను శోధించువాటిని శోధకులను దెలుపుటకు క్రొత్త నిబంధనలో నీ పదమువాడిరి. దీని యసలుపదము ఉరిని సూచించును. క్రీస్తుకు సహా యిట్టి యభ్యంతరములు కలిగెను (మ $16^{23}$). గాని ఆయన శోధకుని నెదిరించి వాని జయించెను. క్రీస్తు విషయము అనేకు లభ్యంతరపడుదురు. ఆయన మానవులు కనిపెట్టినరీతిగా మహిమా ప్రభావములతో రాక చాలవినయుఁడై వచ్చుటచే ననేకులు ఆయనను నమ్మకుండుటకు హేతువుగా నున్నది. బాప్తిస్మమిచ్చు యోహా నిట్టి శోధనలోఁ బడనైయుండెఁగా తన విషయమై అభ్యంతరపడనివాఁడు ధన్యుఁడని క్రీస్తు చెప్పెను (మ $11^{6}$ లూ $17^{1}$). ఇట్లే చివరి రాత్రియందు క్రీస్తు శిష్యులు జరిగినదానిఁజూచి యభ్యంతరపడిరి (మ $26^{31}$ యో $16^{1}$). ఆయన సిలువవేయఁబడిన పిమ్మట ఆ సిలువయే మానవులకిట్టి యభ్యంతరమాయెను (గల $5^{11}$). ఇశ్రాయేలీయులకును యూదులకును పెట్టఁబోవు అభ్యంతరము కలిగించు బండ అట్టిదై యున్నది (యెష $8^{14}$). రోమా $14^{21}$ I పేతు $2^{7,8}$ లో ఆ వాక్యము నెత్తి దానిని అడ్డురాయి అను పదముచే భాషాంతరము జేసిరి. క్రీస్తుకు సంబంధించిన ఈ వాక్యములను జూడఁగా, మానవులు పరమమేలు నెఱుగక తమ విపరీతబుద్ధివలన దానిని కీడుగా నెంచి ఎదిరించి పాపములో పడుట ద్వారా నది వారికభ్యంతరమాయెనని తెలియుచున్నది. అయితే మన స్వంత పాపముల ద్వారా ఇతరులను పాపములోకి నడుపుటవలన వారికభ్యంతర పఱచకుండునట్లు మఱియెక్కువగా మనము జాగ్రత్తపడవలెను (మ $18^{7}$ మా $9^{42}$ లూ $17^{1}$ రోమా $16^{17}$ I కొరి $8^{13}$). అదేరీతిగా మనకు పాపమునకు హేతువులగు అభ్యంతరములు మనకెంత ప్రియమైనవైనను వాటిని త్యజించి పూర్ణముగా వదలివేయవలెను (మ $5^{29-30}$ $18^{8,9}$ మా $9^{43,45,49}$).

**అమజ్యా (Amaziah = యెహోవా బలపఱచును).**

1. క్రీ॥ శ॥ పూర్వము సుమారు 802-786 వఱకు యూదావారి రాజ్యమునకు రాజు (II రాజు $14^{1}$ II దిన $25^{1,2}$). రాజైన యోవాషు కుమారుఁడు. తన తండ్రిని కుట్రజేసి చంపిన నరహంతకులకు మరణ శిక్ష విధించెనేగాని ఆ కాలమున సర్వసామాన్యముగు రీతిగా వారి పిల్లలను శిక్షింపక (II దిన $25^{3,4}$) దేవుని యాజ్ఞకు లోఁబడి (ద్వితీ $24^{16}$) వారిని రక్షించెను. ఎదోమీయులతో యుద్ధముచేసి వారి నోడించెను (II రాజు $14^{7}$ II దిన $25^{6-12}$). ఆ యుద్ధమున తనకు సహాయము చేయుటకై ఇశ్రాయేలీయులను కూలికి పెట్టుకొనెను గాని ఒక ప్రవక్త అనుమతి చొప్పున వారిని తిరిగి పంపివేయఁగా వారు తమ స్వదేశమునకుఁ బోవుచు యూదా దేశములోని కొన్ని యూళ్లను పాడుచేసిరి (II దిన $25^{13}$). తరువాత అతఁడు ఇశ్రాయేలు రాజగు యెహోయాషుమీఁద యుద్ధముచేసి, గొప్ప పరాభవము నొంది, శత్రువులచేఁ జిక్కెను (II రాజు $14^{8-14}$ II దిన $25^{14-24}$). అతఁడు గర్వించి విగ్రహారాధనఁ జేసినందుకు ప్రతిఫలముగా నిది కన్పడుచున్నది. అతఁ డేలినది 29 సంవత్సరములని యున్నది (II రాజు $14^{2}$ II దిన $25^{9}$). ఇతఁడు తన దేశమునుండి వెళ్లఁగొట్టఁబడి లాకీషుకు పాఱిపోయి (II దిన $25^{27-28}$), అచ్చట 12 సం॥ ల వఱకుండిన పిమ్మట పట్టుకొని చంపిరని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల అతని తండ్రియగు యోవాషు

జబ్బుగానున్న కాలములో నతనితోకూడ యేలిన రెండు సంవత్సరములు కలుపుకొని ఇతని ప్రభుత్వ కాలము 24 సంవత్సరము లగునుగాని లేనియెడల అంతకాల మితఁడు ఏలియుండఁడు. ఈ లెక్కలలో కొంత పొరబాటు ఉండునని కొందఱి అభిప్రాయము.

2. షిమ్యోను గోత్రీకులలో నొకఁడు (I దిన $4^{34}$).

3. మెరారీ వంశములోని ఒక లేవీయుఁడు (I దిన $6^{45}$).

4. బేతేలులోని దూడల విగ్రహాలయమునకు రెండవ యరొబాము కాలములో యాజకుఁడుగా నుండినవాఁడు. ఇతఁడు ఆమోసును బెదరించుటకు యత్నించి విఫల మనోరథుఁడాయెను (ఆమో $7^{10-14}$).

**అమరత్వము** (Immortality). మానవులు చనిపోయినపుడు వారిశరీరము నశించును గాని వారియాత్మ నశించక నిత్యము బ్రతుకు ననియు, అంత్యదినమున పునరుత్థానమందు దానికి నశించని స్థితికిఁదగిన శరీర మొకటి కలుగుననియు బైబిలు బోధించుచున్నది. ఈ బోధను వివరించునపుడు క్రీస్తురాకడకు పూర్వముననుండిన సూచనలను క్రీస్తుతేచిన పిమ్మట వ్యాపించిన బోధను ప్రత్యేకముగా చూడవలయును.

1. పాఁతనిబంధన కాలపు బోధ. ఇదియంత తేటయైనదికాదు. మృతులుండు స్థానమొకటి కలదు. దీనిని పాతాళమని తర్జుమా చేసిరి (పాతాళము చూ॥). ఆ మృతులున్నను, వారొకవిధమైన నిద్రావస్థయందుండినట్లు అప్పటి కాలములోని వారు నమ్ముచుండిరని తెలిసికొనవచ్చును. (ప్రస $9^{10}$ I సమూ $28^{3-18}$ యోబు $14^{37}$ కీర్త $88^{12}$). ఆ కాలమందిట్టి యభిప్రాయమున్నను, కొందఱు భక్తులు అమరత్వమునుగూర్చిన నిరీక్షణను కలిగినవారై దాని కనఁబఱచిరి (యోబు $19^{26}$ కీర్త $16^{9}$ $73^{24}$ యెష $26^{19}$ హోషే $13^{14}$ దాని $12^{2,3}$). ఈ వాక్యములలో కొన్నిఁటిని చూడఁగా ఆయా వారలుతేచుటనుగూర్చి మాత్రముగాక నశించిన యిశ్రాయేలు జనములు తమస్వదేశములోఁజేరి జీవించునట్టి క్రొత్త జనమగు ననుటను గూర్చియు తెలియఁజేయును.

ఇందువలన పాఁతనిబంధనలో అమరత్వమును సూచించు సూచనలుండినను మానవుల భవిష్యద్ బ్రతుకును గూర్చియు, ఆ బ్రతుకునందలి స్థితులను గూర్చియు అంత తేటఁగా తెలియుట లేదని యొప్పుకొనవలెను.

2. క్రొత్తనిబంధన కాలపు బోధ. క్రీస్తు కాలములో యూదులలోని పరిసయ్యుల తెగలో చేరినవారు భవిష్య జ్జీవమునుగూర్చి నమ్మిరి (కార్య $23^{8}$). అయితే ఆకాలపు ప్రజలి బోధను క్రీస్తు పునరుత్థానమువలన తేటఁగా గ్రహింపఁగలిగి యుండిరి. సువార్తల బోధయావత్తు నిత్యజీవమును దేవుని రాజ్యమునుగూర్చినదై యున్నది. క్రీస్తు మరణమునుండి లేచుటవలన జీవమును బయలు పఱచెను (II తిమో $1^{10}$). క్రీస్తు శరీరమునకు వలె భక్తుల శరీరములును మార్పునొంది అక్షయమైనవగును (I కొరి $15^{53,54}$). ఈ విధముగా క్రీస్తులేచుటవలన జీవముతోఁగూడిన నిరీక్షణ మనకు కలిగెను (I పేతు $1^{3,4}$). ప్రకటన గ్రంథమెంత యలంకారరీతిగా నున్నను భక్తులకు కలుగునిత్యసౌఖ్యమే అందులోని ముఖ్యవిషయ మనఁదగును. అమరత్వమునుగూర్చి యిట్టి నిరీక్షణ క్రీస్తుయొక్క ఆది శిష్యులందఱిదై యుండి కష్టములను సహించుటకును లోకమును త్యజించుటకును, దేవుని కార్యములను జేయుటకును తెగింపఁగలుగునట్లు వారిని బలపఱచెను (II కొరి $5^{1-10}$). (మరణము, పునరుత్థానము, తీర్పు, న్యాయపుతీర్పు, జీవము చూ॥).

**అమరము** ఓడలు 5 (2) F చూ॥

**అమర్యా** (Amariah = యెహోవా మాట నిచ్చెను).

1. యాజకుఁడైన సాదోకు తాత (I దిన $6^{7,52}$).

2. సొలొమోను కట్టించిన యాలయములో యాజకత్వము జరిగించిన యొక యాజకుఁడు (I దిన $6^{11}$ ఎజ్రా $7^{3}$). ఇతఁడును 1 లోని వాఁడునొకఁడేయై యుండవచ్చును.

3. యాజకుల కుటుంబములలో నొక కుటుంబపుపేరు. దీనిపెద్ద నెహెమ్యా కాలమున నిబంధన ముద్రించిన వారిలో నొకఁడై యుండెను (నెహె $12^{2,13}$ $10^{3}$). I దిన $24^{14}$ లో నున్న

**ఆష్మేరు** అనునది ఇదే కుటుంబపు పేరైయుండ వచ్చును.

4. ఎజ్రా కాలమునం దన్యస్త్రీల నుంచుకొని అతని ప్రేరేపణవలన విడిచిపెట్టిన యొక యూదుఁడు (ఎజ్రా $10^{42}$).

5. చెఱకాలమునకుఁ బిమ్మట యెరూషలేములో నివసించుటకు సమ్మతించిన అతాయా యను నొకని తాత (నెహె $11^{4}$).

6. జెఫన్యాయొక్క ముత్తాత (జెఫ $1^{1}$) హిజ్కియా కుమారుఁడు. ఈ హిజ్కియా రాజైన హిజ్కియాయై యుండవచ్చును.

7. యెహోషాపాతు కాలములో నుండిన యొక ప్రధాన యాజకుఁడు (II దిన $19^{11}$).

8. దావీదు కాలమందుండిన యొక లేవీయుఁడు (I దిన $23^{19}$ $24^{23}$).

9. హిజ్కియా కాలములో యెహోవా మందిరమునొద్ద ద్వారపాలకుఁడుగ నుండిన యొక లేవీయుఁడు (II దిన $31^{14,15}$).

10. నెహె $12^{12}$ లోని మెరాయా యను నొక యాజకుఁడు. కొన్ని తర్జుమాలలో నీ పేరు అమర్యా యని యున్నది. కావున అది అమర్యా యను పేరునకు మాఱురూపము కావచ్చును.

**అమష్షయి** (**Amashai**). నెహెమ్యా కోరిక ప్రకారము యెరూషలేమునందు కాపుర మున్న యాజకులలో నొకఁడు (నెహె $11^{13}$).

**అమస్యా** (**Amasiah** = యెహోవా భరించును). యెహోషాపాతు సేనాధిపతులలో నొకఁడు (II దిన $17^{16}$).

**అమాదు** (**Amad** = నివసించు ప్రజలు). ఆషేరు గోత్రభూమిలోనుండు యొక యూరు (యెహో $19^{26}$). దీని యునికి తెలియదు.

**అమాన** (**Amana** = స్థిరత). లెబానోను పర్వత ప్రతి పంక్తిలోని యొక కొండ (పర $4^{8}$). అబానా నది ఉత్పత్తిస్థానమని తోచును. ఆ నదికి అమాన యను పేరు కలదు.

**అమాము** (**Amam** = కూర్పు?). దక్షిణ దేశమనఁబడిన యూదైయ ప్రాంతములలోని యొక యూరు (యెహో $15^{20-32}$). దాని సరి యైన యునికి తెలియదు.

**అమాలేకీయులు** (**Amalekites** = నాశడి జనులు). అరేబియలోను కాదేషు సీనాయి అరణ్యములలో పూర్వమునుండి నివాసముజేయుచుండిన యొక బలమైన జనాంగము. అబ్రాహాము కాలమున వారు కాదేషులో అరణ్యమందుండిరి (ఆది $14^{7}$). మోషే దినములలో సీనాయి అరణ్యమందు నివసించి, ఇశ్రాయేలీయుల మీఁదఁబడి రెఫీదీములో యుద్ధము జేసిరి (నిర్గ $17^{8-16}$). అందువలన వారు శపింపఁబడినవారై జ్ఞాపకార్థముగ గ్రంథమున వ్రాయఁబడినవారైరి ($17^{14}$). కాదేషుదగ్గర వారు మఱల యుద్ధము చేసిరి (సంఖ్యా $14^{45}$). గిద్యోను కాలమున వారు మిద్యానీయులతోఁ గలిసి దేశమును దోచుకొనిరి. న్యాయా $6^{3}$ దేవుని వలన పిలువఁబడిన గిద్యోను వారిని చాలమట్టుకు నాశము చేసెను ($7^{19-22}$). నన్నూ రేండ్లయిన పిదప సౌలు దేవునాజ్ఞను బొంది అమాలేకీయులను మఱల నాశము చేసెను (I సమూ $15^{1-8}$). అప్పుడు తప్పించుకొనిన వారిని దావీదు కొట్టివేసెను ($27^{8}$ $30^{17,18}$ II సమూ $8^{12}$). దేవుఁడు బిలాము ద్వారా ప్రవచించినట్లు (సంఖ్యా $24^{20}$) తుదకు వారు సర్వనాశమైరి (I దిన $4^{43}$). వీరి రాజైన అగగు వంశములో జన్మించిన హామాను, ఎస్తేరు దినములలో యూదుల నందఱిని సర్వ నాశనముజేయ యత్నించెను గాని తానే హానిబొంది నశించెను (ఎస్తే $7^{9,10}$). తరువాత అమాలేకీయులను గుఱించిన సూచన లేవియును కనుపడుట లేదు. H.

**అమాలేకు** (**Amalek** = నాశడివాఁడు). ఏశావు మనుమఁడు. ఎలీఫజు కుమారుడు. ఎదోమీయుల నాయకులలో నొకఁడు (ఆది $36^{12,16}$). ఇతని సంతానమును గూర్చి బైబిలు నందేమియు గనఁబడదు. అమాలేకీయు లనఁబడినవారితని సంతానము కాదు. అతనికి పూర్వమునుండియే అమాలేకీయులుండిరి ($14^{7}$ సంఖ్యా $24^{20}$). గాని వారు ఇతని సంతానమని తలంచువారును గలరు. H.

**అమావాస్య** కాలమానము VI, పండుగలు II చూ॥

**అమాశా** (**Amasa** = భారము).

1. రాజైన దావీదు తోఁబుట్టువగు అబీగయీలునకు ఇష్రాయేలీయుఁడైన యెతెరువలన

పుట్టినవాఁడు (I దిన $2^{17}$). యోవాబు తల్లియు అమాశా తల్లియు అప్పసెల్లెండ్రై యుండిరి (II సమూ $17^{25}$). ఇతఁడు తిరుగుబాటు చేసిన అబ్షాలోము యొక్క సేనాధిపతియై యుండి యోవాబు వలన పూర్ణముగా నోడింపఁబడెను ($18^{6-8}$). తరువాత దావీదితనిని క్షమించుటయే కాక, యోవాబునకు బదులు సేనాధిపతిగా నియమించెను ($19^{13}$). అందువలన యోవాబు అలిగి కుట్రజేసి అతనిని చంపెను ($20^{9-12}$). (అమాశై 3 చూ॥)

2. పది గోత్రములవారికి రాజైన పెకహు యూదా వారిలో ననేకులను చెఱఁబట్టఁగా వారిని విడిపించిన వారిలో నొకఁడు. ఇతఁడు ఎఫ్రాయిమీయుఁడు (II దిన $28^{12}$).

**అమాశై** (Amasai = భారముగలది).

1. కహాతీయుల కుటుంబములలోని యొక లేవీయుఁడు (I దిన $6^{25,35}$). ఈ కుటుంబము నందు పుట్టిన యొకఁడు హిజ్కియా కాలమున జరిగిన దిద్దుబాటులలో సహాయముజేసెను (II దిన $29^{12}$).

2. దావీదు నిబంధన మందసమును యెరూషలేమునకు తెచ్చుచుండఁగా పాటలు పాడిన వారిలో నొకఁడు (I దిన $15^{24}$).

3. దావీదు యోధులలో నొకఁడు (I దిన $12^{18}$). ఇతఁడును అమాశాయును ఒకరై యుండవచ్చును (అమాశా 1 చూ॥)

**అమిత్తయి** (Amittai = యెహోవా సత్యవంతుఁడు). ప్రవక్తయైన యోనాయొక్క తండ్రి (II రాజు $14^{25}$ యోనా $1^{1}$).

**అమీషద్దాయి** (Ammishaddai = సర్వశక్తుఁడు బంధువుఁడు). దానీయుల ప్రధానియగు అహీయెజెరుకు తండ్రి (సంఖ్యా $1^{12}$ $2^{25}$ $7^{66,71}$ $10^{25}$).

**అమీహూదు** (Ammihud = బంధువుఁడు మహిమ కలిగించును).

1. ఎఫ్రాయిమీయుల ప్రధానియగు ఎలీషామాకు తండ్రి (సంఖ్యా $1^{10}$ $2^{18}$ $7^{48,53}$ $10^{22}$ I దిన $7^{26}$).

2. షిమ్యోను గోత్రపువాఁడు (సంఖ్యా $34^{20}$).

3. నఫ్తాలీ గోత్రపువాఁడు (సంఖ్యా $34^{28}$).

4. అబ్షాలోము పారిపోయి ఆశ్రయించిన గెషూరు రాజుయొక్క తండ్రి (II సమూ $13^{37}$). హెబ్రీ బైబిలులో ఈ పేరును అమ్మీహూరు అని యచ్చువేసి యున్నను అమ్మీహూదు అనియే చదివెదరు.

5. యూదా గోత్రపువారిలో నొకఁడు (I దిన $9^{4}$).

**అమోరీయులు** (Amorites = పర్వత నివాసులు?).

ఇది మిగుల పురాతనమైన యొక జనాంగము. హమ్మురాబియను బాబెలురాజు (క్రీ॥శ॥ ముందు 2250) యొక్క ఇటుక శాసనములమీఁద మార్టు (*Martu*) అను పేరుకనఁబడును. అది యీ జనముయొక్క పేరే. ఎల్-అమర్న (*El-Amarna*) అనుచోట దొరికిన శాసనములలో (క్రీ॥ శ॥ ముందు 1400) వారు లెబానోనుకు ఎదుటనుండు లెబానోను అను కొండల వరుసలమధ్య నివాసముచేసిన జనులై యున్నట్లుగా నగపడును. బైబిలును చూడఁగా ఇశ్రాయేలీయులు కనాను దేశమును జయింపక పూర్వము ఈ యమోరీయులచట నివసించుచుండినట్లు తెలియును (ఆది $10^{16}$ $15^{16}$ నిర్గ $3^{8}$). అబ్రాహాము కాలములో వారు మృత సముద్రమునకు పడమరగానుండు హెబ్రోను కొండ ప్రదేశములో నివసించుచుండిరి. (ఆది $14^{7,13}$). ఆ ప్రదేశమందలి ఇతర జనాంగములకన్న వీరెక్కువ బలాఢ్యులైయుండుటచే ఆప్రాంత వాసుల కందఱికి అమోరీయులను పేరుపెట్టిరి ($15^{16}$). ఇశ్రాయేలీయుల ప్రయాణకాలములో కూడ వారదే ప్రాంతములోనుండి (సంఖ్యా $13^{29}$ ద్వితీ $1^{7,19,20,44}$) యొర్దానుకు తూర్పు ప్రాంతములను కూడ స్వతంత్రించుకొని యచట నివసించుచు నుండిరి (సంఖ్యా $21^{26-30}$). వారి దేశము అర్నోనునదినుండి హెర్మోను పర్వతమువఱకు వ్యాపించియుండెను (ద్వితీ $3^{7}$ $4^{48}$ యెహో $2^{10}$ $9^{10}$ న్యాయా $11^{22}$). అదియుగాక వారు కనాను దేశములోకూడ తమపూర్వ సరిహద్దులనుదాటి పశ్చిమమునకును ఉత్తరమునకును అయ్యాలోను (*Aialon*) లోయ వఱకును వ్యాపించిరి (యెహో $10^{5,6}$ $11^{3}$ $13^{4}$ న్యాయా $1^{35}$). ఇశ్రాయేలీయులు

కనాను దేశమును స్వతంత్రించుకొనిన తరువాత కూడ ఈ యమోరీయులలో ననేకులింక మిగిలి ఆ దేశములో నివసించియుండిరి (న్యాయా 1[35] 3[5]). సమూయేలు కాలమువఱకు వారికి ఇశ్రాయేలీయుల మధ్య సమాధానముగా నుండిరి (1 సమూ 7[14]). తరువాతి కాలములో కనాను దేశమునందు ఇశ్రాయేలీయులకు పూర్వకాలమునందు జీవించిన యితర జనములతో పాటు సొలొమోను వీరిని దాసులనుగాఁ జేసెను (I రాజు 9[20,21] II దిన 8[7]).

**అమ్జీ** (Amzi = పుష్టిగలవాఁడు).

1. మెరారీ సంతతిలోని యొక లేవీయుఁడు (1 దిన 6[46]).

2. జెరుబ్బాబెలు కట్టించిన యాలయములో పనిచేసిన యొక యాజకుఁడు (నెహె 11[12]).

**అమ్నోను** (Amnon = నమ్మకమైన).

1. దావీదు జ్యేష్ఠపుత్త్రుఁడు. తల్లి అహీనోయము. అబ్షాలోము చెల్లెలగు తామారును ఇతఁడు చెఱిపినందున అబ్షాలోము కుట్రచేసి యితనిఁజంపెను (II సమూ 3[2] 13[1-39]).

2. యూదావారిలో నొకఁడు (I దిన 4[20]).

**అమ్మా** (Ammah = తల్లి). గిబియోనను అరణ్యమార్గములోని గీహదగ్గఱనుండు నొక కొండ (II సమూ 2[24]). దానిసరియైన యునికి తెలియదు.

**అమ్మీజాబాదు** (Ammizabad = బంధువుఁడు ఈనామిచ్చెను). దావీదు యోధులలో నొకఁడగు బెనాయా యొక్క కుమారుఁడు (I దిన 27[6]).

**అమ్మీనాదాబు** (Amminadab = జనులు దయగలవారు).

1. యూదా సంతతివారిలో నొకఁడు. (I దిన 2[10]). ఇతఁడు అహరోనుకు మామయు (నిర్గ 6[23]), యూదావారికి పెద్దయైన నయస్సోనుకు తండ్రియు (సంఖ్యా 1[7]), దావీదు పూర్వికులలో నొకఁడు నైయుండెను (రూతు 4[19] మ 1[4] లూ 3[33]).

2. లేవిగోత్రపు కహాతీయులలో నొకఁడు. దావీదు కాలమందితఁడు తనకుటుంబమునకు పెద్దయైయుండెను (I దిన 15[10,11] నిర్గ 6[23]).

3. లేవీయులలో నొకఁడు (I దిన 6[22]). ఇతఁడును కహాతీయుఁడే. ఇతరమైన వంశావళి క్రమములను చూడఁగా అమ్మీనాదాబు అను పేరునకు ప్రతిగా ఇస్హారు అను పేరుకలదు (నిర్గ 6[13,21] I దిన 6[38]). అందువలన అమ్మీనాదాబు అనునది ఇస్హారునకు మాఱుపేరైయున్నట్లూహింపఁదగును (ఇస్హారు I చూ॥).

**అమ్మీయేలు** (Ammiel = దేవుఁడు బంధువుఁడు).

1. వేగుచూచుటకై కనాను దేశమునకు పోయినవారిలో దానుగోత్ర ప్రతినిధి (సంఖ్యా 13[12]).

2. మాకీరు అనువాని తండ్రి (II సమూ 9[4,5] 17[27]).

3. ఓబేదెదోముయొక్క ఆఱవ కుమారుఁడు. దావీదు కాలములో నితఁడును ఇతని కుటుంబపువారును ఆలయముయొక్క దక్షిణద్వారమును కావలికాయుటకు ద్వారపాలకులుగా నియమింపఁబడిరి (I దిన 26[5,15]).

4. దావీదు భార్యయగు బత్షెబయొక్క తండ్రి (I దిన 3[5]). ఇతనికి II సమూ 11[3] లో ఎలీయాము అను మాఱు పేరుగలదు (ఎలీయాము చూ॥).

**అమ్మోను, అమ్మోనీయులు** (Ammon, Ammonites). లోతుయొక్క రెండవ కుమారుఁడగు బెన్నమ్మి యను నతని సంతతివారు. యొర్దానుకును గాదు స్వాస్థ్యమునకు తూర్పుగా అరేబియా యెడారి వైపున నివసించినవారై యుండిరి. వీరియుత్పత్తి ఆది 19[30-38] లో నున్నది గాని వీరు ఇశ్రాయేలీయులకు సంబంధులైనందున యీ సంబంధమును చూపుటకు ఇది కల్పింపఁబడినదిగాని యయ్యది నిజముగా జరిగిన చరిత్ర కాదని కొందఱనుకొందురు. ఈ జనులు బలాఢ్యులును క్రూరులును, కొంతవరకు నాగరికత గలవారునై యుండిరి. బైబిలులో వీరినిగూర్చి యున్న చరిత్రను చూడఁగా వీరు జంజుమ్మీయులను జయించి అర్నోను యబ్బోకు అనునదుల మధ్యనుండు ప్రదేశమును అపహరించియుండిరి (ద్వితీ 2[20,21]). తరువాతి కాలములో నీ ప్రదేశమందు అమోరీయు లుండుటను జూడఁగా

(సంఖ్యా 21$^{54}$ ద్వితీ 2$^{37}$ న్యాయా 11$^{13-22}$). ఈ యమోరీయులు వారిని వెళ్లఁగొట్టి యీ ప్రదేశమును స్వాధీనపఱచు కొనిరని తెలియును. ఇశ్రాయేలీయులను శపించుటకు మోయాబీయులు బిలామును పిలిచిన కాలములో నీ యమ్మోనీయులు వారికి తోడ్పడినందున అమ్మోనీయులలో పదియవ తరము వాఁడైనను ఎన్నడును యెహోవా సమాజములో చేరకూడదని యెహోవా ఆజ్ఞ నిచ్చెను (ద్వితీ 23$^{3-6}$). ఇశ్రాయేలీయుల దేశమునందలి కొంతభాగమును మోయాబీయులపహరింపఁగా వీరు ఎగ్లోను అను మోయాబు రాజునకు సహాయులై యుండిరి (న్యాయా 3$^{13}$). యెఫ్తా కాలములో ఇశ్రాయేలీయులను బాధపఱచిన వారిలో వీరు కూడ నుండిరి (10$^{6,9,18}$). రాజుల కాలములో అమ్మోనీయుల రాజగు నాహాషు యాబేష్గిలాదు కోటకు ముట్టడివేసెను. సౌలు అతనిని జయించి ఆ యూరివారిని విడిపించినందున ఇశ్రాయేలీయులు సౌలునందెక్కువ యభిమానపరులై అతనిని రాజునుగా నియమించుకొనిరి (I సమూ 11). తరువాతి కాలములో నాహాషు దావీదునకు స్నేహితుఁడుగనుండెను. నాహాషు చనిపోయి నప్పుడు దావీదు తన దుఃఖమును తెలుపుటకై నాహాషుకొడుకైన హానూను నొద్దకు రాయబారుల నంపఁగా హానూనువారిని అవమాన పఱచినందున దావీదు అమ్మోనీయుల మీఁద యుద్ధముచేసి వారిని జయించి వారి ముఖ్య పట్టణమగు రబ్బాను స్వాధీనపఱచుకొనెను (II సమూ 10, 11, 12 I దిన 19, 29$^{1-3}$). సొలొమోను కొందఱు అమ్మోనీయు రాండ్రను వివాహముచేసికొని వారి దేవతలను పూజించెను (I రాజు 11$^{1-8}$). యెహోషాపాతు కాలములో అమ్మోనీయులు మోయాబీయులతోను ఎదోమీయులతోను ఐక్యపడి యూదామీఁద యుద్ధముచేసిరిగాని వారిని గెలువలేక పోయిరి (II దిన 20). ఉజ్జియాకును, యోతాముకును అమ్మోనీయులు కప్పమునంపిరి (II దిన 26$^{8}$ 27$^{5}$). యెహోయాకీము కాలములో వీరు యూదావారిని తొందరపెట్టిరి (II రాజు 24$^{2}$). యెరూషలేము నాశనమైన పిమ్మట యూదులను విరోధించి వారియధికారిని కుట్రజేసి చంపుటకు నొకనిపంపిరి (యిర్మీ 40$^{11-14}$). ఈ విధముగా వారిశ్రాయేలీయులకు నిత్య శత్రువు లగుటచే ప్రవక్తలువారిని చాలఖండితముగా గద్దించిరి (యిర్మీ 49$^{1-6}$ యెహె 21$^{20}$ 25$^{1-7}$ ఆమో 1$^{13-15}$ జెఫ 2$^{8-11}$). చెఱకు పిమ్మట యూదులు దేవాలయమును యెరూషలేము ప్రాకారములను కట్టుచుండఁగా అమ్మోనీయులు వారినాటంక పఱచిరి (నెహె 4$^{3,7}$). అయినను వారితో ఇశ్రాయేలీయులు కొందఱు వియ్యమందిరిగాని ఎజ్రా నెహెమ్యాల ప్రేరేపణలవలన వారిని విడిచిపెట్టిరి (ఎజ్రా 9$^{1,2}$ నెహె 13$^{23-31}$). మక్కబీయుఁడగు యూదా వీరికి విరోధముగా యుద్ధము చేయవలసివచ్చెను (I మక్క 5$^{1-8}$). క్రీ॥ శ॥ తరువాతి రెండవ శతాబ్దమువఱకు వారి పేరు కనఁబడెను. వారి ముఖ్య దేవత పేరు మిల్కాము. దానికి మొలెకు అనుపేరు కూడ కలదు (I రాజు 11$^{7,33}$). యెఫ్తా కాలములో ఈ యమ్మోనీయులు మోయాబీయుల దేవతయైన కెమోషును కొలిచిరి (న్యాయా 11$^{24}$).

**అమ్రాపేలు** (Amraphel). షీనారు అనగా బాబెలు దేశపురాజు. ఇతఁడింక నలుగురు రాజులతోఁగలిసి అబ్రాహాము కాలమునందు సొదొమ గొమొఱ్ఱా మొదలగు పట్టణములమీఁద యుద్ధముఁజేసెను. అధికదోపుడు సొమ్మును అనేకమందిని ఖైదీలుగాఁ బట్టుకొనెను గాని తన యన్న కొడుకైన లోతు చిక్కబడెనని తెలిసికొనిన అబ్రాహాముచే నోడింపఁబడి అంతయు కోలుపోయెను. (ఆది 14$^{1-17}$). బాబెలు ఆది రాజులలో హామురాబి యను ప్రసిద్ధుఁడైన రాజు ఈ అమ్రాపేలే యని దాదాపుగా అందఱు సంగీకరింతురు. (బబులోను II 2 చూ॥) H.

**అమ్రామీయులు** అమ్రాము 1 చూ॥

**అమ్రాము** (Amram = అనుభవము లేని వాఁడు?).

1. లేవి మనుమఁడును కహాతు కొడుకునైన యొక లేవీయుఁడు (సంఖ్యా 3$^{17-19}$ I దిన 6$^{2,3,18}$). ఇతఁడు తన మేనత్తయైన యోకెబెదును వివాహము చేసికొని యామెవలన, అహరోను మోషే మిర్యాము అను వారిని కనెను (నిర్గ 6$^{18-20}$ సంఖ్యా 26$^{59}$ I దిన 6$^{3}$). **అమ్రామీయులు** ఇతని వంశపువారే (సంఖ్యా 3$^{27}$ I దిన 26$^{23}$).

2. ఎజ్రా కాలములో అన్య స్త్రీలను వివాహము చేసికొని అతని ప్రేరేపణల వలన వారిని విడిచినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{34}$).

3. I దిన $1^{41}$ లో నున్న హమ్రామును గూర్చి హెమ్దాను చూ॥

**అయాతు హాయి చూ॥**

**అయిన్** (**Ayin** = Y అను అక్షరము). హెబ్రీ అక్షరములలో పదహారవది. 119-వ కీర్తనలోని 16-వ భాగములోని ప్రతిపంక్తి దీనితో నారంభించును. గనుక ఆ భాగమునకీపేరు పెట్టిరి.

**అయీన్‌దోరు ఎన్దోరు చూ॥**

**అయీను, ఆయిని అయీనురిమ్మోను** (**Ain** = ఊట లేక కన్ను).

1. పలెస్తీనుకు ఉత్తరముననున్న లెబానోను పర్వతములలో రిబ్లాదగ్గఱనుండు నొక యూరు (సంఖ్యా $34^{11}$).

2. యూదావారి ప్రదేశములోగాని (యెహో $15^{32}$ I దిన $4^{32}$), షిమ్యోను గోత్ర భూమిలోగాని (యెహో $19^{7}$) యుండు నొక యూరు. రిమ్మోను దగ్గఱగా నుండుటచే దీనిని రిమ్మోనును ఒకటే స్థలముగా నెంచి పై వాక్యములలో నున్నట్లు అయీను రిమ్మోను అందురు. నెహె $11^{29}$ లో నున్నట్లు దానిని ఏన్రిమ్మోను అని యచ్చువేసిరి. ఇది యాజకుల కియ్యఁబడిన నివాస గ్రామములలో నొకటియై యున్నట్లున్నది. యెహో $21^{16}$ లో ఆయిని అని యున్నది. ప్రస్తుతము బెయేర్షెబాకు ఉత్తరముగానుండు ఉమ్-ఎర్-రామామీన్ (*Umm-er-Ramamin*) అనునదే దీని యునికి యని యనుకొందురు. (పటము II, D 3).

**అయ్యెలెత్ షహారు** (**Ayeleth Hashahar** = వేకువలేడి). తెలుఁగున ఆయా రాగములకు పేరులు పెట్టినట్లే హెబ్రీయులును తమ రాగములకు పేరులు పెట్టిరి. ఇది 22-వ కీర్తన రాగమై యున్నది.

**అయ్యా** (**Aiah** = క్రూరపక్షి).

1. హోరీయులలో నొకఁడు (ఆది $36^{20-24}$ I దిన $1^{40}$).

2. రాజైన సౌలు ఉపపత్నులలో రిస్పా అను దాని తల్లి (II సమూ $3^{7}$ $21^{8,10,11}$).

**అయ్యాలోను** (**Aijalon or Ajalon** = లేళ్ల యునికిపట్టు).

1. దాను గోత్రీకుల కియ్యఁబడిన యొక యూరు (యెహో $19^{42}$ $21^{24}$ I దిన $6^{69}$ $8^{13}$). అయినను అది యంతకు మునుపచట నుండిన యమ్మోరీయుల వశమున నిలిచియుండెను (న్యాయా $1^{35}$). రెహబాము కాలములో నది యూదయ యూళ్లలో నొకటియై యుండెను (II దిన $11^{10}$). తరువాతి కాలములో ఫిలిష్తీయులు దానిని పట్టుకొనిరి (II దిన $28^{18}$). బైబిలునందు మాత్రము గాక టెల్ ఎల్-అమర్నా రాతి శాసనమునందు నుదాహరింపఁబడినది. (రాతి శాసనములు 2 చూ॥) ప్రస్తుతము యెరూషలేమునకు వాయువ్య దిక్కున ఏడు క్రోసుల దూరములో నుండు యాలో (*Yalo*) అనునదే దీని యునికియై యుండవచ్చును.

(పటము III, E 5).

2. జెబూలూను స్వాస్థ్యములోని యొక యూరు (న్యా $12^{12}$). దాని యునికిని గూర్చి తెలియదు. న్యాయాధిపతియగు ఏలోనును ఇచటనే పాతిపెట్టిరి.

3. ఒక లోయ పేరు (యెహో $10^{12}$). ఈ లోయ పైనున్న అయ్యాలోను అను పట్టణము నుంచి మధ్యధరా సముద్రము దగ్గరనుండు బయలు వఱకు వ్యాపించెను. (పటము III, E 5).

**అరణ్యము, ఎడారి** (**Wilderness, Desert**). ఈ మాటలచే తర్జుమా జేసిన మూల భాషలయందు పాఁత నిబంధనలో ఐదు హెబ్రీ పదములును, క్రొత్తనిబంధనలో నొక గ్రీకు మాటయుగలవు. కొన్ని నిర్జన ప్రదేశములను, కొన్ని వానలేకపోవుటచే నేర్పడిన గొడ్డుబోతు ప్రదేశములను సూచించును. అయినను చెంచువారివలె తిరుగుడు జనము లచ్చట నివసించిరి (యెహో $15^{61-63}$ యెష $42^{11}$). ఈ దిగువ స్థలముల కాపేరు ప్రత్యేకముగ పెట్టిరి.

1. ఐగుప్తునుండి తిరిగి వచ్చునప్పుడు ఇశ్రాయేలీయులు తిరిగిన అరణ్యము. ఇది సీనాయి ద్వీపకల్పము ఎఱ్ఱసముద్రము మృత సముద్రము

లకు మధ్యనుండు ప్రదేశమును, మృత సముద్రమునకు తూర్పున నుండు ప్రదేశమును సూచించును. నలువది సంవత్సరముల వఱకు వారందు దిరుగుచుండిరి (సంఖ్యా $14^{33}$ మొ॥). ఈ యరణ్యమునకు వాడిన అసలుమాట పాతనిబంధనలో 280 మారులు కనఁబడును. అనేక మారులిది ఈ దేశమును సూచించును. అరణ్యమను పదము వేరుగా వాడఁబడినయెడల అది ఈ యరణ్యమును సూచించెను (కీర్త $78^{15,40}$ $95^{8}$ $106^{14}$ మొ॥).

2. క్రొత్తనిబంధనలోని **యూదయ అరణ్యము.** యోహాను ఆ ప్రాంతములలో బోధించుట చేతను (మ $3^{1}$), క్రీస్తు ఒకవేళ యచటనే శోధింపఁ బడుటచేతను (మ $4^{1}$) ప్రసిద్ధమాయెను. ఈ యరణ్యము మృత సముద్రమునకు పడమరగా నున్న ప్రదేశము.

3. ఇవి గాక ఇంకను ఆయా యరణ్యముల పేరులున్నవి. వీటికి సమీపముననున్న పట్టణములనుబట్టి వీటికా పేరులు వచ్చెను. వాటిని అకారాది క్రమము ననుసరించి యీ దిగువ నుదాహరించెదము.

1. **ఎదోము అరణ్యము** (II రాజు $3^{8}$). ఇది ఎదోము దేశమునందీశాన్యముగాను, మృత సముద్రమునకు దక్షిణముగాను, ఆగ్నేయముగా నున్నట్లున్నది (ఎదోము చూ॥).

2. **ఏతాము (ఎఱ్ఱని) అరణ్యము** (సంఖ్యా $33^{8}$). ఇదే యసలు మాటను నిర్గ $13^{18}$ లో **ఎఱ్ఱసముద్రపు అరణ్యమని** తర్జుమ చేసిరి. అది యెఱ్ఱసముద్రపు పడమటి పాయకు (*Gulf of Suez*) ఉత్తరముగా నున్నట్లు కనఁబడును (ఏతాము చూ॥).

3. **ఏన్గెదీ యరణ్యము** (I సమూ $24^{1}$). మృత సముద్రమునకు పడమర నున్నది. (ఏన్గెదీ చూ॥).

4. **కాదేషు అరణ్యము** (కీర్త $29^{8}$). ఇది కాదేషు బర్నేయ దగ్గరనుండు ప్రదేశము (కాదేషు బర్నేయ చూ॥).

5. **గిబియోను అరణ్యము** (II సమూ $2^{24}$). గిబియోను ఊరికి పడమరగా నున్నది (గిబోను చూ॥).

6. **జీఫు అరణ్యము** (I సమూ $23^{14,15}$ $26^{2,3}$). దక్షిణపు యూదయలో **జీఫు అను** ఊరిదగ్గరనున్న ప్రదేశము (జీఫు చూ॥).

7. **పారాను అరణ్యము** (ఆది $21^{21}$ సంఖ్యా $10^{12}$ $12^{16}$ $13^{3}$ $13^{26}$ I సమూ $25^{1}$). ఇది సీనాయి పర్వతమునకు ఉత్తరముగా నున్నది (పారాను చూ॥).

8. **బెయేర్షెబా అరణ్యము** (ఆది $21^{14}$). బెయేర్షెబాకు దక్షిణముగానుండు ప్రదేశము (బెయేర్షెబా చూ॥).

9. **బేతావెను అరణ్యము** (యెహో $18^{12}$). బేతేలుకు తూర్పుగానుండు ప్రదేశము (బేతావెను చూ॥).

10. **మాయోను అరణ్యము** (I సమూ $23^{24,25}$). యూదయ మన్యప్రదేశములో మాయోను ఊరిదగ్గరనుండు అడవి ప్రదేశము (మాయోను చూ॥).

11. **యెరూవేలు అరణ్యము** (II దిన $20^{16}$). యూదయ అరణ్యమునకు దక్షిణభాగము (యెరూవేలు చూ॥).

12. **షూరు అరణ్యము** (నిర్గ $15^{22}$). ఐగుప్తుకు ఈశాన్య దిక్కుగానున్న ప్రదేశము (షూరు చూ॥).

13. **సీనాయి అరణ్యము** (నిర్గ $19^{1}$ సంఖ్యా $1^{1}$ $10^{11}$ మొ॥). సీనాయి పర్వతము చుట్టునుండు ప్రదేశము (సీనాయి చూ॥).

14. *a.* **సీను (Sin) అరణ్యము** (నిర్గ $16^{1}$ $17^{1}$ సంఖ్యా $33^{11,12}$). ఎఱ్ఱసముద్రమునకును సీనాయి పర్వతమునకును మధ్యనున్న ప్రదేశము.

*b.* **సీను (Zin)** దీని గుణింతము పైదాని గుణింతమువలె నున్నను అసలులో ఇంగ్లీషునందున్నట్లు గుణింతము వేఱుగానున్నది. (సంఖ్యా $13^{21}$ $20^{1}$). ఇది దానికన్న విశాలమైనదై యూదయ దక్షిణ హద్దువరకు వ్యాపించెను (సంఖ్యా $20^{1}$ $34^{3}$ యెహో $15^{1}$). కాదేషుకు ఆగ్నేయదిక్కున నుండినట్లుగా నున్నది.

**అరబిదేశము, అరేబియ, అరబీయులు** (**Arabia** = గొడ్డు ప్రదేశము? **Arabians**).

క్రీస్తు శకమునకుఁ బూర్వము 2-వ శతాబ్దమున తొలెమాయియను భూగోళశాస్త్రజ్ఞుఁడు అరబ్బీదేశమును 3 భాగములుగ విభజించెను. **1. ఫలవంత ప్రదేశము** (*Arabia Felix*). ఇది ఎఱ్ఱ సముద్రమునకుఁ దూర్పున దాదాపు 1500 మైళ్ల పొడవును 800 మైళ్ల వెడల్పుగను వ్యాపించియున్నది. ఇదే ప్రస్తుతపు అరేబియ. దీనిని నేటి వఱకును ఆ పేరుతోనే బిలుచుచున్నారు. **2. రాతి ప్రదేశము** (*Arabia Petra*). ఇది ఎఱ్ఱ సముద్రపు ఉత్తరపాయలకును మృత సముద్రమునకును మధ్యనున్నది. దీనిని సాధారణముగా సీనాయి ద్వీపకల్పమందురు. **3. ఎడారి ప్రదేశము** (*Arabia Desert*). ఇది సీనాయి ద్వీపకల్పమునకు ఈశాన్యముగను, పలెస్తీనుకుఁ దూర్పుననున్నది. బైబిలునందు మొదటి కాలములలో అరబ్బీయను పదమును వాడియుండలేదు. ఆది $10^{26-30}$ నందున్నవారు అరబిదేశమందుండిన యొక గోత్రపువారు గాని అరబియను పదముచ్చటలేదు. తరువాత చరిత్రయందువచ్చు **ఇష్మాయేలీయులు** (ఆది $37^{25}$), **మిద్యానీయులు** ($37^{28}$), **కేదారు** వాసులు ($25^{13}$ యిర్మీ $2^{10}$) అనునవి అరబీయులకు పెట్టిన ఆయా పేరులైయున్నవి. వీరు పైనుదాహరింపఁబడిన రాతిప్రదేశమందుండువారు. యోబు $1^{14}$ లోని **షెబాయీయులును** అరబీయులే గాని వారు ప్రస్తుతపు అరేబియలోని దక్షిణ భాగమందున్నవారు (ఇష్మాయేలు, మిద్యానీయులు, కేదారువాసులు, షెబాయీయులు చూ॥). అరేబియలోనున్న గోత్రములకు ఆయా పేరు లుండినను, పాఁతనిబంధనయందు యిర్మీ $25^{24}$ II దిన $9^{14}$ లోనున్న అరబిదేశపు రాజులందఱు అను మాటలవలన అరబీయను ఈ పేరు, నేటి వఱకు అరబీయులు ఉన్నట్లుగా ఒక జనముకు గాక వేర్వేరు గోత్రములకు చెందినట్లు కనఁబడుచున్నది. నెహెమ్యా కాలమునందట్టి రాజులలో గెషెము అనువాఁడు యెరూషలేమును తిరిగి కట్టకుండ నాపినవారిలో నొకఁడు (నెహె $2^{19}$ $4^{7}$ $6^{1}$). పూర్వమీ దేశము వెండిబంగారములకును సుగంధ ద్రవ్యములకును ప్రసిద్ధికెక్కినది. సొలొమోను వీటినిక్కడినుండి తెప్పించెను (I రాజు $9^{14}$). యెహోషాపాతుకు వారు గొఱ్ఱెలను మేకలను కప్పముగా నిచ్చుచుండిరి (II దిన $17^{11}$). యెహోరాము కాలమున వారితరులతోఁ గలిసివచ్చి యెరూషలేమును దోచుకొనిరి ($21^{16}$). గాని ఉజ్జియా వారిననేకమారులోడించెను ($26^{7}$). యెష $13^{20}$ యిర్మీ $3^{2}$ ను చూడఁగా వీరు బిడారుల రీతిగా తిరిగెడివారైయున్నట్లు తెలియును. వారు తూరుతో వర్తకముజేసిరి (యెహె $27^{21}$). ఈ వాక్యమునందు వారు కేదారీయులకు వేఱయియున్నట్లు కనఁబడుచున్నది. ప్రవక్తలు అరబీయులకు శిక్ష కలుగునని ప్రకటించిరి (యెష $21^{13-17}$ యిర్మీ $25^{24}$). క్రొత్త నిబంధనయందు అరబీయుల పేరు కార్య $2^{11}$ గల $1^{17}$ $4^{25}$ నందు మాత్రము కనఁబడును. కార్య $2^{11}$ లో అది ఆ దేశమునందే భాగమునైనను, (గల $1^{17}$ $4^{25}$ మాత్రము ఎడారిగానున్న అరేబియనుగాని, రాతిప్రదేశమగు అరేబియనుగాని) సూచించును. అరబి దేశవాసులు పెంతెకొస్తు దినమున యెరూషలేమునందున్నారనియు, పౌలు దేశమునందు మూఁడు సంవత్సరములు గడిపెననియు ఈ వాక్యములవలనఁ దెలియుచున్నది.

మహమ్మదు కాలమునకు ముందు అరేబియలో ననేకులు యూదులును క్రైస్తవులునై యుండినను, అతని కాలము మొదలు నేటివఱకు అది మహమ్మదీయుల ముఖ్యదేశములలో నొకటియైయున్నది. మెక్కా, మెదీనా యను మహమ్మదీయ పుణ్యక్షేత్రము లీదేశముననున్నవి.

**అరషెకెలు** నాణెములు III చూ॥

**అరా** (Ara). ఆషేరు సంతతివారిలో నొకఁడు (I దిన $7^{38}$).

**అరాదు** (Arad = అడవి గాడిద).

1. నెగెబు అను పలెస్తీను దక్షిణభాగములోని యొక ఊరు. దాని రాజు అరణ్యములో తిరుగుచుండిన యిశ్రాయేలీయులను బాధపఱచెను (సంఖ్యా $21^{1}$ $33^{40}$). తరువాతి కాలములో యెహోషువ ఆ రాజును పట్టుకొనెను యెహో $12^{14}$). మోషే మామకు సంబంధువులైన **కేయినీయుల** గోత్రపువారచటచేరి నివసించిరి (న్యాయా $1^{16}$). ప్రస్తుతము హెబ్రోనుకు దక్షిణముగా అమడ దూరములోనుండు టెల్-

అరాదు (*Tell-Arad*) దీని యునికిస్థలము యుండ వచ్చును (పటము II, E 4).

2. బెన్యామీను సంతతివారిలో నొకఁడు (I దిన 8[15]).

**అరాను** (Aran = అడవిమేఁక). ఏశావు సంతతివారిలో నొకఁడు. హోరుకుటుంబికుఁడు (ఆది 36[28] I దిన 1[42]).

**అరాబా** (Arabah = మైదానము). బైబిలునందిది గలిలయ సముద్రమునుండి యెఱ్ఱ సముద్రపు ఈశాన్య పాయయైన అకాబా (*Akabah*) అఖాతమువఱకు వ్యాపించు లోయకు గాని, ఆ లోయలోనున్న ఆయా ప్రాంతములకు గాని పెట్టఁబడినపేరు (ద్వితీ 1[7] 3[17] యెహో 3[16] 11[2] 12[3]). II రాజు 25[5] లో నీ పేరు నుంచక దానిని **మైదానము** అను మాటచే తర్జుమజేసిరి. ఆ లోయలో కొంత సముద్ర ముగా నున్నది. ద్వితీ 4[49] నందది అరాబా సముద్ర మనఁబడెను. ప్రస్తుతమరబ్బీయులీ పేరును గలిలయ మృతసముద్రములకు నడుమ నుండు దానికిఁగాక మృత యెఱ్ఱసముద్రములకు మధ్యనుండు లోయకు వాడుదురు. అరాబా అను నీ పేరు సాధారణముగా నీ ప్రదేశమునకు మాత్రముపయోగింపఁబడును (ఉప్పు సముద్రము చూ॥).

**అరాబా సముద్రము** ఉప్పు సముద్రము చూ॥

**అరాము** (Aram = ఎత్తుగల).

I. ముగ్గురు మనుష్యుల పేర్లు.

1. అబ్రాహాము సహోదరుఁడగు నాహోరు యొక్క మనుమఁడు (ఆది 22[21]).

2. ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన 7[34]).

3. క్రీస్తు వంశావళి క్రమములో యూదా మునిమనుమనికి పెట్టిన పేరు (మ 1[4]). పాత నిబంధనలో ఈ మనుష్యుని పేరు **రాము** అని యున్నది (రూతు 4[19]).

**II.** సిరియ దేశపు పురాతన పేరు. అది పలెస్తీను దేశమునకు ఈశాన్య దిక్కున నున్న యూఫ్రాతునది యవతలనుండి పలెస్తీను దేశము దనుక షుమారు 250 మైళ్లవఱకు వ్యాపించి యుండెను. యూఫ్రాతునదియొద్ద ఈ పేరు గలవారు క్రీ॥ శ॥ ముందు 1300 సం॥ లప్పుడు మొదట కనఁబడిరని రాతి శాసనములవలన తెలియును. అచటినుండి వారు దమస్కు ప్రాంతములవఱకు వ్యాపించుట మాత్రముగాక దానికి దక్షిణముగానుండిన అమ్మోనీయులతోను మోయాబీయులతోను కలిసి మెలిసి యుండిరి. ఇశ్రాయేలీయులు కూడ ఈ అరాముకు సంబంధించినవారని వారి భాషవలన తెలియును. ఈ దేశములోని భాగములును ఆయా కాలములలో నుండిన రాజ్యములును ఎల్లకాలము ఒక్కటిగా నుండక వేర్వేఱుగా నుండెను. దీని గూర్చి బైబిలులో ఈ దిగువ విషయము లున్నవి.

**1. అరామ్నహరాయిము** (*Aram-Naharaim* 60 వ కీర్తన పీఠిక). ఈ మాటలకు రెండు నదుల మధ్యనుండు అరాము అని శబ్దార్థము. అది యూఫ్రాతు టైగ్రిస్ లేక యూఫ్రాతు కెబారు అను రెండు నదుల మధ్య నుండు భూభాగమైయుండి మెసపతేమియ అనఁబడిన ఇది ప్రస్తుతము ఇరాక్ (*Iraq*) అను పేరుతో నున్నది. న్యాయాధిపతుల కాలము నందు పలెస్తీనువారిని బాధించిన కూషన్రిషాతయీమను వాఁడు ఈ దేశస్థుఁడే (న్యాయా 3[10]).

**2. పద్దనరాము** (*Paddan Aram* = అరాము బయలు). ఇది పైన 1 లోని ప్రదేశమందలి యుత్తరభాగమునయుండెను (ఆది 28[2,5] మొ॥). అబ్రాహాము ఆ ప్రాంతములోని హారాను నుండి బయలుదేరి కనానుకువచ్చెను. నది యవతల నున్న సిరియనులు (II సమూ 10[16]) ఆ భాగమందలి నివాసులే అరమోజబాయీయులు చూ॥).

**3. అరాము సోబా** (*Aram Zobah*) (II సమూ 10[6] కీర్త 60 పీఠిక). ఇది యూఫ్రాతు నదికి పడమరగానుండు అరాము రాజ్యము. I సమూ 14[47] లో నున్నట్లు ఇది సోబా దేశమనఁబడును. సోబా యనురాజు దీని నేలినందున దీని కాపేరువచ్చెను (II సమూ 8[3]). II దిన 8[3] లో నున్నట్లిది **హమాతు సోబా** యనఁబడుటచే హమాతువఱకు వ్యాపించెనని తెలియును. అంతవఱకు ఆ రాజ్యమును వ్యాపింపఁజేయుటకై దాని రాజగు హదదెజెరు చేసిన యత్న

ములనుగూర్చి I దిన 18[3] II సమూ 8[10] లో చూడవచ్చును. ఈ సోబారాజ్యము అభివృద్ధిలో నుండిన కాలమందు ఆ రాజులు యుఫ్రాతుకు పశ్చిమముగా నుండిన అరాము నంతటిని ఏలినట్లుగానున్నది.

4. దమస్కునకు సంబంధించిన అరాము (*Aram-Damascus* II సమూ 8[5]). ప్రవక్తల కాలములో ముఖ్యముగా ఈ అరామునకును ఇశ్రాయేలీయులకును యుద్ధములు జరిగెను (యెష 7[1]). ఈ యుద్ధములు విశేషముగా పదిగోత్రములవారితో జరిగెను (దమస్కు, సిరియ చూ॥).

**అరాముభాష** (Aramaic or Aramaean). అరాము దేశస్థుల భాష. దీని యక్షరములును హెబ్రీ యక్షరములును ఒకే రీతిగా నున్నవి. ఆది 31[47] లో నున్నట్లు లాబాను రాళ్లకుప్పకు పెట్టిన పేరును బట్టి లాబాను వాడిన భాష యిదియేయని తెలియును. నీనెవె పట్టణమున క్రీ॥ శ॥ ముందు 8 వ శతాబ్దములో ఈ భాషను వాడిరని రాతి శాసనములవలనఁ దెలిసికొనవచ్చును. రాజైన హిజ్కియా కాలములో ఆయా జనములు తమ వ్యాపారములలోను ఇతర పనులను చేయుటయందును ఈ భాషనే వాడుకొని యున్నట్లు II రాజు 18[26] లో నున్నది. యిర్మీయా దానియేలు ఎజ్రా యనువారు తమ గ్రంథములలోని కొన్ని భాగములను ఈ భాషలోనే వ్రాసిరి. క్రీస్తుకాలమందిది పలెస్తీనులోని వాడుక భాషయై యుండెను. తలితాకూమి (మా 5[41]), ఎప్ఫతా (మా 7[34]) మొదలగు వాక్యములు చూడఁగా క్రీస్తుభాషను వాడినట్లు తెలియును. పాతనిబంధనను ఈ భాషలోకి తర్జుమాచేసిరి. సురియక్ (S*yriac*) భాష దీనికి సంబంధించినదిగా నున్నది (హెబ్రీభాష చూ॥).

**అరాము సోబా** అరాము II 3 చూ॥

**అరామ్నహరాయిము** అరాము II 1 చూ॥

**అరారా** అదాదా చూ॥

**అరారాతు** (Ararat). యుఫ్రాతు నదియొక్క యుత్పత్తికిని అరాక్సు (*Araxes*) నదికిని మధ్యనున్న గొప్ప కొండలు గల దేశము. అష్షూరు దేశమునకు ఉత్తరమున నున్నది.

ఆ కొండలలో రెండు మిగుల యున్నతములైనవి. వాటిలో నొకటి 17,000 అడుగుల యెత్తు గలిగి సంవత్సర మంతటిలో హిమముచే కప్పఁబడియుండును. నోవహునావ ఆ శిఖరముమీఁద నిలిచెనను సాధారణ వాడుకయొకటికలదు (ఆది 8[4]). ఇది ప్రస్తుతము ఆర్మీనియ యనఁబడు దేశ



అరారాతుకొండ

మున కుత్తరముగ నున్నది. అయితే యిది అది 8[4] లోని అరారాతు కొండకాదనియు, దీనికి దక్షిణముగానుండు వేఱొక కొండయనియు కొన్ని పారంపర్య వాదుకలున్నవి. నావ నిలిచిన కొండయేదియో యిపుడు నిశ్చయింప వీలు లేదు. సన్హెరీబు కుమారులు తమ తండ్రిని చంపిన పిమ్మట ఈ దేశమునకుఁ బారిపోయిరి (II రాజు 19[37] యెష 37[38]). యిర్మీయా కాలములో అరారాతు దేశము ప్రత్యేకరాజ్యమై యితర రాజ్యములతో సంధిఁజేసికొని, యుద్ధము జేసియున్నట్లు కనఁబడును (యిర్మీ 51[27]).

**అరిమతయియ** (Arimathaea = రామాకు సంబంధించినది). క్రీస్తును పాతిపెట్టిన యోసేపు ఊరు. మ 27[57] మా 15[43] లూ 23[50] యోహా 19[38]). ఆయూరెచ్చటనున్నదో తెలియదు. దానిపేరును బట్టి అది రామాయని తలంతురు (రామా చూ॥). గాని రూఢి తెలియదు.

**అరిస్టొబూలు** (Aristobulus = శ్రేష్ఠాలోచనకర్త). అపొస్తలుఁడగు పౌలు రోమీయులకు వ్రాసిన పత్రికలో నీపేరుగల యింటివారికి వందనములు పంపెను (రోమా 16[10]). రోమాపట్టణమందున్న భక్తిగల కుటుంబికుఁడని పూర్వమనుకొనిరి గాని నవీన శాస్త్రులు మఱియొక విధముగా తలంతురు. అరిస్టొబూలనువాఁడు మహాహేరోదు మనుమఁడని లోకచరిత్రవలనఁ దెలియుచున్నది. అతని సేవకులను అరిస్టొబూలు ఇంటివారని పిలిచిరి. చక్రవర్తియైన క్లౌదే యితని స్నేహితుఁడు గావున వారిని చక్రవర్తి కప్పగించెను. అందువలన వారు చక్రవర్తి పరివారములోఁ జేరినను ఇంకను అరిస్టొబూలు ఇంటివారనియే పిలువఁబడిరి. C.

**అరిస్తర్కు** (Aristarchus = శ్రేష్ఠాధికారి). మాసిదోనియలోని థెస్సలొనీక పట్టణస్థుఁడు (కార్య 27[2]). అపొస్తలుఁడైన పౌలు చేసిన మూఁడవ మిషనేరి ప్రయాణములో నతని జతపనివాఁడు (ఫిలే 24). ఎఫెసునందు పౌలుతోపాటు గొప్ప గండమునందుండెను (కార్య 19[29]). మూఁడవ ప్రయాణమునుండి పౌలు తిరిగి యెరూషలేమునకు వెళ్లఁగా నితఁడు పౌలును వెంబడించినవారిలో నొకఁడై యుండెను (20[4]). పౌలు రోమాకు ఖైదీగాఁ బోయినప్పుడతనివెంట ప్రయాణముజేసి, రోమాలో పౌలు చెఱయందున్నప్పుఁడతనికి తోడుగానుండెను (కొలొ 4[10]). అతఁడు కడపట రోమాలో హతసాక్షి యాయెనను ఇతిహాసమొకటి గలదు. C.

**అరీదాతా** (Aridatha). హామాను కుమారులలో నాఱవవాఁడు. యూదులితనిని జంపిరి (ఎస్తే 9[9]).

**అరీదై** (Aridai). హామాను కుమారులలో తొమ్మిదవవాఁడు. యూదులితనిని జంపిరి (ఎస్తే9[10]).

**అరీయేలు** (Ariel = దేవుని సింహము).

1. మోయాబీయులలో నొకఁడు. బెనాయా యితని యిద్దఱి కొడుకులను చంపెను (I దిన 11[22] 2). II సమూ 23[20] లో మూలభాషయందీపదము గలదుగాని తెలుఁగునందు లోపించినది.

2. అహావాయను నది పాలు వైపునకు ఎజ్రా సమకూర్చిన పెద్దలలో నొకఁడు (ఎజ్రా 8[16]).

3. యెరూషలేమునకు అలంకారార్థముగ పెట్టఁబడిన యొక సార్థక నామము (యెష 29[1,2,7]). దీనికి దేవుని సింహము అను నర్థముండుటచే అది యెరూషలేముయొక్క బలమును సూచించునుగాని గుణితమును కొద్దిగా మార్చిన యెడల దీనికి దేవుని యగ్నిగుండము అని యర్థమగును. అది నిజముగా నాకు అగ్నిగుండమగును (29[2]) అను మాటకు సంబంధముగా ఈ మాటకిదే యర్థమును చెప్పవలెనని కొందఱనుకొందురు.

**అరీసై** (Arisai). హామాను కుమారులలో నెనిమిదవవాఁడు. యూదులితనిని చంపిరి (ఎస్తే9[10]).

**అరీహే** (Arieh = సింహము). రెమల్యా కుమారుఁడైన పెకహుచే చంపఁబడిన యొకఁడు. పెకహు ఇశ్రాయేలు రాజైన పెకహ్యామీఁద కుట్రచేసి యతనిని రాజనగరులోని అంతఃపురమందుండు అరీహే, అర్గోబు అను వారిని చంపివేసెను (II రాజు 15[25]). అసలు భాషలో ఈ వాక్యముయొక్క అర్థము తేటగా తెలియదు గాని దానికి సాధారణముగా అర్థము చెప్పునట్లు తెలుఁగు బైబిలులో తర్జుమాచేసిరి.

**అరుణోదయము** (Dayspring). బైబిలు నందు దీనిని సాధారణ అర్థములోనే యుపయోగించిరి (యోబు $38^{12}$). దానిని వివరింప నవసరములేదు. గాని లూ $1^{78}$ లో అలంకార రీతిగా క్రీస్తు రాకడనుగూర్చి వాడిరి. అది ఆత్మీయ సౌఖ్యములతో విలసిల్లు క్రీస్తు యుగారంభమును సూచించును.

**అరుబ్బోతు** (Arubboth = అల్లిక కిటికీలు). పలెస్తీనుకు నైరృతి దిక్కున నుండు నొక స్థలము (I రాజు $4^{10}$). రాజైన సొలొమోను ఇంటివారికి ఆహారమును సంగ్రహించిన పన్నెండు మందిలో నొకడిచ్చటనుండెను. ఈ స్థలము యొక్క సరియైన యునికి తెలియదు.

**అరుహా వృక్షము, అరుహా వృక్షము** (Heath). ఒక తరహా చెట్టు (యిర్మీ $17^{6}$ $48^{6}$). ఇది హెబ్రీ భాషాపదము. ఈ చెట్టు పర్వత ప్రాంతములయందు బెరుగును. ఆకులు మిక్కిలి చిన్నవియై చెట్లకొమ్మలకు చేపకు పొలుసులవలె అంటుకొని యుండును. J. C.

**అరూమా** (Arumah = ఎత్తయిన స్థలము). అబీమెలెకు తన శత్రువులను నాశనము జేసిన యూరు (న్యాయా $9^{41}$). ప్రస్తుతము షెకెముకు ఆగ్నేయమున 6 మైళ్ల దూరములోనుండు ఎల్ ఓర్నె (*El' Orneh*) యనునది దీనియునికియై యుండవచ్చును (రూమా చూ॥). (పటము III, F 4).

**అరెత** (Aretas). అరబీ పెత్రయనబడిన దేశము నేలిన రాజులకు మక్కబీయులకాలము మొదలు పెట్టబడిన పేరు (II మక్క $5^{8}$). వీరిలో నొకనిగూర్చి మాత్రము క్రొత్త నిబంధనలోనున్నది. అతడు క్రీ॥ శ॥ ముందు 9 నుండి క్రీ॥ శ॥ 40 వఱకు అరేబియ పెత్ర నేలెను. హేరోదు అంతిపకు తన కుమార్తె నిచ్చి వివాహముజేసెను. గాని హేరోదా మెను వదలివేసి హేరోదియ నుంచుకొనినందున అరెత యతనిమీద యుద్ధముజేసి ఓడించెను. కార్య $9^{24}$ II కొరి $11^{32}$ ను చూడగా దమస్కు అతని రాజ్యములో చేరినట్లు కనబడును గాని అదెట్లు, ఏకాలమున దానితో కలిసెనో తెలియదు. ఆ కాలములో దమస్కు రోమావారి యధీనమందుండినను క్రీ॥ శ॥ 34-62 వఱకు ఆ పట్టణమునందు వాడిన రోమన్ వారి నాణెములు బొత్తుగా గానవచ్చుటలేదు. కావున చక్రవర్తి యనుగ్రహమువలన అరెత కిది వచ్చి యుండవచ్చును. అరెత దీనిని స్వంతముగా నేలక తనకు లోబడిన యొక అధిపతి నీ పురపాలకునిగా నియమించె ననునది ఈ యభిప్రాయమునకు సూటిగా సరిపడును. ఆ యధిపతి పౌలును పట్టుకొన యత్నించెను గాని పౌలు తప్పించుకొనెను (కార్య $9^{24}$) (హేరోదు అంతిప చూ॥). C.

**అరేబియ** అరబిదేశము చూ॥

**అరేయొపగీతుడైన దియొనసీయు** (Dionysius the Areopagite). పౌలు ఏథెన్సులో జేసిన ప్రసంగము ద్వారా క్రీస్తును నమ్మినవారిలో నితడొకడు (కార్య $17^{34}$). అరయొపాగు కొండమీద కూడిన ఏథెన్సు వారి మహాసభలో నీయన సభికుడగుటచేత నితనికి అరెయొపాగీతుడను బిరుదు కలిగెను. ఏథెన్సు యందుండిన సంఘమునకాయన మొదటి యధ్యక్షుడయ్యెనని యుసుబియసు అను చరిత్ర కారుడు వ్రాసెను. ఇతడు డొమిషియను చక్రవర్తికాలమున ఏథెన్సులో హతసాక్షి యాయెనను ఇతిహాస మొకటిగలదు. C.

**అరేయొపగు** (Areopagus = అరీసు దేవత కొండ). ఏథెన్సు పురదుర్గమందలికొండ. ఏథెన్సు వారి మహాసభ దీనిపైకూడెను. ఆ పట్టణమందలి ఘనులును, ధనికులును సర్కారుద్యోగీయులలో ముఖ్యులు నీ సభికులై యుండిరి. వారు ఆరంభమున నేరములనుమాత్రమే విచారించినను, క్రమక్రమేణ దేశసంబంధమైన సంగతులను, నీతి విషయములనుగూడ విచారించుచువచ్చిరి. పౌలును ఈ సభయెదుట నిలువబెట్టి అతని సంగతులను విచారణజేసిరి (కార్య $17^{16-34}$). ఇతని బోధలను నమ్మకపోయినను, నేరస్థుడని తీర్మానించలేదు గావున అంతవఱకైనను వీరు పౌలు పక్షమున నుండిరని చెప్పవచ్చును.

**అరేలీ, అరేలీయులు** (Areli, Arelites). గాదు కొడుకులలో నొకడు (ఆది $46^{16}$). ఇతడు అరేలీయుల కుటుంబములకు పూర్వీకుడు (సంఖ్యా $26^{17}$).

**అరోయేరు** (Aroer = దిగంబరత్వము లేక ఒక విధమైన చెట్టు).

1. మృత సముద్రమునకు తూర్పుగానున్న అర్నోనునదికి కుడిప్రక్కగా నుండు నొక పట్టణము (ద్వితీ $2^{36}$). అది మొదట అమోరీయుల రాజ్యమునకును, తరువాత రూబేనుగోత్ర స్వాస్థ్యమునకు దక్షిణపు సరిహద్దయి యుండెను ($3^{12}$ యెహో $12^{2}$ $13^{1}$ న్యాయా $11^{26}$ I దిన $5^{8}$). సిరియ రాజైన హజాయేలు దానిని పట్టుకొనెను (II రాజు $10^{33}$). యిర్మీయా కాలములో అది మోయాబీయుల వశములో నుండెను (యిర్మీ $48^{19}$). ప్రస్తుతము అరెయెరు (*Araer*) అనఁబడు పాడు శేషములుగల స్థలమే దీని యునికి యని యను కొందురు (పటము II, J 3).

2. గాదీయులు కట్టిన ప్రాకారములలో నొకటి (సంఖ్యా $32^{34}$). అది రబ్బా యెదుట నున్నది (యెహో $13^{25}$ న్యాయా $11^{33}$). గాని దానియునికినిగూర్చి మఱీ తేటగా తెలియదు. ఈ పై రెండు పట్టణములందుండు ప్రదేశములు యెష $17^{2}$ లో అరోయేరు పట్టణములు అనఁబడినట్లున్నది. అట్లయినయెడల ఈ వాక్యములో యొర్దానుకు తూర్పుగా నుండు దేశములన్నియు సూచింపఁబడియున్నవి.

3. యూదా యూళ్లలో నొకటి. సిక్లగును దావీదు దోచుకొనిన పిమ్మట దోపుడు సొమ్ములో కొంత ఈ యూరికి పంపించెను (I సమూ $30^{28}$). ప్రస్తుతము బెయేర్షెబాకు తూర్పుగా 6 క్రోసుల దూరముగా నుండు అరార (*'Ar'ara*) యనునదే దీని యునికియై యుండవచ్చును (పటము II, D 5).

**అరౌనా, ఒర్నాను** (Araunah). ఒక యెబూసీయుఁడు. మోరీయా కొండమీఁద ఇతనికి నొక కళ్లముండెను. అచట దావీదు ప్రజలను లెక్కించుటయను పాపము చేసిన పిమ్మట ప్రవక్తయగు గాదుయొక్క అనుమతి చొప్పున నచట నొక వేదికను కట్టించెను. తరువాత దావీదు ఆ కళ్లమును 50 వెండి తులములకు కొనెను (II సమూ $24^{18-24}$). I దిన $21^{15-27}$ లో అది 600 బంగారు తులములని మార్చఁబడియున్నది. దిన వృత్తాంతముల గ్రంథములలో అంకె లచ్చుటచ్చుట ఈలాగు మార్చఁబడియున్నవి. అయితే కొందఱు దినవృత్తాంతములలో నిది దావీదు ఆ కళ్లమునకు గాక, కొండ యావత్తునకు ఇచ్చిన ధరయని యనుకొందురు. I దిన $21^{15-27}$ లోను II దిన $3^{1}$ లోను ఇతనిపేరు ఒర్నాను అని యున్నది. ఈ స్థలముమీఁదనే సొలొమోను దేవాలయమును కట్టించెను.

**అర్కీయుడు** (Archite, Arkite) ఈ పదము అసలులో నున్న రెండు మాటలకు భాషాంతరము. ఆంగ్లభాషయం దున్నట్లు హెబ్రీలోకూడ గుణితమునందు కొంతభేద మున్నది.

1. అర్కీయుడు (*Archite*). బెన్యామీను స్వాస్థ్యమందలి యుత్తర భాగములోనున్న అర్కీ (*Archite*) యను ఊరి నివాసి (యెహో $16^{2}$). దావీదు స్నేహితుఁడగు హూషై యీ యూరి వాఁడే (II సమూ $15^{32}$). ప్రస్తుతము అయిన్-అరిక్ (*Ain-Arik*) అను స్థలము దీని యునికియై యుండవచ్చును. ఇది బేతేలుకు నైరృతిగా నున్నది (పటము III, E 5).

2. అర్కీయులు (*Arkits*). కనాను సంతతివారిలో నొక కుటుంబమునకు పేరు (ఆది $10^{17}$ I దిన $1^{15}$). ఫేనీకే యుత్తరప్రాంతములోని త్రిపోలియను పట్టణమునకు దగ్గఱనున్న అర్కె (*Arke*) యను ఊరి నివాసులు. ఇది మిగుల పురాతనమగు ఊరై క్రీ॥ శ॥ 1500 సం॥లకు పూర్వము ఒక ఐగుప్తు రాజు శాసనములోని అర్కతు (*Arkatu*) అను పేరుగా టెల్-ఎల్-అమార్నా శాసనములో కనఁబడును (రాతి శాసనములు 2 చూ॥). అష్షూరురాజగు తిగ్లత్పిలేసెరు క్రీ॥ శ॥ ముందు 738 సం॥ లో దానిని జయించెను. యోసీఫసు తన కాలములో దాని పేరు అర్కా (*Arka*) యని వ్రాసెను.

**అర్కెలాయు** హేరోదు 3 చూ॥

**అర్కెవాయులు** ఎరెకు చూ॥

**అర్ఖిప్పు** (Archippus = గుఱ్ఱమునకు అధిపతి). ఫిలేమోను అప్పియల సహవాసియగు ఒక క్రైస్తవ బోధకుఁడు. అపొస్తలుఁడైన పౌ

లతనిని తనతోటి యోధుడని చెప్పుచుండెను (ఫిలే 2). అతడు ఫిలేమోను కుమారుడని కొందఱి యూహ. కొలొస్సెలో బోధ పని చక్కగా జేయుమని పౌలతనిని ప్రోత్సాహ పఱచెను (కొలొ 4[17]).

**అర్గోబు** (Argob = సేద్యభూమి లేక రాళ్లకుప్ప).

1. పెకహ్యయను రాజుయొక్క దేహ సంరక్షకులలో నొకడు. పెకహు అనువాడు పెకహ్యను కుట్రజేసి చంపినపుడు ఈ యర్గోబును కూడ చంపెను (II రాజు 15[25]).

2. రాజైన ఓగుయొక్క దేశములోని యొక ప్రదేశము. మనష్షేగోత్రీకులు దాని స్వతం త్రించుకొనిరి (ద్వితీ 3[4-13]). అందులో 60 ప్రాకారములుగల పట్టణములుండెను. (I రాజు 4[13]). అది బాషాను పర్వతములకు పశ్చిమ ప్రదేశమై యున్నట్లున్నది.

**అర్చకులు** బ్రాహ్మ పూజారులు చూ॥

**అర్తహషస్త** (Artaxerxes). ఈ పేరు పారసీకదేశపు చక్రవర్తులలో ముగ్గురికి పెట్టి యున్నారు. వీరిలో మొదటివానిగూర్చి బైబిలునం గుదాహరించిరి. ఇతడు క్రీ॥ శ॥ ముందు 465—424 వఱకు నేలెను. యెరూషలేముకుఁ బోయి దాని ప్రాకారములుగట్ట నెహెమ్యాకు సెల వనుగ్రహించినవాఁడితఁడే నెహెమ్యా నితఁడు యెరూషలేముకు నధిపతిగా నియమించెను (నెహె 2[1-9] 5[14]). ఎజ్రా రెండవ మాఱు యెరూషలేమునకుఁ బోవుచుండఁగా, అతనికి సహాయముజేసి, యతనికిఁ గావలసిన వన్నియు దొరకునట్లు తాఖీదు వ్రాసియిచ్చెను (ఎజ్రా 7). ఎజ్రా 4[7]-6[22] వఱకు కనఁబడు అర్తహషస్త యను వాఁడు బబులోను నేలిన కోరెషు సేనాధిపతు లలో నొకని నైనను, కోరెషునకుఁ బిమ్మట పారసీక దేశము నేలిన కంబైసీసు (*Cambyses*) నైనను సూచించునుగాని యీ యర్తహషస్తను సూచింపఁ డని శాస్త్రులను కొందురు. అయితే యతఁ డెవ్వఁడో నిర్ధారణజేయుటకు ప్రస్తుతమున తగిన యాధారములు లేవు (పారసీకదేశము II, III చూ॥).

**అర్తెమా** (Artemas = అర్తెమి దేవతకు సంబంధి). అపొస్తలుఁడైన పౌలు జతపని వార లలో నొకఁడు. తీతు 3[12] చూడఁగా పౌలతనిని తీతు యొద్దకుఁ బంపఁదలంచెను గాని యితని గూర్చి మఱేమియు తెలియదు.

**అర్తెమి** (Artemis or Diana). ఒక దేవత పేరు. బైబిలునందు కార్య 19[23-36] లో తప్ప ఇది మఱెచ్చటను లేదు. అర్తెమి అనునది ఈ దేవతకు గ్రీకు నామమును, డయానా (*Diana*) అనునది లాటిన్ నామమునై యున్నవి. అసలు గ్రీకుదేవత చంద్రునికి సంబంధించినది. ఈమె పొలములకును అడవులకును అధి దేవత. ముఖ్యముగా వేటాడునది గావున దాని యాకా రము విల్లును బాణములను ధరించిన స్త్రీ రూప ముగా నుండెను. చిన్నాసియలో నీ దేవతా పూజ అక్కడనున్న యితర దేవతలపూజలకు సంబంధించి యుండెను. అది అస్తార్తే దేవత వంటిది. హిందూ దేశమందలి పాడిపంటలను



అర్తెమిదేవి

సూచించు శక్తి పూజవంటిదై యుండెను. ఎఫె సులోనున్న ఈ దేవతారూపము పాడిపంటలను సూచించుటకా యనునట్లు స్తనములతో నిండి యుండెను. ఈ పట్టణమందు దీనికి సర్వలోక ప్రసిద్ధమగు ఆలయమున్నది (ఎఫెసు చూ॥). హిందూదేశముననున్న లక్ష్మీదేవికి మహా యను

బిరుదున్నట్లు ఈ దేవతకును మహాదేవి యను బిరుదుండెను (కార్య 19[28]). ఈ దేవి ద్యుపతి (అనగా ఆకాశము) నుండి పడినట్లు వారునమ్మిరి (కార్య 19[35]). అది ఆకాశమునుండి సాధారణముగా పడెడి ఉల్కయొక్క శేషమైయుండవచ్చును. అట్టి ఉల్కలు అప్పుడప్పుడు భూమిమీద పడుచుండును. ఆలాగు పడినవాటిలో కొన్ని చిత్రవస్తు ప్రదర్శనశాలల (*Museums*) యందు చూడవచ్చును. అట్టివి దేవతలను కొనరాదు. ఎఫెసి పట్టణమందలి కంసాలులు ఈ దేవతయొక్క వెండి విగ్రహములనుచేసి అమ్ముకొని బహు లాభము గడించిరి. పౌలు బోధవలన వారి వ్యాపారము చాల తగ్గినందున, వారు దేమేత్రితో కలిసి పౌలును హింసించి అతని నా పట్టణమునుండి తఱిమిరి (19[24] దేమేత్రి చూ॥).

**అర్దోను** (Ardon). యూదా గోత్రికులలో నొకఁడు. ఇతఁడు కాలేబు కుమారుఁడు (I దిన 2[18]).

**అర్నాను** (Arnan = చురుకుగల). దావీదు సంతతివారిలో నొకఁడు (I దిన 3[21]).

**అర్నోను** (Arnon = వడిగా పోవునది). ఇదియొక లోయకును ఆ లోయలోని నదికినిగల పేరు. ఈ నది మృతసముద్రమునకు తూర్పుగానుండు కొండలగుండపాఱి ఆ సముద్రములో పడును. మొదట ఈ నది దీనికి దక్షిణముగానుండు మోయాబీయులకును, ఉత్తరముగానుండు అమోరీయులకును సరిహద్దయియుండెను (సంఖ్యా 21[13,26]). రూబేను స్వాస్థ్యమునకిది దక్షిణ సరిహద్దయియుండెను (ద్వితీ 3[8,16] యెహో 13[16]) దీని దాటుటకు రేవులునుండెను (యెష 16[2]). యిర్మీ 48[20] లో నున్నట్లు ఈ ప్రదేశము అర్నోను అనఁబడును గాని కొండతెవి యచట నుండు నొక యూరిపేరనుకొందురు. ప్రస్తుతము దానికి వాడి మోజిబ్ (*Wadi Mojib*) అని పేరు. ఇది చాల చక్కని ప్రదేశమై అనేక విధములైన పూలచెట్లవలన నలంకరింపఁబడియుండును.

**అర్పణములు** (Offerings). దేవునికి అర్పణము లర్పించుట ప్రతిజనాంగములోను వాడుకయైయున్నది. బైబిలునందును ఈ వాడుక మొదటినుండి కనఁబడును. మోషేధర్మశాస్త్రమునకుఁ బూర్వమును అట్టి యర్పణము లర్పించిన అర్పణములు సాధారణముగా **యజ్ఞములు, నైవేద్యములు** అను రెండు విధములుగా నున్నవి. నైవేద్యములలో **పానార్పణలు, ధూపములు** చేరియున్నవి. ఇట్లు మనము అర్పణములను భాగించిన యెడల మోషేకాలమునకు పూర్వము (1) నైవేద్యము (ఆది 4[3]), (2) తొలిచూలున పుట్టిన వేటలను యజ్ఞముగా నర్పించుట (4[4]), (3) దహనబలిలేక హోమార్పణములు (8[20] నిర్గ 10[25]), (4) సమాధాన యాగములు (ఆది 31[54]), (5) పానార్పణములు (35[14]) అను ఐదువిధములగు అర్పణములు కనఁబడును.

నిర్గమకాండములోను (అధ్యా 29), సంఖ్యాకాండములోను (అధ్యా 6, 7, 15, 18, 19), ఆయా అర్పణములను వివరించియున్నను, ఇశ్రాయేలీయు లర్పించిన అర్పణల క్లుప్తవివరమును, దానికి సంబంధించిన ఆచారములును లేవీయకాండము 1-7 లలో ముఖ్యముగనున్నవి. అచ్చట నుదాహరింపఁబడిన వాటిక్రమము ఈ దిగువరీతిగా కనఁబడును:—

**I. యజ్ఞములు లేక బలులు.**

**1. దహనబలులు** (లేవి 1). గోవులు గొఱ్ఱెలు మేఁకలలోనుండి మగవాటిని, పక్షిజాతిలోని తెల్లగువ్వలలో దేనినైనను అర్పింపవచ్చును. I సమూ 6[14] నందు ఆవులనుకూడ అర్పించినట్లు చూడవచ్చునుగాని అది వారి అర్పణచట్టముల ప్రకారముగాఁ జేసినదికాదు. హోమార్పణము సంతటిని దహించి వేసిరి. రక్తమును దహనవేదికచుట్టును ప్రోక్షించిరి. ఇది ఒకఁడు తన్నుతాను పూర్ణముగా దేవునికి సమర్పించుకొనుటను సూచించును.

**2.** *a.* **పాపపరిహారార్థబలి** (లేవి 4). దీనికై కోడెలు మేఁకలు గొఱ్ఱెలు పావురములు అను వీటిలో దేనినైనను అర్పింపనచ్చును. యాజకుల కొఱకైన బలియైన యెడల దాని రక్తములో కొంత పరిశుద్ధ స్థలములోనున్న ధూపవేదికకు పూయవలెను. తక్కినవారి కొఱకైన బలియైన యెడల దానిరక్తమును దహనవేదికయొద్ద మాత్రము ప్రోక్షింపవలెను. యాజకుల కొఱకు కర్పింపఁ

బడిన పాపపరిహారార్థబలులను ఎవరును తిన కూడదు. దాని మాంసమును పాలెమునకు వెలపట దహింపవలెను. గాని యితరులకొఱకైన యిట్టి అర్పణములలో కొన్ని భాగములను యాజకులు తినవలెనను నియమమున్నది (లేవీ $6^{16,29}$ $7^{6,7}$ నిర్గ $29^{32}$ హెబ్రీ $13^{11,12}$). ప్రజలపాపములు హెచ్చినయెడల యెక్కువ మాంసము తమకు దొరుకునని యాజకులు హోషేయకాలమున ప్రజలింకను పాపముచేయవలెనని కోరిరి (హోషే $4^{8}$).

*6.* **అపరాధ పరిహారార్థబలి** (లేవీ 6). ఇది పైదానికి సంబంధించినను కొంచెము భేదము గలదు. ఈ యర్పణములో యజ్ఞము మాత్రమే గాక పొరుగువారికి తమ అపరాధమువలన కలిగిన నష్టమును భరింపవలసియుండెను. దీని నర్పించినప్పుడు రక్తమును వేదికమీఁద ప్రోక్షించిరి. క్రొవ్వును కాల్చిరి. తమ పాపమువలన కలిగిన నష్టమునుగాక పైన దానియందైదవ భాగమును కలిపి, అన్యాయమునొందిన వానికియ్య వలసియుండిరి (సంఖ్యా $5^{7,8}$).

**3. సమాధానబలి** (లేవీ 3). ఇది కృతజ్ఞతార్పణము (లేవీ $7^{12}$), మ్రొక్కుబడి ($7^{16}$), స్వేచ్ఛార్పితము అను మూఁడు విధములుగా నుండినను, నియమములొక్కటే. పవిత్రములగు మృగములలో దేనినైన నిట్టిబలిగా నర్పింపవచ్చును. గాని పక్షులనర్పింపరాదు. ఇందు రక్తమును ప్రోక్షించిరి. క్రొవ్వును కాల్చివేసిరి. యాజకులకు బోరను కుడిజబ్బనిచ్చిరి ($7^{31,32}$). మిగిలిన దానిని ప్రజలు తీసికొనిరి. ఇది ప్రజలు దేవునితోను, తమలో తామును సహవాసము చేయుటను సూచించెను.

**II. ఆయా సమయములలో వాడిన యజ్ఞములు.** యజ్ఞములన్ని పై నుదాహరింపఁబడిన నాలుగు విధములలో నేదోయొకదానికి చేరినవైయుండెను. ఆయాకాలములకుఁ దగినటుల వాటిని అర్పించిరి. (1) **యాజకులను ప్రతిష్ఠించినప్పుడు** మొదట పాపపరిహారార్థ బలిని (లేవీ $8^{14}$), దహనబలిని ($8^{18-21}$), సమాధానబలిని ($8^{22-31}$). వరుసగా నర్పించిరి. చివర జెప్పినదానికి **ప్రతిష్ఠితమైన పొట్టేలు** అను పేరుండినను, దాని యాచారమునుబట్టి సమాధానబలియైనట్లు తెలియుచున్నది. ఇటుల నీ యాజకులను ప్రతిష్ఠించుటలో పాపము నిమిత్తము బలినర్పించిన పిమ్మట తమ్మును తాము పూర్ణముగా దేవుని సేవకర్పించుకొనుటను సూచించు దహనబలినర్పించిరి. అటుపిదప దేవునితో సహవాసము చేయుటను సూచించెడి సమాధానబలిని అర్పించిరి. (2) **నాజీరు వ్రతము** నవలంబించినవాఁడు అదేక్రమము ననుసరించి అర్పణము లర్పించెను (సంఖ్యా $6^{16,17}$). ఇదియు నొకవిధముగా ప్రతిష్ఠయే. (3) **కుష్ఠరోగిని శుద్ధిజేసిన** యాచారములలో నిదేక్రమమున్నదిగాని అందు పాపపరిహారార్థ బలిని దహనబలిని మాత్రమర్పించిరి (లేవీ $14^{11-20}$). (4) **గుడారమును ప్రతిష్ఠించి**నప్పుడు పండ్రెండు దినములవరకు ఈ మూఁడు విధములైన యజ్ఞముల నర్పించిరి (సంఖ్యా $7^{15,17,33-35}$ మొ॥). పాపము నిమిత్తమైన ప్రాయశ్చిత్తార్థ దినమునందు (లేవీ $23^{27}$) వారు జేసిన పాపపరిహారార్థబలి చాల గంభీరమైనది (లేవీ 16). వారప్పుడు ఒక మేఁకపోతును పైనున్నట్లుగా నర్పించిరిగాని రెండవపోతు నొకదానికి అజాజేలు అను పేరుపెట్టి దానిని విడిపించి అడవికినంపిరి (అజాజేలు చూ॥). (5) **ప్రతియుదయమున** ఆలయమునం దర్పించినది దహనబలియై యుండెను (నిర్గ $29^{38-46}$). ఆయా యజ్ఞములలో కొద్ది గొప్ప భేదములుండినను ప్రతిది పైనున్నవాటిలో చేరియున్నదని చెప్పఁదగును.

**III. నైవేద్యములు** (లేవీ 2). నైవేద్యము మూఁడు విధములుగా నున్నది. 1. గోధుమపిండి నర్పించుట (లేవీ $2^{2}$). 2. కాల్చిన గోధుమపిండి అప్పడము లర్పించుట ($2^{4}$). 3. పచ్చని వెన్నుల నర్పించుట ($2^{14}$). ప్రతి నైవేద్యమును నూనెతోను సాంబ్రాణితోను అర్పింపవలెను. పులిసినదేదియు వేయకూడదు ($6^{17}$). పులిసినదైనందున తేనెను కూడ అర్పింపరాదు ($2^{11}$). ఈ యర్పణములు యాజకులవైనందున యితరు లెవరును వాటిని తినరాదు. స్వంతముగా యాజకు లర్పించిన నైవేద్యములను వారు సహా తినక అంతయు కాల్చివేయవలెను ($6^{22,23}$). దీనిలో చేరిన అర్పణ లేవియనగా:—(1) సన్నిధి రొట్టెలు (నిర్గ $25^{30}$ $35^{13}$ $39^{36}$ లేవీ $24^{5,6}$). (2) సంఖ్యా $5^{18}$ లోని **రోష విషయమైన** నైవేద్యముకూడ ఇందులో చేరి

యున్నది. ఈ నైవేద్యములు ప్రత్యేకముగా చేయఁబడినను వాటిని సాధారణముగా ఇతర అర్పణలతో నర్పించుచుండిరి (లేవీ $14^{13}$ $23^{18}$ సంఖ్యా $7^{87}$ $15^{24}$ మొ॥). దీనినిబట్టి నైవేద్యము ఎన్నడును ప్రత్యేకముగా నర్పింపఁబడక ఎల్లప్పుడు యజ్ఞముతో నర్పింపఁబడినవని కొందఱను కొందురు.

**IV. పానార్పణములు.** వీటిని ప్రత్యేకముగా నర్పింపక దహనబలులతో అర్పించిరి. ఇట్లర్పింపఁబడిన వాటిలో ద్రాక్షారస మొకటి (నిర్గ $29^{40,41}$ సంఖ్యా $28^{7}$). దాని నర్పింపవలసిన రీతి నుదాహరించలేదు. I సమూ $7^{6}$ లో నీళ్లు చేది వాటిని దేవునియెదుట కుమ్మరించిరి. పర్ణశాల పండుగలోని యాచారములలో అట్లు చేయుట ఒకటియై యుండెను. ధూపవేదికమీఁద సమర్పించిన ధూపార్పణములు నిట్టివై యుండెను ఈ ధూపార్పణములను వేరుగా నర్పింపక నైవేద్యములతో నర్పించిరి.

**V. అర్పణల నర్పించిన విధము.** ప్రతి యర్పణము పవిత్రమైనదై యుండవలెను. దానిలో ఉప్పును కలుపవలెను (లేవీ $2^{13}$). అన్ని అర్పణలకిట్లు కొద్ది సంబంధము లుండినను, భేదములు నుండకపోలేదు.

1. యజ్ఞముల నర్పించునప్పుడీ యైదువిషయములను గమనింపఁదగును. (1) యజ్ఞమునర్పించువాఁడు బలిపశువును ఆలయద్వారమునకుఁ తేవలెను (లేవీ $1^{3}$). (2) దాని నర్పించువాఁడు తన చేతులను ఆ యజ్ఞ పశువుతలపై మోపి తనకు మాఱుగా దానినర్పించుచున్నట్లు ఒప్పుకొనెను ($1^{4}$ $3^{2}$ మొ॥). (3) అర్పించుచున్నవాఁడే దానిని వధించెను ($1^{5}$ $3^{2}$). (4) యాజకుఁడు దాని రక్తమును ప్రోక్షించెను ($1^{5}$ $3^{2}$ మొ॥). ప్రతిష్ఠించు ఆచారమునందట్లు ప్రతిష్ఠించువాని వ్రేళ్లకును, చెవులకును రక్తము చమరవలెను (నిర్గ $29^{20}$ లేవీ $8^{23,24}$). పాపాచ్ఛాదన దినమున దాని నాలయములోని సామగ్రులమీఁదను ముఖ్యముగా మందసముమీఁదను చల్లిరి ($16^{13,14}$). (5) యజ్ఞమును దహించి వేయవలెను. సమాధాన యాగములలో క్రొవ్వును మాత్రము కాల్చివేసిరి ($3^{10}$). దహనబలులలో యజ్ఞపశువును యావత్తు కాల్చివేసిరి ($1^{9}$). పాపపరిహారార్థబలి యాజకులదైనయెడల క్రొవ్వును వేదికమీఁదను, మాంసము చర్మము మొదలైనవాటినన్నిఁటిని పాలెమునకు వెలుపలను దహించవలెను. ఇతరులకొఱకైనయెడల ఆ మాంసము యాజకులు తినవలసియుండిరి.

2. నైవేద్యముల నర్పించునప్పుడు వారు దానిని నూనెతోను సాంబ్రాణితోను అర్పించిరి. కొంత దహించిరి గాని మిగిలినది యాజకులదాయెను ($6^{14-18}$). అయితే యాజకులర్పించినప్పుడు అంతటిని దహించివేసిరి ($6^{22}$).

3. అగ్నితో దహించుట సాధారణ రీతియైనను యాజకుల కియ్యఁబడినది **అల్లాడింపబడు అర్పణము**గా నర్పించిరి ($7^{30}$). యాజకుల బోరను వేదికతట్టు చాపి మఱల తీసికొనిరి. దేవుని కర్పింపఁగా ఆయన తిరిగి దానిని యాజకుల కిచ్చెననునది దాని భావమైయున్నది. దీనికి సంబంధముగానే ఇంకొకవిధముగా కుడి జబ్బను అర్పించిరి (నిర్గ $29^{27}$ లేవీ$7^{14}$ సంఖ్యా $15^{19}$ మొ॥). ఈ వాక్యములలో నది ప్రతిష్ఠార్పణ మనఁబడెను గాని అది **ఎత్తబడు అర్పణ**మని అసలు భావమై యున్నది. అర్పించినవాఁడు దానిని యెత్తి దింపెను. అదికూడ దేవుని కిచ్చిన పిమ్మట దానిని దేవుఁడు తిరిగి యిచ్చినట్లు సూచించుచున్నది.

**VI. అర్పణయొక్క ఉద్దేశమేమి?** అర్పణముల నర్పించుట సర్వలోకులకు వాడుక. వివిధ మతములవారు వివిధ ఉద్దేశములతో వాటి నర్పించుచున్నారు. దేవునితో సహవాసము చేయుటయే వీటి ముఖ్యోద్దేశముగా నుండవలెను. గాని మనకును దేవునికిని మధ్యపాపము అడ్డుగానున్నంతకాలము ఇట్టి సహవాసము ప్రాప్తించ నేరదుగాన, ఈ పాపములను తొలగించుటకై యిట్టి యజ్ఞములను చేసిరని చెప్పవచ్చును. రక్తము చిందించకుండ పాపక్షమాపణ యెంతమాత్రమును కలుగదు (హెబ్రీ $9^{22}$) అనుబోధ పాఁత నిబంధన యజ్ఞములన్నిఁటిలోఁ గనఁబడును. బైబిలునందలి ఆచారములలో యజ్ఞములర్పించుట యనునది విశేషముగా కనఁబడుచున్నది. ఇది పాపములను పరిహరించుటకైన క్రమశిక్షయును ఏర్పాటునై యున్నది. గాని పశువుల రక్తము పాపమును పరిహరింప నేరదను బోధకూడ ఆ

యాచారముల వలననే తేటపడెను ($10^{4}$). అటులైన పక్షమున వీటి నాచరించు టేల? ఇవి సూచనలు మాత్రమే. క్రీస్తు లోకపాపముల నిమిత్తము చేయఁబోవు గొప్ప యజ్ఞమునకు సూచనలైయున్నవి (యోహా $1^{29}$). క్రీస్తు వీటినన్నిఁటిని నెఱవేర్చువఱకు ప్రజలీగొప్పసత్యమును గ్రహించి విశ్వసించునట్లు తత్కాలమునకు తగిన బాలశిక్షలైయున్నవి (గల $3^{23-25}$). పాప ప్రాయశ్చిత్తార్థమేగాక మనము దేవుని కర్పింపవలసిన ఆత్మీయ యజ్ఞములుకూడ వాటిలో సూచింపఁబడినవి (రోమా $12^{1}$). పాతనిబంధన యాచార క్రమమునందు పాపమును మొదట పరిహరించుట (పాపపరిహారార్థ బలి) అత్యవసరమై యున్నది. అదియైన పిదప మనలను మనము పూర్ణముగా దేవుని కర్పించుకొనవలసియున్నాము (దహన బలి). చివరకు మనము దేవునితో సహవాసులమై ఆయనకు మనస్తోత్రము లర్పించుచు, ఆయన యనుగ్రహించెడి దీవెన లొందఁగలము (సమాధానయాగములు, నైవేద్యములు). ఇవన్నియు క్రీస్తు మన పాపముల నిమిత్తము సిలువమ్రానుకు కొట్టఁబడి (రోమా $4^{25}$), దేవుని చిత్తమును పూర్ణముగా నెఱవేర్చి (6), దేవునికిని మనకును మధ్యవర్తియు సమాధానకర్తయునగుట చేతనే (2 కొరి $5^{18}$) నెఱవేఱినవి. క్రైస్తవులు ప్రస్తుతము నొక్క బలినైనను అర్పింపకపోయినను ఆ బలుల యొక్క ఆత్మీయ బోధలలో నొకటియైనను నిరర్థకము కాలేదు.

**VII. పాతనిబంధన ఆచారములకును నీతులకును గల సంబంధము.** పాతనిబంధనలో నీతిబోధకులగు ప్రవక్తలు యజ్ఞములను ఖండించి, వాటినర్పింపవలెనని ప్రజలకు బోధింపలేదని నవీనపండితులలో గొందఱభిప్రాయపడుచున్నారు. I సమూ $15^{22,23}$ యిర్మీ $7^{22,23}$ మీకా $6^{6-8}$ మొదలగు వాక్యములనుబట్టి యాజకులును ప్రవక్తలును విరుద్ధములగు బోధలుచేసినట్లు కొందఱు వాదించెదరు. అట్టి యభిప్రాయము ననుసరించి పాతనిబంధన యావత్తును సవరించవలెనని తలంతురు. యజ్ఞములను గూర్చిన బోధలు మొదటినుండి యున్నవి కావనియు, యాజక పక్షపాతులచే నిటీవల యవి పాతనిబంధనయందు చేర్చఁబడినవనియు వారి యభిప్రాయము. నవీన పుస్తక ప్రతులలో *P* (= *Priest* యాజకుఁడు) అను అక్షరముచే గుర్తింపఁబడు భాగములు యాజకులవలన చేర్చఁబడినవాటిని సూచించును. గాని పై నుదాహరింపఁబడిన వాక్యములు నీతిన్యాయములను పాటింపక బాహ్యాచారములను మాత్రము నమ్ముకొని వాటినే అనుసరించువారికి కలిగిన గద్దింపులైనట్లు చూడవచ్చును. అట్టి బాహ్యాచారములే దేవుని కసహ్యములు (యెష $1^{11-15}$). గాని అర్పణల ఆంతర్య ఉద్దేశము లక్షించి చేయునప్పుడు వాటికిని నీతులకును పూర్ణమైన ఐక్యముగలదు. యజ్ఞములు నీతులను బోధించి వాటిని స్థిరపఱచును. పాపము విషయమింత గంభీరమగు ఆచారములు బైబిలునందుండక పోయినయెడల దేవుని నీతినిగూర్చియు మానవులలో ఒకరియెడల ఒకరికుండవలసిన నీతినిగూర్చియు అంతలోతుగా గ్రహించక పోవుదురనునది రూఢియైన విషయమైయున్నది.

## VIII. కానుకలు (*Offering Gifts*).

1. వేదికమీఁద అర్పింపఁబడిన నియమిత కానుకలేగాక ఇశ్రాయేలీయులు ఇతరకానుకలను అర్పించిరి. (1) **ప్రథమ ఫలములు.** వీటిని నైవేద్యములతో చేర్చవచ్చును (నిర్గ $23^{16}$ $34^{22}$ లేవీ $23^{10-14}$ సంఖ్యా $18^{12-18}$ ద్వితీ $18^{4}$). (2) **తొలిచూలు పిల్లలను దేవునికి ప్రతిష్ఠించుట** కూడ ఇందులో చేరియున్నది (నిర్గ $13^{2,15}$). తరువాత లేవిగోత్రమును వారికి బదులుగా ప్రత్యేకించినప్పుడు, ప్రతితొలిచూలు మగపిల్లను ఐదు తులముల వెండినిచ్చి విమోచింపవలెనని యేర్పాటాయెను (సంఖ్యా $3^{40,41,46}$). మానవులలో మాత్రమేగాక పశువుల ప్రతితొలిచూలు మగ పిల్లయు దేవునికి ప్రతిష్ఠితమే. పవిత్రమైన వాటినర్పించిరి (నిర్గ $13^{15}$), అపవిత్రమైన వాటిని విమోచించుకొనిరి ($13^{13}$). (3) అన్నిఁటిలో **దశమాంశము** నిచ్చుట గొప్పకానుకగ నెంచఁబడెను (ఆది $14^{20}$ హెబ్రీ $7^{2}$ లేవీ $27^{30}$ సంఖ్యా $18^{21-26}$ ద్వితీ $14^{23-28}$ మొ॥) (దశమ భాగము చూ॥).

2. నియమిత కానుకలు మాత్రమేగాక **ఇష్టపూర్వకమైన** వాటిని కానుకలుగా నర్పించిరి. గుడారమును కట్టుటకు అరణ్యములో ఇశ్రా

యేలీయు లర్పించుట (నిర్గ $35^{20-29}$), ఆలయమును కట్టించుటకు దావీదు కొల్లసొమ్మును ప్రతిష్ఠించుట (I దిన $29^{2-6}$ I రాజు $7^{51}$ $15^{15}$ మొ॥), గుడారపు ఉపయోగార్థమై ఇశ్రాయేలీయుల పెద్దలు సామగ్రులు అర్పించుటయు (సంఖ్యా $7^{84,85}$) ఇట్టి కానుకలైయున్నవి. నెహెమ్యా కాలములో యజ్ఞముల నర్పించుటకై కావలసి వచ్చిన కట్టెలు కూర్చుటకైన కట్టెల **అర్పణము** దీనికి సంబంధించినదే (నెహె $10^{34}$ $13^{31}$).

3. **సొమ్మును** దేవునికి కానుకగా అర్పించుట వాడుకయయ్యెను. ఆలయమును మరమ్మతు చేయుటకై సొమ్ముకావలసి యెహోయాదా కానుకపెట్టె నొకదానిని చేయించి దానినాలయములో నుంచెను (II రాజు $12^{9,10}$). ఇది తరువాత దేవాలయములో నొక నిత్యమైన యేర్పాటయి నట్లు కనఁబడుచున్నది (మా $12^{41-44}$).

4. దేవునికి ప్రతిష్ఠించినదానికి **కొర్బాను** అని పేరుపెట్టిరి. అది దేవునికి ప్రతిష్ఠించిన దానిని సూచించును. దాని అసలుమాట లేవీ $2^{12}$ సంఖ్యా $7^{12}$ యెహె $40^{43}$ మొ॥ వాక్యములలో అర్పణమను పదముచే తర్జుమాచేయఁబడెను. ఒకఁడు తన ఆస్తి కొర్బాను అని చెప్పినయెడల, ఇంకను తన స్వంత తల్లిదండ్రులనుకూడ పోషించుటకైనను దానిని వాడకూడదను నంత కఠిన వ్రతమని యూదులు తలంచిరి గాని క్రీస్తు ఈ అభిప్రాయమును బొత్తుగా ఖండించి అది దేవుని యేర్పాటు కాదని చెప్పెను (మా $7^{12,13}$).

5. క్రొత్త నిబంధనలోని కానుకలు. ఔదార్యబుద్ధి మిగుల అవసరమైనదని ఆదికాలము నుండి క్రైస్తవులు దానిపెంచిరి. ఆదిక్రైస్తవులు తమకున్నదాని నంతటిని సమష్టిగా నుంచుకొనుట అట్టిదైయుండెను (కార్య $2^{45}$ $4^{32-36}$). దుష్టులతో నిండియున్న యీ లోకములో అట్టి యేర్పాటును అమలులోకి తెచ్చుటకు వీలులేదను సంగతి వారుచూచినను ($5^{1,10}$) వారాయౌదార్య బుద్ధిని మాత్రము వదలలేదు. అంతియొకయలోని క్రైస్తవులు కఱవువచ్చి తమ సహోదరులు బాధపడుచున్నారని వినినప్పుడు చందాసెత్తిరి (కార్య $11^{27-30}$). బీదలను జ్ఞాపకము చేసికొనవలెనునది అపొస్తలుల తీర్మానములలో మిగుల పురాతనమైన వాటిలో నొకటిదైయున్నది (గల $2^{10}$). పౌలు దీనిననుసరించి, తాను స్థాపించిన సంఘములన్నిఁటిలో గొప్ప చందాను పోగుజేసెను (I కొరి $16^{1-6}$ II కొరి 8,9). దశమభాగము నియ్యవలెనని చెప్పక ప్రతివాఁడు తన శక్తికొలది దేవుఁడను గ్రహించిన కలిమిచొప్పున క్రమముగా కానుకల నర్పింపవలెనని నియమించెను (I కొరి $16^{1-6}$). పాఁతనిబంధనలోని దానికన్న తక్కువ నియ్యక ఎక్కువ ఇయ్యవలెననుటయే దాని యుద్దేశమయ్యున్నది.

కానుకల నర్పించుటవలన పుణ్యము సంపాదించుకొనుటయే గాక, పాపముచేయుటకును సెలవు నొందగలమని కొందఱు మత బోధకులు సహా బోధించిరిగాని, అది బైబిలు బోధకాదు. దుష్టులయర్పణలు దేవునికిష్టములుకావు. అట్టి అర్పణలెన్నియైనను, నీతిగా ప్రవర్తించుటకు సాటిరావు (మ $5^{23-26}$). అయితే మంచిమనస్సుతో ఆయన కర్పించినవే ఆయన కంగీకృతములు (II కొరి $9^{7,13}$). (మ్రొక్కుబళ్లు చూ॥).

**అర్పక్షదు** (Arpachshad). ఆది $10^{22}$ I దిన $1^{17,18}$ ను చూడఁగా అర్పక్షదు షేము యొక్క మూఁడవకొడుకై యున్నట్లు తెలియును. ఇతఁడబ్రాహామునకు పూర్వికుఁడు (ఆది $11^{10,27}$). అర్పక్షదు అనుపేరును విడదీసినయెడల అందులో అర్పక్ + చెసెద్ అను భాగములుండును. చెసెద్ అనుపేరు కల్దీయుల దేశమునకు అసలు పేరైన చస్దీము అను దాని ఏకవచనమైయున్నది. ఇది మొదట ఒక పురుషుని పేరైనను తరువాత ఒక గోత్రమునకును అటుతరువాత యొకదేశమునకును పెట్టిన పేరైయున్నట్లుగ నగపడును. అర్పక్ అను ప్రదేశము అష్షూరు దేశమునకు నైరృతి దిక్కున నున్నది.

**అర్పాదు** (Arpad). సిరియలోని యొక పట్టణము. బైబిలునందిది యెల్లప్పుడు హామాతుకు సంబంధముగా సుండుటచేత హామాతు ప్రాంతములలో నున్నదని యూహింపఁదగును (II రాజు $18^{34}$ $19^{13}$ యెష $10^{9}$ $36^{19}$ $37^{13}$ యిర్మీ $49^{23}$). అంతియొకయకు తూర్పుననుండు అలెప్పోయను పట్టణమునకు ఉత్తరముగా 13 మైళ్ల దూరములో నుండు టెల్-ఎర్ఫాదు (*Tell-Erfad*) దీని యునికిపట్టై యున్నది.

**అర్బా** (Arba). అనాకీయుల తండ్రి (యెహో 21[11]). ఇతఁడు వారిలో గొప్పవాఁడని 14[15] 15[13] లో నున్నది. హెబ్రోను యొక్క మొదటిపేరు కిర్యతర్బా (న్యాయా 1[11]). అనగా అర్బాపట్టణమని యర్థము. ఈ అర్బా యనువాఁడే దాని కట్టించెను (హెబ్రోను చూ॥).

**అర్బాతీయుడు** (Arbathite). బేతరాబా యను ఊరివాఁడు (II సమూ 23[31] యెహో 15[6,61] 18[22]) (బేతరాబా చూ॥).

**అర్బీయుడు** (Arbite). అరాబు (యెహో 15[52]) అను నూరివాఁడు (II సమూ 23[35]). అయితే LXX లో ఇది అర్కీయుఁడు అని యున్నది. I దిన 11[37] లో అర్బీయుడు అను దానికి ప్రతిగా **ఎజ్బాయి** అనుమాట గలదు.

**అర్మోని** (Armoni = నగరమునకు సంబంధమైనది). రిస్పావలన సౌలునకు పుట్టిన కుమారులలో నొకఁడు. ఇతఁడు గిబియోనీయులవలన ప్రాయశ్చిత్తార్థముగా చంపఁబడెను (II సమూ 21[8-11]).

**అర్యోకు** (Arioch = ఆకాశరాణి అనగా చంద్రునికి సేవకుఁడు).

1. ఎల్లాసరురాజైన అర్యోకు సొదొమ మొదలగు పట్టణముల మీఁద యుద్ధముచేసిన నలుగురు రాజులలో నొకఁడు (ఆది 14[1,9]). బబులోను దేశమునకు దక్షిణ భాగము నేలిన ఎరి-అ-కు అనువాఁడు ఈ రాజే. ఇతని పేరు బబులోను శాసనములలో కనఁబడెను. అమ్రాపేలు (ఆది 14[1]) అను వాఁడితనిని ఓడించినట్లుగా ఆ శాసనములవలనఁ దెలియును.

2. నెబుకద్నెజరు దేహసంరక్షకుల అధిపతి (దాని 2[14-15,24-25]).

**అర్వదు, అర్వదువారు** (Arvad = తిరుగుచున్న, Arvadites). ఇది ఫేనీకే దేశములోని యుత్తర ప్రాంతమునకు రేవుపట్టణము. యెహెజ్కేలు కాలమునందు అర్వాదువారు తూరువారి యోడలకు కలాసులుగా నుండిరి (యెహె 27[8,11]). ప్రస్తుతము బైరూట్ (*Beirut*) కు 70 మైళ్లు ఉత్తరముగానున్న ఎర్-రూయద్ (*er-Ruwâd*) అను పేరుగల స్థానమే దీనియునికియైయున్నది.

**అర్సా** (Arza = వేడుక). రాజైన ఏలా యొక్క గృహనిర్వాహకుఁడు (I రాజు 16[9]). తిర్సలో ఏలా యితని యింటికి విందుకువచ్చి త్రాగి మత్తుఁడైయుండఁగా జిమ్రీయనువాఁడు కుట్రజేసి ఏలానుచంపి రాజ్యము నపహరించినపుడు ఇతఁడు కుమ్మకుగానున్నట్లున్నది.

**అల్తష్హేతు** (Altashheth = కొట్టివేయకుము). కీర్తనల గ్రంథమందలి 57, 58, 59, 75 కీర్తనల రాగము పేరైయున్నది. దీనిని ఆ కీర్తనల పీఠికయందు జూడవచ్చును. యెష 65[8] లో వ్రాసిన ద్రాక్షారసమునుగూర్చిన పాటలో అది దీవెనకరమైనది దాని **కొట్టివేయకుము** అని పాడిరి. ఆ కీర్తనలలో ఈమాట ఉండుటవలన క్రమక్రమేణ ఆమాట వీటి రాగమునకు పేరాయెనని కొందఱు తలంతురు.

**అలచందలు** చిక్కుడు కాయలు చూ॥

**అలమ్మెలెకు** (Allammelech = రాజు యొక్క ఒకచెట్టు?). ఆషేరుస్వాస్థ్యములోని యొక యూరు (యెహో 19[26]). ఈ పేరుగల వాగు ఆ ప్రాంతములయందుండుటచే నిది అక్కో దగ్గఱనున్నదను కొందురు. గాని దీని సరియైన యునికి తెలియదు.

**అలామోతు** (Alamoth = కన్యకలు). కీర్తనల గ్రంథమందలి 46-వ. కీర్తన పాడవలసిన రాగపు పేరు. ఇది యా కీర్తన పీఠికయం దగుపడును. కీర్తన రాగము కాదుగాని శబ్ద అర్థమునుబట్టి కన్యకలు పాడదగినదని కొందరి యభిప్రాయము.

**అలెక్సంద్రియ** (Alexandria). ఐగుప్తు దేశమందలి పట్టణము. బైబిలునం దీ పట్టణపు పేరు అచ్చట జన్మించిన అపొల్లో చరిత్రయందును (కార్య 18[24]) అక్కడ నుండి వచ్చిన ఓడల వివరమునందును (27[6] 28[11]) మాత్రము కనఁబడుచున్నది. అయినను ఈ కొద్ది వాక్యములవలనే ఆ పట్టణపు పాండిత్యమును, అచ్చటి వ్యాపారాదులను దెలిసికొనుటకు వీలగుచున్నది. ఇది నైలునది పడమటి ముఖద్వారము దగ్గరనున్నది. మహా అలెక్సందరు క్రీ॥ శ॥ ముందు 332 సం॥ న దీనిని గట్టించెను. చక్కగ అమర్చి కట్టఁబడిన పట్టణము. దీనియందలి 5 భాగములలో నొక

దానిని యూదులకొఱకు ప్రత్యేకించిరి. యూదులచట విస్తారముగా నుండుటచే తమ కొఱకొక సమాజమందిరమును ప్రత్యేకముగా యెరూషలేములో కట్టించుకొనినటుల క్రొత్త నిబంధనయందుఁ జూడఁగలము ($6^{9}$). మహా అలెక్సందరునకు తరువాత నైగుప్తునేలిన తొలెమాయి (*Ptolemys*) రాజు లీపట్టణమందు గొప్ప పుస్తకశాలలను స్థాపించిరి. ఈ పట్టణమాకాలమునందే వ్యాపారములకును ప్రసిద్ధమాయెను. వారిలో నొకని కాలమందు క్రీ॥ శ॥ ముందు రెండవ శతాబ్దమున పాఁత నిబంధనను ఈ పట్టణములోనే గ్రీకు భాషలోకి తర్జుమ (LXX) జేసిరి. రోమను ప్రభుత్వకాలమున నది రోమాకు తరువాతి ముఖ్య పట్టణమయ్యెను. క్రైస్తవమత మచ్చటకు బహు త్వరగా వ్యాపించెనుగాని అచ్చట మొదట బోధించిన వారెవ్వరో బైబిలునందుదాహరింపలేదుగాని మార్కు క్రైస్తవ సంఘమునచ్చట స్థాపించెనను పారంపర్యవాడుక యొకటి గలదు. క్రైస్తవుల మొదటి వేదవిద్యాలయ మిచ్చటయుండెను. క్రైస్తవులలో గొప్పపండితులైన వారిచ్చట బోధించిరి. క్లెమెంటు (*Clement*), ఒరిగేను (*Origen*), అతనేశియు (*Athanasius*) వీరిలో ప్రసిద్ధులు. క్రీ॥ శ॥ 640 మొదలు అది మహమ్మదీయుల యాధీనమయ్యెను. ఇప్పటికిని వారిచేతులయందే గలదు. ప్రస్తుతమున ఆ పట్టణమునందు శివారులతో కలిసి 80 లక్షల మందికన్న నెక్కువ ప్రజాసంఖ్య కలదు.

**అలెక్సంద్రు** (Alexander = మానవులఁగాపాడువాఁడు).

1. **మహా అలెక్సంద్రు (Alexander the Great).** ఇతనిపేరు బైబిలునందు లేకపోయినను బైబిలు చరిత్రను మాత్రమేగాక లోకచరిత్రను మార్చుటచేత నితని చరిత్రను క్లుప్తముగ విచారింపఁదగును. మాసిదోనియయం దితఁడు క్రీ॥ శ॥ ముందు 356 లో జన్మించి 323 లో బబులోనునందు కాలము చేసెను. తన రాజ్యమును గ్రీసు నుండి హిందూదేశమువఱకు వ్యాపింపఁజేసెను. ఆ కారణమున గ్రీకుభాషయు గ్రీకువారి విద్యలును నీ దేశములన్నింటిలో వ్యాప్తిజెందెను. అందువలన క్రొత్తనిబంధన కాలములో గ్రీకుభాష సర్వత్ర వ్యాపించి క్రీస్తు రక్షణవిషయములు ఆ భాషలో వ్రాయఁబడుటకు మూలమాయెనని చెప్పఁదగును.

క్రీ॥ శ॥ ముందు 332 పారసీకులను ఇస్సస్ (*Issus*) యొద్ద నోడించినందున నితఁడు పలెస్తీనుకు మాత్రమేగాక ఆసియ ఖండమందలి పశ్చిమ భాగమంతటికి ప్రభువాయెను. యెరూషలేమును, దాని యందలి యాచారములను అడ్డగింపక వాటిని ప్రోత్సాహపఱచి యాదరించెను. దాని $8^{21}$ $11^{3}$ లో నున్న ప్రవచనము లతనికిఁ గనుపఱచినప్పుడు, అవి తనను గూర్చినవేయని తలంచి యూదులమతమును మరీ యభిమానించెను. పలెస్తీనును సిరియకుఁజేర్చి దాని ప్రభుత్వవిషయము తగిన యేర్పాటులఁజేసెను. ఇందువలననే నితని మరణాంతరమున గూడ అది అంతియొకయ రాజ్యములోనే జేరియుండెను (అంతియొకయ, అంతియోకు చూ॥). అతఁడు యూదుల యందు చాల దయఁజూపినందున అనేకు లతని సేనలోఁ జేరిరి. అతని గౌరవార్థమై యైగుప్తులోఁ గట్టఁబడిన అలెక్సంద్రియ (*Alexandria*) పట్టణమునందు వారికి విశేష హక్కు లిచ్చినందున అనేకమంది యూదు లచ్చటికిఁబోయి కాపురముండిరి. యూదులు తమ వేదములను విద్యలను గ్రీకు భాషలోకి తర్జుమజేసి ప్రచురించుట కది వారి కునికి పట్టయ్యెను. అచటనే **LXX** అను గ్రీకు తర్జుమ చేయఁబడెను. ఇతనిపేరు **I** మక్క $1^{7}$ $6^{2}$ లో కనఁబడును.

2. క్రీస్తు సిలువను మోసిన కురేనీయుఁడగు సీమోను కుమారుఁడు (మా $15^{22}$). ఇదిగాక మఱేమియు నితనిగూర్చి తెలియదు. మార్కుకీయన పేరు తెలిసియుండెను గనుక క్రైస్తవుఁడని నమ్మవచ్చును.

3. ప్రధాన యాజకుఁడగు అన్నకు బంధువుఁడు (కార్య $4^{6}$).

4. ఎఫెసులోనుండిన ఒక యూదుఁడు. అపొస్తలుఁడగు పౌలునుగూర్చి అక్కడ పెద్ద గలిబిలి జరిగినప్పుడు దాని నాపుటకితఁడు ప్రయాసపడెను. పౌలు క్రైస్తవుఁడైన యూదుఁడుగాన యూదులు తమ మీఁదకు నేరము వచ్చునేమోనని భయపడి ఇతఁడు తమ పక్షమున మాటలాడవలెనని ముందు నిలువఁబెట్టిరి (కార్య $19^{33}$).

5. ఎఫెసునందు మతభ్రష్టుఁడును దూషకుఁడునగు నొకఁడు (I తిమో 1[20]).

6. ఎఫెసు నందుండిన యొక కంచరివాఁడు. వీఁడు పౌలునకు చాల కీడుజేసెను (II తిమో 4[14]). 5 లోఁ జెప్పఁబడిన వాఁడితఁడేనని కొందఱి యభిప్రాయము. 4-వ వాఁడును ఎఫెసు కాపురస్థుఁడే గాన ఈ ముగ్గురు నొకవేళ యొక్కరే నేమోనని తలంచువారును గలరు. 2-6 C.

**అల్ఫాయి** (Alphaeus = మారుట ?).

1. అపొస్తలుఁడైన చిన్న యాకోబు తండ్రి (మ 10[3] మా 3[18]). అతని మారుపేరు క్లోపాయని చెప్పెదరు (యోహా 19[25]).

2. అపొస్తలుఁడైన లేవియను మత్తయి తండ్రి (మా 2[14]). C

**అల్ఫా, ఓమెగ** (Alpha and Omega). అల్ఫా గ్రీకు అక్షరములలో మొదటిది, ఓమెగ వాటిలో చివరిది. అల్ఫాయు ఓమెగయు అను మాటలకు మొదటివాఁడును కడపటివాఁడును అనఁగా నిరంతరముండువాఁడు అని యర్థము. ప్రక 1[8] 21[6] లో నున్నట్లు ఈ బిరుదు సర్వాధికారియు, గొప్ప సింహాసనాసీనుఁడునైన దేవునికి ఆరోపింపఁబడెను. ప్రక 22[13] లో నున్నట్లు అది క్రీస్తునకును ఆరోపింపఁబడెను. క్రీస్తు దేవునికి సమానుఁ డనుటకుగల సూచనలలోనిది మిగుల పురాతనమైనది యని యెంచవలెను (యెష 44[6] 48[12] సరిపోల్చి చూడుము).

**అల్మోదాదు** (Almodad). షేముసంతతి వారిలో నొకఁడు. ఇతఁడు అరబీదేశస్థులకు పూర్వికుఁడైన యొక్తానుయొక్క గోత్రములో చేరినవాఁడు (ఆది 10[26] I దిన 1[20]). అల్మోదాదువారు దక్షిణ అరేబియాలో నివసించిరని కొందఱను కొందురు.

**అల్మోను, అల్లెమెతు** (Almon, Allemeth = మఱుఁగుగా నుండునది). బెన్యామీనీయుల స్వాస్థ్యభాగములోని ఒకయూరు. ఇది లేవీయులకు నియ్యఁబడిన 48 ఊళ్లలో నొకటియై యుండెను (యెహో 21[18]). I దిన 6[60] లో దీనికి **అల్లెమెతు** అనుపేరున్నది. ఈ పదమును అల్మోను అనుపదమును ఒకటే అర్థముగలవియై ఒకటే స్థలమునకు చెందును. అనాతోతుకు ఈశాన్యముగా నుండు కొండలలో ప్రస్తుతమున నున్న ఆల్మీటు ('*Almit*) అనునదే దానియునికియై యున్నది (పటము II, F 1).

**అల్మోను దిబ్లాతాయిము** (Almon Diblathaim). ఇశ్రాయేలీయులు అరణ్యములో సంచరించిన 40 సం॥ ల అంత్యకాలములో మోయాబు ప్రాంతమందు మకాముజేసిన యొక స్థలము (సంఖ్యా 33[46,47]). యిర్మీ 48[22] లోనున్న **బేత్-దిబ్లాతాయీము** అనునది యిదేస్థలమని యనుకొందురు (బేత్-దిబ్లాతాయీము చూ॥).

**అల్లాడింపబడు అర్పణములు,** అర్పణములు V 3. చూ॥.

**అల్లిక కిటికీ** కిటికీ చూ॥

**అల్లెమెతు** అల్మోను చూ॥

**అల్లోను** (Allon = ఓకుచెట్టు). షిమ్యోను గోత్రికులలో నొకఁడు (I దిన 4[37]).

**అల్లోను బాకూత్** (Allon-bachuth = అంగలార్చు ఓకుచెట్టు). రిబ్కా దాదియైన దెబోరాను పాతిపెట్టినస్థలము. బేతేలునకు సమీపముగా నుండెను (ఆది 35[8]).

**అల్వా** (Alvah = ఎత్తయిన). ఏశావు సంతతివారగు ఎదోమీయుల నాయకులలో నొకఁడు (ఆది 36[40] I దిన 1[51]).

**అల్వాను** (Alvan = ఎత్తయిన). ఏశావు సంతతివారిలో నొకనిపేరు (ఆది 36[23] I దిన 1[40]).

**అవతారము** యేసుక్రీస్తు IV చూ॥

**అవివేకి** బుద్ధిహీనత చూ॥

**అవిశ్వాసము** విశ్వాసము చూ॥

**అవినెనార** జెనుము చూ॥

**అవీతు** (Avith = పాడు శేషములు). మోయాబీయుల పట్టణములలో నొకటి (ఆది 36[35] I దిన 1[46]). దీని సరియైన యునికి తెలియదు.

**అవ్వా, అవ్వీయులు** ఇవ్వా చూ॥

**అశరేయేలు** (Asareel = దేవుఁడు బంధించెను). యూదావంశస్థులలో నొకఁడు. ఇతఁడు యెహాల్లెలేలు కుమారుఁడు (I దిన 4[16]).

**అశాయా** (Asaiah = యెహోవా చేసెను).

1. హుల్దాయను ప్రవక్త్రియొద్ద విచారణ చేయుటకు రాజైన యోషీయా పంపినవారిలో నొకఁడు (II రాజు 22[12,14] II దిన 34[20]).

2. షిమ్యోనుగోత్రపు అధిపతులలో నొకఁడు (I దిన 4[36]).

3. దావీదు కాలములో దేవుని నిబంధన మందసమును యెరూషలేమునకు తీసికొనివచ్చిన యాజకులలో నొకఁడు. ఇతఁడు మెరారి కుటుంబికుఁడు (I దిన 6[30] 15[6,11]).

4. బబులోను చెఱనుండి తిరిగివచ్చిన యూదులలో షీలోనీయుల కుటుంబమునకు పెద్ద (I దిన 9[5]). నెహె 11[5] లో నితనికి మయశేయా యను పేరుగలదు. దీనికిని అశాయా యను పదమునకును శబ్దార్థమొక్కటే.

**అశాహేలు** (Asahel = దేవుఁడు చేసెను).

1. దావీదు అక్కయగు సెరూయాయొక్క చిన్నకొడుకు (I దిన 2[16]). యోవాబు అబీషై యనువారితని యన్నలు. ఇతఁడు దావీదుయొక్క 30 మంది గొప్ప యోధులలో నొకముఖ్యుఁడును, బహు తేలికగా పరుగెత్తువాఁడుగా నుండెను (II సమూ 2[18] 23[24]). దావీదుసేనలో నొక భాగమునకు అధిపతియునై యుండెను (I దిన 27[7]). అబ్నేరు అనువాఁడితనిని చంపెను (II సమూ 2[18-23]).

2. రాజైన యెహోషాపాతు ప్రజలకు బోధించుటకై నియమించిన లేవీయులలో నొకఁడు (II దిన 17[8]).

3. రాజైన హిజ్కియాకాలములో దశమ భాగార్పణలను ఇంక నితరార్పణలను వసూలు చేసినవారిలో నొకఁడు (II దిన 31[13]).

4. ఇశ్రాయేలీయులు తాము పెండ్లిచేసికొనిన అన్యస్త్రీలను విడిచిపెట్టవలెనని ఎజ్రా యేర్పాటు జేయఁగా ఆ పనికి నిర్ణయింపఁబడిన యోనాతాను అనువానితండ్రి (ఎజ్రా 10[15]). ఇతఁడాయేర్పాటువిషయము ఎజ్రాను ఎదిరించెననునది అసలులోని దాని భావమని నవీనశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

**అశీయేలు** (Asiel = దేవుఁడు సృజించెను). షిమ్యోను సంతతివారిలో నొకఁడు. ఇతఁడు వారి యధిపతులలో యెహూయనువాని తాత (I దిన 4[35]).

**అశ్రీయేలు, అశ్రీయేలీయులు** (Asriel = దేవుని మొక్కు ?, Asrielites). మనష్షేసంతతి వారిలో నొకఁడు. ఇతని సంతతివారు అశ్రీయేలీయులు అనఁబడిరి.

**అశ్వినీ చిహ్నములు** (Castor and Pollux, Dioscuri). నావికులు తమయోడలకు గుఱుతులు పెట్టుట సర్వసాధారణమైన వాడుక. పౌలు ఖైదీగా రోమాకుఁ బోవునప్పుడు మెలితేనుండి పొతియొలీయకు ప్రయాణముజేసిన యోడకుపెట్టిన గుఱుతులను అశ్వినీ చిహ్నములని తెనిఁగించిరి (కార్య 28[11]). నక్షత్రముల రాసులలో నొకదానియందున్న రెండు నక్షత్రములు చాలదగ్గరగా నుండుటచే వాటికి మిథునము (*Gemini*) అని యందురు. అన్యదేవతలలో కవలదేవతలుగా నెంచఁబడిన డియాస్కూరై (*Dioscuri*) అను పేరు వీటికి పెట్టిరి. ఆ దేవతలు ముఖ్యముగా నావికులకు సంరక్షకులని గ్రీకువారనుకొనిరి. కావున వాటి చిహ్నమును తమయోడకు పెట్టుకొనిరి.

**అషరేలా** (Asharelah = దేవునియెడల యథార్థవంతుఁడు). సంగీతమును వాయించుటకు దావీదు నియమించిన ఆసాపు కుమారులలో నొకఁడు (I దిన 25[2]). I దిన 25[14] లో ఈ పేరు యెషరేలా అనియున్నది గాని ఈ రెంటికి నొకటే యర్థముగలదు.

**అషీమా** (Ashima). అష్షూరురాజగు సర్గోను ఇశ్రాయేలువారిని చెఱగొనిపోవుటవలన ఖాళీయైనదేశమును ప్రజలతో నింపనై తెచ్చి పెట్టిన హామాతుప్రజ లారాధించిన పారసీక లేక బబులోనుదేశస్థుల దేవత (II రాజు 17[30]). ఈ దేవత రెండుకలులేని మేఁక ఆకారము కలిగిన గ్రీకులదేవతయగు పాను వంటిదై యుండెనని యూదుల ఇతిహాసములు తెలుపుచున్నవి.

B.

**అష్బేయ** (Ashbea = సాక్షిగా పెట్టనిమ్ము). యూదావంశస్థులలో నొకఁడు. ఇతఁడు షేల కుమారులలో నొకఁడును, సన్నపు వస్త్రములను నేసిన కుటుంబమునకు పెద్దయునైయుండెను.

(I దిన $4^{21}$). అసలుభాషలో అష్బేయ అని యున్నది.

**అషేరా (Asherah).** ఫేనీకేయులు లేక కనానీయుల దేవతయైయున్నట్లు కనబడుచున్నది (II రాజు $21^{7}$ $23^{4,6,7,14,15}$). అష్తోరెతు లేక అష్టార్తి యనునది యిదేనని కొందఱు తలంచెదరు (అష్తోరెతు, అష్టార్తే చూ॥). ఇది దేవతపేరుగాక దేవతకు ప్రతిగానున్న విగ్రహముపేరై యుండును. ఈ విగ్రహము నెప్పుడును కొయ్యతోనే చేసెడివారు. న్యాయా $6^{25-30}$ II రాజు $23^{14}$ లలో నీమాటను **దేవతాస్తంభమని** యాంధ్రీకరించిరి. అదియొక తిన్నని మ్రాను. ప్రతికియున్న చెట్టునుగాని, లేక ఆ పనికొఱకే సిద్ధముచేసిన కొయ్యనుగాని దీనికై వాడిరి. దేశమందంతట నున్న ఉన్నత స్థలములలోని తోఁపులలో నీ యారాధనఁ జేసెడివారు. ఇది పూర్వకాలమునఁ జేసిన వృక్షారాధనయొక్క శేషముగాఁ గన్పడుచున్నది. ఈ యారాధన అష్తోరెతు దేవత ఉత్పత్త్యవయవారాధనలోని యాచారములకు సంబంధించియున్నది. హిందువుల లింగారాధనవంటిది. ఈ యారాధనజరుగు ప్రతిచోటను కనఁబడునట్టి పూజనీయమైన కొయ్యకుగాని చెట్టుకుగాని ఈ పేరు చెందుచున్నది. ఇవి కొన్ని పర్యాయములు గుళ్లలోను, కొన్ని పర్యాయములు తోఁపులలో నుండును.

B.

**అష్కనజు (Ashkenaz).** యాపెతు సంతతివాఁడగు గోమెరు కుమారులలో నొకఁడు (ఆది $10^{3}$ I దిన $1^{6}$). ఇది యొకని పేరు గాని, వంశపుపేరుగాని అయ్యుండవచ్చును. ఎటులనైనను ఇటీవల అదియొక జనమునకు పేరాయెను. యిర్మీ $51^{27}$ నందు మీను అరరాతు, మిన్నీ అను దేశముల (అర్మీనియా ప్రాంతముల) దిగ్గెజనుండి వని తెలియును.

**అష్కెలోను (Ashkelon = వలసపోవుట).** ఫిలిష్తీయుల ఐదు ప్రధానపట్టణములలో నొకటి (యెహో $13^{3}$). ఇది మధ్యధరా సముద్రతీరమున గాజా పట్టణమునకు ఉత్తరముగా 12 మైళ్ల దూరములో బలమైన గోడలుగల పట్టణమైయుండెను. యెహోషువ మరణమునకు పిమ్మట యూదా గోత్రికులు దానిని పట్టుకొనిరి (న్యాయా $1^{18}$). ఈ వాక్యములోని అష్కెలోను ఒక పట్టణమని తెలిసికొనవలెను. సమ్సోను అక్కడకు వెళ్లి ముప్పదిమందిని చంపి వచ్చినందున ఫిలిష్తీయులు మఱల దాని స్వాధీనపఱచుకొనినట్లు (న్యాయా $14^{19}$ I సమూ $6^{17}$) తెలియుచున్నది. అయితే యీ అష్కెలోను అనునది యొక పల్లెయొక్క పేరు అని కొందఱనుకొందురు. ఫిలిష్తీయులు దుష్టులైనందున ఆ పట్టణము బొత్తుగా పాడైపోవునని దీర్ఘదర్శులు ప్రవచించిరి (యిర్మీ $47^{1-7}$ ఆమో $1^{8}$ జెక $9^{5}$ జెఫ $2^{4,7}$). పాడైపోయిన గోడలు, నేలఁబడిన కొన్ని శ్రేష్ఠస్తంభములు గొప్ప బావులు మొదలైనవి యిప్పటికి కనఁబడునుగాని యచట నివాసులులేరు. యెహో $13^{3}$ లో నున్నట్లు ఈ పట్టణపు నివాసులు అష్కెలోనీయులనఁబడిరి (పటము I, B 9).

**అష్టమశ్రుతి (Sheminith).** కీర్తనలగ్రంథమందలి 6, 12 కీర్తనల రాగపు పేరైనట్లు ఆ కీర్తనలపై వ్రాయఁబడెనని తెలియును. కీర్తనల రాగముల అసలు పేరులు సాధారణముగా బైబిలునందుంచినను ఇచ్చట ఆ పేరును తెనిఁగించిరి. దాని అసలు పేరు షెమినీత్ (*Sheminith*) అనగా ఎనిమిదవదానిమీఁద అని మూలభాషలో అర్థమగును.

**అష్డోదు, అజోతు, అష్డోదీయులు (Ashdod, Azotus, Ashdodites = కోట).** ఫిలిష్తీయుల ఐదు సర్దారు పట్టణములలో నొకటి. యెహోషువ యీ పట్టణమును జయింపక విడిచిపెట్టినందున (యెహో $13^{3}$) అది అనాకీయులలో మిగిలిన వారికి ఆశ్రయస్థానమాయెను (యెహో $11^{22}$). ఇశ్రాయేలీయుల నిబంధన మందసము ఫిలిష్తీయులు పట్టుకొనినపుడు మొదట ఈ పట్టణమునకే తెచ్చి యిచటనుండి గాతుకుఁబంపిరి. (I సమూ $5^{1,8}$). రాజైన ఉజ్జియా ఈ అష్డోదు మీఁద యుద్ధముచేసి జయించి దానియొక్క ప్రాకారములను గట్టించెను (II దిన $26^{6}$). అష్షూరురాజైన సర్గోనుయొక్క సేనాధిపతియగు తర్తాను అష్డోదును జయించెను (యెష $20^{1}$). నెహెమ్యా యెరూషలేము గోడలను తిరిగి కట్టింపఁగా అతని నెదిరించినవారిలో అష్డోదీయులును గలసియుండిరి (నెహె $4^{7}$). అయినను అప్పటి కాలములో సహా కొందఱు యూదులు అష్డోదీయుల స్త్రీలను వివాహము చేసికొనుచుండిరి

(నెహె 13[23,24]). యిర్మీ 47[1-7] ఆమో 1[8] జెఫ 2[4-7] జెక 9[5,6] యను ప్రవక్తలు దీని నాశమును గూర్చి ప్రవచించిరి. మక్కబీయులు దానిని రెండు మారులు జయించిరి (1 మక్క 5[68] 10[84]). క్రొత్త నిబంధనలో దీని గూర్చిన ఈయొక్క సూచనకాక మరేదియు లేదు. ఐతియొపియ దేశపు నపుంసకునికి బాప్తిస్మమిచ్చిన పిమ్మట ఫిలిప్పు ఈ పట్టణమునకు వెళ్లినట్లున్నది (కార్య 8[40]). ప్రస్తుతమున ఎస్దూదు (*Asdud*) అనఁబడు ఊరే దాని యునికియని యనుకొందురు. అది జాఫా యను రేవు పట్టణమునకు దక్షిణముగా 10 క్రోసుల దూరములోను మధ్యధరా సముద్రమునకు క్రోసెడు దూరము నున్నయొక యూరు. దానియొద్ద కొన్ని పాడు శేషములు గలవు. ఈ పట్టణపు నివాసులు **అష్డోదీయులనఁ** బడిరి (పటము I, B 9).

**అష్తారోత్ కర్నాయిము** (Ashteroth Karnaim = రెండు కొమ్ములుగల అష్తారోత్). దమస్కుకు దక్షిణముగానున్న యొక ఊరు. అచ్చట రఫాయీయులనఁబడిన రాక్షసుల వంటి వారు నివసించిరి. కదొర్లాయోమెరు రాజు వారినికొట్టి అబ్రాము అన్నకొడుకైన లోతు కాపురమున్న సొదొమమీఁద యుద్ధము జేయుటకు వెళ్లెను (ఆది 14[5]).

H.

1. **అష్తారోతు** (Ashtaroth = అన్య దేవతయగు **అష్టారేతు** సంబంధించినది). బాషానురాజయిన ఓగు పట్టణములలో నొకటి (ద్వితీ 1[3] యెహో 9[10]). వాటిలో రెఫాయీయు లుండిరి (13[12]). ఓగు ఓడిపోయిన తరువాత ఈ పట్టణము మనష్షే గోత్రికుల స్వాస్థ్యమాయెను (13[31]). గాని అటుపిమ్మట అది లేవీయులకియ్యఁబడిన పట్టణములలో నొకటియై యుండెను (I దిన 6[71]). దావీదు యోధులలో నొకఁడగు ఉజ్జీయాయనువాఁడీ యూరివాఁడైనందున **అష్టెరాతీయు** డనఁబడెను (I దిన 11[44]). ప్రస్తుతమున టెల్-అష్తారా (*Tel-Ashtara*) యను స్థానమే దానియునికి పట్టయియుండవచ్చును. అది గలిలయ సముద్రమునకు దూర్పున 21 మైళ్ల దూరమున నున్నది. (పటము I, H 4).

2. (Ashtoreth = నక్షత్రములు). సీదోనీయుల దేవత (I రాజు 11[5,33] న్యాయా 10[6] II రాజు 23[13]). ఇది ఫేనీకేయుల అష్టార్ట్, గ్రీకుల అస్టార్ట్, నీనెవే పట్టణపు ప్రాచీన ఇష్టార్ అను దేవతల హెబ్రీనామమై యుండవచ్చును. ఫేనీకేయులు దీనిని అష్షూరునుండి దెచ్చియుందురు. అష్షూరీయులు ఇష్టారును విశేషముగ నారాధించెడివారు. ఇది అష్షూరీయుల పురాణములయందు పేర్కొనఁబడిన తమ్మూజుయొక్క భార్య. శీతకాలము తమ్మూజును జంపినప్పుడతని మఱల బ్రతికించు కొనుటకై ఇష్టారు మంత్ర జలమునుగొని తెచ్చుటకు పాతాళ లోకమునకుఁ బోయెను. ఆమె యచ్చట నున్నంతవఱకు భూలోకమున ప్రాణికోటియందు సంతానాభివృద్ధి నిలిచిపోయెను. ఆమె మఱల భూమిపై కరుగుదెంచువఱకు భూస్థితిమాఱకుండెను. గాన ఆమె భూసారమునకును వృద్ధికిని యధిదేవతగా భావింపఁబడెను. ఈ కథయందు మనము అస్టార్టి, అష్తారెతు యనఁబడిన దాని నైజ స్వభావమును గాంచుచున్నాము.



అష్తారోతు

ఈమె ఆకాశపురాణిని, గ్రీకుల అఫ్రొదైతును అన్ని దేశములయందు పూజింపఁబడు కామమోహాదుల దేవతను సూచించును. పురుష దేవతయగు బయలు దేవతతోటిదై యుండెను. దీని విగ్రహములును, బయలు విగ్రహములును అష్తారోతు అని పిలువఁబడెను. ఈ దేవతాస్థలముగా నెంచఁబడిన తూరు పట్టణము ఈ దేవతారాధనమునకు ముఖ్యస్థానమై యుండెను. తూరురాజైన హీరాము ఆమెకు గుడ్లు కట్టించెను. ఫిలిష్తీయులు సౌలును చంపిన పిదప నాతని కవచమును దీసికొనివెళ్లి అష్తారోతు గుడిలో పెట్టుట

వలన (I సమూ 31[10]) వీరామెను యుద్ధదేవతనుగా నెంచినట్లు తెలియుచున్నది.

సొలొమోను దీని యారాధనను యెరూషలేముకు గొని తెచ్చెను (I రాజు 11[5]). ఈ ప్రతిమారాధనను యోషీయా కాలము దనుక సంపూర్ణముగా దేశమునుండి దీసివేయఁబడలేదు (II రాజు 23[13]). హిందువులవలె సూర్యచంద్రులను పురుషులనుగా భావింపక, సీదోనీయులు, ఫేనీకేయులు, అష్షూరీయులు మున్నగు వారు సూర్యుని పురుషునిగాను, చంద్రుని స్త్రీనిగాను భావించిరి. సూర్యునిచే సూచింపఁబడిన పురుషశక్తిని బయలనియు, చంద్రునిచే సూచింపఁబడిన స్త్రీ శక్తిని అష్తోరెతు యని బిలిచిరి. గాన అష్తోరెతును ఆకాశరాణియు నొకటేనని కొందరి యభిప్రాయము (ఆకాశరాణి చూ॥) B.

**అష్నా** (Ashnah = బలముగల). యూదయ దేశములోని రెండూళ్ల పేరులు (యెహో 15[33] 15[42]). అయితే వీటియునికిగూర్చి యేమియు తెలియదు.

**అష్పెనజు** (Ashpenaz). దానియేలు కాలమున నెబూకద్నెజరుయొక్క నపుంసకులలో నధిపతిగానుండిన యొకఁడు (దాని 1[3]).

**అష్బేయ** అషేయ చూ॥

**అష్బేలు** (Ashbel = ప్రభువు మనుష్యుఁడు). బెన్యామీనుయొక్క రెండవ కుమారుఁడు). ఇతఁడొక వంశమునకు పెద్దయాయెను (ఆది 46[21] సంఖ్యా 26[38] I దిన 8[1]).

**అష్వాతు** (Ashvath). ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన 7[33]).

**అష్షూరీయులు** (Asshurim). కెతూరా వలన అబ్రాహామునకు పుట్టినవంశపు వారిలో ఒక అరబ్బీగోత్రము (ఆది 25[3]). అరబీదేశములో దొరికిన రాతిశాసనములలో **అష్షూరు** (*A'shur*) అను పేరు కనఁబడెను. అదే యీ గోత్రపు పేరై యుండవచ్చునుగాని యింతకు మించి మరేమియు దీనిగూర్చి తెలియదు.

I. **అష్షూరు** (Assyria). అష్షూరు దేశము పాఁతనిబంధన కాలములో చాల ముఖ్యమైనది. ఇశ్రాయేలు రాజుల కాలములోను ప్రవక్తల కాలములోను అష్షూరీయులు ఇశ్రాయేలీయులను జయించి వారిని ఏలుటచేత అష్షూరు దేశము బైబిలు చరిత్రకు సంబంధముకలదయ్యెను. కావున, వారి చరిత్రలోని ముఖ్యవిషయములను బైబిలును చదువుకొనువారు తెలిసికొనవలసి యున్నది. ఇచ్చట 1. అష్షూరువారి దేశపు హద్దులు, 2. అష్షూరు వారిజాతి, 3. అష్షూరువారి చరిత్రము, 4. అష్షూరు వారిమతము అను విషయములు ప్రశంసింపఁబడును.



అష్షూరువారి దేవాలయపు ద్వారపాలక విగ్రహము

**1. అష్షూరువారి దేశపు హద్దులు.**— అసలు అష్షూరు దేశమును చూడఁగా దానికి ఉత్తరమున అర్మీనియ పర్వతములును, దక్షిణమున జాబు (*Zab*) అనెడి నదియును, తూర్పున మాదీయ పారసీక పర్వతములును, పడమట మెసపొతేమియ యను దేశమును ఉన్నవి. దానికిని నీనెవెయను పట్టణము రాజధానియైయుండెను. అది ప్రస్తుతము టైగ్రిస్‌నది దగ్గఱనున్న బాగ్దాదు పట్టణమునకు ఉత్తరముగా 200 మైళ్ల దూరములో నున్నది. దానికి రెండవ రాజధానియగు కాలహ (*Calah*) కూడ టైగ్రిస్‌నదికి సమీపమున దక్షిణముగా 30 మైళ్ల దూరములో నున్నది. ఈ దేశముయొక్క అసలుహద్దులు చిన్నవైయుండినను, అష్షూరు రాజ్యము వృద్ధిలోకి వచ్చిన క్రీ॥ శ॥ ముందు 1300-607 సం॥ లలో అది లోకములోని గొప్పరాజ్యమై హెచ్చు తగ్గుగా ఇండియానుండి మధ్యధరా సముద్రమువఱకు వ్యాపించియుండెను.



యెహూ పంపిన రాయబారులు రెండవ షల్మనేసెరునకు కప్పము గట్టుట

**2. అష్షూరువారి జాతి.**—అష్షూరువారు షేముసంతతివారని ఆది 10[22] 10[11,12] వలనఁ దెలియును. అష్షూరువారు చాల రాతిబొమ్మలను అనేకమైన రాతిశాసనములను చెక్కించి యుండిరి. వారు చెక్కించిన యాబొమ్మల ముఖరూపములను చూచినను వారు షేము సంతతివారని తెలిసికొనవచ్చును. వారి భాష కూడ సిరియదేశమునకు సంబంధించి అరాము భాషకు సంబంధముగ నుండెను.

**3. అష్షూరువారి చరిత్ర.**—అష్షూరీయుల చరిత్రను తెలిసికొనుటకు చాల రాతిశాసనములు ఆధారములై యున్నవి. అష్షూరువారు తమ రాజుల జాబితాలను వారేలిన సంవత్సరములను నూటిగా వ్రాయుచువచ్చిరి గనుక కాలపరిమాణమును గుర్తించుటకు కూడ అవి చాల ఉపయోగకరములుగ నున్నవి. ఆ చరిత్ర యాపత్తును వివరింపఁ బూనుకొనక, బైబిలునకు సంబంధించిన చరిత్రనుమాత్రము వివరింతుము. వారి చరిత్రను ఈ దిగువరీతిగా విభాగింపవచ్చును.—(1) బాబెలువారి యాధీనమై యుండినకాలము (క్రీ॥ శ॥ ముందు 2300-1650). (2) బాబెలువారితో పోరాడుచు వారిని లోఁబఱచుకొనినకాలము (క్రీ॥ శ॥ ము॥ 1650-745). (3) అష్షూరు రాజ్యము లోకములోని ముఖ్యరాజ్యమైనకాలము (క్రీ॥ శ॥ ము॥ 745-607). మొదటికాలమును చూడఁగా, ఆ చరిత్ర బాబెలుచరిత్రకు సంబంధించినదై యున్నది (బబులోను చూ॥). రెండవ కాలములో (1650-745) అది బాబెలుతో ఎడతెగక యుద్ధములుచేసి యుండెను. బాబెలు క్రమేణ క్షీణించినకొలఁది అష్షూరు క్రమక్రమముగా వృద్ధిలోకివచ్చెను. ఈ కాలములో రెండవ షల్మనేసెరు (క్రీ॥ శ॥ ము॥ 860-824) సిరియ పలెస్తీనుదేశములమీఁద యుద్ధముచేసినట్లు ప్రస్తుతము బ్రిటిష్ వస్తుదర్శనశాల (*British Museum*) లో నున్న రాతిశాసనములవలనఁ దెలియును. దమస్కు రాజగు రెండవ బెన్హదదు ఇంకొక పదకొండు మంది రాజులతోఁ గలసి అతని నెదిరించెను. దమస్కు వారికిని ఇశ్రాయేలీయులకును ఎడతెగని విరోధముండినను అష్షూరీయుల నెదిరించుటకై ఇశ్రాయేలురాజైన అహాబుకాలములో నిశ్రాయేలీయులు దమస్కు వారికి సహాయము చేసియున్నట్లు ఆ రాతిశాసనములవలనఁ దెలియును. II రాజు 20[34] లో నున్నట్లుగా ఆ ఫెకులో సంధచేసికొనిన పిమ్మట ఇది జరిగినట్లుగా ననుకొనఁదగును. అష్షూరురాజు ఈ సమయమున సిరియ పలెస్తీనును జయింపలేకపోయినను, అష్షూరువారి శక్తి వృద్ధిలోకివచ్చినట్లుగా అదే రాతిశాసనములోనున్న మఱియొక విషయమువలనఁ దెలియును. ఆ విషయ మేది యనిన, అహాబువంశమును బొత్తుగా నాశనముచేసి యిశ్రాయేలురాజ్యము నపహరించిన యెహూ (II రాజు 9) అష్షూరు రాజైన ఆ రెండవ షల్మనేసెరునకు బహుమతులను



అష్షూరు దేశపు ప్రభువు

బంపి అతనికి దాసుఁడైనట్లుకూడ ఆ రాతి శాసనములమీఁద నున్నది. ఇట్లుండినను అష్షూరు వారా సమయమున ఆ దేశములన్నిఁటిని జయింపలేక పోయిరి. తరువాత 40 సంవత్సరములవఱకు మఱల దమస్కును జయించుటకు వారే ప్రయత్నము చేయలేదుగాని క్రీ॥ శ॥ ముందు 997 వ సంవత్సరములో వారు దానిని స్వాధీనముచేసికొనిరి. అదిమొదలు దమస్కువారిబలము చాల మట్టునకు తగ్గిపోయెను. అయితే తమ రాజ్యములోని వేఱు ప్రాంతములలో కొందర లుండుటచేత అష్షూరు వారు మఱల 50 సం॥ దాక పలెస్తీను మీఁదికి దండెత్తి రారైరి.

మూఁడవకాలము (745-607)లోనే అష్షూరు వారి చరిత్ర బైబిలులో నెక్కువగా కనఁబడును. ఈ చరిత్ర సంబంధములు II రాజు 15-23 లోను, II దిన 28—33 లోను, యెష 7-11, 19, 20, 36-38 లోను చూడుఁడి. బైబిలులో అష్షూరునుగూర్చి యింక కొన్ని సూచనలున్నవి (హోషే 7[11] 8[9] 9[3] 10[6] 11[11], యిర్మీ 50[17,18] మొ॥). నహూము ప్రవచనము యావత్తును దానిగూర్చినదే. పైనున్న వాక్యముల లోని కాలమును చూడఁగా ఇవి అష్షూరువారు సర్వలోకము నేలుటకు బలమునొందిన కాలమును సూచించును. వారు ఈ కాలములోనే పలెస్తీనును దానిచుట్టునుండు దేశములన్నిఁటిని స్వాధీనము చేసికొనుటకు ప్రయత్నించిరి. ఈ పనికి మొదట పూనుకొనినరాజు మూఁడవ తిగ్లత్పిలేసెరు (II రాజు 15[29]). అతనికి బాబెలువారు పూలు అను మాఱుపేరునుపెట్టిరి (II రాజు 15[19]). ఇతఁడు క్రీ॥ శ॥ ముందు 745 సం॥ నుండి 727 సం॥ వఱకు నేలినవాఁడై యుండెను. 738 వ సం॥ లో ఇశ్రాయేలురాజగు మెనహేము అతనికి రెండువేలమణుగుల వెండి నిచ్చెను (II రాజు 15[17-20]). 734 లో ఇశ్రాయేలీయుల క్రొత్త రాజగు పెకహు దమస్కువారితో సంధిచేసికొని అష్షూరు వారిమీఁద తిరుగుబాటు చేసెను. యూదారాజగు ఆహాజు ఈ సంధిలో చేరకఁ బోయినందున వారు (దమస్కు, ఇశ్రాయేలు) అతనిమీఁద యుద్ధముచేయఁబోఁగా, ఆహాజు అష్షూరురాజు సహాయము వేడుకొనెను (యెష 7). తిగ్లత్పిలేసెరు 734-732 లో పెకహును జయించి కర్మెలుపర్వతమునకు ఉత్తరముగా నున్న పలెస్తీనును తన రాజ్యములో చేర్చికొని (II రాజు 15[29] యెష 9[1]), దమస్కును జయించి, తూరు సీదోనీయులవలన చాల గొప్పకట్నములను గైకొని, ఫిలిష్తీయుల కొన్ని పట్టణములమీఁద తన స్వంత యధికారులను నియమించెను. పెకహుకు పిమ్మట ఇశ్రాయేలు దేశమునేలిన హోషేయ తిగ్లత్పిలేసెరు ఏలిన సంవత్సరములన్నిఁటిలో అష్షూరు వారికి పన్ను చెల్లించుచుండెనుగాని యతఁడు చనిపోయినతరువాత నాలుగవ షల్మనేసెరు ప్రభుత్వకాలములోని (727-722) మూఁడవ సంవత్సరమున ఐగుప్తీయుల ప్రేరేపణవలన తిరుగుబాటు చేసెను. అందువలన నతఁడు ఇశ్రాయేలీయుల షోమ్రోనుమీఁదికివచ్చి దానిని నాశనచేసి 722 లో ఇశ్రాయేలువారు అను పదిగోత్రముల వారిని చెఱఁబట్టెను (II రాజు 17). అదే సంవత్సరములో షల్మనేసెరు చనిపోఁగా అతనికి తరువాత సర్గోను అనువాఁడు చక్రవర్తియయ్యెను (722-705). అతఁడు చాల ప్రఖ్యాతినొందిన చక్రవర్తియై తనరాజ్యమును మఱియెక్కువగా బలపఱచెను. 711 లో అతఁడు అష్డోదులో తిరుగుబాటు చేసినవారిని జయించి వారిని శిక్షించెను (యెష 20). ఐగుప్తునకు పోవుమార్గమును చాల జాగ్రతగా చూచుకొనుచు కాపుదల చేయించి పలెస్తీనువారు ఐగుప్తీయులతో సంధి చేసికొనకుండునట్లు చేసెను. అతనికాలములో మెరోదక్బలదాను అనువాఁడు బబులోనుకు చక్రవర్తియై (యెష 39[1]), అష్షూరువారికి విరోధముగా తిరుగుబాటు చేసెనుగాని సర్గోను అతనితో యుద్ధముచేసి జయించి, విక్టోరియా మహారాజ్ఞి 1857 సం॥ లో ఇండియా దేశమును స్వయముగా నేల నారంభించినపుడు చక్రవర్తిని అను క్రొత్త బిరుదును వహించుకొన్నట్లు తాను బాబెలు ప్రభుత్వము చేయుటను సూచించుటకు బాబెలు చక్రవర్తియను బిరుదును వహించుకొనెను.

సర్గోను మరణమైనపిమ్మట సన్హెరీబు అనువాఁడు అష్షూరురాజ్యము నేలెను (705-681). అతని మీఁద హిజ్కియాకాలములో యూదావారును వారిచుట్టునున్న సిరియజనములును ఐగుప్తీయుల సహాయముదొరుకునని తలంచి అష్షూరువారిమీఁద తిరుగుబాటుచేసిరి. 701 లో సన్హెరీబు దండెత్తి

వచ్చి వారిని జయించి యెరూషలేముమట్టుకు వచ్చి దాని ముట్టడించెను గాని యెరూషలేము వారు దేవునినాశ్రయించి ఆయన సహాయమును వేడుకొనినందున ఆయన తెగుళ్లను పంపి సన్హెరీబు సేనను నాశనము చేయఁగా అతఁడు ప్రాణము దక్కించుకొని పారి పోయెను (II రాజు $18^{13}$-$19^{37}$).

అష్షూరువారికి ఈ యపజయము కలిగినను సన్హెరీబునకు తరువాత నేలిన ఏసర్హద్దోను (681-668) మతీబలముగలవాఁడై అష్షూరు రాజ్యమును మఱియెక్కువగా వ్యాపింపఁజేసెను. ఏసర్హద్దోను అష్షూరుచక్రవర్తు లందఱిలో శ్రేష్ఠుఁడు. అతని కాలములో పలెస్తీనులోఁబడెను. అతఁడు ఐగుప్తును కూడ జయించి దానినేలెను. ఇతనికిఁ బిమ్మట



అష్షూరువారు పట్టణమును ముట్టడించుట

నేలిన అష్షూరు బానిపాల్ కాలములో (668-626) ఐగుప్తువారు తిరుగుబాటుచేసిరి. మొదటి సారి యీ చక్రవర్తి ఐగుప్తువారిని జయించి మఱల వారిని అష్షూరురాజ్యమునకు లోఁబఱచెను గాని వారు మఱల తిరుగుబాటుచేసిరి కావున, అతఁడు 645 లో ఐగుప్తును పోగొట్టుకొనెను. ఇతని కాలములో బాబెలురాజ్యముకూడ తిరుగు బాటుచేసెను. చక్రవర్తిస్వంతతమ్ముఁడు బాబెలు దేశమునకు రాజప్రతినిధియైయుండినను వారు చాల తీక్ష్ణమగు తిరుగుబాటుచేసిరి. ఆ యుద్ధ ములో జయమునొందిన చక్రవర్తి బాబెలువారిని బహుకఠినముగా శిక్షించెను. ఈ కాలములో నతఁడు ఏలాముదాజ్యమునుకూడ జయించెను.

అష్షూరువారి రాజ్యము ఇంత మట్టునకు వ్యాపించియుండెను గాని, దానికి తరువాత వారి రాజులనేక మందిని తమ సేనాబలముచే లోఁబఱచుకొనఁగా వారిష్టపూర్వకముగా ఆ రాజులకు లోఁబడక బలవంతముచేత లోఁబడి ఆ రాజ్యమునకనేక రీతుల తొందరలు కలిగించిరి. ఇందుచేతను ఉత్తరమునుండి అనాగరికులగు స్కితియకువారు వీరిమీఁదికి దండెత్తివచ్చుట వలనను బలహీనులైపోయిరి. ఇట్లుండఁగా ఏలాము వారు సమయముకొఱకు వేచియుండి, తిరుగు బాటుచేసి 607 వ సం॥ లో నీనెవెను జయించి అష్షూరు రాజ్యమును పాడుచేసిరి. ఈ నాశన మునుగూర్చి యంతకుఁ బూర్వమే నహూము అను ప్రవక్త వివరముగా ప్రవచించెను. యెషయా కూడ దానిగూర్చి తేటగా ప్రవచించెను (యెష $10^{5-27}$). ఆకాలములోనే బాబెలువారుకూడ తిరుగుబాటుచేసి స్వతంత్రమును సంపాదించుకొని అదివఱకు అష్షూరువారేలిన రాజ్యమును తామేలు చుండిరి (బబులోను చూ॥). దీనితో అష్షూరు వారి చరిత్రముగిసెను. సేనాబలములచే జనము లన్నిఁటిని లోఁబఱచుకొనుటకు గొప్ప యత్నము చేసినవారిలో వీరు మొదటివారైయుండిరి. వీరి యత్నములు నిష్ఫలములయ్యెను. వీరివలన పాత నిబంధన చరిత్రలో కూడ మార్పుకలిగెను. కాలమునిరూపించుటకు వారిచరిత్ర చాల యుప యోగకరముగ నుండుట మాత్రమేకాక, సర్వ లోకమునందు వ్యాపించిన యీ రాజ్యములో చేరుటచేత యూదాప్రవక్తలు ఒక్క జనమునకు మాత్రమేకాక సర్వలోకమునకు ప్రవక్తలైరి యనఁ దగును (యెష 13-27). మఱియు లోకరాజ్య ములపై యెహోవా ఆసీనుఁడై ఈ రాజ్యములను సహాసాధనములుగాఁ జేసికొని తన నిత్యరాజ్య మును ఈ లోకమునందు స్థాపించుననుగొప్ప

బోధను ప్రవక్తలు మొదట ఈకాలములోనే తెలుపుచుండిరి (యెష 10⁵⁻³⁴). కావున, ఈ బైబిలుబోధ సర్వలోకము కొఱకైన బోధయగుటకు ఆరంభమని చెప్పఁదగును.

**4. అష్షూరువారి మతము.** అష్షూరువారు రాతిబొమ్మల ననేకములుగా చెక్కియున్నారు. వారు బబులోను దేవతలను మొదట పూజించినట్లు కనఁబడును. దృష్టాంతముగా వారు తిను, బెల్, యీయు, షమష్ అను సూర్యదేవతను, సీను అను చంద్రదేవతను, ఆదదు అను ఉరుముదేవతను, ఇష్టారు అను శక్తిదేవతను ఆరాధించిరి గాని అన్నిఁటికి పైగా అష్షూరు అనుదేవతను సేవించిరి. ఇది ఆరంభమందు బాబెలుయొక్క ముఖ్యదేవత యగు తిను అను దేవతను హిందువుల వరుణ దేవునికిని సంబంధించినదని శాస్త్రులు చెప్పుదురు. అష్షూరు దేవతలలో మహోన్నతుఁడుగా నెంచఁబడెను. ఇది యుద్ధదేవత యనఁదగును. ఈ అష్షూరే అష్షూరు రాజ్యమునకు ఏకదేవుఁడని చెప్పఁదగునుగాని అష్షూరు ఆ యొక్క రాజ్యమునకే దేవతగా నెంచఁబడినందున, ఆ రాజ్యము పాడైపోవుటతోనే అష్షూరు దేవతయొక్క పూజకూడ పాడైపోయెను.

**II. (Ashur).** అష్షూరు యూదా సంతతి వారిలో నొకఁడు (I దిన 4⁵).

అసీరు అస్సీరు చూ॥

**అసుంక్రితు** (Asyncritus = నిరుపమాని). రోమాపురములో నుండిన క్రైస్తవులలో నొకఁడు. ఇతనికిని ఇంక నలుగురికిని వారితో నుండిన సహోదరులకును పౌలు వందనములను వ్రాసెను (రోమా 16¹⁴). వీరందఱుఁ గలసి యొక చిన్న క్రైస్తవకూటమై యుండవచ్చును. రోమాలో దొరికిన శాసనములలో ఈ పేరు కనఁబడెను.

**అసుప్పీము** (Asuppim = కొట్లు). ఆలయపు సామగ్రి నుంచుటకై దేవాలయపు దక్షిణ గవిని యొద్ద నుండిన యొక కొట్టు (I దిన 26¹⁵⁻¹⁷).

**అసూయ** మత్సరము చూ॥

**అస్నా** (Asnah = రక్కసిచెట్టు). జెరుబ్బాబెలుతోకూడ బాబెలునుండి తిరిగివచ్చిన నెతేనీయుల కుటుంబములలో నొకదానికి పెద్ద (ఎజ్రా 2⁵⁰).

**అస్పాతా** (Aspatha). హామానుయొక్క మూఁడవ కుమారుఁడు. యూదులితనిని జంపిరి (ఎస్తే 9⁸).

**అస్మోను** (Azmon = పుష్టిగల). యూదా గోత్రపు సరిహద్దులలోనుండు నొక స్థలము. అది దక్షిణమున కాదేషు బర్నేయకు పశ్చిమముగానున్నది గాని దాని సరియైనయునికి తెలియదు (సంఖ్యా 34⁴·⁵ యెహో 15⁴). ఇది యెహో 15²⁹ 19³ లో **ఎజెము** అని యున్నది.

**అస్సీరు, అసీరు** (Assir = ఖైదీ)

1. లేవీయులలో నొకఁడు నిర్గ 6²⁴ I దిన 6²²). ఇతఁడు కోరహుకు కుటుంబమునకు చేరినవాఁడు.

2. ఎబ్యాసాపు కుమారుఁడు (I దిన 6²³·³⁷) (ఆసాపు 3 చూ॥)

3. రాజైన యెకొన్యాయొక్క కుమారుఁడు (I దిన 3¹⁷). ఇతఁడు రాజ్యమునకు వారసుఁడు కాలేదు గాని ఆ వారసత్వము షయల్తీయేలుకు కలిగెను (మ 1¹²).

**అస్సు** (Assos). చిన్నాసియలోని ముసియ పరగణాయందలి రేవుపట్టణము. త్రోయకు 20 మైళ్లు దక్షిణముగానున్నది. పౌలు త్రోయనుండి యీ పట్టణమునకు నడిచిపోయి అచ్చట ఓడనెక్కి మితులేనేకు వచ్చెను (కార్య 20¹³·¹⁴). పాడైన దాని గోడయు గవనులును కోటయు ఇంకను కనఁబడుచున్నవి. ప్రస్తుత మచట బైరామ్ అను చిన్నగ్రామము మాత్రమున్నది (పటము V, H 3).

**అహజై** (Ahazai = స్వాస్థ్యము). యాజకులలో నొకఁడు (నెహె 11¹³). I దిన 9¹² లో నున్నట్లు **యహజేరా** యనువాఁడితఁడే యని కొందఱును ఆ గోత్రములోనే పుట్టిన మఱి యొకఁడని కొందఱు తలంతురు.

**అహజ్యా** (Ahaziah = యెహోవా స్థిరపఱచువాఁడు).

1. ఇశ్రాయేలు రాజగు **అహాబు** కుమారుఁడు. అహాబు క్రీ॥ ముందు 854 సం॥న తన

స్నేహితులతోఁగూడ షల్మనేసెరుమీఁద యుద్ధము చేయఁ బోయినప్పుడు అతనికిమాఱుగా నేలనారంభించెనుగాని తండ్రి మరణానంతరముననే రాజాయెను. రెండేండ్లు మాత్రము రాజ్యమేలెను (I రాజు $22^{40,51}$). యెహోషాపాతుతోఁ జేరి తర్షీషులో నోడలను గట్టించి ఓఫీరునుండి బంగారును తెప్పించుటకు యత్నించెనుగాని యవి ఎసోన్గెబెరులో నాశమైనందున విఫలమనోరథుఁడాయెను (I రాజు 22 $^{48,49}$ II దిన $20^{35,39}$). తండ్రి మరణానంతరమున మోయాబీయులు తిరుగఁబడినను ఇతఁడు దానివిషయము శ్రద్ధవహించినవాఁడుకాదు (II రాజు $1^{1}$ $3^{5}$). మేడగది కిటికి నుండి క్రిందపడి, తన స్వస్థతనుగూర్చి దెలిసికొననై ఎక్రోనులోని బయల్జెబూబు నొద్దకు దూతలను బంపఁగా ఏలీయావారి నెదుర్కొని అహజ్యా నిశ్చయముగా మరణమగునని వారికిఁ దెలిపి వెనుకకుఁ బంపివేసెను (II రాజు $1^{2-17}$). అతని వాక్కు ప్రకారము అహజ్యా చనిపోయెను. అతనికి కుమారులు లేనందున అతని సహోదరుఁడగు యెహోరాము రాజయ్యెను (II రాజు $1^{17}$).

2. యూదారాజగు యెహోరాము కుమారుఁడు. యెహోరాము క్రీ॥ ము॥ 843 సం॥ జబ్బు పడినందున అతనికి మారుగా రాజ్యము నేల నారంభించి (II రాజు $9^{29}$ II దిన $21^{18,19}$), మరుసటి సంవత్సరమే తండ్రి మరణమునకు తరువాత రాజాయెను (II రాజు $8^{25}$). అతని కప్పటికి ఇరువది రెండేండ్ల ప్రాయము. ఒక్క సంవత్సరము మాత్రమే పరిపాలించెను. తల్లియగు అతల్యా దుర్బోధకు లోనై దుర్మార్గుఁడయ్యెను (II దిన $22^{3}$). ఇశ్రాయేలు రాజగు యెహోరాముతోఁ గలిసి రామోత్గిలాదు దగ్గర సిరియనుల మీఁదకుఁబోయెను. గాయపడి యెజ్రెయేలు తిరిగి వచ్చిన యెహోరామును దర్శింపఁబోయి, యెహూ వలనఁ జంపఁబడెను (II రాజు $9^{27,28}$ II దిన $22^{9}$). II దిన $21^{17}$ లో నితఁడు యెహోయాహాజు అని పిలువఁబడెను. అతని పేరును కొంచెము మార్చుటవలన నిది సంభవించెను. H.

**అహరహు**

**అహరోను** (**Aaron** = కాంతిగల?). నిర్గమకాండ చరిత్రయందు మోషే తరువాత ముఖ్యుఁడు. నాయకాగ్రగణ్యుఁడును, మహాధర్మశాస్త్రకారుఁడునగు మోషే సహోదరుఁడు. ఇతఁడు యాజకుఁడు. ఇశ్రాయేలీయులలో యాజకత్వమితని తోడనే యారంభమయ్యెను. అమ్రాము యోకెబెదు ఇతని తల్లిదండ్రులు (నిర్గ $6^{20}$). తమ్ముఁడగు మోషేకన్న మూఁడు వత్సరములు పెద్దవాఁడు ($7^{7}$ సంఖ్యా $33^{39}$). ఎలీషెబ యితని భార్య. నాదాబు అబీహు ఎలీయాజరు ఈతామారులను నలుగురితని పుత్రులు (నిర్గ $24^{9}$ $6^{23}$ యెహో $24^{33}$). ఇశ్రాయేలీయులను రక్షింపుమని దేవుఁడు మోషే కాజ్ఞ యిచ్చినప్పుడు, అహరోను బాగుగా మాట్లాడఁగలవాఁడై యున్నందున అతఁడు మోషేకును ప్రజలకును ఫరోకును మధ్యవర్తిగా నుండునని ఆయన సెలవిచ్చెను (నిర్గ $4^{14-17}$). అహరోను తన తమ్ముఁడగు మోషేను దేవుని పర్వతమందు కలిసికొని, అతనితో నైగుప్తుకుఁబోయి ఇశ్రాయేలీయుల పెద్దలనందఱిని బోగుజేసి, యెహోవా మోషేతోఁ జెప్పిన సంగతులన్నియు వివరించి జనులయెదుట సూచకక్రియలనుజేసి వారిని నమ్మించెను ($4^{28-31}$). మోషేతోఁగలిసి ఫరోసన్నిధికి బోయి గుఱుతులను జూపి జనులను బోనిమ్మని యెంత యడిగినను లాభమెకింతయైనను లేకపోఁగా, మోషేకును ఫరోకును మధ్యవర్తిగనుండి, తన కఱ్ఱ పట్టుకొని చెయ్యిచాపి ఐగుప్తుపైకి తెగుళ్లు రప్పించెను ($7^{9}$ $8^{17}$ మొ॥). అమాలేకీయులువచ్చి రెఫీదీములో ఇశ్రాయేలీయులతో యుద్ధమాడినపుడు మోషే ప్రార్థించనై కొండమీఁది కెక్కఁగా అహరోను హూరుతోఁగలసి చెఱియొకప్రక్కను నిలిచి అతని చేతుల నాదుకొనెను ($17^{10-12}$). ఇత్రో తన యల్లుఁడగు మోషేను జూడవచ్చి దహనబలి నర్పింపఁగా దానికితఁడు హాజరై అతనితోఁగలసి భోజనము జేసెను ($18^{12}$). ధర్మశాస్త్రమియ్యఁబడినపుడు తన యిద్దఱు కుమారులతోను, 70 మంది పెద్దలతోను కలిసి మోషే వెంబడి దేవుని కొండ యెక్కెను ($24^{9-12}$). మోషే దేవుని సన్నిధి నింక కొంతకాలమువఱకు నిలువవలసి యుండినప్పుడు అహరోనును హూరును ప్రజలకు న్యాయాధిపతులుగ నియమింపఁబడిరి (నిర్గ $^{14}$). మోషే కొండ దిగక చాల దినములు తడవుజేయుటను ప్రజలు గుర్తించి తమ్మును నడిపించుట కొక

దేవతను జేయుమని బలవంతము జేయఁగా అహరోను వారి కోరిక ప్రకార మొక బంగారు దూడనుజేసి ప్రజలు విగ్రహారాధనఁ జేయుటకు కారకుఁడాయెను ($32^{1-4}$). మోషేవలన గద్దింపఁబడి తప్పును ప్రజలమీఁదమోపి లేనిపోని సాకులు చెప్పసాగెను ($32^{22-25}$). దేవుఁడు అహరోనును నశింపఁజేయునంత కోపపడఁగా మోషే యతని నిమిత్తము విజ్ఞాపనజేసెను (ద్వితీ $9^{20}$). ప్రత్యక్ష గుడారము పూర్తియైన తరువాత దానిని, దాని యందలి సామగ్రినంతటిని ప్రతిష్ఠించి, నిర్ణయ ప్రకారము బలుల నర్పించెను (నిర్గ 28-29, $40^{13,16}$ లేవీ $8^{6-9}$) ఒకసారి మిర్యాములోఁ గలిసి, దేవుని ప్రత్యక్షత తమకును గలదని మోషే నెదిరించెను (సంఖ్యా $12^{1-16}$). మిర్యాము కుష్ఠుచేత మొత్తఁబడినప్పు డహరోను భయపడి మోషేను వేడుకొనెను. అహరోను యాజకుల కందరికిని పూర్వికుఁడు (నిర్గ $28^{4}$ $31^{10}$ $35^{19}$ లేవీ $13^{2}$ సంఖ్యా $18^{28}$). తెగులు వలన ప్రజలు నశించుచుండఁగా నితఁడు ధూపమువేసి, ప్రజల నిమిత్తము ప్రాయశ్చిత్తముచేసి, తెగులును ఆపివేసెను (సంఖ్యా $15^{46-48}$). మందిర మితని యధీన మందుంచఁబడెను ($^{45}$). అహరోనును ప్రత్యేకముగా అభిషేకించుటవలన అతఁడు తక్కిన యాజకవర్గ మంతటికంటె నెక్కువైన వాఁడని తెలియుచున్నది (నిర్గ $29^{7-29}$ లేవీ $8^{12}$ $16^{23}$ $21^{10-12}$ సంఖ్యా $35^{25}$). సంఘమునకు ప్రధానులును పెద్దలునగు కోరహు కుమారులును అహరోనుకుగాని అతని వంశస్థులకును ప్రత్యేకములగు హక్కులు లేవని వాదించిన లేవీయులును చేసిన తిరుగుబాటువలన అహరోను వంశము వారికిని, తక్కిన లేవీగోత్రికులకు నెంతో భేదమున్నట్లు స్పష్టమగుచున్నది. అహరోను కఱ్ఱ చిగుర్చుటవలన నీ తిరుగుబాటు పూర్తిగా అణిచివేయఁబడెను. అహరోను వంశస్థులకు యాజకత్వము స్థిరపడిపోయెను. (సంఖ్యా 16-17). ఇశ్రాయేలీయులు అరణ్యములో సంచారముజేసిన నలుబదియవ సంవత్సరమున మెరీబా కాదేషుల యొద్ద అహరోను దేవుని మాటను నిర్లక్ష్యపెట్టినందున, అతఁడు కనానునందు ప్రవేశింపరాదని దేవుఁడానతిచ్చెను (సంఖ్యా $20^{1-13}$). కొద్ది కాలమునకు పిదప ఎదోము పొలిమేరల యొద్దనున్న హోరు కొండమీఁదికి అతఁడు మోషే ఎలియాజరులతో నెక్కి అక్కడ తన కుమారునకు యాజక వస్త్రములు ధరింపజేసి 123 సంవత్సరముల ప్రాయమున మృతినొందెను. (సంఖ్యా $20^{28,29}$ $33^{38}$ ద్వితీ $10^{6}$). W.

**అహరోను కఱ్ఱ (Aaron's Rod).** కోరహు అనువాఁడు అహరోను యాజకత్వము ఇతరుల దానికన్న గొప్పదికాదని యెదిరించినప్పుడు, అహరోను యాజకత్వమునకు నియమింపఁబడెనను దానికి సూచనగా ఆ కఱ్ఱ యేర్పరచుకొనఁబడెను (సంఖ్యా 16-18). తక్కిన గోత్రికుల కఱ్ఱ లట్లుండగా అహరోను కఱ్ఱ చిగిర్చెను ($17^{1-11}$). అందుచేత నది శాసనముల యెదుట నుంచఁబడెను ($17^{10}$). హెబ్రీ $9^{4}$ చూడఁగా అది మందసములో నుంచఁబడి నట్లున్నది. హెబ్రీవారి ఇతిహాసములును ఇటులనే దెలుపుచున్నవి.

**అహరోను సంతతివారు (Aaronites).** లేవీయులనుండి యాజకులను ప్రత్యేకించుటకు పాతనిబంధనయందు చివర వ్రాసిన గ్రంథములలో యాజకులకీ పేరుపెట్టిరి. (I దిన $6^{54,57}$ $15^{4}$ $23^{28}$ $24^{1,31}$ నెహె $10^{38}$).

**అహర్హేలు (Aharhel = బలము నిలిచినది?).** యూదా సంతతివారిలో నొకఁడు (దిన $4^{8}$).

**అహవా (Ahava).** బబులోను దేశములోని నదీప్రాంతముననున్న స్థలము. యూఫ్రాతు నదికి సంబంధించినది. బబులోను కుత్తరమున నున్నట్లు కనఁబడుచున్నది గాని దాని యునికిని గూర్చి తేటగానేమియు తెలియదు. చెఱనుఁ బిమ్మట ఇశ్రాయేలీయులు మరల యెరూషలేమునకు వెళ్లనైయుండఁగా ఈ స్థలములోనే ఎజ్రా వారిని సమకూర్చి సిద్ధపఱచెను (ఎజ్రా $8^{15,21,31}$).

**అహష్వేరోషు (Ahasuerus, Xerxes).** క్రీ॥ శ॥ ముందు 485-465 లో పారసీక దేశమునకు చక్రవర్తియైనవాని పేరు. ఇతఁడు గ్రీకు చరిత్రకారులకు బాగుగాఁ దెలిసినవాఁడై గ్రీకు రాజ్యము మీఁదికి దండెత్తిపోయి యుద్ధముచేయ యత్నించి ఓడిపోయెను. చెఱనుండి దిరిగివచ్చిన యూదులమీఁద వారివిరోధులు అహష్వేరోషు నెదుట నేరము మోపినట్లు బైబిలునందున్నది

(ఎజ్రా 4[6]). ఎస్తేరు గ్రంథములోని చక్రవర్తి యితఁడే (ఎస్తే 1[1,2,19] 2[16,17]). దాని 9[1] చూడఁగా ఈ పేరుగల చక్రవర్తి మాదీయుఁడగు దర్యావేషుకు తండ్రియైనట్లున్నది (దర్యావేషు 1, పారసీకదేశము చూ॥).

**అహస్బయి (Ahasbai).** దావీదుయొక్క యోధులలో ఎలీపేలెటు అనునొకని తండ్రి. ఇతఁడు మాయకాతీయునికి పుట్టినవాఁడనఁబడును (II సమూ 23[34]). అసలులో నితఁడు మయకాతీయుఁడని యున్నది. ఈ పేరునుబట్టి చూడఁగా నితఁడు బేత్ మయకా అను నూరిలో నివసించిన మయకా కుటుంబమునకు చేరినవాఁడై యుండవచ్చును (II సమూ 20[14]). అయితే మయకాయను రాజ్యము సిరియలోకూడ నుండెను (II సమూ 10[8]). కావున ఇతఁడు సిరియలోని మయాకా అను నూరివాఁడునై యుండవచ్చును.

**అహాబు (Ahab = పెద్దతండ్రి లేక పినతండ్రి).** ఇశ్రాయేలువారనఁబడిన పదిగోత్రికులకు క్రీ॥ శ॥ ముందు 875-853 వఱకు రాజుగానున్నవాఁడు. ఒమ్రీ కుమారుఁడు. ఆ వంశపు వారందఱిలో ముఖ్యుఁడు. సీదోను రాజు కుమార్తెయగు యెజెబెలును వివాహమాడెను. ఆమె ప్రేరేపణచే ఫేనీకే వారిమతమును ఇశ్రాయేలీయులలో స్థాపింపఁబూనెను (I రాజు 16[29-33]). వారి ముఖ్యదేవతపేరు బయలు. తన పిల్లలకు యెహోవా నామమువచ్చునట్లు పేరుపెట్టినను (అహజ్యా, యెహోరాము, అతల్యా), అతఁడు యెహోవా ప్రవక్తలను చంపించి (18[4]), బయలు ప్రవక్తల నాదరించి పోషించెను. యూదా రాజగు యెహోషాపాతు కుమారుఁడగు యెహోరాముకు తన కుమార్తెయగు అతల్యానిచ్చి వివాహముచేయుట ద్వారా యూదావారి దేశములో కూడ బయలుపూజ స్థాపితమాయెను (II దిన 22[2,3]). ఇట్లు బయలు దేవతారాధనను వ్యాపింపచేయ యత్నించుటలో అహాబు నెదిరించుటకు ఏలీయా అను గొప్ప ప్రవక్తయొకఁడు లేచెను (I రాజు 17, II రాజు 1). మత విషయములలో నిట్టి యపకీర్తి కలుగుటయేగాక, ఇతని కాలమున రాజ్యమును అంతప్రసిద్ధి కెక్కినటులఁ గనఁబడుట లేదు. అతఁడు సిరియరాజగు బెన్హదదుతో యుద్ధమాడి, దేవుని సహాయమువలన గెలిచెను (I రాజు 20). తరువాత అష్షూరు చక్రవర్తియగు షల్మనేసెరు వారిపై దండెత్తిరాఁగా అతఁడు సిరియనులతోఁ గలిసి సంధిజేసికొని, 10,000 మంది సైనికులతో నతనిని పలెస్తీను కుత్తరముగానున్న కర్కారు (*Karkar*) వద్ద యెదిరించి ఓడిపోయెనని మోయాబురాతి శాసనములవలనఁ దెలియుచున్నది (రాతిశాసనములు చూ॥). పిమ్మట యెహోషాపాతుతోఁ గలిసి సిరియనులమీఁద యుద్ధమునకుఁ బోవ ప్రయత్నించెను. దేవుని ప్రవక్తయగు మీకాయా, అతఁడా యుద్ధమున నోడిపోవునని యెంతఁజెప్పినను పెడచెవినిఁ బెట్టి, అబద్ధ ప్రవక్తల మాటలునమ్మి వెళ్లి రామోత్గిలాదులో యుద్ధముజేసెను. అందు ఓడిపోయి చంపఁబడెను (I రాజు 22).

అతఁడొనర్చిన యన్యాయము లెట్టివో నాబోతు ద్రాక్షతోఁటనుగూర్చిన చరిత్రలోఁ జూడఁగలము (I రాజు 21). దానివలన నితని భార్యయగు యెజెబెలు ఇతనికంటె ఏడాకులెగఁ జదివినట్లు కనఁబడుచున్నది. అహాబు ధైర్యహీనుఁడై ఆ యన్యాయమునకు సమ్మతించెనేగాని, అట్టి కుయుక్తిని పన్నునంత దుర్మార్గుఁడుకాఁడు (21[27-29]). అది యతనిభార్య పనియైయుండెను. దానికి శిక్షఁగా, అతఁడును, అతని కుటుంబమును ఊరుపేరులేకుండ నశించెను (యెజెబెలు చూ॥).

**అహీమయస్సు (Ahimaaz = సహోదరుఁడే కోపము).**

1. రాజైనసౌలు భార్యయగు అహీనోయము యొక్క తండ్రి (I సమూ 14[50]).

2. యాజకుఁడగు సాదోకు కుమారుఁడు. అబ్షాలోము దావీదుమీఁద తిరుగుబాటుచేసిన సమయమున ఇతఁడు యోనాతానునువానితోఁ గలిసి అబ్షాలోము సంగతులను తెలిసికొని, బావిలో దాగుకొనుటవలన అబ్షాలోము చేతుల నుండి తప్పించుకొని పారిపోయి దావీదునకు అతనిసంగతులను తెలిపెను (II సమూ 15[27,36] 17[17-21]). అబ్షాలోము ఓడిపోయి చంపఁబడిన పిమ్మట దావీదునకీ సమాచారమును తెలుపవలెనని అహీమయస్సు యోవాబును సెలవడుగఁగా అతఁడొప్పుకొనక కూషీయను మఱియొకని పంపెను గాని తరువాత ఇతనికికూడ సెలవిచ్చినందున

ఇతఁడు హూషీకంటె ముందుగా పరుగెత్తి దావీదు నొద్దకు చేరెను (18[19-32]). సొలొమోనుకాలములో ఆహారమును సంగ్రహము చేసినవారిలో నొకఁడైన నఫ్తాలీము దేశమునకు అధిపతియై యుండినవాఁడితఁడే కావచ్చును (I రాజు 4[15]). ఇది నిజమైనయెడల ఇతఁడు సొలొమోనుకు అల్లుఁడాయెను. కానియెడల యితఁడీ పేరుగల మూఁడవవాఁడై యుండును.

**అహీ** (Ahi = సహోదరుఁడు). 1. గాదు వంశస్థులలో నొక పెద్దయొక్క పేరు (I దిన 5[15]).

2. ఆషేరువంశస్థులలో నొకఁడు (I దిన 7[34]).

**అహీకాము** (Ahikam = నిలుచు సహోదరుఁడు). షాఫాను కుమారుఁడును (II రాజు 22[12]), గెదల్యా తండ్రియు (25[22]), యోషీయా, యెహోయాకీము రాజుల న్యాయస్థానములలో ప్రాముఖ్యమైన ఉద్యోగస్థుఁడునై యుండెను (22[12]). ప్రధానయాజకుఁడగు హిల్కీయా ధర్మశాస్త్రగ్రంథమును కనుగొనినప్పుడు దీర్ఘదర్శురాలయిన హుల్దా యొద్దకుఁబోయి, ఆ సంగతిని గుఱించి దేవుని యాలోచన నడిగినవారిలో నితఁడొకఁడు (22[8-20]). ఇతఁడును, ఇతని కుమారుఁడగు గెదల్యాయును దీర్ఘదర్శియగు యిర్మీయాకు విశేష సహాయ మొనరించిరి. (యిర్మీ 26[24] 39[14]). H.

**అహీటూబు** (Ahitub = దయకు తండ్రి).

1. ఏలీ మనుమఁడును ఫీనెహాసుకొడుకు నైన వాఁడు (I సమూ 14[3]). ఇతఁడు సౌలు చంపిన యాజకుఁడగు అహీమెలెకుకు తండ్రి (I సమూ 22[9]).

2. దావీదు సొలొమోను రాజులకాలములో నున్న యాజకుఁడగు సాదోకుయొక్క తండ్రి (II సమూ 8[17] I దిన 6[7,8])యు అమర్యా కొడుకునై యుండెను.

3. పై కుటుంబములోని మఱియొక యాజకుఁడు. ఇతఁడు మఱియొక అమర్యాకు కొడుకును సాదోకు అను మఱియొకనికి తాతయునై యుండెను (I దిన 6[11,12] 9[11] నెహె 11[11]).

**అహీతోపెలు** (Ahithophel = బుద్ధిహీనునకు తమ్ముఁడు). యూదాగోత్రములోని గిలో పట్టణస్థుఁడు. అతియోచనాపరుఁడు, యుక్తిమంతుడు. మొదట రాజైన దావీదుకు ముఖ్యస్నేహితుఁడును ఆలోచనకర్తయునై యుండెను (II సమూ 15[12] 16[23]). 11[3] 23[34] వలన నితఁడు బత్షెబాకు తాతయై యుండవచ్చును. గనుకనే యితఁడు అబ్షాలోము తన తండ్రిపై తిరుగుబాటుఁ జేసినప్పుడు, దావీదును విడిచి అబ్షాలోముతోఁ జేరి యతనికి ముఖ్యాలోచనకర్తయాయెను (15[31] 16[20-23]). గాని అతఁడు అబ్షాలోము తన యుక్తిప్రకారము జేయక హూషై యాలోచన నంగీకరించెనని తెలిసికొని, అబ్షాలోము ప్రయత్నములు భంగమగుననియు, అంతయు తనమీఁదకు వచ్చునని యెఱిఁగినవాఁడై, తనయింటికిపెళ్లి ఉరిపెట్టుకొని చనిపోయెను (17[1-3,14,23]). కీర్త 41[9]లో నుదాహరింపఁబడినవాఁడితఁడేనని కొందఱు తలంతురు. H.

**అహీనాదాబు** (Ahinadab = ఔదార్యమునకు సోదరుఁడు). రాజైన సొలొమోనుకొఱకు మహనయీములో ఆహారవస్తువులను సమకూర్చిన యుద్యోగస్థుఁడు (I రాజు 4[14]).

**అహీనోయము** (Ahinoam = కృపకు సోదరుఁడు).

1. రాజైన సౌలుయొక్క భార్య (I సమూ 14[50]).

2. దావీదు భార్యలలో నొకతె. (I సమూ 25[43] 27[3]). ఆమె యెజ్రెయేలు ఊరిదైయుండెను. ఈమె సిక్లగులో అమాలేకీయులవలన పట్టువడెను (30[5]) దావీదు జ్యేష్ఠపుత్త్రుఁడగు అమ్నోనుకు తల్లి (II సమూ 3[2]).

**అహీమాను** (Ahiman = దానమునకు సోదరుఁడు).

1. అనాకు అనఁబడిన గొప్పయోధులలో నొకడు (సంఖ్యా 13[22]). ఇతఁడొక కుటుంబమునకు పెద్దయాయెను. అట్టి కుటుంబము లింక రెండుకలవు. వారు కాలేబువలన హెబ్రోను నుండి వెడలఁగొట్టఁబడిరి (యెహో 15[14] న్యాయా 1[10]).

2. దేవునిమందిరములో ద్వారపాలకుఁడైనయొక లేవీయునిపేరు (I దిన 9[17]).

**అహీమెలెకు** (Ahimelech = రాజుకు తమ్ముఁడు).

1. ప్రధానయాజకుఁడగు అహీటూబు కుమారుఁడు (I సమూ 22$^{11,12}$). **అహీయా** తమ్ముఁడు. రాజైన సౌలు కాలమందు నోబులో ప్రధాన యాజకుఁడై యుండెను. అహీయాకు తరువాతి ప్రధానయాజకుఁడు (21$^{1}$). అనేకమంది యాజకు లతనితో నోబులో నివసించిరి. దావీదు రాజైన సౌలువలన తరుమఁబడినప్పుడు అతనియొద్దకువచ్చి సహాయమును గోరఁగా, గొల్యాతు ఖడ్గమును, సముఖపు రొట్టెల నతనికిచ్చెను (21$^{8,9}$). సౌలు సేవకులలో నొకఁడగు ఎదోమీయుఁడైన దోయేగు అప్పుడచ్చటనుండి (21$^{7}$) జరిగినదాని నంతటిని సౌలుకుఁ దెలుపఁగా అతఁడు కోపపడి అహీమెలెకును అతనితో 85 గురు యాజకులను దోయేగుచేఁ జంపించెను (22$^{9-18}$).

2. ప్రధానయాజకుఁడగు అబ్యాతారు కుమారుఁడు. 1 లోని అహీమెలెకు మనుమఁడు. దావీదు సభికులలోని యిద్దరు యాజకులలో నొకఁడు (II సమూ 8$^{17}$). I దిన 18$^{16}$ లో నితనిపేరు **అబీమెలెకు** అని పొరపాటుగా వ్రాసిరి.

3. దావీదును వెంబడించిన హిత్తీయుఁడు (I సమూ 26$^{6}$). H.

**అహీమోతు** (Ahimoth = మరణమునకు సహోదరుఁడు). కహాతీయుల వంశములోఁ జేరిన యొక లేవీయుఁడు (I దిన 6$^{25}$).

**అహీయా** (Ahiah = యెహోవాకు సహోదరుఁడు).

1. అహీటూబు కుమారుఁడు. అహీమెలెకు అన్న. షిలోహులో యెహోవాకు యాజకుఁడు. ఏఫోదును ధరించుకొనెను (I సమూ 14$^{3,18}$). ఇతనికిఁ బిదప ఇతని తమ్ముఁడగు అహీమెలెకు ప్రధానయాజకుఁడాయెను. (I సమూ 21$^{1}$). అహీటూబునకు ఒకఁడే కుమారుఁడనియు, అహీమెలెకు అహీయా యనునవి అతని పేరులేయనియు అభిప్రాయపడుచున్నారు గాని వారిద్దరైయుండి ఒకనికి తరువాత యొకడు ప్రధానయాజకులైరని తోఁచును.

2. సొలొమోనుయొక్క ప్రధానమంత్రులలో నొకఁడు. ఇతని తండ్రి షీషా. (I రాజు 4$^{3}$).

3. షిలోహు అను ఊరిలో వాసముచేయు నొక ప్రవక్త (I రాజు 14$^{2}$). అతఁడు షిలోనీయుఁ డనఁబడెను (11$^{29}$). దైవాజ్ఞవలన యరొబామునకు ఎదురుపడి, దేవుఁడు సొలొమోను రాజ్యమునుండి పదిగోత్రములను వేరుపరిచి అతని కియ్యఁబోవుచున్నాఁడని తెలియఁజేసెను. యరొబాము పాపములలో పడినందున దేవుఁ డతనిమీఁదకు రప్పింపఁబోవు నాశమును అహీయా ప్రవచించెను (I రాజు 11$^{31-39}$).

4. ఇశ్రాయేలు రాజగు బయెషా తండ్రి (I రాజు 15$^{27,33}$).

5. యూదావంశస్థుఁడైన యెరహ్మెయేలు కుమారుఁడు (I దిన 2$^{25}$).

6. దావీదు పరాక్రమశాలురలో నొకఁడగు పెలోనీయుఁడు (I దిన 11$^{36}$).

7. దావీదు రాజుకాలమందు దేవుని మందిరపు బొక్కసమునుకాయు లేవీయుఁడు (I దిన 26$^{20}$).

8. నెహెమ్యాతోఁ గలిసి నిబంధనను ముద్రించినవాఁడు (నెహె 10$^{26}$).

9. గెరాతోఁ గలిసి గెబకాపురస్థులను మహనతుకు చెరఁదీసికొనిపోయిన ముగ్గురిలో నొకఁడు (I దిన 8$^{7}$). H.

**అహీయెజెరు** (Ahiezer = సహోదరుడే సహాయము).

1. ఇశ్రాయేలీయులు అరణ్యమందుండఁగా దాను గోత్ర ప్రధాని (సంఖ్యా 1$^{12}$ 2$^{25}$ 7$^{66,71}$ 10$^{25}$). ఇతని తండ్రి అమీషదాయి.

2. దావీదు సిక్లగులో దాగియుండఁగా అతని యొద్దకువచ్చిన బెన్యామీను గోత్రపు విలుకాండ్ర అధిపతి (I దిన 12$^{1-3}$).

**అహీర** (Ahira = కీడునకు సోదరుఁడు.) ఇశ్రాయేలీయులు అరణ్యములో నుంటుండఁగా నఫ్తాలీగోత్రపు పెద్దలలో నొకఁడు (సంఖ్యా 1$^{15}$ 2$^{29}$ 7$^{78,83}$ 10$^{27}$). ఆ ప్రయాణముల యారంభమందు తప్ప ఇతని పేరు మఱి యెచటనైనను కనఁబడదు.

**అహీరాము, అహీరామీయులు** (Ahiram = ఔన్నత్యముకలిగిన సహోదరుఁడు).

బెన్యామీనుగోత్రికులలో నొకఁడు. ఇతఁడా గోత్రములోని యొక కుటుంబమునకు పెద్దయై యుండెను (సంఖ్యా 26$^{39}$). I దిన 8$^{1}$ లో నున్న **అహరహు**, ఆది 46$^{21}$ లో నున్న ఏహీ అనునవి యితనికి మాఱుపేరులు. ఇతని సంతతివారు **అహీరామీయులు** అనఁబడిరి (సంఖ్యా 26$^{39}$).

**అహీలూదు** (Ahilud = పుత్త్రుని సహోదరుఁడు). దావీదు సొలోమోను అను రాజుల కాలములో దస్తావేజులమీఁదనుండు యెహోషాపాతుయొక్క తండ్రి (II సమూ 8$^{16}$ 20$^{24}$ I రాజు 4$^{3}$ I దిన 18$^{15}$). ఈ పేరుగలవాఁడే సొలోమోనుయొక్క పన్నెండుమంది యుద్యోగస్థులలోని యొకఁడగు బయనా యనువానికి తండ్రియైయుండెను (I రాజు 4$^{12}$). ఇతఁడు వేఱొకఁడని కొందఱనుకొందురుగాని వేఱొకఁడుకాక ఒక్కఁడేయైయుండవచ్చును.

**అహీషహరు** (Ahishahar = వేకువ సోదరుఁడు). బెన్యామీనీయుల సంతతివారిలో నొకఁడు (I దిన 7$^{10}$).

**అహీషారు** (Ahishar = పాడువానికి సహోదరుఁడు). రాజైన సొలోమోనుయొక్క గృహనిర్వాహకుఁడు (I రాజు 4$^{6}$).

**అహీసామాకు** (Ahisamach = ఉద్ధరించుసోదరుఁడు). దానుగోత్రికుఁడు. చిత్రపు పనిచేయు అహోలీయాబుకు తండ్రి (నిర్గ 31$^{6}$ 35$^{34}$, 38$^{23}$).

**అహుజతు** (Ahuzzath = స్వాస్థ్యము). ఇస్సాకుకాలములో గెరారు రాజునకు స్నేహితుఁడని యనఁబడినవాఁడు (ఆది 26$^{26}$). ఇదియొక ఉద్యోగస్థుని బిరుదైనట్లు కనఁబడుచున్నది. అతఁడు రాజు ఆలోచనకర్తలలో నొక ముఖ్యుఁడని తలంపవచ్చును. I రాజు 4$^{5}$ లో నున్నట్లు ఆ బిరుదును మంత్రి యనుమాటచే తర్జుమాజేసిరి.

**అహుజాము** (Ahuzam = స్వాస్థ్యము). యూదాసంతతివారిలో నొకఁడు (I దిన 4$^{6}$).

**అహూమై** (Ahumai = నీటి స్నేహితుఁడు?). యూదా సంతానీకుఁడు (I దిన 4$^{2}$).

**అహెయాను** (Ahian = సహోదరభావముగలవాఁడు). మనష్షేవారిలో నొకఁడు (I దిన 7$^{19}$). షెకెమువలె నిదియు తరువాత ఒక యూరికి పేరాయెనని అభిప్రాయము.

**అహేరు** (Aher = మఱియొకఁడు). ఒక బెన్యామీనీయుఁడు (I దిన 7$^{12}$).

**అహొలీబామా** (Ohalibamah = నా గుడారమే ఉన్నతస్థలము).

1. ఏశావు భార్యలలో నొకదానిపేరు. ఈమె హివ్వీయుల జనములో చేరినది (ఆది 36$^{2,5,14,18,25}$).

2. ఎదోము నాయకులలో నొకఁడు (ఆది 36$^{41}$). ఇతఁడు (1) లో నుదాహరించిన యామె సంతానీకుఁడని కొందఱి యభిప్రాయము.

**అహొయహు, అహొహీయుడు** (Ahoah = వేడిమి). బెన్యామీనీయులలో నొకఁడగు బెలయనువాని కుమారుఁడు (I దిన 8$^{4}$). II సమూ 23$^{9}$ లో అహోహీయుడు అను పేరు కలదు. ఇది అహోయహు సంతతివారికి పెట్టిన పేరు.

**అహొలీయాబు** (Aholiab = తండ్రి గుడారము). మోషేకాలములో మందిరమును కట్టుటకు బెసలేలుకు ముఖ్యసహాయకుడగు దానీయుఁడు (నిర్గ 23$^{4-5}$ 36$^{2}$ 38$^{23}$).

**అహ్బను** (Ahban). యూదాసంతతివారిలో నొకఁడు. ఇతఁడు హెస్రోనువంశములోని యెరహ్మెయేలు కుటుంబమునకు చేరినవాఁడు (I దిన 2$^{29}$).

**అహ్యో** (Ahio = సహోదరభావముగల).

1. అబీనాదాబు కుమారులలో నొకఁడు. దావీదు అబీనాదాబు ఇంటియొద్దనుండి మందసమును తీసికొనివచ్చుచుండఁగా బండితోలినవారిలో నితఁడొకఁడు (II సమూ 6$^{3,4}$ I దిన 13$^{7}$).

2. రాజైన సౌలు తండ్రియగు కీషుకు తమ్ముఁడు (I దిన 8$^{31}$ 9$^{39}$).

3. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన 8$^{14}$).

**అహ్లాయి** (Ahlai).

1. షేషాను కుమార్తెలలో నొకదానిపేరు (I దిన 2$^{31,34}$). ఈ 31 వచనములో నున్న కుమారులు అనుపదము, కుమారులను అర్థమియ్యక సంతతివారని యర్థమిచ్చును.

2. దావీదు పరాక్రమశాలురగు వారియందు జాబాదనువాని తండ్రి (I దిన 11$^{41}$).

**అహ్లాబు** (Ahlab = ఫలవంతమైనది). ఆషేరుగోత్రమునకిచ్చిన యూళ్లలో నొకటి. ఆషేరీయులు కనానీయులనందుండి వెళ్లఁగొట్టఁ జాలకపోయిరి (న్యాయా 1$^{31}$). దీని యునికిని గూర్చి తెలియదు.

## ఆ

**ఆంతర్యపురుషుఁడు అంతరంగ స్వభావము (Inner Man),** మనశరీరేచ్ఛలకు సంబంధించని మనస్సు, అంతరాత్మ మనస్సాక్షి) యను వాటిని తెలుపుటకై పౌలుపయోగించిన పదము (రోమా 7$^{22}$). ఎఫె 3$^{15-17}$ లో నున్నమాట కొంచెము వేఱుగానుండె హృదయమను అర్థము అసలులోనిచ్చుచున్నది. ఈ యంతరాత్మయే క్రీస్తు పనిఁజేయు స్థానమను పరిశుద్ధాత్మకునికి పట్టునయి యున్నట్లు ఈ వాక్యము తెలియఁజేయుచున్నది. II కొరి 4$^{16}$ లో నది బాహ్యపురుషుఁడనఁబడిన శరీరమునకు వ్యతిరేకమైన కృశించనట్టి ఆత్మను తెలుపును. I పేతు 3$^{3,4}$ నందున్న పదము కొద్దిగా భేదించినను పౌలువాడిన యర్థమునే స్ఫురింపఁజేయుచున్నది. వెలుపటి యలంకారము గాక ఈ మనలోనున్న ఈ యాత్మనలంకరించుటయే మిగుల ముఖ్యమైనదని పేతురు అభిప్రాయముగా కనఁబడుచున్నది.

**ఆకాను** (Achan = బాధకర్త). యూదాగోత్రములోని కర్మీయొక్క కుమారుఁడు. యెరికో పట్టణమును పట్టుకొనునప్పుడు దోపుడు సొమ్ము విషయమైన కట్టడను ఇతఁడు లక్ష్యపెట్టక, కొంత తనస్వంతమునకుఁ దెచ్చుకొనినందున ఇశ్రాయేలీయు లోడిపోవుటకు కారకుఁడై వారికి బాధకలిగించెను. చీట్లువేసి యితనిని పట్టుకొని నేరమొప్పుకొనఁజేసి ఇంటిల్లిపాదితో నతనిని ఆకోరులోయలో రాళ్లతోఁ గొట్టి, కాల్చిచంపిరి (యెహో 7$^{1-26}$ 22$^{20}$).

### H.

**ఆకాశము, పరలోకము (Heaven).** బైబిలులో ఆకాశమను పదమును ఏకవచనమునందును బహువచనమునందును, వస్తుప్రపంచమునకు సంబంధించినది, ఆత్మకుసంబంధించినదను రెండు విధములుగా నుపయోగించియున్నారు.

1. వస్తు ప్రపంచమునకు సంబంధమైన ఆకాశము. ఇది భూమియంతటను ఆవరించియున్న విశాలతయై, భూమికాని దాని నంతటిని సూచించును. ఇట్లు సర్వప్రపంచములు **భూమ్యాకాశము** లనియు (ఆది 1$^{1}$) **ఆకాశము, భూమి** అనియు (2$^{1}$) అనఁబడెను (14$^{19}$ 24$^{4}$ యిర్మీ 23$^{24}$ మ 5$^{18}$ కూడ చూ॥). ఆకాశముల పైన జలములున్నవనుట ఆది 1$^{7}$ కీర్త 148$^{4}$ వలన పూర్వికుల అభిప్రాయమని కనుగొనవచ్చును. జలప్రళయమువచ్చినప్పు డీ నీళ్లు దిగునట్లు ఆకాశపుతూములు విప్పఁబడెనని ఆది 7$^{11}$ 8$^{2}$ నందున్నది. దృశ్యమగు ఆకాశమునందే సూర్య చంద్ర నక్షత్రాదులున్నవి (1$^{14-17}$ యెహె 32$^{8}$). భూమి నావరించియున్న ఆకాశములో మేఘము లున్నవి (ఆది 27$^{28}$ II సమూ 21$^{10}$ కీర్త 147$^{8}$). పక్షులందు ఎగురుటవలన (విలా 4$^{19}$) అవి ఆకాశపక్షులనఁబడెను (మ 6$^{26}$). ఆకాశవిశాలత నంతటిని సూచించుటకు **ఆకాశ మహాకాశములు** అను నర్థమిచ్చు హెబ్రీజాతీయమును యూదులు వాడిరి (I రాజు 8$^{27}$ ద్వితీ 10$^{14}$). ఈ విశాలతను ఏడుమండలములుగా యూదుల పారంపర్యము నందు భాగించిరి. దీనిననుసరించియే పౌలు, క్రీస్తు ఆకాశమండలము లన్నిఁటికంటె పైకి ఆరోహణమయ్యెననియు (ఎఫె 4$^{10}$), తాను ఒక దర్శనమందు మూఁడవ ఆకాశమునకు కొనిపోఁబడెననియు (II కొరి 12$^{2}$) వ్రాసెను.

2. ఆత్మీయ ఆకాశము లేక దేవుని ప్రసన్నత. ఇదికూడ ఆకాశ మనఁబడును (కీర్త 80$^{14}$ యెష 66$^{1}$). ఈ పదమును సాధారణముగా **పరలోకము** అనుపదముచే భాషాంతరము జేసిరి (ఆది 28$^{17}$ మ 5$^{12,16,44,48}$ 23$^{9}$). అది దూతలున్న స్థలమును (మ 24$^{36}$ 28$^{2}$ మా 13$^{32}$ లూ 22$^{43}$), చనిపోయిన భక్తులుండుస్థలమును మ 5$^{12}$ 6$^{20}$ 18$^{10}$ ఎఫె 3$^{14}$ I పేతు 1$^{5}$ ప్రక 19$^{1,4}$) సూచించును. క్రీస్తు అచటినుండి ఈ లోకమునకువచ్చి (యో 3$^{13}$), మరల అక్కడకు వెళ్లెను (కార్య 1$^{11}$). ఆయన అక్కడ మనకొఱకు విజ్ఞాపన చేయుచున్నాఁడు (హెబ్రీ 9$^{24}$). రోమా 8$^{34}$ నందు

అది దేవుని కుడిపార్శ్వ మనఁబడెను. తీర్పు చేయుటకు క్రీస్తు అక్కడనుండి తిరిగివచ్చును (మ 24[40] I థెస్స 4[16]). కొన్ని వచనములలో నీ పరలోకమనుమాట అలంకారరీతిగా వాడఁబడి దేవునిని సూచించును (లూ 15[18] ప్రక 18[20]). ఆకాశరాజ్య మనుపదములోను అదేరీతిగా నీ పదమునువాడిరి (దేవుని రాజ్యము చూ॥).

**ఆకాశరాజ్యము** దేవునిరాజ్యము చూ॥

**ఆకాశరాణి (Queen of Heaven).** గ్రీకువారును లాటినువారును ఆరాధించిన అస్టార్టును హెబ్రీయులారాధించిన అషేరాయును గావచ్చును. అది అఫ్రొదైతు, వీనసు అను కామ దేవతలకును సంబంధించినదిగాఁ దోచును. అష్షూరీయులును ఫేనీకేయులు నారాధించిన చంద్రదేవతయే ఆకాశరాణి యని సాధారణ యభిప్రాయము (అష్టారోతు చూ॥). ఈ యారాధన అష్షూరులో నారంభమై, అచ్చటనుండి పడమటి దిక్కునకు వ్యాపించెను. యూదా రాజులలో నతిదుర్మార్గుఁడగు మనష్షే యేలుబడిలో వీరి రాజ్యము అష్షూరు వారి యధీనమందున్నందున, ఈ యాకాశరాణి ఆరాధనము పలెస్తీను నందు విస్తారముగా వ్యాపించెను. దీని పూజా స్థలములయందు నీతిబాహ్యములగు దురాచారములు ప్రబలెను. తప్పుడుతోఁజేసిన పిండిపంటలను ధూప మధుపాన నైవేద్యములతో నామె కర్పించిరి (యిర్మీ 7[18] 44[17-19,25]). ఈ యారాధన గ్రీకుల హెకేటు రోమీయుల వీనస్ దేవతారాధనములవలె నుండెను. భోగమువారీ దేవతల గుళ్లయొద్ద కూర్చుండి, ఆ దేవతల రూపమును రొట్టెలమీఁద చిత్రించి, వాటి నర్పించెడివారు. యిర్మీయా కాలమునకు ముందుగుండిన స్త్రీలు ఆకాశరాణి నారాధించిరి. అట్లారాధించిన వారికి సౌందర్యమును సంతానమును కలుగునని తరువాతి కాలపువారు తలంచిరి. ఇండియా దేశమునకూడ అక్కడక్కడ ఇట్టి పూజాస్థానము లున్నవి.

B.

**ఆకాశ సైన్యము, పరమండల సైన్యము (Host of Heaven).**

1. ద్వితీ 4[19] II రాజు 17[16] యిర్మీ 19[13] మొదలగు వాక్యములలో నీ పదము వాడఁబడెను గాని దాని సూర్యచంద్ర నక్షత్రాదులకువాడిరి (నెహె 9[6] యెష 34[1]). ఇశ్రాయేలీయులీ ఆకాశ సైన్యము నారాధించిరి. ఈ యారాధన అష్షూరు బబులోనులనుండి వచ్చి మనుష్యులయొక్క జనాంగములయొక్క అదృష్టములకీ యాకాశసైన్యములే కారణమని దృఢముగా నమ్మిరి. ప్రస్తుతమున హిందూదేశమున విశేషముగనున్న జ్యోతిశ్శాస్త్ర మిచ్చటనే పుట్టి యుండును. పాతనిబంధనయందు కనఁబడు ఆకాశ సైన్యారాధనము క్రీ॥ ము॥ ఏడవ శతాబ్దమున పలెస్తీనులో నెక్కువగా ప్రబలెను. మనష్షే యెరూషలేములోని దేవునియాలయమునందు ఈ యారాధనకొరకు బలిపీఠముకట్టెను (II రాజు 21[5]). ఈ విగ్రహారాధన ఇశ్రాయేలీయులను మరింత చెరపెను. ద్వితీయోపదేశ కాండమునది బహుఖండితముగా నిషేధింపఁబడెను. ఈ యారాధనను ముఖ్యముగ మేడలమీఁదఁజేసిరి. యోషీయా రాజనపుడు జరిగిన సంస్కరణలో మనష్షే కట్టించిన బలిపీఠములను పడఁగొట్టి దాని పాత్రలను తీసివేసెను.

II. I రాజు 22[19] కీర్త 103[21] లూ 2[13] నందుపయోగింపబడిన పదములు పరలోకమునందు దేవుని సింహాసనము చుట్టునుండు దూతలను సూచించును. ఈ సంపద్యమున సాతాను విషయమును తెలియజేయు రెండు లేఖనములు గలవు (యెష 14[12] లూ 10[18]).

B.

**ఆకీము (Achim = యెహోవా స్థిరపఱచును).** మన ప్రభువైన యేసుక్రీస్తు వంశావళి క్రమములలోనుండువారిలోనొకఁడు (మ 1[14]). ఈ పేరు యెహోయాకీము అను పేరునకు మాఱురూపమై యుండవచ్చును.

**ఆకీషు (Achish).** ఫిలిష్తీయుల యైదు ప్రధానపట్టణములోని గాతు అను పట్టణమునకు రాజు. సౌలురాజుయొక్క యుగ్రతకు భయపడి దావీదు ఇతని రెండుసార్లు ఆశ్రయించెను. మొదటిమాఱు ఒంటరిగా పోయినపుడు ఆకీషు సేవకులతని పట్టుకొని ఫిలిష్తీయుఁడైన గొల్యాతును చంపిన యిశ్రాయేలు రాజితఁడు కదాయని ఆకీషుతో ననినందున దావీదు వెర్రివాని వేషము వేసికొని వారిచేతినుండి తప్పించుకొని పారిపోయి

అదుల్లాము గుహలో దాగుకొనెను (I సమూ $21^{10-15}$ $22^{1}$). నాలుగేండ్లకు పిమ్మట సౌలు దావీదును చంప వెదకినపుడు దావీదు 600 మందిని వెంటఁబెట్టుకొని గాతుకు పారిపోఁగా ఆకీషు అతఁడి ఇశ్రాయేలురాజైన సౌలుకు విరోధముగ నున్నందున తనకు సహాయము చేయుననుకొని యతనిని సంతోషముతో చేర్చుకొని అతఁడును అతని జనులును నివాసముచేయుటకు సిక్లగు అను గ్రామమునిచ్చెను. అయినను ఆకీషు సౌలుమీఁద యుద్ధము జేసినప్పుడు ఫిలిష్తీయుల సర్దారులు దావీదు విషయము సంశయపడినందున ఆకీషు దావీదును యుద్ధమునకు పిలువక సిక్లగులోనుండుమని యుత్తరువుచేసెను (I సమూ $27^{1-7}$ $29^{1-7}$). సొలొమోను రాజైనప్పుడితఁడింకను రాజుగానున్నట్లు I రాజు $2^{39}$ వలన తెలియును. 34-వ కీర్తన పీఠికలో నున్నట్లు ఈ ఆకీషునకు **అబీమెలెకు** అనుపేరు పెట్టఁబడియున్నది.

**ఆకుమిడుత** మిడుత చూ॥

**ఆగురాయి** వ్రత్తులు చేయువారు II 1 (3) చూ॥.

**ఆకోరు** (Achor = ప్రలాపములలోయ). ఇది యూదా బెన్యామీను గోత్రభూములకు మధ్యనున్న యొక లోయ (యెహో $15^{7}$). ఆకానును అతని కుటుంబమును రాళ్లతో కొట్టి చంపినది యీ లోయలోనే (యెహో $7^{24,25}$). చెఱకు తరువాత కుదురుబాటుకలిగిన పలెస్తీనలో అది పశువులు పరుండు ఫలవంతమైన భూప్రదేశమగునని ప్రవక్త ప్రవచించెను (యెష $65^{10}$). హోషే $2^{15}$ లో నున్న **శ్రమగలలోయ** యనునది అసలులో ఆకోరులోయ యని యున్నది. యెరికోకు పడమటిగానుండు కెల్ట్ వాగు (*Wady Kelt*) అను లోయ యిదియేయని కొందఱనుకొందురుగాని దాని విషయమై రూఢిగా తెలియదు.

**ఆగూరు** (Agur = కూర్పరి). సామెతలను రచించిన యొకజ్ఞాని (సామె $30^{1}$). అతనిని గుఱించిన యితర విషయము లెవ్వియును తెలియవు.

**ఆగే** (Agee = తరుమఁబడువాఁడు?). దావీదు యోధులలో ముఖ్యులుగా నెన్నఁబడిన ముగ్గురిలో నొకఁడగు షమ్మాయనువాని తండ్రి (I సమూ $23^{11}$).

**ఆగ్రహము** కోపము చూ॥

**ఆజాజు** (Azaz = బలవంతుఁడు). రూబేను గోత్రికుఁడు. యోవేలు కుటుంబికుఁడు (I దిన $5^{8}$).

**ఆజేలు** (Azel = ఘనమైన?). యెరూషలేము ప్రాంతములోనుండు ఒక స్థలము (జెక $14^{5}$). దీని సరియైన యునికి తెలియదు.

**ఆజేలు** (Azel = ఘనుఁడు?). రాజైన సౌలు కుమారుఁడగు యోనాతాను సంతతివారిలో నొకఁడు (I దిన $8^{37,38}$ $9^{43,44}$).

**ఆజ్ఞ** ధర్మశాస్త్రము, పదియాజ్ఞలు చూ॥

**ఆటంకములు** అభ్యంతరములు చూ॥

**ఆతేరు, అతేరు** (Ater = మూయఁబడినది).

1. చెఱకాలమునకుఁ దరువాత అతేరు సంతతివారిలో 98 మంది తిరిగి యెరూషలేమునకు వచ్చిరి. నెహె $7^{21}$ లో నున్నట్లుగా ఇతఁడు హిజ్కియా బంధువుఁడనఁబడుటచే ఘనుఁడని తెలియును. ఎజ్రా $2^{16}$ లో నున్నట్లు "హిజ్కియాతోకూడ వచ్చిన" అను మాటలున్నను, మూలభాషలో నెహె $7^{21}$ వలెనున్నది.

2. ఎజ్రాకాలపు ద్వారపాలకులలో నొకఁడు (ఎజ్రా $2^{42}$ నెహె $7^{45}$).

**ఆతదు** (Atad). ఐగుప్తునుండి హెబ్రోనుకు యాకోబు శవమును దెచ్చినవారు ప్రయాణమధ్యమందు దిగిన యొక కళ్లము (ఆది $50^{10,11}$). ఐగుప్తునుండి వచ్చిన సమూహమచ్చట ఎంతో గొప్పగా నేడ్చినందున అచ్చట నివసించు కనానీయులు దానికి **ఆబేల్ మిస్రాయిము** అను సార్థకనామము పెట్టిరి. దీనియునికి తెలియదు.

**ఆతిథ్యము అతిథిసత్కారము** **(Hospitality).** ఆతిథ్యముచేయుట పలెస్తీను సిరియ అరేబియా దేశస్థుల ముఖ్యవిధులలో నొకటియైయున్నది. ఆ దేశముల సమస్త గ్రామములలోను ఎడారులయందును ఈ వాడుక నేటి వఱకునున్నది. అనేక గ్రామములయందు పెద్ద కాపుయొక్కయింటిలో అతిథి గదియని యొక గదియుండును. బాటసారులక్కడ బసచేయు

దురు. గ్రామస్థులందఱు వారికి కావలసినవాటిని అమర్చిపెట్టుదురు (ఆది 18[1-8] 19[1-3] కీర్త 23[5]). ఏదైన నొక గ్రామమునకు పరదేశి యొకఁడు వచ్చినయెడల, అతని విషయమై ఆ గ్రామస్థులు జవాబుదారులైయుందురు. ఒక అతిథి ఒక గ్రామమునందు మూఁడురాత్రులు మూఁడు పగళ్లకంటె యెక్కువగా నుండరాదను నియమము గలదు. ఆతిథ్యము విషయమై క్రొత్త నిబంధనయందున్న యితర విషయములను గూర్చి లూ 7[44-46] రోమా 12[13-20] I తిమో 3[2] తీతు 1[8] హెబ్రీ 13[2] I పేతు 4[9] నందు చూడవచ్చును.

J. C.

**ఆత్మ.**

1. దేవుని ఆత్మ. పరిశుద్ధాత్మ చూ॥

2. మానవ యాత్మ. మనుష్యుఁడు చూ॥

3. శరీరమునుండి భిన్నమైన ఆత్మ. శరీరాత్మలు చూ॥

4. దూతలను సూచించు ఆత్మలు. దూతలు చూ॥

5. అపవిత్రాత్మలు. దయ్యములు చూ॥

**ఆత్మల యనాదిజీవము** (Pre-existence of Souls). హిందువులు పునర్జన్మములను నమ్ముచున్నారు. గ్రీకువారిలోకూడ కొందఱు ఆత్మలు అనాదినుండి యున్నవనియు, అవి మనము పుట్టినపుడు మనలోఁ జొచ్చెనుగాని మన పుట్టుకతో అవియును పుట్టియుండలేదని బోధించుచుండిరి. ఆ శాస్త్రముల ననుసరించిన ఒరిగెను (*Origen*) అను గొప్ప వేదజ్ఞుఁడు ఈ బోధ బైబిలు బోధ యని దానిని తన వేదశాస్త్రములలో బోధించెను గాని బైబిలు వాక్యములను చూడఁగా అట్టి బోధకు వాటిలో నెంతమాత్రమును తగిన యాధారము లేదు. యోహా 9[2] లో నున్నట్లు వీఁడు గుడ్డివాఁడై పుట్టుటకు ఎవఁడు పాపముచేసెను వీఁడా అని అడిగినవారు ఆ గుడ్డివానికి అప్పటి జీవమునకుఁ బూర్వము మఱియొక జీవమున్నది యనుకొని ప్రశ్నించిన ఈయొక్క సూచనగాక, ఈ బోధకు బైబిలులో మఱి యే సూచనలైనను లేవు. అట్టి బోధను స్థిరపరచుటకు వారడిగిన ప్రశ్న యే మాత్రమును చాలదు. బైబిలు బోధ నంగీకరించువారు సాధారణముగా మనుష్యుని పుట్టుకలోనే అతని యాత్మయును పుట్టుననుకొందురు. (మనుష్యుఁడు చూ॥).

**ఆత్మసంబంధమైన వరములు** కృపావరములు చూ॥

**ఆదరణ** (Comfort, Consolation). ఈ యర్థమునిచ్చు ఒకటే హెబ్రీ పదమును పాతనిబంధనలో నున్నట్లు **ఆదరించుట** (కీర్త 23[4] యెష 12[1] మొ॥), **ఓదార్చుట** (యోబు 2[11] యెష 40[1] మొ॥), **పరామర్శించుట** (I దిన 7[22] 19[2]) **ఉపశాంతినిచ్చుట** (యోబు 7[13]) అనువాదములచేత తెనిఁగించియున్నారు. క్రొత్త నిబంధనలో హెచ్చరిక లేక ఆదరణ యను నర్థమునిచ్చు ఒకటే గ్రీకుపదమును సాధారణముగా **ఆదరించుట, ఆదరణ** యను పదముల చేతను (కార్య 15[31] 16[40] II కొరి 1[4,5,6,7] మొ॥) మాత్రము గాక, **ఓదార్చుట** యను పదము చేతను (మ 2[18]) కూడ తెనిఁగించిరి. దేవుఁడు ఆదరణకు కర్తయనియు (రోమా 15[5]), క్రీస్తు ఇశ్రాయేలీయులకు ఆదరణ కర్తయనియు (లూ 2[25]), పరిశుద్ధాత్మ ఆదరణ కర్తయనియు (యోహా 14[16,26] మొ॥) వ్రాయఁబడియున్నది. అట్టి యాదరణ మనుష్యుల కీలోకములో మిగుల అవసరముగా నున్నది (II కొరి 1[3-7]). దేవుని ప్రేమయే అట్టి యాదరణకు ఆధారమైయున్నది (రోమా 5[2,5]) పరిశుద్ధాత్మ క్రీస్తు ప్రేమనుబట్టి మనలను ఆదరించుకర్తయై యున్నాఁడు (యోహా 16[7]).

**ఆదరణ కర్త** పరిశుద్ధాత్మ చూ॥

**ఆదా** (Adah = అలంకారము ప్రకాశము).

1. లెమెకు భార్యలలో నొకతె. యాబాలు యూబాలు అను వారితల్లి (ఆది 4[19-21,23]).

2. ఏశావు భార్యలలో నొకతె. హిత్తీయురాలు (ఆది 36[2]). ఆది 26[34] లో నున్నట్లు ఆమెకు **బాశెమతు** అనుపేరు కలదు.

**ఆదాము** (Adam = ఎఱ్ఱనివాఁడు, నిర్మింపఁబడినవాఁడు. పురుషుఁడని సాధారణార్థ మయ్యెను).

1. మొదటినరుఁడు. తక్కిన సృష్టిజాలము రీతిగా మానవుఁడును దేవునిచే జేయఁబడెను (ఆది 1[26]). పురుషునిగాను స్త్రీనిగాను దేవుఁడు

వారిని జేసెను ($1^{27}$ మ $19^{4-6}$). మొదట పురుషుఁడును తరువాత స్త్రీయును చేయఁబడిరి (ఆది $2^{7,20-23}$ I తిమో $2^{13}$). తక్కిన జంతువుల దేహములవలె ఆదాము దేహమును సాధారణమైన నేలనుండి నిర్మింపఁబడెనుగాని దేవుఁడతనికి జీవమనుగ్రహించెను (ఆది $2^{7}$ $6^{13}$ $7^{22}$ యోబు $10^{8-12}$=$33^{4}$). అతఁడు దేవుని స్వరూపమందు చేయఁబడెను (ఆది $1^{26,27}$). జ్ఞానమును నీతి న్యాయములును పరిశుద్ధతయు కలిగియుండుటలో మానవునికి దేవుని పోలికెయున్నదని పౌలు అభిప్రాయముగా నగుపడుచున్నది (ఎఫె $4^{22-25}$ కొలొ $3^{9,10}$). పశుపక్ష్యాదులపై యేలుబడిని దేవుఁ డతని కనుగ్రహించెను (ఆది $1^{26-28}$). ఫలించి యభివృద్ధినొంది విస్తరించి భూమిని నిండించుకొనుఁడను దీవన నొందిరి ($1^{28}$).

నరులకాది పురుషుఁడగు ఆదాము తన సహధర్మచారిణియగు హవ్వతోఁబాటు, ఏదెను తోఁటను సేద్యపఱచి దానికాచుటకు ఆతోఁట యందుంచఁబడెను. జీవమరణములకు సంబంధించిన నిబంధనతోఁగూడిన యాజ్ఞ యొక్కటి వారికియ్యఁబడెను ($2^{16,17}$). ఆ యాజ్ఞనతిక్రమించినందున కష్టమునకు ప్రయాసకు లోనాయెను మరణమునకు పాత్రుఁడై సౌఖ్యదాయకమగు నాతోఁటను వదలిపెట్టవలసివచ్చెను. ($3^{1-24}$). పిదప అతఁడు కయీను హేబెలులను వారికి తండ్రి యాయెను. అతనికి 130 యేండ్లప్పుడు షేతు జన్మించెను. ఇంక 800 సంవత్సరములు జీవించి 930 సం॥ల ప్రాయమున మరణము నొందెను. పౌలు ఆదామును క్రీస్తును సరిపోల్చుచు, క్రీస్తును కడపటి ఆదామని పిలిచెను (రోమా $5^{12-21}$ I కొరి $15^{22,45}$).

2. యొర్దాను లోయలో సారెతాను సమీపముననున్న యొక పట్టణము (యెహో $3^{16}$). యెరికోకు ఈశాన్యమున 18 మైళ్ల దూరమునందు యొర్దానుకు పడమట యబ్బోకు నదీముఖద్వారమున కెదురుగానున్న ఎద్‌దమియా (*ed-Damieh*) యని కొందరందురుగాని అది రూఢికాదు.

**ఆదికాండము** (Genesis = ఉత్పత్తి). బైబిలునందలి మొదటి పుస్తకము. తెలుఁగులో నున్నట్లు హెబ్రీ బైబిలు ఆదియందు అనుపదముచే నారంభమగుటవలన దానిని బెరేషీత్ (***Bereshith*** = ఆదియందు) అని పిలిచిరి. గ్రీకు భాషలో దానిపేరు గెనిసిస్ (***Genesis***=ఉత్పత్తి) అయ్యుండెను. దానిలో ప్రపంచము మానవజాతి సబ్బాతు వివాహము పాపము మరణము దేవుఁడు తన కృపను మానవులకు బయలుపఱచుట రాబోవు మెస్సీయానుగూర్చిన వాగ్దత్తము వేరే జనాంగములు భాషలు దేవుఁడేర్పరచుకొనిన హెబ్రీరాష్ట్రము మొదలగు వాటి యారంభములు తెలియపఱచఁబడి యున్నవిగాన ఆ పేరును దానికి సార్థకమగుచున్నది.

సకల భాషలలోను దేశములలోనుండు వేదములు పురాణములు చరిత్రలన్నిటికన్న, వివరముగను తేటగను వాస్తవముగను భూమ్యాకాశములు వాటియందలి సమస్త చేతనాచేతనముల సృష్టినిగూర్చి తెలియఁబఱచుచున్నది. తాను గాక మరేమియు లేనప్పుడు దేవుఁడు తన మాట మాత్రమున సమస్తమును సృష్టించెనని దీనివలన మాత్రమే తెలిసికొందుము.

ధర్మశాస్త్ర విధాయకుఁడును, ప్రవక్తయునగు మోషే ఆదికాండముయొక్క గ్రంథకర్తయనుటకే సందియమునులేదు. అతనిచే రచింపఁబడిన గ్రంథపంచకము (***Pentateuch***) అనఁబడు అయిదు పుస్తకములలో నిది మొదటిది. (మోషే చూ.)

ఆదాము 930 సం॥ల వయస్సుగలవాఁడై నోవహు తండ్రియగు లెమెకుకు 56 సం॥ వయస్సు వచ్చువఱకు బ్రతికి, అతనితో సృష్టిని గూర్చియు, తాను పాపములోపడి చెడిపోవుటను గూర్చియు, తన సంతానములో రక్షకుఁడు పుట్టునని దేవుఁడు తనకిచ్చిన వాగ్దత్తమును గూర్చియు భూలోకమున 900 యేండ్లవఱకు నడిచిన సమస్తసంగతులను లెమెకుతో చెప్పి యుండును. లెమెకు షేమును 93 సం॥ల ప్రాయము వచ్చువఱకు బ్రదికి యా సంగతులతనికి చెప్పియుండును. షేము అబ్రాహామునకు 150 సం॥లు వచ్చువఱకు బ్రదికి యతనితో ముచ్చటించియుండును. అబ్రాహాము తన కుమారుఁడగు ఇస్సాకుతోను, ఇస్సాకు యాకోబుతోను చెప్పియుండును. యాకోబు లేవికి 60 యేండ్లును, కహాతుకు 27 సం॥లును ప్రాయము వచ్చువఱకు జీవించి ఐగుప్తునందు వారితో చెప్పియుండవచ్చును. కహాతు మోషేకు

71 సం॥ వచ్చువఱకు బ్రతికి, అతనికీ సంగతులను దెలిపి యుండును. అలాగున మోషే ఆదాము యొద్దనుండి ఏడవవానిద్వారా ఆదినుండి జరిగిన సమస్త సంగతులను వివరముగాఁ దెలిసికొని యుండును. మోషే ఐగుప్తురాజు గృహములో పెంచఁబడి ఆ దేశపు సకలవిద్యలందు ప్రవీణుఁడై (కార్య $7^{22}$), తనకాలమునకు ముందు వ్రాయఁబడిన చరిత్రలు, పత్రికలు చదివి తెలిసికొని యుండుననుటలో సందేహోక్తి లేదు. అయినను పరిశుద్ధాత్మవలన నుపదేశము నొంది, దేవావేశముచే నడిపింపఁబడి (II తిమో $3^{17}$) ఆదినుండి జరిగిన వాటిని తప్పు లేకుండ వ్రాసెను.

బిషప్పు అషర్ అను నాయన వ్రాసినకాల నిరూపణపట్టీ ప్రకారము ఇది దాదాపు క్రీ॥పూ॥ 1490-1450 సం॥లో సీనై అరణ్యమందు వ్రాయఁబడియుండును. ఈ యొక్క పుస్తకమునందే 2369 సం॥ల ముఖ్య సంగతు లిమిడియున్నవి.

ఈ గ్రంథమును 3 భాగములుగాఁ జేయ వచ్చును.

**I.** సృష్టి మొదలు జలప్రళయమువఱకు (1-8 అధ్యా.) ఇందు సుమారు 1656 సం॥ల చరిత్ర గలదు. ఆ కాలమందు జనులు బహుగా విస్తరించి కుదర్చఁబడలేనంతటి దుర్మార్గులైరి. 1-2 అధ్యా. లందు లోకసృష్టి, మానవసృష్టి, సబ్బాతు, వివాహముల యారంభముగలదు. 3 అధ్యా. నందు పాపప్రవేశము, శోధకుఁడు, మానవుఁడు శపింపఁబడుట, రక్షకునిగూర్చిన కృపగల వాగ్దత్తము గలదు. 4 అధ్యా. నందు కయీను హేబెలులను గురించియు, కయీను సంతతి, మానవుల వృత్తులు, పనులు శాస్త్రచమత్కారములు ఆరంభమగుటను గూర్చి గలదు. 5 అధ్యాయమందు ఆదాము మొదలు నోవహువఱకుఁగల పితరుల వంశావళులు గలవు. 6-8 అధ్యా. లందు పాపవృద్ధి, నోవహు కుటుంబపు రక్షణ, ఇతరప్రాణి కోటినాశమును గూర్చి యున్నది.

**II.** జలప్రళయమునుండి అబ్రాహామును పిలుచుటవఱకు (అధ్యా 9-11). ఇందు సుమారు 427 సం॥ల చరిత్రగలదు. నోవహు ముగ్గురు కుమారులవలన ప్రపంచమునందు ప్రజలు మఱల వృద్ధినొందిరి. 9 అధ్యా. నందు దేవుఁడు లోకమునుగూర్చి యిచ్చిన వాగ్దత్తమును, నోవహు రాఁబోవుకాలమునందు జరుగనైయున్న వాటిననుసరించి తన ముగ్గురు కుమారులను దీవించుటయు గలదు. 10 అధ్యా. నందు నోవహు సంతతివలన లోకము మఱల నిండుటయు, జనాంగములలోని భేదములును, పురాతనపు ముఖ్యరాజ్యము లారంభమగుటయుగలదు. 11 అధ్యా. నందు భాషలు తారుమారయి, జనులు లోకమంతట చెదరిపోవుటనుగూర్చియున్నది.

**III.** అబ్రాహామును పిలుచుటనుండి యోసేపు మరణమువఱకు (12-50). ఇందు దాదాపు 300 సం॥ల చరిత్ర గలదు. దీనియందు అబ్రాహాము, ఇస్సాకు, యాకోబు అనువారి చరిత్రయు, యాకోబు సంతతివారు ఐగుప్తునకు పోవుటను గూర్చి కలదు. పితరులచరిత్రలోని ముఖ్యములగు కొన్ని విషయములును తెలియపఱచఁబడినవి. ఏర్పఱచఁబడిన జనాంగములో రక్షకుఁడు పుట్టునను సంగతి స్థాపింపఁబడుటయు, కడమ జనాంగములు అన్యమతములలో నుండఁగా, హెబ్రీరాష్ట్రము మెస్సియాకొఱకు సిద్ధపడుటను గూర్చి చెప్పఁబడి యున్నది.

12-25 అధ్యా. లందు అబ్రాహాము కుటుంబపు చరిత్రయు, ఆ కాలమందలి రాజులయొక్క జనాంగములయొక్క చరిత్ర గలదు. 26-27 అధ్యా. లందు ఇస్సాకు కుటుంబమునుగూర్చి, 28-35 నందు యాకోబు కుటుంబమునుగూర్చి, 36-47 నందు యోసేపును, యాకోబు ఇంటి వారును కరవుకాలమున కాపాడఁబడునట్లు ఐగుప్తునకు వచ్చుటను గురించి యున్నది. 48,49 అధ్యా. లందు యాకోబు తనకుమారులకు రాఁబోవుకాలమునందు కలుగువాటినిగూర్చియు, విడుదలనుగూర్చియు ప్రకటించుటనుగూర్చి యున్నది. 50 అధ్యా. నందు యోసేపు తన యెముకలనుగూర్చి తన సహోదరుల కాజ్ఞాపించి చనిపోవుటనుగూర్చియున్నది. H.

**ఆదిసర్పము** సాతాను 1 (2) చూ॥

**ఆదీను** (Adin = మృదువైన). ఇతఁడొక కుటుంబమునకు పెద్ద. ఇతని సంతతివారిలో 454 రు జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు తిరిగి వెళ్లిరి (ఎజ్రా $2^{15}$). నెహె $7^{20}$ లో ఈ

సంఖ్య 655 అని యున్నది. వీరికితరువాత ఎజ్రాతోకూడ ఇంక 50 మంది వెళ్లిరి (ఎజ్రా $8^{6}$). నెహెమ్యాకాలములో నిబంధనచేసిన పెద్దలలో వీరుకూడ కనఁబడుదురు (నెహె $10^{16}$).

**ఆధిపత్యము** అధికారి II చూ॥

**ఆనందము, ఆనందించుట** (Joy). బైబిలులో **ఆనందము, సంతోషము, ఉత్సాహము, ఉత్సహించుట** అను నిట్టి పదములు అనేకములున్నవి. బైబిలులో చూపఁబడినభక్తి ఆనందముతో గూడినభక్తి యని చెప్పఁదగును. దేవుఁడే ఇట్టి యానందమునకు ఆధారభూతుఁడై యున్నాఁడు. ఆయనకూడ తన సృష్టియందును (ఆది $1^{31}$ కీర్త $104^{31}$) తన ప్రజలయందును (ద్వితీ $30^{9}$ జెఫ $3^{17}$). ఆనందించునని వాక్యములు పాఁతనిబంధనలో నున్నవి. అయితే భక్తులు దేవునియం దానందించుటనుగూర్చిన వాక్యములు బైబిలులో మఱి విశేషముగా కనఁబడును. ఇందునకు కీర్తనల గ్రంథములో ననేక సూచనలు కలవు ($97^{12}$ $100^{1-5}$ $149^{2}$ మొ॥). దేవునిగూర్చినజ్ఞానమందును ($16^{11}$) ఆయన కృపయందును ($85^{6,7}$), రక్షణయందును ($21^{1}$ $51^{12}$ యెష $25^{9}$ హబ $3^{18}$) భక్తులు సంతోషించిరి. వారు తమ బలులను దేవునికి చెల్లించుచు తమ సంతోషమును కనఁబఱచుచుండిరి (ద్వితీ $12^{10-12}$). దేవుఁ డనుగ్రహించు సాధారణమైన మేలులను బట్టియు (కీర్త 103), దేశసంబంధమైన సౌఖ్యమునుబట్టియు జయమునుబట్టియు (నిర్గ 15 నెహె $12^{43}$), దుర్మార్గులకు కలుగు తీర్పునుబట్టియు (కీర్త $68^{23}$), దేవుఁడు భక్తులకిచ్చిన వాగ్దానములను బట్టియు (యిర్మీ $15^{16}$) ఆనందించుచుండిరి.

క్రొత్తనిబంధనలో మొదట కనఁబడు కీర్తనలయందు ఇట్లు (లూ $1^{46-55,68-79}$ $2^{29-32}$). రక్షకుని రాకనుబట్టి భక్తులకు గల్గిన సంతోషమును పూర్ణముగా తెలిసికొనవచ్చును. యేసుచరిత్రను చూడఁగా ఆయన దేవునియం దానందించుచు ($10^{21}$), మానవుల సంతోషములలో పాలివాఁడై (మ $11^{16-19}$ యోహా $2^{1-11}$), దుఃఖమునకు సూచనలుగా నుండు ఉపవాసములు తన యవతారకాలమునకు సరిపడదని బోధించెను (మా $2^{18-22}$). ఇట్టి సంతోషమును శిష్యులు ఆయనవలన నేర్చుకొనిరి. దాచఁబడిన ధనమును కనుగొన్నవానివలె శిష్యులు సంతోషింపవలసినవారు (మ $13^{44}$). క్రీస్తుసంపాదించిన రక్షణనుబట్టియు (కార్య $2^{46,47}$ $16^{34}$ I థెస్స $1^{6}$), పరిశుద్ధాత్మను పొందుటనుబట్టియు (రోమా $14^{17}$ గల $5^{22}$ ఎఫె $5^{18-20}$), క్రీస్తు రాజ్యాభివృద్ధినిబట్టియు (లూ $10^{17-20}$ యోహా $4^{36}$ ఫిలి $1^{18}$), రాఁబోవు మహిమయొక్క నిరీక్షణనుబట్టియు (రోమా $5^{2}$ $12^{12}$ I పేతు $4^{13}$), క్రైస్తవ సహవాసమునుబట్టియు (ఫిలి $2^{1-2}$ II యోహా 4) భక్తులానందించుచుండిరి. ఇట్టి యానందము ఆత్మఫలమే (గల $5^{22}$ యోహా $15^{9-24}$). ఈ లోక తాపత్రయములు సహ దానిని ఆర్పఁజాలక పోవుటయే కాక దాని నింకను హెచ్చించును (మ $5^{10,11}$ కార్య $5^{41}$ రోమా $5^{3-11}$ $8^{31-39}$ I పేతు $1^{6-12}$).

**ఆనబెట్టుట** ప్రమాణము చూ॥

**ఆనాకీయులు** అనాకు చూ॥

**ఆనాను** (Anan = మేఘము). నెహెమ్యా కాలములో నిబంధనను స్థిరపఱచినవారిలో నొకఁడు (నెహె $10^{26}$).

**ఆనీము** (Anim = ఊటలు). యూదా మన్యప్రదేశములో నుండు నొక యూరు (యెహో $15^{50}$). ఇది ఎష్టెమో అను పేరునకు తరువాత వచ్చును గనుక దానికి సమీపముగా నున్నదని నమ్మవచ్చును. ప్రస్తుతము ఎష్టెమోకు పడమరగాను హెబ్రోనుకు దక్షిణముగా ఆఱు క్రోసుల దూరములో నుండు ఘువైన్ (*Ghuwein*) అను పాడుశేషములే ఈ ఆనీము అని యనుకొందురు. (పటము II, E 3).

**ఆనూబు** (Anub = అతుకఁబడినది). యూదా గోత్రికులలో నొకఁడు (I దిన $4^{8}$).

**ఆనేము** (Anem = రెండు ఊటలు). ఇశ్శాఖారీయుల గోత్ర భాగమందలి యొక ఊరు. ఇది యాజకుల కియ్యఁబడిన 48 ఊళ్లలో నొకటియై గెర్షోనీయులకు చెందియుండెను (I దిన $6^{73}$). యెహో $19^{21}$ $21^{29}$ లో ఆ యూళ్ల పేరుల జాబితా యున్నది. అందులో అనేము అను పేరునకు **ఏన్గన్నీము** అని యున్నది కావున, ఇది దానికి మాఱుపేరని యెంచవచ్చును.

**ఆనేరు** (Aner).

1. అబ్రాహాముతో నిబంధనచేసిన అమోరీయులలో నొక గోత్రమునకు పెద్ద (ఆది 14[13-24]). ఇతఁడు లోతును విడిపించుకొనుటకు అబ్రాహాము చేసిన యుద్ధములో అతనికి సహాయపడెను.

2. మనష్షే గోత్రికుల యూళ్లలో నొకటి (I దిన 6[70]). అది యొర్దానుకు పడమటి ప్రాంతములలో నున్నదిగాని దాని సరియైన యునికిని గూర్చి తెలియదు.

**ఆఫెకు, ఆపెకు, అపెకు** (Aphek = బలము). (న్యాయా 1[31] లో నుండు **అఫెకు** అను పదముయొక్క గుణితమునకు అసలుభాషలో వేఱు గుణితముండినను, తక్కిన వాక్యములలో అసలు భాషయందొకటే గుణితము కలదు. అయితే తెనుఁగున దానిని పూర్ణముగా లక్షింపక కొన్ని భేదములను చేసియున్నారు).

1. మొదట లెబానోను కొండ ప్రదేశములోను ఆషేరు గోత్రముల సరిహద్దులో నుండిన ఒక యూరు (యెహో 13[4] 19[30]). ప్రస్తుతమచట ఆఫ్కా (*Afka*) అను గ్రామమున్నది.

2. ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయులతో యుద్ధముచేసినప్పుడు ఫిలిష్తీయులదండు దిగిన యొక పట్టణము (I సమూ 4). అచ్చట ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులను జయించి, వారిలో 30,000 మందిని చంపి, దేవుని మందసమును పట్టుకొని ఏలీయొక్క ఇద్దఱు కుమారులగు హొఫ్నీ, ఫీనెహాసులను సంహరించిరి. అది యెరూషలేమునకు వాయువ్యముగా కొన్నిమైళ్ల దూరములో నుండెనని యూహింపవచ్చును.

3. రాజైన సౌలుమీఁద ఫిలిష్తీయులు యుద్ధము చేయఁగా ఫిలిష్తీయుల దండు దిగిన స్థలము. అది యెజ్రెయేలునకును షూనేమునకును కొంతదూరములో నుండెనని తోఁచుచున్నది. యెహో 12[18] లో నున్నట్లు అదియొక రాజనగరము కావచ్చును. ఆ యుద్ధములో రాజైన సౌలును అతని ముగ్గురు కుమారులును చంపఁబడిరి (I సమూ 29).

4. అరాము రాజగు బెన్హదదు. రాజైన అహాబు కాలములో ఇశ్రాయేలీయులమీఁద యుద్ధము చేసిన యొక పట్టణము. అది యెరూషలేము నుండి దమస్కునకుపోవు రాజమార్గమున గలిలయ సముద్రమునకు 6 మైళ్ల తూర్పున ఒక గొప్ప మైదానములో కట్టఁబడిన పట్టణమై యుండెను (I రాజు 20[26]). ఆ మైదానములో యుద్ధము జరిగినప్పుడు ఇశ్రాయేలు వారు ఒక్కదినమందే అరామీయుల కాల్బలములో లక్షమందిని హతము చేసిరి. తక్కినవారు ఆఫెకు పట్టణములోకి పారిపోఁగా అచ్చటనున్న యొక ప్రాకారము వారిలో 27,000 మందిమీఁద పడెను (20[29,30]). ఇప్పటి వఱకు ఆ పట్టణము అనేక చిత్రములు గలదిగా నిలుచుచున్నది. ప్రస్తుతము దానికి ఫీక్ (Fiq) అని పేరు (పటము I, F 4).

**అబీబు** కాలమానము VI 1 చూ॥

**అబేల్ మిస్రాయిము** ఆఠదు చూ॥

**అబేలు షిత్తీము** షిత్తీము చూ॥

**ఆబేల్కెరామీము** (Abel-Cheramim = ద్రాక్షతోఁటలలోయ). యొర్దాను నదికి తూర్పుగానుండు నొకస్థలము. యెఫ్తా అమ్మోనీయులమీఁద యుద్ధము చేసినపుడు వారి నింతవఱకు తరిమి హతముచేసెను (న్యాయా 11[33]). దీని యునికి తెలియదు.

**ఆబేల్బేత్మయకా, ఆబేల్మాయీము** (Abel Beth-Maacah, Abel-maim = మయకా యింటిపొలము). నఫ్తాలీ గోత్ర ప్రదేశములోని బలమైన గోడలుగల పట్టణము. అది దాను పట్టణమునకు సమీపమున గలిలయ సముద్రమున కుత్తరముగా 25 మైళ్ల దూరములో నుండెను. దావీదు కాలములో షెబా అను వాఁడు తిరుగుబాటు చేయఁగా యోవాబు యుద్ధముచేసి దాని ముట్టడించెను (II సమూ 20[14-19]). 80 సంవత్సరములకు తరువాత బెన్హదదు దాని పట్టుకొనెను (I రాజు 15[20]). దానికిఁ బిమ్మట 200 సంవత్సరములకు అనఁగా క్రీ॥ పూ॥ 734 సం॥న తిగ్లత్పిలేసెరు దానిని పట్టుకొనెను (II రాజు 15[29]). ప్రస్తుతము దానికి అబిల్-ఎల్-కామ్ (*Abil-el-Kamh*) అను పేరు కలదు. II దిన 16[4] లో దీనికి నీళ్లయొద్దనుండు అబేలు అను నర్థమిచ్చు **ఆబేల్మాయీము** అను పేరు కలదు (పటము IV, E 4).

**ఆబేల్మాయీము** ఆబేల్బేత్మయకా చూ॥

**ఆబేల్మెహోలా** (Abelmeholah = నృత్యపులోయ). ఇశ్శాకారు గోత్ర ప్రదేశములో చేరియున్న యొక స్థలము. అది యొర్దాను లోయనుండి గలిలయ సముద్రమునకు దక్షిణముగా 1½ ఆమడల దూరములో నున్నది. గిద్యోను మిద్యానీయులను ఇంతవఱకు తరిమెను (న్యాయా 7[22]). ఇది సొలొమోను దేశమును విభాగించిన జిల్లాలలో నొకదాని సరిహద్దులలో కనఁబడును (I రాజు 4[12]). మఱియు నిది ఎలీషా యను ప్రవక్తయొక్క జన్మస్థలము. అచటనే ఏలీయా అతనిని ప్రవక్తపనికి నియమించెనని I రాజు 19[16-21] వలనఁ దెలిసికొనవచ్చును. I సమూ 18[19] లో నున్న మెహోలాతి యనునది యిదే యను కొందురు. అట్లయినయెడల ఇది సౌలు అల్లుఁడగు అద్రీయేలుయొక్క జన్మస్థలమనియును తెలియును (పటము III, G 3).

**ఆభరణములు, నగలు** (Ornaments). బైబిలునం దుదాహరింపఁబడిన యాభరణములు చాలవఱకు హిందూ దేశమున వాడుచున్న యాభరణములవంటివి. ఆయా యాభరణములను సూచించు అసలుపదములకు తగిన పేరులను తెలుఁగు బైబిలునందు వాడక ఒకేమాటకు వివిధ పదముల నుపయోగించుటచే నాయాభరణములను గుఱించి దెలిసికొనుటకు తెలుఁగు బైబిలు ననుసరించుట కష్టముగా నున్నది. అయినను ఆ యాభరణముల జాబితాల నీదిగువరీతిగా వివరింపఁదగును.

1. **చేతికర్ర**లను పురుషులు సాధారణ ఉపయోగమునకు వాడుచుండినను ఆది 32[10] నిర్గ 12[11] I సమూ 17[40] II రాజు 4[29] జెక 8[4] మా 6[8] (=మ 10[9] లూ 9[3]) దానిని సొగసుకుకూడ వాడినట్లు సూచనలు కలవు. కావున వాటిని పురుషుల యాభరణములతో చేర్చతగును (ఆది 38[18]). ప్రవక్త అలంకారార్థముగా జెప్పిన రెండు కర్రలు అట్టివే (జెక 11[7,10,14]).

2. **ఉంగరమును** గాని **శిఖాయుంగరమును** గాని ఆభరణముగా మాత్రమే గాక మిగుల పురాతనకాలమునుండి పురుషులు సంతకమును జేయుటకు వాడుకొనిరి (ఆది 41[42] నిర్గ 35[22] ఎస్తే 3[10,12] 8[8,10] యిర్మీ 22[24]). పరమగీతము నందిదేమాటను **స్వర్ణగోళము** (5[14]) అను మాటచే తర్జుమాచేసిరి. ఇది పురుషులు ధరించిన యలంకారమైనట్టు సాధారణముగాఁ గనఁబడినను యెష 3[21] లో నది స్త్రీలాడంబరముగా ధరించు వాటియందుకూడ నున్నది.

మిగత యాభరణములు సాధారణముగా స్త్రీలు ధరించునవై యుండును. వాటి జాబితా యొకటి యెష 3[19-21] లో గలదు. ఆ వాక్యములను బైబిలులోనుండు ఇతర వాక్యములతో సరిపోల్చినయెడల వాటికి ప్రత్యేకమైన పేరు లింక 24 గలవు గాని ఇవి సరిగా అసలుపదముల ననుసరించుటలేదు.

3. **నగలు** అనుపదమును హోషే 2[13] లో నొక హెబ్రీ సమాసపదమున వాడిరి. ఆ సమాసములో నొక పదమును పర 7[1] లో **ఆభరణ సూత్రము** అను పదముచే భాషాంతరీకరించిరి. రెండవ దానికి సాధారణమగు **పోగులు** అను మాట నుపయోగించిరి. (నిర్గ 35[21] మొ॥).

4. **కడియములు.** ఈ పదము ఆది 24[22] సంఖ్యా 31[50] యెహె 16[11] 23[42] లో నొక మాటకును యెష 3[19] నందు మఱియొక మాటకు భాషాంతరమై యున్నది. II సమూ 1[10] లోని **హస్తకంకణము** అసలులో వేఱుపదమైనను, దానికి సంబంధమగు ఆభరణమై యుండెను (5 చూ॥).

5. **హస్తకంకణము.** II సమూ 1[10] లోని అసలు హెబ్రీ పదము నీమాటచే తర్జుమాజేసినను (4 చూ॥), సంఖ్యా 31[50] లో **గొలుసు** అను మాటతో భాషాంతరముజేసిరి.


హస్తకంకణము

6. **గొలుసు** (5 చూ॥). దీనిని ఆది 41[42] యెహె 16[11] నందు సందేహాస్పదముగా నుండు

నొక హెబ్రీ మాటను నుపయోగించిరి. న్యాయా $8^{26}$ లో గొలుసు అను మాటచే తర్జుమా చేయఁబడిన అసలు మాటను పర $4^{9}$ సామె $1^{9}$ యందు **హారము** అను పదముచేతను సామె $3^{3}$ లో **కంఠభూషణము**ను పదముచేతను భాషాంతరము జేసిరి. ఈ పదములన్నియు మెడకు వేసికొను ఆభరణములను సూచించును.

**7. హారము** (6 చూ॥)

**8. కంఠభూషణము** (6 చూ॥)

**9. ఆభరణ సూత్రము** పర $7^{1}$ లో నిది మెడలో వేసికొను హారమును సూచించు మఱి యొక పదమునకు తర్జుమయై యున్నది. సామె $25^{12}$ లో దానిని **ఆభరణము**ను మాటచే భాషాంతరీకరించిరి.

**10. ఆభరణము** (9 చూ॥)

**11. తావళములు.** నిర్గ $35^{22}$ లో దీని అసలు మాటను **తావళముల**ను పదముచే భాషాంతరము జేసినను సంఖ్యా $31^{50}$ నందు దీనికి **పతకములు** అను మాటను వాడిరి. అది యాభరణమని తెలియును గాని మెడకైనది, చేతికైనది సందేహాస్పదము గా నున్నది.

**12. పతకములు** (25 చూ॥). ప్రధాన యాజకుఁడు ధరించిన పతకమునుగూర్చి పతకము చూ॥

**13. సూర్యబింబ భూషణములు.** యెష $3^{18}$ లో నిది తలపై ధరింపఁబడు దానిని సూచించును. న్యాయా $8^{21}$ లో ఆ మాటనే **చంద్రహారము** లను మాటచే తర్జుమా జేసిరి. అచ్చట నది ఒంటెలకు వేసిన భూషణమై యున్నది. వీటి నన్నిఁటిని రక్షరేకులుగా వాడి నట్లు కనఁబడును.

**14. చంద్రవంకలు** యెష $3^{18}$ లో నిది హారములకు తగిలించిన భూషణమైనట్లు తోచు చున్నది. అదే మాటను న్యాయా $8^{26}$ లో **చంద్రహారము** లని తర్జుమా జేసిరి.

**15. చంద్రహారము** (11, 12 చూ॥).

**16. కిరీటము** యెహె $16^{12}$ లో నొక అసలు పదమును కిరీటమను మాటచే తర్జుమా



శిరోభూషణము

జేసినను $23^{42}$ నందు **పూదండల**ను మాటచే భాషాంతరము జేసిరి. అది శిరోభూషణము. రాజులు ధరించు కిరీటమునకు వాడిన అసలు పదము వేఱు మాటగానె యున్నది.

**17. కుల్లాయీ** ఇది తలపై ధరించు కొనెడి భూషణము (యెష $3^{20}$).

**18. కర్ణభూషణములు** యెష $3^{19}$ న్యాయా $8^{26}$ నందివి చెవులకు తగిలించిన భూషణములు గా కనఁబడు చున్నవి.




చెవిపోగులు

**19. పోగులు** ఆది $35^{4}$ నిర్గ $35^{22}$ యెహె $16^{12}$ న్యాయా $8^{24}$ నందొక హెబ్రీ పదమున కును, సంఖ్యా $31^{50}$ న్యాయా $8^{26}$ నందు మఱియొకదానికిని తర్జుమాజేయఁబడిన మాట. చెవికిగాని ముక్కునకుగాని పెట్టుకొను నగలను ఇది సూచించును. న్యాయా $8^{24}$ లో వీటిని పురుషులు ధరించినట్లుగా నున్నది. ఆది $24^{22}$ $24^{47}$ యెష $3^{31}$ లో నిది **ముక్కుకమ్ముల**ను మాటచేతను, సామె $11^{22}$ లో **కమ్మి** యను పదముచేతను తర్జుమా జేయఁబడినది.

**20. ముక్కుకమ్ములు** (19 చూ॥)

**21. కమ్మి** (19 చూ॥)



ముక్కు-కమ్మి

**22. ముక్కరలు** (నిర్గ $35^{22}$). ఇచట వాడిన అసలు మాట ఈయొక్క చోటనే ఆభరణముగా నున్నది. అసలులో దానికి గాలమని అర్థమగును. వేఱు వాక్యములలో నిది పశువుల ముక్కులకు తగిలించిన గాలమని అర్థమగుచున్నది (II రాజు $19^{28}$ యెష $37^{29}$).

**23. నాణెమైన ముసుకు** (యెష $3^{19}$). ఇది నగలజాబితాలో నున్నను, స్త్రీలు ధరించు వాటిలో ముఖ్యమైనది. దీని విలువనుబట్టి నగలలోఁ జేర్చియుందురు.

**24. పరిమళ ద్రవ్యపు భరిణెలు** (యెష $3^{20}$). సుగంధ ద్రవ్యముల నుంచిన సంచులను దీనిచే సూచించిరి. అట్టిసంచులను హారములకు కట్టినట్లు కనఁబడును.

**25. రక్షరేకులు** (యెష $3^{21}$). వీటిని తాయెత్తులవలె నుపయోగించిరి. (రక్షరేకులు చూ॥)

**26. ఒడ్డాణములు** (యెష $3^{20}$). స్థితిని సూచించెడి యాభరణము. **బంగారు పట్టి** దీనికి సంబంధించినదై గొప్పమహిమను సూచించెను (ప్రక $1^{13}$).



పాదభూషణములు

**27. పాదభూషణములు** (యెష $3^{18}$). ఇవి పాదములకు ధరించిన కడియములు.

**28. కాళ్లగొలుసులు** (యెష $3^{20}$). ఇవి పాదములకడియములకు తగిలింపఁబడినవి. ఇవి నడుచునప్పుడు స్త్రీలు మ్రోగించిన **కాళ్లగజ్జెల** (యెష $3^{16}$) ధ్వని వినఁబడినపుడు స్త్రీలు వచ్చుచున్నారని వెంటనే తెలియును.

**ఆమడ** మానములు I 2 చూ॥

**ఆమాలు** (Amal = కష్టము). ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన $7^{35}$)

**ఆమేన్** (Amen = నిశ్చయము).

స్థిరము, నిజము, నమ్మకము అని యర్థమిచ్చు నొక హెబ్రీ పదము. యెష $65^{16}$ లో నమ్మతగిన దేవుడు తన్నాశీర్వదింపవలెనని కోరుకొనును అని యున్న వాక్యము హెబ్రీలో ఆమేన్ గల దేవుని నామమున అని యున్నది. ప్రక $3^{14}$ లో ఆమేన్ అనునది **యేసుక్రీస్తు** ప్రభువుయొక్క బిరుదుగా నుపయోగింపఁబడును. వాక్యమందు అది మాటగా నున్నయెడల చెప్పఁబోవు సంగతి అగత్యమైనదియు సత్యమైనదియునై యుండును. అను నర్థమునిచ్చును. సువార్తలలో నున్నట్లు యేసుక్రీస్తు ప్రభువు చేసిన కొన్ని ప్రసంగములను చూడఁగా మూల భాషలో ఆమేన్ అను మాటతో ఆలాగు వాక్య ప్రారంభమగుచున్నది (యోహా $10^{1-7}$ మొ॥). క్రీస్తు ఈ మాటను రెండు మాఱులు పలుకుటవలన ఆయన చెప్పినది మఱీ దృఢమని తెలియును. దీని నీలాగు మన తెనుఁగు బైబిలులో తర్జుమా చేయక **నిశ్చయముగా** అను పదముచే సూచించిరి. యోహా $3^{3,5,11}$ $5^{25}$ మొదలగు వచనములలో నిశ్చయముగా అను నీ పదమున్న చోట్ల అసలులో ఆమేన్, ఆమేన్ అను మాటలున్నవని తెలిసికొనవలెను.

పూర్వీక యూదులు సమాజ మందిరముల లోను తమ యిండ్లలోను సంగీతము పాడునప్పుడైనను, లేక ప్రార్థన చేయునప్పుడైనను ముగింపులో అందఱు ఆమేన్ అని యేకశబ్దముతో చెప్పెడివారు. దాని భావము తథాస్తు అనఁగా ఆలాగుజరుగునుగాక అనునదే. అనేక విషయములలో వారు ఆమేన్, ఆమేన్ అని రెండేసి

మాఱులు చెప్పెదరు (కీర్త 41[13] 72[19] 89[52]). ఆది క్రైస్తవులీమాట నుపయోగించిరి (I కొరి 14[16]).

మనము ప్రార్థనకు ముగింపుగా ఆమేన్ అని వచించినయెడల ప్రార్థించువాఁడు ప్రార్థనలో అడిగినదంతయు ఒక్కొక్కఁడు నేనును నిజముగా కోరుదును, అలాగు కలుగునుగాక అని సాధించుకొనును. దేవుని వాగ్దానము లెన్నియైనను అన్నియు క్రీస్తునందు అవునన్నట్టుగానే యున్నవి. అవి ఆయనవలన నిశ్చయములై (ఆమేనై) యున్నవి అని యపొస్తలుఁడైన పౌలు బోధించెను (II కొరి 1[20]).

**ఆమోకు** (Amok = అగాధము). జెరుబ్బాబెలుతోకూడ బబులోనునుండి తిరిగి వచ్చిన యాజకులలోనొకఁడు (నెహె 12[7]). ఈపేరు తరువాతికాలములో నొక కుటుంబముయొక్క పేరయ్యెను (12[20]).

**ఆమోజు** (Amoz = శక్తిమంతుఁడు). యెషయా ప్రవక్త తండ్రియొక్క పేరు (యెష 1[1]).

**ఆమోను** (Amon)

I. (=నిర్భయత లేక చేతిపనివాఁడు).

1. రాజైన అహాబు కాలములో షోమ్రోను పట్టణమునకు అధిపతిగా నుండు నొకఁడు (I రాజు 22[26] II దిన 18[25]).

2. యూదా రాజులలో నొకఁడు. ఇతడు మనష్షే యను రాజు కొడుకు. తండ్రివలె తానును దుర్మార్గుఁడై యుండెను. రెండేండ్లు రాజ్యము చేసిన పిమ్మట ఇతని సేవకు లితని చంపించిరిగాని ఆదేశజను లా హంతకులను జంపి యోషీయాను రాజునుగా నియమించిరి (II రాజు 21[19-26] II దిన 33[21-25]).

3. సొలొమోను దాసులు అనఁబడువారి వంశస్థులలో నొకనిపేరు (నెహె 7[59] ఎజ్రా 2[57]).

II. (అదృశ్యుఁడు).

ఐగుప్తీయుల దేవతలలో నొకముఖ్యదేవత పేరై యున్నది. దానిముఖ్యపూజాస్థానము నో అను పట్టణములో నున్నది (యిర్మీ 46[25]). ఇందువలన ఈ పట్టణమునకు నో ఆమోను అనుపేరుకూడ కలదు (నహూ 3[8]). అది థేబెసు (*Thebes*) అనుపేరుగలదై ఐగుప్తుదేశపు దక్షిణ భాగమునకు ముఖ్యపట్టణమై యుండెను. ఆ పట్టణము క్రీ॥ శ॥ ముందు దాదాపు 1700 సం॥ లకు పూర్వము ఐగుప్తు యావత్తును జయించినప్పుడు ఆమోను అనుదేవత ఐగుప్తు అంతటికి ముఖ్య దేవత యయ్యెను. అష్షూరువారు ఐగుప్తును జయింపఁగా (క్రీ॥ ము॥ 670) ఆ దేవతాపూజ తగ్గిపోయెను (యిర్మీ 46[25]). అది సూర్యదేవతయై, ఇంద్రునివలె భూఫలితమునకు కర్తయని ఐగుప్తీయు లనుకొనిరి.

**ఆమోసు, ఆమోసు గ్రంథము** (Amos = భారము).

I. జీవితము. ఆమోసునుగూర్చి ఈ గ్రంథముననున్న సంగతులుతప్ప మఱేమియు తెలియదు. అతఁడు యూదయ మన్యప్రదేశములోని తెకోవయను ఊరికాపురస్థుఁడు (1[1]). పశువులకాపరి (1[1] 7[14]). అడవిపండ్లనేరి పట్టణములకుఁబోయి యమ్ముకొనెడివాఁడు (7[14]). దేవునిచేఁ బిలువఁబడి, ఇశ్రాయేలను పదిగోత్రముల వారికి బోధించినవాఁడు (7[15]). పట్టణములలో నివసించువారనుదినమును మానవుల యక్రమములను చూచుచుండుటచే, తప్పొప్పులను వివేచించు బుద్ధి చెడుననవచ్చును. ఆమోసు పట్టణవాసిగాక అరణ్యనివాసియై యుండెను. అతఁడడవులలోఁ దిరుగుచుండఁగా దేవుని సృష్టి వైచిత్రములను జూచి, ఆయన గొప్పతనమును స్మరించుకొనుచు తానాయనకు లోఁబడవలసినదని యొప్పుకొని ఆయన నీతులను తేటగా గ్రహించుకొనెను. గనుకనే, పండ్లను, నేతిని, గొఱ్ఱెబొచ్చును అమ్ముటకై తాను షోమ్రోనుపట్టణమునకు వెళ్లినప్పుడచ్చటి దుర్మార్గతలను జూచి ఆత్మప్రేరితుఁడై వారిని గద్దించునంతవఱకు నూరకుండఁజాలక పోయెను. అట్టివాఁడు పాఠశాలకుఁబోయి జదువకున్నను, ఆ పాపములను గద్దించుటకును ప్రజలకు నీతిసంగతు లుపదేశించుటకును తగినవాఁడై యున్నాఁడు గనుక దేవుఁ డతని నాపనికిఁ బిలిచెను.

II. ప్రవచించినకాలము. ఆమోసు బోధించు కాలమున రెండవ యరొబాము ఇశ్రాయేలు

రాజ్యము నేలుచుండెను ($1^{1}$ $7^{10}$). ఉజ్జియా యూదారాజ్యము పరిపాలించెను. తాను ప్రవచింప నారంభించినది భూకంపము కలుగుటకు రెండు సంవత్సరములు ముందు అని ఆమోసు వ్రాసెను ($1^{1}$). మన దేశమునందు కాలపరిమాణమును సూచించుటకు బందరుగాలివాన, ధాత కరవు, నందనకరవు మొదలగు సుప్రసిద్ధ విషయముల నెత్తి చెప్పునట్లు, ఆమోసుకాలమునందప్పుడు కలిగిన యొక భయంకర భూకంపమును కాలసూచనగా నెత్తి వ్రాయుచుండిరి. ఆమోసుకు రెండుశతాబ్దముల తరువాత వ్రాసిన జెకర్యా యెరూషలేమునకు కలుగఁబోవు విపత్తు, ఈ భయంకరమైన భూకంపమువంటిదని వ్రాసెను. ఈ సూచనలవలన ఆమోసు క్రీస్తుకు ముందు **765—750** సం॥ మధ్యకాలమున ప్రవచించెనని తెలియును.

**III.** ఆమోసు బోధించిన ప్రజలు. ఆమోసు స్వగ్రామమగు తెకోవ యూదయ దేశమునందుండినను, అతఁడచ్చట బోధింపక ఇశ్రాయేలీయుల పదిగోత్రములవారికి బోధించెననుట కనేక సూచనలు గలవు ($4^{1}$ $5^{1}$ $7^{10}$ మొ॥). ఇశ్రాయేలు రాజ్యమునకు షోమ్రోను రాజధానియు, బేతేలు పుణ్యక్షేత్రమునై యుండెను. వారి తిరునాళ్ల ఈ స్థలములందు జరిగెను. ఆమోసు ఈ ముఖ్యపట్టణములలో మఱి విశేషముగా బేతేలులో బోధించెనని ఈ గ్రంథమువలననే తెలియును ($7^{10}$).

ఇశ్రాయేలు రాజ్యముయొక్క స్థితి యీ గ్రంథమునందు తేటగా కనఁబడును. యరొబాము కాలమునందు దేశము నెమ్మదిగా నుండెను. ఇశ్రాయేలీయులలో స్థితిమంతు లనేకులుండిరి. వారు మలుపురాళ్లతో ఇండ్లను కట్టుకొనిరి ($5^{12}$). చలికాలమునకును వేసవికాలమునకును తగిన ప్రత్యేకమైన నగరములు వారికుండెను ($3^{15}$). దంతపు మంచములపై పండుకొని, సంగీతములను వినుచు విస్తారముగా ద్రాక్షారసమును త్రాగుచుండిరి ($6^{4-6}$). ఇట్లుండ వారు పుణ్యక్షేత్రములుగ నెంచిన బేతేలు గిల్గాలు బెయేర్షెబాలలో మతాచారములను సలుపుచు ($4^{4}$) అనేక యర్పణముల నర్పించుచుండిరి ($4^{5-7}$). దేశము సుభిక్షముగా నున్నదనుకొనుచు నిశ్చింతతో కాలము గడుపుచుండిరి ($6^{1}$). స్థితిమంతు లిట్లు సుఖభోగములయందు మునిగి తేలుచుండఁగా సాధారణ ప్రజల స్థితి మిగుల పరితాపకరముగ నుండెను. ధనికులు పేదలను బహు బాధపఱచిరి ($2^{6-8}$). న్యాయసభలయందైనను బీదలకు న్యాయము దొరకకపోయెను ($5^{7-11}$). వర్తకులు తప్పుడు త్రాసులను దొంగకొలతలను వాడి మిగుల మోసము జేయుచుండిరి ($8^{4-6}$). బహు సిగ్గుమాలిన వ్యభిచారములు జరిగెను ($2^{7}$). స్త్రీలు సహా మితిమించి త్రాగిరి ($4^{1}$). మతాచారములన్నియు వెలుపలి యాచారములుగ నుండెనే గాని, వారి ప్రవర్తనేమాత్రమైనను మార్చెడి సాధనములుగా నుండకపోయెను ($4^{4,5}$). ఇట్టి స్థితిగతులయందుండువారికి నీతిమంతుఁడొకఁడు బోధింపఁగా అతని బోధ యెట్టిదై యుండునో మనము కొంత వఱకూహించుకొనఁగలము. అతఁడు గద్దింపులతోనే బోధించును గాని వారిని మెచ్చుకొనుచు బోధించఁడు.

**IV.** ఆమోసు ముఖ్యబోధ. దుర్మార్గులైన ఇశ్రాయేలీయులను గద్దించుటకును, వారి దుర్మార్గతలకు కలుగనైయున్న తీర్పులను తెలుపుటకును ఆమోసు ప్రవచించెను. అతఁడు ముఖ్యముగా దేవుని తీర్పులనుగూర్చి తెలిపిన ప్రవక్తయై యుండెను. క్రొత్తనిబంధన కాలములో స్నానికుఁడైన యోహాను ప్రజల పాపస్థితినిగూర్చి చెప్పినదానికిని ఆమోసు తన జీవితకాలమునందున్న వారికి తెలిపిన సంగతులకును చాల సంబంధమున్నది. వీరిద్దరును దేవుని రాకడ తీర్పుకొఱకైనదని బోధించిరి (ఆమో $4^{12}$ మ $3^{10}$).

**V.** ఆమోసు గ్రంథములోని భాగములు.

1. పైవ్రాఁత $1^{1}$.

**2.** ముఖ్యవిషయమును తెలుపుట (దేవుఁడు భయంకరమైన తీర్పుచేయుటకు వచ్చును) $1^{2}$.

**3.** దేవుఁడు ఆయా దేశములను జనుల పాపములనుబట్టి శిక్షించుట $1^{3}$ $2^{16}$.

(1) దమస్కు అనగా సిరియదేశము (గిలాదుదేశమును క్రూరముగ బాధపఱచినందుకు) $1^{3-5}$.

(2) గాజా అనగా ఫిలిష్తీయులదేశము $1^{6-8}$.

(3) తూరు అనగా ఫేనీకేదేశము $1^{9,10}$.

(4) ఎదోము $1^{11,12}$.

(5) అమ్మోను $1^{13-15}$.

(6) మోయాబు $2^{1-3}$.

(7) యూదా $2^{4,5}$.

(8) ఇశ్రాయేలు $2^{6-16}$.

4. ఇశ్రాయేలు పాపమునుబట్టి వారికి కలుగఁబోవు శిక్షలనుగూర్చిన మూఁడు ప్రసంగములు $3^{14}$ $6^{14}$.

(ప్రతి ప్రసంగము ఆలకించుఁడి అను మాటతో నారంభమగును $3^{1}$ $4^{1}$ $5^{1}$).

(1) మొదటి ప్రసంగము $3^{1-15}$.

(2) రెండవ ప్రసంగము $4^{1-13}$.

(3) మూఁడవ ప్రసంగము $5^{1}$-$6^{14}$.

5. ఇశ్రాయేలునకు కలుగఁబోవు శిక్షలను ఐదు దర్శనములద్వారా తెలుపుట $7^{1}$-$9^{10}$.

(1) మిడుతలవలని నాశనము $7^{1-3}$.

(2) అగ్నివలని నాశనము $7^{4-6}$.

(3) మట్టపుగుండుచే ఇశ్రాయేలీయుల అక్రమములను సూచించుట $7^{7-9}$.

(ఈ సంగతి ప్రవచించినప్పుడు అమజ్యా ఆమోసును గద్దింపఁగా ఆమోసు అతనికి జవాబు చెప్పుచు తన పిలుపునుగూర్చి తెలియఁజేసెను $7^{10-17}$).

(4) వేసవిపండ్ల గంపద్వారా అంతమును సూచించి, ఆ యంతమునకు కారణమును, విధమును తెలియఁజేయుట $8^{1-14}$.

(5) వేదికను కొట్టుట యను దర్శనమువలన ఇశ్రాయేలుకు కలుగఁబోవు నాశనమును తెలుపుట $9^{1-6}$.

6. దేవుఁడిశ్రాయేలీయులను బాగుజేయఁగా వారికి మఱల కలుగఁబోవు సౌఖ్యములను తెలుపుట $9^{7-10}$.

**ఆయిని** అయీను చూ॥

**ఆయుధములు** (Arms, Armour). మూఁడువిధములుగ నున్నవి.

I. ప్రహారాయుధములు (*Offensive Weapons*).

**1. దుడ్డుకర్ర** (*Club*). మిగుల పురాతనమైన ఆయుధము (యోబు $41^{29}$). దీనికే **గద** (యెహె $39^{9}$), **గుదియ** (మ $26^{55}$) యను మాఱుపేరులు గలవు.

**2. సమ్మెట** (*Hammer* = యిర్మీ $50^{23}$), **గండ్రగొడ్డలి** (*Battle axe* $51^{20}$) అనునవి యెహె $9^{2}$ నందుదాహరింపఁబడిన **ఆయుధ**ము సంబంధించియుండును. గండ్రగొడ్డలి యని చెప్పఁబడినది యినుపకట్లచేతను, చీలలచేతను పొదగఁబడి మిగుల హానికరముగా నుండును.



ఈటె, విల్లు, కత్తి, గండ్రగొడ్డలి

**3. ఈటె, బల్లెము** (*Spear, Javelin*). ఆదికాలమున వీటిమొనలు రాతివైయుండెను. క్రమక్రమేణ యినుపమొనలు వాడుకలోనికి వచ్చెను. రాజదండమువలె రాచరికమునకు గుఱుతుగా వాడిరి (I సమూ $17^{6}$ $22^{6}$ $26^{7}$). విసరుటకు తగినంత తేలికగా అప్పుడప్పుడు చేయఁబడెను (I సమూ $18^{11}$ యోబు $41^{26}$). కీర్త $57^{4}$ లోని **శూలము** వీటివంటిదే. రోమీయులు మిగుల బరువయిన యీటెలను వాడిరి (యోహా $19^{34}$).

**4. ఖడ్గము, కత్తి** (*Sword*). సాధారణముగా దీనియాకు పొట్టిగాను తిన్నగానుండును. అప్పుడప్పుడు రెండంచులు కలిగియుండును (కీర్త $149^{9}$ హెబ్రీ $4^{12}$). కత్తులను వరలోనుంచి కుడిచేత దానిలాగుటకు వీలగునట్లు యొడమతొడ

మీఁద కట్టుకొందురు (I సమూ 17[51] న్యాయా 3[15-17] పరిపోల్చుము). ఈ ఒరను లోహముతో గాని, తోలుతోగాని చేసి నడికట్టుకు తగిలింతురు (II సమూ 20[8]). బైబిలునందు తరుచుగా ఖడ్గము యుద్ధమునకు గురుతుగాను, నాగటి నక్కు సమాధానమునకు గురుతుగాను వాడిరి (యెష 2[4] మ 26[54]).

**5.** శస్త్రము (*Lance*). మిక్కిలి వాడిగల చిన్నకత్తి (I రాజు 18[28]).

**6.** **విల్లు** (*Bow*). ఈటె వాడుకలోకి వచ్చినకాలమునందే విల్లును వచ్చియుండును. దీనినిగట్టి చువ్వచేఁ జేసిరి. అప్పుడప్పుడు దానికి ఇత్తడికట్లు కట్టిరి (కీర్త 18[34]). **వింటినారిని** (*Bow string* 21[12]) యెద్దు నరముతోను, **బాణము** లేక **అంబును** (57[4]) గట్టిరెల్లుతోను చేసిరి. బాణముల మొనలకు చెకుముకి రాతి ముక్కలనుగాని, ఇత్తడి లేక యినుప సీలలనుగాని పెట్టిరి. వీటికప్పుడప్పుడు విషముకూడ పూయుచుండువారు (యోబు 6[4]). యిర్మీ 50[14] నందు **విల్లు త్రొక్కువారు** అని యున్నది గాన, **యుద్ధపువిల్లు** (జెక 9[10]) మిక్కిలి పెద్దదనియు, వింటికి నారిని పూనునప్పుడు క్రిందికొనను కాలితో త్రొక్కి పైకొన నందుకొనవలసి యుండెనని తెలియుచున్నది. నారి జారిపోకుండునట్లు నొక్కులు వింటిచివరల పెట్టుదురు. ఐగుప్తీయుల యుద్ధపువిల్లు అయిదు అడుగుల యెత్తు గలది. విలుకాండ్రు బాణములను **అంబుల పొదిలో** నుంచి చంకకు తగిలించుకొందురు (విలా 3[13]).

**7**: **వడిసెల** (*Sling*). యోధులు యుద్ధమునందును, గొల్లలు క్రూరమృగములను పారఁదోలుటకును వాడిరి. సాధారణముగా నిది యొకే పొడుగాటి తోలు చీలికచేత చేయఁబడి నడుమ రాయి పట్టఁగలిగినంత వెడల్పు గలదయి కొనల దగ్గరకు రానురాను సన్నముగ నుండును. బెన్యామీనీయులు వడిసెలతో రాతిని గురితప్పక విసిర వేయఁగలిగిరి (న్యాయా 20[16]). తుపాకులు బైబిలుకాలమునందు వాడుకలోనికి రాలేదు.

**II.** సంరక్షకాయుధములు (***Defensive Weapons***).



సంరక్షకాయుధములు

**1.** డాలు లేక కేడెము (*Shield, Buckler, Target*). మిక్కిలి ప్రయోజకరమైనది. ఇది రెండు విధములుగా నున్నది (I రాజు 10[16,17]). ఒకటి చిన్నదై, గుండ్రముగా నుండి సాధారణముగా మధ్యను ఆలుగు లేక చీలఁగలిగియుండెను. ఈలాటిది మిక్కిలి చులకనగానుండి, అవసరమునుబట్టి యిష్టము వచ్చినట్టు వాడుకొన వీలుగానుండెను. రెండవది ఎక్కువ పొడుగాటిదై దేహమంతటిని కాపాడునంత పెద్దది. బైబిలునందు ఈ రెంటిలో ప్రతి దానిని డాలనిగాని కేడెమనిగాని పిలిచిరి (కీర్త 35[2] యిర్మీ 46[3]). అవి లోహముతోఁగాక కర్రతో చేయఁబడి పైన తోలుచే కప్పఁబడినవిగా తోచును (యెహె 39[9]).

**2.** శిరస్త్రాణము (*Helmet*). గొప్పవారు ఇత్తడితోగాని రాగితోగాని చేయఁబడిన శిరస్త్రాణములు ధరించుకొనిరి (I సమూ 17[5]) గాని సాధారణ యోధులు తోలుతో చేయఁబడిన వాటిని ధరించుకొనినట్లు కనఁబడును. ఉజ్జియా తన సైన్యమంతటికి చేయించిన వీలాటివేయని తోచును (II దిన 26[14]).

**3.** కవచము, జీరా (*Armour, Harness*). శిరస్త్రాణమువలె నిదియు గొప్పవారు లోహముతోఁ జేయించుకొనిరి గాని యితరులు తోలుతోఁ జేసినవాటిని ధరించిరి (I సమూ 17[5] యెష 59[17]). కవచములు చేఁప పొలుసులవలె లోహపు తునకలచేత చేయఁబడును. ఇట్టి



మైమరువు

కవచపు కీలులో బాణము ప్రవేశించుటవలన అహాబు గాయపడెను (I రాజు $22^{34}$). గుర్రముల కును ఇట్టి కవచములను తొడిగిరిగాని వాటిని జీరాలని పిలుతురు (యిర్మీ $46^{4}$). **మైమరువు** (*Breast plate*) శిరస్సును తప్ప మొండె మంతటిని మోకాళ్లవఱకు కప్పును (ఎఫె $6^{14}$).

**4. కాళ్లకవచము** (*Greaves*). గొల్యాతు కట్టి కవచముండెను. (I సమూ $17^{6}$). యెష $9^{5}$ లో ప్రశంసింపఁబడిన జోళ్లుకూడ ఒకవిధ మైన సంరక్షకాయుధములుగా నెంచవచ్చును.

**5. ఆయుధములు మోయువాడు** (*Armour bearer*) సాధారణముగా యౌవ నుఁడైయుండెను. అతఁడు తన యజమానునికి అవసరములేని ఆయుధములను మోయుచు అత నికి దగ్గరగా నుండి ఆయా సమయములకు తగి నట్లు కావలసిన ఆయుధములను నందించువాఁడు. యజమానునిచే పడఁ గొట్టఁబడిన వారినతఁడు హతము జేయువాఁడు (I సమూ $14^{13}$).

**III.** అలంకారరీతిగా నుదాహరింపఁబడిన ఆయుధములు (ఆది $15^{1}$ కీర్త $3^{3}$ $57^{4}$ I థెస్స $5^{8}$ హెబ్రీ $4^{12}$ ప్రక $1^{16}$ $19^{15}$). పౌలు ఎఫె $6^{13-17}$ లో చెప్పిన వర్ణన అన్నిఁటిలో మిగుల యలంకారార్థముగా నున్నది. తనను కాయు చుండిన యోధులు ధరించిన వాటిని అతఁడు వీటికి సరిపోల్చెను. ఇందులో మైమరువు శిర స్త్రాణములకు వాడఁబడిన ఉపమానములు యెష $59^{17}$ లో సూచించఁబడెను. అదేరీతిగా యెష $11^{4}$ చెప్పఁబడిన **వాగ్దండము** వాక్యమను ఆత్మ ఖడ్గమును సూచించును. డాలు దేహమంతటిని కప్పెడి రోమీయుల డాలును సూచించును. దీని వాడునప్పుడు డాలును శిరస్త్రాణమును ఖడ్గ మునుతప్ప మరేమియు శత్రువునకు కనఁబడదు.



యోధుఁడు

ఆత్మీయ యుద్ధమునందు వాడఁబడు **సర్వాంగ కవచమును** దేవుఁడే యనుగ్రహించును (ఎఫె $6^{13}$). **అగ్నిబాణములు** (*Fiery darts* ఎఫె $6^{16}$) గాయపఱచుట మాత్రమే గాక బట్ట లను ఇండ్లను తగులఁబెట్టి యెక్కువ నాశనము చేయును. విషముగల అంబులవలె (యోబు $6^{4}$) చేదు మాటలను బాణములు (కీర్త $64^{4}$) యెన్న డును మానని గాయములు చేయును.

J. G. B.

**ఆయుధములు మోయువాడు** ఆయు ధములు II 5 చూ॥

**ఆయుష్కాలము** (**Age**). జలప్రళయ మునకు పూర్వము జీవించినవారు చాల గొప్ప ఆయుష్మంతులైయుండిరి. జలప్రళయమునకు తరువాత జనుల ఆయుష్కాలము తగ్గిపోయి నట్లుగా నున్నది (కాలక్రమణిక చూ॥). మోషే ప్రార్థన యనఁబడు కీర్తనలో జనుల ఆయుష్షు మన కాలమందలి జనుల ఆయుష్షువలె నున్నట్లు తెలిసికొనవచ్చును (కీర్త $90^{10}$). దేవుని యాజ్ఞలను

నైకొనుటవలనను ముఖ్యముగా మన తలిదండ్రులకు లోబడుటవలనను మనము మన జీవిత కాలమును కొనసాగించుకొని వృద్ధిచేసి కొనఁగల మని నిర్గ 20[12] లో నున్నది. అదియుఁగాక మన దుర్మార్గతవలన మన జీవితమును తగ్గించుకొనఁగల మనికూడ స్పష్టముగా నున్నది (సామె 10[27]).

**ఆరమోజబాయాయాములు** అరాము II 3 చూ॥

**ఆరహు** (Arah = దేశద్రిమ్మరి).

1. ఆషేరు గోత్రీకులలో నొకఁడు (I దిన 7[39]).

2. జెరుబ్బాబెలు బబులోను నుండి తిరిగి వచ్చుచుండఁగా అతనితోకూడ వచ్చిన యొక కుటుంబమునకు పేరు (ఎజ్రా 9[5] నెహె 7[10]).

**ఆరాధన** దేవాలయము, సంఘము, సమాజ మందిరము, ప్రార్థన, స్తోత్రము, అర్పణము, నమస్కరించుట చూ॥

**ఆరు, ఆర్మోయాబు** (Ar = పట్టణము, Ar of Moab). మోయాబు దేశమందలి పట్టణములలో నొక ముఖ్యపట్టణము (యెష 15[1]). ఈ పట్టణమునకు చుట్టునున్న ప్రదేశము ఆరుదేశ మనఁబడి మోయాబు దేశముయొక్క ఉత్తరమున అర్నోను లోయలోనుండెను (సంఖ్యా 21[15] ద్వితీ 2[17]).

**ఆరోదీ,** (Arod = సంతానము **ఆరోదీయులు** Arodites). సంఖ్యా 26[17] నందిది యొక కుటుంబ పూర్వికుని పేరుగా కనఁబడు చున్నది. ఆ కుటుంబికులు **ఆరోదీయు** లనఁబడిరి. గాదు కుమారులలో నొకఁడు (ఆది 46[16]).

**ఆరోహణము** యేసుక్రీస్తు III 5 (2) (h) చూ॥

**ఆర్దు, ఆర్దీయులు** (Ard, Ardites).

బెన్యామీను సంతతివాఁడు. ఆది 46[21] లో అతనికి కొడుకనియు, సంఖ్యా 26[40] లో మనమఁ డనియునున్నది. మిగుల క్లుప్తముగనున్న ఈ వంశావళి క్రమములో నిట్టి చిన్న భేదము లుండుట వింతకాదు. I దిన 8[3] నందున్నట్లు అద్దారు అనువాఁ డితడే (అద్దారు 2 చూ॥). ఇతని సంతతివారిని **ఆర్దీయులనిరి.**

**ఆర్మోయాబు** ఆరు చూ॥

**ఆలయ ప్రతిష్ఠ పండుగ** పండుగలు, III 2 (2) చూ॥

**ఆలయము నపవిత్రపరచుట** నేరములు శిక్షలు I 4 చూ॥

**ఆలూషు** (Alush = మానవుల యల్లరి). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి సీనాయికి ప్రయాణముచేయఁగా వారు మకాముచేసిన స్థలములలో నొకటి (సంఖ్యా 33[13,14]).

**ఆలెఫ్** (Aleph א అను అక్షరము). హెబ్రీ యక్షరములలో మొదటిది. 119-వ కీర్తనలోని మొదటిభాగమందలి ప్రతిపంక్తిలోని మొదటి యక్షరము దీనితో నారంభమగుటచే ఆ భాగమునకు ఆలెఫ్ అను పేరు పెట్టిరి. ఉర్దులో అది అను అక్షరమైయున్నది.

**ఆలెమెతు** (Alemeth = కప్పు).

1. ఒక బెన్యామీనీయుఁడు (I దిన 7[8]).

2. రాజైన సౌలు సంతతివారిలో నొకఁడు (I దిన 8[36] 9[42]).

**ఆలోతు** (Aloth = పాలిచ్చునది). తన దివాణమునకుఁ గావలసిన ఆహారపదార్థ సంగ్రహముకొఱకు సొలొమోను దేశమును విభాగించిన 12 భాగములలో ఆషేరుతోకూడ నుదాహరింపఁ బడిన యొక స్థలము. దీనియునికిని గూర్చి తెలియదు (I రాజు 4[16]).

**ఆవగింజ** (Mustard). ఆవగింజ మిక్కిలి చిన్న విత్తనము. అది మొలవనారంభించినప్పుడు మిగుల త్వరగా పెరిగి 10, 12 అడుగుల యెత్తు గల చెట్టగును. దానిగింజలు పక్షులకు మిగుల యిష్టముగాన అవి యనేకములుగావచ్చి ఆ చెట్ల మీఁద నివసించును (మ 13[32] 17[20] లూ 13[19]).

J. C.

**ఆవీము** (Avim). బెన్యామీను గోత్రపు సరిహద్దులోని యొకగ్రామము (యెహో 18[23]).

**ఆవీయులు** (Avim) ఫిలిష్తీయుల దేశము నందలి మొదటి నివాసులు. కఫ్తోరీయులు వీరి నోడించి వీరిలోఁ గొందఱినితప్ప తక్కినవారి నందఱిని నశింపఁజేసిరి (ద్వితీ 2[23]).

**ఆవు, పెయ్య, ఎద్దు, కోడె** (Cow, Calf or bullock) ఇవన్నియు ఆవు జాతిలోనివిగాన వీటన్నిటి నిచట వివరింపఁదగును బైబిలు ప్రదేశ ములలో ఆవులు మొదటినుండి యున్నట్లుగా సూచనలుగలేవు (ఆది 12[16] 21[27] 32[15]).

1. ఆవు, పెయ్య. వీటిని సాధారణముగా పాలకొఱకు పెంచిరి (II సమూ 17[29]). ఆయా ఆచారము లనుసరించుటలోకూడ వీటినివాడిరి. నిబంధనను స్థిరపఱచుటకును (ఆది 15[9]). నరహంత కుఁడు దొరకకపోయిన ఖూనీకి ప్రాయశ్చిత్తము చేయుటకును (ద్వితీ 21[3]). సమాధాన యాగమున కును (లేవీ 3[1]), శ్రవమును ముట్టుటచే గలిగిన అపవిత్రతను శుద్ధిచేయుటకును (సంఖ్యా 19[2] హెబ్రీ 9[13]), ఒకానొకప్పుడు హోమార్పణగాను (I సమూ 6[14]) వీటిని అర్పించు చుండిరి.

2. ఎద్దు, కోడె. దున్నుటకును (I రాజు 19[19]). బండ్లు లాగుటకును (సంఖ్యా 7[3] II సమూ 6[6] మొ॥), నూర్చుటకును (ద్వితీ 25[4]) వీటినుపయోగించిరి. ఇంతేగాక వీటిని యజ్ఞము లకు ముఖ్యముగా దహనబలులకు అర్పించిరి (సంఖ్యా 7[87,88] II సమూ 24[22] II దిన 5[5] 7[5] మొ॥). వాటి మాంసమును ఆహారముగా వాడిరి (I రాజు 1[25] ను 22[4], కోడెలను అదేరీతిగా పనికొఱకును (యిర్మీ 31[18]) యజ్ఞములకును (నిర్గ 29[3] I దిన 29[21] న్యాయా 6[25]) వాడుచువచ్చిరి.

3. ఇండియాదేశములోని కొన్ని ప్రదేశము లందలి ఆవులును, ఎద్దులును ప్రసిద్ధములైనట్లు బైబిలు ప్రదేశములలోను ఉండెను. ఇట్లు **బాషాను ఆవులును** (ఆమో 4[1]), **బాషాను వృషభములును** (కీర్త 22[12]). మిగుల బలిష్ఠము లగు పశువులను సూచించుటకై వాడిన అలంకార పదములైయున్నవి. (బాషాను చూ॥).

**ఆవెను** (Aven = శూన్యము).

1. శూన్యము అను నర్థమునిచ్చు ఈ పేరును హోషేయ విగ్రహారాధనకు ముఖ్యస్థానముగా నుండు బేతేలునకు హాస్యార్థముగా పెట్టెను (హోషే 10[8]). దీనికి అతఁడు అదేభావముతో బేతావెను అను పేరునుకూడ పెట్టెను (4[15] 5[8].)

2. దమస్కు ఆధీనములో నుండు నొక స్థలము (ఆమో 1[5]). దానికి యునికిపట్టెచటనో తెలియదుగాని అది లెబానోను పర్వతములలో నుండు హెలియపొలిస్ అను పట్టణమునకొక హాస్యార్థపు నామమని కొందఱనుకొందురు. అచట సూర్యునిపూజ జరుగుటవలన ప్రవక్త హాస్యార్థముగ దీనికిట్టిపేరు పెట్టియుండవచ్చును.



ఆవెను పట్టణ శిథిలములు

అదేరీతిగా ఐగుప్తుదేశములో సూర్యుని పూజకు ఉనికిపట్టయిన ఓను అను పట్టణమునకు యెహెజ్కేలు హాస్యార్థముగా ఆవెను అను పేరును పెట్టెనుగాని మన తెలుగు బైబిలులో ఆ హాస్యపు పేరుంచక ఆ పట్టణముయొక్క అసలు పేరేయుంచిరి (యెహె 30$^{17}$).

**ఆవేశము** దైవావేశము చూ॥

**ఆశ, ఆశానిగ్రహము** (Desire, self-control). శరీరాశలు పాపమునకు కారణమని బైబిలు బోధనయైయున్నది. మనలను శోధించు శరీరాశ నేత్రాశ జీవపు డంబము అనునవి వాటిలో ముఖ్యములు (I యోహా 2$^{16}$) మొదట శోధకుడు ఇట్టి ఆశలను రేపి మానవకోటిని పాపములో ముంచివేసెను (ఆది 3$^{6}$). బాల్యము నుండి చెడ్డవిగా నెంచబడిన నరుల హృదయాలోచనలు (ఆది 8$^{21}$) దురాశలేయని చెప్పదగును. బైబిలంతటిలో ఆశకును పాపమునకున్న సంబంధమును మనము గుర్తించినయెడల క్రీస్తు దానిని మరెక్కువగా వివరించినట్లు కనబడును (మ 5$^{21-48}$ మా 7$^{21-23}$). పాపమునకు ఉత్పత్తి ఆశయే యని యాకోబు బోధించెను (యాకో 1$^{14}$). క్రొత్త నిబంధన వేదశాస్త్రిగా నెంచదగిన పౌలు ఆశయే మానవులను పాపమునందు ముంచునదైయున్నదని వాదించెను (రోమా 7$^{7-25}$).

బైబిలు అంతయు ఏకగ్రీవముగా చెప్పు ఈ బోధ యింతవఱకు హిందువుల బోధకు సరిపడినను, ఈ యాశలను త్యజించు నిమిత్తము చేయవలసినదాని గూర్చిన బోధయందు భేదము కనబడుచున్నది. ఆశలను త్యజించుటకు సన్యసించి అడవులలో నివసించి విముక్తినొందవలెననునది హిందువుల బోధయైయున్నది కష్టసుఖములను, మంచి చెబ్బరలను విభేదబుద్ధితో గాక నిష్పక్షపాతముగా నెంచవలెననునది బౌద్ధుల బోధ. ఇది బైబిలుబోధకాదు. మానవుల శరీర ఆశలలో నేదియైనను నైజముగా చెడ్డదియని చెప్పవీలుగాదు. ప్రతిదానివలన నొక యుపయోగమున్నది. ఆకలి లేనియెడల దేహమునకు పోషణ మవసరమని తెలియక మానవులు కృశింతురుగాని ఆకలితీర్చుకొనవలెనను ఒకే యుద్దేశము గలవారు తిండిబోతులగుదురు. ఇతర ఆశలును అట్టివే. అట్టివి లేనియెడల మానవజాతి త్వరగా నశించుటయేగాక కుటుంబ ప్రేమయను దివ్యగుణముకూడ ఉండనే యుండదు. సహజమైన ప్రతి యాశకు తగినది ఒకటియు, తగనిది ఒకటియు రెండుపయోగములున్నవి. మన మనో ఆశలలో కొన్ని అసలే చెడ్డవి. అన్యాయ ఓర్వలేనితనము పగ మొదలైనవి అట్టివి. సరిగా నుపయోగించిన యెడల కొన్ని మంచి వగును లేనియెడల అవి పాపమునకు కారణమగును. ప్రేమ అటువంటిది. శ్రేష్ఠమైనవాటిని ప్రేమించుట మంచిది. సర్వసద్గుణ సంపన్నుడగు దేవుని యన్నిటికన్న ఎక్కువగా ప్రేమించుట బహు శ్రేష్ఠమైన కార్యము (మ 22$^{37}$), గాని లోక సంబంధమగు వాటిని ప్రేమించుట గొప్ప పాపములకు కారణము కాగలదు. చెడ్డయాశలను బొత్తుగా త్యజించుటయు మఱిముఖ్యముగా, నైజముగానుండు ఆశలను తగనిరీతిగా గాక, సరియైనరీతి నుపయోగించుటయే **ఆశానిగ్రహ మనబడును.** ఇది సద్గుణములన్నిటికి మిగుల అవసరమైనది. ఆశానిగ్రహమను పదముయొక్క మూల భాషాపదము కార్య 24$^{25}$ గల 5$^{23}$ II పేతు 1$^{6}$ తీతు 1$^{8}$ నందు మాత్రముండినను దానికి సంబంధించిన సంగతు లనేక చోట్లలో గలవు. I కొరి 9$^{25}$ లోనున్న **మితముగా నుండుట** అనునది మూల భాషలోని క్రియకు మఱియొక తర్జుమాయైయున్నది. ఒకడు తన్ను తా నుపేక్షించుకొనుటయు నిదేయర్థము నిచ్చును (మ 16$^{24-28}$ లూ 14$^{25-35}$ I కొరి 9$^{24,25}$ మొ॥). I కొరి 7$^{5,9}$ నందున్న **మనస్సు నిలుపలేక పోవుట** అనుమాట దీనికి వ్యతిరేకపదమైయున్నది. మ 23$^{25}$ లోను II తిమో 3$^{3}$ లోను అట్టి విరుద్ధగుణమును సూచించుమూలపదమును **అజితేంద్రియత్వము అజితేంద్రియులు** అని తర్జుమాచేసిరి. (మనస్సు నిలుపలేనివాడు, ఉపేక్షించుకొనుట, దురాశ చూ॥)

**ఆశ్రయము** ఆశ్రయపురములు, బలిపీఠము చూ॥

**ఆశ్రయపురములు (Cities of Refuge).** కనాను దేశమునందివి ఆఱుగలవు. యొర్దానునదికి పడమట యూదాగోత్రమందలి హెబ్రోను,

ఎఫ్రాయిమునందలి షెకెము, నఫ్తాలీగోత్రమందలి కెదెషు, అను మూఁడును, తూర్పున రూబేనుగోత్రమునందలి బేసెరు గాదులోని రామోత్గిలాదు మనష్షేగోత్రమందలి గోలాను అను మూఁడునై యుండెను (యెహో 20[7-9] సంఖ్యా 35[6,11]).

ఒకఁడు డింకొకనిఁ జంపినపక్షమున చంపఁబడినవానిదగ్గర బంధువుఁడు హంతకుని తరిమి వెదకి చంపునట్టి వాడుక పూర్వకాలమునం దా దేశములలో నుండెను (నిర్గ 21[23]). మోషే యూదులకు చేట్టముల నియమించినప్పుడు కనికరమును గనుపఱచెడు నొక క్రొత్తప్రమాణమును



ఆశ్రయ పురము

ఏర్పఱచెను. ఒకడు విరోధబుద్ధిచే గాక పొరపాటున నొకనిఁ జంపుట తటస్థించినపక్షమందు చంపినవాఁడు అట్టి ఆశ్రయపురమునకు పాఱిపోయి, ఆ సంగతి విచారింపఁబడువఱకు అచ్చట నిర్భయముగ నివసింపవచ్చును (యెహో 20[1-3]). ఆ పురములకు పాఱిపోయినవాని సంగతి అక్కడి పెద్దలు స్పష్టముగ విచారింపవలయును. ఉద్దేశపూర్వకముగా నతనిఁజంపెనని రుజువైనపక్షమున, వారతని వాని విరోధుల కప్పగించవలెను (ద్వితీ 19[12]). అటులగాక పరాకున జంపెనని రుజువైనయెడల వాఁడా యాశ్రయపురమునందును, దానికి వెయ్యిగజముల దూరమునందును సురక్షితముగ బ్రతుకవచ్చును (సంఖ్యా 35[4,5]). అప్పుడున్న ప్రధానయాజకుని మరణానంతరమున తన స్వస్థలమునకు నిర్భయముగఁ బోవచ్చును (35[26,27]). చంపఁబడినవాని బంధుగులతని కేహానియుఁ జేయఁదగదు. ఆశ్రయపురములకు పోవుత్రోవలను బాగుచేసి (ద్వితీ 19[3]) రెండుబాటలు చీలుతావులలో ఆశ్రయపురములకుఁ బోవుమార్గమును గనుపఱచు స్థంభములను గట్టియుంచెడి వారఁట. ఆశ్రయపురములను గూర్చిన నియమములను సంఖ్యా 35 ద్వితీ 19[1-13] యెహో 20[2-9] ను నందుకనుగొనవచ్చును. (హెబ్రోను, షెకెము, కెదెషు, బేసెరు, రామోత్గిలాదు, గోలాను చూ॥). దైవోగ్రతకు పాత్రుఁడగు పాపికి నియమింపఁబడిన ఆశ్రయము యేసుక్రీస్తే. పాపమునకు రావలసిన శిక్షకలుగకముందే విశ్వాసమువలన యేసు శరణు జొచ్చినవాఁడు ధన్యుఁడు (హెబ్రీ 6[18]).

H.

**అషాను, కోరాషాను** (Ashan = పొగ, Corashan = పొగరాజు కొలిమి). ఒక పట్టణము. ఇది మొదట యూదావారికిని (యెహో 15[42]), తరువాత షిమ్యోనీయులకును (19[7] I దిన 4[32]), తదనంతరము లేవీయులకు 48 పట్టణము లిచ్చినపుడు వారికిని స్వాస్థ్యమాయెను (6[59]). యెహో 21[16] లో దీనికి అయిని అను పేరుకలదు. I సమూ 30[30] లో నున్న కోరాషాను (=కోర్ + అషాను) ఇదేస్థలమై యుండవచ్చును. అది

యూదయ పశ్చిమభాగములో నుండెను గాని దానియునికినిగూర్చి మరేమియు తెలియదు

**ఆషేరు, ఆషేకీయులు** (Asher = సౌఖ్యము, Asherites). యాకోబుయొక్క ఎనిమిదవ కుమారుఁడు. యాకోబు ఉపపత్ని యగు జిల్పా అతని తల్లి (ఆది 30[12,13]). ఇతఁడు 12 గోత్రకర్తలలో నాలుగవఁడు. ఇతని గోత్రికులు కనానుదేశమునకు చేరినపుడు 53,400 మందిరైయుండిరి. వారి భూభాగము మధ్యధరా సముద్ర తీరమున కర్మెలుకొండ మొదలుకొని 60 మైళ్లు ఉత్తరముగా వ్యాపించెను. దానివెడల్పు 10 మొదలుకొని 20 మైళ్లవఱకు నుండెను. అందులో 22 పట్టణము లుండెను (యెహో 19[24-31]). వారి భూమిలో విస్తారధాన్యము ద్రాక్షారసము నూనె మొదలగునవి ఫలించెను. వారి దేశసౌఖ్యమునకు సంబంధించిన ప్రవచనములు యాకోబు దీవెన (ఆది 49[20]) లోను, మోషే దీవెన (ద్వితీ 33[24]) లో నున్నవి. ఈ గోత్రికులు దెబోరా పిలుపునకు లోఁబడి యుద్ధమునకు వెళ్లలేరి (న్యాయా 5[17]) గాని గిద్యోనునకు సహాయపడిరి (6[35] 7[23]). అదియుగాక దావీదు నొద్దకుకూడ తమ యోధులను పంపిరి (I దిన 12[16]). ఈ గోత్రభాగపు కొండలలో లోహములుకూడ దొరికెను (పటము IX చూ॥). లూ 2[36] లో చెప్పిన ప్రవక్త్రియగు అన్నా ఆషేరు గోత్రికురాలు. C.

**ఆష్తెరాతీయుడు** అష్తారోతు చూ॥

**ఆసక్తి** (Zeal). లోకములో నీతిన్యాయములను స్థాపించుటకును తన భక్తుల పక్షముగా పని చేయుటకును యెహోవాకు ఆసక్తి కలదని పాత నిబంధన వాక్యములలో నున్నది. అట్టి వాక్యములు ముఖ్యముగా యెషయా గ్రంథములోను, దానికి సంబంధముగా నుండు రాజుల గ్రంథ భాగములోను నుండును (యెష 9[7] 37[32]=II రాజు 19[31], యెష 63[15] యెహె 5[13]). ఈ విధముగా క్రీస్తుకూడ దేవునిమందిరము విషయమైన ఆసక్తికి పక్షుఁడైయున్నట్లు చెప్పఁబడియున్నది (యోహా 2[17]=కీర్త 69[9]). భక్తులగు వారికి దేవుని విషయమును ఆయన వాక్యము విషయమును ముఖ్యముగా ఆసక్తి యున్నట్లు ఆయా వాక్యములలో నున్నది (II రాజు 10[16] కీర్త 119[139]). ఇట్టి యాసక్తి మాఱుమనస్సు పొందకపూర్వము పౌలుకును (ఫిలి 3[6] కార్య 22[3] గల 1[14]), యూదులకును (రోమా 10[2]) కొందఱు క్రైస్తవులకు (కార్య 21[20]) సహ యుండినను అది జ్ఞానానుసారమైనదై యుండలేదు. ఆసక్తితో జ్ఞానముకూడ యుండవలెను. లేనియెడల అది కీడునకు కారణమగును. క్రైస్తవులందఱికి జ్ఞానానుసారమైన యాసక్తి యుండవలెను (రోమా 10[2]). వారు సత్క్రియలందాసక్తిగల ప్రజలై ఇతరులనుండి ప్రత్యేకింపఁబడవలెను (తీతు 2[14]). తప్పులను దిద్దుటయందుకూడ ఆసక్తియుండుట మేలు (II కొరి 7[11]). ఆసక్తినిబట్టి క్రైస్తవులొకరి నొకరు హెచ్చరికచేసికొనవలెను (9[2]).

**ఆసనము** సింహాసనము చూ॥

**ఆసా** (Asa = వైద్యుఁడు). సొలొమోను ప్రపౌత్రుఁడు. అబీయాము పుత్రుఁడు. యూదా రాజులలో మూఁడవవాఁడు. 41 సం॥ ఏలి మృతినొందెను (I రాజు 15[10]). అప్పటికి దేశమున వ్యాపించిన విగ్రహారాధనను త్రోసివేసి దురాచారములను తొలగించెను. యెహోవా యారాధనను తిరిగి స్థాపించుటకు మిగుల ఆసక్తి గలవాఁడై జనసంఘమునందు దిద్దుబాటు చేసెను (I రాజు 15[11-14]). ఇతని యేలుబడి 14-వ సం॥ నందు ఐతియొపియ రాజగు జెరహు 10 లక్షల మందితో దండెత్తిరాఁగా ఆసాదేవునికి మొఱ్ఱబెట్టి, 5 లక్షల 80 వేల మందితో వానినెదిర్చి దేవునిసహాయముచేత వానిని దేశమునుండి దఱిమివేసెను (II దిన 14[9-15]). యూదుల చరిత్రలోఁ జెప్పఁబడిన గొప్పజయములలో నిదియొకటి

పదిహేనవ సంవత్సరమున ప్రవక్తయగు అజర్యా ప్రోత్సాహమువలన మతసంబంధమైన దిద్దుబాటును సమాప్తిజేసి యెహోవా బలిపీఠమును మఱలకట్టించి, ప్రజలచే యెహోవా సన్నిధిని ప్రమాణము జేయించెను (II దిన 15[1-15]). ముప్పది ఆరవ సంవత్సరమున ఇశ్రాయేలు రాజగు బయెషా బెన్యామీనుపై దండెత్తి యెరూషలేమునుండి ఉత్తరముగాఁబోవు మార్గమున రాకపోకలు జరుగకుండునట్లు రామా పట్టణమును కట్టించెను. ఆసా దానిని తిరిగి పట్టుకొని ఆ మార్గమున యథావిధిగా రాకపోకలు

జరిగింపఁజేయ చేతగాక దేవాలయపు బొక్కసమందలి వెండి బంగారులను దమస్కురాజగు బెన్హదదుకు బంపి అతనికి లంచముఁ గట్టెను. బెన్హదదు బయెషా తిరిగివచ్చునట్లతని దేశమును దండెత్తి రామానుండి యిశ్రాయేలీయుల సైన్యమును తనవైపునకు రప్పించుకొనెను. ఆసా రామాకుఁబోయి అచ్చటి రాళ్లు మ్రానులు మొదలగువాటి నన్నిఁటిని యూదావారిచేఁ దెప్పించి గెబను మిస్పాను ప్రాకారపురములుగాఁ గట్టించెను. ప్రవక్తయగు హనానీ ఆసాను గద్దించినందున అతడు కోపగించి హనానీని చెఱలో పెట్టించెను (I రాజు $15^{16-22}$ II దిన $16^{1-10}$). ముప్పది తొమ్మిదవ సంవత్సరమున పాదములలో జబ్బు కనిపించినందున మిగుల బాధనుపొంది దేవుని విచారించక వైద్యులను నమ్ముకొనెను (I రాజు $15^{23}$ II దిన $16^{12}$). చివరిదినములలో అతఁడు దేవునియందు భయభక్తులు గలిగియుండలేదు. నలుబదియొకటవ సం॥ మున మృతినొంది తాను సిద్ధపఱచుకొనిన రీతిగా మిగుల ఆడంబరముతో దావీదు పట్టణమున సమాధిచేయఁబడెను.

H.

**ఆసాపు** (Asaph = సమకూర్చుట).

1. రాజైన హిజ్కియాకాలములో లేఖికుఁడగు యోవాహుయొక్క తండ్రి (II రాజు $18^{18,37}$).

2. నెహెమ్యాకాలములో అడవులను కాయునొకసర్కారు ఉద్యోగస్థుఁడు. నెహెమ్యాకు కావలసిన కలపను దూలములను ఇయ్యవలెనని అర్తహషస్త తాఖీదు పంపినది యితనికే (నెహె $2^{8}$).

3. యాజకులగు కోరహీయులలో నొకఁడు (I దిన $26^{1}$). I దిన $9^{49}$ లో ఈ పేరు ఎబ్యాసాపు (ఎబి+ఆసాపు=తండ్రి సమకూర్చెను) అనియున్నది.

4. దేవాలయపు పాటకులలోని యొక కుటుంబమునకు పెద్ద. వీరిపేరులు ముఖ్యముగా ఆలయ నియమములను తెలియఁజేయు దినవృత్తాంతముల గ్రంథములలో కనఁబడును. వాటిని చూడఁగా ఆసాపు లేవీయుఁడగు గెర్షోను కుటుంబికుఁడై యున్నట్లు తెలియును (I దిన $6^{39,48}$). ఓబేదెదోము ఇంటినుండి మందసమును యెరూషలేమునకు తెచ్చుచుండఁగా ఆసాపు సంగీతమును వాయించువారిలో నొకఁడైయుండెను ($15^{16-19}$). ఆ తరువాత గుడారములోను అదే పనిచేయుటకు నియమింపఁబడెను ($16^{4-7}$). తదనంతరమున ఈ పని యితని కుటుంబికులకు భుక్తమయ్యెను ($25^{1-9}$). వీరిపేరులు II దిన $20^{14}$ $29^{13}$ లో కూడ కనఁబడును. చెఱకాలమునకు బిమ్మట వారిలో 128 మంది తిరిగి యెరూషలేమునకువచ్చి (ఎజ్రా $2^{41}$ నెహె $7^{44}$) ఆలయమునకు పునాది రాయివేసినపుడు స్తుతులను పాడినవారిలో కనఁబడెదరు (ఎజ్రా $3^{10}$). కీర్తనల గ్రంథములోని పన్నెండుకీర్తనలు ఆసాపు కుటుంబికులవై యున్నట్లు వాటిపై వ్రాఁతలవలనఁ దెలియును (కీర్త 50, 73,83). సంగీత నాయకులలో కడమవారివలె ఆసాపునకుఁగూడ దర్శకుఁడను బిరుదు (II దిన $29^{30}$) కలదు.

**ఆసియ** (Asia). ఇది ప్రస్తుతము ఆసియ ఖండమునకు పెట్టఁబడు పేరైయున్నది. అయితే చిన్న ఆసియ (*Asia Minor*) అను భూభాగము కూడ కలదు. అది నల్లసముద్రమునకును మధ్యధరా సముద్రమునకును మధ్యనుండి ఈజియన్ సముద్రమువఱకు వ్యాపించుచున్నది. ఆసియ ఖండముయొక్క పరిమాణమునుబట్టి దీనిని చిన్న ఆసియ యనఁదగునుగాని బైబిలులో నుదాహరించిన ఆసియ ఈ చిన్న ఆసియయొక్క పశ్చిమ భాగము మాత్రమైయున్నది (కార్య $19^{10,22,26,27}$ $20^{4,16,18}$ $21^{27}$ $24^{18}$ $27^{2}$ I కొరి $16^{19}$ II కొరి $1^{8}$ II తిమో $1^{15}$). ఎఫెసు అను పట్టణము ఈ ఆసియకు ముఖ్యపట్టణమై యుండెను. ముసియ పశ్చిమఫ్రుగియ లూదియ కారియ యను నాలుగు పరగణాలు ఈ ఆసియలో చేరియుండెను. ప్రకటన గ్రంథములోని యేడు సంఘములలో అన్నియు ఈ ఆసియలోని పట్టణములే.

**ఆసియ దేశాధికారులు** (Asiarchs). ఈ బిరుదు బైబిలునందు కార్య $19^{31}$ లో తప్ప మఱియెచ్చటను కానరాదు వారు ఎఫెసి పట్టణమందలి ఘనులని ఆ వాక్యమువలన స్పష్టమగుచున్నది. రోమనువారి చరిత్రనుబట్టి ఆసియ అనునది ఎఫెసు చుట్టునుండు పరగణాలుగాని

ఆసియ ఖండము యావత్తును కాదని తెలియుచున్నది. రోమా చక్రవర్తి గౌరవార్థమై చేయఁబడు ఏర్పాటులను చేయుటకును, రంగస్థలమునందు జరిగిన వేడుకలను క్రమముగా జరిపి, వాటి ఖర్చులనుగురించి చూచుటకును, ప్రతిపట్టణమందును యేఁటేట కొందఱిని నియమించినట్లు ఆకాలపు చరిత్రవలనఁ దెలియుచున్నది. ఈ విధముగా ఆసియలో నియమింపఁబడినవారు ఆసియ దేశాధికారులని తెనిఁగించిరి గాని వారు అధికారులు గాక పైఁజెప్పఁబడిన పనులనుమాత్రము జరుపుటకు నియమింపఁబడినవారై యుండిరి. వారి యుద్యోగముతో పాటు ఇతరోద్యోగములను వహించుటకు వీలుగనుండెను. వీరు మిగుల గౌరవార్హులుగనుండిరి. ఎఫెసునందు వారు పౌలును రక్షించుటకు కోరియిచ్చిన సలహాలను చూడఁగా వారికి పౌలుయందుగల యభిమానము కనఁబడుచున్నది.

**ఆసెనతు** (Asenath = నాతు అను ఐగుప్తు దేవతకు శిష్యురాలు). యోసేపు భార్యపేరు. ఈమె ఓనుయొక్క యాజకుఁడైన పోతీఫెర కూతురై యుండెను (ఆది 41[45,50] 46[20]).

**అస్నప్పరు** (Asnapper). చెఱపట్టఁబడిన ఇశ్రాయేలీయుల ముఖ్యపట్టణమగు షోమ్రోనుకు ఇతర జనులను గొనితెచ్చిన అష్షూరు చక్రవర్తులలో నొకఁడు. అష్షూరు బనిపాలుయొక్క మాఱుపేరని సాధారణముగా కొందఱనుకొందురు (అష్షూరు చూ॥). నీనెవెలో గొప్ప గ్రంథశాలలను గట్టించి, బాబెలువారి గ్రంథములక్కడ సమకూర్చి ప్రసిద్ధుఁడాయెను. క్రీ॥ శ॥ 1845 మొదలుకొని నవీనశాస్త్రజ్ఞులా శాసనములను కనుగొని, వాటిద్వారా యనేక పూర్వసంగతులను దెలిసికొనుచున్నారు. ఇతఁడు తన తండ్రియగు ఏసర్హద్దోనుకుఁ బిమ్మట నేలి అతనిరాజ్యమును కాపాడుట మాత్రమేగాక, ఏలాము వారిని ఓడించి, తన రాజ్యము వ్యాపింపఁజేసెను. అట్టి కాలములోనే ఎజ్రా 4[9,10] లోనున్న షూషన్కాయులును ఏలామీయులును షోమ్రోనుకు కొంచుపోఁబడిరి (షూషన్కాయులు, ఏలామీయులు చూ॥). బాబెలువారితనికాలములోఁ దిరుగఁబడిరికాని ఇతఁడు వారినోడించెను. బాబెలు వారిపక్షమున నప్పుడున్న యూదా రాజైన మనష్షేను పట్టుకొని, బాబెలుకు సంకెళ్లతోఁ దెచ్చి (II దిన 33[11]) రని కొందఱి యభిప్రాయము.

**ఆహాజు** (Ahaz = భోక్త). యూదారాజ్యపు 11-వ రాజు. క్రీ॥ పూ॥ 741-725 వఱకు 16 సం॥ లు రాజ్యమేలెను మిగుల దుష్టుఁడు యెహోవాను తృణీకరించి విగ్రహారాధికుఁడాయెను. యెరూషలేమునందు విగ్రహములను నిలుపుటయేగాక దేవాలయములోనే విగ్రహములను ఆరాధించునట్లు జేసెను (II రాజు 16[2-4, 10-18] II దిన 28[22-25]). యెషయా ఆమోసు మీకాయను ప్రవక్తలతని సెంతగద్దించినను అతఁడు తన దుష్టత్వమును విడువనొల్లకపోయెను. అతఁడు యెహోవాను విడిచినందున పెక్కు కష్టములకు లోనాయెను (యెష 7[1-25]). అయినను అతఁడాయన సహాయమునుగోరక, తనకష్టములలో వచ్చి ఆదుకొనుమని అష్షూరు రాజగు తిగ్లత్పిలేసెరునకు దేవాలయపు వెండిబంగారులనుపంపి వేడుకొనెను (II దిన 28[16-21]). చివరకు తిగ్లత్పిలేసెరు అతనిని లోబఱచుకొని మిగుల హీనపఱచెను (II రాజు 16, II దిన 28) గాన దమస్కుదేవతలు యెహోవాకంటె బలాఢ్యములనుకొని వాటి విగ్రహములను యెరూషలేము ఆలయమునందు నిలవఁబెట్టెను (II దిన 28[22-25]). 35 సం॥ ల వయస్సుగలవాఁడై యెరూషలేములో చనిపోయెనుగాని అతని దుష్టక్రియలనుబట్టి వానిని రాజుల సమాధులలో పాతిపెట్టలేదు.

H.

**ఆహారము** (Food). యూదులు చాల మట్టుకు శాఖాభక్షకులనియే చెప్పవలెనుగాని, పండుగ సమయములందును, గొప్పవారు అతిథులుగా వచ్చినప్పుడును బలులర్పించునప్పుడును మాంసాహారమునుపయోగించెడివారు. జలప్రళయమునకుఁ బూర్వము మానవకోటియంతయు శాఖాభక్షకులై యుండినట్లు ఆది 1[29] 9[3] వలనఁ దెలియుచున్నది. రాజులకాలమునందు దేశము సుభిక్షముగా నున్నప్పుడు ప్రజలెట్టి పదార్థముల ననుభవించిరో II సమూ 17[28,29] I రాజు 4[22] నందు జూడవచ్చును. ఈ శీర్షికయందు హెబ్రీయులు భుజించిన యాహారపదార్థములనుగురించి మాత్రము దెలిపెదము.

I శాఖములు

1. ధాన్యాదులలో గోధుమలు, యవలు ముఖ్యయాహార పదార్థములు. జొన్నలు, సజ్జలు నుపయోగించెడివారు (యెహె $4^{9}$). పైరింక కోయఁబడక పూర్వమే పచ్చి వెన్నులను త్రుంచి (లేవీ $23^{14}$ II రాజు $4^{42}$) చేతులతో నలుపుకొని (ద్వితీ $23^{25}$ లూ $6^{1}$) తినిరి. ఊచ బియ్యమును వేయించి తిరుగట విసరి ప్రథమ ఫలముగా దేవుని కర్పించిరి (లేవీ $2^{14,16}$). ధాన్యమును మంగలముమీఁద వేయించి పేలాలుగాఁ జేసికొని తినుట పూర్వకాలమునందే గాక యిప్పటికిని అందఱికి మిగుల యిష్టము (రూతు $2^{14}$). గోధుమలను యవలను పిండి విసరి రొట్టెలు జేసికొందురు. విసరిన పిండిని జల్లించి సన్నపు పిండిఁ దీసిరి (II రాజు $4^{42}$). యవల రొట్టెలను సాధారణ ప్రజలు వాడిరి (న్యాయా $7^{13}$ యో $6^{9,13}$). సంఖ్యా $15^{20}$ యెహె $44^{30}$ లో నున్న పిండిముద్ద ముతకపిండితోఁ జేయఁబడు సర్వసాధారణమగు రొట్టెయై యుండెను (I రాజు $4^{22}$).

2. కాయధాన్యములలో చిక్కుడు గాయలు, అలచందలు ముఖ్యమైన ఆహార పదార్థములు. దాని $1^{12,16}$ నందు శాఖ ధాన్యములని తర్జుమా జేయఁబడిన పదము సర్వసాధారణముగా నుపయోగింపఁబడు కూరగాయలను తెలుపునదై యున్నది ఎఱ్ఱయెఱ్ఱగా నున్నదానిలోఁ గొంచెము పెట్టుమని ఏశావు అడిగినది (ఆది $25^{30}$) చిక్కుడుగింజలలో ఉల్లిపాయలను ఇతరమైన వాటినివేసి ఇప్పటికిని సిరియదేశమునఁ జేసికొను వంటకమైయున్నది. అప్పుడప్పుడీచిక్కుడు గింజలను కాయధాన్యములను కలిపి విసిరిరొట్టెలను జేసికొందురు (యెహె $4^{9}$). ఐగుప్తునుండి వచ్చుచుండఁగా మార్గమున ఇశ్రాయేలీయులుకోరిన కీరకాయలు దోసకాయలు కూరాకులు ఉల్లిపాయలు తెల్లగడ్డలు (సంఖ్యా $11^{5}$), తరువాత పలస్తీను దేశమునందు పండించుకొనిరి పస్కా పశువు మాంసమును చేదుకూరలతో భుజించెడివారు (నిర్గ $12^{8}$).

3. వృక్షఫలములలో నీ దిగువ నుదాహరింపఁబడినవి ఆహార పదార్థములుగ నెంతో తోడ్పడెను. ఒలీవ వృక్షఫలములను ఆహారముగా వాడినట్లు చెప్పఁబడక పోయినను మనము భోజనము సిద్ధపఱచుకొనునప్పుడు నూనెను నేతిని వాడు రీతిగా ఒలీవనూనెను బహుగా నుపయోగించుకొనిరి (న్యాయా $9^{8}$). పండ్లను తినుటయేగాక, ఊరుగాయఁ బట్టుకొని ఇప్పటికిని దేశమున నందఱును వాడుకొనుచున్నారు. అంజూరపు వృక్షఫలములు మాధుర్యమునకు మిగుల ప్రసిద్ధికెక్కి యందఱి చేతను మిగులఁ గోరఁబడెను. అంజూరపు పండ్లను అడలుగాఁ జేసి చాల కాలముదనుక నుంచుకొనిరి (I సమూ $25^{18}$ I దిన $12^{40}$). ద్రాక్షపండ్లు, ఎండు ద్రాక్షపండ్లు, ద్రాక్షాపండ్ల అడల నుపయోగింపని వారు లేనేలేరు. ద్రాక్షా రసము సాధారణమగు పానీయము. ఈత చెట్టు ఫలవృక్షముగా యోవే $1^{12}$ నందు మాత్రముదాహరింపఁబడినను ఆ చెట్టు పండ్లను ప్రజలువిరివిగా నుపయోగించిరి. వాటి నెండఁ బెట్టియు, అడలనుగాఁజేసియు ఇతరదేశముల కెగుమతిజేసిరి. దానిమ్మ (సంఖ్యా $13^{23}$) బాదాము (ఆది $43^{11}$) మొదలగువాటిని ఉపయోగించిరి.

II మాంసాదులు.

1. పెంపుడు జాతి జంతువులలో అన్నియు తినఁదగినవికావు. కొన్ని నిషేధింపఁబడెను (లేవీ $11^{4-8}$ ద్వితీ $14^{7-8}$). మేక, మేకపిల్లల మాంసము అందఱికి దొఱకఁ గలిగిన యాహారము (లూ $15^{29}$). గొఱ్ఱెలు, ఆవుల మాంసము మంచి యాహారముగా నెంచిరి (ఆది $8^{7}$ నిర్గ $29^{22}$ I రాజు $4^{23}$ సామె $15^{17}$ నెహె $5^{18}$). వీటి మాంసమునే గాక పాలు వెన్న, గజ్జిగలను ఆహార పదార్థములుగ వాడిరి (ద్వితీ $32^{14}$ సామె $27^{27}$). ఒంటెపాలను అదేవిధముగ నుపయోగించిరి (ఆది $32^{15}$).

అడవి జంతువులలో తినఁదగినవాటి జాబితా ద్వితీ $14^{5}$ నందున్నది. ఎఱ్ఱజింక, చిన్నదుప్పి యను వాటిని ముఖ్యముగా మాంసము నిమిత్తము వేటాడిరి (ద్వితీ $12^{15}$). ఎఱ్ఱదుప్పులనుకూడ వేటాడినట్లు I రాజు $4^{20}$ నందు కనఁబడుచున్నది. వీటిలో నేదోయొకదానిని వేటాడి

ఏశావు తన తండ్రికిష్టమైన రుచిగల భోజ్యమును సిద్ధపఱచితెచ్చెను. (ఆది $25^{28}$ $27^{4}$). నిషిద్ధ జంతువులలో పంది కుందేలు ఒంటె గాడిద ముఖ్యములైనవి (లేవీ $11^{7}$ ద్వితీ $14^{8}$ మ $8^{30}$).

2. చేపజాతిలో **రెక్కలు పొలుసులు** గల వాటినన్నిఁటిని తినిరిగాని రెక్కలు పొలుసులు లేనివాటిని నిషేధించిరి (ద్వితీ $14^{9}$ లేవీ $11^{9-12}$). చేపజాతిలో నిషిద్ధమగువాటిని మఱి యొకరీతిగా ప్రత్యేకించలేదు. ఐగుప్తునందుండఁగనే చేఁపలను నిరాటంకముగాఁ దినిరి (సంఖ్యా $11^{5}$). జెబూలూను ఇశ్శాఖారు గోత్రికులకు చేఁపలు దొఱకు స్థానములుండినట్లు ద్వితీ $33^{19}$ వలనఁ దెలియుచున్నది. నెహెమ్యా కాలమున తూరుదేశస్థులు చేఁపలవర్తకము యెరూషలేమునందు బాగుగా సాగించిరి (నెహె $13^{16}$). గలిలయ సముద్రముమీఁద చేఁపలవర్తకము విశేషముగ జరిగెనని యోసీఫసువలనఁ దెలిసికొనుచున్నాము. చేఁపలకు ఉప్పుపట్టించి యెండఁబెట్టి యొగుమతిజేయుట సర్వసాధారణమై యుండెను. ఇవి ప్రయాణమున కనుకూలముగా నుండునుగాన క్రీస్తు రెండుమారు లద్భుతరీతిగా భోజనముపెట్టినప్పుడు ఇట్టి చేఁపలనే పెట్టి యుండునని దోఁచుచున్నది.

3. పక్షిజాతిలోను తినఁదగనివాటి జాబితా యొకటిగలదు (లేవీ $11^{13-19}$ ద్వితీ $14^{11-18}$). వీటిలో దాదాపుగా నన్నియు వేటాడుజాతికి సంబంధించినవి. **పావురములు గువ్వలు** తినుటకు మాత్రమేగాక బలియర్పణల కొఱకును పనికి వచ్చెను. ప్రస్తుతము పలెస్తీనునందున్న **ఇంటి కోళ్లు** పారసీకుల కాలమున దేశములోకి వచ్చెను (II ఎస్రా $1^{30}$ మ $23^{37}$ $26^{34}$). సొలొమోను కాలమున **బాతులను** ఆహారముగా నుపయోగించిరి (I రాజు $4^{23}$). అడవి పక్షులలో **కౌజుపిట్టలును** (I సమూ $26^{20}$ యిర్మీ $17^{11}$) **పూరేడులును** (నిర్గ $16^{13}$ సంఖ్యా $11^{31}$ కీర్త $105^{40}$) తినఁదగినవి. నెహె $5^{18}$ నందు కోళ్లు అనఁబడినవాటిలో ఇవన్నియున్నట్లు తోఁచుచున్నది. **పిచ్చుకలను** తినుట గౌరవహీనమని గొప్పవారు తలంచిరి (మ $10^{29}$ లూ $12^{6}$). **పవిత్రపక్షుల గ్రుడ్లను** ఆహార పదార్థములుఁగ నెంచిరి (ద్వితీ $22^{6}$ యోబు $6^{6}$ యెష $10^{14}$ లూ $11^{12}$).

4. మాంసాహారము క్రిందనే **మిడుతలు** వచ్చును (లేవీ $11^{22}$ మ $3^{4}$ మా $1^{6}$). వీటికి ఉప్పు పట్టించి ఊరగాయలవలె నిలువఁజేసి యుంచెడివారు. తేనెటీగల వలనవచ్చు **తేనెయు** ఆహార పదార్థమే.

III. సంబార ద్రవ్యములు:—ఆహార పదార్థములను రుచికరమగునవిగాఁ జేయుటకు ఇతరములగు ద్రవ్యములను వాటితో వాడవలసియున్నదను సంగతి యందఱికిని విశదమే. **ఉప్పు** అట్టి వాటిలో ముఖ్యమైనది. (ఉప్పు చూ॥). **కొత్తిమెరగింజలు** (నిర్గ $16^{31}$ సంఖ్యా $11^{7}$), **నల్లజీలకర్ర** (యెష $28^{25}$), **పుదీనా** (మ $23^{23}$), **సోంపు** ($23^{23}$), **జీలకర్ర** ($23^{23}$), **సదాప** (లూ $11^{42}$), **ఆవాలు** ($13^{19}$) మొదలగు వాటినన్నిఁటిని కొద్దిగానో గొప్పగానో కూరలలో వేసికొనిరి. మిరియాలను వాడినట్లు పారంపర్య గ్రంథములలో నున్నది. **బుడ్డబుడుసరకాయలను** ఆకలి పుట్టించుటకు తినెడివారు (ప్రస $12^{5}$).

IV. నిషిద్ధ పదార్థములు:—అపవిత్ర జంతువులు మాత్రమేగాక ప్రతి జంతువుయొక్క రక్తమును నిషిద్ధము (ద్వితీ $12^{16,23,25}$ $15^{23}$ లేవీ $3^{16}$ $7^{26}$ $17^{10}$). ఆహారము కొఱకుగాని బలికొఱకుగాని వేటకొఱకుగాని చంపఁబడు ప్రతిదాని రక్తము మొదట చిందింపఁబడవలసినదే. బలిగా అర్పింపఁబడు పశువుల క్రొవ్వును ఇంక కొన్ని భాగములను తినరాదు (లేవీ $3^{6}$ $7^{23}$ మొ॥). చచ్చిన ప్రతిజంతు మాంసము నిషిద్ధము (నిర్గ $22^{31}$ లేవీ $17^{15}$). తొడగూటి మీఁది **తుంటి నరమును** నిషిద్ధమే (ఆది $32^{32}$). విగ్రహార్పితములైన వన్నియు యూదులకు నిషిద్ధములు (దాని $1^{8}$ II మక్క $5^{27}$ కార్య $15^{20,29}$ I కొరి $8^{1-10}$ $10^{19,28}$).

ప్రజలకీ భోజన పదార్థములన్నియు వారి మందల వలనను తోఁటల వలనను లభించెను (ఆది $18^{7}$ $27^{9}$ I రాజు $21^{2}$). వీరు దేశమున స్థావరము లేర్పఱచుకొని పట్టణములయందు స్థిరపడిపోవు నప్పటికి వాటి నితరుల కమ్ముటకును

వీలుకలిగెను. ఇతరులను రొట్టెలు కావలసినప్పుడు స్వంత యిండ్లలోఁ జేసినవి అమ్మకమునకు చాల నందున, జనులకనుకూల ప్రదేశములందు వాటికి ప్రత్యేక గృహములను గట్టించి చేసియమ్మిరి. అట్లు యెరూషలేమునందొక వీధికి **రొట్టెలు కాల్చువారి వీధి** యను పేరు (యిర్మీ 37[21]) గలిగెను. నెహెమ్యా దినములలో ఆహార వస్తువులను పట్టణములో నమ్ముట చూడవచ్చును (నెహె 13[15]), యెరూషలేమునందలి **గొఱ్ఱెల గుమ్మము** (3[1]), **మత్స్యపుగుమ్మము** (3[3]) అనునవి గొఱ్ఱెలను, చేపలను అమ్మిన స్థలపుపేర్లు అని యూహింపఁదగును. ఇట్లు క్రమక్రమేణ అంగళ్లు బజారులను వ్యాపారపు టిండ్లను వృద్ధిలోకి వచ్చెను. చివరకు దేవాలయ ప్రాంగణములనే వ్యాపారపుటిల్లుగాఁ జేసిరి (యోహా 2[16]).

## ఇ

**ఇంగిలీకము** రంగులు 5 చూ॥

**ఇంద్రధనుస్సు** (Rain-bow). వర్షము కురియునప్పుడా నీటిబొట్లగుండా సూర్యకిరణములు ప్రసరించి కొంచెముగావంగి ప్రతిఫలించుటనుబట్టి సూర్యునికెదుటి ప్రక్కను తరుచుగా నిది కనఁబడును. జలప్రళయమైన పిదప దేవుఁడు దీనిని రక్షణార్థమైన తనకృపకు సూచనగా నేర్పఱచెను (ఆది 9[12-17]). యెహె 1[28] ప్రక 4[3] లోని దైవ దర్శనములలో ఇంద్రధనుస్సు దేవుని సింహాసనము చుట్టునున్నట్లు వర్ణింపఁబడెను. అది దేవుని విశ్వాస్యతను ఆయన కనికరమునకును సూచనగానున్నది.

**ఇంద్రనీలము** రత్నములు 2 చూ॥

**ఇక్కేషు** (Ikkesh = మూర్ఖము). దావీదు యోధులలో నొకఁడగు ఈరాయను వానితండ్రి (II సమూ 23[26] I దిన 11[28]).

**ఇగాలు** (Igal = న్యాయము చేయును).

1. ఇశ్శాఖారు గోత్రికుఁడును కనానుదేశమును వేగుచూచుటకు మోషే పంపించిన వారిలో నొకఁడు (సంఖ్యా 13[7]).

2. దావీదు యోధులలోనొకఁడు. ఇతఁడు సోబావాఁడును నాతానుకొడుకు (II సమూ 23[36]). I దిన 11[38] లో ఈ పేరునకు బదులుగా **నాతాను సహోదరుడైన యోవేలు** అను పేరుకలదు.

3. దావీదు సంతతివారిలో నొకఁడు. ఇతఁడు రాజైన యెకొన్యా సంతతిలోని షెమయా యను వాని కుమారుఁడు (I దిన 3[22]).

**ఇచ్ఛ** దురాశ చూ॥

**ఇజ్రహయా** 1. (Izrahiah = యెహోవా ఉదయించును). ఇశ్శాఖారు సంతతివారిలో నొక పెద్ద (I దిన 7[3]).

2. (Jezrahiah = యెహోవా ప్రకాశించును). నెహెమ్యాకాలములో యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించినప్పుడు పాటలు పాడినవారిపెద్ద (నెహె 12[42]).

**ఇటలి, ఇటలీ** (Italy). బైబిలులో ఈ పేరు క్రొత్త నిబంధనయందు మాత్రము కనఁబడును. అది యిప్పటి యిటలీదేశమునకు సమమైన భూభాగమునకు పేరై యుండెను. దానికి ముఖ్యపట్టణమగు రోమా అప్పట్లో సర్వలోకమునకు ప్రధానపట్టణమై యుండెను. **ఇటలి పటాలమను** సేన యొకటి కైసరయలో నుండెను (కార్య 10[1]). అకుల ప్రిస్కిల్ల యనువారు కొంతకాలము ఇటలిలో నుండి క్లౌదియ చక్రవర్తి యాజ్ఞ చొప్పున నచటినుండి వెళ్లిపోయిరి (కార్య 18[2]). కైసరయ చెఱలోనుండి పౌలు కైసరునకు అప్పీలు చేసికొనఁగా ఫేస్తు అతనిని ఇటలీకిఁ బంపెను (కార్య 27[1-6]). (పౌలు 5 (2-4) చూ॥).

హెబ్రీ 13[24] చూడఁగా ఇటలివారు సలాములు పంపినట్లున్నది. అందువలన క్రైస్తవులు తత్కాలమందు ఇటలిలో మాత్రము గాక వేఱు దేశములలోకూడ నున్నట్లు స్పష్టమగును. ఇచట సలాములు పంపినవారు ఇటలి దేశములోని క్రైస్తవులుకాక ఇతర దేశములలో నుండిన ఇటలివారని సాధారణముగా ననుకొందురు.

**ఇటిక** (Brick). పూర్వకాలమున ఇండ్లు పట్టణములు నగరులు మొదలగువాటి గోడలు ఎండిన గుండ్రని యిటుకలతో కట్టిరి గాని పండుటిటుక లుపయోగింపలేదు. పలెస్తీను బబులోను దేశములలో వాడిన యిటుకలు ఈ దేశమందలి యిటుకలకన్న చాల పెద్దవియు మిగుల చదు

సైనవియునై యుండెను. గాని ఐగుప్తుదేశమందలివి ఈ దేశపు యిటుకలవంటివి. అచ్చట వర్షము మిగుల తక్కువ గాన పచ్చి యిటుకలు మిగుల సులభముగ నెండును. చేసిన యిటుకలు వారము దినములలో నెండి పని కుపయోగపడును. గడ్డి పోచలను తుత్తునియలుగా నరికి మట్టితో కలిపి యిటుకలను చేసెడివారు. చొప్ప పశ్వాదుల మేతకు కావలసియుండును గాన ఇటుకలు చేయువారు దానికిబదులు తరుముగా కొయ్యకాలు సంపాదించుకొందురు. నోపుపురము (యిర్మీ 44[1]) నందొక గోడమీఁద చెఱకుఁ గొనిపోఁబడిన వారిలో ననేకులు ఇటుకలు చేయుచున్నట్లును, వారిమీఁదనుండు కార్యనియామకులు తమ చేతులతో కర్రలుపట్టుకొని కూర్చుండియున్నట్లును చిత్రపులు వ్రాయఁబడియున్నవి. చెఱకు పోయినవారి ముఖ్యమైనపని యిటుకలు చేయుటయే యని కనఁబడుచున్నది. రాజుల కట్టడముల కొఱకు చేయఁబడినవాటిపై రాజుల పేరులు ముద్రించిరి. క్రీ॥ శ॥ ముందు 1400 సం॥ క్రిందట ఐగుప్తుదేశములో వాడఁబడిన యిటుక యచ్చులును ముద్రలును ఇంకను గలవు. బాబెలు గోపురమును కట్టినవారు తాము జేసిన యిటుకలను కాల్చిరి (ఆది 11[3]).

J. C.

**ఇడుమలు** తెగుళ్లు చూ॥

**ఇతూరయ** (Ituraea). పలెస్తీనుకు ఈశాన్యదిక్కున యొర్దానుకావలనుండు నొక ప్రదేశము. అది 25[15] లో నున్న యెతూరు యెతూరయులకు పూర్వికుఁ డనుకొందురు. వీరును తతిమ్మ అరబ్బీయులవలె తిరిగాడువారై నిలుకడైన స్థావరము లేకుండువారు. లూ 3[1] లో సహ ఇది యొకదేశమునకుగాక ఒక తెగయొక్క పేరని కొందఱనుకొందురు. అయితే యూదుల చరిత్రకారుఁడగు యోసీఫసు (పురా 13,11,3) ఇది క్రీస్తు శకమునకు పూర్వము 105 వ సం॥ నందు యూదయకు చేర్చఁబడిన దేశమని వ్రాసెను గనుక, అది అప్పటినుండి బహుశః ఒక ప్రత్యేక దేశమాయెనని యెంతురు. రోమనులా దేశమును స్వాధీనపరచుకొన్న పిదప దానిని తమ కిష్టమైన వారికి జాగీరుగా నిచ్చిరి. ఇట్లది క్రొత్త నిబంధన కాలములో వారి యనుమతి ప్రకారము చతుర్థాధిపతియైన ఫిలిప్పున కిచ్చిరి (లూకా 3[1]. పటము I GH 2, 3).

**ఇత్కాచీను** (Ethkazin). జెబూలూను గోత్రపు సరిహద్దు ఊళ్లలో నొకటి (యెహో 19[13]).

**ఇత్తడి** లోహములు (3) చూ॥

**ఇత్తడితలుపు** కోట I 3 చూ॥

**ఇత్తడితొట్లు** దేవాలయము I 7 (1) (*c*) చూ॥

**ఇత్తడిసముద్రము** దేవాలయము I 7 (1) (*b*) చూ॥

**ఇత్తడిసర్పము** (Brazen serpent) ఇశ్రాయేలీయులు అవిశ్వాసులై 40 సం॥ లవఱకు అరణ్యములో సంచారముచేయునప్పుడు 39 వ సం॥ నందు హోరుకొండయొద్దకు వచ్చిరి. అచ్చట వారు సణిగినందున తాపకరములగు సర్పములువచ్చి వారిలో ననేకులను కఱచెను గాన వారియందనేకులు చనిపోయిరి. అంతట వారు భయముతో నిండినవారై, పశ్చాత్తాపపడి యెహోవాను వేడుకొనుమని మోషేకు మనవిఁ జేయగా నతఁడు దేవుని యాజ్ఞనుపొందినవాఁడై ఆ సర్పములవంటిదాని నొకటి యిత్తడితోఁ జేయించి స్తంభముమీఁద పెట్టించెను. తాపకరములగు సర్పములచే కఱువఁబడినను దేవుని యాజ్ఞచే దానివంకఁ జూచిన ప్రతివాఁడును బ్రతికెను (సంఖ్యా 21[4-9]). వారిది స్పష్టపరచిన దా యిత్తడిసర్పముగాక దేవుఁడేయై యుండెను. తమకు కలిగిన రక్షణ జ్ఞాపకార్థమై వారు దానిని మంచిబుద్ధితోనే భద్రపఱచిరి గాని యూదారాజయిన హిజ్కియా కాలమునాటికి, ప్రజలు దాని నొకవేల్పుగా భావించి యారాధింప మొదలిడినందున అతఁడు దానిని భిన్నాభిన్నములు జేయించి యిత్తడితునకయని అర్థమిచ్చు **నిహుష్టాను** అను పేరుబెట్టెను (II రాజు 18[4]). ఆ యిత్తడిసర్పము మెస్సీయ కొక ముంగుర్తుగా నుండెను. క్రీస్తే విధముగానే సిలువమీద నెత్తఁబడెను. విశ్వాసముతో నెవరు ఆయనవైపు కన్నులుత్రిప్పి తేరిచూతురో వారే దేశపువారైనను రక్షింపఁబడెదరు.

H.

**ఇత్తయి, ఈతయి** (Ittai, Ithai = దున్ను వాఁడు?).

1. దావీదు యోధులలో నొకఁడు. ఇతఁడు బెన్యామీనీయుఁడు (II సమూ $23^{29}$). I దిన $11^{31}$ లో దీనికి **ఈతయి** అను మాఱురూపము అసలులోను ఉన్నది.

2. గాతు అను ఊరివాఁడైన ఫిలిష్తీయుఁడు. అతఁడు 600 మందికి అధిపతియైయుండెను. అబ్షాలోము దావీదుకు విరోధముగా తిరుగుబాటుచేసినప్పుడు ఈ ఇత్తయి యనువాఁడు తన సైనికులతోఁ గలసి దావీదుపక్షమున పోరాడెను. దావీదు అతనిని ఇంటికివెళ్లుమని సెలవిచ్చినను అతఁడొప్పుకొనక దావీదును విడువకయుండి అతనితోకూడ వెళ్లెను (II సమూ $15^{18-22}$). పిమ్మట అబ్షాలోము అపజయమొందిన యుద్ధమందు ఇతఁడు దావీదుసైన్యములో మూఁడవ భాగమునకు అధిపతియయ్యెను ($18^{2}$).

**ఇత్మా** (Ithmah = మరణమువలన కలుగు దుఃఖము). దావీదు యోధులలో నొక మోయాబీయుఁడు (I దిన $11^{46}$).

**ఇత్రా, యెతెరు** (Ithra, Jether = సమృద్ధి). దావీదుతోఁబుట్టువగు అబీగయీలు పెనిమిటి. అమాశాయొక్క తండ్రి (II సమూ $17^{25}$ I దిన $2^{13-17}$). II సమూ $17^{25}$ నందితఁడు ఇశ్రాయేలీయుఁడని యున్నను, I దిన $2^{17}$ లో ఇష్మాయేలీయుఁడని యున్నందున ఇతఁడు ఇష్మాయేలీయుఁడనియే యెంతురు. I రాజు $2^{5,32}$ లో నితనికి యెతెరు అను మాఱుపేరు గలదు.

**ఇత్రాను** (Ithran = సమృద్ధి).

1. ఏశావు సంతతివారగు హోరీయులలో నొకఁడు (ఆది $36^{26}$ I దిన $1^{41}$).

2. ఆషేరువారిలో నొకఁడు (I దిన $7^{37}$). 38 వచనములో నితనిపేరుకు **ఎతెరు** అను మాఱురూపము కలదు.

**ఇత్రీయుడు, ఇత్రీయులు** (Ithrite, Ithrites). ఒక కుటుంబపుపేరు (I దిన $2^{53}$). దావీదు యోధులలో నిద్దఱీకుటుంబికులై యుండిరి (II సమూ $23^{38}$ I దిన $11^{40}$). యెతెరు అనువాని సంతానీకులగుటచే నీ కుటుంబమున కీపేరు వచ్చినట్లున్నది. గాని కొందఱు, వారు యత్తీరు అనెడి గ్రామమునుండి వచ్చినవారుగాన ఈ బిరుదు వారికి కలిగెననుకొనుచున్నారు. (యత్తీరు చూ॥)

**ఇత్రెయాము** (Ithream = ప్రజల సమృద్ధి). దావీదు ఆరవ కుమారుఁడు (II సమూ $3^{5}$ I దిన $3^{3}$).

**ఇదలా** (Idalah). జెబూలూను సరిహద్దు పట్టణములలో నొకటి (యెహో $19^{15}$).

**ఇదూమయ** ఎదోము చూ॥

**ఇద్దో** (Iddo, Adaiah = అలంకరింపఁబడిన).

1. కాసిప్యాయను స్థలమందుండు నొక అధికారి. ఎజ్రా బబులోనునుండి యెరూషలేమునకు యూదావారిశేషమును నడిపించునపుడు లేవీయులను నెతీనీయులను ఎజ్రాను వెంబడించి వెళ్లునట్లు చేయుటకు సహాయపడినవాఁడు (ఎజ్రా $8^{17-20}$).

2. మనష్షే సంతతివారిలో నొకఁడు. ఇతఁడు యొర్దానుకు తూర్పుననుండిన మనష్షే అర్ధగోత్రపువారిలో నొక అధికారియైయుండెను (I దిన $27^{21}$).

3. గిలాదుదేశమందలి మహనయీములో సొలొమోనుకొఱకు ఆహారవస్తువులను సమకూర్చిన యొక అధికారి తండ్రి. (I రాజు $4^{14}$) ఇతఁడును పై 2 లో చెప్పినవాఁడు నొక్కఁడే యైయుండవచ్చును.

4. గెర్షోను కుటుంబికుఁడగు ఒక లేవీయుఁడు (I దిన $6^{20}$). I దిన $6^{41}$ లో ఇతనికి **అదాయా** యను పేరుకలదు (అదాయా 2 చూ॥)

5. ఒక ప్రవక్త. ఇతఁడు సొలొమోను (II దిన $9^{29}$), రెహబాము (II దిన $12^{15}$), అబీయా (II దిన $13^{22}$) అను రాజులచర్యలను వ్రాసినట్లు కనఁబడును. జ్ఞానదృష్టిగలవాఁడు అనుబిరుదు ఇతనికుండెను. ఈ బిరుదుయొక్క అసలు భాషాపదమును చూచినయెడల అతఁడు దీర్ఘదర్శియు ప్రవక్తయునై యున్నట్లు తెలియును.

6. ప్రవక్తయగు జెకర్యా తాత (జెక $1^{1,2}$ ఎజ్రా $5^{1}$ $6^{14}$).

7. జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు వెళ్లిన యాజకులకుటుంబములలో నొకదానిపేరు (నెహె $12^{4,16}$). ఇతఁడును 6 లోఁ జెప్పిన వాఁడు నొకఁడే యైయుండవచ్చును. నెహె $12^{4-7}$ లో ఇతనిపేరు యెదాయా అనియున్నది.

**ఇద్బాషు** (Idbash = తేనె మధురమైనది!). యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $4^{3}$).

**ఇనుపదంతె** (Ha-rrow). ఇది I దిన $20^{3}$ నందు అమ్మోనీయులను శిక్షించుటకు దావీదు వాడిన పనిముట్లలో నొకటి. II సమూ $12^{31}$లో **పదును గల ఇనుపపని ముట్లు** అని యున్నది. భూమిని దున్ని, మట్టిపెల్లలను నలగఁగొట్టి భూమిని చదునుచేయుటకు బైబిలుకాలములో పలెస్తీనునందు దంతెలను వాడినట్లుగా నే సూచనలును లేవు. ఆ పనికొఱకు వారు నాగలినిగాని గుద్దలినిగాని వాడిరి. పైనున్న పదములను వేరు అచ్చులతో చదివినయెడల దావీదు అమ్మోనీయుల నిట్టి ఇనుపదంతెలతో శిక్షింపక, అట్టివాటితో వారిచేత వెట్టిపని చేయించెనని యర్థమగును. ఇదే దాని సరియైన అర్థమని నవీనవేదశాస్త్రులు అనుకొందురు.

**ఇనుము** లోహములు 4 చూ॥

**ఇపెదయా** (Iphdeiah = యెహోవా రక్షించును). బెన్యామీనీయుల ప్రధానులలో నొకఁడు (I దిన $8^{25}$).

**ఇబ్నీయా** (Ibnijah = యెహోవా కట్టును). ఒక బెన్యామీనీయుఁడు (I దిన $9^{8}$).

**ఇబ్నెయా** (Ibneiah = యెహోవా కట్టును). ఒక బెన్యామీనీయుఁడు (I దిన $9^{8}$).

**ఇబ్రీ** (Ibri = హెబ్రీయుఁడు). మెరారీయుల తెగలోని యొక లేవీయుఁడు (I దిన $24^{27}$).

**ఇబ్లెయాము** (Ibleam = ప్రజలు తగ్గిపోవుదురు). యొర్దానునదికి పశ్చిమముననుండు మనష్షే అర్ధగోత్రమునకు చేరిన యొక యూరు (యెహో $17^{11}$ న్యాయా $1^{27}$). దీనికి సమీపమునందు యూదారాజైన అహజ్యా ప్రాణహానికరమైన ఒక గాయమునొందెను (II రాజు $9^{27}$) I దిన $6^{70}$ లో దీనికి **బిలియాము** అను పేరుకలదు. యెహో $21^{25}$ లో దీనికి బదులుగా **గత్రిమ్మోను** అను పేరున్నది. ఇది యెహో $21^{24}$లో పొరబాటుగా వచ్చినట్లున్నది. LXX లో ఇది **ఇబ్లెయాము** అనుదానికి సంబంధించిన పేరుగా నున్నది. (పటము IV, D 8)

**ఇబ్సాను** (Ibzan = ప్రసిద్ధమైన). న్యాయాధిపతులలో పదవవాఁడు (న్యాయా $12^{8-10}$). నజరేతునకు నైరుతిదిక్కున ఏడుమైళ్ల దూరమున నున్న జెబూలూను భాగమందలి బేత్లెహేము వాఁడు. అతనికి ముప్పదిమంది కుమారులును, ముప్పదిమంది కుమార్తెలును గలరు. తన గౌరవమునకు తగినట్లుగ అతఁడు వారి వివాహపు ఏర్పాటులఁ గావించెను. యెఫ్తాకు పిమ్మట ఏడు సంవత్సరముల వఱకు ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతిగ నుండెను. అతఁడు బేత్లెహేములో చనిపోయి పాతిపెట్టఁబడెను. యూదుల పారంపర్యముల ప్రకారము ఇబ్సాను బోయజై యున్నాఁడు. H.

**ఇభారు** (Ibhar = ఆయన యేర్పఱచుకొనును). దావీదు కొడుకులలో నొకఁడు. ఇతఁడు యెరూషలేమునందు జన్మించెను (II సమూ $5^{15}$ I దిన $3^{6}$ $14^{5}$).

## ఇమ్నా, యిమ్నా, యిమ్నీయులు

1. (Imna = దేవుఁడు అడ్డగించును!) ఆషేరుగోత్రికులలో నొక ప్రధాని (I దిన $7^{35}$).

2. (Imnah or Jimnah = దేవుఁడు భాగముపెట్టును). ఆషేరు కొడుకులలో నొకఁడు (సంఖ్యా $26^{44}$ I దిన $7^{30}$ ఆది $46^{17}$). ఇతని సంతతివారు యిమ్నీయులనఁబడిరి.

3. రాజైన హిజ్కియాకాలములో నుండిన యొక లేవీయుఁడు (II దిన $31^{14}$).

(ఈ పేరులను అసలుభాషలో చూడఁగా 1 లోని దానికిని, 2, 3 లోని వాటికిని ఇంగ్లీషు తర్జుమాలోనున్నట్లు గుణింతభేదము కనఁబడును).

**ఇమ్మానుయేలు** (Immanuel = దేవుఁడు మనకు తోడు). ఈ పదము యెష $7^{14}$ $8^{8}$ మ $1^{23}$ నందు మాత్రమున్నది. కీర్త $46^{7,11}$ నందుకూడ

దీని యసలుపదమున్నదిగాని అచ్చటాపదమొకని పేరుగా లేదు. యెష $8^{8}$ నందు పలెస్తీను ఇమ్మానుయేలుయొక్క దేశమని చెప్పఁబడెను. ఆ వాక్యములోను 46-వ కీర్తనలోవలె, ఒకనిపేరు గాక దేవుఁడు మనకు తోడు అని యర్థమిచ్చు మాటలని కొందఱి యభిప్రాయము. ఒక చిన్నయక్షరము ఆసలు హెబ్రీ పదమునకు చేర్చుటచేత దేవుఁడు మనకు తోడు గనుక పక్షి తనరెక్కలు విప్పునప్పటివలె, దానిరెక్కల వ్యాపకము నీ దేశ వైశాల్యమంతటను వ్యాపించును అని యర్థమగును. దీనినిట్లు చదువవలెనని కొందఱనుకొందురు గాని ప్రస్తుతమున్నరీతిని, ఈ పదము సంబోధనముగా నున్నది గాన అది యొకని పేరగును. అతఁడు $7^{14}$ నందున్నట్లు కన్యకకు పుట్టఁబోవువాఁడు.

యెష $7^{14}$ లోని సంగతి మ $1^{22}$ లో నున్నట్లు క్రీస్తు కన్యకకు పుట్టుటచేత నెఱవేఱినట్లు స్పష్టమగుచున్నది. ఆహాజు ఇబ్బందిలో నుండఁగా దేవుఁడు వానిని రక్షించునని యెషయా తెలిపినట్లు, యెషయాలోని చరిత్ర సంబంధమునుబట్టి కనఁబడుచున్నది. తనమాట సత్యమని నిరూపించుటకు ఆహాజు దేవుని నేదైన నొక సూచన నడుగవచ్చునని యెషయా చెప్పెను గాని, ఆహాజు తానెంతో భయభక్తులుగలవాఁడైనట్లు అడుగనొల్లకపోయెను. తరువాత దేవుఁడు ఆ దేశమును రక్షింతుననుదానిని దృఢపర్చుటకు తానే యొక సూచన నిచ్చునని యెషయా చెప్పి, కన్యక గర్భవతియై కుమారుని కని అతనికి ఇమ్మానుయేలు అను పేరు పెట్టును. అతనికి యుక్తవయస్సు రాకమునుపే ఆహాజును భయపెట్టినవారి దేశములు పాడయిపోవునని చెప్పెను. ఆహాజుచేయు ఉపాయములవలనఁగాక, ఈ రక్షణ దేవుఁడు నియమించువానివలననే కలుగును. యెషయా 9, 11 అధ్యాయములలో మెస్సీయానుగూర్చి ప్రవచించెను. ఇందులోకూడ మెస్సీయానుగూర్చి ప్రవచించెనని స్పష్టమగును.

ఈ యర్థము సరియైనదికాదని కొందఱాక్షేపింతురు. క్రీస్తు యెషయా కాలమునందు రాక 700 సం॥ల పిమ్మట వచ్చెను. $7^{15,16}$ లోని కాలసూచనలనుబట్టి ఆ విడుదలకాలము అతి సమీపమున నుండినట్లు కనఁబడుచున్నది. ఈ ప్రవచనమెట్లు నెఱవేఱినదని వారడిగెదరు. II సమూ $7^{12-16}$ లో నున్న సొలొమోనునుగూర్చిన ప్రవచనములు, క్రీస్తు దావీదు వంశములో పుట్టుటచే పూర్ణముగా నెఱవేఱెను. ప్రతి ప్రవచనమునకును సమీపముగానుండు అసంపూర్ణమైన నెఱవేర్పు ఒకటియు, క్రీస్తువలన గలుగఁబోవు పరిపూర్ణ నెఱవేర్పు ఒకటియునున్నట్లు దీనివలన కనఁబడుచున్నది. అదేరీతిగా పై ప్రవచనము యెషయాకాలమునందు పుట్టిన యొకనివలన ఆ యసంపూర్ణమైన నెఱవేర్పు కలిగియుండును గాని పరిపూర్ణమైన నెఱవేర్పు క్రీస్తు కన్యకకు పుట్టి, ఆహాజు పాడుజేసిన సంఘమును ఆత్మీయముగా రక్షించుటవలన నెఱవేఱెనని తెలిసికొనవలెను.

**ఇమ్మేరు** (**Immer** = వదరుబోతు).

1. అహరోను సంతతివారిలో నొక కుటుంబపువారు. దావీదు కాలములో యాజకులను **24** వంతులనుగా నియమించినపుడీ కుటుంబమునకు 16-వ వంతు వచ్చెను (I దిన $24^{14}$). ఈ కుటుంబికులలో కొందఱు జెరుబ్బాబెలుతోకూడ చెఱనుండి తిరిగివచ్చిరి (ఎజ్రా $2^{37}$ నెహె $11^{13}$). ఎజ్రా కాలమునందు వీరిలో ఇద్దఱు అన్యస్త్రీలను వివాహముచేసికొని ఎజ్రా ప్రేరేపణలవలన వారిని విడిచి పెట్టిరి (ఎజ్రా $10^{20}$). నెహెమ్యాకాలములో పట్టణపుగోడను కట్టుటయందు వీరును సహాయపడిరి (నెహె $3^{29}$).

2. యిర్మీయా కాలములో నుండిన ఒక యాజకుఁడు (యిర్మీ $20^{1}$).

3. చెఱనుండి వచ్చినవారిలో కొందఱు ఇమ్మేరు అను స్థలమునుండి వచ్చినట్లు ఎజ్రా $2^{59}$ నెహె $7^{61}$ లో నున్నది. మూలభాషలో ఈ వాక్యములు తేటగా నుండకపోవుటచే అది యొక స్థలముగాక ఒక మనుష్యునిపేరని కొందఱనుకొందురు.

**ఇమ్రా** (**Imrah** = మంకుబుద్ధి). ఆషేరు గోత్రీకులలో నొక ప్రధాని (I దిన $7^{36}$)

**ఇమ్రీ** (**Imri** = వాక్చాతుర్యము).

1. యూదా సంతతి వారిలో నొకఁడు (I దిన $9^{4}$).

2. యెరూషలేము ప్రాకారములను కట్టుటలో నెహెమ్యాకు సహాయముచేసిన జక్కూరు తండ్రి (నెహె 3[2]).

**ఇమ్లా** (Imla = యెహోవా నింపును). ప్రవక్తయగు మీకాయా తండ్రి (I రాజు 22[8,9] II దిన 18[7,8]).

**ఇరీయా** (Irijah = యెహోవా చూచును). యెరూషలేములోనున్న కావలివారికి అధిపతి. కల్దీయుల పక్షముగానుండి యూదారాజుకు ద్రోహము చేయనెంచుచున్నాడని యితడు యిర్మీయాను పట్టుకొనెను (యిర్మీ 37[13,14]).

**ఇరోను** (Iron = బాగుగా కనబడునది). నఫ్తాలీగోత్రపువారి స్వాస్థ్యములోనున్న ప్రాకారములుగల పట్టణములలో నొకటి (యెహో 19[38]). ప్రస్తుతము మేరోము చెరువుకు 10 మైళ్లు పడమరగానుండు యారూను (*Yarun*) దానియునికి యని తలంతురు (పటము V, D 5).

**ఇర్పేయేలు** (Irpeel = దేవుడు కుదుర్చును). బెన్యామీను స్వాస్థ్యములోనున్న ఒక **యూరు** (యెహో 18[26].) యెరూషలేమునకు వాయవ్యముగా మూడు క్రోసుల దూరములో నుండు రాఫాతు (*Rapat*) అను నది దాని యునికియై యుండవచ్చును.

**ఇర్షెమెషు** బేత్షెమెషు చూ॥

**ఇల్లు** (House). ఇశ్రాయేలీయులు పలెస్తీనులోకి రాక పూర్వము ఆ దేశములోనున్న కనానీయులు ఇండ్లను, ఊళ్లను, కోటలను కట్టుకొని వాటియందు నివసించిరి. కనానీయులకు ముందు ఆ దేశమందు జీవించిన ఆది జాతులవారు గుహలలో నివసించినట్లు శిథిల పరిశోధకులు తెలియజేయుచున్నారు (గుహలు చూ॥). ఇశ్రాయేలీయుల గోత్రకర్తలు ఇండ్లలో నివసించినవారు గాక డేరాలలో జీవించిరి. ఐగుప్తునుండి కనానుకు వచ్చు మార్గములో వారు గడిపిన నలువది సంవత్సరములు వారు నివసించిన యిండ్లు పర్ణశాలలని చెప్పవలెను. వారు కనానులో ప్రవేశింపక మునుపు వారికి స్థిరమైన నివాసములున్న జాడయే లేదు. కనాను జేరినప్పటినుండి వారు ఇండ్లలో నివసించిరి.

I. ఇండ్లను కట్టిన సామగ్రి. 1. అడుసు. ఆది కాలమునుండి దీనితో ఇటుకలుజేసి, ఇండ్లను గట్టిరి. మొదట దానిని బాగుగా త్రొక్కిరి (నహూ 3[14]). గడ్డిని కొయ్యకాలును దానితో కలిపిరి (నిర్గ 5[7-19]). బాబెలులోను ఇటుకలను జేసినట్లు ఆది 11[3] నందు సూచనగలదు. దావీదు తాను పట్టుకొనిన ఖైదీలను ఇటుక ఆవములలో వేయించెను (II సమూ 12[31]). నహూ 3[14] నందిట్టి ఆవములనుగూర్చిన సూచన యుండుటనుబట్టి వారిటుకలను కాల్చుట నెఱిగియున్నట్లూహింపవచ్చును. 2. రాళ్లు. పలెస్తీను పర్వతమయముగాన అచ్చట విశేషముగా ఇండ్లను రాతితోఁగట్టిరి. ప్రజా సామాన్యము సాధారణరాతి నుపయోగించుకొన్నను స్థితిమంతుల ఇండ్లకొఱకును ఆలయముల



పురాతనపు ఇల్లు

కొఱకును మలిచినరాళ్లను వాడిరి (I రాజు 5[17]).
వాటిని రంపములతోఁ గోసిరి (7[9]). గోడలను
కట్టుటలో సున్నమును గాక అడుసునే సాధారణ
ముగా వాడినను అప్పుడప్పుడు మట్టికీలును కూడ
నుపయోగించిరి (ఆది 11[3]). 3. కలప. పలెస్తీను
నందు హిందూదేశమందున్నట్లే కలపను వాడిరి.
అక్కడ అంత మంచి మ్రానులు లేకపోవుటచే
రావి మ్రానుల నిట్టి పని కుపయోగించిరి (యెష.
9[10]). గొప్ప యిండ్లకొఱకు లెబానోను ప్రాంత
ములనుండి దేవదారు మ్రానులను దెప్పించిరి
(I రాజు 7[2,3] యిర్మీ 22[14]). 4. ఇండ్లగోడలను
అలికినట్లు కనఁబడును. దాని 5[5] నందున్న
**గోడపూత** అదే. యెహె 13[11] 22[28] లోని
**గచ్చుపూత** గోడలను కట్టుట కుపయోగించిన
మట్టి కనఁబడకుండ కప్పివేయుటచే అది వేషధార
ణకు గుఱుతుగా నుండెను (మ 23[27] కార్య 23[3]).
స్థితిమంతులు తమ యింటి గోడల లోపటి భాగ
మును చెక్కలతోఁ గప్పి వాటి నలంకరించిరి
(II దిన 3[5] I రాజు 6[15,18] 7[7] యిర్మీ 22[14] హగ్గ
1[4]). యెహె 41[16] లో నున్న **బల్లకూర్పు**
అట్టిదే. ఇట్టి చెక్కలో దంతమును తాపడము
చేయుట బహు చక్కని పనిగా నుండెను (I రాజు
20[39]) గాని అమిత ఖర్చు నది సూచించెను
(ఆమో 3[15]). ఆలయములోని గోడల కిట్టి చక్కని
పని చేసిరి (I రాజు 6[15]). నేలకు మట్టిపూఁతగాని
గచ్చుపూఁతగాని పూసిరి. ధనికుల ఇండ్ల నేలను
చెక్కపలకలతోను (6[15]) చలువ రాళ్లతోను
(ఎస్తే 1[6]) పఱచిరి. బీదల ఇండ్లలో చాపలును
భాగ్యవంతుల యిండ్లలో తివాసీలును నేల నలంక
రించెను.

II. ఇండ్లయేర్పాటు. 1. సాధారణమైన
వారి యింటిలో రెండు గదులుండెను. ఒక
దానిలో నా యింటివారును రెండవదానియందు
వారి పశువులును నివసించిరి. పశువు లధికముగా
నున్న పక్షమున వాటికి ప్రత్యేకముగా కొట్టము
లను కట్టించిరి. కొన్ని యిండ్లలో ఆ రెండు గదు
లను వేఱుచేయు గోడలుండలేదు. 2. ఇంటి
కప్పును ప్రతి సంవత్సరము శీతాకాలమునకుముందు
బాగుజేసికొనెడివారు. సాయంకాలమున తీరు
బడిగా నున్నప్పుడును (II సమూ 11[2]) ఏకాంత
ముగా మాట్లాడుకొనవలసి వచ్చినప్పుడును (I సమూ
9[25]), ప్రలాపించి అంగలార్చుటకును (యెష 15[3]
యిర్మీ 48[38]), విగ్రహపూజకును (19[13] జెఫ 1[5])
దీని నుపయోగించిరి. ఇట్టి కప్పులను తరుచుగా
వాడుటనుబట్టియే మిద్దచుట్టు పిట్టగోడ కట్టవలె
నను నియమ మేర్పడెను (ద్వితీ 22[8]). ఇట్టిపిట్ట
గోడ యున్నను ఒక యింటిమీఁదనుండి మఱి
యొక దానిమీఁదకు దుముకుచు వీధి చివరవఱకు
సులభముగాఁ బోవచ్చును (మా 13[15] పురా
13[5,3]). భాగ్యవంతుల యిండ్లలో కప్పు గనఁ
బడకుండునట్లు సరంబీ వేసి (I రాజు 7[7] యిర్మీ
22[14] హగ్గ 1[4]), దంతము వెండి బంగారు ప్రశస్త
రత్నములతో నలంకరించుకొనిరి (I రాజు 22[39]
ఆమో 3[15]). భాగ్యవంతులైనవారు తమ మిద్దెల
మీఁద గదులను కట్టించుకొని నిద్రించుటకుగాని
బంధుమిత్రాదులు వచ్చినప్పుడుగాని జబ్బుచే
బాధపడునప్పుడుగాని వాడిరి (I రాజు 17[19]
II రాజు 4[10]). ప్రార్థించుటకును ఇట్టిగదుల
నుపయోగించిరి (23[12] దాని 6[10] తోబియా
3[10]=కార్య 10[9]). ఇట్టి మేడగదులనుండి క్రిందికి
వచ్చుటకు సాధారణముగా రెండు మెట్ల వరుస
లుండునవి. ఒకటి వీధివైపునకుఁ బోవును. ఒకటి
క్రిందిగదులలోనికిఁ బోవును (మా 2[4]). 3. ఒక
అంతస్తుకు మించిన భవనములు చాల అరుదు.
సొలొమోను కట్టించిన లెబానోను అరణ్యనగర
మనఁబడిన ఆయుధ శాలయు (I రాజు 7[2]),
దేవాలయపు ప్రక్కలయందుఁ గట్టఁబడిన గదు
లును (6[5]), మూఁడంతస్తులు గలవియై యుండెను.
4. ప్రతి పెద్ద యింటికి ముందు పెద్దలోగిలి
యుండును. దానిచుట్టును గదులు, తిన్నెలుండును.
లోగిలియందు బావియు, చెట్లు నుండును. చుట్ట
పక్కములు వచ్చినప్పుడీ లోగిలి నుపయోగించు
కొనిరి. ఇంట్లో అప్పుడప్పుడు జరిగెడి శుభ
కార్యములు మొదలగునవి ఇచ్చటనే చేయఁబడు
నవి (లూ 22[55] యోబు 1[19] II సమూ 17[18]
నెహె 8[16]). ఎండతగలకుండ చాందినీలను కట్టు
కొనువారు (ఎస్తే 1[6]). 5. గొప్పమందిరములను
లోపలను బైటను చలువరాతి స్తంభములచే నలంక
రించిరి (పర 5[15]). పెద్దగృహములలోఁ గొన్నిఁ
టికి ముందుభాగమున నొకగదియుండెను. దాని
ద్వారమునొద్ద తలుపుగా నొక ద్వారపాలకుఁ
డుండువాఁడు. అప్పుడప్పుడు స్త్రీలును ద్వార



ధనికుల ఇల్లు

పాలకురాండ్రుగా నుండిరి (యో $18^{17}$ కార్య $12^{13}$). పైకిఁబోయెడి మెట్లిక్కడనే యారంభించెను. 6. పెద్దయిండ్లలోని అంతఃపురములు స్త్రీలకొఱకు ప్రత్యేకింపఁబడెను (న్యాయా $15^{1}$ పర $1^{4}$ $3^{4}$). కుటుంబపెద్దతప్ప మరెవ్వరు నచ్చటికిఁబోవ వీలుకాదు. పడకగదు లిచ్చటనే యుండును (II సమూ $4^{7}$ $13^{10}$ II రాజు $11^{2}$). మ $6^{6}$ నందుదాహరించిన గది యిట్టిదే. 7. భాగ్యవంతుల యిండ్లలో వేసవియందును శీతాకాలమునందును ప్రత్యేకముగా నుపయోగించుకొనుటకు తగినగదులుండునవి. ఇవి ఆయాకాలములయందు కావలసినంత చల్లదనమును వెట్టను కలిగించురీతిగా నిర్మించుకొనిరి. చలికాలమున కుంపటులు పెట్టుకొనువారు. వేడిమి త్వరగా పోకుండునిమిత్తము చెక్కతో చట్రమొకటిచేసి, కుంపటిమీఁద దాని నుంచి, ఆ చట్రముపై తివాసీని కప్పెడివారు 8. కిటికీలను పొగపోవు గొట్టములుగా నుపయోగించుకొనిరి. వీధులయందు విస్తారముగ మురికి యుండుటంబట్టి వాటిని సాధారణముగా లోపలి ఆవరణములతట్టుకు పట్టుకొనుచున్నారుగాని పూర్వ మట్లుచేసియుండలేదు (న్యాయా $5^{28}$ సామె $7^{6}$). 9. ఇంటితలుపులను అక్కడక్కడ రాతితోఁ జేయించుకొనిరి గాని సాధారణముగా కర్రతోఁజేసినవాటి నుపయోగించిరి. అవి అంత యెత్తుగలవికావు. కలిగినవారు వాటిని యిత్తడితోగాని బంగారుతోగాని పొదిగించెడివారు (II దిన $4^{9,22}$). ద్వారమునకు పైన క్రిందనున్న రాళ్లలో చెక్కఁబడిన రంధ్రములలో ఈ తలుపు ఊతకలను తగిలించెడివారు (సామె $26^{14}$ I రాజు $7^{50}$). పెద్దతలుపురెక్కలకు మడతలుండునవి ($6^{34}$). 10. తలుపున కొక ఉంగరమును పెట్టి తలుపుతట్టుట కనుకూలమగు పిడిని దానికి తగిలించిరి (లూ $12^{36}$ $13^{25}$ కార్య $12^{13}$). లోపలి



ఐగుప్తీయుల ఇంటి గడప

నుండి వేయుటకు దానికి గడియనుకూడ పెట్టిరి. అట్టితలుపులను బైటనుండి తీయుటకు తాళములు

కూడ గలవు (న్యాయా $3^{25}$ యెష $22^{22}$). 11. ద్వారబంధములమీఁద ద్వితీ $6^{4,5}$ మొదలగు ముఖ్యవచనములను చెక్కించి అలంకరించుకొనెడి వారు (ద్వితీ $6^{9}$). ఇట్టి అలవాటు ప్రస్తుతము మహమ్మదీయులలో నున్నది. పూర్వమైగుప్తీయులు నట్లుజేసిరి. 12. గొప్పకట్టడములకు పునాదిరాతిని వేయునప్పుడును పండుగవలె నాచరించిరి (ఎజ్రా $3^{10}$ యోబు $38^{7}$). అట్లే మూలరాతిని వేయు నప్పుడును (జెక $4^{7}$), ప్రతిష్ఠ జరిగినప్పుడును (I రాజు $8^{63}$ ఎజ్రా $6^{16}$) సంతోషించిరి. I రాజు $16^{34}$ (=యెహో $6^{26}$) లోని సంగతి అట్టి గొప్ప సమయమై యుండును.

పలెస్తీను సిరియదేశమందలి శిథిలములలో గోడలును గుళ్లును కట్టఁబడిన గొప్పరాళ్లుగాక మఱేదియు కనఁబడుటలేదు. రాచనగరులుగాని గొప్ప భవంతులుగాని రాళ్లచేఁ గట్టబడలేదను సంగతి స్పష్టమగుచున్నది. మెసపొతేమియలోను ఐగుప్తులోను పట్టణములు పాడుబడిన పిమ్మట వేలకొలది సంవత్సరముల క్రిందటనే అక్కడుండిన మందిరములు మొదలగునవి మంటఁగలిసి నందున పూర్వము ముఖ్యపట్టణములున్న ప్రదేశమున జనులు సేద్యముచేసి మంచి పంటలు పండించుచున్నారు.

**ఇల్లూరికు** (Illyricum) మాసిదోనియకు పశ్చిమముగానుండి అడ్రియాటిక్ సముద్రము వఱకు వ్యాపించిన దేశము. మిగుల పర్వత మయము. క్రీ॥ శ॥ ముందు 229 సం॥ రోమను వారిచేత స్వాధీనపరచుకొనఁబడి, క్రొత్తనిబంధన కాలములో రోమనురాజ్యమున చేరెను. దీని పేరు రోమా $15^{19}$ లో మాత్రము బైబిలునందు కనఁబడును. పౌలు ఇల్లూరికు ప్రాంతపర్యంతము సువార్తను ప్రకటించెనను మాట అందు కన్పించునుగాని ఆ దేశమునందు బోధించెనా లేక ఆ దేశపు సరిహద్దువఱకు బోధించెనా యనుదాని గూర్చి సందేహము కలదు. పౌలాదేశమునందు బోధించెననుకొనువారు అతఁడు మూఁడవ మిష నెరీ ప్రయాణములో కొరింథుకు వెళ్లుచుండఁగా అచ్చటికి వెళ్లెనని యనుకొందురు.

**ఇవ్వా** (Ivah, Ivvah). అష్షూరీయులు పట్టుకొనిన యొక పట్టణము (II రాజు $18^{34}$ $19^{13}$ యెష $37^{13}$). దీనిని పట్టుకొనిన సంగతి విషయమై సన్హెరీబుయొక్క రాయబారి అతిశయ పడుటవలన అది గొప్ప పట్టణమని ఊహింపఁ దగును గాని దాని యునికి ఏమియు తెలియదు. II రాజు $17^{24}$ లోని అవ్వా దీని మాఱుపేరు అని తలంతురు.

**ఇశ్రాయేలీయుఁడు** (Israelite). ఇశ్రా యేలనఁబడిన యాకోబు సంతతివాఁడు (నిర్గ $9^{7}$). నిజమైన మతమునుగూర్చిన జ్ఞానముగలిగి దేవుని వాగ్దానములన్నిఁటికి వారసులైన వారందఱికి ఆత్మీయముగా నీ పేరు చెందుచున్నది (యోహా $1^{47}$ రోమా $9^{4}$ $11^{1}$ II కొరి $11^{22}$).

**ఇశ్రాయేలు, ఇశ్రాయేలీయులు, ఇశ్రాయేలువారు** (Israel = దేవునితో పోరాడువాఁడు, దేవుఁడు పోరాడును, Israelites)

1. యాకోబు మెసపొతేమియనుండి తిరిగి వచ్చుచు తన యన్నయగు ఏశావును కలిసికొందు నను భయముతో యబ్బోకునదిని దాటుచున్నప్పుడు అతనికి పెట్టఁబడిన పేరు (ఆది $32^{22-32}$). (యాకోబు చూ॥)

2. యాకోబు సంతానపు వారందఱికి పెట్టఁబడినపేరు. ఈపేరు అతఁడు జీవించియుండఁగనే వాడుకలోనికి వచ్చెను (ఆది $34^{7}$). ఇతని సంతానీకులు అరణ్యమందు సంచారము చేయు నప్పుడును, దానికి తరువాతను ఇశ్రాయేలీయు లను పదము ఎక్కువగా వాడఁబడెను (నిర్గ $32^{4}$ ద్వితీ $4^{1}$ $27^{9}$ మొ॥). సౌలు మరణమునకుఁ బూర్వ మీ రెండు పదములును హెబ్రీయు లందఱని యర్థమిచ్చును. ఆ కాలమునందు గోత్ర భేదమింక యు లేకపోయెను. భూసంబంధ మగు భేదములవలనను, ఇతర కాలముల వలనను యూదాగోత్రము తక్కిన ఇశ్రాయేలీయులనుండి వేఱగుచుండిన లక్షణము లప్పుడప్పుడు పొడగట్టె నను, రెండు రాజ్యములు వేఱయినప్పటినుండి మాత్రమే అట్టిభేదము స్థిరపడెను (I సమూ $11^{8}$ $17^{52}$ $18^{16}$ క్రిందనున్న 8, యూదా చూ॥). హెబ్రీ కావ్యములలో ద్విపదలయందు మొదటి పాదమందుండు యాకోబు అను పాదమునకు ప్రతిగా రెండవ పాదమందు ఇశ్రాయేలు అను

నీ పద ముపయోగించిరి (సంఖ్యా $23^{7,10,21}$ $24^{5}$ కీర్త $14^{7}$). చెఱకాలమునకుఁ బిమ్మట యెరూష లేమునకుఁ దిరిగివచ్చిన అన్ని గోత్రముల వారి కీ పేరును వాడిరి (ఎజ్రా $9^{1}$ $10^{5}$ నెహె $9^{2}$ $11^{3}$).

3. **యూదా** బెన్యామీను గోత్రములు తప్ప మిగతగోత్రముల సముదాయమును **ఇశ్రాయేలు వారు** అని పిలిచిరి. సౌలు మరణమునకుఁ దరువాతనే హెబ్రీయులు రెండు రాజ్యములుగా చీలిపోయిరి. ఉత్తరముననున్న వారును యొర్దాను నదికిఁదూర్పున నున్నవారందఱును సౌలు కుమారుఁడగు ఇష్బోషెతును అంగీకరించిరిగాని యూదా వారు మాత్రము దావీదును వెంబడించిరి (II సమూ $2^{8-11}$). ఇప్పటినుండి ఇశ్రాయేలువారు అనునది పది గోత్రములవారిని మాత్రము సూచించును. ఇష్బోషెతు రెండు సంవత్సరము లేలినపిదప చంపఁబడెను ($4^{1-12}$). తరువాత అందఱు నేకీభవించి **దావీదును** ఇశ్రాయేలీయులందఱిమీఁద రాజుగా నభిషేకించు నప్పటికి 7 సంవత్సరములు గతించెను ($5^{1-3}$). వారెంతగా నేకీభవించినను ఆంతర్య వైషమ్యము లంతరింపవయ్యెను. సొలొమోను మరణమైన వెంటనే భేదము స్థిరపడి పోయెను. పదిగోత్రములవారు యరొబామును తమకు రాజునుగా నియమించుకొనిరిగాని **యూదా** బెన్యామీను గోత్రీకులు మాత్రము దావీదు కుటుంబము నెన్నుకొనిరి (I రాజు $12^{1-20}$). యూదా గోత్రీకుల కియ్యఁబడిన భాగపు నైసర్గిక స్వభావమును, **యూదా** ఎఫ్రాయిము గోత్రములకుండు సహజవైరమును, అబ్షాలోము తిరుగుబాటును తరువాత **యూదా**గోత్రీకులు తక్కిన వారితోఁ గలియకయే దావీదును తిరిగి దెచ్చుకొనుటయు (II సమూ $19^{15,40-43}$), సొలొమోను యెరూషలేము పట్టణమును గట్టించి దాని నలంకరించుటకై ప్రజలకుపెట్టిన వెట్టి పనియు (I రాజు $5^{13-18}$), వేసిన పన్నులును ($4^{1-20}$), రెహబాము రాజ్యసింహాసనము నధిష్ఠించిన వెంటనే పౌరుల విన్నపము లాలకింపక వారిని తూలనాడుటయు (I రాజు $12^{3-16}$) ఈరాజ్య విభేదమునకు ముఖ్యకారణములని చెప్పవచ్చును.

**యూదా**వారి రాజ్యమునకన్న ఇశ్రాయేలు వారి రాజ్యము జనసంఖ్య యందిబ్బడిగను, వైశాల్యమునందు మూఁడింతలును హెచ్చుగ నుండెను. అయితే శత్రుబారినుండి తప్పించుకొనుటగాని, దేశసంరక్షణార్థమై యెట్టి దుర్గములనైనను నిర్మించుకొనుటకుగాని వీలయిన స్థితియందుండనందున ఈ విషయమునందు **యూదా**దారి దేశముతోనది సరికాఁజాలకపోయెను. అది రాజ్యమునుండి మాత్రమేగాక దేవునినుండియు వేఱుపడుటవలన భ్రష్టమైపోయి, కొంతకాలములోనే రాజ్యముగా నిలువలేనంత దుస్థితికివచ్చెను. నీతి మత విషయములలో క్రమక్రమేణ కృశించుటవలనను, తమ్ము నాదరించువారు లేనందునను, ఆ రాజ్యమునందక్కడక్కడ చెదరియుండిన యాజకులును లేవీయులును **యూదా**దేశములోనికి వెళ్లిపోయిరి (II దిన $11^{13,14}$).

ఉత్తరముననున్న ఈ రాజ్యమునకు ఆరంభమునందు షెకెము రాజధానిగనుండెను (I రాజు $12^{25}$). కొద్దిదినములలోనే దానిని తిర్సాకు మార్చిరి (I రాజు $14^{17}$ $15^{21}$) గాని, ఒమ్రీ రాజైనపిదప షోమ్రోను పట్టణమును కట్టించిన దానిని రాజధానిగఁ జేసెను (I రాజు $16^{24}$).

ప్రజలు ఆరాధించుటకై యెరూషలేమునకుఁ బోయిన పక్షమున, దావీదు వంశపువారి పక్షముకుఁ దిరిగి పోవుదురని మొదటిరాజగు యరొబాము భయపడి, వారచ్చటికి వెళ్లకుండు నిమిత్తము, తన రాజ్యమునందే ఉత్తరమున దానును దక్షిణమున బేతేలును పుణ్యక్షేత్రములుగ ప్రతిష్ఠించెను. ఈ స్థలములలో బంగారుదూడలను చేయించి నిలిపి, యెహోవా నీ స్థలములలో నారాధింపవచ్చునని ($12^{25-33}$) ప్రకటించెను (దూడ చూ॥). అతఁడును అతని కుటుంబమును ఈ గొప్ప యపరాధము నిమిత్తము నాశనమగుదురను దేవుని భయంకరమగు తీర్పును ప్రవక్తలు ప్రకటించిరి ($14^{7-16}$). అతని కుమారుఁడగు నాదాబు రెండేండ్లేలిన పిదప అతని వంశము నిర్మూలమాయెను. మొత్తముమీఁద ఈ రాజ్యమును 19 మంది రాజులు దాదాపు 210 సం॥ లేలిరి (కాలక్రమణిక చూ॥). వారిలో నేడుగురు రెండు సంవత్సరములకు తక్కువ కాలము సింహాసన మధిష్ఠించిరి. చంపఁబడిగాని, చంపుకొనిగాని యెనిమిదిమంది నశించిరి. తొమ్మిది రాజ కుటుంబములు మారెను.

రెండు కుటుంబములలో మాత్రము నలుగు రేసి యొకని తరువాత నొకఁడు రాజ్యముచేసిరి. వీరిలోనొక్కఁడైనను బేతేలు దానులలోనుండు విగ్రహములను దీసివేయనై ప్రయత్నించినవాఁడు లేకపోయెను. అన్యస్త్రీని వివాహమాడి, ఆమె చేతిలో కీలుబొమ్మవలె నాడిన అహాబనువాని కాలమునందు యెహోవాపూజకు బదులు బయలు పూజ దేశమంతట నిండెననుటలో నాశ్చర్యము లేదు. గాని దేవుఁడీకాలమునందే యెక్కువ మంది ప్రవక్తలను లేపెను. వీరు తమ ప్రాణము లకు సహా ఆసపడక, తీవ్రముగా విగ్రహారాధ నను ఖండించిరి. ఏలీయా ఎలీషాలనువారు వీరిలో ప్రముఖులు (ఏలీయా, ఎలీషా చూ॥). విగ్రహారాధనను నిర్మూలము చేసినపిదప హోషేయ ఆమోసు అనువారలు తమ ప్రజలు నీతిన్యాయము లనుసరించునట్లు జేయుటకై పాటుబడిరి.

ఇశ్రాయేలువారు తరుచుగా యూదా వారితో యుద్ధమాడిరి. ఒమ్రీ కుటుంబపువారి యేలుబడియందు మాత్రము రెండు రాజ్యముల



యెహూ పంపిన రాయబారులు రెండవ షల్మనేసెరునకు కప్పము గట్టుట

వారును ఇచ్చి పుచ్చుకొని సంబంధము కల్గించుకొనిరి. దమస్కునందలి సిరియ వారి రాజ్యము అభివృద్ధినొందగా ఇశ్రాయేలువారి రాజ్యమునందు మార్పులు కలుగవలసివచ్చెను. అప్పుడప్పుడు వారితో సంధిజేసికొనినను తఱచుగా యుద్ధములే సంభవించెను. అందువలన ఇశ్రాయేలువారి దేశపుహద్దులు, ముఖ్యముగా యొర్దానుకుఁ దూర్పున మాఱుచువచ్చెను. అష్షూరీయులు ఆ కాలమునందు ప్రబల శత్రువులుగానున్నందున ఆ ప్రాంతములలోని దేశముల వారందఱు వారి నెదిరించుటకు ఏకీభవించిరి. 120 సం॥ లకు తరువాత యెరూషలేమును పట్టుకొనవలెనను తలంపుతో వీరు సిరియవారితో మరల సంధిజేసికొనిరి. ఈ యపాయమునుండి తప్పించుకొనుటకే యూదారాజైన ఆహాజు యెహోవాయందు నమ్మిక నుంచఁజాలక, వద్దని యెషయా యెంత ఘోషించినను వినక, తన ప్రాణమును రాజ్యమును రక్షించుకొందునను తలంపుతో అష్షూరురాజైన తిగ్లత్పిలేసెరును సహాయమునకుఁ బిలుచుకొని, కొరివితో కొప్పు గోకుకొనినట్లు జేసెను. అప్పటినుండి యూదా అష్షూరువారికి కప్పముఁ గట్టునదాయెను. దమస్కునందుండిన అష్షూరువారి సామంతరాజు నకు దోసిలొగ్గవలసి వచ్చెను (II రాజు 16[8-10]). తిగ్లత్పిలేసెరు యూదావారిని వారి శత్రుబారి నుండి తప్పించెను. ఇశ్రాయేలు వారి రాజ్యమును పాడుజేసెను. ఫిలిష్తీయుల ఉక్కణచెను. దమస్కును ముట్టడించి పట్టుకొని, రెస్సీనును సంహరించెను. యొర్దానుకుఁ దూర్పుననున్న ఇశ్రాయేలువారిని చెఱపట్టుకొనిపోయెను. పెకహు మరణమునకు సమ్మతించి హోషేయను క్రీ॥ ము॥ 730 సం॥ సింహాసనాసీనుని జేసెను. తిగ్లత్పిలేసెరు మరణమైన పిదప, ఇదే సందని హోషేయ తిరుగుబాటు జేసెనుగాని, అష్షూరు సైన్యములు దేశమును మరల నావరించెను. 722 సం॥ నందు షోమ్రోను పట్టుబడెను. దాని నివాసులు వేలకొలదిగ అష్షూరుదేశమునకుఁ గొంచుపోఁబడిరి (చెఱ, సర్గోను చూ॥).

అష్షూరు సామ్రాజ్యమందలి అయిదు దేశములలోని ప్రజలు, ఇశ్రాయేలువారి దేశమునకు పంపఁబడి మధ్యపలెస్తీనునందు మిగిలియున్న ఇశ్రాయేలీయులతోఁ గలిసిపోయి, తరువాత సమరయులనఁబడిన మిశ్రిత జనాంగమునకు పూర్వీకులైరి.

ఇశ్రాయేలువారికి కలిగిన యీచెఱ వారికి శిక్షయైయున్నది. తమ దేవుఁడైన యెహోవా దృష్టికి పాపముజేసి, ఇతరదేవతలయందు భయభక్తులు నిలిపి ఇతర జనాంగముల కట్టడలను, ఇశ్రాయేలు రాజులకట్టడలను అనుసరించుటయే దీనికి కారణము (II రాజు 17[7,8]). ప్రజలు మతభ్రష్టులైరి. ఆయన కట్టడలను (నిర్గ 20-22) మీరి, ఆయన తమ పితరులతోఁ జేసిన నిబంధన నతిక్రమించిరి (II రాజు 17[15] హోషే 6[7] 8[1]). వారి భ్రష్టత్వము రెండు విధములుగా పరిణమించెను. తమయెదుట నిలువకుండ యెహోవా వెళ్లఁగొట్టిన జనములకట్టడలను అనుసరించిరి (II రాజు 17[8,15,17] = హోషే 2[13] 4[2,11,16] ఆమో 2[6-9]). ఇశ్రాయేలురాజులు చేయించిన పోఁతవిగ్రహములైన రెండుదూడలకు సంబంధించిన పూజావిధానమంతటిని మహా భయభక్తులతో నవలంబించిరి (II రాజు 17[8,16] హోషే 8[4-6] 10[5,8] 13[2,4]). దేవుఁడు తన ప్రవక్తల ద్వారాను ప్రదర్శకులద్వారాను ఎంతఁగా సాక్ష్యము పలికించినను వారు లక్షింపక పాపమునందు మునిగిపోయిరి (II రాజు 17[13] హోషే 12[10] ఆమో 2[9-11] 6[13]). వారి నాశనము యూదారాజ్యమునుండి వేఱుపడుటతోను ఆరాధనవిషయము వెనుకపడుటతోను ఆరంభమయి చెఱతో ముగిసెను.

**ఇశ్రాయేలుకు ఆధారమైనవాఁడు** (Strength of Israel). I సమూ 15[29] లో నిది యెహోవాకు సార్థకనామమై యున్నది. ఆధారమను మాటయొక్క అసలుపదము ప్రకాశము లేక మహిమ యని అర్థమగును. I దిన 29[11] లో అదేమాట తేజస్సు అని తెనిగింపఁబడెను. కాఁబట్టి **ఇశ్రాయేలుకు మహిమ** అని దానిని భాషాంతరముజేసినయెడల బాగుగ నుండునది.

**ఇశ్రాయేలు గోత్రములు** అనగా గోత్రములు చూ॥

**ఇశ్రాయేలు పరిశుద్ధ దేవుడు** దేవుడు II 4 (7) చూ॥

**ఇశ్రాహేతీయుడు** (Izrahite). ఇది యొక కుటుంబమునకు పేరు (I దిన 27[8]). 27[11] లోని జెరహీయులు ఈ కుటుంబపువారే యనుకొందురు. ఈ పేరు ఈ కుటుంబమునకు వారి పూర్వికునిబట్టి కలిగెనా లేక వారి యూరి పేరునుబట్టి కలిగెనా అను విషయమునుగూర్చి సందేహముకలదు.

**ఇశ్శాఖారు** (Issachar = కొనఁబడెను. ఆది 30[16]; ప్రతిఫలముగా దయచేసెను 30[18]). యాకోబు కుమారులలో తొమ్మిదవవాఁడు. లేయాపుత్రులలో నైదవవాఁడు (30[17,18] 35[23]). ఇతఁడు తన నలుగురు కుమారులతో ఐగుప్తుకుఁ బోయెను (46[13] నిర్గ 1[3]). యాకోబు ప్రవచనములలో నితఁడు రెండుదొడ్లమధ్య పండుకొని వెట్టి చేయుటకు భుజమును వంచు గార్దభము వంటి వాఁడని చెప్పఁబడెను (ఆది 49[15]). దానివలన నతఁడు దాసుఁడగునని సూచింపఁబడినను దెబోరా బారాకు కాలములో నతనిగోత్రికులు వారికి సహాయులై సీసెరాను జయించుటలో చాల పరాక్రమముజూపిరి (న్యాయా 5[15]). యెహోషువ దేశమును షిలోహులో పంచి పెట్టఁగా నీ గోత్రపువారికి నాలుగవ వంతు చీటి వచ్చెను (యెహో 19[17-23]). వారి దేశమునకు ఉత్తరమున జెబూలూను నఫ్తాలీ గోత్రములును తూర్పున యొర్దానునదియు దక్షిణమున మనష్షే గోత్రమును పశ్చిమమున మనష్షే నఫ్తాలీ గోత్రములునున్నవి. అయితే వారి ప్రదేశములలో మనష్షేవారి యూళ్లుకొన్నియు (యెహో 17[10, 11]). లేవీయుల గ్రామములు కొన్నియు (21[6,28,29] I దిన 6[62,72]). ఇతని అయిదుగురు కుమారుల సంతానము ఈ గోత్రమునందు అయిదు గొప్ప కుటుంబములాయెను (సంఖ్యా 26[23,24]). ఐగుప్తు నుండి బయలువెళ్లిన మొదటి సంవత్సరములలో సూయారు కుమారుఁడైన నెతనేలు ఈ గోత్ర ప్రధాని (సంఖ్యా 1[8] 2[5] 7[18] 10[15]). తరువాత అజ్జాను కుమారుఁడైన పల్తీయేలు ప్రధాని యయ్యెను (34[26]). అరణ్యమందు వేసిన మొదటి ప్రజాసంఖ్యలో ఈ గోత్రమునందు సేనగా వెళ్లఁ గలిగినవారు 54,400 మందియు (1[28,29]). రెండవ మారు లెక్కించినప్పుడు 64,500 మందియు (సంఖ్యా 26[25]) దావీదు ఏలుబడియందు 87,000 మందియు (I దిన 7[5]) నైరి. యోసేపు కుమారుడైన ఇగాలు ఈ గోత్రము నుండి కనానును చూడఁబంపిన వేగులవారిలో నొకఁడు (సంఖ్యా 13[7]). దీవెన వచనములను పలుకుటకై గెరిజీము అను కొండమీఁద నిలిచిన వారిలో ఇశ్శాఖారు గోత్రికులుండిరి (ద్వితీ 27[11]). మోషే ఆయా గోత్రికుల భావిస్థితిని గూర్చి ప్రవచించినపుడు ఇశ్శాఖారీయులు సంతోష సమాధానములు గలిగియుందురనెను (33[18,19]). తోలాయను న్యాయాధిపతియు (న్యాయా 10[1]), బయెషాయను ఇశ్రాయేలు రాజును ఈ గోత్రికులే (I రాజు 15[27]). సౌలు కుటుంబమును వదలి తగిన రాజును తమపై యేర్పాటుచేసికొనుటలో ఇశ్శాఖారు గోత్రనాయకులు సమయోచిత జ్ఞానముకలిగి ప్రవర్తించిరి (I దిన 12[32]). బహుశః ఆకాలమున మిఖాయేలు కుమారుఁడగు ఒమ్రీ వీరికి అధిపతిగానుండెను (I దిన 27[18]). ఇశ్శాఖారు గోత్రికులు ఉత్తరరాజ్యమునకు సంబంధించియుండినను, హిజ్కియా ఆచరించిన పస్కా పండుగకు చాలమంది వచ్చిరి (II దిన 30[18]). యోహానుకు కలిగిన దర్శనమునందు తక్కిన గోత్రికులలోవలె దీనినుండియు 12,000 మంది ముద్రనొందిరి (ప్రక 7[7]).

**ఇషి** (Ishi = రక్షణకరమైన).

1. యూదాసంతతివారిలో నొకఁడు (I దిన 2[31]).

2. యూదాసంతతివారిలో మఱియొకఁడు (I దిన 4[20]).

3. షిమ్యోను గోత్రికులలో నొకఁడు. ఇతని కుమారులు శేయీరు పర్వతముదగ్గర నివసించు అమాలేకీయులను జయించి వారియూళ్లను పట్టుకొనిరి (I దిన 4[42]).

4. యొర్దానుకు తూర్పుగానుండు మనష్షే అర్ధగోత్రపువారిలో నొక కుటుంబమునకు ప్రధాని (I దిన 5[24]).

**ఇషోదు** (Ishod = ప్రకాశముగల వాఁడు). మనష్షే సంతతివారిలో నొకఁడు (I దిన 7[18]).

**ఇష్పా** (Ishpah = బట్టతల?). బెన్యామీనీయులలో నొకఁడు. ఇతఁడొక కుటుంబమునకు పెద్దయాయెను (I దిన $8^{16}$).

**ఇష్పాను** (Ishpan). బెన్యామీనీయులలో నొక కుటుంబమునకు పెద్ద (I దిన $8^{22}$).

**ఇష్బాకు** (Ishbak = అతఁడు వదలి పెట్టును?). అబ్రాహామునకు కెతూరావలన బుట్టిన అరబ్బీయుల గోత్రములలో నొకటి (ఆది $25^{2}$).

**ఇష్బాహు** (Ishbah = స్తుతించువాఁడు). యూదా గోత్రికులలో నొకఁడు. ఇతఁడు ఎష్తెమోయ అనువారికి పెద్దయై యుండెను (I దిన $4^{17}$).

**ఇష్బిబేనోబ** (Ishbibenob = నా నివాస స్థలము ఉన్నతమైనది). బలాఢ్యుఁడగు నొక ఫిలిష్తీయుఁడు. ఇతఁడు దావీదును చంపనై యుండఁగా అబీషై వీనిని సంహరించెను. (II సమూ॰ $21^{16}$).

**ఇష్బోషెతు** (Ishbosheth = అవమాన పురుషుఁడు). రాజైన సౌలు కుమారులలో నాల్గవవాఁడు. గిల్బోవయుద్ధము జరిగినప్పుడు ఇతఁడు నలువది సంవత్సరములవాఁడు (II సమూ $2^{8-10}$). ఆ యుద్ధమున నితని సహోదరులు ముగ్గురును తండ్రియు గతించినందున (I సమూ॰ $31^{2,6}$) సైన్యాధిపతియు సౌలు పినతండ్రి కుమారుఁడునగు అబ్నేరు ఇష్బోషెతును యొర్దాను కవతలనున్న మహనయీమునందు సింహాసనా సీనుని జేసెను (II సమూ॰ $2^{8-10}$). అచ్చటతఁడు రెండేండ్లవఱకు యూదా గోత్రముతక్క మిగిలిన పదునొకొండు గోత్రములకు రాజాయెను ($2^{4}$). సైన్యాధిపతియగు అబ్నేరు నితఁడొకమారు గద్దించినందున, దావీదుపక్షము వహించి రాజ్య మంత దావీదు పరముజేయ యత్నించుచుండఁగా యోవాబుచే రహస్యమున అబ్నేరు చంపఁబడి నందున ఇష్బోషెతు మిగుల అధైర్యపడెను ($4^{1}$). ఇట్లతఁడు నిరాధారుఁడై యుండునప్పుడతని పరివారములో నిద్దరతని నొకమధ్యాహ్నమునఁ జంపిరి. బహుమానమును బొందెదమను నిరీక్షణలో నతని శిరస్సును దావీదునొద్దకుఁ గొని పోయి, యతనిచే సన్మానింపఁబడక హతులైరి ($4^{5-12}$). I దిన $8^{33}$ $9^{39}$ నందు ఇతనికి **ఎష్బయులు** అను పేరుగలదు. I సమూ $14^{49}$ లోని ఇష్వీ అనునదియు ఇతని పేరేయని కొందఱి యభిప్రాయము. H.

**ఇష్మయా** (Ishmaiah = యెహోవా ఆలకించును).

1. దావీదు కాలములో జెబూలూనీయుల కధిపతి (I దిన $27^{19}$).

2. సిక్లగులో దావీదుతో కలిసికొనిన నొకఁడు. ఇతఁడు దావీదుయొక్క 30 మంది యోధులలో పరాక్రమశాలియు వారికి నాయకుఁడునై యుండెను (I దిన $12^{4}$).

**ఇష్మా** (Ishma = పాడైన). యూదా గోత్రికులలో నొకఁడు (I దిన $4^{3,4}$).

**ఇష్మాయేలీయులు** (Ishmaelites). ఇష్మాయేలు సంతతివారు. ఐగుప్తీయులకే గాక అబ్రాహామునకును రక్తసంబంధులు. ఇష్మాయేలు సంతానమునందు 12 గురు రాజులు లేచిరి (ఆది $17^{20}$ $25^{12-16}$). ఇంక నెక్కువమంది యుండ వచ్చును. ఉదాహరింపఁబడిన పేరులలో మనుములైన వారివియు నున్నట్లు దోచుచున్నది. పన్నెండు పరిపూర్ణతను దెలిపెడి సంఖ్య. ఇశ్రాయేలు గోత్రములును, హిత్తీయుల రాజులును పండ్రెండుగా లెక్కించిరి. ఇష్మాయేలీయుల పన్నెండు జాతులు అరేబియా కుత్తరముననున్న యెడారులలోను హవిలా ఐగుప్తు యూఫ్రటీసు ప్రాంతములయందును నివసించి సంచరించుచుండిరి ($25^{18}$ పురా 1, 12, 4). వారిలో నేదో యొకజాతివారు, నాగరీకులై నెబాతీయులవలె నొకస్థావరము నేర్పఱచుకొనిరి గాని వారును తమ మూలపురుషునివలె మచ్చిక చేయఁబడనేరని అడవి గాడిదవంటివారయి ఇతరులకు లోఁబడ నొల్లనివారుగానుండిరి (ఆది $16^{12}$). అతనివలెనే వారును విల్లును వాడుక చేయుటలో బహు నిపుణులైరి (యెష $21^{17}$). యాకోబు కుమారులు గిలాదుకును ఐగుప్తునకును మధ్య వర్తకము నడుపుచున్న మిద్యాను వర్తకులనఁబడిన ఇష్మాయేలీయులకు తమ సహోదరుఁడగు యోసేపు నమ్మిరి (ఆది $37^{25-28}$). వీరు ఎదోమీ

యులు మోయాబీయులు హగ్రీయులతో కలిసి యున్నట్లు కీర్త $83^{6}$ నందు కనబడును.

అరేబియాలోని ఉత్తర ప్రాంతములయందు వీరు విశేషముగా నుండుటను బట్టియో, లేక వీరు ఇతర జాతులవారిని కలుపుకొనుటనుబట్టియో ఆ ప్రాంతములయందు తిరిగెడు జాతుల వారికందఱికి ఈ పేరు సాధారణమాయెను (న్యాయా $8^{24}$=$7^{25}$ $8^{22,26}$ యూదీతు $2^{23}$). మహమ్మదువలె అరబ్బు లందఱును తాము అబ్రాహాము సంతానీకులమని చెప్పుకొందురు.

**ఇష్మాయేలు** (Ishmael = దేవుఁడు వినును).

1. ఐగుప్తీయురాలగు హాగరువలన అబ్రాహాముకుపుట్టిన కుమారుఁడు. ఇతఁడు జన్మించు నప్పటికి అబ్రాహాము కనానుదేశములో నిండు పది సంవత్సరములు గడిపి 86 యేండ్ల ప్రాయము గల్గినవాఁడు (ఆది $16^{3,16}$ $12^{4}$). ఇష్మాయేలు విశ్వాసమూలమున కలిగినవాఁడు కాదు. దేవుని వాగ్దానములను శక్తిని గ్రహింపఁజాలని వారికి స్వంత ప్రయత్నములచేఁ గలిగినవాఁడు. అబ్రాహాము ఇంట సున్నతి నియమింపఁబడి, అతని యింటివారు సున్నతిపొందినప్పు డితఁడు 13 యేండ్ల వయస్కుఁడు ($17^{25}$). అబ్రాహాము శారాల యవిశ్వాసమునకు గద్దింపుగా మరుసటి సంవత్సరము వృద్ధురాలగు శారాకు ఇస్సాకు జన్మించెను ($21^{5}$). బిడ్డడు పాలు విడుచునప్పుడు మామూలుగాఁ జేయు విందు సమయమున ఇష్మాయేలు ఇస్సాకును పరిహసించుట వారు చూచిరి. అబ్రాహాము కుటుంబమునందు దేవుని వాగ్దానములకు వారసులగువారిని శరీరానుసారులైన అవిశ్వాసులు అపహసించుట కిదే మొదటి పర్యాయము. పౌలీ సంగతినే అలంకార రీతిగా (గల $4^{22-31}$) లో నుదాహరించెను. ఇష్మాయేలొనర్చిన యీ యక్రమమునకై యతఁడును, అతని తల్లియు ఇంటనుండి వెళ్లఁగొట్టఁబడిరి. వారు వెళ్లి, ఎండలో దప్పిచేత మరణమునొందు నంతవరకు బెయేర్షెబా అరణ్యమునందు తిరిగిరి. దేవునిదూత యగుపడి దగ్గరగా నొకపొద చాటుననున్న నీటి ఊటను హాగరుకు కనుపఱచఁగా తల్లిబిడ్డ లిరువురును బ్రతికి మరణము తప్పించుకొనిరి. ఇష్మాయేలు అరణ్యవాసియై కనానుకు దక్షిణముగానున్న పారాను అరణ్యములో గొప్ప వేటకాఁడాయెను. అతఁడు తనతల్లి స్వదేశమగు ఐగుప్తులో నొకతెను వివాహమాడెను (ఆది $21^{3-21}$). అబ్రాహాముకు దేవుఁడు వాగ్దత్త మిచ్చినట్లు, ఇష్మాయేలు 12 గురు రాజులకు మూలపురుషుఁడాయెను ($17^{20}$ $25^{12-16}$ ఇష్మాయేలీయులు చూ॥). అతనియొక్క కూతురును ఏశావు వివాహమాడెను ($28^{9}$ $36^{10}$). అబ్రాహాము మరణమైన పిదప ఇతఁడు ఇస్సాకుతోఁ గలిసి అతని పాతిపెట్టెను ($25^{9}$). 137 సం॥ లు గలిగి అతఁడు చివరకు చనిపోయెను ($25^{17}$).

2. యోనాతాను సంతతివారిలో నొకఁడు (I దిన $8^{38}$ $9^{44}$).

3. యెహోషాపాతు కాలమున యూదా వారి కధిపతియు రాజు సంగతుల విషయములో పైవాఁడుగానున్న జెబద్యా అనువాని తండ్రి (II దిన $19^{11}$).

4. అతల్యాను సింహాసనా భ్రష్టురాలినిగాఁ జేయ కుట్రజేసి సహాయపడినవారిలో నొకఁడు. ఇతని తండ్రిపేరు యెహోనాను (II దిన $23^{1}$).

5. యూదా రాజవంశజుఁడగు నెతన్యా కుమారుఁడు. నెబుకద్నెజరు యెరూషలేమును పట్టుకొని పలెస్తీనును విడిచివెళ్లునప్పుడు గెదల్యా యనువానిని యూదయకు అధిపతిగా నియమించెను. గెదల్యా తన యధికారమునకు లోఁబడిన వారందఱికి అభయమిచ్చినప్పుడు, ఇష్మాయేలను నితఁడు దురుద్దేశముతో నతని నాశ్రయించెను. అమ్మోనీయుల రాజు ప్రేరణచే నితఁడు గెదల్యాను ఇంక కొందఱు యూదులను యోధులగు కల్దీయులనుచంపెను. తరువాత అతఁడు శేషించి యున్నవారిని రాజకుమార్తెలతో పాటు ఖైదీలుగా పట్టుకొని అమ్మోనీయుల దేశములోకి పారిపోవుటకు యత్నించెను గాని కారేయా కుమారుఁడైన యోహానానును ఇంక కొందఱును గలిసి ఇష్మాయేలుతో యుద్ధముజేయఁబోయి వానిని గిబియోనులో కలిసికొనిరి. అతనితోనున్న ఖైదీలందఱును యోహానానును జేరుకొనిరిగాని అతఁడు ఎనిమిదిమందితో తప్పించుకొని తమ కుట్రలో కలిసిన అమ్మోనీయుల రాజుయొద్దకు పారిపోయెను (II రాజు $25^{25}$ యిర్మీ $40^{7-16}$ $41^{1-18}$).

6. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణలవలన విడిచిపెట్టినవారిలో నొకఁడు. ఇతఁడు పష్హూరు వంశస్థుఁడు (ఎజ్రా $10^{22}$).

**ఇష్మెరై** (Ishmerai = యెహోవా కాపాడును?). బెన్యామీనీయులలో నొక ప్రధాని (I దిన $8^{18}$).

**ఇష్వా** (Ishwa = సమానము?). ఆషేరు కొడుకులలో రెండవవాఁడు (ఆది $46^{17}$ I దిన $7^{30}$).

**ఇష్వీ, ఇష్వీయులు** (Ishvi, Ishvites).

1. ఆషేరుయొక్క మూఁడవ కుమారుఁడు. ఇతని సంతతివారు ఇష్వీయులనఁబడిరి (ఆది $46^{17}$ సంఖ్యా $26^{44}$ I దిన $7^{30}$).

2. రాజైన సౌలుకుమారులలో రెండవవాఁడు (I సమూ $14^{49}$).

**ఇష్షీయా** (Isshiah = యెహోవా మఱచును లేక అప్పిచ్చును).

1. ఇశ్శాఖారు గోత్రములోని యొక ప్రధాని (I దిన $7^{3}$).

2. లేవీయులలో మోషే సంతతివారిలో నొకఁడు (I దిన $24^{21}$ దీనితో I దిన $23^{14-17}$ సరిపోల్చుము).

3. లేవీయుఁడగు ఉజ్జీయేలనువాని కుమారులలో నొకఁడు (I దిన $24^{25}$). $23^{20}$ నందితనికి యెషీయా అను పేరుకలదు (యెషయా చూ॥).

4. కోరహు తెగవారిలోని యొక లేవీయుఁడు. ఇతఁడు సిక్లగులో దావీదు పరివారమునందు చేరెను (I దిన $12^{6}$). ఇచ్చట యెష్షీయా యని వ్రాసిరి.

5. (Isshijah = యెహోవా మఱచును). అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{31}$).

**ఇష్కరియోతు** యూదా 8 చూ॥

**ఇస్కా** (Iscah = వివేచించునది?). హారాను కుమార్తె (ఆది $11^{29}$). లోతు తోడబుట్టువని ఆది $11^{27}$ వలనఁ దెలియుచున్నది.

**ఇస్మక్యాహు** (Ismachiah = యెహోవాచే నుద్ధరింపఁబడినవాఁడు). రాజైన హిజ్కియా కాలమునందున్న యొక లేవీయుఁడు (II దిన $31^{13}$).

**ఇస్సాకు** (Isaac = అతఁడు నవ్వును). అబ్రాహాము శారాల కుమారుఁడు. దక్షిణదేశమందు బెయేర్షెబాలో జన్మించెను (ఆది $21^{14,31}$). అప్పటికతని తండ్రికి 100 యేండ్లును తల్లికి 90 యేండ్ల ప్రాయము నుండెను ($17^{17}$ $21^{5}$). శారా తనకు కుమారుని కనునను వాగ్దానవార్తను వినినప్పుడబ్రాహాము ఇట్లెన్నఁటికైన జరుగునా యని లోలోపల నవ్వుకొనెను ($17^{17-19}$). తరువాత తన యింటికి వచ్చిన ముగ్గురు అతిథులలో నొకఁడీ కబురుఁదెలిపినప్పుడు శారా దానివిని నమ్మఁజాలక నవ్వెను ($18^{9-15}$). గాని తనకు బిడ్డకలిగినప్పుడామె తనకును తన స్నేహితులకును దేవుఁడు నవ్వు కలుగఁజేసెనని సంతోషముతో నొప్పుకొనెను ($21^{6}$). దేవుని విశ్వాస్యతను ఈ సంగతులను జ్ఞప్తిచేసికొనుచుండు నిమిత్తమై అబ్రాహాము బిడ్డకు నవ్వువాఁడు అని యర్థమిచ్చు ఇస్సాకు అని నామకరణ మొనర్చెను. అతని కెనిమిదవ దినమున సున్నతిజేసిరి. వాగ్దాన పుత్త్రుఁడును వారసుఁడునగు ఇతఁడు దాసురాలి కుమారుఁడగు ఇష్మాయేలుకన్న గొప్పహక్కుల నారంభమునుండియే యనుభవించెను ($21^{1-12}$). తనయందు అబ్రాహామునకున్న విశ్వాసమును వెల్లడిజేసి దానిని స్థిరపఱచనై, దేవుఁ డిస్సాకును తనకు బలిగా నర్పించ సెలవొసంగెను. అప్పటి కతఁడు యౌవనుఁడై యుండెను ($22^{5}$). బహుశః 25 యేండ్ల ప్రాయముండునని యోసీఫసుయొక్క అభిప్రాయము. ఎట్లయినను అతఁడు తన తండ్రి యనుజ్ఞకు బద్ధుఁడాయెను. అబ్రాహాము తనిని బంధించి బలిపీఠముమీఁదనుంచి, తన కున్నదంతయు దేవునికి సమర్పింప సంసిద్ధుఁడై యున్నట్లు కనఁబఱచఁగా, దేవునిదూత ఇస్సాకు నర్పింపవలదని యాజ్ఞాపించి, అతఁడర్పించిన యొక పొట్టేలును దహనబలిగా నంగీకరించెను. ఇట్లు దేవుఁడు, ఆ కాలమునను్న కనానీయులు మొదలగు విగ్రహారాధికులగు జనాంగము లర్పించు నరబలులు తన కసహ్యములని యిందు మూలముగాఁ దెలియఁజేసెను ($22^{1-18}$).

ఇస్సాకు దక్షిణదేశమునందు బెయేర్ లహాయి రోయిలో నివసించెను ($24^{62}$). అతఁడేకాంత వాస ప్రియుఁడును దైవధ్యాన తత్పరుఁడునై యుండెను. తల్లిదండ్రులను మిగులఁ బ్రేమించెను. తల్లి మరణాంతరమున మిగుల బెంగపడెను ($24^{63,67}$). నలువదవ యేటనే వివాహమాడెను గాని తరువాత 20 యేండ్లవఱకు సంతులేక పోయెను ($25^{20,26}$). కరువువచ్చినందున ఉత్తరముగా 50 మైళ్లు ప్రయాణముజేసి గెరారుకు వచ్చెను ($26^{1,6}$). అచ్చట యెహోవా యతనికి ప్రత్యక్షమై, ఐగుప్తునకు వెళ్లవద్దని దెలిసి అబ్రాహాముతో తానుచేసిన వాగ్దానమును మఱల స్థిరపఱచెను ($26^{2-5}$). విదేశములయందున్నప్పుడు భార్యను చెల్లెలని అబ్రాహాము చెప్పుకొనినట్లు ($20^{10}$) ఇస్సాకును తనభార్యయగు రిబ్కా విషయము చెప్ప యత్నించెనుగాని లాభము లేక పోయెను ($26^{6-11} = 12^{10-20}$). అంతట నతఁడు గెరారువిడిచి, గెరారు లోయలోదిగి, అక్కడ తనతండ్రి త్రవ్వించిన బావులను మఱల వాడుకలోనికిఁ దెచ్చెను ($26^{17-18}$) పిదప బెయేర్షెబాకు వెళ్లి యచ్చట చాలకాలము జీవించెను ($26^{23}$ $28^{10}$). అక్కడకువెళ్లినరాత్రియే దేవుఁడతనికి ప్రత్యక్షమై యతనిని ధైర్యపఱచెను. అతఁడచ్చట తనతండ్రివలె నొక బలిపీఠమును గట్టించెను ($26^{24, 25}$). గెరారురాజగు అబీమెలెకు అతనిదర్శింపవచ్చి, అతనితో సంధిజేసికొనెను ($26^{26-31}$). ఇదివఱకే అచ్చటచేయఁబడిన ప్రమాణములవలన ఆ స్థలమునకు కలిగిన బెయేర్షెబా ($21^{31}$) అను పేరును దృఢపఱచుటకు వారీ సమయమున చేసికొనిన సంధియు ఆదినముననే నీళ్లుపడినబావియు హేతువులయ్యెను ($26^{33}$.)

ఇస్సాకుయొక్క యిద్దరు కుమారులలో పెద్దవాఁడు చిన్నవానిని సేవించునని దేవుఁడు తెలియఁజేసినను జ్యేష్ఠుఁడగు ఏశావు అతనికి ప్రియుఁడాయెను ($25^{28}$). ఇస్సాకు నూరేండ్ల ప్రాయమునుదాటి ($27^{1}$ $25^{26}$ $26^{34}$) మందదృష్టిగలవాఁడైనప్పుడు రిబ్కా యాకోబులుగలిసి, అతని మోసపుచ్చి అబ్రాహాముకు దేవుఁడనుగ్రహించిన దీవెన చిన్నవాఁడగు యాకోబునకు వచ్చునట్లు యుక్తిబన్నఁగా, ఇస్సాకు వారి వంచనకు లోనయి, యాకోబును దీవించెను. తరువాత ఏశావు కోపమునుండి యాకోబును తప్పించనై రిబ్కా ఇస్సాకునకు వేఱుకారణములను దెలుపఁగా, అతఁడు యాకోబును పద్దనరాములో నున్న లాబానునొద్దకుఁ బోయి యతని కుమార్తెను వివాహమాడుమని పంపించెను ($27^{46}$-$28^{5}$).

ఇరువది సం|| లకుఁ దరువాత ఇస్సాకు తన తండ్రియగు అబ్రాహాము జీవించిన హెబ్రోనులో నివసించెను ($35^{27}$ $23^{2}$). అక్కడతఁడు 180 సం|| ప్రాయముగలవాఁడై ($35^{28}$) చనిపోయి తన కుమారు లిద్దరిచేత మక్పేలా గుహలో తన తల్లిదండ్రులు భార్యచెంతను పాతిపెట్టఁబడెను ($49^{30,31}$). క్రొత్త నిబంధనయందు ఇస్సాకు వాగ్దానపుత్రుఁడనియు (గల $4^{22,28}$), విశ్వాసియనియు (హెబ్రీ $11^{9,20}$) చెప్పఁబడెను.

**ఇస్హారు** (Izhar = మంచినూనె). కహాతీయుల తెగవారిలోనున్న యొక లేవీయుఁడు. ఇతఁడొక కుటుంబమునకు పెద్దయయ్యెను (నిర్గ $6^{18}$ సంఖ్యా $3^{19,27}$ I దిన $6^{18,38}$). మోషే నెదిరించిన కోరహు ఇతని కుమారుఁడు (సంఖ్యా $16^{1}$). ఇతని వంశస్థులను ఈసారీయులని పిలిచిరి ($3^{27}$ అమ్మీనాదాబు 3 చూ|).

## ఈ

**ఈకాబోదు** (Ichabod = మహిమ పోయెను). ఫీనెహాసు కుమారుఁడు. ప్రధాన యాజకుఁడగు ఏలీకి మనుమఁడు. ఇతని తల్లి తన పెనిమిటియు మామయు మరణమైరనియు దేవుని మందసము ఫిలిష్తీయులవలన పట్టఁబడెననియు విని ప్రసవమై ఇశ్రాయేలీయుల మహిమా ప్రభావములు పోయెనని చెప్పి, ఆ యర్థమిచ్చు ఈకాబోదను పేరు వానికి పెట్టెను (I సమూ $4^{19-22}$ $14^{3}$). H.

**ఈకొనియ** (Iconium). చిన్నాసియలోని ఫ్రుగియ లుకయొనియ పరగణాల మధ్యనుండు పురాతన పట్టణము. మహాయలెక్సందరునకుఁ బిమ్మట సిరియలోని అంతియొకయ ప్రభుత్వమునకు చేరియుండెను. ఆ కాలములో యూదులనేకు లచ్చట చేరియుండిరి. క్రీస్తుశకమునకు పూర్వము రోమనువారు దాని స్వాధీనపరచుకొని గలతీయ పరగణాకుఁ జేర్చిరి. ఇట్లది యూ

మూఁడు పరగణాలకు సంబంధించియున్నది. పౌలు దానిని తన మొదటి ప్రయాణములో రెండు మారులును (కార్య 13^51-52 14^1-6 19^22), రెండవ ప్రయాణములోను (16^6), మూఁడవ ప్రయాణమందును (18^23) దర్శించెను. మొదటి ప్రయాణములో మాత్ర మీ పట్టణపుపేరు కనఁబడినను అది రెండు మూఁడు ప్రయాణములలోనున్న ఫ్రుగియ గలతీయ పరగణాలలోని పట్టణములలో నొకటియని నవీనపండితులందఱు నంగీకరింతురు. పూర్వ పండితులు పౌలు ఫ్రుగియ గలతీయ పరగణాలను చివరి రెండు ప్రయాణములలో దర్శించెను గాని, ఈ పట్టణ మా పరగణాలలో లేదని అభిప్రాయపడిరి (గలతీయ చూ॥). పౌలచ్చట జయకరముగ పనిజేసెను గనుక నే హింసలు కలిగినవని పైవాక్యములవలనఁ దెలియుచున్నది. ఈ ప్రాంతములలో కనఁబడు రాతి శాసనములవలన పూర్వమందిచ్చట చాలమంది క్రైస్తవు లుండినటుల తోఁచుచున్నది. ఈ పట్టణము నేటివఱకు నిలిచియున్నది. దాని నిప్పుడు కొనియ (*Konia*) యని బిలుచుచున్నారు. అది మిగుల ఫలవంతమైన ప్రదేశములోనుండి జనసమ్మర్థముగల పట్టణమైయున్నది గాని పూర్వముండినంత గొప్ప స్థితియందు లేదు. ప్రస్తుత మా పట్టణములోని యిండ్లను పట్టణపు గోడలను కట్టుటకు పూర్వమున్న ప్రాకారములను గొప్ప నగరుల రాళ్లను వాడుచున్నారు. అందువలన మిగుల విలువగల రాతిశాసనములుగల రాళ్లుకూడ గోడలకు ఉపయోగింపఁబడుటచే అట్టి శాసనము లనేకములు పోయినవి.

(పటము V, K 4)

**ఈగ** కీటకములు 3 చూ॥

**ఈజరు, ఈజరీయులు, ఈజరువంశస్థులు** (Jezer Jeezerites = సహాయము). అబీయెజరు, అబీయెజరీయులను వాటికి మాఱు పేరులు (సంఖ్యా 26^30). అబీయెజరు చూ॥.

**ఈటె** ఆయుధములు I 3 చూ॥

**ఈతచెట్టు** ఈ పద మెక్కడ వచ్చినను (నిర్గ 15^27 లేవీ 23^40 మొ॥) ఖర్జూరపు చెట్టు అని యుండవలెను. ఖర్జూరపుచెట్టు చూ॥

**ఈతయి** ఇత్తయి చూ॥

**ఈతామారు** (Ithamar = ఈఁతచెట్ల తీరము). అహరోనుయొక్క నలుగురు కుమారులలో చిన్నవాఁడు (నిర్గ 6^23 I దిన 6^3 24^1). అహరోనును అతని కుమారులును యాజకత్వమునకు ప్రత్యేకింపఁబడినపు డితఁడును వారిలో నొకఁడై యుండెను (నిర్గ 28^1 I దిన 24^2). గుడారమును కట్టుటకు సమకూర్చిన వస్తువులను ఇతఁడే లేవీయులచేత లెక్క పెట్టించి భద్రపఱచియున్నట్లు నిర్గ 38^21 వలనఁ దెలియును. గెర్షోను మెరారీయను కుటుంబముల కప్పగింపఁబడిన పనిమీఁద ఇతఁడే అధికారియై యుండెను (సంఖ్యా 4^21-33). ఏలీయను యాజకుఁ డీతని వంశపువాఁడే (I రాజు 2^27, I దిన 24^3). ఇతనిసంతతివారు యాజకత్వము జరిపిన కుటుంబములలో నొకటియైయుండెనని I దిన 24^4-6 వలనఁ దెలియును. చెఱకాలమునకు పిమ్మట కూడ ఆ కుటుంబపు వారుండిరి (ఎజ్రా 8^2). (ప్రధానయాజకుఁడు చూ॥)

**ఈతీయేలు** (Ithiel = దేవుఁడు నాకు తోడు).

1. నెహెమ్యాకాలములో యెరూషలేమునందు నివసించుటకు సమ్మతించిన బెన్యామీయులలో నొకఁడు (నెహె 11^7).

2. ఆగూరు తన సామెతలను ఉపదేశించిన యిద్దరిలో నొకఁడు (సామె 30^1).

**ఈయోను** (Iyon = పాడు శేషములు). నఫ్తాలీగోత్రములో ఉత్తరభాగమందున్న యొక కోట. సిరియ దేశపురాజైన బెన్హదదు దానిని జయించెను (I రాజు 15^20 II దిన 16^4). తరువాత అష్షూరు రాజైన తిగ్లత్పిలేసెరు ఈ పట్టణ నివాసులను చెఱపట్టెను (II రాజు 15^29) దాను పట్టణమునకు వాయువ్య దిక్కున ఆమడ దూరములోనున్న మెర్జ ఆయూను (*Merj'ayun*) అను దానిలో ఈయోనను పేరుయొక్క శేషము నింక చూడవచ్చును. అది నేటివఱకు అచటి మన్య ప్రదేశమునకు పేరైయున్నది.

**ఈయీము** (Aim = పాడు శేషములు). యూదాగోత్రపు దక్షిణ సరిహద్దులోనున్న ఒక యూరు (యెహో 15^29-32).

**ఈయ్యే అబారీము** (Ijeabarim = అవతలి ప్రాంతములోని ఈయీము). ఇశ్రాయేలీయులు అరణ్యములో ప్రయాణము చేయుచుండఁగా మకాము చేసిన యొక స్థలము (సంఖ్యా $21^{11}$ స$3^{44,45}$). అసలు భాషయందు సంఖ్యా $33^{45}$ లో **ఈయీము** అని మాత్రముండినను తెనుఁగు బైబిలులో నున్నట్లు ఈ పేరును నిండుగా వేసియున్నారు. సంఖ్యా $21^{11}$ చూడఁగా ఇది మోయాబు నెదుట అరణ్యమందున్నట్లున్నది.

**ఈరా** (Ira = మెలకువ).

1. దావీదుకాలములో సభా ముఖ్యుఁడు. ఈ మాటకు యాజకుఁడనికూడ అర్థముచేయవచ్చును (II సమూ $20^{24}$).

2. దావీదు యోధులలో నొకఁడు (II సమూ $23^{38}$, I దిన $11^{40}$). ఇతఁడు ఇత్రీయుఁడనఁబడును (ఇత్రీయుడు చూ॥).

3. దావీదు యోధులలో మఱియొకఁడు. ఇతఁడు తెకోవ యూరివాఁడగు ఇక్కేషుయొక్క కుమారుఁడు (II సమూ $23^{26}$ I దిన $11^{28}$).

**ఈరాదు** (Irad). కయీనుయొక్క మనుమఁడు (ఆది $4^{18}$).

**ఈరాము** (Iram = మెలకువ?). ఎదోములోని నాయకులలో నొకఁడు (ఆది $36^{43}$ I దిన $1^{54}$).

**ఈరీ, ఈరు** (Ir = మెలకువ). బెన్యామీను గోత్రమునకుఁజెందినవాఁడు (I దిన $7^{7,12}$).

**ఈరూ** (Iru = మెలకువ). కాలేబుయొక్క పెద్ద కుమారుఁడు (I దిన $4^{15}$).

**ఈర్నాహాషు** (Ir-nahash = నాహాషు అనువాని యూరు). I దిన $4^{12}$ లో నున్నట్లిది యొక మనుష్యునిపేరును, అతనిపేరిటి పట్టణమునై యున్నది. అభీగయీలు తండ్రియైన నాహాషు (II సమూ $17^{25}$) అనువాని యూరని కొందఱి యభిప్రాయము.

**ఈర్ష్య** దుష్టత్వము చూ॥

**ఈలై** (Ilai = ఉన్నతము). దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{29}$). దీనికి సంబంధముగానున్న II సమూ $23^{28}$ లో సల్మోను అను పేరున్నది.

**ఈవి, ఈవులనిచ్చుట** (Gifts, Giving of Gifts). ఈవికి సంబంధించిన మాటలు బైబిలులో అనేకములున్నవి. అట్టిమాటలను సాధారణముగా **ఇచ్చుట** యనుపదముతో తర్జుమా చేసిరి. ఇట్టివి పాతనిబంధనలో 1000 మాఱులు కన్న నెక్కువగాను, క్రొత్తనిబంధనలో 300 మాఱులుకన్న నెక్కువగాను కనఁబడును. ఈ సాధారణమైన మాటలుగాక, విశేష యీవులను సూచించుటకు కొన్ని విశేష పదములును గలవు. అసలుభాషలో ఈవికి సంబంధించిన మాటలను ఒకే తెనుఁగుమాటతో తర్జుమా చేయలేక పోయినను, వాటికి సంబంధముగా తెనుఁగులో నున్నమాటలవలన ఆ యసలుమాటల తారతమ్యములను కొంతవఱకు తెలిసికొనఁగలము. ఆ యసలుమాటలను ఈవి, ఫలము, దానము, కట్నము, బహుమానము, కానుక, వరము, కృపావరము, అర్పణము, అర్పితము, ఆశీర్వాద సూచన అను నిట్టి తెనుఁగుమాటలచే తర్జుమాచేసిరి. రాజుల కియ్యవలసినవి **కప్పము, పన్ను** అను మాటలచే తర్జుమాచేసిరి. దుష్టాభిప్రాయములతో మనుష్యులిచ్చునవి **లంచములు** అను పదముచేతను, శిక్షగా దేవుఁడిచ్చునవి **తీర్పు, ప్రతికారము, ప్రతిఫలము** అను నిట్టిమాటలచేతను సూచింపఁబడినవి.

తండ్రియైన దేవుఁడు మానవుల కిచ్చుదానములను సూచించుటకు అసలులో వాడఁబడిన మాటను **ఈవులు** అనుమాటతో తర్జుమాచేసిరి (మ $7^{11}$ లూ $11^{12}$ యాకో $1^{17}$). ఫిలి $4^{17}$ లో నున్నట్లు ఫిలిప్పీయులు పౌలుకు పంపిన ద్రవ్యసహాయమును **ఈవి** యనుమాటతో తర్జుమాచేసిరి. తెనుఁగు బైబిలులోని **దానము** అనుమాట మూలభాషలోని వేర్వేఱు మాటలకు తర్జుమాగా నున్నది. అయినను ఈ మాటతో తర్జుమాచేయఁబడిన మూఁడు హెబ్రీపదములును రెండు గ్రీకుపదములును ఒండొంటికి సంబంధముగా నున్నయవి. దానియేలు గ్రంథములో నున్నట్లు రాజు దానియేలున కియ్యఁదలఁచిన బహుమానములకు **దానము** అనుమాటను వాడియున్నారు (దాని $2^{6,48}$ $5^{17}$). సంఖ్యా $18^{11}$ లో అర్పణము అను దానికి **దానములలోనుండి ప్రతిష్ఠింపబడినది** యనుమాటకలదు. దేవుని కృపచే గలిగిన

రక్షణను సూచించుటకు పౌలు వాడిన మాటను దానము అనుమాటతోనే భాషాంతరముచేసిరి (రోమా. $5^{17}$).

**బహుమానము** అనునదియు దానము అను మాటవంటిదే. ప్రజలు రాజునకియ్యవలసినదియు (I సమూ $9^{7}$), రాజు ప్రజలకిచ్చునదియు (ఎస్తే $2^{18}$), తండ్రి తనకొడుకులకిచ్చినదియు (ఆది $25^{6}$ II దిన $21^{3}$), పైవారి యనుగ్రహమును పొందుట కియ్యఁబడినదియు (మీకా $7^{3}$), ఇతరులకోపమును తీర్చుటకిచ్చినదియు (సామె $21^{14}$ $6^{35}$), మంచి మాటలు చెప్పుటకై ప్రజలు బిలామువంటి ప్రవక్తల కిచ్చినదియు (యూదా 11) బహుమానము అను మాటచే తర్జుమాచేయఁబడియున్నను అసలు భాషలో వీటికి వేర్వేఱుమాటలున్నవి. పౌలు పందెములనుగూర్చిన యలంకారములను వాడుచు తాను దేవునిపిలుపునుగూర్చిన బహుమానమును పొందవలెనని ప్రయాసపడినట్లు వ్రాయుచున్నాఁడు (ఫిలి $3^{12-16}$).

ప్రజలు ఔదార్యముతో నిచ్చినవి సాధారణముగా **కానుకలు** అనఁబడును. ఈ మాటయే పాతనిబంధనలో స్వేచ్ఛాపూర్వకముగా నిచ్చిన యర్పణవిషయమై వాడిరి (ఆది $32^{13,18,21}$ మొ॥). క్రొత్తనిబంధనలో నున్నట్లు దీనిని దేవునికిచ్చిన వాటిని సూచించుటకు వాడియున్నారు (మ $2^{11}$ $8^{4}$ మొ॥). కానుక యనుమాటకు ప్రతిగా **అర్పణము** అను పదమును (మ $5^{24}$ $23^{18}$ మొ॥) లో వాడిరి. ఇట్టి యర్పణములు చేయుట మన విధియై యున్నది.

దేవుఁడు మానవులకు నిచ్చువాటిని సాధారణముగా **వరము** అనుమాటచే తర్జుమాచేసిరి (యోహా $4^{10}$ కార్య $2^{38}$ $8^{20}$ $10^{45}$ మొ॥). నిత్య జీవము ఆయన యిచ్చువరమే. పరిశుద్ధాత్మ, పరిశుద్ధాత్మయొక్క శక్తులు అన్నియు ఆయన వరములే. ఇవే మనకు రక్షణాధారములు. (కృపావరములు చూ॥)

**ఈసాకీయులు** ఇస్సాఖారు చూ॥

# ఉ

**ఉంగరము** ఆభరణములు 2 చూ॥

**ఉక్కాలు** (Ucal = నేను బలముగల వాఁడను). ఆగూరు అనువాఁడే యిద్దరికి తన సామెతెలను చెప్పెనో ఆ యిద్దరిలో నొకఁడు (సామె $30^{1}$ ఈతీయేలు చూ॥). LXX చూడఁగా ఇది యొకనిపేరునుగా నెంచక సామాన్యమైన మాటనుగా నెంచి ఈతీయేలును ఉక్కాలు అను వాటిని నేను ఆయాసపడి క్షీణించితిని యని తర్జుమాచేసి యున్నారు. అయితే ఇట్లు తర్జుమా చేయవలెననిన మొదట వాటి హెబ్రీ పదములను సవరణచేయవలసి యుండును. వీటి అసలు హెబ్రీ పదములు తెనుఁగు బైబిలులో నున్నట్లుగానే యున్నవి.

**ఉక్కు** లోహములు 4 చూ॥

**ఉగ్రత** కోపము 2 చూ॥

**ఉచ్చు** వేటాడుట చూ॥

**ఉజ్జా** (Uzza, Uzzah = త్రాణ).

1. లేవీ గోత్రికుఁడైన అబీనాదాబు రెండవ కుమారుఁడు. తాము పట్టుకొని వెళ్లిన దేవుని మందసమును తమయొద్దనుంచుకొనుటకు భయపడి ఫిలిష్తీయులు దానిని మరల పంపివేయఁగా, ప్రజలు దానిని ఈ ఉజ్జా తండ్రియగు అబీనాదాబు ఇంటియందుంచిరి (I సమూ $7^{1-2}$). దావీదు రాజైన పిదప ఆ మందసమును క్రొత్త బండి మీఁదఁబెట్టి యెరూషలేమునకుఁ దెచ్చుచుండఁగా, బండి కదలినప్పుడు వెంటవచ్చుచుండిన ఉజ్జా తన చెయ్యిచాపి దానిని పట్టుకొనెను. మందసమును ముట్టినవాఁడు చావవలెనను (నిర్గ $25^{14}$ సంఖ్యా $4^{15}$) దేవుని యాజ్ఞ నుల్లంఘించినందున ఉజ్జా వెంటనే మరణమాయెను (II సమూ $6^{1-7}$ I దిన $13^{1-10}$). అతఁడు మరణమైనచోటుకు పెరెజ్ ఉజ్జా ( = ఉజ్జాకు ఘాతుకము) అను పేరుపెట్టిరి (II సమూ $6^{8}$). అబీనాదాబు 1 చూ॥

2. యూదారాజుల నగరముదగ్గరనున్న యొక మంచితోఁటయొక్క యజమానుఁడు. తరువాత అతనినిబట్టి ఆ తోఁట కతనిపేరు పెట్టిరి. ఆ తోఁటయందు మనష్షే ఆమోను అను రాజులిద్దరు పాతిపెట్టఁబడిరి (II రాజు $21^{18,25-26}$).

3. బెన్యామీను గోత్రికుఁడగు ఏహూదు యొక్క కుమారుఁడు (I దిన $8^{7}$).

4. బాబెలునుండి చెఱకుఁబిమ్మట జెరుబ్బాబెలుతో తిరిగివచ్చిన నెతీనీయులలో నొక వంశకర్త (నెహె $7^{46,51}$).

5. మెరారీ తెగవాఁడైన ఒక లేవీయుఁడు (I దిన $6^{29}$). H.

**ఉజ్జీ** (Uzzi = నా బలము).

1. అహరోను సంతతివారగు యాజకులలో నొకఁడు (I దిన $6^{5,6,51}$). ఎజ్రా యీ ఉజ్జీ సంతతివారిలో నొకఁడై యుండెను (ఎజ్రా $7^{4}$).

2. ఇశ్శాఖారు గోత్రపువాఁడు. ఇతఁ డొక కుటుంబమునకు పెద్ద (I దిన $7^{2,3}$).

3. బెన్యామీనీయుల కుటుంబములలో నొక దానిపేరు (I దిన $7^{7}$ $9^{8}$). ఈ రెండు వాక్యములలో నున్నవారు ఒకరుగాక యిద్దరని కొందఱి యభిప్రాయము.

4. లేవీయులలో నొకఁడు (నెహె $11^{22}$).

5. యాజకులలో నొక కుటుంబముయొక్క పేరు (నెహె $12^{19,42}$). ఈ రెండు వాక్యములలోనివారు ఒకరుగాక యిద్దరని కొందఱు తలంచుచున్నారు.

**ఉజ్జియా** (Uzziah, Uzzia = యెహోవా నా బలము).

1. యూదా రాజగు అమజ్యా కుమారుఁడు. అజర్యా యను మాఱుపేరు గలవాఁడు. పదునారేండ్ల ప్రాయము గలిగి తండ్రి తరువాత రాజాయెను (II రాజు $15^{1,13}$ II దిన $26^{3}$). ఫిలిష్తీయులు అరబ్బీయులు మెయోనీయులు అమ్మోనీయులమీఁద పొందిన జయములచేత నితని యేలుబడి ప్రసిద్ధి కెక్కెను. ఇశ్రాయేలు రాజగు యెహోయాషు ముట్టడించినందున పాడయిన యెరూషలేము ప్రాకారములను మఱల కట్టించెను (II దిన $26^{6-9}$). ఎఱ్ఱ సముద్ర తీరముననున్న ఏలతు పట్టణపు రేవును బలపఱచి, దానియందు యూదుల నుంచెను (II రాజు $14^{22}$). అందువలన యూదావారెంత విశేషముగ సముద్రములమీఁదఁ వర్తకము సాగించిరో చెప్పఁజాలము. 3,07,500 మందిగల సైన్యబల మతనికుండెనని దినవృత్తాంతముల గ్రంథమందున్నది గాని ముద్రాక్షర యంత్రశాలలులేని కాలమున ప్రతులను చేతితో వ్రాయునప్పుడు, పూర్వపు సంగతులను వ్రాయువారు అభిమానముచేత సంఖ్యలు ఎక్కువగా వేయుట అసాధారణ విషయము కాదు. చివరి దినములలో ఉజ్జియా కుష్ఠరోగియైనందున అతని పుత్త్రుఁడగు యోతాము అధికారియై తండ్రికి బదులుగా నేలెను ($15^{5}$). దేవాలయమునందు ధూపము వేసెడి యాజకత్వపు ధర్మమును తాను అక్రమముగా జరిగించ యత్నించినందున యిట్టి శిక్ష అతనికి కలిగెనని దినవృత్తాంతములలో కనఁబడుచున్నది (II దిన $26^{16-21}$). ఇతని కాలమునందు గొప్ప భూకంపము కలిగెను (జెక $14^{5}$) తరువాతి కాలమునందది కాలనిర్ణయమున కొక సాధన మాయెను. మూఁడవ తిగ్లత్పిలేసరుయొక్క శాసనములలో కనఁబడు యౌది అజ్రియా (*Azriyau of Yaudi*) అను ప్రసిద్ధ శాసనమునందు కప్పము కట్టుచున్నట్లున్న రాజు ఉజ్జియా యని ఇటీవల కొందఱభిప్రాయపడిరి గాని యౌది యనునది పలెస్తీనుకు ఉత్తరముననున్న ఆర్మీనియాలోని యొక పరగణాయని తెలియవచ్చుచున్నది.

2. కహాతీయుల తెగలోని లేవీయులలో నొకఁడు (I దిన $6^{24}$).

3. రాజైన దావీదు ఆస్తిమీఁద అధిపతిగా నుండిన యోనాతానను వాని తండ్రి (I దిన $27^{25}$).

4. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో నొక యాజకుఁడు (ఎజ్రా $10^{21}$).

5. యూదా సంతతివారిలో నొకఁడు (నెహె $11^{4}$).

6. దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{44}$). తెలుఁగునందు ఈ పదముయొక్క గుణింతము తక్కిన వాటికంటె భేదముగా నుండకున్నను, మూలభాషలో కొంచెము భేదముగా నున్నది.

**ఉజ్జీయేలు, ఉజ్జీయేలీయులు** (Uzziel = దేవుడు నా బలము, Uzzielites).

1. కహాతీయుల తెగకుచేరిన లేవీయులలో నొకఁడు. ఇతఁడొక కుటుంబమునకు పెద్ద యాయెను (నిర్గ $6^{18,22}$ సంఖ్యా $3^{19,27,30}$ I దిన $6^{2,18}$ $23^{12,20}$ $24^{24}$ $26^{23}$). ఇతఁడు అహరోనుకు

పినతండ్రి యనఁబడును (లేవీ $10^4$). ఇతని సంతతి వారగు **ఉజ్జీయేలీయులలో** 112 మంది దావీదు దేవుని నిబంధన మందసమును యెరూషలేమునకు తెచ్చుచుండఁగా సహాయపడిరి (I దిన $15^{10}$).

2. షిమ్యోను సంతతివారిలో నొక యధిపతి. ఇతఁడు అమాలేకీయులమీఁద యుద్ధముచేసి వారిని జయించెను (I దిన $4^{41-43}$).

3. బెన్యామీనీయుల కుటుంబములలో నొక కుటుంబమునకు పెద్ద (I దిన $7^7$).

4. దావీదు కాలములోని పాటకులలో నొకఁడు. ఇతఁడొక లేవీయుఁడు (I దిన $25^4$). ఇతనికి **అజరేలు** అను మాఱు పేరు కలదు (I దిన $25^{18}$). (అజరేలు 2 చూ॥)

5. లేవీయులలో మఱియొకఁడు (II దిన $29^{14}$). హిజ్కియా చేసిన దిద్దుబాటుకు సహాయము చేసిన వారిలో నితఁడొకఁడు.

6. నెహెమ్యా కాలమునందు యెరూషలేము గోడలను కట్టించుటలో సహాయముచేసిన యొక కంసాలి (నెహె $3^8$).

**ఉజ్జేన షెయెరా** (Uzzen-Sheerah = షెయెరాయొక్క భాగము). ఇది షెయెరా యను ఎఫ్రాయిమీయురాలు కట్టించిన యొక యూరు (I దిన $7^{24}$). అది యెరూషలేమునకు వాయువ్యమున ఆఱు క్రోసుల దూరములో బేత్ హోరోను అను పేరుగల రెండు స్థలములకు మధ్య నున్నది.

**ఉత్తర దేశము** (North Country). ఇది ఫలాని దేశమని చెప్ప వీలుకాదు. బైబిలులో నిది యీ దిగువ మూఁడు సంబంధములలో కనఁబడును. 1. ఇది పలెస్తీనుకు శత్రువులైన వారు వచ్చిన దేశము. పలెస్తీనుకు తూర్పుగా నుండు బబులోను సహా అట్టి దేశముగా నెంచఁబడెను. ఎందునకనఁగా మధ్య నీరులేని యెడారి యుండుటచే వారు తిన్నఁగా పడమరగా రాలేక చుట్టు తిరిగి యుత్తరమునుండి పలెస్తీనుమీఁదికి వచ్చిరి (యిర్మీ $6^{22}$ $10^{22}$ జెక $6^{6-8}$). 2. అది యిశ్రాయేలువారును యూదా వారును చెఱపట్టఁబడినపుడు కొంచుపోఁబడిన దేశమును సూచించును (యిర్మీ $3^{18}$ $16^{15}$ $23^8$, $31^8$ జెక $2^6$). 3. యిర్మీ $46^{10}$ లో నున్నట్లది ఉత్తరపు సిరియకు వాడఁబడిన నామము. ఇది పలెస్తీనుకు ఉత్తరముగా నున్నది.

**ఉత్తరవక్కనసున్న పై గవని** యెరూషలేము B III 8 (1) చూ॥

**ఉత్తరవైపుననున్న ఆవరణద్వారము** యెరూషలేము B III 8 (1) చూ॥

**ఉత్సవ సమాజము** సమాజము 2 చూ॥

**ఉద్యానము, ఉద్యానవనము** తోట చూ॥

**ఉద్యోగస్థుఁడు** (Officer). ఈ మాట యొక్క సాధారణమైన అర్థము అందఱికిఁ దెలిసి యుండుటచే దానిని వివరింప నవసరములేదు గాని, ఆది $37^{36}$ $39^1$ యిర్మీ $52^{25}$ మొ॥ వాక్యములలో ఉద్యోగస్థుఁడని తర్జుమాజేసిన అసలు పదమునకు విశేషార్థ ముండుటవలన దానినిమాత్ర మిచ్చుట తెలిపెదము. ఆ మాటకు నపుంసకుఁడు అనునది శబ్దార్థము. రాజు పరివారములో నపుంసకులనేకులుండుటచే ఇది వారి పరివారములో చేరిన వారికిని పేరయ్యెను. ఇట్లు ఈ యసలు పదమును యిర్మీ $22^4$ $34^{19}$ $41^{16}$ మొ॥ వాక్యములలో తర్జుమాజేసిరి. అట్టి వారిలోఁ గొందఱుద్యోగస్థులగుటచే (కార్య $8^{27-39}$) పైన నున్నట్లుగా కొన్ని చోట్ల దానిని ఉద్యోగస్థుఁడని తెనిగించుట న్యాయమే గాని ఈ యసలు పదమున కెచ్చట ఈ యర్థమున్నదో, ఎచ్చట నపుంసకుఁడను అర్థమో దానిని నిశ్చయించుట కష్టము (నపుంసకుడు చూ॥)

**ఉన్నత స్థలములు** (Sanctuaries, High places). ఆయా మతములవారు తమ దేవుండ్లను ఉన్నతమగు స్థలములయందారాధించెడి యలవాటు నోవహు కాలమునుండి యారంభమాయెనని పలువుర యభిప్రాయముగఁ గన్పడుచున్నది (ఆది $8^{4, 8-20}$). అబ్రాహాము సహితము యెహోవాకు తన యర్పణ నర్పించుటకు దైవాజ్ఞప్రకారము మోరీయా పర్వతమునకు వెళ్లెను ($22^{1-3}$), ఉన్నత స్థలములమీఁద దేవుని నారాధించుటను తప్పుగానెంచి ఖండించుట కేమియు లేకున్నను, దీని ద్వారా పలెస్తీనులో మిగుల యభివృద్ధికెక్కిన విగ్రహారాధన సంబంధమగు నీచ్యకరమైన

యాచారముల వలన ఇశ్రాయేలీయులు క్రమ మార్గమునుండి తొలగిపోవుట కొక ముఖ్య సాధనముగా నుండుటచే వాటిని నిషేధించవలెనని దేవుఁడు తన ప్రవక్తలద్వారా బహిరంగముగ ప్రకటనఁ జేయించెను. అబద్ధ దేవతలను వాటికి సంబంధించిన యారాధనను విసర్జించవలెనని యాజ్ఞాపించెను (లేవీ $26^{20}$ సంఖ్యా $22^{41}$ $33^{52}$ ద్వితీ $33^{29}$ I రాజు 3,12,13,15,22, II రాజు 12,14,15 మొ॥). పై నుదాహరించిన వచనములలో ఉన్నత స్థలమను పదము **విగ్రహారాధన, కీడు** అను వాటికి పర్యాయ పదముగ నుపయోగింపఁబడెను. ఇవి యా దేశములోని యెత్తయిన స్థలములనైనను, ఇట్టి యారాధనలకొఱకు మనుష్యులు కట్టిన స్థలములనైనను సూచించును.

B.

**ఉన్నీ** (Unni, Unno = బాధపఱచఁబడు).

1. లేవీయుల కుటుంబములలో నొక కుటుంబము. గుడి సేవ చేయువారిలో వీరు రెండవ వరుసలో నుండిరి (I దిన $15^{18-20}$).

2. జెరుబ్బాబెలుతోకూడ బాబెలు నుండి యెరూషలేమునకు వచ్చిన లేవీయుల కుటుంబములలో నొకటి (నెహె $12^{9}$). ఈ పేరు ఉన్నో యని హెబ్రీలోనున్నను ఉన్నీ యని చదువవలయునని ఆ మాట యున్న పుట అంచున వ్రాయఁబడియున్నది.

**ఉపకారములు** కృపావరములు చూ॥

**ఉపచారము** పరిచర్య చూ॥

**ఉపదేశకుడు** బోధకుడు చూ॥

**ఉపదేశము, ఉపదేశించుట** (Instruction, Precepts, Doctrine). ఉపదేశమను తెలుఁగు పదము ఆయా అసలు పదములకు తర్జుమాయై యున్నది. ద్వితీ $32^{2}$ యోబు $11^{4}$ మొ॥ వచనములందు ఒక పదమును, కీర్త $119^{27-40}$) మొ॥ వచనములలో నొకటియు, సామె $1^{2,3,7}$ మొ॥ వచనములలో మఱియొక పదమును అసలునం దున్నవి. ఇవన్నియు బోధకులు చేసిన హితోపదేశమును సూచించును. కీర్త $119^{27,40,56,63}$ మొ॥ వచనములలో అది దేవుని వాక్యమున కారోపించిన సార్థక నామములలో నొకటిగానుండి, లేఖనముల కొక బిరుదయ్యెను. క్రొత్త నిబంధన యందు తాను బోధకులకు వ్రాసిన పత్రికలలో ముఖ్యముగా నిట్టి వాక్యబోధను గూర్చిన పదములను పౌలు వాడెను. I తిమో $5^{17}$ II తిమో $3^{16}$ $4^{3}$ తీతు $2^{7}$ నందు ఉపదేశము ఉపదేశించుట అను మాటలు కనబడును. ఆ యసలు పదమునే I తిమో $4^{13,16}$ II తిమో $3^{10}$ రోమా $12^{8}$ $15^{4}$ లో **బోధ, బోధించుట** అను మాటచే భాషాంతరము చేసిరి. మ $15^{9}$ మా $7^{7}$ ఎఫె $4^{20}$ లో అది మానవులు కల్పించిన తప్పు బోధలకు వాడిరి గాని కొలొ $2^{22}$ లో అదే యసలు మాట **పద్ధతులు** అను పదముచే తెనిఁగించిరి. బోధ యని సాధారణముగా తెనిఁగించిన వేఱొక అసలు పదమును తీతు $1^{9}$ లో ఉపదేశమని తర్జుమాచేసిరి. (బోధ చూ॥)

**ఉపపత్ని, దాసి** (Concubine). బైబిలు నందు ధర్మయుక్తముగ వివాహమాడిన యామె గాక తక్కిన భార్యల కుపయోగింపఁబడిన పదములు. వీరిని కొనిగాని చెఱపట్టిగాని తెచ్చుకొనెడివారు. హాగరు (ఆది $16^{2,3}$ $21^{10}$) బిల్హా (ఆది $29^{29}$ $35^{22}$) గిద్యోను ఉపపత్ని (న్యాయా $8^{31}$ $9^{17}$) ఇట్టివారై యుండిరి. వీరిని భార్యల కన్న సులభముగా విడనాడఁ గలిగినప్పటికి (ఆది $21^{10-14}$) వీరికిని కొన్ని హక్కు లిచ్చి కాపాడుటకు మోషే ధర్మశాస్త్రమునందు మంచి యేర్పాటులు చేయఁబడెను (నిర్గ $21^{7-11}$ ద్వితీ $21^{10-14}$).

**ఉపమానము** (Parable). నీతులనుగాని మత సత్యములనుగాని మనస్సునకు బాగుగా పట్టునట్లు సర్వసాధారణ సంగతులతో పోల్చి చెప్పెడి విధమును ఉపమానముగ నెంచుచున్నాము. దృష్టాంతమునకు ఉపమానమునకు నుండు భేదమును జాగ్రత్తగా గుర్తింపవలెను. ఉపమానము కథవలె నుండును. అది దృష్టాంతమంత క్లుప్తముగ నుండదు. మీరు లోకమునకు వెలుగైయున్నారు (మ $5^{14}$), బొచ్చు కత్తిరించువానియెదుట గొఱ్ఱె మౌనముగా నుండునట్లు అతఁడు నోరు తెరవలేదు (యెష $53^{7}$) మొ॥ నవి దృష్టాంతములుగాని పరలోకరాజ్యము ఒక స్త్రీ తీసికొని పిండి యంతయు పులిసి పొంగువఱకు మూడు కుంచముల పిండిలో దాచిపెట్టిన పుల్లని పిండిని పోలియున్నది (మ $13^{33}$) అనునది యొక ఉపమానము. ఉపమానములవలన రెండు లాభములున్నవి:—1. ఈ

విధముగాఁ దెలుపఁబడిన సత్యము మనస్సున చక్కగా నాటుకొని మఱచినను మఱుపునకు రాకుండును. పశ్చాత్తాపపడు పాపిని దేవుఁడంగీకరించునను సత్యమును తప్పిపోయిన కుమారుని ఉపమానము (లూ $15^{11-32}$) లేకుండ బోధించినయెడల అంత చక్కగా బోధపడునని చెప్పఁజాలము. 2. ఒక గొప్ప వానికి వాఁడు చేయుచున్న యక్రమ కార్యములను గూర్చి దెలిపి గద్దించుటకు మఱియొక రీతిగా వీలుగానియెడల వాని యక్రమముల నీరీతిగా నొక యుపమానముగా నల్లి చెప్పుటవలన వాఁడు దానిని చక్కగా వినుటయేగాక, వాఁడట్టి కార్యములు చేసిన యాతఁడు శిక్ష కర్హుఁడేయని చెప్పునట్లును చేయవచ్చును. హిత్తీయుఁడగు ఊరియాకు ద్రోహముఁ గావించిన దావీదువంటి మహారాజును సహా గద్దించుటకు ప్రవక్తయైన నాతాను కీవిధముగా వీలు జిక్కెను (II సమూ $12^{1-6}$).

ఈ దిగువ నుదాహరింపఁబడినవి పాఁతనిబంధన యందలి ముఖ్య ఉపమానములై యున్నవి. రాజు నభిషేకించుకొనిన చెట్లు (న్యాయా $9^{8-20}$); చిన్న ఆడు గొఱ్ఱెపిల్ల (II సమూ $12^{1-14}$); తన సహోదరుని చంపిన విధవరాలి కుమారుఁడు ($14^{4-20}$); చెఱపట్టిన వాని తప్పించుకొని పోనిచ్చిన యోధుఁడు (I రాజు $20^{35-42}$); తన కుమారునికి మనువు విచారించిన ముళ్లచెట్టు (II రాజు $14^{9-11}$); ద్రాక్షతోట (యెష $5^{1-7}$); రెండు పక్షి రాజులు, ద్రాక్షతీగె (యెహె $17^{1-10}$); కొదమ సింహములు ($19^{1-9}$); ఒహొలా ఒహొలీబా ($23^{1-49}$); ఉడుకుచున్నకుండ ($24^{1-14}$) మొ॥

క్రీస్తు బోధలలో ముఖ్యభాగము ఉపమాన రీతిగాఁ జేయఁబడినవి. బైబిలు ఉపమానము లన్నప్పుడు క్రీస్తు చెప్పిన ఉపమానము లనియే సాధారణముగా అర్థము జేసికొందురు. యేసు తన పరిచర్య నారంభించి నప్పటినుండియు ఉపమానములను వాడుచు వచ్చినను (మా $3^{23}$ లూ $6^{39}$ $7^{40-50}$) తనను అనుసరించిన వారికి మాత్రమే పరలోక సత్యములను వివరించవలసి వచ్చినప్పుడు విశేష రీతిగా ఉపమానములను వాడెను (మ $13^{3}$ మా $4^{2}$). ఆయన యీ విధముగా బోధించుటకు రెండు కారణములను జెప్పెదరు. 1. ఆయన ఉపమానరీతిగా బోధించునను ప్రవచనము నెఱవేఱవలసి యుండెను (మ $13^{34,35}$ కీర్త $49^{4}$ $78^{2,3}$). 2. ఆయన బోధలను నమ్మిన శిష్యులు దేవుని రాజ్య మర్మములను ఇంకను లేటగాఁ దెలిసికొనవలసి యుండిరి. ఆయన ఈ రీతిగా ఉపమానములను చెప్పునప్పుడు ఆయనను నమ్మనివారి కవి యెంత మాత్రమును అర్థము కాక వట్టి కథలవలె నుండెను. వారి అవిశ్వాసమును బట్టి దేవుని రాజ్యసత్యములను దెలిసికొనకుండులాగున అవి వారి కొక తరహా తీర్పుగా నుండెననవచ్చును (మా $4^{11,12}$).

ఈ రీతిగా బోధింపఁబడిన క్రీస్తు బహిరంగ బోధలలో ముఖ్యములై యుండిన ఉపమానములను ఒకటి తప్ప (మ $18^{23-35}$) మిగత నాటి నన్నిఁటిని మూఁడు ముఖ్య భాగములుగఁ జేయవచ్చును. I, పరలోక రాజ్య లక్షణములను దెలియఁజేయు 8 యుపమానములు (మ $13^{1-50}$ మా $4^{26-29}$). వీటితోపాటు మఱియొక దానిని ఆయన ఫలితార్థముగా నుపయోగించెను. (మ $13^{51,52}$). వీటి నన్నిఁటి నాయన యొకనాఁడు గలిలయ సముద్ర తీరమునఁ జెప్పెను (మ $13^{1,53}$). వాటియందు 5 ముఖ్యములగు సత్యములిమిడి యున్నవి. 1. విత్తువాఁడు, విత్తనము; సువార్తను వినిన ఆయా తరగతులవారు దాని నంగీకరించు విధము. 2. గురుగులు గోధుమలు; మంచి వాటి యందు చెడ్డవి యుండ సంభవించుట. 3. తెలియఁబడకుండ మొలిచిన విత్తనము, ఆవగింజ, పులిసిన పిండి: తెలియకుండనే బహిరంగముగాను, అంతర్యముగాను సంఘము వృద్ధినొందుట. 4. దాచఁబడిన ధనము, విలువగల ముత్యము; రాజ్యము యొక్క విలువ, దానిని సంపాదింపనై చేయవలసినపని. 5. అన్ని రకముల చేపలను పట్టువల; యుగాంతము వఱకు దృశ్యమగు సంఘమందుండెడి కలగలుపు స్థితి. II. దేవుని కృప నొందువారు దాని ననుభవించుచు కనుపఱచవలసిన లక్షణములను గూర్చిన 19 ఉపమానములు (లూ $10^{25}$—19; $13^{19-21}$ మినహా). ఇవి యన్నియు దాదాపుగా పర్ణశాల పండుగకును, క్రీస్తు ఆచరించిన చివరి పస్కాకును మధ్య ఆరు మాసములలోఁ జెప్పఁబడెను. మంచి సమరయుఁడు, మధ్యరాత్రి వచ్చిన స్నేహితుఁడు, అవివేకియగు

ధనవంతుఁడు, కనిపెట్టుకొనియున్న సేవకులు, మూయఁబడినతలుపు, అగ్రస్థానములు, విందుకు రాక పోయినందుకు చెప్పిన సాకులు, తప్పిపోయిన గొఱ్ఱె, పోగొట్టుకొనఁబడిన రూక, తప్పిపోయిన కుమారుఁడు, అన్యాయస్థుఁడగు గృహనిర్వాహకుఁడు, ధనవంతుఁడు లాజరు, విధిని జరిగించిన సేవకుఁడు గోజాడిన విధవరాలు, పరిసయ్యుఁడు సుంకరి, మినాలు మొదలగునవి. III. మ $24^{32-35}$ తోఁ గలిసి న్యాయపు తీర్పును గుఱించిన ఆరు ఉపమానములు. వీటిని ఆయన యెరూషలేము నందు తన చివరివారములోఁ జెప్పెను. ఇద్దఱు కుమారులు, దుష్టులగు కాపులు, రాజకుమారుని పెండ్లి, పెండ్లి వస్త్రము, పదిమంది కన్యకలు, తలాంతులు (మ $22^{1-14}$ $25^{1-30}$).

ఈ యుపమానముల భావమును బోధించు నప్పుడు వీటిలోని ప్రతిది మొదట యెట్టి సందర్భమునం దుపయోగింపఁబడెనో, యెట్టి సత్యమును సిద్ధాంతీకరించనై యుద్దేశింపఁబడెనో బహు స్పష్టముగాఁ దెలిసికొనవలెను. ఇట్లు దెలిసికొనగానే ఆ యుపమానములోని బోధ అట్టి స్థితిగతులలో నుండువారి కందఱికి, అన్నికాలములలోను సరిపడును.

**ఉపవాసము (Fasting).** పాతనిబంధన యందు భోజనమును విసర్జించుట మనస్సును చిన్న పుచ్చుకొనుటయను అర్థమిచ్చు రెండు పదములు ఉపవాసమును సూచించును. యెష $58^{3}$ నం దీ రెండుపదము లున్నవి. మొదటి మాటను **ఉపవాసమని,** రెండవదానిని **ప్రాణములను ఆయాసపఱచుకొనుట** (యెష $58^{3}$) యనియు, **దుఃఖపఱచుకొనుట** (లేవీ $16^{29,31}$ $23^{27,29}$) యనియు తర్జుమా జేసిరి. మోషే ధర్మశాస్త్రము నందు ప్రాయశ్చిత్తార్థదినమున మాత్రము ఉపవాసము చేయవలెనను ఆజ్ఞ గలదు (లేవీ $16^{29-31}$ $23^{26-32}$. సంఖ్యా $29^{7}$) గాని, ఇతర సమయములలో ఉపవసింపవలెనను నియమమున్నట్లు కనఁబడదు. ఇందుచేతనే ప్రాయశ్చిత్తార్థ దినమును సూచించుటకు **ఉపవాసదినము** అనుమాటను వాడుచు వచ్చిరి (కార్య $27^{9}$). ధర్మశాస్త్రమునం దీ యొక్క నియమముమాత్రమే యున్నను, యూదులు విశేష సమయములలో ఉపవాసము చేయు వాడుకలున్నట్లు బైబిలునందున్నది. మోషే (నిర్గ $34^{28}$ ద్వితీ $9^{9,18}$), ఏలీయా (I రాజు $19^{8}$) లు దేవుని ప్రత్యక్షతకొఱకు సిద్ధపడు నిమిత్త ముపవాసముజేసిరి. క్రీస్తును అదేరీతిగా జేసెను (మ $4^{2}$). దుఃఖసమయములలో నుపవసించుట అలవాటాయెను. సౌలు యోనాతానులు చంపఁబడఁగా దావీదిట్లుజేసెను (I సమూ $31^{3}$ II సమూ $1^{12}$). తనబిడ్డ చనిపోయినప్పుడు దావీదుపవాసము చేయకపోవుట అతని సేవకులు చూచి యాశ్చర్యపడిరి ($12^{20-23}$). యెరూషలేము గోడలుపడిపోవుటవలన కలిగినదుఃఖముచే నెహెమ్యా ఉపవాసముండెను (నెహె $1^{4}$). అయితే అతఁడు దేవునిసహాయమును పొందుట కిట్లు ఆయన యెదుట తనప్రాణము నాయాసపఱచుకొనెనని తెలిసికొనవలెను. ఎజ్రా కాలము నందును (ఎజ్రా $8^{21}$), ఎస్తేరు కాలమునందును (ఎస్తే $4^{16}$) యూదులు దేవుని సహాయముపొందుటకు ఉపవాసముచేసిరి. ఈ విధముగా తమ్మును తాము తగ్గించుకొనుటచేత దేవుని విశేషసహాయమును పొందఁగలమని వారభిప్రాయపడిరి (I సమూ $7^{6}$ II దిన $20^{3}$ యెష $58^{3-5}$). వారి పశ్చాత్తాపము యథార్థమైనదైనయెడల దేవుఁడు దానియందనుకూలించి ఆ కష్టమునుండి వారిని విడిపించెను. అహాబిట్లుచేసి కీడునుండి తప్పించుకొనెను (I రాజు $21^{27,28}$). నీనెవెవారును ఇట్లు తమ పట్టణమునకు కలుగనై యుండిన నాశనము నుండి రక్షించుకొనిరి (యోనా $3^{5-10}$). ఇట్లుండఁగా ప్రజలు పొరబడి తమనడతను క్రమపఱచుకొనక, ఉపవాసము చేయుటయే పుణ్యకార్యమని భావించి కష్టములలోనుండి తప్పించుకొనుట కిది యొక సాధనముగా నెంచి ఉపవాసదినముల నేర్పరచుకొనిరిగాని అట్టి యుపవాసములు దేవుని కసహ్యములని ప్రవక్తలు దృఢముగా ఖండించుచు వచ్చిరి (యెష $58^{1-7}$ యిర్మీ $14^{12}$ యోవే $2^{12,13}$ జెక $7^{5}$). ప్రాయశ్చిత్తార్థదినమునఁ జేయవలసిన ఉపవాసముగాక తక్కినవాటికి శాస్త్రనియమము లేకున్నను వాటిని ఇచ్ఛాపూర్వకముగాఁ జేసిరి. చెఱకాలమునకుఁ బిమ్మట తమదేశమునకుఁ గలిగిన నాశనమునకు సంబంధముగా యూదులు నాలుగు ఉపవాసకాలములను నియమించుకొనిరి (జెక $8^{19}$ $7^{3,5}$). ఉపవాసము జేసినప్పుడు తమవస్త్రములను చించుకొని (I రాజు $21^{27}$ యోవే $2^{13}$), బూది

దలో గూర్చుండి గోనెపట్టను ధరించుకొనిరి (యెష 58[5]). అట్టి దినములలో పనిజేయలేదు. సబ్బాతుదినమునగాని ఉత్సవకాలమునగాని ఉపవసింపలేదు (జెక 7[3,5]). క్రొత్త నిబంధనకాలములో యూదులుపవాసముజేయుట సర్వసాధారణమై యుండెను (లూ 18[12]). క్రీస్తుకూడ దానిని బాహ్యాచారముగ నెంచి, ప్రవక్తలవలె యూదులను గద్దించెను (మ 6[16,18] 9[14,15]). హృదయమున కలుగు దుఃఖమును కనఁబఱచుటకు తగిన ఆచారమని యొప్పుకొనినను, దుఃఖములేని సమయములలో అట్లు ఉపవసించుట విపరీతమని బోధించెను. (పండుగలు చూ॥)

**ఉపాజు** (Uphaz), బంగారము తేఁబడిన యొక దేశమునకు పేరు (యిర్మీ 10[9]). దాని 10[5] లోనున్న మేలిమి బంగారము అను మాటలకు అసలు భాషలో ఉపాజునుండి తెచ్చిన బంగారము అను మాటలున్నవి. ఇదియు ఓఫీరను ఒకచోయని అభిప్రాయపడుదురు (ఓఫీరు చూ॥).

**ఉపాధ్యాయుడు, ఉపదేశకుడు, బోధకుడు** (Teacher), పాతనిబంధన కాలమునందు ఇశ్రాయేలీయులకు బోధించినవారు ప్రవక్తలై యుండిరి (హోషే 4[6] 8[1] ఆమో 2[1] మీకా 4[2] యెష 1[10] 2[2-6] మొ॥). యాజకులు కూలికి బోధింతురని మీకా చెప్పిన వాక్యమునుబట్టి (మీకా 3[11]) వారును ఈ పనిని జేసిరని తెలిసికొనఁగలము. చెఱకు పూర్వమిట్లు బోధకులున్నట్లు కనఁబడినను, శాస్త్రులు, ధర్మశాస్త్రోపదేశకులనువారికి చెఱకాలమునుండి ఇదియొక ప్రత్యేకమైన యుద్యోగముగా నెంచఁబడినట్లు యూదుల చరిత్రవలనఁ దెలియుచున్నది. శాస్త్రులు ధర్మశాస్త్రము చక్కగాఁ దెలిసికొనియుండుటచేత వారిని బోధకులుగా నంగీకరించిరి. వారియందు ప్రవీణులైనవారికి రబ్బీ (= గొప్పవారు) యను బిరుదును వాడుటచే వారి యుద్యోగమును ఘనమైనదిగా నెంచినట్లు స్పష్టమగుచున్నది. (బోధకుడు చూ॥).

క్రీస్తు వీరివలె గాక అధికారముతో బోధించినందున ప్రజలు ఆశ్చర్యపడిరి (మా 1[22]). బోధకుడనునది ఆయన బిరుదులలో నొకటి (యోహా 8[2] మా 12[14] మొ॥). ఆది సంఘము నందున్న ఉద్యోగస్థులలో బోధకులు అనఁబడినవారు కూడ కనఁబడుచున్నారు (కార్య 13[1] I కొరిం 12[28] రోమా 12[6-8]). ఎఫె 4[11] నందు వారు అపొస్తలులకును ప్రవక్తలకును తరువాతివారు కావున వారిపనియు ఘనమైనదిగా నెంచఁబడెనని స్పష్టమగుచున్నది. ఇదియు ఆత్మవరములలో నొకటిగా నెంచఁబడెను. (ఉపదేశము, కృపావరములు చూ॥)

**ఉప్పు** (Salt). మృతసముద్రతీరమున ఉప్పునీరు ఆవిరయిపోయినచోట్ల పేరుకొనియున్న ఉప్పును పోగుచేయుదురు. అప్పుడప్పుడు చుట్టుప్రక్కలనున్న చౌటినేలల నుండియు కొండల నుండి పోగుచేయుదురుగాని ఇట్టిది అంతమంచిది కాదు. కనానులోను ఇతర దేశములలోను ఉప్పును భోజన పదార్థములలో వేయుటమాత్రమేగాక, మాంసమును ఎక్కువ దినములుంచు నిమిత్తము ఉప్పుపట్టించెడివారు (యోబు 6[6] సైరాక్సు 39[26]). అర్పింపఁబడు ప్రతి నైవేద్యముతోనుప్పును జేర్చవలెనను ధర్మశాస్త్ర నియమములుగలవు (లేవీ 2[13] యెహె 43[24] పురా 3,9,1). ఉప్పుపర్రలు నిష్ఫలవంతములు (యోబు 39[6]). ముట్టడివేసి పట్టుకొన్న పట్టణమును పూర్ణముగా నాశనము చేయవలెనన్నయెడల దానిలో ఉప్పును చల్లెడివారు. అబీమెలెకు షెకెముపట్టణము నిట్లే జేసెను (న్యాయా 9[45]). ఉప్పు ఇతరవస్తువులను చెడనియ్యక, భోజనమునకు రుచికలిగించును గాన మానవసంఘమును తమమాదిరివలనను బోధలవలనను నీతివిషయములలో వృద్ధికిదెచ్చెడి క్రీస్తుశిష్యులు దీనివంటివారని అలంకారరీతిగాఁ జెప్పఁబడినది (మ 5[13] మా 9[50] లూ 14[34]). సత్ప్రవర్తనకును, మంచిసంభాషణ విషయమునందును ఉప్పు అలంకారరీతిగా వాడఁబడినది (మా 9[50] కొలొ 4[6]). సిరియ దేశమునందు ఉప్పు వానకు తడిసినను ఎండ కెండినను తడిగదులలోనుంచినను కొద్దిదినములలోనే చప్పఁబడి నిరుపయోగకరమగును (మ 5[13] లూ 14[35]). మైదానపు పట్టణములన్నియు పాడుజేయఁబడినప్పుడు, ఆ ప్రదేశములోనుండి వెళ్లిపోవుట కాలస్యముజేసిన లోతు భార్య అక్కడనే నశించి ఉప్పుస్తంభమాయెను (ఆది 19[26] సొలొ॥ జ్ఞా॥ 10[7] పురా 1, 11, 4). ఆమె బహుశః ఉప్పుజల్లులోపడియో లేక ఉప్పు పేరుకొనియో నశించియుండును. ఎన్నటికైనను

భంగముకాఁజాలని నిబంధనను ఉప్పుతోఁజేసి కొనిరి (లేవీ 2[13] సంఖ్యా 18[19] II దిన 13[5]).

**ఉప్పులోయ, ఉప్పుపల్లపు స్థలము (Valley of Salt).** ఇది మృత సముద్రమునకు దక్షిణముగా నుండులోయ. అచట నొక యామడ పొడవుగానుండు లోయయు దాని ప్రక్కన ఉప్పుగనులుండు దిబ్బలును గుట్టలును గలవు. ఈ లోయలోనే దావీదు ఎదోమీయుల మీఁద గొప్ప జయమును పొందెను (II సమూ 8[13,14] I దిన 18[12] వీటిలో I రాజు 11[15-17] ను, కీర్త 60 పై వ్రాఁతను సరిపోల్చి చూ॥). II సమూ 8[13] లో. అరామీయులు అను పేరుండినను ఎదోమీయులు అని యుండవలెనని 14 వ వచనమును బట్టి యూహింపఁదగును. రాజైన అమజ్యా కూడ అదే లోయలో ఎదోమీయులను బహుగా నోడించెను (II రాజు 14[7] II దిన 25[11]).

**ఉప్పుసముద్రము, లవణసముద్రము, తూర్పుసముద్రము, అరాబాసముద్రము (Sea of Salt).** బైబిలులో ఉప్పుసముద్ర మనఁబడునది (ఆది 14[3] సంఖ్యా 34[12] యెహో 15[5] మొ॥) సాధారణముగా భూగోళశాస్త్రములలో మృతసముద్ర మనఁబడుచున్నది. మృత సముద్రమను పేరు బైబిలులో లేదు గాని అచట నేదియు జీవించనందున దానికీ పేరుపెట్టిరి. ఆ సముద్రమందలి నీటిలో ఉప్పు విశేషముగ నుండుటచే అందులో జీవజంతువులు బహుకొద్దిగా నున్నవను మాట వాస్తవమేయైనను అందులో బొత్తుగా నేదియు జీవింపదని యనుకొనరాదు. యెహో 3[16] లో దీనిని **లవణ సముద్రము** అని భాషాంతరనుచేసిరి. ఇది బయలు అని అర్థమిచ్చు **అరాబా సముద్రము** అనియు పిలువఁబడును (ద్వితీ 3[17] యెహో 3[16]) మఱియు పలెస్తీనుకు తూర్పున నుండుటచే దీనికి **తూర్పు సముద్రము** అనుపేరుకూడ కలదు (యెహె 47[18] యోవే 2[20] జెక 14[8]). ఇది యూదయ దేశమునకును మోయాబుకును మధ్యనున్నది. దీని పొడవు 47 మైళ్లును, వెడల్పు 2 నుండి 9 మైళ్ల వఱకునుండును. ఇది యొర్దాను లోయలోని దక్షిణ భాగమందున్నది. ఆ లోయ మిగుల లోతైనదై సముద్రపు మట్టమునకు 1293 అడుగులు పల్లముగా నున్నది. ఇంత పల్లముగా నుండు లోయ ఈ లోకములో మఱియెచట నైననులేదు. ఇందులోని నీళ్లలోతు 1300 అడుగులవఱకు నుండును. దాని దక్షిణభాగమందలి తూర్పువైపున లిసాను (=నాలుక) అనఁబడిన ద్వీపకల్ప మొకటియున్నది. అచటినుండి దాని దక్షిణపు కొనవఱకు నీళ్లు లోతుగా నుండవు. యొర్దాను, అర్నోను అనునదులును మఱికొన్ని చిన్ననదులును ఈ సముద్రములోకి పారునుగాని దీనిలోనుండి బయటికి పారునదు లేవియులేవు. ఇందునుబట్టియే ఈ సముద్రపు నీళ్లలో నెక్కువ యుప్పుండును. మహా సముద్రపు నీటిలో



ఉప్పు సముద్రపు పశ్చిమతీరముననున్న క్రైస్తవ మఠము

నూటికి 4-6 భాగముల యుప్పుండునుగాని యీ సముద్రపు నీటిలో నూటికి 20-28 భాగముల వఱకు ఉప్పుండును. కావుననే ఇందులో జీవ జంతువులు బహుకొద్దిగా మాత్రముండును. ఈ సముద్రపు చుట్టునుండు నేలలో ఉప్పును మట్టి కీలును మెండుగా దొఱకును. సొదొమ గొమొఱ్ఱాలు ఈ బయలులోనే యున్నవి. వాటి యునికిని ఇప్పుడీ సముద్రము కప్పివేయుచున్నదని యనుకొనువారు కలరు. అయితే మొదటి నుండి యీ సముద్రము చాలమట్టుకిప్పటివలెనే యున్నదని భూగర్భ శాస్త్రజ్ఞులనుకొనుచున్నారు. అరాబీయులు ప్రస్తుతమున దీనికి బారులూటు (*Bahr-Lut*) అనఁగా లోతుయొక్క సముద్రమని పిలుతురు. ఈ సముద్రమునకు వాయవ్యమునందున్న గుహలలో మృతసముద్రపు ప్రతులనఁబడునవి 1947 సం॥ దొరికెను. (ప్రతులు I చూ॥).



ఉప్పు సముద్రపు దక్షిణతీరము

ఈ సముద్రమెంత యుప్పుమయముగా నున్నను చివరకు దేవాలయములోనుండి పారు నీళ్లు ఈ సముద్రపు నీటిని తీపిగాచేయునని యెహెజ్కేలు వ్రాసి ($47^{6-12}$) దేవుఁడు మానవుల దుష్టగుణమునుమార్చునను సత్యమును సూచించుటకు ఈ యలంకారమును వినియోగపఱచెను.

**ఉమ్మా** (Ummah = చేరిక). ఆషేరు గోత్రమునందుండిన యూళ్లలో నొకదాని పేరు (యెహో $19^{30}$). హెబ్రీలో మ, క అను నక్షరముల రూపములకు బహుకొద్దిభేదము మాత్రముండుటచే ఇచట ఉమ్మాయని కాక ఉక్కాయను పేరుండవలెనని సాధారణముగా ననుకొందురు. అట్లయినయెడల ఇది అక్కోయను పట్టణమునకు మాఱుపేరు అని యెంచవలెను (అక్కో చూ॥). ఇది అక్కోయనునది కాక వేఱొక పట్టణమై యుండినట్లయిన దీని యునికినిగూర్చి తెలియదు.

**ఉమ్మివేయుట, ముఖముమీద ఉమ్మివేయుట** (**Spitting, Spitting on the face**). ఒకని గొప్పగా అవమానపఱచుటకు అతనిమీఁదగాని అతని ముఖముమీఁదగాని యుమ్మివేయుట యూదులలో ఆరంభకాలమునుండి (సంఖ్యా $12^{14}$ ద్వితీ $25^{9}$ యోబు $30^{10}$) క్రీస్తుకాలము వఱకు (మా $10^{34}$ $14^{65}$ $15^{19}$) అలవాటయి యున్నది. ఇది తెనుఁగు దేశస్థులుకూడ గొప్ప అవమానముగా నెంతురు. ఇట్టి యవమానమును మనరక్షకుఁడు మన నిమిత్తము ఓర్చుకొనెను (యెష $50^{6}$ మ $26^{67}$ $27^{30}$).

**ఉరి** వేటాడుట చూ॥

**ఉరికొయ్య** (Gallows). ఎస్తేరు గ్రంథమునందు మాత్రమున్న పదము. ఆ గ్రంథమునందది 8 మారులు వచ్చును ($5^{14}$ $6^{4}$ $7^{9}$ మొ॥). అది

మనుష్యుల నురితీయుటకుగాక, పారశీకులవలె కొరతవేయుట కుపయోగించిరి.

**ఉరితీయుట** (నేరములు శిక్షలు III 7 (2) చూ॥).

**ఉరుము** (Thunder). మెరుపు మెరిసిన వెంటనే కలుగుశబ్దము. ప్రచండమగు వర్షములు కురియునప్పు డురిమిన పక్షమున మతీభయంకర ముగ నుండును (నిర్గ $9^{23}$). వర్షము లేమియు లేని యెండాకాలమున నురుముట విపరీతముగనుం డును (సామె $26^{1}$). అట్టి కాలమున ఉరుమవలెనని ప్రార్థించినప్పు డాలాగు కలిగినయెడల అది యా ప్రార్థన కియ్యఁబడిన జవాబై, ఒక సూచనగా నుండును (I సమూ $12^{17}$). తరుచుగా అది స్వరము, ధ్వని, గర్జనము అనుపదములచేఁ దెలుపఁబడి, కావ్యములందు వర్షముకురియుమని యాజ్ఞాపించు దేవుని స్వరమని (యోబు $28^{26}$) యలంకారముగా వాడఁబడెను (యోబు $37^{2-3}$ $40^{9}$ కీర్త $29^{3-9}$). యెహోవా మహామహిమతో తన్ను ప్రత్యక్ష పఱచుకొనినప్పుడు ఉరుములు వినఁబడెను (నిర్గ $19^{16}$ ప్రక $4^{3}$). అది ప్రకృతి యందు ప్రత్యక్షమగుచున్న దైవశక్తి కొక సూచనగానున్నది (కీర్త $29^{3-5}$). నాశకరమైన గాలి వానకు ఉరుములు ముంగుఱుతులు గాన అవి దేవుని శిక్షను సూచించును (I సమూ $2^{10}$ II సమూ $22^{14,45}$ కీర్త $77^{18}$).

**ఉల్లా** (Ulla = కాడి. ఆషేరు సంతతి వారిలో నొకఁడు (I దిన $7^{39}$).

**ఉల్లిపాయలు** (Onions). సిరియ పలెస్తీను దేశములలోని ఉల్లిపాయలు మిక్కిలి తియ్యగా నుండును. అవి మనదేశపు ఉల్లిపాయ లంత ఘాటయిన వాసనగలవికావు. కూలిచేసికొను వారు తరుచుగా తమ పగటిభోజనము చేయు నప్పుడు రొట్టెలతోపాటు ఉల్లిపాయలను కలుపుకొని తిందురు (సంఖ్యా $11^{5}$). J. C.

## ఊ

**ఊచ చెయ్యి** రోగములు చికిత్సలు I,II చూ॥

**ఊజాలు** (Uzal). యొక్తాను వాని కొడుకులలో నొకఁడు (ఆది $10^{27}$ I దిన $1^{21}$). వీఁడు అరాబీయుల గోత్రములలో నొకదానికి పూర్వీకుఁడైయుండెను.

**ఊజు** (Uz). ఈపేరు తెనుఁగు బైబిలు ప్రకారము వేర్వేఱుగా నుండినను అసలు భాషలో నేకరీతిగానున్నది.

1. షేము మనమఁడును అరాము కొడుకు నైన వానిపేరు (ఆది $10^{23}$ I దిన $1^{17}$).

2. అబ్రాహాము సహోదరుఁడగు నాహోరు కొడుకులలో నొకఁడు (ఆది $22^{21}$) = ఇంగ్లీషు బైబిలునందు హూజు (Huz) అని యున్నది. ఇతని సంతతివారు అరామ్నహరాయిములో నివసించుచుండిరి.

3. హోరీయు లనఁబడిన ఎదోమీయులలో నొకఁడు (ఆది $36^{28}$ I దిన $1^{42}$).

4. ఎదోములోనుండు నొకస్థలము (విలా $4^{21}$).

5. ఒక దేశమునకు పేరు. దానికి రాజు లుండిరి. ఇది ఎదోములో నున్నట్లుగా కనఁబడును (యిర్మీ $25^{20}$).

6. యోబుయొక్క జన్మస్థానము (యోబు $1^{1}$).

పైనున్నవాటిలో మొదటి మూఁడును పురుషుల లేక వంశముల పేరులైయుండవచ్చును. తరువాతి మూఁడు పట్టణములు లేక దేశములు. వీటినిబట్టి యోబు జన్మస్థానమైన ఊజు ఎదోములోనున్నట్లూహింపఁదగును. అయినను అది పలెస్తీనుకు తూర్పుగానుండు హౌరాను (*Hauran*) లో నున్నదని యనుకొనువారును గలరు. ఆ ప్రదేశములోనున్న పేరులను చూడఁగా యోబుగ్రంథములోని పేరులకు సంబంధములైనవి కొన్నికలవు. యోసీఫస్ (పురా 1, 6, 4) చెప్పునది దీనికి సరిపడును. యోబుపుట్టిన ఊజు పలెస్తీనుకు తూర్పునగాని దక్షిణమునగాని యున్నది. అయితే ఈ రెంటిలో నేది నిశ్చయమైనదో తీర్మానించుటకు తగినన్ని యాధారములులేవు.

**ఊజై** (Uzai). నెహెమ్యా యెరూషలేము ప్రాకారములను కట్టింపఁగా అతనికి సహాయము చేసిన పాలాలు అను వాని తండ్రి (నెహె $3^{25}$).

**ఊటు, నీటిబుగ్గ, జెల** (Fountain, Spring). ఇతర పర్వత ప్రదేశములందువలె పలెస్తీనునందును ఊటలు విశేషముగనున్నవి. దాని అసలు పదమగు ఐయిను, ఏను (*Ayin or En*) అను రూపములను ఏన్గెదీ, ఏన్దోరు, ఎన్రోగెలు మొదలగు మాటలలో చూడవచ్చును.

అట్టి స్థలములలో ఊటట లుండుటనుబట్టి ఆ పేరు వాటికి పెట్టిరని తెలిసికొనవలెను.

ఊటలు అలంకారరీతిగా ఆత్మీయ దీవెనల సమృద్ధిని సూచించును (యోవే $3^{18}$). శుద్ధికిని పునర్జీవమునకును సూచనగానున్నది (జెక $13^{1}$ ప్రక $7^{17}$ $21^{6}$). ద్వితీ $33^{28}$ నందున్న ఊటట ఇశ్రాయేలీయులకుఁ గలుగఁబోవు శాంతమునకు (నెమ్మదికి) సూచనగా నున్నది. అన్నిటికంటె నెక్కువగా సమస్త యీవులకు దాతయగు దేవుని సూచించును (యిర్మీ $2^{3}$ $17^{13}$). దీనికి సంబంధముగా దేవునిగూర్చిన జ్ఞానముకూడ జీవమిచ్చు ఊటగా నెంచఁబడును (సామె $13^{14}$).

**ఊటగుమ్మము** యెరూషలేము B V 2 (10) చూ॥

**ఊతై** (Uthai = సహాయకరము).

1\. చెఱకాలమునకు తరువాతనున్న యూదా వారిలో నొక కుటుంబమునకు పేరు (I దిన $9^{4}$). నెహె $14^{4}$ లోని **అతాయా** యనునది యితని పేరునకు మాఱురూపమై యున్నట్లున్నది. (అతాయా చూ॥)

2\. బిగ్వై అనువాని సంతతివాఁడును ఎజ్రాతోకూడ బబులోనునుండి యెరూషలేమునకు వచ్చినవారిలో నొకఁడు (ఎజ్రా $8^{14}$).

**ఊదారంగు, ధూమ్రరంగు** (Purple). ఎరుపుతో నీలి మొదలగు రంగులు గలిసి యేర్పడు ఒక చక్కనివర్ణము. పూర్వమందును ప్రస్తుతమును ప్రజలకెంతో యిష్టమైనరంగు. ఊదారంగు వస్త్రములు ఖరీదుగలవైనందున వాటిని ధరించెడి యదృష్టము ధనికులకుగాక యితరులకు కలుగలేదు. భాగ్యవంతులును గొప్ప హోదాగల్గినవారు మాత్రమే వాటిని ధరించిరి (ఎస్తే $8^{15}$ I మక్క $10^{20,62,64}$ II మక్క $4^{28}$ లూ $16^{19}$). అట్టి వస్త్రధారణము రాచరికమును సూచించెనని గ్రీకువారి మహాకవియగు హోమరు వలనఁ దెలియుచున్నది. క్రీస్తు తాను రాజునని చెప్పుకొనెనని విన్నప్పుడాయన నపహసించుటకై ఆయన కిట్టి వస్త్రములను గట్టఁబెట్టిరి (మా $15^{17}$). కొన్ని వాక్యములలో నీ అసలుపదమే ధూమ్రమని తెనిఁగించఁబడినది. రాజు లుపయోగించు పల్లకీలలోని మెత్తల నీ వర్ణపు వస్త్రములతోఁ గప్పిరి (పర $3^{10}$). ఈ రంగుగల బట్టలను గొప్పవారి ఓడల పైభాగమున చాందినీలుగాఁగట్టిరి (యెహె $27^{7}$). విగ్రహములకు తెరలుగా వాడిరి (యిర్మీ $10^{9}$). గుడారమును నిర్మించినప్పుడీ వర్ణపు తెరలు విశేషముగఁజేసిరి (నిర్గ $25^{5,6,15,33}$ $39^{29}$).

వివిధములగు గుల్లచేఁపలలో నీ రంగు దొరికెను (I మక్క $4^{23}$ యుద్ధ 5, 5, 4). ఆ చేఁపల మెడయొద్దనున్న ఒక గ్రంధిలోనుండి ఊరెడి ద్రవమువలన ఈ రంగువచ్చును. ఒక్కొక్క చేఁపలో బహు కొంచెము రంగుమాత్రముండును గాన దానిని పోగుచేయుట చాల కష్టమైన పరిశ్రమగానుండెను. అందుచేత వాటి ఖరీదు చాల విశేషముగఁ జెప్పిరి.

**ఊయేలు** (Uel = దేవుని చిత్తము). అన్య స్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణచే వారిని విడిచినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{34}$).

**ఊరకులో** (Euraquilo). పౌలు రోమాకు ఖైదీగాఁ బోవునప్పుడు అతఁడు వెళ్లు ఓడపై కొట్టిన పెనుగాలి (కార్య $27^{14}$). ఇది తూర్పు ఈశాన్యములకు మధ్యగా వీచును. అదే నేటి వరకును క్రేతు ద్వీపముయొక్క కొండల సందుల గుండా ఆకస్మికముగఁ గొట్టుచున్నవి.

**ఊరి, ఊరు** (Uri = కాంతిగల)

1\. గుడారమునకు సంబంధించిన చిత్ర విచిత్రపు పనులను జేసిన బెసలేలు అనువాని తండ్రి (నిర్గ $31^{2}$ $35^{30}$ $38^{22}$ I దిన $2^{20}$ II దిన $1^{5}$).

2\. సొలొమోను కాలములో పన్నులు వసూలుజేసిన గెబెరు అనువాని తండ్రి (I రాజు $4^{19}$).

3\. అన్య స్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరణచే వారిని విడిచిపెట్టిన యొక ద్వారపాలకుఁడు (ఎజ్రా $10^{24}$).

తెలుఁగులో ఈ పేరు పై రెండు విధములుగా నున్నను మూలభాషలో నొక రీతిగనే ఉన్నది.

**ఊరియా** (Uriah, Urijah = యెహోవా వెలుఁగు). మూలభాషలో యిర్మీ $26^{20-23}$ నందు దీని గుణితమందు కొద్ది భేదమున్నది.

1\. దావీదుయొక్క 30 మంది యోధులలో నొకఁడు (II సమూ $23^{39}$ I దిన $11^{41}$) హిత్తీయుఁడైనను ఇతఁడు యెహోవానే సేవించువాఁడని

పేరునుబట్టి తెలియుచున్నది. రాజైన దావీదు ఇతని భార్యయగు బత్షెబను చెరిపి తన పాపమును కప్పి పుచ్చుటకై యితనిని యుద్ధములో చంపించెను (II సమూ $11^{1-27}$ $12^{9-15}$ I రాజు $15^{4}$).

2. రాజైన ఆహాజు కాలములో ప్రధాన యాజకుడైయుండి, రాజు దమస్కులో చూచి వచ్చిన బలిపీఠపు మచ్చు ననుసరించి కట్టింపవలెనని ఆజ్ఞ నొందినవాడు (II రాజు $16^{10-16}$). యెష $8^{2}$ లో నున్నట్లు నమ్మకమైన సాక్ష్యము పలుకుటకు నియమింపబడిన ఊరియా ఇతడే యనుకొందురు.

3. ఒక ప్రవక్త. కిర్యత్యారీమువాడైన షెమయ్యా కుమారుడు (యిర్మీ $26^{20}$). యూదా దేశమును యెరూషలేము పట్టణమును నాశనమగునని యిర్మీయావలె ప్రవచించి, రాజైన యెహోయాకీము కోపమునకు భయపడి ఐగుప్తునకు పారిపోయెను గాని యెహోయాకీము ఇతని నచ్చటి నుండి రప్పించి చంపించెను ($26^{21-23}$).

4. ఒక యాజకుడు. హక్కోజు (I దిన $24^{10}$) అనువాని కుమారుడును (నెహె $3^{4}$) ఎజ్రా కాలములో ముఖ్య యాజకులలో నొకడగు మెరేమోతు అనువాని తండ్రియునై యుండెను (ఎజ్రా $8^{33}$). ఇచ్చట తండ్రి యను పదమునకు పూర్వీకుడనియు అర్థము చేసికొనవచ్చును.

5. ఎజ్రా మహాసభలో ధర్మశాస్త్రమును చదివినప్పుడు అతని కుడిప్రక్కను నిలిచినవారిలో నొకడు (నెహె $8^{4}$). ఇతడును యాజకుడై యుండును.

**ఊరీము, తుమ్మీము** (Urim and Thummim = కాంతులు, పరిపూర్ణతలు). ద్వితీ $33^{8}$ నందు తుమ్మీము ఊరీము అని క్రమము మార్చబడి యున్నది. ఊరీమను పదము ఒంటరిగా రెండుసారు లుపయోగింపబడెను (సంఖ్యా $27^{21}$ I సమూ $28^{6}$).

అహరోను యెహోవా సన్నిధికి వెళ్లునప్పుడెల్ల అతని రొమ్మున నుండునట్లు న్యాయవిధాన పతకమునందుంచబడి, ఏఫోదుకు సంబంధించిన వస్తువులు (నిర్గ $28^{30}$ లేవీ $8^{8}$). వీటిని ఆ పతకపు మడతలోగాని, పతకము క్రింద ఉండు స్థలములోగాని పెట్టిరి. సందేహాస్పదమగు విషయములలో ప్రధాన యాజకుడు వీటిద్వారా దేవుని చిత్తమును తెలిసికొనెను. ఒక్కొక్కరి విషయము గాక జనాంగమంతటి మొత్తముమీద మాత్రమే ఈ రీతిగా దైవచిత్త మేమిటో తెలిసికొనిరి. గనుకనే ఇశ్రాయేలీయుల పన్నెండు గోత్రముల పేరులు వ్రాయబడిన రత్నములున్న న్యాయవిధాన పతకమునందవి యుంచబడెను. న్యాయాధిపతియు రాజును అగు యెహోవా చిత్తమును న్యాయవిచారణ సంబంధమగు సంగతులలోను, రాజ్యసంబంధమగు సంగతులలోను విచారించిరి. (సంఖ్యా $27^{21}$ తో యెహో $9^{14}$ సరిపోల్చుము; న్యాయా $1^{1}$ $20^{18,23,27,28}$ I సమూ $10^{22}$ $14^{36-42}$ $22^{10,13}$ $23^{9-12}$ $28^{6}$ $30^{7,8}$ II సమూ $2^{1}$ $5^{19,23,24}$). నిబంధన మందసమున్న పరిశుద్ధ స్థలమునందే గాక (న్యాయా $20^{27,28}$ I సమూ $22^{10}$) ఏఫోదును ధరించుకొనగల్గిన యాజకుడున్న యెట్టి స్థలమునందైనను వీటిద్వారా యెహోవా యొద్ద విచారించవచ్చును. ఈ విచారణకు వచ్చు జవాబును కనుగొనుట చాల సులభము. సాధారణముగా అవునా కాదాయనిగాని అనేకములగు వాటినుండి యొకదానిని ప్రత్యేకించుటవలనగాని ప్రత్యుత్తరమును పొందిరి గాని ఎల్లప్పుడీ రీతిగనే జరుగలేదు (I సమూ $10^{22}$ II సమూ $5^{23-24}$). ప్రజలు పాపముచేయగా ఈ సాధనములద్వారా దేవుడు వారికి జవాబియ్యలేదు (I సమూ $14^{37}$ $28^{6}$). దావీదు యేలుబడికి తరువాత ఊరీము తుమ్మీములద్వారా దేవుని చిత్తమును కనుగొనినట్లు సూచనలు లేవు. చెరనుండి తిరిగివచ్చిన పిదప ఊరీము తుమ్మీములను ధరించుకొనిన యాజకుడొకడును లేకపోయెను (ఎజ్రా $2^{63}$ నెహె $7^{65}$). ఈ విధముగా దేవుని చిత్తమును కనుగొను హక్కు ప్రధాన యాజకునిదై యుండెను. గాన వీటిని కలిగియుండుట లేవీగోత్రమునకు అతిశయాస్పదముగ నుండెను (ద్వితీ $33^{8}$).

ఊరీము తుమ్మీములద్వారా దేవుని చిత్తమును కనుగొనిన రీతినిగూర్చి యనేకాభిప్రాయములు గలవు. వాటిలో నీ దిగువ రెండు సూత్రములు మిగుల ముఖ్యములు. 1. ఊరీము తుమ్మీము లగునవి పతకమునకు తగిలింపబడిన వస్తువులని యిదివరకే చూచియుంటిమిగదా. అవసరమై

నప్పుడు వీటిని ఊడఁదీసి పాచికలవలె వేసి అవి పడువిధమును గుర్తించి దేవుని చిత్త మిదియని తెలిపెడివారు. ఈ యూహ సాధ్యమైనదిగనే కన్పట్టుచున్నను నిజమైనదని స్థాపించుటకు మాత్రము తగిన యాధారములు లేవు. I సమూ $10^{19-22}$ $14^{37-42}$ లయందున్న సంగతులను బట్టి చీట్లు వేయుటవలన వీటిద్వారా దేవుని చిత్తమును కనుగొనిరని కొందఱు సాధింపఁ జూచుచున్నారు. అసలుభాషలో I సమూ $14^{41}$ నందు సరియైన చీటినిమ్ము అని సౌలు ప్రార్థించినట్లున్నది. అక్కడ ఉపయోగింపఁబడిన యసలు పదమగు తమీము (*Thamim*) ను తుమ్మీమని చదివిన యెడల చీట్లు వేయుటవలన దేవుని చిత్తము కనుగొనిరను భావము వచ్చునని వారి వాదము. గాని ఈ రెండు సందర్భములలోకూడ, చీట్లు వేయుట, యెహోవాయొద్ద విచారణ చేయుట యనునవి వేఱువేఱు పనులైయున్నవి. యెహోవాను ఆలోచనడిగిన దొక విషయమునుగూర్చియు, చీట్లు వేసినది మఱియొక విషయమునుగూర్చియునై యున్నది. 2. ఊరీము తుమ్మీము లనునవి యొక విధమైన సూచనలై యుండి యెట్టి విషయములను బహిరంగవిధముగా ప్రత్యక్ష పరచలేదు. వీటిని ధరించుకొనిన ప్రధానయాజకుఁడు దేవుని వెలుగును సత్యమును పొందుటకు కావలసిన యధికారము నాయనవలన పొందియున్నాఁడని యివి సూచించెను. గనుక అతఁడు వాటిని నియమింపఁబడినరీతిని ధరించుకొని ఆయన ఆలోచనను వెదుకవలసియుండెను. తాను విచారింపవలసిన సంగతి నతఁడు వినయముతో ప్రార్థించి దేవునికి తెలియఁజేసెను. అతని ప్రార్థనకు తగిన ప్రత్యుత్తరమతని మనస్సునకుఁ దోచెను. దేవుని యానతి ప్రకారము జరిగించుటయు, దానిని బయలుపఱతునను దేవుని వాగ్దానమందున్న నమ్మకమును, అతని కనుగ్రహింపఁబడిన ప్రత్యుత్తరము నిజమైనదని దృఢపఱచెను. దేవునియందలి నమ్మకమేగదా అదృశ్యమైనవాటి రుజువు (హెబ్రీ $11^{1}$). ఈ రీతిగా ఊరీము తుమ్మీముల కర్థము చెప్పుట పట్టి యూహ మాత్రమే గాదు. ఎందుకనగా, గుడారములోనున్న ప్రతిది యిదే రీతిగా ఆత్మీయబోధను సూచించెను.

**ఊరీయేలు** (Uriel = దేవుఁడు వెలుఁగు).

1. లేవీయులలో కహాతీయుల తెగలోని యొకఁడు (I దిన $6^{24}$). దావీదు కాలములో కహాతీయుల పెద్దయొక్క పేరిదే (I దిన $15^{5-11}$). ఈ రెండువాక్యములలోని ఊరీయేలు అనుపేరు ఒక్కనికే చెందియున్నట్లున్నది.

2. రాజైన అబీయా తల్లియొక్క తండ్రి. ఇతఁడు గిబియాయను ఊరివాఁడు (II దిన $13^{2}$).

**ఊరు** (Ur = ప్రకాశము).

1. అబ్రాహాము పుట్టిన కల్దీయుల పట్టణము (ఆది $11^{28,31}$ $15^{7}$). అది మెసొపొతేమియ దేశమునందున్నది (కార్య $7^{2,4}$) మెసొపొతేమియలో వాయువ్యముగానున్న ఊర్ఫయను Urfa ప్రస్తుతపు పట్టణమదేనని కొంద అనుకొనుచున్నారు. అది బాబెలుకు 400 మైళ్లు వాయువ్యముగా యూఫ్రటీస్ నదీతీరమున నున్నది. అక్కడ ప్రస్తుతము తురుష్కులు, అరబ్బులు, యూదులు, కూర్దులు, ఆర్మీనియా క్రైస్తవులు మొదలగువారితో 50,000 జనసంఖ్య గలిగియున్నది. అచ్చట కనఁబడు ఒక గుహను, కోనేటిని అబ్రాహాముకు సంబంధించినవని యెంచి అతఁడచ్చటనే పుట్టెనని వారు అభిప్రాయపడుచున్నారు. తురుష్కులక్కడ అబ్రాహాము పేరట నొక చక్కని మసీదును కట్టించియున్నారు గాని అనేకులు అది బాబెలు పట్టణమునకు దక్షిణముగా 150 మైళ్లదూరమున నున్న ముఘీర్ (*Mugheir*) శిథిలములే యనుకొనుచున్నారు. అచ్చట త్రవ్వి తీయఁబడిన గుండ్రని యిటుకల మీఁద పూర్వమున వ్రాసియుంచిన సంగతులను పరిశీలించి, ఆ పట్టణము **ఊరు** అనియు, దేశము కల్దు అనియు, కనుగొనిరి. ఆ కాలమునం దచ్చట నుండినవారు చంద్రదేవత నారాధించిరనియు కనుగొనిరి గాన అదే ఊరు పట్టణమని సాధించెదరు.

2. దావీదు యొద్దనున్న పరాక్రమశాలురలో ఎలీపాలను వాని తండ్రి (I దిన $11^{35}$).

H.

**ఊర్బాను** (Urbanus = మర్యాదస్థుఁడు). రోమాలో నుండిన సంఘములోని యొక క్రైస్తవుఁడు. ఇతనికి పౌలు వందనముల నంపెను (రోమా $16^{9}$). రోమాలో కనుగొనఁబడిన రాతి శాసనములమీఁద ఈ పేరు అనేక సారులు కనఁబడును. అందువలన అది బానిసెల పేరై

యున్నట్లు తెలియును. ఈ పేరుగల సేవకులు కైసరుయొక్క నౌకరులలో నున్నట్లు శాసనములచే తెలిసికొనవచ్చును.

**ఊలయి** (Ulai). పారసీక సంయుక్తాగ్రగుడములో పడుచున్న ఏలాము నదులలో నొకటి. దాని 8[3,16] చూడఁగా ఇది షూషను పట్టణమునకు దగ్గరగా నున్నది. ఆ దేశములోని శిలాశాసనములుకూడ దీనితో నేకీభవించును. దానికిప్పుడు కరూను (Karun) అను పేరు గలదు.

**ఊలాము** (Ulam = ముందటి భాగము).

1. మనష్షే సంతతివారిలో నొకఁడు (I దిన 7[16,17]).

2. బెన్యామీనీయులలో నొకఁడు. ఇతఁడు రాజైన సౌలు కుమారుఁడగు యోనాతాను సంతతివారిలో నొకఁడైయుండెను. ఈ ఊలాము సంతతివారు విలువిద్యయందు నిపుణులై యుండిరి (I దిన 8[39,40]).

**ఊసరవెల్లి** కీటకములు, సరీసృపములు 4 చూ॥

## ఋ

**ఋణము** అప్పు చూ॥

## ఎ

**ఎండదెబ్బ** రోగములు చికిత్సలు III 1 చూ॥

**ఎండుతెగులు** వ్యవసాయము 5 (3) చూ॥

**ఎకరము** మానములు కొలతలు I 3 చూ॥

**ఎక్రోను, ఎక్రోనీయులు** (Ekron = మూలధ్వంసము చేయుట Ekronites). ఫిలిష్తీయుల ఐదు ముఖ్యపట్టణములలో ఉత్తరమున నున్నది (యెహో 13[3] I సమూ 6[16,17]). ఇశ్రాయేలీయులు పలెస్తీను దేశమును విభాగించుకొనినప్పుడిది యూదాగోత్రమునకు వచ్చెను (యెహో 15[11,45,46]). పిమ్మట దీనిని దానుగోత్రమున కిచ్చిరి (19[43]). ఇది దానుగోత్రపు స్వాస్థ్యముయొక్క సరిహద్దులలో నొకటియై యున్నది (19[43]). యూదులు దీనిని జయించిరిగాని (న్యాయా 1[18]) కొంతకాలమైన తరువాత ఫిలిష్తీయులు దానిని మరల స్వాధీనము చేసికొనినట్లున్నది. ఫిలిష్తీయులు దేవుని నిబంధనమందసమును పట్టుకొనినప్పుడు మొదటదానిని అష్డోదుకు, తరువాత గాతుకు, పిమ్మట ఎక్రోనుకు నంపిరి (I సమూ 5[10]). సమూయేలు కాలములో ఎక్రోను ఇశ్రాయేలీయులచే పట్టుకొనఁబడినను (6[14] 17[52]) మరల కొద్దికాలములోనే ఫిలిష్తీయులవశమైనట్లుగా నున్నది. గ్రామదేవతయొక్క పేరు బయెల్జెబూబు. ఇశ్రాయేలురాజైన అహజ్యా ఆ దేవతయొద్ద విచారణచేయుటకు కొందఱిని పంపెను (II రాజు 1[2-16]). ప్రవక్తలు ఫిలిష్తీయుల ముఖ్యపట్టణములలో నితరమైనవాటికి విరోధముగా ప్రవచించినట్లు ఎక్రోనుకు విరోధముగాకూడ ప్రవచించిరి (యిర్మీ 25[20] ఆమో 1[8] జెఫ 2[4] జెక 9[5,7]). ఇప్పుడచట ఆకీరు (*Akir*) అను పల్లె యొకటికలదు. ఇదే ఎక్రోనుయొక్క యునికిపట్టని కొందఱును కొందురుగాని యీ రెండు పేరులకుగల సంబంధము తప్ప ఈ ఆకీరు అను పల్లెయే ఎక్రోనమటకు మఱియేయాధారమునులేదు. ఎక్రోనీయులనఁగా ఎక్రోనుపట్టణవాసులు (పటము I, C 8).

**ఎగురు సర్పము** సర్పము I 1 చూ॥

**ఎగ్బతానా** (Ecbatana). మాదీయదేశపు ప్రధానపట్టణముయొక్క గ్రీకు పేరు. దీని హెబ్రీ పేరు అక్మెతా (Achmetha). రాజైన కోరెషు యెరూషలేములోని యాలయమును తిరిగి కట్టుటకు ఇచ్చిన తాకీదు ఈ ఎగ్బతానాయను పట్టణములోని దస్తావేజుకొట్టులో నుంచఁబడఁగా పారసీకరాజైన దర్యావేషుకాలములో దాని నచట కనుగొనిరి. ఈ పేరు బైబిలులో ఎజ్రా 6[2] లో తప్ప మఱి యెచటనులేదుగాని, అప్రమాణిక గ్రంథములలో నిది కొన్నిసారులు కనఁబడును (II మక్క 9[3] టోబీతు 3[7] 6[7] మొ॥). ప్రస్తుతము దీనిపేరు హమదాను (*Hamadan*).

**ఎగ్లా** (Eglah = పెయ్యదూడ). దావీదు భార్యలలో నొకతె. ఇత్రెయాము తల్లి (II సమూ 3[5] I దిన 3[3]).

**ఎగ్లాత్షాలీషా** (Eglath-Sheli-shiyah = మూఁడేండ్లదూడ). ఇది యెష 15[5] లోను యిర్మీ 48[34] లో నున్నట్లు మోయాబునుగూర్చిన ప్రవచనమునకు సంబంధముగా అసలు భాషలో కనఁబడుమాటయై యున్నది. తెనుఁగు బైబిలును చూడఁగా యెష 15 లో నున్నట్లు దీని నొక స్థలమునకు పేరునుగా కొంచక మూఁడేండ్ల తరిపిదూడ అని తర్జుమాచేసిరిగాని యిర్మీయా గ్రంథ

ములో దీని నొకస్థలమునకు పేరుగా తర్జుమాచేసి యున్నారు. ఇందులో నేది సరియైనదో దానిని వేదశాస్త్రులు సహా తీర్మానింపలేక పోవుచున్నారు గాని వారిలో నెక్కువమంది ఇదియొక స్థలమునకు పేరనియే యనుకొందురు. అయితే ఆ స్థల మెచ్చట యని అడిగినయెడల మోయాబుదేశపు స్థలములలో ననేకమైనవాటివలె నిదియును నశించెను కావున దాని యునికినిగూర్చి తెలియ దందురు.

**ఎగ్లాయీము** (**Eglaim** = రెండు చెలువులు). మోయాబు ఊళ్లలో నొకటి (యెష $15^{8}$). ప్రస్తుతమున దాని శేషముల పోలికవయే లేదు.

**ఎగ్లోను** (**Eglon** = దూడకు సంబంధించిన లేక గుండ్రని).

1. మోయాబు దేశమునకు రాజు. ఇతఁడు అమ్మోనీయులతోను, అమాలేకీయులతోను సంధి చేసికొని ఈఁతచెట్లపట్టణము అనఁబడు యెరికో యొద్ద ఇశ్రాయేలీయులను ఓడఁగొట్టి వారిని లోఁబఱచుకొని వారివలన కప్పము పుచ్చుకొని బాధపఱచెను. ఏహూదు అను నతఁడు కుట్ర జేసి ఇతనినిచంపి యిశ్రాయేలీయులకు విడుదల కలిగించెను (న్యాయా $3^{12-30}$).

2. యూదా దేశపు పల్లపు భూములలోని ఒకయూరు (యెహో $15^{39}$). ఈ యూరిరాజు ఇంక నలుగురితో సంధిచేసికొని గిబియోను పట్టణము మీఁదికి దండెత్తివచ్చి గిబియోనీయులతో యుద్ధము చేయఁగా యెహోషువ గిబియోనీయుల పక్షమున పోరాడి యా రాజుల నోడించి వారిని పట్టుకొని చంపించెను (యెహో $10^{3-23,24-37}$ $12^{12}$). అది లాకీషు అను పట్టణమునకు సమీపముగానుండి ప్రస్తుతము టెల్ నెయీలె (*Tell-Nejeleh*) యనఁబడుచున్నది. దానికి దగ్గఱగానున్న అజ్లాన్ (*Ajlan*) అను నదియు నిదేయూరు అని యనుకొనువారును గలరు గాని పేరునుబట్టి కొంత సంబంధమున్నను ఇది పురాతనమైన యూరు కానందున అది యీ ఎగ్లోను కాదనుకొందురు.

**ఎజెము** (**Ezem** = ఎముక). ఎదోముదగ్గర నుండు యూదా యూళ్లలో నొకటి. ఇది తరువాతకాలములో షిమ్యోను గోత్రమున కియ్యఁబడెను (యెహో $15^{29}$ $19^{13}$ I దిన $4^{29}$). అస్తోను చూ॥ .

**ఎజ్బయి** (**Ezbai**). దావీదు యోధులలో నయరై అనువాని తండ్రి (I దిన $11^{37}$).

**ఎజ్రా** (**Ezra** = సహాయము).

1. సాదోకు ఫీనెహాసుల వంశజుఁడగు యాజకుఁడు (ఎజ్రా $7^{1-6}$). మోషే ధర్మశాస్త్రమునందు ప్రవీణుఁడైనశాస్త్రి. ధర్మశాస్త్రమును చక్కగాఁ దెలిసికొనినవాఁడై ($7^{6}$) దాని పఠించుచు ఇతరులకు నేర్పుచుండెను ($7^{10,11}$). క్రీ॥ పూ॥ 465-425 వఱకు పారసీకము నేలిన అర్తహషస్తయేలుబడియందేడవ సం॥ న యెరూషలేముకుఁ బోయి యూదుల వ్యవహార సంబంధమగునట్టియు మత సంబంధమగునట్టి స్థితిగతులను విచారించి వారిని దేవుని ధర్మశాస్త్రాను సారముగ నడిపించుట కితఁడు రాజుగారివలన పంపఁబడెను ($7^{14}$). నది యావతల నున్న ప్రాంతములందలి యధికారులు మందిరమునకు కావలసిన సామగ్రిని ద్రవ్యమునిచ్చి, ఆలయపుపనివారియొద్ద పన్నుపుచ్చుకొనకుండునట్లుత్తరువు నొందెను ($7^{21-24}$). ఎనుబది సం॥ లకు పూర్వము జెరుబ్బాబెలు యేషూవ యనువారితో వెళ్లినవారుగాక పరదేశములందున్న యూదులను సమకూర్చి యెరూషలేమునకు వెంటఁగొనిపోవుటకు సెలవునొందెను. అర్తహషస్తయేలుబడియందేడవ సం॥ న (459 458) నీసానను మొదటినెల (మార్చి) మొదటి దినమున 1500 మందితో ప్రయాణమయ్యెను ($7^{9}$). అహవానదీతీరమున విశ్రాంతి నొందనై దిగి, తమవెంట లేవీయు లెవ్వరును రాకుండుటఁ గని, కొందఱిని తోడ్కొని వచ్చుటకై వెనుకకుఁ బంపెనుగాని వారిలో బహు కొద్దిమంది మాత్రము పలెస్తీనుకువచ్చుటకు సమ్మతించి యతనివెంబడించిరి ($8^{15-18}$). అతఁడును, అతనితో వచ్చిన జనులునుపవసించిన తరువాత మఱల బయలుదేరి, ఐదవనెల మొదటిదినమున అనఁగా నాలుగుమాసములకు యెరూషలేము చేరిరి ($7^{8}$). పిమ్మట తాను దెచ్చిన మందిరోపకరణముల నప్పగించి బలినర్పించి రాజు ఉత్తరువులను ఆ ప్రదేశముల యధిపతులకు తెలియఁజేసెను ($8^{33-36}$). పలెస్తీనులోని యూదులును, కొందఱు యాజకులు సహా అన్యస్త్రీలను వివాహమాడి యుండుట చూచి మిగుల చింతించి ($9^{1-15}$) వారి

విషయమునందు ధర్మశాస్త్రాను సారముగ ప్రవర్తించుటకు బలవంతముజేయ నిశ్చయించుకొని ఆ స్త్రీలను పరిత్యజించుటకు పెక్కండ్రను ప్రేరేపించెను ($10^{1-17}$). అటుతరువాత పదమూఁడు సంవత్సరములు అతని చరిత్రము బొత్తుగాఁ దెలియదు. నెహెమ్యా యెరూషలేముకువచ్చి అర్తహషస్తయేలుబడియందు ఇరువదవయేట యెరూషలేము ప్రాకారములను మరమ్మతుజేసిన తరువాత, ఎజ్రా కొందఱు ముఖ్యుల సహాయము నొందినవాఁడై, నూతనముగా నా దేశమునకు వచ్చిన యూదా జనాంగమునకు మోషే ధర్మశాస్త్రముఁ జదివి వినిపించెను (నెహె $8^{1-12}$). ఎజ్రాకాలమునుండి ప్రవక్తల శకమంతరించి శాస్త్రులశకమారంభమయ్యెను. ఎజ్రా ఎల్యాషీబు ప్రధానయాజకుఁడుగా నుండుకాలమున మరణమాయెనని యోసీఫసు వ్రాసెను. ఇతఁడును నెహెమ్యా ఎల్యాషీబులు సమకాలీనులై యున్నారు ($3^{1}$ $8^{9}$).

2. యూదా అనువానితోగూడ లెక్కింపఁబడినవాఁడు (I దిన $4^{17}$).

3. బబులోను నుండి జెరుబ్బాబెలుతో తిరిగి వచ్చిన ముఖ్యయాజకులలో నొకఁడు (నెహె $12^{1,7}$). తరువాత నొక కుటుంబమునకీ పేరు కలిగెను ($12^{13}$).

H.

## ఎజ్రా గ్రంథము (The Book of Ezra).

ఎజ్రా దీని గ్రంథకర్తయై యున్నాఁడు. దాదాపు క్రీ॥ ము॥ 458-453 సం॥ లలో బబులోను చెఱకుఁ దరువాత యెరూషలేములో వ్రాయఁబడెను. దీనియందు సుమారు 80 సం॥ ల (538-458) చరిత్రగలదు. ఇశ్రాయేలీయులు తిరిగివచ్చి పలెస్తీనులో నివసించినప్పు డీదేశమునకు యూదయ యను పేరు కలిగెను. అప్పటినుండి వారు యూదులని బిలువఁబడిరి.

యూదులు చెఱనుండి తిరిగివచ్చి దేవుని మందిరమునుకట్టి దైవారాధనను మఱల స్థాపించుటను గుఱించి తెలుపుటకు ఇది వ్రాయఁబడెను. ఎజ్రా బబులోనునుండి యెరూషలేమునకుఁ జేసినప్రయాణమును అప్పు డతనితో గూడ వచ్చిన యూదులగుంపును గూర్చియు, వారు పారసీకరాజు నాజ్ఞప్రకారము దేశమును చక్కఁబఱచి పట్టణమును కట్టి, దేవుని యారాధనను, ఆయన యధికారమును తమ బోధనప్రమాణము చొప్పున స్థాపించిన సంగతియు నిందు గలదు. ఈ కాలమునందు ఎజ్రా చేసిన భయభక్తులుగల కార్యములును, సంస్కరణలు దీనియందున్నవి. బబులోను చెఱనుండి విముక్తులమయితిమను సంతోషముతో వారు తమదేశముకుఁబోవ సమకట్టి ప్రయాణముచేసినను, ఐగుప్తునుండివచ్చినప్పటివలె ఈ ప్రయాణమును శ్రమలతోను తొందరులతో గూడినదై యుండెను. ఇందువలన దేవునిసంఘము, దాని క్షేమార్థమై అప్పుడప్పుడు కొంతకాలమువఱకు తొందరలను పొందినను, అది బొత్తుగా విడనాడఁబడలేదని గ్రహించుచున్నాము.

పాఁత నిబంధనయందలి యితర గ్రంథములలో దేవుని ప్రజలైన ఇశ్రాయేలీయులు స్వతంత్ర రాజ్యము గలిగినవారైనట్లు వ్రాయఁబడకపోయినను వారు అన్యదేశపు రాజుల పరిపాలనకు లోఁబడియుండినను దేవుఁడు వారియెడల కరుణ గలవాఁడై యుండెను (హగ్గయి, జెకర్యా ప్రవచనములు చూ॥). వారు తమ దేవుని యారాధనలను మతపద్ధతులను తమ స్వంత శక్తివలననే జరుపుకొనఁగలవారై యుండిరి. ఇవి రాఁబోవు క్రీస్తు యొక్క పనిని ఆయన కృపను స్వతంత్రతను సూచించు గుఱుతులై యుండెను.

ఈ గ్రంథమునందు రెండుభాగములు గలవు. I. 1-6 అ. జనులు కోరెషు ప్రకటనవలన (1 అ), జెరుబ్బాబెలుతోకూడ వచ్చి (2 అ), ఆలయమును కట్టుచుండఁగా (3 అ), ఆటంకములు సమరయులవలన కలిగినను (4 అ), ఆలయమును కట్టి దాని ముగించిరి (5, 6 అ). II. 7-10 అ. జనులు తిరిగి ఎజ్రాతో బయలుదేరి వచ్చిన తరువాత (7, 8 అ), అతఁడు వారిలో దిద్దుబాటులను జేసెను (9, 10 అ).

ఈ గ్రంథమునందు ప్రజలు రాజులకిచ్చుకొనిన అర్జీలును, రాజులు వాటికిచ్చిన తాఖీదులును హెబ్రీ భాషలోగాక, ఆ కాలమునందు వాడుకలో నుండిన అరమేయిక్ భాషలో వ్రాయఁబడెను ($4^{8}$-$6^{18}$ $7^{12-26}$). ఆ భాషయే అప్పుడు వాడుకలో నున్నట్లు దానివలనఁ దెలి

యును. అదిమాత్రమేగాక, అవి అసలులో వ్రాయఁబడినరీతిగానే ఈ గ్రంథములో వాటిని జేర్చినట్లు కనుగొనవచ్చును. H.

**ఎజ్రాహీయుడు** (Ezrahite).

కీర్త 88 పీఠికలోనున్నట్లు హేమానుకును, కీర్త 89 లోను I రాజు 4[31] నందున్నట్లు ఏతానుకును పెట్టఁబడిన బిరుదు. మఱియు నిది జెరహీయుడు అను పేరునకు మాఱు రూపమై జెరహు అనువాని సంతతివారికి గలిగిన బిరుదని యనుకొనువారును గలరు (సంఖ్యా 26[20]).

**ఎజ్రీ** (Ezri = సహాయకుఁడు). దావీదు కాలములో వ్యవసాయకులమీఁద నుండు విచారణ కర్త (I దిన 27[26]).

**ఎతెరు** (Ether = సమృద్ధి).

1. యూదావారి యూళ్లలో నొకటి (యెహో 15[42]). తరువాత ఇది షిమ్యోను గోత్రికుల కియ్యఁబడెను (19[7]). ఫిలిష్తీయుల దేశములోని సిబ్నా ప్రాంతములలో నిది యున్నది. I దిన 4[32] నందు దీనికి తోకెను అను మాఱుపేరు గలదు (తోకెను చూ॥).

2. ఇత్రా చూ॥

**ఎత్తయిన ద్వారము** యెరూషలేము B III 8 (1), దేవాలయము I 3 (1) చూ॥

**ఎత్తైకే** ఎత్తైకే చూ॥

**ఎత్నాను** (Ethnan = దానము).

యూదావారిలో నొకఁడు (I దిన 4[7]).

**ఎత్నీ** యెయతిరయ చూ॥

**ఎత్బయలు** (Ethbaal = బయలుతోకూడ లేక బయలు తోడైనవాఁడు). అహాబు భార్యయగు యెజెబెలు తండ్రి. ఇతఁడు సీదోనీయుల రాజు (I రాజు 16[31]).

**ఎదోము, ఇదూమయ** (Edom = ఎఱ్ఱని, Idumaea, Edomites).

1. ఏశావుయొక్క మాఱు పేరు. మంచి కలగూర వంటకము చేయుటకు, సాధారణముగా నాకాలమందు ఎర్రని కూరాకులు వేసి వండి దానికి ఎర్రనిది యని అర్థమిచ్చు పేరు బెట్టిరి. వేటాడి అలసి సొలసి వచ్చు ఏశావు తన తమ్ముఁడైన యాకోబు అట్టి వంటకము చేయుట చూచి ఆత్యాశపడి, దాని తినుటకు తన జ్యేష్ఠత్వమును యాకోబున కమ్మకొనెను. అందువలన ఎదోమను పేరతనికిఁ గలిగెను (ఆది 25[29-34] 36[1]). (ఏశావు చూ॥)

2. ఏశావు సంతతివారు నివసించిన దేశము (ఆది 32[3] 36[6-8]). శేయీరను నది దాని పూర్వపు పేరు (ద్వితీ 2[5]). అది అరబ్బీ దేశమునందొక భాగము. అది లవణ సముద్రము మొదలుకొని ఎర్ర సముద్రపు అకాబా సంయుక్తా గ్రుడము వఱకు వ్యాపించెను. ఓఫీరు దేశముతో వర్తకము చేయుటకై ఎర్రసముద్ర తీరమున సొలొమోను తన ఓడలను కట్టించిన ఎసోన్గెబెరు పట్టణ మీ యెదోముదేశములోని దక్షిణ భాగమందుండెను (I రాజు 9[26]). అది ఎత్తయిన కొండలును, నిత్యము ప్రవహించెడి యేఁటలు గలిగి ఫల పుష్ప భరితమై, పశ్వాదులకు మంచి మేఁతగల దేశమై యుండెను. బొస్రా (*Bozra* ఆది 36[33]) ఏలోతు (*Eloth* I రాజు 9[26]) ఎసోన్గెబెరు (*Eziongeber* II దిన 8[17]). సెల లేక పెత్ర (*Sela or Petra* II రాజు 14[7]) అనునవి ఈ దేశమందలి ముఖ్య పట్టణములు. ఈ దేశమందు శేయీరు కొండ, అహరోను మృతినొందిన హోరు అను కొండయుఁగలవు. ఇశ్రాయేలీయు లరణ్యమున సంచారముచేయు కాలమందు ఎదోము రాజు వారిని తన దేశముగుండా దాటిపోనియ్యక, వారికి విరోధముగా దండుతో వచ్చినందున దేవుని ప్రవక్తలు ఆ దేశమును శపించిరి. ఈ శాపములన్నియు సంపూర్ణముగా నెఱవేఱినవని అందఱు నొప్పుకొనుచున్నారు (యెష 34[5-14] యిర్మీ 49[7-22] యెహె 25[12-14]). ఆ మార్గమున ఇశ్రాయేలీయులు పోఁజాలక దక్షిణముగా తిరిగి ఆ దేశమును చుట్టుకొని దీర్ఘ ప్రయాణము చేసిరి (సంఖ్యా 20[14-22] అరణ్యము 3 (2) చూ॥)

3. ఏశావుయొక్క సంతతివారు (ఆది 36[9]). వారు నివసించుటనుబట్టి ఈ దేశమున కీ పేరు గలిగెను. ఆరంభమున వారు రాజులచేతను నాయకుల చేతను పాలింపఁబడిరి (ఆది 36[31-41]). మోషే

ఇశ్రాయేలీయులతో ప్రయాణముచేయకమునుపే వీరికి రాజులుండిన సూచనలు గలవు (సంఖ్యా $20^{14}$). ఎదోమీయుల రాజు తన దేశముగుండా ఇశ్రాయేలీయులను వెళ్లనియ్యనందున వారు చుట్టు తిరిగిపోయిరి ($20^{14-21}$ న్యాయా $11^{17-18}$). రాజైన సౌలు ఎదోమీయులతో యుద్ధమాడెను (I సమూ $14^{47}$). దావీదు వారిలో 18 వేల మందిని సంహరించి, ఎదోము పట్టణములలో కాపు బలము నుంచెను (I దిన $18^{11-13}$ కీర్త 60 పీఠిక). ఆమోసు కాలమువఱకు ఎదోమీయులు ఇశ్రాయేలీయులను బహుగా ద్వేషించి హింసించినందున అతఁడు దైవాజ్ఞచే వారినిశపించి సర్వనాశన మగుదురని ప్రవచించెను (ఆమో $1^{11,12}$). యోవేలా దేశము నిర్జనమగు యెడారి యగుననెను (యోవే $3^{19}$). ఆలాగున జరిగెను. ఆదేశమిప్పుడు అరణ్యమయముగ నున్నది. గొప్ప రాతి నగరులు గలిగిన శ్రేష్ఠమైన పట్టణములు పాడై నిర్జనముగ నున్నవి.

H.

**ఎద్దు** ఆవు 2 చూ॥

**ఎద్రెయి, ఎద్రెయా, యెద్రెయి** (Edrei = బలము).

1. బాషానురాజైన ఓగు అనువాఁడు నివసించిన పట్టణము (ద్వితీ $1^{3}$ $3^{10}$ యెహో $12^{4}$ $13^{12}$). ఓగు అనురాజు ఈ పట్టణములో నోడిపోయినందున ఇతనిదేశము ఇశ్రాయేలీయుల వశమయ్యెను (సంఖ్యా $21^{33-35}$ ద్వితీ $3^{1}$). ఇది మనష్షేగోత్రికుల స్వాస్థ్యములో తూర్పు భాగమున నుండెను (యెహో $13^{31}$). ప్రస్తుతమునయున్న ఎద్ దెరా (*Ed-Dera*) యనునదే దీనియూనికి యనుకొందురు (పటము I, H 5)

2. నఫ్తాలీగోత్రపు స్వాస్థ్యములోని యొక యూరు (యెహో $19^{37}$).

**ఎనోషు** (Enosh = మానవుఁడు). ఆదాము మనుమఁడు. షేతు కుమారుఁడు (ఆది $4^{26}$ $5^{6-11}$ I దిన $1^{1}$ లూ $3^{38}$). ఇతనికాలములోనే యెహోవా నామమున ప్రార్థనచేయుట యారంభమైన దనుటవలన కయీను దుష్టత్వమునకెట్లు ప్రసిద్ధుఁడాయెనో అదేలాగున నితఁడు భక్తివిషయములలో ప్రసిద్ధుడయ్యెనని తెలిసికొనఁగలము.

**ఎపఫ్రా** (Epaphras). ఇతనిపేరు కొలొ $1^{7}$ $4^{12}$ ఫిలే 23 లయందు తటస్థించును. పౌలు ఇతనినిగుఱించి తోటిదాసుఁడనియు దాసుఁడనియు, నమ్మకమైన క్రీస్తు పరిచారకుఁడనియు కీర్తనీయముగా వ్రాసెను. కొలొస్సయి యతఁడు పుట్టిన యూరని యనేకుల భావము. అట్లుండక పోయిన నతఁడక్కడ నివసించి యా పట్టణమందు సంఘమును స్థాపించెననవచ్చును. కొలొ $4^{13}$ యందలి మాటను చూడఁగా లవొదికయ సంఘమునకును హియరాపొలి సంఘమున కితఁడే స్థాపకుఁడని యూహించఁ గలుగుదుము. పౌలు మొదటిసారి చెఱలోనుండఁగా ఎపఫ్రా రోమాపురికివచ్చి కొలొస్సయి సంఘమందలి లోపములను గుఱించి యాయన కెఱింగించెను. పౌలాయనను నాతోటి ఖైదీయని చెప్పుటచే నతఁడు పౌలు సహవాసము నిమిత్తము ఆయనతోకూడా చెఱలో నుండవలసివచ్చెనని తోచును. ఎపఫ్రా తెలియఁజేసిన సమాచారమునుబట్టి పౌలు కొలొస్సయి సంఘస్థుల పేరిట వ్రాసిన పత్రిక నితనిచేతికిచ్చి వారియొద్దకు పంపెను.

M.

**ఎపఫ్రాదితు** (Epaphroditus = మనోహరము). ఇతఁడు ఫిలి $2^{25-30}$ $4^{18}$ యందు పేర్కొనఁబడినవాఁడు. పౌలితని సహోదరుఁడనియు, జతపనివాఁడనియు తోటి యోధుఁడనియు చెప్పెడివాఁడు. అపొస్తలుఁడు మొదటిసారి చెఱలోనుండఁగా నితఁడు ఫిలిప్పయి సంఘస్థులు పౌలునిమిత్తము సమకూర్చిన ద్రవ్య సహాయమును అందించెను. ఆయన రోమాపురి చేరిన పిమ్మట సువార్త వ్యాపకత్వము నిమిత్తమును పౌలు యొక్క పరామర్శ నిమిత్తమును మిగుల ప్రయాసపడుటచే వ్యాధిగ్రస్థుఁడై చావుకు సిద్ధమైయుండెను (ఫిలి $2^{27}$). అతని అసౌఖ్యమును గుఱించి ఫిలిప్పయిసంఘస్థులకు తెలిసినందున వారు బహుగ విచారపడిరి. వారు తన్నుగుఱించి చింతాక్రాంతులైయుండుట ఎపఫ్రాదితుకు వినవచ్చినందున వారి దుఃఖోపశమనము కొఱకతడు ఫిలిప్పయికి పోవనపేక్షించుచుండెను. అందుకు పౌలు సమ్మతించివారు తన సహాయమునకు పంపిన ద్రవ్యమునకు కృతజ్ఞతను చెల్లించుటకును వారి భక్తిని స్థిరపఱచుటకు నొక పత్రికను వ్రాసి ఎపఫ్రాదితుచేత వారియొద్దకు పంపెను.

M.

**ఎపికూరీయులు** (**Epicureans** = ఎపికూరస్ అనువాని శిష్యులు). వీరు గ్రీకువారిలోని తత్త్వశాస్త్రములలో నొకదాని ననుసరించెడివారు. ఈదర్శన స్థాపకుఁడు క్రీ॥ పూ॥ **341-270** నందు జీవించిన ఎపికూరస్ అనువాఁడు. అతని బోధ స్తోయికుల బోధకు భిన్నముగానున్నది. సుఖ దుఃఖము లనేకరీతిగా నెంచవలసినదని వారు బోధించిరి గాని ఎపికూరీయులు సంతోష మనుభవించుటయే పరమమేలని యెంచిరి. ప్రస్తుతమున సుఖసంతోషముల నోలలాడువారిని ఆంగ్ల భాషయందీ పేరున పిలుతురు. ఎపికూరస్ దేవుని సృష్టికర్తనుగా నెంచక న్యాయ దర్శనమును మొదట స్థాపించిన కణాదునివలె నీ సృష్టి యావత్తును అణువులవలన నేర్పడినదని బోధించెను. ఇట్లు వారు దేవుని నిరాకరించి సుఖభోగములనే పరమబోధలుగ నెంచినందున అన్యుల బోధకులలో ముఖ్యముగ ఖండింపఁబడవలసినవారని ఆదిక్రైస్తవులు అనుకొనుచు వచ్చిరి. అథేనైలో పౌలు బోధలను విని హేళన జేసినవారిలో వీరు ముఖ్యులని ఊహింపఁదగును (కార్య $17^{18}$).

**ఎపైనేటు** (**Epaenetus** = స్తోత్రార్హుఁడు). ఆసియ పరగణానుండి వచ్చిన మొదటి క్రైస్తవులలో నొకఁడు. ఇతఁడు ఎఫెసుపట్టణస్థుఁడై యుండవచ్చును. పౌలితని తన ప్రియుఁడని పిలిచి వందనము చెప్పెను (రోమా $16^{5}$).

**ఎప్లాలు** (**Ephlal** = జాగరితగల). యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $2^{37}$).

**ఎఫెసీయులకు వ్రాసినపత్రిక (Epistle to the Ephesians).**

I. గ్రంథకర్త.

ప్రాచీను లందరేకగ్రీవముగా నీ యుత్తరము పౌలువలన రచించఁబడినదని సమ్మతింపఁగా నవీనులలో కొందఱు అందుకాక్షేపించి రెండవ శతాబ్దమందు జీవించిన యొకఁడు దీని వ్రాసెనను నభిప్రాయమునవలంభించిరి. ఈలాగున ఆక్షేపించువారు తమ యభిప్రాయమున కాధారముగా రెండు హేతువులను సూచింతురు. 1. శైలి విషయమందీపత్రిక పౌలింతకుపూర్వము వ్రాసిన పత్రికలకు భిన్నమైనదనియు, 2. ఇతరపత్రికల యందు పౌలు బోధించిన మతసిద్ధాంతములకు నీ పత్రికయందలి యుపదేశమునకును మిగుల వ్యత్యాసము కలదనియు వాదింతురు. వీరి సంశయము నిరాస్పదమైనదని చెప్ప వీలుపడదుగాని వారగుపఱచిన కారణములు వారివాదమును స్థిరపఱచు నంతటి బలమైనవి కావు. పౌలు మొదట వ్రాసిన యుత్తరములకును దీనికిని శైలిభేదమున్నను దీనితోపాటుగ నాయన రచించిన పత్రికలశైలి దీని శైలికి సమానముగా నున్నది. పౌలు ఆకాలమున కొలొస్సయి పత్రికయు, ఫిలిప్పీయుపత్రికయు, ఫిలేమోనుపత్రికయు, ఎఫెసీపత్రికయను నాలుగింటిని లిఖించెను. ఈ నాలుగుపత్రికలశైలి చాలమట్టుకు ఒకేవిధముగా నుండును. పౌలు వ్రాసిన గ్రంథముల శ్రద్ధగ పఠించువారాయనయే విధముగా తనభావమును బయలుపఱచునో కనుగొని యీ పత్రికను చదివిరేని నిదియాయన రచించినదని తప్పక నిశ్చయింతురు. సిద్ధాంతభేదమునుగుఱించియు తగుసమాధానము చెప్పఁగలుగుదుము. రోమీయులపత్రికను కొరింథుపత్రికను వ్రాసినతరువాత పౌలు చెఱలో మూఁడు సంవత్సరములు గడిపి యీ ఎఫెసీయులపత్రికను వ్రాసెను. అట్టిసమయమందాయన సంఘపరిపాలనవలనను దేశసంచారమువలనను ఆయాసపడక మతసిద్ధాంతమును ధ్యానించుట కవకాశము గలిగియుండును గనుక ఆ విషయమందు వ్యత్యాసము కలిగియుండుట వింతకాదు. మఱియు నీ పత్రిక రెండవశతాబ్దమందు జీవించిన యొకని రచనమనుట కేవలమపాత్రమైనది. II పేతు $3^{15,16}$ చూడఁగ పౌలువ్రాసిన పత్రికలాయన మృతి నొందినతరువాత కొన్నాళ్లకే జమచేయఁబడి దైవారాధనయందుపయోగించఁబడెనని స్పష్టమగును. అట్లుండఁగా రెండవ శతాబ్దారంభమందుండినవాఁడు పౌలుపేరట కల్పించి వ్రాసిన పత్రిక పౌలుదిగ నంగీకరించఁబడుట యసాధ్యము.

ప్రాచీనకాలీనులగు క్రైస్తవ గ్రంథకర్తలనేకులీ పత్రికనుగుఱించి సాక్ష్యమిచ్చిరి. ఐరేనియను, అలెక్సంద్రియ పట్టణపు క్లెమెంతు టర్టలియాను, మ్యూరటోరి గ్రంథశేషమును రచించినవాఁడు మొదలగు వీరందఱు ఎఫెసీయులపత్రికను ప్రశంసించి యది పౌలు రచించినపత్రిక

యని సాక్ష్యమిచ్చిరి. క్రీ॥ శ॥ 13 సం॥ మందుండిన మార్కియోనును, యోహాను స్నేహితుఁడగు పాలికార్పును, 115 సం॥ మందు హతసాక్షియైన ఇగ్నేషియసును, 95 సం॥ మందు రోమాపురి సంఘాధ్యక్షుఁడగు క్లెమెంతును ఈ పత్రికను వ్రాసినవాఁడు పౌలని దృష్టాంతపఱచిరి. అదియుఁగాక ఎఫెసీయుల పత్రికకును I పేతురు పత్రికకును ప్రకటన గ్రంథమునకును కలిగిన సంబంధమునుబట్టి యీ రెండు గ్రంథములను లిఖించినవారు ఎఫెసీయుల పత్రికను చదివి తమ గ్రంథముల నేర్పఱచిరని నిస్సందేహముగా చెప్పఁగలుగుదుము. కాఁబట్టి పరగ్రంథ పరిశీలనవలన నీ పత్రిక పౌలువనియు అందఱిచే ప్రమాణ గ్రంథముగా నంగీకరింపఁబడెననియు విశదమగును.

తద్గ్రంథ పరిశీలనవలనను ఆ నిర్ధారణకాధారము కలుగును. పౌలుయొక్క పత్రికలని యందఱు నొప్పుకొను పత్రికలయందువలె దీనియందును పౌలు శుభమనిచెప్పి వ్రాయునది యని యారంభమందు సూచించఁబడును. ఇతర పత్రికలయందువలె దీనియందును పత్రిక చదువువారు తనకొఱకు దేవుని ప్రార్థించుఁడని వేడుకొనుచు తనవాడుక ప్రకారము దైవనామమున వారిని దీవించి ముగించును. అదియుగాక యితర క్రొత్తనిబంధన గ్రంథకర్త లెవరైన నుపయోగించని యనేకపదములను పౌలు వాడుకొనెడివాఁడని పండితులు కనుగొని యున్నారు గనుక ఈ పత్రికయందు క్రొత్తనిబంధనయం దెక్కడను అగుపడని ఇరువై క్రొత్తపదములు కనఁబడుటయే యిది పౌలు పత్రిక యని చెప్పుట కాస్పదము గలుగఁజేయును.

కడకు ఎఫెసీయుల పత్రికయొక్క విషయ సంగ్రహమును శైలియును బోధాంశములను పరిశోధించుటచే దీనిగుఱించినశంక లేశమైన నుండనేరదు.

II. ఎవరినిమిత్తమై వ్రాయఁబడెను.

ఈ పత్రిక యారంభమందు "పౌలు ఎఫెసులో నున్న విశ్వాసులైనవారికి శుభమని చెప్పి వ్రాయునది" యనుమాటనుబట్టి యిది ఎఫెసుసంఘస్థుల నిమిత్తము వ్రాయఁబడెనని భావించినను ఆ సంగతి సంశయాస్పదమైనది. క్రొత్తనిబంధన గ్రంథములకు మూలమగు వ్రాఁతప్రతులలో నన్నిఁటి కంటె పురాతనమైనవానియందు ఎఫెసులోనున్న యను పదము కనఁబడదు. ప్రాచీనకాలపు క్రైస్తవగ్రంథకర్తయగు బాసిల్ యను సంఘాధ్యక్షుఁడు తానెఱిఁగిన ప్రతులలో నా పదములేదని తెలియఁజేసెను. ఒరిగెనుకూడ నాలాగు చెప్పెడివాఁడు. మార్కియోను తానేర్పఱచిన క్రొత్తనిబంధన గ్రంథముల నామజాబితాయందు దీనిని లవొదికయుల పత్రికయను పేరుచే నుదాహరించెను. ఇందువలన పౌలీపత్రికను ఎఫెసు సంఘస్థుల నిమిత్తము మాత్రమే వ్రాయలేదని తోఁచక తీరదు. కార్యముల గ్రంథమందలి ఎఫెసుసంఘస్థాపన వృత్తాంతములను చూడఁగ (కార్య $18^{19}$ $19^{8\ 13-16}$) యూదులు లా సభలో కలిసినవారని విశదమగునుగాని పత్రికను పరిశోధించగ పౌలు అన్యులను తలఁచి వ్రాసెనని నిస్సందేహముగా తెలియనగును (ఎఫె $2^{11-19}$ $3^{1}$). మఱియు పౌలు ఎఫెసు పట్టణమందు మూఁడుసంవత్సరములు కాపురముండినను (కార్య $20^{31}$) ఆ పట్టణమం దాయన స్నేహితులు పెక్కండ్రుండినను ఇతర పత్రికలయందువలె దీనియం దాయన యెవరిపేరును పేర్కొనకయు, నెవరికి వందనములను చెప్పకయుండుట మిగుల నాశ్చర్యమగును. ఆయన ఎఫెసు సంఘస్థులనిమిత్తమెయే వ్రాసిన యెడల వారిలో కొందఱికైనను వందనము చేయక మానఁడు. పౌలు కొలొస్సయులకు వ్రాసిన యుత్తరము $4^{16}$ నందు ఈ పత్రిక మీరు చదివించుకొనిన తరువాత లవొదికయవారి సంఘములోను చదివించుడి, లవొదికయకు వ్రాసిపంపిన పత్రికను మీరును చదివించుకొనుడి యని హెచ్చరించెను. ఇందు పేర్కొనఁబడిన లవొదికయ పత్రికను గుఱించి రెండుసంగతులు తేలును. ఏవనిన:— 1. లవొదికయ పత్రిక పౌలువలన రచింపఁబడెను. 2. అదియొక సంఘమునిమిత్తము కాదుగాని పలువురకు పంపఁబడెను అనునవి. మార్కియోను ఎఫెసీయుల పత్రికను లవొదికయుల పత్రికయని చెప్పుటవలన పౌలు కొలొస్సయులకును ఫిలేమోనుకు నుత్తరములను వ్రాసి తుకికు చేతికిచ్చి పంపినసమయమున నందఱు చదువఁదగిన పత్రిక వ్రాసి దానిలో నేసంఘపుపేరును కనుపఱచక చిన్నాసియ ప్రాంతములోని సంఘపు

వారందఱికి కందించి చదివించుమని యాయన కాజ్ఞాపించెనని భావింతుము. ఆ పత్రికను తమ వద్దను భద్రపఱచుటకై ఎఫెసు సంఘస్థులు దాని నెత్తి వ్రాయఁగా పౌలు ఖాళిగ విడిచినస్థలమున వారు తమ పేరును వ్రాసియుందురు. ఎఫెసు పట్టణ మా ప్రాంతములో ముఖ్యపట్టణమైనందున నితర సంఘస్థు లా గ్రామమునకు పలుమారు వచ్చి పోవువారు గనుక తమ యుపయోగమునకు ఎఫెసు సంఘములోని పత్రికనెత్తి వ్రాయునప్పుడు ఎఫెసులోనున్న విశ్వాసులైనవారికియను మాటను కలిపి యుందురు. ఇందునుబట్టి యీ పత్రిక ఎఫెసీయులపత్రిక పేరుచే సర్వత్ర వ్యాపకమాయెను.

III. కాలస్థాన నిరూపణము.

పౌలీ పత్రికను వ్రాసిన కాలమున చెఱయందుండెను ($3^{1}$ $4^{1}$ $6^{19}$) గనుక, ఆయన కైసరియలో నైనను రోమాపురిలో నైనను దీని వ్రాసియుండవలెను. పౌలీపత్రికను వ్రాసిన తరుణముననే కొలొస్సయులకును ఫిలేమోనుకును పంపిన పత్రికలను రచించెనని యందఱంగీకరింతురు. వేదపండితులలో కొందఱా సమయమున పౌలు కైసరియ చెఱలో నుండెననుకొందురు గాని యీ తీర్మానము పెక్కండ్రకు సమ్మతము కాదు. పౌలు ఫిలిప్పీయులకు వ్రాయఁగా నా బంధకములు క్రీస్తు నిమిత్తమే కలిగినవని ప్రేతోర్యమను సేనలోని వారికందఱికి స్పష్టమాయెననియు ($1^{13}$), కైసరు ఇంటివారిలోనున్న పరిశుద్ధులు మీకు వందనములు చెప్పుచున్నారనియు ($4^{22}$) చెప్పిన మాటలను రోమాపురినుండి వ్రాయఁగలడుగాని కైసరయనుండి యీలాగు వ్రాయుటకు వీలుపడదని వేదవేత్తలలో ననేకుల యభిప్రాయము. పౌలీపత్రికను వ్రాసిన సమయముననే యజమానుని యాధీనమును తప్పించుకొని తన చెంతచేరిన ఒనేసిము అను దాసునిగుఱించి అతని యజమానుఁడగు ఫిలేమోను కుత్తరమును వ్రాసి పంపెను. పారిపోయినదాసుఁడు రోమాపురిలో దాగియుండ ననుకూలమైనందున ఒనేసిముక్కడనే పౌలును కలిసికొనెననుటకు సందేహముండదు. కొలొస్సయి ఫిలిప్పీ పత్రికలను పౌలు తిమోతి ఇద్దరు కలిసి వ్రాసిరి (ఫిలి $1^{1}$ కొలొ $1^{1}$). అపొస్తలుఁడు రోమా చెఱయం దున్నప్పుడు తిమోతియు ఆయనతో నుండెను గాని కైసరయలో నున్నప్పుడు తిమోతి ఉండలేదు. అట్లుండఁగా పౌలీ పత్రికను రోమాపురి చెఱలోని సమయమున అనఁగ క్రీ॥ శ॥ 62 లేక 63 సం॥ నని కొందఱు అను, 60 లేక 61 సం॥ న నని మఱికొందఱు నభిప్రాయపడుచున్నారు.

IV. ఉద్దేశము.

ఈ పత్రికయందు పౌలు క్రైస్తవ భక్తకోటి ఒకటే శిరస్సుయందు క్రీస్తుకు శరీరమువంటి సంఘమై యున్నారు గనుక ఆ దివ్యశరీరమందు కలిసిన అవయవములవంటి ప్రతి సభికుఁడు సంఘమహిమార్థముగా సత్ప్రవర్తన ననుసరించి జీవించుకొనవలెనని ఎఫెసీయులను ప్రేరేపించెను.

M.

V. భాగములు.

I. పీఠిక:—1. పై వ్రాఁత $1^{1,2}$. 2. సకలాశీర్వాదములకై దేవుని స్తుతించుట $1^{3-14}$. (1) నిర్ణయము $1^{4-6}$. (2) విమోచనము $1^{7}$. (3) ఐక్యము $1^{8-10}$. (4) స్వాస్థ్యము $1^{11-12}$. 3. ప్రార్థన. జ్ఞానమును కోరుట $1^{15-23}$. (దీనిలోని 20-23 వచ. 19 వచనముమీఁద నాధారపడియున్నవి). II. క్రైస్తవుల పూర్వ ప్రస్తుత స్థితులకు గల భేదము చూపుట $2^{1-22}$:—1. పూర్వము మరణము, ఇప్పుడు జీవము $2^{1-7}$ (జీవమునుగూర్చి వ్రాయునప్పుడు రక్షణ మార్గమును వివరించెను $8^{-11}$). 2. పూర్వము దూరము, ఇప్పుడు సమీపము $2^{11-22}$ (చివరి రెండు వచనములలో వారి నొక కట్టడమునకుఁ బోల్చి వారి స్థితిని దెలిపెను ($2^{20-22}$). III. ఈ సంఘమును కట్టుటలో పౌలుకు కలిగిన పని $3^{1-21}$:—1. క్రీస్తు మర్మమును దెలుపుట $1^{2-13}$. 2. దానివిషయమైన ప్రార్థన $1^{14-19}$. 3. ఈ భాగము నొక స్తుతి వాక్యముతో ముగించుట $3^{20,21}$. (పురా॥ సాధారణముగా పౌలు తన పత్రికల పీఠికలలో వ్రాయు సంగతులే పైన ఉదాహరింపఁబడెను గాని ఈ పత్రిక యందవి చాల విస్తరముగ వ్రాయఁబడెను). IV. క్రైస్తవ నడతవిషయమైన హెచ్చరికలు $4^{1}$-$6^{18}$:—1. ఐక్యము-శరీరము, శిరస్సు-దాని ఔన్నత్యము $4^{1-16}$. 2. అన్యుల మాదిరిని విడిచి క్రొత్తనడత నవలంబింపవలెను $4^{17-24}$. 3. ఒకరికొకరము అవయవములమై యున్నాము గాన చేయవలసిన ధర్మవిధులు $4^{25-32}$.

**4.** **దేవుని పిల్లలవలె** నడుచుకొనవలెను $5^{1-21}$. **(1)** **అనుసరించవలసినవి** $^{1,2}$ **(2)** విడువవలసినవి $^{3-8}$ **(3)** **వెలుఁగుపిల్లలవలె** నడుచుకొనుట $^{9-14}$. **(4)** **వివేకులవలె** నడుచుకొనవలెను $^{15\ 21}$. **5.** **ఆయా** వారలనుసరింపవలసిన విశేష నీతులు $5^{22}-6^{9}$. (1) భార్యాభర్తలు $5^{22-33}$ (ఇది క్రీస్తుకును సంఘమునకున్న సంబంధమును జూపును) **(2)** **పిల్లలు,** తలిదండ్రులు $6^{1-4}$. (3) సేవకులు, **యజమానులు** $6^{5-9}$. 6. యోధులవంటివారగు క్రైస్తవుల ధర్మములను దెలుపుట $6^{10-13}$. **V.** ముగింపు **విషయములు** $6^{19-24}$:—1. తనకొఱకు ప్రార్థించుమనుట $^{19-20}$. **2.** తుకికును సిఫారసు చేసి పంపుట $^{21-22}$. **3.** ఆశీర్వాదము $^{23-24}$.

**ఎఫెసు** (**Ephesus**). చిన్నాసియలో పశ్చిమ లూడియా యను పరగణా యందలి యొక పురాతన పట్టణము. పూర్వ మిచ్చట నొక మంచి రేవు ఉండునది. అందువలన నడిచిన వ్యాపారముచేత నిది చిన్నాసియలో ముఖ్య పట్టణమాయెను. క్రీ॥ ము॥ 11 వ శతాబ్దము నందు గ్రీసువారు దానిని స్వాధీనపఱచుకొనిరి. ఆరవ శతాబ్ద మధ్యమందు లూడియ రాజును కుబేరునివంటి వాఁడునగు క్రీసు (*Croesus*)



ఎఫెసులోని నాటకశాల

దానిని తన రాజ్యమునకు కలుపుకొనెను. కాని యతని రాజ్యమును పారశీకు లాక్రమించుకొని నప్పుడది పారశీకులవశమయ్యెను. **333** వ సం॥ నందు **మహా** అలెక్సందరు వారి నోడించి దానిని మఱల గ్రీకువారి యధీనమున నుంచెను. **190** సం॥ న రోమనులు దానిని జయించి పెర్గము రాజు వశమున నుంచిరి గాని **133** వ సం॥ న దానిని తమ స్వంత యేలుబడి క్రిందకుఁదెచ్చి

కొని, ఆసియయందు దానిని ముఖ్య పట్టణముగాఁ జేసిరి. బైబిలునందు క్రొత్త నిబంధనలో మాత్రము దీని పేరు కనఁబడును. ఆ కాలమునందది రోమనుల పురములలో ముఖ్యమైనది. అనేకమంది యూదులచ్చట నుండిరి (కార్య 18[19] 19[17] పురా 14,10, 11, 13). పౌలు తన రెండవ ప్రయాణాంతమున కొరింథునుంచి యెరూషలేమునకుఁ బోవుచు మొదటిసారి దానిని దర్శించి అకుల ప్రిస్కిల్ల యను వారి నచ్చట దిగఁబెట్టి వెళ్లెను (కార్య 18[19-21]). అతని మూఁడవ ప్రయాణమునందీ పట్టణమతని ముఖ్య స్థానమాయెను. పని జయకరముగా జరిగిన పిమ్మట దేమేత్రి యను కంసాలి చేత కలిగిన గాందరగోళమువలన చాల యాపదలనుండి తప్పించుకొని తాననుకొన్న దానికన్న త్వరలోనే ఆ పట్టణమును విడువవలసివచ్చెను (19[1-41] I కొరి 16[7-9]). I కొరింథి యుత్తర మిచ్చటినుంచియే వ్రాసెను (16[8]). తరువాత మూఁడవ ప్రయాణమునుండి తిరిగివచ్చుచుండఁగా నతఁడు ఎఫెసు పెద్దలను మిలేతుకుఁ బిలిపించి వారికి హెచ్చరికలు జేసెను (కార్య 20[16,17]). తాను చెఱయందుండఁగా ఈ సంఘమునకొక యుత్తరము వ్రాసెను (ఎఫె 1[1] 6[21]). ఇది యోహాను చిన్నపత్రికలను వ్రాసిన యేడు సంఘములలో మొదటిది (ప్రక 1[11] 2[1-7]). అపొస్తలుఁడైన యోహాను తన చివరి సంవత్సరము లీపట్టణములో గడిపెనని క్రైస్తవ పారంపర్యములనలనఁ దెలియుచున్నది. ఈ పట్టణమునందు 3 వ సార్వత్రిక సభ క్రీ॥ శ॥



నాటకశాలనుండి కనబడు ఎఫెసు శిథిలములు

431 సం॥ మందును, మఱియొక అక్రమ సభ 449 లోను కూడినట్లు సంఘ చరిత్రలో చదువుచున్నాము. ప్రస్తుత మచ్చట పాడుశేషములు తప్ప మఱేమియును లేవు. (అర్తెమిదేవి, దేమేత్రి, పౌలు, ఎఫెసీయుల ఉత్తరము చూ॥ పటము V, H 4).

**ఎఫెస్దమ్మీము** (Ephes-dammim = రక్తము హద్దు). దావీదు గొల్యాతును చంపినప్పుడు ఫిలిష్తీయుల దండుపేట యుండిన స్థలము (I సమూ 17[1]). అది యూదాదేశములో నుండెను. I దిన 11[13] లో నున్నట్లు అది పస్దమ్మీము అనఁబడును (పటము II, D 1).

**ఎప్ఫతా** (Ephphata). అరమేయిక్ పదము. తెరువఁబడుమని యర్థమగును (మా 7[34]).

**ఎఫ్రాతా** (Ephratha, Ephrath = ఫలకరము). ఇంగ్లీషులోనున్నట్లు అసలు భాషయందు కూడ రెండు గుణితములున్నవి.

1. హెస్రోను కుమారుఁడగు కాలేబు భార్య. ఈమె హూరు అనువానితల్లి (I దిన 2[19,50] 4[4]).

2. బేత్లెహేముయొక్క మొదటిపేరు (ఆది 35[19] 45[7] రూతు 4[11] మీకా 5[2] బేత్లెహేము చూ॥)

3. కీర్త $132^{6}$ లో నున్నట్లు ఎఫ్రాతా దేవుని మందసము తేఁబడిన స్థలమగుటచే అది కిర్యత్యారీమునకు మాఱుపేరైయున్నది. (కిర్యత్యారీము చూ॥). ఆ కిర్యత్యారీము కాలేబుదైన ఎఫ్రాతా అనఁబడిన ప్రదేశమందున్నందున యీ కీర్తనలో కావ్యరీతిగా దీనికి పెట్టిరి (I దిన $2^{24,50,51}$).

**ఎఫ్రాతీయుడు, ఎఫ్రాయీమీయుడు (Ephrathite).**

1. బేత్లెహేమునకు అసలుపేరు ఎఫ్రాతా కావున దానిలో నివసించువారికి దానినిబట్టి వచ్చినపేరు (I సమూ $17^{12}$ రూతు $1^{2}$).

2. ఎఫ్రాయిము గోత్రభాగమందున్న వారిలో నొకఁడు (I సమూ $1^{1}$ I రాజు $11^{26}$). ఈ వాక్యములలోనున్న ఈ పదము సవరించఁబడిన యింగ్లీషు తర్జుమాలో ఎఫ్రయి మీయుఁడని యున్నది. అసలునందలి పదమును ఇట్లే చదువవలయునని కొందఱి యభిప్రాయము.

**ఎఫ్రాయిము (Ephraim = రెండింతల వృద్ధి).**

1. ఐగుప్తులో యోసేపునకు ఓను యాజకుని కూతురగు ఆసెనతువలనఁ గలిగిన రెండవకుమారుఁడు (ఆది $41^{50-52}$). యాకోబు ఇతనిని ఇతని యన్నయగు మనష్షేతోకూడ పెంచుకొని, తన ప్రియకొమరుఁడగు యోసేపునకు తన సంతానపు వారితోకూడ రెండుగోత్రముల నిచ్చెను. యాకోబు తన చివరికాలములో యోసేపు కుమారులను దీవించునప్పుడు ($48^{13}$) యాకోబు తన కుమారుఁడైన యోసేపు వద్దని చెప్పినను ఒప్పక ఎఫ్రాయిమును మనష్షేకంటె ఘనపఱిచి చిన్నవాఁడు పెద్దవానికంటె గొప్పవాఁడగునని ప్రవచించెను. యాకోబు చివరి దీవెనలో (49) ఈ యిద్దఱన్నదమ్ములు వారికి భవిష్యత్కాలమునఁ గలుగఁబోవు ఐశ్వర్యమును యోసేపు అనుపేరు క్రిందనే చేర్చెను. ఎఫ్రాయిము కొడుకులలో నిద్దరు చంపఁబడఁగా అతఁడు చాల చింతాక్రాంతుఁడైనట్లు I దిన $7^{20-22}$ వలనఁ దెలియును. W.

2. ఎఫ్రాయిము మూలపురుషుఁడుగానున్న గోత్రము (యెహో $16^{4,10}$ న్యాయా $5^{14}$). అతని కుమారులలోఁ గొందఱు ఫిలిష్తీయులవలన చంపఁబడినందున కొంతకాలము దనుక ఈ గోత్రమువారు వృద్ధిలోకి రాలేదు (I దిన $7^{20-23}$). అరణ్యమునందు మొదట వేయఁబడిన జనాభా ప్రకారము వీరు **45,000** మంది యుండిరి. మనష్షే బెన్యామీను గోత్రములు మాత్రమే వీరికన్న యింక తక్కువగానుండెను (సంఖ్యా $1^{33}$). అరణ్య సంచారమునందు వీరిలో ననేకులు మరణమైనందున రెండవ మారు వేయఁబడిన లెక్క ప్రకారము **32,500** మంది మాత్రమే యుండిరి. షిమ్యోను గోత్రమొక్కటియే వీరికన్న తక్కువ మందిని కలిగియుండెను ($26^{37}$). యోసేపు సంతానపు ఉభయగోత్రములను కలిపిన తక్కినవాటిలో దేనికన్నను సరే రెండింతలుగానుండిరి. స్త్రీలు పిల్లలు మినహా **85,200** మంది పురుషులుండిరి. ($25^{34-37}$ దీనితో ద్వితీ $33^{17}$ సరిపోల్చుము). యెహోషువ ఎఫ్రాయిమీయుఁడైనందున అతని నాయకత్వముక్రింద నీగోత్రము బహుత్వరగా ప్రసిద్ధిలోకివచ్చెను (యెహో $19^{50}$ $24^{30}$). ఈ గోత్రికులకు యొర్దాను పడమటి వైపున స్వాస్థ్యము కలిగెను. యొర్దానుకు పడమటనున్న మనష్షే గోత్రమునకును బెన్యామీను గోత్రములకు మధ్యను పడమట మధ్యధరా సముద్రమునుండి తూర్పున యొర్దానువఱకు ఈ గోత్రము వ్యాపించెను (యెహో $16^{1-10}$). షెకెమును పట్టణ మీగోత్రములోనుండెను ($21^{20,21}$ I దిన $6^{67}$). తమ భాగమందుండిన గెజెరులోని కనానీయులను వీరు వెళ్లఁగొట్టకపోయిరి గాని వారిని వెట్టిపనులకు మాత్రము స్వాయముగానో, మనష్షీయులతోఁ గలిసియో పట్టుకొనిరి (న్యాయా $1^{22-26,29}$) దెబోరా వర్ణించిన గొప్పయుద్ధమునందు తమ దేశాభిమానమును చక్కగా కనఁబఱిచినట్లు చూడవచ్చును ($5^{14}$). మనష్షేవాఁడగు గిద్యోను కనానునుండి మిద్యానీయులను వెళ్లఁగొట్టినప్పుడు తమ్మును పిలువలేదని వారతనితో కలహించిరి ($8^{1-3}$). అమ్మోనీయులతోఁ జేసిన యుద్ధమునకు తమ్మును సహాయార్థము పిలువలేదని కోపించి వారు యెఫ్తామీఁద యుద్ధముజేసి **43,000** మందిని కోలుపోయిరి ($12^{1-6}$). పోతవిగ్రహమును చేయించుకొనిన మీకాయ అనువాఁడు ఎఫ్రాయిము మన్యదేశమందున్నవాఁడు ($17^{1}$). బెన్యామీను గోత్రికులకు తక్కినవారితో కలహకారణ

మైన లేవీయుఁడు ఈప్రాంతములలోనే పరదేశిగానుండెను ($19^{1}$). రాజ్యము విభాగింపఁబడిన పిమ్మట 10 గోత్రములవారికి రాజైన యరొబాము ఎఫ్రాయిమీయుఁడు (I రాజు $11^{26}$). అతఁడు ఈ గోత్రమునందున్న షెకెమును కట్టించి దానిని తనకు రాజధాని పట్టణముగాఁ జేసికొనెను ($12^{25}$).

3. బయల్హాసోరుకు సమీపముగా నుండు నొక యూరు (II సమూ $13^{23}$). ఇది యెరూషలేమునకు నుత్తరముగా 10 క్రోసుల దూరములో నున్నదని కొందఱనుకొనుచున్నారుగాని దాని యునికినిగూర్చి రూఢిగాఁ దెలియదు.

4. అరణ్యమునకు సమీప ప్రదేశములోనున్న ఒక యూరు. లాజరును లేపినపిమ్మట క్రీస్తు ఇచ్చటికి వెళ్లినట్టున్నది (యోహా $11^{54}$). బేతేలునకు 5 మైళ్లు తూర్పుగా ఎఫ్రాయిమనఁబడిన స్థలమొకటి గలదని ఒక పురాతన చరిత్రకారుఁడు వ్రాసెను. అదే యీ ఎఫ్రాయిమని కొందఱనుకొందురు. ఈ పేరంటను ఒకటే యూరని కొందఱనుకొందురు. (పటము III, F 5).

5. ఒక వనమునకు పేరు (II సమూ $18^{6}$). అది యొర్దానునకు తూర్పుగా నుండెనుగాని ప్రస్తుతము దాని యునికిని తెల్లియఁజేయు సూచన లెవ్వియు లేవు.

6. ఒక మన్యభూమి పేరు (యెహో $19^{50}$ $20^{7}$ $21^{21}$ న్యాయా $2^{9}$). న్యాయా $3^{27}$ లో నున్నట్లు దీనిని ఎఫ్రామీయుల కొండ యని తర్జుమా చేసిరి. ఇది ఎఫ్రాయిము స్వాస్థ్యములోని కొండప్రదేశమునకు పేరైయున్నదని సాధారణముగా ననుకొందురు. అయితే కొందఱిది యీ కొండలన్నిటికిఁ గాదుగాని యెఫ్రాయిము అనునూరికి సమీపముగా నుండు ఒక కొండకు పేరు అని యెంచుచున్నారు.

7. ఎఫ్రాయిము గవిని. యెరూషలేము B III 7 (2) చూ॥

**ఎఫ్రోను** (**Ephron** = దూడకు సంబంధించిన).

1. హిత్తీయులలో నొకఁడు. అబ్రాహాము తన భార్యయైన శారాను పాతిపెట్టుటకు ఇతని యొద్ద స్థలము కొనెను. అదే మక్పేలా గుహ (ఆది. $23^{9}$).

2. ఒక కొండ (యెహో $15^{9}$). అది బేత్లెహేమునకు పశ్చిమముననున్న కొండల వరుస యని యనుకొందురు.

3. అబీయా యరొబామును ఓడించి పట్టుకొనిన పట్టణములలో నొకటి (II దిన $13^{19}$). ఇది ఎఫ్రాయిమునకు మాఱురూపమని యనుకొందురు. (ఎఫ్రాయిము 4 చూ॥).

**ఎబెదు** (**Ebed** = సేవకుఁడు). ఈ పదమును దీనికి సంబంధించిన ఓబెదు అను పదమును ఎబెద్మెలెకు ఓబేదెదోము మొదలగు సమాసములలో కనఁబడును.

1. అబీమెలెకునకు విరోధముగా తిరుగుబాటు చేసిన గాలు అని వాని తండ్రి (న్యాయా $9^{26-35}$).

2. ఎజ్రాతోకూడ బబులోనునుండి యెరూషలేమునకుఁ దిరిగివచ్చిన వారిలో నొకఁడు (ఎజ్రా $8^{6}$).

**ఎబెద్మెలెకు** (**Ebedmelech** = రాజసేవకుఁడు). యిర్మీయాను గుంటలో పడవేసినప్పుడు అతనిని అందులోనుండి పైకిఁదీసినవాఁడు. అతఁడు ఆఫ్రికాదేశమునుండి వచ్చిన నల్లనివాఁడు (యిర్మీ $38^{7-13}$). ఈ మంచికార్యము చేసినందున యెరూషలేము పట్టఁబడునప్పుడు అతనికి మేలు కలుగునని యిర్మీయా ప్రవచించెను ($39^{15-18}$). ఇది అతని స్వంతపేరుగాక ఉద్యోగమునుబట్టి వచ్చిన పేరైయుండును.

**ఎబెనెజెరు** (**Ebenezer** = సహాయపురాయి). సమూయేలు ఫిలిష్తీయులను పూర్తిగా నోడించిన తరువాత యెహోవా చేసిన సహాయార్థమై జ్ఞాపకార్థముగా నిలువఁబెట్టఁబడిన రాతి పేరు (సమూ $7^{10-12}$). సమూయేలు గ్రంథకర్త $4^{1}$ $5^{1}$ లో కూడ దీనిని గురించి ఉదాహరించెను. ఇది యుండినతావు బాగుగఁ దెలియదుగాని మిస్పెకును షేనుకును మధ్యయని చెప్పవచ్చును.

**ఎబెరు** హెబెరు 5 చూ॥

**ఎబ్యాసాపు** అబీయాసాపు చూ॥

**ఎబ్రోనా** (**Abronah**). సీనాయికొండ యొద్దనుండి ఇశ్రాయేలీయులు కనానుకు ప్రయా

ణము చేయునప్పుడు మకాము చేసిన స్థలములలో నొకటి (సంఖ్యా 33[34,35]).

**ఎముకలు, శల్యములు (Bones),** శరీరమున కెముకలు ఆధారమును బలమునైయున్నవి. గొప్ప రోగములను నీతి సంబంధమైన బలహీనతలను సూచించుటకు బైబిలునందు దక్కడక్కడ దృష్టాంతము లున్నవి (కీర్త 6[2] 22[14] 42[10] 51[8] సామె 14[30] యోబు 17-22 రోగములు II 8, III 2, 3 చూ॥). ఆది 2[23] II సమూ 19[12] లోని యెముకలలో నొక యెముక యను పదములు రక్త సంబంధమును సూచించును. న్యాయా 9[2] II సమూ 5[1] యందు రక్త సంబంధులమని తర్జుమా చేయబడిన పదము II సమూ 19[12] లో నున్నట్లుగా అసలులో నెముకల సంబంధులమని యున్నది. క్రీస్తు పునరుత్థానుడైన పిమ్మట తన శరీరము మాయ శరీరముగాక నిజమైన శరీరమని నిరూపించుటకు తనకు ఎముకలును మాంసము లున్నవని చెప్పెను (లూ 24[39]). ఎముకలు శవములనుకూడ సూచించెను (నిర్గ 13[19] యెహో 24[32] II సమూ 21[12] I రాజు 13[31]). అదేరీతిగా యెహె 31[1-15] లో నున్న యెముకల లోయను గూర్చిన దర్శనము మృతమైన ఇశ్రాయేలీయుల జనాంగమును సూచించును. ఇట్లు ఎముకలు శవములకు సంబంధమైనవిగా నుండుటచే నవి యపవిత్రమునకును సూచనలైయున్నవి (మ 23[27]). అన్యదేవతల వేదికలను అపవిత్ర పరచుటకు వాటి పూజారుల యెముకలను వాటిమీద కాల్చివేసిరి (II రాజు 23[13-16]).

**ఎమ్మాయు (Emmaeus).** యెరూషలేమునకు 60 స్తాదియుల దూరములో నున్న యొక ఊరు. క్రీస్తు మృత్యుంజయుడై లేచిన పిమ్మట ఇక్కడ యిద్దరు శిష్యులకు కనబడెను (లూ 24[13,29-31]). యెరూషలేమున కింత దూరములో నున్న యొక ఊరిలో రోమను సేనాధిపతి యొక పటాలము నుంచినట్లు యోసీఫసు వ్రాసెను (యుద్ధ 7.6.6). అది యెరూషలేమునకు వాయవ్య దిక్కున నుండు కులోనియె (*Kuloniah*) అను యందురు (పటము II, E 1). మక్కబీయుల గ్రంథములో యెరూషలేమునకు 18 మైళ్లు పడమరగా నుండు ఈ పేరుగల యొక ఊరును గుర్తించిన సూచన లున్నవి (I మక్క 3[40] 9[50]). దానిని ప్రస్తుతము అమ్వాస్ (*Amwas*) అని పిలుతురు గాని యిది యొక్కన దూరముగా నుండుటచే పైనున్న ఎమ్మాయు కానేరదు.

**ఎరస్తు** (Erastus = ప్రియమైన). పౌలు యొక్క సహకారి యీ పేరు ముగ్గురు ఉండిరి స్థించును. రోమా 16[23] యందు ఈ పట్టణపు ఖజానాదారుడగు ఎరస్తు మీకు వందనములు చెప్పుచున్నాడను మాటనుబట్టి పౌలాసమయమున కొరింథులోనున్నందున ఎరస్తు ఆ యూరి వాడని నిశ్చయమగును. అపొ 19[22] నందు పౌలు ఎరస్తు అను పేరుగల నొక పరిచారకుని మాసిదోనియకు పంపినట్టు ప్రస్తావించెను. II తిమో 4[20] నందు ఎరస్తు కొరింథులో నిలిచి పోయెనని చెప్పబడెను. అపొ 19[12] యందును II తిమో 4[20] యందును చెప్పబడిన ఎరస్తు ఒకడనియు, రోమా 16[23] వ మందలి ఎరస్తు వేఱనియు పండితులలో కొందరి భావము. M.

**ఎరుగుట** తెలిసికొనుట చూ॥

**ఎరుపువర్ణము, ఎర్రని** రంగులు 2 చూ॥

**ఎరుబ్బేషెతు** యెరుబ్బయలు చూ॥

**ఎరుపు** మలము చూ॥

**ఎరెకు (Erech).** దక్షిణపు బబులోనునందు మిగుల పురాతనమును ప్రసిద్ధమునైనట్టి పట్టణము. నిమ్రోదు పట్టణములలో నొకటి (ఆది 10[10]). బబులోనీయులు వారు దీనికి అర్కు (*Arku*) లేక ఉరుక్ (*Uruk*) అను పేరు పెట్టిరి. ప్రస్తుతము మచ్చటనుండు నొకదిబ్బకు వర్క (*Warka*) యను పేరుగలదు. అది బబులోనుకు దక్షిణముగా యూఫ్రాతు నది యొక్క తూర్పు ఒడ్డున నున్నది. ఈ పట్టణస్థులకు అర్కేవీయులని పేరు కలదు. అస్నప్పరు అను వాడు షోమ్రోనులో నివసింప దెచ్చిన జనులలో ఈ అర్కేవీయులును గలరు (ఎజ్రా 4[9,10] పటము VIII, E 2).

**ఎర్ర జింక** లేడి చూ॥

**ఎర్రని పెయ్య** ఆవు 1, పవిత్ర పరచుట 5 చూ॥

**ఎర్ర సముద్రము (Red Sea).** హెబ్రీ బైబిలులో దీనికి జమ్ముసముద్రమని యర్థమిచ్చు

నరుకలదు. గ్రీకుదేశపు భూగోళశాస్త్రజ్ఞులు దీనికి ఎర్రసముద్రము అను పేరుపెట్టిరి. దీని నీరు ఎర్రనిది కాదుగాని యుత్తరపు ప్రాంతిము లలో దానిమట్టునుండు నేల ఎర్రనిదగుటచే దీనికట్టి పేరు కలిగియుండవచ్చును. ఇది ఐగుప్తు దేశమునుండి దక్షిణముగా 1490 మైళ్లవఱకు వ్యాపించుచు హిందూ మహాసముద్రము (*Indian Ocean*) వఱకు పోవును. దీని యుత్తరపు భాగము రెండు శాఖలుగా విభజింపబడి యుండు అకాబా యను నొక శాఖ సీనాయి కొండల ప్రక్కన తూర్పున 100 మైళ్ల వఱకు వ్యాపించును. ఈ యకాబా యొక్క ఉత్తరపు కొనయందు పూర్వము ఎసోన్గెబెరు (*Eziongeber*) అను రేవు పట్టణముండెను (I రాజు $9^{26}$).

రాజైన సొలొమోను అచ్చట ఓడలను కట్టించి ఓఫీరు అను ప్రదేశమునకుఁ బంపి బంగారము దంతము మొదలైన సరకులను తెప్పించెను ($9^{26-28}$ ఓఫీరు చూ॥). ఈ యకాబా యను శాఖకు నుత్తరముగా ఎదోము దేశముండెను ($9^{26}$). దానికిఁ దూర్పున అరేబియా దేశము వ్యాపించియున్నది.

ఈ యెర్ర సముద్రపు ఉత్తర శాఖలలో పడమటి దానికి సూయజు అని పేరు. ఇది సీనాయి కొండ ప్రదేశమునకు పడమరగా నుండును. ఈ శాఖకే బైబిలులో ఎర్రసముద్ర మని పేరు పెట్టిరి. దీనికి పశ్చిమోత్తరమున ఐగుప్తు లేక మిస్రాయిము దేశమున్నది. ఇశ్రాయేలీయులు ఐగుప్తు దేశమును విడిచి బైలుదేరి నప్పుడు దేవుని యుత్తరువుచొప్పున వారీయెర్ర సముద్రపు పడమటి శాఖయొరనుఁజేరి అద్భుత రీతిగా దాని దాటిరి.

ఇశ్రాయేలీయులు ఎర్ర సముద్రమును దాటిన స్థలమునుగూర్చి చాల సందేహము కలదు. అయినను బైబిలుశాస్త్ర పండితోత్తములు అన్ని సంగతులను సరిచూచుకొని ఆ ప్రదేశములన్నిఁటిని శోధించి చూచి ప్రస్తుతము సూయజు అను ఊరు నిలుచుచున్న స్థలమునకు దక్షిణముగా ఒకటి లేక రెండు మైళ్ల దూరములో వారు దాటిపోయి రని యూహించుచున్నారు. అయినను పూర్వము ఎర్రసముద్ర మింక యుత్తరమునకు వ్యాపించి యుండెను కావున ప్రస్తుతము సూయజుకును చేదు సరస్సులు (*Bitter Lakes*) అను స్థలము నకును మధ్యనుండు స్థలమున వారు దాటి యుండి రనియు కొంద అనుకొందురు.

C.

**ఎర్ర సముద్రమునొద్ద దిగిన స్థలము** (Encampment by the sea). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి సీనాయివఱకు ప్రయాణము చేయుచుండఁగా దిగిన యొక స్థలము (సంఖ్యా $33^{10}$). అది సూయజు సంయుక్తాగ్రగుడము నకు సమీపముగా నున్నది. ఏలీమును విడిచిన పిదప ఇచ్చట దిగిరి. కావున అది ఏలీమునకు దక్షిణముగా నున్నదని తెలిసికొనవలెను. సీనాయికి వెళ్లుమార్గము ప్రస్తుతము ఒకచోట సముద్రమునకు సమీపముగా వచ్చును గాన అదే ఈ స్థలమని భావింతురు.

**ఎల్** (El = దేవుఁడు). ఇది దేవునికి పెట్టఁబడు హెబ్రీ నామమై ఆయనయొక్క శ్రేష్ఠత్వమును బలమును సూచించును. ఇది యనేక సమాసములలో కనఁబడును. ఉదాహరణముగా బేతేలు, ఇశ్రాయేలు, దానియేలు మొ॥. (దేవుఁడు I, 3 చూ॥).

**ఎలతు** ఏలతు చూ॥

**ఎలా** ఏలతు చూ॥

**ఎలాజాబాదు** ఎలియూజరు చూ॥

**ఎలాదా** (Eladah = దేవుఁడు అలంకరించెను). ఎఫ్రాయిము సంతతివారిలో నొకఁడు (I దిన $7^{20}$).

**ఎలాశా** (Eleasah = దేవుఁడు సృజించెను).

1. యూదా వంశస్థులలో నొకఁడు (I దిన $2^{39}$).

2. రాజైన సౌలు కుమారుఁడగు యోనాతాను సంతతివారిలో నొకఁడు (I దిన $8^{37}$ $9^{43}$).

**ఎలాసాపు, ఎలీయాసాపు, ఎలీయాసాపా** (Eliasaph = దేవుఁడు సమకూర్చెను).

1. మొదటిసారి యిశ్రాయేలీయులను లెక్కించినపుడు గాదు గోత్రికుల యధిపతులలో నున్న యొకఁడు (సంఖ్యా $1^{14}$ $2^{14}$ $7^{42,47}$ $10^{10}$).

2. లేవీయులలోని గెర్షోనీయుల కుటుంబమునకు ప్రధానుఁడు (సంఖ్యా $3^{24}$).

**ఎలియాజరు, ఎలాజారు** (Eleazer = దేవుఁడు సహాయము చేయును).

1. అహరోను కుమారులలో మూఁడవవాఁడు (నిర్గ $6^{23}$ సంఖ్యా $3^{2}$). అహరోనును అతని కుమారులును ప్రతిష్ఠింపఁబడినపుడు ఎలాజారు కూడ ప్రతిష్ఠింప బడినవాఁడై యాజకత్వము సలుపు చుండెను (నిర్గ $28^{1}$ సంఖ్యా $3^{4}$ $16^{37-40}$). నాదాబు అబీహు అనువారు చంపఁబడిన పిమ్మట (లేవీ $10^{6-20}$). ఇతఁడు అహరోనుకు తరువాతి వాఁడై లేవీయులకు అధికారియాయెను (సంఖ్యా $3^{32}$). అహరోను చనిపోయిన పిమ్మట ఇతఁడు ప్రధాన యాజకుఁడయ్యెను ($20^{25-28}$ ద్వితీ $10^{6}$). చీట్లు వేసి కనాను దేశమును విభాగించుటయందు యెహోషువకు సహాయము చేసెను (యెహో $14^{1}$) చనిపోయిన పిమ్మట ఇతనిని ఎఫ్రాయిము మన్యములో పాతిపెట్టిరి ($24^{33}$). ఇతనికి పిమ్మట ఇతని కుమారుఁడైన ఫీనెహాసు ప్రధాన యాజకుఁడయ్యెను (నిర్గ $6^{25}$ న్యాయా $20^{28}$ I దిన $6^{4,50}$).

2. లేవీయులలో మెరారీ సంతతికిఁ జెందిన వారిలో నొకఁడు. ఇతనికి పుత్రసంతానము లేనందున ఇతని కుమార్తెలను ఇతని సహోదరుఁడగు కీషు కుమారుల కిచ్చి వివాహముచేసిరి. ఈలాగు ఎలాజారు పిత్రార్జితము కీషు కుటుంబ స్వాస్థ్యమాయెను (I దిన $23^{21,22}$ $24^{28}$ దీనితో సంఖ్యా $36^{6-9}$ సరిపోల్చుము).

3. అబీనాదాబు కుమారుఁడు. ఫిలిష్తీయులు దేవుని మందసమును తిరిగి పంపిన పిమ్మట దానిని కాపాడుటకై కిర్యత్యారీము వారితనిని ప్రతిష్ఠించిరి (I సమూ $7^{1}$).

4. దావీదుయొక్క పరాక్రమశాలురు అని పేరు పడిన ముగ్గురిలో నొకఁడు (I దిన $11^{12}$ I సమూ $23^{9}$ అహోహీయుడు చూ॥).

5. ఎజ్రా కాలములోనుండి యతనికి సహాయము చేసిన ఒక యాజకుఁడు (ఎజ్రా $8^{33}$).

6. ఎజ్రా కాలములో అన్యస్త్రీల నుంచుకొని అతని ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{23}$).

7. యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించిన సమయమున పాటలు పాడిన వారిలో నున్న ఒక యాజకుఁడు (నెహె $12^{42}$).

8. క్రీస్తు తల్లియైన మరియకు భర్తయగు యోసేపు యొక్క పూర్వికులలో నొకఁడు. బహుశః అతని ముత్తాతయై యుండును (మ $1^{15}$).

**ఎలీకా** (Elika) దావీదుయొక్క ముప్పది మంది యోధులలో నొకఁడు (II సమూ $23^{25}$).

**ఎలీదాదు** (Elidad = దేవుఁడు ప్రేమించెను). ఇశ్రాయేలీయులు కనానులోఁ బ్రవేశింపక పూర్వము వారు మోయాబు బయలులో నుండఁగా బెన్యామీనీయుల గోత్రమునకు ప్రధానిగా నుండినవాఁడు (సంఖ్యా $34^{21}$). కనాను దేశమును ఇశ్రాయేలీయులకు విభాగింపనై నియమింపఁబడినవారిలో నితఁ డొకఁడు. సంఖ్యా $11^{26}$ లో నున్నట్లు పెద్దయగు ఎల్దాదు ఇతఁడేయై యుండవచ్చును.

ఎలీపాలు ఎలీఫేలెటు చూ॥

**ఎలీపేలెటు, ఎల్పాలెటు, ఎలీపాలు** (Eliphalat, Eliphelet, Eliphal = దేవుఁడు విడుదలయై యున్నాఁడు.)

1, 2. దావీదు కొడుకులలో నిద్దరు (II సమూ $5^{16}$ I దిన $14^{7}$ $3^{6,8}$). ఈ వాక్యములను చూడఁగా దావీదు కొమరులలో నిద్దరికి ఈ పేరున్నట్లు కనఁబడును. I దిన $14^{5}$ లో దీనికి ఎల్పాలెటు అను మాఱు రూపము కలదు. ఈ పేరులలోని గుణింత భేదము తెనుఁగుననే కాని హెబ్రీలో లేదు. అయితే యీ ఎల్పాలెటు అను పేరు యొక్క గుణితము మాత్రము వేఱుగా నున్నది. వీరిద్దరు గాక ఒక్కరేయని కొందరి యభిప్రాయము.

3. దావీదు యొక్క ముప్పదిమంది యోధులలో నొకఁడు (II సమూ $23^{34}$). I దిన $11^{35}$ లో నితనికి ఎలీపాలు అను పేరు కలదు. మూల భాషలోకూడ ఈ గుణిత భేదము కనఁబడును.

4. రాజైన సౌలు కొడుకగు యోనాతాను సంతతి వారిలో నొకఁడు (I దిన $8^{39}$).

5. బాబెలు చెఱనుండి తిరిగి వచ్చిన వారిలో నొకఁడు. ఇతఁడు అదోనీకాము అను వాని కుమారులలో నొకఁడై యుండెను (ఎజ్రా $8^{13}$).

6. అన్య స్త్రీని వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన ఆమెను విడిచిపెట్టిన వారిలో నొకఁడు.

ఇతఁడు హాషుము అను వాని కొడుకులలో నొకఁడు (ఎజ్రా 10[33]).

ఎలీఫ్లేహు (Eliphelehu = దేవుఁడు ప్రసిద్ధుఁడు). లేవీయులలో నొకఁడు. ఇతఁడు పాటకుఁడును సంగీతములను వాయించినవారిలో నొకఁడునై యుండెను (I దిన 15[18]). దావీదు దేవుని మందసమును యెరూషలేమునకు తీసికొని వచ్చినప్పుడు గుడారపు ద్వారపాలకులలో నితఁడొకఁడైయుండెను (15[21]).

ఎలీఫజు (Eliphaz = దేవుఁడు బలము గలవాఁడు).

1. ఆదా యను నామెవలన ఏశావునకుఁ బుట్టిన కుమారుఁడు (ఆది 36[4] I దిన 1[35]). ఇతఁడు అమాలేకీయులకుఁ బూర్వికుఁడయ్యెను (ఆది 36[10,12]).

2. యోబు ముగ్గురుస్నేహితులలో నొకడు (యోబు 2[11] 4[1] 15[1] 22[1] 42[7,9]). ఇతఁడు తేమానీయుఁ డనఁబడెను. పైన 1 లోని ఎలీఫజు అను వానికి తేమాను అను కుమారుఁ డుండుటచే ఒకవేళ నితఁడా ఎలీఫజు సంతతివాఁడై యుండవచ్చును. లేక తేమాను అను నూరివాఁడైనను కావచ్చును.

ఎలీమెలెకు (Elimelech = దేవుఁడు రాజు). నయోమియొక్క పెనిమిటి. ఇతఁడు బేత్లెహేము ఊరివాఁడై తన కుటుంబముతోకూడ మోయాబు దేశమునకుఁ బోయి యచట మరణమొందెను (రూతు 1[2,3]).

ఎలీయాము (Eliam = దేవుఁడు ఆ కుటుంబములో చేరినవాఁడు).

1. ఊరియా భార్యయగు బత్షెబ తండ్రి (II సమూ 11[3]). ఈ పదమునందలి భాగములను మార్చిన పక్షమున అసలు భాషలో అమ్మీయేలు అను పేరగును (I దిన 3[5]).

2. దావీదు యోధులలో నొకఁడు (II సమూ 23[34]). ఇతఁడును 1 లోని వాఁడును ఒకఁడేయైయుండవచ్చును.

ఎలీయెజెరు (Eliezer = దేవుఁడే సహాయము).

1. అబ్రాహాముయొక్క గృహ నిర్వాహకుఁడు. అబ్రాహామునకు సంతానము కలుగకున్నయెడల, ఇతఁడు తన యజమానునికి వారసుఁడగువాఁడే (ఆది 15[2,3]). అయినను ఇస్సాకు జన్మమైనపిదప నితఁడతనికంటెను దనూయపడక అతనిని కూడ నమ్మకముగా సేవించెను. 24[2] నం॥న్న యింటి పెద్దదాసుఁ డితఁడే యనవచ్చును. ఇస్సాకు నిమిత్తము భార్యను దెచ్చుటకై అబ్రాహాము పూర్వముండిన దూర దేశమునకుఁ బోయెను. అక్కడి రిబ్కాను చూచి ఆమెను ఇస్సాకుకు మాట్లాడి, వెంటఁగొని దెచ్చెను (24).

2. మోషే సిప్పోరాల రెండవ కుమారుఁడు (నిర్గ 18[1-4]).

3. ఒక బెన్యామీనీయుఁడు (I దిన 7[8])

4. దావీదు కాలమున మందసమునకు ముందుగా వెళ్ళిన గాయక నాయకులలో బూరల నూదిన యొకఁడు (I దిన 15[24]).

5. దావీదు కాలమున రూబేనీయుల అధికారులలో నొకఁడు (I దిన 27[16]).

6. యెహోషాపాతుయొక్క ఓడలు పాడగునని ప్రవచించిన వాఁడు (II దిన 20[37]).

7. లేవీయులను పిలుచుకొని వచ్చుటకు ఎజ్రా పంపినవారిలో నొకఁడు (ఎజ్రా 8[16]).

8,9,10. అన్య స్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిన వారిలో ముగ్గురు (ఎజ్రా 10[18,23,31]).

11. క్రీస్తు వంశాను క్రమణికలో కనఁబడు నొకఁడు (లూ 3[29]). H.

ఎలీయోనై (Elienai = నా కండ్లు యెహోవా మీఁద నున్నవి). బెన్యామీనీయులలో నొకఁడు (I దిన 8[20]).

ఎలీయేలు (Eliel = దేవుఁడు దేవుఁడే?).

1. లేవీయులలోని కహాతీయుల తెగయందొకఁడు. ఇతఁడు ప్రవక్తయగు సమూయేలు పూర్వికులలో నొకఁడు (I సమూ 1[1] I దిన 6[34] యెలీయాబు 8 చూ॥)

2, 3, 4. దావీదు యోధులలో ముగ్గురు (I దిన 11[46,47] 12[11]).

5. యొర్దానుకు తూర్పుననున్న మనష్షే అర్థగోత్రములోని పెద్దలలో నొకఁడు (I దిన $5^{24}$).

6, 7. బెన్యామీనీయుల పెద్దలలో నిద్దఱు (I దిన $8^{20-22}$).

8. ఓబేదెదోము ఇంటియొద్దనుండి యెరూషలేమునకు మందసమును తీసికొని వచ్చుచుండఁగా దావీదు అనుమతి చొప్పున కూడుకొనిన లేవీయులలో నొకఁడు (I దిన $15^{9-11}$).

9. రాజైన హిజ్కియా కాలములో అర్పణలను కనిపెట్టుటకు నియమింపఁబడిన లేవీయులలో నొకఁడు (II దిన $31^{13}$).

**ఎలీయ్యాతా** (Eliathah = దేవుఁడు వచ్చెను). లేవీయుఁడగు హేమాను సంతతివారిలో నొకఁడు (I దిన $25^{4}$). ఆలయమునందు సేవచేయుటలో నితని బంధువులు ఇరువదవ వంతువారైయుండిరి ($25^{27}$).

**ఎలీషా** (Elisha = దేవుఁడే రక్షణ. Elishah).

1. యావాను కుమారులలో నొకఁడు (ఆది $10^{4}$). ఇతని సంతతివారు నివసించిన దేశమునకును ఈ పేరేగలదు. ఇది సముద్రపు ప్రదేశమైయుండినట్లు యెహె $27^{7}$ వలనఁ దెలియును గాని, దాని యునికి ప్రస్తుతము తెలియదు.

2. దీర్ఘదర్శియగు ఏలీయా యొక్క శిష్యుఁడు. ఇతఁడును ఇశ్రాయేలీయులకు దీర్ఘదర్శిగ నుండెను. యెహోరాము, యెహూ, యెహోయాహాజు, యోవాషు అను నలుగురు ఇశ్రాయేలు వారి రాజుల యేలుబడిలో ప్రవచించెను. ఆబేల్మెహోలా వాఁడగు షాపాతు ఇతనికి తండ్రి. ఇతఁడు స్థితిమంతుఁడు. దేవుని యాజ్ఞప్రకారమితని ఆయనసేవకై ప్రత్యేకించుటకు ఏలీయా ఆబేల్మెహోలాకు వచ్చినప్పుడే యెలీషా పండ్రెండు అరకలు పెట్టి పొలమును దున్నించుచు, తాను దున్నుచుండెను. ఏలీయా తన దుప్పటిని అతని మీఁద వేసినప్పటినుండి అతఁడు ఏలీయాను వెంబడించెను (I రాజు $19^{16-21}$). ఇతఁడు ఏడెనిమిదేండ్లు ఏలీయాతో కూడ సంచరించి అతనికి సహాయకుఁడుగ నుండెను. వా రిద్దరును కలిసి యొర్దాను కవతల నుండునప్పుడు అగ్ని రథమును అగ్ని గుఱ్ఱములును వారిని వేఱుచేసిన వెనుక (II రాజు $2^{9-11}$) ఎలీషా పైనుండి పడిన ఏలీయా దుప్పటిని చేతఁబట్టుకొని యొర్దానును దాటి తిరిగి వచ్చెను. దేవుఁడితనిద్వారా అనేక అద్భుతములను ఇశ్రాయేలువారిలో జరిగించెను. యెరికోలోని ఉప్పునీటిని మంచినీరుగా మార్చెను ($2^{19-22}$). తనను పరిహసించిన బాలురను శపింపఁగా రెండు ఎలుగుఁబంట్లు బేతేలులోని 42 బాలురను చీల్చివేసెను ($2^{23-25}$). మోయాబీయులపై కలుగు జయమును గూర్చి ముందుగా తెలిపెను ($3^{11-27}$). విధవరాలియొక్క నూనె వృద్ధియగునటులొనరించెను ($4^{1-7}$). షూనేమ్మీయురాలికి కుమారుఁడు కలుగునని తెలిపి, అతఁడెండ దెబ్బకు చావఁగా బ్రతికించెను ($4^{8-37}$). విషపుకూరల మరణము నుండి అపాయము రాకుండ తప్పించెను ($4^{38-41}$). నూరుమందికి 20 యవలరొట్టెలతోను కొన్ని కంకులతోను తృప్తిగా భోజనము పెట్టించెను ($4^{42-44}$). యొర్దాను నదిలో స్నానముచేసిన పక్షమున శుద్ధికలుగునని కుష్ఠరోగియగు నయమానునకుఁ దెలిపెను ($5^{1-19}$). గేహజీని ఆ రోగముతో శిక్షించెను ($5^{20-27}$). గొడ్డలి పైకఁ దేలునట్లు చేసెను ($6^{1-7}$). సిరియ రాజు రహస్యాలోచనలను రాజునకు తెలియజేసెను ($6^{8-12}$). దేవుని సహాయమును చూచునట్లు తన సేవకునికి అంతర్దృష్టి కలుగ ప్రార్థించెను ($6^{13-17}$). సిరియ సైనికులకు అంధత్వము కలిగించి మరల దృష్టి నిచ్చెను ($6^{17-23}$). తన ప్రాణము తీయ యత్నించు వాఁడు ఇశ్రాయేలు రాజుచే పంపఁబడి తలుపు దగ్గర నున్నట్లు తెలియఁజేసెను ($6^{32,33}$). షోమ్రోను ముట్టడింపఁబడినప్పుడు ధరలు తగ్గిపోవునని ప్రవచించి, తాను చెప్పిన సంగతిని నమ్మని యొక ఉద్యోగికి కలుగఁబోవు మరణమును గూర్చి తెలిపెను ($7^{1-20}$). సిరియ రాజగు బెన్హదదు మరణమును గూర్చి అతనికి తెలియఁజేసెను ($8^{7-15}$). అహాబు ఇంటి నాశనమునుగూర్చి తెలిపి, దాని నెఱవేర్చుటకు యెహూను నియమించెను ($9^{1}$ $10^{28}$). సిరియనులపై కలుగఁబోవు మూఁడు జయములను గూర్చి ప్రవచించెను ($13^{14-19}$). ఎలీషా మరణమైన పిమ్మట అతని సమాధిలో నుంచఁబడిన యొకఁడు అతని శల్యములు తగిలినంతనే బ్రతికెను ($13^{20,21}$). ఇతఁడు దాదాపు 60 సం॥ల వఱకు దేవుని ఆజ్ఞప్రకారము ప్రవక్తగా

నుండెను. యేసుక్రీస్తు ఇతనినిగురించి ఎత్తి చెప్పెను (లూ $4^{26}$). H.

**ఎలీషాపాతు** (Elishaphat = దేవుడు తీర్పు చేసెను). అతల్యాను తొలగించి యోవాషును రాజుగా చేసిన యెహోయాదా సహాయకులగు శతాధిపతులలో నొకడు (II దిన $23^{1}$).

**ఎలీషాపాను, ఎల్సాఫాను** Elizaphan, Elzaphan = దేవుడు మరుగు జేసెను).

1. ఇశ్రాయేలీయు లరణ్యమందుండగా లేవీయులలోని కహాతీయుల తెగకు సంబంధించిన యొక ప్రధాని (సంఖ్యా $3^{30}$ I దిన $15^{8}$ II దిన $29^{13}$ = నిర్గ $6^{22}$ లేవీ $10^{4}$). ఈ వాక్యములందు చివరి రెండింటిలో మూల భాష ప్రకారము కొంత భేదమున్నను ఆ పేరులు రెండును ఒక్కరివే యని తెలిసికొనవలెను.

2. ఇశ్రాయేలీయు లాక్రమించుకొనినప్పటి జెబూలూను గోత్రపు ప్రధాని (సంఖ్యా $34^{25}$).

**ఎలీషామా** (Elishama = దేవుడు ఆలకించెను.)

1. ఇశ్రాయేలీయులు అరణ్యమందు చేసిన ప్రయాణాలయందు ఎఫ్రాయిమీయులలో నున్న యొక ప్రధాని (సంఖ్యా $1^{10}$ $2^{18}$). యెహోషువ యితని సంతతివారిలో నొకడు (I దిన $7^{26,27}$).

2. యూదా సంతతి వారిలో నొకడు (I దిన $2^{41}$).

3. దావీదు కుమారులలో ఏలీషూవ (I దిన $14^{5}$) యను వానికి పొరబాటుగా వచ్చిన పేరు (I దిన $3^{6}$).

4. దావీదు కుమారులలో మరియొకడు (II సమూ $5^{16}$ I దిన $3^{8}$).

5. యూదా పట్టణములలో నుండు వారికి ధర్మశాస్త్రము బోధించుటకు రాజైన యెహోషాపాతు పంపిన యాజకులలో నొకడు (II దిన $17^{8}$).

6. రాజైన యెహోయాకీము కాలములో లేఖికుడుగా నుండిన యొక ఘనుడు (యిర్మీ $36^{12,20,21}$). ఇతడు యూదా అధిపతియైన గెదల్యాను చంపిన ఇష్మాయేలును తాతయై యున్నట్లు (II రాజు $25^{23}$ యిర్మీ $41^{1}$) ఒక వదంతి కలదు కాని యీ లేఖికుడగు ఎలీషామాయును ఇష్మాయేలు తాతయును వేరైనవారని కొందరను కొందురు.

**ఎలీషెబ** (Elisheba = దేవుని ప్రమాణము). అహరోను భార్య. అమ్మీనాదాబనువాడామె తండ్రి. ఈమెకు నాదాబు అబీహు ఎలాజారు ఈతామారు అను నలుగురు కుమారులు కలిగిరి (నిర్గ $6^{23}$).

**ఎలీసబెతు** (Elisabeth = దేవుని ప్రమాణము). అహరోను కుమార్తెలలో మంచి దైవభక్తి గల యొక స్త్రీ (లూ $1^{5}$). జెకర్యా యను యాజకుని భార్య. వారి ముసలితనమునందు దేవుడు వారికి వాగ్దానము చేసిన ప్రకారము బాప్తిస్మ మిచ్చు యోహాను పుట్టెను ($1^{8-25}$). ఆమె యేసు తల్లి యగు మరియకు బంధువురాలు ($1^{36}$). క్రీస్తు పుట్టక మునుపు మరియ, యూదా కొండ ప్రదేశములో వారు నివసించుచుండిన గ్రామమునకు వచ్చి, ఎలీసబెతు దగ్గర మూడు నెలలు ఉండెను. ఆమెను చూచినవెంటనే ఎలీసబెతు నా ప్రభువు తల్లి యని పిలిచి వందనము చేసెను ($1^{39-45}$).

**ఎలీహు** (Elihu = ఈయనే దేవుడు).

1. యోబుతో చివరగా వాదించిన స్నేహితుడు (యోబు 32-37).

2. ఎఫ్రాయిము గోత్రికుడు. సమూయేలు ముత్తాత (I సమూ $1^{1}$). ఇతనికి **ఏలీయాబు** (I దిన $6^{27}$), **ఎలీయేలు** ($6^{34}$) అను మారు పేరులు గలవు.

3. దావీదు పెద్దన్న యగు ఏలీయాబు (I సమూ $16^{6}$) యొక్క మారుపేరు (I దిన $27^{18}$).

4. సిక్లగులోనున్న దావీదు నొద్దకు వచ్చిన మనష్షే గోత్రికుడు (I దిన $12^{20}$).

5. లేవీయులలోని కోరహు సంతతికి జేరిన వారిలో నొకడు. ఇతడు దావీదు కాలములో దేవుని గుడారముయొక్క ద్వారపాలకుడై యుండెను (I దిన $26^{7}$).

**ఎలీహూదు** (Eliud = యూదుల దేవుఁడు). క్రీస్తు పూర్వికులలో నొకఁడు (మ $1^{14,15}$).

ఈ పేరు పాతనిబంధనలో నెచ్చటను కనఁబడదు.

**ఎలీహోరెపు** (Elihoreph = దేవుఁడు బహుమానము). రాజైన సొలొమోను ప్రధాన మంత్రులలో నొకఁడు (I రాజు $4^3$). ఈ పదమునకు హెబ్రీ భాషలో వ్రాఁత పని చేయువాఁడు అని యర్థమగును. ప్రస్తుత మా దేశములో గ్రామ మున్సిఫునకును కరణమునకు నెట్టి సంబంధము గలదో అట్టిదే పూర్వము రాజునకును అతనియొద్ద వ్రాఁతపని చేయువారికి నుండెను. కావున ఇతనిని ప్రధాన మంత్రిగా నెంచుట న్యాయము.

**ఎలుక** మృగములు 9 చూ॥

**ఎలుగు బంటి** మృగములు 10 చూ॥

**ఎలుమ** బర్ యేసు చూ॥

**ఎలూజై** (Eluzai = దేవుఁడు నా బలము). దావీదు సిక్లగులో నుండఁగా అతనియొద్దకువచ్చి చేరుకొనిన యోధులలో నొకఁడు (I దిన $12^5$).

**ఎలెపు** (Eleph = ఎద్దు). బెన్యామీనీయుల యూళ్లలో నొకటి (యెహో $18^{27}$). ప్రస్తుతము యెరూషలేమునకు పశ్చిమముగా నుండు లిఫ్త (*Lifta*) అనునది దీని యునికి

**ఎలోయి ఎలోయి లామా సబక్తానీ** (Eloi Eloi Lama Sabachthani = నా దేవా, నా దేవా, నన్నెందుకు చెయ్యి విడిచితివి). ఇది క్రీస్తు సిలువమీఁద నుండఁగా పలికిన మాటలలో నాలుగవదియైయున్నది. మా $15^{34}$ నందు పైనున్న రీతిగానున్నది. మ $27^{46}$ నందు ఏలీ యను హెబ్రీరూపమును, ఎలోయి యను అరమెయిక్ రూపమునకు బదులుంచిరి. మార్కు వ్రాసినదే యేసు పలికిన సూటిమాటలని తలంచెదరు. ఆ మాటల నాయన హెబ్రీ భాషలో ననక తత్కాలమున వాడుకలోనున్న అరమెయిక్ భాషలో ననెనని అందువలనఁ దెలియుచున్నది.

**ఎల్కానా** (Elkanah = దేవుఁడు సృజించెను).

1. లేవీయులలోని యొక తెగకు పూర్వికుఁడుగా నుండిన కోరహు అను వాని కుమారుఁడు (నిర్గ $6^{24}$ I దిన $6^{23}$).

2, 3, 4. ఒకటే కుటుంబములోని ముగ్గురు లేవీయులు. సమూయేలుయొక్క తండ్రి. వీరిలో నొకఁడు (I సమూ $1^1$ $2^{11,20}$). ఇతఁడు ఎఫ్రాయిము మన్యములోని యొక యూరివాఁడైనను ఎఫ్రాయిమీయుఁడు కాక, పలెస్తీనులో ఆయా భాగములయందు నివసించిన లేవీయులలో నొకఁడై యుండెను (I సమూ $1^1$ తో I దిన $6^{34,35}$ సరిపోల్చి చూ॥). I దిన $6^{33-37}$ చూడఁగా ఎల్కానా వంశములోని మఱి యిద్దరికి నీ పేరు కలదు. అందులో నొకఁడు మహాతు కుమారుఁడు ($6^{35}$). ఇంకొకఁడు యోవేలు కుమారుఁడు ($6^{36}$).

5. లేవీయులలో నొకఁడు. ఇతఁడు నెటోపాతీయుల గ్రామమున కాపురమున్నవాఁడై యుండెను (I దిన $9^{16}$).

6. దావీదు సిక్లగులో దాగియుండఁగా నతని యొద్దకు వచ్చిన యోధులలో నొకఁడు (I దిన $12^6$).

7. దావీదు కాలమందు మందసమునకు ద్వారపాలకులుగా నుండిన వారిలో నొకఁడు (I దిన $15^{23}$).

8. రాజైన ఆహాజుయొక్క ప్రధానమంత్రి ఇతనిని జిఖ్రి అనువాఁడు చంపెను. (II దిన $28^{6,7}$).

**ఎల్కోషు** నహూము చూ॥

**ఎల్జాబాదు** (Elzabad = దేవుఁడను గ్రహించెను).

1. గాదుగోత్రపు ప్రధానులలో నొకఁడు. దావీదు సిక్లగులో నుండఁగా అతనియొద్దకు వచ్చినవాఁడు (I దిన $12^{12}$).

2. దేవాలయపు ద్వారపాలకులలో నొకఁడు ఇతఁడు లేవీయుఁడును, ఓబేదెదోము కుటుంబమునకు చేరినవాఁడునై యుండెను (I దిన $26^7$).

**ఎల్తెకే** (Eltekeh = దేవుఁడు భయంకరుఁడు?). దాను గోత్రపు స్వాస్థ్యములోని ఒక

యూరు (యెహో $21^{23}$). $19^{44}$ లో దీనిని ఎత్తెకే అని పొరబాటుగా నచ్చువేసిరి. హిజ్కియా కాలములో సన్హెరీబు అల్తఖు (*Altaqu*) అను యూరిని పట్టుకొన్నట్లుగా అష్షూరు శాసనములవలనఁ దెలియును. అది యీస్థలమై యుండవచ్చును గాని దాని యునికిని గూర్చి ప్రస్తుతమే సూచనలును లేవు.

**ఎల్తెకోను** (Eltekon = దేవుఁడు స్థిరుఁడు). యూదా మన్యములోని ఒక యూరు (యెహో $15^{59}$).

**ఎల్తోలదు, తోలాదు** (Eltolad, Tolad = పుట్టుక, జాతి).

యూదా స్వాస్థ్యమందలి దక్షిణభాగమందున్న ఒక యూరు (యెహో $15^{30}$). దీనిని యెహోషువ కాలములో షిమ్యోనుగోత్రమున కిచ్చిరి ($19^{3}$). I దిన $4^{29}$ లో నున్న **తోలాదు** అను నదీ యూరికి మాఱుపేరై యున్నట్లున్నది.

**ఎల్దాదు** (Eldad = దేవుఁడు ప్రేమించెను). మోషేకు సహాయము చేయుట కేర్పఱచఁబడిన డెబ్బది మందిలో నొకఁడు. ఒక పర్యాయమున యీ డెబ్బది మంది పెద్దలలో ఎల్దాదు మేదాదు అను వారు తప్ప మిగిలిన వారందఱు దేవుని గుడారమునొద్ద కూడియుండిరి. గుడారమునొద్ద కూడియుండిన పెద్దలందఱిమీఁద దేవుని యాత్మ దిగి వారందఱు ప్రవచింప మొదలు బెట్టిరి. ఎల్దాదు మేదాదులను వారు పాలెములో నున్నను అచట ప్రవచించుచుండిరి. ఇది తగని కార్యమని యెంచి యెహోషువ వారినడ్డగించుటకై మోషేతో చెప్పెను గాని మోషే వారి నడ్డగింపక ప్రజలందఱు ప్రవచించుట మేలని చెప్పి ఎల్దాదు మేదాదులను మెచ్చుకొనెను. దేవుని యాత్మ తన కిష్టమైన యే చోటనైన పని చేయునని యిందువలనఁ దెలియును (సంఖ్యా $11^{26-29}$).

**ఎల్దాయా** (Eldaah = దేవుఁడు పిలిచెను). అబ్రాహామునకు కెతూరావలనపుట్టిన మిద్యాను కుమారులలో నొకఁడు (ఆది $25^{4}$ I దిన $1^{33}$).

**ఎల్నయము** (Elnaam = దేవుఁడు ఆనందకరుఁడు). దావీదు యోధులలో నిద్దరి తండ్రి (I దిన $11^{46}$).

**ఎల్నాతాను** (Elnathan = దేవుఁడు ఇచ్చెను).

1. రాజైన యెహోయాకీను తల్లి యగు నెహుష్తాయొక్క తండ్రి (II రాజు $24^{8}$).

2. రాజైన యెహోయాకీము కాలములో ప్రవక్తయగు ఊరియాను ఐగుప్తులోనుండి తెచ్చిన వారిలో నొకఁడు (యిర్మీ $26^{22-24}$). యెహోయాకీము యిర్మీయా వ్రాసిన గ్రంథమును కాల్పఁబోఁగా కాల్పవద్దని చెప్పిన వారిలో నొకఁడు ($36^{12-25}$). పైని 1 లో నున్న వాఁడితఁడేయై యుండవచ్చును.

3, 4, 5. ఎజ్రా యెరూషలేమునకుఁ బోవుచుండఁగా అహవాయనుస్థలమునొద్ద సమకూర్చిన వారిలో ముగ్గురు (ఎజ్రా $8^{16}$).

**ఎల్పయలు** (Elpaal = దేవుఁడు బహుమానమై యున్నాఁడు). బెన్యామీనీయులలో నొకఁడు. ఇతఁడొక కుటుంబమునకు పెద్ద యాయెను (I దిన $8^{11,12,18}$).

**ఎల్మదాము** (Elmadam). క్రీస్తు పూర్వికులలో నొకఁడు (లూ $3^{28}$).

**ఎల్యహ్బా** (Eliahba = దేవుఁడు దాచిపెట్టెను). దావీదుయొక్క ముప్పది మంది యోధులలో నొకఁడు (II సమూ $23^{32}$ I దిన $11^{33}$).

**ఎల్యాకీము** (Eliakim = దేవుఁడు స్థాపించును).

1. రాజైన హిజ్కియా కాలములో గృహనిర్వాహకుఁడగు హిల్కీయా కుమారుఁడు (II రాజు $18^{18,26,37}$ యెష $36^{3,11,22}$). ఇతఁడు అష్షూరు రాజ్యపు చక్రవర్తి యగు సన్హెరీబుయొక్క సేనానియగు రబ్షాకేయను వానితో మాటలాడుటకు పంపఁబడిన వారిలో నొకఁడును యెషయాకు రబ్షాకేమాటలను తెలిపి యెహోవాయొద్ద విచారణ చేయుమని చెప్పినవారిలో నొకఁడునై యుండెను (II రాజు $19^{2}$ యెష $37^{2}$). యెషయా యితనిని మెచ్చుకొని అతఁడు దేశమునకు తండ్రి యగునని ప్రవచించెను ($22^{20-25}$).

2. రాజైన యోషీయా కుమారులలో నొకఁడు. ఐగుప్తు రాజు ఇతనిని రాజునుగా

చేసినప్పు డితనికి యెహోయాకీము అను పేరు పెట్టెను (II రాజు $23^{34}$ II దిన $36^{4}$).

3. నెహెమ్యా కాలములో యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించినప్పుడు సహాయము చేసిన యాజకులలో నొకఁడు (నెహె $12^{41}$).

4. క్రీస్తు పూర్వికులలో నొకఁడగు అబీహూదు కుమారుఁడు (మ $1^{13}$).

5. క్రీస్తు పూర్వికులలో నొకఁడగు మెలెయా యనువాని కుమారుఁడు (లూ $3^{30}$).

**ఎల్యాదా** (Eliada = దేవుఁడెఱుఁగును).

1. దావీదు కుమారులలో నొకఁడు (II సమూ $5^{16}$ I దిన $3^{8}$). ఇతనికి **బేయెల్యాదా** అను మారు పేరు గలదు (I దిన $14^{7}$).

2. సొలొమోను విరోధియగు రెజోను యొక్క తండ్రి (I రాజు $11^{23}$).

3. బెన్యామీనీయుల యోధులలో నొకఁడు (II దిన $17^{17}$)

**ఎల్యాశా** (Elasah = దేవుఁడు సృజించెను).

1. షాఫాను కుమారుఁడు. బాబెలు చెరలో నున్నవారియొద్దకు యిర్మీయా ఉత్తరమును తీసికొని వెళ్లిన యిద్దరిలో నొకఁడు (యిర్మీ $29^{3}$).

2. ఎజ్రా కాలములో అన్యస్త్రీలను ఉంచుకొని అతని ప్రేరేపణవలన విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{22}$).

**ఎల్యాషీబు** (Eliashib = దేవుఁడు తిరిగి కట్టెను).

1. నెహెమ్యా కాలములో నున్న ప్రధాన యాజకుఁడు. అతఁడు జెరుబ్బాబెలు కాలములో ప్రధానయాజకుఁడుగా నుండిన యేషూవయొక్క మనుమఁడు (నెహె $12^{10}$). యెరూషలేము గోడలు తిరిగి కట్టించుటలో నితఁడు నెహెమ్యాకు సహాయము చేసెను ($3^{1}$). మఱియు నితఁడు అమ్మోనీయుఁడగు టోబీయాతో బంధుత్వము కలుగఁజేసికొని ($13^{4}$) దేవాలయము చుట్టునుండు గదులలో నొకదానిని టోబీయా కిచ్చెను (ఎజ్రా $10^{6}$ నెహె $13^{4}$). ఇతని మనుమఁడు ఇశ్రాయేలీయులను విరోధించిన సన్బల్లటుకు అల్లుఁడాయెను. ఇట్లు వీరు అన్యులతో సంబంధపడుటకు ఎజ్రా సమ్మతింపక ఆ యక్రమమును దిద్దెను.

2. ఎజ్రా కాలము నందుండిన గాయకులలో నొకఁడు. ఇతఁడు అన్యస్త్రీని వివాహమాడినను ఎజ్రా ప్రేరేపణవలన ఆమెను విడిచి పెట్టెను (ఎజ్రా $10^{24}$).

3, 4. అన్యస్త్రీలను వివాహము చేసికొని వారిని విడిచిపెట్టిన యిశ్రాయేలీయులలో నిద్దఱు (ఎజ్రా $10^{27,36}$).

5. జెరుబ్బాబెలు సంతతి వారిలో నొకఁడు (I దిన $3^{24}$).

6. యాజకులలో 11 వ వంతు వారి పెద్ద లేక పూర్వికుఁడు (I దిన $24^{12}$).

**ఎలోహయేనై** (Eliehoenai, Elioenai = నా కండ్లు యెహోవా వైపున నున్నవి).

1. షిమ్యోనీయులలో నొక ప్రధాని (I దిన $4^{36}$).

2. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $7^{8}$).

3. దావీదు సంతతిలో చెఱకు తరువాత జీవించిన వారియం దొకఁడు (I దిన $3^{23,24}$).

4, 5. అన్యస్త్రీల నుంచుకొని ఎజ్రా ప్రేరేపణ వలన వారిని విడిచిపెట్టిన వారిలో నిద్దఱు (ఎజ్రా $10^{22,27}$).

6. నెహెమ్యా కాలమందు యెరూషలేము గోడలను ప్రతిష్ఠించునపుడు బూరలు పట్టుకొనిన యాజకులలో నొకఁడు (నెహె $12^{41}$).

ఎల్సెఫాను ఎలీషాపాను చూ॥

**ఎల్హానాను** (Elhanan = దేవుఁడు కరుణ గలవాఁడు).

1. గొల్యాతు సహోదరుఁడైన లహ్మీని చంపిన వాఁడు (I దిన $20^{5}$ II సమూ $21^{19}$).

2. దావీదుయొక్క ముప్పదిమంది యోధులలో నొకఁడు (II సమూ $23^{24}$ I దిన $11^{26}$).

పై నుదాహరించిన యిద్దరి తలిదండ్రుల పేరులు వేర్వేఱుగా నున్నను, అది వ్రాయువారి పొరపాటనియు, ఈ యిద్దరును ఒకఁడేయనియు కొందఱి యభిప్రాయము.

**ఎవిల్మెరోదకు** (Evilmerodach). ఇతనికి బబులోనీయుల భాషనుబట్టి అమెల్+మార్డుక్ (=మార్డుక్ దేవతసంబంధి) అను పేరు కలదు. ఇతఁడు నెబూకద్నెజరు కుమారుఁడై అతనికిఁ బిమ్మట రాజ్యమునకు వచ్చి చెఱయందున్న యూదారాజగు యెహోయాకీను మీఁద దయ గలవాఁడై అతనికి విడుదలను పోషణనుకూడ అను గ్రహించెను (II రాజు $25^{27-30}$ యిర్మీ $52^{31-34}$). ఇతఁడు క్రీ॥ పూ॥ 562-560 వఱకు 2 సం॥లు మాత్రము ఏలినవాఁడై తన బావయగు నెరిగ్లి సారుచే నేపఁబడిన కుట్రవలన చంపఁబడెను. ఇతఁడు క్రూరుఁడై న్యాయమును విచారింపక యేలెనని లౌకిక చరిత్రకారుఁడగు బెరోసుస్ (*Berosus*) అనువాఁడు తెలుపుచున్నాఁడు.

**ఎవీ** (Evi). మోషే జయించిన అయిదు గురు మిద్యాను రాజులలో నొకఁడు (సంఖ్యా $31^{8}$ యెహో $13^{21}$).

**ఎషాను** (Eshan = ఆధారము) యూదా గోత్ర భూమిలోని యొక గ్రామము. అది హెబ్రోను మన్యములో నుండెను గాని దాని సరియైన యునికినిగూర్చి తెలియదు (యెహో $15^{52}$).

**ఎష్కోలు** (Eshcol = పండ్లగెల).

1. అమోరీయుల ప్రధాని. ఇతఁడు కదొర్లాయోమెరుకు విరోధముగా అబ్రాహాముతోఁ గలిసి యుద్ధముచేసినవాఁడై యుండెను. (ఆది $14^{13-24}$). ఇతఁడు హెబ్రోను ప్రాంతములో నివసించెను. హెబ్రోనుకు ఉత్తరముగా నుండు లోయకు ఇతనిని బట్టియే ఎష్కోలు లోయ యను పేరు వచ్చినట్లుగా నున్నది (సంఖ్యా $13^{23,24}$).

2. ఒక లోయ. మోషేపంపిన వేగులవారిచటనుండియే ద్రాక్షగెలలను తెచ్చిరి (సంఖ్యా $13^{23,24}$ $32^{9}$ ద్వితీ $1^{24}$).

**ఎష్టెమో, ఎష్టెమోను** (Eshtemoh, Eshtemoa = విధేయత).

1. యూదా స్వాస్థ్యములోనుండి లేవీయుల కియ్యఁబడిన పట్టణము (యెహో $15^{50}$ $21^{14}$ I దిన $6^{57}$). ఇది హెబ్రోను ప్రదేశములో నుండెను. దావీదు సిక్లగులోనున్నపుడు తాను పట్టుకొనిన దోపుడు సొమ్ములో కొంత ఈ యూరి వారికి కూడ పంపించెను (I సమూ $30^{28}$). ప్రస్తుతము ఎస్సెమూయ (*Essemua*) అను స్థలమే దీనియునికియైయున్నది. ఇది హెబ్రోనుకు దక్షిణమున నాలుగు క్రోసుల దూరములో నున్నది. ఇచట పాడు శేషములనేకములు కలవు (పటము II, E 3).

2. యూదాసంతతివారిలో నొకఁడు (I దిన $4^{17}$).

**ఎష్టాయోలు, ఎష్టాయులీయులు** (Eshtaol = మనవి?, Eshtaolites). యూదా మైదానములోని యొకయూరు (యెహో $15^{33}$). దీనిని దానీయుల కిచ్చిరి ($19^{41}$). దీనికి సమీపము నందే సమ్సోను దేవుని యాత్మ ప్రేరేపణలను మొదట గ్రహించుకొనెను (న్యాయా $13^{25}$). అతఁడు మరణమైనప్పుడిక్కడనే అతని శవమును పాతిపెట్టిరి. లాయీషును పట్టుకొనుటకు వెళ్లిన దానీయులలో కొందఱీ యూరివారైయుండిరి ($18^{2,11}$). ప్రస్తుతముననున్న ఎషువ (*Eshua*) అనునదియే దీనియునికియై యుండవచ్చును (పటము II, E 1). ఈ యూరివారు ఎష్టాయులీయులనఁబడిరి (I దిన $2^{53}$).

**ఎష్తోను** (Eshton = యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $4^{12}$).

**ఎష్బయలు** (Eshbaal = బయలు సంబంధి). సౌలు కుమారుఁడగు ఇష్బోషెతు మాఱు పేరు (I దిన $8^{33}$ $9^{39}$) ఇష్బోషెతు చూ॥.

**ఎష్బాను** (Eshban = బుద్ధి). ఎదోమీయుల ప్రధానులలో నొకఁడు (ఆది $36^{26}$ I దిన $1^{41}$).

**ఎసోన్గెబెరు** (Eziongeber, Eziongaber). ఇది యెఱ్ఱసముద్రమునకు ఉత్తరమందున్న రెండు పాయలలో తూర్పుదైన అకాబా యను దానికి నుత్తరపు కొనయందుండు రేవు పట్టణము (I రాజు $22^{48}$ II దిన $8^{17}$). ఇశ్రాయేలీయులు అరణ్యసంచారములో నుండఁగా నిచట నొకసారి మకాముచేసిరి (సంఖ్యా $33^{35}$ ద్వితీ $2^{8}$). సొలొమోనును యెహోషాపాతును తమనావలనిచటనే చేయించి వర్తక వ్యాపారమునకు పంపించియుండిరి (I రాజు $9^{26}$ $22^{48}$).

**ఎస్తేరు** (Esther = నక్షత్రము). ఇది పారసీకపదము. హదస్సాయను హెబ్రీయురాలు (ఎస్తే $2^{7}$). హదస్సా యను మాటకు పరిమళము గల చెట్టు అని యర్థము. బెన్యామీను గోత్రికుఁడగు అబీహాయిలు అనువాని కుమార్తె ($2^{15}$). తల్లిదండ్రులు చిఱుత ప్రాయముననే గతించుటచే తన పెత్తండ్రి కుమారుఁడగు మొర్దెకైచేత పెంచఁబడెను ($2^{7}$). పారసీక దేశపు రాజైన అహష్వేరోషు తన రాణియైన వష్తిని యవమానపఱచి పంపివేసిన పిదప యీమె తనకున్న యధిక సౌందర్య సంపత్తిచే నతనికి పట్టపురాణియయ్యెను ($2^{15-18}$). మొర్దెకై జ్ఞానమును ఎస్తేరు ధైర్య సాహసములును ఆ కాలమున పారసీక సామ్రాజ్య మందలి యూద జనాంగము నొక్క దెబ్బతో సమూల నాశనముఁజేయ నెంచిన హామాను మంత్రియొక్క కుట్రను భేదించి, రాజింతకు ముందిచ్చి యుండిన తాఖీదులను తలక్రిందుఁ గావించి, యూదులకు రక్షణను హామానుకురి శిక్షను మొర్దెకైకి ప్రధాన మంత్రి పదవి కలుగునట్లొనరించెను ($3^{1}$ $9^{19}$). అదారు మాసము పదునాలుగు పదునేనవ దినములలో యూదులీరక్షణ జ్ఞాపకార్థము విందులాచరించి బీదలకు కానుకలు పంపుకొనునట్లొక చట్టమును ($9^{22}$). హామానువలన కలుగఁబోయిన అపాయమును గూర్చి ఉపవాసముండునటుల ఒక దుఃఖమును నియమించుకొనునట్లొక చట్టమును ఎస్తేరు మొర్దెకైలవలన నేర్పాటాయెను ($9^{29-32}$ $4^{1-3}$).

H.

**ఎస్తేరు గ్రంథము** (The Book of Esther). ఇది పాతనిబంధన చరిత్ర గ్రంథములలో చివరిది. దీని గ్రంథకర్తనుగూర్చి రూఢిగాఁ దెలియదు. కొందఱిది ఎజ్రా వ్రాసెననియు, మరికొందఱు మొర్దెకై వ్రాసెననియు అభిప్రాయపడుచున్నారు. రెండవ యభిప్రాయము యుక్తముగ కనఁబడుచున్నది. ఇది దాదాపు క్రీ॥ ము॥ 470 సం॥ పారసీక దేశమునందు వ్రాయఁబడి యుండును. దీని లోని చరిత్ర క్రీ॥ ము॥ దాదాపు 482-470 సం॥ లలో జరిగెను.

దీనికి పూర్వమున్న గ్రంథములలో తమ స్వదేశమునకుఁ దిరిగివచ్చిన ప్రజల నెట్లు దేవుఁడు దీవించెనో చూడవచ్చును. వారివలెనే తిరిగిరాక విదేశమందే నిలిచిపోయిన వారి స్థితిగతులను తెలుపుట కిది వ్రాయఁబడెను. పూరీమను గొప్పపండుగ స్థాపింపఁబడుటను గుఱించి దీని యందున్నది. యూదుల కీదినములలో కలిగిన విడుదలను సూచించుటకై వారింకను ఈ పండుగ నాచరించుటనుబట్టి ఈ చరిత్రము వాస్తవమైనదని చెప్పవచ్చును. దీనియందు జ్ఞాపక ముంచుకొనవలసిన విషయములు: 1. సర్వాధికారియగు దేవుని యాశ్చర్యకరమగు సంకల్పము 2. తన స్వజనుల యెడల ఆయనకున్న ప్రేమ 3. దుర్మార్గుల దుర్మార్గ తను మేలుగా పరిగణింప చేయఁగల ఆయన శక్తి. యూదు లీ గ్రంథమును ప్రమాణిక గ్రంథముగా నెంచి మోషే బోధన ప్రమాణమునకుఁ బిదప దీనిని విశేషముగా సన్మానించుచు వచ్చిరి.

ఈ గ్రంథమునం దెక్కడను పలెస్తీను యెరూషలేము ఆలయము ధర్మశాస్త్రము దేవుఁడు అను పదములు గానరావు. అయినను దేవుని బలము సర్వాధికారము బహు తేటగ బయలు పరచఁబడినవి. దీనినుండి క్రొత్తనిబంధనలో నెత్తి వ్రాయఁబడిన వాక్యమొకటియును లేదు. దీనియందు డంబప్రీతిపరుఁడగు అహష్వేరోషు ఊరుపేరులేకుండ నశించిన వష్తిరాణి, ధైర్యస్థైర్యములుగల ఎస్తేరు, మతాభిమానియగు మొర్దెకై, ఆత్మస్తుతి పరాయణుఁడగు హామానును గుఱించిగలదు.

H.

**ఎష్బోను** (Ezbon).

1. గాదు కుమారులలో నొకఁడు. ఇతఁడు గాదీయుల తెగలలో నొకదానికి పూర్వికుఁడయ్యెను (ఆది $46^{16}$). సంఖ్యా $26^{16}$ నం దితనికి ఓజనీ యను పేరుగలదు.

2. బెన్యామీను యొక్క మనుమఁడు (I దిన $7^{7}$).

**ఎస్సేనీయులు** (Essenes). వీరు క్రీస్తు కాలమునకు పూర్వమును ఆయనకాలములోను ఉండిన యొకతరహా సన్యాసులకూటపువారై యుండిరి. ఈ కూటపువారిపేరు బైబిలులో లేదుగాని యోసీఫస్ వారియాచారములనుగూర్చి వ్రాసియున్నాఁడు (పురా 13.5.9; 15.10.4.5; 18. 1, 2.5). వారి కూటము మక్కబీయుల

కాలమునకు ముందే స్థాపింపఁబడి ఆకాలములో వృద్ధియయ్యెను. వీరు దేవుని రాజ్యమునందును యూద మతములోని నీతిచట్టముల యందును విశేషాభిమానము గలిగి వాటిని అమలులోకి తెచ్చుటకు లోకమునుండి వేఱుపడి అరణ్యవాసులైన సన్యాసులైరి. బాప్తిస్మ మిచ్చిన యోహాను వీరి కూటములోఁ జేరినవాఁ డనుకొందురు. క్రీస్తు కాలములో ఈ కూటపువారు 4000 మంది యుండిరని పండితులు లెక్కించిరి.

**ఎస్డ్రాసు** అప్రమాణిక గ్రంథములు చూ॥

**ఎస్డ్రెలోను** (Esdraelon). ఈ పేరు బైబిలునందు లేదు. ఇది బైబిలు భూగోళశాస్త్రములో యెజ్రెయేలుకు పెట్టఁబడిన గ్రీకు నామము (యెజ్రెయేలు చూ॥).

**ఎస్లి** (Esli). క్రీస్తు పూర్వికులలో నొకఁడు (లూ $3^{26}$).

## ఏ

**ఏకెరు** (Eker = పరదేశి). యెరహ్మయేలు సంతానీకులలో నొకఁడు (I దిన $2^{27}$).

**ఏజెరు** ఏసెరు చూ॥

**ఏడవ నెల ఉపవాసము** పండుగలు III 3 (2) చూ॥

**ఏడు** సంఖ్యలు II 7 చూ॥

**ఏడు సంఘములు** (The Seven Churches). ప్రకటన గ్రంథమునందు పేర్కొనఁబడిన ఎఫెసు స్ముర్న పెర్గము తుయతైర సార్దీస్ ఫిలదెల్ఫియ లవొదికయ అను ఏడు పట్టణములలో నున్న సంఘములకుండిన బిరుదు. ఈ పట్టణములలోని ప్రతిదానికిని ఒక్కొక్క పత్రిక వ్రాయఁబడినట్లు ప్రక 2, 3 అధ్యాయములలోఁ జూడవచ్చును. ఇవన్నియు చిన్నాసియ పశ్చిమ భాగమునందున్నవి. (ఆయా పట్టణములు చూ॥)

**ఏడ్చుట** దుఃఖమును తెలియచేయు వాడుకలు చూ॥

**ఏతనీము** కాలమానము VI 7 చూ॥

**ఏతాను** (Ethan = స్థిరత).

1. యూదా వంశస్థులలో నొకఁడు. జెరా యను వాఁడితనికి తండ్రియగుటచే నితఁడు యెజ్రాహీయుఁడనఁబడును (కీర్త 89 పీఠిక I రాజు $4^{31}$). ఇతఁడు జ్ఞానమునకు ప్రసిద్ధిఁజెందినవాఁడై యుండెను ($4^{31}$). ఇతఁడు రచించిన కీర్తనలలో 89 వ దొకటియైయున్నట్లు దానిపై వ్రాఁతవలన కనఁబడును.

2. ప్రధాన గాయకుఁడైన ఆసాపుయొక్క పూర్వికులలో నొకఁడు (I దిన $6^{42}$). I దిన $6^{21}$ లో నితనికి **యోవాహు** అను మాఱుపేరు కలదు. ఇతఁడు లేవి కొడుకైన గెర్షోను వంశస్థులలోని లిబ్నీ కుటుంబములోని వాఁడై యుండెను.

3. లేవి కుమారులలో మెరారీ సంతతి వాఁడును ఆలయములోని పాటకులకు పెద్దయునైనవాఁడు (I దిన $6^{44}$ $15^{17,19}$).

**ఏతాము**

1. (Etham = హద్దు?). ఇశ్రాయేలీయులు ఐగుప్తును విడుచుటకు సుక్కోతు నుండి బైలుదేరిన తరువాత మొదట దిగినస్థలము (నిర్గ $13^{20}$) పారాను అరణ్యమునకు దగ్గఱగా ఐగుప్తులో నున్నదిగాని దీని సరియైన యునికినిగూర్చి తెలియదు. ఇది యెర్రసముద్రమునకు ఉత్తరముగానున్నదని సాధారణముగా ననుకొందురు. (అరణ్యము 3 (2) చూ॥)

2. (Etam = వేఁట జంతువుల స్థలము). మూల భాషయందు న్యాయా $15^{8,11}$ I దిన $4^{32}$ II దిన $11^{6}$ లలో నున్న ఏతాము, అను మాటలు ఒకటే మాటగా నున్నవిగాని ఇంగ్లీషులో నున్నట్లు వేర్వేఱు మాటలుగాలేవు. సమ్సోను దాగుకొనిన స్థలమిదియే (న్యాయా $15^{8}$). న్యాయా $15^{11}$ బట్టి ఇది యూదా గోత్ర భాగములో నున్నట్లూహింపవచ్చును. యూదా సంతతివారిలోని అబీయేతాము (I దిన $4^{3}$) అనువాఁడీ యూరివారికి పూర్వికుఁడైయుండవచ్చును. రెహబాము దీనికి ప్రాకారములను కట్టించెను (II దిన $11^{6}$). పైపేరులన్నియు నొకటే స్థలమునకుఁ జెందియున్నట్లు చెప్పఁబడినను దీని సరియైన యునికి తెలియదు కావున నిది యొకటే స్థలమో లేక రెండు మూఁడు స్థలములకుఁగల ఒకటే పేరో రూఢిగా తెలియదు. కొంద ఱనుకొనునట్లు దానియునికి పటము II, F1 అయ్యుండును.

**ఏథేన్సు (Athens).** గ్రీసు దేశమున మిగుల ప్రసిద్ధివడసిన పట్టణము. క్రీస్తు శకమునకు పూర్వము 5 వ శతాబ్దమున పారసీకులను జయించుటచే నీ పట్టణము వినుతి కెక్కెను. అది మొదలు తత్వజ్ఞానమందును, చిత్రపుఁబనులకును వాక్చాతుర్యమునకును ఈ పురము వన్నెఁగాంచుచు ప్రస్తుతమునను ఆ విషయములందు ఇతరులకందరాని ఉన్నతస్థితికి వచ్చెను. నీతిశాస్త్రి యని గొప్ప పేరునందిన సాక్రటీసు (*Socrates*) క్రీ॥ ము॥ 5 వ శతాబ్దమున జీవించెను. అతని తరువాత వచ్చిన అరిస్టాటల్ (*Aristotle*), ప్లేటో (*Plato*) యను తత్వశాస్త్రజ్ఞు లీ పట్టణమున బోధించిరి. వారి తత్వశాస్త్రములు క్రైస్తవ వేదశాస్త్ర నిర్వచనమునకు మిగుల సహాయకరముగ నుండెను. ప్రాఁత నిబంధనయందీ పట్టణమును గూర్చిన సూచన లేవియును గానరావు. క్రొ త్త నిబంధనలో పౌలు తన రెండవ మిషనేరి ప్రయాణమునఁ నచ్చటకు వెళ్లి, ఆ పట్టణపు పండి



"ఏథేన్సులోని ముఖ్య దేవాలయము"

తులకుఁ బ్రసంగించెను (కార్య 17[15] 18[1] I థెస్స 3[1]) గాని, వారీలోక జ్ఞానముతోనే సంతృప్తులైనందున అతనిపనికంత మంచి ఫలితము గలిగినటులఁ గనఁబడదు. క్రొ త్త నిబంధనకాలములో నచ్చట నొక ప్రసిద్ధమైన సర్వకళాశాల యుండెను. అది యాది క్రైస్తవులకాలమునందు గ్రీకువారి పూర్వమతములపక్షమున బోధించినను, క్రైస్తవాధ్యక్షులలో కొందరచ్చటనే విద్యగఱచిరి. ఈ పట్టణము నవీన గ్రీకురాజ్యమునకు రాజధానిగ నున్నది. (అరేయొపగు చూ॥ పటము V, F 4).

**ఏద (Ed = సాక్షి).** యొర్దానునదికి తూర్పుదిక్కున నున్న రెండున్నరగోత్రముల వారును పడమటిదిక్కున నున్న గోత్రముల వారును ఒకే సంతతివారనియు ఒకే మతస్థులనియు తెలుపుటకు తూర్పుననున్నవారు కట్టిన యజ్ఞవేదిక (యెహో 22[34]). యొర్దానునకు పడమటి దిక్కున నున్న గోత్రములవారావేదికను చూచి తూర్పున నున్నవారు మతభ్రష్టులైరని తలంచుచు వారిమీఁదకు వెళ్లినప్పుడు తృప్తికరమైన కారణము తెలిసికొని యుద్ధయత్నములు మానిరి (22[1-34]).

H.

**ఏదూము** మానములు II చూ॥

**ఏదెనీయులు (Children of Eden).** మెసపొతేమియలోని యొక తెగవారు (II రాజు 19[12] యెష 37[12]). అష్షూరు రాతిశాసనములలోనున్న బిట్-అదీనీ (*Bit-Adini*) అను స్థలము వీరి నివాసస్థానమని యూహింతురు. అది

యుఫ్రాతు నదీతీరమున నున్నది గాని దాని యునికినిగూర్చి ఇంక నూటిగా తెలియదు.

**ఏదెను,** (Eden = ఉల్లాసము).

ఆసియ ఖండమునందలి యొక ప్రదేశము, తోఁటయొక్క పేరు. మానవకోటియొక్క ఆది తలిదండ్రులగు ఆదాముహవ్వలు సృష్టింపఁబడిన పిమ్మట నివసించిన స్థలము. అదెచ్చట నుండెనో నిశ్చయింప వీలుగాకున్నను, ఆది 2[8] ప్రకారము తూర్పున అనఁగా కనానుకు తూర్పున నున్నదని స్ఫురించుచున్నది. అచ్చటి నాలుగు నదులు పుట్టెను (ఆది 2[10,14]). ఫరాతు హిద్దెకెలు అను నవి వాటిలో రెండని ఉదాహరింపఁబడెను. అవే ప్రస్తుతపు యుఫ్రాతు టైగ్రీసు నదులై యున్నవని అనుకొనుచున్నారు. అట్లయిన యెడల ఆర్మీనియా పీఠభూమి యందిది యుండె ననుకొనవచ్చును. ఆ వనమునందున్న శ్రేష్ఠవృక్షములమధ్య మంచిచెడ్డల తెలివినిచ్చువృక్షమును దేవుఁడు నేలనుండి మొలిపించెను (2[8,9]). ఆ వృక్షఫలములు తినరాదను యాజ్ఞను వారుపొందిరి గాని, వారాయన యానతిని నిరాకరించి తమ స్వంత యిచ్ఛలకులోనయి ఆ పండ్లను దిని పాపాత్ములైరి. దేవుఁడప్పుడు వారినా తోఁట నుండి తోలివేసి శిక్షించెను (3[1,24]). అప్పటి నుండి నేటివఱకును అదెచ్చటనున్నదో యెవరును నిశ్చయింపఁజాలకున్నారు. ఆ తోఁటకు **పరదైసు** అను మాఱుపేరునుగలదు. దైవభక్తులకుఁ గలుగఁబోవు మోక్షమను క్రొత్త పరదైసును గూర్చి విశేషముఁగ ప్రకటన గ్రంథమునఁ జెప్పఁబడియున్నది (ప్రక 2[7] లూ 23[43] యుఫ్రాతు, పరదైసు చూ॥). H.

**ఏదెరు** (Eder = మంద).

1. ఎదోమీయుల సరిహద్దు దగ్గఱయుండు యూదావారి యూళ్లలో నొకటి (ఆది 35[21]). ప్రస్తుతము గాజాకు దక్షిణముగా నైదుమైళ్ల దూరములోనుండు ఎల్ ఆదారు (*El adar*) అనునదే దీనియునికియై యుండవచ్చును. (మిగ్దల్ ఏదెరు చూ॥)

2. యూదా గోత్రమునకు దక్షిణముగా ఎదోముపైపుననున్న సరిహద్దు పట్టణము (యెహో 15[21]).

3. లేవికుమారుఁడగు మెరారీ మనుమఁడు (I దిన 22[23] 24[30]).

4. బెన్యామీను గోత్రికులలో నొకఁడు (I దిన 8[15]).

**ఏన్, అయిన్** (En, Ain = కన్ను, ఊఁట). ఇవి వేర్వేఱు మాటలుగా నుండక ఆయా సమాసములలోనుండు రూపములైయున్నవి. వీటికి మూలభాషలో కన్ను అని యర్థము. అయినను సాధారణముగా వీటికి ఊఁటలేక నూయియను నర్థములునుగలవు ఏనాయిము (ఆది 38[14]) ఏన్గన్నీము(?) (న్యాయా 15[14-19]) అను పదములలోనిది కనఁబడుచున్నది. (అయిన్ చూ॥).

**ఏన్షెమెషు** (En Shemesh = సూర్యుని యూఁట). యెరూషలేమునుండి యెరికోకు పోవుమార్గముదగ్గర ఎన్రోగెలుకు తూర్పుగా నున్న యూఁట (యెహో 15[7] 18[17]). ఒలీవల కొండకు తూర్పున నుండి ప్రస్తుతము అపొస్తలుల యూఁట అనఁబడునదిదే యనుకొందురుగాని రూఢి తెలియదు (పటము II, F 1).

**ఏన్హద్దా** (En-Haddah = వడిగల యూఁట). ఇశ్శాఖారు గోత్రపు యూళ్లలో నొకటి (యెహో 19[21]). దోతానుబయలులో నున్న కెఫర్ ఆదాను (*Kefer-adhan*) అనునది దీనియునికియై యుండును (పటము III, F 2).

**ఏన్హాసోరు** (En-Hazor = హాసోరు లేక ఊరియూఁట). నఫ్తాలీగోత్రభాగమందలి యూరు (యెహో 19[37]). ప్రస్తుతముగలిలయ యుత్తరభాగములోని కెదెషుకు పడమరగా నుండు హాసీరా (*Hazira*) దీనియునికి గావచ్చును (పటము IV, D 5).

**ఏనాను** (Enan = కన్నులుగలది). ఇశ్రాయేలీయులు అరణ్యములో నుండఁగా నఫ్తాలీ గోత్రప్రధానియైన అహీరాకు తండ్రి (సంఖ్యా 1[15] 2[29] 7[78,83] 10[27]).

**ఏనాము, ఏనాయిము,** (Enaim = రెండు ఊఁటలు). షెఫేలా యనఁబడు యూదా మన్యములోని యొకయూరు (యెహో 15[34] ఆది 38[14]). ఆది 38[1,14] వలన అది అదుల్లామునకును తిమ్నాతుకును మధ్యనుండు ఊరని తెలిసి

కొనవచ్చును. తెనుఁగున నున్నట్లు మూలభాష యందును గుణింతమందు భేదము కనఁబడుచున్నది.



ఏనుఁగును, ఏనుఁగు దంతమును దెచ్చుట

**ఏనుగు** (Elephant). ఈ మృగముపేరు బైబిలునందు కనఁబడకపోయినను ఏనుఁగు దంతమును బైబిలుకాలమున వాడినందున యేనుఁగు పేరును తెలుఁగు బైబిలులో వాడవలసివచ్చెను (II దిన $9^{20}$). ఇతరవాక్యములలో అదే పదమును ఏనుఁగు దంతమనక దంతమని మాత్రము భాషాంతరముచేసిరి (I రాజు $10^{18}$ $22^{39}$ మొ॥ దంతము చూ॥).

**ఏనెగ్లాయీము** (En-eglaim = రెండు దూడల యూఁట). మృతసముద్రముయొక్క ఉత్తరపుటొడ్డుననుండు నొక యూరు అని ఆ పేరు కనఁబడు సందర్భమునుబట్టి తెలిసికొనవచ్చును (యెహె $47^{10}$).

**ఏన్గన్నీము** (En-gannim = తోఁటల యూఁట).

1. యూదాగోత్ర ప్రదేశములోని యొక గ్రామము (యెహో $15^{34}$, పటము II, D 1).

2. ఇశ్శాఖారుగోత్ర ప్రదేశములోని లేవీయుల యూరు (యెహో $19^{21}$ $21^{29}$). అదిప్పటికి నున్నది. ప్రస్తుతము దానికి జెనీను (*Jenin*) అని పేరు. అది తాబోరుకొండకు దక్షిణముగా 15 మైళ్ళదూరములో నున్నది. I దిన $6^{73}$ లోని **అనేము** అనునది ఈ యూరిపేరే (పటము III, F 2). C.

**ఏన్గెదీ** (En-gedi = మేఁకపిల్లయూఁట). మృతసముద్రతీరమునకు పడమరగా నుండు యూదయ అరణ్యమందుండెడి యొక పట్టణము (యెహో $15^{62}$). దీనికి **హాసజోను తామారు** అను మాఱుపేరుగలదు (ఆది $14^{7}$ II దిన $20^{2}$). ఇచ్చట కదొర్లాయోమెరు అమోరీయులను జయించెను (ఆది $14^{7}$). దావీదు సౌలుయొద్ద నుండి పారిపోయినప్పుడు ఇచటనున్న యొక గుహలో దాగియుండి (I సమూ $23^{29}$) సమీపమందుండిన మఱొకగుహలో తనచేతికిఁ జిక్కిన సౌలు పైవస్త్రమునుమాత్రము కోసికొని అతనిని విడిచిపెట్టెను ($24^{1-22}$). జాలరులిచట తమ వలలను పఱతురని కుదురుబాటు కాలమునుగూర్చి యెహెజ్కేలు ప్రవచించెను (యెహె $47^{10}$). అది మిగుల ఫలవంతమగు ప్రదేశము (పర $1^{14}$). ప్రస్తుతమున ఏయిన్ జీడి (*Ain Jidy*) అను నూఁటయే దీని యునికియైయున్నది. దానినుండి వేడి నీళ్ళయూఁట యొకటి ఉబుకుచుండును. ఇది మృతసముద్రమునకు పశ్చిమమున 400 అడుగులు ఎత్తుగల కొండమీఁద నున్నది. (అరణ్యము 3 (3) చూ॥. పటము II, G 3).

**ఏన్తప్పూయ** తప్పూయహు చూ॥

**ఏన్దోరు** (Endor = నివాసుల యూఁట). ఇశ్శాఖారీయుల ప్రదేశములోని యొక యూరు. ఇది మనష్షే గోత్రమునకు చెందినది (యెహో $17^{11}$). రాజైన సౌలు తన చివరి దినములలో విచారణజేసిన కర్ణపిశాచముగల స్త్రీ యీ గ్రామ నివాసియే (I సమూ $28^{7}$). కీర్త $83^{10}$ చూడఁగా యాబీను సీసెరాయను వారీ యూరిలోనే నశించినట్లున్నది (న్యాయా 4). తాబోరు పర్వతమునకు దక్షిణముగా ప్రస్తుతమందు ఎన్దూరు (*Endur*) అనునొక స్థలముకలదు. దానిదగ్గఱ గుహలున్నవి. అట్టి గుహలలో నొకదానియందు కర్ణపిశాచముగల యా స్త్రీ నివసించినట్లున్నది. ఈ ఎన్దూరు అనునదే పూర్వపు ఏన్దోరుయొక్క యునికి యను కొందురు. (పటము III, G 1).

**ఏన్మిష్పతు** (En-mishpat = తీర్పు ఊఁట) కాదేషుకు కావ్యములందున్న పేరు (ఆది $14^{7}$ కాదేషు చూ॥).

**ఏన్రిమ్మోను** (Enrimmon = రిమ్మోను ఊఁట లేక దానిమ్మపండ్లయూఁట).

యూదులు చెఱనుండి తిరిగివచ్చినప్పుడు వారు నివసించిన ఒక యూరు (నెహె $11^{29}$ యెహో $15^{32}$ $19^{7}$ I దిన $4^{32}$) అను నీ మూఁడింటి

లోను అయీాను, రిమ్మోను అను రెండూళ్లున్నట్లు చదువవచ్చును. ఇవి రెండు వేర్వేరు ఊళ్లయినను చెఱకాలమునకు తరువాత ఈ రెంటినిగలిపి ఒకటే యూరికి పేరుగా పెట్టిరి (అయీన్ చూ॥). ప్రస్తుతమున బెయేర్షెబాకు ఉత్తరముగా 9 మైళ్ల దూరములోనున్న ఉమ్ ఎర్రూమామిన్ (*Umm-er-Rumamim*) అను స్థలమే దీని యునికియై యున్నట్లు తెలియుచున్నది (పటము II, D 3).

**ఏన్హక్కోరె** (En-hakkore= మొఱఁబెట్టిన వానియూఁట, కొఱపెట్టయూఁట). యూదా గోత్ర ప్రదేశములో ఫిలిష్తీయుల సరిహద్దు దగ్గఱనున్న లేహీయను లోయయందుండిన ఒక యూఁట. సమ్సోను దేవుని సహాయముచే ఫిలిష్తీయులమీఁద గొప్ప జయమును పొందినపిమ్మట అధిక దాహపీడితుఁడై దేవునికి మొఱఁబెట్టఁగా దేవుని యాజ్ఞవలన లేహీలోనుండి యొక మంచి యూఁట పుట్టెను (న్యాయా $15^{14,19}$).

**ఏఫయి** (Ephai=అలసిపోయిన). యెరూషలేము నాశనమునకుఁ బిమ్మట పలెస్తీనునకు అధిపతిగా నియమింపఁబడిన గెదల్యాను ఆశ్రయించిన వారిలో నొకఁడు (యిర్మీ $40^{8}$). ఇతఁడు నెటోపాతీయుఁడు (నెటోపాతు చూ॥). ఇష్మాయేలు వలన జరిగిన హత్యలో నితఁడును హతుఁడయ్యెను ($41^{3}$).

**ఏఫా** మానములు II 1 చూ॥

**ఏఫెరు** (Epher = జింకపిల్ల).

1. కెతూరావలన అబ్రాహామునకు కలిగిన సంతతిలో మిద్యాను అనువాని రెండవ కుమారుఁడును, మిద్యానీయుల తెగలలో నొకదానికి పెద్దయునైయుండెను (ఆది $25^{1-4}$ I దిన $1^{33}$).

2. యూదా సంతతివారిలో ఎజ్రాయను నొకని కుమారుఁడు (I దిన $4^{17}$).

3. మనష్షే యర్ధగోత్రములోని యైదు తెగలలో నొకదానికి పెద్ద (I దిన $5^{24}$).

**ఏఫోదు** (Ephod = కప్పు).

1. యాజకుల వస్త్రములు II 2 చూ॥

2. మోషేకాలమునందు మనష్షే గోత్రపు పెద్దయైన హన్నీయేలు తండ్రి (సంఖ్యా $34^{23}$).

**ఏబాలు** (Ebal = బోడికొండ).

1. హోరీయుఁడగు షెయీారు వంశస్థుఁడైన శోబాలు కుమారుఁడు (ఆది $36^{23}$ I దిన $1^{40}$).

2. యొక్తాను కుమారుఁడగు ఓబాలుయొక్క నామాంతరము. ఆది $10^{28}$ లో కూడ అది అసలు భాషలో వేఱు రూపమై ఓబాలు అని యున్నది.

3. ఎఫ్రాయిము గోత్ర ప్రదేశమందలి యొక యెత్తయిన కొండ. యెరూషలేమునకు ఉత్తరమున 35 మైళ్ల దూరమందున్నది. దీనికిని గెరిజీము పర్వతమునకును మధ్య 500 గజముల వెడల్పాటి లోయ యొకటి 3 మైళ్ల పొడవున నున్నది. ఈ లోయలో షెకెమను ఊరుండెను (ఆది $12^{6}$ $37^{14}$). యెరూషలేమునుండి సమరయ పట్టణమునకు వెళ్లెడి మార్గము ఆ లోయ గుండా పోవుచున్నది. ఈ కొండ సముద్ర మట్టమునకు 3077 అడుగులు ఎత్తుగానున్నది. ఆ కొండ దిగువను ఒలీవ వృక్షములు కొన్ని గలవు గాని శిఖరముమాత్రము బండల మయమై నాగతాళి కంపలు గలిగి బోడిగాఁగనఁబడును. యెహోషువ ఏబాలు కొండమీఁద బలిపీఠమును కట్టించి, ఆ రాళ్లమీఁద ధర్మశాస్త్రపు ప్రతిని వ్రాయించెను (యెహో $8^{30-32}$). ఇశ్రాయేలీయులు కనానుదేశము చేరిన పిదప మోషే నియమప్రకారము (ద్వితీ $11^{29}$) ఆ రెండు కొండల మధ్యనున్న లోయలో మందసమున కిరువైపుల 6 గోత్రములవారు ఏబాలు కొండ వైపును, 6 గోత్రములవారు గెరిజీము కొండ వైపున నిలిచి యుండఁగా యెహోషువా ధర్మశాస్త్ర శాప వచనములను ($27^{1-26}$) దీవెన వచనములను ($28^{1-14}$) చదివెను. ఏబాలు కొండదరి నున్నవారు శాప వచనములను చదివినప్పుడు ఏర్పాటు చేయఁబడినరీతిగా ఆమేన్ అని గొప్ప శబ్దముతోఁబలికిరి (యెహో $8^{33-35}$). ఈ మధ్య బాటసారులు కొందఱు దానిని పరీక్షించి ఆలాగు మధ్యనుండి చదివినవి చక్కగా వినఁబడునని తెలియఁజేసిరి. (గెరిజీము, షెకెము చూ॥ పటము I, D 6). H.

**ఏబెరు** (Eber = అవలిదేశము).

1. షేము మనుమఁడగు షేలహు కుమారుఁడు (ఆది $10^{21,24,25}$ $11^{14-17}$ I దిన $1^{18,19,25}$ లూ

3[35]). హెబ్రీయులు ఏబెరు వంశస్థులైయున్నట్లు సంఖ్యా 24[24] వలనఁ దెలియుచున్నది. ఇతఁడు తన వంశస్థులకన్న యెక్కువ కాలము జీవించుటయే గాక అబ్రాహాము వంశస్థుల జీవిత కాలమునకు రెండింతలకాలము బ్రతికినట్లున్నది (ఆది 11). అబ్రాహామువఱకు జీవించిన వారందరికన్న నెక్కువ కాలము బ్రతికినదేగాక అబ్రాహామునకుఁ బిదప నాలుగు సంవత్సరములకు అనఁగా తన 464 వ సంవత్సరము మరణము నొందెను. జలప్రళయమునకుఁబిమ్మట నున్న వారిలో నోవహు షేములు మాత్రము ఇతనికన్న నెక్కువ కాలము జీవించిరి. వారైనను జలప్రళయమునకు ముందును దరువాతను జీవించినందున అంత దీర్ఘాయుష్మంతులై యుండిరి. జలప్రళయమునకుఁ బూర్వము మతూషెలహును దానికి తరువాత నితఁడు దీర్ఘాయువులై యుండిరను ప్రసిద్ధినొందిరి.

2. బెన్యామీను గోత్రికుఁడగు షహరయీము వంశస్థుఁడైన ఎల్పయలు కుమారుఁడు (I దిన 8[12]).

3. యోయాకీము దినములలో ఆమోకు కుటుంబ ప్రధానియు యాజకుఁడునై యున్న వాఁడు (నెహె 12[20]).

4. బాషానునందలి గిలాదులో నొక కుటుంబమునకు ముఖ్యుఁడగు గాదీయుఁడు (I దిన 5[13]).

5. షాషకు కుమారుఁడగు నొక బెన్యామీనీయుఁడు (I దిన 8[22-25]). H.

**ఏమీయులు** (Emim). మోయాబీయులు మోయాబు దేశమును స్వాధీన పఱచుకొనక పూర్వమచట నివసించిన జనులు, వీరు పూర్వము బహు గొప్ప జనులును అనాకీయులవలె దీర్ఘదేహులును పరాక్రమశాలురునై యుండిరి (ద్వితీ 2[9-17]). కదోర్లాయోమెరు జయించిన జనులలో వీరుకూడ నుండిరి (ఆది 14[5]).

**ఏయిఫా** ఏఫా 3 చూ॥

**ఏరాను, ఏరానీయులు** (Eran = మెళుకువ, **Eranites**). ఎఫ్రాయిము మనుమఁడు. అతని సంతతివారొక ప్రత్యేక తెగయై ఏరానీయులనఁబడిరి (సంఖ్యా 26[36]).

**ఏరీ, ఏరీయులు** (Eri = మెళుకువ పడుచున్న, **Erites**). గాదుకొడుకులలో నొకఁడు (ఆది 46[16]). ఇతఁడొక తెగకు పెద్దయాయెను. ఇతని సంతతివారు **ఏరీయులనఁ**బడిరి (సంఖ్యా 26[16]).

**ఏరు** (Er = మెళుకువగానున్న).

1. యూదా యొక్క పెద్ద కుమారుఁడు. అతని తల్లి కనానీయురాలు. అతఁడు చెడ్డవాఁడైనందున దేవుఁడతనిని చంపెను (ఆది 38[1-7] 46[12] I దిన 2[3]).

2. యూదా సంతతివారిలో షేలా యను వాని కుమారులలో నొకఁడు (I దిన 4[21]).

3. క్రీస్తు పూర్వికుల వంశావళిలోనున్న యొకఁడు (లూ 3[28]).

4. నీటిప్రవాహము. పలెస్తీనులో నెక్కువ వాగులున్నను సంవత్సరము పొడుగున ప్రవహించునవి కొన్ని మాత్రము కలవు. కీషోను (I రాజు 18[40]), యొర్దానుకు తూర్పుగానుండు యబ్బోకు (ఆది 32[23]) అనునవి యిట్టివైయున్నవి. ఇవి రెండును ఏరులనఁబడును. ద్వితీ 2[13] లో చెప్పఁబడిన **జెరెదు ఏరు** ఒక వాగై యున్నది. II సమూ 17[20] లో నున్న ఏరు అను పేరు కిద్రోను వాగును సూచించును (యోహా 18[1]).

**ఏర్పరచబడినదైన అమ్మ** (Elect Lady). యోహాను రెండవ పత్రికయొక్క మొదటి వచనమందలి అభివందనములోని పదము. వ్యాఖ్యాతలీ పదమున కనేకవిధముల నర్థము చెప్పుదురు. కొందఱందున యోహానుకు పరిచయముగా నుండిన స్త్రీ రత్నము సూచింపఁబడు ననుకొందురు. కొందఱీ మాటవలన సంఘముదాహరింపఁబడెనని నిశ్చయింతురు. ఈలెక్త యను పేరుగల స్త్రీ యిందు ప్రస్తాపింపఁబడెనని మరికొందఱి మతము. తమ యభిప్రాయముల కందఱు చెప్పు హేతువులను చూడఁగా మొదటిమాట యంగీకార పాత్రమని తోచును. అయిన నీ గణ్యురా లెవతెయో ఎక్కడ నుండెనో చెప్ప సాధ్యము కాదు. ప్రాచీన యితిహాసములలో నీమె బేతనియలోని మార్త యని సూచించఁబడును గాని యందు కాస్పదమేమియు లేదు. ఈ మాట యొక సంఘమునకు గుఱుతనుకొనువారు యెరూషలేము ఫిలదెల్ఫియ కొరింథు సంఘములను ప్రస్తాపింతురు.

M.

**ఏర్పరచుకొనుట, ఏర్పాటు** చుండెరు నుట 4 చూ॥

**ఏల్ ఎలోహేయి ఇశ్రాయేలు** (**El-Elohe-Israel** = ఇశ్రాయేలు దేవుఁడే దేవుఁడు). యాకోబు షెకెము దగ్గర కట్టిన బలి పీఠమునకు పెట్టిన పేరు (ఆది $33^{20}$).

**ఏల్ బేతేలు** (**El-Bethel** = బేతేలు దేవుఁడు). తనకు మొదట దర్శనము కలిగిన స్థలమునకు (ఆది $28^{10-22}$) యాకోబు పద్దనరాము నుండి తిరిగివచ్చిన పిదప పెట్టిన పేరు ($35^{7}$).

**ఏలతు, ఎలా, ఎలతు** (**Elath, Elah or Eloth** = ఒక విధమైన వృక్షము లేక వృక్షములు). ఎర్ర సముద్రపు తూర్పు భాగమందున్న సంయుక్తాగ్రహమునకు ఉత్తరమునసున్న యొక పట్టణము (ద్వితీ $2^{8}$ I రాజు $9^{26}$). ఇది పారానుకు తూర్పుగా నుండుటచే దీనికి **ఏల్పారాను** అను పేరు కలదు (ఆది $14^{6}$). పూర్వకాలమున కదొర్లాయోమెరు దాని జయించెనని యీ వాక్యమువలనఁ దెలియును. ఎదోము నాయకులలో నొకఁడు అచ్చట నివసించెను $36^{41}$). అది ఎదోము దేశమునకు దక్షిణపు సరిహద్దు పట్టణములలో నొకటి. దావీదు దానిని జయించినట్లు II సమూ $8^{14}$ వలన నూహింపఁదగును. తరువాత ఎదోమీయులు దానిని జయించుకొనఁగా రాజైన ఉజ్జియా దానిని మఱల స్వాధీనపఱచుకొని కట్టించెను (II రాజు $14^{22}$ II దిన $26^{2}$). తరువాత సిరియన్ వారు దానిని జయించిరి (II రాజు $16^{6}$). రోమీయుల ప్రభుత్వ కాలమందు వారు తమ పటాలములలో నొకదానిని నిచట నుంచిరి. క్రీస్తుకాలమునకు తరువాత అది యొక క్రైస్తవ అధ్యక్షుని ముఖ్య స్థానముగా నుండెను. తురకలకును క్రైస్తవులకును జరిగిన క్రూసేడులు అను యుద్ధములలో క్రైస్తవులు మొదట దానిని పట్టుకొనియున్నను తురకలు దానిని మఱల అపహరించిరి. ప్రస్తుతమచట పాడు శేషములుతప్ప మరేమియు లేవు. (పటము **VIII. C 3**).

**ఏలా** (**Elah** = ఒక విధమైన వృక్షము).

1. ఎదోము నాయకులలో నొకఁడు (ఆది $38^{41}$ I దిన $1^{52}$).

2. ఇశ్రాయేలు వారి రాజైన బయెషా కుమారుఁడు. ఇతఁడిశ్రాయేలీయులను రెండు సంవత్సరములేలెను (I రాజు $16^{8-14}$). ఇతఁడు త్రాగుబోతు. ఒక పర్యాయము త్రాగి మత్తుగొనియుండఁగా నితని సేనాధిపతులలో నొకఁడగు జిమ్రీయనువాఁ డితనిమీఁదపడి చంపి యితని రాజ్యము నపహరించెను.

3. ఇశ్రాయేలీయుల చివరిరాజగు హోషేయ యొక్క తండ్రి (II రాజు $15^{30}$ $17^{1}$ $18^{1}$).

4. కాలేబు కొడుకులలో రెండవవాఁడు (I దిన $4^{15}$).

5. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $9^{8}$).

6. సొలొమోనుకు ఆహార పదార్థములను సమకూర్చిన షిమీయనువాని తండ్రి (I రాజు $4^{18}$).

7. షెఫేలా యనఁబడు యూదయ మన్యప్రదేశమందలి లోయ. ఇచటనే దావీదు గొల్యాతును చంపెను (I సమూ $17^{2}$ $21^{9}$). ఇది యెరూషలేమునకు నైరృతి దిక్కుగ నుండెను. ప్రస్తుతము అది ఎస్ సున్ట్ (*Es sunt*) అను పేరుగల వాగై యున్నది (పటము **II, D 1**).

**ఏలాము, ఏలామీయుడు** (**Elam** = ఎత్తైయిన, **Elamite**).

1. షేము కొడుకులలో నొకడు (ఆది $10^{22}$ I దిన $1^{17}$). ఇతఁడు ఏలామీయులకు పూర్వికుఁడయ్యెను. (క్రింద 7 చూ॥)

2. లేవీయులలోని కోరహు తెగ వారిలో నొకఁడు (I దిన $26^{3}$).

3. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{24}$).

4. బాబెలునుండి జెరుబ్బాబెలుతో కూడ తిరిగి వచ్చిన వారిలో 1245 రు ఏలాము తెగవారై యుండిరి (ఎజ్రా $2^{7}$ నెహె $7^{12}$). తరువాత ఎజ్రా వెంబడి యీ తెగవారిలో 71 రు వచ్చియుండిరి (ఎజ్రా $8^{7}$). ఈ యేలామీయులలో నొకఁడు ఎజ్రాయొద్దకు వచ్చి ఇశ్రాయేలీయులు తాముంచుకొనిన అన్య స్త్రీలను విడిచిపెట్టునట్లుగా ప్రేరేపించుమని అతనితో మనవి

చేసి అతఁడా దిద్దుబాటును పూనుకొనునట్లు చేసెను ($10^{26}$). ఈ తెగవారిలో ఆఱుగురు తాముంచుకొనిన యన్యస్త్రీలను విడిచిపెట్టి యున్నట్లు ఎజ్రా $10^{26}$ వలనఁ దెలియును. నెహె $10^{14}$ చూడఁగా ఈ తెగవారి ప్రధానులలో నొకఁడగు ఏలాము నెహెమ్యా యేర్పఱచిన నిబంధనకు సంతకము చేసియున్నట్లు కనఁబడును.

5. బాబెలునుండి తిరిగి వచ్చిన మఱియొకఁడు (ఎజ్రా $2^{31}$ నెహె $7^{34}$). ఈ తెగవారిలో 1254 గురు జెరుబ్బాబెలుతోకూడ తిరిగి వచ్చినట్లున్నది.

6. నెహెమ్యా కాలమందు యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించిన సమయమందు బిగ్గరగా పాడిన గాయకులలో నొకఁడు (నెహె $12^{42}$).

7. ఒక దేశము. ఇది బబులోనుకు తూర్పున నుండెను. షూషను అను పట్టణము దీనికి రాజధాని. ఈ ఏలామీయులు షేము సంతతివారై యున్నట్లు అది $10^{22}$ లో నున్నది (పైన 1 చూ॥) గాని వారు షేమీయులు కారని శిథిల పరిశోధకులు లనుకొందురు. అట్లయినయెడల వారు షేము సంతతి వారివలన జయింపఁబడుటచే షేము సంతతివారితో చేర్చఁబడిరని యనుకొనదగును. కదొర్లాయోమెరు ఏలాముకు రాజై యుండెను (ఆది $14^{1}$). ఆ కాలమందది మిక్కిలి ప్రభావముగల రాజ్యమై యుండెను. అది క్రీ॥ ము॥ 2300 సం॥ లప్పుడై యుండవచ్చును. తత్కాలమున బబులోను సహా దానికి లోనైన రాజ్యమై యుండెను. తదనంతరము బాబెలు రాజైన హమ్మురాబి ( = అమ్రాపేలు, ఆది $14^{1}$). ఏలామును జయించి దానిని లోఁబఱచుకొనెను. క్రీ॥ ము॥ 645 సం॥ క్రిందట అది అష్షూరువారి వశమాయెను. అష్షూరీయులు యూదయమీఁదికి దండెత్తి వచ్చినప్పుడు వారితో ఏలామీయులును కొందఱు వచ్చినట్లున్నది (యెష $22^{6}$). అష్షూరు రాజు ఏలామీయులలో కొందఱిని చెఱఁబట్టి షోమ్రోను దేశములో నివసింపఁజేసెను (ఎజ్రా $4^{9}$). ప్రవక్తల గ్రంథములను చూడఁగా ప్రవచనములలో కొన్ని యేలామును గూర్చినవి కలవు (యెష $21^{2}$ యిర్మీ $49^{34-39}$ యెహె $32^{24}$ దాని $8^{3}$). ఇది అసలు ఏలాము కాదు గాని మాదీయ దేశముతో కలిసిన ఏలామయియున్నది. కార్య $2^{9}$ లోనున్న ఏలమీయులు ఆ ప్రదేశమునుండి వచ్చిన యూదులని తెలిసికొనవలెను. ప్రస్తుతపు పారసీక దేశమున కిది పురాతన నామము.

**ఏలాలే (Elealeh.)** యొర్దానునదికి తూర్పుగానున్న ఒక యూరు. ఇశ్రాయేలీయులు దీనిని పట్టుకొని రూబేనీయులకు నియ్యఁగా వారు దానిని మఱల కట్టిరి (సంఖ్యా $32^{3,37}$). అది తరువాత మోయాబీయుల వశమయ్యెను (యెష $15^{4}$ $16^{9}$ యిర్మీ $48^{34}$). ప్రస్తుతము ఏల్ ఆల్ (*El-Al*) అను పాడు శేషములే దీని యునికిరై యున్నవి. ఈ పాడు శేషములు హెష్బోనుకు ఉత్తరముగా క్రోసెడు దూరములో నున్నవి. (పటము II, J 1).

**ఏలీ (Eli = ఎత్తు).** అహరోను నాలుగవ కుమారుఁడగు ఈతామారు వంశజుఁడు (I సమూ $1^{9}$ I రాజు $2^{27}$ I దిన $24^{3-6}$). ఏలీ కాలములో ప్రధాన యాజకోద్యోగమును న్యాయాధిపతి యుద్యోగమును ప్రథమ పర్యాయము సమ్మేళనమైనట్లు యూదుల చరిత్రవలనఁ దెలియుచున్నది. ఇతఁడు 40 యేండ్లు ప్రజలకు న్యాయము తీర్చెను. కనికరమును నిష్కాపట్యము నితని కలంకారములు. న్యాయప్రవర్తనుఁడే గాని తన కున్న కుమారులను నడుపుటలో బలహీనత నగుపఱచెను. తన కుటుంబము శాపగ్రస్తమైనదని వినినప్పుడు యెహోవా తన దృష్టికి అనుకూలమైన దానిని చేయుగాక యని విధేయతా బుద్ధిని గనపఱచెను (I సమూ $3^{19}$). షిలోహులో నారాధించుటకు వచ్చిన హన్నాను మొదట గద్దించినను నిజము తెలిసికొనిన పిదప ఆమె నాశీర్వదించెను ($1^{14-18}$). అతనియందుండిన కనికరము అతని కుమారులను శిక్షితులనుగా చేయక చివరకు అతనికిని అతని కుటుంబమంతటికిని గొప్ప ముప్పు కు కారణమయ్యెను ($4^{1-18}$). సొలొమోను అబ్యాతారును యాజకోద్యోగమునుండి తొలగించినప్పుడు ఏలీ కుటుంబమునకు దేవుఁడు విధించిన శిక్ష పూర్ణముగా నెఱవేఱెను (I రాజు $2^{35}$). H.

**ఏలీము (Elim = ఒక విధమైన వృక్షము).** ఇశ్రాయేలీయులు ఎఱ్ఱసముద్రమును దాటిన పిమ్మట వారు మకాముచేసిన రెండవ స్థలము (నిర్గ $15^{27}$ $16^{1}$ సంఖ్యా $33^{9}$). అచట పన్నెండు

నీటిబుగ్గలును డెబ్బది యీతచెట్లు నుండెను. సూయెజుకు 63 మైళ్లు ఆగ్నేయముగా ప్రస్తుతమున్న ఘరండెల్ (*Gharandel*) అను పేరుగల వాగే ఆ స్థలమని యనుకొందురు గాని కొందఱిది సీనాయికి మఱీ దగ్గఱగా నుండు మఱియొక వాగు అని యనుకొందురు.

**ఏలీయా** (**Elijah** = యెహోవా నా దేవుఁడు).

1. పాఁత నిబంధన కాలములో ఇశ్రాయేలీయులు అన్యజనులతో కలిసి పాడైపోకుండునట్లు వారి నాటంకపఱచుటకై దేవుఁడు లేవనెత్తిన యొక గొప్ప ప్రవక్త. గిలాదు కాపురస్థుల సంబంధి. తిష్బీయుఁడనఁబడెను (I రాజు $17^{1}$). యొర్దానుకు తూర్పుననున్న పర్వతప్రదేశములలో పుట్టి పెఱిగిన వాఁడు. ఇతని తలిదండ్రులను గూర్చి గాని వంశమును గూర్చిగాని యెట్టి సూచనలైనను లేవు. చూపునకు మోటుమానిసిగా కనఁబడి ఒంటె వెండ్రుకలతో నేయఁబడిన దుప్పటిని కలిగియుండెను. మెడకు క్రిందుగా వ్రేలాడు దట్టమైన వెండ్రుకలు గలిగియుండినందున ఆ కాలమునందుండిన వారితనిని చూడఁగనే గుర్తింపఁగలిగిరి (II రాజు $1^{8}$). ప్రస్తుతకాలమందున్న బెదూవియనుల వలె నితఁడు నడుముబిగించుకొని బాగుగా పరుగెత్తగలవాఁడు (I రాజు $18^{46}$). మంచి దేహ దార్ఢ్యము గలిగియుండెను. ఒకసారి నలువది దినములవఱకు ఉపవసించెను ($18^{46}$ $19^{8}$). ఇశ్రాయేలువారి రాజగు అహాబుకు హఠాత్తుగా కనఁబడి అతని మతభ్రష్టత్వమునకు ఫలితముగా దేశమందంతట కఱవు సంభవించునని ప్రమాణపూర్వకముగా ప్రకటించెను ($17^{1}$). తరువాత కెరీతు ఏటిదగ్గరకు వెళ్లి ($17^{3}$) అక్కడ కాకోలములు తెచ్చిన రొట్టెను మాంసమును తిని జీవించెను ($17^{4-6}$). వర్షములేని హేతువుచే ఆ యేరు నట్టిపోయిన పిదప సీదోను పట్టణ సంబంధమగు సారెపతు ఊరికివెళ్లి అక్కడ నున్న ఒక పేదరాలు పెద్దమ్మ యింట అతిథిగా నుండెను ($17^{8-12}$). ఆమె యింట నున్నంతకాలము తొట్టిలోని పిండియు బుడ్డిలోని నూనెయు తరుగవయ్యెను. ఆమె కుమారుఁడు మరణము కాఁగా వానిని బ్రదికించెను ($17^{-14-24}$). మహాక్షామమునకు కారకుఁడగు అహాబు ఏలీయామీఁది కోపముచే నతనికొఱకు దేశదేశములు వెదకించి దొరకనందున మిన్నకుండెను ($18^{10}$). మూఁడు సంవత్సరముల వఱకు ఇశ్రాయేలీయుల దేశమున వర్షముగాని మంచుగాని కురియకపోఁగా కఱవు మిగుల భారమైనందున రాజుయొక్క పశ్వాదుల మేఁతకై స్వయముగా రాజును అతని సేవకుఁడగు ఓబద్యాయును వెదుక బయలుదేరిరి ($18^{5-6}$). ఏలీయా ఓబద్యాకు కనఁబడి రాజుకు తన్ను గుఱించిన కబురు తెలుపుమని పంపెను. అహాబు ఏలీయాను కనుగొని నిష్ఠురోక్తులచే నతని నొప్పింపఁజూచెను గాని ఏలీయా వాని నెంత మాత్రమును లెక్కసేయక దేశారిష్టమునకు కారకుఁడు రాజేనని కనఁబఱచి యాతని నోరెత్తకుండఁ జేసెను ($18^{7-19}$). రాజప్రయత్నములచే దేశమంతయు నెలకొల్పఁబడిన బయలు దేవతా పూజను రూపుమాపుటకు ఏలీయా అతనితో పందెము వేసి, బయలు యెహోవాల బలాబలములు పరీక్షింప రమ్మని బిలిచెను. ఆ పందెమందు బయలు ప్రవక్తలోడి పోవుటయే గాక ఏలీయాచే ప్రేరేపింపఁబడిన ఉత్సాహపూరితులగు జనసామాన్యముచే నిహతులైరి. అంతట ఏలీయా ప్రార్థించఁగా కుంభవర్షము కురిసి కఱవును పోఁగొట్టెను ($18^{20-46}$). ఏలీయా యెజ్రెయేలుకు వెళ్లెను గాని అహాబుచే జరిగిన యుదంతమంతయు వినిన యెజెబెలు ఏలీయాపై పగఁదీర్చుకొందునని యొట్టుపెట్టుకొనఁగా వినిన ఏలీయా తన ప్రాణరక్షణార్థమై పారిపోయెను. మార్గాయాసముచే బడలియుండఁగా దేవునిచే పంపఁబడిన యొక దూతవలన నాహారము పుచ్చుకొని నలువది దినముల ప్రయాణముచేసి హోరేబు కొండకు వచ్చెను ($19^{1-9}$). అక్కడనున్న యొక గుహలో బసచేయుచుండఁగా ($19^{9}$). భూకంపము సుడిగాలి అగ్ని మొదలగునవి సంభవించెను గాని ఏలీయా కోరికప్రకారము మట్టి గంభీరమగు ప్రదర్శనములద్వారా దేవుని చిత్తము బయలుపడక తరువాత వినఁబడిన నిమ్మళమైన స్వరముద్వారా సర్వశక్తిమంతుఁడగు దేవుఁడు తనతో సంభాషించుచున్నాఁడని కనుగొని ఏలీయా భక్తిపూరితుఁడయ్యెను ($19^{11-14}$). దేవుని యానతి చొప్పున అతఁడు ధైర్యము నొందినవాఁడై సిరియలో హజాయేలును, ఇశ్రాయేలువారిలో నింషీ కుమారుఁడగు యెహూను ఆయా దేశములకు రాజులగాను

ఎలీషాను తనకు బదులుగా ప్రవక్తగాను నియమింపవలెనని బయలుదేరి వెళ్లెను ($19^{15-18}$). ఎలీషాను మార్గమందు తోడ్కొని తానీ లోకమును విడిచి పెట్టునందాక తనయొద్దనే నిలుపుకొనెను ($19^{19-21}$ II రాజు $2^{12}$). తరువాత అహాబు తన భార్య బోధప్రకారము నాబోతును చంపించి యతని ద్రాక్షతోటను వశపర్చుకొనగా ఏలీయా అతనికి కనబడి అతని కుటుంబమునకు కలుగబోవు నాశనమును గురించి ప్రవచించెను (I రాజు $21^{17-29}$). పిమ్మట అహాబు కుమారుడైన అహజ్యాకు దెబ్బతగిలి ఫిలిష్తీయుల దేవతలయొద్ద విచారణకై వర్తమానము పంపినప్పుడు ఏలీయా అతడు పంపినవారికి కనబడి అహజ్యా బ్రతుకకడని తెలిపెను (II రాజు $1^{2-8}$). అతనిని పట్టుకొని తెచ్చుటకు అహజ్యా మూడుసార్లు యేబదేసిమంది రాజభటుల నంపగా మొదటి రెండు గుంపులు పిడుగులుపడి హతులైరి. మూడవసారి ఆ గుంపుయొక్క అధికారి బ్రతిమాలుకొనినందున ఏలీయా రాజునొద్దకుబోయి అతని గతినిగూర్చి తెలియజేసెను ($1^{9-17}$). అతని వాక్కు ప్రకారము అహజ్యా అల్లుడగు యూదారాజైన యెహోరాము బయలుదేవత నుపాసించుటను గూర్చి తెలిసినవాడై ఏలీయా అతని కొక యుత్తరమును వ్రాసి పంపెను. (II దిన $21^{12-19}$).

ఏలీయా మరణరుచి చూడకుండ కొనిపోబడుటవలన హనోకుతో పాలివాడయ్యెను (హెబ్రీ $11^{5}$). ఏలీయా చివరగా ఎలీషాతో కలిసి ప్రవక్తల పాఠశాలలున్న గిల్గాలు బేతేలు యెరికోలను దర్శించెను (II రాజు $2^{1-5}$). తరువాత వారిద్దరును యొర్దానును దాటిన పిమ్మట ఏలీయా తన ప్రియశిష్యుడగు ఎలీషాకు జ్యేష్ఠ కుమారునికి వచ్చుభాగమెట్లు లభించునో తెలిపెను ($2^{9-10}$). ఏలీయా అగ్ని గుర్రములు అగ్నిరథములచే ఎలీషానుండి వేరుచేయబడి సుడిగాలిలో ఆరోహణుడయ్యెను ($2^{11}$).

ఏలీయా తిరిగి వచ్చునని ప్రవక్తయగు మలాకీ ప్రవచించెను (మలా $4^{5}$). ఆ నిరీక్షణ యూదులకుండినట్లు మ $16^{14}$ $17^{10}$ యోహా $1^{21}$ మొదలగు వాక్యములలో కనబడును. బాప్తిస్మమిచ్చు యోహానే ఏలీయా యని క్రీస్తు చెప్పెను (మ $11^{14}$ $17^{12}$). క్రీస్తు రూపాంతరమునొందిన సమయమున ఏలీయా మోషేతో కూడ కనబడెను ($17^{3}$). రోమా $11^{2}$ నందు పౌలు యూదులందఱు భ్రష్టులు కాక కొందఱు నమ్ముచున్నారని చెప్పుటకు ఏలీయా దృష్టాంతము నెత్తి చూపెను. యాకో $5^{17}$ నందు ఏలీయా చేసిన ప్రార్థనసాదిరి ప్రార్థనగా దృష్టాంతపఱచబడెను. W.

2. యాజకుల వంశములో హారీము అనువాని కుమారుడు. ఎజ్రా ప్రేరణచే తమ భార్యలను విడిచిపెట్టిన వారిలో నొకడు (ఎజ్రా $10^{21}$).

ఏలీయాబు (Eliab = దేవుడు తండ్రి).

1. ఇశ్రాయేలీయులు అరణ్యములో నున్న కాలమందు జెబూలూను గోత్రికులకు పెద్ద. ఇతడు ఇశ్రాయేలీయులను లెక్కించుటలో మోషేకు సహాయము చేసెను (సంఖ్యా $1^{9}$ $2^{7}$ $7^{24,29}$ $10^{16}$).

2. రూబేనీయులలో నొకడును దాతాను అబీరాముల తండ్రియునైన వాడు (సంఖ్యా $16^{1,12}$ $26^{8,9}$).

3. దావీదు సోదరులలో పెద్దవాడు. ఇతని యెత్తును సౌందర్యమును చూచి యితడే రాజగుటకు తగినవాడని సమూయేలనుకొనెను (I సమూ $16^{6,7}$ $17^{13}$). తరువాత నితడు సౌలు సేనలో చేరెను. గొల్యాతుతో పోరాడబోయెదనని చెప్పినపు డితడు దావీదును గద్దించెను (I సమూ $17^{28,29}$).

4. దావీదు దేవుని మందసమును ఓబేదెదోము ఇంటియొద్ద నుండి యెరూషలేమునకు తీసికొని వచ్చుచుండగా పాడిన పాటకులలో నొకడు (I దిన $15^{18}$).

5. సౌలు నొద్దనుండి దావీదు పారిపోయి అరణ్యములో దాగియుండగా అతనియొద్దకు వచ్చిన గాదీయులలో నొకడు (I దిన $12^{9,14}$).

6. సమూయేలు పూర్వికులలో నొకడు (I దిన $6^{27}$). ఎలీయేలు (I దిన $6^{34}$). ఎలీహు (I సమూ $1^{1}$) అను పేరులు ఏలీయాబు అను దానికి మాఱురూపములై యున్నట్లు కనబడును.

ఏలీయ్యా (Eliah = యెహోవా నా దేవుడు).

1. యెరూషలేము నివాసియగు యెరోహాము కుమారుఁడు (I దిన $8^{26}$). ఇతఁడు బెన్యామీను గోత్రీకుఁడు.

2. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరణచే వారిని విడిచినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{26}$).

**ఏలీషూవ** (Elishua = దేవుఁడు రక్షించువాఁడు). దావీదు కొడుకులలో నొకఁడు (II సమూ $5^{14,16}$ I దిన $14^{5}$). I దిన $3^{6}$ లో ఈ పేరు **ఎలీషామా** యను మాఱురూపము గలదిగా నున్నదిగాని యది వ్రాఁతలో వచ్చిన పొరపాటైనట్లున్నది.

**ఏలీసూరు** (Elizur = దేవుఁడు బండయై యున్నాఁడు). ఇశ్రాయేలీయులు అరణ్యములో నుంటుండఁగా రూబేనీయులలో ని పెద్దలలో నొకఁడు (సంఖ్యా $1^{5}$ $2^{10}$ $7^{30,35}$ $10^{18}$).

**ఏలూలు** కాలమానము VI 6 చూ॥

**ఏలోను, ఏలోనీయులు** (Elon = ఒక విధమైన వృక్షము, Elonites).

1. ఏశావు మామయగు నొక హిత్తీయుఁడు (ఆది $26^{34}$ $36^{2}$).

2. జెబూలూను కుమారులలో నొకఁడు (ఆది $46^{14}$). ఇతని వంశస్థులు **ఏలోనీయులన** బడిరి (సంఖ్యా $26^{26}$).

3. న్యాయాధిపతులలో నొకఁడు (న్యాయా $12^{11,12}$). ఇతఁడు జెబూలూను గోత్రీకుఁడు. పది సంవత్సరములమట్టుకు ఇశ్రాయేలీయులకు అధిపతియైయుండి చనిపోయి అయ్యాలోనులో పాతిపెట్టఁబడెనను సంగతి తప్ప ఇతనిగూర్చి మఱేదియు వ్రాయఁబడియుండలేదు.

4. దాను స్వాస్థ్యభాగములోనున్న నొకయూరు (యెహో $19^{40,46}$). I రాజు $4^{9}$ లోనున్న **ఏలోన్బేథానాను** ఇదే స్థలమై యుండవచ్చును.

**ఏలోన్బేథానాను** ఏలోను 4 చూ॥

**ఏల్పారాను** పారాను 3 చూ॥

**ఏశావు** (Esau = వెండ్రుకలు గలవాఁడు). ఇస్సాకు రిబ్కాల కవల బిడ్డలలో పెద్దవాఁడు. అతని శరీరమంతయు రోమ వస్త్రముచే కప్పఁబడినట్లుండుటచే నాతనికా పేరు కలిగెను (ఆది $25^{21-26}$). అతఁడు పెరిగి పెద్దవాఁడయినప్పుడు నేర్పరియగు వేఁటకాఁడయి తన తండ్రికి వేఁటమాంసము దెచ్చి పెట్టుచునుండెను. యాకోబొకనాడు కలగూర వంటకమును వండుకొను సమయమున ఏశావు ఆకలిచే మలమలమాడుచు వచ్చి, ఇంటియొద్ద సిద్ధమగుచున్న భోజనమును తినుసందాకనైన వేచియుండఁజాలక తన జ్యేష్ఠత్వపు హక్కు పెట్టి ఆ కలగూరవంటకమును కొనుక్కొని, అప్పటి తృప్తికొఱకు తన యాశీర్వాదస్థితి నలక్ష్యపెట్టెను. తన తమ్ముని యొద్ద కొనిన ఎఱ్ఱని కలగూర వంటకమునుబట్టి ఎఱ్ఱని యని యర్థమిచ్చు **ఎదోము** అను రెండవసార్థక నామమునకు తగినవాఁడాయెను ($25^{27-34}$ హెబ్రీ $12^{16,17}$). తన నలుబదవ యేట హిత్తీయులగు యహూదీతు బాశెమతులను (ఆది $26^{34,35}$ $36^{12}$). తరువాత ఇష్మాయేలు కుమార్తెయగు బాశెమతు అను మాఱుపేరుగల మహలతును వివాహమాడెను ($28^{9}$ $36^{3}$). ఇస్సాకు కన్నులు సరిగాఁ గానరానంత వృద్ధుఁడైనపిదప నొకనాఁడు తన ప్రియ బిడ్డఁడగు ఏశావు నాశీర్వదింప నుద్దేశింపఁగా రిబ్కా యాకోబునకు ఏశావు వేషము వేసి అతఁడా దీవెన నొందునట్లు చేసినందున ఏశావు యాకోబును చంప యత్నించెనుగాని తండ్రి జీవించి యుండుటంబట్టి యటులఁ జేయఁజాలఁడయ్యెను ($27^{1-41}$). ఏశావు కోపము చల్లాఱునంత దనుక యాకోబు మెసపొతేమియకు పారిపోయి అచ్చట యిరువది సంవత్సరములుండెను ($27^{42}$-$31^{55}$). అతఁడు తిరిగి వచ్చునప్పుడు తనపై కినుక వహించిన ఏశావును శాంత స్వభావునిగఁ జేయనై యొక ఉపాయమును బన్నెను. దయాస్వభావుఁడగు ఏశావు చిరకాలమునుండి చూడక యున్న తన తమ్మునిపై తనకుగల యాగ్రహమును విడిచి యాకోబును సోదరభావముతో చేర్చుకొనెను ($32^{3}$-$33^{15}$). తరువాత అతఁడు మారముగ వెళ్లిపోయి శేయీరు పర్వత ప్రాంతమునందు నివసించెను ($33^{16}$). తరువాత వీరిద్దరు నొద్దిక గలిగియుండి తమ తండ్రి మరణమైన పిదప కలిసి యతనిని పాతిపెట్టిరి ($35^{29}$). ఏశావు వంశస్థులు బహుగా విస్తరించి శేయీరు పర్వత ప్రదేశమునందున్న ఆది నివాసులను వెళ్లగొట్టి ఎదోమీయ

లను ప్రజలుగ నేర్పడిరి (ద్వితీ 2[4,12,22]). శేయీరు పర్వతము ఏశావుయొక్క కొండయని పిలువఁబడెను (ఓబ 8, 9, 19, 21,). యాకోబు ఆశీర్వాద పుత్త్రుఁడుగ నేర్పాటగుటను, ఏశావు నిరాకరింపఁబడుటను గుఱించి ఆది 25[23] మలా 1[2,3] రోమా 9[12,13] నందున్నది. (ఎదోము చూ॥) H.

**ఏశెకు** (Esek = కలహము). గెరారు దగ్గర ఇస్సాకు త్రవ్వించిన బావి పేరు (ఆది 26[20]).

**ఏషెకు** (Eshek=బలాత్కారము). బెన్యామీనీయులలో సౌలు సంతతికిఁ జేరినవాఁడు (I దిన 8[39]).

**ఏసర్హద్దోను** (Esarhaddon = అష్షూరను దేవత సహోదరుని యను గ్రహించెను). రాజైన సన్హెరీబు కుమారుఁడు. ఇతఁడు తన తండ్రికిఁ బిమ్మట క్రీ॥ ము॥ 680-668 రాజ్యమేలెను (II రాజు 19[37] యెష 37[38]). తండ్రి లయపఱచిన బబులోను పట్టణము నితఁడు మఱల కట్టించెను. మఱియు నితఁడు ఐగుప్తుయొక్క ఉత్తరపు భాగమును జయించి దాని లోఁబఱచుకొనెను. తరువాత సిరియ దేశమును పాలెస్తీనునుకూడ జయించి యూదా రాజగు మనష్షేను ఓడించి యతనిని చెఱఁబట్టుకొనిపోయెను (II దిన 33[11]). ఎజ్రా 4[2] చూడఁగా నితఁడు పాలెస్తీనులో అన్యులను నివసింపఁజేసినట్లున్నది.

**ఏసెరు, ఏజెరు** (Ezer = సహాయము).

1. ఎదోమీయుల నాయకులలో నొకఁడు (ఆది 36[21] I దిన 1[38]). ఈ పదము అసలు నందలి గుణింతములో తక్కినవాటికన్న భిన్నముగా నున్నది. దీనిని ( = ఏత్సెరుకంచె) అని తెనిఁగించిన ఉత్తమముగ నుండును.

2. గాతు పట్టణపు ఫిలిష్తీయుల పశువులను పట్టుకొనఁబోఁగా వారిచేఁ జంపఁబడిన ఎఫ్రాయిమీయులలో నొకఁడు (I దిన 7[21]).

3. యూదా వంశస్థులలో నొకఁడు (I దిన 4[4]).

4. దావీదు సేనలో చేరిన గాదు వంశస్థులలో నొకఁడు (I దిన 12[9]).

5. నెహెమ్యా కాలములో ప్రాకారములను కట్టుటకు సహాయము చేసిన వారలలో నొకఁడు (నెహె 3[19]).

6. నెహెమ్యా కాలములో యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించుటయందు సహాయము చేసిన యాజకులలో నొకఁడు (నెహె 12[42]).

**ఏసెలు** (Ezel = ఎడఁబాపు). దావీదు సౌలు యొద్దనుండి వెళ్ళిపోక పూర్వము యోనాతానుతో కలిసి మాటలాడిన బండ పేరు (I సమూ 20[19]).

**ఏహీం** అహీరాము చూ॥

**ఏహూదు** (Ehud = ఐక్యము).

1. యెదీయవేలు వంశస్థుఁడగు నొక బెన్యామీనీయుఁడు (I దిన 7[10] 8[6]).

2. న్యాయాధిపతులలో నొకఁడు. బెన్యామీను గోత్రికుఁడు. ఎడమచేతి వాటము గలవాఁడు. గెరా కుమారుఁడు. ఇశ్రాయేలీయులను హింసించిన ఎగ్లోనును రహస్యముగ జంపెను. తరువాత ఎఫ్రాయిము ప్రదేశమునకుఁ బాఱిపోయి బూర నూది వచ్చిన ఇశ్రాయేలీయులకు నాయకుఁడై యొర్దాను రేవులను వశపర్చుకొని 10,000 మోయాబీయులను సంహరించెను. తన జీవితమంతయు న్యాయాధిపతిగ నుండి ప్రజలను యెహోవాదృష్టి కనుకూలమైనదిగా నుంచెను (న్యాయా 3[15]-4[1]). H.

## ఐ

**ఐగుప్తీయుడు** (Egyptian). ఐగుప్తు దేశమునం దున్నవారికి పెట్టఁబడుపేరు (ఆది 39[2,5] నిర్గ 2[11] మొ॥ ఐగుప్తు చూ॥). గాని యిది కార్య 21[38] నందు రోమీయులకు విరోధముగ తిరుగుబాటును రేపిన యొక నాయకుని పేరుగా నున్నది. ఫేలిక్సు వాని నోడించినట్లు యోసీఫసు దెలుపుచున్నాఁడు (పురా 20.8,6). అతఁడు ఓడిపోయినను పట్టువడక తప్పించుకొనినట్లు కార్యములలోని సూచనవలన స్పష్టమగుచున్నది. కావున పౌలును యూదుల చేతినుండి తప్పించిన సేనాధిపతి ఆ యైగుప్తీయుఁడు పౌలే యని తలంచి అతని నడిగెను.

**ఐగుప్తు** (Egypt). ఐగుప్తు దేశము లోకములోని పురాతన రాజ్యములలో నొకటి. ఇశ్రాయేలీయులకును ఐగుప్తీయులకును ఎక్కువ సంబంధ

ముండుటచే ఐగుప్తుదేశ సంగతులను తెలిసికొనఁ గోరువారు బైబిలు చరిత్రను తెలిసికొనుట అవసరమై యున్నది. ఇందులో దాని పేరు, ఉనికి, ఐగుప్తీయుల జాతి, వారి చరిత్ర, వారిమతము, బైబిలులో ఐగుప్తును గూర్చియున్న సూచనలు వివరింపఁబడమగును.

1. పేరు ఉనికి. ఐగుప్తు అను పేరు గ్రీకువారా దేశమునకు పెట్టినపేరై యున్నది. బైబిలులో నున్నట్లు హెబ్రీవారు దానికి సాధారణముగా మిస్రాయిము అను పేరు పెట్టిరి (ఆది 10^6,13 I దిన 1^8). తెనుఁగున కొన్ని వాక్యములలో మాత్రము మిస్రాయిము అను పేరుండినను పాత నిబంధనలో నెచ్చట ఐగుప్తు అను పేరు వచ్చునో అచట నెల్ల అసలు భాషలో మిస్రాయిము అను పదమున్నదని తెలిసికొనవలెను. ఇది మధ్యధరా సముద్రమునుండి నైలు నది వెంబడి దక్షిణముగా 600 మైళ్ల వఱకు వ్యాపించు ఇఱుకైన దేశమై యున్నది. నైలునదీ తీరమున దాని వరదలు పార్లి ప్రవహించు ప్రదేశములో మాత్రము జనులు నివసింతురు. అది 12 నుండి 120 మైళ్ల వఱకు వెడల్పుగా నుండును. దాని యిరుప్రక్కల యెడారి కలదు. నైలునది లేనియెడల ఈ దేశమంతయు ఎడారిగా నుండునని మనము తెలిసికొనఁగలము. ఇది ఉత్తరపు ఐగుప్తు, దక్షిణపు ఐగుప్తు అని రెండు భాగములుగానున్నది. వీటిలో ఉత్తరపు భాగము ముఖ్యమైనది. దీనికి పూర్వము ఓను (*Memphis*) అను పట్టణము రాజధానిగా నుండెను. ఇశ్రాయేలీయులు నివసించిన గోషెను (ఆది 45^10) దేశమిందులోనే యుండెను. సాధారణముగా బైబిలులోని ఐగుప్తుదేశపు పట్టణములును ఇతర స్థానములును ఈ యుత్తర భాగములోనే యున్నవి. ఐగుప్తుదేశపు దక్షిణ భాగమునకు పత్రోసు ( = దక్షిణము) అను పేరు కలదు (యెష 11^11). దాని నివాసులు పత్రుసీయులనఁబడిరి (ఆది 10^14). పత్రోసు చూ॥). దీనిలోనుండిన నో (*Thebes*, యిర్మీ 46^25 యెహె 30^14) క్రీ॥ ము॥ 1600 సం॥ల క్రిందట మిగుల ప్రసిద్ధమైనదై చాల కాలమువఱకు ఐగుప్తు దేశమంతటికి రాజధానిగ నుండెను.

2. ఐగుప్తు జనులు, వారి జాతి. ఐగుప్తీయులు షేము సంతతివారై యున్నట్లు బైబిలులో నున్నది (ఆది 10^6,13). వారి భాషను పరీక్షించి పండితులుకూడ భాషల సంబంధమునుబట్టి అదే తీర్మానమును చేతురు. వీరివ్విధముగా హెబ్రీయులకు అరబ్బీయులకును సంబంధికులైనను అట్టి సంబంధములు తీక్ష్ణమైనవికావు వారి చెక్కు బొమ్మలను



ఐగుప్తీయులు నాట్యమాడుట

చూడఁగా వారు నీగ్రోవారు కారనియు షేము సంతతివారిలో నితరులకు వేఱుగానుండిన వారనియు పండితులందురు. వారు ఉత్తరాఫ్రికాలో నిర్మూలమైన లిబ్యాను దేశస్థులకు ఎక్కువగ సంబంధింతురని పండితులలో కొందఱనుకొందురు.

3. ఐగుప్తు దేశస్థుల చరిత్ర. ఈ చరిత్ర యెంత పురాతనమైనదో నిశ్చయించుటకు పండితులకు సహా వీలుగాక యున్నది. క్రీ॥ ము॥ 250 సం॥లకు పూర్వము జీవించియుండిన గ్రీకు పండితుఁడగు మనెతో (*Manetho*) యనువాఁడు తన కాలమువఱకు ఆ దేశము నేలిన 31 రాజవంశముల జాబితాను వ్రాసెను గాని మనము ఏదో యొక యుగము ననుసరించి సంవత్సరముల



ఐగుప్తీయులు ఇటుకలు చేయుట

లెక్క ప్రకారముగా వారి చరిత్ర కాలమును నిరూపించుటకు తగిన యాధారములు లేవు. పండితులు నేటివఱకు ఆ రాజవంశముల ప్రకారము

గానే ఆ దేశచరిత్రకాలమును చాలమట్టునకు సూచించెదరు. ఈ రాచవంశములలో మొదటిది క్రీ॥ ము॥ 3000 సం॥లకు పూర్వము ఏలెనని యెక్కుఎమంది పండితు లనుకొందురుగాని అది రూఢికాదు. ఎందుకనఁగా క్రీ॥ ము॥ 1600 సం॥ల వఱకు కాల నిరూపణమును తీర్మానించుటకు తేట యైన సూచనలు లేవు. సాధారణముగా ఆ చరిత్ర 1. పురాతనపు ఐగుప్తు (షుమారు క్రీ॥ ము॥ 25 శతాబ్దమువఱకు). 2. మధ్యకాలపు ఐగుప్తు (షుమారు క్రీ॥ ము॥ 16 శతాబ్దమువఱకు). 3. చరిత్ర తేటగా తెలిసికొనుటకు వీలుగానున్న నవీనకాలపు ఐగుప్తు (క్రీ॥ ము॥ 332 వఱకు) అను మూఁడు భాగములుగా విభాగింతురు.

పురాతనకాలపు ఐగుప్తు చరిత్రలో మొదటి 10 రాజవంశములు చేరియున్నవి. ఓను అను పట్టణము ఉత్తర ఐగుప్తులో ముఖ్యపట్టణమై యుండినను అప్పటికి ఐగుప్తుదేశము ఏకచ్ఛత్రాధిపత్యమునకు లోఁబడినదికాక, వేర్వేఱు చిన్న రాజ్యములుగా నున్నట్లున్నది. అందు నిప్పటి వఱకు నిలిచియుండు పిరమిడ్లు (*Pyramids*) అను గోపుర కట్టడములను కట్టుచునుండిరి గాని, బైబిలు చరిత్రకును ఆకాలపు ఐగుప్తు చరిత్రకును ఆది 10వ లో నున్నట్లు జనులు చెదరిపోవుట యను సూచనగాక మఱితేటయైన సూచనలు బొత్తుగా లేవు.

మధ్యకాలపు ఐగుప్తు చరిత్రలో 11 వ రాజవంశమునుండి 17 వ రాజవంశమువఱకు (షుమారుగా క్రీ॥ ము॥ 2500—1600 సం॥లు) నుండును. దీని యారంభకాలములో నో (*Thebes*) యను పట్టణము చాల ప్రసిద్ధికెక్కియుండెను. 13, 14 రాజవంశస్థులు విదేశీయులై యుండిరి. ఇంతకుఁ బూర్వము వారు గొల్లలనుకొనిరిగాని, నవీన పండితులు వారు ఒకవేళ పలెస్తీను సిరియలనుండివచ్చిన విదేశీయులను సంగతికాక, వారినిగూర్చి మఱేమియు తెలియదనుకొందురు. వారుత్తరయైగుప్తు నాక్రమించుకొనినను, దక్షిణయైగుప్తు నెన్నఁడు నాక్రమించుకొనరైరి. తుదకు 17 వ రాజవంశపు కాలమునకు లోఁగానే వారు ఐగుప్తునుండి బొత్తుగా వెళ్లఁగొట్టఁబడిరి. అబ్రాహాము ఐగుప్తునకు ఈ కాలములోనే వెళ్లెను.



ప్రాచీన ఐగుప్తురాజుల ప్రతిమలు

చరిత్ర కొంచెము తేటగా తెలియు నవీన కాలపు ఐగుప్తు చరిత్ర క్రీ॥ ము॥ 1587 సం॥తో నారంభమై గ్రీకువారు ఐగుప్తీయులను స్వాధీనపఱచుకొనువఱకు అనఁగా క్రీ॥ ము॥ 332 వఱకు వ్యాపించును. బైబిలుకు సంబంధించిన ముఖ్య చరిత్ర విషయము లీ కాలములోనే జరిగెను. ఈ

కాలములో ఐగుప్తీయులు చాల బలముగల రాజ్యమై తమ చుట్టునుండు దేశములను జయించుచుండిరి. 18-వ రాజవంశపువారు 1587—1400 సం॥లలో నేలిరి వారిలో కొందఱు రాజులు తమ రాజ్యమును యుఫ్రాతు నదివఱకు వ్యాపింపఁ జేసిరి. అదివఱకు ఓను (*Memphis*) అను పట్టణము ఉత్తర యైగుప్తునకును, నో (*Thebes*) దక్షిణ యైగుప్తునకును ముఖ్యపట్టణములై యుండెను. అయితే యీ కాలములో ఈ రెండింటికి మధ్య టెల్-ఎల్-అమార్న (*Tell-el-Amarna*) అను క్రొత్త రాజధానిని కట్టించిరి. క్రీ॥ శ॥ 1887 సం॥లో పండితు లచట విలువగల 300 ఉత్తరములను కనుగొనిరి. వాటిని చూడఁగా అష్షూరు, బబులోను, సిరియ, పలెస్తీను అను నీ దేశములతో ఆ కాలమందలి యైగుప్తీయులకు సంబంధము కలిగి యున్నట్లుగా కనఁబడును. ఈ కాలారంభమున నే, యోసేపుచరిత్ర జరిగినట్లుగా నున్నది గాని అతఁడు సేవించిన ఫరో రాజెవ్వఁడో తెలియకున్నది.

పందొమ్మిదవ రాజవంశము (1400—1220) కూడ మిగుల ప్రసిద్ధమైనదై యుండెను. ఈ కాలములో వారు హిత్తీయులతో యుద్ధము చేసి యున్నట్లు (ఆది 15[20]) శాసనములవలనఁ దెలియును. 2-వ రామెసెసనువాఁడు (1340—1273) ఇశ్రాయేలీయులను బాధపఱిచిన ఫరో యని యనుకొందురు. అతఁడు 67 సంవత్సరము లేలి ఐగుప్తు రాజ్యమును చాల బలముగల రాజ్యమునుగా చేసెను. ఇతఁడు పట్టణములనుకూడ కట్టించెను.



రెండవ రామెసెస్ యుద్ధము చేయుట

వాటిలో పితోము రామెసెస్ అనునవి ముఖ్యములు. వాటిని కట్టించుటకుఁ గావలయు ఇటుకలనతఁడిశ్రాయేలీయులచేతఁ జేయించినట్లుగా నున్నది (నిర్గ 1[11]). ఇతని కొమరుఁడగు మనెప్తా (*Meneptah*) కాలములో ఇశ్రాయేలీయులు ఐగుప్తును విడిచినట్లుగా నున్నది. ఇతని కాలములో నైగుప్తునకు చుట్టునుండు దేశములు చాల తిరుగుబాటు చేసినవి. ఈ రాజవంశపువారి తరువాతి 20-వ రాజవంశపువారేల నారంభించువఱకు ఇట్టి తొందర లనేకములు కలిగెను.

20-వ రాజవంశపు వారిలో 3-వ రామెసెస్ అను ఫరో చాల బలముగలవాఁడై హిత్తీయులను పాడుచేసెనుగాని, ఐగుప్తుకు పశ్చిమముననున్న లిబ్యానీయులు ఐగుప్తీయులను ఈ కాలములో తొందరపఱిచిరి. ఇట్టి తొందరలు 21-వ రాజవంశపు వారికాలములో నెక్కువగా నున్నవి.

**22**-వ రాజవంశము మొదలు **25**-వ రాజవంశము వఱకు (**930—645**) విదేశీయులు, ముఖ్యముగా లిబ్యానీయులు ఐగుప్తును స్వాధీనపఱచుకొని దాని నేలుచుండిరి. సొలొమోనుకాలములో యరొ



షీషకు, క్రీ॥ ము॥ 950

బాముకు ఆశ్రయమిచ్చిన షీషకు (I రాజు $11^{40}$) ఈ లిబ్యాను వంశపు రాజులలో మొదటివాఁడై యుండెను. ఇతఁడు రెహబాము కాలములో యెరూషలేముమీఁదికి దండెత్తి వచ్చెను ($14^{25}$).

ఈ లిబ్యాను రాజవంశములకు తరువాత ఐగుప్తునకు దక్షిణముగా నుండిన కూషు (*Ethiopia*) అను దేశపు కుషీయులు ఐగుప్తును జయించి లిబ్యాను వారిని వెళ్లఁగొట్టిరి. వారు మొదటినుండి తమ వారిని రాజులనుగా నియమింపక ఐగుప్తురాజులను సింహాసనముమీఁద నెక్కించి వారిద్వారా ఐగుప్తును ఏలుచుండిరి. **23,24** రాజవంశపు వారివిధముగా ఐగుప్తు రాజవంశస్థులేగాని **25**-వ వంశపువారు (**728—645**) కూషువారై యుండిరి. వీరిలో సో (*So*) అను పేరుగల యొకరాజు (II రాజు $17^4$) ఇశ్రాయేలీయులతోను ఫిలిష్తీయులతోను సంధిచేసికొని అష్షూరువారిమీఁద యుద్ధముచేసెను. తరువాత ఈ కాలములోనే సన్హెరీబు పలెస్తీనుమీఁదికి దండెత్తిరాఁగా **702—662** వఱకు ఐగుప్తు నేలిన కూషు వంశపువాఁడగు తిర్హాకా యనువాఁడు హిజ్కియాకు సహాయముచేయుటకై దండెత్తి వెళ్లెనుగాని ఓడిపోయెను ($19^9$ యెష $37^9$). ఈ కాలము మొదలు అష్షూరువారు ఐగుప్తీయుల దేశమును బాధపఱచ మొదలుపెట్టిరి. **670**-వ సం॥లో సన్హెరీబు కొమరుఁడగు ఏసర్హద్దోను (II రాజు $19^{37}$) ఐగుప్తుదేశమును నో (*Thebes*) అను పట్టణమువఱకు జయించి నో అమ్మోనును నాశనముచేసెను. ఇట్టి నాశనమునకు నహూము $3^{8-11}$ లో సూచనలు కలవు. ఐగుప్తీయుల రాజులలో మొదటి నెకో యను నొకఁడు




ప్రాచీన ఐగుప్తు రాజుల ప్రతిమలు



తిర్హాకా, క్రీ॥ ము॥ 691—665

అష్షూరువారికి సహాయుఁడైనందున కూషు రాజవంశపువారు బొత్తుగా ఓడిపోయిరి.

నెకో కుమారుఁడగు ప్సమ్మెటికస్ (*Psammetichus*) అష్షూరీయులను ఐగుప్తు దేశములోనుండి వెళ్లఁగొట్టి 26-వ రాజవంశమునకు (663—525) స్థాపకుఁడయ్యెను. ఇతని కొమరుఁడగు రెండవ ఫరో నెకో అష్షూరువారిమీఁద యుద్ధము చేయఁబోఁగా అతని నడ్డగింప యత్నించిన



శీషకు కుమార్తె

యూదారాజగు యోషీయా (608) ఓడిపోయి చంపఁబడెను (II రాజు 23[29]). ఈ యుద్ధములో నతఁడు అష్షూరువారిని యూఫ్రాతునది దగ్గఱనున్న కర్కెమెషులో గెలిచి తిరిగివచ్చి యూదారాజగు యెహోయాహాజును తొలఁగించి అతనికి మాఱుగా తనపక్షముగా నున్న యెహోయాకీమును యూదారాజునుగా నియమించి యూదారాజ్యమును స్వాధీనపఱచుకొనియెను (II రాజు 23[34]). అయితే నాలుగు సంవత్సరములకు తరువాత కర్కెమెషులో బాబెలురాజగు నెబుకద్నెజరుచే నోటువడి (704) యూదారాజ్యమును పోఁగొట్టుకొనినందున అది యప్పటినుండి బాబెలువారి యధీనమాయెను. అయితే ఐగుప్తువారు బాబెలువారిమీఁద తిరుగుబాటుచేయుటకై వారిని హెచ్చరించినట్లుగా చరిత్రలో సూచనలుకలవు. సహాయముచేతుమని ఐగుప్తీయులు చెప్పినమాటను నమ్మి యూదావారు బాబెలువారిమీఁద తిరుగుబాటు



ఐగుప్తీయుల చాకలివారు

చేసినందున చివఱకు వారిచే చెఱపట్టఁబడిరి (25). యెరూషలేము పాడైన పిమ్మట నెబుకద్నెజరు ఐగుప్తుమీఁదికి దండెత్తి వచ్చెను (యిర్మీ 46[13,14]) గాని ఐగుప్తు బహు కొద్దికాలమువఱకు మాత్రము అతని స్వాధీనములో నుండెను.

525 మొదలు 414 వఱకు ఐగుప్తు పారసీకుల యాధీనమునందుండెను. తరువాత ఐగుప్తీయులు పారసీకులను తమదేశమునుండి వెళ్లగొట్టి 349 సం॥ వఱకు స్వరాజ్యమనుభవించుచుండిరి. ఈ కాలములో (414-349) 28, 29, 30 రాజవంశపువా రా దేశము నేలుటను చూడఁగా అందులో నొక స్థిరమైన ప్రభుత్వ ముండలేదని తెలిసికొనవచ్చును. 349 సం॥లో పారసీకులు మఱల ఐగుప్తును జయించి 33 వఱకు ఏలుచుండిరి. అది 31 వ రాజవంశపువారేలిన కాలముగా నెంతురు.

331 వ సం॥లో మహా అలెక్సందరు (*Alexander the Great*) ఐగుప్తును జయిం

చెను. అంతకుఁ బూర్వము ఐగుప్తీయులు గ్రీకు వారి విద్యలను కొంతవఱ కంగీకరించియుండిరి. అలెక్సందరుకాలములో అట్టి విద్యలను అంగీకరించుటచే పూర్ణమైన మార్పుకలిగెను. ఈ



ఐగుప్తీయుల కుండలు, పాత్రలు

కాలమునుండి గ్రీకువారు అలెక్సంద్రియ యను పట్టణమును స్థాపించి దానిని ఐగుప్తుకు రాజధానినిగా చేసిరి. 823-31 వఱకు అలెక్సందరుయొక్క సేనానియగు ప్తొలమి (*Ptolemy*) వంశపువారు ఐగుప్తునేలుచుండిరిగాని దానికి స్వరాజ్యముండినను అది పురాతనపు ఐగుప్తువంటిదికాక, గ్రీసు దేశమువంటి దేశమైయుండెను. అలెక్సంద్రియలో గొప్ప గ్రీకుపాండిత్యములు ప్రబలెను. క్రీ॥ ము॥ రెండవ శతాబ్దమందు హెబ్రీ బైబిలును సెప్తుయజింటు (LXX) అనఁబడిన గ్రీకు తర్జుమాలోనికి మార్చివేసిరి. 31 వ సం॥నుండి ఐగుప్తు దేశము రోమారాజ్యములో చేరినను, ఆ విద్యలు ఇంకను గ్రీకువిద్యలై యుండెను. ఈ కాలము



ఐగుప్తీయుల మంచము, తలగడ

లోనే శాలుఁడైన క్రీస్తును యోసేపు మరియలును కొంతకాలమచట నుండిరి (మ $2^{13-23}$). రోమావారది మొదలు క్రీస్తుశకము 362 వ సం॥ వఱకు నేలిరి. 638 వ సం॥లో అరబ్బీయులగు మహమ్మదీయులు దానిని జయించిరి. 1196 వ సం॥లో అది తురుష్కుల ప్రభుత్వముక్రిందికి వచ్చెను. 1880 సం॥నుండి అది యింగ్లీషువారి ప్రభుత్వము క్రింద నుంటూవచ్చెనుగాని 1953 జూ॥ 18 వ తేదీన ఐగుప్తు స్వతంత్ర ప్రజాపరిపాలిత దేశమని ప్రకటింపఁబడినది. ఐగుప్తులో ఫరో వంశపు రాజరికము అంతరించిపోయినది.

3. ఐగుప్తీయుల మతము. ఐగుప్తీయుల మతమునకును హిందూమతమునకును చాల సంబంధముకలదు. హిందువులు బ్రాహ్మణులకు ఘనము చూపుచున్నట్లే ఐగుప్తీయులు తమ యాజకులకు ఘనము చూపెదరు. యోసేపు మామయగు



ఐగుప్తీయుల యాజకుఁడు

పోతీపెర అట్టి యాజకుఁడై యుండెను (ఆది $41^{45}$). హిందూ దేవాలయములకున్నట్లే ఐగుప్తీయుల యాలయములకు సంబంధముగా ఇనాములుండెను. వారును హిందువులవలె మంత్రములను ప్రయోగించువారై యుండిరి. ఐగుప్తీయుల గ్రంథములలో మృతుల గ్రంథము (*Book of the Dead*) అనుదానిలో మంత్రములు తప్ప మరేమియులేదు. ఈ విషయములో అది హిందువుల అథర్వణవేదమువంటిది. వారును హిందు

వులవలె ప్రతివిధమైన దేవతను ఆరాధించిరి. సూర్యదేవత (= రా *Ra*) వారి దేవతలలో ముఖ్యుడు. భూదేవి (= గెబ్ *Geb*), ఆకాశ దేవత (షుయా *Shoou*), నక్షత్రాది దేవతలు, యుద్ధదేవత, విశ్వకర్మ అను దేవతవంటి కంసాలి దేవతలును వారికి నుండెను. అదియుగాక వారు మృగముల నారాధించిరి. ఆయా దేవతలకు ఆయా మృగవాహనములుకూడ నుండెను. ఇట్లు వారు ఎద్దులను పిల్లులను మొసళ్లను చేపలను సర్వమృగ ముల నారాధించిరి. వారి ప్రతిదేవతకు ఒక శక్తి (= భార్య) కూడ నుండెను. వారికి కొడుకులు నుండిరి. హిందువులెలాగున గంగానదిని దేవత నుగా నెంతురో అట్లే ఐగుప్తువారు నైలునదిని దేవతనుగా నెంచిరి. మఱియు వారు మృతులకు



ఐగుప్తీయు లారాధించిన నంది

దినముల నేర్పఱచి హిందువులవలె వారిపేరట విందులుకూడ చేసిరి. ఈ స్థూలదేహ మెంత వఱకు నశింపదో యంతవఱకు ఈ దేహమునకు ఆత్మీయ ప్రతిబింబముగా వారెంచిన సూక్ష్మ దేహము ఆత్మీయలోకములో సౌఖ్యముగా నుండు నని వారనుకొనిరి కావున, వారు తమ మృతుల శవముల నెంతో జాగ్రత్తగా కాపాడిరి. దీనిని బట్టి చూడఁగా నేటివఱకు మన మాశ్చర్యపడ వలసినవారమై యున్నాము. ఇట్లు యాకోబు (ఆది 50[2,3]) యోసేపు (50[26]) శవములనుకూడ ఇశ్రాయేలీయులు కాపాడిరి. ఐగుప్తీయుల మత మివ్విధముగా పలుదేవతలను జీవరాసులన్నిఁటిని మృతులను పూజించుమతమాయెను. అయితే అది చాలకాలముక్రిందటనే కొట్టివేయఁబడెను. క్రీస్తు వచ్చినపిమ్మట క్రైస్తవమతము ఐగుప్తీయులలో చాల బలమైన గొప్ప విద్యలకు ప్రసిద్ధమైనదయ్యెను. ఐగుప్తులో కొన్ని సంవత్సరములక్రిందట క్రీస్తు వాక్యములలో బైబిలునందులేని కొన్ని వాక్యము లను నూతనముగా కనుఁగొనిరి (*Oxyrrhynchus Tablets Logia*, యేసుక్రీస్తు I 1 చూ॥) క్రొత్త నిబంధనలోని గ్రీకుభాషను గ్రహించు టకును అచ్చట దొరికిన శాసనములు చాల ఉపయోగకరములుగ నున్నవి. నేటివఱకు ఐగుప్తులోనుండు కొప్తీయులు (*Copts*) క్రైస్త వులై యున్నారుగాని ఐగుప్తీయులలో నెక్కువ మంది మహమ్మదీయులు. ఆ పురాతనకాలపు ఐగుప్తీయమతము బొత్తుగా నశించెను.

**4. బైబిలులో ఐగుప్తునుగూర్చిన సూచనలు.—** వాటిలో ననేకములు పైచరిత్రలో కనఁబడును. బైబిలులో ఐగుప్తునుగూర్చిన సూచనలలో నెక్కువ భాగము ఇశ్రాయేలీయులు ఐగుప్తులో నుండు టను గూర్చినవియును ఇశ్రాయేలీయులు ఐగుప్తు నుండి విడుదల నొందుటను గూర్చినవియునై యున్నవి (ఆది 39—నిర్గ 15). ఐగుప్తులోనుండి యిశ్రాయేలీయులు విడుదల నొందుటనుగూర్చి పాతనిబంధనలో కొన్ని వందల సూచనలున్నవి. ఈ గొప్ప రక్షణనుబట్టి యిశ్రాయేలీయులు దేవుని సొత్తయి ఆయనను సేవించుటకు బద్ధులైయున్నా రను విషయము ప్రవక్తలందఱి హెచ్చరికలకు ఆధారమైయున్నది. ఆ కాలమునుండి మాత్రమే కాక, యూదారాజులలో యోషీయా యనువాని కాలమునుండి యెరూషలేము పాడగువఱకు



ఐగుప్తీయుల బానిసలు ఇటుకలు చేయుట

(II రాజు 18[9-25] యెష 28-32 యిర్మీ 42-47) ఐగుప్తుకును ఇశ్రాయేలీయులకును ఎక్కువ సంబంధముండెను. ఈ రెండు ముఖ్యకాలముల లోనేకాక, పై చరిత్రలో నున్నట్లు అచ్చటచట చిన్నచిన్న సంబంధము లనేకములు కలవు. ఐగుప్తీ యుల దేశములో ఇశ్రాయేలీయులు పరదేశులై యుండిరి కావున ఐగుప్తీయులను ద్వేషింపకూడ

దను ఆజ్ఞ యిశ్రాయేలీయులకు నుండెను (ద్వితీ 23⁷). ఐగుప్తీయుల జ్ఞానమును గూర్చియు (I రాజు 4³⁰ కార్య 7²²) వారి చిత్రమైన నేత పనినిగూర్చియు (సామె 7¹⁶) అచటి తెగుళ్లను గూర్చియు (ఆమో 4¹⁰) సూచనలు కలవు. ఐగుప్తీయులలో ఆయా జాతులవారినిగూర్చి అచ్చటచట సూచనలున్నవి. హాగరు (ఆది 16¹) యెహోవా నామమును దూషించిన యొకని తండ్రి (లేవీ 24¹⁰) షేషాను దాసుఁడు (I దిన 2³⁴) దావీదు యోధులలో బెనాయా యను వాఁడు చంపినయొక సుందరుఁడు (II సమూ 23²¹ I దిన 11²³) మొదలగువారందఱును ఐగుప్తీయులే. ప్రవక్తలు ఐగుప్తు నాశనమును ప్రవచించిన ప్రవచనములలో అనేక సూచనలు కలవు (యెష 19-20, 45¹⁴ యిర్మీ 46 యెహె 29-32 కీర్త 68³¹ దాని 11⁴² యోవే 3¹⁹ జెక 14¹⁹).

**ఐగుప్తునది** (River of Egypt). ఈ నది లేక వాగు పలెస్తీనుయొక్క నైరృతి సరిహద్దియున్నది (ఆది 15¹⁸ సంఖ్యా 34⁵ యెహ 27¹² మొ॥). కొన్ని వాక్యములలో దీనికి విశేష పేరేమియులేక **నది** యనఁబడును (యెహె 47¹⁹ 48²⁸). ప్రస్తుతము అది వాడి-ఎల్-ఆరీషు (*Wady-el-Arish*) అనఁబడును. అది గాజాకు 50 మైళ్లు నైరృతిగా నున్నది.

**ఐగుప్తు పుండు.** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥

**ఐతియోపీయ** కూషు చూ॥

**ఐతియోపీయుడైన నపుంసకుడు** (The Ethiopian Eunuch). కార్య 8²⁶⁻⁴⁰ లో ఇతనిగూర్చి బైబిలునందున్నదానిని చదువవచ్చును. అతఁడు ఐతియోపీయ యనఁబడు కూషు దేశపు రాణియగు కందాకేయొక్క మంత్రి (కూషు చూ॥). ఫిలిప్పితనికి బోధించి బాప్తిస్మమిచ్చెను. ఈ సంగతి లూకా ఫిలిప్పువలనఁ దెలిసికొని (కార్య 21⁸) వ్రాసెనని యూహింపవచ్చును. సువార్త అన్యదేశములలో ప్రకటింపఁబడుటనుగూర్చిన చర్యలో నొక యారంభ విషయము.

**ఐతుకు** (Eutychus = అదృష్టవంతుఁడు). త్రోయ యూరి యౌవనస్థుఁడు. పౌలు తన మూఁడవ సువార్తయాత్రను ముగించి యెరూషలేమునకు పోవుచుండఁగా త్రోయ యను నితని యూరుచేరి యచ్చటి క్రైస్తవ భక్తబృందముమధ్య నొక వారమును గడిపెను. ఆదివారమురాత్రి భక్తులందరు నొక మేడగదిలో కూడుకొని పౌలు బోధను అర్ధరాత్రివఱకును వినుచుండఁగా కిటికీ సందులో కూర్చుండియుండిన ఐతుకు నిద్రభారమువలన జోగి మూఁడవ అంతస్థునుండి క్రిందపడి చనిపోయెను. అంతట పౌలు క్రిందికి వెళ్లి అతనిమీఁదపడి కౌగిలించుకొని అతని ప్రాణము తెప్పరిలఁజేసెను (కార్య 20⁹). M.

**ఐదవనెల ఉపవాసము** పండుగలు III 3 (1) చూ॥

**ఐనెయ** (Æneas). లుద్దలో ఎనిమిది సంవత్సరములనుండి పక్షవాతముచే బాధనొందుచుండిన యొక రోగి. పేతురు వీనిని యేసు నామమున స్వస్థపఱచఁగా ఆ ప్రాంతములయందున్న సంఘము మిగుల వృద్ధినొందెను (కార్య 9³²⁻³⁵).

**ఐనోను** (Ænon = ఊటలు). బాప్తిస్మమిచ్చు యోహాను బాప్తిస్మమిచ్చిన స్థలము (యోహా 3²³). అది సలీముదగ్గఱ నుండెను (సలీము చూ॥).

## ఒ

**ఒంటె** (Camel). ఒంటెలను గూర్చిన సూచనలు పాతనిబంధనయందు పెక్కులు గలవు. పూర్వకాలమునందు ఇశ్రాయేలీయులును, వారి చుట్టునుండువారును సంచరించుచుండువారగుటచే వీటిని వాహనములుగా వాడిరి. ఇవి మిగుల సాధువులగు జంతువులగుటచే ఆ పనికి మిగులఁదగినవి. బైబిలు ప్రదేశములగు ఐగుప్తు సిరియ మొదలగు దేశములలో దానిని నేటివఱకు అటులనే వాడెదరు. అబ్రాహాము యోబు దావీదు అను భక్తుల చరాస్థిలో ఒంటెలును గణింపఁబడెను (ఆది 12¹⁶ యోబు 1³ 42¹² I దిన 27³⁰). రిబ్కా ఒంటెమీఁద ప్రయాణముజేసెను (ఆది 24⁶¹). ఈ మృగము నీరు త్రాగకుండనే ఒక వారమువఱకు పోఁగలదు కావున అది నీరులేని యెడారులలో ప్రయాణము చేయవలసినవారికి మిగుల ఉపయోగకరముగా

నున్నది. వర్తకులు తమ శిబిరములలో వాటి నుపయోగించుచున్నారు. మిద్యానీయులు (న్యాయా 6[5]) కేదారువారు (యిర్మీ 49[29]) ఇతరులు (I రాజు 10[2] ఎజ్రా 2[67] యెష 60[6]) వాటి నుపయోగించినట్లు సూచనలున్నవి. పలెస్తీనులో దీనిని సాధారణమగు మోతపసుల కుపయోగించిరి (I సమూ 15[3] 30[17] I దిన 12[40] II రాజు 8[9]). పాల కొఱకును దీనిని పెంచిరి (ఆది 32[15]). గాని దాని మాంసము నిషిద్ధమై యుండెను (లేవీ 11[4] ద్వితీ 14[7]). దాని రోమములతో కంబళ్లు నేసిరి (II రాజు 1[8]). బాప్తిస్మమిచ్చు యోహాను అట్టి కంబళ్లు ధరించినవారిలో నొకడు (మ 3[4]).



ఒంటె

**ఒక్రాను** (Ochran = బాధపడువాఁడు). ఇశ్రాయేలీయులు అరణ్యములో నుండఁగా ఆషేరు గోత్రమునకు ప్రధానియగు పగీయేలు తండ్రి (సంఖ్యా 1[13] 2[27] 7[77] 10[26]).

**ఒట్టుబెట్టుకొనుట** ప్రయాణముచేయుట చూ॥

**ఒడ్డాణము** ఆభరణములు 25 చూ॥

**ఒత్ని** (Othni = దేవుని సింహము?). ఆలయపు ద్వారపాలకులలో నొకఁడు. లేవీయులయందలి కోరేయను వానితెగకు చేరిన షెమయా కుమారుఁడు (I దిన 26[7]).

**ఒత్నీయేలు** (Othniel = దేవునిసింహము). యెహోషువ కాలమునకుఁ దరువాత ఇశ్రాయేలీయుల నేలిన మొదటి న్యాయాధిపతి. కాలేబు తమ్ముఁడగు కనజుయొక్క కుమారుఁడు (న్యాయా 1[13]). దెబీరు పట్టణమును పట్టుకొని మిగుల శౌర్యము జూపినందున కాలేబు తన కుమార్తెయైన అక్సా నితనికిచ్చి వివాహము చేసెను (యెహో 15[16,17]). దేవునికి విరోధముగా పాపముఁజేసిన ఇశ్రాయేలీయులు అరాము రాజునకు లోఁబడి దాస్యముచేయు సమయమున గుణపడినందున, ఇతఁడు దేవుని సహాయమువలన వారిని విడిపించెను (న్యాయా 3[9]). ఇతఁడిశ్రాయేలీయుల నేలిన 40 సంవత్సరములు వారు దేవునికి విధేయులై వర్తిల్లిరి (3[7-11]). H.

**ఒనేసిఫోరు** (Onesiphorus = లాభకరుఁడు). ఎఫెసునందుండిన పౌలు స్నేహితులలో నొకఁడు. తా నెఫెసునందుండఁగా అతఁడు ఉపచారము చేసెనని అతనివిషయమై కృతజ్ఞతను చూపుచున్నాఁడు (II తిమో 1[16]). తిమోతికి పౌలు తన రెండవ పత్రికను పంపునపుడు ఒనేసిఫోరు ఇంటివారికి వందనములు (4[19]) చెప్పుటవలన అప్పటికి ఒనేసిఫోరు మరణమై యుండెనని నిశ్చయింతురుగాని, ఆయన రోమాలో పౌలు నొద్ద నుండినందున ఆయన అతనిపేరు విడిచి పెట్టెనని కొందఱి యభిప్రాయము. M.

**ఒనేసిము** (Onesimus = ప్రయోజకుఁడు). ఫిలేమోనను ఒకకొలొస్సయి పట్టణస్థునియొక్క దాసుఁడు. ఇతఁడు కొలొస్సయి యూరివాఁడు అని పౌలు కొలొ 4[9] నందు ఇతఁడు మీయొద్ద నుండి వచ్చినవాడే అని వివరించుటవలనవిశదమగును. ఇతఁడు బహుశః తనయజమానుని సొత్తు నపహరించి రోమాపురికి వచ్చి అక్కడ దాగి యున్నసమయమున ఏవిధముచేతనో పౌలును కలిసికొని ఆయన బోధమూలముగా క్రైస్తవుఁడాయెను. ఆమీఁదట అతఁడు కొంతకాలము పౌలుదగ్గరనే యుండి ఆయన కుపచారముచేసెను గాని అతని తనయొద్ద నుంచుకొనుట ధర్మము కాదనితలఁచి తిరుగ అతని యజమానునియొద్ద కతని పంపుటకు నిశ్చయించుకొనెను. పౌలు ఒనేసిము తనకు చేసిన యుపచారమునుబట్టి అతనివిషయమై ఫిలేమోనుకు సిఫారసు ఉత్తరమును వ్రాసి అతఁడు తనయెడల గలిగిన పరిచయమునుబట్టి ఒనేసిమును తిరిగి చేర్చుకొనవలెనని మనవిచేసి ఆ యుత్తర

మతనిచేతికిచ్చిపంపించెను (ఫిలే 10). ఫిలేమోను తిరుగ ఒనేసిమును చేర్చుకొనెనో లేదో తెలియదుగాని పురాతన యితిహాసములను చూడఁగా నితఁడు బెరయ సంఘాధ్యక్షుఁడని యొకగ్రంథమందు చెప్పఁబడెను. ఇగ్నేషియసు ఎఫెసు సంఘస్థులకు వ్రాయఁగా ఒనేసిమనుపేరుచే వారి సంఘాధ్యక్షుని ప్రస్తాపించెను. మఱియొక పురాతనగ్రంథమం దితఁడు రోమాపురమందు హతసాక్షియాయెనని యుదాహరించఁబడెను. M.

**ఒప్ని** (Ophni). బెన్యామీనీయుల యూళ్లలో నొకటి (యెహో $18^{23}$. పటము III F 5).

**ఒప్పుకొనుట** (Confession). ఇది, దేవుని యందు మనకుఁగలవిశ్వాసమును కనఁబఱచుటను గూర్చియు, పాపవిషయములో మనదుఃఖమును తెలియఁ బఱచుటను గూర్చియు వాడఁబడిన పదమై యున్నది.

I. విశ్వాసము నొప్పుకొనుట. సొలొమోను దేవాలయమును ప్రతిష్ఠించిన సమయమందు నీనామమును ఒప్పుకొనుట అనుమాటలను వాడియున్నట్లు పాఁతనిబంధనలో నున్నది (I రాజు $8^{33,35}$). II దిన $6^{24,26}$ లలో అసలు భాషయందదేమాట యున్నను, మన తెనుఁగు బైబిలులో దానిని నీనామమును స్తోత్రించుట అనుమాటలతో తర్జుమాచేసిరి. దేవునినిగాని ఆయన నామమునుగాని ఒప్పుకొనుట అనుమాటలు పాఁతనిబంధనలో నెక్కువగా లేకపోయినను దేవునియందు తమకుఁగల విశ్వాసమును భక్తులు తమమాటలతో తెలియఁబఱచుటనుగూర్చి ముఖ్యముగా దావీదుకీర్తనలలో బహు తేటగా నున్నవి (కీర్త $18^{2}$ $27^{1}$ $46^{1}$). విశ్వాసమును ఒప్పుకొనుటనుగూర్చిన దృష్టాంతములును వాక్యములును క్రొత్తనిబంధనలో నెక్కువగా నున్నయవి. బాప్తిస్మమిచ్చు యోహాను (యోహా $1^{34}$), ఫిలిప్పు ($1^{41}$), నతనియేలు ($1^{49}$) అనువారు ప్రభువైన యేసు క్రీస్తునునమ్మి తమ విశ్వాసమును కనఁబఱచిరి. ఫిలిప్పుదైన కైసరయ ప్రాంతములో పేతురు బహిరంగముగా క్రీస్తు దేవునికుమారుఁడని యొప్పుకొనెను (మ $16^{16}$). అతఁడు క్రీస్తునందు తనకు గల విశ్వాసము నొప్పుకొనఁగా అట్టివిశ్వాసము మీఁదనే తనసంఘము కట్టఁబడునను గంభీరమగు మాటలను క్రీస్తుపలికెను ($16^{17-19}$). క్రీస్తు ఇట్టి యొప్పుకోలునే కోరును ($10^{32}$). ఇట్టి యొప్పుదల రక్షణకు అవసరమని పౌలు వ్రాసెను (రోమా $10^{8-10}$). ఒకఁడు క్రీస్తును నిజముగా ఒప్పుకొనుటయే అతఁడు దేవుని యాత్మను పొందియున్నాఁడనుటకు తేటయైన నిదర్శనమై యున్నది (I కొరిం $12^{3}$ I యోహా $4^{2}$). దేవుఁడు మనయందును మనము దేవునియందును నున్నవారమని యందువలన తెలియును (I యోహా $4^{15}$). ఆయన సజీవుఁడగు దేవునికుమారుఁడగు క్రీస్తు (మ $16^{16}$ I యోహా $4^{15}$) అనునదే మనము క్రీస్తునుగూర్చి యొప్పుకొనవలసిన అన్నిఁటిలో ముఖ్యమైన యొప్పుదలయై యున్నది. మఱియు యేసుప్రభువనికూడ మనమొప్పుకొనవలెను (ఫిలి $2^{11}$). క్రీస్తుపేరట బాప్తిస్మమొందుటకుఁగల భావమిదియే (కార్య $8^{16}$). అదియుఁగాక యేసుక్రీస్తు శరీరధారియై వచ్చెననికూడ మనమొప్పుకొనవలెను (I యోహా $4^{2,3}$).

II. పాపము ఒప్పుకొనుట. పాఁతనిబంధన యాచారములలోను కీర్తనలలోను ప్రవక్తలగ్రంథములలోను ఇది చాల ముఖ్యవిషయముగా నున్నది. ప్రధానయాజకుఁడు తనస్వంత పాపములను ఒప్పుకొనుటకును (లేవీ $5^{1-5}$ $26^{40}$), ప్రజలపాపముల నొప్పుకొనుటకు తగిన యాచారములు కలవు. మఱియు భక్తులు తమ పాపములను తమ ప్రజల పాపములను ఒప్పుకొనినట్లు చాల దృష్టాంతములున్నవి (ఎజ్రా 9 నెహె 9 దాని 9). పాపక్షమాపణ నొందుటకు పాపము నొప్పుకొనుట అత్యవసరమని పాఁతనిబంధనవలనకూడ తెలిసికొనఁగలము (లేవీ $5^{16}$ కీర్త $32^{6}$ సామె $28^{13}$).

పాపమును ఒప్పుకొనుట యను మాటలు క్రొత్త నిబంధనలో కొన్నిపర్యాయములు మాత్రము కనఁబడినను (మ $3^{6}$ మా $1^{5}$ యాకో $5^{16}$ I యోహా $1^{9}$), పాపము నొప్పుకొనుటనుగూర్చిన సంగతి అనేకపర్యాయములు కనఁబడును. క్షమాపణను కోరినయెడల మన పాపములను ఒప్పుకొనవలెనను బోధ తేటగా నున్నది (లూ $18^{10-14}$ I యోహా $1^{9}$).

మనము దేవునికి మనపాపముల నొప్పుకొనవలెనను సంగతి మ $4^{17}$ మా $1^{15}$ $11^{31,32}$ $24^{47}$

లోను ప్రభువుప్రార్థనలోని యైదవమనవిలోను (మ $6^{12}$ లూ $11^{4}$), తప్పిపోయినకుమారుని గూర్చిన యుపమానములోను ($15^{17-21}$), పరిసయ్యుడు సుంకరి యనువానిని గూర్చిన యుపమానములోను ($18^{10-14}$) తేటగా బోధింపఁబడి యున్నది.

మనము ఎవరియెడల తప్పుచేసియున్నామో వారికికూడ మన పాపములను ఒప్పుకొనవలెను (మ $5^{23,24}$). ఇట్లు ఒప్పుకొనుటయే మనుష్యులలోకూడ క్షమాపణకు మార్గమై యున్నది (లూ $17^{4}$). మన యాదరణ నిమిత్తమును ఒకరికి నొకరము మనపాపముల నొప్పుకొనవలెను (యాకో $5^{16}$).

**ఒఫ్రా** (Ophrah = జింక).

1. బెన్యామీను గోత్రభూమిలో నున్న ఒక యూరు (యెహో $18^{22}$ I సమూ $13^{17}$). ఇది బేతేలుకు తూర్పుగా 5 మైళ్లదూరములో నున్నదని క్రీ॥ శ॥ 2 శతాబ్దమందు వ్రాయఁబడిన గ్రంథములో (*Onomasticon*) నున్నది గాని దానికి ప్రస్తుత సూచనలేవియు లేవు. (పటము III, F 5).

2. గిద్యోనుయొక్క జన్మస్థానము (న్యాయా $6^{11,24}$ $8^{26,32}$ $9^{5}$). అది మనష్షేగోత్రభూమిలో నుండెనుగాని దానికి ప్రస్తుతసూచన లేవియు లేవు.

3. యూదా వంశస్థులలో నొకఁడు (I దిన $4^{14}$).

**ఒమ్రీ** (Omri = యెహోవా యొక్క దాసుఁడు?).

1. ఇశ్రాయేలువారి రాజులలో నాఱవ వాఁడు. అతఁడు తనపేరును సార్థకముచేసి కొన్నవాఁడు కాదు. తనకుముందుండిన రాజులకన్న ద్రోహిగా నడుచుకొనెను. అతఁ డట్టి దుష్టుఁడగుటచే ఒమ్రీకట్టడల ననుసరించుట యనునది మతభ్రష్టత్వమును సూచించుటకు వాడుక మాట యయ్యెను (మీకా $6^{16}$). రాజ్యమునకు వచ్చిన 6 సం॥ లకు పిదప తిర్సాకు బదులుగా షోమ్రోనుకొండను షెమెరనువానియొద్ద కొని షోమ్రోనను పట్టణమును కట్టించి దానిని రాజధానిగ జేసెను. ఇశ్రాయేలువారి రాజ్యము నాశనమగునంతవఱకు అదేరాజధానిగ నుండెను. ఒమ్రీ 12 సం॥ లేలినపిదప చనిపోయెను. అతని కుమారుఁడగు అహాబతనికి మాఱుగా రాజాయెను (I రాజు $16^{15-28}$. అహాబు చూ॥)

2. బెన్యామీను మనుమలలో నొకఁడు (I దిన $7^{8}$).

3. యూదా వంశమునందు ఇమ్రీయను వాని కుమారుఁడు (I దిన $9^{4}$).

4. రాజైన దావీదుయొక్క అధిపతులలో నొకఁడు (I దిన $27^{18}$). H.

ఒర్నాను అరౌనా చూ॥

**ఒలీవలకొండ** (Mt. of Olives). యెరూషలేమునకు తూర్పుగా నున్న యొక కొండ. ఇది కిద్రోను వాగునకావల యెరూషలేము పట్టణపుగోడకు అర్ధమైలుదూరములో నుండును. పూర్వమునుండి దానిమీఁద ఒలీవచెట్లు విస్తారముగా నుండినందున అది ఒలీవకొండ యనఁబడెను. దావీదురాజు తనమీఁద తిరుగఁబడిన తనకుమారుఁడగు అబ్షాలోము ఎదుటనుండి పారిపోవునపుడు ఏడ్చుచు ఆ కొండనెక్కి దానిదాటి అరణ్యమునకు పారిపోయెను (II సమూ $15^{30}$). నెహెమ్యా కాలములో ఇచటనుండి చెట్లకొమ్మలను తెచ్చి పర్ణశాలలను కట్టుకొనినట్లున్నది (నెహె $8^{15}$). యెహెజ్కేలు ($11^{23}$) జెకర్యా ($14^{4}$) యను ప్రవక్తలు యెరూషలేమునుగూర్చి ప్రవచింపఁగా ఈకొండ పేరెత్తిపలికిరి.

ఆ ఒలీవకొండయొక్క తూర్పు అంచున బేతనియ యను ఊరుగలదు. ఆ యూరివాఁడైన లాజరు చనిపోఁగా యేసు అతనిని మృతులలోనుండి లేపెను. యెరూషలేమునుండి బేతనియకు పోవుదగ్గఱిమార్గము ఈ కొండమీఁదుగా పోయెను. ఈకొండకు ఉత్తరపు అంచునపోవు మఱియొక చుట్టుత్రోవను గలదు. తన మరణమునకు ఐదుదినములుముందు ప్రభువైన యేసు ఆ చుట్టుత్రోవను తన శిష్యసమూహముతో వెళ్లుచు అచ్చట నున్న యొక బండవెనుకనుండి యెరూషలేమువైపు చూచి దానికి రాఁబోవు గొప్పనాశనమును గూర్చి ప్రలాపించెను (లూ $19^{29-41}$).

ఆ కొండ శిఖరము యెరూషలేములోని దేవాలయముకంటె 200 అడుగుల యెత్తుగలది.

దానిమీఁద నిలిచినయెడల యెరూషలేము పట్టణము యావత్తును యూదయ దేశమందలి గొప్ప భాగమును తేటగా కనఁబడును.

యేసుక్రీస్తు అనేకసార్లు తన శిష్యులను వెంటఁబెట్టుకొని ఆ కొండకు వెళ్లెను (లూ 22[39] యోహా 18[1]). దేవునిరాజ్యమునుగూర్చియు తనకు కలుగఁబోవు శ్రమలనుగూర్చియు లోకాంతమును గూర్చియు మాట్లాడిన దీ కొండమీఁదనే (మ 24[3]).

ఆ కొండయొక్క పడమటియంచున యెరూషలేమున కెదురుగా గెత్సేమనే అను నొక తోఁట యుండెను. సిలువవ్రానుమీఁద కొట్టఁబడక మునుపటిరాత్రి ప్రభువుభోజన సంస్కారము నేర్పాటుచేసిన పిమ్మట యేసు తన శిష్యులను వెంటబెట్టుకొని, ఆ తోఁటలోకివెళ్లి (మ 26[30]) అధికవేదనపొంది రక్తపుచెమట గార్చి ప్రార్థించెను (లూ 22[39-44] గెత్సేమనే చూ॥). ఈ కొండమీఁద నుండియే ఆయన తన శిష్యులనుండి ప్రత్యేకింపఁబడి ఆకాశమున కెక్కెను (కార్య 1[12]).



ఒలీవలకొండ

**ఒలీవచెట్టు** (Olive Tree). దక్షిణయిండియా దేశమునందు చింతచెట్లంత విశేషముగా పలెస్తీను సిరియా దేశములయందు ఒలీవచెట్లుండును. ఈ వృక్షమంతయు బుడుపులతోను ముడులతో నిండియుండును. పెద్దపెద్ద వృక్షములబోదె సాధారణముగా బోలుగా నుండును. పలెస్తీను లోని ప్రతిపట్టణము ప్రతిగ్రామ సమీపములయం దీ వృక్షపుతోపులు గలవు. దీనిపుష్పములు చిన్నవైనను తెల్లగానుండి గుత్తులు గుత్తులుగా కనఁబడును. అవి రాలిన వెంటనే (యోబు 15[33]) నిలువు వాటముగా నుండు కాయలు కనుపించును. బాగుగా పండినప్పుడు నల్లగా నుండి ఒలీవపండ్లు నూనెతో నిండి యుండును. ఈ తోపుల యజమానులు సాధారణముగా నవెంబరుమాసములో చెట్లపండ్లను, పొడుగాటి వెదురు కఱ్ఱలతో రాలఁగొట్టెదరు (ద్వితీ 24[20] యెష 24[13]). ఒలీవకాయలను ఉప్పునీట నూరవేసి రొట్టెతోఁ గలుపుకొని తిందురు. పండ్లను రాతి గానుగలయం దాడించి నూనె తీయుదురు (యోవే 2[24] 3[18]). ఈ నూనెను ముఖ్యముగా భోజనమున కుపయోగించిరి (సంఖ్యా 11[8] ద్వితీ 12[17] I రాజు 17[12] II దిన 2[10] యెహె 16[13]). మందుకును వాడిరి (లూ 10[34] యాకో 5[14]). అభ్యంగనమున కుపయోగించిరి (కీర్త 23[5] 92[10] మ 6[17]). బైబిలునం దుదాహరింపఁబడిన వృక్షములలోనిదే మొదటిది (ఆది 8[11]). యోతామీచెట్టును వృక్షరాజముగా నెంచెను (న్యాయా 9[8]). ఇది సమాధానమునకు సూచనగా నుండెను (కీర్త 52[8] 128[3]). అన్నిఁటిలో మిగుల శృంగారమైన వృక్షముగా నెంచిరి (యిర్మీ 11[16] హోషే 14[6]). తోఁటల

యందు పెంచఁబడక అరణ్యములలో స్వయముగా నెదిగెడివాటికి **అడవి ఒలీవ వృక్షములని** పేరు (రోమా 11[17] హెబ్రీ 8[15]). యెష 41[20] లో నుండు **తైలవృక్షము** అనునది ఈ చెట్టు నకే మఱియొక పేరు. J. C.



ఒలీవ పండ్లు

**ఒలుంపా** (Olympas). రోమాలోని క్రైస్త వులలో నొకఁడు. పౌలితనికి సలాములు పంపెను (రోమా 16[15]).

**ఒహాలా, ఒహొలిబా** (Oholah and Oholibah). యెహెజ్కేలు 23 వ అధ్యాయములో నున్నట్లు షోమ్రోనుకును యెరూషలేముకును పెట్టఁబడిన యలంకార నామములు. ఈ రెండు దేశములును చెడిపోయిన యిద్దఱు స్త్రీలవలె దుర్మార్గతలను చేసియున్నట్లు వివరింపఁబడెను. ఒహొలా అనఁగా డేరా యనియు, ఒహొలిబా యనఁగా ఆమె డేరా యనియు అర్థము. ఆ కాలములో డేరాలలో వ్యభిచార సంబంధమగు దుర్మార్గతలు సాధారణముగా జరుగుటచే ఆ దేశములవారి కీపేరులు పెట్టఁబడెను.

## ఓ

**ఓగు** (Og = దీర్ఘదేహి). బాషాను దేశపు రాజు. అమ్మోనీయుల రాజగు సీహోనుతో సంధికుదుర్చుకొని, మోషేతో యుద్ధముఁ జేసి ఎద్రెయి యొద్ద పూర్ణముగా నోడిపోయెను (సంఖ్యా 21[12]). ఇదియు అష్తారోతును ఓగు యొక్క రాజ్యమందలి ముఖ్యపట్టణములు (యెహో 13[22]). రఫాయీయు లనఁబడిన వారిలో మిగిలిన యితఁడు మిగుల దీర్ఘదేహియై యుండెను (ద్వితీ 3[11]). అతని యనుపమంచ మనఁబడిన ఒక నల్లరాతిగోరీని అమ్మోనీయుల రబ్బాలో చూపించెడివారు. అతని జయించుట దైవికమని ఎల్లప్పుడును ఇశ్రాయేలీయులు ఎంచిరి (కీర్త 135[11] 136[20] నెహె 9[22]).

**ఓజనీ** (Ozni = శ్రద్ధ). గాదుగోత్రములోని ఓజనీయులనువారి మూలపురుషుఁడు (సంఖ్యా 46[15]). ఆది 46[60] నం దితనికి ఎస్బోను అను మాఱుపేరుగలదు (ఎస్బోను 1 చూ॥).

**ఓజెము** (Ozem = బలముగల).

1. యెష్షయి కుమారులలో నాఱవవాఁడు. దావీదుయొక్క అన్నలలో నొకఁడు (I దిన 2[15]).

2. యూదా సంతతివారిలో యెరహ్మెయేలు తెగలో నొకఁడు (I దిన 2[25]).

**ఓడలు, పడవలు, నావలు** (Ships, Boats).

1. ఆదిచరిత్రయందలి ఓడలు. నోవహు కట్టించినదానికిగాక మఱియేయోడకును బైబిలు నందు ఆదిచరిత్రలో సూచనలులేవు. అది కట్టఁబడినవిధము ఆది 6[13-16] నందున్నది. అది తేలునట్లేగాని ప్రయాణార్థమై ఉద్దేశింపఁబడ నందున పెట్టెరీతిగా నున్నది.

2. ఇశ్రాయేలీయుల చరిత్రయందు కనఁబడు ఓడలు. ఇశ్రాయేలీయులు మధ్యధరా సముద్రము దగ్గరనున్నను, ఆసముద్రపురేవులుమాత్రము ఫేనీకే వారి వశమున నుండెను. ఇశ్రాయేలీయులు ఓడలను కట్టించుకొని నడిపిన సూచనలులేవు. ఫలెస్తీనుకు దక్షిణమున దానుగోత్రీకులును ఉత్తరమున ఆషేరుగోత్రీకులును సముద్రమునకు సమీపమందుండినందున చేఁపలనుపట్టుకొనుటకు పడ

వలను వాడినట్లు సూచనలున్న వేగాని, సముద్రము మీఁద వ్యాపారాములను చేయుటకు ఓడలను కలిగియున్నట్లు గానరాదు. అదేరీతిగా గలిలయ సముద్రమువగ్గరనున్న జెబూలూను ఓడలకు రేవుగా నున్నట్లు కనఁబడును (ఆది 49[13]). సొలొమోను కాలమునకుఁ బూర్వము ఓడలనుగూర్చిన సూచనలిట్లున్నను, రాజులకాలమునందు మాత్రమే వారు వ్యాపారాదులకై వాటిని కట్టింపనారంభించిరి. ఆలయమును, రాచనగరులను కట్టించుటకు కావలసిన కలపను ఫేనీకేనుండి తేవలసియున్నందున, మ్రానులను **తెప్పలు**గాఁ గట్టించి వాటిని పలెస్తీనునందున్న యొప్పేరేవుకుఁ దెచ్చిరి (I రాజు 5[9] 2[3-18]). ఇట్లు మధ్యధరా సముద్రమువ సముద్రప్రస్తకము నారంభించునప్పుడే, ఎఱ్ఱ సముద్రమున కుత్తరభాగమందలి అకాబా సంయుక్తాగ్రగుడము అను తూర్పుపాయకు రేవు పట్టణమైన ఎసోన్గెబెరునందును ఓడలనుకట్టించి, బంగారమును, ఇతర వస్తువులను దెచ్చుటకై, హిందూదేశమువఱకు వాటిని సొలొమోను పంపించెనని యభిప్రాయపడుచున్నారు (I రాజు 9[26-28] 10[22]). యొర్దాను నదిని దాటుటకు **రేవు పడవ** నుపయోగించినట్లు II సమూ 19[18] వలనఁ దెలియుచున్నది.

సొలొమోను తదనంతరము రాజ్యము భాగింపఁబడుటచేత ఈ వ్యాపారము లాగిపోయినను, యెహోషాపాతు కాలమునందు మఱల నారంభింప యత్నించిరిగాని, అతఁడు కట్టించినయోడలు పగిలిపోయెను (I రాజు 22[48,49]). మక్కబీయుల కాలమునందు సీమోను మక్కబీ యనువాఁడు యొప్పేపట్టణమును రేవుపట్టణముగాఁజేసి (I మక్క 14[5]), యుద్ధనావలను వాడినట్లు (1[17] 15[3]) తెలియుచున్నది. అవి తెడ్లచే నడుపఁబడినందున **తెడ్లయోడ** లనఁబడెను. ఆ పదమును యెష 33[21] నందు యుద్ధమునకు సూచనగా వాడినందున, ఆ కాలమునుండియే అట్టి యుద్ధనావ లున్నట్లు కనఁబడును.

3. పాఁతనిబంధన కాలమునందు ఇతరజనుల ఓడలనుగూర్చిన సూచనలు. పలెస్తీనుకు దగ్గరగా నున్నవారిలో ఫేనీకేవారు సుప్రసిద్ధులగు నావికులు, వారియోడలు స్పేను (*Spain*) దేశము వఱకు ప్రయాణముజేసెను. ఆ దేశమందున్న తర్తెస్సస్ (*Tartesos*) అను స్థలమునుబట్టి ఆ యోడలకు **తర్షీషు ఓడలు** అను పేరు గలిగెను. అవి మిగుల దూరప్రయాణముచేయుట కనువగు రీతిని కట్టఁబడినందున, దూరభారమనక ప్రయాణముచేసెడివాటి కిది సార్థకనామమయ్యెను. ఇట్టి యోడలు మానవవైభవమునకు సూచనలాయెను (కీర్త 48[7] యెష 2[16]). యోనా యిట్టియోడ నెక్కి పారిపోవ యత్నించెను (యోనా 1[3]). పారసీకసంయుక్తాగ్రగుడము మీఁదుగా వర్తక వ్యాపారాదులను నడుపుటకై యిట్లు బాబెలు దేశస్థులు ఓడలను కట్టించిరి. అవి మిగుల గొప్పవి యగుటచేత **అతిశయాస్పదములగు ఓడలు** అని యెషయా వాటికి పేరుబెట్టెను (యెష 43[14]). ఐగుప్తుదేశపు నని కాలువలమీఁద వారు **జమ్ము పడవలను** వాడిరి (యెష 18[2]). అసలుభాష యందలి యీ పదమునే యోబు 19[26] నందు **రెల్లుపడవలని** తెనిఁగించిరి. ఐగుప్తీయులకు గొప్పపడవలున్న సూచనలు బైబిలునం దుదాహరింపకపోయినను, వాటికి వేయఁబడు గొప్ప తెర చాపలను సూచనలు కనఁబడుటచేత వారు కట్టివి యున్నవని ఊహింపవచ్చును (యెహె 27[7]).

4. ఓడలకు సంబంధించిన అలంకారప్రయోగములు పాఁతనిబంధనయందు విశేషముగా లేకున్నను అచ్చటచ్చట కొన్ని యగపడుచున్నవి. యెష 33[23] నందు ఇశ్రాయేలు బ్రద్దలైనయోడకు పోల్చఁబడెను. యెహె 27[4-11] లో తూరును ప్రవక్త ఒక యోడకు సరిపోల్చి వివరించెను. ఆ వివరమునందు ఓడలోని ఆయా భాగములన్ని యుదాహరింపఁబడియున్నవి. కీర్త 107[23-27] నందు తుఫానునందు చిక్కుకొనిన ఓడలోనున్న వానియనుభవము వివరింపఁబడెను. సముద్రమున సంచరించుట కుద్దేశింపఁబడినవాటిలో ఓడలు నున్నట్లు కీర్త 104[26] నందున్నది.

5. క్రొత్త నిబంధనయందు వచ్చు ఓడలుగాని క్రీస్తుచరిత్రకు సంబంధముగా గలిలయ సముద్రములోను, పౌలుచరిత్రకు సంబంధముగా మధ్యధరాసముద్రములోను తిరిగినట్లు చూడవచ్చును.

1. గలిలయ సముద్రముమీఁద నున్న పడవలను చేపలుపట్టుకొనుటకును, దానిచుట్టునున్న ఊళ్ల సరకులను మనుష్యులను ఒకదిక్కునుండి మఱియొక దిక్కునకు తోడుకొని పోవుటకు నుపయోగించిరి.

క్రీస్తు శిష్యులలో కనీసము నలుగురు జాలరులై యుండిరి (లూ 5[1-11]). ఇవి ప్రస్తుత మా సరస్సు మీఁద వాడుచున్న పడవలవంటివి. ఈ పడవ లన్నియు నొక్కటే పరిమాణముగలవికావు. గలిలయ సముద్రముమీఁదవాడిన పడవలను **దోనెలు** అని తెనిఁగించినను (మ 4[21-22] మా 1[19] 4[35] మొ॥) ఆ మూలపదమే ఇతరస్థలములలో పెద్దయోడలను సూచించును (కార్య 20[13] యోనా 3[4] ప్రక 18[19] మొ॥). యోహా 6[22,23] లోను కొన్ని ప్రతులలో మా 4[36] లోను చిన్నపడవను సూచించు పై మాటకు వేఱురూపమునువాడి దాని **చిన్నదోనె** యని తెనిఁగించిరి.



రోమీయుల ఓడ

2. పౌలు మిషనేరి ప్రయాణములను జేయు నప్పుడు అనేకమారులు ఓడల నెక్కవలసి వచ్చెను (కార్య 13[4,13] 14[26] 16[11] 18[21] 20[13-15] 21[1-8]). వీటినిమాత్రమే గాక ఇంకను సముద్రముమీఁద ప్రయాణములను జేసినట్లు ఆయా సూచనలవలనఁ దెలియుచున్నది. ఆ కాలముననుండిన యోడలు చిన్నవి యగుటచేత ప్రయాణము బహు అపాయకరముగా నుండెను. "ముమ్మారు ఓడపగిలి శ్రమ పడితిని ఒక దివారాత్రము సముద్రములో గడిపితిని" అని పౌలు II కొరి 11[25] నందు వ్రాయుచున్నాఁడు. పౌలు కైసరయనుండి పొతియొలీకి చేసిన ప్రయాణమునందు లూకాయు నుండుట చేత నది అన్నిఁటికన్న వివరముగా వ్రాయఁబడి యున్నది (కార్య 27). అతఁడా ప్రయాణము నందు మూఁడు ఓడల నెక్కవలసి వచ్చెను. వాటిలో రెండవ ఓడనుగూర్చిన వివరమున్నది. అది అలెక్సంద్రియనుండి ధాన్యమును దెచ్చిన యోడయై యున్నది (27[6]). అందులో 276 ప్రయాణము చేయుటవలన అది పెద్దదియని తెలిసికొనవచ్చును (27[37]). అది తెడ్లవలనఁగాక తెర చాపలమూలమున గాలికి నడిపించఁబడెను. ప్రస్తుతపు నావికు లీ ప్రయాణ వివరమును చదివి గాలికి నడిపింపఁబడు ఓడలను స్వాధీనపఱచుకొనుటలో అప్పటికాలపువారు చాల ప్రవీణులని యొప్పుకొందురు. ఆ యోడకు సంబంధించిన ఈ దిగువ సామానులు ఆ వివరమునందు కనఁబడును.

(*a*) **లంగరులు.** వీటిని మొదట ఓడమీఁద నుంచిరిగాని (27[29]) తరువాత దానిని తేలిక చేయుటకు సముద్రములోకి దింపిరి (27[40]).

(*b*) **చుక్కాని** ఓడను ఆయా దిక్కులకు త్రిప్పుటకైన సాధనము (27[40]). ప్రస్తుతము చిన్న పడవలలో చేయుచున్నట్లు పూర్వము వీటికొఱకు తెడ్లనువాడిరి.

(*c*) **తెరచాప.** ఈ వివరమునందు ఓడ మధ్యనుండు ముఖ్యమైనదానినిగూర్చిన సూచనలు లేకపోయినను 27[40] నందు **ముందటి తెరచాప** అనుదానికి సూచనగలదు. పెద్ద యోడల కిది యుండునుగాని చిన్నవాటి కుండదు.

(*d*) **పడవ** అవసర సమయములయందు వాడుటకై ప్రస్తుతమున ఓడలమీఁద కొన్ని పడవ లుంతురు. పూర్వమున ప్రతియోడకు ఒకదాని మాత్ర ముంచుకొనిరి. దానినైనను ఓడమీఁద నుంచక నీటియందుండి ఓడ వెంట వచ్చునట్లు దానికి కట్టెడివారు. కార్య 27[16] లోని పడవ యిట్టిదే. దానిత్రాడు తెగునేమో యను భయముచే నావికులు దాని నోడమీఁద నెక్కించిరి. తరువాత నావికులు పారిపోవుటకై దానిని దింపఁబోఁగా పౌలువారి యత్నమును గ్రహించినవాఁడై రాణువవారితో చెప్పినప్పుడు వారు దాని త్రాళ్లు కోసి సముద్రమునందు పడవేసిరి (27[30]).

(*e*) **త్రాళ్లు** కట్టి ఓడను బిగించిరను మాటలను చూడఁగా వారు **తమయోడ** పగలకుండు

నట్లు దానిచుట్టును త్రాళ్లను కట్టిరని తెలియుచున్నది (27[17]). అట్లు చేయుట పూర్వమున వాడుక. ఇప్పుడు సహా ఒకానొకప్పుడు ఆపత్కాలమున నట్లు చేతురు.

(*f*) ఈ వివరమునందు ఓడయొక్క **అమరము** ( = వెనుకటి భాగము), **అనివి** (=ముందు భాగము) అని నావికులు వాడుకొను పదము లున్నవి (27[41]).

(*g*) నావికులు సముద్రపు లోతును తెలిసికొనుటకు **బుడుదు**వేసి చూచునట్లు **27[28]** వలన తెలియుచున్నది. సీసపుగుండు నొకదానిని త్రాటికికట్టి నేటివఱకు లోతును కొలిచెదరు.



రోమీయుల యుద్ధనావయొక్క అనివి

ఈ యోడ పగిలినపిమ్మట కొన్ని మాసములకు వారు మఱియొక ఓడనెక్కి ప్రయాణము చేసిరి. దానికి అశ్వినీ దేవతల చిహ్నములుండెను. పూర్వకాలమున నట్టి చిహ్నములను ఓడల ముందు భాగమున పెట్టుట వాడుక. అలెక్సంద్రియ నుండి ఇటలీకి ధాన్యమును గొనితెచ్చిన ఈ యోడలవివరము కార్యములలో మాత్రముగాక ఇతర గ్రంథములలోకూడ కొంతమట్టుకు గలదు. అవి షుమారు 180 అడుగుల పొడవును 45 అడుగుల వెడల్పునుగల ఓడలై యుండినట్లు తెలియుచున్నది.

6. ఓడలకు సంబంధించిన అలంకార ప్రయోగములు కొన్ని క్రొత్త నిబంధనయందును గలవు. క్రైస్తవుల నిరీక్షణ లంగరుకు పోల్చఁబడెను (హెబ్రీ 6[19]). ఇది మనలను స్థిరపఱచునదగుటను సూచించును. ఓడను ఇటు అటు త్రిప్పు చుక్కానివంటిదని నాలుకనుగూర్చి చెప్పఁబడెను (యాకో 3[4,5]).

**ఓడెకరుకు** పక్షులు 2 చూ॥

**ఓదేదు** (Oded = తిరిగి చేర్చెను).

1. ప్రవక్తయైన అజర్యాయొక్క తండ్రి (II దిన 15[1]). II దిన 15[8] లో అజర్యాకు ప్రతిగా ఓదేదు అని పొరబాటుగా వ్రాసిరి.

2. షోమ్రోనువారు యూదావారిని జయించి బానిసెలుగా పట్టుకొనిపోవుచున్నపుడు అలాగున చేయఁగూడదని బుద్ధిచెప్పిన యొక ప్రవక్త. అతని బుద్ధిమాటలను వారు విని వారిని విడిచి పెట్టిరి (II దిన 28[9-11]).

**ఓనాను** (Onan=శక్తిగల). యూదా రెండవ కుమారుఁడు. ఇతఁడు తన అన్నయగు ఏరు చనిపోయినపిదప అతని భార్యకు సంతానాభివృద్ధి కలిగించుట తనకు విధ్యుక్త ధర్మమై యున్నను అట్లు జేయనందున దేవునిచే చంపఁబడెను. ఇది యతని తాతయగు యాకోబు ఐగుప్తుకు పోక పూర్వమే జరిగెను (ఆది 38[4-10] 46[12] సంఖ్యా 26[19] I దిన 2[3]).

H.

**ఓనాము** (Onam = బలముగల, స్థితిగల).

1. ఏశావు సంతతివారిలో నొకఁడు. అతఁడొక కుటుంబమునకు పెద్ద (ఆది 36[23] I దిన 1[40]).

2. యూదా గోత్రములోని యెరహ్మెయేలు సంతతివారిలో నొకఁడు (I దిన 2[26,28]).

**ఓను** (On).

1. ( = బలము) కోరహు తిరుగుబాటులో సహాయముచేసిన రూబేనీయులలో నొకఁడు (సంఖ్యా 16[1]).

2. ( = ఐగుప్తీయుల భాషల ఏ వెల్తురు). ఇది పూర్వకాలమందు ఐగుప్తు ఉత్తరపు భాగమున నొక ప్రసిద్ధపట్టణమై యుండెను. అది సూర్యుని ఆలయమునకు ఉనికియై యుండుటచే గ్రీకువారు దానికి సూర్యపట్టణము అను నర్థమిచ్చు హీలియొపొలి (*Heliopolis*) యను పేరుపెట్టిరి. యిర్మీ 43[13] లోని **సూర్యదేవతా పట్టణమి**దే. యోసేపు ఈ దేవత ఆలయపు యాజకుని కుమార్తెను పెండ్లిచేసికొనెను (ఆది 41[45,50] 46[20]). యెహెజ్కేలు ఐగుప్తునుగూర్చి ప్రవచింపఁగా ఈ పట్టణము పట్టుకొనఁబడునని తెలిపెను (30[17]). ప్రస్తుత మాపట్టణపు పాడుశేషములలో ఒక్క రాతి స్తంభముమాత్రమున్నది. ఇది 3900 సం॥ల క్రిందట ఎత్తఁబడెను.

**ఓనో** (Ono = బలముగల). బెన్యామీనీయుల యూళ్లలో నొకటి (I దిన 8[12]). దీని నివాసులలో కొందఱు చెఱనుండి తిరిగివచ్చిరి (ఎజ్రా 2[33] నెహె 7[37]). నెహెమ్యా విరోధులు అతనిని ఈ యూరి మైదానమునకు పిలిపించిరి (6[2]). ప్రస్తుతమున యొప్పేకు ఆగ్నేయముగా 7 మైళ్ల దూరములోనున్న కెఫర్ ఆనా (*Kefr-'Ana*) అనునదే దీనియునికియై యున్నది. (పటము III, D 4).

**ఓఫీరు** (Ophir = ఫలవంతము). యొక్తాను కుమారులలో నొకఁడు. అతని సంతానము నివసించిన ప్రదేశమున కీపేరు కలిగెను (ఆది 10[25-30]). ఇది రాజైన సొలొమోను బంగారమును తెచ్చుటకై తన యోడలను బంపిన దేశము (I రాజు 9[28] 10[11,22] II దిన 8[18] 9[10]). ఆ కాలమందీ దేశపు బంగారము శ్రేష్ఠమైనదని బైబిలులోని అనేక వచనములలో కనఁబడును (యోబు 22[24] 28[16] కీర్త 45[9] యెష 13[12] మొ॥). ఓఫీరు అను దేశ మెచ్చట నుండెనో నిశ్చయముగా తెలియదుగాని అది యెఱ్ఱసముద్రముద్వార ఓడలు పోవుచుండిన దేశమైయుండెను. ఏమనిన, ఎసోన్గెబెరునుండి సొలొమోనుయొక్క ఓడలు మూఁడు సంవత్సరముల కొకమాఱు వెండిని దంతమును కోఁతులను నెమలి పిట్టలను తీసికొనివచ్చుచుండెను (I రాజు 10[22] 9[26-28] II దిన 9[10]). ఓఫీరు దేశముయొక్క ఉనికినిగూర్చి మూఁడు వేర్వేఱు అభిప్రాయము లున్నవి. 1. అది అరేబియా దేశములోనుండినట్లు కొందఱనుకొందురు. ఎందుకనఁగా యొక్తాను కుమారుఁడగు ఓఫీరు సంతతివారు అరేబియాకు ఆగ్నేయదిక్కున నివసించి నందున ఆ ప్రదేశమున కాపేరు చెందెనని యూహింతురు. అది యిప్పటి ఏడెన్ (*Aden*) అను రేవుకు దగ్గరగానుండి యెఱ్ఱసముద్రపు ఓడలు చేరఁగల స్థలమైయుండెను. 2. అది ఆఫ్రికా ఖండమునకు ఆగ్నేయమున నుండెనని కొందఱనుకొందురు. ఆ యోడలచ్చటికికూడ చేరఁగలిగియుండెను. మఱియు ఆ కాలమందా ప్రదేశములోకూడ బంగారము దొరికెనని చెప్పుకొందురు. 3. అది యిండియాలో నుండెనని ప్రస్తుతకాలపు వేదశాస్త్ర పండితులను కొందురు. ఎందుకనగా ఆ యోడలు తెచ్చిన సరకులన్నియు ఇండియాదేశములో విస్తారముగా దొరుకును. అదియుగాక కోఁతులు నెమళ్లు మొదట హెబ్రీయులుండిన దేశములో నుండలేదు. హెబ్రీభాషలో వాటికి పేళ్లులేవు. గనుక అవి యే దేశములనుండి తెచ్చిరో ఆ దేశములలోని పేరులే హెబ్రీ బైబిలులో నుపయోగించిరి. ఇట్లు కోఁతికి కపి యనియు నెమలికి తోకై అను పేరులు హెబ్రీ బైబిలులో నచ్చటచట కనఁబడును (I రాజు 10[22]). ఇవి అరవభాషలోని పేరులు గనుక ఓఫీరుదేశము అరవభాషను మాటలాడు దేశమే యని యూహింతురు. కాఁగా ఓఫీరు దక్షిణ యిండియాలో నుండెనని వారు తీర్మానింతురు. ఇది నిజము కావచ్చునని తోఁచుచున్నది (మృగములు 21, పక్షులు 26, ఓడ, చందనపు మ్రాను చూ॥).

**ఓఫెలు యెరూషలేము** A IV 3 చూ॥

**ఓబద్యా** (Obadiah = యెహోవా సేవకుఁడు.)

1. ఒక ప్రవక్త. ఇతనిగూర్చి యేమియు తెలియదుగాని ఓబద్యా గ్రంథమునందు వ్రాయఁబడియుండిన మాటలును వాక్యములును యిర్మీయా ప్రవచన గ్రంథమునందు (యిర్మీ $49^{7-22}$) కనఁబడుటనుబట్టియు, యిర్మీయా తనకు ముందుండిన ప్రవక్తల వ్రాఁతలనెత్తి వ్రాయు వాఁడయి యుండుటను బట్టియు, కొందఱు పండితులు ఓబద్యా యిర్మీయా కన్న ముందుగా జీవించి వ్రాసెనని అభిప్రాయపడుచున్నారు. శత్రువులు కొందఱు యెరూషలేమును ముట్టడించి దోచుకొన్న సమయమున ఎదోమీయులు యూదులను పరిహసించిరి. కావున వారిద్వేషబుద్ధికి తగినశిక్ష కలుగునని యితఁడు ప్రవచించెను. (ఓబద్యా గ్రంథము చూ॥). J. C.

2. అహాబుయొక్క గృహ నిర్వాహకుఁడు. ఏలీయా ఇతనికి కరువు చివరిదినములలో కనఁబడెను (I రాజు $18^{3-16}$).

3. రాజగు సౌలు సంతతివారిలో నొకఁడు (I దిన $8^{38}$).

4. ఇశ్యాఖారు సంతతివాఁడు (I దిన $7^{3}$).

5. సిక్లగులో దావీదుతోఁ జేరిన గాదీయులలో నొకఁడు (I దిన $12^{9}$).

6. దావీదు కాలములో జెబూలూను గోత్రికులకు ప్రధానియగు ఇష్మయా తండ్రి (I దిన $27^{19}$).

7. జెరుబ్బాబేలు మనుమలలో నొకఁడు (I దిన $3^{21}$).

8. లేవీయులలోని మెరారీ తెగవారిలో నొకఁడు (II దిన $34^{12}$).

9. నెహె $11^{17}$ నందున్నట్లు అబ్దా యను మాఱుపేరుగలవాఁడు (I దిన $9^{16}$ అబ్దా చూ॥).

10. రాజగు యెహోషాపాతు యొక్క ఉద్యోగస్థులలో నొకఁడు (II దిన $17^{7}$).

11. ఎజ్రాతో యెరూషలేమునకు వచ్చిన వారిలో నొక కుటుంబపు పెద్ద (ఎజ్రా $8^{9}$).

12. నెహెమ్యా కాలమునందు నిబంధనకు ముద్రవేసినవారిలో నొకఁడు (నెహె $10^{5}$).

13. జెరుబ్బాబెలు కాలమునందు ద్వారపాలక కుటుంబములలో నొకదానికి పెద్ద (నెహె $12^{25}$).

**ఓబద్యా గ్రంథము** (Book of Obadiah). చిన్న ప్రవక్త లనఁబడిన గ్రంథములలో నాల్గవది. ఎదోము నాశనమునుగూర్చి మాత్రము దీనియందున్నది. ఆ గ్రంథమందున్న 21 వచనముల నీదిగువరీతిగా విభజింపవచ్చును.

1. ఎదోము నాశనమునుగూర్చి ప్రవచించుట వచ 1-9.

2. కారణము. ఎదోము సహోదరత్వమును పాటింపక ఇశ్రాయేలీయులయెడల నగుపఱచిన నిర్దయ, వచ 10, 11.

3. ఇశ్రాయేలీయులకు కలిగిన అప్పటి యిబ్బందులను చూచి, తామతిశయింపరాదని ఎదోమీయులను మందలించుట వచ 12-16.

4. ఇశ్రాయేలీయులు త్వరలో దేవునిదయను పొంది అప్పుడు వారి నావరించియున్న ఇబ్బందులనుండి తప్పించుకొని మునుపటికన్న నెక్కువగా నభివృద్ధి నొందెదరని ప్రవచించుట వచ 17-21.

ఇతర ప్రవచన గ్రంథములయందున్నట్లు (యెష $2^{12-21}$ $10^{12-19}$ యోవే $3^{12-21}$ ఆమో $9^{8-15}$ మీకా $4^{11-13}$) దేవునికి విరోధముగానున్నారు, యూదులుగాని అన్యులుగాని అందఱును లయమగుదినము వచ్చుననుసంగతి ఈ ప్రవచనము నందు ముఖ్యమైన దనవచ్చును (వచ 15). ఓబద్యా ఎదోమునకు విరోధముగా ప్రవచించుటవలనను, బాబెలు చెఱకాలమున ఎదోమీయులు ఇశ్రాయేలీయుల నెక్కువగా బాధింపచేసెను (కీర్త $137^{7}$), చెఱకాలమునందున్న ప్రవక్తలుకూడ ఇట్టి ప్రవచనములనే చెప్పుటచేతను (యిర్మీ $49^{7-22}$ యెహె $25^{12-14}$ 35), ఇతఁడు చెఱకాలమునందు ప్రవచించెనని సాధారణముగాఁ దలంచుచున్నారు. అది యంగీకరింపఁబడఁదగినదని ఒప్పుకొనవలసియున్నను, ఇతర సమయములలోను యెరూషలేమునకు ఇబ్బందులు కలిగెను. యెహోరాము కాలమునందు అరబ్బీయులు, ఫిలిష్తీయులును (II దిన $21^{16,17}$), అమజ్యాదినములలో పదిగోత్రములవారును (II రాజు $14^{14,17}$), ఆహాజు కాలములో దమస్కు పదిగోత్రములు ఫిలిష్తీ

యులు ఎదోమీయులనువారును (II దిన 28[18]) యెరూషలేమును ముట్టడించి ఇబ్బంది కలిగించిరి. వీటియందు ఆహాజుకాలము ఈ ప్రవచనములకు బహు సూటిగా సరిపోవుననవచ్చును.

**ఓబాలు** ఏబాలు 2 చూ॥

**ఓబీలు** (Obil = ఒంటెలను కాయువాడు). దావీదు సేవకులలో నుండిన యొక యిష్మాయేలీయుఁడు. ఇతఁడు దావీదుయొక్క ఒంటెలమీఁద అధికారియై యుండెను (I దిన 27[30]).

**ఓబేదు** (Obed = సేవకుఁడు).

1. బోయజుకు రూతువలన పుట్టిన కుమారుఁడు (రూతు 4[17]). ఇతఁడు దావీదుకు తాతయు క్రీస్తు పూర్వికులలో నొకఁడునై యుండెను (మ 1[5] లూ 3[32]).

2. యూదా సంతతివాడగు యెరహ్మెయేలీయుల కుటుంబికులలో నొకఁడు (I దిన 2[37]).

3. దావీదు యోధులలో నొకఁడు (I దిన 11[47]).

4. లేవీయులలో నొకఁడు. ఇతఁడు దేవాలయ ద్వారపాలకులలో నొకఁడై యుండెను (I దిన 26[7]).

5. రాణియైన అతల్యాను తీసివేసి యోవాషును రాజునుగా నియమించుటకై యెహోయాదాకు సహాయముచేసిన అజర్యా అను నొకని తండ్రి (II దిన 23[1]).

**ఓబేదెదోము** (Obed-edom = ఎదోము సేవకుఁడు).

1. రాజైన దావీదు కాలమునందున్న యొక గిత్తీయుఁడు. కిర్యత్యారీమునందు అబీనాదాబు ఇంటినుండి యెరూషలేమునకు యెహోవా మందసమును ఎత్తుకొనివచ్చుటకు దావీదు ప్రయత్నము చేసినప్పుడు కొంతమారము వచ్చిన తరువాత అతఁడు భయపడి ఓబేదెదోము ఇంటియందు దానిని మూఁడు నెలలవఱకుంచెను. ఓబేదెదోము దాని నతి జాగ్రత్తతోను భయభక్తులతోను కాపాడినందున దేవుఁ డతనిని అతని యింటివారిని సంపూర్ణముగా నాశీర్వదించెను. ఆ తరువాత దావీదు భయమువిడిచి దానిని యెరూషలేమునకుఁ దెచ్చుకొనెను (II సమూ 6[1-12]).

2. లేవీయులలోని ద్వారపాలకులలో నొకఁడు. దావీదు మందసమును యెరూషలేమునకు దెచ్చుచుండగా దానిముందర వెళ్లిన నాయకులలో నొకఁడై యుండెను (I దిన 15[18,24] 16[38] 26[4,8,15] II దిన 25[24]). పైన 1 యందుదాహరింపఁబడినవాఁడును ఇతఁడును ఒకఁడే కావచ్చును.

3. చెఱకాలమునకు ముందు సంగీతనాయకులలో నొక కుటుంబికుఁడు (I దిన 15[21] 16[5]).

**ఓబోతు** (Oboth = తిత్తులు). ఇశ్రాయేలీయులు అరణ్యములో మకాముచేసిన స్థలములలో నొకటి (సంఖ్యా 21[10,11] 33[43,44]).

**ఓమారు** (Omar). ఏశావు మనుమలలో నొకఁడు (ఆది 36[11,15] I దిన 1[36]). ఇతఁడు ఎదోమువారి నాయకులలో నొకఁడును వారిలో ఒక తెగకు పెద్దయునాయెను.

**ఓమెగ** (Omega). గ్రీకుభాష వర్ణమాలలోని చివరి యక్షరము. మొదటి యక్షరమగు అల్ఫాతోఁగలిపి వీటిరెంటిని ఆదియంత్యములకు సూచనగ నుపయోగించిరి. ఈ మాట ప్రకటన గ్రంథమందుమాత్రము తటస్థించును. ప్రక 1[8] నందు అది దేవుని నిత్యత్వమును, 21[6] 22[13] నందు యేసుయొక్క దైవత్వమును సూచించును (అల్ఫా చూ॥). M.

**ఓమెరు** మానములు II 1 చూ॥

**ఓరెను** (Oren = ఒకతరహా చెట్టు). యూదాసంతతివారిలో నొకఁడు (I దిన 2[25]).

**ఓరేబు, జెయేబు** (Oreb = కాకి, Zeeb = తోఁడేలు). 1. మిద్యాను రాజులు. గిద్యోను కాలమున ఇశ్రాయేలీయులమీఁదకు రాఁగా ఎఫ్రాయిమీయులు వారిని పట్టుకొని వారిద్దరిని ఒకదినమందే చంపి వారి తలలను యొర్దాను కద్దరినున్న గిద్యోనుకు పంపిరి (న్యాయా 7[24,25]). తరువాత యిశ్రాయేలీయులు 40 సం॥ల వఱకు నెమ్మదిగానుండిరి (8[28]).

2. పైనున్న ఓరేబును చంపినస్థలముదగ్గర నుండు బండపేరు (న్యాయా 7[25] యెష 10[26]) దానియునికి తెలియదు.

**ఓర్పా** (Orpah = జూలు). నయోమి కోడలు. కిల్యోను భార్య. రూతు తోడికోడలు. ఈమె మోయాబీయురాలు. కరువువచ్చిన దినములలో నయోమి ఆదేశమునకు వెళ్లినప్పుడు, కిల్యోనీమెను పెండ్లిజేసికొనెను. పెనిమిటి చనిపోయినపిమ్మట ఆమె పలెస్తీనుకు వెళ్లక తన యత్త కోరినట్లు తన బంధువులయొద్దకు వెళ్లిపోయెను (రూతు $1^{4,5,14,15}$). H.

**ఓర్వలేకయుండుట** మత్సరము చూ॥

**ఓలి** కుటుంబము 2 చూ॥

**ఓహదు** (Ohad = శ్రద్ధపుచ్చుకొనుట). షిమ్యోను కుమారులలో నొకఁడు (ఆది $46^{10}$ నిర్గ $6^{15}$).

**ఓహెలు** (Ohel = డేరా). జెరుబ్బాబెలు కొడుకులలో నొకఁడు (I దిన $3^{20}$).

## ఔ

**ఔగుస్తు** (Augustus = పూజనీయుఁడు). రోమారాజ్యము గొప్పదైన తరువాత ఆ రాజ్యపు ఆలోచనసభవారు ఈ బిరుదును తమ రాజున కిచ్చిరి. క్రీ॥ ము॥ 27 సం॥ నందు యూలియసు కైసరు అక్తావియానస్ (*Julius Caesar Octavianus*) అనువాని కిది మొదట దొరికెను. దానికిముం దతఁడు కైసరు అక్తావియానస్ అనఁబడెను. ఇతనినే బైబిలునందు కైసరు ఔగుస్తు అని పిలిచిరి. యేసుక్రీస్తు జన్మించినప్పుడు రోమారాజ్యమునకు చక్రవర్తి యితఁడే. లూ $2^{1}$ నందుదాహరింపఁబడిన జనసంఖ్య ఇతని యాజ్ఞవలననే యెత్తిరి. ఆ యాజ్ఞచేత యోసేపు మరియలు నజరేతును విడిచి బేత్లెహేముకు రావలసివచ్చెను. అక్కడకు వచ్చినప్పుడు జగద్రక్షకుఁడైన యేసు బేత్లెహేమునందు జన్మించెను (మీకా $5^{2}$ మ $2^{1-6}$.) C.

**ఔగుస్తు పటాలము** (The Augustas Band). ప్రస్తుతమున ఆయా పటాలములకు పేరులున్నట్లు రోమను సేనలోని పటాలములకును పేర్లుండెను. ఇటలీ పటాలము కైసరయలో నుండెను (కార్య $10^{1}$). కొర్నేలి దాని యధిపతి. అచ్చటనే పౌలు ఖైదీగా నున్నదినములలో ఔగుస్తు పటాలముండెను ($27^{1}$). ఔగుస్తు (=పూజనీయుఁడు) అనునది చక్రవర్తి బిరుదులలో నొకటి. వారి గౌరవార్థమై ఈ పటాలమునకీ పేరు పెట్టిరి.

**ఔషధములు** రోగములు చికిత్సలు VI 1 చూ॥

## క

**కంచరగాడిదె** (Mule). గుఱ్ఱము గాడిద కూడుటచే పుట్టినది. అన్ని దేశములలోను మిగుల కష్టమైన మోఁతపని కుపయోగించెడి సాధువగు మృగమై యున్నది. దావీదు మహారాజుకాలము మొదలుకొని పలెస్తీనులో వీటిని వాడినట్లు బైబిలులో సూచనలున్నవి (II సమూ $13^{29}$ $18^{9}$). దావీదుకూడ ఒక కంచరగాడిదెను తనకు వాహనముగా చేసికొనెను (I రాజు $1^{33}$). రాజైన సొలొమోనుకు తేవలసిన కట్నములలో కంచర గాడిదెలు నుండెను ($10^{25}$). తరువాతికాలములో ఆయా వారు వీటితో వర్తకముచేసి (యెహె $27^{14}$). వాటిని వాహనములనుగా మాత్రమేగాక మోఁతపనికిని ఉపయోగించినట్లు II రాజు $5^{17}$ వలనఁ దెలియుచున్నది.

**కంచరివాడు** వృత్తులు II 1 (2) చూ॥

**కంటిలో పువ్వు** రోగములు చికిత్సలు I 1 చూ॥

**కంఠకవచము** (Habergeon). నిర్గ $28^{32}$ నందు కంఠకవచమని తెనిగించిన అసలు పదమును $39^{22}$ నందు **కవచ**మని తెనిఁగించిరి. ఈ పదమీ రెండు వాక్యములలో మాత్రము గలదు. యాజకవస్త్రములలో ఏఫోదు మెడరంధ్రమును సూచించుటకు వాడిరి. (ఆయుధములు II 3. చూ॥).

**కంఠభూషణము** ఆభరణములు 6 చూ॥

**కందాకే** (Condace). ఐతియొపియ దేశపు రాణి (కార్య $8^{26,27}$). ఇది ఒక్క రాణిపేరే గాక, ఆదేశపు రాణుల కందరికి పెట్టఁబడిన బిరుదని రోమను గ్రంథకర్తలవలనఁ దెలియుచున్నది. ఆమె దేశము న్యూబియా (*Nubia*) యనియు, ఆదేశపు రాజధాని మెరోయె (*Meroe*) యనియు వారు వ్రాసిన సూచనలవలనఁ దెలియుచున్నది.

**కందిరీగ** కీటకములు 5 చూ॥

**కంప** ముండ్లకంప చూ॥

**కంబళిచెట్టు (Mulberry tree, Sycamine).** II సమూ 5^23 I దిన 14^14,15 నందుదాహరింపఁబడిన కంబళిచెట్టు ఎట్టిదో ఊహించుట కెట్టి పండితునకు సాధ్యము కాలేదు. పలెస్తీనునందు నల్ల మల్బరిచెట్లు పెరుగును. దానిని లూ 17^6 నందు **కంబళిచెట్టని** తెనిఁగించిరి.

J. C.

**కంసాలి, కంసాలిపని** వృత్తులు II 2 చూ॥

**కక్షలు** మతభేదములు 3, 4 చూ॥

**కడెము** అక్షజము 1 చూ॥

**కటాక్షము** కృప చూ॥

**కట్టడ** ధర్మశాస్త్రము చూ॥

**కట్టాతు** కిత్రోను చూ॥

**కట్టెల నర్పించినపండుగ** పండుగలు III 2 (3) చూ॥

**కట్నము** కుటుంబము 2, పన్ను చూ॥

**కట్లపాము** పాము 2 చూ॥

**కట్లు** గొలుసులు చూ॥

**కఠినపఱచుకొనుట, కాఠిన్యము (Hardening, Hardness).** ఫరోతన హృదయమును కఠినపఱచుకొనుట యనునదే **బైబిలులో** కఠినపఱచుకొనుటకు లేక కాఠిన్యమునకు ముఖ్య దృష్టాంతమైయున్నది (I సమూ 6^6 రోమా 9^17). ఫరో చరిత్రయందు నిర్గ 7^22 8^15 8^32 9^7 9^34,35 అను నీ యీయా వాక్యములలో మొదట ఫరో తానే తన హృదయమును కఠినపఱచుకొనెనని వ్రాయఁబడియున్నది. నిర్గ 10^2 10^20 10^27 11^10 14^8 అను నీ యీయావాక్యములలో దేవుఁడు తరువాత ఫరో హృదయమును కఠినపఱచెనని వ్రాయఁబడియున్నది. మన హృదయములను మనము కఠినపఱచుకొనఁగూడదను హెచ్చరిక ద్వితీ 15^7 కీర్త 95^8 హెబ్రీ 3^8 లోనున్నది. ఆయా వారలు తమ హృదయములను కఠినపఱచుకొన్నట్లుగా I సమూ 6^6 II దిన 36^13 నెహె 9^17 యిర్మీ 7^26 లోను, పైన ఫరోనుగూర్చి చెప్పిన మొదటి యీయావాక్యములలోనున్నది. నిర్గ 4^21 లోను పైన ఫరోనుగూర్చి చెప్పిన ఏడువచనములలోను ద్వితీ 2^30 యెహో 11^20 యెష 63^17 మొదలగువాక్యములలోను దేవుఁడు ఆయా వారలను కఠినపఱచినట్లుగానున్నది. మొదట ఫరో తన స్వేచ్ఛను దుర్వినియోగపఱచి దేవుని నెదిరించెను. పిమ్మట దేవుఁడు అతని మంకుతనమును బట్టి యతనిని మఱెక్కువగా కఠినపఱచెనని యీ వాక్యములవలనఁ దెలిసికొనవచ్చును. అదేరీతిగా మన స్వేచ్ఛవలన మనము దేవుని నెదిరించినయెడల మనకు దేవుని తీర్పును బట్టి మఱెక్కువ కాఠిన్యము కలుగవలసియున్నదని మనము పై వాక్యములవలనఁ దెలిసికొనఁగలము. మనకు స్వేచ్ఛగలవారమని మాత్రమే గాక దేవుఁడు లోకమునకు సర్వాధికారియను సంగతినికూడ బైబిలు తేటగా బోధించుచున్నది. ఆయన సర్వాధికారియైనయెడల మనకెట్లు స్వేచ్ఛ యుండఁగలదను ఆక్షేపణకు తగిన సమాధానము చెప్పుట వేదశాస్త్రమునందేగాక తత్వశాస్త్రము నందును అన్నిఁటిలో మిగుల కష్టతరమైన అంశమైయున్నది. పైన నుదాహరించినట్లు బైబిలు దానిని గుఱించి బోధించు దానికన్న తృప్తికరమైన సమాధానమును ఈ లోకశాస్త్రు లెంత మాత్రమును చెప్పఁజాలరు.

**కడవరిగడియ** అంత్య దినము చూ॥

**కడవరి వర్షము** వ్యవసాయము 3, 5 (1), (2) చూ॥

**కడియము** ఆభరణములు 4 చూ॥

**కడుపు జబ్బులు** రోగములు చికిత్సలు II 7 చూ॥

**కత్తి (Knife, dagger).** ఆరంభమున కత్తులు చెకుముకి రాళ్లతోను అట్టి పదునుగల ఇతర రాళ్లతోను చేయఁబడినవి (నిర్గ 4^25 యెహో 5^2,3). పురాతన గుహలను పాడైన స్థలములను త్రవ్వినప్పుడు తరుచుగానిట్టి రాతి కత్తులు కనఁబడును. దేశము మధ్యను నివసించెడి అరబ్బీయులలో కొన్ని తెగలవారు ఇప్పుడు కూడ అట్టి రాతి కత్తుల నుపయోగించుచున్నట్లు చెప్పుకొందురు. తరువాత ఇనుపకత్తులు వాడుకలోకి వచ్చెను. సిరియా పలెస్తీను దేశములయందు వాడెడి కత్తు

లకు ఒరలు కలిగియుండును. అవి 8 లేక 10 అంగుళముల పొడవుగలవి. వాటిని నడికట్లయందు దోపుకొందురు. (ఆయుధములు I 4 చూ॥) J. C.

**కత్తెరలు, కత్తెర చిప్పలు** దేవాలయము I 7 (2) చూ॥

**కత్సీయా** గంధవర్గము 5 చూ॥

**కథ** ఉపమానము, కల్పనా కథ చూ॥

**కదురు** (Awl). ఈ దేశమునందు దూదిని వడికినట్లే పలెస్తీనులోను స్త్రీలు దూదివడికి నూలు తీయుట కుపయోగించిన పొడుగాటి సూది (సామె $31^{19}$). నిత్య దాసత్వమున కొప్పుకొన్న వాని చెవికి పొడిచిన దానిని కదురు అని తెనిగించినను (నిర్గ $21^{6}$) అది రాట్నమునకు పెట్టు కదురు కానట్లున్నది (ద్వితీ $15^{17}$). J. C.

**కదొర్లాయోమెరు** (Chedorlaomer= లయోమెరు అను దేవతకు దాసుడు). ఏలాము దేశపురాజు. ఇతడు దండెత్తి యొర్దానుకు తూర్పుననుండు పట్టణములను మృతసముద్రపు లోయలోనున్న పట్టణములను స్వాధీనపఱచుకొని అందలి ప్రజలను పన్నెండేండ్లవఱకు ఏలెను. అటు తరువాత వారు తిరుగఁబడినందున ఇతడు ఇంక నలుగురు రాజులతో కలిసివచ్చి వారిని జయించి వారిని వారితో లోతునుకూడ ఖైదీలనుగా పట్టుకొని తనదేశమునకు తీసికొని పోవుచుండఁగా అబ్రాహాము తన సేవకులతోఁ గలిసి వచ్చి యకస్మాత్తుగా ఈ యైదుగురురాజులసేనపైఁబడి వారు తీసికొనిపోవుచుండిన దోపుడు సొమ్మును ఖైదీలను విడిపించెను (ఆది 14). ఇతనిపేరు ఏలామువారి పేర్లవంటిది. ఆ పురాతనకాలమందు ఏలాము రాజ్యమిటుల వ్యాపించి యుండెనుగాని యీ రాజుయొక్క పేరు లౌకిక చరిత్రకు సంబంధించిన శాసనములలో నింతవఱకును కనఁబడలేదు.

**కద్మీయేలు** (Kadmiel = దేవుఁడు పురాతన కాలమునుండి యున్నవాఁడు). బబులోనునుండి జెరుబ్బాబెలుతోకూడ తిరిగివచ్చిన లేవీయులలో నొకఁడు (ఎజ్రా $2^{40}$ నెహె $7^{43}$ $12^{8}$). ఇతఁడు దేవాలయముకట్టిన వారికిపై విచారణ కర్తగా నుండెను (ఎజ్రా $3^{9}$). ఈ కుటుంబపువారి పెద్ద నిబంధనను ముద్రించిన వారిలో నొకఁడై యుండెను (నెహె $10^{9}$). అంతకుమునుపు తమ ప్రజల పాపములనొప్పుకొని యెహోవాకు మొర బెట్టిన వారిలో ఇతఁడుకూడ నుండెను ($9^{4,5}$)

**కద్మోనీయులు** (Kadmonites = తూర్పు వారు). అబ్రాహామునకు స్వాస్థ్యముగా నిత్తునని దేవుఁడు వాగ్దానముచేసిన జనములలో నొక జనమునకు పేరు (ఆది $15^{19}$). $25^{15}$ లో నున్న కెదమా సంతతివారువీరేయై యుండవచ్చును. అయితే వీరు తూర్పువారు అనఁబడుటచే అబ్రాహామువలన తూర్పునకు ($25^{6}$) పంపఁబడిన సంతతి వారిలో నొక తెగవారై యుందురని కొందఱను కొందురు. ఎట్లయినను వారు యొర్దానుకు తూర్పుగానున్న అరబ్బీయుల తెగలలో నొకతెగ వారైయున్నారు.

**కనజు** (Kenaz = వేఁటాడుట).

1. ఏశావు సంతతివాఁడు (ఆది $36^{11}$). ఒక తెగకు పెద్ద ($36^{15,42}$ యెహో $15^{17}$ I దిన $4^{13}$ కనజీయులు చూ॥).

2. కాలేబు సంతతివారిలో నొకఁడు (I దిన $4^{15}$).

**కనానీయుఁడైన సీమోను** సీమోను 4 చూ॥

**కనానీయులు** (Canaanites). నోవహు మనుమఁడగు కనాను సంతతివారు. వీరు మొదట అరారాతునుండి దక్షిణముగా యూఫ్రాతునది వెంబడి షీనారు దేశమునకువెళ్లి అచ్చట మిగుల విస్తరించిరి (ఆది $10^{10}$). పిమ్మట వారిలో కలిగిన యేదో ఒక ప్రేరణచే ఆ స్థలమును వాయవ్యముగానుండిన మధ్యధరా సముద్ర ప్రాంతములకు వలసబోయిరని శాస్త్రజ్ఞుల యభిప్రాయమై యున్నది ($10^{15-20}$). వారచ్చట తూరు సీదోను అను పట్టణములనుకట్టి ఇంక నుత్తరముగా తౌరసు పర్వతములవఱకును దక్షిణమున ఫిలిష్తీయుల దేశము వఱకునువెళ్లి అచ్చట విస్తరించిరి. సొదొమ గొమొఱ్ఱాలును వారి సరిహద్దులలో నుండెను ($10^{19}$). అబ్రాహాము కాలమునకుఁ బూర్వము వారాదేశము లన్నిఁటిలో నివసించిరి ($12^{6}$). వారు వెవ్వేఱు గోత్రికులై వేఱువేఱు రాజ్యము లైరి. ఆ రాజ్యముల పేరులు నిర్గ $3^{8,17}$ $23^{23}$ $34^{11}$ ద్వితీ $7^{1}$ యెహో $3^{11}$ నందు చెప్పఁబడి యున్నవి. వారు మంచి తెలివి తేటలుగల వర్తకులై మిగుల దూరదేశములకు వెళ్లిరి (యెష

23[8]). కాలక్రమేణ పూర్ణముగ విగ్రహారాధికులై చెడి సిగ్గుమాలిన పాపిష్ఠులైరి. కనుక ఇశ్రాయేలీయులు వారి దుష్టత్వము నిమిత్తమై వారిని నిర్మూలము చేయవలయునని మోషేకును యెహోషువకును దేవుఁడాజ్ఞాపించెను (సంఖ్యా 33[52-54] ద్వితీ 7[1-4]). గాని దేశము నిర్జనమైన పక్షమున దుష్టమృగములు విస్తరించునని భయపడి ఇశ్రాయేలీయులు వారినందఱిని నిర్మూలము చేయలేదు (నిర్గ 23[29]). దావీదు రాజ్యమునకు వచ్చునంతదాక యెరూషలేము కనానీయుల వశమునందే యుండెను. అప్పుడు దానిని యెబూసు అని పిలిచిరి. దానియందు నివసించుచుండిన యెబూసీయులనఁబడిన కనానీయులను జయించి దావీదు దానికి యెరూషలేమను పేరు పెట్టెను (II సమూ 5[6,7] I దిన 11[4-7]). పైన నుదాహరించినట్లు కనానీయులందఱును చంపఁబడలేదు గాన వారిలో ననేకులు వేఱువేఱు దేశములకు వెళ్లి ఆ దేశపు జనులతోఁ గలిసిపోయిరి. అనేకులిశ్రాయేలీయులకు దాసులైరి. ఆలాగు ఇశ్రాయేలీయులను మోసముచేసిన గిబియోనీయులు నిత్యదాస్యమునకులోనైరి (యెహో 9[23]). కనానీయులిప్పటికి బొత్తుగా రూపు మాసిపోయిరని దోచుచున్నది. H.

**కనాను** (Canaan = పల్లము).

1. హాముయొక్క నాలుగవ కుమారుఁడు. నోవహు మనుమఁడు. అతని సంతానీకులు సీదోను ప్రాంతములలో మొదట నివసించి తరువాత సిరియా కనాను దేశములలో విస్తరించి స్వాధీనపఱచుకొనిరి (ఆది 10[15-19] I దిన 1[13-16]. కనానీయులు చూ॥). యూదుల ఇతిహాసములవలన అతఁడు తన తండ్రితోఁ గలసి నోవహు నవమానపఱచినందున శాపగ్రస్తుఁడాయెనని తెలియుచున్నది (9[20-25]). గిబియోనీయులు అతని సంతానమై యుండిరి (యెహో 9[1-3, 23-27]).

2. కనానీయులు నివసించిన దేశముయొక్క పేరు. ఐగుప్తునుండి సీదోనువఱకు మధ్యధరా సముద్రపు తూర్పు తీరముననున్న దేశమునకు ఆ పేరాకాలమున పెట్టఁబడెను (ఆది 10[16-19]). అబ్రాహామీ దేశమునకు వచ్చినప్పుడు దక్షిణదేశ మనఁబడినదానినుండి బేతేలువఱకు తన డేరాను వేఱువేఱు చోట్ల వేసి చాల యేండ్లమట్టుకు నివసించెను (13[1-12]).

మోషే యెహోషువ కాలములలో యొర్దాను నదికిని మధ్యధరా సముద్రమునకు నడుమనుండిన దేశమునకు మాత్ర మాపేరు నుపయోగించిరి. తరువాత యొర్దాను నదికి తూర్పున నున్న గిలాదు కొండల దేశమునకుకూడ ఆ పేరు వాడఁబడెను. పిమ్మట ఇశ్రాయేలీయులు నివసించిన దేశమంతటికి నది యుపయోగింపఁబడెను.

ఆ దేశమునకు వేఱువేఱు పేర్లుగలవు. కనానీయు లున్నందున **కనాను** అనఁబడెను. తరువాత ఫిలిష్తీయులవలన దాని పలెస్తీను (*Palestine*) అను పేరు కలిగెను. అబ్రాహామున కది వాగ్దానము చేయఁబడినందున **వాగ్దానభూమి** యనియు, మన రక్షకుఁడగు యేసుస్వామి జన్మదేశమైనందున **పరిశుద్ధదేశము** (*Holy Land*) అనియు పిలువఁబడుచున్నది (పలెస్తీను చూ॥). H

**కనికరము** కృప చూ॥

**కన్నము వేయుట** నేరములు శిక్షలు 2 చూ॥

**కన్ను, నేత్రము** (Eye). కంటినిగూర్చిన సూచనలు బైబిలునం దనేకములు గలవు. అది



కన్ను

అన్నిటిలో మిగుల విలువగల దానిని సూచించును (కీర్త 17[8] మా 9[47] గల 4[15]). అది దేహమునకు దీపమువంటిది (మ 6[22] లూ 11[34-36]). అదింత విలువగలది యైనను దాని ద్వారానే అనేక శోధనలు కలుగును. కావున అట్టి శోధన

లకు సాధనమైనట్లు ఎంచఁబడును. గాన మన లోనున్న విషయేచ్ఛలు **నేత్రాశలు** (I యోహా 2[16]) అనఁబడును. వ్యభిచారులకు పాపమును మానలేని కన్నులు గలవారు అను పేరు పెట్టఁబడెను. మ 20[15] లో చెడిన కన్ను (భాషాంతరము చూ॥) అసూయకు మాఱు పేరుగా నున్నది. ఆ వాక్యమునందు దృష్టిపెట్టుట అనునది సూచింపఁబడెనని కొందఱి యభిప్రాయము.

**కన్నే (Canneh).** హారాను, ఏదెను ప్రదేశములతో కలిపి చెప్పఁబడిన సిరియాలోని ఒక స్థలము (యెహె 27[23]). దీనిని గురించి మఱేమియు తెలియదు. బహుశః కల్నేకు బదులు పొరబాటున వ్రాయఁబడి యుండును.

**కన్యక (Virgin).** బైబిలులో ఈ పేరు వివాహము చేసికొనని యౌవన స్త్రీలకు మాత్రమే గాక ఆయా దేశములకును జనాంగములకు కూడ అలంకార రీతిగా పెట్టఁబడి యున్నది. దృష్టాంతముగా యిర్మీ 18[13] ఆమో 5[2] లో ఇశ్రాయేలీయులకును, II రాజు 19[21] లో సీయోను అనఁబడు యెరూషలేమునకును, యెష 47[1] లో బబులోనుకును, యిర్మీ 46[11] లో ఐగుప్తునకును కన్యక యను అలంకార నామమున్నది. ఇది చక్కదనమును సూచించునట్టి యలంకారము. ద్వితీ 22[23-29] లో కన్యకలను కాపాడుకొనుట విషయమై విశేష చట్టము లున్నవి. యెష 7[14] లో కన్యక యని అర్థమిచ్చు అసలు మాటకు యౌవనురాలు అను నర్థముకూడకలదు. అదే మాటను నిర్గ 2[8] లో **చిన్నది** అనుమాటతోను పర 1[3] 6[8] లో **కన్యక** అను మాటతోను తర్జుమా చేసిరి.

**కన్యక ఊట** యెరూషలేము A II 1 చూ॥

**కపటము, కపటోపాయము (Deceit).** ఈ పదముచే తెనిఁగించిన హెబ్రీ మాట పాత నిబంధనలో దాదాపు 40 సారులు కనఁబడును (ఆది 34[13] యోబు 15[35] కీర్త 5[6] 38[12] మొ॥). ముఖ్యముగా నాలుకకు సంబంధించిన మోసముల విషయమై వాడినపదమై యున్నది (కీర్త 10[7] 17[1] 24[4] 34[13] 50[19] 52[4] 109[2]). శ్రమపడుచున్న సేవకుని సందర్భమునను ఈ పదము వాడి ఆయన నోట ఏ కపటమును లేదని ఉదాహరింపఁబడెను (యెష 53[9]). ఇతరులను దగా చేయుటకై వాడిన దొంగ త్రాసుల విషయమును ఇదేపదమును వాడిరి. సామె 11[1] 20[23] ఆమో 8[5] నందు **దొంగ త్రాసు** అనియు, హోషే 12[7] నందు **అన్యాయపు త్రాసు** అనియు, మీకా 6[11] లో **తప్పు త్రాసు** అనియు తెనిఁగించిన మూల పదమిదేయై యున్నది.

పై మాటకు సంబంధించిన గ్రీకు పదము క్రొత్త నిబంధనలో కుట్రజేసి మానవులను చిక్కుపఱచుట యని యర్థమగును (కార్య 13[10] రోమా 1[29] I థెస్స 2[3] I పేతు 2[1]). మ 26[4] (=మా 14[1]) లో ఆ పదమునే **మాయోపాయ**మనియు, మా 7[22] లో **కృత్రిమ**మనియు, II కొరి 12[16] లో **తంత్ర**మనియు తెనిఁగించిరి. నతనయేలునందే కపటమును లేదని క్రీస్తుతని మెచ్చుకొనెను (యోహా 1[47]). క్రీస్తును గూర్చి యెష 53[9] లో ప్రవచింపఁబడినట్లు ఆయన నోట యే కపటమును కనఁబడలేదు (I పేతు 2[22]). గొఱ్ఱెపిల్లను వెంబడించిన వారి నోట ఏ యబద్ధమును లేదు (ప్రక 14[5]). దేవుని దృష్టియందు కపటము మిగుల హేయమైనదని పై వాక్యములవలన స్పష్టమగుచున్నది. (నిష్కాపట్యము, వేషధారణ చూ॥).

**కపాలము, కపాలమనబడిన స్థలము** యెరూషలేము B VI 5 చూ॥

**కపాలమును పగలగొట్టుట** రోగములు చికిత్సలు III 3 చూ॥

**కపిరిగాడు** పక్షులు 3 చూ॥

**కపెర్నహూము (Capernaum** = నహూము ఊరు). గలిలయ సముద్రమునకు వాయువ్య దిక్కుగా నున్న ఒక పట్టణము. పాత నిబంధనయందు దీనినిగూర్చిన సూచనలేవియును లేనందున చెఱకాలమునకుఁ బిమ్మట కట్టిన పట్టణమని యూహింపఁదగును. అది జెబూలూను నఫ్తాలీ ప్రాంతములలో నున్నట్లు మ 4[13-16] నందున్నది. ఆ పట్టణములోకి తేఁబడు వస్తువులపై పన్నును వసూలుచేసెడి వారని మా 2[1-14] వలనఁ దెలియుచున్నది. తన సేవకుని బాగుచేయించుకొనిన రోమను శతాధిపతి యచ్చట ఉండుటచే (మ 8[5-13] లూ 7[1-10]). రోమీయులచ్చట నొకపటాలమునుంచి నట్లూహింపవచ్చును.

ఈ పట్టణము చాల ముఖ్యమైనదైనట్లు క్రీస్తు చరిత్రవలనఁ దెలియుచున్నది. ఆయనను నజరేతు వారు తిరస్కరించినపిదప కపెర్నహూమున కాయనవచ్చి దాని తన నివాసస్థానముగఁ జేసి కొనెను. కనుకనే మ $9^{1}$ నందది ఆయన స్వంత ఊరనఁబడెను. ఆయన ఇచ్చట అనేక యద్భుతములను జేసెను. వాటి యందు సమాజమందిరములో దయ్యముపట్టిన వానిని బాగుజేయుట (మా $1^{21-28}$ లూ $4^{31-37}$), పేతురు అత్తను స్వస్థపఱచుట (మ $8^{14-17}$ మా $1^{29-31}$), నలుగురిచే మోయఁబడిన పక్షవాయువు గలవానిని బాగుచేయుట (మా $2^{1-13}$ మ $9^{1-9}$), శతాధిపతిసేవకుని స్వస్థపఱచుట (మ $8^{5-13}$ లూ $7^{1-10}$), ప్రధానిసమారుని బాగుచేయుట (యోహా $4^{46-54}$) అనునవి వివరముగా వ్రాయఁబడెను. ఇవిగాక ఇంక ననేకములు ఆయన అక్కడఁ జేసినట్లు సువార్తికులు వ్రాసియున్నారు (మ $8^{16,17}$ మా $1^{32,34}$ లూ $4^{23,40,41}$). ఇక్కడనే అపొస్తలులలో మొదటి వారిని బిలిచెను (మా $1^{16-20}$). మత్తయి అనఁబడిన లేవి ఈ పట్టణస్థుఁడే (మా $2^{14-17}$). దీనికి సమీపముగానున్న సముద్రముమీఁద దివ్యమైన ఉపమానములను జెప్పెను (మ 13). ఐదు వేలమంది కాహారముపెట్టిన పిదప జీవపురొట్టెను గూర్చిన ప్రసంగమును జేసిన దిచ్చటనే (యోహా $6^{24-27}$). గలిలయలో బోధించుటకై ఆయన చేసిన ప్రయాణముల నిచ్చటినుండి యారంభించి, అవి ముగిసినపిదప మఱల యిటకే వచ్చెను. ఆయన చివరిసారి యీ పట్టణము మీఁదుగా వెళ్లినప్పుడు దేవాలయపు పన్ను చెల్లించుట కేమియు లేనందున ఇచ్చటనే చేపనోట షెకెలును పట్టించుకొనెను (మ $17^{24-27}$). శిష్యులకు వినయము గూర్చి బోధించినట్లునున్నది (మ 18). ఇన్ని యద్భుతములను బోధలను ఆయన ఇక్కడఁజేసినను, కపెర్నహూమువారు గుణపడనందున, ఆ పట్టణము నశించునని దానిని గూర్చియు దాని సమీపమున నుండు కొరాజీను బేత్సయిదాలను గూర్చియు ప్రవచించెను (లూ $10^{15}$ మ $11^{23,24}$). క్రీస్తు చెప్పినట్లుగానే అది పూర్ణముగా నాశనమాయెను. అచ్చట టెల్‌హూము (*Tell-Hum*) అను పాడు శేషము లింకనున్నవి. అవే కపెర్నహూము ఉనికి యని సాధారణముగా సను కొందురు. (పటము **IV, E. 6**).

**కప్ప (Frog).** ఐగుప్తులోని పది తెగుళ్లలో రెండవది కప్పల తెగులై యుండెను (నిర్గ $8^{2-14}$ కీర్త $78^{45}$ $105^{30}$). కప్పలు అపవిత్రతకు సూచనగా నుండినట్లును దురాత్మ లెత్తిన రూపములై యున్నట్లును ప్రక $16^{13,14}$ లో నున్నది. (కీటకములు సరీసృపములు 6 చూ॥)

**కప్పదొకియ** (Cappadocia). చిన్న ఆసియాకు తూర్పు భాగమందు నుండు మెట్టభూమి గల యొక పరగణా. దానికి ఉత్తరమున పొంతు, తూర్పున సిరియ అర్మీనియలు, దక్షిణమున కిలికియ, పడమట లుకయోనియయు నున్నవి. రోమీయులు క్రీ॥ ము॥ 19 వ సంవత్సరములో దానిని రోమన్ పరగణాగాఁ జేసి దాని పైని ఒక రోమన్ అధిపతిని నియమించిరి. పౌలు తన ప్రయాణములలో అచటికి వెళ్లలేదు గాని పేతురు తన యుత్తరములను వీరి కొఱకుకూడ వ్రాసెను (I పేతు $1^{1}$). కార్య $2^{9}$ చూడఁగా పెంతెకొస్తు దినమున కప్పదొకియవారును యెరూషలేములో నున్నట్లు కనఁబడును, ఈ పరగణాలో నుండిన కైసరయ యనుపట్టణములో బాసిల్ (*Basil*) అను బోధకుఁడు గొప్ప పని చేసియున్నట్లు క్రైస్తవ సంఘ చరిత్రవలనఁ దెలియును. నుస్సావాఁడైన గ్రెగొరియు (*Gregory of Nyssa*) న్యాజయంజెను వాఁడైన గ్రెగొరియు (*Gregory of Nazianzus*) ఈ పరగణానుండి వచ్చినవారే.

**కఫ్** (Kaph = כ అను అక్షరము). హెబ్రీ యక్షరములలో పదునొకండవది. 119 వ కీర్తన 11 వ భాగములోని ప్రతి పంక్తియు ఈ యక్షరముతో నారంభించుటచే ఆ భాగమునకు కఫ్ అను పేరు పెట్టిరి.

**కఫ్తోరు, కఫ్తోరీయులు** (Caphtor, Caphtorim). ఫిలిష్తీయులు మొదట నివసించిన దేశపు పేరు (ఆమో $9^{7}$ యిర్మీ $47^{4}$). ఈ కఫ్తోరు దేశస్థులే కఫ్తోరీయులనఁబడిరి (ఆది $10^{14}$ ద్వితీ $2^{23}$). కఫ్తోరు దేశము క్రేతు ద్వీపమని కొందఱును, ఐగుప్తు ఉత్తరభాగములోని యొక ప్రదేశమని కొందఱును, కుప్ర ద్వీపమని మఱికొంద

అను అనుకొందురు. ఐగుప్తులో దొరికిన శాసనములయందా ప్రదేశపు వారు ఫిలిష్తీయులకు సంబంధించిన పేరుచే పిలువబడుటను బట్టి కఫ్తోరు అను దేశము చిన్న ఆసియా దక్షిణభాగము మఱి ముఖ్యముగ కిలికియ ప్రదేశము అని నవీన పండితులనుకొందురు.

**కబ్బోను** (Cabbon = పాశము). షెఫేలా యనఁబడు యూదయ మన్యప్రదేశములో ఎగ్లోను దగ్గఱనుండు నొకయూరు (యెహో $15^{40}$). I దిన $2^{49}$ లో నుండు మగ్బేనాయనున దీయూరే యని యనుకొందురు.

**కబ్సెయేలు** (Kabzeel = దేవుఁడు సమకూర్చును). యూదయ దక్షిణ భాగములోను ఎదోము హద్దు దగ్గఱ నుండు నొక యూరు (యెహో $15^{21}$). ఇది దావీదుకు గొప్ప సహాయము చేసిన యోధుఁడగు బెనాయాయొక్క జన్మస్థలము (II సమూ $23^{20}$ I దిన $11^{22}$). చెఱకాలమునకు పిమ్మట కూడ ఈ యూరుండెను గాని అప్పటికి దాని పేరు యెకబ్సెయేలు అని కొద్దిగా మాఱి పోయెను (నెహె $11^{25}$).

**కమ్మరివాడు** వృత్తులు, చేతిపనులు II 1 చూ॥

**కమ్మి** ఆభరణములు 21 చూ॥

**కయప** (Caiaphas = నొక్కు). యేసుక్రీస్తు యూదులమధ్య తన పనిని జేయుచున్న కాలమునందు ప్రధాన యాజకుఁడుగా నున్నవాఁడు. ప్రధాన యాజకుఁడగు అన్నాయొక్క అల్లుఁడు. అన్నా ప్రధాన యాజకోద్యోగము నుండి తీసివేయఁబడిన పిమ్మట ముగ్గురు ఈ పని కొకఱి తరువాత నొకఁడు వచ్చిరి. పిదప క్రీ॥ శ॥ 25 వ సం॥ నందు కయప ఆ యుద్యోగమునకు నియమింపఁబడెను క్రీ॥ శ॥ 36 వ సం॥ వఱకతఁడే ప్రధానయాజకుఁడై యుండెను. పునరుత్థానములేదని సాధించు సద్దూకయ్యుల తెగవాఁడై యేసును బహుగా ద్వేషించెను. ఆయన లాజరును మృతులలోనుండి బ్రదికించిన పిదప యూదుల మహా సభవారు ప్రజలందఱు క్రీస్తును నమ్మెదరని భయపడి యేమిచేతమా యని యోచించునప్పుడు కయప, బిలాము వలె తన కెంత మాత్రము తెలియని ప్రవచన మొకటి చెలిపెను (యోహా $11^{49-52}$).

తాను ప్రధాన యాజకుఁడయినను కయప తన మామయగు అన్నా సలహాల ననుసరించి పోవుట వాడుకయయ్యెను (అన్నా చూ॥). నియమింపఁబడిన ప్రధాన యాజకుఁడు తానే గనుక జరిగిన తీర్పుల భారమును, దోషమును కయప మీఁదనే యుండును. గెత్సేమనే తోఁటలో బంట్రౌతులు యేసును పట్టుకొనినప్పుడు మొదట ఆయనను అన్న యొద్దకుఁ దీసికొని పోయిరి (యోహా $18^{13}$) అన్న ఆయనను మొదట విచారించి అవమాన పఱచిన మీఁదట ఆయనకు తీర్పు విధించుటకు తనకెట్టి హక్కును లేనందున, తెల్లవారుజామున ప్రధాన యాజకుఁడగు కయప యొద్దకు యేసును బంధింపఁబడియున్నట్లు గానే పంపెను ($18^{24}$). కయప యేసుకు మరణశిక్ష విధించియు, ఆయనపై నా శిక్షను జారీ చేయించ అధికారము లేనందున రోమను గొర్నరగు పిలాతు నొద్ద కాయనను పంపించెను. పిలాతు నగరున కెదురుగా వీధిలో మిగుల నల్లరి జేయుచుండిన గుంపును, సంహారింపుము సిలువ వేయుము అని కేకలు వేయునట్లు ప్రేరేపించినది కయపయే. గనుక నిరపరాధియగు క్రీస్తును సిలువవేయించి చంపినది పిలాతు అయినను, దానికి జవాబుదారి కయప యనియే స్పష్టమగుచున్నది. ఆయనను చంపించినను, మూఁడవనాడు తిరిగి లేతునని క్రీస్తు చెప్పిన సంగతిని నిరర్థక పఱచనై గొర్నరును ప్రేరేపించి సమాధిచుట్టు ఇతఁడును ఇతని సహచరులును కావలిపెట్టించినను వారి యత్నము లన్నియు నిష్ఫలమునైనందున భయముతోను దిగులుతోను కూడినవాఁడై, ఆయన లేచెనని ప్రకటించిన ఆయన శిష్యులను మిగుల హింసించుటకు పూనుకొనినవాఁడాయెను (కార్య $4^{6}$).

తానుచేసిన యపరాధములకొఱకైన శిక్షను ఈ లోకమునందతఁడు తక్కినవారివలె ననుభవించెను. పిలాతు తానుచేసిన యక్రమములకై సమాధానము చెప్పుకొనవలసినదని చక్రవర్తి యతనిని పిలిపించి, గాలు దేశమున నతనికి దేశాంతరవాస శిక్షను విధించెను. పిలాతుకు పిదప వచ్చిన వితెలియు (*Vitellius*) అను వానిచే ఉద్యోగమునుండి కయప తీసివేయబడి అవమానము నొందెను. అతని అంతమునుగూర్చి అంతగా

తెలియక పోయినను అంత్య దినమున లెక్క నప్పగించి శిక్షను పూర్ణముగా నొందును.

**కయప నగరు** యెరూషలేము B VI 3 చూ॥

**కయీను** (Cain = పొందుట). మొదటి నరులగు ఆదాము హవ్వల ప్రథమ కుమారుఁడు. హేబెలుయొక్క అన్న. ఇతఁడు భూమిని సేద్య పఱచువాఁడు. హేబెలు గొఱ్ఱెల కాపరి. కొంత కాలమైన పిమ్మట కయీను పొలము పంటలోఁ గొంత యెహోవాకు అర్పణగాఁ దెచ్చెను. హేబెలుకూడ తన మందలో తొలుచూలున పుట్టినవాటిలో క్రొవ్వినవాటిని కొన్ని దెచ్చెను. (ఆది $4^{3}$). అహంకారియు, ఓర్వలేని వాఁడు నగు కయీను తగినమనస్సుతో దేవుని కర్పింప నందున ఆయన వాని కానుక నంగీకరింపక విశ్వాసముతోను దీనమనస్సుతోను అర్పించిన హేబెలు అర్పణ నంగీకరించెను (హెబ్రీ $11^{4}$). దీనిని తెలిసికొనిన కయీను అసూయాక్రాంతుఁడై హేబెలును జంపి శాపగ్రస్తుఁడాయెను (ఆది $4^{1-15}$). అతఁడు ఏదెను దేశమునకు తూర్పుగా నున్న నోదుకు వెళ్లి అక్కడ నివసించి కుమారులను కుమార్తెలను కనెను. అతని సంతానీకులు ఆఱవతరము వారివఱ కుదాహరింపఁబడిరి ($4^{17-20}$). వారు మిగులచెడి పాపమునందు మునిగిపోయి నందున వారందఱును నోవహుకాలమునందు వచ్చిన జలప్రళయములో నశించిరి (హేబెలు చూ॥). H.

**కరణము** (Town Clerk). ఎఫెసులో దేమేత్రిచే రేపఁబడిన అల్లరిని అణచివేసిన ఉద్యోగస్థుని బిరుదును కరణమను మాటచేతఁ దెనిఁగించిరి (కార్య $19^{35}$). అసలుపదము లేఖికుఁడని యర్థమిచ్చును. గ్రీకు పట్టణములయందిట్టి ఉద్యోగస్థులుండిరి. అతని విధులు చాల మట్టునకు కరణముయొక్క పనులవంటివై యుండెను. పట్టణపు స్థితిగతులనుబట్టి అతని యధికారము మాఱుచుండెను. ఎఫెసు అట్టి కాలమునందు చిన్నాసియలో ముఖ్యపట్టణమగుటచేత, ఆ యల్లరినణచిన ఉద్యోగస్థుఁడు మిగుల ప్రాముఖ్యుఁడని తెలిసికొనవచ్చును. అతఁడా ప్రదేశపు గొర్నరుకు తరువాతి యధికారి. ఆ యల్లరి మూఁకతో నతఁడు చెప్పిన మాటలను బట్టి ($19^{35-40}$) అతఁడు న్యాయస్థుఁడును దేశచట్టములను బాగుగా నెఱిఁగినవాఁడును ధైర్యవంతుఁడైన వాఁడని కనఁబడుచున్నది.

**కరవు, క్షామము** (Famine). వర్షము లేక పోవుటవలనఁ గలిగిన కరవులను గూర్చి బైబిలులో నెక్కువ సూచనలున్నవి. ఇట్టి కరవుచే అబ్రాహాము కనానుదేశమును విడిచి ఐగుప్తుకు వెళ్లెను (ఆది $12^{10}$). ఆదేకారణమును బట్టి అతని సంతతివారుకూడ అచటికి వెళ్లవలసి వచ్చెను ($26^{1}$ $41^{27-56}$ $47^{13}$). న్యాయాధిపతుల కాలములో కరవుకలుగఁగా ఎలీమెలెకు తన కుటుంబముతోకూడ మోయాబుకు వెళ్లెను (రూతు $1^{1}$). దావీదు కాలములోను (II సమూ $21^{1}$), ఏలీయా కాలములోను (I రాజు $17^{1}$-$18^{46}$), ఎలీషాకాలములోను (II రాజు $4^{38}$ $8^{1}$), క్రొత్త నిబంధన కాలములోను క్లౌదియ కైసరుకాలములోను (కార్య $11^{28}$). కరవులు కలిగియున్నట్లు సూచనలు కలవు. వర్షములేక పోవుటవలన మాత్రముగాక యుద్ధమువలనఁ గలిగిన కరవులను గూర్చి II రాజు $6^{24,25}$ $25^{1-3}$ యిర్మీ $52^{1-6}$ చూ॥. మిడతలవలనకూడ కరవులు కలిగినట్లు నిర్గ $10^{15}$ యోవే $1^{4}$ ఆమో $4^{9}$ లలో నున్నది. ప్రవక్తలీకరవులను దేవుని తీర్పులనుగా నెంచిరి (I రాజు $17^{1}$ యెహె 5 మొ॥). లోకాంతమున కలుగఁబోవు కష్టములలో నిదియు నున్నది (మా $13^{8}$ ప్రక $6^{5}$ $18^{8}$). దేవునివాక్యము లేకపోవుటకూడ క్షామమని ఆమో $8^{11}$ లో అలంకారరీతిగా నున్నది.

**కరుణ, కరుణాచిత్తము** కృప చూ॥

**కరుణాధారము, శాంతికరము** (Propitiation). ఈ మాటల మూలపదము లొకదానికొకటి సంబంధించినవై పరిశుద్ధుఁడగు దేవుఁడెట్టి యాచారకర్మలచే పాపులగు మానవులను తిరిగి తన సన్నిధికి చేర్చుకొని వారికి ప్రసన్నుఁడగునో దానిని సూచించుచున్నవి. క్రీస్తే అట్టి కరుణాధారమని రోమా $3^{25}$ నందున్నది. ఈ గ్రీకుపదము నే పాఁతనిబంధనయందు నిబంధన మందసమునకు పైనున్న కరుణాపీఠమునకు LXX నందు వాడిరి (నిర్గ $25^{17-22}$ లేవీ $16^{2}$ మొ॥). ఆ కరుణాపీఠమెట్లు ధర్మశాస్త్ర

మునుంచిన మందసమును కప్పెనో, అటులనే మనపాపములను క్రీస్తు కప్పివేయునను ఆత్మీయ భావము నిది స్ఫురింపఁజేయుచున్నది. కొద్దిపాటి రూపభేదముతోనున్న యీ మూలపదము నే I యోహా 2[2] నందు శాంతికరము అని తెనిఁగించిరి. ఈ పదముయొక్క క్రియారూపమును హెబ్రీ 2[17] నందు పాపములకు నివృత్తి కలుగ జేయుట యనియు, లూ 18[13] నందు కరుణించుటనియు తర్జుమజేసిరి. ప్రాయశ్చిత్తమును సూచించు పదములలో నిదియొకటి. దేవుఁడు దేనినిబట్టి పాపులయందు కరుణఁగలిగి, వారి పాప నివృత్తిఁజేయునో దానినే సూచించును. క్రీస్తు మనపాపములను భరించి పాపక్షమ కాధార భూతుఁడగుటచే నిది ముఖ్యముగా నాయనకును ఆయన పనికిని సార్థకనామముగా నున్నది (సమాధాన పరచుట, ప్రాయశ్చిత్తము చూ॥).

**కరుణాపీఠము** (Mercy Seat). బంగారు రేకులతో కప్పఁబడి అతిపరిశుద్ధ స్థలమునందుంచఁబడిన కెరూబులు నిలుచుట కాధారముగా నుండిన పలక. నిబంధనల మందసమునకు మూఁతగా నుండెను (నిర్గ 25[17-22] 26[34] 30[6] 31[7] 35[12] 37[6-9] 39[35] 40[20] లేవీ 16[2-15] సంఖ్యా 7[90]). ఈ మాటయొక్క మూలపదము కప్పునట్టి దానిని సూచించుచు, ప్రాయశ్చిత్తమని తెనిఁగించిన పదమునకు సంబంధించినదై యున్నది. I దిన 28[11] ప్రాయశ్చిత్తార్థదినమున దీనిమీఁదనే రక్తమును ప్రోక్షించి, ధర్మశాస్త్ర ప్రకారము ప్రాయశ్చిత్తము చేసినందున దీనికీ పేరు కలిగినట్లున్నది. ఇట్టిది పాపములను పరిహరించు దేవుని కరుణకు సూచనగా నున్నది. క్రొత్తనిబంధనయందు హెబ్రీ 9[5] లో కరుణాపీఠ మదాహరింపఁబడెను. అక్కడ ఉపయోగింపఁబడిన గ్రీకు పదమునే LXX నందు ప్రాయశ్చిత్తార్థమైన దాని సూచించుటకు వాడిరి. పాపులను రక్షించుటకు తన రక్తమును ధారపోసిన క్రీస్తుకు ఆ పదము రోమా 3[26] నందు సూచనగా నెంచిరి. (కరుణాధారము చూ॥)

**కర్కసు** (Carcus). చక్రవర్తియగు అహష్వేరోషునొద్ద కొలువుచేసిన యేడుగురు నపుంసకులలో నొకఁడు (ఎస్తే 1[11]).

**కర్కా** (Karka = చేటియ). యూదయ దేశపు దక్షిణ భాగమందున్న ఒక స్థలము (యెహో 15[3]).

**కర్కాటుములు** వృత్తులు చేతిపనులు I 2 (2) (c) చూ॥

**కర్కెమీషు** (Carchemish). యుఫ్రాతునదికి పశ్చిమపుటొడ్డున నుండు నొక ముఖ్య పట్టణము. ఇది హిత్తీయుల రాజ్యములోని తూర్పు భాగమునకు రాజధానియై యుండెను. హిత్తీయులు వృద్ధిలోనికి రాకమునుపు సహా అది యుండెను. క్రీ॥ శ॥ పూర్వము 8, 9 వ శతాబ్దములలో అష్షూరు రాజులు కొందఱు దానిని జయింపఁ బూనుకొనిరిగాని చివరకు సర్గోనను రాజు క్రీ॥ ము॥ 717 సం॥ లో జయించెను (యెష 10[9]). అప్పటినుండి యది అష్షూరు రాజ్యములో నొక భాగమునకు రాజధాని యయ్యెను. కర్కెమీషు దగ్గర నెబుకద్నెజరు ఫరోనెకో అను ఐగుప్తు రాజును ఓడించెను. క్రీ॥ ము॥ 605). ఈ యుజయము వలననే ఆసియాఖండములో పూర్వము ఐగుప్తీయులుచేసిన ప్రభుత్వమునకు అంతము కలిగెను (యిర్మీ 46[2] II దిన 35[20]).

**కర్కోరు** (Karkor = పునాది). గిలాదులోనుండు నొకస్థలము (న్యాయా 8[10]). గిద్యోను నిచ్చట జెబహు సల్మున్నా యను మిద్యానీయుల సేనాధిపతుల నోడించెను.

**కర్ణపిశాచము** (Familiar Spirit). దయ్యములకును మనుష్యులలోఁ గొందఱికి నొకవిధమగు సంబంధముగలదనియు, అందువలన ఆత్మలలోకము నుండి యొక ఆత్మగాని దయ్యముగాని వచ్చి కర్ణపిశాచము గలవానికి పరిచర్య చేయుననియు ఎంచఁబడెను. ఇట్టి సంబంధమును తెలియఁజేయుటకు లేఖనములయందు వెవ్వేఱుమాట లుపయోగింపఁబడి యున్నవి. అట్టి పదములలో నిదియొకటి. అసలుభాషయందు దీ సంగతిని సూచించుటకు వాడిన మూఁడు వివిధపదములను తెలుఁగునందు కర్ణపిశాచమను నొకమాటను మాత్రముపయోగించిరి. ఆ మూఁడింటిలో ద్వితీ 18[11] నందున్నదానికి తెలిసికొనువాఁడు గారడివాడు మాంత్రికుఁడని యర్థమగును. యెష

$47^{9-12}$ లో నున్నపదము మంత్రశక్తి భ్రమ ఆకర్షణ మాంత్రికుఁడు అను నర్థమిచ్చును. మూఁడవపదము లేవీ $19^{31}$ $20^{6-27}$ ద్వితీ $18^{11}$ I సమూ $28^{3,7,8}$ II రాజు $23^{24}$ I దిన $10^{13}$ II దిన $33^{6}$ యెష $8^{19}$ $19^{3}$ $29^{4}$ నందున్నది. దానికి గోణుగువాఁడు చచ్చినవారి యాత్మలతో సంబంధముగలిగి ఇతరులకుఁ దెలియని రాఁబోవు సంగతులను కనుగొనువాఁడనియు అర్థము.

పాఁతనిబంధన కాలమునందే గాక క్రొత్త నిబంధనకాలమునందును కొందఱిట్లు దయ్యములతో సహవాసముచేసి రాఁబోవు సంగతులను రహస్యవిషయములను చెప్పఁగలరనియు స్త్రీ పురుషులకు కీడుకలిగించఁగలరనియు నమ్మినట్లు ఆయా వాక్యములవలనఁ దెలిసికొనవచ్చును (కార్య $8^{9-11}$ $13^{8}$ $16^{16}$ $19^{13-16}$). శకునము సోది దేవోక్తి మంత్రము యక్షిణికొండ్లు గోణుగువారు చిల్లంగితనము గారడి కాలజ్ఞానము అను మొదలగునవి దీనికిసంబంధించిన పదములై యున్నవి. (ఆ పదములను చూ॥). మనుష్యులకు దయ్యములతో నిట్టి సంబంధమున్నదనుట నిజమో కాదో తెలియదుగాని అది మోసయుక్తమైన విషయమను సంగతిమాత్రము సత్యము. ఇది మానవులను నిజదేవునినుండి దూరముగాఁ దొలగించెను గనుక దీని నిషేధించవలెనను హెచ్చరికెలును దానిచే మోసపర్చఁబడు వారి కీడును గూర్చిన ప్రవచనములును పాఁతనిబంధనయందంతట మనకు కనఁబడుచున్నవి. ఆదికాలమునుండి ఈ మూఢనమ్మకము హెబ్రీమతమునందుఁ దప్ప యితరమతము లన్నిఁటిలో కొద్దిగనో గొప్పగనో కనఁబడుచునే యున్నది. జ్ఞానులనఁబడిన వారుండిన అష్షూరు బబులోను కల్దీయ అనుదేశమున నగుపడునట్టి నాగరిక పద్ధతులనుండి మంత్రములు దృష్టి మున్నగు నీచ విషయములవఱకు ఈ మూఢాచారములు అన్ని దేశములలోనున్నవి. ఐగుప్తు కనాను ఇశ్రాయేలీయులు చెఱకుపోయి యితరదేశములయందుండఁగా నిది వారికిని అంటురోగమువలె త్వరగా నంటుకొనెను గాన, దేవుఁడు తన ప్రవక్తలచేత నిట్టి హెచ్చరికెలను జేయించెను.

B.

**కర్ణభూషణము (Amulet, Collars and Pendants).** 1. యెష $3^{20}$ నందున్న యొక మూల భాషా పదమునకు అపాయము రాకుండ అడ్డగించు ఒకవిధమైన మంత్రశక్తి లేక తాయెత్తు అని యర్థము. ఈ దేశమునందింకను వాడుకలోనున్న మంత్రములు రక్షరేకులు అను వాటి కిది సంబంధించియున్నది. సామె $25^{12}$ న్యాయా $8^{26}$ నందున్న పదమునకు భూషణమని మాత్రమే యర్థము. ఆది $35^{4}$ నిర్గ $32^{2,3}$ $35^{22}$ న్యాయా $8^{24,25}$ లో ఈ పదమును **పోగులనియు** హోషే $2^{13}$ నందు **నగలనియు** తర్జుమాజేసిరి (ఆభరణములు 18 చూ॥).

ఆది $35^{4}$ నం దుదాహరింపఁబడిన పోగులు షెకెము వారి శవములనుండి దీసికొనఁబడిన మంత్రపు కమ్మలు గావచ్చును. హోషే $2^{13}$ నందు ఈలాటి నగలు బయలు దేవతారాధనకు సంబంధించినట్లు చెప్పఁబడియున్నవి. దురదృష్టము దృష్టి మంత్రశక్తి మొదలగు వాటినుండి తప్పించుకొనుటకు ఈ కర్ణభూషణము లుపయోగింపఁబడెను. వాటిని వెవ్వేఱు పదార్థములతోఁ జేసిరి. అవి వివిధాకారములు గలిగి యుండెను. వాటికి విచిత్రమగు శక్తి గలదని నమ్మిరి. వాటిలో గొన్ని మిగులవిలువగల రాళ్లయియుండెను ఈ దేశమునం దుపయోగించు హనుమంతు బిళ్లలవలెఁ గొన్ని వారారాధించెడి దేవతా రూపములు చిత్రింపఁబడినవై యుండెను. అప్పుడప్పుడు మంత్రములు వ్రాయఁబడిన తోలు ఓళ్లలుగాని కాగితపు బిళ్లలుగాని ఉపయోగించిరి. వీటిని చెవులకుమాత్రమేగాక మెడకును చేతికిని కట్టుకొనెడివారు. ద్వితీ $6^{8}$ నందున్న దాని ప్రకారము చేయుటకు యూదులు లేఖన వాక్యములను తోలు బిళ్లలమీఁద వ్రాసి బాసికములుగాను కంకణములుగాను కట్టుకొనెడివారు. క్రీస్తు కాలమున నిది తక్కినవాటివలె బహిరంగ యాచారముగ మాత్రమే పరిగణింపఁబడెను.

B.

2. ఆభరణములు 18 చూ॥

**కర్తా (Kartah = పట్టణము).** లేవీయుల తెగలోని మెరారీయుల కియ్యఁబడిన యూళ్లలో నొకటి (యెహో $21^{35}$). ఇది జెబూలూను గోత్రికుల స్వాస్థ్యములో నుండెనుగాని దాని యునికిని గూర్చి మ కేమియుఁ దెలియదు.

**కర్తాను** (Kartan = ఊళ్ల జంట?). లేవీయులలోని గెర్షోనీయుల తెగవారికి నియ్యఁబడిన యూళ్లలో నొకటి (యెహో $21^{32}$). I దిన $6^{76}$ లో అది **కిర్యతాయిము** అనఁబడెను. ఇది నఫ్తాలీగోత్ర స్వాస్థ్యములో నుండెనుగాని దాని యునికినిగూర్చి మరేమియు తెలియదు.

**కర్పు** (Carpus = మణికట్టు). త్రోయ పట్టణస్థుఁడు (II తిమో $4^{13}$). పౌలు తన చివరి ప్రయాణములో నితనియొద్ద తన యంగీ నుంచి వచ్చెను. ఇతని పేరు గ్రీకు పేరుగాని యితఁడు యూదుఁడో గ్రీకువాఁడో రూఢిగాఁ దెలియదు.

**కర్పూరవృక్షము** (Camphor Tree). ఇది గోరంటవృక్షమని యుండవలెను (పర $4^{13}$).
J. C.

**కర్మీ, కర్మీయులు** (Carmi = ద్రాక్షతోఁట మాలి, Carmites).

1. యూదా గోత్రికులలో నొకఁడగు ఆకానుకు తండ్రి (యెహో $7^{1,18}$ I దిన $2^{7}$).

2. యూదా కొడుకులలో నొకనికి ఈ పేరుకలదు (I దిన $4^{1}$). I దిన $2^{9,18}$ లో నున్న **కెలూబై** (= కాలేబు) వీనికి సరియైన పేరై యున్నట్లున్నది.

3. రూబేను కుమారులలో నొకఁడు. ఇతఁడొక కుటుంబమునకు పెద్దయాయెను (ఆది $46^{9}$ నిర్గ $6^{14}$ సంఖ్యా $26^{6}$). ఈ కుటుంబికులు **కర్మీయులు** అనఁబడిరి ($26^{6}$).

**కర్మెలు** (Carmel = తోఁట, వనము).

1. యూదయ మన్య ప్రదేశములోనున్న ఒక యూరు (యెహో $15^{55}$). సౌలు అమాలేకీయులను జయించిన పిమ్మట ఇచట జయసూచకమైన యొక శిలను నిలిపెను (I సమూ $15^{12}$). ఇచట (మాయోనులో) నాబాలు అను ఆస్తిపరుఁడుండెను ($25^{2-40}$). ఇతఁడు చనిపోయిన పిమ్మట ఇతని భార్యయగు అబీగయీలును దావీదు వివాహము చేసికొనెను ($30^{5}$). రాజైన ఉజ్జియాకుకూడ ఇచట పొలములు ద్రాక్షతోఁటలు నుండెను (II దిన $26^{10}$). దావీదు యోధులలో హెస్రై (II సమూ $23^{35}$) లేక హెజ్రో (I దిన $11^{37}$) అనువాఁడీ యూరివాఁడే. ఇది హెబ్రోనుకు ఆగ్నేయము 5 క్రోసుల దూరములో నుండెను. ప్రస్తుతము దానికి కుర్ముల్ (*Kurmul*) అను పేరుకలదు (పటము II, E 3).

2. సాధారణముగా కర్మెలు అనునది యొక కొండ వరుసకు పెట్టఁబడుపేరై యున్నది. అది గలిలయకును సమరయకును పశ్చిమ భాగపు హద్దుగానున్నది. ఆ కొండలు 1746 అడుగుల ఎత్తుగాను వాటి వరుస 15 మైళ్ల పొడుగుగా నుండును. అది అక్కా యను సంయుక్తాగ్రగుడమునకు దక్షిణముగా సముద్రమువఱకు వ్యాపించును అది యచట 556 అడుగుల ఎత్తుగా నుండును. దానిలో గుహలుండుటచే అది ప్రవక్తల యాశ్రమములకు తగినస్థానమై యుండెను. బైబిలులో అది ఆషేరు గోత్రపు దక్షిణహద్దుగా నున్నది (యెహో $19^{26}$). ఇచటనే ఏలీయా బయలు ప్రవక్తలను ఓడించెను (I రాజు $18^{17-40}$). ఏలీయా సేవకుఁడు వర్షమువచ్చు సూచనను చూచిన దిచటనే ($18^{41-46}$). ఎలీషాకూడ అచటికి వచ్చి నట్లున్నది (II రాజు $2^{25}$ $4^{25}$). ఈ కొండ యొక్క ఫలవంత స్థితిని సూచించు అలంకారములు యెష $33^{9}$ $35^{2}$ యిర్మీ $50^{19}$ లో నున్నవి. మీకా $7^{14}$ చూడఁగా అచట అడవి యున్నట్లు తెలియును కావుననే అచట దాగుకొనుటకు వీలులుండెను (ఆమో $9^{3}$). పర 7:5 లో నున్నట్లు కర్మెలు శిఖరము ఒక స్త్రీ శిరస్సుకు పోల్చఁబడి యున్నది కావున అది మిగుల సొగసైనదై యుండునని తెలిసికొనవచ్చును. కర్మెలు ఎండిపోవుట గొప్ప యుపద్రవమునకు సూచనగా నుండెను (ఆమో $1^{2}$). ఇది నేటివఱకు పరిశుద్ధముగా నెంచఁబడుచున్నది. కర్మెలు సన్యాసులు అనఁబడువారికి అచట నేటివఱకు ఒక మఠము కలదు.

**కర్ర** (Rod). నేరస్థులను దెబ్బలు కొట్టుటకై నుపయోగించు ఉపకరణము (యెష $10^{24}$). ఈ పదమును దండము అను పదముతో కలిపి ఉపయోగించిరి. సామె $10^{13}$ $13^{24}$ $26^{3}$ కార్య $16^{22}$ II కొరి $11^{25}$ నందున్న అదే పదమును బెత్తము అని తెనిఁగించిరిగాని ఈ దేశమునందు బెత్తముతో కొట్టుట అలవాటు కావున ఆ పదము నట్లు తెనిఁగించిరే గాని అది బెత్తము కానే కాదు. శిక్షించుటకై వాడఁబడు కర్రను సూచించు అసలు మాట కీర్త $23^{4}$ నందు **దుడ్డు**

కర్ర యని సరిగా తెనిఁగించఁబడెను. లేవీ 27[32] నందున్న అదే పదము కోల యని తర్జుమా చేయఁబడెను. (ఆభరణములు 1 చూ॥).

**కర్షేనా (Carshena).** అహష్వేరోషు దగ్గఱ నున్న ఏడుగురు పారసీక ప్రధానులలో నొకఁడు (ఎస్తే 1[15])

**కల, స్వప్నము (Dream).** దేవుఁడు మానవులకు కలలద్వార తన సంగతులను తెలిపి యున్నట్లు బైబిలులో నున్నది. ఈ విధముగా దేవుఁడు అబీమెలెకు (ఆది 20[3]), యాకోబు (28[12] 31[10]), యోసేపు (37[5,9,10,20]), ఫరో సేవకులు (40[5]), ఫరో (41[1-7,15,25,26]), సొలొమోను (I రాజు 3[5]), నెబుకద్నెజరు (దాని 2[1,4], 1[36] 4[4-18] మొ॥), దానియేలు (7[1] మొ॥) మరియను ప్రధానము చేసికొనిన యోసేపు (మ 1[20]), జ్ఞానులు (2[12]) మొదలయినవారికి తన సంగతులను తెలిపెను. అదియుఁగాక ఆ స్వప్నములకు అర్థము చెప్పు శక్తిని దేవుఁడు కొందఱికి ననుగ్రహించెను. యోసేపు (ఆది 41[16]), దానియేలు (దాని 2[25-28]). అట్టి శక్తిఁ గలవారై యుండిరి. తన భక్తులకు మాత్రమే గాక వారి విరోధులకుకూడ స్వప్నముల మూలమున భయము చెప్పినట్లు కొన్ని దృష్టాంతములు కలవు. ఇట్లు మిద్యానీయులలో నొకని కలవలన వారందఱికి భయము కలుగఁజేసెను (న్యాయా 7[13]). పిలాతుభార్యకు కలిగిన స్వప్నమువలన నతనికి భయము కలుగఁజేసెను (మ 27[19]). స్వప్నములన్నియు దేవుని చిత్తమును తెలుపునవియే యని బైబిలు గ్రంథకర్తలనుకొనుటలేదు. చెడ్డ నడతనుగాని భక్తిహీనతనుగాని బోధించు స్వప్నములు దేవునివలనఁ గలిగినవి కావు. అట్టివి యిశ్రాయేలీయులను యెహోవా సేవనుండి తొలఁగించిన యెడల వాటినిఁ గనిన వారిని చంపవలెనని బహు కఠిన నియమములు కలవు (ద్వితీ 13[1-5] యిర్మీ 23[25-32] జెక 10[2]). స్వప్నములన్నియు నిట్టి యర్థములతో కూడినవై యున్నట్లు బైబిలు బోధించక పోవుటయే కాక అవి అస్థిరతను శూన్యమును సూచించునట్టి వనుటకుకూడ సూచనలు కలవు (యోబు 20[8] కీర్త 73[20] యెష 29[8] దర్శనములు చూ॥).

**కలము (Pen).** మిగుల పురాతనకాలము నుండియే నరులు వ్రాయఁగలిగి యుండిరి. చీనా వారు నేటివఱకు ప్రస్తుత మీ దేశములో నక్కడక్కడ వ్రాయునట్లు రెల్లు పుడకతో వ్రాయుచున్నారు. III యోహా 13 లో నున్న కలము అను దాని మూల పదము అట్టి కలమునే సూచించును. శాస్త్రులని సాధారణముగా తెనిఁగించిన మూలపదమునకు వ్రాసెడివారని యర్థము. అబద్ధములను వ్రాసిన వారికి కల్ల కలము లున్నట్లు యిర్మీ 8[8] నం దున్నది.

రాళ్లమీఁద అక్షరములను చెక్కుటకు ఇనుప పోగరు నుపయోగించిరి (యోబు 19[24]). ఎంత తుడిచినను చెడిపోని సత్యమగు వార్త ఇనుప గంటముతో (యిర్మీ 17[2]) వ్రాయఁబడినట్లు అలంకార రీతిగా చెప్పఁబడెను (వ్రాత చూ॥).

**కలహము (Strife).** పాఁతనిబంధనలో కలహమును సూచించెడి రెండుపదములను మూల భాషయందు వాడిరి. అబ్రాహాము లోతు అను వారి సేవకులు కలహ పడుటను (ఆది 13[8]) గూర్చి ఉపయోగించిన మరీబా అను పదమును కీర్త 106[32] నం దట్లే యుంచిరి. ఇశ్రాయేలీయులు మోషేతో కలహపడుటవలన ఆ స్థలమునకీ పేరు పెట్టిరి (సంఖ్యా 27[14]). యిర్మీయా తన స్థితిని గూర్చి ప్రలాపించినప్పుడీ పదమును వాడెను (యిర్మీ 15[10]). యిర్మీయా సత్యవాదియైనందున లోక విరోధి యాయెను. ఆ కారణముచే ప్రజలందఱతనితో కలహించిరే గాని అతఁడు దోషియై నందునఁగాదు. రెండవపదము వ్యాజ్యమునకు సంబంధించిన తర్కములను మొదట సూచించి నను కలహమునకును వాడిరి (సామె 28[25]). కలహపడుట నీతికి విరుద్ధమైన ముఖ్య పాపముగా పరిగణింపఁబడినటుల సామెతల గ్రంథమువలనఁ దెలియుచున్నది. ఈ రెండు పదములీ గ్రంథము నందు తఱచుగవాడిరి (మొదటిది 15[18] 17[1,14] 18[6] 20[3] 26[21] 30[33]; రెండవది 16[28] 17[14] 28[25] 29[22] మొ॥). సామె 26[17] నందు మొదటి పదమును, 26[20] నందు రెండవదానిని జగడమనియు, సామె 15[18] 17[14] నందు మొదటి పదమును వివాదమనియు తెనిఁగించిరి. ఇట్టి కలహములను పేరాస గలవాఁడును (28[25]) కోపిష్ఠుఁడును

(29[22]) కలహప్రియుఁడును (26[21]) జగడగొండియు (21[19]) గయ్యాళియు (27[15]) పగ పెట్టినవాఁడును చేపుదురు. కీర్త 31[20] నందున్న వాక్కలహము అను పదమువలన మాటలును కలహ కారణమని తేటపడుచున్నది. దీర్ఘశాంతుఁడు దానినణచివేయును (సామె 15[18]). కలహప్రియుల ఉపవాసములు దేవుని కిష్టమైనవి కావని ప్రవక్తబోధించెను (యెష 58[4]).

క్రొత్తనిబంధనయందు కలహమును శరీర కార్యములలోఁ జేర్చిరి (గల 5[20]). భ్రష్ట మనస్సుగలవారి లక్షణములలోని నిదియొకటి (రోమా 1[29]). అంధకారపు పనులలో నొకటి యని లెక్కించిరి (13[13]). ఇట్టి కలహబుద్ధి మానవులలో నెక్కువగా నుండుటవలన ఇది యుండరాదని ఆయా క్రైస్తవసంఘములకు అనేకమార్లు హెచ్చరికెలు చేయఁబడెను (I కొరి 1[11] 3[3] II కొరి 12[20] ఫిలి 1[15] I తిమో 6[4] తీతు 3[9] మొ॥). I కొరి 11[16] నందు కలహప్రియుడని తెనిఁగించిన మూలపదము మఱియొకటియై వాదప్రియుఁడను నర్థమిచ్చును. II తిమో 2[23] నందలి జగడములను పదముచే తర్జుమాజేసిన మూలపదమునకు యుద్ధములని యర్థము. ఆ పదమునే యాకో 4[1] నందు పోరాటములని తెనిఁగించిరి. ఆ వాక్యములోనే యుద్ధములని యున్నమాట వేఱొకటిగా నున్నది. అది గొప్పకలహములను సూచించును. మనదికానిదాని నాశించుటవలన నిట్టి కలహములు పుట్టునని ఈ వాక్యమువలన స్పష్టమగుచున్నది. మా 7[21-23] నందున్న పాపముల జాబితాలో కలహపడుట లేకున్నను దాని ముఖ్య కారణములగు లోభములు అసూయలు దానియందుదాహరింపఁబడక పోలేదు. (తర్కము, కక్షలు, మత్సరములు, భేదములు చూ॥).

**కల్కోలు** (Calcol = పోషణ). యూదా వంశస్థులలో నొకఁడు (I దిన 2[6]). ఇతఁడు జ్ఞానమునకుఁ బ్రసిద్ధులగువారిలో నొకఁడు (I రాజు 4[31]).

**కల్దీయ, కల్దీయదేశము** (Chaldea). మిగుల పురాతనకాలమందు బాబెలుకు దక్షిణముగా పారసీక సంయుక్తాగ్రగుడమువఱకు వ్యాపించినదేశమునకు కల్దీయదేశమని పేరు. అచ్చట కూషుయొక్క సంతానము వసించెను. ఆ దేశమునకు షీనారు అనుపేరుకూడ ఉపయోగింపఁబడెను (ఆది 11[2] 14[1]). తరువాతికాలములో ఆ దేశస్థులు బాబెలుమీఁద జయము పొంది ఆ దేశమునుకూడ తమరాజ్యములో చేర్చికొనినందున ఆ దేశములన్నిఁటికి కల్దీయదేశము అను పేరుచెందెను. యెరూషలేమును పట్టుకొని దాని జనులను చెఱఁబట్టి దేవాలయమును పాడుచేసి అందలి యుపకరణములను వెండిబంగారములను దోపుడుసొమ్ముగా బాబెలుకు తీసికొనిపోయిన నెబుకద్నెజరు కల్దీయుఁడనఁబడెను (ఎజ్రా 5[12]). అతఁడేలిన దేశములన్నిఁటికి కల్దీయ యనుపేరుపయోగింపఁబడెను (యిర్మీ 50[8,10] యెష 23[15,1] బాబెలు, నెబుకద్నెజరు చూ॥). C.

**కల్దీయులు** (Chaldeans). కల్దీయ రాజ్యములోని జనులు. వారు మిగుల పురాతనకాలము మొదలు యుద్ధశూరులై యుండిరి (యోబు 1[17] ఆది 14[1] హబ 1[6-11]). షుమారు క్రీ॥ పూ॥ 600 సం॥ న కల్దీయులు నెబుకద్నెజరు తండ్రియగు నెబోపొలస్సరను (*Nabopolassar*) కల్దీయులరాజు కాలములో బాబెలుమీఁద జయము పొంది యేలిరి. నెబుకద్నెజరు యెరూషలేము మీఁద యుద్ధముచేసి యూదారాజైన సిద్కియాను పట్టుకొని అతని కన్నుల నూడదీసి గొలుసులతో నతని బంధించి అతనిని యూదా జనులను కూడ చెఱగా తీసికొనిపోయెను (ఎజ్రా 5[12] యిర్మీ 39[5-7]).

నెబుకద్నెజరుకు తరువాత అతనికుమారుఁడగు ఎవిల్మెరోదకు ఏలెను. అతఁడు యూదా రాజుల యెడల దయఁ జూపెను (II రాజు 25[27-29]). అతనికి తరువాత నెరిగ్లిస్సరు (*Neriglissar*), లబాసి మర్దుక్ (*Labashimarduk*), నబోన్నెదు (*Nabona'id*), అను కల్దీయ రాజులు కొంతకాలమువఱకు నేలిరి. వారికిఁబిమ్మట బెల్షస్సరు సింహాసనమెక్కి బహుగా గర్వించి తన ముత్తాత యెహోవా ఆలయమునుండి దోపుడుసొమ్ముగా తెచ్చిన పరిశుద్ధోపకరణములను బంగారు పాత్రలను ఒకవిందుసమయమున భోజనశాలకు తెప్పించి తానును తనక్రింది ప్రభువులును వారి స్త్రీలును వాటితో ద్రాక్షారసము త్రాగిరి. అప్పు

డకస్మాత్తుగా నొకమనుష్యహస్తము అద్భుతముగా కనఁబడి వారు విందుచేయుచుండిన గదియొక్క గోడమీఁద యెహోవా వారినిగూర్చి తీర్మానించిన నాశనమును వ్రాసెను (దాని 5[1-29]). ఆ రాత్రి లోనే బెల్షస్సరు చంపఁబడెను (5[30]). ఆలాగున యీరాజ్యమునకు ముగింపు కలిగెను. మాదీయుఁడగు దర్యావేషు ఆ పట్టణమును ఆ దేశమును జయించి వాటిని తన రాజ్యమునకు కలుపుకొనియెను (5[31] 6[1]).

ప్రవక్తయైన దానియేలుకాలము మొదలు కల్దీయులు అను పేరుకు వేఱొక ఉపయోగము కలదు. అప్పటి కల్దీయులు విద్యలయందు ప్రవీణులై యుండిరి. వారు గణితశాస్త్రజ్ఞులును తత్వజ్ఞులును జ్యోతిష్కులునై యుండిరి. గనుక వారు భవిష్యత్కార్యములను చెప్పువారని జనులు నమ్మిరి. కాఁబట్టి దానియేలు గ్రంథమందు కల్దీయులు అనుమాట అనేకచోట్ల అట్టి ప్రయోగమున నుపయోగింపఁబడును (2[2,10] 4[7] 5[11]).

C.

**కల్నే** (Calneh, Calno).

1. షీనారు అనఁబడిన బబులోను ప్రదేశములోని పురాతనపట్టణములలోని యొక ముఖ్యపట్టణము (ఆది 10[10]). యూదులపురాతన పండితుల యభిప్రాయము చూడఁగా నిప్పూరు (*Nippur*) అను పట్టణ మిదియే యని తెలియును. అయితే పూర్వము బబులోను దగ్గర కులును (*Kulunu*) అను పట్టణముండెను. అదే దీనియునికియై యుండవచ్చును.

2. ఆమోసు 6[2] లో నున్న కల్నే లెబానోను పర్వతప్రాంతములో నున్న హమాతు ఫిలిష్తీయుల దేశములో నున్న గాతు అను నీ పట్టణముల గుంపులో నున్నది. ఈ కిల్నే సిరియాదేశపు పట్టణములలో నొకటి. అష్షూరుదేశపు శిలాశాసనములందుగల సిరియాపట్టణములలో కుల్నియ (*Kulnia*) అను పేరుకలదు. అర్పాదుకు మూఁడు క్రోసుల దూరములో నున్న కుల్లంహు (*Kullanhu*) అనునది దాని యునికియై యున్నది.

**కల్పనాకథలు** (Fables). ఈ మాట I తిమో 1[4] II తిమో 4[4] తీతు 1[14] లో నున్నది. తెనుఁగు బైబిలులోని I తిమో 4[7] లో ముచ్చటలు అనుపదముగా తర్జుమా చేయఁబడినది అపలులో ఈ మాటయై యున్నది. II పేతు 1[16] లో ఆ మాటనే **కల్పించినకథలు** అని తర్జుమా చేసియున్నారు. కల్పనాకథలను మాటచే సూచింపఁబడిన బోధలలో అన్యులయొక్కయు యూదులయొక్కయు బోధలు చేర్చఁబడినట్లుగా నున్నది. పౌలుదాహరించిన కల్పనాకథలు అప్పటికాలమున వాడుకలోకి వచ్చిన ఒకవిధమగు తత్వశాస్త్రమునకు సంబంధమైనవిగా నుండెను. వాటి ననుసరించి ప్రకృతి పాపమునకు మూలమనియు, దేవునికిని ఈ ప్రకృతికిని మధ్య అనేకులైన యుగాధిపతు లున్నారనియు నమ్ము గ్నోస్టికు (*Gnostics*) లవలె కొందఱు క్రైస్తవులును నమ్మియుండవచ్చును (I తిమో 4[7]). వీరు పాపమునకు ప్రకృతియే మూలమని బోధింపఁగా కొంద ఱీ బోధను త్యజించి బైరాగులైనట్లున్నది (I తిమో 4[3]). మఱి కొందఱు పాపమునకును ప్రకృతికిని సంబంధముండుటచే పాపము మన శరీరమున కంటునే కాని ఆత్మ కంట నేరదని బోధించి పాపములలో మఱెక్కువగా మునిఁగి పోవుచుండిరి (తీతు 1[15,16]). ఆది క్రైస్తవుల కాలములో నిట్టి దుర్బోధ లుండినట్లు పైచెప్పిన ములలో మాత్రము గాక కొలొ 2[20-23] ప్రక 2[6,15,20] లో కూడ సూచనలున్నవి.

**కల్లయి** (Kallai = వేగిరము). యాజకుల లోని యొక కుటుంబపెద్ద (నెహె 12[20]).

**కవచము** ఆయుధము II 3 చూ॥

**కస్తూరి పుష్పము** (Rose). కస్తూరియని యెష 35[1] నందు తెనిఁగించఁబడిన మొక్క పల్లప్రదేశములయందును ముఖ్యముగా చెమ్మ భూములయందును యథేచ్ఛగాఁ బెఱిగెడి దుంప సంబంధమైన మొక్కయై యున్నది. దాని పువ్వులు మిక్కిలి చక్కనివై మనోహరమగు పరిమళమునిచ్చును. J. C.

**కస్లూహీయులు** (Casluhim). మిస్రాయీము సంతతివారు (ఆది 10[14] I దిన 1[12]). మిస్రాయీమనునది ఐగుప్తుదేశముయొక్క అసలు పేరైయుండెను. కావున యీ కస్లూహీయులు మిస్రాయీమువారికి సంబంధులై యున్నట్లుగా నున్నది. వీరు కఫ్తోరీయు లనఁబడు ఫిలిష్తీయు

లకు పూర్వికులై యున్నట్లు ఆది 10[14] వలన కనబడును.

**కహాతు, కహాతీయులు** (Kohath, = సభ? Kohathites). లేవీ కుమారులలో నొకఁడు. ఇతఁడు కహాతీయుల గొప్ప వంశమునకు పూర్వికుఁడయ్యెను (ఆది 46[11] నిర్గ 6[16,18]). **కహాతీయులు** అనునవి లేవీయులలోని మూఁడు భాగములలో నొకభాగమునకు గోత్రనామమయ్యెను. వీరిలో మఱి నాలుగు ఉపభాగములుకూడ నుండెను (నిర్గ 6[18] సంఖ్యా 3[27]). మోషే అహరోనులు ఈ కుటుంబపువారే (నిర్గ 6[20] I దిన 23[13-17]). అరణ్యములో వారు మందిరమునకు దక్షిణదిక్కున దిగవలసినవారని నియమించిరి (సంఖ్యా 3[29]). గుడారములోని వస్తుసామగ్రిని వారు ముట్టుటకు సెలవియ్యక యాజకులు వాటిని కప్పినపిమ్మట వాటిని కహాతీయులు మోయునట్లు ఏర్పాటు చేసిరి (సంఖ్యా 4[15,17,20] II దిన 34[12]). వారు ప్రత్యేకముగా లెక్కింపఁబడిరి (సంఖ్యా 34-37). పలెస్తీనును విభాగించినపుడు యాజకులతోపాటు వీరికిని 23 పట్టణముల నిచ్చిరి (యెహో 21[4,5,13-26]). దావీదు కాలమందు ఈ తెగవారిలోని యొక కుటుంబపు వారు దేవుని మందిరములో సంగీతమునకు నాయకులై నడిపించిరి (I దిన 6[31-38]). యెహోషాపాతు కాలములోకూడ వీరీపనిని చేసినట్లు తెలిసికొనవచ్చును (II దిన 20[19]). హిజ్కియా కాలములో ఆలయము పవిత్రపఱచుటయందు వీరు సహాయపడిరి (II దిన 29[12-14]). కోరహు ఈ తెగలోనివాఁడే (సంఖ్యా 16[1]).

**కళంకము** రోగములు చికిత్సలు I 2 చూ॥

**కళ్లము** వ్యవసాయము 7 చూ॥

**కళ్లెము** (Bridle). ఇప్పటివలె బైబిలు కాలమునందును గుఱ్ఱములను మాత్రమేగాక గాడిదెలను లోఁబఱచుకొని పనిఁజేయించుకొనుటకు కళ్లెముల నుపయోగించిరి (కీర్త 32[9] సామె 26[3]). ఈ పదమును ఆయా వాక్యములలో అలంకారరీతిగా నుపయోగించిరి: 1. కళ్లెమును వదలించుకొనుట విధేయతగా నుండకపోవుట కొక సూచనగా నున్నది (యోబు 30[11]). ఇది బుద్ధిలేని జంతువులను లోఁబఱచుకొనుటకు సాధనముగా నున్నది. అట్టి జంతువులవలె నుండరాదు అని హెచ్చరించుటలో కళ్లెము అనుపదము నుపయోగించిరి (కీర్త 32[9]). 2. అది చిన్నసాధనమైనను బలముగల గుఱ్ఱములను సహ దానివలన లోఁబఱచుకొనఁగలుగుచున్నాము. నాలుక బహు చిన్న అవయవమై యుండినను బహు కీడుచేయగలదియై యున్నవి గాన దానికి కళ్లెముపెట్టుకొని లోఁబఱచుకొనవలయునని (యాకో 3[3]) నందున్నది.

## కా

**కాకి** పక్షులు 4 చూ॥

**కాగితము** (Paper). ఈ పదము II యోహా 12 నందు తప్ప బైబిలులో మఱెచ్చటను కనఁబడదు. ఆకాలమందున్నవారు పలకలు తోళ్లు ఇటుకలు రాళ్లు మొదలగువాటిమీఁద వ్రాసెడివారుగాని కాగితములమీఁద వ్రాసినవారుకారు. ఐగుప్తు నదీతీరమునందు దొరకు జమ్మునందలి పీచును ఎండఁబెట్టికొని ప్రస్తుతము దొరల గోపిలయందు కొన్నిఁటిలో కనఁబడు కాగితమువంటిదానికి సంబంధించిన దానిని చేసి దానికి పపైరస్ (*Papyrus*) అనుపేరును పెట్టిరి. అట్టిజమ్ము ఐగుప్తునందును పలెస్తీనులోను దొరకును. ఆ జమ్ముతోఁ జేయఁబడు కాగిత మెక్కువకాలముండక త్వరగా చెడిపోవునుగాని తేమ యెక్కువలేనట్టి ఐగుప్తునందు నేటివఱకు కాపాడఁబడిన అట్టి పురాతన కాగితము లింకఁ గలవు. యోహాను తన రెండవ పత్రిక నట్టిదానిమీఁద వ్రాసినట్లు పైవాక్యము వలనఁ దెలియుచున్నది.

**కాటుక** రోగములు చికిత్సలు IV 1 (2) వ్యవసాయము 5, (2) చూ॥

**కాడి** (Yoke). ఈ దేశమునందున్నట్లుగానే పలెస్తీనుదేశమునందును భారవాహకములగు పనులకు పశువుల నుపయోగించిరి గాన కాండ్లను వాడవలసివచ్చెను. బైబిలునందు కాఁడి దాసత్వమునకు సూచనగా వాడఁబడెను. జనములు కాఁడిక్రింద నున్నారనుట వారు మఱియొక జనాంగమునకు దాసులగుటను సూచించెను (ఆది 27[40] లేవీ 26[13] I రాజు 12[4] మొ॥). ఆయా జనాంగములు బాబెలురాజునకు లోఁబడెదరను

సంగతిని సూచించుటకు యిర్మీయా తానొక కాఁడిని మెడకు ధరించుకొనుటయేగాక, ఆయా జనాంగముల రాయబారులద్వారా వారిరాజులకు కాండ్లను పంపించెను (యిర్మీ 27³⁻⁷). స్వంత రాజుల కఠిన ప్రభుత్వమును బరువైన కాఁడితో పోల్చిరి (I రాజు 12⁴⁻¹⁵). **కాఁడినివిఱుచుట** అట్టి దాసత్వమునుండి తప్పించుకొని స్వతంత్రు లగుట కొక సూచనగా నున్నది (ఆది 27⁴⁰ యిర్మీ 28² యెహె 34²⁷ మొ॥). పైనుండు వారికి చూపవలసిన విధేయతకును కాఁడి యొక సూచన. పిల్లలు తమ తలిదండ్రులయెడల చూప వలసిన విధేయత కాఁడి మోయుటయని అలంకార రీతిగాఁ జెప్పఁబడినది (విలా 3²⁷). దాసులు తమ యజమానులకు చేయవలసిన సేవయును వారి కాఁడియని యెంచిరి (I తిమో 6¹⁻²).

మతవిషయములలోకూడ నేయేవిధులను చేయుటకు బద్ధులమైయున్నామో అది కాఁడి యని యూదులు వాడుకగా నుపయోగించిన అలంకారమై యున్నది. ఒకఁడు విద్యార్థియై ధర్మశాస్త్రమును నేర్చుకొనునపుడు ధర్మశాస్త్ర మను కాఁడిని ధరించుకొన్నట్లుగాఁ జెప్పిరి. యూదుల ధర్మశాస్త్రము ఎవరును మోయలేనంత బరువైనదని పేతురు చెప్పెను (కార్య 15¹⁰). యేసుక్రీస్తు ఈ యలంకారమునే యుపయోగించుచు తన సేవను పూనుకొనువారు తనకాఁడిని యెత్తుకొని తన్ను వెంబడించవలసినదనియు, ఆ కాఁడి సుఖమై తేలికగా నున్నదనియు చెప్పెను (మ 11²⁹,³⁰).

ఫిలి 4³ నందున్న **నిజమైన సహకారి** యనుపదముచే తెనిఁగించిన అసలుమాట ఒకటే కాఁడికి కట్టఁబడిన జతదానిని సూచించును.

**కాదేషు, కాదేషుబర్నేయ** (Kadesh, Kadesh Barnea = ప్రతిష్ఠతము). ఈపదము ఒక ఊటకును దాని దగ్గరనున్న యూరునకును వాటిచుట్టునున్న యొక యెడారికిని పేరుగా నుపయోగించిరి. ఆ యూటయు, ఊరును హెబ్రోనుకు షుమారు 75 మైళ్లను, బెయేర్షెబాకు 50 మైళ్లను దక్షిణముగా పలెస్తీనునుండి ఐగుప్తునకు వెళ్లుమార్గ సమీపమునన్నది. అది కనానుదేశపు ఆగ్నేయమున ఎదోము సరిహద్దు దగ్గరనున్నది (సంఖ్యా 20¹⁶). ఈపేరుగల యెడారి పారాను (13³,²⁶) లేక సీను (20¹) అను గొప్ప అరణ్యమందలి ఒక భాగమైయున్నది. హాగరు కనుగొనిన బెయేర్ లహాయిరోయి అను బుగ్గ దానియందున్నది (ఆది 16⁷,¹⁴). అబ్రాహాముకూడ కొంతకాలమువఱకు అచ్చటనే సంచరించెను (20¹).

ఇశ్రాయేలీయులు సీనాయికొండనుండి కనానుదేశమునకు ప్రయాణముచేయఁగా రెండు సార్లు కాదేషులోనే పాలెమువేసిరి. మొదటి సారి ఐగుప్తును విడిచిన రెండవ సంవత్సరము 5-వ నెలలో అచ్చటఁజేరిరి (సంఖ్యా 13²⁶ 10¹¹⁻¹³). కనానుదేశమంతటిని చూచివచ్చుటకు 12 మంది వేగులవారు బయలుదేరినదిచ్చటినుండియే (13³). వారు 40 దినములవఱకు కనాను దేశములో సంచరించినపిదప తిరిగివచ్చి యిచ్చటనే యీ సంగతిని దెలిపిరి. వారిలోని 10 మంది చెప్పిన దుర్వార్తను విని ప్రజలు వెనుకకు వెళ్లఁగోరఁగా యెహోషువ కాలేబులు వారిని ధైర్యపఱచిన దీస్థలమందే. వారిమాటలను నమ్మక ప్రజలు వారిని చంపఁ బోయి దేవునిమీఁద సణిగినందున యెహోషువ కాలేబులుగాక [illegible]నవారిలో నిరువది సం॥ కు పైఁబడినవారందఱును అరణ్యములోనే నశింతు రను శాపముకలిగినదిచ్చటనే. నలువది సం॥ లు అరణ్యమందు తిరుగవలెనను శిక్ష విధింపఁబడిన పిమ్మట వారు మార్గమధ్యమందున్న అమాలేకీయులను జయించి కనానులో ప్రవేశింతమని మోషే వద్దని యెంతఁజెప్పినను వినక అమోరీయులపైకిఁ బోయి, యుద్ధముచేసి ఓడిపోయి తిరిగి కాదేషుకు వచ్చి అచ్చట బహుదినములు నివసించిరి (ద్వితీ 1⁴⁰⁻⁴⁶). దేవుఁడు విధించినట్లు అరణ్యమునందు సంచరించుచు 38 సం॥ గడిపి ఐగుప్తునుండి బయలు దేరిన 40 వ సం॥ మొదటినెలలో రెండవసారి యిచ్చటికి వచ్చిరి. మిర్యామచ్చట చనిపోయి పాతిపెట్టఁబడెను (సంఖ్యా 20¹ 33³⁶ ద్వితీ 2⁷,¹⁴). మోషే అహరోనులు దేవునిమాట కవిధేయులై వాగ్దానభూమిలోఁజేరెడి హక్కును పోఁగొట్టుకొనిరి (సంఖ్యా 20⁸⁻¹³). కాదేషునుండిబయలు దేరినపిమ్మట దానికిసమీపముగా నుండు హోరు కొండమీఁద అహరోను మృతినొందెను (20²²⁻²⁸ 33³⁸). H.

**కాదేషుయొద్దనున్న మెరీబా** మెరీబా 21 చూ॥

**కానా**

1. (Kanah = జమ్ముపాలెము). ఇది ఆషేరు గోత్ర స్వాస్థ్యమునకు ఈశాన్య దిక్కుననుండు నొక యూరు (యెహో $19^{28}$). ప్రస్తుతము తూర్పు పట్టణముండు స్థానమునకు ఆగ్నేయ దిక్కుననుండు కానా (*Kana*) దీని యునికియై యుండవచ్చును.

2. (Cana = జమ్ముపాలెము). గలిలయలో నజరేతుకు 4 మైళ్లు ఈశాన్య దిక్కున నుండు ఊరు. ప్రస్తుతము ఆయూరికి కెఫర్ కెన్నా (*Kefr Kenna*) అని పేరు. కొందఱు అది ప్రస్తుతము నజరేతుకు 8 మైళ్లు ఈశాన్యముగా నుండు కానాత్ ఎల్ జెలీల్ (*Kanat-el-Jelil*) అని యనుకొందురు. యేసుక్రీస్తు ఇచ్చట వివాహము జరిగినప్పుడు తన మొదటి యద్భుతము జేసెను (యోహా $2^{1-11}$). ప్రధాని కుమారుని బాగుచేసినప్పు డిచ్చటనే యుండెను ($4^{16}$). నతనయేలు ఈ యూరివాఁడే ($21^{2}$). (పటము VI, C 7)

**కానాయేరు** (Brook Kanah). ఎఫ్రాయిమీయుల స్వాస్థ్యములోనున్న యొక వాగు (యెహో $16^{8}$ $17^{9}$). షెకెముదగ్గరనుండు కానావాగు (*Wady Kanah*) ఈ వాగేనని కొందఱనుకొందురుగాని దానిగూర్చి సందేహము కలదు.

**కానుక** ఈవి చూ॥

**కానుకపెట్టె** (Treasury). దేవాలయము నందు స్త్రీలయావరణములో గొట్టిపాట్లు కొమ్మురూపమున చేయఁబడిన 13 కానుకపెట్టెలు గలవు. అవి స్త్రీలయావరణమునుండి పురుషుల ఆవరణము లోనికి వెళ్లు పెద్దద్వారముయొక్క రెండు ప్రక్కలను అమర్చఁబడి యుండెను (మా $12^{41-43}$ లూ $21^{1}$ యోహా $8^{20}$). ఈ వచనముల యందు సూచింపఁబడిన వాటిలోనే బీదవిధవ తన రెండుకాసులను వేసెను. J. C.

**కాపరి** గొర్రెలకాపరి చూ॥

**కాపుకాయువారు** దేహసంరక్షకులు చూ॥

**కాబూల్** (Cabul = గొడ్డుభూమి). ఆషేరుగోత్ర స్వాస్థ్యములోనున్న ఒక యూరు (యెహో $19^{28}$ I రాజు $9^{13}$). సొలొమోను దానిచుట్టునుండు ప్రదేశమును రాజైన హీరాముకు కిచ్చెను. అది ప్రస్తుతము అక్కో యను దానికి తూర్పుననున్న కాబూలు (*Kabul*) అయి యుండవచ్చును.

**కామవికారము, కాముకత్వము, కామాతురత్వము, పోకిరిచేష్టలు** (Lasciviousness). పైనుదాహరించఁబడిన పదములకు అసలులో నొక గ్రీకుమాటకుమాత్రము వాడిరి. అది మా $7^{22}$ లో **కామవికారములు** గల $5^{19}$ ఎఫె $4^{19}$ లో **కాముకత్వము** యూదా 4 లో **కామాతురత్వము** II కొరి $12^{21}$ I పేతు $4^{3}$ లో **పోకిరిచేష్టలు** అని తర్జుమా చేయఁబడెను. దీనికి సిగ్గుమాలిన కాముకత్వమని అర్థము. ఇది శరీర క్రియలలో నొకటియై యున్నది.

**కామోను** (Kamon, Camon). న్యాయాధిపతులలో నొకఁడైన యాయీరును పాతిపెట్టిన స్థలము (న్యాయా $10^{5}$). అది యొర్దానుకు తూర్పుననుండు గిలాదుప్రదేశములో నున్నది గాని దానియునికినిగూర్చి మఱి నూటిగాఁ దెలియదు.

**కాయధాన్యములు** (Beans). ఈ దేశము నందు ఇండ్లచుట్టును పాదులుపెట్టుకొన్నట్లు పలెస్తీనుదేశస్థులు నానావిధములైన చిక్కుడు పాదులను ద్రాక్షతీగెలను తమ యిండ్లచుట్టును వేసికొని వీటిని సమృద్ధిగా ననుభవించిరి. (II సమూ $17^{28}$). J. C.

**కాయువారు** దేహసంరక్షకులు చూ॥

**కారపుచెక్క** గంధవర్గము I 4 చూ॥

**కారు** దేవాలయము I 7 (2) (c) చూ॥

**కారు జింక** లేడి చూ॥

**కారుమేక** మేక 2 చూ॥

**కారేహ** (Kareah = బట్టతల). గెదల్యా యొద్దకువచ్చిన యోహానాను, యోనాతాను అను వారి తండ్రి (II రాజు $25^{23}$ యిర్మీ $40^{8}$-$43^{6}$).

**కాలక్రమణిక** (Chronology). బైబిలు నందుదాహరించిన ఆయా సంగతులు జరిగిన కాలమును దెలిసికొనుటకు స్థిరమైన శకములేవియును లేనందున పాతనిబంధన కాలక్రమణికను నిశ్చయించుట సులభసాధ్యముకాదు. పితామహుల జీవితకాలమును లెక్కించుటవలనను, న్యాయాధిపతులు రాజులు ఏలినకాలమును కూడుటవలనను దీనిని చెప్పవలసియున్నదేగాని, ఆ కాలమును స్థిరపఱచుటకు ఇతరయాధారము లెవ్వియును గానఁబడవు. దీనియందును లోపములు లేకపోలేదు. ఒక రాజు ఇన్ని సంవత్సరము లేలెనని చెప్పినప్పుడు అతఁడేలిన చివరి సంవత్సరములోని కొన్నిమాసములు అప్పుడప్పుడు లెక్కలోనికి రాలేదు. అప్పుడప్పుడు ఆ మాసములను సంవత్సరముగా లెక్కించిరి. ఈ కారణములచేత చరిత్రయుగమందలి కాలక్రమణికయందును కొద్ది గొప్ప భేదములున్నవని చెప్పితీరవలెను. ఇంగ్లీషు బైబిలునందుదాహరింపఁబడు కాలక్రమణిక క్రీ॥ శ॥ 1658 సం॥ న అషరు (*Ushur*) అను ఆర్చిబిషపుచే వేయఁబడినదిగాని ప్రస్తుతమున దానినంతఁగా వాడుటలేదు. ఈ దిగువనున్న పట్టీలో ముఖ్యసంగతుల క్రమమును కనుగొనవచ్చును.

జలప్రళయమునకుఁ బూర్వపు కాలక్రమణిక

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదాము మొదలు | | | షేతు | జన్మము | వఱకు | 130 సం॥ లు |
| షేతు | జన్మము | మొదలు | ఎనోషు | ,, | ,, | 105 ,, |
| ఎనోషు | ,, | ,, | కేయినాను | ,, | ,, | 90 ,, |
| కేయినాను | ,, | ,, | మహలలేలు | ,, | ,, | 70 ,, |
| మహలలేలు | ,, | ,, | యెరెదు | ,, | ,, | 65 ,, |
| యెరెదు | ,, | ,, | హనోకు | ,, | ,, | 162 ,, |
| హనోకు | ,, | ,, | మెతూషెల | ,, | ,, | 65 ,, |
| మెతూషెల | ,, | ,, | లెమెకు | ,, | ,, | 187 ,, |
| లెమెకు | ,, | ,, | నోవహు | ,, | ,, | 182 ,, |
| నోవహు | ,, | ,, | జలప్రళయమువఱకు | | | 600 ,, |
| | | | | | మొత్తము | 1656 సం లు |

సమరయుల గ్రంథప్రకార మీకాలము 1307 సం॥ లును, LXX ప్రకారము 2242 సం॥ లగుచున్నది.

కొందఱీప్రకారముగా పుట్టుకల ననుసరించి లెక్కించక, ఆదాము జీవితకాలమని చెప్పిన 930 సం॥ లు అతని వంశపువారు పలుకుబడి కలిగియుండిన కాలమును సూచించుననుచు ఆ సం॥ లకు షేతు వంశపువారు వృద్ధిలోకివచ్చియుండిన 912 సం॥ లు కలుపవలెనని అభిప్రాయపడుచున్నారు. ఇట్లు లెక్కించిన పక్షమున ఆదాము మొదలు జలప్రళయమువఱకు పితామహులకాలము 8000 సం॥ ల కెక్కువ యగును. పైనున్న యే కాలక్రమణికను మన మనుసరించినను అన్నివేల సం॥ ల చరిత్రను మన తెలుఁగు బైబిలునందు 5 పేజీలలో నిముడునంత క్లుప్తముగా నున్నప్పుడు, దానికి స్థిరమైన కాలక్రమణిక నేర్పఱచుట యసాధ్యమనుటలో నాశ్చర్యమేమియును లేదు.

అదేరీతిగా జలప్రళయమునుండి అబ్రాహాము పుట్టుకవఱకును కాలక్రమణికను నిశ్చయింప వీలుగాదు. ఆది 11$^{10-26}$ లోని సంఖ్యలను మొత్తము చేయుటవలన 290 సం॥ లును, LXX ప్రకారము 117 సం॥ లును వచ్చును. పైనజెప్పినట్లు సాధారణముగా నందఱంగీకరించు లెక్కప్రకారము ఆరంభమునుండి అబ్రాహాముపుట్టుకవఱకు 1946 (=1656+290) సం॥ లగుచున్నది.

అబ్రాహాము కాలమునుండి ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి వెళ్లిపోవువఱకు ఎంతికాలమైనదో నిశ్చయించుటకు కావలసిన సాధన సంపత్తియు మనకున్నదనఁజాలము. ఇశ్రాయేలీయులను హింసించిన ఐగుప్తురాజు రెండవ రామ్సేసనునది సర్వజనాంగీకారమైనది. అతఁడు క్రీ॥ ము॥ 1300 సం॥ న యేలెనని ఆ దేశపు శాస్త్రజ్ఞులు లెక్క వేయుచున్నారు. ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి క్రీ॥ ము॥ 1320—1250 సం॥ మధ్య నెప్పుడో వెళ్లియుండురని ఆయా వారభిప్రాయ పడుచున్నారు. వీటిలో మొదటి లెక్క ప్రకారము దానికి, ఇశ్రాయేలీయు లైగుప్తుదేశమందు పరవాసులైయున్న 430 సం॥ లు (నిర్గ 12[41]) కలిపినయెడల యాకోబు ఐగుప్తునకు వెళ్లినది క్రీ॥ ము॥ 1750 (=1320+430) సం॥ మని తేలుచున్నది. అబ్రాహాముపుట్టుకనుండి ఇస్సాకు పుట్టుకవఱకు 100 సం॥ లు (ఆది 21[5]). ఇస్సాకు పుట్టుకనుండి యాకోబుపుట్టుకవఱకు 60 సం॥ లు (25[26]). యాకోబు ఐగుప్తుకు వెళ్లినప్పుడు 130 సం॥ ల ప్రాయముగలవాఁడు (47[9]). ఈ మొత్తమును (100+60+130=290) యాకోబు ఐగుప్తుకు వెళ్లిన 1750 సం॥ నకు కలిపిన యెడల, అబ్రాహాము క్రీ॥ ము॥ 2040 సం॥ న పుట్టెనని తేలుచున్నది.

ఐగుప్తునుండి బయలుదేరివచ్చినది మొదలుకొని సొలొమోను దేవాలయమును కట్టనారంభించువఱకు 480 సం॥ లని I రాజు 6[1] నందున్నది. ఇది 592 లేక 612 సం॥ లై యుండునని యోసీఫసు లెక్కించుచున్నాఁడు. (పురా 8. 3. 1; 20. 10). కనానును జయించినది మొదలుకొని సమూయేలువఱకు 450 సం॥ లని పౌలుచెప్పుచు (కార్య 13[20]), యోసీఫసు వలెనే యెక్కువ కాలమును లెక్కించుచున్నాఁడు. I రాజు 6[1] నున్న 480 సం॥ లను ఐగుప్తునుండి బయలుదేరినకాలమగు 1320 నుండి తీసివేసినయెడల, అనగా 940 సం॥ న దేవాలయమునుగట్ట నారంభించినట్లు లెక్క తేలుచున్నది. గాని ఈ లెక్క ప్రకారము దేవాలయము చాల వెనుక కట్ట నారంభించినట్లు కనఁబడుచున్నది. యూదులు సాధారణముగా తమ కాలమును నలుబదేసియేండ్లుగల భాగములుగా లెక్కించినట్లు అనేకసూచన లున్నవి. అట్లయిన యెడల I రాజు 6[1] నందున్న 480 సం॥ లు పైనఁ జెప్పఁబడినట్టి 12 భాగములగును. వీటిలో మొదటిదానిని అరణ్యసంచారమునందు గడిపిరి. దాదాపు 8 భాగములను న్యాయాధిపతు లేలిన కాలముగ గణింపవలెను. ఏలీ సమూయేలుల కాలము నిందే యిమిడియున్నదనవలెను. సౌలు దావీదు యేలుబడుల క్రింద రెంటి యొకభాగము గతించును. కాని వీటియందు ప్రతిభాగము పూర్తిగా 40 సం॥ లని చెప్పఁజాలము.

పైనుదాహరింపఁబడిన లెక్కల ప్రకారము మాత్రమేగాక, రాజులకాలముల ప్రకారము చూడఁబడు లెక్కననుసరించియు సొలొమోను క్రీ॥ ము॥ 971 సం॥ నందేల నారంభించినట్లు శాస్త్రజ్ఞు లభిప్రాయపడుచున్నారు. మఱియు పైనున్నట్లు ఆ నలుబదేసి సం॥ ల భాగములు పూర్తియైనవిగాక షుమారు 40 సం॥ లని లెక్కించినయెడల, అదికూడ దీనికి సరిపోవును. సొలొమోను కాలమునుండి స్థిరమైన కాలక్రమణికను వేయఁగలము. దీని ప్రకారము దేవాలయము 967 సం॥ న కట్టనారంభించిరి. దావీదుకాలమువఱకు అనేక సంఖ్య లంత తృప్తికరముగా నుండనందున సరియైన పట్టీని వేయుటకు వీలుగాకున్నది. అతని కాలమునుండి చరిత్రలో జరిగిన సంగతి కాల మీ దిగువరీతిగా నున్నది.

# కాలక్రమణిక

| సంవత్సరము క్రీ॥ ము॥ | యూదాలో జరిగినవి | ఇశ్రాయేలువారిలో జరిగినవి | బైబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
|---|---|---|---|
| 1010 | దావీదు యూదా వారి రాజగుట (II సమూ $2^{4}$). | | |
| 1003 | దావీదు ఇశ్రాయేలీయులందరిపై రాజగుట (II సమూ $5^{1-3}$ I దిన $11^{1-3}$). | | |
| 971 | సొలొమోను రాజగుట (I రాజు $1^{39}$ $2^{12}$ II దిన $1^{1}$). | | |
| 967 | దేవాలయమును కట్టనారంభించుట (I రాజు $6^{1}$). | | |
| 960 | దేవాలయమును ముగించుట (I రాజు $6^{38}$). | | |
| 931 | రాజ్య విభాగము (I రాజు $12^{1-16}$). | | |
| | రెహబాము రాజగుట (I రాజు $14^{21}$). | యరొబాము I రాజగుట (I రాజు $12^{20}$). | |
| 926 | ఐగుప్తు రాజగు షీషకు యూదామీఁద దండెత్తి వచ్చుట (I రాజు $14^{25}$). | | |
| 915 | అబీయాము రాజగుట (I రాజు $15^{1,2}$ II దిన $13^{1,2}$). | | |
| 913 | ఆసా రాజగుట (I రాజు $15^{9,10}$). | | |
| 910 | | నాదాబు రాజగుట (I రాజు $15^{25}$). | |
| 909 | | బయెషా రాజగుట (I రాజు $15^{28-33}$). | |
| 886 | | ఏలా రాజగుట (I రాజు $16^{6-8}$). | |
| 885 | | జిమ్రి రాజగుట (I రాజు $16^{10-15}$). | |

| సంవత్సరము క్రీ॥ ము॥ | యూదాలో జరిగినవి | ఇశ్రాయేలువారిలో జరిగినవి | బైబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
|---|---|---|---|
| | | ఒమ్రీ రాజగుట (I రాజు $16^{22,23}$). | |
| 875 | ఆసా, యెహోషాపాతు కలిసి యేలుట (I రాజు $16^{28}$ LXX). | | |
| 874 | | అహాబు రాజగుట (I రాజు $16^{29}$). | |
| 871 | యెహోషాపాతు రాజగుట (I రాజు $22^{41}$). | | |
| 854 | యెహోషాపాతు యెహోరాములు కలిసి యేలుట. | అహజ్యా రాజగుట (I రాజు $22^{51}$). | |
| 853 | | యెహోరాము రాజగుట (II రాజు $1^{17}$). | |
| 849 | యెహోరాము రాజగుట (II రాజు $8^{25,26}$). | సిరియారాజగు బెన్హదదు సమరయపై దండెత్తుట (II రాజు $6^{24}$). | |
| 842 | అహజ్యా రాజయి యెహూవలన చంపఁబడుట (II రాజు $8^{25,26}$). | యెహూ రాజ్యము నపహరించి రాజగుట (II రాజు 9). | |
| 840 | అతల్యా రాజ్య మపహరించి రాజ కుమారులను వధింపఁగా యోవాషు తప్పించుకొని ఆరు సం॥లు దాగియుండుట (II రాజు $11^{1-3}$). | | |
| 834 | యోవాషు రాజగుట (II రాజు $12^{1}$). | | |
| 814 | | యెహోయాహాజు రాజగుట (II రాజు $10^{35}$). | |
| 805 | | యెహోయాషు రాజగుట (II రాజు $13^{10}$). | |
| 804 | అమజ్యా రాజగుట (II రాజు $14^{1}$). | | |
| 790 | | యరొబాము II రాజగుట (II రాజు $14^{23}$). | |

| సంవత్సరము క్రీ॥ ము॥ | యూదాలో జరిగినవి | ఇశ్రాయేలువారిలో జరిగినవి | బెబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
|---|---|---|---|
| 786 | ఉజ్జియా రేక అజర్యా రాజగుట (II రాజు 14[21]). | | |
| 749 | ఉజ్జియా యోతాములు కలిసి యేలుట (II రాజు 15[31,33]). | | |
| 748 | | జెకర్యా (II రాజు 15[8]). షల్లూము (II రాజు 15[13]). మెనహేము (II రాజు 15[17]). ఒకరి తరువాత నొకరు రాజులగుట. | |
| 745 | | | తిగ్లత్పిలేసె రనఁబడిన [illegible] మెక్కుట. |
| 741 | యోతాము ఆహాజు కలిసి యేలుట. | | |
| 738 | | మెనహేము పూలుకు కప్పముఁ గట్టుట (II రాజు 15[19]). పెకహ్యా రాజగుట (II రాజు 15[23]). | |
| 736 | ఉజ్జియా మరణము. యోతాము రాజగుట (II రాజు 16[1-2]). | పెకహు షోమ్రోనులో రాజగుట (II రాజు 15[27]).* | |
| 730 | | హోషేయ రాజగుట (II రాజు 15[30]) | |
| 728 | ఆహాజు, హిజ్కియా కలిసి యేలుట (II రాజు 18[1-2]). | | |
| 727 | | | షల్మనేసరు అష్షూరు రాజగుట. |

* II రాజు 15[27] నందున్నట్లు పెకహు యేలుబడిని తక్కిన సంగతులతో సరిపోల్చిన యెడల చాల యెక్కువగా నున్నట్లు కనఁబడుచున్నది. పెకహు చూ॥

| సంవత్సరము క్రీ॥ పూ॥ | యూదాలో జరిగినవి | ఇశ్రాయేలువారిలో జరిగినవి | బైబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
|---|---|---|---|
| 726 | ఆహాజు మరణము. హిజ్కియా రాజగుట (II రాజు 18[9]). | | |
| 722 | | షోమ్రోను పట్టబడుట, ఉత్తర రాజ్యనాశనము (II రాజు 18[10]). | |
| 721 | | | సర్గోను అష్షూరు రాజగుట. |
| 714 | సన్హెరీబు సేనాధిపతియై యూదా దేశముపై దండెత్తి వచ్చుట (II రాజు 18[13]). | | |
| 713 | హిజ్కియా జబ్బుపడుట (II రాజు 20[1-6]). | | |
| 712 | బబులోను రాజగు మెరోదక్బలదాను రాయబారము నంపుట (II రాజు 20[12]). | | |
| 705 | | | సన్హెరీబు అష్షూరు సింహాసన మెక్కుట. |
| 701 | సన్హెరీబు యెరూషలేమును ముట్టడించుట (II రాజు 18[14]). | | |
| 698 | హిజ్కియా మరణమగుట, మనష్షే రాజగుట (II రాజు 21[1]) | | |
| 680 | | | ఏసర్హద్దోను అష్షూరు రాజగుట (II రాజు 19[37]). |

| సంవత్సరము క్రీ॥ పూ॥ | యూదాలో జరిగినవి | బైబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
| --- | --- | --- |
| 668 | | అషుర్బనిపాల్ అష్షూరు రాజగుట. |
| 647 | అషుర్బనిపాల్ మనష్షేను ఖైదీగా పట్టుకొని పోవుట (II దిన 33[11]). | |
| 642 | ఆమోను రాజగుట (II రాజు 21[19]). | |
| 639 | యోషీయా రాజగుట (II రాజు 22[1]). | |
| 610 | | ఫరో నెకో ఐగుప్తు రాజగుట. |
| 608 | యోషీయా నెకోచే హతుఁడగుట (II రాజు 23[29]). యెహోయాహాజు 3 మాసములు రాజ్యమేలుట (II రాజు 23[31]). యెహోయాకీము రాజగుట (II రాజు 23[36]). | |
| 605 | యెహోయాకీము నెబుకద్నెజరునకు లోఁబడుట (యిర్మీ 25[1] 46[2]). | నెబుకద్నెజరు బబులోను రాజగుట. |
| 598 | యెహోయాకీను 3 మాసములు రాజ్యమేలి బబులోనుకు చెఱ గొనిపోఁబడుట (II రాజు 24[8-12]). | |
| 597 | సిద్కియా రాజగుట (II రాజు 24[18]). | |
| 587 | ఆలయము నాశనమగుట (II రాజు 25[8,9]). | |

## పారసీకుల కాలము

| | | |
| --- | --- | --- |
| 539 | | కోరెషు బబులోనును పట్టుకొనుట. |
| 538 | జెరుబ్బాబెలు 42,000 మంది యూదులతో యెరూషలేమునకుఁ దిరిగి వచ్చుట (II దిన 36[22,23] ఎజ్రా 1, 2). | |
| 537 | ఆలయమును తిరిగి కట్టనారంభించుట (ఎజ్రా 3[8]). | |
| 529 | | కంబైసీసు పారసీకుల రాజగుట. |
| 521 | | దర్యావేషు హిస్టాస్పను పారసీకుల రాజగుట. |
| 520 | హగ్గయి జెకర్యాలు ఆలయమును కట్టి ముగించుఁడని ప్రోత్సాహపఱచుట (ఎజ్రా 5[1] హగ్గ 11). | |
| 515 | ఆలయమును కట్టిముగించుట (ఎజ్రా 6[15]). | |

| సంవత్సరము క్రీ॥ ము॥ | యూదాలో జరిగినవి | బైబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
|---|---|---|
| 486 | | జరెక్సీసు (అహష్వేరోషు) రాజగుట. |
| 465 | | అర్తహషస్త రాజగుట. |
| 458-457 | ఎజ్రా 1755 మంది యూదులతో యెరూషలేమునకు వచ్చుట (ఎజ్రా 7,8). | |
| 445-444 | నెహెమ్యా యెరూషలేమునకు వచ్చి పట్టణపు గోడలను మరల కట్టుట (నెహె 2). | |
| 433-432 | నెహెమ్యా పారసీకమునకు మరల వెళ్లుట (నెహె 5[14] 13[6]). | |

## గ్రీకుల కాలము

| | | |
|---|---|---|
| 331 | | మహా అలెక్సందరు పారసీకుల నోడించుట. |
| 323 | | మహా అలెక్సందరు మరణము. |
| 320 | అలెక్సందరునకుఁ బిమ్మట ఐగుప్తు నేలికయగు తొలిమి సోటరుచే యూదయ ఆ దేశముతో చేర్చబడుట. | |
| 312 | | సెల్యూకసు అంతియొకయలో సెల్యూసిడయ రాజ్యమును స్థాపించుట. |
| 223 | | మహా అంతియోకసు సెల్యూసిడయ రాజ్యమున కేలికయగుట. |
| 203 | అంతియోకసు యెరూషలేమును పట్టుకొనుట. | |
| 198 | యూదయను సిరియాతోఁ జేర్చుట. | |
| 175 | | అంతియోకస్ ఎపిఫనీస్ సెల్యూసిడయ రాజ్యమున కేలికయగుట. |
| 170 | అంతియోకస్ ఎపిఫనీస్ యెరూషలేమును పట్టుకొని దేవాలయము నపవిత్ర పఱచుట. | |
| 168 | ఆలయములోని బలిపీఠముమీఁద విగ్రహ సంబంధమైన వేదికను నిలుపుట. | |
| 166 | మక్కబీయుల తిరుగుబాటు. | |
| 165 | ఆలయమును మరల ప్రతిష్ఠించుట. | |

## రోమీయుల కాలము

| సంవత్సరము క్రీ॥ పూ॥ | యూదాలో జరిగినవి | బైబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
|---|---|---|
| 63 | పాంపే యను రోమా సేనాధిపతి యెరూషలేమును పట్టుకొనుట. | |
| 47 | జూలియసు సీజరు అంతిపతేరును యూదయకు గవర్నరుగా నియమించుట. | |
| 37 | మహా హేరోదు యెరూషలేమును పట్టుకొని రాజగుట. | |
| 31 | | ఔగుస్తు రోమా చక్రవర్తియగుట. |
| 20 | హేరోదు ఆలయమును తిరిగి కట్టనారంభించుట (యోహా. 2[20]). | |
| 6 | క్రీస్తు పుట్టుక. | |
| 5 | హేరోదు మరణము. రాజ్యమును అర్కెలాయు అంతిప ఫిలిప్పులు పంచుకొనుట. | |
| క్రీ॥ శ॥ | | |
| 5 | అర్కెలాయును రాజ్య పదభ్రష్టునిఁ జేయుట. | |
| 14 | | ఔగుస్తు మరణము. తిబెరి చక్రవర్తి యగుట. |
| 26 | పొంతి పిలాతు గౌర్నరగుట. క్రీస్తు తన బహిరంగ పరిచర్య నారంభించుట.* | |
| 28 లేక 29 | క్రీస్తు సిలువ వేయఁబడుట.* | |
| 32 | పౌలు క్రైస్తవుఁడగుట.§ | |
| 37 | | తిబెరి మరణము, కలిగ్యులా చక్రవర్తియగుట. |
| 41 | హేరోదు అగ్రిప్ప I యూదయ సమరయలకు రాజగుట. | కలిగ్యులా చంపఁబడుట, క్లాడియ చక్రవర్తియగుట. |
| 44 | హేరోదు అగ్రిప్ప I మరణమగుట (కార్య 12[23]). | |

* వివరములగు తేదీలకొఱకు యేసుక్రీస్తు చూ॥

§ పౌలు చరిత్రయందలి యితర తేదీలకొఱకు పౌలు చూ॥ రోమా వ్యాఖ్యానము 6 వ పేజీ కూడ చూ॥

| సంవత్సరము క్రీ॥ శ॥ | యూదాలో జరిగినవి | బైబిలు చరిత్రకు సంబంధించిన యితర దేశములలో జరిగినవి |
|---|---|---|
| 48 | ఫేలిక్సు కుమేరినసు అను వానితో గలిసి గౌర్నరగుట | |
| 52 | ఫేలిక్సు ఒకడే గౌర్నరగుట. | క్లౌదియ రోమానుండి యూదులన వెళ్లఁగొట్టుట (కార్య 18²). |
| 54 | | క్లౌదియ విషముచే మరణమగుట. నీరో చక్రవర్తి యగుట. |
| 59 లేక 60 | ఫేస్తు గౌర్నరగుట (ఫేలిక్సు 48 లేక 52 నందు గవర్నరయినయెడల ఇది 55 లేక 56 అగును). | |
| 64 | గెసియస్ ఫ్లోరసు గౌర్నరగుట. | నీరో హింసల కారంభము. |
| 66 | యూదుల యుద్ధములకారంభము. | |
| 68 | | నీరో స్వహత్యఁ జేసికొనుట. గల్బా ఓతో అనువారు ఒకంతరువాత నొకరు చక్రవర్తులై బలాత్కారముగా చంపబడుట. |
| 69 | | వితెల్లియసు రాజ్యమునకువచ్చి చంపబడుట. వెస్పాషియను చక్రవర్తియగుట |
| 70 | యెరూషలేము తీటసువలన నాశనము జేయఁబడుట. | |

**కాలజ్ఞానులు** (Enchanters). మూల భాషయందు వాడఁబడిన పదమునకు కప్పట గారడీచేయుట మంత్రించుట కాలములను సమయములను ఆచరించుట యని యర్థమగును గాన ఈ పదము సోదె, మంత్రగాండ్రను గూర్చి యుపయోగించిరి (యిర్మీ 27⁹) ఆ పదమునే యెష 2⁶ 57³ మీకా 5¹² నందు మంత్రమునిగాని దాని సంబంధించిన వేఱొక పదముచేఁగాని తెనిఁగించిరి. మేఘచలనమును గ్రహణములను గ్రహముల సంయోగమునుబట్టి రాజ్యాంగములందును ప్రకృతియందును కలుగనైయున్న మార్పులనుగూర్చి ముందుగనే తెలిపెడివారు పాఁతనిబంధన కాలమునందుండిరి. హిందువు లిప్పుడు పంచాగమును చదివి వివాహములు మొదలగు శుభకార్యములకు మంచి ముహూర్తములను పెట్టించుకొనుటకై జ్యోతిష్కుల యాలోచన వెదకుటవలె ఆ కాలమునందున్న వారును చేసిరి. B.

**కాలమానము** (Duration of Time calendar). బైబిలునందున్న కాలమానములు దివారాత్రములను, ఋతువుల ననుసరించిచేసిరి గాని అంత వివరముగఁజేయలేదు. ఈ శీర్షిక క్రింద కాలముయొక్క బహు చిన్న భాగములతో నారంభించి వివరింతుము గాని ఈ క్రమము బైబిలునందున్నది కాదని తెలిసికొనవలెను.

1. అన్నిఁటిలో సూక్ష్మమైన కాలభాగము నిమిషము లేక రెప్పపాటు (I కొరి 15⁵²) అయియున్నది. ఇది యింతకాలమని కాలమున సూచింపక బహు సూక్ష్మకాలమును కనఁబఱచును

II. కాలమును గడియల ప్రకారము భాగించినట్లు కనఁబడు సూచనలు పాతనిబంధనయందు బహు అరుదు. దాని $4^{19}$ లో గంట యను పదమును, $4^{33}$ $5^{5}$ లోని గడియ అను పదమును కలవు గాని అవి మన మిప్పుడు వాడెడి గంటల వంటివి కాక యేదో ఒక కాలభాగమును తెలియఁజేయుచున్నవి. ఆహాజు గడియారపు మెట్లు అనఁబడినది (II రాజు $20^{10,11}$) యిట్టి కాల పరిమాణమును సూచించవచ్చును. క్రొత్త నిబంధనయందు మఱీ తేటయైన గడియలున్నవి. యూదులలెక్క ప్రకారముని పగలు 12 గంటలును, రాత్రి 12 గంటలు నున్నట్లు తెలియును గాని మన తెలుఁగు బైబిలు యూదుల కాలభాగమును అనుసరించినటుల కనుపించదు. బైబిలు



సూర్య గడియారము

తెనిఁగించినవారు ఆ కాలమానమును ప్రస్తుతము మనము వాడుచున్న కాలమానమునకు మార్చిరి. తెలుఁగు బైబిలునందు మ $27^{45}$ మా $15^{33}$ లూ $23^{44}$ లో నున్న మధ్యాహ్నము మొదలుకొని మూఁడుగంటలవఱకు అనియున్న వాక్యము మూల భాషలోను ఇతరతర్జుమాలలోను ఆరుగంటలు మొదలుకొని తొమ్మిది గంటలవఱకు అని యున్నది. ప్రొద్దునుండి లెక్కించిన పక్షమున ఆరుగంటలు మన లెక్క ప్రకారము మధ్యాహ్నమును, తొమ్మిది గంటలు మూఁడు గంటలగును. గాని యోహాను సువార్త చూచినపక్షమున, అతఁడు యూదుల వలె గాక మధ్యరాత్రినుండి మధ్యాహ్నమువఱకు 12 గంటలను, మధ్యాహ్నమునుండి మధ్యరాత్రి వఱకు 12 గంటలను లెక్కించినటుల అనేకు లభిప్రాయపడుచున్నారు. ఇట్లు మధ్యరాత్రినుండి మధ్యరాత్రివఱకు దినమును లెక్కించుట రోమీయులవాడుకయై యుండెను. అయితే (యోహా $19^{14}$) లోనున్న ఆరుగంటలు మన తెలుఁగు బైబిలులో నున్నట్లుగా ఉదయము ఆరుగంటలుగానే లెక్కించవలెను. యోహా $1^{39}$ $4^{6,52}$ లో కూడ అతఁడు మన లెక్కనే అనుసరించెనని అభిప్రాయ పడువారు కలరు. యోహా $1^{39}$ నందు మూలభాషలో 10 గంటలని యున్న దానిని తెలుఁగునందు సాయంత్రము నాలుగు గంటలుగాను, $4^{52}$ లో నున్న ఏడు గంటలను మధ్యాహ్నము ఒంటి గంటగాను $4^{6}$ లో నున్న ఆరుగంటలను పన్నెండు గంటలుగాను మార్చిరి. తర్జుమా చేసినవారు మూలభాషలో ఉన్నరీతిగానే అంకెలను తెలుఁగునందును వేసియుండినయెడల బాగుగ నుండును.

III. జాములు. గడియకన్న జామును బైబిలునం దెక్కువగా వాడిరి. ఆదికాలముల యందు రాత్రి కాలమును మూఁడుజాములుగా భాగించిరి. (నిర్గ $14^{24}$ న్యాయా $7^{19}$ I సమూ $11^{11}$ విలా $2^{19}$). అవి మొదటిజాము నడిజాము వేకువజాము అనునవై యున్నవి. గాని క్రొత్తనిబంధనలో రోమీయులకాలము ననుసరించి రాత్రిని నాలుగుజాములుగా భాగించిరి (మా $13^{35}$). అవి ప్రొద్దుగ్రుంకుజాము, అర్ధరాత్రిజాము, కోడికూయుజాము, తెల్లవారుజాము అని పిలువఁబడెను. రాత్రిని భాగించినట్లు పగటినికూడ భాగించిన సూచనలు లేవు. ఆది $3^{8}$ లో ఉదయమును చల్లపూట యనియు, $18^{1}$ లో మధ్యాహ్నమును ఎండవేళ యనియు పిలిచిరి. I సమూ $11^{11}$ నందున్న ఆ యసలుమాటనే మధ్యాహ్నము అని తర్జుమా చేసిరి. దీనికి సంబంధముగా దినమును రాత్రింబగళ్లు అను రెండుభాగములుగ చేయుటయు వాడుకై యుండెను (ఆది $8^{22}$ యిర్మీ $33^{20,25}$). అలంకార రీతిగా రాత్రి వేళను అజ్ఞానమునకును, పగటిని దైవజ్ఞానమునకును సూచనలుగా వాడిరి (రోమా $13^{12}$ ఎఫె $5^{11,13}$ I థెస్స $5^{5,6}$).

IV. దినము. పైఁజెప్పఁబడినకాల భాగములన్నియు దినవిభాగములు. సృష్టిక్రమప్రకారము దినము మొదటికాలభాగము. సూర్యాస్తమయముతో పాతనిబంధన కాలమునందు

నూతనదిన మారంభమాయెను (ఆది $1^{5-8-13}$ మొ॥). సబ్బాతుదినమునకుతప్ప బైబిలునందు మరేదినమునకును ప్రత్యేకమైన పేరులేదు. ఆయాదినములకు మొదటి రెండవ మూఁడవ మొదలగు దినములని పేరుపెట్టిరేగాని వాటికితర పేరు లెవ్వియును లేనేలేవు. మ $28^{1}$ మా $16^{2}$ మొ॥ వాక్యములలోని **ఆదివారము** సహా మూలభాషలో దినమునకు పేరుగాక మొదటి దినమని యర్థమిచ్చును. అది ప్రక $1^{10}$ లో **ప్రభువుదినము** అనఁబడెను. సబ్బాతుదినమునకు ముందురోజు **సిద్ధపఱచుదిన** మనఁబడెను (మ $27^{62}$ మా $15^{42}$ మొ॥). మా $15^{42}$ లో అది **విశ్రాంతిదినమునకు పూర్వదిన** మనఁబడెను.

**V. వారములు**. సబ్బాతునుండి సబ్బాతువఱకు వారమును లెక్కించిరి. అసలు భాషయందలి సబ్బాతులు అను బహువచన ప్రయోగమును వారమని తెనిఁగించిరి (మ $28^{1}$ యో $20^{1}$). వారము సృష్టిక్రమము ననుసరించును (ఆది $2^{1-3}$). లేవి $12^{1-5}$ ద్వితీ $16^{9}$ దాని $9^{24}$ మొ॥ వాక్యములను చూడఁగా వారముల లెక్క వాడుకలోయై యున్నట్లు స్పష్టమగుచున్నది.

**VI. మాసములు**. యూదులు చాంద్రమాసముల ననుసరించిరి గాని వారి మాసముల పేరులు ఆయా ఋతువులను సూచించును. ఈ దిగువ నుదాహరించిన జాబితాలోని మొదటి మాసపుపేరుయొక్క శబ్దార్థము వసంతకాలమును, రెండవది పువ్వులకాలమును, ఏడవది వరదలు వచ్చుకాలమును, ఎనిమిదవది వర్షాకాలమును సూచించును. ఈ నాలుగుమాసముల పేరులు అన్నిఁటిలో పురాతనపువి. ఋతువులు సూర్యుని అనుసరించును. కావున బైబిలునందు ఆదికాలములో సౌర (సూర్య) సంవత్సరమును అనుసరించి యున్నట్లు ఊహింపఁదగును గాని తరువాతకాలములో వారు చాంద్రమాసములను వాడిరని తెలిసికొనవలెను. అవి పన్నెండుమాసములు. ప్రతిమాసమునకు 28 లేక 29 దినము లున్నవి. వారి సంవత్సరము మేష సంక్రాంతి (*Vernal Equinox*) కి పిమ్మట వచ్చు మొదటి అమవాస్యతో నారంభమగుటచే అనేక సంవత్సరములకు వారొక అధికమాసమును చేర్చి, దానికి 13 మాసములుగా లెక్కవేసిరి. ఆ మాసపుపేరు లారంభమున పలెస్తీనుదేశభాషకు సంబంధించినను చెఱకాలమునకుఁ బిమ్మట బాబెలువారి మాసముల పేరులు వాడిరి. ఆ మాసములపేరు లీ దిగువనున్నవి.

1. **ఆబీబు** (*Abib* = పాల కంకులు నిర్గ $13^{4}$). ఇది మార్చి ఏప్రిల్ మాసములలో వచ్చెను. చెఱకుఁబిమ్మట దీనికి **నీసాను** (*Nisan*) అను బబులోను పేరుపెట్టిరి (నెహె $2^{1}$ ఎస్తే $3^{7}$) ఇది పస్కామాసము (నిర్గ $12^{2}$).

2. **జీవ్** (*Ziv* = కాంతిగలనెల? I రాజు $6^{1}$). ఇది ఏప్రిల్ మే మాసములలో వచ్చెను.

3. **సీవాను** (*Siuan.* ఎస్తే $8^{7-9}$). ఇది బబులోని వారినెలపేరు. మే జూన్ మాసములలో వచ్చెను.

4. **తమ్మూజు** (*Tammuz*). ఈ నెల పేరు బైబిలునందు కనఁబడదు. ఇది ఒక దేవతకు గౌరవార్థమై పెట్టినపేరు. (తమ్మూజు చూ॥). జెక $8^{19}$ లోని నాలుగవ మాసమిదే. జూన్ జూలై నెలలలో వచ్చెను.

5. **అబ్** (*Ab*). ఇదియు బైబిలునందు లేదుగాని యోసీఫస్ అను చరిత్రకారుఁడు (పురా 4,4,75) దీనివాడెను. జెక $8^{19}$ లోని ఐదవనెల ఇదే. జూలై ఆగస్టు మాసములలో వచ్చెను.

6. **ఏలూలు** (*Elul.* నెహె $6^{15}$ I మక్క $14^{85}$). అష్షూరువారి పంచాంగములోను కనఁబడును. దీని అర్థము తెలియదు. ఆగస్టు సెప్టెంబరు మాసములలో వచ్చును.

7. **ఏతనీము** (*Ethanim* = ఆగక ప్రవహించు ఊటలు లేక నదులు. I రాజు $8^{2}$). యోసీఫసు దీనిని తిష్రి (*Tishri*) యని పిలిచెను (పురా 4, 1). ఇది సెప్టెంబరు అక్టోబరు నెలలలో వచ్చెను.

8. **బూలు** (*Bul.* I రాజు $6^{38}$). దీనికి మార్చెస్వాను (*Marchesvan*) అను పేరుకూడ కలదుగాని అది బైబిలులో లేదు. అక్టోబరు నవెంబరు మాసములలో వచ్చెను.

9. **కిస్లేవు** (*Chislev*). ఇది బబులోను వారి పదము. దానియర్థము తెలియదు (నెహె $1^{1}$ జెక $7^{1}$). I మక్క $1^{54}$ నందున్న ఖిసెలు

అనునదీమాసమే. ఇది నవెంబరు డిశంబరు మాసములలో వచ్చెను.

**10. తెబేతు** (*Tebeth* = బురదమాసము? ఎస్తే 2[16]). ఇది అష్షూరుపదము. డిశంబరు జన్యువరి నెలలలో వచ్చెను.

**11. శెబాటు** (*Shebat* = జలప్రళయము జెక 1[7]). ఇది బాబెలుపదము. జన్యువరి ఫెబ్రువరి మాసములలో వచ్చెను.

**12. అదారు** (*Adar* = చీకటి? ఎజ్రా 6[15] ఎస్తే 3[7]). II మక్కా 15[36] నందు దీనికి **ఆదారు** అను పేరుకలదు. ఇది బాబెలు పదము. ఫెబ్రువరి మార్చి మాసములలో వచ్చెను.

అధికమాసమువచ్చిన సంవత్సరమున వారు ఆ మాసమును **రెండవ అదారు లేక అదారుకు తరువాతి నెల** అని పిలిచిరి.

సంవత్సరమును నెలల ప్రకారముగా మాత్రమే విభజింపక ఋతువుల ననుసరించియు వాటిని విభజించిరిగాని ఆ విభజననూటిగా ఋతువుల ననుసరించినదే యని చెప్పలేము. అన్నిటిలో మిగుల పురాతన విభాగములు ఆది 8[22] లో నున్నవి. అవి **వెద కాలము, కోతకాలము, శీతోష్ణములు, వసంత శీతకాలము** అనునవి. ఇదేలాగు నిర్గ 34[21] లో **దున్ను కాలము, కోత కాలము** అను భాగములు కనఁబడును. లేవీ 26[5] లో **ద్రాక్షాపండ్ల కాలము** కూడ ఒక కాలవిభాగముగా నున్నట్లున్నది. **వేసవి కాలము చలికాలము**ను రెండు ఋతువులుఁగ కూడ సంవత్సరమును విభజించిరి (కీర్త 74[17] జెఖ 14[8]).

ఇశ్రాయేలీయుల పండుగులు పైరులు వేయుట పంటలుపండుట వాటిని కోయుట యనువాటి ననుసరించవచ్చును. (పండుగలు చూ॥).

**VII. సంవత్సరములు** పైన చెప్పఁబడిన రీతిఁగా చంద్రునిగమనము ననుసరించినను మేష సంక్రాంతి (*Vernal Equinox*) నం దారంభిం చుటచే మన తెలుఁగు సంవత్సరములవంటివై యున్నవి. సంవత్సరాది దినము మార్చి లేక ఏప్రిల్ మాసమునందువచ్చును. ప్రతియేడవ సంవత్సరము **విశ్రాంతిసంవత్సర**మై యుండెను (ద్వితీ 15[1-6]). ఏడేళ్లు నలువది తొమ్మిది సంవత్సరములకు పిమ్మట యేఁబదవయేఁడు **సునాద లేక జూబిలి** (*Jubilee*) సంవత్సరమనఁబడును (లేవీ 25[8-22]).

**VIII. శకములు.** సంవత్సరములను లెక్కించుటకు స్థిరమైన శకము బైబిలునందు లేదు. ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనున్న కాలము (నిర్గ 12[40] గల 3[17]) నన్నూటముప్పది సంవత్సరము లనియు, సొలొమోను దేవాలయమును కట్టించుటకు మొదలు బెట్టినది నిర్గమమునకు తరువాత 480 సం॥ లనియు (I రాజు 6[1]), చెఱకాలము 70 సం॥ లనియు (యిర్మీ 25[11] 29[10] జెక 7[5]) అను నీ గొప్ప కాలభాగముల ననుసరించి లెక్కించి నను, సాధారణముగా రాజులు ఏలిన సంవత్సరములనుబట్టి కాలమును సూచించుచుండిరి. లూ 3[1,2] లో అట్టి కాలసూచనలు చాలఁగలవు ఆమో 1[1] లో భూకంపము అను విపత్తు ననుసరించి కాలమును లెక్కించినట్లున్నది. ఇట్లు విపత్తుల ననుసరించి కాలమును లెక్కించుట, ఈ దేశము నందును సాధారణ విషయమైయున్నది.

**IX. కాలమును తెలిసికొను ఉపకరణములు.** ఇట్టి వాటినిగూర్చి ఆహాజు చేయించిన సూర్య గడియారము (II రాజు 20[9-11] యెష 38[8]) తప్ప వేఱు సూచన లేవియును లేవు.

**కాలహు** (Calah). నీనెవె పట్టణమునకు దక్షిణముగా ఘుమారు పదిక్రోసుల దూరములో నున్న యొక పురాతన పట్టణము. నిమ్రోదు దీనిని కట్టించెను (ఆది 10[11,12]). అష్షూరు రాజ్యము ఉన్నత దశయందున్నప్పుడు అష్షూరు రాజుల నివాస స్థానముగనుండెను. నీనెవె కిది సమీపముగా నుండుటచే హెబ్రీయులు అను కొనునట్లుగా **మహాపట్టణము**నియు (యోనా 1[2]), **మహాపురము** అనియు (4[11]) చెప్పఁబడిన నీనెవెలోచేరి యుండవచ్చును.

**కాలువ** యెరూషలేము A II 2 చూ॥

**కాలేజము** (Liver). ధర్మశాస్త్రమునందు విధింపఁబడిన యాచారములలో కాలేజమును దానిమీఁది వపయు దేవార్పితమైన వాటియం దుదాహరింపఁబడుటవలన (నిర్గ 29[13,22] లేవీ 3[4,10,15]) ఇది ప్రాణాధారమగు అవయవములలో

నొకటి యని పూర్వకాలమున 'పలెస్తీనుకు చుట్టు నున్న దేశస్థులు నమ్మియున్నట్లు శాస్త్రజ్ఞులు తెలిసికొనియున్నారు. అది యంతముఖ్యమైన దైనందువలననే దేవుని కర్పించిరని కొంద అభిప్రాయ పడుచున్నారు గాని హిందువులు నేతిని యర్పించునట్లు వారు క్రొవ్వు నర్పించి యుందురు. కాలేజము ప్రాణాధారమైనదిగా నెంచబడినట్లు విలా $2^{11}$ నందొక సూచన కనబడుచున్నది. నా కాలేజము నేలమీద నొలుకుచున్నది అను నీ వాక్యము ప్రాణమును ధార పోయునంత కష్టమును తెలుపును. సామె $7^{23}$ లో **గుండె** యని తెనిగించిన అసలు మాటకు కాలేజమని శబ్దార్థము. ఇదియు కాలేజము ముఖ్యావయవ మనుటకు సూచనగానున్నది. మృగముల లోని అవయవములను అన్యులు శకున సాధనములుగా నెంచిరి. యెహె $21^{21}$ లో **శకునములు చూచుట** యని తెనిగించిన యసలు పదము కాలేజమును చూచుట యను నర్థమిచ్చును.

**కాలేబు** (Caleb = కుక్క). 1. హెస్రోను కుమారుడు. యెరహ్మయేలు సహోదరుడు (I దిన $2^{18,42}$). $2^{9}$ నందీ పదమునకు **కెలూబై** యను మాఱు రూపమున్నది. గోత్రములవారిని వ్రాయునప్పుడు యూదా గోత్రమనియు పెరెజు కుటుంబమనియు హెస్రోను యింటి వారనియు ఇతని సంతానపువారిని లెక్కించిరి అహరోను తోటివాడగు హూరు (నిర్గ $17^{10,12}$) ఇతని కుమారుడు (I దిన $2^{19}$). గుడారమును కట్టుటయందు సహాయము చేసిన చిత్రపు పనివాడగు బెసలేలు హూరుయొక్క మనుమడై యుండెను (I దిన $2^{50}$).

2. యూదా గోత్రికుడగు యెఫున్నె కుమారుడు. యూదా గోత్ర ప్రధానులలో నొకడు (సంఖ్యా $13^{2,6}$). కనాను దేశ మంతటిని వేగు జూడ పంపించిన వారిలో నితడొకడు. వారు తిరిగి వచ్చినపిమ్మట ఇతడు నూను కుమారుడగు యెహోషువతో గూడి ధైర్యముగా మాట్లాడి దేవుని సహాయముతో ఆ దేశస్థులను జయించి వారి పట్టణములను స్వాధీనపఱచుకొనవచ్చునని చెప్పెను ($13^{30}$ $14^{6}$) గాని ప్రజలు 10 మంది మాటనే నమ్మి తమ్మును ధైర్యపఱచుచున్న వీ రిద్దరిని రాళ్లతో గొట్టవలెనని యత్నించగా దేవుడడ్డుపడి వారిని తప్పించెను ($14^{9-10}$). ప్రజలు విశేషముగా సణిగి ఐగుప్తునకు దిరిగిపోవలెనని యుద్దేశించగా ఆయన వారిమీద కోపపడి ఐగుప్తునుండి బయలుదేరిన వారిలో 20 సం॥ లకు పై వయస్సుగల వారందఱును కనాను దేశమునకు ప్రవేశింపకయే అరణ్యమందు కూలుదురని వారిని శపించెను ($14^{22,23}$). కాలేబు యెహోషువాల నమ్మకము నిమిత్తము వారు మాత్రమే ఆ దేశమందు ప్రవేశించి దానిని స్వాధీనపఱచుకొందురని తెలిపెను ($14^{24,30}$). అరణ్యమందు తక్కినవారి శవములు రాలు నలువదేండ్ల పర్యంతము అరణ్యమందు సంచారము చేయవలెననియు దెలిపెను.

ఆ నలువది యేండ్లు గతించిన తరువాత కాలేబు ఇశ్రాయేలీయులతోకూడ యెహోషువ నాయకత్వముక్రింద యొర్దానునదిని దాటి కనాను దేశమునుచేరి తానుముందుగా చూచి మెచ్చిన హెబ్రోను పట్టణమును దానిచుట్టు ప్రదేశమును, యెహోవా చెప్పినట్లు స్వాధీనపఱచుకొనెను. అతడప్పటికి 85 యేండ్లవాడై యుండియు బల పరాక్రమ సమన్వితుడై అచ్చటనుండిన అనాకీయులను రాక్షస వర్గమును జయించి వారిని దూరముగ దఱిమివేసి దుర్గమములగు వారి పట్టణములను పట్టుకొని, వాటియందు చాలకాలము వఱకు జీవించెను (ద్వితీ $1^{36}$ యెహో $14^{6-14}$, కాదేషు, యెహోషువా చూ॥). H.

**కాలేబుదైన ఎఫ్రాతా** (Caleb-Ephrathah). కాలేబుకు ఎఫ్రాతా అను భార్యవలన కలిగిన సంతానము యొక్క పేరు (I దిన $2^{19-24}$). పై వచనముల ప్రకారము కాలేబు తండ్రియగు హెస్రోను పెద్ద వయస్సులో మనష్షే మనుమరాలిని వివాహమాడినప్పటికి వారి వంశస్థులు మనష్షే గోత్రముతో లెక్కింపబడిరి. అయితే ఈ పట్టీయందు వారు కాలేబు ఎఫ్రాతాల ద్వారా హెస్రోను వంశస్థులతో జేర్చబడినట్లు కనబడుచున్నది. ఈ సందర్భమున హెస్రోను కాలేబుదైన ఎఫ్రాతాలో మరణమాయెనని వ్రాయబడియున్నది. అనగా కాలేబు ఎఫ్రాతాయని పిలువబడిన వారిలో

కొందఱు నివసించిన గోషేను నందని కొందఱి యభిప్రాయము (ఎఫ్రాతా చూ॥).

H.

**కాళైనను చెయ్యాళైనను విఱుగుట** రోగములు చికిత్సలు I 8 చూ॥

**కాల్బలము (Foot-men).** ప్రస్తుతమున్న ట్లే, బైబిలు కాలములోను కాల్బలము సేనయందలి ముఖ్యభాగములలో నొకటి (న్యాయా 20[2] I సమూ 4[10] 15[4] II సమూ 10[6] మొ॥). సంఖ్యా 11[21] యిర్మీ 12[5] నందు **పాదచారులు** అని తెనిఁగించిన అసలుమాట పై వాక్యమునందున్న పదమే.

**కావలి, కావలివాఁడు** దేహ సంరక్షకులు చూ॥

**కావ్యము (Poetry).** ప్రతిజనాంగమునందు మిగుల పురాతన రచనలు కావ్యములై యున్నట్లు హెబ్రీయులలో నుండెను (ఆది 4[23] నిర్గ 15[20,21] మొ॥). హెబ్రీ కావ్యములందు యతిప్రాసలను గణప్రస్తారము ననుసరించిన పద్యములు లేవు. ఒకటే సంగతిని **ఆయా** విధములుగాను, **ఆయా** దృష్టాంతములచేత వివరించుటయే **ఆ** కావ్య ముఖ్యలక్షణమై యున్నది. **అట్టి** వాక్యములు రెండుగాని రెంటి కెక్కువగాని యుండును.

1. **అవి** ఒకటే యర్థము నిచ్చునవిగానుండవచ్చును (**ఉదా**॥ ఆది 4[23] కీర్త 22[20] మొ॥)

2. **అవి** వ్యతిరేక వాక్యములుగా నుండవచ్చును (**ఉదా**॥ యోబు 3[17] సామె 10[1,2,3] మొ॥). సామెతెల గ్రంథమునందున్న సామెతెలలో ననేకము లిట్టివి. క్రొత్త నిబంధనలోని వాక్యములు కావ్యరీతిగా వ్రాయఁబడక పోయినను **ఇట్టి** శైలి అనేక వాక్యములలో కనఁబడును (యోహా 1[3,5,11] మొ॥ మ 8[20]).

3. ఒక వాక్యమందు అసంపూర్ణముగా నున్న సంగతి రెండవదానిలో **పూర్తియగును**. ఒక పంక్తి ప్రశ్నగాను రెండవది **ఉత్తరముగా నుండును** (కీర్త 25[12] యెష 66[3] మొ॥). లేదా, ఒక పంక్తిలో **కారణమును** ఒకదానిలో ఫలితము నుండును (**సామె** 26[4] కీర్త 24[9]). లేక ఒకదానిలో ఒక సంగతియు, రెండవ దానిలో దానిగూర్చిన దృష్టాంతము నుండును (కీర్త 43[1]). సాధారణముగా రెండు పంక్తులు **మాత్రమే** యిట్టి సంబంధము గలవిగా నుండినను **మూఁడేసి పంక్తులును** (కీర్త 24[9] మ 8[20] మొ॥) నాలుగేసి పంక్తులును (కీర్త 1[3] 37[14] 121[3,4]), ఐదేసి పంక్తులును (కీర్త 27[4,9]) సహ గల వాక్యములున్నవి.

కావ్యములందు సాధారణముగా ఇట్టివిగాక పద్యములులేవు. కొన్ని కీర్తనలలో నొక విధమైన పల్లవియుగలదు 42,43 కీర్తనలలో 5,11,5 వాక్యములను పల్లవిగా నెంచవచ్చును. యెష 2 అధ్యాయమందు 9,11,17 వచనములు ఒక విధమైన పల్లవిగా నున్నవి. కొన్ని అక్షరమాలి కలుగానున్నవి (కీర్త 25,34,37,119, విలాపవాక్యములు).

యోబు గ్రంథమును నాటక కావ్యముగా నెంచవచ్చును. బైబిలునందున్న కావ్యములు ఎక్కువగా కీర్తనలైయున్నవి.

**కాశె పనివాండ్లు** వృత్తులు చేతిపనులు I 2 (1) చూ॥

**కాసిఫ్యా (Casiphai).** బబులోనునుండి యెరూషలేమునకు పోవు మార్గము దగ్గరనుండు నొక స్థలము (ఎజ్రా 8[17]). ఇది బబులోను దేశముయొక్క ఉత్తర ప్రాంతములో నున్నది గాని దాని యునికిని గూర్చి మఱేమియు తెలియదు.

**కాసు** నాణెములు III చూ॥

**కాళ్ల గొలుసులు** ఆభరణములు 27 చూ॥

**కాళ్లువిఱుగ గొట్టుట** రోగములు చికిత్సలు III 3 చూ॥

కి

**కింహాము (Chimham = ఆశ).** అబ్షాలోము తిరుగుబాటు చేసినందున దావీదు గిలాదుకు వెళ్లి అచట బసచేయుచుండఁగా నతనికి దయఁ జూపిన బర్జిల్లయి కుమారులలో నొకఁడు (I రాజు 2[7]). ఇతఁడు దావీదుతో కూడ తిరిగి యెరూషలేమునకు వచ్చి యచట బసచేసెను (II సమూ 19[37,38]). యిర్మీ 41[18] లో నున్న గెరూతు కింహాము అను స్థలమునకా పేరు బహుశః

ఇతని వలననే కలిగియుండ వచ్చును. (గెరూతు కింహాము చూ॥)

**కిటికీ** (Window). బీదల యిండ్లలోపలికి వెలుఁగు వచ్చుటకును, పొగ బయటకు పోవుటకును సాధారణముగా గోడలకు రంధ్రముల నుంచిరి. అంతస్తులున్న యిండ్లలో రాజ మార్గము వైపు నొక పెద్ద కిటికీ యుండును. దానిమీఁద



అల్లిక కిటికీ

వలవంటి పని చేయఁబడియుండును. దానిని **అల్లిక కిటికీ** యని తర్జుమాచేసిరి. దానిగుండా లోపల నుండువారు బయట జరుగునది చూడఁ గలరు గాని బయటివారు లోని వారిని చూడఁ జాలరు. (న్యాయా $5^{28}$ సామె $7^{6}$ పర $2^{9}$ II సమూ $6^{16}$ రాజు $9^{30}$).

J. C.

**కిత్తీము, కిత్తీయులు** (Kittim).

1. యావాను కుమారులలో నొకఁడు (ఆది $10^{4}$ I దిన $1^{7}$). యావాను గ్రీకు వారికి పూర్వికుఁ డయ్యెను.

2. కుప్రద్వీపమునకు మఱియొక పేరు (సంఖ్యా $24^{24}$ యెష $23^{12}$). ఆ ద్వీపవాసులు **కిత్తీయుల** నఁబడిరి (యెహె $27^{6}$ దాని $11^{30}$). యిర్మీ $2^{10}$ చూడఁగా ఆ యొక్క ద్వీపమునకు మాత్రము గాక దానిచుట్టునున్న ద్వీపములకుకూడ ఆ పేరు కలదు.

**కిత్రోను** (Kitron), జెబూలూను గోత్ర ప్రదేశములోనుండు నొక యూరు (న్యాయా $1^{30}$). ఇశ్రాయేలీయులు దీనిలోనుండి కనానీయులను వెళ్లఁ గొట్టలేరి. యెహో $19^{15}$ లో తెనుఁగు బైబిలునందున్న కటాతు అను స్థలమిదేయై యుండవచ్చును.

**కిత్లీషు** (Kithlish, Chitlish). షెఫేలా యనఁబడు యూదా మన్య ప్రదేశమందున్న ఒక యూరు (యెహో $15^{40}$).

**కిద్రోను, కెద్రోను** (Kidron, Cedron= చీఁకటి). యెరూషలేమునకును ఒలీవ కొండకును మధ్యనున్న ఒక లోయ. అది యెరూషలేమునకు ఉత్తరమున నొక మైలు దూరముననుండి కొంచెము మట్టుకు తూర్పుగాను పిమ్మట దక్షిణముగాను పోవుచున్నది. వర్షాకాలములో మాత్రము అందులో నొక స్వల్పమైన వాగు పారును (యెరూషలేము A I 1. చూ॥).

యెరూషలేమునుండి గెత్సేమనే తోఁటకైనను, ఒలీవకొండకైనను బేతనియకైనను పోవలసి యున్నయెడల ఈ వాగును దాటి పోవలసి యుండును. ఉత్తరమున ఈ లోయ వెడల్పులేక యుండునుగాని ఒలీవకొండ ప్రక్కన ఇది వెడల్పుగలదియై ఒలీవతోఁటలును, ఇతర చెట్ల తోఁపులును గలిగియున్నది.

రాజైన దావీదు తన కుమారుఁడగు అబ్షాలోము తనకు విరోధముగా తిరుగుబాటు చేసినపుడు అతనికి భయపడి యెరూషలేమును విడిచి యేడ్చుచు కిద్రోను వాగుదాటి ఒలీవకొండ నెక్కి యొర్దాను కవతలకు పారిపోయెను (II సమూ $15^{23}$).

యేసుప్రభువుకూడ తన శిష్యులను వెంటఁ బెట్టుకొని కిద్రోను వాగును దాటి ఒలీవకొండకును గెత్సేమనే తోఁటకును వాడుకగా వెళ్లుచుండువాఁడు (యోహా $18^{1}$).

ఆ కిద్రోను లోయకు తూర్పు ప్రక్కనుండు ఒలీవకొండయొక్క పడమటి యడుగునగల మెత్తని బండలలో ననేక సమాధులు తొలిపింపఁబడి యున్నవి. ఒలీవ కొండయొక్క అడుగున పాతి పెట్టఁబడుట యూదులకు మిగుల యిష్టము. ఆ లోయ ప్రక్కనుండు యెరూషలేము మిట్ట యొక్క అడుగున ప్రస్తుతము తురుష్కుల స్మశాన భూమికలదు. ఇప్పటికిని ఆ లోయయొక్క ఇరుపార్శ్వములయందు అనేక సమాధులు కనఁబడును.

ఆ లోయ ఇంకను దక్షిణముగా సాగి హిన్నోము లోయతోఁ కలియుచోట దైవభక్తు

లగు రాజులైన ఆసా యోషీయా హిజ్కియా అనువారు తమకు పూర్వమందుండిన భ్రష్టులగు రాజులు యెరూషలేములో నిలువఁ బెట్టిన విగ్రహములు మొదలైన హేయవస్తువులను తెచ్చి కాల్చి నిర్మూలముచేసిరి (I రాజు 15[13] II రాజు 23[4,6] II దిన 29[16]).

యెరూషలేమునకు ఎదురుగా ఈ కిద్రోను లోయకు ఎడమ ప్రక్కన హిన్నోములోయ కలియుచోటున రెండు మూఁడు చెట్లు కనఁబడు మిట్టయే యూదా ఇస్కరియోతు దేవాలయములో పారవేసిన 30 వెండి రూకలతో ప్రధాన యాజకులు పరదేశుల స్మశాన భూమి కొఱకు కొనిన అకెల్దమ అను పొలమై యున్నది. క్రూసేడులను (*Crusades*) యుద్ధములు చేసిన వారు యెరూషలేమును పట్టుకొనుటకు వచ్చి అచ్చట యుద్ధము చేసినప్పుడు చనిపోయిన తమ వారిని ఆ మిట్టమీఁదనే పాతిపెట్టిరి (అకెల్దమ చూ॥).

యెరూషలేమునకు పక్షిణముగా పారునట్టి కిద్రోనువాగు చిన్నవాగుగా నుండునుగాని అది ఆగ్నేయముగా ప్రవహించునప్పుడు అనేక వాగులందులో కలియుటవలన ఒక యేరై కడపట మృత సముద్రములో సంగమించును. C.

**కిన్నెరెతు** (Chinnereth, Chinneroth = ?ణె). నఫ్తాలీవారి ప్రదేశమందుండు నొక దుర్గము (యెహో 19[35]). క్రీ॥ పూ॥ 16 వ శతాబ్దము నందు ఐగుప్తురాజగు 3 వ థాట్మిస్ (*Thothmes*) జయించిన దుర్గములలో నిది యొకటి యని ఐగుప్తు శాసనములవలనఁ దెలియుచున్నది. ఆ దుర్గమును బట్టియే దాని చుట్టునున్న ప్రదేశమునకు గూడ అదే పేరు గలిగెను (I రాజు 15[20]). ద్వితీ 3[17] యెహో 11[2] నందు ఆ యా ప్రదేశములకు హద్దులను జెప్పు సందర్భమునందు ఇది చెప్పఁ బడినది. మ 14[34] నందున్న గెన్నేసరెతు బయలు ఈ పదమునకు మాఱు రూపమని సాధారణముగా ననుకొందురు గాని దానిని గూర్చి కొంత సందేహము గలదు. (గెన్నె సరెతు బయలు చూ॥).

**కిన్నెరెతు సముద్రము** గలిలయ సముద్రము చూ॥

**కిన్నోరు** సంగీతము 3 (3) (*a*) చూ॥

**కిబ్రోతు హత్తావా** (Kibroth-Hattaavah = దురాశా సమాధులు). ఇశ్రాయేలీయులు సీనాయి అరణ్యములో దిగి సీనాయి కొండమీఁద యెహోవా యిచ్చిన ఆజ్ఞలను పుచ్చుకొనిన అనేక దినములకు తరువాత కనాను దేశమునకు వెళ్లనై బయలుదేరి మరుసటి దినమున వచ్చి దిగి ఒక నెల దినముల మట్టుకుండిన స్థలము (సంఖ్యా 11[20]). ఇన్ని దినములనుండి మన్నాను మాత్రమే తినుటవలన విసికి మాంసమునుకోరి యెహోవా మీఁద మిగుల సణిగిరి. ఆయన వారికి పూరేడు పిట్టలను పంపఁగా వారు వాటిని తమ కసహ్యము పుట్టులాగున తిని తెగులుపుట్టి అనేక వేలమంది చచ్చిరి గనుక ఆ తావునకు దురాశా సమాధులను అర్థమిచ్చు కిబ్రోతు హత్తావాయను పేరు పెట్టఁబడెను (11[31-34] 33[16]).

H.

**కిబ్సాయిము** (Kibzaim = రెండు రాసులు). ఎఫ్రాయిము స్వాస్థ్యములో లేవీయుల కియ్యఁబడిన యొకయూరు (యెహో 21[22]). దానికి యొక్మెయాము అను పేరుకూడ కలదు (I దిన 6[68]). అసలు హెబ్రీలో I రాజు 4[12] నందు ఇదే పదముండినను ఇంగ్లీషు బైబిలునందు పొరబాటుగా దానిని యొక్నెయాము (*Jokneam*) అని వ్రాసిరి. తెలుఁగు బైబిలునందును అట్లే యుంచిరి.

**కిరీటము** (Crown). ఈ పదముచే తెనిఁగించఁబడిన మూల పదములు మూఁడు హెబ్రీ భాషలోను రెండు గ్రీకు భాషయందునుగలవు.

రాజులును (II సమూ 1[10] 12[29] మొ॥) రాణులును (ఎస్తే 1[10] 2[17]), రాజు దయనొంది ఘనత వహించిన వారును (8[15]) కిరీటములను ధరించిరి. ప్రధాన యాజకులును దానిని ధరించిరి (నిర్గ 29[6] 39[30] లేవీ 8[9] జెక 6[11-14]). పై నున్నట్లు ఘనమునకు మాత్రమే గాక రాజులును ప్రధాన యాజకులును ఒక విశేషమైన పనికై ప్రత్యేకింపఁబడిరని అది సూచించుచున్నది.

కిరీటము బైబిలంతటియందును మహిమ శక్తి అధికారములకు సూచనగానున్నది (కీర్త 132

కక 9[16]). క్రొత్త నిబంధనయందు ఆ పదమును ఇట్టి యలంకారరీతిగా నుపయోగించిరి. ఘనమును సూచించుటకై ఆకులతో కిరీటము నల్లి ధరింపఁజేసిరి (I కొరి 9[25]). ఇది జయమునకును మహిమకును సూచనగా నున్నందున మోక్షవాసులు కిరీటధారులై యున్నట్లు అలంకార రీతిగాఁ జెప్పఁబడినది (II తిమో 4[8] యాకో 1[12] I పేతు 5[4] ప్రక 2[10] 3[11] 6[2] మొ॥).



కిరీటములు

కిరీట మిాలోకాధికారమును సహితము సూచించుచున్నది. క్రీస్తు విరోధికి గుఱుతుగా నుండిన ఘట సర్పమునకు ఏడు కిరీటములున్నట్లు చెప్పఁబడెను (ప్రక 12[3] 13[1]). తూరు పట్టణపు ఐశ్వర్యమును సూచించుటకు అది కిరీటముల నిచ్చు పట్టణ మనఁబడెను (యెష 23[8]). ఇట్టి లోక ప్రభావము శాశ్వతము కాదనుసంగతిని తెలుపుటకు కిరీటము తరతరములు ఒక కుటుంబమునం దుండునాయని జ్ఞాని యనెను (సామె 27[24]).

కిరీటము ఘనమును సూచించుటచే విలువగల వాటిని ప్రియమైన వాటిని తెలుపుటకు దానిని వాడిరి. జ్ఞానము (సామె 4[9]), మంచి భార్య (12[4]), నెరిసిన తల (16[31]), కుమారులు (17[6]) కిరీటముగా నెంచఁదగును. అదే రీతిగా దయ (కీర్త 65[11]), కరుణా కటాక్షములు (103[4]), మానవుల ఔన్నత్య స్థితి (8[5]) కిరీటమనఁబడెను. దేవుఁ డిశ్రాయేలీయులకు చూపిన మేలులను ఆయా ఆభరణములుగా వర్ణించుచు, వారి ఘనమును కిరీటముగాఁ బోల్చెను (యెహె 16[12]). పౌలు తనకు సభికులు తన కిరీటమై యున్నారనెను (ఫిలి 4[1] I థెస్స 2[19]). కిరీటము పడిపోవుట అవమానమునకు గుఱుతైయుండెను (యోబు 19[9] కీర్త 89[39] యిర్మీ 13[18] విలా 5[16] యెహె 21[26]). క్రీస్తు నపహసించుటకు ముండ్లతో కిరీటమల్లి దాని నాయన తలపైఁ బెట్టిరి (మ 27[29] మా 15[17] యోహా 19[2,5]). ఆయన తన మహిమతో మరల వచ్చునప్పుడు ఆయనయొక్క శక్తి ప్రభావములను సూచించుట కాయన తలమీఁద ననేక కిరీటము లుండును (ప్రక 19[12]).

**కిర్యత్ (Kiriath).** ఒక హెబ్రీ ఉపసర్గ. దీనికి ఊరు అని యర్థము. తెలుఁగున పల్లె లేక పట్నము అను పదములవలెనే యనేక మాటలతోఁగలిసి వాడఁబడును (ఉదా॥ కిర్యతర్బా, కిర్యతాయిము).

**కిర్యత్ హుచ్చోతు** (Kiriath-Huzoth = వీధులుగల పట్టణము). పూర్వము మోయాబులో నున్న యొక పట్టణము (సంఖ్యా 22[39]). బిలాము ఇచ్చట అర్పణల నర్పించెను. దీనిగూర్చి యింకేమియు తెలియదు.

**కిర్యతర్బా** (Kiriath-arba = అర్బాయొక్క పట్టణము.) అర్బా యను వాఁడు రాక్షసుఁడగు అనాకుయొక్క కొడుకు. అబ్రాహాము భార్యయగు శారా ఈ యూరిదగ్గర మృతిఁబొందెను (ఆది 23[1,2]). అప్పుడబ్రాహాము ఈ యూరి సమీపముననున్న యొక పొలమును అందులోని మక్పేలా గుహను ఆ యూరివాఁడైన హేతు కుమారుఁడగు ఎప్రోనునొద్ద 400 వెండి రూకలకు కొని యా గుహలో తన భార్య శవముంచెను (23[3-20]).

తరువాత ఆ యూరు హెబ్రోను అనఁబడెను (23[2] యెహో 14[15]). అబ్రాహాము ఇస్సాకు యాకోబు అను వారలీ మక్పేలా గుహలోనే పాతిపెట్టఁబడిరి. (హెబ్రోను, శారా, ఇస్సాకు, యాకోబు చూ॥) C.

**కిర్యతాయిము** (Kiriathaim = రెండు పట్టణములు).

1. యొర్దానుకు తూర్పున మోయాబు రూబేను సరిహద్దులలోనుండు నొక పట్టణము.

అది మొట్టమొదట ఏమీయులను వారి యాధీనములోనుండెను (ఆది $14^{5,6}$). రూబేనీయులు మోయాబును స్వతంత్రించుకొనిన పిమ్మట దానిని తిరిగికట్టిరి (సంఖ్యా $32^{37}$ యెహో $13^{19}$). మోయాబీయులు మరల దాని స్వతంత్రించుకొనిరని మోయాబు రాతి శాసనములవలనను యిర్మీ $48^{1,22}$ యెహె $25^{9}$ వలనను తెలిసికొనవచ్చును.

2. నఫ్తాలీ స్వాస్థ్యములోనున్న ఒక యూరు (I దిన $6^{76}$). ఇది యెహో $21^{32}$ లో కర్తాను అనబడును (కర్తాను చూ॥).

**కిర్యతు** (Keriath = ఊరు). బెన్యామీనీయుల యూళ్లలో నొకటి (యెహో $18^{27}$). ఇది కిర్యత్యారీముకు మాఱుపేరని సాధారణముగా అంగీకరింతురు. LXX లో ఈ వాక్యమునందు కిర్యత్యారీము అని యున్నది (కిర్యత్యారీము చూ॥).

**కిర్యత్బయలు** (Kiriath-baal = బయలు దేవత పట్టణము). ఇది కిర్యత్యారీమునకు పురాతన నామమైనట్లున్నది (యెహో $15^{60}$). దీనికి యెహో $15^{10}$ లో బాలా అనియు I దిన $13^{6}$ లో బయిలు అనియు, II సమూ $6^{2}$ లో బయిలా యెహూదా అనియు నున్నది. దీనిగూర్చిన వివరమునకై కిర్యత్యారీము చూ॥

**కిర్యత్యారీము** (Kiriath-jearim = అడవులు గలిగిన పట్టణము). గిబియోనీయుల పట్టణములలో నొకటి (యెహో $9^{17}$). అది యూదా బెన్యామీను గోత్రముల సరిహద్దుగా నున్నను ($15^{9}$ $17^{12-14}$) యూదా వారి స్వాధీనమందుండెను ($15^{48-60}$). దాని అసలు పేరు బయలు లేక కిర్యత్బయలు. ఫిలిష్తీయులు దేవుని మందసమును పట్టుకొనిన పిమ్మట అది షుమారు 20 సం॥ లవఱకు ఇచట నుంచబడెను (I సమూ $6^{21}$ $7^{2}$). దావీదు ఈ స్థలమునుండి మందసమును యెరూషలేమునకు తీసికొనివచ్చెను (కిర్యత్బయలు చూ॥). యిర్మీయా కాలములో చంపబడిన ప్రవక్తయగు ఊరియా ఈ యూరివాఁడే (యిర్మీ $26^{20}$). ఈ యూరివారిలో కొందఱు బబులోను చెఱకు పిమ్మట తిరిగి వచ్చిరి (ఎజ్రా $2^{25}$ నెహె $7^{29}$). ప్రస్తుతమున యెరూషలేమునకు పడమరగా 7 మైళ్ల దూరములోనున్న కురియెటెల్ ఎల్ ఏనాబు (*Kurietel 'Enab*) అనునది దీనియునికి యని సాధారణముగా ననుకొందురు (పటము II, E 1).

**కిర్యత్సన్న** దెబీరు చూ॥

**కిర్యత్సేఫెరు** దెబీరు చూ॥

**కిలికియ** (Cilicia). చిన్నాసియలోని యొకపరగణా. ఉత్తరమునన్న తౌరసు పర్వతములు దీనిని కప్పదొకియ లుకయొనియ ఇసౌరియ యను పరగణాలనుండి వేఱుచేయుచున్నవి. తూర్పున దీనికిని సిరియకును మధ్య అమానసు (*Amanus*) పర్వత మున్నది. దక్షిణమందు మధ్యధరా సముద్రమును, పడమట పంఫూలియయును దీనికి సరిహద్దులై యున్నవి. పౌలు జన్మస్థానమగు తార్సు దీనికి ముఖ్య పట్టణము (కార్య $21^{39}$ $22^{3}$ $23^{34}$). కిలికియ సిరియలో నొకభాగమై యుండెను. కిలికియ నుండి వచ్చిన యూదులు స్తెఫనుతో వాదించిరి ($6^{9}$). బహుశః పౌలే ఇచ్చట మొదట సువార్త బోధించి యుండును ($15^{23}$ $9^{30}$ గల $1^{21}$). రెండవ ప్రయాణమందతఁడు దీని గుండా ప్రయాణము చేయుచు సంఘములను స్థిరపఱచెను (కార్య $15^{41}$). రోమాకు ఖైదీగాఁ బోవునప్పుడు కిలికియ సముద్రము మీఁదుగా వెళ్లెను ($27^{5}$).

**కిల్మదు** (Chilmad). తూరుపట్టణస్థులతో వ్యాపారముచేసిన స్థలములలో నొకటి (యెహె $27^{23}$). అది షేబ, అష్షూరు అను వాటితో కలిపి చెప్పఁబడినందున మూర ప్రదేశములలో నొకటి యని తోఁచుచున్నది గాని దానికి మించి ఇంక నేమియు తెలియదు.

**కిల్యాబు** (Chileab = తండ్రిని సిద్ధునిగా చేసినవాఁడు?). దావీదుయొక్క రెండవ కుమారుఁడు. ఇతఁడు అబీగయీలుకు పుట్టెను (II సమూ $3^{3}$). I దిన $3^{1}$ లో ఇతనికి దానియేలు అను మాఱు పేరు కలదు.

**కిల్యోను** (Chilion = క్షీణించుట). ఎలీమెలెకు నయోమి యను వారి రెండవ కొడుకు (రూతు $1^{2}$). ఇతఁడు ఓర్పాను వివాహము చేసికొని మోయాబు దేశములో కాలముచేసెను ($1^{5}$ $4^{10}$).

**కిష్యోను** (Kishion = గట్టితనము). ఇశ్శాఖారీయుల సరిహద్దులో నుండు ఊళ్లలో నొకటి

(యోహా 19[20]). ఇది లేవీయుల కియ్యఁబడెను (21[28]). ఊళ్లను వ్రాయునప్పుడు దీనికి కెదేషు అను పేరు పెట్టిరి. ఇది లేఖకుని పొరబాటై యుండవచ్చును. (పటము III, F 1).

**కిస్లేవు** కాలమానము VI 9 చూ॥

**కిస్లోతాబోరు** కెసుల్లోతు చూ॥

**కిస్లోను** (Chislon = నిరీక్షణ). మోషే కనాను దేశము వేగుజూడఁ బంపిన పన్నెండు మందిలో బెన్యామీనీయుల ప్రతినిధియగు ఎలీదాదుకు తండ్రి (సంఖ్యా 34[21]).

## కీ

**కీటకములు, చరములు, సరీసృపములు** (Insects and Reptiles). మూల భాషలం దుదాహరించిన ప్రతి కీటకమును సరీసృపమును తెలుఁగు తర్జుమాలో నూటిగా సూచింపఁ బడిన దని రూఢిగాఁ జెప్ప వీలులేదు. మన తెలుఁగు బైబిలు మాటలను అక్షర రీతి ననుసరించి ఈ దిగువ చూడవచ్చును.

**1. అడవి యెలుక.** లేవీ 11[30] నందు మాత్ర మున్నది. తినుటకు నిషేధింపఁబడిన వాటిలో నొకటి.

**2. ఆకు మిడుత.** మిడుత చూ॥

**3. ఈగలు.** ఈ పదమును ప్రస 10[1] లో చూడవచ్చును. గాని యిదే యసలు మాటను యెష 7[18] లో జోరీగ లని భాషాంతరము జేసిరి (క్రింద 13 చూ॥).



ఊసరవెల్లి

**4. ఊసరవెల్లి.** ఈ పదము లేవీ 11[30] నందు మాత్రము గలదు. నిషేధింపఁ బడిన వాటిలో నిది యొకటి.

**5. కందిరీగలు.** ఈ పదముచే సాధారణ ముగా తర్జుమా జేయఁబడినది మనుష్యులను బాధ పఱచునదగుటచే అది వారిని శిక్షించుటకైన సాధనములలో నొకటిగా నున్నది (ద్వితీ 7[20] యెహో 24[12]). నిర్గ 23[28] నందు దానిని పెద్ద కందిరీగ లని తర్జుమాచేసిరి. ద్వితీ 1[44] కీర్త 118[12] నందు కందిరీగలను పదము వాడినను ఆ వాక్యములలోని అసలు పదమును సాధారణ ముగా తేనెటీగలు అని తెనిఁగించిరి (క్రింద 14 చూ॥).

**6 కప్పలు.** ఐగుప్తునందు కలిగిన 10 తెగు ళ్లలో రెండవది కప్పలవలన కలిగినది. (నిర్గ 8[2-13]). ప్రక 16[13] నం దవి లోకాంతమునకు ముందుగా కలుగఁబోవు విపత్తులను దెలుపుటకై వాడిన యలంకారము లందును కనఁబడును. అచ్చట యవి క్రీస్తుకు విరోధముగా నుండు మూఁడు అపవిత్రాత్మలను సూచించును.

**7. కీటకములు.** (క్రింద 22 చూ॥)

**8. గొంగళిపురుగు.** (మిడుత చూ॥)

**9. చిమ్మెట.** పాఁతనిబంధన యందున్న సాధారణ పదములలో నొకటి. యోబు 27[18] నందీ మాటను పురుగులనియు తక్కిన వాక్య ములలో చిమ్మెట యనియు తర్జుమాజేసిరి (యోబు 4[19] 13[28] యెష 50[9] 51[8] హోషే 5[12]).



చిమ్మెట

యెషయా 51[8] లోనిది మఱియొక అసలు పదమై యున్నది. క్రొత్త నిబంధన యందు అసలులో నొకటే మాట గలదు. దానిని తెలుఁగునందు

ఒకటే రీతిగా తెనిఁగించిరి (మ $6^{19,20}$ లూ $12^{33}$). ఈ లోక సంపదయు సౌఖ్యమును చెడి పాడై పోవునను సంగతిని సూచించుటకు బైబిలునందీ పదమును సాధారణముగా నుపయోగించిరి.

**10. ఈడ పురుగులు.** (మిడుత చూ॥).

**11. చీమలు.** ఇవి శ్రద్ధను సూచించెను. సామెతెల గ్రంథమునందును ఆ సుగుణమును బోధించుటకే ఉపయోగించిరి (సామె $6^6$ $30^{25}$).

**12. జలూకము.** ఇది రక్తమును పీల్చునదై అతృప్తికి గురుతుగానున్నది. (సామె $30^{15}$). గాని దీని యసలు పదము దేనిని సూచించునో అది రూఢిగా తెలియదు.



ఐతియోపియలోని జోరీగ

**13. జోరీగలు.** ఈ పదముచే తర్జుమా చేయఁబడిన అసలు పదము, గొప్ప సముదాయములుగనుండు కీటకములను సూచించును. ఐగుప్తును బాధపెట్టిన తెగుళ్లలో నాలుగవది జోరీగలవలన కలిగినది (నిర్గ $8^{21-31}$ కీర్త $105^{31}$). మఱియొక అసలు పదమునుకూడ యెష $7^{18}$ లో జోరీగలని తర్జుమాజేసిరి (పైన 3 చూ॥)

**14. తేనెటీగలు.** బైబిలునం దుదాహరింపఁబడినవి అడవి తేనెటీగలు (న్యాయా $14^8$). దీని అసలు పదము దెబోరా అనునది. ఇది బైబిలునందిద్దరి పేరు ($4^5$ ఆది $35^8$). ఈ పదము న్యాయా $14^8$ నందు తేటగా తేనెటీగలను సూచించినను ద్వితీ $1^{44}$ కీర్త $118^{12}$ యెష $7^{18}$ లో కందిరీగలు అని తెనిఁగించిరి.

**15. తేలు** క్రొత్త నిబంధనలోను పాతనిబంధనలోను తేళ్లనుగూర్చిన సూచనలు గలవు (ద్వితీ $8^{15}$ యెహె $2^6$ లూ $10^{19}$ $11^{11}$ ప్రక $9^{3-10}$). ఇవి మనుష్యులను బాధపెట్టునవియై దేవుని శిక్షలకు సాధనములుగా పంపఁబడును. I రాజు $12^{11-14}$ (=II దిన $10^{11,14}$) లో నున్న కొరడాలు అను దాని మూలపదము తేళ్లని



తేలు

అర్థమిచ్చునదే గాన కొన్ని తర్జుమాలలో ఆ పదమును తేళ్లు అని తెనిఁగించిరి. ఇతర తర్జుమాలలో నున్నట్లు అది మిగుల బాధకరమైన చబుకుగా ఎంచి దానిని కొరడాలు అని తర్జుమాజేసిరి.

**16. తొండ.** దీని యసలుపదము లేవీ $11^{30}$ లో మాత్రమున్నది. నిషేధింపఁబడిన వాటిలో నిది యొకటి.

**17. దోమలు.** కీర్త $105^{31}$ నందు దోమలు అని తర్జుమాజేసిన అసలు పదమును నిర్గ $8^{16-18}$ నందు పేలు అని తెనిఁగించిరి (క్రింద 23 చూ॥). క్రొత్తనిబంధనలోని గ్రీకు పదమును మ $23^{24}$ నందు దోమ యని భాషాంతరము జేసిరి. అక్కడ అది మిగుల సూక్ష్మమైనదానిని సూచించును.



నత్త

**18. నత్త.** కరిగిపోయి మెత్తగానున్న దానిని సూచించుటకు వాడఁబడిన పదమైయున్నది (కీర్త $58^8$).

**19. నేతమిడుత** (మిడుత చూ॥)

**20. నేల మొసలి.** లేవీ $11^{30}$ నందు మాత్రము దీని అసలు పదమున్నది. అది బల

మును సూచించును. ఇది సరియైన తర్జుమా యని తలంచుచున్నారు.

**21. పసరు పురుగు** (మిడుత చూ॥)

**22. పురుగులు** (పైన 9 చూ॥). రెండు హెబ్రీ పదములను పురుగులని తర్జుమాచేసిరి. ఒకటి ద్వితీ $28^{39}$ యోబు $25^{6}$ కీర్త $22^{6}$ యెష $41^{14}$ యోనా $4^{7}$ లో నున్నది. యెష $14^{11}$ నందు దానిని **కీటకము**లని తర్జుమాచేసిరి. రెండవది నిర్గ $16^{24}$ యోబు $7^{5}$ $21^{26}$ $24^{20}$ $25^{6}$ యెష $14^{11}$ నందుపయోగించిరి. గాని రెంటి అర్థము ఒకటే. చనిపోయిన పిమ్మట మనుష్యుడు పురుగుల పాలగు నను సంగతి ఈ వచనములలో విశేషముగా కనఁబడును. మరణమునకు పిమ్మట దుష్టులకు కలుగు బాధకు సూచనగా క్రొత్త నిబంధనయందు (మా $9^{48}$ = యెష $64^{24}$) ఈ పదము హేరోదుకు కలిగిన జబ్బునందును కనఁబడును (కార్య $12^{23}$).

**23. పేలు.** ఐగుప్తులోని తెగుళ్లలో మూఁడవది పేలవలన కలిగెను (నిర్గ $8^{16-18}$). ఈ పదమునే కీర్త $105^{31}$ నందు **దోమలు** అని తెనిఁగించిరి (పైన 17 చూ॥).

**24. ప్రాకుజీవరాసులు** (లేవీ $11^{29}$). ఈ అర్థమిచ్చు రెండు పదములు మూలభాష యందున్నవి. బైబిలునందు సాధారణముగా జంతువులనన్నిఁటిని ఆకాశ పక్షులు భూజంతువులు ప్రాకెడి జంతువులు సముద్రమత్స్యములని భాగింతురు (కీర్త $148^{10}$ యెహె $38^{20}$ హోషే $2^{18}$ మొ॥). ప్రాకుజంతువులను ఈ పదమును ఒకే మాటతో తెనిఁగించక **ప్రాకుపురుగు లనియు** (ఆది $7^{14}$), **ప్రాకెడు జంతువులని** (లేవీ $5^{2}$ I రాజు $4^{33}$), **ప్రాకుజీవులనియు** (కీర్త $148^{10}$), **పురుగులనియు** (లేవీ $11^{24}$ $22^{5}$ మొ॥) తర్జుమాచేసిరి. హబ $1^{14}$ లో మానవుల స్వల్ప స్థితిని సూచించుటకు ఇవి దృష్టాంతముగానున్నవి.

**25. బల్లి.** సామె $30^{28}$ నందిది రాజ గృహములలో నున్నట్లు చెప్పఁబడినది. కొందఱిది సాలెపురుగు అని తలంచుచున్నారు. లేవీ $11^{29}$ నందున్న బల్లియను దాని అసలు పదము వేఱుగానున్నది. ఇది నిషిద్ధమగు జంతువులలో నొకటియైయున్నది. పలెస్తీనునందు ఇంచుమించు 40 రకముల బల్లులున్నట్లు శాస్త్రజ్ఞులు కనుగొని యున్నారు.

**26. మిడుతలు** మిడుత చూ॥

**27. మిన్నల్లి.** దావీదు తన హీనస్థితిని సూచించుకొనుటకు మిన్నల్లితోఁ బోల్చుకొనెను (I సమూ $24^{14}$).

**28. సరటము** లేవీ $11^{30}$ లో మాత్ర మున్నది. ఇది ముసలి తొండ. గాని ఆ యసలు పదమునకిదే యర్థమని రూఢిగాఁ జెప్పవలను పడదు.

**29. సాలెపురుగు.** యోబు $8^{14}$ యెష $59^{6}$ నందు మాత్రము దీని యసలు పదమున్నది. భక్తిహీనుల ఆశ్రయపు బలమును సూచించుటకు దీని గూటిని అలంకారముగా వాడిరి.

**కీడు** దుష్టత్వము చూ॥

**కీదోను** (Chidon = బల్లెము). ఉజ్జాయను వాఁడు మందసమును పట్టుకొని చనిపోయిన చోటనున్న కళ్లముపేరు (I దిన $13^{9}$). II సమూ $6^{6}$ లో దీనికే **నాకోను** కళ్లమను పేరుగలదు.

**కీనా** (Kinah = ప్రలాపగీతము). యూదా దేశములోని దక్షిణపు కొనయందున్న ఒక యూరు (యెహో $15^{22}$). దీనియునికినిగూర్చి మఱేమియు సరిగా తెలియదు.

**కీయోసు** (Chios). స్ముర్నయను పట్టణమునకు ఎదురుగానున్న యొక ద్వీపము. అది యాజియన్ సముద్రములోని ద్వీపరాశిలో నొకటియై యుండెను. దాని పొడవు 32 మైళ్లును వెడల్పు 18 మైళ్లు నుండును. పౌలు చివరిసారి యెరూషలేమునకు వెళ్లిన ప్రయాణములో అతఁ డెక్కినయోడ దీనికి సమీపముగా పోయెను (కార్య $20^{15}$) ప్రస్తుతము దీనికి స్కీయు (*Scio*) అనుపేరు కలదు.

**కీరకాయలు** (Cucumbers). ఇది సంఖ్యా $11^{5}$ నందుమాత్రము కనఁబడుచున్న కూరకాయలపేరు. అది ఒక తరహా దోస కాయ. పలెస్తీనునందు పలువిధములగు దోస కాయలు గలవు. J. C.

**కీరు** (Kir = ప్రాకారము). క్రీ. శ. 7, 8 శతాబ్దములలో అష్షూరు రాజ్యమునకు లోనైన యొక స్థలము. దమస్కు వారచటికి కొనిపోఁబడెదరని ఆమోసు ప్రవచించెను (ఆమో $1^{5}$).



కీరకాయ

ఆమో $9^{7}$ చూడఁగా దేవుఁడు దమస్కువారైన సిరియనులను కీరు దేశమునుండి రప్పించెనను సంగతియున్నది. అష్షూరు రాజు వారిని కీరు పట్టణమునకు కొనిపోయెనని II రాజు $16^{9}$ లో నున్నది. కీరునుండి వచ్చిన యోధులు అష్షూరు వారి సేనలోనున్నట్లు యెష $22^{6}$ లో నున్నది. ఇది ఆఫ్రికాలోను చిన్నాసియలోను బబులోను ప్రదేశములో నున్నదని ఆయా వార లూహించిరి గాని యెచటనున్నదో రూఢిగా నెవరికిని దెలియదు.

**కీర్తన** (Hymn). దేవుని యారాధన యందు వాడఁదగిన కీర్తనలు బైబిలులోనున్నవి. (కీర్తనల గ్రంథముయొక్క వివరము చూ॥). పాఁత నిబంధనలో మోషే కీర్తనలు (నిర్గ $15^{1-19}$ ద్వితీ $32^{1-43}$), దెబోరా కీర్తన (న్యాయా 5), హన్నా కీర్తన (I సమూ $2^{1-10}$) మొదలగు కీర్తనలుగలవు. క్రొత్త నిబంధనలో మరియ కీర్తన (లూ $1^{46-55}$), జెకర్యా కీర్తన ($1^{68-79}$), సుమెయోను కీర్తన ($2^{29-32}$) యనునవి చాలమట్టునకు పాఁత నిబంధన కీర్తనలవలెనున్నవి ఇట్టి కీర్తనలను ఆరాధన సమయమందు పాడినట్లు II దిన $29^{27-28}$ వలనఁ దెలియును. క్రీస్తు మృతిఁబొందక మునుపటి రాత్రి తన శిష్యులతో పాడిన కీర్తన (మ $26^{30}$) యూదులు పస్కాసమయములో పాడునట్టి హల్లెలు (స్తోత్రము) అని యందఱు నంగీకరింతురు. అందులో దావీదు కీర్తనలు 115-118 వఱకు నున్నవి. కొలొ $3^{16}$ ఎఫె $5^{19}$ చూడఁగా క్రొత్త నిబంధనలోని కీర్తనలకు **సంగీతములు కీర్తనలు ఆత్మసంబంధమైన పద్యములు** అను మూఁడు పేరులు కలవు. పాఁత నిబంధన కీర్తనలును ఇందులో చేరియున్నవి. క్రైస్తవులు ఆది కాలము మొదలు క్రీస్తునకు స్తోత్ర గీతములను రచించి పాడుచుండిరి (కార్య $16^{25}$ I కొరింథి $14^{26}$). అసలు భాషను చూడఁగా అట్టి కీర్తనలును పద్యములును I తిమో $3^{16}$ ఎఫె $5^{14}$ లో ఎత్తి వ్రాయఁబడినట్లుగా నున్నవి. రెండవ శతాబ్దారంభమందు ప్లిని (*Pliny*) యను గొర్నరు త్రయాను (*Trajan*) అను చక్రవర్తికి ఆది క్రైస్తవుల వాడుకలను వివరించుచు నొక యుత్తరమును వ్రాసెను. అందులో క్రైస్తవులు క్రీస్తును దేవునిగా నెంచి ఆయనకు స్తుతులు పాడుట ఒక ముఖ్యవిషయమై యున్నదని వ్రాసెను. ఆరాధనలో కీర్తనలను పాడుట నేటివఱకు క్రైస్తవులకు సర్వసాధారణమైన అలవాటు.

**కీర్తనల గ్రంథము** (Psalms). మన ప్రభువీ లోకమందున్న కాలములో నిది యూదులు పాడెడి కీర్తనల పుస్తకమయ్యుండెను. ప్రస్తుతమున అరబ్బులు మొదలగువారు సితారా కిన్నెరలవంటి వాయిద్యములమీఁద వాయించునట్లు ఆ కాలమందున్న యూదులును ఆయా వాయిద్యములమీఁద వాయించుచు పాడుటకెంతయు ఆసక్తిపరులుగ నుండిరి. దావీదు యౌవనుఁడయి యుండఁగా వీణెమీఁద చమత్కారముగా వాయించి పాడెడివాఁడు (I సమూ $16^{18}$). అతఁడు రాజయినప్పుడు లేవీయులు యెరూషలేమునందలి గుడారములో అనుదినమును ప్రభువును వాయిద్యములతో స్తుతించునట్లు ఏర్పాటు జేసెను (II సమూ $6^{5}$). ఇశ్రాయేలీయుల మధురగానము చేసినవాడని దావీదునకు బిరుదు గలదు ($23^{1}$). ఈ గ్రంథమునందు దావీదు రచించిన కీర్తనలలోఁ గొన్ని యుండుటను బట్టి తఱుచుగా దీనిని దావీదు గ్రంథమని పిలిచిరి. (హెబ్రీ $4^{6}$). అయితే ఈ కీర్తనలలో ననేకములు దావీదు చనిపోయిన పిమ్మట చాల సంవత్సరములకు రచింపఁబడినట్లు స్పష్టముగఁ దెలియుచున్నది.

ప్రాచీనకాలమునుండియే ఈ గ్రంథమును అయిదు స్కంధములుగా విభజించియున్నారు. ప్రథమస్కంధము 1-41 కీర్తనలు; ద్వితీయ స్కంధము **42-72** కీర్తనలు; తృతీయ స్కంధము **73-89** కీర్తనలు; చతుర్థ స్కంధము 89-106 కీర్తనలు; పంచమ స్కంధము 107-150 కీర్తనలు.

ఈ కీర్తనలు, తమ్మును వ్రాసిన వారి మనో భావములను అనుభవములను దెలియఁజేయును. ఇందు కొన్ని ప్రార్థనలు, కొన్ని కృతజ్ఞతా స్తుతులు, కొన్ని స్తోత్రగానములై యున్నవి. వీటిని రచించినవారిలోఁ గొందఱు దేవునియందు తమకుగల విశ్వాసప్రేమ నిరీక్షణ భయభక్తులను, తమ యవసరములను, తమ కోరికెలను, తమ ఉత్సాహ సంతోషములను తెలియఁజేయుచున్నారు. కొన్ని కీర్తనలయందు సృష్టియందును ఇశ్రాయేలీయుల చరిత్రలయందును ప్రత్యక్షమగుచున్న దేవుని యాశ్చర్యకార్యములు పేర్కొనఁబడియున్నవి. కొన్నిఁటియందు ఆయా కవులు అనుదిన జీవితమునందు తమకు కలిగిన తలంపులును, పాపాత్ములు వర్ధిల్లుటను చూచినప్పుడు వారికి కలిగిన భ్రమయును, నీతిమంతులు శ్రమ ననుభవించుటను జూచినప్పుడు కలిగిన కలవరమును కనఁబరచుచున్నారు. మెట్టుకు కీర్తనలన్నియును దేవునికే చెందినవి. పరమభక్తులైనవారికి ఆయా సమయములయందు కలిగిన తలంపులును దేవునిద్వారా వారికి కలిగిన ఆయాస్థితిగతులును వాటిమూలముగాఁ దెలియుచున్నవి. వీటిని రచించినవారందఱును ధర్మశాస్త్రమును తమ జీవితమునకు మార్గదర్శిగాఁ నెంచుకొనిరి. దేవుని ఆలయమం దాయనను ఆరాధించఁ గలిగినప్పుడు వా రత్యధికముగా సంతోషించిరి. ఆయా కాలములయందును స్థితులయందును తమకుఁ గలిగిన యనుభవమును దెలుపుటవలన అవి యిప్పటి కాలమందున్నవారి కందఱి కెంతో ప్రయోజనకరముగా నున్నవి.

వీటిని రచించినవారిలో కొందఱిని గూర్చి మాత్రము తప్ప తక్కినవారినిగూర్చి తెలియదు. కొన్ని కీర్తనల ప్రారంభమున పేరులు వ్రాయఁబడియుండినను అవి యా కవుల పేరులు కావు. దృష్టాంతముగా 69 కీర్తన ప్రారంభమున దావీదు కీర్తన యని వ్రాయఁబడియున్నను దానియందు వివరింపఁబడిన కష్టములును శ్రమలును దావీదనుభవించినవి కావుగాని యిర్మీయాయో మఱియొకఁడో అనుభవించినవైన యున్నవి. వీటిలో 12 కీర్తనలపైన **ఆసాపు కీర్తన** అను పదములు కనఁబడును. ఇతఁడు దావీదు నియమించిన సంగీత పాటకులలో ప్రధానుఁడు (I దిన $16^{4,5}$). కోరహు కుమారులు 12 కీర్తనలను రచించినట్లు అనుకొందురు. వీరు సొలొమోను కట్టించిన మందిరములో ద్వారపాలకులైనను (I దిన $26^{1}$) పాటకులై యుండిరి (II దిన $20^{19}$). సెలా యను పదమునకును ఆయా రాగముల పేరులకును సరియైన అర్థము తెలియదు (ఆయా రాగముల పేర్లు చూ॥).

కీర్తనలలో 7, 35, 69, 109 శాపకీర్తనలనఁబడును. వీటిని వ్రాసినవారు దుష్టులు శిక్షనొందెదరని ప్రవచించుటయే గాక వారికిని వారి పిల్లలకును భయంకరమైన శిక్షలు కలుగవలెనని అత్యాసక్తితో దేవుని వేడుకొనిరి. మనము వాటిని చదివినప్పుడు, వాటిని వ్రాసినవారు క్రీస్తు పుట్టుకకు పూర్వము అనేక వందల సం॥లకు ముందు జీవించినవారనియు వారు తమ శత్రువులను ప్రేమించ నేర్చుకొనుటకు (మ $5^{43,44}$) ఆయన ఉపదేశములను వినినవారు కారని జ్ఞప్తియందుంచుకొనవలసియున్నాము. దేవుఁడు లోకమును పాలించువాఁడనియు, అనృతవాదులను, క్రూరులను, అన్యాయస్థులను దండించుటవలన తాను లోకమును పరిపాలించుచున్నాఁడని ఈ ప్రార్థనలవలన మనము తెలిసికొనవలెను.

**2, 18, 20, 21, 45, 61, 72, 89, 110, 132** కీర్తనలు రాజ్యసంబంధమైన కీర్తనలై యున్నవి. వీటివలన రాజెట్టివాఁడై యుండవలెనో వాటిని రచించిన వారు దెలుపుచున్నారు. మిక్కిలి శ్రేష్ఠులుగ నెంచఁబడిన రాజులయందును పొరబాటులును తప్పులు నుండుటంబట్టి, దేవుని చిత్తమును పరిపూర్ణముగ నెఱవేర్చఁగల ఒక రాజుకొఱకు యూదులు సదా యెదురుచూచుచుండిరి. దేవుని చిత్తమును పరిపూర్ణముగా నెఱవేర్చినవాఁడు యేసుక్రీస్తు ఒక్కఁడే.

**22, 35, 41, 55, 69, 109** కీర్తనలు శ్రమ కీర్తనలనఁబడును. జయశాలియగు క్రీస్తు మాత్రమే గాక శ్రమలు పొందు రక్షకుఁడుకూడ రానవ

సరమై యున్నట్లు వరులు తెలిసికొనవలసి యుండెను. దావీదుయొక్కయు, పూర్వికులైన ఇతర భక్తులయొక్కయు శ్రమలు రాఁబోవు వాని శ్రమలకు ముంగుఱుతులుగా నుండెను. ఈ శ్రమలను బట్టి నీతిమంతుల శ్రమలు తరుచుగా జయమునకు త్రోవయనియు, ఓర్పుతో సహించుటవలన దేవునికి మహిమయు నరులకు విమోచనమును సిద్ధించునని మానవులు గ్రహించిరి. యేసుక్రీస్తు వచ్చువఱకు ఈ సంగతిని వారు పూర్ణముగా గ్రహించలేదు. (లూ 24[44] హెబ్రీ 10[5-13]).

మన ప్రభువైన యేసుక్రీస్తు ఈ లోకమందున్న కాలములో ఈ కీరనలను దేవాలయమందును సమాజమందిరములయందును యూదులు పాడుచుండిరి. క్రైస్తవులును తమ సంఘము ఆరంభించినది మొదలు వీటిని పాడుచున్నారు. వీటి ద్వారా దేవునితోటి సహవాస మెట్టిదో దెలిసికొనుచున్నాము. బహిరంగపు టారాధనలో వాడుట కీ కీర్తనలు మిగుల తగియున్నవి.

J. C.

**కీర్మోయాబు** (Kir-Moab = మోయాబు ప్రాకారము). మోయాబు దేశములోని యొక ముఖ్యపట్టణము (యెష 15[1]). ఆ వాక్యమందున్న సంబంధమును బట్టి ఆర్మోయాబు నది మాఱుపేరని కొందఱి యభిప్రాయము గాని ఆర్మోయాబు అర్నోను నదికి దక్షిణముగా నుండు ప్రదేశమై యున్నది. కీర్మోయాబు దానిలోని ముఖ్యమైన కోట యనుకొనుట యుక్తము. ప్రస్తుతము కెరాక్ (*Kerak*) అనఁబడు ప్రాకార శిథిలములు దీని యునికి యని యూదుల తార్గములలో నుదాహరింపఁబడియున్న సంగతి నిజము కావచ్చును. అది మృతసముద్రమునకు 4000 అడుగులు ఎత్తుగానున్న కొండమీఁద నున్నది. (పటము II, H 4).

**కీర్హరెశెతు** (Kir-Hareseth = ఇటుకల పురము). మోయాబు దేశములోని బలమైన కోటలలో నొకటి (II రాజు 3[25] యెష 16[7,11] యిర్మీ 48[31-36]). కీర్మోయాబు అనునది దీనికి మాఱుపేరని సాధారణముగా నంకరింతురు. (కీర్మోయాబు చూ॥).

**కీలు** (Pitch). ప్రస్తుతమందు చేయునట్లు బైబిలు కాలమునందును దీనిని ఓడల చెక్కసందులకుఁ బూసిరి. అందువలన నీరులోనికి రాఁజాలదు. నోవహు కట్టించిన ఓడకు దీనిని బూసిరి (ఆది 6[14]). మోషే నుంచిన జమ్ముపెట్టెకు పూసినదానిని తెలుపుటకు మూలభాషయందు వేఱొక పదమును వాడినను, తెలుఁగు బైబిలునందు ఈ పదమునే యుంచిరి (నిర్గ 2[3]). అది ప్రస్తుతపు తారువంటిదై త్వరగా మండునదై యుండెను. ఎదోముదేశముయొక్క నాశనమును సూచించుటకు దాని కాలువలు కీలగునని యెషయా వ్రాసెను (యెష 34[9]).

యెహీయేలు

అబ్దోను సూరు కీషు బయలు నేరు నాదాబు

నేరు
|
సెరోరు
|
అబీయేలు

కీషు
|
సౌలు

నేరు
|
అబ్నేరు.

**కీషీ (Kishi).** లేవీయులలోని మెరారీ తెగకు చేరిన యొకఁడు (I దిన $6^{44}$). ఇతనికి **కూషాయాహు** అను మాఱుపేరు కలదు (I దిన $15^{17}$).

**కీషు (Kish).**

**1.** యెహీయేలు కుమారుఁడగు నొక బెన్యామీనీయుఁడు (I దిన $8^{30}$ $9^{35-36}$).

**2.** రాజైన సౌలు తండ్రియు అబీయేలు కుమారుఁడునగు యొక బెన్యామీనీయుఁడు (I సమూ $9^{1}$). కాని యితఁడు నేరు కుమారుఁడును గిబోనువాఁడగు యెహీయేలు వంశస్థుఁడయినట్లు వ్రాయఁబడియున్నది (I దిన $8^{33}$ $9^{35-39}$). ఇతఁడు నేరుయొక్క స్వంత కుమారుఁడుగా భావింపఁబడక ఈ దిగువ వంశావళియందు అతని వంశస్థుఁడని మాత్రము వ్రాయఁబడియున్నది. కీషుకును నేరుకును నడుమ అబీయేలును మఱి యితరులను జేర్చవచ్చును. యెహీయేలుకు కీషను నొకఁడును నేరు అను నొకఁడును పుట్టియుందురు. అట్లయినయెడల నేరుసంతతి కీషుయొక్కయు, నేరుయొక్కయు కుటుంబములుగా నేర్పడినవని ఈ వంశావళిభావము తేటపడును. మొదటి గోత్రము అనగా కీషు గోత్రము సౌలుయొక్క రాచవంశమై యున్నది. దీనికి నేరు కుమారుఁడగు కీషు మూల పురుషుఁడై యున్నాఁడు. అయితే యిది అంత ప్రసిద్ధిఁజెందక చిన్న తెగగా మాత్రమే యేర్పడిన నేరు వంశమునకు సంబంధించియున్నది. ఆ రెండు గోత్రములు యెహీయేలు సంతతిలోఁ జేరినందున యెహీయేలు కుమారులలోఁ గల నియమము ప్రకారము నేరు వలెనే కీషుకూడా లెక్కింపఁబడి యున్నాఁడు (I దిన $9^{36}$). సౌలు తండ్రియగు కీషును, అబ్నేరు తండ్రియగు నేరును అబీయేలు కుమారులుగా నెన్నఁబడియున్నారు (I సమూ $9^{1}$ $14^{51}$). వీరిద్దరిలో నొకరు సౌలుకు పినతండ్రియై యుండెను ($14^{50}$). అబీయేలను పదము యెహీయేలు యొక్క నామాంతరమని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల వారి వంశావళి యిట్లుండును.




**3.** దావీదు కాలమందున్న మెరారీ సంతతివారిలో మహలికుటుంబికుఁడగు లేవీయుఁడు (I దిన $23^{21-22}$ $24^{29}$).

**4.** మెరారీ కుటుంబికుఁడు. అబ్దీ కుమారుఁడు. హిజ్కియాకు సహాయపడిన లేవీయుఁడు (II దిన $29^{12}$).

**5.** మొర్దెకై వంశస్థుఁడగు నొక బెన్యామీనీయుఁడు (ఎస్తే $2^{5}$). H.

**కీషోను నది** (**Brook Kishon** = వంకర టింకరగా నుండు). కర్మెలు కొండకు ఈశాన్యముగా ప్రవహించు ఒక నది. అది చాల తూర్పుననున్న తాబోరు కొండలో నుత్పత్తియై యెజ్రెయేలు మైదానముమీఁద వాగుగా పారును. కర్మెలు కొండమీఁదనుండి ప్రవహించు అనేకమైన చిన్న వాగు లందులో కలియుటచే అది యేరై కర్మెలు కొండ యడుగు పొడుగున ప్రవహించి అక్కో యను పట్టణముదగ్గర మధ్యధరా సముద్రములో సంగమించును. తాబోరునుండి కర్మెలువఱకు ఇది వర్షాకాలములో మాత్రము ప్రవహించును గాని అది మొదలు సంవత్సరమంతయు పారునట్టి మంచి నదియై యున్నది.

ఆ నదినిగూర్చి మొదట న్యాయా $4^{7}$ లో చెప్పఁబడియున్నది. ప్రవక్తయగు దెబోరాయును న్యాయాధిపతియగు బారాకును రాజైన యాబీను సేనానియగు సీసెరామీఁద దేవుని ప్రేరేపణవలన యుద్ధము చేసినప్పుడు అతఁడు తన రథములతోను కాల్బలముతోను కీషోను నదిని దాటుచుండఁగా దేవుని యాజ్ఞవలన ఆ నదిలో అకస్మాత్తుగా నొక ప్రవాహము పుట్టి వారి మీఁద ప్రవహించినందున వారందఱు నాశనమైరి ($5^{21}$). రమారమి 300 సంవత్సరములైన తరువాత రాజైన అహాబు అతని దుష్టభార్యయగు యెజబెలు అను నిరువురి వలన నిశ్రాయేలు జనులు ప్రేరేపితులై యెహోవాను విడిచి బయలు అను సీదోనీయుల దేవత తట్టు త్రిప్పఁబడినందుకు శిక్షగా మూఁడేండ్ల కరవు కలిగెను. అప్పుడు యెహోవా యాజ్ఞవలన ఏలీయా అహాబును ఇశ్రాయేలీయులను బయలు ప్రవక్తలందఱిని కర్మెలు కొండమీఁద పోగుచేసి, తా నర్పించిన యజ్ఞమును దహించుటకు ఆకాశమునుండి వచ్చిన యగ్నినిబట్టి యెహోవాయే దేవుఁడని జనులందఱును ఒప్పుకొనులాగున చేసి, బయలు ప్రవక్తలందఱిని పట్టుకొని కర్మెలు కొండ యంచున నుండిన ఈ కీషోనునది యోారను సంహరింపఁ జేసెను. అప్పుడు మంచి వర్షము కురిసెను. కరవు తీరిపోయెను (I రాజు $18^{18}$-40). C.

## కు

**కుంకుమ** (Saffron). కుంకుమ పువ్వుతోఁ జేసిన యొక విధమైన పొడుము. దీనిని ముఖము నలంకరించుకొనుటకు మిగుల నుపయోగించెడివారు. ఈ దేశములో వాడినట్లు పలెస్తీనులోను దానిని మందులలో వాడిరి (పర $4^{14}$ గంధ వర్గము I 11 చూ॥).

**కుంచము** మానములు II 1 చూ॥

**కుంటితనము** రోగములు చికిత్సలు I 3 చూ॥

**కుండ** వంట సామగ్రి I 3 చూ॥

**కుందేలు** మృగములు 16 చూ॥

**కుకుడు గువ్వ** పక్షులు 5 చూ॥

**కుక్క** (Dog). బైబిలునందలి యొక హెబ్రీ మాటను రెండు గ్రీకు పదములను కుక్కయని తెనిఁగించిరి. సాధారణముగా నీ దేశమునం దున్నరీతిగానే బైబిలునం దుదాహరింపఁబడిన కుక్కలు వీధులయం దుండునవై యున్నవి. అవి యటునిటు తిరుగులాడుచు (కీర్త $59^{6-14}$), పారవేయఁబడినవాటిని తినుచు (నిర్గ $22^{31}$), రక్తమును నాకుచు (I రాజు $22^{38}$ కీర్త $68^{23}$), పీనుగలను భక్షించుచు (I రాజు $14^{11}$ $16^{4}$ II రాజు $9^{35-36}$). అప్పుడప్పుడు తోఁడేళ్లవలె మనుష్యులను చంపుటకు కూడుకొనునవి (కీర్త $22^{15-23}$). గొల్లలు మందలను కాచుటలో సహాయపడనై కొన్ని కుక్కలను పెంచిరి (యోబు $30^{1}$). అట్టివి యింటిలో పడు ముక్కల నేరుకొని తిని (మా $7^{28}$) లాజరు పుండ్లను నాకినట్లు (లూ $16^{21}$) కనఁబడుచున్నది. తమ హీనస్థితిని దెలుపుకొనుటకు కుక్కగాను (II రాజు $8^{13}$), చచ్చిన కుక్కగాను (I సమూ $24^{14}$) ఎంచుకొనిరి. కుక్కయని పిలుచుట గొప్ప దూషణగా నెంచిరి ($17^{43}$ II రాజు $8^{13}$).

ఆత్మీయ సంగతులను వివేచింపలేక వాటిని తృణీకరించువారికిని (మ $7^{6}$), మూర్ఖించి తప్పుబోధలను జేయువారికిని (ఫిలి $3^{2}$), తమ పాపములను వదలి మఱల వాటితట్టు తిరుగువారికిని (II పేతు $2^{22}$ సామె $26^{11}$) అలంకార రీతిగా కుక్కలను పేరుఁబెట్టిరి. ద్వితీ $23^{18}$ లో నున్న **కుక్క విలువ** అను పదము అలంకారరీతిగా పురుషు సంయోగమను హేయ పాపమును సూచించునని సాధారణముగా తలంతురు. అన్యులను కుక్కలని హేళనగా పిలుచుటకు యూదుల కలవాటయ్యెను. అట్టి యలవాటును సూచించు సామెతెను (మ $15^{26-27}$ మా $7^{26-28}$) యేసుక్రీస్తు ఎత్తినను, అచట కుక్క యను పదమును వాడక హేళనగా నుండకుండునటుల చిన్ని కుక్కయను నర్థమిచ్చు పదమును వాడెను.

యెష $34^{13}$ లో **అడవి కుక్క** యని తర్జుమా చేసిన అసలుమాటను సాధారణముగా **నక్క** యని $13^{21}$ నందు తెనిఁగించిరి (మృగములు 36 చూ॥)

**కుచ్చులు** వస్త్రములు 2 చూ॥

**కుటుంబము** (Family). 1. బైబిలునందీపదమునకుఁగల యర్థము:—ఈ పదము హిందు

వులయందువలె ఒక వంశమును సాధారణముగా సూచించుచున్నందున, అనేక వాక్యములలో **వంశమని** తెనిఁగించిరి (ఆది 10[5] 28[14] మొ॥). I దిన 13[14] II దిన 35[5-12] నందు కుటుంబమని తెనిఁగించిన మూలపదము ఇంటికి సంబంధించినదై ఇంటివారు అని యర్థమగును. అనేకవాక్యముల యందు కుటుంబ మను పదము నట్లే యుంచిరి (నిర్గ 6[11] 12[21] సంఖ్యా 2[34] 3[15] ఎఫె 3[14] మొ॥). ఒకనికి పుట్టినవారందఱికి కుటుంబమను నీ పదమును వాడినట్లు కనఁబడును. ఏకపత్నీ వ్రతము హెబ్రీయులకు విధిగా నుండనందున పలుభార్యలకు కలిగిన సంతానమంతయు కుటుంబమునందు చేరిరి. వారి సేవకులును తమ తమ కుటుంబములతో ఈ కుటుంబపువారుగా నెంచఁబడిరి. అబ్రాహాము కుటుంబ మిట్టిది. బీద కుటుంబము నందు భార్యాభర్త లిరువురును వారి బిడ్డలును మనుమలును చేరియుండిరి. ఈ శీర్షికయందు భార్యాభర్తలు, తల్లిదండ్రులు కొడుకులు కూతుండ్రు వీరి అన్యోన్య ధర్మములు స్థితిగతులు మున్నగువానిగూర్చి చర్చింతుము.

**2. భార్యాభర్తలు.** బైబిలు ఆరంభము నుండి బోధించెడి నియమములలో ఏకపత్నీ వ్రతము ఒకటియై యున్నది (ఆది 2[24]). క్రీస్తు ఈ నియమమును స్థిరపఱచెను (మా 10[1-9]). కాని అప్పటివారి హృదయ కాఠిన్యమునుబట్టి (10[5]) పాత నిబంధన కాలమున బహు కొద్ది కారణాంతరములచేతనే పరిత్యాగ పత్రిక నిచ్చుటయే గాక పలుభార్యలను వివాహమాడుటయు, అనేకమంది యుపపత్నుల నుంచుకొనుటయు వాడుక యయ్యెను (ఆది 4[19] 16[1-2] 25[1] 33[2] I సమూ 1[1] II సమూ 3[2-5] I రాజు 11[1-3] మొ॥). భార్యను కుదుర్చుకొనుట చాలమట్టుకు ప్రస్తుత మీదేశమున నున్నట్లే యుండెను. వారి వాడుకలు మఱీ విశేషముగా మహమ్మదీయుల వాడుకల వంటివై యున్నను హెబ్రీ స్త్రీలకు ఎక్కువ స్వాతంత్ర్యముండెను. వరుఁడు వధువుయొక్క తండ్రికి కట్నము లేక ఓలి నియ్యవలసి యుండెను (ఆది 34[12] నిర్గ 22[17] I సమూ 18[25]). బహు భార్యాత్వము నిషేధింపఁబడకపోయినను భార్య చెల్లెలిని వివాహమాడఁగూడదను నియమ ముండెను (లేవీ 18[18]). వివాహమాడఁగూడని వారినిగూర్చిన జాబితా (లేవీ 18[6-18]) నందున్నది (వివాహము చూ॥).

భార్య భర్తయొక్క సొత్తుగా పరిగణింపఁబడినను (నిర్గ 20[17]), శారా రిబ్కా హన్నా మొదలగువారు స్వతంత్రురాండ్రై ఘనత వహించిన వారుగా నుండిరేగాని వేఱువిధముగా నుండలేదు. భార్య తన అత్తకులోఁబడి యుండుట అలవాటు (రూతు 1[4-22] ఆది 26[34] 27[46]). తన యింటి పనులన్నిఁటిని చక్కబెట్టుకొనుట భార్యయొక్క విధి. అట్టి యిల్లాలిని గూర్చిన చక్కని వివరము సామె 31[10-31] నందుగలదు. భార్యాభర్తల కుండవలసిన నిండు ప్రేమనుగూర్చిన దృష్టాంతములను చూడవచ్చును (ఆది 29 I సమూ 18[20])

ద్వేషింపఁబడిన భార్య తన పెనిమిటివలన అన్యాయము నొందకుండునట్లు ధర్మశాస్త్రము నందు నియమములు గలవు (నిర్గ 21[7-11] ద్వితీ 21[15-17]). బహు భార్యాత్వమువలన కలుగు అన్యాయములను సమర్థించుటకై నిట్టియేర్పాటులను జేసిరి. అట్టి యన్యాయములను రూపుమాపుటకే క్రీస్తు ఏకపత్నీ వ్రతమునే తేటగా స్థాపించెను (మా 10[1-9]). భార్యాభర్తల అన్యోన్య ధర్మములు ఎఫె 5[22-33] నందు స్పష్టముగ వివరింపఁబడినవి.

**3. తల్లిదండ్రులు.** కుటుంబము నందు తండ్రి పెత్తనదారి. లేవీగోత్రికులను యాజకోద్యోగమునకు ప్రత్యేకింపకఁ బూర్వము తండ్రియైనవాఁడు తన కుటుంబమునకు యాజకుఁడుగా కూడనుండెను (ఆది 12[7] 13[18] 31[54] మొ॥). తల్లిదండ్రులను కొట్టుటయు శపించుటయు మరణ శిక్షకు తగిన దోషములుగా భావించిరి (నిర్గ 21[15,17]). తన బిడ్డలకు తగిన బోధలు చేయుట తండ్రియొక్క విధి (ఆది 18[19] నిర్గ 12[26] 13[8] ద్వితీ 6[7]). తమ బిడ్డలను ప్రేమించిన తండ్రులను గూర్చిన సూచనలు యాకోబు యోసేపు యెఫ్తా దావీదు మొ॥ వారి చరిత్రలలో నున్నవి.

తల్లిని తండ్రితోపాటుగా సన్మానించవలెనను ఆజ్ఞలు కలవు (నిర్గ 20[12] 21[15]). పిల్లలు లేక పోవుట అన్నిఁటికన్న గొప్ప దౌర్భాగ్యమని తలంచిరి. కుమారుఁడు అన్నిఁటికన్న గొప్ప భాగ్యమని యెంచిరి (ఆది 30[1] I సమూ 1[1-28]).

తల్లియు తండ్రితోపాటు తన బిడ్డలకు జ్ఞానము బోధింపవలసి యున్నది (సామె $1^{8}$). యూదుల తల్లులు తమ బిడ్డలకు దేవుని సంగతులను బోధించిరి (II తిమో $1^{5}$).

**4. పిల్లలు.** తల్లిదండ్రులైనవారు ముఖ్యముగా కుమారులు కావలెనని కోరుకొనినట్లు పాత నిబంధనలోని సూచనలవలనఁ దెలియుచున్నను కుమార్తెల నెన్నఁడయినను తృణీకరించిన జాడలు లేనేలేవు. కొడుకులకు ఎనిమిదవ దినమున సున్నతి జేయించిరి (ఆది $17^{11,12}$ లేవీ $12^{3}$). అదేసమయమున నామకరణోత్సవమును జేసిరి (లూ $1^{59}$ $2^{21}$). ప్రథమపుత్రుఁడు దేవునికి ప్రతిష్ఠితుఁడు కావున అర్పణల నర్పించి యతని విమోచించుకొనవలసివచ్చెను (నిర్గ $13^{11-13}$ $22^{29}$ $34^{19,20}$). కులీనులైనవారు తమ బిడ్డలను జూచుటకు దాదులను పెట్టుకొనిరి (II సమూ $4^{4}$). వారికి తగిన విద్యఁ గఱపుటకై మంచి ఉపాధ్యాయుల నియమించిరి (II రాజు $10^{1-8}$). గాని పిల్లలకొఱకైన పాఠశాలలున్న సూచనలగుపడుట లేదు. తండ్రి జీవించి యున్నంత వఱకు ఆస్తి యతని యాధీనము నందుండెను. అతఁడు కాలము చేసిన పిదప దానిని కుమారులు పంచుకొనిరి. జ్యేష్ఠకుమారునికి ఇతరులకు వచ్చినదానికి రెండింతలు వచ్చెను (ద్వితీ $21^{15-17}$). కుమారులులేని పక్షమున దానిని కుమార్తెలకు విభాగించిరి. ఆ యాస్తి యితర గోత్రికులకు చెందకుండునట్లు ఆ కుమార్తెలు తమ గోత్రపు వారితోనే వియ్యమందవలెనను నియమమేర్పడెను (సంఖ్యా $27^{1-11}$ $36^{11-13}$). వివాహమగువఱకు వారు తమ తండ్రి యాధీనమందుండవలెను. (నిర్గ $21^{7}$ లేవీ $19^{29}$). వివాహమైనపిమ్మట ఆమె తన పెనిమిటి కుటుంబమునకు చెందినదిగా నెంచఁబడెను. ఆమె కా కుటుంబపు ఆస్తియందెట్టి హక్కును లేకపోయినప్పటికిని, కుమారులు కలుగక పూర్వమే ఆమె తన పెనిమిటిని పోగొట్టుకొన్న పక్షమున అతని సహోదరులలో నొకఁడామెను వివాహమాడి ఆమెను పోషింపవలెను (ద్వితీ $25^{5,6}$). ఆమె తన తండ్రి యింటికి వెళ్లి అతని యధీనము నందుండవచ్చునని ఆది $38^{11}$ వలనఁ దెలియుచున్నది (పిల్లలు చూ॥).

**5. ఇంటి సేవకులు.** వీరు బానిసలు. యజమానులకు వీరిమీఁద పూర్ణ అధికారమున్నది. వీరు హెబ్రీయులైన యెడల ఏడవ సం॥న వారిని విడిపించవలసి యుండెను (నిర్గ $25^{2-5}$). వారిని పంపివేయునప్పుడు వట్టిచేతులతోగాక ఏమైన నిచ్చి పంపవలయునను నియమముండెను (ద్వితీ $15^{12-14,18}$). తప్పు చేసినప్పుడు వారిని కఠినముగా శిక్షించుటకు యజమానునికి అధికారమున్నను ఆ శిక్షవలన కలుగు నష్టమును కొంతవఱకు యజమానుఁడే సహింపవలసి యుండుటచే (నిర్గ $21^{20,21,26}$) వారిని మితముగానే శిక్షించుటకు జాగ్రత పుచ్చుకొనిరి. తన యజమానుని యొద్దనుండి పాఱిపోయివచ్చిన దాసుని పట్టుకొని మఱల అప్పగింపరాదు (ద్వితీ $23^{15}$). హెబ్రీయులగు దాసులు ఆ కుటుంబికులుగా నెంచఁబడి మతాచారము లన్నిఁటియందు పాలివారైరి (ఆది $17^{27}$ ద్వితీ $16^{11}$). ఆ దాసు లన్యులైనపక్షమున సున్నతి నొంది యూదుల మతములో చేరుటకు వీలుండెను (నిర్గ $12^{44,45}$). సేవకులందఱి యెడల దయగా నుండవలెనను నియమములుండెను ($20^{10}$ మొ॥). వారిలో స్త్రీలను ముఖ్యముగా దయతో చూడవలెను (ద్వితీ $21^{10-14}$). వీటిని బట్టి పాత నిబంధన కాలమునందు బానిసత్వముండినను దానికష్టములను తేలికచేయుటకు తగిన ఏర్పాటులను నియమించినట్లు కనఁబడుచున్నది

**6. పిత్రార్జితము.** ఇశ్రాయేలీయుల కా దేశమును దేవుఁడనుగ్రహించెను. వారిలోని గోత్రములకును గోత్రకుటుంబములకును ఆయన దానినిచ్చెను గాన ఆ కుటుంబముల కది నిత్యస్వాస్థ్యమయ్యెను (ద్వితీ $18^{8}$). ఈ నియమమును రద్దుపరచుటకు రాజులకు సహా వీలుగాక పోయెను (I రాజు $21^{3,4}$). అప్పు తీసికొనుటవలన భూమిని పోఁగొట్టుకొన్నవారు సునాద సంవత్సరమున దానిని మఱల తమ కుటుంబపు సొత్తుగా నొందిరి (లేవీ 25). ఆ సంవత్సరము రాకముందుసహా వారుగాని వారి బంధువులుగాని ఆ యప్పును తీర్చి దానిని విడిపించుకొనవచ్చును.

హెబ్రీ కుటుంబమునందు లోపములుండినను, అప్పటికాలము నందున్న ఇతర జనాంగములతో సరిపోల్చిన యెడల వీరి యేర్పాటులెంతో

శ్రేష్ఠములైనవని యేకగ్రీవముగ నొప్పుకొనవలసి వచ్చును.

**కుట్టుట** వృత్తులు చేతిపనులు III 4 చూ॥

**కుడివైపు, కుడిపార్శ్వము** చేయి 4 చూ॥

**కుదురుబాటు** (Restitution). శాస్త్ర సంబంధముగా విచారించిన యెడల కుదురుబాటు అనునది యీ ప్రపంచములో పాపమును జయించుటను దేవుని రాజ్యమును పూర్ణముగా స్థాపించుటను సూచించు పదమైయున్నది. ఇట్టి యర్థముతోనే పేతురు ఈ మాట నుపయోగించుకొనెను (కార్య 3[21]). ఈ బోధను బోధించునట్టి యితర వాక్యములలో కుదురుబాటు అను మాట లేక పోయినను దాని సంగతి అట్టి యనేక వాక్యములలో నున్నది. మన తెనుగు బైబిలులో దీనికి ప్రపంచ యను మాటనుచేర్చి **ప్రపంచ పునర్జన్మము** అని తర్జుమా చేసిరి. II పేతు 3[13] లోను, ప్రక 21[1] లోను ఇది **క్రొత్త ఆకాశము క్రొత్త భూమియు** నగుట యనఁబడును. ఈ వాక్యములలో యెష 65[17] 66[22] లోని మాటలను ఎత్తి వ్రాసిరి. యుగాంతమున దేవుని రాజ్యము పూర్ణముగా జయమొందునని ప్రవక్త లేక గ్రీవముగా ప్రవచించిరని చెప్పదగును. ఇది లోకాంతమున కలుగునని గురుగులు గోధుమలను గూర్చిన యుపమానములోను (మ 13[39,40]) చేపలు వలన గూర్చిన యుపమానములోను (13[47-50]) క్రీస్తు బహు తేటగా బోధించెను. అట్టి కుదురుబాటు క్రీస్తు రెండవ రాకడకాలములో (19[28]) జరుగుననియు క్రీస్తే దీనిని జరిగించువాఁడుగాని వేరొకఁడు కాదనియు అంతయు క్రీస్తునకు లోఁబడునప్పుడే ఇది నెరవేరుననియు (ఫిలి 2[10,11] I కొరి 15[24-48] ఎఫె 1[10]) చెప్పఁబడియున్నది. ఈ మన యుగమునకు కలియుగ బోధప్రకారముగా ఆచారములన్నియు చెడి నాశనము గతిగ్రై యుండక ధర్మములన్నియు పూర్ణముగా స్థాపింపఁబడు స్థితిగతిరై యుండుటయే క్రైస్తవులమైన మనకు గొప్ప నిరీక్షణను గలిగించు దివ్యసత్యమైయున్నది.

**కుప్ర** (Cyprus). మధ్యధరా సముద్రము యొక్క ఈశాన్య మూలలోనున్న యొక పెద్ద ద్వీపము. అది 140 మైళ్ల పొడవును 5-50 మైళ్ల వెడల్పును గలిగియున్నది. దాని పూర్వపు పేరు కిత్తీము (కిత్తీము చూ॥). ఆ ద్వీపము మీఁద నిలిచి లెబానోను కొండను తౌరసు (*Taurus*) కొండను చూడవచ్చును.

పౌలు బర్నబాలు క్రీ॥ శ॥ 47 వ సంవత్సరమున కుప్రకుఁబోయి అచ్చట క్రైస్తవసంఘములను స్థాపించిరి. వారచట ప్రసంగింపఁగా ఆ ద్వీపమునకు అధిపతియైన సెర్గిపౌలు అనువాఁడు విని నమ్మినప్పుడు గారడీవాఁడైన ఎలుమ వారిని ఎదిరించినందున పౌలు అతని గద్దింపఁగా అతఁడు గుడ్డివాఁడయ్యెను. దాని చూచి ఆ యధిపతి నమ్మెనుగాని క్రైస్తవ సంఘములో బహిరంగముగా చేరనో లేదో రూఢిగా తెలియదు (కార్య 13[6-12]). బర్నబా ఈ ద్వీపములోనే పుట్టెను (4[36]). C.

**కుమారుడు** కుటుంబము 4 చూ॥

**కుమార్తె** కుటుంబము 4 చూ॥

**కుమ్మరి** వృత్తులు చేతిపనులు I 4 చూ॥

**కుమ్మరివాని పొలము** యెరూషలేము B VI 6 చూ॥

**కురుపు** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥

**కురువిందము** (Diamond). యిర్మీ 17[2] యెహె 3[9] జెక 7[12] నందున్న ఈ పదము రత్నముగా నెంచఁబడక దాని గట్టితనమునుబట్టి చెక్కడపు పనిచేయు సాధనమునకు సూచనగానున్నది. దీని అసలు మాటకు వాడి మొనయని శబ్దార్థము. ఈ పదమును పైచెప్పఁబడిన చోట్ల కురువిందమని తెనిఁగించినను సాధారణముగా దానిని **వజ్రమని** తర్జుమా జేసిరి.

**కురేనియు** (Cyrenius, Quirinius). సిరియదేశము నేలిన యొక రోమను గొర్నరు (లూ 2[2]). యోసీఫను వ్రాఁతలవలన ఇతఁడు రోమను గొర్నరనియు, జనాభాలెక్క వేయించెననియుఁ దెలియుచున్నది (పురా 18. 1. 1; 2. 2). గాని అది క్రీ॥ శ॥ 6 వ సం॥న జరిగినట్లు శాస్త్రులు లెక్కించిరి. ఈ విషయమునందు లూకా పొరపడెనని యిదివఱక నేకులు తలంచిరి.

గాని ఈమధ్య రమ్సే (*Ramsay*) యను పండితుఁడు రోమీయులు ప్రతి 14 సం॥ ల కొకమాఱు జనాభా లెక్క వేయించిరని పురాతన శాసనముల నుండి యెత్తిచూపెను. లూకా ఉదాహరించిన ప్రజాసంఖ్య యోసీఫసు వ్రాసినదిగాక దానికి 14 సం॥ లు ముందుగా వేయఁబడినదనియు, కురేనియు రెండుమాఱులు ఆదేశమునకు గొర్నరుగా నియమింపఁబడెననియు అట్టి శాసనములవలన ఆయన రుజువుజేసెను. మొదటవేసినది లూకాయం దుదాహరింపఁబడిన దానికి సూటిగా సరిపడు చున్నది. ఇంతచిన్న సంగతుల యందును లూకా బహు సూటిగా వ్రాయుటను చూడఁగా అతఁడు తాను వ్రాసిన సంగతులన్నియుఁ ఉన్నవి యున్నట్లుగా వ్రాసెననుటకు పూర్ణ ధైర్యము కలుగుచున్నది.

**కురేనే, కురేనీయుఁడు** (Cyrene). ప్రస్తుత ముత్తర ఆఫ్రికాయందు త్రిపొలియని పిలువఁబడుచోట పూర్వమున్న దేశము. దాని యందున్న పీఠభూమియందు క్రీ॥ శ॥ ముందు దాదాపు 631 సం॥ న గ్రీకువారు కురేనేయను పట్టణమును కట్టిరి. అది యారంభమున గ్రీకు వారి పట్టణము. గ్రీకులలో మిగుల ప్రసిద్ధికెక్కినవారిలోఁ గొందఱి జన్మస్థానము. 321 సం॥ నందు మహా అలెక్సందరు రాజ్యములోని దక్షిణభాగమునకు వారసులైన తొలెమీయులు (*Ptolemys*) దానిచుట్టు పట్లనున్న యింక నాలుగు పట్టణములను కలిపి పెంటెపోలి (*Pentapolis* = 5 పట్టణములు) అను పేరుపెట్టి ఐగుప్తుతో చేర్చిరి. వారికాలమునందు అనేకమంది యూదులకది ప్రవాస స్థానమాయెను (పురా 14. 7. 2). క్రీ॥ శ॥ ముందు 117 నందు అది స్వతంత్ర రాజ్యమయ్యెనుగాని 67 సం॥ నందు మఱల రోమీయులచే జయింపఁబడెను. క్రీస్తు సిలువను మోసిన సీమోను అచ్చటినుండి వచ్చిన యూదుఁ డనియూహింపఁ దగును (మ $27^{32}$). కురేనీయులగు యూదులు లిబెర్తీనులతోఁ గలిసి యెరూషలేము నందొక సమాజమందిరమును కట్టించుకొనిరి (కార్య $6^{9}$). అక్కడినుండి వచ్చిన వారిలోఁ గొందఱు ఆది క్రైస్తవులలో నుండిరి ($11^{20}$). వారిలో నొకఁడు లూకియు ($13^{1}$). పాడుశేషములా ప్రదేశమునందు చాలఁ గలవుగాని ప్రస్తుత మచ్చట నున్న అనాగరీకులు వాటిని పరీక్షించనీయరు. ఆ దిబ్బలలో ఎల్కెన్న (*el-kenna*) అనునదే దీని యునికి యనుకొందురు.

కురేనే అను ఈ ప్రాంతము రెండవ ప్రపంచ యుద్ధానంతరము 1949 లో స్వతంత్రత నొందినది.

**కుల్లాయీ** ఆభరణములు 17 చూ॥

**కుశల ప్రశ్నలడుగుట** వందనము చూ॥

**కుష్ఠము, కుష్ఠు** రోగములు చికిత్సలు II 5 (1) చూ॥

**కుళ్లు** (Corruption). మానవులు శరీరాత్మలు గలవారై యున్నారు. చనిపోయిన పిమ్మట వారి శరీరములు కుళ్లి పోవును. కావున ఈ విధముగా కుళ్లు అనునది మరణమునకొక సార్థక నామమాయెను (కీర్త $16^{9}$ భాషాంతరము). కుళ్లు ఒకని పట్టకపోవుట అతఁడు చావునకు లోనైన వాఁడు కాఁడని యర్థమగును. కాఁబట్టి ఆ వాక్యము ($16^{9}$) క్రీస్తునకు సరిపోయి ఆయన పునరుత్థానమును నిర్ధారణ చేయునట్టి వేదవాక్యములో నొకటి యాయెను (కార్య $2^{26-31}$ $13^{34-37}$). I కొరి $15^{12,50,53,54}$ లలో దీనిని **క్షయత, క్షయమైనది** యనుమాటలతో తర్జుమాచేసియున్నారు. క్రీస్తు దానిని జయించి అక్షయతను వెలుఁగులోనికి తెచ్చెను. (II తిమో $1^{10}$). ఇట్లు క్రీస్తుమాత్రముగాక ఆయనద్వార ఆయనభక్తులుకూడ నాశనకరమైన మరణమును క్షయతను కుళ్లును జయించు వారగుదురు (II కొరి $5^{4}$).

## కూ

**కూజా** (Chuza). హేరోదుయొక్క గృహ నిర్వాహకుఁడు. ఇతని భార్యయగు యోహన్న క్రీస్తుకు పరిచర్య జేసినవారిలో నొకతె (లూ $8^{3}$). కనుక కూజా క్రీస్తుకు స్నేహితుఁడై యుండెననవచ్చును. E.

**కూటసాక్ష్యము** అబద్ధము చూ॥

**కూతా** (Cuth, Cuthah). బాబెలు దేశములోని యొక ప్రదేశము ఇదే పేరుగల ఒక

యూరును అచ్చట గలదు. గతించిన 80 సం॥ లలోఁగా బాబెలుకు ఉత్తరమున 15 మైళ్ల దూరములోనున్న ఒక పాడు దిబ్బలో నెబుకద్నెజరు కాలమునుండి యున్న యిటుకలు దొరికినవి. వాటి మీఁద కూతా యను పేరు కనఁబడెను గనుక అవి పూర్వపు కూతాయొక్క శిథిలములేయని ప్రస్తుతకాలపు పండితులు తలంచెదరు. దానికి ప్రస్తుతము టెల్ ఇబ్రాయీము (*Tel-Ibraim*) అను పేరుకలదు. అష్షూరు రాజు సమరయ పట్టణమును దేశమును జయించి దాని జనులను బాబెలు దేశమునకు చెఱగా తీసికొని పోయిన తర్వాత ఆ సమరయ దేశమును సేద్యపఱచుటకును కాపాడుటకును బాబెలు కూతా అవ్వా హమాతు సెపర్వయిము అను ప్రదేశములలో నుండి జనులను పంపించి యిశ్రాయేలీయులకు మాఱుగా అచ్చట నుంచెను (II రాజు 17[24,30]).

**కూను** (Chun). హదదెజెరు ఆధీనమందుండిన ఒక సిరియను పట్టణము. దావీదు దీనిని పట్టుకొనెను (I దిన 18[8]). II సమూ 8[8] లో దీనికి బేరోతై అను మారుపేరుగలదు. లవొది కయ హిలియా పొలిసుల మధ్యనున్న కూనా (*Cuna*) ఇదియై యుండవచ్చును.

**కూపము, నాశకూపము** (Pit). బైబిలులో కూపము అనుమాటచే తర్జుమా చేయఁబడిన అసలు మాటలు వేర్వేఱుగా నున్నవి. కీర్త 55[23] లో నున్నట్లు **నాశకూపము** అని తర్జుమా చేయఁబడిన అసలుమాట బావిని సూచించును. దానిని ఆది 14[10] కీర్త 69[15] లలో **గుంట** యను మాటచే తర్జుమా జేసిరి. దానికి సంబంధముగా I సమూ 13[6] లో **కూపము** అని తర్జుమా చేయఁబడిన యసలు పదమును **గుంట** (ఆది 37[20,22] మొ॥), **గోయి** (నిర్గ 21[33] II రాజు 10[14] మొ॥), **సమాధి** (కీర్త 28[9] 30[3] మొ॥), **బిలము** (యెష 14[19]), **పాతాళము** (యెహె 31[16] మొ॥) అను మాటలచే తర్జుమా చేసిరి. యోబు 33[18] **కూపము** అనుమాట నాశనమును లేక మరణమును సూచించును. ఆ మాటనే 33[18] లో **గోయి** యనియు 33[24] లో **పాతాళము** అనియు, కీర్త 30[8] లో **సమాధి** యనియు, 35[7] లో **గుంట** యనియు భాషాంతరముచేసిరి. ఈ పదము లన్నిఁటిని చూడఁగా నివి సాధారణమైన గుంటలను సూచింప వచ్చును. అయితే అలంకార రీతిగా మాటలాడినయెడల అవి నాశనమును మరణమును పాతాళమును సూచించును. (పాతాళము చూ॥)

**కూబీయులు** (Cubites, Cub, Chub). యెహె 30[5] నందున్న కూషీయులు పూతీయులు లూదీయులు అనువారిలోఁ జెప్పఁబడిన యొక జనము. LXX నందు వీరు లూబీయు లనఁబడిరి. అట్లయినయెడల ఉత్తర ఆఫ్రికాలోని లిబియ యను దేశస్థులై యుండవలెను. కూబీయులను పేరు వ్రాత పొరబాటువలన కలిగినట్లుగా నున్నది.

**కూరాకులు** (Leeks). ఈ పదము సంఖ్యా 11[5] నందు **చిన్న ఉల్లిపాయలని** యుండవలెను. J. C.

**కూలి** (Wages). పనిఁజేసినందుకు కూలి గాని జీతమునుగాని ఏదోయొక వస్తురూపమున నిచ్చుట పురాతన కాలమునుండి వాడుకగా నున్నది (ఆది 29[15,20] 30[28]). ఇశ్రాయేలీయులు ఐగుప్తునందుండఁగా ద్రవ్యరూపమునను వస్తురూపమునను జీతము నొందినట్లు నిర్గ 2[9] వలనఁ దెలియుచున్నది. ధర్మశాస్త్ర ప్రకారమే నాటికూలి ఆనాడే యియ్యవలెను (లేవీ 19[13] ద్వితీ 24[14,15]). కూలినియ్యక దిగఁ బెట్టుకొనినవారిని ప్రవక్తలు ఖండించిరి (యిర్మీ 22[13] మలా 3[5] యాకో 5[4]). క్రీస్తు లోక మందున్న కాలమునందు పలెస్తీనులో దినమునకు 8 అణాల నిచ్చిరి. దానితో నెంత సరకు కొనవచ్చునో బాగుగాఁ దెలియక పోయినను లూ 10[35] వలన అది యెక్కువయై యున్నట్లు కనఁబడు చున్నది. తరువాతి కాలమునందు రోమీయభటులకియ్యబడిన దినభత్యము దాదాపు 5 అణాలై యుండునని రోమీయ గ్రంథకర్తల వలనఁ దెలియుచున్నది.

**కూషన్రిషాతాయిము** (Cushanrishathaim). ఇతఁడు అరామ్నహరాయిము అనఁబడిన మెసపొతేమియకు రాజై న్యాయాధిపతులకాలములో ఇశ్రాయేలీయులను 8 సం॥లు బాధింపఁగా ఒత్నీయేలు అను న్యాయాధిపతి వీనిని జయించెను (న్యాయా 3[8-11]). ఇదితప్ప యితనిని గూర్చి మఱేమియు తెలియదు.

**కూషాయాహూ** కీషీ చూ॥

**కూషీ** (Cushi, Cu-shite = నల్లనివాఁడు).

1. యిర్మీయా కాలములో జీవించిన యెహూది యనువాని పూర్వీకులలో నొకఁడు (యిర్మీ 36[14]).

2. ప్రవక్తయగు జెఫన్యాతండ్రి (జెఫ 1[1]).

3. అబ్షాలోము మీఁద కలిగిన జయమును గూర్చిన వార్తను తెలిపిన యిద్దఱిలో నొకఁడు (II సమూ 18[21-23,31,32]). అసలు భాషనుబట్టి చూడఁగా నిది యితని స్వంత పేరుకాక ఇతని జాతియొక్క పేరని స్పష్టమగును. ఇతఁడు కూషు దేశస్థుఁడగుటచే కూషీ యనఁబడెను.

**కూషు, ఐతియొపియ** (Cush = నలుపు, Ethiopia). హెబ్రీ బైబిలులో ననేక సార్లు చెప్పఁబడిన యొక దేశమునకు పేరు. హెబ్రీ బైబిలులో ఇది నలుపు అనఁబడును. గ్రీకులు ఆ దేశమునకు ఐతియొపియ అను పేరుపెట్టిరి. కాఁబట్టి గ్రీకుభాషలో మొదట వ్రాయఁబడిన క్రొత్త నిబంధనయందు ఐతియొపియ యను మాఱుపేరు మాత్రము ఉపయోగించిరి (కార్య 8[26,27]). పాఁత నిబంధనలో అది యెల్లప్పుడు కూషు అనఁబడును (కీర్త 68[31] యెష 20[3-6] యెహె 29[10] దాని 11[43] నహూ 3[9]).

ఆ దేశములో హాముయొక్క జ్యేష్ఠకుమారుఁడగు కూషువంశస్థులు మొదట నివసించిరి గనుక అతనిపేరు అనఁగా కూషు ఆ దేశమునకు కూడ చెందెను (ఆది 10[6]). వారు ఎత్తును నలుపును గలవారై యుండినందున గ్రీకులు వారిని చూచి కాలిన ముఖము గలవారు అను నర్థమిచ్చు ఐతియొపీయులు అని వారికిని ఐతియొపియ యని వారి దేశమునకును పేరుపెట్టిరి కూషు అను పేరు పాతనిబంధనలో మూఁడు ప్రత్యేకమైన దేశములనుగూర్చి యుపయోగింపఁ బడియున్నది.

1. ఐగుప్తుకు ఆగ్నేయ దిక్కున నున్న దేశము. ప్రస్తుతపు అబిసీనియ (*Abyssinia*) న్యూబియ (*Nubia*) అను దేశములకును స్యూడాన్ (*Sudan*) దేశములోని యుత్తరభాగమునకును ఆ పేరు చెందెను. అవి యెఱ్ఱసముద్రమునకు పశ్చిమమున నుండును.

2. కూషు అనువాని వంశస్థులు. ఎఱ్ఱ సముద్రమును దాటి దాని తూర్పుతీరమునకు కూడ వెళ్లి వాసము చేసినందున యిప్పటి అరబ్బీ దేశములోని ఆ ప్రదేశమునకుకూడ కూషు అను పేరును కొన్నిసార్లు వాడియున్నారు (II దిన 21[16]). అది సముద్రముయొక్క ఓరనుండి నందున కూషు ద్వీపము అని చెప్పఁబడి యున్నది. (సంఖ్యా 12[1]).

3. కూషు కుమారుఁడగు నిమ్రోదు వంశస్థులు ఇంకను తూర్పుకుఁబోయి యుఫ్రాతు, టైగ్రీసు నదుల యొద్దను వాసము చేసినందున ఇప్పటి పారసీ (*Persia*) దేశములోని యా ప్రదేశమునకు కూషు అను పేరు కొన్నిసార్లు ఉపయోగింపఁబడెనని తోఁచుచున్నది (యెష 11[11] యెహె 38[5]). అలాగున ఆది 2[13] లో ఫరాతునది దగ్గరనున్న గీహోనునది కూషు దేశమంతటిని చుట్టు పారుచున్నది అని యున్నది.

ఐగుప్తు దేశమునకు దక్షిణముగానున్న కూషు లేక ఐతియొపియ దేశపు రాణియగు కందాకే యొక్క మంత్రియు ఐతియొపియుఁడునగు నపుంసకుఁడు యెహోవాను ఆరాధించుటకు యెరూషలేమునకు వచ్చి తిరిగి పోవుచుండఁగా ఫిలిప్పు అను సువార్తికుని సంధించి యేసుక్రీస్తును గూర్చి విని నమ్మి బాప్తిస్మము పొందెను (కార్య 8[26-28]).

సంఖ్యా 12[1] లో చెప్పఁబడిన **కూషు ద్వీపస్థురాలగు** నొకస్త్రీ ఎఱ్ఱసముద్రపు తూర్పు టొడ్డున నుండు కూషునుండి వచ్చెనని తోఁచుచున్నది. మోషే భార్యయగు సిప్పోరా మరణమైన తరువాత అతఁడీమెను వివాహము చేసికొనెనని యూహింపవచ్చును. (సిప్పోరా చూ॥).

# కృ

**కృతజ్ఞతార్పణ** అర్పణలు I 3 చూ॥

**కృత్తిక** (Pleiades). వృషభ నక్షత్రరాశి యందుండు ఒక చిన్న రాశిపేరు (యోబు 9[9] 38[31]). ఆమో 5[8] నందాపదమునే ఇంగ్లీషు ననుసరించి **సప్తఋషి నక్షత్రము**లని తెనిఁగించిరి. కంటికి ఆరు మాత్రమే కనఁబడుచుండి

నను ఏడున్నట్లు ఆయాభాషలలో దాని కాపేరును పెట్టిరి. గాని దానిని దుర్భిణిగుండా చూచిన పక్షమున దానియందు దాదాపు నూరు నక్షత్రములు గానవచ్చును.

**కృప, కనికరము, కరుణ, కటాక్షము, జాలి, దయ, దాక్షిణ్యములు, వాత్సల్యత, అంతఃకరణము, అనుగ్రహము (Grace, Mercy, Loving-kindness, Favour, Goodness).** దేవుని కనికరమును సూచించు పదములు తెలుఁగు నందును ఇంగ్లీషునందును ఉన్నట్లు హెబ్రీ భాషయందును అనేకములు గలవు. ఈ భాషలయందున్నట్లే అసలులోను ఆయాపదముల కెప్పుడు నొకటే రీతిగా నర్థము చెప్పక సంగతి సందర్భముల ననుసరించి వాటి కనుకూలముగా చెప్పవలసి యున్నది. మూలభాషయందున్న ప్రతి పదమునకు ప్రత్యేక పదమును వాడుట అసాధ్యమైన యత్నమైయున్నది. బైబిలును తెనిఁగించినవారు ఒకటే భావమిచ్చు పదములకు నొకే తెలుఁగు పదమును వాడినట్లుగాని, ఒకటేమూల పదమును ఏకరీతిగానే తెనిఁగించినట్లుగాని కనుపించుట లేదుగాన పైనుదాహరించిన పదములన్నిఁటిని ఈ శీర్షిక క్రింద వివరింపవలసి వచ్చెను. ఈ వివరమునందు మూలభాషా పదముల ననుసరించితిమి. మూలభాషయందును ఇదివఱకే చెప్పినట్లు ఆ పదములు ఎక్కువగా నుండినందున కొన్ని చిక్కులు తటస్థించుచున్నవి. అయినప్పటికి ఆ పదముల బాహుళ్యమును బట్టియు, బైబిలునందు కృపను గూర్చిన బోధ లెక్కువగా నుండుటవలనను, దాని గూర్చిన బోధ యెంత గొప్పదో కొంతవఱకు గ్రహించుకొన వీలున్నది.

I. పాఁత నిబంధనయందు కృపకు సంబంధించిన మాటలు:—

1. కృపను సూచించుటకు సర్వసాధారణముగా వాడఁబడిన ఖెసెదు (*Hesedh=mercy, goodness, loving kindness*) అను పదము దాదాపు 200 మారులు బైబిలునందు వచ్చును. సాధారణముగా నది దేవుని దయను సూచించినను అప్పుడప్పుడు, మనుష్య లోకరికొకరు చూపించు దయను (న్యాయా 1[24]=ఉపకారము, హోషే 4[1] 6[6]=కనికరము, సామె 20[6]=దయ), మానవులు దేవునియెడల కనపఱచు భక్తిని సహా సూచించుటకు (II దిన 32[32] హోషే 6[4]=భక్తి II దిన 35[26] = భయభక్తులు) వాడఁబడెను. పాఁత నిబంధన కాలము చివరనున్న భక్తులకు యూదులు పెట్టిన ఖసీదీము (*Chasdim*) అను పదము దీని నుండియేకలిగెను. దేవునిదయను సూచించు వాక్యములలో[8] దానిని **కృప** (ఆది 19[19] 24[27] నిర్గ 15[13] 34[7] మొ॥ కీర్త 5[7] 6[4] 13[5] 21[7] 23[6] 26[3] 36[7] 136[1-26] సామె 20[28] యెష 16[5] యిర్మీ 33[11] మొ॥) యని సాధారణముగా తెనిఁగించినను **కనికరము, కనికరించుట** యనియు (ఆది 39[21] నిర్గ 34[6] II సమూ 22[51] I రాజు 8[23] మొ॥), **కరుణ** యనియు (నిర్గ 20[6] జెక 7[9]), **దయ** యనియు (ద్వితీ 5[10] సామె 3[3]), **కటాక్ష**మనియు (I రాజు 3[6] నెహె 1[5]) తెనిఁగించిరి. దేవుని కృపా బాహుళ్యతను సూచించుట కీ పదముయొక్క బహువచన రూపమును వాడిరి. **ఉపకారము** లనియు (ఆది 32[10]) **కృపాతిశయము**లనియు (కీర్త 25[6] 89[49] 107[43] 145[8] యెష 63[7]) తెనిఁగించిరి. ఆ కృపయొక్క గొప్పతనమును **కృపాతిశయము** అనియు (సంఖ్యా 14[19]),దాని విస్తీర్ణతను **కృపాబాహుళ్య**మనియు (కీర్త 69[13]), దాని నిశ్చయతను **శాశ్వత కృప** (యెష 55[3]) యను సమాసములచేఁ దెలిపిరి. దేవుఁడు కృపతో నిండినవాఁడై యున్నాఁడు (కీర్త 86[5]). ఆ కృప యుగయుగములవఱకు నిలుచును (103[17]). అది నిరంతరముండును (138[8]). ఆకాశములకన్న యెత్తయినది (108[4]). దానిని క్రిందనున్న 3 వ మాటతో సమానముగా నుపయోగించి **కరుణాకటాక్ష**మనియు (103[4]). **కరుణ** **వాత్సల్యత** (జెక 7[9]), **కృపావాత్సల్యత**లనియు (యిర్మీ 16[5]), **దయాదాక్షిణ్యము**లనియు (హోషే 2[19]) తెనిఁగించిరి. దేవుఁడు కనికరము గలవాఁడై యున్నందున మనమును కనికరము చూపవలెనని పాఁత నిబంధనయందును ఈ బోధ తెలుపఁబడి యున్నది (4[1] 6[6]). ఆ బోధ క్రొత్త నిబంధనలో బహుతేటగా కనఁబడును (మ 18[23-35].)

2. హెబ్రీ భాషయందు కృపను సూచించు ఖేను (*Hen*) అను మఱియొక సాధారణమైన

మాటను ఆదికాండము మొదలు సమూయేలువఱకు **కటాక్షము** అని తెనిఁగించిరి (ఆది $6^{8}$ $19^{19}$ $32^{5}$ మొ॥ నిర్గ $33^{12,13,16,17}$ $34^{9}$ సంఖ్యా $32^{5}$ న్యాయా $6^{17}$ రూతు $2^{2,10}$). I సమూయేలు మొదలుకొని దాని నొకటే పదముచే తెనిఁగించక **కృప** (I సమూ $1^{18}$ కీర్త $84^{11}$ జెక $4^{7}$), **అనుగ్రహము** (I సమూ $27^{5}$ II సమూ $14^{22}$ $16^{4}$), **దయారసము** (కీర్త $45^{2}$), **దయ** (యిర్మీ $31^{3}$) **అనుకూలుడు** (1 సమూ $20^{3}$) అను వేఱువేఱు పదముల నుపయోగించిరి. దానికి సంబంధించిన మఱియొక రూపముగల పదమును **దయయుంచుట** (యిర్మీ $16^{13}$), **దయ** (సామె $3^{34}$ $21^{10}$ కీర్త $109^{12}$ విలా $4^{16}$), **కనికరము** (కీర్త $102^{14}$) అని తెనిఁగించిరి. క్రింద 3 నందున్న పదముతో కలిపి **దయాదాక్షిణ్యము**లను సమానముగా తర్జుమాజేసిరి (ఎస్తే $2^{17}$ కృప I. చూ॥). ఇది దేవుఁడు మానవుల యెడలఁజూపు కృపను మాత్రమేగాక, మానవు లొకరియెడల నొకరు చూపు దయను సూచించును (ఆది $39^{21}$ నిర్గ $11^{3}$ ద్వితీ $24^{1}$ రూతు $2^{13}$ మొ॥). ఇతరుల యెడల కనఁబఱచు గుణమును మాత్రమేగాక ఒకని యందు కనిపించు సుగుణమునుగాని వాని స్వరూపమునుగాని తెలియఁజేయును. ఈ విధముగా సామె $31^{30}$ నందు **అందము** అని తెనిఁగించిన హెబ్రీ పదమిదియే.

3. రహమీము (*Rahamim*) అను మఱియొక హెబ్రీ పదమును ఈ యర్థమునందే వాడఁబడెను. ఆ పదమునకు కడుపు అని శబ్దార్థము. ప్రేమకును వాత్సల్యమునకును కడుపు ఉనికి యని వారు భావించినందున ఈ పదము నీ విధముగా వాడిరని కొందఱి యభిప్రాయము. ఒక తల్లి గర్భమున జనించిన వారికుండు (=సహోదర) ప్రేమను యీ పదము సూచించునని మఱికొందఱి తలంపు. దీనికి సంబంధముగా మన తెలుఁగు బైబిలునందు కనికరించుట (I రాజు $8^{50}$ II దిన $30^{9}$), జాలిపడుట (విలా $3^{32}$ మీకా $7^{19}$), కరుణ, కరుణించుట (ద్వితీ $13^{18}$ $30^{3}$ యెష $49^{15}$), వాత్సల్యత (కీర్త $78^{38}$ అను పదములను వాడిరి. పైన 2 నందున్న పదముతో సమానముగచేర్చి **దయాదాక్షిణ్యములు** ($86^{15}$ $111^{4}$ $145^{8}$), **కటాక్షమును వాత్సల్యమును** ($112^{4}$) అని ఉపయోగించిరి.

4. ఇట్టి యర్థమునం దుపయోగింపఁబడిన రాచోను (*Ratson*) అను పదమునకు అనుకూలత యని శబ్దార్థము. దానిని ద్వితీ $33^{23}$ సామె $3^{35}$ $12^{2}$ $16^{15}$ $19^{12}$ యెష $60^{10}$ యందు **కటాక్ష**మనియు కీర్త $5^{12}$ $30^{5,7}$ $89^{17}$ సామె $14^{9}$ నందు **దయ** యనియు తెనిఁగించినను $11^{27}$ నందు **ఉపయుక్తమైన క్రియ** యనియు, $18^{22}$ నందు **మేలు** అనియు, $14^{35}$ లో **ఇష్టుఁడనియు** తర్జుమాచేసిరి. II సమూ $20^{11}$ కీర్త $41^{11}$ లో నున్న ఇష్టుఁడను అర్థమిచ్చునది ఖాఫేచ్ = (*Haphets*) అనునది మఱియొక హెబ్రీ పదమై ఒకనియం దానందించుట యని యర్థమిచ్చును.

5. నాలుగవ మాటకు సంబంధముగానున్న టోబు (*Tob*) అను మఱియొక మాటను దేవుఁడు చూపు కృపను గూర్చి వాడిరి. అది మేలు చేయు బుద్ధినిగాని అట్టిబుద్ధిచే చేయఁబడు మేలునుగాని సూచించును. కీర్త $65^{11}$ నందు దీనికి **దయ** అను పదము నుపయోగించినను, సాధారణముగా **మేలు** అని తెనిఁగించిరి (నిర్గ $18^{9}$ II సమూ $7^{28}$ I దిన $17^{26}$ I రాజు $8^{66}$ II దిన $6^{41}$ $7^{10}$ కీర్త $107^{9}$). పైనున్న వాక్యములలో నది దేవుఁడు చేయుమేలును సూచించినను సంఖ్యా $10^{32}$ నందు మానవులుచేయు మేలునుకూడ సూచించును. అట్లే న్యాయా $8^{35}$ నందు నున్నదిగాని అచ్చటాపదమును **ఉపకారమ**ని తెనిఁగించిరి. I సమూ $2^{26}$ నందు సమూయేలు దేవునికిని మానవులకును **అనుకూలు**డాయెనను వాక్యములో నిదే పదము వాడఁబడెను. అది మేలు చేయువాని దయను మాత్రమేగాక ఆ దయవలన కలిగిన ఫలితమును సూచించును. ఇట్లది **క్షేమము** (కీర్త $23^{6}$ $39^{2}$) **శ్రేయస్కరము** ($21^{3}$), **క్షేమాధారము** ($16^{2}$), **సదుపాయము** ($68^{10}$) అను పదములచే తెనిఁగించఁబడెను. ఈ పదమునే సృష్టి వివరమునందు **బాగుగనుండెను** (ఆది $1^{31}$) అని తర్జుమా చేసిరి.

II. క్రొత్త నిబంధన యందున్న మాటలు:—

1. దీనిని సూచించు పదము లనేకములుండినను గల $5^{22}$ ఎఫె $5^{9}$ నందు **మంచితనము** అని

తెనిఁగించఁబడిన మాట పాఁతనిబంధనయందున్న వాటిలో పైనఉన్న 5 కు సంబంధించినదై యున్నది. ఇచ్చట మంచితనమనఁగా దయయని తెలిసికొనవలెను.

**2. అనుగ్రహము** అని రోమా $2^{4}$ $11^{22}$ నందు తెనిఁగించిన గ్రీకుపదము II కొరి $6^{6}$ తీతు $3^{4}$ నందు **దయ** అనియు గల $5^{23}$ కొలొ $3^{12}$ నందు **దయాళుత్వము** అనియు తెనిఁగించిరి.

3. హెబ్రీ $10^{34}$ నందు **కరుణించుట**యని తెనిఁగించిన గ్రీకుపదము I పేతు $3^{8}$ నందు **ఒకరి సుఖదుఃఖముల యందొకరు పాలు పొందుట** యని తెనిఁగించిరి. హెబ్రీలో నున్నట్లుగా నిది యితరుల కష్టములలో పాలు నొందు దయను సూచించు మాటయై యున్నది. హెబ్రీ $4^{15}$ నందు ఆ యసలు మాటనే **సహానుభవము** అని తెనిఁగించిరి.

4. క్రీస్తు కనఁబఱచిన కనికరము తెలుపుటకు సువార్తలయందు మఱియొక గ్రీకుపదము వాడఁబడెను (మ $9^{26}$ $14^{14}$ $18^{27}$ $20^{34}$ మా $1^{41}$ $6^{34}$ $8^{2}$ $9^{22}$ లూ $7^{13}$ $15^{20}$). అది పైనున్న పాఁతనిబంధన మాటలలో 3 వ దానికి సంబంధించినది. జాలి కడుపులోనుండి వచ్చునని వారభిప్రాయపడినట్లు ఆ పదముయొక్క శబ్దార్థమువలనఁ దెలియుచున్నది. అది ముఖ్యముగా జాలిని సూచించును మంచి సమరయుని గూర్చిన ఉపమానమునందు దానిని **జాలిపడుట** యని తెనిఁగించిరి (లూ $10^{34}$). **కనికరము చూపుట** యని I యోహా $3^{17}$ నందును, **అంతఃకరణ**మని II కొరిం $6^{12}$ $7^{15}$ నందును, **ప్రాణమువంటి వాడు** అని ఫిలె 12 లోను, **హృదయ**మని 20 నందును తెనిఁగించిరి. ఇవన్నియు గొప్ప ప్రేమను సూచించుటకు వాడిన పదములై యున్నవి.

**5. జాలిచూపుట** యని రోమా $9^{15}$ నందు అర్థమిచ్చు మఱియొక గ్రీకుమాట పైనున్న దాని వలె పాఁత నిబంధనలోని పదములలో 3 వ దానికి సంబంధించినదై ఆ యర్థమునే యిచ్చును. ఆ ధాతువుయొక్క కృదంతమును రోమా $12^{1}$ నందు **వాత్సల్యత** యనియు హెబ్రీ $10^{28}$ నందు **కనికరమ**నియు తెనిఁగించిరి. ఆ పదమునే II కొరి $1^{3}$ నందు **కనికరము** చూపు తండ్రి యని యున్నది. దీనిని పై మాటతోఁ గలిపి **జాలిగల మనస్సు** (కొలొ $3^{12}$), **దయారస వాత్సల్యములు** (ఫిలి $2^{1}$), **జాలి కనికరము** (యాకో $5^{11}$) అను సమాసములుగా నుపయోగించిరి. ఈ పదము (లూ $6^{39}$) నందు దేవుని గూర్చియు మానవులనుగూర్చియు వాడఁబడెను.

6. పైనున్న వాటికన్న నీ దిగువనున్న రెండు పదములను క్రొత్త నిబంధనయందు ఎక్కువగా వాడిరి. వాటిలో నొకటి I తిమో $1^{2}$ II తిమో $1^{2}$ తీతు $1^{4}$ యూదా 2 నందున్న ఆశీర్వచనముల యందు **కనికరము** అని తెనిఁగించిరి. ఇట్లు దేవుఁడు చూపెడి కనికరమును గూర్చిన సూచనలు మ $9^{13}$ $12^{7}$ రోమా $9^{15,16}$ $11^{30}$ I కొరిం $7^{25}$ నందుఁ గలవు. దేవుఁడు మానవులను రక్షింపనై చూపుచున్న దయ యిదియే (తీతు $3^{5}$ లూ $1^{54}$ రోమా $15^{9}$ ఎఫె $2^{4}$). యూదా 21 నందది, అంత్య దినమందు క్రీస్తు పాపులయెడల చూపించు కనికరమును సూచించును. మానవులును ఒకరియందొకరు చూపవలసిన కనికరమును కనఁబఱచును (మ $23^{23}$ యాకో $2^{13}$ $3^{17}$ మొ॥). మానవులయందు ఇది ముఖ్యముగా రోగుల యందును (మ $9^{27}$ $15^{22}$ $17^{15}$ $18^{33}$ మొ॥), బీదలయందును చూపు దయకు ఉపయోగించిరి. బీదలయందుంచు దయను సూచించుటకు వాడఁబడిన పదము ధర్మము అను నర్థమిచ్చును (మ $6^{3}$ లూ $11^{41}$ $12^{33}$ కార్య $3^{2}$).

7. కనికరమును చూపుటకు వాడఁబడిన పదము లన్నిఁటిలో సర్వ సాధారణమగు గ్రీకు పదము **కృప**యని తెనిఁగించఁబడెను. క్రొత్త నిబంధనయందు కృప యను పదము కనఁబడిన చోట్ల యందంతట ఆ మూలపదము వాడఁబడి యున్నది. క్రొత్త నిబంధనయందది 200 కన్న ఎక్కువ మారు లుపయోగింపఁబడి యున్నది. (యోహా $1^{14,16,17}$ కార్య $11^{23}$ $13^{43}$ రోమా $1^{5,7}$ $3^{24}$ $4^{16}$ మొ॥). లూ $1^{28}$ $2^{40}$ కార్య $2^{46}$ $7^{10,46}$ $25^{3}$ నందు **దయ** అనియు, రోమా $4^{4}$ నందు **దానమ**నియు తెనిగించఁబడినది. ఇది సువార్తల యందు గాక, పత్రికలయందు విశేషముగ వాడఁబడి యున్నది. ప్రతి పత్రిక ఆరంభమందును అంతమందునుండు ఆశీర్వచనములలో కృప యను నీ పదము గలదు. ఇది **దైవకృప** యనియు

(కార్య $4^{33}$), **క్రీస్తుకృప** యనియు (గల $1^{6}$) అనఁబడును. II థెస్స $1^{11}$ నందు ఈ రెంటిని చూడవచ్చును. విశ్వాసము కృపవలన కలుగును (కార్య $18^{27}$). రక్షణ కృపాదానమే (ఎఫె $^{5,8}$ II తిమో $1^{9}$). రక్షణ నొందువారు దాని చేతనే నీతిమంతులని తీర్చఁబడెదరు (రోమా $3^{24}$). కృప యేర్పాటువలననే అది కలుగును ($11^{5}$). కృప చేతనే రక్షణకు పిలువఁబడెదరు (గల $1^{15}$). అది మనలను బలపఱచును (II తిమో $2^{1}$). ఆదరించును (II థెస్స $2^{16}$). మనము కృపను పొందఁగలము (హెబ్రీ $12^{15}$). అందులో వృద్ధినొందెదము (II పేతు $3^{18}$). కృపా సహితముగా పాడెదము (కొలొ $3^{16}$). మాట్లాడెదము ($4^{6}$). దానిని దుర్వినియోగ పఱచి (యూదా 4), నిరర్థకపఱచి (గల $2^{21}$), తిరస్కరింపఁగలము (హెబ్రీ $10^{29}$). దానిలో ప్రవేశింపఁగలము (రోమా $5^{2}$). దాని నుండి తొలిగి పోఁగలము (గల $2^{21}$). దేవుఁడు పాపులను రక్షించుటకు చూపెడి గొప్ప దయకు పెట్టిన పేరు ఇదే యని పైవాక్యములవలన తేటగాకనఁబడును. దేవుఁడు దానికి ఉత్పత్తియై యున్నాఁడు. (I పేతు $5^{10}$). ఆయన సింహాసనము కృపాసనమై యున్నది (హెబ్రీ $4^{16}$). ఆయన తన కృపను క్రీస్తు మరణము ద్వారా కనఁబఱచెను ($2^{9}$). దాని నాయన దీనుల కనుగ్రహించును (I పేతు $5^{5}$). దానిని పొందిన వారు ఆయన కృప విషయమైన గృహ నిర్వాహకులై యున్నారు (I పేతు $4^{10}$). కనుక ప్రస్తుత కాలము కృప విషయమగు నిర్వాహకత్వపు కాలమైయున్నది (ఎఫె $3^{2}$). కృప యొక్క మహత్త్వ మనేక వాక్యములలో ననేక రీతులుగా నగపడును. అది అత్యధికముగా విస్తరించెను (I తిమో $1^{14}$) గనుకనే యది **కృపా బాహుళ్య** మనఁబడును (రోమా $5^{17,20}$). దాని విలువనుబట్టి **కృపా మహదైశ్వర్యమను** పదము వాడుకలోకివచ్చెను (ఎఫె $1^{7}$ $2^{6}$). ఆ కృపా మహిమకు కీర్తి కలుగును ($1^{6}$).

ముగింపు. కనికర మెంత ముఖ్యవిషయమో పైనుదాహరించిన వాక్యములవలన స్పష్టముగా కనఁబడుచున్నది. మానవు లొకరియెడల మరొకరు చూపుకొనవలసిన ముఖ్యగుణమని తేటయగుచున్నది. దీనివలననే వారు దేవుని యనుచరులు కాఁగలరు. దేవుఁడు చూపు కరుణ చేత గాక వేఱు రీతిగా రక్షణ సిద్ధించదను సిద్ధాంతమును పాత నిబంధన యాచారములు ఘోషించుచున్నవి. క్రీస్తు అవతారము, ఆయన శ్రమ మరణాదులవలన నది మఱింత తేట యయ్యెను. కృపను గూర్చి మనము గంభీరముగాఁ దలంచుచుండఁగా, కృపా సహితుఁడగు దేవుని ఘన పఱచు చున్నామని తెలిసికొనవలసి యున్నది. రక్షణ నొందుట కెంత మాత్రమును యోగ్యులము కానివారమై దేవుని కృపవలన మాత్రమే దాని నొందఁగలుగుచున్నాము. కావున నీ భాగ్యము నిమిత్తము క్రొత్తనిబంధనను వ్రాసినవారు నిత్య స్తోత్రముల నర్పించిరి (ప్రేమ చూ॥).

**కృపా వరములు (Spiritual Gifts).** ఇది అసలు గ్రీకుభాషలో ఒక విశేషమాటయై యున్నది. పరిశుద్ధాత్మ మానవులకునిచ్చు విశేష శక్తుల నిది సూచించును. దీనికి సంబంధించిన వాక్యములలో ముఖ్యమైనవి కార్య $2^{1-13}$ రోమా $12^{6-8}$ I కొరి 12,13,14, ఎఫె $4^{7-81}$ I పేతు $4^{10-11}$ నందున్నవి. మనమీ వాక్యము లన్నిఁటిని పరీక్షింపఁగా కొన్ని వరములను అద్భుతములనుగా నెంచవలసియుండును. అవేవియనఁగా, నానా విధ భాషలతో మాటలాడుట, భాషల అర్థము చెప్పుట, స్పష్టపరచుట, అద్భుత కార్యములను చేయుట, ప్రవచించుట (I కొరిం $12^{8-11}$), దయ్యములను వెళ్లఁగొట్టుట (మా $16^{17}$ కార్య $16^{18}$ $19^{12}$), తప్పు చేసిన వారిని అద్భుతముగా శిక్షించుట ($5^{1-11}$ $13^{9-12}$ I కొరి $4^{21}$ $5^{5}$) మొదలగునవి వీటిలో మఱికొన్ని దేవుని ఆత్మచేత శుద్ధపఱచఁబడినవారిలో నుండు సాధారణ శక్తులు అనవచ్చును. అవేవియనిన, బోధించుట, హెచ్చరించుట, పంచిపెట్టుట, పై విచారణ చేయుట, కరుణించుట, (రోమా $12^{8}$), క్రీస్తుప్రభువని యొప్పుకొనుట (I కొరి $12^{3}$), ఉపకారములు చేయుట, ప్రభుత్వముచేయుట (రోమా $12^{8}$), ఆశానిగ్రహము (I కొరి $7^{7}$) అను నిట్టివి. ఇవి అద్భుతములుగా నెంచఁబడక పోయినను రోమా $12^{6-8}$ లోను I పేతు $4^{10}$-11 లో నున్నవి చాల మట్టుకు వీటిలో చేరియున్నవి. ఈ సాధారణ వరములు ముఖ్యములైనవని వీటినిగూర్చిన వేద వాక్యములవలనఁ దెలియును. అద్భుతములకు

సంబంధించినవి తత్కాలము కొఱకైనవి కాని ఇవి ఆత్మీయములును నిత్యమైనవియునై యున్నవి.

**కృష్ణవర్ణము** రంగులు వర్ణములు 2 చూ॥

## కె

**కెంక్రేయ** (Cenchreae). కొరింథు పట్టణము భూసంధిమీఁదఁ గట్టఁబడినందున దానికి తూర్పు పడమరలయందు రేవు పట్టణములు గలవు. కెంక్రేయ తూర్పున 9 మైళ్ల దూరమందున్న రేవై యున్నది. పౌలు తన రెండవ ప్రయాణమునందు దానిని దర్శించి, అచ్చట తన మ్రొక్కుబడి తీర్చుకొని ఓడయెక్కి ఎఫెసుకు వెళ్లెను (కార్య 18[18]). అచ్చట నొక సంఘమున్నట్లును అందు ఫీబే యను నామె పరిచారకురాలైనట్లును రోమా 16[1] వలనఁ దెలియుచున్నది. ఆ పట్టణము ప్రస్తుత కాలము దనుక నిలిచియున్నది గాని పూర్వమంత పెద్దదిగా లేదు. ప్రస్తుతమున దానిని కిక్రిస్ (*Kikris*) అని పిలుతురు. (పటము V, F 4).

**కెంపు** రత్నములు 3 చూ॥

**కెజీయా** (Keziah = ఒక విధమైన చెట్టు). యోబు శ్రమలకు పిమ్మట అతనికి పుట్టిన రెండవ కుమార్తె (యోబు 42[14]).

**కెతూరా** (Keturah = సుగంధ ద్రవ్యము). అబ్రాహాము భార్యలలో నొకతె (ఆది 25[1-4] I దిన 1[32,33]). శారామరణమునుగూర్చిన చరిత్రకు పిదప నీమె సంగతి వ్రాయఁబడినను ఆమె శారా జీవించిన కాలమునందే అబ్రాహామునకు భార్యయైనట్లూహింప వీలున్నది. ఇట్లు ఒకరి చరిత్రను సాంతముగాఁ దెలిపిన పిమ్మట మఱియొకరి సంగతిని దెలుప నారంభించుట ఆదికాండపు శైలియై యున్నది. ఈమెవలన అబ్రాహామునకు కలిగిన కుమారులు అరబ్బీయులలో 16 గోత్రములకు పూర్వికులైరి. మక్కా (*Mecca*) దగ్గిఱపూర్వము కటూర (*Qatura*) అను నొక గోత్రముండినట్లు గ్రంథకర్తలు వ్రాసియున్నారు.

**కెదమా, కెదెమా** (Kedemah = తూర్పు దిక్కున). ఇష్మాయేలు సంతతి వారిలో నొక తెగవారికి పేరు (ఆది 25[15] I దిన 1[31]) లలో తప్ప ఈ పేరు బైబిలులో మఱి యెచటను లేదు. ఈ పేరుల గుణితము దినుఁగున వేఱుగా నుండినను అసలు భాషలో అది ఒకటే రీతిగా నున్నది (కద్మోనీయులు చూ॥).

**కెదెషు** (Kedesh = పరిశుద్ధమైనస్థలము).

1. యూదయదేశపు దక్షిణభాగమందున్న ఒక యూరు (యెహో 15[23]). దాని యునికిని గూర్చి తెలియదు గాని కొందఱు అది కాదేషు బర్నేయకు వేఱుగా నున్నదనుకొందురు (కాదేషు బర్నేయ చూ॥).

2. ఇశ్శాఖారు గోత్రములో నుండు ఒక యూరు (I దిన 6[72]). యెహో 21[28] లో దానికి కిష్యోను అను పేరున్నది కావున I దిన 6[72] లో కెదెషు అని పొరబాటుగా వ్రాయఁబడె ననుకొనవచ్చును (కిష్యోను చూ॥).

3. నఫ్తాలికెదెషు అనఁబడు మూఁడవ కెదెషు (న్యాయా 4[6]). నఫ్తాలీగోత్ర భూమిలోనున్న ఒక యూరు. అది యెహో 12[22] 19[37] న్యాయా 4[9-11] II రాజు 15[29] లో కెదెషు అనఁబడును. అది లేవీయుల పట్టణములలో నొకటియు (యెహో 21[32]) ఆశ్రయపురము లొంటిలో నొకటియునై యున్నది (20[7]). బారాకు ఈ యూరివాఁడు (న్యాయా 4[6]). పెకహు ప్రభుత్వ కాలములో అష్షూరు రాజగు తిగ్లత్పిలేసెరు దీనిని జయించెను (II రాజు 15[29]). ప్రస్తుతము గలిలయలోని కెదెసు (*Kedes*) దీని యునికియై యున్నది. మేరోము సరస్సుకు వాయువ్యముగా 4½ మైళ్ల దూరమందున్నది. (పటము IV, E 5).

**కెదేమోతు** (Kedemoth = పురాతన స్థలములు). యొర్దానుకు తూర్పుగా అరణ్యమునకు సమీపమున నుండు నొక యూరు (ద్వితీ 2[26]). అది రూబేనీయులకు స్వాస్థ్యమయ్యెను (యెహో 21[37] I దిన 6[79]).

**కెనన్యా** (Chenaniah = యెహోవా స్థిరుఁడు). దావీదు ఓబేదెదోము ఇంట నుండి మందసమును యెరూషలేమునకు తీసికొని వచ్చుచుండఁగా దాని మోయువారికి మోఁత క్రమము నేర్పుట కేర్పాటు చేయఁబడిన యొక లేవీయుఁడు (I దిన 15[22-27]). ఇతఁడు ఇశ్రాయేలీ

యులకు శేఖకులుగాను న్యాయాధిపతులుగాను నియమింపఁబడిన వారిలో నొకఁడు ($26^{29}$).

**కెనయనా** (Chenaanah = కనాను అను పదముయొక్క స్త్రీలింగ రూపము).

1. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $7^{10}$).

2. అహాబు కాలములో అబద్ధ ప్రవక్తయై యుండిన సిద్కియా యను వాని తండ్రి (I రాజు $22^{11}$ II దిన $18^{10}$).

**కెనయా** గంధవర్గము I 10 చూ॥

**కెనాతు** (Kenath = స్వాస్థ్యము). యొర్దానుకు తూర్పుననున్న పలెస్తీనుకు ఈశాన్య దిక్కున నుండు ఒక యూరు. అది దెకపొలిలో (=పది పట్టణములు) అన్నిఁటికంటె తూర్పుగా నుండెడిది. మనష్షేగోత్రములోని నోబహు అనువాఁడు దాని జయించి దానికి నోబహు (*Nobah*) అను పేరు పెట్టెను (సంఖ్యా $32^{42}$). దీనికి క్రొత్త పేరుండినను పాఁత పేరును కూడ ఉపయోగించుచుండిరి. దీని చుట్టు పట్లనుండు అన్యజనులు దీని నిశ్రాయేలీయులయొద్ద నుండి అపహరించిరి (I దిన $2^{23}$). ప్రస్తుతము గొప్ప పాడు శేషములుగల కనావత్ (*Kanawat*) అను చోటు దీని యునికియై యున్నదని కొందఱనుకొనుచున్నారు.

**కెనానీ** (Chenani = స్థిరుఁడు). లేవీయులలో నొకఁడు. యెహోవాను హత్తుకొని యుండునట్లు నిబంధన చేయుటకై నెహెమ్యా కాలములో ఇశ్రాయేలీయులను ప్రేరేపించిన వారిలో నితఁ డొకఁడు (నెహె $9^{4}$).

**కెనిజీయులు, కెనెజీయుడు,** (Kenizzites).

ఏశావు సంతతి వారిలో నొక తెగవారు. (ఆది $36^{11,15,42}$ I దిన $1^{36-53}$). కాలేబు (సంఖ్యా $32^{11}$ యెహో $14^{6,14}$) ఒత్నీయేలు ($15^{17}$ న్యాయా $1^{13}$) అను వారు కెనిజీయులలో చేర్చఁబడిరి. ఎదోమీయుల తెగవారిలో నొక భాగము యూదాలో చేర్చఁబడియున్నట్లు ఇందు వలన నూహింపదగును (కెనజు చూ॥).

**కెపరమ్మోని** (Chephar-ammoni = అమ్మోనీయుల యూరు). బెన్యామీనీయుల యూళ్లలో నొకటి (యెహో $18^{24}$). ప్రస్తుతము శేతేలు దగ్గఱనుండు కెఫరాన (*Kefer' Ana*) దీని యునికియై యుండవచ్చును (పటము III, F 5).

**కెఫీరా** (Chephirah = ఊరు). హెబ్రీయులతో సంధి చేసికొనిన హివ్వీయుల నాలుగు, ఊళ్లలో నొకటి (యెహో $9^{17}$). అది పిమ్మట బెన్యామీనీయుల వశమయ్యెను ($18^{26}$). చెఱ కాలమునకు తరువాత అది తిరిగికట్టఁబడెను (ఎజ్రా $2^{25}$ నెహె $7^{29}$). ప్రస్తుతము గిబియోనుకు నైరృతిదిక్కుననుండు కెఫీరా (*Kefirah*) దీని యునికియై యుండవచ్చును (పటము II, E. 1).

**కెబారు** (Kebar). యుఫ్రాతు నదిలోకి పాఱుచుండిన యొక ఉపనది యని పూర్వము కొందఱనుకొనిరి. అట్లయినయెడల ఇది మెసపొతేమియ యుత్తరమున నుద్భవించి దక్షిణముగా ప్రవహించి యుఫ్రాతులో పడినదై యుండెను గాని నవీన కాలములో కబరు అను కాలువ బబులోను దేశపు దక్షిణ భాగమందున్నట్లు రాతి శాసనములవలనఁ దెలియును. అట్టి కాలువలు బబులోను దేశములో చాల యున్నవి. ప్రస్తుతము కబరు పేరుచే పిలువఁబడునదీ కెబారునదియే యనుటకు సందేహము లేదు. ఇది నిప్పూరు అను పట్టణమునకు తూర్పుగానుండెను. యూదులు మొదట చెఱపట్టఁబడినప్పుడు అనేకుల నచట నుంచిరి (యెహె $1^{3}$) యెహెజ్కేలు ప్రవక్త అచటనుండి కొన్ని దర్శనములను చూచి ప్రవచించెను ($1^{3}$ $3^{15,23}$ $10^{15,20}$).

**కెమూయేలు** (Kemuel = దేవుని సభ?).

1. అబ్రాహాము సహోదరుఁడైన నాహోరు కుమారులలో నొకఁడు. ఇతఁడు అరాముకు తండ్రి (ఆది $22^{21}$).

2. ఎఫ్రాయిమీయులలో నొక ప్రధాని (సంఖ్యా $34^{24}$). కనాను దేశమును విభాగించుట కేర్పాటయిన 12 మందిలో నొకడు.

3. లేవీయుల ప్రధానియగు హషబ్యా తండ్రి (I దిన $27^{17}$).

**కెమోషు** (Chemosh) = జయశాలి?) మోయాబీయుల దేవత (సంఖ్యా $21^{29}$ యిర్మీ $48^{7,13,46}$). అమ్మోనీయులును దీని నారాధించిరి

(న్యాయా $11^{24}$). ఈ దేవతారాధనము సొలొమోను ద్వారా యెరూషలేము లోనికి వచ్చెను (I రాజు $11^{7}$) గాని యోషీయా దీనిని నిర్మూలముజేసెను (II రాజు $23^{13}$). ఈ పూజయందు నరబలినికూడ చెల్లించెడివారు ($23^{27}$). ఒక నల్లని నక్షత్రము నీ దేవతకు గుఱుతుగా నిలిపి దాని నారాధించి, తలను కప్పుకొనకను, సూదితో కుట్టిన వస్త్రములను ధరింపకను తిరిగెడి వారని యూదుల ఐతిహ్య మొకటి గలదు. ఈ దేవతారాధనము చాలమట్టుకు అరబ్బుల విగ్రహారాధన వంటిదిగా నున్నది. మొలెకు ఆరాధనకు సంబంధించినట్లుగా నున్నది (I రాజు $11^{7}$). ఇది శనిగ్రహముగాని దానికి సంబంధించినది గాని యైయుండునని అభిప్రాయపడుచున్నారు.

B.

**కెయీలా** (Keilah). యూదాదేశమందలి షెఫేలా యనఁబడినమన్యములోనున్న ఒక యూరు (యెహో $15^{44}$). దావీదు ఫిలిష్తీయులను జయించి వారిచేతినుండి దీని తప్పించెను గాని ఆయూరివారొకవేళ తనను సౌలున కప్పగింతురేమోయని అచట దిగక దాని విడిచి వెళ్లెను (I సమూ $23^{1-13}$). చెఱకాలమునకు తరువాత ఇశ్రాయేలీయులీ యూరిని తిరిగికట్టి యచట నివసించు చుండిరి (నెహె $3^{17}$). ప్రస్తుతమునన్న కెర్బెత్ కీలా (*Kherbet Kila*) యనునదే దీనియునికియై యుండవచ్చును. అది హెబ్రోనుకు ఒక ఆమడ వాయువ్యముగా నున్నది (పటము II, C 2).

**కెరాను** (Cheran = సితారా). ఎదోమీయులలోని శేయీరు కుమారులలో నొకఁడు (ఆది $36^{26}$ I దిన $1^{41}$).

**కెరీతు** (Cherith = లోయ). యొర్దానులోకి పారుచున్న యొక ప్రవాహము. ఏలీయా ఇచటనే దాగుకొనెను (I రాజు $17^{1-6}$). ఇది యొర్దానుకు తూర్పుననున్నదో పడమటనున్నదో రూఢిగా తెలియదు.

**కెరీయోతు** (Kerioth = పట్టణములు). మోయాబు పట్టణములలో నొక ప్రధాన పట్టణము (యిర్మీ $48^{28}$ ఆమో $2^{2}$). యిర్మీ $48^{41}$ లో నీపేరు కోటలు అను మాటతో తెనిఁగించి యున్నారు. దీని సరియైన యునికినిగూర్చి తెలియదు.

**కెరీయోతు హెబ్రోను హాసోరు చూ॥**

**కెరూబులు** (Cherubim = బలముగల.) దూతలలో నొక తరగతి. బైబిలునందు వీరిని గూర్చిన సూచనలు 4 మాత్రముగలవు. *1.* ఆదాము హవ్వలను వారిని ఏదేను తోఁటలోనుండి వెళ్లఁగొట్టిన పిమ్మట జీవవృక్షమునకు పోవుమార్గమును కాఁయుటకు నియమింపఁబడిన వారు ఈ దూతలే (ఆది $3^{24}$). 2. గుడారమును కట్టినప్పుడు నిబంధన మందసము మీఁదనుంచిన బంగారపు ప్రతిమలను (నిర్గ $25^{18}$ మొ॥), తెరలమీఁద కుట్టిన చిత్రరూపములను ($26^{1}$) కెరూబులని పిలిచిరి. 3. సొలొమోను కట్టించిన దేవాలయమందలి మందసము మీఁది రెండు బంగారపు ప్రతిమలకును (I రాజు $6^{23-28}$ II దిన $3^{7-13}$), దేవాలయపు ఉపయోగార్థమై నీటినుంచు తొట్లక్రిందనుంచఁబడిన స్తంభముల పలకలమీఁద చెక్కిన రూపములకును (I రాజు $7^{29,36}$), ఆలయములోని తెరలమీఁద నున్న చిత్రరూపములకును (II దిన $3^{14}$) కెరూబులను పేరు పెట్టిరి. 4. యెహెజ్కేలుకు కలిగిన దర్శనమునందు కెరూబులు కనఁబడెను (10, $11^{22}$ $41^{18-25}$). ఒక్కొక్క కెరూబున కొక్కొక చక్రముండెను. నరుని ముఖమును సింహపుముఖమును ఎద్దుముఖమును గరుత్మంతుని ముఖమును ఒక్కొక్క కెరూబున కుండెను. యెహె 1 లో కెరూబులను పదములేక పోయినను వాటిని గూర్చిన సూచనలున్నవి. వీరు దేవుని సింహాసనమున కాధారులై యున్నారుగాన జీవరాసియంతటిలో నేవి మిగులబలముగలవో వాటి ముఖములను కలిగియుండెను. ప్రక $4^{6-8}$ నందుదాహరించిన దేవుని సింహాసనము చుట్టునున్న జీవులు నట్టివే.

ఈపై నాలుగు విధములగు వాక్యములందున్న కెరూబులన్నిఁటికి ఒకటే విధమగు రూపము లున్నట్లు తోఁచదు. మొదటివాటికి దూతల రూపములున్నట్లున్నది. మందసము మీఁదనుండుటచే దేవుఁడు కెరూబుల మధ్యనివసించుచున్నట్లుగా ఆయా వాక్యములలో అలంకార రీతిగా నున్నది (II రాజు $19^{15}$ I దిన $13^{6}$ కీర్త $80^{1}$ $99^{1}$ యెష $37^{16}$ మొ॥). ఆయన కెరూబులమీఁద నెక్కి ఎగిరెనను వాక్యమువలన (కీర్త $18^{10}$ II సమూ

22[11]) వారికి రెక్కలుగలవని ఊహింపవచ్చును. గుడారమందును ఆలయములోనున్న కెరూబు లిట్టివేగాని యెహెజ్కేలు గ్రంథములోని రూపములు వేగిరమును బలమును సూచించును. ఆత్మ స్వరూపములగు దూతలకిట్టి రూపముల నారోపించుట వాటి గుణలక్షణములను సూచించెడి రూపములేగాని వాటి స్వరూపములని తలంచరాదు.

**కెరంహప్పుకు** (Keren-Happuch = కండ్లకాటుక). యోబు శ్రమలు గడచిన పిదప అతనికి కలిగిన చివరికుమార్తె (యోబు 42[14]). అది సొగసును సూచించుపదము.

**కెరేతీయులు** (Cherethites = క్రేతునివాసులు!) ఫిలిష్తీయుల దేశమందుగాని లేక దక్షిణ భాగమందుగాని నివసించిన యొక జనాంగము (I సమూ 30[14] యెహె 25[16] జెఫ 2[5]). కఫ్తోరు నుండి ఫిలిష్తీయులలో కూడ వచ్చినవారని (ఆమో 9[7] యిర్మీ 47[4]) కొందఱును, క్రేతులంకనుండి వచ్చిన వారని మఱికొందఱును అభిప్రాయ పడుచున్నారు. దావీదు రాజు రక్షక భటులయందు వీరిలోఁ గొందఱుండిరి (II సమూ 8[18] 15[17] 20[23] పెలేతీయులు చూ॥)

H.

**కెలాలు** (Chelal = సంపూర్తి). ఎజ్రా కాలములో అన్యస్త్రీలను వివాహముచేసికొని అతని ప్రేరేపణవలన విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా 10[30]).

**కెలిథా, కెలిటా** (Kelita = పొట్టివాఁడు.) అన్యస్త్రీలను పెండ్లిచేసికొని ఎజ్రా ప్రేరేపణ వలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా 10[23]). ఇతఁడు లేవీయుఁడై యుండెను. ఇతనికి **కెలాయా** అను మాఱుపేరు కూడకలదు. నెహెమ్యా కాలమందు జరిగిన దిద్దుబాటులో ధర్మశాస్త్రమును చదివిన వారిలోను (నెహె 8[7]) దానిగైకొందుమని నిబంధనను స్థిరపఱచుకొనిన వారిలోను (10[10]) ఇతఁ డొకఁడై యుండెను.

**కెలూబు** (Chelub = పంజరము).

1. యూదా వంశస్థులలో నొకఁడు (I దిన 4[11]).

2. దావీదు పొలములను సేద్యము చేసినవారికి పై విచారణకర్తయగు ఎజ్రీయను వాని తండ్రి (I దిన 27[26]).

**కెలూబై** (Chelubai). కాలేబు అను పేరునకు మాఱు రూపము (I దిన 2[9] కాలేబు చూ॥).

**కెలూహు** (Cheluhi). అన్య స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా 10[35]).

**కెసాలోను** (Chesalon = నిరీక్షణ). యూదా దేశపు పశ్చిమ హద్దున నుండు నొక యూరు (యెహో 15[10]). ప్రస్తుతము యెరూషలేమునకు పడమట 5 క్రోసుల దూరములోనుండు కెస్లా (*Kesla*) దీని యునికియై యున్నది (పటము II, E 1).

**కెసీలు** (Chesil = వెఱ్ఱి). యూదాదేశపు దక్షిణ హద్దులో నుండు నొక యూరు (యెహో 15[30]). 19[3] లో దీనికి ప్రతిగా **బెతూలు** అను పేరు కలదు. LXX లోని యెహో 15[30] లో కూడ బేతెలు అను పేరుండుటచే ఇదే దాని సరియైన పేరనియు వ్రాఁత పొరబాటులవలన కెసీలు అను పేరు వచ్చినదనియు ననుకొందురు.

**కెసుల్లోతు, కిస్లోత్తాబోరు** (Chesulloth = నిరీక్షణలు, లేక కొండ చఱియలు, Chisloth-Tabor). ఈ రెండును ఒకటే స్థలమునకు పేరులైయున్నవి (యెహో 19[18] 19[12]). కెసుల్లోతు అను పట్టణము తాబోరు కొండ దగ్గఱ యుండుటచే దానికి కిస్లోత్తాబోరు అను పేరు పెట్టిరి. ఇది జెబూలూను గోత్రభాగమునకు సరిహద్దుగానుండు నొకపట్టణము. ప్రస్తుతము తాబోరు కొండకు పశ్చిమమున నుండు ఇక్సాలు (*Iksal*) అను ఊరు దీని ఉనికియై యున్నది (పటము IV, C 7).

**కెసెదు** (Chesed = కల్దీయుల మాఱుపేరు). మిల్కా నాహోరునకు కనిన కొడుకులలో నొకని పేరు (ఆది 22[22]).

**కెహేలాతా** (Kehelathah = కూటము). ఇశ్రాయేలీయులు అరణ్యములో దిరుగుచుండఁగా మకాము చేసిన స్థలములలో నొకటి (సంఖ్యా 33[22,23]).

## కే

**కేడెము** ఆయుధములు II 2, కోట III 4 చూ॥

**కేదారు** (Kedar = నలుపు). ఇష్మాయేలు కుమారుఁడు ($25^{13}$) ఇతని సంతతి వారికికూడ ఈ పేరుకలదు. వారు తూర్పు దేశస్థులుగా నెంచఁబడిరి (యిర్మీ $2^{10}$ $49^{28}$). వారు విలుకాండ్రనియు (యెష $21^{17}$), వారికి నివాస గ్రామములున్నట్లును ($42^{11}$), గొఱ్ఱెలమందలున్నట్లును ($60^{7}$) యెషయా వ్రాసిన వాక్యములవలనఁ దెలియును. ఇది యిర్మీ $49^{29}$ కి చక్కగా సరిపడును. యెహె $27^{21}$ చూడఁగా వారు అరబీయులతోకూడ తూర్పు పట్టణములతో వర్తకము చేసినట్లున్నది. పర $1^{5}$ లో వారి డేరాలు నల్లగాను సౌందర్యముగాను నున్నట్లు అలంకారరీతిగా వ్రాయఁబడి యున్నది. ప్రస్తుతము అరబీయులలో కొన్ని తెగలవారు నల్లని డేరాలలోని వాసము చేయుచున్నట్లుగా వీరు పూర్వకాలమున చేసియుండిరని తెలిసికొనవచ్చును.

**కేనీయులు, కయీనీయుడు** (Kenites = ఇనుప పనిచేయువారు). మృత సముద్రమునకు తూర్పున వసించిన యొక పురాతన జనము. అబ్రాహామున కిచ్చెదనని దేవుఁడు వాగ్దత్తము చేసిన జనములలోనొకటి (ఆది $15^{18,19}$). వారు మిద్యానీయుల సంబంధులై యుండిరి. మిద్యానీయుఁడగు ఇత్రో యనఁబడిన హోబాబు అనఁగా మోషేయొక్క మామ కయీనీయుఁడై యుండెను (సంఖ్యా $10^{29}$). అతని వంశస్థులును ఇంక ననేక మంది కయీనీయులును ఇశ్రాయేలీయులతోకూడ కనాను దేశమునకువెళ్లి వారితోకూడ నివసించిరి (న్యాయా $1^{16}$ $4^{11}$ I దిన $2^{55}$). వారు యూదులతోఁ గలసి యెహోవా ననుసరించి ఆయన నారాధించి సేవించిరని తోఁచుచున్నది. రాజైన సౌలు అమాలేకీయులను సంహరింపనై యెహోవా వలన పంపఁబడినపుడు కేనీయులు వారితో నివసించినను వారిని హతముచేయక సమాధానముతో పంపివేసెను (I సమూ $15^{2-6}$). రాజైన దావీదుకూడ తాను అమాలేకీయులను శిక్షించినపుడు వారితో కూడ నుండిన కేనీయులకు హానిచేయక తాను పట్టుకొనిన దోపుడుసొమ్మును వారితోఁగలిసి పంచుకొనెను ($27^{10}$ $30^{26-29}$). రేకాబీయులు (యిర్మీ 35) అను వారు వీరిలో చేరినవారై యుండిరి (I దిన $2^{55}$). C.

**కేఫా** (Cephas = రాయి). యేసుక్రీస్తు సీమోనుకు పెట్టినపేరు (యోహా $1^{42}$). ఇది అతని గుణమును తెలియఁజేయుచున్నది. గ్రీకు భాషయందు పేతురు అను దానికి నిదేయర్థము. ఈ యర్థముతోనే యేసు నీవు పేతురువు ఈ బండ మీఁద నా సంఘమును కట్టుదును అనెను. పౌలీ పేరు నుపయోగించెను (I కొరి $1^{12}$ $3^{22}$ $9^{5}$ $15^{5}$ గల $2^{11}$ పేతురు చూ). C.

**కేయినాను** (Cainan).

1. ఎనోషు కుమారుఁడు (ఆది $5^{9-14}$ I దిన $1^{2}$ లూ $3^{37,38}$).

2. అర్పక్షదు కుమారుఁడును షేలహు అను వాని తండ్రియునై యున్నాఁడు. ఆది $11^{12}$ నందున్న వంశావళిలో కేయినాను పేరు లేదు గాని LXX నందున్నది. దీని నుండియే యెత్తి లూకా యుదాహరించెను (లూ $3^{36}$).

H.

**కేరోసు** (Keros = పంటె). జెరుబ్బాబెలుతోకూడ బబులోనునుండి యెరూషలేమునకు తిరిగి వచ్చిన నెతీనీయులలో నొక కుటుంబపెద్ద (ఎజ్రా $2^{44}$).

కేలాయా కెలితా చూ॥

## కై

**కైసరయ** (Caesarea = కైసరుకు సంబంధించిన). కర్మెలుపర్వతమునకు దక్షిణమున 23 మైళ్ల దూరములో పలెస్తీను తీరమున నున్న పట్టణము. దీనిని కట్టించుటకు మహా హేరోదునకు 12 సంవత్సరములు (క్రీ॥ ము॥ 25-13) పట్టెను. తన కాపుఁడైన కైసరాగూస్తు పేరట అతఁడు దీనిని కట్టించెను (పురా 15,9,6; యుద్ధ 1,21,5). సముద్రములోనికి 200 అడుగుల దూరమువఱకు 125 అడుగుల లోతుగల గట్టి గోడను పెద్ద రాళ్లతో రేవుగాఁగట్టిరి. ఈ రేవులోనికి ప్రవేశించు ద్వారము ఉత్తరముగా నుండెను. ఈ పట్టణమును హేరోదు దేవాలయము నాటకశాల వేడుకశాల మొదలగు గొప్ప భవనములతో నలంకరించెను. పట్టణమందలి మురికి నీటిని వెలుపటికిఁ

గొనిపోవనై పట్టణమంతయు కాలువలు గట్టించెను. ఈ పేరుతోనున్న యితర పట్టణములనుండి ప్రత్యే కించుటకు దీనిని పలెస్తీను కైసరయ యనియు, సముద్రతీరపు కైసరయ యనియుఁ బిలిచిరి. పలె స్తీను దేశమున కిది తరువాత రోమీయ ముఖ్య పట్టణమాయెను. సువార్తికుఁడగు ఫిలిప్పు ఇక్కడ బోధించి కాపురముండెను (కార్య $8^{40}$ $21^{8}$). సౌలు మాఱుమనస్సు నొందిన పిదప యెరూష లేము నందలి యూదు లతనిని చంప యత్నింపఁగా సహోదరు లతనిని కైసరయ వఱకుఁ గొనితెచ్చి తార్సుకంపిరి ($9^{30}$). ఇచ్చటనే రోమను శతాధి పతియగు కొర్నేలి క్రైస్తవుడాయెను అన్యులు క్రైస్తవ సంఘమునఁ జేరుటకు మొదట పిలువఁబడిన దిచ్చటనే ($10^{1,24}$ $11^{11}$). క్రీ॥ శ॥ 44 సం॥ నందు హేరోదు అగ్రిప్పా ఇక్కడ చనిపోయెను ($12^{19,23}$ పురా 19,8,2). పౌలు రెండుమారులు దీనిని దర్శించెను (కార్య $18^{22}$ $21^{8,16}$). ఈ పట్టణము నందతఁడు రెండు సంవత్సరములు ఖైదీగా నుండెను ($28^{23-33}$). అగ్రిప్ప ఫేస్తు అను వారతనిని విచారించిన దీపట్టణములోనే ($25^{1-4,6,13}$). ఈ పట్టణమునందు ఆయా జాతుల వారు కలిసి నివసించుచున్నందున జాతి వైషమ్య ములు ప్రబలమై నీరోచక్రవర్తి కాలమునందు సిరియనులు యూదుల నందఱిని వధించిరి. దీనితో నారంభమైన కలహములు క్రీ॥ శ॥ 70 సం॥న యెరూషలేము నాశనమగుటతో ముగిసెను. క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమునందు కైసరియ బిషపు యొక్క ముఖ్యస్థానమై 451 వఱకు పలెస్తీనులోని క్రైస్తవగురు పీఠముగానుండెను. 195-వ సంవత్సర మున నిక్కడ ఒక ఆలోచనసభ సమావేశ మయ్యెను. ఈ పట్టణమున స్థాపింపఁబడిన గొప్ప క్రైస్తవ విద్యాలయమునందు ఒరిగెన (*Origen*) ను శాస్త్రవేత్త బోధించెను. ఈ పట్టణపు గురు పీఠము తరువాత నలంకరించిన యుసుబియసు (*Eusebius*) ఈ విద్యాలయములో శిక్షితుఁ డయ్యెను. 548 సం॥న దీనియందలి యూదు లును సమరయులును గలిసి క్రైస్తవులను సంహ రించిరి. 638 నందీ పట్టణమును మహమ్మదీయులు పట్టుకొనిరి గాని 1102 నందు సిలువ యుద్ధవీరుల వశమయ్యెను. 1189 నందు సలాడీన (*Saladin*)ను మహమ్మదీయ చక్రవర్తియు 1191 నందు సిలువ సైనికులును 1265 నందు మహమ్మదీయులును ఒకరి తరువాత నొకరు దీనిని జయించి స్వాధీన పఱచు కొనిరి. ఇచ్చట ప్రస్తుతము కాన్పించు శిథిల ములలో రోమనులకాలము నాటివియును సిలువ యుద్ధవీరుల నాటివియునున్నవి. రోమనుల నాటక శాల ఆలయము వేడుకశాల రేవుగోడ పట్టణపు గోడలు కాలువలు చక్కగా కనఁబడుచున్నవి. వీటితోపాటు సిలువ యుద్ధవీరులు కట్టిన గోడలు కోట గొప్ప దేవాలయము చిన్న చిన్న గుళ్లు చూడవచ్చును. రోమనులు కట్టించిన గోడలు 2700 అడుగుల వఱకు తూర్పు పడమరలను, 4800 అడుగుల వఱకు ఉత్తర దక్షిణములను వ్యాపించియున్నవి. ప్రస్తుతమున ఆపట్టణమునకు కైయసరియ (*Raisarieh*) అను పేరు గలదు (ఫిలిప్పుదైన కైసరయ చూ॥).

**కైసరు** (Caesar). రోమా చక్రవర్తుల యొక్క యుద్యోగ బిరుదాంకము. ఐగుప్తు దేశపు రాజులెట్లు ఫరోయను బిరుదాంకము వహించుకొని యుండిరో అటులనే రోమాచక్ర వర్తులు సహ కైసరను బిరుదాంకమును వహించు వారు. నూతన నిబంధనయందు ప్రస్తాపించఁబడిన కైసరు అనుపేరు ఆయా సమయములందుండి రాజ్యము చేయుచుండిన చక్రవర్తులకు చెల్లును (మ $22^{17-21}$ = మా $12^{14-17}$ లూ $20^{22-25}$). క్రీ॥ ము॥ 31 సం॥ మందు సింహాసన మెక్కిన అక్టేవియసు మొట్టమొదట ఈ బిరుదును వహిం చినవాఁడు. కైసరు అను బిరుదును వహించిన చక్రవర్తులు పన్నెండుగు రుండినను బైబిలునందు ఔగూస్తు (లూ $2^{1}$), తిబెరి ($3^{1}$), క్లౌదియ (కార్య $11^{27}$ $18^{2}$), నీరో ($25^{11}$) అను నలుగురిని గూర్చిన సూచనలు మాత్రముగలవు. H.

**కైసరు ఇంటివారు** (Caesar's House-hold). రోమా చక్రవర్తి నగరిలో మంత్రి మొదలుకొని అధమ యుద్యోగస్థుని వఱకునుండు కైసరుయొక్క సేవకుల నందఱిని గుఱించి ఈ పేరు వినియోగింపఁబడెను (ఫిలి $4^{22}$). ఇక్కడ ప్రశంసించఁ బడినవారు రోమా చక్రవర్తి నగరిలో గొప్పయుద్యోగము వహించుకొన్న వారనియు చక్రవర్తియొక్క దగ్గిర బంధువులనియు కొందఱు గ్రంథకర్త లూహింతురుగాని అలాగున నిశ్చ యించు కొనుటకు చాలినంత యాస్పదములేదు.

ఆ కాలమందు చక్రవర్తి నగరిలో లెక్కకు మించిన దాసులుండిరి. వారు సర్వసాధారణులైన బానిసలే గాని స్వతంత్రులుకారు. పౌలు ఖైదీగా నుండి యిట్టివారితోనే సంబంధము చేసికొని సువార్తను తెలియఁజేయఁగలిగి యుండెను గాని గొప్ప యుద్యోగస్థులకును చక్రవర్తియొక్క బంధువులకును సువార్త ప్రకటించుటకు వీలుగలిగి యుండఁడు. కాఁగా వీరిని దాసులనుగా భావించుకొనవలెను. M.

**కైసరు నెదుట చెప్పుకొనుట (Appeal to Caesar).** కైసరుకు అప్పీలు చేసికొనుట ప్రతి రోమీయుని హక్కులలో నొక ముఖ్యమైనదై యున్నది. వ్రాఁత మూలముగా కాకుండనే న్యాయవిమర్శ జరుగునప్పుడే నేను అప్పీలు చేసికొందునని చెప్పఁటచాలును. పౌలు ఈ హక్కును ఫేస్తునెదుట నిలిచినప్పు డుపయోగించుకొనెను (కార్య 25$^{10-12}$).

## కొ

**కొంకి** దేవాలయము I 7 (1) *a* చూ॥

**కొంగ** పక్షులు 6 చూ॥

**కొండ, పర్వతము (Mount, Mountain).** పలెస్తీను దేశము కొండ ప్రదేశమైనను మిగుల యున్నతములైన కొండ లెక్కువగా లేవు. బైబిలులో చెప్పఁబడిన కొండలలో సీనాయి హెర్మోను కర్మెలు సీయోను ఒలీవకొండ ముఖ్యములైనవి. ఈ పేరు లాయాకొండలకు మాత్రము గాక వాటి చుట్టునుండు ప్రదేశమునకు కూడ చెందెను. శేయీరు గిలాదు అను కొండలు కూడ ఇట్టివే.

కొండలయొక్క విశేష ఉపయోగమును గూర్చి బైబిలులో చెప్పఁబడినదేమనఁగా:—

1. అచట గుహలనేకములుగా నుండుటచేత అవి నివాసస్థానములయ్యెను (ఆది 36$^{8}$ II రాజు 4$^{25}$). 2. అవి దేశముయొక్క సరిహద్దులను చూపు గుర్తులుగా నుండెను (సంఖ్యా 34$^{7}$). 3. గొప్ప సమూహములకు బోధించుట కవి పీఠములుగా నుపయోగింపఁబడెను (యెహో 8$^{30-35}$ న్యాయా 9$^{7}$ II దిన 13$^{4}$). 4. సమాధి స్థలములుగా నుపయోగింపఁబడెను (II రాజు 23$^{16}$). 5. ఆపదలనుండి తప్పించుకొనుటకవి ఆశ్రయస్థానములుగా నుండెను (ఆది 14$^{10}$ మ 24$^{16}$). 6. అవి దండుపేటలుగా నుండెను (I సమూ 17$^{3}$). 7. అచటనుండి మ్రానులు కఱ్ఱలుకొట్టి తెచ్చుకొనుచుండిరి (II దిన 2$^{18}$ హగ్గ 1$^{8}$). 8. అవి కావలివాండ్ర గోపురములుగా నుండెను (యెషె 40$^{9}$, మ 4$^{8}$). 9. మేఁత స్థలములు (కీర్త 50$^{10,11}$ లూ 8$^{32}$), 10. దుర్గములు (కీర్త 125$^{2}$) గానుండెను. అందుచేతను, వాటి స్థిరతను బట్టియు బలమును దీర్ఘకాలమును సూచించుటకు వీటిని అలంకారరీతిగా నుపయోగించిరి (90$^{1,2}$).

మఱిముఖ్యముగా కొండలు పూజాస్థానములుగా నుండెను. నేటివఱకు పలెస్తీనులోని ప్రతి యున్నత స్థలము మీఁదను ఒక మసీదుకలదు. పురాతన కాలమునుండి ఇవి యిట్లుండెను (ఉన్నత స్థలములు చూ॥).

**కొండగొఱ్ఱె** గొఱ్ఱె చూ॥

**కొండమేక** మేక చూ॥

**కొండెములు, కొండెగాడు (Slander, Backbiting, Talebearing).** ఇది సర్వసాధారణమైన పాపము. దీని సూచించు పదములు పాఁతనిబంధనలో హెబ్రీ భాషయందు ఏడును, క్రొత్తనిబంధనలో గ్రీకుభాషయందు మూఁడును గలవు. వీటిని తెలుఁగునందు సాధారణముగా కొండెము అనుపదముచే తర్జుమాజేసిరి గాని కీర్త 15$^{3}$ లో కొండెములాడు అని తెనిఁగించిన అసలు పదమును II సమూ 19$^{27}$ లో **అబద్ధమాడు** అని భాషాంతరముజేసిరి సామె 10$^{18}$ లోని కొండెములు ప్రచురము చేయువాఁడు అను వేఱొక అసలు మాటను సంఖ్యా 14$^{36}$ లో **చెడ్డ సమాచారములను చెప్పువాడనియు,** కీర్త 31$^{13}$ నందు **దురాలోచన చేయువాడనియు** తెనిఁగించిరి. కొండెగాండ్రు మహాయపరాధులని పాఁతనిబంధన నీతిబోధల నుపదేశించు సామెతెల గ్రంథములో తేటగా కనఁబడును (11$^{13}$ 18$^{8}$ 20$^{19}$ 26$^{20,22}$). ఈ పాపమును ధర్మశాస్త్రమందును (లేవీ 19$^{16}$), ప్రవక్తలలోను (యిర్మీ 6$^{28}$ 9$^{4}$), కీర్తనలలోను (50$^{20}$ 101$^{5}$) ఖండింపఁబడెను.

క్రొత్తనిబంధన యందలి పదములలో నొకటి సాతాను పేరుకు సంబంధించినది. అది I తిమో 3$^{11}$ లో కనఁబడును. తక్కిన రెండు రోమా

1³⁰ II కొరి 12²¹ లో నున్నవి. II కొరి 12²¹ నందు కొండెములను మాటచే తర్జుమా చేయఁబడిన పదముయొక్క పుంలింగ వాచకము రోమా 1³⁰ లో అపవాదకులని వ్రాసిరి. 1³⁰ లో కొండెగాండ్రు అను పదముచే తర్జుమాచేసిన పదము యొక్క నపుంసకలింగ వాచకమునకు II కొరి 12²¹ నందు గుసగుసలాడుట అను మాటను వాడిరి. ఈ పాపము క్రొత్త నిబంధనలోకూడ హేయమైన పాపముగా నెంచఁబడి కామ క్రోధాదులతో చేరియున్నది.

**కొజ్బీ** (Cozbi = దుష్టురాలు). మిద్యానీయురాండ్రలో నొకతె. ఈమె తండ్రి మిద్యానీయుల నాయకులలో నొకఁడు. ఇశ్రాయేలీయులను విగ్రహారాధనఁ జేయునట్లు శోధించినను షిమ్యోనీయులలో నొకఁడు ఈమె నుంచుకొనెనుగాన ఫీనెహాసు వీరిద్దరిని ఈటెతో పొడిచి చంపెను (సంఖ్యా 25⁶⁻⁸,¹⁴,¹⁵,¹⁸).

**కొట్టుట** నేరములు శిక్షలు III 4 (1), (2), (3) చూ॥

**కొట్లు** వ్యవసాయము 7 చూ॥

**కొడవలి** వ్యవసాయము 6 చూ॥

**కొతిమెర** (Coriander). వీటిని ఔషధములయందు విశేషముగా వాడిరి అరణ్యమందు ఇశ్రాయేలీయులు తినిన మన్నా కొతిమెర గింజలవలె నుండెను (నిర్గ 16³¹ సంఖ్యా 11⁷).

J. C.

**కొనన్యా** (Conaniah = యెహోవా స్థిరపఱచెను).

1. హిజ్కియా కాలమునందు పదవ భాగములకు ఇతర అర్పణలకు పైగా విచారణ కర్తగా నియమింపఁబడిన వాఁడు (II దిన 31¹²,¹³).

2. యోషీయా కాలమునందు లేవీయుల ప్రధానులలో నొకఁడు (II దిన 35⁹)

**కొన్యా** యెహోయాకీను చూ॥

**కొమ్ము, శృంగము** (Horn). ఈ దేశమునందుచేసినట్లే ఇశ్రాయేలీయులును తైలము మొదలగు పదార్థములను పోసియుంచుకొనుటకు కొమ్ములను వాడిరి. (I సమూ 16¹,¹³ I రాజు 1³⁹). దీనికి సంబంధముగా మాత్రమేగాక బలమును సూచించుటకు కూడ ఈ పదమును అలంకార రీతిగా వాడిరి. తమ్మును తాము కాపాడుకొనుటకును శత్రువులను తరిమివేయుటకును కొమ్ములు గల మృగములు వాటి నుపయోగించుకొనుటచే అవి బలమును సూచించుట సహజమై యున్నది. ఈ యలంకారము విశేషముగా కావ్యములందే కనఁబడును.

1. యోసేపు గోత్రమునకుఁ గలుగు గొప్పతనమును (ద్వితీ 33¹⁷), భక్తునికి కలుగు జయమును (కీర్త 92¹⁰) సూచించుటకు వారికొమ్ము గుర్రబోతు కొమ్మువలె యెత్తఁబడునని వ్రాసిరి. బలవంతుఁడగు శత్రువారినుండి తప్పించుమని ప్రార్థించుచున్న భక్తుఁడు గుర్రబోతు కొమ్ములలో పడకుండ రక్షించుమని మొఱఁబెట్టెను (22²¹) ఈ విధముగా భక్తులకు కలిగెడి రక్షణకు రక్షణశృంగ మని పేరు పెట్టిరి (II సమూ 22³ కీర్త 18² లూకా 1⁶⁹). భక్తులైన వారి కొమ్ము హెచ్చింపఁబడుటయే గాక (కీర్త 75¹⁰ 89¹⁵ 112⁹ 148¹⁴). భక్తిహీనుల శక్తిని నశింప చేయుననునప్పుడును (75⁵⁻¹⁰) వాడఁబడెను. మోయాబు గర్వమణఁగ ద్రొక్కుటను సూచించుటకు ఈ యలంకారమునే వాడిరి (యిర్మీ 48²⁵). ఇశ్రాయేలీయులకొమ్ము విరుగఁగొట్టఁబడి వారి శత్రువుల శృంగము హెచ్చింపఁబడునను వాక్యములును గలవు (విలా 2³⁻¹⁷).

2. ఇశ్రాయేలీయులు కొమ్ములు విఱువఁబడినవారైనట్లు చెఱకాలము నందట్టి శక్తియులేని వారివలె నుండిరి. కుదురుబాటు కాలములో దావీదు రాజవంశమునకును (కీర్త 132¹⁷), ఇశ్రాయేలీయులకును (యెహె 29²¹) అనుగ్రహింపఁబడు శక్తి బలములను సూచించుటకు వారి శృంగమును ఇనుపదిగాఁ జేతునని దేవుఁడు సెలవిచ్చెను (మీకా 4¹³).

3. కొన్ని వాక్యములలో నీ పదమును కొమ్ము అని గాక బలమని తెనిఁగించిరి I సమూ 2¹,¹⁰ ఆమో 6¹³ నందున్న బలము అనుమాట మూల భాషయందు శృంగమని అర్థమిచ్చును.

4. అహాబు యెహోషాపాతు అను వారు సిరియవారిని గెలిచెదరని చెప్పినదానికి సూచనగా అబద్ధ ప్రవక్తయగు సిద్కియా ఇనుప కొమ్ములు ధరించెను (I రాజు 22¹¹). దొంగ కాపరులు తమ ప్రజలను బాధపఱచుట రోగముగల వాటిని

కొమ్ములతో పొడిచి తరిమినట్లుండును (యెహె 34[21]). దర్శనముల మూలముగా భవిష్యత్సంగతులను అలంకారరీతిగా తెలుపు దానియేలు జెకర్యా ప్రకటన గ్రంథములలో కొమ్ములు సాధారణముగా దేవుని రాజ్యమునకు విరోధులగు వారి శక్తి బలములను సూచించినను (దాని 7[7-24] 8[3-21] జెక 1[18-21] ప్రక 12[3] 13[1,11] 17[1,3,7,12,16]), ఒక వాక్యము నందుమాత్రము క్రీస్తుశక్తిని గనపఱచుచున్నవి (5[6]). వేదికయొక్క నాలుగు మూలలకు నాలుగు కొమ్ములను వేసిరి (నిర్గ 27[2] 29[12] 30[2,3,10] లేవీ 4[7,8]). దానికి యాగపశువును కట్టిరి (కీర్త 118[27]). వాటికి రక్తము పూసిరి (నిర్గ 29[12] లేవీ 16[18]). వాటిని పట్టుకొనుటవలన ఆశ్రయము దొరుకునని భావించిరి (I రాజు 1[50]).

**కొరాజీను (Chorazin).** విశేష అద్భుతములను జేసినను క్రీస్తును నమ్మకపోయినందున ఆయన శపించిన మూఁడు పట్టణములలో నొకటి (మ 11[21] లూ 10[13]). అది క్రీస్తు వాక్యప్రకారము పూర్ణముగా నశించెను. కాఁబట్టి దానియునికి సహా సందేహాస్పదముగా నున్నది. అయినను టెల్‌హూమని యెంచఁబడు కపెర్నహూమునకు 2½ మైళ్లు ఉత్తరముగానున్న కెరాస్ (*Keraseh*) దీనియునికి యని సాధారణముగా నంగీకరింతురు (పటము IV, E 6).

## కొరింథీయులకు వ్రాసిన మొదటి పత్రిక (First Epistle to the Corinthians).

1. గ్రంథకర్త.

ప్రాచీన కాలము మొదలు ప్రస్తుతమువఱకు వేదాంత వేత్తలందఱును కొరింథీయుల పేరుగల రెండు పత్రికలు పౌలుయొక్క చేతియుత్తరములని ఏలాటి బాధకము లేకుండ నొప్పుకొనుచున్నారు. ఇతర యుత్తరములను గుఱించి యెంత సందేహించినను వీటివిషయమై యెవరు నాక్షేపించ లేదు.

2. ప్రామాణికత్వము.

బహిస్సాక్ష్యము:—క్రీ॥ శ॥ 95 సం॥ మందు రోమాపురి సంఘాధ్యక్షుఁడగు క్లెమెంతు కొరింథీయులకు వ్రాయుచు పౌలు వారికి వ్రాసిన పత్రికను గుఱించియు దానియందుండు మాటలను గుఱించియు వారికి జ్ఞాపకము చేసెను. యోహాను శిష్యుఁడగు పాలికార్పును (*Polycarp*) జస్టిను మార్టరును (*Justin Martyr*) ఈ గ్రంథము నందలి వాక్యములనెత్తి తమ పుస్తకములలో నుదాహరించిరి. మ్యూరటోరి (*Muratori*) వలన కనుగొనఁబడిన గ్రంథశేషము రచించిన గ్రంథకర్త తానేర్పరచిన క్రొత్తనిబంధన పుస్తకముల నామ జాబితాయందీ యుత్తరమును పేర్కొనెను. అది యునుగాక పురాతన భాషాంతర గ్రంథము లన్నిఁటిలో పౌలు కొరింథీయులకు పంపిన యుత్తరము కనఁబడక మానదు. కాఁబట్టి పర గ్రంథములవలన దీనికి కలుగు సాక్ష్యము అనివార్యమైనది.

అంతస్సాక్ష్యము:—ఈ పత్రికను గమనము లేకుండ పఠించినను దీనియందలి వివరమునుబట్టి యిది పౌలుయొక్క చేతియుత్తరము కానియెడల కొరింథీయులు దీని భద్రపఱచి యుండరనుటకు సందేహము లేశమైనను లేదు. దీనిలోని విషయములు కొరింథీయులకు ననేక విధముల నవమానము కలుగఁజేయునట్టివి. ఈ పత్రిక మూలముగా వారు కక్షబుద్ధిగల వారనియు చెప్పశక్యముకాని దుష్కార్యములకు సమ్మతించు వారనియు ప్రభువు రాత్రిభోజనము నవమానపరచు వారనియు గర్వాతిశయులనియు కనఁబడుచున్నారు గనుక ఇంత కఠినముగా తమ లోపములను బయలుపఱచి తమ కపకీర్తిని కలుగఁజేయు పత్రిక పౌలుగాక మఱి యెవరు వ్రాసియుండినను వారే మాత్రమును సహించి యుండరు. పౌలు ఒక్కఁడే వీరినంత తీక్ష్ణముగా గద్దించుటకు కారణము గలవాఁడు.

కార్య 18 వ అధ్యాయమున పౌలు రెండవ ప్రయాణమందు కొరింథు పట్టణమును దర్శించి యచ్చట నొక సంఘమును స్థాపించి యొకటిన్నర సంవత్సరము వఱకు దాని పరిపాలించెనని చదువుచున్నాము. అందు కనుగుణ్యముగా నీ పత్రికయందు పౌలు సంఘమును గుఱించి చెప్పఁగా నేను నాటితిననియు (3[6]) పునాది వేసితిననియు (3[10-11]) మిమ్మును నేను కంటిననియు చెప్పుచున్నాఁడు గనుక చరిత్ర వృత్తాంతములును ఉత్తరమందలి వివరములును ఒక దాని కొకటి చక్కగా పొసగుటవలన నిది పౌలు పత్రికయను తీర్మాన మవార్యమైనదియై యున్నది.

3. ఎవరి నిమిత్తమై వ్రాయబడెను.

కొరింథు సంఘస్థులలో చాలమంది క్రైస్తవులు కాక పూర్వము విగ్రహారాధకులై యుండినను (కార్య $18^{7}$ I కొరి $12^{2}$) యూదులై యుండిన వారునుండిరి (కార్య $18^{8}$ I కొరి $7^{18}$ $10^{32}$). వారిలో ననేకులు బీదలైయుండి స్వకాయకష్టము వలన జీవనోపాధిని సంపాదించు కొనుచుండిరి. ఆ యూరి నివాసులగు భాగ్యవంతులు తమ యధీనమందు దాసులనేకులనుంచి వారివలన సేవ చేయించు కొనుచుండిరి. అట్టివారిలోనే సువార్త వ్యాపకమగుటచే నా దాసులలో ననేకులు సభికు లైరి ($7^{22}$). ఆ పట్టణమందు కామదేవిపూజ బహు వైభవముగా జరుగుచున్నందున నాపుర ప్రజలు విషయాసక్తులై దుష్ట ప్రవర్తనకు ప్రసిద్ధులై యుండిరి. వారు క్రైస్తవులైన మీదటనైనను తమ దురిచ్ఛలను నివృత్తిజేసికొనకున్నందున పౌలు వారి పాపకార్యములను గద్దించవలసి వచ్చెను. క్రైస్తవులు కాకముందు స్వాతంత్ర్యము నెఱుఁగని దాసులు క్రీస్తువలన తమకుఁ గలిగిన స్వాతంత్ర్య మాత్మసంబంధమైనదని చక్కగా గ్రహించుకొనక తమ ప్రవర్తన విషయమై జాగరూకులుగాక విచ్చల విడిగ నటించుచు తామవలంభించిన మతము నవమానపఱచిన వారైరి. వారు మొదటినుండి పరతంత్రులై బ్రతికినందున క్రీస్తుమత సహోదర ధర్మమును సరిగ గుర్తించక హెచ్చుతగ్గులనుపఱచి గర్వాంధులగుటవలన సంఘైక్యమునకు లోపము కలిగెను. అయినను సభికు లక్కువ మంది యల్పస్థితిగలవారై యుండినను వారిలో కొందఱు ఘనులై యుండినట్టు కనఁబడుచున్నది. ఆ సంఘమున కంతకు నాతిథ్యము చేయుగాయి యును, పట్టణపు ఖజానాదారుఁడగు ఎరస్తును బహుశః స్థితిమంతులై యుండిరి.

4. కాలస్థాన నిరూపణము:—

పౌలు తాను చేసిన రెండవ సువార్త సంచార మందు కొరింథు పట్టణమున 1½ సం॥ ముండి బోధించిన తరువాత యెరూషలేమును అంతియొకయను దర్శించి యక్కడ కొంతకాలమును గడపిన మీఁదట గలతీయ ఫ్రుగియ ప్రదేశముల యందు సంచారముచేసి ఎఫెసు చేరెను. ఎఫెసునం దాయన రెండు సంవత్సరముల పైఁగా మత వ్యాపకత్వమునకు పాటుపడిన పిమ్మట కొరింథు సంఘస్థుల విషయమైన దుర్వార్తలు వినఁబడుచు వచ్చెను. ఆ మధ్యన కొరింథుకు పోయి అక్కడ కొంతకాలము గడపిన అపొల్లో ఎఫెసు పట్టణమునకు వచ్చి తాను కొరింథు సభికులను గుఱించి తెలిసికొన్న సంగతులను పౌలుకు చెప్పి యుండును. ఆ సంఘస్థుల యక్రమ ప్రవర్తన తెలిసికొని పౌలు వారిని తిరుగ మార్గమునకు రప్పించుటకై వారియొద్దకు పోయెను. ఆయన యాసమయమున చేసిన దర్శన వివరములు కార్యముల గ్రంథమందు వర్ణించఁబడలేదు గాని పత్రిక యందలి ప్రశంసలమూలమున విశదమగును. II కొరి $12^{14}$ నందు—ఇదిగో యీ మూఁడవసారి మీయొద్దకు వచ్చుటకు సిద్ధముగా నున్నానని ఆయన చెప్పుటవలన నీ పత్రికను వ్రాయకముందు వారిని రెండు పర్యాయములు దర్శించెనని స్పష్ట మగును. అయితను కార్యముల గ్రంథమందాయన యిప్పటికి యొకసారి మాత్రము కొరింథుకు వెళ్లి నట్టున్నను గనుక కార్యములయందు వివరింపఁ బడిన దర్శనములుగాక ఆయనా మధ్య నా యూరికి పోయె ననుకొనక తీరదు. II కొరి $13^{1}$ నందును ఈ మూఁడవసారి మీయొద్దకు వచ్చుచున్నానని సెలవిచ్చుట మాత్రముకాక $13^{2}$ లో తానదివరకు రెండుసార్లు వారిని చూచినట్టు సూచించుచున్నాఁడు. పౌలు కొరింథుకుపోయి తిరుగ ఎఫెసు చేరిన కొన్నాళ్లకు తానా సంఘ సవరణ నిమిత్తము చేసిన యత్నము విఫలమాయెనని తెలిసికొని వారి దుష్కార్యములను ఖండించుటకై యొక పత్రికను వ్రాసియుంపెను. ఇది I కొరి $5^{9}$ యందు దాహరించఁబడిన పత్రికయై యుండును. ఆ యుత్తరము పంపిన కొన్నాళ్లకు క్లోయే యింటివారువచ్చి కొరింథు సంఘములో ప్రబలి యుండిన కక్షలను గుఱించి పౌలుకు తెలియఁజేసిరి. ఇందును గుఱించి అపొస్తలుఁడు మిగుల విచారపడుచుండఁగ కొరింథు సంఘస్థులగు రాయబారులు ఆయనయొద్ద కొక యుత్తరమును దెచ్చిరి. ఆ యుత్తరమందు వారు పౌలిది వఱకు వ్రాసిన పత్రికను జదివి యాయన గద్దించిన దుష్కర్మకుని సాంగత్యము విసర్జించుట నాయనకు తెలియఁజేసి తమకు సంశయముగా నుండిన కొన్ని యంశములను గుఱించి యాయన యోచన నడిగిరి. వారు వేసిన ప్రశ్నల కుత్తర మిచ్చుటకును క్లోయే యింటివారు తనకు తెలియఁ

జేసిన విషయములయందు వారికి బుద్ధిచెప్పుటకును పౌలు మొదటి పత్రికను 57 వ సం॥ ముందటి భాగమందు రచించి పంపెను. కొరింథు సభికులు పౌలుపేరట పంపించిన యుత్తరము తీసికొని వచ్చిన స్తెఫను ఫోర్తునాతు అకాయికు అనువారు తమ కప్పగింపఁబడిన పని నెఱవేర్చి తిరిగి యింటికి పోవుచుండిరి గనుక పౌలు యుత్తరము వారిచేతి కిచ్చి తీతును వారి వెంబడి పొమ్మని సెలవిచ్చి వారినందఱిని పంపెను.

**M.**

5. ముఖ్యభాగములు:—

I. పీఠిక: పై వ్రాఁత, ఆశీర్వాదము సంఘాభివృద్ధికై దేవుని స్తుతించుట $1$-$9$.

II. కొరింథు సంఘములోని యక్రమములను దిద్దుట:—

1. వారిలోని పార్టీలు $1^{10}$-$4^{21}$; 2. ఘోరమగు వ్యభిచారము జేసినవానిని వెలివేయక పోయినందున గద్దించి, వాని వెలివేయ నాజ్ఞాపించుట $5^{1-13}$; 3. సహోదరుల మీఁద అన్యులయొద్ద వ్యాజ్యమువేయుట $6^{1-11}$; 4 వ్యభిచార సంబంధమైన అక్రమములు $6^{12-20}$.

III. వారడిగిన ప్రశ్నలకు జవాబులు వ్రాయుట:—1. వివాహమును గూర్చి $7^{1-40}$; 2. విగ్రహార్పితములను భుజించుటను గూర్చి $8^{1}$-$10^{33}$.

IV. ఆరాధనకు సంబంధమైన అక్రమములను దిద్దుట.

1. స్త్రీలు ాకాలపు వాడుక ప్రకారము ముసుకు వేసికొనక పోయినందున వారిని గద్దించుట $11^{1-16}$; 2. ప్రభువు భోజనము నాచరించుటలో చాల అమర్యాదగా నున్నందున వారిని గద్దించి ఆ సంస్కారపు టేర్పాటును, దాని యుద్దేశమును దెలుపుట $11^{17-34}$; 3. ఆత్మవరముల నొందినవారు తమతమ వరములే గొప్పవని అతిశయపడి ఆరాధన జరుగునప్పుడు తమ శక్తిసామర్థ్యముల నగుపఱచుకొనఁగోరి అల్లరి చేయుచున్నందున వారిని గద్దించి ఆ వరములలో ముఖ్యముగా ప్రవచించుట, భాషలతో మాటలాడుట యను వాటినిగూర్చి దెలుపుట (ఈ వరములను గూర్చి వివరించుచుండఁగా ప్రేమలేనిది అవి యన్నియు వ్యర్థమని వ్రాసి ప్రేమనుగూర్చి దివ్యముగా వర్ణించెను; అధ్య 13) $12^{1}$-$14^{33,37-40}$; 4. స్త్రీలు ఆరాధనలో మట్లాడినందున అది అమర్యాదయని దానిని దిద్దుట $14^{34-36}$.

V. పునరుత్థానము లేదని వారిలోఁ గొంద ఱభిప్రాయపడఁగా దానిని రుజువుచేయుచు దాని వలన కలుగు మేలులను వివరముగా వ్రాయుట $15^{1-58}$.

VI. ముగింపు: చందావిషయము, తన ప్రయాణపు క్రమము, తన సహవాసుల ప్రయాణమును గుఱించి వ్రాయుట; వందనములు చెప్పి ఆశీర్వాదముతో ఉత్తరమును ముగించుట $16^{1-24}$.

## కొరింథీయులకు వ్రాసిన రెండవ పత్రిక
## (Second Epistle to the Corinthians).

మొదటి పత్రికను వ్రాసిన మూఁడునాలుగు నెలలకు పౌలు ఈ రెండవ యుత్తరమును రచించెను గనుక ఇది 57 సం॥ వేసవికాలమున లిఖితమాయెనను కొనఁదగును. అదివఱకు పౌలు తిమోతియును ఎరస్తును మాసిదోనియకు పంపియుండెను (కార్య $19^{22}$). గనుక పౌలు పంపిన మొదటి యుత్తరమందిన తరువాత వారు కొరింథు సంఘమును దర్శించి యుందురనుట కాస్పదము గలదు. తీతును కొరింథుకు పంపించుటకు రెండు కారణములుండెను. అతఁడు సంఘస్థుల యక్రమప్రవర్తనను సవరించి యెరూషలేములోని బీద క్రైస్తవుల కొఱకు పౌలెత్తు నుద్దేశించిన చందాను గుఱించి వారిని పురికొల్పుటకు నాజ్ఞనొందెను. ఆయన యావిషయమందు పడిన ప్రయాసము విఫలమగుట మాత్రముకాక యాసభికులలో కొందఱాయన నెదిరించి పౌలును గుఱించి తిరస్కారముగా నుడివిరి గనుక తీతు తనకు కలిగిన కార్యవిఘ్నమును గుఱించి పౌలుకు తెలియఁజేయుటకై మరల ఎఫెసుకు వచ్చెను. పౌలు తీతు తెచ్చిన సమాచారమునకు మిగుల చింతాక్రాంతుఁడై కొరింథీయుల దుష్ప్రవర్తనను ఖండించుటకై యొక తీక్ష్ణమైన యుత్తరమును వ్రాసి యాసభికుల కందించుటకై తీతును తిరిగి కొరింథుకు పంపించి యా యుత్తరమువలన కలిగిన ఫలమును తెలియఁజేయుటకై తనను త్రోయలో కలిసికొనుమని యాజ్ఞాపించెను.

తీతు రెండవ పర్యాయము కొరింథుచేరి మును పటిలాగుననే వారి ఆధ్యాత్మిక క్షేమాభివృద్ధి నిమిత్తమై ప్రయాసపడఁగా నాయన పడినపాట్లు కొనసాగి కార్యసిద్ధి యాయెను గనుక ఆయన తన యత్నమును కడముట్టించి పౌలును కలిసి కొనుటకై బయలుదేరెను. ఆ మధ్య ఎఫెసు పట్టణమున గల్లత్తు జరిగినందున పౌలా పట్టణమును విడిచి త్రోయకుపోయి యక్కడ తీతు రాక కెదురు చూచుచుండెనుగాని తీతురానందున మనో వేదనను సహించలేక (II కొరి $2^{14}$) మాసిదోనియ దేశమునకు దాటి పోయెను. ఆయన యక్కడ కొంతకాలము గడిపిన తరువాత తీతువచ్చి కొరింథు సంఘమందు కలిగిన శుభమును పౌలుకు తెలియఁజేయఁగా నాయన యందుకు మిగుల నానందభరితుఁడై వారియొద్దకీ రెండవ పత్రికను పంపించెను. పారంపర్య సాంప్రదాయముల వలన పౌలప్పుడు థెస్సలొనీకేయు పట్టణమందుండెనని కనఁబడును. కొరింథి సంఘసమాచారము పౌలుకు తెలియఁజేసిన తీతు ఆయనచేత నీయుత్తరమును పుచ్చుకొని వారికందించెను (II కొరి $8^{6,16-18}$).

క్రొత్త నిబంధనయందు పౌలు కొరింథీయులకు వ్రాసినట్టు సూచింపఁబడు నుత్తరములు రెండు. అయిన నా రెండు పత్రికలయందుదాహరింపఁబడిన వివరములను పరిశోధించఁగా నీ రెండు ఉత్తరములుగాక యాయన మఱియొకటి లేక రెండు ఉత్తరములు వ్రాసియుండెనని ఊహింప వలసి వచ్చును. మొదటి పత్రిక $5^{9}$ నందు జారులతో సాంగత్యము చేయవద్దని నా పత్రికలో వ్రాసియుంటిని యనుమాట భూతకాల రూపముగా నుండుటంబట్టి ఆయన యంతకు మునుపు వారికొక యుత్తరమును వ్రాసెనని స్పష్టమగును. ఆ పత్రిక మిగుల చిన్నదిగాను ఆ సంఘములో జరిగిన దుష్కార్యమును గుఱించియే వ్రాయఁబడినదిగా నున్నందున నది ప్రస్తుతకాలమువఱకు నిలిచియుండలేదు.

మరియు పౌలు రెండవ పత్రికయందు తానది వఱకు వారియొద్దకు పంపిన యుత్తరమును ప్రస్తావించి దానిమూలముగా వారిని దుఃఖపెట్టినట్టును దాని వ్రాసినప్పుడు తాను నిండు బాధతోను మనోవేదనతోను ఎన్నో కన్నీళ్లు విడుచుచు వ్రాసెనని చెప్పెను (II కొరి $2^{3-4}$ $7^{8-12}$). ఇచ్చట కనఁబఱచిన లక్షణములు మొదట పత్రికకు చక్కగా పొసగవు గనుక మొదటి పత్రికకును రెండవ పత్రికకును మధ్య మఱియొకటి రచించి పంపెనని కొందఱిభావము. పౌలు అలాటి పత్రికను వ్రాసినయెడల నది యేమాయెనో నిశ్చయముగా చెప్పవీలులేదు గాని రెండవ పత్రికయందలి 10-13 అను నాలుగధ్యాయములు పత్రికలోని కడమ యధ్యాయముల కసంగతమైనవై యుండుటచే వేదవేత్తలలో పెక్కండ్రు ఆ నాలుగధ్యాయములు మొదట నొక ప్రత్యేక పత్రికయై యుండి తరువాత రెండవ పత్రికయందు కలుపఁబడెనని భావింతురు. అట్లయిన యెడల పౌలు కొరింథీ సంఘస్థులకు వ్రాసిన పత్రికలు కనీసము నాలుగు అనవచ్చును. 1. మొదటి పత్రిక $5^{9-12}$ యందు సూచింపఁబడినది. 2. ఇప్పుడు క్రొత్త నిబంధనలోనుండు మొదటి పత్రిక. 3. దుఃఖకరమైన పత్రికయనగా II కొరి 10-13 అధ్యాయములు. 4. ఇప్పుడు క్రొత్త నిబంధనలో నుండు రెండవ పత్రికయందలి 10-13 అధ్యాయములుతప్ప మిగిలిన భాగము అని అభిప్రాయ పడుచున్నారు.

ముఖ్యభాగములు

**I.** 1. పీఠిక పైవ్రాఁత, అభివందనములు, ఆదరణకర్తయగు దేవునికి స్తుతులు $1^{1-14}$.

**II.** 1. పౌలు తమయొద్దకురానందున మాట తప్పిన వాడని యన్న వారికి సమాధానము చెప్పుట $1^{15}$-$2^{11}$; 2. తీతు తనకు తెలియఁజేసిన సమాచారమునుబట్టి తన సంతోషమును కనఁబఱచుట $2^{12-17}$; 3. దానిని బట్టియే తాను చేసిన యథార్థ తను గుఱించి వ్రాయుట $3^{1}$-$6^{13}$ $7^{1-4}$; 4. వారు అన్యులతో జతగాండ్రై యుండరాదని హెచ్చరించుట $6^{14-16}$; 5. తీతు రాకడను గూర్చిన సంగతులను ముగించుట $7^{5-16}$.

**III.** యూదయ ప్రాంత్యముల యందలి సంఘముల చందా నిమిత్తమైన ఏర్పాటులు, హెచ్చరికలు (8, 9 అధ్యా).

**IV.** తన్ను దూషించిన వారిని ఖండించి తన పని విధమును, కష్టముల వివరమును, తన యధికార మూలమును వివరించుటవలన అట్టివారి నటనలను కనఁబఱచుట (10,11,12 అధ్యా).

**V.** ముగింపు హెచ్చరికలు, ప్రయాణ క్రమము, వందనములు, ఆశీర్వాదము (13 అధ్యా). **M.**

**కొరింథు** (Corinth). ఉత్తర దక్షిణ గ్రీసు దేశములకు మధ్య నొక యిరుకైన వెడల్పుగల భూసంధిమీఁద కట్టబడిన యొక పట్టణము. ఈ పట్టణమునకు పశ్చిమమున 1½ మైలు దూరముగా లెకియము తూర్పున 8½ మైళ్లు దూరముగా కెంక్రేయ యను రెండు రేవు స్థలములు గలవు. ఈ పురము కేవలము ప్రాచీన కాలములో మొదట స్థాపింపఁ బడెనుగాని క్రీ॥ పూ॥ 146 సం॥మందు రోమా సైన్యాధిపతియైన మమ్మియను దానిని సమూల నాశనము చేసినపిమ్మట దాదాపు 100 సం॥ల వఱకు నది శిథిలమై నిర్జనమైనదిగా నుండెను. క్రీ॥ పూ॥ 46 సం॥మందు రోమాచక్రవర్తియైన జూలియసు కైసరు దాని మఱల కట్టించి దూర ప్రదేశమునుంచి ప్రజను రప్పించి వారికి ప్రవాస స్థలముగాఁ జేసెను. ఇది భూసంధిమీఁద కట్టఁ బడినందున ఉత్తర దక్షిణ గ్రీసుదేశములకు జరుగు వ్యాపారమునకు మధ్యస్థానముగా నుండెను. అదియుఁగాక తూర్పుదేశములనుంచి సబురుచేసి వచ్చిన నావికులు ఈజియన్ సముద్రమందు సంభవించు అపాయములకు వెఱచి కెంక్రేయలో సరకులను దిగుమతిచేసి తిరుగ పశ్చిమమున నుండిన లెకియమను రేవున కెగుమతి చేయవలసి యుండెను గనుక కొరింథు పట్టణమందు వ్యాపార మధికమాయెను. ఈలాగున ఓడలోని సరుకు దిగుమతి యెగుమతి చేయక యోడను ఉన్నపాటుననే ఈ రేవునుండి ఆ రేవున కీడ్చుకొని పోవుట కొక మార్గము చేసిరి.

నీరోచక్రవర్తి కాలమున ఆ భూసంధిగుండా నొక కాలువ త్రవ్వనుద్దేశించిరిగాని ఆపని కొనసాగింపలేరి. ప్రస్తుతము ఓడలు పోవునట్టి నంతటి కాలువ యొకటి యేర్పడినది. కొరింథు పట్టణము కట్టఁబడిన భూసంధి చదరముగాను రాళ్లమయ మయినదిగా నుండినను ఆ పట్టణము సమీపమున రెండువేల యడుగుల యెత్తుగల యొక దుర్గముండెను. కేవలము ప్రాచీనకాలమున దాని శిఖరమున నొక యూరును ఒక బలాఢ్యమైన దాని కోటయుఁ గట్టఁబడెను. ఈ పట్టణమందు వ్యాపారమధిక మగుటవలన మాత్రమే కాక బహు శృంగారముగాఁ గట్టఁబడిన కామదేవత యొక్క దేవాలయ ముండుటవలన జనబాహుళ్య మైనదై యుండెను.

ఈ కామదేవత యాచారి ననుసరించుటను బట్టి యీ పట్టణస్థులు అసహ్య ప్రవర్తనకు లోక ప్రసిద్ధులై యుండిరి గనుక వారివలె అవాచ్య దుస్థితి ననుసరించిన వారి నడతను గుఱించి కొరింథిసేతి యను పరిహాసపదము వాడుకలోకి వచ్చెను.



కొరింథు పట్టణము (ప్రస్తుతము)

కొరింథు పట్టణము యొక్క ప్రఖ్యాతికి మఱి యొక కారణముండెను. ఏమనిన ఆ భూసంధి మీద 5 సం॥ల కొకపర్యాయము ఆ దేశమం దంతట మిగుల ప్రఖ్యాతిచెందిన పందెములు జరుగుచుండెను. దీనినిగూర్చి I కొరి $9^{24-27}$ నందు సూచన గలదు. ఆ పందెములలో గెలిచినవారు మిగుల శ్లాఘనీయులుగా నెంచఁబడిరి గనుక గ్రీసు దేశస్థులు మాత్రముకాక ఇతర దూరదేశముల వారును ఆ పందెములయందు ప్రవేశించువారు. ఆ వేడుకలు జరుగు సమయమున కొరింథు పట్టణమున కెన్నశక్యముగాని జనసమూహము వచ్చుట కద్దు. అదియుగాక ఆ పట్టణము విద్యా ప్రవీణతకును ప్రసిద్ధిచెందినదాయెను. అక్కడనుండిన సర్వకళాశాలలో సకల శాస్త్రములు పదిలముగా బోధించఁబడెను. ఇందువలన వారి మృదుభాషయు వారి గ్రంథములయొక్క మధురశైలియు లోకమందంతటను మనోహరమైనదై యుండెను. (పటము V, F 4). M.

**కొరుకుడు కుష్ఠము** రోగములు చికిత్సలు II 5 (1), (3) చూ॥

**కొర్నేలి** (Cornelius). కైసరయలోనున్న ఇటలీ పటాలమనఁబడిన పటాలమునకు సేనాని. అతఁడు రోమీయుఁడని వాని యుద్యోగము వలనఁ దెలియుచున్నది. భక్తిపరుఁడును ధర్మనిరతుఁడునై యుండెను. రక్షణ సువార్తను అతఁడు వినునట్లు ఆతనికిని అన్యులైనవారికి బోధించునట్లు పేతురునకును దర్శనములు కలిగెను గాన అతఁడప్పుడు యొప్పేలోనున్న పేతురును పిలిపించుకొని సువార్తను విని నమ్మి సంఘము నందుఁ జేరెను. అన్యులు సంఘమునందు చేర గూడదని సంఘస్థులకు కలిగియున్న సంశయములను దీర్చుటకట్టి అద్భుతములగు దర్శనములు కలుగుట అవసరముగా నుండెను. అతనిని అతని కుటుంబమును చేర్చుకొనుటవలన అన్యులును ప్రవేశించునట్లు సంఘపు తలుపులు తెరువఁబడెనని చెప్పఁదగును. ఆ గొప్ప కార్యమునుబట్టి అతఁడు మారుమనస్సు నొందుటను గూర్చిన చరిత్ర బహు విశదముగా నున్నది (కార్య 10, $11^{1-18}$ $15^{7-11}$).

**కొర్బాను** (Corban = అర్పితము). మా $7^{11}$ నందున్న హెబ్రీ భాషాపదము. క్రీస్తు యూదులు నియమించిన ఆజ్ఞలు మానవాజ్ఞలేగాని దేవుని యాజ్ఞలుకావని రుజువుచేయుటకు దీని నెత్తెను. తమ తల్లి దండ్రులను పోషింప నిష్టపడని యూదులు యెంత స్థితిగలవారైనను అది కొర్బాను అని చెప్పిన పక్షమున వారి పోషణార్థమై ఒక దమ్మిడి సహా యియ్య నక్కరలేదని యూదుల శాస్త్రులు బోధించిరి. మన తెలుఁగు బైబిలునందీ యొక్క చోటమాత్రమే కనఁబడినను లేవీ $1^{2,3}$ లో బలియనియు $2^{1}$ నందు **నైవేద్యమనియు** $3^{1}$ **అర్పించునదియనియు** సంఖ్యా $7^{12-17}$ **అర్పణమనియు** తెనిఁగించిరి. మ $27^{6}$ నందుదాహరించిన **కానుకపెట్టె** మూలభాషయందు కొర్బానను మాటకు సంబంధించినదై కొర్బానస్ (*Korbanas*) అనఁబడెను.

**కొఱకర్ర** మానములు I, వృత్తులు చేతిపనులు I 2 (1) (c) చూ॥

**కొలతలు** మానములు చూ॥

**కొలను** కోనేరు, యెరూషలేము B IV 1 చూ॥

**కొలమానాలు** వృత్తులు చేతిపనులు 2 (1) (c), (d) చూ॥

**కొలిక్కి** గుడారము 5 చూ॥

**కొలిమి** అగ్నిగుండము చూ॥

**కొలిమిత్తి** వృత్తులు చేతిపనులు II 1 (4) చూ॥

**కొలుముల గోపురము** యెరూషలేము B V 2 (7)

**కొలొస్సయి** (Colossae). మియాండరను నదికి ఉపనదిగానుండు లైకస్ (*Lycus*) యేటి యొద్దనుఁ గట్టఁబడి ఫ్రుగియ ప్రదేశమందుండిన యొక పురాతన పట్టణము. దీనికి సమీపమున 10 మైళ్ల దూరమున లవొదికయ, 13 మైళ్లదూరమున హిరాపొలి యను రెండు పట్టణములుగలవు. బహుకాలము క్రిందటనే శిథిలమై జాడయైన లేకుండ పోయిన ఆ పట్టణము కట్టఁబడిన స్థలమిట్టిదని కనుగొనఁబడెను. పురాతన గ్రంథకర్తలు ఆ పట్టణముయొక్క లక్షణములను వివరించుచు దాని సమీపమున ప్రవహించెడి వాగు అకస్మాత్తుగా నింకిపోయి అర్థమైలువఱకు సురం

గము లోపలనే ప్రవహించి తరువాత బయట కనఁబడుచుండెనని వర్ణించిరి. అట్టివాగు ఆ ప్రాంత్యములలో నిప్పుడు కనఁబడదుగాని వా రందును గూర్చి చెప్పిన మఱియొక సంగతినిబట్టి దానిని గుర్తింపఁగలము. ఆ యూరి సమీపమున ప్రవహించు యేటి నీళ్లలో ఒందు అధికముగా నుండుననియు, అది పేరుకొనిన పక్షమున ఇటుక బండకు సమానమనియు ప్లిని (*Pliny*) యను పురాతన గ్రంథకర్త చెప్పుచున్నాఁడు. ప్రస్తుతమున నా ప్రాంత్యమందు ప్రవహించు లైకసను వాగు ప్లిని చెప్పిన లక్షణము గలదిగా నున్నది. దానినీటిలోని యొందు వాగు ఒడ్డున కంటుకొని క్రమక్రమమున పేరుకొనిపోయి యెండినకొలది గట్టిపడి తుదకు రాయిగా నేర్పడును గనుక ప్రస్తుతము శిథిలమై పాడుపడియున్న కొలొస్సయి పట్టణమీ లైకస్ నదిగట్టున కట్టఁబడియుండెనని రూఢియగుచున్నది.

కొలొ $2^{1}$ నందు పౌలు మీరు నా ముఖము చూడకున్న వారనుటవలన ఆయనా సంఘమెన్నడును దర్శింపలేదని గ్రాహ్యమగును. ఆయన పత్రికలను వ్రాసిపంపిన సంఘములన్నిఁటిలో కొలొస్సయి సభ కొంచెపాటిది. పౌలు ఎఫెసునందున్న తరుణములో అతని సహచరుఁడగు ఎపఫ్రా యిచ్చట సంఘమును స్థాపించెనని వేదవేత్తల యభిప్రాయము (కొలొ $1^{7}$). తరువాత అర్ఖిప్పు దీనియందు బోధించెనని కొలొ $4^{17}$ ఫిలే 2 వలన నూహింపఁదగును. ఒనేసిము ఈ యూరివాఁడేనని కొలొ $4^{9}$ వలనఁ దెలియుచున్నది. అట్లయినయెడల ఫిలెమోనుకూడా ఈ యూరివాఁడని స్పష్టమగుచున్నది (పటము V, I 4). M.

## కొలొస్సయులకు వ్రాసిన పత్రిక (Colossians, Epistle to the).

1. గ్రంథకర్త:—పౌలే యీపత్రికను వ్రాసెననుట కెవరును సంశయింపవీలులేదు.

2. ఎవరి నిమిత్తము వ్రాయఁబడెను:—కొలొస్సయిలోని సంఘమెవరివలన స్థాపింపఁబడెనో నిశ్చయింప శక్యము కాదుగాని పౌలు మా ప్రియుఁడైన తోటి దాసుఁడని చెప్పిన (కొలొ $1^{7}$) ఎపఫ్రా ఎఫెసునందు తాను మొదట క్రీస్తు సత్యమును దెలిసికొని తరువాత కొలొస్సయిలో సువార్తను ప్రకటించి అచ్చట నొక సంఘమును స్థాపించెనని చెప్పఁగలుగునంత యాస్పదము గలదు. పౌలు ఆ సంఘమును దర్శించి యుండలేదని తానే చెప్పినట్లు $2^{1}$ నందున్నది.

3. రచింపఁబడిన కాలము:—ఈ పత్రికను రచించి నప్పుడతఁడు చెఱలోనుండెను. కైసరయ చెఱయందుండె ననుకొందురు గాని, రోమాలో ఖైదీగా నుండెనని సాధారణాభిప్రాయముగ నున్నది. అతఁడు 61 సం॥న రోమా చేరి రెండు సంవత్సరములు ఖైదీగా నుండిన పిదప 63 వ సంవత్సరమున విడుదల యాయెను గనుక నీ పత్రికను క్రీ॥ శ॥ 62 సం॥ రచింపఁబడెనని నిశ్చయింప వచ్చును.

4. ఉద్దేశము:—ఎపఫ్రా కొందఱు రోమాకు వచ్చి కొలొస్సయిలో ప్రచురించుచుండిన తప్పుబోధను గుఱించి పౌలుకుఁ దెలుపఁగా అతఁడా తప్పుడు సిద్ధాంతములను ఖండించుటకై యీ పత్రికను వ్రాసి యాసమయమున చిన్నాసియా ప్రాంతములకు పోవుచుండిన తుకికు చేతికిచ్చి కొలొస్సయి సంఘస్థులకు పంపెను. ఆ సమయమునసే నతని చేతనే ఎఫెసి పత్రికను గూడ వ్రాసియంపెను (ఎఫె $6^{21}$). ఈ రెండు పత్రికలేక సమయమునందె రచింపఁబడుటంజేసి వాటికి చాల సంబంధముగలదు. వాటికుండు సంబంధమునుబట్టి అవి రెండు నొకటే సమయమున వ్రాయఁబడిన వనుటకెట్టి సంశయము నుండదు. ఈ దుర్బోధకు లెవరైనది విశదముగాఁ జెప్పుటకవకాశము లేదుగాని వారు బాహ్యాచారములను గొప్పజేసి సున్నతి యవసరమని బోధించి యూదులు గైకొను పండుగలను అమావాస్య విశ్రాంతి దినములను ఆచరించుట యావశ్యమని బోధించుటవలన వారు యూదా మతస్థులని వెల్లడియగుచున్నది.

అయినను వీరు దూతల యారాధనను గుఱించియు, క్రీస్తు సర్వాధికారమునకు విరుద్ధమైన నిరర్థక తత్త్వజ్ఞానమును గుఱించియు గొప్పముగా నారాధించుటవలన వారు తరువాతి కాలమున క్రీస్తుమతమును భ్రష్టుపఱచిన జ్ఞోస్తికులని పండితుల యభిప్రాయము. ఈ తప్పు సిద్ధాంతములను బోధించువారి యుపదేశ మనుసరించ వద్దనియు క్రీస్తునందు సంపూర్ణ విశ్వాసము గలిగి

ఆయనను హత్తుకొని యుండవలెననియు; దుర్బోధల వలనఁ గలిగిన అక్రమ ప్రవర్తనను చక్కపఱచవలెననియు కొలొస్సయి సంఘస్థులను హెచ్చరించి బుద్ధిచెప్పుట కీ పత్రికను రచించెను. M.

5. ముఖ్యభాగములు:—

I. పీఠిక:—1. పైవ్రాత, వందనవాక్యము ($1^{1-2}$); 2. తగిన కారణములను గనపఱచుచు దేవునికి కృతజ్ఞత చెల్లించి ప్రార్థించుట ($1^{3-23}$); 3. తన కప్పగింపఁబడిన పనినిగూర్చి తెలుపుట $1^{24-29}$.

II. తప్పుబోధలను ఖండించుట:—1. ఆ సభవారి విషయమై తనకున్న చింత $3^{1-5}$; 2. స్థిరముగా నుండుఁడని హెచ్చరించుట $22^{6,7}$, 3. ఆయా తప్పు బోధలను ఖండించుట:— (1) మోసకరమగు తత్త్వజ్ఞానము ($2^{8-11}$); (2) సున్నతి ($2^{13-15}$); (3) ఉత్సవదినములు ($2^{16,17}$); (4) దేవదూతారాధనలు ($2^{18}$). (5) వారు క్రీస్తును అనుసరించిన వారైన యెడల వీటన్నిఁటి యొక్క నిష్ప్రయోజనము ($2^{19-23}$).

III. నీతిబోధలు:—1. క్రీస్తు లేచినందున మనము నూతన జీవన మవలంబింపవలెను ($3^{1-4}$); 2. భూసంబంధమైన వాటిని విడిచిపెట్టవలెను ($3^{5-11}$); 3. పరలోకసంబంధమైన నీతి ననుసరింపవలసి యున్నాము ($3^{12-17}$); 4. ఆయా వారికొఱకైన విశేషనీతులు (1) భార్యాభర్తలు ($3^{18,19}$); (2) పిల్లలు, తల్లిదండ్రులు ($3^{20-21}$); (3) దాసులు, యజమానులు ($3^{22-26}$).

IV. ముగింపు సంగతులు:—1. ముగింపు హెచ్చరికలు ($4^{1-6}$); 2. తుకికును ఒనేసిముకును సిఫారసు చేయుట ($4^{7-9}$); 3. ఆయా వారికి సలాములు పంపుట ($4^{10-17}$); 4. తన వందనములతో ముగించుట, ఆశీర్వాదము ($2^{18}$).

**కొల్హోజె** (Col-hozeh = అన్నిఁటిని చూచువాఁడు). నెహెమ్యా కాలమునందు జీవించిన యొక యూదుఁడు (నెహె $3^{15}$ $11^{5}$).

# కో

**కోగిలె** పక్షులు 7 చూ॥

**కోజేబా** అక్జిబు 1 చూ॥

**కోట, దుర్గము, గోపురము, ప్రాకారములు, గోడలు** (Fortress, Stronghold).

I. కోటల యేర్పాటు.

1. ఇశ్రాయేలీయులు కనాను దేశమును జయింపక పూర్వమే అచ్చట ప్రాకారములు గల గొప్ప పట్టణములుండెను (సంఖ్యా $13^{28}$ ద్వితీ $9^{1}$). ఈ పట్టణములకు సమీపముగా నుండిన పల్లెటూళ్లయందలి జనములు తమ పల్లెలకు ప్రాకారములు లేనందున ($3^{5}$) యుద్ధకాలమున ఆ పట్టణములలోఁ బ్రవేశించి వాటిలో నాశ్రయము నొందిరి. ప్రస్తుతమున మట్టి దిబ్బలుగ పడియున్న పురాతన పట్టణముల శిథిలములను చూచి వాటి ప్రాకారము మట్టితో గట్టఁబడియున్నట్టు తెలిసికొనుచున్నాము. ఇశ్రాయేలీయులు తమ కోటలను రాళ్లతోఁగాని, యిటుకలతోఁగాని ఎత్తయిన దిబ్బలమీఁదను కొండల మీఁదను గట్టుకొనిరి. వారి కోటల శిథిలములను పరిశోధింపఁగా అవి 5-10 గజముల వెడల్పును 10 గజములకుపైన ఎత్తునుగల గోడలై యున్నట్లు కనుకొనవచ్చును. ఈ ప్రాకారపు గోడలు స్థిరముగా నిలుచుటకు మధ్యమధ్య అండ (*buttresses*) లనా గోడలకు పెట్టిరి. ఇవే **గోపురము** లయ్యెను. కావలివారికిని కోటను కాపాడెడి భటులకు నిట్టి గోపురములు మిగుల సహాయకరము లాయెను. ఈ గోపురములపైన చుట్టును అక్కడక్కడ రంధ్రములుండునట్లు గట్టి పిట్టగోడలు కట్టిరి. యెష $54^{12}$ నందున్న **కోటకొమ్ము** లివేనని కొందఱి యభిమతము కొన్ని కోటలయందు ఒకటికి రెండు లేక మూఁడు ప్రాకారములుండునవి. దుర్గము అన్నిఁటికి మధ్య నుండి మఱిబలముగలదై యుండెను. తేబేసులోని పట్టణపు నడుమనున్న **బలమైన గోపురము** (న్యాయా $9^{51}$) తిర్సాలోని **రాజనగరు** (I రాజు $16^{18}$) **యెజ్రెయేలు గోపురము** (II రాజు $9^{17}$) అనునట్టి మధ్యనుండు దుర్గములు కావచ్చును. యెరూషలేమునందున్న **సీయోను కోట** (I దిన $11^{5}$) అట్టి దుర్గమని యభిప్రాయపడుచున్నారు. మక్కబీయుల కాలమునందట్టి దుర్గ మొకటి యెరూషలేము నందుండెను (I మక్క $1^{33}$ $3^{55}$). అంతోనియకోట సీయో

నుకు వేఱుగా నుండినను ఆ కాలమునందే మిగుల పేరుపడెను. క్రొత్తనిబంధనకాలములో పౌలు దీనియందుఁ గొన్నాళ్లు ఖైదీగా నుండెను (కార్య $21^{34}$ $22^{24}$ యెరూషలేము A IV 2, అంతోనియ కోట చూ॥). ఇట్టి దుర్గము లన్నికోటలయందు నుండలేదు. సాధారణమగు కోటల ప్రాకారము చుట్టు కందకముండునది. శత్రువులు దేశముపై దండెత్తి వచ్చినప్పుడు వారు వెళ్లవలసి యుండిన మార్గములలోను, మఱీముఖ్యముగా ఆ మార్గముల లోనున్న కనుమల దగ్గిర సొలొమోను ఇట్టి కోటలను గట్టించెను (I రాజు $9^{15,17,18}$). రెహబాము (II దిన $11^{10}$) యోతాము (27⁴) ఆట్టి వాటినిఁగట్టించిరి. నెహెమ్యా చెఱకాలమునకుఁ దరువాత యెరూషలేము ప్రాకారములను గట్టించి ప్రతిష్ఠించెను (నెహె 6). ఈ దిగువ నుదాహరించినవి క్రొత్త నిబంధన కాలమునందు పలెస్తీనులో బలమైన కోటలుగా నెంచఁబడెను (1) యెరూషలేము (2) దక్షిణమునందున్న బేత్సూరా (*Bethsura*). ఇది మక్కబీయుల కాలమునందును ప్రసిద్ధి జెందెను. (3) గలిలయలోని యొటపటా (*Jotapata*) ఇది యోసీఫసు కాలము నుండి ప్రసిద్ధికెక్కెను. (4) మృతసముద్రపు తూర్పుతీరమున మోయాబు మన్యప్రదేశమందలి మకేరస్ (*Machaerus*). ఇచ్చటనే హేరోదు బాప్తిస్మమిచ్చు యోహానును ఖైదుచేసి చివరకుఁ జంపించెను. యెరూషలేము నాశనమైన పిమ్మట మసాదా (*Masada*) యను మఱియొక కోటను రోమనులు చివరకు పట్టుకొనిరి.



ఐగుప్తీయులు దుర్గమును ముట్టడించుట

**2. కోట గవనులు** ప్రస్తుతకాలమందువలె ఆ కాలమునందును మిగుల ముఖ్యస్థానములై యుండెను. వీటిద్వారా శత్రువులు కోటలోనికి రా యత్నింతురు గాన వీటి సమీపమునందు గోపురములు మఱింత బలమైనవిగా నుండునట్లు కట్టిరి (II దిన $26^{9}$). ఈ గవనులకు వెలి ద్వారమును లో ద్వారము నుండెను. అబ్షాలోముతో తన సైన్యము చేయుచుండిన యుద్ధసమాచారము కొఱకు కనిపెట్టుచుండిన దావీదు రెండు గుమ్మముల మధ్య కూర్చుండెను (II సమూ $18^{24}$). అవి యీ రెండు ద్వారములను సూచించును. వాటి కిఱువైపుల నుండు గోపురముల నెక్కుట కిచ్చటనే మెట్లు నుండును ($18^{33}$). కావలివారు వీటిమీఁద నెక్కి కనిపెట్టుచుందురు.

**3.** ఈ గవనుల యందలి ద్వారములకు తలుపులు గలవు. యెష $45^{1}$ లోని తలుపులని

యర్థమిచ్చు మూల భాషాపదము ద్వివచన మం దుండుటవలన ఆ ద్వారమునకు రెండు తలుపు రెక్కలుండునని తెలిసికొన వచ్చును. అవి కఱ్ఱతోఁ జేయఁబడినవైనను మఱింత దిట్టముగా నుండునట్టు వాటిని యిత్తడి (రాగి)తో కప్పిరి. కావున వాటిని ఇత్తడి తలుపులని పిలిచిరి (కీర్త $107^{16}$ యెష $45^{2}$). ఈ తలుపులను మూసివేసిన పిమ్మట వాటిని తీయకుండునట్లు అడ్డుగడల నుపయోగించిరి. అవి యిత్తడితోఁగాని (I రాజు $4^{13}$) ఇనుముతోఁగాని (యోబు $40^{18}$) చేయఁ బడెను. సమ్సోను గాజాపట్టణపు తలుపులను ద్వారబంధములను అడ్డుగడియలతో నూడఁదీసి యెత్తుకొని వెళ్లెను (న్యాయా $16^{1-3}$). ముఖ్య ద్వారముల దగ్గరనే కావలివారి నుంచిరి (II రాజు $7^{17}$ II సమూ $18^{24}$).

II. కోటలను జయించుట.

కోటలనిట్లు దిట్టపఱచుట మాత్రమేగాక, వాటిని జయించి పట్టుకొని పడఁగొట్టుట యుద్ధ ప్రబంధములలో మిగుల ముఖ్యమైనదిగా నెంచిరి. అంత బలములేని కోటలను పట్టుకొనవలసి వచ్చినప్పుడు దొమ్మిజేసి వాటిలోఁ బ్రవేశించ యత్నించిరి. గవనులను పగలగొట్టి లోపలికిఁ జొచ్చుటకుఁ జూచిరి (యెష $28^{6}$). ద్రోహులగు వారు పట్టణమును శత్రువుల కప్పగించుటకై గుమ్మములను తెఱచిగాని రహస్య మార్గములను జూపిగాని యుందురు (న్యాయా $1^{23,24}$). కోటలను బట్టుకొన నెంచిన వారి గుమ్మములను తెగఁబెట్ట యత్నించిరి ($9^{49,52}$). ఇట్టి యుపాయములుజేసి గుమ్మముల ద్వారా కోటలోఁ బ్రవేశింపలేక పోయినయెడల ప్రాకారముల నెక్కి దానిని బట్టుకొనుటకై నిచ్చెనల నుపయోగించిరి (I దిన $11^{6}$ సామె $21^{22}$). అట్టి నిచ్చెనలనుగూర్చిన సూచనలు బైబిలునందు లేకున్నను I మక్క $5^{30}$ లో నున్న లెక్కలేని నిచ్చెనలను పదము అట్టి వాటిని తెలుపును. ఇట్లు బలత్కారముగాఁ బట్టుకొన వీలులేనప్పుడు కోటలను యుక్తులచే స్వాధీన పఱచుకొనిరి. హాయి పట్టణమును యెహోషువయును (యెహో $8^{10-23}$), షెకెమును అబీమెలెకును (న్యాయా $9^{34-45}$). ఇశ్రాయేలీయులు గిబియా పట్టణమును ($20^{30-48}$) పట్టుకొనిరి.

సాధారణమగు కోటలనిట్లు పట్టుకొనినను దిట్టమగు వాటిని జయించుటలో వేఱు తంత్రముల నుపయోగింప వలసివచ్చెను. సాధారణముగా వాటిని ముట్టడివేసి ఆ పట్టణములోనికి రాకపోకలు జరుగనియ్యక ఆకలిచే నందలి ప్రజలను అలయటించునటులఁజేసి వాటిని స్వాధీన పఱచుకొనిరి. నీటి కాలువలను నాశనముజేసి కోటలోని వారికి నీటికిబ్బంది కలుఁగజేసిరి. యోవాబు అమ్మోనీయుల రబ్బాపై యుద్ధము చేయుచు జలములమీఁది పట్టణమును పట్టుకొంటినని దావీదుకు వర్తమానము చేసినది ఇట్టి నీటి వసతులుగలభాగమై యున్నట్లు II సమూ $12^{26,27}$ వలనఁ దెలియుచున్నది. గాన కోటలోపలనుండు వారు ముట్టడింపఁబడు జాడలు పొడచూపఁగానే ఆహారమునకును నీటికిని వెలితి లేకుండునట్లు ముందుగనే జాగ్రత్త పడిరి (యెరూషలేము A II 2, III 2 చూ॥). కోటను ముట్టడి వేయుచున్నను, దానిలోఁ జొరఁబడుటకు సమయములను వెదకిరి. కోటయందుండు వారిట్టి యత్నములను విఫలము జేయుట మాత్రమేగాక ప్రాకారములమీఁదనుండి శత్రువులను బరిమార్చుటకును, అనుకూల తరుణములకై వేచియుండి గుంపులు గుంపులుగా సైనికులను ద్వారములగుండ శత్రుమధ్యమునకుఁ బంపి వారిని చీకాకు పఱచుటకును యత్నించెడివారు. అష్షూరీయులును (II రాజు 17-19) బాబెలు వారును (II రాజు 25) ముఖ్యముగా యెరూషలేమును ముట్టడించుటను గూర్చియే బైబిలునందు దృష్టాంతములు కనఁబడుచున్నవి. గాని అట్టి ముట్టడి కాలములో ననేక పోరాటములు జరిగెను.

1. ముట్టడి వేయువారు ప్రాకారముల యెదుట ముట్టడి దిబ్బను గట్టిరి. (II రాజు $29^{32}$ = యెష $37^{33}$ యెహె $4^{2}$ $17^{17}$). ఈ పదమునే II సమూ $20^{15}$ లో బురుజు అని తెనిఁగించిరి. ముట్టడించినవారు కోటచుట్టుకట్టిన ఎదురుకోట యని దీనిని చెప్పవచ్చును. క్రమక్రమముగా వారు దీని పట్టణమునకు జరిపి కట్టుచువచ్చిరి. దానిని మట్టితో కట్టిరి. దీని చాటున శత్రువులు తమ్మును దాచుకొనిరి. నెబుకద్నెజరు ఇట్టి దిబ్బలను యెరూషలేమునకు దగ్గరగా కట్టించుకొన్నట్లుగా నున్నదిగాని ఆ పదముపై

పదమునకు సంబంధించినదిగాక యెహె $4^{2}$ $17^{17}$ లో బురుజులని తెనిఁగింపఁబడిన పదమై యున్నది. ద్వితీ $20^{20}$ లోని మఱియొక పదము ముట్టడి దిబ్బయని తెనిఁగించిరి. దీనిని మ్రాకులతోఁ గట్టిరి. లూ $19^{43}$ నందున్న గట్టు అట్టిముట్టడి దిబ్బను సూచింపవచ్చును.

2. **బురుజులు**. వీటిని ప్రాకారములలో నచ్చటచ్చటఁ గట్టించిరి. ఇవి ప్రాకారములు దిట్టపడుటకు మాత్రమేగాక, యోధులా బురుజుల మీఁదనుండి ప్రాకారములను మఱీబాగుగా కాపాడుటకు అనుకూలముగా నుండెను. పట్టణ ప్రాకారపు బురుజుల లెక్కనుబట్టి ఆ కోట బలమును నిర్ణయించిరి (కీర్త $48^{18}$). యెహె $17^{17}$ లోని బురుజులు శత్రువులు కట్టిన ముట్టడిదిబ్బలోని బురుజులుగాఁ దోచుచున్నవి (పైన 1 చూ॥).

3. ప్రాకారములను పడఁగొట్టుటకై నొక విధమగు **యంత్రములను** వాడిరిగాని అవి యెహెజ్కేలు కాలమునకుఁ బూర్వమున్న సూచనలు లేవు (యెహె $4^{2}$ $21^{22}$ $26^{9}$). మంచి చేవగల పొడుగాటి మ్రానుల చివరలోహముతో కప్పి వాటిని వ్రేలాడఁగట్టి గొలుసులతో లాగి ప్రాకారముల కామ్రాను కొన తగులునట్లు విడిచెడివారు. వీటిని ప్రాకారముల యొద్దకు గొనిపోవుటకు రెండు మూఁడు అంతస్థుల బురుజులవంటివాటినిగట్టి వాటిని భటులతో నింపి ప్రాకారముల దగ్గఱికి పంపిరి.

4. ఈ యంత్రములను లాగెడి వారు శత్రువులవలన తమకుఁ యపాయములు గలుగకుండునట్లు తమ గుంపున కడ్డముగా పెద్ద కేడెములను పట్టుకొని వెళ్లిరి (II రాజు $19^{32}$) యెహె $26^{8}$ నందున్న డాలు అట్టిదై యుండును. నహూ $2^{5}$ లో పరాక్రమశాలురు సిద్ధపఱచిన మ్రానులు అట్టివైయున్నవి. వీటి చిత్తరువులను అష్షూరీయుల రాతి శాసనములమీఁద చూడఁగలము.



పెద్ద అంబులను ప్రయోగించు యంత్రము

5. పెద్ద అంబులను రాళ్లను ప్రయోగించుటకు ఉజ్జియా కాలములో యంత్రములను జేయించినట్లు II దిన $26^{15}$ వలనఁ దెలిసికొనవచ్చును. తుపాకులుగాని ఫిరంగులుగాని లేని యాకాలమునందు ప్రాకారములను పగలఁగొట్టుటకును శత్రువులను దూరముగాఁ దరుముటకును నివి సాధనములుగా నుండెను. వీటిని మక్కబీయుల కాలమున మిగుల ప్రయోగించిరి (I మక్క $6^{51,52}$ $13^{43}$). యెరూషలేమును నాశనముఁజేసిన రోమన్ సేనానియగు తీతు ఇట్టి వాటి నుపయోగించినట్లు యోసీఫసువలనఁ దెలియుచున్నది.

ముట్టడివేయుచున్న వారి యంత్రములను పెద్ద రాళ్లతో పాడు చేయుటకును, వారి కొయ్య పనిముట్లను అగ్ని బాణములతో తగలఁబెట్టుటకును యత్నించిరి (ఎఫె $6^{16}$). వారి బురుజులను త్వరత్వరగా కట్టుటవలన వాటికి తగిన పునాదులు లేనందున, అట్టివాటి క్రింద త్రవ్వి వాటిని పడఁగొట్టుట సర్వసాధారణ విషయము. నిచ్చెనలు

వేసికొని ప్రాకారముల నెక్కువారిపై సలసల కాగుచున్న నూనెను బోసినటుల యోసీఫసు యుద్ధచరిత్ర మువలనఁ స్పష్టమగుచున్నది. ముట్టడి వలన నొండొరులకు కలుగు కష్టములను గూర్చిన సూచన II రాజు $6^{25-29}$ నందు చూడవచ్చును.

**కోడి** పక్షులు 8 చూ॥

**కోడె** ఆవు 2 చూ॥

**కోత కాలము** పండుగలు IV 4 చూ॥

**కోతకోయుట** వ్యవసాయము VI చూ॥

**కోతి** మృగములు 21 చూ॥

**కోనేరు (Pool).** వర్షపునీటిని ఊటలనుండి యూరెడి జలమును నిలువఁజేయుటకై వీటిని త్రవ్వించెడివారు. **కోనేరు కొలను తటాకము చెలువు** అను పదములచే తెనిఁగించబడిన పదము మూలభాష యందొకటి మాత్రమేగలదు. వీటినుండి కాలువలద్వారా నీటిని పట్టణముల లోనికి రప్పించిరి (II రాజు $20^{20}$ ప్రస $2^{6}$ సైరాక్సు $24^{30}$). యెరూషలేమునందు బేతెస్ద (యోహా $5^{2}$) సీలోయము ($9^{7}$) గిహోను (I రాజు $1^{18}$) అనునవి గలవు. ఏతాము యొద్దనున్న కోనేళ్లనుండియు నీరు వచ్చునది. హెబ్రోను గిబోను సమరయ హెష్బోను నందిట్టివిగలవు (II సమూ $2^{13}$ $4^{12}$ I రాజు $22^{38}$ పరః $7^{4}$).

**కోపము, క్రోధము, కోపాగ్ని, ఉగ్రత రౌద్రము, ఆగ్రహము (Anger, Wrath, Indignation).** కోపమును సూచించు పదములు బైబిలునం దనేకములు గలవు. పాతనిబంధనలో సుమారు 12 హెబ్రీపదములును క్రొత్తనిబంధనలో 3 గ్రీకు పదములును కోపమును సూచించును. బైబిలు నాయాభాషలలోకి తర్జుమాచేసినవారు ఒక పదమును ప్రతిచోట నొకటే విధముగా తర్జుమాచేయక, పలుమాటలను వాడిరి. ఉదాహరణముగా ఎఫె $4^{31}$ లోని ద్వేషము, కోపము అను అసలు మాటలను కొలొ $3^{8}$ లో కోపము, ఆగ్రహము అని తెనిఁగించిరి. ఆ మాటలనే రోమా $2^{8}$ లో దేవుని విషయమై వాడినపుడు ఉగ్రత రౌద్రము అని తర్జుమాచేసిరి. పైన కనఁబఱచినట్లు ఈ మాటలను మనుష్యుల విషయమును దేవుని విషయమును వాడిరి.

1. మానవుల కోపము. పాతనిబంధనలో నిట్టి మాటలనేకములు కలవు (ఆది $27^{45}$ $30^{2}$ నిర్గ $11^{9}$ $32^{19}$ మొ॥). ఆయా చరిత్రలలో అట్టి కోపము న్యాయమో కాదో దాని సూచింపక చరిత్ర సంగతుల మాత్రము వివరించిరి. పాతనిబంధనలో నీతి మంజరిగా నెంచఁదగిన సామెతెల గ్రంథము త్వరగా కోపపడుట పాపమని బోధించుచున్నది ($14^{29}$ $15^{1,18}$ $16^{32}$ $29^{8}$). క్రొత్తనిబంధనలో దీనిని సూచించు మాటలు తక్కువ. న్యాయముగా కోపపడినను (ఎఫె $4^{26}$ మా $3^{5}$) అది పాపమని సాధారణముగా ఖండింపబడెను (మ $5^{22}$). క్రొత్తనిబంధనలో రెండు ప్రత్యేకపదములు గలవు. ఒకటి అమిత కోపమును సూచించును. రోమా $2^{8}$ గాక తక్కిన చోట్ల అది మానవులనుగూర్చి మాత్రము వాడఁబడెను. రెండవది దుష్టత్వమును ఖండించు కోపమనవచ్చును. అది సాధారణముగా దేవుని కోపమునుగూర్చి వాడిన పదమై యున్నది (మ $3^{7}$ యోహా $3^{36}$ రోమా $1^{18}$). మూఁడవపదము నొకటి గలదుగాని అది వైత్యమును సూచించునదైయున్నది. అది యోహా $7^{23}$ లో మాత్రము వాఁడబడి యూదులు క్రీస్తు పైచూపిన వెఱ్ఱి కోపమును కనఁబఱచును. పాపముల జాబితాలలో (రోమా $1^{29-31}$ $13^{13}$ గల $5^{19-21}$ మొ॥) కోపము కామక్రోధాదులకు సంబంధముగా నున్నది.

2. దేవుని కోపము. దేవునిగూర్చిన బైబిలు బోధనుచూడఁగా ఆయన ప్రేమఁగలవాఁడు మాత్రముగాక పరిశుద్ధుఁడును నీతిమంతుఁడునై యున్నాఁడు. ఇట్టి దేవుఁడైయుండుటచే ఆయన అపరిశుద్ధమైన దానిని, దుర్మార్గతను సహింపలేక దానిని ఖండించి శిక్షించును. దేవునియందుండు ఈ లక్షణమును ఆయన కోపము లేక యుగ్రత యందురు. ఈ లక్షణమును దృష్టాంతపఱచుటకు ఇశ్రాయేలీయుల చరిత్రలో ననేక సంగతులు కలవు. దేవుఁడు తిరుగఁబడువారిని ఖడ్గముచేతను తెగుళ్లచేతను కరవుచేతను లయపఱచెను (కీర్త $7^{8}$ ద్వితీ $32^{15-43}$). తన పరిశుద్ధతను దక్కించుకొనుటకై ఆయన ఎవరును ముట్టకూడదని తన పరిశుద్ధ నిబంధన మందసమును గూర్చిన ఆజ్ఞను నిర్లక్ష్యముచేసి పరాకున దాని ముట్టిన వారిని

పంపెను (I సమూ $6^{19,20}$ II సమూ $6^{7}$). దేవుని యుగ్రత యెంత బలముగలదైనను అది న్యాయమైనదని స్పష్టమగును. పాపమును లయపఱచుటకును నీతిని స్థిరపఱచుటకును ఆయన తన యుగ్రతను కనఁబఱచునుగాని ఊరకయే దాని కనఁబఱచుట లేదు. ఇట్లుండఁగా తప్పు చేయువారు తమ తప్పులను గూర్చి పశ్చాత్తాపపడి వాటినుండి తిరిగినయెడల దేవుఁడు వారిని క్షమించును (నిర్గ 32 లేవి $10^{1-6}$ సంఖ్యా $25^{11}$ ద్వితీ $13^{17,18}$). కీర్తనలను ప్రవక్తల గ్రంథములను చూడఁగా దేవుని యుగ్రత ఆయన కనికరమునకు లోనైనదని చెప్పఁదగును. దేవుఁడు దీర్ఘశాంతుఁడై యున్నాడు (కీర్త $103^{8,9}$ $145^{8}$ యోవే $2^{13}$ యోనా $4^{2}$ నహూ $1^{3}$). ఆయన నిత్యము కోపపడఁడు (కీర్త $30^{5}$ యెష $42^{1}$ యిర్మీ $3^{12}$ మీకా $7^{18}$). అయినను ఇట్టి కనికరమునకు వ్యతిరిక్తముగాఁగాక దానికి సరిపడు రీతిగానే ఆయన కనఁబఱచు ఉగ్రతను గూర్చి ప్రవక్తల గ్రంథములలో నున్నది (యెష $1^{18-20}$ $5^{25}$ $42^{25}$ $54^{8}$).

క్రొత్తనిబంధనలోకూడ ఆ బోధయే గలదు. క్రీస్తు దేవుని ప్రేమనుగూర్చి యెంత తేటగా బోధించినను ప్రతి కష్టము పాపమువలనఁ గలిగిన శిక్షయేయని ఆయన బోధింపక పోయినను (లూ $13^{1-5}$ యోహా $9^{3}$) దేవుని న్యాయమైన తీర్పులనుగూర్చి బహు ఖండితముగా బోధించి యుండెను (లూ $12^{5}$ $13^{3-5}$ మ $25^{39-41}$). పశ్చాత్తాపపడని వారికి కలుగఁబోవు శిక్షలను సూచనగా దేవునియుగ్రత లేక ఉగ్రత అను మాటలను పౌలు అనేక చోట్ల వాడియున్నాఁడు (రోమా $1^{18}$ $2^{8}$ $5^{9}$ ఎఫె $5^{6}$ కొలొ $3^{6}$). తీర్పు దినమును పౌలు ఉగ్రత దినమను చున్నాఁడు (రోమా $2^{5}$. దీనితో మ $3^{7}$ సరిపోల్చి చూ॥). క్రీస్తు రక్షణను పొందనివారు ఉగ్రతపాత్రలనియు (రోమా $9^{22}$) ఉగ్రతపిల్లలనియు (ఎఫె $2^{3}$) పౌలు వ్రాసెను. తక్కిన యపొస్తలులుకూడ అదే బోధను చేసిరి. దేవుఁడు ప్రేమయై యున్నాఁడని వ్రాసిన యోహాను (I యోహా $4^{8}$) క్రీస్తును విశ్వసింపని వాని మీఁద దేవుని యుగ్రత నిలిచియుండును నియు వ్రాసెను (యోహా $3^{36}$). పాఁతనిబంధన యొక్క భయంకరమైన శిక్షలు క్రీస్తుద్వార తీసివేయఁబడి యున్నవని వ్రాసినవాఁడు (హెబ్రీ $12^{18-24}$) మన దేవుఁడు దహించు అగ్నియై యున్నాఁడని కూడ వ్రాసెను ($12^{29}$).

క్రొత్త నిబంధనను చూడఁగా దేవుఁడు తన కోపమును కనబఱచు సమయము సాధారణముగా అంత్యదినము సంగతికూడ మనము గుర్తింపవలసినదే. ప్రక $6^{15-17}$ $11^{18}$ $14^{10}$ $16^{19}$ $19^{15}$ వచనములను మాత్రముగాక పైఁజెప్పిన క్రొత్తనిబంధన వాక్యము లన్నిఁటిని జూచినను ఇది స్పష్టమగును.

కోరమీను పక్షులు 9 చూ॥

**కోరహు, కోరె** (Korah = మంచుగడ్డ లేక బోడి).

1. ఏశావునకు అహొలీబామా కనిన కుమారుఁడు (ఆది $36^{5,14}$) ఇతఁడొక ఎదోమీయుల గోత్రకర్తయు, దాని ముఖ్యనాయకుఁడు నాయెను ($36^{18}$).

2. ఎలీఫజు కుమారుఁడు. ఏశావు మనుమఁడు (ఆది $36^{16}$). ఇది $36^{11,12}$ నందుగాని I దిన $1^{36}$ నందుగాని లేనందున ఇచ్చట పొరపాటుగా వ్రాయఁబడినదని యెంచెదరు.

3. హెబ్రోను కుమారుఁడు (I దిన $2^{43}$).

4. మోషే అహరోను అనువారి పిన తండ్రి కుమారుఁడు. ఇతఁడు వారినిగూర్చి అసూయపడి, యెహోవాకును వారికిని విరోధముగా తిరుగఁబడి, 250 మంది లేవీయులు తనతో చేయునట్లు పురిఁజేసెను (సంఖ్యా $16^{1}$). అందువలన యెహోవాయొద్దనుండి అగ్ని బయలుదేరి ధూపార్పణను దెచ్చిన ఆ ఇన్నూటయేబదిమందిని కాల్చివేసెను ($16^{35}$). అతనితోపాటు ఈ తిరుగుబాటులో చేరిన రూబేనీయులగు దాతాను అబీరాములును వారి కుటుంబములును వారి బిడ్డలతోపాటు భూమిచే మ్రింగివేయఁబడిరి ($16^{30}$ యూదా ). గాని కోరహు యొక్క భార్య బిడ్డలు అందులో చేరనందున వారు తప్పించుకొనిరి. వీరి సంతానీకులు తరువాత దావీదురాజు కాలమున దేవాలయ ద్వారపాలకులు గాను, కీర్తనలు పాడువారుగాను నియమింపఁబడిరి (I దిన $9^{19}$). కోరహునకు కోరె అను మారురూపము $9^{19}$ నందు కనఁబడుచున్నది. ఇతని సంతానీకులు కోరహీయులనఁబడిరి ($9^{19}$). H.

**కోరాషాను** (Cor=Ashan or Chor-Ashan = పొగరాజేసుండము). ఈ పేరు I సమూ $30^{30}$ నందుమాత్రము గలదు. యెహో $15^{42}$ $19^{7}$ దిన $6^{59}$ నందున్న ఆషాను ఇదే యనుకొందురు. (ఆషాను చూ॥).

**కోరెషు** (Cyrus=సూర్యుఁడు). ఏలాము రాజగు కంబైసీసు (*Cambyses*) అనఁబడిన 2 వ అహాష్వేరోషుయొక్క కుమారుఁడు. ఇతఁడు క్రీ॥ పూ॥ 590 సం॥ జన్మించి 40 యేండ్లవాఁడై 550 వ సం॥ న పారసీ సింహాసనాసీనుఁడాయెను. ఇతని తల్లి పేరు మందానే (*Mandane*) ఇతఁడు తన మేనమామయగు దర్యావేషుతో కలిసికొని బాబెలు దేశముపై దండెత్తెనని పండితులభిప్రాయపడుచున్నారు. బాబెలురాజైన బెల్షాస్సరు రాజ్యమునకు వచ్చినపిదప అతిగర్విష్ఠుఁడై యుండి వినోదములతో ప్రొద్దుపుచ్చుచు మిగుల మత్తుఁడై యున్న సమయమున వింతయైన వ్రాఁత గోడమీఁద కనఁబడి అతని రాజ్యమంతమగునను సంగతి తెలిపెననియు, ఆ రాత్రియందే కల్దీయుల రాజగు బెల్షాస్సరు హతమై మాదీయుఁడగు దర్యావేషు 62 సం॥ వాఁడై ఆ సింహాసనమెక్కెననియు దాని 5 నందు కనఁబడుచున్నది. బబులోను క్రీ॥ పూ॥ 539 సం॥ న జయింపఁబడెను.



కోరెషు సమాధి

బైబిలునందు కోరెషు యెషయా ఎజ్రా గ్రంథములలో పేర్కొనఁబడెను. అతఁడిశ్రాయేలీయులను చెఱలోనుండి విడిపించి వారి స్వదేశమునకు వారిని తిరిగి పంపుటకై దేవుఁడేర్పఱచుకొనిన సాధనమను ప్రవచనములు గలవు (యెష $41^{2,3}$ $44^{28}$-$45^{6}$). $45^{1}$ నందు యెహోవా తానభిషేకించిన కోరెషు అను ఘనమైన బిరుదు నతఁడు పొంది నట్లున్నది. అతఁడు బబులోనును జయించిన పిమ్మట ఇశ్రాయేలీయులకు మాత్రమేగాక బాబెలు వారు చెఱపట్టిన యితర జనములనుకూడ విడిపించెనని శిథిలపరిశోధకులు కనుగొన్న శాసనములవలనఁ దెలియుచున్నది.

H.

కోరే కోరహు చూ॥

**కోలాయా** (Kolaiah) = యెహోవా స్వరము).

1. అబద్ధప్రవక్తయగు అహాబు తండ్రి (యిర్మీ $29^{21}$).

2. చెఱకాలమునకుఁ బిమ్మట యెరూషలేమునందు నివాసముజేసిన యొక బెన్యామీనీయుని పితరుండొకని పేరు (నెహె $11^{7}$).

**కోవిదారుమ్రాను** (Ebony). ఈ పదము యెహె $27^{15}$ నందు మాత్రము కనఁబడును. దదాను వర్తకులు దానిని తూరునకుఁ దెచ్చిరి. ఈ చెట్టుకలప నల్లరంగు గలదై చాల గట్టిదిగానున్నది. అందువలన రాయియని యర్థమిచ్చు హెబ్రీ పదమును దీనికి వాడిరి. దానిని ఇండియా సింహళము లేక ఐతియొపియ దేశములనుండి దెచ్చిరి. తాపము చేయుటకు దీని నుపయోగింతురు.

**కోసాము** (Cosam). క్రీస్తువంశావళియందున్న యొకని పేరు (లూ $3^{28}$).

కోసీకోసఁటు దేశము చీలుకొనుట చూ॥

**కోసు** (Cos). చిన్నాసియకు నైరృతి దిక్కుగా 21 మైళ్ల పొడవున 6 మైళ్ల వెడల్పును గల ద్వీపము. ఆ దీవియందలి ముఖ్యపట్టణమునకును ఆపేరే వాడెదరు. పౌలు తన మూఁడవ ప్రయాణమునందు మిలేతును విడిచిన పిదప దీని మీఁదుగా వెళ్లెను (కార్య $21^{1}$). అది మిలేతునకు దాదాపు 40 మైళ్లు దక్షిణముగా నున్నది. పూర్వమున నీ ద్వీపము తైలములకును నీలి ధూమ్రవర్ణములకును, ద్రాక్షవనములకును ప్రసిద్ధికెక్కినది. ప్రస్తుతమున దీనిని స్టంకెయో (*Stanchio*) అని పిలుతురు. (పటము V, H 4).

# కౌ

**కౌజుపిట్ట** పక్షులు 10 చూ॥

**కౌవ** (Cauda). క్రేతుకు నైరృతిదిక్కున నున్న ఒక చిన్నద్వీపము పౌలెక్కిన ఓడ గాలికి కొట్టుకొని పోవుచుండఁగా నావికులు దానిని ఈ దీవి చాటున నడిపించిరి (కార్య 27[16]). ప్రస్తుతము దీనికి గాదో (*Gaudho*) అను పేరు కలదు. షుమారు 70 కుటుంబములు మాత్రము దానిమీఁద నివసింతురు. (పటము V, G 5).

# క్ని, క్రి, క్రీ.

**క్నిదు** (Cnidus). చిన్నాసియలోని కేరియ (*Caria*) అను పరగణాకు నైరృతి కొనయందు పూర్వము రేవుగానున్న పట్టణము. అది కోసు దీవికి 10 మైళ్లు దూరముగా నున్నది. పౌలు రోమాకుఁ బోవునప్పుడు అతఁడెక్కిన యోడ కోసును దాటిన పిమ్మట దీని కెదురుగా వెళ్లెను (కార్య 27[7]). ప్రస్తుత మచ్చటనుండు పాడు శేషములవలన అచ్చట పూర్వము గొప్ప పట్టణ ముండెనని దెలియుచున్నది గాని ఇంక మరే మియు దానిని గూర్చి తెలియదు. (పటము V, H 4).

**క్రిస్పు** (Crispus = ఉంగరపు వెంట్రుకలు గల). పౌలు కొరింథుకు వెళ్లిన సమయమున అచ్చటి సమాజమందిరపు పెద్ద. ఇతఁడు తన కుటుంబ సమేతముగా క్రీస్తు మెస్సీయాయని నమ్మి (కార్య 18[8]) పౌలువలన బాప్తిస్మము నొందెను (I కొరి 1[14]).

**క్రీస్తు** యేసుక్రీస్తు చూ॥

**క్రీస్తురాజ్యము** దేవునిరాజ్యము చూ॥

**క్రీస్తు రెండవరాకడ** (The Parousia). ఈ లోకము నందొక రాజ్యమును స్థాపించుటకు క్రీస్తు పనిజేసెను. ఆ రాజ్యము ప్రస్తుతకాల మందున్నను జయకరముగా బయలు పఱచబడి స్థిరపడు కాలము వచ్చునను బోధయు బైబిలు నందు గలదు (యేసుక్రీస్తు IV 2, దేవునిరాజ్యము II (4) చూ॥). అది క్రీస్తు రెండవ రాకడ సమయమున కలుగును. క్రీస్తే యీలాగు బోధించెను (మ 24 మా 13 లూ 21). అపొస్తలులును దాని తమ బోధలలో నొక ముఖ్యమైన దానిగా నెంచిరి (I థెస్స 4[16]-5[3] I కొరి 15[24-27, 51,57] II పేతు 3[8,9] యాకో 5[8] ప్రక 22[20] మొ॥). ఇది త్వరలో సంభవించునని వారనుకొన్నను ఆ కాలమెవరికిని తెలియదని ఆయనవలెనే వారును బోధించిరి (II థెస్స 2[1-12]).

క్రీస్తు ఆ సమయమున తన దూతల సైన్యము లతో గంభీరమగు రీతిని హఠాత్తుగా వచ్చుననియు మృతులనులేపి అందఱికి తీర్పుదీర్చి భక్తులైన వారిని తన చెంతఁజేర్చు కొనుననియు సాతానురాజ్య మును పూర్ణముగా నశింపఁజేసి దేవునిరాజ్యమును స్థిరముగా స్థాపించుననియు, సమస్తమును లోఁ బఱచుకొనునను బోధ లాయా వాక్యములయందు కనఁబడుచున్నవి. క్రీస్తు వచ్చి మొదట భక్తులను లేపి వారితోఁగలిసి ఈ లోకమునందు 1000 సంవత్సరము లేలిన పిదప దుష్టులనులేపి వారికి తీర్పు దీర్చునని చాల పురాతనకాలమునుండి కొందఱభిప్రాయపడుచున్నారు. ఇట్టి బోధకు ప్రక 20[2-7]ను ముఖ్య ఆధారముగా నెంచెదరు. నేటివఱకు కొన్ని శాఖలవారు ఈ బోధలనవలం బించినను ఇట్టి బోధను స్థిరపఱచుటకు బైబిలు నందున్న వాక్యములు చాలవని దానిని మత సిద్ధాంతముగా నంగీకరింపరు.

**క్రీస్తువిరోధి** (Anti = Christ). ఈ పదము యోహాను పత్రికలలో తప్ప బైబిలునందు మరెచ్చటను కనఁబడకున్నను (I యోహా 2[18,22] 4[3] 2 యోహా 8 వ) వాటిని గూర్చిన సూచనలు ఇతర గ్రంథములందును చూడవచ్చును.

1. పాత నిబంధనలోని బోధలు:—దేవుని పనిని విరోధించెడి మాగోగు దేశపువాఁడగు గోగు అట్టి విరోధిని సూచించును (యెహె 38, 39). దానియేలు గ్రంథమునందు వీనిని గూర్చిన సూచనలు చాలఁగలవు ఇవి యూదులను మిగుల హింసించి వారిని యెహోవా సేవనుండి మళ్లించు టకై వారి నెంతో బాధపఱచిన అంతియోకసు ఎపిఫనీసు (అంతియోకు 2 చూ॥) ను గూర్చిన సూచనలై యున్నవి (దాని 7[8] 11[20,21,25] 11[36-45]). ఇవి వానికి మాత్రమేగాక సాతాను

మూర్తికిని సంబంధించినదానికూడ చెప్పవచ్చును. యూదుల అభిప్రాయమును దీనికి సరిపడునని వారి ప్రమాణిక గ్రంథములలోని సూచనలవలన నూహింపఁదగును. ఆ విరోధి దానుగోత్రమున పుట్టుననియు (ఆది $49^{17}$ ద్వితీ $33^{22}$ యిర్మీ $6^{16}$), అతఁడు దేవునికిని ఆయన ప్రజలకును విరోధియై వారిని చాల హింసించునుగాని, మెస్సియా వానిని సంహరించుననియు యూదుల శాస్త్రులు బోధించిరి.

2. క్రొత్తనిబంధనలోని బోధలు:—క్రీస్తు అబద్ధపు క్రీస్తులనుగూర్చి జాగ్రత్తపడుఁడని తన శిష్యులకు హెచ్చరికలను జేసెను (మ $24^{24}$ మా $13^{21}$) గాని వారిలో నొకఁడు సాతానని మాత్రము స్పష్టముగాఁ జెప్పియుండలేదు. మా $13^{14}$ నందున్న నాశనకరమైన హేయవస్తువు అనునది అతనిని సూచించునని కొందఱి యభిప్రాయముగాని అది సిద్ధికాదు.

పౌలు పత్రికలయందు వీనినిగూర్చి మఱింత తేటయగు సూచనలుగలవు. II కొరి $6^{15}$ లోనున్న బెలియాలు అనుపదము కొన్ని ప్రతులలో బెలియారు అని యున్నది. యూదుల అప్రమాణిక గ్రంథములలో బెలియారు అనునది క్రీస్తు విరోధి పేరులలో ముఖ్యమైనదిగా కనఁబడుచున్నది. గనుకనే ఆ వాక్యము క్రీస్తునకును క్రీస్తు విరోధికిని ఏమి సంబంధము అని యర్థమగునని కొందఱు అభిప్రాయపడుచున్నారు. II థెస్స $2^{1-12}$ నందు క్రీస్తు విరోధినిగూర్చి మఱీ స్పష్టమగు సూచనగలదు. అందులో నతఁడు నాశనపురుషుఁడు పాపపురుషుఁడు, ధర్మవిరోధి యనఁబడును (II థెస్స $2^{3,7}$). ఏది దేవుఁడనబడునో ఏది పూజింపఁబడునో దానినంతటి నెదిరించుచు, దానికంతటికిపైగా తన్నుతాను హెచ్చించుకొనుచు తాను దేవుఁడనని కనఁబఱచుకొనుచు దేవుని యాలయములో కూర్చుండును (వచ 4) అను వివరము కొంతవఱకు దాని $11^{36}$ $18^{13}$ $9^{27}$ $11^{31}$ $12^{11}$ లో నున్న వాటి ననుసరించును. ఇంత గొప్పవాఁడైనను ప్రభువైన యేసు వానిని తన శ్వాసచేత నశింపఁజేయును (యెష $11^{4}$ II థెస్స $2^{8}$).

యోహాను పత్రికలయందు వీఁడొక్కఁడే గాక ఇంక ననేకమంది విరోధులున్నట్లు కనఁబడును (I యోహా $2^{18-22}$ $4^{3}$ II యోహా 7). క్రీస్తు నరావతారి కాలేదనువారును క్రీస్తు విరోధులని వాటిద్వారా తెలియుచున్నది.

ప్రక 13-20 నందు గూఢార్థములగు అలంకారములతో నీ విరోధి సూచింపఁబడెను. క్రూరమృగము ($13^{1}$) వాటిలో నొకటి. $12^{9}$ $13^{1,2,3,5-10}$ $14^{11}$ ను II థెస్స $1^{1-12}$ ను చాలమట్టుకు సంబంధించి యున్నవి. ఈ బోధల వివరమును బట్టి, క్రీస్తు విరోధి సాతాను యొక్క మూర్తియని చెప్పవచ్చును. అతఁడు నీరోచక్రవర్తి యని కొందఱి యభిప్రాయముగాని, అతఁడు క్రీస్తు విరోధికి ముంగుఱుతని చెప్పుట యుక్తము. సంఘచరిత్రయందు వచ్చు వారిలోఁ గొందఱు క్రీస్తు విరోధులని దృష్టాంతములు గలవు. పోపు అట్టివాఁడని చెప్పిన ప్రొటెస్టాంటువారు పూర్వముండిరి. లూథరు క్రీస్తు విరోధియని రోమను కథోలిక్కు లనుచున్నారు. పైనుదాహరింపఁబడిన వాక్యములవలన క్రీస్తు విరోధియను పేరు దుర్మార్గుల కందఱికి ఒక విధముగా సరిపడినను లోకాంతము రాక పూర్వము దుష్టుల కధికారి యగు నొకని కాబిరుదు ముఖ్యముగా చెందును. సాతాను రాజ్యమంత మొందునప్పటికి క్రీస్తు రాజ్యము వృద్ధినొంది వెలుగును (మ $13^{24-30}$). అంతము రాకపూర్వము వీటికి మఱిగొప్ప పోరాటము కలుగును. దుర్మార్గుల నా పోరాటమునందు నడిపింపఁబోవు వాఁడు మిగుల శక్తివంతుఁడై యుండును. అతఁడే క్రీస్తు విరోధి. అతఁడెంత బలము గలవాఁడైనను క్రీస్తువలన లయపఱచఁబడుననునది ఆ వాక్యముల బోధసారమై యున్నది.

## క్రూ

క్రూరత్వము, బలాత్కారము, బాధించుట (Cruelty, Oppression). క్రూరులను పదముచే తెనిఁగించిన హెబ్రీ భాషాపదము శత్రువులకు వాడిన పదమైయున్నది (సామె $5^{9}$ యిర్మీ $50^{42}$). దేశముయొక్క శత్రువులు క్రూరజనమనఁబడిరి ($6^{23}$). శత్రువులు వీరికిఁ జేసినది క్రూరసర్పముల విషముతో తుల్యమైన ద్రాక్షారసమువంటిదని యెంచిరి (ద్వితీ $32^{33}$). విచారకరమగు వార్తను దెచ్చువాఁడు క్రూర దూత

యనఁబడెను (సామె 17$^{11}$). అధిక కష్టములలో చిక్కుకొనిన యెరూషలేము నగరవాసులు స్వంత బిడ్డలయందు దయలేని నిప్పుకోళ్లవలె క్రూరచిత్తులైరని ప్రవక్త ప్రలాపించెను (విలా 4$^{3}$). క్రోధము క్రూరమైనదిగా నెంచిరి (యెష 13$^{9}$ 27$^{4}$). తనయెడల దేవుఁడు సహా క్రూరుడాయెనని యోబు విలపించెను (యోబు 30$^{21}$). ఈ వాక్యమందలి కఠినుఁడు అనునదే యీ మూలపదమై క్రూరత్వము సూచించును. కఠినత్వమును సూచించెడి మఱియొక పదమును బలాత్కారమని తెనిఁగించిరి (కీర్త 18$^{48}$ II సమూ 22$^{49}$ కీర్త 140$^{1,4}$). సామె 3$^{31}$ నందని బీదలను నిర్దయగా మాచెడి స్థితిమంతుల కఠినత్వమును సూచించును. ఆ పదమే షిమ్యోను లేవియను యాకోబు కుమారుల క్రూరత్వము కనఁబఱచు బలాత్కారపు ఖడ్గములను దృష్టాంతముగ ప్రయోగింపఁబడెను (ఆది 49$^{5}$). మానవుల దుష్టకార్యములెట్టి జగులచేత వారు బలాత్కారముతో భూమిని నింపినట్లుగా నున్నది (6$^{13}$). ఐగుప్తీయులు ఇశ్రాయేలీయులను బాధించుటను గూర్చినమాట పైనున్న వాటికి సంబంధించినదె యున్నది. దానిని నిర్గ 3$^{9}$ లో **హింసించుట** యని తెనిఁగించినను చుట్టునున్న అన్యులు న్యాయాధిపతుల కాలములో వారిని కష్టపెట్టుటను గూర్చి బాధించుట యని తెనిఁగించిరి (న్యాయా 6$^{9}$). ఇట్లు ఇతరులను బాధింపరాదనియు (లేవి 25$^{14}$ ఆమో 3$^{9}$), కూలివారిని నహబాధ పెట్టకూడదని బైబిలు తేటగా బోధించును (ద్వితీ 24$^{14}$).

క్రూరమైన శిక్షలను కొన్నిఁటిని దేవుని యను మతి మీఁదనే ప్రయోగించినట్లు అక్కడక్కడ సూచన లగుపడుచున్నవి (20$^{17}$ యెహో 6$^{21}$ II సమూ 12$^{31}$) అట్టి శిక్ష లాకాలమునందెంత యవసరముగ నున్నను క్రీస్తు అట్టి క్రూర శిక్షల వలనగాక అపరిమితమగు ప్రేమచేతనే మానవులను రక్షించుననను సంగతి లూ 9$^{55}$ వలన స్పష్టమగుచున్నది.

**క్రూరమృగము** (Beast). బైబిలునందు అడవిమృగములను సూచించెడి యొక్క మూల భాషాపదమును దుష్టమృగమనియు అడవిమృగమనియు తెనిఁగించిరి. ఈ పదమునకు విశేషయర్థము లేకపోవుటవలన దానిని వివరింప నవసరము లేదు. ప్రక 13$^{1-4}$ లందున్న ఆ పదమునే క్రూర మృగమని తెనిఁగించిరి. అది క్రీస్తు విరోధిని సూచించునని సాధారణముగా అర్థము చెప్పెదరు. ప్రక 13$^{1-18}$ నందున్న క్రూరమృగము క్రీస్తు విరోధి ప్రతినిధియైయున్నది. ఈ యలంకారములకు దాని 7$^{3-12}$ ఆధారములుగా నుండవచ్చును.

**క్రూరపక్షి** పక్షులు 11 చూ॥

**క్రూరసర్పము** మకరము చూ॥



**క్రేతు, క్రేతీయులు** (Crete, Cretans). గ్రీసు దేశమునకు దక్షిణముగా 50 మైళ్ల దూరములోనున్న ద్వీపమునకు క్రేతు అని పేరు. దానిలోని నివాసులు క్రేతీయులు అనఁబడిరి. ప్రస్తుతమున దానికి కాండియ (*Candia*) యను పేరుకలదు. ఇది 160 మైళ్లు పొడవును 7 మొదలు 35 మైళ్లవఱకు వెడల్పును గలిగియున్నది. దీని తూర్పు కొననుండి పశ్చిమ కొనవఱకు నొక కొండ వరుస కలదు. ఇందులో కొన్ని శిఖరములు చాల యెత్తుగా నున్నవి. ఇది చాల పురాతనమైన ద్వీపము. గ్రీకువారి యాది గ్రంథములను రచించిన హోమరు (*Homer*) దీనియందలి 100 పట్టణములనుగూర్చి వ్రాసెను. క్రీ॥ పూ॥ 68-66 సం॥లలో రోమీయులు దీని జయించియుండిరి. చాల మంది యూదులచ్చట నివసించియున్నట్లు కార్య 2$^{11}$ వలనఁ దెలియును. పౌలు కాలములోనే క్రైస్తవ మతమచట స్థాపింపఁబడెను. యూదుల మతోపదేశలను ఖండించుటకు పౌలు తీతు నచట నుంచెను (తీతు 1$^{5}$ $^{10,14}$). పౌలు రోమాకు ఖైదిగా వెళ్లుచున్నప్పుడు దీని దక్షిణ ప్రాంతపు పొడుగున ప్రయాణముచేసి మంచిరేవులను స్థలములలో కొంతకాలము గడిపెను (కార్య 27$^{1,12,13,21}$). లౌకిక చరిత్రనుబట్టి విచారింపఁగా క్రేతీయులు గొప్ప విలుకాండ్రై యున్నట్లు తెలియును గాని వారి గుణములనుబట్టి చూడఁగా అంతమంచి వారుకారు (తీతు 1$^{12}$). క్రీ॥ శ॥ 823 వ సం॥న తురకలు దీని స్వాధీనపఱచుకొనిరి. 961 సం॥ గ్రీకువారు దీనిని జయించిరి. 1204-1665 వఱకు అది వెనీస్ (*Venice*) వారి క్రిందను అప్పటి నుండి 1897 వఱకు మహమ్మదీయుల యధీనమందు

నుండెను. 1897 నందు అది స్వాతంత్ర్యమును బొందెను.

**క్రేస్కే** (Crescens = ఎదుగుచున్న వాఁడు). పౌలు రోమా చెఱలోనుండఁగా ఆయనయొద్దనుండిన క్రైస్తవులలో నొకఁడు ఇతఁడచటనుండి గలతియకు వెళ్లెను (II తిమో 4[10]). ఈ గలతీయ అసలు గలతీయకాక ఆ పేరుకు సంబంధించిన గాలు (*Gaul*) అనఁగా ఫ్రెంచి దేశమని కొందఱనుకొందురు. ఇతఁడు ఆ దేశములోని వియన్ (*Vienne*) మయెన్స్ (*Mayence*) అను సభలను స్థాపించినవాఁడని నేటివఱకు ఆ సభలలో నొక వదంతి కలదు. అయితే యిట్టివదంతి మొదటినుండి యుండక చాలకాలమునకు పిమ్మట పుట్టెను. కావున అది నమ్మఁదగినదని చెప్పవీలు కాదు.

## క్రై, క్రొ, క్రో

**క్రైస్తవుడు** (Christian). యేసు క్రీస్తును నమ్మి ఆయన ననుసరించువాఁడు క్రైస్తవుఁడనఁబడును. అయితే యిది క్రొత్తనిబంధనలో సాధారణముగా వాడఁబడిన పదముకాదు. ఆది కాలమందు క్రైస్తవులకు విశ్వాసులు సహోదరులు శిష్యులు అనునిట్టి నామములను సాధారణముగా నుపయోగించిరి. అయితే మొట్టమొదట అంతియొకయలో క్రీ॥ శ॥ 43 వ సంవ శిష్యులు క్రైస్తవులనఁబడిరి (కార్య 11[26]). ఇది వీరికి అన్యులు హాస్యార్థముగ పెట్టిన నామమని యూహింపఁదగును. II వ అగ్రిప్పయను వాఁడు కూడ (షుమారు క్రీ॥ శ॥ 59 సం॥లో) ఈ పేరును వాడుట చూడఁగా ఆ మధ్యకాలములో నిది యెక్కువ వాడుకలోనికి వచ్చినదని స్పష్టమగును (26[28]). ఎవఁడైనను క్రైస్తవుఁడైనందుకు బాధ ననుభవించినయెడల అతఁడు సిగ్గుపడకూడదని (I పేతు 4[16]) చిన్నాసియలోని క్రైస్తవులకు పేతురు వ్రాయుచు ఈ పేరొకమారెత్తెను. పైమూఁడు సందర్భములలో మాత్ర మీ పేరు క్రొత్తనిబంధనలో నుపయోగింపఁబడియున్నది. ఆది సంఘపు చరిత్రయందిది అతి శీఘ్రకాలములోనే ముఖ్యమైన నామమాయెనని తెలిసికొనఁగలము. నేటివఱకును అదియట్లున్నది. మనము క్రీస్తునే నమ్మి ఆయనను సేవించుచున్నాము గనుక ఈ పేరు మతమునకు అన్నింటిలో తగియున్నది.

**క్రొత్త గవని ద్వారము** దేవాలయము I 3 (4) చూ॥

**క్రొత్త నిబంధన** బైబిలు II చూ॥

**క్రొత్త నిబంధన ప్రమాణిక గ్రంథములు** ప్రమాణిక గ్రంథములు 2 చూ॥

**క్రొత్త నిబంధనలో నెత్తి వ్రాయబడిన వాక్యములు** (Quotations from the Old Testament in the New). క్రొత్త నిబంధనలో (1) పాత నిబంధనలో నుండియు (2) యూదుల యప్రమాణిక గ్రంథములలో నుండియు (3) గ్రీకు వారి గ్రంథములలో నుండియు (4) ఆయావారలు వ్రాసిన యుత్తరములలో నుండియు కొన్ని వాక్యముల నెత్తి వ్రాసియున్నారు.

(1) పాత నిబంధన వాక్యము లనేకములు క్రొత్త నిబంధనలో నెత్తి వ్రాసియున్నారు. ఫిలెమోను 1, 2, 3, యోహాను II పేతురు అను నీ యైదు పత్రికలలో తప్ప తక్కిన గ్రంథములన్నిఁటిలో పాత నిబంధన వాక్యము లున్నవి. మఱియు పాత నిబంధన గ్రంథములలో ఎస్తేరు పరమగీతము, ప్రసంగి యను నీ మూఁడు గ్రంథములనుండి తప్ప తక్కిన వాటన్నిఁటినుండియు వాక్యములను నూతన నిబంధనలో నెత్తి వ్రాసియున్నారు. ఇట్లు ఎత్తి వ్రాయఁబడిన తేటయైన వాక్యములు 160 యున్నట్లు స్వీటె (*Swete*) యను నొక పండితుఁడు లెక్కించెను గాని ఇతరులు షుమారు 275 వాక్యములు తేటగా నెత్తఁబడియున్నవని లెక్కించియున్నారు. పాత నిబంధన వాక్యములలో తేటగా గాక సూచనరీతిగాను, ఆయా వాక్యముల భాగములుగా గాని యెత్తబడిన వాక్యములు 1279 యున్నవని వేదశాస్త్రులలో నిద్దఱు (*Westcott and Hort*) లెక్కించిరి. ఈ వాక్యములను చూడఁగా ఇవి చాలమట్టుకు అసలు హెబ్రీ భాషనుండి యెత్తఁబడక దాని గ్రీకు తర్జుమానుండి (LXX) ఎత్తఁబడినవని తెలియును.

(2) యూదుల యప్రమాణిక గ్రంథములలో నుండి యెత్తి వ్రాయఁబడిన వాక్యములు షుమారు 24 ఉన్నట్లు వేదశాస్త్రులు లెక్కించియున్నారు

(ఉదా॥ రోమా $12^{15}$ = సైరాక్సు $7^{34}$ యాకో $1^{19}$ = సైరాక్సు $5^{11}$ మొ॥).

(3) అన్యుల గ్రంథములలోనుండి యెత్తిన వాక్యములు కొన్ని మాత్రమున్నవి. మఱియు వాటినన్నిఁటిని పౌలు గ్రీకువారి గ్రంథములలో నుండి యెత్తెను (తీతు $1^{12}$ కార్య $17^{28}$ I కొరి $15^{33}$). I కొరి $12^{12-27}$ లో అవయవములు ఒక దానితో నొకటి కలహపడినట్లున్న దృష్టాంతమును గ్రీకు కల్పనా కథలలోనుండి యెత్తి యుండ వచ్చును. అట్టి కథ హిందూ గ్రంథములలో కూడ నున్నది.

(4) ఆయా యుత్తరములలోనుండి యెత్తిన వాక్యములు. పౌలు వ్రాసిన పత్రికలలో అట్టివి కొన్ని యున్నవి. ఆయా క్రైస్తవులు పౌలునకు వ్రాసిన కొన్ని యుత్తరములు పౌలు యొద్ద నుండెను. పౌలు అట్టివాటిలో కొన్ని వాక్యముల నెత్తి వాటిని చర్చించెను. I కొరి $7^{1}$ $8^{1}$ $11^{2,17,18}$ $12^{1}$ ఫిలి $1^{3}$ $2^{25,26}$ $4^{14-18}$ ఫిలె $^{5-7}$, మొదలగు వాక్యములట్టివై యున్నట్లు సాధారణముగా ననుకొందురు.

**క్రోధము** కోపము చూ॥

**క్రోసు** మానములు కొలతలు I 2 చూ॥

## క్లె, క్లో

**క్లెమెంతు** (Clement = దయగల). ఇతఁడు ఫిలి $4^{3}$ యందు పౌలుయొక్క సహకారియని చెప్పఁబడినవాఁడు. పూర్వికులైన గ్రంథకర్తలలో కొందఱు ఇతఁడు తరువాత రోమాపురి సంఘాధ్యక్షుఁడై యున్నట్టును కొరింథు సంఘ పత్రికను రచించినట్టును నిశ్చయించుకొనిరి. అయినను వారి యభిప్రాయము పూర్ణాంగీకారము కాదు. పౌలు ఫిలిప్పీయుల పత్రిక వ్రాసినపుడు క్లెమెంతు ఫిలిప్పీపట్టణములోనే కాపురముండెనని విశదమగుట మాత్రముకాక క్రొత్త నిబంధన యందితఁడు రోమాలోనుండుటను గుఱించి యే ప్రశంసయైనను లేదు. అదియుగాక పండితోత్తములు కొరింథు సంఘమునకు పైజెప్పిన పత్రికను రచించిన గ్రంథకర్త క్రీ॥ శ॥ 110 సం॥ వఱకుండి పరగతుఁడాయెనని సిద్ధాంత పఱచుచున్నారు గనుక పౌలు క్రీ॥ శ॥ 62 సం॥ మందు ఫిలిప్పీయులకు పత్రిక వ్రాసినపుడు పెద్దమనుష్యుఁడుగా నుండిన క్లెమెంతు క్రీ॥ శ॥ 110 సం॥ వరకు సజీవుఁడై యుండుట మిగుల అనుమానాస్పదము. కాఁబట్టి యితఁడు ఫిలిప్పీ సంఘములో పేరుపడసిన భక్తుఁడని తీర్మానించుకొనుట యుక్తము. M.

**క్లెయొపా** (Cleopas). క్రీస్తు లేచిన దినమున ఎమ్మాయు గ్రామమునకు వెళ్లుచుండిన యిద్దరిలో నొకఁడు (లూ $24^{18}$). యోహా $19^{25}$ లోని క్లోపాయు నితఁడు నొకఁడేయని కొందఱి యభిప్రాయము. E.

**క్లోపా** (Clopas). క్రీస్తు సిలువయొద్ద నిలిచి యుండిన స్త్రీలలో నొకరి పెనిమిటి (యోహా $19^{25}$). మా $15^{40}$ ప్రకారము చిన్న యాకోబు తల్లి యగు మరియ ఈమెయే యని చెప్పవలెను. మ $10^{3}$ నందున్నట్లు చిన్న యాకోబు తండ్రి పేరు అల్ఫయి గనుక వీరిద్దరు నొకఁడేయని చెప్పుటకు వీలున్నది. E.

**క్లోయె** (Chloe = లేత గడ్డిపోచ). కొరింథు పట్టణస్థురాలగు నొక క్రైస్తవ స్త్రీయని కొందఱి యభిప్రాయము గాని మఱికొందఱీమె ఎఫెసు కాపురస్థురాలందురు. ఈమె యింటివారగు దాసులద్వారా పౌలు కొరింథు సంఘములోని కలహములనుగూర్చి తెలిసికొనెను (I కొరి $1^{11}$). ఆమెయొద్ద దాసులుండుటవలన కొంచెము స్థితిమంతురాలనుట కాస్పదమున్నది. M.

## క్లౌ

**క్లౌదియ 1.** (Claudia). తిమోతికి వ్రాసిన రెండవ పత్రికయందు పేర్కొనఁబడిన స్త్రీ (II తిమో $4^{21}$). ఈమె రోమాయందుండి పౌలు తిమోతికి వ్రాయునప్పుడ తనికి వందనములు చెప్పెను. ఈమె పేరునుబట్టి కొందఱీమె కైసరు యింటికి చేరియుండునని యెంచుచున్నారుగాని అది రూఢి యనఁజాలము. రోమాయందలి అది క్రైస్తవులలో మిగుల ప్రసిద్ధుడగు లీను అనువాని తల్లిగాని భార్యగాని అయ్యుండునని ఆయా యితిహాసములవలనఁ దెలియుచున్నదిగాని వాటిని నమ్ముటకు తగిన యాధారములు లేవు. M.

**2.** (Claudius). రోమను సామ్రాజ్యమును కైసరులను బిరుదముతో నేలిన చక్రవర్తులలో నాల్గవవాఁడు. మూఁడవ చక్రవర్తియగు తిబెరియు కైసరుయొక్క సహోదరుని కుమారుఁడు. ఇతఁడు తన కిష్టులైన వారి మాటలను తీసివేయఁజాలక రాజ్యమును వారి యిష్టమనుసరించి యేలెను గాన దుర్బలమనస్కుఁడని కనఁబడుచున్నది. తన పట్టాభిషేక మహోత్సవమునాడు హేరోదీయులలో నొకఁడగు మొదటి అగ్రిప్ప రోమాలోనుండి అతనిని సంతోషపఱచినందున క్లౌదియు వానిని పలెస్తీనుకు రాజుఁగా జేసెను. తన ప్రభుత్వారంభమున యూదులను దయగాఁ జూచెనుగాని తరువాత వారిని రోమానుండి వెళ్లఁగొట్టెను (కార్య $18^{2}$). అతఁడు క్రీ॥ శ॥ 41—54 వఱకు నేలి కాలము చేసెను. అతని ప్రభుత్వకాలమునందు సర్వలోకములో కలిగిన కరవును గూర్చిన సూచన $11^{28}$ నందున్నది.

**క్లౌదియలూసియ** (Claudius Lysias) యెరూషలేమందుండిన పటాలపు సహస్రాధిపతి (కార్య $21^{26,31}$ $24^{22}$). బైబిలునందీ అధ్యాయములలోని సంగతుల కన్న మఱెక్కువ యితనిని గూర్చి తెలియదు. పౌలును చంపఁగోరిన యూదుల నుండి యతనిని తప్పించి కైసరయకుఁ బంపెను. అతఁడు భాగ్యవంతుఁడై రోమా పౌరత్వమును కొని సంపాదించుకొనినట్లు కనఁబడుచున్నది. తన విధిని న్యాయముగాఁ జేయుటయందు ప్రమత్తుఁడుగ నుండలేదు. పౌలు నతఁడు శిక్షించుటకు ఆజ్ఞ నిచ్చినపిదప అతడు రోమీయుఁడని తెలిసికొని కొట్టకపోయినను, అతనినిగూర్చి ఫేలిక్సుకు వ్రాసినప్పుడు మాత్రము తనకు మెప్పుకలుగునట్లు, యూదులతని చంపఁబోఁగా అతఁడు రోమీయుఁడని విని రాణువతో వచ్చి తప్పించితినని వ్రాసికొనెను. E.

# క్వా, క్ష

**క్వర్తు** (Quartus = నాల్గవ) కొరింథీయుఁడగు క్రైస్తవుఁడు. పౌలితనిని సహోదరుఁడైన క్వర్తు అని పిలిచి, అతని వందనములను రోమా సంఘస్థులకుఁ బంపెను. ఇదిగాక ఇతని గూర్చి మఱేమియు తెలియదు (రోమా $16^{23}$). M.

**క్షమాపణ** పాపపరిహారము చూ॥

**క్షమత, క్షయమైనది** కుళ్లు చూ॥

**క్షయరోగము** రోగములు, చికిత్సలు II 10 (5) చూ॥

# క్షా

**క్షామము** కరవు చూ॥

**క్షారము** (Nitre). ఇంగ్లీషునందున్నట్లు దీనిని సామె $25^{20}$ లో **సురేకారము** అని తెనిఁగించిరి. గాని ఆ మూల పదమునే యిర్మీ $2^{22}$ నందు క్షారమనిరి. ఈ రెండు చోట్ల మాత్రమే యీ పదము నుపయోగించిరి. వస్త్రముల నుదుకుట కుపయోగించు సోడాయని దీని సంబంధములవలనఁ దెలియుచున్నది గనుక యిది సురేకారము కాదు. పై రెండు వచనములలో నుదాహరించఁబడినది సోడాకు చక్కగా సరిపడును. చిరకాను సోడామీఁద పోసినయెడల అదెట్లు పొంగునో, అట్లే దుఃఖించు వానికి పాటలు వినిపించినయెడల వానికి దుఃఖ మెక్కువ యగుననునది దీని భావమని విశదమగుచున్నది.

**క్షేమము** సమాధానము చూ॥

# ఖ

**ఖజానాదారుడు, బొక్కసమును చూచువాడు, ఖజానా, బొక్కసము, ధనాగారము, నిధులు, ధననిధులు** (Treasurer, Treasure). ఈ పదములన్నిఁటిని రాజధనము ఆలయధనముకు సంబంధముగా బైబిలునందుపయోగించిరి. ఖజానా యను పదము పారసీ పదమైయున్నది. ఈ పదమును హెబ్రీ భాషయందును గ్రీకు భాషయందును వాడుకొన్నట్లు సూచనలున్నవి. ఎజ్రా $1^{8}$ $7^{21}$ నందు పారసీ దేశపు ఖజానాను చూచినవానికి **ఖజానాదారుడు** అని పారసీ భాషకు సంబంధించిన పదమునే తెలుఁగు బైబిలునందు వాడిరిగాని ఆ మూలపదమునే I దిన $2^{20,22,24,26}$ $27^{25}$ నందు ఆలయ ద్రవ్యమునకు సంబంధముగా **బొక్కసమును కాయువాడని** తెనిఁగించిరి. గ్రీకు భాషయందీ పారసీ పదమునకు సంబంధించిన

గాజా (*Gaza*) యను పదమునే వాడిరిగాని తెలుఁగునందు ధనాగారమంతటి మీఁదనున్న యనుమాటతో దాని తర్జుమాజేసిరి (కార్య $8^{17}$). రోమా $16^{23}$ లో ఖజానా దారుఁడని తెనిగింపబడిన పదము మూల భాషయందు వేరొకపదమై గృహనిర్వాహకుఁడని యర్థమిచ్చుచున్నది.

సొమ్మునుంచు స్థలమును **ఖజానా** యని యిర్మీ $38^{11}$ నందు తెనిఁగించిన మూల పదమును ఇతర చోట్ల బొక్కసమనియు (I దిన $9^{26}$ $28^{12}$ II దిన $32^{27}$) తర్జుమాజేసిరి. ఈ పదమే దేవుని దయా సమృద్ధిని సూచించుచు కీర్త $13^{57}$ నందు **నిధులు** అను పదముచే తెనిఁగించఁబడెను. క్రొత్త నిబంధనయందు ఖజానా పెట్టెయని యర్థమిచ్చు మూల పదమును **కానుకపెట్టె** యని తెనిఁగించిరి (దేవాలయము IV 3 (1) చూ.). గాని మ $27^{6}$ నందున్న కానుకపెట్టె యను పదము కొర్బాను అను మూల పదముయొక్క భాషాంతరము (కొర్బాను చూ॥). క్రొత్త నిబంధనయందు బొక్కసమును సూచించు పదములను **ధననిధి** (మ $12^{35}$ $13^{52}$), **ధనము** (మ $6^{19,20,21}$ $13^{44}$ $19^{21}$ మొ॥), **సంపద** (కొలొ $2^{8}$) **భాగ్యము** (హెబ్రీ $11^{26}$), **పెట్టె** (మ $2^{11}$) మొదలగు వాటిచే తెనిఁగించిరి. ఇవి అలంకార రీతిగా మోక్షమును (లూ $12^{33}$ $18^{22}$). దేవుని వాక్యమును (II కొరి $4^{7}$), భక్తుల సౌఖ్యమును (హెబ్రీ $11^{26}$), క్రీస్తు గుణలక్షణముల సమృద్ధిని (కొలొ $2^{3}$) సూచించును.

**ఖడ్గము** ఆయుధములు I 4 చూ॥

**ఖర్జూరపుచెట్టు** (Palm Tree). ఈ మాటచే తెనిఁగించఁబడిన హెబ్రీ పదము పాత నిబంధనలో తామారు అను పేరుకు సంబంధించినది. దానిని యెహె $40^{16}$ నందు **ఖర్జూరపు చెట్టు** అనియు నిర్గ $15^{27}$ లేవి $23^{40}$ సంఖ్యా $33^{9}$ ద్వితీ $34^{3}$ న్యాయా $1^{16}$ నెహె $8^{15}$ యోవే $1^{12}$ నందు **ఈతచెట్టని**యు, I రాజు $6^{29-31}$ మొ॥ నందు **తమాలవృక్షమని**యు, న్యాయా $4^{5}$ II దిన $28^{15}$ నందు **సరళవృక్షమని**యు, పర $7^{7}$ నందు **తాళవృక్షమని**యు తెనిఁగించిరి. క్రొత్త నిబంధనలోనున్న గ్రీకు పదమును ఖర్జూరపుచెట్టని తర్జుమాజేసిరి (యోహా $12^{13}$ ప్రక $7^{9}$). ఈ మాటలన్నియు నొకటేచెట్టును సూచించును. అది ఖర్జూరపుచెట్టని సాధారణముగా ననుకొందురు. ఇవి పలెస్తీను సిరియాదేశముల సముద్రతీర మైదానములందును ఐగుప్తు న్యూబియా అరేబియా దేశముల యందును సమృద్ధిగాఁ బెరుగును. పూర్వమీ చెట్లు యొర్దాను నదిలోయలో అతి విస్తారముగా నుండెను. వాటి నక్కడనాటి పెంచిన యెడల ఇప్పటికిని అవి బహుగా పెరిగి ఫలించును. యెరికోయొక్క చుట్టు ప్రక్కలయందు ఈ చెట్లతి విస్తారముగా నుండుటంబట్టి ఆ పట్టణమునకు **ఖర్జూరచెట్ల** పట్టణమను పేరుకలిగెను. (న్యాయా $1^{16}$ $3^{13}$). యేసు యెరూషలేములోనికి జయోత్సవముగా ప్రవేశించినప్పుడు ఖర్జూరపు మట్టలను చేతఁబట్టుకొని పోయిన యాత్రికులు (యోహా $12^{13}$), బహుశః వాటిని యెరికో



ఖర్జూరపుచెట్టు

పుర సమీపమునుండి తెప్పించుకొని యుందురు ఇవి పొడవుగా నెదిగి సుందరముగా కనఁబడును గాన అందగతెలు ఈ చెట్టుకు పోల్చఁబడెదరు (పర $7^{7}$). ధన్యుఁడైన నీతిమంతుని ఈ చెట్టుకు పోల్చిరి (కీర్త $92^{12}$). గొప్ప భవనముల యొక్కయు,

గుళ్లయొక్క స్తంభములమీఁదను గోడలమీఁదను వీటి రూపములను నకిషిపనిగా చెక్కించుదురు (I రాజు $6^{29}$ యెహె $41^{19}$). దీని మట్టలతో ఉత్సవదినములయందు పర్ణశాలలు కట్టుటకుపయోగించిరి (లేవి $38^{50}$). జయోత్సవముతో సంతోషించెడి వారీమట్టలను పట్టుకొనిపోయిరి (యోహా $12^{13}$ ప్రక $7^{9}$). ఖర్జూరపు పండ్ల నెండఁబెట్టి ఆహారముగా వాడుకొందురు. ఒక దోసెడుపండ్లు ఒకనాటి భోజనమున కొకనికి చాలునందురు.

J. C.

# ఖూ, ఖై, ఖో

**ఖూనీ** నరహత్య చూ॥

**ఖైమ** నేరములు శిక్షలు III 3 చూ॥

**ఖోఫ్** (Koph = ק అను అక్షరము). హెబ్రీ అక్షరములలో 19 వది. కీర్త 119 లోని 19 వ భాగమందలి ప్రతి పంక్తియు నీ యక్షరముతోనే యారంభమగుటచే ఆ భాగమునకు ఖోఫ్ అను పేరుపెట్టిరి.

# గ

**గంగాళము** గుడారము 6 (1) (*b*), దేవాలయము I 7 (I) (*b*) చూ॥

**గంట** (Bell). బైబిలులో దీనినిగూర్చి రెండు సూచనలు మాత్రముగలవు. ప్రధానయాజకుఁడు ధరించిన ఏఫోదు అంచున గంటలు కట్టిరి (నిర్గ $28^{33,34}$ $39^{25,26}$). ఇవి బంగారపువి. ప్రధానయాజకుఁడు ఆలయమునందు తిరుగునప్పుడివి మ్రోగుచుండవలెను.

గుర్రముల మెడలకును, ఒంటెల మెడలకును వేసిన కంఠహారములకు చిన్న గంటలు కట్టిరి (న్యాయా $8^{21}$). జెక $14^{20}$ లో నున్న శల్లము అనుమాట మూలభాషయందు గంటను సూచించుచు, అట్టివి సహా కుదురుబాటు కాలమునందు దేవునికి ప్రతిష్ఠితములగునని తెలుపుచున్నది.

కాలమానముగా వాడిన గంటలనుగూర్చి కాలమానము II, సంగీతము 3 (1) (*d*) చూ॥

**గండ్రగొడ్డలి** ఆయుధములు I (2) చూ॥

**గంధకము** (Sulphur). ఇది భూమియందు దొరకు మూల పదార్థములలో నొకటి. ఇదే ప్రదేశములలో నెక్కువగా నుండునో ఆ ప్రదేశపు ఊటలయందూరునట్టి నీటితోఁగలసి వచ్చుచున్న అట్టి గంధక మిశ్రితమైన నీటి యూటలు యొర్దాను లోయలోను, విశేషముగా మృత సముద్రమునకు సమీపమందును పెక్కులు గలవు. ఆ ప్రాంతములయందుండిన సొదొమ గొమొఱ్ఱా మొదలగు పట్టణములు గంధకము అగ్ని ఆకాశము నుండి కురియుటచే నాశనమైనట్లు (ఆది $19^{24-28}$ లూ $17^{29}$) చదువుచున్నాము. అప్పుడు కలిగిన భూకంపముచే భూమియందు పడిన పగుళ్లగుండానీ గంధకపు ఆవిరి బైటికివచ్చి వేడిమిచే మండిపోయి యుండునని అనేకు లభిప్రాయపడుచున్నారు. ఇట్టి మూల పదార్థములచే తన కార్యముల నప్పుడప్పుడు నెఱవేర్చుట బైబిలు బోధకు అనుకూలముగా నున్నది. భూమిలోనుండి గంధకము ఇతరవస్తువులును ఆవిరి రూపమునవచ్చి కాలిపోయినయెడల అది ఆకాశమునుండి కురిసినటులే కనఁబడును. ఈ చరిత్ర ననుసరించి గంధకము నాశనమునకు సూచనగా బైబిలునందు వాడఁబడెను (ద్వితీ $29^{23}$ కీర్త $11^{6}$ యెష $30^{33}$ $34^{9}$ యెహె $38^{22}$ ప్రక $9^{17,18}$ $14^{10}$ $19^{20}$ $20^{10}$ $21^{8}$).

**గంధపుచెక్క** గంధవర్గము I 8, చందనపు మ్రాను చూ॥

**గంధవర్గము, పరిమళతైలము** (Spices, Ointment). మతాచారములయందు వాడిన అభిషేక తైలము (నిర్గ $30^{22-24}$), ధూపవేదికపై దహించిన ధూపద్రవ్యము ($30^{34-35}$), శరీరాలంకారములకు వాడిన సుగంధముల (సామె $7^{17}$ పర $4^{13-14}$) కుపయోగించిన దినుసుల జాబితాలు బైబిలునందు గలవు. ఇవిగాక ఇతర వాక్యములలో మఱికొన్ని యగపడును. వాటియందు ముఖ్యములైనవి దిగువ నున్నవి:—

I గంధవర్గ దినుసులు.

1. ఏదో యొక ప్రత్యేకమగు దినుసును పేర్కొనక మొత్తముమీఁద గంధవర్గము లన్నిఁటిని సూచించెడి మూలపదమును **సుగంధ సంభారములు** (నిర్గ $25^{6}$ $30^{23}$ $35^{8}$), **సుగంధ ద్రవ్యములు** ($35^{28}$), **సుగంధ వర్గము** (I రాజు $10^{10}$

యెహె $27^{22}$ పర $8^{14}$), **పరిమళ ద్రవ్యములు** (పర $4^{14}$) అని తెనిఁగించిరి. పై పదములకు ఇంగ్లీషునందు, బాల్సామ్ (*balsam*) అను పద మున్నది గాని నిర్గ $30^{34}$ లోని మఱియొక మాటను (*sammim*) పరిమళద్రవ్యములని తర్జుమా జేసిరి. మూలభాషయందు పదభేదమేగాని యర్థ భేద మెంతమాత్రమును లేదు. క్రొత్తనిబంధన యందు **అత్తరు** అను పదమును దీనినే సూచించును (మ $26^{7-9}$ మొ॥ క్రింద 6 చూ॥).

2. **సాంబ్రాణి.** ఇది బైబిలునందనేక మారులు వచ్చును. దీనిని యజ్ఞములమీఁద వేసిరి (లేవీ $2^{15}$ $5^{11}$ $24^{7}$ సంఖ్యా $5^{15}$ మొ॥). ధూప ద్రవ్యమునందు వాడిన దినుసులలో నిదియొకటి (నిర్గ $30^{34}$). జ్ఞానులు క్రీస్తునకర్పించిన కానుకలలో నిదియున్నది (మ $2^{11}$). యెష $60^{6}$ నందు **ధూపద్రవ్యమని** తెనిఁగించిన మూలపదమున కిదే యర్థము. వాక్య సందర్భమునుబట్టి అది యరబ్బీదేశమునుండి వచ్చినట్లు తెలియుచున్నది. పర $4^{6}$ లోని సాంబ్రాణి పర్వతములు సాంబ్రాణి చెట్లు మొలచిన పర్వతమును సూచించును. $4^{13}$ నందున్న **కర్పూరవృక్షము** అదే చెట్టని మూల భాషాపదమువలన స్పష్టమగుచున్నది. పరమగీత మందలి యీ వాక్యములవలన ఈ వృక్షములు పలెస్తీను నందున్నట్లు స్ఫురించుచున్నది. రోమా పురమున కెగుమతిజేసిన సరకులలో నిదియొకటి. ఇది సాంబ్రాణి చెట్టునుండి తీయుబంకయై యున్నది.

3. **జటామాంసి.** పరిశుద్ధ తైలమునందు వేసిన దినుసు (నిర్గ $30^{34}$). ఇదియు నొక చెట్టు బంక. పర $4^{13}$ నందు జటామాంసి యని తెనిఁగించఁబడిన మూల భాషాపదము మఱియొకటియై మరియ క్రీస్తునభిషేకించుటకు వాడినదై యున్నది (మా $14^{3}$). జటామాంసిని హిమాలయములమీఁదఁ బెరుగుచున్న ఒక చెట్టునుండి తీసెదరు. ఇంత దూరమునుండి వచ్చునది మిగుల విలువగల దనుటలో నాశ్చర్యములే . రోమనుల గ్రంథములవలనను ఇది మిగుల ప్రియమైనదని తెలియుచున్నది.

4. **లవంగిపట్ట.** దీనినే దాల్చిన యందురు. ఫేనీకేవారు సింహళమునుండి పలెస్తీనుకు మొదటఁ దెచ్చిరి. దీనినుండి సువాసనగల నూనెనుగూడఁ దీసిరి. దీనిని అభిషేక తైలమునందు వాడిరి (నిర్గ $30^{24}$). శరీరమునకు పూసికొనుటకును వస్త్రములపై చల్లుకొనుటకు నుపయోగించిరి (పర $4^{14}$). సామె $7^{17}$ నందీ మూల భాషాపదమునే **కారపు చెక్క** యని తెనిఁగించిరి (క్రింద 5 చూ॥). కీర్త $45^{8}$ లోని మఱియొక పదమును లవంగిపట్టయని తెనిఁగించిరిగాని అది క్రింద 5 నందున్న దానికి సంబంధించినట్లు కనఁబడుచున్నది.

5. **కత్సీయా.** నిర్గ $30^{24}$ లోని రెండవ పదమును లవంగి పట్టయని తెనిఁగించినను ఆ మూల భాషా పదమునే యెహె $27^{19}$ నందు కత్సీయా యనిరి. అదియు పరిశుద్ధ తైలమునందలి దినుసులలో నొకటి. అది కాశ్మీర దేశమందలి యొక మూలికనుండి ముఖ్యముగా దాని వేరునుంచి తీసెదరని వాడుక. నేటివఱకు చీనాలో ఇది గుళ్ల యందు ధూపమువేయు సుగంధములలో నొకటియై యున్నది. కీర్త $45^{8}$ నందు లవంగిపట్ట యనబడిన పదము మూలభాషయందు కత్సీచా (*Quatsitsah*) యనునదై యున్నది అది లవంగపట్టగాక కత్సీయ (*Cassia*) యను మఱియొక చెట్టుబెరడు అని యెంచుచున్నారు.

6. **గోపరసము, బోళము.** పరిశుద్ధ తైల మందువేసిన దినుసులలో నిదియొకటి (నిర్గ $30^{28}$). బట్టలమీఁద చల్లుకొనుటకూడ దీని నుపయోగించిరి (కీర్త $45^{8}$ పర $1^{13}$ $3^{6}$ $4^{14}$). సామె $7^{17}$లో ఆ మూల పదమునే **బోళము** అని తెనిఁగించిరి. అరబ్బీదేశమునందుండు ఒక విధమైన ముళ్లచెట్టు నుండి వచ్చు బంకయైయున్నది. క్రీస్తును చూడ వచ్చిన జ్ఞానులు దీనిని ఆయనకు కానుకగా నర్పించిరి (మ $2^{11}$). శవములు కుళ్లి చెడిపోకుండునట్లు నాటికి దీనిని పూసిరని యోహా $19^{39}$ వలన మాత్రమేగాక లౌకిక చరిత్రవలనను తెలియుచున్నది. మ $26^{7,9}$ లూ $7^{37}$ యోహా $11^{2}$ నందున్న **అత్తరు** అనునదియు మా $14^{4,5}$ యోహా $12^{3,5}$ నందున్న **జటామాంసి అత్తరు** అనునదియు ఈ మూల పదమునకు తర్జుమాలై యున్నవి.

7. **గోపిచందనము.** పరిశుద్ధ ధూపద్రవ్య మందలి దినుసులలో నొకటి (నిర్గ $30^{34}$). దీని మూల భాషాపదమీ యొక్కచోట మాత్ర ముప యోగింపఁబడుటవలన దీనిగూర్చి యింక స్పష్ట

ముగాఁ దెలియదు. హిందూదేశమున దొఱుకు నొక విధమగు గుల్లతో దీనిఁజేసిరని హెబ్రీ పండితుల తాత్పర్యము.

8. **గంధపుచెక్క.** ఇదియు పరిశుద్ధధూప ద్రవ్యమందలి యొక దినుసు (నిర్గ 30[34]). అది పలెస్తీను అరబ్బీ దేశములయందున్న యొక తరహా వృక్షపుచెక్క. ఈ పదమీ యొక్కచోట మాత్రమున్నది.

9. **అగరు.** సాధారణముగా శరీరమునకుఁ బూసికొనిన యొక సుగంధ ద్రవ్యము (కీర్త 45[8] సామె 7[17] పర 4[14]). అహలోతు (*ahaloth*) అను దీని హెబ్రీ పదముయొక్క రూపమే అగరు అని చెప్పవచ్చును. దీనిని చెట్లనుండి తీసిరి. ఈ చెట్లు విస్తారముగా వాగులదరిని మొలచినట్లు సంఖ్యా 24[6] వలనఁ దెలియుచున్నది. నీకొదేము దీనిని దెచ్చి క్రీస్తు దేహమునకుఁ బూసెను (యోహా 19[39]).

10. **నిమ్మగడ్డి, నిమ్మగడ్డినూనె.** పరిశుద్ధ తైలమునందుపయోగించిన యొక ద్రవ్యము (నిర్గ 30[24]). దానిని బట్టలమీఁద చల్లుకొనెడివారు (పర 4[14]). యెహె 27[19] నం దుదాహరించిన ఫేనీకే వారి వర్తక సరకులలో నీ మాటయొక్క మూలపదము తెనిఁగించక **కేనయా** యని యుంచిరి. యిర్మీ 6[20] నందు దాని **మధురమైన చెరుకు**యని తెనిఁగించిరి. దాని బహు దూర ప్రదేశమునుంచి తెచ్చినట్లీ వాక్యము వలనఁ దెలియుచున్నది. అది హిందూదేశమునుండి వచ్చిన పక్షమున అది నిమ్మగడ్డనుండి తీసినదై యుండును గాని సాధారణముగా యూరపు ఖండమునందు దొఱుకు ఒక విధమైన గంధపు చెక్కయని యభిప్రాయపడుచున్నారు.

11. **కుంకుమ.** పరమగీతము నం దుదాహరింపఁబడిన పరిమళ ద్రవ్యములలో నిది యొకటి (పర 4[14]). ఈ పదమీ యొక్కచోట మాత్రమే కనఁబడుచున్నది. దీనిని మూల భాషయందు కరకుమ్ (*karkum*) అందురు. అది కుంకుమ యను పదముయొక్క మాఱురూపము కావచ్చును. దీనిని హిందూదేశమునుండి తెచ్చిరనుకొను చున్నారు.

II. గంధవర్గముల యుపయోగము. పై నుదాహరించిన గంధవర్గ దినుసులలో ననేకములను ఆయా దేశములనుండి తెచ్చినటులఁ దెలియుచున్నది. అందువలన నవి మిగుల విలువగలవిగా నెంచఁబడెను. రాజులు తమ గిడ్డంగులలో వాటిని సేకరించి దాచియుంచిరి (II రాజు 20[13]). స్థితిమంతులైనవారు తమ మృతులకు వీటిని పూయుట వాడుకయయ్యెను (II దిన 16[14]). పరిశుద్ధ తైలమును (నిర్గ 30[23,44]) ధూపద్రవ్యమును (30[34]) పరిశుద్ధమగు పనులకే గాని యితరమైన వాటికి వాడరాదు (నేరములు, శిక్షలు I 7 చూ॥)

III. గంధవర్గములను సిద్ధపఱచినవారు.

ధూపద్రవ్యములను తీసి కలిపిన వారికి నిర్గ 30[35] నందు **సుగంధ ద్రవ్యమేళకులు** అనఁబడిరి. ఈ పదమునకు తెలుఁగులో సుగంధ ద్రవ్యములను కలిపెడివారని యర్థము. అదే మూలపదమును నెహె 3[8]లో **ఓషధజ్ఞాని** యని తెనిఁగించిరి. మందులను సిద్ధపఱచువాఁడని ఈ పదమునకు తెలుఁగునందు అర్థమిచ్చుచున్నదిగాని యిచ్చట అట్టి యర్థము చెప్పవీలులేదు. ఇది పైన చెప్పినట్లు సుగంధ ద్రవ్యములను కలుపువారిని సూచించును. ప్రస 10[1] నం దీపదమునే **బుక్కావాడు** అని తెనిఁగించిరి. బుక్కా అను పదము మూల భాషయందు లేదు గాన ఈ పదము సుగంధములను కలుపువాని సూచించును.

**గంప** (Basket). గంపలు బుట్టలు ఎట్టి పనులకై వాడఁబడెనో దానిని సూచించెడి వాక్యములు బైబిలునందు గలవుగాని వాటి పరిమాణము సరిగాఁ దెలిసికొనదగిన వీలులు లేవు. పండ్లను (యిర్మీ 24[2]) ఇటుకలను (కీర్త 81[6]), మోయుటకు వీటినివాడిరి. వాటిని మోఁత కుపయోగించుటచే తట్టలను సూచించుననవచ్చును. రొట్టెలను మోయుట కుపయోగించినది మఱియొకపదమై ఆది 40[16] నిర్గ 29[3] న్యాయా 6[19] నందు జల్లవంటి యాకారము గలదని తెలియుచున్నది. కూర గాయలను గింజలను దీసికొనిపోవుటకు గాడ యాకారముగల గంపను వాడిరి (ద్వితీ 26[2] 28[5]). ఆమో 8[1] లోని గంప యని తెనిఁగించిన మూల పదము వేఱొకటియై మూఁతగలది యని అభిప్రాయపడుచున్నారు.

క్రొత్త నిబంధనయందు మా $6^{43}$ $8^{19}$లో వాడిన పదము యూదులు ప్రయాణము చేయునప్పుడు తమ భోజనమును పెట్టుకొనిపోవు చిన్న బుట్టలని తెలియుచున్నది. మా $8^{8,20}$ లో గంప యని తెనిఁగింపఁబడిన మూలపదమువలన అది పెద్దదని కనఁబడుచున్నది. పౌలు దమస్కు గోడ మీఁదనుండి దింపఁబడిన గంప (కార్య $9^{25}$) ఆ మాటకే తెనుఁగు పేరైయున్నది. II కొరి $11^{33}$ లో దీనికే మఱియొక పదమున్నది. అది త్రాళ్లతో అల్లిన బలమైన దానిని సూచించును.

**గంభీరధ్వని** హిగ్గాయోన్ చూ॥

**గచ్చపొదలు** ముళ్లు 4 చూ॥

**గచ్చుపూత** ఇల్లు I 4 చూ॥

**గజ్జాము** (Gazzam = భక్షించుట). జెరుబ్బాబెలు కాలములో అతనితోకూడ యెరూషలేమునకువచ్చిన నెతెనీయులలో నొక కుటుంబపువారు (ఎజ్రా $2^{48}$ నెహె $7^{51}$).

**గజ్జి** రోగములు చికిత్సలు II 5 (2) చూ॥

**గడప** (Threshold). బైబిలునందుదాహరించిన దేశములయందలి యిండ్ల గడపలకును తక్కిన యిండ్ల గడపలకు నంతభేదము లేదు (యెహె $9^{3}$ $40^{6}$ మొ॥) గాని దాగోను గుడి గడపను మాత్రము దాని యర్చకులు దాటెడివారు కాదు (I సమూ $5^{4,5}$).

J. C.

**గడియారము** కాలమానము II, IX చూ।

**గడ్డ** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥

**గడ్డము** (Beard). గడ్డమును పెంచుకొనుట యిశ్రాయేలీయుల కొక వాడుకగాని కుష్ఠరోగులు స్వస్థత నొందినమీఁదట శుద్ధీకరణాచారము గైకొనునప్పుడు తమ గడ్డములను తక్కిన రోమమంతటితో పాటు గొరిగించుకొనవలసియుండెను (లేవి $14^{9}$). గొప్ప దుఃఖములో నుండువారు తమ గడ్డములను కత్తిరించుకొన్నట్లును (యిర్మీ $41^{5}$), గడ్డపు వెండ్రుకలను పెఱికివేసికొనినట్లును (ఎజ్రా $9^{3}$) దృష్టాంతములు గలవుగాని, యిది యూదుల యాచారములకు భిన్నముగానున్నది. ఇది తానాచరింపఁగూడని అన్యాచారమని యూదుల అభిప్రాయము (లేవీ $19^{27}$ $21^{5}$).



ఐగుప్తీయ పురుషుఁడు, స్త్రీ

బలవంతముగా నొకని గడ్డమును గొరుగుట అవమానకరముగా నెంచఁబడెను. అమ్మోనీయుఁడగు హానూను దావీదు దూతల నిట్లవమానపఱచి శిక్షకు పాత్రుఁడాయెను (II సమూ $10^{4-15}$). ప్రీతి కొలకును ప్రతిమాలునప్పుడును గడ్డమును పట్టుకొను అలవాటు ఇశ్రాయేలీయులకున్నది. యోవాబిట్లు అమాశా గడ్డము పట్టుకొనునట్లు నటించి యతనిఁ జంపెను ($20^{9}$).



గ్రీకు పురుషుడు, స్త్రీ



అష్షూరీయుఁడు

**గడ్డల రోగము** రోగములు చికిత్సలు II 10 (4) చూ॥

**గడ్డి** (Grass). గడ్డిని సూచించు పదములు పాఁత నిబంధనయందు నాలుగును క్రొత్త నిబంధన

యందు ఒకటియు గలవు (ఆది $1^{11,29}$ I రాజు $18^{5}$ సంఖ్యా $22^{4}$ మ $6^{30}$ మా $6^{39}$ మొ॥). గడ్డి వర్షాకాలమునందు మాత్రముండి తరువాత బహు త్వరగా నెండిపోవును. కాఁబట్టి మనుష్యుల కించిదాయుష్కాలమును సూచించుటకు వాడఁబడెను (కీర్త $90^{5-9}$ $103^{15}$ యెష $40^{6}$ I పేతు $1^{24}$). మిద్దెలమీఁద మొలుచు గడ్డి మఱింత త్వరఁగా ఎండిపోవునుగాన అది దీనికిని పోల్చఁబడినది (కీర్త $129^{6}$) ఘనికిమాలిన వాటినికూడ గడ్డి సూచించును (I కొరి $3^{12-18}$).

**గత్రిమ్మోను** (Gath-rimmon = దానిమ్మ పండ్ల గానుగ).

1. దాను స్వాస్థ్యములో లేవీయుల కియ్యఁబడిన ఒక యూరు (యెహో $19^{45}$ $21^{24}$). దీని యునికిని గూర్చి తెలియదు.

2. మనష్షే అర్థ గోత్రికుల స్వాస్థ్యమునుండి లేవీయుల కియ్యఁబడిన ఒక యూరు (యెహో $21^{25}$). I దిన $6^{70}$ చూడగా అచట దీనికి **బిలియాము** అను పేరు కలదుగాని దాని యునికినిగూర్చి తెలియదు.

**గత్హేపెరు, గిత్తెహోపెరు** (Gath-Hepher = బావిదగ్గఱ నుండు ద్రాక్షగానుగ). ప్రవక్తయగు యోనాయొక్క స్వంతయూరు (II రాజు $14^{25}$). ఇది జెబూలూను గోత్రపు సరిహద్దులో నుండెను (యెహో $19^{13}$). ప్రస్తుతము నజరేతుకు ఈశాన్య దిక్కున మూఁడు మైళ్ల దూరములోనుండు ఎల్‌మెషెదు (*El-Meshed*) దీనియునికైయున్నది. ఇచ్చట యోనా గోరిని నేటివఱకు చూపెదరు గాని, నీనెవెలో కూడ అట్టిదే యొకటి ఉన్నందున యోనా ఇచ్చట పాతిపెట్టఁబడెనని నమ్మ వీలుగాదు. (పటము IV, C 7).

**గద** ఆయుధములు I 1 చూ॥

**గదరేనీయుల దేశము** గెరాసేనుల దేశము చూ॥

**గది** ఇల్లు చూ॥

**గదీ** (Gaddi = అదృష్టవంతుఁడు). గోత్రమున కొక్కొక్కరి చొప్పున కాదేషు బర్నేయనుండి మోషే పంపిన 12 మంది వేగుల వాండ్రలో నొకఁడు. ఇతఁడు మనష్షే గోత్ర ప్రతినిధి (సంఖ్యా $13^{11}$).

**గదీయేలు** (Gaddiel = దేవుని యదృష్టము నొందినవాఁడు). కాదేషు బర్నేయనుండి గోత్రమున కొక్కనిచొప్పున మోషే పంపిన 12 మంది వేగుల వారిలో నొకఁడు. ఇతఁడు జెబూలూను గోత్ర ప్రతినిధి (సంఖ్యా $13^{10}$).

**గద్ద** పక్షులు 12 చూ॥

**గన్నేరుచెట్టు** నిరవంజిచెట్టు చూ॥

**గబ్బతా** యెరూషలేము B VI 4 చూ॥

**గబ్బయి** (Gabbai = పన్ను వసూలు చేయువాఁడు). చెఱకాలమునకుఁ దరువాత బెన్యామీను గోత్రపు ముఖ్యులలో నొకఁడు (నెహె $11^{8}$).

**గబ్బిలము** మృగములు 22, పక్షులు 13 చూ॥

**గబ్రియేలు** దూతలు 3 చూ॥

**గమలీయేలు** (Gamaliel = దేవుని బహుమానము).

1. ఇశ్రాయేలీయు లరణ్యమందుండు సమయమున మనష్షే గోత్రపువారి పెద్ద (సంఖ్యా $1^{10}$ $2^{20}$ $7^{54,59}$).

2. సమస్త ప్రజలవలన ఘనతనొందిన ధర్మశాస్త్రోపదేశకుఁడగు పరిసయ్యుడు (అపొ. కార్య. $5^{34}$). అపొస్తలుఁడైన పౌలు కుపాధ్యాయుఁడీయనే ($22^{3}$). పేతురును ఇతర అపొస్తలులును సన్‌హెడ్రిన్ (*Sanhedrin*) సభయెదుటకు తేఁబడినప్పుడు ఇతఁడు సభికులకు బుద్ధిగల మాటలు జెప్పి శిష్యులను విడిపించెను ($5^{39}$). ఇతఁడు న్యాయస్థుఁడు. అన్యాయము నొందు వారిని గూర్చి కొన్ని మంచి యేర్పాటులను జేసెను. యూదులచేత నతఁడు మంచి పేరు నొందెను. ఆయన చనిపోయినప్పుడు ప్రజలకు ధర్మశాస్త్రమునందు భక్తి యడుగంటెననియు, నీతియుక్తమైన ప్రవర్తన నేలఁగలిసినదనియు యూదులందురు. ఇతఁడు హిల్లెలను యూదమతోద్ధారకుని మనుమఁడని వారి యితిహాసములవలనఁ దెలియుచున్నది. అతఁడు క్రీ॥ శ॥ 50 సం॥న మరణమాయెను. E.

**గరిశె** గుడారము 6 (I) (*a*) చూ॥

**గరిసె** మానములు కొలతలు III 6 చూ॥

**గర్భపాతము** రోగములు చికిత్సలు III 4 చూ॥

**గర్మీయుడు** (Garmite = ఎముకలు బైట పడినవాఁడు). కెయీలా అనువాని బిరుదు (I దిన $4^{19}$). గాని అది వాని కెట్లు కలిగెనో తెలియదు.

**గలతీయ** (Galatia). గ్రేకు చరిత్రకారులు ప్రాచీన కాలమునుంచి గలతీయులను జనులు ఇప్పుడు ఫ్రాంసు అనఁబడిన దేశమందు నివసించుచుండిరని తెలియఁజేసిరి. రోమా చరిత్రకారులీ జనులకు గాతీయులను పేరుపెట్టిరి. క్రీ॥ ము॥ 280 సం॥మున ఫ్రాంసు దేశములోని గాతీయులు చుట్టుపట్ల దేశములమీఁద దండెత్తి క్రమక్రమముగా వశపఱచుకొని గ్రీసుదేశముయొక్క ఉత్తర భాగమును స్వాధీనపరచుకొన్న తరువాత సముద్రముదాటి తౌరసుపర్వత పంక్తివఱకున్న, చిన్నాసియా ప్రదేశ మాక్రమించుకొనిరి. అంతట పారసీ రాజు వారి నెదిరించి వెనుకకు తరిమి వారాక్రమించుకొనిన ప్రాంత్యములలో కొంత భాగమును తనవశము చేసికొన్నందున గాతీయులు చిన్నాసియా మధ్యప్రదేశమందలి యొక భాగమందు నివాసులై ఆ భాగమునకు గలతీయ యను పేరు పెట్టిరి. కడకు రోమీయులు వీరిని జయించి ఆ జనులను వారి దేశమును తమ రాజ్యములో చేర్చిరి. గలతీయ ప్రదేశముయొక్క సరిహద్దులేవనిన:—పశ్చిమమున ఆసియ, తూర్పున కపదొకియ, దక్షిణమున పంఫూలియ కిలికియ, ఉత్తరమున బితునియ పొంతు అనునవి. క్రీ॥ ము॥ 25 సం॥మున రోమా చక్రవర్తియగు ఔగూస్తు పై చెప్పఁబడిన గలతీయ ప్రదేశమునకు లుకవొనియ, ఫ్రుగియ పిసిదియ ప్రదేశములలోని కొంత భాగమును చేర్చి ఆ భూభాగము యావత్తుకు గలతీయ యను పేరు పెట్టెను గనుక అంతియొకయ, ఈకొనియ, లుస్త్ర, దెర్బె యను పట్టణములు నూతనముగా నేర్పడిన యీ గలతీయ ప్రదేశములో చేర్చఁబడినవాయెను. ఆయావత్తు ప్రదేశమందును నివసించు ప్రజలను రోమీయులు గలతీయులని పిలిచిరని కొందఱు పండితోత్తములు చెప్పుదురు. పౌలు కాలమందు ఆ ప్రదేశములో ఫ్రుగీయులు గ్రీకులు గాతీయులు రోమీయులు యూదులును చేరి నివాసులై యుండిరి.

వేదవ్యాఖ్యాతలు గలతీయపత్రికలో ప్రస్తాపింపఁబడిన గలతీయ దేశమునుగుఱించి తాత్పర్యభేదములు గలవారై యున్నారు. కొందఱు పౌలు మొదట చెప్పిన గలతీయలో నివాసులైన ప్రజలకు గలతీయ పత్రికను వ్రాసిపంపెనని తలఁచి, ఆ పత్రిక ఆ ప్రదేశములోని ముఖ్యపట్టణములైన పెస్సీన (*Pessinus*), అంకిర (*Anekyra*), తావ్యము (*Tavium*) అను స్థలముల యందుండు సంఘస్థులయొద్దకు పంపించెనని తీర్మానించెదరు గాని వీరి యభిప్రాయము నంగీకరింపనివారు పౌలు ఔగూస్తు చక్రవర్తి యేర్పరచిన గలతీయ ప్రదేశమందు నివాసులైన వారి నుద్దేశించి అంతియొకయ ఈకొనియ లుస్త్ర దెర్బెయను పట్టణములలోని సంఘస్థులకు ఆ పత్రిక పంపెనని నిశ్చయించుకొందురు. రామ్సె (*Ramsey*) యను పండితుఁడు ఈ యభిప్రాయభేద మేలాగు నేర్పడెనో కారణములను తెలియఁజేయుచున్నాఁడు. ఎట్లనిన క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమందు ఔగూస్తు చక్రవర్తి యేర్పఱచిన గలతీయ ప్రదేశమును గుఱించి రోమీయులు క్రొత్త యేర్పాటుచేసి అంతకు పూర్వము అందులో చేరియుండిన లుకవొనియ ప్రాంత్యమును వేఱుపఱచిరి గనుక రెండవ శతాబ్దములో అంతియొకయ ఈకొనియ, లుస్త్ర దెర్బె యను పట్టణములు గలతీయ ప్రదేశములో నుంచి ప్రత్యేకింపఁబడెను. 2-వ శతాబ్దములోని గ్రంథకర్తలు మొదటి శతాబ్దమందీ పట్టణములు గలతీయ ప్రదేశమునకు చేరియుండిన సంగతి నెఱుగక తమ కాలమందు గలతీయ యను పేరుచే పిలువఁబడిన ప్రదేశనివాసులకు పౌలా పత్రికను వ్రాసెనని పొరపాటుగాఁ దలంచిరి.

ఈ పత్రికలోనేగాక గలతీయ యను పేరు అపొ. కార్య $16^{6}$ $16^{23}$ I కొరి $16^{1}$ II తిమొ $4^{10}$ I పేతు $1^{1}$ నందును కనఁబడును. నవీన పండితోత్తముల యభిప్రాయ ప్రకారము పౌలు తన మొదటి ప్రయాణము నందీ ప్రదేశములోఁ దిరిగి అచ్చట సంఘములను స్థాపించెను (అపొ. కార్య. $13^{13}$-$14^{25}$). M.

**గలతీయులకు వ్రాసినపత్రిక** (Galatians, Epistle to the). ఈ పత్రికనుగురించి పరిశోధించుటయందు గలతీయ ప్రదేశమును గురించి చెప్పిన వృత్తాంతమును మొదట తెలిసికొనుట అవశ్యకమైనది (గలతీయ చూ॥). ఈ పత్రిక పౌలుచే రచించఁబడెననుట కెవరును సంశయింపరు. కేవలము నిష్ఠాపరులైన విమర్శకులు సహా యీ పత్రిక పౌలు రచనమని నిరాటంకముగా నంగీకరింతురు.

1. ప్రామాణికత్వము.

(1) బహిస్సాక్ష్యము. దీని ప్రామాణికత్వమును గురించి పరగ్రంథములవలన కలుగు నిదర్శనములు కేవలము నమ్మతగినవి. రెండవ శతాబ్దారంభమందు అనగా క్రీ॥ శ॥ 130–145 సం॥ మధ్య వెలసిన మార్సియోను (*Marcion*) అను దుర్బోధకుఁడేర్పఱచిన వేదగ్రంథములపేర్ల పట్టీలో నీ పత్రిక పేర్కొనఁబడెను గనుక అప్పటికది యంతట నుండు క్రైస్తవులకు తెలిసినదియై యుండెనని విశదమగును. మఱియు క్రీ॥ శ॥ 150–170 మధ్య ప్రసిద్ధిచెందిన జస్టిను మార్టరును, 176 సం॥మందు వ్రాసిన అతెనాగరసును (*Athenagoras*) ఈ పత్రికలోని మాటల నెత్తి తమ గ్రంథములయందు ప్రస్తాపించిరి. అదియుఁ గాక రెండవ శతాబ్దమందు భాషాంతరీకరణము చేయఁబడిన లాటిన్ గ్రంథమందును సిరియభాష గ్రంథమందు నీ పత్రిక చేరి యుండెను.

(2) అంతస్సాక్ష్యము. అపొస్తలుఁడుగా నియమింపఁబడిన పౌలు లిఖించెనని గల $1^{1}$ నందు ప్రస్తాపింపఁబడి యుండుట మాత్రము గాక ఈ పత్రిక శైలినిబట్టియు కథాసంగ్రహమునుబట్టియు పౌలు రచించిన యితర పత్రికలను సంబంధించి యున్నది. ముఖ్యముగా నీ పత్రికలోని బోధాంశములు రోమా పత్రికయందలి బోధాంశములకు చక్కగా సంబంధించి యున్నవి గనుక నీ రెండు పత్రికలు పౌలువలననే రచించఁబడె ననుటకు సందేహము లేదు.

2. ఎవరి నిమిత్తమై వ్రాయఁబడెను. ఇందును గురించి వేద వ్యాఖ్యాతలు మిగుల తాత్పర్య భేదములు గలవారై యున్నారు. పౌలు రెండవ ప్రయాణమందు పైగలతీయ ప్రదేశమును దర్శించెనని తలఁచువారు పెస్సీన అంకీర తావ్యము అను పట్టణములలోని సంఘస్థుల నిమిత్తమై ఆయ నీ పత్రిక వ్రాసెనని తీర్మానించు కొందురు. అయినను పౌలు రెండవ ప్రయాణమందు దర్శించిన ప్రాంత్యము దక్షిణ గలతీయ ప్రదేశమని యెంచువారు ఈ పత్రిక అంతియొకయ ఈకొనియ లుస్త్ర దెర్బేయను పట్టణములలోని భక్తుల నిమిత్తమై రచించఁబడెనని నిశ్చయించుకొందురు. ఇరుపక్షములను విచారించఁగా చాలమట్టుకు రెండవ యభిప్రాయ మంగీకరించుట యుక్తమని తోచును. పౌలు పై గలతీయ ప్రదేశములో నుండిన పెస్సీన అంకీర తావ్యములను పట్టణములను దర్శించి సంఘములను స్థాపించినయెడల, కార్యముల గ్రంథమందందును గురించిన ప్రస్తాపము లేకుండుట మిగుల చోద్యము. ఆయనా ప్రదేశమందు సంఘములను స్థాపించి యున్నయెడల లూకా ఆ సంగతి వివరింపక మానఁడు. అదియు మాత్రముగాక యీ పత్రిక పై ప్రదేశములోని గలతీయులకు పౌలు వ్రాసెనని నిశ్చయించుకొన్నయెడల, ఆయన పలుమారు దర్శించిన అంతియొకయ, ఈకొనియ, లుస్త్ర, దెర్బే యను పట్టణ సంఘస్థులకొక పత్రికయైనను వ్రాయలేదని చెప్ప వలసివచ్చును గాని అలాగు చెప్పుట సహేతుకము కాదు. దక్షిణ ప్రదేశములోని క్రైస్తవులకు పౌలు ఒక యుత్తరమునైనను వ్రాయక పోయెనని నమ్ముట కేవలము అసాధ్యము. మరియు $2^{13}$ బర్నబాకూడ వారి వేషధారణచేత మోస పోయెనను మాటనుబట్టి పౌలెవరికి వ్రాయుచున్నాఁడో వారికి బర్నబా బాగుగా తెలిసినవాఁడని విశదమగును. కార్యముల గ్రంథము మూలముగా బర్నబా పౌలు చేసిన మొదటి ప్రయాణమందు ఆయనకు సహచారియై యుండెను గాని ఆ తరువాత వారు వేఱుపడినట్టు తెలియుచున్నది గనుక పౌలు మొదటి ప్రయాణమందు దర్శించిన సంఘస్థులకీ పత్రిక వ్రాసెనను నిష్కర్ష నిరాక్షేపమైనది. మఱియు $4^{13}$ లో మొదటిసారి శరీర దౌర్బల్యము కలిగినవాఁడనై నేను సువార్త మీకు ప్రకటించితినని మీరెరుగుదురు అని పౌలు చెప్పుటవలన గలతీయ సంఘస్థులను దర్శించుటకు ఆయనకు కలిగిన శరీర బలహీనత కారణమని విశదమగును.

ఇక్కడ చెప్పఁబడిన వ్యాధి పౌలు కెప్పుడు సంభవించెనో కార్యముల గ్రంథమందు వివరింపఁ బడలేదు గాని అట్టి దుర్దశలో నున్నప్పుడు పౌలెక్కడ సంచారము చేసియుండునో యూహించి తెలిసికొనఁగలము. ఆయనా సమయమున పై గలతీయకు పోయెనని నిశ్చయించుకొను వారు ఆ వ్యాధి రెండవ ప్రయాణమందు సంభవించెనని తలఁచెదరు. అయినను పై గలతీయ కొండ ప్రదేశమనియు, అక్కడికి పోవుటకు చక్కని మార్గములు లేవనియు అక్కడి జనులు కొంత అనాగరికులనియు ఆ దేశము దూరముగా నుండినదనియు జ్ఞాపకముచేయఁగా దేహ బలహీనుఁడైన పౌలు బహుశః అచ్చటికి పోయి యుండఁడని తలంచవచ్చును. రామ్సే (*Ramsey*) యను పండితుఁడు పౌలు మొదటి ప్రయాణ మందు పంఫూలియచేరి అక్కడ జ్వరముతగిలి అవస్తనొందినందున స్వస్థత నిమిత్తమై మిట్ట ప్రదేశములోనుండు అంతియొకయకు పోయి వ్యాధి కొంత గుణమయిన తరువాత తన స్వగ్రామమునకు పోవు రాజమార్గమున తటస్థించు పట్టణములను దర్శించి యిల్లు చేరవలెనని తలఁచి బైలుదేరెననియు, ప్రయాణముచేయుచు ఆయన ఈకొనియ, లుస్త్ర, దెర్బే యను పట్టణములను దర్శించునప్పటికి కొంత బాగైనందున తన స్వగ్రామమైన తార్సుకు పోక వచ్చిన త్రోవను తిరిగి అంతియొకయకు పోయెనని ఊహించుచున్నాఁడు. ఈలాగుండఁగా పౌలు మొదటి ప్రయాణమందు తన దేహ బలహీనతను బట్టియే దక్షిణ గలతీయ ప్రదేశములోని సంఘములను స్థాపించెనని విశదమగును. అదియు మాత్రముగాక పైనఁ జూచినట్టు ఆ ప్రయాణ మందే బర్నబా ఆయనతో నుండెను. కాఁబట్టి యీ వివరములను యోచించఁగా పౌలు వ్రాసిన గలతీయ పత్రిక అంతియొకయ, ఈకొనియ, లుస్త్ర, దెర్బే యను పట్టణములలోనుండు సంఘముల నిమిత్తమై రచించెనని నిష్కర్షించుట యుక్తము.

3. కాలస్థాన నిరూపణము:—పౌలు ఉత్తర గలతీయ సంఘములకే పత్రికను పంపెనని నిశ్చయించుకొనువారు ఆయన మూఁడవ ప్రయాణ మందు ఎఫెసునుచేరి అక్కడ కాపురమున్న సమయమున రచించెనని యూహింతురు గనుక వారిమాటకు సమ్మతించిన యెడల క్రీ॥ శ॥ 57 సం॥ లిఖితమాయెనని యెంచవలసి యుండును. దక్షిణ గలతీయ సంఘములకు ఆయన వ్రాసెనను అభిప్రాయము ననుసరించువారు పౌలు రెండవ ప్రయాణమందు కొరింథులో 1½ సం॥ గడిపి అంతియొకయకు బైలుదేరు సమయమున తిమోతిని అతని స్వగ్రామమయిన లుస్త్రకు పంపించి తాను అంతియొకయకు పోయెను. అక్కడ నుండఁగా తిమోతి పౌలు చెంతచేరి యూదులు దుర్బోధవలన ఆ సంఘములయందు కలిగిన కలతను ఆయన కెఱింగించినందున ఆయన వెంటనే యీ పత్రికను రచించి తిమోతి చేతికప్పగించి అతని ముందు పంపించి తాను కొన్నాళ్లలోపల తిరిగి ఆ సంఘములను దర్శింప బైలుదేరెనని తీర్మానింతురు. వీరి యభిప్రాయ మంగీకరించినయెడల యీ పత్రిక సిరియ దేశపు అంతియొకయయందు క్రీ॥ శ॥ 53 సం॥ రచించఁబడెనని యనుకొనుట యుక్తము.

M.

అన్యులను క్రైస్తవులు సున్నతి పొందవలెనా యను అంశమునుగూర్చి యీ పత్రికయందు పౌలు చర్చించినను, అతఁడంతకు పూర్వము జరిగి యుండిన యెరూషలేము సభలోని తీర్మానమును గుఱించి కొద్దిగానైనను సూచింపక పోవుటచే, ఇది యా సభకు పూర్వమే వ్రాయఁబడియుండు ననుకొనువారును గలరు. ఈ యభిప్రాయము నిజమైన పక్షమున నీ పత్రిక పౌలు పత్రికలన్నిఁటిలో మొదటిదై, క్రీ॥ శ॥ 50 లేక 51 సం॥న వ్రాయఁబడెను.

4. ఉత్తరమును వ్రాయుటకు కారణము:—పౌలీ సంఘములకు బోధించిన కొద్ది కాలములోనే ($1^{6}$), సున్నతి పొందవలెనని బోధించిన వారచ్చటికి వెళ్లి బోధింపఁగా ఆ సభికులు అస్థిరులై వారిబోధ నంగీకరించుటకు మనస్సుగలవారై యున్నట్లు పౌలునకుఁ దెలియఁగా, వారా తప్పుబోధ ననుసరింపకుండునట్లు అతఁడు దీనిని వ్రాసెను సున్నతి మొదలగు వెలుపటి యాచారములవలనగాక క్రీస్తునందలి విశ్వాసముచేతనే రక్షింపఁబడెదమను ముఖ్యాంశము అందువలననే వివరింపవలసివచ్చెను. సున్నతి పొందవలెనని బోధించినవారు పౌలు సరియైన అపొస్తలుఁడు కాఁడుగాన అతని బోధను గాక, సరియైన అపొస్తలుల బోధను మాత్రమే

యంగీకరింపవలెనని చెప్పిరి గాన తానితర అపొస్తలులకన్న యే విషయమందైనను తక్కువవాఁడను కానను సంగతినికూడ అతఁడు రుజువు జేయవలసి వచ్చెను.

5. ముఖ్యభాగములు:—

I. పీఠిక:—1. పైవ్రాత ($1^{1,2}$); 2. అభివందనములు ($1^{3-5}$); 3. గలతీయు లగుపఱచిన నిరుత్సాహమును గుఱించి పౌలు వ్యసనపడుట ($1^{6-10}$).

II. తాను క్రీస్తునుగుఱించి బోధించెడి సత్యమును దేవునివలన తప్ప మనుష్యులవలన పొందలేదని తన చరిత్రయందు కొన్ని దృష్టాంతముల నెత్తి చూపుట. 1. తనకు కలిగిన దైవదర్శనము ద్వారా పొందెను ($1^{11,12}$); 2. తన విద్యాభ్యాసమువలన పొందలేదు ($1^{13,14}$) 3. దైవదర్శనమునకు లోఁబడుట వలననే గాని యితర అపొస్తలులయొద్ద నేర్చుకొనుటవలన తెలిసికొనలేదు ($1^{15-24}$), 4. తనకు సాటియైన అపొస్తలుఁడేయని యితర అపొస్తలులు ఒప్పుకొనుట ($2^{1-10}$); 5. అంతియొకయలో పేతురుతో వాదమాడుట ($2^{11-21}$) (దీనికి సంబంధముగా ధర్మశాస్త్రమువలన గాక విశ్వాసమువలననే రక్షింపఁబడెదమని పేతురుతో వాదించిన ముఖ్యాంశమునుగూర్చి వివరించుచు ఈ పత్రికలోని సిద్ధాంత బోధకు పౌలు దిగెను).

III. ధర్మశాస్త్రమువలన కాదుగాని క్రీస్తునందలి విశ్వాస మూలముననే రక్షణకలుగునని స్థాపించి వివరించుట:—1. వారి స్వంత అనుభవము వలనను ($3^{1-5}$), దేవుని వాక్యమువలనను ($3^{6-18}$) దీనిని రూపించుట; 2. ధర్మశాస్త్రముయొక్క పని మనలను రక్షించుట కాదుగాని, మనకు కుమార స్థితి నిచ్చునట్టి క్రీస్తుయొద్దకు నడిపించుటయే యనుదానిని వివరించుచు, ఆ స్థితియొక్క గంభీరత్వమును చూపుట ($3^{19}-4^{7}$); 3. గలతీయులు ప్రారంభమందు అగుపఱచిన మతాభిలాషను జ్ఞాపకముచేసి వారి ప్రస్తుత నిర్విచారమునుగూర్చి విచారపడుట ($4^{8-20}$); 4. ఇష్మాయేలు ఇస్సాకు అనువారి చరిత్రవలన ధర్మశాస్త్రముద్వారా కలుగు దాసత్వమును, విశ్వాసమువలన కలుగు స్వాతంత్ర్యమును దృష్టాంతపఱచుట ($4^{21-31}$); 5. అట్టి స్వతంత్రతను సంపాదించుకొనిన గలతీయులు దానిని పోఁగొట్టుకొనక ఆత్మను సారులగుటచే దానిని సరిగా నుపయోగించు కొనవలెను (అధ్యా 5).

IV. ముగింపు హెచ్చరికలు, ఆశీర్వచనము:—1. పడిపోయిన వారిని చేర్చుకొని బోధకులను పోషించి అందఱికి మేలుచేయవలెనని హెచ్చరికలు చేయుట ($6^{1-10}$); 2. సున్నతి పొందుటను గుఱించి ముగింపు హెచ్చరికలు చేయుట ($6^{11-15}$); 3. ఆశీర్వాదములు ($6^{15-18}$).

గలిలయ (Galilee = గుండ్రము, ప్రదేశము). నఫ్తాలీ మన్నె మందలి ప్రదేశమున (II రాజు $15^{29}$ I దిన $6^{76}$) కారంభమున నున్న పేరు. కెదెషు దీని పట్టణములలో నొకటి (యెహో $20^{7}$ $21^{32}$). సొలొమోను హీరామున కిచ్చిన యిరువది నిష్ప్రయోజన పట్టణము లీ గలిలయలోనే యుండెను (I రాజు $9^{11}$). ఈ ప్రాంత నివాసులను కనానీయులలో ననేకులు జయింపఁబడనేలేదు (న్యాయా $1^{30-33}$). యూదులుకాని వారిచ్చట విశేషముగా నుండుటం బట్టి దీనికి అన్యజనులు నివసించు గలిలయ, అన్యజనుల ప్రదేశము అనునవి సార్థకనామములయ్యెను (యెష $9^{1}$ I మక్క $5^{15}$ మ $4^{15}$). కాలక్రమేణ నీ పేరు దక్షిణమందున్న ఎస్డ్రేలను బయలు వఱకున్న ప్రదేశమంతటికి పెట్టిరి (I మక్క $5^{55}$ $10^{30}$ $12^{47-49}$). అష్షూరీయులతో కలిగిన యుద్ధకాలమునం దీ ప్రదేశవాసు లనేకులు చెఱపట్టఁబడిరి (II రాజు $15^{29}$ I రాజు $15^{20}$). మిగిలియున్న యూదులను సీమోను మక్కబీయను వాఁడు క్రీ॥ శ॥ ముందు దాదాపు 164 సం॥న యూదయలోఁ గాపురముండునట్లు దీసికొని వెళ్లెను (I మక్క $5^{23}$) గాని, కొద్దికాలములోనే గలిలయ మఱల యూదుల ప్రదేశమయ్యెను. ఇది మహా హేరోదు రాజ్యమున నొక భాగమైయుండి అతని మరణానంతరము చతుర్థాధిపతియగు హేరోదున కియ్యఁబడెను. రోమీయుల కాలమునం దది యొర్దానుకు పడమర నున్న మూఁడు భాగములలో నుత్తరమున నుండెను. ఉత్తరమున లెబానోను పర్వతములును తూర్పున యొర్దాను నది గలిలయ సముద్రములును, దక్షిణమున సమ

రయయు పడమట ఫేనీకే దేశమును దాని సరి హద్దులుగా నెంచఁబడెను. ఈ కాలమునందే యిది మిగుల జనసమ్మర్దముగా నుండెను. యోసీఫసు కాలమునందు ఒక్క గలిలయనుండియే లక్ష మంది యౌవనులు సైన్యమునఁజేరిరి (యుద్ధ 2,20,6). 15 వేలమందికి తక్కువగా నట్టి జనసంఖ్య గల పట్టణములును గ్రామములును 240 ఈ జిల్లాలో నుండెను. పట్టణములలో సెఫోరిసు (*Sepphoris*) ను, గ్రామములలో యాఫా (*Jappa*) యును పెద్దవైయున్నట్లు తెలియుచున్నది (యోసీఫసు జీవితము 45). పైన నుదాహరించినటుల బహుజన మిళితమైన ఈ ప్రదేశమందలి భాష యూదయలో మాటలాడుభాషకు భేదముగా నుండుటలో నాశ్చర్యమేమియు లేదు (మా $14^{70}$ లూ $22^{59}$ కార్య $2^{7}$.). గలిలయలోనే ప్రవక్తయు పుట్టఁడని యూదుల యభిప్రాయము (యోహా $7^{41,52}$). అయినను క్రీస్తు శిష్యులలో దాదాపుగా నందఱును గలిలయులే. ఆయనయు అక్కడనే పెరిగి పెద్దవాఁడై కొరాజీను బేత్సయిదా కపెర్నహూము నాయీను కానా నజరేతు అను గ్రామముల మధ్యనుండు ప్రదేశమందు విశేషముగాఁ దిరిగి బోధించెను.

ఈ జిల్లా దాదాపు 60 మైళ్ల పొడవును 25 మైళ్ల వెడల్పునుగల ప్రదేశము. ఫలవంతమగు లోయలుగల బహు అందమైన ప్రాంతముగా నగపడును. ఉత్తర దక్షిణ గలిలయలను రెండు భాగములు పడమటి తీరముననున్న అక్కో (*Acco*) నుండి గలిలయ సముద్ర ఉత్తరకొనకు గీయఁబడు ఊహారేఖవలన నేర్పడుచున్నవి. దక్షిణ ప్రాంతము సముద్రమట్టమునకు పైన 1850 అడుగులకు మించని ఉన్నత ప్రదేశములుగలిగి విశేషముగా గోధుమలను పండించు ప్రాంతముగానున్నది. ఉత్తరభాగము 3 లేక 4 వేల అడుగుల యెత్తుగల కొండలుగలిగి ఒలీవల తోఁపుచే నిండియున్నది. (పలెస్తీను V చూ॥)

**గలిలయలోని కొండ (Galilee, Mountain in).** క్రీస్తు పునరుత్థానుఁడైన పిమ్మట ఆయనచే నియమింపఁబడినట్లుగా శిష్యులు వెళ్లిన యొక కొండ (మ $28^{16}$). ఇది ఆయన ఆరోహణమైన కొండయని కొంద అనుకొనుచున్నారు గాని ఆయన ఆరోహణమైనది ఒలీవ కొండయని స్పష్టముగా నున్నది (లూ $24^{50}$ కార్య $1^{12}$) గాన అట్లనుకొనుటకెట్టి యాధారమును కనఁబడుటలేదు. మ $28^{16}$ నందలి దర్శనము గలిలయ కొండలలో నేదో యొక దానిమీఁద కలిగియుండును. అదేదియో నిశ్చయించుటకు వీలులేదు.

**గలిలయ సముద్రము (Galilee, Sea of).** గలిలయ జిల్లాలోని మంచినీటి సరస్సు. యొర్దానునది దీనిలోకి ప్రవహించి మఱల వెలువడుచున్నది. ఆరంభమున నీ సరస్సు **కిన్నెరతు సముద్రమని** (సంఖ్యా $34^{11}$) పిలువఁబడెను గాని క్రమక్రమముగా **గెన్నెసరెతు సరస్సు** (లూ $5^{1}$ పురా 18,2,1; 13,5,7:1 మక్క $11^{67}$) **గలిలయ సముద్రము, తిబెరియ సముద్రము** (యోహా $6^{1}$ $21^{1}$) అను పేరులు కలిగెను. యొర్దాను నది దనియందు పడి వెడలిపోవు చోట్లం దక్క యితర భాగమంతయు సముద్ర మట్టమునకు దాదాపు 1,000 అడుగుల యెత్తుగల కొండలఁచే నావరింపఁబడియున్నది. ఈ సముద్రమునకు వాయవ్యమున మాత్రమా కొండలంత ఎత్తుగాగాని యేటవాలుగాగాని లేవు. విస్తీర్ణతను బట్టి దీనిని సముద్రమని బిలిచినను నీరు మాత్రము బహు దివ్యమైన మంచి నీరుగానున్నది. యొర్దాను దీనియందు పడు చోటనుండి మఱల వెడలువఱకు ఉత్తర దక్షిణములుగా నిది 12¾ మైళ్ల పొడవును, మగ్దాలా (*Magdala*) నుండి నూటిగా తూర్పు తీరమువఱకు 7½ మైళ్ల వెడల్పును గలిగియున్నది. తూర్పుతీరమునం దీ సముద్రమునకు విశేష గండ్లు లేవుగాని పడమటి తీరమున మాత్రము టెల్ హూమ్ (*Tell Hum*) నుండి దక్షిణమున తిబెరియువఱకు నొక పెద్ద వియుక్తాగ్రగుడము గలదు. ఇది మధ్యధరా సముద్రమట్టమునకు 682½ అడుగులు లోతుగానుండి ఉష్ణమండల ప్రాంత్య శీతోష్ణస్థితిఁగలిగి యున్నది. ఈ సముద్రమునకు బహు సమీపమునందే నిరంతరము హిమముచే కప్పఁబడియుండు హెర్మోను శిఖరము గలదు. ఇంత కొద్ది దూరమునందే అతి శీతల అత్యుష్ణ శీతోష్ణస్థితులుగల ప్రాంతములుండుటచే శీతలవాయువు లకస్మాత్తుగా కొండ సందులలో నుండి యీ సముద్రముపై బలముగా వీచి తుఫానులు రేపుచు సముద్రము నంతటిని యల్లకల్లోలము



గలిలయ సముద్రము (వాయువ్య దిక్కు)

గావించుచుండును. ఈ సముద్రమునందు మంచి చేఁపలకు కొదువ యెట్టిదో దెలియదు. దాదాపు **22** రకములచేఁప లిందున్నవని ట్రిస్ట్రమ్ (*Tristram*) యను శాస్త్రజ్ఞుఁడు కనుగొనెను. అవి దీనియందు మందలు మందలుగా సంచరించు చుండును. అవి తమ రెక్కలను నీటిపైకి రానిచ్చి విహరించు సమయమున మీఁదనుండి జూచు వారికి గాజు సముద్రముపై పిడుగువాన గొట్టునట్లు కనిపించునని చెప్పెదరు. తీరమున నిలిచిగాని లోనికి పడవలమీఁద వెళ్లిగాని వీటిని బట్టెదరు. ఈ చేఁపలా సముద్రమునందు మాత్రమేగాక యొర్దానులోను, దాని యుపనదులలోను విశేష ముగ నున్నవని తెలియుచున్నది.

ఈ సముద్రతీరమునఁబోవుచు యేసు తన శిష్యులను బిలిచెను (మ $4^{18-22}$ మా $1^{16-20}$). దోనె మీఁద నెక్కి ఆయన యీ సముద్రతీరమున ప్రజలకు బోధించెను (మ $13^{1-3}$ మా $4^{1}$). శిష్యులు అద్భుతరీతిగా చేఁపలుపట్టునట్లు జేసెను (లూ $5^{1-11}$ యోహా $21^{1-14}$). కనీసము 5 మాఱులాయన దీనిని ఆ దరినుండి ఈ దరికి దాటెను (మా $4^{35-36}$ $5^{21}$ $6^{32}$ $6^{45-52}$ $8^{13}$ మొ॥). ఇట్లు దాటునప్పు డొకమారు తుఫానును నిమ్మళింపఁజేసెను (మ $8^{23-27}$ మా $4^{35-41}$). ఒక సారి ఈ సముద్రముపై నడిచెను (మ $14^{22-33}$ మా $6^{45-51}$ యోహా $6^{16-21}$). ఆయన విశేషముగా బోధించిన దీ సముద్రము చుట్టునున్న ప్రాంతములలోనే యై యుండెను.

**గలేదు** (Galeed = సాక్షిగానుండు రాళ్ల కుప్ప). లాబాను యాకోబుతో నిబంధనచేసిన తర్వాత ఆ నిబంధనకు గురుతుగా వేసిన రాళ్ల కుప్పకు యాకోబు పెట్టిన సార్థకనామము (ఆది $31^{47,48}$). ఇందులో గల్ అనఁగా కుప్ప అనియు, ఏదు అనఁగా సాక్షియనియు అర్థము. ఈ విధముగానే ఒకసారి యెహోషువ అట్టి రాళ్లకుప్పకు ఏదు అను పేరుపెట్టెను (యెహో $22^{34}$).

**గల్లియో** (Gallio). ఒక రోమను అధిపతి. చాల గొప్పవాఁడు. తత్వశాస్త్రియగు సెనెక (*Seneca*) యనువాని తమ్ముఁడును లూకను (*Lucan*) యను కవీశ్వరుని పినతండ్రియునై యుండెను. ఇతఁడు మంచి జ్ఞానవంతుఁడైనందున జ్ఞానమునకు ప్రసిద్ధికెక్కిన అకయకు అధిపతిగా నియమింపఁబడెను. ఇతఁడు కొరింథునందుండు సమయమున యూదులు పౌలుమీఁద నితని యెదుట నేరము మోపిరిగాని గల్లియో అది మత సంబంధమగు సంగతిగా గుర్తించి పౌలు చెప్పఁ బోవనై యుండిన సమాధానమును వినకనే వారిని న్యాయపీఠమునుండి వెళ్లఁగొట్టెను. యూదుల సమాజపు మందిరముయొక్క అధిపతియగు సోస్తె

నేను పట్టుకొని ప్రజలు కొట్టినను ఇతఁడా సంగతిని లక్ష్యపెట్టుకొనలేదు (కార్య 18[12-17]). అతఁడు రోముకు వెళ్లినప్పుడు మిగుల గొప్ప యుద్యోగము నొందెను గాని నీరో యాజ్ఞయైనందున తన్నుతానే చంపుకొనెను.

E.

గల్లీము (Gallim = కుప్పలు). అనాతోతుకును సౌలుగిబియాకును సమీపముగానుండు ఒక గ్రామము (యెష 10[30]). దావీదు సౌలుకు భయపడి పారిపోయి నప్పుడతని భార్యయగు మీకాలును సౌలీ యూరి నివాసియగు పల్తీయేలున కిచ్చెను (I సమూ 25[44]). అది బహూరీమునకు సమీపముగా నున్నదని II సమూ 3[13-16] వలన నూహింప వీలున్నదిగాని దాని యునికి మరింత నూటిగాఁ దెలియదు.

గవనులు కోట I 2 చూ॥.

గహాము (Gaham = మండుచున్న). నాహోరుయొక్క ఉపపత్నియగు రయూమాకు పుట్టిన కుమారులలో నొకఁడు (ఆది 22[24]).

గహారు (Gahar = మరుగుచోటు). బెరు బ్బాబెలుతోకూడా చెఱనుండి వచ్చిన నెతేనీయులలో నొక తెగవారి పూర్వికుఁడు (ఎజ్రా 2[47] నెహె 7[49]).

## గా

**గాజా, గాజీయులు, గాజావారు** (Gaza = బలమైన దుర్గము Gazites). ఫిలిష్తీయుల ముఖ్య పట్టణము లైదింటిలో దక్షిణమున నున్నది. అది మొదట కనానీయుల దక్షిణపు సరిహద్దుగానుండు పట్టణమని ఆది 10[19] వలనఁ దెలియును. యెహోషువ జయించిన దక్షిణ దేశమున కిదేహద్దయి యుండెను (యెహో 10[41]). యెహోషువ కనాను దేశమును విభజించి యిచ్చినప్పుడిది యూదా వారి కియ్యబడినను వారు దీనిని స్వాధీనపఱచుకొనరైరి (15[47]). అది మొదలు పాత గాజా యున్న స్థానము అరణ్యమని యనుకొనఁబడుచున్నది (కార్య 8[26]). రాక్షసులగు అనాకీయుల చివరి నివాస స్థానములలో ఈ పట్టణ మొకటియై యుండెను. సమ్సోను ఈ పట్టణముయొక్క గవనుల నెత్తుకొని పారిపోయెను (న్యాయా 16[1-3]). ఈ పట్టణములోనే చివరి కతఁడు కైదీయై అనేకులను సంహరించి తానును చనిపోయెను (16[21]). దీనికి కలుగఁబోవు శిక్షలనుగూర్చి ప్రవక్తలాయా కాలములలో తెలుపుచు నుండిరి (ఆమో 1[6,7] జెఫ 2[4] జెక 9[5]).



గాజా పట్టణము (ప్రస్తుతము)

ఐగుప్తురాజు దానిని జయించుటను గూర్చిన సూచన యిర్మీ $47^{1}$ లో నున్నది. పరిచారకులలో నొకఁడగు ఫిలిప్పు ఈ పట్టణమునకు పోవు మార్గమున నపుంసకునికి బోధించి యతనికి బాప్తిస్మ మిచ్చెను (కార్య $8^{26}$). లౌకిక చరిత్రలో ఈ పట్టణమును గూర్చి చాల సూచనలు కలవు. ఐగుప్తురాజగు రెండవ రామెసెసు (*Ramesses II*) కాలములోని శాసనములలో ఈ పేరు కలదు (క్రీ॥ పూ 1300). క్రీ॥ పూ॥ 734-676 సం॥లలో అష్షూరు వారు దానిని స్వాధీనము పట్టుకొనిరి. క్రీ॥ పూ॥ 332 వ సం॥లో మహా అలెక్సండరు అను రాజు ఐదు మాసములవఱకు ముట్టడించిన పిమ్మట పట్టుకొనెను. క్రీ॥ పూ॥ 96 వ సంవత్సరములో అది పూర్ణముగా నాశనమయ్యెనుగాని 57 వ సంవత్సరము క్రొత్త స్థానములో మరల కట్టఁబడెను. క్రీ॥ శ॥ 402 లో కన్స్టాంటినోపిల్ (*Constantinople*) వారును 635 లో తురుష్కులును క్రూసేడుల కాలములో ఫ్రెంచివారును పట్టుకొనిరి. అయితే 1245 సం॥లో అది మరల తురుష్కుల వశమై అప్పటినుండి ఈ మధ్య జరిగిన ఐరోపా మహా సంగ్రామ కాలమువఱకు వారి వశమున నుండెను గాని ప్రస్తుతము ఐక్యరాష్ట్రసమితి యధీనము నున్నది. వారి యధీనమున ప్రస్తుతము దానికి గుజ్జె (*Ghuzzeh*) యను పేరు కలదు. ప్రస్తుత మీ పట్టణములో 37,820 మంది గలరు. (పటము I, A 9).

**గాజువంటి సముద్రము** (Sea of Glass). ప్రక $4^{6}$ లోనిది యిట్లున్నను $15^{2}$లో అసలు గ్రంథమందలి యీ పదమును **స్ఫటికపు సముద్రము** అని తర్జుమా చేసిరి. ప్రకటన గ్రంథములోని యలంకారములను చూడఁగా ఈ సముద్రము దేవుని సింహాసనము ముందర నున్నట్లు తెలియును. ఇది ఆ సింహాసనము చుట్టు నుండు ప్రకాశతను ఒక వేళ దేవుని యాలోచనల యొక్క లోతునుకూడ సూచించును.

**గాజేజు** (Gazez = కత్తిరించువాఁడు). కాలేబు సంతతివారిలో నిద్దఱికి ఒకటే వచనము నందున్న పేరు (I దిన $2^{46}$).

**గాడిదె, గార్దభము, గాడిదెపిల్ల, అడవి గాడిదె** (Ass). పురాతనకాలమునుండి నేటి వఱకు బైబిలు ప్రదేశములలో పనికొఱకై పెంచఁబడు సాధువైన మృగములలో నొకటి. ఐగుప్తు చెఱనుండి ఇశ్రాయేలీయులు వచ్చినప్పుడు వారు తమ పనులకు ఎడ్లను గాడిదెలను ఉపయోగించుచుండిరి (నిర్గ $20^{17}$). బాబెలు చెఱనుండి వచ్చుచుండఁగా వారు తమ వెంట తెచ్చిన గాడిదెల సంఖ్యను (6720) సహా నుదాహరించిరి (ఎజ్రా $2^{67}$). గాడిదలను సూచించెడు పదములు పాత నిబంధనలో మూఁడు కలవు. (1) మగ గాడిదెలను సూచించునవి. వీటిని భారములను మోయుటకును (ఆది $42^{26}$ $49^{14}$ మొ॥) వాహనములుగాను (నిర్గ $4^{20}$ యెహో $15^{18}$ I సమూ $25^{20}$ మొ॥) వాడిరి. (2) ఆడు గాడిదెలను సూచించునవి. వీటిని మఱి ముఖ్యముగా వాహనములకొఱకు కోరిరి (సంఖ్యా $22^{21}$ II రాజు $4^{22}$). అవి తెల్లని వైనయెడల మఱింత విలువగలవిగా నెంచఁబడెను (న్యాయా $5^{10}$). (3) గాడిదెపిల్లలను సూచించునవి. లేఁతవయస్సు గలవాటిని ఈ పదము సూచించెను (ఆది $49^{11}$ యెష $30^{6,24}$). క్రీస్తు జయోత్సవముతో యెరూషలేమునందు ప్రవేశింపఁగా నిట్టి దానిని పైనెక్కెను (మా $11^{2}$; యోహా $12^{15}$).


అడవి గాడిదె

పై నుదాహరింపఁబడిన వాటినిగాక **అడవిగాడిదె** లేక **అడవిగార్దభము**లను సూచించు మఱి రెండు పదములుకూడ పాత నిబంధనలో నున్నవి. అవి గుంపులు గుంపులుగా నిర్జన ప్రదేశములలోఁ దిరుగుచు సాధుపఱచఁబడనేరనివై యున్నవి (హోషే $8^{9}$ యోబు $24^{5}$).

**గాద్భువెబ్బ** వ్యవసాయము 5 (3) చూ॥

**గాతాము** (Gatam = గిటకపారిన). ఎదోము ప్రధానులలో నొకఁడు (ఆది 36^11,16 I దిన 1^36).

**గాతు, గాతీయులు** (Gath = ద్రాక్ష గానుగ). ఫిలిష్తీయుల ఐదు ముఖ్య పట్టణములలో నొకటి. అనాకీయులు నివసించిన పట్టణములలో నిది యొకటియై యుండెను (యెహో 11^22) ఫిలిష్తీయులు మందసమును పట్టుకొనిన పిమ్మట దానిని అష్డోదునుండి గాతుకు తీసికొనివచ్చి యచటనుండి ఎక్రోనుకు నంపిరి. (I సమూ 5^8). రాక్షసుఁడగు గొల్యాతు ఈ పట్టణస్థుఁడే (17^4 II సమూ 21^19). గొల్యాతు కూలిన పిమ్మట ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయులను గాతువఱకు తరిమిరి (I సమూ 17^52). దావీదు సౌలు యొద్ద నుండి పారిపోవలసివచ్చిన సమయమున కొంత కాలము గాతులో నుండెను (21^10). దావీదు సంరక్షకులైన గిత్తీయులు (II సమూ 15^18) ఈ పట్టణమునుండియే వచ్చినవారై అబ్షాలోము తిరుగు బాటు కాలములో కూడ దావీదును విడువ కుండిరి. దావీదు గాతును జయించెను (I దిన 18^1). రెహబాము అచట నొక కోటను కట్టించెను (II దిన 11^8). పారిపోయిన తన సేవకులను దెచ్చుకొనుటకై షిమీ యనువాఁడు సొలొమోను ఆజ్ఞను మీఱి అచటికి వెళ్లినందున మరణశిక్ష నొందెను (I రాజు 2^39-46). సిరియ రాజగు హజాయేలు గాతును పట్టుకొనెను (II రాజు 12^17). గాతీయుల పశువులను దోచుకొనుటకై వచ్చిన ఎఫ్రాయిమీయులను వారోడించిరి (I దిన 7^21). ఉజ్జియాయను రాజు దానిని మఱల పట్టుకొనెను. (II దిన 26^6). ఆమో 6^2 చూడఁగా దానికి గొప్ప విపత్తు కలిగినట్లు కనఁబడును. అష్షూరు రాజు దానిని పట్టుకొనినట్లందువలన తెలిసికొన వలెనని కొంద అనుకొందురు. తరువాతి కాల మందలి ప్రవక్తల గ్రంథములలో ఈ పేరు లేకుండుటవలన వారు ప్రవచింపక పూర్వమే అది నాశనమయ్యెనని తెలిసికొనఁగలము. ఈ పట్టణము ప్రస్తుతమున లేదు గాని ఎక్రోనుకు తూర్పుగా 10 మైళ్లు దూరములోనున్న టెల్-ఎస్-సాఫీయె (*Tell-es-Safiyeh*) అనుదాని పాడు శేషముల స్థానమే దీని యునికి యను కొందురు. (పటము I, C 9).

**గాదీ** (Gadi = గాదు గోత్రపువాఁడు). ఇశ్రాయేలువారి రాజ్యమనఁబడిన పదిగోత్రముల నేలినరాజులలో మెనహేమను వాని తండ్రి (II రాజు 15^14-17).

**గాదు, గాదీయులు** (Gad = అదృష్టము, Gadites).

1. లేయా దాసీయు యాకోబు ఉపపత్నియైన జిల్పా కుమారుఁడు. యాకోబుయొక్క ఏడవ కుమారుఁడు. (ఆది 30^9-11). అతని పుట్టుక రానైయుండిన గొప్ప సమూహము లేక సైన్యము వంటి యాశీర్వాదములను సూచించినందున అతని కది సార్థకనామముగా పెట్టిరి. ఇతని కేడుగురు కుమారులు కలిగిరి. వీరందఱును కుటుంబములను కలిగియుండిరి (46^16 సంఖ్యా 26^15-18)

2. గాదుయొక్క కుటుంబికు లందఱును **గాదీయులన**ఁబడిరి. యొర్దానుకు తూర్పున వీరు స్వాస్థ్యము నొందిరి (సంఖ్యా 32). వీరిలో కొందఱు దావీదుతో కలిసికొని అతనికి సహాయపడిరి (I దిన 12^8-15,37,38). వీరు మిగుల యుద్ధప్రియులు. తమ సరిహద్దులయందుండు అరబ్బులతో నెల్లప్పుడు యుద్ధమాడుచుండిరి (ఆది 49^19 ద్వితీ 33^20 I దిన 5^19).

3. గాదీయుల కియ్యఁబడిన దేశము. యొర్దానుకు తూర్పున నున్నది. ఇది పూర్వము అమ్మోనీయుల దేశములోని భాగమై యుండెను (యెహో 13^24-28 సంఖ్యా 32^17 I సమూ 13^7 యిర్మీ 49^1). గాదు దేశపు ముఖ్య పట్టణములకు గిలాదు పట్టణములను పేరుగలదు (పటము IX). B.

4. దావీదు కాలములో ప్రవక్తగానుండిన యొక ముఖ్యుని పేరు. ఇతనికి దర్శకుఁడు (I దిన 21^9 II దిన 29^15, II సమూ 24^11). ప్రవక్త (I సమూ 22^5 II సమూ 24^11) యను బిరుదులు కలవు. దావీదు సౌలుయొద్దనుండి పారిపోవలసి వచ్చిన సమయములలో ఇతఁడు దావీదుకు ఆలోచన చెప్పెను (I సమూ 22^5). దావీదు ప్రజలను లెక్కించినపు డతనిని గద్దించి తరువాత అతనికి కలిగిన శిక్షను నివారణచేయుటకు ఉపాయము తెలిపెను (II సమూ 24^18 I దిన 21^9-27). యెహోవా మందిరములో సంగీత వాయిద్యా

దుల నేర్పాటు చేయుటయందు అతఁడు దావీదుకు సహాయము చేసెను (II దిన 29[25]). దావీదు ప్రభుత్వకాలపు చర్యలను వ్రాసినవారిలో గాదు ఒకడై యుండెను (I దిన 29[30]).

5. ఒక దేవతయొక్క పేరు (యెష 65[11]). హిందువుల లక్ష్మికివలె ఆ దేశస్థులకిది అదృష్ట దేవతయై యుండెను. బయల్గాదు (= బయల్ + గాదు, యెహో 11[17] 12[7] 13[5]), మిగ్దల్గాదు (= మిగ్దల్ + గాదు, 15[37]), అజ్గాదు (= అజ్ + గాదు, ఎజ్రా 2[12]) అను పేరులలో ఈ పదము కనఁబడును. యెహో 13[5] నందు బయల్గాదు అను మూలరూపము గలదు.

**గాదునదిలోయ** (Gad, Valley of). మోయాబుకును గాదుకును మధ్యనుండు అర్నోను యేరు నదిలోయ పేరు (II సమూ 24[5], అర్నోను చూ॥).

**గానుగ** ఒలీవచెట్టు, ద్రాక్షచెట్టు చూ॥

**గామూలు** (Gamul = బహుమతి నొందిన వాఁడు). అహరోను సంతతివారగు యాజకుల లోని 22 వ వంతుకు మూల పురుషుఁడు (I దిన 24[17]).

**గాయకులు** యాజకులు, లేవీయులు చూ॥

**గాయపఱచుకొనుట** దేహము చీరుకొనుట చూ॥

**గాయములు** రోగములు చికిత్సలు III 5 చూ॥

**గాయములు బాగుచేసిన వారు** రోగములు చికిత్సలు IV 2 (1) చూ.

**గాయియు, గాయు** (Gains).

1. ఎఫెసు పట్టణమందు పౌలును గుఱించి అల్లరి జరిగిన సమయమున అతనితో కూడనున్న యొక మాసిదోనీయుఁడు (కార్య 19[29]).

2. పౌలు కొరింథును మూఁడవ ప్రయాణాంతమున విడిచి బయలుదేరి నప్పుడతని వెంట నుండిన దెర్బేపట్టణస్థుఁడు (కార్య 20[4]).

3. రోమా పత్రికను వ్రాయునప్పుడు పౌలు నతిథిగా చేర్చుకొని రోమా సంఘస్థులకు వందనము లంపినవాఁడు (రోమా 16[23]).

4. యోహాను తన మూఁడవ పత్రికను వ్రాసి పంపినవాఁడు (III యోహా 1).

పై నుదాహరించిన సంగతులు గాక వీరిని గూర్చి ఇఁక నేమియు దెలియదు.

M.

**గారడీ, గారడీవాఁడు** (Sorcery, Sorcerer). బైబిలు మూలభాషలయందున్న ఈ పదములకు గుసగుస మాటలాడుట, ఇంద్రజాలము చేయుటయని యర్థము. సాధారణముగా తెలుఁగు భాషయందిచ్చు అర్థముకన్న లోతైన యర్థమునం దీ పదమును వాడిరి. మానవులకు స్వాభావికముగా నుండు జ్ఞాన శక్తులకన్న మించినవాటిని దయ్యములద్వారా పొందుట యని సాధారణముగా ననుకొనుచున్నారు. ఇట్టి శక్తులను జ్ఞానమును సూచించుటకు బైబిలునం దనేక పదము లుపయోగించి యున్నారు. వీటి కంతగా వ్యత్యాసమున్నట్టుల కనఁబడదు. ఈ పనులు చేయువానికి గారడీవాఁడని తెనిఁగించిరి. (దాని 2[2] కార్య 8[9-11] 13[6]).

B.

**గారడీ సీమోను** (Simon Magus). సమరియ పట్టణమందలి యొక గారడీవాఁడు. ఇతని భ్రమలలో చిక్కి ఆ పురవాసు లితని దేవుని మహాశక్తియని పిలిచిరి. సువార్తికుఁడగు ఫిలిప్పు పట్టణమునందు బోధించి అద్భుతములను చేయఁగా చూచి నమ్మి బాప్తిస్మము నొందెను గాని పేతురు యోహాను హస్తనిక్షేపణము చేయుటద్వారా పరిశుద్ధాత్మ వరము కలుగుట చూచి, అట్టి శక్తిని డబ్బు పెట్టి కొనఁదలంచి, పేతురుచే గద్దింపఁబడి క్షమాపణ గోరెను గాని మారుమనస్సు నొందినట్లు గనఁబడదు (కార్య 8[9-24]). అతఁ డప్పటినుండి పేతురు నెదిరించు చుండెననియు, రోమాకు వచ్చి గారడీలుజేసి జనులను మోసపఱచెననియు చెప్పెదరు. రోమా పట్టణము పైకి యెగురుటవలన తన దైవత్వము రుజువుచేయఁ బోవుచుండఁగా పేతురు ప్రార్థించుటవలన క్రిందపడి చనిపోయెనని కొందఱును, తన్ను పాతిపెట్టినయెడల క్రీస్తువలె లేవఁగలనని పాతిపెట్టించుకొని మఱల లేవనేలేదని కొందఱును చెప్పెదరు.

E.

**గారుత్మతము** రత్నములు 4 చూ॥

**గారేబు** (Gareb = జిల). దావీదుయొక్క ముప్పదిమంది ముఖ్య యోధులలో నొకఁడు (II సమూ 23[38] I దిన 11[40]).

**గారేబుకొండ** (Gareb, The Hill of). యెరూషలేము ప్రాంతములో నుండు నొక కొండ (యిర్మీ 31[39]).

**గార్దభము** గాడిద చూ॥

**గాలము** (Hook). చేపలను పట్టుకొనుటకును (యోబు 41[1,2] మ 17[27]) పశువులను నడిపించుటకును (II రాజు 19[28] ఆమో 4[2]) ఉపయోగపడు నొక విధమైన యినుపపనిముట్టు. ఇశ్రాయేలీయులను శత్రువులు చెఱబట్టినపుడు వారిని బలవంతముగా నడిపించుటను సూచించుటకై నా గాలమును నీ ముక్కుకు తగిలించెదను (II రాజు 19[28] యెష 37[29]), నీదవుడలకు తగిలించెదను (యెహె 29[4] 38[4]) అని అలంకారరీతిగా వాడఁబడియున్నది.

**గాలాలు** (Galal) చెఱకాలమునకుఁ బిమ్మట జీవించిన లేవీయులలో నిద్దఱిపేరు (I దిన 9[15,16] నెహె 11[17]).

**గాలి** (Wind). గాలివచ్చు దిక్కునుబట్టి దానికి పేరుపెట్టుట మనవలె బైబిలులోనుకూడ వాడుకయుండెను. పలెస్తీనులో మే మాసము మొదలు అక్టోబరు మాసమువఱకు సాధారణముగా ఉత్తరమునుండియు వాయువ్యమునుండియు వీచు గాలి అనుకూలమైన గాలియై యున్నది (పర 4[16] యోబు 37[9]). సెప్టెంబరు అక్టోబరు మాసములలో అనేక మాఱులు వడగాలి తూర్పునుండి వీచును ప్రజలకు బాధకరము గానుండెను (హోషే 13[15]). అది యొకానొకప్పుడు ముందుగానే వచ్చినందున పైరులన్నియు యెండిపోవుచుండెను (యెహె 17[10] కీర్త 103[16]). అక్టోబరుమాసమునకు తరువాత దక్షిణపు గాలి వీచును (లూ 12[55]). అటుపిమ్మట పడమటినుండియు నైరృతి దిక్కునుండియు గాలి వీచి వర్షము కురియును (I రాజు 18[44] లూ 12[54] ఊరకులోను చూ॥).

**గాలిలు** గలిలయ చూ॥

**గాలు** (Gaal = అయిష్టము). న్యాయాధిపతుల కాలములో అబీమెలెకునకు విరోధముగా తిరుగుబాటుచేసిన యొకఁడు. ఇతఁడు ఓడిపోయి చంపఁబడెను (న్యాయా 9[26-49]).

## గి

**గిజోనీయుడు** (Gizonite). హాషేము అను వాని బిరుదు (I దిన 11[34], హాషేము చూ॥).

**గిత్తయీము** (Gittaim = రెండు ద్రాక్ష గానుగలు). బెన్యామీనీయుల యూళ్లలో నొకటి (II సమూ 4[3] నెహె 11[33]).

**గిత్తహెపెరు** గత్హెపెరు చూ॥

**గిత్తీత్** (Gittith = గాతు సంబంధమైన). కీర్త 8, 81, 84 అను వాటి రాగముయొక్క పేరు. ఆ రాగము ఏదొకటియైనట్లు మూలభాషవలనఁ దెలియుచున్నను తెనుఁగు బైబిలునందు గాతు రాగము, గిత్తీత్ రాగము అని యున్నది. దీని మూలపదము గాతు అను పేరుకు స్త్రీ లింగ రూపమై యుండి, గిత్తీతుమీఁద యని యర్థమిచ్చుటచేత, అదిరాగము పేరుగాక గాతులోని వాద్యములను సూచించుచు, వాటితో పాడవలసినదను అర్థమిచ్చునని కొందఱి యభిప్రాయము. మఱికొందఱు ఇది గిత్తీయుల రాగములలో నొకటి యనుకొనుచున్నారు. గాతు అను పదమునకు ద్రాక్షగానుగ యని అర్థముగాన ద్రాక్షగానుగ నాడించునప్పుడు పాడఁబడు రాగమని యనుకొను వారును గలరు.

**గిత్తీయులు** (Gittites). గాతు పట్టణ నివాసులు (II సమూ 6[10,11] 15[18,19,22] గాతు చూ॥).

**గిదోము** (Gidom = నరికించుట). బెన్యామీనీయులను ఇతర గోత్రముల వారు శిక్షించఁగా వారిని ఈ గిదోమువఱకు తఱిమినట్లున్నది (న్యాయా 20[45]). దీని సరియైన యునికినిగూర్చి తెలియదు. ఇది యొకవేళ ఆ స్థలమునకు పేరుకాదని కొందఱనుకొందురు. అట్లయినయెడల వారిని నరికే మట్టుకు వెంటాడి తఱిమిరి అని యీ వచనములో చదువవలయును.

**గిద్దల్తీ** (Giddalti = దేవుని గొప్ప చేతును). జెరుబ్బాబెలు ఆలయమును కట్టించిన పిమ్మట సంగీతము చేయుటకు నియమించిన వంతులలో 22 వ దానికి పెద్ద (I దిన 25[4-29]).

**గిద్దేలు** (Giddel = మిగుల గొప్ప).

1. నెతీనీయులలో నొక తెగ వారికి పెద్ద (ఎజ్రా $2^{47}$ నెహె $7^{49}$).

2. సొలొమోను సేవకులలో నొక తెగవారికి పెద్ద (ఎజ్రా $2^{56}$ నెహె $7^{58}$).

**గిద్యోనీ** (Gideoni = నరుకుట). ఇశ్రాయేలీయు లరణ్య సంచారముచేయు కాలమందు బెన్యామీనీయులకు పెద్దయగు అబీదానుయొక్క తండ్రి (సంఖ్యా $1^{11}$ $2^{22}$ $7^{60-65}$ $10^{24}$).

**గిద్యోను** (Gideon = నరుకు ద్రోయువాఁడు, ద్రోయువాఁడు). మనష్షె గోత్రికుఁడును అబీయెజెరు వంశస్థుఁడగు యోవాషు కనిష్ఠపుత్రుఁడు (న్యాయా $6^{15}$). ఒఫ్రా గ్రామ నివాసి ($6^{11}$ $8^{26}$). ఇతని సహోదరులు తాబోరులో మిద్యానీయుల వలన హతులైరి ($8^{18}$). ఇశ్రాయేలీయులను మిద్యానీయుల దాసత్వము నుండి విడిపించుటకు దేవుని దూత యితనిని పిలిచెను ($6^{11-24}$). దేవుని యాజ్ఞ ప్రకారమతఁడు ఒఫ్రాయందలి బయలు బలిపీఠమును దేవతా స్తంభమును పడఁగొట్టె ఆ యూరి ప్రజలు తన పైకిఁ దెచ్చుకొనెను గాని అతని తండ్రి వారి నపహసించి వారికోపమును త్రిప్పివేసెను ($6^{25-32}$). అప్పటినుండి గిద్యోనుకు యెరుబ్బయలు ($6^{32}$), యెరుబ్బెషెతు (II సమూ $11^{21}$) అను పేర్లు కలిగెను. గిద్యోను మనష్షె నఫ్తాలీ జెబూలూను ఆషేరు గోత్రికులను (న్యాయా $6^{35}$) యుద్ధమునకు పోగుజేసెను. దేవుఁడు గొఱ్ఱె బొచ్చుద్వారా రెండు దృష్టాంతములను కనుపఱిచి ధైర్యపఱచిన మీఁదట ($6^{36-40}$). హరోదు బావి కెదురుగానున్న మిద్యానీయుల సమీపమునకువచ్చి ($7^{1}$) దేవుని యానతి చొప్పున అందఱిని పరీక్షించి 300 నందల మందిని గాక తక్కిన వారిని పంపివేసెను ($7^{2-8}$). ఆ రాత్రి గిద్యోను తన సేవకుఁడగు పూరాతోఁ గలసి మిద్యానీయుల దండులోఁ ప్రవేశించి అచ్చటవిన్న సంగతులవలన మఱింత ధైర్యమునొంది తిరిగివచ్చి వింతయిన వ్యూహమును బన్ని మిగులయుక్తితో శత్రువులను పటాపంచలుగఁ దఱిమివేసెను ($7^{9-24}$). మిద్యానీయులు పరారులగుచున్నారను వార్త విని ఎఫ్రాయిమీయులు వారికెదురొడ్డి శత్రురాజులలో ఓరేబు జెయేబులను నిద్దరిని పట్టుకొని హతముజేసి ($7^{25}$), తమ్ము నా యుద్ధమునకుఁ బిలువనందుకై గిద్యోనుపై కినుక వహింపఁగా నతఁడు చమత్కారోక్తులచే వారిని సముదాయించి పంపివేసెను ($8^{1-3}$). యొర్దాను దాటి తప్పించుకొనిన వారివెంటఁబడి దరుముచు సుక్కోతు పెనూయేలు పట్టణముల వారి సహాయము గోరినప్పుడు వారతని నపహసించి సహాయనిరాకరణులు కాఁగా, అతఁడు నిరుత్సాహుఁడు గాక, శత్రువులను దఱిమి కర్కోరుయొద్ద జెబహు సల్మున్నాలను మఱియిద్దరు రాజుల నోడించెను ($8^{4-12}$) శత్రు సంహారమైన పిదపఁ దిరిగివచ్చుచు పెనూయేలు సుక్కోతులవారిని తగినట్లు శిక్షించి ($8^{13-17}$), చెఱపట్టిన యిద్దఱు రాజులను విచారించి సంహరించెను ($8^{18-21}$). ప్రజలతని జయమునకు మిగుల సంతోషించి రాజుగాఁజేయనుద్యమింపఁగా నతఁడందుల కియ్యకొనక ($8^{22,23}$) వారి దోపుడు సొమ్మునుండి కొంత స్వీకరించి దానితో నొక ఏఫోదును చేయించి (యాజకుల వస్త్రములు I 5, II 2 చూ॥) ఒఫ్రాయందుంచెను. ఇది అతనియింటి వారికొక ఉరియంటిదయ్యెను. నలుబదియేండ్లవఱకు ప్రజల నేలి మిగులవృద్ధుఁడై చనిపోయి ఒఫ్రాలో పాతిపెట్టఁబడెను ($8^{29-32}$). విశ్వాసులజాబితా యందితని పేరును గలదు (హెబ్రీ $11^{34}$).

W.

**గిన్నె, పాత్ర** (Cup). ఈ మాటలతో తెనిఁగించఁబడినవి కనీసము ఆరు హెబ్రీ పదములును, ఒక గ్రీకుపదమును గలవు. ఒకటేపదము నొకసారి గిన్నెయనియు, ఒకసారి పాత్రయనియు తెనిఁగించిరి. ఆరంభమునుండి వీటిని ఆయా పనుల కుపయోగించినట్టుల జూడగలము. గుడారమునందును దేవాలయమునందు నుపయోగింపఁబడిన గిన్నెలు పాత్రలు ఇత్తడి వెండి బంగారు లోహములతోఁ జేయఁబడినవి (నిర్గ $25^{29}$ $37^{16}$ I రాజు $7^{50}$ యిర్మీ $52^{19}$, దేవాలయము I 7 (2) చూ॥). యోసేపు తన వెండి గిన్నెను బెన్యామీను గోతములో వేయించెను (ఆది $44^{2}$). అది త్రాగుటకు మాత్రమేగాక శకునము చెప్పుట కుపయోగింపఁబడెను ($44^{5}$). బీదలును త్రాగుటకు గిన్నెలను వాడిరి గాని అవి యిత్తడివై యున్నట్లూహింపఁదగును (వంటసామగ్రి 5 చూ॥).

వీటినిగూర్చిన అలంకార ప్రయోగములును బైబిలునందు గానవచ్చుచున్నవి. కీర్త $116^{13}$ నందు **రక్షణ పాత్ర** యను పదము కనఁబడుచున్నది. కీర్త $11^{6}$ $16^{5}$ లోని **పానీయ భాగము** అని తెనిఁగించిన మూలపదము పాత్రయని యర్థమిచ్చును. పాత్ర ఒకని గతినికూడ సూచించును. కనుకనే క్రీస్తు నేను త్రాగవలసిన గిన్నెలోనిది మీరు త్రాగఁగలరాయని శిష్యుల నడిగెను (మ $20^{22}$). తాను పొందనైయున్న క్రూరమరణము ఒకగిన్నెయై యున్నట్లు గెత్సేమనేలో చెప్పెను (మ $26^{39}$). శిక్షవిధింపఁబడిన నేరస్థులు **ఉగ్రత పాత్ర, క్రోధపు పాత్ర** త్రాగినటుల చెప్పు అలంకారము సర్వసాధారణమైనది (యెష $51^{17}$ యిర్మీ $25^{15}$ యెహె $23^{31-33}$ హబ $2^{16}$ ప్రక $14^{10}$ $16^{19}$ $17^{4}$ $18^{6}$ మొ॥).

పస్కా నాచరింపునపుడు ద్రాక్షారసమును పానముచేయుట యూదులలో మొదట లేక పోయినను తరువాత వాడుకయైనట్లు పారంపర్యములవలనఁ దెలియుచున్నది. వారు దానికి **ఆశీర్వచనపు పాత్ర** (I కొరి $10^{16}$) యని పేరు పెట్టిరి. క్రీస్తు తన మరణజ్ఞాపకార్థమైన ప్రభు రాత్రి భోజనమును సంస్కారము నేర్పరచగా, అట్టి పాత్రను వాడెను. అందుచేతనే ద్రాక్షారసమునక, గిన్నెలోనిది యనెను (మ $26^{27}$ మా $14^{23}$ లూ $22^{20}$ I కొరి $11^{25}$).

**గిన్నెతోను** (Ginnethoi, Ginnethon = తోఁటమాలి). చెఱకు తరువాతి కాలములోనున్న యాజకులలో నొకఁడు (నెహె $12^{3,16}$ $10^{6}$).

**గిన్నెనందించువాడు** పానదాయకుడు చూ॥

**గిబియా, గిబా, మారెగిబా** (Gibeah, Geba = కొండ, Maureh – Geba).

1. యూదయ మన్య ప్రదేశములోనున్న ఒక యూరు (యెహో $15^{57}$ II దిన $13^{2}$).

2. బెన్యామీనీయుల యూళ్లలో నొకటి. న్యాయా $19^{12-30}$ లో వివరింపఁబడిన ఘోర కృత్యమును దానికిఁగలిగిన శిక్షయు ఇచటనే జరిగెను. ఇది యిశ్రాయేలీయులకు మొదటి రాజైన సౌలుయొక్క స్వంతయూరు (I సమూ $10^{26}$). ఇందుచేతనే దీనికి **సౌలుగిబియా** అను పేరుపెట్టిరి (I సమూ $11^{4}$ యెష $10^{29}$). సౌలు ఫిలిష్తీయులతో యుద్ధము చేయఁగా ఇచట దండు పేటనుంచెను (I సమూ 13,14). ఇచట గిబియోనీయులు సౌలుయొక్క ఏడుగురు కుమారులను ఉరితీసిరి (II సమూ $21^{6-9}$). అష్షూరురాజగు సన్హెరీబు ఉత్తరము నుండి యూదా వారిమీదికి దండెత్తివచ్చుచుండఁగా ఈ గిబియా మీఁదుగానే వచ్చెను (యెష $10^{29}$). ఇది బేత్లెహేముునుండి బేతేలుకు పోవు మార్గమునకు సమీపమున నున్నదని న్యాయా $20^{31}$ వలన తెలియును గాని దీని యునికి మఱి సూటిగాఁ దెలియదు (గెబా చూ॥). పటము III F 5.

3. ఇశ్రాయేలీయులు బెన్యామీనీయుల మీఁద యుద్ధముచేయఁ బోయినప్పుడు దాగు కొనిన చోటు (న్యాయా $20^{33}$). దీనికిక్కడ గిబియా బట్టబయలు (*Maureh-Geba*) అను పేరుగలదు. ఆ పేరును అసలునందు కొంచెము సవరించినయెడల అది గిబాకు పడమట నున్నదని అర్థమిచ్చును గాన ఆ దిక్కున నున్నదని కొందఱి అభిప్రాయము.

4. (Gebim = నీటి తొట్లు). దీని మూల పదము యెష $10^{31}$ నందు గాక మఱెచ్చటను లేదు. ఇది యెరూషలేమున కుత్తరము గానున్నది. దీని యునికినిగూర్చి యింకేమియు తెలియదు.

**గిబియోను, గిబియోనీయులు** (Gibeon = కొండ సంబంధమైన, Gibeonites).

1. కనాను దేశవాసులగు హివ్వీయుల ముఖ్య పట్టణము (యెహో $9^{3,17}$ $11^{18,19}$). వీరికే అమోరీయులను పేరుగలదు (II సమూ $21^{2}$). వీరికి కెఫీర, బెయేరోతు, కిర్యత్యారీమను పట్టణము లుండెను (యెహో $9^{17}$). మాయోపాయముఁ జేసి వీరిశ్రాయేలీయులతో సంధిజేసికొనిరి గాని, అది తెలిసినమీఁదట వారికి దాసులైరి ($9^{1-27}$). వారితోఁజేయఁబడిన సంధిని ప్రజలు లక్ష్యపెట్టి శత్రువులబారి నుండి వారిని రక్షించిరి ($10^{1-43}$). కొన్ని శతాబ్దములకుఁ పిమ్మట సౌలీ సంధిషరతులను మీఱి వారిని సంహరించి, దేశముపైకి శాపము రప్పించుకొని, దాని పరిహారార్థమై తన సంతతి వారిలో నేడుగురిని కోలుపోయెను (II సమూ $21^{1-9}$). బెన్యామీను సరిహద్దులలో నీ పట్టణమున్నది (యెహో $18^{25}$). దీనిని దీనిచుట్టునుండు

సేటులతోఁగలిపి అహరోను సంతతి వారికిచ్చిరి ($21^{17}$). సౌలు పూర్వికులీ గిబియోనులోఁ గొంత కాలముండి స్థితిమంతులుగను కులీనులుగనైరి (I దిన $8^{30}$, $9^{35}$). ఇష్బోషెతు దావీదు సైన్యము లిచ్చట యుద్ధము జేసెను (II సమూ $2^{8-17,24}$ $3^{30}$). దావీదు ఫిలిష్తీయుల నిచ్చట ఓడించెను (I దిన $14^{16}$ II సమూ $5^{25}$). దీనికి సమీపమందే యోవాబు అమాశాను జంపెను ($20^{8}$). దేవాలయము కట్టఁబడక పూర్వముండిన గుడారము దావీదు సొలొమోనుల కాలమునందు ఇచ్చట నుండెను. సొలొమోను కిచ్చట దైవదర్శనములు లభించెను (I రాజు $3^{5-15}$ $9^{2}$ I దిన $16^{39}$ $21^{29}$ II దిన $1^{3,13}$). గిబియోనీయులు చెఱనుండి తిరిగి వచ్చి (నెహె $7^{25}$) యెరూషలేము ప్రాకారములఁ గట్టుటలోఁ తోడ్పడిరి ($3^{7}$). యెరూషలేమునుండి గిబియోనుకు 4½-6 మైళ్ల దూరముండునని యోసీఫసు వ్రాతలవలనఁ దెలియుచున్నది (పురా 7,11,7 యుద్ధ 2,19,1) యెరూషలేమున కుత్తరముగాను, ప్రస్తుతమున్న యెల్ జిబ్ (*el-zib*) అను గ్రామమునకు వాయువ్యముగా గిబియోనున్నట్లు కనుగొనిరి. అచ్చట నొకకొండ కలదు. ఈ పట్టణము విశాలములైన లోయల మధ్యనున్నది ఆ లోయలలో బహుగా సేద్యము చేయుచున్నారు. ఇదే గిబియోను లోయయై యున్నది (యెష $28^{21}$). ఈ యూరు ఆ కొండ మీఁద విశాలముగనున్న శిఖరమున కట్టబడి నల్లఫే లేక యాఫె పురాతనమగు ఇండ్లు గలిగియున్నది. ఈ గ్రామమున కాగ్నేయముగా కొంచెము దూరమందు మనోహరమగు నొక యూఁట భూమి లోపలగా తొలచఁబడిన కోనేటిలోకి ప్రవహించుచున్నది. దీనికి సమీపముగా ఒలీవతోఁపు నందు 59 అడుగుల పొడవును 36 అడుగుల వెడల్పును గల మఱియొక తటాకము గలదు. అది యీ మొదటి కోనేటి కెక్కుడైన నీటికొఱకే త్రవ్వఁబడినట్లు కాన్పించుచున్నది. పడమటి దిక్కున నొక పెద్ద బండయందు తొలువఁబడిన 11×7 అడుగుల కోనేరు మఱొక్కటిగలదు. దీనిపేరు ఎల్ బిర్కె (*el-Birke*). ఈ మైదానమునందే ప్రతి శీతాకాలమునందు 7 లేక 8 ఎకరముల వైశాల్యముగల యొక సరస్సేర్పడుచున్నది. వీటిలోనే ఒకటి II సమూ $2^{13}$ యిర్మీ $41^{12}$ నందు దాహరింపఁబడిన గిబియోనుకొల్లనై యుండును గిబియోనుకును రామాకును మధ్య సేద్యమునకు రాక విడువఁబడిన పీఠభూమియే గిబియోను అరణ్యమై యున్నది (అరణ్యము 3 (5) చూ॥). అది అరణ్యమే యైనయెడల పట్టణమునకు తూర్పున చాల దూరమందుండె ననవలెను (II సమూ $2^{24}$ పటము I, D 8).

గిబియోనులోను దానితోఁజేరిన మూఁడు పట్టణములందు నివసించిన ప్రజలు **గిబియోనీయు**లని పిలువఁబడిరి (యెహో $9^{26}$ $10^{2}$ II సమూ 2,1,4,9.) H.

**గిబ్బారు** (Gibbar = యోధుడు). చెఱ కాలమునకు తరువాత జెరుబ్బాబెలుతో కూడ తిరిగివచ్చిన వారిలో నొక కుటుంబమునకు పెద్ద (ఎజ్రా $2^{20}$). నెహె $7^{25}$ లో దీనికి **గిబియోను** అను మాఱుపేరు కలదు.

**గిబ్బెతోను** (Gibbethon = ఎత్తైన స్థలము). దాను గోత్రికుల యూళ్లలోనుండి లేవీయుల కియ్యఁబడిన యొక యూరు (యెహో $19^{44}$ $21^{23}$). యరొబాము కుమారుఁడగు నాదాబు దానిని ముట్టడివేయఁగా బయెషా అతని చంపి రాజ్యము నపహరించెను (I రాజు $15^{27}$). ఒమ్రీ దీనిని ముట్టడి వేయునపుడు సైనికు లతని రాజునుగా నియమించుకొనిరి (I రాజు $16^{15-17}$). ప్రస్తుతము కిబ్బియ (*Kibbeah*) అనఁబడిన స్థలము దీని యునికియై యుండవచ్చును. అది లుద్దకు ఈశాన్య దిక్కున నున్నది (పటము III, E 5).

**గిబ్యా** (Gibea = కొండ). కాలేబు మనుమఁడు (I దిన $2^{49}$). దక్షిణ యూదాలో ఈ పేరుతో నొక యూరును గలదు. I దిన $2^{42-55}$ లో నున్న జాబితా ప్రకారము కాలేబు సంతతి లోని ప్రతివాని కుటుంబము నొక్కొక్క యూరిని స్థాపించుకొనుటచే ఆ పేరు వానికి మాత్రమేగాక ఆ యూరికిని గలిగెను (గిబియా చూ.)

**గిమ్జోను** (Gimzo = మేడిచెట్లున్న స్థలము). యూదావారి స్వాస్థ్యమునకు వాయువ్య దిక్కున నుండు నొక యూరు (II దిన $28^{18}$). ప్రస్తుతమున దానికి జిమ్జూ (*Jimzu*) అను పేరుగలదు (పటము III, D 5).

**గిర్గాషీయులు,** (Girgashites = జిగట మట్టి నివాసులు?). ఇశ్రాయేలీయులు కనాను లోకి రాకముందు ఆ దేశమును వశపఱచుకొని యున్న కనానీయులలోని యొక జనము (ఆది $10^{16}$ $15^{21}$ ద్వితీ $7^{1}$ యెహో $3^{11}$ I దిన $1^{14}$ నెహె $9^{8}$). యెహో $24^{11}$ ప్రకారము వీరు కనానీయులకును యెబూసీయులకును నడుమ నివసించుచుండినటులు తెలిసికొనగలము. (కనానీయులు చూ॥).

H.

**గిలకతప్పెట** సంగీతము 3 (1) (*a*) చూ॥

**గిలలై** (Gilalai = బరువుగల). నెహెమ్యా కాలమునందు యెరూషలేము గోడలను ప్రతిష్ఠించినప్పుడు పాడిన పాటకుల సంతతులలో చేరిన లేవీయులలో నొకనికి పేరు (నెహె $12^{36}$).

**గిలాదు, గిలాదీయుడు** (Gilead = కఠినమైన, Gileadite).

1. మనష్షే కుమారుడగు మాకీరు అనువాని పుత్రుడు (సంఖ్యా $26^{29}$ $27^{1}$ యెహో $17^{1}$ I దిన $2^{21}$). అతడొక గోత్రమునకు మూల పురుషుడయ్యెను.

2. గాదు వంశస్థులలో నొకడు (I దిన $5^{14}$).

3. న్యాయాధిపతియగు యెఫ్తా తండ్రి (న్యాయా $11^{1}$).

4. ఒక కొండ. గిద్యోను తన సేనలోని పిరికి వారు ఇంటికి పోవచ్చునని యాజ్ఞనియ్యగా అతని సైనికులు గిలాదుకొండ దగ్గరనున్నట్లు న్యాయా $7^{3}$ వలన తెలియును. ఇది యొర్దాను నదికి పడమరగానున్నది. ఈ కొండ యొర్దానుకు పశ్చిమమునయున్నట్లు ఈ యొక్క సూచన మాత్రము కలదు. ఇందుచేతనే ఇది గిల్బోవ కొండకు పొరబాటుగా వచ్చిన పేరు అని కొందరనుకొందురు.

5. యొర్దానుకు తూర్పుగానుండు దేశమునకు పేరు. అది గలిలయ సముద్రమునకును మృత సముద్రమునకును మధ్యనుండు యొర్దానుకు తూర్పుగానున్నది. దానికి ఉత్తరమున బాషానును, తూర్పున యెడారియు, దక్షిణమున మోయాబును గలవు. అది మన్య ప్రదేశమై సముద్ర మట్టమున కంటె 2000 అడుగులు ఎత్తుగా నున్నది. ఈ పేరు మొదట ఆది $31^{21}$ లో కనబడును. యాకోబు అచ్చటికి పారిపోవ యత్నించుచుండగా లాబానతనిని కలిసికొనెను ($31^{25}$). ఇచ్చట యాకోబు బలి నర్పించెను ($31^{54}$). అది సుగంధ ద్రవ్యములకును, మందు దినుసులకును ప్రసిద్ధమగు దేశమగుటచే వాటికి సంబంధించిన వ్యాపారము బహుల జరిగెను (యిర్మీ $8^{22}$ $46^{11}$). ఇష్మాయేలీయు లట్టి వ్యాపారముమీాద వెళ్లుచుండగా యోసేపు సోదరులు అతనిని కిరి కమ్మివేసిరి (ఆది $37^{25}$). మోషే యిశ్రాయేలీయులను ఐగుప్తునుండి కనానుకు నడిపించిన కాలములో గిలాదు అమోరీయుల రాజగు సీహోను ఆధీనములో నుండెను. ఇశ్రాయేలీయులు ఆ రాజును జయించిన పిమ్మట (సంఖ్యా $21^{21-26}$) దానికి ఉత్తరమునయుండు భాగము గాదు గోత్రికుల స్వాస్థ్యమయ్యెను (32). అది మంచి మేత భూమి యగుటచే వారు దానిని కోరుకొనిరి. అచ్చటి మందలనుగూర్చిన యలంకారము పర $6^{5}$ లో నున్నది. మనష్షే సంతతివాడైన యాయీరు గిలాదునకు ఉత్తర భాగమునందలి యూళ్లను పట్టుకొని వాటికి యాయీరుపల్లెలను పేరు పెట్టెను (సంఖ్యా $32^{41}$). న్యాయాధిపతియగు యాయీరు గిలాదు దేశస్థుడైయుండెను (న్యాయా $10^{3}$). న్యాయాధిపతియైన యెఫ్తాకూడ గిలాదువాడే ($11^{1-40}$). ఇట్లు ఇశ్రాయేలీయులను విడిపించు వారు గిలాదులోనుండి వచ్చినను అంతకుముందు దెబోరా బారాకుల కాలమందు వారు ఇశ్రాయేలీయులకు సహాయముచేయక పోయినందున గద్దింపులకు పాత్రులైరి ($5^{17}$). $20^{1}$ లో గిలాదు యొర్దాను తూర్పు భాగమంతటికి పేరైనట్లుగా నున్నది. ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులను బాధపెట్టుచుండగా ఇశ్రాయేలు వారిలో కొందఱు గిలాదు దేశమునకు పారిపోయిరి (I సమూ $13^{7}$). సౌలు మరణమునకు తరువాత అతని కొడుకగు ఇష్బోషెతు గిలాదు నేలెను (II సమూ $2^{8-10}$). అబ్షాలోము తిరుగుబాటుచేసిన సమయమున దావీదు అచటికి పారిపోయి బర్జిల్లయి యొద్ద బసచేసెను (II సమూ $17^{27}$ $19^{31}$ I రాజు $2^{7}$). దావీదు తన ప్రజల జనాభా చేయించినపుడు అతని సేవకులలో కొందఱు పని నిమిత్తము గిలాదుకు

వచ్చిరి (II సమూ 24⁶). సొలొమోను కాలములో అది గెబెరు కుమారునికి జాగీరు అయ్యెను (I రాజు 4¹³). ఏలీయా ప్రవక్త యీ దేశపువాఁడే (17¹). గిలాదు జనులలో దమస్కువారును అమ్మోనీయులును క్రూరముగా చూచినందున వారికి శిక్ష కలుగునని ఆమోసు ప్రవచించెను (ఆమో 1³,¹³). హోషేయ గిలాదువారి పాపమును ఖండించెను (హోషే 6⁸ 12¹¹). ఈ వాక్యముల ప్రకారము ఇది ఆ దేశమునకు మాత్రమే గాక అందులోని యొక పట్టణపు పేరైనట్లున్నది. పెకహు కుట్రచేసి ఇశ్రాయేలు రాజ్యము నపహరించినపుడు, గిలాదు వారిలో యేఁబదిమంది యతని సేనలో నుండిరి (II రాజు 15²⁵). దమస్కు రాజైన హజాయేలు గిలాదును ఓడించెను (II రాజు 10³³). అష్షూరు రాజగు తిగ్లత్పిలేసెరుకూడ దానిని జయించి దాని నివాసులను చెఱపట్టెను (II రాజు 15²⁹). దీని నివాసులకు **గిలాదువారు, గిలాదీయులు** అను రెండు పేరులు కలవు.

**గిలో, గిలోనీయుఁడు** (Giloh, Gilonite = దేశ భ్రష్టుఁడు). యూదా మన్యమునందలి దక్షిణ భాగములోని ఒక యూరు (యెహో 15⁵¹). ఇది దావీదునకు గొప్ప ఆలోచనకర్తయై యుండిన అహీతోపెలు యొక్క ఊరు. అందువలన నతఁడు గిలోనీయుఁడనఁబడెను (II సమూ 15¹²) దీని సరియైన యునికినిగూర్చి తెలియదు. (పటము II, E 2).

**గిల్గాలు** (Gilgal = చక్రము లేక పొర్లుట).

1. ఇశ్రాయేలీయులు యొర్దానునదిని దాటిన తరువాత ఆ నదికిని యెరికోకును మధ్య మొదట దిగిన స్థలము. ఇచ్చట జేరిన పిదప వారు అరణ్య సంచారమున నశింపజేసిన సున్నతిని మరల నాచరించి దేవునితో నిదివఱకుఁ జేసికొనిన నిబంధన నవీ విఘ్నముగా నారంభించిరి. కనానుదేశము చేరినపిమ్మట మొదట పస్కా నాచరించినదీ స్థలమునందే (యెహో 5⁹⁻¹² మీకా 6⁵). యెహోషువ కనానును జయించుచుండిన కాలములో చాల సంవత్సరములవఱకు ఇదే యిశ్రాయేలీయుల వాసస్థానముగ నుండెను (యెహో 9⁶ 10⁵,¹⁵,⁴³). తరువాత అక్కడ నొక యూరు కట్టిరి (15⁷). ప్రత్యక్షపు గుడారము షిలోహునకు తీసికొనిపోఁబడునంతవఱకు నిచ్చటనే యుండెను (18¹). సమూయేలు అర్పణల నర్పించి (I సమూ 10⁸) న్యాయము తీర్చి (17¹⁶) సౌలును రెండవ మాఱు అభిషేకించి (11¹⁵) సౌలు బలుల నర్పింపఁగా నతని గద్దించి (13⁷⁻¹⁴). అమాలేకీయుల రాజగు అగగును చంపిన దిచ్చటనే యనుటకు ప్రబలమైన నిదర్శనములు కలవు. దావీదు అబ్షాలోము మరణానంతరము యెరూషలేమునకు తిరిగివెళ్లినప్పుడు యూదావారీ స్థలమునందే యతనిని కలిసికొనిరి (II సమూ 19¹⁵⁻⁴⁰). యెరికోకు తూర్పున 1½ మైళ్ల దూరమున నిది యుండెనని యోసీఫసు వలనఁ దెలియుచున్నది. (పటము III, G 5).

2. అంతిపత్రికి దగ్గరనున్న ఊరు (యెహో 12²³). ఈ వాక్యములో LXX నందు గలిలయ యను పదమున్నది.

3. బేతేలునకు ఉత్తరమున ఎఫ్రాయిము కొండలలో నున్న ఒక ఊరు (ద్వితీ 11³⁰ II రాజు 2¹⁻⁶). ఇచ్చట ప్రవకల పాఠశాల యొకటి కలదు (4³⁸). తరువాత కాలమునందది విగ్రహారాధనకు ఉనికి పట్టయినట్టుల కనిపించుచున్నది (హోషే 4¹⁵ 9¹⁵ 12¹¹ ఆమో 4⁴ 5⁵). బహుశః ఇదే నెహె 12²⁹ ప్రకారము గిల్గాలుయొక్క యిల్లయి యుండవచ్చును. అది బేతేలుకు 5 మైళ్లును షిలోహునకు 4 మైళ్ల దూరము నుండి జిల్జిలియా (*Gilgilia*) యని పిలువఁబడుచున్నది. (పటము III, F 4).

**గిల్బోవ** (Gilboa = పొంగుచున్న యూట). యెజ్రెయేలు మైదానమునకు తూర్పుగానుండు పర్వతసముదాయము (I సమూ 28⁴ 31¹,⁸ II సమూ 1⁶⁻²⁷ 21¹² I దిన 10¹,⁸) వాటి యెత్తు షుమారు 1700 అడుగులుండును. ఇచ్చట సౌలును అతని సైనికులును ఫిలిష్తీయులచే పూర్ణముగా నోడింపఁబడిరి. సౌలు యోనాతాను హతులైరి ప్రస్తుతము జెబెల్ ఫకువ (*Jcbel Fakua*) దీని యునికియై యున్నది. (పటము I, E 6).

**గిష్పా** (Gishpa = ఊరట కలిగించు). నెతీనీయుల ప్రధానులలో నొకఁడు (నెహె 11²¹).

**గిహోను, గీహోను** (Gihon = ఊటలు యుబుకుట).

1. యెరూషలేము దగ్గఱనున్న ఒక యూట. సొలొమోనునకు ఇచట రాజ్యాభిషేకము చేసిరి (I రాజు $1^{33,38,45}$). ఇచ్చట నీటిని యెరూషలేమునకు తెప్పించుటకు హిజ్కియా యను రాజు ఒక కాలువ త్రవ్వించి (II దిన $32^{30}$). యెరూషలేము పట్టణమును అంతిమట్టును పెంపకము చేయించెను (II దిన $33^{14}$). యెరూషలేము (A II, చూ॥).

2. ఏదెనులోని నాలుగు నదులలో నొక దాని పేరు (ఆది $2^{13}$).

## గి

**గీనతు** (Ginath) ఒమ్రీ = ఇశ్రాయేలు రాజ్యము నపహరించినపుడా రాజ్యమును తాను సంపాదింపవలెనని యతనితో పోట్లాడి చని పోయిన తిబ్నీ యను వాని తండ్రి (I రాజు $16^{21,22}$).

**గీమెల్** (Gimel = అను ג అక్షరము) హెబ్రీ యక్షరములలో మూడవది. అక్షర మాలికగా వ్రాయబడిన 119-వ కీర్తనలోని ప్రతి పంక్తియు ఈ యక్షరముతో నారంభమగును. గాన ఈ భాగమునకీ పేరు కలదు.

**గీహా** (Giah = ఉబుకుట). యోవాబు అబ్నేరును తరుముచు వచ్చిచేరిన ఒక యూరు (II సమూ $2^{24}$) అది గిబియోను దగ్గఱనున్నది గాని దాని సరియైన యునికిని గూర్చి తెలియదు.

**గీహోను** గిహోను చూ॥

## గు

**గుంజు చెట్టు** (Myrtle). ఈ మాటచేత తెనిగించిన తె అష్షరను హెబ్రీపదమునకు పొడవు అని యర్థము (యెహె $27^{6}$). యెష $41^{20}$ నందీ పదమునే **నేరెడి** చెట్టు అని తెనిగించిరి. ఇదెట్టి చెట్టో తెలిసికొనుట కష్టము.

J. C.

**గుంటు** కూపము చూ॥

**గుండీలు** గుడారము 5 చూ॥

**గుండునూలు** వృత్తులు చేతిపనులు I 2 (1) (b) చూ॥

**గుండె** రోగములు చికిత్సలు II 9, III చూ॥

**గుగ్గిలము** రోగములు చికిత్సలు IV 1 (3) చూ॥

**గుజ్జువాడు** రోగములు చికిత్సలు I 5 5 చూ॥

**గుడారము, ప్రత్యక్షపు గుడారము** (Tabernacle). అరణ్యమునందు సంచరించు కాలములో ఇశ్రాయేలీయుల ఆరాధన స్థలమొక యిల్లుగాక గుడారమై యుండినట్లు బైబిలునందు చదువుచున్నాము. సీనాయి కొండ యొద్ద నుండగా దానినిగట్టిరి. అది దావీదు సొలొమోనుల కాలమువరకు నుండెను.

1. గుడార నిర్మాణమును గూర్చిన వివరము. ఇది నిర్గ $25^{1}$ $31^{17}$ నందున్నది. ఆ వివరమునందీ దిగువ సంగతులుగలవు. (1) దాని నిర్మాణమునకై వలయు వస్తువులు నిర్గ $25^{1-9}$; (2) మందిరమునందుంచవలసిన సామగ్రి (*a*) మందసము $25^{10-22}$; (*b*) సన్నిధిపు రొట్టెలబల్ల $25^{23-30}$; (*c*) దీప వృక్షము $25^{31-40}$; (3) గుడారమును కట్టుట $26^{1-37}$; (4) ఆవరణమునందుంచవలసిన బలిపీఠము $27^{1-8}$; (5) ఆవరణము $27^{9-19}$; (6) యాజకుల వస్త్రములు 28; (7) వారిని ప్రతిష్ఠించుట $29^{1-35}$; (8) గుడారమును ప్రతిష్ఠించుట $20^{36-42}$; (9) గుడారపు ఉద్దేశము $29^{43-45}$; (10) ధూప వేదిక $30^{1-10}$; (11) ప్రాణపరిక్రయధనము $30^{11-16}$; (12) గంగాళము $30^{17-21}$; (13) అభిషేక తైలము $30^{22-33}$; (14) ధూపద్రవ్యము $30^{34-38}$; (15) గుడారమును కట్టవలసినవారు $31^{1-11}$; (16) విశ్రాంతి దినమును గూర్చిన నియమము $31^{12-17}$.

దేవుడు మోషేకాజ్ఞాపించిన రీతిగా వారు గుడారమును కట్టుటను గురించి $34^{29}$-$39^{43}$ నందున్నది. పైరెండు భాగములు నొక్క రీతిగానే యున్నను $25^{1}$-$31^{17}$ నందు దానిగూర్చిన యాజ్ఞయు, $34^{29}$-$39^{43}$ నందు దాని నెఱవేర్పునున్నది. 40 అధ్యాయమునందు ప్రజలు గుడారములోని యారాధన నారంభించిన రీతిగలదు.

2. గుడారముయొక్క సార్థక నామములు. ఈ నామములవలన గుడారముయొక్క ఉద్దేశమును తెలిసికొనగలము. నిర్గ $25^{9}$ $26^{1}$ లో **మందిరము**ను పదము మూల భాషయందు గుడార

మని యర్థమిచ్చుచు హెబ్రీ $9^{2}$ నందు అట్లు తెనిఁగింపఁబడెను. నిర్గ $29^{44}$ నందు **సాక్ష్యపు గుడారము** అనఁబడెను. ఆ మాటకు మూల భాషయందు కలిసికొను గుడారమని యర్థము గనుకనే దినవృత్తాంతములయందు దానిని **సమాజపుగుడారమని** తెనిఁగించిరి (II దిన $5^{6}$ మొ॥). దేవుఁడు తన ప్రజల మధ్య నివసించుచు వారితో సహవాసముచేసినట్లుగా ఈ గుడారము సాక్ష్యార్థమైన గురుతుగా నుండినట్లు దీనివలనఁ దెలియుచున్నది. ఈ యుద్దేశము నిర్గ $29^{43-46}$ నందు తేటగా కనఁబడును. $25^{8}$ $30^{13}$ నందు **పరిశుద్ధ స్థలము** $38^{21}$ నందు **సాక్ష్యపు మందిరము** సంఖ్యా $9^{15}$ నందు **సాక్ష్యపు గుడారము** అనియు పిలువఁబడెను. ఆజ్ఞలనచ్చటనుంచుటచే (నిర్గ $25^{16-21}$) దీని కిట్టి పేరులు కలిగినవని మూల భాషాపదములవలనఁ దెలియుచున్నది. ఇది దేవుఁడు తన ప్రజలను కలిసికొనుచోటని వీటి వలన నూహింపవచ్చును. ఆ కారణముచే నిది పరిశుద్ధస్థలమై యున్నది.



గుడారము

3. ఇశ్రాయేలీయుల పాళెమునందీ గుడారమున్న స్థలము. ఇశ్రాయేలీయుల యొక్క పాళెము చతురముగా నుండెను. తూర్పున యూదా ఇశ్శాఖారు జెబూలూను గోత్రములు, దక్షిణమున రూబేను షిమ్యోను గాదు గోత్రములును, పడమట ఎఫ్రాయిము మనష్షే బెన్యామీను గోత్రములును, ఉత్తరమున దాను ఆషేరు నఫ్తాలీ గోత్రములుండెను. (సంఖ్యా $2^{1-32}$). ఈ గోత్రముల మధ్య యాజకులు లేవీయులచే చుట్టుకొనఁబడినదై గుడారము అంతటికి మధ్య స్థానము నలంకరించెను (సంఖ్యా $3^{21\ 39}$). లేవీయులలో కహాతీయులు గుడారమునకు దక్షిణమందును, గెర్షోనీయులు పడమటను మెరారీయులు ఉత్తరమునందునుండిరి. గుడారమునకు తూర్పున మోషేయు యాజకులు నుండిరి. ఇట్లు పాళెమును పరిశుద్ధమైనదిగా నెంచి దాని మధ్య స్థానమును మందిరముకొఱకు ప్రతిష్ఠించిరి.

4. గుడారపు ఆవరణము (నిర్గ $27^{9-19}$ $38^{9-20}$). ఇది 100 మూరలు పొడవును 50 మూరల వెడల్పును గల్గినదై యుండెను. దీనిచుట్టును తెరలను గట్టిరి. వీటిని కట్టుటకు ఇత్తడి దిమ్మెలలో నమర్చిన 60 తుమ్మ స్తంభము లుండెను. ఇవి ఐదేసి మూరలు ఎడముగా నిలిచెను. వీటి నన్నిఁటిని త్రాళ్లతోను ఇత్తడి మేకులతోను బిగించిరి. తూర్పున గాక తక్కిన దిక్కులనున్న తెరలను ఒకదానితో నొకటి వంకులతో కలిపిరి. తూర్పుదిక్కున నిట్లేకలిపినను మధ్య 20 మూరల వెడల్పున ద్వారమును వదలిరి. ఈ ద్వారమునకు ప్రశస్తమగు నారగుడ్డతోఁ జేసిన తెరను గట్టిరి.

5. గుడారము ($26^{1-37}$). ఇది ఆవరణ మధ్యమందు పడమరగానున్నది. 30 మూరల పొడవును 10 మూరల వెడల్పును గలిగి రెండు భాగములుగా చేయఁబడెను. అవి 20×10 మూరలుగల పరి

శుద్ధ స్థలము, 10×10 మూరలు గల అతి పరిశుద్ధ స్థలమునై యుండెను. అవి రెండును ఒక ప్రశస్తమైన తెరచే వేరుపఱచఁబడెను. హెబ్రీ 9[3] నందా తెర రెండవ తెరయనఁబడెను.

మందిరము చుట్టును పలకలచే నావరింపఁబడెను. ఉత్తర దక్షిణములందు ఇరువదేసి పలకలును పడమటి దిక్కున 6 పలకలునుండెను. వీటిని వెండిదిమ్మెలమీఁద నిలిపిరి. వీటి నొకదానితో నొకటి బిగించునిమిత్తము పైన కడియములను పెట్టిరి. తూర్పుదిక్కున మాత్రము 5 తుమ్మకర్ర స్తంభములను నిలిపి వాటి కొక చక్కని తెరను తగిలించిరి.



ప్రత్యక్షపు గుడారము

మందిరము మీఁద రెండు విధములగు తెరలు పఱచిరి. మొదటి 10 తెరలను నీలధూమ్ర రక్తవర్ణ వస్త్రములతో చేసిరి. ప్రతిది 4 మూరల వెడల్పును 28 మూరల పొడవునుండెను. వీటిని మందిరముపైన అడ్డముగా వేసిరి. గుడారపు వెడల్పు 10 మూరలే గాన ఇవి దానిపై భాగమును మాత్రమేగాక ప్రక్కలను కప్పెను. ఈ పది తెరలను బంగారపు గుండీలచే కొలుకులకు తగిలించి ఒక దానితో నొకటిఁ జేర్చిరి.

వీటిపైన మేఁక వెండ్రుకలచే నేయఁబడిన 11 తెరలను మందిరమున కడ్డముగా పఱచిరి. ఇవి ఒక్కొక్కటి 30 మూరల పొడవును, 4 మూరల వెడల్పును గలిగి యిత్తడి గుండీలతో నొకదాని కొకటి కలుపఁబడెను. వీటిలో నొక తెరను గుడారపు ఎదుటిభాగమున మడిచియుంచిరి.

వీటన్నిఁటిపైన పొట్టేళ్లతోళ్లతోఁజేసిన పై కప్పును, దానిపైన సముద్రవత్సల తోళ్లతోఁ జేసిన కప్పును వేసిరి (నిర్గ 26[14]) గాని వాటి నెట్లు పఱచిరో యని వివరింపఁబడలేదు. (సముద్ర వత్సలతోళ్లు చూ॥).

6. గుడారమునందలి సామగ్రి.

(1) ఆవరణములో బలి పీఠమును ($27^{1-8}$ $38^{1-7}$), గంగాళమును ($30^{17-21}$) మాత్రముంచిరి. ఇవిరెండును ఇత్తడితో చేయఁబడెను. (*a*) బలి పీఠమును కఱ్ఱతోఁజేసి ఇత్తడితో కప్పిరి. దాని మీఁద నర్పించెడివి క్రింద పడిపోకుండునట్లు ఇత్తడి జల్లెడను తగిలించిరి. బలిపీఠము 5 మూరల చదరముగా నుండెను. దీనికికావలసిన కుండలను, గరిటెలను, గిన్నెలను, ముండ్లను, అగ్నిపాత్రలను ఇత్తడితోఁజేసిరి (27[3]). (*b*) గంగాళమును స్త్రీలర్పించిన అద్దములతోఁ జేసిరి (38[8]). దాని కొలతలుదాహరింపఁబడలేదు. యాజకుల స్నానాదులకొఱకైన నీటి నిమిత్తము దీని నుపయోగించిరి.

(2) పరిశుద్ధ స్థలమనఁబడిన దానిలో నీ దిగువ సామగ్రు లుండెను. (*a*) సన్నిధి రొట్టెల

బల్ల ($25^{22-30}$ సంఖ్యా 47). ఇది 1½ మూర ఎత్తును 2 మూరల పొడవును 1 మూర వెడల్పును గలిగియుండెను. దీనిని తుమ్మ కఱ్ఱతోఁ జేసి బంగారుతో పొదిగిరి. దానిచుట్టును బంగారుతోఁ జేయఁబడిన అంచుగలదు. దీనికి సంబంధించిన **పళ్లెములు ధూపార్తులు గిన్నెలు పానీయ పాత్రలు** అన్నిఁటిని మేలిమి బంగారుతోఁ జేసిరి (నిర్గ $25^{29}$). సన్నిధి రొట్టెలను దీనిమీఁదనే యుంచిరి. దానిగూర్చిన **యేర్పాటు** లేవీ $24^{5-9}$ నందుగలదు దానిమీఁద నుండు రొట్టె దేవుని కర్పితమైనది. అందువలన దీని నొక విధమగు వేదికగా నెంచవచ్చును. యెహె $41^{22}$ నందు దీనిని **బలిపీఠము** అనిరి. ఇది పరిశుద్ధస్థలములో **ఉత్తర** దిక్కుగానుండెను (నిర్గ $26^{35}$). (*b*) **దీప వృక్షము** ($31^{8}$ లేవీ $24^{4}$). ఇదియు బంగారుతోఁ జేయబడెను. ఇది వట్టి దీపస్తంభమే గాక **మూఁడు** జతల కొమ్మలుగల వృక్షాకృతిగ నుండెను. గాన దానికి **ఏడు** దీపములు పెట్టవచ్చును. దీనికి సంబంధించిన **కత్తెరలు, కత్తెర చిప్పలు, తైలపాత్రలు** కూడ బంగారుతోఁ జేసిరి (నిర్గ. $25^{39}$). ప్రతిదినము ఈ దీపములను శుభ్రముజేసి నూనె పోయుచుండవలెనను నియమముగలదు ($27^{20,21}$ లేవీ $24^{1-4}$). దీని పరిశుద్ధస్థలమునందు దక్షిణ దిక్కుగానుంచిరి (నిర్గ $26^{35}$). (*c*) **ధూప వేదిక** ($30^{1-10}$). ఇది 1 మూర పొడవును 1 మూర వెడల్పును 2 మూరల ఎత్తునుగలదై యుండెను. దీనినికూడ తుమ్మ కఱ్ఱతోఁజేసి బంగారుతో పొదిగించిరి. దీనిమీఁద ధూపము వేసిరి. దాని **యేర్పాటులు** $30^{7-10}$ లో నున్నవి. దీనిని అడ్డుతెర యెదుట నుంచిరి ($30^{6}$).

**(3) అతి** పరిశుద్ధస్థల మనఁబడిన దానిలో **మందసము** మాత్రముండెను (నిర్గ $25^{10-22}$ $37^{1-3}$). అది 1½ మూర యెత్తును 2½ మూరల పొడవును 1½ మూర వెడల్పును గలిగియుండెను. దానిచుట్టును బంగారుతో చక్కని అంచును గట్టిరి. దానియందు ఆజ్ఞలు వ్రాయఁబడిన రాతి పలకలనుంచిరి. **కరుణాపీఠ**మనఁబడిన దానిని దీనికి మూఁతగా పెట్టిరి. ఈ పీఠముపైన ముఖాముఖిగానుండు రెండు కెరూబులుండెను. ఇది దేవుని సన్నిధానమున కొక విశేష సూచనగా నుండెను (కరుణాపీఠము, దేవాలయము I 7 (3) చూ॥).

7. ముగింపు. ప్రతిదానిని మోసికొని వెళ్లు సమితము తగిన కడియములును మోఁతకఱ్ఱలు నుండెను. ఈ గుడారముయొక్క **యేర్పాటులు** చాలమట్టుకు దేవాలయముయొక్క **యేర్పాటు**లయ్యెను (దేవాలయము చూ॥). ప్రతి దాని యేర్పాటునందును దేవుని పరిశుద్ధతయు పాపియైన నరుఁడట్టి దేవుని సమీపించవలసిన మార్గమును సూచనార్థముగా చూపఁబడెను. అది యీ విధముగా మానవులు క్రీస్తుద్వారా దేవునితో సహవాసులగుటకు నిజమైన ముంగుఱుతు ఆయ్యెను (హెబ్రీ $8^{2}$ $9^{11}$. అర్పణములు చూ॥).

**గుడి** (Temple, Shrine). విగ్రహములను పూజించెడి స్థానములు బైబిలునందు సాధారణముగా **బలిపీఠములు** (I రాజు $11^{7}$ యిర్మీ $7^{31\ 32}$ మొ॥) **ఉన్నతస్థలములు** (I సమూ $9^{12}$ హోషే $10^{8}$ మొ॥) అయ్యున్నను గుడి యను పదమును అచ్చటచ్చట కనఁబడును. కార్య $19^{24,27}$ నందు ఎఫెసునందున్న గొప్ప ఆలయము అర్తెమిదేవియొక్క గుడియనఁబడెను. రోమా $2^{22}$ నందున్న గుళ్లను దోచుకొనువారు అని యర్థమిచ్చు మూలపదమునందును ఇది కనఁబడును. కార్య $17^{24}$ నందున్న **ఆలయమను** పదము వేఱొక మూలపదమై గర్భాలయమును సూచించును. పాతనిబంధనలోని ఇశ్రాయేలీయుల ఆలయమునకును, అన్యుల యీ గుళ్లకును వాటి యేర్పాటుల విషయములో సంబంధముగలదు. ఇవి దేవునికిగాని దేవతలకుగాని నివాసస్థలములుగా నెంచఁబడెను. క్రైస్తవ దేవాలయముల నిట్టి యుద్దేశముతోఁ గట్టక, ప్రజలు దేవుని నారాధించుటకై కూడుకొనుటకు తగియుండునట్లు కట్టఁబడి, బైబిలునం దుదాహరింపఁబడిన సమాజ మందిరములకు సంబంధించినవైయున్నవి. (గుడారము, దేవాలయము, బలిపీఠము, ఉన్నతస్థలము చూ॥

**గుడ్డితనము** రోగములు చికిత్సలు II (1) చూ॥

**గుడ్డు** ఆహారము II 3 చూ॥



గుడిద్వారము

**గుడ్లగూబ** పక్షులు 14 చూ॥

**గుదియ** ఆయుధములు I, చూ॥

**గుద్గోద (Gudgodah).** ఇశ్రాయేలీయు లరణ్యమునందు మకాము చేసిన స్థలములలో నొకటి (ద్వితీ 10[7]). అది ఎదోము దేశములో నున్న దనుకొందురు. సంఖ్యా 33[33] లోని **హోరాగ్ హాగ్గిద్గాదు** అను స్థలమిదే.

**గుబ్బలు (Knobs).** దేవాలయములోని దేవదారు చెక్కలపైను, ఇత్తడి సముద్రమునకును చెక్కిన అలంకారములను సూచించుటకై వాడిన పదము (I రాజు 6[18] 7[24]). దీని మూల భాషా పదము బైబిలునందు రెండు చోట్ల మాత్రమే గలదుగాన అది దేనిని సూచించునో తేటగాఁ దెలియదు. దీనికి సంబంధమైన పదమును II రాజు 4[39]లో **తీగెలు** అని తెనిఁగించిరి. అలంకారపు పనులలో నుపయోగించు తీగెల నీ పదము సూచింపవచ్చును (మొగ్గ చూ॥).

**గుమ్మము (Gate).** సిరియాపలెస్తీను దేశములయందున్న మంచి గృహముల కన్నింటికి తలుపులును ద్వారబంధములు నుండును (సిర్గ 12[7]). ఈ తలుపులను కఱ్ఱతోఁగాని లోహముతోఁగాని, రాతితోఁగాని చేసిరి (యెష 54[12]). గలిలయ సముద్రమునకు తూర్పు ప్రాంతములయందు మిగుల పురాతనమైన యిండ్లకు రాతి యుతకల మీఁదఁ దిరిగెడి రాతి తలుపులు గనఁబడుచున్నవి. దుష్టులగు సొదొమపురవాసులు లోతు ఇంటి తలుపులను పగులఁగొట్ట జూచిరి (ఆది 19[9]). విడుదల సంవత్సరమునందు వెళ్లిపోనొల్లని దాసుని చెవిని కదురుతో తలుపులోనికి దిగునట్లు గుచ్చి వాని నిత్య దాసునిగఁ జేసిరి (ద్వితీ 15[17]). దర్వాజాలను తరుచుగా నలంకరించెడి వారు (యెష 54[12] ప్రక 21[21]). రాత్రులయందు వాటికి అడ్డు కమ్ములు వేసి బిగించుకొనిరి (నెహె 7[3] ప్రక 21[25]). సమ్సోను గాజా పట్టణపు తలుపులను ద్వారబంధములతో, వాటి అడ్డు గడ్డలతో నూడఁ బెరికి యెత్తుకొనిపోయెను (న్యాయా 16[3]). సాధారణముగా గ్రామములలోను పట్టణములలో నుండు ఇండ్లద్వారములకు గాని పురద్వారములకు గాని తాళము లుండునవి కావు గాని, కొన్నింటి కుండునవి. గృహ నిర్వాహకులు, అధికారులు మొదలగువారి యధికారమును తాళపుచెవులు సూచించెను (యెష 22[22] మ 16[19]). ప్రస్తుతమున ఆ ప్రాంతముల వర్తకులు బరువైన తమ

తోళపు చెవులను భుజములమీఁద వేసికొనిపోయెదరు. వాటిని ఇనుముతోఁగాని, కఱ్ఱతోఁగాని చేయుదురు. (కోట I 2, యెరూషలేము B III 8 చూ॥).

J.C.

**గురుగులు** (Tares). పాలెస్తీనునందు నాలుగు రకముల గురుగులు పెఱుగును. అందొక రకము గోధుమ యవల పొలములలో విశేషముగ వృద్ధి నొందును (మ $13^{24-30}$). ఆ ధాన్యముల పైరంత యెత్తుగా నీ మొక్కలు ఎదుగును గాన, ధాన్యము లెస్సగా ముదిర పంటలు బాగుగా పండునంత వఱకు వీటిని పీకివేయరు.

J.C.

**గురుతులు** (Marks). సూచనలు అను శీర్షిక యందు సాధారణమైన గుఱుతులను గూర్చిన వివరము కనఁబడును. ఇచ్చట దేహమందు వేయఁబడిన గుఱుతులనుగూర్చి వివరింతుము.

1. సున్నతియను గుఱుతు యూదులలో సర్వసాధారణమైనది. ఇది దేవుఁడు అబ్రాహాముతోఁ జేసిన నిబంధనకు గుఱుతుగా నున్నది (ఆది $17^{14}$).

2. కయీనుమీఁద నొక గుఱుతు గలదు (ఆది $4^{15}$). ఇతరులతనిని చంపకుండునట్లు వేయఁబడిన గుఱుతైయుండెను.

3. I రాజు $20^{41}$ లో ప్రవక్తలను పోల్చుటకు ఏదోయొక గుఱుతున్నట్లున్నది. జెక $13^{4}$ నందిది నొక కంబళియైనట్లున్నది. ఇట్లే మన దేశమునందలి సాధులు నేటివఱకు ప్రత్యేకమైన దుస్తులచే పోల్చఁబడుచున్నారు.

4. పూర్వకాలమున దుఃఖ సమయమునందు తమ దేహములను కోసికొనెడివారు. ఇట్లు చేయుట దుఃఖమునకు మాత్రమేగాక చనిపోయిన వారికి చూపఁదలఁచిన మర్యాదకును గుఱుతుగా నెంచిరి. లేవీ $19^{28}$లోని పచ్చబొట్లును ఇట్టివే. ఇశ్రాయేలీయుల కిది నిషిద్ధమైయుండెను (ద్వితీ $14^{1}$).

5. యెహోవా చేసిన మేలులను స్మరించుకొనుటకు చేతులకును నొసటికిని గుఱుతులు వేసికొనవలెనను ఆజ్ఞ గలదు (నిర్గ $13^{9,16}$). ఆరంభమున వారు ఆ స్థలములందు గాయపఱచుకొని గుర్తులు పెట్టుకొనినట్లు తలంచిరిగాని అవి ప్రజలు ధరించవలసిన బాసికములని ద్వితీ $11^{18}$ వలనఁ దెలియుచున్నది.

6. నిత్య దాసత్వమునకు గుఱుతుగా చెవులను కదురుతో గుచ్చిరి (నిర్గ $21^{6}$).

7. యెహె $9^{4}$ ప్రక $7^{3}$ $14^{1}$ $17^{5}$ $22^{4}$ చూచిన పక్షమున భక్తులకు నొసటిమీఁద నొక గుఱుతున్నట్లు తెలియుచున్నది. వారి నొసటిమీఁద హెబ్రీ యక్షరములలో టౌ (T) యను అక్షర గుఱుతు వేసినట్లున్నది. కావున ఇది సాధారణముగా సిలువ గుఱుతు అని అలంకారరీతిగా నెంచఁబడుచున్నది.

8. అదేరీతిగా క్రీస్తువిరోధికి శిష్యులగువారు ఆ విరోధిగుఱుతును చేతిమీఁదనైనను నొసటిమీఁదనైనను వేయించుకొనునట్లు అలంకారరీతిగా నున్నది (ప్రక $16^{2}$ $19^{20}$ సూచనలు, సంఖ్య చూ॥).

**గుఱుపోతు** మృగములు 25 చూ॥

**గుఱ్ఱము** (Horse). గుఱ్ఱములను గూర్చిన సూచనలు బైబిలునందు మొదటినుండి గలవు. ఐగుప్తీయులు వీటిని విశేషముగాఁ బెంచిరి (ఆది $47^{16}$ నిర్గ $9^{3}$). ఇశ్రాయేలీయులను తఱిమిన ఫరో సైన్యమునందు గుఱ్ఱములు విశేషముగ నుండెను ($14^{18}$ $15^{19}$). ఇశ్రాయేలీయులు వెళ్లఁ దఱిమిన కనానీయులకును అట్టి సేనాబలము లుండెను (న్యాయా $4^{15}$ $5^{22}$). ఇశ్రాయేలీయుల రాజులు గుఱ్ఱములను విస్తారముగా సంపాదించుకొనరాదను ఆజ్ఞ యున్నను (ద్వితీ $17^{16}$) వారిట్టి సేనాబలములనుగాక యెహోవానే నమ్ముకొనవలెనను హెచ్చరికలు ప్రవక్తలు చేయుచుండినను (యెష $30^{16}$ కీర్త $20^{7}$ $33^{17}$) వారు తమ చుట్టునుండు వారివలె నుండఁగోరి వీటిని సంపాదించుకొనిరి. దావీదు (II సమూ $8^{4}$) సొలొమోనులు (I రాజు $10^{28}$) వాటిని సమకూర్చిరి. సొలొమోనుకాలమున దేశమునందు గుఱ్ఱముల వ్యాపారము విశేషముగ నుండెను ($10^{28-29}$ II దిన $1^{16,17}$ $9^{28}$). అతడు ఐగుప్తీయులయొద్ద గుఱ్ఱ మొకటింటికి 150 తులముల వెండి పెట్టికొనెను. ఐగుప్తీయుల దేశ మిట్టి

వ్యాపారమునకు మిగుల ప్రసిద్ధిపడసినట్లు (యెష $31^{1,3}$ యెహె $17^{15}$) వలనఁ దెలియుచున్నది. ఆ కాలమునం దిశ్రాయేలీయుల రాజులు **గుఱ్ఱము**లను తమ సేనాబలములో జేర్చుట సర్వసాధారణ మాయెను (I రాజు $22^{4}$ II రాజు $3^{7}$ $9^{18,33}$ యెష $2^{7}$). అన్య జనాంగముల రాజులు వాటిని వాహనములుగా నుపయోగించిరి (ఎస్తే $6^{8}$). $8^{10}$ లోనున్న **బీడాశ్వములు** పారసీరాజులు వాహనములుగా నుపయోగించిన శ్రేష్ఠమైన గుఱ్ఱములను సూచించును. గుఱ్ఱములను సూర్య దేవతకు ప్రతిష్ఠించుచుండిరను II రాజు $23^{11}$ వలనఁ దెలియుచున్నది. ఇట్టి గుఱ్ఱములు ఈ భరతఖండమున నున్నట్లు మట్టితోఁ జేయబడిన విగ్రహములై యుండవచ్చును. యుద్ధములను ఇతరములను బాధలను సూచించుటకును వేగరముగా వర్తమానములను తీసికొనిపోవు దూతలను సూచించుటకును జెకర్యా ($1^{8}$ $6^{2,3}$ $10^{5}$ $14^{20}$) ప్రకటన ($6^{2,4,5,8}$ $9^{11}$ మొ॥) ప్రవచన గ్రంథములలో గుఱ్ఱములను పదము అలంకార రీతిగా నుపయోగింపఁబడెను.

**గుఱ్ఱముల గవని, గుఱ్ఱపువ్యాపారము, గుఱ్ఱములు వచ్చు మార్గము** యెరూషలేము III 8 (5) చూ॥

**గువ్వ** పక్షులు 15 చూ॥

**గుహ** (Cave). పలెస్తీను దేశమునందు సున్నపురాళ్లెక్కువగా నుండి భూమిలోనుండి యుబుకు ఊటలవలన నవి కఱిగి పోవుటచే అచ్చట గుహ లనేకము లేర్పడినవి. గుహాయను పదమునకు మూలభాషలో హోరు (*Hor*) అను మాటను వాడిరి. హోరీయులనఁబడిన వారిట్టి గుహలయందు నివసించిన వారని యీ పదమువలనఁ దెలిసికొనవచ్చును (హోరీయులు చూ॥). ఆద్య కాలమునందు జీవించినవారి నివాసస్థానములు గుహలే. లోతు (ఆది $19^{30}$) దావీదు (I సమూ $22^{1}$) పారిపోయియున్న సమయములో వారు నివసించినది గుహలలోనే. ఆపత్కాలమున వాటి యందు దాగుకొనుట సర్వసాధారణమైయుండెను (యెహో $10^{16}$ న్యాయా $6^{2}$ I రాజు $18^{4}$ మొ॥). మృతులను పాతిపెట్టుటకును గుహలను వాడిరి (ఆది $23^{9}$ యోహా $11^{38}$ అదుల్లాము, మక్పేలా చూ॥).

**గుళ్లను (గుడిని) దోచువారు** (Robbers of Temple). ఈ మాట కార్య $19^{37}$ రోమా $2^{22}$ లో నున్నది. II మక్క $4^{39}$ నందు లుసిమాఖు యెరూషలేము ఆలయములోనున్న ప్రతిష్ఠిత వస్తువు లనేకములు దొంగిలినాఁడని వ్రాసినచోట ఈ గ్రీకు మాటను వాడిరి. రోమా $2^{22}$లో అదేరీతిగా యూదులు అన్యులు **గుళ్లను దోచుకొని** అచటి సొమ్మును దొంగిలించెదరని పౌలు వారిమీఁద నేరము మోపెను. దీని శబ్దార్థము గుళ్లను దోచుకొనుటయై యుండినను కార్య $19^{37}$లో దానికా యర్థమును చెప్పక, దేవతలను దూషించుటయను అర్థ మిచ్చునని చెప్పుదురు. పౌలు ఆర్తెమి దేవతనట్లు దూషించలేదని ఎఫెసు పట్టణపు కరణము అల్లరి రేపినవారితో చెప్పెను.

## గూ

**గూడబాతు** పక్షులు 16 చూ॥

**గూడు** (Nest). పక్షుల గూళ్లను గూర్చి బైబిలునం దుదాహరింపఁబడి యున్నది (ద్వితీ $22^{6}$ $32^{11}$ కీర్త $84^{3}$ మొ॥). దీనికంత విశేషార్థము లేదుగాని కొన్నిచోట్ల అలంకారరీతిగా నీ పదము ప్రయోగింపఁబడెను. ఎత్తయిన స్థలములలో పక్షిరాజు కట్టుకొను గూళ్లు దుర్గములను సూచించును (సంఖ్యా $24^{21}$ యిర్మీ $49^{16}$ ఓబ 4). యోబు తన యింటిని గూటికి పోల్చెను (యోబు $29^{18}$). పక్షులకైనను గూళ్లు గలవుగాని తన కట్టి నివాసస్థలము లేదని తనయొద్ద నేమయిన పొందవలెనను ఉద్దేశముతో వెంబడింపఁ గోరి వచ్చిన యొకనికి మన ప్రభువు బోధించెను (మ $8^{20}$ లూ $9^{58}$).

**గూఢార్థము, గూఢవాక్యము, విప్పుడు కథ, మరుగుమాట, సామెత** (Dark sayings, Riddle, Parable, Proverb).

1. పాతనిబంధనయందు సాధారణముగా సామెతే యని తెనిఁగింపఁబడిన పదమును గూఢార్థమనియు (కీర్త $49^{4}$) గూఢమైనమాట యనియు (యెహె $20^{49}$) తెనిఁగించిరి. సామెతలను మాత్రమేగాక ఉపమానములను సూచించుటకును ఈ పదమునే వాడిరి (సంఖ్యా $23^{7,18}$ $24^{3}$ యెహె $17^{2}$ $24^{3}$ మొ॥. ఉపమానము చూ॥). వీటివలన కథలలోను సామెతలలోను

సాధారణ భావము గాక మఱియొక లోతైన భావమును ఉన్నదని యర్థమగుచున్నది గాని వీటన్నిటిని ఒక విధమైన గూఢార్థములని యెంచఁదగును.

2. చిక్కుగానుండు వాక్యములను సూచించు మఱియొక పదము గూఢార్థములను సూచించును. ఇది సమ్సోనుఫిలిష్తీయులపై వేసిన విప్పుడు కథకు వాడినమాటయై యున్నది (న్యాయా 14[12-19]). దేవుఁడు మోషేతో గూఢ భావముతో గాక తేటగా మాట్లాడెనను వాక్యమునందు అది యున్నది (సంఖ్యా 12[8]). షెబా రాణి సొలొమోనును శోధించుటకు అడిగిన గూఢమైన ప్రశ్నలకును ఈ పదమునే వాడిరి (I రాజు 10[1] II దిన 9[1]). దేవునిగూర్చిన లోతైన సంగతులను సూచించుటకు కీర్తనలను వ్రాసినవారు అట్టిసంగతులనుగూర్చి ఈ పదమును వాడిరి. ఆ కీర్తనలలో దానిని **మరుగుమాటలనియు** (కీర్త 49[4]) **గూఢవాక్యములనియు** (78[2]) తెనిఁగించిరి. ఆ రీతిగానే జ్ఞానులు చెప్పు హితబోధలును గూఢవాక్యములనఁబడెను (సామె 1[6]). దానియేలు కలలభావము చెప్పువాఁడగుటచే అతఁడు అట్టి గూఢార్థములను విడఁదీయువాఁడనియు మర్మములు బయలుపఱచువాఁడనియు పిలువఁబడెను (దాని 5[12]). ఆ పదమును దానియేలు రాజగు అంతియొకసునుగుఱించి వాఁడినప్పుడు ఉపాయము తెలిసికొనుట యని దానిని తెనిఁగించిరి (8[23]). పై నివర్ణనములనుబట్టి ఈ పదము రహస్యములను తెలిసికొను జ్ఞానమును సూచించుచునని చెప్పవచ్చును (ఉపమానము, సామెత, మర్మములు చూ॥).

**గూన** వంట సామగ్రి 3 చూ॥

**గూనివాడు** రోగములు చికిత్సలు I 6 చూ॥

**గూనీ, గూనీయులు** (Guni = రంగు వేసిన).

1. నఫ్తాలీ కుమారులలో నొకఁడు (ఆది 46[24] I దిన 7[13]). సంఖ్యా 26[48] నందితని సంతతి వారికి గూనీయులను పేరు కలదు.

2. గాదు సంతతి వారిలో నొక పెద్ద (I దిన 5[15]).

**గూరు** (Gur = కొండవు సింహము). ఇబ్లెయాము అను ఊరు దగ్గరనుండు నొక స్థలము. యూదా రాజైన అహజ్యానిచ్చట గాయపఱచిరి (II రాజు 9[27]).

**గూర్బయులు** (Gurbaal = బయలు నివాస స్థానము). అరబ్బీయులు నివసించిన యొక స్థలము (II దిన 26[7]). బహుశః ఎదోముదేశములో నుండవచ్చును.



**గృహదేవతలు** (Teraphim = స్వస్థపఱచుటనుగూర్చి విచారించుట). హెబ్రీ భాషయందు వీటిని టెరాఫీములనిరి. ఇవి ఇంద్రజాలము మాంత్రికము అనువాటికి సంబంధించినవి. పూర్వీకుల నారాధించుటలోనుండి వీటి యారాధనవచ్చెనని కొందఱి యభిప్రాయము. ఆరంభమున నివి సుగంధ ద్రవ్యములతో సిద్ధపర్చబడిన పూర్వీకుల ప్రేతలఁట. నాగరికత హెచ్చిన కొలఁది అట్టి ప్రేతలకు బదులు వాటివలె సిద్ధపర్చఁబడిన కర్రవిగ్రహముల నుపయోగించిరి మీకాలు ఇట్టిదాని నొకటి మంచము మీఁదఁబెట్టి కప్పుటవలన నది దావీదేనని సౌలు సేవకులను మోసపఱచఁగలిగెను గాన అవి మనుష్యులంత పెద్దవిగా నుండెనని I సమూ 19[13-16] వలన నూహింపవచ్చును గాని లాబాను వాటిని కనుగొనకుండ రాహేలు ఒంటె సామగ్రిలో దాచిపెట్టఁగలిగెను (ఆది 31[19]) గాన అవి చాల చిన్నవిగ కూడ నుండవచ్చును. న్యాయా 17[5] 18[14,17,18,20] II రాజు 23[24] హోషే 3[4] జెక 10[2] నందును వీటినిగూర్చిన సూచనలు గలవు. B.

**గృహనిర్వాహకుఁడు** (Steward). పాత నిబంధనయందీ పదము ఒక ప్రత్యేక పదమునకు గాక ఇంటిపనులమీఁద నున్నవాఁడు అని యర్థమిచ్చు కొన్ని పదములకు భాషాంతరమై యున్నది. ఆది 43[16,19] 44[4] లో యోసేపు యొక్క ముఖ్యసేవకుని బిరుదుగా నున్నది. క్రొత్త నిబంధనలోని రెండు గ్రీకుపదముల నీమాటలతో తెనిఁగించిరి. మ 20[8] లూ 8[3] నందు ఆస్తి యప్పగింపఁబడిన వాఁడని యర్థమిచ్చు మూలపదము గలదు. 8[3] నందు

ఇది హేరోదు సేవకుఁడగు కూజాయనువాని బిరుదుగా నున్నది. సాధారణముగా క్రొత్త నిబంధనయందు దుపయోగించిన మఱియొక పదము ఇంటిని చూచువాఁడు అని యర్థమిచ్చును. దీనిని కూడ గృహ నిర్వాహకుఁడు, గృహనిర్వాహ కత్వములను మాటలచే తెనిఁగించిరి ($12^{42}$ $16^{2,3,4,8}$). తరువాతి కాలమునందీ పదము క్రీస్తు వాక్యసేవకులకొక బిరుదయ్యెను (I కొరి $4^{1,2}$ I పేతు $4^{10}$). తీతు $1^{7}$ లో అది అధ్యక్షునికి బిరుదుగానున్నది. ఈ యధ్యక్షులు తమ స్వంతపనులను గాక క్రీస్తు పనినే చూచువారు గావున గృహ నిర్వాహకులవలె దానిని నమ్మకముగాఁజేసి ఆయనకు లెక్క నప్పగింపవలెనను సంగతులను సూచించుటకు ఈ బిరుదు బోధకులకు తగినదై యున్నది.

## గె

**గెజెరీయులు** (Gizrites). గెజెరు అను ఊరి నివాసులు (I సమూ $27^{8}$ గెజెరు చూ॥).

**గెజెరు** (Gezer = వేఱుపడిన). షెఫేలాలో నుండు మిగుల పురాతనమైన యూరు. క్రీ॥ ము॥ 3000 సం॥ల క్రిందట హోరీయులచట నివసించియున్నట్లు అచ్చట దొరికిన రాతి శాసనములవలనఁ దెలియును. క్రీ॥ శ॥ షుమారు 2500 సం॥లకు ముందు కనానీయులు దాని స్వాధీనపఱచుకొనిరి. ఇశ్రాయేలీయులు కనాను దేశమునకు మొదట వచ్చినప్పుడు యెహోషువ దాని రాజును జయించి యతనిని చంపెను (యెహో $10^{33}$ $12^{12}$). అది ఎఫ్రాయిమీయుల స్వాస్థ్యములోనిదిగా నెంచఁబడి లేవీయుల కియ్యఁబడిన యూళ్లలో నొకటియై యుండెను ($16^{3}$ $21^{21}$) గాని యిశ్రాయేలీయులు దీనిని స్వాధీనపఱచుకొనక పోవుటచే (న్యాయా $1^{29}$) దావీదు కాలమువఱకు ఫిలిష్తీయుల వశమున నుండెను (I దిన $20^{4}$). తరువాత ఐగుప్తురాజు దానిని పట్టుకొని సొలొమోనుకు భార్యగా నిచ్చిన తన కుమార్తెకు దీనిని ఓలిగా నిచ్చెను (I రాజు $9^{16}$). మక్కబీయులలో సీమోనను వాఁడు దానిని ముట్టడివేసి జయించెను. I మక్క $15^{43-53}$ నందు దీనికి గాజరా యనుపేరు కలదు. ఇటీవల శిథిలపరిశోధకులలో కొందఱు ఈ యూరి పాడుదిబ్బలను త్రవ్వించి పూర్వకాలపు వాడుకలలోను ఆచారములలోను అనేకమైన వాటిని కనుగొనిరి. (పటము III, D 5).

**గెతెరు** (Gether) ఆరాము కుమారుఁడని ఆది $10^{23}$ నందున్నను షేము కుమారుఁడని I దిన $1^{17}$ లో కనఁబడుచున్నది. ఇచ్చట కుమారుఁడను పదమునకు సంతతివాఁడని యర్థము. ఆది 10 లోని వారందఱు ప్రత్యేకజనములకు పూర్వికులైరి గాని గెతెరు సంతతి వారెచ్చట జీవించిరో తెలియకున్నది.

**గెత్సేమనే** (Gethsemane = నూనె గానుగు). ఒలీవ చెట్లతో నిండియున్న యొక తోఁట. ఆ చెట్ల పండ్లనుండి నూనెతీయుట కొక గానుగ దీనియందుండినట్లు ఈ పేరువలన నూహింపఁదగును. ఈ తోఁట యెరూషలేమునకుఁ దూర్పుగా నున్న కెద్రోను వాగుకు కొంచెమవతల ఒలీవకొండకు దిగువగా నుండెను (మ $26^{30,36}$ మా $14^{26-32}$ యోహా $18^{1}$). యేసునకిదెంతో యిష్టమైన చోటు గావున ధ్యానించుకొనుటకుఁ దఱుచుగా నాయన ఇచ్చటికేకాంతముగ వెళ్లెడివాఁడు (లూ $22^{39}$ యోహా $18^{2}$). ఆయన శ్రమపడి శత్రువుల చేతి కప్పగింపఁబడిన స్థలమిదే (మ $26^{30,36}$ మా $14^{32-52}$ లూ $22^{39-53}$ యోహా $18^{1-12}$) గాన నిత్యము పుణ్యభూమిగా నెంచఁబడును. తూర్పునుంచి యెరూషలేము లోనికిఁబోవు మార్గము కెద్రోనువాగును దాటునట్టి వంతెనకు కొంచెము తూర్పుగా నీ తోఁటగలదను పారంపర్యమొకటి యున్నది. ఒలీవల కొండ మీఁదకు ఉత్తరముగాఁబోవు మార్గమును ఆ కొండను చుట్టి దక్షిణముగా బోవు మార్గమును కలియునట్టి మూలలో నిదియున్నదని కొందఱి యభిప్రాయము. ఈ తోఁట చాల మట్టుకు చదరముగా నున్నది. ఉత్తరమున 150 అడుగులును, పడమట 160 అడుగులును గల గోడలచే రోమన్ సంఘస్థులు దీనిని పదిలపఱచి యున్నారు. దీనియందు 8 గొప్ప ఒలీవ వృక్షములుగలవు. 7 వ శతాబ్దమున యెరూషలేమును స్వాధీనపఱచుకొనిన అరబ్బులు వాటిమీఁద పన్నువసూలుచేసినట్లు ఆధారములున్నందున అవి 1200 సం॥ల నుండి యున్నవని తెలిసికొనవచ్చును. అంత పెద్ద వృక్షములాచుట్టుపట్ల ననేకములుగలవు.

రోమీయులు యెరూషలేమును ముట్టడించినప్పుడు చుట్టునుండు చెట్ల నన్నిటిని నరికివేసిరి (యుద్ధ 5.12.4) గాన క్రీస్తు శ్రమపడి నప్పుడున్న చెట్లు అవే యనుటకు వీలుగాదు. ఈ భాగమునకు తూర్పుగా కొండ వాలుమీఁద నున్నదే ఆ తోఁటయని గ్రీకుసంఘస్థులు మఱియొకస్థలమును చూపుచు దానిని పదిలపఱచి యున్నారు. అది ఒలీవ కొండమీఁద నున్నను సరియైన యునికి యేదియో నిశ్చయించుటకు వీలులేదు. గెత్సేమనే తోఁట వీటిలో నేనొయొకటి యనిగాని కాదనిగాని రూఢిగా చెప్పవీలులేదు. ఆ తోఁట యెరూషలేము కెదుటనున్న ఒలీవకొండమీఁద నుండుట మాత్రము రూఢి.

**గెదల్యా** (Gedaliah = దేవుఁడు నా గొప్పతనమై యున్నాఁడు).

1. యెదూతూను కుమారులలో సితారా వాయించినవాఁడు. దేవుని మందిరమునందు గానము చేయుటకై నియమింపఁబడిన 24 వంతులలో రెండవ వంతునాయకుఁడు (I దిన $25^{3,9}$).

2. ప్రవక్తయగు జెఫన్యాయొక్క పూర్వికులలో నొకఁడు (జెఫ $1^{1}$).

3. యిర్మీయా కాలమునందున్న పష్హూరను వాని కుమారుఁడు (యిర్మీ $38^{1-4}$).

4. యెరూషలేము పట్టణములో కొంత భాగమును దేవాలయమును క్రీ॥ పూ॥ 588 సం॥ నాశనమైన పిదప నెబుకద్నెజరు యూదయ నేలుటకు నియమించిన అధిపతి. ఇతఁడు అహీకాము కుమారుఁడు. తన తండ్రివలె నితఁడును యిర్మీయాను ఘనపఱచి అతనికి స్నేహితుఁడాయెను (యిర్మీ $40^{5}$). మిగుల తెలివి తేటలతో రాజ్యము నేల నారంభించెను గాని రెండు నెలలలోనే ఇష్మాయేలనువాఁడు కుట్రజేసి యితనిని చంపెను (II రాజు $25^{22-26}$ యిర్మీ $39^{14}$ $40^{5}$-$41^{18}$). తరువాతి కాలములలో నీతని మరణదినము జనాంగపు ఉపవాస దినములలో నొకటిగా నాచరించిరి (జెక $7^{5}$ $8^{19}$).

5. అన్య స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని వదలిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{18}$). H.

**గెదెరు, గెదేరీయుఁడు** (Geder = హద్దు, కంచె, Gederite). కనానీయుల యూళ్లలో నొకటి. యెహోషువ దాని రాజును జయించెను (యెహో $12^{13}$). I దిన $2^{51}$ లోని బేత్గాదేరు (=బేత్ + గాదేరు) ఈ యూరే యనుకొందురు. I దిన $27^{28}$ లో గెదేరీయుఁడనఁబడినవాఁడీ యూరి వాఁడేనని సాధారణాభిప్రాయముగాని ఇతఁడు గెదేరా వాఁడని యనుకొనువారును గలరు (యెహో $15^{36}$).

**గెదెరోతాయిము** (Gederothaim = గొర్రెల రెండు దొడ్లున్న స్థలము). షెఫేలాలో యూదాకు చెందియుండిన 14 ఊళ్లలో నొకటి (యెహో $15^{36}$). అయితే అచ్చటి యూళ్ల పేరులను చూడఁగా నవి 14 కాక 15 ఉన్నవి. ఇందుచేత ఈ పేరు ఆ జాబితాలోకి పొరబాటుగా వచ్చెనని కొందరు అనుకొందురు. LXX లో ఈ పేరుకు ముందునుండు గెదేరా అను దానితో చేర్చి దాని చుట్టునుండు కంచెలు అని తర్జుమ చేసిరి. ఇట్లున్నయెడల అది ప్రత్యేకమైన యూరు కానేరదు.

**గెదెరోతు** (Gederoth = గోడలచే నావరింపఁబడిన స్థలములు లేక మందల దొడ్లు). షెఫేలా యనఁబడిన యూదా మైదానమందుండు గ్రామములలో నొకటి (యెహో $15^{41}$ II దిన $28^{18}$). ప్రస్తుతము కట్రా (*Katra*) యను నదే దీని యునికియై యున్నట్లున్నది. (పటము II, C 1).

**గెదేరా, గెదేరాతీయుఁడు** (Gederah= దొడ్డి, Gederathite). షెఫేలాలోనుండు నొక యూరు (యెహో $15^{36}$ I దిన $4^{23}$). ప్రస్తుతము జెదీరె (*Jedireh*) అనఁబడిన యూరే దాని యునికియై యున్నది. అందులో నివసించువాఁడు గెదేరాతీయుఁడు అనఁబడెను. ($12^{4}$). యెహో $15^{36}$ నందు అది యూదాకును I దిన $12^{4}$ నందు బెన్యామీనుకును చెందియున్నట్లున్నది. అందువలన నివి రెండు ప్రత్యేకమైన ఊళ్లని కొందరు అనుకొనుచున్నారుగాని ఆ రెండు గోత్ర స్థానములు దగ్గరగా నున్నందున మొదట ఇది యూదాకును తరువాత బెన్యామీనుకును చెందెనని తోచుచున్నది. (పటము II D 1).

**గెదోరు, గెదోరీయుడు** (Gedor= గోడ కంచె, Gederite).

1. యూదయలోని యొక గ్రామము (యెహో $15^{59}$ I దిన $4^{4,18}$ $12^{7}$). ప్రస్తుతము దానికి జెదూరు (*Jedur*) అని పేరు. గెదరీయులు ఈ యూరివారై (I దిన $4^{4}$ పటము II, E 2).

2. హాము సంతతివారు నివసించిన యొక జిల్లాకు పేరు. షిమ్యోను సంతతివారు వీరి నచటి నుండి వెళ్లఁగొట్టిరి (I దిన $4^{39,40}$) LXX లో గెదోరు అను మాటకు ప్రతిగా గెరారు అను మాట యున్నది. అయితే గెరారు అనునదే యిచటికి బాగుగా సరిపడుచున్నందున ఇదే సరియైనదని తోచును (గెరారు॥ చూ॥).

3. రాజగు సౌలు పూర్వికులలో చేరిన ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{30}$ $9^{37}$).

**గెనుబతు** (Genubath = దొంగతనము). సొలొమోనును విరోధించిన ఎదోమీయుఁడగు హదదు కుమారుఁడు (I రాజు $11^{20}$). ఇతని తల్లి ఫరో భార్యకు చెల్లి యగుటచే నితఁడు ఫరో నగరమందు రాచకుమారులవలె పెరిగెను.

**గెన్నేసరెతు దేశము** (Gennesaret = హాసోరు అనువాని తోఁట!). గలిలయ సముద్రమునకు పశ్చిమముగానున్న బయలు (మ $14^{34}$ మా $6^{53}$). ఈ బయలునందు క్రీస్తు తనయొద్దకు వచ్చిన గొప్ప జనసమూహమునందున్న యనేకమంది రోగులను స్వస్థపరచెను. ఈ బయలు చాల ఫలవంతమైనదనియు, దాదాపు 3½ మైళ్ల పొడవును 2½ మైళ్ల వెడల్పును కలిగియుండెనని యోసీఫసు వ్రాసెను (యుద్ధ 3.10.8). ఇది కపెర్నహూమునకును మగ్దలానుకును మధ్యనుండెను. (పటము IV, D 6.)

**గెన్నేసరెతు సరస్సు** గలిలయ సముద్రము చూ॥

**గెబ, గెబా** (Geba = కొండ). బెన్యామీనీయుల యూళ్లలో నొకటి (యెహో $18^{24}$). వారు దానిని లేవీయుల కిచ్చిరి ($21^{17}$ I దిన $6^{60}$). అది యూదావారి యుత్తరహద్దుగా నుండుటచే, గెబా మొదలుకొని బెయేర్షెబవఱకు అను మాటలు యూదా దేశమంతటిని సూచించును. (II రాజు $23^{8}$). I దిన $14^{16}$ లో నున్న గిబోను ఈ యూరే (II సమూ $5^{25}$). I సమూ $14^{5}$ ను చూడఁగా అది మిక్మషు సమీపమున నున్నదని తెలియును. ఇచట యోనాతాను ఫిలిష్తీయులను హతము చేసెను. ఆసా దానికి ప్రాకారములను కట్టించెను (I రాజు $15^{22}$). అష్షూరు రాజు యెరూషలేము మీఁదికి ఈ యూరిమీఁదుగానే వచ్చునని యెషయా ప్రవచించెను (యెష $10^{29}$). చెఱకాలమునకు తరువాతి చరిత్రలోకూడ ఈ పేరు కనఁబడును (నెహె $11^{31}$ ఎజ్రా $2^{26}$). న్యాయా $20^{31}$ లోని గిబియా ఇదే స్థలమని యనుకొందురు. యెరూషలేమునకు ఉత్తరమున మూఁడు క్రోసుల దూరమునందుండి ప్రస్తుతము జెబా (*Jeba*) అనఁబడినది దీని యునికియై యున్నది. (పటము III, F 5).

**గెబలు, గిబ్లీయులు** (Gebal = కొండ, Gebalites = గెబాలు నివాసులు).

1. ఫేనీకే దేశములోనున్న ఒక యూరు. అది దేవుఁడిశ్రాయేలీయుల కిచ్చిన భూమిలో నున్నట్లు లెక్కింపఁబడినను ఇశ్రాయేలీయులు దానిని స్వాధీనము చేసికొనక యుండిరి (యెహో $13^{5}$). సొలొమోను కట్టించిన యాలయము కొఱకు రాళ్లను మలిచినవారును (I రాజు $5^{18}$). యెహెజ్కేలు కాలములో ఓడలను బాగుచేయు వారును (యెహె $27^{9}$) ఈ యూరినుండియే వచ్చిరి. సీదోనుకు దాదాపు 50 మైళ్లు ఉత్తరముగా నున్న జబెయిల్ (*Jebeil*) దీని యునికియై యున్నది.

2. ఎదోమీయులతోను మోయాబీయులతోను అరబ్బీయులతోను సంధి చేసికొని యిశ్రాయేలీయులను విరోధించిన యూరివారు (కీర్త $83^{7}$ పురా 2.1.2;9,9,1.) ఈ యూరు మృత సముద్రమునకు దక్షిణమున నున్నట్లున్నది. ఇప్పుడు దీని జెబల్ (*Jebal*) అను పేరు కలదు.

**గెబెరు** (Geber = యోధుఁడు). సొలొమోను కాలమున యొర్దానుకు తూర్పుగా నుండు ఒక అధికారి. ఆహారమును సంగ్రహింప నియమింపఁబడిన 12 మందిలో నితఁడొకఁడు (I రాజు $4^{19}$). యొర్దాను కీశాన్య దిక్కున నున్న ప్రదేశ

ములో నిదేపనిఁజేసిన **గెబెరుకుమారు** డనఁబడినవాఁ డొకఁడుండెను. దీనికి మూలభాషయందున్న బెన్‌గెబెరు (*Ben-Geber*) అను నది వాని పేరై యుండును. అతఁడీ గెబెరు యొక్క కుమారుఁ డనవచ్చును.

**గెమర్యా** (Gemariah = యెహోవా కొనసాగించును).

1. యిర్మీయా కాలములో లేఖికుఁడగు షాఫాను కుమారుఁడు. యిర్మీయా వ్రాసిన గ్రంథమును యూదారాజైన యెహోయాకీము కాల్చివేయఁబోవుచుండగా అటుల కాల్చకూడదని చెప్పినవారిలో నొకఁడు. ఇతని మాటను రాజు వినకనే యా గ్రంథమును కాల్చివేసెను (యిర్మీ $36^{10-12,25}$).

2. రాజైన సిద్కియా యెరూషలేమునుండి బబులోనుకుఁ బంపిన యొక దూత. ఇతనిచేత యిర్మీయా ఒక యుత్తరమును వ్రాసి పంపించెను. ఇతఁడు హిల్కీయా కుమారుఁడు (యిర్మీ $29^{1-3}$).

**గెమలి** (Gemalli = ఒంటెలు గలవాఁడు). కాదేషు బర్నేయనుండి గోత్రమున కొక్కని వంతున మోషే పంపిన 12 మంది వేగులవారిలో దాను గోత్రీకుఁడగు అమీయేలు తండ్రి (సంఖ్యా $13^{12}$).

**గెయువేలు** (Geuel = దేవుని మహాత్మ్యము) కనాను దేశమును వేగు చూచుటకు మోషే గోత్రమున కొక్కని చొప్పున పంపిన 12 మందిలో గాదు వారి ప్రతినిధి (సంఖ్యా $13^{15}$).

**గెరా** (Gera = గింజ). బెన్యామీను కొడుకులలో నొకఁడు (ఆది $46^{21}$). సంఖ్యా $26^{33-40}$ లోని జాబితాలో ఈ పేరు కనఁబడదు. I దిన $8^{3,5,7}$ లలో నితఁడు బెన్యామీను మనుష్యుఁడై యున్నట్లున్నది. ఇతఁడు బెన్యామీనీయుల తెగలలో నొకదానికి ముఖ్యుఁ డయ్యెను. ఏహూదు (న్యాయా $3^{15}$) షిమీ (II సమూ $16^{5}$ $19^{16,18}$), అనువా రీతని వంశస్థులు.

**గెరారు** (Gerar = మఖాము లేక నీటి కుండలు.) మిగుల పురాతనమైన ఒక యూరు. అది కనాను దేశపు హద్దులలో నొకటియైయుండెను (ఆది $10^{19}$). అచటికి అబ్రాహాము ఒకసారియు ($20^{1,2}$) ఇస్సాకు ఒక పర్యాయమును ($26^{1,6}$) వెళ్లియుండిరి. ఆసా యను రాజు కూషీయా నోడించిన ఈ చరిత్రలో (II దిన $14^{13,14}$) గాక గెరారు పేరు మఱి యెచట కనఁబడదు. ఆది $10^{19}$ చూడఁగా అది ఫిలిష్తీయుల దేశములో గాజాకు ఉత్తరముగానున్నట్లు తెలియును గాని $20^{1,2}$ లో అది పలెస్తీనుకు దక్షిణముగా కాదేషుకును షూరుకును మధ్య నున్నట్లున్నది. ఇందువలన రెండు గెరారు లున్నవని కొంద ఱనుకొందురు. మఱికొందఱు గెరారు ఒక యూరు కాక విశాలమైన యొక పరగణా యను కొందురు గాని దీని యునికి ఫలానిదని రూఢిగా చెప్పఁజాలము. (పటము II, A 3).

**గెరసేనుల దేశము** గెరాసా, గెరసీనీయుల దేశము చూ॥

**గెరసీనీయుల దేశము, గెరాసేనుల దేశము, గదరేనీయుల దేశము** (The land of the Gerasenes, Gadarenes). పైనున్న రూపములుగాక గెర్గెసేనుల దేశము అను మఱియొక రూపము మా $5^{1}$ నందున్నట్లు కొన్ని ప్రతులయందు కనఁబడుచున్నది. ఇన్ని వేర్వేఱు రూపము లుండుటకు కారణములు లేకపోలేదు. గలిలయ సముద్రమునకుఁ దూర్పున మధ్య భాగమందు కెర్స (*Kersa*) అనునొక చిన్న పల్లె నీ మధ్య డాక్టర్ టాంప్సన్ (Dr. Thompson) అను నాయన కనుగొనెను. ఇది చాల చిన్నదగుటచే దీనివలననే చుట్టునుండు ప్రదేశమునకీ పేరు వచ్చియుండునని ఆదికాలమునం దుండిన పండితులు భావించలేదు. గలిలయ సముద్రమునకు ఆగ్నేయముగా 4 క్రోసుల దూరమందుండిన గదారా అను ఊరివలన ఈ ప్రదేశమునకు గదరేనీయుల దేశమను పేరు వచ్చినదని పొరపడి వ్రాతప్రతులలో నిట్లు వ్రాసిరి. ఇది యా చరిత్ర కెంత మాత్రమును సరిపడదుగాని పైన నుదాహరించిన కెర్స యనఁబడినది అన్ని విధముల ఆ చరిత్రకు సూటిగా సరిపడుచున్నది. దీని సమీపముగా నేటవాలుకున్న ప్రపాతము నుండియే పందులు మేయుచు సముద్రములోనికి వడిగా పరుగెత్తినదని (మ $8^{28-34}$ మా $5^{1-20}$) చెప్పవీలున్నది గాన ఈ దేశముయొక్క సరియైన నామము గెరసీనీయుల దేశ మనునదై యున్నది (లూ $8^{26-39}$ పటము I, F 4).



గెరిజీము

గెరిజీము (Gerizim = గెరిజీయుల కొండ). ప్రస్తుతము నాబ్లూస్ (*Nablus*) అనఁబడు షెకెము పట్టణముండిన లోయకు దక్షిణముగా నున్న కొండ. రాతిమయమై మిగుల నిట్రువుగా నున్నది. దీని కెదురుగా ఉత్తరమందు ఏబాలు పర్వతమున్నది. ఈ గెరిజీము మధ్యధరా సముద్ర మట్టమునకు 2849 అడుగులును, పైనుదాహరించిన షెకెమునకు 700 అడుగులు ఎత్తుగా నున్నది. యెహోషువ మధ్యకనానును జయించిన పిమ్మట మోషేయాజ్ఞ ప్రకారము (ద్వితీ 11[29] 27[12,13]) ఇశ్రాయేలు గోత్రికులను రెండు భాగములుజేసి, ఆశీర్వాద వాక్యములను జెప్పుటకు సగముమందిని గెరిజీము కొండ కెదురుగాను, శాపవాక్యములను జెప్పుటకు తక్కిన సగముమందిని ఏబాలు కొండ కెదురుగాను నిలువఁబెట్టెను (యెహో 8[33-35]). గెరిజీము కొండమీఁద నిలిచి గిదోను కుమారుఁడగు యోతాము షెకెము నివాసులకొక యుపమానము చెప్పెను (న్యాయా 9[7]). మహా అలెక్సందరు కాలమున ప్రధాన యాజకుఁడుగానున్న యద్దూవ (*Jaddua*) యనువాని సహోదరుఁడగు మనస్సే గెరిజీము సన్బల్లటు అను నొక విదేశీయుని కుమార్తెను వివాహమాడినందున యెరూషలేము నందలి పెద్దలు దీనినిగురించి తమ అనిష్టమును కనఁబఱచి, అతఁడామెను పరిత్యజించ నొల్లని పక్షమున బలులర్పించ వీలుగాదన పట్టుబట్టిరి. ఆమె తన కతిప్రియురాలైనను అతఁడు పదిమంది కెదురాడ నొల్లక ఆమెను విడనాడ యత్నించుచుండఁగా ఆమె తండ్రి దానికొప్పుకొనక అతఁడామెను వదలిపెట్టని పక్షమున, యెరూషలేము ఆలయమువంటి ఆలయము నొకదానిని కట్టించి దాని కతని యాజకునిగాఁ జేసెదనని వాగ్దానమొనర్చెను. అట్లే యతఁడు గెరిజీము పర్వతము మీఁద నొక గుడిని కట్టించి తన మాట నిలుపుకొనెను. ఆ కొండమీఁద నుండిన సమరయుల ఆలయమున కారంభమిదే. క్రీ॥ ము॥ 335 సం॥ నీ యారాధన యారంభ మాయెనని యోసీఫసు వలనఁ దెలియుచున్నది (పురా 11.8.2,7). క్రీ॥ ము॥ 445 సం॥ నెహెమ్యా కాలమున యూదులకు విరోధియైన సన్బల్లటు అను పేరు గల సమరయుఁ డితఁడేయై యుండినయెడల (నెహె 4[1] 13[28]) ఈ దేవాలయమింక చాల ముందుగనే కట్టఁబడినదై యున్నది. మక్కబీయులకుఁ దరువాత వచ్చిన జాన్ హిర్కానస్ (*John Hyrcanus*) అనువాఁడు క్రీ॥ ము॥ 129 సం॥న దీనిని నాశనము జేసినను సమరయుల కిది పరిశుద్ధ స్థలమాయెను ఈ పర్వతమని సమరయ స్త్రీ చెప్పినది దీనినిగూర్చియే (యోహా 4[20,21] పురా 12.1). వారా సమయమున మాట్లాడుచుండిన యాకోబుబావి ఈ కొండ దిగువ భాగమున నుండెను. (పటము I, E 6).

**గెరూతు కింహాము** (Geruth-Chimham). యిర్మీయా కాలములో ఐగుప్తుకు పారి పోయిన యూదులు దిగిన యొక స్థలము. అది బేత్లెహేమునకు సమీపమునగలదు (యిర్మీ $41^{17}$). గెరూతను పదమునకు సత్రమని యర్థముగావున ఈ మాటను కింహాము సత్రమని తెనిఁగించఁ దగును. II సమూ $19^{37}$ నందున్న కింహాము పేరట నిది కట్టఁబడుటచే దీని కీపేరు కలిగెనని యూహింపవచ్చును.

**గెర్గెసేనుల దేశము.** గెదరేనీయుల దేశము చూ॥

**గెర్షోను, గెర్షోము గెర్షోనీయులు** (Gershon, Gershom = ఇచట అతఁడు పరదేశి, Gershonites).

1. మోషే పెద్ద కుమారుఁడు (నిర్గ $2^{22}$). దానులో విగ్రహారాధన చేయుటకు కట్టిన గుడిలో నితని సంతతివాఁడగు యోనాతానును యాజకునిగా నేర్పఱచిరి (న్యాయా $18^{30}$).

2. లేవికొడుకులలో నొకఁడు (I దిన $6^{16,17}$ $15^{7}$ ఆది $46^{11}$ నిర్గ $6^{16}$ సంఖ్యా $3^{17}$). ఇతని సంతతివారు గెర్షోనీయులనఁబడిరి ($3^{21-23}$ $4^{24}$ మొ॥). వీరు లేవీయులలోని మూఁడు తెగలలో నొకరైయుండిరి. వీరు గెర్షోను కుమారులగు లిబ్నీ షిమీ యనువారినిబట్టి లిబ్నీయులు షిమీయులు అను రెండు కుటుంబములుగా నుండిరి ($3^{21}$). అరణ్య సంచారమందు గుడారపు తెరలు త్రాళ్లు మొదలైనవి మోయుట వీరి పనియై యుండెను ($3^{25}$ $4^{24}$ $10^{17}$). వీరికి పలెస్తీనుదేశమునందు పదమూఁడు పట్టణము లియ్యఁబడెను (యెహో $21^{27-33}$). ఆలయములో సంగీతములను నడిపించిన ఆసాపు ఈ గోత్రికుఁడే (I దిన $6^{39-43}$). దావీదు లేవీయులకు వంతులు నియమించినపుడు ($23^{6-11}$) గెర్షోనీయులకు విశేష పనులు చూపెను ($26^{21-24}$). చెఱకాలమునకు తరువాత ఆసాపు సంతతివారిలో 128 మంది (ఎజ్రా $2^{41}$) లేక 148 మంది (నెహె $7^{44}$) బలిపీఠప్రతిష్ఠసమయమున గాయకులుగా నుండిరి (ఎజ్రా $3^{10}$). యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించిన సమయమున బూరల నూదినవారు వీరే (నెహె $12^{35}$).

3. ఫీనెహాసు సంతతివారిలో నొకఁడు. ఇతఁడు ఎజ్రాతో యెరూషలేమునకు వెళ్లిన వారిలో నొకఁడై యుండెను (ఎజ్రా $8^{2}$).

**గెలీలోతు** (Geliloth = చుట్టున్న రాళ్ల స్థలములు). అదుమ్మీమున కెక్కు చోటున కెదురుగా నున్నది (యెహో $15^{7}$ $18^{17}$). $15^{7}$ లోను నెహె $12^{29}$ లోను దీనికి గిల్గాలు అను పేరుగలదు. యెరికోనుండి యెరూషలేమునకు పోవు మార్గము దగ్గరగా నుండెను గాని దాని యునికినిగూర్చి రూఢిగాఁ దెలియదు.

**గెషూరు, గెషూరీయులు** (Geshur = వంతెన, Geshurites = గెషూరు నివాసులు). సిరియకు సంబంధించిన యొక జాతివారు నివసించిన ప్రదేశము. ఇది పలెస్తీనుకు ఈశాన్యమున బాషానుప్రదేశమునకు పడమరగా నుండెను (ద్వితీ $3^{14}$ యెహో $12^{4}$ $13^{11}$). యొర్దానుకు తూర్పునుండిన మనష్షే అర్థగోత్రపువారికిది స్వాస్థ్యముగా నియ్యఁబడెను గాని మనష్షే గోత్రికులు దీని నెన్నఁడును స్వాధీనముచేసికొని యుండలేదు ($13^{13}$). దావీదుకాలములో సహా ఈ గెషూరీయులకు స్వంత రాజు ఉండెను. దావీదు ఇతని కూతురును వివాహము చేసికొనెను (II సమూ $3^{3}$). అబ్షాలోము ఈ గెషూరీయుల రాజుకు మనుమఁడై యుండెను కావున, అమ్నోనును చంపినపిమ్మట తన తాతయొద్దకు పారిపోయెను ($13^{37}$ $15^{8}$). I దిన $2^{23}$ చూడఁగా ఈ గెషూరీయులు ఇశ్రాయేలీయులయొద్దనుండి యాయీరు పట్టణములను అపహరించినట్లుగా నున్నది. యెహో $13^{2}$ I సమూ $27^{8}$ ప్రకారము ఫిలిష్తీయులదేశమునకు సమీపముగా మఱియొక గెషూరున్నట్లు కొందఱను కొందురు. అట్లయిన దావీదు వివాహముచేసికొనిన స్త్రీ యీ ప్రదేశస్థురాలై యుండవచ్చును. అయితే అట్టి గెషూరు మఱియొకటి యున్నట్లు తగిన రుజువులు గాని సూచనలు గాని లేవు.

**గెషెము** (Geshem = గాలివాన). నెహెమ్యా యెరూషలేము ప్రాకారములను తిరిగి కట్టించుచుండఁగా నతని నాటంక పఱచిన వారిలో నొకఁడు (నెహె $2^{19}$, $6^{1,8}$). అతఁడు అరబ్బీయుఁడనఁబడునుగాని షోమ్రోనులో నివసించిన అన్యుఁడగు అరబ్బీయుఁడో పలెస్తీనుకు

దక్షిణముననున్న అరేబియా నివాసియో రూఢిగా చెప్ప వీలుకాదు.

## గే

**గేషాను** (Geshan, Gesham = మాలిన్యము). కాలేబు సంతతి వారిలో నొకని పేరు (I దిన 2[47]).

**గేహాజీ** (Gehazi = దర్శన పు లోయ). ఎలీషా సేవకుఁడు. షూనమ్మీయురాలి చరిత్ర సందర్భములో కనఁబడుచున్నాఁడు (II రాజు 4[8-37]). సిరియవాఁడగు నయమాను తెచ్చిన కానుకను పుచ్చుకొనుటకు ఎలీషా యిష్టపడనందున, ఇతఁడు నయమానును మోసముజేసి కొంత సొమ్మును పుచ్చుకొని, దానికి శిక్షగా కుష్ఠరోగి యయ్యెను (5[20-27]). తాను పోఁగొట్టుకొనిన భూముల విషయమై షూనమ్మీయురాలు రాజుతో మనవి జేసికొనుటకై వచ్చినప్పుడు గేహాజీ యెహోరాముతో నున్నట్లు కనుఁగొనవచ్చును (8[1-6]). H.

**గేహిన్నా** యెరూషలేము A, I 2, నరకము చూ॥

## గొ

**గొంగళిపురుగు** మిడుతలు చూ॥

**గొంజి చెట్టు** (Myrtle). నిత్యము పచ్చగా నుండు చెట్టు (నెహె 8[15] యెష 41[20] 60[12] 55[13] జెక 1[8]). ఎనిమిది అడుగులకన్న యెక్కువ యెత్తెదుగదు. పలెస్తీను దేశములో నీ చెట్టు పువ్వులు తెల్లనివై గుత్తులు గుత్తులుగా పూయును. పువ్వులు రాలినవెంటనే దీని కాయలు తెల్లగా కనఁబడును. కొలఁదికాలములోనివి నల్లబారును. దీని యెండుటాకులను పొడుముగాఁజేసి నూనెతో కలిపి చంటి బిడ్డలకుఁ బూసెదరు అప్పుడప్పుడు ఆ బిడ్డల చర్మము గట్టిపడునట్లి పొడుమును వారి యొంటిమీఁదఁ జల్లెదరు. ఈ యాకులకు బలహీనతను కుదుర్చుగుణము గలదని యెంచి వాటిని బిడ్డల పరుపులలోను, తలగడలయందును పెట్టి కుట్టుదురు. J. C.

**గొంతుక యెండిపోవుట** రోగములు చికిత్సలు II 3 చూ॥

**గొడ్డలి వృత్తులు** చేతిపనులు I 3 (f) చూ॥

**గొడ్రాలు, గొడ్రాలితనము** పిల్లలు 1 చూ॥

**గొణుగువాడు** (Charmer). మూలభాషయందీ మాటకు గొణుగుట, గుసగుస మాట్లాడుట, మెల్లగా మాట్లాడుట, కదలుట, మంత్రించుట యని యర్థము. సమాధులను దర్శించి, శవములను పరీక్షించి, చనిపోయినవారి యాత్మలను పిలుచునట్లు నటించి, వీటిద్వారా అదృశ్యలోకపు సంగతులను తెలిసికొనుటవలన నిది చనిపోయిన వారితో ముచ్చటించుట యనికూడ అర్థమిచ్చును. లేవీయకాండ చట్టప్రకారమిది యొక గొప్ప నేరముగా నెంచఁబడి అట్టి వారిని రాళ్లతోఁగొట్టి చంపిరి (లేవీ 19[31] 20[27]). ప్రస్తుతము పశ్చిమదేశములలోను తూర్పు దేశములలోను వ్యాపించుచున్న స్పిరిచ్యులిజమ్ (*Spiritualism*) వంటిదిది యయున్నది. B.

**గొప్ప ఆవరణము** యెరూషలేము B, III 6 చూ॥

**గొప్ప గోపురము** యెరూషలేము B, V 2 (13) చూ॥

**గొమొఱ్ఱా** సొదొమ చూ॥

**గొరపోతు** మృగములు 26 చూ॥



సిరియదేశపు గొఱ్ఱె

**గొఱ్ఱె, పొట్టేలు** (Sheep, ram). ఆది కాలమునుండి కనఁబడు సాధువైన మృగజాతిలో నిది యొకటి (ఆది 4[2]). అబ్రాహాము ఇస్సాకు యాకోబులు గొఱ్ఱెల మందలను గాచిరి (12[16] 26[14] 30[32] మొ॥). వారి సంతతివారైగుప్తునందుండునప్పుడు గొల్లలుగా నెంచఁబడిరి (నిర్గ 10[9]

$12^{32,38}$). గొర్రె నిబంధన కాలమువఱకు నిది పలెస్తీను దేశపు ముఖ్య సృత్తులలో నొకటిగ నెంచఁదగును (లూ $2^{8}$). పలెస్తీను చుట్టునుండు మోయాబు ఎదోము మొదలగు దేశములలో గొర్రెలు మఱి విశేషముగ నున్నవి (సంఖ్యా $32^{1}$ న్యాయా $5^{16}$ I సమూ $16^{11}$ $25^{2}$). మెసపొతేమియ (ఆది $30^{25-43}$), యోబు జీవించిన ఊజు (యోబు $1^{3}$), మిద్యాను (నిర్గ $2^{16}$) కేదారు (యెష $60^{7}$ మొ॥) దేశములన్నియు నీటి మందలకు సుప్రసిద్ధములు.

గొర్రెలు పవిత్ర జంతువులుగాన వాటి నాహారమున కుపయోగించిరి (I సమూ $14^{32}$ $25^{18}$). వాటి పాలను త్రాగిరి (ద్వితీ $32^{14}$ యెష $7^{21,22}$). వాటి చర్మములను వస్త్రములకు ప్రతిగా బీదలు కప్పుకొనుట కుపయోగించుకొనిరి (హెబ్రీ $11^{37}$ జెక $13^{4}$). వాటి తోళ్లు సంకె నితెరలకు పనులకును వాడిరి (నిర్గ $26^{14}$). వాటి బొచ్చుతో బట్టలనేసిరి (లేవి $13^{47,48}$ సామె $27^{26}$ మొ॥). ఇవి చాల విలువగలవి యగుటచే ఆయా దేశముల వారు గొర్రెలను కప్పముగాఁ జెల్లించిరి (II రాజు $3^{4}$ యెష $16^{1}$). బొచ్చు కత్తిరించు సమయమున ప్రజలు సంభ్రమపడిరి (ఆది $38^{12}$ II సమూ $13^{23}$ మొ॥). గొర్రెపొట్టేళ్ల కొమ్ములను బూరలనూదుటకును బుడ్లకు ప్రతిగాను ఉపయోగించుకొనిరి (యెహో $6^{4}$ I సమూ $16^{1}$). ముఖ్యముగా గొర్రెలను యజ్ఞాదులయందర్పించుట వాడుకగా యుండెను (నిర్గ $20^{24}$ సంఖ్యా $22^{40}$). ధర్మశాస్త్రమునందు గొర్రెలను హోమములకును (లేవి $1^{10}$), పాప పరిహారార్థ బలులకును ($4^{32}$), అపరాధ పరిహారార్థ బలులకును ($5^{15}$ $6^{6}$), సమాధాన బలులకును ($22^{21}$) అర్పించిరి. గొర్రె యిట్లు సర్వ సాధారణమగు యాగ పశువుగా నుండుటవలన లోక పాపముల నిమిత్తము తన్నుతా నర్పించు కొన్న క్రీస్తు అర్పింపఁబడిన గొర్రెపిల్లగా నెంచఁబడును (యోహా $1^{29}$ I కొరిం $5^{7}$ ప్రక $5^{6}$).

ప్రేమ (II సమూ $12^{3}$), విధేయత (యోహా $10^{3,4}$), వినయము (యెష $53^{7}$ యిర్మీ $11^{19}$), దిక్కులేని స్థితి (మీ $5^{8}$ మ $10^{16}$), కాపరి నాశ్రయించి యుండు బుద్ధి (యెహె $34^{5}$ మ $26^{31}$) అనునవి గొర్రెల లక్షణములని సూచింపఁబడినవి. దీని మగజాతియగు పొట్టేలు బలమును శక్తిని సూచించుచు దాని $8^{3-7,20}$ లో ఒక రాజ్యమునకు గుఱుతుగా నున్నది. అది రెండు కొమ్ములుగల దగుటచేత మాదియ పారసీక రాజ్యములు కలిసి బలమైన రాజ్యముగా నేర్పడినదానిని సూచించె నందురు.



గొర్రె తల

పలెస్తీనులోని గొర్రెలు సాధారణముగా తెల్లవి (యెష $1^{18}$) గాని, రంగుగలవియు లేక పోలేదు. ఆ దేశపు గొర్రెలు రెండు రకములు. ఒకటి చిన్నది. రెండవది పెద్దదియు లావైనతోక గలదియునైయున్నది. ఈ రెండవ దాని నచ్చట విశేషముగాఁ బెంచెదరు.



అడవి గొర్రె

ద్వితీ $14^{5}$ నందు కొండ గొర్రె యను పదముగలదు. దాని మూలభాషాపదము ఎగురు

చున్న మృగమును సూచించును. అది యొక్క చోట మాత్రమే ఉదాహరింపబడుటచే అట్టి మృగమో యూహీగా చెప్ప వీలులేదు. ఒక విధమైన జింక యని కొందఱి తాత్పర్యము.

**గొఱ్ఱెపిల్ల** గొఱ్ఱె, యేసుక్రీస్తు IV 3 (1) (e) పండుగలు III 1 (1) చూ॥

**గొఱ్ఱెబొచ్చు (Wool).** ఇశ్రాయేలీయుల దీనిని విశేషముగా తమ వస్త్రములకొఱకు వాడిరి (లేవీ $13^{47,59}$ యెహె $44^{17}$). గొఱ్ఱెబొచ్చును కత్తిరించి శుభ్రముచేసి చిక్కుదీసిన పిమ్మట రంగు వేసిరి. పిదప దానిని వడికి వస్త్రములుగా నేసిరి. ఈ దేశమునందు దూదినేకినట్లే ప్రస్తుతము పలెస్తీనునందు గొఱ్ఱెబొచ్చును ఏకి చిక్కుదీయుచున్నారు. గొఱ్ఱె వెంట్రుకలతో నేసిన వస్త్రములను సాధారణముగా పైవస్త్రములుగా వాడిరి. మ $11^{8}$ లూ $7^{25}$ నందుదాహరించిన సన్నపు బట్టలు బహుశః మెత్తటి బొచ్చుతో నేయబడినవి కావచ్చును. నారను బొచ్చును కలిపి నేయుట నిషిద్ధమై యుండెను (లేవీ $19^{19}$). అట్టి బట్టలు యాజకులుగాక యితరు లెవ్వరును వేసికొనరాదని యోసీఫను తెలిపినను (పురా 4,8,11), ఎవరును అట్టివాటిని ధరింపరాదని దాని భావము. యాజకులు మందిరమునందు పరిచర్య జేయునప్పుడు బొచ్చు వస్త్రముల ధరింపరాదని యెహె $44^{17}$ నందున్నది. ఏకిన బొచ్చును ప్రస్తుతమువలెనే పరుపులకును దిండ్లకు నుపయోగించిరి. వీటిని పురుగులు కొట్టివేయకుండునట్లు జాగ్రత్త పడవలసియుండెను (యెష $51^{8}$). గొఱ్ఱె బొచ్చు యొక్క తెలుపు పరిశుద్ధత కలంకారముగా పోల్చఁబడెను (కీర్త $147^{16}$ యెష $1^{18}$ దాని $7^{9}$ = ప్రక $1^{14}$ వస్త్రములు చూ॥).

**గొఱ్ఱెబొచ్చు కత్తిరించు కాలము** పండుగలు III 5 చూ॥

**గొఱ్ఱెలకాపరి, గొల్ల (Shepherd).**

1. గొల్లల ప్రాముఖ్యత. గొల్లలవృత్తి బైబిలు నందు మిగుల ప్రాముఖ్యమైనది. గొఱ్ఱెలను కాయుటవలన వీరికీ పేరువచ్చినను, వారు వాటిని మాత్రమేగాక మేఁకలను పశువులనుగూడ మేపిరి.

ఇశ్రాయేలీయు లొక జనాంగముగా నేర్పడక ముందు చాలకాలము క్రిందటనే హేబెలు ఈ వృత్తి నవలంబించినట్లున్నది (ఆది $4^{20}$) గాన నిది ఆరంభమందుండిన వృత్తులలో నొకటి యన వచ్చును. ఆ కాలమునందుండిన గొల్లలు ఆయా భూభాగములను స్వతంత్రించుకొనక తమ మందలను మేఁత దొరికిన యెల్లెడలకుఁ దిరుగుచుండెడి వారని గోత్రకర్తల చరిత్రలయందు సూచనలున్నవి (13, $37^{12-14}$ మొ॥). అందువలన ఆయా కాపరులు కలహించుటలో నాశ్చర్యములేదు ($13^{7}$). అబ్రాహాము కలహపడుట కిష్టములేనందున వేఱుపడి దూరముగాఁ దొలగెను గాని అరబ్బీయులలో తరతరముల క్రిందటనే యారంభమయిన కలహము లున్నవి.

ఇశ్రాయేలీయులు ఐగుప్తునకు వెళ్లినప్పుడు గొల్లలుగా ఆ దేశములోఁ బ్రవేశించిరి ($47^{6}$). గొల్లరాజులనఁబడిన హిక్సస్ (*Hyksos*) వంశస్థులొకప్పుడు ఐగుప్తున కేలికలుగా నుండిరి. వారి ప్రభుత్వమంతరించిన పిమ్మట వచ్చినవారు వారిని మిగుల హీనముగాఁ జూచినందున గొల్లల సహ్యించుకొనుట ఐగుప్తీయులకు సహజమాయెను. గనుకనే యాకోబు తన కుటుంబమంతటితో గొడ్డు గోదను వెంటఁగొని ఐగుప్తునకు వచ్చినప్పుడు వారికొక ప్రత్యేక ప్రదేశము నిచ్చిరి. మోషే యిశ్రాయేలీయుల నాయకుఁడు కాక పూర్వము అరణ్యమునందు మందను గాయుచు 40 యేండ్లు గడిపెను (నిర్గ $3^{1}$). మోషేకు తదనంతరము దావీదు గొఱ్ఱెల కాపరులలో ప్రసిద్ధుఁడయ్యెను (I సమూ $16^{11}$).

2. గొల్లల యాపదలు. కాపరులు తమ మందలను అడవులలోని పచ్చిక బీడులకుఁ దోలుకొని పోవలసియుండెనుగాన అట్టి స్థలములయందు దాగియుండు సింహములు ఎలుగుబంట్లు చిరుతపులులు తోఁడేళ్లు మొదలగు (I సమూ I $7^{34}$ యోహా $10^{12}$) అడవి మెకములవలన కలుగు యాపదలకు లోనైరి. దొంగల భయమును మెండుగఁగలదు (యోహా $10^{10}$). దావీదు దేశభ్రష్టుడై అడవులలో దాగియుండు సమయమున అతఁడును అతని సహచరులును నాబాలు మందల కట్టి హానియు రాకుండ కాపాడుచు వచ్చిరి (I సమూ 25). ఆ ప్రాంతములలోఁ దిరిగాడి అరబ్బులు నేటివఱకిట్లు వీటిని దొంగిలించుట వలననే జీవించుచున్నారు. ప్రతి నిత్యమిట్లాపద

యందు మునిగి తేలుచుండువారు ధైర్యశాలురగుట సహజము ($17^{34}$). తమ మందల కిట్టి యాపదలు కలుగకుండునట్లు వాటి యుపయోగార్థమై దొడ్లను కట్టుకొనిరి. వీటి చుట్టు గోడలనుకట్టి ముండ్లకంపలను వేసిరి. కొండ ప్రదేశములయందుండు గుహలనుగూడ అట్టి దొడ్లనుగా వాడిరి. ఆ గుహాద్వారముల కడ్డముగా మాత్రము గోడనుకట్టి, అందులోనే రాకపోకల కనుకూలముగా నుండునట్లు తలుపు నొకదానిని పెట్టిరి. ఫిలిప్పుదైన కైసరయకు సమీపమందున్న ఒక గుహను నేటివఱకు అట్టి దొడ్డిగా వాడుచున్నారు. తమ మందలకు కలుగు అపాయములనుండి తప్పించుకొనుటకు కాపరులు ఒకటిగా కలిసికొని వాటిని మేపిరి. తమకు సహాయముగానుండుటకై కుక్కలను కూడఁ బెంచుకొనిరి (యెష. $56^{10}$).

3. గొల్లలు తమ పనిచేయురీతి. వారి పని చాల మట్టునకీ దేశపు గొల్లల పనివంటిదే. ఉదయమున లేచి తన మందను కూర్చుకొని వాటిని మేఁతగల బీడులకు తోలుకొనిపోవును. తన మందలోని ప్రతి గొఱ్ఱెను బహు చక్కగా నెఱుగును. ప్రతిదానిని పేరుపెట్టి పిలుచునంత బాగుగా వాటి నెఱుఁగును (యోహా $10^{3}$). గొల్లనికి ఒక దుడ్డుకఱ్ఱ యుండును (కీర్త $23^{4}$). మధ్యాహ్నమైనప్పుడు మందను నీటియొద్దకు నడుపును (ఆది $29^{7-10}$ నిర్గ $2^{16,17}$ కీర్త $23^{2}$). తరువాత వాటిని మఱల మేపుటకై గొనిపోయి సాయంకాలము వఱకు త్రిప్పును. గొఱ్ఱెపిల్లలలో బలహీనమైన వాటిని మోసికొనిపోవును (యెష $40^{11}$). ప్రతి సంవత్సరము ఎండాకాలమునందు బొచ్చు కత్తిరింతురు (ఆది $31^{19}$ $38^{13}$). ఈ బొచ్చు కాపరుల యొక్క ముఖ్య ఆదాయములలో నొకటి గావున దీనిని గొల్లల కోఁతకాలమని చెప్పవచ్చును. వారట్టి కాలమున మిగుల సంభ్రమపడెడివారు (II సమూ $13^{23-27}$ పండుగలు III 5 చూ॥). మందలను కాపాడిన వారు కట్నములకై నిరీక్షింతురు (I సమూ $25^{4-9}$). అట్టివారి నిరీక్షణకు భంగముకలిగినయెడల కాపరులకు క్షేమమే మాత్రముండదు.

4. కాపరుల విషయమగు నియమములు బోధలు. ధర్మశాస్త్రమునందు కాపరులకు నష్టము కలిగించెడి వారి విషయమైన నియమములు గలవు (నిర్గ $22^{1}$). వారు తమ మందలలోని తొలిచూలు వాటిని దేవుని కర్పింపవలసి యుండిరి (ద్వితీ $15^{19}$). ఇశ్రాయేలీయులు దేవునికి విధేయులైన పక్షమున వారిమందలు విస్తరించుననునది వారి దీవెనలో మిగుల ముఖ్యమైనది ($7^{13}$ $28^{4,18,31}$). వీరి వృత్తి వ్యవసాయమునకు సంబంధమైనదై యుండుటవలననే వీరికిట్టి నియమము లేర్పడెననుట కెట్టి సందేహమును లేదు.

యాజకులు రాజులు ఘనులు ప్రజలకు కాపరులని దృష్టాంతపఱచుచు ప్రవక్తలు వారి విధులను గూర్చి బోధించిరి (యిర్మీ $23^{4}$ $25^{34-38}$ యెహె 34 జెఖ $10^{2}$ $11^{3-15}$). ఆ కాపరులు అపనమ్మకస్థులగుటచే మందయైన యిశ్రాయేలీయులకు గొప్ప బాధలు కలిగినట్లు వారు వచించిరి (యిర్మీ $50^{6}$ యెహె $34^{6}$). కాపరిని చంపినందున అతని మందయగు ప్రజలు చెల్లాచెదరైరి (జెక $13^{7}$ మ $26^{31}$). దేవుఁడు తన ప్రజలను కాపాడు విధమును సూచించుటకు ఆయనకూడ కాపరియని చెప్పిరి (కీర్త 23,80 యెష $40^{11}$ వీటితో కీర్త $44^{11}$ $49^{14}$ $78^{52}$ $79^{13}$ $95^{6}$ $100^{3}$ ను సరిపోల్చుఁడు). దీని ననుసరించియే యేసు తాను కాపరినని చెప్పుకొనెను (యోహా $10^{2-11}$). ప్రజలు గొఱ్ఱెలై యున్నట్లాయన వారిని జాలితో చూచెను (మ $10^{6}$ $18^{11-14}$ లూ $15^{3-7}$). కాపరి తన గొఱ్ఱెల విషయము చూపెడి జాలినైనను మానవులు తమ తోటి వారికి చూపవలెనని ఆయన బోధించెను. (మ $12^{11,12}$). కాపరి గొఱ్ఱెలను మేఁకలను వేఱుపఱచునట్లు తీర్పుదినమున క్రీస్తు సన్మార్గులను వేఱుపఱచునను దృష్టాంతమును జెప్పెను ($25^{31-46}$). క్రీస్తు ప్రజలకొరకు తన ప్రాణము పెట్టినందునను (యోహా $10^{11}$ కార్య $8^{32}$) వారిని నడిపించుచున్నందునను (I పేతు $2^{25}$ $5^{4}$ హెబ్రీ $13^{20}$) ఆయన ప్రధానకాపరి యనఁబడెను. కాపరి (*Pastor*) యను పేరు బోధకులకుకూడ పెట్టఁబడెను. ఎఫె $4^{11}$ నందు మాత్రమే ఈ బిరుదు వారికున్నను కాపరులవిధులు వారివారి విధులైనట్లు యోహా $21^{15,16,18}$ I పేతు $2^{25}$ నందు తేటగానున్నవి. ఈ పేరు నేటివఱకు బోధకుల కొక ముఖ్యమైన బిరుదై యున్నది.

**గొఱ్ఱెల దొడ్డి** గొఱ్ఱెల కాపరి II చూ॥

**గొర్రెల ద్వారము** యెరూషలేము B V 2 (1) చూ॥

**గొర్రె వెండ్రుకలు కత్తిరించు ఇల్లు (Shearing-House, The).** యెహూ యెజ్రె యేలునుండి సమరయకువచ్చుచు యూదారాజగు అహజ్యాసహోదరులను కలిసికొని వారిని సంహరించిన స్థలము (II రాజు 10[12,14]). దీని మూల పదమగు బేత్ ఎకెడ్ (*Beth-eked*) అను దానిని తెనిఁగించక అట్లే యుంచిన యెడల బాగుండెడిది. దీనియునికి సరిగాఁ దెలియదు.

**గొలుసులు, కట్లు, పాశములు (Chains)** గొలుసులను ఆభరణములుగా ధరించుటనుగూర్చి ఆభరణము 6 చూ॥. యోసేపు (ఆది 41[42]). దానియేలు (దాని 5[7]) అను వారలిట్టి యాభరణములను రాజులచే గౌరవార్థ చిహ్నములుగా నొందిరి. ప్రధాన యాజకుడు ధరించిన పతకమునకును (నిర్గ 28[14,22]), దేవాలయమునకు సంబంధించిన తెరకును స్తంభములకును (I రాజు 6[21] 7[17]), అన్యులైన వారు తమ దేవతలకును (యెష 40[19]) బంగారు గొలుసులను భూషణములుగా వేసిరి.

సాధారణముగా గొలుసులను భూషణార్థమే గాక ఖయిదీలను బంధించుట కుపయోగించిరి (కీర్త 49[8]). యెష 45[14] యిర్మీ 40[1] నహూ 3[10] నందు ఇవి సంకెళ్లు అనఁబడెను. రోమనువారు సంకెళ్లతో ఖయిదీలను బంధించి, వారిని గొలుసులతో బంటులకు కట్టుటవాడుక యయ్యెను (కార్య 2[6,7]). పిచ్చిపట్టిన వారినిగూడ గొలుసులతో బంధించిరి (లూ 8[29]). అధికారులకు చూపవలసిన విధేయత అలంకారరీతిగా కట్లు, పాశములుగా నెంచబడెను (కీర్త 2[3]). అవిధేయులగు వారా పాశములను తెంపి పారవేయునట్లు వర్ణించిరి. పాశములు నరకబాధలకును సూచనగా నున్నవి (II పేతు 2[4] యూదా [6]).

**గొల్యాతు** (Goliath=పరదేశి). దావీదుచేఁ జంపఁబడిన గాతు పట్టణస్థుఁడగు నొక ఆజానుబాహుఁడు (I సమూ 17[1-58] 21[9,10] 22[10]). II సమూ 21[19] నందున్నవాఁడు గాతు పట్టణస్థుఁడగు మతి యొకఁడు కావచ్చును.

H.

**గొల్గొతా** యెరూషలేము B VI 5 చూ॥

**గొల్లలు** గొర్రెల కాపరి చూ॥

# గో

**గోక్షుర వృక్షము** (Bramble). ముండ్లను, ముండ్లపొదలను తెలుపు మూలభాషా పదములు బైబిలునందు దాదాపు 20 గలవు. వాటిని వివక్షించి తెలిసికొనుట కష్టతరముగా నున్నది. న్యాయా 9[14,15] నందు గోక్షురవృక్షమని తెనిఁగించిన పదమును కీర్త 58[9] నందు ముండ్లకంప యని తర్జుమాచేసిరి. అది 50[10,11] లో నున్న ఆతమ అని యొకని పేరుగా నున్న పదమే ఈ చెట్టు యొక్క పేరైయున్నది. న్యాయా 8[7] వలన ఇది యొక ముండ్ల తుప్పయని తెలియుచున్నది గనుక అదే చెట్టును సూచించునో యూహగాఁ దెలుప వీలులేదు.

**గోగు** (Gog).

1. రూబేను సంతతివారిలో నొకని పేరు (I దిన 5[4]).

2. యెహెజ్కేలు 38,39 అధ్యాయములలో నున్నట్లు పలెస్తీనుకు విరుద్ధముగా యుద్ధముచేసిన యొక యధిపతి. ఇతఁడు మాగోగు అను దేశపు వాఁడనియు, రోషు, మెషెకు తూబాలు అను ప్రదేశముల కధిపతి యనియు నున్నది (యెహె 38[2]) అవి నల్లసముద్రమునకును కస్పియను సముద్రమునకును మధ్యనుండు ప్రదేశములని యనుకొందురు. యెహెజ్కేలు అనేక అలంకారములతో బోధలు చేయుటనుబట్టి యిదియు అతఁడు వాడిన యలంకారనామమా, లేక అట్టి రాజొకఁడు నిజముగానుండెనా అని చెప్పుటకు సందేహముగా నున్నది. అయితే గోగు అను వాఁడు దేవుని ప్రజలకు విరోధముగా పోరాడుచుండిన వారికి అధిపతియై యుండెనను సంగతి విషయములో సందేహమేమియు లేదు. ఏమనిన అది యిట్లు ప్రక 20[8-15] లోకూడ నున్నది. లోకాంతమున క్రీస్తు రాజ్యమును పాడుచేయుటకు యత్నము చేయువారిలో గోగు అనువాఁడు ఒక ముఖ్యుఁడని యచట అలంకారరీతిగా నున్నది.

**గోజాను** (Gozan). మెసపొతేమియా దేశములోని కేబారు నది దగ్గరనున్న యొక యేరు

(II రాజు 17[6] 18[12] I దిన 5[26]). దీని సమీపమున నున్న పరగణాకునిదే పేరుగలదు (II రాజు 9[12] యెష 37[12]). అష్షూరువారు షోమ్రోనును జయించిన పిమ్మట ఇశ్రాయేలీయులను చెఱపట్టి వారిలోఁ గొందఱి నీ ప్రదేశమున కంపిరి.

**గోడ** కోట I 1 చూ॥

**గోడపూత** ఇల్లు I 3 చూ॥

**గోత్రకర్త** (Patriarch). ఒక జనాంగపు మూలపురుషుఁడు. హెబ్రీయులజాతి మూలపురుషులను క్రొత్త నిబంధనయందు పెట్టఁబడినపేరు. అబ్రాహాము (హెబ్రీ 7[4]), యాకోబు పన్నిద్దరు కుమారులు (కార్య 7[8,9]), రాజైన దావీదు (2[29]) అనువారలకీ బిరుదుగలదు. ఆది 5 అధ్యా. నందున్నట్లు జలప్రళయమునకుఁ బూర్వము జీవించిన భక్తి పరులగు కుటుంబ పెద్ద లందఱికీ నీపేరు చెల్లును. గోత్రకర్తల యుగమునందు తండ్రి కుటుంబమునకు పెత్తనదారుగా నుండెను. మొదట మూలపురుషునికిని వాని తరువాత వాని పెద్ద కుమారునికిని తరువాత వాని పెద్ద కుమారునికిని ఈ పెత్తనము పారంపర్యముగ కలిగెను. ఆ జాతి విస్తరిల్లిన కొలది ప్రతి కుటుంబము తన పెద్దకు లోఁబడి యుండును. ఇశ్రాయేలీయులకు రాజ్య సంబంధమగు నేర్పాటులను జేయక పూర్వము ఆయా కుటుంబములకు పెద్దలైనవారు గురువులుగా నుండిరి. వీరి ద్వారానే దేవుఁడు తన చిత్తమును వెల్లడి జేసెను.

**గోధుమలు** (Wheat). అందఱికిని మిగుల యిష్టమైన ధాన్యము. మిస్రీతు గోధుమలనఁబడునవి అన్నిఁటికన్న మిగుల శ్రేష్ఠమైనవి. వీటిని యూదులు తూరు సీదోను పట్టణముల కెగుమతిఁ జేసిరి (యెహె 27[17]). గోధుమ కోఁతకాలము సాధారణముగా మే మాసమునందు వచ్చును. గోధుమలనుకోసి, ఇండ్లకుఁ గొనిపోయి కళ్లముల యందుంచి నూర్తురు (ఆది 50[10] II సమూ 24[17-18]). తన గ్రామ కళ్లములో ధాన్యమును నూర్చుకొనుటకు భయపడి, గిద్యోను రహస్యముగా గానుగ చాటున వాటిని దుళ్లగొట్టెను (న్యాయా 16[11]). మిగుల సారవంతములగు పొలములనుండి గోధుమ యూచ బియ్యమును సమకూర్చి వాటిని వేయించి గాని వండిగాని తిందురు. (లేవీ 2[14] 23[14] I సమూ 17[17] II సమూ 17[19]). శ్రేష్ఠమైన గోధుమ పిండితో చేసిన రొట్టెలు గొప్పవారు మాత్రము భుజింతురు (I రాజు 4[22] యెహె 16[13] ప్రక 18[13]).

గోధుమలను గూర్చిన సూచనలు క్రొత్త నిబంధనయందలి ఉపమానములలోను దృష్టాంతములలోను కనఁబడుచున్నవి (మ 3[12] 13[25-30] లూ 16[7-31] యోహా 12[24] I కొరి 15[37] ప్రక 6[6]). పౌలు రోమాకు ప్రయాణముచేసిన యోడలోని ముఖ్యసరుకు ఐగుప్తునుండి తెచ్చిన గోధుమలై యుండెను (కార్య 27[38]). రోమాకు వర్తకులు తెచ్చిన సరకులలో నిదియొక ముఖ్యమైనదై యున్నట్లు ప్రక 18[13] వలనఁ దెలియుచున్నది.

J. C.

**గోనెపట్ట** (Sack cloth). సాధారణముగా దీనిని మేఁక వెంట్రుకలతో నేసిరి గాన నల్లగా నుండునది (ప్రక 6[12]). సాక్ (*Sak*) అను హెబ్రీ పదమునుండియే ప్రస్తుతము వాడుకలో నున్న యాంగ్ల పదమువచ్చినది. దుఃఖమునందున్నవారు సాధారణముగా గోనెపట్ట ధరింతురు (II సమూ 3[31] II రాజు 19[1,2]). తరుచుగా ప్రవక్తలును (యెష 20[2] ప్రక 12[3]) ఖైదీలును (I రాజు 20[31]=యెష 3[24]) ధరించుకొనెడి గోనెపట్టకు మెడయొద్దను చేతులయొద్దను ముందుభాగము నందును రంధ్రములుండెను. దానిని నడుమునకు ధరించి (ఆది 37[34] I రాజు 20[31]) కట్టుకొనిరి (II సమూ 3[31] యెహె 7[18] యోవే 1[8]). సాధారణముగా పైన వేసికొనిరి (యోనా 3[6]=II సమూ 21[10]). అప్పుడప్పుడు వట్టి దేహము మీఁదనే కట్టుకొనిరి. (I రాజు 21[27] యోబు 16[15] యెష 32[11]). ఇప్పటివలె పూర్వకాలములోను దీనితో సంచులను కుట్టి వాటిని గోనె లనిరి (ఆది 42[25] యెహో 9[4]).

**గోపరసము** గంధవర్గము 6 I చూ॥

**గోపీ చందనము** గంధవర్గము I 7 చూ॥

**గోపురము** కోట I 1, II చూ॥

**గోబు** (Gob = గోయి). దావీదు ఫిలిష్తీయులతో యుద్ధముచేసిన యొక స్థలము (II సమూ 21[18,19]). కొన్ని ప్రతులలో దీనికి నోబు అను పేరుగలదు. దీనియునికినిగూర్చి తెలియదు.

$21^{18,19}$ కు సంబంధముగానున్న I దిన $20^{4}$ లో గోబు అనుదానికి ప్రతిగా గెజెరు అని యున్నది. LXX లో గాతు అను పేరు గలదు. ఇట్లొక దానికే వెవ్వేఱు పేరు లుండుటంబట్టి పదము వ్రాయుటలో పొరబాటులు కలిగెనని కొందఱి యభిప్రాయము.

**గోమెరు, గోమెరువారు** (Gomer = సంపూర్ణత).

1. యాపెతు కుమారులలో నొకఁడు (ఆది $10^{2,3}$). ఇతని సంతతివారు గోగు సైన్యమునఁ జేరియున్నట్లు యెహె $38^{6}$ లో నున్నది. వీరికి అష్షూరీయులు గిమ్మిరవారనియు, గ్రీకువారు కిమ్మిర వారనియు పేరులు పెట్టిరి. వీరు మొదట నల్ల సముద్రమునకు ఉత్తరముగా నివసించిరి. క్రీ॥ పూ॥ ఏడవ శతాబ్దమునకు లోపుగానే వీరు చిన్నాసియాలోని కప్పదొకియను జయించి స్వాధీనముచేసికొని యుండిరి.

2. హోషేయ భార్యపేరు (హోషే $1^{3}$). పైనున్న గోమెరు అను పదమునకును దీనికిని హెబ్రీ భాషలో నొకటే పదమున్నది (హోషేయ చూ॥).

**గోమేధికము** రత్నములు 5 చూ॥

**గోయా** (Goah = అంబాయని అరచు). యెరూషలేము దగ్గఱనున్న యొక స్థలము (యిర్మీ $31^{39}$).

**గోయి** కూపము చూ॥

**గోయీయులు, గోపీయులు** (Goiim = జనములు). ఈ పేరు ఆది $14^{1}$ లోను యెహో $12^{23}$ లోను మాత్రము కలదు. ఈ రెండు చోట్లను ఈ మాట ఒక దేశముగాని ఒక పట్టణము గాని కాక జనములు అను నర్థమీయవచ్చును. ఇట్లుండినయెడల ఈ వాక్యములలో చెప్పఁబడిన రాజులు జనముల రాజులు అను బిరుదునొందిన వారని కనఁబడుచున్నది. మఱియు వారి ప్రజలు ఒకటే జనమైయుండక ఆయా జనములు కలిసి యున్నవారని తెలిసికొనవలెను. ఇవి స్థలముల పేరులై యుండినయెడల మొదటిది బాబెలు ప్రాంతములోను, రెండవది పలెస్తీనులోను నుండెనని యెఱుఁగవలెను. అయితే వీటియునికిని గూర్చి తేటగా తెలియదు.

**గోలాను** (Golan = చుట్టు ప్రదేశము). యొర్దానునదికి తూర్పుననుండిన మూఁడు ఆశ్రయపురములలో నుత్తరమున నుండిన పట్టణము (ద్వితీ $4^{43}$ యెహో $20^{8}$ $21^{27}$). ఇది మనష్షే గోత్రములో నుండెను కాని దాని సరియైనయునికి బాగుగాఁ దెలియదు. తరువాతి కాలములోనిది యొక ప్రదేశమునకుఁ బేరయ్యెను. యోసీఫసు చరిత్రకారుని కాలమునందు ఆ పేరుగల పట్టణమును ప్రదేశమునుకూడ నుండెనుగాని ఆ ప్రదేశము ఆ కాలమున గౌలనైటిస్ (*Gaulonitis*) అని పిలిచిరి (పురా 13.15.3; 17.8.1). నేటి వఱకు అరబ్బీయులా ప్రదేశమును జౌలను (*Jaulan*) అని పిలుచుచున్నారు.

**గోషెను** (Goshen).

1. యూదయలో నుండిన యొక యూరు (యెహో $15^{51}$).

2. పలెస్తీనుకు దక్షిణ భాగమందుండిన యొక ప్రదేశము (యెహో $10^{41}$ $11^{16}$). ఇది గోషెను అను నూరికి చుట్టునుండు ప్రదేశమై యుండ వచ్చును.

3. ఐగుప్తులో నిశ్రాయేలీయులు నివసించిన ప్రదేశము (ఆది $45^{10}$ $46^{28}$ $47^{27}$ $50^{8}$ నిర్గ $8^{22}$). అది మంచి మేతగల ప్రదేశమై యుండెను. దాని యునికినిగూర్చి నూటిగా తెలియదుగాని యున్న సూచనలబట్టి అది ఐగుప్తున ఈశాన్య దిక్కునయుండిన భాగమని యనుకొందురు.

# గ్ర

**గ్రంథపంచకము మోషే.** (Pentateuch = మోషే అయిదు గ్రంథములు). పాత నిబంధనలోని మొదటి అయిదు గ్రంథములగు ఆది నిర్గమ లేవీయ సంఖ్యా ద్వితీయోపదేశ కాండములకు పెట్టఁబడుపేరు. బైబిలునందీపేరు అగపడదు. ఇశ్రాయేలీయులీ పుస్తకములను ధర్మశాస్త్రము (యెహో $1^{7}$ మ $5^{17}$), మోషే ధర్మశాస్త్రము (I రాజు $2^{3}$ ఎజ్రా $7^{6}$ లూ $2^{22}$), యెహోవా ధర్మశాస్త్రము (II దిన $31^{3}$),

**ప్రభువు ధర్మశాస్త్రము** (లూ $2^{24}$), **ధర్మశాస్త్ర గ్రంథము** (యెహో $1^{8}$), **మోషే గ్రంథమందలి ధర్మశాస్త్రము** (II దిన $25^{3,4}$), **మోషే వ్రాసియిచ్చిన ధర్మశాస్త్ర గ్రంథము** (యెహో $8^{32}$), **దేవుని ధర్మశాస్త్ర గ్రంథము** ($24^{26}$), **యెహోవా ధర్మశాస్త్ర గ్రంథము** (II దిన $17^{9}$) అను పేరులచేఁ బిలుచుచుండిరి. పైనుదాహరించిన పేరులవలన నీయైదును నొకే గ్రంథముగ వారెంచినట్లు స్పష్టమగుచున్నది. హెబ్రీభాషా లిఖితప్రతులయందు నివి యొకటే భాగముగ నగపడుచున్నవి.

ఈ గ్రంథపంచకములోని ప్రథమభాగమునందలి చరిత్రాంశములు మోషే కాలపర్యంతము జరిగినవి ఐతిహ్యములవలనను లిఖితపూర్వకముగను అతనికి తెలియపర్చఁబడి యుండునని ప్రస్తుతమున నూహించుచున్నారు. తరువాత జరిగిన సంగతులు అతఁడు కండ్లార చూచినవై యుండెను. ఆ కాలమున జరిగిన ముఖ్యమైనవాటియందతఁడు కొద్దిగనో గొప్పగనో చేయికలుఁగఁజేసి కొనినవాఁడై యుండెను. గ్రంథరచన మోషేకుఁ బూర్వమునుండియే వాడుకలో నుండెను. అతఁడు విద్యనభ్యసించిన ఐగుప్తునందును, తరువాత నతఁడు సంచరించిన అరేబియాలోను, అతని పూర్వీకులు కొంతకాలము నివసించినట్టియు, ఇశ్రాయేలీయులను తాను నడిపించుకొని దీసికొనిపోవుచున్నట్టి కనాను దేశమునందును అట్టివాడుక గలదు. మోషే వీటిని వ్రాసెనని ఈ గ్రంథములలో నెచ్చటను వ్రాయఁబడకపోయినను, అందలి సంగతులతఁడే వీటిని వ్రాసెనని స్పష్టముగఁ గనపఱచుచున్నవి. అమాలేకీయులను జయించిన వృత్తాంతమును (నిర్గ $17^{14}$), ఐగుప్తునుండి యెరికో కెదురుగానున్న మోయాబు మైదానములవఱకు ఇశ్రాయేలీయులు చేసిన సంచారక్రమము అను నీ రెండు చరిత్ర సంగతులు నాతనిచేత వ్రాఁతలని దాఖలా లగుపడుచున్నవి. దేవునికార్యములనుగూర్చి హితోపదేశమును జేయుకీర్తన మోషేయే వ్రాసి ఇశ్రాయేలీయులకు కంఠతగా నేర్పినటుల ద్వితీ $31^{19,22,30}$ $32^{44}$ నందుఁ జూడవచ్చును. ధర్మశాస్త్రమునందలి చట్టములు మూఁడు ముఖ్య భాగములుగ నేర్పడుచున్నవి. వాటిలో మొదటిది నిబంధనగ్రంథమనఁబడి జనాంగపు మూలసూత్రములను గూర్చిన పదియాజ్ఞలును వాటికి సంబంధించిన ముఖ్య చట్టములను గలిగియున్నది (నిర్గ 20-23). దీనిని మోషేయే వ్రాసెనని ఈ గ్రంథము ఘోషించుచున్నది ($24^{4}$). రెండవ భాగము మందిరమునకును ఆరాధనకును సంబంధించినదై యున్నది (25-31, 35-40 లేవీయకాండము, సంఖ్యాకాండమందున్న చట్టముల భాగము). ఈ భాగమును దేవుఁడు తరుచుగా మోషేకు బయలుపఱచి వెల్లడించెను (నిర్గ $25^{1}$ మొ॥) కనాను దేశమునందుఁ బ్రవేశింపనై యున్న క్రొత్త తరమువారికి మూఁడవ భాగము ఖండితముగా పదేపదే బోధింపఁబడెనని స్పష్టముగా నున్నది. దీనియందలి ఉపన్యాసములను మోషే లేవీయులకు ప్రజలకు వినిపించి అప్పగించెను (ద్వితీ $31^{9,25-26}$). ఈ గ్రంథ పంచకమునం దచ్చటచ్చట నగపడు సంగతుల వివరములు మోషే వాటిని వ్రాసియుండునని స్పష్టపఱచుచున్నవి. ఈ ధర్మశాస్త్ర గ్రంథము మోషేచేతనే రచింపఁబడినటుల పాఁతనిబంధనలోని యితర గ్రంథములు వివరముగ నుడువుచున్నవి (యెహో $1^{7,8}$ ఎజ్రా $6^{18}$ నెహె $8^{1,18}$). మోషే ధర్మశాస్త్రమునకు సంబంధించిన సంగతులు వాటిలో ననేకము లున్నవి (యెహో $1^{7,8}$ $8^{31-35}$ న్యాయా $3^{4}$ I రాజు $2^{3}$ II రాజు $18^{6}$ $21^{7,8}$ దాని $9^{11,13}$ ఎజ్రా $3^{2}$ $6^{18}$ $7^{6}$ నెహె $8^{1,18}$ మలా $4^{4}$). ఈ గ్రంథమును మోషే వ్రాసెనని కనాను దేశమందలి ఉత్తర రాజ్య భాగమందును అంగీకరించిరి. అచ్చటనున్న పది గోత్రములకు బోధించిన హోషేయ ఆమోసు అను ప్రవక్తలు మోషే పేరు నుదాహరింపకపోయినను, ఆ గ్రంథమందలి ధర్మవిధులనెత్తి చెప్పుచు బోధించిరి. యెహోవా మందిరమందుంచఁబడిన ధర్మశాస్త్ర గ్రంథ ప్రతి తరువాత చాలకాలమువఱకు నుపయోగింపఁబడనే లేదు. మనష్షేయనువాని యేలుబడిలో నేఁబది సంవత్సరములవఱకు దాని ఉనికియే యెవరికినిఁ దెలియకుండెను గాని, యెహోవా నారాధించుట మఱల దేశమునందు స్థాపించినపిమ్మట ఆలయమును మరమ్మతుచేయు సమయమున అది దొరికెను. అది బహుశః ద్వితీయోపదేశకాండమయ్యుండును (II రాజు $22^{8}$ $23^{25}$). ధర్మశాస్త్ర గ్రంథ

కర్త మోషేయేనని దానియేలు ఎజ్రా నెహెమ్యా యను వారు నిశ్చయించిరి. గ్రంథపంచకము యొక్క గ్రంథకర్త మోషే యని క్రీస్తుకాలమందున్న యూదులు అభిప్రాయపడిరి (మా $12^{19}$ యోహా $8^{5}$). క్రీస్తును, నలుగురు సువార్తికులును గ్రంథపంచకమును గూర్చి అది మోషే యనియు, మోషే గ్రంథమనియు చెప్పుచు (మా $12^{26}$ లూ $16^{29}$ $24^{27,44}$) మోషేవలన నియ్యఁబడెననియు, అతని చేత వ్రాయఁబడెననియు (మా $10^{5}$ $12^{19}$ యోహా $1^{17}$ $5^{46,47}$ $7^{19}$) సాక్ష్యమిచ్చిరి.

మోషే తన కాలమునకు ముందు జరిగిన కార్యములనుగూర్చి పాత వ్రాతల నుపయోగించి దైవసహాయముతో ఆయన యాజ్ఞానుసారముగా వ్రాసియుండును. గ్రంథపంచకమందలి భాషా శైలియందును దేవనామ ప్రయోగమునందు గాని వచ్చు వ్యత్యాసముల కిదే కారణము. అవి కొందఱాక్షేపించునట్లు మోషే గ్రంథకర్తృత్వమునకు వ్యతిరిక్తముగ లేవు. కనాను దేశము జయింపఁబడిన పిదప వాడిన కొన్ని స్థలములపేర్లు ఆయా స్థలములకు ప్రవచనరీతిగా ముందుగనే చెప్పఁబడి యుండవచ్చును. దాను (ఆది $14^{14}$ ద్వితీ $34^{2}$=యెహో $19^{47}$) హెబ్రోను (ఆది $13^{18}$ $23^{2}$ యెహో $14^{15}$ న్యాయా $1^{10}$) అనునవి యిందునకు దృష్టాంతములు. లేదా, గ్రంథపంచకము యొక్క తర్వాతి ప్రతులను వ్రాసినవారీ పేరులను తమ కాలమునకు సరిపడునట్లు మార్చి యుండవచ్చును.

ఈ గ్రంథ పంచకమునందలి కొంతభాగమును విశ్రాంతిదినమున ప్రతి సమాజ మందిరమందు క్రమముగఁ జదివిరి (కార్య $13^{15}$ $15^{21}$). బైబిలు నందలి యితరభాగముల నంగీకరింపని సమరయులు దీనిని పరిశుద్ధగ్రంథముగా నంగీకరించిరి.

ఈ గ్రంథపంచకమునందు ముఖ్యముగా హెబ్రీయులలో దేవుని ఆధిపత్యమునుగూర్చిన సంగతి యున్నది. ఆదికాండమునందు దాని సిద్ధపాటును, నిర్గమకాండమునందు దాని పునాదియు, లేవీయకాండమున దాని నిజస్థితియుఁ సంఖ్యాకాండమునందు దానిస్థాపనము ద్వితీయోపదేశకాండమునందు దానిని మఱల స్థిరపఱచుటను జూడవచ్చును.

వీటియందు సృష్టిమొదలు మోషేమరణము వఱకు దాదాపు 2345 సం॥ల (క్రీ॥ పూ॥ 4004-1451) కాలచరిత్ర గలదు.

1. సృష్టి, జలప్రళయము, అబ్రాహామునకు ముందున్న వంశావళులు (ఆది 1-11).

2. ఏర్పరచుకొనఁబడిన యూదులచరిత్ర:— వారి పితామహులు, ఐగుప్తుదాస్యము, మోషే కాలమునం దరణ్యమునందు తిరుగులాడుట (ఆది 12-50, నిర్గ 1-19, సంఖ్యాకాండము).

3. మోషే ధర్మశాస్త్రము, ఆచారములు (నిర్గ 20-49, లేవీయకాండము, ద్వితీయోపదేశకాండము).

**H.**

**గ్రంథము** జీవగ్రంథము, పుస్తకము చూ॥

# గ్రా

**గ్రామము** (Village). ఈ భరతవర్షమునందు ప్రస్తుతమున్నట్లే పాలస్తీనులోకూడ పల్లెటూరివారు తమ పొలములలో నిండ్లనుకట్టుకొని జీవించక గ్రామములలో నివసించిరి. ఆదికాలములలో పట్టణములకేగాని, గ్రామములకు చుట్టుగోడ లుండలేదు (లేవీ $25^{31,32}$ I సమూ $6^{18}$). గాని రానురాను నానా కారణములనుబట్టి గాక జనసమ్మర్ధమును బట్టియు, వారి పరిపాలనా విధానమును బట్టియు వాటికి భేదము లేర్పడెను. పాతనిబంధన కాలమునందు ప్రాకారముల చుట్టునుండు **దాని గ్రామములు** అను పదములు **మూలభాష**యందు దాని కుమార్తెలు అనఁబడెను. (సంఖ్యా $32^{42}$ యెహో $18^{23}$ II దిన $28^{18}$). నెహె $11^{30}$ లో ఆ పదమునే **పల్లెల**ని తెనిఁగించిరి. మా $1^{38}$ నందున్న గ్రామములను పదమునకు మూల భాషలో గ్రామపట్టణమని యర్థమగును. అవి యా పట్టణములకు సంబంధించిన పేటలుగాని పాళెములుగాని యైయుండును. క్రొత్తనిబంధనలో బేత్లెహేము (యోహా $7^{42}$), బేత్ఫగే (మ $21^{1}$), బేతనియ (యోహా $11^{1}$), ఎమ్మాయు (లూ $24^{13}$) అను ఊళ్లకా పదమునే ఉపయోగించిరి. బేత్సయిదాయని మా $8^{22}$ నందున్న దానికిని మూలభాషలోనిదే మాట గలదుగాని తెలుఁగున నా పదమును ఊరు అనిరి. గలిలయలోని

గ్రామములలో నొక్కొక్కదానియందు 15,000 మందికన్న తక్కువ జనముండలేదని యోసీఫసు వ్రాసెనుగాని (యుద్ధ 3 3.2) అది అతిశయోక్తి యని అభిప్రాయపడుచున్నారు.

## గ్రీ, గ్రు, గ్రే

**గ్రీకు తర్జుమాలు** (ప్రాతనిబంధన) భాషాంతరములు 2 చూ॥

**గ్రీకు దేశస్థులు** హెల్లేనీయులు చూ॥

**గ్రీకు భాష** హెల్లేనీయ భాష చూ॥

**గ్రీసు దేశము** హెల్లాసు చూ॥

**గ్రుడ్డులోని తెలుపు** (White of an egg). రుచిలేనిదానిని సూచించుటకు యోబు $6^{6}$ నం దుదాహరించిన పదము. కొందరీ మూల పదము దీనిని గాక, రుచిలేని యొకతరహా కూరను సూచించునని తలంచుచున్నారు. దాని భావము శాస్త్రజ్ఞులైనవారికిని అగోచరముగా నున్నది.

**గ్రేకులు, గ్రీకీయులు** హెల్లేనీయులు

## ఘ

**ఘటసర్పము** పాము 3 చూ॥

**ఘనతవహించిన** (Most Excellent). థెయొఫిలాయను వానికి పెట్టబడిన బిరుదు (లూ $1^{1}$). మూలభాషయం దీ పదమునే లూకా గవర్నరులగు ఫేలిక్సు ఫేస్తు అను వారి కారోపించెనుగాని తెనుగున మహాఘనతవహించిన యని తర్జుమాచేసిరి (కార్య $23^{26}$ $24^{3}$ $26^{25}$). ఈ దేశమునందు గౌరవనీయులగు (*Honourable*) అనునట్లు ఘనులకుమాత్రము బిరుదుగా వాడుచున్నారో అదే రీతిగా దీనిని గొప్ప ఉద్యోగస్థులకు మాత్రము పెట్టియున్నారని పైవాక్యముల వలనఁ దెలియును (థెయొఫిలా చూ॥).

## చ

**చందనపుమ్రాను** (Almug). చందనపు మ్రాను అని తెనిగించిన హెబ్రీభాషాపదము ఇంగ్లీషులోనున్నట్లు అల్మగ్ అనునదై యున్నది. అది యెట్టి చెట్టో వివరించుట సాధ్యముకాదు. రాజైన సొలొమోను లెబానోను పర్వతములమీఁద ఈ చెట్లకలపను గొట్టించవలయునని హీరాము రాజునకు వర్తమానమంపినట్లు II దిన $2^{9}$ నందు కనఁబడుచున్నది. గాని ఆ వృక్షములు లెబానోను పర్వత ప్రాంతములలో మొలవనేరవు. ఆ పదము మిగుల వెలగల మఱియొక వృక్షమును సూచించును. I రాజు $10^{11,12}$ II దిన $9^{10}$ లో ఓఫీరునుండి దంతమును కోతులను దెచ్చిన యోడలు అల్మగ్ మ్రానులనుకూడఁ దెచ్చినట్లు చూడవచ్చును. ఆ పదమును చందనపు మ్రాను అని తెనిఁగించిరి. అది చందనపుచెట్టని యభిప్రాయపడువారు ఈ భరతఖండమునుండియే అది వచ్చెనని తలంచుచున్నారు. ఈ కలపతో సొలొమోను చుట్టుడు మెట్ల చక్రమును స్తంభములను సితారాలను స్వరమండలములను చేయించెను. అది చందనపు కలపయేయైనయెడల మిగుల విలువ గలదియై యుండెను. నిర్గ $30^{34}$ లో నున్న **గంధపుచెక్క** అను పదము మూలభాషయందు వేఱుపదమై తెలుఁగుననున్నట్లు చందనపుచెక్కను గాక మఱియొక సుగంధ ద్రవ్యమును సూచించును. అది పారసీ దేశమునుండి వచ్చినదై యున్నది (గంధవర్గము చూ॥). **J. C.**

**చందనపు మ్రానుల స్తంభములు** దేవాలయము I 5 చూ॥

**చంద్ర హారములు, చంద్ర వంకలు** ఆభరణములు 14,15 చూ॥

**చంద్రుడు** (The moon). రాత్రియందు వెలుగిచ్చు జ్యోతులలో ముఖ్యమైనది (ఆది $1^{16}$ కీర్త $136^{9}$). మాసములు చంద్రునివలన నేర్పడుచున్నవి. పస్కా జరుగుకాలమును నియమించుటకు చంద్రుఁడే ముఖ్యసహాయకారి. తక్కిన పండుగులన్నియు పస్కా ననుసరించివచ్చుటచే నిది మిగుల ముఖ్యమైనదిగా నెంచఁబడెను (నిర్గ $12^{2}$ కీర్త $104^{19}$ పురా 3.10.5). పూర్వకాలమున పలెస్తీనుకు సంబంధించిన యితర దేశములలో చంద్రుని పూజ జరిగెను. అబ్రాహాము జన్మస్థానమగు ఊరు అట్టి పూజకు ముఖ్యస్థానమై యుండెను. ఐగుప్తునందును చంద్రుని పూజించిరి. ఇశ్రాయేలీయులు నీ పూజకు లొంగి

పోయిరి (II రాజు 23[5] యిర్మీ 7[18] 8[2]). చంద్రుని తేట్టు జూచి ముద్దుబెట్టుటను (యోబు 31[26]) ధూపము వేయుటను (II రాజు 23[5]) దాని పూజగా గణించిరి. సూర్య చంద్ర నక్షత్రాదుల ననుసరించి శకునములు జెప్పిరి (యెష 47[13]). వెన్నెలదెబ్బవలన ఈ దేశమందువలె పలెస్తీనులోను ఒక తరహా పక్షవాతము వచ్చినట్లు కీర్త 121[6] వలనఁ దెలియుచున్నది,

యూదుల నెలలు అమావాస్యతో నారంభించి నందున వారాదినమును విశేషదినముగా నెంచిరి గాన ప్రత్యేకమగు అర్పణలర్పించి (సంఖ్యా 28[11-14]) బూరల నూదుట ద్వారా నెల యారంభించెనని చాటించి (10[10] కీర్త 81[3]), పనులను గూడ మానుకొని (ఆమో 8[5]) సంభ్రమపడిరి (I సమూ 20[5] యూదీతు 8[6]). దేవుని వాక్యమును బోధించుటకది యనుకూల సమయమాయెను (II రాజు 4[23] యెహె 46[1,3]). ఏడవమాసము పండుగునెల గాన మఱి గంభీరముగా దాని నాచరించిరి (లేవీ 23[24,25] సంఖ్యా 29[1-6]). అమావాస్యలను జాగ్రత్తగా లెక్కించి దానినందఱికిఁ దెలుపుటకు యూదులు చాల శ్రద్ధఁబుచ్చుకొన్నట్లు యూదుల పురాణములుగా నెంచఁదగిన టాల్ముదు (*Talmud*) వలనఁ దెలియుచున్నది.

**చక్రము** (Wheel). బైబిలునం దుదహరింపఁబడిన చక్రములు సాధారణముగా యుద్ధ రథపు చక్రములై యున్నవి (నిర్గ 14[25] యెష 5[28] యిర్మీ 47[3] యెహె 23[24] 26[10]). చక్రములతో నమర్చిన బండిని నూర్చుటకై వాడినందున (యెష 28[27]) చక్రమొకని మీఁదకు పోనిచ్చుట కష్టపెట్టుటకు గుఱుతయ్యెను. చక్రములు చాల బరువుగలవై గొప్పధ్వనిచేసెడివి. సొలొమోను ఆలయమున కలంకారములుగా నుండునట్లు ఇత్తడితో చక్రములను జేయించి గంగాళమునువాటిమీఁది కెత్తించెను (I రాజు 7[30-33]). యెహెజ్కేలుకు కలిగిన దర్శనములలో దేవుని సింహాసనమున కున్న చక్రములు విశేషమైనవై జీవముగలిగి కెరూబు లెట్లు అన్ని దిక్కులకు వెళ్లుచు అన్నిఁటిని చూచునో దానిని సూచించెను (యెహె 1[15-21] 3[13] 10[2-19] 11[22] దాని 7[9]). యూకో 3[6] నందున్న **జనన చక్రము** అనుపదము మూల భాషలో ఈ లోక వ్యవహారములను సూచించును. అవి ఎల్లప్పుడును తిరుగుచునే యుండునుగాన ఇచ్చట జనన చక్రమను పదము అలంకారరీతిగా నుపయోగింపఁబడినది. బౌద్ధులు పునర్జన్మములను చక్రమునకు పోల్చిరి.

**చతుర్థాధిపతి** (Tetrarch). రాజ్యమునందలి నాలుగవ భాగమున కధికారియని శబ్దార్థము. మహా అలెక్సందరు తండ్రియగు ఫిలిప్పను గ్రీకు రాజ్యపు రాజు తన దేశమందలి థెస్సలే (*Thessaly*) యను దానిని నాలుగు భాగములుజేసి, ప్రతిభాగమున కొక్కొక్క యధికారిని నియమించుటతో నీపదము వాడుకలోకి వచ్చెను. గాని తరువాతి కాలములలో దేశమున నాలుగు భాగములు లేకున్నను ఆ యధికారులకీ బిరుదును వాడుచు వచ్చిరి. రోమీయులు పలెస్తీనును మూఁడు భాగములుగా మాత్రమే చేసినను (లూ 3[1]) వారా యధికారులను చతుర్థాధిపతులనిరి. అదిమాత్రమే గాక గొర్నరుల లేక రాజులక్రింద నున్న అధికారులకును సామంతరాజులకు నీ పేరు చెల్లెను. క్రొత్తనిబంధనలో నీ పేరు మహాహేరోదు కుమారుఁడగు అంతిపకును (మ 14[1] లూ 3[1,19] 9[7] కార్య 13[1]). అతని తమ్ముఁడగు ఫిలిప్పునకును, లుసానియకును గలదు (లూ 3[1]). అంతిపకు రాజు అను బిరుదును గలదు (మ 14[9] మా 6[14]). వీరికిగాక క్రొత్త నిబంధనయందు చతుర్థాధిపతియను బిరుదు మఱెవ్వరికిని లేదు. (హేరోదు చూ॥).

**చతుష్టయము** (Quaternion). ఖైదీలను కాయుటకు నియమించిన నలుగురు రాణువవారి గుంపునకు బైబిలునందు పెట్టఁబడినపేరు. పేతురును బహు భద్రముగాఁ జూడవలెనని కోరి హేరోదు అట్టి చతుష్టయములను నాలుగు నియమించెను (కార్య 12[4]). క్రీస్తు వస్త్రములను నాలుగు భాగములను చేయుటవలన (యోహా 19[23]) సిలువయొద్దకూడ నలుగురు రాణువవారు కావలియున్నట్లు తెలియుచున్నది. కావలి గాయుటకు నలుగురిని నియమించు వాడుక యున్నట్లు పై సూచనలవలన పొడగట్టుచున్నది. రాత్రిని నాలుగు జాములుగా భాగించుటచే జామున కొక్కరిచొప్పున వీరు మేలుకొని యుందురని ఊహింపవచ్చును.

**చరములు** కీటకములు చూ॥.

**చర్మకారుడు** వృత్తులు చేతిపనులు IV చూ॥.

**చర్మపుకాగితము** (Parchment). చాల కాలము చెడకుండవలెనని కోరిన గ్రంథములను వాడిపోయెడి ఆకులమీఁద వ్రాయక మేఁకల చర్మములను చక్కగా ఊని సిద్ధపఱచి వాటిమీఁద వ్రాసిరి. బైబిలు పురాతన ప్రతులన్నియు ఇట్టి తోళ్లమీఁదనే వ్రాయఁబడి యున్నవి. అట్టి తోళ్లను చుట్టలుగా చుట్టి యుంచిరి. పౌలు పండితుఁడు గావున తాను ప్రయాణమై పోవు నప్పుడట్టి చుట్టలను వెంటఁదీసికొనిపోయినట్లు II తిమో $4^{13}$ వలనఁ దెలియుచున్నది. ఈ యొక వాక్యములో తప్ప ఇట్టి చర్మపు కాగితము ననుగూర్చిన సూచనలు బైబిలునందెచ్చటను లేవు (పుస్తకములు చూ॥).

## చా

**చాంద్రరోగి** రోగములు చికిత్సలు II 6 (1) చూ॥.

**చాకు** (Penknife). యిర్మీ $36^{23}$ నందు మాత్ర మీపదము గలదు. యిర్మీయా వ్రాసిన గ్రంథమును ముక్కలుగా కోయుటకు రాజైన యెహోయాకీము దానిని వాడెను. వ్రాఁత గాండ్రు తమ కలములను చెక్కుటకు దీని నుప యోగించెడివారు.

**చాగలు** రంగులు 3 చూ॥.

## చి

**చింత, చింతించుట, విచారములు** (Care). చింతింపకూడదను బోధ క్రీస్తు తన శిష్యులకుఁ జేసిన బోధలలో నొక ముఖ్యమైనదిగా నెంచఁదగును (మ $6^{25-31}$ లూ $12^{25}$). అన్న వస్త్రముల విషయము మాత్రమే గాక, హింసింపఁ బడునప్పుడును తాము చెప్పవలసినదాని గూర్చియు చింత నొంద నవసరములేదని ఆయన వారి నాద రించెను (మ $10^{19}$ = లూ $12^{11}$). కష్టకాలమప్పుడు ఒకరివిషయ మొకరు చింతపడి విశ్వాసమందు వెనుకపడెదరేమోనని అట్టివారు వివాహమాడ కుండుట యుక్తమని పౌలు సలహా నిచ్చెను (I కొరి $7^{32-34}$). దేని విషయమును చింతింపరాదని పౌలును (ఫిలి $4^{6}$), చింతలన్నిటిని దేవునిమీఁద వేయవలెనని పేతురును కీర్త $55^{22}$ యెత్తి (I పేతు $5^{7}$) అట్లే యాదరించుచున్నారు. ఈ పదమునే మార్త విషయములోను (లూ $10^{41}$), విత్తువాని ఉప మానములోను ($8^{14}$ = మ $13^{22}$ = మా $4^{19}$), లూ $21^{34}$ లోను **విచారములు** అని తెనిఁగించిరి. మా $4^{38}$ లూ $10^{40}$ లో చింతయని తెనిఁగించిన పదము మూల భాషలో మఱియొక పదమై యున్నది.

**చిక్కము** (Muzzle).

1. తీగెలతో అల్లి పశువులమూతికి గట్టెడి చిన్నబుట్ట. కళ్లమునూర్చెడి పశువుల మూతికి చిక్కము వేయరాదను ధర్మశాస్త్రచట్టము (ద్వితీ $25^{4}$) వాటియెడల మానవుల కుండవలసిన భూత దయను సూచించుచున్నది. పనివాఁడు తన జీత మునకు పాత్రుఁడు కావున, సంఘకులు తమ కొఱకై పాటుపడుచున్న బోధకులను పోషించ వలెనను సంగతిని దృష్టాంత పరచుటకు పౌలీ దృష్టాంతము నెత్తెను (I కొరి $9^{9}$ I తిమో $5^{18}$).

2. గొల్లలు మొదలగువారు తమ యన్నమును గాని యితర వస్తువులనుగాని పెట్టి తీసికొని వెళ్లు టకై త్రాళ్లతో నల్లినసంచి (I సమూ $17^{40}$). ఈ మూలభాషాపదము పైనున్నదానికి వేఱు పదమై ఆయావస్తువులను పెట్టుకొనెడి దానిని సూచించును.

**చిక్కుడుగాయ** (Lentil). పలెస్తీను సిరియా ఐగుప్తు దేశపు భాగముల యందు పైరగు



అలచందలు

కాయ ధాన్యము (II సమూ $17^{28}$). ఆ దేశముల యందు వీటిని ఉల్లిపాయలు బియ్యము నూనె

స్త్రీ పురుషులకు అపాయము గలుగఁజేయునై వారు తమకు సహాయభూతులుగా దయ్యములు మొదలగు అమానుష శక్తులను ప్రయోగించెడివారని ప్రజలు తలంచెడివారు. తమ విరోధులకు పరాభవము గలిగించుటకై జనులు సాధారణముగా వీరి సహాయమునపేక్షించిరి. వారి కోరికెలు నెఱవేఱునట్లు మాంత్రికుఁడుగాని మంత్రగత్తెగాని ఆయా మందులను తాయెత్తులను యితర వస్తువులను మంత్రించి యిచ్చినయెడల అవి తప్పక తమ యిష్టమును నెఱవేర్చునని ప్రజల యభిప్రాయము. రోగములు దయ్యములవలన వచ్చునని ఆ కాలపువారు తలంచినందున రోగములను బాగుచేయుట కా మంత్రగత్తెలకు శక్తి గలదని తలంచిరి. [illegible] కలుగుటవలన కలుగు [illegible] సహాయము మంత్రగత్తెలకునియని [illegible] తలంచెడివారు. వారికట్టి శక్తియుండెనని తలంచుటవలననే క్రీస్తు శకారంభమైన నాటనుండి మంత్రకత్తెలన్న మిగుల ద్వేషించిరి. విమత శిక్షసభ (*Inquisition*) కాలమున నట్టి వారిని వెంటనే శిక్షించిరి. పిల్గ్రిమ్ ఫాదర్సు (*Pilgrim Fathers*) అనువారు వలసపోయిన అమెరికాదేశమున ఆరంభ దినములలో మంత్రగత్తెల నెక్కువగా నమ్మెడివారు. సోదెకత్తె యని ప్రజలు తలఁచిన స్త్రీ బ్రతుకు మహా కష్టమైనదై యుండెను

క్రీస్తుకుముందు శతాబ్దములలోనున్న ప్రజలయందీ నమ్మకము బలముగా నుండెను. ఆ శక్తిని వారియొద్దనుండి తీసివేయుటకై లక్కతో నట్టి స్త్రీ రూపమును చేసి నిప్పు ముందు దానిని పెట్టి కరఁగించువారు. దానియొక్క శక్తియు అట్లే కఱగి పోవునని తలంచిరి. B.

## చీ

**చీకటి** (Darkness). దాచఁబడిన రహస్యములను (I కొరి $4^{5}$), కష్టములను (యెష $42^{7}$), అజ్ఞానమును (కీర్త $82^{5}$ I థెస్స $5^{5}$), ముఖ్యముగా పాపమును (యెష $5^{20}$ మ $4^{16}$ యోహా $3^{19}$ $8^{12}$ $12^{46}$ I యోహా $2^{11}$) సూచించుటకు అలంకారముగా వాడఁబడిన పదము. గొప్ప చీకటి ఐగుప్తు తెగుళ్లలో నొకటియై యున్నది (నిర్గ $10^{21-23}$). క్రీస్తును సిలువను వేసినప్పుడు దేశమంతయు చీకటి కమ్మెను (మ $27^{45}$). అంత్యదినము చీకటిమయమై యుండునని యున్నది ($24^{29}$ కార్య $2^{20}$). ఇట్టి చీకటి ఆదియందు సృష్టిక్రమ మారంభింపక పూర్వ మున్నదాని నంటినది (ఆది $1^{2}$).

**చీపుబాతు** పక్షులు 18 చూ॥

**చీట్లువేయుట** (Casting lots). మూలభాషయందీపదము రాళ్లువేయుట యని యర్థమిచ్చునని కొందఱి యభిప్రాయము. ఈ రాళ్లు వివిధరంగులు గలవి గావచ్చును (ఊరీము తుమ్మీము చూ॥). వాటిని ఒడిలో వేయుట వాడుకైనట్లు సామె $16^{33}$ వలనఁ దెలియుచున్నది. ఇట్లు చీట్లు వేయుటవలన ఆయాగోత్రములవారికి కనానుదేశమును విభాగించిరి (సంఖ్యా $26^{55}$ యెహో $14^{2}$ మొ॥). యాజకుల వంతులను నియమించుటకు వాటి నుపయోగించిరి (I దిన $6^{65}$ $24^{5}$ $26^{13}$) పాపపరిహార దినమున అజాజేలుకు విడువవలసిన మేఁకను ఇట్లే ప్రత్యేకించిరి (లేవీ $16^{8}$). ఆకాను పాపమును (యెహో $7^{18}$), యోనా పాపమును (యోనా $1^{7}$) ఇట్లే బయలుపడెను. సౌలును రాజుగా నియమించుటయు నిట్లే జరిగెను (I సమూ $10^{21}$). క్రొత్త నిబంధనలో క్రీస్తు అంగీ ఎవరికి పోవలెనో తెలిసికొనుటకును (మా $15^{24}$), యూదాకు బదులుగా అపొస్తలుని నియమించుటకును (కార్య $1^{26}$) మాత్రము చీట్లు వేసిన సూచనలు గలవు. సమానమైన రెంటిలో నొకదాని నేర్పరచుకొనుటలో ప్రస్తుతము చీట్లు వేతురుగాని దేవుఁడు మన కనుగ్రహించిన బుద్ధిని అట్టి సమయములలో నుపయోగించుట మఱి యుక్తముగ నుండును.

**చీడపురుగులు** మిడుతలు చూ॥

**చీపురుకట్ట** (Besom). యెష $14^{23}$ నందు ఇది సంపూర్ణ నాశమునకు గుఱుతుగా వాడిన పదము. తెలుఁగునకూడ ఊడ్చివేయుట నాశనమునకు సూచనగా నుపయోగింతురు.

**చీమ** కీటకములు 11 చూ॥

**చీరుకొనుట** దేహమును చీరుకొనుట చూ॥

**చీర్ణము** వృక్షులు చేతిపనులు I 2 (2) చూ॥

# చు, చె

**చుంచులు** మృగములు 32 చూ॥

**చుక్కాని** ఓడ 5 (2) (*b*) చూ॥

**చువ్వపిట్ట** పక్షులు 19 చూ॥

**చెంగు** వస్త్రములు 2 చూ॥

**చెంప, చెక్కిలి (Cheek).** చెక్కిళ్లు చక్కదనమునకు ఉనికియై యున్నట్లు పరమ గీతములో అలంకారరీతిగా నున్నది (పర 1[10] 5[13]). చెంపమీఁదఁ గొట్టుట సాధారణముగా అవమానమునకు సూచనయై యున్నట్లు బైబిలులో చూడఁగలము (I రాజు 22[24]=II దిన 18[23] యోబు 16[10] విలా 3[30] మీకా 5[1]). చెంపమీఁదనుండు వెండ్రుకలను పెరికివేయుటయు అట్టి యవమాన మునకే చిహ్నమై యున్నది (యెష 50[6]). ఇట్లు అవమానము చేయు వానినెదిరింపక కుడిచెంప మీఁద కొట్టువానికి ఎడమచెంపకూడ త్రిప్పచు అవమానము సహించుఁడని క్రీస్తు తన శిష్యులకు బోధించెను (మ 5[39] = లూ 6[29]).

**చెకుముకిరాయి (Flint).** పలెస్తీనులో సర్వసాధారణముగా నగపడు గట్టిరాయి. ఇట్టి రాతి బండలనుండి ప్రవహించిన నీటినే ఇశ్రాయేలీయులు అరణ్య సంచారమునందుఁ ద్రాగిరి (కీర్త 114[8]). దీనికి సంబంధముగానున్న ద్వితీ 8[15] నందు ఈ మూలపదము చెకుముకిరాతిబండ యని యుండవలెను. ఇట్టి బండలున్న నేలలో ఒలీవచెట్లు అతివిస్తారముగా పెరిగినట్లు 32[13] నందున్నది. ఈ రాయి స్థిరత్వమునకు గుఱుతుగా నున్నది (యెష 50[7]).

**చెక్కిలి** చెంప చూ॥

**చెక్కడివానిపని, చిత్రపుపని (Art).** హెబ్రీయులు అలంకారార్థములగు చెక్కడు పనులను ఎక్కువగా నభ్యసించి యుండలేదు. విగ్రహములను చేసికొనకూడదని నిర్గ 20[4] లో నున్న ఆజ్ఞను వారు ఏవిధమైన ప్రతిమలను చేయకూడదను ఆజ్ఞనుగా నెంచిరి కావున రాళ్లలో చెక్కఁబడిన బొమ్మలు అన్యుల దేశములలో నేటి వఱకు నుండినను పలెస్తీను దేశములో కనుగొనఁ బడినవిలేవు. ఇశ్రాయేలీయులు ఏఫోదును చేసి కొని దానిని తమ యర్చకపు పనులలో వాడు కొనినట్లు (న్యాయా 8[26] 17[5]) న్నదిగాని దాని రూపమెట్టిదో తెలియదు. వారు గృహదేవత లనుకూడ పెట్టుకొనియున్నట్లు (ఆది 31[19] I సమూ 19[13]) తెలియును. వాటి యాకార మెట్టిదో సరిగాఁ దెలియదు. సొలొమోను కట్టించిన యాలయములో అలంకారము నిమిత్తము కర్రతో గుబ్బలను పువ్వులను రెండు కెరూబులను ఒలీవచెట్లను (I రాజు 6[23]) చెక్కించి నట్లున్నది గాని ఆ చెక్కడపు పని హెబ్రీయులదికాక సీదోనీయులదై యుండెను.

రంగుబొమ్మలను వేసినట్లు పాతనిబంధనలో సూచనలేవియులేవు. యెహెజ్కేలు తన దర్శన మందు చూచినవి గోడమీఁద చెక్కఁబడి సింధూర ముతో పూయఁబడినవై (యెహె 23[15] 8[10]) యుండెను. వాటి వివరమును చూడఁగా అవి యీ దేశములో ఆంజనేయుల విగ్రహము చెక్కినపిమ్మట దానికి సింధూరము పూసినట్లుగా నుండెనని యనుకొనవచ్చును. రత్నములను చెక్కడిపనియు (నిర్గ 28[11]), కంసాలిపనులను (28[12-15]) హెబ్రీయులు బహు నేర్పరితనముగా చేసినట్లున్నది. అదియుఁగాక వారు చిత్ర వస్త్రములనుకూడ నేసినట్లు 26[1] వలనఁ దెలియును. (ఆభరణములు, ముద్ర, దేవాలయము చూ॥)

**చెడుతనము** దుష్టత్వము చూ॥

**చెడుది, చెడువాడు** సాతాను 1 (4) చూ॥

**చెదిరిపోయినవారు, చెదిరియున్నవారు, చెదిరినవారు (Dispersion, Diaspora).** పలెస్తీనులోఁగాక అన్యదేశముల యందా యా పట్టణములలో నివసించియున్న యూదులు చెదిరి పోయినవారు లేక చెదిరియున్నవారు లేక చెదిరిన వారు అని పిలువఁబడుదురు. అసలులో నిది యొకటే పదమైయున్నది. ఈ నామము II మక్క 1[27] లోను యోహా 7[35] లోను యాకో 1[1] లో నున్నట్లు యూదులనుగూర్చి వాడఁబడి యున్నది. I పేతు 1[1] లో నున్నట్లు అది చెదరి పోయిన క్రైస్తవులను నిజమైన యిశ్రాయేలీయుల కును పెట్టఁబడిన బిరుదైయున్నది.

యూదులు లివ్విధముగా చెదరిపోవుటకు కారణములేవనగా: వారు చెఱపట్టఁబడినపుడు అనేకులు అష్షూరు బాబెలు ప్రాంతములకు చెదరిపోయిరి (II రాజు $15^{29}$ $17^{6}$ $24^{12-16}$ $25^{11}$ యిర్మీ $52^{15}$). వారి ప్రాంతములనుండి చుట్టుపట్లనుండు దేశములకుపోయి నివాసముచేసిరి. బాబెలులోని యూదులు చాల వృద్ధిలోనికి వచ్చినవారై అచట తమ శాస్త్రములను బోధించుట కెక్కువ శ్రద్ధపుచ్చుకొనిరి కావుననే వారి స్మృతులలో బాబెలు దేశీయుల స్మృతియున్నది. ఫరోనెకోయను రాజుకూడ ఇశ్రాయేలీయులలో కొందఱిని చెఱఁబట్టి ఐగుప్తునకు తీసికొని వెళ్లినట్లున్నది (II దిన $36^{4}$). మఱియు యిర్మీయా యను ప్రవక్తకాలములో ఆశ్రయముకొఱకు ఐగుప్తునకు వెళ్లిరి (యిర్మీ $44^{1}$). మహా అలెక్సాండరు కాలములో ఆతనితోకూడ ననేకమంది యూదులు ఐగుప్తునకు వెళ్లియున్నట్లు యోసీఫస్ వలనఁ దెలియును (యుద్ధ 18.8). తదనంతరమున ఐగుప్తునేలిన తొలెమీయుల (*Ptolemys*) కాలమందు యూదులలో ననేకులు అచటికి వెళ్లియుండిరి (పురా 12.1.1). అచటనే పాత నిబంధన గ్రీకుభాషలోనికి తర్జుమాచేయఁబడెను (సెప్తుయజింటు చూ॥).

పలెస్తీనుదేశము అంతియొకయలోని రాజుల ప్రభుత్వము క్రిందనుండగాఁ యూదులనేకులు చిన్నాసియాలోనికి పోయిరి (పురా 12.3.1). క్రొత్తనిబంధన కాలమందు వారు ఈ దేశములన్నిటిలోనికి చెదరిపోవుటయేకాక వర్తకము మీఁదను ఇంక నితరమైన పనులమీఁదను అరేబియా రోమా మొదలగు ప్రాంతములకుకూడ వెళ్లిపోయిరి.

ఇట్లు యూదులు నానాదేశములకు చెదరిపోయియున్నను తమ మతాచారముల ననుసరించుచునే యుండిరి. వీరిలో ననేకులు పండుగల నాచరించుటకై యెరూషలేమునకు వెళ్లుచుండిరి (కార్య $2^{10,11}$). మఱియు వారు తాము నివసించిన ప్రతి పట్టణములోను సమాజమందిరములను కట్టించి బైబిలుబోధను వ్యాపింపఁజేసిరి ($13^{14}$ $17^{2}$ $18^{7}$ మొ). నేటివఱకు యూదులు అన్ని దేశములలో చెదరియున్నారు. క్రైస్తవులు క్రొత్త ప్రదేశములకు పోవునపుడు వారివిషయములోను ఈ చెదరిపోయిన లేక చెదరియున్న అను బిరుదు నేటివఱకు వాడుకలో నున్నది.

చెప్పు వస్త్రములు 6 చూ॥

**చెర, చెరబట్టుట (Captivity).** పాత నిబంధన చరిత్రలో ఇశ్రాయేలువారిని యూదా వారిని అష్షూరు బబులోను వారు దూరదేశమునకు కొనిపోవుటనే చెఱయనియు బబులోను చెఱయనియుఁ బిలిచిరి (ఎజ్రా $1^{11}$ $2^{1}$ $4^{1}$ మొ॥). యుద్ధమున నోడిపోయి పట్టుపడినవారిని శిక్షించి వారివలన కప్పములను గొనుట సర్వసాధారణమైన సంగతి గాని, అప్పుడప్పుడు విశేష కారణములచే జయశీలురట్టి శిక్షలతోఁ దృప్తినొందక, ఓడిపోయిన వారిని మఱియొక దేశమునకుఁ దీసికొని వెళ్లి అచ్చట వారినుంచుటయు కద్దు. అట్టివి బైబిలునందు రెండుదాహరింపఁబడెను.

1. అష్షూరుచెఱ. అష్షూరు చక్రవర్తియగు తిగ్లత్పిలేసరు (745-727) ఇశ్రాయేలీయులలోని 10 గోత్రములవారిని జయించి వారిని దేశాంతరవాసులుగఁ జేయుటతో నిది యారంభమాయెను (II రాజు $15^{29}$ I దిన $5^{26}$). షోమ్రోనును ముట్టడించిన షల్మనేసరుకుఁ దరువాతి రాజయిన సర్గోను ఆ పట్టణమునుఁ బట్టుకొని దాని నివాసులను మెసపొతేమియ మాదయియను దేశములకుఁ గొంచుపోయి (II రాజు $17^{5,6}$) అన్యులైన వారిని వేఱు స్థలమునుండి గొని తెచ్చి ఈ పట్టణములలో నుంచెను ($17^{24-28}$). చెఱకుఁబోయిన 10 గోత్రముల వారిలోఁ గొందఱు మఱల తమ దేశమునకు వచ్చినను (లూ $2^{36}$) వారు తమ రాజ్యమును ఎన్నడైనను తిరిగి స్థాపించుకొనఁ జాలకపోయిరి. ఆయా దేశములలోనికి చెదరిపోయిన వారేమయిరో తెలియదు. ఇశ్రాయేలీయులలో పోయిన గోత్రములు (*The lost tribes of Israel*) అని వారినందురు.

2. బబులోనుచెఱ. అష్షూరు రాజగు సన్హెరీబు యూదా వారిలో 2 లక్షల మందిని చెఱపట్టితినని రాతి శాసనములలో వ్రాయించుకొనెను (II రాజు $18^{13}$ సరిపోల్చుము). ఈ సంఖ్య చాల యెక్కువగ కనఁబడుచున్నను. అతఁడు వారిలోఁ గొందఱినైనను చెఱఁగొనిపోయిన సంగతి మాత్రము సత్యమని స్పష్టమగుచున్నది. యూదా వారిని చెఱగొనిపోయి రనినయెడల బబులోను

వారే వారినట్లు చెఱపట్టిరని సాధారణముగా ననుకొనుట వాడుకయైనది. ఈ బబులోను చెఱనుగూర్చి ముందుగనే ప్రవచించిరి (యెష $6^{11,12}$ $11^{12}$ $39^{6}$ మీకా $4^{10}$). వారా దేశములో 70 సం॥లు గడిపెదరని యిర్మీయా చెప్పెను (యిర్మీ $25^{1,11,12}$). యూదా రాజగు యెహోయాకీము యేలుబడిలో మూఁడు లేక నాలుగవ సంవత్సరమున నెబుకద్నెజరు యెరూషలేమును పట్టుకొని దానిని దోచుకొని రాజవంశపు వారిలోఁ గొందఱిని చెఱకొని పోయెను (II రాజు $24^{2-7}$ దాని $1^{1-3}$). 7 సంవత్సరములైన పిదప యెహోయాకీనును అతని బంధువులలో 3 వేల మందిని, యోధులలో 7 వేలమందిని, కంసాలులలో వెయ్యిమందిని పట్టుకొని పోయెను (II రాజు $24^{10-16}$). తదనంతరము 11 సంవత్సరములకు అతఁడు మఱలవచ్చి యెరూషలేమును నాశనము జేసి నిరాధారులను తప్ప తక్కినవారినందఱిని చెఱపట్టుకొని పోయెను ($25^{8-21}$). మఱియైదు సంవత్సరములకు ఇంకఁ గొందఱిని పట్టుకొని పోయినట్లు యిర్మీ $52^{30}$ వలనఁ దెలియుచున్నది. ఇదే బాబెలుచెఱ యూదులు బానిసలవంటి వారైరి. వారు చెఱసాలలో నుంచఁబడలేదు. వారాదేశమునందుండి కూలిజేసికొని కొందఱును, ఆయా వ్యాపారాదులలోఁ బ్రవేశించి కొందఱును జీవించుచుండిరి ($29^{5-9}$ ఎజ్రా $2^{65}$). క్రమక్రముముగా కొందఱు దేశమందలి గొప్ప యుద్యోగములను సహ సంపాదించఁగలిగిరి (దాని $2^{48}$ నెహె $1^{11}$). యాజకులును శాస్త్రులును వారికా కాలములో బోధించిరి (యిర్మీ $29^{1}$ యెహె $1^{1}$ ఎజ్రా $1^{5}$). కీర్తనల గ్రంథమునందలి కొన్ని కీర్తనలీ కాలమునందే రచించఁబడెను (కీర్త 187). భక్తులు వీరి విడుదలకొఱకు ప్రార్థించిరి (దాని $9^{2}$). యెషయా ప్రవచించినట్లు ($44^{28}$ $45^{1}$) ఆ విడుదల మాదీయుఁడగు కోరెషు చక్రవర్తివలనఁ గలిగెను (ఎజ్రా $1^{1-4}$). అప్పుడు దాదాపు 43 వేలమందివచ్చిరి గాని అనేకులు మెసపొతేమియ మాదయియను దేశములలోనే నిలిచిపోయి చెదిరిపోయిన యూదులనఁబడిరి (జెక $6^{10}$ కార్య $2^{9}$ అష్షూరు, బబులోను, చెదరిపోయినవారు చూ॥).

**చెరలోనున్న ఆత్మలు (Spirits in Prison).** ఈ మాట I పేతు $3^{19,20}$ లో తప్ప బైబిలులో మఱి యెచటనైనను లేదు. II పేతు $2^{4}$ యూదా 6 లో నున్నట్లు పాపముచేసిన దేవదూతలు చెఱలోనున్న యీ యాత్మలేయని కొందఱనుకొని ఆ వాక్యములోని విషయములు దీనికి (I పేతు $3^{19,20}$) సంబంధమైనవిగా నెంచెదరు గాని I పేతు $3^{18-20}$ లోని వాక్యములను చూడఁగా నాయాత్మలు, దూతలు కాక నోవహు దినములలో నుండిన అవిధేయులైన వారు అని స్పష్టమగును. పూర్వము క్రీస్తు నోవహుకాలములోనున్న వారికే (నోవహుద్వారా) సువార్త ప్రకటించెనని పేతురు అలంకారరీతిగా ఈ వాక్యమును వ్రాసెనని కొందరనుకొనిరి. అయితే అపొస్తలుల విశ్వాస ప్రమాణములో నున్నట్లు క్రీస్తు అదృశ్యలోకమునకు లేక పాతాళమునకు దిగిపోయినపుడు ఈ పనిచేసియుండెనని సాధారణముగా ననుకొందురు. ఏమనిన, క్రీస్తు అదృశ్యలోకమునకు దిగుట యనునది మృతులుండు స్థానమునకు దిగుటయే కాని వేఱొకటి కాదని యనుకొందురు. లూ $16^{23}$ లోని పాతాళము అనుమాట వ్యర్థులుండు స్థానమునే సూచించునని ఈ యభిప్రాయము గలవారు వాదింతురు. మఱియు సిలువమీఁది దొంగతో క్రీస్తు "నేడు నీవు నాతోకూడ పరదైసులో నుందువు" అని చెప్పినవాక్యము ($23^{43}$) ఈ సంగతికి చక్కఁగా సరిపడునందురు. కావున చెఱలోనున్న యీ యాత్మలు పాపములవలన శిక్ష నొందుచుండఁగా క్రీస్తు వారియొద్దకు వెళ్లి వారికి ఇదే సువార్త ప్రకటించినట్లుగా నున్నది అది దీని భావమైనయెడల ఈ బోధకు ఈ ఆధారముకాక వేఱు ఆధారములులేవు.

**చెరసాల** నేరములు శిక్షలు III 3 చూ॥

**చెరసాల అంగణము** యెరూషలేము B III 3 చూ॥

**చెరువు** మడుగు చూ॥

**చెరుపు కొట్టి** పక్షులు 20 చూ॥

**చెవి (Ear).** బైబిలునందు వినుట విధేయతను గనుపఱచుబుద్ధి యని యెంచి దానికి సంబంధముగా చెవులు అనుపదమును వాడిరి గాన చెవి విధేయతకు గుఱుతుగా నలంకారార్థమున ప్రయోగింపఁబడును (యెష $6^{10}$ మ $11^{15}$ $13^{9}$ ప్రక $2^{7}$).

వినుటకు తమ మనస్సును సిద్ధపఱచుకొనరని యిర్మీ $6^{10}$ లో నున్న దానికి మూలభాషలో నున్నది లేని చెవులు అనగా దేవునికి లోబడని చెవులని యర్థమిచ్చును. విధేయతగలబుద్ధి పుట్టించుట యనుదాని కలంకారరీతిగా కీర్త $40^{6}$ నందు చెవులను సృజించుటయని యున్నది. ఇట్లు చెవులు విధేయతకు సూచనగా నుండుటనుబట్టి దాసుల చెవులను పొడుచుట వాడుకలోకి వచ్చెనని కనఁబడుచున్నది (నిర్గ $21^{6}$ ద్వితీ $15^{16,17}$). యాజకుల కుడిచెవికి రక్తము పూయుట వారు దేవుని మాట విని ఆయనకు లోబడవలసియున్నదను సంగతిని సూచించెను (నిర్గ $29^{20}$ లేవి $8^{23}$). దేవుఁడు మన మనవులను వినునను సంగతి ఆయన చెవి యొగ్గునను అలంకారము తెలుపుచున్నది (కీర్త $17^{6}$ $31^{2}$ మొ॥).

**చెవుడు** రోగములు చికిత్సలు II 2 చూ॥

## చే

**చేట (Fan).** చేటతో చెరుగుటచేత పనికి మాలిన దానిని ధాన్యమునుండి తీసివేయుదురు గాన అది న్యాయపు తీర్పున కొక సూచనగా నున్నది (యిర్మీ $15^{7}$ మ $3^{12}$ మొ॥ దేవాలయము I 7 (1) (*a*), వ్యవసాయము 7 చూ॥).

**చేతికఱ్ఱ** ఆయుధములు 1 చూ॥

**చేతిగుడ్డ** రుమాలు చూ॥

**చేదు (Bitter).** 1. చేదుకూరలను ఇశ్రాయేలీయులు పస్కాకాలమునందు తినవలసిన నియమముగలదు (నిర్గ $12^{8}$ సంఖ్యా $9^{11}$). ఇవి ఐగుప్తునందు వారనుభవించిన వాటికి సూచనలై యుండెను.

2. స్త్రీ తన నిర్దోషత్వమును స్థిరపఱచుటకు **చేదునీళ్లు** త్రాగిన పానముగా నియమించిరి (సంఖ్యా $5^{18-27}$). దీనినిగూర్చిన సూచన ఈ యొక్క చోటనేగాక మఱెచ్చటను లేదు.

3. చేదు కష్టమునకు సూచనగా నున్నది (సామె $5^{4}$). ఒకనికి చేదైన దానిని తినిపించుట వాని కష్టపెట్టుటయై యున్నది (విలా $3^{15}$). క్రీస్తుకు కలిగెడి బాధలు ప్రవచనరీతిగా ఇట్లు తెలుపఁబడెను (కీర్త $69^{21}$). అక్షరరీతిగా నిదెట్లు నెఱవేరెనో మ $27^{34}$ నందున్నది. ఇశ్రాయేలీయుల చేయరానిపనులు చేదు పండ్లతో సరి పోల్పఁబడెను (ద్వితీ $32^{32}$).

ఈ యలంకారము ననుసరించియే అన్యదేవతలతట్టు తిరుగుట చేదగుదానిని ఫలింపఁజేయు వేరై యున్నట్లు $29^{18}$ నందున్నను, దానిని **మష్యత్రుయమునకు మూలమైనది** అని తర్జుమా జేసిరి. (పైత్యము చూ॥).

**చేనికాపరులు** వ్యవసాయము 5 (5) చూ॥

**చేపలు, చేపలు పట్టుట (Fish, Fishing).** చేపలను ఆహారముగా వాడుకొనుటను గూర్చిన సూచనలు బైబిలునందు ఆరంభమునుండి గలవు (ఆది $9^{1-3}$). ఐగుప్తునందుండఁగా నవి ఇశ్రాయేలీయుల కిష్టమైన యాహారముగా నున్నట్లు సంఖ్యా $11^{5}$ వలనఁ దెలియుచున్నది. ఆ దేశమునందు చేఁపలను పట్టువృత్తి వారి జీవనమున కెంతో ముఖ్యమైనదై యున్నది (యెష $19^{8}$). ఐగుప్తీయులు చేఁపలను పూజించినట్లు వారి గ్రంథములవలనఁ దెలిసికొనవచ్చును. మధ్యధరా సముద్రతీరవాసులగు తూరుసీదోనీయులును ఫిలిష్తీయులును చేఁపలను పట్టి పలెస్తీనులో నమ్మిరి (నెహె $13^{16}$). పొలుసులులేని చేఁపలు ఇశ్రాయేలీయులు తినరాదని నిషేధింపఁబడెను (లేవి $11^{9-12}$ ద్వితీ $14^{9}$). ఇట్లు నిషిద్ధములైనవి మ $13^{47,48}$ లో నున్న చెడ్డవి యని యెంచుచున్నారు. ఇశ్రాయేలీయులు ముఖ్యముగా గలిలయ సముద్రములోను యొర్దాను నదిలోను చేఁపలను బట్టుకొనిరి. ఆ సముద్రమునందు 43 రకముల చేఁపలున్నట్లును, వాటిలో కొన్ని రకములు బహు విస్తారముగా నున్నట్లును చెప్పెదరు (గలిలయసముద్రము చూ॥).

చేఁపలను బట్టుటకు **వలలను** (యెహె $26^{5}$ హబ $1^{15}$ మ $13^{47}$ మొ॥), **గాలములను** (యోబు $41^{1}$ హబ $1^{15}$ ఆమో $4^{2}$ మొ॥) **ఇనుపశూలము**లను (యోబు $41^{7}$) వాడిరి. క్రీస్తు మొదటి శిష్యులు జాలరులే. బోధకులనిని చేఁపలను పట్టు పనికిఁ బోల్చెను (లూ $5^{1-11}$). పరలోకరాజ్య మందలి తీర్పును వారి పనితో దృష్టాంతపఱచెను (మ $13^{47-50}$).

**చేయి, బాహువు, హస్తము (Hand).**

1. బైబిలులో చేయి అను పదము ఆయా సంగతులను సూచించుటకు వేర్వేఱు రీతులుగా నుపయోగింపఁబడియున్నది. మన తెనుఁగు బైబిలునందు కొన్ని వాక్యములలో అట్టి పదములను తర్జుమాచేయక సూచింపఁబడిన విషయమును మాత్రము వ్రాసి యున్నారు. కావున అట్టి వాక్యములలో మూల భాషయందు చేయి అను నర్థముగల మాటయున్నను తెనుఁగున అది యుండక దాని సూచన మాత్రము కలదు. ఉదా. II రాజు $3^{11}$ లోని చేతులమీఁద నీళ్లుపోయుట అను నర్థమిచ్చు మూల భాషాపదములను ఉపచారముచేయుట అనియు, నిర్గ $28^{3}$ లోని చేతులను నింపుట అను మూలపదమును ప్రతిష్ఠించుట యనియు, కీర్త $109^{6}$ జెక $3^{1}$ లూ $22^{69}$ రోమా $8^{34}$ లలోని చేయి అను మూలపదమును ప్రక్క, పార్శ్వము అనియు భాషాంతరము చేసి యున్నారు. ఇట్లే I సమూ $15^{12}$ లోని 1 జయ సూచకమైన శిల II సమూ $18^{18}$ లోని అబ్షాలోము స్తంభము యెష $56^{5}$ లో ఒకభాగము అను మాటలు మూలభాషయందు చేయి అను అర్థమిచ్చు పదములై యున్నవి. ఈ మూఁడును జ్ఞాపకార్థపు సూచనలని స్పష్టమగును. ప్రస్తుతమున ఈ దేశములో హిందూ మహమ్మదీయులు తాము పూజించు వీరులపు పేరట చేతి రూపములను జ్ఞాపకార్థపు సూచనలుగా నెట్లు పెట్టుకొనుచున్నారో అట్లే పూర్వకాలమందు ఆయా జనులు చేసియున్నట్లిందువలన నూహింపఁదగును. చేతులకు సంబంధముగా నున్న ఆయా విషయములు చేతులనే సూచించును గాన ఇట్లు చేయి యను మాటను పెట్టక ఆ పదమును చేయుట అనుటయే న్యాయము.

2. అనేక వాక్యములలో నిట్లు ఒక విషయము దీనిని సూచించునో ఆ పదమును పెట్టక మూల పదముయొక్క భాషాంతరమునే యుంచిరి. ప్రార్థన చేయునపుడు మర్యాదగా చేతులెత్తిరి (నిర్గ $17^{11-13}$ I రాజు $8^{22}$ కీర్త $28^{2}$). మ్రొక్కుబడి చేయునపుడు యెహోవా యెదుట చేతినెత్తిరి (ఆది $14^{22}$). చేతిని తొడ క్రింద పెట్టుట ప్రమాణమునకు గుర్తుగా నెంచిరి ($24^{2}$ $47^{29}$). ఆశీర్వాదమిచ్చునపుడు చేతిని తలమీద పెట్టిరి ($48^{14}$). దీనికి సంబంధముగానే హస్తనిక్షేపణము అను నాచారము ఉద్భవించి యుండవచ్చును (హస్త నిక్షేపణము చూ॥). అర్పింపఁబోవు పశువుమీఁద చేతులుంచుట అర్పించువాఁడు తన పాపభారమును మోపినట్లెంచిరి (నిర్గ $29^{10}$ లేవీ $16^{10}$). తాము నిర్దోషులమని చూపుటకు చేతులను కడుగుకొనుట వాడుకగా నుండెను (ద్వితీ $21^{6}$ కీర్త $26^{6}$ మ $27^{24}$ మొ॥). ఇట్లే పవిత్రమైన చేతులు నిర్దోషిత్వమును సూచించెను (యోబు $22^{30}$ I తిమో $2^{8}$). చేతులను చరచుట కోపమునకు సూచన (సంఖ్యా $24^{10}$). చేతిలో చేయివేయుట ఒడంబడికకు గుఱుతు (సామె $6^{1}$). చేతులు ముడుచుకొనుట సోమరితనమునకు సూచనయై యుండెను ($24^{33}$). బెన్యామీనీయులు ఎడమచేతి వాటముగలవారై (న్యాయా $20^{16}$) యుండిరి. ఇట్టివారై యుండుట వలననే ఏహూదు, ఎగ్లోనను వానిని కుట్రచేసి చంపుటకు అతనికి సులభముగా వీలుకలిగెను ($3^{15-21}$). తాము సేవించిన దేవతల పేరులను చేతులమీఁద వ్రాయించుకొనుట లేక పచ్చపొడిపించుకొనుట వాడుకై యున్నట్లు యెష $44^{5}$ వలనఁ దెలిసికొనవచ్చును. ప్రక $20^{4}$ లో చేతులమీఁది ముద్రయు నిట్టి గుఱుతని యనుకొనవచ్చును.

3. మానవులనుగూర్చి మాత్రమే గాక దేవుని గూర్చి కొంతమంది వ్రాసినపుడు దేవుని శక్తిని గూర్చి అలంకారరీతిగా చేయి, బాహువు హస్తము అను మాటల నుపయోగించిరి (ద్వితీ $2^{15}$ $4^{34}$ మొ॥). తెనుఁగు బైబిలులో నిట్టిమాటలు మూఁడుండినను హెబ్రీలో నొకటి మాత్రము కలదు. ఆయన శక్తివలన మానవులకు బలము మాత్రము గాక దేవుని సంగతుల నెఱుఁగు జ్ఞానముకూడ కలిగినట్లు దేవుని హస్తము ప్రవక్తలమీఁదికి వచ్చెను అను దృష్టాంతమువలన కనఁబడును (యెహె $8^{1}$ $37^{1}$ మొ॥). యెష $5^{25}$ $9^{12,17,21}$ $10^{4}$ మొ॥ వచనములలో నున్నట్లు చాపఁబడిన యెహోవాహస్తము ఆయన విధించు శిక్షలకు గుఱుతైయున్నది. దేవుని హస్తముతోడుగా నుండుట (ఎజ్రా $7^{6}$), నా చేయి (యోహా $10^{28}$), నా తండ్రిచేయి ($10^{29}$) అను మాటలు దేవుని దయగల నడుపునకును సూచనలై యున్నవి.

వ్యాజ్యములలో వాది కుడిచేతివైపున నిలుచుటయు (కీర్త $109^{6}$ జెక $3^{1}$), యుద్ధములో డాలును ఎడమ చేతిలో పట్టుకొనిరి కావున యోధుని దేహసంరక్షకుఁడు వాని కుడిచేతివైపున నిలుచుటయు (కీర్త $109^{31}$) వాడుకగా నుండెను. దీనికి సంబంధముగానే కుడిపార్శ్వము ఘనమునకు సూచనయై యుండెను. ఇట్టి ఘనమునకు సూచనగా క్రీస్తు దేవుని కుడిపార్శ్వమున కూర్చుండెనను యలంకారమున్నది ($110^{1}$ లూ $22^{69}$ రోమా $8^{34}$). ఇది క్రీస్తునకుగల దైవఘనమునకును దైవాధికారమునకు గుఱుతై యున్నది.

## చౌ,

**చౌక్కాయి** అంగీ చూ॥

**చౌళ్లు** చిక్కుడు గాయలు చూ॥

## చే, చొ, ఛే

**చేలువరాయి** (Marble). ఒక తెల్లని సున్నపురాయి. దీనిని చెక్కి నునుపుచేసి మెరుగు పెట్టినప్పుడు దానిలోని వివిధరంగులు కనఁబడి మిగుల సుందరముగా నుండును. అన్నిఁటిలో శ్రేష్ఠమైనవి తెల్లనివై యున్నవి. దేవాలయమును కట్టుటకు వీటి నుపయోగించిరి. I దిన $29^{2}$ లో నున్న **తెల్లచేలువరాళ్లు** ఇవే. హేరోదు కట్టించిన దేవాలయములోని స్తంభములు రాతివై యున్నట్లు యోసీఫసువలనఁ దెలియుచున్నది. (యుద్ధ 5, 5.2). రాజులు తమ నగరములను ఇట్టి రాళ్లతోఁ గట్టించుకొనిరి (ఎస్తే $1^{6}$). అట్టివి గొప్ప సౌందర్యమునకు సూచనగా వర్ణింపఁబడెను (పర $5^{15}$). ప్రక $18^{12}$ లో బబులోను పేరుచే సూచింపఁబడిన వర్తకపు సరకులలో నిది యొకటియై యుండెను.

**చౌకలివాడు** వృత్తులు చేతిపనులు III 3 చూ॥

**చౌకిరేవు మార్గమున నున్న మెరప కొలను కాలువ** యెరూషలేము A III 2 చూ॥

**ఛేదన, ఛేదించుకొనుట** సున్నతి చూ॥

**ఛేదించుట** నేరములు శిక్షలు III 5 చూ॥

## జ

**జంగిసాలు** అక్షోట వృక్షము చూ॥

**జంజుమ్మీయులు** (Zamzummim = గుసగుసలాడువారు). అమ్మోనీయులు పూర్వమున రెఫాయీయులకు పెట్టిన సార్థకనామము (ద్వితీ $2^{20}$ రెఫాయిము చూ॥). తూర్పు పలెస్తీనులో నుండిన బ్లెంచఁబడిన రాక్షసుల కేకలను తెలుపుటకు వారు వాడిన పేరని యనుకొందురు. వీరును జాజీయులును ఒకటే జనాంగమని కొందఱి యభిప్రాయము (జాజీయులు చూ॥).

**జంతువు** జీవి, మృగము చూ॥

**జక్కయి** (Zaccai, పవిత్రుఁడు).

చెఱకాలమునకుఁ దరువాత జెరుబ్బాబెలుతో కూడ తిరిగివచ్చిన యొక తెగవారి మూలపురుషుఁడు (ఎజ్రా $2^{9}$ నెహె $7^{14}$ జబ్బయి చూ॥).

**జక్కయ్య** (Zacchaeus = పవిత్రుఁడు). యెరికో పట్టణములోని సుంకపు గుత్తదారుడు (లూ $19^{1-10}$). అతఁడు క్రీస్తును చూడఁగోరి తాను పొట్టివాఁడైనందున నొక మేడి చెట్టెక్కి ఆయనను చూచెను. క్రీస్తతనియింట బస చేసెను.

**జక్కూరు** (Zaccur = జ్ఞప్తిచేయుట).

1. కనానుదేశమును వేగుచూచుటకు మోషే పంపిన పన్నిండుగురిలో రూబేనుగోత్ర ప్రతినిధి (సంఖ్యా $13^{4}$).

2. షిమ్యోను గోత్రికులలో నొకఁడు (I దిన $4^{26}$).

3. మెరారీ తెగవారిలోనున్న యొక లేవీయుఁడు (I దిన $24^{27}$).

4. ఆసాపు తెగవారిలో నొకఁడు. ఇతఁడు ఆలయములో సంగీత నాయకుఁడుగా నియమింపఁబడెను (I దిన $25^{2,10}$ నెహె $12^{5}$).

5. యెరూషలేము గోడలను కట్టుటలో నెహెమ్యాకు సహాయము చేసినవారిలో నొకఁడు. అతఁడు ఇమ్రియను వాని కుమారుఁడు (నెహె $3^{2}$).

6. నెహెమ్యా కాలములో నిబంధనను స్థిరపఱచుకొనిన లేవీయులలో నొకఁడు (నెహె $10^{11}$). $13^{13}$ లో నున్న జక్కూరు ఇతఁడే యనుకొందురు (జబ్బూదు చూ॥).

**జటామాంసి** గంధవర్గము I 3 చూ॥

**జత్తూ** (Zattu). చెఱనుండి తిరిగివచ్చిన వారిలో నొక తెగవారు (ఎజ్రా $2^{8}$ = నెహె $7^{13}$). వీరిలోఁ గొందఱు అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని వదలిపెట్టిరి ఎజ్రా $10^{27}$). వారి పెద్ద నెహెమ్యాకాలములో నిబంధనను స్థిరపఱచిన వారిలో నొకఁడు (నెహె $10^{14}$).

**జనముకాదు** (Loammi = నా జనము కాదు). హోషేయ ప్రవక్తయొక్క రెండవ కుమారుని సార్థకనామము (హోషే $1^{9}$). దేవుఁడిశ్రాయేలీయులను విసర్జించుననుసంగతి దీనివలన అలంకారరీతిగా సూచింపఁబడెను.

**జనములు** (Nations, People). బైబిలోను సాధారణముగా ఈ మాటలు యూదులు కాని యితర జనము లన్నింటిని సూచించుటకు వాడియున్నారు (యెష $49^{6}$ రోమా $2^{14}$, $3^{29}$). మఱియు వారు విగ్రహారాధికులను సంగతికూడ సాధారణముగా ఈ పేరులవలన సూచింపఁబడును (II సమూ $7^{23}$). ఇశ్రాయేలీయులకు కూడ జనులు అను పేరుకలదుగాని వారు దేవుని జనులైయున్నారను నుద్దేశముతోనే ఆ పేరును వారి కారోపించిరి (I దిన $17^{21-23}$). వారు దేవుని క్రమశిక్షవలన నడిపింపఁబడి పరిశుద్ధుఁడగు దేవుని సంగతుల నెఱిఁగియుండుటచే వారికట్టి బిరుదునిచ్చుట న్యాయమే. అయితే వారు అన్యజనులందఱికి ఈ గొప్ప బోధలను తెలియఁజేయుటకు దేవుఁడు వారి నిపక్షముగా నేర్పఱచుకొనెను (ఆది $12^{3}$ యెష $49^{1-6}$ ఆమో $9^{11}$). వారిది తలంచక గర్వపడి అన్యులను తృణీకరించుచుండిరి. మన దేశములో హిందూమత బోధకులైన బ్రాహ్మణులవలె ఆ యూదులును తమ జాతిని బట్టి చాల నిస్థాపరులైయుండిరి. క్రైస్తవమతము స్థాపింపఁబడు కాలమందు అన్యులనుకూడ ఈ మతములోనికి చేర్చికొనవలెనని దేవుఁడు పేతురుకు చూపించెను (కార్య 10). పౌలు అన్యజనులలో బోధించుటకు నియమింపఁబడెను $22^{21,22}$). యూదుల యాచారములను అన్యజనులు ఆచరించనవసరము లేదని యెరూషలేములో కూడిన మొదటి యాలోచన సభ తీర్మానించెను ($15^{1-28}$). అన్యులు క్రైస్తవమతములో నెక్కువగా చేరియుండిరి. అందువలన యూదులలో ననేకులు ఆటంకపఱచఁబడి యిందులో చేరుటకు వెనుకదీసిరి (రోమా 9-11). ఇట్లు క్రైస్తవ సంఘములోకూడ అన్యజనులు అను నొక ప్రత్యేకమైన తెగవారుండిరి ($15^{9-12}$ ప్రజలు, అన్యులు చూ॥).

**జనాంగములు** (Races). బైబిలునందు సూచింపఁబడిన జనాంగముల నీరీతిగా విభాగింపవచ్చును.

I. యాపెతు సంతతివారగు ఆర్యులు. వీరిలోని వారెవరనగా: 1. హెల్లేనీయులు (రోమా $1^{14}$). 2. యావానునివాసులు అనఁగా చిన్నాసియాలోని గ్రీకువారు (యెష $66^{19}$). 3. పార్తీయులు (కార్య $2^{9}$). 4. పారసీలు (ఎస్తే $1^{19}$). 5. మాదీయులు (యెష $13^{17}$). 6. రోమీయులు (యోహా $11^{48}$). 7. తుబాలువారు (ఆది $10^{2}$). 8. గోమెరువారు ($10^{2}$). 9. మెషెకువారు ($10^{2}$).

II. హాముసంతతివారు. 1. మిస్రాయిము అనఁబడిన ఐగుప్తీయులు (ఆది $12^{10}$). కూషీయులు. వీరు ఐతియోపీయులు ($10^{6}$). 3. లిబ్యేవారు (కార్య $2^{10}$).

III. షేము సంతతివారు.

1. ఉత్తరపువారు. (1) బబులోనీయులు (ఆది $10^{10}$); (2) అష్షూరీయులు ($10^{11}$); (3) అరామీయులు, వీరు సిరియవారు ($10^{22}$); (4) కనానీయులు. వీరిలో అమ్మోనీయులు (ద్వితీ $2^{19}$), అమోరీయులు (ఆది $10^{16}$), కనానీయులు ($15^{21}$), ఎదోమీయులు ($36^{9}$), హివ్వీయులు (నిర్గ $3^{8}$), ఇశ్రాయేలీయులు యెబూసీయులు (ఆది $15^{21}$), మోయాబీయులు (ఆది $19^{37}$), ఫేనీకేయులు (యెహె $25^{22}$ = తూరుసీదోనులు) బైబిలునందుదాహరింపఁబడిరి.

2. దక్షిణపువారు. (1) ఉత్తర అరేబియాలోనివారు (*a*) అమాలేకీయులు (ఆది $14^{7}$);

(*b*) ఇష్మాయేలీయులు ($37^{25}$); (*c*) మిద్యానీయులు (న్యాయా $6^{1}$). (2) దక్షిణ అరేబియాలోనుండు షెబావారు (ఆది $10^{7}$).

**IV.** ఇతరులు. 1. ఎలమీయులు (కొర్య $2^{9}$). 2. హిత్తీయులు (ఆది $15^{20}$) 3. హోరీయులు ($36^{30}$). 4. ఫిలిష్తీయులు.

(వీటి వివరములకొఱకు ఆయా పేరుల క్రింద చూ॥).

**జనుము (Flax).** మూలభాషయందలి యీ పదమును అవిసెయని తెనిఁగించుట యుక్తము. ఇది విశేషముగా ఉత్తర యిండియాలో పెరగును. ఈ గింజలనుండి నూనెఁ దీసెదరు. చలిప్రదేశములలో ఈ కాడలనుండి నారను తీయుదురు. శ్రేష్ఠమైన నారబట్టను లినెన్ అను నారతో నేతురుగాని జనుముతో నేయరు. పాలెస్తీనులోని వారికి నూలుబట్ట లెట్టివో తెలియదు. ఎస్తే $1^{6}$ లోని అవిసెనార యను పదము ప్రత్తినూలు అని యుండవలెను. పాత నిబంధనయందున్న పదమిచ్చుటగాక మరేచోటను గనఁబడదు. జనుపు కాడ లెండఁబెట్టిన (యెహో $2^{6}$) పిదప నీటిలో నూరవేయుదురు. ఆ తరువాత వాటిని బాగుగా నెండఁబెట్టి దువ్వెనతో చిక్కుఁదీసి నార తీసెదరు (యెష $19^{9}$). ఆ పిమ్మట దానిని నేత పనుపయోగింతురు. ఈ పంట సిరుల ముఖ్యమైన పంటలలో నొకటి (నిర్గ $9^{31}$ హోషే $2^{9}$). J. C.

**జన్మదినము** (Birthday). రాజుల జన్మదినములనుగూర్చి మాత్రమే బైబిలునందు సూచనలున్నవి. ఫరో జనదినమున విందుజేసెను (ఆది $40^{20}$). హోషే $7^{5}$ లోని **రాజుదినము** అప్పటి కాలమున ఇశ్రాయేలు రాజుగానున్నవాని పుట్టినదినమని ఊహించుచున్నారు. అతఁడు కూడ విందుజేసి సంభ్రమపడెను. క్రొత్త నిబంధనయందు హేరోదు అంతిప తన జన్మదినమున తన ఉద్యోగస్థులందఱికి విందొసఁగ్గా వారు త్రాగి తందనాలాడిరి. త్రాగుట అట్టి జన్మదినోత్సవములలో నొక ముఖ్యవిషయమై యుండినట్లు కనఁబడుచున్నది. అది యనేకకీడులకు మూలమాయెను.

**జప్నత్పనేహు** (Zephenathpeneah = దేవుఁడు పలుకును లేక అతఁడు జీవించునని దేవుఁడు పలికెను). ఫరో యోసేపునకు పెట్టిన ఐగుప్తీయనామము (ఆది $41^{45}$).

**జబ్ది** (Zabdi = దేవదానము, నా దానము). క్రొత్త నిబంధనలోని జెబెదై అను పదము దీని రూపాంతరమై యున్నది.

1. ఆకాను అనువాని తాత (యెహో $7^{1,17,18}$). I దిన $2^{6}$ లో నున్నట్లు ఇతనికి జిమ్రి అని పేరు పెట్టిరి.

2. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{18}$).

3. దావీదు ఉద్యోగస్థులలో నొకఁడు. ఇతఁడు ద్రాక్షారసపు కొట్టులను చూచెడివాఁడై యుండెను (I దిన $27^{27}$).

4. లేవీయులలోని ఆసాపు సంతతివారైన సంగీత నాయకులలో నొకఁడు (నెహె $11^{17}$). I దిన $9^{15}$ లో ఇతనికి జిఖ్రి యను పేరు కలదు.

**జబ్దీయేలు** (Zabdiel = దేవుఁడు నా దానము).

1. దావీదు ఉద్యోగస్థులలో నొకని తండ్రి (I దిన $27^{2}$).

2. నెహెమ్యా కాలమందు ప్రాముఖ్యులైన యుద్యోగస్థులలో నొకఁడు (నెహె $11^{14}$). ఇతఁడు ఆలయముపై విచారణకర్తగా నుండెను.

**జబ్బయి** (Zabbai = ఝంకారము).

1. ఎజ్రా కాలములో అన్యస్త్రీలను వివాహము చేసికొని అతని ప్రేరేపణవలన వారిని విడనాడిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{28}$).

2. నెహెమ్యా కాలములో యెరూషలేము ప్రాకారములను మరమ్మతుచేసినవారిలో నొకఁడు వారికి పెద్దయగు బారూకుయొక్క తండ్రి (నెహె $3^{20}$). హెబ్రీ బైబిలులో ఈ వచనమునుండి ఈ పేరును జక్కయి యని చదువవలెనని హెబ్రీ బైబిలును సవరణచేసినవారు కాగితము క్రింద వ్రాసియున్నారు. వారి సవరణ సరియై యుండవచ్చును (జక్కయి I చూ॥).

**జబుళకండ్లు** రోగములు చికిత్సలు II 1 (4).

**జబ్బూదు** (Zabbud = ఇయ్యఁబడినది). చెఱనుండి ఎజ్రాతోకూడ యెరూషలేమున తిరిగి వచ్చిన వారిలో నొకఁడు (ఎజ్రా $8^{14}$). హెబ్రీ బైబిలును సవరణ చేసినవారు ఇచట జబ్బూదుకు ప్రతిగా జక్కూరు అని చదువవలెనని కాగితము క్రింద వ్రాసిరి (జక్కూరు 5, 6 చూ॥).

**జమ్ము** (Bulrush). చాల ఎత్తుగా నెదుగు నొక తరహా గడ్డి. ఇది పది అడుగులకు పైఁగా నెదుగును. అడుగు భాగమున మూఁడంగుళముల దళసరిఁగలిగి యుండును. దీనితో చాపలనల్లిరి తట్టలు చిన్నచిన్న పడవలు మొదలగువాటినిఁ జేసిరి (నిర్గ $2^{3}$ యెష $18^{2}$). శ్రేష్ఠమైన జమ్ము కాడలను చీల్చి యెండఁబెట్టి పూర్వ మీ దేశములో తాటియాకులు వాడినట్లు పుస్తకములనుగా వాడుకొనిరి. పూర్వమీ జమ్ము ఐగుప్తుదేశములో నపరిమితముగా నుండెనుగాని ప్రస్తుతమున నైలు నదీ ముఖద్వారమునకు 800 మైళ్లదూరమువఱకు కనఁబడుటలేదు. యెష $58^{5}$ లో జమ్ము అని యున్న పదము రెల్లు అని యుండవలెను.

J. C.

**జమ్ముపడవలు** ఓడలు 3 చూ॥

**జయనన్నీము** (Zaanannim = బయలు వెడలుట). నఫ్తాలి హద్దులోనుండు ఒక పట్టణము (యెహో $19^{33}$). అచ్చట ఒక సిందూరవనము గలదు. న్యాయా $4^{11}$ లో అక్కడ మస్తిచా వృక్షమున్నట్లు కనఁబడుచున్నది. సీసెరాను చంపిన యాయేలు అచ్చట నివసించెను. దాని యునికి తెలియదు.

**జయనాను** (Zaanan = మందలుండు చోటు). యూదా గోత్ర ప్రదేశములో నైరృతి దిక్కుగా నుండు నొక పట్టణము (మీకా $1^{11}$). హెబ్రీ భాషలో అది బయలుదేరుట అను మాటకు సంబంధించినది గాన మీకా ఆ మాటనెత్తి అదే భావము వచ్చునట్లు చమత్కారముగా తక్కిన పట్టణములకువలెనే దీని నుపయోగించెను. యెహో $15^{37}$ లో నుండు సెనాను ఇదేయై యుండవచ్చును. దీని సరియైన యునికి తెలియదు.

**జర్హీయులు** ఇశ్రాహేతీయుడు చూ॥

**జలప్రళయము జలప్రవాహము** (Flood). నోవహుకాలమున భూమియంతటి మీఁదికివచ్చిన గొప్ప ప్రవాహము. ఎనమండుగురు మాత్రమే తప్పించుకొనిరి. దీనినిగూర్చి మోషే ఆది 6-8 అధ్యాయములలో వ్రాసెను.

మానవజాతియొక్క పాపమే ఈ జలప్రళయమునకు కారణము. ఇది క్రీ॥ ము॥ 2348 సం॥ క్రిందట జరిగెనని అనేకమంది వ్యాఖ్యాతల యభిప్రాయము. జలప్రళయమునందు నశించని వారు ప్రవేశించిన నావతలుపు మూయఁబడిన పిదప ఇది యారంభమాయెను. నలువది దినములు వర్షము కురిసెను. మహాగాధ జలముల యూఁటలన్నియు, ఆకాశపుతూములు విప్పఁబడెను. నావయందున్న నరులును జీవజంతువులనుతప్ప మిగతవన్నియు నశించెను. 5 నెలలకు జలములు ఎత్తయిన పర్వతశిఖరమునకుపైన 15 మూరల వఱకు లేచెను. ఎవఁడును తప్పించుకొనుటకు వీలులేని రీతిగా భూమియంతయు జలమయమాయెను. అంతట జలములు తగ్గుటకారంభమయ్యెను. ఎత్తయిన భూములు మొదట కనఁబడెను. ఆ నావ అరరాతు పర్వతముపై నిలిచెను. మఱిమూఁడు మాసములకు తక్కిన కొండలగుపడెను. తరువాతి నలువది దినములకు నోవహు భూస్థితిగతులు కనుగొనుటకై యొక కాకిని విడిచిపెట్టెను. ఏడు దినముల కొకమారు చొప్పున అతఁడు మూఁడుసార్లు ఒక నల్లని పావురమును వదలెను. అటు పిమ్మట అతఁడు నావకప్పు నూడఁదీసి నేల ఆరి యుండుట కనుగొనెను. అతఁడు ఓడవెడలి బయటకువచ్చి మానవజాతి నిఁక నెన్నఁటికి జలప్రళయమువలన నాశనము జేయనని ఇంద్రధనస్సు ద్వారా వాగ్దత్తముఁజేసిన దేవునికి యజ్ఞవేదికకట్టి బలుల నర్పించెను.

ఈ జలప్రళయము కలుగుటకు తగిన ప్రకృతి సంబంధములైన కారణము లున్నవేమో దెలిసికొనుటకు విశేష ప్రయత్నములు చేయఁబడెను. అద్భుతరీతిగా జరిగినదని బైబిలు చెప్పుచున్న దానినిగూర్చి ప్రకృతిసంబంధముగా నెట్లు జరిగెనా యని విచారించు విషయమున జాగ్రత్తగా నుండవలెను. జలప్రళయమంతమై దానియందుండిన జీవరాసులన్నియు బైటికివచ్చునందాక,

వాటి కన్నిఁటికి కావలసిన భోజనము స్థలము మొదలగు నవన్నియు ఆ నావయందుండెనా యను విషయమును, మంచినీటియందు మాత్రమే జీవింప గలిగిన జీవరాసులెట్లు బ్రతికెనా యనియు అనేకములగు కారణములను దెలుపుచు నవీన శాస్త్రజ్ఞులు జలప్రళయము విషయమై శంకించు చున్నారు. బైబిలును నమ్మునట్టి భక్తులలోను అనేకులు అట్టి ప్రళయము అప్పటికాలమున మానవులు వ్యాపించిన ప్రాంతములమట్టుకే అది కలిగెనని నమ్ముచున్నారు. గాని వారు చెప్పు సంగతులన్నింటికి రుజువులు చెప్పఁజాలరు. ఇట్టి గొప్ప జలప్రళయము అద్భుతరీతిగా పంపుట దేవునికసాధ్యముకాదు. క్రొత్తనిబంధనయందీ సంగతి యెత్తి చెప్పఁబడెను (మ $24^{37,38}$ లూ $17^{26,27}$ I పేతు $3^{20}$). ప్రస్తుతపు లోకము అగ్నిచేత నెట్లు నాశనమగునో అట్లే ఆది సృష్టి జలప్రళయమువలన నాశనమయ్యెను (II పేతు $3^{5-7}$). దేవుని ఓర్పును దృష్టాంతపఱచుటకును ఆయన తీర్పును దెలియఁజేయుటకును, క్రీస్తుయొక్క రెండవ రాకడను గుఱించి తెలుపుటకును నిది ఉపయోగింపఁబడెను.

నావయందు కాపాడఁబడిన కుటుంబమునుండి జనాంగములన్నియు కలిగినందున ఇతర జనాంగములయొక్క ఇతిహాసములయందు దీ సంగతిని గూర్చి చెప్పఁబడి యున్నదన వచ్చును. ఐగుప్తీయులు, కల్దీయులు, ఫేనీకేయులు, గ్రీకులు హిందువులు, చీనులు, జపానీయులు సిథియనులు మాత్రమే గాక, భూగోళపు పడమటిభాగము నందుండిన మెక్సికనులు పెరూవియనులును దక్షిణ సముద్రద్వీపవాసులును జలప్రళయమును గుఱించి చెప్పుచున్నారు. (ఓడ, నోవహు చూ॥). H

**జలూకము** కీటకములు 12 చూ॥

**జలోదరరోగము** రోగములు-చికిత్సలు II 10 (2) చూ॥

**జల్దరువృక్షము** (Apple Tree). ఈ పదముచే తెనిఁగించిన మూల భాషాపదము దేనిని సూచించునో చెప్పుటకష్టము. ఇంగ్లీషు భాషయందు ఆపిల్ అనఁబడు పండ్లచెట్లయి యుండునని అనేకమంది పండితుల యభిప్రాయము. పలెస్తీను దేశమునందు కాయిలా పడినవారు సాధారణముగా నీ పండు కావలెనని గోరదరు. వారు దీనిని తమచేతులలో నుంచుకొని వాసన చూచుకొందురు (పరమ $2^{3,5}$ యోవే $1^{12}$). J. C.

**జల్లెడ** వ్యవసాయము 5 (7), గుడారము 6 (1) (*a*) చూ॥

**జవాను** (Zavan, Zavaan = తొందర పడినది). ఎదోమీయులలో నొకఁడు (ఆది $8^{27}$ I దిన $1^{42}$).

**జహాము** (Zaham = వెగటు). రాజైన రెహబాము కొడుకులలో నొకఁడు (II దిన $11^{19}$).

## జా

**జాగరూకులు** దేవదూత 3 చూ॥

**జాజా** (Zaza = సమృద్ధి). యూదా వంశస్థులలోని యెరహ్మెయేలుకు పుట్టిన వారిలో నొకఁడు (I దిన $2^{33}$).

**జానోహ** (Zanoah = ముఱికి నీరు).
1. హెబ్రోనుకు సమీపమునన్న యొక స్థలము (యెహో $15^{56}$). ప్రస్తుతమున జనూత (*Zanuta*) అను స్థలమిదే. యనుకొందురు. మూల భాషలో దీనికి జానోహ అను గుణితము కలదు. (పటము II, D 3).

2. షెఫేలా యను పేరుగల మన్య ప్రదేశములోనున్న ఒక యూరు (యెహో $15^{34}$ నెహె $3^{13}$ $11^{30}$ I దిన $4^{18}$). ప్రస్తుతము అవి జానుయ (*Zanua*) అనఁబడును (పటము II, D 1).

**జాబాదు** (Zabad = దానము). జెబద్యా (I దిన $8^{15}$), జబ్దీయేలు (నెహె $11^{14}$), జాబూదు (I రాజు $4^{5}$) అనునవి దీనికి సంబంధించిన పేరులు.

1. యూదా గోత్రికులలో నాతాను అను వాని కుమారుఁడు (I దిన $2^{36}$).

2. దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{41}$). ఇతఁడు అహ్లాయికుమారుఁ డనఁబడినను పైన 1 లో నున్నట్లు నాతాను కుమారుఁడే యని కొందఱి యభిప్రాయము.

3. ఎఫ్రాయిము వంశస్థులలో నొకఁడు (I దిన $7^{21}$).

4. యెహోయాదా కుమారుడగు జెకర్యాను రాజైన యోవాషు చంపినందున అతనిపైని కుట్రజేసి చంపిన వారిలో ముఖ్యుడు. ఇతడు అమ్మోనీయురాలైన షిమాతు కుమారుడు (II దిన $24^{26}$). II రాజు $12^{21}$ లో నితనికి యోజాకారు అను మాఱుపేరు గలదు.

5,6,7. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో ముగ్గురు (ఎజ్రా $10^{27,33,43}$).

**జాబూదు** (Zabud = ఇచ్చినది). రాజైన సొలొమోను ఆలోచనకర్తలలో నొకడు. ఇతడు నాతానుకుమారుడు (I రాజు $4^{5}$ జాబాదు 1 చూ॥).

**జాము** కాలమానము III చూ॥

**జాయిన్** (Zain = ז అను అక్షరము. హెబ్రీ యక్షరములలో నేడవది. అక్షరమాలికగా వ్రాయబడిన 119 వ కీర్తనలోని ఏడవ భాగమునకు పేరు ($119^{49-56}$). మూలభాషయందా భాగములోని ప్రతి పంక్తియు నీ యక్షరముతోనే యారంభమగును.

**జాయీరు** (Zair = చిన్న). యూదా రాజగు యెహోరాము ఎదోమీయులమీద యుద్ధముచేసిన స్థలము (II రాజు $8^{21}$). దాని యునికినిగూర్చి తెలియదు. దీనికి సాటియైన II దిన $21^{9}$ నందీ పేరుకు ప్రతిగా—అధికారులను వెంటబెట్టుకొని యని యున్నది గాన, జాయిరు అనునది స్థలమా యనుదానిగూర్చి సందేహమున్నది.

**జారత్వము** వేశ్య, నేరములు శిక్షలు II 1 (2) *b* చూ॥

**జారస్త్రీ** వేశ్య చూ॥

**జారీయులు** జార్యా చూ॥

**జాలాపు** (Zalaph). నెహెమ్యాకాలమునందు పట్టణప్రాకారములను కట్టుటయందు సహాయపడిన హానూను అనువాని తండ్రి (నెహె $3^{30}$).

**జాలి** కృప చూ॥

**జాలినొందనిది** (Loruhamah). హోషేయ తన పెద్ద కుమార్తెకు పెట్టిన సార్థక నామము (హోషే $1^{6,8}$). దేవుడు ఇశ్రాయేలీయులయందు జాలిపడక వారిని శత్రువుకు అప్పగించును అను భావము దీనికి గలదు.

## జి

**జింక** లేడి చూ॥

**జిఖ్రీ** (Zichri = యెహోవా జ్ఞాపకముచేయును.) జెకర్యా అనుపద క్లుప్తరూపము.

1. కహాతు మనుమలలో నొకడు (నిర్గ $6^{21}$).

2,3,4,5. బెన్యామీనీయులలో నలుగురు (I దిన $8^{19,23,27}$ నెహె $11^{9}$).

6. ఆసాపు కుమారులలో నొకడు (I దిన $9^{15}$). నెహె $11^{17}$ లో ఇతనికి **జబ్దీ** యను మాఱుపేరు కలదు (జబ్ది 4 చూ॥).

7. లేవీయుడగు ఎలీయెజెరు కుమారుడు (I దిన $26^{25}$).

8. రూబేను వంశస్థులలో నొకడు (I దిన $27^{16}$).

9. యూదా వంశస్థులలో నొకడు (II దిన $17^{16}$).

10. యెహోయాదా కాలములో యూదా రాజ్యము నపహరించిన అతల్యాను రాజ్యభ్రష్టురాలినిగా చేసిన యోధులలో ఎలీషాపాతు అను నొకని తండ్రి (II దిన $23^{1}$).

11. ఎఫ్రాయిమీయులలో నొకయోధుడు (II దిన $28^{7}$).

12. యెహోయాకీముకాలములోనున్న ఒక యాజకుడు (నెహె $12^{17}$).

**జిగటమన్ను, మన్ను** (Clay). ఈ పదములచే తెనిగించిన మూల భాషాపదములు వెవ్వేఱుగలవు. పలెస్తీను పల్లపుప్రదేశములలో జిగటమన్ను ఎక్కువగా నుండును (I రాజు $7^{46}$ II దిన $4^{17}$). దానితో కుండలను ఇటుకలను చేయుట ఆ దేశప్రజలకు దెలియును. ఇట్టి కుండలు బహుసులభముగా పగిలిపోవుటచే

యోబు 4[19] లో మన దేహముయొక్క బలహీన తను సూచించుటకై జిగటమన్ను అను మాటను వాడిరి. మరీ ముఖ్యముగా సృష్టికర్త యగు దేవుడు తన చిత్త ప్రకారముగానే మనలను నిర్మింప గలడను సంగతిని సూచించుటకు మనము ఆయన చేతిలో మన్నునంటి వారము అను దృష్టాంతము బైబిలునందు అప్పుడప్పుడు కనబడును (యెష 64[8] రోమా 9[21]). ఆపదలో చిక్కుటను జిగట మంటిలో దిగుటయను దృష్టాంతపరచిరి (కీర్త 40[2]). శత్రువుల నోడించుట జిగటమంటిని త్రొక్కుటకు పోల్చిరి (యెష 41[25]).

**జిద్దీము** (Ziddim = ప్రక్కలు). నఫ్తాలీలో ప్రాకారములుగల పట్టణములలో నొకటి (యెహో 19[35]). గలిలయ సముద్రమునకు పడమటనున్న 52 మైళ్లు వాయువ్యముగా నుండు హట్టీను (*Hattin*) దీని యునికి యని తెలంతురు. దీనికి కెఫర్ చిట్టై (*Kepher Chittai*) అను పేరు గలదు.

**జిఫ్రోను** (Ziphron = సువాసన). కనాను ఉత్తర సరిహద్దుగానున్న యొక స్థలము (సంఖ్యా 34[9]). యెహె 47[16] లోని సిబ్రయీము అను స్థానమిదేయై యుండవచ్చును.

**జిబ్యా** (Zibia, Zibiah = లేడి).

1. ఒక బెన్యామీనీయుడు (I దిన 8[9]).

2. యూదా రాజగు యెహోయాషు తల్లి (II రాజు 12[1] = II దిన 24[1]).

**జిమ్మా** (Zimmah = ఆలోచన). లేవీయులలో గెర్షోను తెగకు సంబంధించిన యొక కుటుంబపువారు (I దిన 6[20,42] II దిన 29[12]).

**జిమ్రాను** (Zimran = అడవి మేకలు). కెతూరావలన అబ్రాహామునకు పుట్టిన కొడుకులలో నొకడు (ఆది 25[2] I దిన 1[32]). ఇతడు అరబ్బీ తెగలలో నొక దానికి పూర్వికుడై యుండెను.

**జిమ్రి** (Zimri = అడవిమేక).

1. రాజైన ఏలాను చంపి యిశ్రాయేలు రాజ్యము నపహరించిన యొక సేనాధిపతి. ఇతడు ఏడు దినములు మాత్రము ఆ రాజ్యము నేలి ఒమ్రీయను వానిచే పరాజితుడై దానిని పోగొట్టుకొనెను (I రాజు 16[9-20]). ఇతని కుట్ర గొప్ప పాపమును సూచించుట కొక వాడుకమాట యయ్యెను (II రాజు 9[31]).

2. షిమ్యోనీయుల ప్రధాని. ఇతడొక మిద్యానీయురాలి నుంచుకొన్నందున ఫీనెహాసు ఇతనిని చంపెను (సంఖ్యా 25[14]).

3. యూదా గోత్రికులలో నొకడు. ఇతడు ఆకాను పూర్వికులలో నొకడైయుండెను. బహుశః ఆతనికి తాతయై యుండవచ్చును (I దిన 2[7]). యెహో 7[1] లో నితనికి జబ్ది యను మారు పేరుకలదు (జబ్ది 1 చూ॥).

4. బెన్యామీనీయులలో నొకడు. అతడు రాజైన సౌలు వంశమునందు పుట్టినవాడై యుండెను (I దిన 8[36] 9[42]).

5. ఒక స్థలముయొక్క పేరు (యిర్మీ 25[25]). ఏలాము మాదయి దేశముల రాజులతోపాటు జిమ్రీ రాజులందరును అను మాట యుండుటచే ఇది ఆ దేశముల ప్రాంతములలో నున్నదని యూహింపదగును గాని దాని యునికినిగూర్చి మరే సూచనలును లేవు.

**జిలకర, జీలకర్ర** (Cummin). భారత దేశమునందు కూర దినుసులలో వాడుచున్నట్లు పలెస్తీనులోని జనులును వాడుకొనిరి. మరియు ఈ దేశములో చేయుచున్నట్లు వారును మందు దినుసుగా దీని వాడిరి. యెష 28[25] లో నున్న ట్లిందులో నల్ల జీలకర్ర తెల్ల జీలకర్ర యను రెండు విధములు కలవు. యెహె 4[9] లో అది కష్టమును సూచించుటకై ప్రవక్తకు నియమింపబడిన పత్యాపుటాహారములోని యొక దినుసు. యూదులు జీలకర్రలో కూడ పదియవవంతు చెల్లించుచుండిరి (మ 23[23]).

**జిల్పా** (Zilpah = బొట్టు). లాబాను తన కుమార్తె యగు లేయాకు నిచ్చిన దాసి (ఆది 29[24]). లేయా యీమెను యాకోబునకు ఉపపత్నినిగా నిచ్చెను (30[9]). ఈమెవలన యాకోబునకు గాదు ఆషేరు అను కొమరులు పుట్టిరి (30[10-13] 35[26] 37[2] 46[18]).

**జిల్లెతై** (Zillethai, Zilthai).

1. ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{20}$).

2. మనష్షే గోత్రికులలో నొకఁడు. దావీదు సిక్లగులో నుండఁగా ఇతఁడు వచ్చి కలిసికొనెను. దావీదు సైన్యాధిపతులలో నొకఁడయ్యెను (I దిన $12^{20}$).

## జీ

**జీజా** (Ziza, Zizah = బాహుళ్యము).

1. షిమ్యోను గోత్రపు ప్రధానులలో నొకఁడు (I దిన $4^{37}$).

2. రెహబాము కొడుకులలో నొకఁడు (II దిన $11^{20}$).

3. లేవీయులలోని గెర్షోను తెగకు సంబంధించిన యొకఁడు (I దిన $23^{11}$). తెనుఁగున ఈ పదముల రూపములన్నియు నేకముగా నున్నను అసలులో 1, 2 లోని పదములకును 3 పదమునకును చివరి యక్షరమునందు భేదము కలదు. ఇంగ్లీషులోను ఆ భేదము కనఁబడును. ఈ పదమునకే దిన $23^{10}$ లో జీనా యను మాఱు రూపము కలదు.

**జీజు** (Ziz = ప్రకాశము). ఏన్గెదీనుండి తెకోవకు ఎక్కిపోవు కొండత్రోవ. యెహోషాపాతు కాలములో మోయాబీయుల, అమ్మోనీయులు మెయోనీయులు ఈ మార్గమున వచ్చి అతనిమీఁద యుద్ధము జేసిరి (II దిన $20^{16}$). ఏన్గెదీనుండి యెరూషలేమునకు రోవిగాయు లొక రస్తాను వేసిరి.

**జీతము** కూలి చూ॥

**జీనా** జీజా 3 చూ॥

**జీఫా** (Ziphah). యూదావారిలో నొకఁడైన యెహల్లెలేలు కుమారుఁడు (I దిన $4^{16}$).

**జీఫు, జీఫీయులు** (Ziph, Ziphites).

1. యూదావారిలో యెహల్లెలేలు కుమారుఁడు (I దిన $4^{16}$).

2. కాలేబు సంతతి వారిలో నొకఁడు (I దిన $2^{42}$). ఇది క్రింద 3 కు సంబంధించి యున్నట్లున్నది.

3. హెబ్రోను మన్యప్రదేశములలో నున్న ఒక యూరు (యెహో $15^{55}$). అది హెబ్రోనుకు ఆగ్నేయముగా సుమారు 3 క్రోసుల దూరములో నున్నది. ప్రస్తుతమున దానికి టెల్ జీఫ్ (*Tel Zif*) అను పేరు కలదు. దావీదు సౌలు యొద్దనుండి పారిపోయి ఈ పట్టణము నాశ్రయించి యుండఁగా (I సమూ $23^{14,15,24}$ $26^{2}$) ఈ యూరి నివాసులైన జీఫీయులు ఆ సంగతిని సౌలుతోఁ జెప్పిరి ($23^{14}$ $26^{1}$ కీర్త *54* పై వ్రాఁత, పటము II, 3 చూ॥).

4. యూదా దేశమందున్న మఱియొక యూరు (యెహో $15^{24}$). దీని యునికిని గూర్చి సరిగా తెలియదు. (అరణ్యము 3 (6) చూ॥).

**జీయ** (Zia = భయము) గాదు వంశస్థులలో నొకఁడు (I దిన $5^{13}$).

**జీవగ్రంథము, గ్రంథము** (Book of Life). దేవుఁడు ప్రతివాని క్రియలచొప్పున వానికి తీర్పుచేయునను బోధకు సంబంధముగా ప్రతివాఁడును చేయునట్టి క్రియలు ఒక గ్రంథములో లిఖితములగునను అలంకారములు బైబిలులో నున్నవి (దాని $7^{10}$). ఇట్టి లిఖితములు తీర్పునకు సూచనలై యున్నవి. ఇదియుఁగాక ఇశ్రాయేలీయుల వంశములో పుట్టినవారందఱు దేవుని ప్రజలసంఖ్యలో చేరియున్నారు కావున, ఆ పేరుల జాబితాలను ఎక్కించు గ్రంథములు వారి హక్కులకు సూచనలై యున్నవి (యిర్మీ $22^{30}$ నెహె $7^{5,64}$ $12^{22}$). ఇట్టి ఆత్మీయ హక్కులకు పాత్రులైన నీతిమంతుల పేరుల జాబితాలుగల గ్రంథమునకు జీవగ్రంథము అను పేరు పెట్టిరి (దాని $12^{1}$ మలా $3^{16}$ కీర్త $69^{28}$). ఈ లెక్కలోనుండి యొకని పేరును తుడిచివేయుట అతనిని నాశనమునకు అప్పగించుటయై యుండెను (నిర్గ $32^{32,33}$ ప్రక 3). ఇట్టి గ్రంథములో లిఖితమైన వాటి ననుసరించి దేవుఁడు ప్రతివానికిని న్యాయము తీర్చునను సంగతి యూదుల పురాణగ్రంథములలో మిగుల వివరముగా నున్నది. మంచివారును చెడ్డవారును చేసిన కార్యములను తెలుపునట్టి గ్రంథములను గూర్చి క్రొత్త నిబంధనయందలి $20^{12,15}$ లోను నిత్యజీవమునకు వారసులగువారి పేరులను తెలుపు

నట్టి గ్రంథములనుగూర్చి లూ 10[20] ఫిలి 4[3] హెబ్రీ 12[22] ప్రక 13[8] 17[8] 21[27] లోను సూచనలు గలవు. దేవుఁడు సర్వజ్ఞానియై యుండుటచే ఆయన కిట్టి గ్రంథములుండవలసిన యవసరము లేదు కావున, ఇవి యలంకారములని తెలిసికొనవలెను. తీర్పు బహు న్యాయముగా జరుగుననియు దేవుని జనుల స్వాస్థ్యమును ఎవరును తీసివేయలేరనియు ఈ యలంకారములు మిగుల తేటగా కనఁబఱచుచున్నవి.

**జీవము, ప్రాణము (Life).** జీవము అను మాటచే తర్జుమాచేయఁబడిన హెబ్రీపదములు రెండుకలవు. అందు మొదటిది ప్రాణి దానిలో నుండు జీవమును మఱి ముఖ్యముగా మానవులజీవమును సూచించును (ఆది 9[4,5]). రెండవది ఊపిరియను శబ్దార్థము కలిగి ఆత్మయును పదమునకు సంబంధమైనదై యున్నది (6[17]). క్రొత్త నిబంధనలోని రెండు గ్రీకుమాట లిదే యర్థమును సూచించును (మ 2[21] 7[14]). 7[14] లో జీవము అని తర్జుమాచేసినమాటను 2[21] లో ప్రాణము అని తెనిఁగించిరి. ఆ జీవము అను మాటకు నిత్య యను విశేషణమునుచేర్చి నిత్యజీవము అని (యోహా 3[15,16]) తర్జుమాచేసిరి. పై రెండునుగాక గ్రీకులో ఈ యర్థముగల మూఁడవ పదమింకొకటికలదు. అది మన జీవితకాలమును ముఖ్యముగా సూచించును (లూ 8[14]).

I. పాఁత నిబంధన:

1. దేవుఁడు జీవరాసులను ప్రత్యేకముగా సృజించెను (ఆది 1[21] కార్య 17[25]). ఇట్టి జీవము సాధారణముగా వృక్షాదులకుగాక మానవులకును పశుపక్ష్యాది జంతుజాలమునకు గలదుగాని యోబు 14[7-10] యెష 11[1] లను చూడఁగా వృక్షాదుల జీవమునుగూర్చిన దృష్టాంతములుకూడ కలవు.

మానవులయొక్కయు పక్షి మృగాదుల యొక్కయు జీవము రక్తములో నున్నదను సంగతి పాఁత నిబంధన యాజ్ఞలన్నిఁటికిని బోధలన్నిఁటికిని ఒక మూలాంశమై యున్నది (ఆది 9[4]). ఇందుచేతనే రక్తము తినకూడదను ఏర్పాటు కలిగెను (లేవీ 3[16] 7[26] I సమూ 14[33]). మఱియు ఇది పాఁత నిబంధన బలులన్నిఁటికి ఆధారమైయున్నది. రక్తము నర్పించువారు అర్పింపఁబడు జంతువు యొక్క ప్రాణము నర్పించునట్లెంచఁబడెను.

మానవుల ప్రాణరక్షణవిషయమై బహు కఠినమైన ఆజ్ఞలు ఆదినుండి యున్నట్లు చూడఁగలము (ఆది 9[6] నిర్గ 20[13]). మానవుల ప్రాణము మాత్రముగాక జీవరాసుల ప్రాణముకూడ ప్రియమైనదిగా ఎంచఁబడెను (యోనా 4[11]). దేవుఁడు జీవరాసు లన్నిఁటికి నాధారభూతుఁడై యున్నాఁడు గనుక అవియు నాయనవేయని తెలిసికొని వాటిని నిష్కారణముగా బాధింపకుండవలెను (కీర్త 36[6] 104,105).

2. పైనఁ జెప్పినట్లు మానవులకు మృగాదులకును జీవమున్నను మానవులకు మాత్రము సరిపడు మఱియొక అర్థము జీవము అను పదమునకున్నది. మానవ సందర్భమందది పరమమేలు అను నర్థము నిచ్చును. ద్వితీ 30[19] చూడఁగా దేవుఁడు మానవులయెదుట జీవమును మరణమును ఉంచినట్లున్నది. అనేక దినములు బ్రదుకఁగోరువారు (కీర్త 34[10-14]) కీడుచేయుటమాని మేలుచేయవలెను. కావున, నీతితోఁగూడిన నడతకు ఫలము జీవమనఁదగును. ఇట్లు జ్ఞానము జీవవృక్షమనియు (సామె 3[18]), జ్ఞానమును కనుగొనువారు జీవమును కనుగొందురనియు (8[35]) తెలియఁజేయు వాక్యములు కలవు. సర్వమేలుల సంపూర్ణత జీవము అని యెంచి భక్తు లిట్లు వ్రాసిరి. కష్టమువలనను (యోబు 7[16]) నిరీక్షణకు భంగము కలుగుటవలనను (ప్రస 4[2]) మానవులు మరణమే మేలని యెంచెదరుగాని అది స్వస్థతనొందుహారి బుద్ధికాదు. అట్టివారు జీవమును సకలాశీర్వాదములలో గొప్పదానినిగా ఎంచెదరు. ఇట్లు అది పరమమేలుకు సూచనయై యున్నది.

3. ఈ పరమ మేలునకు సంబంధముగా నిత్యజీవము అను పదమును క్రొత్త నిబంధనలో విశేషముగా వాడియున్నారు. ఈ మాట పాఁత నిబంధనలో దాని 12[2] లో మాత్రము కలదు. యూదుల అప్రమాణిక గ్రంథములలో దీని సంగతి యెక్కువగా కనఁబడునుగాని అది క్రొత్త నిబంధనలో మఱీ తేటగా నున్నది (అమరత్వము చూ॥).

**II. క్రొత్త నిబంధన:**

1. మానవుల ప్రాణము రక్షించుటనుగూర్చి పాత నిబంధనలోని యాజ్ఞలను క్రీస్తు రద్దుపఱచక వాటిని మఱి లోతుగా బోధించెను. ఆయన మానవజీవమును జీవరాసుల ప్రాణమును దేవుని దానముగా నెంచి తండ్రియైన దేవుడు దాని నుద్ధరించునని బోధించెను (మ $6^{25,26}$—లూ $12^{6}$). సన్యాసులవలెను బైరాగులవలెను ఆయన ఈ జీవము నొక బంధకమునుగా నెంచక ఇది దేవుడనుగ్రహించు మేలని యెంచి దానియందలి దీవెనల ననుభవించుకొనెను. ఇందుచేతనే కొందరు ఆయనను దూషించిరి (మ $11^{19}$). ఇట్టి జీవమునకు సంబంధించినవాటి నుపయోగించుకొనుట ధర్మమని బోధించినను మనము వీటి విషయము చింతపడకూడదని మిగుల దృఢముగా బోధించెను (మ $6^{19,31}$ లూ $12^{15-29}$). మనము ప్రాణమును దక్కించుకొనుటకు బ్రదికినయెడల దాని పోగొట్టుకొనువారమగుదుము అని ఆయన బోధించియున్నట్లు నాలుగు సువార్తలలో నున్నది (మ $16^{25,26}$ మా $8^{35}$ లూ $9^{24}$ యోహా $12^{25}$). ఈ భూసంబంధమైన జీవము ఎంత గొప్ప దీవెనయై యుండినను ఇదే అన్నిటిలో శ్రేష్ఠమైనది యని యెంచుటచే మనము ఆ పరము మేలును పోగొట్టుకొనువారమగుదుము మనునదే దాని బోధయై యున్నది.

నిత్యజీవమునుగూర్చి క్రీస్తు బహు తేటగా బోధించి యుండెను. నిత్యజీవము అను మాట క్రీస్తు కాలమునందు యూదులలో వాడుకయందుండెను. నిత్యజీవములు పొందుటకు నేనేమి చేయవలెను అని యొకడాయనను నడిగెను (మ $19^{17}$). క్రీస్తు — నిత్యజీవమును స్వతంత్రించుకొనుటనుగూర్చియు ($19^{29}$), నిత్యజీవమును పొందుటనుగూర్చియు (మా $10^{20}$), జీవములో ప్రవేశించుటను గూర్చియు (మ $19^{17}$) పలికినపుడు ఆ కాలమందు యూదులపండితుల వాడుకలోనున్న మాటలను వాడెను. ఇట్లు జీవము అను మాట మాత్రము కొన్నిచోట్ల యుండినను అది నిత్యజీవము అను నర్థము నిచ్చును ($19^{17}$ $7^{14}$ మా $9^{43}$ యోహా $3^{36}$ $10^{10}$ మొ॥).

నిత్యజీవము అను మాట ముఖ్యముగా యోహాను సువార్తలో కనబడును. మత్తయి, మార్కు, లూకా యను వారలు వాడిన దేవుని రాజ్యము (=పరలోకరాజ్యము) అను పదమునకు ప్రతిగా యోహాను సువార్తలో నిత్యజీవము అను పదము కలదు. యోహా $17^{3}$ లో దేవునిని, ఆయన పంపిన యేసు క్రీస్తును ఎఱుగుటయే నిత్యజీవము అని చెప్పబడి యున్నది. అది ముందు రాబోవు మేలు మాత్రముగాక (మా $10^{30}$ మ $25^{46}$) ప్రస్తుతము ఇహమందు విశ్వాసులు పొందు స్వాస్థ్యమునై యున్నది (యోహా $3^{36}$ $5^{24}$ $6^{33-35}$ మొ॥). ఈ జీవము క్రీస్తునందే యున్నది ($1^{4}$) ఆయనయందుండువారు నిత్యజీవము గలవారగుదురు. అంత్యదినమందు అమరత్వము కాదుగాని విశ్వాసులకిప్పుడు నిత్యజీవము ఉండునని సూచింపబడెను. క్రీస్తు బోధలో నిది ముఖ్యమైనదగుటచే ఇది క్రొత్త నిబంధన యంతటిలో చాల ప్రాముఖ్యమైనదై యున్నది.

2. క్రీస్తు బోధయేకాక అపొస్తలుల బోధను చూచినను అది యంతయు క్రీస్తు బోధకు సంబంధముగా నున్నది. I యోహా పత్రికలోని ముఖ్య విషయము నిత్యజీవమై యున్నది (I యోహా $1^{2}$). పౌలు దీనిని పరమమేలునుగా నెంచి ఆ జీవము మనకు క్రీస్తు మూలముగానే లభించునని యనేకచోట్ల వ్రాసియున్నాడు (రోమా $6^{23}$ గల $2^{20}$ ఫిలి $1^{21}$ కొలొ $3^{3,4}$). అదియుగాక ఈ సాధారణ జీవమునకుకూడ క్రీస్తే ఆధారభూతుడని పౌలు బోధించెను ($1^{16,17}$). జీవము అను మాటను కొన్నిచోట్ల మాత్రము వాడియున్నను అది నిత్యజీవమునకు సంబంధముగా నున్నదని తెలిసికొనవలెను (రోమా $5^{17}$ II కొరి $5^{4}$ ఫిలి $2^{16}$). ఆత్మానుసారముగా ప్రవర్తించుటయే అట్టి జీవమునకు ఆధారమను సంగతి యోహా $17^{3}$ లో నున్నట్లు రోమా $8^{6}$ లో నున్నది. ఈ జీవమిప్పటినుండియే కార్యసాధకమగును. ఇకమీదట విశ్వాసులు దాని పూర్ణఫలముల ననుభవింతురు. ఈ బోధయే ప్రకటన గ్రంథములో ననేక అలంకారములయందు కనబడును. అందులో జీవకిరీటము (ప్రక $2^{10}$), జీవగ్రంథము ($3^{5}$ $20^{12}$), జీవజలముగలబుగ్గ ($21^{6}$), జీవవృక్షము ($22^{2}$) అను నిట్టి యలంకారములు అనేకచోట్ల

కనఁబడును. క్రీస్తు తన పునరుత్థానమువలన మరణమును నిరర్థకముచేసి జీవమును అక్షయతను తన సువార్తవలన వెలుఁగులోనికిఁ దెచ్చెను (II తిమో $1^{10}$). కావున యీ బోధ క్రొత్త నిబంధనలోని ప్రతి గ్రంథములోను తేటగా నున్నది (మనుష్యుడు, అమరత్వము, పునరుత్థానము చూ॥).

**జీవులు** (Living Creatures). జీవరాశిని సూచించుటకీపదము వాడఁబడెను (ఆది $1^{24,25}$ మొ॥). దీనిని వివరింప నవసరములేదు. ప్రకటన గ్రంథమునందు దేవుని సింహాసనము చుట్టునున్న నాలుగు జీవులు సాధారణమైనవికావు. అవి కెరూబులవంటివి (ప్రక $4^{6,9}$ $5^{8-14}$ $7^{11}$ $19^{4}$); అడవిమృగములలోను సాధు మృగములలోను జీవులన్నిఁటిలోను ఆకాశపక్షులలోను బలమిగల వన్నియు ఈ నాలుగు రూపములచే సూచింపఁబడును. కావున ఇవి ప్రాణముతోనున్న ప్రతి దానిని సూచించుచున్నవి. సర్వసృష్టియు దేవుని స్తోత్రించు ననునది దీనిభావమై యున్నది. ఈ జీవులు దేవుని సేవకులై ఆయన మహిమను నెఱవేర్చుచున్నట్లు ఆయా వాక్యములలో చూడ వచ్చును ($6^{3-7}$ $15^{7}$ కెరూబులు చూ॥).

**జీహా** (Ziha = ఎండిన).

1. నెతీనీయులలో నొక కుటుంబము (ఎజ్రా $2^{43}$ నెహె $7^{46}$).

2. పై కుటుంబపు పెద్దలలో నొకఁడు (నెహె $11^{21}$).

## జు, జూ, జె

**జుస్నగడ్డ** పాలు చూ॥

**జూజీయులు** (Zuzim). కదొర్లాయోమెరు జయించిన జనములలో నొకటి (ఆది $14^{5}$). మాట సంబంధమునుబట్టి ఈ జనము హాము సంతతికి చేరియున్నట్లు వ్రాసిరిగాని యీ హాము అను మాట అమ్మోను అని పురాతన విషయముల నెఱిఁగిన పండితులలో ప్రవీణులైన వారు కొందఱను కొందురు. ఇది నిజమైన యెడల యీ జనాంగము అమ్మోనీయులలో నొక తెగయని తెలిసికొనవలయును. ద్వితీ $2^{20-23}$ లో నున్నట్లు జంజుమ్మీయులు అను వారు వీరే యని అట్టివారెను కొందురు.

**జెకర్యా** (Zechariah, Zecharias = యెహోవా స్మరించును.)

1. రాజైన సౌలుయొక్క పినతండ్రి (I దిన $9^{37}$). $8^{31}$ లో ఈ పేరునకు **జెకెరు** అను మాఱు రూపముకలదు.

2. యాజకులలో నొకఁడైన **మెషెలెమ్యా** కుమారుఁడు (I దిన $9^{21}$ $26^{2-14}$).

3. లేవీయులలోని సంగీత నాయకులలో నొకఁడు (I దిన $15^{18-20}$).

4. దావీదు కాలములోనుండిన ఒక యాజకుఁడు (I దిన $15^{24}$).

5. కహాతీయుల తెగకు జేరిన లేవీయులలో నొకఁడు (I దిన $24^{25}$).

6. మెరారీయుల తెగకు సంబంధించిన యొక లేవీయుఁడు (I దిన $26^{11}$).

7. మనష్షే గోత్రికులలో ఇద్దోయనువాని తండ్రి (I దిన $27^{21}$).

8. రాజైన యెహోషాపాతు కాలమునందు యూదుల ప్రధానులలో నొకఁడు (II దిన $17^{7}$).

9. ఆసాపు కొడుకులలో నొకఁడు (II దిన $20^{14}$).

10. రాజైన యెహోషాపాతు కొడుకులలో నొకఁడు (II దిన $21^{2}$).

11. యాజకుఁడైన యెహోయాదా కుమారుఁడు (II దిన $24^{20-22}$). ఇతఁడు యూదులను విగ్రహారాధనకై గద్దించినందున వారు అతనిని రాజాజ్ఞ ప్రకారము రాళ్లతోఁగొట్టి చంపిరి. ఇతని మరణమునకు ప్రతీకారము చేయఁబడునని మత్త $23^{35}$ లూకా $11^{51}$ లో నున్నట్లు క్రీస్తు చెప్పెను.

12. రాజైన ఉజ్జియా కాలములో జీవించిన యొక ప్రవక్త (II దిన $26^{6}$).

13. రెండవ యరొబాము కొడుకు. యరొబాము మరణమునకు పిమ్మట ఇతఁడిశ్రాయేలు రాజ్యమునకు రాజై 6 మాసములు మాత్రమేలెను (II రాజు $14^{29}$ $15^{8-12}$). ఇతఁడు యెహూ సంతతిరాజులలో చివరివాఁడై యుండెను. కుట్రచే చంపఁబడెను. వీనికి తరువాత ఇశ్రాయేలీయులకు స్థిరమైన ప్రభుత్వము లేకపోయినందున దేశము చాల గందరగోళముగా నుండెను.

**14.** యెషయా కాలములో మంచిపేరు నొందినయొకఁడు (యెష 8[2]). తాను పలికిన ప్రవచనమునకు యెషయా ఇతనిని ఊరియాను సాక్షులనుగా పెట్టెను. ఇతఁడును యెష 8[16] లోని శిష్యుఁడు నొకఁడేయై యుండవచ్చును.

*15.* రాజైన హిజ్కియా తాత అనఁగా తల్లియొక్క తండ్రి (II రాజు 18[2] II దిన 29[1]).

16. రాజైన హిజ్కియా కాలములో దిద్దుబాటుచేయుటకు యత్నము జేసిన ఒక లేవీయుఁడు. ఇతఁడు ఆసాపుతెగలో చేరినవాఁడు (II దిన 29[13]).

17. రూబేనీయులలో నొక ప్రధాని (I దిన 5[7]).

18. కహాతీయుల తెగవారిలోనున్న ఒక లేవీయుఁడు (II దిన 34[12]).

19. రాజైన యోషీయా కాలమునందు ఆలయ విచారణకర్తలలో నొకఁడు (II దిన 35[8]).

**20.** జెకర్యా గ్రంథమును రచించిన ప్రవక్త (జెక 1[1] నెహె 12[16] జెకర్యా గ్రంథము చూ॥).

**21.** ఎజ్రాతోకూడ యెరూషలేమునకు వచ్చినవారి కుటుంబములలో నొక దానికి పెద్ద (ఎజ్రా 8[3]). ఇతఁడు పరోషువంశపు వాఁడైయుండెను.

22. ఎజ్రాతోకూడ వచ్చినవారి కుటుంబములలో మఱియొక దానికి పెద్ద (ఎజ్రా 8[11]). ఇతఁడు బేబైకుమారుఁడు.

**23.** ఎజ్రా బైలుదేరక పూర్వము అహవా నదిదగ్గర అతనితో ఆలోచనచేసిన వారిలో నొకఁడు (ఎజ్రా 8[16]). ఇతఁడును 21 లోని వాఁడు నొకఁడేయై యుండవచ్చును.

**24.** అన్యస్త్రీలను వివాహముచేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా 10[26]).

**25.** నెహెమ్యా కాలమందు యెరూషలేములో నివసించిన యూదులలో నొకఁడు (నెహె 11[4]). ఇతఁడు పెరెసు వంశస్థుఁడు.

**26.** నెహెమ్యా కాలమందు యెరూషలేములో నివసించిన యూదులలో మఱియొకఁడు నెహె 11[5]). ఇతఁడు షిలోని వంశస్థుఁడు.

**27.** యాజకులలో నొకఁడు. ఇతఁడు పష్హూరు కుమారుఁడు (నెహె 11[2]).

28. లేవీయులలో ఆసాపు తెగవారిలో నొకఁడు (నెహె 12[35]).

*29.* నెహెమ్యా కాలమందున్న యాజకులలో నొకఁడు (నెహె 12[41]).

**30.** బాప్తిస్మమిచ్చు యోహాను తండ్రి (లూ 1[5-23, 67-80]). ఇతఁడు అబీయా తరగతికిచేరిన యాజకుఁడై యుండెను. యోహాను పుట్టుకను గూర్చి గబ్రియేలు మాతచెప్పినమాట నతఁడు నమ్మనందున మూగవాఁడయ్యెను. అయితే యోహాను పుట్టినపిమ్మట అతనికి సున్నతి చేయఁబడిన దినమున మఱల బాగుపడెను. అప్పుడతఁడు దేవునికి స్తుతి గానముచేసెను.

**జెకర్యా గ్రంథము (Zecheriah, Book of).** చిన్న ప్రవక్తలనఁబడినవాటిలో పదునొకండవది. దీని గ్రంథకర్త బబులోను చెఱనుండి క్రీ॥ ము॥ 537 వ సం॥న తిరిగివచ్చిన వారిలో నొకఁడు. హగ్గయి ప్రవచనములలో మూఁడు నాలుగు ప్రవచనములు ప్రవచింపఁబడక పూర్వ మొకమాసమునకే జెకర్యా ప్రవచింప నారంభించెను. ఇతఁడు యాజక వంశీయుఁడు (నెహె 12[16]). సైన్యముల కధిపతియగు యెహోవా తట్టుకు జనులు పరిపూర్ణముగాఁ దిరుగవలయునని హెచ్చరించు నిమిత్తమే యాతఁడు తన పని నారంభించెను (1[1-6]). అతనికి కలిగిన ఎనిమిది దర్శనము లిందుదాహరింపఁబడెను (1[7]-6[15]). అవెవ్వియనః—1. రథములు (1[7-17]); 2. నాలుగు కొమ్ములు (1[18-21]); 3. కొలనూలు (2[1-13]); 4. ప్రధానయాజకుడైన యేషూవను స్థిరపఱచి శుద్ధిచేయుట (3[1-10]); 5. సువర్ణమయమైన దీపస్తంభము (4[1-14]); 6. ఎగిరిపోవు పుస్తకము (5[1-4]); 7. కొలతూములో కూర్చున్న స్త్రీ (5[5-11]); 8. రథములు గుర్రములు (6[1-8]). యూదులను శ్రమపెట్టిన జనములను తాను శిక్షించి, యూదులను సంపూర్ణముగా క్షమించి వారికనేకమైన యాశీర్వాదములను దయచేయునైయున్నానని దేవుఁడీ దర్శనముల మూలమున ప్రవక్తకుఁ దెలియచేసెను. ఈ కాలమువఱకు దేవుఁడు ప్రవక్తలతో తానే మాట్లాడెనుగాని

జెకర్యాకు దర్శనములను కనఁబఱచుటకు తన దూతను పంపెను. రెండవ సంవత్సరమున ప్రజలు తాము చెఱయందుండఁగా నెట్టి ఉపవాసముల నాచరించిరో అట్టివే ఇకనుకూడ నాచరింపవలెనా యని ప్రవక్త నడుగఁగా, వారు యెహోవా తట్టుకు తిరిగినయెడల ఆయన వారికి కనఁబఱచబోవు గొప్ప కనికరమునుగూర్చి వారికి నిశ్చయము కలిగించెనే ఆయన జెకర్యాకు కొన్ని యాదరణలు చెప్పి అట్టి యుపవాసము లవసరము లేదని తెలిపెను (జెక 7-8). ఈ గ్రంథమందలి ప్రవచనములలో 9-14 అధ్యాయములలోని వాటిని జెకర్యా ప్రవచింపలేదనువారుగలరు. లోకాంతమువఱకు తన ప్రజలైనవారి జీవిత మెట్లుండునో దానిని దేవుఁడు తెలియఁజేయు చున్నాఁడు. రాఁబోవు మెస్సీయానుగూర్చియు ఆయన తన జనులవలన విసర్జింపఁబడుటను గూర్చియు తెలిపెడి ప్రవచనము లిందు కలిసి యున్నవి. అంతమందు దేవుఁడేవచ్చి తన జనులను వారిశత్రువుల చేతినుండి విడిపించి కాపాడును. అన్యజనులువచ్చి యెహోవా నారాధింతురను సంగతియు నిందుఁగలదు. J. C.

**జెకెరు, జెకర్యా** 1 చూ॥

**జెపాతా** (Zephathah = కావలివారి గోపురము). మారేషాకు సమీపమునందున్న పల్లపు భూమి (II దిన $14^{10}$). గాని LXX లో దీని నొక స్థలముగాఁ జెప్పక ఉత్తరపుదిక్కు అను మాటచే తర్జుమచేసిరి. ఈ పదమును కొంచెము సవరించినయెడల ఈ యర్థమునే యిచ్చును. ఆలాగు సవరించుట యుక్తమని కొందఱి యభిప్రాయము. అది స్థలమే యైనచో, దానిని గూర్చిన వేఱుసూచన లేవియు లేవు.

**జెఫతు** (Sephath = కావలివారి గోపురము). యూదా దక్షిణభాగములోని ఒక యూరు. యూదావారును షిమ్యోనువారును దీనిని జయించి దీనికి హోర్మాయను పేరుపెట్టిరి (న్యాయా $1^{17}$ హోర్మా చూ॥).

**జెఫన్యా** (Zephanaiah = యెహోవా దాచెను).

1. కహాతీయులలో నొక లేవీయుఁడు (I దిన $6^{36-38}$).

2. యిర్మీయా కాలములో నొక యాజకుఁడు. ఇతఁడు సిద్కియా యిర్మీయా యను వారు పంపిన వార్తలను గొనిపోయిన మధ్యవర్తి (యిర్మీ $21^{1}$ $28^{3}$). యిర్మీయా యెరూషలేము నాశనముగూర్చి ప్రవచించుటవలన అంతకుపూర్వము బాబెలు చెరలో నున్నవారిని చాల అధైర్యపఱచెను గనుక అతనిని శిక్షింపవలెనని బాబెలులో నున్న షెమయా అను నొకఁడు ఉత్తరమును పంపఁగా ఈ జెఫన్యా దానిని యిర్మీయాకు పంపెను ($29^{25-32}$). ఇతఁడు ఆలయమునకు పై విచారణకర్తయై ప్రధాన యాజకునికిఁ దరువాతి రెండవ యాజకుఁడుగా నుండెను. నెబుకద్నెజరు యెరూషలేమును పట్టుకొనిన పిమ్మట నితఁడు ఇతరులతోకూడా రిబ్లాలో బాబెలువారిచే చంపఁబడెను (II రాజు $25^{18-21}$ యిర్మీ $52^{24-27}$).

3. జెరుబ్బాబెలు కాలములో జీవించిన యోషీయా అను నొకని తండ్రి (జెక $6^{10-14}$).

4. ఒక ప్రవక్త. హిజ్కియాకు మునిమనుమఁడు. ఈ హిజ్కియా రాజగు హిజ్కియా కావచ్చును. జెఫన్యా యోషీయా కాలములో ప్రవచించెను. గనుక ఆ కాలము దానికి చక్కగా సరిపడును.

**జెఫన్యా గ్రంథము** (Zephaniah, the Book of). చిన్న ప్రవక్తలలో తొమ్మిదవది. అది యోషీయా కాలములో వ్రాయఁబడినట్లు పై వ్రాఁతలో నున్నది. ఈ గ్రంథములోని సూచనలు దానికి చక్కగా సరిపడును. దీనిని వ్రాయునప్పటికి నీనెవెపట్టణము ఇంకను నిలచి యుండెను. జెఫ $2^{4}$ లో ఫిలిష్తీయుల పట్టణములను గూర్చియు నున్నవి గాని వానియందు సాధారణముగా నుండు గాతుపట్టణము ఈ జాబితాలో లేదు. గాతు అంతకు మునుపే లయమాయెనని యితర చరిత్రలవలనఁ దెలియును. ఈ ప్రవచనము క్రీ॥ము॥ 622 సం॥లో యోషీయా పూనుకొన్న సంస్కరణమునకు పూర్వము చేసి యున్నట్లు మనము దాని ముఖ్యాంశములవలన నూహింపఁదగును (II రాజు $23^{3}$ II దిన $24^{8}$ = $25^{19}$). అయితే ఆ సంస్కరణ ముగిసిన పిమ్మట యోషీయా కాలములోనే యూదావారు మఱింత వెనుకపడి పాపమునందు మునిగిపోయిరి

(యిర్మీ $25^{3}$ $26^{1-20}$ II రాజు $23^{32-37}$). కనుక ఆ కాలములో కూడ నిది వ్రాయఁబడి యుండ వచ్చును. ఎట్లయినను ఈ ప్రవచనము యూదా వారు జారిపోవు స్థితియందుండఁగా చెప్పఁబడి యుండును.

ఈ ప్రవచనమునందు సార్వత్రిక తీర్పు ముఖ్య విషయమై యున్నది గాని, అట్టి తీర్పువలన కొందఱు తిరిగెదరు కావున దానిలోని చివరి సంగతులు కుదురుబాటును గూర్చినవై యున్నవి. దీనిలోని ముఖ్యభాగము లెవ్వి యనఁగా:—

I. పీఠిక ($1^{1}$).

II. సర్వలోకమునకు కలుగనైయున్న తీర్పు ($1^{2-18}$). అది గొప్ప వరదవలె నాశనకరమైన దగును ($1^{2,3}$). యెరూషలేమునందలి విగ్రహారాధన కొట్టివేయఁబడును. ఆ విగ్రహారాధన చేసినవారు గొప్ప బల్యర్పణవలె హతము చేయఁబడెదరు ($1^{4-13}$). మనుష్యులు తమ పాపముల నిమిత్తము శిక్షింపఁబడెదరు ($1^{14-18}$).

III. మనుష్యులు పశ్చాత్తాప పడుటవలన ఈ భయంకరమైన శిక్షలో నుండి తప్పించుకొనవలెనని వారిని హెచ్చరించుట ($2^{1}$-$3^{8}$). ఈ పిలుపును గూర్చి మొదటి మూఁడు వచనములలోఁ జెప్పిన మీఁదట, దానిని దృఢపఱచుటకు అన్యజనములకు కలుగఁబోవు నాశనమును గూర్చి తెలిపెను ($3^{1-8}$).

IV. ఆ తీర్పువలన కలుగఁబోవు ఆశీర్వాదములు ($3^{9-20}$). అన్యజనులు దేవునితట్టు తిరిగెదరు ($3^{9-10}$). ఇశ్రాయేలీయులలో శేషించువారు పరిశుద్ధులగుదురు ($3^{11-13}$). దేవుఁడు తన ప్రజల మధ్యనుండి వారిని ప్రభావముతోను, దయతోను పరిపాలన చేయును ($1^{14-18}$). ఇట్లు వారు చెఱనుండి విడిపింపఁబడి మనుష్యులకు దీవనకరముగా నుండెదరు ($3^{19-20}$).

**జెబద్యా** (Zebediah = యెహోవా దానము).

1. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{15}$).

2. బెన్యామీనీయులలో మఱియొకఁడు (I దిన $8^{17}$).

3. దావీదు సిక్లగులోనుండఁగా అతనిని కలిసికొన్నవారిలో నొకఁడు (I దిన $12^{9}$).

4. దావీదు ఉద్యోగస్థులలో నొకఁడు (I దిన $27^{7}$).

5. లేవీయులలోని కోరహు తెగవారిలో నొకఁడు (I దిన $26^{2}$).

6. యూదాపట్టణములలో బోధించుటకై రాజైన యెహోషాపాతుచే పంపఁబడినవారిలో నొకఁడు (II దిన $17^{8}$).

7. యెహోషాపాతు ఉద్యోగస్థులలో నొకఁడు (II దిన $19^{1}$).

8. ఎజ్రాతోకూడ యెరూషలేమునకు తిరిగి వచ్చినవారిలో నొకఁడు (ఎజ్రా $౮^{8}$).

9. అన్యస్త్రీలను వివాహముచేసికొని ఎజ్రా ప్రేరేపణనుబట్టి వారిని విడిచిపెట్టినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{20}$).

**జెబహు** (Zebah = వధింపఁబడువాఁడు). మిద్యానీయుల రాజులలో నొకఁడు. ఇతఁడును సల్మున్నాయనువాఁడును గిద్యోను కాలములో ఇశ్రాయేలీయులను బాధపెట్టిరి. గిద్యోను దేవుని సహాయమువలన వారిని ఓడించి పట్టుకొనెను. తరువాత అతఁడు తన పెద్దకుమారుని చూచి వీరిని చంపుమనఁగా వాఁడు చిన్నవాఁడైనటుచే వెఱచినందున తానే వారిని చంపెను (న్యాయా $౮^{18-21}$). వీరిని జయించుట మహాగొప్ప విషయమని ఇశ్రాయేలీయులనుకొన్నట్లుగా మనము యెష $9^{4}$ $10^{26}$ కీర్త $౮3^{11}$ లోని సూచనలవలనఁ దెలిసికొనఁగలము.

**జెబీనా** (Zebina = కొనఁబడినవాఁడు). ఎజ్రా కాలములో అన్యస్త్రీలను వివాహము చేసికొని అతని హెచ్చరికవలన వారిని విడనాడిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{43}$).

**జెబులు** (Zebul = నివాసము). అబీమెలెకు ఉద్యోగస్థులలో నొకఁడు. షెకెము పట్టణపు అధికారి. గాలు అనువాఁడు కుట్రజేసి షెకెమును పట్టుకొనఁబోగా అబీమెలెకువచ్చి గాలును జయించువఱకు ఇతఁడు పట్టణమును కాపాడెను (న్యాయా $9^{28-45}$).

**జెబూలూను** (Zebulun = నివాసము).

1. **యాకోబు** కుమారులలో పదవవాఁడు. **లేయాకు** కనినవారిలో నారవవాఁడు (ఆది $30^{19,20}$). ఇతఁడు తన తండ్రితో నైగుప్తునకు వెళ్లెను (నిర్గ $1^{3}$). ఇతనికి ముగ్గురుకుమారులు (ఆది $46^{14}$). ఇతని సంతానీకులు సముద్రపు టొడ్డున ఓడలకు రేవుగానుండు ప్రాంతముల నివసించి సీదోను వఱకు వ్యాపించు పొలిమేరఁ గలిగియుండునని యాకోబు దీవించెను ($49^{13}$) గాని, అది యక్ష రాల నెఱవేఱినట్లు గానరాదు. తీర ప్రాంతము లందున్న పట్టణములతో వ్యాపారము గలిగి యుండెనను గలిలయ సముద్రమునుండి నఫ్తాలీ ఇశ్శాఖారు గోత్రములును మధ్యధరాసముద్రము సీదోనులనుండి ఆషేరు గోత్రమును ఈ గోత్రపు స్వాస్థ్యమును వేఱుపఱచెను. యాకోబు మరణమునప్పుడు యున్న దేశమును పంచి పెట్టిన పిదప రచించినను కొందఱాక్షేపింతురు గాని, ఆ దీవెనతో నిది సరిపడకపోవుటయే ఆ యాక్షేపణను ఖండించును దానికి పూర్వమే యాకోబు అట్లు తన సంతానమును దీవించెనని రూఢిపఱచు చున్నది.

2. జెబూలూను సంతాన మంతటిని ఈ పేరు తోఁబిలిచిరి. అతని ముగ్గురు కుమారులనుబట్టి యీ గోత్రము విభాగింపఁబడెను. (సంఖ్యా $26^{26}$). ఇశ్రాయేలీయుల అరణ్య సంచారారంభ మున హేలోను కుమారుఁడగు ఏలీయాబును ($1^{9}$ $10^{16}$), అంతమున పర్నాకు కుమారుఁడగు ఎలీషా పానును ($34^{25}$) ఈ గోత్రపు ప్రధానులై యుండిరి. గదియేలు కుమారుఁడగు సోది, కనాను దేశమును వేగుజూడ వెళ్లినవారిలో నీ గోత్రపు ప్రతినిధియై యుండెను ($13^{10}$). అరణ్యమునందు వేయఁబడిన ప్రజాసంఖ్యలయందీ గోత్రమున సేనయందుఁ జేరఁదగినవారు మొదట 57,400 మందియు తరువాత 60,500 మందియు నుండిరి ($1^{30,31}$ $26^{27}$). కనానుదేశమునఁ బ్రవేశించిన యారంభమున దీవెన శాపవచనములను చదివి ఏబాలు కొండపై నిలిచిన ఆరుగోత్ర ప్రతినిధు లలో నీ గోత్రికులును గలరు (ద్వితీ $27^{13}$ యెహో $8^{32-35}$). మోషే ఆయా గోత్రములను దీవించునప్పుడు దీనితో ఇశ్శాఖారు గోత్రమును గలిపి వారందరు సంతోష సౌఖ్యములఁ బడసెద రనెను (ద్వితీ $33^{18,19}$). దేవుఁడు తన స్వాస్థ్య మగు పర్వతముమీఁద తన ప్రజలను స్థిరపఱచిన పిదప వీరాయనకు గొప్ప కానుకలను దెచ్చెదరని ఆ వాక్యముల భావమై యున్నది. ఇశ్శాఖారుకు ఉత్తరమునందును ఆషేరుకుఁ దూర్పునను నఫ్తా లీకి పడమటను దక్షిణమునందును ఈ గోత్రపు వారి స్వాస్థ్యముండెను (యెహో $19^{27,34}$). ఇది మిగుల ఫలవంతమైన ప్రదేశము. ఈ భాగము నందు గలిలయలోని దిగువ ప్రాంతమును ఎస్ద్రలోను బయలుయొక్క వాయువ్య ప్రాంతము నుండెను. సీసెరా నోడించిన బారాకు సైన్యమునందును (న్యాయా $4^{6-10}$ $5^{14,18}$). మిద్యానీయులను దఱిమిన గిద్యోను సైన్యమునందును ($6^{35}$) ఈ గోత్రికులు ముఖ్యులై యుండిరి. న్యాయాధి పతులలో ఏలోనను వాఁడీ గోత్రపువాఁడే (న్యాయా $12^{11}$). ఇష్బోషెతు మరణమైన పిదప దావీదును రాజుగాఁ జేయుటకై కూడినవారి యందు మిగుల నేర్పరులైన సేనానులు గలిగిన 50 వేలమంది జెబూలూనీయులు నుండిరి (I దిన $12^{33,40}$). దావీదుకాలమున ఇష్మయా యనువాఁడీ గోత్రికులకు యధిపతియై యుండెను ($27^{19}$). అష్షూరీయులచే మిగుల బాధింపఁబడిన వారిలో నీ గోత్రికులు నుండిరిగాని మెస్సీయా వచ్చి నప్పుడు వీరును దీవెనల నొందుదురని యెషయా ప్రవచించెను (యెష $9^{1}$. మ $4^{12-16}$). హిజ్కియా కాలమున జరిగిన గొప్ప పస్కా నాచరించుటకు వీరిలోఁ గొందఱు యెరూషలేమునకు వెళ్లుటకు సమ్మతించిరి (II దిన $30^{10,11,18}$). యెహెజ్కేలు వర్ణించిన యెరూషలేమునందు వీరికి నొక గుమ్మ ముండునని యెహె $48^{33}$ వలనఁ దెలియుచున్నది. ప్రకటనలోని ఏర్పాటులయందు ఈ గోత్రికులలో 12 వేలమంది ముద్రింపఁబడినట్లు కనఁబడుచున్నది (ప్రక $7^{8}$ పటము IX. చూ॥).

**జెబూదా** (Zebudah, Zebidah = అను గ్రహింపఁబడినది. రాజైన యెహోయాకీము యొక్క తల్లి (II రాజు $23^{36}$).

**జెబెదై, జెబెదయి** (Zebedee = యెహోవా దానము). అపొస్తలులైన యాకోబు యోహాను అనువారి తండ్రి (మ 21 మా $1^{20}$). మా $15^{40}$

మ 27[56] సరిపోల్చిచూడఁగా ఇతఁడు సలోమే యను నామెయొక్క పెనిమిటియని దెలియు చున్నది. ఇతఁడు జాలరియై యుండెను. ఇతని యొద్ద జీతగాండ్రుండుటను జూడఁగా (మా 1[20]) ఇతఁడు స్థితివంతుఁడని యూహింపఁదగును. తెనుఁగున ఈ పేరునకు వేర్వేఱు రూపములుండి నను మూలభాషలో నిది యొకటే పదముగా నున్నది.

జెబోయిము (Zeboim = కొర్నాసిగండ్లు). ఫిలిష్తీయు లొకసారి ఇశ్రాయేలీయులను దోచుకొనుటకై వచ్చిన యొక లోయ (I సమూ 13[18]). ప్రస్తుతము కొర్నాసిగండ్ల లోయ యని అర్థమిచ్చు అబుదాబా (*Abudaba*) అనువాగు దీని యునికి కావచ్చును.

జెమీరా (Zemirah, Zemera = పాట). బెన్యామీనీయులలో నొక తెగవారికి పెద్ద (I దిన 7[8]). ఇతఁడు బేకరు కొడుకు.

జెయేబు (Zeeb = తోఁడేలు.) గిద్యోను ఓడించి చంపిన మిద్యానీయుల రాజులలో నొకఁడు (న్యాయా 7[25]). ఇతనిని హత్యచేసిన స్థలము జెయేబు అనఁబడును (ఓరేబు జెయేబు చూ॥).

జెరహు, జెరహీయులు (Zerah = అరుణోదయము, Zerahites).

1. ఏశావు సంతతివారిలో నొకఁడు (ఆది 36[13] I దిన 1[37]). అతఁడు ఎదోమీయుల నాయకులలో నొకఁడై యుండెను. (ఆది 36[17] I దిన 1[37]).

2. ఎదోము రాజగు యోబాబుకు తండ్రి (ఆది 36[33] I దిన 1[44]). ఇతఁడు 1 లోనివాఁడును ఒకఁడేయై యుండవచ్చును.

3. యూదా సంతతి వారిలో నొకఁడు. అతని సంతతివారు జెరహీయు లనఁబడిరి (ఆది 38[30] సంఖ్యా 26[20] యెహో 7[1,17]).

4. షిమ్యోను సంతతివారిలో నొకఁడు. అతని సంతతివారుకూడ జెరహీయులనఁబడిరి. (సంఖ్యా 26[13] I దిన 4[24] సోహరు చూ॥).

5, 6. ఇద్దఱు లేవీయుల పేరులు (I దిన 6[21,41]).

7. రాజైన ఆసాకాలములో గొప్ప సేనతో కూడ యూదా దేశము మీఁదికి దండెత్తివచ్చి ఓడిపోయిన కూషీయుఁడు (ఐగుప్తీయుఁడు). అయితే కొందఱు ఇతఁడు అరబ్బీయుల గోత్రములలో నొక గోత్రపువాఁడని యనుకొందురు (II దిన 14[9-15]).

జెరహ్యా (Zerahiah = యెహోవా లేపువాఁడు).

1. యాజకులలో నొకఁడు (I దిన 6[6-31]). అతఁడు ఎజ్రా పూర్వికుఁడు (ఎజ్రా 7[4]).

2. ఎజ్రాతోకూడ చెఱనుండి తిరిగి వచ్చిన వారిలో ఎల్యోయేనై అనువాని తండ్రి (ఎజ్రా 6[4]).

జెరుబ్బాబెలు (Zerubbabel = బాబెలులో పుట్టినవాఁడు). పెదాయా కుమారుఁడు యూదా రాజ్య వారసుఁడు (I దిన 3[17-19]). ఇతఁడు పెదాయా సహోదరుఁడగు షెయల్తీయేలు కుమారుఁడనఁబడెను (ఎజ్రా 3[2 8] నెహె 12[1] హగ్గ 1[1] మొ॥. మ 1[12-13] లూ 3[27]). బహుశః షెయల్తీయేలు సంతానహీనుఁడై చనిపోయి యుండును. అట్లు సంతానహీనుఁడై చనిపోయిన వాని సహోదరుని కుమారుఁడై వారసుఁడగుట వలననో, దేశమర్యాదననుసరించి (ద్వితీ 25[5-10]) సంతానహీనుఁడైన సహోదరుని భార్యను వివాహ మాడుటవలన కలిగినందుననో జెరుబ్బాబెలును షెయల్తీయేలు కుమారుఁడని బిలిచిరి. కోరెషు బబులోనును జయించిన పిమ్మట యూదులను వారి స్వదేశములకు వెళ్లుఁడని సెలవనుగ్రహించినప్పుడు యూదారాజ్య వారసుఁడగు జెరుబ్బాబెలును యూదాకు పారసీ గిపర్నరుగా నియమించెను (ఎజ్రా 1[8] హగ్గ 2[21]). రాజుగారి తాఖీదునం దితని బబులోను పేరగు షేష్బజ్జరనునది నమోదు చేయఁబడెను (ఎజ్రా 1[8-11] 5[14-16]) గాని షేష్బజ్జరనువాఁడు వేఱొకఁడని కొందఱను కొందురు. ప్రధానయాజకుఁడగు యేషువయును, మఱికొందఱు ప్రధానులును బరివేష్టించిరాఁగా, ఇతఁడు చెఱనుండి మఱలి వచ్చువారిని వెంటఁ గొని క్రీ॥ ము॥ 538 సం॥న స్వదేశమునకు వచ్చెను (ఎజ్రా 2 నెహె 7,12[1-9]). వారు వచ్చి బలిపీఠమునుగట్టి పండుగల నారంభించి లేవీయులను

వారి వారి విధ్యుక్త ధర్మముల నాచరించుటకుఁ బ్రత్యేకించిరి (ఎజ్రా 3[1-9]). తరువాత ఆలయపు బునాదులు వేసిరి. శత్రువులైన వారు జెరుబ్బాబెలు నా పనినుండి యాపవలె పలువిధములఁ బ్రయత్నించి, తరువాత వచ్చిన పారసీ రాజులతో నుత్తర ప్రత్యుత్తరముల జరిపి దర్యావేషు ఏలుబడియందు రెండవ సంవత్సరమువఱకు పనిని నిలిపివేసిరి (4[1-24]). ఆ సంవత్సరమున హగ్గయి ప్రవక్త వారినిమిగుల పురికొల్పి, ఆ పనిని వారు మఱల నారంభించి కొనసాగించుమనటులఁ బ్రేరేపించెను (హగ్గ 1[2-11]). జెరుబ్బాబెలును అతని సహాయకులును ఉత్సాహ పూరితులై యా పనికిఁ బూనుకొనిరి. జెకర్యా హగ్గయితోఁ జేరి వారి నింక ప్రేరేపించి పని సాగునటుల తోడ్పడెను (ఎజ్రా 5[1-2] హగ్గ 1[12]-2[23] జెక 4[1-14]). ఎట్లు కేలకు 515 సం॥నకు ఆలయమును కట్టుట ముగసెను. ఈ యాలయమును కట్టించునప్పుడున్న హోదానుబట్టియు ఆ పనియందతఁడు చూపిన శ్రద్ధనుబట్టియు అది జెరుబ్బాబెలు ఆలయమని పిలువబడుచున్నది (దేవాలయము III చూ॥). అతఁడు క్రీ॥ పూ॥ 515 వఱకు అధికారిగా నున్నట్లు తెలియుచున్నదిగాని ఇంకెంతవఱకట్లుండెనో నిశ్చయింప వీలులేదు. జెరుబ్బాబెలు దావీదు రాజ్యమునకు వారసుఁడుగా ఆ దినములలో నెంచఁబడెను (హగ్గ 2[20-23]). అతని పేరు యేసుక్రీస్తు వంశావళియందును గలదు (మ 1[12 13] లూ 3[27]).

**జెరుబ్బాబెలు ఆలయము** దేవాలయము III చూ॥

**జెరూవహ** (Zeruah = మొట్టఁబడిన). మొదటి యరొబాము తల్లి (I రాజు 11[26]).

**జెరెతు** (Zereth = ప్రకాశము). యూదా గోత్రికులలో నొకఁడు. ఇతఁడు తెకోవ ఊరిలోని యొక కుటుంబమునకు పూర్వికుఁడు (I దిన 4[7]).

**జెరెదు** (Zered = పుష్టిగా పెరుగునది). మృతసముద్రమునకుఁ దూర్పుగా నుండు లోయ (సంఖ్యా 21[12]). ఇశ్రాయేలీయు లీ లోయలోని యేటినిదాటు నప్పటికి వారు అరణ్యములో సంచరించిన 38 సం॥లు ముగిసెను (ద్వితీ 2[14]).

అది అర్నోనునదికి దక్షిణముగా నున్నది గాని దాని యునికినిగూర్చి మఱింత తేటగాఁ దెలియదు.

**జెరెషు** (Zeresh). హామాను భార్య (ఎస్తే 5[10-14] 6[13]).

**జెరెదా** సారెతాను చూ॥

**జెలెకు** (Zelek = బండలోని సందు). ఒక అమ్మోనీయుఁడు. దావీదు యోధులలో నొకఁడు (II సమూ 23[37] = I దిన 11[39]).

## జే

**జేతరు** (Zethar). అహష్వేరోషు షండులలో నొకనిపేరు (ఎస్తే 1[11]).

**జేతాను** (Zethan = ఒలీవచెట్టు). బెన్యామీనీయులలో నొకఁడు (I దిన 7[10]).

**జేతాము** (Zetham). గెర్షోనీయుల తెగకుఁ జేరిన యొక లేవీయుఁడు (I దిన 26[22]).

**జేన** మానములు I చూ॥

**జేనా** (Zenas = జ్యూసను దేవత దానము). క్రేతు ద్వీపములోనున్న యొక ధర్మశాస్త్రవేది. తీతు ఇతనిని తనయొద్దకు పంపవలెనని పౌలు వ్రాసెను (తీతు 3[13]).

**జేరు** (Zer = చెకుముకిరాయి). నఫ్తాలీ గోత్రములోని ప్రాకారపట్టణములలో నొకటి (యెహో 19[35]). దీనియునికి సూటిగా తెలియదు.

## జొ, జో

**జొర్యా, జొరీయులు, జొరాతీయులు** (Zorah = తెగులు? Zorites, Zorathites). మొదట యూదా వారికియ్యఁబడిన పట్టణములలో నొకటి (యెహో 15[33]) గాని, తరువాత దాను గోత్రమునకు సంబంధించినట్లున్నది (యెహో 19[41] న్యాయా 18[2,8,11]). సమ్సోను జన్మభూమి (13[2,25]). దీనికిని ఎష్తాయోలుకును మధ్య ఇతనిని పాతిపెట్టిరి (16[31]). రెహబాము చుట్టుకోట నొకదానిని కట్టించెను (II దిన 11[10]). చెఱకుఁ బిమ్మట యూదావారు నివసించిన పట్టణములలో నిదియొకటి (నెహె 11[29]). దీని నివాసులు జొరాతీయులనఁబడిరి (I దిన 4[2]). 2[54]

లోని జాతీయులును వీరే కావచ్చును. యెరూషలేమునకు 15 మైళ్లు పడమరగా నుండు షెఫేలా ఊళ్లలో ప్రస్తుతము సూరా (*Surah*) యనఁబడునదే దీని యునికియై యున్నది. శోరేకు లోయయందు 800 అడుగుల యెత్తుగల యొక కొండ కొనమీఁద నున్నదగాన కోటనుఁగట్టుటకు మంచితావుగ నుండెనని తెలిసికొనవచ్చును. (పటము II, D 1).

**జోపై** (Zophai = కావలివాఁడు). సమూయేలు తండ్రియగు ఎల్కానా కుమారుఁడు (I దిన $6^{26}$).

**జోఫరు** (Zophar = కిచకిచలాడువాఁడు). యోబు నాదరించుటకు వచ్చిన ముగ్గురు స్నేహితులలో నొకఁడు (యోబు $2^{11}$ $11^{1}$ $20^{1}$ $42^{9}$). అతనికి నయమాతీయుడను బిరుదుగలదు. అది యతని దేశమును సూచించును. LXX లో సితేఁడు మినీయులరాజైనట్లున్నది. అరబీ దేశస్థుఁడనియు ఎదోము సరిహద్దులలో నుండి వచ్చెననియు తలంతురు.

**జోబెబా** (Zobebah = నెమ్మదిగా చలించుట). యూదావారి సంబంధులలో నొకఁడు (I దిన $4^{8}$).

**జోరీగలు** కీటకములు 13 చూ॥

**జోహెలెతు** (Zoheleth, Stone of = సర్పము అను బండ లేక ప్రకాశమాన మైన బండ). అదోనీయా అనువాఁడు దావీదురాజ్యము నపహరింపఁబోవుచుండఁగా బలులు నర్పించిన యొక స్థలము (I రాజు $1^{9}$). అది యెరూషలేములోని ఏన్‌రోగేలు అను నూటయొద్ద నుండెను (యెరూషలేము A II 1 చూ॥).

**జోహేతు** (Zoheth). యూదా సంతతి వారిలో నొకఁడు (I దిన $4^{20}$).

**జోళ్లు** ఆయుధము II 4 చూ॥

## జ్ఞా

**జ్ఞానము, జ్ఞాని** (Wisdom, Wiseman). జ్ఞానులకు ప్రత్యేకమగు వృత్తియొకటి ఉండినటుల బైబిలునందు సూచనలు గలవు. ఫరో నెదుట విద్వాంసులు (= జ్ఞానులు) ఉండిరి (ఆది $41^{8}$ నిర్గ $7^{11}$ మొ॥). పారసీరాజుల సభల యందు ఎఱిఁగినవారు (= జ్ఞానులు) న్నట్లు ఎస్తే $1^{13}$ నందు చూడవచ్చును. బాబెలు దేశము జ్ఞానులకు ప్రసిద్ధికెక్కెను (దాని $2^{12-14}$). వీరందఱును రహస్యములను తెలిసికొని కలల భావమును చెప్పి, మంత్రముల నుపయోగించి, శకునములను చెప్పుచు జ్యోతిశ్శాస్త్రము నభ్యసించినవారై యున్నట్లు కనఁబడుచున్నది.

ఇశ్రాయేలీయులలోను జ్ఞానము నభ్యసించిన వారుండిరి గాని వారట్టి లౌకిక జ్ఞానమును గాక దైవజ్ఞానమునే యభ్యసించిరి. విడికథలను ప్రయోగించెడివారిని జ్ఞానులని పిలిచిరి. తెకోవ ఊరినుండి వచ్చిన యుక్తి (= జ్ఞానము) గల యొక స్త్రీ యొక కథను కల్పించి దావీదు నెదుట చెప్పుటచే అబ్షాలోము తిన స్వదేశమునకు వచ్చినటుల సెలవు నొందెను (II సమూ $14^{1-20}$). యోతాము (న్యాయా $9^{7-20}$), నాతాను (II సమూ $12^{1-6}$), ఒక ప్రవక్త (I రాజు $20^{35-43}$), రాజగు యెహోయాషు (II రాజు $14^{9}$) మొదలగు వారు చెప్పిన కథలు దీనికి సంబంధించినవే. సమ్సోను వేసిన విప్పుడు కథయు అట్టిదే (న్యాయా $14^{14}$). జ్ఞానవంతురాలైన యొక స్త్రీ తన యుక్తిచే ఆబేలు పట్టణపు ముట్టడిని విడిపించెను (II సమూ $20^{16-22}$). ఆయా సమయములకు తగిన ఉపాయములు జ్ఞానవంతులని యెంచఁబడినను నీతి బోధకములగు సామెతలను చెప్పి హితోపదేశములను చేసినవారికి ఈ బిరుదు ముఖ్యముగా పెట్టఁబడెను. అట్టి సామెతల కూర్పునకు జ్ఞానమును పేరుపెట్టిరి (సామె $1^{3}$ సామెతల గ్రంథము చూ॥). జ్ఞానులు యోబు గ్రంథములో నున్నట్లు భక్తులకు కీడులుగుట యెందుకు అను నట్టి సంశయములకు తగిన సమాధానములఁ దెలుపుటకు యత్నించిరి (యోబు గ్రంథము చూ॥). ఈ లోకమందలి ఘనధన సౌఖ్యము లన్నియు వట్టివనియు, దేవునికి భయపడుట మాత్రమే నిత్యభాగ్యమనియు చూపుటకు గ్రంథములను వ్రాసిరి (ప్రసంగి గ్రంథము చూ॥). పాత నిబంధన ప్రమాణిక గ్రంథములలో నీ మూఁడును మూలభాషయందు జ్ఞానము అని యర్థమిచ్చు హక్మా (*Hokmah*) యను భాగమందు

చేరియున్నవి. ఇట్టివాటిని రచించిన వారందరిలో సొలొమోను గొప్ప జ్ఞానియై 3000 సామెతలను 1005 కీర్తనలను రచించెను. ఏతాను హేమాను దర్దయను వారును జ్ఞానులేగాని సొలొమోను అంత గొప్ప జ్ఞానులు కారు (I రాజు $4^{32,33}$). సొలొమోను రచితములన్నియు నేటి వఱకు నిలువలేదు. పై నుదాహరించిన వాటితో సైరాకు రచించిన జ్ఞాన గ్రంథము అను అప్రమాణిక గ్రంథము నొకటి దానికూడ చేరును (అప్రామాణిక గ్రంథములను చూ). సొలొమోను జ్ఞానము అనఁబడిన గ్రంథములో ను ఇట్టి జ్ఞానబోధలు గలవు. దేవునికి భయపడుటయే జ్ఞానమునకు మూలమను ఈ జ్ఞానబోధల సారమై యున్నది. అది ఆత్మసంబంధమైయున్నది. ఇట్టి యర్థములతోనే యెషయా $11^2$ నందు తెలివి యను పదము ఉపయోగింపఁబడెను.

జ్ఞానము ఒక మూర్తియై ప్రజలకు బుద్ధి చెప్పుచున్నట్లీ గ్రంథములలోనున్న ఆయా వాక్యములలందలంకార రీతిగా నున్నది (సామె $1^{20}$ $8^1$ $9^1$ మొ॥). ఇట్లు జ్ఞానము నొకమూర్తిగా నెంచుట యూదుల పారంపర్యమునందొక విశేషవాదుక యయ్యెను. దేవుని యొక్క జ్ఞానమూర్తియగు క్రీస్తుయొక్క సార్థకనామములలో వాక్యమను దాని యుత్పత్తి యిదే యని కొందఱి యభిప్రాయము (వాక్యము చూ॥).

క్రొత్త నిబంధనయందు జ్ఞానులు రాజుగా పుట్టిన యేసును కనుగొనుటకు యూదయకు వచ్చుటచే (మ 2) వారి పేరిచట కనఁబడుచున్నది. ఆ కాలమునందట్టి వాఁడొకఁ డుద్భవించునను నిరీక్షణ అంతటను సర్వసాధారణమైనదై యుండెను. బాబెలు దేశమునందలి జ్యోతిష్కము నభ్యసించినవారు నక్షత్రములలోని సూచనను చూచి దానివలన ఆయనపుట్టెనని తెలిసికొనిరి. తూర్పునుండి వచ్చినవారు బాబెలు ప్రాంతముల నుండియే వచ్చిరని యూదులు ఆ పదమును వాడిన విధమునుబట్టి తెలిసికొనవలెను. గ్రీసు, ఇండియా, ఐగుప్తుదేశములనుండి యొక్కొక్కఁడు వచ్చెనను మాట కల్పనగాక దానిని గూర్చిన తగిన యాధారములు బైబిలునందు లేనేలేవు. యోసేపు (ఆది $41^{8,16}$), దానియేలు (దాని $2^{19-20}$) అను వారివలె పరిశుద్ధ భక్తిగలవారై దేవునివలన గూఢమైన వాటి భావములను తెలిసికొనియుండిరి.

క్రీస్తు ఉపమాన రీతిగా బోధించుటయు (మ 13) పాత నిబంధనలోని జ్ఞానబోధలకుఁ గొంత సంబంధించి యున్నది. లూ $11^{49}$ లో దేవుని జ్ఞానము మాట్లాడుచున్నట్లున్నది. అచ్చట నున్నది పాత నిబంధనలోని వాక్యమైనట్లు లేదు. సామెతల గ్రంథమునందున్న రీతిగా (సామె $1^{20}$ $8^1$ మొ.) క్రీస్తు జ్ఞానము నొక మూర్తిగా నెంచి పలికినట్లున్నది. యాకోబు భూసంబంధ జ్ఞానమునకును పైనుండి వచ్చు జ్ఞానమునకున్న భేదమును గూర్చి తెలిపెను (యాకో $3^{15-17}$). అట్లే పౌలును లోకజ్ఞానమును గూర్చి వ్రాసి దానిని ఖండించెను (I కొరి $1^{19-30}$). ఈ లోక తత్త్వ శాస్త్రజ్ఞులు దేవుని నెఱుఁగక తమ శాస్త్రములను కల్పించిరి కావున అవి వెఱ్ఱితనముగా నెంచఁబడెను. వాటికి జ్ఞానరూపముండినను (కొలొ $2^{23}$) వాటియందు జ్ఞానసారము లేకుండెను. ఇట్లు జ్ఞానమునకు భిన్నముగా పౌలు క్రీస్తు సిలువను గూర్చిన ఆత్మ ప్రసాదమగు జ్ఞానమును బోధించెను (I కొరి 2). బుద్ధిజ్ఞానముల సర్వసంపదలు క్రీస్తునందే గలవు (కొలొ $2^3$).

**జ్ఞానుల కధిపతి** నెర్గల్ షరేజరు చూ॥

**జ్ఞానులు** (Magi, Wisemen). క్రీస్తు బేత్లెహేములో జన్మించిన పిమ్మట ఆయనను చూచి ఆరాధించుటకు వచ్చినవారికి జ్ఞానులు అను బిరుదు కలదు (మ $2^{1,7,16}$). దీనికి అసలులోనున్న పదము పారసీ దేశములోని జ్యోతిష్కులకును గారడి వారికిని పెట్టఁబడిన బిరుదైయున్నది. పారసీ గ్రంథములను చూడఁగా ఒక మహానుభావుఁడు పుట్టుసమయమున ఆయనకు సంబంధించిన యొక ప్రత్యేక నక్షత్రము కనఁబడునను బోధకలదు. కావున వారికి అలవాటయిన ఇటువంటి దానివలన క్రీస్తు పుట్టుకనుగూర్చి దేవుఁడు వారికి తెలిపి యుండెనని తెలిసికొనవచ్చును.

## జ్యే

**జ్యేష్ఠత్వము, జ్యేష్ఠపుత్రుఁడు** (Birthright, firstborn).

1. జ్యేష్ఠపుత్రుని హక్కులు. ఈ దేశములో వలెనే ఇశ్రాయేలీయుల జ్యేష్ఠపుత్రులకు విశేష

హక్కులు గలవు. పిత్రార్జితమునం దతనికక్కువ భాగము వచ్చెను. అది ఇతరులలో ప్రతివానికి వచ్చుదానికి రెట్టింపు అని ద్వితీ $21^{17}$ వలనఁ దెలిసికొనవచ్చును. రాజకుటుంబమునం దుద్భవించిన ప్రథమపుత్రుఁడు రాజ్యమునకు వారసుఁడయ్యెను (II దిన $21^{3}$). జ్యేష్ఠుని కిట్టి హక్కులున్నను బహుభార్యలున్న కుటుంబమునందు జరుగు కుట్రలవలనను ఇతరకార్యములవలనను వారసత్వము ఈ క్రమము ననుసరింప లేదు. అన్యాయవలన దీనిని మార్చరాదను ధర్మశాస్త్ర చట్టము గలదు (ద్వితీ $21^{15-17}$). రూబేను తన దుష్టత్వమువలనను (ఆది $49^{3,4}$ I దిన $5^{1}$), ఏశావు దానిని తృణీకరించి యమ్ముకొనుటవలనను (ఆది $25^{29-34}$) ఆ హక్కును పోఁగొట్టుకొనిరి. ఇష్మాయేలు దాసి కుమారుఁడగుటచేతను వాగ్దత్త పుత్రుఁడు కాకపోవుటవలనను ఈ హక్కు నొందలేదు (ఆది $21^{9,10}$ గల $4^{21-31}$). ఎఫ్రాయిము (ఆది $48^{13-20}$), సొలొమోను (I రాజు 1), షిమ్రి (I దిన $26^{10}$) జ్యేష్ఠులు కాకపోయినను వారికాహక్కు కలిగెను. పిల్లలు లేకనే యొకఁడు చనిపోయినయెడల అతని సహోదరుఁడు ఆ విధవను పెండ్లాడవలెనను ఏర్పాటు కలదు. వారికి పుట్టిన మొదటివాఁడు జ్యేష్ఠపుత్రుఁడుగా నెంచఁబడి చనిపోయినవానికి వారసుఁడయ్యెను (ద్వితీ $25^{5-10}$). జ్యేష్ఠపుత్రుఁడు చనిపోవుట అన్నిఁటిలో గొప్ప శిక్షగా నెంచఁబడెను. ఐగుప్తులో కలిగిన తెగుళ్లయందిది చివరిదియు గొప్పదియునై యున్నది (నిర్గ $11^{4-8}$ $12^{29,30}$). ఈ శిక్షను గూర్చిన అనేక సూచనలు బైబిలునందు గలవు (కీర్త $78^{51}$ $105^{36}$ హెబ్రీ $11^{28}$ మొ॥). I రాజు $16^{34}$ లో నున్నదియు దీనికి సంబంధించినట్టి శిక్షయై యున్నది.

2. జ్యేష్ఠపుత్రుఁడు దేవునికి ప్రతిష్ఠితుఁడై యున్నాఁడు. ప్రథమపుత్రులను తమ దేవతలకు బలినిచ్చుట అన్యజనులలో వాడుకయైయున్నట్లు కొన్ని సూచన లగుపడుచున్నవి (II రాజు $3^{27}$ మీకా $6^{7}$). ప్రతి తొలిచూలు మగపిల్లయు దేవునికి అర్పింపవలెనను నియమము ధర్మశాస్త్రమునందున్నది (నిర్గ $13^{2,16}$) గాని మనుష్యులను అట్లు అర్పింపక దేవుని సేవచేయుటకు వారిని ప్రత్యేకించుచుండిరి. తరువాతి కాలములో జ్యేష్ఠపుత్రులకు మాఱుగా లేవీయులను అట్టి సేవకు ప్రత్యేకించిరి (సంఖ్యా $3^{41-51}$).

3. జ్యేష్ఠత్వమునుగూర్చిన అలంకారములు. జ్యేష్ఠపుత్రునికి కలిగియున్న హక్కులనుబట్టి ఇశ్రాయేలీయుల సనాంగము దేవుని జ్యేష్ఠపుత్రుఁడనియు (నిర్గ $4^{22}$), ఎఫ్రాయిము అనఁబడిన పదిగోత్రములు ఆయన జ్యేష్ఠకుమారుఁ డనియు (యిర్మీ $31^{9}$), దావీదు సంతానమును ఆయన తన జ్యేష్ఠకుమారునిగాఁ జేసుననియు (కీర్త $89^{27}$) చెప్పినట్లున్నది. దీనికి సంబంధముగానే క్రీస్తుయొక్క ఔన్నత్యమును సూచించుటకు ఆయన దేవుని జ్యేష్ఠకుమారుఁ డనఁబడును (రోమా $8^{29}$ కొలొ $1^{15,18}$ హెబ్రీ $1^{6}$ ప్రక $1^{5}$). క్రీస్తునందు చనిపోయిన భక్తులకు విశేష హక్కులు కలవని సూచించుటకు చనిపోయినవారు **జ్యేష్ఠుల సంఘము** అనఁబడుదురు (హెబ్రీ $12^{23}$).

జ్యోతిష్కులు (Astronomers, Astrologers). బైబిలునందు సూర్యచంద్ర నక్షత్రాదులనుగూర్చి శాస్త్రరీతిగా వ్రాయక, మానవులు సాధారణముగా చెప్పుకొను సంగతులను వ్రాసిరి. నక్షత్రములను, గ్రహములను విశేషరీతిని పరిశీలించిన వారున్నట్లు సూచనలుండినను, వారును శకునములు గురుతులు మున్నగువాటిని చూచుటకేగాని శాస్త్రీయముగా వాటిని పరీక్షించినట్లు కనఁబడదు. ఇట్టి విద్యలను మిగుల నభ్యసించినవారిలో బాబెలువారు సుప్రసిద్ధులని లోకచరిత్రవలనఁ దెలియుచున్నది. **నక్షత్రసూచకులు** అనఁబడిన జ్యోతిష్కులు బాబెలును రక్షించఁజాలరని యెషయా చెప్పెను (యెష $47^{13}$). వారు చెప్పు శకునములకు భయపడరాదని యిర్మీయా వారిని హెచ్చరించెను (యిర్మీ $10^{2}$). గూఢార్థములు తెలుపఁగలమని దానియేలు కాలమునందు చెప్పుకొనిన జ్ఞానులిట్టి జ్యోతిష్కులే (దాని $1^{20}$ $2^{2,27}$ $4^{7}$ $5^{7,11,15}$). క్రొత్త నిబంధనకాలమునందు క్రీస్తు పుట్టినప్పుడు ఆయనను చూచుటకు వచ్చిన వారు అట్టివారే (మ $2^{2}$). పలెస్తీనుచుట్టునున్న వారిలో ఇట్టి విద్య యెంత ప్రబలమైనను యూదులలో నదెన్నడును వృద్ధిఁజెందలేదు. ఇట్టి జ్యోతిష్కులు ముహూర్తములను పెట్టుటవలన వారు

మాసచర్య చెప్పువారు అనఁబడిరి. ఇశ్రాయేలీయులు బాబెలువారికి సంబంధులైన సమయమునందు వారిట్టి విద్యలను అభ్యసించిరిగాని స్వంతముగా వాటిని అభ్యసించలేదని పై సూచనల వలన కనఁబడుచున్నది.

**జ్వరము** రోగములు చికిత్సలు II 10 (3) చూ॥

## ట, టా, టి, టె

**టబ్బోయాతు** (Tabboath = ముద్దుటుంగరములు). జెరుబ్బాబెలుతోకూడ చెఱనుండి తిరిగివచ్చిన నెతేనీయులలో నొక తెగవారి పూర్వికుఁడు (ఎజ్రా $2^{43}$ నెహె $7^{46}$).

**టబ్రిమ్మోను** (Tabrimmon = రిమ్మోను దేవత మంచిది) సిరియారాజైన బెన్హదదు తండ్రి (I రాజు $15^{18}$).

**టర్పెలాయులు** (Tarpelites). అష్షూరు రాజు ఇశ్రాయేలు దేశములో నుంచిన అన్యులలో నొక తెగవారు (ఎజ్రా $4^{9}$). వీరు బబులోను ప్రాంతములలోనున్న తర్పెలు అను స్థలము నుండి వచ్చినవారని యూహింపఁదగును గాని రూఢిగా నిశ్చయించుటకు ఇతర యాధారములు లేవు.

**టల్మోను** (Talmon = బాధింపఁబడు వారు). దేవాలయ ద్వారపాలక కుటుంబములలో నొకటి (I దిన $9^{17}$ ఎజ్రా $2^{41}$ నెహె $7^{45}$ $11^{19}$ $12^{25}$).

**టాఫతు** (Thaphath = బిందువు). రాజైన సొలొమోను కుమార్తె. ఈమెను అబీనాదాబు కుమారునకిచ్చి పెండ్లిజేసిరి (I రాజు $4^{11}$).

**టాబెయేలు** (Tabeal, Tabeel = దేవుఁడు మంచివాఁడు).

1. రెజీను పెకహు అను వారలు ఆహాజు రాజ్యము నపహరించి దాని నియ్యఁదలంచిన యొకని తండ్రి (యెష $7^{6}$). ఎజ్రా $4^{7}$ నందున్న టాబెయేలునకు నిదే గుణింతమున్నది.

2. సిరియనుఁడగు ఒక పారసీ యుద్యోగి. యూదులు యెరూషలేము గోడలను కట్టుచున్నారని అర్థహష్తసు తెలిపినవారిలో నొకఁడు (ఎజ్రా $4^{7}$).

**టాల్మదు** (Talmud = విద్య). యూదుల పారంపర్యబోధల సముదాయమునకు వారు టాల్మదు అను పేరుపెట్టిరి. దేవుఁడు మోషేకు ధర్మశాస్త్రము నిచ్చినప్పుడు దానిని వివరించిన మాటలను మోషే వ్రాసియుంచక వాటిని తన శిష్యులకుఁ జెప్పెననియు, ఆయన శిష్యులు తమకుఁ బిమ్మట వచ్చినవారికిఁ జెప్పిరనియు ఇట్లవి పారంపర్యముగా వచ్చెననియు వారనుకొనిరి. క్రీస్తు కాలమునకు తరువాత యూదులలో పండితులైన వారు వీటినన్నిఁటిని సమకూర్చి అట్టి కూర్పున కీ పేరుపెట్టిరిగాని, యూదులపండితు లాకాలమందు పలెస్తీనుదేశములోను బబులోను దేశములో నుండుటచే ఆ రెండు దేశములలో వారు సమకూర్చిన పారంపర్యము లొక్కటిగా నుండక రెండు విధములుగా నున్నవి కావున, యెరూషలేము టాల్మదనియు, బబులోను టాల్మదనియు రెండువిధము లగు టాల్మదులు కలవు. యూదుల పారంపర్యములను తెలిసికొనుట కివి చాల యుపయోగకరములుగ నున్నను యూదు లనుకొనినట్లవి దేవుఁడు పలికినమాటలుగాక మనుష్యుల కాలక్రమమున స్వయముగాచేసిన వివరములని తెలిసికొనవలెను. (పారంపర్యాచారములు చూ॥).

**టికేల్** మినే చూ॥

**టిభ్హతు** (Tibhath = వధ). సోబా రాజైన హదరెజెరు పట్టణములలో నొకటి. అచ్చటినుండి దావీదు ఇత్తడిని తీసికొనివచ్చెను (I దిన $18^{8}$). II సమూ $8^{3}$ నందు దానికి బెతహు అను మారు పేరు కలదు. సిరియక్ తర్జుమాలో దానికి తెబహు అను మఱియొక రూపము కలదు. దీని యునికి రూఢిగా తెలియక పోయినను లెబానోను నెదుటి భాగమందలి తూర్పు ప్రాంతములలో నున్నదని చరిత్ర సంబంధమువలనఁ దెలియును.

**టుక్కీము** ధ్వజము చూ॥

**టుబేతు** కాలమానము VI 10 చూ॥

## టో, డా, డె, డే, డో

**టోబదోనీయా** (Tob-Adonijah = నా ప్రభువగు యెహోవా దయాళుఁడు).

రాజైన యెహోషాపాతు యూదయ దేశమందలి యూళ్లలో ధర్మశాస్త్రమును బోధించుటకు పంపించిన లేవీయులలో నొకఁడు (II దిన 17$^{8}$).

**టోబీయా** (Tobiah, Tobijah = యెహోవా దయాళుఁడు). తెలుఁగునందున్నట్లు హెబ్రీలోకూడ ఒక గుణింతమే గలదు.

1. రాజైన యెహోషాపాతు **యూదయ** దేశమందలి యూళ్లలో ధర్మశాస్త్రమును బోధించుటకు పంపిన లేవీయులలో **నొకఁడు** (II దిన 17$^{8}$).

2. చెఱనుండి తిరిగివచ్చిన యొక కుటుంబమునకు పేరు. వీరు తమ పితరులయొక్క యింటినైనను వంశావళినైనను చూపింపలేకపోయిన వారిలో చేరినవారు (ఎజ్రా 2$^{60}$ నెహె 7$^{62}$).

3. అమ్మోనీయులలో నొకఁడు (నెహె 2$^{10}$ 4$^{3,7}$ 6$^{1,17}$). ఇతఁడు సన్బల్లటుతోను ఇంకి నితరులతో గలిసి నెహెమ్యా యెరూషలేము ప్రాకారములను కట్టుచుండఁగా అతని పనిని మిగుల నడ్డగించినవాఁడై యుండెను. 13$^{4}$ నందు ఇతఁడు గొప్పవారితో వియ్యమందినందున ఆలయము చుట్టునున్న ఆవరణములో నివసించుటకు సెలవునొందెనుగాని నెహెమ్యా అతని నడ్డగించెను.

4. ఆలయమునకొఱకు వెండి బంగారములు నర్పించుటకై బబులోనునుండి యెరూషలేమునకు వచ్చిన దూతలలో నొకఁడు (జెక 6$^{10,14}$).

**టోబు** (Tob). దమస్కునకు దక్షిణముగా నుండు సిరియా సంస్థానములలో నొకటి. హామాతు సోబా బేత్రెహోబు మయకా అనునవికూడ ఇట్టి సంస్థానములై యున్నవి. టోబు వీటన్నిఁటిలో మిక్కిలి తూర్పుగా నుండెను. యెఫ్తా తన సహోదరులచే తిరస్కరింపఁబడినపు డీ ప్రాంతమునకు పారిపోయెను (న్యాయా 11$^{3,5}$). టోబుదేశస్థులు అమ్మోనీయులతో గలసి దావీదుకు విరోధముగా యుద్ధము చేసిరి (II సమూ 10$^{6}$).

**డాలు** ఆయుధములు II 1, కోట III 4 చూ॥

**డెబ్బది** సంఖ్యలు 7 చూ॥

**డేగ** పక్షులు 21 చూ॥

**డేరాలుకుట్టుట** వృత్తులు చేతిపనులు I 1 చూ॥

**డోలీ** (Litter). దేవుని ప్రజలు తిరిగి యెరూషలేమునకు ఎక్కివచ్చు వాహనములలో నొకటి (యెష 66$^{20}$). ఈ మాటయొక్క మూలపదము నెమ్మదిని సూచించును కావున నెమ్మదిగా ప్రయాణము చేయువారు ఈ వాహనముల మీఁద నెక్కి తిరిగిరని కనఁబడును. సంఖ్యా 7$^{3}$



డోలీ

నందీ పదమునే బండి యని అర్థమిచ్చు మరి యొక పదముతోఁ గలిపి **గూటిబండి** యని తెనిఁగించిరి.

## త

**తంగేడు** (Juniper). ఈ పదముచే తెనిఁగించిన రోతెము అను మూల భాషాపదమువలన సూచింపఁబడునది తంగేడు చెట్టువంటి ఒక చిన్న చెట్టయి యున్నది. ఇది పలెస్తీను చుట్టుపట్ల



తంగేడు చెట్టు

నున్న అడవులలో విశేషముగా పెరుగును (కీర్త 120[4]). ఈ పదమునే I రాజు 19[4] నందు బదరీ వృక్షమని తెనిఁగించిరి. ఇట్లు వేఱు వేఱు పదములు వాడుటకన్న మూలభాషా పదమునే యుంచుట యుక్తముగా నుండును.

J. C.

**తండ్రి** దేవుడు III 1,2,3, కుటుంబము 3 చూ॥

**తంతి వాద్యము** (Neginoth). కీర్తనల గ్రంథమందలి 4,6,54,55,61,67,76 కీర్తనల పై వ్రాఁతలలో నీ మాటలు కనఁబడును. ఈ కీర్తనలు తంతి వాద్యములతోఁ గలిపి పాడఁదగినట్లు కనఁబడుచున్నది. హబక్కూకు చేసిన ప్రార్థనయు అట్టిదే (3[1,19] సంగీతము 3 (3) - (b) చూ॥).

**తంబుర** సంగీతము 3 (1) (a) చూ॥

**తక్షోనీయుడు** హక్మోనీ చూ॥

**తగరము** లోహములు 5 చూ॥

**తత్తెనై** (Tuttenai). ఎజ్రా కాలములో దర్యావేషు అను చక్రవర్తి క్రింద సిరియా దేశాధిపతిగా నుండినవాఁడు (ఎజ్రా 6[6,13]).

**తత్వజ్ఞానము** (Philosophy, Science). కొలొ 2[8] లోను దాని 1[4] లోను ఈ మాటను వాడియున్నారు. దాని 1[4] లో ఈ పదము విద్యను సూచించును. కొలొస్సైలో అది షడ్దర్శనములవంటి తత్వశాస్త్రమును సూచించును. అది యూదుల యోగము అని కొలొ 2 వ యధ్యాయములోని సూచనలవలనఁ దెలిసికొనవచ్చును. వీటి ననుసరించినవారు తుదకు జ్ఞోస్టికులైనట్లు కనఁబడును.

**తద్దయి, లెబ్బయి** (Thaddaeus, Lebbaeus = ప్రియుఁడైన బిడ్డ?). పండ్రెండుగురు అపొస్తులులలో నొకఁడు (మ 10[3] మా 3[18]). లూ 6[16] కార్య 1[13] నందున్న పట్టీలలో నీ పేరుకు బదులు **యాకోబు కుమారుడగు యూదా** అను పేరుగలదు. ఈ రెండు పేరులుగలవారొక్కరే యని నమ్ముట కాస్పదము గలదు. యోహా నీతని ఇస్కరియోతు కాని యూదా యని పేర్కొనెను (యోహా 14[22]).

ఇతనిగుఱించి ఇంక విశేషమేమియు బైబిలు నందు గనఁబడుటలేదు. ఇతఁడు సిరియా అరేబియా, మెసపొతేమియ పర్షియా యను దేశములలోఁ దిరిగి బోధించి చివరకు అరేబియాలో హతసాక్షి యాయెనను ఇతిహాసమొకటి గలదు.

E.

**తద్మోరు** (Tadmor = ఈఁతచెట్టుకు సంబంధించిన). ఈ పట్టణమును సొలొమోను కట్టించి యున్నట్లు II దిన 8[4] లో నున్నది. I రాజు 9[18] లో కూడా ఇదే పేరు కలదు. ఇది దమస్కునకు 120 మైళ్లు ఈశాన్యముగా నుండి దానికిని యుఫ్రాతునదికిని మధ్యనుండు నొక పట్టణము. ప్రాఁత నిబంధనకాలమునకు తరువాత దీనికి పల్మైరా (*Palmyra* = ఈఁతచెట్టు) అను పేరు కలదు. దాని కింకను తెద్మూరు (*Tedmur*) పేరున్నది గాని ప్రస్తుతమచట పాడు దిబ్బలు కాక, మఱేవియు లేవు. (పటము VIII, C 2).

**తన్హుమెతు** (Tanhumeth = ఆదరణ). యూదులు చెఱఁబట్టఁబడిన పిమ్మట మిగిలిన వారికి అధిపతియైన గెదల్యాయొద్దనుండిన సేనాధిపతులలో శెరాయా యను నొకని తండ్రి (II రాజు 25[23] యిర్మీ 40[8]).

**తపేల** పంట సామగ్రి 3 చూ॥

**తప్పూయ** (Tappuah = రేఁగుపండు లేక రేఁగువంటి పండు).

1. హెబ్రోను కొమరులలో నొకఁడు (I దిన 2[43]). అతనినిబట్టి షెఫేలాలోని యూళ్లలో నొకదానికీ పేరు వచ్చినట్లున్నది. యెహో 15[54] నందు దీనికి **బేత్తపూయ** అను మాఱుపేరు గలదు.

2. ఏన్తప్పూయ అనఁగా తప్పూయ ఊఁట యని యర్థము. మనష్షే గోత్రపు సరిహద్దులో నున్న యొకయూఁట (యెహో 17[7]). యెహో 16[8] 17[8] లోని తప్పూయ ఇదే యని సాధారణముగా ననుకొందురు.

3. యెహోషువ జయించిన పట్టణములలో నొకటి (యెహో 12[17]). ఇదియు 2 లో నున్నదియు నొకటే యనుకొందురుగాని అది రూఢి కాదు. (పటము III, F 4).

**తబితా** దొర్కా- చూ॥

**తబేరా** (Taberah = మంట). ఇశ్రాయేలీయులు సీనాయికొండను విడిచివెళ్లిన పిమ్మట మకాముచేసిన యొక స్థలము (సంఖ్యా $11^{3}$ ద్వితీ $9^{22}$). అచట వారికి శిక్షకలిగెను. దీని యునికినిగూర్చి తెలియదు.

**తబ్బాతు** (Tabbath). గిద్యోను మిద్యానీయులను జయించిన స్థలములలో నొకటి (న్యాయా $7^{22}$). దీని యునికినిగూర్చి తెలియదు.

**తమాలవృక్షము** ఖర్జూరపు వృక్షము చూ॥

**తమ్మూజు** (Tammuz).

1. సిరియా దేశస్థుల దేవత. యెరూషలేము స్త్రీలు దీని నారాధించినట్లు యెహెజ్కేలు తన దర్శనమందు జూచెను (యెహె $8^{14}$). తమ చుట్టు ప్రక్కలనుండు విగ్రహారాధికులగు జనాంగములతోఁ గలిసి ఈ స్త్రీలు తమ్మూజుకొఱకు ఏడ్చుచుండిరి. ఫేనికేయు లారాధించిన సూర్యదేవతయగు ఆదోనిస్ అనునదే సిరియా భాషలో తమ్మూజు అనఁబడెను.

తమ్మూజు బబులోనీయుల సూర్యదేవత. ఈ దేవతయొక్క భార్యయే ఇష్తారు లేక అస్తారెతు (అష్తారోతు చూ॥). టైగ్రిసు యుఫ్రాతునదులు ఇరుపార్శ్వముల ప్రవహించుచున్న ఎరిదు అను తోఁటమధ్యనున్న జీవవృక్షపునీడను తమ్మూజు నివసించుచుండును. ఇతఁడొక గొల్లవాఁడు. యౌవనమునందు శీతకాలమను పందికోరలచే హతుఁడయ్యెను. అంతట అతని భార్యయగు ఇష్తారతనికొఱ కంగలార్చుచు తుద కతని వెదకి తీసికొనివచ్చుటకుగాను పాతాళలోకమునకు వెళ్లెను. ఇవ్విధముగా నామె పాతాళలోకములో నున్నంతమట్టుకు ప్రకృతియందెట్టి అభివృద్ధియు కలుగలేదని బబులోనీయుల పురాణములయందొక గాథ కలదు.

ఇది భూభ్రమణమునుబట్టి కలుగు ఋతువులను సూచించెడి యొక కావ్యసంబంధమైన యలంకారమైనట్లు తోఁచును. మార్చి 21, సెప్టెంబరు 21 తేదీలయందు సూర్యుఁడు సరిగా భూమధ్యరేఖమీఁద నుండును. జూన్ 21 తేదీన కర్కాటరేఖమీఁద నుండును. మార్చి 21 నుండి జూన్ 21 తేదీలమధ్య భూమధ్యరేఖకు ఉత్తరమున నున్నవారికి వేసవికాలముగా నుండును. అట్లే సెప్టెంబరు 21 నుండి డిసెంబరు 21 వఱకు భూమధ్యరేఖకు దక్షిణమున నున్నవారికి వేసవికాలమై యుండును. ఉత్తర ప్రాంతవాసులకు జూన్ 21 నుండి చలికాలారంభము గాన దాదాపు జూన్ 20 నుండియే తమ్మూజు మరణపు జ్ఞాపకార్థము పండుగ చేయుదురు. అప్పుడు వారు మిగుల అంగలార్చెడివారు. అటుపిమ్మట అతని విషయమై సంతోషించెడి కాలమువచ్చినను, దుఃఖదినములను ఏడుదినములును ముఖ్యముగా స్త్రీలు వెండ్రుకలను లాగుకొనుచు, శరీరమును గాయపఱచుకొనుచు దుఃఖించి ఈ పండుగు నాచరించిరి. ఈ ప్రలాపమునే యెహెజ్కేలు తన దర్శనమునఁ జూచెను. ఇట్టి అంగలార్పునుగూర్చి యితర ప్రవక్తలును సూచించిరి (యిర్మీ $22^{18}$ ఆమో $8^{10}$ జెక $12^{10}$).

2. యూదుల నాల్గవనెల. అది జూన్ చివరగాని జూలై మొదటగాని యారంభించును). (కాలమానము VI 4 చూ॥). B.

**తరలా** (Taralah = తూలుట). బెన్యామీనీయుల ప్రదేశములోనున్న ఒక యూరు (యెహో $18^{26}$).

**తరేయ** (Tahrea, Tarea = యుక్తి.) యోనాతాను కొడుకగు మెరీబ్బయలు (=మెఫీబోషెతు) మనుమఁడు (I దిన $9^{41}$). ఇంగ్లీషునందున్నట్లు మూలభాషయందును ఈ పేరు గుణింతములోఁ గొంచెము భేదము గలదు.

**తర్కములు, వాదములు, తర్కవాది** (Dispute, Disputer). పండితులు తర్కించుటవలన తమ బోధలను నిర్ధారణచేయుట పూర్వమెట్లు హిందువులకు వాడుకయో అట్లే గ్రీకువారిలో నిది సర్వసాధారణమాయెను. దైవసంగతులను తమ స్వంత జ్ఞానముచేఁ దెలిసికొనఁగలమని తర్కవాదు లభిప్రాయపడినందున పౌలు వారిని ఖండించి (I కొరి $1^{20}$) వారివాదములు దేవునిఁ దెలిసికొనుటలో కేవలము నిష్ప్రయోజనమని దెలిపెను. స్తెఫను (కార్య $6^{9}$), పౌలు

($9^{29}$ $17^{17}$ $19^{8,9}$) క్రీస్తుమత సత్యములను నిరూపించుటకు యూదులతో తర్కించిరి. సున్నతి పొందుట యవసరమా యను విషయములో అంతియొకయలోను యెరూషలేము సభయందును తర్కించుటవలన దానిని గూర్చిన సత్యము తేలెను ($15^{3,6}$). అట్టి తర్కములు సరియైనవైనను పనికిమాలిన వాటికొఱకైన తర్కములనేకములు వచ్చును. మూలభాషయందు తర్కించుటను సూచించెడి పైమాట మాత్రమేగాక వాదములను సూచించెడి మాటలు ఇంక కొన్ని గలవు. శిష్యులు గొప్పతనమునుగూర్చి వాదించుకొనిన సందర్భమునం దుపయోగించిన మాట యొకటి. వారిట్లు వాదించుకొనినందున ఆయన వారిని గద్దించెను (మా $9^{33}$). కొద్ది యనుభవముమాత్రమే గల క్రైస్తవుల యభిప్రాయములు సరికావని నిర్ధారణచేయుటకు వారితో వాదించినయెడల అవి సంశయాస్పద వాదములగునేమోయని అట్లు వాదించరాదని పౌలు సలహాచెప్పెను (రోమా $14^{1}$). పౌలు బర్నబాలకు కలిగిన తీక్ష్ణమైనవాదమని తెనిఁగించిన పదము మఱియొకటియై గొప్ప ఉద్రేకమును సూచించును (కార్య $15^{39}$).

**తర్తాకు** (Tartak). అష్షూరు రాజగు సర్గోను ఇశ్రాయేలు దేశములోకి తీసికొనివచ్చిన అన్యులలో అవ్వీయులను వారు పూజించిన యొక దేవత పేరు (II రాజు $17^{31}$). బబులోనీయుల టాల్మదు ప్రకారము ఈ దేవతకు గాడిద రూపమున్నట్టు వ్రాయఁబడి యున్నదిగాని బబులోను శాసనములనుగూర్చిన గ్రంథములలో అట్టి దేవత పేరు కానరాదు.

**తర్తాను** (Tartan). అష్షూరు సేనలన్నిఁటికి సేనాధిపతిగా నుండువాని యుద్యోగపు బిరుదు. బైబిలు ఈ బిరుదు అష్డోదును జయించుటకు అష్షూరురాజగు సర్గోనుచే పంపఁబడిన సేనాధిపతికిని (యెష $20^{1}$) సన్హెరీబుచే హిజ్కియా యొద్దకు పంపఁబడిన సేనాధిపతులలో నొకనికిని గలదు (II రాజు $18^{17}$).

**తర్షీషు** (Tarshish). ఈ పేరు పాఁత నిబంధనలో ననేక పర్యాయములు కనఁబడినను దాని యునికిపట్టునుగూర్చి తేటగా తెలియదు. యోనా $1^{3}$ $4^{2}$ చూడఁగా అది పలెస్తీనుకు పశ్చిమమున నున్నదని తెలియును. ఆది $10^{2}$ లో నున్న తీరసు $10^{4}$ లో నున్న తర్షీషు (ఇచ్చట మనుష్యుఁడుగా చెప్పఁబడెను) అనునదిస్థలమే యని కొందఱనుకొందురు. అది పలెస్తీనుకు చాల దూరముగా నున్నదనుటచే అది స్పెయిన్ దేశములో నున్నదను కొనువారు కూడకలరు. అయితే కొందఱది కిలికియలోనుండు తార్సు అని యందురు. అచటినుండి వెండి (యిర్మీ $10^{9}$) యు, తగరమును, ఇనుమును సీసమును (యెహె $27^{12}$) ఎగుమతి యగుచుండెను. ఈ వర్తకమునుబట్టి చూడఁగా అది స్పెయిన్ దేశములోనున్న దనుకొనుట మఱి బాగుగా నుండును.

చాల దూరప్రయాణములను చేయుటకై పూర్వము తర్షీషు ఓడలను కట్టిరి (I రాజు $22^{48}$ II దిన $20^{36}$ కీర్త $48^{7}$ యెష $2^{16}$ $23^{1}$ యెహె $27^{25}$) కావున అవి యే దిక్కునకుఁ బోయినను వాటికి పెద్ద యోడలను పేరు వచ్చెను. (ఓడలు 3 చూ॥).

**తల, శిరస్సు** (Head). ఈ పదముయొక్క సామాన్య అర్థము అనేకమారులు బైబిలునందు వాడఁబడెను. ఈ శీర్షిక క్రింద అలంకారార్థముగ నుపయోగింపఁబడిన సూచనలుమాత్రము వివరింతుము.

1. తల ప్రాముఖ్యతను సూచించును (యెష $9^{14,15}$). మూలభాషయందు గోత్రముల పెద్దలు వాటి తలలనఁబడిరి. ఇంగ్లీషుభాషయందు నాయలంకారమునే యుంచిరిగాని తెలుఁగున ఆ పదమును మూలపురుషులనియు (నిర్గ $6^{14,25}$), ప్రధానులనియు ($18^{25}$ యెహో $11^{10}$ మొ॥), ముఖ్యులనియు (సంఖ్యా $1^{4}$ ద్వితీ $1^{15}$ మొ॥) తర్జుమాజేసిరి. ఇట్టి ప్రధానత్వము నీ పదముచే సూచించినందునే క్రీస్తు సంఘమునకును (కొలొ $1^{18}$ ఎఫె $5^{23}$), అన్నిఁటికిని ($1^{22}$ $2^{10}$) శిరస్సుగా నున్నాఁడని చెప్పఁబడెను. అట్టి ప్రాముఖ్యతను తెలుపుటకే భార్యకు భర్త శిరస్సు అను అలంకారమును వాడిరి ($5^{23}$ I కొరి $11^{3}$). కట్టడములోని ముఖ్యరాతిని మూలకు **తలరాయి** అని పిలిచిరి (I పేతు $2^{7}$ మా $12^{10}$).

2 తలలు ఎత్తుకొనుట. ఈ విధముగానే ప్రధానత్వమును వహించుకొనుటకు సూచనగా నున్నది (న్యాయా $8^{28}$). ఒకని తలయెత్తుట అతనికి దయచూపుటకు సమానము (ఆది $40^{13,19}$,

20). II రాజు 25[27] (= యిర్మీ 52[31]) నందు యెహోయాకీను తలనెత్తుట యను మూలభాషా పదమును సరిగా తెనిఁగించక అతనికి దయ చూపుట అను మాటతో తెనిఁగించిరి. కీర్త 24[7,9] లో ద్వారములు తెరువఁబడుట యనునది, తలలెత్తుట యని మూలభాషలో అలంకారముగా నున్నది.

**తలగొట్టించుట** నేరములు శిక్షలు III 7 (4) చూ॥

**తలనంటుట, నూనె పూయుట లేక రాచుట** (Anoint). దేహమునకు నూనె రుద్దుకొనుట ఈ దేశమందువలె పలెస్తీనులోను వాడుకయైయున్నది (రూతు 3[3] కీర్త 104[15] సామె 27[9]) గాని దుఃఖసమయములయందు వారు దీనిని వాడలేదు (II సమూ 14[2] మ 6[17]). ఆతిథ్య మిచ్చునప్పుడు అతిథి తలనంటుటవలన నెక్కువ గౌరవించిరి (కీర్త 23[5] లూ 7[46] యోహా 12[3]). దీనిని సాధారణముగా తలకంటినను, పాదములకు పూయుట మఱీ గొప్ప మర్యాదఁగా భావించిరి. చికిత్సకును దీనివాడిరి (యెష 1[6] లూ 10[34] యాకో 5[14]). మృతులకళేబరములకును వారు గౌరవార్థముగా నూనె పూసిరి (మా 14[8] లూ 23[56] యోహా 11[2]).

**తలరాయి** మూలరాయి చూ॥

**తలవెంట్రుకలు, శిరఃకేశములు** (Hair). వెంట్రుకలను కత్తిరించు విషయమాయా దేశములలో నాయా వాడుకలున్నవి. ఐగుప్తులో పురుషులు తలను క్షౌరము చేయించుకొన్నట్లును, అష్షూరులో వెంట్రుకలను పెంచుకొన్నట్లును గ్రీకు చరిత్రకారుఁడగు హెరొడొటసు వలనఁ దెలియుచున్నది. గాని ఇశ్రాయేలీయులు వెంట్రుకలను పెఱుగనిచ్చినను అవి సుమారుగా నుండునట్లు వాటిని కత్తిరించిరి. సుందరమైన వెంట్రుకలుగల అబ్షాలోము ప్రతియేట వాటిని కత్తిరించెను (II సమూ 14[26]). మంగలికత్తిని గూర్చిన సూచనలుండుటవలన (యెష 7[20] యెహె 5[1]) మంగలివారిశ్రాయేలీయుల దేశమున నున్నట్లూహింపవచ్చును. నాజీరు వ్రతస్థులు మంగలకత్తి నెన్నడైనను తమ తలలమీఁద పెట్టించుకొనలేదు. ఆ వ్రతదినములు పరిపూర్తియైన తరువాతనే వాటిని క్షౌరముచేయించుకొనిరి (సంఖ్యా 6[18] కార్య 21[24] 18[18] తో సరి పోల్చుము). ఇట్టి నాజీరువ్రతస్థులలోఁ గొందఱు యావజ్జీవము నాజీరులుగా నుండిరి. సమ్సోను (న్యాయా 13[7]), బాప్తిస్మమిచ్చు యోహాను (లూ 1[15]) అట్టివారు (నాజీరు చూ॥). తల వెంట్రుకలను గుండ్రముగా కత్తిరించుట అనఁగా కొంత క్షౌరము చేయించి కొంత చేయించుకొనక పోవుట యూదులకు నిషిద్ధము (లేవీ 49[27]). అట్లే దుఃఖసూచనగా కనుబొమల మధ్యను బోడి చేసికొనుటయు నిషిద్ధము (ద్వితీ 11[1]). ఇవి అన్యులవాడుకలగుటచే నిషేధింపఁబడినవని తెలిసికొనుట యుక్తము. యాజకులెన్నడైన నట్లు చేసికొనరాదు (లేవీ 21[5]). స్త్రీలు తమ వెంట్రుకలను కత్తిరించక వాటిని పెంచుకొనిరి (I కొరి 11[15] ప్రక 9[8]). అవి సౌందర్యమునకు సూచన (పర 7[5]). జడలను వేసి (I తిమో 2[9] I పేతు 3[3]) వెంట్రుకలనలంకరించుకొనిరి. వాటికి నూనెను వ్రాయు వాడుకయు గలదు (కీర్త 23[5] మ 6[17]).

కుష్ఠరోగి శుద్ధుఁడైనపిమ్మట వెంట్రుకలన్నిఁటిని క్షౌరము చేయించుకొనవలసి యుండెను (లేవీ 14[8,9]). అట్లే యుద్ధమునందు అన్యస్త్రీని చెఱపట్టి ఆమెను భార్యగా పరిగ్రహించు ఇశ్రాయేలీయుఁడు ఆమె తలను క్షౌరము చేయించి ఆమెను మొదట శుద్ధిచేయవలెను (ద్వితీ 21[12] గడ్డము చూ॥).

**తలాంతు** మానములు IV, నాణెములు 1 చూ॥

**తలీతాకుమీ** (Talitha cumi = బిడ్డా లెమ్ము). క్రీస్తు యాయీరు కుమార్తెను బ్రతికించిన సమయమున ఆమెతో ననినమాట (మా 5[41]). దీనివలనను, మార్కు వ్రాసిన అట్టి యితర మాటలవలనను (7[11,34] 15[34]) క్రీస్తు హెబ్రీ ప్రాకృతమని యెంచఁదగిన అరమేయిక్ భాషను మాటలాడెనని సాధారణముగాఁ దలంతురు.

**తలుపు** ఇల్లు II 9, 10 ద్వారము చూ॥

**తలుపు స్తంభములు** ద్వారబంధపు కమ్ములు చూ॥

**తల్మయి** (Talmai = చాళ్లకు సంబంధించిన).

1. పూర్వకాలమందు హెబ్రోను ప్రాంతములో నుండిన యొకతెగవాడు. కాలేబు వీరి

నోడించి యచటినుండి వెళ్లఁగొట్టెను (సంఖ్యా 13[22] యెహో 15[14] న్యాయా 1[10]).

2. గెషూరురాజు. ఇతఁడు తన కుమార్తె యగు మయకాను దావీదున కిచ్చెను (II సమూ 3[3] 13[37] I దిన 3[2]).

**తల్లి, తల్లిదండ్రులు** కుటుంబము 3, నేరములు శిక్షలు II 1 (1) చూ॥

**తహాను, తహానీయులు** (Tahan, Tahanites). ఎఫ్రాయిమీయుల తెగలలో నొకదానికి పెద్ద (సంఖ్యా 26[35] I దిన 7[25]). ఆ తెగవారు తహానీయులనఁబడిరి.

**తహాపనేసు** (Tahpanhes, Tehaphnehes). ఐగుప్తుదేశపు పురాతన పట్టణములలో నొకటి (యిర్మీ 2[16] 43[7] 44[1] 46[14] యెహె 30[18]). ప్రస్తుతము దానిపాడుశేషములున్న స్థలమునకు టెల్ దెఫ్నే (*Tell-Dephne*) అను పేరుకలదు. అది పితోనుకు 6 క్రోసులు ఉత్తరముగా నున్నది. అది క్రీ॥ శ॥ పూర్వము 7 వ శతాబ్దములో కట్టఁబడెను. ఇది ఐగుప్తుకు తూర్పుభాగమున నుండు ఒక కోట యని గ్రీకుచరిత్రకారుఁడగు హెరొడోటసనువాఁడు వ్రాసెను. పూర్వము నైలునదియొక్క పాయలీపట్టణముదగ్గర నుండెను గాని యిప్పుడవి లేకపోవుటచే ఆ ప్రాంతము యావత్తు ఎడారియయ్యెను. గెదల్యాను చంపిన తరువాత యూదులలో మిగతవారచటికి వెళ్లిరి. యిర్మీయాకూడ వారివెంట వెళ్లెను. (పటము VI, D 2).

**తహాషు** (Tahash = ఒకవిధమైన చేఁప). నాహోరు కొడుకులలో నొకఁడు (ఆది 22[24]).

**తహ్తీం హొద్షీ దేశము** (Tahtim Hodshi, The Land of). దావీదుకాలమందతని యాజ్ఞప్రకారము యోవాబు ప్రజలను లెక్కించునప్పుడు యొర్దానునదికి తూర్పున అతఁడు దర్శించిన యొక పట్టణపుపేరు (II సమూ 24[6]). అది గిలాదుకును దానాయానుకును మధ్యను వ్రాయఁబడుటచే ఆ స్థలములమధ్య నుండెనని యూహింపవచ్చును. దీనియునికినిగూర్చి మఱేమియుఁ దెలియదు. కొందఱీపేరు వ్రాయుటయందు తప్పువ్రాసిరని యనుకొందురు. వారు దాని సవరణచేయురీతిని చూడఁగా దీనికి కాదేషుదగ్గఱనుండు హిత్తీయులదేశమని యర్థము చెప్పుదురు.

**తహ్పనేసు** (Tahpenes). ఫరో భార్య పేరు. ఈమె చెల్లిలిని హదదు వివాహమాడెను. (I రాజు 11[20]).

## తా

**తానాకు** (Taanach = ఇసుకప్రదేశము). ఇశ్రాయేలీయులు కనానీయులను జయింపఁగా వారికిఁ జెందిన రాచకీయపట్టణములలో నొకటి (యెహో 12[21] I రాజు 4[12] I దిన 7[29]). పాత నిబంధనయం దీపట్టణమునుగూర్చి యున్న సూచనలన్నిఁటిని చూడఁగా మెగిద్దో యను నూరిపేరుతో కూడ ఈ పేరును వచ్చును గనుక ఇది మెగిద్దోకు సమీపమున నున్నదని తెలిసికొనవచ్చును. ఈ తానాకు ఇశ్శాఖారీయుల ప్రదేశములో నుండినను మనష్షేగోత్రికులకు చెందియుండెను గాని మనష్షీయులు ఆ పట్టణములలో నుండిన కనానీయులను వెళ్లఁగొట్టలేదు (యెహో 17[11-13] న్యాయా 1[27]). ఇది లేవీయులకు నియ్యఁబడిన 48 పట్టణములలో నొకటియై యుండెను (21[25]). మఱియు నిది మనష్షీయులు కట్టించిన నాలుగు సరిహద్దుకోటలలో నొకటియై యుండెను (I దిన 7[29]). దెబోరా బారాకులు కనానీయులతో చేసిన యుద్ధము మెగిద్దో కాలువలయొద్దనున్న తానాకులో (న్యాయా 5[19]) జరిగెను. ప్రస్తుతమున దానికి టెల్ తానాకు (*Tell-Ta'anak*) అను పేరుకలదు. దీని నీమధ్య త్రవ్వించి దీని పాడుశేషములలో చాల రాతిశాసనములను కనుగొనిరి. (పటము III, F 1).

**తానాత్షీలో** (Taanath-Shiloh = షీలో దగ్గర). ఎఫ్రాయిమీయుల ప్రదేశమునకు ఈశాన్యదిక్కున నుండు నొక యూరు (యెహో 16[6]). ప్రస్తుతమున నాబ్లూసు (*Nablus*) నకు ఏడుమైళ్లదూరములో నుండు తానా (*Ta'na*) దీనియునికియై యుండవచ్చును. (పటము III, G 3).

**తాపకరమైన సర్పము** పాము 4 చూ॥

**తాపజ్వరము** రోగములు చికిత్సలు II 10 (3) చూ॥

**తాపిపని** వృత్తులు చేతిపనులు I 2 చూ॥



తాబోరుకొండ

**తాబోరు** (Tabor = రాతిగని లేక ఎత్తయిన స్థలము).

1. జెబూలూను గోత్రములో నున్న నొక యూరు (I దిన $6^{77}$).

2. గిద్యోను జన్మస్థానమగు ఒఫ్రాయొద్దనుండు నొకయూరు (న్యాయా $8^{18}$). ఇది పైనున్నదియు ఒకటేనని కొందరి యభిప్రాయము.

3. రామానుండి గిబియాకు పోవుమార్గమున నుండు నొక మైదానము (I సమూ $10^{3}$).

4. ఎస్ద్రేలన్ బయలున కీశాన్యదిక్కున నుండు నొక కొండ. అది నజరేతుకు తూర్పున 7 మైళ్ల దూరములో నున్నది. అది 1843 అడుగుల యెత్తుమాత్రముండినను బోడియై గుండ్రముగా నుండుటచే చాలదూరముదాక అన్నిదిక్కులకు నగపడుచుండును. ఈ హేతువుచే అది హెర్మోను పర్వతమునకంటె చాల చిన్నదిగ నుండినను హెర్మోనుతోకూడ లెక్కింపఁబడి (కీర్త $89^{12}$) ఉన్నతమైన పర్వతములలో నొకటిగా నెంచఁబడెను (యిర్మీ $46^{18}$). అది జెబూలూను ఇశ్శాఖారు గోత్రముల సరిహద్దుగా నుండెను (యెహో $19^{12,22}$). అదియొక పూజాస్థానమై యుండెనని నమ్మఁదగును. ద్వితీ $33^{18,19}$ లోని కొండ యిదే యని యనుకొందురు. దెబోరా బారాకులు యుద్ధమునకు వెళ్లినపుడు తమ సేనలను ఈ కొండదగ్గరనే సమకూర్చిరి (న్యాయా $4^{6,12}$). $8^{18}$ లో నుండు తాబోరు వేఱేకొండయై యున్నట్లున్నది. లౌకికచరిత్రను విచారింపఁగా తాబోరు ఒక గొప్పదుర్గమై యుండినట్లు తెలియును. మక్కబీయుల యుద్ధములోను, రోమీయుల యుద్ధములోను క్రూసేడులలోను ఆయావారలీ కోటను జయింపవలసి వచ్చెను.

ఈ కొండమీఁదనే క్రీస్తు రూపాంతరము పొందెనని చాల పురాతనకాలమునుండి యొక వదంతికలదుగాని దాని నమ్ముటకు తగిన యాధారములు లేవు (రూపాంతరము చూ॥).

ప్రస్తుతము తాబోరుకొండమీఁద మంచి వనములు కలవు. క్రైస్తవ సన్యాసులమఠములు కూడ కొన్ని యున్నవి. ఇవిగాక ఒక గొప్ప కోటయొక్క ప్రాకారములును మిగుల పురాతన

మైన గుళ్లయొక్క పాడుశేషములును అనేక సమాధులును అచట కనఁబడును. ప్రస్తుతము దానికి జెబెల్ ఎట్‌టూరు (*Jabel-et-Tour*) అని పేరు. అనగా కొండల కొండ యని యర్థము. (పటము I, E 5).

**తామర** (Lily, Lotus). పాఁత నిబంధన యందలి రెండుపదములను తామరచెట్లు లేక తామరపుష్పము లనుమాటలచేఁ దెనిఁగించిరి.

1. దేవాలయము నందుండిన ఆయావాటి కలంకారముగా చెక్కించిన పువ్వులు (I రాజు $7^{19}$ II దిన $4^{5}$). దేశముయొక్క సౌందర్యమును చూపుటకు హోషేయ ఈ పదమును అలంకార రీతిగా నుపయోగించెను (హోషే $14^{5}$). పర $2^{1,2}$ లో సౌందర్యమునకు సూచనగా నుపయోగించిన **పద్మము, పల్లిపద్మము** అను పదములచేఁ తెనిఁగింపఁబడిన మాట లోకేపదమై తామర పుష్పమువంటి పుష్పమును సూచించుననుగాని అందులో నొక్క తామరపుష్పములేగాక దానికి



తామరపుష్పము

సంబంధించిన యితర పుష్పములును చేరియున్నవని కొందఱి యభిప్రాయము. మ $6^{28}$ (= లూ $12^{27}$). లో నున్న **అడవి పువ్వు అట్టి** పుష్పమని యను కొను వారును గలరు.

2. యోబు $40^{21,23}$ నందున్న **తామర చెట్టు** అనుదాని మూలభాషాపదము మఱియొకటియై నీడయని అర్థమిచ్చునని కొందఱి యభిప్రాయము. అది ఉత్తరాఫ్రికాలో దక్షిణ యూరపునందున్న యొక ముండ్లపొదకావచ్చును. మొసల్లు దాని నీడ క్రింద నుండునని చెప్పఁబడుటవలన అది తామరమొక్క కానట్లున్నది.

**తామారు** (Tamar = ఈఁతచెట్టు).

1. యూదాకొడుకైన ఏరుకును అతఁడు చనిపోయినపిమ్మట నతని తమ్ముఁడైన ఓనానుకును భార్యయైన కనానీయురాలు. యూదావలన ఆమెకు పెరెసు జెరహు అను కవల బిడ్డలు పుట్టిరి (ఆది $38^{29}$ రూతు $4^{12}$ I దిన $2^{4}$ మ $1^{3}$).

2. దావీదు కుమార్తె. ఈమె అబ్షాలోము చెల్లెలు. అమ్నోను ఈమెను చెరిపెను (II సమూ $13^{1-22}$ I దిన $3^{9}$).

3. అబ్షాలోము కుమార్తె (II సమూ $14^{27}$).

4. కుదురుబాటునొందిన యిశ్రాయేలీయుల దేశమునకు ఆగ్నేయ సరిహద్దుగా నుండెడి ఒక స్థలము (యెహె $47^{19}$ $48^{28}$). దీని సరియైన యునికినిగూర్చి తెలియదు. I రాజు $9^{18}$ II దిన $8^{4}$ లో నున్న తద్మోరు ఇదేస్థలమై యుండ వచ్చును.

**తారహు, తెరహు** 2 చూ॥

**తార్గములు** (Targums). ఇశ్రాయేలీయులు రెండవ ఆలయముకట్టుకాలమునకు తమ బైబిలు వ్రాయఁబడిన అసలు హెబ్రీభాషను మఱచిపోయి యున్నందున సమాజమందిరములలో వారు బైబిలు చదువుకొనినపుడు తత్కాలమందు వారి వాడుకభాషయైన అరమేయిక్ భాషలో అర్థము చెప్పిరి. ఇట్లర్థము చెప్పినవారందఱు ఒక్కరీతిగానే చెప్పియున్నందున చివఱ కాయర్థమును గ్రంథములలో నెక్కించిరి. ఆ గ్రంథములకు తార్గములని పేరు పెట్టిరి. ఈ గ్రంథములు బైబిలు భావమును తెలిసికొనుట మంచి సహాయకరములై యున్నవి. ఇట్టి తార్గములు 14 కలవు. దానియేలు ఎజ్రా నెహెమ్యా

యను మూఁడు గ్రంథములకు తప్ప తక్కిన గ్రంథము లన్నింటికి తార్గములు కలవు. ఈ మూఁడు గ్రంథములును చాలమట్టుకు హెబ్రీ ప్రాకృతమగు అరమేయిక్ భాషలో వ్రాయఁబడినందున వాటి కట్టి యర్థములను వ్రాయ నవసరములేకపోయెను. (భాషాంతరములు I (2) చూ॥).

**తార్సు (Tarsus).** చిన్నాసియా కు ఆగ్నేయమున నున్న కిలికియ పరగణాయొక్క ముఖ్యపట్టణము. సముద్రతీరమునకు 12 మైళ్ల దూరమున సిడ్నస్ (*Cydnus*) నది కిరువంకల వ్యాపించియున్నది. క్రీ॥ ము॥ దాదాపు 830 సం॥ మున అష్షూరురాజగు షల్మనేసెరు ఈ పట్టణమునుగూర్చి తన శాసనములయం దుదాహరించెను. క్రీ॥ ము॥ 64 సం॥ న రోమనులు కిలికియాను పరగణాగా చేర్చుకొనినప్పుడు తార్సును తమ రాజధానిగఁజేసిరి. రోమారాజ్యము నపహరింప యత్నించిన మార్కు అంతోని యనువాఁడు దీనిని స్వతంత్రమైనదిగఁజేసి దొరతనము వారికి కప్పముగట్టు నవసరములేకుండఁ జేసెను. ఏతెన్సు అలెక్సంద్రియ యను పట్టణములలోని కళాశాలలకు సాటియగు కళాశాలను గలిగినదై ఈ పట్టణము మిగుల పన్నెకెక్కెను. ఇది అపొస్తలుఁడగు పౌలు జన్మస్థానము (కార్య $9^{11}$ $21^{39}$ $22^{3}$). అతఁడు మారుమనస్సునొందినపిదప దీనిని దర్శించెను ($9^{30}$ $11^{25}$). ఇదివరకున్నంత గొప్పతనము ప్రస్తుతము దీనికిలేకున్నను ఇంకను పెద్ద బస్తీగానే యున్నది. పాఁతపట్టణపు శిథిలము లింకను అక్కడక్కడ కనఁబడుచున్నవి (పటము V, L 4).

**తావళము** ఆభరణములు 11 చూ॥

**తాళపుచెవి (Key).** తాళములును తాళపు చెవులును ఆయా పనులకొఱకై ఉపయోగించినట్లు బైబిలునందు సూచన లనేకములుగలవు. (ఇల్లు II 10 చూ॥).

1\. ఈ పదము బైబిలునందు అధికారమును సూచించుపదమై యున్నది (యెష $22^{22}$). ప్రవేశమునకుగూడ అది సూచనయైనట్లు కనఁబడుచున్నది. జనసామాన్యమునకు బోధించక వారి నజ్ఞానస్థితియం దుంచినవారు జ్ఞానమను తాళపుచెవిని ఎత్తుకొని పోయినట్లు అలంకార రీతిగా చెప్పఁబడినది (లూ $11^{52}$).

2\. క్రీస్తుకు మరణముమీఁద నధికారమున్నదను సంగతిని మరణముయొక్కయు పాతాళలోకముయొక్కయు తాళపుచెవులను తన స్వాధీనమందున్నవనుటయే విశదపరచుచున్నది (ప్రక $1^{18}$). పనిచేయుటకు తగిన తరుణములు కలుగఁజేయువాఁడుగాన ఆయన తాళపుచేతులు గలిగినవాఁడని $3^{7}$ నందు చెప్పఁబడెను. పాతాళలోకపు తాళపుచేతులు గలిగినవాఁడుగాన ఆయనకు సాతానుమీఁద అధికారముగలదని స్పష్టమగుచున్నది ($9^{1}$ $20^{1}$).

3\. పరలోకరాజ్యముయొక్క తాళపుచెవులు నీ కిచ్చెదనని (మ $16^{19}$) యేసు పేతురుతో చెప్పిన దానినిగూర్చి తాత్పర్యభేదము గలదు. ఆ మాట లధికారమును సూచించునను దానినిగూర్చి యెట్టి సందేహమునులేదు గాని రోమనుకథోలికు వారు ఇతరులకులేని యధికారమును పేతురునకు మాత్రమే యేసు అనుగ్రహించెనని ఈ వాక్యమునుబట్టి వాదించెదరు. ప్రొటెస్టంటు వారి దిగువరీతిగా దాని గ్రహింతురు. పెంతెకొస్తు దినమున పేతురు ప్రసంగముద్వారా 3 వేలమంది యూదులు క్రీస్తును తమ రక్షకునిగా నమ్మి యంగీకరించుటవలన యూదులకును (కార్య $2^{41}$), అన్యజనులు విశ్వసించునట్లు అతఁడు మొదట కొర్నేలికుటుంబమునకు ప్రకటించి వారికి బాప్తిస్మమిచ్చుటవలన అన్యులకును ($10^{34-38}$ $15^{7}$) క్రైస్తవ సంఘ ద్వారమును విప్పుటకు దేవుఁ డేర్పరచుకొనిన సాధనమై యున్నాఁడు. క్రీస్తు దేవుని కుమారుఁడని యొప్పుకొనుటచే ఈ ప్రాముఖ్యత యతనికిఁ గలిగెను గాని రోమనువారనుకొనునట్లుగా, అతనికిని అతని గురుస్థానమున వచ్చువారికిని ఇతరులందరిపై నిత్యాధికారము కలిగి నట్లెంచరాదని దేవుని గ్రంథములోని యితర వాక్యములచే రూఢిగాఁ దెలిసికొనఁగలము (మ $23^{8-12}$ మా $10^{42-45}$).

ఆయావాటిని బంధించుట విప్పుట యను దానినిగూర్చిన బోధయు దీనికి సంబంధించి యున్నది (మ $16^{19}$). ఒక మతమునుసరించు వారికి తగిన కట్టుదిట్టములను నియమించుట సహా

జముగదా. యూదులిట్టి భావముతో దీనినుప యోగించిరి. సంఘ పరిపాలనార్థమై స్థిరమైన నియమములు సువార్తలయం దుదాహరింపఁబడ లేదని దాదాపు అందఱు నొప్పుకొందురు. అట్టి వాటి విషయమైన తగిన ఏర్పాటుల నియమించు టకు పేతురునకు అధికారమునిచ్చినట్లు ఈ వాక్య మునందగుపడుచున్నది గాని, అట్టి యధికారమే తక్కిన శిష్యులకు నిచ్చినట్లు మ $18^{18}$ లో చూడ వచ్చును. కావున ఈ యధికారము క్రీస్తు దేవుని కుమారుఁడని యొప్పుకొన్న సంఘమున కిచ్చెనని స్పష్టమగుచున్నది. పేతురట్లు మొదట యొప్పు కొన్నందున అతనికి మొదట యియ్యఁబడెనేగాని అతనికి మాత్రమే యియ్యఁబడినట్లు బైబిలు చెప్పుట లేదు.

దీనికి సంబంధముగా పాపమును క్షమించుటను గూర్చిన యధికారమునుకూడ చేర్చవలసియున్నది (యోహా $20^{23}$). ఆ యధికారముకూడ శిష్యుల సమూహమున కనుగ్రహింపఁబడిన యాధిక్యత గాని పేతురునకును, అభిషేకము నొందినవారికి మాత్రమే యియ్యఁబడినదికాదు (లూ $24^{47}$). ఆయన తననునమ్మిన సర్వసమూహమునకు పరి శుద్ధాత్మ ననుగ్రహించినందున (యోహా $20^{22}$ I యోహా $2^{20}$) వారు సంఘమును క్రమ శిక్షయం దుంచునప్పుడు వారి తీర్మానములు వారికి మాత్రమే గాక సంఘమున కధికారమిచ్చిన ప్రభువు దీనికి యధికారముండునట్లు దయచేసెను (గల $6^{1}$ I కొరి $5^{3,4}$).

**తాళపుచెవుల అధికారము** పాప పరి హారము, తాళపుచెవి 3 చూ॥

**తాళము** ఇల్లు II, 10 సంగీతము 3 (*1*) (*b*) చూ॥

**తాళ్లుకట్టుట** ఓడలు 5 (2) (*b*) చూ॥

**తాహాతు** (Tahath = క్రింద నుండునది).

1. కహాతీయుల తెగకు చేరిన లేవీయులలో నొకఁడు (I దిన $6^{24}$).

2, 3. ఎఫ్రాయిము గోత్రికులలోని యిద్దఱు (I దిన $7^{20,21}$). తాహాతు అను పేరు ఈ వచన ములో రెండు పర్యాయములు కనఁబడును. అయితే వ్రాఁత తప్పువలన నిట్లు వచ్చెను గాని అసలు ఒక్కసారి మాత్రమే యిచట నుండ వలయునని కొందఱందురు.

4. ఇశ్రాయేలీయు లరణ్యములో మకాము చేసిన స్థలములలో నొకటి (సంఖ్యా $33^{26}$). దీని సరియైన యునికినిగూర్చి తెలియదు.

## తి

**తిక్వా** (Tikvah = నిరీక్షణ).

1. ప్రవక్త్రియగు హుల్దాయొక్క మామ (II రాజు $22^{14}$ II దిన $34^{22}$).

2. ఎజ్రా దిద్దుబాటు చేయుచుండఁగా అతనికి సహాయముచేసిన యహజ్యా తండ్రి (ఎజ్రా $10^{15}$).

**తిగ్లత్పిలేసెరు** (Tiglathpileser). ఇది అష్షూరు చక్రవర్తులలో కొంతమందికి పేరై యున్నను బైబిలులో ఆ పేరుగల యొకనిగూర్చిన సూచనలు మాత్రము కలవు. ఇతఁడు మూఁడవ తిగ్లత్పిలేసెరు అనఁబడును. ఇతఁడు క్రీ॥ ము॥ 745-727 లో అష్షూరు రాజ్యమునేలెను. ఇతనికి **పూలు** అను మాఱుపేరు కలదు (II రాజు $15^{19}$). బబులోను వారి శాసనములలోను ఇతనికీ మాఱు పేరు కలదు. ఇతఁడు 745 వ సం॥లో అష్షూరు రాజ్యము నపహరించెను. అతఁడు 743 వ సం॥ లో సిరియా పలెస్తీను ప్రాంతములపై దండయాత్ర చేసెనని రాతిశాసనమువలనఁ దెలియును. అందు వలననే అర్పాదు తూరు దమస్కువారితనికి పన్ను చెల్లించుచుండిరి. అతఁడు 743 లో అర్పాదును ముట్టడించినను అర్పాదువారు 740 సం॥ మట్టుకు అతని నెదిరించిరి (యెష $10^{8}$ $36^{19}$ $37^{13}$). 739 వ సం॥ లో ఇతఁడు యూదారాజైన అజ్రీయాతో పోరాడినట్లు రాతి శాసనములవలనఁ దెలియును. ఆ యజ్రీయాయనువాఁడు ఉజ్జియా కావచ్చును. కుల్లాని యను పట్టణము నతఁడు జయించినట్లు కూడ రాతి శాసనములవలననే తెలియును. అది యెష $10^{9}$ లోని కల్నోయై యుండవచ్చును (ఆమో $6^{2}$ లో దీనికిబదులు కల్నే యను పేరు కలదు). 738 వ సం॥లో ఇతఁడు పదిగోత్రములకు రాజైన మెనహేమునుండి పన్నుతీసికొనెను (II రాజు $15^{19}$). 834 లో ఇతఁడు యూదారాజగు ఆహాజుతో సంధి చేసికొని అతనిని విరోధించిన

దమస్కు రాజగు రెస్సీను, ఇశ్రాయేలు రాజగు పెకహులనుండి విడిపించుటకువచ్చి రెస్సీను నోడించి సిరియాను ఉత్తరపు ఇశ్రాయేలు దేశమును పాడుచేసి (I దిన 5[26]) చాలమందిని చెఱఁబట్టెను. ఆ దండయాత్రలోనే ఫిలిష్తీయుల దేశమునందలి గాజా అష్దోదు ఎక్రోను అనుపట్టణములను జయించి దోచుకొని, మోయాబు అమ్మోను అరబ్బీ అను దేశముల వారియొద్ద కప్పముఁ బుచ్చుకొనెను. 732 వ సం॥ న అతఁడు దమస్కును జయించెను. అప్పుడతని దర్బారులో చేరినరాజులలో యూదారాజైన ఆహాజు ఒకఁడని రాతి శాసనములవలనఁ దెలియును. 733 వ సం॥ లో హోషేయ యనువాఁడు ఇశ్రాయేలు రాజైన పెకహును చంపినప్పుడు తిగ్లత్పిలేసెరు హోషే యను రాజునుగా జేయుటను చూచినయెడల ఇతఁడే పెకహును చంపుటకు హోషేయను ప్రేరేపించి యుండునని యనుకొనవచ్చును. తిగ్లత్పిలేసెరు 727 సం॥ లో చనిపోయెను. ఇతఁడు అష్షూరువారి రాజవంశలలో నొకదానికి స్థాపకుఁడై అష్షూరు రాజ్యమునకు ఇతరరాజ్యములను వాటి రాజులను లోఁబఱచి యివ్విధముగా ఆ రాజ్యము నధికముగా బలపఱచెను (అష్షూరు చూ॥).

**తిజీయుడు** (Tizite). దావీదు యోధులలో నొకఁడైన యోహా అనువాని సహోదరుని బిరుదు (I దిన 11[45]). ఆ బిరుదతని జన్మస్థానమును బట్టి కలిగి యుండవచ్చును గాని అదెచ్చట నున్నదో తెలియదు.

**తిత్తి** వంటసామగ్రి 2 చూ॥

**తిదాలు** (Tidal). ఇతఁడు గోయీయుల రాజనఁబడును. గోయీయులనిన జనములు అని యర్థము. ఇతఁడు అబ్రాహాము కాలములో సిరియామీఁదికి దండెత్తివచ్చిన ఐదుగురు రాజులలో నొకఁడై తతిమ్మవారివలె బబులోను ప్రాంతములనుండి వచ్చెను (ఆది 14[1]). బ్రిటిష్ మ్యూజియములోనుండు రాతిశాసనములలో నొకదానిమీద టుడుల్ అను పేరుకలదు. అతఁడే ఈ తిద్యాలు అని కొందఱనుకొందురు.

**తిప్సహు** (Tipsah = రేవు).

1. యుఫ్రాతునదిని దాటుట కిదియొక రేవై యుండెను. అది అంతియొకయకు తూర్పున యుఫ్రాతునది దక్షిణమునకు తిరుగుచోట నున్నది. అది గ్రీకు వారిచేత తాప్సకుస్ (*Thapsacus*) అనఁబడి లౌకికచరిత్రలో నొక ప్రసిద్ధమైన రేవుగా నున్నది. సొలొమోనురాజ్యము ఈశాన్య దిక్కున ఈ రేవువఱకు వ్యాపించి యుండెను (I రాజు 4[24]) (పటము VIII, C I).

2. ఇశ్రాయేలు రాజైన మెనహేము పాడు చేసిన యొక పట్టణము (II రాజు 15[16]). దీని సరియైన యునికినిగూర్చి తెలియదు. ఒక గ్రీకు తర్జుమాలో దీనికి తప్పూయహు అను మాఱుపేరు కలదు (తప్పూయహు 2 చూ॥).

**తిబెరికైసరు** (Tiberius Caesar). కైసరు ఆగూస్తుయొక్క మాఱుకొడుకు. రోమా సామ్రాజ్యపు మూఁడవ చక్రవర్తి. క్రీ॥ శ॥ 12 వ సంవత్సరమున రోమాకు సంబంధించిన దేశములకు సైనిక గవర్నరుగా నుండి ఔగూస్తు 14 వ సం॥ న మరణమొందఁగా అతనికిఁ దరువాత చక్రవర్తి యయ్యెను. శక్తి సామర్థ్యములతో నతఁడు 23 సం॥ లు సామ్రాజ్యమున కేలికగా నుండెను. అతని ప్రభుత్వము మొత్తముమీఁద న్యాయమైనదిగానే కనఁబడినను అతఁడు మాత్రము క్రూరుఁడును భోగాసక్తుఁడునై యుండెను. లూ 3[1] నందుదాహరించిన కాల సూచనలోను అతని గౌరవార్థమై కట్టఁబడిన పట్టణపుపేరు (తిబెరియ చూ॥) నందును మాత్రము గాక బైబిలునం దితనిగూర్చిన సూచనలెవ్వియును లేవు (కాలక్రమణిక చూ॥).

**తిబెరియ** (Tiberias). గలిలయసముద్ర పశ్చిమతీరమున నున్న యొక పటణము. అది యొర్దాను సముద్రసంగమ మగుచోటికి 11½ మైళ్లును, అది సముద్రమును వెడలుచోటికి 6 మైళ్లు దూరమునందున్నది. ఆ సముద్రమునకు సమీపముగా నుండు ఒక ముఖ్యపట్టణమగుటచే రోమను లా సముద్రమునకు తిబెరియ సముద్రమను పేరు పెట్టిరి గాని పలెస్తీనులో ఆ పేరు నుపయోగింపలేదు (యోహా 6[1] 21[1] గలిలయ సముద్రము చూ॥). ఈ పట్టణపుపేరు యోహా 6[23] నందు మాత్రమే కనఁబడినను, ఇది యూదుల చరిత్రయందు ఎంతో ముఖ్యపట్టణమై యుండెను. హేరోదు అంతిప దీనిని క్రీ॥ శ॥ 20 సం॥ న కట్టించి అప్పుడు రాజ్యము నేలుచుండిన తిబెరి



తిబెరియ

కైసరు గౌరవార్థమై దానికి పేరు పెట్టెను (తిబెరి కైసరు చూ॥). అది గలిలయ ప్రదేశమునకు రాజధానిగా యున్నను యూదులలో నిష్ఠాపరులగు వారు దాని నపవిత్రమైన పట్టణముగా నెంచి దానిలోకి పోయెడివారు కాదు. యెరూషలేము నాశనమైన పిమ్మట యూదుల మహాసభయగు సన్హెడ్రిన్ వారు దానిని తమ ముఖ్యస్థానముగఁ జేసికొనిరి. తరువాత అది యూదపాండిత్యమునకు ముఖ్యస్థానమయ్యెను. పలెస్తీను టాల్మడు లనఁబడున విచ్చటనే విరచితమయ్యెను (టాల్మడు చూ॥). హెబ్రీభాషయందు హల్లులుమాత్రము పూర్వముండెను.

ప్రస్తుతము హెబ్రీ బైబిలునందలి హల్లులను ఇతర గుర్తులను చేర్చుట కారంభించిన దిచ్చటనే. ప్రస్తుతము అచ్చటనున్న తుబరియ (*Tubariya*) అను ఊరు 4 వేలమంది జనులుగల పట్టణమై యున్నది. అది అంత ఆరోగ్యవంతమగు ప్రదేశముకాదు (పటము IV, E 7).

**తిబ్నీ** (Tibni). ఒమ్రీ యిశ్రాయేలు రాజ్యము నపహరించిన సమయమున అతని నెదిరించి రాజ్యము తా నపహరించుటకుఁ బూనుకొన్నవాఁడు (I రాజు $16^{15-21,23}$).

**తిమింగిలము** (Whale, a great fish). యోనా గ్రంథమునుండి యెత్తిన యొక వాక్యమునకు తెలుఁగు పదము (మ $12^{40}$). దీని మూలభాషాపదము LXX లో యోనా $1^{17}$ నందున్నది. ఇచ్చట దానిని తిమింగలమనక **గొప్పమత్స్యమని** హెబ్రీభాషలో నున్నట్లే తెనిఁగించిరి. ఇదే సరియైన తర్జుమా. ఇతర భాషలలోనికి ఈ మూలపదమును తిమింగిలమని తర్జుమాజేసినను, అది తిమింగిలమును మాత్రమేగాక ఏ గొప్ప చేఁపనైనను సూచింపవచ్చును.

**తిమోతి** (Timothy = దేవుని ఘనపఱచువాఁడు). అపొస్తలుఁడగు పౌలు సహవాసి. అతని ముఖ్యసహాయకుఁడు. ప్రభువునందు నాకు ప్రియుఁడును నమ్మకమైన నా కుమారుఁడును (I కొరి $4^{17}$), విశ్వాసమునుబట్టి నా నిజమైన కుమారుఁడు (I తిమో $1^{2}$) అని పౌలతనిని గూర్చి వ్రాయుటవలన పౌలున కతనియందున్న అనురాగము మాత్రమేగాక అతనిద్వారానే తిమోతి క్రైస్తవుఁడైనటులుఁ దెలియుచున్నది. ఎటులనైనను పౌలు మొదటి ప్రయాణమునందు లుకయొనియలోని లుస్త్రను దర్శించినప్పుడు తిమోతి తల్లియగు యూనికేయును, అతని అవ్వయగు లోయియు క్రీస్తునందు విశ్వసించిరి (II తిమో $1^{5}$ $3^{11}$). తన తల్లి యనుసరించిన యీ నూతనమతమును గూర్చిన సంగతులను ఆమె చెప్పఁగా విని గ్రహించుకొనఁ గలిగిన వయస్సునందతఁ డప్పుడుండెను. అతనితల్లి యూదురాలు గాని తండ్రిమాత్ర మన్యుఁడు (కార్య $16^{1}$). చిన్నతనమునుండియే అతఁడు లేఖనములను చక్కఁగా నెఱిగి యుండినను (II తిమో $3^{15}$) సున్నతిమాత్రము పొందియుండలేదు (కార్య $16^{3}$). అతఁడు క్రైస్తవుఁడైన పిదప సువార్తసేవయందుఁ బ్రవేశింప నాసక్తిఁ గలవాఁడై, పౌలు రెండవమాఱు లుస్త్రను దర్శింపవచ్చుసరికి, లుస్త్ర, ఈకొనియ ప్రాంతములలోని సహోదరు లందఱివలన మంచి పేరునొంది యుండెను ($16^{2}$). అతఁడేదో యొక ప్రత్యేకమగు పనిచేయనై యున్నాఁడను సంగతి ముందుగనే ప్రవచింపబడియుండెను (I తిమో $1^{18}$ $4^{14}$). గనుక పౌలతనిని తన వెంటఁ దీసికొనివెళ్ల నిశ్చయించినందున అతఁడును ఇతర పెద్దలును హస్తనిక్షేపణముచేసి సువార్తికుని పనికతని ప్రతిష్ఠించిరి ($4^{14}$ II తిమో $1^{6}$). బాహ్యాచారము మాత్రమేయగు సున్నతినొందుటవలనగాని, పొందక పోవుటవలనగాని లాభనష్టము లెవ్వియులేనందున సువార్తపని జయకరముగా యూదులలో జరుగునని నిరీక్షించిన పౌలు ఇతనికి సున్నతి చేయించి తన వెంటఁ గొనిపోయెను. పౌలు గలతియగుండా త్రోయ ఫిలిప్పియి థెస్సలోనీకయ బెరయలకు వెళ్లినప్పుడితఁడును వెళ్లెను. కాని పౌలు ఏథెన్సుకు వెళ్లునప్పుఁడితనిని సీలను బెరయలో విడిచివెళ్లెను (కార్య $17^{14}$). వారు త్వరలోవచ్చి తన్ను కలిసికొనవలసినదిగా పౌలు వారికి కబురంపెను ($17^{15}$) గాని I థెస్స $3^{1,2}$ నందు పౌలితనిని థెస్సలోనీకయకుఁ బంపినట్లును, తాను కొరింథుకువచ్చువఱకు అతఁడుగాని సీలగాని వచ్చితనను కలిసికొన లేదని వ్రాయుచున్నాఁడు (కార్య $18^{5}$ I థెస్స $3^{6}$). కొంతకాలమునకు తిమోతి వచ్చి కొరింథులో పౌలును కలిసికొనెను ($1^{1}$ II థెస్స $1^{1}$). తరువాత అతనిపేరు ప్రస్తాపింపఁబడక పోయినను పౌలు తిరిగి వెళ్లునప్పుడితఁడును అతనివెంట వెళ్లియుండును. తరువాత పౌలు ఎఫెసులో పనిఁజేయునప్పుడక్కడ అతనితో కలిసియున్నట్లు చూడవచ్చును. పౌలు కొరింథీయులకు మొదటి యుత్తరము వ్రాయకమునుపే ఆ సంఘమునందున్న కొన్ని యక్రమములను సవరింపనై అతని నక్కడకుఁ బంపినట్లు I కొరి $4^{17}$ నందున్నది. ఈ యుత్తరము వారి కందునప్పటి కతఁడింక నేదోయొక కారణముచే అచ్చట చేరియుండలేదని $16^{10}$ వలన నూహింపవచ్చును. ఎట్లయినను పౌలు ఎఫెసును వదలి పెట్టక ముందఱనే పౌలతనిని ఎరస్తును మాసి

దోనియలోనికిఁ బంపినందున అతఁడు మఱల పౌలునొద్దకు వచ్చినట్లు కనఁబడుచున్నది (కార్య $19^{22}$). తరువాత కొద్దికాలమునకే పౌలతనిని మాసిదోనియలోఁ గలిసికొనినందున ఇద్దరును కొరింథుకు వెళ్లిరి (రోమా $16^{21}$). పౌలు యెరూషలేమునకుఁ జివరిసారి వెళ్లినప్పుడు అతని వెంట నున్నవారిలో నితఁడొకఁడై యుండెను (కార్య $20^{4}$). అతఁడు యెరూషలేమువఱకు వెళ్లెనో లేదో తెలియదు. పౌలు కైసరయలో నుండినప్పుడు గాని రోమాకు ఖైదీగాఁ బోవునప్పుడుగాని అతఁడు పౌలుతోనున్న జాడయేలేదు గాని పౌలు రోమానుండి వ్రాసిన యుత్తరములలో నతనిపేరు కనఁబడును (ఫిలి $1^{1}$ $2^{19-22}$ కొలా $1^{1}$ ఫిలే 1). దీనివలన అతఁడు రోమాకువెళ్లి అక్కడ పౌలు సహవాసిగ నుండినట్లు స్పష్టమగుచున్నది. పౌలు చెఱనుండి విడుదల నొందినపిదప తిమోతికి మఱి ముఖ్యములగు పనుల నప్పగించినట్లు చూడ వచ్చును. అతఁడు ఎఫెసులోని సంఘమునకు నియమింపఁబడినట్లు తిమోతికి వ్రాసిన మొదటి పత్రికవలనఁ దెలియుచున్నది. తిమోతివంటి యౌవనునికట్టి పనిభారమైనదియు కష్టమైనదియు ననుటకెట్టి సందేహములేదు (I తిమో $4^{12}$). తప్పుడు బోధకులను ఖండించుటయు పెద్దల నాయాపనులకు నియమించుటయు, సంఘము యొక్క ధర్మ విధుల నేర్పఱచి వాటిని క్రమముగా జరుపుట యనునవి అక్కడ చేయవలసిన పనులలోఁ గొన్నియై యుండెను. ఆ పని ఒక అపొస్తలుని యంతటివాఁడు చేయవలసిన పని గాన దానినిగూర్చి పౌలతనికొక ప్రత్యేకమగు పత్రికను వ్రాసెను. పౌలు తన యవసానకాలమున చివరిపత్రిక వ్రాసినదితనికే (II తిమో). అప్పటికి దాదాపుగా అందఱివలన విడువఁబడి ఒంటరిగా నున్నవాఁడై ప్రియబిడ్డయగు తిమోతి తన మరణకాలమున తనకు దగ్గరగా నుండవలెనని యెంతగానో యపేక్షించుచు ($4^{9,21}$) తన సంగతుల నన్నిఁటిని దాచక అతనికిఁ దెలుపుకొనెను. పౌలు బ్రతికియుండఁగానే అతఁడువెళ్లి కడసారి యతనిఁ జూచెనో లేదో చెప్పవీలుగాదు. తిమోతి యొక్క అంత్యమునుగూర్చి మనకంతగాఁ దెలియదు. అతఁడు చెఱయందు వేయఁబడి విడుదల నొందెనను సంగతి మాత్రమే మన మతనినిగూర్చి తెలిసికొనఁగలము (హెబ్రీ $13^{23}$). అతఁడు తన మరణపర్యంతము ఎఫెసు పట్టణమున కధ్యక్షుఁడుగా నుండినట్లు ఆది సంఘపు పారంపర్యముల వలనఁ దెలియుచున్నది. అట్లయినపక్షమున ప్రక $2^{1-7}$ లో నున్న ఎఫెసు సంఘముయొక్క దూత యితఁడు గావచ్చును. ఇతఁడొకమాఱు ఎఫెసు పట్టణమునందు జరుగు అన్యుల తిరునాళ్లలోని యక్రమములను ఖండించినందున వారతనిపై కోపించి యతనిని చంపినట్లు ఒక పారంపర్యము వలనఁ దెలియుచున్నది. కన్‌స్టాంటినోపిలు నందేలిన కన్‌స్టంటియస్ అను చక్రవర్తి అతని యెముకలను ఆ పట్టణమునకుఁ దెప్పించి అచ్చట పాతిపెట్టించినట్లు భక్తులచరిత్ర (*Acts of the Saints*) వలనఁ దెలియుచున్నది గాని అతనిగూర్చి బైబిలునందున్నవిగాక యితర సంగతులంత రూఢియైనవి గావు.

**తిమోతికి వ్రాసిన పత్రికలు (Timothy, Epistles to).**

**మొదటిపత్రిక.**

1. గ్రంథకర్త.

ప్రాచీనకాలము మొదలుకొని 19 వ శతాబ్దారంభమువఱకు వేద పండితోత్తములందఱు నీ పత్రికలను లిఖించినవాఁడు పౌలైనట్టు భావించుకొనుచు వచ్చిరిగాని నవీనగ్రంథ పరిశోధకులు కొందఱు అందునుగుఱించి సందేహించుట కాస్పదము గలదని నిశ్చయించుకొనుచున్నారు. వారి సంశయమున కాధారముగా మూఁడు ముఖ్య సందర్భములను చెప్పుదురు. అవేవనిన:—(1) ఈ మూఁడు పత్రికలయందు అనఁగా, మొదటి రెండవ తిమోతికి తీతుకు వ్రాసిన పత్రికలయందు, కార్యముల గ్రంథములో వివరింపఁబడు పౌలు యొక్క ప్రయాణములలోనే ప్రయాణమున కైనను సంబంధింపని విషయములు కనఁబడుచున్నవి. అందుకు దృష్టాంతముగా I తిమో $1^{1-3}$ యందు పౌలు తాను మాసిదోనియకు పోవ బైలుదేరఁగా ఎఫెసులో తిమోతిని విడిచెనని వివరింపఁబడఁగా కార్య $19^{22}$ నందు పౌలు తాను మాసిదోనియకు పోఁదలఁచి తనకు ముందుగా తిమోతిని పంపించెనని వర్ణించఁబడెను. కార్యముల గ్రంథమందు పౌలు తానే ముందుగ మాసి

దోనియకు పోవునపుడు తిమోతిని ఎఫెసునందు విడిచిపెట్టిన సంగతి యెచ్చటనైనను కనఁబడదు. అదియుగాక II తిమో $4^{20}$ నందు త్రోఫీము రోగియైనందున నతని మిలేతులో విడిచి వచ్చితినని చెప్పుచున్నాఁడుగాని కార్య $21^{29}$ నందు పౌలు త్రోఫీమును కలిసికొని మిలేతులో ఎఫెసు సంఘ పెద్దలను దర్శించిన తరువాత అతని తోడుకొని యెరూషలేమునకు పోయెనని కనఁబడుచున్నది. కాఁగా ఈ పత్రికలయందు ప్రశంసింపఁబడిన ప్రయాణములును, కార్యములయందు ప్రస్తాపింపఁబడిన ప్రయాణములును వేఱువేఱుగా నున్నవనుటకు సంశయములేదు. (2) ఈ పత్రికలయందు సంఘ పరిపాలననుగుఱించి చెప్పఁబడిన వివరములు చూడఁగా పౌలుకాలములో సంఘములింత యభివృద్ధి జెందలేదని నిశ్చయింతురు. అదియు మాత్రముగాక యీ పత్రికలయందు సూచింపఁబడిన సంఘపరిపాలనయు మతసిద్ధాంతబోధయు తప్పుడు సిద్ధాంత వ్యాపకత్వమును పౌలుకాలములో నింత వృద్ధిఁజెందియుండలేదని కొందఱాక్షేపింతురు. (3) ఈ పత్రికల శైలికిని పౌలు వ్రాసిన యితర పుస్తకముల శైలికిని వ్యత్యాసముండుట మాత్రమేగాక యీ పత్రికలయందనేక నూతన పదములు కనఁబడుటనుబట్టి వీనిని పౌలు వ్రాయలేదని నిశ్చయించుకొందురు. ఇందుకు దృష్టాంతముగా మొదటి పత్రికయందు క్రొత్త నిబంధనయందు మఱెచ్చటను కనఁబడని 74 క్రొత్త పదములును, రెండవ పత్రికయందు 46 నూతన పదములు, తీతు పత్రికయందు 28 నూతన పదమును కనఁబడుచున్నవి. పై మూఁడు ముఖ్యకారణములనుబట్టి యీ పత్రికలు పౌలుచే రచింపఁబడినవి కావని పూర్వపక్షము చేయుదురు.

అయినను పై యాక్షేపణలను విచారింపఁగా వానికి సమాధానము చెప్పుట సులభసాధ్యమని తోఁచకమానదు. (1) వీటియందలి యాత్ర వివరములు కార్యములయందలి వృత్తాంతములకు పొసగకుండుట వాస్తవమేగాని అందువలన పౌలీపత్రికలను రచింపలేదను తీర్మానము మాత్రము న్యాయమయినదికాదు. ప్రాచీన గ్రంథములను సంఘ యితిహాసములను పరిశోధింపఁగా పౌలు రోమాయందు రెండు సంవత్సరములు ఖైదులోనుండిన తరువాత విడుదలయై కార్యములలో వర్ణింపఁబడని సువార్త యాత్రలు చేసెననుటకు చాలినంత యాధారముగలదు. పౌలు విడుదలయైన తరువాత రోమావిడిచి ఫిలిప్పయి సంఘమును దర్శించి అక్కడనుండి ఎఫెసు పట్టణమునకు పోయి ఆ చుట్టుపట్లనుండిన కొలొస్సయి మొదలగు గ్రామములను చూచి ఎఫెసును విడిచి స్పెయిను దేశమునకుపోయి, స్పెయినుదేశము నుంచి తిరిగి వచ్చుచున్నప్పుడు క్రేతు ద్వీపమును దర్శించిన మీఁదట తిరుగ ఎఫెసును చేరెను. ఎఫెసులో నెంతకాలము గడిపెనో చక్కగా తెలియదుగాని ఎఫెసును విడిచిన తరువాత మఱల మాసిదోనియ ప్రాంత్యములలో సంచరించి కడకు నీకొపొలిలో శీతకాలము గడుపఁదలఁచి అక్కడికి పోవుచున్న సమయములో పట్టుబడి రెండవ పర్యాయము రోమాకు ఖైదీగా కొంచుపోఁబడినవాఁడాయెను. పైన వివరించిన ప్రయాణములలోనే పౌలీ పత్రికలను రచించెనని వేద వ్యాఖ్యాతలు అభిప్రాయపడుదురు. ఈలాగుండఁగా పౌలు I తిమో $1^{1-3}$ నందు చెప్పిన సంగతి కార్యములయందగుపడక పోయినను ఆయన విడుదలయైన తరువాత చేసిన ప్రయాణ వివరములవలన నది విశదమగును. (2) మఱియు నీ పత్రికలయందు సంఘపరిపాలనను గుఱించియు సంఘాభివృద్ధిని గుఱించియు సూచింపఁబడిన వివరములనుబట్టి యీ పత్రికలు పౌలు వచనములు కావని నిశ్చయించుకొనుట సహేతుకము కాదు. పౌలు ఇతర పత్రికలయందు సంఘ క్రమ శిక్షను గుఱించి అంతఁగ వర్ణించ నావశ్యముండలేదు గనుక వాటి మూలముగా సంఘ పరిపాలనను గుఱించి చక్కగా తెలిసికొన సాధ్యముకాదుగాని యీ మూఁడు పత్రికలయందును పౌలు సంఘసవరణ నిమిత్తమే ఎఫెసునందును క్రేతునందును తిమోతిని తీతును నియమించి వారికి వ్రాయుచున్నాఁడు. గనుక వీనియందు సంఘపరిపాలన వివరములే ముఖ్య ప్రస్తావనలై యున్నవి. అదియుఁగాక యీ పత్రికలయందు ఖండింపఁబడిన తప్పు సిద్ధాంతములు వీనియందు సూచింపఁబడినంత పూర్ణముగా పౌలుకాలములో ప్రబలియుండలేదను ఆక్షేపణ నిరాధారమైనది. కొలొస్సయుల పత్రికయందు

పౌలు ఖండించిన తప్పు సిద్ధాంతములును ఈ పత్రికలయందు ప్రశంసింపఁబడిన తప్పు సిద్ధాంతములును చాలమట్టుకు ఒకటే. వాని మూలమున వెనుకటి కాలమున జ్ఞోస్తిక సిద్ధాంతములను దుర్బోధ యేర్పడెను. (3) ఈ పత్రికలయందు నూతన నిబంధనయందు మఱెచ్చటను కనఁబడని క్రొత్త మాటలనుబట్టి యీ పత్రికలను పౌలు రచించలేదని చెప్పుటకు వీలులేదు. వీనియందు పౌలు సాధారణ మతబోధను చేయు నుద్దేశించలేదుగాని ముఖ్యముగా సంఘపరిపాలన విధులను తెలియఁజేయుచున్నందున అందుకు సంబంధించిన జాతీయముల నుపయోగింపవలసివచ్చెను. కాఁబట్టి పైఁజెప్పిన ఆక్షేపణలను సాధక బాధకమున పరిశోధించుకొలఁది యీ మూఁడు పత్రికలు పౌలుచే లిఖించఁబడిన రచనములు కావను ఆక్షేపమునకు సహేతుకమైన ఆధారమేమియులేదు.

**2.** ఎవరి నిమిత్తమై వ్రాయఁబడెను?

పౌలు వ్రాసిన యితర పత్రికలవలె ఇదియే సంఘస్థులయొక్క హెచ్చరిక నిమిత్తముగాక పౌలుకు బహు ప్రియుఁడుగా నుండు సహచారియగు తిమోతి అను సంఘ పరిపాలకుని హెచ్చరిక నిమిత్తము రచించఁబడెను. (తిమోతియు చూ॥).

**3.** కాలస్థాన నిరూపణము.

పౌలు రోమాలోనుండి విడుదల నొందిన తరువాత 63 లేక 64 సం॥ లలో చేసిన ప్రయాణములలో నెప్పుడో యొక సమయమున నీ పత్రిక లిఖితమాయెను. రమారమి క్రీ॥ శ॥ 66 లేక 67 సం॥ పౌలు రోమాపురియందు హతసాక్షియాయెను. కావున క్రీ॥ శ॥ 64-66 సం॥ ల మధ్య నీ పత్రికను రచించె ననుకొనకతీరదు. అయనెక్కడ వ్రాసెనో మనకు చక్కగా తెలియదుగాని బహుశః క్రీ॥ శ॥ 64 సం॥ వసంతకాలమున వ్రాసెనని పెక్కండ్రు పండితోత్తములనుకొందురు. ఈ పత్రికెక్కడ రచించఁబడెనో నిస్సందేహముగా చెప్ప వీలుపడదుగాని బహుశః పౌలు మాసిదోనియ ప్రదేశమందు సంచారము చేయుచుండఁగా వ్రాసిపంపించెనని యనుకొనుటకు చాలినన్ని యాస్పదములు గలవు.

**4.** మొదటి పత్రికలోని ముఖ్యసంగతులు:—

I. అభివందనములు (1[1,2]).

II. తాను ప్రకటించిన సువార్త సత్యమును తిమోతి బోధించి మిథ్యాభిప్రాయములను ఖండించవలెనని ప్రేరేపించుట (1[3-20]).

III. సంఘారాధన విధాయకమును సంఘపెద్దల పరిచారకుల నియామక విధులను వివరించి ఒక స్తుతి వాక్యముతో నీ భాగమును ముగించుట (2[1]-3[16]).

IV. నిర్నిమిత్తమైన శారీర నిగ్రహమును ఖండించుచు తిమోతి ధైర్యస్థైర్యములు గలిగి యుండవలెనని హెచ్చరిక చేయుట (4[1-16]).

V. వృద్ధులను వితంతువుల నెట్లు చూడవలెనో చెప్పుచు సంఘమందలి పెద్దలకు చూపవలసిన మర్యాదనుగూర్చి వివరించి తిమోతియును హెచ్చరించుట (5[1-25]).

VI. దాసులనుగురించియు వివిధములగు తప్పుడు బోధలను చేసినవారిని గుఱించియు తెలిపి, తిమోతి ఎట్లు తన పనిని నిర్వహించి స్థితిగలవారికి బోధింపవలెనో వివరించి హెచ్చరించుట (6[1-21]).

## రెండవ పత్రిక.

1. మొదటి పత్రికనుగూర్చి చెప్పిన నిదర్శనములన్నియు నీ రెండవ పత్రికనుగూర్చియు చెప్పఁదగును. గనుక దాని ప్రామాణికత్వమును గుఱించి తీర్మానించినట్లే దీనిగూర్చియు తీర్మానించుట తగును. ఈ రెండవ పత్రిక పౌలు వ్రాసిన పత్రికలన్నింటిలో చిట్టచివరిది. అతడు ఖైదులోనుండి తనకు మరణశిక్ష విధింపఁబడునని యెఱిఁగి దీనిని వ్రాసినట్లు దీనియందు సూచనలు కనఁబడుచున్నవి (1[8-16] 2). అతఁడు నేరస్థుఁడుగా నెంచఁబడెను (2[9]). స్నేహితులలో ననేకు లతని వదలివేసిరి (1[15] 4[10-12]). లూకా యొకఁడు మాత్రము పాతవారిలో స్థిరుఁడుగ నుండెను (4[11]), గాని క్రొత్త స్నేహితులును కొందఱేర్పడిరి (4[21]). ఇది వ్రాయకమునుపు ఒక విచారణ జరిగెను (4[16,17]). మఱియొక వాయిదా వేసిరి. అతఁడు విడుదల నొందనందున తప్పక తనకు మరణశిక్ష కలుగునని తెలిసికొనెను. గాన యిది బహుశః 67 సం॥ వ్రాయఁబడి

యుండుననుట యుక్తము. ఇట్టి కష్టములలో తానుండఁగా తనకు విశ్వాసవిషయములో కుమారుఁడైన తిమోతి తనదగ్గర నుండవలెనని యాశించుచు ప్రేమతో నతఁడు తనయొద్దకు రావలెనని చెప్పుటకు ఈ యుత్తరమును వ్రాసెనుగాని బహుశః అట్లతఁడు వచ్చుట తటస్థింపదేమోనని తలంచి తన పనిముగిసెననియు తిమోతి తనపని నెంతనమ్మకముగా చేయవలెనో దానిని తెలుపుచు అతనికిది వ్రాసెను.

2. రెండవ పత్రికలోని ముఖ్యసంగతులు.

I. అభివందనములు ($1^{1,2}$).

II. తిమోతి ప్రేమను స్మరించుకొనుచు దాని విషయమై ఆదరణ నొందుచుండఁగా అతఁడు వహించిన ఉద్యోగ బాధ్యతనుగూర్చి తెలుపుట ($1^{3-14}$).

III. ఫుగెల్లు హెర్మొగెనే యనువారు తన్ను ఎడబాసిన సంగతియు, ఒనెసిఫోరు తన్ను పరామర్శించిన సంగతియు తెలుపుచు, దేవుఁడు నమ్మదగినవాఁడుగాన తిమోతిని ధైర్యము గలిగి యుండుమని హెచ్చరిక చేయుట ($1^{15}$-$2^{13}$).

IV. హుమెనై ఫిలేతు అను వారనుసరించిన తప్పు సిద్ధాంతములనుగూర్చి జాగ్రత్తగలిగి, స్వంత నడువడికను గురించి హెచ్చరికగా నుండుమని ప్రేరేపించుట ($2^{14-26}$).

V. అంత్యకాలమున కనఁబడు దుష్ప్రవర్తనులను గురించి జాగ్రత్తచెప్పి తానిప్పుడు ముగించనైయున్న తన జయకరమగు నిర్గమమునుగూర్చి ఆనబెట్టి అతఁడేపనిని నమ్మకముగా చేయవలెనని చెప్పుట ($3^{1}$-$4^{8}$).

VI. తిమోతి తనయొద్దకు రావలెనని చెప్పి, తనను వదలివేసిన స్నేహితులనుగూర్చి దెలిపి, దేవుఁడు తన నెంతమాత్రమును విడువఁడని ధైర్యమును కనఁబఱచుచు స్నేహితులకు వందనములు చేసి ఆశీర్వాదముతో నీ పత్రికను తన పత్రికలన్నిఁటిని ముగించుట ($4^{9-22}$). M.

**తిమ్నత్సెరహు,** (Timnath-serah, or **Timnath-heres** = మించిన భాగము). యెహోషువకు ఇయ్యఁబడిన స్వాస్థ్యములోనున్న యొక పట్టణము (యెహో $19^{50}$). యెహోషువ ఈ పట్టణములో నివాసముచేసి దీనిలోనే పాతిపెట్టఁబడెను ($24^{30}$ న్యాయా $2^{9}$). అది గాయషుకొండకు ఉత్తరదిక్కునయున్నదని వ్రాయబడెను ($2^{9}$). I మక్క $9^{50}$ లోని తిమ్నా ఇదేస్థలమై యుండవచ్చును. అది యెరూషలేమునుండి కైసరయకు పోవుమార్గమునకు సమీపముగనుండి లుద్దకు ఈశాన్యమున 7 క్రోసులదూరములో నున్నట్లు పురాతన గ్రంథములలో (*Onamasticon*) నొక దానియందున్నది యెహోషువ సమాధి షెకెమునకు దక్షిణమున 5 క్రోసులదూరములో నున్నదని షోమ్రోనువారు చెప్పుకొందురు. (పటము III, E 4).

**తిమ్నా, తిమ్నాతు** (Timna = భాగము Timnath).

1. ఏశావు కుమారుఁడగు ఎలీఫజు ఉపపత్ని (ఆది $36^{11}$).

2. ఏశావు సంతతిలో నొక స్త్రీ (ఆది $36^{22}$ I దిన $1^{39}$). ఈమె హోరీయుల తెగవారిలో చేరియుండెను.

3. ఎదోము నాయకులలో నొకఁడు (ఆది $36^{40}$ I దిన $1^{51}$).

4. యూదా మన్యమందలి యొక స్థలము (ఆది $38^{13,14}$). యూదా అచ్చట తన మందను మేపెను. యెహో $15^{57}$ నం దుదాహరింపఁబడిన హెబ్రోనుకు దక్షిణముగా నున్న ఊళ్ల జాబితాలో నీ పేరుండుటచే అది యా ప్రాంతములందున్న గ్రామమని యూహింపఁదగునుగాని దాని యునికి ఇంక సూటిగాఁ దెలియదు.

5. యూదా ఉత్తరపు సరిహద్దు నందున్న ఒక యూరు. అది బేత్షెమెషుకు సమీపముగా నుండి దానీయుల ఊళ్లలో చేర్చఁబడెను (యెహో $19^{43}$). సమ్సోను భార్య ఈ యూరి కాపురస్థురాలు గాన సమ్సోను కాలమునందిది ఫిలిష్తీయుల యాధీనమందుండెను (న్యాయా $14^{1,2,5}$ $15^{6}$). రాజగు ఆహాజు దానిని పట్టుకొని స్వాధీనము చేసికొనెను (II దిన $28^{18}$). దానికిప్పుడు తిబ్నె (*Tibneh*) యను పేరుగలదు. అది యెరూషలేముకు పడమటి దిక్కునకు కొంచెము దక్షిణముగా 8 క్రోసుల దూరమందున్నది. (పటము II, D 1).

**తిరాతీయులు** (Tirathites = తిరహు నివాసులు). లేఖికుల పనిచేసిన యొక కుటుంబపు వారు (I దిన $2^{55}$).

**తిరుగలి, తిరుగటిరాయి** వంటసామగ్రి 2 చూ॥

**తిరుగుటు, వేపునితట్టు** మారుమనస్సు చూ॥

**తిర్సా** (Tirzah = సంతోషదాయకము).

1. యెహోషువ పట్టుకొనిన 31 పట్టణములలో నిదియొకటి (యెహో $12^{24}$). ఇశ్రాయేలురాజైన మొదటి యరొబాము అందులో నివసించెను (I రాజు $14^{17}$). ఆయనకు తరువాత ఇశ్రాయేలు దేశము నేలినవారు ఒమ్రీకాలము వఱకు అచటనే బసచేయుచుండిరి ($15^{21}$ $16^{6,9,15,17,23}$). మెనహేము షల్లూముమీఁద కుట్ర చేసిన స్థానమిదే (II రాజు $15^{14}$). పర $6^{4}$ లో సుందరమతియగు షూలమ్మీతి తిర్సాపట్టణమువలె సుందరమైనదని చెప్పఁబడెను. ఆ తిర్సా యిదేయై యుండవచ్చును. దాని సరియైన యునికినిగూర్చి తెలియదుగాని అది షోమ్రోనుకు సమీపముగా నెచ్చటనో యున్నదని సాధారణముగా నంగీకరింతురు. (పటము II, G 2).

2. సెలోపెహాదుయొక్క ఐదుగురు కుమార్తెలలో నొకతె (సంఖ్యా $27^{1}$ $36^{11}$ యెహో $17^{3}$).

**తిర్హనా** (Tirhanah). కాలేబుకొడుకులలో నొకఁడు (I దిన $2^{48}$).

**తిర్హాకా** (Tirhakah). కూషుదేశమునకు రాజు (II రాజు $19^{9}$ యెష $37^{9}$). అతడు తన సేనతోకూడ ఐగుప్తునుండి బయలుదేరి అష్షూరు రాజగు సన్హెరీబునకు విరోధముగా యుద్ధము చేయుటకు వెళ్లెను. లౌకిక చరిత్రకారుఁడైన హెరోడొటస్ (*Herodotus*) కూడ ఈ యుద్ధమునుగూర్చి వ్రాసెను. ఆ రాజు క్రీ॥ ము॥ 691-665 సం॥ లలో నేలుచుండెను. అతని యేలుబడి చివటి యైదు సం॥ లలో నితనికి అష్షూరీయులతో ఎడతెగని యుద్ధములు జరిగెను. అష్షూరీయులు అతని దేశమును బట్టుకొనినను దానిని తమ స్వాధీనములో నుంచుకొనలేక పోయిరి.



**తిష్బీయుఁడు** (Tishbite). ప్రవక్తయగు ఏలీయాకు పెట్టఁబడిన బిరుదు (I రాజు $17^{1}$). అతఁడుపుట్టిన ఊరువలన ఆ బిరుదతనికి కలిగి యుండవచ్చును. ఆ యూరు గిలాదులో నున్నట్లు పైవచనమువలనఁ దెలియుచున్నది. ప్రస్తుత మచ్చటనున్న ఎల్ ఎష్టీబ్ (*El-Ishtib*) దీని యునికియై యుండవచ్చును. అది మహనయీముకు పడమరగా నున్నది.

## తీ

**తీతియు యూస్తు** (Titus Justus). కొరింథుపురవాసి. యూదులు తమ సమాజమందిరములోనుండి పౌలును వెళ్లఁగొట్టినప్పుడతఁడు తీతియు ఇంటనుండి బోధించెను (కార్య $18^{7}$). ఇతఁడు భక్తిగలవాఁడని చెప్పుటచేత ఛేదన సంస్కారము నొందకపోయినను యూదులమతమును నమ్మి యనుసరించినవాఁడని తెలియుచున్నది. కొన్ని ప్రతులలో యూస్తు అను పేరొకటిమాత్రమే గనఁబడుచున్నది.

**తీతు** (Titus). పౌలుయొక్క సహచారియు నతని కతి ప్రియమిత్రుఁడునైనవాఁడు. పౌలితని పేరు ప్రస్తాపించునప్పుడెల్లను ఇతనిగుఱించి బహు యనురాగ మగుపఱచును. ఇతని పేరు కార్యముల గ్రంథములో నెక్కడను తటస్థించదుగాని పత్రికలలో కొన్నిపర్యాయములు మాత్రమగుపడుచున్నది. ఇతని జన్మస్థానమును గుఱించి పండితులు వెవ్వేఱభిప్రాయముల ననుసరింతురు. అతఁడు క్రేతుద్వీపములో జన్మించినవాఁడని కొందఱును ఈకొనియలో జన్మించినవాఁడని కొందఱును చెప్పుదురుగాని సంఘాధ్యక్షుఁడైన కృసోస్తమతని స్వగ్రామము కొరింథు అని నిశ్చయించుకొనెను. పౌలు క్రైస్తవుఁడైన 14 సం॥ లకు అంతియొకయ సంఘమందన్యులైన క్రైస్తవులు సున్నతిపొందుట అవసరమో లేదో అను వివాదము కలిగిన సమయమున తీతు అక్కడ నుండెను. దీనివలన అతఁడు అంతియొకయ పట్టణపువాఁడని కొందఱి యభిప్రాయము. గల $2^{3}$ వలన నితఁడు హెల్లేనీయుఁడని స్పష్టమగును. ఆ వివాదములో సమాధానము చేయుటకై పౌలు యెరూషలేమును దర్శించినపుడు తీతును వెంటఁబెట్టుకొని వెళ్లెను. యెరూష

లేము సంఘస్థులలో పెక్కండ్రు తీతుకు సున్నతి చేయవలెనని వాదించఁగా పౌలందున కెంతమాత్రమును సమ్మతించకపోయెను.

ఆ మీఁదట తీతు పౌలువెంట సంచరించుచు ఆయన ఎఫెసులోనుండి గలతీయుల పత్రిక వ్రాయునందాక ఆయనతోకూడ నుండెను. అటుతరువాత పౌలు మొదటి రెండు కొరింథీయులకైన పత్రికలు వ్రాయుటకు నితఁడాయన దగ్గర యున్నట్టగుపడదుగాని ఆ పత్రికలను వారి కందించుటకితఁడు రెండుమూఁడావర్తులు కొరింథు పట్టణమును దర్శించెను. అతఁడు మొదటి కొరింథీయుల పత్రికనా సంఘస్థుల కప్పగించిన పిదప ఆ ప్రాంత్యమందు యూదయలోని బీదలగు క్రైస్తవుల సహాయము నిమిత్తము ద్రవ్య సేకరణము చేయుచుండెను (II కొరి $12^{18}$ I కొరి $16^{1-2}$ II కొరి $8^{6}$).

తీతు కొరింథును విడిచినపిమ్మట ఆ సంఘములో కక్షలేర్పడి పౌలువిషయమై సణుగులు పుట్టెను గనుక II కొరి $2^{9}$ నందు చెప్పఁబడిన యుత్తరమును గొనిపోవ తీతు పౌలువలన కొరింథుకు పంపించఁబడెను. తీతు ఆ యుత్తరు మప్పగించిన తరువాత మాసిదోనియనుదాటి తనను త్రోయలో కలిసికొమ్మని పౌలతని కాజ్ఞాపించెనుగాని పౌలు త్రోయకురాఁగా తీతురాక తడవుచేసినందున మాసిదోనియకు పోయి కొరింథునుండి అతఁడు తెచ్చిన సమాచారమువలన ఆ సంఘము క్రమపడుటను గుఱించి విని సంతుష్టహృదయుఁడాయెను. తీతు ఆ సంఘస్థితిని పౌలు కెఱింగింపఁగా నాయన రెండవ కొరింథీ పత్రికను రచించి యితనిచేతి కిచ్చి వారియొద్దకు పంపించెను ($8^{16}$).

ఆ తరువాత పౌలు మొదటిచెఱనుండి విడుదలయైన తదుపరి చేసిన సువార్తయాత్రలో నితనిని వెంటఁబెట్టుకొనిపోయి క్రేతుద్వీపములో విడిచి యా ద్వీపములోని సంఘములను క్రమపఱచి ప్రతిపట్టణమందు పెద్దలనేర్పఱచుటకు పౌలుచేత నియమించఁబడినట్లు తీతు $1^{5}$ వలనఁ దెలియఁబడును. ఇతఁడు ఆ ద్వీపములోని సంఘముల కధ్యక్షుఁడై యుండి యక్కడనే పరగతుఁడైనట్టు ఒక పారంపర్యవాడుక గలదు. M.

**తీతునకు వ్రాసిన పత్రిక (Titus, Epistle to).**

1. గ్రంథకర్త. ప్రాచీనకాలము మొదలుకొని యీ శతాబ్దమువఱకు నీ పత్రిక పౌలువలననే రచింపఁబడినదని సర్వాంగీకారమైనను నవీనకాలమున కొందఱు వేదపండితులు ఇందును గుఱించి సంశయించి యీ పత్రిక పౌలు రచనము కాదనియు రెండవ శతాబ్దముమధ్య నెవఁడో యొకఁడు పౌలు వ్రాసిన పత్రికలలోని మాటలను సమకూర్చి ఆ పత్రికకు పౌలు పేరుపెట్టి ఆయన తీతుకు వ్రాసినట్టు ప్రచురము చేసెనని చెప్పుచున్నారు. వీరియభిప్రాయమునకు కొంత మట్టుకు ఆధారమున్నను అది సర్వాంగీకార యోగ్యము కాదని తీర్మానించవలెను. ఈ సంగతి విషయమై తిమోతికి వ్రాసిన పత్రికలనుగూర్చి విచారించినపుడు వివరించియున్నాము. కాఁబట్టి యిక్కడ ఆ విషయమునుగురించి ప్రత్యేకా చెప్ప నవసరములేదు (తిమోతి పత్రికలను చూ.).

2. ఎవరినిమిత్తమై వ్రాయఁబడెను. ఇది తీతుయొద్దకు పంపించఁబడినట్టు $1^{1}$ నందు ప్రశంసించఁబడెను. ఆ సమయమున తీతు క్రేతుద్వీపమందు పౌలతనికి నియమించిన సంఘకార్యములను నిర్వహించుచుండెను. ఈ పత్రిక వ్రాయకమునుపు కొన్నాళ్ల క్రిందట పౌలు, తీతుతో కూడ క్రేతుద్వీపమును దర్శించెనని $1^{5}$ నందు తెలియుచున్నది. పౌలాద్వీపమును దర్శించిన కాలమును చక్కఁగా నిరూపించుట దుర్లభము. ఆయన కైసరయనుంచి రోమాపురికి పోవు సమయములో నీద్వీపము సమీపమున ఓడనాయకులు లంగరువేసిరి (కార్య $27^{12,13}$) గాని వారప్పుడనుకూలమైన గాలికొఱకు కనిపెట్టుచున్నందున బహుశః ఎవరును ఓడదిగుటకు అవకాశము లేకుండెను. అదియుమాత్రముగాక ఆ సమయమున తీతు పౌలుకు తోడ్పడి యుండలేదు. కాఁబట్టి ఆ సమయమున ఈ పత్రికయందు ప్రశంసించినట్లు ఈ దీవిని దర్శించలేదని నిస్సందేహముగా చెప్పఁగలుగుదుము. ఇట్లుండఁగా పౌలు మొదటి చెఱనుంచి విడుదలయైన తరువాతను రెండవ పర్యాయము పట్టుబడకమునుపును మధ్యజరిగిన వ్యవధానమందు తీతుతో కూడ క్రేతుకుపోయి

అతని ఆ సంఘములను క్రమపఱుచుటకు అక్కడ విడిచెనని నిశ్చయించుకొనవలెను. ఆ వ్యాసభాగమందు పౌలు చేసిన ప్రయాణములనుగూర్చియు దర్శించినపట్టణములను గుఱించియు తిమోతి పత్రిక క్రిందివివరములను చూడుఁడు.

క్రేతుద్వీపములోని సంఘమెప్పుడు, ఎవరివలన స్థాపించఁబడెనో కచ్చితముగా చెప్ప వీలుపడదు. పెంతెకొస్తు పండుగనాడు ఈ ద్వీపమునుంచి యెరూషలేమునకు వచ్చినవారు అపొస్తలులు సువార్త బోధించుచుండఁగా విని తెలిసికొనిరి. కాఁబట్టి ఒకవేళ వారిలో విశ్వసించిన కొందఱివలన ఇక్కడ సంఘము స్థాపితమాయెనను అభిప్రాయ మంగీకరించఁదగును.

3. కాలస్థాన నిరూపణము. పౌలీపత్రిక కొరంథునుంచి వ్రాసెనని కొందఱి అభిప్రాయము గాని పెక్కండ్రు పండితోత్తములు అది పౌలు తిమోతికి పంపిన మొదటి పత్రిక రచించఁబడిన సమయముననే లిఖితమాయెనని తీర్మానించుకొందురు. వారి యభిప్రాయ మంగీకరించినయెడల ఈ పత్రిక మాసిదోనియ ప్రదేశమందు క్రీ॥ శ॥ 67 సం॥ మున పౌలు సంచరించుచుండఁగా లిఖితమాయెనని తలంచవలసియుండును.

4. ఉద్దేశము: సంఘ నిర్వాహకత్వమును గుఱించి తిమోతికి సలహా ఇచ్చినట్లు తీతుకును చెప్పనుద్దేశించి పౌలీపత్రికను వ్రాసెను. క్రేతులోని కొందఱు తీతు కార్యములను అటకాయించుచున్నారని పౌలువిని అతనిని ధైర్యపఱచుటకును సహాయముచేయుటకును ఈ పత్రికను వ్రాసెను. మొదటినుంచి సంఘములో క్రమపద్ధతిననుసరించి వృద్ధియగులాగున ప్రతిపట్టణమందును అతఁడు యోగ్యులైన పెద్దలను నియమించవలెనని యాజ్ఞాపించి వారి యోగ్యతలను తెలియఁజేసి వారి విషయమై అతను హెచ్చరించుచు వచ్చెను. ముఖ్యముగా తీతు తానే అన్నిటియందు తిన్నతోను సత్కార్యముల విషయమై మాదిరిగ కనబఱచుకొనుమని బుద్ధి చెప్పుచున్నాఁడు (2[7,8]).

5. ముఖ్యసంగతులు.

I. వందనములు (1[1-4]).

II. సంఘాధ్యక్షుల కుండవలసిన యోగ్యతలు (1[5-11]).

III. క్రేతీయుల దుష్ప్రవర్తన (1[12-16]).

IV. అందఱును సత్కార్యనిర్వహణమునందు ఆసక్తిపరులుగ నుండవలెనను ముఖ్యోద్దేశముతో ఆయా యంతస్థులలోని వారనుసరించవలసిన విధులనుగూర్చి తెలుపుట (2[1-15]).

V. క్రీస్తు ప్రేమచే ప్రేరేపింపఁబడినవారై క్రైస్తవులనుసరించవలసిన వివిధనీతులు (3[1-11]).

VI. ఆయా వారినిగూర్చి తగిన యాజ్ఞలిచ్చి సలాములు పంపి ఆశీర్వాదముతో నీ పత్రికను ముగించుట (3[12-15]). M.

**తీమయి** (Timaeus = శ్రేష్ఠుఁడు). యెరికోలో క్రీస్తు బాగుచేసిన గ్రుడ్డివారిలో నొకని తండ్రిపేరు. ఆ గుడ్డివానికి తిమయి కుమారుఁడని యర్థమిచ్చు బర్తిమయి అనుపేరు (మా 10[46]) గలదు.

**తీమోను** (Timon = యోగ్యుఁడు). ఏడుగురు పరిచారకులలో నొకఁడు (కార్య 6[5]).

**తీరసు** (Tiras). యాపెతు కుమారులలో నొకఁడు (ఆది 10[2]). అతను త్రాకియ (*Thrace*) దేశప్రజల పూర్వీకుఁడని యిదవఱకు తలంచిరిగాని నవీన పండితులు క్రీ॥ ము॥ 13 శతాబ్దమున ఈజియన్ సముద్రద్వీపవాసులై ఐగుప్తుదేశముమీఁదకు దండెత్తివచ్చిన తురష (*Turasha*) యను బందిపోటు (లేక ఓడ) దొంగలకు పూర్వీకుఁడని యనుకొందురు. ఇతని పేరునకు సంబంధముగా తార్సు తార్షీషు అను పేరులు వచ్చినవని కొందఱి యభిప్రాయము.

**తీర్పు, విమర్శ** (Judgment). అంత్యదినపు సంగతులన్నియు న్యాయపు తీర్పుకు సంబంధించినట్లు బైబిలు బోధలవలన స్పష్టమగుచున్నది. వాటన్నిటిలో న్యాయతీర్పు ముఖ్యమైనదై యున్నది. అందఱును ఆ విమర్శకులోనగుదురు (మ 12[36] లూ 10[14] హెబ్రీ 9[27] II పేతు 2[4] I యోహా 4[17]). దేవుఁడే ఆ న్యాయ తీర్పు చేయును (హెబ్రీ 12[23]). ఆయన ఆ పని క్రీస్తు కప్పగించెను (రోమా 2[16] మ 25[31-45]

యోహా $5^{22-27}$). ఈ పనిలో దూతలును ఆయనకు సహాయపడెదరు (మ $13^{24-30,37-43,47-50}$). పరిశుద్ధులును సహాయము చేతురని లూ $22^{30}$ I కొరి $6^{2}$ వలన నూహింపవచ్చును. ఆ తీర్పు ప్రకారము మానవులకు నిత్యసౌఖ్యముగాని, నిత్యదండనగాని కలుగును (మ $25^{46}$ రోమా $2^{5,10}$ పాతాళము, అమరత్వము అంత్యదినము, నిత్యజీవము చూ॥).

**తీర్పుతీర్చులోయ** (Valley of Decision). ఈ పేరు యోవే $3^{14}$ లో తప్ప మరి యెచటను కనఁబడదు. $3^{2,12}$ లో అది **యెహోషాపాతులోయ** అనఁబడును. దానికి కిద్రోనులోయ యని మారుపేరు కలదు. యెహోషాపాతు అను పేరునకు యెహోవా తీర్పుచేయును అను శబ్దార్థముండుటచే అది తీర్పు చేయులోయ యనఁబడి యుండవచ్చును. యోవేలు గ్రంథమును చూడఁగా యెహోవా ఆ లోయలోనే అన్యులకు తీర్పుచేయునట్లున్నది గనుక దానికి ఈ పేరు పెట్టఁబడెను. (యెరూషలేము AI 1 చూ॥).

**తీర్పుతీర్చుట, వివేచించుట** (Judging). ఈ శీర్షికయందు దేవుఁడు చేయు తీర్పునుగూర్చి గాక మానవులు చేసెడి తీర్పునుగూర్చి వివరింపఁబడును.

మానవులు మనస్సాక్షిగలవారైనందున ఆయా కార్యముల మంచిచెడ్డలను వివేచించుట వారి విధియై యున్నది (రోమా $2^{14,15}$). క్రైస్తవులైన వారు దేవుని పరిశుద్ధాత్మ నొందినవారు గాన ఇట్టి వాటిని మరింత సూక్ష్మముగా వివేచింపవలసి యున్నారు (I కొరి $2^{15}$). ప్రతిదానిని క్రీస్తు బోధననుసరించి వివేచించుట వారి విధియై యున్నది (ఫిలి $1^{10}$ I థెస్స $5^{21}$). ఇట్లు ఆయా కార్యములనుగూర్చిన మంచి చెడ్డలను వివేచించుట వారి విధియని సంశయించుటకెట్టి యాస్పదములు లేకున్నను ఇతరులనుగూర్చి వారు మంచివారా చెడ్డవారా యని తీర్చుట తగునా యను సందేహము తప్పక కలుగుచున్నది. ఒకరు జేసినకార్యములు మంచివనిగాని చెడ్డవనిగాని వివేచించునప్పుడు వాటిని చేసినవారినిగూర్చి తీర్పుతీర్చకుండుట అనివార్యమైనదై యున్నది. మంచి చెడ్డలను భేదము కార్యములయందు గాక వాటినిచేసిన వారియందుండుటయే దీనికి మూలము. ఇతరులెట్టివారైనది స్పష్టముగాఁ దెలుపుటకు క్రీస్తైన్నడైనను వెనుక దీయలేదు (మ $16^{23}$ $23^{13}$ మా $10^{21}$ లూ $13^{32}$ యోహా $1^{47}$ $6^{70}$). ఆయనిట్టి తీర్పును పక్షపాత బుద్ధితో గాక ప్రేమతోఁ జేసెను. సాధారణముగా మానవుల తీర్పులు అట్టివికావు గనుకనే యవి నిషేధింపఁబడెను (మ $7^{1}$ రోమా $14^{10}$ యాకో $4^{11}$). క్రీస్తు మనస్సుగలిగి న్యాయముగా తీర్పుతీర్చవలెనని గోరనపక్షమున క్రొత్త నిబంధనలోనున్న ఈ దిగువవాటిని లక్షింపవలసియున్నాము. మన లనుగూర్చి మనమే మొదట తీర్పు తీర్చుకొనవలెను (మ $7^{3}$ రోమా $2^{1}$). పై వేషమును చూడక యధార్థవంతులమై యుండవలెను (యోహా $7^{24}$ లూ $16^{15}$). ఇతరుల నాటంకపఱచక ప్రేమగల భావముతో వారిని చూడవలెను (రోమా 14 I కొరి $10^{29}$). దేవుఁడొకఁడు అందరికి తీర్పుజేయునని దెలిసికొని న్యాయతీర్పు దినమున జరుగునట్టి తీర్పును ముందుగా చేయఁదెగింపరాదు ($4^{5}$ రోమా $14^{10}$). ఎల్లప్పుడు ఇతరులు చేసిన దానిలోని లోపములను కనిపెట్టు మన నైజబుద్ధి యేహ్యాకరమని తెలిసికొని విసర్జించవలెను (యాకో $4^{11}$). ఇట్లు ఇతరులకు తీర్పుచేయు వారు పై విషయములను గమనించిన పక్షమున ఎక్కువ తీర్పులను జేయరని చెప్పుటకు సంశయములేదు.

**తీర్యా** (Tiria). యూదా సంతతివారిలో యెహల్లెలేలు అనువాని కుమారుఁడు (I దిన $4^{16}$).

**తీలోను** (Tilon). యూదాసంతతివారిలో నొకఁడైన షీమోను కుమారుఁడు (I దిన $4^{20}$).

## తు

**తుంగ** నాచు చూ॥

**తుంబోడి** పక్షులు 22 చూ॥

**తుకికు** (Tychicus = అదృష్టవంతుఁడు). పౌలుయొక్క అనుచరులలో నొకఁడు. ఆసియ యనఁబడిన పరగణావాఁడు. పౌలు తన మూఁడవ ప్రయాణాంతమున కొరింథునుండి యెరూషలేమునకుఁ దిరిగి వెళ్లుచుండఁగా అతనికన్న ముందుగా

వెళ్లి త్రోయలో కనిపెట్టుమండిన వారిలో నొకఁడు (కార్య 20[4]). చెఱయందుండి పౌలు వ్రాసిన పత్రికలను ఎఫెసు కొలొస్సయులలోని సంఘములకుఁ గొనితెచ్చిన దూతయై యుండెను (ఎఫె 6[21] కొలొ 4[7]). వాటిని పౌలు రోమా నుండి వ్రాసెనని సాధారణముగా నంగీకరింతురు గావున తుకికు ఆ సమయమున పౌలుయొద్ద నుండెనను సంగతి స్పష్టమగుచున్నది. పౌలున కితఁడెంతో ప్రియుఁడని ఆ వాక్యములయందున్న ప్రియసహోదరుఁడు, ప్రభువునందు నమ్మకమైన పరిచారకుఁడు, జత సేవకుఁడు అను పదముల వలనఁ దెలియుచున్నది. పౌలితనిని క్రేతుకుఁ బంపఁ దలచినటుల గనఁబడుచున్నది (తీతు 3[12]). తన రెండవ చెరకాలమున పౌలితనిని ఎఫెసుకుఁ బంపించెను (II తిమో 4[12]). ఈ సూచనలను చూడఁగా అతఁడు పౌలుకు సహాయముచేసిన నమ్మకమైన పరిచారకుఁడని తెలియును. పౌలు మరణమొందిన పిదప ఇతఁ డొక యుపద్రష్టుఁడై హతసాక్షి యాయెనని పారంపర్యమువలనఁ దెలియుచున్నదిగాని దానిగూర్చి మరేమి తెలియదు.

**తుత్తిచెట్లు** (Mallows). ఈ మాటచే తెనిఁగింపఁబడిన పదము సముద్రతీరమందును వాటి నేలలయందును పెరుగు ఈలమొక్కల వంటిది. పేదలు దీని యాకులను వండుకొని తిందురు (యోబు 30[4]). J.C.

**తుఫాను, సుడిగాలి** (Tempest).

I. పాఁత నిబంధనలో కనిపించు మూఁడు హెబ్రీ పదములను తుఫాను అనుమాటచే తెనిఁగించిరి. వీటిలో నొకటి పెనుగాలిని సూచించును (యోబు 27[20] 37[9] సామె 1[27] యెష 17[13] 66[15]). కొన్ని వాక్యములలో దీనిని ప్రళయ వాయువనియు (హోషే 8[7] ఆమో 1[14]), కొన్నింటిలో సుడిగాలి (సామె 10[25] యెష 52[8] 21[1] యిర్మీ 4[13] నహూ 1[3]) యనియు తర్జుమా చేసిరి. సామె 1[27] నందు తుఫాను అని తెనిఁగించిన మఱియొక పదమును కీర్త 55[7] లో సుడిగాలి యనియు, యెష 54[11] లో గాలివాన యనియు తర్జుమా చేసిరి. మూఁడవ పదమును తుఫాను అని తెనిఁగించినను (కీర్త 83[15] యిర్మీ 25[32] యెహె 1[4] దాని 11[40] యోనా 1[4] నహూ 1[8]) హోషే 13[3] లో గాలి యనియు, యిర్మీ 23[19] 30[23] లో పెనుగాలి యనియు తెనిఁగింపఁబడెను. ఈ పదమును సుడిగాలి యని తెనిఁగించుట మఱి సాధారణముగాఁ గనఁబడుచున్నది (II రాజు 2[1,11] యోబు 38[1] 40[6] కీర 55[7] యెష 40[24] 41[16] యిర్మీ 30[23] ఆమో 1[14] జెక 9[14]).

II. క్రొత్త నిబంధనయందు తుఫాను అని తెనిఁగించిన హెబ్రీ 12[18] లోని ఒకపదమును మ 8[24] లోని మఱియొక పదమును కదలింపుయని అర్థమిచ్చును. కార్య 28[12-20] లో నున్న పెద్ద గాలి యను పదము చలికాలములో కొట్టెడు తుఫాను అని శబ్దార్థమిచ్చు ఇంకొక మాటయై యున్నది. II పేతు 2[17] నందున్న పెనుగాలి యను పదము వేఱొకమాటగా నున్నది.

ఈ మాటలన్నియు పెద్దగాలినిగూర్చి చెప్పఁబడినను (యోహా 6[18] కార్య 27[18,20]) అవి సాధారణముగా నాశనమును సూచించెడి యలంకారములని తెలియుచున్నవి (గలిలయ సముద్రము, ఊరకులో చూ॥).

**తుబాలు** (Tubal). యాపెతు కుమారులలో నొకఁడు (ఆది 10[2]). చిన్నసియాలోని జనమునకితఁడు పూర్వికుఁడాయెను. యెష 66[19] నందు ఈ పదము గ్రీకువారిని సూచించు యావానుతో కలిసి ఉపయోగింపఁబడుటవలన పైన చెప్పినట్లు తలంతురు. వీరు సాధారణముగా మెషెకువారితో కనఁబడెదరు (యెహె 32[26] 38[2] 39[1]). ఈ రెండు జనాంగముల పేరులు అష్షూరు రాతిశాసనములయందును కనఁబడును. ఇది చిన్నాసియాకు తూర్పు భాగమున నున్న యుఫ్రాతు నది దగ్గఱ నున్నది. వీరును మెషెకువారును గలిసి చేసిన వానిజ్యవర్తకమును గూర్చిన సూచనగలదు (27[13]).

**తుమ్మచెట్లు** (Shittim wood). పలెస్తీను దేశమందును అరేబియా ఐగుప్తు యెడారులయందును పెరిగెడు చెట్లు. వీనియందనేక జాతులు గలవు. ఈ దేశమందువలె ఆ దేశములలోను కలపకును వంటచెరకుకును ఈ చెట్ల నుపయోగింతురు (నిర్గ 25[10]). గుడారమునందు

కఱ్ఱతో చేయవలసిన వాటి నన్నిటి ఈ చెట్టు కలపతోనే చేసిరి (2)[15] 27[1,6] 30[1,5] ద్వితీ 10[3] మొ"). ఎండి బీడుపాఱిన గొడ్డు నేలను భూముల ఫలవంతములుగా చేసి పలెస్తీనుదేశమునందు కలుగఁబోయెడి దివ్య మార్పును సూచించెడి చెట్లలో నిదియు గలదు (యెష 41[20]).

J. C.

**తుమ్మీమ్** ఊరీమ్ తుమ్మీమ్ చూ॥

**తుయతైర** (Thyatira). చిన్నాసియా యందలి పడమటి పరగణాయగు లిడియాలో ఉత్తరముగా నున్న పట్టణము. పెర్గమునుండి సార్దీస్ అను పట్టణమునకుఁ బోవు రస్తామీఁద నున్నది. ప్రకటన గ్రంథమం దుదాహరింపఁబడిన ఏడు సంఘముల జాబితాలో నిది యా రెండు పట్టణములకు మధ్య వచ్చును (ప్రక 2[24-29]). మిగుల ప్రసిద్ధికెక్కిన పురాతన పట్టణమై పెలోపియా. ఐహిప్పాయను పేరులచేఁ బిలువఁబడెను. క్రీ॥ పూ॥ 280 సం॥ అంతియొకయు రాజులలో నొకఁడు దీనిని మరల గట్టించి తుయతైర అను పేరు పెట్టెను. ఆ పట్టణస్థులు చేతిపనులకు మిగుల ప్రసిద్ధినొందిరి. ధూమ్రవర్ణ వస్త్రములు నేయుట వాటిలో నొక విశేషమగు పనియై యుండెను. ఫిలిప్పీయి పట్టణమున క్రైస్తవురాలయిన లూదియ ఈ పట్టణస్థురాలై యుండి అట్టి వస్త్రముల వ్యాపారము చేయుచుండెను (కార్య 16[14]). ఇత్తడి పనులకును ఈ పట్టణము పేరు నొందెను. ప్రక 2[18] లోని అపరంజి పాదములు, అపరంజినిగాక మెఱయుచున్న ఇత్తడిని సూచించుచు ఈ పనిని తెలుపునని కొందఱి యభిప్రాయము. చిన్నాసియా యందలి యితర పట్టణములందువలె ఇచ్చటను యూదుల నేకులుండిరి. వీరు సోదెయడుగుట కభ్యాసపడినవారు (కార్య 13[6] 19[13]). ప్రక 2[20-24] లో నున్న జారత్వములును, 2[24] లోని సాతానుయొక్క గూఢమైన సంగతులు అట్టి సోదె పనులను సూచించుననుకొనఁదగును. ప్రస్తుతమున దానికి అక్హిస్సారు (*Ak Hissar*) అని పేరు. అది దాదాపు 12,000 మంది జనము గలిగి యున్నది. తురుష్కులు, గ్రీకులు యూదులు అందుగలరు. పూర్వముండిన కట్టడముల రాళ్లతోను కలపతోను ప్రస్తుతపుటిండ్లు కట్టించుకొని యున్నట్లు శిథిలపరిశోధకులు తెలుపుచున్నారు. (పటము V, H 3).

**తురన్ను** (Tyrannus = ఏకచక్రవర్తి). ఎఫెసు పట్టణమందలి యొక గొప్ప విద్వాంసుఁడు. యూదులు పౌలును తమ సమాజమందిరములో బోధింపనియ్యక పోయినప్పుడు పౌలితని విద్యాశాలలలో బోధించెను (కార్య 19[9]). ఇది యొక్కటిగాక అతనిగూర్చిన మఱే సూచనయు కనఁబడదు. గ్రీకులలోని పండితు లిట్టి విద్యాశాలలను స్థాపించుట అలవాటై యున్నట్లు తెలియుచున్నది. D అను గుఱుతుచే తెలియఁబడు మాతృకలో పౌలిచ్చట ఐదవగంట మొదలు పదవగంటవఱకు బోధించినట్లున్నది. గ్రీకువారి పండితులు నుపదేశించిన కాలవిదే. అచ్చటనుండి దేవుని వాక్యము అనేకులకు తెలుపఁబడుటవలన (19[10]) ఇది ప్రసిద్ధమగు విద్యాశాలయని ఊహింపవచ్చును. తురన్ను ఈ పని కొఱకై తన విద్యాశాలను పౌలుకిచ్చుటనుబట్టి అతఁడు పాత నిబంధనలోని శ్రేష్ఠమైన బోధలు సత్యమని నమ్మిన అన్యులలో నొకఁడై దేవునికి భయపడిన వారలో చేరియుండును. ఎఫెసులో మాత్రమే గాక పౌలు ఏథెన్సులోను ఇట్టి విద్యాశాలలో బోధించెను (17[16,17]).

**తులము** నాణెములు I, మానములు కొలతలు IV చూ॥

## తూ

**తూబల్కయీను** (Tubal - Cain). లెమెకు కుమారులలో నొకఁడు (ఆది 4[22]). పదునైన యిత్తడి యినుప పనిముట్లను మొదట చేసినవాఁడు.

**తూము** మానములు II 1 (2) చూ॥

**తూరు, సోరు** (Tyre = బండ). మధ్యధరా సముద్రపుటొడ్డున ఫేనీకే దేశములో నుండు మిగుల పురాతనమైన పట్టణము. గ్రీకు చరిత్రకారుఁడగు హెరొడొటస్ అది క్రీ॥ పూ॥ 2740 వ సం॥ న స్థాపింపఁబడినదని వ్రాసెను. యోసీఫసు వ్రాఁతలనుబట్టి అది క్రీ॥ పూ॥ దాదాపు 12(0 సం॥ న కట్టఁబడినదని తెలియుచున్నది (పురా 8. 31). యెషయా దీనికి

ప్రాచీన కాలమున నుండిన పట్టణము ($23^{7}$) అను పేరు పెట్టెను. దీనికంటె సీదోను పట్టణము మఱీ పురాతనమైనదై యుండెను (ఆది $10^{15}$). సీదోనువారు తూరు పట్టణమును స్థాపించి యుండుటచేత తూరు సీదోను కన్యక (కూతురు) అనఁబడెను (యెష $23^{12}$) యెహోషువ దేశమును జయించినపిమ్మట తూరును ఆషేరు గోత్రమున కిచ్చెను (యెహో $19^{29}$ సోరు = తూరు) గాని, వారు దాని నెన్నడును జయించి యుండలేదు. అప్పటినుండి దావీదు కాలమువఱకు (అనఁగా 430 సం॥ వఱకు) తూరు అను పేరు బైబిలులో కనఁబడదు. దావీదు కాలములో తూరు నేలిన హీరాము అనువాఁడు దానిని గొప్ప పట్టణముగా చేసెను. అతఁడు దాని పెంపకము చేయుటయేగాక దానిచుట్టు ప్రాకారములను కట్టించెను (II సమూ $24^{7}$). హీరాము మంచి సముద్ర వ్యాపారము చేయుటచే (I రాజు $9^{27}$) అతఁడు ఇక్కడ మంచి రేవులను కట్టించి యుండును. అప్పటి కాలమునుంచి ఆ పట్టణస్థులు వాణిజ్యమునఁ బ్రసిద్ధిఁజెంది తమ యోడలను నలు దిక్కులకుఁ బంపి అందఱిలో గొప్ప వర్తకులని పేరు వడసిరి. దావీదు నగరమును (I దిన $14^{1}$) యెరూషలేము ఆలయమును (II దిన 2) కట్టుటకై హీరాము మ్రానులను పనివారినిఁ బంపెను. సొలొమోను తన యోడలను దూరదేశములకుఁ బంపునపుడు తూరువారి యోడలతోఁ గలిపి పంపెను (I రాజు $9^{26,27}$ $10^{22}$).

హీరాము చనిపోయినపిమ్మట స్థిరమైన ప్రభుత్వము లేకపోవుటచేత తూరుకు చాల తొందరలు కలిగెను. చివఱకు ఎత్బయలు అను సీదోను రాజు ఆ రాజ్యము నపహరించెను. యెజెబెలు ఇతని కూతురే ($16^{31}$). ఈమెను ఇశ్రాయేలు రాజైన అహాబు వివాహము చేసికొనెను. క్రీ॥ ము॥ 726 వ సం॥ న అష్షూరురాజగు షల్మనేసెరు దానిని ముట్టడించెను గాని జయింపలేక పోయెను. అయితే 705 సం॥ న సన్హెరీబు దాని జయించెను. అష్షూరు రాజగు అషుర్బని పాల్ అనువాఁడు 664 సం॥ లో దానిని జయించెను. అష్షూరు రాజ్యము క్షీణించిపోఁగా తూరుకు మఱల స్వతంత్రత కలిగెను (630 సం). నీనెవె పట్టఁబడిన పిమ్మట దానికి ఔన్నత్యస్థితి కలిగెను. యెహె 27, 28 అధ్యాయములలో దాని విస్తరమును దాని భాగ్యమునుగూర్చి యున్నది. అయినను వారి పాపములవలన వారు నశింతురని యెహెజ్కేలు ఆ కాలములోనె ప్రవచించెను. (26-28, $29^{18-20}$).

బాబెలువారు వృద్ధిలోకి రాఁగా ఐగుప్తీయులతో సంధిచేసికొనిరి. బాబెలు రాజైన నెబుకద్నెజరు దానిని 13 సం॥ వఱకు ముట్టడి వేసి ($27^{7-12}$) చాల నష్టము కలిగించినను దానిని పూర్ణముగా జయింపలేక పోయెను ($9^{18}$). చివఱకు తూరు పట్టణస్థులు బాబెలు వారితో సంధిచేసికొనినట్లున్నది ఈ యుద్ధమువలన తూరుయొక్క వర్తకము చెడిపోయెను. కావున 50 సం॥ ల వఱకు అది బీదస్థితిలో నుండెను.

యిర్మీ $44^{30}$ లో నున్నట్లు బబులోను వారికి ఐగుప్తీయులకు జరిగిన యుద్ధములో తూరుకూడ పాలుపుచ్చుకొనెను. అది చివఱకు బాబెలు వారి యధీనమై బాబెలు రాజ్యము క్షీణించిన దాక దానికి లోఁబడి యుండెను. తూరువారి గర్వమును (యెహె $28^{2}$) వారి యన్యాయమును (ఆమో $1^{9}$) వారు బానిసలబేరము చేయుటను (యోవే $3^{4-6}$) ప్రవక్తలు ఖండించిరి.

క్రీ॥ ము॥ 538 వ సం॥ న కోరెషు యెరూషలేము ఆలయమును తిరిగికట్టుటకు తూరువారు సహాయము చేయవలెనని యాజ్ఞనిచ్చెను (ఎజ్రా $3^{7}$). నెహెమ్యా కాలమందు (క్రీ॥ ము॥ 430) తూరు వర్తకులు యెరూషలేములో చేఁపలనమ్మినట్లు నెహె $13^{16}$ వలనఁ దెలియును. తదనంతరము పారసీలు గ్రీకువారితో చేసిన యుద్ధములలో తూరుకు మఱల తొందఱలు కలిగినవి. క్రీ॥ ము॥ 332 వ సం లో మహా అలెక్సందరు దానిని ముట్టవేసి జయించి దాని నివాసులలో 10,000 మందిని చంపుటయేకాక 30,000 మందిని బానిసలనుగా నమ్మి తూరు పట్టణమును (ప్రస్తుతమున్న) బొత్తుగా నాశనము చేసెను. అయితే తూరు పట్టణము మఱల కట్టఁబడెను. పాత నిబంధనకును క్రొత్త నిబంధనకును మధ్య కాలములో అంతియొకయ వారికిని ఐగుప్తువారికిని జరిగిన యుద్ధములలో కూడ దీనికి తొందఱలు కలిగెను. అప్పుడది 70 సం॥ ల వఱకు ఐగుప్తు



ప్రస్తుతకాలపు తూరు

వారికి లోనైయుండి మిగతకాలము అంతియొకయవారి స్వాధీనమందుండెను. క్రీ॥ ము॥ 65 సం॥ లో రోమీయులు దానిని లోఁబఱచుకొనిరి. క్రొత్త నిబంధనకాలములో అది వారి యాధీనముననే యుండెను. క్రొత్త నిబంధనలోని సూచనలను చూడఁగా తూరువారు కొందఱు క్రీస్తుబోధను వినుటకు వచ్చియుండిరి (మా $3^{8}$). క్రీస్తు తూరు ప్రాంతములకు వెళ్లియుండెను ($7^{24-31}$ = మ $15^{21-31}$) తూరువారు క్రీస్తుబోధ నంగీకరించుటకు మనస్సు గలిగియున్నట్లు లూ $10^{13}$ వలన నూహింపఁదగును. తూరీయులు హేరోదుతో సంధిఁజేసికొనిరి (కార్య $12^{20}$), పౌలు ఆ పట్టణమును దర్శించియుండెను ($21^{3-7}$). సంఘ చరిత్రను చూడఁగా

పూర్వము తూరులో అన్యదేవత యాలయమెచట నుండెనో అచట క్రైస్తవాలయమును కట్టించియున్నట్లు తెలియును. ఒరిగెను అను సంఘ పితరుఁ డచట ఆశ్రయ మొందినవాఁడై అచటనే దాదాపు 254 లో కాలము చేసెను. క్రీ॥ శ॥ తరువాత 638 సం॥ లో తురకలు దాని జయించిరి. 1124 లో క్రూసేడులవారు దానిని జయించి యుండిరి గాని 1291 లో తురకలు దానిని మఱల స్వాధీనపఱచుకొనిరి. అది మొదలు 1918 వఱకు అది వారి స్వాధీనమందుండెను. అప్పటినుండి ఫ్రెంచివార సంరక్షణ క్రిందనుండి, 1944 లో లెబానోను స్వతంత్ర రాజ్యములో చేరినది. ప్రస్తుతమున అది యొక చిన్న బెస్తపల్లెయై ఎస్సూరు (*Essur*) అను దాని పురాతన పేరుతో పిలువఁబడుచున్నది (పటము I, D 2).

**తూర్పారబట్టు** వ్యవసాయము 7 చూ॥

**తూర్పు ద్వారము** దేవాలయము 1 3. (3) చూ॥

**తూర్పున నుండువారు, తూర్పుజనులు, తూర్పువారు** (Children of the East) పాలెస్తీనుకుఁ దూర్పున నుండు సిరియా అరణ్య నివాసులకు పెట్టఁబడిన సాధారణ నామము. వారు కొంతవఱకు సిరియనులును కొంతవఱకు అరబ్బీయులునై యున్నారు (న్యాయా $6^{3}$ $8^{10}$ యెహె $25^{4,9}$ యెష $11^{14}$ యిర్మీ $49^{28}$ యోబు $1^{3}$). వారిలోఁ గొందఱు జ్ఞానమునకు ప్రసిద్ధులైనవారై యుండిరి (I రాజు $4^{30}$).

**తూర్పుసముద్రము** ఉప్పు సముద్రము చూ॥

## తృ, తె

**తృప్తి** సంతుష్టి చూ॥

**తెకోవ** (Tekoa, Tekoah). యూదయ యరణ్యములో నుండిన యొకకోట (II దిన $20^{20}$). అబ్షాలోము పక్షముగా దావీదుతోను మనవి చేయుటకు యోవాబు రప్పించిన యుక్తిగల స్త్రీ ఈ యూరినుండియే వచ్చెను (II సమూ $14^{2,4,9}$). రెహబాము దానికి ప్రాకారములను కట్టించెను (II దిన $11^{6}$). యిర్మీయా కాలములో అది యింక కోటగా నుండెనని యిర్మీ $6^{1}$ వలన నూహింపఁదగును. ప్రవక్తయైన ఆమోసు ఈ యూరి పశువుల కాపరులలో నొకడై యుండెను (ఆమో $1^{1}$). నెహెమ్యా కాలములో తెకోవ పట్టణపు అధికారులు యెరూషలేము గోడలు కట్టుటలో సహాయపడిరి గాని వారి అధికారులు అందుకు సమ్మతించలేదు (నెహె $3^{5,27}$). తెకోవ యను పేరు LXX లో యెహో $15^{59}$ నందు కూడ కనఁబడును. I దిన $4^{5-8}$ లోని వంశావళులలో ఈ పేరుగలదు. అది బేత్లెహేమునకు దక్షిణముగా 5 మైళ్ల దూరములో నున్నది. దానియెత్తు 2790 అడుగులు. దాని ప్రస్తుతపు పేరు కుర్బెటితెకోవ (*Khurbet Tequ'a*) యై యున్నది. అది చిన్నదైనను అచ్చటనున్న శిథిలములు దాదాపు 4, 5 ఎకరాల విరివిగలవై పూర్వము మంచి రాళ్లతో కట్టఁబడినదైనట్లు తెలుపుచున్నవి. (పటము II, E 2) చూ॥

**తెగుళ్లు** (Plague, Pestilence). తెగులు అను పదముచే తెనిఁగించిన పదములు హెబ్రీ భాషలో కనీసము నాలుగును గ్రీకుభాషలో రెండును బైబిలునం దగుపడుచున్నవి.

1. ఒక హెబ్రీ పదము గొప్పనాశమును సూచించును. దానిని సాధారణముగా తెగులు అను పదముచే తెనిఁగించిరి. ఐగుప్తునందు కలిగిన పది తెగుళ్ల సందర్భములో నీ పదము అరుదుగా నుపయోగింపఁబడెను. మోషే ఫరోను జనులను సెలవిమ్మని యడిగినప్పుడును (నిర్గ $5^{3}$), పశువులకును ($9^{3}$), మనుష్యులకును ($9^{15}$) కలిగెడు నాశనమును తెలుపునప్పుడు మాత్రమే ఈ పదమును వాడినను, సాధారణముగా మనము తెగులు అను పదమును ఇశ్రాయేలీయుల చరిత్ర సందర్భములో ఆ పది తెగుళ్లను సూచించుటకే వాడుచున్నాము. ఆ పది తెగుళ్లెవ్వియనగా:—(1) నీరు రక్తమగుట నిర్గ $7^{14-25}$. (2) కప్పలు $8^{1-15}$. (3) పేలు $8^{16-19}$. (4) జోరీగలు $8^{20-32}$. (5) దొమ్మ సంకటము $9^{1-7}$. (6) దద్దురులు $9^{8-12}$. (7) వడగండ్లు $9^{13-35}$. (8) మిడుతలు $10^{1-20}$. (9) దట్టమైన చీకటి $10^{21-29}$. (10) ఐగుప్తీయుల జ్యేష్ఠపుత్రుల మరణము $12^{1-36}$. దావీదిశ్రాయేలీయులను లెక్కించినందున శిక్షగా వచ్చిన దానికి II సమూ $24^{13,15}$ లో నిదే పదమును

వాడినను $24^{21,35}$ I దిన $21^{22}$ లో క్రింద 2 నందున్న హెబ్రీ పదము నుపయోగించుటవలన ఈ రెంటి యర్థము ఒకటే యని స్పష్టమగుచున్నది. ఇశ్రాయేలు వారికి కలిగినట్లు ఆమోసు ఉదాహరించిన తెగులును (ఆమో $4^{10}$), యిర్మీయా నొక్కి వక్కాణించిన మూఁడు శిక్షలలో నొకటి యగు తెగులును (యిర్మీ $14^{12}$ $21^{6,7,9,10}$ $38^{1}$ $44^{13}$ మొ॥) ఇదేయై యున్నది. యెహెజ్కేలు కూడ దీనిగూర్చి ప్రకటించెను ($6^{11}$ $7^{15}$ $12^{16}$ $14^{21}$ మొ॥). ఇట్టి శిక్ష అవిధేయుల కగునను మందలింపులు ఇతర గ్రంథములయందును కనఁబడుచున్నవి (సంఖ్యా $14^{12}$ ద్వితీ $28^{21}$ II దిన $21^{19}$ హబ $3^{5}$). ఆలయము నాశ్రయించుకొని ప్రార్థించువారిని ఇతర శిక్షలతోపాటుగా నిట్టి తెగులు నుండియు విడిపింపవలెనని ఆలయ ప్రతిష్ఠ సమయమున సొలొమోను ప్రార్థించెను (I రాజు $8^{37}$ II దిన $6^{28}$ $7^{13}$).

పై వాక్యము లన్నిఁటిలో దీనిని తెగులనియే తర్జుమా జేసిరిగాని హోషే $13^{14}$ నందు బాధలు అని తెనిఁగించిరి. ఇదే యర్థమిచ్చు నొక గ్రీకు పదమును లూ $21^{11}$ నందు కరవు అను పదముతో చేర్చి తెగులనియు, కార్య $24^{5}$ నందు పౌలు విషయములో వాడుచు పీడ వంటి వాఁడని తెనిఁగించిరి.

2. రెండవ హెబ్రీ పదము దెబ్బయని గాని మొత్తుటయనిగాని యర్థమిచ్చును. దానిని నిర్గ $9^{14}$ నందు ఐగుప్తునందు కలిగిన తెగుళ్లన్నిఁటిని సూచించుటకు వాడిరి. అరణ్య సంచారమునందు ఇశ్రాయేలీయులకు కలిగిన శిక్షలకు ఇదే పదము నుపయోగించిరి (సంఖ్యా $14^{37}$ $16^{48-50}$ $25^{8,9,17}$ $26^{1}$ $31^{16}$ యెహో $22^{17}$ కీర్త $106^{29,30}$). ఈ మాటనే నిర్గ $32^{35}$ లో బాధపెట్టుట యని తెనిఁగించిరి. ఫిలిష్తీయులు నిబంధన మందసమును పట్టుకొనిపోయిన సందర్భములోను (I సమూ $6^{4}$), దావీదు ప్రజలను లెక్కించిన సందర్భములోను (పైన 1 చూ॥) ఈ పదము నుపయోగించిరి. యెరూషలేమునకు విరోధముగా పోరాడువారికి కలుగు కష్టములను జెకర్యా ఈ పదముచే సూచించెను (జెక $14^{12,15,18}$).

క్రొత్త నిబంధనయందు దీనికి సంబంధించిన గ్రీకు పదము ప్లేగ్ (*Plague*) ను కూడ తెగులనియే తెనిఁగించిరి. ప్రకటన గ్రంథమునం దుదాహరించిన దుర్మార్గులకు కలుగఁబోవు శిక్షలు ఈ పదముచే సూచింపఁబడెను. ప్రక $9^{20}$ లో దాని శబ్దార్థము ననుసరించి దెబ్బయని తెనిఁగించినను, సాధారణముగా తెగులనియే తర్జుమా చేసిరి ($11^{6}$ $15^{1,6,8}$ $16^{9,21}$ $18^{8}$ $21^{9}$ $22^{18}$).

3. మొత్తుట యని యర్థమిచ్చు మఱియొక హెబ్రీ పదమునుకూడ తెగులనియే తెనిఁగించిరి. ముఖ్యముగా నా పదము ద్వితీయోపదేశకాండమం దుదాహరింపఁబడిన శాపవచనములయందు కనఁబడును ($28^{59-61}$ $29^{22}$). ఇతర చోట్లను అది యున్నది (సంఖ్యా $11^{33}$ I సమూ $4^{8}$ యిర్మీ $50^{13}$). $19^{8}$ $49^{17}$ లో దానినే ఇడుములు అని తెనిఁగించిరి.

4. దెబ్బయని అర్థమిచ్చు నాలుగవ హెబ్రీ పదమును నిర్గ $11^{1}$ I రాజు $8^{37}$ కీర్త $91^{10}$ లో తెగులని తర్జుమాచేసిరి. లేవి 13, 14 నందు కుష్ఠరోగమున కా పదమును వాడిరి అచ్చట దానిని కుష్ఠు అని తెనిఁగించిరి. I రాజు $8^{38}$ లో దానిని వ్యాధి యనిరి. II రాజు $15^{5}$ నందు దేవుఁడు ఉజ్జియాను మొత్తెనఁనుట అని తెనిఁగించిన దానికి హెబ్రీభాషలో ఈ పదమునే వాడిరి. కుష్ఠరోగమునకు వాడిన మఱియొక పదముకూడ దెబ్బయని అర్థమిచ్చును.

పైనున్న పదములన్నియు దేవుఁడు పంపు గత్తెరలను సాధారణముగా సూచించును. ఇవి ఊరకయే వచ్చునని యెంచుట సర్వసాధారణమై యున్నది గాని బైబిలుకాలమునం దట్లుగాక, పాప ఫలితముగా దేవుఁడు పంపిన శిక్షలుగా నవి యెంచఁబడెను. అవి ప్రపంచమందున్న వారి సౌఖ్యార్థమై నిర్ణీతమైన చట్టముల నతిక్రమించుట వలన కలుగు శిక్షలని అందఱు నొప్పుకొనక విధి లేదు. నీతి చట్టములు మీఱుటవలనను ఇట్టి శిక్షలు కలుగునని ప్రవక్తలు బోధించిరి. ప్రస్తుతమున లోకమందున్న గందరగోళములు వారి బోధలు సత్యములని ధృఢపఱచుచున్నవి (రోగములు చికిత్సలు II 10 (4) చూ॥).

తెప్ప ఓడ 2 చూ॥

**తెబహు** (Tebah = వధ). నాహోరు కుమారులలో నొకఁడు (ఆది $22^{24}$ టిబ్హత్తు చూ॥).

**తెమహు** (Tamah = నవ్వు). బాబెలు నుండి జెరుబ్బాబెలుతో కూడ యెరూషలేముకు తిరిగి వచ్చిన యొక కుటుంబము. వారు నెతే నీయులలో చేరినవారు (ఎజ్రా $2^{53}$ నెహె $7^{55}$).

**తెర** గుడారము 5, దేవాలయము I, 7 (2) (*d*) చూ॥.

**తెరచాప** ఓడలు 5 (2) (*c*) చూ॥.

**తెరహు, తారహు,** (Terah = అడవి మేఁక ?).

1. నాహోరు కుమారుఁడు. (ఆది $11^{24}$). అబ్రాహాము నాహోరు హారాను అనువారి తండ్రి ($11^{24-32}$ I దిన $1^{26}$ లూ $3^{34}$). అతఁడు తన కుటుంబసమేతముగా ఊరు అను స్థలమునుండి బయలుదేరి హారానుకు వచ్చి యచట మృతి బొందెను. యెహో $24^{2}$ వలన అతఁడు ఇతర దేవతలను పూజించినట్లు తెలియుచున్నది.

2. అరణ్యములో తిరిగినప్పుడు ఇశ్రాయేలీయులు మకాముచేసిన స్థలములలో నొకటి (సంఖ్యా $33^{27,28}$).

**తెరెషు** (Teresh). అహాష్వేరోషు దగ్గఱ నున్న షండులలో నొకఁడు (ఎస్తే $2^{21}$). ఇతఁడు అహాష్వేరోషుపై కుట్రఁజేసి యతని చంపఁదలంచఁగా మొర్దెకై దానిని కనుగొని రాజును రక్షించెను. అందువలన తెరెషు మరణశిక్ష నొందెను.

**తెర్తియు** (Tertius = మూఁడవ వాఁడు). రోమా పత్రికను పౌలు చెప్పుచుండఁగా వ్రాసిన వాఁడు. ఈ పత్రికను వ్రాసిన తెర్తియు అను నేను ప్రభువునందు మీకు వందనములు చేయుచున్నానని తన్ను తానెఱిఁగించుకొనుచున్నాఁడు (రోమా $16^{22}$). ఇతనిగురించి ఇంక నెక్కువగా నేమియుఁ దెలియదు. M.

**తెర్తుల్లు** (Tertullus = తెర్తియు అను పదముయొక్క ముద్దుమాట). పౌలుపై నేరము మోపిన యూదులపక్షమున వాదించిన వకీలు (కార్య $24^{1-9}$). పేరునుబట్టి యితఁడు రోమీయుఁడని నెంచఁగఁదగును. పౌలుపై నితఁడు లేనిపోని నేరములను మోపినను, ఇతని మాటల ధోరణినిబట్టి బహు మర్యాదగాను యుక్తితోను వకీలుకుఁ దగిన రీతిగా మాట్లాడినట్లు తెలియుచున్నది.

**తెలహు** (Telah = విఱిగినది). ఎఫ్రాయిము గోత్రపువారిలో నొకఁడు (I దిన $7^{25}$).

**తెలశ్శారు,** (Telassar = అష్షూరివారి కొండ?). గోజాను హారాను రజెపు అను స్థలములతో కూడ తెలశ్శారు అను పేరు కలదు. సంబంధమునుబట్టి చూడఁగా నివి యన్నియు గొప్ప కోటలైయున్నవి. తెలశ్శారు నివాసులు ఏదేనీయులనఁబడిరి (II రాజు $19^{12}$ యెష $37^{12}$). అష్షూరువారి రాతిశాసనములలో ఈ పేరు రెండు చోట్ల కనఁబడెను. అది మెసపొతేమియా యుత్తరభాగములో నుండవచ్చును.

**తెలాయీము** (Telaim = గొఱ్ఱెపిల్లలు). అమాలేకీయులమీఁద యుద్ధముచేయక పూర్వము సౌలు తన సైన్యమును సమకూర్చిన స్థలము (I సమూ $15^{4}$). LXX నందు దీనికిబదులు గిల్గాలు అని వ్రాసిరిగాని అది గిల్గాలుగాక యూదయ దక్షిణభాగమందలి యొక స్థలమని నమ్మవచ్చును. యెహో $15^{24}$ లోని తెలెము అను స్థలము యూదయకు దక్షిణమందున్నది కావున తెలాయీముగూడ అదేనని కొందఱి యభిప్రాయము.

**తెలియబడని దేవుడు** (Unknown God). ఏథెన్సులో పౌలుకు కనఁబడిన గుళ్లలో నొకదాని దేవత. దాని నా పురవాసులు తెలియఁబడని దేవునికి ప్రతిష్ఠించిరి (కార్య $17^{23}$). ఏథేనీయుల దేవతలకు లెక్కలేకపోయినను, తమకు తెలియని దేవత యేదైననుండి, దానికి గుడి కట్టింపనందులకు కోపగించుకొని శిక్షించునేమో యని భయపడి అచ్చటచ్చట యిట్టి గుళ్లను కట్టించిరి. ఇట్టి గుళ్లున్నట్లు ఇతర గ్రీకు గ్రంథకర్తల వలనను దెలియుచున్నది. పౌలు వారిభక్తిని మెచ్చుకొని వారికి తెలియకుండనున్న దేవుఁడే నిజమైన దేవుఁడని ఈ గుడిని తన ప్రసంగాంశముగా నెత్తి వారికి బోధించెను.

**తెలిసికొనుట, తెలివి, ఎరుగుట** (Knowing, Knowledge). ఈ పదములు సర్వసాధారణమైనవి. బైబిలునందట్లు పయోగింపఁబడినందున వాటిని వివరింపఁబనిలేదు. కాని

ఒకటి రెండు విశేషసంగతులు మాత్రము వీటిని గూర్చి యీ దిగువ వివరింతుము.

1. తెలిసికొనుటనుగూర్చి శాస్త్రీయమగు చర్చ బైబిలునందు లేకున్నను మనము దేవునిగూర్చి తెలిసికొనవలసిన దానినిగూర్చిన హెచ్చరికలు మిగులఁగలవు. మానవుఁడు దేవునిగూర్చి సంపూర్ణముగా నెఱుఁగుటకు చాలినవాఁడు కాకపోయినను (యోబు 36[27-29] రోమా 11[33,34]) తనబుద్ధి పరిమితి చొప్పునఁ దెలిసికొనఁగలఁడు (కీర్త 19[1] రోమా 1[20,21]) దేవుఁడు తన్నుదాను బైలుపఱచుకొనినయెడల మఱింత తేటగాఁ దెలిసికొనఁగలము (నిర్గ 7[17] 18[12] 31[13] యెహోే 24[31]). ఆయన చేసిన యేర్పాటులవలనను (లేవి 23[43]). క్రమశిక్షలవలనను (యెష 45[6] యెహె 5[13] 6[7-14] మొ॥) ఆయనను తెలిసికొన వీలుకలుగుచున్నది. మఱి ముఖ్యముగా దేవునిగూర్చిన ఉపదేశమువలన ఆయన నెఱుఁగుదుము (కీర్త 19[7-9] 119 మొ॥). అట్టి క్రమశిక్షలో లేనియితరులు దేవునెఱిఁగిన వారుకారు (79[6] యెష 55[5]). దేవునిని దెలిసికొనుటయే అట్టి క్రమశిక్ష ఉద్దేశమై యున్నను యూదులు పై యాచారములను మాత్రము లక్షించి దాని యాంతర్యభావమును గుర్తెఱుఁగకపోయిరి. దుర్నడతఁ గలిగి యుండినను ఆయనను దెలిసికొనఁగల మనుకొనిరిగాని దుష్టమార్గావలంబుల అభిప్రాయములు సరికావనియు అట్టి వారు దేవుని నెఱుఁగ జాలరనియు ప్రవక్తలేక గ్రీవముగ బోధించిరి 1[3] యిర్మీ 4[22] 9[3] హోషే 5[4] మొ॥). శుద్ధమైన మనస్సులేనియెడల దేవునిని దెలిసికొనలేమని ప్రవక్తలు సహా సూచించుచు వచ్చినట్లు వాక్యములవలనఁ దెలియుచున్నది. దేవునికి భయపడుట తెలివికి మూలమని వారిబోధయై యున్నది (సామె 1[7] జ్ఞానము చూ॥). అట్టివారు ఇతరులకు మఱుగైన వాటిని సహా తెలిసికొనఁగలరు (కీర్త 25[14]).

క్రీస్తుద్వారానే దేవునిని తెలిసికొనఁగల మను సంగతి క్రొత్త నిబంధనద్వారా కనుగొనఁగలము (మ 11[27] యోహా 17[3] ఫిలి 3[8-10] మొ॥). మనము దేవుని సత్యములను తెలిసికొనవలెనని కోరినయెడల ఆయన చిత్తము చొప్పున చేయఁగోరువారమై యుండవలెను (యోహా 7[27-29] 8[31] 10[15] I యోహా 2[3]). క్రీస్తు నెఱుఁగువాఁడు తండ్రిని నెఱుఁగును (యోహా 14[7,8]). దేవుని ఎఱుఁగుట ఆయననుగూర్చిన సంగతులను తెలిసికొనుట మాత్రమే గాక శుద్ధహృదయముతో ఆయనను గూర్చిన యనుభవజ్ఞానముఁగలిగి యుండుటయే యని వీటివలన స్పష్టమగుచున్నది.

2. దేవుఁడే ఎఱుఁగుటనుగూర్చిన బోధల విషయమై చూచినయెడల, ఆయన మానవుఁడై యున్నట్లుగాను, మనవలెనే సంగతులను పరీక్షించి తెలిసికొనవలసి యున్నట్లుగాను ఆరంభమున కొన్నిసూచనలున్నవి (ఆది 11[5] 18[20,21]). ఆదికాలమున జీవించిన వారు దేవునిగూర్చి యిట్లనుకొనుట సహజమై యున్నది. అప్పటి కాలమున కవి తగిన దృష్టాంతములుగా నుండెను. ఆయన సర్వజ్ఞుఁడైయుండి సర్వమును దెలిసికొనుచున్నాఁడను బోధ క్రమక్రమముగా మానవులు నేర్చికొనినట్లు చూడఁగలము (యోబు 21[22] 23[10] 28[23] 38-40 కీర్త 119 యెష 40[14]). మనకు తగిన హెచ్చరికె కలుగఁగలందులకై ఆయన మన రహస్యములను పూర్తిగా నెఱుఁగునను సంగతి మఱింత దృఢముగా బైబిలునందున్నది. (కీర్త 1[6] 37[18] 44[21] 69[5] 94[11] 103[14] 139[1] లూ 16[15]). దేవుఁడు పైవేషమును బట్టికాక ఉన్నరీతిగా సమస్తమును ఎఱిఁగి తీర్పులోనికిఁ దెచ్చునను బోధ బైబిలంతటిలోఁగలదు (ద్వితీ 29[29] కీర్త 90[8] యిర్మీ 23[24] దాని 2[22] మ 6[4] లూ 8[17] రోమా 2[16] జ్ఞానము, ముందెలివి, దేవుఁడు I 4, II, III 1, 2, యేసుక్రీస్తు IV 2, 3 చూ॥).

**తెలెము** (Telem = బలాత్కారము).

1. యూదయ దక్షిణమందలి యొక పట్టణము (యెహో 15[24]. తెలాయీము చూ॥).

2. అన్య స్త్రీలను చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిన వారిలో నొక ద్వారపాలకుఁడు (ఎజ్రా 10[24]). నెహె 12[25] లోని టల్మోను అనువాఁడితఁడై యుండవచ్చును.

**తెల్లగడ్డలు** (Garlic). ఇవి ఉల్లిజాతికి సంబంధించినవి. పలెస్తీను ఐగుప్తుదేశముల యందున్న జనులు వీటిని సాధారణముగా తిందురు. బీదలు విస్తారముగా నుపయోగింతురు. ఇశ్రాయేలీయులివి ఐగుప్తులో దొరికినట్లు అరణ్యమునందు దొరకలేదని సణిగిరి (సంఖ్యా 11[5]).

J. C.

**తెల్లగద్ద** పక్షులు 11 చూ॥

**తెల్లగువ్వ** పక్షులు 15 చూ॥

**తెల్లని, తెల్లనిరాయి, తెల్లనివస్త్రము** రంగులు 1 చూ॥

**తెల్లబంమ** పక్షులు 24 చూ॥

**తెహిన్నా** (Tehinnah = కృపాయాచనలు). యూదావంశపువారిలో నొకఁడు. అతఁడు ఈర్నాహాషుకు తండ్రి (I దిన $4^{12}$).

## తే

**తేజము, తేజస్సు, వెలుగు** (Light). పూర్వీకులు తేజమును పరిశుద్ధమైన దానిఁగా నెంచిరి. అదేరీతిగా బైబిలులో తేజస్సు దైవ స్వరూపముగా నెంచఁబడెను. దేవుఁడు తేజస్సులో నివసించును (నిర్గ $24^{10}$ I తిమో $8^{16}$). ఆయన తేజమును వస్త్రమువలె ధరించుకొనె ననియు (కీర్త $104^{2}$) ఆయన వెలుఁగై యున్నాఁడనియు ఆయనయందు చీఁకటి లేదనియు (I యోహా $1^{5}$), ఆయన మహిమయే ప్రకాశించుచున్నదనియు (ప్రక $21^{23}$) ఆయా వాక్యములలో నున్నది. అలాగే యేసు లోకమునకు వెలుఁగనియు (యోహా $1^{4,5,9}$ $8^{12}$), దేవుని మహిమ యొక్క తేజస్సనియు (హెబ్రీ $1^{3}$) చెప్పఁబడెను. ఎవరు ఆయన రక్షణయందు పాలివారగుదురో వారు వెలిగింపఁబడిన వారనఁబడుదురు (యోహా $8^{12}$ $12^{35,36}$ I యోహా $1^{7}$ II కొరి $4^{6}$ ఎఫె $5^{8-14}$ I థెస్స $5^{5}$ I పేతు $2^{9}$). క్రీస్తు శిష్యులు క్రీస్తునకు సాక్షులును లోకమునకు వెలుఁగునై యున్నారు (మ $5^{14-16}$ ఫిలి $2^{16}$). దానికి భిన్నముగా భక్తిహీనులు చీఁకటిలోనుండు వారనఁబడిరి (యోహా $3^{19}$ $8^{12}$ $12^{46}$ I యోహా $2^{11}$).

**తేజోనక్షత్రము** (Lucifer = కాంతిని ధరించినది). బబులోను చక్రవర్తికి యెషయా పెట్టిన యొక పరిహాసపు బిరుదు (యెష $14^{12}$). హెబ్రీభాషయం దీ పదమిచ్చటగాక ఎక్కడను కనఁబడకపోవుటచే దాని సరియైన యర్థమును నిశ్చయించుటకు వీలులేదు. దీనితోపాటు వేకువ చుక్క యను పదము నుండుటచే ఇది శుక్రగ్రహమై యుండునని కొందఱును కృష్ణపక్షపు చంద్రుఁడని కొందఱును అభిప్రాయపడుచున్నారు. రెండవ యభిప్రాయము ననుసరించువారు అది బాబెలు రాజుయొక్క క్షీణదశను సూచించునని చెప్పెదరు. అతఁడు వేకువ చుక్కవలె ప్రకాశించినను అట్టి ఘనమైన స్థితినుండి తప్పక పడిపోవునని మొదటి యభిప్రాయము ననుసరించినవారు చెప్పెదరు. ఇంగ్లీషునం దీ పదమును వాడిన లూసిఫరు (*Lucifer*) అనునది సాతాను పేర్లలో నొకటిగా మిల్టను (*Milton*) అను గొప్ప ఆంగ్ల కవికాలమునుండి వాడుచున్నారు. లూ $10^{18}$ లో సాతాను ఆకాశము నుండి మెరుపువలె పడుటనుగూర్చిన వాక్యము యెషయాలోనున్న దానికి సంబంధముగా నున్నదనవచ్చునుగాని అట్లనుటకు వేఱు ఆధారములు లేవు. (వేకువచుక్క చూ॥).

**తేత్** (Teth = ט అను అక్షరము) హెబ్రీ యక్షరములలో తొమ్మిదవది. అక్షరమాలికె ననుసరించి వ్రాసిన 119 కీర్తనలోని తొమ్మిదవ భాగములోని ప్రతివచనమును ఈ యక్షరముతో నారంభించుటవలన ఈ భాగమునకు తేత్ అను పేరు వచ్చెను.

**తేనె** (Honey). బైబిలునందు మధురమైన యాహారపదార్థముసుగూర్చిన సూచనలు ఆరంభము నుండి గలవు. ఐగుప్తుదేశమున కధికారిగా నుండిన యోసేపునకు యాకోబు పంపిన కానుకలలో తేనె ఉదాహరింపఁబడెను (ఆది $43^{11}$). పలెస్తీనుయొక్క ఫలవంతమును కనపర్చుటకు పాలు తేనెలు ప్రవహించుదేశమని బిలిచిరి (నిర్గ $3^{8}$ $13^{5}$ $33^{1}$ సంఖ్యా $13^{27}$ $14^{8}$ $16^{13}$ ద్వితీ $6^{8}$ మొ॥). అచ్చట తేనె విస్తారముగా నున్నదని ఈ వాక్యములవలనఁ గాకున్నను అనేకములగు ఇతర వాక్యములవలనఁ దెలియుచున్నది. సౌలు కాలమున యిశ్రాయేలీయులు ఫిలిష్తీయులతో యుద్ధముచేసిన యొక అరణ్యమందు తేనెపట్లు విస్తారముగా నున్నట్లు I సమూ $14^{25,43}$ వలన స్పష్టమగుచున్నది. సౌలుపెట్టిన వెర్రి శపథ ప్రకారము యోనాతాను ఆ తేనె తిని మరణ గండమును లోనయ్యెను. సమ్సోను చంపిన సింహపు అస్థిపంజరమునందు తేనె తెట్టెను పెట్టినట్లు న్యాయా $14^{8-18}$ నందున్నది. అడవి తేనె

టీగలు బండల సందులలో తేనెతెట్లను పెట్టును (ద్వితీ $32^{13}$). బాప్తిస్మమిచ్చు యోహాను తిను బండారములలో తేనె యొకటి (మ $3^{4}$). తేనె పులియుటచేత దానిని యజ్ఞములలో నుపయోగింప రాదను నియమమేర్పడెను (లేవీ $2^{11}$).

మాధుర్యమునుబట్టి తేనె మనోహరమైన దానిని సూచించెను. ఇంపైన మాటలు తేనె పట్టుకు పోల్చఁబడెను (సామె $16^{24}$). తేనెయు తేనెపట్టును మక్కువవలన కలుగు ఆనందమును సూచించును (పర $4^{11}$ $5^{1}$). దేవునివాక్యము వలన కలుగు ఆనందమును తేనెకుపోల్చిరి (కీర్త $19^{10}$ $119^{103}$ యెహె $3^{3}$ ప్రక $10^{9,10}$). తేనెను తినుట సంతుష్టికి గుఱుతు (యెష $7^{15,22}$ కీర్త $81^{16}$ యెహె $16^{13}$), గాని మంచిపదార్థములను మితి మీఱి తినినయెడల వెగటు కలుగునని బోధించు టకు దీని నుపయోగించిరి (సామె $25^{16}$ $27^{7}$). తేనె వేశ్యలవలన కలుగు శోధనలను సూచించును ($5^{3}$).

**తేనెటీగలు** కీటకములు సరీసృపములు 14 చూ॥

**తేబేసు** (Thebez = ప్రకాశము?) న్యాయాధిపతుల కాలములో ప్రాకారములుగల పట్టణములలో నొకటి. దీనికి సమీపముగా అబీమెలెకు చంపఁబడెను (న్యాయా $9^{50}$ II సమూ $11^{21}$). షెకెముకు ఈశాన్యముగా 5 క్రోసుల దూరములో నున్నది. ప్రస్తుతము దానికి తూబాసు (*Tubas*) అని పేరు. (పటము III. C 3).

**తేమనీ** (Temeni). యూదా సంతతి వారిలో నొకఁడు. అతఁడు అష్హూరు కుమారుఁడు (I దిన $4^{6}$)

**తేమా** (Tema = కుడిపార్శ్వము, దక్షిణము). ఇష్మాయేలు కొడుకులలో నొకఁడు (ఆది $25^{15}$ I దిన $1^{30}$). ప్రస్తుతము దమస్కు మదీనాలకు దాదాపు మధ్యను అరబ్బీదేశములో నుండు తైమ (*Taima*) అనునది అతని సంతతి వారివలన వచ్చిన పేరై యున్నది. తైమ యను నీ దేశము గొప్ప వర్తకములకు ప్రసిద్ధి కెక్కెను (యోబు $6^{19}$ యెష $21^{14}$).

**తేమాను, తేమానీయుడు** (Teman = కుడిపార్శ్వము, దక్షిణము Temanite). ఎదోములో నొకభాగము. ఎదోమీయులలో నొక తెగవారికీ పేరు గలదు. తేమాను ఏశావు జ్యేష్ఠ పుత్రుఁడగు ఎలీఫజుకు పెద్ద కొడుకై యుండెను (ఆది $36^{11-15}$). ఆమో $1^{12}$ లో నున్నట్లు తేమాను, బొస్రా యను రెండు స్థలములు ఎదోములో ముఖ్యములైనవి. ఇవి దేశమునంతటిని సూచించును. యెహె $25^{13}$ నందు తేమాను నుండి దదానువఱకు ఎదోముదేశము వ్యాపించి నట్లుగా నున్నది. మఱియు అది ఎదోమునకు ఈశాన్యముగాను మోయాబుకు దక్షిణముగా నున్నది. దాని నివాసులు జ్ఞానమునకు ప్రసిద్ధులైన వారై యుండిరి (యిర్మీ $49^{7}$). యోబును ఆదరించినవారిలో ఎలీఫజు అనువాఁడు తేమానీయుఁడు (యోబు $2^{11}$).

**తేలాబీబు** (Tel-abib = కంకులకుప్ప). బబులోను దేశమందలి కెబారు నదియొద్దనున్న యొక స్థలము. చెఱపట్టఁబడిన యూదులచ్చట నివసించిరి (యెహె $3^{15}$). దాని యునికిని గూర్చి రూఢిగా తెలియదు.

**తేలు** కీటకములు, సరీసృపములు 15 చూ॥

**తేల్మెలెహా** (Telmelah = ఉప్పుదిబ్బ). బాబెలు దేశములోని యొక పట్టణము (ఎజ్రా $2^{59}$ నెహె $7^{61}$). జెరుబ్బాబెలుకాలమున తిరిగి వచ్చినవారిలో కొందఱీ పట్టణమునుండి వచ్చిరి. దీనియునికినిగూర్చి తెలియదు.

**తేల్హర్షా** (Tel-harsha = మంత్రదిబ్బ). బాబెలుదేశములోని యొక పట్టణము (ఎజ్రా $2^{59}$ నెహె $7^{61}$). దీనియునికినిగూర్చి తెలియదు. జెరుబ్బాబెలు కాలమున తిరిగివచ్చిన యూదులలో కొందఱీ పట్టణమునుంచి వచ్చిరి.

## తై

**తైలము** రోగములు చికిత్సలు IV 1 (4) చూ॥

**తైలముపూయుట** తలనంటుట చూ॥

**తైలవృక్షము** (Oil Tree). యొర్దాను లోయలో పెరుగు దేవదారు వృక్షజాతిలో చేరినది (యెష 41[20]). ఇవి యథేచ్ఛగా లేచి పెరుగును. కొమ్మలు విశాలముగా వ్యాపించి విస్తారమైన నీడనిచ్చును. కఱ్ఱ మిగుల గట్టిదై నను మంచినూనెను తీయవచ్చును.

J. C.

## తొ

**తొండ** కీటకములు సరీసృపములు 16 చూ॥

**తొట్ట** పంట సాము గ్రి 1 చూ॥

**తొట్టి, పశువుల** (Manger). ఈ మాటచే తెనిఁగించిన మూల భాషాపదము లూ 2[7,12,16] 13[15] లో నున్నది. దానికి మేత పెట్టుట యని యర్థము. 13[15] లో దానిని గాడి యని తెనిఁగించిరి. అది యీ గ్రీకుపదమునకు మఱింత సూటిగా సరిపడును. ఇట్టి గాళ్లలో నేటివఱకు పలెస్తీనులోని బీదలు తమ పిల్లలనుంచెదరని ఆ దేశమును చూచి వచ్చిన వారు చెప్పెదరు. క్రీస్తు శిశువుగా నుండినప్పుడు అట్టిదానిలో పరుండఁ బెట్టిరి.

**తొడ** (Thigh). తొడక్రింద చెయ్యి పెట్టి ప్రమాణముచేయుట ఆదికాలమునుండి యున్న వాడుకయని కనఁబడుచున్నది (ఆది 24[2,9] 47[29]). తొడనుండి సంతానము వచ్చునదని వారు దానిని పవిత్రముగ నెంచి అట్లు ప్రమాణము చేసియుందురు. 46[26] నిర్గ 1[5] లో **గర్భ** మనియు న్యాయా 8[30] లో **కడుపు** అనియు తెనిఁగించిన పదమిదే. పెనూయేలు నొద్ద యాకోబు దేవునితో పెనుగులాడినందున అతని తొడగూడు వసిలెను. అందువలన యూదులు తొడమీఁదనున్న తుంటి నరమును తినరు (ఆది 32[22-32]). ఏహూదు ఎడమచేతివాటముగల వాఁడైనందున తన ఖడ్గమును కుడి తొడమీఁద కట్టుకొనెను (న్యాయా 3[16,21]). తొడమీఁద నిట్లు ఖడ్గము కట్టుట వాడుకయైనట్లు నిర్గ 32[27] కీర్త 45[3] వలనఁ దెలియును. అచ్చట ఈ పదమును **మొల, నడుము** అని తెనిఁగించిరి. సంఖ్యా 5[21,27] లో చెడిన స్త్రీకి కలుగు శిక్షయందు ప్రశంసించిన నడుము పడిపోవుట మూలభాషయందు తొడ పడిపోవుట యని యర్థమగును. తొడలతో తుంట్లను విఱుగఁగొట్టుట గొప్ప నాశనమునకు సూచన (న్యాయా 15[8]). **తొడను చరుచుకొనుట** గొప్ప భీతికిగాని దుఃఖమునకుగాని గుఱుతు (యిర్మీ 31[19] యెహె 21[12]). క్రొత్త నిబంధనయందు తొడ యను పదము ప్రక 19[16] నందు మాత్రమున్నది. రాజులకు రాజు అను పేరు క్రీస్తు వస్త్రములమీఁదను తొడమీఁదను వ్రాయఁబడి యున్నదను మాటలు శబ్దాలంకారమై తొడలను కప్పు వస్త్రమని అర్థమిచ్చునను కొనఁదగును.

**తొలకరివాన** వ్యవసాయము 3,5 (1), (2) చూ॥

**తొలిపంటుయొక్క కోతపండుగ** పండుగలు ఉపవాసములు III 1 (2) చూ॥

**తొలిచూలు, తొలిపిల్ల** జ్యేష్ఠపుత్త్రుడు చూ॥

**తొలిమాయి** అక్కో చూ॥

## తో

**తోకేను** (Tochen = ఒక కొలత). షిమ్యోను స్వాస్థ్యమందలి యొక ఊరు (I దిన 4[32]). దీని యునికనిఁగూర్చి తెలియదు. (ఎతెరు చూ॥)

**తోగర్మా** (Togarmah). గోమెరను వాని మూఁడవ కుమారుఁడు (ఆది 10[3]). తోగర్మావారు గుఱ్ఱములు కంచరగాడిదల బేరము చేసిన వారని యెహె 27[14] వలనఁ దెలియును. వీరు గోగురాజు సైన్యములో నుండిరను సంగతి 38[6] లో నున్నది. ఇది ఆర్మీనియా దేశమునకు నైరృతి దిక్కున నుండిన దేశమని కొందఱనుకొందురు.

**తోట, వనము** (Garden). కూరగాయలు పండించు స్థలమునకు (ద్వితీ 11[10] I రాజు 21[2] మొ॥) ఫలవృక్షాదులుండు స్థలములకును (యిర్మీ 29[5,28] ఆమో 4[9] మొ॥), తోఁటలకును (II రాజు 25[4] ఎస్తే 1[5]) ఈ పేరు కలదు. ఈ మాటకు మూలభాషలో కంచె వేసినచోటు అని యర్థము. పర 6[2] చూడఁగా ఆ కాలమున పూల తోఁట లుండినట్లు సూచన కలదు. పలెస్తీనులో

నీటి ప్రవాహములు లేకపోయిన యెడల ఈ తోఁటలు బహు త్వరఁగా ఎండిపోయి యుండును (యెష 58[11]). కాలువ గలిగిన తోఁట గొప్ప వృద్ధికి సూచనగా నున్నది (సంఖ్యా 24[6]). వనములలోని చెట్లనీడలయందు కాలమును గడుపుకొనుట చాల మనోహరముగా నుండును (ఎస్తే 7[7] పర 4[16]). పూర్వమున చాలమంది రాత్రి కాలము వనములయందు గడుపుచుండిరి. ఇట్లు క్రీస్తు గెత్సేమనే తోఁటలో అనేక పర్యాయములు గడిపియుండెను (మా 14[32] లూ 21[37]). ఈ తోఁటలో నుండఁగానే విరోధు లాయనను పట్టుకొనిరి (యోహా 18[1,26]). పూర్వకాలమున వనములలో విగ్రహారాధన లెక్కువగా జరిగినవి (యిర్మీ 17[1]). వనములలో పూర్వీకులు తమ సమాధులను కట్టుకొనిరి (II రాజు 21[18]). ఇట్టి సమాధిలోనే క్రీస్తును పెట్టిరి (యోహా 19[41]).

మోక్ష సౌఖ్యమును సూచించుటకు వనమును అలంకారముగా నెంచెదరు (పరదైసు చూ॥).

**తోఁడేలు** (Wolf). దీనిగూర్చిన యనేక సూచనలు బైబిలునందు గలవు. ఇది క్రూరమైన మృగము (యెష 11[6] హబ 1[8]). ముఖ్యముగా గొఱ్ఱెలను పట్టుకొని చంపును (యోహా 10[12])



ఐగుప్తు తోఁడేలు

పగటివేళ దాగుకొని రాత్రులయందు సంచరించుచు తన యెఱను పట్టుకొనును (జెఫ 3[3]). బెన్యామీను తోఁడేలువంటి వాఁడుగా నెంచఁబడెను (ఆది 49[27]). అది యా గోత్రపువారి పరాక్రమమును సూచించు మాటగాని బైబిలు నందీ మృగము సాధారణముగా ధైర్యమను సుగుణమునకు సూచనగా కాక, దిక్కుమాలిన వారిని వేధించెడి వారికి సూచనగా నున్నది (యెహె 22[27]). ఇట్లు తమ దుర్బోధలవలన మనుష్యులను చెరుపు దుర్బోధకులకును (మ 7[15] కార్య 20[29]), భక్తులను హింసించు హింసకులకును (మ 10[16]) తోఁడేళ్లను పేరు పెట్టిరి. పలెస్తీనులోని తోఁడేళ్ళు నక్కజాతికి సంబంధించి, వాటివలె గుంపులు గుంపులుగానైనను ఒక్కొక్కటిగానైనను సంచరించును.

**తోఫెతు** హిన్నోము లోయ చూ॥

**తోమా** (Thomas = కవలవాఁడు). పన్నెండుమంది అపొస్తలులలో నొకఁడు (మ 10[3]). ఇతనికి కవలవాఁడని అర్థమిచ్చు **దిదుము** అను గ్రీకు పేరును గలదు (యోహా 11[16]). యెరూషలేములోని యూదులు యేసును రాళ్లతోఁ గొట్ట యత్నించిన (11[7,8]) కొద్ది దినములకే ఆయన యూదయలోనికిఁబోవ తలంచి శిష్యులాశ్చర్యపడుచుండఁగా ఆయనతో చనిపోవుటకు మనమును వెళ్ళుదమని ఆయనయందు తనకున్న భక్తి పూర్వకముతో ననెను. ఆయన తాను పట్టుపడక మునుపటి రాత్రి తాను వెళ్ళుటను గూర్చి మాట్లాడుచు వారు తనతోకూడ నుండునట్లు వారికొఱకు స్థలమును సిద్ధపరచనై వెళ్ళుచున్నాననియు తాను వెళ్ళుచున్న స్థలమును దాని మార్గమును వారికిప్పుడు తెలియుననియు చెప్పఁగా తోమా ఆయనతో — ప్రభువా నీ వెచ్చటికిఁ బోవుచున్నావో మాకు తెలియదే. మార్గ మెట్లు తెలియుననెను (14[1-6]). యేసు లేచి తన శిష్యులకు మొదటిసారి దర్శనమైనప్పుడు తోమా వారితో నుండలేదు. వారు ఆయనను చూచితిమన్నప్పుడు తోమా నమ్మక ఆయన చేతుల గాయములలో తన వ్రేళ్ళు పెట్టి ఆయన ప్రక్కలో తన చేతినుంచితేనే గాని నమ్మజాల ననెను (20[24,25]). అందువలననే అతనికి సందేహించు తోమా యను బిరుదు గలిగెను. గాని తోమాయొక్క సందేహమువలన ఇతరులకు మేలు కలుగునట్లు దేవుఁడు సమకూర్చెను. మనము సందేహింపనవసరము లేకుండునట్లు అతఁడు సందేహించెనని అగస్తీను (*Augustine*) అను భక్తుఁడనెను. ఆయన ఎనిమిది దినములకుఁ బిదప మరల కనఁబడినప్పుడు అతఁడాయనను గుర్తించి నా ప్రభువా నా దేవా యని ఎలుగెత్తి చెప్పెను (20[26-29]). గలిలయ సముద్రముమీద చేపలను బట్టఁబోయిన వారిలో

నితఁడునుండి, ఆయన మాట ప్రకారముచేసి 153 గొప్ప చేపలను బట్టెను ($2^{1-14}$). ఆయన ఆరోహణమైన పిదప ఇతఁడు తక్కిన వారితోఁ గలిసి యెరూషలేములోని మేడగదిలో నుండెను (కార్య $1^{13}$). అతఁడు పార్తియ పారసీ దేశములలో బోధించి పారసీ దేశములో చనిపోయినట్లు పారంపర్యము గలదు. అతఁడు భరతఖండములో బోధించి హతసాక్షియైనట్లును చెప్పెదరు. ప్రస్తుతము చెన్నపట్టణమునకు సమీపమందున్న సెయింట్ తోమాకొండ అతని పేరట పిలువఁబడుచున్నది.

**తోయుహు** నహతు చూ॥

**తోయి తోహూ** చూ॥

**తోలా** (Tola = పురుగు, పురుగునుండి తీసిన రంగు). న్యాయాధిపతులలో నొకఁడు. న్యాయాధిపతులలో ఐదుగురిని గురించి విశేషముగా నేమియు వ్రాయఁబడలేదు. అట్టివా లో నితఁడు మొదటివాఁడు (న్యాయా $10^{1,2}$). ఆది $46^{13}$ సంఖ్యా $26^{23}$ I దిన $7^{1}$ వలన నితఁడు ఇశ్శాఖారు గోత్రీకుఁడని దెలియుచున్నది గాని ఈ వచనములయందుదాహరింపఁబడినవారు ఒకరుగాక వెవ్వేఱు మనుష్యులని కొందఱి యభిప్రాయము.

**తోలాదు** ఎల్తోలదు చూ॥

**తోహు** నహతు చూ॥

**తోహూ, లోయి** (Toi, Tou = నీచుఁడు!). దావీదు సిరియా రాజగు హదరెజెరును జయింపఁగా తన సంతోషమును కనఁబఱచుటకై దావీదు నొద్దకు దూతలను బంపించిన హమాతు దేశపురాజు (I దిన $18^{9,10}$). ఈ వాక్యమునకు సంబంధముగనున్న II సమూ $8^{9,10}$ లలో ఈ పేరునకు తోయి యను మాఱురూపము కలదు.

# తౌ

**తౌ** (Taw = ת అను అక్షరము). హెబ్రీ అక్షరములలో 22 వది. అక్షరమాలికగా వ్రాయఁబడిన 119 వ కీర్తనయొక్క 22 వ భాగమందు ప్రతి పంక్తియు ఈ యక్షరముతో నారంభించుచున్నందున ఆ భాగమునకు తౌ అను పేరు పెట్టిరి. ఈ యక్షరము సిలువ రూపమున నుండుటచే యెహె $9^{3-6}$ లో నొసటిమీఁద వేసిన గుఱుతు ఈ యక్షరమని హెబ్రీ భాష యందున్నది.

# త్ర, త్రా

**త్రకోనీతి** (Trachonitis = రాతి ప్రదేశము). లెబానోను హౌరాను కొండలకు మధ్య దమస్కుకు దక్షిణముగా నున్న రాతి ప్రదేశము. అచ్చట నున్న రాళ్లవలన అది పూర్వము అగ్నిపర్వతములున్న ప్రదేశమని తెలియుచున్నది. అది దాదాపు 370 చదరపు మైళ్ల విస్తీర్ణత గలది. ప్రస్తుత మచోటును లీజా (*Leja*) యందురు. ఈ పేరు లూ $3^{1}$ నందు మాత్రము వచ్చును. బాప్తిస్మ మిచ్చిన యోహాను తనపని నారంభించిన కాలమునందిది హేరోదు ఫిలిప్పను వానికి లోఁబడి యుండెనని తెలియుచున్నది. యూద చరిత్రకారుఁడగు యోసీఫసు దానినిగూర్చి పలు మారుదాహరించెను (పురా 15.10.3; 17.2.1,2 మొ॥).

**త్రాగుట, త్రాగుబోతుతనము** (Drinking, Drunkenness). ఇది పురాతన కాలమునుండి వచ్చుచున్న దురభ్యాసమైనట్లు బైబిలువలనను ఇతర గ్రంథములవలనను దెలిసికొనవచ్చును. నోవహు (ఆది $9^{21}$), లోతు ($19^{33,34}$), నాబాలు (I సమూ $25^{36}$) త్రాగి మత్తులై యుండినట్లు చదువుచున్నాము. హన్నా యను స్త్రీ మత్తురాలైనదని ఏలీ యనుకొనుటచే (I సమూ $1^{13}$) స్త్రీలలోను ఈ దురభ్యాసముండినటుల స్పష్టమగుచున్నది. ప్రవక్తలును యాజకులును త్రాగినటుల యెషయా చెప్పెను (యెష $28^{7}$ $56^{12}$). తూలుటయు, ఎటుతోచక నుండుటయు, వెనుకకు ముందుకు దొర్లుటయు (రోమా $12^{25}$ కీర్త $107^{27}$ యెష $19^{14}$) త్రాగుట యొక్క ఫలితములలోఁ గొన్నియని కనుగొను నప్పుడు అమితముగాఁ త్రాగుట వారికభ్యాస మాయెనని స్పష్టమగుచున్నది. ముఖ్యముగా స్థితిమంతులైన వారీ పాపమునకు దాసులైనట్లు కన్పడుచున్నది ($5^{11}$ ఆమో $4^{1}$). క్రొత్త నిబంధనయందిది యొక ముఖ్యపాపముగా

పెంచఁబడెను (లూ $21^{34}$ రోమా $13^{13}$ గల $5^{21}$ I కొరి $5^{11}$ $6^{10}$). యాజకులు తమ విధ్యుక్త ధర్మముల నాచరించునప్పుడు త్రాగుట నిషిద్ధమై యుండెను (లేవీ $10^{9}$). నాజీరు వ్రతము నాచరించెడి వారి కది పూర్ణ నిషిద్ధము (సంఖ్యా $6^{1-4}$ న్యాయా $13^{5-7}$ లూ $1^{15}$). న్యాయము ను తీర్చెడి వారది పుచ్చుకొనతగదని సామె $31^{4,5}$ యెష $28^{7}$ వలనఁ దెలియుచున్నది. త్రాగుబోతులకు శ్రమలు కలుగునని ప్రవక్తలు బోధించిరి ($5^{11-16}$ $28^{1}$). జ్ఞానులైనవారు దానివలన కలుగు వెఱ్ఱిని గనపఱచిరి (సామె $23^{21,29-35}$ $26^{9}$ హబ $2^{5}$). క్రైస్తవులకు నిది నిషిద్ధము (ఎఫె $5^{18}$) దానివలన వారికిఁ కలిగెడి తీర్పు తేటగాఁ దెలుపఁబడెను (I పేతు $4^{3-5}$ I కొరి $5^{11}$ $6^{10}$ ద్రాక్షారసము, మద్యము చూ॥).

**త్రాడు, పాశము** (Cord, rope). బైబిలునం దుదాహరించిన దేశములలో ఇతరచోట్ల వలె త్రాళ్లు నాయా పనుల కుపయోగించిన సూచన లనేకములు గలవు (నిర్గ $35^{18}$ యెహో $2^{15}$ న్యాయా $15^{13}$ యిర్మీ $38^{6}$ మొ॥). అవి నారతోనేగాక చువ్వలతోను (న్యాయా $16^{8}$), జమ్ముతోను (యోబు $41^{2}$ యెహో $2^{15}$ కార్య $27^{32}$), అలంకారముకొఱకై సన్న నారతోను (ఎస్తే $1^{6}$), వెండితోను (ప్రస $12^{6}$), బంగారముతోను (నిర్గ $28^{14}$) సహా చేయఁబడెను. $28^{14}$ లో అల్లికగొలుసులని తెనిఁగించిన మూలభాషాపదము అల్లిక త్రాడు అని యర్థమిచ్చును. ఇట్టి సాధారణ వివరము లనేకములు గలవు. ఈ పదములు అలంకారరీతిగాను ఉపయోగింపఁబడెను.

శ్రమపడువారు కష్టము అను త్రాళ్లచే బంధింపఁబడినట్లును (యోబు $36^{8}$), దుష్టుఁడు పాప పాశములచే కట్టఁబడినట్లును (సామె $5^{22}$), పాపము నాశించెడివారు దానిని త్రాళ్లచే తమయొద్దకు లాగుకొనునట్లుగాను (యెష $5^{18}$) వర్ణించిరి. దేవుఁడు పాపులను స్నేహబంధములచే తనయొద్ద కాకర్షించుకొనునట్లు హోషేయ వ్రాయుచున్నాఁడు (హోషే $11^{4}$). ఇచ్చట నున్న బంధములను పదము మూలభాషయందు త్రాళ్లు అని యర్థమిచ్చును. గుడారపుత్రాళ్లను పొడుగుచేయుట ఒకరి నివాసస్థలమును వృద్ధిచేయుటను (యెష $54^{2}$), గుడారపుత్రాళ్లు తెగిపోవుట, నివాసములు పాడగుటను సూచించుట కలంకారరీతిగా వాడఁబడెను. విచారము నగుపఱచుటకును, విధేయతను చూపుటకును త్రాళ్లు నెత్తిమీఁద వేసికొనుట ఒక గుఱుతుగాను నున్నట్లు సూచన యొకటి గలదు (I రాజు $20^{31,32}$). వేటకాండ్లు తమ వలను త్రాళ్లతో చేసినందున, అనుభవములేనివారిని చిక్కుపఱచుటకై మానవులుచేయు యుక్తులనుకూడ త్రాళ్లు సూచించెను (కీర్త $140^{5}$).

**త్రాసు** (Balance). బైబిలునం దుదాహరించిన త్రాసు లీ దేశమందలి వంటివేగాన వాటిని వివరింప నవసరములేదు. మూలభాషలో త్రాసునికెరాళ్లు (ద్వితీ $25^{13-15}$ సామె $20^{23}$) అను నర్థమిచ్చుపదమువలన బరువును తెలిసికొనుటకు ఆయా విధములగు రాళ్ల నుపయోగించినట్లు తెలియును. లేవీ $19^{36}$ లో **గుండ్లు** అని తెనిఁగించినదియు రాళ్లని యర్థమిచ్చుపదమే. తప్పు రాళ్లను వాడి మోసముచేయుట ప్రజలు నీతిమార్గము తప్పినకాలమునం దలవాటై యున్నట్లు ప్రవక్తలవలనఁ దెలియుచున్నది (ఆమో $8^{5}$ మీకా $6^{11}$). అట్టి పనులు దేవుని కేహ్యములనియు (సామె $20^{10}$), న్యాయమైన రాళ్లు ఆయన కిష్టమనియు ($11^{1}$) సామెతల గ్రంథపు ముఖ్యబోధయై యున్నది. కరవు కాలమున ఆహారమును తూచి పెట్టుదురుగాన అట్లుచేయుట పాపమువలన కలుగు శిక్షకు గుఱుతుగా నున్నది (లేవీ $26^{26}$ యెహె $4^{16}$ మానములు కొలతలు చూ॥).

# త్రి, తు

**త్రిత్వము** దేవుడు III చూ॥

**త్రిసత్రములు** (Three Taverns). పౌలు రోమాకు ఖైదీగాఁ బోవుచున్నప్పుడు వారు దాటి వెళ్లిన ఒక స్థలము. అది సుప్రసిద్ధమగు అప్పియన్ రాచబాట (*Appian Way*) మీఁదనుండి రోమాకు ఆగ్నేయమున 33 మైళ్ల దూరమందున్నది. రోమా క్రైస్తవులు పౌలు నెదుర్కొనుట కింతమట్టుకు వచ్చిరి (కార్య $28^{15}$ పటము V, A 2).

**త్రుఫోసా, త్రుఫైనా** (Tryphosa, Tryphæna = సుకుమారి). పౌలు రోమా పత్రికను వ్రాయుచు తన వందనములు పంపిన ఇద్దఱు (రోమా 16[12]). వీరిద్దఱక్క చెల్లెండ్రని చెప్పెదరుగాని దానికి తగిన యాధారము లేమియు లేవు M.

## త్రొ

**త్రొగెల్లియము** (Trogyllium). తెలుఁగు బైబిలునం దీ పదము లేకున్నను కొన్ని మాతృకలలో కార్య 20[15] నందు 'సమొసుకు చేరి' అను మాటలకు తరువాత 'త్రొగెల్లియములో ఆగి' అను పదములున్నవి. సవరింపఁబడిన ఇంగ్లీషు బైబిలులో నున్నట్లు తెలుఁగు బైబిలులోకూడ దీనిని భాషాంతరముగ నుంచుట యుక్తము. త్రొగెల్లియము సమొసుద్వీపమున కెదురుగా చిన్నాసియా పశ్చిమముననున్న నొక యగ్రముకును అక్కడనున్న యొక ఊరికిని పేరై యున్నది. ఆ రేవును ఇప్పటికిని పరిశుద్ధుఁడై పౌలు వియుక్తాగ్రుడమని పిలుతురు (పటము V, H 4).

## త్రో

**త్రోఫీము** (Trophimus = పోషణగల). పౌలు చేసిన మూఁడవ ప్రయాణమున అతనితోఁ గూడ నున్నవారిలో నొకఁడు. ఇతఁడును తుకికును ఆసియనుండి వచ్చిరి (కార్య 20[4]). ఇతఁడు బహుశః ఎఫెసుపట్టణస్థుఁడై యుండును. ఇతఁడు పౌలుతో యెరూషలేమునకు వెళ్లెను. యెరూషలేములోని క్రైస్తవులకొఱకు జమచేసిన చందాను అక్కడికిఁ గొనిపోవుటకై నియమింపఁబడిన ప్రతినిధులలో నితఁడొకఁడని ఊహింప వీలులున్నవి. ఇతఁడు అన్యులలోనుండి క్రైస్తవుఁడైనవాఁడు. యెరూషలేమునందున్న సమయములో పౌలుతోఁ గలిసి బజారులలోఁ దిరిగినందున, పౌలుపై పగబట్టి యున్న యూదులు అన్యులు సమీపింపరాని ఆలయ యావరణములోకి పౌలతనిని తెచ్చెనని యపనిందమోపి పౌలును చంపఁ జూచిరి (21[29]). పౌలు మొదటి చెఱనుండి విడిపింపఁబడిన పిమ్మట చేసిన చివరి ప్రయాణమునం దితఁడు పౌలుతో కలిసి ప్రయాణముచేసెను గాని జబ్బుపడి నందున పౌలతనిని ఎఫెసులో విడిచి వెళ్లెను (II తిమో 4[20]).

**త్రోయ** (Troas). చిన్నాసియ వాయవ్య దిక్కున నున్న మసియ పరగణాలోని రేవు పట్టణము (కార్య 16[11]). పౌలిచ్చట నుండగా, మాసిదోనియకు రమ్మని యెవరో బిలుచుచున్నట్లు దర్శనమునఁ జూచెను (16[8-10]). మూఁడవ ప్రయాణము చేయునప్పు డీ పట్టణము మీఁదుగా వెళ్లెను. అక్కడ మంచి పనిజేయుటకు తగిన గొప్ప తరుణములు చిక్కినను, తానొక కార్యార్థమై బంపిన తీతు వచ్చి తనను కలిసికొనక పోవుటచే, అక్కడ నిలువఁజాలక (II కొరి 2[12,13]) వెళ్లిపోయి, తిరిగి వచ్చునప్పు డచ్చట ఒక వారము గడిపెను (కార్య 20[6]). మొదటి చెఱనుండి విడిపింపఁబడిన పిమ్మటను అక్కడికి వెళ్లి, తన అంగిని చర్మపు పుస్తకములను కర్పు అను నొకని యింట నుంచెను. ఆసియనుండి రోమాకు వెళ్లెడి త్రోవ ఈ పట్టణముగుండా పోయెను గాన తిమోతి తనయొద్దకు వచ్చునప్పుడు వాటిని మఱువకఁ దేవలయునని రోమాలో తాను రెండవ మాఱు ఖైదీగా నుండుసమయమున వ్రాసెను (II తిమో 4[13]). త్రోయ యను పట్టణము చాల పురాతనమైనదని గ్రీకు చరిత్రవలనఁ దెలియుచున్నది. గ్రీకుల రామాయణమని యెంచఁదగు ఇలియడు (*Iliad*) అను ఇతిహాసమునందు వివరించిన గొప్ప యుద్ధములు జరిగిన స్థలమిదే గాని పౌలు దర్శించిన త్రోయ కది కొంచె ముత్తరముగా నుండెను. పూర్వముగా పాడయిపోయినను దాని పేరును సమీపముగా కట్టఁబడిన దీనికి పెట్టిరి. మహా అలెక్సందరుకు తరువాత అతని రాజ్యమేలిన యొకఁడు దీనిని బహుశః క్రీ॥ పూ॥ 300 సం॥ మందు కట్టించి అలెక్సంద్రియ యను పేరు పెట్టెను. ఐగుప్తు నందొక అలెక్సంద్రియ యుండుటచే దీనిని త్రోయలోని అలెక్సంద్రియ యని బిలుచుచువచ్చిరి గాని కాలక్రమేణ త్రోయ యనునది మాత్రమే చివరకు నిలిచెను. రోమను చక్రవర్తులు దీనిని చక్కగా నలంకరించిరి. దాని శిథిలములే ఆ పట్టణపు చక్కదనమును ప్రకటించుచున్నవి. ఆ పట్టణమునుండిన పరగణాకు నేటివఱకును త్రోయను (= త్రోయకు

సంబంధించినది) అను పేరున్నను పట్టణము మాత్రము లేదు. (పటము V, H 3).

త్రోవ మార్గము చూ॥

## థూ

**థూదా** (Theudas = Theodoros = దేవదానము). రోమీయుల ప్రభుత్వము నెదిరించిన నొక విప్లవకారుఁడు. ఇతనికి 400 మంది యనుచరులుండిరని గమలీయేలు సన్హెడ్రిన్ సభలో చేసిన ప్రసంగమం దితని గురించి ప్రశంసించెను. కురేనియు ఏలుబడిలో వేసిన జనాభా కాలమున యూదా అను నింకొకఁడును అట్లే తిరుగఁబడెననెను. ఆ జనాభా క్రీ॥ ము॥ 6 సం॥ వేసిరని సాధారణముగా నంగీకరింతురు. ఇతఁడు థూదాకు తరువాత వచ్చెనని గమలీయేలు చెప్పుటచే (కార్య $5^{36,37}$). థూదా అంతకు పూర్వమే యుండినట్లు నిశ్చయించుకొనవలెను. కాని ఇట్లనుకొనుటవలన నొక చిక్కు సంప్రాప్త ముగుచున్నది. క్రీ॥ శ॥ 44-46 లో థూదా యను పేరుగల వాఁడొకఁడు రోమనులపై తిరుగఁబడినట్లు యూదుల చరిత్రకారుఁడగు యోసీఫసు వ్రాయుచున్నాఁడు (పురా 20.5.1). క్రీ॥ శ॥ 34 సం॥ లోపలనే గమలీయేలు తన ప్రసంగము చేయుటవలన పది సం॥ లకు తరువాత జరుగనై యున్నది జరిగినట్లు చెప్పుటవలన లూకా బహుశః ఈ ప్రసంగములో నీ సంగతిని పొరబాటుగా నిజీకించెనని కొంద అభిప్రాయపడుచున్నారు. కాని క్రీ॥ ము॥ 6 సం॥ లకు ముందు అనేకులు రోమనులమీఁద తిరుగఁబడుచుండినట్లు యోసీఫసువలనఁ దెలియుచున్నది (పురా 18,10,4). అతఁడు వ్రాసిన వారిలో మత్తీయ యను పేరుగల వాఁడొకఁడు గలఁడు (పురా 17.6.2). గ్రీకు భాషయందు థూదా యను పదమును హెబ్రీ భాషలో మత్తీయ యను పదమును ఒకటే యర్థమిచ్చుటచే థూదాయని లూకా యనినది మత్తీయ యనువాని మారుపేరైయుండవచ్చునని కొందఱి తలంపు. లేదా, ఆ కాలమునందీపేరు సర్వసాధారణమగు పేరులలో నొకటియైయుండెను. యోసీఫసు అనేకులని వ్రాసిన వారిలో ఈ పేరు గల వాఁడొకఁడుండవచ్చును. ఇట్టి చిన్నచిన్న సంగతులను లూకా బహు సూక్ష్మముగా పరిశీలించి వ్రాసెననుట కనేక దృష్టాంతములున్నవి గాన ఈ విషయములోను అతఁడు వ్రాసినది పొరపాటు కాదనునది నమ్మఁదగిన సంగతియై యున్నది.

## థె

**థెయొఫిల** (Theophilus = దేవప్రియుఁడు). లూకా సువార్త, అపొస్తలుల కార్యములను గ్రంథముల కృతికర్త (లూ $1^1$ కార్య $1^1$). అతని పేరు సార్థక నామమయుండుగు గాని అతిశ్రేష్ఠుఁడు అను బిరుదమును దానికి కలుపుటచే అది యొకానొకని పేరని నిశ్చయింప వలసియున్నది. ఇతఁడు ఘనుఁడని అట్టి బిరుదును వాడిన రోమన్ వారి దేశవాడుకలవలనఁ దెలియుచున్నది. ఈ బిరుదును క్రొత్త నిబంధనలో దేశాధిపతులగు ఫేలిక్సు ($23^{26}$ $24^3$), ఫేస్తు ($26^{25}$) అను వారికి వాడిరి. ఇందువలన థెయొఫిలకూడ రోమను ఉద్యోగస్థుఁడని యూహింపఁ దగును. ఇదిగాక థెయొఫిలనుగూర్చి మరేమియుఁ దెలియదు. (లూకా సువార్త, అపొస్తలుల కార్యములు చూ॥).

**థెస్సలొనీక** (Thessalonica = థెస్సలే యను దేశమును జయించినది). మాసిదోనియ దేశమందలి పట్టణము. ప్రస్తుతమున ఈ పట్టణము జనబాహుళ్యమైన పురమైనను, ప్రాచీన మందది అంత యెన్నికలేని చిన్న పల్లెయై యుండెను. మహా అలెక్సందరు వెనుక కస్సాండె రను (*Cassander*) రాజ్యవంశీకుఁడు క్రీ॥ ము॥ 315 సం॥న మాసిదోనియ రాజ్యమును ఆక్రమించుకొని అలెక్సందరు సహోదరియగు థెస్సలొనీకను వివాహమాడి యామె నామగౌరవార్థమై ఈ పట్టణమును క్రొత్తగాఁ గట్టించి దానికి తన ప్రియ పత్ని పేరు పెట్టెను. తరువాత నీ పట్టణము మిగుల నభివృద్ధినిచెంది వాణిజ్యమునకు ప్రసిద్ధి కెక్కెను. రోమీయులు మాసిదోనియను వశపరచుకొని దాని నాలుగు భాగములొనర్చి, ఒక భాగమునకు దీని నొక ముఖ్యపట్టణముగాఁ జేసిరి. అది తూర్పునుండి రోమాకుఁబోవు ప్రసిద్ధమగు రస్తామీఁద నున్నది. పౌలు ఈ రస్తామీఁదుగా ప్రయాణము చేయుచు ఫిలిప్పయినుంచి ఇక్కడికి వచ్చెను. ఇక్కడ యూదులెక్కువగా నున్నట్లు సమాజ మందిరమను పద

మునుబట్టి యూహింపవచ్చును. పౌలిచ్చట మూఁడు విశ్రాంతిదినములు బోధించెను. తరువాత హింసలారంభమై, అధికారులు యాసోనునొద్ద జామీను పుచ్చుకొన్నందున అతఁడా పట్టణమును విడువవలసివచ్చెను (కార్య $17^{1-10}$ ఫిలి $4^{16}$) ఈ పట్టణమందలి సంఘమున కతఁడు రెండు ఉత్తరములను వ్రాసెను. అతని జత పనివారగు అరిస్తర్కు సెకుందు అను నిద్దఱు ఈ పట్టణ వాసులు ($20^{4}$ $27^{2}$). ప్రస్తుత మా పట్టణము సలొనీకే (*Soloniki*) యని పిలువఁబడుచు దాదాపు రెండు లక్షల మందిగల పట్టణమై యున్నది (పటము V, F 2). M.

**థెస్సలొనీకయులకు వ్రాసిన మొదటి పత్రిక (Thessalonians, First Epistle to the).**

1. చరిత్ర సంగతులు. పౌలు వ్రాసిన పత్రిక లన్నిఁటిలో నిది మొదటిదియు యేసు యొక్క ఉపదేశవాక్య సంగ్రహ గ్రంథములు అనఁగ, యేసుయొక్క యుపదేశ ముఖ్యాంశములను తెలియఁజేయు క్లుప్తమైన పుస్తకములకు తరువాత యీ పత్రిక క్రొత్త నిబంధన గ్రంథములన్నిఁటిలో మొట్టమొదట వ్రాయఁబడినదియునై యున్నది. థెస్సలొనీక సంఘస్థాపనను గుఱించిన వివరము కార్య $17^{1-9}$ నందు సూచింపఁబడెను. పౌలు సిల్వానును, తిమోతిని వెంటఁబెట్టుకొని వెళ్లి ఫిలిప్పయి పట్టణ సంఘమును స్థాపించిన తరువాత థెస్సలొనీకను దర్శించెను. ఇక్కడ యూదుల సమాజమందిర ముండుటవలన తన వాడుక చొప్పున నచ్చటికిపోయి యూదులకు సువార్తను బోధించెను. ఆలాగున మూఁడు విశ్రాంతిదినములు చేసెనని కార్యములయందు వర్ణింపఁబడెను. అయినను పౌలా పట్టణమందు మూఁడు వారములు మాత్రమే బోధించె ననుకొననావశ్యకములేదు. ఆయన యూదులకు బోధించిన తరువాత బహుశః అన్యులకు సహా బోధించెనని అనుకొనఁదగును. ఆ పట్టణమందు పౌలు చేసిన బోధవలన యూదులును అన్యులును యూదమత ప్రవిష్టులును కలిసిన యొక సంఘ మేర్పడెను. యూదులు పౌలు బోధకు మండిపడి, అల్లరి రేపి, యాసోనను వాని యింటిలో పౌలు బసచేయుచున్నాఁడని తెలిసికొని పౌలును చంపఁదలచి, ఆ యింటిమీఁద పడిరి గాని ఆ యింటివారు కలుగఁబోవు అపాయమును ముందుగానే తెలిసికొని పౌలును పంపించుట చూచి, యాసోనును పట్టుకొని, ఇతఁడు లోకమును తలక్రిందు చేసి కైసరుగాక క్రీస్తను మఱియొక రాజున్నాఁడని ప్రకటించుచున్నవారికి ఆశ్రయ మిచ్చువాఁడని న్యాయాధిపతుల దగ్గర కీడ్చుకొనిపోయి దోషారోపణ చేసిరి. అక్కడనుంచి పౌలు బెరయకు పోయి కొన్నాళ్లు వారికి సువార్త నుపదేశించిన తరువాత థెస్సలొనీకలో అల్లరి రేపిన యూదులు అతడక్కడనున్న సంగతిని తెలిసికొని అక్కడకువచ్చి అతని పనికి భంగము చేయ యత్నించినందున, బెరయలోనివారు ఆయనను ఓడమీఁద నెక్కించి ఏతెన్సుకు సాగనంపిరి. ఏతెన్సు చేరిన తరువాత పౌలు తనతోకూడ వచ్చిన తిమోతిని థెస్సలొనీకలోని క్రైస్తవుల క్షేమమును విచారించుటకు పంపించెను. అతఁడా సంఘమును దర్శించి వారి స్థితిగతులను విచారించి పౌలుకు తెలియఁజేసెను. అప్పటికి పౌలు ఏతెన్సు విడిచి కొరింథు చేరియుండెను (కార్య $18^{1}$). పత్రికలోని మాట చూడఁగా పౌలు బెరయను విడిచిన తరువాత థెస్సలొనీక సంఘస్థులను గురించి చింతగలవాఁడై తిరుగ వారిని దర్శింప యత్నించెను గాని శత్రువుల తంత్రోపాయములవలన ఆ యోచనను వదలిపెట్టెను. పౌలు తిమోతి తెచ్చిన సమాచారమునుబట్టి ఈ మొదటి పత్రికను క్రీ॥ శ॥ 51 లేక 52 సం॥న కొరింథు పట్టణమందు లిఖించి పంపించెను.

2. ప్రామాణికత్వము. ఈ యుత్తరము పురాతన లాటిన్ భాషాంతరములో నున్నది. మురెటోరి (*Muratori*) కనుగొనిన పురాతన క్రొత్త నిబంధన గ్రంథజాబితాయందును గనఁబడుచున్నది. బర్నబా, రోమావాఁడగు క్లెమెంతు, ఇగ్నేషియసు, పాలికార్పు అను వారు వ్రాసిన వ్రాతలలో దీనినుండియెత్తి వ్రాయఁబడిన వాక్యము లున్నవని కొందఱభిప్రాయ పడుచున్నారుగాని అవి యంత తేటగైనవికావు. ఐరేనే యనువాఁడు దీనిలోని యొకవాక్య మెత్తుటయేగాక ఇది పౌలు వ్రాసిన ఉత్తరమనియు చెప్పెను. అలెక్సంద్రియవాఁడగు

క్లిమెంతుకూడ ఈ పత్రికలోని వాక్యముల నెత్తెను. దీనికి భిన్నముగానున్న అభిప్రాయమేదియు ఆ గ్రంథములలో కనఁబడదు. పై సంగతులవలన ఇది పౌలు వ్రాసిన ఉత్తరమే యనుట కెట్టి సంశయమును లేదు.

ఇతరులు వ్రాసినవిగాక ఈ పత్రికయందున్న సంగతులను జూచినను, శైలినిబట్టియు సరళతను బట్టియు, పౌలుచరిత్ర కిది నూటిగా సరిపడుటను బట్టియు, అతఁడు వ్రాసిన యితర యుత్తరములతో దీనికిగల పూర్ణ ఐక్యతనుబట్టియు, దీని నతఁడే వ్రాసెననుటకు లేశమైనను సందేహము లేదు.

3. పత్రికను వ్రాసిన కారణములు. ఈ పట్టణమునందు పౌలు తన పనిని పూర్తిజేయక పూర్వమే, కలిగిన హింసలవలన దానిని విడువలేక విడువవలసివచ్చెను. అక్కడనున్న సహోదరులు హింసలవలన అస్థిరులై పోదురేమోనను చింతతో తిమోతిని వారియొద్దకుఁ బంపి, వారి సంగతులు చక్కగాఁ దెలిసికొని వారి నాదరించి రమ్మనెను. వారు స్థిరులైయుండుట మాత్రమే గాక విశ్వాసమునందు మిగుల అభివృద్ధి నొందుచున్నారని తిమోతి తెచ్చిన కబురు విని, తనకు వారియందున్న ప్రేమను కనఁబఱచి, వారి విషయమై తనకుఁ గలిగిన ఆదరణను తెలియఁజేయుటకై పౌలు దీనిని వ్రాసెను. అచ్చట కొన్ని యక్రమము లున్నవని యెఱిఁగి, దీనిద్వారా వాటిని క్రమపఱచఁ దలంచెను. గ్రీకువారు జారత్వవిషయమంతగా పాటించినవారు కాదు. ఇచ్చటి క్రైస్తవులును ఈ విషయమున వారివలె నుండుటయు, క్రైస్తవులు కానివారియెడలఁ జూపవలసిన ప్రేమను చూపకుండుటయు వారి యక్రమములలో ముఖ్యమైనవి. వారిలోఁ గొందఱు పనిచేయుటమాని ఇతరుల జోలికివెళ్లి అపరాధులైనట్లు రెండవ పత్రికవలనఁ దెలియుచున్నది. అన్నిఁటికన్న ముఖ్యముగా వారు క్రీస్తు రెండవరాకడవిషయమై పొరపాటుపడిరి. ఈ పత్రికయందు దానినిగూర్చిన సూచన లనేకము లుండుటవలన ($1^{10}$ $2^{19,20}$ $3^{13}$ $4^{13}$-$5^{11}$ $5^{23}$), అది ఈ పత్రికలోని ముఖ్యవిషయమని చెప్పవచ్చును. క్రీస్తువచ్చునప్పుడు జీవించియుండువారేగాని అంతకుపూర్వము మరణమైన వారాయన మహిమలో చేరరని ఎందువలననో పొరపడిరి. వానిని దిద్దుటకును క్రీస్తురాకడను గూర్చిన సరియైన బోధలు తెలుపుటకును, వారి కీవిషయమునుగూర్చి సరిగా బోధించుటకును, వారి నడతయందుండిన తప్పులు దిద్దుటకును అవసరమని యెంచి పౌలీ పత్రికను వ్రాసెను.

4. ముఖ్యభాగములు:—

I. పై వ్రాఁత ($1^{1}$).

II. చరిత్రాంశములు, స్వవిషయములు. 1. తాను వారిమధ్య చేసిన సువార్త ప్రకటనను దేవుఁ డాశీర్వదించి సఫలపఱచినందుకు స్తోత్రములు చెల్లించుట ($1^{2-10}$). 2. తాను వారికి ప్రకటించినవిధమును, వారు దాని నంగీకరించుటనుగూర్చి జ్ఞప్తిచేయుట ($2^{1-16}$). 3. వారిని గుఱించి చింతించి, వారి నాదరించుటకై తిమోతిని పంపుటనుగూర్చి తెలిపి, వారినిగూర్చి దేవుని వేడుకొనుట ($2^{17}$-$3^{13}$).

III. హెచ్చరికలు. 1. శుద్ధినిగూర్చి ($4^{1-8}$). 2. ప్రేమనుగూర్చి ($4^{9-12}$). 3. క్రీస్తు ఆగమనమునుగూర్చి ($4^{13}$-$5^{11}$). 4. వివిధ హెచ్చరికలు ($5^{12-22}$).

IV. ముగింపు. సెలవుపుచ్చుకొని వారి నాశీర్వదించుట ($5^{23-28}$). M.

**థెస్సలొనీకయులకు వ్రాసిన రెండవ పత్రిక** (Thessalonians, Second Epistle to the). మొదటి పత్రికను వ్రాసిన కొన్నాళ్లకు, పౌలు తానందులో చెప్పిన కొన్ని విషయములనుగుఱించి థెస్సలొనీకయ భక్తులు తప్పభిప్రాయము గలిగి కలతనొందినట్లు తెలిసికొనెను. మొదటిపత్రికయందు పౌలు, యేసుక్రీస్తుయొక్క ఆగమనమునుగుఱించి చెప్పిన మాటలను వారు చక్కగా గ్రహించుకొనక ఆయన వెంటనే రాఁబోవునని కొన్ని విషయములయందు అయోగ్యముగా ప్రవర్తించుచు వచ్చిరి. ఆమధ్య ఎవరో యొకరు పౌలుపేరట నొక కల్పనా పత్రికను వ్రాసి ($2^{2}$ $3^{17}$), అందులో క్రీస్తు వెంటనే ప్రత్యక్షమగునని బోధించి వారికి తప్పభిప్రాయము పుట్టించెను గనుక, ముఖ్యముగా ఆ విషయమందు వారు పడిన పొరపాటును దిద్దుటకై పౌ

లీ రెండవ పత్రికను క్రీ॥ శ॥ 51-52 సం॥ వసంతకాలమున వ్రాసి పంపించెను.

ఏయే నిదర్శనములవలన మొదటి పత్రికను ప్రమాణగ్రంథమని మనము నిశ్చయించితిమో అట్టి నిదర్శనములవలననే యీ పత్రికయును పౌలువలన రచించఁబడి అందఱివలనను సర్వాంగీకారమైన ప్రమాణగ్రంథమని నిశ్చయింపఁ గలుగుదుము. $1^{1}$ లో పౌలును సిల్వానును తిమోతియును ముగ్గురుకలసి పత్రికను పంపించినట్లు సూచించఁబడెను గనుక, రెండవ ప్రయాణములో పౌలు కొరింథు పట్టణములో నుండిన సమయమునమాత్రమే సిల్వాను, తిమోతియు ఆయనను కలిసికొని యుండుటనుబట్టి యీ పత్రిక కొరింథుపట్టణమందు లిఖితమాయెనని వెల్లడియగును. $2^{3}$ లో నుండు పాప పురుషుఁడు, ధర్మవిరోధి, భ్రష్టత్వము, అడ్డగించునది మొదలగు వానివిషయమైన బోధలనుగుఱించి వేదవ్యాఖ్యాతలకు పలువిధములగు ఉద్దేశములుగలవు (ఆ మాటల క్రింద చూ॥).

మొదటినుంచి యీ రెండవ పత్రిక విషయమై అనేకులకు సంశయముగలిగి యిది పౌలుచే రచించఁబడినది కాదని సందేహించిన వారైరి. వారు మొదటి పత్రికయందు క్రీస్తుయొక్క ఆగమనమును గుఱించి చెప్పఁబడిన బోధ రెండవ పత్రికయందు చెప్పఁబడిన బోధకు భేదమై యున్నట్టు తలంచుటమాత్రముగాక యీ పత్రికయందలి సంగతి దర్శనసంబంధమైనదైనందున ఇది పౌలుయొక్క రచనముకాదని తలంచెదరు. తమ యభిప్రాయమునకు వారేలాగు ఆధారము కలుగఁజేయుదురనిన: మొదటి పత్రికయందు యేసు వెంటనే రాఁబోవునట్లు కనపఱచఁబడగా రెండవ పత్రికయందు యేసుయొక్క రాకడ దూరముగా నున్నట్టు సూచించఁబడెను గనుక ఈ వ్యత్యాసమునుబట్టి యీ రెండవ పత్రికను పౌలు రచించలేదని తీర్మానించుకొనుచున్నారు. అయినను ఈ రెండు పత్రికలను చక్కగా పరిశోధించుటవలన వారు చేయు పూర్వపక్షము నిరాధారమైనదని చెప్పక తప్పదు. మొదటి పత్రికయందు పౌలు యేసుయొక్క ఆగమనము ఆకస్మికముగా కలుగునని తెలియపఱచుచున్నాఁడుగాని ఆయన వెంటనే రాఁబోవునని బోధించలేదు గనుక ఈ రెండు పత్రికలకు ఆ విషయమందు ఆక్షేపణీయమైన వ్యత్యాసములేదు.

అదియు మాత్రముగాక యీ రెండు పత్రికలలోని బోధ దర్శనరూపకమైనదయినందున పౌలు మృతుఁడైన తరువాత క్రీ॥ శ॥ 70 సం॥ మందెవఁడో యొకఁడు ప్రకటనగ్రంథమును పోలిన గ్రంథమును వ్రాసి పౌలు థెస్సలొనీకైయులకు వ్రాసిన రెండవ పత్రికయను పేరు పెట్టెనని తలఁతురు. అయినను పౌలువ్రాసిన యితర పత్రికలయందు సహా కొంతమట్టుకు దర్శనరూపకమయిన శైలి కనఁబడుచున్నది (I కొరి $15^{52}$ I థెస్స 4) గనుకను, యూదులైన గ్రంథకర్తలు దర్శనరూపకముగా వ్రాయుట వాడుక (యెహె 38,39, దాని 7-12) గనుకను పైసంగతినిబట్టి యీ పత్రిక పౌలుది కాదని నిశ్చయించుటకు వీలుండదు.

ముఖ్యభాగములు:—

I. పీఠిక. 1. పైవ్రాఁత (వచ $1^{1,2}$). 2. వారి స్థిరతకొఱకై దేవుని స్తుతించుచు వారికొఱకు ప్రార్థించుట ($1^{3-12}$).

II. ముఖ్యసంగతులు. 1. క్రీస్తువెంటనే వచ్చునని వారికి కలిగిన తప్పుడభిప్రాయమును దిద్ది, వారి స్థిరతవిషయమైన నమ్మకమును కనఁబఱచి, ప్రార్థించుచు, వారును తనకొఱకు ప్రార్థింపవలెనని మనవిచేయుట ($2^{1}$-$3^{5}$). 2. పనిచేయుట మాని అక్రమముగా నడుచుకొనువారి విషయమై హెచ్చరికచేసి, వారు పని చేయనియెడల వారిని దూరపరచవలెనని నియమించుట ($3^{6-15}$).

III. ముగింపు. ఆశీర్వాదము, వందనములు ($3^{10-17}$). M.

## డ

**దండము, రాజదండము, రాజ్యదండము (Sceptre, Staff, Rod).** దండము అను మాటచే తెనిఁగింపఁబడిన హెబ్రీ పదము సాధారణముగా కఱ్ఱను సూచించును (సామె $10^{13}$ $13^{24}$ కీర్త $89^{32}$ మొ॥). అట్టివాటిచే శిక్షించెడి వారు గాన అది యధికారమునకు సూచన

యుర్యోను (సంఖ్యా 24[17] కీర్త 45[6] = హెబ్రీ 1[8]. ఆమో 1[5,8] యెహె 19[14] మొ॥). ఈ పదమే ఆది 49[10] లో యూదులకు కలుగఁబోవు అధికారమును సూచించుచున్నది. ఆ వాక్యములోనే రాజదండమని తెనిఁగించిన మరియొక పదము న్యాయమును స్థాపించు దానిని సూచించును. దీనిని మెస్సీయాను గూర్చిన ప్రవచనముగా మొదటినుండి యెంచుచున్నారు. ఆ పదమును అదే యర్థముతో కీర్త 60[7] లో కూడ తెనిఁగించిరి.

చువ్వయని (ఆది 30[37] యిర్మీ 1[11]) సాధారణముగా తెనిఁగించిన పదము నొక దానిని యిర్మీ 48[17] లో రాజదండమని తర్జుమా చేసిరి. ఆది నుండి ఇది అధికారమునకు సూచనగా నుండినను, పారసీకులలో మరీ యెక్కువగా వాడఁబడినట్లు లౌకిక చరిత్రవలనఁ దెలియుచున్నది. అట్లది ఎస్తేరు గ్రంథమునందును కనఁబడును (ఎస్తే 4[11] 5[2] 8[4]). దాని బంగారుతోఁ జేసిరి. అది దాదాపు 4 లేక 5 అడుగుల పొడవుండి ఒక చివరను బంతివంటి దానిని కలిగి యుండునని రాతిశాసనములవలనఁ దెలియుచున్నది.

**దండువిడుస్థలము, దండుపాలెము, దండుపేట (Camp).** సైన్యము కొఱకుగాని,

దాను

ఆషేరు నఫ్తాలీ గోత్రముల

దండుపేట

మెరారీయులు

| | | | | |
|---|---|---|---|---|
| ఎఫ్రాయిము మనష్షే బెన్యామీను గోత్రముల దండుపేట | గెర్షోనీయులు | పరిశుద్ధ స్థలము ▭ అతిపరిశుద్ధ స్థలము | దహనబలుల ○ పీఠము | మోషే అహరోను అహరోను కుమారులు |
| | | | | యూదా ఇశ్శాకారు జెబూలూను గోత్రముల దండుపేట |

కహాతీయులు

రూబేను

షిమ్యోను గాదు గోత్రముల

దండుపేట

మనుష్యుల కొఱకుగాని తత్కాల వసతికై కట్టఁబడిన యిండ్లుగల చోటు (నిర్గ 14[9] I సమూ 4[5] 17[4] II రాజు 7[7]). ఈ పాలెముల శుభ్రత కొఱకై ఇశ్రాయేలీయులకు ఖండితములగు కట్టడ లీయఁబడెను (ద్వితీ 23[9-14]). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి వెడలిపోవుచుండఁగా వారుండవలసిన దండుపాలెపు ఏర్పాటులనుగూర్చి పైన కనఁబఱచుచున్నాము. దానిని గూర్చిన వివరము సంఖ్యా 1[47]-2[34] 3[14-39] 10[11-28] నందున్నది. చదరమగు విశాలమైన బయలునందు మకాము

చేయునప్పుడు మాత్రమే షైవిధముగా నుండుటకు వీలయ్యెను. (ప్రయాణము, పిత్తీము చూ||).
H.

**దంతము (Ivory).** పళ్లను, ఏనుఁగు దంతమును సూచించెడి రెండు పదములను పాతనిబంధనయందు దంతము అను మాటచే తెనిఁగించిరి. రెండవ పదము I రాజు 10[22] II దిన 9[21] లో మాత్రము కనఁబడును. పలెస్తీను దేశమునందు ఏనుఁగులు లేకపోవుటచే దంతమును విదేశములనుండి తెప్పించుకొనవలసి వచ్చెను గనుక అది బహు ప్రియమైనదిగా నెంచఁబడెను. సొలొమోను కాలమునందు దానిని ముఖ్యముగాఁ దెప్పించి (I రాజు 10[22]) నగరముల నలంకరించుటకు వాడిరి. సొలొమోను తనకొఱకు దంతపు సింహాసనమును కట్టించుకొనెను (10[18-20]). ఇశ్రాయేలు రాజగు అహాబు దంతముతో నలంకరింపఁబడిన దంతపుటిల్లు అనఁబడిన దానిని కట్టించెను (22[39]). సుందరవతియొక్క మెడ దంతపు గోపురమునకు పోల్చఁబడెను (పర 7[4]). అదియు దంతముతో నలంకరింపఁబడిన గోపురమును సూచించును. ఇశ్రాయేలీయులు మిగుల వృద్ధియందుండి స్థితిమంతులైన కాలమునందు దంతపు మంచములను వాడుకొనిరి (ఆమో 6[4]). తినుట కన్నమును కట్ట వస్త్రములును లేక బీదలు బాధపడు కాలమున ధనికు లిట్టి యనావసరములగు ఖర్చుల పాలగుట చూచి ఆమోసు వారిని ఖండితముగా గద్దించెను. హిజ్కియా అష్షూరు రాజగు సన్హెరీబునకు చెల్లించిన కప్పమునందు దంతపు మంచములున్నట్లు అష్షూరువారి రాతిశాసనముల వలనఁ దెలియుచున్నది.

ఆమోసు కాలములో స్థితిగలవారు దీనితో తమ నగరములను అలంకరించుకొనినట్లు వారి దంతపు నగరులు లయమగునను శాపమువలనఁ దెలియుచున్నది (3[15]). తూరు పట్టణపు అమిత భోగమునుగూర్చి యెహెజ్కేలు హెచ్చరికెఁ జేయుచు దంతముతో చెక్కడపు పనిఁజేసిన పీటలు వారికున్నట్లు చెప్పెను (యెహె 27[6]). వారితరదేశములతోఁ జేసిన విలువగల వ్యాపారపు సరకులలో దంతమును ఉన్నట్లు తెలియుచున్నది (27[15]) క్రొత్త నిబంధనలో రోమా పట్టణమును గూర్చిన వివరమునందు ఆ పట్టణస్థులును ఇట్టి వ్యాపారమును జేసినట్లు ప్రక 18[12] వలనఁ దెలియుచున్నది. క్రొత్త నిబంధనలో దానిని గూర్చిన ఈయొక్క సూచనగాక మఱేమియును లేదు.



ఏనుఁగును, ఏనుఁగు దంతమును తెచ్చుట

**దంతె** ఇనుప దంతె చూ||

**దక్షిణ నక్షత్రరాసులు** నక్షత్రములు చూ||

**దక్షిణదేశము** (Negeb = ఎండిన ప్రదేశము). పలెస్తీనుకు దక్షిణ మందున్న ప్రదేశము. హిందూ దేశమునందు వింధ్యపర్వతములకు దక్షిణ ప్రాంతమంతటికి ఎట్లు దక్కను ( = దక్షిణము) అను పేరు పెట్టిరో అట్లే పలెస్తీనులోకూడ హెబ్రోను పట్టణప్రాంతములకును దానికి దక్షిణమున నున్న దేశమునకును నెగెబు అను సార్థకనామము పెట్టిరి. అబ్రాహాము కనానులో నుండు నప్పుడు విశేషముగా తిరిగినదీ ప్రదేశములోనే (ఆది 12[9] 13[1,3,14] 20[1]). ఈ ప్రాంతములలోనే దూత హాగరునకు ప్రత్యక్షమై ఆమె నాదరించెను (16[7,14]). ఇస్సాకు యాకోబు లిచ్చటనే నివసించిరి (24[62] 37[1] 46[5]). మోషే వేగులవారిని కాదేషుబర్నేయనుండి పంపినప్పుడు వారీ దేశముగుండా సంచరించిరి (సంఖ్యా 13[17,22]). 13[29] నందిది అమాలేకీయుల దేశమనఁబడెను. దేశమును పంచిపెట్టినప్పుడు దానిని యూదా గోత్రమున కిచ్చిరి (యెహో 15[21-32]) అయినను అది షిమ్యోను గోత్రీకులదయ్యెను. (19[1-9]). దావీదు నీళ్లగులోనుండు కాలమున అతఁడీ దక్షిణ దేశపు సరిహద్దులలో సంచరించినట్లున్నది. అచ్చట అది కెరేతీయుల, యూదా కాలేబు అనువారి

దక్షిణ దేశమనియు (I సమూ $30^{14}$), యూదా యెరహ్మెయేలుకేనీయుల దేశమునకు దక్షిణ దేశమని పిలువఁబడెను ($27^{10}$). ఆ ప్రదేశమునకు నాశనము సంభవించుననియు (యిర్మీ $13^{19}$), యూదులు చెఱనుండి తిరిగి వచ్చినప్పుడు ఈ ప్రదేశపు వారికి కుదురుబాటు కలుగుననియు ($32^{44}$ $33^{13}$) యిర్మీయా ప్రవచించెను. కాదేషు బర్నేయ (ఆది $14^{7}$), బెయేర్షెబా (యెహో $15^{28}$) బెయేర్ లహాయిరోయి (ఆది $24^{62}$) సిక్లగు (యెహో $15^{31}$) అరాదు (సంఖ్యా $21^{1}$) అనునవి ఈ ప్రదేశమందలి ముఖ్యపట్టణములు. అది హెబ్రోనునుండి దక్షిణముగా బాదాపు 70 మైళ్లును, తూర్పున అరాబా మృత సముద్రములనుండి పడమట మధ్యధరాసముద్రమునకు దగ్గరనున్న బయలువఱకును వ్యాపించి యుండెను. ప్రస్తుతమున అది చాలమట్టుకు నిర్జన ప్రదేశముగా నున్నను అక్కడ కనఁబడెడి శిథిలములవలన అది పూర్వమున గొప్ప పట్టణములుగల భాగమని తెలియుచున్నది. దావీదు అమాలేకీయులయొద్ద పట్టుకొన్న దోపుడునుబట్టి ఇది పూర్వము మిగుల అభివృద్ధి యందున్న ప్రదేశమని ఊహింపవచ్చును (I సమూ $15^{9}$ $27^{9}$).

**దట్టీ, నడికట్టు, మొలత్రాడు, నడుము కట్టుకొనుట** (Girdle). ఈ దేశమందువలె పలెస్తీనులోను దట్టీలు కట్టుకొనుట సర్వసాధారణ విషయము. అది నారతోఁగాని (యిర్మీ $13^{1}$) తోలుతోఁగాని (II రాజు $1^{8}$) చేయఁబడునది. దానిని సాధారణముగా బుటేదారు పనిగాఁ జేసినందున మిగుల విలువగలదై యుండెను. ప్రక $1^{13}$ $15^{6}$ లో నున్న బంగారు దట్టీ క్రీస్తు మహిమను సూచించెడి గుఱుతులలో నొకటియై యుండెను. కావున స్థితిమంతులు అట్టివాటిని కూడ ధరించినట్లు దీనివలనఁ దెలియుచున్నది. ఒకఁడు తన పనిని నిరాటంకముగా చేయుటకై దట్టీని బిగించుకొనుట అలవాటగుటచే దట్టీ కట్టుకొనుట పనికి సిద్ధపడుటను సూచించును (లూ $12^{35}$). శోధనల నెదిరించుటకు సిద్ధపడుటకై దేవుని సత్యము ముఖ్యసాధనమగుటచే సత్యమను దట్టీని కట్టుకొనవలెనని ఎఫె $6^{14}$ లో అలంకార రీతిగా నుపయోగింపఁబడెను. క్రీస్తు తన శిష్యుల పాదములను కడిగినప్పుడు ఆయన తన నడుమును కట్టుకొనినందున (యోహా $13^{4}$) నడుము కట్టుకొనుట సేవ చేయుటకు తగిన వినయబుద్ధికి ఒక గుఱుతుగా నున్నది. పేతురీ పదము నిదే భావముతో వాడినట్లున్నది (I పేతు $1^{13}$). ప్రధాన యాజకుని దట్టీనిగూర్చి యాజకుల వస్త్రములు I 5 (3) చూ॥

**దదాను, దేదాను** (Dedan). హాము సంతతివాఁడైన కూషు కుమారులలో నొకఁడు (ఆది $10^{7}$). $25^{3}$ వలన ఇతఁడు కెతూరా అబ్రాహాములకు మనమఁడై యున్నట్లు తెలియును. కూషీయులు అరబీయులకు సంబంధులని మనము దీని వలన మాత్రముగాక ఇంక నితర సాక్ష్యములవలన కూడ తెలిసికొనఁగలము (యెష $21^{13}$). యెహె $25^{13}$ ను బట్టి దదాను ఎదోము దేశపు సరిహద్దులో నున్నట్లు తెలియును (యిర్మీ $25^{23}$ $49^{8}$). యెహెజ్కేలు కాలమందు తూరు పట్టణమునకు తమ సరకులను పంపిన అనేకులలో దదాను వారొక తెగవారై యుండిరి (యెహె $27^{20}$). $27^{15}$ లో కూడ దదానువారి పేరు కలదుగాని అది రోదాను అను పేరుకు బదులుగా అచ్చు తప్పు అని కొందఱనుకొందురు. హెబ్రీభాషలో ద, ర యను నక్షరములు చాలమట్టుకు ఒకటే రూపముగా నుండుటచేత అట్టి యచ్చు తప్పులు బహు సులభముగా వచ్చును.

**దద్దురు** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥

**దన్నా** (Dannah = పల్లపు భూమి). యూదా స్వాస్థ్యములోని ఒక యూరు (యెహో $15^{45}$). అది హెబ్రోనుకు నైరృతి దిక్కున నుండు ప్రదేశములో నున్నట్లున్నది. ప్రస్తుతమున అచ్చటనున్న ఇద్నా (*Idhnah*) దాని యునికియై యుండవచ్చును (పటము II, D 2).

**దబ్బమాను** (Thyine Wood). ప్రకటన గ్రంథములోనున్న రోమాను సూచించు బాబెలునందు విక్రయించఁబడు ఒక విధమైన మ్రాను (ప్రక $18^{12}$). ఇది అశోకవృక్షము వంటిది. దాని కర్ర యెర్రగ నుండును. అందుచేత పూర్వికులు దాని మిగుల వెలగల దానిగ నెంచిరి. రోమీయులు దాని చెక్కలతో విలువగల పెట్టెలు చేసిరి.

J. C.

**దబ్బెషెతు** (Dabbesheth = ఒంటె మూపురము). జెబూలూను స్వాస్థ్యములోని పశ్చిమ హద్దుననున్న ఒక యూరు (యెహో 19[11]). ప్రస్తుతమున దానికి తూర్పుగానుండు దబ్షే (*Dabsheh*) దాని యునికిస్థై యున్నది. (పటము IV, C 5).

**దమరి** (Damaris = పెయ్య). ఏతెన్సులో పౌలు పనిఁజేయుచుండఁగా శిష్యురాలైన యొక స్త్రీ (కార్య 17[34]). మిగుల పురాతనమగు మాతృకలో నీమె ఘనురాలైనట్లున్నది. ఈమెతోపాటు క్రైస్తవుఁడైన దియొనూసియు మహా సభికుఁడగుటచే నీమెయు పూజ్యురాలై యుండును.

**దమస్కు** (Damascus). అబానా ఫర్పరు అను నదులు ప్రవహించెడి పీఠభూమి యందలి పట్టణము (II రాజు 5[12]). ఈ పీఠభూమి సముద్రమట్టమునకు 2200 అడుగు లెత్తుగానుండి లెబానోను పర్వతము యెదుటి పంక్తికి తూర్పున 500 చదరపు మైళ్ల వైశాల్యము గలిగి యున్నది. పై రెండు నదులలోపడు పిల్లచేఁ దడుపఁబడు చోట్లెల్లను మిగుల ఫలవంతములైన వనముల తోడను తోఁటలతోడను నిండి దమస్కు పట్టణమున కెంతయో శోభను గలిగించుచున్నవి. ఆ దిక్కునకు దృష్టి సారించిన వెంటనే చుట్టునున్న వంధ్యభూమికిని దీనికిని భేదము స్పష్టముగాక మానదు. నైరృతి దిక్కుగా మధ్యధరా సముద్ర తీరమునఁబడి యైగుప్తునకును, దక్షిణముగా నరేబియాకును, ఎడారిని దాటి బాగ్దాదు వంకను బోవు మూఁడు గొప్ప రాచబాట లీ పట్టణము యొద్దనే చీలుచున్నవి. దమస్కు పట్టణ మతి పురాతనమైనది. అబ్రాహాము కాలమునుండి అది గలదు (ఆది 15[15]). దావీదు కాలము నందది దక్షిణ సిరియా యందలి యొక చిన్న రాజ్యముగ నుండెను. దావీదు దానిని జయించి అచ్చట నొక పటాలము నుంచెను (II సమూ 8[5,6] I దిన 18[5,6]). సిరియా యందలి సోబా రాజ్యమును దావీదు జయించినప్పుడు సోబా రాజుయొక్క సేవకులలో నొకఁడగు రెజోను అను నతఁడు సైన్యము నొక దానిని కూర్చుకొని వెళ్లి దమస్కును పట్టుకొని స్వతంత్ర రాజ్యమును స్థాపించుకొనెను (I రాజు 11[23,24]). ఈ రాజ్యమే తరువాతి కాలములో ఇశ్రాయేలు వారితో తఱచుగాఁ బోరాడుచుండెను. దాని నేలిన రాజులలో హెజ్యోను, టబ్రిమ్మోను, బెన్హదదులు (I రాజు 15[18,20] 20[34] II రాజు 8[7]), హజాయేలు (I రాజు 29[17] II రాజు 8[8-15]), రెజీను (16[5]) అను వారినిగూర్చిన సూచనలు బైబిలునందున్నవి. టబ్రిమ్మోను, మొదటి బెన్హదదు అనువారు ఇశ్రాయేలు వారి రాజులతో సంధి చేసికొనిరి (I రాజు 15[19] II దిన 16[3]). వర్తకము నిమిత్తమై దమస్కులో వీధులను కట్టించుకొనవచ్చునను షరతుతో బెన్హదదు మరల యొక సంధ అహాబుతోఁ జేసికొనెను (I రాజు 20[34]). అప్పుడప్పుడే వృద్ధిలోకి వచ్చుచుండిన అష్షూరు రాజ్యము నెదిరించుటలో దమస్కు నాయకత్వము వహించెను. అతఁడు సముద్ర తీరముననున్న రాజులతోను ఇశ్రాయేలు వారి రాజగు అహాబుతోను ఈ విషయమై సంధి కుదుర్చుకొని క్రీ॥ ము॥ 854 సం॥న కర్కారువద్ద షల్మనేసెరు నెదుర్కొని పరాజయము నొందెను. 841 సం॥న హజాయేలును షల్మనేసెరుచే నోడిపోయెను. రెండవ బెన్హదదు సేనాధిపతియగు నయమాను ఈ పట్టణస్థుఁడే (II రాజు 5[1-12]). రెజీను ఇశ్రాయేలు వారి రాజగు పెకహుతోఁ గలిసి యెరూషలేమును పట్టుకొనుట కాలోచించి నప్పుడు యూదా రాజగు ఆహాజు అష్షూరు రాజగు తిగ్లత్పిలేసెరును సహాయమునకుఁ బిలువఁగా నతఁడు వచ్చి దమస్కును పట్టుకొని రెజీనును జంపి ప్రజలను కీరుకు చెఱగొనిపోయెను (II రాజు 16[5-9] యెష 7[1-8] 10[9]). ఆమోసు బోధించుటలో ఈ నాశనమును దృష్టాంతముగా నెత్తి చెప్పెను (1[3-5]). తరువాత దమస్కు మరల తలయెత్తి ప్రసిద్ధిపడసెను (యెహె 27[18]). అష్షూరీయులు, బబులోనీయులు, పారసీకులు, గ్రీకులు ఒకరి తరువాత నొకరు దీనిని లోఁబఱచుకొనిరి. ఆరంభమున దెకపొలి పట్టణములలో నిది యొకటి. రోమను సేనానియగు మెటిల్లుసు (*Metellus*) దీనిని క్రీ॥ ము॥ 63 సం॥న పట్టుకొని రోమీయుల ఆధీనము చేసెను. యూదు లనేకు లీ పట్టణమున కాపురముండిరి. ఇక్కడ కొన్ని సమాజమందిరము లుండినట్లు కనఁబడుచున్నది (కార్య 9[2] పురా 2.20.2). ఇక్కడనుండు క్రైస్తవులను హింసింప వెళ్లుచుండఁగా దీని సమీపమునందే సౌలు దర్శనమును జూచి అంధుఁడయ్యెను (కార్య

9[2,3,10] 22[6,10,11,12]). క్రైస్తవుఁడైన పిదప దాదాపు మూఁడేండ్లవఱకు అరబి యరణ్య ప్రాంతములలో దైవధ్యాన తత్పరుఁడైన సౌలు దమస్కుకు తిరిగివచ్చి క్రీస్తు నామమున బోధింపఁగా వినిన యూదులతని చంప యత్నము చేయు చున్నారని విని అక్కడున్న శిష్య బృంద సహాయమున గోడమీఁదనుండి క్రిందికి దింపఁబడి పారి పోయెను (9[24,25] 26[20] గల 1[17]). తిన్ననిది యనఁబడిన వీధి (కార్య 9[11]) రెండు మైళ్ల పొడవు గలిగి ఈశాన్యమునుండి నైరృతి దిక్కుగా దాదాపు పట్టణ పొడవున వ్యాపించియుండెనని చెప్పెదరు. ప్రస్తుతమున నావీధి యెంత మాత్రము బాగుండకపోయినను సౌలు జీవించిన కాలమునందు మంచిమంచి చౌకులనుగల్గి ప్రతి వ్యాపారాదులచే విలసిల్లుచుండెడిది. ఆ వీధి తూర్పు కొనను పట్టణపు తూర్పు ద్వారముండెను. ఆ ద్వారము 38 అడుగుల ఎత్తును 20 అడుగుల వెడల్పును గలది. ఇదిగాక దాని కిరుపార్శ్వముల యందు రెండు చిన్న ద్వారములు నుండెను. రోమనులు వీటిని సౌలు కాలమున గట్టియుందురు. ఈ మూఁడు ద్వారములలో మధ్యనున్న దానిని దక్షిణమందున్న దానిని రాళ్లతో మూసివేసి ఉత్తరపు ద్వారమును మాత్రముఁ దెఱచియుంచిరి. పౌలు జీవితకాలమునందీ పట్టణము అరేబియా పెత్రకురాజైన అరెతాయను వాని యధీనమం దుండెను (II కొరి 11[32]) గాని త్వరలోనే రోమనులు దాని తమ సామ్రాజ్యమునకు కలుపుకొనిరి. క్రీ॥ శ॥ 634 నందు అరబ్బులు దాని ముట్టడించి 635 నందు స్వాధీనపఱచుకొనిరి. 1300 సం॥ న తార్తారులు దాని దోచుకొనిరి. 1400 సం॥ న తైమూరు దాని కొల్లఁగొట్టెను. 1510 నుండి 1918 వఱకు దది తురుష్కుల స్వాధీన మందుండెను గాని అప్పటి నుండి బ్రిటిషువారి సంరక్షణ క్రిందకు వచ్చెను. ప్రస్తుతము స్వతంత్రరాజ్యమగు సిరియాకు రాజధాని. అననీయ యింటిని (కార్య 9[11]), పౌలు తప్పించుకొని దాటివచ్చిన చోటును (II కొరి 11[33] కార్య 9[25]) నేటివఱకు అక్కడ చూపెదరుగాని అవి రూఢియని చెప్పఁ జాలము. (అరాము II 4 చూ॥).

**దమస్కు గుమ్మము** యెరూషలేము B V 2 (4) చూ॥

**దయ** కృప చూ॥

**దయాదాక్షిణ్యములు** కృప చూ॥

**దయ్యములు (Devils, Evil Spirits).** దయ్యములున్నవను నమ్మకము సర్వలోకమున ఆదికాలమునుండి యున్నది. హెబ్రీయులును దయ్యములున్నవని నమ్మినసూచనలు బైబిలునందున్నవి. లేవీ 17[7] నందున్న దయ్యములు అను అర్థమిచ్చు మూలపదమును యెష 13[21] నందు కొండమేఁకలని తర్జుమా జేసిరి. అది మేఁక యాకారముగలిగి అడవియందుండెడి దయ్యము యనుకొందురు (మేక 3 చూ॥). ద్వితీ 32[17] నందున్న దయ్యములను పదమునకు మూలభాషలో తుఫానులు కలిగించునవి యని యర్థమగును. ఒకనికి దురాత్మపట్టినట్లు I సమూ 16[14-16] వలనఁ దెలియుచున్నది.

దయ్యములనుగూర్చిన సూచనలు చెఱకాలమునకు తరువాత యధికముగా కనఁబడుచున్నవి. అప్రమాణిక గ్రంథమగు తోబితులో (3[7-12] 6[7] మొ॥) దయ్యములు జబ్బులకు కారణమైనట్లున్నది. దయ్యములుపట్టినవారిలోనుండి వాటిని వెళ్లఁగొట్టుటవలన బాగుపఱచిన చికిత్సలను గూర్చి యోసీఫసు (పురా 8.2.5) వ్రాసెను. దయ్యములు సాతానుకు లోఁబడి యున్నట్లు క్రొత్త నిబంధనయందలి సూచనలవలన స్పష్టమగుచున్నది (మా 3[23-30]).

క్రొత్త నిబంధనయందు దయ్యములు పట్టుటను గూర్చిన సూచనలనేకములు గలవు. మూర్ఛలు, నరములకు సంబంధించిన జబ్బులు మొదలగున వన్నియు ఆ కాలమునందున్న యూదులు దయ్యములు పట్టుటచే కలిగినట్లు చెప్పిరి. అట్టి జబ్బులలో ననేకమైనవాటికి మనము ఆయా పేరులను పెట్టియున్నామని కొందఱనుకొనుచున్నారు. సాతాను క్రియలను లయపఱచుట కవతరించిన క్రీస్తు ఈ లోకమునందు జీవించినకాలములో దయ్యములు మిగుల భయపడి, మఱింత ఆతురతతో మానవులను చెఱుపుటకు ప్రయత్నించిన వనుటకు ఆస్పదమున్నది (1[24,32] మొ॥). దయ్యములను వెళ్లఁగొట్టుట క్రీస్తును (1[34,39] 3[22] 7[26] మొ॥), ఆయన శిష్యులును (3[15] 6[7]) చేసిన పనిలో ముఖ్యభాగముగా

నున్నది. ఇది దేవుని శక్తివలన జరుగుచున్నదని ఆయన చెప్పెను (మ $12^{24-27}$). యూదులు బొత్తుగా వెళ్లగొట్టలేక పోయిరనంజాలము (లూ $11^{19}$) గాని ఆయన తనపనిని మరిఎక్కువ జయకరముగా జరిగించెను ($11^{20}$). క్రీస్తు లేచిన పిమ్మట పౌలు ఫిలిప్పయి పట్టణమునందును (కార్య $16^{16-18}$), ఎఫెసులోను ($19^{13,19}$) అట్టి పనులు చేసినట్లున్నది గాని సువార్తలకు తరువాత దయ్యములుపట్టినవారిని స్వస్థపఱచుటను గూర్చిన సూచనలంతగా లేవు (సాతాను చూ॥).

**దయ్యములను వెళ్లగొట్టుట** దయ్యములు చూ॥

**దయ్యముల యధిపతి** సాతాను, దయ్యములు చూ॥

**దర్కోను** (Darkon = చెదరగొట్టుట). జెరుబ్బాబెలుతో కూడ బబులోనునుండి వచ్చిన నతీనీయులలో నొకని కుటుంబమునకు పూర్వీకుడు (ఎజ్రా $2^{56}$ = నెహె $7^{58}$).

**దర్ద, దార** (Darda, Dara = జ్ఞాన ముత్యము?). గొప్ప జ్ఞానమునకు ప్రసిద్ధులైన వారిలో నొకడు (I రాజు $4^{31}$). సొలొమోను వీనికంటె జ్ఞానవంతుడని యున్నది. I దిన $2^{6}$ లో ఇతనికి **దార** అను మాఱుపేరు కలదు. ఇతడు తామారువలన యూదాకు కలిగిన సంతతివారిలో నొకడు.

**దర్యావేషు** (Darius = రాజు).

1. మాదీయుడగు దర్యావేషు (దాని $11^{1}$). ఇతడు **అహష్వేరోషు** కుమారుడనబడెను (దాని $9^{1}$). బెల్షస్సరునకు తరువాత ఇతడు బబులోను నేలెనని దాని $5^{31}$ లో నున్నది. గాని, అట్టిరాజు బబులోను నేలినట్లుగా పారసీక దేశపు చరిత్రలో సూచనలేవియు లేవు. కోరెషు పేరట బబులోనుదేశము నేలినవాడిందులో సూచింపబడెనని కొందఱనుకొందురు. దానియేలు గ్రంథములో కల్పనాకథ లనేకములున్నవి గనుక ఆ చక్రవర్తుల పేరులు, ఉన్నరీతిగా వ్రాయక కల్పించి వ్రాసిరని నవీన వేదశాస్త్రులలో కొందఱు అనుకొనుచున్నారు. ఇతడు మాదయుదేశపు చివరి చక్రవర్తియైన అస్త్యాగెస్ (*Astyages*) అనువాని కొడుకని యోసీఫసు వ్రాసెను (పురా 10.11.4). పూర్వచరిత్ర సంగతులలో ననేక సంగతులు పోయినందున ఈ దర్యావేషు ఎవ్వడో రూఢిగా చెప్పవీలుకాదు.

2. మొదటి దర్యావేషు (క్రీ॥ పూ॥ 521-485). ఇతని సంగతులు గ్రీకుచరిత్రకారుడగు హెరొడొటసు వలనను, ఇతడు స్వయముగా చెక్కించిన రాతిశాసనముల వలనను తెలియును. యెరూషలేము ఆలయమును తిరిగి కట్టించుటకు ఇతడు యూదులకు సెలవిచ్చెను. ఆ యాలయము ఇతనియేలుబడి 6 సం॥లో పూర్తియాయెను (ఎజ్రా 4,5,6 హగ్గ $1^{1}$ $2^{10}$ జెక $1^{1,7}$).

3. నెహె $12^{22}$ లో పారసీకుడగు దర్యావేషు అను పేరు కలదు. ఇతడు మూడవ దర్యావేషు కావచ్చును (పారసీకదేశము III చూ॥).

**దర్శనములు** (Visions). మానవులకు తన సంగతులను తెలుపుటకు దేవుడు స్వప్నముల నొకానొకప్పుడు సాధనములుగా నుపయోగించినను (కల చూ॥) దర్శనములద్వారా వాటిని మరిఎక్కువగా బయలుపఱచెను. దర్శనములు కలలు అను పదములు రెండును కొన్నివాక్యములలో కలిసియున్నవి (దాని $1^{17}$ $2^{28}$ యోవే $2^{28}$). **రాత్రిదర్శనము** లను పదమును దీనికి సంబంధించినదే (ఆది $46^{2}$ కార్య $16^{9}$). యోబు $4^{13}$ నం దీపదమునే **రాత్రికల** యని తెనిగించిరి. బాలుడగు సమూయేలుకు కలిగిన దర్శన మిట్టిదై యున్నది (I సమూ $3^{1-15}$). అవి చాలమట్టుకు కలలైనను, వాటిని కనినవారు మేలుకొనియుండి పరవశులై దర్శనములను చూచిరి (సంఖ్యా $24^{3,4}$ కార్య $10^{9-11}$ $11^{5}$ $22^{17}$). ఇట్లు పరవశులైనవారు దేవునిసంగతుల నెఱిగియుండినను ఆ దర్శన మెట్టిదో వారికి సహా తేటగా దెలియలేదు (II కొరి $12^{1-4}$). ప్రవక్తల దర్శనములలో ననేకము లిట్టివి (యెష 6 యెహె 1). గాని ప్రవక్తలు ఆత్మీయ దృష్టి వలననే దేవుడు బయలుపఱచిన సంగతులను సాధారణముగా దెలిసికొనిరి (యెష $1^{1}$ $2^{1}$ హోషే $1^{1}$ యిర్మీ $1^{4,19}$ ఆమో $7^{4,7}$). ప్రవక్తలకు గలిగిన దర్శనములన్నియు నీతిసహితము

లును పవిత్రములునై యున్నవి. దేవుని చిత్తమును మానవులకుఁ దెలుపుటకై అవి యనుగ్రహింపఁబడెనే గాని తమాషాకొఱకై కల్పించరాదు.

మంచిపనులు జరుగు ప్రతిస్థలమున వాటిని చెఱచెడి మోసగాండ్రుండుటలో లేతురు. ప్రవక్తల విషయములో నిట్లే జరిగెను. వారిలోఁ గొందఱు దర్శనములను చూచినట్లుగా చెప్పుకొనిరి గాని వారు ఉద్రేకపూరితులైనందున తమకు కలిగిన వాటిని దర్శనములని యెంచి బోధించిరి (యిర్మీ 14[14] 23[16] యెహె 13[7] మొ||). కనుక ప్రవక్తలకు కలిగిన దర్శనములు నిజముగా దేవునివలన కలిగినవా, కాదా యని వాటిని పరీక్షింపవలసిన యవసరము తటస్థించెను (యిర్మీ 23[16,21,22,27] యెష 8[20] ద్వితీ 18[10] మొ||). నీతిబోధలను బహు స్పష్టముగా బోధించుటయు, అట్లు బోధింపఁబడినది తప్పక నెఱవేఱుటయే ఆ దర్శనములు దేవునివలన కలిగిన వని ఋజువగుచున్నది.

**దల్ఫోను (Dalphon).** హామాను కొడుకులలో రెండవవాఁడు. హామానుతోను అతని కుమారులతోను కలిపి యూదు లితనికూడ చంపిరి (ఎస్తే 9[8]).

**దల్మతియ (Dalmatia).** అడ్రియాటిక్ సముద్ర తూర్పుతీరమున నుండు నొక కొండ ప్రదేశము. దీనికి ఉత్తరమున నారోనదియు దక్షిణమున సాపసునదియు గలవు. పౌలు రెండవమాఱు రోమాలో చెఱయుండుండు సమయమున తీతు ఈ ప్రదేశములో సువార్త ప్రకటించెను (II తిమో 4[10]). M.

**దల్మనూతా (Dalmanutha).** క్రీస్తు 4000 మందికి ఆహారము పెట్టిన పిమ్మట దల్మనూతా ప్రాంతమునకు వచ్చెనని మా 8[10] సందున్నది. దీనికి సాటియగు చరిత్రగల మ 15[39] సందు **మగదాను** అను పేరు కలదు. ఈ పదసంబంధమునుబట్టి ఇది మగ్దాల యను ఊరైయుండునని కొందఱి యభిప్రాయముగాని అది రూఢికాదు. దల్మనూతా యను పదమునకు రేవు అని యర్థమగునని కొందఱెంచెదరు గాని దల్మనూతా మగదాను అను వీటినిగూర్చి యితర గ్రంథములలో నెట్టి సూచనలును లేకపోవుటచేత దాని యునికినిగూర్చి తెలిసికొనుటకు పైనున్న వాక్యములుగాక వేఱు ఆధారములు లేవు. అది గలిలయకు పశ్చిమతీరమున నున్న యొకస్థలమని యూహించుచున్నారు. కాని దీనియునికిని గూర్చి నూటిగాఁ దెలియదు.

**దశమభాగము (Tithes).** తము రాఁబడి యంతటిలో పదవభాగమును దేవుని కర్పింపవలెనను నియమము యూదులకుఁగలదు (లేవీ 27[30,32]). ఈ యేర్పాటు ఒక యూదులలో మాత్రమేకాక ఇతర జనాంగములకును ఉన్నట్లు కనఁబడుచున్నది. ఫేనీకేయులకీ యేర్పాటు గలదని గ్రీకు చరిత్రకారుఁడగు హెరొడొటసు (*Herodotus*) వలనఁ దెలియుచున్నది. యోసేపు కాలమునకు పిదప ఐగుప్తీయులు తమ రాజుకు రెండింత లెక్కువ అనఁగా ఐదవభాగము నిచ్చిరి. (ఆది 47[24]). మోషే ధర్మశాస్త్రమునకు పూర్వము అబ్రాహాము మెల్కీసెదెకుకును దశమాంశమిచ్చెను (14[20]). యాకోబు బేతేలులో పదవభాగమిత్తునని మ్రొక్కుకొనెను (28[22]). గాని తరువాత అది మోషే ధర్మశాస్త్రములో లేవీయులను పోషించుటకైన మొట్టమొదటి స్థిరమగు ఏర్పాటాయెను (సంఖ్యా 18[21-24]). లేవీయులా పదవభాగములోని పదవవంతును మాత్రము యాజకులకిచ్చి మిగిలిన దాని నెచ్చట నైనను తినవచ్చునను నియమముండెను (18[28-31]). ద్వితీ 12[11,17,18] 14[23-27] లో ప్రజలు దీనిని ఆలయము దగ్గఱ తినవలెనను ఏర్పాటు తరువాత చేసినట్లు కనఁబడును గాని, ప్రతిమూఁడవ సంవత్సరమున (14[28,29]) ఆ పదవభాగమును తమ తమ ఊళ్లలో నర్పింపవలసినట్లు 26[12] లో కనఁబడుచున్నది. దీనియంతటినిబట్టి, ఆ దశమభాగములో కొంత ఆలయములో నర్పించి, మూఁడవ సంవత్సరమున ఆ లెక్క నంతటిని తమ తమ ఊళ్లలో పూర్తిజేసిరని చెప్పవచ్చును. కొందఱు యెరూషలేములో పదవభాగమునిచ్చుట మాత్రమే గాక, ప్రతి మూఁడవ సంవత్సరమందు తమ గ్రామాదులలో మఱియొక పదవవంతు నియ్యవలసిన నియమముండెనని అభిప్రాయ పడుచున్నారు. ఆ చొప్పున వారు తమ రాఁబడిలో నైదవవంతు నర్పింపవలసి యున్నారు గాని యిట్లు చేసిరనుటకు తగిన యాధారములేదు.

పాంత నిబంధనలో చివరి చరిత్రకాలమునందు యూదులు తమ ధనధాన్యాదుల నుండియు, కూరలు మొదలగు వాటినుండియు పదవవంతుల నర్పించినట్లు సూచనలు గలవు. (నెహె 10[37] 12[44] 13[12]). తమ మందలలోనుండికూడ పదవ వంతును తెచ్చిన సూచనలున్నవి (II దిన 31[6]).

యూదులు తమ మతమందంత శ్రద్ధలేక యుండుకాలమునందీ దశమ భాగములనిచ్చుట ను నిర్లక్ష్యముజేసిరి (II దిన 31[4-12] మలా 3[7-12]). హిజ్కియా కాలమున ప్రజలతని హెచ్చ రికలకు చెవినొగ్గి తమ పదవవంతులను తేంగా వాటిని దాచుటకు ప్రత్యేకమగు కొట్లు కట్టించ నలసివచ్చెను (II దిన 31[11]). అట్టి దశమాంశ ముల నుంచుటకై చెఱకు పిమ్మట యెరూషలేము నందు కట్టించిన దేవాలయములో కొట్లు కట్టించిరి (నెహె 13[10-14] మలా 3[10]). లేవీయులు ఆయా గ్రామములలో వాటిని పోగుచేసి యెరూషలేము నకు వాటి నంపిరి (నెహె 10[37,38]) యూదులు క్రొత్త నిబంధన కాలమువరకు తమ దశమభాగ ముల నిచ్చుచుండిరి (I మక్క 3[49] లూ 11[42] 18[12]). పరిసయ్యులు ఇతర మతాచారముల విషయమై గలిగియుండినంత నిష్ఠ దీని విషయ మందును కనంబఱచిరి (మ 23[23]).

క్రైస్తవులైన వారీ చట్టమునకు బద్ధులా యని కొందఱికి సందేహము కలుగుచున్నది. మ 23[23] లో క్రీస్తు పలికిన "వాటినిమానక" అను మాట లను బట్టి వారును బద్ధులనుకొనుట కాధారము గలదు గాని క్రీస్తుమాటలు యూదులైయుండిన తన శిష్యులతో చెప్పెనుగాన వారు దానికి బద్ధు లైనను అందఱికట్టి నిర్బంధము లేదనియు, క్రీస్తు మనలను ధర్మశాస్త్రమునుండి విడిపింపఁగా దీని నుండియు విడిపించెనని యితరు లనుకొందురు. ఆది క్రైస్తవులలోని అన్యక్రైస్తవులు ఈ చట్ట మునకు బద్ధులైయుండినట్లు పత్రికలలో నెట్టి సూచనలులేవు. I కొరి 16[1-3] II కొరి 8,9 లో మనము స్వేచ్ఛా పూర్వకముగాను శక్తికొలదియు నియ్యవలసినట్లు కనఁబడును. యూదులకన్న తక్కువగాక యెక్కువ నిచ్చు బాధ్యత క్రైస్త వుల కున్నదనుటకే సందేహములేదు.

**దస్తా వేజులమీద నున్నవాడు** (Recorder). II సమూ 20[24] II దిన 34[8] యెషు 36[3,22] నందు రాజుగారి ఉద్యోగస్థులలో నొకని బిరుదు. I రాజు 4[3] II రాజు 18[18,37] నందీ పదమునే **లేఖకుడు** అని తెనిఁగించిరి. దీని యసలుమాటకు జ్ఞాపకము చేయువాఁడని యర్థ మగును. రాజుల చర్యలు మరువఁబడకుండునట్లు వాటిని వ్రాసియుంచుటయే ఆ యుద్యోగస్థుల పనియని యెంచవచ్చును.

**దహింపుట** నేరములు శిక్షలు III 7 (5) చూ॥

## దా

**దాక్షిణ్యము** కృప చూ॥

**దాగోను** (Dagon). ఫిలిష్తీయుల ముఖ్య దేవత. గాజా బేత్దాగోను అష్డోదు అను పట్టణ ములలో దీనికి గుళ్లుకలవు (న్యాయా 16[21,23] I సమూ 5[1-7] I దిన 10[10]). మక్కబీయులలో యోనాతాననువాఁడు ఫిలిష్తీయుల నోడించి అష్డోదులోనున్న ఈ దేవత గుడిలోనికి వారిని తఱిమి దానిని, ఆ పట్టణమును తగలఁబెట్టెను (I మక్క 10[84] 11[4]). ఈ దేవతాపూజ ఫేనీకే అష్షూరు దేశములందుఁ గొంతవఱకు కనఁబడు చున్నది. ఈ విగ్రహముయొక్క తల చేతులు మొండెము మానవాకారమును (I సమూ 5[4]), క్రిందిభాగము చేఁపయాకారమును గలిగియుండి నట్లు కొందఱి యభిప్రాయము. ఇట్టి యాకా రముగల విగ్రహమొకటి అస్కెలోను అను మఱొక ఫిలిష్తీయుల పట్టణమందుండెనని యొకఁడు వ్రాయుచున్నాఁడు. అష్షూరు నందును ఇట్టి విగ్రహము కనఁబడెనుగాని దాని పేరు సరిగాఁ దెలియదు.

**దాడిమపండు** దానిమ్మపండు చూ॥

**దాతాను** (Dathan). కోరహు అబీ రాము అను వారితోఁ గలిసి మోషేకు విరోధ ముగా తిరుగుబాటు చేసినవాఁడు. ఇతఁడు రూబేనీయుఁడు (సంఖ్యా 16, 17, కోరహు చూ॥).

**దాతృత్వము, భిక్షము** (Alms, Alms-giving). బీదలయెడలఁగల ఔదార్యమును చూపుటకు బైబిలు గ్రంథకర్తలు ఆయా పదము లను వాడియుండిరి. ఈ కార్యము **అలంకార**

రీతిగా, బీదలవైపు చేయిచాచుట యనఁబడెను (ద్వితీ $15^{11}$). బీదలను కటాక్షించుట (సామె $14^{31}$), బీదలను కనికరించుట ($19^{17}$) ధర్మము చేయుట (మ $6^{2}$) అను నిట్టి మాటలుకూడ వాడఁబడియున్నవి. బీదలు ధర్మమడిగినయెడల అది భిక్షమగుగుట అనియు నందురు బీదలయందు దయయుంచి వారికి సహాయము చేయవలయునని చెప్పు ఆజ్ఞలు బైబిలునందనేకము లున్నవి (ద్వితీ $15^{11}$ యోబు $29^{12,13}$ కీర్త $112^{9}$ సామె $14^{21}$ $19^{17}$ $31^{20}$).

పాఁత నిబంధనకును క్రొత్త నిబంధనకును మధ్యకాలములో రచింపఁబడిన యప్రమాణ గ్రంథముల గ్రంథకర్తలు బీదలకు ధర్మము నిచ్చుటను మఱి గొప్ప పుణ్యకార్యముగా నెంచిరి. మ $6^{1}$ లో నున్నట్లు యూదులు ధర్మము చేయుటను నీతికార్యముగాను, పాపవిముక్తిని గలిగించు పుణ్యకార్యముగాను నెంచిరని తెలియును. యూదుల దేవాలయములోని ఆచారములు ఆపివేయఁబడినను ఈ ధర్మకార్యము వాటన్నిఁటికి పైఁగా నున్నదని చెప్పవచ్చును. ధర్మమును వసూలుచేయుటకును దానిని పంచిపెట్టుటకును యూదుల అధికారులు ఎక్కువ శ్రద్ధ పుచ్చుకొనుచుండిరి.

క్రొత్త నిబంధనలో దాతృత్వమును గూర్చిన బోధలు అనేకములు గలవు. ధర్మము చేయుచున్నట్లు మనుష్యులకు కనఁబడుటకు యూదులు చూపిన డంబమును క్రీస్తు ఖండించెనుగాని ధర్మము చేయవలెననియే బోధించెను (మ $6^{1-4}$). దాతృత్వము ధన్యకరమైనదనియు (కార్య $20^{35}$) ధర్మము చేయుటకు అనేక సమయములు కలవనియు (మ $25^{35-40}$), ధర్మమును తన నామమున చేయవలెననియు (మా $9^{41}$) క్రీస్తు బోధించెను. ఆది క్రైస్తవులు తమ యాస్తినంతటిని సమష్టిగానుంచుకొని బీదల అక్కఱలను తీర్చిరి (కార్య $4^{32-34}$). ధర్మమును పంచిపెట్టుటకు పరిచారకులను నియమించుకొనిరి ($6^{1-6}$). యెరూషలేములోని బీదక్రైస్తవులకొఱకు చందాను పోగుచేయుటకై పౌలు చాల శ్రద్ధపుచ్చుకొనెను (I కొరి $16^{1-6}$ II కొరి $8^{1-9}$). ఆదినుండి యిప్పటివఱకును బీదలను పోషించుటలో క్రైస్తవులు విశేష శ్రద్ధగలవారై యున్నారు. (ఈవి చూ॥).

**దాది** (Nurse). హెబ్రీయులలోని తల్లులే తమ బిడ్డలకు పాలిచ్చుట సర్వసాధారణమైనను, ఆయా స్థితిగతులనుబట్టి పాలిచ్చుటకు కొందఱు దాదులను సేవకురాండ్రను పెట్టుకొనిరి. అందువలన దాదులకును పిల్లలకును పరస్పర ప్రేమ యుండుట సహజమై యుండెను. రిబ్కాయొక్క దాది రిబ్కా మరణమగు నంతవఱకు ఆమెదగ్గఱనే యుండెను (ఆది $24^{59}$ $35^{8}$). ఫరో కుమార్తె మోషే తల్లినే అతనికి దాదిగా నియమించుట దైవికమని భావింపవలెను (నిర్గ $2^{5-9}$). యోవాషు దాది అతఁడు చంపఁబడకుండ అతనిని రక్షించెను (II రాజు $11^{2}$). రాజులు ఇశ్రాయేలునకు దాదులగుదురని ప్రవక్త వారికి కలుగఁబోవు మహిమాస్థితిని వర్ణించెను (యెష $49^{23}$). తన సభికులకును తనకునుగల సంబంధము దాది తాను పాలిచ్చు బిడ్డలయందు కనఁబఱచు ప్రేమ వంటిదని దృష్టాంతపఱచెను (I థెస్స $2^{7}$). ఈ వాక్యమందున్న స్తన్యమునిచ్చుతల్లి దాది యని తెలిసికొనవలెను.

**దానము** ఈవి చూ॥

**దానాయాను** (Danjaan). యోవాబును అతని ఉద్యోగస్థులును ప్రజలను లెక్కించుచున్నప్పుడు వెళ్లివచ్చిన యొక సరిహద్దు పట్టణము (II సమూ $24^{6}$). దీని సరియైన యునికి తెలియదుగాని కొందఱిది దాను అనుకొందురు (దాను చూ॥). కొందఱీ పదమును దానాయాను అని చదువుట యుక్తమందురు. అట్లయినయెడల దీనికి దాను అరణ్యమని శబ్దార్థమగును.

**దానిమ్మచెట్టు, పండు** (Pomegranate). ఆదినుండి ఈ చెట్టు పలెస్తీను నందున్నట్లు బైబిలులో ననేక సూచనలు గలవు (సంఖ్యా $13^{23}$ $20^{5}$ ద్వితీ $8^{8}$ I సమూ $14^{2}$ యోవే $1^{12}$ హగ్గ $2^{19}$). ఈ చెట్టును సౌందర్యమునకు దృష్టాంతముగా వాడిరి (పర $4^{3}$ $6^{13}$). దానిమ్మపండు విత్తనములచే నిండియున్నను అది బహు రుచిగలది చల్లదనము కలిగించును. ఈ పండ్లలోనుండి పర్బతు చేతురు ($8^{2}$). ఈ పండ్లు చక్కనివిగాన వీటిరూపమును దేవాలయమునందు చెక్కిరి. సొలొమోను కట్టించిన దేవాలయము ముందర నున్న రెండు స్తంభములమీఁద రెండు వరుసలు

నూరేసి దానిమ్మపండ్లు త్రేలాడుచుండునట్లు కట్టిరి (I రాజు 7[20] II రాజు 25[17] II దిన 3[16]). ప్రధాన యాజకుడు ధరించు ఏఫోదు అను అంగీకికూడా అలంకారార్థమై వీటిని తగిలించిరి (నిర్గ 28[33]) గాని, ఇవి పండ్లరూపమునఁ గాక పుష్పముల వలెనే చేసిరని కొందరి యభిప్రాయము.

**దానియేలు** (Daniel - దేవుఁడే న్యాయాధిపతి).

1. దావీదు అబీగయీలులవలన హెబ్రోనులో జన్మించిన కుమారుఁడు (I దిన 3[1]). II సమూ 3[3] నందితనికి కిలాబు అను పేరు కలదు.

2. నెహెమ్యా కాలమున నిబంధనను ముద్రించిన యొక యాజకకుటుంబపు పెద్ద (ఎజ్రా 8[2] నెహె 10[6]).

3. బబులోను రాజ్య సభ్యులలో నొకఁడై మిగుల ప్రసిద్ధికెక్కిన ప్రవక్త. యూదా గోత్రమునందలి యొక కులీన వంశస్థుఁడు (దాని 1[3-7]). క్రీ॥ పూ॥ 605 సం॥న యెహోయాకీము రాజుగా నుండునప్పుడు నెబుకద్నెజరు ఇతనిని ఇంకను సేకులను మొదటిసారి చెఱఁగొని పోయెను (దాని 1[1] యిర్మీ 25[1]). రాజవంశస్థులును సురూపులును విద్యాజ్ఞానాదులచే విలసిల్లెడి బాలురఁ గొందఱిని రాజ్యపు మేలునిమిత్తమై సిద్ధపఱచ రాజు ఆజ్ఞనొసంగుటచే దానియేలును అట్టి బాలురతో సమకూర్చఁబడెను. రాజు నియమ ప్రకారము ధర్మశాస్త్ర నిషిద్ధములైన వాటిని విగ్రహార్పితములగు వాటిని తిననొల్లక దానియేలును అతని స్నేహితులగు ముగ్గురు యూదబాలురును సాధారణ భోజనమునే తినునట్లు నపుంసకుల యధిపతి సెలవునొందిరి (దాని 1[8]). బబులోను జ్ఞానమునందారితేరినవారైన ఈ నలుగురు బాలురు మృత్యువు పాలఁబడనున్నను నియమభంగులు గాకుండునంతగా దేవుని కృపావరబలము నొందినవారైరి. మూఁడు వత్సరముల వఱకు వారిట్లు విద్యఁగఱచిన పిదప (1[5]) బాబెలు సంస్థానమున నిలిచిరి. దానియేలు క్రమక్రమేణ వృద్ధిలోనికి వచ్చుచు క్రీ॥ పూ॥ 538 అనఁగా కోరెషు ఏలుబడిలో మొదటి సం॥ వఱకు జీవించెను (1[21]). క్రీ॥ పూ॥ 603 సం॥ అనఁగా నెబుకద్నెజరు ఏలుబడిలో రెండవ సంవత్సరాంతమున గొప్ప విగ్రహమునుగూర్చి అతఁడు కనిన కలను దెలిపి దాని యర్థమును దానియేలు వివరించెను (2[1-46]). అందువలన అతఁడు బాబెలు సంస్థానమంతటికి యధిపతిగాను బాబెలు జ్ఞానులందఱిలో ప్రధానుఁడుగాను నియమింపఁబడెను (2[48]). తరువాత అతఁడు నెబుకద్నెజరునకు పట్టనైయున్న పిచ్చినిగూర్చిన కలభావమును తెలియఁజేసెను (4). దానియేలు నీతి విషయములలోను, జ్ఞానిమాదిరిగా నుండుటకును గనంత ప్రసిద్ధి నొందినట్లు యెహెజ్కేలు వ్రాసెను (యెహె 14[14] 28[3]). బెల్షస్సరు యేలుబడి మొదటి సంవత్సరమునందు నిత్యమునుండఁబోవు ఆత్మీయ రాజ్యమును స్థాపించెడి సింహాసనాసీనుఁడగు మహా వృద్ధుఁడును ఆకాశ మేఘారూఢుఁడగు మనుష్యకుమారుఁడును వచ్చువఱకు లోకమును ఏలెడి నాలుగు రాజ్యములను సూచించునట్టి మృగములనుగూర్చిన దర్శనము దానియేలుకు కలిగెను (దాని 7). బెల్షస్సరు యేలుబడి మూఁడవ సం॥న కలిగిన దర్శనము (8[2]) ఏలాము దేశముయొక్క ముఖ్యపట్టణమును, అప్పటికే సుప్రసిద్ధుఁడైన పారసీక రాజగు కోరెషు కాపుర స్థానమగు షూషనునుగూర్చినదై యుండెను. ఆ దర్శన కాలమునందతఁడు బహుశః బబులోనులో నుండవచ్చును (యెహె 8[1-3] సరిపోల్చుము). ఈ దర్శనమందతఁడు మేఁకపోతుచే అణఁగఁ ద్రొక్కఁబడిన పొట్టేలును చూచెను. మేఁకపోతు శక్తిహీనమైన పిదప దానికి నాలుగు కొమ్ములు లేచుటయు ఆ కొమ్ములలోనే నొకదానికి మఱియొక చిన్నకొమ్ము పుట్టి మహోగ్రమై ఆనంద దేశమునకును దానిలోని పుణ్యక్షేత్రమునకును విరోధముగా ప్రవర్తించుటను చూచెను. ఈ దర్శనమందతఁడు చూచినవి మాదయిపారసీక రాజ్యమును, మాసిదోనియ రాజ్యమును, మాసిదోనియ రాజ్య విభాగమును, ఆ భాగములలో నేలెడి యొక క్రూరుఁడగు రాజును, అతఁడు పరిశుద్ధపట్టణమును అపవిత్రపఱచుటను సూచించెను (దాని 8). బాబెలు రాజ్యము క్షీణింపఁగనే రాజప్రతినిధియగు దర్యావేషు ఈ నూతన రాజ్యమును 120 సంస్థానములుగ భావించి వాటిపై అధిపతులను, వారిపైన ముగ్గురు ప్రధానులను నియ

మించెను. ఈ ముగ్గురియందు దానియేలు ఒకఁడై యుండెను. (దాని 6[1,2] కోరెషు చూ॥). దానియేలు శక్తిసామర్థ్యములు జ్ఞానవివేచనలు అతని నింకను వృద్ధిలోకిఁ దెచ్చినందున (6[3]) అసూయావేశపరులై అతని నాశము చేయవలెనని విరోధులు కుట్రజేసి సింహముల బోనులో వేయించిరి (6[4-23] I మక్క 2[60]). దర్యావేషు ఏలుబడి మొదటి సంవత్సరమున ప్రవక్తయగు యిర్మీయా చెప్పినట్లు (యిర్మీ 25[11,12] 29[10]) యూదులచెఱ అంతమగుచున్నదని దానియేలు తెలిసికొనెను (దాని 9[1,2]). అతఁడు తన్ను తాను తగ్గించుకొని తన జనాంగపు పాపముల నొప్పుకొని ప్రార్థించెను. దీనికి ఫలితముగా డెబ్బదివారములనుగూర్చిన ప్రవచన మతనికి బయలుపఱచఁబడెను (9[24]). కోరెషు ఏలుబడి మూఁడవ సంవత్సరమున లోకరాజ్యములకు దేవుని రాజ్యముతో కలుగనైయున్న చివరిపోరాటమును గూర్చిన దర్శనము కలిగెను (10-12). దానియేలు నెబుకద్నెజరు వంశపు యేలుబడి ఆరంభమునుండి చివరివఱకును మాదీయుఁడగు దర్యావేషు, పారసీకుఁడగు కోరెషు పరిపాలనవఱకు జీవించినందున చాలకాలము బ్రతికియుండవలెను (6[28]). అతఁడు చనిపోయిన కాలముగాని రీతిగాని తెలియదు. దానియేలునుగూర్చి యెహె 14[14] 28[3] II ఎస్డ్రా 12[11] I మక్క 2[60] మ 24[15] మా 13[14] హెబ్రీ 11[33] లందు ప్రశంసింపఁబడియున్నది.

**దానియేలు గ్రంథము** (Daniel, Book of). పాత నిబంధన గ్రంథసముదాయములలో నొకటి. LXX నందును, ఇంగ్లీషు తెలుగు మొదలగు తర్జుమాలలో యెహెజ్కేలు గ్రంథమునకుఁ దరువాత వచ్చినను హెబ్రీ బైబిలు నందు మూఁడవ భాగమందలి గ్రంథమై యున్నది. దీని గ్రంథకర్త ప్రవక్తయని పిలువఁబడినను (మ 24[15] పురా 10. 15. 4, 6) గొప్పవారని పన్నెఁగాంచిన వారిలో నొకఁడైనను (పురా 10. 11. 7), ప్రవచించు ఆత్మవరము విశేషముగ కలిగియున్నను, అతఁడు ఉద్యోగరీత్యా ప్రవక్తయై యుండ లేదుగావున హెబ్రీ బైబిలునందీ గ్రంథమును ప్రవచన గ్రంథములతోఁ జేర్చ లేదు. అతనికి ప్రవచింపఁగల వరమున్నను, ప్రవక్తపని లేకుండెను. రాజసభలో నుండు మంత్రులలో నొక ముఖ్యుఁడై రాజకీయ విషయములలో శ్రద్ధవహించినవాఁడు. యెహోవా ఇట్లు సెలవిచ్చుచున్నాఁడని సాధారణముగా ప్రవక్తలు తమ ప్రవచనములను చెప్పినట్లుగాని, వారివలె తన సమకాలీకులకు తగిన హెచ్చరికెలు జేసినట్లుగాని కనఁబడదు. ఈ గ్రంథమునందు దక్కువ భాగము హెబ్రీ భాషలో వ్రాయఁబడెనుగాని విదేశమందున్న యూదుల జీవితపు విషయములును విదేశపు సామ్రాజ్యములను గూర్చిన ప్రవచనములును (2[4]-7[28]) అప్పటికాలమున దేశమునందు వాడుకగా నుండిన భాషయగు అరమేయిక్ భాషతో వ్రాయఁబడెను (ఎజ్రా గ్రంథముతో సరిపోల్చుము).

ఈ గ్రంథము నీ దిగువరీతిగా భాగింపవచ్చును. I. పీఠిక. దానియేలును అతనిని ముగ్గురు స్నేహితులును తమ పనికై సిద్ధపడుట (అధ్యా 1). II. దేవుఁడు లోకరాజ్యముల అభివృద్ధివిషయములోను వాటికి తన రాజ్యముతోఁగల సంబంధవిషయములోను తన సర్వశక్తి సర్వజ్ఞత్వములను విదేశ సంస్థానమునందున్న ఈ నలుగురిద్వారా కనఁబఱచుట (2-7). ఈ భాగము అరమేయిక్ భాషతో వ్రాయఁబడెను. ఇందు నాలుగు లోహములతోఁజేసిన విగ్రహమునుగూర్చియు దాని నాశమునుగూర్చి నెబుకద్నెజరునకు కలిగిన కల. (2) దానియేలు ముగ్గురు సహవాసులకు కలిగిన శోధన, వారు అగ్ని గుండమునుండి తప్పించఁబడుట. (3) నఱుకఁబడిన వృక్షమునుగూర్చిన స్వప్నము. (4) బెల్షస్సరు చేసిన విందు సమయమున కనఁబడిన గోడ మీఁది వ్రాఁత. (5) దానియేలుపై చేయఁబడిన కుట్ర, అతఁడు సింహములనోటఁ బడకుండ రక్షింపఁబడుట. (6) నాలుగు మృగములు మనుష్య కుమారునివంటి వానిగూర్చిన దర్శనము. (7) మూఁడవ భాగమునకు సంబంధముగా నుండునట్టి దర్శనము కాలక్రమము ననుసరింపకున్నను ఇక్కడుంచఁబడెను. III. ముఖ్యముగా దేవుని ప్రజలకు కలుగఁబోవు మంచివాటిని గూర్చిన మతికొన్ని దర్శనములు (8-12). వీటిని మూఁడుగా భాగింపవచ్చును. 1. బల్యర్పణ నివారణ, పరి

శుద్ధ స్థలము నపవిత్రపఱచుట, రాజాధిరాజుతో యుద్ధములను గుఱించి (8, $8^{13}$ ను $8^{15}$ తో సరి పోల్చుము). 2. డెబ్బదియేండ్ల చెఱకాలము ముగియవచ్చినందున దానియేలు తన జనాంగపు పాపముల నతివినయుఁడై యొప్పుకొని క్షమాపణ నడుగుట. ఇదివఱకుఁ జెప్పఁబడిన ప్రవచనములను బట్టి మెస్సీయ రాజ్యము చెఱముగించిన వెంటనే స్థాపింపఁబడునని యెంచుచున్నందున యెరూషలేము తిరిగి కట్టవలెనను హుకుముజారియైనపిదప పాపనివారణయై నీతి స్థాపింపఁబడుటకు ముందు 70 వారములు గడువవలెనని దానియేలుకు దర్శనమందు తెలుపఁబడుట (9). 3. పారసీకరాజ్య స్థాపనకర్తయగు కోరెషు పరిపాలనలో మూఁడవయేట ఆ రాజ్య వినాశమునుగూర్చియు దేవుని ప్రజలకుకలుగు హింసలను గూర్చియు కుదురుబాటునుగూర్చిన వర్ణనములు (10,12).

క్రొత్త నిబంధనలో నున్న సూచనలనుబట్టి దానియేలు గ్రంథప్రాముఖ్యత తెలియుచున్నది. (1) క్రీస్తు తన కారోపించుకొనిన మనుష్యకుమారుఁడను బిరుదు నీ గ్రంథమునుండి తీసికొన్నట్లుగా నున్నది ($7^{13,14}$ యేసుక్రీస్తు IV 3 (1) (*d*) చూ॥). (2) ఆయన యెరూషలేము నాశనమునుగూర్చి ప్రసంగించినప్పుడీ గ్రంథమందలి వాక్యము నెత్తిచూపెను (మ $24^{15}$ = మా $13^{14}$ దాని $11^{31}$ $12^{11}$, నాశము కలుగఁజేయు హేయమైనది చూ॥). (3) దాని $7^{3-7}$ లో ఆయా రాజ్యములను సూచించిన మృగరూపములను ప్రక $13^{1}$ నం దుదాహరించిన ఒక మృగమునందిమిడియుండి దేవుని రాజ్యమును విరోధించు ఈ లోకరాజ్య సముదాయమును సూచించును. (4) దానియేలు అంత్యకాలమును గూర్చియు దేవుని రాజ్యమును విరోధించు సాతాను మూర్తినిగూర్చియు న్యాయతీర్పును గూర్చియు తెలిపిన రీతిగా (దాని $8^{19}$ $11^{36}$-$12^{4}$) అపొస్తలులు వ్రాసిరి (II థెస్స $2^{3-4}$ II తిమో $3^{1}$ I యోహా $2^{18}$ యూదా 18).

దానియేలు గ్రంథము ఒకనిచేతనే వ్రాయఁబడెనని సాధారణముగా నంగీకరింతురు. అది వ్రాయఁబడిన చెఱయందుగాక మక్కబీయుల కాలములో క్రీ॥ ము॥ దాదాపు 167 సం॥ వ్రాయఁబడెనని యభిప్రాయపడు కొందఱు గలరు. అంతియోకు ఎపిఫనీసు అనువాఁడు యూదుల మతమును మార్చుటకు వారి నెక్కువగా హింసించిన కాలముగాన ఆ కాలమందున్న యూదులను ధైర్యపఱచి స్థిరపఱచుటకు దీనిని వ్రాసెనని అట్టి వారి తలంపు. క్రీ॥ ము॥ దాదాపు 200 సం॥న వ్రాయఁబడిన సైరాక్సు అను అప్రమాణిక గ్రంథమునం దుదాహరించిన భక్తులపేరులలో (49 అధ్యా) దానియేలు పేరు లేకపోవుటవలనను, దానియేలు గ్రంథమునందు గ్రీకు పదములుండుటవలనను, అంతియోకు ఎపిఫనీసు హింసలనుగూర్చి సూచించుటచేతను, చెఱకాలపు సంగతులను దోషరహితముగా వ్రాయకపోవుటవలనను అట్లు తలంచవలసినదని వారి వాదము.

సైరాక్సు తన గ్రంథమునందు ఎజ్రా గిద్యోను మొదలగు భక్తుల పేరులనుకూడ ఉదాహరింపలేదు కావున దానియేలు పేరు అతఁ డుదాహరింపనంతమాత్రమున దానియేలు అంతకు మునుపు ప్రవచింపలేదనుట అంత సయుక్తికము కాదు. దానియేలు గ్రంథమునవచ్చు గ్రీకు పదములనుగూర్చి యొక్కమాట. అట్టి పదములన్నియు సంగీత వాయిద్యములకు సంబంధించినవై యున్నవి. సంగీతమునకు సంబంధించిన అన్యభాషాపదములు వాడుకలో నుండుటయు, కొంతకాలమున కవి గ్రంథస్థమగుటయు సాధారణ విషయమేగాని దీనిగూర్చి విస్తరించి చర్చించుట అనవసరము. దానియేలు అంతియోకు ఎపిఫనీసు కాలమున జరిగిన వాటినిగుఱించి మాత్రమేగాక దాని తరువాత వచ్చిన రోమను సామ్రాజ్యమునుగూర్చియు ప్రవచించెను. అతఁడీసంగతులను జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనినవాఁడై వ్రాయఁగా అట్లు కాదనుట న్యాయముగా కనుపించదు. చెఱకాలమునందలి బాబెలు చరిత్రనుగూర్చి మనకు తెలిసిన సంగతులు బహు కొద్ది. ఆ చరిత్రయంతయుఁ దెలిసినప్పుడు మాత్రమే దానియందు తప్పులున్నవనుటకు వీలున్నది కాని పూర్తిగాఁ దెలియనప్పుడట్లు చెప్పుట సరికాదని పూర్వపక్షము చేయువారు వాదింతురు.

**దానీయుల వందు** మహానెదాను చూ॥

**దాను** (Dan = న్యాయాధిపతి).

1. యాకోబు భార్యయగు రాహేలు దాసి యైన బిల్హాకు, యాకోబువలన కలిగిన కుమారులలో మొదటివాఁడు ($30^{6}$). రాహేలునకు చాల కాలమువరకు బిడ్డలులేనందున ఆమె తన దాసిని యాకోబునకు ఉపపత్నిగా నిచ్చి ఆమెకు పుట్టిన కుమారుని తాను పెంచుకొనెను. హుషీము అనువాఁడితని కుమారుఁడు (ఆది $46^{23}$). దాను ఇశ్రాయేలీయుల గోత్రములలో నొక దానికి మూలపురుషుఁడాయెను. ఇతనిగూర్చి ఇంకేమియు తెలియదు.

2. దాను సంతానపువారి పేరు. ఈ గోత్రికులు ఆరంభమున ఎఫ్రాయిము యూదా బెన్యామీను గోత్రములకు మధ్య నివసించిరి (పటము IX). గాని తరువాత వారికిది యిఱుకుగా నుండినందున మఱియొక ప్రాంతమును చూచుకొనవలసి వచ్చెను (న్యాయా 18). సీనాయి పర్వతము యొద్ద వేసిన మొదటి సంఖ్యయందు 62,700 మంది యుండిరి (సంఖ్యా $1^{39}$). రెండవసారి అరణ్యమందు వేసిన జనసంఖ్యయందు 1700 యెక్కువ యున్నట్లు తెలియుచున్నది ($26^{43}$). ఈ గోత్రికులు ప్రయాణకాలమందు ఆషేరు నఫ్తాలీ గోత్రికులతో సాఁగ ఉత్తరముగా దండు దిగిరి ($2^{25}$). బైబిలునందు శరీరబలమునకు ప్రసిద్ధికెక్కిన సమ్సోను ఈ గోత్రికుఁడే (న్యాయా $13^{2,24}$). త్రోవలో సర్పముగాను దారిలో కట్లపాముగా నుండునని యాకోబును (ఆది $49^{17}$). దాను సింహపుపిల్లయని మోషేయును (ద్వితీ $33^{22}$) చెప్పిన సంగతులనుబట్టి ఈ గోత్రికులు తరువాత యెట్టివారయిరో తెలియుచున్నది. ఇశ్రాయేలీయులలో ఒక విగ్రహమును నిలువబెట్టుటలో వీరే మొదటి వారయినందున (న్యాయా $18^{30,31}$), దాను గోత్రములలో నుండి క్రీస్తు విరోధి వచ్చునని యూదాల పారంపర్యములలో చెప్పఁబడియున్నది. అందువలననే కాఁబోలు ప్రక $7^{5-12}$ లో ముద్రింపఁబడిన భక్తుల సమూహములో దాను గోత్రము పేరు కనఁబడదు.

W.

3. ఉత్తర పలెస్తీనులో నుండు ఒక పట్టణము. దాని మొదటి పేరు లయిషు (న్యాయా $18^{29}$) లేక లెషెము (యెహో $19^{47}$). మిగుల పురాతన మగుచరిత్రలోను దాని పేరు దాను అని కనఁబడును (ఆది $14^{14}$). ఆ పట్టణము ఒంటరిగా నుండుటచే తమ గోత్రమునకు కెక్కువ స్థలము కావలెనని కోరిన దానీయుల కది సులభముగా లభించెను (న్యాయా 18). ఇచ్చటనే దాను గోత్రికులు లోకవిగ్రహమును నిలిపిరి ($18^{27}$). అందుచేతనే మొదటి యరొబాము అను ఇశ్రాయేలు వారి రాజు ఇక్కడ ఒక బంగారు దూడను నిలిపెను (I రాజు $12^{29}$ II రాజు $10^{29}$ ఆమో $8^{14}$). దావీదు కాలములో యోవాబు ప్రజలను లెక్కించినప్పుడు, తాను లెక్కించిన దేశమునకు సరిహద్దుగా నియమించిన **దానాయాను** ఈ దాను పట్టణము కావచ్చును (II సమూ $24^{6}$ దానాయాను చూ॥). సిరియా రాజగు బెన్హదదు దాని పట్టుకొనెను (I రాజు $15^{20}$ II దిన $16^{4}$). గాని యెహె $27^{19}$ లో నున్న మాటలనుబట్టి అది మరల కట్టఁబడెనని తెలియుచున్నది. ప్రస్తుతము ఆ ప్రాంతములందున్న టెల్-ఎల్-కాది (*Tell-el-Kadi*) దాని యునికి కావచ్చును. దానికి న్యాయాధిపతి దిబ్బయని అర్థము. అది యొర్దానునదికి ఉత్పత్తిగా నుండు వాగులలో నొకదాని తీరమునందుండి పలెస్తీను ఉత్తరపు హద్దుగా నుండుటవలన దాను మొదలు బెయేర్షెబ వఱకు అను మాటలు ఆ దేశమంతటిని సూచించును. (పటము IV, E 4).

**దాబెరతు** (Daberath = మేత బీడు). జెబూలూనీయుల యొల్లలో నొకటి (యెహో $19^{12}$). అయినను ఇశ్శాఖారు గోత్రమునకు చెందిన లేవీయుల పట్టణములలో నొకటిగా ఎంచఁబడెను ($21^{28}$ I దిన $6^{72}$). అందువలన నిది ఆ రెండు గోత్రములకు సరిహద్దు స్థానములో నున్నట్లూహింపవచ్చును. ప్రస్తుతమున తాబోరుకొండ దిగువనున్న దాబూరియె (*Daburiah*) దాని యునికియై యుండవచ్చును (పటము IV, D 7).

**దార** దర్ది చూ॥

**దారి** మార్గము చూ॥

**దాలెత్** (Daleth) = ד అను అక్షరము). హెబ్రీ యక్షరములలో నాల్గవది. అక్షరమాలికగా వ్రాయఁబడిన 119 కీర్తనలోని నాల్గవ భాగమందలి ప్రతి పంక్తియు నీ యక్షరముతో నారంభమగుటచే దానికి దాలెత్ అను పేరు పెట్టిరి.

**దాల్చిని చెక్క** గంధవర్గము I 4,5 చూ॥

**దావీదు** (David = ప్రియుఁడు). యెష్షయి కుమారుఁడు. ఇశ్రాయేలీయుల రెండవ రాజు. ఇతని జీవితము నీ దిగువ రీతిగ విభజింపవచ్చును.

1. యూదా బేత్లెహేమునందలి బాల్యకాలము. దావీదు యెష్షయి ఎనిమిదిమంది కుమారులలో కనిష్ఠుఁడు (I సమూ 16[10,11] 17[12-14]) యూదాగోత్ర కుటుంబ జాబితాయందు వీరిలో ఏడుగురు పేరులు మాత్రమే కనఁబడును (I దిన 2[13-15]). బహుశః ఒకఁడు సంతానము లేకనే మృతినొందియుండెను. దావీదు తల్లి భయభక్తులు గలదని యూహింపవచ్చును (కీర్త 86[16] 116[16]). అతని పూర్వికుల చరిత్ర దోషసహితమైనను మనోహరమును ఉత్సాహపూరితమును గలదైయున్నది. (ఆది 37[26,27] 38[13-29] 43[8,9] 44[18-34] సంఖ్యా 1[7] యెహో 2[1-21] రూతు 4[17-22]). అతఁడెఱ్ఱనివాఁడును చూడ చక్కని సుందరుఁడునై యుండెను (I సమూ 16[12]). కనిష్ఠుఁడైనందున తండ్రియొక్క గొఱ్ఱెలఁగాయు పని యతని పాలిటఁబడెను (16[11]). తన మందమీఁదబడిన సింహమును ఎలుఁగుబంటిని పట్టి చంపుటవలన నితని ధైర్యస్థైర్యములును దేవుని యందలి నమ్మకమును చిఱుత వయస్సునందే వెల్లడియయ్యెను (17[34-36]). సంగీతమునందు మిగుల నిపుణుఁడును వాయిద్యమునందు కడునేర్పరియునై యుండెను. రసవంతములగు కవనములు చెప్పుటలో కీర్తివంతుఁడయ్యెను. దేవుఁడు సౌలును విసర్జించినపిమ్మట, ఇతనిని సౌలు తరువాతి రాజుగా నభిషేకింపనై దేవునాజ్ఞనుబొంది సమూయేలు బేత్లెహేమునకు వచ్చెను. సౌలున కిది తెలియునేమోయను భయమున ఈ కర్మ బహిరంగముగ జరుగలేదు. పట్టణపు పెద్దలుమాత్రము హాజరైరి. అభిషేక కారణమైనను దెలుపఁబడినట్లు కానము (16[4,5,13]). బహుశః యెష్షయికిని దావీదునకు మాత్రము దెలిసియుండవచ్చును. ఇది దావీదు జీవితములో మొదటిమెట్టు. యెహోవాయాత్మ అతనిమీఁదికి బలముగా వచ్చెను. అయినను అతఁడు తన వృత్తిని తృణీకరించినవాఁడు కాదు.

2. సౌలునొద్ద కొలువుకాలము. దేవునిచే విసర్జింపఁబడి, దురాత్మపీడితుఁడై మనోనెమ్మదిలేక వెఱ్ఱియెత్తినట్లున్న సౌలున కుపశాంతి కలిగించనై వీణెవాయిద్యకు నొకని అతనిచెంత నుంచుట యుక్తమని సౌలుసేవకులలోఁ గొందఱు సలహా నియ్యఁగా, చమత్కారముగా వీణెవాయింపఁ గలవాఁడును, శూరుఁడును యుద్ధశాలియు మాట నేర్పరియు, రూపసియునగు దావీదు దీనికి తగినవాఁడని వారిలో నొకఁడు తెలిపెను (16[14-18]). సౌలతనిని పిలిపించి, అతని సంగీత నైపుణ్యము వలన తనకుఁ గొంచెముపశాంతి కలిగినందుల కెంతయు సంతసించి వాని సద్గుణముల కలరి, తనను కనిపెట్టుకొని యుండునట్లతని తండ్రిని యొప్పించి, తన ఆయుధములు మోయువారిలో నొకనిగా దావీదును నియమించెను (16[19-23]). ఈ కొలువు దావీదు భవిష్యత్తునకు కావలసిన తగు అనుభవము నతనికి కలిగించెను. రణరంగమునందును పరిపాలనా తంత్రమునందు నతఁడు ప్రవీణుఁడయ్యెను. అచ్చటనుండఁగా ధీమంతులగువారి సహవాసభాగ్యము లభించెను. రాజు సభాస్థానమునగల మేలుకీళ్ల నెఱుంగఁగలిగెను. దావీదు సౌలు సమక్షమునందే చిరకాలముండలేదు. రాజుగారి స్థితిగతులు కుదుటఁబడిన పిమ్మట తన తండ్రిగారి మందలెట్లున్నవో చూచివచ్చుటకై తఱుచుగా వెళ్లుచుండెడివాఁడు (17[15]). ఇట్లతఁడొకపనిమీఁద తండ్రియింటికి వెళ్లిన యొక తరుణమున ఫిలిష్తీయులు దండెత్తివచ్చి బేత్లెహేమునకు పడమరగా 15 మైళ్ల దూరమున దండువిడిసిరి. సౌలు ఇశ్రాయేలీయుల సైన్యమును సమకూర్చుకొని వెళ్లి వారి నడ్డగించెను. దావీదు సహోదరులలో పెద్దవారైన ముగ్గురు సౌలుసేనలో నుండిరి. ఆరువారములైనపిదప వారి కబురు కనుగొనిరమ్మని యెష్షయి దావీదు నంపెను. అక్కడకుఁబోయి గొల్యాతు ఇశ్రాయేలీయులపై వేసిన సవాలు వినఁగా దావీదు ఆత్మ చెలరేగెను. తన ప్రజలకు కలిగిన యీ యవమానము దేవుఁడు తనద్వారా తొలఁగించునని నమ్మెనుగాన జీవముగల దేవుని

సైన్యములను తిరస్కరించుటకు వీఁడెంతటివాఁడని దావీదు చెప్పసాగెను. ఈ వార్త సౌలు చెవి కెక్కుట కెంతోసేపు పట్టలేదు. అతఁడు దావీదును బిలిచి అతని యావేశము దైవాత్మచేఁ గలిగెనని తెలిసికొని గొల్యాతుతోఁ బోరాడుటకుఁ బంపెను. సౌలు తనకిచ్చిన ఆయుధములు అలవాటు లేనందున వాటిని తీసివేసి తనకు మిగుల అనుకూలముగా నుండురీతిని రణరంగమునఁ బ్రవేశించెను. కవచధారియు సకలాయుధ సమేతుఁడగు గొల్యాతు మిగుల భారమును మోయవలసినందున త్వరత్వరగ నడుచుటకు వీలులేకుండెను. అతని ఆయుధములన్నియు సమీపమునుండి పోరాడుటకు మాత్రముఁ దగియుండెను. దెబ్బఁ గొట్టుటకు తగినచోటు అతని ముఖమునందు మాత్రమే కనఁబడుచుండెను. అదియు సాధారణమైనవాని యందుబాటులో లేదు. తనకు మిగుల పరిచయమైన వడిశెలతోను, ఐదు నున్నటి రాళ్లతోను దావీదు బహు సులభముగా వానిని సమీపించి, దేవుని పక్షముగాఁ దానుఁ బోరాడుచున్నానను దృఢనమ్మకము గలవాఁడై గొల్యాతు నెదుర్కొనెను. వారిద్దరికి మధ్యనడచిన దూషణ పలుకులును, బెదరింపు మాటలును ఆ కాలమున సర్వసాధారణమైనవే. దావీదు విసరిన ఒక్క వడిశెలదెబ్బతో గొల్యాతు నేలకొరిగెను ($17^{17-53}$). పోరాటమైన పిదప బెన్యామీనులోని గిబాయొద్ద దిగియున్న సౌలునొద్దకుఁ బోవునప్పుడో లేక ప్రత్యక్షపు గుడారమున్న నోబుకు వెళ్లునప్పుడో మార్గమున తటస్థించిన యెరూషలేమునం దింకను లొంగకున్న యెబూసీయుల కతియు నిట్లనే యగునని బెదురుపెట్టుటకు దావీదు గొల్యాతు శిరస్సును పట్టణమున కెదురుగా నిలిపెను. గొల్యాతు ఆయుధములను ప్రస్తుతము తానున్న డేరాలో నుంచుకొని ($17^{54}$) అతని కత్తిని నోబులోని గుడారమునందుంచెను ($21^{9}$). గొల్యాతుతోఁ బోరాడనై వెళ్లునప్పుడు అబ్నేరును, పోరాటమునుండి తిరిగివచ్చినప్పుడు దావీదును అతని తండ్రి యింటినిగూర్చి సౌలడిగెను ($17^{55}$-$18^{1}$). అంతకుమునుపు దావీదు పితామహులలో నెవరును మహా శూరకృత్యములనుజేసి ప్రసిద్ధికెక్కియుండలేదని దావీదిచ్చిన జవాబువలనఁ దెలియుచున్నది. గొల్యాతును జంపిన వానికి తన కూతురునిచ్చి వాని తండ్రియింటివారిని ఇశ్రాయేలీయులలో స్వతంత్రులనుగాఁ జేతునని యుండెను గాన ఇఁకముందుకు తన కల్లుఁడు కాఁబోవునట్టివాని యంతస్థును దెలిసికొనుటకు ఇట్లు సౌలడిగెనని తోఁచుచున్నది ($17^{25}$ $18^{18}$). దావీదు కుటుంబమును గూర్చిన సంగతులను పరిష్కారముగాఁ దెలిసికొనినపిదప సౌలు అతని పుట్టుపూర్వోత్తరములను గూర్చి శంకింప నవసరములేకపోయెను. గొల్యాతును జయించుట దావీదు జీవితములో రెండవ మెట్టు.

దావీదుయొక్క శౌర్య పరాక్రమములను, వినయభయభక్తులను జూచి ముచ్చటపడి యువరాజగు యోనాతాను అతనికి ప్రాణస్నేహితుఁడయ్యెను ($18^{1}$). దావీ దిఁకను ఇదివఱకువలె మాటిమాటికి తండ్రియింటికి వెళ్లివచ్చుటకు వీలుగాక నిరంతరము రాజు సన్ముఖమునందే యుండవలసివచ్చెను ($18^{2}$). ప్రజలు దావీదును ఘనపఱచి తనకన్న నెక్కువగా అభిమానించుటను సౌలు కనుగొని అసూయపిశాచా పూరితుఁడయ్యెను ($18^{6-9}$). అతనికన్న ఉత్తముఁడగు వానికి రాజ్యమియ్యఁబడునని సమూయేలు కొన్నియేండ్లక్రిందట పల్కిన ప్రవచనము ($15^{17-29}$) దావీదువలన నెఱవేఱనై యున్నదని యతనికి బాగుగాఁ దెలిసిపోయెనుగాన నెట్లయినను దాని రద్దుజేయుటకు శక్తి వంచనలేక యత్నించ సమకట్టెను. ఈఁటెను విసరి దావీదును పొడిచి చంపుటకు యత్నించెను ($18^{10,11}$) గాని భగ్నమనోరథుఁడై దావీదును సైన్యపదవినుండి తగ్గించెను ($18^{13}$). అతని కిచ్చెదనన్న తన కుమార్తెను మఱియొకనికిచ్చి వివాహము చేసెను ($18^{17-19}$). దావీదు తన రెండవ కూతురగు మీకాలును మిగులఁ బ్రేమించుచున్నాఁడని తెలిసికొని, అతఁడు ఫిలిష్తీయులచేతఁ బడునట్లుపాయములను బన్నెను ($18^{20-27}$). తన ప్రయత్నములన్నియు నిష్ఫలములగుటయు తన కోరికకు భిన్నముగా మీకాలు తన భర్తను ప్రేమించుటయు కనుగొని మిగుల భయాక్రాంతుఁడై అతని చంపయత్నించుటయం దిఁక నెంతమాత్రము రహస్యముగ నుండలేకపోయెను ($19^{1}$). ఇట్టి ప్రయత్నములను చేయుటలో అతని సేవకులలోఁ గొందఱు మిగుల శ్రద్ధవహించిరి ($24^{9}$ కీర్త 7

పైవ్రాత). యోనాతాను ప్రయత్నముల వలన కొంతకాలముదనుక అతని క్రోధము కొంత తగ్గినను (I సమూ $19^{2-7}$), దావీదుకు తదనంతరము కలిగిన జయములచే అది మఱల తల యెత్తెను. దావీదును చంపుటకు మఱియొకసారి యీటె విసరెను ($19^{8-10}$). అతనిని పట్టుకొన వలెనని యత్నించెనుగాని మీకాలు చేసిన పన్నుగడవలన దావీదు తప్పించుకొని పారిపోయెను ($19^{11-17}$). ఈ సమయమునందే దావీదు 59 కీర్తనను వ్రాసినట్లు దాని పైవ్రాతవలనఁ దెలియుచున్నది. తరువాత అతఁడు రామాలోని సమూయేలునొద్దకు పారిపోయెను గాని సౌలు అతని పట్టుకొనుటకు భటులనంపెను ($19^{18-24}$). తరువాత అతఁడు రహస్యముగావచ్చి యోనాతానును దర్శింపఁగా, అతఁడు తన తండ్రి భావమును కనుగొని, ఇఁకమీఁదట దావీదు రాజసభకు వచ్చిన యెడల అతని ప్రాణము దక్కదని తెలియఁ జేసెను (20).

3. పారిపోయి దాగిన కాలము. దేవుని యందు తనకున్న నమ్మకము తప్పినవాఁడై నిరాశా కూపమునఁబడి దావీదు పారిపోయెను. నోబుకు వచ్చి, విశ్వాస మిసుమంతయులేక అబద్ధమాడి ($21^{1-9}$) గాతుకు వెళ్లి సౌలుశత్రువగు ఆకీషు నాశ్రయించ యత్నించెను. తమ్ము నదివఱకు పరాభవించినవాని కాశ్రయమిచ్చుటకు ఫిలిష్తీయ నాయకులు సమ్మతించక అతని పట్టుకొనినందున ($21^{10-14}$ కీర్త 56 పైవ్రాత) అతఁడు వెఱ్ఱివాని వలె నటించి, వారియెదుట అసహ్యునిగాఁ గనుపఱచుకొనినందున ఆకీషతనిని వెళ్లఁగొట్టించెను (కీర్త 34 పైవ్రాత). ఇప్పటి కతనికి దేవుని యందు గురి మఱల కుదిరెను (కీర్త 34). యూదా దేశమునకు మఱలవచ్చి అదుల్లాము గుహలో నివసించెను (I సమూ $22^{1}$) గాని తన నాశ్రయించి వచ్చిన వృద్ధులగు తల్లిదండ్రులను మోయాబు రాజు సంరక్షణ కప్పగించెను ($22^{3,4}$). అప్పుల పాలై దివాలా యెత్తినవారును, ఇబ్బందులలో చిక్కి మనోనెమ్మది లేకుండినవారును దాదాపు 400 మంది సాహసికులతని చేరుకొనిరి. నోబులో జరిగిన హత్యనుండి తప్పించుకొని ఏఫోదును తెచ్చిన అబ్యాతారను యాజకుఁడును, రామానుండివచ్చిన గాదు ప్రవక్తయు నుండిరి ($22^{5,20}$ $23^{6}$). ఇట్లు దావీదునకు భక్తిపరుల సహాయ సహవాసములు లభించెను. అదుల్లామునుండి అతఁడు కెయిలా సంరక్షణార్థమై వెళ్లి దానిని ఫిలిష్తీయుల బారినుండి రక్షించెను ($23^{1-5}$). సౌలతని నక్కడనే ముట్టడించి పట్టుకొన యత్నించుచుండఁగా కనుగొని యూదా అరణ్యమునకు పారిపోయెను ($23^{14}$ కీర్త 63). జీఫీయులచే పురికొల్పఁబడినవాఁడై సౌలచ్చటికివచ్చి అతని పట్టుకొనవలెనని యుండఁగా తన దేశముపై ఫిలిష్తీయులు పడిరని విని తిరిగి వెళ్లిపోయెను ($23^{14-29}$). ఆ తొందర యణగిన పిమ్మట అతఁడు మఱల దావీదుకొఱకు ఏన్గెదీ అరణ్యప్రాంతములలో వెదకుచు దావీదు చేతిలోఁబడి, అతఁడు తన విషయము చూపిన దయవలన మనస్సు కరిగి కొంత కాలమువఱకు అతని వెదకుట మానెను ($24^{1-22}$ కీర్త 57, 142). దావీదును అతని యనుచరులును ఇశ్రాయేలీయుల ఆస్తిని దొంగ తోఁడుబోతులనుండి కాపాడుచు సహాయముచేయుచు (I సమూ $23^{1}$ $25^{16,21}$ $27^{8}$) తమ భోజనమునకు వారేమయిన చేతురని నిరీక్షించిరి. అతఁడు వారిపై నెట్టి పన్నులను విధించి గాని, ప్రతివారు క్రమముగా నింతింత చెల్లించవలెననిగాని అడవిదొరలవలె నియమింపఁగలిగియున్నను అట్లు చేయలేదు. వారిలో నాబాలను వాఁడు దావీదు మనవిని తృణీకరించుటయే గాక, అతని తూలనాడినందున, దావీదు భగ్గునమండిపడి అతనిని సంహరింప సమకట్టియు, నాబాలు భార్యయగు తెలివితేటలుగల అబీగయీలుచే నట్టి ఘోర యత్నమునుండి మఱలింపఁబడెను (25). నాబాలు మరణాంతమున దావీదామెను వివాహమాడి మంచి యాస్తిగలవాఁడయ్యెను. అతఁడు మఱల జీఫుప్రాంతములకు రాఁగా సౌలాసంగతి నెఱిఁగి అతని పట్టుకొన సైన్యసమేతుఁడై వచ్చెను. తనపై అట్లు దండెత్తివచ్చిన సౌలు శిబిరము మధ్యరాత్రిన జొచ్చి, గాఢనిద్రాపరవశులగు వారి మధ్య బొమ్మపైఁ జేయివేసికొని హాయిగ నిదురించుచున్న తన శత్రునిఁ జంపనై ఈఁటెనెత్తిన మేనల్లుఁడగు అబీషైని వారించి ఈఁటెను నీళ్లబుడ్డిని కొంచు వచ్చి, తన నిర్దోషత్వమును వెల్లడించఁగా సౌలు దావీదు దొడ్డబుద్ధిని గొనియాడి తిరిగి వెళ్లిపోయెను (26). సౌలుచేతఁబడకుండ మాటిమాటికిఁ దప్పించుకొనుట దుష్కరమని భావించి దావీదు దక్షిణమున

నున్న సరిహద్దుపట్టణమగు సిక్లగులో నుండునట్లు గాతు రాజగు ఆకీషు ననుజ్ఞనిచ్చెను. ఇచ్చట అతఁడు ఫిలిష్తీయులను దోచుకొనవచ్చిన దొంగల గుంపులను నాశనము జేయుచు, ఒక్కొక్క స్థాదు దూరమననున్న ఫిలిష్తీయుల గ్రామములను నిశ్శేషముగ పాడుజేయుచు సంవత్సరముపై నాలుగుమాసము లచ్చట నివసించెను (27). ఫిలిష్తీయులు సౌలుతో యుద్ధముజేయుటకు గిల్బోవకుఁ బోవునప్పు డితఁడు తమవెంట రాకుండునట్లు వారి సర్దారు లాటంకపెట్టిరి (28$^{1,2}$ 29). అతఁడు తిరిగివచ్చునప్పటికి సిక్లగు పాడుపడియుండుట కనఁబడెను. వెళ్లిపోవుచున్న శత్రువులవెంటఁబడి అంతటిని విడిపించుకొని వచ్చెను (30). గిల్బోవ యుద్ధఫలితమును విని, సౌలు యోనాతానుల దుర్గతికి మిగుల వగచి వారిపై నొక గీతమును రచించెను (II సమూ 1).

4. యూదావారిపై రాజుగా నుండిన కాలము. సౌలుమరణానంతరమున యూదా గోత్రికులు దావీదును తమకు రాజుగా నెన్నుకొనినందున అతఁడు వారిని హెబ్రోనులో నేల నారంభించెను (II సమూ 2$^{1-10}$). అప్పటికతనికి 30 సం॥ల ప్రాయము (5$^{4}$). ఆ కాలమున మిగుల శక్తిసామర్థ్యములుగలిగి సౌలు సైన్యాధిపతియగు అబ్నేరు నాయకత్వము క్రింద తక్కిన గోత్రములన్నియు సౌలు కుమారుఁడగు ఇష్బోషెతును మహనయీములో రాజుగా నేర్పరచుకొనిరి. తరువాతి రెండు సంవత్సరములు అంతఃకలహములతో దేశము నిండిపోయెను. అబ్నేరు ఇష్బోషెతుల సంహారముతో నీ పోరాటముల కంతము కలిగెనుగాని వారి మరణవిషయము దావీదు కేవలము నిర్దోషి (2$^{12}$-4$^{12}$). హెబ్రోనులో దావీదు 7½ సం॥ లేలెను. అప్పటికే యతనికి కొందఱు భార్యలుండిరి. వారివలన అతనికి హెబ్రోనులో అమ్నోను అబ్షాలోము అదోనియా యను పుత్రులు గల్గిరి (2$^{2}$ 3$^{1-5}$ 5$^{5}$).

5. ఇశ్రాయేలీయు లందఱిపై రాజుగా నున్నకాలము. ఇష్బోషెతు మరణమైన తరువాత అన్ని గోత్రములవారు దావీదును రాజుగా నెన్నుకొనిరి. వెంటనే అతఁడు రాజ్యమును స్థిరపఱచ నారంభించెను (5$^{1-5}$). ఇశ్రాయేలీయుల దేశమందలి యనేక పట్టణములలో ఫిలిష్తీయ సైనికులుండిరి. ఇతరములైనవి కనానీయులవశమున నుండెను. దావీదు యెబూసీయుల దుర్గమగు యెరూషలేమును ముట్టడించెను. దాని జయించుట దుర్ఘటమని దాని నివాసు లెంచియుండిరిగాని దావీదు దానిని దొమ్మిచేసి పట్టుకొనెను. దానిని తనకు ముఖ్యపట్టణముగ జేసికొని తూరుదేశపు శిల్పుల రప్పించి తన కొఱకొక నగరును కట్టించుకొనెను. ఈ నూతన రాజధాని యూదాకును ఇతర గోత్రములకును మధ్యగా నుండెను. ఉత్తర దక్షిణ ప్రాంతములందుండువారి ద్వేషముల నివారించుటకనుకూలమగు తావుగ నుండెను. దానిని జయించుటవలన దేశమున రాకపోకలు మిగుల సులభమై రాజ్యస్థాపనకు మంచివీలు చిక్కెను. ఫిలిష్తీయులు రెండు మారులు యెరూషలేముమీఁదకు దండెత్తివచ్చి దాని సమీపమునందే ఘోరిగా నపజయులైరి (5$^{17-25}$ I దిన 14$^{8-17}$). రెండవ యుద్ధము జరిగిన వెంటనే రాజువారి దేశముపై దండెత్తి గాతును పట్టుకొని, తరువాత చేసిన మరికొన్ని దండయాత్రలవలన (II సమూ 21$^{15-22}$) గర్వ శత్రువులగు ఫిలిష్తీయులు మఱల తలయెత్తకుండఁ జేసెను. ఇట్లు రాజ్యస్థాపన మొనరించినపిమ్మట యాతని దృష్టి మతవిషయములవంక మఱలెను. కిర్యత్యారీమునందున్న (I సమూ 7$^{1,2}$ II దిన 1$^{4}$) మందసమును బల్యర్పణములతోను సంభ్రమములతోను గొనితెచ్చి, దావీదు పురమున తెను వేయించిన గుడారమునందుంచెను (II సమూ 6$^{1-23}$ I దిన 13$^{1-14}$ 15$^{1-3}$). ఆరాధన విషయమైన గంభీరపు టేర్పాటులు చేయఁబడెను (15. 16). గొప్ప దేవాలయమును కట్టుటకైవలయు సామగ్రిని సిద్ధపఱచెను (II సమూ 7$^{1-29}$ I దిన 17$^{1-27}$ 22$^{7-10}$). దేవునిదయవలన అతఁడు మిగుల గొప్పవాఁడాయెను. తన జనాంగపు క్షేమార్థమును విగ్రహారాధకుల పొత్తు దానికి లేకుండునట్లును ఇదివఱకు దానికి కలిగిన యవమానమునకు తగిన శాస్తిజేయుటకును అతఁడు చుట్టునున్న జనాంగములతో యుద్ధముచేసి మోయాబీయులు సోబా దమస్కులయందున్న సిరియనులు అమ్మోనీయులు ఎదోమీయులు అమాలేకీయులను వారిని జయించి (II సమూ 8$^{1-18}$ 10$^{1-19}$ 12$^{26-31}$) దేవుఁ డారంభమున అబ్రాహామునకు వాగ్దానముచేసిన హద్దుల

వఱకు (ఆది 15[18]) తన రాజ్యమును వ్యాపింపఁజేసెను. అమ్మోనీయులతో యుద్ధము చేయు కాలమునందే హిత్తీయుఁడగు ఊరియా విషయమున నతఁడు మహాపాతక మొనరించినందున దేవుఁడు నాతాను ప్రవక్తద్వారా అతనిని గద్దించి, అతని యింటివారికి సదాకాలము యుద్ధము కలుగునను శిక్షను తెలియఁజేసెను (II సమూ 11[1]-12[23]). తరువాత దావీదు యథార్థముగా పశ్చాత్తాపపడెను (కీర్త 51). అతనికి కలిగిన శిక్ష అతని కార్యములకు తగిన ఫలితముగా కలిగినట్లు చూడవచ్చును. అతని బిడ్డ చనిపోయెను (II సమూ 12[19]). అతని కుటుంబికులు కామతప్తులును పగ తీర్చుకొను వారునైరి (13). అతనికుమారులు విధ్యుక్త ధర్మములను బోనాడి, పితృభక్తిలేనివారై, రాజ్యము నపహరింప యత్నించి దేశమునంతః కలహములతో క్షోభింపఁజేసిరి (14-19). ఆయా గోత్రికులకందు పరస్పరవైషమ్యములును, అసూయయు, అతృప్తియు, అబ్షాలోము తిరుగుబాటు నణచివేసిన కొన్నినాళ్లకే షెబాయనువానిచే మఱల చేయఁబడెను (20). గిబోనీయులతో ఇశ్రాయేలీయులు జేసికొనిన సంధిని (యెహో 9) సౌలు మీఱినందున దేశమునకు విపత్తు కలిగినదని ఆ కాలమున తలంచినవారి యుద్దేశముల ప్రకారము దావీదు సౌలు కుటుంబికుల నురితీయించి న్యాయమును జరిగించెను (21[1-14]). ప్రజలను లెక్కించి అతిశయించినందున శిక్షావిధికి లోనయి దేశముమీఁదికి తెగులు తెచ్చుకొనెను (24; I దిన 21). రాజ్యసంబంధమగు సంగతులను చూచుకొనుటలోను, దేవాలయమును కట్టుటకు కావలసిన సామగ్రి సంపాదించుటలోను దావీదు తన యేలుబడి కాలమును ముఖ్యముగా గడిపెను. తనకు పిమ్మట సొలొమోను రాజ్యమునకు వచ్చునట్లు ఏర్పాటుజేసెను (I రాజు 1). తన కాలమున శిక్షనొందక తప్పించుకొన్నవారిని నిర్దోషులనుగా విడువరాదని కఠినమగు ఆజ్ఞనిచ్చెను (2[1-11]). 40½ సం॥లు రాజ్యమేలి తన డెబ్బదియొకటవ సంవత్సరమున యెరూషలేమందు మరణము నొందెను (II సమూ 2[11] 5[4,5] I దిన 29[27]).

మధురగానముచేసిన నాయకుఁడు అను బిరుదును దావీదు చిఱుత ప్రాయమునందే పొందెను (II సమూ 23[1]). కీర్తనల గ్రంథము యొక్క కర్త యితఁడేనని హెబ్రీ పారంపర్యము వలనఁ దెలియుచున్నది. సంగీతమం దతనికిఁగల ప్రతినిగూర్చి చరిత్ర గ్రంథములలోఁ జూడవచ్చును. వీణెను చమత్కారముగా మీటెడివాఁడు (I సమూ 10[18-23] II సమూ 6[5]). యెహోవా మందిరమందు సంగీత సేవకొఱకు అతఁడు మంచి యేర్పాటులఁజేసెను (I దిన 6[31] 16[7,41,42] 25[1]). సౌలు యోనాతానులు (II సమూ 1[17-27]), అబ్నేరు (3[33,34]) లమీఁద అతఁడు శోక గీతములను రచించెను. విమోచన గీతమును (22[1-51]), చివరి దేవోక్తులను (23[1-7]) కూడ రచించెను. సంగీతవిషయమై అతఁడు పుచ్చుకొనిన శ్రద్ధనుగూర్చి ఆమోసు (6[5]), ఎజ్రా (3[10]) నెహెమ్యా (12[24,36,45,46]), సైరాక్సు (జ్ఞాన గ్రంథము 47[8,9]) అనువారు ఎత్తి లిఖిరి. కార్యములను సంగీతమును అభివృద్ధిలోఁకి దెచ్చుట హెబ్రీయులకేగాక ఐగుప్తీయులకును బాబెలువారికిని అలవాటయియుండెను (సంఖ్యా 21[14] న్యాయా 5). కీర్తనల గ్రంథమందు మొత్తము మీఁద 73 కీర్తనలు దావీదుపేరట నున్నవి. వాటిలో ననేకములు అతఁడు రచించినట్లున్నది (కీర్త 3, 7, 34, 51 మొ॥). 7, 59 అతఁడు సౌలు సభయందుండఁగా రచించియుండును. 34, 52, 54, 56, 57, 63, 142 అతఁడు పారిపోయి దాగుకొనుచుండిన శ్రమకాలమునకు సంబంధించినవి. 3, 18, 30, 51, 60 అతఁడు రాజైన పిమ్మట కలిగిన ఆయా అనుభవములను గురించినవై యున్నవి.

దావీదుచేసిన భయంకరమైన పాపములను గుఱించి తలంచినప్పుడు అతఁడు ఎట్లు దేవుని హృదయానుసారమైన మనుష్యుఁడాయెనా యను సంశయము మనస్సున కప్పుడప్పుడు తట్టుచుండును. అంధకారబంధురమైన ఆ కాలమున జరిగిన సంగతులను జ్ఞానదీప్తిగల మన కాలపు తెలివితేటలతో విచారించి తీర్పుచేయుట న్యాయము కాదు. అతఁడెంతగా చెడిపోయినను పశ్చాత్తప్తుఁడై దేవుని దృష్టికి యోగ్యమైన కార్యములను చేయుటకు ప్రయత్నించినందున అతఁడు "హిత్తీయుఁడైన ఊరియా సంగతియందుతప్ప తన జీవితదినములన్నియు యెహోవా దృష్టికి యథార్థముగా నడుచుకొనుచు యెహోవా అతని కిచ్చిన

యాజ్ఞలలో దేనివిషయమందును తప్పిపోకుండెను" అను మెప్పునకు పాత్రుఁడయ్యెను (I రాజు $15^{4}$). అతఁడు దేవుని సంకల్పము చొప్పున తన తరము వారికి సేవఁజేసి నిద్రించెను (కార్య $13^{36}$). హెబ్రీయుల రాజతీకమును స్థాపించినది నిజమున కితఁడనియే చెప్పవలెను. అతని కీర్తనలు ఎడతెగక క్రైస్తవ సంఘములలో చదువఁబడుచు మిగుల ప్రయోజనకరముగ నున్నవి. దావీదు కుమారుఁడనఁబడి అతనికి ప్రభువైనవాని వంశకర్తలలో దావీదు ఒక ముఖ్యుఁడు (మ $22^{41-45}$).

**దావీదు కట్టించిన గోపురము** యెరూషలేము B II 2 చూ॥

**దావీదు నగరము** యెరూషలేము B II 3 చూ॥

**దావీదు పట్టణమునుండి క్రిందకుపోవు మెట్లు** యెరూషలేము B V 2 (12) చూ॥

**దావీదు పురము** యెరూషలేము B I IV చూ॥

**దావీదు సమాధి** యెరూషలేము B II 5 చూ॥

దాసి ఉపపత్ని చూ.

**దాసుడు, దాసత్వము; బానిస, బానిసత్వము; సేవకుడు, సేవ** (Servant, Slave, Slavery). దాసుఁడను పదముచే తెనిఁగించిన మూలభాషా పదములు వేర్వేరు పదములై యున్నవి. యౌవనుఁడని యర్థమిచ్చు ఒక పదము దాసుఁడని తెనిఁగించినను (I రాజు $18^{43}$ $19^{3}$ మొ॥), I సమూ $2^{13,15}$ లో **పనివాడని** తర్జుమా చేసిరి. మరియొక పదమును **పరిచారకుడని** తెనిఁగించిరి (నిర్గ $33^{11}$ సంఖ్యా $11^{28}$ మా $9^{35}$ మొ॥). ఈ పదములు బానిసలను సూచింపవు గాని దాసులను పదముచే తెనిఁగింపఁబడిన హెబ్రీ పదములుగాని గ్రీకు పదములుగాని సాధారణముగా బానిసలను బానిసత్వమును సూచించును.

బానిసత్వము బైబిలుకాలమునందు సర్వసాధారణమైనది. యుద్ధమునందు పట్టుపడిగాని (సంఖ్యా $31^{9}$ II రాజు $5^{2}$), కొనుటవలనఁగాని (ఆది $17^{27}$ $37^{28,36}$ యెహె $27^{13}$ యోవే $3^{6,8}$), బానిసలకు పుట్టుటవలనఁగాని (ఆది $17^{12}$), చేసిన ఋణమును తీర్పఁజాలనందువలనఁగాని (II రాజు $4^{1}$ నెహె $5^{5,8}$ మ $18^{25}$), దొంగ తాను దొంగిలినది చెల్లింపలేకపోయినందునఁగాని (నిర్గ $22^{3}$), కడు బీదలై తమ్మును తామమ్ముకొనుటవలనఁగాని ($21^{2,7}$ లేవీ $25^{39,45}$) బానిసలగుచుండిరి.

బానిసలనందఱిని ఒక్కటే ధరకు కొనలేదు. న్యాయవిచారణయందు బానిసగా శిక్షనొందిన వాఁడు 30 తులముల వెండికమ్మఁబడవలెనను నియమ మొకటి యుండెను (నిర్గ $21^{32}$). యోసేపు తన సహోదరులచే 20 తులముల వెండి కమ్మఁబడెను (ఆది $37^{28}$).

యూదులగు బానిసలకును అన్యులగు బానిసలకును తారతమ్యము చూపినట్లు ధర్మశాస్త్రము నందు కనఁబడుచున్నది. యూదా బానిసలకు విశ్రాంతి సంవత్సరమున విడుదల నియ్యవలెనను ఏర్పాటుండెను గాన వారు ఆరు సం॥ల కన్న నెక్కుడు కాలము బానిసలుగా నుండలేదు గాని ఒకఁడు తన యిష్టపూర్వకముగా నిత్యము బానిసగా నుండఁ గోరుకొన్నయెడల అతనినట్లు జేసికొనుటకు వీలుండెను (నిర్గ $21^{2-6}$ లేవీ $25^{43,47-55}$ యిర్మీ $34^{8-16}$). బానిసలు స్త్రీలైనయెడల అట్టివారి కాపుదల నిమిత్తము విశేషములగు ఏర్పాటులుండెను (నిర్గ $21^{7-11}$). తమ బానిస స్థితిని వదల్చుకొన నేరనివారు సహా జూబిలీయనఁబడిన సునాద సంవత్సరమున ఎటులనైనను విడిపింపఁబడవలెనను నియమముండెను (లేవీ $25^{40}$). అప్పుల వలన దాసులైనవారు తాముగాని తమ బంధువులుగాని తమ యప్పులను తీర్చినయెడల నెప్పుడైనను విడుదల నొందవచ్చును ($25^{48}$). ఇశ్రాయేలీయులు భ్రష్టులగుచుండిన కాలములో దయాసహితమగు నీ యేర్పాటులను నిర్లక్ష్యపెట్టిరి (యిర్మీ $34^{8-22}$ నెహె $5^{1-18}$).

అన్యులగు బానిసల విషయమై యింత మంచి యేర్పాటులు లేకున్నను వారును దయకు పాత్రులనియు వారిని కఠినముగాఁ జూడరాదనియు బోధించిరి. అన్యులు తమ బానిసలను తమ యిష్టము వచ్చినయెడల వారి కండ్ల నూడఁబెఱికి, వారి నంగహీనులుగాఁజేసి వారిని చంపినను చంప వచ్చునను ఏర్పాటులుండెను గాని ఆదినుండి

బైబిలు అట్టి క్రూరమగు వాడుకలను కఠినముగా నిషేధించెను (నిర్గ $21^{26,27}$ లేవీ $24^{17-22}$). అన్యులగు బానిసవాండ్రను అవమానపఱచకుండునట్లు విశేషనియమము లేర్పఱచిరి (ద్వితీ $21^{10-14}$). దైవనియమితములగు ఆచారము లనుష్ఠించుటకు అట్టి బానిసలకును హక్కులుండెను (నిర్గ $12^{44}$ లేవీ $22^{11}$ ద్వితీ $12^{12,18}$ $16^{11,14}$). విశ్రాంతి దినమున వారును విశ్రమింపవలసియుండిరి (నిర్గ $20^{10}$ $23^{12}$). విడుదలనుకోరి తప్పించుకొని పారిపోయివచ్చిన విదేశపు బానిసలను వారి యజమానులకు తిరిగి యప్పగించెడి వాడుక అన్ని దేశములలో సాధారణమైనదైనను అట్టివారిని మఱల అప్పగింపరాదను దయగల నియమము బైబిలునందుండెను (ద్వితీ $23^{15,16}$). బానిసలనుగాఁ జేయనై నరులను దొంగిలించుట మరణకరమగు శిక్షను విధింపవలసినంత గొప్ప నేరముగా నెంచిరి (నిర్గ $21^{16}$ ద్వితీ $24^{7}$). ఆయా దేశములలో బానిసల వర్తకముకొఱకై ఏర్పాటుచేయఁబడు దొడ్లనుగూర్చిగాని సంతలనుగూర్చిగాని బైబిలునందట్టి ప్రశంసయైనను గానరాదు. బానిసలకును యజమానులకును గల స్నేహసంబంధములను గూర్చిన సూచనలున్నవి (ఆది 24 రూతు $2^{4}$). వారొకానొకప్పుడు తమ యజమానునికి వారసులైరి (ఆది $15^{2,3}$). బానిస యొకఁడు తన యజమానునికి అల్లుఁడైన సూచన యొకటి కలదు (I దిన $2^{34,35}$). బానిసలకు సహా న్యాయము జరిగించుటకు బాధ్యులై యుండిరి (యోబు $31^{13-18}$). పాతనిబంధన కాలమునందు బానిసత్వముండినను దాని వలన కలుగు కష్టనష్టబాధల నివారణార్థమైన నియమము లనేకములుండినటుల పైవాక్యముల వలన స్పష్టమగుచున్నది.

క్రొత్త నిబంధన కాలమున ఇశ్రాయేలీయులు రోమీయులకు లోఁబడియుండిరి గాన దేశసంబంధమగు నేర్పాటుల విషయమై అన్యదేశములతో కొద్ది గొప్ప సంబంధము గలిగియుండిరని చెప్పవలసియున్నది. ఆ కారణమున నీ సందర్భముగా వారి యేర్పాటులతోపాటు రోమీయుల యేర్పాటులను గూర్చియు తెలిసికొనవలసి వచ్చును. రోమీయులలో స్వతంత్రులకన్న బానిస లెక్కువమంది యుండిరి. రోమీయులు కఠినులగువారని చెప్పవలెను. బానిసలకుమాత్రమే గాక స్వంత కుమారులకు సహా మరణశిక్ష విధించుటకు కుటుంబమునకు పెద్దయైనవాని కధికారముండెను. అట్టి స్థితిగతులున్న కాలమునందు దాసులని స్వతంత్రులని భేదములేని రాజ్యమును స్థాపింపనై యేసుక్రీస్తు అవతరించెను (గల $3^{28}$). ఇట్టి రాజ్యమును స్థాపింప వచ్చినవారు తమ యుద్దేశమును రెండు విధములుగా నెఱవేర్చుకొనవచ్చును. అట్టివారు బానిసత్వమును బొత్తుగా నిషేధించి దానిని తీసివేయుటకు బలాత్కారము నుపయోగింపవచ్చును. అట్టి ప్రయత్నములవలన తిరుగుబాటులు కలిగి దేశమెల్ల అల్లకల్లోలమై ప్రజలయందు సంక్షోభము కలుగును. లేదా, బానిసలు గలిగిన యజమానులు బుద్ధిపూర్వకముగా బానిసత్వమును నిషేధించి, సర్వసమత్వము దేశమంతట నలుముకొనునట్లు వారి బుద్ధిని మళ్లించుటకైన యేర్పాటులను జేయవచ్చును. ఇది చాల మంచి యేర్పాటని ఒప్పుకొనక తప్పదుగాని దాని నిట్లు సాధింపనెంచినవారు చిరకాలము బహు ఓపికతో పనిచేయవలసి యున్నది. క్రీస్తు రీతిగాఁజేయ సమకట్టినందుననే తానీ లోకమున సశరీరుఁడుగా నున్న కాలములో బానిసత్వమును కొట్టివేయుటకట్టి యత్నమును పూనక ప్రేమయను సాధనమునుగూర్చి మాత్రము బోధింప పూనుకొనెను. అట్టి ప్రేమను స్నేహమును చూపుటకు తానే మాదిరియై తన శిష్యులను దాసులని యనక వారిని తన స్నేహితులని పిలిచెను (యోహా $15^{15}$). అపొస్తలులు పలెస్తీనలోను మాత్రమే గాక రోమను సామ్రాజ్యమందంతటను క్రీస్తు రాజ్యసువార్తను బోధింపఁగా, బానిసలు ప్రస్తుతము తామున్న స్థితిలోనే యుండి, ప్రేమతోఁ గూడిన నమ్మకమును తమ యజమానులకు కనఁబఱచవలెనని బోధించుచు వచ్చిరి (I కొరి $7^{21,22}$ I తిమో $6^{1}$ తీతు $2^{9}$ I పేతు $2^{18}$) గాని దానితోకూడ యజమానులు తమ బానిసలను దయతో చూడవలెనని బోధించిరి (ఎఫె $6^{5-9}$ కొలొ $3^{22}$-$4^{1}$). ఫిలేమోనుకు పౌలు వ్రాసిన పత్రిక దీనిని మఱింత స్పష్టపఱచును. ఫిలేమోను దాసుఁడగు ఒనేసిమనువాఁడు ఏదోయొక తప్పుజేసి పాఱిపోయి, రోమాయందు ఖైదీయైయుండిన పౌలు బోధ విని క్రైస్తవుఁడు కాఁగా పౌలతనిని మఱల ఫిలేమోనునొద్దకుఁ బంపుచు, అతనిని తనవలె స్వంత సహో

దరునిగా భావించి చేర్చుకొనుమని వ్రాసెను (ఫిలే 1-25). ఆ యుత్తరమందలి సంగతులవలన క్రమక్రమముగా క్రైస్తవదేశము లన్నిటిలో బానిసత్వము మాపుమాపబడెను.

బానిసల కుపయోగింపబడిన పదముసే అలం కారరీతిగా బైబిలునందలి భక్తులు దేవుని విషయ ములో తమను పెట్టుకొనిరి. అబ్రాహాము ఇస్సాకు యాకోబులు (ఆది 19[2,19] ద్వితీ 9[27]), మోషే (నిర్గ 4[10] సంఖ్యా 12[7]), యెహోషువ (న్యాయా 2[8]), సమూయేలు (I సమూ 3[9]), దావీదు (కీర్త 18 పై వ్రాత), సొలొమోను (I రాజు 3[7]) మొదలగువారికి బిరుదుగలదు. ఇశ్రాయేలీయు లందఱి విషయములో మొత్తము మీఁద ఈ పదముపయోగింపఁబడెను (యెష 43[10] 44[1] మొ). ప్రవక్తలకు నీ బిరుదుగలదు (యిర్మీ 7[25] 35[15] 44[4]). అట్లే క్రొత్త నిబంధనలోని యపొస్తలులును తమ్మునిట్లు పిలుచుకొని తాము క్రీస్తు దాసులమని చెప్పుకొనిరి (రోమా 1[1] యాకో 1[1] II పేతు 1[1] యూదా 1[1] ప్రక 1[1]). క్రీస్తు తమ్మును విమోచించినందున వారిష్టపూర్వక ముగా ఘనమైన ఈ సేవకు పూనుకొనిరి (II కొరి 5[14]). క్రీస్తు స్వయముగా దాసుని రూపమును ధరించుకొనినట్లు (ఫిలి 2[7]) భక్తులుకూడ ఆయన నిమిత్తము ఇతరులకు దాసులగుటకు సంతోషముగా సమ్మతింతురు (II కొరి 4[5]).

# ది

**దిక్లా** (Diklah = ఖర్జూరవృక్షము). యొక్తాను కొడుకులలో నొకఁడు (ఆది 10[27] I దిన 1[21]). ఇతఁడొక జనాంగమునకుఁ బూర్వికుఁ డగుటచే ఆ జనాంగమునకుకూడ దిక్లా యను పేరు కలిగెను.

**దిదుము** (Didymus = కవల పిల్లలలో నొకఁడు). అపొస్తలుఁడగు తోమాయొక్క మారు పేరు (తోమా చూ॥). E.

**దినప్రయాణము** మానములు కొలతలు I 2 చూ॥

**దినము** కాలమానము IV చూ॥

**దినము, యెహోవా** అంత్యదినము చూ॥

**దినవృత్తాంతముల రెండు గ్రంథములు (The Two Books of the Chronicles).** ఈ రెండు గ్రంథములను ఎజ్రా వ్రాసెనని యూదులలో నొక వాడుక గలదు. బహుశః ఈ వదంతి సరియైనది కావచ్చును. అయితే కొన్ని భాగములు అనఁగా I దిన 3[19-24] లోని కొన్ని సంతానములు అతని కాలమునకు తరువాత దీనితో చేర్చఁబడినవి అవి యూకాలపు సంగతులే యని తెలంనుచున్నారు. ఇది దాదాపు క్రీ॥ పూ॥ 450-435 లో బబులోను చెఱ ముగిసిన తరువాత వ్రాయఁబడెను.

దైవారాధనను విధులను సరిగా నెరవేర్చుటవలన కలుగు ఆశీర్వాదములను దాని నశ్రద్ధచేయుటవలన కలుగు కీడులను కనఁబఱచుట కిది వ్రాయఁబడెను. రాజుల గ్రంథమందలి సంగతులను దీనిలోని సంగతులను సరిపోల్చి చదివిన పక్షమున ఇది స్పష్టమగును.

ఈ రెండు గ్రంథములు పూర్వము ఏక గ్రంథముగనే యుండెను. అయితే వీటిలో వ్రాయఁబడిన చరిత్ర దేశచరిత్రలోని సంగతు లతో దినచర్యలు వ్రాయుటవలన ఈ పేరు కలిగెను. ఈ గ్రంథములలో మానవులు పుట్టినది మొదలుకొని బబులోను చెఱవఱకు అనఁగా 3468 సం॥ల చరిత్ర సుగుల సంక్షేపముగ వ్రాయఁబడియున్నది. ఇవి సమూయేలు రాజుల గ్రంథములలోని చరిత్రను పూర్తిచేయు గ్రంథ ములు కావున వీటిని వాటితో కలిపి చదువవలెను. ఈ గ్రంథములలోలేని యనేక సంగతులు వెనుకటి గ్రంథములలో నుండును. వాటిలో కనఁబడని అనేక ముఖ్య విషయములు దీనియం దున్నవి.

మొదటి గ్రంథము వ్రాయఁబడిన యుద్దేశము తోనే రెండవదియు వ్రాయఁబడెను. మఱియు దావీదు మహారాజు రాజరికముచేసి మరణమొంది నప్పటినుండి నెబుకద్నెజరువలన ఆ రాజ్యము జయింపఁబడువఱకునుండు చరిత్ర వ్రాయఁబడి యున్నది. ఈ గ్రంథములలోని కాలము రాజుల గ్రంథములలోని కాలముతో సంబంధము గలదై అనేక విషయములలో వాటితో సరిపడుచున్నవి. ఈ గ్రంథములయందు ఇశ్రాయేలువారి రాజుల సంగతులుగాక యూదా రాజుల సంగతులు

మాత్రమున్నను సందర్భము వచ్చినప్పుడు వారి సంగతులు నుదాహరింపఁబడెను. ఇతర గ్రంథములలో ఇశ్రాయేలు యూదా రాజులనుగూర్చి లేని అనేక సంగతులు ఈ గ్రంథములలో నున్నవి. ఇందు ముఖ్యముగ దావీదు రాజవంశమును గుఱించిన సంగతులున్నవి.

ముఖ్య సంగతులు:—

మొదటి గ్రంథము

I. వంశావళులు. సౌలు ఏలుబడి అంతము వఱకుగల చరిత్ర (1-9 అధ్యా). దీనిలో జల ప్రవాహమునకు ముందుండిన జనులు, తరువాత వచ్చిన పితరులు, రాజులు, యాజకులు మొదలగు వారి వంశావళులు, మోషే గ్రంథ పంచకము యెహోషువ, న్యాయాధిపతులు, రూతు మొదటి సమూయేలు గ్రంథములలోని చరిత్ర యంతయుఁ గలదు.

II. సౌలు మరణమునుండి దావీదు వేయించిన ప్రజాసంఖ్య వఱకుగల చరిత్ర (10-21 అధ్యా). దీనియందు సౌలు (10), దావీదు (11,12), నిబంధన పెట్టె (13-17), దావీదు జయములు (18-20), జనాభా లెక్క (21) అను గుఱించి యున్నది.

III. ఆలయమునకు సంబంధించిన సంగతులు (22-29).

దీనియందు సామగ్రిని సిద్ధపఱచుట (22), సేవ జరిగించుటకు యాజకులను ఏర్పాటుచేయుట (23-27), రాజ్యమును సొలొమోనుకు కప్పగించుట (25), దావీదు ప్రార్థన చివరిదినముల (29) గూర్చిన సంగతులున్నవి.

రెండవ గ్రంథము

I. సొలొమోను ఏలుబడి (1-9); సొలొమోను సింహాసన మెక్కుట (1), అతనికి కలిగిన దర్శనము (2), మందిరమునుకట్టి ప్రతిష్ఠించుట (3-7), అతని యైశ్వర్యము (8,9)

II. యూదా రాజుల యేలుబడి (10-36). గోత్రవిభాగము (10,11), రాజులు విగ్రహారాధనలో పడిపోయి తిరిగిలేచుటను చూడవచ్చును. ఎట్లనఁగా రెహబాము (11,12) అబీయా (13) యేలుబడులలో జనులు విగ్రహారాధికులైరి గాని ఆసా (14-16) యెహోషాపాతు (17-20) యేలుబడులలో దిద్దుబాటులు కలిగెను. తరువాత యెహోరాము (21) అహజ్యా (22), అతల్యా (22,23) కాలములో ప్రజలు మఱింత విగ్రహారాధికులైరి. యోవాషు (24) యేలుబడిలో యెహోయాదా నాయకత్వము క్రింద జనులు మంచి స్థితికి వచ్చిరి. అయినను అమజ్యా (25) ఉజ్జియా (26) యోతాము (27) ఆహాజు (28) కాలమందు జనులు మఱల తప్పుత్రోవలోఁ బడిరి గాని హిజ్కియా ఆలయమును శుద్ధచేసి (29) పస్కా నాచరించుట కేర్పాటులుచేసి (30), విగ్రహారాధన రూపుమాపి (31), సన్హెరీబును జయించుటతో (32) గొప్ప దిద్దుబాటు జరిగెను. తరువాత వచ్చిన మనష్షే ($33^{1-20}$) ఆమోను ($33^{21-25}$) దినములలో జనులు విగ్రహారాధికులైనందున యోషీయా (34,35) చేసిన గొప్ప యత్నముల వలన జనులు దేవునితట్టు తిరిగిరి. యెహోయాహాజు ($36^{1-4}$) యెహోయాకీము ($36^{5-8}$) యెహోయాకీను ($36^{9-10}$) సిద్కియా ($37^{11-23}$) దినములలో వారు చెఱకు పోవునంతఁగా చెడి పోయిరి.

H.

ఈ గ్రంథపు ముగింపు సంగతులును ($36^{22,23}$) ఎజ్రా గ్రంథపు ఆరంభమును ($1^{1-3}$) ఒకటిగా నుండుటచే ఎజ్రా గ్రంథము దీని సశేషమని కొందఱి యభిప్రాయము. ఎట్లయినను ఇది యంతయు ఒకటే చరిత్రకు సంబంధించినదై యున్నది. హెబ్రీ బైబిలును చూడఁగా ఇది పాత నిబంధనలో చివరిదైనట్లున్నది. దీనిని పూర్వ ప్రవక్తలనఁబడిన చరిత్ర గ్రంథములతో గాక పరిశుద్ధ లేఖనము (*Hagiographa*) లనఁబడిన భాగముతోఁ జేర్చిరి. యేసు వాడిన బైబిలు నందాక్రమమే యుండినట్లు మ $23^{35}$ (=లూ $11^{51}$) లోనున్న జెకర్యా చావు పాత నిబంధనయొక్క చివరయని ప్రశంసించుటవలన నూహింపవచ్చును. ఆ చరిత్ర II దిన $24^{20-22}$ లోనున్నది.

ఇది రాజుల గ్రంథమునకు సంబంధమైనదిగా నున్నను అచ్చటనున్న అంకెల ననుసరింపక కొన్ని విషయములలో వాటి నింక నెక్కువగా వేసినట్లు చూడవచ్చును. ఉదాహరణముగా II సమూ $8^4$ $10^{18}$ లో దావీదు 700 గుఱ్ఱపు రౌతులను చంపను

లను పట్టుకొనెనని యున్నది గాని I దిన $18^{4}$ $19^{18}$ లో దానిని 7000 గా నుదాహరించిరి. II సమూ $24^{34}$ నందు అతఁడు అరౌనా కళ్లమును 50 తులముల వెండికి కొనినట్లున్నది గాని I దిన $21^{25}$ నందు దానికి 600 బంగారపు తులముల నిచ్చినట్లుదాహరింపఁబడెను. I రాజు $10^{14}$ లో సొలొమోను కాలమునందు 1632 మణుగుల బంగారము మాత్రము ప్రతి యేట వచ్చుచుండెడిదని చెప్పఁబడెను గాని దావీదు జీవించియుండఁగానే అతఁడు దేవాలయము నిమిత్తము 2 లక్షల మణుగుల బంగారమును సమకూర్చి యుంచినట్లు I దిన $22^{14}$ నందు చూడవచ్చును. ఈ సంఖ్యలును ఇంక నిటువంటి సంఖ్యలును దినవృత్తాంతముల గ్రంథములలో నెక్కువగా వేసినట్లు కనఁబడుచున్నది. అంకెలు వ్రాయుటలో వ్రాఁత ప్రతులయందు తప్పులు బహు సులభముగా పడును కావున అట్టి పొరపాటులు ఈ గ్రంథములందుండుట వింత గాదు గాని వానియందుదాహరింపఁబడిన కొన్ని వందల సం॥ములకు తరువాత (కనీసము 500) ఈ గ్రంథములు వ్రాయఁబడెననియు ఈ మధ్య ఆయా మానములు కొలతలు మారుచువచ్చెను గాన ఉన్నరీతిగా నా యంకెలను వేసిన పక్షమున సంగతులంతగా బోధపడవు గాన అట్లు ఆయా కాలములకుఁ దగిన మానములతో సరిజేసి యుంచ వచ్చుననియు యెంచుట సమంజసము.

**దిన్హాబా** (Dinhaba). ఎదోమురాజైన బెల యనువాని రాజనగరు (ఆది $36^{32}$ I దిన $1^{43}$). దీని యునికినిగూర్చి రూఢిగాఁ దెలియదు గాని ప్రస్తుతమందు హెష్బోనున కీశాన్యదిక్కుగానున్న తేనీబ (*Thenib*) అనునదే దీని యునికియై యుండవచ్చును.

**దిబ్బ** కోట II 1 (2) చూ॥

**దిబ్రీ** (Dibri). దాను గోత్రికులలో దేవుని నామమును దూషించినందున చంపఁబడిన యొకని తాత. (లేవీ $24^{11}$).

**దిబ్లయీము** (Diblaim = ముద్దలజత). ప్రవక్తయగు హోషేయయొక్క మామ (హోషే. $1^{3}$, హోషేయ చూ॥).

**దిబ్లాతు** (Diblath = గుండ్రని ముద్ద). యెహె $6^{14}$ లో చెప్పబడిన యొక అరణ్యము. ఇచట దిబ్లాతు అని చదువక రిబ్లా యని చదువ వలెనని కొందఱనుకొందురు. కొన్ని పురాతనమైన ప్రతులలోకూడ రిబ్లా యను పదమును వ్రాసిరి. (రిబ్లా చూ॥).

**దిమోనా** దీబోను 2 చూ॥

**దిమ్మోను** రిమ్మోను చూ॥

**దియొత్రెఫే** (Diotrephes = దేవునిచే పోషింపఁబడినవాఁడు). III యోహా 9 నందుదాహరింపఁబడిన యొకఁడు. ఇతఁడు ఈ పత్రికను వ్రాసినవానిని దూషించుట మాత్రమే గాక, సహోదరులను ఆతిథ్యము చేయకయు, చేయ మనస్సుగలవారి నాటంకపఱచుచుండెనని తెలియుచున్నది. ఇతనిగూర్చి యింక నెక్కువ తెలియదు.

**దియొనూసియు** అరేయొపగీతుడైన దియొనూసియు చూ॥

**దిలాను** (Dilan = దోసకాయల చేను). యూదా స్వాస్థ్యములోనుండిన యొక యూరు (యెహో $15^{38}$).

**దివిటి** దీపము చూ॥

**దిషోను** (Dishon = జింక).

1. శేయీరు కొడుకులలో నొకఁడు (ఆది $36^{21}$ I దిన $1^{38}$).

2. శేయీరు మనుమలలో నొకఁడు. ఇతఁడు అనా యనువాని కుమారుఁడు (ఆది $36^{25}$ I దిన $1^{41}$). వీరు కొన్ని వంశములకు పూర్వికులైరి కావున యీ పేరులు ఆయా వారలకు మాత్రము గాక వారివలన గలిగిన వంశములకుకూడ పెట్టిరి.

## దీ

**దీజాహాబు** (Dizahab = బంగారు సమృద్ధిగా గలది). యొర్దాను నదికి తూర్పుననున్న యొక స్థలము (ద్వితీ 1). ఆది $36^{39}$ లో మేజాహాబు అను పేరు కలదు. దానికి సువర్ణజలములు అని యర్థము. ఇచటనున్న దీజాహాబునకు ప్రతిగా మేజాహాబు అని వ్రాయవలయునని కొందఱను కొందురు. ఎటులనైనను దీని సరియైన యునికి తెలియదు.

**దీనత్వము, వినయము** (**Humility**). దీనత్వము గర్వమునకును అహంకారమునకు భిన్నముగానున్నది. ఒకఁడు తన అయోగ్యతను తెలిసికొని దీనమనస్సుగలవాఁడై యుండవలెను. ఒకనికి ఇట్టి వినయము లేకుండినయెడల వాఁడు దేవుని యందు భయభక్తులుంచుట దుర్లభము. అది యుండినచో దేవునితట్టు తిరుగుట సులభము (కీర్త $51^{17}$ యెషయా $57^{15}$ సామె $22^{4}$). మనకు దీనత్వముండవలయునని క్రీస్తు బోధించెను (మ $5^{3}$ $18^{1-14}$ $23^{12}$ మా $10^{35-45}$ లూ $18^{9-14}$). ఆయన దాని బోధించుట మాత్రముగాక దానిని దృష్టాంత పఱచెను (యోహా $13^{1-6}$). క్రీస్తు చరిత్రను మాపఁగా ఆయన పొందిన ఘనతకు ముందుగా అట్టి వినయముండెనని తెలిసికొనవచ్చును (ఫిలి $2^{9-11}$). ఈ పద్ధతిని పాఁతనిబంధన జ్ఞానులు సహా గ్రహించుకొనిరి (సామె $15^{33}$ $18^{12}$). క్రీస్తు మాదిరిని చూచియుండిన యపొస్తలులు దానిని మఱీ తేటగా గ్రహించి విశదపఱచిరి (I పేతు $5^{5}$ యాకో $4^{6}$).

వినయము ఇంతటి శ్రేష్ఠమైన గుణమైయున్నది గాని ఒక విఘ్నమైన అతివినయము కూడ కలదు (కొలొ $2^{18,23}$). యోగులు అనావసరమైన కష్టములను భరించుచు తమ సౌఖ్యమును పోఁగొట్టుకొనుచు ఇట్లతి వినయులగుదురు. కాని అట్టివారు తమ పుణ్యమునుబట్టి యెన్నో విధములుగా గర్వపడుచుందురు. మనమైతే మన దేహోత్తలను హీన పఱచక ఇవి దేవుని దానములని గ్రహించి ఇతరులను సేవించుటచే మన దీనత్వమును కనఁబఱచవలెను (కార్య $20^{19}$ మా $10^{45}$).

ఇట్టి వినయము భక్తులకు ముఖ్యముగా నుండవలసిన గుణమగుటచే క్రీస్తు వారికి ఆత్మయందు దీనులైనవారను పేరుపెట్టెను (మ $5^{3}$). ఇందులో పాఁత నిబంధనయందు ముఖ్యముగా కీర్తనలు, యెషయా గ్రంథములలో భక్తులకుపెట్టిన సార్థక నామమై యున్నది (కీర్త $22^{26}$ $25^{9}$ $37^{11}$ $147^{6}$ $149^{4}$ యెష $29^{19}$ $61^{1}$ మొ॥).

**దీనా** (**Dinah** = న్యాయపు తీర్పు). యాకోబు లేయాల కుమార్తె (ఆది $30^{21}$). ఆమె షెకెము ప్రాంతమందలి కనానీయుల కుమార్తెలను జూచు నిమిత్తము తోడులేకనే బోవుచున్నప్పుడు హివ్వీయుఁడగు హమోరు కుమారుఁడైన షెకెము ఆమెను దౌర్జన్యముగ యవమానపఱచెను. అటు పిమ్మట అతఁడామెను సగౌరవముగ వివాహ మాడఁ గోరఁగా ఆమె సహోదరులు హివ్వీయులందఱు సున్నతినొందు షరతుమీఁద సమ్మతించిరి. షెకెము నివాసు లందుకిష్టపడి యట్లు చేయించుకొనిరి. యాకోబు కుమారులగు షిమ్యోను లేవి యనువారలు తమ సోదరికి కలిగిన యవమానమును భరింపఁజాలక వారు బాధపడుచుండు సమయమున పురుషులనందఱిని హమోరు షెకెము అను వారలతోపాటు చంపివేసిరి ($34^{1-29}$). యాకోబున కెఱుఁకలేకుండనే వారింతటి దారుణకార్యమొనర్చిరి. తరువాత అతఁడీ పని యుక్తముకాదని వారిని గద్దించెను ($34^{30}$). తన మరణసమయము నందును అతఁడు వారిని నిందించెను ($49^{5-7}$). అతని కుమారులొనర్చిన యీ కార్యమువలన నతఁడొక జిల్లాను జయించి దానికి హక్కుదారుఁడయ్యెను. అతఁడు దానిని షిమ్యోను లేవి యను వారలలో నెవరికి నియ్యక యోసేపున కిచ్చెను ($48^{22}$).

**దీనాయీయులు** (**Dinaites**). అష్షూరు రాజు షోమ్రోనును జయించిన తరువాత ఆ దేశములో నివసింపఁజేసిన జనాంగములలో నొకటి (ఎజ్రా $4^{9}$). వీరు మాదయి దేశములోనున్న దిన్‌షర్రు (*Din-Sharru*) నుండి వచ్చినవారై యుండవచ్చును గాని ఆర్మీనియానుండి వచ్చిన దయాని (*Da-ja-eni*) వారని మఱికొందఱి యభిప్రాయము.

**దీనులు** దీనత్వము, సాత్వికము చూ॥

**దీపము** (**Lamp**). ఈ దేశమునకు కిరోసిను నూనె రాకమునుపు ప్రమిదెలలో వత్తిబెట్టి చమురుపోసి దీపములు వెలిఁగించినట్లుగా పూర్వము పలెస్తీనుదేశములో 20 లేక 30 సం॥ల క్రిందటివఱకు ఒలీవనూనెను దీపములకు వాడుచు వచ్చిరి. ప్రస్తుతమున ఆ దేశమందుకూడ కిరోసిను నూనెను వాడుచున్నారు. గుడ్డివెలుతురు నిచ్చు దీపమయినను లేకుండ ఆ దేశస్థులు నిద్రపోరు. ప్రమిదెలను కర్ర లేక లోహపు సెమ్మెల మీఁద నుంచిరి. దీనికి సంబంధముగా క్రీస్తు దీపమును కుంచముక్రింద పెట్టక దానిని దీపస్తంభము

మీఁద పెట్టెదరని దృష్టాంతపఱచెను (మ $5^{15}$ = మా $4^{21}$ లూ $8^{16}$ $11^{33}$). ఐశ్వర్యాభివృద్ధికి చిహ్నముగా అహర్నిశలు దీపములాఱిపోక ఏకరీతిగా వెలుఁగుచుండునట్లు అనేక గృహములయందుంచుకొనిరి. నా దీపమును వెలిఁగించువాఁడవు నీవే (కీర్త $18^{28}$) యని యున్నదానికి నాకు ఆయురారోగ్యైశ్వర్యాద్యభివృద్ధిని నీవే దయచేయుచున్నావని యర్థము. భక్తిహీనుల దీపమాఱిపోవును (సామె $24^{20}$) అను మాటలకు దుర్మార్గుఁడు నశించునని యర్థము. గుడారమందును దేవాలయములో పరిశుద్ధ స్థలమందుండిన దీపస్తంభములకు ఏడు శాఖలుండెను (నిర్గ $25^{31-40}$). సొలొమోను కట్టించిన దేవాలయములో పరిశుద్ధ స్థలమునందు ఇరుప్రక్కలను ప్రక్కకైదేసి చొప్పున పది దీపస్తంభములుండెను (I రాజు $7^{49}$. గుడారము



దీపము, దీపస్తంభములు

6 (2) (*b*) చూ॥). క్రీస్తు భూలోకమందుండిన దినములలో నున్న దేవాలయమందు ఒక్క దీపస్తంభము మాత్ర ముండెను. రోమనులు యెరూషలేమును నాశనము చేసినప్పుడు వారు దానిని రోమాపురికి తీసికొనిపెళ్లిరి J. C.

**దీపవృక్షము** గుడారము 6 (2) *b*, దీప ॥ చూ॥

**దీపస్తంభము** దేవాలయము I 7 (2) (*e*) చూ॥

**దీబోను, దీమోను, దిమోనా** (Dibon, Dimon, Dimonah = క్షీణించుట).

1. మృతసముద్రమునకు తూర్పుగాను, అర్నోను నదికి ఉత్తరముగానుండు నొక పట్టణము. ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి తిరిగివచ్చి దీని స్వాధీనపరచుకొనక పూర్వమే అమోరీయుల రాజైన సీహోను మోయాబీయులనుండి దీని నపహరించెను (సంఖ్యా $21^{26,30}$). ఇశ్రాయేలీయులు దానిని అతనియొద్దనుండి లాగుకొని రూబేనీయుల కిచ్చిరి (యెహో $13^{9,17}$). అయితే సంఖ్యా $32^{3,34}$ చూడఁగా రూబేనీయులుగాక గాదీయులే దీబోనును తిరిగి కట్టినట్లున్నది. అందువలననే దానికి దీబోనుగాదు అను పేరుకలిగెను ($33^{45}$). యొర్దానుకు తూర్పుననున్న ప్రదేశములన్నిటిని ఇశ్రాయేలీయులు నిరు స్వాధీనమందుంచుకొనలేకపోయిరి. యెషయా కాలములో ఈ దీబోనును మోయాబు పట్టణములలో లెక్కించిరి (యెష $15^2$). $15^9$ లోని దీమోను అనునది దీబోనుకు నామాంతరమై యున్నది. హెబ్రీలో దీమోను అనఁగా రక్తసంబంధమని యర్థము. ఈ వాక్యములోని జలములు రక్తములాయెను అను సంబంధమునుబట్టి ప్రవక్త దానికట్లు మార్చెనని నెంచదగును. ప్రస్తుతమునన్న దీబాను (*Dhiban*) దాని యునికియై యున్నది. ఆ పట్టణపు పాడు శేషములుతప్ప ఇప్పుడచట మఱేమియు లేవు. గాని కొందఱు అచట మోయాబు రాతిశాసనములను కనుఁగొనుటచే దానికి ప్రసిద్ధికలిగెను. (రాతిశాసనములు చూ॥ పటము II, J 3).

2. నెహెమ్యా కాలములో కొందఱు యూదులు నివాసముచేసిన ఒక యూరు (నెహె $11^{25}$). యూదాదేశపు దక్షిణ హద్దులోనుండిన దిమోనా (యెహో $15^{22}$) ఇదే యూరై యుండవచ్చును.

**దీర్ఘశాంతము** (Long Suffering). త్వరగా కోపపడకపోవుటయే ఈ పదముయొక్క భావము. పాపులను వారి దోషముల నిమిత్తము శిక్షింపక వాటిని సహించుటయే గావున అది కనికరముతో కూడినదనవచ్చును. పాతనిబంధనయందలి హెబ్రీపదమునకు దీర్ఘముఖము లేక దీర్ఘకోపమని యర్థమగును (నిర్గ $34^6$ సంఖ్యా

14[18] కీర్త 86[15] యిర్మీ 15[15]). క్రొత్త నిబంధన యందలి గ్రీకుపదమును అదే యర్థమిచ్చుచు దేవుని వాత్సల్యతను దెలుపుచున్నది (రోమా 2[4] 9[22] I తిమో 1[16] I పేతు 3[19] II పేతు 3[15]). ఇతర వాక్యములలో నది మానవులు చూపునట్టియు చూపవలసినట్టియు గుణమును సూచించును (II కొరి 6[6] ఎఫె 4[2] కొలొ 1[11] 3[12] I థెస్స 5[14] II తిమో 3[10] 4[2]). ఆత్మఫలములలో నిది యొకటి (గల 5[22]). హెబ్రీ 6[12] నందు **ఓర్పు,** యాకో 5[10] లో **ఓపిక,** లూ 18[8] నందు **ఆలస్యముచేయుట** యని ఈ మూలపదమును తెనిఁగించిరి.

**దీషాను** (Dishan = ఒక తరహా జింక?). శేయీరు కొడుకులలో నొకఁడు (ఆది 36[21,28,30] దిషోను చూ).

## దు

**దుఃఖసూచక తెలియఁజేయు వాడుకలు** (Mourning Customs). తూర్పుదేశములలోని వారు కనఁబఱచు దుఃఖపు వాడుకలు ప్రస్తుత కాలమునందున్నట్లే డాంబికమైనవై యుండెను. భూషణములన్నిఁటిని దీసివేసి దేహవిషయము పట్టి జాగ్రత్తయు పుచ్చుకొనకపోవుటచేత ముఖ్యముగా తమ విచారమును వెలిబుచ్చిరి (నిర్గ 33[4] II సమూ 14[2] 19[24] మ 6[16-18]). ధరించెడి అంగి



గోనెపట్ట కట్టుకొనుట

గాని పైవస్త్రమును గాని మెడయొద్దనుండి క్రిందికి రెండుగా చించుకొనిరి (లేవీ 10[6] II సమూ 23[31] యోవే 2[13]). తల క్షౌరము చేయించుకొనిరి. గడ్డములను పెరికివేసిరి (ఎజ్రా 9[3] యిర్మీ 7[29]). గోనెపట్ట కట్టుకొని (యోవే 1[8]) బూడిదెను ధూళిని నెత్తిపైఁ జల్లుకొనిరి (II సమూ 15[32]). ఉపవాసముండి (కీర్త 35[13]) ఏడ్చి ప్రలాపించిరి (యోవే 1[8,13]). పైఁజెప్పినవాటిలోఁ గొన్నిఁటి నొక్కసారే చేసిరి (ఆది 37[34] II సమూ 3[31,32] 13[19] 15[32] ఎజ్రా 9[3,5] యోబు 1[20] యిర్మీ 41[5]). స్నేహితులాదరించు నిమిత్తము వచ్చిరి (యోబు 2[11,13] యోహా 11[19]). పిల్లనగ్రోవులు వాయించువారిని రోదనముచేయువారిని కూలికి పిలుచుకొని వారిచే రోదనము చేయించిరి (యిర్మీ 9[17,18] మ 9[23] కార్య 9[39]). సమాధిచేయునప్పుడు కూడి వచ్చినవారికి అంగలార్పు విందులుచేయుట (యిర్మీ 16[7] బారూకు 6[32]) నేటివఱకును వాడుకగా నున్నది. సమాధియైన పిమ్మట అత్యుదయము నందే స్త్రీలు ప్రార్థనలుచేసి ఏడ్చి అంగలార్చి, దుఃఖపు పాటలుపాడి రొమ్ముకొట్టుకొనుటకై సమాధియొద్దకు వచ్చుట (మా 16[1,2]) నేటిదినము నందును చూడవచ్చును. అట్లు వచ్చువారిలో నెక్కువ మంది ఆ వృత్తిచే జీవించువారై యున్నారు గాని చనిపోయినవారి బంధుస్నేహితులు దుఃఖముచే నిండినవారై ప్రేమచేతనే వత్తురు (యోహా 11[31]). ఐగుప్తు పర్షియా స్కితియా దేశములయందును ఇట్టి వాడుకల ననుసరించుట సర్వసాధారణ విషయమని గ్రీకు చరిత్రకారుఁడగు హెరోడొటసువలనఁ దెలియుచున్నది (హెరోడొటసు 2·66, 85; 4·71; 8·99; 9,24).

దుఃఖకాలము ఆయావారినిబట్టి మారెను. అహరోను మోషేల నిమిత్తము ముప్పదేసి దినములును (సంఖ్యా 20[29] ద్వితీ 34[8]), సౌలు నిమిత్తము ఏడుదినములును (I సమూ 31[13]) జనులు దుఃఖించిరి. ఐగుప్తీయులు యాకోబుకొఱకు డెబ్బది దినములును, ఆతఁడు కళ్లమునొద్ద ఇంక ఏడు దినములును దుఃఖము సలిపిరి (ఆది 50[3,10]).

**దుడ్డుకఱ్ఱ** గొఱ్ఱెలకాపరి 1, ఆయుధములు I 1 చూ॥

**దున్నుట** వ్యవసాయము 4 చూ॥

**దుప్పటి (Sheet, Mantle).** ఈ పదముచే తెనిఁగించిన హెబ్రీమాటలు కనీసము మూఁడును

గ్రీకుపద మొకటియును బైబిలునందు కనఁబడు చున్నవి.

1. ప్రవక్తయగు ఏలీయా కప్పుకొనిన దుప్పటి (I రాజు 19[13,19] II రాజు 2[8,13,14]). వెడల్పాటి చక్కని వస్త్రమని ఈ హెబ్రీపద మునకు శబ్దార్థము. అది పైన వేసికొనునట్టి వస్త్రమై యున్నది. యోనా 3[6] లో వస్త్రమని తెనిఁగించిన పదమిదే.

2. కప్పుకొనునది యని యర్థమిచ్చు మఱి యొక పదము I సమూ 15[27] లో రాజవస్త్రమును, 28[14] లో యాజకుల వస్త్రమును సూచించుచు ఆ వాక్యములలో దుప్పటి యని తెనిఁగించఁబడెను. ఎజ్రా 9[3,5] లో అదే పదమును పైదుప్పటి యని తర్జుమాచేసిరి. ఈ పదము స్థితిగలవారు ధరించెడి నిలువుటంగిని సూచించును. ఈ పదమునే కీర్త 109[29] లో నిలువుటంగీ యనియు, యోబు 1[20] లో పైవస్త్రమనియు, 2[12] లో వస్త్రమనియు తెనిఁగించిరి. భాగ్యవంతులలోని స్త్రీలును ఇట్టి వస్త్రమునే ధరించినట్లు II సమూ 13[18] వలనఁ దెలియుచున్నది గాని అచ్చట ఈ పదమును చీరలు అని తెనిఁగించిరి.

3. రూతు 3[15] లో దుప్పటి యని తెనిఁగించిన మూలపదము మఱియొకటియై యున్నది. దానినే యెష 3[22] నందు పైటలు అని సరిగా తెనిఁగించిరి.

4. క్రొత్త నిబంధనలో దుప్పటియను పదము పేతురుకు కలిగిన దర్శనమందు మాత్రమే కనఁబడును (కార్య 10[11] 11[5]). నారతో నేయఁబడిన కోకవంటి పెద్ద వస్త్రమును సూచించును.

**దుప్పి** లేడి చూ॥

**దురదగొండి** ముండ్లకంప చూ॥

**దురాశ, అపేక్ష, ఇచ్ఛ, ఆశ, భోగేచ్ఛ, మోహము (Lust).** దురాశ యను పదమును పాత నిబంధనలో ముఖ్యముగా ఇశ్రాయేలీయు లరణ్యమునందు చూపిన యవిధేయతను గూర్చి వాడిరి (సంఖ్యా 11[34] కీర్త 106[14]). మోహబుద్ధి మాత్రమేగాక రుచిగల భోజనము నపేక్షించు బుద్ధినికూడ అది సూచించెను. ఇతరుల సొమ్ములను సొత్తులనాశించు బుద్ధియు వారికి నిషిద్ధమై యుండెను. అదియు ఒకనికుండరాని దురాశయై యున్నది (నిర్గ 20[17] ద్వితీ 5[21]). క్రొత్త నిబంధనయందు దురాశ యని తెనిఁగించిన పదము సాధారణముగా ఆశ యని యర్థమగును గాని కొన్ని వాక్యములలో నది దురాశయై యున్నట్లు కనిపించుచున్నను (మ 13[17] లూ 16[21] 17[22] మొ॥), ఉండరాని యాశను సూచించును (రోమా 7[7] గల 5[24] ఎఫె 2[3] 4[22] I తిమో 6[9] II తిమో 3[6] 4[3] తీతు 2[12] 3[3] మొ॥). ఇట్టి యాశలే పాపమునకు మూలము (యాకో 1[14,15]). అవి సాతానుకు సంబంధించినవి (యోహా 8[44]). అనేక విషయములలో నవి కంటిచూపుద్వారా రేఁపబడును కావున అలంకార రీతిగా నేత్రాశ యనఁబడును (I యోహా 2[16]). అవి యీ లోకమర్యాదల ననుసరించినవగుటచే లోకపు ఆశ లనియు చెప్పఁబడును (2[17]). దురాశలని యర్థమిచ్చు మూల పదమును అపేక్షలు (మా 4[19]), ఇచ్ఛలు (II తిమో 2[22]), శరీరేచ్ఛలు (రోమా 13[14]) అని తెనిఁగించిరి. ఈ పదముకు సంబంధించిన యితర పదములు ఇట్టి యాశలనే సూచించును. లోకభోగముల నాశించుట యని యర్థమిచ్చు నొక పదమును యాకో 4[1] లో భోగేచ్ఛలనియు, 4[3] లో భోగము లనియు తెనిఁగించిరి. గల 5[24] లోని మఱియొక పదమును ఇచ్ఛలని తర్జుమా జేసిరి. ఈ పదమునే రోమా 7[5] లో పాపేచ్ఛలని తెనిఁగించి దానిని పాపముల జాబితాయందుఁ జేర్చిరి. ఇంకొక పదమును మ 5[28] లో మోహమనియు I కొరి 10[6] యాకో 4[2] లో ఆశ యనియు గల 5[17] లో అపేక్ష యనియు తెనిఁగించిరి. అది బహు తీవ్రమైన ఆశను సూచించును. I థెస్స 4[5] లోని మఱియొక పదమును కామాభిలాష యని తెనిఁగించిరి. ఇంక నెక్కువ యుద్రేకమును చూపు పదమొకటి మంటకు సంబంధించినందున దానిని రోమా 1[27] నందు కామతప్తులని భాషాంతరము చేసిరి. ఇట్లు దురాశ లెన్ని విధములుగ వివరింపఁబడినను, మోహబుద్ధి అన్నిటికన్న సాధారణమైనదియు ఏహ్యమైనదియునై యున్నట్లు కనఁబడుచున్నది.

ఆశలన్నియు దురాశలనునది బైబిలు బోధ కానేకాదు. శ్రేష్ఠమైనవాటి నాసక్తితో నపే

క్షింపవలెనను హెచ్చరికె గలదు (I కొరి $12^{31}$). దేవుఁడే అన్నిఁటికన్న పరమ మేలని యెంచి ఆయననే ముఖ్యముగా నాశింపవలెను (కీర్త $73^{25}$ $42^{1,2}$ మ $22^{37,38}$). ఆ ప్రధాన మేలు నాశింపక ఆయనకన్న తక్కువవాటి నపేక్షించుట పాపము లన్నిటికి మూలమైయున్నది (రోమా $1^{21-32}$ శరీరము చూ॥.)

**దుర్గము** కోట చూ॥

**దుర్మార్గత** దుష్టత్వము చూ॥

**దుర్మార్గుడు** బెలియాలు చూ॥

**దుర్లాభము** లోభిత్వము చూ॥

**దుష్కృత్యము** చేను 3, దుష్టత్వము, పైత్యము చూ॥.

**దుష్టత్వము, చెడుతనము, ఈర్ష్య** (Malice, Wickedness). క్రొత్త నిబంధన యందు దుష్టత్వమను పదముచే తెనిఁగించిన గ్రీకు పదములు రెండున్నవి. ఒకటి దుష్టగుణమును దుష్టత్వమును సూచించును. అది I కొరి $14^{20}$ ఎఫె $4^{31}$ కొలొ $3^{8}$ తీతు $3^{3}$ యాకో $1^{21}$ I పేతు $2^{16}$ లో నున్నది. ఈ పదమునే ఇంగ్లీషుపదమగు (*Malice*) అనుదాని ననుసరించి రోమా $1^{29}$ నందు **ఈర్ష్య** యని తెనిఁగించిరి. కొర్య $8^{22}$ లో దానినే **చెడుతనము**నియు I కొరి $5^{8}$ లో **దుర్మార్గత** యనియు తర్జుమాజేసిరి. మ $6^{34}$ లోని **కీడు** అను పదము మూలభాషయందీ మాటయే యైనను అచ్చట అది కష్టమును సూచించును.

రెండవ పదము. దుష్క్రియలను సూచించు చున్నది. దానిని రోమా $1^{29}$ I కొరి $5^{8}$ కొర్య $3^{26}$ లలో దుష్టత్వమనియు మ $22^{18}$ లూ $11^{38}$ లో **చెడుతనము**నియు మా $7^{22}$ లో **చెడుతనములు** అనియు తెనిఁగించిరి. ఎఫె $6^{12}$ లోని మూలపదమునందు ఇది దురాత్మలను పదముతో కలిపి వాడఁబడెను. అచ్చటది చెడుతనమునకు సంబంధించిన ఆత్మలని యర్థమిచ్చును.

**దుష్టుడు** సాతాను చూ॥

**దుష్టులపళ్లు విరుగగొట్టుట** రోగములు చికిత్సలు III 3 చూ॥

**దుస్తులు, బట్టలు** వస్త్రములు 5 చూ॥

## దూ

**దూడ, బంగారపు దూడ, పోత పోసిన దూడ** (Calf, Golden Calf, Molten Calf). బంగారపు దూడనుగూర్చిన చరిత్ర నిర్గ 32 లోను, ద్వితీ $9^{7-21}$ లో నున్నది. దానిగూర్చి నెహె $9^{18}$ లోను కీర్తన $106^{19,20}$ లోను కూడ సూచనలు కలవు. అహరోను చేసిన దూడ ఈ భరత ఖండమునందు కొందఱు పూజించు నందివిగ్రహమువంటి యొకవిగ్రహమని తెలిసికొనవలెను. నందియొక్క బలమునుబట్టి దానిని దేవతకు సూచనగా నెంచుకొనిరని కొందఱనుకొందురు. అయితే దాని లింగమును బట్టియు, ఆ లింగము సృష్టిని సూచించుటను బట్టియు దాని విగ్రహమును పెట్టుకొని పూజింతు రనుకొనుట మఱీ మంచిది ఏమనఁగా, హిందువులు నందిని పూజించుటకుఁగల అసలు కారణ మిదేయై యున్నట్లుగా నున్నది. దూడ యను పేరు సాధారణముగ బైబిలులో అహరోను చేసిన దూడ విగ్రహమునకు పెట్టినను దాని యసలు భాషాపదమువలన అది మంచి వయస్సులో నున్న యొక కోడెయని తెలియును. ఐగుప్తీయులు ఈ నందిని తమ దేవతలలో నొకదానికి వాహనమునుగా నెంచిరి (ఐగుప్తు 4 చూ॥). పూర్వము ఇశ్రాయేలీయులు ఈ విగ్రహమును ఐగుప్తులో చూచియుండిరిగాన అరణ్య ప్రయాణమందుండఁగా దానిని జ్ఞప్తిచేసికొని అట్టిదానిని చేయుమని కోరినందున అహరోను దానిని చేసెనని వేదశాస్త్రులనుకొనిరి. అయితే హెబ్రీవారికి సంబంధించిన జాతులవారందఱును అట్టి నందిపూజను చేసినట్లు ఈ మధ్య ఆయా దేశములలోని రాతిశాసనములను చెక్కబొమ్మలను పరీక్షించినవారు తెలిసికొనిరి కావున, ఇది ఐగుప్తీయులనందికాక, హెబ్రీయులజాతివారియొక్క సహజమతమునకు సంబంధించి యున్నదని నవీన వేదశాస్త్రులను కొందురు. అహరోను నిర్మించిన విగ్రహమంతయు బంగారము కాదుగాని, కొయ్యతో చెక్కిన విగ్రహమును బంగారు రేకుతో కప్పిరని ద్వితీ $9^{21}$ వలన తెలిసికొనవచ్చును. వారు యెహోవాకు వేఱుగా దానిని పూజించుటకు కాదుగాని యెహోవాకు పూజచేయుటకే ఈ దూడను నిర్మించుకొని యుండినట్లు రేపు యెహో

వాకు పండుగ జరుగును (నిర్గ $32^{5}$) అను చాటింపు వలనఁ దెలియును. ఈ దూడవిగ్రహమును పెట్టుకొని యెహోవాకు పూజచేయఁదలంచిరి. అది దేవునికి విరోధమైన కార్యము గనుక, వారికి గొప్ప శిక్ష కలిగెను ($32^{26-28}$). అందువలన ఇశ్రాయేలీయులు దూడపూజను చాలకాలము దాక బొత్తుగా చేయనట్లున్నది. అయితే పైనున్న దూడపూజ జరిగిన నాలుగైదు శతాబ్దములకు తరువాత మొదటి యరొబాము తన రాజ్యమునందు, దాను బేతేలు అనుచోట్ల ప్రత్యేకమైన పూజాస్థానముల నేర్పఱచినపుడు అతఁడు మఱల నిట్టి దూడలను నిలిపెను (I రాజు $12^{28-30}$). ఐగుప్తు దేశమునుండి మిమ్మును రప్పించిన దేవుఁడు ఇవే యని ($12^{29}$) యతఁడు చాటించుటను చూడఁగా ఈ విగ్రహముల మూలముగానే ప్రజలు యెహోవాకు పూజచేయవలయునని యరొబాముకూడ తలంచినట్లుగా నున్నది. దాను అను నొక స్థలములో అంతకుఁబూర్వమే విగ్రహపూజను చేసియుండిరని న్యాయా $17^{4}$ $18^{17,30,31}$ వలనఁ దెలియును గాని తరువాతి కాలమునందు పదిగోత్రములవారిలో అది సర్వసాధారణమాయెను. ఈ పూజాస్థానములలో నుండు విగ్రహములను నమ్ముకొనువారికిఁగలుగు నాశనమునుగూర్చి ఆమోసు ప్రవక్త (ఆమో $8^{14}$) ప్రవచించెను. హోషేయయు (హోషే $8^{5}$ $10^{5}$ $13^{2}$) దానిని మఱింత ఖండితముగా గద్దించుచుండెను. ఇందువలననే యరొబాము ఇశ్రాయేలు వారు పాపముచేయుటకు కారకుఁడాయెను అను బిరుదు నొందెను (I రాజు $14^{16}$ $15^{26}$ మొ॥).

**దూత, అంచెగాడు (Messenger).** వార్తలను ప్రచురించుటకై పంపఁబడువాఁడు. దూతయను పదమును దేవదూతలకును వాడిరి (దేవదూత చూ॥). వార్తావహములకై ప్రస్తుతముండు నట్టి సౌకర్యాదులు లేనికాలమున నిట్టివారుండుట మఱీ యవసరముగ నుండెను (ఆది $32^{3,6}$ సంఖ్యా $20^{14}$ $21^{21}$ మొ॥). వేగు చూచుటకును (యెహో $6^{17,25}$ $7^{22}$ మొ॥), దేశస్థులను యుద్ధమునకు కూర్చుటకును (న్యాయా $7^{24}$ $11^{12}$ మొ॥), సంగతులను కనుగొనుటకును (II రాజు $1^{2}$), సహాయముపొందుటకును ($16^{7}$), ఏదో యొకదానిని చేయుఁడని యడుగుటకును ($19^{9}$), స్నేహమును కనఁబఱచుటకును (I దిన $14^{1}$ $19^{2}$), దేశమునకు సంబంధించిన యిట్టి పనులను చేయుటకై దూతలను పంపుచుండినట్లు చూడవచ్చును.

దేవుఁడు తన సంగతులను మానవులకుఁ దెలుపుటకై పంపిన ప్రవక్తలకు అలంకారరీతిగా ఈ పేరు పెట్టఁబడెను (II దిన $36^{15,16}$). ప్రవక్తయగు హగ్గయి **యెహోవాదూత** యనఁబడెను (హగ్గ $1^{13}$). మెస్సీయా రాకడకు ముందు నట్టి దూత నొకని దేవుఁడు పంపునని మలాకీ ప్రవచించెను (మలా $3^{1}$). బాప్తిస్మమిచ్చిన యోహాను వలన నీ ప్రవచనము నెఱవేఱెను (మ $11^{10}$ మా $1^{2}$). ప్రక $2^{1,8,12,18}$ $3^{1,7,14}$ లలో ఆయా సంఘముల దూతలకు వర్తమానము పంపఁబడినట్లు చూడవచ్చును. ఇచ్చట సూచింపఁబడినవారు దేవదూతలని కొందఱి యభిప్రాయమైనను, సంఘమునకు దైవసంగతుల నుపదేశించు బోధకులు గాని రాయబారులుగాని కావచ్చునని మఱికొందఱనుకొనుచున్నారు.

ఇట్టి బోధకులకు చాటింపుచేయువారని యర్థమిచ్చు మఱియొక పేరు గలదు. రాజులిచ్చు ఆజ్ఞలను చాటించెడి వారుగాన ఈ పేరు వారికి పెట్టిరి. దాని $3^{4}$ లో ఆ దేశపదమును దూతయని తెనిఁగించినను దానికి సంబంధించిన పదమును I తిమో $2^{7}$ II తిమో $1^{11}$ లో **ప్రకటించువాఁడు** అని తెనిఁగించిరి. అధికారుల యాజ్ఞలను చాటించెడి వారి విషయమీమాటను వాడుచు వచ్చిరి (ప్రకటించుట చూ॥).

ఎస్తే $3^{13,15}$ $8^{14}$ నందు రాజువార్తలను తెలుపుటకు పంపఁబడిన గుఱ్ఱపురౌతులును **అంచెవారు** అనఁబడిరి. వారును దూతలే. ఆ మూలపదమునకు పరుగెత్తువారని యర్థము. కొన్ని వాక్యములలో ఆ పదమును **దేహసంరక్షకులని** తెనిఁగించిరి (దేహ సంరక్షకుడు చూ॥). వీరిని రాజ్ఞలను చాటించుటకు పంపినందువలన వారికీ పేరు కలిగినదని చెప్పవచ్చును.

**దూమా (Dumah = నిశ్శబ్దముగా నుండునది).**

1. ఇష్మాయేలు 12 గోత్రములలో నొకటి (ఆది 25[14] I దిన 1[30]). అతని సంతతివారి ప్రదేశము దమస్కుసు మెదీనాసు మధ్యను గల మార్గమునకు సమీపమునయుండెను. దమస్కుసు దానికెనిగల దూరముకంటె మెదీనాసు దానికెనిగల దూరము మూడవవంతులు హెచ్చుగా నున్నది. యెష 21[11] లో గూఢార్థముగ నుండు దూమా యనునది ఇదేయై యుండవచ్చును. గాని LXX నందు అచట దూమా యని వ్రాయక ఇదూమయయని వ్రాసిరి కావున ఆ దూమా ఎదోముదేశమై యుండవచ్చును.

2. యూదయ మన్య ప్రదేశములో నున్న ఒక యూరు (యెహో 15[52]). LXX లోను లాటిన్ తర్జుమాలోను దూమా యని వ్రాయక రూమా యని వ్రాసిరి కావున ఈ స్థలమును గూర్చి సందేహము కలదు. మన బైబిలులో నున్నట్లు ఇచట దూమా యని యుండవలసిన యెడల అది ప్రస్తుతము హెబ్రోనుకు అగ్నేయముగా 5 కోసులు దూరములోనున్న ఎద్-డౌమ్ (*ed-Daumeh*) యై యుండవచ్చును. (పటము II, D 3).

**దూరా** (Dura). నెబుకద్నెజరు చేయించిన బంగారు విగ్రహము నిలుపఁబడిన మైదానము (దాని 3[1]). అష్షూరు భాషలోని "దురు" అను పదమై యుండును. ఇది అష్షూరు శాసనములలో 3 సార్లు వాడఁబడెను. బాబెలుకు 6 మైళ్లు దక్షిణముగా ప్రవహించు నదికిని "దూరా" యను పేరు గలదు. ఈ మైదానపు ఉనికి ఎచ్చటనో తెలియదు.

**దూలగొండి** ముల్లు చూ॥

**దూషించుట, నిందించుట** (Evil Speaking). లేనిపోని యపనింద లొకనిమీఁద మోపి, వాని కపకీర్తి కలిగించుట ఈ మాటల భావమై యున్నది. ఇట్లు చేయుట తప్పని యెంచి దీనిని క్రమపఱచుటకు ఆరంభమునుండి తగిన కట్టుదిట్టము లేర్పరచిరి (నిర్గ 23[1] ద్వితీ 19[16-19]). అంతర్యాగ్నము స్పష్టమగునట్లు క్రీస్తు వివరించిన యాజ్ఞలలో నిదియొకటి (మ 5[22]). తామిట్టి దూషణపాలగుదురని ఆది క్రైస్తవులు ముందుగనే యెఱిఁగియుండిరి. తనను వెంబడించిన వారికట్టి నిందలు వచ్చునని క్రీస్తు తెలియఁ జేసియుండెను (5[11] = లూ 6[22]). ఆయనకును అ దూషణరాకపోలేదు (రోమా 15[3] = కీర్త 69[19]). I పేతు 4[14] నందు శిష్యులు నిందపాలగుదురను అర్థమిచ్చు మూలభాషాపదము గలదు. 2[12] 3[16] లో నున్న పదము విరోధముగా మాటలాడుట యను అర్థమిచ్చును. రోమా 14[16] I కొరి 10[30] లో దేవదూషణయని యర్థమిచ్చు మూలభాషాపదములో నీ మాటయే గలదు. వారు దూషణలకు హేతువుకలుగఁజేసి కొనకుండునట్లు జాగ్రత్త పడవలెననుసంగతి అందులో నున్నది. తీతు 2[8] లోను అదే ప్రశ్నేపఁగలదుగాని దాని యసలుమాట వేఱుపదమైన నీచమై, వాటిని ఇతరులు చెప్పుకొనుటకు మన ప్రవర్తన సందియ్య కూడదను భావమిచ్చుచున్నది (దేవదూషణ చూ॥).

## దె

**దెకపొలి** (Decapolis = పది పట్టణములు). యొర్దాను లోయ ప్రాంతమునందున్న యొక ప్రదేశము. ఎస్ద్రేలను బయలు యొర్దానులోయ లోనికిఁ జొచ్చు ప్రదేశమున నారంభమై ఆ నదికి తూర్పుగా వ్యాపించెను. దీనియందు పది గ్రీకుపురములుండుటనుబట్టి ఈ పేరు దానికి కలిగెను. గ్రీకువారీ ప్రాంతములకు మహా అలెక్సందరు కాలమున వచ్చిరి. స్కిథాపొలిస్ (*Scythopolis*) అనఁబడిన బేత్షెయోను, హిప్పస్ (*Hippos*), దమస్కు, గదారా, రఫానా (*Raphana*), కనాత (*Kanatha*), పెల్లా (*Pella*) డియను (*Dion*), గెరాసా, రబ్బాతు అమ్మోను అనఁబడు ఫిలదెల్ఫియ (*Philadelphia*) అను పది పట్టణము లా జిల్లాలో నుండెనని రోమా చరిత్రకారుఁడగు ప్లిని (*Pliny*) తెలుపుచున్నాఁడు. తరువాత మఱికొన్ని పట్టణములను వాటితోఁ జేర్చిరి. పురాతన భూగోళ శాస్త్రజ్ఞుఁడగు తొలమి (*Ptolemy*) పద్దెనిమిది పట్టణములను పేర్కొనెను. ఎడారిమీఁదుగా దమస్కు నుండి అరేబియాకుఁబోవు గొప్ప వర్తకబాటతో ఎస్ద్రేలను బయలునుండివచ్చు మూఁడు దారులు కలుపుచున్నవి. ఈ పదిపట్టణము లీ నాలుగు బాటలమీఁద నున్నవి. ఈ దేశము దెకపొలి

ప్రాంతమని ప్లిని వ్రాసెను. క్రీస్తు పరిచర్య ఆరంభమున దెకపొలి ప్రాంతములనుండి గుంపులాదిగ జనులు ఆయనయొద్దకు వచ్చిరి (మ $4^{25}$). సేన దయ్యముపట్టినవాఁడు తనకు క్రీస్తువలనఁ గలిగిన విముక్తినిగూర్చి దెకపొలియందంతటను ప్రకటించెను (మా $5^{20}$). క్రీస్తు తూరుసీదోనుల నుండి గలిలయ సముద్రమునకు వచ్చినప్పు డీ పట్టణములమీఁదుగా వచ్చెను ($7^{31}$).

**దెకెరు** (Deker). రాజైన సొలొమోను తన నిమిత్తము ఆహారమును సంగ్రహము చేయుటకు ఏర్పాటుచేసిన 12 మందిలో నొకనితండ్రి (I రాజు $4^{9}$).

**దెదాను** దదాను చూ॥

**దెబీరు** (Debir).

1. హెబ్రోను ప్రాంతములలో నున్న ఒక యూరు. దాని అసలు పేరు కిర్యత్సేపెరు (యెహో $15^{15}$ న్యాయా $1^{11}$). పూర్వమున అనాకీయులు అను రాక్షసులు అందులో నివాసము చేసిరిగాని యెహోషువ వారిని నాశనము చేసెను (యెహో $11^{21}$). యెహోషువ తానే నాశనము చేయలేదుగాని కాలేబు అల్లుఁడగు ఒత్నీయేలుచే వారిని నాశనము చేయించెను ($15^{15}$). దీనికి కిర్యత్సన్న అను మాఱుపేరు కూడ కలదు ($15^{49}$). హెబ్రీ యక్షరముల సంబంధమువలన దానికి మాఱుపేరు వచ్చియుండవచ్చును. దీనియునికినిగూర్చి తెలియదుగాని ప్రస్తుతమున హెబ్రోనుదగ్గరనుండు ఏద్-దాహేరీయె (*Edh-Dhaheriyeh*) అనేది దాని యునికియని కొందఱనుకొందురు. (పటము II, D 3).

2. యూదాకు ఉత్తరసరిహద్దునందు ఆకోరు లోయలోనున్న ఒక యూరు (యెహో $15^{7}$) నేటివఱకును ఈ పేరు అచట కనఁబడును.

3. యొర్దానుకు తూర్పుగా నున్న యొక స్థలము. అది గాదు స్వాస్థ్యములో నున్నది (యెహో $13^{26}$) గాని దానిగూర్చి మఱేమియు తెలియదు.

4. ఒక అమోరీయుఁడు. ఎగ్లోనురాజు ఇతఁడింక నలుగురు రాజులతో సంధిజేసికొని ఇశ్రాయేలీయులపై యుద్ధము చేసి యోడిపోయెను (యెహో $10^{3,4}$).

**దెబీరు సరిహద్దు** లోదబారు చూ॥

**దెబోరా** (Deborah = తేనెటీఁగ).

1. రిబ్కాదాది. ఈమె రిబ్కా మెసపొతేమియనుండి వచ్చునప్పుడు ఆమె వెంటవచ్చి యాకోబు పద్దనరామునుండి కనానుకు వచ్చువఱకు జీవించెను. యాకోబు బేతేలుకు వచ్చినప్పు డామె అతనియొద్ద నుండెను. అచ్చట నుండునప్పుడు 155 సం॥ ప్రాయముగలదై మరణమాయెను. బేతేలు పట్టణమున్న కొండ దిగువ నుండిన సింధూరవృక్షము క్రింద నామెను పాతిపెట్టిరిగాన ఆ స్థలమునకు అల్లోనుబాకూత్ (= ఏడ్పే సింధూరవృక్షము) అను పేరుపెట్టిరి (ఆది $24^{59}$ $35^{8}$)

2. లప్పీదోతు అనువాని భార్య. ఈమె ఒక ప్రవక్త్రియై యుండెను. ఎఫ్రాయిమీయుల మన్యమందలి రామాకును బేతేలుకును మధ్యను తన పేరుతో పిలువఁబడిన సరళవృక్షము క్రింద నివసించి ఇశ్రాయేలీయులకు న్యాయము తీర్చెను. సీసెరాతో జరుగనైయున్న యుద్ధమందు సేనానిగా నుండనై బారాకు అనువానిని నియమించి తానును యుద్ధరంగమునకు వెళ్లెను (న్యాయా $4^{4-14}$) అప్పుడు కలిగిన జయమునుగూర్చి ఆమె యొక జయకీర్తనను రచించెను ($5^{1-31}$).

**దెబ్బలు** నేరములు శిక్షలు III 4 చూ॥

**దెయూవేలు** (Deuel, Reuel = దేవుని దీవెన గోరుట). గాదుగోత్రపు ప్రధానియగు ఎలాసాపు అనువాని తండ్రి (సంఖ్యా $1^{14}$ $7^{42,47}$ $10^{20}$). $2^{14}$ లో నున్న రగూయేలు అను పేరు దీని మాఱురూపమే.

**దెర్బే** (Derbe). చిన్నాసియలోని లుకయొనియ పరగణాకు ఆగ్నేయ దిక్కుననున్న యొక పట్టణము. లౌకిక చరిత్రలో నీ పట్టణపు పేరు మొదట క్రీ॥ ము॥ 54 సం॥ కనఁబడును క్రీ॥ ము॥ 64 సం॥న గలతియరాజు దాని నపహరించి గలతియతో దానిఁ జేర్చెను. ఆ రాజు చనిపోయిన పిమ్మట క్రీ॥ ము॥ 25 సం॥ అది రోమనులవశమయ్యెను గాన వారు దానిని తాము

గలతియ పరగణాగా నెంచినదానితో చేర్చిరి. కావున అది లుకయోనియ పట్టణముగా నుండినను గలతియ సభలలో నొకటిగా నెంచఁబడెనని నవీన పండితులు అభిప్రాయపడుచున్నారు. పౌలు దానిని తన మొదటి ప్రయాణమునందే దర్శించెను (కార్య $14^{6,20}$). రెండవ ప్రయాణములోను దానిమీఁదుగా వెళ్లెను ($16^{1}$). ఆ పేరు లేకపోయినను మూఁడవ ప్రయాణములో కూడ దానిని దర్శించిన ట్లూహింపవచ్చును ($18^{23}$). తిమోతి ఈ యూరియందో లుస్త్రలోనో పుట్టి క్రీస్తు శిష్యుఁడైనట్లు $16^{1}$ వలనఁ దెలియును. పౌలు అనుచరులలో నొకఁడగు గాయు ఈ పట్టణస్థుఁడే ($20^{4}$ పటము V, K 4).

**దెలాయ్యా** (Delaiah = యెహోవా రక్షించెను).

1. దావీదు సంతతివారిలో నొకఁడు. ఇతఁడు ఎల్యోయేనై కుమారుఁడు (I దిన $3^{24}$).

2. ఒక యాజకుఁడు. యాజకులలోని 24 వంతులలో 23 వ దానిపెద్ద (I దిన $24^{18}$).

3. యిర్మీయా కాలములోని ప్రధానులలో నొకఁడు. ఇతఁడు షెమయా కుమారుఁడు (యిర్మీ $36^{12}$).

4. యెరూషలేములో నెహెమ్యా ఎవని యింట బసచేసెనో ఆ షెమయాయొక్క తండ్రి (నెహె $6^{10}$).

5. జెరుబ్బాబెలుతో కూడ బాబెలునుండి యెరూషలేమునకువచ్చిన కుటుంబములలో నొక దానికి పెద్ద (ఎజ్రా $2^{60}$ = నెహె $7^{62}$).

**దెలీలా** (Delilah = మధురము). సమ్సోనును మోసముచేసి అతనిని ఫిలిష్తీయుల కప్పగించిన యొక స్త్రీ. ఆమె శోరేకు లోయలో నివసించెను (న్యాయా $16^{4-18}$). H.

**దెహాతీయులు** (Dehaites). అష్షూరు రాజు షోమ్రోనును జయించిన తిరువాత అచ్చట నుంచిన జనాంగములలో నొకటి (ఎజ్రా $4^{9}$). పారసీకదేశమునందు స్థిరనివాసములేక తిరిగెడి దయోయ్ (*Daoi*) అను జాతివారు వీరేయని కొందఱనుకొందురు. అష్షూరు రాతి శాసనములలో కనఁబడిన దూయాయ (*Du'ua*) యను తెగవారు వీరేయని మతికొందఱి యభిప్రాయము గాని యివి పట్టి యూహలై యున్నవి. వీరిని గూర్చి తెలిసికొనుటకు వీలులేదు.

# దే

**దేనారము** నాణెములు III చూ॥

**దేమా** (Demas). పౌలుయొక్క జత పనివారలలో నొకఁడు (ఫిలే 24). పౌలు మొదటి సారి రోమాలో ఖైదీయైయుండి కొలొస్సయులకును ($4^{14}$), ఫిలేమోనుకును పత్రికలను వ్రాయుచు దేమాయొక్క వందనములను వ్రాసెను గాన ఆ సమయమున అతఁడు పౌలుకు మిగుల పరిచయుఁడుగా నుండెననఁదగును. గాని అతఁడు రెండవ మారు చెఱలోనుండఁగా దేమా యిహలోకమును స్నేహించి తన్ను విడిచి థెస్సలొనీకకు వెళ్లెనని చెప్పుటవలన (II తిమో $4^{10}$), దేమా క్రైస్తవ ప్రవర్తనకు కలుగు అభ్యంతరముల విషయమై అధైర్యపడియో లేక ఏదోయొక లాభము కాశపడియో మతద్రోహియాయెనని విశదమగును. M.

**దేమేత్రి** (Demetrius = వ్యవసాయ దేవత సంబంధి). పౌలు ఎఫెసులోను దానిచుట్టు ప్రాంతములలోను సువార్తను ప్రకటించుటవలన ననేకులు క్రీస్తు నంగీకరించి విగ్రహారాధనను విసర్జించిరి. ఎఫెసులోని కంసాలి కులస్థులు ఆర్తెమిదేవి దేవాలయముయొక్క ప్రతిరూపములనుచేసి యమ్ముటవలన జీవనము చేసికొనెడివారు. గనుక పౌలు బోధ నవలంబించినవారు విగ్రహారాధనను విసర్జించుటవలన కంసాలుల వ్యాపారము తగ్గిపోవుటను చూచి వారి ముఖ్యుఁడగు దేమేత్రి ప్రోత్సాహమువలన వారందఱును చెలరేగి అల్లరిచేసిరి (కార్య $19^{24}$). ఇతఁడును III యోహాను పత్రికలో (12) ప్రశంసింపఁబడిన దేమేత్రియు నొకఁడే యని కొందఱు వ్యాఖ్యాతల యభిప్రాయము. అతఁడు క్రీస్తు సత్యమంగీకరించి భక్తుఁడాయెనను జనవాడుక గలదుగాని దానిని గుఱించి నిశ్చయము తెలియదు. M.

**దేవతాస్తంభము** అషేరా చూ॥

**దేవదారువృక్షము** (Cedar). ఈ చెట్టు పేరు పాత నిబంధనలో మిగుల తఱచుగ

కనఁబడును. ఇది శీతలదేశములయందు ముఖ్యముగా పర్వతములమీఁద మాత్రము పెరుఁగును. ఈ చెట్లలో ననేక రకములు గలవు. ఇది పొడవుగాను తిన్నగాను నెదుగునుగాన నిట్టి వృక్షపు దూలములను దేవాలయమున కుపయోగించిరి (II దిన $3^{5}$). దేవదారు చెక్కలను పలకలను తలుపుల కుపయోగించిరి (I రాజు $5^{8}$ $6^{15,34}$). దీని కొయ్యతో ఓడలుచేసిరి (యెహె $27^{5}$). లెబానోను పర్వతములమీఁద పెరిగెడి దేవదారు వృక్షములు శ్రేష్ఠమైనవిగ నెంచఁబడెను. అవి మిక్కిలి పొడవుగా నెదుగును (యెష $2^{13}$ ఆమో $2^{9}$). దానికొమ్మలు మిగుల విశాలముగా వ్యాపించును గనుక బహు చక్కని నీడనిచ్చును (యెహె $31^{3-9}$) ఇది స్తంభములకును దూలములకును పలకలకును మిగుల తగినది. చిన్నాసియలోని దేవదారు వృక్షపుపలకలు 70 అడుగుల పొడవును అడుగుభాగమున 7 అడుగులును పైకొనయందు 2 అడుగులును వెడల్పును గలవిగా కోయవచ్చును. దానికర్ర పీచులేక మిక్కిలి గట్టిగా నుండును కావున అది త్వరిగా కుళ్లదు. ఏతెన్సుపట్టణము నందుండిన ఒక గుడి యొక్క సరంబీ పలకలు నన్నూరు సం॥ల కాల ముండెను. దాని వాసన మిగుల మనోహరమైనది. ఈ కర్రకు మెఱుగుపెట్టుట మిక్కిలి సులభము గనుక నకిషీపనికది యెంతయు తగినది (యెష $44^{14,15}$). ఇది మిగుల పొడవైన చక్కని వృక్షము గనుకనే యెహోవా వృక్షమని పిలువఁబడుచున్నది (కీర్త $104^{16}$). అరబ్బీయులు ఈ చెట్టును దేవుని చెట్టందురు. ఈ విధముననే హిమాలయపర్వత పార్శ్వములయందు పెరుగు చెట్లనుకూడ దేవదారువృక్షములందురు. ప్రస్తుతము లెబానోను పర్వతములయందు దేవదారు వృక్షములు విశేషముగలేవు. ఈ చెట్టు దక్షిణ ఇండియా దేశములో పెరుగదు. J. C.

**దేవదూతలు, దూతలు (Angels).** బైబిలునందు దూతలనుగూర్చిన సూచనలు మొదటినుండి (ఆది $3^{24}$), చివరివఱకు (ప్రక $22^{8}$) గలవు.

1. దూతలపేరులు, పాత నిబంధనయందు కీర్త $97^{7}$ లో నున్న దేవతలు అను పదము దూతలకు పెట్టఁబడిన మాఱుపేరని కొందఱి యభిప్రాయము. యోబు $1^{6}$ $2^{1}$ లో నున్న దేవదూతలను పదమునకు మూలభాషలో దైవకుమారులు అను పేరుకలదు. ఆది $6^{2}$ నందున్న **దేవుని కుమారులు** అనుపదియు అదే యర్థమున వాడఁబడెనని అభిప్రాయపడువారును గలరు. కీర్త $29^{1}$ $89^{6}$ లో నున్న **దైవపుత్రులు** అనునది దూతలకు మాఱుపేరు. మూలభాషయందు అది శక్తిప్రభావముల పుత్రులని యర్థమిచ్చును. యోబు $5^{1}$ కీర్త $89^{5}$ నందు **పరిశుద్ధదూత** లనఁబడిరిగాని అసలులో పరిశుద్ధులని మాత్రమున్నది. బైబిలును తెనిఁగించినవారు దూతలు అను పదమును దానికి జేర్చిరి. దాని $4^{14}$ నందున్న పరిశుద్ధుఁడు అనునది దూతయొక్క పేరే. వారికి **జాగరూకులు** అను బిరుదు కలదు ($4^{14,17}$). వారు పరలోక సైన్యమునుండి, దేవుని కుడి యెడమల నుండిరి (I రాజు $22^{19}$). ఆయన తన మహిమతో సీనాయి మీఁదికి వచ్చినప్పుడు **వేవేల పరిశుద్ధుల సమూహములలో** వచ్చినట్లుగా నున్నది (ద్వితీ $33^{2}$) ఆ సమూహములు దూతల సైన్యములై యున్నవి. వారు యెహోవా సైన్యములైగాను ఆయన చిత్తము నెరవేర్చు ఆయన **పరిచారకులు** అనియు పిలువఁబడిరి (కీర్త $103^{21,22}$ $148^{2}$). అట్టి దూతల సమూహము దేవుని చుట్టునుండు **పరిశుద్ధదూతల** సభగానున్నట్లు కీర్త $89^{7}$ నందున్నది. యెష $6^{2-6}$ నందు మహాదూతలను పేరు తెనుఁగు బైబిలునందుంచిరిగాని అసలులో అది సెరాఫీము (*Seraphim*) అను పదమై యున్నది. ఆ మాటకు ప్రకాశించుచున్న యని యర్థము. వీరు దేవుని సింహాసనము చుట్టునుండి, ఆయన మహిమను ప్రకటించువారై యున్నారు. వారికున్నట్లుదాహరింపఁబడిన రెక్కలు, ప్రకాశము, మహిమ భక్తి అనునవి అలంకార రీతిగా వాడిన పదములేగాని వేఱు కాదు.

2. దూతలపనులు. వీరిపని నిత్యమును దేవుని స్తోత్రించుట యని కీర్త $103^{21,22}$ $148^{2}$ నందు కనఁబడును. అదిమాత్రమేగాక, వారాయన చిత్తమును నెఱవేర్చు ఆయన పరిచారకులై యున్నారు ($103^{22}$). ఇస్సాకు పుట్టుకనుగూర్చి అబ్రాహామునకుఁ దెలుపుట (ఆది $18^{10}$), లోతును రక్షించుట ($19^{15}$), గిద్యోనును పిలుచుట

కును ($8^{26}$) కొర్నేలికిని ($10^3$) పేతురుకును ($12^{7-11}$) పౌలుకును ($27^{23}$) యోహానుకును (ప్రక $1^1$ $22^6$ మొ॥) వారు పరిచర్యచేసిరి. కొలొ $1^{16}$ లో నున్న ప్రభుత్వములును, ప్రధానులును, అధికారములును దూతల మహాత్త్వములను సూచించును (రోమా $8^{38,39}$ పరిపోల్చుము). వారెంతటి గొప్పవారైనను క్రీస్తు వారికన్న అధికుఁడని హెబ్రీ పత్రికలోని యొకభాగమందు విశేషబోధయై యున్నది (హెబ్రీ 1, 2). యూదులలోని సద్దూకయ్యుల తెగవారు దూతలున్నట్లు నమ్మలేదు (కార్య $23^8$).

సాతానుకుకూడ దూతలున్నట్లు మ $25^{41}$ ప్రక $12^8$ నందు కనఁబడును. వీరు మొదట మంచి దూతలై యుండి చెడిపోయిరని II పేతు $2^{4,11}$ యూదా 6 వలనఁ దెలియుచున్నది. (కెరూబులు, దయ్యములు చూ॥).

**దేవదూషణ** (Blasphemy). దేవుని నామమును దూషించుటయు (లేవీ $24^{10-16}$ కీర్త $74^{10-18}$ ప్రక $16^{9,11,21}$) ఆయన ఆలయమును గూర్చి చులకనగా మాట్లాడుటయు (కార్య $6^{13}$) దేవదూషణయని భావించిరి. ఇశ్రాయేలీయులు దేవుని ప్రజలగుటచే వారు తమ దుర్నడతవలనను విగ్రహారాధనవలనను ఆయననామ ఘనతకు నిందాస్పదము కలుగఁజేయుటయు దేవదూషణగా పరిగణింపఁబడెను (యెహె $20^{27}$ $36^{20}$ యెష $52^5$ రోమా $2^{24}$). ఈ నేరమునకు మరణశిక్షను విధించిరి (లేవీ $24^{16}$). యెజెబెలు అన్యాయముగా నీ నిందను నాబోతు మీఁద మోపినట్లు బైబిలు చరిత్రయందుఁ జూడ వచ్చును (I రాజు $21^{10-13}$). పాపములు క్షమించుటకు తన కధికారముగలదనియు (మ $9^3$), తాను దేవునికుమారుఁడ ననియు ($26^{65,66}$), దేవునికి సమానుఁడ ననియు (యోహా $10^{36}$) చెప్పుకొన్నందున క్రీస్తుమీఁద యూదు లీనేరమును మోపిరి. ఆలయము పాడైపోవునని చెప్పినందున స్తెఫనుకూడ దేవదూషణఁ జేసెనని యతని పట్టుకొని చంపిరి (కార్య $6^{11}$).

దేవునిశక్తిచే తానుజేసిన అద్భుతములు సాతాను సహాయమువలనఁ జేయుచున్నాఁడని యూదులు మూర్ఖులై చెప్పుట పరిశుద్ధాత్మను దూషించుట యని క్రీస్తు తెలిపెను (మ $12^{22-32}$ మా $3^{22-30}$, నేరములు శిక్షలు I 3, క్షమాపణ చూ॥).

**దేవకుల వివాహమునుగూర్చిన పద్ధతి** వివాహము V చూ॥

**దేవవాక్కు, యెహోవా వాక్కు** (Oracle of God, Oracle of Jehovah). ప్రవక్తల గ్రంథములలో నిదియొక వాడుకపదమై యున్నది. దేవుని రహస్యములను తెలిసికొనుటకై అన్యజనులు తమదేవతలయొద్ద విచారణ చేసిరి. అట్టి రహస్యములు బైలుపడినవని వారనుకొని, ఇట్లు బైలుపడిన విషయములకు ఈ పదము నుపయోగించుకొనిరి. పాఁత నిబంధనలోకూడ దీని యుద్దేశమదే గాని, సోదెలడుగుటవలనఁగాక దేవుని యాత్మచేతనే ప్రవక్తలు దేవుని మర్మములనెఱిఁగి వాటిని జనులకు తెలిపిరి. ఎటులనైనను దేవవాక్కు అనఁగా దేవుఁడు తానే పలికినమాట యని యర్థమగును. ప్రవక్తలు ఎప్పుడెపుడు గంభీరమైనమాటలను పలికిరో ఆ మాట గంభీరత్వమును చూపుటకు ఈ పదమును వాడుకొనిరి. మన తెనుఁగు బైబిలులో సాధారణముగా యెహోవావాక్కు అను పదమును, యెహోవా ఇట్లు సెలవిచ్చుచున్నాఁడు అని తర్జుమా చేసిరి (యెష $3^{15}$ $14^{23}$ యిర్మీ $31^{1,10}$ మొ॥). యెషయా గ్రంథములో సాధారణముగ నిట్లే తర్జుమా చేసినను $14^{22}$ $30^1$ $37^{34}$ లలో యెహోవావాక్కు అను మాటలనే యుంచిరి. యిర్మీయాలో ఇది సర్వసాధారణమైన పదముగా నున్నది ($2^{22}$ $3^{12-14,16,20}$ మొ॥). యెహెజ్కేలుకూడ దీని వాడెను $18^{3,9,23}$ మొ॥) గాని, అతనికాలములో అబద్ధప్రవక్తలు దాని వాడుకొనుచుండినందున అతఁడు వారిని ఖండించెను ($13^{6,7,8}$). చిన్న ప్రవక్తలలో దాదాపుగా నందఱును దీనిని వాడుకొని యుండిరి. అయితే హగ్గయి, జెకర్యా యనువారి గ్రంథములలో మఱెక్కువగా కనఁబడును.

మూలభాషయందున్నట్టియు పైన వివరింపఁబడినట్టియు ఈ విశేషపదమునుమాత్రముగాక, యెహోవా పలికినది, లేక యెహోవామాట అను నర్థము నిచ్చు అసలుపదమునుకూడ మన తెనుఁగు బైబిలులో యెహోవావాక్కు అని తర్జుమా చేసిరి (మీకా $4^4$ యెష $2^3$).

**దేవాలయము, మందిరము, గుడి** (Temple). అన్యులగుళ్లవలె (I దిన $10^{10}$), పాఁత నిబంధనయందు మందిరమనఁబడిన దేవాలయము దేవుని నివాసస్థానముగా నెంచఁబడినను (I రాజు $8^{13}$), ఆలయ మెంతమాత్ర మాయనను పట్టఁజాలదని మొదటినుండి ఇశ్రాయేలీయులు తెలిసికొని యొప్పుకొనుచుండిరి ($8^{27}$). సొలొమోను కాలముదనుక గుడారముగాక స్థిరముగా కట్టఁబడిన ఆలయమువారికి లేనేలేదు (II సమూ $6^{17}$). I సమూ $1^{9}$ $3^{3}$ నందు ఆ గుడారమునకు సంబంధించిన యిండ్లు షిలోహులో నున్నట్లూహింపఁదగును. యిర్మీ $7^{14}$ లో నున్నది అట్టి యూహకు సరిపడును. పిదప గుడారము నోబు నందున్నప్పుడును అచ్చటకూడ అట్టి యిండ్లే యుండవచ్చును (I సమూ 21) గాని, II సమూ $7^{6}$ నందు మోషేకాలము మొదలుకొని దేవుని నిబంధనమందసము గుడారమునందే యుంచఁబడినట్లు స్పష్టమగుచున్నది (గుడారము చూ॥). దేవాలయమును మొదట సొలొమోను కట్టించెను. చెఱనుండి తిరిగివచ్చిన తరువాత జెరుబ్బాబెలు దానిని తిరిగి కట్టించెను. హేరోదుకాలమునందు దానిని మరమ్మతుచేసి పెంచిరి. వీరుముగ్గురు కట్టించినవాటిని సాధారణముగా మూఁడు ఆలయములని యెంచెదరు. ఇవిగాక కుదురుబాటు కాలమునందు కట్టఁబడఁబోవు నాలయమునుగూర్చి యెహెజ్కేలు అలంకారరీతిగా వివరించెను. ఆ యాలయ మెన్నడును కట్టఁబడకపోయినను దాని వివరమునుబట్టి నాలుగవదానిగా నెంచఁదగును. ఇట్లు కాలక్రమము ననుసరించి

I. సొలొమోను కట్టించిన ఆలయము.

II. యెహెజ్కేలు వర్ణించిన ఆలయము.

III. జెరుబ్బాబెలు కట్టించిన ఆలయము.

IV. హేరోదు కట్టించిన ఆలయము అను నాలుగింటి నిందు వివరింతుము.



ఆలయపు ద్వారము

I. సొలొమోను కట్టించిన ఆలయము.

1. ఉనికి. ఇది యెరూషలేము తూర్పు కొండమీఁద కట్టించఁబడెను. ఆ కొండమీఁదనే సొలొమోను కట్టడములన్ని యున్నవి (యెరూషలేము B III 1-6 చూ॥). ఆ కట్టడము లన్నిఁటిని మందిరమని పిలిచిరి. II రాజు $11^{10}$ నందున్నట్లు దావీదు ఈటెలను డాళ్లను ఉంచిన మందిరము దేవాలయముగాక, ఆ కొండమీఁదనే సొలొమోను కట్టించిన కట్టడములలో నొకటి యని తెలిసికొనవలెను. ఈ తూర్పుకొండమీఁద

దావీదు అరౌనాయొద్ద కొన్నకళ్లమే దేవాలయపు ఉనికియై యున్నది (II సమూ $24^{16}$ II దిన $3^{1}$).

2. ఆలయమును కట్టించినవారు. దేవాలయము కట్టుటకు కావలసినదంతయు దావీదు సిద్ధపఱచెనుగాని దానిని అతఁడుగాక అతని కుమారుఁడు కట్టించవలెనని యేర్పాటయ్యెను (II సమూ $7^{6-17}$ I దిన $17^{6-15}$). దావీదు పనికొఱకు తాను సిద్ధపఱచిన వాటన్నిఁటిని ($22^{1-5}$ $29^{1-9}$). సొలొమోను కప్పగించి దానిని కట్టించుమని యాజ్ఞాపించెను.

3. ఆలయపు గోడలు, గుమ్మములు, మోరీయా కొండపైభాగమును చదునుజేసి, దానిని నాపరాళ్లతోఁ గప్పిరి. దానిచుట్టును ప్రాకారపు గోడగలదు. అందులోని గవునులేవి యనఁగా:—

**(1) ఎత్తు ద్వారము** (II రాజు $15^{35}$). రాజైన యోతాము దీనిని గట్టించెను (II దిన $27^{3}$). దాని యునికి సరిగాఁ దెలియదు.

**(2) బెన్యామీనుమీఁది గుమ్మము.** ఇది యెహోవా మందిరమున్న గుమ్మమని యిర్మీ $20^{2}$ వలనఁ దెలియుచున్నది. అది ఆలయమున కుత్తరపైపున నున్నట్లు కనఁబడును (యెరూషలేము B III 7 (1) చూ.).

**(3) రాజు గుమ్మము.** (I దిన $9^{18}$). ఇది యాలయమునకుఁ దూర్పుగా నున్నది. యెహె $10^{19}$ $11^{1}$ లో నున్న తూర్పు ద్వారము ఇదే అయ్యుండవచ్చును.

**(4) క్రొత్తగవని (ద్వారము).** ఇది ఆలయమునకు దక్షిణముగా నున్నది (యిర్మీ $26^{10}$ $36^{10}$).

**(5) షల్లెకెతు గుమ్మము** (I దిన $26^{16}$) పడమటగా నున్నది. ఇది ఆలయమునకు నూటిగా పడమట నుండక సొలొమోను నగరమునకు పడమరగా నుండవచ్చును. ఈ పదమునకు మైల అని అర్థమగుటచే, అది ఆలయావరణములో నుండి మైలను తీసికొనిపోవుట కుపయోగింపఁబడు ద్వారమని కొందఱి యభిప్రాయము గాని, ముఱికిని కిద్రోను లోయలో పడవేసిరి గావున ఆ యూహ సరియైనది కానట్లు కనఁబడుచున్నది.

**(6) సూరు గుమ్మము** (II రాజు $11^{6}$). దీని పేరున్నదిగాని దాని యునికినిగూర్చి తెలిసికొనుట కెట్టి యాధారమును లేదు.

4. ఆలయపుకొలతలు; భాగములు. ఆలయము లోనికి ప్రవేశించు ద్వారము తూర్పున నున్నది. ఆలయము పొడుగు 60 మూరలును, వెడల్పు 20 మూరలును, ఎత్తు 30 మూరలునై యున్నది. (I రాజు $6^{2}$=II దిన $3^{3,4}$). ఆ మూర మన మూరకన్న మూఁడు అంగుళము లెక్కువ. ఈ కొలతలు బహుశః ఆలయపులోపలి కొలతలై యుండును. ఈ యాలయము రెండు భాగములుగ విభాగింపఁబడెను.

**(1) పరిశుద్ధ స్థలము** (I రాజు $6^{17}$ నిర్గ $26^{23}$). దాని పొడవు 40 మూరలు వెడల్పు 20 మూరలు.

**(2) అతిపరిశుద్ధ స్థలము** (I రాజు $6^{16}$= $7^{50}$ $8^{6}$ నిర్గ $26^{33}$). ఇది పరిశుద్ధ స్థలమునకు పడమరగా 20 మూరలు చచ్చౌకముగా నుండి గోపురమువలె కనఁబడెనుగాని కొందఱు అంకెలు పొఱబాటుగా వేయబడెననుకొనుచున్నారు. I రాజు $6^{3}$ నందు దీనియెత్తు తెలుపఁబడక పోయినను అది దేవాలయముయొక్క తక్కిన భాగములవలె 30 మూరల యెత్తుగా నున్నట్లు వారభిప్రాయపడెదరు.

(3) పరిశుద్ధ స్థలమునకు ముందఱ తూర్పున 20 మూరల పొడవును 10 మూరల వెడల్పునుగల ముఖమంటపమున్నది (I రాజు $6^{3}$). II దిన $3^{4}$ నందది 120 మూరల యెత్తున్నట్లు తెలిసికొనవచ్చును.

5. ఆలయమును కట్టిన క్రమము. గోడల మందమెంతో చెప్పఁబడలేదు. పైకప్పు మిద్దె రీతిగా నున్నట్లు తోఁచును. 20 మూరల వెడల్పు గల గదులకు దూలముల పొడవు చాలనందున స్తంభములమీఁద వాటిని

వచ్చును. I రాజు $10^{12}$ లో నున్న **చందనపు మ్రానుల స్తంభము** లివియై యుండనగును. దానిలోపటి గోడలను, క్రిందను పైన అంతయు చెక్కలచే కప్పిరి ($6^{15}$).

గోడలను రాళ్లతోఁగట్టిరి. వాటి నన్నిఁటిని కొలతకుఁదగినట్లుగా రాతిగనులయొద్ద చెక్క—

నందున ఆలయమును కట్టునప్పుడు సుత్తెధ్వని వినఁబడక పోయెను (I రాజు 6[7]) గర్భాలయము లోకి పోవుటకు ఒలీవమ్రాను చెక్కలతో తలుపులను చేయించి (6[31]) వాటిని చక్కగా నలంకరించిరి (6[32]).

6. ఆలయము చుట్టునున్న గదులు. తూర్పున గాక తక్కిన ప్రక్కలన్నిఁట ఒక వరుస గదులున్నవి. అవి మూఁడంతస్తులు ఎత్తుగా నున్నవి. క్రింది అంతస్తు గదులు 5 మూరలును, రెండవ దానిలోనివి 6 మూరలును, మూఁడవ దానిలోనివి 8 మూరలును వెడల్పుగలవి. ప్రతి అంతస్తు గోడ పూరి అయిన పిమ్మట గోడయొక్క మందమును తగ్గించుటచేత నిట్లయ్యెను (6[6]). ఈ మూఁడంతస్తులు 20 మూరలకన్న ఎత్తుగలవికావు. ఆ గదుల సంఖ్యయు నిశ్చయింప వీలులేదుగాని యెహె 41[6] బట్టి 30 యున్నట్లూహించెదరు. మందిరమునకు విచిత్రమైన పనితో చేయఁబడిన అల్లిక కిటికీలుండెను (I రాజు 6[4]).

7. ఆలయమందలి సామగ్రి:— ఇవి గుడారములోని సామగ్రివంటివేగాని కొన్నిఁటియందు మాత్రము కొద్ది మార్పులు గలవు (గుడారము చూ॥).

(1) ఆలయముచుట్టును ఆవరణముగలదు. అందీ దిగువ నుదాహరించినవి గలవు:—

(*a*) **ఇత్తడి బలిపీఠము** (I రాజు 8[64]). అది 20 మూరల చతురము గలిగి 10 మూరల యెత్తుండెను (II దిన 4[1]). I రాజు 7[40] లో నున్న చేటలను బూడిదెను తీసివేయుటకు చేసిరి. అవి చేటలు గాక ఒక విధమైన పారలవంటివి.



బలిపీఠము

ఊడుకుచున్న దానిని తీయుటకు కొంకులనుకూడ చేసినట్లు I దిన 2[8,17] వలనఁ దెలియుచున్నది.

(*b*) **ఇత్తడిసముద్రము** (II రాజు 25[13] I దిన 18[8]). అది II దిన 4[2] నందు **పోత పనితో జేసిన సముద్రము** అనఁబడును. ఇది స్నానాదులకై పలుయు నీటిని సేకరించుటకొఱకైన పెద్ద గంగాళము. మందిరమునకు ముందర కుడిపార్శ్వముగా దక్షిణ దిశయందుంచిరి. అది చిత్రపుపనితోఁ జేయఁబడి యలంకరింపఁబడెను (I రాజు 7[23-39]=II దిన 4[2-5]). దాని వ్యాసము 10 మూరలును ఎత్తు 5 మూరలై యుండెను. అది పన్నెండెద్దుల మీఁద నిలిచి పువ్వులతో నలంకరింపఁబడెను. దానియందు 9 గరిసెల నీరుపట్టును. అసలు నందు ఆ గంగాళములో 1000 బతులు పట్టెనని యున్నది (మానములు III 6 చూ). ఆహాజురాజు ఈ సముద్రముక్రింద నాధారముగా నున్న ఎడ్లను దీసివేసి ఆ యిత్తడిని తన స్వంతమునకు వాడి ఆ సముద్రమును క్రిందపడవేసెను (II రాజు 16[17]). ఈ ఆలయమును పాడుచేసిన బాబెలువారీ సముద్రమునుకూడ దోచుకొనిపోయిరి (25[13] యిర్మీ 52[17,20]).

(*c*) **పది యిత్తడితొట్లు** (I రాజు 6[38]), **స్నానపు గంగాళములు** (II దిన 4[6]). వీటిలో ప్రతిది ఒక్కొక్క స్తంభముమీఁద నిలుపఁబడెను (I రాజు 7[38]). ఆలయమునకు కుడిప్రక్కను 5, యెడమ ప్రక్కను 5 గంగాళములనుంచిరి. ఒక్కొక్కదానిలో 40 బతులు (=360 పళ్ళు) పట్టెను. బైబిలును తెనిఁగించినవారు వీటిని 720 తూములని లెక్కించిరి. దహన బలులుగా నర్పించు వాటిని కడుగుటకై యీ తొట్లలోని నీటి నుపయోగించిరి గాని సముద్రము వంటి తొట్టియందలి జలమును యాజకుల స్నానాదులకు వాడిరి (II దిన 4[6]).

(*d*) **ఆలయ మంటపము యొక్క రెండు స్తంభములు**:—కుడి వైపునున్న దానికి **యాకీను** (=స్థిరత) అనియు, ఎడమవైపునున్న దానికి **బోయజు** (=బలము) అనియు పేర్లు పెట్టిరి (I రాజు 7[21] II దిన 3[17] యిర్మీ 52[21,22]). కొందఱివి మంటప స్తంభములందురుగాని అలం

కారార్థమై కట్టబడిన ప్రత్యేకమగు ధ్వజస్తంభము లని మరికొందరి యభిప్రాయము. వాటి యెత్తు 18 మూరలును కైవారము 12 మూరలునై యుండెను. వాటి పై భాగమును చక్కగా నలంకరించిరి (I రాజు 7[17]). దేవాలయమునకు సంబంధించిన యిత్తడి పనియంతయు ఫేనీకే కంసాలియగు హూరాము చేయించెను (II దిన 4[11]).

(2) పరిశుద్ధ స్థలమందలి సామగ్రి:—



సముఖపు రొట్టెలనుంచు బల్ల

(*a*) **సముఖపు రొట్టెలనుంచు బంగారపు బల్ల** (I రాజు 7[48]). II దిన 4[8] నందు బల్లలు పది యున్నట్లు కనుగొనవచ్చును. మందిరము నందలి ప్రతిదానిని బంగారముతో పొదిగి నట్లు వీటినికూడ పొదిగిరి

(*b*) **బంగారపు బలిపీఠము** (I రాజు 7[48]). ఇదే ధూపవేదిక (నిర్గ 37[25-29]). **ధూప కలశములు** దీనికి సంబంధించినవే (I రాజు 7[50]).



ధూపవేదిక

(*c*) **పది బంగారు దీపస్తంభములు** (I రాజు 7[49] II దిన 4[7]). గుడారమునందు ఒక దీపస్తంభము మాత్రమే యుండెను (నిర్గ 25[31-40]) గాని, ఈ యాలయమునందు పదింటిని నిలిపిరి. పరిశుద్ధ స్థలమునందు కుడిప్రక్కను





దీపవృక్షము

5 ను ఎడమ ప్రక్కను 5 ను పెట్టిరి. వీటికి సంబంధముగా దీపములవత్తులను శుభ్రము చేయుటకు **కాటులను** (I రాజు 7[49]), **కత్తెరలను** (7[50]), నూనె పోయుటకు **గిన్నెలను** (7[50]) చేసిరి.

(*d*) పరిశుద్ధ స్థలమునకును అతి పరిశుద్ధ స్థలమునకును మధ్య దేవదారు పలకతో కట్టిన విభాగమున్నది (I రాజు 6[16]). అతి పరిశుద్ధ స్థలములో ప్రవేశించుటకు ఒలీవచెట్టు కర్రతో తలుపులను చేయించిరి (6[31]). ఆ తలుపుల ముందఱ చక్కగా నలంకరింపబడిన యొక **తెర** గలదు (II దిన 3[14] మ 27[51]).

(3) అతి పరిశుద్ధ స్థలములో ఒకటి మాత్రముండెను. అదే **మందసము** (I రాజు 8[3-9]). దానిపైని రెండు పెద్ద కెరూబులున్నవి. వీటి రెక్కలలో నొకటి మందసమునకుపైన ఒకదానినొకటి అంటెను. రెండవరెక్క గర్భాలయపు గోడనంటెను (6[27] 8[7]). గుడారమునందవి ముఖాముఖిగా నిలుపఁబడెను (నిర్గ 25[20]) గాని, ఆలయమునందట్లుగాక, పరిశుద్ధ స్థలమువైపు చూచునట్లుంచఁబడెను (గుడారము, మందసము చూ॥).

II. **యెహెజ్కేలు ఆలయము:**—దీని వివరము యెహెజ్కేలు 40[1]-43[27] నందుండినను, ఇది యెన్నడును కట్టఁబడలేదు. యెహెజ్కేలు చెఱకాలమున ప్రవచించెను. ఆలయము తిరిగి కట్టఁబడునని తెలిపెను. ఆ యాలయము మాత్రమేగాక, యెరూషలేమును లోపరహితమైన దగునని సూచించుటకు యెహెజ్కేలీ

వివరమును వ్రాసెను. అందువలననే కొలత లన్నియు అట్టి లోపములేని యేర్పాటులను సూచించును. అవి నూటిగా అట్లే కట్టఁబడునని యెహెజ్కేలు సహితము మనుకొనలేదని నమ్మవచ్చును. ఐనను, ఆ యాలయముయొక్క భాగములను సామగ్రి వస్తువు లన్నియును సొలోమోను కట్టించిన ఆలయము ననుసరించి వివరించెను.

1. ఈ యాలయము 500 మూరలు చతురముగా నున్న ప్రదేశమునఁ గట్టఁబడెను. దాని చుట్టును ప్రాకారమున్నది ($42^{16-20}$). దాని యందు ఉత్తరమున నొకటియు ($42^{2}$), తూర్పున నొకటియు ($42^{9}$), దక్షిణమున నొకటియు ($40^{28}$) మూఁడు గుమ్మములు (A) సరిగా మధ్య నుండెను. అవి ఒక్కొక్కటి 50 యేసి మూరల పొడవు. వాటిలో కావలి గదులున్నవి. బయటి ఆవరణపు (B) గోడచుట్టును 30 గదులు (1, 2,3......) ఉండెను. ఈ చుట్టు గోడ మూలలలో నుండు నాలుగుగదుల (D) యందు యజ్ఞములలో ప్రజలు తినఁదగిన వాటిని వండుకొనిరి. ప్రతిగవనియొద్దనుండి 100 మూరల దూరమున 8 దేసి మెట్లుండెను ($40^{37}$). వీటి నెక్కిన పక్షమున లోపలియావరణము (v, w, x, y) నకుఁ బోవచ్చును. అది 300 మూరల పొడవును 200 మూరల వెడల్పును గలది. దీనికిని మూఁడు గుమ్మములు (E) గలవు. అవికూడ




యెహెజ్కేలు ఆలయము

గదులు గలిగి 50 మూరల పొడవుగా నుండెను ($40^{28,29-32,33}$). ఈ గుమ్మములకు మధ్య సరిగా 100 మూరల చచ్చౌకము (a, b, c, d) గా నున్న స్థలములో బలిపీఠము (L) గలదు ($40^{47}$). తూర్పు

గుమ్మములో లోపలి గుమ్మపు వాకిలిగది (S) యందు నాలుగును ఆ గదికి ఉత్తరమున దక్షిణమున చెరి నాలుగును బల్లలు (H) యజ్ఞపశ్వాదులను సిద్ధపఱచుటకు ఉంచఁబడెను ($40^{38-42}$). లోపలి ఆవరణముయొక్క ఉత్తరదక్షిణ గుమ్మముల నానుకొని రెండు గదులు (J) ఉండెను. ఇవి యాజకులవి.

2. బలిపీఠపు వివరము $43^{13-17}$ నందున్నది. దానికి మెట్లవలెనుండు నాలుగు భాగము లుండెను. అన్నిఁటికన్న అడుగున నున్నది 1½ మూరల యెత్తుండెను ($43^{13}$). రెండవది 2 మూరలును ($43^{14}$) మూడవది 4 మూరలును ($43^{14}$) నాలుగవది 4 మూరలయెత్తుండెను ($43^{15}$). మొదటి మూఁడును **దేవునికొండ** యనఁబడిన నాలుగవ దానికి పునాదులుగ నెంచఁబడును. ఇదే బలిపీఠము. అది 12 మూరల చదరముగలది. దీనిచుట్టు రెండు చూరులు గలవు. ఒకటి చిన్నది, రెండవది పెద్దది ($43^{14,17,20}$).

3. బలిపీఠమునుండి 50 మూరలు తూర్పుగా ఆలయమున్నది. ఇది ప్రత్యేకింపఁబడిన స్థలము b, $b_1$, $c_1$, c) అనఁబడిన దానిలో నుండెను ($41^{12}$). ఆలయమునకు ముందర 20 × 12 మూరల మంటప మొకటి గలదు. ఆలయములోని పరిశుద్ధస్థలము 40 × 20 మూరలును, అతి పరిశుద్ధ స్థలము 20 × 20 మూరలు నుండెను. ఆలయపుగోడలు 6 మూరల మందము గలవి. దీనిచుట్టును 30 మేడగదులు గలవు. ఈ కట్టడము 100 మూరల చతురమునందున్నవి ($41^{1-14}$). మందిరమునకు చుట్టునున్న విడి స్థలము (K) యొక్క ఉత్తరదక్షిణములయందు యాజకుల కొఱకైన గదులుండెను. ఇచ్చటనే యాజకులు పరిశుద్ధమైన వాటిని తిని ($42^{13}$) తమ పరిశుద్ధ వస్త్రముల నుంచవలసి యుండిరి ($42^{14}$).

ఈ యాలయము మిగుల పరిశుద్ధమైనదిగాన అదియు దాని నియమములును పూర్వముగా లౌకికమగు వాటినుండి ప్రత్యేకింపఁబడవలెనను నదే దీని ముఖ్యోద్దేశమై యున్నది.

**III. జెరుబ్బాబెలు కట్టించిన యాలయము** దీనినే రెండవ యాలయమనిరి. సొలొమోను గట్టించిన యాలయము నెబుకద్నెజరుచే నాశనమయ్యెను. చెఱకాలమునకుఁ బిమ్మట జెరుబ్బాబెలు అధిపత్యముక్రింద నొక క్రొత్త ఆలయమును గట్టిరి (ఎజ్రా $5^{1}$). షేష్బజ్జరను మారుపేరుగల జెరుబ్బాబెలు ఆలయపు పునాదిని క్రీ॥ పూ॥ 537 నందువేసి ఆలయమును 517 సం॥న పూర్తిచేసెను (జెక $4^{7}$). దీనిని కట్టించుటకు కోరెషు చక్రవర్తి సెలవొసంగెను. నెబుకద్నెజరు కొంచుపోయిన వాతి ఆలయమందుండిన సామగ్రులన్నిఁటిని ఇతఁడు వారికి తిరుగా నప్పగించి ఆలయపు పన్నులకొఱకై చందాలు జమచేయవలయునని అనుజ్ఞ నిచ్చెను (ఎజ్రా $1^{7-11}$ 5, 6). ఈ పని నెంతటి యాసక్తితో నారంభించినను రెండవ సంవత్సరమునందు సమరయులు, ఇతర మిశ్రిత జనుల విరోధములవలన దాని నాపివేయవలసి వచ్చెను (4). దానిని తిరిగి యారంభించుటకు సెలవు దొరికెను (6) ప్రజలకుండిన మొదటి యాసక్తి తగ్గిపోవుటచే చాల కాలముదాక వారు దాని ముగింపరైరి. హగ్గయి జెకర్యా ప్రవచన గ్రంథములలో వారు ప్రజలను జేసిన హెచ్చరికలను జూడవచ్చును. వీరి ప్రోత్సాహముచే ప్రజలు పనిని పూనుకొని చివరకు పూర్తిచేసిరి.

1. రెండవ యాలయము మొదటిదాని క్రమముననుసరించి కట్టఁబడెను. కోరెషు తాకీదులలోనున్న కొలతలను (ఎజ్రా $6^{3,4}$) సూటిగా ననుసరించి దానిని కట్టినట్లు కనఁబడదు. ఈ యాలయము క్రీస్తుకాలమువఱకు నిలిచెను. దీనియందు పరిశుద్ధాతి పరిశుద్ధ స్థలములుమాత్రమే గాక, యాజకులు మాత్రము ప్రవేశింపఁగలిగిన నొకటియును, ఇతరులు ప్రవేశించుటకు వీలయిన నొకటియు, రెండు ఆవరణములుండినట్లు యోసీఫసువలనఁ దెలియుచున్నది (పురా 13.13.5). సొలొమోను ఆలయమందును, దీనియందునున్న సామగ్రులకు చాలభేదముకూడ కలదు. ఇత్తడి బలిపీఠమునకు ప్రతిగా రాతితోకట్టిన బలిపీఠము దీనియందుండెను. పది దీపస్తంభములకు బదులు దీనియందు ఏడుకొమ్మలుగల యొకటే దీపవృక్షమున్నది. పది సముఖపు రొట్టెలబల్లలుగాక ఒకటే యందుండెను. చెఱకాలమునకుఁ బిమట

నిబంధన మందసమునుగూర్చి వినఁబడదుగాన, స యాలయములోని అతిపరిశుద్ధమైన స్థలమునందది లేనేలేదు.

2. ఈ దేవాలయమునకు, సొలొమోను ఆలయమునకున్నంత వైభవము లేకపోయినందున, ప్రతిష్ఠితకాలమునందు, చెఱనుండి తిరిగివచ్చిన వృద్ధులకు మిగుల దుఃఖము కలిగెను (హగ్గ 2³). ఆలయ మిట్లుండుటవలన యూదులు తమ ఆచారములను క్రమముగా జరుపుకొనుటకు వీలు కలిగెను. అంతియొకస్ ఎపిఫనీసు (క్రీ॥ పూ॥ 168-165), ఈ ఆచారములను మాన్పుటకు, ఆలయమునందు అన్యదేవతా విగ్రహములను నిలిపి దాని వేదికపైని పందిమాంసము సమర్పించెనుగాని, ఆ కాలమున మక్కబీయుల నాయకత్వము క్రింద యూదులు తిరుగబడి స్వతంత్రులై, ఆలయమును శుద్ధిచేసి, దానిని తిరిగి ప్రతిష్ఠించిరి. క్రీస్తు కాలమునకూడ ఈ జ్ఞాపకార్థమైన ప్రతిష్ఠ పండుగను యూదులాచరించిరి (యోహా 10²²).

ఈ యాలయమును తరువాత పెంచి, దివ్యముగా నలంకరించిరిగాని క్రీ॥ శ॥ 70 సం॥న యెరూషలేము నాశనమగువరకు, మాత్రము అది నిలిచెను. అప్పుడు సహా రోమీయులు దానిని పాడుచేయక దాని యలంకారములను మాత్రము దోచుకొనిరి.

IV. హేరోదు కట్టించిన యాలయము:— హేరోదు యూదయకు రాజైనప్పుడు ఈ యాలయమును తిరిగికట్టుటకుఁ బూనుకొనెను. అతఁడు పాతదానిని పడఁగొట్టించక దానికి క్రొత్త కట్టడములను కలిపి, దానిని యలంకరించి వృద్ధిచేసెను గనుక దీనిని ప్రత్యేకమైన ఆలయముగా నెంచఁదగును. దీనిని క్రీ॥ పూ॥ 19వ సం॥న నారంభించి దాదాపు క్రీ॥ శ॥ 63 సం॥న పూర్తిచేసిరి. క్రీస్తుకాలమున యూదులు దీనిని 46 సంవత్సరములు కట్టిరని చెప్పిరి (యోహా 2²⁰) అది హేరోదు పనినిగూర్చి చెప్పిన మాట.




హేరోదు దేవాలయపు ప్లాను

ఆలయమును పెంపకము చేయుటకై హేరోదు దాని చుట్టునుండు స్థలమును విశాలపఱచెను. మోరీయా కొండయంతటిని దేవాలయపు ఆవరణములతోఁ జేర్చెను. ఈ దేవాలయము విశాలమైన దనియు, అందమైన దనియు మిగుల ప్రసిద్ధివడసెను. ఆలయమునందలి భాగముల క్రమమును మార్చకున్నను, నూతనమగు భాగములను వాటికి కలిపెను. అది ముగిసినపిదప లోకమందలి వింతలలో నొక ముఖ్య వింతగా నెంచఁబడెను. దానియందలి నూతనభాగము లెవ్వి యనఁగా:—

1. దేవాలయావరణము చుట్టునున్న గోడ మీఁద నానుకొని, స్తంభములపైఁ గట్టఁబడిన పెద్ద మంటపములు. దక్షిణమునం దీ స్తంభములు నాలుగు వరుసలుగా నున్నవి. అట్టి స్తంభములు 162 గలవు. దీనికి రాచమంటపమని పేరు. తూర్పుదిక్కున నున్న మంటపమునం దొక భాగమునకు సొలొమోను మంటపమని పేరు (యోహా 10[23] కార్య 3[11] 5[12]). సొలొమోను కట్టించిన దానిశేషము అచ్చట నుండుటవలన దానికీ పేరు కలిగి యుండవచ్చును.

2. అన్యులయావరణము (*Court of Gentiles*). ఇది ఆవరణములలోని మొదటి భాగము. అది దక్షిణమున 900 అడుగుల చతురముగా నున్నది.

3. లోపలి యావరణము (*Inner Court*). దీనిలోనికి వెళ్లుటకు 14 లేక 15 మెట్లు ఎక్కవలసి యుండెను. ఈ యావరణము చుట్టును 25 మూరల యెత్తుగల గోడయును మంటపములు నున్నవి. ఇశ్రాయేలీయులు కానివా రందులో ప్రవేశించినయెడల మరణశిక్షకు పాత్రులగుదురని ఆ గోడమీఁద శాసనములు వ్రాసిరి. వాటిలోఁ గొన్ని నేటివఱకును గలవు. పౌలు అన్యుల నిందులోనికిఁ దెచ్చెననియే యూదు లతనిపై యబద్ధములు గల్పించిరి (కార్య 21[28,29]). ఈ లోపలి యావరణమునం దీ దిగువ భాగము లున్నవి.



దేవాలయపు దక్షిణభాగమును చూపెడి ప్లాను

(1) ఈ యావరణమందు తూర్పుగా స్త్రీలకొఱకు ప్రత్యేకమైన భాగమొకటి గలదు. దానికి స్త్రీల యావరణమని (*Court of Women*) పేరు. దీనిలోనే కానుకపెట్టె లున్నవి (లూ 21[1-4]). అట్టి కానుకపెట్టెలు ఇతర మంటపములయందు నున్నట్లు కనఁబడును (యోహా 8[20]).

(2) స్త్రీల యావరణమునకు పడమరగా మరల 15 మెట్లు ఎక్కినయెడల పురుషులు మాత్రము ప్రవేశింపఁగలిగిన మఱియొక ఆవరణము గలదు. దానిలోనికి ప్రవేశించెడి ద్వారము 40 మూరలు వెడల్పుగాను 50 మూరలు ఎత్తుగా నున్నది. శృంగారమను దేవాలయపు ద్వారము ఇదేయై యుండును (కార్య 3[7]) గాని ఇది రూఢియని మాత్రము చెప్పఁజాలము. స్త్రీల యావరణములోనికి పోవుటకును ఒక పెద్ద ద్వారము గలదు. అది శృంగారద్వార మని కొందఱి యభిప్రాయము.

(3) పురుషులు మాత్రమే ప్రవేశింపఁగలిగిన యావరణము (*Court of Israel*) లో కొన్ని కట్టడములు గలవు. వాటిలో నొకటి సన్హెడ్రీకు సభామందిరము. ఇతరమైనవి ఆయా వస్తు సామగ్రులనుంచు కొట్లుగా వాడిరి.

(4) పురుషుల యావరణమునకు కొంచె మెత్తుగా మఱియొక యావరణము గలదు. దీనికి యాజకుల ఆవరణమని (*Court of Priests*)

పేరు. బలిపీఠ మిచ్చుటనే యున్నది. యాజకులు గాక యితరులు ఇచ్చటికిఁ బోవుటకు సెలవు లేకున్నను, అర్పణముల నర్పించువారు తమ యర్పణలతోఁబాటుగా నీ స్థలమును సమీపించ వచ్చును.

(5) ఈ యాజకుల ఆవరణమందే దేవాలయము గలదు. ఇది జెరుబ్బాబెలు కట్టించినదే గాని దీనిని చాలమట్టుకు పెంపకముచేసిరి. దాని ప్రక్కలయందు ఇండ్లు కట్టించుటవలన ఇదివఱకు వలె 20 మూరలుగాక దానివెడల్పు 100 మూరలయ్యెను. దాని గోపురముల యెత్తును 100 మూరలు. ఈ యాలయమునందు అతి పరిశుద్ధ స్థలము, పరిశుద్ధస్థలములను రెండుభాగము లక్లే యుండెను. వాటికి మధ్య 3 మూరలు ఎడముగా నుండు రెండు చక్కని తెరలు లున్నవి. లోపలికి వెళ్లుటకు ద్వారములు ఒకదానికి ఉత్తరమునందును రెండవదానికి దక్షిణమందు నున్నందున ఎవరును లోపలిభాగమును చూడ వీలుగాక పోయెను. క్రీస్తు చనిపోయినప్పుడు లోపలి భాగము కనబడునట్లీ తెరలలో నేదో యొకటి చినిగెను (మ 27[51]). పరిశుద్ధస్థలములోకి ప్రవేశించుద్వారమునొద్దను ఒక తెరను వేసిరి.



రోమీయులు దేవాలయపు ఉపకరణములను దీసికొనిపోవుట

(6) **దేవాలయశిఖరము** (మ 4[5] లూ 4[9]) క్రీస్తు శోధనలనుగూర్చిన చరిత్రయందుమాత్రము ఈ మాట కనఁబడును. కిద్రోనువైపున నున్న ప్రాకారగోపురములలో నొకటియని కొందఱనుకొనుచున్నారు. అట్లయినయెడల దాని యెత్తు ఆ గోడ గోపురము లదిమాత్రమేగాక ఆ కొండ అంచుతోకూడ కలిసినదని తెలిసికొనవలెను. మఱికొందఱు పైన (5) లో గుడికి తూర్పుగానున్న మంటపముపై నున్న గోపురమని యభిప్రాయపడుచున్నారు. అక్కడనుండి క్రీస్తు దూకినయెడల జనులలో నెక్కువ మంది చూచుటకు వీలుండును గావున, ఇదే ఆ శిఖరమై యుండవచ్చును.

లోకమందలి వింతలలో నొకటిగా నెంచఁబడిన ఈ దేవాలయము క్రీస్తు ప్రవచించినట్లు (మ 24[2] మా 13[2] లూ 21[6]) రాతిమీఁద రాయి యొకటియైనను నిలిచియుండకుండునట్లు రోమను వారిచే నాశము చేయఁబడెను. క్రీ॥ శ॥ 70 సం॥న రోమనులు యెరూషలేమును ముట్టడించియున్నకాలమున యూదులు దేవాలయ ఆవరణమును తమకు కోటగాఁ జేసికొని దానిచుట్టునుండు మంటపములను కాల్చివేసిరి. గాని రోమనువారి సేనానాయకుఁడగు టైటసు ఆజ్ఞకు విరుద్ధముగా దేవాలయమున నొక రోమీయ భటుఁడు నిప్పు ముట్టింపఁగా దానిలో అగ్నిచే కాల్చఁబడునదంతయు కాలిపోయెను (యుద్ధ 6. 3,1; 4,5; 5.1; 9.2). తరువాత రోమీయులు దాని గోడలను పడఁగొట్టిరి (7.1, 1). క్రీ॥ శ॥ 136 సం॥కు పూర్వము హాడ్రియను (*Hadrian*) అను చక్రవర్తి ఆ స్థలముమీద ద్యుపతికి (*Jupitar*) ఒక గుడిని కట్టించి ప్రతిష్ఠించెను. మతభ్రష్టుఁడగు యూలియను (*Julian*) అను చక్రవర్తి క్రీ॥ శ॥ 363 నందు క్రీస్తుచెప్పిన ప్రవచనమును (మ 24[2]) నిరర్థకపఱచఁగోరి ఆ యాలయమును మఱల కట్టించ యత్నించెను గాని పునాదుల నుండి మంటలు వెలువడినందున కట్టించఁజాలక

భగ్నమనోరథుఁడయ్యెను. ప్రస్తుతము ఆ స్థలమునందు ఓమారు మసీదు అను గొప్ప భవనమున్నది. 1867, 1870 సం॥లలో నొక శిథిల పరిశోధకుఁ డాస్థల సమీపమునందు 100-125 అడుగుల లోతు నఱకు చెత్తచెదారము పడియున్నట్లు కనుగొనెను. ఇప్పటికిని అక్కడ పడియున్న మూలరాళ్లు 14 లేక 15 అడుగుల పొడవును 3½ లేక 4½ అడుగుల ఎత్తునుగలవై యున్నవి. ఆగ్నేయదిక్కున కనఁబడిన రాళ్లపై ఫేనీకే వారి అక్షరములు చెక్కఁబడి యున్నందున సొలొమోను కాలము నుండి ఆ రాళ్లుండవచ్చునని యూహింప వీలగు చున్నది. దేవాలయ ఆవరణము దాదాపు 1000 అడుగుల పొడవుండెనని కనుగొనిరి. దేవాలయమున్నతావు లోయనుండి దాదాపు 200 అడుగుల ఎత్తుగా కట్టఁబడిన గోడలుగల ఉన్నతస్థలము మీఁద నుండెననియు తెలిసినది. లోపలి ఆవరణములలోకి అన్యులు ప్రవేశింపరాదను వ్రాఁతలుగల పలకలు ఇటీవలనే కనుగొనఁబడెను.

**దేవాలయశిఖరము** దేవాలయము IV 3(6).

**దేవుడు** (God). దేవునిగూర్చి బైబిలు బోధించు దానిని వివరింపఁదలంచినయెడల బైబిలు యావత్తును వివరింపవలసివచ్చును. బైబిలు దేవుని గూర్చియు, ఆయన పనులనుగూర్చియు తెలుపుచున్న గ్రంథమై యున్నది. బైబిలు దేవుని సృష్టితో నారంభమగునట్లు ఆదికాండమునందు చదివి తెలిసికొనుచున్నాము. మానవులు పాపము చేసినందున, దేవుఁడు వారిని పాపమునుండి రక్షించుటకు చేసిన పనివివరము పాత నిబంధనలో నున్నది. వారాయన గద్దింపులను లక్ష్యపెట్టక మూర్ఖచిత్తులు కాఁగా ఆయన వారికి విధించిన తీర్పులవలనను ఆయన పనులు మాడఁగలము. ఇట్లు మానవులు గ్రహించుకొనఁగలిగినంతవఱకు దేవునిగూర్చి వారికి వివరించఁబడినట్లు పాత నిబంధనవలనఁ దెలియుచున్నది గాని, క్రొత్త నిబంధనలో దైవావతారియగు క్రీస్తుద్వారా దేవుని సంగతులు పూర్ణముగా బయలుపడినట్లు చూడఁగలము. బైబిలునందున్న చివరిదగు ప్రకటన గ్రంథము దేవుని పని యెట్లు పూర్తియగునో బయలుపఱచుచున్నది. ఇట్టి బైబిలుబోధలు బహు సంక్షేపముగా నీ శీర్షికయందు వివరింపఁబడును.

ఈ బోధ ఆరంభమునందే పూర్ణముగా నుండక, క్రమక్రమముగా బైలుపడెను (హెబ్రీ 1[1,2]).

I. మోషే ధర్మశాస్త్రమునకు పూర్వమున్న బోధలు.

1. అబ్రాహామునకు పూర్వపు బోధలు:—ఇవి యా కాలమునందు జీవించిన మానవుల కందఱి కుండిన బోధలకు సంబంధించినను, ఇతరుల బోధల యందలి తప్పులు అందులో కాన్పింపవు. ఆదికాండమునందున్న సృష్టిక్రమము నాబిలోను సృష్టిక్రమము ననుసరించునని శాస్త్రులు తెలిసికొనిరి గాని ఆ క్రమమునందు ఆయా దేవతలు సృష్టించినట్లున్నది గాని ఆదికాండమునందు అద్వితీయుఁడగు దేవుఁడే సమస్తమును తన మాటమాత్రముచే సృష్టించెనని స్పష్టముగా నున్నది (ఆది 1). ఆరంభమున అన్యులకు నిట్టి బోధయే యుండెనని బైబిలు బోధించుచున్నది. దేవుఁడు తన దైవత్వమును, శక్తిని సృష్టివలననే యందఱికి విశదపఱచెనని బైబిలు తేటగా బోధించును (కీర్త 8,19 రోమా 1[18-21]) గాని, మానవులు పాపముచేసి పరిశుద్ధుఁడగు దేవునికి భయపడక, ఆయన దివ్యలక్షణములను మఱచి మూర్ఖముగా విపరీతమైన విగ్రహములను చేసికొని వాటికి మ్రొక్కిరనుటకు దీని బోధయే యున్నది (1[22-32]). ఆది 1-11 అధ్యాయములలో అనేకవేల సంవత్సరముల చరిత్ర బహు సంక్షేపముగా నుండినను, అది యా చరిత్రయొక్క సార మనఁదగును. ఆది పురుషులనేను నోవహునను దేవుఁడు తన చిత్తమును విశేష ప్రత్యక్షతలవలన కనఁబఱచి నప్పటికిని, మానవులు పాపమువలన చెడి ఈ విధముగా నిజమైన దేవుని నిరాకరించిరని తెలిసికొనవలెను.

2. అబ్రాహాము మొదలు మోషే వఱకున్న బోధలు:—తనను గూర్చిన సత్యజ్ఞానము నుపదేశించుటకై దేవుఁ డొకని నియమించుకొనెను. అతఁడే అబ్రాహాము (ఆది 12). అతడు ఏక దేవునిగూర్చిన బోధ నంగీకరించెను. అతని సంతతివారిలోనిది వ్యాప్తమగుటకై వారిని విశేషమగు ఒక క్రమశిక్షయందుంచుట అవసరముగ నుండెను. కనుకనే దేవుఁడు ప్రత్యేకమగు దేశమును నియమములను వారికనుగ్రహించెను. ఆ కాలమునందుండిన యితరులకు ఏకదేవుని

గూర్చిన జ్ఞానము బొత్తుగా లేదని బైబిలు బోధింపుట లేదు. మెల్కీసెదెకు సర్వోన్నతుఁడగు దేవునికి యాజకుఁడు ($14^{18}$). అతఁ డొకఁడు మాత్రమే యట్టివాఁడనుకొన వీలుగాదు ఇంక ననేకు లుండవచ్చును గాని, మానవుల చరిత్రను చూడఁగా ఏకదేవసిద్ధాంతము గలవారగు యూదులు, క్రైస్తవులు, మహమ్మదీయు లందఱును అబ్రాహామునే అట్టి జ్ఞానమునకు మూలపురుషునిగా భావించి గౌరవించెదరు. ఆ మతము లందు తప్ప పలుదేవతల నారాధింపక ఏకదేవుని మాత్రము ఆరాధింపవలెనను బోధ ఈ లోకము నందలి యితర మతములలో లేదని చెప్పఁదగును. అబ్రాహాము సంతానీకులలో మఱీ ముఖ్యముగా ఇశ్రాయేలీయుల తెగలలో ఏకదేవునిగూర్చిన బోధ లెట్లు కాపాడఁబడినవో అది పాతనిబంధనయందు వివరింపఁబడిన ముఖ్యవిషయమై యున్నది.

3. మోషేకాలమునకు పూర్వము దేవునికి పెట్టఁబడిన పేరులు:—ఎలోహీము (*Elohim*) అను పేరు (ఆది $1^{1,2,5,6}$ మొ॥) శక్తి ప్రభావములను దెలుపునదై యున్నది. ఈ పదము అసలునందు బహువచనాంతముగా నున్నందున, ఆ కాలమునందుండినవారు బహు దేవతాసమ్మిక గలవారై యుండిరని కొందఱు వాదింతురు గాని అనేక భాషలలో చేసినట్లు ఇచ్చటకూడ గౌరవార్థముగా బహువచనాంతముపయోగింపఁ బడెనని తెలిసికొనవలెను. ఈ పదమునకు సంబంధించిన పేరులు ఆదికాండమునం దింకను గలవు. అవెవ్వి యనఁగా:—

(1) మెల్కీసెదెకు ఆరాధించినవాఁడు **సర్వోన్నతుడగు దేవుడ**నఁబడెను (ఆది $14^{18-20,22}$). అసలునం దది ఎల్ ఎల్యోను (*'El' Elyon*) అనఁబడెను. సంఖ్యా $24^{16}$ లో ఎల్యోను అని పేరుగా నున్న పదమును **మహోన్నతు** డని తెనిఁగించిరి. ఇది ఔన్నత్య వైభవమును సూచించెను.

(2) **సర్వశక్తిగల దేవుడు** అను పేరు ఆది $17^{1}$ నం దున్నది. అసలులోనిది ఎల్ షద్దై (*'El' Shaddai*) అనఁబడెను. ఇది సర్వశక్తి గలవాని ప్రభావమును దెలియఁజేయును. $28^{3}$ $35^{11}$ $43^{14}$ $48^{3}$ నందును ఈ పేరు కలదు. ఇది మోషేకాలమునకుఁ బూర్వము దేవుడు తన్ను తాను బైలుపఱచుకొనిన ముఖ్యనామమని నిర్గ $6^{3}$ వలనఁ దెలియుచున్నది.

(3) ఆది $21^{33}$ నందు **నిత్యదేవుడు** అను పేరు గలదు. అసలునందు ఇది ఎల్ ఓలాము (*'El' Olam*) అను పదమై యున్నది. అది నిత్యుఁడగు దేవుని ప్రభావమును సూచించును.

(4) దేవుఁడు యాకోబుకు ప్రత్యక్షమై తాను బేతేలు **దేవుడ**నని చెప్పుకొనెను. (ఆది $35^{7}$). అసలునందు అది ఎల్ బేతేలు (*'El Bethel*) అను పదమై యున్నది. ఇది ప్రత్యేకమైన పేరుగాక, ఇదివఱకు కలిగిన ప్రత్యక్షతను సూచించెడి నామముగా నున్నది.

(5) ఇవిగాక **ప్రభువు** అని అర్థ మిచ్చు అదోనై (*Adonai*) అను పదమును గలదు (ఆది $15^{2-8}$ $18^{3,27-30}$ $20^{4}$ మొ॥).

(6) **యెహోవా** (*Jehovah*) అను పేరు సాధారణమైనది (ఆది $2^{4,5,7}$ మొ॥). ఆదికాండము 1 అధ్యా॥నందు ఎలోహీము అను పేరును, 2 అధ్యా॥నందు యెహోవా అను పేరును వాడఁబడుటచే ఇవి రెండును ఆరంభమున ప్రత్యేకమగు వివరములై తరువాత నొకానొక చరిత్రకారునివలన నొకటిగాఁ చేర్చఁబడెనని యభిప్రాయపడువారు గలరు. ఈ చరిత్రలు జరిగిన వెంటనే వ్రాయఁబడక, అనేక సంవత్సరములకుఁ బిదప వ్రాయబడెనను సంగతిని మఱువరాదు. యెహోవా అను పేరు మొదట నిబంధనపేరుగా నియ్యఁబడినట్లు కనఁబడును (నిర్గ $3^{14}$ $6^{3}$). ఆ పేరు ఇయ్యఁబడిన పిదప ఆదికాండము వ్రాయఁబడెనని తెలిసికొనవలెను. అందుచేత నా పదమును ఆదికాండమందలి చరిత్రలో నుపయోగింపఁగలిగిరి. ఆ చరిత్రలో నెచ్చట యెహోవా అను పదమును సార్థకనామముగా వాడఁదగునో అట్టిచోట్ల దానిని వాడినట్లు ఇతరుల యభిప్రాయమై యున్నది.

4. దర్శనములు మొదలగువాటియందు దేవుఁడు మానవుఁడై యున్నట్లుగా నున్న విషయములు:—ఆదికాలపు చరిత్రయందు దేవుని ప్రత్యక్షతలు మెండుగాఁ గనఁబడుచున్నవి (ఆది

$3^{8-24}$ $4^{6-13}$ $9^{8-17}$ $18^{1-15}$ మొ॥). దేవుఁడు మానవునివలె వారికి దర్శనమిచ్చినట్లు వీటియందు కనఁబడును. మానవకోటియొక్క బాల్యదశయం దీరీతిగా ఆయన దర్శనమిచ్చుట యత్యవసరమై యున్నది. మనము దేవుని సంగతులను అట్టి పూర్వకాలపు చరిత్రవలన పూర్ణముగాఁ దెలిసి కొనఁజాలముగాని వారి గ్రాహ్యశక్తికొలఁది ఆయన వారికి తన సంగతులను దెలుపుకొనెను. అప్పుడు మాత్రమేగాక నేటివఱకును మనము దేవునిగూర్చి చెప్పునప్పుడు మానవరీతిగాఁ గాక మఱియొకరీతిగా మాట్లాడఁజాలము. అట్లయిన యెడల, మానవకోటియొక్క బాల్యదశలో ఆయన మఱెక్కువగా అట్లు వారితో మాట్లాడె ననుట కెట్టి సందియమును లేదు. మోషేకాలమునకు పిమ్మట సహా అతఁడు దేవుని పూర్ణమహిమను చూడలేక పోయెనను సంగతిని సూచించుటకు దేవునికి వెనుకపార్శ్వమున్నట్లు (నిర్గ $33^{23}$) అలంకార రీతిగా చెప్పఁబడెను. దేవుని ముఖము అని ఆ వాక్యములోనే చెప్పఁబడినదియు అట్టి అలంకారమే. ఆయన మనవలెనే చేతులతోను (యెష $45^{12}$), హస్తములతోను ($59^{1}$), వ్రేలితోను (నిర్గ $8^{19}$ భాషాంతరము) తన పనులను చేయుచున్నట్లు వ్రాయఁబడెను. తన వాక్యమును మన కనుగ్రహించిన ఆయన నోటితో మాట్లాడుచున్నట్లు (యెష $1^{2}$) నం దున్నది. దేవుఁడు సంతాపపడుట (ఆది $6^{6}$), కోపపడుట (నిర్గ $4^{14}$) మానవరీతిగా చెప్పఁబడిన విషయములై యున్నవి (ఉగ్రత చూ॥). మనుష్యులు దేవునిగూర్చి యిట్లు మానవరీతిగా చెప్పుట సహజము. అయితే మనము దేవుఁడు శరీరరీతిగాఁగాక ఆత్మరీతిగా నున్నాఁడనునది బైబిలుయొక్క దృఢమైన బోధయై యున్నదని యెంతమాత్రమును మరువరాదు. ఆదికాలములో సహా ఆయన ఏకదేవుఁడును, ప్రభావము గలవాఁడును, సర్వోన్నతుఁడును, సర్వశక్తుఁడును, నిత్యుఁడును, పాపమును శిక్షించువాఁడును భక్తులకు ప్రతిఫలమిచ్చువాఁడునై యున్నట్లు తనను తాను కనుపఱచుకొనినట్లు ఆ కాలచరిత్రలో సహా కనఁబడును.

**II. మోషేకాలమునుండి పాతనిబంధన చివరివఱకున్న దేవునిగూర్చిన సంక్షేపబోధ.**

1. దేవునిగూర్చి తెలిసికొనుటకై కాలమునందుఁ జేయఁబడిన విశేష యేర్పాటులు:—ఇశ్రాయేలీయులకు దేవునిగూర్చి బోధించుటకై తగిన యేర్పాటులు మోషేకాలమునుండి గలవు. అవేవనఁగా:—

(1) ధర్మశాస్త్రమునకు సంబంధించిన యేర్పాటులు. దేవుఁ డిశ్రాయేలీయులతోఁ జేసిన నిబంధనయు, గుడారమునకు సంబంధించిన నియమములును, యజ్ఞములను గూర్చిన యేర్పాటులును, యాజకత్వమును గూర్చిన నియమములన్నియును పట్టివిగాక, దేవునిగూర్చి బోధించుటకైన సూచనలుగా నున్నవి. దేవుఁడు చేసిన నిబంధనకు సూచనగా యెహోవా అను నామము ఈ కాలము మొదలుకొని వాడుకలోనికి వచ్చెను. అసలుభాషలో కీర్త $68^{4}$ నందున్న యాహు అను క్లుప్తరూపమునుకూడ యెహోవా యని తెనిఁగించిరి. ఆ పదమునకు ఉన్నవాఁడు అని శబ్దార్థము. ఈ పదము దేవుని స్వయంభుత్వమును ముఖ్యముగా సూచింపక, ఆయనయొక్క విశ్వాస్యతను సూచించు సార్థకనామ మయ్యెను. దేవుఁడు పరిశుద్ధుఁడు గాన ఆయన ప్రజలును పరిశుద్ధులై యుండవలెనను సంగతిని ధర్మశాస్త్రనియమము లేకగ్రీవముగా బోధించుచున్నవి (లేవీ $11^{44}$ $19^{2}$ మొ॥).

(2) దేవుని క్రమశిక్షవలన మనము ఆయన గుణలక్షణములను దెలిసికొనఁగలము. పాతనిబంధన చరిత్ర యావత్తును అట్టి క్రమశిక్షగా నెంచఁదగును. పాపవిషయమైన అర్పణలు కొంతవఱకు నట్టివని ధర్మశాస్త్రము కనఁబఱచు చున్నది. అందున్న నీతిబోధలును దానికి సంబంధించినవి. అన్నిఁటికన్న ప్రవక్తలు దేవుని క్రమశిక్ష యెట్టిదో దానిని మఱింత విశదపఱచిరి. వీటిద్వారా దేవుఁడు అద్వితీయుఁడును (యెష $44^{8}$), నీతిమంతుఁడును (యిర్మీ $12^{1}$), పరిశుద్ధుఁడును (యెష $6^{3}$), కనికరముగలవాఁడును (యోవే $2^{13}$), ఒక జనమునకుమాత్రమేగాక సర్వలోకమునకు దేవుఁడని (యెష $54^{1-3}$) స్పష్టమగుచున్నది

2. ఇశ్రాయేలీయులు క్రమక్రమముగా దేవునిగూర్చి మఱింత తేటగా నేర్చుకొనిరి. ఇశ్రాయేలీయుల చరిత్రయంతయు నొక్కటే

రీతిగా నుండక, అనేకమార్పులతో గూడిన చరిత్రయై యున్నది. ప్రతిసారి వారు దేవుని గూర్చి విశేషమైన సత్యములను నేర్చుకొనిరి.

(1) వారు అరణ్యమునుండి కనానులోఁ బ్రవేశించునప్పుడు, తమ యోగ్యతనుబట్టి గాక తన యధికమైన కృపచేతనే, దేవుఁడు తమ్మును తనకొఱకైన స్వాస్థ్యముగా నేర్పఱచుకొనెనని దెలిసికొనిరి. తమయెడల ఆయన కనుపఱచిన యధికమైన కృపనుగూర్చి తెలుపుటకు, ఈ కాలమును వారు ఆధారము జేసికొనిరి. (నిర్గ $20^{1,2}$ కీర్త 105 యెష $5^{1-7}$ యిర్మీ $2^{21}$ హోషే $9^{10}$ మొ॥).

(2) రాజు లేలుకాలమునందు దేవుఁడు అభిషేకించినవానిద్వారా ఈ లోకమునందు తన రాజ్యమును స్థాపించునను సత్యమును ఆయన వారికి నేర్పినటుల మొదట కనఁబడును (II సమూ $7^{16}$ యెష $9^{7}$). ఈ కాలమునందే వారిరాజులలోఁ గొందఱు బయలుదేవతాపూజను దేశమునందు నెలకొల్పఁగా, దేవుని శక్తి ప్రభావములను గనపఱచుటకు ప్రవక్తలు విశేషముగా పనిచేసిరి (I రాజు 17,18). దేవుని ప్రభావమునుగూర్చి ప్రవక్తలు చేసిన బోధలు వీటికి సంబంధముగా నున్నవి.

(3) దేవుఁడెట్టి పక్షపాతమును జూపక అపరాధులైనయెడల తనవారిని సహా శిక్షించునని చెఱకాలమునందుఁ దెలిసికొనిరి. తనను తిరస్కరించి మఱచినవారినైనను, ఆయన మఱువక వారి నా చెఱనుండి రక్షించుటవలన, ఆయనకు రక్షకుఁడు, విమోచకుఁడు అనునట్టి సార్థకనామములు పెట్టుటకు నేర్చుకొనిరి. శ్రమలమూలముగా నిట్టి రక్షణ కలుగునని వారు గ్రహించి శ్రమపడుచున్న అభిషిక్తునిగూర్చి నేర్చికొనిరి (యెష 40-53).

3. ఇశ్రాయేలీయులు అన్యజనాంగములచే చుట్టఁబడియుండఁగా, వారి వాడుకల నభ్యసించుట వారికి నైజమాయెను. అరణ్యమందు సంచారము చేయుట మొదలుకొని (సంఖ్యా $25^{1-9}$), చెఱకాలమువఱకు (యిర్మీ $44^{15-23}$) వారు లెక్కలేనిసారులు విగ్రహారాధన నభిమానించి, దేవునివిడిచి అన్యదేవతలను గొలిచిరి. ఇందువలననే వారికి శిక్షలు పలుమాఱులు సంభవించెను. వారికిట్లు బుద్ధి భ్రమ కలిగినను పాత నిబంధనలోని నియమములు క్రమశిక్షలు మొదలగువాటివలన దేవునిగూర్చిన యీ దిగువ సత్యములను వారు నేర్చికొనిరి:—(1) యెహోవా దేవుఁడు ఏకదేవుఁడు (యెష $44^{6}$). (2) విగ్రహములు నట్టి శూన్యములు ($44^{9-20}$). (3) దేవుఁడు పరిశుద్ధుఁడును నీతిమంతుఁడునై యున్నాఁడు. అందుచేత ఆయన ప్రజలును అట్టివారై యుండవలెను ($5^{16}$).

4. పాత నిబంధనయందున్నట్లు దేవునిగూర్చిన బోధల నీ దిగువరీతిని క్లుప్తముగా వివరింపవచ్చును.—

(1) యెహోవా ఏకదేవుఁడు (యిర్మీ $10^{6-10}$ యెష $42^{8}$).

(2) ఆయన సజీవుఁడైన దేవుఁడు (యిర్మీ $4^{2}$ $10^{10}$). విగ్రహములు నిర్జీవములు (యెష $44^{9-17}$).

(3) సజీవుఁడగు ఈ దేవుఁడు నిత్యుఁడు (కీర్త $90^{2}$ యెష $44^{6}$ $48^{12}$).

(4) ఆయన సర్వవ్యాపి (కీర్త 139).

(5) సర్వశక్తుఁడు (యెష $43^{6}$ $45^{9}$ $50^{2,3}$ $64^{1-4}$). ఆయనకు సైన్యముల కధిపతియగు యెహోవా యను బిరుదు గలదు. ఇదియు ఆయన శక్తిని సూచించును. ఆయన మొదట యుద్ధదేవుఁడుగా నెంచఁబడెననియు, అందువలన ఆయనకు సేనలున్నట్లుగా చెప్పఁబడుననియు కొందఱనుకొనుచున్నారు. దీని ఉత్పత్తి యేదియైనను, అది శక్తి ప్రభావములను చూపించు బిరుదేగాని ఆయన యుద్ధదేవుఁడై యున్నట్లు ఆ వాక్యమునందు కించిత్తు సూచనయైనను లేదు (I సమూ $15^{2}$ $17^{45}$ యెష $1^{9-24}$ $5^{16}$ $6^{3,5}$ మొ॥). ఆయన సర్వశక్తి ఈ ప్రపంచములను సృష్టించి పరిపాలించుటయందుమాత్రమే గాక, తన ప్రజలను కాపాడుటయందును కనఁబడుచున్నది. దీనికి సూచనగా ఇశ్రాయేలున కాధారమైనవాఁడు అను బిరుదొకటి ఆయనకు గలదు (I సమూ $15^{29}$). ఆయన వారి నుద్ధరించువాఁడు (I దిన $29^{11}$). దేవుఁడు తన ప్రజలకు బలమును (నిర్గ $15^{2}$), ఆశ్రయమునై (కీర్త $28^{7,8}$) యున్నాఁడు. శైలము, కోట

**దేవునికి భయపడువాడు** భయభక్తులు చూ॥

**దేవునికుమారుడు** యేసుక్రీస్తు IV 3 (1) (*c*) చూ॥

**దేవుని (యెహోవా) కుమారులు, దేవునిపిల్లలు, దైవపుత్రులు** (Sons of God, Children of God). బైబిలులోని కొన్ని వాక్యములయం దిది మానవులకుగాక దేవదూతలకు పెట్టఁబడిన పేరైయున్నది (యోబు $1^{6}$ $2^{1}$ $38^{7}$). దాని $3^{25}$ లలోని దేవతలు అను మాటకు ప్రతిగా అసలుభాషలో దేవునికుమారులు అను నర్థమిచ్చు పదమున్నది. ఆది $6^{2}$ లోని దేవుని కుమారులుకూడ అట్టి దేవదూతలే యని సాధారణముగా ననుకొందురుగాని కొంద ఱది దేవునియందు భక్తినుంచిన షేతు సంతతి వారికిఁగల బిరుదని యనుకొందురు. కీర్త $82^{6}$ లో న్యాయాధిపతులకు దేవునికుమారులు అను బిరుదు కలదు (యోహా $10^{34}$). ఇదేవిధముగా కీర్త $29^{1}$ $89^{6}$ లలో నుండు దైవపుత్రులు అను పదము కూడ గొప్పవారినిగాని దేవదూతలనుగాని సూచించును. $2^{7}$ II సమూ $7^{14}$ లో ఇది రాఁబోవు మెస్సీయ యను రాజునకు పెట్టిన పేరై యున్నది.

పైఁజెప్పిన వాక్యములలో తప్ప దేవునికుమారులకు సంబంధముగ నున్నపదములన్నియు దేవునికి మానవులకునుగల సంబంధమును తెలుపును. సృష్టి వలననే యందఱును దేవుని పిల్లలని యొకవిధముగా చెప్పఁదగును (మలా $2^{10}$ కార్య $17^{25}$). అయితే యీ మాటలను బైబిలులో ఇట్టి యర్థముతో నుపయోగించలేరిగాని దేవునికిని మానవులకును గలిగిన విశేషసంబంధమును చూపుటకే ఉపయోగించుకొనిరి. ఇట్లు ఇశ్రాయేలీయులు నా కుమారుఁడు అనఁబడెను (నిర్గ $4^{22}$ హోషే $11^{1}$ యెష $1^{2,3}$ కీర్త $103^{3}$ మొ॥). ఇశ్రాయేలీయులు తమ యిబ్బందులలో తండ్రిభావముగల దేవుఁడని జ్ఞాపకము చేసికొని యాదరింపఁబడిరి (యిర్మీ $31^{9,18-20}$ యెష $63^{16}$ $64^{8-12}$). చెఱకుఁ బిమ్మట ఇశ్రాయేలీయులను తిరిగి పోగుచేయుట కుమారులను కుమార్తెలను తిరిగి పోగుచేసినట్లుగా ఎంచఁబడెను ($43^{6}$). ఇశ్రాయేలీయులు తమ [illegible]మీఁదగాక తమ గుణములను బట్టియే దేవునికుమారులై యున్నారను బోధ పాత నిబంధనలోకూడ కనఁబడును. ద్వితీ $32^{5}$ లో వారిలోని దుష్టులు ఆయన పుత్రులుకారు అని యున్నది. దుర్మార్గతల చేతనే వారు దేవుని ప్రజలు కారైరి (హోషే $2^{9}$). కుమారస్థితికిఁదగిన నడతయుండక పోయినయెడల దేవుఁ డట్టి కుమారస్థితి నంగీకరింపక యుండును (మలా $1^{6}$). దేవుని కుమారులనఁబడువారు ఆయనకు విధేయులై ఆయనయందు నమ్మకముంచెదరు అను బోధ ఈ విధముగా పాతఁ నిబంధనలో నున్నదనుటకు సంశయమేమియు లేదు.

క్రొత్త నిబంధనలోకూడ ఇదే ముఖ్యబోధయై యున్నది. దేవుఁడు మనకు తండ్రియనునదే క్రీస్తు దేవునిగూర్చి మనకుచేసిన బోధలన్నిఁటిలో ముఖ్యమైనదై యున్నది (మ $6^{10,32}$ లూ $11^{13}$ $12^{32}$ మొ॥). దేవునికి అందఱియెడలను తండ్రిభావము కలదు (మ $5^{44-48}$) గాని మనము ఆయన పోలికగా మార్చఁబడుటవలననే మనము విశేషరీతిగా ఆయన కుమారులమని యనఁబడుటకు తగినవార మగుదుము ($4^{9,45}$ = లూ $6^{35}$). మనము ఆయనను విశ్వసించుటచేతనే (యోహా $1^{12}$ $11^{52}$ I యోహా $3^{1,2,10}$ గల $4^{2,3,6}$) అట్టి పిల్లలము కాఁగలము. ఇది పరిశుద్ధాత్మ మనలో పుట్టించు భావమై యున్నది (రోమా $8^{14}$ గల $4^{6}$ స్వీకృతము చూ॥). ఈ పిల్లల స్వాస్థ్యమెంత గొప్పదో అది యిప్పుడు కనఁబడక ఇఁకమీఁదట బయలుపఱచఁబడును (రోమా $8^{17-25}$ గల $4^{1-7}$ ఎఫె $1^{14-18}$ I యోహా $3^{2}$ ప్రక $21^{7}$).

**దేవుని కొండ.** ఈ మాటచే తెనిఁగించఁబడిన రెండు హెబ్రీ పదములు గలవు.

1. (God's Hill). I సమూ $10^{5}$ నందున్న గిబియాత్ అను పదము దేవుఁడు అనుదానితో కలుపఁబడి దేవునికొండ యని తెనిఁగింపఁబడెను. ఇది గిబాను సూచించునని యభిప్రాయపడు చున్నారు (గిబా చూ॥).

2. (Mountain of God). యెహె 43 నందు దేవునికొండ యని తెనిఁగింపఁబడిన మఱియొకటియై యెహెజ్కేలుకు దర్శనమందఁ బడిన దేవాలయములోని బలిపీఠమును సూచించును (దేవాలయము II 2 చూ॥).

**దేవుని కోపము** ఉగ్రత చూ॥

**దేవునిగొఱ్ఱెపిల్ల (The Lamb of God).** యూదులర్పించిన బలిపశువులలో గొఱ్ఱెపిల్ల బహు సాధారణమైనది. దేవునికర్పించవలసినవాటిని అది ముఖ్యముగా సూచించెను. దీనిని అనుసరించి బాప్తిస్మమిచ్చిన యోహాను యేసునుచూచి దేవునిగొఱ్ఱెపిల్ల అనుపేరు ఆయనకు పెట్టెను. ఇది యెష 53 లో వధకు తేబడు సాధువగు గొఱ్ఱెనుగూర్చిన సంగతిని సూచించుచు దీని నెత్తెననుటకు సంశయము లేదు. అదే సూచన యిర్మీ $11^{19}$ లోను గలదు. మఱియు పస్కాసమయమునందు అర్పింపఁబడిన గొఱ్ఱె రక్తముచే ఇశ్రాయేలీయులకు ఐగుప్తుదేశమునుండి కలిగిన విమోచనమును (నిర్గ $12^{21-28}$) మనస్సునందుంచుకొని యోహానీపేరును ఆయనకు పెట్టియుండెననవచ్చును (యోహా $1^{29}$). ఇదే భావముతో పేతురుకూడ క్రీస్తును గొఱ్ఱెపిల్ల యను బిరుదు నారోపించెను (I పేతు $1^{19}$). పైనున్న వాక్యములనుబట్టి క్రీస్తునకు పెట్టఁబడిన ఈ బిరుదు ఆయన నిర్దోషత్వమును మానవులకొఱకాయన అర్పింపఁబడుటను, ఆయనద్వారా కలిగిన విమోచనము అను నీగొప్ప సత్యములను కనఁబఱచుచున్నదని చూడవచ్చును.

ప్రకటన గ్రంథములో గొఱ్ఱెపిల్ల యను బిరుదు క్రీస్తుకు 27 మారులున్నది (ప్రక $5^{6,8,12,13}$ $6^{1}$ మొ॥). అందులో వాడఁబడిన గ్రీకుపదము పైనున్నదానికి వేఱుగా నున్నను దానిసంగతి ఒకటేయైయున్నది. ప్రకటన గ్రంథమందలి సూచనలలో క్రీస్తుమరణముచే కలిగిన విమోచనము ముఖ్యముగా సూచింపఁబడెను.

**దేవునితట్టు తిరుగుట** మారుమనస్సు చూ॥

**దేవుని రాజ్యము, పరలోక రాజ్యము (Kingdom of God).** ఈ రెండు పదములు నొకటే యర్థమిచ్చును. మత్తయి యను సువార్తికుఁడొకఁడు మాత్రమే పరలోకరాజ్యమను పదమును వాడెనుగాని తక్కినవారు దేవునిరాజ్యమని వాడిరి. యూదులు దేవునిపేరును వాడక, దానికి ప్రతిగా పరలోకమనుపదము నుపయోగించిరి. యూదులకు వ్రాసిన మత్తయి పరలోకరాజ్యమనుమాటను తన సువార్తలో వ్రాసెను.

I. పాత నిబంధనలో దేవుని రాజ్యమును గూర్చిన బోధ:—దేవుని రాజ్యమునుగూర్చిన బోధ ముఖ్యముగా క్రొత్త నిబంధనకు సంబంధించియున్నను, దానిని గూర్చిన సూచనలు పాత నిబంధనయందును గలవు. ఇశ్రాయేలీయులు దేవునికి యాజకరూపమైన రాజ్యముగా నున్నారు (నిర్గ $19^{6}$). గిద్యోను ఇశ్రాయేలీయుల నేలనొల్లక యెహోవా మిమ్ము నేలునని చెప్పెను (న్యాయా $8^{23}$). ఇశ్రాయేలీయులు తమ కొక రాజు కావలెనని కోరినప్పుడు దేవుఁడు సమూయేలుతో వారు నిన్ను విసర్జించ లేదుగాని, తమ్మును ఏలకుండ నన్నే విసర్జించి యున్నారు అని చెప్పెను. ఇవన్నియు పాత నిబంధన కాలమునందు సహా దేవుని ప్రభుత్వమున్నదని సూచించుచున్నవి. రాజులకాలమునం దట్టి సూచనలంతగా తేటగా నున్నట్లు కనఁబడక పోయినను, ఇశ్రాయేలు యూదా రాజ్యముల యేలికలు తమ దుర్మార్గతలవలన పాడయిపోఁగా, దేవుఁడు వారిని తీసివేసి తన స్వంతరాజును వారి కిత్తునను ప్రవచనములు మెస్సీయానుగూర్చిన ముఖ్యప్రవచనములై యున్నవి (యెష $11^{1-4}$ $9^{1-7}$ యిర్మీ $23^{5}$ యెహె $37^{24}$ మీకా $5^{2}$ మొ॥). యెహోవా తానే వారికి రాజై వారి నేలునను సంగతి ప్రవక్తలుకూడ ప్రకటించుచుండిరి (యెష $43^{15}$ $44^{6}$). దేవుఁడు రాజను సంగతిని సూచించు కీర్తనలు గలవు (కీర్త 93-100). ప్రకటన గ్రంథమునందున్న రీతిగానే దానియేలు గ్రంథమునందును గూఢార్థమగు అలంకారములు చెప్పఁబడెను. అంత్యదినములలో నది సర్వలోక రాజ్యమగునను బోధ అందులో తేటగా కనఁబడును (దాని 3, 7, 11). పాత నిబంధన క్రొత్త నిబంధనకు మధ్యగా నున్న అప్రమాణిక గ్రంథములలో అట్టి బోధ లనేకములు గలవు. క్రీస్తులోకములో నున్న కాలమునందు యూదులు పరతంత్ర పాలనకు లోనయి మెస్సీయ వచ్చినప్పుడు, తమ్మును విడిపించి అట్టి రాజ్యమును స్థాపించు ననుకొనిరి (లూ $17^{20}$) గాని యది ఆత్మీయరాజ్యమని గ్రహింపక పూర్ణముగా లౌకిక రాజ్యమని యనుకొనిరి.

**II.** క్రొత్త నిబంధనలో దేవునిరాజ్యమును గూర్చిన బోధలు:— దేవునిరాజ్యము సమీపముగా నున్నదను బాప్తిస్మమిచ్చు యోహాను బోధ (మ $3^{2}$) అతనిపనికి మాత్రమేగాక క్రొత్త నిబంధన బోధలన్నిటికి శ్రుతిగా నెంచవచ్చును.

ఆకాశరాజ్యమును గూర్చిన బోధ క్రీస్తు బోధలలో నొక ముఖ్యవిషయమై యున్నది. ఈ మాటగాని దేవుని రాజ్యమను మాటగాని సువార్తలలో 120 మారులకన్న నెక్కువ కనఁబడును. యోహాను సువార్తలో నది రెండు మారులు మాత్రమున్నను, దానికి ప్రతిగా **నిత్యజీవ**మను పదమదే యర్థమునందు వాడిరి (యోహా $10^{28}$ $12^{25}$). మానవులు రక్షింపఁబడు టయే ఆయా వాక్యములలో దేవునిరాజ్యమందు ప్రవేశించుట యనుదానికి సమానముగా నున్నది (యోహా $5^{24}$ $10^{9}$). ఇట్లే లూ $18^{18}$ నందలి **నిత్యజీవము**, $18^{24}$ లోని **దేవుని రాజ్యము**, $18^{26}$ లోని **రక్షణ** యను మూఁడు పదములు ఒకటే యర్థమిచ్చుచున్నవి.

1. రాజ్యము అను పదమును వాడిన విధము. ఇది కనఁబడు వాక్యములన్నియు, **దేవుని రాజ్యము** అను దానిని నాలుగు విధములుగా వాడినట్లు తెలుపుచున్నవి. (1) దేవుని రాజ్య మొక స్థలముగ సూచించును. అందులో ప్రవేశించుటనుగూర్చిన వాక్యములన్నియు అదే యర్థము నిచ్చును (మ $7^{21}$ $18^{3}$ మా $10^{15-23}$ లూ $18^{24,25}$ మొ॥). అందులోఁ బ్రవేశించుటకు ప్రయాసపడవలెను (మ $7^{13,14}$ $11^{12}$). అందుచేత వారి కమితానంద సౌఖ్యములు సమకూరును ($26^{29}$ మా $14^{25}$ లూ $22^{18,26}$). (2) దేవుని రాజ్యమొక స్వాస్థ్యముగా నెంచఁబడును. ఇట్లు ధన్యత వాక్యములలో అది బీదల యొక్కయు, హింసింపఁబడు వారియొక్క స్వాస్థ్యమై యున్నది (మ $5^{3,10}$). అది పిల్లల వంటి వినయమనస్కుల భాగధేయమగును (లూ $18^{16,17}$). దానిని పొందుటకు తగనివారియొద్ద నుండి అది తీసివేయఁబడి, తగినవారికియ్యఁబడు స్వాస్థ్యముగా నున్నది (మ $21^{43}$). విశ్వాసులగు వారికొద్ది సమూహమునకది స్వాస్థ్యమగును (లూ $12^{32}$). అది యన్నిటికన్న గొప్ప స్వాస్థ్యమై యుండుటనుబట్టి (మ $13^{44-46}$), దానినే వెదకుట వివేక కృత్యమైయున్నది ($6^{33}$ లూ $12^{31}$). (3) దేవునిరాజ్యమొక సమాజముగా నెంచఁబడును. ఆరంభమున నది మిగుల చిన్నదిగా నుండినను చాల వృద్ధియగును (మ $13^{31}$ మా $4^{26}$). అందులో చేరువారు రాజ్య సంబంధులనఁబడెదరు (మ $13^{38}$). ఇతరమైన సమాజములలో నున్నట్లుగా దీనియందును ఉద్యోగస్థు లుండుట యవసరముగా నున్నదిగాని వీరు అధికారులు గాక సేవకులైయుందురు ($20^{21-28}$). (4) దేవునిరాజ్యమొక యుగముగా పరిగణింపఁబడును. ఈ వాక్యములలో నది లోకాంతము అను పదమునకు సాటిగా నున్నది. దానియేలు వర్ణనములలోని రాజ్యమిట్టిదై యుండెను (దాని 3, 7, 11). నీ రాజ్యము వచ్చుగాక అను ప్రార్థనలో దానిరాకడకై యెదురు చూచుచున్నాము (మ $6^{10-13}$ లూ $9^{2,11}$). సిద్ధపడినవారు అందులో పాలిభాగరులగుదురు(మ $25^{1-13}$). నమ్మకస్థులకందులో ప్రతిఫలమును, అపనమ్మకస్థులకు శిక్షయు కలుగును ($25^{15-30}$). ఆ రాజ్యమును దాని నియమములును క్రీస్తు తీర్పుదినమున పూర్ణముగా ప్రత్యక్షమగును ($25^{31-46}$). ఇదే మా $10^{30}$ లో నుండు **రాబోవులోకము.** ఇది యిహమందున్నదానికి భిన్నమై పరమందు ప్రాప్తించువాటిని సూచించును (లూ $18^{30}$).

నవీన పండితులలో గొందఱు క్రీస్తు పైనున్న నాలుగింటిలో చివరిదానినిగూర్చి మాత్రము బోధించినట్లనుకొనుచున్నారు. క్రీస్తా నూతన యుగము అతి సమీపముగా నున్నదను అభిప్రాయముతో తన బోధలన్నిటిని జేసెనని వారి తలంపు. వారు ఆయనజేసిన బోధలన్నిటిని గూర్చి తలంచక వాటిలో నొక్కదానినిగూర్చి మాత్రమే తలంచుటవలన కలిగిన పొరపాటని చెప్పవలెను. దేవుని రాజ్యమీ లోకమందే యున్నది (లూ $17^{21}$). అదీలోకమునందే వృద్ధియగుచున్నది ($13^{31,32}$) గాని అది లోపసహితమైనదిగా నున్నది (మ $13^{24-30}$). లోకాంతమున అది సంపూర్ణముగా వచ్చును (25). ఈ బోధలు భిన్నములుగాక, ఒకదాని నొకటి పరిపూర్తి జేయు బోధలని తెలిసికొనవలెను.

2. అపొస్తలులు దేవుని రాజ్యమనుపదమును వాడినవిధము. క్రీస్తుబోధలకును అపొస్తలుల

బోధకును పూర్ణ ఐక్యము గలదు. వారును దేవుని రాజ్యమనుపదమును ఆయా విధములుగా వాడిరి. హింసింపఁబడు వారి యాదరణ నిమిత్తము తన పత్రికలను వ్రాసిన పేతురు ఆ రాజ్యమును ముఖ్యముగా క్రీస్తు తనవారిని రక్షించుటకు వచ్చుకాలముగా నెంచి దానినిగూర్చి వ్రాసెను (I పేతు $1^{7,8}$ $4^{13}$ $4^{5,6}$). యాకోబు దానిని దీనుల స్వాస్థ్యముగా నెంచినను, అది యింకమీఁదట కలుగఁబోవు భాగ్యమని తాను హెచ్చరికచేసిన క్రైస్తవులకు వ్రాసెను (యాకో $2^{5}$) యోహాను తన పత్రికలలో నిత్యజీవమను పదమును ఎక్కువగా వాడెను. అది విశ్వాసులకు ఇప్పుడు సహా కలిగినను నిత్యముండు స్వాస్థ్యమై యున్నది (I యోహా $5^{11,13}$). ప్రకటన గ్రంథమును చూడఁగా విశ్వాసులు ఇప్పుడు దేవునిరాజ్యములోని వారైనను ($1^{5}$ $5^{10}$), ఆ రాజ్యము అనేక యుద్ధములతో వ్యాపింపఁచేయఁబడి పూర్ణజయమునొందునట్లు ఆ గ్రంథము యావత్తులో కనఁబడును. పౌలు పత్రికలలోకూడ ఈ రెండు విషయములు కనఁబడును. క్రైస్తవులు ఇప్పుడే దూరస్థులుకాక ఈ రాజ్యమునందలి పాలిభాగస్థులై యున్నారు (ఎఫె $2^{19}$). విశ్వాసమువలన నిప్పుడు క్రీస్తు రాజ్య నివాసులముగా నున్నాము (కొలొ $1^{13}$). అయినను ఇది క్రీస్తురాకడకు సంబంధించినదై (II తిమో $4^{1}$)), ఇఁకమీఁదట మనకు స్వాస్థ్యముగా నియ్యఁబడును (I కొరి $6^{9,10}$).

ఈ రాజ్యము ఇశ్రాయేలీయులు అను ఒక జనాంగముదేగాక అందరికి కొఱకైనది (ఎఫె $3^{6}$ రోమా $9^{31,32}$). అందఱు పాపమునుగూర్చి పశ్చాత్తాపపడి, క్రీస్తునునమ్మి అందులో చేరఁగలరు (మ $16^{16}$ కార్య $3^{19}$ $17^{30}$ రోమా $1^{16}$). ఇందులో చేరువారు దేవుని కుమారులై యొకరితో నొకరు సహవాసులై యుందురు. ఇట్టి లోకములో నారంభింపఁబడినపని పరలోకములో పూర్తియగును (I కొరి $2^{9}$).

**దేవోక్తి** (Burden, Oracle). ప్రవక్తలు వాడిన యొక హెబ్రీ పదమును మన తెనుఁగు బైబిలులో దేవోక్తి యను పదముచే తర్జుమాచేసిరి (యెష $13^{1}$ $14^{28}$ $15^{1}$ మొ॥ యెహె $12^{10}$ నహూ $1^{1}$ హబ $1^{1}$ జెక $9^{1}$ $12^{1}$ మలా $1^{1}$). దాని అసలు అర్థము భారము లేక కష్టము అగును. సాధారణముగా ఒక శిక్షా ప్రకటనకు బైబిలులో ఈ పేరు కలదు. యిర్మీ $23^{33-36}$ చూడఁగా అది ప్రవక్తలకు అలవాటైన మాటయైయున్నట్లును దాని యర్థమును గ్రహింపకయే అబద్ధప్రవక్తలు ఈ మాటను వాడినట్లును స్పష్టమగును. అందుచేతనే యిర్మీయా దానిని చులకనగా వాడిన యబద్ధ ప్రవక్తలను గద్దించెను.

క్రొత్త నిబంధనలో ఒక గ్రీకుపదమునుకూడ ఈ మాటచే తర్జుమాచేసిరి (రోమా $3^{2}$ హెబ్రీ $5^{12}$ I పేతు $4^{11}$). అది పలుకుట యను నర్థము నిచ్చునుగాని సాధారణముగా మంత్రముల నుచ్చరించిన వారి దైవికమాటలని అన్యులనుకొని ఈ మాటల నుపయోగించుకొనిరి. ఇదే పదమును కార్య $7^{38}$ లో జీవవాక్యములు అను పదముతో తర్జుమాజేసిరి. ఇచట వేటినిగూర్చి యీ పదమును వాడిరో అవి మానవవాక్కులుగాక దేవవాక్కులనునదే దాని భావమైయున్నది (దేవవాక్కు చూ॥).

**దేశ ప్రజలు** ప్రజలు చూ॥

**దేహమును కోసికొనుట నరుకులు, గాయపఱచుట, చీరుకొనుట** (Cuttings in the flesh). గొప్ప దుఃఖమునకుగాని ఉద్రేకమునకుగాని సూచనగా దేహమును కోసికొనుట ఇశ్రాయేలీయులలో మాత్రమేగాక (యిర్మీ $16^{6}$ $41^{5}$ $47^{5}$ $48^{37}$) వారి చుట్టునుండు అన్యులలోను ఒక వాడుకగా నుండెను (I రాజు $18^{28}$), గాని అది నిషేధింపఁబడెను (లేవీ $19^{28}$ $21^{5}$ ద్వితీ $14^{1}$ నేరములు శిక్షలు III 5 చూ॥).

**దేహసంరక్షకులు, దేహసంరక్షకుల అధిపతి** (Guard, Captain of Guard). పోతీఫరునకును, నెబూజరదానుకును రాజదేహసంరక్షక సేనాధిపతియను బిరుదుండెను (ఆది $37^{36}$ $39^{1}$ $40^{3,4}$ II రాజు $25^{8,10,12,15,18}$ యిర్మీ $39^{9}$ $40^{1,2,5}$ $41^{10}$). దీని మూలపదమునకు వధించెడువారని యర్థముగాన వీరు తలవరులై యుందురని కొందఱి యభిప్రాయము. I దిన $11^{25}$ నందు దావీదుయొక్క దేహసంరక్షకులని తెనిఁగించిన పదము వేఱొకపదమై కావలివాఁడు అని యర్థమిచ్చును. కెరేతీయులు పెలేతీయులు దావీదు

దేహ సంరక్షకులని తలంచుచున్నారు (కెరేతీయులు, పెలేతీయులు చూ॥). అందఱిలో మిగుల నమ్మకమైనవారిని మాత్రమే ఈ పనికి నియోగించుటవలన వారిలో చేరుట ఘనముగా యెంచఁబడెను. వారి యధిపతి మహాఘనుఁడుగ యెంచఁబడెను. నెబూజరదాను, నెబుకద్నెజరు రాయబారి యైనట్లు కనఁబడును (యిర్మీ $52^{12-30}$).

I రాజు $14^{27,28}$ II రాజు $10^{25}$ $11^{4-19}$ II దిన $12^{10-11}$ లో కావలియనియు, కాపుకాయువారనియు, కాయువారనియు తెనిఁగించిన మూలపదము పరుగెత్తువారని యర్థమిచ్చును గాన వీరురాజు ముందఱను వెనుకను పరుగెత్తు దేహ సంరక్షకులను సూచించును.

## దై

**దైవపుత్రులు** దూతలు, దేవునికుమారులు చూ॥

**దైవభక్తుడు** దేవునికి భయపడువాడు చూ॥

**దైవధ్యానము** (Maschil = దేవునిగూర్చిన ధ్యానము). దావీదు కీర్తనల గ్రంథములోని 32, 42, 44, 45, 52, 53, 54, 55, 78, 88, 89, 142 కీర్తనల పేరైయున్నది. ఈ పేరు వీటికి సంబంధించినదిగాక ఇతరులచే నాటికి పెట్టఁబడినదై యున్నది. ఈ కీర్తనలలో ముఖ్యముగా దైవధ్యానమున్నందున ఈ పేరును పెట్టిరి (కీర్తనలు చూ॥).

**దైవావేశము** (Inspiration, Inspiration of the Scriptures). ఆయా మనుష్యులకు కలిగిన దైవావేశము, బైబిలు అను పరిశుద్ధ లేఖనములకుఁగల దైవావేశము అను రెండింటినిగూర్చిన బైబిలు బోధను మనము ముఖ్యముగా కనిపెట్టవలెను.

1\. ఆయావారలకుఁ గలిగిన దైవావేశము. ఇట్టి యావేశము పరిశుద్ధాత్మచేతనే కలుగును. ఈ యాత్మసృష్టిలో పనిచేసెను (ఆది $1^{2}$ కీర్త $104^{30}$ ఊపిరి=ఆత్మ). ఇట్టి ఆత్మావేశమువలననే మానవుఁడు జీవాత్మయయ్యెను (ఆది $2^{7}$). ఆ యాత్మచేతనే ఆయావారికి విశేష శక్తులు కలిగినవి (న్యాయా $6^{34}$ $14^{6,19}$ నిర్గ $35^{31}$). ఆత్మావేశము ప్రవక్తలలో ముఖ్యముగా కనఁబడును (యోవే $2^{2}$ మీకా $3^{8}$ మొ॥ ప్రవచనము, ప్రవక్తలు చూ॥). దేవుని యాత్మచే మానవులకు జ్ఞానమును (యోబు $32^{8}$ I రాజు $3^{28}$ ద్వితీ $34^{9}$), ధైర్యమును (న్యాయా $13^{25}$ $14^{6}$), పశ్చాత్తాపమును, నూతన నడతయు (జెకర్యా $9^{20}$ కీర్త $51^{10}$ యెష $63^{10}$ యెహె $36^{26}$ జెక $12^{10}$) కలుగును. ఇట్టి గుణములను చూడఁగా నివి క్రొత్త నిబంధనలో ఆత్మఫలములని పిలువఁబడిన వాటికి సంబంధములై యున్నవి. క్రీస్తుతానే తన శిష్యులకు ఆత్మను గ్రహించెను (యోహా $20^{22}$). ఆయన పరలోకమున కెక్కినపిమ్మట పెంతెకొస్తు దినమందు శిష్యుల మీఁదికి ఆత్మను పంపించెను (కార్య $2^{2,4}$). క్రొత్త నిబంధనకాలపు క్రైస్తవులను చూడఁగా ఒక విధమైన ఆత్మావేశముచే వారికి విశేషశక్తులు కలిగెను. ఇవి ఆత్మ వరములన్నియు, కృపావరములనియు నందురు (I కొరి 12, కృపావరములు చూ॥). ఇవెంత గొప్పవైనను విశ్వాసము, నిరీక్షణ, ప్రేమ యనువాటికి లోకువవై యున్నవి (I కొరి 13).

అద్భుత శక్తులీ విధముగా ఆత్మావేశమువలన కలిగినవని చెప్పినను అవిగాక క్రైస్తవులకు సాధారణముగా నుండవలసిన సద్గుణములుకూడ ఆత్మవలననే కలుగును. కావున అవికూడ ఆత్మఫలములై యున్నవని చెప్పఁబడును (గల $5^{22,23}$). వింతలనుచేయు శక్తులనిచ్చు అట్టి విశేష వరములకును క్రైస్తవ బ్రతుకుకు కావలసిన ఇట్టి సాధారణ శక్తికిని మధ్య బోధకులు తమ బోధపనిని జయకరముగ చేయునట్లు కావలసిన ప్రత్యేకమగు వరములుకూడ గలవు. అవికూడ ఆత్మావేశమువలన పొందవలెనని తెలిసికొనవలెను (రోమా $12^{6,7,8}$ I కొరి $12^{28}$ కృపావరములు చూ॥).

2\. పరిశుద్ధ లేఖనములకుగల దైవావేశము. పరిశుద్ధ లేఖనములు మానవుల శక్తి వలనఁగాక దైవాత్మ శక్తిచే వ్రాయఁబడుటవలన అవి సాధారణమైనవిగాక దైవావేశమువలన రచింపఁబడినవని తెలిసికొనవలెను. క్రీస్తు స్వంత మాటలనుబట్టి, ఆయన దేవుని యెఱుఁగుటచేతను (మ $11^{27}$) తన సంగతులను గాక తనను పంపిన తండ్రి సంగతులను పలుకుచున్నట్లు చెప్పుటచేతను (యోహా $7^{16,17}$) ఆయన మాటలు దైవావేశము గలిగినవని తేటయగుచున్నది. క్రొత్త నిబంధనలోని గ్రంథ

ములను వ్రాసినవారు ఆత్మచే నడిపింపఁబడిరని క్రీస్తు తన శిష్యులకు చేసిన వాగ్దానములనుబట్టి తెలిసికొనఁగలము (14[26] 16[13]). క్రొత్త నిబంధన గ్రంథములన్నియు ఆ వాగ్దానము పొందిన వారిచే రచింపఁబడినవి.

పాఁత నిబంధనను క్రీస్తు దైవవాక్యమునుగా నెంచినట్లు సూచనలు కలవు (మ 22[43] లూ 24[25]). పాఁత నిబంధననుగూర్చి పౌలు వ్రాయునప్పుడు దైవావేశమువలన కలిగిన ప్రతి లేఖనము (II తిమో 3[16]) అని ఉదాహరించెను. II పేతు 1[21] లోను ఆ బోధయే గలదు. ఇదియుఁగాక క్రొత్త నిబంధనలో నెచ్చటెచ్చట పాఁత నిబంధన వాక్యముల నెత్తి పలికియున్నారో అచ్చట వాటిని ప్రమాణ వాక్యములనుగా నెంచియున్నారు.

## దొం

**దొంగతనము** నేరములు శిక్షలు II 2 (1) చూ॥

**దొంగత్రాసు** నేరములు శిక్షలు II 2 (3) చూ.

**దొర్కా** (Dorcas = లేడి). యొప్పే పట్టణమునందు నివసించిన భక్తిగల యొక స్త్రీ. హెబ్రీ ప్రాకృతమగు అరమేయిక్ భాషలో నామెను తబితా (*Tabitha* = లేడి) యని పిలిచిరి. బీదలైన వారియెడల మిగుల మిగుల దయ కలిగియుండుటచే అట్టి యౌదార్యమునకామె మాదిరిగా నుండెను. ఆమె చనిపోయినప్పుడు పేతురామెను బ్రతికించెను. అందువలన యొప్పే చుట్టు ప్రాంతములలోని వారలనేకులు విశ్వసించిరి (కార్య 9[36-43]). నేటివఱకు క్రైస్తవ సంఘములోని బీదలకొఱకై వస్త్రములను కుట్టు స్త్రీల సమాజములకు ఈమెనుబట్టి దొర్కా సమాజము అను పేరు కలిగెను.

## దో

**దోతాను** (Dothan = నూతులు!). హెబ్రోను దేశమందలి ఉత్తర ప్రాంతములలోని యొక బయలు (ఆది 37[17]). ఆ ప్రాంతములలో నదే పేరుగల పట్టణమును ఒకటి గలదు (II రాజు 6[13]). యోసేపు సహోదరు లతనిని ఈ ప్రాంత్యములోని యొక గోతిలోవేసి తరువాత మిద్యానీయులకమ్మిరి (ఆది 37[17-28]). ప్రవక్తయగు ఎలీషా ఈ పట్టణములో నుండఁగా దమస్కు రాజైన బెన్హద్దదు అతనిని పట్టుకొనుటకు సైన్యము నంపఁగా వారందఱును గ్రుడ్డితనముచే మొత్తబడి షోమ్రోనుకు కొంచుపోఁబడిరి. ఈ పట్టణము చుట్టునున్న కొండలమీఁద తన సేవకునికి ఎలీషా దర్శన రీతిఁగా అగ్నిమయమైన గుర్రములను రథములను జూపెను (II రాజు 6[8-23]). ప్రస్తుత మాకొండకు టెల్ దోతాను (*Tell-Dothan*) అను పేరు గలదు. (పటము III F 2).

**దోదానీము** (Dodanim). యాపెతు సంతానీకులు (ఆది 10[4] I దిన 1[7]). హెబ్రీ భాషలోని, కొన్ని తర్జుమాలలోను I దిన 1[7] నందు రోదానీము అను పేరుగలదు. గ్రీసు దేశమునకు పశ్చిమముగానున్న దొదోనా (*Dodona*) వారని కొందఱును, దీని మాఱురూపమగు రోదానీము సరియైన పదమని రోదు (*Rhodes*) అను ద్వీప వాసులని మఱికొందఱు నెంచుచున్నారు గాని యిట్టి పురాతనములగు జనముల ఉనికినిగూర్చి రూఢిగాఁ జెప్ప వీలుపడదు.

**దోదావాహు** (Dodavahu = యెహోవాకు ప్రియుఁడు). యెహోషాపాతు అహజ్యాతో సంధిచేసికొనినందున అతనిని గద్దించిన ప్రవక్తయగు ఎలీయెజెరుయొక్క తండ్రి (II దిన 20[37]).

**దోదో** (Dodo, Dodai = ప్రేమ).

1. న్యాయాధిపతులలో నొకఁడగు తోలా యనువాని తాత (న్యాయా 10[1]).

2. దావీదు యోధులలో ఎలీయాజరు అను నొకని తండ్రి (II సమూ 23[9] I దిన 11[12]). I దిన 27[4] చూడఁగా దోదై (=దోదో) దావీదు సేనలో నొక భాగమునకు అధిపతియైయున్నట్లున్నది. పైనున్న వాక్యములలోవలె ఈ వాక్యములోకూడ దోదైకుమారుఁడగు ఎలీయాజరు అను మాటలు మొదట నున్నవి కాని కుమారుఁడగు ఎలీయాజరు అను మాటలు మూలభాషలో పొరాకున లోపించి పోయినవనుకొనువారు కలరు.

3. దావీదు యోధులలో ఎల్హానాను అను నొకని తండ్రి (II సమూ $23^{24}$ I దిన $11^{26}$).

దోదో యను పేరు చాల పురాతనమైనది. ఇది మిగుల పురాతనమైన రాతిశాసనములమీఁద అనఁగా టెల్-ఎల్-అమార్న (*Teil El Amarna*) అను రాతిశాసనములమీఁదను, మోయాబురాయి (*Moabite Stone*) అనఁబడిన రాతిశాసనములమీఁదను కనఁబడును (రాతిశాసనములు చూ||).

**దోనె** ఓడలు 5 (1) వృత్తులు చేతిపనులు III 2 చూ.

**దోపకా** (Dophkah). ఇశ్రాయేలీయులరణ్య సంచారమునందు మకాము చేసిన యొక స్థానము (సంఖ్యా $33^{12}$). దీని యునికినిగూర్చి తెలియదు.

**దోపుడు సొమ్ము** (Booty). యుద్ధమునందపజయమొందినవారి ఆస్తిని పశువులను బానిసలను ఆఁడుపిల్లలను జయశీలురు పట్టుకొని స్వంతముగాఁ జేసికొనుట పలెస్తీనుకు చుట్టుపట్లనుండు దేశములలో బైబిలుకాలమునందు వాడుక (సంఖ్యా $31^{9,26-52}$ యెహో $7^{21}$). అబ్రాహాము తాను పట్టుకొనిన దోపుడు సొమ్మును తీసికొనక తన యౌదార్యగుణము నగుపఱచెను (ఆది $14^{11-24}$). కనాను దేశము నిశ్రాయేలీయులు జయించునప్పుడు అందఱిని చంపవలెనను ఆజ్ఞ కలదుగాని (సంఖ్యా $33^{50-56}$ ద్వితీ $7^{2}$) ఆయా జనాంగములలోని పురుషులనుమాత్రము చంపి తక్కినవారిని దోపుడు సొమ్ముగాఁ దీసికొనవచ్చునని సెలవియ్యఁబడెను ($20^{10-18}$). ఇశ్రాయేలీయులు యెరికో పట్టణమును పట్టుకొనినప్పుడు మాత్రము దానిలోని జీవుల నన్నింటిని హతముజేసి వెండి బంగారములను దేవునికి ప్రతిష్ఠించిరి (యెహో $6^{19}$). ఇట్లే అమాలేకీయులఁ జేసి వారినందఱిని సంహరింపవలెనను ఆజ్ఞ సౌలు పొందెను (I సమూ $15^{2,3}$). జయించి తెచ్చుకొన్నదానిలో నొక భాగమును దేవుని కర్పింపవలెనను నియమము గలదు (సంఖ్యా $31^{26-47}$). యుద్ధమునకు వెళ్లినవారికిని సామానునొద్ద కావలియున్నవారికి సమానభాగములు రావలెనను ఏర్పాటుజేసిరి (I సమూ $30^{23-25}$). దోపుడు సొమ్మును విభాగించుకొనుట సంతోషమునకును (యెష $9^{3}$) భాగ్యమునకును ($53^{12}$) ఒక సూచనయైయున్నది. దేశము దోపుడగుట సర్వనాశనమున కొక సాధారణమైన సూచనగా భావించిరి ($42^{22}$ యిర్మి $30^{16}$ $50^{10}$ జెక $2^{9}$ మొ||).

**దోమ** కీటకములు 17 చూ||

**దోయేగు** (Doeg = పిఱికివాఁడు). సౌలు మందకాపరులలో ముఖ్యుఁడగు నొక ఎదోమీయుఁడు. దావీదు సౌలు సన్నిధినుండి పారిపోయి నోబులోనున్న అహీమెలెకువలన ఆహారమును ఖడ్గమును పుచ్చుకొనిన సంగతి నితఁడు కనిపెట్టి (I సమూ $21^{7}$ కీర్త 52 పై వ్రాఁత) సౌలునకుఁ దెలిపెను. అంతట రాజు కోపోద్రేకుఁడై అహీమెలెకును అతనితోటి యాజకులను రావించి అందులకు కారణమడిగి దానినిగూర్చి సాంతముగాఁ దెలిసికొనకుండనే వారిని జంపు డని భటుల కానతిచ్చెను. అందుకు వారు సమ్మతించనందున రాజాకార్యభారమును దోయేగు మీఁద నుంచఁగా అతఁడు 85 గురు పురుషులను జంపెను. తరువాత నతఁడు ఆ గ్రామముల మీఁద పడి స్త్రీలను బిడ్డలను జంపి పశువులను గూడ హతము జేసెను (I సమూ $22^{7-23}$).

**దోరు** (Dor = నివాసము). ఇశ్రాయేలీయులు పలెస్తీనుదేశమును జయింపక పూర్వము కనానీయుల అసలు పట్టణములలో నొకటి. ఈ పేరు ఆ పట్టణమునకుమాత్రము కాకుండ దానికి సమీపముగనుండు మైదానమునకుకూడ కలదు. దోరురాజు యాబీను అను కనానీయులరాజుతోఁ గలిసి యెహోషువమీఁద యుద్ధము చేసెను (యెహో $11^{2}$). ఆ యుద్ధములో వారిరాజు ఓడిపోయి చంపఁబడెను ($12^{23}$). కనానుదేశమును విభాగించినపుడు అది మనష్షేగోత్రికుల పాలయ్యెనుగాని అది ఇశ్శాఖారీయుల ప్రదేశములోను ఆషేరీయుల ప్రదేశములోను నున్నట్లు $17^{11}$ వలనఁ దెలియును కావున అది యీ గోత్రస్వాస్థ్యముల మధ్య నున్నదని యూహింపఁదగును. దోరులో నివసించిన కనానీయులను ఇశ్రాయేలీయులు వెళ్లఁగొట్టలేరి (న్యాయా $1^{27}$). సొలొమోను కాలములో అది ఇశ్రాయేలీయుల స్వాధీనములో నుండెనని I రాజు $4^{11}$ వలనఁ

దెలియును. సొలొమోను దానికి ప్రత్యేకమైన యధిపతిని నియమించెను. కైసరయకు ఉత్తరముగా నున్న తలంతురు (*Tantura*) అను స్థలమే దీని యునికి యని సాధారణముగా నను కొందురుగాని అది దానికి ఉత్తరముననుండు కర్మెలు కొండకు దక్షిణభాగమం దున్నదనుకొనుట మంచిది. దానిపేరు ప్రస్తుతమున ఆ ప్రాంతములలో వాడుకగా నుండు ఏ పేరునందైనను కనఁబడదు.

**దోషము, దోషమూర్తి** పాపము 1 చూ॥

**దోసకాయ** (Cucumber). పలెస్తీను ఐగుప్తుదేశములయందు సాధారణముగా రెండు రకముల దోసకాయలు దొరకును. వాటియందొకజాతి సాగుబడి నేలలయందుమాత్రము పండును. రెండవది బహు సాధారణమైనది. అవి మాగాణి ప్రదేశములయందును మెట్ట భూములయందును, వేసవిలో సహితము నీటితడి లేకున్నను విశేషముగా పెరిగి పూవులు పూయును. యెష 1[8] లోని **దోసపాదుల** పాక యను మాటలు దోసపాదులలోని మంచె యని యెంచవలెను. ఇశ్రాయేలీయులు అరణ్య సంచారము చేయుచుండుకాలమున ఐగుప్తులో తాము తినిన దోసకాయలను ఆశించి వాటికొఱకు కణిగిరి (సంఖ్యా 11[5]) J. C.

# ద్యు, ద్యూ

**ద్యుపతి** (Jupiter, Zeus). గ్రీకు రోమీయుల దేవతలలో అగ్రగణ్యుఁడుగా నెంచఁబడిన ముఖ్య దేవత పేరు. అందులోని పదములను చూడఁగా మొదటిభాగము దేవ అను పదమునకు సంబంధించినట్లు కనఁబడును. హిందువుల వేదములలో ద్యుష్ పితర్ (*Dyaus Pitar*) అను దేవత ఆకాశవిశాలమును సూచించును. ఆ పదమును ద్యుపతియను పదమును ఒకటే శబ్దమునుండిపుట్టి ఆర్యులు వేఱుపడక పూర్వము వారందఱుకలిసి యేకస్థలములో నివసించునప్పుడు తమ ముఖ్య దేవతకు పెట్టినపేరని తెలిసికొనవలెను. క్రమక్రమేణ ఆ దేవతకు వేర్వేఱు గుణముల నారోపించిరి. ఒకటి వర్షమిచ్చు పనిని (*Jupitar Pluvius*) సూచించును. అది ఇంద్రునికి సంబంధించినది. పౌలు బర్నబాలు లుస్త్రలో కుంటివానిని బాగుజేసిన పిమ్మట వీరు దైవమూర్తులనుకొని బర్నబాకు ద్యుపతి యను పేరు పెట్టిరి (కార్య 14[12]). అందువలన బర్నబా పెద్దయనియు ఎక్కువగా మాట్లాడక ధ్యానము చేసికొనువాఁడనియు ఊహింప వీలు గలుగుచున్నది. ఎఫెసులోని అర్తెమిదేవి ద్యుపతియొద్దనుండి పడినట్లు ఎంచిరి (19[35]). ఈ దేవతనుగూర్చిన సూచన లివిగాక బైబిలునందింకెవ్వియును గానరావుగాని అప్రమాణిక గ్రంథములలోని మక్కబీయుల కాలమునందు అంతియొకస్ ఎపిఫనీసు యూదులమతమును మార్చుటకు యత్నించఁగోరి ఈ దేవత విగ్రహమును యెరూషలేమునందలి దేవాలయమునందుంచెను.

# ద్రా

**ద్రాక్షచెట్లు, ద్రాక్షతోట** (Vine, Vineyard). బైబిలునం దుదాహరించిన వృక్షములలో ప్రధానమైనది. సిరియ పలెస్తీను దేశములయందు పైరుచేయఁబడువాటిలో నిది ముఖ్యమైనది. దీనినిగూర్చిన సూచనలు బైబిలునందనేకములు గలవు. నోవహు ద్రాక్షతోఁట వేసికొనెను (ఆది 9[20]). యూదా తన గాడిదెను ద్రాక్షచెట్టునకు కట్టినట్లు చెప్పిన సంగతి అతని కట్టిచెట్లు విశేషముగ గలవని యర్థమగును (49[11]). ద్రాక్షచెట్లక్రిందను అంజూరపుచెట్ల క్రిందను నివసించుట సమాధాన సంరక్షణలకు సూచనగా నుండెను (I రాజు 4[25] మీకా 4[4]). ద్రాక్షచెట్లను అణగఁద్రొక్కుట నాశనమునకు గుఱుతుగా నెంచిరి (యెష 16[8]). ద్రాక్షచెట్లు పలెస్తీను దేశమందు ముఖ్యముగా పర్వతముల మీఁద సమృద్ధిగాఁ బెరుగును (ద్వితీ 8[8] యిర్మీ 31[5]). ఐగుప్తులోనుండి తేఁబడిన ద్రాక్షచెట్లని ఇశ్రాయేలీయులకు పేరు కలిగెను (కీర్త 80[8-14] యెష 5[1-5]). సంతానవంతురాలగు భార్యను ద్రాక్షచెట్టుకు పోల్చిరి (కీర్త 128[3]). ద్రాక్షచెట్లను పందిళ్లమీఁదికిఁగాని (I రాజు 4[25]), ఇతర చెట్లమీఁదికిఁగాని (యెహె 19[10,11]) ప్రాకనిచ్చెడివారు. ద్రాక్షపండ్లను సమకూర్చిన వెంటనే ఆ చెట్ల తల్లి తీగెలలో మిగుల నావశ్యక

మైన రెండు మూఁడు ముఖ్యమైన తీగెలను గాక తక్కినవాటి నన్నిఁటిని కొట్టి వేసెడివారు (యోహా $15^{2-6}$). పెద్ద ద్రాక్షావనములమధ్య గోపురములను కట్టించిరి. కావలివారు వాటియం దుండి పైరులను గాయువారు (యెష $5^{2}$ మ $21^{33}$). ద్రాక్షావనముల ఖామందులు వాటి పంటలో పాలు నొందెడి షరతుమీఁద వాటిని గుత్తకిచ్చిరి (పర $8^{11}$ మ $21^{33}$). ద్రాక్షఫలము లనేకవిధములు. కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. కొన్ని తెలుపుతోఁ గూడిన పచ్చరంగు గలవి గాను మఱికొన్ని నలుపుతోఁ గూడిన ఎఱ్ఱరంగు గలవిగా నుండును. ద్రాక్షాఫలములను సమకూర్చుదినములు సంవత్సరములో మహా యానందకరములగు దినములు (యెష $16^{10}$ న్యాయా $9^{27}$). ఆ కాలము జూలై-సెప్టెంబరు మాసములలో వచ్చును. వాటిని కోయునప్పుడు తమ కిష్టము వచ్చినట్లు తిందురు. గంపలు నింపుకొని యిండ్లకు తీసికొని వెళ్లెదరు. వాటి నెండఁబెట్టి గాని గానుగలలో వేసి ద్రాక్షారసము తీసిగాని వాడుకొందురు (యెష $16^{10}$ $63^{3}$ యిర్మీ $25^{30}$). పలెస్తీను దేశములో కొండలమీఁదను అనేకమైన ద్రాక్షల తోట్లు తొలువఁబడియున్నవి. ఈ చెట్లు పండ్లకుఁగాక మఱి దేనికిని ఉపయోగకరమైనది కాదు గాన ఫలింపని చెట్లనుగాని కారు ద్రాక్ష చెట్లనుగాని దుష్టులను సూచించుటకు వాడిరి. అబీగయీలు దావీదుకు తెచ్చియిచ్చిన సూరు గెలలు ఎండఁబెట్టినవై యుండెను (I సమూ $25^{18}$ II సమూ $16^{2}$ I దిన $12^{40}$ హోషే $3^{1}$). ద్రాక్షాఫలములను సమకూర్చువారు పరదేశులకొఱకును విధవలకొఱకును దిక్కులేనివారికొఱకును కొంతలో పరిగెను విడువవలయునను విధులు గలవు (లేవి $19^{9}$ ద్వితీ $24^{19-21}$ న్యాయా $8^{2}$). గొప్ప వాఁడగు హేరోదు ఆలయము నలంకరించుటకు బంగారపు ద్రాక్షతీగలను చేయించెను. తన శిష్యులకును తనకును గల సంబంధము ద్రాక్షవల్లికి దాని తీగెలతోఁ గల సంబంధము వంటిదని యేసు దృష్టాంతపఱచెను (యోహా $15^{1-6}$). J. C.

**ద్రాక్షారసము, మద్యము (Wine, Strong drink).** బైబిలునం దుదాహరించిన మత్తుపదార్థములన్నిఁటిని ఈ రెండు పదములు సూచించును (లేవి $10^{9}$ I సమూ $1^{15}$ సామె $20^{1}$ మొ॥). ద్రాక్షారసమును ద్రాక్షాపండ్ల నుండియు, మద్యమును అంజూరు మొదలగు ఇతర ఫలములనుండియు ధాన్యాదులనుండియు తీసిరి.

I. ద్రాక్షారసము.

1. పేరులు. ఇది ఇశ్రాయేలీయులు సర్వసాధారణముగా వాడుకొనిన పానీయము. ద్రాక్షపండ్లు వారిదేశములో అతి విస్తారముగా ఫలించును. ద్రాక్షారసమును సూచించెడి పదములు మూలభాషయందు రెండు గలవు. ఒకటి క్రొత్త ద్రాక్షారసమునకు వాడిరి (ద్వితీ $7^{13}$ $11^{14}$ $12^{17}$ మొ.) ఇట్టి ద్రాక్షారసము మత్తును కలిగించినట్లు న్యాయా $9^{13}$ హోషే $4^{11}$ మొ॥ వాక్యములవలనఁ దెలియుచున్నది. రెండవపదము సాధారణమైనదై వైను (*Wine, Heb-yayin*) అను దానికి సంబంధించినది (ఆది $9^{21}$ $14^{18}$ మొ॥). ఈ రెండుమాత్రమేగాక హెబ్రీభాషయందింక అయిదారు పదము లున్నవి గాని అవెక్కువ వాడుకలో నుండలేదు. క్రొత్త నిబంధనలో నున్న సాధారణపదముగాక (మ $9^{17}$ యోహా $2^{3}$), క్రొత్త ద్రాక్షారసమును సూచించు మఱియొకపదము కార్య $2^{13}$ లో మాత్రము కనఁబడును.

2. తీసినవిధము. పండ్లను గోసి బుట్టలలో సమకూర్చి (యిర్మీ $6^{9}$) ద్రాక్ష గానుగయొద్దకుఁ దెచ్చిరి (యెష $5^{2}$). ఆ గానుగలు నీలితొట్ల వంటివి గాని, అంతకన్న చిన్నవి. ఆ గానుగ



ద్రాక్షలతొట్టి

లలో వాటినివేసి పండ్లను త్రొక్కుటవలన రసమును దీసిరి (నెహె $13^{15}$ యోబు $24^{11}$). కూలి

వారు వాటిని త్రొక్కుచు పాటలు పాడిరి (యెష 16[10] యిర్మీ 25[30]). ఆ పండ్లరసము వారిబట్టలకంటి రక్తపు మరకలవలె గనుపించెను (యెష 63[1-3]). ప్రతి గానుగకు రెండు తొట్లుండునవి. పై తొట్టిలోని పండ్లను త్రొక్కఁగా రసము క్రిందనున్న దానిలోకి కారును. ఆ రసము బాగుగా పొంగువఱకు ఉండనిచ్చిన పిమ్మట తిత్తులలో పోసి భద్రము చేసిరి (యోబు 32[19] మ 9[17]). ద్రాక్షారసము పాఁతదగునప్పుడు దానిని వేఱుతిత్తులలోను కుండలలోను పోసిరి (యిర్మీ 48[11,12]).

**3.** ఉపయోగములు. ద్రాక్షారసమును ముఖ్యపానీయముగా వాడిరి. ప్రస్తుతము మధ్యధరా సముద్రతీరమున నున్న దేశప్రజలవలె పూర్వకాలమందును అచ్చట నున్నవారి కది ముఖ్య భోజనపదార్థములలో నొకటియై యుండెను (సంఖ్యా 6[20] ద్వితీ 14[26] II దిన 2[15] కీర్త 104[14,15] మొ॥). యజ్ఞములకును దాని వాడిరి (నిర్గ 29[40]). పస్కాసమయమున యూదులు దానిని త్రాగిరి. అప్పుడు వారు వాడిన దానిని స్తుతిపాత్రలని పిలిచిరి. క్రీస్తు తన శ్రమలకు జ్ఞాపకార్థముగా నేర్పఱచిన విందులోను అదే రీతిగా దానిని వాడెను (మ 26[29]). ఇతర శుభకార్యములందును దీనిని వాడుకొనిరి (యోహా 2[1-10]). ఔషధముగాను ఉపయోగించుకొనిరి (సామె 31[6] లూ 10[34] I తిమో 5[23] రోగములు చికిత్సలు IV 1 (5) చూ॥).

II మద్యము. ద్రాక్షల కితరములగు పండ్ల నుండియు ధాన్యాదులనుండియు తీసిన మత్తు పదార్థములు మద్యమని పిలువఁబడెను. హెబ్రీ భాషయందు వీటికొక ప్రత్యేకపదము గలదు (లేవీ 10[9] సంఖ్యా 6[3] మొ॥). లూ 1[15] నందు హెబ్రీపదమునట్లే గ్రీకుభాషయం దుంచిరి. క్రొత్త నిబంధనయం దిది ఈయొక్క చోట మాత్రమే గలదు. ఈపద మరుదుగా బైబిలు నందు కనఁబడుటచే దీనిని ద్రాక్షారసమంత విశేషిగ నుపయోగించ లేదనవచ్చును. (త్రాగుట, త్రాగు బోతుతనము చూ॥).

# ద్రు, ద్రో

**ద్రుసిల్ల** (Drusilla). మొదటి అగ్రిప్పా యనఁబడిన రాజగు హేరోదు చిన్న కుమార్తె. ఈమెను ఎమెస్సా (*Emessa*) యను రాజున కిచ్చి వివాహము జేసిరి. ఆమెను వివాహమాడు నిమిత్త మతఁడు యూదుఁడు కావలసి వచ్చెను. యూదయ గొర్నరగు ఫేలిక్సు ఆమెను మోహించి నందున ఆమె తన పెనిమిటిని వదలివేసి అన్యుఁడైన ఫేలిక్సునొద్ద జేరెను. పౌలు వారియెదుట నీతినిగూర్చియు ఆశానిగ్రహమును గూర్చియు రాఁబోవు తీర్పునుగూర్చియు బోధించుచుండఁగా అట్టి స్థితిలోనున్న ఫేలిక్సు వణఁకుట ఆశ్చర్యము కాదు. ఆ బోధలను విననప్పటికి ఆమె మనస్సాక్షి ఆమెను బాధించినట్లే సూచనలును కనఁబడవు (కార్య 24[24,25]).

**ద్రోహి** బుద్ధిహీనుడు చూ॥

# ద్వా

**ద్వారపాలకుడు** (Door Keeper, Porter). ప్రత్యేకమగు నొక యుద్యోగమును చేయువారికిఁగాక కావలిపని చేయువారికి ఈ పేరు పెట్టినట్లు అనేక సూచన లున్నవి (II రాజు 7[10] యోహా 10[3]). II సమూ 18[26] లో ఈ యర్థమునిచ్చు మాటను కావలివాడని తర్జుమా చేసిరి. అయితే దినవృత్తాంతముల గ్రంథములలోను ఎజ్రా నెహెమ్యా గ్రంథములలోను అది యొక ప్రత్యేకమగు ఉద్యోగపు పేరుగా నున్నది. ఆ యుద్యోగస్థులు దేవాలయములోని పనివారై యుండిరి (I దిన 15[18] 16[38] మొ॥). ఎజ్రా నెహెమ్యా గ్రంథములలో ఈ ద్వారపాలకులు లేవీయులకు వేఱుగా లెక్కింపఁబడినను (ఎజ్రా 2[40,42] నెహె 7[43,44]) వారుకూడ లేవీయులలో చేరియుండిరి (I దిన 23[5]). దావీదుకాలములో వీరు 4000 మందిరై యుండిరి. వారు కోరహు సంతతివారును మెరారీ సంతతివారునై యుండిరి (26[19]).

**ద్వారబంధములు** (Door Posts). సాధారణముగా వీటిని కర్రతోఁ జేసినను రాతితోఁ

జేయఁబడినవియు గలవు. స్థితిమంతులైనవారు ఈ స్తంభములను ఈ దేశమందు చేసినట్లు అలంకరించుట బైబిలుకాలమునం దుండిన వారికిని వాడుకయై యుండెను. వీటినిగూర్చి బైబిలునం దీదిగువ విశేష సూచన లగుపడుచున్నవి. 1. హిందువుల ద్వారబంధపు కమ్ములను పసుపు కుంకుమ పూసినట్లు హెబ్రీయులు పస్కాపసమయమున గొఱ్ఱెపిల్ల రక్తమును వాటికి పూసిరి (నిర్గ $12^{7}$).

2. తన యజమానుని విడువక నిరంతరము వానినే సేవింపఁదలఁచిన దాసుని ద్వారబంధము నొద్దకుఁ దెచ్చి కదురుతో అతని చెవిని దానికి గ్రుచ్చిరి. ఇట్లు అతనికిని ఆ యింటికిని నిత్య సంబంధ మేర్పడెను ($21^{2-6}$).

3. యూదులు దేవుని వాక్యములు వ్రాయించి ద్వారబంధపు కమ్ములకు తగిలించిరి. దేవునివాక్య మెల్లప్పుడును దగ్గర నుంచుకొని లక్షింపవలెనను ఆజ్ఞను (ద్వితీ $6^{4-9}$ $11^{13-20}$) ఇట్లు అక్షరశఃగా గ్రహించుకొని అట్లు చేసిరి (ఇల్లు II 11 చూ॥).

**ద్వారము** ఇల్లు II 9-11, కోట I 3, యెరూషలేము B III 8, V 2 చూ॥

# ద్వి, ద్వీ, ద్వే

**ద్వితీయోపదేశకాండము** (Deuteronomy = ధర్మశాస్త్రపునర్వివరము). మోషే వ్రాసిన చివరి గ్రంథము. నలువది సంవత్సరములు అరణ్యవాసమైన పిదప చివరిమాసములో వ్రాసినట్లు కనఁబడుచున్నది. ఇదివఱకు వ్రాయఁబడిన గ్రంథములలోని అనేక సంగతులు మఱల దీనిలో వ్రాయఁబడినవి గనుక ఇది యీ పేరున పిలువఁబడుచున్నది. దీనిలోని అంశములు వాగ్దాన భూమియందు వారు నివసించుకాలమున వారికి రాఁగల స్థితిగతులకు సంబంధించినవై యున్నవి.

దేవుని ధర్మశాస్త్రమును గైకొనువారికి కలుగఁబోవు దేవుని కృపాసహాయములను గుఱించియు, గైకొననివారు పొందఁబోవు దేవుని శిక్షలను గుఱించియు తెలుపుట కిది వ్రాయఁబడెను. దీనియందు మోషే చరిత్రను ధర్మశాస్త్ర చట్టములను మఱల క్లుప్తముగఁ దెలిపెను. దేవుని యాజ్ఞలను బలత్తరముగ పలికెను. ఇట్లు మోషే మఱల చెప్పుటకు కారణము లేకపోలేదు. సీనాయి పర్వతముపై ధర్మశాస్త్ర మీయఁబడినప్పుడు లేని జనాంగ మిప్పటికి ఎదిగి పట్టణములలోను గ్రామములలోను స్థిరముగ నిలువఁబోవుచున్నందున వారికి తిరిగి ధర్మశాస్త్రమును చెప్పుట మిగుల అవసరమై యుండెను.

ధర్మశాస్త్రమునకు ఆదికాండము అవతారికయును ఈ గ్రంథము అంతమునై యున్నది. మిగిలియున్న మూఁడు గ్రంథములలో దేవోక్తములను వినుట గలవు. ఈ ఐదు పుస్తకములలోని చరిత్రకాలము సుమారు 2553 సం॥లు (క్రీ॥ పూ॥ 4004-1451) అయ్యుండెను.

వారు నలువది సంవత్సరములవఱకు దేవుని స్వకీయు లనఁబడినవారి పాపములను తిరుగుబాటులను సహించిన సుముఖుఁడగు మోషేయొక్క వివరణలలో హృదయమును కరఁగించు మృదుత్వము కనఁబడుచున్నది. ఆ మాటలతని మనస్సులోనుండి బయలువెడలినవియును దైవప్రేరితములునై యాతని మనస్సునందు పాతుకొనినవైనట్లున్నవి. ఇదివఱకే యనుగ్రహింపఁబడిన ధర్మశాస్త్రముయొక్క ఆయాభాగములనెత్తి చెప్పుచు వారు పొందిన సకలానుభవములనుగాను వారు చూపిన యవిధేయతను, అందువలన దేవునిచే వారికి కలిగిన శిక్షలను, వారి ప్రయాణమందంతయు వెంబడించుచు వచ్చిన దేవుని దయను వారి హృదయములు కరఁగు రీతిగా జ్ఞాపకము చేసెను. ధర్మశాస్త్రముయొక్క అక్షరార్థమును గాక దాని మఱుఁగైన ఆత్మీయార్థములను చరిత్రవిషయములను గాక సిద్ధాంతవిషయములను దేవుఁడు వారి కిచ్చియున్న న్యాయవిధులను పదేపదే వారికి తెలియఁజేయును.

ఈ గ్రంథమునందు నాలుగు ప్రసంగము లున్నవి.

I. మొదటి ప్రసంగమునందు ($1^{6}$-$4^{43}$). ఇశ్రాయేలీయుల అరణ్యవాసమును వివరించుచు దేవునికి విధేయులుకండని హెచ్చరించి ($1^{6}$-$3^{29}$), ఆశ్రయపురములనుగూర్చి మఱల చెప్పుట ($4^{1-43}$).

**II.** రెండవ ప్రసంగమునందు (5-27) జ్ఞాన కాండమును ($5^{1}$-$11^{31}$), కర్మకాండమును ($11^{32}$-$16^{17}$), ధర్మకాండమును ($16^{18}$-26) వివరించి వారు కనానులో ప్రవేశించిన తరువాత వారికి కావలసినవి ముందుగనే జాగ్రత పెట్టుట ($27^{1-10}$).

**III.** మూడవ ప్రసంగమునందు (28-30) దేవునికి విధేయులగుటవలన కలుగు ఆశీర్వాదములు ($28^{1-14}$) అవిధేయులగుటవలన కలుగు శాపములు ($28^{15-68}$) చెప్పి హెచ్చరించుచు నిబంధననుగూర్చి వారికి తెలిపెను (29,30).

**IV.** నాలుగవ ప్రసంగము (31-34) నందు తాను రచించిన కీర్తనను ($31^{14}$ $32^{17}$) చెప్పి జనులను దీవించెను ($32^{48}$-33). చివర అధ్యాయమును మోషే చనిన తరువాత ఇశ్రాయేలు జనులను నడిపించిన యెహోషువ వ్రాసియుండు ననుట కెట్టి సందేహమును లేదు (గ్రంథసంబంధకము, బైబిలు చరిత్రము చూ॥) H.

**ద్వీపము (Island).** పాత నిబంధనలో నుదాహరింపబడిన ద్వీపములు సముద్రతీరమును కూడ సూచించెను. దీని మూలభాషాపదమును ఆది $10^{5}$ యెష $20^{6}$ $23^{2}$ లో సముద్రతీరము అని తెనిగించిరి. $42^{15}$ లోని ద్వీపములు అను మాటకు మెట్టభూములని యర్థము. ఇతర వాక్యములలోని ద్వీపములు అను మాట మధ్యధరా సముద్రము చుట్టునున్న దేశములన్నిటికి చెందును (ఎస్తే $10^{1}$ యెహె $26^{18}$ కీర్త $72^{10}$). కిత్తీయుల ద్వీపములు అను మాటలు (యిర్మీ $2^{10}$ యెహె $27^{6}$) సైప్రసను దీవియొక్క పురాతనపు పేరనియు, కఫ్తోరు ద్వీపమనునది (యిర్మీ $47^{4}$) క్రేతు ద్వీపముయొక్క పురాతన పేరనియు అనుకొందురు. క్రొత్త నిబంధనయందు సైప్ర (కార్య $4^{36}$ మొ॥) క్రేతు ($27^{1}$) కౌద ($27^{16}$) మెలితే (28) కీయొసు ($20^{15}$) సామొసు ($20^{15}$) కోసు ($21^{1}$) రోదు ($21^{1}$) పత్మాసు (ప్రక $1^{9}$) అను దీవుల పేరులున్నవి.

**ద్వేషము, పగ (Hatred).** ఇతరులను ద్వేషించుట పాతనిబంధన కాలమున అంతగా నిషిద్ధముగాకున్నను (ద్వితీ $23^{6}$ కీర్త $41^{10}$ $118^{17}$). క్రీస్తు దానిని బొత్తుగా నిషేధించెను (మత్త $5^{43-45}$) శత్రువులనైనను ద్వేషింపక వారిని ప్రేమించవలెను (రోమా $12^{20}$). మరణార్థమైన శరీర ఫలములలో నొకటిగా దీని నెంచిరి (గల $5^{20}$). తమ సహోదరులను ద్వేషించెడివారు దేవుని ప్రేమింపక నరహంతకులకు సమానులని I యోహా $2^{9-11}$ $3^{15}$ $4^{20}$ నందున్నది. పాత నిబంధనలో సహోదరునియందు పగబట్టుట నిషిద్ధముగా నెంచిరి (లేవీ $19^{17}$). ఒకనినొకరు ద్వేషించుట నూతనపరచబడినవారి పురాతనపు స్థితికి చిహ్నముగా నున్నది (తీతు $3^{3}$). క్రీస్తుయొక్క శిష్యులైనవారు ఇతరులను ద్వేషింపరాదను నాజ్ఞ ఎంత స్పష్టముగా నున్నదో, ఇతరులు క్రీస్తు శిష్యులైన వారిని ఆయన నిమిత్తము ద్వేషింతురను సంగతి అంత స్పష్టముగా నున్నది (మత్త $5^{11}$ $10^{22}$ మార్కు $13^{13}$ యోహా $15^{18,19-24}$). లోకులు క్రీస్తును ద్వేషించినందున ఆయన శిష్యులనుకూడ అట్లు ద్వేషించిరి ($15^{25}$). దుష్టులు వెలుగును మేలుగా నెంచక దానిని ద్వేషించుచున్నారు ($3^{20}$). మనము మేలైనదానిని గాక కీడునే ద్వేషింపవలెను. క్రీస్తు ఇట్లు చేసెను (హెబ్రీ $1^{9}$ ప్రక $2^{6}$). కీడు చేయువారిని తాను ద్వేషించుచున్నానని పాతనిబంధన భక్తుడొకడు వ్రాసెను (కీర్త $139^{21}$). మనమట్టి క్రియల నెంత అసహ్యించుకొనినను వానిని శత్రునిగా నెంచక సహోదరునిగా భావించి, అట్టి భావముతోనే వానిని శిక్షింపవలెనని నేర్పు క్రొత్త నిబంధనయందు గలదు (II థెస్స $3^{14,15}$).

ద్వేషించుట యను పదమునకు హెబ్రీ జాతీయ ప్రకారము తక్కువగా ప్రేమించుట యను విశేష యర్థముకూడ గలదు. మనము మన తల్లిదండ్రులను దేవునికన్న తక్కువగా ప్రేమింపవలెననుదానికి బదులు వారిని ద్వేషింపవలెనను పదము ప్రయోగింపబడినది (లూకా $14^{26}$). ఈ పద ప్రయోగమునుబట్టి అది జాతీయము మాత్రమే గాక అన్నిటికన్న దేవుని నధికముగా ప్రేమింపవలెనను సంగతి బహు దృఢముగా తెలియుచున్నది. రోమా $9^{13}$ (= మలా $1^{2,3}$) లో దేవుడు ఏశావును ద్వేషించితిని అని యున్న పదము నిదే యర్థము నిచ్చును (కోపము చూ॥).

## ధ

**ధనము, సంపద, ధనవంతుడు (Wealth, Richman).** 1. బైబిలునందు దుద

హరించిన స్థితిమంతులు. ఆయా వారల స్థితిని గూర్చిన సూచనలనేకములు బైబిలునందు గలవు. అబ్రాహామునకు పశ్వాదులు మాత్రమే గాక వెండి బంగారములు నున్నట్లు సూచింపఁబడెను (ఆది 13[2]). యాకోబునకును అట్టి సంపద యుండెను (33[13,14]). యోబుకున్న ఆస్తిని పశువులచే లెక్కించిరి (యోబు 1[3] 42[12]). స్థితిమంతుఁడగు నాబాలు అనువానికట్టి సంపదయే యుండెను (I సమూ 25[2]). కష్టకాలమునందు దావీదునకు సహాయము చేసిన బర్జిల్లయి మంచి భాగ్యవంతుఁడు (II సమూ 19[32]). సొలోమోను రాజుయొక్క సంపద లోకప్రసిద్ధమైనది (I రాజు 10[14,15] మ 6[29]). స్థితిమంతులగువారు సాధారణముగా దేవుని మఱచెడివారై యుండిన ట్లుదాహరింపఁబడెను (లూ 12[16-21] 16[19-31] 18[18-24]) గాని జక్కయ్యయు (19[2-10]). అరిమతయియ యోసేపును (మ 27[57]) భక్తిపరులై యుండిరి.

ఆయా వారల సంపదనుగూర్చి మాత్రమేగాక పలెస్తీను దేశపు స్థితినిగూర్చి సూచనలును బైబిలునందు గలవు. అది పాలు తేనెలు ప్రవహించు దేశము (నిర్గ 3[8,17] 13[5] మొ॥). తోఁటలకును పొలములకును గనులకును ప్రసిద్ధికెక్కినది (ద్వితీ 8[7-9]). సమృద్ధివలన దేవుని మఱచెదరేమోనను కారణమున వారు తగినట్లు హెచ్చరికల నొందుచుండెడివారు (8[10-24]). వారాయనను మఱచినందున ఆయన చెప్పినట్లు ప్రవక్తల కాలమునందు నెఱవేఱెను (యెష 27[7,8] 5[3] హోషే 2[8,9]). చెఱకాలమునందీ దేశము మిగుల దరిద్రదశయందుండినను క్రొత్తనిబంధన కాలమునందది మంచి స్థితికి తిరిగివచ్చెను. దేవాలయమును అలంకరించుటకు హేరోదు పెట్టిన ఖర్చులే (లూ 21[5]) దాని మంచి స్థితిని కనుపఱచుచున్నది.

2. పాతనిబంధన కాలము ఈ కాలములో ధనమును దేవుని యనుగ్రహసూచనగా నెంచిరి (ద్వితీ 28[1-14] కీర్త 1[3,4] మొ॥) గాని భక్తులు లేమియు, భక్తిహీనులు కలిమియుఁ గలిగియుండినట్లు కనఁబడుటవలన అది యనేక సంశయములు పుట్టుట కాస్పదమయ్యెను (యోబు గ్రంథము, కీర్త 37,73 యిర్మీ 12 మొ॥). ఒకనికి లోక సంపద యెంత యున్నను అది వాని యాత్మను రక్షింపఁజాలదని తెలిసికొని దానికన్న మఱి శ్రేష్ఠమైన సంపద గలదని 49 వ కీర్తన వ్రాసినవాఁడు గ్రహించుకొనెను. ఈ విషయమును గూర్చి పాతనిబంధన భక్తులందఱును తమ బ్రదుకులవలన నేకగ్రీవముగా బోధించిరని చెప్పఁదగును (హెబ్రీ 11[24-40]).

3. క్రొత్తనిబంధన కాలము. ఈ కాలమునందు పైనచెప్పిన బోధ మఱింత స్పష్టమైనది. ఈ లోకమును బైరాగులవలె త్యజింపవలెనని క్రీస్తు బోధింపలేదు. మన కవసరమగు ధనము దానిని దేవుఁ డనుగ్రహించును. కావున ఈ లోకధనమును గూర్చి చింతింపకూడదని బోధించెను (మ 6[25-34]). బీదలయొక్క కష్టములను గుర్తించి వారికి విశేష దీవెనలు కలుగు ననెను (లూ 6[20]). దైవభక్తియు, బీదలకు చేయు దానములును లోకసంపదలకన్న మఱి ధన్యకరములైనవని బోధించెను (12[16-21] 18[8-24]). నిజమైన భాగ్యమును సంపాదించుకొనుటకు ఈ లోక సంపదను చక్కగా నుపయోగించుకొనవలెననెను (16[19-31]). దానిని తగినట్లుగా నుపయోగింపవలసిన గృహనిర్వాహకులము గాన దానిని సద్వినియోగించుకొనవలెనని ఆ యుపమానపు బోధయై యున్నది. ఈ బోధల ప్రకారము చేయువారీ లోకమునఁగాక పరలోకమునందు తమ ధనమును పోగు జేసికొందురని ఆయన చెప్పెను (మ 6[19-21]).

ఈ లోకమందుండఁగా ధనమును సేకరించుట తప్పు అనునది క్రీస్తుబోధ కాదు. ఆయన ఈ లోకమందుండు కాలమున ఆయన శిష్యులలో కొంచెము స్థితిమంతులైనవారు ఆయనకును ఆయన శిష్యులకును ఉపచరించినట్లు కనఁబడుచున్నది (లూ 8[2]). తమకు కావలసిన భోజనమును కొనుక్కొనుటకును, బీదలైనవారి కిచ్చుటకును వారు సొమ్మును నిలువయుంచుకొనెడివారని తెలియుచున్నది (యోహా 4[8] 13[29] లూ 22[36]). అపొస్తలులను, డెబ్బది మందిని దేవునిరాజ్య సువార్తను బోధించుటకు పంపినప్పుడు సంచియైనను సొమ్మైనను లేకుండనే పంపెను గాని వారు బోధించెడి ఊరివారు వారికి కావలసినవాటి నిచ్చెదరని యెఱిఁగి యుండుటచేతనే అట్లు చేసెను (మ 10[10]

లూ 10[7]). పనివాఁడు తన జీతమునకు పాత్రుఁడని బోధించెను. ధనమును సద్వినియోగము చేయు కొంత ధర్మకార్యమైనను దానిని సమకూర్చుకొనఁ గోరుటనే ముఖ్యముగాఁ నెంచి అందులకై మాత్రమే బ్రతికెడివారు దానిని దేవతగా నుంచుకొని సేవింతురనియు (మ 6[24]), అట్టివారు దేవుని రాజ్యములోఁ బ్రవేశింపలేరనియు (లూ 12[20] 16[19-31] 18[24-26]), మనము పొందవలసియుండిన సంపదలను నొందకపోవుటకు హేతువగు ముప్పుగా నుండును గాన దాని నుండి తప్పించుకొను నిమిత్తము ధర్మముగా వదలివేయవలెననియు, ఈ సంపద నిత్యమైనది కాదనియు, దాని విషయమై దేవునికి లెక్క నప్పగించవలసి యున్నాము గాన నమ్మకమైన గృహనిర్వాహకుల వలె దాని నుపయోగించవలె ననునది క్రీస్తు బోధ యొక్క సంక్షేపమై యున్నది.

ఒకరియెడల నొకరు కలిగియుండవలసిన ప్రేమచే పొంగిపొరలెడి హృదయులై అపొస్తలులు తమకు కలిగినదాని నంతటిని సమష్టిగా నుంచుకొనిరి. పోషకులును మోసగాండ్రును లేనియెడల ఈ లోకమునందు దా యేర్పాటు అన్నిటికన్న ఉత్తమమైనదిగా నుండును గాని ఆదిసంఘమునందు దాని వలన అయా కీడులు కలిగినట్లు కార్య 5[1-3] 6[1] వలనఁ దెలిసికొనవచ్చును. ఆదిక్రైస్తవులు కొంత కాలములోనే తమంతట తామే ఆ యేర్పాటును మానుకొనిరి గాని వారి నట్లు చేయుటకు ప్రేరేపించిన ప్రేమ యను సుగుణమును మాత్రము వదలలేదు. సంపద కలిగియుండుట తప్పుకాదను సంగతి కార్య 5[4]లో నున్నదానినిబట్టి స్పష్టమగును. అయినను స్థితిపరుల విలాసత్వమును చూచి యాకోబు వారిని గద్దించెను (యాకో 2[1-8] 5[1-5]). సంపదవలన కలుగు శోధనల విషయమై జాగ్రత్త పడుఁడని పౌలు ధనవంతులను హెచ్చరించెను (I తిమో 6[9,10,17,19]). లవొదికయ సంఘస్థులకు నదే హెచ్చరిక చేయఁబడెను (ప్రక 3[17]).

**ధనాగారము** ఖజానాదారుడు చూ॥

**ధనాపేక్ష, లోభత్వము (Covetousness).** మానవులకుండు నొక ముఖ్య పాపముగ బైబిలంతటిలో నిది యెంచఁబడెను. పది యాజ్ఞలలో అది నిషేధింపఁబడెను (నిర్గ 20[17] ద్వితీ 5[21]). ఆకాను ధనాపేక్షాపరుఁడై ఈ పాపములోపడి శపితమైనదానిని తీసికొని గొప్ప శిక్షకర్హుఁడయ్యెను (యెహో 7[16-26]). ధనాపేక్ష గలవాఁడు బీదలను బాధపఱచుటచే పొందు లాభము దుర్లాభ మనఁబడెను (సామె 28[16]). దానివలన వచ్చునది దుర్లాభమని యెంచి ప్రవక్తలు ఇశ్రాయేలీయులను మిగుల గద్దించిరి. బీదలను కష్టపెట్టుటచే దేశమునకు శిక్ష కలిగెను (ఆమో 2[6] యెష 5[8,10] 57[17] యిర్మీ 22[17] హబ 2[9] మొ॥). క్రొత్త నిబంధనయందు నిది కామక్రోధాదులతో కూడ చేర్చఁబడిన పాపమైయున్నది (మా 7[22] I కొరి 5[11] 6[9,10] II పేతు 2[14]). అది విగ్రహారాధనగా నెంచఁబడెను (కొలొ 3[5]). ధనాపేక్ష అన్ని కీడులకు మూలము (I తిమో 6[10]). కావున ఈ పాపములో పడకుండునట్లు భక్తులు మిక్కిలి జాగ్రత్తపడవలెనను హెచ్చరికె అనేక వాక్యములలో కనఁబడును (లూ 12[15] ఎఫె 5[3,5] హెబ్రీ 13[5] మొ॥). ధనాపేక్షాపరులు దేవుని రాజ్యమునకు వారసులు కానేరరు (I కొరి 6[10] ధనము చూ॥).

**ధన్యత, ఆశీర్వదింపబడినవారు** (Blessedness, the Blessed). గొప్ప ధన్యతను సూచించెడి పదములు పాత నిబంధనయందు రెండును క్రొత్త నిబంధనయందు రెండును గలవు.

1. ఆశీర్వాద దీవెనలొందుటకు కావలసిన అర్హతను సూచించెడి యొక పదమును ఆయా వారినిగూర్చి వాడిరి (ద్వితీ 28[3,4,5,6] 33[24] రూతు 2[19,20] 3[10] I సమూ 15[13,21] మొ॥). దీనికి సంబంధించిన గ్రీకు పదము మ 25[34] నందున్నది. అది మోక్షమునకు పాత్రులగువారి ధన్యతను సూచించును. ఈ పదమును ఆశీర్వదింపబడిన వారు అని సరిగా తెనిఁగించిరి.

2. రెండవ పదమును ధన్యతకు సంబంధించిన మాటచే తెనిఁగించిరి. ఆ ధన్యత దేవుని యాజ్ఞలు గైకొనువారికిని (కీర్త 1[1] 106[3]), దేవుని నమ్ము వారికిని (2[12] 34[8] 84[12]), ఆయనకు భయపడు వారికిని (128[1]), పాపపరిహారము నొందినవారికిని (32[1,2]), బీదలను కటాక్షించువారికిని (41[1]), దేవునిచే శిక్షింపఁబడినవారికిని (94[12]), సమస్త జలములయొద్ద విత్తనములను చల్లెడివారికిని

(యెష. $32^{20}$), దేవుని యింట నివసించువారికిని (కీర్త $84^{4}$), నిర్దోషులకును ($119^{1}$) కలుగును దేవుని నమ్ముకొనెడి జనమునకును కలుగును ($33^{12}$ $89^{15}$). నీతిమంతుల పిల్లలకు నట్టి భాగ్యము లభించును (సామె $20^{7}$).

ఇట్టి వాక్యములు క్రొత్త నిబంధనయందును విశేషముగ నున్నవి. దీనులు దుఃఖితులు సాత్వికులు కనికర హృదయులు శుద్ధులు సమాధాన పరచెడివారు హింసింపఁబడువారు ధన్యులని క్రీస్తు చెప్పెను (మ $5^{3-9}$ లూ $6^{20-22}$) అభ్యంతరపడనివారు (మ $11^{6}$), శిష్యులు చూచినవాటిని చూచినవారును ($13^{16}$ లూ $10^{23}$), దేవుని వాక్యము వినువారును (లూ $11^{28}$), నమ్మకమైన సేవకులును (మ $24^{46}$ లూ $12^{37,38,43}$), చూడకున్నను నమ్మువారును (యోహా $20^{29}$) అట్టి స్థితి గలవారని క్రీస్తు చెప్పెను. మరియు (లూ $1^{45}$) పేతురును (మ $16^{17}$) ధన్యులనఁబడిరి. శోధనలు సహించువారును (యాకో $1^{12}$) వాక్యమును విని దాని ప్రకారము చేయువారును ($1^{25}$) ధన్యులని యాకోబు వ్రాసెను. వాక్యమును చదువువారును (ప్రక $1^{3}$ $22^{7}$), ప్రభువునందు చనిపోవువారును ($14^{13}$), ప్రభువు రాకడకొఱకు కనిపెట్టువారును ($16^{15}$), పరమ విందులో పాల్గొనువారును ($19^{9}$), జీవపునరుత్థానము నొందువారును ($20^{6}$), పరమ యెరూషలేములో ప్రవేశించునట్లు తన వస్త్రములను ఉదుకుకొనువారును ధన్యులని యోహాను వ్రాయుచున్నాఁడు.

పాఁత నిబంధనయందలి కొన్ని వాక్యములలో నిట్టి ధన్యతలు భూసంబంధమైనవై యున్నను (ద్వితీ 28) అవి క్రమక్రమేణ ఆత్మీయములైన వగునని పై సూచనలవలన కనుగొనవచ్చును. క్రొత్త నిబంధనలో అవి పూర్ణముగా ఆత్మీయములైనవై దేవుని రాజ్యమునకు సంబంధించి మోక్షము ననుభవించుటను గూర్చినవై యున్నవి.

**ధన్యవాక్యములు** (Beatitudes). **మ $5^{3-12}$ లూ $6^{20-23}$** నందున్న దీవెనలకు సాధారణముగా పెట్టఁబడు పేరు. మత్తయిలో తొమ్మిదియు, లూకాలో నాలుగు నున్నవి. లూకాలో ధన్యవాక్యములకు తరువాత శ్రమవాక్యములు నాలుగు కలవుగాని యివి మత్తయిలో లేవు. ఇవి మాత్రమేగాక యింకను కొన్ని ధన్యవాక్యములు గలవు (మ $11^{6}$ $13^{16}$ లూ $11^{28}$ $12^{37}$ యోహా $20^{29}$ యాకో $1^{12}$ ప్రక $14^{13}$ మొ॥).

పై వాక్యములలో మత్తయి సూటిగా క్రీస్తు పలికినవే వ్రాసెనని కొందఱు తలంతురు. మఱి కొందఱు లూకా సరిగా వ్రాసినవాటిని మత్తయి కొంచెము విసరించెనని తలంచుచున్నారు. క్రీస్తు వాటిని వెవ్వేఱు సమయములలో నేకరీతిగానే చెప్పిక మత్తయిలో నున్నట్లును లూకాలో నున్నట్లును ఆయా సమయములలో చెప్పియుండవచ్చును. మొత్తముమీఁద సంగతిలో నెట్టి భేదమును లేదు.

**ధర్మముచేయుట** దాతృత్వము చూ॥

**ధర్మశాస్త్రము** (Law). ధర్మశాస్త్రము అనఁగా ధర్మవిధులు గల గ్రంథము అని యర్థము. ఆ విధులకు లోఁబడవలెనని యొక అధికారి యాజ్ఞ నియ్యకపోయిన యెడల ధర్మశాస్త్రమును పాపమును నుండనేరవు (రోమా $5^{13}$). అయితే గ్రంథములోనున్న ధర్మవిధులు మాత్రముగాక, మానవుల మనస్సాక్ష్యమువలన సహజముగా తెలిసిన ధర్మవిధులను కూడ ధర్మశాస్త్రమునుగా నెంచఁదగును ($2^{14,15}$). ఇట్లు మన సహజబుద్ధికి సంబంధించిన దుర్బుద్ధిసహా ఒక విధమైన ధర్మశాస్త్రముగా నెంచఁబడును ($7^{23}$). అధికారుల యాజ్ఞ (ఎజ్రా $7^{26}$ = నియమము ఎస్తే $1^{19}$ = రాజాజ్ఞ దాని $6^{8}$ = శాసనము)లు మంచివైనను సరే చెడ్డవైనను సరే హెబ్రీభాషలో ధర్మశాస్త్రము అనఁబడును. అయితే ఈ మాట కట్టి సామాన్య అర్థములుండినను సాధారణముగా బైబిలులో ధర్మశాస్త్రమునకు పాఁతనిబంధన (యోహా $12^{34}$ I కొరి $14^{21}$), మఱీ ముఖ్యముగా పాఁత నిబంధనలో మోషే వ్రాసిన గ్రంథపంచకము (యెహో $1^{8}$ నెహె $8^{2,3,14}$ మ $5^{17}$ $7^{12}$ లూ $16^{16}$ యోహా $1^{17}$) అను విశేషార్థమును కలదు. ఇట్లు ధర్మశాస్త్రము మోషే ద్వార ఇయ్యఁబడెను (నిర్గ $20^{19-22}$ మ $15^{4}$ యోహా $1^{17}$) అనియు, దేవుని ధర్మశాస్త్రము (యెహో $24^{26}$) అనియు, యెహోవా ధర్మశాస్త్రము (II దిన $31^{3}$) అనియు ననఁబడును. యెహో $1^{7,8}$ చూడఁగా అది యొక గ్రంథమై

నట్లు స్పష్టమగును. ఈ దిగువ వాక్యముల సంబంధమును చూడఁగా ధర్మశాస్త్రమనుదానిలో మోషే గ్రంథ పంచకములోని ప్రతి గ్రంథమును చేరియున్నట్లు తేటపడును (మ $12^{26}$ తో నిర్గ 3 ను, మా $7^{10}$ తో నిర్గ $20^{12}$ $21^{17}$ ను, లూ 2 యోహా $7^{22,23}$ లతో లేవి $12^{2,3}$ ను, మ $8^{4}$ తో లేవి $14^{3}$ మ $19^{8}$ $22^{24}$ లతో ద్వితీ $24^{1}$ $25^{5}$ లను సరిపోల్చి చూ॥). లూ $24^{44}$ లోని ధర్మశాస్త్రము అను మాట మోషే గ్రంథ పంచకమునకు చేరి యున్నది.

ఈ ధర్మశాస్త్రములోని విధులేవి యనఁగా, (1) పదియాజ్ఞలలోని నీతిశాస్త్రము (నిర్గ 20). ఇది సీనాయిపర్వతమునొద్ద మిగుల గంభీరమైన విధముగా నను గ్రహింపఁబడియెను. (2) సామాన్యధర్మములను, పండుగల విషయములను, ఆరాధనవిషయములను జరుపవలసిన విధులు (నిర్గ 21-40). (3) గుడారము నిర్మింపఁబడిన పిమ్మట తెలుపఁబడిన ఆచారవిధులు (లేవీయకాండము). (4) $38$ సం॥ లకుఁ బిమ్మట మోషే ధర్మశాస్త్రము యొక్క అంతర్యభావమును తెలుపుటకు నిచ్చిన విషయములు (ద్వితీయోపదేశకాండము). ఆచార సంబంధములగు విధులు క్రీస్తునకు ముంగుఱుతులై ఆయనవలన పూర్ణముగా నెఱవేఱినవి (హెబ్రీ 8-10). కావున అవి క్రీస్తువచ్చినపిమ్మట అమలులో నుండునవి కావు. ఈ ధర్మశాస్త్రములో దేశసంబంధమగు చట్టములుకూడ కలవు. అవి ఆయా దేశస్థుల శిక్షాస్మృతులలో (*Penal Codes*) నిమిడి యున్నవి. కావున మనము వాటికిఁగాక మన స్వదేశసంబంధమైన శిక్షాస్మృతికి (*Penal Code*) లోఁబడ బద్ధులమై యున్నాము. అయితే నీతిశాస్త్రము గతించి పోనేరదు. నీతికి సంబంధించిన విధులు పది యాజ్ఞలలో నున్నవిగాని పాఁత నిబంధనలో నెచ్చటెచ్చట నీతిచట్టములు కలవో (యెష $1^{17}$, మీకా $6^{8}$ మొ॥) అనియును మాఱని యీ నీతులలో నున్నవి (మ $6^{17,18}$).

పౌలు ముఖ్యముగా గలతీయులకు వ్రాసిన యుత్తరములోను (3-4), రోమా యుత్తరములోను (6-8) ధర్మశాస్త్రము విశ్వాసనియమము అను సువార్తకు విరుద్ధముగా నున్నట్లు వ్రాసి యున్నాఁడు. అతఁడందులో మనము మన స్వంత నీతికృత్యములచే మఱి ముఖ్యముగా పాఁత నిబంధనలోని యాచారములచే రక్షణ పొందఁ గలము అను తప్పభిప్రాయమును ఖండించెను. మనము ధర్మశాస్త్రమును పూర్ణముగాఁ గైకొనలేము కావున అదిమాత్రమే యుండినయెడల మనకు శాపమేగాని రక్షణ కలుగనేఱదనునదే పౌలు వ్రాసిన పై యధ్యాయముల సారమై యున్నది. పాఁత నిబంధన యాచారములను చూడఁగా అవి యసంపూర్ణములైనవి కావున అవి మనలను రక్షింప నేరవు అనుబోధ హెబ్రీయులకు వ్రాసిన యుత్తరమునకు సారమై యున్నది (హెబ్రీ $9^{11-15}$).

ధర్మశాస్త్రములోని యుత్కృష్టమైన నీతి చట్టములను పూర్ణముగాఁ గైకొనుటకు పాపుల మైన మనకు శక్తిలేదు కావున మనకు దానివలన రక్షణ కలుగనేఱదని రోమా 7 వ అధ్యాయములో నున్నట్లు పౌలు బోధించెను. ఇట్లుండ నీతితోఁ గూడిన ధర్మముతో మనకుఁ బనిలేదని తలంపరాదు. ధర్మశాస్త్రము మన పాపములను మనకుఁ జూపి రక్షకుఁడైన క్రీస్తునొద్దకు మనలను నడిపించును (గల $3^{24,25}$). మఱియు మనము దేవునికృపచే ఆయన పరిశుద్ధాత్మవలన నూతన పఱుపఁబడినవారమైన పిమ్మట నీతితోఁ గూడిన ఆ యాజ్ఞలకు మనము స్వయముగా లోఁబడుటకు మనస్సుకలవారమగుదుము (ఎఫె $1^{8-10}$). గాన ఇఁకను అది దాసత్వమెంతమాత్రముగాక మనము చేయఁగోరు స్వాతంత్ర్యమై యుండునని తెలిసి కొనవలెను. ఇదే మన హృదయముమీఁద వ్రాయఁ బడిన ధర్మశాస్త్రముని యనఁబడును (యిర్మీ $31^{31-34}$ హెబ్రీ $8^{8-12}$).

ధర్మశాస్త్రమునకు **ఆజ్ఞలు, విధులు, కట్టడలు, నియమములు, శాసనములు, ఉపదేశములు** అను పేరులు కలవు (ధర్మశాస్త్రమును వర్ణించు 119 వ కీర్తనను చూ॥). ఈ పేరులన్నిఁటిని చూడఁగా నివి ధర్మశాస్త్రము యొక్క ప్రాముఖ్యతను దాని యధికారమును సూచించు పదములై యున్నవని తెలిసికొనఁ గలము.

పై వివరము బైబిలుక్రమము ననుసరించును. నవీనవేదశాస్త్రులలో ననేకు లీ క్రమము ననుసరింపక దీనిని సవరణచేయవలె ననుకొందురు.

పాత నిబంధనలో నీతివట్టములున్నవి. పది యాజ్ఞలే వాటికి ఆధారములు. నీతిన్యాయములను బోధించిన ప్రవక్తలు ముఖ్యముగా బోధించినవివే. అయితే దీనికిభిన్నముగా ఆచారములను ముఖ్యముగా నాచరింపవలెనని బోధించిన యాజకులు కూడ నుండిరి. వారు తమ బోధలను ప్రచురింపఁ జేయుటకు ఆయన నీతిబోధలతో ఆచారములకు సంబంధించిన విషయములనుచేర్చి యున్నట్లుగాను వాటిని బోధించు గ్రంథములను సహా రచించినట్లుగాను కనఁబడుచున్నది. ఈ రెండు తెరగతులవారుగాక వారి గ్రంథములను దిద్ది సవరణచేసినవార లున్నారని మఱికొందఱి యభిప్రాయము. గ్రంథముల శైలినిఁబట్టియు చరిత్ర సంబంధములనుబట్టియు ఎవరు యది వ్రాసిరో నిర్ధారణచేయుటకు వారు గ్రంథములను బహు సూక్ష్మముగా పరీక్షించి యుండిరి. వారంగీకరించిన విషయములలో ముఖ్యములైన వేవియనఁగా: ద్వితీయోపదేశకాండము మోషేవలన రచింపఁబడక రాజులకాలములో యోషీయా పరిపాలనకుఁ బూర్వమున మొదట రచింపఁబడెనని యనుకొనుచున్నారు. మోషే గ్రంథపంచకములోని కొన్నిభాగములు (ఉదా॥ నిర్గ $22^{2}$-$23^{33}$ = దీనికి నిబంధనగ్రంథమని పేరు). మిగుల పురాతనమైనవైనను, వీటిలోని ఆచారవిషయములు (ఉదా॥ లేవీయకాండము) అంత పురాతనమైనవి కాక, అన్నిటిలో చివఱగా వ్రాయఁబడినవై యున్నవి. ఇట్లు గ్రంథములను సవరణచేయుట వలన ఇశ్రాయేలీయులలో గొప్ప నీతిబోధలను ప్రవక్తలు మొదట బోధించిరనియు, ప్రవక్తలు ఆచారములను ఖండించిరనియు, దానికి భిన్నముగా యాజకులు తమ యాచారములను స్థిరపఱచుటకు వ్రాసిరనియు ననుకొందురు. అదియుఁగాక వారు గ్రంథములను సవరణచేయువిధమును చూడఁగా ఇశ్రాయేలీయులు మొదట ఏకదేవుని నెఱుఁగనివారై క్రమక్రమేణ ఆ బోధను సంపాదించుకొని యెరూషలేములో తప్ప ఇంక ఎచటనైనను పూజచేయకూడదను విషయములను చేర్చికొనియుండిరనుకొందురు. పండితు లిట్టివాటిని ఎంతగా పరీక్షించినను రూఢియైన తీర్మానములను చేసినట్లు కనఁబడదు. ఇట్టి సంగతులను మఱి విశదముగా తెలిసికొనవలెననిన యెడల ఆయా పండితుల గ్రంథములను పరీక్షింపవలెను లేనియెడల పైన బహు క్లుప్తముగా వ్రాయఁబడిన వారిబోధలను తేటగా తెలిసికొనుటకు వీలుకాదు. (బైబిలు చరిత్ర చూ॥).

**ధవళము** రంగులు I చూ॥

## ధా, ధూ

**ధాన్యము** (Corn). యవలు గోధుమలు కాయధాన్యములు చోళ్లు సజ్జలు తెల్లజొన్నలు కర్ర చిక్కుడుకాయలు అనువాటిని ధాన్యములుగా బైబిలునందుదాహరించిరి (యెహె $4^{9}$ ఆ పదముల క్రింద చూ॥).

**ధారగుమ్మము** యెరూషలేము B V 2 (10) చూ॥

**ధూపకలశము, ధూపార్తి** (Censer) ఆరాధనజరుగునప్పుడు ధూపద్రవ్యమును కాల్చుటకు వాడినపాత్రలు (సంఖ్యా $16^{6,39}$). గుడారమునందు ఇత్తడివాటిని వాడిరి (లేవీ $16^{12}$). నిర్గ $27^{3}$ లోని అగ్నిపాత్రలు ఇవేయై యుండెను. సొలొమోను కట్టించిన దేవాలయము నందున్నవి బంగారువి (I రాజు $7^{50}$ II దిన $4^{22}$ హెబ్రీ $9^{4}$). ప్రకటనగ్రంథములో అలంకారముగా వాడఁబడిన ధూపార్తులును బంగారువే. అచ్చట అవి పరిశుద్ధుల ప్రార్థనలకు గుఱుతుగా నున్నవి. ఆరాధనచేయుట యందు దాని భావమదేగాన ప్రార్థనచేయు సమయములలో యాజకుఁడు ధూపము వేయుట వాడుకయై యుండెను (లూ $1^{8,10}$).

**ధూపద్రవ్యము** (Incence). దేవాలయమునందారాధన సమయములో వేసిన ధూపద్రవ్యము ఒక విశేష మిశ్రిత ఔషధమై ఆ పనికి మాత్రమే వాడవలెనను గట్టి నియమముండెను (నిర్గ $30^{34-38}$ లేవీ $10^{1-7}$). అందులో జటామాంసి గోపీచందనము గంధపుచెక్క స్వచ్ఛమైన సాంబ్రాణి ఉప్పు అనునవి గలవు. దానిని కాల్చుటకు బంగారుతో చేయఁబడిన ప్రత్యేకమగు వేదికయొకటిగలదు (నిర్గ $30^{1-9}$). దాని మీఁదనే ప్రతి ఉదయమును సాయంకాలమును యాజకుఁడు ధూపము వేయవలసియుండెను

($30^{1,8}$). పాపాచ్ఛాదన దినమున ఆ ధూపము నొక కలశమునవేసి అతి పరిశుద్ధమగు స్థలములో ప్రధానయాజకుడు కాల్చెను (లేవీ $16^{12,13}$). వేదికను ప్రతిష్ఠించిన సమయములో ఆయా గోత్రముల ప్రధానులలో నొక్కొక్కడు ధూపద్రవ్యములతో నింపబడియున్న బంగారు ధూపార్తులను తెచ్చి యర్పించిరి (సంఖ్యా $7^{14,20,26,32}$ మొ॥). ఈ ధూపద్రవ్యములు ప్రార్థనలకు సూచనకావున అది ముఖ్యముగా ప్రధానయాజకుడు ప్రజల నిమిత్తముచేసిన విజ్ఞాపనమునకు గుఱుతు. అది యటువంటిదై యున్నందున ప్రాయశ్చిత్తము చేయుటకు మంచి సాధనముగా నుండెను ($16^{46,47}$). భక్తుడు తన ప్రార్థనలు ధూపమువలె దేవుని కంగీకారముగా నుండవలెనని ప్రార్థించెను (కీర్త $141^{2}$). క్రొత్త నిబంధన కాలములోకూడ ఈ యాచారము నాచరించుచునే వచ్చిరి (లూ $1^{8\ 10}$). ప్రక $8^{3-5}$ లో ధూపము భక్తుల ప్రార్థనలకు సూచనగా నున్నది. అన్యులు తమ దేవతలను ఆరాధించుటలోకూడ ధూపమువేసిరి (II దిన $34^{25}$ యిర్మీ $48^{35}$ గంధవర్గము 2 చూ॥).

**ధూపవేదిక** గుడారము 6 (2) (*c*) చూ॥

**ధూమ్రము, ధూమ్రవర్ణము** రంగులు 3 చూ॥

**ధూళి బూడిద** చూ॥

# ధై

**ధైర్యము** (Courage). ఈ పదముచే తెనిగించిన హెబ్రీ పదములు కనీసము నాలుగును గ్రీకుపదమొకటియు బైబిలునందున్నవి.

1. హృదయమని యొకపదమున కర్థమగును. హృదయము ధైర్యమునకు సూచనగా నుండు నట్లితర భాషలలోను జాతీయములున్నవి. ఇది ఆమో $2^{16}$ నందు ధైర్యమనుపదముచే తెనిగింపబడెను.

2. యెహో $2^{11}$ లో ఆత్మయని శబ్దార్థమిచ్చు పదము. ఇట్టి యర్థముతోకూడిన జాతీయము లితర భాషలలోను గలవు.

3. బలమని యర్థమిచ్చెడి పదమునుకూడ ధైర్యమనియే తెనిగించిరి (ద్వితీ $31^{6,7,23}$ యెహో $1^{6,7,9,18}$ $10^{25}$ I దిన $22^{13}$ $28^{20}$).

4. అదే యర్థమిచ్చు ఇంకొకమాట II సమూ $10^{12}$ $13^{28}$ II దిన $19^{11}$ ఎజ్రా $10^{4}$ కీర్త $27^{14}$ $31^{24}$ యెష $41^{6}$ నందున్నది.

5. క్రొత్త నిబంధన యందీ పదముయొక్క నామవాచకరూపము కార్య $28^{15}$ లో మాత్రమున్నదిగాని దాని క్రియారూపమును మ $9^{2,22}$ $14^{57}$ మా $6^{50}$ $10^{49}$ యోహా $16^{33}$ కార్య $23^{11}$ నందు చూడవచ్చును.

ధైర్యమును చూపుటకుగావలసిన ప్రేరేపణ దేవునివాక్యమును లక్షించుటవలననే కలుగునని పై వాక్యములవలన దెలిసికొనవచ్చును. శరీర సంబంధమగునదేగాక నిర[illegible] లోకము నందు కలుగు కష్టము[illegible]ంచి వాటి సా[illegible]ముగా జయించు [illegible]యుండవలెనను ప్రేరే[illegible]పణలు కలవు. [illegible]ర్యమెట్టి స్థితియందైనను కనబఱుచుటకు [illegible].

**ధ్వజము,** [illegible] (Banner, Standard).

1. ప్రస్తుతమున [illegible] నందును సేనలలోని వారు ధ్వజముల నుపయోగించిరి. ధ్వజములు ప్రజల[illegible] చునవై యుండినట్లు [illegible]లదు (పర 6[illegible]). మఱి ముఖ్యముగా నది ప్రజలు కూడవలసిన స్థానమును సూచించును (నిర్గ $2^{2}$ యిర్మీ $4^{6}$ $51^{18}$). పైనున్న వాక్యములలోని మూలభాషాపదము నిర్గ $17^{15}$ లో యెహోవానిస్సీ యని తెనిగించిరి. అది యెహోవా నా ధ్వజము లేక నేను ఆశ్రయించు స్థానమని యర్థమగును.

2. మఱియొక పదము ఇశ్రాయేలీయుల గోత్రములు గుఱుతుగా నుంచినవాటికి నుపయోగించి దానిని టెక్కెము అని తెనిగించిరి (సంఖ్యా $1^{52}$ $2^{2}$ $10^{14}$ మొ॥). $6^{4}$ లోను ఈ పదమే యున్నదిగాని అది కనబడునది యని యర్థమగుచు ఆయా గోత్రముల వారు కూడవలసిన స్థలమునకు సూచనగా నున్నది. ఈ పదము అలంకారరీతిగా ప్రయోగింపబడి మనస్సు నాకర్షించు దానిని సూచించును (పర $2^{4}$).

3. గుఱుతు అర్థమిచ్చు మూఁడవపదమును కీర్త $74^4$ లో విరోధులకు కలుగు జయమునకు సూచనయై యున్నది. ఈ మాట సంఖ్యా $2^2$ నందు పైనున్న రెండవ మాటలో కలిసి వాడఁబడెను.

ధ్వజములను వస్త్రములతో మాత్రమేగాక సాధారణముగా పెద్ద కర్రలపై తగిలించిన లోహమయమగు వాటితోను చేసిరి. అష్షూరువారు వృషభరూపమును సింహరూపమును, రోమనులు గరుత్మంతుని రూపమును తమ ధ్వజములపై నిలిపిరి. యెరూషలేము నాశనమునుగూర్చిన ప్రవచనములోనున్న నాశనకరమైన హేయవస్తువు యూదులకు హేయముగా నున్న అట్టి ధ్వజముల రూపములని కొందఱి యభిప్రాయము.

## న

**నక్క** (Fox, Jackal). ఈ మాటచే తెనిఁగించఁబడిన 4 హెబ్రీ పదములును ఒక గ్రీకుమాటయు బైబిలునందున్నవి. సాధారణముగా నక్కయని తెనిఁగింపఁబడిన పదము నెహె $4^3$ నందు గుంటనక్కను సూచించును. యిర్మీ $9^{11}$ $10^{22}$ నందు నక్కయనియు యెష $34^{13}$ నందు అడవికుక్క యని తెనిఁగింపఁబడినదిగాని అది చాలమట్టు తోఁడేలువంటిదని కొందఱు పండితుల యభిప్రాయము. ఇవన్నియు రాత్రులలో భయంకరమైన రోదన ధ్వని చేయుచు తిరుగునవై యున్నవి. పలెస్తీనునందివి బహు విశేషముగా నున్నవి. పగటియందు ఇవి నిర్మానుష్యములగు గుహలలో దాగియుండును (యెష $13^{21}$ $34^{14}$ $35^7$ మ $8^{20}$). గాని ప్రొద్దుగ్రుంకిన వెంటనే అవి బయటికివచ్చి మార్గముల వెంబడి అటు ఇటు మేఁతకొఱకై తిరుగులాడుచుండును. సాధారణముగా అవి కళేబరములను దినును (కీర్త $63^{10}$). ఇప్పటికిని ఆ ప్రాంతములలో తిరిగెడి అరబ్బీజాతులవారు తమ శత్రువుల శరీరములను నక్కలకు పారవేతుమని బెదరింతురు. రాత్రులయందవి మందలుగా తిరుగును గనుకనే సమ్సోను వాటిలో మూఁడు వందల నక్కల నొక్కసారిగ పట్టుకొనఁగలిగెను (న్యాయా $15^4$). ఇవి ద్రాక్షతోఁటలను పాడుచేయును (పర $2^{15}$). జాగరూకతగలిగి తప్పించుకొనుటకు మెళుకువ గలిగినవై యున్నవి (యెహె $13^4$ లూ $13^{32}$). క్రీస్తు తనకేమియు ఈ లోకమున లేదనుసంగతిని తెలిపినప్పుడు (లూ $9^{58}$), హేరోదు జిత్తులమారి తనమును తెలుపుటకును ($13^{32}$) దీనిని దృష్టాంతముగా నెత్తెను.

**నక్షత్రములు** (Stars). నక్షత్రముల సృష్టినిగూర్చినదే బైబిలునందు వాటినిగూర్చి యున్న మొదటి సూచనయైయున్నది (ఆది $1^{16}$). అవి ఆకాశసమూహములనఁబడెను ($2^1$). లెక్కకు మించినవాటిని తెలుపుటకు నక్షత్రములతోఁ బోల్చిరి ($22^{17}$) నక్షత్రములకు పేరులు గలవు. అట్టివి కొన్ని బైబిలునందున్నవి. II పేతు $1^{19}$ నందున్న **వేకువచుక్క** నక్షత్రము కాదు గాని శుక్రుఁడు అనుగ్రహమై యున్నది. యెష $14^{12}$ లో నున్న **తేజోనక్షత్రము** అదేనని యభిప్రాయపడుచున్నారు. ఆమో $5^{26}$ లో దేవతగా నెంచుకొనిన నక్షత్రము అని తెనిఁగించిన మూలపదము శనిగ్రహమును సూచించునని కొందఱనుకొందురు. అపొ $7^{43}$ నం ఉదహరింపఁబడిన ఈ వాక్యమునందు దానికి రొంఫా యను పేరు గలదు. ఇది శనిగ్రహముయొక్క మఱియొక పేరు కావచ్చును. నక్షత్రరాసులలో కొన్నిటి పేర్లును బైబిలునందున్నవి (సప్తర్షి, మృగశీర్ష, స్వాతి, కృత్తిక, మహాసర్పము మొ). ఇవిగాక యోబు $9^9$ నందున్న **దక్షిణ నక్షత్రముల రాసులు** అనునది ఏ యొక రాసినిగాక, అన్నిటిని మొత్తముమీఁద సూచించునని తలంచుచున్నారు.

జ్ఞానులకు మార్గము చూపిన నక్షత్రము (మ 2), ఒకటే రాశియందుచేరిన గ్రహముల కలయికవలన యేర్పడినదని కొందఱనుకొనుచున్నారు. కొందఱది యొక తోకచుక్కయని తలంతురు. అది యేదైనను, క్రీస్తుపుట్టుకను కనఁబఱచుటకు ఒక విశేష సూచనయని తెలిసికొనవలెను.

**నక్షత్రసూచకులు** జ్యోతిష్కులు చూ॥

**నగరు** (Palace). గొప్ప యిండ్లకు పెట్టఁబడు పేరు (ఆమో $1^{7,10,14}$ $3^{10}$ $6^7$). సొలొమోను మహారాజుయొక్క నగరిని మాత్రము బైబిలునందు వర్ణించిరి (I రాజు $7^{1-13}$). దావీదు

కీర్తనలలో నగరులు అను పదము యెరూషలేము లోని శ్రేష్ఠములగు కట్టడములను సూచించును (కీర్త $48^{3,13}$ $122^{7}$).

**నగలు** ఆభరణములు 3, రత్నములు చూ॥

**నగ్గయి (Naggai).** క్రీస్తు వంశావళి క్రమణికలోని యొకఁడు (లూ $3^{25}$).

**నజరేతు (Nazareth** = చిగురు రక్షించునది). యోసేపు మరియలు నివసించినయూరు. క్రీస్తు దీనిలోనే పెరిగెను (మా $6^{1}$ లూ $4^{23}$ మ $13^{53}$). అది ఎస్డ్రేలను బయలు కుత్తరముగా నున్న యొక కొండ ప్రక్కను కట్టఁబడెను (లూ $4^{29}$). అక్కడనుండి యా బయలును



ప్రస్తుతపు నజరేతు

మాత్రమే గాక కర్మెలు పర్వతమును చూడవచ్చును అతియందాయము మిగుల కన్నులపండువుగా నుండును. ఈ పట్టణము పేరు పాత నిబంధన యందు కనఁబడదు. క్రీస్తు జీవించిన కాలములో నిచ్చట నొక సమాజమందిర ముండెను. క్రీస్తు అందులో బోధించెను (లూ $4^{16-29}$). క్రీస్తు చరిత్రకు సంబంధించిన యనేకములను అచ్చట చూపింతురు గాని కన్యక ఊట యనఁబడునది తప్ప తక్కినవాటన్నిఁటికి ఆధారములేమియు లేని యూహలై యున్నది. దాని ప్రస్తుతపు పేరు ఎన్-నసీరా (*En-nasira*). (నజరేయుఁడు చూ॥. పటము IV, D 7).

**నజరేయుఁడు (Nazarene).** క్రీస్తు నజరేతు అను పల్లెటూరి వాఁడైనందున ఆయనకు కలిగిన పేరు. ఆ పేరాయనకు కలుగునని ప్రవచింపఁబడినట్లు మ $2^{23}$ నందున్నది. ఏ ప్రవచనమున కిది సరిపడునో అదియంత స్పష్టముగ లేదు. నజరేతు పల్లెయగుటచే ఇది యొకవేళ ఆయన హీనస్థితి కొక సూచనగా నున్నది కావున దానిని గూర్చిన ప్రవచనములను సూచింపఁబడవచ్చును సంగతినిబట్టి గాక శబ్దమునుబట్టి (యెష $11^{1}$) నందున్నదే యీ ప్రవచనమని యనేకుల అభిప్రాయము. అచ్చట మూలభాషలో నెచర్ అను బిరుదు క్రీస్తునకు పెట్టిరి. దానికి చిగురు అను అర్థమున్నను, శబ్ద సంబంధమునుబట్టి ఆయన నజరేయుఁడగునని సంగతిని సూచించుననవచ్చును. ఇది మొదట క్రీస్తుకు హేళనగా వాడిన పేరు (యోహా $1^{46}$) గాని, హేళనకు మాత్రమే గాక ఈయన యెవఁడో దానిని తెలుపుటకును ఈ బిరుదును వాడిరి. దయ్యములు పట్టినవారును (మా $1^{24}$ లూ $4^{34}$), ప్రజలును (మా $10^{47}$ లూ $18^{37}$ యోహా $18^{5}$), ఆయనను పట్టుకొనిన బంటులు ($18^{5,7}$), ఆయన ప్రధాన యాజకుని ఆవరణమందున్న సమయములో నక్కడనున్న

అతని సేవకులు (మ $26^{71}$ మా $14^{67}$) పిలాతు (యోహా $19^{19}$) ఆయన నిట్లు పిలిచిరి. మిగుల హీనదశయందున్నవాఁడెంత గొప్ప నాయకుఁడయ్యెనో ఆ సంగతిని తెలుపుటకు ఆయన శిష్యులీ పేరును గౌరవార్థముగా నాయనకుఁ బెట్టిరి (లూ $24^{19}$ కార్య $2^{22}$,$3^{6}$ $4^{10}$ $6^{14}$ $10^{38}$ $26^{9}$). పౌలుకు కలిగిన దర్శనమందీ పేరుతో క్రీస్తు తనను అతనికి బయలుపరచుకొనెనట అప్పటికింతో తగియుండెను ($22^{8}$). ఈ పేరును క్రీస్తుయొక్క ఘనమైన నామములలో నొకటిగా నేటివఱకును



నజరేతు పట్టణపు నీటి బుగ్గ

వాడుచున్నారు. క్రీస్తెంత గొప్పవాఁడైనను తన్ను తాను తగ్గించుకొని మన హీనదశలో పాలివాఁడయ్యెనని ఈ బిరుదు సూచించుచున్నది.

**నడత** ప్రవర్తన చూ॥

**నడికట్టు** దట్టీ చూ॥

**నడిమిశాల** యెరూషలేము B III 3 చూ॥

**నతనయేలు** (Nathanael = దేవదానము). గలిలయలోని కానా కాపురస్థుఁడు (యోహా $21^{2}$). క్రొత్త నిబంధనలో రెండుసారులు మాత్రమే యితని పేరగుపడుచున్నది. యొర్దాను నదినుండి క్రీస్తు గలిలయకుఁ దిరిగివచ్చినప్పుడు ఫిలిప్పు తనిని ఆయనయొద్దకుఁ గొని తెచ్చెను ($1^{45-49}$). యేసు పునరుత్థానమైన పిదప గలిలయ సముద్రముమీఁద చేపలు పట్టుటకు వెళ్లినవారిలో నితఁడునుండెను ($21^{2}$).

నతనయేలు పండ్రెండుగు రపొస్తలులలో నొకఁడా యనునది విచారింపఁదగిన సంగతి. దీనినిగూర్చి నిశ్చయించుటకుఁదగిన రుజువులంతగా కనఁబడవు. అతఁడు ఇతర యపొస్తలులతో కూడి యుండినట్లు యోహా $21^{2}$ నందున్నదిగాని వారి కెలుకర్తయైన వాఁడగుటచే నాంతోనుండి యుండవచ్చును. అపొస్తలుల జాబితాలో నొక చోటను ఇతని పే రుదాహరింపఁబడలేదు. మత్తయి మార్కు లూకా సువార్తలలో బర్తొలమయియని యున్న పేరు నతనయేలుయొక్క మాఱు పేరని చాల కాలమునుండి యొక జనప్రమేయము గలదు. యోహా $15^{1}$ నందున్నట్లు క్రీస్తు చెప్పిన మాటల ప్రకారమితఁడాయన అపొస్తలులలో నొకఁడై యుండవచ్చునని స్ఫురించుచున్నది. అతనిని యేసుయొద్దకుఁ దెచ్చిన ఫిలిప్పు పేరుతో కలిసి బర్తొలమయి యనుపే రుదాహరింపఁబడుటను చూడఁగా (మ $10^{3}$ మా $3^{18}$ లూ $6^{14}$) ఆ యభిప్రాయము నిజమై యుండునని దోఁచుచున్నది.

ఇతఁడు మంచివాఁడని యేసు సాక్ష్యమిచ్చెను (యోహా $1^{47}$). యేసు మెస్సీయయని అతఁడు తక్షణమే యంగీకరించెను. అంజూరపు చెట్టు క్రింద నుండఁగా ఆయనకు కనఁబడినప్పుడు

అతండు మెస్సీయ రాకకొఱకు ప్రార్థించుచుండ వచ్చును. అతని తరువాత జీవితమునుగూర్చి మన కంతగాఁ దెలియదు (నెతనేలు చూ॥).

E.

**నతనేలు** నెతనేలు చూ॥

**నత్త** కీటకములు 18 చూ॥

**నత్తివాయి** రోగములు చికిత్సలు II 3 (2) చూ॥

**నది, ఏరు** (River). బైబిలునందలి కొద్ది గొప్ప ప్రవాహములను సూచించెడి పదమై యున్నది సాధారణముగా ఆ నదుల పేరు పేరితో కలిపి వాడెదరు (ఆది $2^{13,14}$ $15^{18}$ మొ॥). ఒకానొకప్పుడు ఒక నదియొక్క పేరు అందరికిని తెలిసియుండుటచే ఆ నది పేరును చెప్పక నది యను పదమును మాత్రము వాడెదరు. ఐగుప్తునందుండగా అక్కడనున్న నైలునది ప్రాముఖ్యతను బట్టి నది యను పదము దానిని సూచించెను (నిర్గ $1^{22}$ $2^{3,5}$ $4^{9}$ మొ॥). యాకోబు చరితలో అతండు పద్దనరాము నుండి తిరిగి వచ్చునపుడు వాడిన నది యను పదము యూఫ్రటీసు నదని సూచించెను (ఆది $31^{21}$). పాలెస్తీను సరిహద్దులలో నది యను పదము హద్దుగా వాడిన చోట్లెల్లెడను అది యూఫ్రటీసును సూచించును (నిర్గ $23^{31}$ I రాజు $4^{21,24}$ ఎజ్రా $8^{36}$ మొ॥). మూలభాషయందు II దిన $9^{26}$ లో నది యను మాటమాత్రే యున్నను బైబిలును తెనిఁగించినవారు ఫరాతు అను మాటను కూడ చేర్చిరి.

**నపుంసకుడు, షండుడు** (Eunuch). బైబిలు కాలమునందు గొప్పవారి అంతఃపురములలో సేవకులుగా నుండుటకై నపుంసకులను నియమించుట వాడుకగా నున్నది. తురకవారు ఇటీవలి పనిని నిట్లే చేయుచుండిరి. పాత నిబంధనయందు నపుంసకుఁడని యర్థమిచ్చు పదమును **పరిచారకుడ**నియు (II రాజు $9^{32}$ $23^{11}$ యిర్మీ $29^{2}$ $34^{19}$), **ఉద్యోగస్థుడ**నియు (ఆది $37^{36}$ $39^{1}$ $40^{2,7}$ మొ॥), **పరివారమ**నియు (I సమూ $8^{15}$ II దిన $18^{8}$), **అధిపతి** యనియు ఆయా సందర్భములకుఁ దగినట్లు తెనిఁగించినను, ప్రతి వాక్యములో నది నపుంసకుఁడని యర్థ మిచ్చునని కొందఱి యభిప్రాయము. రాజులు సాధారణముగా నపుంసకులను అట్టి పనులకు నియమించుటచే నీ పదమునకు పరిచారకుఁ డనియు అర్థమయ్యెనని మఱికొందఱ అభిప్రాయ పడుచున్నారు (ఉద్యోగస్థుడు చూ॥).

రాజు అంతఃపురములోని సేవకులను సూచించునప్పు డీ పదమును నపుంసకుఁడని గాని షండుఁడని గాని తెనిఁగించిరి (II రాజు $20^{18}$=యెష $39^{7}$). పారసీకరాజ నగరులోను (ఎస్తే $1^{11,12}$ $2^{3,14,15,21}$ మొ॥), బాబెలులోను (దాని $1^{3,7,8}$ మొ॥) అట్టివారు పెక్కండ్రు గలరు. యూదావారిలోను అట్టివారుండినట్లు యిర్మీ $41^{16}$ వలనఁ దెలియును. యిర్మీయాను రక్షించిన సేవకుఁ డట్టివాఁడే ($38^{7}$). నపుంసకులను దేవుని సంఘమునందు చేర్చుకొనరాదను నియమ ముండినను (ద్వితీ $23^{1}$) అట్టివారు దేవుని యాజ్ఞలను గైకొని ఆయన విశ్రాంతిదినమును లక్షించినయెడల వారును చేర్చఁబడుట కర్హులని యెషయా ప్రవచించెను ($56^{3,4}$).

క్రొత్తనిబంధనలో కందాకేరాణియొక్క ధనాగారియగు నపుంసకుఁడు విశ్వసించుటను గూర్చి కార్య $8^{27-38}$ నందు చూడవచ్చును. రాణియొద్దనుండు అట్టి గొప్ప యుద్యోగస్థుఁడు నపుంసకుఁడుగా నుండుట ఆ కాలపు వాడుకలకు సూటిగా సరిపడును (ఐతియొపీయుడైన నపుంసకుడు చూ॥). ఇంద్రియ నిగ్రహులు అలంకారరీతిగా నపుంసకు లనఁబడుదురు (మత్త $19^{12}$). ఓరిగెను (*Origen*) అను భక్తుఁడు దీని నక్షరాల నెఱవేర్చెను గాని అట్లు క్రీస్తుయొక్క ఆత్మీయబోధలను అక్షరరీతిగా గ్రహించుట పొరపాటని యందఱు నొప్పుకొందురు.

**నప్తుహీయులు** (Naphtuhim). మిస్రాయిము కుమారులలో నాల్గవవాఁడు. మిస్రాయిము ఐగుప్తు పూర్వీకుఁడు కావున ఇతని సంతతి వారును ఐగుప్తీయులలో జేరినవారు (ఆది $10^{13}$ I దిన $1^{11}$). ఈ పేరు ఐగుప్తీయుల శాసనములలో నింతమట్టుకు కనఁబడలేదు. కావున అది లెహాబీయులకును పత్రూసీయులకును మధ్యనుండుటచే ఐగుప్తుమధ్యలో నుండవచ్చును.

**నఫ్తాలి** (Naphtali = పోరాడి గెలుచుట).

1. యాకోబు ఆరవకుమారుఁడు. రాహేలు దాసియగు బిల్హా రెండవకుమారుఁడు. దేవుని

యుండెను. అట్టి వాడుకలనుమాత్ర మిచ్చట వివరింతుము.

1. నమస్కరించుటయని యర్థమిచ్చు ఒకశే హెబ్రీ పదమును (II సమూ $15^{5}$ $16^{4}$ ఎస్తే $3^{2}$ కీర్త $72^{11}$ మొ॥), **సాగిలపడుట** (ఆది $23^{7,12}$ $33^{3,6}$ $43^{26,28}$ $49^{8}$), **సాష్టాంగపడుట** ($37^{7}$ II రాజు $2^{15}$ $4^{37}$), **సాష్టాంగనమస్కారము చేయుట** (సంఖ్యా $22^{31}$ I సమూ $20^{41}$), **దండము పెట్టుట** ($2^{36}$) అను మొదలగు పదములచే తెనిగించిరి. గొప్పవారికిని రాజులకును (ఆది $43^{26,28}$ $49^{8}$ I రాజు $1^{16,31}$ మొ॥), ప్రవక్తలకును (II రాజు $2^{15}$ $4^{37}$ మొ॥) సాగిలపడిరని తెలియుచున్నది. మనవి చేసికొని బదులాడుకొనవారును (ఆది $23^{7,12}$ II సమూ $1^{3}$ $9^{6}$ మొ॥), ఇతరుల దయను గోరెడివారును (ఆది $33^{3,6}$ II సమూ $14^{4}$ మొ॥) ఇట్లు చేసిరి. ఆసియా ఖండమందు డిప్పుడుండిన వాడుకలు ఇప్పటివాడుకల వంటివని స్పష్టమగుచున్నది.

2 క్రొత్త నిబంధనలోని యొక గ్రీకు పదము దీనికి సంబంధించినదై అతితగానే వాడఁబడెను. క్రీస్తును మనవి చేసికొనినవారు ఆయనకు నమస్కరించిరి (మత్త $2^{11}$ $14^{33}$ $20^{20}$ మార్కు $5^{6}$ యోహా $9^{38}$ మొ॥). బంటులు క్రీస్తును పరిహసించుటకు ఆయనకు నమస్కారముచేసిరి (మార్కు $15^{19}$). క్రీస్తు లేచిన పిమ్మట ఆయన శిష్యులాయనకు మ్రొక్కిరి (మత్త $28^{17}$ లూకా $24^{52}$). మూలభాషయందీ పదమునకే అచ్చటచ్చట **పూజించు** యను పదమును వాడిరి (మత్త $2^{2,8,11}$). మహిమపరచఁబడిన క్రీస్తుకు చూపిన మర్యాదను ఈ పదముచేతనే సూచించిరి (హెబ్రీ $1^{6}$ ప్రక $4^{10}$ $5^{8}$ $7^{11}$ మొ॥). అచ్చటచ్చట **మ్రొక్కుట** యనియు తెనిగించిరి (మత్త $8^{2}$ $9^{18}$ $15^{25}$ $18^{26}$ $28^{9}$ మొ॥). సాతాను క్రీస్తును శోధించుచు తనకు మ్రొక్కవలెనన్నప్పుడీ పదమునే వాడెను ($4^{9}$) గాని క్రీస్తువానితో మనము దేవునికి మాత్రమే నమస్కరింపవలెనని చెప్పెను (మత్త $4^{10}$). దుష్టులు క్రీస్తు విరోధికి నమస్కరించినట్లు పరిమార్థజ్ఞాని చూచెను (ప్రక $13^{4,12}$ $16^{2}$ $19^{20}$). యోహాను దూతకు నమస్కారము చేయఁబోఁగా నతఁడు దూతచే నడ్డగింపఁబడెను ($22^{8,9}$).

రోమను వారు భక్తులకును దూతలకును నమస్కరింపవచ్చునుగాని ఆరాధన చేయరాదని బోధింతురుగాని, యోహా $4^{20-23}$ $12^{20}$ కార్య $8^{27}$ $24^{11}$ మొదలగు వాక్యములో ఆరాధన యని తెనిగించిన పద మిదే యని మరువరాదు. రోమను వారు దీనివిషయమై చెప్పెడి భేదము బైబిలునందు లేదని తెలిసికొనవలెను (ఆరాధన చూ॥).

**నమ్మకము** విశ్వాస్యత చూ॥

**నయమా** (Naamah = మధురము).

1. తూబల్కయీను సహోదరి (ఆది $4^{22}$).

2. రాజైన రెహబాముయొక్క తల్లి. ఈమె అమ్మోనీయురాలు. సొలొమోను భార్యలలో నొకతె (I రాజు $14^{21,31}$ II దిన $12^{13}$).

3. యూదయదేశములో షెఫేలా యను ప్రదేశమందుండు నొక యూరు (యెహో $15^{37-41}$). లూదుకు దక్షిణముగా మూఁడు క్రోసుల దూరములోనుండు నానె (*Naneh*) అను చిన్న యూరు దీని యునికియై యుండవచ్చును. (పటము III, D 5).

**నయమాతీయుడు** (Naamathite). యోబు గ్రంథములో నిది జోఫరు అనువానికి గల బిరుదు (యోబు $2^{11}$ $11^{1}$ $20^{1}$ $42^{9}$). ఈ పదమునకు నయమానివాసి యని యర్థము. ఇది నయమా 3 నందున్న స్థలమే యనుటకు శబ్ద సంబంధముతప్ప మరే యే యాధారమును లేదు. జోఫరుయొక్క జన్మస్థల మిదిగాక, అరబ్బీదేశములో మనమెఱుఁగని ఒక యూరని కొందఱి యభిప్రాయము.

**నయమాను, నయమానీయులు** (Naaman = ప్రియము, Naamites).

1. బెన్యామీను సంతతివారిలో నొకఁడు. ఆది $46^{21}$ లో ఇతఁడు బెన్యామీను కుమారుఁడైయున్నట్లున్నదిగాని సంఖ్యా $26^{40}$ I దిన $8^{4}$ లోను అతని మనుమఁడై యున్నట్లున్నది. ఇతని వంశస్థులకు **నయమానీయులు** అను పేరు కలదు (సంఖ్యా $26^{40}$).

2. సిరియాదేశపు సేనాధిపతులలో నొకఁడు. ఇతఁడు కుష్ఠరోగియైయుండి ఇశ్రాయేలీయులలోనుండి వచ్చిన యొక బానిసె చిన్నదాని మూల

ముగా ప్రవక్తయైన ఎలీషాను గూర్చి విని తన కుష్ఠమును కుదుర్చుకొనుటకు అతనియొద్దకు వెళ్లెను. యొర్దాను నదిలో ఏడుమారులు మునిఁగినయెడల బాగుపడెదవని చెప్పఁగా నయమాను మొదట ఇట్టి సామాన్యమైన పనికి సమ్మతింపక కోపావేశుఁడై స్వదేశమునకు వెళ్లనై యుండెనుగాని, తన నౌకర్లలో నొకని ప్రేరేపణవలన వెళ్లి స్నానముచేసి బాగుపడెను. ఎలీషా చేసిన మేలునకు కృతజ్ఞతగా నతనికి బహుమానము లియ్యఁబోయెనుగాని అతఁడు పుచ్చుకొననొల్లఁడాయెను. తరువాత అతఁడు యెహోవాయే నిజమైన దేవుఁడని యొప్పుకొని రెండుబండ్ల మంటిని తోలించుకొని స్వదేశమునకు పోయెను (II రాజు $5^{1-14}$). ఎందుకనఁగా, ఇశ్రాయేలీయుల భూమిమీఁదనే కాని మఱి యెచటను యెహోవాను పూజింప వీలుకాదని యతఁడును అప్పటి జనులును అనుకొనుచుండిరి (I సమూ $26^{19,20}$). తదనంతరం మతఁడు యెహోవానే విశ్వసించినను సిరియా రాజాజ్ఞ ప్రకారము ఆ దేశ దేవతయగు రిమ్మోను పూజా సంబంధములగు పనులలో పాలు పుచ్చుకొనవలసి వచ్చును గనుక అట్టి పాపమునకై ముందుగానే ప్రవక్తయొక్క క్షమాపణను వేడుకొనెను (II రాజు $5^{18}$). యెహోవాను సేవించువారెంత మాత్రమును ఇతర దేవతల పూజలలో పాలిభాగరులు కారాదను సంగతి నతఁడింకను తేటగా గ్రహించి యుండలేదు. ఆయావారలను పూజింప వచ్చునని పూర్వీకు లనుకొనిరి. ప్రస్తుతమున సామాన్యులగు హిందువులలో నిట్టి యభిప్రాయమే కలదు.

**నయము** (Naam = అందము). కాలేబు సంతతివారిలో నొక కుటుంబపుపెద్ద (I దిన $4^{15}$).

**నయరా, నహరా, నారాతా** (Naarah = చిన్నది Naarath, Naaran = అందము).

1. తెకోవ నివాసులకు పూర్వీకుఁడుగా నుండిన అష్హూరు అనువాని భార్యలలో నొకతె (I దిన $4^{5,6}$). ఈమె తెకోవ యనువానికి తల్లి యైయుండెను.

2. ఎఫ్రాయిమీయుల స్వాస్థ్యములోనున్న ఒక యూరు (యెహో $16^{7}$ I దిన $7^{28}$). ఈ రెండు వాక్యములను చూడఁగా ఈ పేరు మొదటి వచనములో **నారాతా** అనియు రెండవవచనములో **నహరా** యనియు నుండినను అవి రెండును ఒకటే స్థలమునకు పేరులై యున్నవి. యెరికో పట్టణమునకు ఉత్తరముగానుండు ఎల్-ఔయెహె (*el-' Aujeh*) అను పాడు శేషములే దాని యునికియైయున్న దనుకొందురు. అది యూఁటలుగల యొక స్థలము. హేరోదు అర్కెలాయు (మ $2^{23}$) యెరికోలోని తన నగరిపు అవరణమందలి తోఁటలకు ఈ నయరాయను స్థలము నుండి నీళ్లను రప్పించెనని యోసీఫసువలనఁ దెలియుచున్నది (పురా 17,13,1; పటము III, G 5).

**నయరై** (Naarai = యౌవనస్థుఁడు). దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{37}$). ఈ వాక్యమునకు సంబంధముగానుండు II సమూ $23^{35}$లో ఇతనికి **పయరై** అను పేరు కలదు.

**నయషోను** (Nahshon = ప్రధాని). అహరోను మామ (నిర్గ $6^{23}$). ఇతఁడు యూదా సంతతివాఁడై యుండెను (I దిన $2^{10,11}$). ఇశ్రాయేలీయులు అరణ్యములో తిరుగుచుండిన యారంభకాలమందతఁడు యూదావారిలో నొక ప్రధానియై యుండెను (సంఖ్యా $1^{7}$ $2^{3}$ $7^{12,17}$ $10^{14}$). ఇతఁడు దావీదు పూర్వీకులలో నొకఁడు (రూతు $4^{20}$ I దిన $2^{10,11}$). కావున క్రీస్తునకు కూడ పూర్వీకుఁ డయ్యెను (మ $1^{4}$ లూ $3^{32}$).

**నయోమి** (Naomi = నా సంతోషము). బేత్లెహేము కాపురస్థుఁడగు ఎలీమెలెకు భార్య (రూతు $1^{2}$). బేత్లెహేమునందు ఇతఁడు బాగుగఁ దెలియఁబడినవాఁడని చెప్పవచ్చును ($1^{19}$). దేశమున కలిగిన క్షామమువలన ఈమె కుటుంబము మోయాబుదేశమునకు వెళ్లిరి. అక్కడ ఆమె తన పెనిమిటిని యిద్దరు కుమారులను పోఁగొట్టుకొని రూతు అను కోడలితో తిరిగివచ్చెను (రూతు చూ॥). H.

**నరకము** (Hell, Gehenna). గేహెన్న యను పదమును తెనుఁగు బైబిలులో నరకము అను మాటచేత తర్జుమా చేసిరి. ఆ మాట

మ $5^{22,29,30}$ $10^{28}$ $18^{9}$ $23^{15}$ మా $9^{43,45,47}$ లూ $12^{5}$ యాకో $3^{6}$లో కనఁబడును. గేహెన్న యను పదముకు హిన్నోము భూమియని యర్థము. అది యెరూషలేమునకు దక్షిణముగా నుండు నొక లోయ. అచట జనులు విగ్రహారాధన చేయుచున్నందున యోషీయా యను రాజు దాని నపవిత్రపఱచి పట్టణపుచెత్త నచట పారవేయించి కాల్పించెను (II రాజు 22,23) ఇట్లు అది యపవిత్రమైనదై నిత్యమును కాలుచుట్టి స్థలమయ్యెను కావున దుష్టులు శిక్షింపఁబడు నరకము అనుపేరు దీనికి కలిగెను (పాతాళము చూ)

**నరజాతి** మనుష్యుడు చూ॥

**నరహంతకులు** (Assassins). ఫేలిక్సు యూదయకు గౌర్నరుగానున్న కాలములో క్రీ॥ శ॥ 52 సం॥ ప్రిమ్మట యూదయలో బందిపోటు దొంగల గుంపొకటి యుండినట్లుల యోసీఫసు వ్రాయుచున్నాఁడు (పురా 20.8.5). తనకు విరోధయైన నొకని చంపించుటకై ఫేలిక్సువారికి కుమ్మక్కు యిచ్చినట్లు ఆ చరిత్ర వలన కనఁబడుచున్నది. క్రీ॥ శ॥ 66-70 సం॥లలో రోమీయుల నెదిరించుటలో వీరు ముఖ్యులుగ నుండిరి. సహస్రాధిపతియైన లూసియ పౌలు వారిలో నొకఁడైనట్లు యెంచిన యొక్క సూచనమాత్రమే వీరిని గురించి బైబిలునందుగల (కార్య $21^{38}$).

**నరహత్య** నేరములు శిక్షలు I 3 (1) చూ॥

**నరుసులు** దేహమును కోసికొనుట చూ॥

**నరుడు** మనుష్యుడు చూ॥

**నరుని దొంగిలించుట** నేరములు శిక్షలు I 3 (3) చూ॥

**నలగగొట్టుట** రోగములు చికిత్సలు III 6 చూ॥

**నలుపు, కృష్ణవర్ణము** రంగులు 2 చూ॥

**నల్లబోరువ** పక్షులు 24 చూ॥

**నహతు** (Nahath = దిగుచోటు, అల్లరి లేకుండ నుండుట).

1. ఎదోము నాయకులలో నొకఁడు (ఆది $36^{3,4,13,17}$ I దిన $1^{37}$).

2. సమూయేలు పూర్వికులలో నొకఁడు. అతఁడు లేవీయులలోని కహాతు తెగవాఁడై యుండెను (I దిన $6^{26}$). ఇతనికి తోయహు ($6^{34}$) తోహు (I సమూ $1^{1}$) అను మాఱు పేరులు కలవు.

3. రాజైన హిజ్కియాకాలములో నుండిన యొక లేవీయుఁడు. ఆలయములో జను లర్పించిన కానుకలను కనిపెట్టుటకై హిజ్కియా నియమించినవారిలో నితఁ డొకఁడు (II దిన $31^{13}$).

**నహబీ** (Nahbi = దాచఁబడినది). కనాను దేశమును వేగుచూచుటకు మోషే పంపిన 12 మంది వేగులవారిలో నఫ్తాలీ గోత్రపువారి ప్రతినిధి (సంఖ్యా $13^{14}$).

**నహమానీ** (Nahamani = ఆదరింపఁబడువాఁడు). జెరుబ్బాబెలుతోకూడ బబులోను నుండి యెరూషలేమునకు వచ్చిన యూదుల పన్నెండుమంది పెద్దలలో నొకఁడు (నెహె $7^{6}$). ఇతనిపేరు ఎజ్రాలోని జాబితాలో (ఎజ్రా $2^{2}$) లోపించి పోయినది.

**నహము** (Naham = ఆదరించువాఁడు) యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $4^{19}$).

**నహరా** నయరా చూ॥

**నహరై** (Naharai = బుసకొట్టుట). దావీదు సేనాధిపతియగు యోవాబుయొక్క ఆయుధములను మోయువాఁడు (I దిన $11^{39}$).

**నహలాలు, నహలోలు** (Nahalal Nahalol = బీడుభూమి). జెబూలూనీయుల స్వాస్థ్యములోని యూళ్లలో నొకటి (యెహో $19^{15}$). తరువాతికాలములో ఈ యూరిని లేవీయుల కిచ్చిరి (యెహో $21^{35}$). జెబూలూనీయులు ఈ యూరిలోనున్న కనానీయులను వెళ్లఁగొట్టక వారిని వెట్టివారినిగా చేసికొనిరి (న్యాయా $1^{30}$). ఈ వాక్యములో మాత్రము దీనికి నహలోలు అను మాఱుపేరు కలదు. నజరేతుకు ఉత్తరముగా నుండు అయిన్ మహీలు (*'Ain Mahil*) అను కొండలేక నజరేతుకు పడమరగా నుండు మాలూలు (*Ma'lul*) అను నూరు దీనికి యునికియై యుండవచ్చును. ఆ రెండును జెబూలూను గోత్రస్వాస్థ్యమునకు సరిహద్దులైయున్నవి. (పటము IV, D 7).

**నహలీయేలు** (**Nahaliel** = దేవునిలోయ, వాగు). ఇశ్రాయేలీయులు అరణ్యమందు చేసిన ప్రయాణములో దిగిన యొక స్థలము (సంఖ్యా $21^{19}$). దీని సరియైన యునికి తెలియదు గాని మృతసముద్రమునకు తూర్పుగా నుండు అర్నోను నదిలోకి పారుచున్న యొక యేరై యుండ వచ్చును.

**నహూము** (**Nahum** = ఆదరణ).

1. గ్రంథకర్త.

చిన్న ప్రవక్త లనఁబడినవారిలో నొకఁడు. అతఁడు ఎల్కోషీయుఁడను సంగతిగాక మఱే మియు అతని గుఱించి తెలియదు (నహూ $1^{1}$). ఎల్కోషు అను స్థలమునుబట్టి అతనికా బిరుదు వచ్చినట్లున్నది గాని ఆ స్థలమునుగూర్చిన సూచన మఱెచ్చటను గానము. కొందఱది నీనెవెకు సమీపమునన్న ఎల్కోషు (*Elkosh*) అనునది కావచ్చునందురు. ఇచ్చట నహూము చనిపోయెనను పారంపర్య మొకటి కలదుగాని అది రూఢి యనుట కెట్టి యాస్పదమును లేదు. అతని పేరట నున్న గ్రంథమందలి సంగతులనుబట్టియైనను అట్లు చెప్పుట కే యాధారము కన్పించదు. ఎల్కోషు గలిలయలోని ఒక గ్రామమను పారంపర్యము సరియైనదని జెరోమను పండితుని యభిప్రాయముగా కన్పడుచున్నది. గాని యితఁడు యూదా దేశపువాఁడు గావచ్చునని $1^{15}$ నందున్న సంగతినిబట్టి చూచినయెడల పై పారంపర్యమునకు అంత ఆధారముండదు. బహుశః ఎల్కోషు అను గ్రామము దక్షిణపు యూదాలో నుండి పాడైపోయి యుండవచ్చును.

2. కాలము. నహూము ప్రవచించిన కాలమును సులభముగా నూహింప వీలు లున్నది. నీనెవెపుర మింకను నిలిచియున్నట్లుగనే అతని వ్రాతలవలనఁ దెలియుచున్నది ($1^{1}$). ఆ పట్టణము క్రీ॥ ము॥ 606 సం॥కు పూర్వము నాశము కాలేదు. $3^{8-10}$ నందు నో ఆమోను (తీబ్సు) పట్టణము శత్రువులచే పట్టఁబడినట్లున్నది. ఆ పట్టణము క్రీ॥ ము॥ 663 సం॥ అష్షూరీయులచే జయింపఁబడెను. ఈ మధ్యకాలములో నెప్పుడో నహూము ప్రవచించెను. అతఁడు అష్షూరు రాజ్యము శిథిలమగుటకు సిద్ధముగానున్న స్థితిని గూర్చి వర్ణించుటచే క్రీ॥ ము॥ 7 శతాబ్ద మధ్యకాలమునం దారాజ్య మట్టి స్థితియందుండెనని తెలిసికొనవచ్చును. అతఁడు దాదాపు క్రీ॥ ము॥ 650 సం॥న ప్రవచింప నారంభించెనని చెప్పవచ్చును. యూదా రాజగు మనష్షేకును అష్షూరీయులతోఁ గలిగిన వ్యవహార సంబంధములవలన భక్తిపరులగు ఇశ్రాయేలీయులకు నహూముకు కలిగిన రోషము వంటి రోషము కలుగుట సహజమైన సంగతి.

3. గ్రంథమందలి ముఖ్య సంగతులు.

(1) యెహోవా రోషము గలవాఁడై యూదావారి శత్రువులకు ప్రతీకారము చేయ వచ్చుట ($1^{1-15}$).

(2) నీనెవెపురమునకు కలుగఁబోవు వినాశము ($2^{1-13}$) మొదటి అధ్యాయమందు మొత్తము మీద చెప్పఁబడిన శత్రునాశనము సంపూర్ణమైనది మాత్రమే గాక మాన్పఁబడనిదియునై యుండును.

(3) నీనెవెపురమునకు కలుగఁబోవు నాశన కారణములు ($3^{1-7}$).

(4) విడిపించుకొనవై అది చేయు ప్రయత్న భంగము ($3^{8-19}$).

4. ముఖ్య లక్షణములు: ఈ ప్రవచనమంతయు పద్యరీతిగాఁ గాక అక్షరమాలికా గద్య రీతిగ నున్నది. వేర్వేఱు భావములు వేర్వేఱు అక్షరములతో నారంభమగు పదములతో బహు నిపుణత్వముతో కూర్చఁబడినవి. ఈ గ్రంథమందు ముఖ్యముగా దేవునివలన ఏర్పాటు చేసికొనఁబడిన ప్రజలయొక్క శత్రువుల నాశమునుగూర్చి మాత్రమే చెప్పఁబడినది. తన ప్రజల అక్రమములనుగూర్చి ప్రవక్త యేమియు చింతించినట్లు లేదు. వారికి కలుగఁబోవు శిక్షలను గూర్చి యేమియు లేదు. అష్షూరువారికికలుగు నాశనమే తనవారికి విడుదలయౌనట్లాతని ఉద్దేశముగా కనఁబడుచున్నది.

## నా

**నాకోను** కీదోను చూ॥

**నాగలి** వ్యవసాయము 4 చూ॥

**నాగుబాము** పాము 5 చూ॥

**నాచు** (Weeds). యోనా 2⁵ నందు నాచు అని తెనిఁగించిన పదమునకు సముద్రము లోను సముద్రతీరమందును పెరుగు మొక్కలని యర్థము. J. C.

**నా జనము కాదు** జనము కాదు చూ॥

**నాజీరు వ్రతము చేయువాడు** (Nazarite = దేవుని పనికొఱకు ప్రత్యేకించుట). ఇశ్రాయేలీయుల వ్రతములలో నొకటి. అట్టి వ్రతము ననుసరింపఁ గోరినవారు మద్యపానమును ద్రాక్షపండ్లయొక్క యే విధమైన రసమును త్యాగముని శపథముచేసి, వెండ్రుకలను పెఱుగ నిచ్చి, శవమున్న ఇంటికిపోక పీనుగ వెంబడి సమాధియొద్దకు వెళ్లకుండునట్లు చూచుకొనవలెను. వారి సమీపమున నెవ్వరైన నకస్మాత్తుగా చని పోయిన యెడల వారు తమ వ్రతమును మరల నారంభింపవలసి యుండును. ఈ వ్రతమునకు కాలపరిమితము లేదు. కొందఱు కొన్ని దినములు గాని నెలలుగాని జీవితకాలమంతగాని నాజీరుగా నుందుమని నియమమేర్పఱచు కొనవచ్చును. నాజీరు వ్రతము ముగిసినపిదప ఆ వ్రతము చేసిన వారిలో ప్రతివాఁడును ఈవులను దహనబలిని పాపపరిహారార్థబలిని సమాధానబలిని నూనెతో సిద్ధపఱచఁబడిన 20 రొట్టెలను (సంఖ్యా 28) వాడుక ప్రకారముగా మాంసమును పానార్పణ మును మనఃపూర్వకమైన యితర అర్పణలను దేవాలయమునకుఁ దేవలెను. అప్పుడు యాజ కుఁడు వాని వెండ్రుకలను కత్తిరించి కాల్చివేసిన తరువాత వారు తమ వ్రతమునుండి విడుదల నొందెదరు (సంఖ్యా 6 ఆమో $2^{11,12}$). I సమూ $1^{11}$ నందున్నట్లు తల్లిదండ్రులు తమ బిడ్డలను పుట్టుకమొదలు వారి నీ విధముగా సమర్పింప వచ్చును. సమూయేలు, సమ్సోను, (న్యాయా $13^{4-5}$) బాప్తిస్మమిచ్చిన యోహాను (లూ $1^{15}$ $7^{33}$) అట్టివారై యుండిరి. ఒకనియొక్క దేహమును ఆత్మను ప్రభువునెదుట పరిశుద్ధముగా నుంచవలె నను విధిని నాజీరువ్రతము సూచించును.

ఈ వ్రతము తీరిపోవునప్పుడు వా రర్పించు అర్పణల ఖర్చు బీదలైనవారు భరింపఁజాలరు గాన ఇది భక్తిసంబంధమగు వ్రతముగాయెంచి ధర్మాపేక్ష గల ఇతరులు ఇట్టి పేదలకు సహాయము చేయు చుందురు. పౌలీ వాడుకనుబట్టియే తనపై మోపఁ బడిన నేరమును ఖండించు నిమిత్తము ఇట్టి వ్రత మాచరించి కానుకలను తీర్పవలెనైయున్న నలుగురు యూద క్రైస్తవులతోఁ గలిసి వారి ఖర్చులను భరించెను (కార్య $21^{20-26}$). పౌలును అకుల యును అట్టి వ్రతములాచరించి యుండినట్లు కనఁ బడుచున్నవి ($18^{18}$).

**నాటకశాల** (Theatre). రోమీయులు లోను గ్రీకులలోను నాటకశాలలు సర్వసాధారణ మైనవైనను యూదులలో లేవు. అంతియోకస్ ఎపిఫనీసు కాలములో యూదుల వాడుకలను మార్చి గ్రీకు వాడుకలను స్థాపింప యత్నించి నప్పుడు ఇట్టి నాటకశాలలను యెరూషలేములో కూడ ప్రవేశపెట్టుటకు యత్నించిరిగాని యూదు లట్టివాటి నెదిరింపఁగా అతని ప్రయత్నములు నిష్ఫలములయ్యెను. గ్రీకుల ప్రతిపట్టణమునందును ఒక్క నాటకశాలయైనను యుండకపోలేదు. నాట్యములాడుటను చూచుట మాత్రమేగాక ఆయా సభలను జరుపుటకు వాటిని వాడుచు వచ్చిరి. ఇట్లు దేమేత్రివలన రేపఁబడిన అల్లరి జరిగిన సమయములలో ప్రజలు నాటకశాలలో కూడిరి (కార్య $19^{29-31}$ ఎఫెసు చూ॥). ఆ కాలమునందు మనుష్యులు ఒకరితో నొకరును, దుష్టమృగములలోను ప్రజల వేడుక నిమిత్తము పోట్లాడించుట సర్వసాధారణమై యుండెను. నాటకశాలయను పదము పైనున్న ఒకటే వాక్య ములో మాత్రముండినను అచ్చట జరిగిన అట్టి వేడుకలు II కొరి 4⁹ లో మాత్రముదాహరింపఁ బడెను. ఈ పదము మూలభాషలో నాటక శాలలో కనపఱచఁబడినవారమని శబ్దార్థమిచ్చు పదమైయున్నది. హెబ్రీ $10^{33}$ లో ఆ పదమునే ఏ కారణముచేతనో పదిమందిలో ఆరడి పడితిరి యని తెనిఁగించిరి. ఈ రెండు వాక్యములలో నున్న దృష్టాంతము నాటకశాలకు సంబంధించినదై అచ్చట జరుగు గొప్ప పోరాటములవలన కలుగు కష్టములను సూచించును.

**నాట్యమాడుట** (Dance). ఈ పదముచే తెనిఁగించిన హెబ్రీపదములు పాతనిబంధన యందు నాలుగు కలవు.

1. ఒకదానికి చుట్టుతిరుగుటయని శబ్దార్థము. శత్రువులపై జయముకలిగిన సమయమునందు

కన్యకలు నాట్యమాడుటను గూర్చిన సందర్భమున నీ పదమును వాడిరి. మోషే కాలమున ఫరో మీదను (నిర్గ $15^{20}$) యెఫ్తా కాలములో అమ్మోనీయుల మీదను (న్యాయా $11^{34}$), సౌలు దావీదుల కాలములో గొల్యాతు ఫిలిష్తీయుల మీదను (I సమూ $18^{6}$ $21^{11}$ $29^{5}$) జయము కలిగినప్పుడు స్త్రీలు తంబురలను పట్టుకొని నాట్యమాడి సంతోషించిరి. కోతకాల మప్పుడును ఇదే రీతిగా తమ సంతోషమును వెలిబుచ్చుటకు నాట్యమాడిరి (న్యాయా $21^{20}$). నాట్యమాడుట దేవుని సేవయం దొక భాగముగా నెంచినందున విగ్రహములకుచేసిన ఉత్సవములో నిట్లు నాట్యమాడిరి (నిర్గ $32^{19}$). యెహోవాను సేవించునప్పుడట్లు చేయవలెనను హెచ్చరికలు కనబడుచున్నవి (కీర్త $149^{3}$ $150^{4}$). నాట్యమాడుట సంతోషమునకు గురుతుగా నుండుటచే ఇశ్రాయేలీయుల దుఃఖము నాట్యముగా మార్చబడునని యలంకారరీతిగా నున్నది ($30^{11}$) గాని విలా $5^{15}$ నందు వారి నాట్యము దుఃఖముగా మార్చబడెనని యున్నది. చెఱకాలమునకు పిమ్మట ప్రజలు మరల నాట్యమాడుట ఇశ్రాయేలీయుల కుదురుబాటున కొక సూచనగా నున్నది (యిర్మీ $31^{4}$).

2. రెండవ పదమునకు మొదటి మాటకున్నట్టి యర్థమే గలదు గాని దానిని దావీదు దేవుని మందసము నెదుట నాట్యమాడుటను గూర్చి వాడిరి (II సమూ $6^{14,16}$). ఈ పదమును గంతులు వేయుట యని అర్థమిచ్చు పదముతో కలిపి వాడుటవలన ఈ దేశమునందు ఉత్సవములు చేయునప్పుడును, శివమాడునప్పుడును చేసెడు నాట్యమువంటిదని చెప్పవచ్చును.

3. మూడవ పదమునకు గంతులు వేయుట యని శబ్దార్థము. ఆ పదము కీర్త $29^{6}$ $114^{4}$ యోవే $2^{5}$ లో గంతులువేయుట యని తెనిగింపబడెను. దావీదు మందసమునెదుట నాట్యమాడు సందర్భమున దీనిని వాడిరి. సంతుష్టిగల పిల్లలు చేయు నాట్యములను సూచించును (యోబు $21^{11}$). నాట్యమాడుటకు కాలమున్నదని ప్రసంగి యన్నప్పు డీ పదమునే ప్రయోగించెను.

బైబిలు కాలమునం దున్నవారు ఈ విధముగా సంతోష సమయములలో నాట్యమాడినట్లు పై సూచనలవలన స్పష్టమగుచున్నది. వారి మతమునకు సంబంధించిన ఉత్సవములన్నియు అట్టి సంతోష సమయములుగా నెంచిరి. పిల్లలు నాట్యమాడుటను గూర్చి క్రీస్తు సాదృశ్యముగా చెప్పిన నాట్యమట్టిదె (మ $11^{17}$ = లూ $7^{32}$).

గ్రీకులలోని భోగమువారు మానవుల కామమును రేపుటకు నాట్యమాడుట వాడుకగా నుండెను. వారి యుడుపులును అభినయాదులన్నియు దానికి సంబంధించినవే. అవి ఈ దేశపు భోగము మేళములవంటివి. ఇశ్రాయేలీయులలో అట్టి వాడుకలు బొత్తుగా లేకున్నను గ్రీకువారి వాడుకల ననుసరించిన హేరోదియ కుమార్తె సిగ్గుమాలినదై హేరోదు ముందట నాట్యమాడుటను గూర్చినది గాక మఱియొకటి క్రొత్త నిబంధనయందు గనబడుటలేదు (మ $14^{6}$ = మా $6^{22}$). ప్రస్తుతమందు ఐరోపాలోనున్నట్లు స్త్రీ పురుషులు కలిసి కాలక్షేపము నిమిత్తము చేయు నాట్యములవంటి వాటిని గూర్చిన సూచనలైనను బైబిలునందు కనబడవు. మహనయీము నాట్యమునకు ప్రసిద్ధికెక్కినట్లు పర $6^{13}$ వలన తెలియుచున్నది. ప్రస్తుతమున యానాది యెఱుకలు మొదలగు జాతులవారు ఆడు ప్రత్యేక నాట్యములవంటివని ఆ వాక్యమువలన ఊహింపవచ్చును.

నాడె వృత్తులు చేతిపనులు III 3 చూ॥

**నాణెములు, రూకలు (Money, Coins)** వ్యాపారములకు రాగి వెండి బంగారు నాణెములను వాడుట ప్రస్తుతము సర్వసాధారణముగా నున్నదిగాని పూర్వమిట్లుండలేదు. ఇతరమైన సరకులను తూచినరీతిగనే ఈ లోహములనుకూడ పూర్వము తూచిరి. అబ్రాహాము మక్పేలా గుహను కొనినప్పుడు 400 తులముల వెండినితూచి చెల్లించెను (ఆది $23^{16}$). తులమనుపదము మూలభాషలో షెకెలు అనబడెను. బైబిలునందు వచ్చు ఇతర బరువులపేరులు తెనిగించిరిగాని ఆ తెలుగుపదములు మూలభాషయందున్న ఎత్తులకు సూటిగా సరిపడు ననుకొనరాదు. తులమునకు బదులుగా మ $17^{27}$ లో మాత్రము షెకెలు అను పదము నుంచిరి.

I. బైబిలునందు వాడిన పురాతన మగు తులామానము. ఈ దిగువ తులామానము ఆ కాలములో వెండి బంగారములను తూచుటకు వాడిరి.

20 చిన్నములు (గేరా = *Gerah*) = 1 తులము (షెకెలు = *Shekel*)

60 తులములు (సాధారణముగా 50 మాత్రము) = 1 అర వీసె (మానె=*Maneh*)

60 అరవీసెలు = 1 తలాంతు (*Talent*).

ఈ మానము సులభముగా నున్నట్లు కనఁబడినను తులము ఆయా దేశములలో వేర్వేరుగా నుండుటచేత వీటిని రూపాయలలోకి మార్చి చెప్పనియెడల గ్రహించుకొనుట చాలకష్టముగా నుండును. తులములలో పెద్దది చిన్నది యను భేదమును గలదు. ఆయా దేశములలోని తులము (=షెకెలు) భేదించుటయే గాక ఆయా కాలములకు తగినట్లు దాని విలువయు మారుచు వచ్చెను గాన అది వచ్చినప్పుడెల్ల దాని ఖరీదు దాదాపుగా ఉదాహరింపఁబడినంతయై యుండునని తెలిసికొనవలెను.

తులము (=షెకెలు) వెల యిట్లు వేర్వేరుగా నుండుటచేత నిర్గ 30[13-24] 38[24] మొదలగు వాక్యములలో పరిశుద్ధస్థలముయొక్క తులమును అనుసరించి యియ్యవలసినదను నియమము గలదు. అప్పుడు షెకెలునకు నియమితవెలగలదు. మన రూపాయి యింగ్లీషు నాణెములలో ఒక షిల్లింగు నాలుగు పెన్నులకు సమానమైనయెడల తులము (=షెకెలు) రెండు రూపాయలగును అట్లయిన యెడల సాధారణముగా 50 తులముల మానె (=అరవీసె) రూ. 100 లకు సమానము. లూకా 19[13] లోని మినాలు ఇట్టివే. ఇవి చెఱకాలమునకు పూర్వము బైబిలునందు కనఁబడవు. ఇవి బబులోను పారసీక తులామానములయందు నుదాహరింపఁబడి వారివలన పలెస్తీనులో వాడుకలోకి వచ్చెను. తలాంతు పైలెక్క ప్రకారము 6000 రూపాయలగును (మ 18[24] 25[15]). ఇది వెండి తలాంతు. ఇదిగాక బంగారపు తలాంతును గలదు. అది వెండికన్న 15 రెట్లు ఎక్కువ ఖరీదు గాన 90,000 రూపాయలగును (నిర్గ 25[39] II సమూ 12[30]). ఇది పరిశుద్ధ స్థలముయొక్క తులము ననుసరించిన వెలయై యున్నది. ఇది పెద్ద తులమని తెలిసికొనవలెను. చిన్న తులము దానిలో సుమారు సగముండును కావున వాటివెల ఈ దిగువ జాబితాలో నున్నట్లుండును.

II. చెఱకాలమునకుఁబిమ్మట వాడిన నాణెములు. చెఱకాలమైన తరువాత పలెస్తీనులో నాణెములను వాడ మొదలుపెట్టిరి గాని అవి స్వంత నాణెములుగావు. పారసీకము గ్రీసు సిరియా లోని అంతియొకయ ఐగుప్తు మొదలగు దేశముల వారికి లోఁబడి యున్నంతవఱకు వారి నాణెములను వాడిరిగాని మక్కబీయుల కాలమునందు స్వంత నాణెములనుకూడ వాడసాగిరి. ఈ నాణెములలో తులము (షెకెలు), మినా అనునవియు నున్నవి. పారసీకుల షెకెలు యూదుల దాని కన్న కొంచెము పెద్దది. పరిశుద్ధస్థలపు తులము కన్న 1⅓ రెట్లు ఎక్కువ విలువగలదిగాన వారి మినాలును తలాంతులును అదేరీతిగా హెచ్చాయెనని తెలిసికొనవలెను.

III. రోమనువారి కాలమున నుండిన ప్రత్యేక నాణెములు: క్రొత్త నిబంధనకాలములో రోమను వారు దేశము నేలుచుండిరి. కావున వారి నాణెములు

| | పెద్ద తులము | | చిన్న తులము | |
|---|---|---|---|---|
| | భరతఖండము | ఇంగ్లాండు | భరతఖండము | ఇంగ్లాండు |
| వెండి తులము (షెకెలు) | రూ. 2-0-0 | పౌ. 0-2-9 | రూ. 1-0 0 | పౌ. 0 1-4½ |
| బంగారు ,, | 30-0-0 | 2-1-0 | 15-0 0 | 1-0-6 |
| మినా | 100-0-0 | 7-0-0 | 50-0-0 | 3 0-0 |
| వెండి తలాంతు | 6000-0-0 | 400 0-0 | 3000-0 0 | 200-0-0 |
| బంగారు ,, | 90000-0-0 | 6000-0-0 | 45000-0-0 | 3000-0-0 |

పలెస్తీనునందు వాడుకలోకివచ్చెను. వారియొక్క ముఖ్యవెండి నాణెమును దేనారము (మ 18[28]) అనిరి. అది యించుమించు 8 అణాలగును. చక్రవర్తిరూపము దానిమీఁద ముద్రింపఁబడెను

($22^{19}$). లూ $15^{8}$ లో దీనికి వేఱు పేరు (*Drachm*) ఉండినను, అది ఈ నాణెమేయై యుండవచ్చును. లేక తులమునకు సంబంధించినదై యుండవచ్చును. దానిలోని పదునారవ భాగమును సూచించు మూల భాషాపదమును (*Assarion*) క్రొత్త నిబంధనలో కాసు అని తెనిఁగించిరి (మ $10^{29}$ లూ $12^{6}$). దీనిలోని నాలుగవ భాగమును సూచించు పదమునుకూడ (*Quadrans*) కాసు అని తెనిఁగించిరి (మ $5^{26}$). దీనిలోని సగమును సూచించు నాణెమును గలదు. దానిపేరు (*Lepton*) ను మూలభాషయందు వేఱుగా నున్నను దానినికూడ కాసు అని భాషాంతరము జేసిరి. క్రొత్త నిబంధనలో మీనా



మక్కబీయుల నాణెము.



దేనారము



అసారియోన్ రాగి నాణెము.



లెప్టోన్ రాగి నాణెము.

(లూ $19^{13}$) తలాంతు (మ $18^{25}$ $25^{13}$) అను వాటినికూడ వాడిరి. యూదా క్రీస్తును అమ్మిన వెండి తులముల (షెకెలుల) లెక్కయని తలసికొన వలెను ($26^{15}$). క్రీస్తు తన కొఱకును పేతురు కొఱకును చెల్లియొక అరషెకెలును చెల్లించెను ($17^{24-27}$). ఇం కుపయోగించిన మూలపదము (*Stater*) వేఱుగా నున్నను అది దాదాపు షెకెలుకు సమానము. షెకెలుకు సంబంధించిన నాణెములుపైన కనపఱచఁబడెను. క్రొత్త నిబంధనయందు పఱచఁబడిన యితర నాణెములీ దిగువనున్నది

2 కాసులు (*Lepta* = ఏగాని) = 1 కాసు (*Quadrans*) = కాణి

4 కాసులు (*Quadrans*) = 1 కాసు (*Assarion*) = 1 అణా

16 కాసులు (*Assarios*) = 1 దేనారము (*Denarius*) = 8 అణాలు

రోమనువారికి వీటికన్న గొప్ప నాణెము లున్నను వాటిని క్రొత్త నిబంధనయందు వాడలేదుగాన నిచ్చట వివరించలేదు.

**నాణెముపైన ముసుగు** అభరణములు 23 చూ॥

**నాతాను** (Nathan = దానముగా నిచ్చెను)

1. దావీదు సొలొమోను కాలమున జీవించిన యొక ప్రవక్త. తాను దేవునికిఁ గట్టఁదలంచిన దేవాలయమునుగూర్చి దావీదు ఇతనికి తెలియఁజేసెను. మొదట ఇతఁడు దానిగూర్చి తన సమ్మతినగుపఱచెను గాని దేవునిచే ప్రబోధింపఁబడి దావీదుకుఁ బిమ్మట సింహాసనాసీనుఁడగువాఁడు దానిని కట్టునని అతనికిఁ దెలిపెను (II సమూ $7^{1-17}$ I దిన $17^{1-15}$). హిత్తీయుఁడగు ఊరియా భార్యవిషయములో దావీదొనరించిన మహాపాతకమునకై అతని గద్దించుటకు ఇతఁడు దేవునిచే పంపఁబడెను. ఆ సమయమునందే ఆఁడు గొఱ్ఱెపిల్లను గూర్చిన ఉపమానము నతఁడు చెప్పెను (II సమూ $12^{1-15}$ కీర్త 51 పై వ్రాఁత చూ॥). సొలొమోనున కితఁడే యదీద్యాయని పేరుపెట్టెను (II సమూ $12^{25}$). ఇతఁడును దీర్ఘదర్శి యగు గాదును ప్రోత్సాహపఱచఁగా దావీదు పరిశుద్ధ స్థలమున జరుగు ఆరాధనకు తగిన సంగీతపు ఏర్పా

టులను జేసెను (I దిన $23^{25}$). అదోనీయా రాజ్యము సొలొమోనుకుఁగాక తనకేరావలెనను ఉద్దేశముతో కుట్రజేసినప్పుడు దావీదు సొలొమోనుల యెడల భయభక్తులుగల నాతానుతో ఆలోచించుటకు యత్నింపకపోయెను (I రాజు $1^{8-10}$). ఈ కుట్రనుగూర్చి ఇతఁడు బత్షెబాకు చెప్పినందున ఆమె వెళ్లి దావీదున కీ సంగతిఁ దెలిపి అదోనీయా ప్రయత్నములను భంగపఱచునట్లు జేసెను ($1^{11-45}$). ఇతఁడు దావీదు సొలొమోనుల పరిపాలనలనుగూర్చిన చరిత్ర వ్రాసెను (I దిన $29^{30}$ II దిన $9^{29}$).

2. దావీదు బత్షెబాల కుమారుఁడు (II సమూ $5^{14}$ I దిన $14^{4}$ $3^{5}$). ఇతని సంతానములోనుండి క్రీస్తువచ్చినట్లు లూకా వ్రాసెను (లూ $3^{31}$).

3. దావీదు యోధులలో యోవేలు అను వాని సహోదరుఁడు (I దిన $11^{38}$). వారిలోని ఈగాలు అనువాఁడితని కుమారులలో నొకఁడు.

4. యూదాగోత్రికులలో నొకఁడు (I దిన $2^{36}$).

5. ఎజ్రాకు సహాయము చేసినవారిలో నొకఁడు (ఎజ్రా $8^{16}$).

6. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{39,40}$). W.

**నాదాబు** (Nadab = ఇష్టపూర్వకముగా).

1. అహరోనుయొక్క జ్యేష్ఠపుత్రుఁడు (నిర్గ $6^{23}$ సంఖ్యా $3^{2}$ $26^{60}$ I దిన $6^{3}$ $24^{1}$). సీనాయి కొండను సమీపించుటకు సెలవునొందిన వారిలో నితఁడొకఁడు (నిర్గ $24^{1}$). ఇతఁడు యాజకుఁడుగా నియమింపఁబడినవాఁడే ($28^{1}$) గాని ఇతఁడును ఇతనితమ్ముఁడైన అబీహుతో కూడా అన్యాగ్నిని దేవుని సన్నిధికి తేఁగా చంపఁబడెను (లేవి $10^{1-7}$ సంఖ్యా $26^{61}$). ఆ అన్యాగ్ని యెట్టిదో రూఢిగా తెలియదు. అది దేవుని వేదికమీఁద నుండు అగ్ని కాక వేఱువిధమగు నొక సామాన్య అగ్నియని సాధారణముగా ననుకొందురు. ఈ చరిత్ర తరువాతనే ద్రాక్షారసమును మద్యమును త్రాగకూడదను (లేవి $10^{8,9}$) అను నాజ్ఞను దేవుఁడు అహరోనుకును యాజకులకు నిచ్చుటచే ఈ నాదాబు అబీహులు మత్తుగా నుండినందువలననే వారట్లు చేసి యుండిరని మనము నిశ్చయించుకొనఁదగును. ఈ యిరువు రన్నదమ్ములును సంతానము లేకనే చనిపోయిరి (సంఖ్యా $3^{4}$ I దిన $24^{2}$).

2. యూదా సంతతివారిలో నొకఁడు. ఇతఁడు యెరహ్మెయేలు వంశపువాఁడును షమ్మయి కుమారుఁడునై యుండెను (I దిన $2^{28,30}$).

3. బెన్యామీను సంతతివారిలో నొకఁడగు గిబియోనుకొడుకు (I దిన $8^{30}$ $9^{36}$).

4. ఇశ్రాయేలు వారి రాజగు మొదటి యరొబాము కుమారుఁడు. తండ్రి తదనంతరము సింహాసనాసీనుఁడయ్యెను. క్రీ. పూ. 910 సంవత్సరము రాజ్యమేల నారంభించెను. బంగారు దూడల నారాధించు విషయములో తండ్రి ననుసరించినవాఁడు. సైన్యసమేతుఁడై గిబ్బెతోనును ముట్టడించుచుండఁగా బయెషాయను వాఁడితనిని ఇతని బంధువర్గమంతటిని సంహరించి సింహాసన మధిష్ఠించెను. యరొబాము కుటుంబమును గూర్చిన దేవుని శాపమీవిధముగా నెఱవేఱెను. నాదాబు పట్టుమని రెండు సంవత్సరములైనను ఏలినవాఁడు కాదు (I రాజు $14^{10,11,20}$ $15^{25,30}$).

**నాఫీషు** (Naphish, Nephish = శ్వాసించుట). ఇష్మాయేలు కొడుకులలో నొకఁడు ఇతఁడు ఇష్మాయేలు సంతతివారిలో నొక గోత్రమునకు పూర్వుఁడయ్యెను (ఆది $25^{15}$ I దిన $1^{31}$). ఎజ్రా $2^{50}$ నెహె $7^{52}$ లోని నెఫూసీము వంశస్థులు వీరయియుండవచ్చును.

**నాబాలు** (Nabal = వెఱ్ఱివాఁడు). యూదయ దేశములోని కర్మెలు అను నొక ప్రాంతములో తన మందలను మేపుకొనిన యొక స్థితిమంతుఁడు. దావీదు తన పరివారముతోకూడ సౌలుయొద్దనుండి పారిపోయిన సమయములో ఈ ప్రాంతములయందే దాగియుండెను. దావీదు అచట నుండఁగా తనవారును ఇతరులును నాబాలు మందలకు ఏ హానినైనను చేయకుండ దావీదు వాటిని కాపాడెను. గొఱ్ఱెలబొచ్చు కత్తిరించు పండుగకాలమందు దావీదు తన పనికై బహుమానము నడుగుటకు తన పనివారిలో కొందఱిని

నాబాలునొద్దకుఁ బంపెను గాని అతఁడు అప్పుడు మత్తుగా నుండినవాఁడై హేళనగా ప్రత్యుత్తరము నిచ్చి దావీదు పనివారిని వట్టి చేతులలో పంపివేసెను. ఇందునకై కసి తీర్చుకొనఁగోరి దావీదు నాబాలును అతనియొద్దనుండు మగవారి నందఱిని చంపఁదలంపఁగా నాబాలు భార్యయైన అబీగయీలు దీనిగూర్చి విని బహుమానములతో దావీదు నెదుర్కొనవచ్చి అతనితో యుక్తిగా మాటలాడి యతని కోపమును చల్లార్చి నాబాలును రక్షించెను. తప్పించుకొనిన యీ గొప్ప యాపదనుగూర్చి అబీగయీలు నాబాలుతో మఱునాఁడు తెలియఁజేయఁగా వాఁడీ దిగులు చేతతో అమితముగా త్రాగుటచేతనో ఒక విధమైన పక్షవాతము తగిలి పదిరోజులలో మృతినొందెను. కొంత కాలమునకుఁబిమ్మట దావీదు నాబాలు విధవయైన అబీగయీలును వివాహము చేసికొని తన భార్యలలో నొకతెనుగా చేర్చుకొనెను (I సమూ $25^{1-42}$).

**నాబోతు** (Naboth = ఫలము). యెజ్రెయేలు పట్టణస్థుఁడు. అతని ద్రాక్షతోఁట రాజైన అహాబు నగరమునొద్దర నుండెను. రాజు దాని కొనఁగోరి యడిగెను గాని అది పిత్రార్జితము గనుక పిత్రార్జితము నమ్మఁగూడదను ఏర్పాటు ననుసరించి (సంఖ్యా $36^{7}$) దానిని అమ్మనొల్లఁడాయెను. రాణియైన యెజెబెలు కూటసాక్షులను పెట్టి వారి యబద్ధ సాక్ష్యములవలన నాబోతు రాజద్రోహి యని నేరస్థాపనచేసి, నాబోతును అతని సంతతివారి నందఱిని చంపించి ఆ తోఁటను జప్తుచేయించి అహాబున కప్పగించెను. అతఁడు దాని చూడఁబోఁగా ఏలీయా అతని కెదురుపడి ఈ ద్రోహకార్యము చేసినందుకు అతనికిఁ గలుగు శిక్షలను తెలిపెను (I రాజు $21^{1-29}$). అహాబు కుటుంబము సర్వ నాశనమగుటవలననే ఆ శాపము నెఱవేఱెను ($22^{34-38}$ II రాజు $9^{30-37}$).

**నాయకుడు** ఉద్యోగస్థుడు చూ॥

**నాయీను** (Nain = పచ్చికబీడు). క్రీస్తు ఒక విధవకుమారుని లేపిన యూరు (లూ $7^{11}$). అది నజరేతునకు ఆగ్నేయ దిక్కున మూఁడు క్రోసుల దూరములో నుండెను. నేటిదినము వఱకు అచట నెయీను (*Nein*) అనునొక చిన్న పల్లె యున్నది. చిన్న హెర్మోను అను కొండ ప్రక్కన ఆ యూరున్నది. అచ్చటి పాడు శేషములను చూడఁగా పూర్వమున అది ఇప్పటికంటె చాల పెద్ద యూరని స్పష్టమగును. ఆ కొండ ప్రక్కన చాల పురాతనమైన గోరీలుకూడ కలవు. ప్రభువగు యేసుక్రీస్తు మకాం అను పేరుగల ఒక మసీదు నేటివఱకు అచటనున్నది. తురుష్కులు పాలెస్తీనును జయించకముందు అచ్చట నొక క్రైస్తవ గుడి యుండెనని యూహింపఁదగును. క్రీస్తు అచటచేసిన యద్భుతమునకు జ్ఞాపకార్థముగ దాని నచటఁ గట్టియుందురు. (పటము IV, D 8).

**నాయోతు** (Naioth = నివాసములు). సమూయేలు నివసించిన రామాలోనుండిన యొక స్థలము. ఈటెతో దావీదును పొడిచి చంపుటకు సౌలు ప్రయత్నముచేసిన తరువాత దావీదు సమూయేలు నొద్దకు పారిపోఁగా సమూయేలు అతని నిచటికి రక్షించియుంచెను (I సమూ $19^{18}$). ప్రవక్తల సమూహము అచట నుండెను ($19^{20}$) కావున ఇది యొక విధమైన మఠమునకు ఉనికియై యుండెనని తెలిసికొనవచ్చును. దావీదును తరుముచు అచ్చటికి వచ్చిన సౌలును ఆత్మవశుఁడై ప్రవచించెను ($19^{23}$). దీని సరియైన యునికిని గూర్చి తెలియదు. ఈ పదముయొక్క శబ్దార్థమునుబట్టి ఇదియొక స్థలముయొక్క పేరుకాక రామాలోనుండిన ప్రత్యేకములగు నివాసములను సూచించునని కొందఱనుకొందురు గాని యిదియును రూఢికాదు.

**నారబట్టు** వస్త్రములు 1 చూ॥

**నారాతా** నయరా 2 చూ॥

**నార్కిస్సు** (Narcissus = ఒక పుష్పము). రోమా పత్రికను వ్రాయునప్పుడు పౌలు తన వందనముల నంపిన యొక రోమను పురవాసి (రోమా $16^{11}$). పౌలీపత్రికను వ్రాయకముందు నాలుగు సంవత్సరముల క్రిందట దాస్యమునుండి విముక్తుఁడైన నార్కిస్సు అను పేరు గలవాఁడొకడు నీరో తల్లిచేత రోమునందు చంపఁబడెను. పౌలు తన పత్రికయందు పేర్కొనిన నార్కిస్సు ఇంటివారితని దాసులై యుందురు.

E.

**నాశనకూపము** అలుకోను చూ॥

**నాశనపురము** సూర్యపట్టణము చూ॥

**నాశనము, నాశము, నశించుట, నాశనపుత్రుడు** (Perdition, Son of Perdition). బైబిలులో ఈ మాట వాడబడు వాక్యము లన్నిటిని ఇందులో వివరింపక క్రొత్త నిబంధనలో దీనికి ప్రత్యేకమైన యర్థము గల కొన్ని వాక్యముల బోగలను మాత్రము కనిపెట్టెదము. ఈ పదములు దుష్టుల యాత్మలు పొందబోవు నరకశిక్షలను సూచించును (ఫిలి $1^{28}$ I తిమో $6^{9}$ హెబ్రీ $10^{39}$ II పేతు $3^{7}$ ప్రక $17^{8,11}$). నాశనపాత్రుడు అను మాట క్రొత్త నిబంధనలో రెండు పర్యాయములు మాత్రమున్నది. మొదటి పర్యాయమున అది యూదా ఇస్కరియోతుకు చెందును (యోహా $17^{12}$). యూదా తానే నాశనమునకు లోనైనవాడనునది దాని భావము. II థెస్స $2^{3}$లో నాశనపుత్రుడు అను పదము క్రీస్తు విరోధి పేరైయున్నది (క్రీస్తు విరోధి చూ॥).

**నాశనము చేయుట** శపితము చూ॥

**నాశనము కలుగజేయు హేయమైనది** (Abomination of desolation). హేయమైనది యని తెనిగింపబడిన హెబ్రీ పదమునకు మైనది అసహ్యమైనది విగ్రహారాధనకు సంబంధమైనవి రోతది యను అర్థములు గలవు. ఇది సాధారణముగ విగ్రహారాధనను గూర్చిన పదము గాక దేవుడేర్పరచుకొనిన ఇశ్రాయేలీయులు యెహోవా యారాధననుండి తొలగి విగ్రహారాధకులైన దానిని దెలుపుటకు వాడిన పదమై యున్నది (II రాజు $21^{2}$ $23^{17}$). దీనిని గూర్చిన ప్రవచనములు (దాని $11^{31}$ $12^{11}$) యూదుల మతభ్రష్టత్వమును మాత్రమే చూపించుచున్నవని డాక్టర్ స్మిత్ (*Dr. Smith*) దొరగారి యభిప్రాయము. యూదు చరిత్రకారుడగు యోసీఫసు కూడ నిట్లే గ్రహించినట్లు కనబడుచున్నది. నాశనము అని తెనిగించబడిన పదము ఆశ్చర్యకరమైనది భయంకరమైనది యని యర్థమియ్యవచ్చును.

ఈ పదములు దేనిని సూచించుచున్నవను విషయమునుగూర్చి వివిధాభిప్రాయములు గలవు. క్రీ॥ ము॥ 170 సం॥న యెరూషలేము ఆలయములో అంతియోకు ఎపిఫనీసు ద్యుపతి (*Jupitar*) విగ్రహమును నిలిపినప్పుడు నెరవేరెనని కొందరు తలంచిరి గాని ఇది క్రీస్తు 200 సం॥లకు తరువాత చెప్పిన మాటలకు (మ $24^{15}$ మా $13^{14}$) సరిపడదు. క్రీ॥ శ॥ 70 సం॥న రోమీయుల సేనానియగు తీతు యెరూషలేమును నాశనముచేసి రోమీయుల దేవతల యొక్కయు చక్రవర్తి యొక్కయు పటములు గల జెండాలను ఆలయముయొక్క పరిశుద్ధావరణములలోకి తెచ్చి వాటిని ఆరాధించినప్పు డిది నెరవేరెనని కొందరి యభిప్రాయము. హేయవస్తు వనునది యూదుల మతభ్రష్టత్వమును విగ్రహారాధనను చూపించును గాన ఈ యభిప్రాయము ఆ మాటయొక్క సంపూర్ణ అర్థము నియ్యజాలదు. పైన చెప్పిన రెండు సమయములయందును ఈ ప్రవచనములు కొంతవరకు నెరవేరినట్లు కనబడినను వాటి సంపూర్ణ నెరవేర్పు ఇంకముందున్నదని అనేక మంది బైబిలుభాషా జ్ఞానులు నమ్ముచున్నారు. యూదు మతభ్రష్టుడగు క్రీస్తువిరోధి దాని $9^{26}$ లో చెప్పిన ప్రకారము యూదులతో నిబంధన చేసికొని దానిని కొంత కాలమునకు రద్దుచేసి యూదులు యెరూషలేమునందు క్రొత్తగా కట్టిన ఆలయములో తన విగ్రహమును నిలిపినప్పుడు (ప్రక $13^{14-16}$ II థెస్స $2^{4}$) ఇది సంపూర్ణముగా నెరవేరునని అట్టివారి తలంపు. B.




నాశనకరమైన హేయవస్తువులు

**నాహాషు** (Nahash = సర్పము).

1. అమ్మోనీయుల రాజులలో నొకఁడు. ఇతఁడు యాబేష్గిలాదును ముట్టడించి, ఆ పట్టణస్థులను హీనపఱచి అందున్న మగవారిలో ప్రతి వాని కుడికంటిని ఊడఁదీయించినసరి, లేనియెడల ఆ పట్టణమును సర్వనాశనముచేసి యందున్న మగవారి నందఱిని చంపెదనని బెదరించెను. వారు తప్పించుకొనఁజాలరని యతఁడెంచి తనకు జవాబునిచ్చుటకై ఒక వారముమట్టుకు వాయిదా కూడ వేసెను. అయితే ఇశ్రాయేలీయులపై నూతనముగా నభిషేకమునొందిన సౌలు దీనిగూర్చి విని రౌద్రుఁడై ఇశ్రాయేలీయులను పోగుచేసి నాహాషు నోడించి యాబేష్గిలాదు వారిని రక్షించెను (I సమూ 11[1-11]). నాహాషు అనునొకఁడు సౌలుచే తరుమఁబడిన దావీదు నెడల దయఁజూపెను (II సమూ 10[2] I దిన 19[1,2]). మఱియు దావీదు కుమారుఁడైన అబ్షాలోము తిరుగుబాటు చేసినప్పుడు దావీదు పారిపోయి యొర్దానుకు తూర్పుగా నుండు మహనయీములో కాపురముండఁగా అతనికిఁ గావలసిన తినుబండారములను పంపినవారిలో నాహాషు కొడుకగు షోబి యనువాఁడొకఁడై యుండెను (II సమూ 17[27]). ఈ పై రెండు సందర్భములలో నుండు నాహాషు అనువాఁడు అమ్మోనీయుల రాజైన నాహాషేయై యుండవచ్చును.

2. సెరూయా అబీగయీలు అను నిద్దఱి తండ్రి (II సమూ 17[25]). I దిన 2[16] లో వీరు దావీదు అక్కచెల్లెండ్రు అనఁబడిరి. నాహాషు కుమార్తెలు దావీదున కేలాగున అక్కచెల్లెండ్రు కాఁగలరు అని యనుమానించి కొందఱు ఇచట అచ్చు తప్పు గలదని యనుకొందురు. అయితే మఱికొందఱు దావీదు తండ్రియగు యెష్షయి నాహాషు అనునొకని విధవను వివాహము చేసికొనినందున వీరు దావీదునకు అక్కచెల్లెండ్రయి యుండిరని యనుకొందురు.

**నాహోరు** (Nahor = బుసకొట్టుట).

1. అబ్రాహాము తాత (ఆది 11[22-25] I దిన 1[26] లూ 3[34]).

2. అబ్రాహామునకును హారానుకును తోఁబుట్టువు (ఆది 11[26,27] యెహో 24[2]). ఇతఁడు హారాను కుమార్తెయగు మిల్కాను వివాహము చేసికొనెను. ఇస్సాకు భార్యయగు రిబ్కా వీరికి మనుమరాలై యుండెను (ఆది 24[15]). నాహోరునకు పన్నెండు మంది కుమారులుండిరి (22[20-24]). వీరు అరామీయుల గోత్రములకు పెద్దలై యుండిరి. అబ్రాహాము సిరియాలోని దక్షిణ భాగమందున్న ఇశ్రాయేలీయులకును ఎదోమీయులకును పూర్వికుఁడై యుండఁగా నాహోరు అందులోని యుత్తర భాగమందలి సిరియవారికిని, అరామువారికిని, అరామ్నహరాయిము వారికిని పూర్వికుఁడాయెను. 24[10] లో హారాను నాహోరు పట్టణమన బడును. 31[53] చూడఁగా నాహోరు మనుమఁడైన లాబాను అబ్రాహాము దేవుఁడు నాహోరు దేవుఁడు అను దేవునితోడ ప్రమాణముచేసి యున్నట్లు కనబడును.

## ని

**నింపింపుట** దూషించుట చూ॥

**నింషీ** (Nimshi = మట్టుకైన?). రాజైన యెహూయొక్క తాత. యెహూ సాధారణముగా నింషీ కుమారుఁడనఁబడును (I రాజు 19[16] II రాజు 9[2,14,20] II దిన 22[7]).

**నిగనిగలాడు పుచ్చు** రోగములు చికిత్సలు V 1 చూ॥

**నిచ్చెన** (Ladder). యాకోబు తన దర్శనమునందు చూచిన నిచ్చెన ఆకాశమునకెక్కు నిమిత్తము కట్టిన రాతి మెట్లని యనేక పండితులు యెంచుచున్నారు (ఆది 28[12]). దిబ్బవేయుట యని శబ్దార్థమిచ్చు హెబ్రీమాట ఈ యొక్క చోట మాత్రము బైబిలునందున్నది కావున అది దాని భావమని యనుకొందురు గాని అది రూఢియనఁజాలము. ప్రాకారముల నెక్కుటకు వాడిన నిచ్చెనలను గుఱించి కోటలు II చూ॥

**నిజము** సత్యము చూ॥

**నిత్యజీవము** జీవము చూ॥

**నిధి** ఖజానాదారుడు చూ॥

**నిప్పు, అగ్ని** (Fire). బైబిలునం దుదాహరించిన నిప్పుయొక్క ప్రయోజనములను గుఱించియు, అది అలంకారరీతిగా సూచించిన సూచన

లను గూర్చియు ఈ శీర్షిక క్రింద ప్రశంసింపఁబడును.

1. నిప్పు ఉపయోగములు. ఈ దిగువవి బైబిలు వాక్యములందు కనఁబడును (1) వంటపని చేయుటకును రొట్టెలు కాల్చుటకును (నిర్గ $12^{8,9,39}$ హోషే $7^{6,7}$ యోహా $21^{9}$), (2) చలి కాచుకొనుటకు (యెష $44^{16}$ మా $14^{54}$), (3) లోహములను సాగగొట్టుటకు (యెష $44^{12}$), పోతపోయుటకు (నిర్గ $32^{24}$) పుటము వేయుటకు (యిర్మీ $6^{29}$). (4) చెత్త చెదారమును కాల్చి వేయుటకు (నిర్గ $12^{10}$ లేవి $8^{17}$ $9^{11}$) (5) అంటు రోగములు తగిలిన వస్త్రములను కాల్చుటకు ($13^{52}$). (6) ఘోర నేరములను చేసినవారిని శిక్షించుటకును ($20^{14}$ యెహో $7^{15}$). (7) యాజ్ఞముల నర్పించుటకు (నిర్గ $29^{18}$ లేవి $1^{9}$) నిప్పును వాడిరి. వేదికమీఁద ఆరని అగ్నిని మాత్రమే ఉపయోగింపవలెనను నియమము నుండెను ($6^{13}$, అన్యాగ్ని చూ).

2. నిప్పుయొక్క సూచనలు:—(1) లోహములను పుటము వేయుటకు వాడుటచే, మానవులను వారి పనులను పరీక్షించుటకును (జెక $13^{9}$ మలా $3^{3}$ I కొరి $3^{13}$), వారిని శుద్ధిచేయుటకును (మలా $3^{2}$ మా $9^{49}$) వాడఁబడు క్రమశిక్షలకు సూచనగా నున్నది. (2) అది యుగాంతనాశమున కొక సూచనయై యున్నది (యెష $10^{17}$ $26^{11}$ యిర్మీ $17^{27}$). దేవుని నెదిరించువారిని లయపఱచుటకును (సంఖ్యా $11^{1,2,3}$ II రాజు $1^{10}$), యుద్ధకాలమున శత్రువుల పట్టణములను కాల్చుటకును వాడఁబడినందున (యెహో $6^{24}$ $7^{15}$ న్యాయా $9^{15}$) అది యట్టి నాశనమున కొక సూచన యయ్యెను. (3) దీనికి సంబంధముగా నది దుష్టుల నాశనమునకు సూచనగా నున్నది (కీర్త $68^{2}$ యెష $47^{14}$ యిర్మీ $51^{58}$ మ $5^{22}$ $13^{50}$ $18^{8}$ మా $9^{48}$ యూదా 7 ప్రక $19^{20}$). (4) ఆకాశమునుండి అగ్నిని పంపి యాగములను దహించుటచే దేవుఁడు దానిని అంగీకరించె ననుటకు సూచనయైయున్నది (న్యాయా $6^{21}$ I రాజు $18^{38}$). (5) అగ్ని దేవుని సన్నిధానమున కొక గుఱుతుగానుండె (ఆది $15^{17}$ నిర్గ $3^{2}$) ఆయన మహిమకును ($24^{17}$ దాని $7^{9}$), ఆయన తనవారిని కాపాడుటకును (నిర్గ $13^{22}$ $40^{38}$ కీర్త $78^{14}$) వారి పాపమును దహించివేయుటకును (ద్వితీ $4^{24}$ యిర్మీ $4^{4}$ ఆమో $5^{6}$ కీర్త $89^{46}$ హెబ్రీ $12^{29}$) సూచనగా నున్నది. (6) అది మానవులను శుద్ధిచేయు పరిశుద్ధాత్మను సూచనగా నున్నది (మ $3^{11}$ లూ $3^{16}$ కార్య $2^{3}$ (తేజము చూ॥).

**నిప్పుకోడి** పక్షులు 25 చూ॥

## నిబంధన (Covenant, Testament)

1. పాతనిబంధన. నిబంధన యను పదము ఒడంబడికలకు వాడఁబడు పదమైయున్నది. మానవులొకరితోనొకరు కట్టి యొడంబడికలను చేసికొన్నయెడల దానికి నిబంధన యను పేరు కలదు. ఇట్లు అబీమెలెకు అబ్రాహాముతోను (ఆది $21^{24}$), అబ్రాహాము అమోరీయులతోను ($14^{13}$), లాబాను యాకోబుతోను ($31^{44}$), యోనాతాను దావీదుతోను (I సమూ $18^{3}$) నిబంధనలను స్థిరపఱచుకొనిరి. అయితే బైబిలులో దేవుఁడు మానవులకు చేసిన వాగ్దానములతోఁ గూడిన విశేష యొడంబడికను సూచించుటకు ఈ పదమును ముఖ్యముగా నుపయోగించి యున్నారు. అట్టి యొడంబడిక దేవుఁడు తన కృపవలననే చేయును కావున ఆయన నిబంధనలు కృపాసహితములైనవై యున్నవి. ఈ విషయముగా విధేయతమీఁద ఆనుకొనినట్టి నిబంధనను దేవుఁడు ఏదెను తోటలో చేసియున్నట్లు (ఆది $2^{16,17}$) అనేకు లనుకొందురు గాని దానికి బైబిలులో నిబంధన యను పేరు లేదు. $6^{18}$ లో దేవుఁడు నోవహుతో నొక నిబంధనను స్థిరపఱచినట్లుగా నున్నది. జలప్రళయమువలన అందఱిని నాశముచేసెనను నోవహును అతని కుటుంబమును రక్షించు ననునది దాని యుద్దేశమై యున్నది. కావున దేవుఁడు జలప్రళయమైన తరువాత భూమిని మఱల వరదల చేత లయపఱచనని ఆ నిబంధనకు ఇంద్రధనస్సును గుఱుతుగా నిచ్చెను ($9^{12,15,16}$). తరువాత దేవుఁడు అబ్రాహాముతోను అతని సంతతివారితోను తన నిబంధనను స్థిరపఱచి కనానుదేశమును వారికి ననుగ్రహించి వారిని తన ప్రజలనుగా చేతునని మాటిమాటికి వాగ్దానములను చేసెను ($13^{17}$ $15^{18}$ $17^{2,4,7,11,13,14}$ II రాజు $13^{4}$ I దిన $16^{15-18}$ కీర్త $105^{9-11}$ కార్య $7^{8}$ రోమా $4^{13,17}$.)

ఆయన ఇశ్రాయేలు జనముతోకూడ నిబంధన చేసెను. తాను వారికి దేవుఁడైయుండి వారిని కాపాడి రక్షింతునని మాటనిచ్చెను గాని వారు ఆయన విశ్రాంతిదినమును లక్షించి (నిర్గ $31^{16}$) పదియాజ్ఞలను గైకొనవలెను (ద్వితీ $4^{13,23}$) అను వాటిని ఈ నిబంధనకు షరతులనుగా పెట్టెను. దేవుఁడిశ్రాయేలీయులతో సీనాయి పర్వతము నొద్ద చాల గంభీరముగా నిబంధనచేసెను ($5^{2}$). మోయాబు మైదానములో దానిని మఱల స్థిరపఱచెను ($19^{1}$). లేవీయులతో ఆయన యొక్క విశేష నిబంధనను స్థిరపఱచెను (మలా $2^{4,5}$) యాజకత్వము వారి కుటుంబములో నిత్యముగా నుండునను విశేష నిబంధనను దేవుఁడు అహరోను మనుమఁడగు ఫీనెహాసుతో చేసెను (సంఖ్యా $25^{12,13}$). దావీదు సంతానము నిత్యముగా సింహాసనాసీనులగుదురను విశేష నిబంధనను దేవుఁడు దావీదుతో స్థిరపఱచెను (కీర్త $89^{20-28,34}$ II సమూ $7^{1-29}$ I దిన $17^{1-27}$ II దిన $7^{18}$ యిర్మీ $33^{21}$) ఇట్లెన్ని నిబంధనలున్నను వాటన్నిటికి అతీయముగానున్న ఒక క్రొత్త నిబంధనను గూర్చి యిర్మీయా ప్రవచించెను (యిర్మీ $31^{31-34}$ హెబ్రీ $8^{8-11}$). దేవుఁడు తన యాజ్ఞలను మనుష్య హృదయములమీఁద వ్రాయుటయే దాని ముఖ్య సూచనయై యున్నది. మనుష్యులు తమ యిష్ట పూర్వకముగా దేవుని ప్రేమించి దానినిబట్టి ఆయనను సేవించుటయే దాని యాంతర్య విషయమై యున్నది.

పైనున్న చరిత్రకు సంబంధముగా మఱికొన్ని సందర్భములలో నిబంధన యను పదమును పాత నిబంధనలో వాడియున్నారు. దేవుఁడు పది యాజ్ఞలను వ్రాసిన రెండు రాతిపలకలు నిబంధన సంబంధమైన పలకలు (ద్వితీ $9^{11}$) అనియు, ఆజ్ఞలుంచఁబడిన నిబంధనపెట్టె యెహోవా నిబంధన మందసము (సంఖ్యా $10^{33}$) అనియు, నిర్గ 20-23 అధ్యాయములలోని యాజ్ఞలును కట్టడలును నిబంధన గ్రంథము (నిర్గ $24^{7}$) అనియు, మోషే ధర్మశాస్త్రము యావత్తును నిబంధన సంబంధమైన మాటలు (II రాజు $23^{2}$ $22^{8-11}$) అనియు అనఁబడును (బైబిలుచరిత్ర చూ॥).

2. క్రొత్త నిబంధన. నిబంధన యను పదముచే తర్జుమచేయఁబడిన అసలు భాషాపదము క్రొత్త నిబంధనలో ముప్పదిమూఁడు మాఱులు కనఁబడును. వీటిలో దాదాపు సగము మాటలు హెబ్రీ యుత్తరములో నున్నవి. దానిని గల $3^{35}$ లో ఒడంబడికె యను పదముచేతను, హెబ్రీ $9^{17}$ లో **మరణశాసనము** అను పదముచేతను తర్జుమా చేసియున్నారు గాని తక్కిన వాక్యము లన్నిటియందు మన తెనుఁగు బైబిలులో నిబంధన యను పదమునే వాడియున్నారు. ఆ వాక్యము లన్నిటిని చూడఁగా పదునాలుగు వాక్యములలో అది పాత నిబంధనను గాని దానికి సంబంధించిన వాగ్దానములను నియమములను గాని సూచించును (లూ $1^{72}$ కార్య $3^{25}$ $7^{8}$ రోమా $9^{4}$ II కొరి $3^{14}$ గల $3^{17}$ $4^{24}$ ఎఫె $2^{12}$ హెబ్రీ $8^{9}$ $9^{4}$ $9^{15}$ $9^{20}$). మఱియు పదునాలు పర్యాయములది క్రీస్తు సువార్తకు సంబంధించిన క్రొత్త నియమములను సూచించును (మ $26^{28}$ మా $14^{24}$ లూ $22^{20}$ I కొరి $11^{25}$). ఈ నాలు వాక్యములలోను అది ప్రభువు రాత్రి భోజన సంస్కారమునకు సంబంధముగా నున్నది (రోమా $9^{4}$ II కొరి $3^{6}$ గల $4^{24}$ హెబ్రీ $7^{22}$ $8^{6,9,10}$ $9^{15}$ $10^{17,29}$ $12^{24}$ $13^{20}$). పైనున్న యీ వాక్యములకు సంబంధముగా మనము నేటివఱకు బైబిలులోని మొదటి ముఖ్య భాగమునకు పాతనిబంధన, రెండవ ముఖ్య భాగమునకు క్రొత్త నిబంధన యను పేరులను పెట్టుదుము. మూఁడు పర్యాయములది మానవులు స్థిరపఱచు మరణశాసనములను గాని ఒడంబడికెలను గాని సూచించును (గల $3^{17}$ హెబ్రీ $9^{16,17}$). దేవుఁడు మానవులతో చేసిన వాగ్దానములు రద్దుపఱచఁబడనేరవు అను విషయమును మానవుల మరణశాసనము రద్దుపరచఁబడనేరదను దానిచే దృష్టాంతపఱచుటకు ఈ పదములను ఈ వాక్యములలోసహా వాడియున్నారు. ఈ దృష్టాంతమును గూర్చి వ్యాఖ్యాతలు ముఖ్యముగా చర్చింతురు. పాత నిబంధన నియమములను చూడఁగా పిత్రార్జితము అదే కుటుంబములో నుండవలయునను ఏర్పాటుండుటచే మరణశాసనములు వ్రాసి దానిని ఆయావారల కిచ్చువాడుక యుండలేదు. అయితే గలతీయ హెబ్రీ పత్రికలలో ఈ దృష్టాంత ముండుటవలన ఆ పత్రికలు ఎవరికి వ్రాయఁబడెనో వారికీవాడుక లుండెను. లేని యెడల ఈ దృష్టాంతముల భావము వారికి సరిపడ

దని తెలిసికొనవచ్చును. ఇది గ్రీకువారి వాడుకలను రోమావారి దేశచట్టముల ప్రకారముగా క్రమపఱచఁబడిన విధమును అనుసరించును. ఒక తండ్రి యొకానొకని తనకు వారసునిగా నియమించుకొనినయెడల వారసత్వము మార్చఁబడనేరదుగాని యా తండ్రి చనిపోక పూర్వము ఆ యేర్పాటు అమలులోకి రాదు (హెబ్రీ $9^{16,17}$). క్రీస్తు మరణము ద్వారా మనకు ననుగ్రహింపఁబడిన వారసత్వమును సూచించుటకు ఇదియొక చక్కని దృష్టాంతమై యున్నది.

**నిబంధన గ్రంథము** (Book of the Covenant). నిర్గ $24^{7}$ లో ఈ మాటలు కలవు. ఈ పేరు మొట్టమొదట $20^{22}$ $23^{33}$ లో నున్న చట్టములకు ఒక ప్రత్యేకమైన పేరైయుండెనని నవీన పండితులలో ననేకు లనుకొందురు. అందులోని చట్టములను చూడఁగా నవి దేశసంబంధమైనవియు మతసంబంధమైనవియునై యున్నవి. దేశసంబంధమైన విధులలో, దాసుల హక్కులు ($21^{1-11}$), నరహత్య ($21^{12-15}$), దేహసంబంధమైన యితర యాతనలు ($21^{16-32}$), పశువులవలనఁ గలుగు అపాయములు ($21^{33-36}$), దొంగతనము ($22^{1-5}$), మంట వేయుటవలనఁ గలుగు నష్టము ($22^{6}$), ఒప్పగింపఁబడినదాని మీరుట ($22^{7-13}$), అప్పులు ($22^{14,15,25-27}$), వ్యభిచారము ($22^{16,17}$) అనువాటిని గూర్చినవి కలవు. మతసంబంధమైన ఆచారములను గూర్చిన విధులలో వేదికను కట్టుట ($20^{24-26}$), సోదె చెప్పుట ($22^{18}$), అన్యులను పయమాపుట ($22^{21}$), దేవుని యధికారులను దూషించుట ($22^{28,29}$), ప్రథమఫలముల నర్పించుట ($22^{29,30}$), పొలములో చీల్చఁబడిన మాంసమును తినకుండుట ($22^{31}$), న్యాయమైన తీర్పుచేయుట ($23^{1-3,6-8}$), విశ్రాంతిదినము, విశ్రాంతి సంవత్సరము ($23^{10-12}$), పండుగలు ($23^{14-16}$) అనువాటిని గూర్చినవి కలవు. వీటన్నిఁటిని చూడఁగా అవి యిశ్రాయేలీయుల పురాతన స్థితికి సంబంధించియున్న చట్టములే యని చెప్పుటకు వీటిలో ననేక సూచనలు కలవు (బైబిలు చరిత్ర చూ॥)

**నిబంధన మందసము** మందసము చూ॥

**నిబ్బరమైనబుద్ధి** స్వస్థబుద్ధి చూ॥

**నిబ్షాను** (Nibshan = చదునుగా నుండు మెత్తని నేల). యూదయ అరణ్యములోని యొక గ్రామము (యెహో $15^{62}$).

**నిబ్హాజు** (Nibhaz). ఇశ్రాయేలీయులు అష్షూరు చెఱకు వెళ్లినప్పుడు వారి స్థలమును నింపుటకు సర్గోను పంపిన అవ్వీయులు సమరయకుఁ దెచ్చిన దేవతలలో నొకటి (II రాజు $17^{31}$). రబ్బీల ఇతిహాసముల ప్రకార మీ దేవతకు కుక్కయాకారము గలదు. మృతుల మార్గమున కధిదేవతయగు కుక్కతల యాకారము గల అనుబిస్ (*Anubis*) అను ఐగుప్తీయుల దేవతవంటిది, గాని ఆ దేవతకు సంబంధించినదనుటకు వేఱు ఆధారములు లేవు. B.

**నిముషము** కాలమానము I చూ॥

**నిమ్మగడ్డ నూనె** గంధవర్గములు I 10 చూ॥

**నిమ్రా** (Nimrah = తేటయైన నీరు). ఇది బేత్నిమ్రా అను స్థలమున కొక క్లుప్తనామము (సంఖ్యా $32^{3,35}$ బేత్నిమ్రా చూ॥).

**నిమ్రీము, నిమ్రీము నీటితావులు** (Nimrim = తేటనీళ్లు Waters of Nimrim). మోయాబు ప్రదేశములో నుండు నొక స్థలము (యెష $15^{6}$ యిర్మీ $48^{34}$). ఇది సోయరు హోరొనయీము మొదలువానితో చెప్పఁబడుటచే మోయాబుదేశపు దక్షిణ భాగమున నున్నదని కొందురు. ప్రస్తుతము మృతసముద్రపు దక్షిణ కొనకు ఉత్తరముగా మూఁడుమైళ్ల దూరములో వాడి నెమైరా (*Wady N'meirah*) అను నొక వాగు కలదు. ఆ వాగే దీని యునికి యనుకొనఁదగును.

**నిమ్రోదు** (Nimrod = దైవద్రోహి). హాము మనుమఁడు. కూషు కుమారుఁడు. మొదటినుండి మిగుల పరాక్రమశాలియైన వేఁటకాఁడు అయినట్లు సామెతె యొకటి గలదు (ఆది $10^{8-10}$ I దిన $1^{10}$). ఇతఁడు దేవునికిఁగాని మనుష్యులకుఁ గాని భయపడనివాఁడైనట్లు కనఁబడుచున్నది. మిగుల సాహసికులను గొందఱిని కూర్చుకొని తాను జయించిన దేశమును ఇతియోపియనుండి షీనారువఱకు వ్యాపింపఁజేసి అక్కడ బాబెలు ఎరెకు అక్కాదు కల్నే యను కోటలుగల పురము

లను కట్టించెను. షీనారునుండి అష్షూరుకు వెళ్లి అచ్చట నీనెవె, రహోబోతీరు, కాలహు రెస్సీను లను కట్టించెనని చెప్పెదరు. నిమ్రోదు అష్షూరును షీనారునుండి తరిమివేసినప్పుడు అష్షూరు నీనెవెను



నిమ్రోదు

రాజధానిగా స్థాపించెనని సాధారణాభిప్రాయ మైనను నిమ్రోదే వీటి స్థాపకుఁడని యందురు (మీకా $5^{6}$). బాబెలు గోపురము నారంభించి నది నిమ్రోదని చెప్పెదరు. పురాతన బాబె లుండిన స్థలముదగ్గర గల పెద్ద మట్టిదిబ్బలవలన వాని పేరింకను కాపాడఁబడి యున్నది.

H.

**నిరవంజి చువ్వలు** (Withs). న్యాయా $16^{7}$ నందీమాట క్రొత్త త్రాళ్లని యుండవలెను. ఈ మూలభాషా పదమే యోబు $30^{11}$ నందు త్రాడు అనియు కీర్త $11^{2}$ నందు నారి యనియు తెనిఁగించబడినది.

J. C.

**నిరవంజిచెట్టు** (Willow). పలెస్తీను మెసపొతేమియ దేశపు నీటియోరలయందును, హిమాలయపర్వతముల మీఁదను సమృద్ధిగాఁ బెరుగు నొక వృక్షమును సూచించు హెబ్రీ పదము నీ మాటచే తెనిఁగించిరి. పర్ణశాలల పండుగ సమయమున దీని కొమ్మలను నరికి వాడు కొనిరి (లేవీ $23^{40}$). నీటిగుఱ్ఱములు ఈ చెట్ల నీడను దాగుకొనెడివి (యోబు $40^{22}$). బబు లోను చెఱకుఁగొనిపోఁబడిన యూదులు తమ సితారాలను ఈ చెట్లకు తగిలించిరి (కీర్త $137^{2}$). చెఱనుండి తిరిగివచ్చువారు ఈ చెట్లవలె నెదు గుదురని పోల్చఁబడినది (యెష $44^{4}$). యెహె $17^{5}$ లో నున్న గన్నెరు నిరవంజియని యుండ వలెను.

J. C.

**నిరీక్షణ** (Hope). క్రైస్తవ గుణములలో నిరీక్షణ యొక ముఖ్యగుణమై యున్నది (I కొరి $13^{13}$). అది యిఁకముందు పరమమేలు కలుగు నను నిశ్చయతతోఁ గూడిన ఆశయై యున్నది. ఈ విధముగా అది విశ్వాసమునకు సంబంధం మను (హెబ్రీ $11^{13-16}$). పాఁత నిబంధనను మాపిఁగా జనులు నిరీక్షించిన భవిష్యన్మేలులు సాధారణముగా భూసంబంధమైన మేలులని యనేకవాక్యములవలన కనఁబడును (యెష $9^{6,7}$ $11^{1-9}$ 55, 61, కీర్త 77, 96, 97, 98 మొ॥). అయితే క్రమక్రమేణ అవి మఱీ తేటగా కనఁబడును ఆత్మసంబంధమగు మేలులనుఁ గూర్చినవియై యున్నవి (యిర్మీ $14^{8}$ $17^{12-18}$ యెష $42^{4-6}$ 60). ఇశ్రాయేలీయులదేశము పాడగుటచే వారు నిరీక్షించిన భూసంబంధమైన మేలులలో ననేకమైవాటికి భంగము కలిగినను రెండుపిషయ ముల ననుసరించి మఱీ బలముగ నిరీక్షించఁగలవా రైరి. (1) మెస్సీయది యనఁబడిన క్రీస్తు రాజ్యము. (దేవుని రాజ్యము చూ॥). (2) పున రుత్థానము. మృతులు తిరిగి లేతురను నిరీక్షణ యిశ్రాయేలీయుల కష్టదశలలో ముఖ్యముగా కనఁబడును (యెష $25^{8}$ $26^{19}$ దాని $12^{2}$). ఇట్టి కష్టదశలలో కూడా వారు కీర్తనలను రచించి నట్లుగా నున్నది (యోబు $19^{25-27}$ కీర్త $16^{8-11}$ $17^{15}$). మృతుల పునరుత్థానము తప్పక కలుగ వలెను లేదా దేవునిరాజ్యముకొఱకు ఎక్కువగా ప్రయాసపడువారిలో ననేకులు దాని మేలులను పొందక పోయెదరు అని యోచించి వారు మృతుల పునరుత్థానమును మఱీ బలముగా నమ్మి యుండిరని స్పష్టమగును (హెబ్రీ $11^{35}$ I థెస్స $4^{13-17}$). పాఁత నిబంధన గ్రంథములకును క్రొత్త నిబంధన గ్రంథములకును మధ్యకాలములోను

తదనంతరకాలమందును ఇట్టి భవిష్యద్ మేలులను తెలుపుటకై అలంకార రీతిగా యూదులు రచించిన ప్రకటన గ్రంథములు (*Apocalyptic Books*) అనేకములు కలవు. ఆ గ్రంథకర్తలు భావికాలమున యూదులకు కలుగఁబోవు అమిత సౌఖ్యములనుగూర్చి వాటిలో వ్రాసియుండిరి.

క్రొత్త నిబంధనను చూడఁగా క్రీస్తు పునరుత్థానము నూతనమైన నిరీక్షణకు ఆధారమయ్యెనని తెలిసికొనవచ్చును (I పేతు $1^{3}$ కార్య $2^{22-36}$ I కొరి $15^{12-26}$ ప్రక $1^{18}$). సువార్తల యారంభమందు అట్టి నిరీక్షణను దృష్టాంతపఱచు భక్తుల చరితములును (లూ $2^{25-32}$ $2^{36-39}$) అట్టి నిరీక్షణను తెలుపు కీర్తనలును (లూ $1^{46-55,67-79}$) ఉండినను, నాలుగు సువార్తలలో అట్టి నిరీక్షణనుగూర్చిన సూచనలును పదములును ఎక్కువగా లేవు. అపొస్తలుల కార్యముల గ్రంథములోను పత్రికలలోను అట్టివి యెక్కువగా నున్నవి. పౌలు తన ప్రసంగములలో మనకున్న నిరీక్షణనుగూర్చి (కార్య $23^{6}$) ప్రసంగించుచు ఇశ్రాయేలీయులకు క్రీస్తునుగూర్చి బోధించి యుండెను ($13^{32}$ $23^{6-8}$ $26^{6-24}$ $28^{20}$). దానికి భిన్నముగా నతఁడు అన్యుల కట్టి నిరీక్షణలేదని బోధించెను (ఎఫె $2^{12}$ I థెస్స $4^{13}$ I కొరి $15^{32-34}$). మనము నిరీక్షించుటయను కార్యమునకు మాత్రముగాక మనము నిరీక్షించుచున్న మేలుకు కూడా నిరీక్షణ యనుపేరు కలదు (హెబ్రీ $6^{18}$). అనేకవాక్యములలో నిరీక్షణ యనుపదము నుపయోగింపక పోయినను దానికి సంబంధమగు ఓర్పు అను పదము నుపయోగించి దానిసంగతిని తెలిపి యున్నారు (I థెస్స $1^{3}$ II థెస్స $1^{3}$ మొ॥). ఓర్పు నిరీక్షణకు ఫలమై యున్నది కావున నిరీక్షణ యను పదము నిట్లు వాడుట న్యాయమే. నిరీక్షణ ఆశతో కనిపెట్టుచున్నాము అను దృఢమైన మాటలను కూడా పౌలు ఉపయోగించెను (రోమా $8^{19}$). I కొరి $1^{7}$ గల $5^{5}$ లో నున్నట్లు దానికి ఎదురు చూచుట అను మఱియొక పదమును కూడా పౌలు వాడి యున్నాఁడు నిరీక్షణను గూర్చి క్రొత్త నిబంధన బోధలను క్లుప్తముగా నీ క్రింది విధమున చేర్చవచ్చును.

(1) మనము దేనికొఱకు నిరీక్షించుచున్నామో అది యనేక వాక్యములలో కనఁబడును. అది దేవుని మహిమ యనఁబడును (రోమా $5^{2}$ I థెస్స $2^{12}$). దేవుని రాజ్యము జయకరముగా ప్రబలమగుచుండునప్పుడును క్రీస్తుప్రభుత్వము పూర్ణముగా స్థాపితమై యంగీకరింపఁబడు కాలము లోను ఈ మహిమ వెల్లడియగును (I కొరి $15^{24-28}$ ఫిలి $2^{9-11}$ ప్రక $17^{14}$). అట్టి మహిమలో క్రీస్తును నమ్మువారుమాత్రముగాక ఈ సృష్టి సహా పాలొందును (రోమా $8^{17,25}$ II థెస్స $1^{10,11}$ I కొరి $15^{35-54}$).

(2) మన నిరీక్షణకు ఫలము అంత్యదినమున పరిపూర్ణముగా కలుగును. మృతుల పునరుత్థానమున ఇది ఆరంభమగును (I థెస్స $4^{16}$ I కొరి $15^{19-23}$ యోహా $5^{28,29}$). మన దేహము సహా మహిమాస్వరూపము గలదిగా నుండునట్లు మార్పునొందును (I కొరి $15^{50-54}$ II కొరి $5^{1-8}$ ఫిలి $3^{21}$). క్రీస్తు భక్తులు దేవుని నిత్యమును చూచువారై క్రీస్తునకు సహవాసులై నిత్యజీవమును పూర్ణముగా పొందెదరు (లూ $20^{35,36}$ మ $5^{8}$ యోహా $14^{2,3}$ $17^{24}$ I యోహా $3^{2}$ ప్రక $7^{14-17}$).

(3) ఆ గొప్పభాగ్యము మనకు పూర్ణముగా పరలోకములోనే కలుగును. అది మన నిరీక్షణకు పదవియై యున్నది. దేవుని రాజ్యమునకు ఇహమందెంతటి జయము కలిగినను దేవునిపిల్లలు పరలోకమందే మహిమగల స్వాస్థ్యమును పొందెదరు (రోమా $8^{21}$).

(4) ఇట్టి నిరీక్షణకు దేవుని వాగ్దానములే ఆధారములై యున్నవి (తీతు $1^{2}$ హెబ్రీ $6^{13-18}$ II పేతు $3^{13}$ I యోహా $2^{25}$). మఱి ముఖ్యముగా క్రీస్తు జయకరముగా తిరిగివచ్చుటయే (అనఁగా ఆయన రెండవరాకడయే) ఈ నిరీక్షణకు ఆధారమై యున్నది (మ $24^{30,31}$ కార్య $1^{11}$ $3^{18-21}$ ప్రక $11^{15-18}$). ఈ నిరీక్షణకు భంగము కలుగదను నిశ్చయతకు క్రీస్తు పునరుత్థాన యారోహణములు (కార్య $17^{31}$ రోమా $1^{4}$ ఎఫె $1^{18-23}$ కొలొ $1^{18}$ హెబ్రీ $6^{20}$ I పేతు $1^{21}$) పరిశుద్ధాత్మ మనకు అనుగ్రహింపఁబడుట (II కొరి $1^{20,22}$ రోమా $8^{16,17}$ ఎఫె $1^{13,14}$) అనునవి ఆధారములై యున్నవి.

(5) ఇట్టి నిరీక్షణ విశ్వాసులకే కలుగును (రోమా $5^{1-5}$ $15^{13}$). ఇది వారి పిలుపునకు

సంబంధించిన నిరీక్షణాయై యున్నది (ఎఫె 4[4]). ఆయా క్రైస్తవులకు మాత్రముగాక మొత్తము మీఁద క్రైస్తవసంఘమునకుకూడ ఈ నిరీక్షణ కలుగును. ఇది వారిని ఐక్యపఱచునదై యున్నది. మఱియు వారిలో ఒకరియందొకరికి నుండు ప్రేమనుబట్టి యీ యేకనిరీక్షణ మఱీ యాదరణ గలదియై యుండును (I థెస్స 4[13-18] II థెస్స 2[1] ఎఫె 5[27] ప్రక 1[4,9] 21[1-7]). తమకు నప్పగింపఁబడిన క్రైస్తవులవిషయములో బోధకులకు గూడ ఇట్టి నిరీక్షణ కలుగును (II కొరి 1[7-10] I థెస్స 2[19,20] కొలొ 1[27] ఫిలి 2[16]).

(6) ఈ నిరీక్షణకు ఫలమేదనిన, అది మనలను స్థిరపఱచి మనలను పవిత్రపఱచును (I కొరి 15[58] I యోహా 3[2,3]).

ఈ మహిమా నిరీక్షణకు క్రీస్తే కారకుఁడై యున్నాఁడు (కొలొ 1[27]). ఆయన రెండవ రాకడకొఱకు కనిపెట్టుటవలననే అది క్రైస్తవులు ఆ నిరీక్షణను బహు తేటగా కనఁబఱచిరి (తీతు 2[13]). ప్రభువు వచ్చును అనునది ఆది క్రైస్తవులలో నొకవిధమగు జయధ్వనియై యున్నది (I కొరి 16[22]). పరలోకములో తమకొఱకు ఉంచఁబడిన రక్షణకొఱకు కనిపెట్టుట (I థెస్స 1[9,10] కొలొ 1[5] 3[1-4]) ఆది క్రైస్తవుల బ్రతుకులో చాల ముఖ్యవిషయమై యుండెను. ఇది వారిని బలపఱచి స్థిరపఱచి, వారు తమ హింసలవలన క్రుంగిపోకుండునట్లు వారిని రక్షించెను (రోమా 5[2-5] 8[18-25] II కొరి 4[13] 5[8] ఫిలి 1[20,21] హెబ్రీ 10[32-36] ప్రక 7[13-17]). హెబ్రీ 6[19,20] లో నున్న దృష్టాంతము ప్రకారముగా ఇది క్రైస్తవులను తెచ్చి మహిమపఱచఁబడిన క్రీస్తు సింహాసనము అను బండకు అంటుకట్టు లంగరై యున్నది.

నిరీక్షణ ఇంత గొప్పది యగుటచే అది విశ్వాసము ప్రేమ అనువాటితో చేర్చఁబడినది (I కొరి 13[13] I థెస్స 1[3] II థెస్స 1[3,4] ఎఫె 4[1-4] హెబ్రీ 10[22,23]). ఈ మూఁడును క్రైస్తవుల కుండవలసిన ముఖ్యలక్షణములై యున్నవి.

**నిర్గమకాండము** (Exodus = లో నుండి పోవుట). బైబిలులోని రెండవ గ్రంథము. మోషే గ్రంథపంచకమనఁబడిన దానిలో రెండవదియై యున్నది. దీనియందు ముఖ్యముగ ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి పోవుటను గుఱించి తెలుపఁబడి యున్నది. దీనిలోని చరిత్రయంతయు ఆదికాండములోని చరిత్రపై నాధారపడి యున్నది. ఆదికాండములేకుండ నిర్గమకాండము అర్థముకాదు. ఏ సంగతియొక్క ఆరంభముగాని ముగింపుగాని దీనియందగుపడదు. ఈ గ్రంథమునందలి సంగతులు జరుగుటకు దాదాపు 415 సం॥ లు పట్టెను.

ఈ దిగువనున్న మూఁడు సంగతులనుబట్టి దీనిని జ్ఞాపకార్థక గ్రంథమనవచ్చును.

1. ఐగుప్తీయుల కఠినదాసత్వమువలన ఇశ్రాయేలీయులకు కలిగిన ఆశ్చర్యకరమైన విడుదల.

2. బహిరంగముగ దేవుని నారాధించుటకై వీరందఱి నొకమతముగలవారినిగ చేర్పరచుట.

3. దేవుఁడు రాజుగను తండ్రిగనుండి నీతి మత రాజ్యవిషయిక చట్టనిర్మాణము చేయుట.

దీనియందు మనము జ్ఞప్తియందుంచుకొనఁదగు నేడు ముఖ్యసంగతులున్నవి: 1. దుర్మార్గులగు ఐగుప్తీయులను శిక్షించుటకు పంపఁబడిన పదితెగుళ్లు; 2. ఇశ్రాయేలీయుల విడుదలను జ్ఞాపకముంచుకొను నిమిత్తము నియమింపఁబడిన పస్కాపండుగు; 3. వారి సంరక్షణార్థమును ఐగుప్తీయుల నాశనార్థమును ఎఱ్ఱ సముద్రమునందు మార్గమేర్పడుట; 4. ఇశ్రాయేలీయుల పోషణార్థమై దేవుఁడరణ్యములోఁ జేసిన నానావిధ యద్భుతములు; 5. దేవుఁడు తన గంభీరమగు మహిమతో సీనాయిపర్వతము మీఁదనుండి ధర్మశాస్త్రము నిచ్చుట; 6. ఇశ్రాయేలీయు లవివేకులును దుర్మార్గులునై బంగారపు దూడను జేసికొని దాని నారాధించుట; 7. మన మధ్యవర్తియు విమోచకుఁడునగు ప్రభువైన యేసు క్రీస్తుయొక్క యాజకత్వమును సూచించు గుడారముయొక్క నానావిధ కర్మలు.

ఈ గ్రంథమును మూఁడు ముఖ్యభాగములుగ భాగింపవచ్చును.

I. ఇశ్రాయేలీయులు ఐగుప్తునందుండుట (1-12); దీనియందు ఇశ్రాయేలీయుల దాసత్వము (1), మోషే జననము బాల్యము పిలుపు

(2-4), ఫరో మోషే అహరోనులతో మాటలాడుట ($5^{1-5}$), అతఁడిశ్రాయేలీయులను బాధించుట ($5^{6-19}$), యెహోవా కనఁబడుట (6), పది తెగుళ్లు (7-11), పదియవ తెగులుతో పస్కాపండుగను స్థాపించుట (12) ను గూర్చి గలదు. ఈ భాగమునందు మనకు కనఁబడు మూఁడు సంగతులేవనిన: 1. ఫరో హృదయము కఠినపఱచఁబడుట. దీనినిగుఱించి 19 సార్లుదాహరింపఁబడినది (కఠినపఱచుకొనుట చూ॥). 2. తెగుళ్లు. ఒక్కొక్కదానిలో మూఁడేసి యుండునట్లు వీనిని మూఁడు గుంపులుగఁ జేయవచ్చును. మొదటిమూఁడు ఇశ్రాయేలీయుల మీఁదను ఐగుప్తీయులమీఁదను వచ్చెను. తక్కినవి ఐగుప్తీయులమీఁదను మాత్రమే వచ్చెను. 3. పస్కా. దీనియందలి ముఖ్యసంగతి రక్తము. గొఱ్ఱెపిల్ల నేర్పఱచుకొని చంపి తినిరి. ఆ గొఱ్ఱెపిల్ల మన పస్కాయగు క్రీస్తును సూచించెను (I కొరి $5^{7}$ I పేతు $1^{19}$ ప్రక $5^{6-12}$).

II. ఐగుప్తునుండి సీనాయిపర్వతమును నొద్దకు వచ్చుట (13-18). దీనిలో ఐగుప్తును విడచుట ($13^{1\ 19}$) ప్రయాణములు కలవు ($13^{20}$-18). ఈ ప్రయాణమునందు ఎఱ్ఱసముద్రమును దాటుట (14) విమువలపాట ($15^{1-19}$) మారాయొద్ద చేదు నీళ్లు, మన్నా, లావుకపిట్టలు ($15^{20}$-16) రెఫీదీములో నీళ్లు రప్పించుట అమాలేకీయులను జయించుట, యిత్రో వచ్చుటను గుఱించిగలదు (17,18). ఇశ్రాయేలీయులు కఠినదాసత్వములో నుండి విడిపింపఁబడి కనానుకుదగ్గరి త్రోవయగు ఫిలిష్తీయ మార్గమున పోకుండుట. అది 100 మైళ్లకు కొంచెమెక్కువయై నాలుగు లేక అయిదు దినములలో చేరఁగలిగినను దేవుఁడు వారిని యెఱ్ఱ సముద్రమార్గమున తానే వారికి మార్గదర్శిగనుండి క్షేమముగ నడిపించెను.

III. సీనాయిపర్వతమునొద్ద నుండుట (19-40). దీనియందు ధర్మశాస్త్ర మనుగ్రహింపఁబడుట (19-24) గుడారపు ఏర్పాటు (25-31, 35-40) బంగారుదూడ నారాధించి శిక్షనొంది మఱల నిబంధన నొందిన విధము (32-34), యాజకుల నియామకము వారి ఉడుపులు వారి సమర్పణము (28,29, 39,40) ను గుఱించి యున్నది. H.

**నిర్గమము** మరణము II 2 చూ॥

**నిర్ణయించుట** ముందెఱుగుట 3 చూ॥

**నిర్దోషులుగా చేయుట** నీతిమంతులుగా తీర్చబడుట చూ॥

**నిర్ధారణ** హస్తనిక్షేపణము చూ॥

**నిర్మలము** (Pure). II తిమో $1^{3}$ లో నున్న నిర్మలమైన మనస్సాక్ష్యమను పదమును, హెబ్రీ $10^{22}$ నందు దానికి సంబంధించిన నిర్మలమైన ఉదకముతో కడుగబడుట యను పదమును మలా $3^{3}$ లోని వెండిని పుటమువేయు కంసాలి దానిని నిర్మలముజేయువాఁడు అను మాటయు బైబిలునందు గలవు. ఈ వాక్యములలో నిర్మలమని తెనిఁగించిన మూలపదమును సాధారణముగా **పవిత్రత, శుద్ధి** అను మాటలచే ఇతరచోట్ల తెనిఁగించిరి (పవిత్రాపవిత్రములు, పరిశుద్ధత చూ॥).

I పేతు $2^{2}$ లో నిర్మలమైన వాక్యమను పాలు అను సమాసమందలి నిర్మల శబ్దము మఱియొక పదముయొక్క భాషాంతరమై మోసము లేనిదానిని సూచించును. పదములు వేఱుగా నున్నను, సంగతి సందర్భములను బట్టి II కొరి $2^{17}$ లో నున్నట్లు దేవునివాక్యమును కలిపి చెఱిపెడి వారముకాక నిష్కాపట్యము గలవారమను వాక్యము దీనికి సంబంధమైనదిగా నున్నది.

II పేతు $3^{2}$ లో నున్న నిర్మలమైన మనస్సు అను పదము మఱియొకటి యైనందున సాధారణముగా **నిష్కాపట్యమను** పదముచే తెనిఁగించిరి (నిష్కాపట్యము చూ॥).

**నిర్మూలము చేయుట** శపితము చూ॥

**నిశ్చయత** (Assurance). ఈ పదమునకుఁ గల సాధారణ యర్థము గాక మనము రక్షణ విషయములనుగూర్చి సందేహములేక రూఢిగా నుండుట యను విశేషార్థముకూడ దీనికిఁ గలదు (I థెస్స $1^{5}$ II తిమో $3^{14}$). ఆ విశేషార్థము మాత్రమే యిచట విచారణలోకి వచ్చును. మతవిషయములను నమ్ముటకుఁ దగిన యాధారములున్నవని సూచించుటకు (లూ $1^{1-4}$) ఈ పదమును వాడుదురు. అది బాహ్యమైన లేక వెలుపలి నిశ్చయతయని చెప్పఁదగును. అయితే

మనము అనుభవపూర్వకముగా స్వరక్షణవిష యము తెలిసికొనుటయే దానివలన మఱి ముఖ్య ముగా సూచింపఁబడును. అది హెబ్రీ $10^{22}$ లో ఆత్మ నిశ్చయత యనఁబడును, ఇది ఆంతర్య నిశ్చయతయైయున్నది. ఈ విధముగా మనము మర్మముగా నున్న క్రీస్తునుగూర్చి స్పష్టముగా తెలిసికొని (కొలొ $2^{2}$), దృఢిగా నమ్మి (II తిమో $1^{12}$), నిరీక్షణ పరిపూర్ణత గలవారమై యుండ వలెను (హెబ్రీ $6^{11}$). దృఢిగా నమ్ముట, పూర్ణ నిరీక్షణగలవారమగుట అనునవి చాల మట్టుకు ఒకటేభావముగల మాటలై యున్నవి. హెబ్రీ $11^{1}$ లో ఈ రెండును కలసియున్నవి. I యోహా $3^{21-23}$ చూడఁగా ఎవరు పూర్ణప్రేమచే శేపఁబడి దేవునియాజ్ఞలను గైకొందురో అట్టి వారికి మంచిధైర్యము కలుగును అని తెలిసికొన వచ్చును. ఇట్టి ధైర్యముకూడ ఈ నిశ్చయతకు సంబంధముగా నున్నది. యెష $32^{17}$ లో నీతి సమాధానములు నిబ్బరమును కలుగఁజేయునను బోధలు కలవు. ఇట్టి నిశ్చయత పరిశుద్ధాత్మ ఫలమై యున్నది (రోమా $8^{16}$). అయితే మనకు కూడ అందులో నొక పనియున్నది. మనము విశ్వాస నిరీక్షణ ప్రేమలయందు వృద్ధి నొందుచు మన పిలుపును ఏర్పాటును నిశ్చయము చేసికొను టకు మఱి జాగ్రతపడవలెను (I పేతు $1^{10}$). ఈ రక్షణ నిశ్చయతనుగూర్చిన బోధ వేదశాస్త్రము లలో నొక యంశమై యున్నది.

**నిష్కాపట్యము** (Without hypocrisy). ఇది రెండు గ్రీకుపదముల తర్జుమాయై యున్నది.

1. ఒకటి వేషధారణకు భిన్నమగు సద్గుణ మును సూచించు పదము. ప్రేమ చూపుట యందును (రోమా $12^{9}$ II కొరి $6^{6}$ I పేతు $2^{22}$), విశ్వాసులమగుటయందును (I తిమో $1^{5}$ II తిమో $1^{5}$) నిష్కాపట్యము గలవారమై యుండవలెను. దీనికిబదులుగా యాకో $3^{17}$ నందు **వేషధారణ లేని** అను పదము నుపయోగించిరి. ఇచ్చట నిష్కాపట్యము పైనుండి యనుగ్రహింపఁబడెడి జ్ఞానసంబంధమగు విషయములో నొకటిగా చెప్పఁ బడెను. నతనయేలు విషయమై యితనియందు ఏ కపటములేదని క్రీస్తు చెప్పిన పదము మోసము నెఱుగని అను యర్థము నిచ్చెడు వేఱొక పదమై యున్నది (వేషధారణ చూ॥).

2. రెండవ పదము నిజమును మఱుగుపఱచు బుద్ధికి భిన్నమైనదై ప్రతిదానిని సూర్యుని కాంతి లోనికిఁదెచ్చు మంచి బుద్ధిని సూచించును. రహ స్యములన్నిఁటిని విసర్జించి నిష్కాపట్యముగా నడుచుకొంటిననియు (II కొరి $1^{12}$), దేవుని వాక్యమును చెఱుపక దానిని ఉన్న రీతిగా బోధించితిననియు ($2^{17}$) కొరింథి ఫిలిప్పయి సంఘ స్థులు నిష్కాపట్యముతో పులియని రొట్టెలపండు గను ఆచరింపవలెననియు (I కొరి $5^{8}$ ఫిలి $1^{10}$) వ్రాసినప్పుడు పౌలీపదము నుపయోగించెను. ఈ పదమునే II పేతు $3^{2}$ లో **నిర్మలము** అని తెనిఁగించిరి (నిర్మలము చూ॥).

**నిస్రోకు** (Nisroch). అష్షూరు రాజగు సన్హెరీబు ఆరాధించిన దేవత. దాని యాలయము లోనే అతఁడు తన కుమారులిద్దరిచేఁ జంపఁబడెను (II రాజు $19^{36}$ యెష $37^{38}$). అష్షూరీయుల రాతిశాసనములలోఁ గనఁబడు నుస్కు (*Nusku*) అనునది యీ దేవతయే యని కొంద ఱూహించి నను ఇదియొక సమాసపదమని సాధారణముగా ననుకొందురు. ఆ పదములో అష్షూరు అను



నిస్రోకు దేవత

పేరు గలదందురు. ఇట్లది అష్షూరు+అకు అను దాని రూపాంతరము కావచ్చును. అట్లయిన యెడల అది అష్షూరువారి చంద్రదేవత యను నర్థమియ్యవచ్చును.

## నీ

**నీకానోరు** (Nicanor = జయము). ఆది క్రైస్తవ సంఘమునందు బీదలకు ధనము పంచి

పెట్టుటకు నియమింపఁబడిన యేడుగురు పరిచారకులలో నొకఁడు (కార్య 6[5]).

**నీకానొరుపనము** పండుగలు III 4 (1) చూ॥

**నీకొదేము** (Nicodemus = ప్రజలను జయించువాఁడు). ఒక పరిసయ్యుఁడు (యోహా 3[1]). సన్హెడ్రిన్ సభికుఁడు (7[50]). భాగ్యవంతుఁడుగ కనఁబడుచున్నాఁడు (19[39]). ఇతఁడు బైబిలునందు మూఁడు సందర్భములలో నుదాహరింపఁబడెను. 1. రాత్రికాలమం దాతఁడు క్రీస్తు యొద్దకు వచ్చెను (3[1-10]). అతఁడు సత్యమును దెలిసికొనుట కాశపడినను పగటియందు వచ్చుటకు భయపడెను. యేసు అతనికిఁజేసిన లోతయిన ఉపదేశములనుబట్టి అతని హృదయ మెంతో ఆతురపడునదైనట్లు కనఁబడుచున్నది. 2. పర్ణశాలల పండుగ సమయమున పరిసయ్యులాయనను పట్టుకొన ప్రయత్నించిరి గాని భగ్నమనోరథులైరి (7[32, 43-48]). అట్టి సమయమున నీకొదేము ఆయన పక్షమున మాటలాడెను (7[51]). ఈ మాటలవలన అతఁడు యేసుకు స్నేహితుఁడైనట్లు తెలియుచున్నది. అతఁడీ మాటలను స్వయముగా చెప్పక ధర్మశాస్త్రమునుండి చెప్పుటవలనను, మహాసభలోని గొందఱతనిని గద్దింపఁగా మౌనముగా నుండుటవలన నితఁడు ఇంకను పిరికివాఁడుగా నుండెనని చూడవచ్చును. 3. యేసు శరీరమును భూస్థాపన చేయునప్పు డితఁడు ఆయన కళేబరమునకు పూయుటకు బోళముతో కలిసిన అగరును తెచ్చెను (19[39]) అతఁడిప్పటికి ధైర్యశాలియై తాను నిజమైన విశ్వాసినని బైలుపఱచుకొనెను. ఇతని పేరట నొక అప్రమాణిక సువార్త గలదు (అప్రమాణిక సువార్తలు 4 చూ॥). E.

**నీకొపొలి** (Nicopolis = జయపురము). తీతుకు పౌలు వ్రాసిన పత్రికలో నుదాహరించిన పట్టణము. పౌలు ఈ పట్టణములో శీతాకాలము గడుప నిర్ణయించుకొంటినని వ్రాసెను (తీతు 3[12]). ఈ పేరుగల పట్టణములు గ్రీసు దేశమునందు కొన్ని గలవు. ఇది కైసరాగూస్తు తన శత్రువులందఱిమీఁద తనకుఁ గలిగిన జయమునకు జ్ఞాపకార్థముగా పడమటి గ్రీసులో క్రీ॥ ము॥ 30 సం॥నఁ గట్టించినదై యుండెను. దీని ప్రాముఖ్యతనుబట్టి పశ్చిమ గ్రీసులో సువార్తను ప్రకటించుటకై పౌలు దీనిని తనకు మధ్యస్థానముగా చేసికొన నుద్దేశించినట్లు ఊహింపవచ్చును. (పటము V, E 3).

**నీకొలా** (Nicolas = ప్రజలమీఁద జయ మొందువాఁడు). ఏడుగురు పరిచారకులలో నొకఁడు (కార్య 6[5]). ఇతఁడంతియొకయ పట్టణస్థుఁడనియు గ్రీకువాఁడై యూదమత స్వీకారమొనర్చిననియు ఆ వాక్యమువలనఁ దెలియుచున్నది. ఈ వాక్యమును యూదులమత ప్రవిష్టుఁడగు అంతియొకువాఁడైన నీకొలా యని జదువుట సరి గాని తెనుఁగు బైబిలులో నున్నటుల అంతియొకు నీకొలా యనుట సరిగాదు. ఇతనిగూర్చి యింకేమియు బైబిలునందు లేదు గాని తరువాత మతభ్రష్టుఁడై ప్రక 2[6,15] లో నున్నట్లు నీకొలాయితులను వారి మతిస్థాపకుఁడయ్యెనని ఆది క్రైస్తవులలో నొక వదంతి వ్యాపించెనని ఐరేనియస్ (*Irenaeus*) అను శాస్త్రి వ్రాసెను గాని అది రూఢి యని చెప్పఁజాలము.

**నీకొలాయితులు** (Nicolaitans = నీకొలా శిష్యులు). దుర్బోధ జేసినట్లు ప్రకటన గ్రంథములో నుదాహరింపఁబడిన యొక తెగవారి పేరు. ఎఫెసీయులు వారి బోధలను ఖండించినందున మెప్పువడసిరి (ప్రక 2[6]) గాని, పెర్గెము లోని సంఘపువారు ఆ బోధల ననుసరించినవారై గద్దింపఁబడిరి (2[15]). వారి బోధ యెట్టిదో రూఢిగాఁ జెప్ప వీలులేదు. ప్రక 2[14] లో నున్న విగ్రహార్పితములకును వ్యభిచారమునకును సంబంధముగాఁ నుండుటచేత వారి బోధ లిట్లు కామాదులకు సంబంధించినదని యూహింపవచ్చును. అట్లయినయెడల క్రైస్తవులు తమ క్రియలచేగాక విశ్వాసముచేతనే రక్షింపఁబడెదరు కావున యెట్టి క్రియలఁజేసినను అవి మన నీతికి భంగము కలుగఁజేయదను తప్పుడభిప్రాయమువలన కలిగిన తప్పు బోధ యని యనుకొనఁదగును. ఇది ధర్మవిరుద్ధముగాన ఆది క్రైస్తవులలో ఖండింపవలసిన మొదటి బోధలలో నొకటియై యుండెను. క్రొత్త నిబంధనలో నీకొలాయను పేరు గలవాఁడొకఁడు మాత్రమే కనఁబడుచున్నాడు. అందువలననే కాఁబోలు ఈ తెగవారతని శిష్యులను వదంతి చాల పురాతనకాలమునుండి యున్నది. (నీకొలా చూ॥).

**నీగెరు** (Niger = నల్లని). అంతియొకయ సంఘములో నుండిన సుమెయోను మాఱుపేరు (కార్య $13^{1}$). అది లాటిన్ పదమై యున్నది (షిమ్యోను 6 చూ॥).

**నీటిగుమ్మము** యెరూషలేము B V 2 (14) చూ॥

**నీటిగుఱ్ఱము** మృగములు 36 చూ॥

**నీతి, నీతిమంతుడుగా తీర్చబడుట, నీతిమంతునిగా తీర్చుట, నీతిమంతునిగా యెంచుట, నీతిమంతుడుగా యెంచబడుట, నిర్దోషులుగా చేయబడుట** (Righteousness, Justify, Justification). నీతికి సంబంధించిన యిట్టి మాటలు బైబిలులో ననేకములు కలవు. హెబ్రూ, గ్రీకు భాషలను చూడఁగా అవి యన్నియు నొకటే పదమునకు సంబంధించినవని తెలిసికొనవచ్చును. ఆ పదము పాపులను నీతిమంతులనుగా చేయుట కాదు. ఆ మార్పుకూడ వారిలో జరుగవలసినదేగాని అది పరిశుద్ధత అను ప్రత్యేకమైన పదముచే సూచింపఁబడెను (పరిశుద్ధత చూ॥). నీతికి సంబంధించిన ఈ పైపదములన్నిఁటిని చూడఁగా, ఇవి దేవుఁడు పాపులను నీతిమంతులనుగా యెంచుట యను అర్థము నిచ్చును. ఇది దేవుఁడు మానవులను గూర్చి చేయు నొక తీర్పును లేక తీర్మానమును సూచించును గాని ఆయావారి స్వంత గుణములను సూచింపదు. దేవుఁడు నీతికి సంబంధముగా చేయు నిట్టి తీర్పునకు మొదట సాధారణ భావము తరువాత పౌలు గ్రంథములలో ముఖ్యముగా గలతీయ రోమా యుత్తరములలో దీనికిఁగల విశేష భావము అను నీ రెండు విషయములను విచారింపవలెను.

1. నీతి యను మాట సాధారణముగా వాడఁబడు రీతిని చూడఁగా, ఒకనిమీఁద నేరము మోపఁబడినను అతఁడు నేరస్థుఁడని కాదు కాని నిర్దోషియని తీర్మానముచేయుటయేయై యున్నది. ఇది యతనిని నీతిమంతునిగా తీర్చుట యనఁబడును (కీర్త $51^{4}$ రోమా $3^{4}$ I తిమొ $3^{16}$). ఈ విధముగా లోకులు దేవుని బిడ్డలమీఁద మోపునట్టి లేనిపోని నేరముల విషయములో వారు నీతిమంతులని యెంచఁబడుదురు (యోబు $23^{7}$ కీర్త $7^{8-10}$ $35^{19-24}$ $37^{6}$ $43^{1}$ $97^{11}$ మొ॥ మ $13^{43}$ I పేతు $2^{23}$). దుష్టులనుసహా వారికంటె మఱీ గొప్ప దుష్టులతో పోల్చిచూడఁగా వారు నిర్దోషులని తీర్చఁబడినట్లు కొన్ని వాక్యములలో నున్నది (యిర్మీ $3^{11}$ యెహె $16^{51,52}$ మ $12^{41,42}$). ఇట్టి బోధ లుండినను దీనికి సంబంధముగా ఇశ్రాయేలీయులు తాము గ్రహించుకొనఁజాలని గొప్ప సందేహములోఁ బడినట్లు కనఁబడుచున్నది. అష్షూరు బబులోను మొదలగు రాజ్యములవారిచే ఇశ్రాయేలీయులు చెఱపట్టఁబడినపుడు తమ్మును చెఱఁబట్టినవారికంటె తాము నీతిమంతులమని తామెఱిఁగియుండినను, అన్యులు సౌఖ్యముతో నుండఁగా తాము తమ దోషముల నిమిత్తము అధిక శిక్షను పొందుచున్నట్లు తెలిసికొనిరి. ఇదెట్లు న్యాయమని వారిలో కొందఱు ప్రశ్నించినను, మఱికొందఱు దేవుఁ డిశ్రాయేలీయులకు చేసిన వాగ్దత్తములను తప్పక నెఱవేర్చుననియు (యెష $51^{5-10}$), వెలిచూపునకు అన్యాయముగా కనఁబడు ఈ యన్యాయములను దేవుఁడు తీర్చివేసి ఇశ్రాయేలీయుల నీతిన్యాయములను బయలుపఱచుననియు నమ్మినట్లు కొన్ని వాక్యములు కనఁబడును. ఇందుకు దృష్టాంతముగా నన్ను నీతిమంతునిగా యెంచువాఁడు (దేవుఁడు) ఆసన్నుఁడై యున్నాఁడు అనియు, నామీఁద నేరస్థాపనచేయువాఁ డెవఁడు అనియు ($50^{8,9}$ రోమా $8^{31-34}$) ధైర్యముతో ఇశ్రాయేలీయు లనియున్నారు. ఇదియుఁగాక దీనిక సంబంధముగా నీతిమంతుఁడైన నా సేవకుఁడు జనుల దోషములను భరించి తనకున్న అనుభవ జ్ఞానముచేత అనేకులను నిర్దోషులుగా చేయును (యెష $53^{11}$) అను వాక్యమును చూడఁగా ఈ సేవకుఁడు (యెహోవా సేవకుడు చూ॥) అన్యాయముగా శ్రమలను పొంది వాటిని సహించుకొనుటవలన ఆయనకు సంబంధించిన యే ప్రజలైనను నీతిమంతులుగా తీర్చునను సంగతి స్పష్టమగును. ఇట్లుండఁగా ఆయా భక్తులు తమ పాపదోషమును మఱీ లోతుగా గ్రహించుకొని (యిర్మీ $17^{9}$ కీర్త $51^{5}$ $130^{3}$ $143^{2}$) నరుఁడు దేవుని దృష్టికి ఎట్లు నీతిమంతుఁడు కాఁగలఁడు (యోబు $25^{4}$) అని యడిగెదరు. ఇశ్రాయేలీయులకుండిన ఈ యనుభవము మీకా గ్రంథములో బహు

చక్కఁగా కనఁబడును. మనము నీతిమంతుల మగుటకు ఏమి చేయవలయునో మీకా $6^{6-8}$ లో తేటగా నున్నది, గాని $7^{1-6}$ చూడఁగా ఇశ్రాయేలీయులును మానవులందఱును ఆ నీతిమార్గము నెట్లు తప్పియున్నారో అదియంతయు విశద మగును. దేవుఁడు తన కృపవలన మనలను క్షమించి శుద్ధిచేయుటవలననేగాని మఱియే విధము చేతనైనను ఆ నీతిమార్గములో చేరలేమను సంగతిని $7^{18-20}$ తేటగా సూచించును. ఇశ్రాయేలీయులు యెహోవాయందే నీతిమంతులుగా ఎంచఁబడిన వారై (యెష $45^{25}$) నిత్యమైన రక్షణను పొందెదరు ($45^{17}$). అయితే ఇశ్రాయేలీయుల గుణలక్షణములనుబట్టి వారును దోషులే ($59^{7-15}$ = $64^{6,17}$). దేవుని కృపలేనిది వారుకూడ నీతిమంతులు కాలేరు ($59^{16}$) అనునదే ప్రవక్తలు దీనినిగూర్చి బోధించిన బోధలయొక్క సారమై యున్నది. ప్రవక్తల బోధమాత్రము గాక ఎజ్రా కాలము మొదలు యూదుల యాచారముల యందును ఏర్పాటులయందును చాల నిష్ఠపరులై వాటి ననుసరించిన వారి బోధల సారము నిదే. ఆచారములలో ప్రతిదానిని బహు తీక్ష్ణముగా గైకొనుటవలననే నీతి సంపాదించుకొనఁగలమని వారనుకొని ఆ యాచారములను చాల నిష్ఠతో ననుసరించిరి (గల $3^{12}$) గాని వాటివలన నెవరును నీతిని పొందఁజాలరనియు రోమా $7^{7,25}$), ఇశ్రాయేలు జనులు మొత్తముమీఁద దాని పొందలేక పోయిరనియు ($9^{30}$-$10^{3}$) స్పష్టమగును. ఇట్లు క్రియలమూలమైన నీతిమార్గము లేదను సంగతి పాఁత నిబంధనకు ఫలితార్థమని చెప్పఁదగును.

2. పౌలు వ్రాసిన పత్రికలలో నీతికి సంబంధించిన మాటలకుఁగల విశేషార్థము. పౌలు యూదుల యాచారములవలనను ఏర్పాటులవలనను నీతిమంతుఁడగుటకు చాల నిష్ఠగలవాఁడై ప్రయాసపడినను అది తనకుచేతఁగానిదని తెలిసికొనెను. ఏది యతని స్వప్రయత్నములవలన కలుగలేదో అది సిలువవేయఁబడిన క్రీస్తువలననే అతనికిఁ గలిగెను (రోమా $7^{24}$-$8^{4}$). ఇట్లతఁడు తాను నీతిమంతుఁడగుటకై తనకొఱకు మరణము పొందిన యేసుక్రీస్తును నమ్ముకొనుటయే ఆధారమని యనుభవపూర్వకముగా తెలిసికొనెను ($3^{22}$). ఇట్టి విశ్వాసమూలమైన నీతిమానవులను రక్షించుటకు దేవుఁడేర్పఱచిన అసలు ఏర్పాటై యున్నది అని అబ్రాహాము చరిత్రవలనఁ దెలియును (4). సిలువవేయఁబడిన క్రీస్తు యెష 53 లో నున్నట్లు ప్రజల యపరాధముల నిమిత్తము చనిపోయిన వాఁడై యున్నాఁడు. బాప్తిస్మమిచ్చు యోహాను (యోహా $1^{29}$) క్రీస్తును ($10^{11}$) ఈ సంగతిని సూచించిరి. అయితే పౌలు దాని మఱీ తేటగా తెలిపెను (రోమా $5^{18-21}$ దీనితో యెష $53^{11}$ సరిపోల్చి చూ॥). ఇట్లుండఁగా యూదులకు ఆటంకముగా నున్న క్రీస్తు సిలువమరణము రక్షణకు సాధనమైన మహిమగలది యాయెను (I కొరి $1^{21-23}$ గల $2^{20,21}$ $3^{13}$ $6^{14}$ II కొరి $5^{21}$). మానవులు తమ పాపముల మూలముగా పోఁగొట్టుకొనినస్థితిని క్రీస్తుమరణము మూలముగా మఱల పొందియున్నారు. ఇట్లు మనము నీతిమంతులమని తీర్చఁబడుటయు దేవునివలన సమాధాన పఱచఁబడుటయు నొకటేయై యున్నవి (రోమా $3^{23,24}$ $4^{4,5}$ $5^{6,8,21}$ $6^{23}$ హెబ్రీ $2^{9}$). ఈ నీతి క్రీస్తు తన ప్రాణమును మనకొఱకు ప్రాయశ్చిత్తముగా నిచ్చుటద్వారానే కాని మఱియే సాధనమువలనను కలుగదు (రోమా $3^{24,25}$ $4^{25}$ $5^{6,9}$ II కొరి $5^{14,18}$ తో మ $20^{28}$ $26^{28}$ హెబ్రీ $9^{12,23}$ $10^{18}$ I పేతు $2^{24}$ $3^{18}$ I యోహా $1^{7}$ $4^{10,14}$ ప్రక $1^{5}$ సరిపోల్చి చూ॥). విశ్వాసము అను నొక్కటే షరతుమీఁద ఇది మనకు ప్రాప్తించును. ఇట్టి విశ్వాసమునకు బాప్తిస్మము ముద్రయై యున్నది. ఈ రెండింటిని చూడఁగా నివి మాఱు మనస్సుతోఁ గూడినవై యున్నవి (రోమా $6^{3,4}$ గల $3^{26,27}$ రోమా $6^{2,11}$ I కొరి $6^{11}$ కార్య $20^{21}$ $22^{16}$ $26^{18}$). దేవుఁడు క్రీస్తుద్వార అందించునట్టి కృపను పాపియైనమానవుఁ డంగీకరించి ఆయనను నమ్మినయెడల అతఁడు నీతిమంతుఁడుగా తీర్చఁబడును (రోమా $4^{25}$ $5^{1}$ గల $2^{20,21}$). క్రీస్తుయేసునందలి విమోచనము ($3^{24}$) అనుమాటలు మన నీతినిమిత్తము దేవుఁడుచేసిన కార్యమును, యేసుక్రీస్తునందలి విశ్వాసము ($3^{22}$) అనుమాటలు ఆ నీతినిమిత్తము మనము చేయవలసిన కార్యమును సూచించుచున్నవి.

మనము నీతిమంతులముగా ఎంచఁబడునట్లు క్రీస్తుచేసిన ఆ గొప్పకార్యమును ఆయన మానవులకు కేవలదాతగా నుండి చేయలేదు. ఆయన

మనవంటివాఁడై, మనకు ప్రతినిధియై, మనలో నొకఁడై యీ కార్యము చేసెను (రోమా $5^{15-21}$). ఆయన పాపులతో లెక్కింపఁబడెను (యెష $53^{12}$ లూ $22^{37}$). ఆయన సిలువమరణ పర్యంతము విధేయుఁడాయెను (ఫిలి $2^{8}$). మనకు నీతికలుగుటకు ఆయనశాపమునకు లోనయ్యెను (గల $3^{14}$ II కొరి $5^{21}$). మన యపరాధముల నిమిత్తము అప్పగింపఁబడి మనకు నీతికలుగుటకు లేపఁబడెను (రోమా $4^{25}$). మన మీ వాక్యములనుబట్టి నీతిమంతులముగా తీర్చఁబడుట యనఁగా అసలులో క్రీస్తుచేసిన పనినిఁబట్టి దేవుఁడు పాపులయందు కరుణఁ జూపి వారిని శిక్షకు పాత్రులనుగా నెంచక తన బిడ్డలనుగా నెంచుటరై యున్నదని తెలిసికొనవచ్చును ($5^{18}$). అయితే ఇట్టి ఘన కార్యము ఎవరు సువార్తను నమ్మెదరో వారియందే సఫలమగునని స్పష్టమగును ($1^{17}$ $3^{22}$ $5^{1}$ $6^{11}$). ఈ స్థితిలోఁ జేరినవారికి పాపక్షమాపణయు దేవుని కుమారస్థితిని పొందుటయు కలుగును ($5^{1}$ $8^{15,16}$ II కొరి $1^{22}$ గల $4^{6}$ ఎఫె $1^{13,14}$).

ఈ విషయములో యాకోబు బోధ పౌలు బోధకు భిన్నముగా నున్నదని కొందఱు వాదింతురు (యాకో $2^{14-26}$). అయితే వారిబోధలలో పదభేదమేకాని సంగతిలో భేదములేదు. విశ్వాసమునకు తగినక్రియలు చేయనివారి విశ్వాసము వట్టిదని యాకోబు బోధించెను. పౌలు బోధయు నిదేయై యున్నది (I థెస్స $1^{3}$ II థెస్స $1^{11}$ గల $5^{6}$ రోమా 6).

**నీతిబోధలు** (Biblical Ethics). బైబిలునందు ఆదినుండి (ఆది $3^{5}$) అంతమువఱకు (ప్రక $21^{27}$) తప్పొప్పులనుగూర్చిన బోధలు బహు విశదముగా నున్నవి.

1. మోషే ధర్మశాస్త్రమునకుఁ బూర్వము నీతిచట్టము లంతతేటఁగా కనఁబడకపోయినను ఒకఁడు తప్పుచేసినయెడల అది మానవునికేగాక దేవునికిని విరుద్ధమని సూచించువాక్యములు గలవు (ఆది $20^{6}$ $39^{9}$). నరులు దుష్టులైనందున జలప్రళయముచే నాశమైరి ($6^{3}$). ఆదికాండమునందుదాహరింపఁబడినవారి చరిత్రలలో వారిగుణములే ముఖ్యవిషయములుగా నెంచఁదగియున్నవి. అబ్రాహాము కలూకారికానందునసే సమాధానము గోరెను ($13^{8,9}$). తమ అత్యధిక పాపముల నిమిత్తమై సొదొమ గొమొఱ్ఱాలు నాశమాయెను ($19^{1-29}$). యోసేపు చరిత్రవలన పాపమునుదాచుట అసాధ్యమనియు, దేవుఁడు నీతిమంతులవిషయము విచారించుననియు తెలియుచున్నది. ఇట్లు మోషే ధర్మశాస్త్రమునకు ముందును నీతిబోధలున్నవనియు, అవి దేవునిచే నియమింపఁబడెనని యనుట కెట్టి సందేహమును లేదు.

2. మోషే ధర్మశాస్త్రమునందు ఆచారములెన్నియున్నను, దానియందు నీతిబోధలే ముఖ్యవిషయమని చెప్పఁదగును. సీనాయియొద్ద చేయఁబడిన బోధలలో పదియాజ్ఞలే ముఖ్యవిషయమై యున్నది. దేవునియెడలను మానవులయెడలను జరుపవలసిన నీతివిధులందు సంక్షేపముగా నున్నవి. ఇవి యన్నియు దేవుని యేర్పాటులై యున్నవి. వాటిని లక్ష్యించెడివారియందాయన అనుకూలించునుగాని వాటిని నిర్లక్ష్యము చేయువారిని శిక్షించును.

**నీనెవె** (Nineveh). అష్షూరు రాజ్యపు ముఖ్యపట్టణము. ఆ భాషయందు వ్రాసినరాతి శాసనములలో దానికి నీనా (*Nina*) లేక నినువ (*Ninua*) అను నామాంతరములు గలవు. ఈ పట్టణము నిమ్రోదుచే కట్టింపఁబడెనని ఆది $10^{11}$ వలనఁ దెలియుచున్నది. బాబెలు రాజ్యమేలిన మిగుల పురాతన చక్రవర్తులలో హామురాబి (అమ్రాపేలు చూ॥) యనువాఁడు దానిని పెంచి,



నీనెవెవారిదేవత

దానియందున్న ఇష్టారుదేవతాలయమును తిరిగి కట్టించెను. అష్షూరు వారాదేవతను నినాయని పిలిచిరిగాన ఆ పట్టణమునకు నీనెవె యనుపేరు వచ్చినది. ప్రస్తుతము టైగ్రిసు నదీ తీరమున నున్న మోసులు (*Mosul*) కు నెదురుగా నుండి

ఆ నదియొక్క తూర్పుతీరమున నుండెను. ప్రస్తుత మా ప్రాంతమున దాదాపు ఎనిమిది మైళ్ల కైవారముగల శిథిలములున్న దిబ్బలు గలవు. యోనా వెళ్లి బోధించిన నీనెవెపట్టణము మూఁడు దినముల ప్రయాణమంత గొప్పదియని ఉదాహరింపఁబడి యున్నది. దానియందు నీనెవె మహాపురమును దాని సివారులు కలిసియుండెనని తెలిసికొని యున్నారు. ఆయా కాలములలో ఆ పట్టణము యొక్క సరిహద్దులు మాఱినందున దానికైవారమంత గొప్పదియాయెనని నమ్మఁదగును. ఈ పట్టణస్థులకు బోధింపనై యోనా పంపఁబడెను. (యోనా గ్రంథము చూ॥). నహూము ప్రవక్త దీని నాశనమును గూర్చియే బోధించెను. జెఫన్యా కూడ దీని నాశనమునుగూర్చి ప్రస్తాపించెను. II రాజు $19^{36}$ యెష $37^{37}$ నందున్నట్లు సన్హెరీబు చరిత్ర వివరములో నీపట్టణ ముదాహరింపఁబడెను. క్రొత్త నిబంధనలో పశ్చాత్తాపపడని వారికన్న నీనెవె పట్టణస్థులే శ్రేష్ఠులని దెలుపుటకు వారిని గూర్చిన దృష్టాంత మెత్తఁబడెను (మ $12^{41}$ లూ $11^{30,32}$). శిథిల పరిశోధకులు నీనెవెలోను దాని చుట్టునున్న ప్రాంతములలోను దిబ్బలను త్రవ్వించి అనేకశాసనములను కనుగొని అష్షూరురాజ్యపు సంగతులను దెలిసికొనిరి (అష్షూరు చూ॥).

**నీరో** (Nero). క్రీ॥ శ॥ 54 సం॥ మొదలు 68 సం॥ వఱకును రోమారాజ్యమేలిన చక్రవర్తి. ఇతని తల్లియైన అగ్రిప్పిన (*Agrippina*) తన భర్తయగు క్లాదియసు చక్రవర్తికి విషముపెట్టి చంపి 17 సం॥ వయస్సుగల తనకుమారుని సింహాసన మెక్కించెను. ఇతనిపేరు క్రొత్త నిబంధనయం దెక్కడను కనఁబడదుగాని కైసరను ఉద్యోగ బిరుదువలన మాత్రము ప్రశంస యాయెను. పౌలు కాలమందితఁడు చక్రవర్తియై యుండెను గనుక కార్య $25^{11}$ నందు పౌలు ప్రశంసించినవాఁడితఁడే యని స్పష్టమగును. అక్కడమాత్రముగాక ఫిలి $1^{12,13}$ $4^{22}$ నం దితఁడు కైసరను పదముచే సూచింపఁబడెను. పౌలు మొదటి పర్యాయము రోమాపురియందు ఖైదుచేసినతరువాత ఇతనివలన విచారించఁబడి విడుదలనొంది రెండవసారిపట్టఁబడి విమర్శించఁబడిన తరువాత ఇతనివలననే మరణతీర్పు నొందెననుట కాస్పదమున్నది.

యౌవనప్రాయమం దితఁడు గుణవంతుఁడుగాను నిర్నిందుఁడుగాను ప్రవర్తించుచు కొంత కాలమువఱకు న్యాయపరిపాలన చేయుచు సర్వ కార్యములయందు సాధువుగానుండి దయారస మగుపఱచుటవలన అందఱివలన నుతించఁబడినవాఁడై రాజ్యవ్యవహారము బహు గణనీయముగాను వంద్యముగాను నిర్వహించి జనులచే శ్లాఘనీయుఁడాయెను. ఆ కాలమందు పూజ్యులగు సెనక (*Seneca*) యను తత్త్వజ్ఞానియు సేనాధిపతియగు బరస్సును (*Burrus*) ఇతనికి విద్య నేర్పి తమ కాపుదలలో నుంచినందున అతఁడు సత్ప్రవర్తనుఁడాయెను. అయినను 58 సం॥ మం దితఁడు తరువాత రాజ్యమునకు వచ్చిన ఓథో (*Olho*) యను చక్రవర్తి పత్నియైన పొప్పియతో దుస్సాంగత్యము చేయుటవలన మొదటగుపఱచిన సద్గుణ లక్షణములను వదలి క్రమక్రమముగా గుణభ్రష్టుఁడాయెను. ఈమె యూదమత ప్రవేశస్థురాలైనందువలన చక్రవర్తియైన నీరో మొదట క్రైస్తవమతమును విరోధించక దానిని గుఱించి అభేదమనస్సుగలవాఁడై యుండెనని కొందఱి యభిప్రాయముగాని క్రీ॥ శ॥ 64 సం॥ మందు రోమాపురిలోని యెక్కువభాగము దగ్ధమైన తరువాత ఇతఁడు క్రైస్తవులయెడలనున్న తన గుణమును మార్చుకొనెను. ఈ ప్రమాదమునకు చక్రవర్తియే కారకుఁడని జనవాడుక ఏర్పడెను గనుక తనమీఁదకు వచ్చిన నిందను తొలగించుకొనుటకై క్రైస్తవులమీఁద ఆ దోషారోపణచేసి వారిని జనరౌద్రమునకు పాత్రులనుగాఁ జేసెను. ఇతఁడు పట్టణమును తగలఁబెట్టెననుటకు చాలినంత ఆస్పదము లేకపోయినను ఆ కార్యము విషయమై జనులు చక్రవర్తిమీఁద అనుమానపడుటకు వీలులుండెను.

ఇతఁడు సింహాసన మెక్కినప్పుడు పట్టణములో నెక్కువ భాగము శిథిలమై యుండుటను బట్టియు అనారోగ్యమైనదియై యుండుటను బట్టియు నీరో ఆయా భాగములలోని కట్టడములను పడఁగొట్టి నూతనముగా కట్టుచు వచ్చెను. ఇది తమ క్షేమార్థమైనదని జనులు గ్రహించక అందును గుఱించి సణుగుచువచ్చిరి. ఇంతియ గాక నీరో అనేక పర్యాయములు రోమాపురి

కట్టఁబడిన వైఖరివిషయమై తృప్తిచెందక దానిని శృంగారముగా కట్టనుద్దేశించిన ట్లగుపడుచుట వలనను ఇటుకపెళ్లలతో కట్టఁబడిన కట్టడములకు ప్రతిగా తాను చలువరాతి భవనములను కట్టుదు నని తన యభిప్రాయమగుపడుచుటవలనను జనులు తమ పట్టణము కాలినపుడు అతనిమీఁద అనుమాన పడుటకు కారణము లేకపోలేదు. పట్టణము రగులుకొనుచున్నప్పుడు నీరో తన నగరిమీఁది కెక్కి తన జనులయొక్క దుస్థితిని పాటించక అదియొక వింత యని వేడుకగాఁ జూచెను. పట్ట ణము రగులుకొని తొమ్మిది దినములవఱకును కాలి మంట ఆరిపోయెను గాని కొన్నాళ్లైన తరువాత నీరో చక్రవర్తియొక్క ముఖ్య బంటగు తిగల్లీనసు (*Tigellinus*) తోఁటలోనే తిరిగి రగులుకొనుచు రాఁగా చక్రవర్తి మొదట పట్టణమును తగలఁ బెట్టకపోయినను పట్టణమును సమూల నాశనము చేయుటకై మరల తగలబెట్టుట నిశ్చయమని జనులు తలంచుకొనిరి.

రోమా పట్టణస్థులు తమ పురమునకు కలిగిన నష్టమునుబట్టి క్రైస్తవుల యెడల నుత్కృష్టమైన క్రూరత్వమగు పడుచివారిని అఘోరచిత్ర హింసల పాలుజేసిరి. వారి దుష్కార్యమునకు చక్రవర్తి సహాయుపడి తన యుద్యానవనమందు వేడుక జరు గుట కుత్తరువిచ్చి ఆ రాత్రి యా వినోదములను చూడవచ్చిన జనులకు జ్యోతులుగా నుండునట్లు క్రైస్తవులను పట్టుకొని నిలువఁబెట్టి వారికి మృగ చర్మములను చుట్టి వాటిపైన నూనెపోసి నిప్పం టించఁగా వారు దివిటీలనుబోలి ప్రకాశించు చుండిరి. ఆ సమయమందు రోమాపురి క్రైస్తవు లనేకులు హతమైరిగాని చాలామట్టుకా హింస రాజ్యమందంతట జరుగక బహుశః ప్రధానపట్టణ మైన రోమాపురిలోనే జరిగి ఆగిపోయెను. ఇతఁ డప్పటినుండి మరణాంతము దనుక దుర్మార్గమం దత్యాసగలవాఁడై సకల దుర్మార్గములయందును ప్రసిద్ధికెక్కిన పంచమహాపాతకుఁడుగా నుండెను. లోకచరిత్రమం దెక్కడను ఇతనికి సాటియైన దుర్మార్గు నెవ్వరిని యేకాలమునను కానము. ఇతఁడు కటికవాఁడు గొఱ్ఱెలను వధించినచందం బున అరిషడ్వర్గవశుఁడై తన్నుకన్నతల్లిని తన్నెక్కు వగా ప్రేమించిన తన భార్యలను తన ప్రాణ సమానులైన మిత్రులను దరిద్రులను ధనవంతులను ఎదురుమాటాడనీక హతముచేసిన క్రూరకర్ముఁడనక విధిలేదు. కడకు ప్రజలితని దుర్మార్గమునకు సహింపలేక క్రీ॥ శ॥ 68 సం॥ మం దితఁడు గ్రీసు దేశమునకు పోయి యుండిన సమయమున సైని కులు మంత్రులు ముఖ్యులు మొదలగువారంద ఱును కలిసి నీరోకు విరోధముగా కుట్రచేసి అతనికి ప్రతిగా స్పెయిను దేశాధిపతిని సింహాసన మెక్కించి యితనికి ఛత్రభంగముఁ గలుగఁజేసిరి. నీరో తనదేశముచేరి సమాచారమును తెలిసికొనఁ గానే రోమాపురి సమీపముననుండిన నొక స్నేహి తుని యిల్లుచేరి ప్రాణత్యాగము చేసికొనెను. అతఁడు చనిపోయినపిమ్మట తిరిగి బ్రతికెనను వదంతి రాజ్యమునకు తూర్పుభాగమునపుట్టి వ్యాపించి యుండినట్లు లౌకికచరిత్రవలనఁ దెలియుచున్నది. ప్రక $13^{12}$ నందున్నట్లు చావుదెబ్బ తగిలి బాగు పడియున్న మృగమును గూర్చినదే ఈ వదంతికి ఒక సూచనయని యెంచెదరు. అదేరీతిగా $13^{18}$ లో నున్న 666 అను సంఖ్యయు ఇతని గూర్చిన సూచనయని కొందఱి యభిప్రాయము. గ్రీకువారు అంకెలు వేఱుగా వ్రాయక వాటిని సూచించుటకు అక్షరములు వాడిరి. నీరో కెసారు (*Nero Kesar*) అను అక్షరముల మొత్తము వారిలెక్కచొప్పున 666 అగును. ఈ మొదలగు సూచనలవలన నీరో క్రీస్తువిరోధికి ముంగుఱుతని ప్రకటనగ్రంథపు ఉద్దేశమని కొందఱెంచు చున్నారు. **M.**

నీలము రంగులు 3 చూ॥

నీలరత్నము రత్నములు 6 చూ॥

**నీళ్లు** (Water). షేము సంతానీకులుండు ప్రాంతములలో నీటియొద్దడి విశేషముగా నుండు నది గాన తక్కిన జాతులకన్న వారు దాని నెక్కువగా నెంచిరి. వారి మొదటి నివాసస్థాన మగు అరేబియా యెడారియందు ఇక్కడ అక్కడ ఉబుకు బహు కొద్ది ఊఁటలలో మాత్రమే వారికి నీరు దొరికెను. ఈ యెడారికి సమీపమున నుండు కనాను మొదలగు దేశములలో వర్షము లుండినను వారికి చాలినంత నీరు దొరకనందున దానిగూర్చి నిరంతరము దిగులుతో నుండెడివారు. ఈ కారణములచే బైబిలుసందు నీళ్లు తక్కినద్రావి

కన్న నెక్కుడుగ ప్రశంసింపఁబడిన దన్నయెడల ఆశ్చర్యములేదు. జీవనమున కాధారమగువాటిలో నిదియొకటి యని దలంచినట్లు యెష $3^{1}$ $33^{16}$ సైరాక్సు $29^{21}$ $39^{26}$ వలన స్పష్టమగుచున్నది. నీటిని కనుగొనుట గొప్ప విషయముగ నెంచిరి (ఆది $16^{7}$ $21^{19}$ $26^{19,32}$ నిర్గ $15^{22}$ $17^{2}$ సంఖ్యా $21^{5}$ $33^{14}$). ఏదైన బావిని కనుగొన్నయెడల దానిపై కీర్తనలు చేసిరి ($21^{16-18}$). ఊటలు కనఁబడని యెడలను విదేశములగుండ ప్రయాణము చేయునప్పుడును నీటిని కొనవలసియుండెను (ద్వితీ $2^{6,28}$). నీటియెద్దడి కలుగుట జనాంగముకు కలుగు గొప్ప విపత్తులలో నొకటిగాను, దేవుని శిక్షలలో నొకటిగాను ఎంచిరి (లేవీ $26^{19}$ ద్వితీ $28^{23}$ I రాజు $17^{1}$ యెష $5^{6}$ ఆమో $4^{7}$). నీటి ప్రవాహములు వృద్ధియగుట మెస్సీయ రాజ్యమున కలుగు మేళ్లలో నొకటియని ప్రవక్తలుద్ఘోషించిరి



నీటినితోడు సాధనము (ఐగుప్తు)

(యెష $30^{25}$ $35^{6}$ $41^{19}$ $49^{10}$ యిర్మీ $31^{9}$ జెక $14^{8}$ యోహె $4^{7}$). నీటి అవసరమునుబట్టియు, అంతఁగా దొరకమినిబట్టియు దానిని అన్ని విధములగు మేళ్లకు సూచనగా నెంచిరి. మంచి కబురు (సామె $25^{25}$), జ్ఞానము (సైరాక్సు $15^{3}$), భార్య (పర $4^{15}$), ముఖ్యముగా దేవుని కృప (కీర్త $23^{2}$ యెష $32^{2}$ $55^{1}$ $58^{11}$ యోహా $7^{38}$ ప్రక $7^{17}$ $21^{6}$ $22^{1,17}$) నీటికి పోల్చఁబడెను.

హెబ్రీయులు మొదటినుండియు తక్కిన షేము సంతానీకులవలెనే నీటికి సంబంధించిన ప్రతిదానిని దేవునియొక్క గొప్ప వరముగా నెంచిరి. తరువాతి కాలములలో ఊటలుగల స్థలములు పూజాస్థలములయ్యెను. వారికి నీటివసతి కలిగించుట దేవునియొక్క పనులలో నొకటిగా అక్కడక్కడ ఉదాహరింపఁబడినది (నిర్గ $15^{25}$ $17^{6}$ సంఖ్యా $20^{8}$ $21^{16}$ ద్వితీ $8^{15}$). చివరి ప్రవక్తలలో నొకఁడగు యిర్మీయా కూడ దేవునికిని వ్యర్థదేవతలకును గల భేదమునుగూర్చి చెప్పినప్పుడు వాటికి వర్షము కురిపింపఁగల శక్తిలేదనెను (యిర్మీ $14^{22}$).

శుద్ధిచేయుటకు నీటినివాడిన ట్లనేక సూచనలున్నవి (ఆది $24^{32}$ $43^{24}$ నిర్గ $30^{18-21}$ $40^{7,30-32}$ లేవీ $11^{32}$ $14^{8}$ $15^{5,13}$ $16^{4,24,28}$ సంఖ్యా $19^{17}$ లూ $7^{44}$ యోహా $13^{4,5}$). ఆత్మకు పట్టిన పాపము నుండి పరిశుద్ధిచేయుటకును నీరు ఒక సూచనయై యున్నది (యెహె $16^{4,9}$ $36^{25}$ యోహా $3^{5}$ ఎఫె

5[26] హెబ్రీ 10[22] I యోహా 5[6,8]). అట్లు అది బాప్తిస్మమునందును వాడఁబడుచున్నది.

నీసాను కాలమానము VI 1 చూ॥

# ను

నుంఫా (Nymphas). కొన్ని పురాతన ప్రతులలో నీ పేరు మహతుమ్రూపముగాను మఱి కొన్నిఁటియందు మహతిరూపముగా నుదాహరింపఁబడుటవలన నిది పురుషునికి చెందునో స్త్రీకి చెందునో నిశ్చయింప కష్టసాధ్యము. పెక్కండ్రు పండితోత్తము లీ పేరుచే లవొదికయలోని యొక భక్తుఁడు సూచింపఁబడునని తలంతురు. లవొదికయ క్రైస్తవు లితని యింటిలోనే యారాధనకు కూడుకొనుచుండిరని కొలొ 4[15] వలనఁ దెలియుచున్నది. M.

నుసుసు నొసలు చూ॥

# నూ

నూతన జన్మము పునర్జన్మము, మాఱుమనస్సు చూ॥

నూన్ (Nun = ] అను అక్షరము). హెబ్రీ యక్షరములలో 14 వ యక్షరము. అక్షరమాలికా కీర్తనయైన 119 వ కీర్తనలో 14 వ భాగములోని ప్రతిపంక్తికి ఈ యక్షరము మొదటిదిగా నుండుటచే దానికి నూన్ అను పేరు కలదు.

నూను (Nun = చేఁప). యెహోషువ తండ్రి పేరు (నిర్గ 33[11] సంఖ్యా 11[28] యెహో 1[1] మొ॥).

నూనె ఒలీవచెట్టు, రోగములు చికిత్సలు IV 1 (6), తలనంటుట చూ॥

నూర్చుట వ్యవసాయము 7 చూ॥

# నె

నెకో ఫరో 7 చూ॥

నెకోదా (Nekoda = ప్రసిద్ధికెక్కినవా?).

1. నెతినీయులలో నొక తెగవారి పూర్వికుఁడు (ఎజ్రా 2[48] నెహె 7[50]).

2 చెఱనుండి వచ్చినవారిలో నొక తెగవారు. వీరు తమ వంశావళిని చూపింపలేనివారిలో చేరియుండిరి (ఎజ్రా 2[60] నెహె 7[62]).

నెజీయహు (Neziah = శుద్ధియగు). నెతీనీయులలో నొక వంశపువారికి పెద్ద (ఎజ్రా 2[54] నెహె 7[56]).

నెటోపా, నెటోపాతీయులు (Netophah = బొట్లు బొట్లుగా పడుట). యూదాలో నున్న ఒక యూరు. దీనిని బేత్లెహేము అనాతోతు అను నూళ్లమధ్య పెట్టుటచేత అది ఆ యూళ్ల ప్రాంతములో నున్నదని యూహింపఁదగును (ఎజ్రా 2[22] నెహె 7[26]). చెఱనుండి జెరుబ్బాబెలు కాలములో తిరిగి వచ్చినవారిలో కొందఱు ఈ యూరిని తిరిగి కట్టియచట బసచేసిరి. ఈ యూరివారగుటచేతనే దావీదు యోధులలో నిద్దఱు నెటోపాతీయులనఁబడిరి (II సమూ 23[28,29] I దిన 11[30]). చెఱ కాలమునకు పూర్వము కాలేబు సంతతివారు అచటఁ గాపురముండిరి (I దిన 2[54]). బేత్లెహేమునకు ఈశాన్యముగా క్రోసెడు దూరములోనున్న కుర్బెట్ ఉం-టోబా (*Kharbet-um-Toba*), బేత్లెహేమునకు పడమరగా అఱు క్రోసుల దూరములోనున్న బైట్-నెట్టీఫు (*Beit-Nettif*) అను నీ రెండింటిలో నేదో యొకటి దీని యునికియైయుండవచ్చును (పటము II, F 1).

నెతనేలు (Nethanel = దేవుఁడు అనుగ్రహించెను).

1. ఇశ్శాఖారు గోత్రికులలో నొక పెద్ద (సంఖ్యా 1[8] 2[5] మొ॥).

2. దావీదు అన్నలలో నొకఁడు. ఇతఁడు ఇష్షయికి నాలుగవ పుత్త్రుఁడు (I దిన 2[14]).

3. దావీదు కాలమున మందసమును తెచ్చినప్పుడు బూరల నూదినవారిలో నొక యాజకుఁడు (I దిన 15[24]).

4. ఒక లేవీయుఁడు (I దిన 24[6]).

5. ఓబేదెదోము కుమారులలో నొకఁడు (I దిన 26[4]).

6. యెహోషాపాతు కాలములో ప్రజలకు బోధించిన యూదా ప్రధానులలో నొకఁడు (II దిన 17[7]).

7. యోషీయా కాలమందలి లేవీయులలో నొకఁడు (II దిన 35[9]).

8. పషూరు వంశీయులలో నొకఁడు (ఎజ్రా 10[22]). ఇతఁడు అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టినవారిలో నుండెను.

9. యాజకులలో నింకొకఁడు (నెహె 12[21]).

10. ఎజ్రా కాలములో వాద్యములను వాయించు యాజకుల కుమారులలో నొకఁడు (నెహె 12[36]).

నెతన్మెలకు (Nathan—Melech = రాజు లేక మొలెకుదేవత ఇచ్చెను). రాజైన యోషీయా కాలములో నుండిన యుద్యోగస్థులలో నొకఁడు. దేవాలయ యావరణములో నితని పేరట నొక గది యుండెను. అందులో సూర్యునికి ప్రతిష్ఠింపఁ బడిన గుఱ్ఱము లుండెను. ఆ విగ్రహములను యోషీయా తీసివేయించెను (II రాజు 23[11]).

నెతన్యా (Nethaniah = యెహోవా యనుగ్రహించెను).

1. ఆసాపు కుమారులలో నొకఁడు. ఇతఁడు గాయకులలో ఐదవవంతు వారికి పెద్దయై యుండెను (I దిన 25[2,12]).

2. యూదయ యూళ్లలో బోధించుటకు రాజైన యెహోషాపాతు పంపించిన వారిలో నొకఁడు (II దిన 17[8]).

3. యెహూదియొక్క తండ్రి (యిర్మీ 36[14]).

4. గెదల్యాను కుట్రజేసి చంపిన ఇష్మాయేలు యొక్క తండ్రి (II రాజు 25[23-25]).

నెతాయీము (Netaim = నారు మొక్కలు). యూదయదేశములో షెఫేలా యను ప్రదేశములో నున్న యొక స్థలము (I దిన 4[23,24]). ఈ వచనములలో నిది గెదేరాతో కూడ నుదాహరింపఁబడి యున్నందున దానికి సమీపముననుండి యుండవచ్చును. (గెదేరా చూ॥).

నెతీనీయులు (Nethinim = అర్పింపఁ బడినవారు) ఆలయమునకు సంబంధముగా వెట్టి పనులు చాల యుండెను. ఈ నెతీనీయులు ఆరంభమున నిటువంటి వెట్టిపనులను చేయువారై యుండిరి. ఈ పేరు ఎజ్రా నెహెమ్యా దినవృత్తాంతములు అను గ్రంథములలో తప్ప మఱియెచటనైనను లేదు ఇతర గ్రంథములలో నెతీనీయులు అను పేరు లేకపోయినను గిబోనీయులను వారికికూడ చాలమట్టున కదేపనియుండినట్లు యెహో 9[23] వలనఁ దెలియును. సంఖ్యా 31[47] చూడఁగా మోషేకాలములో మిద్యానీయులు లేవీయులకు నిట్టి సేవచేయుచుండిరని తెలిసికొనవచ్చును. అయితే దావీదుకాలము మొదలుకొని ఆలయసేవకు సంబంధముగా నిటువంటి వెట్టివారిని క్రమమైన యుద్యోగముగా నేర్పఱచినట్లున్నది (ఎజ్రా 8[20]). వారి స్థితిగతులు క్రమేణ మాఱిపోయి మూఁడువిధములుగా నాయెను.

1. వారు మొట్టమొదట యుద్ధములో చెఱఁ పట్టఁబడిన దాసులై యుండిరి. గ్రీకువారును తురకవారును ఈ విధముగా ఆలయమునకు సంబంధించిన యిట్టి నీచమైన పనులను చేయుటకు బానిసెల నుంచెడివారు (ఎజ్రా 2[55,58] నెహె 7[57,60] 11[3]). వీరిలో ఆలయమును కట్టిన సేవకుల వంశస్థులు చేరియున్నట్లున్నది (I రాజు 9[19-21]). చెఱకాలమువఱకు ఈ విధముగా అన్యులగు బానిసెలను ఆలయమునొద్ద వెట్టివారినిగా నుంచిరి (యెహె 44[6,7]). చెఱకుఁ బూర్వమున వారి స్థితి బానిసెల స్థితికంటె ఘనమైనదికాదు.

2. చెఱకాలములో వీరిస్థితి మాఱిపోయెను. ఆలయము పాడుచేయఁబడినపిమ్మట ప్రజలు దాని యందుంచిన యభిమానమునుబట్టి అందులోని ప్రతిదానిని (అందలి వెట్టిపనివారిని సహా) ఘనముగా నెంచినట్లు కనఁబడును. అయితే అందఱును మొత్తముమీఁద చెఱపట్టఁబడినపుడు యూదులు యజమానులు, నెతీనీయులు దాసులు అను భేదము పోయెను. ఏమనిన వారి వెలుపలి స్థితినిఁబట్టి అందఱును సమానులుగానే యుండిరి. ఈ విధముగా చెఱపట్టఁబడిన యూదులలో ఈ నెతేనీయు లొక ప్రత్యేకమైన తెగగా నెంచఁబడిరి. నెతీనీయులును సొలొమోను సేవకుల వంశస్థులును గలసి 392 మంది జెరుబ్బాబెలుతో కూడ తిరిగి యెరూషలేమునకు వెళ్లిరి (ఎజ్రా 2[43-58] నెహె 7[46-56,73]). ఎజ్రావెంట ఇంక 220 మంది వెళ్లిరి (ఎజ్రా 8[20]). వారికి కొన్ని

విశేష హక్కులుండెను. లేవీయులు పన్ను చెల్లింప బద్ధులు కానట్లు వీరును బద్ధులుకాకుండిరి (7[24]). ఓఫెలు అను స్థలము వారి ప్రత్యేక నివాసస్థానమయ్యెను (నెహె 3[26]). వారిపైన ఇద్దఱు ప్రధానులుండిరి (11[21]). లేవీయులవలె వారిలో కొందఱుమాత్రము యెరూషలేములో నివసించుచుండిరి. తక్కినవారు ఊళ్లలో కాపురముండిరి (ఎజ్రా 2[70] నెహె 7[73] I దిన 9[2]). వారు అన్యులుగా నెంచఁబడక ఇశ్రాయేలీయుల పిల్లలనేగాని అన్యులపిల్లలను వివాహముచేసికొనమని ప్రమాణముచేసిరి (నెహె 10[28-30]). ఈ సూచనలన్నిఁటిని చూడఁగా ఈ నెతీనీయులు అన్యులుగా నెంచఁబడక ఇశ్రాయేలీయులతో హక్కుదారులుగా చెఱకాలములోను చెఱకాలమునకు పిమ్మటను ఎంచఁబడిరని తెలిసికొనవచ్చును.

3. చెఱకాలమునకుఁ బిమ్మట నెతీనీయులు మఱీ ఘనులుగా నెంచఁబడి లేవీయులకు సమానులైరి. I దిన 23[27,28] చూడఁగా గుడిసేవచేయువారందఱు లేవీయులలో చేరియున్నట్లు స్పష్టమగును. ఎస్డ్రాసు అను అప్రమాణిక గ్రంథము చూడఁగా లేవీయులును (ఎస్డ్రాసు 1[3]) నెతీనీయులును (8[48] = ఆలయదాసులు) ఆలయ సేవచేయువారని యేకరీతిగా పిలువఁబడిరి. వారు లేవీయులలో చేరుటచేతనే తరువాత ప్రత్యేకమైన తెగగా నెంచఁబడి యుండలేదు.

**నెత్తి** (The Crown of the head). దీని సాధారణయర్థ మందఱికిని స్పష్టమైనదే గాన ఈ పదముయొక్క అలంకార ప్రయోగములమాత్రమిచ్చట వివరింపఁబడును.

దుర్మార్గులు తమ నెత్తిమీఁదికి కీడు రప్పించుకొందురు (కీర్త 7[16]). అది సైరాక్సు 27[25] లో నున్నట్లు పైకి రాళ్లువేయువాఁడు తన తలమీఁదకు వాటిని రువ్వుకొనుచున్నాఁడనుదానికి సంబంధముగా నున్నది. పాపముజేసినవాఁడు తనకేహాని జేసికొనుచున్నాఁడని దానికర్థము. నడినెత్తిని వ్యాధి కలిగియుండుట గొప్ప వ్యాధిని సూచించును (యెష 1[5]). చేతులు నెత్తిమీఁదబెట్టుకొనుట (యిర్మీ 2[37]) హిందువులలో నున్నట్లు దుఃఖమునకు సూచనగా నున్నది (II సమూ 13[19]).

తలమీఁద ధూళిపోసికొనుటయు దుఃఖమును సూచించును (I సమూ 4[12]). బీదలనోటిలో మన్నువేయుట అని ఆమో 2[7] లో నున్న జాతీయము హెబ్రీభాషలో వారినెత్తిమీఁద మన్ను వేయుటయని యున్నది. బీదలను బాధపఱచి దుఃఖము కలిగించుటను అది సూచించును.

**నెదబ్యా** (Nedabiah = యెహోవా కార్యము సిద్ధించెను). యూదారాజైన యెకొన్యా కొడుకులలో నొకఁడు (I దిన 3[18]).

**నెపూసీము** నాపీషు చూ॥

**నెపెగు** (Nepheg = చిగురు).

1. అహరోను సంతతివారిలో నొకఁడు. ఇతఁడు ఇస్హారు కోరహుల తోఁబుట్టువు (నిర్గ 6[21]).

2. యెరూషలేమునందు దావీదుకు పుట్టిన కుమారులలో నొకఁడు (II సమూ 5[15] I దిన 14[6]).

**నెఫీలీయులు** (Nephilim). ఈ పదము సంఖ్యా 13[33] నందు అనాకు వంశస్థులగు దీర్ఘదేహులను సూచించును. ఇచ్చటమాత్రమే గాక ఆ పదము ఆది 6[4] లోను గలదు. అచ్చటకూడ అది రాక్షసులవంటి దీర్ఘదేహులను సూచించునని అనుకొనఁదగును. వీరు పూర్వకాలమునందు పేరుపొందిన శూరులేగాని వారినిగుఱించి మఱేమియు తెలియదు.

**నెఫ్తోయ** (Nephtoah = ఒక సందు). ఒక నీళ్లయూఁటపేరు (యెహో 15[9] 18[15]). ఆ యూఁట యూదా బెన్యామీనీయుల సరిహద్దులో నుండెను. యెరూషలేమునకు వాయువ్యముగా క్రోసెడుదూరములో నున్న లిఫ్త (*Lifta*) అను నదియని కొందఱును, బేత్లెహేమునకు నైరృతిదిక్కున క్రోసెడుదూరములో నున్న ఏటం (*Alam*) అను యూఁటయని కొందఱును అభిప్రాయపడుచున్నారు. (పటము II, E 1).

**నెబల్లాటు** (Neballat). చెఱకాలమునకుఁ బిమ్మట బెన్యామీనీయులు కాపురమున్న ఒక యూరు (నెహె 11[34]). లుద్దకు ఈశాన్యముగా రెండుక్రోసుల దూరములో నున్న బైట్-నెబాల (*Beit - Nebala*) యనునది దీని యునికియై యున్నది. (పటము III, D 5).

**నెబాతు** (Nebat = చూపు). ఇశ్రాయేలీయుల రాజైన మొదటి యరొబాము తండ్రి (I రాజు $11^{26}$). రెండవ యరొబాము అను రాజునుండి యితనిని వేఱుపఱచుటకు ఇతఁడు సాధారణముగా నెబాతు కుమారుఁడగు యరొబాము అనఁబడును ($12^{2,15}$ మొ॥).

**నెబాయోతు** (Nebaioth = ఉన్నత స్థలములు). ఇష్మాయేలు కుమారులలో నొకఁడు (ఆది $25^{13}$ $28^{9}$ $36^{3}$ I దిన $1^{29}$). ఇతని సంతతి అరబ్బీదేశపు టుత్తరభాగమందలి గోత్రమై యుండెను. వారికి మందలు విస్తారముగా నుండినట్లు యెష $60^{7}$ లో సూచనకలదు. మఱియు ఆ వాక్యమును చూడఁగా అది కేదారుకు సంబంధించియున్నట్లు అనుకొనఁదగును. అష్షూరు చక్రవర్తియగు అష్షుర్బనిపాల్ (*Asshur-Bani-pal* క్రీ॥ శ॥ 668-626) యొక్క రాతిశాసనములమీఁద ఈ పేరు కనఁబడును. రోమనువారి చరిత్రలో నబటీయనులకు (*Nabataeans*) సంబంధించినట్లు అనేక సూచనలున్నవి. వీరును నెబాయోతువారును ఒకటే యని కొందఱు కొందరు గాని వీరు అరబ్బీయులై యుండినను నెబాయోతువారికి వేఱైనవారని నవీనపండితులలో నెక్కువమంది అభిప్రాయపడుచున్నారు.

**నెబుకద్నెజరు, నెబుకద్రెజరు** (Nebuchadnezzar, Nebuchadrezzar,) కల్దీయ భాషలో ఇది (నెబు - కుదురు - ఉసుర్ *Nabu-Kudur-Uurs* = హద్దులు కాపాడు నెబో). ఇతఁడు నవీన బబులోనుకు చక్రవర్తియై యుండెను (క్రీ॥ శ॥ ముందు 604-561). ఈ రాజవంశమునకు ఇతని తండ్రియైన నబోపొలస్సారు (*Nabopolassar*) స్థాపకుఁడయ్యెను. అతఁడు తన తండ్రి యింకను చక్రవర్తియై యుండఁగా కర్కెమిషులో ఫరో నెకోను ఓడించి (యిర్మీ $46^{2}$) సిరియా పలెస్తీను నంతటిని స్వాధీనము చేసికొనెను. ఇతఁడీ దండయాత్రలో దాని $1^{1,2}$ లో నున్నట్లు యెరూషలేమును మొదటి పర్యాయము ముట్టడించినట్లున్నది (II రాజు $24^{1}$) గాని ఈ కార్యము చేయుచుండఁగా తన తండ్రియొక్క మరణ వార్తవిని బబులోనుకు తిరిగి వెళ్లి చక్రవర్తి యాయెను. అతఁడు చాల యుద్ధములను చేసియుండినను ఇటుక శాసనములను చూడఁగా యుద్ధములను గూర్చి కాక, ఆయా స్థలములలో ఆలయములను కట్టుటను గూర్చియు చెల్లించిన మ్రొక్కుబడులనుగూర్చియు ముఖ్యముగా వ్రాయించెను. ఇతఁడు యెరూషలేమును నాశనముచేసి యూదావారిని చెఱఁబట్టిన సంగతి పాఁత నిబంధనలో నేగాని యిట్టి శాసనములలో వ్రాయఁబడలేదు (II రాజు 24,25, యిర్మీ 52). యెరూషలేమును ముట్టడివేసిన సమయమున ఐగుప్తురాజగు ఫరోహొఫ్రానుకూడ ఓడించెను (యిర్మీ $37^{5-8}$). యెరూషలేమును పట్టుకొనిన పిమ్మట 13 సం॥ ల వఱకు తూరును ముట్టడించెను (585-572) గాని దానిని జయింపఁజాలక పోయెను. అతఁడు 567 సం॥ లో మఱియొకసారి ఐగుప్తులో యుద్ధము చేసినట్లు రాతి శాసనములవలన కనఁబడును. ఇట్లతఁడు 43 సం॥ లు ఏలిన తరువాత చనిపోయెను. అతనికిఁ బిమ్మట అతని కుమారుఁడగు ఎవిల్మెరోదకు రాజ్యమునకు వచ్చెను. నెబుకద్నెజరు బబులోను దేశపు నవీన చక్రవర్తు లందఱిలో గొప్పవాఁడై యుండెను. ఇతఁడు బబులోను పట్టణమును ప్రసిద్ధమైనదిగా చేసెను (బబులోను 3 యెహోయాకీము, యెహోయాకీను, సిద్కియా, గెదల్యా, యెరూషలేము చూ॥). దానియేలు 4 లో నున్నట్లుగా అతనికి కలిగిన పిచ్చి విషయమై రోగములు II 6 (3) చూ॥

**నెబూజరదాను** (Nebuzaradan = కల్దీయ భాషలో నెబు - జరా - యిద్దీన *Nabu-Zera-iddin* = నెబో సంతాన మనుగ్రహించెను). యెరూషలేము నెబుకద్నెజరుచే పట్టుకొనఁబడుచున్నప్పు డితఁడు నెబుకద్నెజరుయొక్క దేహసంరక్షకులయొక్క సేనాధిపతియై యుండెను (II రాజు $25^{8,11,20}$). యెరూషలేము పట్టుకొనఁబడిన పిమ్మట నితఁడు శానిసెలపై విచారణ కర్తగా పనిచేసి యుండెను. చక్రవర్తియొక్క ఆజ్ఞానుసారముగా ఇతఁడు యిర్మీయాయెడల విశేషదయఁ జూపెను (యిర్మీ $39^{11}$). ఇది క్రీ॥ ము॥ 568 వ సం॥ లో జరిగెను. 5 సం॥ లకుఁ బిమ్మట నతఁడు మఱల యెరూషలేములో 745 మందిని పట్టుకొని బబులోనుకు కొంచుపోయెను (యిర్మీ $52^{30}$).

**నెబూషజ్బాను** (Nebushazban = కల్దీయ భాషలో నెబు - షిజిబ్ - అన్ని *Nabu-*

*Shigib-Auni* నెబో నన్ను రక్షింపుమీ). నెబు కద్నెజరు యెరూషలేమును పట్టుకొనినపుడు యిర్మీయాను విడిపించుమటకై పంపిన యుద్యోగస్థులలో నొకఁడు (యిర్మీ 39[13]). ఇతఁడు షండుల కధిపతియై యున్నట్లు తెనుఁగున తర్జుమాచేసి యున్నారు. దీనికి అతఁడు చక్రవర్తి సేవకులలో ప్రధానుఁడని యర్థమగును. చక్రవర్తి యొక్క ఇంటి సేవకులలోఁగాక సేనయందలి సేవకులలో ప్రధానుఁడై యుండినయెడల ఇతఁడు సేనాధిపతులలో నొక ముఖ్యుఁడని యెంచఁదగును. ఇచట ఆ యుద్యోగమే సూచింపఁబడియెనని సాధారణముగా ననుకొందురు.

నెబో (Nebo = తెలుపునది).

1. బబులోను దేవతలలో నొకటి. అది హిందువుల సరస్వతివలె విద్యకు దేవతగా నెంచఁబడెను. అది గ్రీకు వారి హెర్మే దేవతవలె దేవత


నెబో దేవత

లలో వార్త తెలుపునదియై యుండెను (యెష 46[1]). నెబుకద్నెజరు నెబూజరదాను అబెద్-నెగో (= నెబో) అను బాబెలు పేరులలో ఈ దేవత పేరు కనఁబడును.

2. యొర్దానుకు తూర్పుగా నుండు మోయాబు మైదానములోనున్న యొక కొండ (సంఖ్యా 33[47] ద్వితీ 32[49]). యొర్దానునది మృతసముద్రములో పారు స్థలమునకు తూర్పుగా అమడదూరములో నుండు నెబ (*Neba*) యను కొండ అదే యని సాధారణముగా ననుకొందురు. అది సముద్ర మట్టమునకు 2643 అడుగుల యెత్తుగా నున్నది. అచ్చటనుండి చూచినట్లయిన పలెస్తీను యావత్తు కనఁబడు ననఁదగును. ద్వితీ 34[1,2] లో నుండు స్థలములు పలెస్తీను సరిహద్దులే. వాటిలో నున్న ప్రతిదియు ఆ కొండమీఁదనుండి కనఁబడక పోయినను (ఉ॥ పశ్చిమ సముద్రము అనఁగా మధ్యధరా సముద్రము కనఁబడదు) ఆ వాక్యములకు అక్షర రీతిగా అర్థము చెప్పక అది దేశము యావత్తునకు చెందునని యర్థము చెప్పఁదగును. (పటము II, J 1).

3. యొర్దానుకు తూర్పుగా నున్న మోయాబు దేశములోనున్న ఒక యూరు. అది నెబో కొండదగ్గఱ నుండెను (సంఖ్యా 32[3]). రూబేనీయులు దానిని తిరిగి కట్టించుకొని యచట కాపురముండిరి (32[37,38] 33[47] I దిన 5[8]) గాని, మోయాబీయులు దానిని మఱల స్వాధీనపఱచుకొనిరి (యెష 15[2] యిర్మీ 48[1,22]). మోయాబు శిలయనఁబడు రాతి శాసనములోకూడ దీని పేరు కనఁబడును. దాని చూడఁగా మోయాబురాజు ఆ పట్టణమును జయింపవలెనని తన దేవతయగు కెమోషువలన ఆజ్ఞ నొందినట్లుగా నున్నది.

4. చెఱకాలమునకు తరువాఁత యూదయ దేశములో నున్న ఊళ్లలో నొకటి (ఎజ్రా 2[29] నెహె 7[33]). ఇది యెరూషలేమునకు వాయువ్యముగా 6 క్రోసుల దూరములోనుండు బైట్-నుబా (*Beit-Nuba*) అని యనుకొందురు.

నెమలి పక్షులు 26 చూ॥

## నెమూయేలు, యెమూయేలు (Nemuel, Jemuel).

1. షిమ్యోను పుత్రులలో నొకఁడు (సంఖ్యా 26[12]). ఈ పేరునకు యెమూయేలు అను మాఱు రూపముగలదు (ఆది 46[10] నిర్గ 6[15] I దిన 4[24]). నెమూయేలీయులను వారు ఇతని

సంతానమై షిమ్యోనీయుల తెగలలో నొకరై యున్నారు.

2. రూబేను సంతతివారిలో నొక తెగవారి పూర్వీకుఁడు (సంఖ్యా $26^{8}$).

**నెమ్మది** సమాధానము చూ॥

**నెయపొలి** (Neapolis = క్రొత్త పట్టణము). మాసిదోనియ దేశములోని ఫిలిప్పయి పట్టణమునకు 5 క్రోసులు ఆగ్నేయముగా నున్న రేవు పట్టణము. రోమా పట్టణమునుండి తూర్పుగా పోవు ఎగ్నేషియన్ (*Egnatian*) రస్తా దీని మీఁదుగాఁ బోవుచున్నదిగాన, ప్రయాణస్థులు ఇంతవఱకు మెట్ట ప్రయాణముచేసి చిన్నాసి యాకు పోవుట కిక్కడ ఓడనెక్కి ఈజియన్ సముద్రమును దాటుచు వచ్చిరి. పౌలు తన రెండవ మిషనేరి ప్రయాణములో త్రోయనుండి బయలుదేరి దీనిమీఁదుగా వెళ్లెను (కార్య $16^{11}$). ప్రస్తుతమున అక్కడ కొన్ని శిథిలము లగుపడుచున్నవి. అది యంతయు బొత్తుగా నాశన మాయెను (పటము V, J 2).

**నెయర్యా** (Neariah = యెహోవా సేవకుఁడు?).

1. రాజైన హిజ్కియా కాలములో అమాలేకీయులమీఁద జయకరముగా జరిగించిన యుద్ధములో పాలిభాగరియైన యొక ప్రధాని. అతఁడు షిమ్యోను గోత్రికుఁడై యుండెను (I దిన $4^{42}$).

2. దావీదు వంశస్థులలోని షెకన్యా కొడుకులలో నొకఁడు (I దిన $3^{22,23}$).

**నెయీయేలు** (Neiel). ఆషేరు గోత్ర స్వాస్థ్యమునకు సరిహద్దుగా నుండిన యూళ్లలో నొకటి (యెహో $19^{27}$). దాని యునికినిగూర్చి తెలియదు. నేయా యనునది యీ పేరునకు మాఱు రూపమైయుండవచ్చును (నేయా చూ॥).

**నెర్గలు** (Nergal = గొప్ప యోధుఁడు). బాబెలు దేవతలలో నొకటి. బబులోనులో నున్న కూత యను నూరు దానికి ముఖ్యపూజా స్థానమగుటచే ఇది కూతువారి దేవత యనఁబడెను (II రాజు $17^{30}$). ఈ కూతువారు షోమ్రోను దేశములో అష్షూరు రాజు నివసింపఁజేసిన అన్య జనులలోనుండిరి కావున నెర్గలు దేవతపూజ షోమ్రోనులోకూడ చేయ మొదలుపెట్టిరి. బాబెలు దేవతలలో నిది యుద్ధ దేవతయని బాబెలు శాసనములవలనఁ దెలియుచున్నది.



**నెల** కాలమానము VI చూ॥

**నెసీబు** (Nezib = విగ్రహము, దండుపాలెము). షెఫేలాలోనున్న యూదయ యూళ్లలో నొకటి (యెహో $15^{43}$). ఇది ప్రస్తుతమున హెబ్రోనుకు వాయువ్యముగా 9 మైళ్ల దూరములో నున్న బైట్-నుసీబు (*Beit Nusib*) అని యనుకొందురు.

**నెహుష్టాను** (Nehushtan = ఇత్తడికమ్మి). ఇశ్రాయేలీయు లరణ్యములో నుండఁగా సర్పములచే కఱువఁబడినప్పుడు మోషే నిలిపిన ఇత్తడి సర్పమునకు (సంఖ్యా $21^{9}$) హిజ్కియా పెట్టిన పేరు (II రాజు $18^{4}$). ఇశ్రాయేలీయులు దీనిని జాగ్రత్తగా దాచిరి గాని క్రమక్రమముగా నదియే విగ్రహారాధనకు కారణమాయెను. హిజ్కియా రాజైనపిదప యూదమత సంస్కరణ నారంభించినప్పు డతనికి విగ్రహారాధన విషయమైన కోపమును రేపుట కిదియే మొదటి కారణ మాయెను. వెంటనే దాని నతఁడు నాశముచేయ నాజ్ఞాపించెను. అతఁడు దానిని నిహుష్టానని పిలిచెను. దీని యర్థముగాని, ఇది సూచించునది గాని తేటగాఁ దెలియదు. ఈ విగ్రహము యొక్క నామమునుబట్టి వచ్చియుండును. నహోషను మాటకు హెబ్రీ భాషలో సర్పమని గాని, ఇత్తడి లేక రాగితో చేయఁబడినదని గాని యర్థమగును. ఇది సరియైనచో హిజ్కియా పెట్టిన పేరు పరిహాసపు పేరై యుండును. అనఁగా "ఛీ, ఇదియొక రాగిముక్కయే గాని దేవత కాద"ని చెప్పినట్లుండును. ఈ విషయమందు ఆత్మీయారాధనలో ఏదోయొక వస్తువును గాని రూపమును గాని సహాయముగా వాడుకొనుట యొక్క బుద్ధిహీనతయు అపాయమును తేటగా కనఁబడుచున్నవి. ఎందుకనఁగా అట్టిది తప్పక విగ్రహారాధనలోకి నడిపించును. B.

**నెహుష్తా** (Nehushta = ఇత్తడి). యూదా రాజైన యెహోయాకీము భార్య, రాజైన యెహోయాకీను తల్లి (II రాజు $24^{8}$). యెహోయాకీనుతో ఈమెను కూడ చెఱబెట్టిరి ($24^{12}$).

**నెహూము** (Nehum = ఆదరణ). జెరుబ్బాబెలుతోకూడ చెఱనుండి తిరిగి వచ్చిన యూదుల పన్నెండుమంది ప్రధానులలో నొకఁడు (నెహె $7^{6}$). ఎజ్రా $2^{2}$ లో ఈ పేరునకు రెహూము అను వేఱురూపము కలదు. ఎజ్రా లోనున్న యీ రూపము సరియైనదని యను కొందురు.

**నెహెమ్యా** (Nehemiah = యెహోవా వలన ఓదార్పఁబడినవాఁడు).

1. జెరుబ్బాబెలుతో యెరూషలేమునకు తిరిగి వచ్చినవారిలో నొకడు (ఎజ్రా $2^{2}$ నెహె $7^{6}$).

2. యూదా గోత్రికులలో హకల్యా యను వాని కుమారుఁడు (నెహె $1^{1}$). ఇతనికి హనానీ యను సహోదరుఁడు గలఁడు ($1^{2}$). రాచ వంశస్థుఁడై యుండును. బబులోను చెఱయందు యూదులుండఁగా పుట్టి పారసీక రాజగు అర్తహషస్తకు గిన్నె నందించువాఁడయ్యెను ($2^{1}$). యెరూషలేముకు చెఱనుండి తిరిగి వెళ్లిన యూదులకు కలిగిన దుఃఖకరమైన స్థితినిగూర్చి విని విచారపడి, వారి స్థితినిగురించి దేవునికి మొఱఁ బెట్టి, యెరూషలేమును తిరిగి కట్టించుటకై తాను సహాయపడు నిమిత్తము తనకు సెలవిమ్మని రాజు నడిగెను. అర్తహషస్త తన యేలుబడి యిరువదవ సంవత్సరమున అనఁగా క్రీ॥ పూ॥ 444 సం॥న అతనిని యెరూషలేమునకు గొర్నరుగా నియమించి పంపెను. పట్టణముయొక్క ప్రాకారములను గట్టించుటయందతఁడు ముఖ్యముగా తన దృష్టి నిలిపెను. యూదులకు శత్రువులగు సమరయులు పెట్టు శ్రమలు మరీ యెక్కువాయెను. శత్రుత్వము ముదిరెను. ఆ ప్రదేశమున కధిపతిగా నుండిన సన్బల్లటుతోఁ గలిసి వారనేక కుయుక్తులఁ బన్ని అనేక నిందలు వారిపై మోపి వారు చేయుచుండిన పనినాపుటకై తమకు చేతనైనన్ని ఆటంకములు కలిగించిరి. యూదులు పనిచేయుచుండఁగా దాని నాపుటకై వారు సంసిద్ధులైనందున సాయుధులై వీరు గోడను కట్టవలసినదని నెహెమ్యా యాజ్ఞనిచ్చెను. ఎన్ని ఆటంకములు కలిగినను నెహెమ్యా పట్టుదలతో పనిజేయించినందున ఒక సంవత్సరములో దానిని ముగించిరి. తాను యూదులపై అధికారిగానున్న దినములన్నిఁట అతఁడు కనఁబఱచిన దృఢచిత్తమును భక్తి మర్యాదలును, పరోపకార ధురీణతయు ధైర్య స్థైర్యములును సోదర ప్రేమయు దేశాభిమానమును దేవునియందు అతనికున్న స్థిరవిశ్వాసమును ఈ పనిని తుదముట్టించెను. మహా శాస్త్రవేత్తయగు ఎజ్రా మొదలగు నమ్మకమైన స్నేహితుల సహాయమున ప్రజలలో నెలసియున్న వ్యాజ్యముల విషయమై తగిన యనేక మంచి యేర్పాటులనుజేసి సాంఘికవృద్ధి కలిగించెను ($8^{1,9,13}$ $12^{36}$). క్రీ॥ పూ॥ 432 సం॥న బబులోనుకు తిరిగి వెళ్లిపోయెను ($2^{6}$ $5^{14}$ $13^{6}$) గాని కొన్ని సంవత్సరములైన తరువాత దైవమందిరమున ఆరాధనలు క్రమముగా జరుగకుండుట, విశ్రాంతిదినము నాచరింపక పోవుట, అన్యులను వివాహమాడుట యను మొదలుగాఁగల యనేక అక్రమములను దిద్దుటకై ఆయన తిరుగ యెరూషలేమునకుఁ బిలువఁబడెను. అన్య స్త్రీలను వివాహమాడినవారు తమ భార్యలనుగాని దేశమునుగాని వదలిపెట్టునట్లు బలవంతముచేసెను. యాజకులలో నకను లీ కారణముచే దేశభ్రష్టులై సమరయులతోఁ జేరి గెరిజీము కొండమీఁద ఆలయమును కట్టించుకొనియుండురని తోఁచుచున్నది. మరమ్మతుచేయఁబడిన మందిరపు గోడ ప్రాకారమును మరల మర్యాదగా ప్రతిష్ఠించెను. బీదలను అన్యాయపు వడ్డీతో బాధించుటను ఆపి, వారి పోషణార్థమై తగిన యేర్పాటుఁలొనర్చి ఆరాధనాదులను గూర్చి మంచి కట్టుదిట్టములు చేసెను. ప్రతి విషయమందును ప్రభుత్వ పరిపాలకులకు మాదిరిగా నుండెను.

3. యూదా గోత్రికుఁడగు అజ్బూకు కుమారుఁడు. యెరూషలేమును కట్టుటకు సహాయపడెను (నెహె $3^{16}$). **H.**

**నెహెమ్యా గ్రంథము (The Book of Nehemiah).**

1. గ్రంథకర్త, కాలము:—ఈ గ్రంథములోని 8-10 అధ్యాయములు ఎజ్రావలన వ్రాయఁబడినట్లు కనఁబడినను ఎక్కువ భాగము నెహెమ్యాయే వ్రాసెనని అందఱు నంగీకరించుచున్నారు. ఎజ్రా గ్రంథములో చరిత్రయొక్క మిగత భాగము దీనియందున్నది గనుక, యూదులు తమ ప్రమాణిక గ్రంథ జాబితాయందు ఈ రెంటిని ఒకటిగ నెంచిరి. దీనియందు విశేషముగ యెరూషలేము పట్టణమును తిరిగి

కట్టించుట, ముఖ్యులైన యూదుల వంశావళి, జనుల వ్యాపారములు వాడుకలు తెలియ వచ్చు చున్నవి. దీనితో పాత నిబంధన చరిత్ర గ్రంథములు ముగియును. ఇది బహుశః క్రీ॥ ము॥ 430 సం॥ 330 సం॥ మధ్యను యెరూషలేమునందు వ్రాయబడియుండును. దీనియందు 40 సం॥ల చరిత్ర మాత్రముగలదు.

2. ఉద్దేశము:—యెరూషలేము గోడలను తిరిగి కట్టించుటను దైవారాధనలను చక్కపఱచుటను వారికి కలిగిన ఆటంకములను దీవెనలను తెలుపుటకిది వ్రాయబడెను. ఈ గ్రంథము ప్రార్థనతో నారంభమై ప్రార్థనతో ముగియుచున్నది. నెహెమ్యా ఏడు సారులు ప్రార్థించినట్లు సూచనలున్నవి.

3. ముఖ్య భాగములు:—

I. గోడకట్టక మునుపటి చరిత్ర ($1^{1}$-$2^{20}$). ఇందు నెహెమ్యా ప్రార్థన ($1^{1-11}$) ప్రార్థనకు ప్రత్యుత్తరము ($2^{1-9}$) ప్రయాణము కొఱకు ($2^{10-11}$)ను, పనికొఱకును ($2^{12-20}$) సిద్ధపడుటను గుఱించి యున్నది. నెహెమ్యా ప్రార్థన నిజమైన ప్రార్థనకు మంచి మాదిరిగానున్నది. దీనియందు దేవుని చిత్తమునకు లోబడుట పాపములను ఒప్పుకొనుట వినయము మనవి స్తోత్రము గలదు.

II. గోడకట్టునప్పటి చరిత్ర ($3^{1}$-$12^{43}$). దీనిలో గోడకట్టు పని నారంభించుట ($3^{1-32}$), కలిగిన ఆటంకములు ($4^{1}$-$6^{14}$), ముగించుట ($6^{15}$-$7^{73}$), ధర్మశాస్త్రమును జనులకు చదివి వినిపించుట ($8^{1-13}$), పర్ణశాలల పండుగు నాచరించ నారంభించి ($8^{14-18}$) కొనసాగించుట ($9^{1-37}$), నిబంధనను స్థిరపఱచుట ($10^{1-39}$), జనులను లెక్కించుట ($11^{1}$-$12^{26}$), గోడలను ప్రతిష్ఠించుట ($12^{27-43}$) లను గూర్చి యున్నది.

III. గోడకట్టిన తరువాతి చరిత్ర ($12^{44}$-$13^{31}$). దీనియందు ఆలయమునందలి ఆరాధన క్రమమును చక్కబఱచుట ($12^{44-47}$), అన్య స్త్రీలను పెండ్లాడినవారిని ధర్మశాస్త్ర ప్రకారము వెలివేయుట ($13^{1-9, 23-28}$), పదియవ భాగమును ఇచ్చుటనుగూర్చిన యేర్పాటు ($13^{10-13}$), విశ్రాంతి దినమును గైకొనుటను గూర్చిన నియమము ($13^{15-22}$) లను గుఱించి కలదు. H.

**నెహెలామీయుడు** (Nehelamite). యిర్మీయాను విరోధించిన అబద్ధ ప్రవక్తయగు షెమయాకు బిరుదుగా నుండు పదము (యిర్మీ $29^{24, 31-32}$). షెమయా ఊరిని సూచించు బిరుదని ఊహింపదగునుగాని ఆ యూరిపేరు బైబిలులో లేదు. అందువలన అది యితని వంశమునుబట్టి కలిగిన బిరుదని కొందఱి యభిప్రాయము.

## నే

**నేతగాండ్లు, నేతపని** వృత్తులు చేతిపనులు III 2 చూ॥

**నేత్రక్షీణత** రోగములు చికిత్సలు II 1 (2) చూ॥

**నేబై** (Nobai). నెహెమ్యాకాలమునందు నిబంధనను ముద్రించిన యూదుల ప్రధానులలో నొకఁడు (నెహె $10^{20}$).

**నేయా** (Neah = ఉద్రేకము). జెబూలూను సరిహద్దులలో నుండు నొక స్థలము. (యెహో $19^{13}$). 27 వ వచనములోని నెయీయేలు అనునది దీనికి మాఱు రూపమై యుండవచ్చును. దాని యునికినిగూర్చి తెలియదు.

**నేరములు, శిక్షలు** (Crimes and Punishments). ఎట్టి నేరముల కెట్టి శిక్షలు విధించఁబడెనో వాటిని ఈ శీర్షిక క్రింద నుదాహరింతుము. దేవునికి విరోధముగఁ జేయఁబడిన నేరములనియు, మానవులకు విరోధము జేయఁబడిన నేరములనియు ఇవి రెండు విధములుగ నున్నవి.

I. దేవునికి విరోధముగ జేసిన నేరములు, వాటి శిక్షలు:—ప్రతి తప్పును దేవునికి విరుద్ధమైనదిగా నెంచవచ్చును. ఆయన యిశ్రాయేలీయులకు రాజైయుండుటచే, వారి యేర్పాటుల ప్రకారము ఇతరులకుచేసిన యన్యాయములు మఱిముఖ్యముగ దేవునికి విరోధముగా జేసిరనదగును. ఆయనను విసర్జించుట దూషించుట మొదలగు పాపములు మఱింత నూటిగా ఆయనకు విరోధమైనవి. అవెవ్వియనఁగా:—

1. అన్యుల దేవతలను సూర్యచంద్ర నక్షత్రాదులను ఆరాధించెడివారు మరణ శిక్షకు పాత్రులైరి (ద్వితీ $17^{2-7}$). తన సంతానమును మొలెకున కర్పించినవానిని ఇట్టివారితోఁ జేర్పవలెను (లేవీ $20^{2-5}$). అన్యదేవతలను ఆరాధించుట తిరుగుబాటనియు (యెష $1^{2}$), ఆత్మీయ వ్యభిచారమనియు (యెహె 23) యెంచఁబడెను.

2. అన్యదేవతల నారాధించుమని యితరులకు బోధించువాఁడును మరణ శిక్షకు పాత్రుఁడు (ద్వితీ $13^{1-5}$). అబద్ధ ప్రవక్త లిట్టివారే.

3. దేవుని ఘననామమును దూషించిన వాఁడు మరణశిక్షకు పాత్రుఁడు (లేవీ $24^{16}$).

4. యాజకులును లేవీయులును మాత్రమే రాఁదగిన యాలయ భాగములలోనికి వచ్చెడి యితరులు ఆలయము నపవిత్రపఱతురుగాన వారును మరణ శిక్షకు పాత్రులైరి (సంఖ్యా $18^{7-22}$).

5. విశ్రాంతి దినము నుల్లంఘించి అనావసరములగు పనుల నా దినమునఁ జేయువారు మరణ శిక్షకు పాత్రులు ($15^{32-36}$).

6. కర్ణ పిశాచి గలవాఁడును, సోదె చెప్పువాఁడును మరణ శిక్షకు పాత్రులు (లేవీ $20^{27}$).

7. ప్రాయశ్చిత్తార్థదినము నాచరింపనివారు ప్రజలలోనుండి కొట్టివేయఁబడిరి అనఁగా వెలివేయఁబడిరి ($23^{29}$). పస్కా నాచరింపనివారును (సంఖ్యా $9^{13}$), ప్రతిష్ఠాభిషేక తైలముచేయువారును, అన్యుని దానితో నభిషేకించువారును (నిర్గ $30^{31,32}$) రక్తమును దినువాఁడును (లేవీ $7^{27}$) అట్టి శిక్షకులోనైరి.

II. మానవులకు విరోధముగాఁజేసిన పాపములు, వాటి శిక్షలు:—ఇవి ప్రతి కుటుంబము యొక్క పరువు ప్రతిష్ఠలను దక్కించుటకును, ప్రతివాని సొత్తును కాపాడుటకును, ప్రాణమును రక్షించుటకును, న్యాయమును స్థాపించుటకును చేసిన యేర్పాటులు కావున వీటికి భిన్నముగానున్న ప్రతిదానికి శిక్షవిధింపఁబడెను. అవెవ్వియనఁగా:—

1. కుటుంబ ధర్మముల నుల్లంఘించు నేరములు. బైబిలునం దుదాహరింపఁబడిన యాదికాలములో దేశసంబంధములగు ప్రభుత్వము లింక నేర్పడియుండలేదు. కుటుంబమునకు గోత్రమునకును పెద్దలైనవారే అట్టికాలమునందు అధికారులుగా నుండిరి గాన కుటుంబ హక్కులను దక్కించుకొనుటకైన చట్టములు మరింత స్పష్టముగానున్నవి.

(1) తల్లిదండ్రులను దూషించుట అన్నిఁటిలో గొప్ప పాపముగా నెంచఁబడెను. తల్లి దండ్రులను కొట్టుటయు ($21^{15}$), వారిని శపించుటయు (నిర్గ $21^{17}$ లేవీ $20^{9}$), ఎడతెగక వారికవిధేయత చూపుటయు (ద్వితీ $21^{18-21}$) అనెడి యీ నేరములు చేసినవారందరు మరణ శిక్షకు పాత్రులైరి.

(2) (*a*) కుటుంబము క్షీణించిపోకుండ దానిని నిలువఁ బెట్టుటకై వివాహవిషయమైన నియమములు విశేషముగానున్నవి. రక్తసంబంధుల వివాహము నిషేధింపఁబడెను. వివాహమాడరాదని నిషేధించిన వావి వరుసలు లేవీ $18^{6-18}$ నందు పదునేడు గలవు. నేటివఱకు క్రైస్తవులా నియమములను చాలవఱ కనుసరించుచున్నారు (వివాహము చూ॥). ఒకరితో నొకరు శయనించిన దగ్గిర బంధువు లిద్దఱును మరణ శిక్షకు పాత్రులు ($20^{11,12}$). ఒకఁడొక స్త్రీని ఆమె కుమార్తెను కూడ వివాహము చేసికొనిన పక్షమున ఆ ముగ్గురిని అగ్నితో కాల్చివేయవలెను ($20^{14}$). పురుష సంయోగులు ($20^{13}$), మృగసంయోగులు ($20^{15,16}$) మరణ శిక్షకు పాత్రులు. కడగానున్న స్త్రీతో శయనించు వానిని ఆమె పెనిమిటియైనను ఆ స్త్రీతోకూడ వారిద్దరిని వెలివేయవలెను ($20^{18}$). నిషేధింపఁబడిన వావి వరుసలను తప్పి వివాహమాడుటయు, అక్రమముగా నొకరితో శయనించుటయు శిక్షార్హమైన నేరములుగా నెంచఁబడెనుగాని దేనికే శిక్ష విధించవలెనో అంత తేటగా కనఁబడుట లేదు ($20^{20,21}$). అట్టివారు మరణ శిక్షకు పాత్రులని తెలుఁగు బైబిలునందున్నను హెబ్రీభాషలో వారిని ప్రజల యెదుట నుండి కొట్టివేయవలెనని యున్నదిగాన ఇదియు వెలిని సూచింపవచ్చును.

(*b*) వ్యభిచారము చేయువారికి ఆయా సంబంధములనుబట్టి శిక్షలు కలిగెను. జారత్వము నిషేధింపఁబడెను ($19^{29}$). వ్యభిచరించినది వివాహము కానిదైన యెడల ఆమెను మరులు కొలిపి చెఱిపినవాఁడామె తండ్రి సెలవుపొంది ఓలిని చెల్లించి ఆమెను వివాహమాడవలెను (నిర్గ

22[16,17] ద్వితీ 22[29]). ఆమె సంగతి బయలు పఱచఁబడక మఱియొకని వివాహమాడినపిదప ఆమెదోషము బయలుపడినయెడల ఆమెను మరణ శిక్షకు పాత్రురాలినిగా నెంచవలెను (22[21]). ఒకఁడు మఱియొకని భార్యతోగాని (లేవీ 20[10] ద్వితీ 22[22]), మరియొకనికి ప్రధానము చేయఁబడిన దానితోగాని వ్యభిచరించినయెడల వారుభయులు చంపఁబడవలెను (ద్వితీ 22[23,24]) గాని ఆమె బలాత్కారము చేయఁబడినయెడల ఆమెనువదలి వానినే చంపవలెను (22[25-27]). యాజకుని కుమార్తె వ్యభిచరించిన పక్షమున నామెను కాల్చవలెను (లేవీ 21[9]). ఇతరులకన్న యాజకులకు కఠినములగు నియమము లుండుటచేత ఇట్టి యేర్పాటును చేసిరి. పూర్వకాలమున కామదేవత గుళ్లలో భోగము వారి నుంచుట గొప్పయని యెంచిరిగాని బైబిలునం దిది బొత్తుగా నిషేధింపఁబడెను. వారి యార్జిత ములో నుంచి దేవాలయమునకు కానుక లర్పించు టయు నిషిద్ధమై యుండెను (ద్వితీ 23[17,18]).

2. ఒకరి సొమ్మునుగాని సొత్తునుగాని నష్టము చేయుటను నేరముగా నెంచిరి. బైబిలునందు సొమ్మును నష్టముచేయుటనుగూర్చిన నేరములును, వాటికిపెట్టిన శిక్షలు నీదిగువ నున్నవి:—

(1) దొంగతనము (నిర్గ 20[15] ద్వితీ 5[19]). కన్నమువేయువానిని కన్నములోనే చంపుట నేరముగా నెంచఁబడలేదు (22[2]). పశువులను దొంగిలినవాఁడు వాటిని చంపినపక్షమున ఐదు రెట్లు తిరిగి చెల్లించవలెను (22[1]). ప్రాణముతో దానిని తిరిగి యిచ్చినపక్షమున రెండంతలు కట్టి యియ్యవలెను (22[4]). భద్రపఱచుమని యిచ్చిన సొమ్ము నపహరించినవాఁడును రెండంతలు తిరిగి యియ్యవలెను (22[7]). మిగిలిన విషయములలో దొంగపనిజేసినవాఁడు దొంగలించినదానిని మఱల యియ్యవలెను. ఇచ్చుటకేమియు అతనియొద్ద లేనిపక్షమున వానిని దానిసగా నమ్మవలెను (22)[3]. ఇశ్రాయేలీయులదేశము క్షీణింపఁగా ఈ పాపము సర్వసాధారణమైనట్లు ప్రవక్తలవలనఁ దెలియు చున్నది (యెష 1[23] కీర్త 50[18]). ఇది క్రొత్త నిబంధన పాపముల జాబితాలలో నొక ముఖ్య పాపమై యున్నది (మ 15[19] = మా 7[21] I కొరి 6[10]). అపొస్తలులలో యూదా దొంగయై యున్నట్లు చూచుచున్నాము (యోహా 12[6]).

(2) హద్దురాళ్లను దీసివేయుటయు నొక విధ మగు దొంగతనము (ద్వితీ 19[14]). శపింపఁబడిన పాపములలో నిదియొకటి యగుటచే (27[17]) దానిని భయంకరపాపములలో నొకటిగా నెంచిరి. బలాత్కారులుచేయు అక్రమములలో నిదియొక టిగా నున్నది (యోబు 24[2]).

(3) తప్పుడు తూనికెరాళ్లను కొలతలను వాడుటకూడ ఒకవిధమగు దొంగతనమే (లేవీ 19[36] ద్వితీ 25[13-15] యెహె 45[10]). ఇశ్రాయే లీయులు వ్యాపారాదులయందు వృద్ధికెక్కుచున్న కొలఁది ఈ పాపము మిగుల విస్తరించినట్లు ప్రవక్తలవలనఁ దెలియుచున్నది (ఆమో 8[5] మీకా 6[11] సామె 20[23]).

(4) దురుద్దేశముతోఁగాక అజాగ్రతవలన తన పొరుగువాని సొత్తును నష్టపఱచినవాఁడు దానికి ప్రతిగా ఆ సొత్తును మఱల నియ్యవలెను. అట్టి నష్టము పశువులవలనగాని (నిర్గ 22[5]) అగ్నివలన గాని (22[6]) కలిగినయెడల, ఆ పశువుల యజమా నుఁడుగాని అగ్ని నంటించినవాఁడుగాని భరింప వలెను.

ప్రతివిధమైన దొంగతనమునకు ప్రత్యేకమైన శిక్షవిధింపఁబడక పోయినను దానిని తిరిగి యియ్య వలసిన యేర్పాటా శిక్షలలో ముఖ్యమైనదై యున్నది. అపరాధపరిహారార్థ బలిలో నీ యేర్పాటు కనఁబడుచున్నది (సంఖ్యా 5[3-8]). ఇది శరీరహాని నొనర్చువాని శిక్షావిధికి నూటిగా సరిపడును (నిర్గ 21[24]).

3. శరీరమునకు హానికలిగించు నేరములు.

(1) నరహత్య (నిర్గ 20[13] ద్వితీ 5[17] మ 19[18] మొ॥). నరుని చంపువాఁడు నరునిచే చంపఁబడ వలెనను నియమము ఆదినుండియుఁగలదు (ఆది 9[6]). నిర్గ 21[24] నందిది నిర్ధారణ చేయఁబడెను. దేశములో నింక ఇతర క్రమమైన యేర్పాటులు లేకపోవుటచేత చంపఁబడిన వానిదగ్గర బంధు వుఁడు ఈ శిక్షవిధించ నేర్పాటాయెను (సంఖ్యా 35[15-19]). పరాకున నొకని చంపినయెడల అట్టి వాఁడు చంపఁబడకుండునట్లు ఆశ్రయపుర ములు నియమింపఁబడెను (నిర్గ 21[13] ద్వితీ 19[4-13] యెహో 20[1-9] ఆశ్రయపురములు చూ॥). ఒక యజమానుఁడు చచ్చునట్లు తన దాసుని కొట్టిన

యెడల అతఁడు చంపఁబడవలెనుగాని వాఁడు కొన్ని దినములదాక బ్రతికినపక్షమున అట్టిశిక్ష నొందనక్కరలేదు (నిర్గ $21^{20,21}$). దొంగ దొంగతనముచేయు చుండఁగా చంపఁబడినయెడల శిక్ష విధింపఁబడదు.

ఇంతకఠినములగు నియమములుండినను దీనిని గూర్చిన సూచన లనేకములు గలవు. కయీను మొదటి నరహంతకుఁడు (ఆది $4^{8-11}$). దావీదు ఊరియాను చంపించెను (II సమూ $12^{9}$). ఇశ్రాయేలు వారి రాజ్యము క్షీణించుకాలమున, ఆయా రాజులును ఘనులును కుట్రలకులోనై మరణ మగుట సర్వసాధారణమాయెను (I రాజు $16^{9}$ II రాజు $21^{16}$ మొ॥). ఇది హృదయములో నుండి బయలుదేరు పాపమని క్రొత్త నిబంధన కాలమునందు క్రీస్తుబోధించెను (మ $15^{19}$ = మా $7^{21}$). పగపట్టువాఁడు నరహత్యనుగూర్చిన యాజ్ఞను మీఱునని ఆయనచేసిన బోధకు సంబంధముగా నున్నది (మ $5^{21-26}$). బరబ్బా నరహంతకుఁడని చెప్పిరి (మా $15^{7}$=లూ $23^{19}$). దేవునిని విసర్జించెడివారి పాపములలో నిదియొకటియై యున్నది (రోమా $1^{29}$). దుర్మార్గులెన్ని శిక్షల నొందినను మఱింతకఠినులై గుణపడరని బోధించు దృష్టాంతములలో నరహత్యలుచేసెడి వారుకూడ నున్నారు (ప్రక $9^{21}$).

(2) ఒకనిని చంపకున్నను వానిశరీరమునకు హానిచేసినయెడల అతఁ డుద్దేశపూర్వకముగా నెట్టిహానిఁ జేసెనో ఆ శిక్ష నే తానును పొందుట కర్హుఁడు. దెబ్బకొట్టుటచే కన్నుపోఁగొట్టిన పక్షమున, దెబ్బకొట్టిన వాని కన్నులలో దానినే ఊడఁదీయవలెను (నిర్గ $21^{18-26}$). దీనినే హానికి ప్రతి హానినిగూర్చిన చట్టమందురు. శరీరమునకు హాని సంభవించి ఒకఁడు పనిచేయలేకపోయిన దినములకు వానికి రావలసిన జీతమును, హానిఁ జేసినవాఁడు భరించవలసియుండెను ($21^{19}$).

(3) నరుని దొంగిలించువాఁడు మరణశిక్షకు పాత్రుఁడు (నిర్గ $21^{16}$ ద్వితీ $24^{7}$).

**4. న్యాయమును చెఱుపు నేరములు.** ప్రతివానికి న్యాయము కలుగఁజేయుటయే బైబిలు నియమముల ఉద్దేశము (నిర్గ $21^{1}$ ద్వితీ $1^{17}$ $16^{19,20}$). న్యాయముచెఱుపు ప్రతిదియు శిక్షాపాత్రమై యున్నది. రాజులును అధికారులును సహా అన్యాయముచేయుటవలన తమ రాజ్యములను పోఁగొట్టుకొని దేశమును పాడుజేసిరి (యెష $5^{7}$ $59^{15}$ యిర్మీ $5^{1}$ ఆమో $5^{7}$). ఇట్టి అన్యాయములను జేసినవారిని దేవుఁడు తానే శిక్షించెను. ఈ వివరమునందు ప్రజలు తమ యబద్ధ సాక్ష్యములవలన న్యాయస్థులగు అధిపతులుచేసిన న్యాయమును చెఱుపుటను గూర్చిన విషయములుమాత్ర మున్నవి.

(1) ప్రతి విధమగు కొండెము న్యాయమును చెఱుపును గనుక అది నిషిద్ధము (నిర్గ $23^{1}$ లేవీ $19^{16}$). గాని వాటికి ప్రత్యేకములగు శిక్షలు విధింపఁబడలేదు (కొండెము చూ॥). ఒకఁడు తాను నూతనముగా వివాహమాడిన భార్యను దూషించి ఆమె దుష్టురాలని లేనిపోని నేరముల నామెమీఁద మోపఁగా, అట్టివానిని పెద్దలు విచారించి, ఆ నేరమామెమీఁద రుజువు కాని యెడల వానికి నూరుతులముల జరిమానా విధింపవలెను (ద్వితీ $22^{13-21}$).

(2) లంచము పుచ్చుకొనుట అన్నిటికన్న నెక్కువగా న్యాయమును త్రిప్పివేయునుగాన అది మఱింత కఠినముగా ఖండింపఁబడెను (నిర్గ $23^{8}$ ద్వితీ $27^{19}$). ఈ విషయములో తాను నిర్దోషినని సమూయేలు ధైర్యముతో చెప్పినను (I సమూ $12^{3}$), అతని కుమారులు అతనివంటి వారు కాకపోయిరి ($8^{3}$). ఇశ్రాయేలీయుల దేశము క్షీణదశకు వచ్చినకాలములో నీ పాపము బహుగా విస్తరించెనుగాన ప్రవక్తలు దీనిని ఖండించిరి (ఆమో $5^{12}$ కీర్త $26^{10}$). లంచము పుచ్చుకొనకుండుట భక్తుల లక్షణములలో నొకటిగా నెంచిరి (యెష $33^{15}$ కీర్త $15^{5}$). రోమనుల ప్రభుత్వము మొత్తముమీఁద నెంత న్యాయవంతమైన దైనను, ఆయా దేశములయం దుండిన వారి గొర్నరులు లంచముల నాశించి పుచ్చుకొన్నట్లు పిలాతు (మ $28^{14}$), ఫేలిక్సు (కార్య $24^{26}$) లను గూర్చి సూచనలు గలవు.

(3) అబద్ధసాక్ష్యమును నిషేధించిరి (నిర్గ $20^{16}$ ద్వితీ $5^{20}$). అబద్ధసాక్ష్యము చెప్పుట వలన నొకడు తన పొరుగువారికిఁ జేయఁదలఁచిన హానియే వానికి శిక్షగా విధించిరి ($19^{15-21}$).

దేశము చెడిపోఁగా ఈ పాపముకూడ విస్తరించెను. అప్పుడప్పుడు అధికారులుసహా కూట సాక్ష్యములను పన్నుటకు వెనుకఁ దీయలేదనుసంగతి నాబోతుచరిత్రవలన విశదమగుచున్నది (I రాజు 21[7-15]). అదెంతఘోరమగు పాపమో అది యతనికి ప్రవక్త విధించిన శిక్షవలనఁ దెలియుచున్నది (21[17-29]). ఇట్టి యబద్ధసాక్ష్యమువలన క్రీస్తును సహా సంహారింపవలెనని యూదుల గురువులు ప్రయత్నించిరి (మ 26[59,60]) గాని వీరి సాక్ష్యము సరిపడలేదు.

III. శిక్షలు విధించినవిధము.

1. నరహత్య శరీరహాని అబద్ధసాక్ష్యము అను నేరములకు విధించినట్లే హానికి ప్రతిహానిచేయుట బైబిలు శిక్షాస్మృతియందు ఒక ముఖ్య యేర్పాటై యున్నది (నిర్గ 21[23,24]). అట్టి శిక్షను విధించుటకు హానినొందినవాఁడైనను, వానిబంధువులైనను పెద్దలైనను అర్హులుగా నుండినట్లు పై నుదాహరించిన దృష్టాంతములవలనఁ దెలియును. హానికి ప్రతిహానిచేయు చట్టము (*Lextalionis*) ప్రకారము సరియైన యేర్పాటులులేని దేశమునందు జేసిరేగాని, అట్టివేర్పడిన పిమ్మట దీనిప్రకారము న్యాయము తీర్చిరనుకొనరాదు. మోషే ధర్మశాస్త్రము నియమింపఁబడిన పిదప సహా పరాకున నొకఁడు చంపఁబడిన పక్షమున వానిబంధువులు ఆ సంగతియొక్క న్యాయాన్యాయములు విచారించలేదు గావున, అట్టివారికి తగినన్యాయము కలుగులాగున ఆశ్రయ పట్టణములను ఏర్పరచిరి. చేసిన నేరమునకు తగిన శిక్షను భరింపవలెనినదను నియమమును నేటివఱకు అనుసరించుచునే యున్నారు.

2. నష్టము కలిగించినవాఁడు తనవలన కలిగిన నష్టమును భరించుకొనవలెనను నియమము సొత్తు విషయమైన నేరములలో ముఖ్యముగా కనఁబడును (II 2 (1), (4) చూ॥). శరీరహానికి సంబంధించిన నేరములకును అట్టి శిక్షయే విధింపఁబడెను (II 4 (3) చూ॥). నూతనముగా వివాహ మాడిన భార్యపై మోపిన అబద్ధనేరములకు విధించిన జరిమానాయు అట్టి శిక్షగా నెంచఁదగును II 5 (4) చూ॥).

3. మిగుల పురాతనమైన యేర్పాటులలో నేరస్థులను ఖైదులో వేసెడి శిక్షలు కనఁబడవు. మోషే ధర్మశాస్త్రమునం దట్టి యేర్పాటులేదు గాని తరువాతికాలములలో నది సర్వసాధారణమైన శిక్షగా నున్నది (I రాజు 22[27] = II దిన 18[26] యిర్మీ 37[18] 52[31] హెబ్రీ 3[25] 12[39]). ఇది ఐగుప్తీయులు (ఆది 39[20-23]), అష్షూరీయులు (యిర్మీ 52[11]) విధించిన సాధారణ శిక్షయైనట్లు ఆయా సూచనలవలన కనఁబడుచున్నది. ఇశ్రా



బొండకొయ్య

యేలీయులు ధర్మశాస్త్రమియ్యఁబడిన తరువాతి అనేక సంవత్సరములవఱకు అరణ్యమందు సంచరించునప్పుడు నేరస్థుల నిట్లు ఖైదులో నుంచుటకు వీలుగాకపోవుట యొక ముఖ్యకారణమని చెప్పవచ్చును. స్థిరనివాసములేక తిరుగువారి కొఱకే మోషేధర్మశాస్త్రము మొదట యేర్పడెను. వారికి స్థిరనివాసము ఏర్పడుటతోనే చెఱసాల లారంభమయ్యెను. యిర్మీ 37[18] లో చెఱసాలయని తెనిఁగించిన పదమును సాధారణముగా బందీగృహమని తెనిఁగించిరి (37[15]). పలెస్తీనులోను ఇతరదేశములలో నివి యున్నట్లు చూడవచ్చును (మ 5[25] కార్య 5[19] 12[4] మొ॥). బొండకొయ్యనుగూర్చిన సూచనలును ధర్మశాస్త్రమునలేవు. రాజులకాలమునందిది వాడుకలోకి వచ్చెను (యిర్మీ 20[2,3]). రోమీయులు నేరస్థుల నిట్లు శిక్షించిరని కార్య 16[24] వలనఁ దెలియుచున్నది. హీనజాతివారిని బానిసలను మాత్రమే వారిట్లు శిక్షించవచ్చునను ఏర్పాటుగలదు. రోమను పౌరత్వముగల పౌలును

బొండలో వేసినందున అధికారులు భయపడిరి. మర్యాదపరుల నీ దేశములోను బొండవేయుట నిషిద్ధము.

4. కొట్టుట.

(1) బైబిలునం దుదాహరించిన శిక్షలలో కొరడాలతో కొట్టుట ఒకటై యున్నది. ఒకే సారి 40 దెబ్బలకన్న నెక్కువ కొట్టరాదను నియమము గలదు (ద్వితీ 25[1-3]). మూఁడు త్రాళ్లుగల చబుకుతో 13 సారులు కొట్టవలెనని యూదుల ఇతిహాసములయందున్నది. అప్పుడు $13 \times 3 = 39$ యగును. సమాజమందిరపు పెద్దల కీవిధముగా శిక్షించుట కధికారముగలదు (మ 10[17]). వారిచేత పౌలు 5 మారు లీ శిక్షను పొందెను (II కొరి 11[24]).

(2) రోమీయులు తూర్పువారి వాడుకలలోఁ గొన్నిఁటి ననుసరించుటచే కొరడాలను తమ శిక్షాసాధనములలో నొకటిగా నుంచుకొనిరి. వారి కొరడాలలో పదునైన యినుప ముక్క లుండునవి గాన వారిచేత శిక్షనొందిన వారు మఱెక్కువగా బాధనొందిరి. క్రీస్తును వారిట్లు కొట్టిరి (మ 20[19] యోహా 19[1]). రోమీయుల నిట్లు శిక్షించుట నిషిద్ధము (కార్య 22[25-28]).

(3) రోమీయులు బెత్తములతో కొట్టి శిక్షించువారు. ఫిలిప్పయిలో వారు పౌలుసీలలను బెత్తములతోఁ గొట్టిరి (కార్య 16[22] II కొరి 11[25]). మర్యాదస్థులగు రోమీయుల నిట్లు శిక్షించుటయు నిషిద్ధమే.

5. పూర్వకాలమందుండిన యనేక జనాంగములలో కండ్లనూడఁబెరుకుట, ముక్కు చెవులను గోయుట, చేతులను నరుకుట (న్యాయా 1[6,7]) మొదలగువాటిని శిక్షలనుగా విధించిరిగాని ఇశ్రాయేలీయులలో నిట్టి క్రూరమైన శిక్షల నభ్యసించలేదు. ఒక సిగ్గుమాలిన పనికిమాత్రము చేతిని ఛేదింపవలెనను నియమమున్నది (ద్వితీ 25[11,12]). ఇట్టి క్రూరమైన శిక్షలు యుద్ధమునందు పట్టుబడినవారికి విధించుట మామూలై యుండెను (న్యాయా 1[6,7] II రాజు 25[7]).

6. ఇశ్రాయేలీయు లొక మతమునే యనుసరించిన జనాంగమగుటచేత మతసంబంధములగు అట్టి నేరములను జేసినవారిని వెలివేయుట సాధారణమాయెను. మతాచారముల నతిక్రమించి అపవిత్రులైనవారి కిదియొక ముఖ్య శిక్షగా నుండెను (I 7 చూ॥). ప్రజలలో నుండి కొట్టివేయఁబడుట యనునదే ఆ శిక్షయై యున్నది (లేవీ 23[29] సంఖ్యా 9[13] మొ॥). ఎజ్రా 7[26] లో నున్న శిక్షలలో స్వదేశత్యాగము అనునది దీనికి సంబంధించినదై యున్నది. అట్టివారిని ఊరిలోఁ గాని దేశములోఁగాని ఉండనియ్యక వెళ్లఁగొట్టి వట్లు ఈ మాటవలన తెలియుచున్నది. అది వెలికిమాలుగా నుపయోగింపఁబడిన మఱియొక పదమేగాని ప్రత్యేకమగు శిక్షకాదు. ఆ వాక్యములోనే దేవుని చట్టములనుగాని రాజ్యచట్టములను గాని మీఱెడివారి యాస్తిని జప్తుచేయుట మఱియొక శిక్షయై యున్నది. దీనినిగూర్చిన సూచనలు ధర్మశాస్త్రమునందు లేకున్నను, అన్నిదేశములలోను రాజద్రోహ నేరమున కిది సర్వసాధారణమైన శిక్షయై యున్నది. రాజులకాలమున నిట్టి చట్టమొకటి ఆచరణలో నుండెను. దీని ననుసరించియే యెజెబెలు నేరములను పన్ని అహాబుకు నాబోతు ద్రాక్షతోఁట నిప్పించెను (I రాజు 21[13-15]).

7. మరణశిక్షలు అన్నిఁటిలో గొప్ప నేరములకు విధింపఁబడెను. అవి దిగువరీతిగా విధింపఁబడెను.

(1) రాళ్లతోఁ గొట్టుట. మొదటినుండి యూదులిట్లుచేసిరి (I 1-6, II 1 చూ॥). నేరస్థుని ఊరివెలపటనే చంపవలెను (లేవీ 24[14]). నేరముమోపినవాఁడే మొదటిరాతిని రువ్వవలెను (ద్వితీ 17[7] = యోహా 8[7]). స్తెఫనును రాళ్లతోఁ గొట్టిచంపిరి (కార్య 7[58]). పౌలును కొట్టిరి (14[19]). క్రీస్తునుకూడ ఇట్లే కొట్టిచంపుటకు యత్నించిరి గాని ఆయన తప్పించుకొనెను (యోహా 8[59]). చంపుటకుఁగాక, చంపఁబడిన వాని నింకను అవమానపఱచుటకుఁగాని, ఇతరులకు భయము కలిగించుటకుఁగాని వారి దేహమును అప్పుడప్పుడు మ్రానుమీఁదవేయు వాడుకయు గలదు. అట్లు చేయవలెనను నియమమేదియు బైబిలునందు లేకపోయినను, ఆరీతిగా వేయఁబడిన శవము సాయంకాలములోపుగా దింపవలసినదను జాలితో గూడిన యేర్పాటొకటి గలదు (ద్వితీ 21[22,23]).

ఈ యవమానము క్రీస్తు సిలువవేయఁబడుటకు సూచనగా నెంచఁబడెను (కార్య $5^{30}$ $10^{39}$ $13^{29}$ గల $3^{13}$ I పేతు $2^{24}$).

(2) ఉరితీయుట. క్రైస్తవదేశములలో నీ విధముగా మరణపాత్రులగువారిని శిక్షించుట యెంత సాధారణమైనను బైబిలునం దిది కనఁబడదు. అహీతోపెలును (II సమూ $17^{23}$) యూదాయును (మ $27^{5}$) స్వయముగా ఉరి పెట్టుకొని మరణమైరిగాని దేశసంబంధమైన శిక్షగా దానివాడిన సూచనలు లేవు. పారసీకులు ఇట్లు తమనేరస్థులను చంపకపోయినను, హామానును 50 మూరల ఎత్తుగల ఉరికొయ్యమీఁద ఉరితీసిరి (ఎస్తే $7^{10}$).

(3) సిలువవేయుట. అన్నిఁటిలో నిది ఘోరమైన శిక్ష. ఇట్లు సిలువవేయుట యూదులలోఁగాని రోమీయులలోఁగాని సాధారణము కాదు. గాని ఫేనీకేవారిట్లు చేసినందున రోమీయులు వారిమాదిరి ననుసరించి నీచులకు బానిసలకు ఇట్టిశిక్ష విధించిరి. వారిని సిలువవేయక పూర్వము కొరడాలతో క్రూరముగా కొట్టిరి (యోహా $19^{1}$). అట్టిశిక్షకు పాత్రుఁడైనవాఁడు తన సిలువలోని అడ్డకొయ్యనుమాత్రమే సాధారణముగా వధ్య స్థలమునకు మోసికొనిపోయెడివాఁడు. క్రీస్తును అట్లే తన సిలువలోని అడ్డకొయ్యను మోసియుండును. వారాయనయెడల మఱీ నిర్దయులుగా నుండి సిలువయంతటిని మోయించిరి (మ $27^{32}$). నేరస్థుని నేరమును వ్రాసి వానిమెడకు తగిలించుటగాని, లేక దాని నొక కొయ్యకుగట్టి బంట్రోతు ఒకఁడు ముందుగా నడుచుటగాని సాధారణము. తరువాత దానిని సిలువకుఁ గట్టిరి (యోహా $19^{19}$). సిలువ నేలమీఁద నుండఁగనే వారు నేరస్థుని కాలుసేతులను దానికి మేకులతో కొట్టిగాని, త్రాళ్లతో కట్టిగాని బిగించిరి. క్రీస్తువిషయములో నాయనను మేకులతోఁ గొట్టిరి (లూ $24^{39,40}$). పిమ్మట సిలువ యెత్తఁబడెను. అది అంత యెత్తయినదికాదు. దానిబాధలు చెప్పశక్యముకాదు. మానవులు మరణశిక్షను త్వరగా ముగించవలెనని కోరుట వారిలో పుట్టు నొకవిధమగు జాలివలనఁ కలుగును గాని, సిలువవేయుటలోమాత్ర మట్టి జాలి యగుపడుట అరుదు. కొందఱు వారము దినములకా ఘోరబాధ ననుభవించుచు, మరణము నొందక యుందురని చూచినవారు చెప్పెదరు. కాళ్లనువిఱిచి వారిబాధ నింక హెచ్చుచేసిరిగాని, అందువలన వారు త్వరగా మరణమైరి. క్రీస్తు సిలువవేయఁబడుటచేత, మిగుల క్రూరమగు ఈ శిక్షాసాధనము రక్షణపొందఁగోరువారి కందఱికి అతిశయాస్పదమాయెను (గల $6^{14}$).

(4) శిరచ్ఛేదము. రోమీయులలో మర్యాదస్థులగు నేరస్థులను చంపినవిధమై యున్నది. రోమీయులు క్రొత్త నిబంధనకాలములో పలెస్తీను కధికారులుగా నుండుటచే ఈ శిక్షను గూర్చిన కొన్నిసూచనలు గలవు. బాప్తిస్మమిచ్చు యోహానును (మ $14^{10}$), యాకోబును (కార్య $12^{2}$), హతసాక్షులను (ప్రక $20^{4}$) ఈ విధముగాఁ జంపిరి. అట్టివారిలో రోమను పౌరస్థితిగలిగిన పౌలుకూడ ఒకఁడను సంగతి బైబిలునందు లేకున్నను, అందఱిచే మొదటినుండి యంగీకరింపఁబడెడి పారంపర్యమై యున్నది.

(5). దహించుట. దగ్గఱబంధువులతో వ్యభిచరించుటయు (లేవీ $20^{14}$), యాజకుల కుమార్తెలు వ్యభిచరించుటయు ($21^{9}$) మఱీ ఘోరమగు పాపములగుటచే అట్టి నేరస్థులను దహించవలెనను నియమముకలదుగాని వారిని ప్రాణముతో దహించిరా లేక రాళ్లతో వారిని చావఁగొట్టినపిమ్మట వారిశవము లపవిత్రములగుటచే వాటిని దహించిరా యనుదానినిగూర్చి సందేహముగలదు. ఆది $38^{24}$ నందు యూదా వ్యభిచరించిన తన కోడలిని ప్రాణముతోనే దహింపఁబోయినట్లు కనఁబడును. కావున ప్రాణముతోనే కాల్చుట అలవాటయి యుండునని తోఁచుచున్నది.

**నేరి** (Neri). యేసుక్రీస్తు వంశావళిలోని యొకఁడు (లూ $3^{27}$).

**నేరియు** (Nereus = సముద్రదేవత). రోమాపురికాపురస్థుఁడు. పౌలితనికి వందనములు పంపెను (రోమా $16^{15}$). ఇతఁడు హతసాక్షియాయెనను సంగతిగాక పురాతనగ్రంథముల ద్వారానైనను వేఱుసంగతి దెలియదు. M.

**నేరియా** (Neriah = యెహోవా వెలుఁగు). యిర్మీయాకు సహాయకుఁడుగా నుండిన బారూకు

యొక్క తండ్రి (యిర్మీ $32^{12,16}$ $36^{4,8,32}$ $43^{3,6}$ $45^{1}$ $51^{59}$ బారూకు $1^{1}$).

**నేరు** (Ner = వెలుగు).

1. అబ్నేరు తండ్రి. ఇతఁడు రాజైన సౌలు యొక్క పినతండ్రి (I సమూ $14^{50,51}$).

2. రాజైన సౌలుతండ్రియగు కీషుకు తండ్రి లేక పూర్వికుఁడు (I దిన $8^{33}$ $9^{35,36}$). పైనున్న వాక్యములలో I సమూ $14^{50}$ లో నేరు సౌలుకు పినతండ్రియని చదువక అబ్నేరు అతనికి పినతండ్రి యని చదువవలెనని కొందఱనుకొందురు. అట్లయినయెడల 1, 2 లలోనివారు ఇద్దఱు కాక ఒక్కరే యైయున్నారు.

**నేరేడు వృక్షము** గుంజుచెట్టు చూ॥

**నేర్గల్ షరేజరు** (Nergalsharezer = కల్దీయ భాషలో నెర్గల్ - షార్ - ఉజుర్ *Nergal - shar - uzur* = నెర్గలూ, రాజును కాపాడుము). యెరూషలేము నెబుకద్నెజరుచే పట్టఁబడఁగా యిర్మీయాను విడిపించుటకై అతనిచే పంపఁబడిన యుద్యోగస్థులలో నొకఁడు (యిర్మీ $39^{13}$). ఇతఁడు యెరూషలేములో ప్రవేశించిన మొదటి వారిలో నొకఁడై యుండెను ($39^{3}$). ఇతఁడు జ్ఞానులకధిపతియను బిరుదును పొందినట్లుగా తెలుఁగు బైబిలులో నున్నదిగాని, ఇది ఆ యసలు బిరుదునకు అర్థమగునో కాదో యని సందేహముకలదు. ఈ బిరుదుయొక్క మూలభాషాపదమగు రబ్ మాగ్ (*Rab-mag*) అనునది యొకని పేరుగా నెంచి కొన్ని తర్జుమాలలో దానిని భాషాంతరముచేయక అట్లే యుంచిరి. దీనికి యువరాజు అని యర్థమగునని కొందఱనుకొందురు. బబులోను చరిత్రను చూడఁగా నేర్గల్ షరేజరు ఇట్టి గొప్పవాఁడును నెబుకద్నెజరున కల్లుఁడునై ఎవిల్మెరోదకునకుఁ బిమ్మట క్రీ॥ శ॥ ముందు 559-555 నందు చక్రవర్తియైనట్లుగా నున్నది.

**నేల భూమి** చూ॥

**నేలమొసలి** కీటకములు, సరీసృపములు 20 చూ॥

## నై

**నైలు నది** (The Nile). ఐగుప్తుదేశపు నదులలో నొకటి. ఇది యీ లోకములోని ముఖ్యనదులలో నొకటియై యున్నది. యెష $23^{3}$ లో నైలునది యను పేరున్నను అసలు హెబ్రీలో నది యను నర్థముగల పదముమాత్రమున్నదని తెలిసికొనవలెను. ఈ నదినిగూర్చి బైబిలులో నసేక సూచనలు కలవు (ఆది $41^{1,2,3,17,18}$ నిర్గ $1^{22}$ $2^{3,5}$ $4^{9}$ మొ॥) గాని దానికి ఏరు లేక నది అనుపేరుతప్ప సాధారణముగా వేఱేపేరులేదు. అసలు హెబ్రీలో నైలు అను పేరు బొత్తుగా కనఁబడదు. తెనుఁగు బైబిలునందు యెష $23^{3}$ లోను నహూ $3^{8}$ లోను దానికి నైలు అను పేరుపెట్టిరికాని అసలులోని యీ వాక్యములలో నది లేక కాలువ యను నర్థమునిచ్చుపదముతప్ప వేఱొకటిలేదు. యెష $23^{3}$ లోను యిర్మీ $2^{18}$ లోను దీనికి షీహోరు అను పేరు కలదు. ఆ మాటకు నలుపు అని యర్థము. ఆది $2^{13}$ లోని గీహోను అనుపేరు నైలునదికి మాఱుపేరని కొందఱనుకొందురు గాని యది రూఢికాదు. నైలు అనుపేరు గ్రీకువారు దానికి పెట్టినపేరై యున్నది. ఐగుప్తీయులు దానినొకదేవతనుగా నెంచి దానికి పూజచేసిరి. ఆ నదివలననే ఐగుప్తుకు భూసారము కలుగును. ఆ నది లేకపోయినయెడల ఐగుప్తుకూడ దానిచుట్టునుండు ఎడారులవలె నుండి యుండును. ఐగుప్తులో వర్షములు కురియుట అరుదు. ఈ నది ఆఫ్రికా మధ్యభాగమున నుత్పత్తియగును. అచ్చట వర్షాకాలములో అనఁగా జూన్ మాసము మొదలు నవంబరుమాసమువఱకు చాల వర్షము కురియును. అందువలన ఆ నది యుప్పొంగి వరదలై ఐగుప్తుదేశమందంతట వ్యాపించును. దీనిచే దేశమునకు తేమమాత్రముగాక భూసారము కూడ కలుగును. ఈ వరద ఏడు సంవత్సరముల దాక రాకపోవుటచే యోసేపు కాలమందు ఐగుప్తులో కరవు కలిగెను (ఆది $41^{30}$). ఐగుప్తీయుల చరిత్రలలో యోసేపుకాలమునకు చాలపూర్వమున ఏడు సంవత్సరములవఱకు ఆ వరద రాకపోవుటనుగూర్చి మఱియొక సూచన కలదు.

**నైవేద్యము** అర్పణములు III చూ॥

## నొ, నో

**నొసలు, నుదురు, లలాటము** (Forehead). నొసటినిగూర్చి బైబిలునందున్న

కొన్ని సూచనలనుమాత్రమిచ్చుట వివరింతుము. యెహె $3^{8,9}$ లో నుదురు ఇశ్రాయేలీయుల హృదయకాఠిన్యమునుగాని సిగ్గుమాలినతనముగాని సూచించును. యిర్మీ $3^{3}$ లోని మూలపదమును దానినే సూచించునుగాని తెలుఁగు బైబిలునందు దానినట్లు వ్రాయక ధైర్యము అని తెనిఁగించిరి. దేవునికి పరిశుద్ధత యనువాక్యములు చెక్కిన బంగారపురేకును ప్రధానయాజకుని నొసటికి కట్టిరి. భక్తులందఱి నొసటిమీఁద తక్కిడ రూపము ముద్రగా వేయఁబడినట్లున్నది (యెహె $9^{4}$). మూలభాషాపదమునుబట్టి అది హెబ్రీ అక్షరములలోని చివరి యక్షరమగు తా (ת) గుఱుతు అయినట్లు స్పష్టమగుచున్నది. ప్రకటన గ్రంథములోను భక్తుల నీవిధముగా ముద్రించినట్లు చూడవచ్చును (ప్రక $7^{3}$ $9^{4}$ $14^{1}$ $22^{4}$). అందులోని యలంకారములలో క్రీస్తువిరోధికి శిష్యులైన వారి నొసటిమీఁదకూడ వానికి సంబంధించిన ముద్ర వేసినట్లున్నది ($13^{16}$ $14^{9}$ $17^{5}$ $20^{4}$).

**నో, నో ఆమోను** (No, No Ammon = అమ్మోనుదేవత పట్టణము). పూర్వము దక్షిణ ఐగుప్తులో నుండిన యొక గొప్ప పట్టణము. అది ఆమోను అను దేవతకు ముఖ్య పూజా స్థానమగుటచే దానికి నో ఆమోను అనుపేరు వచ్చెను (ఆమోను చూ॥). ఈ పట్టణమునకు గ్రీకువారు తేబేస్ (*Thebes*) అనుపేరు పెట్టిరి. నేటివఱకు దానికి ఇదే వాడుకపేరుగా నున్నది. క్రీ॥ ము॥ 16 వ శతాబ్దమం దిది యున్నతస్థితి గలదియై ఐగుప్తునకు రాజధాని యాయెను. తరువాతికాలములో అది రాజధాని కాకపోయినను, ఆమోనుదేవతకు పూజాస్థానమగుటచేతను ఆమోనుదేవత పూజారులకు గొప్ప యధికారముండుటచేతను దాని ప్రసిద్ధితగ్గక యుండెను. క్రీ॥ ము॥ 8 వ శతాబ్దమున దక్షిణముగా నుండు ఐతియోపీయులనువారు దానిమీఁదికి పలుమాఱులు దండెత్తివచ్చి యుద్ధము చేయుటచేత దానిస్థితి తగ్గిపోయెను. క్రీ॥ ము॥ 667 వ సం॥ లో అష్షూరు చక్రవర్తియగు అష్షూర్బనిపాల్ (*Ashurbanipal*) అనువాఁడు దానిని జయించెను. అష్షూరు చక్రవర్తియగు ఏసర్హద్దోను (II రాజు $19^{37}$) క్రీ॥ ము॥ 687 వ సం॥ లో దానిని జయించెను. నహూము $3^{8}$ లో ఈ రెండు జయములలో నేదో యొక దానికి సూచనకలదు. యిర్మీయాయు ($46^{25}$) యెహెజ్కేలును ($30^{14,15}$) దాని నాశనమునుగూర్చి ప్రవచించిరికావున అది వారికాలములో నింకను నిలిచియుండెనని స్పష్టమగును. క్రీ॥ ము॥ నాల్గవ శతాబ్దమునుండి దానిస్థితి బొత్తిగా తగ్గిపోయెను. ప్రస్తుతము దాని యునికిపట్టునందు లుక్సోరు (*Luxor*) కార్నక్ (*Karnak*) మెదినెత్ - హాబు (*Medinet-Habu*) అను చిన్న పల్లెలుమాత్రమున్నవి. పూర్వముచట కట్టఁబడిన గొప్ప ఆలయములపాడు శేషము లింకను గలవు. అవి నేటివఱకు చాల వింతైనవని యెంచెదరు. (పటము VI, D 7).

**నోగహు** (Nogah = ప్రకాశము). దావీదుకొడుకులలో నొకనిపేరు (I దిన $3^{7}$ $14^{6}$).

**నోదాబు** (Nodab = ఘనతవహించిన). యొర్దానుకు తూర్పుగా నుండు అరబ్బీయుల తెగవారిలో నొకతెగకుపేరు. రూబేనీయులు గాదీయులు మనష్షే అర్ధగోత్రమువారును వారికి విరోధముగా యుద్ధముచేసి వారిని గెల్చిరి (I దిన $5^{19}$).

**నోదు** (Nod = తిరుగుట). కయీను హేబెలును చంపినతరువాత వెళ్లినదేశముపేరు (ఆది $4^{16}$). అది ఏదెనుకు తూర్పున నుండెను గాని దానియునికినిగూర్చి మఱియేమియు తెలియదు.

**నోపు** (Noph). ఐగుప్తుదేశములోని మిగుల పురాతనపట్టణము. మొదటి రాజవంశస్థులు దానిస్థాపించిరి. దక్షిణఐగుప్తులో నో యను పట్టణమేలాగున ముఖ్యపట్టణమయ్యెనో అట్లు నోపు ఉత్తరఐగుప్తులో ముఖ్యపట్టణమయ్యెను. ఉత్తరఐగుప్తు సాధారణముగా ఐగుప్తుదేశమని యెంచఁబడెను. క్రీ॥ ము॥ నాల్గవ శతాబ్దము వఱకు నోపు పట్టణము ప్రాముఖ్యముగా నుండెను గాని తరువాత అలెక్సంద్రియ పట్టణము స్థాపింపఁబడినందున నోపుయొక్క ప్రాముఖ్యత తగ్గిపోయెను. అది కైరో యను పట్టణమునకు దక్షిణముగా అఱుక్రోసుల దూరములో నుండెను. కైరోను కట్టుటకు దీని రాళ్లనుపయోగించిరి. అది ప్త (*Ptah*) అను దేవతయొక్క ముఖ్య పూజా స్థానమయ్యెను. ఆ దేవతకు ఏపిస్ (*Apis*) అను

క్రేయగల కూడ లేక యొద్దు వాహనముగా నున్నది. గ్రీకువారీ పట్టణమును మెంఫిస్ (*Memphis*) అని పిలిచిరి. శిథిలపరిశోధకులు సాధారణముగా నీపేరునే వాడెదరు.

బైబిలులో నున్నట్లు యెషయా (19[13]) హోషేయ (9[6]) యను ప్రవక్తలు 8 వ శతాబ్దమందు దానిపేరును తమ ప్రవచనములలో నెత్తిరి. అధిపతియగు గెదల్యాను చంపినపిమ్మట ఐగుప్తునకు పారిపోయిన యూదులలో కొందఱు అచ్చటికి వెళ్లిరి (యిర్మీ 44[1]). 2[16] లోని నోపు తహపనేసు అను పట్టణములు ఐగుప్తుదేశమును సూచించును. యిర్మీయా (46[19]) యును, యెహెజ్కేలును (30[13,16]) దాని నాశనమునుగూర్చి తెలిపిరి. ఆ ప్రవచనముల ప్రకారమే నేటిదినమున అచ్చట కొన్ని పాడు శేషములుతప్ప మరేమియులేవు. (పటము VI, C 3).

**నోబహు** (Nobah = మొఱుగుట).

1. మనష్షీయులలో నొకతెగవారు. వారు హౌరాను (*Hauran*) లో నున్న కెనాతు అను పట్టణమును జయించి దానికి నోబహు అనుపేరు పెట్టిరి (సంఖ్యా 32[42] కెనాతు చూ॥).

2. గిద్యోను మిద్యానీయులను తరుముటను గూర్చిన చరిత్రలో కనఁబడు ఒక ఊరిపేరు (న్యాయా 8[11]). అది గాదుకును అరబ్బీయుల యెడారికిని సరిహద్దుగా నుండిన ప్రదేశములో నుండెనుగాని దానియునికినిగూర్చి ఇంక తేటగా తెలియదు.

**నోబు** (Nob = దిబ్బ). యాజకులు నివసించిన యొక యూరు (I సమూ 22[11,19]). అచట మందిరమును ఏఫోదునుండెను (21[1]). దావీదు సౌలుయొద్దనుండి పారిపోయి అచటికి వచ్చెను. అచ్చటి యాజకులు దావీదుకు సహాయము చేసినందువలన సౌలు వారిని చంపించెను. అష్షూరువారు యెరూషలేముమీఁదికి వచ్చుచుండఁగా ఈ యూరిమీఁదుగా వచ్చిరి (యెష 11[32]). అచ్చటి పేర్లజాబితాను చూడఁగా అది యెరూషలేమునకు సమీపముగా నుండెనని యనుకొనఁదగును. ఈ యూరు చెఱకాలమునకుఁ బిమ్మటకూడ నుండెను (నెహె 11[32]). అది అనాతోతుకు సమీపముగా నుండెను. ఈ వాక్యములను చూడఁగా ఇది యెరూషలేమునకు ఉత్తరముగా నుండు సమీపగ్రామమని తేటగా తెలియునుగాని దాని యునికినిగూర్చి ప్రస్తుతమే సూచనలును లేవు.

**నోయా** (Noah = చలనము). సెలోపెహాదు కుమార్తెలలో నొకతె (సంఖ్యా 26[33] 27[1] 36[11] యెహో 17[3]). సెలోపెహాదుకు కుమారులు లేనందున ఈమె తన యక్కసెల్లెండ్రతో తండ్రి స్వాస్థ్యమునకు వారసురాలయ్యెను.

**నోరు** (Mouth). ఈ మాటచే తెనిఁగించిన ఏడు హెబ్రీపదములును, రెండు గ్రీకుపదములును బైబిలునందు గలవు. వాటిని వివరింపనవసరములేదు. అనేకచోట్ల నోరు వాక్కును సూచించును (నిర్గ 4[12] యోబు 31[30] కీర్త 149[6] మొ॥). క్రియచేతఁగాక నోటితోమాత్రము కనఁబఱచెడు మాయభక్తి నోటిమాటతో దేవుని సమీపించుట యనఁబడెను. ఇదే పెదవులతో ఘనపరచుట యనియు చెప్పఁబడెను (మ 15[7]). దేవునివాక్యము ఆయననోటిమాట యనఁబడెను (యెష 45[23] మ 4[4] మొ॥). ఈ పదమునే దేవుఁడు సెలవిచ్చుట యనియు తెనిఁగించిరి (ద్వితీ 8[3] యెష 1[20] మొ॥). అది తిండినికూడ సూచించెను (ప్రస 6[7] మీకా 8[5] మొ॥. భూమి.) ఆయావాటిని మ్రింగుటచే దానికిని నోరున్నట్లు అలంకారరీతిగా నున్నది (ఆది 4[11]). దాతాను అబీరాములపక్షమున నున్నవారి సంహారమై భూమి తననోరు తెరచినట్లు అలంకారముగా చెప్పఁబడెను (సంఖ్యా 16[30]).

**నోవద్యా** (Noadiah = యెహోవా యెదురు పడెను).

1. ఎజ్రాకాలములో నుండిన యొక లేవీయుఁడు (ఎజ్రా 8[33]).

2. నెహెమ్యాను ఎదిరించిన యొక ప్రవక్త్రి (నెహె 6[14]).

**నోవహు** (Noah = విశ్రాంతి, ఆదరణ). షేతుసంతతివాఁడగు లెమెకు కుమారుఁడు (ఆది 5[28,29]). అందఱును దేవునిమఱచి లోకభోగములలో మునిఁగియుండు సమయమున (మ 24[38]), ఇతఁడు నీతిపరుఁడై దేవుని నమ్మెను (ఆది 6[9] హెబ్రీ 11[7]). ఆ కాలమున లోకభోగములతోపాటు బలాత్కారమును మెండుగా నుండెను

(ఆది 6[11]). మానవులు బొత్తుగా చెడిపోవుటచే (6[5]) దేవుడు వారిని జలప్రళయముచేత నాశనము చేయగా, నోవహును అతని కుటుంబమును రక్షించెను (6-9). దుష్టత్వముచే నిండిన ఆ కాలములో నోవహు నీతిమంతుడగుటచే నీతిని ప్రకటించినవారి కతడు మాదిరిగా నెంచబడును (II పేతు 2[5]). దేవుని యాజ్ఞప్రకార మతడొక నావను కట్టించి తనను తన భార్యను తన ముగ్గురు కుమారులను వారిభార్యలను మొత్తము మీద ఎనిమిదిమందిని, ప్రతివిధమగు జంతువును రక్షించుకొనెను (నావ చూ॥). జలప్రళయమైన పిమ్మట దేవుడతనితో తన నిబంధనను స్థిరపఱచి, దానికి గుఱుతుగా ఇంద్రధనుస్సు నిచ్చెను (ఆది 9[8-17]). నోవహు వ్యవసాయముచేసి ద్రాక్షతోటలను నాటెను (9[20]). ఎంతటి భక్తులైనను వారు పాపాత్ములే యను బోధకనుగుణ్యముగా నోవహు పాపము నెంతమాత్రమును దాచక, అతడు త్రాగుబోతనియు, అవమానము నొందె ననియు తెలియుచున్నది (9[21-24]). తన యవమానమును చూచి ఎగతాళిచేసిన హాము నతడు శపించెను (9[25-27]). అతడు 950 సం॥ లు జీవించినవాడై కాలముచేసెను (కాలక్రమణిక చూ॥). ఇతనిద్వారానే మానవజాతి రెండవ మాఱు ఉత్పత్తియాయెను. పై సూచనలే గాక, దేవుడతనితో చేసిన నిబంధననుగూర్చియు (యెష 54[9]), అతని భక్తినిగూర్చియు (యెహె 14[14]) ఉదాహరింపబడెను. నావలో నున్నవారు రక్షింపబడుట బాప్తిస్మముద్వారా కలుగు రక్షణకు సూచనగా నున్నది (I పేతు 3[20]). హిందూ పురాణములందలి మనువుచరిత్రకును నోవహు చరిత్రకును కొంతసంబంధము కనబడుచున్నది (జలప్రళయము చూ॥).

**నోవహు** (Nohah = నెమ్మది). బెన్యామీనుయొక్క నాల్గవ కుమారుడు (I దిన 8[2]).

## న్యా

**న్యాయపీఠము** (Judgment Seat). ఈ పదముచే తెనిగించిన గ్రీకు మాటను రోమనులును గ్రీకువారును అధికారులు న్యాయము తీర్చిన స్థలమునకు ఉపయోగించిరి. ఆ పద శబ్దార్థమునుబట్టి అది ఎక్కవలసిన స్థలమై యుండెనని గ్రహింపవచ్చును. ప్రస్తుతమును న్యాయము తీర్చువారు మెట్లమీదుగా నెక్కవలసిన పీఠము మీద కూర్చుండుటను చూచుచునే యున్నాము. పిలాతు (మ 27[19] యోహా 19[13]), హేరోదు (కార్య 12[21]), గల్లియో (18[12,16,17]) ఫేస్తు (25[6,10,17]) అనువారు తీర్పుతీర్చునప్పుడు పీఠముల మీద కూర్చుండియున్నట్లు క్రొత్త నిబంధన యందు సూచనలగుపడుచున్నవి. అందఱును దేవుని తీర్పునకు లోనగుదురు కావున దేవుడును (రోమా 14[10]), క్రీస్తును (II కొరి 5[10]) ఇట్టి న్యాయపీఠముమీద కూర్చుండెదరనునది అలంకారముగా చెప్పబడెను (న్యాయతీర్పు, యెరూషలేము VI 4 చూ॥).

**న్యాయము** (Justice). న్యాయము చేయుట దేవుని లక్షణములలో నొకటి (ద్వితీ 32[4] యోబు 8[3] కీర్త 9[3] 45[6] ప్రక 15[3] మొ॥). ఆయన పరిశుద్ధుడును నీతిమంతుడునగుటచే న్యాయమైన కార్యములా లక్షణములకు వెలుపటి దృష్టాంతములని చెప్పవచ్చును. దేవుడు అట్టివాడగుటచే మానవులుకూడ న్యాయము చేయవలెనని బైబిలు బోధహైయున్నది (ద్వితీ 16[18,19] యెష 1[17] 5[7] ఆమో 5[24] మొ॥). న్యాయముచేయుట మంచివారికి సంతోషము కలిగించును (సామె 21[15]). అది రాజులకు భూషణము (యెష 32[1]). మనుష్యులు న్యాయమును త్రిప్పివేసినప్పుడు ప్రవక్తలు వారిని బహుగా గద్దించిరి (59[8,15] ఆమో 5[7] మొ॥ న్యాయము తీర్చుట, న్యాయతీర్పు, నీతి చూ॥).

**న్యాయముతీర్చుట, న్యాయము తీర్చువారు** (The Administration of Justice). న్యాయము తీర్చుటయందు క్రమక్రమేణ మార్పులు గలిగియున్నట్లు బైబిలునందు చూడవచ్చును. ప్రస్తుతమందునట్టి క్రమమైన యేర్పాటు లారంభమందుండకపోయినను అవి కాలక్రమేణ కనబడి వృద్ధిలోకి వచ్చెను. వాటి క్రమము నీ దిగువ వివరములో జూడనగును.

1. ఆరంభమున కుటుంబపు పెద్దయైనవాడిట్టి సంగతులను విచారించి న్యాయము తీర్చెను. తన కుటుంబములోని యెవరికైనను మరణశిక్ష

సహా విధించుటకు తండ్రికి హక్కు ఉండినటుల ఆది 38[24] వలనఁ దెలియుచున్నది. ఒక కుటుంబికుఁడు కానివాఁడెవడైనను ఆ కుటుంబములో నెవనికైనను అన్యాయముచేసిన పక్షమున వారతనికి బలాత్కారముగా శిక్షవిధించి కసితీర్చుకొనుట అలవాటాయెను (9[6] సంఖ్యా 35[19]). న్యాయమును తీర్చుకొనుటకు తగిన యేర్పాటులు లేని జాతులలో ఇంక నిట్టివాడుకలున్నట్టు తెలియుచున్నది.

2. కుటుంబ పెద్దలేగాక గోత్రపుపెద్దలును న్యాయము తీర్చుట క్రమక్రమేణ వాడుక యయ్యెను. ఇశ్రాయేలీయుల తగవులను విచారించి వారికి న్యాయముచేయుటకు మోషే పూనుకొనెను (నిర్గ 18[13]). ఆ పని యొకనికి భారమైనదగుటచే తనకు సహాయముచేయుటకై 70 మంది నేర్పఱచెను (18[14-27]). విచారణీయములగు సంగతులను విమర్శింపనై ఊరిగవనియొద్ద కూర్చుండెడివారు (ద్వితీ 21[18-21]). తమ సంగతులను వారికిఁదెలిపి వారిచే న్యాయము చెప్పించుకొనుటకు వచ్చెడివారని ఆయా దృష్టాంతముల వలనఁ దెలియును.

ఏదైన నొక సంగతిని విచారించుటకు తగిన వీలులు లేకపోయినయెడల వారు దేవునియొద్ద విచారణచేయుటకై రావలసిన నియమముండెను (నిర్గ 22[8,9]). భాషాంతరమునందున్నట్లు అచ్చట దేవుఁడు అని తెనిఁగించిన పదమును న్యాయాధిపతియని తెనిఁగింపవలసినదేమోనని కొందఱి యభిప్రాయము గాని, దేవునియొద్ద విచారణ చేయునట్టి యాజకులు తగిన యాచారములతో దానిని తీర్చవలసియున్నారనుట మంచి యభిప్రాయముగఁదోచును. ద్వితీ 21[1-9] లో అట్టి విచారణనుగూర్చిన యొక దృష్టాంతముగలదు.

3. దేశమున రాజు నియమింపఁబడిన పిమ్మటను న్యాయముతీర్చు విషయములో నిదివఱకున్న యేర్పాటులే నిలిచియున్నను (I రాజు 21[8-13]). దాని విషయమై రాజ్యసంబంధములగు ఏర్పాటులును చేయఁబడెను. వాటివలన రాజే రాజ్యమందలి ప్రధాన న్యాయాధిపతి యయ్యెను. గొప్ప గొప్ప వ్యవహారముల నతఁడే తీర్చినట్లున్నది (I సమూ 8[20] II సమూ 14[4-27] 15[2,6] I రాజు 3[9] II రాజు 15[5]). రాజైన సొలొమోను తీర్పు చేయుటకై అధికారమంటపము నొకదానిని గట్టించెను (I రాజు 7[7]). కుటుంబపు పెద్దలట్టి వ్యవహారములలో న్యాయము తీర్చుటను మానఁగా దానికొఱకై ప్రత్యేకమగు ఉద్యోగస్థు లేర్పాటు చేయఁబడిరి. వారిలోఁ గొందఱు నేటివఱకు జరుగుచున్నట్లు న్యాయమును పాటింపక స్వలాభమును చూచుకొని లంచగొండులైరి. యెషయా కాలములో అట్లు చేయుట సర్వసాధారణ మాయెను (యెష 1[23] 5[7,20,23] మీకా 3[11] 7[3]). ఇతర ప్రవక్తలుకూడ సర్వసాధారణమగు నీ పాపమును ఖండించుచు వచ్చిరి (యెహె 18[8] 22[13] ఆమో 5[7] 6[13] I రాజు 21[17-24]). మెస్సీయ ప్రభుత్వము ఇట్టివాటికి భిన్నమైనదై, కేవలము న్యాయ ప్రభుత్వమగునని ప్రవచించిరి (యెష 11[3,4]).

రాజులిట్లు తాము నియమించిన వారిచే న్యాయము తీర్చినను ఆయా వాటినిగూర్చి తీర్పు చేయుటకు యాజకుల కింకను వాడుక ఉండెనని దెలిసికొనవలెను. ఊరీము తుమ్మీములు వారి వశముననుండుటచే అట్టి సంగతులను విచారించుటకు వారికి విశేష వీలులు చిక్కెను. ఇదిగాక వారు ధర్మశాస్త్రములోని నియమములను చక్కగా నెఱిఁగినవారై యుండిరి (ద్వితీ 17[8-13] 19[16-21]). వీరుగాక ఊరిపెద్దలును పంచాయతిగా నేర్పడి అనేక వ్యాజ్యములను తీర్చుచువచ్చిరి (II రాజు 10[5] యిర్మీ 26[17] విలా 5[14]). ఇట్టి విచారణలు పట్టణపు గవనులయొద్ద జరిగినట్లనేక సూచనలవలనఁ దెలియును (ఆమో 5[12-15] ద్వితీ 21[19] 22[15] 25[7] జెక 8[16]).

4. చెఱకాలమునకుఁ బిమ్మట పంచాయతీ పెద్దలు ఇంకను న్యాయము దీర్చుచుండినటుల ఎజ్రా 7[25] 10[14] వలనఁ దెలియుచున్నది. ఈ కాలములోనే సన్హెడ్రిన్ సభవారు హైకోర్టు యొక్క అధికారములను వహించి గొప్ప విచారణలను సలిపినట్లును, అప్పీలులను వినినట్లును యూదుల పారంపర్యములవలన స్పష్టమగుచున్నది. కనీసపక్షము యిద్దఱు సాక్షులుండవలెననియు, వారు యుక్తవయస్కులగు పురుషులై సత్యమే చెప్పెదమని ప్రమాణము చేయవలెననియు, సాక్షులు లేనియెడల సంగతులను విచారించుటకు అడ్డు

సవాళ్లు వేయవలెననియు, అబద్ధసాక్షులున్న యెడల వారి సాక్ష్యమువలన నెట్టి శిక్ష కలుగునో అదే శిక్షను వారికి విధింపవలెననియు ట్లాల్ముడు అను గ్రంథములవలనఁ దెలియుచున్నది.

5. క్రొత్త నిబంధనకాలములో యూదులు రోమీయుల ప్రభుత్వము క్రిందనుండిరి. మత విషయములలో స్వయముగా తీర్పుజేసి శిక్ష విధించుట కధికారము రోమీయులవలననొందినను మరణశిక్ష మాత్రము రోమీయులే విధించవలసి యుండిరి (యోహా 18[31,32]). ఇతర నేరములకు వారే శిక్షవిధించిరి (కార్య 4[3] 5[40] 9[2]). అల్లరి మూకలనురేపి ఆయా వారలను చంపిరి (7[54-60]) గాని యిది పద్ధతికి విరుద్ధముగా జరిగిన విషయము. మతసంబంధములగు వ్యాజ్యములను చెఱకు పిమ్మట కాలములోవలె విచారించినను న్యాయము తీర్చుట రోమకవారి ప్రభుత్వకాలములో వేఱువిషయముగా నుండెను. ఆంగ్లేయులవలె రోమనులును న్యాయము బహు నూటిగా విచారించిరి. రోమీయ పౌరస్థితిగల పౌలుకు చేసిన తీర్పును చూడఁగా రోమీయులు న్యాయముతీర్చిన విధము కనఁబడును ఫిలిప్పయిలో వారు చేసినది రోమకవారి న్యాయవిరుద్ధమైనది (16[22-24, 37-39]). కొరింథులో గల్లియో చేసిన తీర్పునుబట్టి రోమనుల ప్రభుత్వపు శ్రేష్ఠతను గమనింపవచ్చును (18[12-16]). పౌలు యెరూషలేమునందు పట్టుబడిన పిమ్మట, అధికారుల స్వార్థ ప్రయత్నముచే నతనికి అన్యాయము సంభవించినను రోమీయులు న్యాయముతీర్చిన విధము స్పష్టమగుచున్నది (24-26). నేరము మోపఁబడిన పిమ్మట వారు నేరస్థుని ఖైదులో నుంచినను అది విడి ఖైదుగా నుండెను. రోమన్ పౌరస్థితిలేని వారికి గొర్నరు చెప్పిన తీర్పేచివరిదిగాని పౌరులు చక్రవర్తికి అప్పీలు చేసికొన హక్కుగలిగియుండిరి (25[11,12]).

**న్యాయవిధాన పతకము** యాజకుల వస్త్రములు II 1 చూ॥

**న్యాయాధిపతి (Judge).** 1. అక్రమ సంబంధమగు వ్యాజ్యములు తీర్చువాఁడు (నిర్గ 21[22] ద్వితీ 16[18]). గొప్ప వ్యాజ్యములనుగాక అల్పవిషయములను తీర్చుటకు పదిమంది కొకనిని ఏఁబదిమంది కొకనిని నూరుమంది కొకనిని వేయిమంది కొకనిని న్యాయాధిపతుల నేర్పఱచుమని మోషేమామయగు యిత్రో సలహా ప్రకారమతఁడు వీరిని నియమించెను (నిర్గ 18[13-26]). మతసంబంధములగు సంగతులను సివిలు సంబంధములగు సంగతులనుగూర్చి పరిష్కరించుట కిదివఱకే ఆయా గోత్రములకు ప్రధానులును పెద్దలు నుండిరి. మోషే తాను నూతనముగా స్థాపించిన నియమముల ప్రకారము వీరును న్యాయముతీర్చు అధిపతులైయుండి వారసత్వముద్వారా పొందిన యధికారమును నిలుపుకొనిన వారైరి (ద్వితీ 1[15-17] 21[2]). ఇశ్రాయేలీయులు స్వాస్థ్యముగా నొందఁబోవు దేశమున కాపురములు కుదుర్చుకొన్న పిదప న్యాయాధిపతులను అధికారులను నియమించుకొని, వారికి మించిన సంగతులను యాజకులచే పరిష్కరించుటకు కొని పొమ్మని తగినకట్టుదిట్టములను మోషే తన మరణమునకు ముందుగానే చేసెను (16[18-20] 17[2-17] 19[15-20] యెహో 8[33] 23[2] 24[1] I సమూ 8[1]). రాజరిక మారంభమగుటతో రాజు అందఱికన్న గొప్ప న్యాయాధిపతి యయ్యెను (II సమూ 15[2] I రాజు 3[9-28] 7[7] I సమూ 8[5]). దావీదు లేవీయులను న్యాయముతీర్చు పనికి నియమించి వారిలో 6000 మందిని అధిపతులగాను న్యాయాధిపతులుగాను ఏర్పాటుచేసెను (I దిన 23[4] 26[29]). రాజైన యెహోషాపాతు యూదా రాజ్యమందలి బురుజులు గల పట్టణములన్నింటిలో న్యాయాధిపతులను నిర్ణయించి వారికి మించిన వివాదాంశములను పరిష్కరించు లేవీయులు యాజకులు కుటుంబ ప్రధానులు గలిగిన మహా న్యాయసభను యెరూషలేమునందు స్థాపించెను. మతవిషయములలో దీనికి ప్రధాన యాజకుఁడును ఇతర సంగతులలో యూదా గోత్ర ప్రధానియు అగ్రాసనాధిపతులుగ నుండిరి (II దిన 19[5-8]).

2. విదేశీయులవలన తన జనాంగమునకు కలిగిన బాధల నణచుటకై ప్రజల నాయకుఁడుగా నుండు నిమిత్తము దేవునిచే నియమింపఁబడిన వాఁడు. ఇతఁడు ప్రజలకు విమోచనము కలిగించి దేవునిచే నా పనికిఁ నియమితుఁడని ప్రజలు తెలిసికొనిన పిదప వారు తమవ్యవహారమును పరిష్కరించుకొనుటకై అతని యొద్దకు వెళ్లిరి. ఈ

న్యాయాధిపతులు మోషేవంటి రక్షకులైయుండిరి. దేవునివలన నేర్పరచఁబడకనే తన్నుతాను రాజుగాఁజేసికొనిన అబీమెలెకు (న్యాయా 9) గాక 12 మంది న్యాయాధిపతులేలిరి. వారెవరనగా.—అరామ్నహరాయీము రాజు వశము నుండి విమోచించిన యూదా గోత్రికుఁడగు ఒత్నీయేలు; మోయాబీయులు అమ్మోనీయుల నుండి ప్రజలను విడిపించిన బెన్యామీనీయుఁడగు ఏహూదు; ఆరు వందలమంది ఫిలిష్తీయులను సంహరించి ఇశ్రాయేలీయులను రక్షించిన షమ్గరు; నఫ్తాలీ జెబూలూను గోత్రికులను ఉత్తరకనానీయులపైకి నడిపి వారియుక్కడఁచిన బారాకు దెబోరాలు; ఇశ్రాయేలీయుల దేశమునుండి మిద్యానీయులఁ పారదోలిన గిద్యోను; తోలా యాయీరులు; అమ్మోనీయులతో యుద్ధముచేసి జయించిన యెఫ్తా; ఇబ్సాను ఏలోను అబ్దోను, ఫిలిష్తీయులతో పోరాడిన సమ్సోనులు. ఏలీ సమూయేలులును న్యాయాధిపతులుగ నుండిరి (I సమూ $4^{18}$ $7^{15}$) గాని, ఏలీ ప్రధాన యాజకోద్యోగ ధర్మమునుబట్టియు సమూయేలు ప్రవక్తోద్యోగ ధర్మమునుబట్టియు ఆ పనిని నిర్వహించిరి. ఈ న్యాయాధిపతులు ఒకరి తరువాత నొకరు క్రమముగా ఈ పనిని చేయక ఆయా అవసర సమయముల వచ్చినప్పుడు దేశముయొక్క వివిధ భాగములలో నిట్లు జరిగించిరి. ఏదో కొంత ప్రదేశమువఱకుమాత్రమే వారి పలుకుబడి చెల్లెను. వారిలో నెవరును అన్ని గోత్రముల వారి నేకముగా యుద్ధమునకుఁ బురికొలిపినట్లు గానరాదు. ఇశ్రాయేలీయులకు ఆయా శత్రువులవలన హింసలొక కాలమునందే వివిధ స్థలములలోఁ గలిగియుండునుగాన వీరిలో కొందఱు సమకాలీనులని చెప్పవచ్చును. ఉదాహరణముగా షమ్గరు చరిత్ర ఏహూదు చరిత్రలో వచ్చునట్లు ఇముడ్చఁబడినది (న్యాయా $3^{30}$). యొర్దానుకు తూర్పున అమ్మోనీయులు జయశీలురై యూదా ఎఫ్రాయిము బెన్యామీను గోత్రికులను హింసించిన కాలమునందే యూదా గోత్రికులను మఱొక తిక్కున ఫిలిష్తీయులు బాధపఱచిరి ($10^{7}$).

ఈ సంగతులనుబట్టి న్యాయాధిపతుల కాలములో జనాంగస్థితి యెట్లుండెనో దెలిసికొనుట కాధారము కలుగుచున్నది. యొర్దాను నది వలనను, యూదా వారికిని ఉత్తరగోత్రముల వారికిని మధ్యనున్న అన్యజనములవలనను గొప్ప అడ్డు ఏర్పడెను. ఆయా గోత్రము లొకదానితో నొకటి ఐక్యపడునను గుఱుతులున్న జాడ కనఁబడుటలేదని దెబోరా కీర్తన, యెఫ్తా చరిత్రముల వలనఁ దెలియుచున్నది. యూదావారు తక్కిన వారినుండి వేఱుగా నుండుట స్పష్టమైన సంగతియే (యూదా 2 చూ॥). అయినను అందఱి నైక్యపఱచుటకై యత్నము లుండకపోలేదు. బెన్యామీను గోత్రికులను రూపుమాపఁజేసిన యుద్ధమునకు పూర్వమును తరువాతను గోత్రముల కన్నిఁటికి కలిగిన భావోద్రేకములు (న్యాయా 19-21) ఈ సంగతికి దృష్టాంతమై యున్నది. అన్ని గోత్రములకును ఒకటే నిబంధన మందసము గల ప్రత్యక్షపు గుడారము షిలోహులో నుండెను (యెహో $18^{1}$ న్యాయా $21^{19}$ నిర్గ $23^{14-17}$ తో సరిపోల్చుము). ఆ గుడారమును యుద్ధమునకు పూర్వము దేవునియొద్ద ఆలోచన అడుగు నిమిత్తము తాముకూడిన బేతేలుకు తెప్పించిరి (న్యాయా $20^{18-29}$). వారికి కలిగిన గొప్ప హింసలు వారందఱేకమగుట కొక బలమైన కారణమయ్యెను. ఒకని నాయకత్వము నంగీకరించి అతనియెడల భక్తి శ్రద్ధలుంచిన పక్షమున తమకెంత మేలగునో దానిని తమ నాయకులద్వారా కనుగొనిరి. అందఱును కలిసినందున కలిగిన గొప్ప విడుదల వారు మఱింత ఐక్యపడుటకు మంచికారణములయ్యెను. న్యాయాధిపతులకాలము ఇశ్రాయేలీయులకు కలియుగమువంటిదిగా నుండెను. ప్రజలు బహుతఱుచుగా విగ్రహారాధనలో పడుచు వచ్చినందున దేశమునకు కలిగిన కల్లోల స్థితిలో ప్రత్యక్షపు గుడారముండిన స్థలములో తగినట్లు ఆరాధనలు జరుగ వీలులేకపోయెను. యాయేలు సీసెరాను వధించుట, యెఫ్తా తన కూతురును అర్పించుట, గిద్యోను సుక్కోతు పెద్దలకు చేసినది, గిబియా వారొనర్చిన పాతకము మొదలగు వాటిని బట్టి మట్టుమర్యాదలులేని క్రూరకిరాతకులుగా నుండినట్లు దోచుచున్నదిగాని యెఫ్తా కుమార్తె గనుపఱచిన పితృభక్తి, రూతు నయోమియెడల చూపిన భక్తి విశ్వాసములు, బోయజు కనపఱచిన నీతియుక్తమైన నడువడివలన అంతయు అంధకార

బంధురమేగాక మిగుల దూరమునుండి తమకాంతిని వ్యాపింపఁజేయు నక్షత్రపు వెలుఁగును సూచించు చున్నవి.

**న్యాయాధిపతుల గ్రంథము (The Book of Judges).** పాఁత నిబంధన గ్రంథముల వరుసలో నేడవదియు, యెహోషువ గ్రంథమునకు తరువాత నుండు పుస్తకము. బహుశః సమూయేలు దీని గ్రంథకర్తయై యుండును.

ఇశ్రాయేలీయులమీఁద అధికారులయి వారి శత్రువులనుండి విడిపించుచువచ్చిన పదముగ్గురు న్యాయాధిపతుల చరిత్రమందుండుటచే దీని కీపేరు వచ్చెను. వీరు రాజులకంటె తక్కువవారు. ఆయా గోత్రములలోనుండి జనులకు సంరక్షకులుగాను, న్యాయాధికారులుగా నుండుటకు వలయు విశేష జ్ఞానభక్తి సంపదలు గలిగినవారుగా దేవునిచే నేర్పరచఁబడిరి. కావుననే యిశ్రాయేలీయులు తమకొక రాజు కావలెనని కోరినప్పుడు దైవచిత్తము నెదిరించి ఆయన రాజ్యాధిపత్యమును విసర్జించుట రాష్ట్రీయమైన వారి యజ్ఞానపు వాంఛకల ననుసరించుటయై యున్నది. దేవుని జనులగువారు రాజులవలన కలుగు కష్టముల నొందక స్వతంత్రులుగా నుండవలెననుట దేవుని చిత్తమై యున్నది.

ఇశ్రాయేలీయులు మిగుల సారవంతమగు కనాను దేశమును స్వాధీనపఱచుకొనిన యల్పకాలములోనే వారు యెహోవాను మఱచి ఆయనకు విరోధముగా గొప్ప పాపములొనర్చిరి. అందుచే వారు యెహోవావలన తమ శత్రువుల కప్పగింపఁబడి, కడు ఇడుమల పాలైరి. గాని వారు పశ్చాత్తాపపడినవారై యెహోవాతట్టుకు తిరిగినపుడు ఆయన వారియందు కనికరపడి తమ శత్రువులను జయించ సామర్థ్యముగల విమోచనకరుల నప్పుడప్పుడు వారికి దయచేయుచుండెను. అన్యులగు కనానీయులతో సాంగత్యము చేయుటయు వారి విగ్రహములను బూజించుటవలననే వారి కట్టి యాపదలు కలిగెను.

ఈ గ్రంథమునందు యెహోషువ మరణము మొదలుకొని సమ్సోను మరణమువఱకుగల దాదాపు 308 సంవత్సరముల చరితము గలదు.



1. దేవుఁడు తన స్వజనులగు ఇశ్రాయేలీయులను న్యాయాధిపతు లేలునట్లు చేయుటను గూర్చియు, 2. మానవ బలహీనత, కృతఘ్నత, సులభముగా పాపమునకు లోఁబడు స్వభావము, ఆయన వారి కొనర్చిన మహోపకారములు, వారి పోషణకర్తగాను తండ్రిగా నుండునని ఎన్నివాగ్దత్తములు చేసినను వారు ఆయనను మఱచి పాపము చేయుటనుగూర్చియు, 3. పాపమును శిక్షించుటలో దేవునికిఁగల ఖండితమగు న్యాయబుద్ధియు, నిజమైన పశ్చాత్తాపము గలవారిని క్షమించి పోషించుటయందు దాయనకుగల కృపా బాహుళ్యమును గూర్చియు మన మీ గ్రంథమున చూడవచ్చును.

న్యాయాధిపతులు దేవునిచే నియమింపఁబడి శత్రువులను జయించి స్వకీయులను విడుదలచేసి న్యాయమును పరిపాలించుటలో క్రీస్తుకు ముంగుఱుతులుగా నున్నారు.

ముఖ్యభాగములు:—

I. పీఠిక $1^{1}$-$2^{23}$. ఇశ్రాయేలీయులు తప్పిపోవుటనుగూర్చి ముఖ్యముగ దీనియందున్నది. యూదా ($1^{1-20}$), బెన్యామీను ($1^{21-26}$), మనష్షే ($1^{27-36}$) గోత్రీకులు తప్పిపోవుట, అందువలన దేవుఁడు తనదూతను పంపి ($2^{1-5}$) వారిని విడిపించుట ($2^{6-23}$).

II. చరిత్ర ($3^{1}$-$16^{31}$). దీనియందు వారిని విడిపించిన విమోచకులను గుఱించి చెప్పియున్నది. వారు ఏడుమాఱులు తప్పిపోయిరి. మొదటిసారి తప్పిపోయి ($3^{1-11}$) మెసపొతేమియులకు ఎనిమిదేండ్లు సేవచేసి ప్రథమ న్యాయాధిపతియగు ఒత్నీయేలువలన విడిపింపఁబడిరి. రెండవసారి అపరాధులయి ($3^{12-30}$) మోయాబీయులకు 18 యేండ్లు దాసులుగా నుండి ఏహూదుచే రక్షింపఁబడిరి. మూఁడవ మాఱు కనానీయులకు ఇరువదేండ్లు సేవఁజేసి దెబోరా బారాకులవలన విమోచన నొందిరి ($4^{1}$-$5^{31}$). నాలుగవ మాఱు మిద్యానీయుల కేడేండ్లు బానిసలై గిద్యోనుచే రక్షింపఁబడిరి ($6^{1}$-$8^{32}$). ఐదవసారి తోలా యాయీరులను వారు రక్షించిరి. అది మిగుల అందోళన కాలమై యుండెను ($8^{33}$-$10^{5}$). ఆరవసారి అమ్మోనీయులకు 18 యేండ్లు సేవజేసి యెఫ్తాచే విడిపింపఁబడిరి ($10^{6}$-$12^{7}$). ఏడవమాఱు ఫిలిష్తీ

యులకు నలువదేండ్లు దాసులై సమ్సోనుచే రక్షణ నొందిరి ($13^{1}$-$16^{31}$).

III. అనుబంధములు ($17^{1}$-$21^{25}$). ఈ భాగమునందు మీకా చేయించిన పోత విగ్రహమును దానీయులు ఉత్తర ప్రాంతములకు గొనిపోవుట ($17^{1}$-$18^{31}$) ను గూర్చియు, గిబియావారు చేసిన అపరాధమునకై బెన్యామీను గోత్రమునకు కలిగిన శిక్షాఫలితమునుగూర్చియు ($19^{1}$-$21^{25}$) గలదు. (న్యాయాధిపతి 2 చూ॥).

H.

## ప

**పంచాంగము** కాలమానము చూ॥

**పంటకూర్పు పండుగు** పండుగలు ఉపవాసములు III 1 (3) (c) చూ॥

**పంటు** వృత్తులు చేతిపనులు III 1 చూ॥

**పంట్రుకోల (Habergeon).** యోబు $41^{26}$ లో పంట్రకోలయని తెనిఁగించిన పదమును I సమూ $17^{5,38}$ II దిన $26^{14}$ నెహె $4^{16}$ నందు కవచమని తర్జుమాచేసిరి (ఆయుధములు III 3 చూ॥).

**పండుగలు, ఉపవాసకాలములు (Feasts and Fasts).** బైబిలునం దుదాహరించిన పండుగలు క్రొత్త నిబంధనలో కనఁబడినను చాలమట్టుకు అవి పాత నిబంధనలోని పండుగలే. హెబ్రీ భాషయందు అట్టి పండుగలను సూచించు పదములు మూఁడు గలవు. వాటియం దొకటి తురకలువాడు హాజ్ (*Haj*) అను పదమునకు సంబంధించినదై సంతోషమును సూచించును. రెండవది నియమితకాలములను సూచించును. మూఁడవ దానిని **పరిశుద్ధ సంఘము** అని తెనిఁగించిరి (నిర్గ $12^{16}$ లేవీ $23^{3,4,7,8}$ సంఖ్యా $28^{18,25}$ మొ॥). యజ్ఞముల నర్పించుటకును, ఉపవాసము మొదలగు ఆచారముల ననుష్ఠించుటకును చేసిన కూటములకీ మాటను వాడిరి. యూదులకు వారమునకొక మాఱును, నెలకొకమాఱును సంవత్సరమున కొకమాఱు చొప్పున నున్న విశేష పండుగుల నీ దిగువ నుదాహరింతుము:—

1. వారమునందు జరిగిన పండుగు. ఈ పండుగు విశ్రాంతిదినము. అసలునందు సబ్బాతు అనిరి. ఇది వారములోని ఏడవదినమున వచ్చెను. రెండు కారణములచేత వారీ పండుగు నాచరించిరి. ఆరు దినములలో దేవుఁడు సమస్తమును సృజించి యేడవ దినమున విశ్రమించుట ఒక కారణము (ఆది $2^{3,4}$ నిర్గ $20^{11}$). రెండవది, దేవుఁ డిశ్రాయేలీయులను ఐగుప్తు దాస్యము నుండి విడిపించిన దాని జ్ఞాపకార్థమై అట్టి దినమొకటి ప్రతిష్ఠించెను (ద్వితీ $5^{15}$). ఇట్లు విశ్రాంతిదినము సృష్టినిఁబట్టియు, విమోచనమును బట్టియు ఆచరింపవలసియున్నది. పని చాలించుకొని విశ్రాంతి నొందుటవలన దీని నాచరింపవలసియున్నది. పనిచేయకూడదను బోధ నిర్గ $16^{23-30}$ $31^{12-17}$ $35^{1-3}$ సంఖ్యా $15^{32-36}$ నందున్న దృష్టాంతములవలన దృఢముగా బోధింపఁబడినది. విశ్రాంతి దినమును చాలకాలమునుండి యాచరించినట్లు పాత నిబంధన చరిత్రయందలి అనేక వాక్యములవలనఁ దెలియును (II రాజు $4^{23}$ ఆమో $8^{5}$ హోషే $2^{11}$ యెష $1^{13}$). ఇది తన దినమని యెహోవా చెప్పెను (యెహె $20^{12,13}$ $22^{8}$ $23^{38}$). ఇశ్రాయేలీయులు ఈ దినమును నిర్లక్ష్యము చేసినను కుదురుబాటు కాలమునందు దానిని తిరిగి యాచరించెదరని యెహెజ్కేలు వ్రాసెను ($44^{24}$). దాని నాచరించువారికి విశేష దీవెనలు కలుగును. దాని నాచరించు అన్యులైనను దేవుని ప్రజలతో చేర్చఁబడెదరు (యెష $56^{1-9}$ $58^{13,14}$). చెఱకాలమునకుఁ బిమ్మట యూదులు దాని నాచరించునట్లు నెహెమ్యా విశేష శ్రద్ధ బుచ్చుకొనెను (నెహె $10^{31}$ $13^{15-22}$). మక్కబీయుల కాలమునందు యూదులు విశ్రాంతిదినమున యుద్ధముచేయక శత్రువులచే నోడిపోయిరి (I మక్క $2^{31-38}$). అప్పుడు మక్కబీయులలో నొకఁడగు మత్తతీయ అనువాఁడు అవసరమైన యెడల విశ్రాంతి దినమునందు యుద్ధము చేయవచ్చునను ఆజ్ఞనిచ్చెను (I మక్క $2^{39-41}$).

విశ్రాంతిదినము అను పేరును అమావాస్య దినమునకును (II రాజు $4^{23}$ సంఖ్యా $29^{1}$) పస్కా, పర్ణశాలపండుగల మొదటి ఎనిమిదవ దినములకును ($29^{12,35}$) పెట్టిరి. ఏడవ సంవత్సరమునకును

జూబిలీ సంవత్సరమునకును విశ్రాంతి సంవత్సరములని పేరు (లేవీ $25^{2,4,8}$ $26^{43}$ మొ॥).

2. విశ్రాంతి దినమునుగూర్చి క్రీస్తుచేసిన బోధలు. పాత నిబంధనకును క్రొత్త నిబంధనకును మధ్యకాలమున విశ్రాంతి దినమునుగూర్చి యూదులు బహు కఠినమైన నియమములను జేసిరి. టాల్మదు (*Talmud*) అను యూదుల పారంపర్యములలో రెండు కాండములు విశ్రాంతిని గూర్చినవైయున్నవి. ఆ దినమున మేలు చేయవచ్చునను బోధయున్నను, యూదులు దాని నిర్లక్ష్యముచేసి, దీని నాచరించుటవలన తమకు కీడు సహా కలిగినను దానినుండి తప్పిపోకూడదని బహు నిష్ఠతోనుండిరి. క్రీస్తు విశ్రాంతి దినము నాచరించెను (మా $1^{21}$ లూ $4^{6-17}$ $13^{10,11}$) గాని అట్టి వెలపటి యాచారములన్నిటిని ఖండించి విశ్రాంతి దినము మేలుచేయుట తగినదని ఆ దినమున రోగులను స్వస్థపరచి (యోహా $5^{9}$ మా $3^{1-6}$ లూ $13^{10-17}$ $14^{1-6}$), తన శిష్యులాకలిని తీర్చుకొనుటకు ప్రయత్నించుచుండగా వారిని గద్దింపక, అట్లు ఎంచిన వారి కది తప్పుకాదని బోధించెను (మా $2^{23-28}$). ఆచారము కాదుగాని మానవుల క్షేమము మిగుల ముఖ్యమైనదని బోధించెను.

3. విశ్రాంతి దినమును ఆది క్రైస్తవులాచరించిన విధము:—వారు యూదుల విశ్రాంతి దినమును మొదట ఆచరించిరి (కార్య $13^{14}$ $15^{21}$ $17^{2}$) గాని దానితోకూడ మొదటనుండి తమ రక్షకుడు పునరుత్థానుడైన ఆదివారమును కూడ నాచరించిరి ($20^{7}$ I కొరి $16^{2}$). దీనికి **ప్రభువు దిన**మని పేరుపెట్టిరి (ప్రక $1^{10}$). యూదుల ఆచారములను అన్యులు ఆచరింపలేదు గనుక క్రమక్రమముగా, సబ్బాతు దినమైన ఏడవదినమునకు బదులుగా ఆదివారమును విశ్రాంతి దినముగా నాచరించుటకు మొదలుబెట్టిరి. యూదుల విశ్రాంతిదినము గైకొనకతప్పదని బోధించినవారిని పౌలు ఖండించెను (కొలొ $2^{16}$). క్రీస్తు ఆదివారమున లేచినందునను (మ $28^{1}$), ఆ దినమున తన శిష్యులకు కనబడినందునను (యోహా $20^{14-23, 26-31}$). ఆ దినమున పరిశుద్ధాత్మ కుమ్మరింపబడినందునను (కార్య 2), ఆది క్రైస్తవులు దీని నాచరించుచు వచ్చినందునను ($20^{7}$ I కొరి $16^{2}$ ప్రక $1^{10}$) ఇదే నిజమైన విమోచన దినమైనందునను (ద్వితీ $5^{15}$). క్రైస్తవులు దీనిని విశ్రాంతి దినముగా నాచరింతురు.

II. నెలనెలకు జరిగిన పండుగు **అమావాస్య యొకటియే**. యూదులు తమ నెలలను **అమావాస్యతో** నారంభించిరి. (సంఖ్యా $10^{10}$) దీని నాచరింపవలసినదనెడి నియమములు ధర్మశాస్త్రమునందు తేటగా లేకపోయినను, ఇశ్రాయేలీయులు దానిని పురాతనకాలమునుండి యాచరించుచున్నారు (I సమూ $20^{5}$ II రాజు $4^{23}$ ఆమో $8^{5}$ యెష $1^{13,14}$ యెహె $46^{1-3,6}$ మొ॥). క్రొత్త నిబంధన కాలమునందు, యూదులాచారములను నిష్ఠతో నాచరించెడి క్రైస్తవులు కొందఱు దీని నాచరింపవలసినదని బోధించిరిగాని పౌలు వారిని ఖండించెను (కొలొ $2^{16}$ క్రింద III 1 (3) (*a*) చూ॥).

III. సంవత్సరమున కొకసారి యాచరింపఁబడు పండుగలు:— మొదట ఇవి మూఁడు మాత్రమే యుండెను (నిర్గ $23^{15,16}$ $34^{18-24}$). గాని క్రమక్రమముగా నితర పండుగలు వాటితోఁ జేర్పఁబడినవి. సంవత్సరమున కొకమాఱు వచ్చు పండుగ లెవ్వియనగా:—

1. శాస్త్రయుక్తములగు పండుగలు.

(1) **పస్కా లేక పులియని రొట్టెల పండుగు**. ఇది యూదుల పండుగలలో మొదటిది. వసంతకాలమున పగలును రాత్రియు సమముగానుండు (వసంత క్రాంతిపాత) దినమునకుఁ దరువాతి మొదటి అమావాస్యతో యూదుల సంవత్సరమారంభమగును. దాని తరువాత 14 వ దినమున అనగా పౌర్ణమినాడు పస్కాపండుగ నాచరించిరి. ఈ పండుగకు రెండు పేరులున్నవి నిర్గ $12^{1-13, 21,27, 43,50}$ $34^{25}$ లేవీ $23^{5}$ సంఖ్యా $9^{1-14}$ $28^{16}$ ద్వితీ $16^{1,7}$ యెహె $45^{21}$ నందు ఇది పస్కాపండుగ యనఁబడెను. నిర్గ $12^{13}$ నందున్నట్లు ఇది దాటిపోవుటను సూచించును. దేవుడిశ్రాయేలీయులలోని ప్రథమ కుమారులను చంపక, గొఱ్ఱెల రక్తము పూయఁబడిన ద్వారములను దాటిపోవుటచే దీనికీపేరు కలిగెను. పస్కాయను పదమునకు ప్రాయశ్చిత్తమనునది శబ్దార్థమని కొందఱి యభిప్రాయము. గొఱ్ఱె రక్తము ప్రాయశ్చిత్తముగా నుండుటచే దీనికీపేరు వచ్చిన

దని వారి యుద్దేశము. నిర్గ $13^{15}$ నందు దానిని **పులియని రొట్టెల పండుగ** అనియు, $34^{18}$ నందు **పొంగనివాటి పండుగ** అనియు పేరులు గలవు. పులియని రొట్టెలను ఆ పండుగలో తిన్నందున దానికీ పేరు వచ్చెను ($12^{14-20}$ $13^{3-10}$ లేవీ $23^{9-14}$ సంఖ్యా $28^{17-25}$). పస్కాపండుగ మొదటి నెల 14 వ దినమున జరుగును. 15 వ దినమున పొంగని రొట్టెల పండుగ నారంభించి ఏడు దినములవఱకు దాని నాచరింపవలెనని లేవీ $23^{6-8}$ నందున్నది.

ఈ పండుగను ఐగుప్తులోనుండి బయలుదేరినది మొదలుకొని యాచరించినను (యెహో $5^{10,11}$) ఇశ్రాయేలీయులు దాని నాచరింపక నిర్లక్ష్యము చేసిరిగాని, కొన్ని విశేష సమయములయందు దానిని మిగుల గంభీరముగా నాచరింపసాగిరి. ఇట్లు హిజ్కియా కాలములోను (II దిన 30), యోషీయా దినములయందును (II రాజు $23^{21,23}$ II దిన 35) ఈ పండుగ నాచరించిరి. చెఱకుం బిమ్మట ఎజ్రా కాలమున నాచరించిన పండుగ యును అట్టిదే (ఎజ్రా $6^{19}$).

పై నుదాహరించిన వాక్యములనుబట్టి ఈ పులియని రొట్టెల పండుగకును వ్యవసాయమునకును కొంచెము సంబంధమున్నట్లు కనఁబడును. ఇది వసంతకాలమున వచ్చును. అప్పటికి పైరులింక పండియుండవు గాన వారు చేనికిబోయి ఒక పనను కోసితెచ్చి దానిని దేవునికి అల్లాడింపఁబడు అర్పణగా నర్పించిరి (లేవీ $23^{9-14}$). ఇశ్రాయేలీయులు వ్యవసాయకులుగాన వారి పండుగలో ప్రతిదానియందును పంటకు సంబంధించిన సూచనలను కనుగొనవచ్చును. పస్కా పండుగకూడ యిట్టిదైనను, ఆ కాలమునం దిశ్రాయేలీయులు ముఖ్యముగా ఐగుప్తు దాస్యమునుండి విడుదల నొందుటను గూర్చిన దానిని జ్ఞాపకముచేసికొని దాని నాచరించిరి గనుకనే దానికి సంబంధముగా పస్కా గొఱ్ఱెను వధించిరి. పులియని రొట్టెలను తినిరి. ప్రయాణమునకు సిద్ధపడినట్లుండిరి. అప్పటి చరిత్రను వివరించిరి (నిర్గ $12^{1-13, 21-27}$). క్రమక్రమమున మఱికొన్ని యాచారములు వాటికి కలుపఁబడెను. స్తుతిపాత్రలని పిలువఁబడినవాటిని నాలుగుసారులు త్రాగిరి. మొదటిదానిని త్రాగినపిదప తండ్రి సర్గమమునుగూర్చిన చరిత్ర వివరించఁగా 113, 114 కీర్తనలను పాడిరి. రెండవ దానికి పిమ్మట పస్కా విందును భుజించిరి. దానితో పులియని రొట్టెలను, చేదుకూరలతో సిద్ధపఱచిన చారును పుచ్చుకొనిరి. క్రీస్తు రొట్టెను విఱచి ముంచిన పాత్రలోనన్నది అట్టి చారే (యోహా $13^{26}$). తరువాత మూఁడవ స్తుతి పాత్రను త్రాగిరి. లూ $22^{20}$ లోనిది యిది కావచ్చును. తరువాత నాలుగవదానిని త్రాగిరి. ఆ సమయమున క్రీస్తు నిజమైన పస్కా గొఱ్ఱెకు జ్ఞాపకార్థముగా ప్రభువు భోజనమును ఏర్పఱచెను (మ $26^{26-29}$). చివఱకు 115-118 కీర్తనలను పాడి ఆ స్తుతికీర్తనలతో నా విందును ముగించిరి. పస్కా నాచరించుట క్రీస్తు కలవాటుగనుండెను (లూ $2^{41-52}$ $22^{14-23}$ యోహా $2^{13-16}$). ఐగుప్తు దాసత్వమునుండి తమకు కలిగిన విమోచనకు జ్ఞాపకార్థముగా యూదులు దీని నాచరించిరి. గొఱ్ఱెపిల్ల రక్తము వారిని విమోచించుటకైన వెలుపటి సాధనముగా నుండెను. తన ప్రాణము పెట్టుట వలన మనలను మఱీ గొప్ప పాపపు దాస్యములో నుండి విమోచించినందున ఆయన మన పస్కా పశువు అనఁబడును (I కొరి $5^{7}$). యూద క్రైస్తవులు మొదట పస్కాను ఆచరించినట్లు $5^{7,8}$ వలనఁ దెలియుచున్నది. తరువాత ఈ పండుగకు ప్రతిగా క్రైస్తవులు ఈస్టరుపండుగ నాచరింప మొదలుపెట్టిరి. నేటివఱకు ఈస్టరు వచ్చుకాలమును మన పంచాంగము ప్రకారముగాక యూదుల పంచాంగము ననుసరించి లెక్కింతుము. కావున అది యూదుల లెక్క ప్రకారము మొదటి నెల 14 దినము వచ్చినను, మన లెక్క ననుసరించి యేదొయొక తారీఖున రాక మార్చి ఏప్రిల్ మాసములయందు వచ్చును.

షోమ్రోనువారు నేటివఱకు గెరిజీము పర్వతముపై పస్కా నాచరింతురు. యూదులును దాని నాచరించుచుండినను, ఆలయము నాశనమైనది మొదలు పస్కాకు సంబంధించిన ఇతర ఆచారముల నాచరించుటలేదు.

(2) వారముల పండుగ. పస్కాకు ఏడు వారములకు తదనంతరమున ఇది వచ్చినందున దీనికి వారముల పండుగ యని పేరుపెట్టిరి (నిర్గ $34^{22}$ ద్వితీ $16^{9,10,16}$). నిర్గ $23^{16}$ నందున్న **తొలి పంటయొక్క కోతపండుగ** ఇదే. ఆ

పండుగలో ప్రజలు క్రొత్త పంటను నైవేద్యముగా దేవుని కర్పించిరి. యూదుల పారంపర్యములను చూడఁగా, ఈ పండుగ సీనాయికొండ దగ్గర దేవుఁడు ధర్మశాస్త్రము నిచ్చుటకు జ్ఞాపకార్థముగా నాచరించినట్లున్నదిగాని అది బైబిలునందు చెప్పఁబడలేదు. పస్కాకు యాభైదినముల తరువాత నాచరింపఁబడినందున యాభై అని యర్థమిచ్చు గ్రీకుపదము ననుసరించి, దానికి పెంతెకొస్తు అని పేరుపెట్టిరి. వెలుపటి ధర్మశాస్త్రమునకు ప్రతిగా, మన నూతన హృదయములమీఁద దానిని వ్రాయు పరిశుద్ధాత్మ ఆ దినమున కుమరింపఁబడుటచేత (కార్య $2^{1-13}$), ఈ పండుగ క్రైస్తవ పండుగలలో పెంతెకొస్తు అను దానికి ముంగుఱుతుగానుండి నేటివఱకును ఆచరింపఁబడుచున్నదనఁదగును. ఇది మే జూన్ మాసములలో వచ్చును.

(3) ఏడవ వారమును పండుగగా నాచరించినట్లు ఏడవ నెలను పండుగనెలగా నాచరించిరనవచ్చును. ఆ నెలలో మూఁడు పండుగలు వచ్చెను

(*a*) ప్రతి అమావాస్యనాడు బూరనూదినట్లు సంఖ్యా $10^{10}$ లో సూచన యున్నను, ఈ నెల పండుగనెల యగుటచేత దాని కారంభముగానున్న అమావాస్యనాడు విశేషముగా బూరల నూదుటవలన దీనికి **బూరలపండుగ** యని పేరు కలిగెను. దీని **శృంగధ్వని దినమని** తెనిగించిరి ($29^2$). ఈ పేరు బైబిలునందు లేకపోయినను యూదుల పండుగలలో నొకటిగా లెక్కింపఁబడెను.

(*b*) పండుగనెలగా నెంచఁదగిన యేడవ నెలలోని పదవదినమును **ప్రాయశ్చిత్తార్థదినముగా** నెంచిరి (లేవీ $25^9$). ఆనాడు చేయవలసిన విధ్యుక్త ధర్మములు 16, $23^{26-32}$ సంఖ్యా $29^{7-11}$ నందున్నవి. ఆ దినమున ప్రజలందఱు తమ్మునుతాము దుఃఖపఱచుకొనవలసి యుండెను (లేవీ $16^{29}$). ఉపవాస నియమమునుగూర్చిన బైబిలుసూచన యిది యొక్కటి మాత్రమే గలదు (ఉపవాసము చూ॥). గనుకనే ఈ పండుగకు **ఉపవాసదినమను** పేరు కలిగెను (కార్య $27^9$). పాపముల విషయమైన పశ్చాత్తాపమును, అందుకుగాను చేయవలసిన ప్రాయశ్చిత్తమును ఈ యాచారములలో మిగుల గంభీరముగా నాచరింపఁబడినందున, ఆ పండుగ బైబిలునందుదాహరించిన పండుగ లన్నిటిలో బైబిలు బోధల సారమును కనపఱచుచునవచ్చును. హెబ్రీ యుత్తరమును వ్రాసినవాఁడు ఈ విధముగా నది పాఁత నిబంధన యాచారముల శిఖరమని యెంచి, దాని జ్ఞానభావమును వివరించెను (హెబ్రీ $9^{11-28}$). ఈ పండుగదినము యూదుల విశ్రాంతి సంవత్సరములకును జూబిలీ సంవత్సరములకును ఆరంభదినమై యున్నది (లేవీ $25^{9-22}$).

(*c*) ఈ యేడవనెలలోని మూఁడవ పండుగ **పర్ణశాలలపండుగ.** దీని యేర్పాటులు నిర్గ $23^{18}$ $34^{22}$ లేవీ $23^{33-36}$ సంఖ్యా $29^{12-38}$ ద్వితీ $16^{13-15}$ యెహె $45^{25}$ నందున్నది. ఆ పండుగ పేరులనుబట్టి దాని యుద్దేశములను దెలిసికొనవచ్చును. అది **సంవత్సరాంతమందు ఫల సంగ్రహపండుగ** అనఁబడెను (నిర్గ $23^{16}$). ఈ మూలపదమునే $34^{22}$ నందు సంవత్సరాంతమందు **పంటకూర్పు పండుగ** యని తెనిఁగించిరి. కోఁతలన్నియు ముగిసిన పిమ్మట దీనిని కోఁతపండుగగా నాచరించిరి. పర్ణశాలల పండుగ యని దీనికి మఱియొక పేరు గలదు (లేవీ $23^{34}$). వారు అరణ్యమందుండఁగా పర్ణశాలలయందు నివసించినారనుదానికి జ్ఞాపకార్థముగా దీని నాచరించిరి ($23^{42}$). దీని నేడవనెల 15వ తారీఖు మొదలు ఏడుదినము లాచరించిరి. అది యొక పరిశుద్ధదినముతో నారంభించి పరిశుద్ధదినముతో ముగియును గనుక యెనిమిదిదినముల పండుగ అనియు పిలువఁబడును. ప్రతి యేడవ సంవత్సరమున ఈ పండుగ సమయమునందు ధర్మశాస్త్రమును చదువవలెనను నియమము గలదు (ద్వితీ $31^{10,11}$). ఈ పండుగ సమయమునందే ఆలయమును ప్రతిష్ఠించిరి (I రాజు $8^{65,66}$ II దిన $7^{8-10}$). నెహెమ్యా కాలమునందు ఈ పండుగ నాచరించిరి (నెహె 8). తరువాత దేవాలయము యెదుట నీళ్లుచల్లుట, దీపములతో నలంకరించుట మొదలగు వాడుకలను యూదులు చేర్చిరి. క్రీస్తు పండుగకు యెరూషలేమునకువెళ్లి అచ్చట ఈ వాడుకలకు సంబంధముగా బోధించినట్లు కనఁబడును (యోహా $7^{37-39}$ $8^{12}$).

పైనుదాహరించిన మూఁడు పండుగలు నవెంబరు మాసములో వచ్చెడివి.

**2.** ఇతర పండుగలు:—పైనున్న మూఁడు మాత్రమేగాక యూదులాచరించిన యితర పండుగలకును బైబిలునందు సూచనలున్నవి.

(1) **పూరీము పండుగు**:—ఇది మార్చి మాసమందు వచ్చును. నేటివఱకు యూదులు దాని నాచరించుచున్నారు. ఎస్తేరు కాలమునందు యూదులకు కలిగిన విమోచనకు జ్ఞాపకార్థముగా నాచరింతురు (ఎస్తే $9^{20-32}$). బైబిలునందీ పండుగకు సూచనలేవియును లేవుగాని యోహా $5^{1}$ లో నున్న పండుగు ఇదేనని కొందఱి యభిప్రాయము.

(2) **ఆలయప్రతిష్ఠ పండుగు** (యోహా $10^{22}$). క్రీ॥ ము॥ 165 సం॥ నందు మక్కబీయుల కాలములో నారంభమైన పండుగు. మూఁడు సం॥ లకుఁ బూర్వము అంతియోకస్ ఎపిఫనీసు అను సిరియదేశపురాజు ఆలయమును అపవిత్రపఱచెను. దానిని మఱల శుద్ధిచేసిన పిమ్మట, పండుగు నొకదాని నేర్పఱచి, ఎనిమిది దినములవఱకు నాచరించిరి (I మక్క $1^{41,64}$ II మక్క $6^{10,11}$ I మక్క $4^{52-58}$). ఆ పండుగు సమయమున కీర్త 30 పాడిరి.

(3) యజ్ఞములకొఱకైన కట్టెల **నర్పించిన పండుగు.** ఇది సెప్టెంబరుమాసములో వచ్చెను. యోహా $5^{1}$ నందున్నదీపండుగు యని మఱికొందఱి యభిప్రాయము. పై (1) కన్న ఈ యభిప్రాయము క్రీస్తుచరిత్రకు బాగుగా సరిపడును కావున ఇది సరియైన యూహకావచ్చును.

**3.** ఈ పండుగలుగాక, ఏఁటేఁట ఉపవాస దినములుకూడ యూదు లాచరించిరి. అవెవ్వియనగా:—

(1) యెరూషలేము నెబుకద్నెజరుచే తగలఁబెట్టఁబడినదినము. ఇది 5 వ మాసము 7 వ దినమున వచ్చెను (II రాజు $25^{18,19}$). చెఱకాలమునందు దీనిని ఉపవాసదినముగా నాచరించిరి (జెక $7^{3,5}$).

(2) యూదుల గౌవర్నరగు గెదల్యా హతుఁడైన దినము (యిర్మీ $41^{1,2}$ II రాజు $25^{25}$). దీనిని ఏడవనెలలో ఉపవాసదినముగా నాచరించిరి (జెక $7^{2,5}$). రోమీయులు యెరూషలేమును నాశనముచేసినపిమ్మట యిట్టి ఉపవాస దినముల సంఖ్య యధికమాయెను.

4. మక్కబీయుల కాలమునందు ఆరంభమయిన పండుగలు కొన్నిగలవు. బైబిలునందు వాటినిగూర్చిన సూచనలు లేకున్నను ఈ దిగువ రెంటిని గుర్తించుట యుక్తము:—

(1) **నీకానోరుదినము** మక్కబీయులలో యూదాయనువాఁడు క్రీ॥ ము॥ 160 సం॥ నందు నీకానోరుమీఁద పొందిన జయమునకు జ్ఞాపకార్థముగా నీదినము నాచరించిరి (I మక్క $7^{49}$). ఇది మార్చిమాసములో వచ్చెను.

(2) **పట్టణమును తిరిగి పట్టుకొనుటను గూర్చిన పండుగు.** క్రీ॥ ము॥ 141 సం॥ నందు మక్కబీయులు పట్టణమును తిరిగి జయించుటకు జ్ఞాపకార్థముగా దీని నాచరించిరి (I మక్క $13^{50-52}$). ఇది మేమాసమునందు వచ్చెను.

5. సంతోషకరములగు ఇతరకాలములు కోఁతకాలము ఇట్టివాటిలో నొకటి (యెష $9^{3}$). గొఱ్ఱెలబొచ్చు కత్తిరించెడికాలము కూడ అట్టిదే (I సమూ $25^{4}$ II సమూ $13^{23}$) గాని వీటిని పైవాటితోఁ జేర్చలేదు.

IV. ఏఁటేఁటవచ్చు పండుగలుగాక, ఏడవ సంవత్సరమును, ఏడేళ్లు అయినపిదపవచ్చు 50 వ సంవత్సరమును పండుగులుగా నాచరించిరి. ఏడవ సంవత్సరమునందు భూమికి విశ్రాంతిని కలిగించిరి. దాసిసిలను విడిపించిరి. అప్పులను క్షమించిరి. ఇట్టి మంచి నియమము లుండెను (నిర్గ $21^{1-11}$ ద్వితీ $15^{12}$ లేవీ $25^{39-41}$ యిర్మీ $34^{13-20}$). 50 వ సంవత్సరము మఱీ గొప్ప పండుగు (లేవీ $25^{8-24}$). అదే జూబిలి సంవత్సరము. దానిని సునాద మని తెనిఁగించిరి. ఏడవ సంవత్సరమున చేయవలసినవి గాక, అప్పుల క్రింద భుక్తమైపోయిన ప్రతికుటుంబపు స్వాస్థ్యమును విడిపింపవలెను. ఈ సంవత్సరమున దేశనివాసుల కందఱికి విడుదలను ప్రకటింపవలసి యున్నది ($25^{10}$). రాఁబోవు మెస్సీయా వలన కలుగు సౌఖ్యములను వివరించునప్పుడు, ఈ హితవత్సరములోని హక్కుల ననుసరించి ప్రవక్తలు వాటిని వివరించిరి (యెష $61^{2}$ లూ $4^{18,19}$).

**పంద్రెండు**, పన్నెండు సంఖ్య II 11 చూ॥

**పండ్లు** ఫలములు చూ॥

**పంది** (Swine, Boar). అపవిత్రమైన జంతువు. దానిమాంసము నిషిద్ధమని ధర్మశాస్త్ర నియమమై యున్నది (లేవి $11^{7}$ ద్వితీ $14^{8}$). అది హేయ్యముగా నెంచఁబడెను (యెష $65^{4}$). పంది అపవిత్రతకును మూర్ఖమునకు సూచనయై యున్నది (సామె $11^{22}$ మ $7^{6}$ II పేతు $2^{22}$). పందులను మేపువృత్తి యన్నిఁటిలో కడునీచము (లూ $15^{15}$) గాని ధర్మశాస్త్రమును నిరాకరించిన యూదులు తమ విందులలో దాని తినుచు వచ్చిరి (యెష $65^{4}$ $66^{17}$). మక్కబీయులకాలమునందు సిరియకురాజైన అంతియోకస్ ఎపిఫనీసు యూదులచే బలవంతముగా పందిమాంసము తినిపించెను



పందులుతిను పొట్టు

(I మక్క $1^{47-50}$ II మక్క $6^{18-21}$ $7^{1-7}$). నిష్ఠపరులగు యూదులు ఆ యాజ్ఞ నెంతగా లక్ష్యము చేసినను యూదులలో కొందఱు మాంసమును తినుచు పందులను పెంచుచువచ్చిరి. అందుచేత ప్రధానయాజకుఁడగు హార్కేనసు (*Hyrcanus*) ఎవరును పందులను పెంచకూడదని గట్టిగా నాజ్ఞాపించవలసి వచ్చెను. అయినను అన్యజను లమితముగా నుండిన దెకపొలిప్రాంతములలో, క్రీస్తుకాలమునందే పందుల పెద్దమంద యొకటి యున్నట్లు మ $8^{30}$ మా $5^{11-14}$ లూ $8^{32}$ వలనఁ దెలిసికొనవచ్చును. నేటివఱకు యూదులును మహమ్మదీయులును పందిమాంసము హేయ్యమైనదిగా నెంచి వాటిని పెంచరు. కీర్త $80^{13}$ నందు చెప్పఁబడిన పంది పెంపుడుపందిగాక అడవి పందియై యున్నట్లు సంబంధమువలననే తెలిసికొనవచ్చును.

**పందికొక్కులు** మృగములు 38 చూ॥

**పందుము** మానములు కొలతలు II చూ॥

**పందెము** (Race, Games). దేహపరిశ్రమ నిమిత్తమును కాలక్షేపముకొఱకును ఆయా జనులు సాధారణముగా పెట్టుకొను పందెములు యూదులలో నున్నట్లు సూచనలులేవు. I సమూ $17^{10}$ లో నున్నరీతిని ఫిలిష్తీయుఁడు పోట్లాడెదనని పందెము వేసినందున ఇశ్రాయేలీయులును పందెమునకు దిగవలసివచ్చెను. ఆ పందెము తత్కాలముకొఱకైనదే గాని అలవాటు ననుసరించినది కాదు. II సమూ $2^{13-16}$ లో పడుచువారు మల్లచేష్టలు చేసిరి అని యున్నది. అదియొక విధమైన కుస్తీ యనుకొనఁదగును. అయితే అనేకపర్యాయములు జరిగినట్లు అట్టి కుస్తీలు తరువాత గొప్ప యుద్ధములకు కారణములయ్యెను. న్యాయా $14^{12-14}$ లో విప్పుడుకథలు వేసి వాటిని విప్పినవారికి బహుమానము లిచ్చినట్లున్నది. ఇదియును ఒకవిధమైన పందెమే. ఇవితప్ప యూదులలో పందెములుండిన సూచనలు లేవు.

పందెములువేయుట గ్రీకువారికి గొప్ప అలవాటు. వారు తమరాజ్యములోని నాలుగుస్థలములయందు గొప్ప పందెములు వేయుచువచ్చిరి. అట్టిపందెములు జరిగినసమయమందు అందఱును ఆ స్థలములలో కూడుకొనిరి. వాటన్నిఁటిలో కొరింథు పట్టణమున జరిగిన పందెములు ముఖ్యములై యుండెను. అవి క్రీ॥ ము॥ 776 సం॥ ము మొదలు నాలుగేండ్లకొకసారి జరిగెను. దానిని బట్టియే గ్రీకువారు తమశకములను లెక్కించిరి.

అంతియొకయ రాజ్యముమీఁద ప్రభుత్వము చేసిన గ్రీకువారు పలెస్తీనాను ఏలుచుండఁగా వారి పక్షమునునుండిన ప్రధానయాజకుఁడగు యాసోను యెరూషలేములోనే యిట్టి పందెములను స్థాపింపఁబూనుకొనెను (II మక్క $4^{9-17}$). యూదులు

తమ పూర్వీకుల యాచారములయందు అభిమాన పడి యీ పందెములను గ్రీకువాడుక లన్నిఁటిని మఱీ గట్టిగా ఖండించుచు వచ్చిరి. అయినను మహా హేరోదు గ్రీకు నాటకములను పందెములను వేయించుటకు యెరూషలేములో నొక వేడుకశాలను కట్టించుకొనెను (పురా 15.8.1).



పందెములు

గ్రీకువారి పందెములలో చేరవలెనని కోరు వారు పదిమాసములవఱకు చాల కఠినమైన దేహ పరిశ్రమచేయనియెడల ఆ పందెములకు రానియ్యరిరి. వారిట్లు ప్రయాసపడకపోయినయెడల నేమాత్రమును గెలువఁజాలకపోయిరి. ఇట్టి ప్రయాసమునుగూర్చి రోమా $9^{16}$ సూచింపఁబడి యున్నది. ఆ పందెములలో గెల్చినవారికి ఆకులతో నల్లిన కిరీటముతప్ప మఱే బహుమానమైన దొరకకపోయినను అట్టివారిని గ్రీకువారందఱును ఘనపఱచినందున అందఱును అట్టి కీర్తిని కోరిరి. పందెములో చేరువారినిగూర్చిన దృష్టాంతమువలన పౌలు కొరింథులోని క్రైస్తవులను హెచ్చరించెను (I కొరి $9^{24-27}$). అదేరీతిగా తాను పందెములలో పరుగెత్తువానివలె తన క్రైస్తవపరుగులో ప్రయాసపడుచున్నానని మిగుల సూటియైన దృష్టాంతమును ఫిలిప్పీయులకు వ్రాసెను (ఫిలి $3^{12-16}$). క్రైస్తవనడత ఒక పరుగువంటిది అను దృష్టాంతముల నుపయోగించియున్నట్లు గల $2^{2}$ $5^{7}$ ఫిలి $2^{16}$ కార్య $20^{24}$ లలో కనఁబడును. మఱియు తుదవఱకు తనపనిని నమ్మకముగా చేసిన తరువాత నిత్యజీవకిరీటమును పొందుదునను నిరీక్షణనుగూర్చి పౌలు తిమోతికి వ్రాయఁగా పందెములకు సంబంధమైన యిట్టిపరుగును దృష్టాంతముగా పెట్టి వ్రాసెను (II తిమో $4^{7}$).

కుస్తీనిగూర్చిన దృష్టాంతములనుకూడ పౌలు కొన్నిఁటిని వాడెను. ఎఫె $6^{12}$ లోనిది అట్టి దృష్టాంతమే. $4^{27}$ లోని చోటియ్యకుఁడి అను మాటలు ముష్టియుద్ధము చేయునప్పుడు ఎదుటివాఁడు దెబ్బకొట్టకుండ కాచుకొనుటను గూర్చినదని యనుకొందురు. కార్య $19^{31}$ లో ఆసియ దేశాధికారులు అనుబిరుదు నొందిన యుద్యోగస్థులు కలరు. వారి ధర్మములలో ఎఫెసులో జరిగిన పందెములను జరుపుట యనునది ముఖ్యమైనది. I కొరి $15^{32}$ లో మనుష్యరీతిగా నేను ఎఫెసులో మృగములతో పోరాడితిని అను వాక్యము తత్కాలమున జెట్టీలు సింహములతో పోట్లాడుటను సూచించును.

అట్లు పందెములువేయుటనుగూర్చిన దృష్టాంతమును హెబ్రీగ్రంథకర్త $12^{1,2}$ లో నెత్తెను. అందులో సాక్షులనఁబడినవారు పందెములలో ప్రయాసపడువారిని ప్రోత్సాహపఱచుచుండువారు. గెలుచుటకు ఆటంకముగా నుండు భారములను విడిచిపెట్టి ఓపికతో ప్రయాసపడుచు ఇటునటు చూడక గుఱియొద్దనుండు క్రీస్తుమీఁద దృష్టియుంచి పరుగెత్తవలెను. అట్లు ప్రక $7^{9}$ లో జయించినభక్తులు ఖర్జూరపు మట్టలను చేతపట్టుకొనిరి అనుమాటలు ఈ పందెములలో గెల్చినవారికియ్యఁబడు మట్టలను సూచించవచ్చును.

**పంఫూలియ (Pamphylia).** చిన్న ఆసియా దక్షిణభాగములోనున్న యొకపరగణా. అది మధ్యధరా సముద్రతీరమున నున్నది. దానికి

ఉత్తరమున పిసిదియ, తూర్పున కిలికియ, దక్షిణమున మధ్యధరా సముద్రములో నున్న పంఫూలియ సంయుక్తాగ్రగుడము, పశ్చిమమున లుకియయు ఫ్రుగియలో నొకభాగమును సరిహద్దులుగా నున్నవి. పెంతెకొస్తుదినమున పంఫూలియ నుండి వచ్చిన యూదులుకూడ యెరూషలేములో నుండిరి (కార్య 2[9]). కావున పంఫూలియలో యూదులు కాపురముండిరను సంగతి తేటగా కనఁబడును. పౌలు తన మొదటి మిషనెరీ ప్రయాణములో పంఫూలియలో నుండిన పెర్గే అత్తలయ అను పట్టణములను దర్శించెను (13[13] 14[22,25] 15[38]). రోమాకు వెళ్లినపుడు దానికి సమీపముగా ఓడప్రయాణముకూడ చేసెను (27[5]).

**పక్షవాయువు** రోగములు చికిత్సలు II 6 (2) చూ॥

**పక్షిరాజు** పక్షులు 27 చూ॥

**పక్షులు** (Birds). పలెస్తీనునందు 348 విధములగు పక్షిజాతులు గలవని యాదేశమును చక్కగా పరిశీలించిన యొక పండితుఁడు లెక్కించెను. అక్కడ శీతలప్రదేశపు పక్షులెక్కువగా నుండినను, ఉష్ణప్రదేశపు పక్షులును కనఁబడును. రెక్కలుగలవాటిని పక్షులుగ నెంచుటచే గబ్బిలమును పక్షిజాతియందు చేర్చిరి (ద్వితీ 14[17] లేవీ 11[16]). పక్షిజాతి సృష్టిలో నొక ప్రత్యేకమగు జీవరాశియై యున్నది (ఆది 1[21]). పవిత్రాపవిత్ర పక్షుల భేదమునుగూర్చి ధర్మశాస్త్రమునందుదాహరింపఁబడెను (లేవీ 11[13-16] ద్వితీ 41[12-17]). పవిత్రమైనవి యూదుల కాహారమయ్యెను (యెష 10[14] లూ 11[12]). పావురములను గువ్వలనుగాక యితరములగువాటిని యజ్ఞములుగా నర్పించియుండలేదు (లేవీ 1[14]). ఆయా ప్రదేశములకు వెళ్లవలసిన కాలమును గుర్తించి పక్షులు ఎగురుచుండునను సంగతిని ప్రవక్త తన బోధకు దృష్టాంతముగా వాడెను (యిర్మీ 8[7,8]). పక్షులు తమ పిల్లలను కాపాడుట, దేవుఁడు తన ప్రజలను కాపాడుటకు తగిన దృష్టాంతముగా నున్నది (ద్వితీ 32[11] యెష 31[5] మ 23[37]). దిక్కుమాలినవారికి పక్షులవంటివారను దృష్టాంతము వాడిరి (సామె 27[8] యెష 16[2]). ఇంత స్వల్పమైన జీవులకు సహా ఆహారము దొరుకుట, దేవుని యందు మనకుండవలసిన నమ్మికను కనఁబఱచుచున్నది (మ 6[26] 10[29-31]). క్రూరపక్షులు విందుకు పిలువఁబడుట గొప్ప హత్యను సూచించు దృష్టాంతముగా నున్నది (యెహె 39[17,18] ప్రక 19[17,18]). జనములను నాశనముచేయుటకు వచ్చిన కోరెషును క్రూరపక్షితో సరిపోల్చిరి (యెష 46[11]). దేవుఁడు తన ప్రజలను శిక్షించుటకు రప్పించిన అన్యులుకూడ క్రూరపక్షు లనఁబడిరి. బైబిలునందుదాహరింపఁబడిన ఆయా పక్షులపేరులకు సరియైన తెలుఁగుపదములు వాడినట్లు కొన్ని సూచనలున్నవి.

1. **ఉష్ట్రపక్షి** క్రింద 25 చూ॥

2. **ఓదెకొరుకు** (Crane = యిర్మీ 8[7]). ఇది ఓదెకొంగ. కోఁతకాలమునందే వచ్చుటకు వీటికి బాగుగాఁ దెలియును.

3. **కపిరిగాడు** (Night hawk = లేవీ 11[13-16] ద్వితీ 14[12-17]). మూలభాషలోని పద మేపక్షిని సూచించునో రూఢిగాఁ దెలియదు. అదియొక విధమగు గూబయని సాధారణముగా ననుకొందురు.

4. **కాకి, కాకోలము** (Crow, Raven; లేవీ 11[13-16] ద్వితీ 14[12-17]). పలెస్తీనునందు 8



కాకి

రకముల కాకులు గలవు. ఇవి సర్వలోకమున నున్నవి. వీటి పేరు అపవిత్రపక్షుల జాబితాలోఁగాక మఱెచ్చటను బైబిలునందు కనఁబడదు.

5. కుకుడుగువ్వ (Hoopoe = లేవీ $11^{13}$). దీనిని (ద్వితీ $14^{12-17}$) నందు కొంగ యని తర్జుమా



కుకుడుగువ్వ

చేసిరి. మోషే ధర్మశాస్త్రమునందది అపవిత్రమైన పక్షులలోనుండినను ఇప్పుడు పలెస్తీనులోనివారు దానిని తిందురు.

6. కొంగ (Crane). పలెస్తీనునందలి కొంగలు పలువిధములు. లేవీ $11^{16}$ నందును



కొంగ (గలిలయ)

ద్వితీ $14^{17}$ నందును రెండు విధములగు పక్షుల పేళ్లను కొంగ యని తెనిఁగించినట్లున్నది గాని, ద్వితీ $14^{12-17}$ లో అసలుభాషలోకన్న యెక్కువ మాటలుండుటచే, దేనికేపదమును తెనిఁగించిరో నిశ్చయింప వీలుపడదు. (ఓదెకరుకు, చీకుబాతు, సారసపక్షి, కుకుడుగువ్వ చూ॥).

7. కోగిలె (Cuckoo, Sea-mew = లేవీ $11^{16}$ ద్వితీ $14^{15}$). దీని యసలు పదముయొక్క



కొంగ (ఐగుప్తు)

సరియైన అర్థము తెలియదు. దానిని కోవెలవంటి పక్షియైయున్నట్లు తెనిఁగించినను, అది సరికాదని కొందఱి యభిప్రాయము. అదియొక విధమైన కొంగ కావచ్చును.

8. కోడి (Hen, Cock). పాఁత నిబంధనలో కోడి యను పదము లేకుండుటచే పలెస్తీను నందు కోళ్లు లేవని యనుకొనుచుండిరి. గాని యది రూఢి కాదు మ $23^{7}$ లూ $13^{24}$ లోనున్న యసలు పదము కోడినిమాత్రముగాక పక్షి సంబంధించిన దేనినైనను సూచింపవచ్చును.

9. కోరమీను (Ospray = లేవీ $11^{13-36}$ ద్వితీ $14^{12-17}$). దీని యసలుమాట యే పక్షిని సూచించునో అది రూఢిగాఁ దెలియదు. అది కొంగగాని మఱియొక పక్షిరాజుగాని కావచ్చును.

10. కౌజుపిట్ట (Partridge = I సమూ $26^{20}$ యిర్మీ $17^{11}$). పలెస్తీనులోని కౌజుపిట్టలలో రెండు జాతులున్నవి. సమూయేలు గ్రంథము నందలి తరుమఁబడుచున్నవానిని సూచించును. ఈ పక్షి, యితర పక్షుల గుడ్లను పొదుగునట్లు యిర్మీయా గ్రంథమునందు సూచనలున్నవి. అది వృథా ప్రయాసను దృష్టాంతపఱచును.

11. **క్రూరపక్షి** (Bird of prey = యెష $46^{11}$ యిర్మీ $12^{9}$ యెహె $39^{4}$). మాంసము తిను



కౌజుపిట్ట

పక్షులన్నిఁటి నిది సూచించునుగాని ఫలాని పక్షి యన వీలులేదు.

12. **గద్ద** (Kite, Vulture). అసలుభాషలో నీపక్షిని సూచించెడి మాటలు మూఁడు గలవు. వాటిని లేవీ $11^{13-16}$ లోను ద్వితీ $14^{12-17}$ లోను **పిల్లిగద్ద, తెల్లగద్ద, గద్ద** అని తర్జుమాజేసిరి.



గద్ద

వాటిలో నొక పదమును యోబు $28^{17}$ నందు **డేగ** యని తెనిఁగించిరి. ఈ యసలుపదము లన్నియు గద్దను సూచించునుగాని యేజాతి గద్ద యేపదముచే సూచింపఁబడెనో దాని నిశ్చయింప వీలుకాదు. మ $24^{28}$ లూ $17^{37}$ నందున్నది గద్దలనుగూర్చిన సామెతగా నెంచవలెను. ప్రక $4^{7}$ $12^{14}$ లోనున్న అదే యసలుమాటను **పక్షిరాజు** అని తర్జుమాచేసిరి.

13. **గబ్బిలము** (Bat). ఇది పక్షిగాక పోయినను రెక్కలుండుటచేత అపవిత్రమైన పక్షులతోఁ జేర్చఁబడెను (లేవీ $11^{13-16}$ ద్వితీ $14^{12-17}$). గబ్బిలములు నిర్మానుష్యమైన చోట్ల యందుండుటచే విగ్రహములను గబ్బిలములకు పారవేయుట యనునది విగ్రహనాశమును దెలిపెడి దృష్టాంతముగా నున్నది (యెష $2^{20}$).

14. **గుడ్లగూబ** (Owl). అసలునందీ పక్షికి మూఁడుపదము లున్నవి. అవి ఆయా విధములగు గుడ్లగూబలను సూచించును. లేవీ $11^{13-16}$ ద్వితీ $14^{11-20}$ యెష $34^{11}$ లో గుడ్లగూబ అని తెనిఁగించినది పెద్దదైయున్నది. యెష $34^{15}$ లో మఱియొక మాటను **చిత్తగూబ** అని తర్జుమాజేసిరి. ఇది చిన్నగుడ్లగూబ కావచ్చునుగాని దాని అసలు మాటయొక్క అర్థము సరిగా తెలియదు. లేవీ $11^{13-16}$ ద్వితీ $14^{12-20}$ కీర్త $102^{6}$ నందు **పగిడికంకు** అని తర్జుమాజేసిన దాని యసలుపదమును చిన్నజాతి గుడ్లగూబను సూచించుననుకొందురు. పలెస్తీనులో అన్ని విధములగు గుడ్లగూబలు విస్తారముగా నున్నవి.



గువ్వ (పలెస్తీను)

15. **గువ్వ, తెల్లగువ్వ, పావురము** (Dove). పలెస్తీనునందివి మందలు మందలుగ నున్నవి. అసలుభాషయందు వీటికి రెండు పదములు వాడిరి. ఒకదానిని **తెల్లనిగువ్వ** యని (ఆది $15^{9}$ యిర్మీ $8^{7}$) తెనిఁగించిరి. యోనా అను రెండవ పదమును **పావురమని** ఆది $8^{8}$ పర $5^{9}$ $6^{9}$ నందు తర్జుమాచేసినను $1^{15}$ $4^{1}$ $5^{12}$ యెష $59^{11}$ యెహె $7^{16}$ నందు **గువ్వయని** తెనిఁగించిరి.

సొగసైన పిల్లకు దాని నలంకార నామముగా వాడిరి నేటివఱకు పలెస్తీనునందీ పదము నట్లే వాడుచున్నారు. యెష $59^{11}$ యెహె $7^{16}$ నందీ పిట్టధ్వనిని రోదనధ్వనికి పోల్చిరి. క్రొత్త నిబంధన



గువ్వ

యందున్న యొక సాధారణ గ్రీకుపదమును పావురమని తర్జుమాజేసిరి. అది నిష్కాపట్యమునకును, శాంతమునకును సూచనమై యున్నది (మ $10^{16}$). అందువలన నది పరిశుద్ధాత్మ సూచనగా నున్నది ($3^{16}$ మొ॥). యూదులు పక్షిజాతిలో గువ్వలను మాత్రము యజ్ఞములకు వాడిరి (లేవీ $5^{7}$ $12^{6}$ లూ $2^{22-24}$). లూ $2^{22-24}$ నందు గువ్వయని తర్జుమాచేయబడినది గ్రీకు నందు వేఱు పదముగా నున్నది.

16. **గూడబాతు** (Pelican). లేవీ $11^{18}$ ద్వితీ $14^{17}$ నం దిది అపవిత్రమైన పక్షుల జాబితాలో నున్నది. యెష $34^{11}$ జెఫ $2^{14}$ నం దిది పాడైన స్థలములయందుండు పక్షులలో నొకటి.



గూడబాతు

కీర్త $102^{6}$ లో అడవిలోని గూడబాతు అను పేరు కలదు. అచ్చట అలంకారముగా నీ పదమును వాడినను, ఇవి చేపలను పట్టుకొని తిని బ్రతుకును కావున నీరున్న స్థలములలో మాత్రముండునని తెలియుచున్నది పలెస్తీనునందు వీటిలో రెండుజాతులున్నవి.

17. **చిత్తగూబ** పైన 14 చూ॥

18. **చీకుబాతు** (Stork). దీని యసలు పదమునకు భక్తిగలపక్షి యని శబ్దార్థము. తన పిల్లలను చక్కగా చూచుకొనుటచే దీనికీపేరు కలిగినదని యనుకొందురు. ద్వితీ $14^{14-17}$ లో దానిని చీకుబాతు అని తెనిగించినను, ఆ వాక్యమునకు సంబంధించిన లేవీ $11^{13-16}$ నందు దానిని కొంగ యని తర్జుమా జేసిరి. కీర్త $104^{17}$ నందును అదేరీతిగా తర్జుమా జేసిరిగాని యిర్మీ $8^{7}$ జెక $5^{9}$ నందు దానిని **సంకుబుడికొంగ** యనిరి. పలెస్తీనునందీ పక్షులనేకములు గలవు. అది వసంతకాలమునవచ్చి (యిర్మీ $8^{7}$) పైరులను పాడుజేయు పురుగులను నాశముజేయును. ఈ పక్షి యపవిత్రమైనదను కారణముచేత కాదుగాని ఈ జాతివలన కలుగుమేలు నిమిత్త మిది నిషిద్ధజాతిలో జేర్చబడెను.

19. **మువ్వపిట్ట** (Lilith). దీని యసలు పదము యెష $34^{14}$ నందుమాత్రమున్నది. ఎదోము నాశనము చేయబడినపిమ్మట, అచ్చట నివసించెడి పక్షులలో నొకటి. పాత నిబంధనకాలమునకు



మువ్వపిట్ట

పిమ్మట వ్రాయబడిన పురాణములలో దీని యసలు పదమును ఒకవిధమగు దయ్యముగా నెంచినట్లు చాల సూచనలు గలవు. ఆ దయ్యము ముఖ్యముగా పసిపిల్లలకు హానిచేయునని యభిప్రాయపడిరి.

20. **చెరువుకాకి** (Cormorant = లేవీ $11^{17}$ ద్వితీ $14^{17}$). దీనిని నీటికాకి యనవచ్చును. పలెస్తీనునందు వీటిలో రెండుజాతులున్నవి. అపవిత్రపక్షిజాతి జాబితాలో దీని పేరువచ్చును.

21. **డేగ** (Hawk). అపవిత్రమగు పక్షులలో నొకటి (లేవీ $11^{16}$ ద్వితీ $14^{25}$). పలెస్తీనునందీ పక్షిజాతులు 18 గలవు. యోబు $39^{26}$ నందు, అవి యొకస్థలమున స్థావరముగా నుండక తిరుగుచుండునని సూచనగలదు. యోబు $28^{7}$ నందు డేగ యని తెనిఁగించినపదము డేగగాక గద్దలలో నొకజాతియై యున్నది (పైన 12 చూ॥).

22. **గుంబోళ్లు** (Bittern). యెష $14^{23}$ $34^{11}$ జెఫ $2^{13,14}$ నందు ఈ పక్షులు పాడైన స్థలములలో నివసించుననియున్నదిగాన అవి నాశమునకు గురుతులుగా నున్నవి. గాని దీని మూలపదము ఏదుపందిని సూచించుననని కొందఱి యభిప్రాయము.

23. **తెల్లగద్ద** పైన 12 చూ॥

24. **తెల్లబంము, నల్లబోరువ** (Vulture). పలెస్తీనునందివి విశేషముగ నున్నవి. ఇవి అపవిత్రపక్షులు (ద్వితీ $14^{17}$). లేవీ $11^{18}$ నందున్న ఈ పదమునే నల్లబోరువ అని తెనిఁగించిరి. ఇది గూడబాతు జాతిలో చేరినది.

25. **నిప్పుకోడి** (Ostrich). ఈ పక్షిని సూచించు హెబ్రీభాషాపదములు బైబిలునందు మూఁడు గలవు. లేవీ $11^{16}$ ద్వితీ $14^{15}$ నందది నిషిద్ధమైనదిగా కనఁబడుచున్నది. యోబు $30^{29}$ యెష $13^{21}$ $34^{13}$ యిర్మీ $50^{39}$ లో అవి యడవులలో నివసించుటచే, అవి నివసించు స్థలములు పాడుపడినస్థలములను సూచించును. దానికూఁత గొప్ప రోదనధ్వనికి సూచనయై యున్నది (మీకా $1^{8}$). పాడుపడిన స్థలములను దేవుఁడు మాఱల బాగుచేయఁగా, తమకు మేలు కలిగెనని దేవుని ఘనపఱచువాటిలో నిప్పుకోళ్లు నున్నట్లు అలంకారరీతిగా యెష $43^{20}$ నందున్నది. పైన చెప్పఁబడిన వాక్యములలోని పదములు ఒక్కటే హెబ్రీపదముయొక్క భాషాంతరమై యున్నవి. దీనికి సంబంధించిన మఱియొకటి విలా $4^{3}$ నందు **ఉష్ట్రపక్షి** యని తెనిఁగించఁబడెను. యెరూషలేము పట్టణము తన నివాసుల నాదరింపలేకపోవుటచే, అది తన పిల్లలయెడల నిర్దయురాలుగా నున్న ఉష్ట్రపక్షికి సమానముగా నున్నదని అలం



నిప్పుకోడి

కార రీతిగా నచ్చట చెప్పఁబడెను. యోబు $39^{13}$ నందున్న పదము దేవుని సృష్టి మహాత్మ్యములను నొక్కి చెప్పుటలో నుదాహరించిన జంతుజాలములో నొకటిగా నున్నది. ప్రస్తుతమున పలెస్తీనులో నీ పక్షులు లేకున్నను, దానికి ఆగ్నేయదిక్కున నున్న యెడారులలో నెక్కువగా నున్నవి.

26. **నెమలిపిట్ట** (Peacock). ఇది పలెస్తీనులోని పక్షికాదు. సొలొమోను దీనిని దూర



నెమలి

దేశమునుండి తెప్పించెను (I రాజు $10^{22}$ II దిన $9^{21}$). దీని హెబ్రూపదమగు తూకియం అనునది

యదే యార్థమిచ్చు అరవపదమునకు సంబంధముగా నుండుటచే వీటిని దక్షిణ యిండియా నుండి తెప్పించి యుండవచ్చునని కనబడుచున్నది.

**27. పక్షిరాజు (Eagle.)** పలెస్తీనునందీ జాతిలో నెనిమిదిరకము లున్నవఁట. దీని యసలు



పక్షిరాజు

పదము పక్షిరాజునుగాని, పెద్దగద్దనుగాని సూచించును, క్రొత్త నిబంధనలోని మాట ఆ రెండు విధములుగా తర్జుమా జేసిరి (పైన 12 చూ॥). ద్వితీ $28^{49}$ యిర్మీ $49^{14}$ నందు **గద్ద** యనియు, మీకా $1^{16}$ నందు అన్నిఁటికన్న పెద్దగద్దను **బోరువగద్ద** యనియు తెనిఁగించిరి. మీకా లోని ఈ వాక్యమునందది బోడిగా నున్నదని తేటగా చెప్పుటచే అది సరిగా నున్నదనుటకే సందేహమునులేదు. లేవి $11^{13}$ ద్వితీ $14^{12}$ లో దీనిని యపవిత్ర పక్షిగా నెంచిరి. దేవుఁడు తన పిల్లలను కాపాడువిధమును చూపుటకు దృష్టాంతముగా వాడిరి (ద్వితీ $32^{11}$). దేవుని సృష్టి యందలి గొప్ప జీవులలో నొకటి యని యోబు $39^{27-30}$ నందు సూచింపఁబడెను. యెష $40^{31}$ హబ $1^{8}$ లో అది యతివేగముగా నెగురునని యున్నది.

**28. పగిడికంటె** పైన 6, 14 చూ॥

**29. పావురము** పైన 15 చూ॥

**30. పిచ్చుక** (Sparrow = కీర్త $84^{4}$ $102^{7}$ సామె $26^{2}$). పిచ్చుకలు అనుమాటయొక్క అసలు హెబ్రీపదమును సాధారణముగా పక్షి యని తెనిఁగించిరి (ఆది $7^{14}$ $15^{10}$ ద్వితీ $4^{17}$ మొ॥). ఆ యసలుపదమునకు రెండర్థములు కలవు. క్రొత్త నిబంధనలోని గ్రీకుపదము సరిగా పిచ్చుకలనే సూచించును (మ $10^{29}$ లూ $12^{6,7}$). ఇవి దిక్కుమాలినవియును, స్వల్ప



పిచ్చుక

ధరలకే దొరుకునవియునై యున్నవి. వీటిని నేటివఱకు ఆహారముగా వాడెదరు. లూ $12^{6,7}$ నందున్నట్లు, వాటిని ప్రస్తుతమును అంత చౌకగా అమ్ముచున్నారు.

**31. పిల్లిగద్ద** పైన 12 చూ॥

**32. పురిటిపిట్టలు, పూరేడులు** (Quails = నిర్గ $16^{13}$ సంఖ్యా $11^{31,32}$ కీర్త $105^{40}$). ఇవి పలెస్తీనుదేశమునకు ఆఫ్రికానుండి మార్చి మాసమున గుంపులుగుంపులుగ వచ్చు పక్షులు. అవి చాల దూరము ఎగురుటవలన



పూరేడుపిట్ట

కలిగిన ఆయాసముతో నుండునప్పుడు వానిని సులభముగా పట్టుకొనవచ్చును. దేవుఁడు అరణ్యమునం దిశ్రాయేలీయుల కిట్టి పక్షుల మాంసము నిచ్చెను. దీని అసలుపదము మిగుల బలిసినదను అర్థమిచ్చును. ఇవి బాగుగా క్రొవ్విన పక్షులు గాని వాటి నెక్కువగా తిన్నందున వెగటు త్వరలోనే కలుగును (సంఖ్యా $11^{31,32}$).

33. **పెద్ద గోరువ, గోరువగద్ద** పైన 27 చూ॥

34. **పగిడికంటి**, పైన 6, 14 చూ॥

35. **మంగలకత్తిపిట్ట** (Swallow, Crane = యెష 38[14] యిర్మీ 8[7]). దీని యసలుపదము బహు వేగముగా యెగురు పక్షిని సూచించును. యెషయాలో దీని కూత దుఃఖమునకు గురుతుగాను యిర్మీయాలో, తమ కాలము నెఱుగని ప్రజల తెలివితక్కువకు గద్దింపుగా నున్నది.

36. **వానకోవెల** (Swallow, Cuckoo). దీనిని వానకోవెల యని తెనిఁగించినను, అదియొక విధమైన పిచ్చుక యని తలంచెదరు. అది ఆలయమునందు గూడుకట్టుకొనును (కీర్త 84[3]). క్రింద యెక్కడను వ్రాలకుండనే చాల కాలము ఎగురును (సామె 26[2]). ఇది పిచ్చుకలకు సూటిగా సరిపడును.



వానకోవెల

37. **సంకుబుడి కొంగ** పైన 18 చూ॥

38. **సారసపక్షి** (Heron = ద్వితీ 14[17]). ఇదియొక విధమగు కొంగ. (పైన 6 చూ॥)

39. **హంస** (Swan, Horned owl = లేవీ 11[18] ద్వితీ 14[16]). పలెస్తీనులో హంస కనఁబడుట బహు యరుదు, గాన యిది యీ అసలుపదముకు సరియైన అర్థమో కాదో యని సందేహాస్పదముగా నున్నది. సరియైన తర్జుమాయైనపక్షమున దీని నిషిద్దముగ ఎంచినది యపవిత్ర పక్షియని గాక, దీని జాతిని కాపాడుటకని తోఁచుచున్నది.

**పగ** ద్వేషము చూ॥

**పగడము** రత్నములు 7 చూ॥

**పగతీర్చుకొనుట** (Avenging). ఇతరుల వలన దూషణపాలై కష్టముల నొకఁడు భరింపవలసివచ్చిన పక్షమున అట్టి విషయములలో సహింపవలెననుట బైబిలు బోధయైయున్నది (లేవీ 19[18] రోమా 12[19]). అట్టి విషయములో వారు పగతీర్చుకొనక తమ సంగతి యావత్తును దేవుని కప్పగించుకొనుట ధర్మమైయున్నది (ద్వితీ 32[43] II సమూ 22[48] లూ 8[2-7,8] ప్రక 6[10] 19[2]). తన మట్టుకు తాను పొందవలసినవాటి విషయ మిట్లు చేయవలసియున్నను, నేరస్థులను శిక్షింపకుండిన పక్షమున దేశమునకును సంఘమునకును కీడు కలుగనైయున్నప్పుడు శిక్ష విధింపవలెనను బోధయుఁగలదు (సంఖ్యా 31[2]). ఇట్టి శిక్షలు విధించుటకు దేశమునందు క్రమమైన యేర్పాటులు చేయక పూర్వము హత్యచేయఁబడినవాని దగ్గరి బంధువుఁడు హత్యచేసినవానిని శిక్షింపవలెనను ఏర్పాటు ఒకటి యుండుటచే అట్టివానికి పగతీర్చువాఁడు అను పేరు కలిగెనుగాని, శిక్ష విధించుటకు తగిన కట్టుదిట్టములు కలిగిన దేశములలో మాత్రము ఆ విధముగా చేయుటకు వీలులేకపోయెను (నేరములు శిక్షలు III, ఆశ్రయపురములు చూ॥)

**పగలు** కాలమానము III చూ॥

**పగిడికంటి** పక్షులు 6, 14 చూ॥

**పగీయేలు** (Pagiel = దేవునితో కలిసికొనుట). ఇశ్రాయేలీయు లరణ్యమందుండఁగా ఆషేరు గోత్రప్రధాని (సంఖ్యా 1[13] 2[27] 7[72,77] 10[26]).

**పచ్చ** రత్నములు 8 చూ॥

**పచ్చదాళు, పచ్చని** రంగులు 5 చూ॥

**పచ్చబొట్లు** గురుతులు 4 చూ॥

**పచ్చరాయి** రత్నములు 8 చూ॥

**పచ్చిపుండు** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥.

**పటాలము, స్తోమము** (Band). రోమన్ వారి సేనలోని పదవభాగమునకు పెట్టిన పేరును క్రొత్త నిబంధనలో పటాలమని తెనిఁగించిరి (సేన

చూ॥). ఆ సేనయందు 600 మొదలు 1000 మంది సిపాయీలుండిరి. క్రొత్త నిబంధన కాలమునందట్టి పటాలమొకటి యెరూషలేమునందుండెను (మ $27^{27}$ మా $15^{16}$ కార్య $21^{31}$). యోహా॰ $19^{3-12}$ లోని రాణువవారిట్టి పటాలమైనట్లున్నది (ఇటలి, ఔగుస్తు పటాలము చూ॥).

**పట్టణపు అధికారులు** (Politarchs). కార్యముల గ్రంథమునందు లూకా ఆయా పట్టణముల యధికారులకు వెవ్వేఱు పేరుల నుపయోగించినట్లు చూడవచ్చును. థెస్సలొనిక పట్టణములోనివారికి పట్టణపు అధికారులని యర్థమిచ్చు పలితార్కు (*Politarch*) లను పేరుగలదు (కార్య $17^{6}$). థెస్సలొనిక పట్టణపు రాతిశాసనముల యందు ఈ బిరుదు కనఁబడుటచే లూకా ఆ పట్టణములయందు వాడుకలోనుండిన బిరుదులను వాడినట్లు స్పష్టమగుచున్నది. ఈ పేరు రోమన్ అధికారులందఱికిఁగాక ఈ యొక్క దేశపు అధికారులకు మాత్రమే వాడినట్లు మాసిదోనియలో కనఁబడిన 17 రాతి శాసనములవలనఁ దెలియుచున్నది.

**పట్టణపు దిగువ భాగము** యెరూషలేము B IV 3 చూ॥

**పట్టణము** (City). హెబ్రీపట్టణములలో ననేకములు గ్రామములేగాని పట్టణములు కావని తెలిసికొనవచ్చును. సాధారణముగా ప్రాకారములు గలిగినవే పట్టణములైయుండెను (ఆది $4^{17}$ $18^{26}$ $19^{20}$ సంఖ్యా $13^{19}$ న్యాయా $20^{15}$ మొ॥). ప్రాకారములులేని పట్టణములుకూడ వారికుండెను (ద్వితీ $3^{5}$). పట్టణములు దిబ్బలమీఁదగాని, ఊటల యొద్దగాని కట్టఁబడెను. రామా మిస్పా గెబా గిబియోను అను నిట్టి పేరులన్నియు ఎత్తైన స్థలములను సూచించును. ఏన్గెది, ఏన్ గన్నీము, బెయేర్షెబా అను నిట్టి పేరులు ఊటలను లేక బావులను సూచించును. ప్రాకారములకు గొప్ప గవనులుండెను. గుమ్మములమీఁద గదులుకూడ కట్టిరి (II సమూ $18^{33}$). మఱియు గవనులయొద్ద కావలినుంచిరి (II రాజు $7^{10}$ నెహె $13^{19}$ II సమూ $18^{24}$ II రాజు $9^{17}$). వాటియొద్ద పంచాయతీలు కూడి సంగతులను విచారించిరి. సంతలుకూడ పెట్టిరి (ఆది $28^{10}$ రూతు $4^{1,11}$ II సమూ $15^{2}$ I రాజు $22^{10}$ II రాజు $7^{3}$ నెహె $8^{1}$). పట్టణములలోని వీధులు సాధారణముగా ఇఱుకైనవిగా నున్నను విశాలమైనవి కొన్ని గలవు (II సమూ $15^{1}$ I రాజు $1^{5}$ $20^{34}$ యిర్మీ $17^{15}$). వాటిలో సంతవీధులు కూడ కొన్నియుండెను (నెహె $3^{31}$ యిర్మీ $37^{21}$). సాధారణముగా ఈ పట్టణములకు పెద్దలే యేలికలైయుండిరి. మఱియు నీ పెద్దలు మాత్రముకాక న్యాయాధిపతులు కూడ నున్నట్లు ద్వితీ $16^{18-20}$ $19^{12}$ మొ॥ వాక్యములవలనఁ దెలియును. షోమ్రోను పట్టణమునకు ఒక పట్టణపు అధికారి యుండెను (I రాజు $22^{26}$). పెద్దల ప్రభుత్వము సాధారణమైనద్ది అనేక పట్టణములలో క్రొత్త నిబంధన కాలమువఱకు నిలిచి యుండెను (పట్టణపు అధికారులు చూ॥).

**పట్టాభిషేకము** అభిషేకము చూ॥

**పట్టె, జాబితా** వంశావళి చూ॥

**పట్టు** (Silk). పట్టుగుడ్డలనుగూర్చిన సూచనలు బైబిలునందు యెహె $16^{10.13}$ ప్రక $18^{12}$ లో తప్ప మఱేమియు లేవు. పాత నిబంధన కాలములో తూరువారును క్రొత్త నిబంధన కాలములో రోమీయులును ఈ వ్యాపారము చేసినట్లు ఆ వాక్యములవలనఁ దెలియుచున్నది. ఇది పలెస్తీనులోనికి దిగుమతి యగునదే యని యు తెలియుచున్నదిగాన ఇది సుఖభోగములను సూచించును.

**పడవ** ఓడలు 5, 2 (*d*) చూ॥

**పడి** మానములు II, III చూ॥

**పతకము** ఆభరణములు 12, యాజకుల వస్త్రములు II చూ॥

**పతర** (Patara). చిన్నాసియాకు నైరృతి దిక్కుననున్న లుకియ యను పరగణాలోని యొక రేవుపట్టణము. పౌలు చివరి పర్యాయము యెరూషలేమునకు వెళ్లునపు డిచట సిరియకుఁ బోవు ఓడనెక్కెను (కార్య $21^{1}$). పూర్వమున అది సూర్యదేవతకు ఒకముఖ్య పూజాస్థానమై యుండెను. నేటివఱకు దాని పాడు శేషము లున్నవి (పటము V, I 4).

**పత్మాసు** (Patmas). చిన్నాసియాకు నైరృతి దిక్కుననుండు నొక ద్వీపము. ఇది

ఈజియన్ సముద్రములోని ద్వీపముల రాశిలో నొకటియై యున్నది. దాని కైవారము 15 మైళ్లు మాత్రముండెను. అది ప్రస్తుతమున చెట్లు చేమలులేని యొక బొడ్డుబోతు ప్రదేశమై యున్నది. రోమీయులు పూర్వము ఖైదీల నచటికిఁ బంపిరి. క్రీ॥ శ॥ 946 సం॥ లో డొమిషియన్ అను రోమన్ చక్రవర్తి ప్రభుత్వకాలమందు వారు అపొస్తలుఁడైన యోహాను నచటికి



పత్మపట్టణము

ఖైదీగాఁ బంపిరి (ప్రక 1[9]). ఇచటనే యోహాను తన ప్రకటన గ్రంథమును రచించెను. ఆ ద్వీపములో దర్శనముల గుహ యను పేరుగల గుహను నేటివఱకు చూపుదురు (పటము V, H 4 చూ॥).

**పత్రుసీయులు** పత్రోసు చూ॥

**పత్రోబ** (Patrobas). రోమా పట్టణ మందలి క్రైస్తవులలో నొకఁడు. రోమా పత్రికను వ్రాయుచు పౌలు అతనికి తన వందనములను పంపెను (రోమా 16[14]) గాని అతనిగూర్చి మఱేమియుఁ దెలియదు.

**పత్రోసు** (Pathros = దక్షిణము). ఐగుప్తు దేశపు దక్షిణభాగము (యెష 11[11] యిర్మీ 44[1,15] యెహె 29[14] 30[14]). ఐగుప్తులో మధ్యధరా సముద్రమునకు దగ్గరనుండు ఉత్తరభాగము మిస్రాయిము అనఁబడెను. దానిని ఐగుప్తు అని తెనిఁగించిరి. పత్రోసు అను పేరును యెషయా ఐగుప్తునకును కూషుకును మధ్యనుంచెను (యెష 11[11]). యూదులు చెదరఁగొట్టఁబడిన దేశములలో నిదియొకటి (యిర్మీ 44[1,2,15]). ఐగుప్తీయుల లిఖితములను చూడఁగా క్రీ॥ ము॥ 525 సం॥ కు పూర్వమే పత్రోసుయొక్క దక్షిణభాగమునందు యూదులుండినట్లు తెలియుచున్నది. అది 10[14] I దిన 1[12] లో నున్నట్లు దాని నివాసులు **పత్రుసీయులు** అనఁబడిరి (ఐగుప్తు 1 చూ॥).

**పది** సంఖ్యలు II 10 చూ॥

**పదియాజ్ఞలు** (The Ten Commandments). పదియాజ్ఞలు అను మాటలు తెనుఁగు బైబిలునందు నిర్గ 34[28] ద్వితీ 4[13]-10[4] లలో కనఁబడును. అసలు భాషలోని పదములను చూడఁగా అవి పదిమాటలు అను నర్థము నిచ్చును. ఈ పదిమాటలు నిర్గ 20[1-17] లోను ద్వితీ 5[6-21] లోను నున్నవి. నిర్గ 34[1-28] లో నున్న ఆజ్ఞలకు ఆ యధ్యాయమందలి 28 వ వాక్యమునందు పది యాజ్ఞలు అను పేరు పెట్టిరని కొందఱనుకొందురు. నిర్గ 20[1-17] లోను ద్వితీ 5[6-21] లోను ఉన్న యాజ్ఞలను చూడఁగా కొన్ని చిన్న చిన్న భేదము లున్నను వాటిసంగతి యొకటే. విశ్రాంతి దినమునుగూర్చిన యాజ్ఞను చూడఁగా దేవుని సృష్టిని బట్టి దాని నాచరింపవలెనని నిర్గమకాండము లోను, దేవుఁడు తన ప్రజలను ఐగుప్తు దాసత్వము నుండి విమోచించుటనుబట్టి దాని నాచరింపవలెనని ద్వితీయోపదేశకాండములో నున్నట్లు చిన్న భేదముకలదు. తల్లిదండ్రులను సన్మానించుటను

గూర్చిన యాజ్ఞను చూడఁగా నీవు క్షేమముగునట్లు అను మాటలు ద్వితీ॥ లో నున్నవిగాని నిర్గ॥ లో లేవు. మఱియు ఆశించుటనుగూర్చిన, యాజ్ఞలను చూడఁగా నిర్గ॥ లో మొదట ఇల్లు, తరువాత భార్యను ఆశింపకూడదను క్రమమున్నదిగాని ద్వితీ॥ లో భార్య ఇల్లు అను క్రమముకలదు. ఈ యాజ్ఞలు రెండు రాతిపలకలమీఁద చెక్కఁబడి సీనాయి కొండమీఁద దేవునివలన మోషే కియ్యఁబడెను. దేవునియెడల జరిగింపవలసిన విధులు మొదటి పలకమీఁదను మనుష్యులయెడల జరిగింపవలసిన విధులు రెండవ పలకమీఁదను వ్రాయఁబడినవని సాధారణముగా ననుకొందురు. అయితే ఈ యాజ్ఞలను విభాగించుటయందు క్రైస్తవులలో కొన్ని భేదములున్నవి. ఔగుస్తీను అను సంఘ పితురుఁడు వీటిలో దేవుని విషయమైన యాజ్ఞలు మూఁడుగాను మనుష్యుల విషయమైన ఆజ్ఞలు ఏడుగాను విభాగించెను. ఇతరులు మొదటి రెండాజ్ఞలుగా నెంచినవి అతఁడు మొదటి యాజ్ఞగాను ఇతరులు పదియవ యాజ్ఞనుగా నెంచిన దాని నతఁడు తొమ్మిది పది యాజ్ఞలనుగాను ఎంచెను. రోమను కతోలిక్ వారును లూథరను సంఘస్థులును నేటివఱకు ఔగుస్తీను చేసిన విభాగముల ననుసరింతురు. ఇతరులు మొదటి పలకమీఁద నాలుగాజ్ఞలును రెండవ పలకమీఁద ఆఱాజ్ఞలును ఉన్నట్లు వాటిని విభాగించిరి. ఆయా వారలనుసరించు భాగములలో ఇట్టి భేదముండినను ఆజ్ఞలలో మాత్రమే భేదమును లేదు. ఈ యాజ్ఞల సారమును క్రీస్తు రెండు ప్రధానమైన ఆజ్ఞలుగా చెప్పెను (మ $22^{36-40}$). ఆయన కొండమీఁది ప్రసంగములో ఈ యాజ్ఞలలో కొన్నిఁటి భావమును వివరించెను ($5^{21-32}$). ఈ పదియాజ్ఞలు క్రైస్తవులందఱియొక్క నీతి బోధలకు మూలచట్టములైయున్నవి.

**పవితంతుల స్వరమండలము** సంగీతము 3, (3) (*b*) చూ॥

**పదియవ భాగము** దశమభాగము చూ॥

**పద్దనరాము** (Paddan-Aram, Paddan = అరాములోని మైదానము). యుఫ్రాతు టైగ్రీసు నదులమధ్యనుండు ప్రదేశము. ఆది కాండమునందీ పదము తొమ్మిది మాఱులు కనఁబడును ($28^{2-57}$ $31^{18}$ $33^{8}$ $35^{9,26}$ $46^{15}$ $48^{1}$). తెలుఁగు బైబిలునందు ఆది $48^{7}$ నందు పద్దనరాము అను పేరున్నను మూల భాషయందు పద్దను అను పేరు మాత్రము కలదు (అరాము II చూ॥).

**పద్మము** (Lily). పరమ గీతమునందున్న శువానయను హెబ్రీ పదము నీ మాటచే తెనిఁగించిరి (పర $2^{1-16}$ మొ॥) గాని అదియంత యుక్తముగలేదు. హెబ్రీపదము నీటఁబెరుగు పద్మము అమృతలత చిరుబొద్ది మొదలగు మెట్ట పూవులనేకములను దెలిపెడి సాధారణ పదమైయున్నది. పరమగీతమునందలి సంగతులు పద్మములు మొలవని మెరక ప్రదేశములయందు జరిగెను. పరమగీతమునందిది యెట్టి పుష్పమును సూచించునో నిశ్చయింప వీలులేదు. దానిని ఇంగ్లీషు పదముకు సంబంధించిన లిలియా పుష్పమని తెనిఁగించుట యుక్తము. ఈ పదము అనేక పుష్ప జాతులను సూచించును. J. C.

**పద్మరాగము** రత్నములు 9 చూ॥

**పనిముట్లు** వృత్తులు చూ॥

**పనివారిలోయ** (Ge-harashim). ఇది యొక స్థలమునకు పేరని I దిన $4^{14}$ నెహె $11^{35}$ వలన తెలిసికొనవచ్చును. ఇది యూదా గోత్రములో నుండెను (I దిన $4^{14}$) గాని చెఱకుఁ బిమ్మట బెన్యామీను గోత్రికులకు చెందెను (నెహె $11^{35}$). దీనియునికిని గూర్చిన సూచన లేవియులేవు.

**పనులు** వృత్తులు చేతిపనులు చూ॥

**పనూయేలు** (Phanuel = దేవుని సమ్ముఖము). భక్తిపరురాలగు అన్నయొక్క తండ్రి (లూ $2^{36}$).

**పన్ను, సుంకము** (Tax, Custom). ఆది కాలమున పన్ను చెల్లించిన సూచనలు బైబిలునందు లేవు. గొప్పవారి దయను కోరినవారు వారికి బహుమానము లిచ్చిరి (ఆది $32^{13-21}$ $33^{10}$ $43^{11}$) గాని పన్నులు వేయుటగాని చెల్లించుటగాని లేకుండెను. ఇశ్రాయేలీయులు కనాను దేశమును జయింపఁగా, జయింపఁబడినవారిచే ఒక విధమగు వెట్టి పనులను చేయించిరి (యెహో

$16^{10}$ $17^{13}$ న్యాయా $1^{28-35}$). అట్లే యిశ్రాయేలీయులు తమ చుట్టునుండు ఆయా జనాంగములచే జయింపఁబడినప్పుడు తామును అట్టి కఠిన సేవ చేయవలసివచ్చెను (ఆది $48^{15-20}$ న్యాయా $3^{15-18}$). తరువాతి కాలములో యుద్ధమందు దొరికిన దోపుడు సొమ్ములో నొక భాగమును న్యాయాధిపతులు పుచ్చుకొనిరి (న్యాయా $8^{24}$ I సమూ $30^{26}$).

పన్నులను క్రమమనుసరించివేయుట రాజుల కాలమునుండియే కనఁబడుచున్నది. మాకు రాజు కావలెనని కోరిన ప్రజల పెద్దలకు సమూయేలు రాజులు పెట్టు భారములనుగూర్చి దెలిపినప్పుడు ప్రజల సంపాద్యములో పదవవంతు పన్నుగాఁ దీసికొందురని చెప్పెను (I సమూ $8^{15-17}$). తరువాత అది రాజ్యములో నొక పద్ధతి యాయెనని చరిత్రకారుఁడు వ్రాసిన దానినిబట్టి ఊహింపఁదగును. సౌలుకు ప్రజలు కానుక లిచ్చిరి ($10^{27}$). గొల్యాతును చంపిన వాని కుటుంబికులను స్వతంత్రులనుగాఁ జేతునని సౌలు ప్రకటించెను ($17^{25}$). ఆ కుటుంబికులు పన్ను చెల్లింప నవసరము లేదనుట దాని భావమై యున్నది. పాడి పంటలలో తనకు రావలసినదానిని వసూలుచేయుటకై సొలొమోను ప్రత్యేకమగు ఉద్యోగస్థుల నియమించెను (I రాజు $4^{7-28}$). అతఁడు విదేశములతో వర్తకము పెట్టుకొని వివిధములగు సరకులఁ దెప్పించి వీటివలన మిగుల లాభము నొందెను ($10^{15-28}$). దావీదు సొలొమోనుల వంటి మహారాజులు తమచే జయింపఁబడిన ప్రజలచే కానుకలను బుచ్చుకొనిరి (II సమూ $8^{10-12}$ I రాజు $4^{21}$ $10^{25}$ II దిన $17^{11}$). ఇవి యిష్టపూర్వకమగు కానుకలుగాక ఒక విధమైన పన్నులని దెలియవలెను. సొలొమోను ఇశ్రాయేలీయులచే వెట్టిపనికూడఁ జేయించెను (I రాజు $5^{13-18}$). అతఁడు ప్రజలపై వేసిన పన్నులతి భారముగా నుండుటవలనను, అతని తరువాత రాజ్యమునకువచ్చిన రెహబాము వాటిని తేలిక చేయ ప్రజల మనవిని నిర్లక్ష్యపెట్టినందునను రాజ్యవిభాగమయ్యెను ($12^{1-20}$).

సొలొమోను తరువాత రాజ్యమేలిన వారికి వ్యాపారమువలన లాభము లేకపోయినందున ప్రజలకు మఱింత కష్టమగు పన్నులను విధించిరి. రాజుకు ప్రత్యేకమగు కోఁతనిచ్చినట్లు ఆమో $7^{1}$ వలనఁ దెలియుచున్నది. ఆ పన్నును వసూలు చేయుటకు నియమింపఁబడిన వారు ప్రజల నెక్కువగా బాధించిరి (ఆమో $2^{3}$ $5^{11}$ యెష $3^{14,15}$ మీకా $3^{1-3}$). దమస్కువారు దేశముపై దండెత్తి వచ్చిన సమయములలో వారికికూడ కప్పము చెల్లింపవలసివచ్చెను (I రాజు $15^{18,19}$ $20^{1-6}$). తరువాత అష్షూరు ఐగుప్తు బబులోను వారు ఒకరి తరువాత నొకరు వచ్చి దేశమును లోఁబఱచుకొన్నందున వారు చాల బాధపడిరి (II రాజు $15^{19,20}$ $16^{8}$ $17^{4}$ $18^{31}$ $23^{33-35}$ $24^{1}$). బాబెలు చెఱకాలమువఱకు ఇట్టి బాధలలోఁబడి, వాటినుండి తప్పించుకొనుటకు పదేపదే తిరుగఁబడుచుండినను వారి బాధలు క్రమక్రమముగా నెక్కువయ్యెనేగాని తగ్గిన సూచనలు లేవు.

చెఱకాలమునకుఁ బిమ్మట పారసీకుల ప్రభుత్వకాలమునందు వారు ప్రస్తుత కాలమందున్నట్లుగా శిస్తు, సుంకము పన్ను అని తెనిఁగించిన ఆయా విధములగు పన్నులను చెల్లింపవలసి యుండెను (ఎజ్రా $4^{13-20}$ $7^{24}$). గొర్నరుయొక్క ఖర్చుల నిమిత్తమై మామూలుగా వచ్చు కానుకలుగాక (మలా $1^{8}$) రోజుకు 40 తులముల వెండి నియ్యవలసివచ్చెను (నెహె $5^{15}$). ప్రజలు దీని నెంతమాత్రము భరింపలేకపోవుట మాత్రమేగాక వారు మఱింత దరిద్రులగుటకు కారణమయ్యెను. నెహెమ్యా దానిని కనిపెట్టి తన పోషణకు కావలసినది మాత్రమే పుచ్చుకొనెను.

పారసీకులకు పిమ్మట క్రీ॥ పూ॥ 330 నుండి యేలిన అంతియొకయలోని గ్రీకురాజులు ధాన్యపు పంటలో మూఁడవ భాగమును, వృక్షఫలములలో సగమును, ఉప్పుమీఁదను ఇంక నితరములగు పన్నులను విధించిరి (I మక్క $1^{29}$ $10^{28,29}$ $11^{34,35}$). వారివలని నియమింపఁబడిన ఉద్యోగస్థులు వాటిని జమచేసిరి ($11^{20}$). ఐగుప్తులోని తొలెమయివారు పరిపాలకులై పన్నువసూలుచేయుట కంట్రాక్టరుల కిచ్చిరి (పురా 12-$4^{4}$).

క్రీ॥ పూ॥ 63 సం॥న రోమను ప్రభుత్వము పలెస్తీనులో నారంభించినది మొదలు హేరోదు మరణమగునంతవఱకు పలెస్తీనులో నప్పటికి

వాడుకగానున్న రీతిని పన్ను వసూలుచేసిరి గాని గొర్నరులు నియమింపఁబడిన పిమ్మట ఆ పని కంట్రాక్టరుల చేతికివచ్చెను (సుంకరులు చూ॥). ప్రజలు తలపన్ను చెల్లింపవలసివచ్చెను (మ $17^{25}$ $22^{17-19}$ మా $12^{14}$). చాకీ పన్నులను విదేశ సరకులమీఁదను పన్నులను పుచ్చుకొనిరి. వాటిని వసూలుచేయుటకు పట్టణములయొద్ద ప్రత్యేక స్థలములుండెను. మూలభాషయందలి పదమును **సుంకపు మెట్టు** అని తెనిఁగించిరి. బండికింత యనిగాక సరకుల విలువనుబట్టి పన్ను నచ్చుట పోగుచేసిరి. ఇంటి పన్నును వసూలుచేసినట్లు యోసీఫసువలనఁ దెలియును (పురా 19-6-3).

చెలకాలమునకుఁ దరువాతి సర్వలోకమందున్న యూదులకు తలకు అరషెకెలు చొప్పున పన్ను విధింపఁబడెను మ $17^{24}$ లోనున్న పన్ను ఇదే. ఇది మత సంబంధమగునదై యుండెను.

పరాయివారికి పన్నిచ్చుట దేవుని ప్రజలగు ఇశ్రాయేలీయులకు తగదని బోధించిన మతాభిమానులుండిరి. అట్టి బోధ ప్రజల కనుకూలమైనదగుటచేత అది చాలవఱకు వ్యాపించెను. క్రొత్త పన్నులను వేయుటకు ప్రజాసంఖ్య వేయఁగా అట్టి యభిమానముగలవారు తిరుగఁబడుట (కార్య $5^{37}$) ఆశ్చర్యముకాదు. అట్టి మతాభిమానులు క్రీస్తును చిక్కులో పడవేయుటకు పన్నియ్యఁదగునాయని ప్రశ్నించిరి (మ $22^{15-22}$ మా $12^{13-17}$ లూ $20^{19,26}$). కైసరువి కైసరుకు చెల్లించుఁడని ఆయన యెంత తేటగాఁ జెప్పినను, పిలాతునెదుట ఆయన పన్నీయవద్దని బోధించుచున్నాఁడని నేరము మోపిరి (లూ $23^{2}$). అపొస్తలుల బోధయందును పన్ను చెల్లింపవలెననుట బహు తేటగానున్నది (రోమా $13^{7}$ I పేతు $2^{13}$).

**పన్నెండుమంది, పన్నెండుగురు, పంద్రెండుగురు** (The Twelve). అపొస్తలులు పన్నెండుమంది యగుటచే వారు పన్నెండుగురు అను పదములచే పిలువఁబడిరి. అట్టి వాక్యములకు తెలుఁగు బైబిలునందు కొన్నిఁటిలో శిష్యులు లేక అపొస్తలులు అను పదములను దానితోఁ జేర్చిరిగాని అట్లు చేర్చని వాక్యములును గలవు (మ $26^{14,47}$ మా $14^{10,20}$ యోహా $6^{67,70,71}$ $20^{24}$ I కొరి $15^{5}$). ఈ సంఖ్య ఈ వాక్యములలో పన్నెండుమంది అపొస్తలుల పేరుగా వాడఁబడినది (అపొస్తలులు చూ॥).

**పయుర్రై** నయుర్రై చూ॥

**పరదేశి, పరదేశమందు నివసించువాడు** (Stranger, Sojourner). పరదేశులు అను వారు ఇశ్రాయేలీయులలో నివసించి తమ అన్యమతాచారములను విడిచిపెట్టినవారై యుండిరి. పాత నిబంధన యేర్పాటులు వారియెడల బహు దయను చూపును. విశ్రాంతి దినమున విశ్రమించుటకు వారికికూడ సెలవియ్యఁబడెను (నిర్గ $20^{10}$ $22^{21}$ $23^{9,12}$). లేవీయులయెడలను దిక్కుమాలిన పిల్లలయెడలను చూపవలసిన దయ వారియెడలను చూపవలెనని ఆజ్ఞ యుండెను (ద్వితీ $14^{21-29}$ $16^{11}$ $26^{11,13}$). ఇతరులకు న్యాయము తీర్చిన రీతిగా వారికిని న్యాయము తీర్చవలసియుండెను ($24^{14-17,19-21}$ $27^{19}$). అట్టివారు యెహోవాకు అర్పణ నర్పింపవచ్చును (లేవీ $17^{8}$ $22^{18}$). ఈ పరదేశులు కొన్ని యాచారముల నాచరింపవలసివచ్చెను ($17^{10}$ $18^{26}$). పరదేశి యొకఁడు స్థితివంతుఁడైనప్పుడు అతనికి హెబ్రీ బానిస దొరికినయెడల విశ్రాంతి సంవత్సరము రాకమునుపే వాని బంధువులు వానిని విమోచింపవచ్చును ($22^{47}$). అట్టి పరదేశి సున్నతి పొందినయెడల పస్కాను భుజించుటకు సెలవుండెను (నిర్గ $12^{19,48,49}$). వీరిట్లు క్రమక్రమేణ యిశ్రాయేలీయులలో చేరినవారైరిగాని అమ్మోనీయులును మోయాబీయులును ఇట్లు చేయుటకు వీలులేకపోయెను (ద్వితీ $23^{3}$ అన్యులు చూ॥).

**పరదైసు** (Paradise). వనమని యర్థమిచ్చు పారసీక పదము. LXX నందు దీనికి ఏదెను పరదైసు (ఏదెను వనము) అను మాటలను వాడిరి (ఆది $2^{8}$) గాని ఆ పదము హెబ్రీభాషలో లేదు. పరదైసు అను పేరును ఏదెనువనమునకు పెట్టుట పురాతనకాలమునుండి వచ్చెడి వాడుకయై యున్నది. దాని ననుసరించి అది అలంకార రీతిగా పరలోకమునకు కూడ వాడుక మాట యయ్యెను. పాత నిబంధనయందీ పదమును ప్రస $2^{5}$ నందు **శృంగార వనమ**నియు పరమ $4^{12}$ నందు **ఉద్యానమ**నియు నెహె $2^{8}$ నందు **అడవి** యనియు తెనిఁగించిరి. ఆ ప్రమాణిక

గ్రంథములలో అది గేహెన్న యను నరకమునకు వ్యతిరేకపదమై మృతుల సౌఖ్యస్థానమును సూచించుటకు వాడుకమాట యయ్యెను. క్రొత్త నిబంధనయందట్లు దానిని లూ $23^{43}$ II కొరి $12^{4}$ ప్రక $2^{7}$ నందు వాడిరి (పరలోకము చూ॥).

**పరమగీతము (Song of Songs).** పాత నిబంధనయందున్న పరమగీతము రూతు గ్రంథము విలాపవాక్యములు ప్రసంగి ఎస్తేరు అను నీ యైదు పుస్తకములను యూదులు అయిదు గ్రంథపు చుట్టలని యర్థమిచ్చు పదముచే బిలుతురు. ఇవి పాత నిబంధనయందలి చిన్న పుస్తకములు. యూదులీ పుస్తకములను అయిదు విశేషమైన పండుగలయందు సమాజమందిరములలో బహిరంగారాధన సమయమున ధర్మశాస్త్రమునకుఁ దరువాత చదివి వినిపింతురు. పరమగీతమును వారు పస్కా పండుగుయొక్క యెనిమిదవ దినమునఁ జదివిరి.

ఈ గ్రంథముయొక్క నిజమైనయుద్దేశమును దెలిసికొనుట మిగుల కష్టము. దీని కథామూల మిట్లున్నదందురు. ఇశ్శాఖారు గోత్రమందుండిన (యెహో $19^{18}$ I రాజు $1^{3}$) షూనేములోని భాగ్యవంతులలో నొకరి పుత్రికయగు కన్యకపై నామె సహోదరులు కోపపడి ఆమెను తమ ద్రాక్షతోఁటలను కాపాడు నిమిత్తము పంపిరి. ఆమె అక్కడనుండఁగా నొకఁడు ఆమెను చూచి యెత్తుకొనిపోయి రాజనగరులలో నొకదానియందుండు రాజుగారి జనానాలోనుండు స్త్రీల వశమందుంచెను గాని ఆమె తన స్వంత ప్రియుని యందే మనస్సు నిలిపినదై తాను రాజును ప్రేమించునట్లు అక్కడివారు చేయుచువచ్చిన సర్వ యత్నములను భంగపఱచుటయేగాక తన ప్రియుని మఱచి రాజును ప్రేమించుమని తనతోఁ జెప్పవలదని ఆమె అక్కడి స్త్రీలను బ్రతిమాలెను ($1^{1}$-$2^{7}$). ఆమె తన యింటనుండఁగా తన ప్రియుఁడెట్లు తన్ను చూడఁగలిగెనో అదియు తానతని వెదకి కనుగొన్నట్లును తనకు కలిగిన స్వప్నమును వారికి వర్ణించి చెప్పి వారు తనను రాజును ప్రేమించునట్లు శోధింపవలదని మనవిజేసికొనెను ($2^{8}$-$3^{5}$). రాజును ఆమె తనను ప్రేమించునట్లు జేయ యత్నించెను. ఆమెను ప్రధానము జేసికొనినవాఁడు వచ్చి ఆమె తన వెంట వచ్చి వేయవలెనని బ్రతిమలాడుచున్నాఁడు ($8^{6}$-$5^{1}$). ఆమె తన ప్రియునికొఱకు వెదకినట్లు కలగని దాని వర్ణించెను. రాజును జనానాలోని స్త్రీలును వచ్చి ఆమె మనస్సును త్రిప్పుటకు ప్రయత్నము చేయఁగా ఆమె వారిని మఱల బ్రతిమలాడుచున్నది ($5^{2}$-$8^{4}$). తరువాత ఆమె తన యింటికివెళ్లి తన ప్రియునియందు తనకున్న ప్రేమనుగూర్చి వర్ణించెను ($8^{5-14}$). కొందఱు వ్యాఖ్యాతలీ గ్రంథము మానవుని నిజమైన ప్రేమ యెట్టిదో తెలియఁజేయునని యెంచుచున్నారు. కొందఱు యెహోవాయెడల ఇశ్రాయేలు సంఘమునకుగల గొప్ప ప్రేమను సూచించు గ్రంథమని యందురు. ఇంక కొందఱిది క్రీస్తుకును ఆయన సంఘమునకునుగల పరస్పరానురాగమును తెలుపునందురు.

కొందఱిది కామసంబంధమగు కావ్యములకు సంబంధించినదనియు, హిందువులలో వాడుకగానున్న గోవింద గీతము అనుదానికి సరిపోల్చవచ్చునందురు. కామసంబంధమగువాటిని చదువవచ్చు ననెడివారు దీనిని దృష్టాంతముగా నెత్తిచెప్పెదరు. ఇది దేవునికిని ఆత్మకునుగల ఐక్యమును ఆత్మీయముగా చూపుటకువాడిన కావ్యమైన పక్షమున అట్టి యాక్షేపణ బహు అసందర్భమైనదై యున్నది. అట్లుగాక మానవులకుండవలసిన నిష్కపటమైన కుటుంబ ప్రేమమాత్ర మిందులో చూపఁబడినయెడల, అట్టి ప్రేమ యెంత దివ్యమైనదో దాని నీ గ్రంథమున చక్కగా చూడవచ్చునుగాన దీనిని దురాశలను రేపు కామసంబంధమైనవాటితోఁ జేర్చుట ఎంతమాత్రమును న్యాయముకాదు.

గ్రంథకర్త:—దీనిని రచించిన వారినిగూర్చి తాత్పర్య భేదముగలదు. ఈ గ్రంథముయొక్క శీర్షికనుబట్టి అది సొలొమోను రచించిన పరమగీతమందురుగాని మూలభాషయందలి పదములను సొలొమోనును గూర్చిన పరమగీతమనియు తెనిఁగింపవచ్చును. ఈ కావ్యమునందున్న రాజును గూర్చిన సంగతులతనికి ఘనతను కలిగించునవి కావుగాన అతఁడు తననుగూర్చి అట్టి సంగతులను వ్రాయునా యను సందేహము కలుగుచున్నది. అదియుఁగాక మూలభాషయందు అయా కావ్య గ్రంథముల శీర్షికలు కనఁబడుటలేదు. అవి

తరువాత చేర్చఁబడినవని నవీన పండితుల సాధారణ యభిప్రాయమైయున్నది. ఈ గ్రంథమునందు యూదులలోఁ గాక గలిలయలోను అన్య దేశములలోను వాడుక యందుండిన పదములుండుటచే అది సొలొమోను కాలమందు గాక యూదయ అన్యులచే పరిపాలింపఁబడిన కాలమున వ్రాయఁబడినట్లు వారెంతురు.

ఇది సొలొమోనుచే రచింపఁబడెననువారు మొదటినుండి యిది అతనిచే రచింపఁబడెనను మాట పారంపర్యముగా వచ్చుచున్నది గనుకను, గలిలయలో వాడిన పదములిందుండుట షూనమ్మీయురాలగు నా కన్యక ఆ ప్రదేశపుదగుటచే అతఁడా పదము లుపయోగింపవలసివచ్చినదనియు, ఈ కావ్యమువలన సొలొమోనుకు ఘనత కలుగక పోయినను అది నిష్కపటమగు ప్రేమను దృష్టాంతపఱచు కావ్యమైనందునను అతఁడే దీనిని రచించెననుటకు తగిన యాధారములుగలవని వాదింతురు.

J. C.

**పరలోకము** ఆకాశము 2 చూ॥

**పరలోక భూలోకములు** భూమ్యాకాశములు చూ॥

**పరలోకసైన్యము** ఆకాశ సైన్యము చూ॥

**పరవశుఁడగుట** (Trance). పేతురు అన్యులకు సువార్తను బోధింప పిలువఁబడఁగా పరవశుఁడై దర్శనము చూచెను (కార్య $10^{10}$ $11^{5}$). పౌలును ఆ పనికే పిలువఁబడినపుడు అతఁడు చూచిన దర్శనమును గూర్చియు ఆ పదము వాడఁబడెను ($22^{17}$). II కొరి $12^{2-5}$ నందు పౌలీ దర్శనమునే వివరించెనని కొందఱి తాత్పర్యము పై వాక్యములలోని గ్రీకుపదమును గొప్ప ఆశ్చర్యమును సూచించుటకును వాడి విస్మయమొందిరియని తెనిఁగించిరి (మా $5^{42}$ $16^{8}$ లూ $5^{26}$). కార్య $3^{10}$ లోను దానికీ యర్థమేయైనను దాని నక్కడ పరవశులైరి యని తర్జుమా చేసిరి. ఒకఁడు దేహము తెలియక మిగుల వింతయిన దానిని మాత్రము మనస్సునందు చూచి దానిని గాక ఇంక దేనిని చూడఁజాలని స్థితిని ఈ పదము సూచించును (దర్శనము చూ॥).

**పరస్త్రీ** అన్యులు చూ॥

**పరాక్రమశాలుర యిండ్లు** యెరూషలేము B II 4 చూ॥

**పరిగె** (Gleaning) కోఁతకోయువారు వదలిపెట్టిన ధాన్యమును కూర్చుట పరిగె నేరుట యందురు. యూదులలో ద్రాక్షపండ్లను కోసిన పిమ్మటకూడ పరిగె నేరెడివారు (న్యాయా $8^{2}$ రూతు $2^{2,7,9,16}$ యెష $17^{6}$). బీదలు విధవలు దిక్కులేనివారి నిమిత్తము పరిగె నేరరాదనియు, మఱచిపోయి వచ్చిన పనను దెచ్చుటకు వెనుకకు వెళ్లఁగూడదనియు పడిపోయిన పండ్లను ఎత్తరాదనియు నియమము ఏర్పడెను (లేవీ $19^{9-10}$ $23^{22}$ ద్వితీ $24^{19}$). పరిగె ఏమియు విడువఁబడని కోఁత దేశమునకు కలుగు సర్వనాశనమునకు సూచనగా నుదాహరింపఁబడెను (మీకా $7^{1}$ యిర్మీ $6^{9}$ $49^{9}$).

**పరిచర్య, పరిచారకుఁడు** (Ministry, Minister, Servant). ఈ పదము లాయా వాక్యములలో సాధారణమగు సేవను సూచించును గాని ఈ శీర్షికయందు పూజకు సంబంధించిన పరిచర్యనుగుఱించియు ప్రత్యేకమగు పరిచర్యను గుఱించియు ప్రస్తావింతుము.

1. పాఁత నిబంధనయందు యెహోషువ మోషే పరిచారకుఁడనఁబడెను (నిర్గ $24^{13}$ $33^{11}$ సంఖ్యా $11^{28}$ యెహో $1^{1}$). ఇతరులుకూడ ఆయా వారలకిట్టి సేవఁజేయుటనుగూర్చి ఈ పదమునసే వాడినను దానిని కనిపెట్టుచుండుట (I రాజు $1^{15}$), పనివాఁడు (II సమూ $13^{17,18}$ II రాజు $4^{43}$ $6^{15}$), సేవచేయుట (I దిన $27^{1}$), ఉపచారులు (ఆది $40^{4}$ I దిన $28^{1}$ I రాజు $19^{1-21}$ ఎస్తే $1^{11}$ $2^{2}$ $6^{3}$ మొ॥) అను మాటలచేతను తెనిఁగించిరి. ఈ పదము మూలభాషయందు సాధారణముగా లేవీయులకు బిరుదుగా నుపయోగించిరి. గుడారములోఁగాని దేవాలయములోఁగాని పనిచేయు వారికీ పదమువాడిరి (సంఖ్యా $3^{6}$ $8^{26}$ $18^{21}$ ద్వితీ $17^{12}$ II దిన $29^{11}$ యెష $56^{6}$ యెహె $43^{19}$ $44^{15}$ $46^{24}$ యోవే $1^{9-13}$ $2^{17}$ మొ॥). ఈ పదమును పాఁత నిబంధనయందు సాధారణముగా సేవచేయుట యని తెనిఁగించిరి (నిర్గ $28^{35,43}$ $29^{30}$ $30^{20}$ $35^{19}$ $39^{1}$ సంఖ్యా $16^{7}$ ద్వితీ $10^{8}$ $18^{5}$ $21^{5}$ మొ॥). అది

దేవాలయపు సేవను మాత్రమేగాక విగ్రహసేవను సూచించును. యెహె $20^{32}$ లో **పూజచేయుట** యని తెనిఁగించిన పదమిదే. అది దేవదూతలకు వారుచేయు పనినిబట్టి పెట్టఁబడిన బిరుదైయున్నది (కీర్త $103^{21}$). మొత్తముమీఁద నీ పదమును పాఁత నిబంధనయందు దేవునికి పరిచర్య చేయుటనుగుఱించి వాడిరి.

2. క్రొత్త నిబంధనయందు పరిచర్య, పరిచారకులు అని తెనిఁగించిన పదములు నాలుగు గలవు. (1) ఉద్యోగస్థుల దగ్గరనుండి వారి పనులు జరిగించువారని శబ్దార్థమిచ్చు పదము. దానిని తఱుచుగా బంట్రోతులని తెనిఁగించిరి (మ $5^{25}$ $26^{58}$ మా $14^{54}$ యోహా $18^{18}$ మా $14^{65}$ యోహా $7^{32-35}$ $18^{3,12,22}$ $19^{6}$ కార్య $5^{22-26}$). క్రీస్తీ పదమును తన శిష్యుల విషయ ముపయోగించెనుగాని దానిని సేవకులని తెనిఁగించిరి (యోహా $18^{36}$). లూ $4^{20}$ లో సమాజమందిరపు అధికారి విషయ ముపయోగించిరి. పౌలు తన పిలుపునుగూర్చి చెప్పుకొనినప్పుడీ బిరుదు నే వాడుకొనెను (కార్య $26^{16}$). I కొరి $4^{1}$ నందు పౌలీ బిరుదును తనకును అపొల్లోకును ఆరోపించుకొనెనుగాని దానిని సేవకులని తెనిఁగించిరి. లూకా సువార్త పీఠికయందీ పదము ఆదికాలములో సువార్త బోధకులకు పెట్టఁబడెనుగాని దానిని **వాక్యసేవకులని** తర్జుమాజేసిరి బర్నబా పౌలు అను వారివెంట మొదటి మిషనేరి ప్రయాణముజేయుటకు బయలుదేరిన మార్కునకు ఇదే బిరుదుగలదుగాని దానిని **ఉపచారము చేయువాడు** అని తెనిఁగించిరి (కార్య $13^{5}$).

(2) ఆరాధనకు సంబంధించిన పదమై పాఁత నిబంధన వాక్యములలోని పదమువలె అర్థమిచ్చు మాట. హెబ్రీ $8^{2}$ నందు ఈ మాట ప్రధాన యాజకునిగూర్చి వాడఁబడెను. అన్యులలో జరుగు బోధపని యాజకత్వమైయున్నట్లు పౌలు దానిని అలంకార రీతిగా నుపయోగించెను (రోమా $15^{16}$). రోమా $13^{16}$ నందిది దేశాధికారుల పనిని, హెబ్రీ $1^{7}$ లో దూతలపనిని సూచించునుగాని ఈ వాక్యములలో దానిని పరిచారకులనిగాక **సేవకులని** తెనిఁగించిరి హెబ్రీ $1^{14}$ లో దూతల సేవనుగూర్చిన పదమిదిగాక క్రింద (3) నందున్నదైయున్నది. ఫిలిప్పీయి వారి దానమును పౌలుకుఁ దెచ్చి యిచ్చిన ఎపఫ్రొదీతు ఇట్టి పరిచారకుఁడని పౌలు వ్రాసెనుగాని దానిని **ఉపచరించువాడని** తెనిఁగించిరి (ఫిలి $2^{25}$).

(3) క్రొత్త నిబంధనయందు సాధారణముగా పరిచర్యయనిగాని పరిచారకుఁడనిగాని తెనిఁగించిన పదము మఱియొకటైయి ఉపకారములను చేసెడి సేవను సూచించును. తన శిష్యులు చేయవలసిన సేవను క్రీస్తు ఈ మాటచే సూచించెను (మ $20^{26}$ $23^{11}$ మా $9^{35}$ $10^{43}$). మార్త ఆయనకిట్టి పరిచర్య చేసెను (లూ $10^{40}$). కానాలో వివాహకాలమున సహాయముజేసిన వారివిషయమీ పదము నుపయోగించిరి (యోహా $2^{5\,9}$). అన్ని విధములగు ఉపకార కార్యముల కీ పదమును వాడినను ముఖ్యముగా సువార్తసేవ సందర్భమున నిది ఉపయోగింపఁబడెను. ప్రవక్తలపని నిట్టిదిగా నెంచిరి (I పేతు $1^{12}$). అపొస్తలుల బోధపనియు ఈ మాటచేత సూచింపఁబడెను (కార్య $1^{17,25}$ $20^{24}$ $21^{19}$ రోమా $11^{13}$ II కొరి $6^{4}$). కార్య $6^{4}$ లో అది **వాక్యపరిచర్య** యనఁబడెను. పౌలు అపొల్లో (I కొరి $3^{5}$), తిమో (I థెస్స $3^{2}$), ఎపఫ్రా (కొలొ $1^{8}$), తుకికు (కొలొ $4^{7}$), స్తెఫను యింటివారు (I కొరి $16^{15}$) చేసిన బోధపనిని సూచించుటకు వాడిరి. ఒకసారి క్రీస్తువిషయములోను ఈ పదము నుపయోగించిరి (రోమా $15^{9}$). ఆయన యూదులను రక్షించుటకు వారివిధులను గైకొన్నందున ఈ బిరుదును వాడిరి. ఈ పనినిబట్టి యిట్టి బోధకులు ఆత్మ పరిచారకులనియు (II కొరి $3^{6}$), సువార్తకు పరిచారకులనియు (ఎఫె $3^{7}$ కొలొ $1^{23}$), నీతి పరిచారకులనియు (II కొరి $11^{15}$) అనఁబడుదురు. అదేరీతిగా నీసేవ ఆత్మసంబంధమైన పరిచర్య యనియు (II కొరి $3^{8}$), సమాధాన విషయమైన పరిచర్య యనియు ($5^{19}$) యనఁబడును. పరిచర్య లాయావిధములుగా నున్న వనుమాటనుబట్టి (I కొరి $12^{5}$ I పేతు $4^{10}$ = ఉపచారము), ఈ పదము వాక్యసేవనుమాత్రమేగాక క్రీస్తు సేవకులుచేసిన ఆయా పనులను కూడ సూచించును.

ఈ పదమునే ధర్మమిచ్చుటను గూర్చియు ధర్మము పంచిపెట్టుటనుగూర్చియు విశేషార్థముతో

నుపయోగించిరి (కార్య 11[29] భాషాంతరము చూ॥ రోమా 15[31]). పౌలు యెరూషలేము నందలి బీదలకొఱకు ద్రవ్యమును సమకూర్చుట అట్టి పరిచర్యగా నెంచిరి (II కొరి 8[4] 9[1,12,13]). ఆది క్రైస్తవసంఘమునందు బీదలకు సొమ్ము పంచి పెట్టుటకై నియమింపఁబడిన యేడుగురిని పరిచారకుల నిలిచిరి (కార్య 6[3]). మూలభాషలో I కొరి 12[28] లో **ఉపకారము చేయువార**ని తెనిఁగింపఁబడిన మాటయొక్క పదము ఇట్టి పరిచారకులను సూచించును.

ఈ పరిచారకులు ధర్మమును పంచిపెట్టుట మాత్రమేగాక వాక్యమును ప్రకటించుపనిని జేసినట్లు స్తెఫను ఫిలిప్పు అనువారి చరిత్రవలనఁ దెలియును (కార్య 6-8). ఫిలి 1[1] I తిమో 3[1-13] నందు అధ్యక్షులును పరిచారకులు నున్నట్లు కనఁబడుచున్నది. వీరు సంఘమందలి ఉద్యోగస్థులై యున్నారు. ఫీబే యను నొక స్త్రీకిని యిట్టి బిరుదుకలదు (రోమా 16[1,2]). పరిచర్య చేయువారు సంఘములో నొక ప్రత్యేకమైన పని వారై యుండినట్లు రోమా 12[7] వలన స్పష్టమగుచున్నది. వారు బోధపనిచేసినను ఉపకారములను చేయుట ధర్మమును పంచిపెట్టుట, బహుశః రోగులను పరామర్శించుట మొదలగు విశేష పనులు వారి విధ్యుక్త ధర్మములై యుండె ననఁ దగును.

**పరిత్యాగపత్రిక** వివాహము 6 చూ॥

**పరిపాలన, ప్రభుత్వము** (Government). బైబిలుకాలమునం దెట్టి పరిపాలన మొదటినుండి చివరివఱకుఁ గలదో దాని నీ శీర్షిక క్రింద వివరింతుము. దేశచట్టముల నేర్పాటు చేయుటకు ప్రస్తుతమున్న చట్టనిర్మాణ సభలు (*Legislative Councils*) పూర్వమున ఇండియా దేశమున లేనట్లే బైబిలుకాలమునందును ఆ దేశములో నుండలేదు. వారిపై యధికారులుగ నుండినవారు న్యాయమును విచారించి యుద్ధములలో సైన్యమును నడిపించి అయిన ఖర్చులకు పన్నువసూలు చేసెడివారు. అంతేగాని దేశ పరిపాలన నిమిత్తము ప్రస్తుతముండునట్టి యేర్పాటులనుగూర్చిన సూచనలేవియు కనఁబడుటలేదు. బైబిలుకాలపు ప్రభుత్వము నీ దిగువరీతిగా వివరింపవచ్చును:—

1. కుటుంబపెద్దలు గోత్రకర్తల కాలము. ఇది మొదటికాలము. ఆదినుండి యెహోషువ మరణపర్యంతమున్న కాలము. కుటుంబములోని పెద్ద పరిపాలకుఁడుగ నుండెను. తన కుటుంబముపై అతఁడు సర్వాధికారి (ఆది 21[22] 31[45] 38[24] ద్వితీ 21[18]). అతఁ డన్యాయముచేసిన యెడల అతనిని శిక్షించువాఁడు దేవుఁడుగాక మఱెవ్వఁడును లేకపోయెను (ఆది 31[49,53] 49[7]). ఆయా కుటుంబములుకలిసి గోత్రములైన కాలమున గోత్రపుపెద్దలు పరిపాలకులైరి (నిర్గ 3[16] 18[21] సంఖ్యా 22[7]). ఒకటే వంశమునుండి పుట్టిన గోత్రములన్ని ఆపత్కాలమునం దెవఁడో యొకని పరిపాలనకు లోనైరి. మోషే యెహోషువల పరిపాలన యిట్టిదై యుండెను (నిర్గ 2[14] 4[1] యెహో 1[1,9]). వీరు గోత్రముల పెద్దల పరిపాలన ననుసరించి (నిర్గ 18) ఆయా గోత్రముల నేదో యొక గొప్ప పనికి ఐక్యపఱచిరి. వారు రాజవంశస్థులుగాక ఒకపనికై నియమింపఁబడిన వారై యుండిరి. దేవునిచే ఆలాగు నియమింపఁబడిన సూచనలు ప్రజలు గుర్తించి వారికి లోఁబడి వారిని సన్మానించిరి (నిర్గ 5-16 సంఖ్యా 16 యెహో 4[14]) గాని సేనాబలము గలిగినందున పరిపాలించినవారుకాదు.

2. న్యాయాధిపతుల కాలము. అప్పటికింకను క్రమమైన నియమములు లేకపోయెను. అందువలన ఈ కాలము కుటుంబ పెద్దలయొక్కయు, రాజులయొక్కయు పాలనకు మధ్యనుండి రెంటికి సంబంధించినదై యుండెను. ఈ న్యాయాధిపతులు స్థిరమైన అధికారులుగాక అవసరమైన కాలమునందు దేశమును శత్రుబారినుండి విడిపించుటకు నియమింపఁబడిన పరాక్రమశాలురై యుండిరి. వారు ముఖ్యముగా ప్రజలను వారి దాసత్వములోనుండి విడిపించుటకు ప్రయత్నించిరి. ఆ ప్రయత్నములు సఫలమైన పిమ్మట వారి పరిపాలనయు అంతమొందెను (న్యాయా 8[22,23]). న్యాయాధిపతులైనవారు దేవుని విశేషవరములను, పిలుపును పొందినందువలనగాని, పరాక్రమశక్తులు కలిగియున్నందునగాని నియమింపఁబడిరి. గిలాదు పెద్దలు తమవారిలో యెఫ్తా యనువాని నిట్లు నాయకునిగాఁ జేసికొనిరి (11[5]). సమూయేలు ప్రజలను శత్రువులచేతినుండి విడిపించుటయేగాక

వారి వ్యవహారములనుకూడ పరిష్కరించెను (I సమూ 7[5-17]). అతని కుమారులతని చివరి కాలమునందు న్యాయకర్తలుగా నియమింపఁబడినను వారాపనికి పాత్రులుకానందున ప్రజలిష్టపడక పోయిరి (8[1-5]). న్యాయాధిపతులలో సమూయేలుగాక తక్కినవారెవ్వరును ఇశ్రాయేలీయుల నందఱిని పరిపాలించలేదు. ఆయా గోత్రములలో మాత్రము వారు పనిజేసిరి. ఈ కాలమందున్న పెద్దలు కుటుంబములకుగాని గోత్రములకుగాని గాక పట్టణములకు పెద్దలుగా నుండిరి (న్యాయా 8[6,14,16]). ఇశ్రాయేలీయులు పట్టణవాసులగుటచేత నిట్టి పరిపాలన అవసరమాయెను. ప్రాకార పట్టణములచుట్టును సివారులు నుండెను (సంఖ్యా 21[25,32] యెహో 17[11]). ఆ ప్రాకారముల పరిపాలన వీటిపైనకూడ నుండుటచే రాజ్య పరిపాలనకు ముందుండిన పరిపాలన యని చెప్పఁదగును.

3. రాజుల ప్రభుత్వకాలము. సమూయేలు వృద్ధాప్యము మొదలు బాబెలు చెఱకాలమువఱకు నుండెను. ఈ కాలమునందు రాజు ముఖ్యాధికారియయ్యెను (I సమూ 8[20]). ఆరంభమునందు ప్రజలు రాజుల నేర్పఱచుకొనుటలో పాలిభాగులుగా నుండిరి (I సమూ 11[15] II సమూ 2[4] 5[1,3] I రాజు 12[1]) గాని, దావీదువంశమునకున్న విశేష వాగ్దానములనుబట్టి దక్షిణమునను న్న యూదారాజ్యమున కాతని రాజవంశము స్థిరపడి పోయెను. ఇశ్రాయేలువారనఁబడిన ఉత్తర రాజ్యమున కిట్టి స్థిరవంశము లేకపోయినందున ప్రజల యొక్క యిష్టాయిష్టములనుబట్టియు, కుట్రలను బట్టియు అనేక వంశములు రాజ్యము చేయవలసి వచ్చెను. ఆ రాజ్యము దాదాపు 200 సంవత్సరములు మాత్రముండినను 6 వంశములనుండి వచ్చిన 19 మంది రాజులు మాత్రమేలిరి. ఈ రెండు రాజ్యములయందును రాజులు అన్యాయమున కొడిగట్టినప్పుడు ప్రవక్తలులేచి వారికి తగిన బుద్ధిచెప్పిరి (సమూయేలు, నాతాను, ఏలీయా, ఎలీషా, యెషయా, యిర్మీయా మొ॥). రాజులు లక్షింపవలసిన ధర్మవిధులు ద్వితీ 17[14-20] నందు మాత్రము గలవు. యూదారాజ్యము నపహరించిన అతల్యా బయలుదేవత పూజను స్థాపించుటకుచేసిన ప్రయత్నములు భంగమైనపిదప ప్రధాన యాజకుఁడగు యెహోయాదా జనులు యెహోవావారని ఆయన పేరట రాజుచేతను ప్రజలచేతను చేయించిన నిబంధన దానికి సంబంధముగా నుండెను.

రాజ్యస్థాపనతో సైన్యస్థాపనము నారంభమాయెను. దావీదు సైన్యమున ప్రసిద్ధులగు యోధులుండిరి (I దిన 12[1-21]). అతఁడుచేసిన యుద్ధములనుబట్టి అతని సేనాబలము సంగతిఁ దెలిసికొనవచ్చును. అతఁడు దేశసంబంధమగు అధిపతులనుకూడ నియమించెను (II సమూ 8[16] I రాజు 4). రాజులచే నియమింపబడినవారై, వారు చాల కాలమువఱకు దేశమును పరిపాలించిరి. వీరు చేయుచువచ్చిన అన్యాయములను గూర్చి ప్రవక్తలు గద్దించిరి (ఆమో 3[9] 4[1] యెష 5 మొ॥). రాజునకియ్యవలసిన పన్నులను వసూలు చేసిరి (పన్ను చూ॥). రాజద్రోహులగువారి ఆస్తి జప్తుచేయఁబడెను (I రాజు 21). అవసరము వచ్చినయెడల దేవాలయమందలి ఆస్తినిసహా రాజు కోచుకొనెను (II రాజు 18[15]). రాజు న్యాయమును విచారించెను (II సమూ 15[2] II రాజు 15[5]). ప్రజలు స్వయముగా రాజుతో తమ సంగతులను చెప్పుకొనుటకు తగిన వీలులుండెను (II రాజు 8[3]). పట్టణములలోని సంగతులను, దానియందుండు పంచాయతీవారు విచారించిరి (II సమూ 19[11] I రాజు 20[7] II రాజు 23[1]). యెహోషాపాతు తన పరిపాలనయందు దేశమంతటిలో న్యాయసభలు స్థాపించెను (II దిన 19[5-11]). ఇశ్రాయేలీయులలో యాజకులు తమ ఉద్యోగమునుబట్టి న్యాయాధిపతులుగ నుండిరి (ద్వితీ 19[17] 1,2 22[15] I దిన 23[4] 26[29] మొ॥).

4. చెఱకాలమునకుఁ దరువాత స్వంత ప్రభుత్వము లేనందున తరుచుగ మాఱుచువచ్చెను. పారసీకుల కాలమునందు (క్రీ॥ ము॥ 537-330) యూదులు యుఫ్రాతునదికి పడమటగానుండిన గొర్నరుచే పాలింపఁబడిరి (ఎజ్రా 5[3]). యూదయ కొక ప్రత్యేక అధిపతియుండెను (నెహె 5[14] 11[24]). ఈ కాలములోనే పెద్దలు మత సాంఘిక విషయములలో అధికారము గల వారైనట్లు అనేక సూచనలున్నవి (ఎజ్రా 5[9] 6[7] 10[8] నెహె 2[16]). విదేశీయుల ప్రభుత్వకాలములో ప్రధాన యాజకుఁడు మతాధికారియు దేశాధికారియు నాయెను. గ్రీకువారి ప్రభుత్వ

ములోను (క్రీ॥ ము॥ 330-63) మక్కబీయుల కాలములోను మఱెక్కువ యయ్యెను (I మక్క 12$^{6}$ 14$^{20}$). యూదులు తమ సంగతులను తామే చూచుకొనునట్లు చాలవఱకు స్వపరిపాలన ననుగ్రహించిరి. అందుచేతనే వారి మహాసభ చాల వృద్ధిలోకి వచ్చెను (మహాసభ చూ॥). ఈ సభకు ప్రధానయాజకుఁడు గ్రాసనాధిపతియైయుండెను. ఇది ప్రధానయాజకుని అధికారము నింక వృద్ధి చేసెను. క్రీ॥ ము॥ 142 సం॥న సీమోను నిత్య ప్రధాన యాజకుఁడుగాను సేనాధిపతిగాను అధికారిగాను నియమింపఁబడెనని I మక్క 14$^{27-47}$ నందున్నది. అతనికి తరువాతి ప్రధానయాజకులు దేశాధికారులైరి. వారియందు అరిస్టొబులు అను వాఁడు రాజు అను బిరుదునొందెను (క్రీ॥ ము॥ 105). రూకలమీఁద అలెక్సందరు రూపమును ముద్రించిరి. రోమను ప్రభుత్వ కాలమునందు (క్రీ॥ ము॥ 63 నుండి) అనేక మార్పులు జరిగెను గాని ఈ మహాసభకును ప్రధానయాజకునికిని గొప్ప హక్కు లింకనుండెను. క్రీ॥ ము॥ 6 సం॥ వఱకు మహా హేరోదు దేశము నేలెను గాని అతని కాలమునందు ప్రధాన యాజకునియొక్క, మహాసభయొక్క అధికారము తగ్గిపోయెను. అటు తరువాత పలెస్తీనును విభాగించిరి. అంతిపకు గలిలయను పెరీయ నిచ్చిరి. అర్కెలాయుకు యూదయనిచ్చి క్రీ॥ శ॥ 6 సం॥న మరల తీసికొనిరి. తరువాత గౌర్నరులను దానికి నియమించిరి. ఈ కాలమునందు మరల మహాసభ వారికిని ప్రధానయాజకునికిని పలుకుబడి కలిగెను. ఒక్క మరణశిక్షగాక తక్కిన శిక్షలన్నిఁటిని విధించుటకు వారి కధికారము కలిగెను (యోహా 18$^{31}$). సమాజమందిరములకు సంబంధించిన పంచాయతీదారులు చిన్నచిన్న సంగతులను విచారించి పరిష్కరించిరి. ఆయా దేశములలో చెదరియున్న యూదులు తమ సంగతులను విచారించుకొనుటకు కావలసిన విశేష హక్కులిచ్చిరి (పలెస్తీను IV, ప్రధానయాజకుడు, న్యాయాధిపతులు రాజులు, దేవుడు II చూ॥).

**పరిపూర్ణత, సంపూర్ణత (Perfection, Perfect, Fulness).** ఈ మాటలచే తర్జుమా చేయఁబడిన అసలుమాట లన్నియు నొకటే కాక వేర్వేఱుగా నున్నవి. పరిపూర్ణత యని భాషాంతరము చేసిన మాటలను యథార్థత (ఆది 17$^{1}$ యోబు 17$^{1-8}$ 2$^{3}$), సర్వసిద్ధము (I రాజు 8$^{61}$) నిర్దోషము (కీర్త 19$^{8}$), నిందారహితము (ఆది 6$^{9}$), సన్నద్ధుఁడు (I కొరి 1$^{10}$ II తిమో 3$^{17}$) అను నీ మాటలచేతఁకూడ తర్జుమచేసిరి. ఇట్లు తెనుఁగు బైబిలులో మాత్రముగాక అసలుభాషలో కూడ పదభేదములున్నవి గాని అసలులోని భేదములు తెనుఁగులోని మాటలకు సూటిగా సరిపడవు. పాఁత నిబంధనలో ఇట్టి మాటలను వాడినవిధమును చూడఁగా దేవుఁడుచేసిన కార్యము సంపూర్ణమై (అనఁగా లోపములేనిదై) యున్నదను వాక్యము కలదు (ద్వితీ 32$^{4}$). దానికి సంబంధముగా క్రొత్త నిబంధనలో దేవుఁడిచ్చు వరములు సంపూర్ణమైనవని యాకోబు (1$^{17}$) వ్రాసెను. కీర్త 19$^{8}$లో యెహోవా యుపదేశములు నిర్దోషములైనవి అనఁగా సంపూర్ణమైనవి అను మాట కలదు. దీనికి సంబంధముగా దేవుని బోధలు స్వాతంత్ర్యమునిచ్చు సంపూర్ణ నియమము అని యాకోబు (1$^{25}$ 2$^{12}$) వ్రాసెను.

పాఁత నిబంధనలో దేవుని యాచారములను గైకొని ఆయనను సేవించిన భక్తులు యథార్థవంతులు (అనఁగా పరిపూర్ణులు) గా నెంచఁబడిరి (ఆది 17$^{1}$ యోబు 1$^{1}$ 2$^{3}$ I రాజు 8$^{61}$). అమజ్యా యథార్థముగా ప్రవర్తించెను గాని పూర్ణహృదయముతో ఆయనను అనుసరింపలేదు (II దిన 25$^{2}$) అను మాటలుకూడ నున్నవి. పరిపూర్ణత అను పదము పాఁత నిబంధనలో నెక్కువగా లేకపోయినను నేను పరిశుద్ధుఁడను కావున మీరును పరిశుద్ధులై యుండవలెను (లేవి 11$^{44}$ 19$^{2}$) అను వాక్యములో దాని సంగతి తేటగా కనఁబడును (పరిశుద్ధత చూ॥).

పరిపూర్ణతనుగూర్చిన మాటలు క్రొత్త నిబంధనలో మఱియెక్కువగా కనఁబడును. మఱియు క్రొత్త నిబంధనలో సకల సద్గుణ సంపన్నులను సూచించుటకు ఈ మాటలను మఱీ లోతైన భావముతో వాడియున్నారు. ఇవ్విధముగా తండ్రియైన దేవుఁడు పరిపూర్ణుఁడనఁబడును (మ 5$^{48}$). ఇట్టి భావముతోనే క్రైస్తవులను పిలిచినవాఁడు పరిశుద్ధుఁడని పేతురు వ్రాసెను (I పేతు 1$^{14-16}$).

క్రీస్తునుగూర్చిన బోధను చూడఁగా ఆయనకు పరిపూర్ణత కలదని తెలిసికొనుచున్నాము (యోహా

$1^{17}$). క్రీస్తు తన శ్రమలచే సంపూర్ణుఁడుగా చేయఁబడెనను బోధలు హెబ్రీ యుత్తరములో నున్నవి ($2^{10}$ $5^{9}$ $7^{28}$). అంతకుఁ బూర్వము క్రీస్తునకు ఏ పాపములైన యున్నట్లు ఈ వాక్యములవలన గ్రహింపఁగూడదు గాని ఆయన మన యనుభవములలోఁ జేరి వాటిలో పాలిభాగస్థుఁడగువఱకు మనలను రక్షించుట కాయనలో నుండవలసిన రక్షణసంబంధమైనవి లేవని తెలిసికొనవలెను. వీటిలోఁ జేరుటవలన ఆయన పరిపూర్ణుఁడగు రక్షకుఁడయ్యెను. ఇట్లు ఆయన యర్పించిన యర్పణముకూడ రక్షణకు సాధనమై సంపూర్ణమైనదాయెను (హెబ్రీ $7^{11-19}$ $9^{9}$ $10^{14}$). ఎఫెసీ కొలొస్సి యుత్తరములలో నున్నట్లు ఆరోహణమైన క్రీస్తుయొక్క పరిపూర్ణతనుగూర్చి పౌలు మఱీ దివ్యముగా తెలిపియున్నాఁడు. దేవత్వము యొక్క సర్వ పరిపూర్ణత క్రీస్తులో నివసించుచున్నది (కొలొ $2^{9}$). ఆయనయందు సర్వ సంపూర్ణత నివసింపవలెనని...తండ్రికి అభీష్టమాయెను ($1^{19}$). క్రీస్తునకు సంపూర్ణమైన పురుషత్వము కలిగెను (ఎఫె $4^{13}$) అను వాక్యములు కలవు (వీటిని యోహా $1^{16}$ తో సరిపోల్చి చూ॥).

క్రీస్తు శరీరముగా నెంచఁబడిన సంఘమును గూర్చికూడ సంపూర్ణతయను నీ పదమును వాడిరి. అది సంపూర్ణుఁడైన క్రీస్తుయొక్క సంఘమగుటచేతనే దానికీపదమును వాడియున్నారు. అది సమస్తమైనవాటిని నింపుచున్నవానిలో నింపఁబడినదై యున్నది (ఎఫె $1^{23}$). ఈ వాక్యములోని మాటలను ఇతరమైన చోట్లనున్నట్లుగా తర్జుమా చేసినయెడల సమస్తమును పూర్తిచేయువాని సంపూర్ణత అను బిరుదు సంఘమునకు కలదు.

సంఘమునుగూర్చి మాత్రముగాక విశ్వాసులను గూర్చికూడ ఈ పదమును వాడియున్నారు. క్రైస్తవమతమునందు దక్షివృద్ధిపొంది దానియందలి భావమును గ్రహించి యాది నియమించు నడతనవలంబించిన క్రైస్తవులకు పరిపూర్ణులు అను పేరు పెట్టియున్నటుల కొన్ని వాక్యములలో నున్నది (I కొరి $2^{6}$ ఫిలి $3^{15}$). ఇట్లు యాకోబు శోధనలను సహించువారు సంపూర్ణులగుదురని తెలిసికొని క్రైస్తవులు శ్రమలను సంతోషముతో సహించవలెనని వ్రాసెను ($1^{4}$). అయితే సాధారణమైన క్రైస్తవ సద్గుణములకు ఈ బిరుదు పెట్టబడినను, మనము క్రీస్తునందు నిలిచియుండుటచే ఆయన పరిపూర్ణతలో మనమును పరిపూర్ణత నొంది మఱీ లోతుగా సంపూర్ణులము కాఁగలము, సంపూర్ణులము కావలెను అను బోధలుకూడ కలవు (యోహా $1^{16}$). ఇట్లు మనము సంపూర్ణులము కావలెనని ప్రభువు చెప్పెను (మ $5^{48}$). మనము సంపూర్ణులమగువఱకు ఎదుగవలెనని (ఎఫె $4^{3-5}$) పౌలు చెప్పెను. తన సభవారిని సంపూర్ణులగాఁ జేసి క్రీస్తు ఎదుట నిలువఁబెట్టవలెనని పౌలు వారి నిమిత్తము ప్రయాసపడెను (కొలొ $1^{28}$ $4^{12}$). ఇట్టి సంపూర్ణత వారికిఁ కలుగునట్లు వారినిమిత్తము ప్రార్థన చేసెను (ఎఫె $3^{15-18}$). క్రైస్తవులకు అట్టి సంపూర్ణత కలుగునట్లు క్రీస్తుబోధకులను నియమించెను ($4^{13}$). పౌలు రోమాకు వెళ్లనై యుండఁగా నేను క్రీస్తు ఆశీర్వాద పరిపూర్ణుఁడనై వత్తునని యెఱుఁగుదును (రోమా $15^{24}$) అని వ్రాసెను. పౌలు తన్నుతాను సంపూర్ణులలో చేర్చుకొనినను (ఫిలి $3^{15}$) తాను సంపూర్ణుఁడను కాననికూడ వ్రాసెను ($3^{12}$). క్రీస్తునందున్నవారు ఆయనకుఁగల సంబంధమువలన పరిపూర్ణులైనను వారు తమ యనుభవములోను తమ నడతలోను ఎల్లప్పుడు నిట్టి సంపూర్ణులగునట్లు ప్రయాసపడవలెనని మన మీవాక్యములవలన తేటగా తెలిసికొనఁగలము.

**పరిమళతైలము** గంధవర్గము చూ॥

**పరిమళతైల వృక్షము** గంధవర్గము I, చూ॥

**పరిమళతైలపు భరిణెలు** ఆభరణములు 24 చూ॥

**పరిమళ ద్రవ్యముల మేళకుడు** గంధవర్గము III చూ॥

**పరిశుద్ధత, పరిశుద్ధులు, పరిశుద్ధపరచుట, పరిశుద్ధపరచబడుట, పవిత్రత, ప్రతిష్ఠించుట** (Holiness, Sanctify, Sanctification). 1. పాఁత నిబంధన. పరిశుద్ధతను సూచించుమాటలు పాఁత నిబంధనలోనే 830 మాఱులు కలవు. అవి మోషే గ్రంథపంచకములో 350 సార్లున్నవి. పరిశుద్ధతయొక్క అసలుభావము ప్రత్యేకించుట అని యను

కొందురు. ఏయది లౌకిక యుపయోగముల నుండి ప్రత్యేకింపఁబడి దేవుని సేవయం దుపయోగింపఁబడునో అదే పరిశుద్ధమైనదనఁబడును. అదే రీతిగా యాజకులును నాజీరు మొదలగు వ్రతముల నాచరించు వారును లౌకిక పనులనుండి తమ్మును తాము ప్రత్యేకించుకొని దేవుని సేవకు సంబంధమైనవాటిని చేయుదురు గనుక వారు పరిశుద్ధులనఁబడుదురు. పలెస్తీను చుట్టునుండు అన్యులలో ఈ విధముగా ప్రత్యేకింపఁబడినవారు నీతిపరులై యుండవచ్చును కాకపోవచ్చును. ప్రస్తుతము హిందువులలో కొందఱివలె తత్కాలమందు వారుకూడ ఒకఁడు ఈ లోకమును త్యజించి దేవునియందు భక్తినుంచునట్లు వ్రతము బూనిన యెడల అతని నడత యెట్టిదైననుసరే అతఁడు పరిశుద్ధుఁడని యనుకొనుచుండిరి. దేవదాసీలుగా కామదేవతకు ప్రతిష్ఠింపఁబడిన వారుకూడ పరిశుద్ధురేయని అట్టివారెంచిరి.

ఇశ్రాయేలీయులు ఇట్టి దురభిప్రాయములు గల అన్యులచే చుట్టఁబడియుండినను మొదటి నుండియు పాఁత నిబంధనలో పరిశుద్ధులు నీతిపరులై యుండుట అగత్యమను బోధలుండుటను జూడఁగా అవి ఆ యన్యుల బోధలకెంతో వ్యత్యాసముగా నున్నవని చెప్పఁదగును. లేవీ 17-26 లలోని వాక్యములు పరిశుద్ధతనుగూర్చిన నియమ (*Law of Holiness*) మనఁబడును. అందులో మీరు పరిశుద్ధులై యుండవలెను. మీ దేవుఁడనైన యెహోవానగు నేను పరిశుద్ధుఁడనై యున్నాను అను వాక్యము ముఖ్యమైనదై యున్నది. అందులో నున్న యాజ్ఞలలో కొన్ని ఆచారసంబంధములైనవై యున్నవి. వాటిలో భోజనవిషయమైన యేర్పాటులు ($17^{10-16}$ $19^{26}$) వేర్వేఱు మృగజాతులను, విత్తనములను, నారలను కలుపకూడదను యేర్పాటులు ($19^{9}$) క్రొత్త చెట్లకు ఫలించిన ఫలములను నాలుగేండ్ల దాక తినఁగూడదనుటను గూర్చిన యేర్పాటులు ($19^{23-25}$), యాజకులు దుఃఖసమయములలోను వివాహ విషయములలోను చేయవలసిన ప్రత్యేకమైన యేర్పాటులను గూర్చిన నియమములు కలవు ($21^{1-15}$). ఇవి నీతిసంబంధములుకాక, ఆచారసంబంధములేయై యున్నవిగాని వారి దేవుఁడు పరిశుద్ధుఁడైనందునను వారు దేవునికి ప్రత్యేకింపఁబడినవారైనందునను వీటినికూడ గైకొనవలసినదను ఏర్పాటున్నది. మఱియు పరిశుద్ధతనుగూర్చిన యీ నియమములకు సంబంధించిన యితర నియమములను చూడఁగా అవి యన్నియు నీతి యుక్తములైనవై యున్నవని తెలిసికొనవచ్చును. నీతికి సంబంధించిన యిట్టి విషయములు మహా ముఖ్యములైనవై యున్నవి. వీటిలో దొంగిలింపక పోవుట అబద్ధమాడకుండుట ($14^{11}$), న్యాయమైన త్రాసు ($19^{36}$), తలిదండ్రులను సన్మానించుట ($19^{3}$ $20^{9}$), కూలివాని కూలిని బిగబట్టకుండుట ($19^{14}$), పరదేశులను ప్రేమించుట ($19^{34}$), పొరుగువారిని ప్రేమించుట ($19^{18}$) అను నిట్టి గొప్ప నీతులు కలవు. మఱియు ప్రవక్తల గ్రంథములను చూడఁగా మనము పరిశుద్ధులమగుటకు ఈ నీతులు తప్ప మఱేవియు అవసరములేదని తేటపడును ($1^{16,17}$). యెషయా 6 వ యధ్యాయములో నున్నట్లు ఆయనకుఁగలిగిన దర్శనమును చూడఁగా అది మఱీ విశదముగా నగపడును. యెషయా దేవుని పరిశుద్ధతను చూచినవెంటనే అయ్యో, నేను అపవిత్రమైన పెదవులు గలవాఁడను అపవిత్రమైన పెదవులుగల జనుల మధ్య నివసించుచున్నాను అని చెప్పిన మాటలలో తాను దేవుని ఆచారములనుగాక ఆయన నీతిచట్టములను మీఱియున్నట్లు తన పాపములను ఒప్పుకొనెను ($6^{1-5}$). $57^{17}$ లోను దేవుని పరిశుద్ధతనుగూర్చిన 99 వ కీర్తనలోను దేవుఁడు నీతి న్యాయముల విషయములలో పరిశుద్ధుఁడని స్పష్టమగును. ఈ కీర్తనయందున్నట్లు పాఁత నిబంధనలో దేవుని పరిశుద్ధత భయంకరమైనదియునై యున్నది.

పాఁత నిబంధనలో దేవునికిని ఆయన సేవకును సంబంధించిన ప్రతిదియు పరిశుద్ధమైనదై యుండెను. ఇట్లు ఆయన నివసించు ఆకాశము పరిశుద్ధాకాశమనియు (కీర్త $20^{6}$), ఆయన సింహాసనము పరిశుద్ధ సింహాసన మనియు ($47^{8}$), ఆయనను సేవించు దూతలు పరిశుద్ధ దూతలు అనియు ($89^{7}$), ఆయన యాత్మ పరిశుద్ధాత్మ యనియు ($51^{11}$ యెష $63^{10,11}$), ఆయన నామము పరిశుద్ధనామ మనియు (లేవీ $20^{23}$), ఆయన బాహువు పరిశుద్ధబాహువు అనియు (కీర్త $98^{1}$), ఆయనమార్గము పరిశుద్ధమార్గ మనియు (యెష $35^{8}$), ఆయన జనులగు ఇశ్రాయేలీయులు ప్రతిష్ఠిత (= పరిశుద్ధ) జనమనియు

(ద్వితీ $7^{6}$), వారిదేశము ప్రతిష్ఠితదేశమనియు (జెక $2^{12}$), వారి యాలయము పరిశుద్ధాలయ మనియు (కీర్త $11^{4}$), యెరూషలేము పరిశుద్ధపట్టణ మనియు (యెష $52^{1}$ నెహె $11^{1}$) చెప్పఁబడెను. దేవుని గుడారమునకును ఆలయమునకును సంబంధించిన సామగ్రులన్నియు పరిశుద్ధ యుపకరణము లనియు (I రాజు $8^{4}$), అతి పరిశుద్ధమైనవనియు (నిర్గ $30^{27-29}$) చెప్పఁబడును. ఇట్లు దేవునికి అర్పింపఁబడిన మాంసము ప్రతిష్ఠితమైన మాంస మనియు (హగ్గ $2^{12}$), ధూపద్రవ్యము అతి పరిశుద్ధమైన దనియు (నిర్గ $33^{36}$), దేవుని బల్లమీఁద వేయఁబడిన రొట్టెలు ప్రతిష్ఠితమైన రొట్టె లనియు (I సమూ $21^{6}$), గుడిలో వాడఁబడిన తైలము ప్రతిష్ఠాభిషేకతైలమనియు (నిర్గ $30^{35}$) అనఁబడును. ఆలయసేవచేయు యాజకులు పరిశుద్ధులై యుండవలెననియు (లేవీ $21^{6}$) నున్నది.

1. క్రొత్త నిబంధన. క్రొత్త నిబంధనలో పరిశుద్ధతను సూచించుపదములు మూఁడుకలవు. అవి సుమారు 250 సార్లు కనఁబడును. మఱియు నవి యీ దిగువవిధములుగా వాడఁబడెను. (1) పరిశుద్ధుఁడు అనుబిరుదు కొన్ని వాక్యములలో మాత్రము దేవునికి పెట్టఁబడెను (లూ $1^{44}$ యోహా $17^{11}$ I పేతు $1^{15,16}$ ప్రక $4^{8}$) గాని దేవుని యాత్మకు పరిశుద్ధాత్మ అని 94 పర్యాయములు పెట్టఁబడి యున్నది. (2) పరిశుద్ధుఁడు అను బిరుదు క్రీస్తునకు 10 మాఱులు ఆరోపింపఁబడెను (మా $1^{24}$ లూ $4^{34}$ యోహా $6^{69}$ లూ $1^{35}$ కార్య $3^{14}$ $4^{27,30}$ I యోహా $2^{20}$ ప్రక $3^{7}$). క్రీస్తు తన్నుతాను ఒకపనికి ప్రత్యేకించుకొనుట యనుసంగతినిగూర్చి తెలుపుటకు నన్ను నేను ప్రతిష్ఠచేసికొనుచున్నాను (= పరిశుద్ధపఱచుకొనుచున్నాను అనెను (యోహా $17^{17}$). హెబ్రీ యుత్తరములో నున్న సంగతివలన దీని భావమును తెలిసికొనఁగలము. (3) క్రొత్త నిబంధన గ్రంథకర్తలు క్రైస్తవులకు పరిశుద్ధులు అను బిరుదులను పెట్టిరి. ఈ బిరుదు 60 పర్యాయములు కనఁబడును. వీటిలో 39 సార్లు పౌలు పత్రికల లోనే కనఁబడును. క్రైస్తవులు దేవునికి ప్రత్యేకింపఁబడినవారును శుద్ధులునై యుండుటచేతనే వారికీ బిరుదును పెట్టిరి. ఎఫె $1^{4-6}$ లలో పరిశుద్ధులు నిర్దోషులు అను మాటలు కలిసియున్నవి. ఎఫె $5^{27}$ లోను కొలొ $1^{22}$ లోను ఇట్టి సంబంధము కలదు. మా $6^{20}$ కార్య $3^{14}$ లలో నీతిమంతుఁడు పరిశుద్ధుఁడు అను జంటపదము లున్నవి. I థెస్స $4^{4,7}$ లో పరిశుద్ధత యను పదము వ్యభిచార సంబంధములగు పాపములకు వ్యతిరేకమైనదై ఇంద్రియ శుద్ధిని సూచించును. ఈ సంబంధములను చూడఁగా పరిశుద్ధత కేవలము నీతికి సంబంధమైనదని స్పష్టమగును. దీనికి సంబంధముగా క్రీస్తు శిష్యులు పరిశుద్ధ పఱచఁబడుటనుగూర్చి వివరింపఁదగును. క్రీస్తు తన శిష్యులను ప్రతిష్ఠించుటకు తన్నుతాను ప్రతిష్ఠ చేసికొనుచున్నాననెను (యోహా $17^{17-19}$). ఈ సంగతి హెబ్రీ గ్రంథమందు మఱిపూర్తిగా వివరింపఁబడెను (హెబ్రీ $2^{11}$ $9^{11-18}$ $10^{10-14,19-22}$ $12^{14}$ $13^{11-12}$). మనము క్రీస్తు విధేయతచేతను ($10^{5-10}$), ఆయన రక్తమువలనను ($9^{13-15}$ $10^{14}$) పరిశుద్ధ పఱచఁబడి యున్నాము.

మనలను పరిశుద్ధ పఱచుటకు క్రీస్తు చేసినపని ఆధారమైయున్నదిగాని ఆలాగు మనలను పరిశుద్ధ పఱచుటకు పరిశుద్ధాత్మకర్తయై యున్నాఁడు. కావున మనము పరిశుద్ధాత్మచేత పరిశుద్ధపఱచఁబడు వారమగుదుము (రోమా $15^{16}$ I కొరి $6^{11}$ I థెస్స $4^{7,8}$ ఎఫె $4^{30}$ I పేతు $2^{9}$ మొ॥). మనము విశ్వసించినయెడల పరిశుద్ధాత్మచే ఇట్టి పరిశుద్ధత నొందఁగలము (కార్య $26^{18}$ ఎఫె $1^{13,14}$). ఈ పరిశుద్ధత మాఱు మనస్సు నొందునప్పుడు నారంభమై (రోమా $6^{1-11}$) విశ్వాసి జీవితకాలమందంతటను వృద్ధి పొందుచుండవలెను (రోమా $6^{12-14}$ I థెస్స $5^{23,24}$ పరిపూర్ణత చూ॥).

**పరిశుద్ధమాత** దేవమాత I చూ॥

**పరిశుద్ధ లేఖనములు (Holy Scriptures, Hagiographa).** పాఁత నిబంధనకు సాధారణమైన పేరు లేఖనములు అనునదైనను పౌలు ఒక పర్యాయము పాఁతనిబంధన యావత్తుకు పరిశుద్ధ లేఖనములు అను పేరు పెట్టెను (రోమా $1^{2}$). మనము ప్రస్తుతమున బైబిలంతటికి ఈ పేరును పెట్టుచున్నాము. అయితే యూదులు పాఁత నిబంధనకాలములో లేఖనములు, (లేక) పరిశుద్ధలేఖనములు అను అర్థమిచ్చు పేళ్లను పాఁత నిబంధనములోని కావ్యగ్రంథములకును మఱి

కొన్ని యితర గ్రంథములకును మాత్రము పెట్టిరి. ఇట్లు కీర్తనలు, సామెతలు, యోబు, పరమగీతము, రూతు, విలాపవాక్యములు, ప్రసంగి, ఎస్తేరు, దానియేలు, ఎజ్రా, నెహెమ్యా, I, II దినవృత్తాంతములును ఇందులో చేరియున్నవి. యూదులు వీటిని తమ ప్రమాణ గ్రంథములలో చేర్చికొని యున్నను మోషే వ్రాసిన గ్రంథముల కంటెను ప్రవక్తల గ్రంథములకంటెను తక్కువ యధికారముగల గ్రంథములనుగా నెంచిరి (పాత నిబంధన చూ॥).

**పరిశుద్ధ సంఘము** పండుగలు, సంఘము చూ॥

**పరిశుద్ధ స్థలము** దేవాలయము I 4 (1) చూ॥

**పరిశుద్ధాత్మ, ఆత్మ** (The Holy Spirit, the Spirit). ఆత్మ యనుపదము హెబ్రీ భాషలోను గ్రీకుభాషలోను ఇతర భాషలలో నున్నట్లుగా శ్వాసను (ఊపిరి) సూచించును. ఉచ్ఛ్వాస నిశ్వాసము లాగిపోవుటతోడనే ప్రాణమును పోవునుగాన శ్వాసను ప్రాణముగా నెంచి ఆ ప్రాణమునకు ఆత్మయను పేరు పెట్టిరి. దేవునికి యాత్మ యున్నట్లు బైబిలునందు మొదటినుండి సూచనలు కలవు. ఆ యాత్మను పరిశుద్ధాత్మ యను పదముచే సూచించిరి. తన యాత్మచే ఆయా పనులు ఆయన చేయుచున్నట్లు ఆయా వాక్యములయందు కనఁబడును.

1. దేవునియాత్మ ఈ పంచభూతములను సృష్ట్యాదియందు క్రమపఱచినట్లు ఆది 1[2] నందున్నది. యోబు 37[10] లో ఊపిరి యనియు యెష 40[7] నందు శ్వాసమనియు తెనిఁగించిన అసలు పదమును ఆత్మ యనికూడ తెనిఁగించవచ్చును. అట్లు తెనిగించిన పక్షమున ఆ యాత్మకూడ సృష్టికి సంబంధించిన పనులు చేయుచున్నట్లున్నదిగాని, అట్టి సూచనలు మిక్కిలి అరుదుగా నున్నవి.

2. దేవుని యాత్మ మానవులకు జీవమిచ్చుటను గూర్చిన వాక్యములు బైబిలునందు గలవు (యోబు 33[4]). యెహె 37[3-14] లోనున్న జీవాత్మయు కీర్త 104[29,30] నందున్న ఊపిరియు, ఈ యసలు పదముయొక్క తర్జుమాలై యున్నవి. ఆది 2[7] నందున్న మానవుల సృష్టియు నదే భావము నిచ్చును. దేవుని యాత్మ జీవమిచ్చు యాత్మయని ఈ వాక్యములవలనఁ దెలియుచున్నది.

3. దేవుని యాత్మ ఆయావారలకు విశేష శక్తిని బలమును అనుగ్రహించిన యాత్మయని సూచించెడి వేలు వాక్యములును గలవు. న్యాయాధిపతుల మీఁదికిని (న్యాయా 3[10] 6[34] 11[29] 14[6]), సౌలు మీఁదికిని (I సమూ 11[6]) ఆ యాత్మ వచ్చినట్లు కనఁబడును. చిత్రపు పనులను చేయుటలో నిపుణుఁడగు బెసలేలు దేవుని యాత్మపూర్ణుఁడై యట్టి శక్తినొందెనని యున్నది (నిర్గ 31[1-3]). మనుష్యుల కసాధ్యమైన పనులు దేవుని ఆత్మవలన కాఁగలవని జెకర్యాచేలు ధైర్యపఱచఁబడెను (జెక 4[6]).

4. మఱి ముఖ్యముగా, ప్రవక్తల కనుగ్రహింపఁబడిన జ్ఞానమును శక్తియును, ఈ యాత్మ బలముచేతనే కలిగెనని చూపుటకనేక సూచనలు గలవు. ఆత్మను పొందినవారు ఆవేశముగలవారైరి (I సమూ 10[6,10] 19[9,20,23,24]). అట్లావేశపూర్ణులైన వారిలో నొక ప్రవక్త మోసపుచ్చు ఆత్మను పొందినట్లు I రాజు 22[21-28] లో కనఁబడుచున్నది. ఇట్టి ఆవేశమొందినవారు తాము ఆత్మపూర్ణులమని తెలిసికొనిరి. అది యట్టి ఆవేశము మాత్రమే గాక, దేవుఁడు తన భక్తుల కనుగ్రహించిన బుద్ధిని దేవునికు వారి కాత్మను మఱివిశేషముగా ననుగ్రహించుట యని కనఁబడుచున్నది (మీకా 3[8] యెహె 2[2] 3[12,14,24] మొ॥ నెహె 9[30] II దిన 15[1]). ప్రవక్తలు తమకు తోఁచినట్లుగాక ఆత్మచేత రేపఁబడినట్లు ప్రవచించిరని ఇందుచేతనే చెప్పఁగలము (II పేతు 1[21]).

5. దేవుఁడిశ్రాయేలీయులను తన పరిశుద్ధాత్మచే నడిపింపఁగా (యెష 63[12]) వారు ఆ యాత్మ నెదిరించినట్లు యెష 63[10] లో చూడవచ్చును. ఆ ప్రజలకు నెమ్మది కలుగఁజేసినవాఁడు యెహోవా యాత్మయే (యెష 63[14]). మెస్సీయ కాలమునందు ప్రజలకు కలుగవలసిన కుదురుబాటును సౌఖ్యమును వారికి కలుగునట్లు, పరిశుద్ధాత్మయే ముఖ్యముగా ఆ జనములో పనిఁజేసెను (యెహె 39[29] యెష 4[4] 44[3] యోవే 2[28,29]).

6. ఆ యాత్మ మానవులను శుద్ధిచేసినట్లు కూడ ఆయా వాక్యములలో సూచనలున్నవి (యెహె

$36^{26,27}$ కీర్త $51^{10,11}$). ఆయన సర్వ వ్యాపియై భక్తులను నడిపించి కాపాడును (కీర్త $139^{7}$ $143^{10}$). పరిశుద్ధాత్మ త్రైక దేవునిలో నొక మూర్తియని పాత నిబంధనలో తేటయైన బోధలున్నవని చెప్ప వీలు లేకపోయినను, అందులోనున్న బోధలు దానికి చక్కగా సరిపడును. పాత నిబంధన గ్రంథములయందు ముఖ్యముగా ప్రవచింపబడిన మెస్సీయ దేవుని యాత్మ కలిగినవాడను ప్రవచనములు గలవు (యెష $11^{1-9}$ $61^{1-3}$). పరిశుద్ధాత్మను గూర్చిన బోధలు నూతన నిబంధనలో పూర్ణముగా నున్నవిగాని ఈ వాక్యము లట్టి బోధలకు ముందు సూచనలని చెప్పదగును.

రాబోవు కుమరుబాటు కాలమునందు పరిశుద్ధాత్మ సర్వ జనులమీద కుమ్మరింపబడునను (యోవే $2^{28,29}$) ప్రవచనము క్రీస్తు పనికి సంబంధముగా నెఱవేఱెను.

(1) మలాకీ కాలము మొదలుకొని ఆత్మావేశపరులై ప్రవచించినవారు లేకపోయినను క్రీస్తుకు ముందుగా వెళ్లి మార్గము సిద్ధపఱచిన యోహానుకు ఆ యాత్మవరము మరల ననుగ్రహింపబడెను (లూ $1^{15-17}$). పరిశుద్ధాత్మ నిచ్చుట తన పని కాదనియు, క్రీస్తుయొక్క పనియనియు అతడు బోధించినను (మా $1^{11}$ మ $3^{11}$) అతడు తన పనిని ఆత్మశక్తిచేతనే జేసెను.

(2) క్రీస్తు ఆత్మపూర్ణుడై తన పనిని జేసెను. ఆయన జన్మించినది పరిశుద్ధాత్మ శక్తివలననే (మ $1^{18,20}$ లూ $1^{35}$). బాప్తిస్మము నొందినప్పుడు పరిశుద్ధాత్మ పావురాకారముతో ఆయనమీదకు దిగివచ్చెను (మా $1^{10,12}$ మ $3^{16}$ లూ $4^{1}$ యోహా $1^{32,33}$). ఆయన తన పని నింకమీదట ఆత్మపూర్ణుడై చేసెను (లూ $4^{1}$). తరువాత ఆయన అరణ్యమునకు కొనిపోబడి శోధింపబడెను. ఆయన నజరేతులో పని నారంభించినప్పుడు, యెహోవా యాత్మ తనమీదనున్నదను ప్రవచనము (యెష $61^{1-3}$) నెఱవేఱెనని చెప్పెను (లూ $4^{18}$). తాను లోకమును విడిచివెళ్లువఱకు, వాగ్దత్తము చేయబడిన పరిశుద్ధాత్మ యనుగ్రహింపబడలేదు కావున ఆయన తన మరణమునకు పూర్వము ఆ యాత్మను గూర్చి విశేషముగా బోధించెను గాని అంతకు మునుపు వివరముగా బోధించలేదు. అయినప్పటికిని ఒకడు ఆత్మమూలముగా జన్మించక పోయినయెడల దేవుని రాజ్యములో చేరలేడనియు (యోహా $3^{5-8}$), తాను దేవుని యాత్మవలన దయ్యములను వెళ్లగొట్టుచున్నాననియు (మ $12^{28}$), దేవుడు తనను అడుగువారికి తన యాత్మ ననుగ్రహించుననియు (లూ $11^{13}$), తన్ను నిరాకరించుటవలన పరిశుద్ధాత్మ నెదిరించి క్షమింపబడని పాపమునకు లోనగుచున్నారనియు (మ $12^{31,32}$ మా $3^{29}$), హింసలుకలుగు కాలమునందు పరిశుద్ధాత్మ శిష్యుల నాదరించి బలపఱచు (మ $10^{20}$ మా $13^{11}$ లూ $12^{12}$), దావీదు క్రీస్తును గుఱించి ప్రవచించినది ఆత్మప్రేరేపణవలననే యనియు (మ $22^{43}$), చెప్పి ఆయా సమయములలో బోధించుచువచ్చెను. ఈ లోకమును విడిచి కొద్దికాలములోనే వెళ్లుననగా, ఆయన పరిశుద్ధాత్మనుగూర్చి మఱింత స్పష్టముగా బోధించెను. పరిశుద్ధాత్మ తన పనిని సఫలపఱచు ఆదరణకర్త (హెచ్చరిక చేయువాడు) అనియు (యోహా $16^{7}$), తనబోధలను వారి జ్ఞప్తికిదెచ్చుచు, దానిని సంపూర్ణముగా గ్రహించుటకు వారికి శక్తినిచ్చుననియు ($14^{26}$ $15^{26}$ $16^{14,15}$), పాపమును గూర్చియు, నీతినిగూర్చియు, న్యాయతీర్పును గూర్చియు, లోకము నొప్పుకొనజేయుననియు (యోహా $16^{8}$) బోధించెను. తండ్రి పరిశుద్ధాత్మను క్రీస్తు పేరట పంపుననియు ($14^{26}$). క్రీస్తుచేత పంపబడుననియు ($16^{7}$) వ్రాయబడి యున్నది. ఆయన తండ్రియొద్దనుండి బయలు వేరు సత్యస్వరూపియైన ఆత్మ అని $15^{26}$ నందున్నది. బయలు దేరు అను నీపదము తండ్రికిని పరిశుద్ధాత్మకునుగల సంబంధమును సూచించును. యోహా $16^{7}$ నందు పరిశుద్ధాత్మవచ్చునను పదముగలదు. ఇట్టి వాక్యములవలన వారికి తీక్ష్ణమగు సంబంధమున్నను, పరిశుద్ధాత్మ ప్రత్యేకమైన మూర్తియై యున్నట్లు స్పష్టమగుచున్నది. పునరుత్థానుడైన క్రీస్తు తన శిష్యులమీదనుండి వారికి పరిశుద్ధాత్మ ననుగ్రహించెను (యోహా $20^{22}$). పరిశుద్ధాత్మ వారిమీదకు వచ్చువఱకు కనిపెట్టి యుండవలెనని ఆయన ఆజ్ఞాపించెను (లూ $24^{49}$). చివరకు ఆయన, తండ్రి, కుమారుడు పరిశుద్ధాత్మయను త్రైక దేవుని నామమందు అందఱికిని బాప్తిస్మ మియ్యవలెనను ఆజ్ఞనిచ్చి ఆరోహణమయ్యెను (మ $28^{19}$).

(3) అపొస్తలుల కార్యముల గ్రంథ మీ వాగ్దానముల నెఱవేర్పుయొక్క వివర మనఁదగును. పెంతెకొస్తు దినమున పరిశుద్ధాత్మ కుమ్మరింపఁబడెను (కార్య 2). అప్పుడు జరిగిన వింత కార్యములు కొన్ని, సమరయలో విశ్వసించిన వారికి పరిశుద్ధాత్మ యనుగ్రహింపఁబడినప్పుడును ($8^{15-19}$) అన్యుల కనుగ్రహింపఁబడినపుడును ($10^{44}$ $11^{15}$) కనఁబడెను. అన్యభాషలతో మాట్లాడఁగల శక్తియు (కార్య $13^{9-16}$ I కొరి $12^{10-29}$ గల $3^{5}$), ప్రవచించు శక్తియు (కార్య $11^{28}$ $21^{4-10-11}$ I కొరి 14) అను నిట్టి విశేష వరములు శిష్యులుపొందిరి. క్రీస్తును గుఱించి బోధించి ఆయన పనిని కొనసాగించుటకు పరిశుద్ధాత్మ సహాయము అత్యావసరముగా కావలసి యున్నది (కార్య $1^{6-11}$ $6^{3}$). ఆ అపొస్తలులు దేవుని యాత్మవలన కలిగిన శక్తిచేత తమ కార్యములను చేయుటచేత వారి పేరటనున్న గ్రంథమును పరిశుద్ధాత్మ కార్యముల గ్రంథమని చెప్పఁదగును (కార్య $2^{4}$ $8^{29}$ $10^{19}$ $16^{7}$ మొ॥).

(4) పత్రికలలోని బోధలను చూడఁగా, విశ్వాసులు ఆత్మ వరములను విశేష శక్తులనుకూడ పరిశుద్ధాత్మచేత పొందినట్లుగా కనఁబడును (I కొరి $12^{11}$). అయినను అద్భుతములను చేయుటను ముఖ్యమైనదానిగా నెంచక, దేవుని యాత్మ మనలను ప్రేరేపించి పవిత్రపఱచి, మనలను క్రీస్తు రక్షణయందు పాలిభాగరులనుగాఁ జేయుటయే ఆయన ముఖ్యమైన పనియని పత్రికల బోధయై యున్నది. ఇట్లు పరిశుద్ధాత్మచేత మనము దేవుని యొక్క గొప్ప ప్రేమను గ్రహించుకొని (రోమా $5^{5}$ తీతు $3^{4-6}$) దేవునియెడల పుత్రభావముగలవార మగుదుము (గల $4^{6-19}$ రోమా $8^{9-16}$). పరిశుద్ధాత్మ మనకు సరియైన జ్ఞానము కలుగఁజేసి I కొరి $2^{10-16}$) దేవుని సంగతులను గ్రహించుకొనుటకు మాత్రమేగాక దేవుని యొద్దకుచేరి ఆయనతో సహవాస భాగ్యమనుభవించుటకును మనకు శక్తి సహాయముల ననుగ్రహించును (రోమా $8^{26,27}$ ఎఫె $2^{17}$ ఫిలి $2^{1}$ $3^{3}$). దేవుని గుఱించిన సంగతులను బోధించుటకు బోధకులకు మాత్రమే గాక (రోమా $15^{19}$ I కొరి $2^{4}$), క్రైస్తవులందఱికి కావలసిన సద్గుణములు పట్టుబడులాగున సహాయము చేయును (ఎఫె $3^{16}$). క్రీస్తును ప్రభువుగా నొప్పుకొనువారు ఆత్మచేతఁగాక స్వశక్తిచేత నొప్పుకొనఁజాలరు (I కొరి $12^{3}$ I యోహా $4^{2-13}$). అట్లు నమ్మువారికి నెంతమాత్రమును స్వబుద్ధిచేత కొట్టుకొనిపోక దేవుని యాత్మచే నడిపింపఁబడిన వారై, తమ శరీరేచ్ఛలను చంపుదు (రోమా $8^{5,10}$ గల $5^{16,17}$), ఆత్మీయ సంగతులలో పెంపొందెదరు (గల $5^{22}$). మనకు రక్షణ రూఢిగా కలుగునటుకు ఆయన సంచకరవుగా నుండును (రోమా $8^{15,16}$ I కొరి $6^{11}$ II కొరి $1^{22}$ ఎఫె $1^{13,14}$ $4^{30}$). క్రీస్తునందు విశ్వాస ముంచువారిని ప్రేమానుబంధములో నైక్యపఱచి వారిని కాపాడును (I కొరి $12^{13}$ ఫిలి $2^{1}$ II కొరి $13^{13}$).

పరిశుద్ధాత్మ క్రీస్తుతో కలిసి పనిచేయునేగాని వేఱుగా చేయుఁడను సంగతి సువార్తలలోను, పత్రికలలోను స్పష్టముగా నున్నది. ప్రభువే ఆత్మయని II కొరి $3^{17,18}$ నందున్నది. క్రీస్తు ఆయనను పంపెనను సంగతిని యోహా $16^{7}$ నందు చూడవచ్చును. రోమా $8^{9}$ నందు ఆయన దేవుని యాత్మయనియు, క్రీస్తు ఆత్మయనియు అనఁబడును. గల $4^{6}$ నందు తనకుమారుని యాత్మ అనఁబడెను. మన హృదయములలో నివసించువాఁడు క్రీస్తు అనియును (ఎఫె $3^{16,17}$). పరిశుద్ధాత్మయనియు (II కొరి $1^{22}$) వ్రాయఁబడి యున్నది. పరిశుద్ధాత్మ దేవునితోను క్రీస్తుతోను చేర్చఁబడి, వారి యాత్మయని పిలువఁబడినను, వారికి ప్రత్యేకమైనవాఁడై యున్నాఁడు (మ $28^{19}$ II కొరి $13^{13}$). ఈ సంగతిని విశదపఱచుటకే, పరిశుద్ధాత్మ, తండ్రి కుమారునితో కూడ త్రైకదేవుఁడని క్రైస్తవ సంఘము ఆదినుండి నేటివఱకు తమ విశ్వాస ప్రమాణములలో నొప్పుకొనుచున్నది. (ఆత్మవరములు, దేవుఁడు యేసుక్రీస్తు చూ॥).

## పరిశుద్ధాత్మకు విరోధమైన పాపము

పాపము 6 చూ॥

**పరిశుద్ధులు** పరిశుద్ధత చూ॥

**పరిసయ్యులు** (Pharisees = ప్రత్యేకముగా నుండువారు).

1. ఉత్పత్తి:—క్రొత్త నిబంధనలో పరిసయ్యులు యూదులతెగలలో నొక ముఖ్యమైన తెగవారై యుండిరి. వారు బబులోను చెఱకు తరువాత నుద్భవించినవారు. వీరు అన్యులనుండి

కేవలము ప్రత్యేకముగా నుండి యూదా దేశమును రక్షింపఁజూచిరి. క్రీ॥ పూ॥ 2 వ శతాబ్దమున అంతియొకయరాజులు యూదుల యాచారములను మార్చి వాటికి ప్రతిగా గ్రీకువారి వాడుకలను దేశములో వ్యాపింపఁజేయ యత్నించుచుండఁగా ఈ పరిసయ్యులు తమ మతాచారములయందు మఱింత నిష్ఠపరులై యుండిరి. అప్రమాణగ్రంథములలోని మక్కా $2^{39-41}$ లో మతాభిమానులను తెగవారి పేరు కలదు. వారు అప్పటి పరిసయ్యులై యుండిరి. క్రీస్తుకాలములో నిట్టివారు సుమారుగా 6,000 మంది యుండిరని లెక్కింపఁబడెను.

2. బోధలు, గుణములు:—యూదుల తెగలలో పరిసయ్యులు యూదమతమందు మిగుల అభిమానముగలవారై యుండిరి. వారు పాత నిబంధనమాత్రముగాక తమ శాఖలోని పెద్దల పారంపర్యములను మిగుల నిష్ఠతో ననుసరించిరి. అట్టి పారంపర్యము లనేకములు కలవు. ఈ పరిసయ్యులు పునరుత్థానమును, దూతలను, రాఁబోవు న్యాయతీర్పును నమ్మిరి (కార్య $23^{8}$). అయినను ఇట్టిబోధలు వారిబోధలలో ముఖ్యమైనవి కావు. వారు భోజన పానాదులవిషయమును అంటువిషయమును అనేక యాచారముల నాచరించిరి (మా $7^{1-3}$). వారు మొదట దేవుని యందలి యాసక్తిచే వీటి నాచరించినను అవి క్రమక్రమేణ వట్టి వెలుపలియాచారములై నీతి న్యాయములను గొప్పవిషయములను మఱుగుపఱచిన వయ్యెను. ఇటుల వారు క్రీస్తుకాలములో స్వనీతిపరులును మతవేషము ధరించినవారునై యుండిరి (మ $5^{20}$ $16^{6-12}$ $23^{1-39}$). వారితరులను తృణీకరించుటనుగూర్చియు వారి వేషధారణను గూర్చియు క్రీస్తు గద్దించినందున వారు క్రీస్తు విరోధులలో ముఖ్యులైరి (మా $3^{6}$ యోహా $11^{47-57}$). అయినను వారిలో శ్రేష్ఠులైన భక్తులు కూడ నుండిరి. గమలీయేలు వారిలో నొక ఘనుఁడగు శాస్త్రియై యుండెను (కార్య $5^{34}$). పౌలుకూడ వీరిలో నొకఁడై యుండెను ($23^{6}$ $26^{5}$).

3. బైబిలులో వారినిగూర్చిన యితర సూచనలు:—సువార్తలలో పరిసయ్యులనుగూర్చి చాల సూచనలున్నవి. వారు బాప్తిస్మమిచ్చు యోహాను నొద్దకు వచ్చిరి (మ $3^{7}$). యోహాను ఎట్టివాఁడో విచారించుటకు వారు కొందఱిని అతనియొద్దకు నంపిరి (యోహా $1^{24}$). నీకొదేము వారిలో నొకఁడై యుండెను ($3^{1}$). వారు అన్యాయపడినందున క్రీస్తు యూదయను విడిచి వెళ్లవలసి వచ్చెను ($4^{1}$). క్రీస్తు దయ్యములకు అధికారి యనియు ($9^{34}$), ఆయన యూదుల యాచారముల నాచరింపఁడనియు ($9^{13}$) విశ్రాంతిదినమును మీఱువాఁడనియు (మా $2^{24}$ $3^{6}$) పెద్దలపారంపర్యములను ఆచరింపఁడనియు (మ $15^{1}$) పాపులతో భోజనము చేయువాఁడనియు (లూ $15^{2}$) ఇట్టి నేరములను వారు మొదటినుండి చివరివఱకు క్రీస్తుమీఁద మోపుచుండిరి. వారు యాజకులతోఁ గలసి క్రీస్తును పట్టుకొనుటకు మనుష్యులను పంపిరి (యోహా $7^{32}$). క్రీస్తు లాజరును లేపినపిమ్మట వారు క్రీస్తును సంహరించుటకు సభను సమకూర్చిరి ($11^{47}$). వారు క్రీస్తును ఒక గుఱుతు (మ $19^{3}$) ను, చిక్కుప్రశ్నలను అడిగిరి (మా $12^{13}$). చివఱకు క్రీస్తును పట్టుకొనుటకు యాజకులను బంట్రౌతులను పంపిరి (యోహా $18^{3}$). క్రీస్తు చంపఁబడినపిమ్మట ఆయనసమాధిని భద్రపఱచవలెనని పిలాతు నడిగినవారిలో పరిసయ్యులు నుండిరి (మ $27^{62}$).

కార్యముల గ్రంథములో నున్నట్లు వారిలో కొందఱు క్రైస్తవులైరిగాని పూర్వపు యూదమతమునందు ఎక్కువ యభిమానముగలవారై యుండిరి (కార్య $15^{5}$). పునరుత్థానమును నమ్మి యుండినందున వారు ఒకపర్యాయము పౌలు పక్షముగా మాట్లాడిరి ($23^{5-7}$).

**పరుగు** పందెము చూ॥

**పరుపు** (Bed). యూదుల పరుపు సాధారణముగా చాప, దానిమీఁద పఱచు బొంతయు దానిమీఁద కప్పు దుప్పటితోఁగూడినదై యుండెను (యెష $28^{20}$ నిర్గ $22^{27}$). ఇది అట్టి దగుటచేతనే ఒకఁడు దానిని చుట్టి యెత్తుకొనిపోవుటకు వీలుగా నుండెను (మా $2^{4}$ యోహా $5^{8,9}$). భాగ్యవంతుల యిండ్లలోని గోడల ప్రక్కలందు అరుగులుకట్టించి వాటిమీఁద రజైలను పఱచి, వాటిమీఁద చిత్రవర్ణములుగల దుప్పట్లను పఱచిరి. వాటిమీఁద పగలు కూర్చుం

డిరి. రాత్రులలో పరుండిరి (సామె $7^{17}$). భాగ్యవంతులైనవారు బాలీసులను వాడుకొనిరి తలగళ్లను ఉపయోగించిరి (I సమూ $19^{13}$). (యెహె $13^{18}$). J. C.



హెబ్రీయుల మంచము

**పరూయహు** (Paruah = వృద్ధినొందుచున్న). సొలొమోనుకు ఇశ్శాఖారు గోత్రము నుండి ఆహారమును సంగ్రహింపనై యేర్పాటు చేయఁబడినవారిలో యెహోషాపాతుయనువాని తండ్రి (I రాజు $4^{17}$).

**పరోషు** (Parosh = మిన్నల్లి). చెఱకాలమునకుఁబిమ్మట బాబెలునుండి తిరిగివచ్చిన యొక కుటుంబము (ఎజ్రా $2^{2}$ = నెహె $7^{8}$, $8^{3}$ $10^{25}$ నెహె $3^{25}$ $10^{14}$).

**పర్ణశాలలపండుగు** పండుగులు ఉపవాసములు III 1 (3) (c) చూ॥

**పర్మష్తా** (Parmashta = మహా గొప్ప?) హామాను కుమారులలో నేడవవాఁడు (ఎస్తే $9^{9}$) యూదు లితని సోదరులతో నితనిని జంపిరి.

**పర్షండాతా** (Parshandatha = పారసీక దేశమునకిచ్చినవాఁడు). హామాను కుమారులలో జ్యేష్ఠుఁడు (ఎస్తే $9^{7}$). యూదులితనిని ఇతర సోదరులతోఁ జంపివేసిరి.

**పర్నాకు** (Parnach). జెబూలూను గోత్రపు ప్రధానియగు ఎలీషాపాను తండ్రి (సంఖ్యా $34^{25}$).

**పర్వతము** యెరూషలేము A IV 3 చూ॥

**పర్వాయీము** (Parvaim). సొలొమోను దేవాలయమును అలంకరించుటకు బంగారమును దెప్పించిన ప్రదేశము (II దిన $3^{6}$). ఇది అరేబియా దేశములో నున్నదనుకొందురు.

**పర్మెనాసు** (Parmenas = నమ్మకమైనవాఁడు?). ఆది క్రైస్తవ సంఘమునందు ఏడుగురు పరిచారకులనఁబడిన ధర్మకర్తలలో నొకఁడు (కార్య $6^{5}$).

**పలక** (Tablet). పలకయని తెనిఁగించిన మూలభాషాపదము గుడారమునందు వాడిన మ్రానుపలకలను (నిర్గ $27^{8}$), ఆలయమందలి స్తంభములమీఁదవేసిన పలకలను (I రాజు $7^{36}$), ఓడ బ్రద్దలైపోఁగా తప్పించుకొనిపోవుటకు వాడిన ఓడచెక్కలను (కార్య $27^{44}$) సూచించును. ఈ శీర్షికయందు వ్రాఁతకు వాడిన పలకలనుగూర్చి వివరింపఁబడును. పదియాజ్ఞలు రెండు రాతిపలకలమీఁద వ్రాయఁబడెను (నిర్గ $31^{18}$ $32^{15}$ $34^{1,4,28,29}$ ద్వితీ $4^{13}$ $5^{22}$ $9^{9}$ మొ॥). వీటిని నిబంధన మందసమున నుంచిరి ($10^{5}$ I రాజు $8^{9}$). హెబ్రీ $9^{4}$ నందివి నిబంధన పలకలనఁబడెను అట్టి పలకమీఁదనే యెషయా తన బోధలలోఁ గొన్నింటిని వ్రాసెను (యెష $30^{8}$). $8^{1}$ లో నున్న పలకయను పదము మూల

భాషయందు మఱియొకపదమైనను ఈ యర్థమునే తెలుపును. అది యెరూషలేమునం దొకచోట నిలుపఁబడవలసినంత పెద్దదై యుండెను. పరుగెత్తువాఁడు సహా చదువఁగలుగునంత పెద్ద యక్షరములతో దేవుని బోధలను పలకమీఁద వ్రాయుమనునాజ్ఞ హబ $2^{2}$ నందున్నది. క్రొత్త నిబంధనలో జెకర్యా యోహాను పేరు వ్రాసినది (లూ $1^{63}$) చిన్నదియై మైనములో కప్పఁబడి యుండెను. ఆ పలకమీఁద నున్న మైనముపై వ్రాసిరి.

బోధలు మన హృదయములలో నాటును గాన హృదయములు దేవునిబోధలను వ్రాయుటకైన పలకలుగా పాఁత నిబంధనయందును (సామె $3^{3}$ $7^{3}$ యిర్మీ $17^{2}$) క్రొత్త నిబంధనలోను (II కొరి $3^{3}$) సూచనలున్నవి

## పలెస్తీను (Palestine).

I. పేరు:—పలెస్తీను అను పేరు బైబిలులో లేదుగాని దానికి సంబంధించిన పేరు నిర $15^{14}$ యెష $14^{29,31}$ యోవే $3^{4}$ ఫిలిష్తీయ అని యున్నది. ఈ పేరు అసలు ఫిలిష్తీయుల దేశమునకు పెట్టఁబడెను మొదట కర్మెలు పర్వతమునకు దక్షిణముగా సముద్రమునకును కొండలకును మధ్య నుండు మైదానమునకు వాడిరి. అందువలననే తరువాతి కాలములో అది యిశ్రాయేలు దేశమంతటికిఁ జేరియ్యెను యొర్దాను పడమటిభాగమునకు కనానుదేశము అను పేరుకూడ కలదు. యెహోషువ దానిని జయించినపిమ్మట అది యిశ్రాయేలీయుల దేశమనఁబడెనుగాని ఆ దేశము రెండుభాగములుగ భాగింపఁబడిన పిదప ఉత్తరపుభాగమునకు మాత్రము ఇశ్రాయేలు దేశమను పేరుండెను. జెక $2^{12}$ లో అది ప్రతిష్ఠితమైన (= పరిశుద్ధ *Holy*) దేశమనఁబడెను. ఇది క్రైస్తవదేశములలోని వారు దానికి పెట్టునామమై యున్నది. గ్రీకువారును రోమను వారును దానికి పలెస్తీను దేశము అనుపేరుపెట్టుటచే పలెస్తీను అనుపేరు అన్నిఁటిలో మిక్కిలి వాడుకైన నామమయ్యెను.

II. సరిహద్దులు, వైశాల్యము:—ఈ దేశము మధ్యధరాసముద్రమునకు తూర్పున ఆ సముద్రమునకును అరేబియా యెడారికిని మధ్యనున్నది. దక్షిణమున ఐగుప్తునది యనఁబడిన వాగునుండి యుత్తరమున లెబానోను పర్వతమువఱకును అది వ్యాపించి యుండెను. దానిపొడవు 145 మైళ్లును వెడల్పు 70 మైళ్లవఱకునుండి సుమారు 8,400 మైళ్లవైశాల్యము కలిగియున్నది. ఇది చిన్న దేశమేగాని మధ్యధరాసముద్రము తీరముననుండి ఆసియా, ఆఫ్రికా, ఐరోపా యను మూఁడు ఖండములమధ్య నున్నది.

III నైసర్గిక స్వరూపములు:—పలెస్తీనులో ఉత్తరమునుండి దక్షిణమువఱకు వ్యాపించు ఐదు భాగము లున్నవనఁదగును.

1 సముద్రముదగ్గఱనుండు మైదానము. దీనికి దక్షిణమునందు ఫిలిష్తీయదేశమును, ఉత్తరమున కర్మెలు పర్వతమువఱకు షారోను అను మైదానమును కలదు. కర్మెలున కుత్తరమున ఆ మైదానము చాల విశాలమైనదై ఎస్డ్రేలన్ బయలు అనఁబడును. దాని కింకను ఉత్తరముగా తూరుసీదోనుల మైదానము కలదు. అది పలెస్తీనులో చేరినదికాదు.

2. షెఫేలా అనుభాగము. ఇది ఆ మైదానమునకును పలెస్తీను మధ్యభాగమున నుండు పెద్ద కొండలవరుసకును మధ్యనుండు నొక కొండ ప్రదేశమై యున్నది. ఈ కొండలు సుమారు 500 అడుగుల ఎత్తుగలవిగాని అంత యెక్కువ యెత్తుగలవికావు.

3. పలెస్తీను మధ్యభాగము అను పీఠభూమి. ఇది ముఖ్యభాగమనఁదగును. దీని దక్షిణభాగమునకు ప్రత్యేకముగ 'దక్షిణభాగము' అనుపేరు కలదు. ఇది హెబ్రోను చుట్టునుండు ప్రదేశమై యున్నది. దీనికి ఉత్తరమున యూదయ అరణ్యము వచ్చును. దీనికి నుత్తరమున యెరూషలేమును దానిచుట్టునుండు పట్టణముల కొండ ప్రదేశము నున్నది. దానికి నుత్తరమున షోమ్రోనుకొండల ప్రదేశముండును. అయితే దీనికి దిగువనుండు కొండ ప్రదేశము సుమారు 2,000 అడుగుల యెత్తుననుండును. షోమ్రోనుకు ఉత్తరమున నుండు ఎస్డ్రేలన్ బయలు ఆ కొండలను గలిలయ కొండలనుండి వేఱుపఱచును. అచట బయలుండుటచే రస్తాలు దానిమీఁదుగా పడెను. ఈ బయలుయొక్క ఫలవంతమగు స్థితినిబట్టియు

రస్తాలు దానిమీఁదుగా వేయఁబడియుండుటను బట్టియు ఇది పలెస్తీనుదేశమునందలి ముఖ్యమైన రణభూమియాయెను. సీసెరా, సౌలు, యోషీయా యనువారి కాలములలో ముఖ్యయుద్ధము లిచటనే జరిగియుండెను. ఈ బయలున కుత్తరముగా గలిలయ కొండలు కలవు. అవి ఉత్తరమున లెబానోను కొండలవఱకు వ్యాపించును. వాటిలోని ముఖ్యశిఖరము హెర్మోను.

4. యొర్దానునదియు దానికి సంబంధముగా నుండు సరస్సులును, (యొర్దానునది, మేరోము, గలిలయ సముద్రము, మృతసముద్రము చూ॥). దక్షిణభాగమందు యొర్దాను లోయ చాల లోతైనది. మృతసముద్రపుమట్టమును చూడఁగా. అది మహా సముద్రపు (మధ్యధరా) మట్టమునకు 1,290 అడుగుల లోతుగా నున్నది. ప్రపంచమంతటిలో నిది మిగుల లోతైన లోయయై యున్నది.

5. యొర్దానుకు తూర్పుగా నున్న కొండ ప్రదేశము. దీని దక్షిణమందు మోయాబు కొండలు గలవు. మధ్యభాగమునకు గిలాదు అని పేరు. ఉత్తరభాగములో బాషాను కొండలున్నవి. ఇట్లు అది సిరియావఱకు వ్యాపించును. యొర్దానుకు పశ్చిమమున చాల నదులు కలవు. పూర్వమున ఈ దేశమునం దెక్కువ యూఁటలుండెను గాని ప్రస్తుతమున కర్మెలు కొండకు ఉత్తరముగా నుండు కీషోనుతప్ప నది యనఁదగిన దేదియు లేదు. యొర్దానుకు తూర్పుననుండు అర్నోనునది మృతసముద్రములోకి ప్రవహించును. పలెస్తీనుకు మధ్యభాగముననుండు యబ్బోకునదియు, ఉత్తరముననుండు యర్మూకు నదియు యొర్దానులోకి ప్రవహించును. ఈ యర్మోకునది యే ప్రదేశముగుండ ప్రవహించునో ఆ ప్రదేశము చాల ఫలవంతమైనది.

IV. శీతోష్ణస్థితి:—పలెస్తీను చిన్నదేశమైనను సర్వలోకములోనుండు శీతోష్ణభేదము లన్నియు నా దేశములో నున్నవని చెప్పఁదగును. మన దేశములోని హిమాలయపర్వతములమీదనున్నట్టే అచ్చటి హెర్మోనుపర్వతముపై నిత్యము హిమముండును. యొర్దాను లోయలో యెరికో చుట్టునుండు మైదానమునందు భరతఖండములో నుండు ఉష్ణమువంటి యుష్ణముకలదు. పలెస్తీనులో నున్న యితరభాగములలో పై రెండు స్థితులకుమధ్య నుండు శీతోష్ణస్థితులన్నియు నున్నవి.

అచటి తొలకరివర్షములు అక్టోబరుమాసములలో కురియును (యోవే $2^{23}$). అప్పుడే వారు పొలములను దున్నెదరు. అదిమొదలు మార్చి ఏప్రిల్ మాసములవఱకు అప్పుడప్పుడు వర్షములు కురియుచుండును. కడవరివానలు మార్చి ఏప్రిల్ నెలలలో కురియును. దీనివలన అచ్చటి పైరులు పెఱుగును. అటుతరువాత మఱల అక్టోబరుదాక ఏ మాత్రమును వర్షము కురియదు. అప్పుడా దేశములోని పైరులన్నియు పచ్చని ప్రతి మొక్కయు ఎండిపోవును. శీతోష్ణస్థితు లిట్లుండుటచే పలెస్తీనులో సకలవిధములైన చెట్లును మృగములు నున్నవి. (మృగములు, వృక్షములు చూ॥).

V. పలెస్తీను భాగములు:—ఈ దేశము ఇశ్రాయేలీయులలో విభాగింపఁబడకపూర్వమున నెట్లుండెనో తెలియదు. అయిన నిది యిశ్రాయేలులలో భాగింపఁబడిన పిమ్మటకూడ భాగములు చాల సారులు మాఱిపోయెను. ఇశ్రాయేలీయులకు చుట్టునుండు అన్యులు వారిని జయింపఁగా ఈ దేశమును ఆ యన్యులు కొంతవఱకు ఆక్రమించుకొనిరి. కావున ఈ భాగములనుగూర్చిన సంగతి చాల చిక్కుగా నున్నది. యొర్దానుకు తూర్పుననుండుభాగము 2½ గోత్రములవారికిని పశ్చిమభాగము 9½ గోత్రములవారికిని విభాగింపబడెను (పటము IX చూ॥).

చెఱకాలమునకుఁ బిమ్మట, ఇశ్రాయేలీయులు మఱల స్వాధీనపఱచుకొనిన ప్రదేశము యెరూషలేము పట్టణముచుట్టు నుండెను. షోమ్రోనులో మిశ్రమజాతివారుండుటచే (II రాజు $17^{24-41}$) అది ప్రత్యేకముగా నుండెను. మఱియు దానికి ఉత్తరముననుండిన గలీలు (గలిలయదేశము) లో ఇశ్రాయేలీయులుండినను అన్యుల యాధీనమునందుండెను. గాని క్రీ॥ ము॥ 104-103 లో మక్కబీయులు దానిని జయించి అందుండు వారినందఱిని యూదులగునట్లు బలవంతముచేసిరి. అటుపిమ్మట గలిలయులు యూదమతస్థులై యుండిరిగాని యెరూషలేమువారు వారిని హీన

ముగఁ జూచిరి. క్రొత్త నిబంధనకాలములో నివ్విధముగా దేశము విభాగింపఁబడెను. దక్షిణ మందుండు ఎదోమీయులు పలెస్తీను దక్షిణ భాగమును ఆక్రమించుకొనుటచే అది ఐదుమయ యనఁబడెను. దీనికి నుత్తరమున యూదయ, మధ్యమున సమరయ, ఉత్తరమున గలిలయయును పరగణాలుండెను. మఱియు యొర్దానునకు తూర్పున అవతల యనునర్థమిచ్చు పెరీయ యనఁబడిన భాగముండెను.

**VI. పలెస్తీను దేశముయొక్క చరిత్ర:—** పలెస్తీనుదేశముయొక్క ఆదిచరిత్ర తెలియదు గాని క్రీ॥ పూ॥ 3,000 సం॥ ల నుండియున్న రాతిశాసనములవలన పండితులాయా సంగతులను తెలిసికొనిరి. ఆ పురాతనకాలమునందుండిన ఈ దేశ నివాసులు షేము సంతతికి చెందినవారుకారు. వారు మిగుల అనాగరికులై యుండిరి. అయితే క్రీ॥ పూ॥ 2,500 సం॥ లకు హాము సంతతివారగు కనానీయులును అమోరీయులును మొట్టమొదట ఆ దేశములో నివాసము చేయ మొదలుబెట్టినట్లుగా నున్నది. క్రీ॥ పూ॥ 2000 సం॥ న నలుగురు రాజులు ఐదుగురు రాజులతో యుద్ధము చేయుట యనునది బైబిలులో వ్రాయఁబడిన యిట్టి లౌకిక చరిత్రలలో మొదటిదై యున్నది (ఆది 14, బబులోను III 2 చూ॥). అట్టి పురాతనకాలములో ఐగుప్తీయులు ముఖ్యముగా ఆ దేశమందలి దక్షిణభాగముతో నెక్కువ వర్తక వ్యాపారములు చేసియున్నట్లు రాతిశాసనముల వలనఁ దెలిసికొనవచ్చును. క్రీ॥ పూ॥ 1,500 సం॥ న ఐగుప్తురాజు పలెస్తీను దేశమును జయించెను గాని యతని ప్రభుత్వము కొద్దికాలముమాత్ర ముండెను. తరువాతి కాలములో కబీరీ (*Kabiri*) యనువారు ఆ దేశమును క్రమక్రమముగా జయించినట్లు టెల్-ఎల్-అమార్న (*Tell-el-Amarna*) రాతిశాసనములవలన తెలియును (రాతిశాసనములు చూ॥). ఈ కబీరీవారే హెబ్రీయులు. ఇచటినుండి పలెస్తీను చరిత్రకు ఆధారము బైబిలులో నున్నది.

క్రీ॥ పూ॥ 13 వ శతాబ్దమందు ఇశ్రాయేలీయులు మొదట మోషేవలనను తరువాత యెహోషువవలనను ఆ దేశమును జయించినను వారిమధ్యను చుట్టుపట్లను అన్యులింక విస్తారముగా నుండిరి కావున సుమారు క్రీ॥ పూ॥ 1,000 సం॥ లో దావీదు దానిని జయించువఱకు ఆ దేశజనులు పూర్ణముగా జయింపఁబడలేరైరి. దావీదు సొలోమోను రాజులకాలములో ఆ దేశము ఎక్కువగా ప్రబలియుండెను గాని తరువాతికాలములో అది రెండుభాగములయ్యెను (షోమ్రోను, యూదా చూ॥). అదిమొదలు ఇశ్రాయేలీయులే దాని నేలిరి క్రీ॥ పూ॥ 722 లో షోమ్రోనును, 587 లో యూదాయును చెఱపట్టబడి వినాశమొందెను. అది మొదట మహా అలెక్సందరు కాలమువఱకు (333) బబులోనువారి క్రిందను పారసీకుల క్రిందనుండెను. 537 సం॥ లో కోరెషు అను పారసీకరాజు చెఱపట్టఁబడిన యూదులను స్వదేశమునకు వెళ్లనిచ్చినను పలెస్తీనున కంతటితో స్వతంత్రత కలిగెననుకొనరాదు. అది యప్పటినుండి పారసీకుల ప్రభుత్వము క్రిందనుండినను మహా అలెక్సందరు కాలమునుండి 63 వ సం॥ వఱకు గ్రీకువారి క్రింద నుండెను. అలెక్సందరు చనిపోయిన పిమ్మట పలెస్తీను ముఖ్యముగా అంతియొకయవారి ప్రభుత్వము క్రిందనుండినను ఈ కాలములో ఐగుప్తురాజులగు తొలమీవారు దానిని కొద్ది కాలమువఱకు నేలిరి (312 217). అట్లు క్రీ॥ పూ॥ 2 వ శతాబ్దమున మక్కబీయులను యూదులు స్వతంత్రము నొందిరి. క్రీ॥ శ॥ ముందు 63 వ సం॥ నుండి రోమన్ వారి ప్రభుత్వమునకు బైబిలులో యెరూషలేము నాశనమువఱకు సూచనలు కలవు. ఆ నాశనము క్రీ॥ శ॥ 70 సం॥ లో జరిగెను. రోమావారి ప్రభుత్వము వేర్వేఱుగా నుండెను. రోమనులచే జయింపఁబడిన యితర ప్రదేశములకువలె ఈ దేశముకూడ, ఆయా కాలములలో ప్రేతర్లు (*Praetors*) అను గవర్నరులచే నేలఁబడెను. ఈ హిందూదేశమునందు గవర్నరులను నియమించుచున్నట్లు, ఆ కాలమున రోమన్ చక్రవర్తి రోమనులను ఈ యుద్యోగమునకు నియమించెను. బైబిలునందు చెప్పఁబడిన పొంతియు పిలాతు, ఫేలిక్సు, ఫేస్తులిట్టివారు. ఈ దేశమునందు మహారాజు లుండినట్లుగా ఆ కాలమందును స్వదేశపురాజులుండిరి. వారు హేరోదు సంతతివారు. వారు రోమనుల యనుగ్రహమువలన ఆ దేశములో నొకప్పుడు

గొప్ప భాగములను, ఒకప్పుడు కొద్దిభాగములను మాత్రమేలుచుండిరి. (హేరోదు, చతుర్థాధిపతి చూ॥). ఈ ప్రభుత్వకాలములో క్రీస్తు జన్మించి తన పరిచర్య జరిగించెను. అపొస్తలులుకూడ ఈ ప్రభుత్వకాలమున జీవించిరి. రోమను రాజ్యము తూర్పుపడమర రాజ్యములుగా విభాగింపఁబడినపిమ్మట పలెస్తీను కన్‌స్టాంటినోపిల్ రాజ్యప్రభుత్వముక్రింద నుండెను. 7 వ శతాబ్దమునుండి అది మహమ్మదీయుల యాధీనములో నున్నది. 11 వ శతాబ్దమున సిలువయుద్ధములు (*Crusades*) అను యుద్ధములవలన అది క్రైస్తవుల స్వాధీనమై 70 సం॥ ల వఱకు నుండెను గాని, అప్పటినుండి అది తుఱకల ప్రభుత్వము క్రిందను, 1918 సంవత్సరమునుండి బ్రిటిషువారి పరిపాలనక్రింద ఉంటూ వచ్చెను. పలెస్తీనులోని యూదులదేశము 'ఇశ్రాయేలు' అను పేరుతో 1948 వ సం॥ నుండి ఏర్పడినది. దీనికొరకు యూదులు అనేకవందల సంవత్సరములనుండి నిరీక్షించుచు ప్రయత్నములు చేసిరి. 1948 వ సం॥ మే 14 వ తేదీ మధ్యరాత్రి యూదులసభ తమ స్వంతరాజ్యమును ప్రజాపాలితరాజ్యముగ ప్రకటించుకొనిరి. వీరికిని అరబీయులకును ఇంకను కలహములు జరుగుచునే యున్నవి. వారిరాజ్య విస్తీర్ణము 8050 చ॥ మైళ్లు. టెల్ ఆవీవ్ (*Tel Aviv*) వారి ముఖ్యపట్టణము.

ఇదివరకు పెరీయ అనఁబడిన యొర్దాను తూర్పు భాగమునకు ప్రస్తుతము జోర్డాను (*Jordan*) అని పేరు. ఇది ఒక అరబీయుడగురాజు పరిపాలనక్రింద 1946 వ సం॥ నుండి ఉన్నది. దీని విస్తీర్ణము 30,460 చ॥ మైళ్లు. జనసంఖ్య 6,19,000. దీని ముఖ్యపట్టణము అమ్మాను (*Amman*).

**పల్తీ** (Palti = విడుదల). మోషే కనాను దేశమును వేగుచూచుటకు పంపిన పన్నెండుమందిలో బెన్యామీను గోత్ర ప్రతినిధి (సంఖ్యా $13^{9}$).

**పల్తీయుడు** (Paltite, The) బేత్పెలెతు నివాసియగు హెలెస్సు అనువాని బిరుదు (II సమూ $23^{26}$). I దిన $11^{27}$ నం దితఁడు పెలోనీయు డనఁబడెను (బేత్పెలెతు చూ॥).

**పల్తీయేలు** (Paltiel = దేవుని విడుదల).

1. ఇశ్రాయేలీయులు అరణ్యములో ప్రయాణము చేయుచుండఁగా ఇశ్శాఖారు గోత్రికులకు ప్రధాని (సంఖ్యా $34^{26}$).

2. దావీదు భార్యయైన మీకాలును సౌలు ప్రేరేపణచే వివాహము చేసికొనినవాఁడు (I సమూ $25^{44}$ II సమూ $3^{15}$).

**పల్లపుస్థలముల గుమ్మము** యెరూషలేము B III 8 (4) చూ॥

**పల్లు, పల్లువీయులు** (Pallu = కీర్తికొందిన). రూబేను కొడుకులలో నొకఁడు. ఇతని వంశస్థులని పల్లువీయులు అను పేరు కలిగెను (ఆది $46^{9}$ నిర్గ $6^{14}$ సంఖ్యా $26^{5}$). సంఖ్యా $16^{1}$ లో నుండు పేలెతు అనునది యీ పేరునకు మాఱురూపమై యుండవచ్చును.

**పల్లేరుచెట్టు** ముండ్లచెట్టు చూ॥

**పవిత్రత** పరిశుద్ధత, పవిత్రపరచుట, పవిత్రా పవిత్రములు చూ॥

**పవిత్రపరచుట** (Purification). ఆచార సంబంధముగా ఆయావాటిని పవిత్రపఱచుటను గూర్చిన యేర్పాటులు మాత్రము ఈ శీర్షికలో నున్నవి. ఇవి ఆయావిధములుగా నున్నవి.

1. పవిత్రపఱచుటకు అన్నిటిలో సులభముగ నుండు ఆచారము స్నానముచేసికొని బట్టలను ఉదుకుకొనుటయే (లేవీ $15^{8,10,11}$). ఒకఁడిట్లు స్నానముచేసి బట్టల నుదుకుకొనిన నాటి సాయంకాలమున ఆ బట్టలను మరల ధరింప వచ్చును. అప్పుడా యపవిత్రుని పవిత్రునిగా నెంచిరి. ఈ సులభమైనరీతి కొద్దిపాటి అంటునకు మాత్రము సరిపడెను. స్రావముకలిగిన యొకనిని ముట్టినవాఁడు తనకుకలిగిన యపవిత్రతను పవిత్రపఱచుకొనుట కిది చాలియుండెను ($15^{5-11}$). అన్యులైన యితరులను ముట్టిన పరిసయ్యులు చేసినస్నానాదులు వీటికి సంబంధములైనవై యుండెను (మా $7^{1-5}$).

2. ఏ స్రావమైన కలిగిన స్త్రీగాని పురుషుఁడుగాని పవిత్రత పొందవలెననిన, వారు ఏడుదినములవఱకు ఇతరులకు వేరైయుండినపిమ్మట

ప్రవహించు నీటిలో స్నానముచేసి తమబట్టల నుదుకుకొనవలెను. అట్టివారిని పవిత్రపఱచుట కివి చాలియుండెను. అయితే ఎనిమిదవదినమున రెండు పావురములను తెచ్చుకొని పాపపరిహారార్థ బలిగా నొకదానిని దహనబలిగా నింకొక దానిని అర్పింపవలెనను ఏర్పాటుకూడ కలదు (లేవీ $15^{28-30}$).

3. కానుపు అయినతరువాత తల్లిని పవిత్రపఱచుటకు విశేష నియమములు కలవు. మగబిడ్డను గనిన తల్లి యేడుదినములవఱకు అపవిత్రమైనదిగా నెంచఁబడెను ($12^{2}$). అటుపిమ్మట నింక 33 దినములవఱకు ఆమె ఆలయమునకు రాకూడదనియు, పవిత్రమైన దేనిని ముట్టకూడదనియు నియమమున్నది. అట్టి వాయిదాయైన తరువాత ఆమె యొక గొఱ్ఱెపిల్లను అర్పణముగా నర్పింపవలెను. మిగుల బీదలైతే గొఱ్ఱెకు బదులుగా రెండు పావురముల నర్పింపవలెను ($12^{8}$ లూ $2^{24}$). ఆఁడుపిల్లను గనినతల్లి రెండింత లెక్కువకాలము అపవిత్రురాలని యెంచఁబడెను గాని అర్పణాచారములలో నెక్కువ భేదములేదు.

4. కుష్ఠరోగి బాగుపడినయెడల మఱీ చిక్కుగా నుండు ఆచారముల నాచరింపవలసియుండెను. బాగు పడినవాఁడు మొదట రెండు పవిత్రమైన పక్షులను పట్టణపు గవినియొద్ద యాజకునికి నర్పింపవలెను. కుష్ఠరోగులు పట్టణము వెలుపల నివసింపవలసిన వారు కావున ఈ నియమముండెను. యాజకుఁడు ఆ పక్షులలో నొకదానిని పారునీటిమీద మంటిపాత్రలో చంపి, రెండవపక్షిని ఆ రక్తములో ముంచి స్వస్థపడినవానిమీద ప్రోక్షించి దానిని విడిచిపెట్టువాఁడు. తరువాత ఆ రోగి దేహమంతయు క్షౌరము చేయించుకొని స్నానము చేయవలెను. ఎనిమిదవదినమున రెండు మగ గొఱ్ఱెపిల్లలను, ఒక ఆఁడుగొఱ్ఱెపిల్లను (బీదలైనయెడల ఒక మగ గొఱ్ఱెపిల్లను రెండు పావురములను) నైవేద్యముతోకూడ తెచ్చి దహనబలిగాను పాప పరిహారార్థ బలిగాను వాటి నర్పింపవలెను. యాజకుఁడు దాని రక్తములోను నూనెతోను ఆ రోగి యొక్క కుడిచెవిని కుడిచేతి బొటనవ్రేలిని, కుడికాలి బొటనవ్రేలిని అంటి నూనెతో అతని నభిషేకించెను. ఇట్లు ఆ కుష్ఠరోగి పవిత్రపఱచఁబడెను (లేవీ 14).

5. ఒకఁడొకని శవమును ముట్టినయెడల అట్టివానిని పవిత్రపఱచుటకు మఱీ విశేష యాచారము లున్నవి. సంఖ్యా 19 వ యధ్యాయములో నున్నట్లు ఎఱ్ఱని పెయ్యను కాల్చి దాని బూడిదెను నీళ్లతో కలిపిరి. ఇది పాపపరిహార జలము అనఁబడెను ($19^{13}$). శవమును ముట్టుకొనిన వానిమీఁద యాజకుఁడు ఈ జలము 3 వ దినమునను 7 వ దినమునను ప్రోక్షింపవలెను. పిమ్మట అతఁడు స్నానము చేసికొని పవిత్రుఁడయ్యెను ($19^{18-22}$).

6. నాజీరు వ్రతము ననుసరించువాఁడు ఆ వ్రతము నాచరించు దినములలో ఒక శవమును ముట్టినయెడల అతనిని పవిత్రపఱచుటకు విశేష ఆచారములున్నవి. అట్టి నాజీరు 7 దినములవఱకు అపవిత్రుఁడై యుండును. తరువాత అతఁడు క్షౌరము చేయించుకొని రెండు గువ్వలను లేక పావురములను తెచ్చి ఒక దానిని దహనబలిగాను, మఱియొకదానిని పాప పరిహారయాగముగాను అర్పించవలెను. ఈ యర్పణకు సంబంధించిన యాచారములు కుష్ఠరోగికి సంబంధములైనవై యున్నవి ($6^{9-12}$).

7. నరహత్య చేసినవాని నెఱుఁగక పోవుటచే దేశమునకుఁ గలిగినయంటును పవిత్రపఱచుటకు పెద్దలు బీడుగానుండిన యొక లోయలో ఒక పెయ్యను చంపి దానిపైన తమ చేతులను కడిగి తమ నిర్దోషత్వమును ప్రకటించి తమ దేశముకొఱకు దేవుని క్షమాపణను వేడుకొనవలెను. ఇట్లు దేశము పవిత్రము చేయఁబడును (ద్వితీ $21^{1-9}$ అర్పణములు I. 2 (*a*) చూ॥ పవిత్రాపవిత్రములు, పరిశుద్ధత చూ॥).

**పవిత్రాపవిత్రములు (Clean and unclean).** బాహ్యములగు ఏయే వస్తువులచే మానవులు అపవిత్రులైరో అట్టివి అపవిత్రములైనవాటిలో చేరియున్నవి. ఇండియా దేశమునందు వేటివలన అంటుకలుగునో అట్టివియు నిందుఁజేరియున్నవి. ఇవి ప్రాచీనజనము లన్నింటిలో నుండెను. ఏయే హేతువులచే ఆయా వాటికి అంటుకలుగునో అట్టి ప్రతివిషయమును

గూర్చి తెలిసికొన వీలులేదు. పాఁత నిబంధన యాచారములను చూడఁగా మోషే ధర్మశాస్త్రమునకు పూర్వముండిన ఇట్టి యాచారములకు సంబంధించిన సూచనలుకూడ ఇందులో నున్నవని పురాతన విషయములను పరిశీలించు శాస్త్రులను కొందురు. అది యట్లుండవచ్చునుగాని పాఁతి నిబంధనను చూడఁగా అంటు విషయమైన చట్టములు నిష్కారణములైనవికాక సహేతుకములైనవే యని అందఱు నొప్పుకొనవలసి యుండును. ఇట్టి యంటును కలిగించునవి పాఁత నిబంధనలో ఐదు విధములుగా నున్నవి.

1. పుట్టుక సంబంధమైన అంటు. వీర్యస్ఖలనము చేయుట అంటైయున్నది (లేవీ $15^{16-18}$). ఏదో యొక గంభీరమైన కార్యమును చేయుటకు సిద్ధపడఁగా ఏ పురుషుఁడును స్త్రీని చేరకూడదు (నిర్గ $19^{15}$) అను నాజ్ఞయు దీనికి సంబంధమైనదే. పిల్లను కనినతల్లి అపవిత్రమైనదిగా నెంచఁబడెను (లేవీ 12). ఆమె యపవిత్రురాలుగా నున్నంతకాల మామెను ఆలయమునకు రానియ్యకుండిరి. ఆ కాలమునకుఁ బిమ్మట ఆమె కొన్ని యర్పణల నర్పించి పవిత్రురాలయ్యెను (12 లూ $2^{24}$). స్త్రీలు కడగా నుండు నప్పుడుకూడ వారివ్విధముగా అపవిత్రులైనవారే (లేవీ $15^{19-24}$).

2. రక్తమువలని యంటు. రక్తము ప్రాణమైయున్నది కావున దానిని ముట్టరాదు. ఏమాత్రమును ముట్టరాదు (ద్వితీ $12^{23}$). రక్తమును చిందింపకుండ చంపినవాటి మాంసము నిందువలననే తినరాదను ఆజ్ఞయైయున్నది (యెహె $4^{14}$ $22^{31}$ లేవీ $17^{15}$ $22^{8}$). ఇట్టివాటిని తినుటచే యూదులకు అంటుకలిగెను (I సమూ $14^{33}$ యెహె $33^{25}$).

3. ఆహారమునకు సంబంధమైన యంటు. దీనిగూర్చిన చట్టములు లేవీ 11 లోను ద్వితీ $14^{4-21}$ లో నున్నవి. నిషేధింపఁబడిన వేవి యనఁగా: (1) మృగములలో డెక్కలు లేనివి నెమరువేయనివి అపవిత్రములు (లేవీ $11^{3,4}$). (2) మాంసము తినుపక్షులు అపవిత్రములు ($11^{13-19}$ ద్వితీ $14^{12-18}$). (3) రెక్కలుఁగల చరములలో మిడుతలుతప్ప అన్నియు నిషేధములే (లేవీ $11^{20-23}$). (4) జలచరములలో పొలుసులులేనివి నిషేధములు ($11^{9,10}$), ప్రాకెడి జీవరాసులన్నియు అపవిత్రములు ($11^{24-30}$).

4. శవములకు సంబంధించిన యంటు. శవముల విషయమైన అంటు చాలగొప్పది (హగ్గ $2^{13}$). శవమును ముట్టినవాఁడు ఏడుదినములవఱకు అపవిత్రుఁడు (సంఖ్యా $19^{11-22}$). ఇట్లు యుద్ధము చేసిన యోధులును అపవిత్రులైరి ($31^{19-21}$).

5. కుష్ఠరోగమువలని యంటు. కుష్ఠమునకు మతసంబంధమైన అంటున్నట్లు దాని విషయమైన చట్టములవలనఁ దేటగాఁ తెలియును (సంఖ్యా $12^{12}$ లేవీ 13). ఆ రోగము కుదిరినయెడల అట్టివాఁడు సంఘమునుండి వెలివేయఁబడిన వానివలె తిరిగి చేర్చఁబడవలెను (14).

ఆయావారలకు మాత్రమేకాక దేశమంతటికి కూడ నొక విధమైన యంటు తగలవచ్చును. ఎట్లనఁగా ఒక దేశములో ఒక ఖూనీజరిగియుండి ఆ నరహంతకుఁడు కనఁబడనియెడల ఆ దేశము యావత్తు అపవిత్రమగును (ద్వితీ $21^{1-9}$). అదే విధముగా విగ్రహారాధనచేయు దేశమును అపవిత్రమైనదగును ($13^{1}$ హోషే $6^{10}$). ఇందుచేతనే యూదులు అన్యదేశములను అపవిత్రమైన వాటినిగా నెంచిరి ($9^{3,4}$ యెహె $4^{13}$). మఱియు అన్యులు పరిశుద్ధదేశమును త్రొక్కుటచే దానినపవిత్రపఱిచిన యట్లెంచి యుండిరి ($44^{7,9}$ కార్య $21^{28}$).

క్రొత్త నిబంధన కాలమును చూడఁగా యూదులు అంటువిషయమైన స్నానాదుల నెక్కువగా చేసిరని స్పష్టమగును (మా $7^{1-5}$). బైబిలులోని చట్టములు మాత్రమేకాక తిండి విషయమై ఇంక అనేకములగు చట్టములు యూదుల పారంపర్యములలో నున్నవి. అవి హైందవుల కులచట్టముల వంటివే. క్రీస్తు వాటిని ముఖ్యముగా ఖండించి, ఇట్టి వెలుపలి విషయములనుగాక, ఆంతర్య పవిత్రతవలననే మనము పవిత్రులము కావలెనని బోధించుచుండెను ($7^{6-23}$ లూ $11^{38}$ మ $15^{10}$). యెరూషలేము సభవారు నిషేధించిన నాలుగు విషయములలో యూదుల అభిమానమునుబట్టి తత్కాల

మున క్రైస్తవులకుకూడ పవిత్రా పవిత్రములను గూర్చిన నిషేధవిషయములు రెండు కలవు (కార్య 15[29]). అయితే పాత నిబంధన యాచారములతో ఈ యాచారములుకూడ గతించిపోయె నని పౌలు స్పష్టముగా బోధించియుండెను (రోమా 14[14] I కొరి 6[13] కొలొ 2[16,20-22] తీతు 1[15]). యూదుల యభిమానములను లక్షించి వాటికి ఆటంకము కలుగకుండునట్లు క్రైస్తవ ప్రేమతో ఈ చట్టముల నింకను గైకొనవచ్చునని పౌలు అప్పటి క్రైస్తవులకు బోధించెను (కార్య 21[26] రోమా 14[20]) గాని అవి ఆత్మీయ పరిశుద్ధతకు సాధనములని యే మాత్రము బోధింపలేదు. మనము ఆరోగ్యము నిమిత్తమును శుభ్రత నిమిత్తమును అదేరీతిగా ఇప్పటి కింకను పాత నిబంధన పవిత్రా పవిత్రములను గూర్చిన చట్టములను లక్షింపవలెనుగాని వాటిని మతాచారములనుగా నెంచి వాటివలన ఆత్మీయ శుద్ధి కలుగునని మన మేమాత్రము అనుకొనరాదు.

**పశుప్రాయులు** (Brutish). అతి మూర్ఖులైన వారికి పాత నిబంధనయందు పెట్టిన పేరు. ఈ పదముయొక్క వ్యుత్పత్త్యర్థమును బట్టి నాశనమునకు విధింపబడినదని గ్రహింపవచ్చును. యెహె 21[31] లో నాశనము చేయు వారను దాని సంబంధమునుబట్టి ఈ మాటలను తెనిగించిరి. మూలభాషాపదమునందు పశువులను సూచించెడి పదమేమియు లేకున్నను ఆ పదము అతి మూర్ఖత్వమును సూచించుటచే నిట్లు తెనిగించిరి (కీర్త 49[10] 73[22] 92[6] సామె 12[1] 30[2] యెష 19[11] యిర్మీ 10[14,21] 51[17] మూర్ఖత్వము చూ॥).

**పశువుల తొట్టి** (Manger). పశ్వాదులకు నీరు పెట్టుటకై ఈ దేశమందువలె పలెస్తీనులోను రాతితొట్లను తొలిపించుకొనిరి. ఇట్టి తొట్లలో నొకదానిలోనే ఈ లోకమున కవతరించిన ప్రభువగు యేసును మొదట పరుండబెట్టిరి (లూ 2[7,12,16]). ఆ పశువులశాల బేత్లెహేములోని సత్రమునకు సంబంధించినదై యుండును. అది బేత్లెహేములో నుండిన యొక గుహాయని పారంపర్యముగ జెప్పెదరు. అట్టి గుహాలలో ఆ దేశస్థులు తమ పశువులనుంతురు.

**పశువులు** మృగములు 38 చూ॥

**పశ్చాత్తాపము, పశ్చాత్తాపపడుట,** (Repentance, Repent). మానవులు పశ్చాత్తాపపడుట మాఱు మనస్సునకు సంబంధముగా నున్నది. కావున అది యాపదముక్రింద వివరింపబడును. ఇచట పశ్చాత్తాపపడుట యను పదమును బైబిలులో దేవునిగూర్చి యే యర్థముతో వాడియున్నారో ఆ సంగతి మాత్రము వివరింపబడును.

పాత నిబంధనలో ఈ మాటను దేవునిగూర్చి యనేక పర్యాయములు వాడియున్నారు. అచట దేవుడు పశ్చాత్తాపపడెను లేక దేవుడు పశ్చాత్తాపపడడు అను మాటలు మఱల మఱల వచ్చును. తెనుగున అనేకమాఱులు ఈ పదమునకు మాఱుగా సంతాపములేక సంతాపపడుట యను పదములను వాడిరి (ఆది 6[6] నిర్గ 32[12-14] న్యాయా 2[18] యిర్మీ 18[8-10] 20[17] 26[3,13,19] 31[19] 42[10]). అయితే అనేకచోట్ల పశ్చాత్తాపము అను పదమునే యుంచిరి (I సమూ 15[11,29,35] యిర్మీ 4[28] 8[6] యోవే 2[13,14] ఆమో 7[3-6] యోనా 3[9-10] 4[2] సంఖ్యా 23[19] హోషే 13[14]) క్రొత్త నిబంధనలో రోమా 11[29] హెబ్రీ 7[21] లో మాత్రము దేవునిగూర్చి యీ పదమును వాడిరి. ఈ వాక్యము లన్నిటిని చూడగా హోషే 11[8] లో నా మనస్సు మాఱినది అను పదముచే దానిని తర్జుమా చేసినను మానవులనుకొనురీతిగా దేవునిగూర్చి యిట్లు వ్రాసిరిగాని, అది శాస్త్ర రీతి యనుకొనరాదు. దేవుడుమాఱినట్లు కనంబడునది యావత్తు ఆయనయెడల మాఱిపోయిన వారి విషయములో ఆయన వేఱురీతిగా నుండుట యని తెలిసికొనవలెనుగాని దేవునిలో మార్పున్నట్లుగా ననుకొనరాదు. దేవుడు పశ్చాత్తాపపడడను పదమును చూడగా ఆయన మాఱడు అని యర్థమగును. కీర్త 110[4] లో అదే పదమును ఆయన మాటతప్పనివాడని తర్జుమా చేసిరి. కావున ఆయన పశ్చాత్తాపపడక పోవుట యను మాటలకును తతిమ్మవాక్యములలో నున్నట్లు అదే యర్థమని అనుకొనవలెను. ఇతరులయెడల మాఱిపోవుట యను నర్థముతో కొన్ని వాక్యములలో మానవులనుగూర్చికూడ పశ్చాత్తాపము అను పదమును వాడియున్నారు (నిర్గ 13[17] న్యాయా 21[6-15]).

**పష్హూరు** (Passhur).

1. మల్కీయా కుమారుఁడు. ఇతఁడు యిర్మీయా కాలమునందు దేవాలయములో నుండు నొక ప్రధాని (యిర్మీ $21^{1}$). మఱియు నితఁడు యిర్మీయాను విరోధించినవారిలో నొకఁడు ($38^{1-13}$).

2. ఇమ్మేరు కుమారుఁడు. ఇతఁడు యిర్మీయా కాలములో దేవాలయమునందు యాజకుఁడును అధికారియునై యుండెను. యిర్మీయా యెరూషలేము నాశనమును ప్రకటించినందున ఇతఁడు యిర్మీయాను బొండలో వేయించెను. యిర్మీయా యితనికి పషూరు = (అనగా చుట్టును సమాధానము) అను పేరుపెట్టక భయాక్రాంతుఁడు అను అర్థమిచ్చు పేరు పెట్టెదరనెను. ఇతఁడు బబులోనులో చచ్చిపోవునని యిర్మీయాకూడ ప్రవచించెను (యిర్మీ $20^{1-6}$).

3. గెదల్యా తండ్రి (యిర్మీ $38^{3}$). ఇతఁడు పై జెప్పిన (1,2 లో నొకఁడుగాని వేఱేవాఁడు గాని అయ్యుండవచ్చును).

4. యాజకులలో నొక తెగవారికి పూర్వీకుఁడు (ఎజ్రా $2^{38}$ నెహె $7^{41}$ ఎజ్రా $10^{22}$).

5. నెహెమ్యా కాలమునందు నిబంధనచేసిన వారిలో నొకఁడు (నెహె $10^{3}$). ఇతఁడు పైన 4 లోని వాఁడై యుండవచ్చును.

**పసరు పురుగు** మిడత.

**పసుపు పచ్చ** రంగులు 5 చూ॥

**పస్కా పండుగ** పండుగలు III 1 (1), సేరములు శిక్షలు I 7 చూ॥

**పస్దమ్మీము** ఎఫెస్దమ్మీము చూ॥

**పహత్మోయాబు** (Pahath-Moab = మోయాబు అధిపతి). ఇశ్రాయేలీయులలో నొక తెగవారు. బబులోను చెఱకుఁ బిమ్మట వీరిలో 2812 మంది (ఎజ్రా $2^{6}$) లేక 2818 మంది (నెహె $7^{11}$) జెరుబ్బాబెలుతో కూడ యెరూషలేమునకు తిరిగి వెళ్లిరి. వీరిలో యేషూవ యోవాబు అను రెండు తెగలవారుండిరి (ఎజ్రా $2^{6}$). కొంతకాలమునకుఁ బిమ్మట వీరిలో 218 మందియు ($8^{4}$) యోవాబు తెగవారిలో నుండి 218 మందియు ఎజ్రాతోఁ గలిసి యెరూషలేమునకు వెళ్లినట్లుగా నున్నది (ఎజ్రా $8^{9}$). పహత్మోయాబు కొడుకైన అహష్షూబు యెరూషలేము ప్రాకారములను కట్టుటకు సహాయముచేసెను (నెహె $3^{11}$). ఈ తెగవారి ప్రధాని నిబంధన చేసిన వారిలో నొకఁడైయుండెను ($10^{14}$). ఆ తెగవారిలో 8 మంది అన్యుల స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిరి (ఎజ్రా $10^{30}$).

## పా

**పాగా** యాజకుల వస్త్రములు I 4, II 4 చూ॥

**పాటు** పశువులు మృగములు 41 చూ॥

**పాడె** (Bier). రాజైన దావీదు అబ్నేరును సమాధి చేయునప్పుడు అతని పాడె వెంట వెళ్లి అతనికి మర్యాద జూపెనని II సమూ $3^{32}$ నందున్నది. అక్కడ వాడిన మూలభాషా పదము మంచమును సూచించును. మృతులను మంచముమీఁదపెట్టి సమాధిస్థలమునకుఁ దీసికొనుపోవు వాడుక యుండినట్లు దీనివలనఁ దెలిసికొనవచ్చును. క్రొత్త నిబంధనయందు లూ $7^{13}$ నందు మాత్రమున్న పాడెయు అట్టి మంచమునే సూచించును.

**పాడైనగోడ** యెరూషలేము B IV 2 (2) చూ॥

**పాత గుమ్మము** యెరూషలేము B V 2 (5) చూ॥

**పాత నిబంధన** బైబిలు I, ప్రమాణిక గ్రంథములు 1 చూ॥

**పాతాళము** (Hell, Sheol, Hades). సాధారణముగా తెనుఁగు బైబిలులో మృతుల లోకమును సూచించు హెబ్రీ షియోలు (*Sheol*), గ్రీకు హేడిస్ (*Hades*) అను మాటలను పాతాళము అను పదముచే తర్జుమాచేసి యున్నారు (ద్వితీ $32^{22}$ యోబు $11^{8}$ కీర్త $9^{17}$ మ $11^{23}$ మొ॥). ఆది $37^{35}$ లోను ప్రక $1^{18}$ $6^{8}$ $20^{13,14}$) లోను దానిని మృతులలోకము అను మాటచే భాషాంతరము చేసిరి. యెహె

$26^{19}$ $28^{8}$ $31^{16}$ ప్రక $9^{1,2,11}$ $17^{8}$ $20^{1-3}$ వచనములలో పాతాళము అను పదమునకుగా నుపయోగించిన అసలు మాటలు ప్రత్యేకమైనవై గుంటను లేక అగాధమును సూచించుచున్నవి. రోమా $10^{7}$ లో దాని అగాధమను మాటచే తర్జుమ చేసిరి. II పేతు $2^{4}$ లో పాతాళమునకుగా నుపయోగించిన పదము నరకమును సూచించు గ్రీకు పదమై యున్నది.

పాత నిబంధనలో పాతాళమునకుగా నుపయోగించిన షియోల్ (*Sheol*) అను మాటకు శబ్దార్థము తెలియదు. క్రొత్త నిబంధనలో దీనికిగా నుపయోగించిన హేడీస్ (*Hades*) అను దానికి అదృశ్యమైనది యని శబ్దార్థము. ఈ మృతుల స్థానము క్రిందిలోకములోనున్నట్లును (సంఖ్యా $16^{30,33}$ యెహె $31^{17}$) దానికి ద్వారము లున్నట్లును (యెష $38^{10}$) అది చనిపోవు వారందఱు వెళ్లవలసిన స్థలమై యున్నట్లును (ఆది $37^{35}$ కీర్త $31^{17}$ యెష $38^{10}$) అచటి వారికి స్మారకమున్నను ఒక విఘ్నమైన నిద్రావస్థలో నుండి యేమియు చేయనివారై యున్నట్లును (II సమూ $22^{6}$ కీర్త $6^{5}$ ప్రస $9^{10}$) ఆయా మంత్రశక్తులు గలిగినవారు వారి నచటి నుండి రప్పించుటకు శక్తి గలిగి యున్నట్లును (I సమూ $28^{8-19}$) నమ్ముచుండిరి. పాతాళములోనిది దేవునికి మఱుగు కానేఱదనియు (యోబు $26^{6}$ సామె $15^{11}$) దేవుఁ డచటకూడ నున్నాఁడనియు (కీర్త $139^{8}$) పాత నిబంధన బోధయై యున్నది. దేవుఁ డచటనుండు వారి సంగతుల నెఱుఁగు ననుటచే ఆయన భక్తులకు సౌఖ్యమును దుష్టులకు శిక్షయు కలుగునను బోధకూడ ఇందులో నున్నట్లు కనఁబడునుగాని అది పాత నిబంధనలో స్పష్టముగా బయలుపఱచఁబడలేదు. అయితే భక్తులు నిత్యమును అట్టి దశలోనుండుటకు అందుండి లేపఁబడెదరను బోధ పాత నిబంధనలో నంత తేటగా లేకపోయినను ఒక విధముగా నున్నదని చెప్పవచ్చును (యోబు $19^{25-27}$ కీర్త $16^{8-11}$ $17^{15}$ $49^{14,15}$ $73^{24}$ దాని $12^{2,3}$). హనోకు (ఆది $6^{24}$) ఏలీయా (II రాజు $2^{11}$) చావకయే పరలోకగతులగుటను చూడఁగా అట్టి శరీర పునరుత్థానము కలుగదను సంగతి నిది సూచించును. అయితే పాత నిబంధనలో దాని విషయమెన్ని సూచనలున్నను అది క్రీస్తు మృతులలో నుండి లేచుట ద్వార మనము తిరిగి లేతుమను క్రొత్త నిబంధన బోధలోనే మొదట తేటగా కనఁబడును; క్రీస్తు మొదట మరణమును జయించి జీవమును అక్షయతను వెలుగులోనికిఁ దెచ్చి (II తిమో $1^{10}$ యోహా $14^{1-3}$ II కొరి $5^{6-8}$) మనలను పాతాళమను మృతుల లోకమునుండి తప్పించెను (గేహెన్న, కూపము, నరకము చూ॥).

**పాతాళమునకు (నరకమునకు, అదృశ్య లోకమునకు) దిగుట** (Descent into Hell). ఈ మాటలు బైబిలులో లేవుగాని అపొస్తలుల విశ్వాస ప్రమాణములో నున్నవి. I పేతు $3^{18-20}$ $4^{6}$ వచనములు దీనికి ముఖ్యాధారములై యున్నవి. దీనికి మూఁడువిధములుగా అర్థము చెప్పుదురు. (1) ఇది క్రీస్తు మరణమును సూచించును. ఆయన మరణము గాక మఱి యే సంగతియు నిందు బోధింపఁబడ లేదని యట్టివా రనుకొందురు (లూ $23^{43}$ కార్య $2^{24-31}$). (2) జల ప్రళయమునకు ముందు జీవించి చనిపోయి యుండినవారికి క్రీస్తు ప్రకటించుటకు వెళ్లెనని కొందఱు దీనినిబట్టి యనుకొందురు. (3) క్రీస్తు తాను మరణమును జయించిన సంగతి జయకరముగా ప్రకటించుటకు వెళ్లెనని మఱికొందఱనుకొందురు. కొలొ $2^{15}$ లో నున్న వాక్యము లయమును గూర్చినదని అట్టి వారు తలంచెదరు.

**పాతిపెట్టుట** సమాధి చూ॥

**పాత్ర** వంట సామగ్రి 2,5, గిన్నె చూ॥

**పాదపీఠము** (Foot stool). బైబిలునందు రెండుచోట్ల మాత్రము దీనిని సాధారణార్థమునం దుపయోగించిరి (II దిన $9^{18}$ యాకో $2^{3}$) గాని విశేషముగా అలంకార రీతిగా వాడిరి. (1) దేవునికన్న భూమి యెంత తక్కువైనదో దానిని కనపఱచుటకు ఆ పదము భూమికి సార్థక నామముగాను నుపయోగింపఁబడెను (యెష $66^{1}$ కార్య $7^{49}$). భూమి ఘనుఁడైన దేవుని కిట్లు పాదపీఠమై యున్నందున, దేవునికిని దానికిగల సంబంధమువలన, దాని పేరట ప్రమాణము చేయరాదని క్రీస్తు బోధించెను (మ $5^{35}$). (2) పైనున్న రీతిగానే అది యెరూషలేమునకు పెట్టఁ

బడినపేరు (విలా $2^{1}$). (3) నిబంధనల మందసమునకు దావీదీ పేరుపెట్టెను (I దిన $28^{2}$). కీర్త $99^{5}$ $132^{7}$ నందున్న ఈ పదము నిబంధనల మందసమును సూచించుచునని కొందఱి యభిప్రాయము. ఎటులనైనను అది దేవుని నారాధించు స్థలమై యున్నది. (4) అది మెస్సీయాను విరోధించెడి వారి స్థితికి సూచనగా నుండి పైవాటికి భిన్నముగా కనఁబడుచున్నది. వారు ఆయనకు పాదపీఠముగా నుందురు (కీర్త $115^{1}$ = మ $22^{44}$ కార్య $2^{35}$ హెబ్రీ $1^{13}$). ఇది శత్రువుల అపజయమును కనఁబఱచును.

**పాదభూషణము** ఆభరణములు 27 చూ॥

**పాదము** (Foot). ఈ పదముయొక్క అలంకార ప్రయోగములు మాత్ర మీ దిగువ నుదాహరింపఁబడును.

1. పాదముల క్రింద నుంచుట సంపూర్ణ జయమును సూచించును (యెహో $10^{24}$ II సమూ $22^{39}$ కీర్త $8^{7}$ రోమా $16^{20}$ I కొరి $15^{25}$). **2.** పాదముల దగ్గర కూర్చుండుటయు పాదముల మీఁదపడుటయు ఈ దేశమునందువలె గొప్ప వినయమునకు గుఱుతు (ద్వితీ $33^{3}$ II రాజు $4^{27}$ ఎస్తే $8^{3}$ మా $5^{22}$ ప్రక $1^{17}$). శిష్యుఁడు గురువు పాదములయొద్ద కూర్చుండుట అతని వినయబుద్ధిని సూచించుచున్నది (లూ $10^{39}$ కార్య $22^{3}$). పాదములు కడుగుట అతని వినయమునకు సూచనయై యున్నది (యోహా $11^{2}$ $13^{5}$). యూదులు తమ అతిథులకు నిట్టి మర్యాదచేసిరి (ఆది $18^{4}$ లూ $7^{44}$). 3. పాదధూళిని దులిపివేయుట ఒకని బొత్తుగా తిరస్కరించుటకు సూచనగా నున్నది (మ $10^{14}$ కార్య $13^{51}$). 4. కావ్యముల గ్రంథములయందు పాదములు నడువడికి సూచనగా నుండుటచే అవి మానవుల ప్రవర్తనయంతటిని సూచించును (కీర్త $25^{15}$ లూ $1^{73}$). అవి మానవులనుకూడ సూచించును (కార్య $5^{9}$).

**పాదములలో జబ్బు** రోగములు చికిత్సలు II 4 చూ॥

**పాదోను** (Padon = స్వతంత్రము). నెతెనీయులలోని యొక కుటుంబమునకు పేరు. వారు జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు తిరిగి వచ్చిరి (ఎజ్రా $2^{44}$ = నెహె $7^{47}$).

**పానదాయకుడు, గిన్నె నందించు**వాడు (Cupbearer). రాజ సేవకులలో నొక సేవకుని బిరుదు. పానములయందు విషము కలిపి ద్రోహము చేసెదరేమోనని మిగుల నమ్మకమైన వారికి మాత్రమే ఈ నౌకరీ నిచ్చిరిగాన ఇది ఘనమైన యుద్యోగముగా నెంచఁబడెను. పాత నిబంధనలో ఫరో పానదాయకునికిని (ఆది $40^{1}$-$41^{9}$) సొలొమోనుకు గిన్నె నందించు వారికిని (I రాజు $10^{5}$ = II దిన $9^{4}$) పారసీకుఁడగు అర్తహషస్త పానదాయకుఁడగు నెహెమ్యాకును (నెహె $1^{11}$) సూచనలున్నవి. ఈ పదములన్నియు ఒకే హెబ్రీ పదమునకు భాషాంతరమై యున్నది.

**పానము** ద్రాక్షారసము, త్రాగుట చూ॥

**పానార్పణము** అర్పణములు IV చూ॥

**పాపపతనము** (The Fall). ఇందులో మానవులు పాపులైన విధము చేరియున్నది. తెనుఁగు బైబిలులోనైనను ఇంగ్లీషు బైబిలులోనైనను ఈ పాపపతనము (*Fall*) అను మాటలేదు. అయినను దాని సంగతియొక్క ప్రాముఖ్యతను బట్టి ఆదికాండము 3 వ అధ్యాయమునందు వ్రాయఁబడిన సంగతి ముఖ్యముగా ఈ పదము క్రింద వివరింపఁబడును.

దాని చరిత్ర యేదనఁగా, ఆది తలిదండ్రులగు ఆదాము హవ్వలు నిర్దోషులుగా ఏదెను వనములో నుంచఁబడిరి. వారా వనములో మేలుకీడులను గూర్చిన జ్ఞానమును తెలుపు ఫలములను మాత్రము తప్ప తక్కిన చెట్ల ఫలములను తినవచ్చుననెడి యాజ్ఞయుండెను. ఇట్లుండఁగా సర్పము హవ్వను శోధించినందున మొదట హవ్వయు తరువాత ఆదామును ఆ నిషేధఫలములను తినిరి. అందువలన వారికి సిగ్గు కలిగి దేవునికి కనఁబడక దాగుకొనిరి. తరువాత దేవుఁడు సర్పమును శపించి, దాని నాశనముచేయు రక్షకునిగూర్చిన మొదటి వాగ్దానము చేసెను. మఱియు హవ్వకు ప్రసవవేదనలు కలుగునని శిక్షవిధించి, ఆదాము తన ఆహారము కష్టముతో సంపాదించుకొనవలెనని శపించుచు అతని నిమిత్తము భూమినికూడ శపించెను. ఆదాము హవ్వలు ఏదెను తోఁటలోని జీవ వృక్షఫలములు తిని యెల్లప్పుడు అదే

స్థితిలో బ్రతికెదరేమో యని దేవుఁడు వారిని ఆ తోఁటలోనుండి వారిని వెళ్లఁగొట్టెను.

అనేకు లీచరిత్రను ఒక యుపమానమునుగా నెంతురు. తప్పొప్పులను వివేచించుటకు యుక్త వయస్సు వచ్చిన సమయమున ఆదినరులు తమ మనస్సాక్ష్యమునకు లోఁబడక దానికి అవిధే యులై మనోవేదనలను సిగ్గును పొందిరను సంగతి ఈ యుపమానములో బోధింపఁబడినవని వారను కొందురు. పూర్వకాలమందున్న బాబెలు వారి యలంకారములను చూడఁగా సర్పము, జీవ వృక్షము, దూతలు ఈ మొదలగునవి వారి పురా తన శాసనములలోకూడ కనఁబడును. పరిశుద్ధ లేఖనములను వ్రాసినవాఁడు పూర్వకాలమందలి యా సంగతులను తీసికొని మానవులు పాపములో పడిన విధమును తెలిసికొనునట్లు పరిశుద్ధాత్మా వేశమువలన వాటిని అలంకారరీతిగా వ్రాసెనని అట్టి వారందురు. సద్భక్తిగల క్రైస్తవులలో కొందఱు ఆ చరిత్ర నిర్విఘ్నముగా చూచెదరని యొప్పుకొనవలెను. అట్టివారు ఆ చరిత్రలోని ఆత్మీయ సత్యములు చాల గంభీరములైనవని యెంచెదరు.

ఇతరులు దీనిగూర్చి వ్రాసిన సంగతులను చూడఁగా ఎంతో గంభీరములైన సత్యము లిందులో కనఁబడును. ఎందుకనఁగా వారు ఈ చరిత్ర నిజముగా జరిగినదనుకొందురు. శోధ కుని యుత్పత్తిని గూర్చియు, మేలుకీడులను తెలుపు వృక్షమును గూర్చియు పాపఫలితములను గూర్చియు గ్రహించుట కెన్ని కష్టములున్నను అవి యీ చరిత్రలో మాత్రము కనఁబడక మానవు లందఱి చరిత్రలోను వారి పాపములవలన వారికి గలుగు కష్టములలోను మఱీ తేటగా కనఁబడును. మఱియు మానవులు మొదట నిర్దోషులు కావున దేవుఁడు పాపమునకు కారకుఁడు కాఁడనియు వారు తమ స్వేచ్ఛను దుర్వినియోగపఱచుటచేత పాప ముద్భవించెననియు, స్వేచ్ఛాపరులకు శోధనలేకున్న వారిస్వేచ్ఛ నిజమైన స్వేచ్ఛ కానేఱదు గనుక శోధనకూడ నుండఁదగును అను లోతైన సంగతులు ఈ చరిత్రలో తేటగా కనఁ బడును. పాపమును గూర్చిన విషయములలో వీటిని మూల విషయములనుగా నెంచవలసినదే. శోధన విధమును, సర్పము మొదట ప్రశ్నార్థ ముగా మానవుని మనస్సులో సందేహము పుట్టిం చుటను రమ్యమైన ఫలములను చూపుటవలన ఆశను పుట్టించుటను చూడఁగా, అది శోధన విధమును ఎంత తేటగా చూపునో అనుభవశాలు రందఱికి విశదమే. పాపమువలన కష్టము కలుగు ననుట అన్ని జనాంగముల వారును ఎఱిఁగి యుండి యొప్పుకొనుచున్న విషయమై యున్నది. ఇందులోని సత్యములు ఇంత గంభీరములైనవై యుండఁగా వీటిని తెలుపు చరిత్ర సత్యమని నమ్మరాదనుట యెట్లు ధర్మమగును?

పాపపతనమును గూర్చిన సూచనలు బైబిలులో నెక్కువగా లేవు. క్రీస్తు రక్షణ మానవులందఱి కొఱకైనదని పౌలు వాదించుచు, అది పాపము కంటె మఱీ బలముగలదనియు చేసిన వాదములో (రోమా 5[12-21]) ఈ చరిత్రకు తేటయైన సూచ నలు కలవు. అప్రమాణిక గ్రంథములలో ఆ సర్పము సాతాను అను సంగతి మొదట కనఁ బడును (సొలొమోను జ్ఞానము 2[24]). క్రొత్త నిబంధనలో అట్టి సూచనలు కొన్ని కలవు (రోమా 16[20] ప్రక 12[9] 29[2]). బైబిలులోని సూచనలు ఇంక కొన్ని మాత్రముండినను ఇంగ్లీషు కవీశ్వరుఁ డగు మిల్టన్ అను ఘనుఁడు తాను రచించిన కావ్యములో (*Paradise Lost*) దీనిని బహు వివరముగా వ్రాసెను. ఆ కావ్యములోని సంగ తులు చాలవఱకు కల్పనలే. అవి మొత్తమున బైబిలు బోధలకు సరిపడినప్పటికి మనము సాధా రణముగా ననుకొనుచున్నట్లవి యన్నియు బైబిలులో నున్నవనుకొనరాదు.

పాప పరిహార జలము పవిత్రపరచుట చూ॥

పాప పరిహారము, క్షమాపణ (Forgiveness, Pardon). పాప క్షమాపణను సూచించు వేర్వేఱు మాటలు బైబిలులో నున్నవి.

1. వాటిలో నొకటి తీసివేయుట అను నర్థము నిచ్చును (ఆది 50[17]).

2. పాప మొక మచ్చయై యున్నట్లెంచి దానిని కప్పివేయుటను సూచించు మఱియొక పదము కలదు. తెనుఁగున దీనిని ప్రాయశ్చిత్తము నొందుట అను మాటచే తర్జుమాచేసిరి (కీర్త 32[1] 78[38]). ఇది ముఖ్యముగా బలులను గూర్చిన

మాటయై యున్నది (నిర్గ $29^{36}$ $30^{10}$ లేవీ $1^{4}$ మొ॥). దీనిని క్రొత్త నిబంధనలోకూడ ఉపయోగించి యున్నారు (I పేతు $4^{8}$ యాకో $5^{20}$).

3. దయచూపుట అను నర్థముగల మఱియొక పదమును క్షమాపణకుగా నుపయోగించి యున్నారు (లూ $7^{43}$ II కొరి $2^{7}$). ఒక ఋణమును రద్దుపఱచుటలోఁ జూపఁబడు దయ ఇందులో సూచింపఁబడుచున్నది.

4. పాపమును పంపివేయుటను, లేక పోవుటకై పాపమునకు సెలవిచ్చుటను సూచించు నింకొక పదము దీనికి సంబంధముగా నుపయోగించిరి (I రాజు $8^{39}$ కీర్త $103^{3}$ మ $6^{15}$ $9^{2}$ మొ॥).

పాపమును క్షమించుటకు దేవునికి అధికారము కలదు. మఱియు ఆయన క్షమాపణ ననుగ్రహింప నిష్టముగలవాఁడై యున్నాఁడు (దాని $9^{9}$ నెహె $9^{17}$ యిర్మీ $36^{3}$). అయితే మనము క్షమాపణ నొందుటకుఁదగిన మనస్సు గలవారమై యుండవలెను. అనఁగా మనము పశ్చాత్తాపపడవలెను (II దిన $7^{14}$ మా $1^{4}$). మన అక్రమములను విడిచిపెట్టు మనస్సుగలవారమై యుండవలయును (యిర్మీ $5^{7}$ మ $3^{8}$). క్షమించుబుద్ధియు ($18^{35}$) మన పాపములవలనఁ గలిగిన నష్టమును సాధ్యమైనంతవఱకు తీర్చుబుద్ధియు (లేవి $6^{2-7}$) మనలలో నుండవలసిన లక్షణములై యున్నవి. అయితే యిట్టి లక్షణములను కలిగియుండినయెడల దేవుని క్షమాపణను పొందుటకు హక్కుదారుల మనునది బైబిలు బోధకాదు. ఎటులనైనను తగిన ప్రాయశ్చిత్తము లేనిది క్షమాపణ లేదు (హెబ్రీ $9^{22}$ కార్య $2^{38}$). ఈ విధముగా యేసుక్రీస్తు ద్వార మనకు క్షమాపణ కలుగును (ఎఫె $1^{7}$ కొలా $1^{14}$). క్రీస్తు చేసిన ప్రాయశ్చిత్తము పాపములన్నిఁటిని పరిహరింపఁజాలినదై యున్నది కావున, వాటి క్షమాపణకై మఱియే బలులను అర్పింప నవసరములేదు (హెబ్రీ $10^{18}$ యోహా $19^{30}$).

క్షమాపణను పొందు విధమునుగూర్చి ప్రొటెస్టాంటువారు దేవుని వాగ్దానములనుబట్టి ఆయన క్షమాపణ తనకు గలుగునను నిశ్చయత ప్రతి విశ్వాసియు పొందఁగలఁడని నమ్ముకొనుచున్నారు. అయితే రోమను కతోలిక్ వారు, ఇది గురువుల ద్వార పొందవలసినదే కాని మఱి యే రీతిగానైనను పొంద వీలుకాదందురు. మ $16^{19}$ $18^{18}$ యోహా $20^{23}$ లలో ఈ బోధ యున్నదని వారనుకొందురు. ఈ యధికారము ఆది క్రైస్తవులలో మొదటి గురువుగానుండిన పేతురుకును తరువాత (క్రైస్తవుల) జగద్గురువులగు పోపులకును అటు పిమ్మట ఈ పోపులవలన అధికారమునొందిన యితర గురువులకును ఇయ్యఁబడె ననుకొందురు. ఇది తాళపు చెవుల యధికారము (*Power of the Keys*) అనఁబడును. పై వాక్యములను చూడఁగా మ $16^{19}$ లో నున్నట్లు పేతురునకియ్యఁబడిన యధికారము $18^{18}$ లో నున్నట్లు శిష్యులందఱికి నియ్యఁబడెనని స్పష్టమగును. యోహా $20^{23}$ లోని వాక్యము పరిశుద్ధాత్మనొందిన శిష్యులతో చెప్పఁబడినదై యున్నది. కావున నీ సంబంధమును చూడఁగా పరిశుద్ధాత్మనొందిన శిష్యుల సమూహము సంగతులను విచారించుటకును, న్యాయము తీర్చుటకును శక్తిగలదని తేలియును. ఆ సమూహములోనివారు పశ్చాత్తప్తులకు దేవుని క్షమాపణను ప్రకటించి వారిని అంగీకరింపఁగలరనునది బైబిలు బోధయై యున్నది. ఈ సమూహమునకు ప్రతినిధిగానుండు గురువులు దీనిని ప్రకటింతురు గాని ఇది వారికియ్యఁబడిన ప్రత్యేకమైన హక్కు అని యెంచకూడదు.

**పాప పరిహారార్థ బలి** అర్పణములు I 2 (*a*) చూ॥

**పాప పురుషుడు (Man of sin).** II థెస్స $2^{3}$ నందు పౌలు యేసుయొక్క ఆగమన సూచనలను తెలియఁజేయుచున్నాఁడు. అందులో క్రీస్తు ప్రత్యక్షము కాకమునుపు భక్తులనేకులు మతభ్రష్టులగుట మాత్రముగాక నాశనపాత్రుఁడగు పాప పురుషుఁడు బయలుదేరవలయునని విశదపఱిచెను. ఈ దుష్టుఁడు ఏది దేవుఁడనఁబడునో ఏది పూజింపఁబడునో దాని నంతటిని యెదిరించుచు దాని కంతటికిపైఁగా తన్నుతానే హెచ్చించుకొనుచు తనొక దేవతనని కనపఱచుకొనుచు దేవుని ఆలయములో కూర్చుండుననియు 6-7 వచనములందు ఆ ధర్మవిరోధి ప్రబలము కాకుండను దానివలన భక్తులు బాధపఱచఁబడకుండను ఏదో యొక అసందర్భమువలనను ఎవరో యొక మహాపురుషునివలనను అభ్యంత

రము గలిగియుండెననియు, అయినను కాలము గడువఁగా నా యభ్యంతరము నివారణ చేయఁబడును గనుక ఆమీఁదట ధర్మవిరోధి ప్రబలి తన కార్యము కొనసాగించును గాని కడకు క్రీస్తు ప్రత్యక్షమై వానిని సమూల నాశనము చేయుననియును పౌలు తెలియఁజేసెను.

ఈ వచనములయందు దెవరెవరు ప్రశంసించఁబడిరో యిప్పుడు కచ్చితముగా చెప్ప వీలుపడదు. పెక్కండ్రు వ్యాఖ్యాతలు పౌలీపేరుచే తనకు జైజమను బిరుదాంకము పెట్టుకొన్న రోమా చక్రవర్తిని ఉదాహరించఁ దలఁచి పేరుగా పేర్కొనక గుప్తముగా నతని సూచించె ననుకొందురు. అయినను పౌలు II థెస్సలొనీకైయుల పత్రికను రచించినప్పుడు రోమారాజ్య దొరతనమువారు క్రీస్తు మతమును హింసింప మొదలుపెట్టలేదు గనుక ఆ పత్రికయందు చెప్పఁబడిన పాప పురుషుఁడను పేరు రోమాచక్రవర్తికి చెల్లదని ఆక్షేపింతురు. ఈ యభిప్రాయమునకు సమ్మతించనివారు పౌలు యూదుల జనాంగములను గూర్చియేనను వారు కనిపెట్టుచుండిన మెస్సీయకైనను ఈ పాప పురుషుఁడను బిరుదాంకము పెట్టి రోమా ప్రభుత్వమువారికి సూచనగా అడ్డగించువాఁడను పేరు నుపయోగించుచున్నాఁడని తలఁచెదరు. అందు కాధారముగా పౌలు థెస్సలొనీకైయులకు వ్రాసిన పత్రికలయందు యూదులు క్రైస్తవ మతస్థులను హింసించుచున్నట్లు వర్ణించఁగా కార్యముల గ్రంథ మందంతట రోమా దొరతనమువారు క్రైస్తవ మతస్థుల సంరక్షకులుగా కనపడుచఁబడిరని యుదాహరించుచున్నారు. కొంతవఱకా యభిప్రాయ మంగీకరించతగినదై యుండినను పాపపురుషుఁడు దేవుని ఆలయములో కూర్చుండునను అంశము పరిష్కారము కాదు. రోమా చక్రవర్తిని గుఱించి అతఁడు దేవాలయములో కూర్చుండుననుమాట చెప్పుటకు వల్లపడదు గనుక రోమా చక్రవర్తి విషయమై పౌలీ బిరుదాంక ముపయోగించెననుటకు చాలినంత యాధారములేదు.

పై వివరములన్నియు పరిశీలించఁగా పాప పురుషుఁడను నామమైనను అడ్డగించువాఁడను నామమైనను తత్కాలమందు జీవించిన ఎవరికైనను చెల్లునట్లు నిశ్చయించుకొనక పాపపురుషుఁడు ఇతర పత్రికలయందు క్రీస్తు విరోధియను నామమునకు సమానముగాను అడ్డగించువాఁడను నామము క్రీస్తు విరోధి ప్రబలము కాకుండా చేసిన ఏదోయొక అసందర్భమునకు సమానముగాను నిశ్చయించుకొనుట యుక్తము.

ఈ పాపపురుషునిగూర్చి ఆయా కాలములయందు జీవించిన వేదాంతులు వేర్వేఱభిప్రాయముల ననుసరించెదరు. వారిలో కొందఱు పాప పురుషుడు మహమ్మదనియు కొందఱు లూథరనియు కొందఱు నెపోలియన్ అనియు కొందఱు రోమాను మతస్థుల ప్రధానగురువులైన పోపుల వర్గమనియు తలంతురు. అయినను పౌలు II థెస్స $2^{7}$ లో ధర్మవిరోధ సంబంధమైన మర్మము ఇప్పటికే క్రియ చేయుచున్నదిగాని యిదివఱకు నడ్డగించుచున్నవాఁడు మధ్యనుండి తీసివేయఁబడు పర్యంతమే అడ్డగించును అను వాక్యమునుబట్టి పౌలు కాలములోనే ధర్మవిరోధి అడ్డగించఁబడి యుండెనని విశదముగా తెలియఁబడుచున్నది. ఇదివఱకు నడ్డగించుచున్నవాఁడు తీసివేయఁబడువఱకు పాపపురుషుఁడు ప్రత్యక్షము కాఁడుగాని ఆ తరువాత ప్రత్యక్షమగునని పౌలు సెలవిచ్చుచున్నాఁడు కాఁబట్టి పౌలు తన కాలములోనే బ్రతుకుచుండిన యొకని తలంచి యీ రీతిగ చెప్పినట్లు స్పష్టమగును కాఁగా పౌలుకు తదనంతరము జీవించిన పైఁజెప్పిన వారిలో నెవరికైనను పాపపురుషుఁడను బిరుదాంకము చెప్పతగదని తెలియుచున్నది. M.

**పాపము (Sin).** 1. పాపమును సూచించు పదములు పాత క్రొత్త నిబంధనలలో ననేకములు కలవు. దీనికి సాధారణముగ వాడుకలో నున్న పదమునకు గురితప్పుట అని యర్థమగును. దేవుఁడు మనకు విధించినది మన గురియనఁదగును. మనము దానిని తప్పినయెడల పాపులమగుదుము. దోషము అను నర్థమిచ్చు మఱియొక మాటకలదు. అవిధేయత, ఋణము, అపరాధము, అతిక్రమము, సంకరమార్గము, కీడు, ఆటంకము, బుద్ధిహీనత, తిరుగుబాటు అను నిట్టి యర్థములిచ్చు పదములు కూడ నున్నవి. జెక $5^{8}$ లో దోషమూర్తి యని తెనిఁగించిన పదము దోషము అని తెలిసికొనవలెను. దర్శనములతో నిండియున్న ఆ గ్రంథములో దోషము స్త్రీ రూపముగా నుండి

పలెస్తీనులోనుండి బలవంతముగా కొంచుపోఁబడు నట్లుగా నున్నది కావున దానిని దోషమూర్తియని తెనిఁగించిరి. ఈ మాటలలో దాదాపుగా నన్నియు తెనుఁగు బైబిలులో వాడఁబడినను ప్రతిమాటయు ప్రత్యేకముగా నొకే యసలు పదమును తెనుఁగున సూచించుటలేదు. అయితే యీ శబ్దార్థములను చూడఁగా పాపమనఁగా నేదియో తేటగా తెలియును. దేవునిగూర్చి తలంచినయెడల పాపమనఁగా ఆయనకు విరోధముగా తిరుగఁబడుట లేక ఆయనయెడల అవిధేయతగా నుండుటయై యున్నది. ఆయన యాజ్ఞలనుగూర్చి విచారించినయెడల పాపమనఁగా వాటిని అతిక్రమించుట లేక అపరాధము చేయుటయై యున్నది. ఇతరుల విషయములో చూడఁగా పాపము వారికొక కీడుగా లేక ఆటంకముగా నున్నది. మనలనుగూర్చి దేవుఁడుద్దేశించిన దానిని చూడఁగా పాపము ఆ యుద్దేశమును తప్పించునదిగా నున్నది. మన స్వంత జ్ఞానమునుబట్టి చూడఁగా పాపము బుద్ధిహీనతయేయని యొప్పుకొనవలెను. మనము చేయవలసిన వాటిని చేయకపోవుటచే అది యొక ఋణమని యెంచఁదగును. ఏ విధముగా చూచినను అది దేవుఁడు మన మేలునిమిత్త మేర్పాటు చేసినదానికి భిన్నముగానుండి ఆయన యేర్పాటులను చెఱుపునదై యున్నది.

2. పాపమునుగూర్చిన బోధ బైబిలు గ్రంథములన్నిఁటిలో నున్నది. తప్పొప్పులను వివేచించు నైజబుద్ధిని మాత్రమేకాక, దేవుఁడు బైబిలులో తన చిత్తమును తన పరిశుద్ధతను తెలిపి యుండెను. వీటినిగూర్చి తెలిసికొనుటతోడనే మనము వీటిని తప్పి పాపముచేసి యున్నామని యొప్పుకొనక తప్పదు. పాపము విషయమై యింతటి లోతైన గ్రహింపు మతి యే మత గ్రంథములలోను లేదు. హిందువులు దేవుఁడు నిర్గుణుఁడని చెప్పుదురు గనుక ఆయన పరిశుద్ధతనుగూర్చి యెఱుఁగరు. అందువలన పాపమునుగూర్చిన సరియైన బోధ వారికిలేదు. ఒకవేళ అట్టి బోధయున్నను వారు లలాటలిఖితమును కర్మను నమ్ముదురు కావున పాపమును అత్యవసరముగా చేయవలసిన వారగుదురు. కాఁబట్టి అది పాపముకాక, వ్యవహారికవిషయముగా నున్నది. మఱియు వ్యవహారిక విషయములు గతించిపోవునవై యున్నందున ఇదికూడ గతించిపోవునను కొందురు. పాపము నివ్విధముగా నెంచువారి బోధకును బైబిలు బోధకును సంబంధము లేశమైనను లేదు. దేవుఁడు మన కందఱికి అధికారియు తండ్రియునై యున్నాఁడనియు ఆయన మనము లక్షింపవలసిన పరిశుద్ధమైన యాజ్ఞలను మన హృదయము మీఁదను ఆయన వాక్యములోను మనకు నిచ్చెననియు, మనము వీటిని అతిక్రమించుట గొప్ప దోషమనియు అది తీసినగాని లేకపోయినయెడల దేవునికిని మనకును సహవాస ముండనేఱదనియు బైబిలు బోధించుచున్నది. ఇట్లుండఁగా మనము మన స్థితిని తెలిసికొనుటకు మాత్రమేకాక, రక్షణ మార్గమునుకూడ తెలిసికొనుటకు బైబిలు పాపమునుగూర్చి బోధించుచున్నదని తేటగా గ్రహించుకొనవలసి యున్నాము.

3. పాపముయొక్క యుత్పత్తినిగూర్చి ఆదికాండము 3 వ అధ్యాయములో నున్నది. దానిని చరిత్రనుగా నెంచినను, కొందఱనుకొనునట్లు ఉపమానమని యెంచినను దేవుఁడు మానవుల కిచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగపఱచుట చేతనే పాపముద్భవించెనని స్పష్టమగును. దేవుఁడు పాపమునకు కారకుఁడు కాఁడు (యాకో 1[13-16]). అయితే దేవుఁ డెందుకు శోధనను కలుగ నిచ్చెను అని యడిగినయెడల, శోధనలేనిది స్వేచ్ఛయు నుండనేఱదని తెలిసికొనవలెను. దేవుఁడు సృష్టించినది యావత్తు మంచిదే (ఆది 1[31]). మానవులు తమ స్వేచ్ఛయను మంచి యీవిని దుర్వినియోగపఱచుటచే పాపము కలిగెను గాని అది దేవుఁడు చేసినది లేక దేవునికి సంబంధమైనదని యేమాత్రము ననుకొనరాదు. ఈ విషయమును చూడఁగా సమస్తము దేవుఁడే గనుక పాపమనునది లేదనిగాని పాపము ఒకవిధమైన మాయయనిగాని అద్వయితులు చెప్పు బోధలకు బైబిలు బోధ బద్ధ విరుద్ధముగ నున్నదని తెలిసికొనవలెను. పాపము ఈ స్థూల ప్రపంచమునకు లేక ప్రకృతికి, లేక మన దేహమునకు సంబంధించి యున్నదను బోధకూడ బైబిలు బోధకు భిన్నముగా నున్నది. పాపకృత్యములను చేయుటకై పాపము మన శరీరములో నున్నట్లుగాను (గల 5[13-21]) మన అవయవములలో నున్నట్లుగాను

(రోమా $7^{23}$) కొన్ని వాక్యములలో నుండినను ఈ శరీరమును అవయవములును చెడిపోయిన మనస్సునకు సాధనములని యెంచవలెను. పాపము వీటిలో లేదుగాని ఆ చెడిపోయిన మనస్సులో నున్నది. అది బాగుపడినయెడల ఈ యవయవములు నీతికార్యములను చేయుటకు సాధనములగునని పౌలు వ్రాసెను ($6^{12,13}$).

పాపముచేసిన వారివలన పుట్టిన వారు స్వాభావికముగా అట్టి చెడిన మనస్సుతో పుట్టియున్నారని బైబిలు బోధించును (కీర్త $51^{5}$ మ $7^{11}$ రోమా $5^{12-21}$). ఇదే జన్మ పాపమనఁదగును. ఇది మనము మనోవాక్కాయ కర్మములచేయు పాపములకు వేరుగాను ఊఁటగాను నున్నదని చెప్పఁదగును.

4. మనము బైబిలులో చూచినయెడల ఆయా వారలు మాత్రమేకాక, ఆయా జనములుకూడ పాపము చేసినవారై దేవుని శిక్షకు పాత్రులైరని ముఖ్యముగా ప్రవక్తల గ్రంథములలో కనఁబడును (ఆమో 1,2). పాపమువలన ఇశ్రాయేలీయుల దేశము పాడైపోయెను (యెష $1^{1-7}$ మీకా $2^{2}$). ఇశ్రాయేలీయులు మాత్రమేకాక అన్యులుకూడ తమ పాపములనుబట్టి నశించిరి (యెష 23-34). పాపమెంత ఘోరమైనదైనను, ఎంత సర్వసాధారణమైనదైనను మానవులు గుణపడినయెడల వారు నశింపక జీవింతురను బోధకూడ ప్రవక్తలేకగ్రీవముగ చేయుచుండిరి ($1^{18}$ మీకా $7^{18-20}$ ఆమో $9^{11-15}$ యెహె $18^{23,24}$ యోనా గ్రంథము యావత్తు). ఇట్లు పాపము విషయము మాత్రమే కాక పాపమును పరిహరించెడి విషయముకూడ పాత నిబంధన ఆచారములలోను బోధలలోను లెక్కలేని సూచనలు కలవు (విమోచనము చూ॥).

5. యేసుక్రీస్తు బోధలను చూచినయెడల ఆయన పాపమునుగూర్చికూడ మఱింతలోతుగా బోధించెను. దేవుఁడు మన తండ్రియగుటచే (లూ $15^{11-32}$) ఆయనకు విరోధముగా ప్రవర్తించుట మిగుల విపరీతముగ నున్నదని ఆయన బోధించెను. ఆయన దేవుని యాజ్ఞలయొక్క వెలుపలి బోధను మాత్రమేకాక, వాటి యాంతర్యభావమును తెలిపి (మ $5^{21-48}$) మన పాపస్థితిని మనకు మఱీ తేటగా చూపించెను. అదియుఁగాక ఎవరును ఆక్షేపింపఁజాలని తన పరిశుద్ధ ప్రవర్తనవలన మన పాపములను మఱింత తేటగా కనఁబఱచెను. శిష్యులు తాము పాపులమని క్రీస్తువలన మిగుల స్పష్టముగ నేర్చుకొనుచుండిరి (లూ $5^{8}$ I తిమో $1^{15}$ I యోహా $1^{8}$). క్రీస్తు ప్రాయశ్చిత్తము అవసరమని బోధించుటకు పాపమును గూర్చిన బోధ రోమా $1^{18}$-$3^{20}$ లో నున్నట్లుగా పౌలు మిక్కిలి విశదముగా వివరించెను (విమోచనము చూ॥).

6. క్రీస్తు విమోచనమునుబట్టి పశ్చాత్తప్తుల ప్రతి పాపమునకు క్షమాపణ కలుగుననునది క్రొత్త నిబంధన బోధయై యుండఁగా (రోమా $5^{20}$ I తిమో $1^{15}$ I పేతు $2^{24}$), పరిశుద్ధాత్మను దూషించుటయను పాపమునకు క్షమాపణలేదని క్రీస్తు బోధించెను (మా $3^{29}$=లూ $12^{10}$=మ $12^{31}$). ఇట్టి భయంకరమైన పాపమునుగూర్చి హెబ్రీ $6^{6}$ $10^{29}$ I యోహా $5^{16}$ లలోను వ్రాసియున్నారు. ఈ వాక్యములను చూడఁగా పరిశుద్ధాత్మ మనకు అనుగ్రహించిన జ్ఞానము జ్ఞానముకాదని తిరస్కరించి దానిని విరోధించుటయే ఇట్టి భయంకరమైన పాపమని తెలిసికొనవలెను. అట్టి పాపమును చేయువారు తమ హృదయమును కఠినపఱచుకొని పరిశుద్ధాత్మ వెలుఁగును ఆర్పివేయువారగుదురు (I థెస్స $5^{19}$) కావున, పశ్చాత్తాపపడుట వారికి అసాధ్యమగును. అందువలననే ఈ పాపమునకు క్షమాపణ యుండదు.

7. పాపము విషయములో క్రీస్తు భక్తులస్థితి యెట్టిది? క్రీస్తు పాపులను రక్షించెనుగాని వారికి సెలవిచ్చునపుడు వెళ్లి యికను పాపము చేయకుమని సెలవిచ్చెను (యోహా $8^{11}$). ఇట్లు పాపమునకు దాసులైనవారు దేవుని సేవింపలేరని బోధించెను (మ $6^{24}$ యోహా $8^{34}$). క్రీస్తునందు బాప్తిస్మము నొందినవారు పాపము విషయము చనిపోయి నీతి విషయము బ్రదుకుదురని పౌలు వ్రాసెను (రోమా $6^{1-11}$ గల $6^{14,15}$). ఆదేరీతిగా యోహానుకూడ దేవునివలన పుట్టినవారు పాపము చేయరని వ్రాసెను (I యోహా $3^{9}$). విశ్వాసికి పాపముమీఁద ఆశయుండదని యీ వాక్యములవలన స్పష్టమగును. పాపము వారిమీఁద ప్రభుత్వము చేయదు (రోమా $6^{14}$). ఏలయనఁగా, వారు క్రొత్త యజమానునికి దాసు

లైరి ($6^{18}$). వారు బుద్ధిపూర్వకముగా పాపము చేయరు. అయితే దేవుని అతి పరిశుద్ధమైన యాజ్ఞలను వారు తేటగా గ్రహించుచున్నప్పుడు వారు తమ పాపములను మఱీ తేటగా తెలిసికొని తాము అయోగ్యులైన సేవకులమని యొప్పుకొందురు (లూ $17^{10}$). ఈ జీవితకాలములో మనము ఎల్లప్పుడును జాగరూకులమై (మా $14^{38}$ గల $6^{1}$), పాప సంబంధములగువాటిని అంతకంతకు విడిచిపెట్టి నీతి యుక్తములగువాటిని అవలంబింపవలయును (ఎఫె $4^{22-24}$). మనమీ శరీరములో నుండఁగా పాపమునుండి పూర్ణముగా విడిపింపఁబడక పోయినను అట్టి పాప విముక్తిని ఆశించుచు మూల్గుచున్నాము (రోమా $8^{23}$) పాప విముక్తి నొందుటయే మోక్ష సౌఖ్యములలో ముఖ్యమైన సౌఖ్యమై యున్నది (ప్రక $21^{27}$ పాప పతనము, పాపపరిహారము చూ॥).

**పాఫు** (Paphos). కుప్రదీవియందు నైఋతి దిక్కుగానున్న రేవుపట్టణము. రోమీయుల ప్రభుత్వకాలమున నిది కుప్రకు రాజధానిగ నుండుటచే వారా దీవి నేలుటకు నియమించిన అధిపతికి ఇది నివాసస్థానమయ్యెను. పౌలు బర్నబాలు తమ మొదటి మిషనేరీ ప్రయాణమందు ఈ పట్టణమునకు వచ్చి అచ్చట అధికారియగు సెర్గి పౌలుకు బోధించిరి (కార్య $13^{6-13}$ పటము V, K 5).

**పాము** సర్పము చూ॥

**పాయు** (Pai, Pau = గొఱ్ఱె అరుపు). హదదు అను రాజుయొక్క ముఖ్యపట్టణము (I దిన $1^{50}$). ఇతఁడు ఏశావు సంతతివాఁడగుటచే అది ఎదోములో నున్నదనఁదగును గాని దాని యునికినిగూర్చి మఱి తేటగాఁ దెలియదు.

**పారంపర్యములు, పారంపర్యాచరములు** (Traditions). ఆయా మతముల లోని ప్రమాణ గ్రంథముల కితరములగు బోధలును విధులును ఆ మత పారంపర్యములన వచ్చును. హిందువులు వానిని స్మృతులందురు. మహమ్మదీయులలోని సున్ని తెగకుఁ జేరినవారు పారంపర్యముల నెక్కువగా లక్షింతురు. అట్లే యూదులలోను పాత నిబంధనయందలి ప్రమాణములు గాక పెద్దలనేక విధుల నేర్పఱచి వాటిని పారంపర్యముగా తమ శిష్యుల కప్పగించిరి. మోషే వీటిని వ్రాయకున్నను పారంపర్యముగా కాపాడఁబడినందున యూదులు వాటిని ప్రామాణిక గ్రంథములకు సమానముగా నెంచినట్లు యోసీఫసు వ్రాయుచున్నాఁడు (పురా 13. 10. 6). పురాతనములగు విధులను దెలిపెడి పారంపర్యములను హలాకా (*Halakhah* = విధులు) అనియు, ఆయా చరిత్రలను దెలుపునని హగ్గాదా (*Haggadhah* = వివరింపఁబడినవి) అనియు, ధర్మశాస్త్రమును వివరించునవి మిష్నా (*Mishnah* = పునర్విమర్శములు) అనియు, వాటిని గూర్చిన ప్రశ్నోత్తరములు మిద్రాషు (*Midrāsh* = విచారణ) అనియు, వాటిని మొత్తముమీఁద బోధించు బోధలు టాల్ముదు (*Talmud* = బోధలు) అనియు పిలువఁబడును. ఇవి ప్రామాణిక గ్రంథములయొక్క భావములను దెలుపును గాన వాటికన్న నెక్కువైనవని వాదించెడి వారు పరిసయ్యులలో నుండిరి. తాను పరిసయ్యుఁడనుగా నున్నంతమట్టుకు వీటివిషయమై అందరికన్న యెక్కువ ఆసక్తి పరుఁడనుగా నుంటినని పౌలు చెప్పుకొనెను (గల $1^{14}$). ఇవి దేవునివాక్యమునకు భిన్నమై వాటిని నిరర్థకపఱచుచున్నవని క్రీస్తును (మ $15^{2-6}$ $7^{3-13}$), పౌలును (కొలొ $2^{8}$) వాటిని ఖండించిరి.

క్రీస్తునుగూర్చిన సువార్తలు వ్రాయఁబడక పూర్వము క్రైస్తవ బోధలను సూచించుటకు పైన నుదహరించిన కొన్ని పదములను మూలభాషలో నుపయోగించి యున్నారు. II థెస్స $2^{15}$ లోని విధులు, $3^{6}$ లోని బోధ, I కొరి $11^{2}$ లోని కట్టడలు అను పదములచే తెనిఁగింపఁబడిన మూల భాషాపదములు అట్టి పారంపర్యములను సూచించును. ఇవి సువార్తలకు తరువాత వ్రాయఁబడినవై యున్నవి. ఇట్లు పారంపర్యములుగా నప్పగింపఁబడిన యనేకములు కలవని రోమను సంఘస్థులు చెప్పెదరు. ప్రమాణ గ్రంథములేగాక అలిఖిత బోధకు ఆధారములని వారి యుద్దేశము. క్రీస్తుచేసిన కార్యములును చెప్పిన బోధలన్నియును వ్రాయఁబడని సంగతి వాస్తవమే. అయినప్పటికిని పరిశుద్ధాత్మావేశము వలన నడిపింపఁబడినవారు వ్రాసినవిమాత్రము ప్రామాణికములనియు, పారంపర్యముగా వచ్చెడి

సంగతులు సత్యము కావచ్చును, సత్యము కాక పోవచ్చును గాన వాటిని ప్రమాణ గ్రంథములకు సమమైన వాటినిగా నెంచరాదనుట ప్రాటెస్టాంటువారి బోధయై యున్నది. (టాల్మడు చూ||).

**పారసీకదేశము, పారసీకులు (Persia, Persians).** I. పారసీకదేశము యొక్క యునికి, చరిత్ర. బైబిలు చరిత్రలో పారసీకులు బబులోను చెఱకాలమునకు పిమ్మట కనఁబడుదురు. వారి యసలు దేశము పారసీక సంయుక్తాగ్రగుడమునకు ఈశాన్య దిక్కునయున్న యొక చిన్న దేశమయి యున్నది. అందలి నివాసులు ఆర్యులై యుండిరి. వారు మాదీయుల సంబంధికులు (మాదై చూ). క్రీ|| పూ|| 700 సం||ల వఱకు వారినిగూర్చియమైన సూచన లేవియు లేవు. అదిమొదలు క్రీ|| పూ|| 550 సం||ల వఱకు వారు ఇతరులకు ముఖ్యముగా మాదయివారికి లోనైనవారై యుండిరి. 550 సం|| లో కోరెషు మాదయి దేశమును జయించెను. అప్పటినుండి మాదయి దేశము పారసీక దేశమునకులోనై యుండెను. అదిమొదలు పారసీక దేశము చాల వృద్ధిలోకి వచ్చెను. 539 వ సం|| నందు పారసీకులు బబులోనును జయించి యందు చెఱలోనున్న యూదులను ఇంక నితరులను విడిపించి యుండిరి (యెష 13, 14, 21, 41, 44-47, యిర్మీ 50, 51) ఇవ్విధముగా పూర్వకాలపు రాజ్యములన్నిటిలో నొక గొప్ప రాజ్యము స్థాపింపఁబడెను. అది యిండియానుండి గ్రీసు ఆఫ్రికా దేశములవఱకు వ్యాపించెను. పారసీకులు అనేకమైన యితర జనాంగములవలె తమ రాజ్యములలోని అన్య జనములను కఠినముగా చూడక ఆయా జనుల సౌఖ్యములను విచారించి యేలినట్లు అనేక దృష్టాంతములున్నవి (ఎజ్రా 1-6). కోరెషును దర్యావేషును యూదులకు చేసిన మేలు లట్టి దృష్టాంతము లనఁదగును.

II. పారసీక దేశమును ఏలిన చక్రవర్తులు. కోరెషునకు పిమ్మట పారసీకదేశము నేలినవారెవరనిన: కంబైసీసు (*Cambyses* 529-521), మొదటి దర్యావేషు (*Darius I* 521-486), మొదటి అహష్వేరోషు (*Xerxes I* 486-465), మొదటి అర్తహషస్త (*Artaxerxes I* 465-424), రెండవ దర్యావేషు (*Darius II* 424-405), రెండవ అర్తహషస్త (*Artaxerxes II* 405-359), మూడవ అర్తహషస్త (*Artaxerxes III* 359-338), అర్సేసు (*Arses* 338-336), మూఁడవ దర్యావేషు (*Darius III* 336-331). 333-331 లో మహా అలెక్సండరు ఆ దేశమును జయించెను. అంతటితో పారసీక రాజ్య మంతమొందెను గాని, 226 సం. లో నొక క్రొత్త వాఁడైన పారసీకరాజు ఒక క్రొత్త రాజ వంశమునకు పూర్వికుఁడై దాని నేలెను. ఈ రాజ వంశస్థులు క్రీ|| శ|| 641 వ సం|| వఱకు ఏలుచుండిరి. అప్పుడు మహమ్మదీయు లీ దేశమును జయించి నేటివఱకు దాని నేలుచున్నారు. క్రీ|| శ|| 717 సం|| నందు పారసీకులలో కొందఱు గుజరాతు దేశమునకు పారిపోయి అచట బస చేయుచుండిరి. ప్రస్తుతమున ఇండియాలో వ్యాపించియున్న పారసీవారు వారి సంతతివారై ముఖ్యముగా వర్తక వ్యాపారములకు ప్రసిద్ధులైరి.

III. బైబిలులో కనఁబడు పారసీక దేశపు చక్రవర్తులను గూర్చినది.

బైబిలులో చెప్పఁబడిన పారసీక చక్రవర్తులెవరనఁగా: కోరెషు (యెష 45 II దిన $36^{22,23}$ ఎజ్రా $1^{1,2,8}$ $3^7$ $4^3$), మొదటి దర్యావేషు (హగ్గ $1^1$ $2^{10}$ జెక $1^1$), అహష్వేరోషు (ఎస్తే $1^1$ మొ|| ఎజ్రా $4^7$), మొదటి అర్తహషస్త (ఎజ్రా 7 నెహె 2). ఒకవేళ ఈ జాబితాతో కూడ కోరెషుకు తరువాత నేలిన కంబైసీసును చేర్చవలసి యున్నది. ఇతఁడు దాని $6^1$ $9^1$ $11^1$ లో నున్న మాదీయుఁడగు అహష్వేరోషు అని కొందఱనుకొందురు. మఱియు నెహె $12^{22}$ లో మూఁడవ దర్యావేషును గూర్చిన సూచనకూడ నుండవచ్చును.

పారసీకుల మతమునకు జర్టుష్టు లేక జరథూష్ట్ర మతమని పేరు. మంచిదేవుఁడును చెడ్డ దేవుఁడును ఇద్దఱు దేవుండ్లున్నారను బోధ ఆ మతములోని ముఖ్య బోధయై యున్నది. చుట్టు నున్న ఇతరులవలన మిత్రాయను సూర్యదేవత పూజకూడ కొంతవఱకు వారు నేర్చికొనినట్లుగా నున్నదిగాని మొత్తానికి వారు పలుదేవతలను పూజచేసిన వారుకారు. పాఁత నిబంధన

కాలపు వారు ఈ జర్తుష్టు మతమునుండి దూత లను గూర్చిన బోధను కొంతవఱకు పొంది యున్నట్లున్నది గాని వేటే విషయములను పొందియున్నట్లు సూచనలేవియు లేవు.

**పారా** (Parah = పెయ్య). బెన్యామీనీయుల స్వాస్థ్యములోనున్న ఒక యూరు. అది మిక్మషులోయ ద్వారముననున్నది (యెహో 18[23]). దాని ప్రస్తుతపు పేరు ఫారా (*Farah*, పటము III, F 5).

**పారాను** (Paran = బిలములున్న ప్రదేశము?).

1. మిద్యానుకును ఐగుప్తుకును మధ్యనుండు అరణ్యము (I రాజు 11[18]). ఈ యరణ్యములో కాదేషు, సీను అరణ్యమును, దానికి దక్షిణముగ నుండు ప్రదేశమును నున్నవి (సంఖ్యా 20[1] 27[14] ద్వితీ 32[51]). అయితే LXX అనుసరించి సంఖ్యా 33[36] చూడఁగా పారాను సీను అరణ్యము నుండి వేరై దానికి నుత్తరముగా నుండు కాదేషు ప్రాంతముగా నున్నది. అది ప్రస్తుతమున ఎట్.టి. (*Et-Tih*) అనఁబడు మెట్ట భూమియై యున్నది. ఇష్మాయేలు అబ్రాహాముచే వెళ్లఁగొట్టఁబడినపు డిచటనే యుండెను (ఆది 21[21]). ఇశ్రాయేలీయులు అరణ్యములో తిరుగుచుండఁగా నిచట మకాము చేసిరి (సంఖ్యా 10[12] 12[16]). ఇచటినుండి పలెస్తీను దేశమును చూచివచ్చుటకై మోషే వేగులవారినిఁ బంపెను (13[26] అరణ్యము 3 (7) చూ॥).

2. ఒక కొండయొక్క పేరు. సీనాయి శేయీరు తేమాను అను కొండలతో ఈ పేరు కూడ కలదు (ద్వితీ 33[2] హబ 3[3]). ఇది బైబిలులోని కావ్యములలో మాత్రముండుటచే ఇది యొక యలంకార నామమై యుండవచ్చునను కొందురు.

3. ఏల్పారాను = (పారాను ఓకు వృక్షము). కాదేషు దగ్గఱనుండు నొక స్థలము (ఆది 14[6]). అది ఏలతుకు మాఱుపేరై యుండవచ్చును (I రాజు 9[26]).

**పార్తీయులు** (Parthians). పార్తీయులని కార్య 2 వ దుదాహరింపఁబడినవారు పార్తీయ దేశమునందు నివసించిన చెదరిపోయిన యూదులే గాని ఆ దేశపు అన్యులు గాదు. పార్తీయ రాజ్యము క్రీ॥ పూ॥ 250-క్రీ॥ శ॥ 226 వఱకు నిలిచిన గొప్ప రాజ్యమై గ్రీకులను రోమనులను ప్రతిఘటించినదై యుండెను. వారి స్థిరమగు దేశము కస్పియన్ సముద్రమునకు దక్షిణముగా 300 మైళ్లు పొడవును 100-400 మైళ్లు వెడల్పును మాత్రమే విస్తీర్ణత గలదైనను అది మహోన్నత స్థితియందున్న కాలములో 1500 మైళ్ల పొడవున యుఫ్రాతునది మొదలు సింధు నదివఱకు వ్యాపించిన దయ్యెను. క్రీ॥ పూ॥ 39 సం॥న వారు పలెస్తీనుమీఁద దండెత్తివచ్చి యెరూషలేమును దోచుకొన్నట్లు యోసీఫసువలనఁ దెలియుచున్నది (పురా 14. 13[13] యుద్ధ I. 13. 1). రోమనులు వీరితో ననేకమారులు యుద్ధముచేసినను పూర్ణముగా జయింపలేక పోయిరిగాని క్రీ॥ శ॥ 226 సం॥ లో పారసీకులు వీరిని జయించి వారి దేశమును తమ దేశముతో కలుపుకొనిరి.

**పార్శ్వము** (ప్రక్క) చెయ్యి 4 చూ॥

**పాలాలు** (Palal = న్యాయ విమర్శకుఁడు). నెహెమ్యాకాలములో యెరూషలేము ప్రాకారములను కట్టించుటకు సహాయముచేసిన వారిలో నొకఁడు (నెహె 3[25]).

**పాలు** (Milk). ప్రతి దేశమందువలెనే పలెస్తీనులోను పాలు మిగుల ముఖ్య ఆహారముగా నెంచిరి. ఆవు పాలను (యెష 7[22]), గొఱ్ఱెపాలను (ద్వితీ 32[14]), మేఁకపాలను (సామె 27[27]), ఒంటెపాలను (ఆది 32[15]) వాడుకొనిరి. పాలను మాత్రమేగాక దానినుండివచ్చు పెరుగు వెన్న జున్ను మొదలగువాటిని విరివిగా నుపయోగించుకొనిరి గాని, హెబ్రీభాషయందున్న యే పదము దేనిని సూచించునో చెప్పుట కష్టముగా నున్నది. ఒక పదమును వెన్నయని సాధారణముగా తెనిఁగించినను (ఆది 18[8] II సమూ 17[29] యోబు 17[29] సామె 30[33]), దానినే మజ్జిగ యనియు (ద్వితీ 32[14]), మీగడ యనియు (న్యాయా 5[25]), పెరుగు అనియు (యెష 7[15,22]) తర్జుమాచేసిరి. ఈ పదమునకు వెన్న, మీఁగడ యను రెండర్థములున్నట్లు తెలియుచున్నది. II సమూ 17[29] లో జున్నుముద్ద యని తెనిఁగించఁబడిన పద మాయొక్క చోట మాత్ర

ముండుటవలన దాని యర్థమును నిశ్చయించుటకు వీలుగాదు. అక్లే యోబు $10^{10}$ లోని మఱియొక పదమును జున్నుగడ్డయని తెనిఁగించిరిగాని దానిని అంతతేటఁగా తెలిసికొనుట కాధారము లేదు. I సమూ $17^{18}$ లో నున్నది వేఱొకమాటయై పాల ముక్కలని యర్థమగును. దానిని జున్ను గడ్డలని సరిగా తెనిఁగించిరి.

పాలు తేనెలు ప్రవహించు దేశమను పేరు పలెస్తీనుకు దాని ఫలవంత స్థితినిబట్టి కలిగెను (నిర్గ $3^{8,17}$ తేనె చూ॥). పెరుగుకూడ ఆహార పదార్థమగుటవలన అది రుచిగల భోజనమునకు సూచనగా నుండెను (యెష $7^{15}$). పశువులకు అడవులలో మఱీ మంచి మేఁత దొఱకుటవలన ఆ దేశము అడవియై యున్నదనుటకును పెరుగు సూచనగా నున్నది ($7^{22}$). మేఁకపిల్ల మాంసమును తల్లి పాలతో నుడక పెట్టరాదను నియమము భూతదయను లక్షించునట్లు చేసినట్టి యున్నది (నిర్గ $23^{19}$ $34^{26}$ ద్వితీ $14^{21}$).

**పాలు పుచ్చుకొనుట** సహవాసము, ప్రభు భోజన సంస్కారము చూ॥

**పావురపు రెట్ట** (Dove's dung). షోమ్రోను ముట్టడి వేయఁబడినప్పుడు పావురపు రెట్ట సహితము గొప్ప ధరకు అమ్మి వేయఁబడు నంత కఠినమైన కరవు కలిగెను (II రాజు $6^{25}$) పావురపు రెట్టయని తెనిఁగించఁబడిన పదము ఒక తరహా కాయను సూచించునని కొందఱను కొందురు. అసలు పదముయొక్క గుణింతమును కొంచెము మార్చినయెడల ఆ దేశములో పందులకు పెట్టు కాయలలో కారోబు (*Carob*) అను కాయ పేరగును కావున దాని నట్లు సవరించవలెనని కొందఱి యభిప్రాయము. యెరూషలేమును రోమీయులు ముట్టడి వేసినప్పుడు దాని నివాసులు మలమును తిన్నట్లు యోసీఫను వ్రాయుటను చూడఁగా (యుద్ధ 5. 13. 7) అది అక్షర రీతిగానే పావురపు రెట్టయని చెప్పఁదగును.

**పావురము** గువ్వ చూ॥

**పాశము** గొలుసు చూ॥

**పాసకు** (Pasach) ఒక ఆషేరీయుఁడు (I దిన $7^{33}$).

**పాసెయ** (Paseah = కుంటివాఁడు).

1. యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $4^{12}$).

2. నెహెమ్యాకాలములో యెరూషలేము ప్రాకారములను బాగుజేసిన వారిలో యెహోయాదా యనువాని తండ్రి (నెహె $3^{6}$).

3. జెరుబ్బాబెలుతోకూడ తిరిగివచ్చిన నెతీనీయులలో నొక తెగవారిపేరు (ఎజ్రా $2^{49}$- నెహె $7^{51}$). ఈ పేరు 2 లోని వానివలన వచ్చినదని కొందఱి తలంపు.

## పి

**పిండి రొట్టె**, అర్పణములు III, ఆహారము I 1, వంటసామగ్రి 2 చూ॥

**పిండి పిసుకు తొట్టి** వంట సామగ్రి 2 చూ॥

**పిచుల వృక్షము** (Tamarisk). దీని మూల పదమగు ఎశెల్ అను హెబ్రీ పదమును తెనిఁగింపక అటులనే వ్రాసి యుండిన పక్షమున యుక్తముగ నుండెడిది. ఈ మాట ఆది $21^{33}$ I సమూ $22^{6}$ $31^{13}$ నందు మాత్రము కనఁబడును. ఇది యిసుక తెరనేలల యందును సముద్రపు ఉప్పుగాలి తగిలెడి మెట్ట నేలల యందును లెస్సగా పెరిగెడి చిన్న చెట్టయి యున్నది. J. C.

**పిచ్చి** రోగములు చికిత్సలు II 6 (3) చూ॥

**పిచ్చుక** పక్షులు 30 చూ॥

**పిత్రార్జితము** కుటుంబము 4,6 చూ॥

**పిబేసెతు** (Pibeseth). పూర్వము ఐగుప్తులోనున్న యొక పట్టణము (యెహె $30^{17}$). ఐగుప్తీయులు దానికి పుబాస్తి (*Pubasti*) అను పేరు పెట్టిరి. ఉబాస్తియను నొక దేవతకు ప్రతిష్ఠించిన పట్టణమై యుండెను. ఆ దేవత సింహ రూపము గలదైనను దానిని పిల్లి దేవతనుగా పూజించిరి. ఈ పట్టణము క్రీ॥ ము॥ 1000 సం॥ లకు పూర్వము ఐగుప్తునకు రాజధానిగా నుండెను. ఇటీవల దాని పాడు శేషములను కనుగొనిరి. అది కైరో (*Cairo*) కు ఈశాన్యమందు 45 మైళ్ల దూరములో నున్నది (పటము VIII, B 2).

**పిరాతోను, పిరాతోనీయుడు** (Pirathon, Pirothonite = ఎత్తు?). ఎఫ్రా

యిము స్వాస్థ్యములోని కొండ ప్రదేశములో నున్న ఒక యూరు. న్యాయాధిపతియగు అబ్దోను ఈ యూరివాఁడే (న్యాయా 12$^{13-15}$). దావీదు యోధులలో చేరిన బెనాయాకూడ ఈ యూరివాఁడే. అందువలననే అతఁడు పిరాతోనీయుఁ డనఁబడెను (II సమూ 23$^{30}$ I దిన 27$^{14}$). మక్కబెయుల కాలములో యూదులకు విరోధులైన వారు అచట కోటను కట్టించిరి (I మక్క 9$^{10}$ పిరతోనీ). దీనియునికి షెకెమునకు పడమటి దిక్కున 3 క్రోసుల దూరములోనున్న ఫెరత (*Fer'ata*) యని సాధారణముగా ననుకొందురు గాని మఱికొందఱు షోమ్రోనుకు ఈశాన్య దిక్కునయుండు ఫరా (*Fara*) యను వాగుదగ్గఱ నున్నదనుకొందురు. (పటము III, E 3).

**పిరాము** (Piram = వేగముగల). కనాను దేశములోని యర్మూతు అను పట్టణమునకు రాజు. యెహోషువ అతనిని జయించి చంపెను (యెహో 10$^{3,16-27}$).

**పిలాతు** (Pilate). మహా హేరోదు కుమారుఁడగు అర్కెలాయును రోమీయులు యూదా దేశపు ప్రభుత్వమునుండి క్రీ॥ శ॥ 6 సం॥న తొలగించిన పిమ్మట దాని నేలుటకు నియమించిన రోమా గౌర్నరులలో నైదవవాఁడు. ఇతనిని పొంతిపిలాతు అని పిలిచిరి (మ 27$^{2}$ లూ 3$^{1}$). అతఁడు యూదయను క్రీ॥ శ॥ 26-36 వఱకు నేలెను. ఇతఁడు పుట్టుకచేతనే రోమనుఁడైనట్లు కనఁబడదు. సేనాధిపతిగా నుండి పొంతు అను జిల్లాలో యుద్ధములు చేసి కీర్తి నొందినందున పొంతు అను బిరుదితనికి వచ్చినట్లు కొందఱభిప్రాయపడుచున్నారు. పిలాతు అను పదము ఈఁటెను సూచించును గాన ఇతఁడు ఈఁటెలను విసరెడి పటాలమునకు నాయకుఁడై యుండునని అట్టివారి యభిప్రాయము. కాని బానిసలుగానుండి స్వతంత్రము నొందినవారు వేసికొనెడి ఒక విధమైన టోపీనికూడ ఆ పదము సూచించవచ్చునుగాన ఇతఁడు మొదట బానిసగా నుండి తరువాత స్వతంత్రతను సంపాదించుకొనెనని మఱికొంద అనుకొందురు.

పిలాతు గౌవర్నరుగానుండి చేసిన కార్యములను గూర్చి యోసీఫసు వ్రాసెను. యూదులు విగ్రహములుగా నెంచిన రోమా ధ్వజములను రాజధానియగు కైసరయనుండి తెప్పించి యెరూషలేమునం దుంచుటచే యూదులు మిగుల కోపపడి తిబెరియు కైసరునకు అప్పీలుచేసి ఆ ధ్వజములను దీసివేయించిరి (పురా 18, 3, 1; యుద్ధ 2, 9, 2-3). యెరూషలేమునందు నీటి కాలువలను త్రవ్వించుట కతఁడు దేవాలయమునం దర్పింపఁబడిన సొమ్మును తీసికొనుటకు ప్రయత్నింపఁగా యూదులు తండోప తండములుగా నాతని మందిరము నెదుటకూడి మనవిచేయఁబోయినప్పు డతఁడు వారిలో ననేకులను చంపించెను (పురా 18. 3. 2. యుద్ధ 2. 9. 4). గలిలయులు యుద్ధప్రీతిగలవారై చీటికి మాటికి అల్లరులను రేపెడివారై, ఆలయమునందట్టి కల్లోలము నొకటి రేపినందున, పిలాతు వారిని బలిపీఠము యొద్దనే చంపించెను (లూ 13$^{1,3}$). గలిలయులు హేరోదు ప్రభుత్వములోని వారు గాన హేరోదీ సంగతివిని కోపగించెనని కొందఱందురుగాని, క్రీస్తును విచారించు సమయమున పిలాతు హేరోదు అధికారమును లక్షించి క్రీస్తును అతనియొద్దకుఁ బంపినందున వారప్పటినుండి స్నేహితులైరి (23$^{6-12}$).

క్రీస్తు జీవించి పనిచేసిన కాలములో పిలాతు గౌవర్నరుగా నుండుటవలనను (లూ 3$^{1}$), ఆయనను విచారించి శిక్ష విధించుట చేతను (మ 27 మా 15 లూ 23 యోహా 18$^{28}$-19) పిలాతు యొక్క పేరును ప్రసిద్ధి వడసినదాయెను. గొప్ప పండుగులు జరుగు కాలమున యెరూషలేమునందు తొందరలు కలుగునేమో యని గౌవర్నరులా సమయమున అచ్చటికి వచ్చెడివారు. అదే రీతిగా క్రీస్తు చంపఁబడు సంవత్సరమున పస్కా పండుగు కాలములో పిలాతు అచ్చటికి వచ్చుట సంభవించెను. అతఁడా సమయమున అంతోనియ కోటలో నుండినట్లు తోచును. వారచ్చటికి క్రీస్తునుపట్టి తెచ్చిరి. పండుగుకాలములో తమ కంటుతగులునేమోనను భీతిచే న్యాయస్థానములోనికి వెళ్లక బయటనే నిలిచి యుండిరి. తామే ఆయన మరణశిక్షకు పాత్రుఁడని తీర్మానించి పిలాతు దానిని ఖాయపరచవలెనని కోరిరి గాని స్వయముగా విచారించకుండ శిక్ష విధించుట కతఁడు ఒప్పక పోయెను (యోహా 18$^{28-32}$).

పన్నులకు సున్నాచుట్టు మన్నాఁడనియు, తానే రాజనని చెప్పుకొన్నాఁడనియు రాజద్రోహి యనియు మోపిన నేరములను (లూ $23^{2}$) విచారించి, ఆయన తానీ లోక సంబంధమగు రాజును కాననియు, సత్యమునకు సంబంధించిన రాజు ననియు క్రీస్తు చెప్పఁగా విని సత్యమేమిటి యని యడిగి తన అవిశ్వాసమును కనఁబఱచెను. అయినను క్రీస్తు నేరస్థుఁడు కాఁడని నిశ్చయించుకొనిన వాఁడై ఆయనను విడిపింప నెంతో యత్నించెను (యోహా $18^{33-38}$). ఆ యత్నము లెవ్వియనగా 1. మొదట ఆయనను హేరోదు నొద్దకుఁ బంపెను (లూ $23^{6-12}$). 2. పండుగు సమయమున ఖైదీని విడిపించు వాడుక ప్రకారము ఈయనను విడిపించ యత్నించెను (మ $27^{15-21}$ మా $15^{6-11}$ లూ $23^{13-19}$). 3. తనచేతులు కడుగుకొని ఈ నిర్దోషి రక్త విషయము తాను నిరపరాధి ననెను (మ $27^{24,25}$). 4. శిక్షించి విడిపింతు ననెను (లూ $23^{16,22}$). దేవుని కుమారుఁడనని యేసు చెప్పుకొన్నట్లు వినిన (యోహా $19^{7}$) సమయమందే అతని భార్య కనిన స్వప్నపు సంగతిఁ దెలిసికొని (మ $27^{19}$) మతింత భయపడెను. 5. గాని ఆయనను విడిపించిన పక్షమున కైసరునకు స్నేహితుఁడవుకావు అని యాజకులు భయపెట్టినందున (యోహా $19^{12}$) అతఁడేమి చేయుటకు తోఁచక మొదట వారి జాలిని రేపుటకును, తమ రాజునని చెప్పుకొన్నవాఁడు సిలువ వేయఁబడినాఁడను అవమానమునకు వారు ఒప్పుకొనక పోవచ్చునను తలంపుతో ముండ్ల కిరీటమును ధరించుకొని నలుగఁ గొట్టఁబడిన యేసును వారికిఁ గనపఱచెను ($23^{14}$) గాని అతని ప్రయత్నములన్నియు వృథాకాఁగా, వారిని సంతోషపెట్టుట కాయనను సిలువవేయ నప్పగించెను. ఆయన సిలువపైఁ గొట్టవలసి యుండిన పై వ్రాఁతను మార్చు మన్నప్పుడు మాత్ర మట్లు చేయనని దృఢముగాఁ జెప్పెను ($23^{21,22}$). వారు కోరినట్లు త్వరగా చంపుటకును ($27^{31-34}$) సమాధికి కావలి పెట్టుటకును (మ $27^{62-66}$). సమ్మతించెను. అతఁడు కావలి వారిని శిక్షింపకుండునట్లు అతనిని సమాధాన పెట్టగలమని యూదులకు పరిపూర్ణ నమ్మకమున్నట్లు మ $28^{14}$ వలనఁ దెలియుచున్నది. పిలాతు సమయాను సారియని యీ చరిత్రవలన స్పష్టమగుచున్నది.

పిలాతు క్రూరుఁడైనను సమయాను సారియై న్యాయమును విచారింపక తనకు లాభకరములగు వాటి నాశించి పనిజేసినను అతఁడు పదేండ్ల వఱకు ఏలుటనుబట్టి యూదులవంటి తొందరలను రేపెడి వారిని ఏలఁగల ఉపాయ శాలియనుటకు సాధ్యమగుచున్నది. అతఁడు హఠాత్తుగా పనినుండి తొలఁగించఁబడెను. షోమ్రోను వారిలో నొకఁడు గెరిజీము పర్వతముపై మోషే దాచిన బంగారు పాత్రలు దొఱకునని చెప్పిన మోసపు పలుకులు నమ్మి షోమ్రోను వారనేకులు ఆయుధములు ధరించినవారై ఆ పర్వతముమీఁద కూడఁగా పిలాతు వారు తిరుగుబాటుచేయనై అచ్చటికిఁ జేరిరని యెంచి వారిలో ననేకులను పట్టుకొని చంపించెను. ఈ సంగతిని షోమ్రోను వారు సిరియ కధిపతియగు వితెల్లియుకుఁ (*Vitellius*) దెలుపఁగా నతఁడు పిలాతును ఉద్యోగమునుండి తొలఁగించి విచారణకై అతనిని రోమునకంపెను గాని అతఁడు రోమా చేరక మునుపే అతనియం దింతవఱకు ప్రీతిగా నుండిన తిబెరియు చనిపోయెను. తరువాత పిలాతున కేమి సంభవించెనో తెలియదు. పిలాతు కార్యములు (*Acts of Pilate*) అను అప్రమాణిక గ్రంథము కలదు. అందు అతని అంతమునుగూర్చి అయా విధములుగా నున్నది. దేశాంతరవాస శిక్ష విధింపఁబడి ఆల్ఫ్సు కొండ ప్రదేశమందుండఁగా స్వహత్య చేసికొని పిలాతు అనఁబడిన సరస్సులో పాతిపెట్టఁబడెనని ఒక యితిహాసముగలదు. అతఁడు క్రీస్తును ప్రార్థింపఁగా ఆయన అతనిని క్షమించినట్లును చెప్పెదరు. అందువలననే అబిస్సీనియాలోని క్రైస్తవులలో అతఁడు పితరుని వలె నెంచఁబడుచున్నాఁడు గాని యివి యన్నియు కల్పనాకథలని యెఱుఁగవలెను. అతఁడుద్యోగము నుండి తొలఁగింపఁబడిన పిమ్మట అతనిగూర్చి యేమియు రూఢిగాఁ దెలియదు.

**పిలుపు, పిలువబడినవారు** (Call, Calling, the Called). బైబిలులో నున్న పిలుపు అను నీ పదమునకు మానవులను రక్షించుటకై దేవుఁడు వారిలో కలుగఁజేయు ప్రేరేపణ యను విశేషార్థముకలదు (మ $9^{13}$ $22^{3}$ లూ $14^{13}$

రోమా 8[30] 9[11,24,26] I కొరి 7[17] గల 1[6] 5[8] I థెస్స 5[24] II థెస్స 2[14] II తిమో 1[9] I పేతు 5[10] II పేతు 1[3]). ఇట్లు దేవుని ప్రేరేపణలకు లోఁబడనివారుకూడ మ 22[14] లో నున్నట్లు పిలువఁబడినవారు అనబడిరి. అయినను సాధారణముగా పిలువఁబడినవారు అను పదములు దేవునిపిలుపునకు లోఁబడినవారిని సూచించును (రోమా 1[6,7] 8[28] I కొరి 1[2,24] యూదా 1 ప్రక 17[14]). కొన్ని వాక్యములలో పిలువఁబడినవారేదిపొందుటకు పిలువఁబడిరో ఆ యుద్దేశము కూడ తెలియఁజేసియున్నారు. ఇట్లు దేవుఁడు మనలను తన రాజ్యమునకును మహిమకును పిలుచుచున్నాఁడని (I థెస్స 2[12]), సమాధానము పొందుటకు పిలుచుచున్నాఁడనియు (కొలొ 3[15]), చీఁకటిలోనుండి ఆశ్చర్యకరమైన తనవెలుఁగులోనికి మనలను పిలుచుచున్నాఁడనియు (I పేతు 2[9]) ఆయా విధములుగా నున్నది. వేదశాస్త్రములో పిలుపు అను మాటకు పైనున్నదానికి సంబంధించిన శాస్త్ర సంబంధమైన యర్థము కలదు (ముందెరుగుట 5 చూ॥).

**పిలొలొగు** (Philologus = వాగ్ప్రియుఁడు). రోమా పత్రికలో పౌలు వందనములు పంపినవారిలో నొకఁడు (రోమా 16[15]). ఇతనినిగుఱించి రూఢియైన సంగతియేదియు తెలియదు. పురాతన యితిహాసములలో నితఁడు ప్రభువు సువార్త బోధింపఁ బంపిన 70 మందిలో నొకఁడనియు, తరువాత సినోపేయను పట్టణపు సంఘాధ్యక్షుఁడై యుండెననియు ప్రశంసింపఁబడునుగాని దానికి తగిన రుజువులు లేవు. M.

**పిల్టయి** (Piltai = రక్షణసంబంధి). జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు వెళ్లిన యాజకులలో నొకని పేరు (నెహె 12[17]).

**పిల్దాషు** (Pildash). నాహోరు కొడుకులలో నొకఁడు (ఆది 22[22]).

**పిల్లనగ్రోవి** సంగీతము 3 (1) (a) చూ॥

**పిల్లలు** (Children). 1. పిల్లలను కలిగియుండు టొకభాగ్యము. పిల్లలు దేవునిదానమై యున్నారు (ఆది 4[1] 33[5] కీర్త 113[9] 128[3] యోహా 16[21]). పిల్లలుగలవాఁడు, మఱి ముఖ్యముగా పుత్రులుగలవాఁడు భాగ్యవంతుఁడుగా నెంచఁబడును. పిల్లలు లేకపోవుట గొప్ప దౌర్భాగ్యకరమనియు అవమానకరమనియు నెంచిరి (ఆది 30[1] I సమూ 1[6] లూ 1[25]). ఇందువలన గొడ్రాలియొక్క స్థితి హీనముగా నెంచఁబడెను (ఆది 16[4]). పిల్లలవలనఁ గలుగు సంతోషముకొఱకు మాత్రమేకాక కుటుంబము నశించిపోకుండునట్లును పిత్రార్జితము దక్కించుకొని వృద్ధిబొందించుకొనుటకుగూడ యూదులు పిల్లలను కోరిరి.

2. పిల్లల ధర్మవిధులు. పిల్లలు తమ తలిదండ్రులగువారికి లోఁబడి యుండవలెనను సంగతి అనేక వాక్యములలో కనఁబడును (నిర్గ 20[12] లేవీ 19[3] ద్వితీ 27[6] సామె 1[8] మొ॥). తలిదండ్రులను కొట్టువారికిని శపించువారికిని ధర్మశాస్త్రము మరణశిక్ష విధించును (నిర్గ 21[15-17]). మూర్ఖముగా తలిదండ్రుల నెదిరించు పిల్లలకు సహ మరణశిక్ష విధించిరి (ద్వితీ 21[18-21]). పెద్దలయెడల అమర్యాదగా నున్న పిల్లలకు గొప్ప శిక్ష కలిగెను (II రాజు 2[23,24]). పిల్లలను తగినట్లుగా పెంచుకొనుటకుఁ దగిన క్రమశిక్ష యుండవలెననుటకుకూడ సామెతల గ్రంథములో చాల సూచనలు కలవు (3[12] 13[24] 15[25] 22[6] 29[15] మొ॥). తల్లిదండ్రులకు లోఁబడుటెంత ధర్మమని యెంచిరో, వారికి అవిధేయులగుటను అంత గొప్ప పాపమునుగా నెంచిరి. దేవునికి విరోధముగా ఇశ్రాయేలీయులుచేసిన పాపము ఎంత ఘోరమైనదో తెలుపుటకు ప్రవక్తలు వారిని అవిధేయులైన పిల్లలని గద్దించిరి (యెష 1[2] 63[8-10]). మానవుల పాపముల ఘోరత్వమును క్రీస్తుకూడ ఇట్టి దృష్టాంతముచే తేటపఱిచెను (లూ 15[11-19]). విధేయత పిల్లల కింతటి ముఖ్యధర్మమై యుంటుండఁగా దేవునికి లోఁబడుట మఱీ యవసరమని క్రీస్తు బోధించినపుడు మొట్టమొదట ఆ సంగతిని వినినవారి కది యెంతె గొప్ప ఆశ్చర్యమును పుట్టించి యుండెనో ఈ బోధవలన తెలిసికొనవచ్చును (మ 10[21,35,38]) పిల్లల యవిధేయతవలన వారి పాపము కనఁబడుచుండఁగా, దేవునియెడల మన కుండవలసిన భక్తిప్రేమలుకూడ మనము దేవుని పిల్లలమగుటవలనఁ కనఁబడును (దేవునికుమారులు చూ॥).

పిల్లలకు తండ్రిగుణములుండుట సహజము కావున, విశ్వాసులు అలంకారరీతిగా అబ్రాహాము పిల్లలనఁబడెదరు (యోహా $8^{39}$). దీనిని బట్టియే బైబిలులోని అవిధేయులు అవిధేయత పిల్లలనియు (కొలొ $3^{6}$ భాషాంతరము), దుర్మార్గులు బెలియాలు కుమారులనియు (ద్వితీ $13^{13}$=పనికిమాలినవారు) జాతీయము లనేకములు అసలు భాషలో కలవు గాని తెనుఁగున తర్జుమచేసినవారు ఈ యలంకారముల నుంచక వాటి భావమును మాత్ర ముంచిరి.

3. బైబిలులో పిల్లలయెడల చూపఁబడు అనురాగము. పుత్రభావమునుగూర్చిన దృష్టాంతములు ఆది $37^{35}$ $43^{14}$ $44^{20}$ I సమూ $2^{19}$ II సమూ $12^{16}$ II రాజు $4^{18-37}$ లలో మిగుల చక్కగాఁ కనఁబడును. కుదురుబాటు కాలములో పిల్లలు దుష్టమృగములతో నిర్భయముగా నాడుకొందురను దృష్టాంతముచే యెషయా రాఁబోవునట్టి ఆ సౌఖ్యకరమగు కాలమును వివరించెను (యెష $11^{6-9}$). ఇట్లే జెకర్యా యెరూషలేము వీధులు మఱల మగపిల్లలతోను ఆఁడు బిడ్డలతోను నిండియుండు కాలమును గూర్చి ప్రవచించెను (జెక $8^{5}$). కీర్తనలు రచించినవాఁడును ఈ విధముగా పిల్లలయొక్క వినయమునుబట్టి తన ఆత్మయొక్క వినయమును చూపును (కీర్త $131^{2}$). ఇవ్విధముగా క్రీస్తు పిల్లలయొక్క వినయమును (మ $18^{3}$) వారు దైవబోధల నంగీకరించుటయు ($11^{25}$) చూపి వారినిగూర్చి చాల యనురాగముతో మాటలాడెను (కుటుంబము 4 చూ॥).

**పిల్హా** (Pilha = ముక్క). నెహెమ్యా కాలములో నిబంధనకు ముద్రవేసినవారిలో నొకఁడు (నెహె $10^{24}$).

**పిల్లిగద్ద** పక్షులు 12 చూ॥

**పిసిదియ** (Pisidia). చిన్నాసియాలోని దక్షిణభాగమందు దాదాపు 120 మైళ్లు పొడవును 50 మైళ్లు వెడల్పునుగల మన్యప్రదేశము. ఉత్తరమున ఫ్రుగియ, తూర్పున లుకవొనియ, దక్షిణమున పంఫూలియ లుకియ, పడమట కారియ యను పరగణాలు ఎల్లలుగా నున్నవి. అది యావత్తు కొండప్రదేశము. దాని నివాసులు పర్వతవాసులై మిగుల నిపుణులైనవారు. చిన్నాసియా పారసీకులచేతను రోమనులచేతను జయింపఁబడినను, హిందూదేశమందలి కొండజాతులవారివలె పూర్ణముగా లోఁబడనొల్లని వారై మిగుల తొందరగలిగించెడి వారుగ నుండిరి. వారికి స్వభాషయున్నను అచ్చట కనఁబడెడి శాసనములలో గ్రీకుభాషయేగాని మఱేదియు కనఁబడుటలేదు. వారిని లోఁబఱచుకొనుటకు రోమీయులు క్రీ॥ ము॥ 25 సం॥ లో ఈ పరగణా హద్దులలో కోటలను కట్టించిరి. అట్టి కోటలలో అంతియొకయ యొకటి. అందువలననే అది పిసిదియలో చేరకున్నను పిసిదియలోని అంతియొకయ అనఁబడును (కార్య $13^{14}$). పౌలు బర్నబాలు తమ మొదటి ప్రయాణపు రాకపోకలయందు ఈ దేశముగుండా వెళ్లిరి ($13^{13}$ $14^{24}$). II కొరి $11^{26}$ నందు పౌలుదాహరించిన దొంగలవలననైన ఆపదలు వీరివలన కలిగి యుండవచ్చును. ఆ కొండలలో నేటివఱకు బౌలు (*Baulo*) అను గ్రామ మొకటి గలదు. పౌలు దానిమీఁదుగా వచ్చుటచే దానికీపేరు కలిగినదని కొందఱి యభిప్రాయముగాని ఆ దేశస్థులు కాన్స్టంటైను చక్రవర్తి కాలమువఱకు క్రైస్తవులైనట్లు కనఁబడదు. (పటము V, J 4).

**పిస్గా** (Pisgah=భూభాగము). మోయాబు దేశములోని యుత్తరభాగమందు యొర్దానునదికి సమీపముగ నుండు నొకకొండ. ఇశ్రాయేలీయులు అరణ్యములో ప్రయాణము చేయుచుండఁగా నిచటకు వచ్చిరి (సంఖ్యా $21^{20}$). బిలాము ఇశ్రాయేలీయులను శపించఁ బోవునపుడు ఇచట ఏడువేదికలను కట్టెను (సంఖ్యా $23^{14}$). మోషే మరణము నొందక పూర్వము ఈ కొండశిఖరమునుండియే కనాను దేశమును చూచెను (ద్వితీ $3^{27}$ $34^{1}$). దేశము విభాగించినపు డిది రూబేనీయుల స్వాస్థ్యములో చేరియుండెను (యెహో $13^{20}$). దానికి నెబో యను మాఱుపేరుకలదు (నెబో 2 చూ॥).

**పిస్తాచకాయలు** (Nuts). ఐగుప్తు కధికారిగా నున్న యోసేపునకు యాకోబు పంపిన కానుకలలో నొకటి (ఆది $43^{11}$). ఈ పదము బైబిలంతటిలో నీయొక్కచోటమాత్రమే గలదు.

ఈ కాయలు గాయుచెట్టు పలెస్తీనుదేశమునం దింకను గలదు.

**పిస్పా (Pispah).** ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన 7[38]).

## పీ

**పీఠము** సింహాసనము చూ॥

**పీతోను (Pithon).** యోనాతాను సంతతి వారిలో నొకఁడు (I దిన 8[35] 9[41]).

**పీతోము (Pithom).** ఐగుప్తులో ఫరో కొఱకు ధాన్యాదులను నిలువచేసిన రెండు పట్టణములలో నొకటి (నిర్గ 1[11]). దానికి ఐగుప్తు యులు పెతోము (*Petom* = తోము ఆలయము) అను పేరు పెట్టిరి. తోము అను సూర్యదేవతాలయమునకు ఇది ముఖ్య స్థానమగుటచే దానికా పేరు వచ్చెను. దీని పాడు శేషములు కనుగొనఁబడెను. ప్రస్తుతము అచట టెల్-ఎల్-మస్ఖూట (*Tell-El-Maskhuta*) అను స్థలము కలదు. అది గోషెను దేశములో నుండెను. పూర్వ మచట కట్టింపఁబడిన ధాన్యపు కొట్ల నిటీవల కనుఁగొనిరి. వాటిని ఇటుకలతో కట్టించిరి. ఆ యిటుకలను చూడఁగా వాటిలో కొన్నిఁటిని చేయుటలో గడ్డిని వాడిరి. మఱి కొన్నిఁటిని చేయుటయందు గడ్డిని వాడలేదు కావున ఇవి యిశ్రాయేలీయులు చేసిన యిటుకలకు బాగుగా సరిపడును (నిర్గ 1).

**పీనోను (Pinon).** ఎదోము నాయకులలో నొకఁడు (ఆది 36[41] I దిన 1[52]). ఇతని వంశస్థులున్న స్థలమున కిదే పేరు కలిగెను. సంఖ్యా 33[42,43] లో నున్న **పూనోను** ఈ పేరుకు మాఱురూపమై యున్నదనుకొందురు.

**పీషోను (Pishon).** ఏదేనులోనుండిన యొకనది (ఏదేను చూ॥).

**పీహాహీరోతు** (Pihahiroth = తుంగ ప్రదేశము?). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి వచ్చునప్పుడు ఎర్రసముద్రమును దాటకపూర్వము చివరగా మకాముచేసిన స్థలము (నిర్గ 14[2-9] సంఖ్యా 33[7,8]). ఇది మిగ్దోలుకు సముద్రమునకును మధ్యనున్న బయల్సెఫోనునెదుట నున్నది దీనిసరియైన యునికిగూర్చి తెలియదు.

## పు

**పుండ్లు** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥

**పుట్టి** మానములు కొలతలు II చూ॥

**పుట్టుక వలని యపవిత్రత** పవిత్రా పవిత్రములు 1 చూ॥

**పుతోను (Python** = నాగమ్మవారు). ఒక దయ్యముపేరు. ఫిలిప్పీయిలో నున్న ఒక చిన్నదాని కీదయ్యము పట్టినందున ఆమె సోదె చెప్పఁగలిగెను. పౌలామెను స్వస్థపఱచెను (కార్య 16[16]). గ్రీకువారనుకొన్నట్లు పుతోను ఒక గొప్ప సర్పము. ఈ దేశమందలి దేవతలలో రంగనాయకుఁడనువాఁడు సర్పమును చంపినట్లే గ్రీకులదేవతలలో అపొల్లో (*Apollo*) అనువాఁడీ సర్పమును చంపినట్లున్నది. అపొల్లో ఆ సర్పమును చంపిన స్థలము మిగుల ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రమగు డెల్ఫీ (*Delphi*) అనుదాని యొద్ద నున్నది. కావున అచ్చటి అపొల్లోకు పుతోనుకు సంబంధించిన అపొల్లో యను బిరుదు గలిగెను. అచ్చట నుండు దేవదాసీలు ఈ దేశపు మాతంగులవంటివారై పుతోను అనుపేరుచే పిలువఁబడెదరు. రాఁబోవు సంగతులను తెలిసికొనుటకై గ్రీకువారు సాధారణముగా ఈ ఆలయముకు వెళ్లిరి. ఫిలిప్పీయిలోనున్న చిన్నది అట్టి యాత్మ గలిగినదై సోదె చెప్పి తన యజమానుల కెంతో యాదాయమును గడించెను. మఱియొక దిక్కునుండి శబ్దము వచ్చునట్లు మాట్లాడగలిగిన వారికి గ్రీకులు పుతోను అను పేరుపెట్టినట్లు వారి శాస్త్రులలో నొకఁడగు ప్లూటార్కు (*Plutarch*) వ్రాసెను. అందువలన ఈమెకును అట్టి శక్తి యుండెనని కొందఱి యభిప్రాయము.

**పుత్రదాత వృక్షము (Mandrake).** కల్ప వృక్షమని యర్థమిచ్చు నొక హెబ్రీభాషా పదముయొక్క భాషాంతరము (ఆది 30[14] పర 7[13]). అరబ్బీయులు దీనిఫలములను మరులు మందుగా నెంచిరి. ఈ ఫలముల నిచ్చువానికి పుచ్చుకొనువారు వశ్యులగుదురని నమ్మిరి. పారపాటునసైనను ఈ వృక్షపు వేరును ముట్టుకొన్న

పక్షమున మరణమగుదురని తలంచిరి. దీనిని ఔషధముగాను ఉపయోగించిరి (రోగములు చికిత్సలు IV 1 (6) చూ॥. J. C.

**పుదీనా** (Mint). సువాసనగల కూర మొక్క. సిరియాదేశమునందు ప్రతి యింటి వారును వీలున్నయెడల పుదీనామడిని వేసికొనక మానరు. పరిసయ్యులు దీనిలోను పదియవవంతును దేవుని కర్పించుటలో వెనుకబడలేదు (మ $23^{23}$= లూ $11^{42}$). J. C.

**పుదే** (Pudens = సిగ్గరి). రోమానుండి తిమోతికి సలాములు పంపిన యొక క్రైస్తవుడు (II తిమో $4^{21}$). ఈ వచనమునం దుదాహరించ బడిన లీను క్లౌదియ యనువారితని భార్య కుమారులై యుందురనుకొందురు. E.

**పునరుత్థానము** (Resurrection). అంత్యదినమున మృతులు లేతురనునది దీనిభావము. ఈ బోధ పాత నిబంధనలో అంత తేటగా లేదు. మరణమైన పిమ్మట మృతులస్థానములో నుండువారికేమియు తెలియదనియు, వారొక విధమైన నిద్రావస్థలో నుందురనియు ఆ కాలమందున్నవా రనుకొన్నట్లు ఆయా వాక్యములలో సూచనలు కలవు (కీర్త $6^{5}$ $31^{17}$ యెష $38^{18}$ పాతాళము చూ॥). అయితే అట్టిస్థితినుండి వారెన్నడైన లేతురా యనుదానిగూర్చి పాత నిబంధనలో బహు కొన్ని సూచనలుమాత్రము కలవు. యోబు $19^{26}$ లోని సంగతి దానికొక సూచనయై యున్నదిగాని దాని భాషాంతరమును చూడగా ఆ సూచనయొక్క భావము విషయములోకూడ సందేహమున్నట్లు కనబడును. ఇట్లు కీర్త $16^{9}$ లో కూడ ఒక సూచనకలదు. అయితే అది యొక భక్తునికి గలుగు విశేషవరమునేగాని సామాన్య పునరుత్థానమును సూచింపదు (కార్య $2^{27}$ $13^{35}$). యెహె 37 లో నున్న యెముకలనుగూర్చిన దర్శనమును, హోషే $13^{14}$ లో నున్న విడుదలయు ఇశ్రాయేలు జనమును దేవుడు తిరిగి గుణపఱచుటనుగూర్చినవై యున్నవి. ఇవి పునరుత్థానమునకు గుఱుతులని యెంచవచ్చును గాని దానికి తేటయైన సూచనలని యన వీలుపడదు. దాని $12^{2}$ లో మాత్రము నీతిమంతుల యొక్కయు దుష్టులయొక్కయు పునరుత్థానమునకు తేటయైన సూచనయున్నది. ఇట్టి సూచనలు అప్రమాణిక గ్రంథములలో మఱి విశదముగా కనబడును. క్రీస్తుకాలములోని సద్దూకయ్యులు పునరుత్థానము లేదని నమ్మినను యూదులు సాధారణముగా దీని నమ్ముచుండిరి (కార్య $23^{8}$).

క్రొత్త నిబంధనలో పునరుత్థానమునుగూర్చిన బోధ తేటగా కనబడును (అమరత్వము చూ॥). క్రీస్తు మృతులనులేపెను (మ $9^{24}$ లూ $7^{11}$ యోహా 11). అయితే యీ కార్యము అంత్యదినమున జరుగు పునరుత్థానమునకు సాటియైనది కాదు. ఎందుకనగా, ఇచట మృతినుండి లేపబడినవారు మఱల చనిపోయిరి. అయినను ఇది క్రీస్తు మృతులను లేపుటకు శక్తిమంతుడని నిర్ధారణ చేయును. మఱియు అట్టి పునరుత్థానము కలుగుననుసంగతి దీనివలన తెలిసికొనవలెనని క్రీస్తు స్వంతమాటలవలన తెలిసికొనవచ్చును (యోహా $11^{25,26}$). అయినను అది క్రీస్తు పునరుత్థానమువలననే తేటగా కనబడును (యేసుక్రీస్తు III 5 (2) *h* చూ॥). ఇందులో మానవులగుటి యెట్టిదో స్పష్టముగా చూపబడును (I కొరి $15^{23}$). మఱియు ఆ పునరుత్థాన సమయమున మనము పొందుదేహములకు ఇప్పుడు మనకున్న దేహములకు గొప్ప సంబంధముండినను, ఆ సంబంధమునుబట్టి దానిని మనము పోల్చగలిగి యుండినను అప్పుడు విశేషమార్పుకూడ కలుగునని మనము తెలిసికొనగలము. ఈ మన స్థూల దేహమునకుండు బలహీనతలు దానికి ఉండవు భూమియొక్క ఆకర్షణశక్తికి అది లోనగునదికాదు (కార్య $1^{9}$). తలుపులు దాని నడ్డగింపజాలవు (యోహా $20^{19}$). అది యాత్మసంబంధమైనదై (I కొరి $15^{46}$) ఆత్మయొక్క ఇచ్ఛలకు పరిపూర్ణముగ లోనగును. అయితే క్రొత్త నిబంధనలో మనము తెలిసికొనగోరు ఇట్టివాటిని తేటగా మనకు తెలుపుట క్రొత్త నిబంధన గ్రంథకర్తల యుద్దేశముకాదుగాని వారు రాబోవు జీవముయొక్క నిశ్చయతను తెలుపుటకును అందువలన మనకు నిరీక్షణకలిగించుటకును క్రీస్తు పునరుత్థానము ఆధారమై యున్నందున దానిగూర్చి ముఖ్యముగా తెలిపియుండిరి.

ఇందుచేతనే అపొస్తలులబోధలలో పునరుత్థానమునుగూర్చిన బోధ అంత ప్రాముఖ్యమైనదై యున్నది. మనవిశ్వాసము క్రీస్తు పునరుత్థానము మీఁదనే ఆనుకొనునని పౌలు బోధించెను (I కొరి 15[17] 17[18]) అదే పేతురు యొక్క బోధయై యున్నది (కార్య 4[2,33] I పేతు 1[4]). నీతిమంతుల పునరుత్థానమును మృతుల పునరుత్థానమును కలవని తత్కాలమందు బోధించుచుండిరి (I కొరి 15[18] ప్రక 20). పౌలు దుష్టుల పునరుత్థానమునుగూర్చి యెక్కువగా వ్రాయలేదుగాని నీతిమంతుల పునరుత్థానమునుగూర్చి యెక్కువగా వ్రాసెను (I థెస్స 4[14]-5[11] II థెస్స 2[1-12] I కొరి 15). అట్టి పునరుత్థానములో పాలివాఁడగునట్లు పౌలు ప్రయాసపడెను (ఫిలి 3[11]). నీతిమంతుల పునరుత్థానమునుగూర్చి యిట్లు సాధారణముగా వ్రాసినను ఇందులో పాలిభాగరులుకానివారి గతి యెంత భయంకరమైనదో దానిగూర్చి మనలను హెచ్చరించుటకుకూడ అక్కడక్కడ తెలిపి యున్నాఁడు (రోమా 2[5] II థెస్స 1[9] ఫిలి 3[19]).

ప్రకటన 20 అధ్యాయములో నీతిమంతుల పునరుత్థానము మొదట కలుగునని యుండుటచే (20[5]) దుష్టుల పునరుత్థానముకూడ యున్నదని తెలియును. ఈ యధ్యాయము ననుసరించి కొందఱు నీతిమంతుల పునరుత్థానమునకును దుష్టుల పునరుత్థానమునకును మధ్య 1000 సం॥ల పరిపాలనకాలముండు ననుకొందురు. మఱి కొందఱు ప్రకటనగ్రంథము అలంకారములతో నిండియున్నది కావున ఈ వేయి సంవత్సరములకుకూడ అలంకారరీతిగా అర్థము చెప్పవలెనను కొందురు (వేయి సంవత్సరములపరిపాలన చూ॥).

క్రీస్తు పునరుత్థానమునకు సంబంధించిన శరీర పునరుత్థానమునుగూర్చి యిట్టి బోధ లుంటుండఁగా ఆయన పునరుత్థానము మనకు ఈ జీవితకాలములోకూడ నూతన జీవమునకు ఆధారమై యున్నదను బోధయు కలదు (I కొలొ 2[12] 3[1] రోమా 6[5]). ఈ నూతన జీవమునకు కార్యసాధకమైనశక్తి క్రీస్తు పునరుత్థానమునకు సంబంధించు శక్తియైయున్నది (రోమా 1[4] ఫిలి 3[10,11]). ఈ శక్తి మనము క్రీస్తుతో నైక్యపడునట్లు పని చేయును (రోమా 6[3,4] గల 3[27]). మఱియు విశ్వాసులు ఆయన పోలికగా మార్చఁబడి చివరకు మహిమ పఱచఁబడిన ఆయనపోలికగా అదే శక్తివలన రూపాంతరము నొందుదురు (ఎఫె 1[20] 2[10] 2[19-22] అమరత్వము చూ॥).

**పునర్జన్మము** (Regeneration). పునర్జన్మము అను మాటచే తర్జుమయైన అసలు భాషా పదము మ 19[28] లోను తీతు 3[5] లోను మాత్ర మున్నది. మ 19[28] లో అది క్రీస్తు రెండవ రాకడ కాలమునందు అన్నిటికి కలుగఁబోవు కుదురుబాటును సూచించును (కార్య 3[21] రోమా 8[18] II పేతు 3[13]). తీతు 3[5] లో అది దేవునితట్టు తిరిగి బాప్తిస్మము నొందువారిలో నూతన మనస్సుకలుగుటను సూచించును. పునర్జన్మము అను మాట యోహా 3[1-15] లో లేకపోయినను దానిగూర్చినబోధ అందులో వివరముగాను తేటగాను నున్నది. పునర్జన్మము అను మాటను చూడఁగా కొద్ది దిద్దుబాటుమాత్రము కలిగిన యెడల మానవులు దేవునిరాజ్యములో చేరఁగల రనుకొనగూడదు. వారు పాపమువలన బొత్తుగా చెడిపోయినందున క్రొత్త జన్మమువంటి పూర్ణ మార్పుకలుగనియెడల దేవునిబిడ్డలు కానేరరు. మన మెంతగా చెడిపోతిమో అదియు, మనలో నెంత గొప్పమార్పు కలుగవలయునో అదియు ఈ పదమువలన సూచింపఁబడును.

పునర్జన్మము అను పదమును చూడఁగా, మనలో కలుగు మార్పు మనము మన స్వంతముగా చేసికొనఁగల్గునది కాదుగాని దేవుఁడు మనలో కలిగించునదై యున్నదను సంగతినికూడ సూచించును. ఇందుచేతనే మనము నీటి మూలముగాను ఆత్మమూలముగాను జన్మించితేనేకాని దేవుని రాజ్యము చూడలేమనియు (యోహా 3[6]), క్రీస్తు యేసునందున్నవాఁడు నూతన సృష్టియనఁబడు (II కొరి 5[17]) ననియు, అట్టివారు పాపపుస్థితిలో చచ్చినవారై యుండఁగా క్రీస్తు వారిని బ్రతికించెననియు (ఎఫె 2[5]) తెలియఁజేయు వాక్యము లున్నవి. క్రీస్తును మృతులలోనుండి లేపినశక్తియే ఈ గొప్ప మార్పును కలిగించును (ఎఫె 1[19-23]). ఈ మార్పునొందువారు తాము స్వాభావికముగా వేటిని యోచించి కోరి, చేయుదురో అట్టివాటిని విసర్జించి దేవుఁడు కోరువాటిని ఇకను యోచించి

వాటినే చేయుదురు (రోమా 12[2] ఎఫె 4[23] కొలొ 3[10] తీతు 3[5] I పేతు 1[22,23]). ఈ మార్పు బాప్తిస్మము మూలముగానే కలుగునా లేక అట్టి మార్పు కలిగినట్లు బాప్తిస్మము ఒక వెలుపలి సూచనయై యున్నదా అను నీ సంగతులనుగూర్చి తాత్పర్యభేదములున్నను తీక్ష్ణసంబంధము కలదను సంగతి చాల వాక్యములలో తేటగా కనఁబడును (రోమా 6[4] తీతు 3[5] I పేతు 3[21]). పునర్జన్మము కలిగించుటకు దేవునివాక్యము సాధనమై యున్నదను సంగతికూడ ఆయా వాక్యములలో తేటగా నున్నది (యోహా 17[17] I థెస్స 2[13] యాకో 1[18] I పేతు 1[23-25] మారుమనస్సు చూ॥).

పునాది (Foundation). కట్టడములకు వేయు పునాదులనుగూర్చిగాక (I రాజు 6[37] ఎజ్రా 3[10] హగ్గ 2[18] మొ॥) దాని అలంకార ప్రయోగమునుగూర్చి ఈ శీర్షిక క్రింద వివరింతుము.

1. దేవుఁడు సృష్టికి కర్తయగుటచే ఆయన లోకమునకు పునాదివేసినట్లు అనేక వాక్యములలో నున్నది (కీర్త 24[2] 104[5] యెష 1[13] జెక 12[1] మొ॥). జగత్పునాదివేయఁబడక మునుపు (యోహా 17[24] ఎఫె 1[5] హెబ్రీ 4[3] 9[26] I పేతు 1[20] ప్రక 13[8] 17[8]) అను పదములు అనాదికాలమును సూచించును. 2. రాజ్యములను స్థాపించుటనుగూర్చి చెప్పినప్పుడు వాటికి పునాదులను వేసినట్లు అలంకారరీతిగా వాడిరి. ఐగుప్తు రాజ్యమునకు పునాదివేయుటనుగూర్చి యున్నది (నిర్గ 9[18]). దానికి భిన్నముగా యెరూషలేము యొక్క పునాదులను కాల్చుటయు (విలా 4[11]), అవి కనఁబడునట్లు చేయుటయు (యెహె 13[14] మీకా 1[6]), వాటిని పడఁగొట్టుటయు దాని పూర్ణనాశనమును సూచించెను. 3. ఆలయమునకు పునాదివేయుట దేవుఁడు తన ప్రజలను మరల యెరూషలేములో నాటుటకు గుఱుతుగా నున్నది (యెష 44[28]). ఆలయమునకుఁగాని యెరూషలేమునకుఁగాని విలువగల రాళ్లతో పునాది వేయుట దాని ఘనస్థితికి సూచనగా నున్నది (యెష 54[11] ప్రక 21[14,19]). సీయోను పునాది స్థిరమైనదనుటకు సూచనగా స్థిరమైన బండను వేయుటను గూర్చిన వాక్యము (యెష 28[16]) క్రైస్తవ సంఘమున కాధారమైన క్రీస్తును సూచించెను (మ 21[42] కార్య 4[11]). క్రీస్తు తన సంఘమునకు పునాది యను అలంకారమును దీనికి సంబంధించినదే (I కొరి 3[12]). అపొస్తలులును క్రీస్తు సంఘమునకు పునాదివేసిరి (ఎఫె 2[14]) అనఁగా వారిసంఘమును స్థాపించిరి. 4. పునాది వేయుట మనుష్యులను బోధయందు స్థిరపఱచుటనుకూడ సూచించును. ఆ బోధయొక్క ఆరంభపు సంగతులను నేర్పుట పునాదివేయుటగా నెంచఁబడును (హెబ్రీ 6[1] I కొరి 3[10]). దేవుని వాగ్దానములుకూడ మన విశ్వాసమునకు స్థిరమైన పునాదిగా నున్నవి (II తిమో 2[19]). విశ్వాసులను స్థిరపఱచుట ఈ పదమునకు సంబంధమైనదై యున్నది (I పేతు 4[10] ఎఫె 3[17]). పునాది స్థిరమైనదానికి సూచనగా నుండుటచే పాడైపోవుచుండు ఇండ్లు మొదలగు ఆస్తిపునాదులుగల పట్టణమందలి (హెబ్రీ 11[10]) నిత్య నివాసములకు భిన్నముగా నున్నట్లు కనఁబడును.

**పురిటిపిట్ట** పక్షులు 32 చూ॥

**పురీము, పురు** పండుగలు III 2 (1) చూ॥

**పురుగు** కీటకములు 22 చూ॥

**పురుగులుపడుట** రోగములు చికిత్సలు II 10 (5) చూ॥

**పుర్రు** (Pyrrhus). పౌలు సహాయకులలో సోపత్రు అను పేరుగలవాని తండ్రి (కార్య 20[4]). క్రొత్త నిబంధనలో ఒకని పేరుకు తండ్రి పేరును జేర్చుట బహు అరుదు. ఇట్లుండఁగా నిచ్చట తండ్రి పేరు జేర్చుటవలన నితఁడు కులీనుఁడని కొందఱనుకొందురుగాని అతని వి మతియొక సోపత్రునుండి వేఱుపఱచుటకుకూడ అతనికి ఈ పేరుపెట్టి యుండవచ్చును.

**పులియనిరొట్టె** (Unleavened Bread). ఈ దేశమునందు రొట్టెలను తేలికగా చేయుటకై పొంగుచున్న కల్లునువాడుచున్నట్లు ఇతర దేశములందును పులిసినపిండిని వాడుదురు. ఇట్టివాటిని వాడకపోయినయెడల రొట్టె తేలికగా నుండక గట్టిపడును. అయితే పులిసినది చెడిపోయిన పిండియగుటచే దానిని అర్పణలలో వాడక పులియనిరొట్టెనుమాత్రమే వాడవలెనను ఏర్పాటు

పాత నిబంధనలో నున్నది (లేవీ $2^{4,5}$ $6^{16}$ $7^{12}$ మొ||). యాజకులే యర్పణలను తినుటకు సెల వుండెనో అట్టి యర్పణలలోమాత్రము పులిసిన పిండి నుపయోగింపవచ్చును (లేవీ $7^{13}$ $23^{17}$). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి బహు తొందరగా వెళ్లుటచే పిండిని పులియనిచ్చుటకుకూడ సమయము లేకపోయెను గనుక దానికి జ్ఞాపకార్థముగా పస్కాపండుగలో ఏడుదినములవఱకు పులియని రొట్టెలనే తినుచువచ్చినట్లు నిర్గ 12, 13 వలనఁ దెలియును. అందువలననే అది పులియని రొట్టెలపండుగ యనఁబడును.

**పులియనిరొట్టెల పండుగ** పండుగలు III 1 (1) చూ||

**పులిసినపిండి, పుల్లనిపిండి (Leaven).** క్రొత్త పిండిని రొట్టెలు చేయునప్పుడు పొంగునట్లు ఆ పిండితో కలిపెడి పాత (పులిసిన) పిండి. ఈ పులిసినపిండి క్రొత్తపిండిముద్ద ఎంత పెద్దదియైనను దానినంతటిని పులియఁజేయును. సాధారణముగా ఈ పులిసినపిండిని దుష్టత్వ వ్యాపకమును సూచించుటకై అలంకారరీతిగా వాడిరి (I కొరి $5^{6-8}$ గల $5^{9}$). ముఖ్యముగా అది పరిసయ్యుల వేషధారణను తప్పుబోధలను సూచించును (మ $16^{6,12}$ లూ $12^{1}$). అవి బహుగా నితరులను చెరుపును కావున క్రీస్తు దృష్టాంతముద్వారా తన శిష్యులకు జాగ్రత్త చెప్పెను. పులిసినపిండి సాధారణముగా చెడిన దానిని సూచించినను, మంచివాటి వ్యాపకత్వమును తెలుపుటకును ఒకసారి వాడఁబడెను (మ $13^{33-35}$).

**పుష్పీయులు** పూయా చూ||

**పువ్వులు, పుష్పములు (Flowers).** పలెస్తీనుదేశమునందు అనేక రకముల చక్కని పువ్వులుండినను వాటినిగూర్చిన సూచనలు బైబిలునందు కొద్దిమాత్రమేగలవు. అవి మిగుల సొగసైనవగుటచే గుడారమును దేవాలయమును అలంకరించుటలో వాటిరూపమును చిత్రించిరి (నిర్గ $25^{31-33}$ $37^{17-19}$ I రాజు $7^{26-49}$). ప్రియుఁడైనవాని చక్కదనము పరమగీతమునందు పుష్పములకు పోల్చిరి ($2^{12}$ $5^{13}$). సొలొమోను వైభవమంతయు గడ్డిపువ్వుపై కొలఁగాదని యేసు వాటి చక్కదనమునుగూర్చిమాత్రమే గాక కొద్ది కాలము మాత్రమే ఉండువాటి నింత చక్కగా నలంకరించువాఁడు తన బిడ్డలకువలయు అన్న వస్త్రాదులకు లోపము కలుగనియ్యఁడను సత్యము బోధించెను. ఇట్లు పుష్పములు చక్కదనమునకు దృష్టాంతముగా నున్నను ఆ చక్కదనము బహు త్వరగా వాడిపోవునుగాన అవి గతించిపోయెడి సౌఖ్యములకును సౌందర్యమునకును సూచనలుగాకూడ బైబిలునం దనేకవాక్యములలో నెత్తి చెప్పఁబడెను (యెష $28^{1-4}$ $40^{6,7}$ యాకో $1^{10,11}$ I పేతు $1^{24}$).

**పుస్తకపుచుట్ట (Roll).** పూర్వకాలమందు పుస్తకములు సాధారణముగా చుట్టలైయుండెను (యిర్మీ $36^{2}$ కీర్త $40^{7}$ లూ $4^{16,17}$ II తిమో $4^{13}$ ప్రక $6^{14}$). మఱియు వాటిలో విలువగలవి తోలుచుట్టలై యుండెను. సాధారణమైనవి ఐగుప్తునుండి తెచ్చిన యొక చెట్టు బెరడులై యుండెను ఆ బెరడును సన్నని ఆకులుగా కోసి ఒకదానితో నొకటి అంటించి చుట్టలుగా చేసిరి. క్రొత్త నిబంధన పుస్తకములుకూడ ఇట్టి చుట్టలమీఁదనే వ్రాసిరిగాని వాటి విలువ నెఱిఁగి వాటిని ప్రమాణగ్రంథములనుగా నెంచినపిమ్మట తోలుచుట్టలమీఁద వ్రాసిరి. ఈ తోలుచుట్టల రెండంచులయందు కర్రలనుకట్టి వాటిమీఁద ఆ తోలుకాగితములను చుట్టఁగా ఆయా పుటలు కనఁబడుచుండెడివి కావున, వారు చదివినపిమ్మట ఆ చుట్టనంతటిని చుట్టివేసి పెట్టెలో నుంచిరి (లేఖనములు చూ||).

**పుస్తకములు (Books).** ఈ శీర్షికయందు వ్రాయఁబడిన పుస్తకములనుగూర్చి బైబిలులోని సూచనలను సమకూర్చి వివరింతుము (పుస్తకపుచుట్ట చూ||).

ఇశ్రాయేలీయులు ఐగుప్తులో కొన్ని వందల సంవత్సరములుండి యచటి నుంచి పలెస్తీను వచ్చిరి. అంతకుఁ బూర్వము చాల సంవత్సరముల క్రిందటనే ఐగుప్తీయులు గ్రంథములను వ్రాసినట్లు లౌకిక చరిత్రవలనఁ దెలియును. ఇశ్రాయేలీయులు ఏదో యొక విషయమును వ్రాసినట్లు నిర్గ $17^{14}$ లో మొదటి సూచనకలదు. పాత నిబంధనలోని 39 పుస్తకములును క్రొత్త నిబంధనలోని 27 పుస్తకములును గాక ఇంక

ఆయా పుస్తకములు యూదులకుండినట్లు సూచన లున్నవి. దృష్టాంతముగా: యెహోవా యుద్ధముల గ్రంథము (సంఖ్యా 21[14]), యాషారు గ్రంథము (యెహో 10[13]), దావీదు సొలొమోను అను వారి చరిత్రలను దర్శకుఁడగు సమూయేలు, ప్రవక్తయగు నాతాను దర్శకుఁడగు గాదు అను వారలు వ్రాసియున్నట్లు సూచనలు కలవు (I దిన 29[29]). ఇట్లు దావీదురాజు వృత్తాంతముల గ్రంథము లుండెను (I దిన 27[24]). సొలొమోను యరొబాము అను వారిచరిత్ర సంగతులు ప్రవక్తయగు నాతాను షీలోనీయుడగు అహీయా జ్ఞానదృష్టిగల ఇద్దో వ్రాసియున్నట్లు II దిన 9[29] వలనఁ దెలియును. రెహబాామునుగూర్చి షెమయాయు జ్ఞానదృష్టిగల ఇద్దోయును వ్రాసిరి (II దిన 12[15]). రెహబాాముకాలము మొదలుకొని యెహోయాకీము కాలమువఱకు ఆయా రాజుల వృత్తాంతముల గ్రంథములుండెను (I రాజు 14[19-29] II రాజు 24[5] 36[8]). ఇవియుఁగాక దినవృత్తాంతముల గ్రంథములలో ఇతర గ్రంథములనుగూర్చిన సూచనలు చాల కలవు (II దిన 13[22] 20[34] 24[27] 26[22] 32[32] 33[18,19] 35[29]). ఇట్లు సొలొమోను మన బైబిలులో లేని యితర సామెతలను, కీర్తనలను, శాస్త్రములను రచించియున్నట్లు సూచనలున్నవి (I రాజు 4[32]). హిజ్కియా సేవకులు వ్రాసినవి కూడ యున్నవి (సామె 25[1]). పుస్తకములు అధికముగా రచింపఁబడును, దానికి అంతములేదు (ప్రస 12[12]) అని ప్రసంగి వ్రాసెను. అప్రమాణిక గ్రంథముల విషయమైన సూచనలు బైబిలులో లేకపోయినను వాటిని మనము యూదుల పుస్తకములలో చేర్చవలెను (అప్రమాణిక గ్రంథములు చూ॥). క్రొత్త నిబంధనను చూడఁగా క్రీస్తు సంగతులను వివరముగా వ్రాయుటకు అనేకులు పూనుకొన్నారు అని లూకా తన సువార్త పీఠికలో వ్రాసెను (1[1-4]).

## పూ

**పూటకూళ్లవాని యిల్లు** సత్రము చూ॥

**పూతీయులు** (Puthites). కిర్యత్యారీములో నివసించిన యొక కుటుంబము (I దిన 2[53] పూతు చూ॥).

**పూతీయేలు** (Putiel = దేవునిచే శిక్షింపఁబడువాఁడు. అహరోను కుమారుడగు ఎలియాజరు మామ (నిర్గ 6[25]).

**పూతు, పూతీయులు** (Put, Phut, Puthites). హాము సంతతివారిలో నొక జనము (ఆది 10[6] I దిన 1[8]). వీరు ఐగుప్తీయులతో సంధిజేసికొని వారికి సంబంధించి యున్నట్లుగా ప్రవక్తలలో సూచనలు కలవు (యిర్మీ 46[9] యెహె 27[10] 30[5] 38[5] నహూ 3[9]). అందువలన వీరు ఐగుప్తుకు దగ్గరగా నివసించినట్లు స్పష్టమగుచున్నది. దాని సరియైనయునికి తెలియదు. అది ఐగుప్తునకు దక్షిణముగా నున్నదని కొందఱు చెప్పినను మఱికొందఱది ఐగుప్తునకు వాయవ్యముగా నున్నదని యూహింతురు. యిర్మీ 46[9] లో మన తెలుఁగు బైబిలునందు ఆ దేశనివాసులకు పూతీయులను పేరు పెట్టిరిగాని మూలభాషలో పుతు అను పదముమాత్రము గలదు.

**పూదండలు** (Garlands). నేటిదినము వఱకు ఈ దేశమునందు చేయుచున్నట్లే చిన్నాసియాలోను దేవతల కర్పింపఁబోవు యజ్ఞపశువులను పూదండలతో నలంకరించువాడుకయుండెను (కార్య 14[13]). ఈ విషయములోను యితర విషయములలోను ఈ దేశమందలి మతములకు సంబంధ ముండినట్లు తోఁచుచున్నది (ఆభరణములు 16 చూ॥).

**పూనోను** పీనోను చూ॥

**పూయా, పువ్వా, పువ్వీయులు** (Puah Puvah, Punites). 1. ఇశ్రాయేలీయులు ఐగుప్తునందు దాసులుగా నుండుకాలమున ఐగుప్తు మంత్రసానులలో నొకతె (నిర్గ 1[15]).

2. న్యాయాధిపతియగు తోలా యొక్క తండ్రి (న్యాయా 10[1]). ఆది 46[13] I దిన 7[1] లలో ఇతఁడు తోలాయనువాని తోఁబుట్టువైయున్నట్లున్నది. సంఖ్యా 26[23] లో నున్నట్లు అతని సంతతివారు పువ్వీయులనఁబడిరి. ఆది 46[13] లో ఇది బువ్వా అని తెలుఁగున పొరపాటున అచ్చువేసిరి.

**పూయు పుష్పము** (Rose of Sharon). ఇది కస్తూరిపుష్పము అని యుండవలయును (పర 2[1] కస్తూరి పుష్పము చూ॥).

**పూరా** (Purah = కొమ్మ). గిద్యోనుయొక్క సేవకుఁడు (న్యాయా 7[10,11]). ఇతఁడు గిద్యోనుయొక్క డాలు పట్టుకొనువాఁడై యుండ వచ్చును.

**పూరేడు పిట్ట** పక్షులు 32 చూ॥

**పూర్వ కొలకర్ర** మానములు I 1 చూ॥

**పూలు** 1. తిగ్లత్పిలేసెరు చూ॥

2. ఆఫ్రికా ఖండమందలి యొకదేశము. ఈ పదము యెష 66[19] నందున్నది. LXX నందు దీనికి పూతు అను రూపము కలదు. ఇక్కడను అది అట్లే నుండుట మేలని యందురు.

## పె

**పెంకు** (Tile). యెరూషలేము పట్టణపు రూపమును గీయవలెనని యెహె 4[1] లో నున్న పెంకు అను పదమును ఇతరచోట్ల సాధారణముగా ఇటుక యని తెనిఁగించిరి (ఆది 11[3] నిర్గ 1[14] యెష 9[10] 65[3] మొ॥). పూర్వకాలమున పచ్చి యిటుకలమీఁద వ్రాసి వాటిని కాల్చిరి. అట్టి వ్రాఁతలు బాబెలుదేశపు శిథిలములందు నేటివఱకు చాలఁగలవు. క్రొత్త నిబంధనలో నలుగురిచే మోయఁబడి వచ్చిన పక్షవాయువు గలవానిని క్రీస్తుదగ్గర దింపుటకు పెంకులు విప్పినట్లు లూ 5[19] నందున్నది. మార్కు పెంకులను పదము నీ సందర్భమునందు వాడకపోవుటచేత పెంకులువిప్పుట అని వాడిన పదమును పైకప్పును విప్పుట యను అర్థముతో వాడి యుండును. అట్లుగానియెడల కప్పునందు అదివఱకే చేయఁబడి యున్న సందును పెంకులతో కప్పియుందురు.

**పెంట** మలము చూ॥

**పెంటద్వారము** యెరూషలేము B V 2 (9) చూ॥

**పెండ్లికుమారుడు, పెండ్లికుమార్తె** వివాహము 4, 6 చూ॥

**పెంతెకొస్తు పండుగ** పండుగలు III 2 చూ॥

**పెకహు** (Pekah = విముక్తి). రెమల్యా కుమారుఁడు. ఇశ్రాయేలువారి రాజగు పెకహ్యా యొక్క సేనాధిపతిగానుండి అతనిపై కుట్రచేసి చంపి యతనికి మాఱుగా రాజాయెను. మొదటి యరొబాము స్థాపించిన విగ్రహపూజ ననుసరించినవాఁడు (II రాజు 15[25-28]). యూదా రాజగు యోతాము చివరి దినములలో నితఁడు సిరియా రాజైన రెజీనుతో సంధిచేసికొనెను. వారు యోతామును సింహాసనభ్రష్టునిఁజేసి తమకిష్టుఁడైన నొకని రాజుగాఁజేయ నుద్దేశించిరి (యెష 7[5,6]). ఆహాజు ఏల నారంభించునప్పుడే వీరును తమ సైన్యములతో దండెత్తి రాసాగిరి (యెష 7[1]). సిరియనులు యెరూషలేమునొద్ద దండు విడియవలెనని యొర్దానుకు తూర్పుగా ఏలతు వఱకు వచ్చిరి. పెకహు గ్రామములను దోచుచు తగలఁబెట్టుచు తన సైన్యములతో తిన్నగా యెరూషలేమును సమీపించుచుండెను. ఆ సంగతిని విని యెరూషలేము పౌరులు అదరిపోయిరి. శత్రువుల యేర్పాటులన్నియు భిన్నములగునని జనుల కభయమిచ్చి దేవునియందు నమ్మిక మాత్ర ముంచుఁడని వారి నాదరించుటకు దేవుని యాజ్ఞచే యెషయా వారి యొద్దకు వెళ్లెను గాని, ఆహాజు అతనిమాటను పెడచెవినిఁబెట్టి అష్షూరు రాజైన తిగ్లత్పిలేసెరును సహాయమునకుఁ బిలుచుకొనుట యుత్తమమని యెంచెను. అతఁడును సైన్యసమేతుఁడై గలిలయగుండ (II రాజు 15[29]) ఫిలిష్తీయదేశమునకు క్రీ॥ పూ॥ 734 సం॥ నందు వచ్చుటఁజూచి పెకహును సిరియనులును తమ దేశ సంరక్షణార్థమై వెనుకకుఁ బోవలసినవారైరి. పెకహు వెళ్లునప్పుడు తనవెంట అనేకమంది యూదావారిని చెఱపట్టుకొని వెళ్లెను గాని ఓదేదను ప్రవక్తవలన బోధింపఁబడినవాఁడై వారికి తినుటకు భోజనమును కట్టుకొనుటకు వస్త్రములనిచ్చి సంతుష్టులనుగాఁ జేసి తిరిగి పంపివేసెను (II దిన 28[5-15]). తరువాతి రెండు సంవత్సరములును తిగ్లత్పిలేసెరు దమస్కులోనుండి ఫిలిష్తీయదేశముమీఁదకుఁ బోవునప్పుడెల్ల తన సైన్యములను ఇశ్రాయేలువారి దేశముగుండ తీసికొని వెళ్లుచుండెను. దమస్కునుండి అతనిచే పంపఁబడిన సైన్యములు యొర్దానుకు తూర్పుననున్న దేశమును జయించి అనేకమంది ఇశ్రాయేలువారిని చెఱగొని పోయెను (I దిన 5[26]). క్రీ॥ పూ॥ 730 సం॥ నందు హోషేయ పెకహును చంపి అతనికి

బదులు తానే రాజాయెను (II రాజు $15^{30}$). ఈ హత్య తిగ్లత్పిలేసెరు సమ్మతిని జరిగినట్లు అష్షూరు రాతి శాసనములవలనఁ దెలియుచున్నది.

పెకహు 20 సం॥ వఱకు ఏలినట్లు II రాజు $15^{27}$ నందు కనఁబడుచున్నది గాని షోమ్రోనులో అతఁడంత కాలము రాజ్యము చేసెననుట మాత్రము కొంచెము విపరీతముగ నున్నది. ఏలననఁగా, ఇతనికి ముందు ఇశ్రాయేలు వారి నేలిన మెనహేము తిగ్లత్పిలేసెరు ఏలుబడియందు, క్రీ॥ ము॥ 738 సం॥ వఱకు షోమ్రోనులో నేలినట్లు దాఖలా గలదు (II రాజు $15^{19}$). ఈ గ్రంథకర్త చెప్పినట్లు అతఁడు యూదారాజగు అజర్యా యేలుబడిలో నేఁబది రెండవ సంవత్సరమున షోమ్రోనులో నేల నారంభించెను. షోమ్రోనులో నేల నారంభించక మునుపు అతఁడు గిలాదీయులతో కలిసికొని యున్నట్లు II రాజు $15^{25}$ వలనఁ దెలియుచున్నది. రెండవ యరొబాము చనిపోయిన పిమ్మట దేశమునందు రేగిన గొప్ప గందరగోళములలో ఉత్తర గిలాదును గలిలయను క్రీ॥ ము॥ 749 లో తన వశముజేసికొని మెనహేము ఇశ్రాయేలు వారిమీఁద రాజ్యముచేయు కాలమునందు చాల సంవత్సరములవఱకు ఈ భాగమునందు తన యధికారమును చెలాయించుకొనుచుండెను గాని తిగ్లత్పిలేసెరువచ్చి మెనహేమును ఇశ్రాయేలు వారిపై స్థిరపఱచఁగా నితఁడు అప్పటివలె తన యధికారమును మెనహేము కప్పగించి సైన్యములో నొక భాగమున కధిపతియై సామంత రాజుగ నుండియుండెను. మెనహేము మరణమైన పిదప తిగ్లత్పిలేసెరు దేశమునందు లేకుండుట జూచి రజీనుచే ప్రబోధింపఁబడినవాఁడై పెకహ్యాను చంపి ఉజ్జియా యేలుబడియందు 52 వ సం॥ మున ఇశ్రాయేలు వారికందఱికి రాజాయెను. ఇట్లతఁడు మొత్తముమీఁద రాజ్యము చేసినది యిరువది సంవత్సరములని చెప్పుట యుక్తము

**పెకహ్యా** (Pekahiah = యెహోవా దృష్టినిచ్చెను లేక విడిపించెను). మెనహేము కుమారుఁడు అతని తరువాత ఇశ్రాయేలువారి రాజాయెను. క్రీ॥ ము॥ 737 సం॥ న రాజ్యమునకు వచ్చి రెండు సంవత్సరములేలి యరొబాము చేసిన పాపముల ననుసరించెను. షోమ్రోను నందలి రాజనగరులోని అంతఃపురమునందు పెకహు అను సేనాధిపతిచే చంపఁబడెను (II రాజు $15^{23-26}$).

**పెకోదు, పెకోదీయులు** (Pekod, Inhabitants of Pekod). పెకోదు అను పదమునకు ఆధిపత్యము అను శబ్దార్థముకలదు. అదే యర్థముతో దానిని అధిపతులని యెహె $23^{23}$ లో తెనిగించినను అనేక భాషాంతరములలో పెకోదు అను 'పదము' నట్లేయుంచిరి. పెకోదు (=ఆధిపత్యము) అను పేరు బబులోనుకు అలంకార నామమని కొందరు అనుకొందురు. పెకోదు అను స్థలమందలి నివాసులు పెకోదీయులనఁబడిరి (యిర్మీ $50^{21}$). పెకోదీయులు బబులోను దేశ నివాసులగుదురు. అయితే సాధారణముగా పెకోదు బబులోను దేశమందలి యొక స్థలమనుకొందురు.

**పెతహయా** (Pethahiah = యెహోవా విడిపించెను).

1. యాజకుల సంతులలో 19 వ దాని పెద్ద I దిన $24^{16}$).

2. లేవీయులలో నొకఁడు (ఎజ్రా $10^{23}$ నెహె $9^{5}$).

3. నెహెమ్యా కాలమునందుండిన యూదుల యధికారులలో నొకఁడు (నెహె $11^{24}$).

**పెతూయేలు** (Pethuel = దేవుని ధారాళత). ప్రవక్తయగు యోవేలుయొక్క తండ్రి (యోవే $1^{1}$).

**పెతోరు** (Pethor = సందు). బిలాము యొక్క స్వంతయూరు (సంఖ్యా $22^{5}$ ద్వితీ $23^{4}$). అది కర్కెమిషు అను పట్టణమునకు కొంచెము దక్షిణముగాను యుఫ్రాతు నదికి పడమరగా నుండి ప్రస్తుతము పితు (*Pitru*) అని పిలువఁబడుచున్నది (పటము VIII, C 1).

**పెదవులు** (Lips). ఈ శీర్షికయందు పెదవులను పదముయొక్క అలంకార ప్రయోగములు మాత్రము వివరింపఁబడును. కీర్త $22^{7}$ నందు పెదవులు విఱుచుట హాస్యమునకు సూచనగా నున్నది. పెదవులు సాధారణముగా మాటలాడుటను సూచించుటచే మాటలకు అవి సూచ

నగా నున్నవి. సామె $17^{4}$ లో దోషపు పెదవులు దోషపు మాటలనియు, యెష $57^{19}$ లో పెదవుల ఫలితములని యర్థమిచ్చు పదమును కృతజ్ఞతాబుద్ధి పుట్టించుట యని తెనిఁగించి అలంకారముల నుంచక వాటి యర్థమును వ్రాసిరి. కొన్ని వాక్యములలో ఆ పదములను తెనిఁగించక ఆ యలంకారములట్లనే యుంచిరి. ఇచ్చకములాడు పెదవులు (కీర్త $12^{2,3}$), కపటమైన పెదవులు ($17^{1}$) అబద్ధికుల పెదవులు ($31^{18}$), ఉత్సాహించు పెదవులు ($63^{5}$), నీతిగల పెదవులు (సామె $16^{13}$), ప్రేమగల మాటలాడు పెదవులు ($26^{23}$), అపవిత్రమైన పెదవులు (యెష $6^{5}$) మొ॥ అట్టి యలంకారములై యున్నవి. పెదవులతో ఘనపరచుట ముఖస్తోత్రమునకు సూచనగా నున్నవి (యెష $29^{13}$). పై యలంకారముల ననుసరించి మాటల వలన కలుగు హానిని సూచించుటకు దుష్టుల పెదవులలో కత్తులున్నవనియు (కీర్త $59^{7}$), వాటి క్రింద సర్ప విషమున్నదనియు ($140^{3}$), వాటి మీఁద అగ్ని మండుచున్నట్లున్నదనియు (సామె $16^{27}$) వర్ణింపఁబడెను. పెదవులను దేవుని కర్పించుట (హోషే $14^{2}$) ఆయనకు స్తోత్రము చేయుటను సూచించును. యెహె $24^{17-22}$ లో గడ్డము కప్పుకొనుటయు మీకా $3^{7}$ లో నోరు మూసికొనుటయు అను మాటలు మూలభాష యందు పెదవులను కప్పుకొనుట యను అర్థము నిచ్చును నిర్గ $6^{13-30}$ లో నున్న మాట మాంద్యము కలవాఁడనని తెనిఁగించిన మూలభాషాపదము సున్నతిలేని పెదవులుగలవాఁడనని యర్థమగును. క్రొత్త నిబంధనలో పెదవులను ఈ పదము పాఁత నిబంధననుండి యెత్తిన వాక్యములలో తప్ప మఱి యితరచోట్ల కనఁబడుటలేదు (మ $15^{8}$ మా $7^{6}$ రోమా $3^{13}$ I కొరి $14^{21}$ హెబ్రీ $13^{15}$ I పేతు $3^{10}$).

**పెదహేలు** (Pedahel = దేవుఁడు రక్షించెను). ఇశ్రాయేలీయు లరణ్యమందుండు కాలములో నఫ్తాలీ గోత్రప్రధాని (సంఖ్యా $34^{28}$).

**పెదాయా** (Pedaiah = యెహోవా విమోచించెను).

1. దావీదు కాలములో యొర్దాను నదికి పడమరగా నివసించిన మనష్షేగోత్రికులకు అధిపతిగా నుండిన యోవేలు అనువాని తండ్రి (I దిన $27^{20}$).

2. రాజైన యెహోయాకీము తల్లి యగు జెబూదాయొక్క తండ్రి (II రాజు $23^{36}$).

3. దావీదు వంశములో నున్న యెకొన్యా కుమారుఁడు (I దిన $3^{18}$). జెరుబ్బాబెలు ఇతని కుమారుఁడని I దిన $3^{19}$ లో నుండినను వంశానుక్రమణికలలో అతఁడు యెకొన్యా అన్నయగు షయల్తీయేలు కొడుకుగా ఎంచబడెను (మ $1^{12}$).

4. యెరూషలేము ప్రాకారములను కట్టుట యందు సహాయముచేసిన వారిలో నొకఁడు (నెహె $3^{25}$).

5. ఎజ్రా ప్రజలకు ధర్మశాస్త్రమును వినిపింపఁగా అతనిదగ్గఱ నిలిచియుండిన వారిలో నొకఁడు (నెహె $8^{4}$). ఇతఁడును 4 లోని వాఁడును ఒకఁడేయై యుండవచ్చును.

6. ఒక లేవీయుఁడు (నెహె $13^{13}$).

7. బెన్యామీనీయులలో నొకఁడు (నెహె $11^{7}$)

**పెదాసూరు** (Pedahzur = బండ రక్షించెను). ఇశ్రాయేలీయులు అరణ్యములో నుండఁగా మనష్షేగోత్రికులకు అధిపతిగా నుండిన గమలీయేలు తండ్రి (సంఖ్యా $1^{10}$ $2^{20}$ $7^{54-59}$ $10^{23}$)

**పెద్దలు** (Elders, Presbyters). పాఁత నిబంధనకాలములో నీ పదము కుటుంబమునందలి ముఖ్యులకును (ఆది $50^{7}$), గోత్రపు నాయకులకును (ద్వితీ $5^{23}$), పట్టణపు ముఖ్యులకును ($19^{12}$) ఇశ్రాయేలీయులలోని ముఖ్యులగు వారికిని (నిర్గ $3^{16-18}$ మొ॥), సమాజమునందలి ముఖ్యులకును (లేవి $4^{15}$) వాడఁబడెను. వీరు తరువాత కాలములో సమాజమందిరపు అధికారులనఁబడిరి. యాయీ రట్టివాఁడు (లూ $8^{41}$ మా $5^{35}$). యూదు లీ పదము నిట్లు విశేషముగ వాడిరి.

ఆది క్రైస్తవసంఘపు ఏర్పాట్లు సమాజమందిరమునకు సంబంధించినవి గనుక పెద్దలు క్రైస్తవ సభలలో నాయకులై యుండిరని తెలియుచున్నది. ఇది అంతియొకయనుండి యెరూషలేమునకు తమ సొమ్మును సహాయార్థముగాఁ బంపిన సందర్భమున

మొదట నుపయోగింపఁబడెను (కార్య 11[30]). అది క్రీ॥ శ॥ 44 లో జరిగెను. దాదాపుగా నా కాలమునందే యాకోబు సంఘపుపెద్దలను గూర్చి వ్రాసెను (యాకో 5[14]). క్రీ॥ శ॥ 50 సం॥ నందు జరిగిన మొదటి ఆలోచనసభలో పెద్దలు పాలివారైరి (కార్య 15[6]). పౌలు మూఁడవ ప్రయాణాంతమున యెరూషలేమునకు రాఁగా వారతనిని చేర్చుకొనిరి (21[18]).

పెద్దలును అధ్యక్షులును ఒకటే యుద్యోగమునకు పెట్టఁబడిన వివిధములగు పేరులై యున్నవి (అధ్యక్షుఁడు చూ॥). వారిని నియమించుటను గూర్చియు వారి విధులను గూర్చియు ప్రశంసింపఁబడెను.

వీరు పైవారివలన నియమింపఁబడిరి (కార్య 14[23] తీతు 1[5]) గాని పరిచారకులను సభవారి సమ్మతినిబట్టి నియమించియుండవచ్చును (కార్య 6[5,6]). వారి నభిషేకించుటను గూర్చిన సూచనలు క్రొత్త నిబంధనలో లేకున్నను, వారిభిషేకమునొంది యుండవచ్చును. I తిమో 4[14] లో వీరు ఇతరులను అభిషేకించుటయందు అపొస్తలులకు సహాయపడినట్లు కనఁబడును.

వారీ దిగువపనులు చేసినట్లు తెలియుచున్నది. (1) పైవిచారణ (కార్య 20[28] I తిమో 5[17]). వారు యెరూషలేము ఆలోచన సభలో పాలు పుచ్చుకొనుట దీనికి సంబంధముగా నున్నది (కార్య 15[6] 21[18]). (2) బోధపని (I థెస్స 5[12] I తిమో 5[17] తీతు 1[9]). (3) రోగులను పరదేశులను పరామర్శించుట (యాకో 5[4] I తిమో 3[2] తీతు 1[8]).

**పెద్ద తాళములు** సంగీతము 3 (1) *b* చూ॥

**పెద్దబోరువ** పక్షులు 27 చూ॥

**పనము** పంటసాముగ్రి 4 చూ॥

**పెనిన్నా** (Peninnah = పగడము). ఎల్కానా యనువాని రెండవ భార్య (I సమూ 1[23]).

**పెనుగాలి** తుఫాను చూ॥

**పెనుగులాడుట** పోరాడుట చూ॥

**పెనూయేలు** (Peniel, Penuel = దేవుని సముఖము). 1. యొర్దానునదికి తూర్పుగా యబ్బోకునదికి సమీపమునుండు నొక స్థలము. అచట యాకోబు దేవుని దూతతో పెనుగులాడి ముఖాముఖిగా దేవుని చూచియుండినందున ఆ పేరు దానికివచ్చెను (ఆది 32[30,31]). ఆ ప్రాంతములోని కొండలోనో బండలోనో ఏదో యొక చిత్రమైన ముఖరూపము కనఁబడినందున ఆ కోటకీ పేరు కలిగియుండెనని కొందఱను కొందురు. న్యాయాధిపతులకాలములో అచట నొక కోట యుండెను. గిద్యోను దానిని జయించి దాని నివాసులను సంహరించెను (న్యాయా 8[8,9,17]). మొదటి యరొబాము అను రాజు దానికి ప్రాకారములను కట్టించెను (I రాజు 12[25]). ప్రస్తుతమున ఈ స్థలము విషయమైన సూచన లేవియు లేవు.

2. యూదావారిలో నొకఁడు. అతఁడు గెదోరీయులకు తండ్రియై యుండెను (I దిన 4[4]).

3. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన 8[25]).

**పెయుల్లెతై** (Peullethai = కష్టతరము). లేవీయులలో నొకఁడు. ఇతఁడు ఓబేదెదోము కుమారుఁడును ద్వారపాలకులలో నొకఁడునై యుండెను (I దిన 26[5]).

**పెయోరు** (Peor = సందు). యొర్దానుకు తూర్పుగానున్న కొండశిఖరములలో నొకటి. బాలాకనురాజు బిలామును ఈ కొండకు రప్పించెను. అచటనుండి ఇశ్రాయేలీయుల దండు పేట బాగుగా కనఁబడెను (సంఖ్యా 23[28]). అది నెబోకొండకు దగ్గఱగా నుండెను గాని ఏ కొండయొక్క శిఖరమై యుండెనో తెలియదు. బయల్పెయోరు అను దేవతను అచట పూజించినట్లున్నది. సంఖ్యా 25[17] 31[16] యెహో 22[17] లలో నున్న పెయోరు అనునది యీ కొండ యొక్క పేరుకాక, బయల్పెయోరు అను దేవత యొక్క పేరు అని తెలిసికొనవలెను (బయల్పెయోరు చూ॥).

**పెయ్య** ఆవు 1 చూ॥

**పెరాజీము** (Perazim = విడిగా బయలు దేరిన స్థలము). దేవుఁడు తన ప్రభావమును ఏదో యొక విశేషమైన పనినిచేయుటచేత కనఁబఱచిన కొండయని యెష 28[21] వలన తెలియును.

అది II సమూ $5^{20}$ I దిన $14^{9-11}$ లో నున్న బయల్పెరాజీము కావచ్చును (బయల్పెరాజీము చూ॥).

పెరిజ్జీయులు (Perizzites = ప్రాకారములు లేని యూళ్లలో నివసించెడివారు). ఇశ్రాయేలీయులు పలెస్తీనును స్వాధీనపఱచుకొనక పూర్వము, కనాను దేశములోనున్న జనములలో నొక జనమునకు పేరు (ఆది $15^{20}$ నిర్గ $3^{8}$ యెహో $9^{1}$). అబ్రాహాము కాలమందు వారు కనాను దేశములో నుండిరి (ఆది $13^{7}$). యెహోషువ గ్రంథమును చూడఁగా వారు కొండవాసులై యున్నట్లు స్పష్టమగును ($11^{3}$). వారి దేశమును ఇశ్రాయేలీయులు జయించిన పిమ్మట ఎఫ్రాయిము, మనష్షే ($17^{5}$), యూదా (న్యాయా $1^{4,5}$) గోత్రికులకు దానిని పంచిపెట్టిరి. ఇశ్రాయేలీయులు వారిని పూర్ణనాశనముచేయక వారితో వియ్యమందుచు వారి విగ్రహారాధనలలో పడుచుండిరి ($3^{5,6}$). రాజైన సొలొమోను వారిని దాసులనుగఁజేసెను (I రాజు $9^{20,21}$ II దిన $8^{7}$). ఆది 10 వ అధ్యాయములోనున్న వంశావళులలో పెరిజ్జీయుల పేరులేకపోవుటచేతను, ఈ జనమునుగూర్చి ప్రత్యేకమైన యితరసూచనలు లేకపోవుటచేతను వీరు ప్రత్యేకమైన యొక జనాంగముకాక, ఆ దేశములో నుండి ప్రత్యేకమైన యొక వృత్తి నవలంభించినవారని నవీనపండితులలో ననేకు లనుకొందురు. ఇది నిజమగునెడల వారిపేరునకుగల శబ్దార్థమును బట్టి వారు వ్యవసాయకులై పల్లెటూళ్లలో నివసించినవా రనుకొనఁదగును.

పెరేయ (Peraea = అవతల). యొర్దానుకు తూర్పుగానున్న ప్రదేశపుపేరు. ఈ పదము బైబిలునందు లేదుగాని యోసీఫసువలన తరుచుగా వాడఁబడెను (యుద్ధ 3. 3. 4; 4. 7, 3. 6). బైబిలునందు ఆ పదమునకు ప్రతిగా యొర్దాను అవతల (మ $4^{23}$ $19^{1}$ యోహా $1^{28}$ $3^{26}$ $10^{40}$) అని యున్నది. పాత నిబంధనయందీ ప్రాంతములను గిలాదుదేశమనిరి (గిలాదు చూ॥). క్రొత్త నిబంధనకాలమునందది గలిలయతోకూడ హేరోదు అంతిపయనువానిచే నేలఁబడెను (పురా 17. 18. 1). యూదులీ దేశమును పలెస్తీనులో నొకభాగముగా నెంచినట్లు వారి పురాణములవలన స్పష్టమగుచున్నది. యోహాను నిచ్చట బాప్తిస్మమిచ్చెను (యోహా $1^{28}$ $3^{26}$). గలిలయలోనివారు విరోధించినందున క్రీస్తు ఇచ్చట బోధించెను (మ $19^{1}$ మా $10^{1-45}$ లూ $10^{1}$ $18^{34}$). యెరూషలేము వారాయనను పట్టుకొనఁబోఁగా ఆయన తప్పించుకొని యిచ్చటకు వెళ్లెను (యోహా $10^{40-42}$). ప్రస్తుతమది అరబ్బీయుల వశమై దమస్కునకు సంబంధించియున్నది.

పెరూదా (Perida, Peruda = చెల్లాచెదరగుట). సొలొమోనురాజు సేవకుల వంశపువారిలో బాబెలు చెఱనుండి తిరిగివచ్చిన యొక తెగవారు (ఎజ్రా $2^{55}$ నెహె $7^{57}$).

పెరెజ్ ఉజ్జా (Perez—Uzzah = ఉజ్జా అతిక్రమము). దేవుని నిబంధన మందసమును ముట్టినందున ఉజ్జా చనిపోయిన స్థలమునకు దావీదు పెట్టినపేరు (II సమూ $6^{8}$ I దిన $13^{11}$). దీనిసరియైన యునికినిగూర్చి తెలియదు (ఉజ్జా).

పెరెషు (Peresh = వేఱుపఱచఁబడుట). మనష్షేగోత్రపు వారిలో నొకఁడు (I దిన $7^{16}$).

పెరెసు, పెరెసీయులు (Perez, Phares = సందుచేయుట, Perezites). తామారువలన యూదాకు పుట్టిన కవలకొడుకులలో నొకఁడు (ఆది $38^{24-30}$). ఇతఁడొకగోత్రమునకు పెద్దయాయెను వారు పెరెసీయులనఁబడిరి (సంఖ్యా $26^{20,21}$ I దిన $2^{4,5}$). దావీదుకాలములో ఈ గోత్రపు వారికి ఒకవంతు నేర్పఱచిరి (I దిన $27^{3}$). చెఱకాలమునకు పిమ్మట యెరూషలేమునకు తిరిగివెళ్లిన వారిలో ఈ తెగవారుండిరి (నెహె $11^{4,6}$). ఇతఁడు దావీదుకును (రూతు $4^{12-18}$) పూర్వికుఁడై యుండెను కావున, క్రీస్తు వంశావళి క్రమణికలో కూడ ఇతనిపేరు కనఁబడును (మ $1^{3}$).

పెర్గము (Pergamus, Pargamum = దుర్గము). చిన్నాసియ పడమటి భాగమందున్న ముసియ పరగణాలోని ముఖ్యపట్టణము. అది సముద్ర తీరమునకు 20 మైళ్ల దూరమున నున్నను ఒక నదీతీరమున నున్నది. క్రీస్తు శకమునకుఁ బూర్వము మూఁడు రెండు శతాబ్దములలో చిన్నాసియలోని పడమటి భాగమునకు రాజధానిగ నుండెను. క్రీ॥ ము॥ 133 సం॥ నుండి

అది రోమనుల స్వాధీనమై చిన్నాసియ యంతటికి వారి రాజధాని పట్టణముగ నుండెను. ఇచ్చట 2,00,000 ప్రతులుగల గొప్ప పుస్తక భాండాగార ముండెను. రోమనులు దానిని అలెక్సంద్రియకుఁ దీసికొని పోయిరి. పుస్తకములను వ్రాయుటకు చర్మపు కాగితములను (II తిమో 4[13]) ఉపయోగించిన దిచ్చటనే. వాటి యింగ్లీషు పేరగు పార్చ్మెంట్ (*Parchment*) అనునది పెర్గములనునే కలిగెను. గ్రీసు దేవతలగు ద్యుపతి, ఏథేనె, వైద్య దేవతలకు ఇచ్చట గొప్ప ఆలయములుండెను. ఈ పట్టణపు పేరు బైబిలునందు ప్రకటన గ్రంథమునందు మాత్రము వచ్చును (1[11] 2[12-17]). అది ఏడు సంఘములుండిన పట్టణములలో మూఁడవది. అది సాతాను సింహాసనమున్న స్థలమనఁబడెను (2[13]). ఆ పట్టణస్థులు తమ విగ్రహారాధన నెక్కుడుగా నభిమానించి క్రీస్తు మతమును విరోధించినందున యిట్టిపేరు వచ్చియుండును. అట్టి విరోధముండుటవలననే అంతిపయనువాఁడు ఆది కాలములోనే ఇచ్చట హతసాక్షి యాయెను (2[13]) అచ్చటనున్న క్రైస్తవులలోఁ గొందఱింకను విగ్రహార్పితములను దినుచు అన్యాచారములనుసరించుచుండిరి (2[14] ను I కొరి 8[4] 10[19] తో సరిపోల్చుము). ఆదికాలములో నిదియొక క్రైస్తవాధ్యక్షునికి పీఠమయ్యెను గాని లౌకిక విషయములలోను సంఘవిషయములలోను దీనికి సమీపముగానుండిన ఎఫెసును మించలేక పోయెను. ఈ పట్టణ సమీపమున శిథిలములు పెక్కులు గలవు. జర్మనీవారు ముఖ్యముగా వీటిని త్రవ్వించి తమ వస్తు ప్రదర్శన శాలలో నుంచిరి. ప్రస్తుతమున దానిని బెర్గము (*Bergama*) అని పిలుచుచున్నారు. అది యొక చిన్న పల్లె. (పటము V, H 3).

**పెర్గే** (Perga = దుర్గము). చిన్నాసియ దక్షిణ భాగమందున్న పంఫూలియయలోని ముఖ్య పట్టణము. అది యా ప్రదేశమునకు రేవు పట్టణముగానున్న అత్తాలియకు 12 మైళ్లు ఉత్తరముగానున్నను దానికి సమీపముగ నొక నది యుండుటచేతను, పడవలు అందాక రాఁగలుగుట చేతను దీని రేవుపట్టణముగా నెంచఁదగును. ఎఫెసులోవలె అచ్చటకూడ అర్తెమిదేవి పూజ విశేషముగ జరిగెను. ఆ దేవత యిచ్చట పెర్గెరాణి యనఁబడెను. ఇచ్చటనున్న శిథిలములనుబట్టి పూర్వ మిదియొక గొప్ప పట్టణమని తెలియుచున్నది. పౌలు బర్నబాలు తమ మొదటి ప్రయాణమందీ పట్టణముమీఁదుగా వెళ్లి (13[13,14]) తిరిగి వచ్చునప్పుడు మాత్రమే అచ్చట బోధించిరి (14[25]). వారి బోధకు అచ్చట ఎక్కువ ఫలితము గలిగినట్లు సూచనలులేవు (పటము V, J 4).

**పెర్సిసు** (Persis = పారసీక). రోమాలో నుండిన యొక క్రైస్తవురాలు. పౌలు వందనములు పంపినవారిలో ఈమె యొకతె (రోమా 16[12]).

**పెలట్యా** (Pelatiah = యెహోవా రక్షించును).

1. షిమ్యోను గోత్రికులలో నొక పెద్ద (I దిన 4[42]).

2. యెరూషలేములో నుండు యూదా గోత్రికులలో నొక ప్రధాని. యెహెజ్కేలు ప్రవచింపఁగా నితఁడు చనిపోయెను (యెహె 11[13]). అయితే యెహెజ్కేలు గ్రంథములో దర్శనము లనేకములుండుటచే ఇదియు నొక దర్శనమేనని యనుకొనువారుకలరు.

3. జెరుబ్బాబెలు మనుమఁడు (I దిన 3[21]).

4. బాబెలు చెఱవు తరువాత బ్రతికియుండిన యొక కుటుంబమునకు పేరు (నెహె 10[22]). వీరు నిబంధనకు సమ్మతించి చేవ్రాలు చేసిన వారిలో నుండిరి.

**పెలల్యా** (Pelaliah = యెహోవా న్యాయము తీర్చును). యాజకులలో నొకఁడు (నెహె 11[12]).

**పెలాయా** (Pelaiah = యెహోవా గొప్ప చేసెను).

1. దావీదు వంశములో పుట్టిన యొకఁడు (I దిన 3[24]).

2. చెఱకాలమునకుఁ బిమ్మట జీవించిన యొక లేవీయుఁడు. ధర్మశాస్త్రముయొక్క భావము చెప్పుటయందు ఎజ్రాకు సహాయము చేసిన

వారిలో నితఁడొకఁడు (నెహె $8^{7}$). ఇతఁడును నెహెమ్యా కాలమునందు నిబంధనను స్థిరపఱచిన వారిలో నొకఁడై యుండెను ($10^{10}$).

**పెలెగు** (Peleg = విభాగము చేయుట). షేము వంశములో నాలుగవ తరమునందు పుట్టిన యొకఁడు (ఆది $11^{16}$). లూ $3^{35}$ లో ఇతఁడు ఐదవతరమున పుట్టినట్లుగా నున్నది. అతని కాలములో భూమి విభాగములు చేయడమైనట్లు ఆది $10^{25}$ లో నున్నది. ఇది దేశ విభాగమును గాని జనములు చెదిరిపోవుటను గాని సూచింప వచ్చును.

**పెలెటు** (Pelet = స్వతంత్రము).

1. యూదా వారిలోను కాలేబు తెగవారిలో నుండిన యొకఁడు (I దిన $2^{47}$).

2. దావీదు సిక్లగులో నుండఁగా అతని పరివారములో చేరియుండిన యొక బెన్యామీనీయుఁడు (I దిన $12^{3}$).

**పెలేతీయులు** (Pelethites). దావీదు రాజు దేహసంరక్షక భటులలో నొక తెగవారు. కెరేతీయులు గాతు పట్టణస్థులవలె వీరును బహుశః ఫిలిష్తీయుల దేశమునుండి వచ్చినవారై యుందురు. దావీదు చివరి దినములలో సంభవించిన గందరగోళములలో వీరు దావీదును విడువక బహు నమ్మకస్థులుగా నుండిరి. అబ్షాలోము (II సమూ $15^{18-22}$), షెబా ($20^{7}$) తిరుగుబాటులలో వీరు చాల సహాయపడిరి (కెరేతీయులు చూ॥).

**పెలోనీయుడు** (Pelonite). దావీదు యోధులలో అహీయా యనువాని బిరుదు. (I దిన $11^{36}$). II సమూ $23^{34}$ లో ఇతనికి గిలోనీయుఁడు అను బిరుదుకలదు. పెలోనీయుఁడు అని I దిన $11^{36}$ లో నున్నది వ్రాత పొరబాటువలన వచ్చినట్లనుకొనవచ్చును. (పల్తీయుడు I చూ॥).

**పెసీలీము** (Quarries,Graven images). న్యాయా $3^{19,26}$ నందీ పదము నొక స్థలము యొక్క పేరుగా వాడిరిగాని యిది ప్రతిమలని యర్థమిచ్చు నొక హెబ్రీపదమై యున్నది. ద్వితీ $7^{5,25}$ $12^{3}$ లో ప్రతిమలను మాటచే తెనిఁగించిన మూలభాషాపదమిదే. ఈ పదమునే యెష $21^{9}$ $30^{22}$ II దిన $34^{4}$ లో విగ్రహములని తెనిగించిరి. న్యాయా $3^{19,26}$ నందీ మాట నట్లే యుంచినను అది అట్టి విగ్రహములున్న స్థలమును సూచించునేగాని ఒక యూరి పేరు కాదనుట యుక్తము. మోయాబు రాజగు ఎగ్లోనును చంపిన ఏహూదు చరిత్రలో ఈ మాట వచ్చును.

## పే

**పే** (Pe = פ అను హెబ్రీ యక్షరము). హెబ్రీ యక్షరములలో పదునేడవది అక్షరమాలికా కీర్తన యనఁదగు 119 కీర్తనలోని 17 వ భాగమందలి ప్రతిపంక్తియు ఈ యక్షరముతో నారంభమగుటచే ఆ భాగము కీపేరు పెట్టిరి.

**పేడ** మలము చూ.

**పేతురు** (Peter = బండ). అపొస్తలుఁడైన పేతురును గురించిన వివరములు విశదముగాఁ దెలిసికొనుటకై ఆయన చరిత్రమును మూఁడు భాగములుగా విభజించుట యుక్తము. (1) సువార్తలయందలి చరిత్రము. (2) కార్యముల గ్రంథమందలి చరిత్రము. (3) ఇతర గ్రంథములవలన తెలియవచ్చు చరిత్రము.

1. సువార్తలయందలి వృత్తాంతము పేతురు యొక్క మొదటి పేరు సీమోను. ఈ పేరు పాతనిబంధనయందు చెప్పబడిన షిమ్యోనను పేరుకు సమానము. ఆ రెండు పేరులకు వినికిడి అని యర్థము. ఇతఁడు యోహాను లేక యోనా యను నొకని కుమారుఁడైనందున అతఁడు బర్ యోనాయని మ $16^{17}$ యోహా $1^{42}$ $21^{15}$ నందు పిలువఁబడెను. అతనికి అంద్రెయ యను పేరుగల సహోదరుఁడుండెనుగాని అతఁడు పేతురుకు అన్నయో తమ్ముఁడో చెప్ప వీలుపడదు. వీరు గలిలయ సముద్రతీరమున నుండిన బేత్సయిదా యను యూరివారు. బేత్సయిదా యను పేరు మచిలీపట్టణమను అర్థమిచ్చును. ఇక్కడ ఫిలిప్పుకూడ నివాసము చేయుచుండెను. పేతురు బాల్యమునుండి జాలరుల వృత్తి ననుసరించి జీవనము చేయుచుండెనని సువార్తలయందు పలుమారు ప్రస్తాపింపఁబడెను (మ $4^{19}$ మా $1^{16}$ లూ $5^{3}$). అతనికి స్వంతపడవయును కపెర్న

హూములో నొక యిల్లును ఉండుటనుబట్టి అతని కుటుంబమువారు కేవలము దరిద్రులు కారని కనఁబడును. వారు జెబెదయి కుమారులైన యాకోబు, యోహానులతో భాగస్థులై చేఁపల వ్యాపారము చేసి జీవించెడివారు. పేతురు సంసారము కలవాఁడైనట్లు మ $8^{14}$ మా $1^{30}$ లూ $4^{38}$ యందు కనఁబడును. మొట్టమొదట పేతురు తన సహోదరుఁడైన అంద్రెయయొక్క యత్నమువలన యేసుయొక్క పరిచయము గలిగిన వాఁ డాయెను (యోహా $1^{40}$). అంతకు పూర్వము ఆయన యేసు నెఱిఁగి యుండెనో లేదో చెప్ప వీలుపడదుగాని బహుశః ఆయనను గురించిన సదంతయు వినియుండునని నిస్సందేహముగా చెప్పవచ్చును. పారంపర్య సాంప్రదాయములనుబట్టి అప్పటికి 30 లేక 40 సం॥ ముల ఈడుగలవాఁడని తోఁచుచున్నది. యూదులు తమ బ్రతుకునందు సంభవించు మహాద్విషయములనుబట్టి తమ పేరులు మార్చుకొనుట సర్వసాధారణము (ఆది $17^{5,15}$ $32^{28}$). యేసు తన బోధను తెలిసికొనుటవలన సీమోనుకు కలుగఁబోవు భాగ్యము నెఱిఁగి అందుకు సూచనగా అతనికి కేఫా లేక పేతురను నామాంతరము నిచ్చెను. అంద్రెయ పేతురుకు యేసుని దర్శనము చేయించిన వెంటనే శిష్యత్వము నంగీకరించ లేదుగాని కొంతకాలమువరకు నతఁడు తన సాధారణమైన వృత్తి ననుసరించి కాలక్షేపము చేసెను. ఆ తరువాత యేసు తన శిష్యబృందము నేర్పఱుపఁగా అంద్రెయ పేతురులను వారిభాగస్థులైన యాకోబు యోహానుల నేర్పఱచుకొనెను (మ $4^{18-22}$ మా $1^{16-20}$ లూ $5^{1-11}$). అప్పటికి సహా పేతురు యేసుయొక్క నిత్యసేవఁ జేయక కొన్నాళ్లు గలిలయ ప్రదేశమందు ఆయనను వెంబడించి ఆయనతో సంచరించుచు కొన్నాళ్లు జీవనోపాధి చేసికొనుచు కడకు యేసు తన అపొస్తలుల నేర్పఱచి నియమించినపుడు వారు సమస్తమును వదలి యేసు నెడతెగక వెంబడించిరి. పేతురు అపొస్తలులలో నెన్నిక గలవాఁడైనట్లు పలుమారు క్రొత్త నిబంధనయందు కనఁబడుచున్నదిగాని తక్కిన అపొస్తలులకంటె అతని కెక్కువ యధికారముండలేదు. అపొస్తలుల గుంపులో వయస్సునుబట్టి అతఁడే పెద్దయైనందున కొంత ఆధిక్యతగలిగి యుండెనుగాని అందునుబట్టి అతఁడపొస్తలు లందఱికంటె గొప్పవాఁడనుట కాస్పదమెంత మాత్రమునులేదు. యేసు తన ముఖ్య సూచక క్రియలను చేసినపుడు తన అపొస్తలు లందఱిలో పేతురును యాకోబును యోహానును తన యొద్దనుండుటకు సెలవిచ్చెను. ఇందుకు దృష్టాంతముగా యాయీరు కుమార్తెను బ్రతికించినపుడును, రూపాంతరము పొందినపుడును గెత్సెమనే వనమందు నొందిన వేదనయందు నీ ముగ్గురు కలిసి యుండిరి. (మా $5^{37}$ లూ $8^{51}$ మా $9^{2}$ లూ $9^{28}$ మ $17^{1}$ మా $14^{33}$). అపొస్తలులు మొదటి సువార్త యాత్రకు పోయి రాఁగా యేసు వారి విశ్రాంతికొఱకు బేత్సయిదా యూలియ యను గ్రామసమీపమునకు వారిని పిలుచుకొని పోయెను. అక్కడ ఆహారములేక అవస్థపడుచుండిన జనసమూహము నిమిత్తమై యేసు రొట్టెలను అద్భుతకరముగా విస్తరింపఁజేసి వారికి తృప్తి కలుగఁజేసెను. ఆ మీఁదట తనకంటె ముందుగ శిష్యులను పంపించి యేసు ప్రార్థించుటకుగాను కొండెక్కి రాత్రిగడిపి తెల్లవారుజామున సముద్రముమీఁద నడిచి పడవను నడిపించుచుండిన తన శిష్యులయొద్దకు రాఁగా పేతురు ఆయన యేసని తెలిసికొని అతిశయించి నీళ్లమీఁదనడచి ఆయనచెంత చేరుటకై సెలవిమ్మని అడిగెను. యేసు సెలవివ్వఁగా నతఁడేలాగు పడవదిగి నీళ్లమీఁద కొన్ని అడుగులు పెట్టి అవిశ్వాసముచేత మునిఁగి యేసువలన రక్షించఁబడెనో (మ $14^{26-34}$ మా $4^{47-56}$ యోహా $6^{21-61}$) తెలియును.

ఆ మీఁదట యేసు తన అపొస్తలులను ఫిలిప్పుదైన కైసరయ ప్రాంతములకు తోడుకొని పోయి జనులు తానెవఁడైనట్లు తలంచుచున్నారని వారిని ప్రశ్నించఁగా పేతురు యేసుయొక్క దైవత్వమును గుర్తెఱిఁగి అందునుగుఱించి బహు గంభీరమైన సాక్ష్యమిచ్చెను (మ $16^{13-20}$ మా $8^{27-30}$ లూ $9^{18-21}$). వెంటనే యేసు తన కార్యము తుదముట్టించుటయందు తా ననుభవింప నావశ్యకమైన శ్రమలనుగూర్చి తెలియచేసెను. అప్పుడు పేతురు గర్వాతిశయముచేత యేసు నందునుగూర్చి ఖండించఁగా యేసు పేతురు మూలమున సాతాను తన్ను శోధించుచున్నట్లు

గుర్తెఱిఁగి అతనిని గద్దించెను. ఈ సంగతి జరిగిన వారము దినములకు యేసు యాకోబు యోహానులతోకూడ పేతురును తోడుకొని ఆ ప్రాంత్యములోనున్న నొక పర్వతమెక్కి వారి సముఖమున రూపాంతరము నొందెను (మ $17^{1-12}$ మార్కు $9^{2-13}$ లూ $9^{28-36}$). మఱియొక సమయమున సుంకమెత్తువారు యేసు పన్నిచ్చునో లేదో యని పేతురును విచారింపఁగా అతఁడు నిరాలోచనగా నిచ్చునని చెప్పినందున యేసు అతని యాతురతను గద్దించి చెల్లింపవలసిన సుంకమున కవసరమైన నాణెము చేపనోటిలో నద్భుతముగా కొరుకునట్లు చేసెను. ఒక సమయమున యేసు ఇతరుల తప్పులను మన్నించుట విషయమై బోధించఁగా పేతురు ఎంతసాఱులు అపరాధిని క్షమించుట అగత్యమని ప్రశ్నించినప్పుడు యేసు క్షమాపణయొక్క అక్కఱనుబట్టి డెబ్బది ఏళ్లుమాఱుల మట్టుకని సెలవిచ్చెను. (మ $18^{21}$). యేసు పట్టఁబడిన తరువాత పేతురనుభవించిన విశ్వాసభ్రష్టత్వము కేవలము సంతాపకరమైనది. ఆ సమయమున అతఁడు తన బలహీనతచేత ప్రమాణపూర్వకముగా యేసుకును తనకును సంబంధమే లేదని గురుద్రోహము చేసెను (మ $26^{69-75}$ మా $14^{65-72}$ లూ $22^{55-62}$ యోహా $18^{25-27}$). యేసు లేచిన సమాచారము మొట్టమొదట తెలిసికొన్నవారిలో పేతురొకఁడు. ఆ సమాచారము వినఁగానే యోహానుతోకూడ పేతురు సమాధియొద్దకు పరుగెత్తి యేసు నిశ్చయముగా లేచినట్లు గ్రహించుకొనెను. ఆ తరువాత పేతురు యోహాను తోమా ఫిలిప్పులు తమ మునుపటి వృత్తి ననుసరించి గలిలయ సముద్రములో చేపలు పట్టుచుండఁగా యేసు వారికి ప్రత్యక్షమై వారితోకూడ భోజనముచేసిన తరువాత పేతురుతో సంభాషించి అతనిని తిరుగ తన శిష్యబృందములో చేర్చినట్లు యోహా 21 నందు వివరించిన వృత్తాంతముతో సువార్తలలో సూచింపఁబడిన పేతురు చరిత్ర ముగింపగును.

2. కార్యముల గ్రంథమందున్న చరిత్రము. యేసు అనుగ్రహించిన యాజ్ఞ ప్రకారము అపొస్తలు లందఱు యెరూషలేములోనుండి అనుదినము ప్రార్థనకు కూడుకొని యేసు వాగ్దానమిచ్చినవరము నిమిత్తమై కనిపెట్టుచుండిరి. యేసు ఆరోహణమైన తరువాత 40 దినములకు వారందరు యథాప్రకారము ప్రార్థించుచుండఁగా కార్య 2 నందు సూచింపఁబడిన మహత్కార్యము జరిగెను. ఆ సమయమందు అందఱికంటె పేతురు యేసు పునరుత్థానుఁడై యున్నాఁడని సాహసపూర్వకముగా సాక్ష్యమిచ్చుచువచ్చెను. తానిదివఱకు అవమానపఱచిన ప్రభువును మహిమపఱచవలెనని ఆయననుగూర్చి మిగుల నిర్భయముగా సాక్ష్యమిచ్చెను. పెంతెకొస్తునాడు సంభవించిన వింత జరిగిన కొన్నాళ్లయినమీఁదట పేతురు యోహానుతో కలిసికొని దేవాలయము దగ్గఱ కూర్చుండి భిక్షమెత్తుచుండిన కుంటివానిని స్వస్థపఱచెను (కార్య $3^{2-12}$). పేతురు మతవ్యాపకమునకు మాత్రముకాక సంఘసవరణకు సహా శ్రద్ధవహించుకొని క్రీస్తు నామము ధరించుకొనినవారందఱు అన్ని విషయములయందు నిర్దోషులై యుండవలెననియు, సంఘమే యక్రమమువలననైనను భ్రష్టముకాకుండవలెనను చింతఁగలిగి యుండెననియు అననీయ సప్పీరల విషయములో ఆయన విధించిన శిక్షవలన స్పష్టముగుచున్నది. ఆ కుంటివానిని స్వస్థపఱచినందునను, అపొస్తలులు మహత్కార్యములు చేసినందునను (కార్య $5^{12}$). కలిగిన మతవ్యాపకమును గుఱించి యాజకులు ఆగ్రహము తెచ్చుకొని సువార్త యింకను వ్యాపింపకుండ చేయఁబూనుకొని అపొస్తలులను హింసించి వారిని చెఱయందుంచిరి. అయినను రాత్రి దేవదూతవచ్చి వారిని విడిపించి వారెప్పటిలాగున రాజ్యసువార్తను ప్రకటించుఁడని వారి కాజ్ఞాపించెను. స్తెఫను హతసాక్షియైన సమయమున కలిగిన హింసలవలన క్రీస్తుభక్తులు యెరూషలేములో నుండఁజాలక నలుదిశలకు చెదరిపోవలసి రాఁగా పరిచారకుఁడైన ఫిలిప్పు సమరయ పట్టణమునకు పోయి అక్కడ సువార్త ప్రకటించినందున అనేకులు సువార్త నంగీకరించిరి. అందును గుఱించిన సమాచారము యెరూషలేములోని అపొస్తలులకు తెలియచేయఁబడుటచే అక్కడ జరిగిన దేవుని పనిని తెలిసికొనుటకై పేతురును యోహానును ప్రతినిధులనుగా నేర్పఱచి వారి నక్కడికి పంపిరి. ఫిలిప్పు యత్నమువలన నమ్మిన వారి కొఱకై పేతురు ప్రార్థించఁగా వారు

పరిశుద్ధాత్మను పొందుట (కార్య 8[17]) జూచి, గారడీవాఁడైన సీమోను అది అపొస్తలుల సామర్థ్యమువలన కలిగిన వరమనియు తనకంటె వారు గారడీ విద్యామర్మము నెక్కువగా నెఱిఁగిన వారనియు భావించుకొని వారికిగల మహాశక్తిని సంపాదింప బూనుకొనెను. మఱియు అతఁడు అదియొక లౌకికవిద్యయనియు తాను సంపాదించు కొన్నయెడల అధిక ద్రవ్యసేకరణమునకు మూల మగుననియు తలఁచి అపొస్తలులకు కొంత సొమ్మిచ్చి ఆ శక్తినిపొంద యత్నించఁగా పేతురతని దురభిప్రాయమును గుర్తించి అతని ద్రవ్యాశను ఖండించి గట్టిగా గద్దించెను.

పౌలు క్రైస్తవుఁడయిన తరువాత దమస్కు నుండి యెరూషలేమునకు తిరిగి వచ్చినపుడెవరును ఆయనకు స్వాగతమివ్వని యనుమానించినను పేతురు అతని తనయింటఁజేర్చి పదిహేనుదినముల (గల 1[18]) వఱకు అతని పరామర్శించెను. గనుక పౌలు క్రైస్తవుఁడయినది మొదలుకొని పేతురుకును ఇతనికిని స్నేహముండినట్లు తెలియుచున్నది. ఆ మధ్యను పేతురు యూదయ ప్రాంత్యమున సంచరించి లుద్దలో నేర్పడిన సంఘము నాదరించుటకై వెళ్లి ఆ యూరిలో బసచేయుచుండఁగా 8 సం॥ నుండి పక్షవాయువు వలన మంచములో పడియుండిన ఐనెయా అను వ్యాధిగ్రస్థుని స్వస్థపఱచెను (కార్య 9[32-35]). ఆ సమయమందు లుద్ద, షారోను ప్రాంత్యములలో ననేకులు ఆయిన యత్నమువలన సువార్త నంగీకరించిరి. అచ్చటినుంచి యొప్పేకువచ్చి ఆ సమయమందే మరణమైన దొర్కా అను నాఱు పేరుగల తబీతాను పునర్జీవముగల దానినిగాఁ జేసెను. పేతురు యొప్పేలో బహుదినములు గడిపిన తరువాత కైసరయ కాపురస్థుఁడైన కొర్నేలియను శతాధిపతి అతనిద్వారా మత బోధను తెలిసికొనుటకై అతని నిమిత్తము మనుష్యులను బంపెను. ఆ కార్యము నిమిత్తమై కార్య 10[9-18] యందు విస్తరింపఁబడిన యొకదర్శనము ద్వారా దేవుఁడు ముందుగానే పేతురును హెచ్చరించియుండెను. అదివఱకు పేతురు తన స్వజనులకు సువార్తను బోధించుటయందు అత్యాసక్తి యగుపఱచినను, అన్యజనులకు ప్రకటించుట తన కర్తవ్యమై యున్నట్టు గ్రహించలేదు గనుక ఈ దర్శనము మూలముగా యేసు తాను రాజ్య వ్యాపకత్వమును గుఱించి యిచ్చిన కడపటి యాజ్ఞను పేతురుకు జ్ఞాపకపఱచ తలఁచెనని నిశ్చయింపతగును. ఆ మీఁదట పేతురు అభేద మనస్సుగలవాఁడై తన స్వజనులకువలె అన్యులకును సువార్త తెలియఁజేయుట తన బాధ్యతయని యెఱిఁగెను. ఇందువలన తక్కిన అపొస్తలులకు సందేహము కలిగి వివాదపడిరి (కార్య 11). పేతురు తాను చేసినది తన స్వయోచన ననుసరించి కాదుగాని దైవాజ్ఞానుసారముగాఁ జేసితినని వారికి నిశ్చయము కలుగఁజేయఁగా వారందఱు దైవసంకల్పమునకు సంతోషించి, దేవుఁడన్యులకు సహా రక్షణభాగ్యము ననుగ్రహించినందున ఆయన నామమును స్తుతించిరి. ఈలాగుండఁగా మొదటి హేరోదు అగ్రిప్పా, సంఘమును హింసించి జెబెదయి కుమారుఁడైన యాకోబను అపొస్తలుని వధించి పేతురును సహా చంపఁదలచి అతనిని పట్టి చెఱయందుంచఁగా రాత్రి దేవదూత అద్భుతరీతిగా నతని తప్పించెను (కార్య 12). ఆ మీఁదట పేతురు అంతియొకయ సంఘమందు కలిగిన విభేదమును గుఱించి యెరూషలేమున సమావేశమయిన సభయందు చెప్పిన సలహా (కార్య 15) మూలమున తెలియనగును. ఆ సభ జరిగిన తరువాత పేతురు చర్యలు కార్యముల గ్రంథమందు సూచింపఁబడవు గనుక ఆయన దైవరాజ్యాభివృద్ధి కొనర్చిన యత్నములను ఆయన పత్రికలను జదివి తెలిసికొన నావశ్యకమగును.

3. ఇతర గ్రంథములలోని చరిత్రము. పైన ప్రస్తావింపఁబడిన సభ జరిగిన కొంతకాలమునకు పేతురు అంతియొకయ సంఘమును దర్శించి భేదాభేదము లేకుండ యూదులతోను అన్యులతోను కలిసిమెలిసి యుండఁగా యెరూషలేము నుండి వచ్చిన కొందఱి దుష్ప్రేరణవలన ఆ సంఘములోని యూదులైన క్రైస్తవులు అన్యుల సహవాసము విడిచి వారితో సహా పంక్తి భోజనము చేయకుండుటచూచి పేతురును వారి తప్పభిప్రాయమనుసరించి తిరిగి అన్యుల సహవాసము చాలించుకొనెను. అందుకు పౌలు యెరూషలేము సభలో పేతురు భేదాభేదము లేకుండా అందఱు

రక్షణకు పాత్రులని వాదించిన వాదమునుబట్టి అతఁడీలాగున మాటతప్పుటవలన దైవరాజ్యాభివృద్ధి కభ్యంతరము కలుగుననియు అది ప్రభువు యెదుట అవిశ్వాసమనియు (గల $2^{11}$) ముఖాముఖిగా అతనిని గద్దించెను. పిమ్మట పేతురే యే ప్రాంత్యములలో సంచరించెనో నిశ్చయముగా తెలిసికొన సాధ్యముకాదు. I పేతు $5^{12,13}$ యందు అతఁడు మార్కుతోను సీలతోను కలిసి యుండెనని విశదమగును గాని ఆయన ఆ మధ్య నెక్కడ యుండెనో చెప్పసాధ్యము కాదు. ఆ వాక్యమందు బబులోనులో మీవలె నేర్పఱచఁబడిన ఆమెయు మీకు వందనములు చెప్పుచున్నది అని చెప్పఁబడుటవలన పేతురా పత్రిక వ్రాయునపుడు బబులోనులో నుండెనని కొందఱు వేదవ్యాఖ్యాతలు నిశ్చయించుకొందురు. అయినను ఆ కాలమందలి గ్రంథకర్తలలో పెక్కండ్రు, రోమాపురయని పేరుగా వచింపక బబులోనను పేరుచే దాని సూచించుట వాడుక గనుక పత్రిక వ్రాసిన తరుణమున పేతురు రోమాయందుండెనని వారి యభిప్రాయము. మొదటి పత్రిక పొంతు గలతియ కప్పదొకియ ఆసియ బితూనియ అను దేశములయందు చెదరినవారిలో చేరిన భక్తుల నిమిత్తమై రచించఁబడుటనుబట్టి పేతురు చిన్నాసియ ఈశాన్య మూలయందుండిన ప్రదేశములలో సువార్త సంచారము చేసెనని భావించుకొందురు గాని అందునుగుఱించి నిష్కర్షగాఁ జెప్పసాధ్యము కాదు. I కొరి $1^{12}$ $3^{22,23}$ లో వర్ణింపఁబడిన దానిని ఆధారము చేసికొని పేతురు కొరింథు సంఘమును దర్శించి అక్కడ బోధించెనని చెప్పుటకద్దు. అలాగుననె తరువాత కాలమందు కొరింథు సంఘాధ్యక్షుఁడై యుండినందున దియోనిసియుసు పేతురు కొరింథులో నుపదేశించెనని తన గ్రంథమందు వర్ణించెను. అయినను శ్రద్ధగా విచారించిన నిది యితిహాసముగాని నిశ్చయమైన సంగతికాదని తీర్మానించక విధిలేదు.

రోమను కతోలిక్కులు పేతురు తమ సంఘస్థాపకుఁడని యగుపఱచ యత్నించి ఆయన రోమా సంఘమును స్థాపించి 25 ఏండ్లవఱకు అధ్యక్షుఁడుగా నుండి పరిపాలించెనని చెప్పుదురు గాని ఆయనను గుఱించి క్రొత్త నిబంధనయందు వివరింపఁబడిన వివరములను, సంఘ చరిత్ర వృత్తాంతములను విచారించఁగా వారి యభిప్రాయమునకు లేశమైనను ఆస్పదములేదని రూఢియగును. M.

## పేతురు వ్రాసిన మొదటి పత్రిక

(Peter, First Epistle of) పేతురుయొక్క జీవితచరిత్రమునుగూర్చి తెలిసికొనఁగోరినయెడల పేతురు అను మాట క్రింద చూడుము:

1. గ్రంథకర్త. ఈ పత్రికను రచించిన గ్రంథకర్త పేతురని వేదవేత్తలందఱును ఒప్పుకొనుచున్నారు.

2 బహిస్సాక్ష్యము. క్రీ॥ శ॥ 260-339 సం॥ వఱకును జీవించిన యుసేబియసు (*Eusebius*) అను సంఘ చరిత్రకారుఁడీ పత్రిక సర్వాంగీకారమైన ప్రమాణ గ్రంథాగ్రములలో కలిసియుండెనని తెలియఁజేసెను. పషీటా (*Peshitta*) అను సిరియా భాషాంతర గ్రంథమందును. వల్గెటు (*Vulgate*) అను పురాతన లాటిన్ గ్రంథమందును ఈ పత్రిక చేర్పఁబడి యుండెను. మఱియు క్రీ॥ శ॥ 70-155 సం॥ వఱకును జీవించిన పోలికార్పును, (*Polycarp*) క్రీ॥ శ॥ 100-140 సం॥ వఱకును జీవించిన పాపియ (*Papias*) యును, క్రీ॥ శ॥ 160-230 సం॥ వఱకును జీవించిన తెర్టులియను (*Tertulliun*) ను, క్రీ॥ శ॥ 175-200 సం॥ వఱకును జీవించిన ఐరేనియసు (*Irenaeus*) ను ఈ పత్రికను రచించిన గ్రంథకర్త పేతురని సూచించుచున్నారు.

3. అంతస్సాక్ష్యము. పత్రికను రచించినవాఁడు పత్రిక $5^{1}$ నందు తాను ప్రభువైన యేసు క్రీస్తు అనుభవించిన శ్రమలను కన్నులారఁ జూచినవాఁడైనట్టును $1^{8}$ నందు యేసును చూచినవారిలో తానున్నట్టును ఉదాహరించుచున్నాఁడు. అదియుఁగాక $5^{2}$ నందు దేవుని మందను కాయుఁడి అను మాట, యోహా $21^{16}$ లో నా గొఱ్ఱెలను కాయుమని యేసు తనతో చెప్పిన మాటను జ్ఞాపకముచేసికొని వ్రాసెననియు, $5^{5}$ నందు మీ యెదుటివానియెడల దీనమనస్సను వస్త్రము ధరించుకొనుఁడు అను మాట యోహా $13^{13}$ యేసు తన శిష్యుల పాదము కడుగుటను జ్ఞాపకము చేసికొని గ్రంథకర్త ఇట్లు వ్రాసెననియు తోఁచక మానదు. $2^{20-25}$ వఱకు

గ్రంథకర్త చెప్పిన హెచ్చరికలవలన అతఁడు యేసు విచారణలో నున్నప్పుడు దగ్గరనుండిన వాఁడని దృఢమగును. అదియుఁగాక II పేతు $3^{1}$ నందు ఈ రెండవ పత్రిక మీకిప్పుడు వ్రాయుచున్నాను అను మాటవలన ఆయన యిదివఱకొక పత్రిక వ్రాసినవాఁడను దానికిసాక్ష్య మేర్పడుచున్నది.

పైచెప్పిన విషయము లన్నియు పేతురు యొక్క చరిత్రకు సంబంధించినవి గనుక ఈ పత్రిక వ్రాసినవాఁ డాతఁడేనని నిస్సందేహముగా చెప్పఁ గలుగుదుము.

4. ఎవరినిమిత్తమై వ్రాయఁబడెను? ఈ పత్రిక పొంతు గలతియ కప్పదొకియ ఆసియ బితూనియ అను దేశములయందు చెదిరినవారిలో చేరిన యాత్రికులకు నిచితమైనట్లు $1^{1}$ నందు సూచించఁబడెను. సాధారణముగా చెదరిపోయిన వారను మాట పలెస్తీను దేశమునకు వెలుపల నివసించుచుండిన యూదులకు చెల్లుటవలన పేతు $1^{1}$ నందు వివరింపఁబడిన ప్రాంతములలోని యూదులైన క్రైస్తవుల నిమిత్తము ఈ పత్రిక వ్రాసెనని వేద పండితులలో కొందఱి యభిప్రాయము. ఆ యభిప్రాయమునకు సమ్మతించని పండితోత్తములు చక్రవర్తియైన నీరోవలన కలిగిన హింసలచే రోమాపురి విడిచి చెదరిపోయిన భక్తుల నిమిత్తము వ్రాసెనని నిశ్చయింపుకొందురు.

5. కాలస్థాన నిరూపణము. ఈ పత్రిక $5^{13}$ నందు బబులోనులో మీవలె నేర్పఱచఁబడిన ఆమెయు, నా కుమారుఁడైన మార్కును మీకు వందనములు చెప్పుచున్నారు అను మాటనుబట్టి పేతురు బబులోనునుంచి యీ పత్రికను రచించి పంపెనని అనేకుల యభిప్రాయము. అయినను బబులోనను మాట విషయమై పెక్కండ్రు పండితులు సంశయించి అది రోమాపురిని సూచించు గుప్తపదమని తలంచుదురు. పూర్వకాలమున బబులోనురాజులు యూదులను బాధపరచినట్టు పేతురు కాలమున నీరోచక్రవర్తి క్రైస్తవులను హింసించుచుండెను. గనుక ఆ సంగతిని మనస్సున తలంచి నేరుగా చెప్పుట యుక్తముకాదని యిక్కడ రోమాపురికి ప్రతిగా బబులోనను పేరు నుపయోగించెనని వారి యభిప్రాయము.

ఈ పత్రిక ఎక్కడ వ్రాయఁబడెనో ఖచ్చితముగా తీర్మానింప చాలినంత ఆస్పదములేకుండినను ఈ పత్రిక రోమాపురియందు లిఖితమాయెనని పెక్కండ్రు పండితుల యభిప్రాయము. పేతురు క్రీ॥ శ॥ 67 సం॥ మున హతసాక్షియాయెను గనుక ఈ పత్రిక అంతకు పూర్వమే లిఖితమై యుండెను. అదియుఁగాక పౌలు రోమీయుల ఉత్తరములో సూచించిన అంశము లీ పత్రికయందు అగుపడుటవలన రోమీయుల పత్రికను చూచి పేతురు తన పత్రికను వ్రాసెనని స్పష్టమగును:—

| | | | |
|---|---|---|---|
| I పేతురు | 3:8-9. | రోమా | 12:10, 13-16. |
| ,, | 1:14 | ,, | 12:2 |
| ,, | 2:6-10 | ,, | 9:32:33 |
| ,, | 2:13 | ,, | 12:1-4 |
| ,, | 4:9 | ,, | 12:13 |

(చూడుఁడు.)

పౌలు రోమీయులకు పంపిన పత్రిక క్రీ॥ శ॥ 58 సం॥ అంత్యమున లిఖితమాయెనని తీర్మానించతగును కాఁబట్టి యీ పత్రిక 58-67 సం॥ మధ్యమందనఁగా క్రీ॥ శ॥ 65 సం॥ మున రచించఁబడెనని నిశ్చయమగును. M.

6. ముఖ్య భాగములు:—

I. పీఠిక $1^{1-12}$: 1. పై వ్రాఁత, వందనములు ($1^{1,2}$).

2. కృతజ్ఞత ($1^{3-12}$) *a.* నిరీక్షణకొఱకు ($1^{3-5}$); *b.* సంతోషముకొఱకు ($1^{6-9}$); *c.* రక్షణయొక్క గొప్పతనముకొఱకు ($1^{10-12}$); ఈ రక్షణ ప్రవక్తలచేత ముందుగా తెలుపఁబడెనేగాని వారి కనుగ్రహింపఁబడలేదు. దూతలాశ్చర్యములతో అది యెట్టిదో యని తొంగి చూడఁ గోరుచున్నారు.

II. నీతులు $1^{13}$-$5^{13}$: 1. దేవుఁడు పరిశుద్ధుఁడు గనుక వారును పరిశుద్ధులై యుండవలెను ($1^{13}$ $2^{10}$). *a.* దేవుని తీర్పునుబట్టియు ($1^{13-17}$). *b.* క్రీస్తు విమోచనమును బట్టియు ($1^{18-22}$). *c.* దేవుని వాక్యములను నమ్ముటను బట్టియు ($1^{23}$-$2^{10}$) వారు పరిశుద్ధులై యుండవలెను.

మగును. ఈ ప్రత్యక్షీకరణ మను గ్రంథము రెండవ శతాబ్దమందు అలెక్సంద్రియ పట్టణమున రచింపఁబడెనని పెక్కుల భావము. కాఁబట్టి పేతురు వ్రాసినట్టు చెప్పఁబడు రెండవ పత్రికయు నదేస్థలమందు అదే సమయమందు లిఖితమాయెనని తలఁచెదము. ఈ పత్రికలోని విషయములు అలెక్సంద్రియ పట్టణములో వెలసిన ఫైలోయు (*Philo*), క్లెమెంతును (*Clement*) రచించిన గ్రంథములలోని విషయములకు మిగుల సంబంధమగుచున్నందున పై చెప్పిన అభిప్రాయమున కధిక యాధారము కలుగుచున్నది. M.

5. ముఖ్యభాగములు:

I. పీఠిక: పై వ్రాఁత. వందనవాక్యము $1^{1-4}$.

II. దేవుని వాగ్దానములనుబట్టి సభవారు మంచి క్రైస్తవ నడత నవలంబింపవలెనను హెచ్చరికలు $1^{5-11}$.

III. ఆ వాగ్దానములు సువార్త నిశ్చయతను రూఢిపఱచుచున్నవి $1^{12-21}$.

1. చూచిన దానివలన ($1^{12-18}$).

2. లేఖనములు ఆత్మావేశముతో వ్రాయఁబడుటవలన ($1^{19-21}$).

IV. తప్పు బోధలను ఖండించుట $2^{1-22}$. ఈ యధ్యాయము యూదా పత్రిక వంటిది.

V. క్రీస్తురాకడవిషయము అవిశ్వాసులు కాకుండునట్లు జాగ్రతచెప్పి వారు దానికొఱకు సిద్ధపడవలెనని హెచ్చరిక చేయుట $3^{1-17}$.

VI. ఆశీర్వాదము, స్తుతివాక్యము $3^{18}$.

**పేరు, పేరులు, నామము, నామములు (Name, Names).** మనలోనున్న పేరులకు భావములున్నను వాటి భావమునుబట్టి కాక, ఆయా పేరులకునుండు సంబంధమునుబట్టి గాని, వాటి రమ్యతనుబట్టి గాని ఆయా పేరులను పెట్టుదురు. అయినను కొందఱు తమ బిడ్డలకు ఆయా పేరుల యర్థమునుబట్టి పేరుపెట్టుటనుకూడ చూచుచున్నాము. బైబిలుకాలమును చూడఁగా నివ్విధమున సార్థకనామములను పెట్టుట సర్వసాధారణమై యుండెను. ఆయా మనుష్యుల నామములను గూర్చియు, ఆయా స్థలముల పేరులను గూర్చియు, మనుష్యులు దేవుని కారోపించిన నామములను గూర్చియు నిందులో క్లుప్తముగ ప్రశంసింపఁడమగును.

I. మనుష్యులపేరులు. మనలోనున్నట్లు కొన్నిచోట్ల బైబిలులోకూడ పేరు కీర్తికి సమానమైనదై యున్నది (I సమూ $18^{30}$ II సమూ $8^{13}$ సామె $22^{8}$) గాని యిది మిగుల అరుదుగానున్నది. పాఁత నిబంధనను చూడఁగా బిడ్డ పుట్టినతోడనే తల్లి దానికి పేరుపెట్టినట్లు తెలియును (ఆది $4^{1}$ $14^{37,38}$ $29^{32-35}$ మొ॥). కొన్ని సమయములలో తండ్రి తన బిడ్డకు పేరుపెట్టి యున్నట్టు చూడఁగలము (ఆది $4^{26}$ $16^{15}$ $21^{3}$ $35^{18}$ II సమూ $12^{24,25}$). ఒకానొకప్పుడు బంధువులు బిడ్డకు పేరు పెట్టినట్లున్నది (రూతు $4^{17}$). క్రొత్త నిబంధన కాలమునందు బిడ్డకు సున్నతిచేసినపుడు వానికి పేరు పెట్టినట్లున్నది (లూ $1^{59}$ $2^{21}$) గాని అది పూర్వకాలములోని వాడుక కానట్లు తెలియుచున్నది. చిన్నతనములో పెట్టిన పేరునుమాత్రము గాక, కొందఱు ఆయా కార్యములకు జ్ఞాపకార్థముగా క్రొత్త పేరులను పొందియున్నారు. దృష్టాంతముగా, అబ్రాము అబ్రాహామనియు, యాకోబు ఇశ్రాయేలనియు, దానియేలు బెల్తెషజ్జరనియు మాఱు పేరులను బొందిరి. అరవ వారిలో పూర్వమున్నట్లు బైబిలులోకూడ ఒక్కొక్కరికి ఒక్క పేరుమాత్రమున్నదిగాని ఒకటే పేరుగల వారి నుండి ఆయా వారలను విభేదించుటకు ఆయా వారలెవరెవరికుమారులో సూచించి యున్నారు. ఒకానొకప్పుడొకని పేరుతో నతఁడు పుట్టిన స్థలమునుకూడ చేర్చియున్నారు (II సమూ $23^{24-39}$). మగ్దలేనేమరియ పేరిట్టిదే. కొన్ని పేరులను విభేదించుటకు వారి వృత్తిని కూడ పేరులతో చేర్చియున్నట్లు చూడఁగలము. ప్రవక్తయగు నాతాను, సుంకరియైన మత్తయి, అరెయొపాగీతుఁడైన దియొనూసియు మొదలగు పేరు లిట్టివి. క్రొత్త నిబంధనలో హెబ్రీ ప్రాకృతమనఁదగిన వాడుక భాషనుకాక, గ్రీకు భాషనుకూడ వాడిరి కావున కొందఱికి హెబ్రీ పేరొకటియు గ్రీకు పేరొకటియు రెండు పేరులున్నట్లు చూడగలము. దృ॥ కేఫా పేతురు, తోమా దిదుము, మెస్సీయ క్రీస్తు.

ఆయా పేరుల విధములను చూడఁగా, వాటిలో కొన్ని సురూపముగల మృగముల పేరులైయున్నవి. దృ॥ తెరహు (అడవిమేఁక), లేయా (అడవియావు), యోనా (పావురము), తబీతా (లేడి) మొదలైనవి. ఇదియుఁగాక సౌందర్యములగు చెట్లను పుష్పములను సూచించు కొన్ని పేరులునుగలవు. దృ॥ తామారు (ఈఁత చెట్టు), సూసన్న (లిలీయాపుష్పము), ఏలా (ఓకుచెట్టు) మొదలగునవి. సౌందర్యము అను నర్థమునిచ్చు కొన్ని పేరులును గలవు. దృ॥ షిఫ్రా (సౌందర్యములేక సుందరమ్మ). నాయొమి (సంతోషమ్మ) మొ॥. వీటికి వ్యతిరేకముగా భయంకరత్వమును సూచించు పేరులుకూడ కొన్ని యున్నవి. దృ॥ గెషెము (గాలివాన), బారాకు (మెరుపు).

తలిదండ్రులు పొందిన మేలునకు జ్ఞాపకార్థముగాను లేక బిడ్డలవిషయము తల్లిదండ్రులకు గల నిరీక్షణకు సూచనగాకూడ పెట్టినపేరులు కొన్ని యున్నవి. దృ॥ షిమ్యోను (వినఁబడెను), సమూయేలు (దేవుఁడు మనవి నను గ్రహించెను), యోసేపు (దేవుఁడు చేర్చును), నెతన్యా (యెహోవా యిచ్చెను) అను పేరులు తలిదండ్రులు తాము పొందిన మేలునకు జ్ఞాపకార్థముగా పెట్టిరి. నోవహు (నెమ్మది), హోషేయ (యెహోవా రక్షించును), యెహెజ్కేలు (యెహోవా బలపఱచును), జెకర్యా (యెహోవా జ్ఞాపకమందుంచుకొనును) అను నిట్టి పేరులు బిడ్డలకుగాని బిడ్డలమూలముగా నితరులకుగాని కలుగు మేలుల విషయమైన నిరీక్షణను చూపును.

కొన్ని పేరులు పిల్లలకు (ఒకానొకప్పుడు పెద్ద వారికికూడ) నుండు ఏదోయొక విశేష లక్షణము వలన కలిగెను; దృ॥ ఏశావు (=ఎఱ్ఱనివాడు), యాకోబు (=మోసము చేయువాఁడు), లాబాను (=తెల్లనివాఁడు) మొదలగునవి. ఇట్లే పేతురు నకుకూడ పేరు వచ్చెననుకొనఁదగును.

దేశమునందలి ఆయా యిబ్బందులవలన కొన్ని పేరులను పెట్టిరి. దృ॥ ఈకాబోదు (=మహిమ తొలఁగెను), హోషేయ బిడ్డలపేరులు (హోషే 1), యెషయా పిల్లల పేరులు (యెష 7³ 8¹⁻⁴).

దేవుని ఘనము నిమిత్తము పెట్టిన పేరులు కూడకలవు. దృ॥ ఏల్ (= దేవుఁడు), యా (= యెహోవా), బయలు (= ప్రభువు), మెలెకు (=రాజు), అదోనై (= ప్రభువు), అబ్ (=తండ్రి) అను నిట్టి ప్రత్యయము లేయే పేరులలో చేరి యున్నవో అట్టి పేరులన్నియు ఈ రకమునకు సంబంధించినవైయున్నవి. ఇట్టివనేకములు గలవు. ఈ విధముగా దైవసంబంధములైన పేరులను పెట్టుట అన్నిఁటిలో సర్వ సాధారణము.

పాఁత నిబంధన ముగింపుకాలమును, క్రొత్త నిబంధనకాలమును చూడఁగా తాతపేరునుబట్టి, తండ్రి పేరునుబట్టి యొకబిడ్డకు పేరు పెట్టుట వాడుకై యుండెను (లూ 1⁵⁹,⁶¹). ఇందువలన ఒక వంశమునందు ఒకటే తరహా పేరులు మాటి మాటికి కనఁబడును.

II. ఆయాస్థలముల పేరులు:—అనేక స్థలముల పేరులకు అర్థము తెలియదు. అవి పురాతన మైనవియు, ఇశ్రాయేలీయులు కనానుకు రాక పూర్వము వాటికి ఆయా జనములవారు పెట్టినవి యునై యున్నవి. వారి భాష తెలియకయుండు టచే వారు పెట్టిన పేరుల యర్థముకూడ తెలి యుటలేదు. అయితే ఆ స్థలములో అనేకమైన వాటి పేరులు హెబ్రీ పేరులైయుండుటచే వాటి యర్థముకూడ తెలియుచున్నది. ఇట్లు యా స్థలములకీ క్రిందివిధముగా పేరులను పెట్టిరి.

చెట్ల పేరులు: ఏలా (=ఓకుచెట్టు), తామారు (=ఈఁతచెట్టు), తప్పూయహు (= రేఁగుచెట్టు), అనునవిట్టివి. కొన్ని స్థలముల పేరులు జంతువుల పేరులైయున్నవి. దృ॥ అయ్యాలోను (= మగ జింక), ఈర్నాహాషు (= నాగులపట్టణము).

కొన్ని స్థలములకు వాటి సౌందర్యమునుబట్టి లేక భూసారమునుబట్టి పేరులు వచ్చెను. దృ॥ కర్మెలు (=వనము), షాపెరు (=సౌందర్యము), లెబానోను (=తెల్లనిది).

కొన్ని నీటియూఁటల సమీపమున నుండు టచే వాటికి సంబంధమైన పేరులు కలిగెను దృ॥ ఏన్ (=ఊఁట), బెయేర్ (=బావి), మే (=జలము), అను ప్రత్యయము లేయే పేరులతోఁ గలసియున్నవో అవి యిందులో చేరియున్నవి.

ఉ॥ ఏన్గెదీ, బెయేర్షెబా, మేదబా (సంఖ్యా 21[30]) మొదలయినవి.

కొన్ని స్థలముల పేరులు కొండలకును కోటలకును సంబంధించియున్నది. దృ॥ గెబా, గిబా, రామా మిస్పా అను ప్రత్యయముగల పేరు లిట్టివే. గుడారములనుకాక, స్థిరమైన నివాసములను సూచించు పేరులును గలవు. దృ॥ బేత్ (=ఇల్లు), హాజోరు (=ఊరు), అను ప్రత్యయములుగల పేరు లిట్టివైయున్నవి. పట్టణమును సూచించు ప్రత్యయములుగల యూళ్లు కొన్ని యున్నవి. దృ॥ కిర్, కిర్యోతు, ఈర్ అను ప్రత్యయము లిట్టివి.

ఆయా స్థలములకు కొన్ని దేవతలపేరులుకూడ కలవు. దృ॥ షెమెషు (=సూర్యదేవత) అనత, బయల్, నెబో యనుపేరు లిట్టివి. ఇట్లే ఏల్ అను ప్రత్యయముకూడ బేతేలు ఇశ్రాయేలు మొదలగు స్థలముల పేరులలో కనఁబడును.

III. దేవునికి ఆరోపింపఁబడిన పేరులు:— దీని వివరము దేవుడు అను పదము క్రిందనున్నది. ఇచ్చట దేవుని నామమునకు (మానవులు) చూపిన విశేష ఘనతనుగూర్చి మాత్రము ప్రశంసింపఁబడును. దేవునికి ఎట్టి ఘనమును చూపవలెనో దానినే ఆయన నామమునకుకూడ చూపవలెను. దేవుని నామమును, దేవుఁడును ఒక్కటేయై యున్నట్లు అనేక వాక్యములలో కనఁబడును (నిర్గ 23[21] 34[4-7] మొ॥). దేవుఁడు తన నామమునకు జ్ఞాపకార్థముగా పేరుపెట్టిన ప్రతిష్ఠలమును పరిశుద్ధమైన దయ్యేను (20[24] ద్వితీ 12[5] I రాజు 8[29] మొ॥). ఈ నామములన్నిఁటిలో మనము యెహోవా యని యుచ్చరించు నామమును పరిశుద్ధముగా నెంచి యూదులు తమ బైబిలు చదువునప్పుడు ఆ నామము నుచ్చరింపక దానికి బదులుగా ప్రభువు అను నర్థమునిచ్చు అదోనై అను నామమును చదివిరి. సర్వోన్నతుఁడు (ఆది 14[18-20]), సర్వశక్తుఁడు (17[1] నిర్గ 6[3]), ఆయన యౌన్నత్యమును సూచించు ఏల్ లేక ఏలోహీము (దీనిని దేవుఁడు అని తర్జుమచేసిరి) ప్రభువు (ఆది 15[2,8] 18[3] మొ॥) అను నీ నామములుకూడ మిగుల పరిశుద్ధమైనవి. పాతనిబంధన కాలమునకుఁ బిమ్మట యూదులు దేవుని నామములలో దేనినైనను వాడక వానికి ప్రతిగా పరలోకము అను నర్థమునిచ్చు పదమును వాడుచుండిరి. ఇట్లు పరలోకరాజ్యము అనఁగా దేవుని రాజ్యము అని యర్థమగును క్రీస్తు, దేవునికి తండ్రియను పేరు పెట్టి మనము దేవునిగూర్చి మాటలాడుటకు వెఱవక ఆయననుగూర్చి ప్రేమతో భక్తితోను మాటలాడవలెనని మనకు బోధించి, దేవునిగుఱించి మాటలాడుటలో యూదులకుఁగల మితిమీఱిన భయమును పోఁగొట్టెను.

యూదులు దేవుని నామమును ఎంత ఘనముగా నెంచిరో క్రీస్తు శిష్యులు క్రీస్తు నామమును అంత ఘనముగా నెంచిరి. శిష్యులు, తండ్రి పరిశుద్ధాత్మతోకూడ ఆయన నామమున బాప్తిస్మమొందిరి (మ 28[18,19]). ఆయన నామమందలి విశ్వాసమువలన అద్భుతములను చేసిరి (కార్య 3[16]). క్రీస్తు నామమువలననేగాని మఱి దేనివలనను రక్షణలేదు (4[12]). ఆయన నామము నెదుట అందఱును మోకరింపవలెను (ఫిలి 2[9,10]). దేవుని నామమునకు చూపిన ఘనతనే క్రీస్తునకు చూపుటను చూడఁగా ఆది క్రైస్తవులు క్రీస్తును దేవునిగా నెంచుటనుగూర్చి సంశయమేమియులేదు.

పేలు కీటకములు 23 చూ॥

**పేలెతు** (Peleth = వేగిరము). యూదా సంతతివారిలో నొకఁడు (I దిన 2[33]). ఈ పేరుగల రూబేనీయుఁడొకఁడు గలఁడు (సంఖ్యా 16[1] పల్లు చూ॥).

# పై

**పైకప్పు** ఇల్లు II 2 చూ॥

**పైగిడికంకు** పక్షులు 6,14 చూ॥

**పైత్యము** (Gall). పైత్యపుతిత్తిని పొడుచుట (యోబు 20[25]), పైత్యమును నేలపోయుట (16[13]) గొప్ప హింసలకు గుఱుతుగా నున్నది. 20[14] లోనున్న నాగుపాముల విషము అను పదము మూలభాషలో నాగుపాముల పైత్యమని యర్థమగును. దీనినిబట్టియే పైత్యము గొప్ప దుర్మార్గతను సూచించును. కార్య 8[23] లోనున్న చేదైన పైత్యము

అని యర్థమిచ్చు పదమును ఘోరదుష్టత్వమని తెనిఁగించిరి. (చేదు 3 చూ॥).

**పైరాయి** (Head Stone). అనేక కట్టడములలో మూలరాతిని మాత్రమేగాక దానిని పూర్తిచేయు పైరాతినికూడ ఉత్సవముతో వేసిరి. అప్పుడప్పు డట్టిరాతిపై అది వేయఁబడిన కాలమునుకూడ దానిమీఁద చెక్కిరి. జెక $4^{7}$ లో నున్న పైరాయి అట్టిది దేవాలయము పూర్తియగుటను సూచించెను.

**పైవస్త్రము** వస్త్రములు 4 చూ॥

**పైవిలాసము, పైవ్రాత** (Superscription). సిలువ శిక్షకర్హులైన నేరస్థులను సిలువ వేయునప్పుడు వారు చేసిన నేరము నొక పలకపై వ్రాసి దానిని వారిమెడకు తగిలించి, వారిని సిలువవేసిన పిదప నా పలకలను సిలువకుఁగొట్టుట వాడుకయైయుండెను. క్రీస్తుకును ఆ రీతిగనే చేసిరి. దానికి పెట్టఁబడిన పేరును పైవిలాసమని మార్కు లూకాలలో తెనిఁగించిరి (మా $15^{26}$ లూ $23^{38}$). ఆ పదమునే నాణెముల మీఁద ముద్రించిన దానికిని వాటి పైవ్రాఁతలనే తెనిఁగించిరి (మ $22^{20}$ మా $12^{16}$ లూ $20^{24}$). శీర్షిక అని యర్థమిచ్చు మఱియొక పదమును యోహాను వాడినను దానినికూడ పైవిలాసమనియే తెనిఁగించిరి (యోహా $19^{19}$). మత్తయి ఈ రెండు మాటలలో దేనినిగాక నేరమని సరిగా తెనిఁగింపఁబడిన మఱియొక పదమును వాడెను (మ $27^{37}$). యేసు సిలువకు కొట్టఁబడిన పైవిలాసము మూఁడు భాషలలో వ్రాయఁబడినట్లు యోహానువలనఁ దెలియును. ప్రతి సువార్తలో పైవ్రాఁతయందున్న యూదుల రాజు అను మాటలు సమముగానున్నవి గాని తక్కిన మాటలలో కొద్దిభేదము కనఁబడుచున్నది. ఆ భేదము మూఁడు భాషలలో వ్రాయఁబడుటవలన కలిగియుండవచ్చును.

## పొ

**పొంగని భక్ష్యముల పండుగు** పండుగలు II 1 (1) చూ॥

**పొంతు** (Pontus=సముద్రము). చిన్నాసియలోని ఉత్తరభాగమందు బితునియకు తూర్పుగానుండు పరగణా. నల్లసముద్రము దగ్గర



నుండుటచేత నీ పేరు కలిగెను. అచ్చట క్రీ॥ ము॥ 400 సం॥ నుండి స్వతంత్ర ప్రభుత్వమొకటి యుండెనుగాని క్రీ॥ ము॥ 63 లో రోమీయులు దానిని స్వాధీనపఱచుకొనిరి. పెంతెకొస్తు పండుగు నాచరించుటకు ఆ దేశస్థులు వచ్చిరని కార్య $2^{9}$ వలనఁ దెలియును. యూదులచ్చట ఉండిరనుటకు ఇతర సూచనలును గలవు ($18^{2}$ I పేతు $1^{1}$).

**పొకెరెతు వంశస్థులు** (Pochereth-Hazzebaim = లేళ్లను పట్టువారు?). రాజైన సొలొమోను సేవకులలో బాబెలు చెఱకుఁ దరువాత జీవించిన యొకానొక తెగ (ఎజ్రా $2^{57}$ = నెహె $7^{59}$).

**పొక్కు, పొక్కుదద్దురులు** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥

**పొట్టిపుందేలు** మృగములు 43 చూ॥

**పొట్టు** (Chaff, husks). పాఁత నిబంధనయందు పొట్టు అను పదముచే తెనిఁగించిన సాధారణమగు హెబ్రీపదము దుర్మార్గుల నాశనమును సూచించు నిమిత్తము అలంకార రీతిగా ప్రయోగించిరి (యోబు $21^{18}$ కీర్త $1^{4}$ $35^{5}$ యెష $17^{13}$ $29^{5}$ జెఫ $2^{2}$). క్రొత్త నిబంధనలోను బాప్తిస్మమిచ్చు యోహాను అదేరీతిగా దుర్మార్గుల యంతమును దృష్టాంతపఱచెను (మ $3^{12}$ లూ $3^{17}$). ఇశ్రాయేలీయుల బలహీనతను దీనికి పోల్చిరి. (హోషే $13^{3}$). రక్షింపఁబడెడి ఇశ్రాయేలీయులు కొండలను సహా పొట్టుగా చేయుదురని వారికి కలుగనైయున్న శక్తినిగూర్చి చెప్పఁబడెను (యెష $41^{15}$).

$33^{11}$ లో నున్న పొట్టు అను పదముచే తెనిఁగించిన మూల భాషాపదము $5^{24}$ లో నున్నట్లు ఎండుగడ్డిని సూచించును. తృణీకరింపఁబడుట దీనికి పోల్చఁబడెను.

తప్పిపోయిన కుమారుఁడు తినిన పొట్టు (లూ $15^{16}$) పొట్టుగాక ఒకవిధమైన చెట్టుకాయలైయుండెను. పందులు వాటిని తినెను. బీదలును వాటిని పోగుచేసి దాచిపెట్టుకొని తినిరి.

**పొట్టేలు** గొఱ్ఱె చూ॥

**పొతియొలీ** (Puteoli = ఊటలు). ప్రస్తుతము ఇటలీదేశములోని నేపిల్సు (*Naples*)

అను పట్టణమున కుత్తరముగానున్న పొజ్జుయోలి (*Pozzuoli*) అను రేవుపట్టణముయొక్క పురాతనపు పేరు. ఐగుప్తు పలెస్తీనులనుండి వచ్చెడి ప్రయాణికులు సాధారణముగా దిగెడి రేవుపట్టణమని యోసీఫను వ్రాయుచున్నాఁడు (పురా 17. 12. 1; 18. 7. 2). రోమాకు ఖైదీగా వెళ్లుచుండిన పౌలు దీనిమీఁదుగా వెళ్లెను (కార్య 28[13]). అప్పటికే యచ్చట క్రైస్తవు లుండిరి. అది రేవుపట్టణమగుటచే భక్తిగల వర్తకులు సువార్తను మొదట ప్రకటించిరని యూహింపవచ్చును. (పటము V, B 2).

**పొత్తు** సహవాసము చూ॥

**పొద** (Bush). నిర్గ 3[2-6] లో నున్నట్లుగా దేవుఁడు మండుచుండిన పొదలో మోషేకు ప్రత్యక్షమయ్యెను. ఆ పొద యే చెట్టు పొదయో తెలియదుగాని, అది యా ప్రదేశములో విస్తారముగ నుండు ఒకవిధమైన తుమ్మ పొద యని కొందఱనుకొందురు. ఈ దర్శనమునకు సంబంధముగా ద్వితీ 33[16] లో దేవుఁడు పొదలోనుండినవాఁడు అనఁబడెను. ఆ చరిత్ర యుండు భాగమునకు లూ 20[37] లో నున్నట్లు పొద భాగము అని పేరు. స్తెఫను తన ప్రసంగములో ఈ చరిత్రనుకూడ ఎత్తెను (కార్య 7[30-35]).

**పొదిగించుట** వృత్తులు చేతిపనులు II 3 చూ॥

**పొప్లి** (Publius). పౌలు రోమాకుఁ బోవుచుండినయోడ బద్దలైన మెలితే దీవిలో అతనిని అతనితోటివారిని చేర్చుకొని ఆతిథ్యమిచ్చినవాఁడు. ఇతఁ డా దీవికి ముఖ్యుఁడు (కార్య 28[7]). ఆ బిరుదు ఆ దేశమందలి కొన్ని రాతి శాసనములమీఁదను కనఁబడుచున్నది. వాటి వలన ఇతఁడు మెలితేకు అధికారి యని తెలిసికొనవచ్చును. పౌలితని తండ్రిని స్వస్థపఱచెను (28[8]).

**పొయి** పంట సామగ్రి 3 చూ॥

**పొలిమేర రాయి** సరిహద్దురాయి చూ॥

**పొల్లు, సున్న** (Jot and Tittle). అసలు భాషనుబట్టి చూడఁగా ఈ మాటలు అక్షరములన్నిఁటిలో చిన్నయక్షరమును, ఆ యక్షరములో నుండు చిన్నగుఱుతులను సూచించును. తెనుఁగున పొల్లు, సున్నయనునవి అట్టివై యుండుటచే ఆ యసలుమాటలను అక్షరరీతిగా తెనిఁగింపక అక్షరములన్నిఁటిలో చిన్నవిగ నుండు వీటిచేత తెనిఁగించిరి. ధర్మశాస్త్రము సెలవేఱువఱకు అందులోని ఎంత చిన్నవిషయమైనను తప్పిపోదని బోధించుటకు క్రీస్తు వీటిని దృష్టాంతముగా వాడెను (మ 5[18]).

## పో

**పోగులు** కర్ణభూషణము, ఆభరణములు 18, 19 చూ॥

**పోతీఫరు** (Potiphar = సూర్య దేవత యొక్క దానము). ఫరోరాజుయొక్క ఉద్యోగస్థుఁడును రాజ సంరక్షక సేనాధిపతియునైన వాని పేరు (ఆది 37[36] 39[1]). ఇచట ఉద్యోగస్థుఁడు అను పదమునకు అసలుభాషలో నపుంసకుఁడు అను శబ్దార్థమునిచ్చు మాటకలదు (37[36] 39[1]). అయితే పోతీఫరుకు భార్యయున్నందుచేత (39[7,8]) ఆ పదమునకు ఇచట నపుంసకుఁడని కాక ఉద్యోగస్థుఁడు అను నర్థమని యూహింపఁదగును. అయితే ఈ యూహ రూఢియనలేము. సాధారణముగా తత్కాలమందలి రాజసేవకులు నపుంసకులై యుండుటచే ఆ రాజులయొద్దనుండు ఉద్యోగస్థులు నపుంసకులు కాకపోయినను వారికిట్టి బిరుదు వచ్చెనని కొంద ఱీ పోతీఫరు నపుంసకుఁడు కాఁడనుకొందురు. అయినను నపుంసకులుకూడ ఒకానొకప్పుడు వివాహముచేసికొనుట తటస్థించుచున్నది కావున ఈ యూహయును రూఢికాదు. ఇష్మాయేలీయులు యోసేపును ఇతని కమ్మిరి (37[36]). మఱియు నితని భార్య కుట్రవలన ఇతఁడు యోసేపును చెఱలో వేయించెను (39[1-20]). ఇతని యుద్యోగమునుగూర్చి సందేహము కలదు. ఎందుకఁగా దానిని వివరించుటలో నిచ్చట ఐగుప్తీయుల యుద్యోగపు పేరును వాడక, హెబ్రీభాషలో ఆ పనిని మాత్రము వ్రాసిరి. దానినిబట్టియే ఇతని యుద్యోగము నూహింపఁదగును.

**పోతీఫెర** (Potiphera = సూర్య దేవత యొక్క దానము). యోసేపు మామపేరు,

ఇతఁడు ఓను అను పట్టణములో నుండిన యాజకుఁడు (ఆది $41^{45,50}$ $46^{20}$ ఐగుప్తు 4 చూ॥).

**పోరాడుట, పెనుగులాడుట (Wrestling, Fight).** పోరాడుట యను ఈ పదముచే తెనిఁగింపఁబడిన హెబ్రీపదము అచ్చటచ్చట యుద్ధమును సూచించుచు (కీర్త $35^{1}$) సాధారణముగా **యుద్ధముచేయుట** యని తెనిఁగించఁబడెను (న్యాయా $5^{19,20}$ $9^{45}$ మొ॥). ఈ శీర్షికయందు దా పదముయొక్క అలంకారార్థములు మాత్రము వివరింపఁబడును.

(1) యాకోబు దూతతో పెనుగులాడుట అట్టి పదమై ఆది $32^{24,25}$ లో మాత్రమున్నది. అది కుస్తీచేయుటను సూచించినను, కుస్తీనిగాక దేవునిని వదలిపెట్టక ఆయనను వేడుకొనుట యని అంతరార్థమగును. (2) కుమారులను బడయుటకై రాహేలు పడిన ప్రయాసను సూచించుటకు వాడిన పదము పోరాటమని తెనిఁగించిరి ($30^{8}$). ఆ సంగతికి జ్ఞాపకార్థముగా ఆమె బిల్హా యను తన దాసీ కుమారునికి పోరాటమని యర్థమిచ్చు నఫ్తాలియను పేరు బెట్టెను. ఈ పదముకూడ కుస్తీని సూచించు ననుకొందురు. (3) క్రొత్త నిబంధన కాలమునందుండిన గ్రీకు వారు ఎక్కువగా కుస్తీ నభ్యసించిరి. వారట్టి కుస్తీలకు పెట్టినపేరు ఎఫె $6^{12}$ లో పౌలు వాడి, భక్తుఁడు సాతాను నెదిరింపవలసి దానికి సూచనగా దాని నెత్తెను. ఆ పదము గ్రీకు వారిలో బహు సాధారణమైనదై యుండినను క్రొత్త నిబంధనయందు దిచ్చటగాక మఱెక్కడను కనుపించదు. (4) పోరాడుటయని తెనిఁగింపఁబడిన మఱియొక గ్రీకుపదము గొప్ప ప్రయాసను సూచించును. ఫిలి $1^{30}$ లో దానిని ప్రయాసపడుట యనియు కొలొ $1^{29}$ లో పోరాడుచు ప్రయాసపడుట యనియు I తిమో $4^{10}$ లో **పాటుపడుట** యనియు తెనిఁగించిరి. బోధించుటయందును (I థెస్స $2^{2}$) ప్రార్థించుటయందును (కొలొ $2^{1}$ $4^{12}$) ప్రయాసపడుటయే అట్టి పోరాటమై యున్నట్లు పౌలీపదమును వాడెను. ఇట్లు క్రైస్తవ జీవము యావత్తును కష్టములతోను ఎదిరింపులతోను కూడినదై విశ్వాస సంబంధమైన పోరాటముగానెంచి అతఁడీ మాట నుపయోగించెను (I తిమో $6^{12}$ II తిమో $4^{7}$). పరుగెత్తు పందెమునుగూర్చి యొకమాఱు ఈ పదమే వాడఁబడెను (పందెమును చూ॥).

**పోరాతా (Poratha).** హామాను కుమారులలో నాల్గవవాఁడు. వీఁడును తన సహోదరు లందఱితో పాటు చంపఁబడెను (ఎస్తే $9^{8}$).

**పోర్కియు** ఫేస్తు చూ॥

## పౌ

**పౌత్రుఁడు** బంధువులు II 9 చూ॥

**పౌరత్వము, పౌరస్థితి** (Citizenship). ఇవి దేశ సంబంధమగు హక్కులను సూచించెడి పదములు. ఆదికాలములలో పట్టణములే గొప్ప రాజ్యములుగ నుండినందున, వాటికి సంబంధించిన హక్కులీ మాటలచే తెనిఁగించిన మూల భాషా పదమువలన సూచింపఁబడెను. పాత నిబంధన కాలమునందు ఇశ్రాయేలీయులు మత సంబంధమగు హక్కులను ముఖ్యములైనవిగా నెంచినందున దేశమునకు సంబంధించిన పదములు వారి భాషయందు లేకపోయెను. క్రొత్త నిబంధనలోఁ గానవచ్చు అట్టి మాటలు గ్రీకు రోమను పదములై యున్నవని తెలిసికొనవలెను. రోమా రాజ్యమునందు స్వతంత్రులకన్న దాసులే యెక్కువమంది యుండినను స్వతంత్రులకు కొన్ని విశేష హక్కులుండెను. నీచమైన శిక్షలను వారికి విధింపరాదు. తమ సంగతి చక్రవర్తిచే విచారింపఁబడునట్లు వారు అతనికి అప్పీలు చేసి కొనఁ గలిగియుండిరి. పట్టణమునకు సంబంధించిన సభలలో వారు సభికులై యుండిరి. పౌలు ఇట్టి హక్కుదారుఁడై యుండెను (కార్య $16^{37-39}$ $21^{39}$ $22^{28}$). సహస్రాధిపతియగు లూసియ చాల సొమ్మునిచ్చి ఆ హక్కును సంపాదించుకొనెను ($22^{28}$).

ఈ హక్కులు దేవుని రాజ్యమునందు చేరువారికి కలుగఁబోవు హక్కులను సూచించుటకు అలంకార రీతిగా వాడిరి (ఫిలి $3^{20}$). దేవుని ప్రజలుగా నెంచఁబడుట పౌరత్వ మనఁబడెను (ఎఫె $2^{19}$). ఫిలి $1^{27}$ లోని సువార్తకు తగినట్లు అను పదమునకు ఇట్టి పౌరస్థితికి తగినట్లుగా ప్రవర్తింపవలెనను భావమిచ్చును. ఆ పదమునే

కార్య $28^{1}$ నందు నడుచుకొనుట యని తెనిఁగించిరి. పరలోక పౌరస్థితి నొందినవారు ఈ లోకమర్యాదల ననుసరింపక, పరలోక మర్యాదల ననుసరించి ప్రవర్తింపవలెననుట దాని భావమై యున్నది.

**పౌలు** (Paul = చిన్నవాఁడు). అన్యజనుల కపోస్తలుఁడుగ నుండుటకు దేవునిచే పిలువఁబడినవాఁడు. ఇతని జీవితము నీ క్రింద నున్న రీతిగఁ జూడవచ్చును.

1. పేరు. ఇతని మొదటి పేరు సౌలు (కార్య $7^{58}$ $13^{9}$). బెన్యామీను గోత్రికుఁడు (ఫిలి $3^{5}$) గాన ఆ గోత్రమునుండి ఇశ్రాయేలీయుల మొదటిరాజగు సౌలు జ్ఞాపకార్థ మితనికా పేరును పెట్టియుందురు. పౌలనునది అతని రోమను పేరుకావచ్చును. రోమునకు సంబంధించిన దేశములలో అతఁడు మిషనేరి పని నారంభించి నప్పుడిది వాడుకలోనికి వచ్చియుండును.

2. జన్మము, కుటుంబము. చిన్నాసియలోని తార్సు పట్టణమతని జన్మస్థానము (కార్య $9^{11}$ $21^{39}$ $22^{3}$). ఇది మిగుల ముఖ్యపట్టణమై యుండెను (తార్సు చూ॥). అతని బంధువులు యూదమతాభిమానులును పరిసయ్యులునై యుండి ($23^{6}$). వారికి రోమా పట్టణపు పౌరత్వముగలదు ($22^{28}$). రాజ్య సంబంధమగు సేవజేసినందున అతని తండ్రికో తాతకో అట్టి హక్కు నిచ్చియుందురు. ఇతని కుటుంబము స్థితివంతమైనదిగఁ దోఁచుచున్నది. ఇతఁడు క్రైస్తవుఁడైనందున కుటుంబమునకు మారకుఁడై తన జీవనోపాధిని కష్టపడి సంపాదించుకొనవలసి వచ్చెను (I థెస్స $2^{9}$ కార్య $18^{3}$ $20^{34}$), గాని కొంతకాలమునకు వారు తమ మనస్సును మార్చుకొని ($23^{16}$) అతనికి కావలసినది యిచ్చియుందురు. అతఁడు మొదటిసారి రోమాలో చెఱయందుండఁగా తన అద్దెయింట రెండు సంవత్సరములవఱకు కాపురమున్నట్లు సూచనలున్నందున ($28^{30}$) అతఁడు తన భాగమునకు హక్కుదారుఁడయ్యెనని చెప్పవచ్చును.

3. బాల్యము, యౌవనము. పౌలు తార్సులో పుట్టినను ఎక్కువకాలము యెరూషలేమునందు గడిపెను. పరిసయ్యులలో ముఖ్యుఁడగు గమలీయేలు పాదములయొద్ద సకల విద్యలయందు శిక్షితుఁడయ్యెను ($22^{3}$ $26^{4,5}$). విద్యను ముగించునప్పటికి మిగుల నిష్ఠగల పరిసయ్యుఁడాయెను (ఫిలి $3^{5}$). క్రీస్తు జీవించి యున్న కాలమునం దతఁడాయనను చూచియుండలేదు (I కొరి $9^{1}$ $15^{8}$). ఆయన బోధించిన కాలమునందు పౌలు పలెస్తీనులో నుండలేదని స్పష్టమగుచున్నది.

స్తెఫనును చంపినప్పుడతనిని రాళ్లతోఁగొట్టిన వారి వస్త్రములకు ఇతఁడు కావలియుండెనను నదే ఇతనిగూర్చి బైబిలునందుండిన మొదటి సూచనయైయున్నది ($7^{58}$). అప్పటినుండి అతఁడత్యంతాగ్రహముతో నిండినవాఁడై యెరూషలేములోని క్రైస్తవులను హింసించెను ($8^{3}$ $9^{1}$). యెరూషలేమునందలి క్రైస్తవులను చెదరఁగొట్టిన తరువాత దమస్కునందు ఈ మార్గమందున్న పురుషులైనను స్త్రీలైనను కనుగొనిన యెడల వారిని బంధించి యెరూషలేమునకుఁ దీసికొని వచ్చుటకు దమస్కులోని సమాజముల వారికి పత్రికలిమ్మని యడుగుకొనెను ($9^{1-3}$).

4. క్రైస్తవుఁడగుట, ప్రారంభ క్రైస్తవ సేవ. పౌలు తన సహచరులతోఁగూడ దమస్కును సమీపించినప్పుడు అతఁడొక గొప్ప వెలుఁగును చూచి భూమిమీఁదఁ బడెను. సౌలా, సౌలా, నన్నెందుకు హింసించుచున్నావను నొక శబ్దమతనికి వినవచ్చెను. తరువాతి మూఁడుదినముల వఱ కతనికి దృష్టిలేకపోయెను. అననీయ యను భక్తుఁడు వచ్చి అతనికి బోధించి బాప్తిస్మ మిచ్చెను. సమాజమందిరములలో నతఁడు క్రీస్తునుగూర్చి యొప్పుకొని బోధించెను ($9^{3-22}$ $22^{5-16}$ $26^{12-18}$). తరువాత అతఁడు తాను చేయనైయున్న గొప్ప పనికొఱకు ప్రార్థించి సిద్ధపడుటకై అరేబియా దేశమందలి అరణ్యమునకు, బహుశః సీనాయి అరణ్యములోనికి వెళ్లెను (గల $1^{16,17}$).

అతఁడా ప్రదేశమునుండి దమస్కునకుఁ దిరిగి వచ్చి అక్కడ బోధింప నారంభించెను. అక్కడ నున్న యూదులు కొన్నిదినములలో అతనిని చంపవలెనని కుట్రజేసినందున పట్టణప్రాకారపు గోడమీఁదనుండి నొక కిటికీగుండా గంపలో

దింపఁబడి తప్పించుకొని యెరూషలేమునకు వెళ్లెను (9[23-25] II కొరి 11[32-33]). అతఁడు క్రైస్తవుఁడైన మూఁడు సంవత్సరముల కిది జరిగెను (గల 1[18]).

యెరూషలేమున కతఁడు వచ్చినప్పుడు ఆరంభమున క్రైస్తవులతనిని జూచి భయపడిరి గాని బర్నబా అతని చేర్చుకొని యితరులతో అతనికి పరిచయము కలిగించెను (కార్య 9[26-29]). పదిహేను దినములకుఁ తరువాత (గల 1[18,19]) యెరూషలేమునుండి తప్పించుకొని వెళ్లుమని ఒక దర్శనముద్వారా బోధింపఁబడి (కార్య 22[17,18]) అతఁడు తార్సుకు వెళ్లిపోయెను (9[30]). అక్కడనుండఁగా అతఁడు సిరియ కిలికియ ప్రదేశములలో పది సంవత్సరములవఱకు బోధించుచుండెను (గల 1[21-24]). ఇదియైన తరువాత బర్నబా తార్సుకువచ్చి అతని కనుగొని అంతియొకయకుఁ దెచ్చెను. వారిద్దరుకలిసి ఒక సంవత్సరమువఱకు అక్కడ బోధించిరి. యెరూషలేమునందున్నవారు కరవుచే పీడితులైరను వార్తవిని పౌలు బర్నబాతో కలిసి చందా ద్రవ్యమును దీసికొని వెళ్లెను. ఇది అతఁడు క్రైస్తవుఁడైన పిదప అక్కడకు వెళ్లిన రెండవ సారిగా యున్నది (కార్య 11[22-30] గల 2[1]). అక్కడ పని ముగిసినపిదప వారు మార్కును వెంటఁబెట్టుకొని అంతియొకయకు తిరిగివచ్చిరి (కార్య 12[25]).

5. పౌలు పని, ప్రయాణములు.

(1) మొదటి మిషనెరీ ప్రయాణము (కార్య 13[4]-14[26]). అంతియొకయలోని సంఘము బర్నబాను పౌలును సువార్త సేవనిమిత్తము పంపెను. వారు మార్కును వెంటఁబెట్టుకొని బర్నబాయొక్క జన్మభూమియగు కుప్రకు వెళ్లిరి. ఆ దీవియొక్క పడమటి దిక్కునుండి తూర్పు దిక్కుకు ప్రయాణము చేయుచు బోధించిరి. పాఫులో సెర్గి పౌలు అను నొక రోమా అధిపతి విశ్వసించెను. ఇప్పటినుండియే సౌలు అను పేరుకు బదులు పౌలు అను పేరు వాడుకలోకి వచ్చెను. ఆ యిద్దరపొస్తలుల పేరులలో పౌలు పేరు ఇప్పటినుండి మొదట వచ్చుటయు మనము గుర్తింపవచ్చును. కుప్రనుండి వారు చిన్నాసియకు వెళ్లిరి. పెర్గేయొద్ద మార్కు వారిని విడిచి యెరూషలేమునకు వెళ్లెను. వారిద్దరును అక్కడనుండి పిసిదియలోని అంతియొకయ ఈకొనియ లుస్త్ర దెర్బే యను పట్టణములకు వెళ్లి బోధించిరి. లుస్త్రలో పౌలు రాళ్లతో కొట్టఁబడెను. ఇది తిమోతియొక్క పట్టణము (కార్య 16[1]). తరువాత వారు తిరిగి ఆ స్థలములగుండా ప్రయాణము చేయుచు ఆయా సంఘములను స్థిరపఱచి అత్తాలియకు వచ్చిరి. అక్కడనుండి ఓడయెక్కి అంతియొకయకు వచ్చి మొదటి ప్రయాణమును ముగించిరి: ఇక్కడనుండఁగా పౌలు గలతీయులకు పత్రిక వ్రాసెనని కొందఱి యభిప్రాయముగాని అది యెరూషలేమందు జరిగిన మొదటి క్రైస్తవ మహా సభకుఁ బిమ్మటనని కొందఱును, మూఁడవ ప్రయాణమునందు ఎఫెసునుండి వ్రాసెనని మఱికొందఱును అనుకొనుచున్నారు (గలతియ పత్రిక చూ॥).

(2) యెరూషలేమునందు జరిగిన మొదటి క్రైస్తవ మహాసభ (క్రీ॥ శ॥ 49 లేక 50. కార్య 15[1-29]). అన్యులు క్రైస్తవ సంఘములోనికి రానారంభించినప్పుడు వారు మోషే నియమించిన యాజ్ఞప్రకారము చేయుటనుగూర్చిన గొప్ప సమస్యవచ్చెను. యూదమతాభిమానులగు క్రైస్తవులు కొందఱు అంతియొకయకువచ్చి అన్యులలోనుండి క్రైస్తవులైనవారు సున్నతి చేయించుకొనవలెనని చెప్పిరి. ఈ వాద పరిష్కారార్థమై పౌలు బర్నబాలు మఱికొందఱు క్రైస్తవులతోఁ గలిసి యెరూషలేమునకు వెళ్లిరి.

పౌలు యెరూషలేమునకు వెళ్లుట కిది మూఁడవ సారి. సభ జరిగిన పిమ్మట వారు మఱల మార్కును వెంటఁబెట్టుకొని అంతియొకయకుఁ తిరిగివచ్చిరి.

(3) రెండవ మిషనెరి ప్రయాణము (క్రీ॥ శ॥ 50-53. కార్య 15[36]-18[22]).

అంతియొకయకు వచ్చిన పిమ్మట, మొదటి ప్రయాణములో తాము చూచిన స్థలములను దర్శింప పౌలుద్దేశించెను. మార్కును దీసికొని వెళ్లుట విషయము వాదము కలిగినందున పౌలు సీలను ఏర్పఱచుకొని బర్నబానుండి వేరైపోయెను (15[38-39]).

పౌలు తౌర్సు మార్గమున సంఘములను దర్శించుచు కాలినడకను ప్రయాణము చేసెను. అతఁడు తౌర్సునందు తాను మునుపుండినప్పుడు స్థాపించిన సంఘములను దర్శించియుండును. తరువాత అతఁడు దెర్బే లుస్త్రలకు వచ్చెను. ఇచ్చట తిమోతి అతని కలిసికొనెను. అక్కడి నుండి వారు ఫ్రుగియ గలతీయ ప్రాంతములకు వెళ్లిరి. బితూనియకును వెళ్లనుద్దేశించిరి గాని ఇది దేవుని ఏర్పాటుకాదని తెలిసికొని తిన్నగా త్రోయకు వచ్చిరి. అక్కడ పౌలుకు కలిగిన దర్శనమునుబట్టి ఐరోపాకుఁ బోవలసివచ్చెను. నెయపొలియొద్ద ఓడ దిగి ఫిలిప్పీయికి వెళ్లిరి. అక్కడ లూదియయు మఱికొందఱును విశ్వసించిరి. పౌలును సీలయు ఖైదులో వేయఁబడి భూకంపము కలుగుటద్వారా విడుదల నొందిరి ($15^{40}$-$16^{40}$).

ఫిలిప్పీయిలో పౌలు లూకాను విడిచి థెస్సలొనీకకు వెళ్లెను. అక్కడ నుండఁగా అతఁడు తన స్వంతజీవనోపాధిని కష్టపడి పనిచేసి సంపాదించుకొనెను. అనేకులిచ్చట విశ్వసించిరి (I థెస్స $1^{9}$ $2^{1-9,12}$). కొన్ని దినములలో హింస లారంభమైనందున అతఁడు బెరయకు వెళ్లెను. అనేకులు ప్రభువునందు విశ్వాసముంచిరి. తరువాత పౌలు ఏథెన్సుపట్టణమునకు వచ్చి అరెయొపాగు కొండమీఁద గొప్ప ప్రసంగము చేసెను. అక్కడనుండి కొరింథుకువచ్చి థెస్సలొనీక పట్టణస్థులకు రెండుత్తరములు వ్రాసెను. ఇక్కడ నుండఁగా అతఁడు అకుల ప్రిస్కిల్లయను దంపతులను కలిసికొనెను. అతఁడక్కడ పదునెనిమిది మాసములుండి కెంక్రెయ మార్గమున ఎఫెసు పట్టణమునకు ఓడ ప్రయాణము చేసెను. అకుల ప్రిస్కిల్ల యనువారి నక్కడ విడిచిపెట్టి కైసరయకు వెళ్లి యెరూషలేమును నాలుగవసారి దర్శించెను. పిమ్మట అంతియొకయకు వచ్చి తన రెండవ ప్రయాణమును ముగించెను.

(4) మూఁడవ మిషనెరి ప్రయాణము (క్రీ॥ శ॥ 53-57. కార్య $18^{23}$-$21^{17}$).

పౌలు అంతియొకయనుండి ప్రయాణమై ఫ్రుగియ గలతియలోని సంఘములను దర్శించుచు ఎఫెసుకు వచ్చెను. ఇక్కడ అతఁడు దాదాపు మూఁడు సంవత్సరము లుండెను. అతని పని బహు జయకరముగ జరిగెను. దేమేత్రియను కంసాలి వానివలన జరిగిన యొక అల్లరినిబట్టి అతఁడు ఎఫెసును విడువవలసి వచ్చెను గాని అతఁడంతకు ముందే దానిని వదలి మాసిదోనియ మొదలగు ప్రాంతములకుఁబోవ ఏర్పాటులుచేసికొని యున్నందున ఎఫెసులో జరిగిన అల్లరినిబట్టి మాత్రమే వెళ్లినన వీలులేదు. ఎఫెసులో నుండఁగా పౌలు కొరింథు పట్టణస్థులకు తన మొదటి పత్రికను వ్రాసెను. అతఁడు ఎఫెసును విడిచి త్రోయకు వచ్చెను (II కొరి $2^{12}$). అక్కడనుండి బయలుదేరి మాసిదోనియ సంఘములన్నిఁటిని దర్శించెను. మాసిదోనియలో నుండఁగనే కొరింథీయులకు రెండవ పత్రికను వ్రాసి పంపెను. కొంతకాలమునకు స్వయముగానే కొరింథుకు వెళ్లి అక్కడనుండి రోమీయుల పత్రికను వ్రాసెను. రెండవ ప్రయాణములో చేసినట్లే ఓడమీఁద సిరియాకు వెళ్లఁ దలంచెను గాని తనను చంపుటకై యూదులు చేయుచుండిన కుట్రనుగూర్చి తెలిసికొని ఫిలిప్పీయి త్రోయ మార్గమున మిలేతుకు వచ్చెను. ఎఫెసు పెద్దలను పిలిపించుకొని వారికి చివరి హెచ్చరికలు చేసెను. తరువాత కైసరయకువచ్చి సువార్తికుఁడగు ఫిలిప్పుతో బసచేసెను. అగబు అను ప్రవక్త వచ్చి యెరూషలేమునందు పౌలు కొఱకు కాచుకొని యున్న బంధకములనుగూర్చి ప్రవచించెను.

(5) పౌలు యెరూషలేమును ఐదవసారి దర్శించుట (క్రీ॥ శ॥ 57. కార్య $21^{18}$-$23^{30}$).

కైసరయనుండి పౌలు యెరూషలేమునకు వెళ్లెను. పౌలు ధర్మశాస్త్రానుకూలముగా నడుచుకొనుచున్నాఁడని యూదులు తెలిసికొను నిమిత్తము అతఁడు శుద్ధిచేయించుకొని మ్రొక్కుబడి చెల్లించవలసిన కొందఱి కయ్యెడి ఖర్చును భరింపుమని యాకోబును మఱికొందఱు పెద్దలును అతనికి సలహా నిచ్చిరి. పౌలు ఆ సలహా ప్రకారము చేసినను ఆసియనుండి వచ్చిన కొందఱివలన ప్రేరేపణ నొంది యూదులు ఆగ్రహముతో నిండినవారై యతనిపైఁ బడిరి. రాణువవారు వచ్చి అతని తప్పించి అతనిని మోసికొని వెళ్లకపోయిన యెడల యూదులతనిని చంపియుందురు. కోట మెట్లమీదనుంచి పౌలు జనులతో మాట్లాడెను. తరువాత జరిగిన గందరగోళము నిమిత్తము

శిక్షింపఁబడెడివాఁడే గాని రోమీయుఁడైనందున ఆ దెబ్బలు తప్పించుకొనెను. అతని చంపుటకై యూదులు కుట్రచేసిరి గాని పౌలు మేనల్లుని వలన సహస్రాధిపతి దానినిగూర్చి తెలిసికొని పౌలును కైసరయకుఁ బంపి యూదుల యాలోచనను భంగపఱచెను ($23^{31-35}$). రోమను అధిపతి యగు ఫేలిక్సు పౌలువలన లంచముఁబట్ట నెంతో యపేక్షించెను గాని రెండు సంవత్సరముల వఱకు ఒక చిన్న రూకయైనను రాలుజాడ లేకపోయెను గాన అంతవఱకు పౌలు ఖైదీగానే యుండెను ($24^{1-26}$). తరువాత వచ్చిన ఫేస్తు యూదులను సంతోషపెట్టఁగోరి యెరూషలేములో అతని విమర్శింపనెంచి యడిగెను గాని పౌలు దాని కొప్పుకొనక కైసరుకు అప్పీలు చేసికొందుననఁగా అతని నక్కడికి పంపించెను ($24^{27}$-$26^{32}$).

6. పౌలు రోమాలో ఖైదీగానుండుట (క్రీ॥ శ॥ 60,61. కార్య 27,28). యూలియను శతాధిపతి వశమున పౌలు రోమాకు పంపఁబడెను. లూకా అరిస్తర్కులు అతని వెంట ప్రయాణమై వెళ్లిరి. పౌలు ఖైదీగా వెళ్లినను అందఱిచేత సన్మానము నొందెను. సముద్ర ప్రయాణములో వారు గొప్ప తుఫానులో చిక్కుబడిరి. మెలేతు దీవియొద్దున వారియోడ బద్దలై పోయెను. వారు శీతాకాల మక్కడ గడిపి వసంతికాలమున మఱల బయలుదేఱి రోమా పట్టణము చేరిరి. ఇక్కడ నుండఁగా పౌలు రెండేండ్లవఱకు తానొక యిల్లు అద్దెకుఁదీసికొని దానియందు నివసించెను. దానియందుండినను అతఁడు విడిఖైదిగా నెంచఁబడెను. అక్కడ నుండియే అతఁడు ఎఫెసు కొలొస్సై, ఫిలెమోను, ఫిలిప్పీ పత్రికలను వ్రాసెను.

7. చివరికాలపు చరిత్ర. తిమోతికిని తీతుకును వ్రాసిన ఉత్తరముల వలన మాత్రమే మనము పౌలుయొక్క చివరికాలపు చరిత్రను దెలిసికొనఁగలము. రోమాలో మొదటిసారి చెఱయందుండఁగానే తాను త్వరలో విడిపింపఁబడుదునని తెలిసికొనెను (ఫిలి $2^{24}$ ఫిలె 22). చెఱనుండి విడిపింపఁబడఁగానే స్పెయిను కతఁడు వెళ్లినట్లూహింప వచ్చును (రోమా $15^{24-28}$). తరువాత అతఁడు కొరింథును మిలేతును దర్శించెను (II తిమో $4^{20}$). అక్కడనుండి ఎఫెసుకు వెళ్లి తిమోతిని విడిచి పెట్టెను (I తిమో $1^3$). తరువాత త్రోయకును (II తిమో $4^{13}$) మాసిదోనియకును వచ్చెను (I తిమో $1^3$). అతఁడు క్రేతుకు వెళ్లినట్లు తీతు పత్రికవలనఁ దెలియుచున్నది (తీతు $1^5$). శీతాకాలము నీకొపొలియందు గడుపుచుండఁగా (తీతు $3^{12}$) తిమోతికి మొదటి ఉత్తరమును తీతుకు ఒక పత్రికను వ్రాసియుండునని అభిప్రాయ పడుచున్నారు.

నీకొపొలియందుండఁగా పౌలును పట్టుకొని రోమాకుఁ దీసికొని వెళ్లిరి. అతఁడు ఖైదులో నుండి తిమోతిని తనయొద్దకు రావలెనని రెండవ ఉత్తరమును వ్రాసెను. నీరో చక్రవర్తి యాజ్ఞ ప్రకార మతఁడు తలఁగొట్టించఁబడి చనిపోయెనని సంఘ పితరులు వ్రాసినవానినిబట్టి తెలియు చున్నది.

E.



**ప్రకటన** బయలు పరచుట చూ॥

**ప్రకటన గ్రంథము (Revelation, Book of)**

1. గ్రంథకర్త: ప్రకటన గ్రంథమును రచించినవాఁడు $1^{1,4-9}$ $22^8$ యందు తనపేరు యోహాను అని తెలియఁజేయును. ఈ నామము ఆ యోహానకు చెల్లునో మఱియొకనికి చెల్లునో కచ్చితముగా చెప్ప వీలుపడదు. అది క్రైస్తవ చరిత్రకారులలో కొందఱు ఈయన అపొస్తలుఁడనియు మరికొందఱీయన పెద్ద యనఁబడిన మఱియొక యోహాననియు భావింతురు. ఇందును గుఱించి వేద పండితులు ఆదికాలము మొదలుకొని ప్రస్తుతము వఱకు పరిపరివిధములైన తాత్పర్యముల ననుసరించుచు వచ్చిరి. ఆదిభక్తులు యోహానను పేరు అపొస్తలునికే సూచనగా భావింతురనియు ఈ యోహానను గ్రంథకర్త పత్మాసుద్వీపములోనుండిన వాఁడనియు గమనించఁగా నీయన అపొస్తలుడగు యోహానను కొనుట కెక్కువ యాస్పద మున్నదని చెప్పవచ్చును గాని యందుకు సమ్మతించనివారి యభిప్రాయము తప్పని చెప్పునంత నిశ్చయములేదు.

2. ప్రామాణికత్వము.

బహిస్సాక్ష్యము:—గ్రంథకర్తను గురించి సంశయించినలాగున వేదవేత్తలీ గ్రంథపు ప్రామాణికత్వమును గురించియు సందేహము గలవారైయున్నారు. జస్టీను మార్టరు (*Justin Martyr*) క్రీస్తుయొక్క అపొస్తలులలో నొకఁడైన యోహాను ప్రకటన గ్రంథము రచించెనని యుదాహరించెను. జస్టీను, యోహాను చాల కాలము జీవించిన ఎఫెసు పట్టణములోనే యుండి యోహాను మృతుఁడైన తర్వాత 50 ఏండ్ల లోపల నా మాట వ్రాసెను గనుక ఆయన సాక్ష్యము బలమైనది. ఐరేనియసు (*Irenaeus*) యోహాను సహవాసులు ప్రకటన గ్రంథమును గురించి చెప్పిన మాటలనుబట్టి యది యోహాను కృతమైనదని సూచించుచున్నాఁడు. మ్యూరటోరి (*Muratori*) కనుగొన్న గ్రంథశేషమందు దీని ప్రశంస రెండు పర్యాయములు తటస్థించును. ఒకమారు దీనిపేరు ప్రమాణ గ్రంథముల నామ జాబితాలో కనఁబడుట మాత్రము గాక ఆరాధన యందుపయోగింపఁబడిన గ్రంథముల సముదాయమందును ఇది లిఖితమాయెను. క్రీ॥ శ॥ 177 సం॥ విజృంభించిన మెలిటో (*Melito*) నీ గ్రంథముమీఁద నొక భాష్యము రచించెను. వియెన్నా, లియోను సంఘములయొద్దకు పంపించఁబడిన యుత్తరములలో ప్రకటనగ్రంథము ఇతర ప్రమాణగ్రంథములవలె లేఖనమనఁబడెను.

పై వివరింపఁబడినవారి సాక్ష్యము బలమైనదియైనను వారి సమకాలీనులందఱు వారి యభిప్రాయ మామోదించుటలేదు. అలెక్సంద్రియ పట్టణపు దియొనిసు (*Dionysius*) గ్రంథలక్షణములను గురించిన యుపన్యాసమందీలాగు చెప్పుచున్నాఁడు. "ఈ గ్రంథము రచించిన వాని పేరు యోహానేగాని, యితఁడు జెబెదయి కుమారుఁడును యాకోబు సహోదరుఁడును యోహాను సువార్తను మొదటి పత్రికను వ్రాసిన యపొస్తలుఁడైన యోహానని నేనంగీకరించ సాధ్యము కాదు. ఈ గ్రంథముల నొకదాని నొకటి సరిపోల్చి వానివాని బోధాంశములను శైలిని పరిశోధించఁగా నిది వేఱువేఱు గ్రంథకర్తల వలన రచించఁబడెనని తెలియనగును. సువార్తికుఁడు సువార్తయందైనను పత్రికయందైనను తన పేరునుగాని తన సంగతినిగాని బయలుపరచఁడు. ఈ గ్రంథము వ్రాసినవాఁడు తనపేరు యోహానని చెప్పుటచే మన మంగీకరించవలెను గాని అతఁడే యోహానో తీర్మానించ సాధ్యము కాద"ని చెప్పెను. సంఘచరిత్రకారియగు యుసీబియసు (*Eusebeus*) ఈ విషయమునుగూర్చి మిగుల సంశయించెను. యెరూషలేము సంఘాధ్యక్షుఁడగు సిరిలు (*Cyril*) తా నేర్పఱచిన ప్రమాణ గ్రంథముల నామజాబితాలో దీని పేరు కనఁబఱచలేదు. క్రిసొస్తమైనను (*Chrysostom*) మాప్సుస్టియా పట్టణపు తియొడోరైనను (*Theodore*) ప్రకటన గ్రంథమును గురించి యేమియు వివరించలేదు.

అంతస్సాక్ష్యము:—సాహిత్యజ్ఞానులీ గ్రంథలక్షణములను అనఁగా దీనిశైలిని, విషయసంగ్రహమునుబట్టి యిది యోహానుకృతమైనది కాదందురు. గ్రంథపరిశీలనచేయఁగా యోహాను వ్రాసిన యితర గ్రంథములకును నీ గ్రంథమునకును శైలి భేదము విశేషమనక విధిలేదు. సువార్తను పత్రికలను వ్రాసిన గ్రంథకర్త బహు ప్రాంధికమైనదియు నాణెమైనదియునైన గ్రీకుభాష నుపయోగించెనుగాని ప్రకటన గ్రంథమునురచించినవాఁడు గ్రామ్యభాషను, అపశబ్దముల నుపయోగించి వ్రాసెను గనుక ఆ గ్రంథములను లిఖించిన వాఁడును ఈ గ్రంథమును లిఖించినవాఁడును వేఱని నిర్ధారణ చేతురు. వీరు చేయు నాక్షేపణము కొంచెము గొప్పల నాధారము కలిగియుండినను వారి యభిప్రాయము సంపూర్ణాంగీకారము కాదు. ఇందుకు సమాధానము చెప్పువారు పలు విధములయిన కారణముల నగుపఱచుదురు. ఎట్లనిన:—1. సువార్త చరిత్రవృత్తాంత గ్రంథమైయుండఁగా ప్రకటన దర్శనగ్రంథమైయున్నది గనుక సందర్భ వ్యత్యాసములు భాషాభేదమునకు కారణము. 2. యోహాను మొదట ఎఫెసు పట్టణము చేరిన సమయమున ఆయనకు గ్రీకు భాషాభ్యాసము తక్కువ గనుక ఆ సమయమున ఆయన వ్రాసిన గ్రంథశైలి పాండిత్య విరుద్ధము గాని ఎఫెసులో కాలక్షేపము చేయుకొలఁదిని ఆయన గ్రీకుభాషయందు నేర్పరి యాయెను గనుక ముందువ్రాసిన ప్రకటన గ్రంథపుశైలికిని వెనుక వ్రాసిన సువార్తశైలికిని ఇదే వ్యత్యాస కారణము. 3. గ్రీకుభాష యోహానుకు స్వభాష

కాలమందున నాయన గ్రీకుభాష సాహిత్యజ్ఞాని సహాయముచే గ్రంథమేర్పఱచుచు వచ్చెను. ప్రకటన గ్రంథమును లిఖించినప్పుడట్టి సహాయకుఁడు లేకున్నందున ఆయన తనకు తెలిసినది మాత్రము వ్రాయుటవలన శైలివ్యత్యాసమునకు హేతువు.

ఇంత మాత్రమేగాక పైఁజెప్పిన శైలి వైపరీత్యము నొప్పుకొనవలసి యున్నను యోహాను వ్రాసిన యితర గ్రంథములను ఇప్పుడు చర్చించెడు గ్రంథమునను అనేక సంబంధించిన విషయములున్నవి. సువార్తయందును పత్రికయందును యోహాను తరుచుగా ప్రయోగించు ముఖ్య పదము లిందును తటస్థమగును. (1) నాలుగవ సువార్తయందును ప్రకటన గ్రంథమందునుగాక గొఱ్ఱెపిల్లయను నామధేయము యేసును గుఱించి మఱెక్కడ నుదాహరింపఁబడదు. అటువలెనే యేసుకు వాక్యమనే బిరుదాంకము సువార్తయందును, మొదటి పత్రిక యందును, ప్రకటన గ్రంథమందును తప్ప మఱే గ్రంథమునందును కనఁబడదు. (2) యోహాను ఇతర గ్రంథములలో ననేకపర్యాయము లగుపడు మాటలు ప్రకటన గ్రంథమును పలుమాఱు తటస్థించును. ఇందుకు జయించువాఁడు, సాక్ష్యము, నామాట కాపాడుకొనువాఁడు అనునవి దృష్టాంతములు. (3) యోహాను యథార్థమును మిథ్యను భేదించుటకై యుపయోగించు సత్యము లేక నమ్మకమైన యను పదములు సువార్తయందు తొమ్మిది పర్యాయములును, మొదటి పత్రికయందు నాలుగు పర్యాయములును, ప్రకటన గ్రంథమందు పది పర్యాయములును కనఁబడగా క్రొత్త నిబంధన యందలి తక్కిన గ్రంథములయందు అయిదు పర్యాయములు మాత్రము సూచించబడును. పై యంశములను విచారించఁగా నంతస్సాక్ష్యమువలన ప్రకటన గ్రంథము యోహాను రచించినదని నిశ్చయముగా చెప్పుటకు చాలినంత యాస్పదము లేకున్నను పారంపర్య సాంప్రదాయమునుబట్టి యిది ఆయన రచన మనవచ్చును.

### 3. కాలస్థాన నిరూపణము.

భాష్యకారులీ గ్రంథమందలి చరిత్ర వృత్తాంతముల కర్థము చెప్పుటవలన నిది జరిగిన తరుణమును గుఱించి పలువిధములైన యభిప్రాయముల ననుసరింతురు గనుక గ్రంథ ముఖ్యాంశముల విషయమై వారు చేసికొన్న భావముకొలఁదిని లిఖితమైన కాలమును గుఱించి యభిప్రాయ భేదములు గల వారై ఇందున్న దర్శనముల కొకవిధముగా నర్థము చెప్పువారు. కొందఱిది ముందు కాలమందు రచించఁబడె ననియు మఱియొక విధముగా భాష్యము చేయువారిది వెనుకటికాల గ్రంథమనియు తర్కింతురు. లియోన్ సంఘాధ్యక్షుడగు ఐరేనియసు ఈ దర్శనము చాల కాలము క్రిందటకాదు గాని మన కాలమున ననఁగా డొమిషన్ (*Domitian*) చక్రవర్తి యేలుబడి యంత్యమున కలిగినదని చెప్పెను. అటువలెనే అలెక్సంద్రియ పట్టణపు క్లెమెంతు (*Clement*) యోహాను చక్రవర్తి మృతినొందఁగా పత్మాసు ద్వీపమందలి చెఱనుంచి వచ్చెనని వివరించెను. డొమిషన్ చక్రవర్తి క్రీ॥ శ॥ 81-96 సం॥ వఱకు రాజ్యము చేసెను. గనుక ఐరేనియసు మాట నామోదించినయెడల నిది 93,94 సం॥ వ్రాయఁబడెనని రూఢియగును. అయిన నిందు వివరింపఁబడిన హింసలు నీరో చక్రవర్తికాలమందు కలిగిన వని భావించువారు ఈ గ్రంథము 70 సం॥ మున లిఖితమాయెననియు, వెస్పేషియన్ (*Vespecian*) చక్రవర్తి కాలమందీ హింసలు కలిగిన వనుకొనువారు 77 సం॥ మందు లిఖితమాయె ననియు దృష్టాంతపరతురు. మెట్టుకు ఐరేనియసు కేవలము ప్రాచీన కాలీనుఁడైనందున నాయన యిచ్చిన సాక్ష్య మంగీకారమగును.

### 4. ఎవరి నిమిత్తమై వ్రాయఁబడెను?

ఎవరి యవసరమున కీ గ్రంథము లిఖితమాయెనో 1:4 వలన తేటపడును. అయినను గ్రంథకర్త మొదట ఆసియాలోని సంఘపువారి భక్త్యాభివృద్ధి నిమిత్తము వ్రాసినను దీనిమూలముగా సర్వకాలముల యందును జీవించు భక్తకోటియాత్మల ప్రయోజనము నిమిత్తమై దేవుఁడు సంకల్పించెనని దృఢమగును.

ఈ గ్రంథమందలి దర్శనముల యర్థము వివరించుటకై భాష్యకారులు రచించిన వ్యాఖ్యాన గ్రంథము లెన్నిశక్యముకానివి. మొదటినుండి వేదపండితులు దీని యర్థమునుగుఱించి వేఱువేఱు

భావములు చెప్పినను దీనియర్థ మిదియేగాని మఱి యొకటి కాదని నేటికిని సిద్ధాంతీకరించ వీలు పడదు. అయినను వ్యాఖ్యాతలు భిన్నతాత్పర్యములు గలవారైయున్నను సమష్టిగా వారి యభిప్రాయములు మూఁడువిధములని యెంచవచ్చును. ఒక పక్షమువారి గ్రంథమందలి దర్శనముల వృత్తాంతములు బహుకాలము క్రిందట జరిగిపోయిన సంగతులకు సూచనలను నభిప్రాయము ననుసరించువారు. వీరు గతకాలానుసరణ భావము చెప్పెడివారు. రెండవ తెగవారీ దర్శనములు అయినప్పటినుంచి యుగాంతము వఱకు క్రీస్తుసంఘమునకు సంభవించు సంగతుల కుదాహరణములని చెప్పుదురు. వీరు సదాకాల చరిత్రానుసరణ భావము చెప్పువారు. మూడవ పక్షము వారీదర్శనముల వలన ముందుకాలమం దిక జరుగఁబోవు చర్యలనుగుఱించిన ప్రవచనములని తలఁచెదరు. వీరు ప్రవచనానుసరణ భావము చెప్పెడువా రనఁబడుదురు. ఈ మూఁడు పక్షములలో నేయభిప్రాయము నవలంభించినను ఈ గ్రంథమందలి సత్యవిశేషములను కనుగొనుట ముఖ్యము. లోకమందున్న దృశ్యసంఘ మనేక హింసబాధ లనుభవించి, సాతాను విరోధమువలన నవస్థపడి శ్రమానుభవము వలన పావన సంపూర్ణమైనదై దేవునియొద్దనుంచి దిగివచ్చిన క్రొత్త యెరూషలేముకు సమానమగునట్లు దేవుఁడు దీని మూలమున సదాకాలము భక్తులను ప్రేరేపించి స్థిరపఱచ నుద్దేశించెను. M.

5. ముఖ్యభాగములు, క్లుప్తవివరము.
పీఠిక $1^{1-8}$.

II. ఏడు దర్శన సముదాయములు $1^{9}$.$22^{7}$ (ప్రతి దానియందును ఏడేసి అంతర్భాగములు గలవు).

1. సంఘములో మహిమ పఱచఁబడిన యేసునుగూర్చిన దర్శనము. ఆయన ఏడు సంఘములకు చేసిన వర్తమానములు ($1^{9}$-$3^{22}$). అప్పటి సంఘ స్థితినిబట్టి ఆయన దానికి చేసిన ఉపదేశము హెచ్చరిక, ధైర్యము ఇందు గలవు.

2. సృష్టి యంతటికిని కర్తయగు దేవుని గూర్చిన దర్శనము. ($4^{1}$-$7^{17}$). ఆయన సృష్టి యంతటి చేతను పూజింపఁబడుచు మహిమపఱచఁబడుచు, తాను సృష్టించిన వానినన్నిఁటిని రక్షింపఁజాలినవాఁడైయున్నాఁడు ($4^{1-11}$). ఏడు ముద్రలున్న గ్రంథమును చేతపట్టుకొనిన దేవుని గొఱ్ఱెపిల్ల ($5^{1-14}$) ఆ ముద్రలను విప్పుటవలన న్యాయపు తీర్పునిమిత్తమై క్రీస్తు లోకమును జయించుటలో దేవునికిగల ఉద్దేశమును బయలుపఱచుచున్నాఁడు ($6^{1}$-$8^{1}$). ఆరు ఏడు ముద్రలకు మధ్యలోకమునకు కలుగనైయుండిన తీర్పుకాలమున దేవుని ప్రజలకు అనుగ్రహింపఁబడు క్షేమసౌఖ్యములను గుఱించి చెప్పఁబడెను ($7^{1-17}$).

3. బూరలను గూర్చిన దర్శనము ($8^{2}$-$11^{19}$). పరిశుద్ధుల ప్రార్థనలను దేవుని కర్పించుచున్న దూతనుగూర్చిన దర్శనముతో నివి యారంభించును ($8^{2-6}$). పాప భరితమగు లోకనాశనమును సూచించెడు దర్శనములు ప్రతిదూత బూరనూదిన వెంటనే కలిగెను. ఇవి చివరి న్యాయపు తీర్పుతో ముగిసెను. ఆరు ఏడు బూరలకు మధ్య సాక్ష్య మిచ్చెడి దేవుని సంఘము కాపాడఁబడిన రీతిని గూర్చియున్నది ($10^{1}$-$11^{14}$). సత్య స్థాపన విషయమై పరిశుద్ధులు దేవుని ప్రార్థింపఁగా ఆయన పాపలోకమునకు కలిగెడి స్థితిగతులను వారికి కనఁబఱచి వారా సంగతులను గూర్చి సాక్ష్యమియ్యవలసి యున్నారని ఆయన వారి ప్రార్థనలకు ప్రత్యుత్తర మిచ్చెనని ఈ దర్శనములవలన స్పష్టమగుచున్నది.

4. సంఘమును గూర్చిన దర్శనము ($12^{1}$-$14^{20}$). క్రీస్తును నశింపచేయవలెనని ఘటసర్పముచేసిన యుద్ధము ($12^{1-17}$), సాతానుయొక్క ఏజెంట్లగు ఆయా మృగములనుగూర్చిన దర్శనములు ($13^{1-18}$), పోరాడుచున్న సంఘము ($14^{1-5}$), క్రీస్తుకు కలిగిన జయముల క్రమము ($14^{6-20}$) ను గూర్చి ఈ భాగమునందు గలదు. పోరాటమును గూర్చిన దర్శనమని దీని ననవచ్చును.

5. ఏడు పాత్రలను గూర్చిన దర్శనము ($15^{1}$-$16^{21}$). ఈ పాత్రలయందు చివర తెగుళ్లుగాక దేవునితీర్పు లున్నవని చెప్పవచ్చును. పరిశుద్ధులకు కలిగెడి జయమునుగూర్చి ఈ దర్శనములో ఆరంభమున వర్ణించఁబడెను ($15^{1-8}$). దూతలు కుమ్మరించిన ఏడు పాత్రలు లోకము

లోని దుష్టులకు కలుగఁబోవు ఏడు భయంకర శిక్షలై యున్నవి ($16^{1-21}$).

6. మహావేశ్య యనఁదగిన బబులోనును గూర్చిన దర్శనము ($17^{1}$-$20^{15}$). బబులోను వర్ణన ($17^{1-18}$), ఆ క్రీస్తుకు దానిమీఁదను దాని మిత్రులమీదను కలుగుజయము, చివరకు కలుగు న్యాయపుతీర్పునుగూర్చి ($18^{1}$-$20^{15}$) ఈ దర్శన మునందున్నది. ఈ జయమునందు వివరింపఁబడిన ఆరు ఏడు దర్శనములకు మధ్య క్రీస్తును నమ్మిన వారికి కలుగు గొప్ప పోరాటమునందు కలుగు విముక్తియు సౌఖ్యమును విజయమును గూర్చి ($20^{1-10}$) చెప్పఁబడినది. కొందఱీ జయమును $19^{11}$ తరువాత పెట్టుట యుక్తమని భావింతురు.

7. క్రీస్తుయొక్క వధువును నూతన యెరూషలేమును అగు మాదిరి సంఘమును గూర్చిన దర్శనము ($21^{1}$-$22^{7}$).

III. ముగింపు. $22^{8-20}$.

**ప్రకటన (అప్రమాణిక గ్రంథములు) (Apocalyptic Literature).** బైబిలులోని గ్రంథములు కాక, యూదులు క్రీస్తుశకమునకు పూర్వము రెండవ శతాబ్దము మొదలుకొని క్రీస్తు శకమునకు తరువాత రెండవ శతాబ్దముఁవఱకు నుండు కాలములో రచింపఁబడిన యొక విధమైన గ్రంథము లీ జాబితాలో చేరియున్నవి. ఆ గ్రంథకర్తలు వానిలో ముఖ్యముగా లోకాంత మును దర్శనములరీతిగా వివరింపఁబూనుకొనిరి. యెహెజ్కేలు గ్రంథములో నచ్చటచ్చటను, జెకర్యా 9-14 లోను, దానియేలు గ్రంథమంతటిలో నున్నటువంటి దర్శనములు వీనిలో నెక్కువగా నున్నవి. క్రొత్త నిబంధనయందలి ప్రకటన గ్రంథములోనున్న దర్శనము లిట్టివై యున్నవి. యూదులయొక్క అనేకములైన యిట్టి గ్రంథములలో 16 నేటివఱకు కాపాడఁబడి యున్నవి. ఈ గ్రంథములలోని ముఖ్య లక్షణము లేవియనిన: (1) వాటిలో దృష్టాంతములు చాల ఎక్కువగాను మిగుల చిక్కుగా నున్నవి. (2) నీతిమంతులకును దుర్మార్గులకును చాల తీక్ష్ణ విరోధమున్నట్లు వాటిలో నున్నది. (3) దేవునికిని మానవులకు మధ్య అనేక మంది దూతలు మధ్యవర్తులుగ నుందురు. (4) ఈ గ్రంథములకు వాటిని తత్కాలమందు రచించిన వారి పేరుపెట్టక హనోకు, సొలొమోను అను వారి పేరులుపెట్టి వారిని గ్రంథకర్తలనుగా నెంచిరి. (5) మానవులకుమఱుఁగైన అంత్య దినముల సంగతులు మిగుల తేటగా తెలిసి యున్నట్లు వివరించిరి. మఱియు చివఱకు దేవుని నీతి న్యాయములను అవలంబించుభక్తులు తప్పక గెలుతురను నిరీక్షణనుకూడ వానిలో బహు విశద ముగా నున్నది. (6) చరిత్రకాలము నంతటిని యుగముల రీతిగా విభాగించి ఇప్పటి యుగమును గూర్చియు రాఁబోవు యుగమును గూర్చియు వాటిలో వ్రాసిరి.

క్రీస్తు శకమునకు ముందు రెండవ శతాబ్ద మందు యూదులు అంతియొకయలోని గ్రీకు రాజుల ప్రభుత్వమునకు దాసులైరి. ఆ పర తంత్రము వారికి ప్రాణసంకటముగ నుండెను. ఆ రాజులు యూదుల మతాచారములను మార్చుటకు యూదుల మతాభిమానములకు బద్ధ విరుద్ధముగ నుండు ఏర్పాటులను చేయఁగా వారీ గ్రీకుల ప్రభుత్వమును మఱెక్కువగా విరోధించుచుండిరి. ఇట్లుండిన యా కాలములో వారిని బాధపఱచినవారు దుర్మార్గులై నాశనమునకు పాలగుదురని వ్రాసినయెడల అది రాజద్రోహమగును కావున, ఆ సంగతిని తేటగా వ్రాయక అలంకారరీతిగా వ్రాయుటకు ఆ కాలపు స్థితినిబట్టి చూడఁగా గొప్ప హేతువు కనఁబడును. ఆ కాలములో నిట్టి గ్రంథములు విశేషముగా వ్రాయఁబడుటకు ఇది హేతువై యున్నట్లుగా నెంచఁదగును. యూదులకు ఈ గ్రంథములలోని యలంకారము లెంత తేటగా నుండినను, వారిని బాధించిన గ్రీకు అధికారులకు అవి గూఢముగా నున్నవి.

ఇట్టి గ్రంథములలో ప్రస్తుతమున నున్నవి కాలవరుస ననుసరించి యీ దిగువ జాబితాలో కనఁబడును:

1. ఐతియోపియ భాషలో కాపాడఁబడిన హనోకు గ్రంథము (*Etheopic Book of Enoch*).

2. స్లావోని యను భాషలో కాపాడఁబడిన హనోకు గ్రంథము (*Slavonic Book of Enoch*).

3. సిబిలీను దేవోక్తులు (*The Sybilline Oracles*).

4. మోషేయొక్క ఆరోహణము (*The Ascension of Moses*).

5. ఎస్ద్రాసుయొక్క రెండవ గ్రంథము (*Second Esdras*).

6. సిరియ భాషలో కాపాడఁబడిన బారూకు గ్రంథము (*Syriac Book of Baruch*).

7. గ్రీకుభాషలో కాపాడఁబడిన బారూకు గ్రంథము (*Greek Book of Baruch*).

8. సొలొమోను కీర్తనలు (*The Psalter of Solomon*).

9. యాకోబుకొడుకులగు పన్నెండు గోత్రకర్తల నిబంధనలు (*The Testaments of the Twelve Patriarchs*).

10. జూబిలీల గ్రంథము (*The Book of Jubilees*).

11. యెషయా ఆరోహణము (*Ascension of Isaiah*).

12. ఆదాము హవ్వల చరిత్రలు (*Histories of Adam and Eve*).

13. ఏలీయాకు కలిగిన దర్శనములు (*The Apocalypse of Elias*). ఇందులో నొక చిన్న భాగము మాత్రము కాపాడఁబడి యున్నది.

14. ఎల్దాదు మేదాదుల గ్రంథము (*The Book of Eldad and Medad*).

15. యోసేపు ప్రార్థన (*The Prayer of Joseph*).

16. జెఫన్యాకు కలిగిన దర్శనములు (*The Apocalypse of Zephaniah*). దీనిలో కూడ ఒక చిన్నభాగము మాత్రమే కాపాడఁబడి యున్నది.

ఈ గ్రంథములలో గూఢార్థములే కాక, ఇంక నితర సంగతులుండినను గూఢార్థ విషయము లనేకము లుండుటచే వీనిని ప్రకటన గ్రంథమునకు సంబంధించిన గ్రంథము లని యెంచఁదగును.

**ప్రకటించుటు, ప్రకటన చేయుట** (**Preaching**). పాత నిబంధనను చూడఁగా యోనా నీనెవె వారికి సంగతులను తెలియఁ జేయుటనుగూర్చి ప్రకటించుట యను మాటను వాడిరి (యోనా 3²). ఈ మాటకు చాటించుట యని భావము. క్రొత్త నిబంధనలో దేవుని రాజ్యమునుగూర్చిన సంగతులను తెలుపుటకై ఆ మాటనే వాడియుండిరి (మ 4¹⁷). బాప్తిస్మమిచ్చు యోహాను చాటించిన వార్తనుగుఱించి ముఖ్యముగా ప్రకటించుట అను పదమును వాడిరి (3¹·²). పై మాటలన్నిఁటిని చూడఁగా ఒక అధికారి యొక్క దూతద్వార తెలియఁజేయు చున్న వార్తను ఈ మాటలు సూచించును. అయితే మంచివార్తను తెలుపుట అను నర్థమునిచ్చు ఇంకొక యసలు పదమును క్రీస్తుచేసిన బోధలకును, అపొస్తలులు చేసిన బోధలకును సంబంధముగా వాడియున్నారు. దానిని సువార్తను ప్రకటించుట యను మాటలచే తర్జుమా చేసిరి (కార్య 13³² రోమా 10¹⁵). ప్రకటించుట యనఁగా ఒక వార్తను బాహాటముగ చాటించుటయేయైనను ప్రసంగముల మూలముగా చేయు బోధలన్నిఁటిని సూచించుటకై సంఘ చరిత్రలో ఆదినుండి యీ మాటను వాడు చున్నారు.

ప్రవక్తలు దేవుని పేరట మాట్లాడినవారై యుండిరి. పై మాటలలో సూచింపఁబడి యున్నట్లు ఒక విధముగా వారు సంగతులను ప్రకటించిరి అనఁదగును. అయితే వారు విశేషరీతిగా దైవసంగతులను బయలుపఱచి తెలిపి యుండిరి. వారు చేసిన పనినిగూర్చి సాధారణముగా ప్రవచించుట యను నొక ప్రత్యేకమైన మాటను వాడుచున్నాము.

దేవునివాక్యములను గూర్చిన ప్రసంగములను చేయుట ఎజ్రాకాలములోనే ఆరంభమైనట్లుగా నున్నది. విశ్రాంతి దినములలోను, పండుగ దినములలోను దేవునివాక్యములో నొక విషయమును చదివి పిమ్మట చదివినదానిని ప్రజలకు గ్రాహ్యమగు భాషలో నొకఁడు వివరించి చెప్పు చుండెను. దీని నుండియే ప్రసంగములను చేయుట యను కార్యముద్భవించెను. ఇట్లు క్రీస్తు సమాజమందిరములలో బోధించుచు ప్రక

టించెను (మ 4[23] రోమా 18[20]). లూ 4[16-28] లో ఆయన చేసిన ప్రసంగములలో నొకటి క్లుప్తముగా నున్నది. అదేవిధముగా పేతురు (కార్య 2[14-42]), స్తెఫను (7[1-53]) పౌలు (13[16-41]) ప్రకటించిన ప్రసంగములకు కార్యముల గ్రంథములో దృష్టాంతములు కలవు. (బోధించుట చూ॥).

**ప్రకృతిసంబంధమైన (Natural).** పునరుత్థానమందు లేపఁబడు ఆత్మశరీరమునకు భిన్నమైన ప్రస్తుత శరీరమునుగూర్చిన సందర్భమున పౌలు వాడినపదము (I కొరి 15[44-46]). మొదటిది పరలోక సంబంధమైనదనియు రెండవది భూ సంబంధమైనదను భేదము నతఁడు 15[47] నందుఁ జూపెను. ఈ మాటలు పై నుదాహరించిన పదములకు సమానమైనవై యున్నవి. ప్రకృతి సంబంధమైన యని తెనిఁగించిన అసలు పదము ఈ జీవమునకు సంబంధమైనదని యర్థమగును. అది సాధారణముగా ప్రాణమని తెనిఁగించిన పదము యొక్క రూపాంతరమై యున్నది. (మనుష్యుడు 4 (4) చూ॥). I కొరి 2[14] లో అది శరీరమునుగూర్చిగాక మనస్సునుగూర్చి వాడిన విశేషణమై యున్నది. అది దేవుని యాత్మచే నూతనపఱచఁబడని స్వంత బుద్ధిని సూచించును.

**ప్రజలు (People).** ఇశ్రాయేలీయుల సమూహమునకు ప్రజలు అను సర్వసాధారణ నామముకలదు (నిర్గ 20[18,20,21] లేవీ 4[3] 7[20,21,25,27] మ 26[5] 27[1,25]). బైబిలులో ఈ పేరిశ్రాయేలీయులకు పెట్టఁబడినట్లు వేయికంటె నెక్కువ పర్యాయములున్నదిగాని ప్రతిసారి ప్రజలు అనియే తర్జుమాచేయక జనము, జనులు అను నితరమైన మాటలచేతకూడ తర్జుమా చేసియున్నారు. కొన్నిచోట్ల అది యాజకులనుండియు అధికారులనుండియు సామాన్య ప్రజలను ప్రత్యేకించును (నిర్గ 19[24] లేవీ 9[7] మ 27[1]). ఈ యర్థమందది క్రైస్తవులలో సాధారణమైన సభికులు (*Laity, Laymen*) అను మాటకు సమానమగును. దేశప్రజలు అను మాటనుకూడ దీనికి సంబంధముగా వివరింపఁదగును. ఇది II రాజులు 11[14,18,19,20] మొ॥ యిర్మీ 1[18] యెహె 12[19] 22[29] II దిన 23[13,21] లలో నున్నది. దీనిని తెనుఁగున దేశపువారు, దేశపుజనులు, దేశనివాసులు, సామాన్యజనులు అను నిట్టి నామములచే తర్జుమా చేసిరి. పై గ్రంథములలోని యీ మాటలు ఇశ్రాయేలీయులను సూచించును. ముఖ్యముగా అవి అధికారులు కాని సామాన్య ప్రజలకు పేరై యున్నది. ఆది 23[7,12,13] సంఖ్యా 14[9] లో నున్నట్లది పలెస్తీనులోని ఆది జనులకు పేరు. ఎజ్రా 10[2,11] నెహె 10[30] లో అది చెఱకాలమునకు తరువాత పలెస్తీనులో నుండిన సంకరజాతివారికి బిరుదై యుండెను. యూదులకును వారికిని ఏ పొందు నుండలేదు.

**ప్రజా సంఖ్య (Census).** ఇశ్రాయేలీయులను మూఁడుమారులు గోత్రముల కుటుంబముల ననుసరించి యుద్ధమున కర్హులైన వారిని లెక్కించిరి గాని ప్రజల నందఱిని లెక్కించినట్లు లేదు. వారు ఐగుప్తునుండి బయలు దేరిన పిమ్మట రెండవ సంవత్సరము రెండవ నెలలో సీనాయి కొండదగ్గర మొదటిసారి లెక్కించిన (సంఖ్యా 1). లేవీయులుగాక లెక్కినవారిలోనే 6,03,550 యుద్ధభటులుండిరి (1[45-47] 11[21]). ఇశ్రాయేలీయుల జ్యేష్ఠపుత్రుల లెక్కయు గలదు (3[43]). వీరుగాక నెలకుపై వయస్సుగల లేవీయులు 22,000 మంది యుండిరి (3[39]). 38 సంవత్సరములకుఁ దరువాత రెండవసారి మోయాబు దేశములో లెక్కించిరి. ఈ సంఖ్య అరణ్యములో వేసినదానికన్న తగ్గి 6,01,730 అయెను (26[1-51]). లేవీయులు 23,000 మంది లెక్కింపఁబడిరి. మూఁడవది దావీదుచేత వేయఁబడెను. అప్పుడు ఇశ్రాయేలు వారిలో 8,00,000 మందియు, యూదావారిలో 5,00,000 మంది యుద్ధసన్నద్ధులైన వారుండిరి (II సమూ 24[1-9] I దిన 21[1-6]).

చెఱకాలమునకుఁ బిమ్మట తిరిగి యెరూషలేమునకు వెళ్లినవారిని లెక్కించిరి (ఎజ్రా 2, 8[1-14] నెహె 7).

రోమీయులు ఇప్పటివలెనే ప్రజాసంఖ్య వేసిరిగాని పది సంవత్సరముల కొకమాఱుగాక 14 సంవత్సరముల కొకసారి వేసినట్లు తెలియుచున్నది. పలెస్తీనులోని ప్రజలను యూదుల వాడుకల ననుసరించి గోత్రముల ప్రకారము వారిని లెక్కించిరి. అట్టి ప్రజా సంఖ్య వేయఁ

బడు కాలములో క్రీస్తు జన్మించెను (లూ $2^{1-3}$ కురేనియు చూ॥).

**ప్రతిష్ఠించుట** పరిశుద్ధత చూ॥

**ప్రతిష్ఠ పండుగు** పండుగులు ఉపవాసములు III 2 (2) చూ॥

**ప్రతిష్ఠార్పణ** అర్పణములు V 3 చూ॥

**ప్రతిష్ఠితము** శాపము, వెలి చూ॥

**ప్రతిష్ఠితస్థలము (Sanctuary).** ఉన్నత స్థలములకు ఆమో $7^{9}$ లో తెలుఁగు బైబిలునందుపయోగించినమాట (ఉన్నత స్థలము చూ॥). దీని మూలభాషా పదమును అరణ్యములోని ప్రత్యక్ష గుడారమునకును తరువాతి కాలములో దేవాలయమునకును ఉపయోగించిరిగాని దానిని తెలుఁగు బైబిలునందు పరిశుద్ధ స్థలము అని భాషాంతరము చేసిరి (నిర్గ $25^{8}$ మొ॥ గుడారము, దేవాలయము చూ॥).

**ప్రతిష్ఠితులగువారు** బొమ్మ పూజారులు చూ॥

**ప్రతిహత్య చేయువాడు (Avenger of Blood, Kinsman, Goel).**

1. ఈ మాటయొక్క మూల భాషాపదమునకు విమోచించుటయని యర్థము. రక్తము అను మాటతో చేర్చఁబడినదై, చిందింపఁబడిన రక్తము విషయము విచారించువానిని సూచించును. దేశమున జరిగెడి యక్రమములకు తగిన శిక్షలను విధించుటకు యుక్తమైన యేర్పాటులను చేయకమునుపు పలెస్తీను చుట్టునుండు అన్య జనాంగములలో పూర్వము వాడుకగా నుండినట్లు హత్యచేసిన వానిని శిక్షించెడి భారము చంపఁబడిన వాని బంధువులదై యుండెను (ఆది $9^{5,6}$ సంఖ్యా $35^{31}$). ఇట్టి పద్ధతివలన ఆయా కుటుంబములకును గోత్రములకును నిత్యము విరోధము లుండుట తటస్థించెను. చంపఁబడినవాని శిక్షించుటకై జరిగిన హత్యలకు మితములేక పోయెను. ఇట్టి విరోధము లణచుటకును న్యాయము చేయుటకును పరాకున కొకని చంపినవాఁడు తప్పించుకొను నిమిత్తమును ఆశ్రయపురములను నియమించిరి ($35^{19-27}$ యెహో 20). ఈ యేర్పాటు దావీదు కాలమువఱకు నుండినట్లు II సమూ $14^{11}$ వలనఁ దెలియును (ఆశ్రయపురము, నేరములు శిక్షలు I 3 (1), III చూ॥).

2. దగ్గఱి బంధువుని చంపినందున కసితీర్చుకొనుటయేగాక, అప్పుక్రింద పోఁగొట్టుకొనిన పిత్రార్జితమును విమోచించుటయు అతని విధియైనందున అతనికి విడిపించువాఁడు అని యర్థమిచ్చు ఆ పదమే, వాడఁబడెను. ఈ పదమునే లేవీ $25^{49}$ లో రక్తసంబంధి యనియు రూతు $2^{1}$ లో బంధువుడనియు తెనిఁగించిరి. ప్రతి హత్య చేసినవాఁడు చిందింపఁబడిన రక్తమును విమోచించినట్లుగానే ఇతఁడు పోఁగొట్టుకొనఁబడిన పొలమును ఇంటిని స్వాతంత్ర్యమును విమోచించుట అతని విధిగా నుండెను (లేవీ $25^{30-54}$ సంఖ్యా $5^{8}$ రూతు $3^{12}$ $4^{1,6,8}$ I రాజు $16^{11}$). దగ్గరబంధువుఁడు ఇబ్బందిలోనున్న తన సహోదరుని విడిపించుట దేవుఁడు మనలను విడిపించుటకు సూచనగా నుండుటచే దేవుఁడు మనలను విమోచించు వానిగాఁ దెలిపెడి అనేకవాక్యములలో ఆయన కా పేరును పెట్టుచు వచ్చిరి (యెష $43^{1}$ $44^{22}$ $48^{20}$ $49^{7}$ యోబు $19^{25}$ కీర్త $72^{14}$ $106^{10}$ మొ॥). ఆ రీతిగానే నిర్గ $6^{6}$ లోను అది ఐగుప్తు దాసత్వములోనుండి విడిపించుటను గూర్చి వాడిన మూలభాషా పదమై యున్నది (విమోచకుఁడు చూ॥).

3. సంతాన హీనుఁడై చనిపోయిన సహోదరుని పేరట సంతానము కలిగించుటయు అట్టి దగ్గరబంధువుని విధియైయుండెను (రూతు $3^{13}$ వివాహము చూ॥).

**ప్రతీకారము చేయుట (Restitution, Revenge).** దేశసంబంధమైన నష్టమునకుగాని అన్యాయమునకుగాని చేయవలసిన ప్రతీకారమునుగూర్చి నేరములు శిక్షలు II 2,3, III 1,2 చూ॥. దేశసంబంధమైన నేరములకు ప్రతీకారము చేయవలెనను నియమముండినను (రోమా $13^{4}$), ఇతరులు మనకు చేయు తప్పులకై ప్రతీకారమును చేయక అట్టి శిక్ష విధించుటను దేవుని కప్పగింపవలెనని క్రీస్తును (మ $5^{38-41}$ లూ $6^{28-30}$) అపొస్తలులును (రోమా $12^{19-21}$ I పేతు $3^{9}$) బోధించిరి.

**ప్రతులు** (**Manuscripts**). బైబిలు గ్రంథ ములు పూర్వము చర్మముల మీఁదగాని ఒక విధమైన కాగితము మీఁదగాని చేతితో వ్రాసిరి. క్రీ॥ శ॥ 15 వ శతాబ్దమునకుఁ బూర్వముండిన గ్రంథములన్నియు ఈ విధముగానే వ్రాయఁ బడినవి. అట్టి వ్రాతప్రతు లా యా స్థలముల యందు కాపాడఁబడియున్నవి. వాటిని బైబిలు ప్రతులందురు. ఈ శీర్షిక క్రింద పాత నిబంధన క్రొత్త నిబంధన ప్రతులను గూర్చి మాత్రము వివరింపఁబడును.

1. పాత నిబంధన ప్రతులు. యూదులు పాత ప్రతులను పారవేయక వాటిని మర్యాదగా పాతి పెట్టెడివారు. అప్పుడప్పుడు వాటిని కాల్చివేసిరి. అందువలన పాత నిబంధన యొక్క మిగుల పురాతన ప్రతులు లేవు. ప్రస్తుతముండు ప్రతులన్నియు యూదులలో మస్సోరీయులు (*Massorites*) అనఁబడిన పండిత సమూహముచే సవరింపఁబడిన దానియొక్క ప్రతులైయున్నవి. పాత నిబంధనయొక్క పురాతన ప్రతులు క్రీ॥ శ॥ 1009 సం॥ నందు వ్రాయఁబడినవిగాని చరిత్ర గ్రంథములును ప్రవక్తల గ్రంథములను మాత్రము గలిగిన మిగుల పురాతనమైన ప్రతియొకటి కైరో (*Cairo*) పట్టణమునందు క్రీ॥ శ॥ 895 లో వ్రాయఁబడినది గలదు. పది యాజ్ఞలును ద్వితీ 6$^{4,5}$ వాక్యములును మాత్రమున్న ప్రతియొకదానిని ఇటీవలనే కనుగొనఁబడెను. అది క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమున వ్రాయఁబడినట్లు తీర్మానింతురు. షోమ్రోను వారు మోషే గ్రంథపంచక మనఁబడిన దానిని కాపాడిరి. అది మస్సోరీయులచే సవరింపఁబడ నందున ప్రతులను సవరించెడి పండితుల కది మిగుల ఉపయోగకరముగా నున్నది. కాని ప్రస్తుతముననున్న ప్రతులలో నేదియు క్రీ॥ శ॥ 1200 సం॥ కన్న ముందు వ్రాయఁబడి యుండ లేదు. LXX వారు తర్జుమా చేసిన హెబ్రీ ప్రతులును మస్సోరీయులచే సవరింపఁబడలేదు కావున వారి గ్రీకు తర్జుమాకూడ వాటిని సవరించుట కుపయోగపడుచున్నది. ఈ LXX ప్రతులు హెబ్రీ ప్రతులకన్న పురాతనమైనవై క్రీ॥ శ॥ 4 వ శతాబ్దమున వ్రాయఁబడినవి మాత్రము గలవు. అట్లే 464 సం॥ న సిరియక్ భాషలో వ్రాయఁబడి పాత నిబంధనయొక్క ప్రతి యొకటి గలదు. హెబ్రీ ప్రతులవలె భాషాంతర ప్రతులను యూదులు అభిమానించ లేదుగాన వీనిని కాల్చివేయక పోయిరి అందు వలననే అంత పురాతన భాషాంతర ప్రతులం మనకు లభించుటకు వీలు చిక్కెను (భాషాంతర ములు చూ॥).

మృతసముద్రపు ప్రతులు (*Dead Sea Scrolls*) అని పిలువఁబడే హెబ్రూ మాతృకలు 1947 సం॥ న ముహమ్మద్ అద్దీబ్ అను ఒక యౌవనునికి దొరికినవి. తప్పిపోయిన తన గొఱ్ఱెలకొఱకు వెదకుచుండఁగా మృతసముద్ర తీరమందలి ఒక గుహలో నివి వానికి కనఁబడెను. బైబిలునందలి గ్రంథముల వ్రాత ప్రతులలో అన్నిఁటికన్న మిగుల పురాతనమైనవి. తాకితేనే ముక్కలైపోవుచున్న ఆ ప్రతులను జాగ్రతగా విప్పి పటములు తీయించి బైబిల్ పండితులు వానిని తర్జుమచేయుచున్నారు. పురాతత్వ పరిశోధకులు తమ పరిశోధనాఫలితముగ అవి యూదులలోని ఎస్సెనీయుల తెగకు సంబంధించిన గ్రంథాలయములోనివని నివేదించుచున్నారు. ఆ మాతృకలకు చుట్టి యుండిన నారపేలికలద్వారా అవి క్రీ॥ పూ॥ 100 నుండి క్రీ॥ శ॥ 100 సం॥ ల మధ్య వ్రాయఁబడిన గ్రంథములని దృఢపరచుచున్నారు.

ఈ ప్రతులయందు యెషయా గ్రంథ మంతయు, హబక్కూకు గ్రంథవ్యాఖ్యానమును మరికొన్ని గ్రంథములు నున్నవి. అప్పటినుండి పండితులు యొర్దాను ప్రాంతములందు కనుగొనిన ఈ మృతసముద్రపు ప్రతులలో పాత నిబంధన గ్రంథములన్నియు దాదాపుగా ఉన్నట్లు తెలిసి కొనిరి. ఈ యెస్సెనీ తెగవారు తమ గ్రంథ నిధులనుంచిన స్థలములను పేర్కొనెడి రెండు రాగిరేకులనుకూడ పండితులు కనుగొనిరి. హెబ్రూ అరమెయిక్ గ్రీకుభాషలందున్న ఇతర ప్రతులలో ఈ తెగవారి బోధలును వాడుకలును లిఖితములై యున్నవి.

II. క్రొత్త నిబంధన ప్రతులు. పైన చెప్పిన కారణములవలననే ఇవి పాత నిబంధన ప్రతులకన్న పురాతనమైనవై యున్నవి. అవి

గ్రీకుభాషలో నున్నవి. ఆంగ్లభాషయందున్నట్లే గ్రీకులోను అక్షరములు పెద్దవి చిన్నవి యను భేదము కలదు. పెద్ద అక్షరములతో వ్రాయఁబడిన ప్రతులు మిగుల పురాతనములైనవి. అవి సంఖ్యయం దెక్కువలేవు. వాటిని పండితులు కొన్ని యక్షరములచే సూచింతురు. చిన్న అక్షరములలో వ్రాయఁబడిన వనేకములున్నవి. అవి ఒక విధమగు గొలుసు కట్టుతో వ్రాయఁబడెను. వాటిని పండితులు అంకెలచే సూచింతురు.

1. పెద్ద యక్షరములతో వ్రాయఁబడిన ప్రతులు.

(1) 1859 సం॥ సీనాయి కొండమీఁదనున్న మఠములో తిషెండార్ఫు (*Tischendorf*) అను పండితునిచేఁ కనుగొనఁబడెను. ఇది 4 వ శతాబ్దమందు వ్రాయఁబడి బైబిలు ప్రతులన్నిఁటిలో మిగుల పురాతనమైన రెంటిలో నొకటియై యున్నది. పండితులు దీనికి హెబ్రీ భాషలో ℵ అను హెబ్రీ యక్షరమును సంకేతముగా నుంతురు. క్రొత్త నిబంధన ప్రతి దొరకక ముందు అచ్చటనే 1844 లో గ్రీకులో వ్రాయఁబడిన పాఁత నిబంధన ప్రతిని కనుగొనెను. అది కనుగొనఁబడిన స్థలమునుబట్టి దానికి కోడెక్సు సైనయిటికస్ (*Codex Sinaiticus* = సీనాయి ప్రతి) అని పేరు కలిగెను. పాఁత నిబంధన ప్రతి ప్రస్తుతము లైప్సిగ్ (*Leipzig*) సర్వకళాశాలలోను, క్రొత్త నిబంధన పెట్రొగ్రాడు (*Petrograd*) పుస్తకాలయములో నున్నవి.

(2) ఐగుప్తులోని అలెక్సంద్రియ పట్టణమందు 5 వ శతాబ్దములో వ్రాయఁబడి ప్రస్తుతము లండనులోని బ్రిటిషువారి చరిత్ర వస్తుప్రదర్శనశాలలోనున్న ప్రతి. దీనికి A అను అక్షరమును సంకేతముగా వాడెదరు. ఇది వ్రాయఁబడిన స్థలమునుబట్టి దీనికి కోడెక్సు అలెక్సంద్రీనస్ (*Codex Alexandrinus* = అలెక్సంద్రియ ప్రతి) అను పేరు వచ్చెను. దీనియందు మ $1^{1}$-$25^{6}$ యోహా $6^{50}$-$8^{52}$ II కొరి $4^{13}$-$12^{6}$ తప్ప బైబిలులోని మిగత గ్రంథము లన్నియు గలవు.

(3) క్రీ॥ శ॥ 1481 సం॥ నుండి రోమాలో పోపుయొక్క నగరములోని గ్రంథాలయం దుండిన ప్రతి. దానికి B అను అక్షరమును సంకేతముగా వేతురు. దానిని కనుగొనినప్పుడు దానియందు బైబిలు యావత్తు గ్రీకుభాషయం దుండినను ప్రస్తుతము హెబ్రీ $9^{14}$-$13^{25}$ తీతు, ప్రకటన గ్రంథము వ్రాయఁబడిన ఆకులు పోయినవి. ఇది నాల్గవ శతాబ్దమునందు వ్రాయబడి ప్రాచీనత్వమున ℵ తో సమానమైనది. పోపు నివసించెడి నగరముయొక్క పేరునుబట్టి దీనిని కోడెక్సు వటికానస్ (*Codex Vaticanus* = వటికానను ప్రతి) యందురు.

(4) C అను అక్షరము సంకేతముగాగల కోడెక్సు ఎఫ్రాయిమస్ (*Codex Ephraemus* = ఎఫ్రాయిము పత్రి) అను ప్రతి. ఇది వ్రాయఁబడిన చర్మముమీఁది వ్రాఁత కాలవశమున కనఁబడి కనఁబడనట్లుండినందున ఎఫ్రాయిము సిరియ గ్రంథకర్త దానిపై మరియొక గ్రంథము వ్రాసెను. కొంతకాలమున కతఁడు వ్రాసిన సిరా పోయినందున మొదట వ్రాయఁబడిన బైబిలులోని వ్రాఁతలే కనఁబడుచున్నవి. దీనియందు పాఁత నిబంధనలోని కొన్ని ఆకులును, క్రొత్త నిబంధనలో దాదాపు సగముకన్న కొంచె మెక్కువ యున్నది. అక్షరము లంత తేటగా నుండనందున అనేక వాక్యములు చదువ వీలుగా కున్నది. అది 5 వ శతాబ్దమందు వ్రాయఁబడి ప్రస్తుతము పారిస్ (*Paris*) పట్టణమందున్న దేశసంబంధమగు పుస్తకశాలలో నున్నది.

(5) కోడెక్సు బీజా (*Codex Bezae* = బీజా పండితుని ప్రతి) అనునది బీజా యను పండితునిచే 1581 సం॥ న ఫ్రాన్సుదేశపు దక్షిణభాగమందలి యొక మఠమునందు కనుగొనఁబడెను. అతఁడు దానిని కేంబ్రిడ్జి (*Cambridge*) సర్వ కళాశాలవారికిచ్చినందున అచ్చట అది పదిలపర్చఁబడి యున్నది. అది 5 లేక 6 వ శతాబ్దములో వ్రాయఁబడెను. దానికి D అను అక్షరము సంకేతముగా నున్నది. దానియందు సువార్తలును అపొస్తలుల కార్యములును మాత్రము గ్రీకు లాటిను భాషలో వ్రాయఁబడియున్నవి.

పెద్ద అక్షరములతో వ్రాయఁబడిన ముఖ్య ప్రతు లింక దాదాపు 12 గలవు. పెద్ద అక్షరములతో వ్రాయఁబడిన ప్రతుల సంఖ్య దాదాపు

160. అయినను వాటిలో ననేకములు బైబిలు యొక్క భాగములు మాత్రమై యున్నది.

2. చిన్న అక్షరములతో వ్రాయఁబడిన ప్రతులు. ఇవి లెక్కకు ఎక్కువగా నున్నవి గాని అంత పురాతనమైనవిగావు. సువార్తలుగల ప్రతులే 1500 ఉన్నవి. సువార్తలులేనివి తక్కువగా నున్నవి. ఆరాధన సమయములో చదువవలసిన బైబిలు పాఠములుగల సువార్త ప్రతులు వేయికిపైగా నున్నవి. భాషాంతరములు చేయఁబడిన ప్రతులును మిగుల పురాతనమైనవి గలవు. అన్నియు మొత్తముమీఁద నేటివఱకు 3000 ప్రతుల కెక్కువగా నున్నవి.

ఈ ప్రతులన్నిఁటిని పరీక్షించి తారతమ్యములను కనిపెట్టి వాటివలన అసలు ప్రతిని తీయుటకు పండితులు పూనుకొని పనిచేసి యున్నారు. అక్షరముల భేదములును, వేలకొలఁది వ్రాఁత భేదములును పదభేదము లనేకములును వాక్యభేదములు కొన్నియును ఈ ప్రతులలో కనఁబడినను అవన్నియు ఒక గ్రంథముయొక్క ప్రతులేయై యున్నవి. ఉన్న భేదము వలన సిద్ధాంతముల యందుగాని బోధలయందుగాని భేదముండినటుల కనఁబడలేదు. ఈ గ్రంథమిట్లు జాగ్రత్తగా కాపాడఁబడుట దేవునియొక్క కృపవలననే యని ఆశ్చర్యముతో ఆయనను స్తుతించుట యుక్త కార్యమై యున్నది. (భాషాంతరములు, భాష, దైవావేశము, లేఖనములు చూ॥).

**ప్రత్యక్షత** బయలుపరచుట చూ॥

**ప్రత్యక్షపు గుడారము** గుడారము చూ॥

**ప్రథమ ఫలములు** అర్పణములు VIII 1 (1), పండుగలు III 1 (2) చూ॥

**ప్రథమ సంతానము** జ్యేష్ఠపుత్రుడు చూ॥

**ప్రదర్శకుడు** ప్రవచనము చూ॥

**ప్రధానము** వివాహము 4 చూ॥

**ప్రధాన యాజకుడు** (Chief Priest, High Priest). ప్రధాన యాజకుని ఇశ్రాయేలీయుల జగద్గురువుగా నెంచవచ్చును. సీనాయి పర్వతమునొద్ద గుడారమును కట్టిన పిమ్మట అహరోను నీ యుద్యోగమునకు ప్రత్యేకించి ప్రతిష్ఠించిరి (నిర్గ $27^{21}$ 28). అంతకు పూర్వము అహరోను మోషేకు సహాయుఁడై ఆయనకు ప్రతిగా మాట్లాడెను ($4^{14,30}$). అతఁడిశ్రాయేలీయుల పెద్దలలో నొకఁడైయుండెను ($24^{1,9}$). అతని కుమారులును అట్టి పెద్దలలో నుండుటనుబట్టి వారీపనియందు ప్రవేశింపనై యుండఁగా అట్టి ఘనము నొందిరను సంగతి విశదమగుచున్నది. అహరోనుకుఁ బిమ్మట అతని సంతానీకులకే యుద్యోగము వారసత్వమయ్యెను. సాధారణముగా అది జ్యేష్ఠత్వపు హక్కుల ననుసరించి పెద్దవాని హక్కుగా నుండినను, వానియందెట్టి లోపమైన నుండినయెడల గాని (లేవీ $21^{16-24}$) అతఁడు రాజున కిష్టుఁడు కాకున్నయెడల గాని (I రాజు $2^{26-35}$) ఆ వంశమును తప్పించి మఱియొక వంశమునకు దానినిచ్చిరి. ఒకఁడు 20 సం॥ల వయస్కుఁడుగాక పూర్వమతనికీ యుద్యోగ ధర్మము వహించుకొనుటకు వీలుగాదని యూదుల యితిహాసముల యందుండినను అరిస్టోబులు అను నతఁడు 17 యేండ్ల ప్రాయమప్పుడే దాని నిర్వహించెనని యోసీఫసువలనఁ దెలియుచున్నది (పురా 15. 3,3). ఇతరులకన్న వారికి శుద్ధీకరణాచారము విషయము మఱీ కఠినమగు నియమములుండెను (లేవీ $21^{1-15}$). ఆలయము నందు జరుగు ఆచారము లన్నిఁటికి పైవిచారణ కర్తయైనను (II రాజు $12^{7-16}$ $22^{4-7}$) మహాప్రాయశ్చిత్త దినమున ప్రజలకు ప్రాయశ్చిత్తము చేయుటయు (లేవీ 16) ఊరీము తుమ్మీము అను వాటి ద్వారా దేవుని చిత్తమును దెలిసికొని వారికి దాని తెలుపుటయు అను నీ రెండు ప్రధాన యాజకునికుండు ముఖ్యధర్మములైయున్నవి (పండుగలు, ఉపవాసకాలములు III 1 (3) (b), ఊరీము తుమ్మీము చూ॥). ఇట్లు ప్రధాన యాజకుఁడు ప్రజల పక్షమున దేవునియెదుట విజ్ఞాపనము చేయుటవలనను, దేవుని పక్షముగా ప్రజలకు దేవుని చిత్తమును తెలుపుటవలనను అతఁడు దేవునికిని మానవులకును ఇఱుపక్షముల మధ్యవర్తిగా నుండెను. ఇవిగాక అతఁడీదిగువ నుదాహరించిన పనులుకూడ నిర్వహించెను. విశ్రాంతి దినమందును అమావాస్యనాడును ఏఁటేఁట నాచరించిన పండుగల సమయములప్పుడును బలులర్పించెను (యుద్ధ 5.5.7). మత విషయములను పరిష్కరించు

సన్హెడ్రీను మహాసభకు అగ్రాసనాధిపతియై యుండెను (మ 26[17] కార్య 5[21]). అతని ఉద్యోగ వస్త్రము లితరులు ధరింపగూడదను నియమము గలదు (యాజకుల వస్త్రములు II చూ॥). ప్రధాన యాజకునిని, అతని వస్త్రములను ప్రతిష్ఠించుటనుగూర్చి నిర్గ 29 లో నున్నది. ఒకని పవిత్రపఱచుట కెట్టి యాచారము లనుష్ఠింతురో వాని ప్రకారమే ప్రధాన యాజకునికి చేసిరి. వానితోపాటు అతనిని తైలముతో నభిషేకించి ప్రత్యేకించిరి (29[7] లేవీ 8[12]). ఇందుచేతనే అతఁడు అభిషిక్తుఁడైన యాజకుఁడనఁబడెను (21[10] సంఖ్యా 35[25]). సాధారణ యాజకుల శిరస్సులపై నూనెపోసి వారి నభిషేకింపక వారి బట్టలమీఁద దానినిపోసి యభిషేకించిన ట్లున్నది (నిర్గ 40[13-15] లేవీ 8[30]) గాని వారిని కూడ శిరస్సుపై నూనెపోసి యభిషేకించెడివారని యూదుల యితిహాసములవలనఁ దెలియుచున్నది. యాజకుల మీఁదకంటె ప్రధాన యాజకులపై నూనెను విస్తారముగఁ బోసిరి (కీర్త 133[2]). పాఁత నిబంధన వాడుక ప్రకారము ప్రధాన యాజకుఁడు తన జీవితాంతమువఱకు ఆ యుద్యోగము నిర్వహించుకొనెను. గాని తరువాతి కాలములయందు హేరోదును రోమీయులును తమ యిష్టము వచ్చినట్లు ప్రధాన యాజకులను నియ



అబ్యాతారు అదోనియా పక్షమవలంబించినందున సొలొమోను అతనిని తీసివేసి (I రాజు $1^{7}$) సాదోకు వంశము వా రుద్యోగమునకు స్థిరపరచెను. తరువాతవచ్చిన ప్రధాన యాజకు లెవరనగా,

సాదోకు

అహిమయస్సు

అజర్యా

అమర్యా (II దిన $19^{11}$) ... ... ... క్రీ॥ ము॥ 853

యెహోయాదా (II రాజు $11^{4-19}$ $12^{2}$ II దిన $22^{10-12}$ $24^{15}$)

జెకర్యా (II దిన $24^{20-22}$) ... ... ... ,, 819

యోహానను

అజర్యా (I దిన $6^{10}$ II దిన $26^{17}$) ... ... ,, 750

ఊరియా (II రాజు $16^{10}$) ... ... ... ,, 732

అజర్యా (II దిన $31^{9-13}$) ... ... ... ,, 727

అమర్యా

అహీటూబు

మెరాయోతు (I దిన $9^{11}$ నెహె $11^{11}$)

సాదోకు

మెషుల్లాము లేక షల్లూము (I దిన $6^{12}$ $9^{11}$)

హిల్కీయా (I దిన $9^{11}$ II దిన $34^{8,9}$) ... ... ,, 622

అజర్యా

శెరాయా

యెహోజాదాకు (I దిన $6^{14}$). ఇతఁడు చెఱకాలమువఱకు ప్రధాన యాజకుఁడుగా నుండెను ... ... ,, 587

చెఱకాలమున 50 సం॥ ల వఱకు ప్రధాన యాజకోద్యోగ ముండలేదు. తరువాత వచ్చిన వారెవరనగా:—

యేషూవ (ఎజ్రా $2^{2}$ $3^{2}$ నెహె $12^{10}$ జెక $3^{1}$ $6^{11}$) ... క్రీ॥ ము॥ 538

యోయాకీము (నెహె $12^{10-12}$) ... ... ... ,, 520

ఎల్యాషీబు (నెహె $3^{20}$ $12^{10}$ $13^{4,8}$) ... ... ,, 446

యోయాదా

యోనాతాను (నెహె $12^{11}$)

యద్దూవ (నెహె $12^{11}$). ఇతని కాలమున మహా అలెక్సందరు యెరూషలేమును దర్శించెను... ... ... ,, 332

ఓనీయ (I మక్క $2^{20}$) ... ... ... ,, 309

సీమోను ... ... ... ... ,, 285

ఎలియాజరు (పురా 12. 2. 5)

మనష్షే (పురా 12. 4. 1)

ఓనీయ II (పురా 12. 4. 10)

ఓనీయ III (II మక్క 3. పురా 12. 4. 10) ... ... ,, 187

యాసోను (II మక్క $4^{7,26-26}$)

మెనేలాయు (II మక్క $13^{3-8}$ పురా 12. 5. 1; 15. 3. 1)

యాకీము (I మక్క $7^{5-9,25}$ $9^{1,54-56}$ పురా 12. 9. 7; 20. 10. 1) ,, 161

ఈ యుద్యోగము ఏడు సంవత్సరములవఱకు ఖాళీగా నున్నపిదప మక్కబీయులు దానిని తిరిగి స్థాపించిరి. అప్పటినుండి ప్రధాన యాజకుడు మతాధికారిమాత్రమేగాక దేశాధికారియు నయ్యెను. తరువాత వచ్చిన ప్రధానయాజకు లెవ్వరనగా:

| | |
|---|---|
| యోనాతాను (I మక్క $8^{1}$) ... ... | క్రీ॥ ము॥ దాదాపు 152 |
| సీమోను ... ... ... ... | ,, 144 |
| హుర్కానువాడగు యోహాను ... ... ... | ,, 135 |
| అరిస్టోబులు ... ... ... .. | ,, 104 |
| యన్నయ్య యనబడిన అలెక్సందరు ... ... | ,, 102 |
| హుర్కాను ... ... ... ... | 75-71, 67-41 |
| అరిస్టోబులు II ... ... ... ... | ,, 71-61 |
| అంటి గోనస్ ... ... ... ... | ,, 41 |

మించుచు తీసివేయుచు వచ్చిరి. ఒకే సమయమున ఒకని కెక్కువగా ప్రధాన యాజకులున్నట్లు క్రొత్త నిబంధనయందు సూచనలు కలవు (మ $2^{4}$ $16^{21}$ $20^{18}$ $21^{15,23,45}$ మొ॥ కార్య $4^{23}$ $9^{14}$ $25^{15}$). వారు ప్రధాన యాజకుడును, అతనికి ముందా యుద్యోగము నిర్వహించిన వారును వారి కుటుంబములోని యితరులైయుందురు. వారందఱిని ప్రధాన యాజకులనుట పరిపాటి. వీరు క్రీస్తును అపొస్తలులను విరోధించి వారిలో ముఖ్యులైయుండిరి.

యేసు క్రీస్తు దేవునికిని మానవులకును నిజమైన నిత్య ప్రధాన యాజకుడై పూర్ణవిధేయత చూపుట వలనను నిష్కళంకమగు యజ్ఞము నర్పించుట వలనను తప్పక యంగీకరింపబడు విజ్ఞాపనము చేయుటవలనను మన బలహీనతల నెఱిగియున్న సంపూర్ణుడగు మధ్యవర్తియై యుండుట వలనను మనము విశ్వసించుచున్న ప్రధాన యాజకుడై, ఆ యుద్యోగమును నిర్వహించిన వారిచే సూచింపబడిన ప్రతిదానిని నెఱవేర్చెను (హెబ్రీ $3^{1-3}$ $8^{1-6}$ $9^{24}$ $^{28}$). మెల్కీసెదెకు అనువాడు పాతనిబంధనయందు యాజకుడని మాత్ర మనబడినను (ఆది $14^{18}$ కీర్త $110^{4}$) అతడు తన ప్రాముఖ్యతను బట్టి ప్రధాన యాజకుడుగా నెంచబడి క్రీస్తు ప్రధాన యాజకత్వమునకు సూచనయై యున్నాడు (హెబ్రీ $6^{20}$).

పైన 610-612 పుటలలో ప్రధాన యాజక వంశవృక్షము కనపఱచబడియున్నది. I దిన $6^{1-15}$ ఎజ్రా $7^{1-5}$ లో ఆ వంశావళి వ్రాయబడియున్నదిగాని సాధారణముగా ప్రతిదానియందుండునట్లు దీనిలోను కొన్ని పేరులు లోపించిపోయినవి. పైనున్న వంశవృక్షమందు పెద్ద అక్షరములలోనున్న పేరులుగలవారు ప్రధాన యాజకులై యుండిరి.

మహాహేరోదు క్రీ॥ ము॥ 37 లో ప్రధాన యాజకులను స్వయముగా నేర్పఱచ నారంభించి వారి ననేక మారులు మార్చెను. ఇట్లు క్రీ॥ ము॥ 37 నుండి క్రీ॥ శ॥ 70 సం॥ న యెరూషలేము నాశమగునంతవఱకు నూటయేడు సం॥లలో 28 మంది ప్రధాన యాజకులు నియమింపబడిరి. బైబిలులో అన్నా (లూ $3^{2}$ యోహా $18^{13}$) కయపా (మ $26^{3,57}$ యోహా $18^{13}$), అననీయ (కార్య $23^{2}$ $24^{1}$) అనువారు మాత్ర ముదాహరింపబడిరి. (యాజకులు, లేవీయులు చూ॥).

ప్రపంచము భూమ్యాకాశములు చూ.

**ప్రభుత్వము (Dominion).** లౌకిక ప్రభుత్వములనుగూర్చి అధికారి చూ॥ అయితే యిచట లౌకిక యధికారములనుగూర్చి కాక, పరలోకసంబంధమగు శక్తులను సూచించుటకు పౌలు ఎఫె $1^{21}$ కొలొ $1^{16}$ లో వాడిన విశేష పదమునుగూర్చి మాత్రము ప్రశంసింపబడును. ఎఫె $1^{21}$ లో క్రీస్తు ఇట్టి ప్రభుత్వముకు పైగా హెచ్చింపబడెను అను సంగతి గలదు. ప్రభుత్వము అను నీ మాటలో సాతాను ప్రభుత్వమును చేరియున్నదని ఎఫె $2^{2}$ $6^{12}$ వలన తెలిసికొనవచ్చును గాని మంచి దూతలయొక్క ప్రభుత్వము కూడ ఇందులో చేరియున్నది. కొలొ $1^{16}$ లో

ప్రభుత్వములు అను బహువచనరూపము కలదు. దీని భావమును చూడగా పైనున్న యర్థమేకాని మఱియొకటి కాదు. II పేతు $2^{10}$ యూదా 8 లోకూడ అసలు భాషలో ఈ పదమే కలదు. ఇచట నీ పదము లౌకిక ప్రభుత్వమునకు సరిపడ వచ్చును. అయినను ఇది దూతల ప్రభుత్వమును కూడ సూచించుచునని కొనవచ్చును. (పరిపాలన, అధికారి చూ॥).

**ప్రభువు** (Lord). దేవునికి బిరుదుగా నుపయోగించిన పదములనుగుఱించి మాత్రము ఇందు విచారింపబడును. పాత నిబంధనయందున్న అదోనై (*Adonai*) అను పదమును ప్రభువు అని భాషాంతరము చేయు వాడుకకద్దు (ఆది $15^{2,8}$ $18^{27,31,32}$ నిర్గ $4^{10,13}$ $5^{22}$ మొ॥). ఈ పదమును మనుష్యులకుకూడ వాడెదరు. అట్లు వాడినప్పు డాపదమును తెనుగు బైబిలునందు **యజమానుడ**నియు (ఆది $18^{12}$ $40^{7}$ మొ॥), **అయ్య**యనియు ($23^{6,11}$; $^{15-18}$ మొ॥). **ఏలినవాడ**నియు (I రాజు $18^{7,13}$ II రాజు $2^{19}$ $4^{28}$ మొ॥) తర్జుమా చేసిరి. దేవునికి సంబంధించిన చోట మాత్రము ప్రభువని తెనిగించిరి.

క్రొత్త నిబంధన యందిది క్రీస్తు బిరుదములలో నొక ముఖ్యమైనది. దాని మూలపదమును మనవులకుకూడ నుపయోగించిరి. అట్టి సందర్భములలో యజమాను డని తెనిగించిరి (మ $10^{24,25}$ $18^{25,27,34}$ $20^{8}$ మొ॥). దానిని యేసుక్రీస్తు అను పదములో కలిపి వాడిరి (రోమా $1^{3-7}$ $4^{24}$ $5^{1,11}$ మొ॥). ప్రభువు అను పదము ప్రత్యేకముగా కనబడని చోట్లెల్ల క్రీస్తని యర్థమగును (కార్య $5^{14}$ $9^{10}$ $11^{21}$ రోమా $14^{8}$ మొ॥).

తెలుగులో క్రొత్త నిబంధనయందు కొన్ని వాక్యములలో ప్రభువు అను పదమును పెద్ద అక్షరములలో అచ్చువేసిరి. అది రెండువిధములుగా నున్నది. ఒకటి ప్రభువు దూతకు సంబంధముగానున్నది. అచ్చట అది యెహోవా దూతయని అర్థము (దూత 2 చూ॥). రెండవది పాత నిబంధనలోనుండి యెత్తబడిన వాక్యములలో ప్రభువు అను బిరుదుకు సంబంధముగా నున్నది (మ $3^{3}$ $4^{7-10}$ $5^{33}$ $21^{9}$ $22^{37}$ లూ $2^{23}$ కార్య $2^{21-25}$ రోమా $14^{11}$ ప్రక $4^{8}$ మొ॥).

ప్రభువను పదము క్రొత్త నిబంధనలో పెద్దక్షరములతో అచ్చువేసినప్పుడెల్ల అది యెహోవా అను పదమునకు సమానమని తెలిసికొనవలెను. ఆ నామమును యూదులు ఉచ్చరింపక, దానికి బదులు పైనున్న అదోనైయను పదము నుచ్చరించిరి. క్రీ॥ శ॥ ముందు రెండవ శతాబ్దమునందు పాత నిబంధనను గ్రీకుభాషలోకి తర్జుమా చేసినప్పుడు యెహోవా యను పదమును వారు ప్రభువని యర్థమిచ్చు పదమును వాడిరి. ఇది యెహోవా యను పదమని తెలియునట్లు అది వచ్చినప్పుడెల్ల ప్రభువు అను పదమును, అనేక తర్జుమాలలో పెద్దక్షరములతో నచ్చువేసిరి. తెలుగు బైబిలునందును దానినే యనుసరించిరి.

**ప్రభువు దినము** (Lord's Day). ప్రభువుదినము అను మాటలు బైబిలునందు ప్రక $1^{10}$ లో తప్ప మఱి యెచ్చటను గానరావు. అది యాదివారమున కొక పేరని దాదాపుగా నందఱును అంగీకరింతురు. ఆది క్రైస్తవులు ఆదివారమున విశేషారాధనలు చేసియున్నట్లు కార్య $20^{7}$ I కొరి $16^{2}$ వలన తెలియును. హతసాక్షియైన జస్టీను (*Justin Martyr*) సుమారు క్రీ॥ శ॥ 120 సం॥ నందు వ్రాసిన యొక గ్రంథములో క్రైస్తవులు ప్రతి యాదివారమున సమాజముగా కూడుకొని అపొస్తలుల లేఖనములను ప్రవక్తల లేఖనములను చదివి వినిపించిరనియు, వారిలోని పెద్ద ప్రసంగించిన పిమ్మట అందఱును కలిసి ప్రార్థన చేసిరనియు, తరువాత ప్రభురాత్రి భోజన సంస్కారము నాచరించిరనియు వ్రాసెను. యూదులలోనుండి క్రైస్తవులైనవారు యూదుల యాచార ప్రకారముగా విశ్రాంతి దినమును (అనగా శనివారమును), క్రీస్తు నారాధించు నిమిత్తము ఆదివారమును ఆచరించినట్లు కనబడును. అయితే అన్యులలోనుండి క్రైస్తవులైన వారిలో నెక్కువమంది యూదుల విశ్రాంతి దినము నాచరింపక ఆదివారమును మాత్రము నాచరించినట్లు తెలియుచున్నది. క్రీస్తు ఆదివారమున పునరుత్థాన మొందుటను బట్టియు (యోహా $20^{1}$) ఆ దినమున తన శిష్యులకు దర్శనమిచ్చుటను బట్టియు ($20^{19}$) మఱియు సాధారణముగా నంగీకరింపబడినట్లు పరిశుద్ధాత్మ కుమ్మరింపబడినందునను (కార్య $2^{1}$) ఆదివారము విశేషరీతిగా ప్రభువు

దినమనఁబడెను. క్రీస్తు విశ్రాంతి దినముగూర్చి చేసిన బోధలను క్రైస్తవులనుసరించి విశ్రాంతి దినము విషయమై క్రీస్తుచేసిన యేర్పాటుల నుండ నిచ్చిరిగాని యూదుల విశ్రాంతి దినమున వాటి నాచరింపక ప్రభువు దినమున వాటి నాచరించిరి (పంచాంగము 1 చూ॥).

**ప్రభువు ప్రార్థన (Lord's Prayer).** క్రీస్తు తన శిష్యులకు నేర్పిన ప్రార్థనను ప్రభువు ప్రార్థన యందురు. ఆయన కొండమీఁద ప్రసంగించినప్పుడును (మ $6^{9-13}$), పెరీయ చర్యలో శిష్యులు తమకు ప్రార్థించుటకు నేర్పుమని యడిగినప్పుడును (లూ $11^{1-4}$) దానిని చెప్పినట్లు కనఁబడుచున్నది. లూకా వ్రాసినట్లు అది పెరీయ చర్యలోనే చెప్పఁబడినట్లును, ఆయన బోధలను సంక్షేపముగా వ్రాయునప్పుడు మత్తయి దానిని కొండమీఁది ప్రసంగములోఁ జేర్చినట్లును కొందఱి యభిప్రాయముగాని అందుకు తగిన యాధారములులేవు. మత్తయి ఆ ప్రార్థనను పూర్ణముగాను లూకా క్లుప్తముగాను వ్రాసిరి. ఆ భేదము నీ దిగువ గుర్తింపవచ్చును.

| మత్తయి | లూకా |
|---|---|
| **పీఠిక** | **పీఠిక** |
| పరలోకమందున్న మాతండ్రీ | తండ్రీ |
| **మనవులు** | **మనవులు** |
| 1. నీ నామము పరిశుద్ధపఱచబడునుగాక | 1. నీ నామము పరిశుద్ధపఱచబడునుగాక |
| 2. నీ రాజ్యము వచ్చుగాక | 2. నీ రాజ్యము వచ్చునుగాక |
| 3. నీ చిత్తము పరలోకమందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరునుగాక | 3. |
| 4. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. | 4. మాకు కావలసిన అనుదినాహారము దిన దినము మాకు దయచేయుము. |
| 5. మా ఋణస్థులను మేము క్షమించియున్న ప్రకారము మా ఋణములు క్షమించుము. | 5. మేము మాకచ్చియున్న ప్రతివానిని క్షమించుచున్నాము గనుక మా పాపములను క్షమించుము. |
| 6. మమ్మును శోధనలోకి తేకుము. | 6. మమ్మును శోధనలోకి తేకుము. |
| 7. దుష్టుని (కీడు)నుండి మమ్మును తప్పించుము. | 7. |

కొన్ని ప్రాచీన ప్రతులయందు "రాజ్యము బలము మహిమయు నీవైయున్నవి ఆమెన్" అను ముగింపుస్తుతి వాక్యము మత్తయి సువార్తలో కనఁబడుచున్నది.

పీఠికయందు సంబోధన వాక్యము మాత్ర మున్నది. దేవుఁడు మన తండ్రి యనియు, సాధారణమైన తండ్రిగాక పరలోకమందుండు సర్వోన్నతుఁడగు తండ్రి యనియు దాని భావమై యున్నది. పైనుండు అంకెల ననుసరించి సాధారణముగా ప్రభువు ప్రార్థనలో ఏడు మనవు లున్నట్లు చూడవచ్చును. లూకా వాటిలో నైదింటిని మాత్రము వ్రాసెను. నాలుగవ మనవిలో దినాహారమని తెనిఁగించిన గ్రీకు పదము మఱే గ్రంథములోను కనఁబడక పోవుటచే దాని యర్థమంత చక్కఁగాఁ దెలియకున్నది. భావి నంత యాహారమని కొందఱును, రేపటి యాహార

మని కొందఱును అర్థము చెప్పెదరు. మొదటి మూఁడు మనవులు దేవుని ఘనమును గూర్చినవి యును, చివరి నాలుగు మన యక్కఱలను గూర్చిన మనవులైయున్నవి. ఈ ప్రార్థన యెంత దివ్య మైనదైనను, అవసరమైనవన్నియు దానిలో సంక్షేపముగా నున్నను మత్తయి లూకాలు మాటలనేకరీతిగా నుపయోగింపనందున మనము ప్రార్థనచేయునప్పుడు ఈ విధముగా చేయవలె నను బోధ యిందులో నున్నది. ఈ మాటలనే హృదయ పూర్వకముగా నుచ్చరించుట యెంత మేలుగా నున్నను ఈ మాదిరి ననుసరించి మన ప్రార్థనలను చేయువలెనని స్పష్టమగుచున్నది.

ముగింపుగానున్న స్తుతివాక్యము అసలు ప్రతు లలో లేకపోయినను ఆదికాలమునుండి భక్తులచేత వాడఁబడిన స్తుతివాక్యమని తెలిసికొనవలెను. తథాస్తు అని యర్థమిచ్చు ఆమేన్ అను పదము యూదుల ప్రార్థనల ననుసరించి వాడుకలోకి వచ్చెను.

ప్రభువుయొక్క సహోదరులు (Brethren of the Lord). పౌలు ప్రభువు యొక్క సహోదరులనుగూర్చి I కొరి $9^{5}$ నందు ప్రశంసించెను. గల $1^{19}$ నందు యాకోబు ప్రభువు సహోదరుఁడనఁబడెను. ఆయన సహోదరులను గూర్చిన ప్రశంస సువార్తలలోను గలదు. వారు మరియతోను క్రీస్తుతోను నజరేతునుండి కపెర్నహూమును వెళ్లిరి (యోహా $2^{12}$). క్రీస్తు మతిచెప్పియున్నాఁడని ఆయనను పట్టి తీసికొనిపోవుటకు మరియతోకూడ వచ్చిరి (మ $12^{47-50}$ మా $3^{31-35}$ లూ $8^{19-21}$). యాకోబు యోసే యూదా సీమోను అని వారు పిలువఁ బడిరి (మా $6^{3}$). మ $13^{55}$ లోను అదే పేరు లున్నవిగాని యోసే అనువానికిగా యోసేపు అని యున్నది. ఆయన ఇంక అనుమానములకు చంపఁబడుననఁగా వారు ఆయనను నమ్మియుండక పోయినను (యోహా $7^{3-5}$) ఆయన లేచినపిమ్మట ఆయన శిష్యులతో కలిసియుండిరి (కార్య $1^{14}$). ఆయన లేచినపిమ్మట దర్శనమిచ్చిన యాకోబు ఆయన సహోదరుఁడే యని నమ్మఁదగును (I కొరి $5^{7}$). తరువాత అతఁడు యెరూషలేములోని సంఘమునకు పెద్దయయ్యెను (కార్య $12^{17}$ $15^{13}$ గల $2^{9}$). యాకోబు పత్రికను వ్రాసినవాఁ డితఁడే (యాకోబు 3 చూ॥).

వీరట్లు ప్రభువుకు సహోదరులని మొదటి నుండి తాత్పర్యభేదము కలదు.

1. వీరు యోసేపు కుమారులుగాని మరియ కొడుకులు కారనునది ఒక యభిప్రాయము. ఈ యభిప్రాయప్రకారము యోసేపు వైధవ్యుఁ డనియు మరియకన్న చాల పెద్దవాఁడని తెలియఁ చున్నది. ఇట్టి యభిప్రాయముకలవారు మరియ నిత్య కన్యకగానే యుండెనందురు. లూ $1^{34}$లో అట్టి భావ మిమిడియున్నదని చెప్పెదరు. క్రీస్తు తన తల్లిని వీరికిఁగాక యోహాను కప్ప గించుటయు (యోహా $19^{26,27}$) నీ యభిప్రాయ మునకు సరిపడునందురు. వారు క్రీస్తుకన్న పెద్దవారైనట్లు నటించుటయు (మా $3^{21-31}$ యోహా $7^{3-5}$). దీని బలపఱచును. ఎపిఫనియస్ (*Epiphanius*) అనువాఁ డీ యభిప్రాయమును మొదట అనుసరించినవాఁడగుటచే దీని కతనిపేరు నారోపింతురు. ప్రస్తుతమున ననేకు లీ యభి ప్రాయము నవలంబింతురు.

2. జెరోము (*Jerome*) అను పురాతనశాస్త్రి వీరు మరియ తోఁబుట్టువగు వేఱొక మరియ కుమారులని చెప్పెను. ఈమె అల్ఫయి అను వాని భార్యయని ఈ యభిప్రాయము ననుస రించువారి తలంపు (మా $15^{40}$ యోహా $19^{25}$). అపొస్తలులలోని అల్ఫయి కుమారుఁడగు యాకోబు క్రీస్తు సహోదరుఁడని వారి యభిప్రాయము. జెరోము 4 వ శతాబ్దమున జీవించినవాఁడగుట వలనను అతనికి పూర్వము దీని ననుసరించినవారు లేకపోవుటవలనను, ఆయన సహోదరులైనను ఆయనను నమ్మియుండలేదని యోహాను వ్రాయుట వలనను (యోహా $7^{3-5}$) ఈ యభిప్రాయము ననుసరించువారు బహు కొద్దిమందిమాత్రమే గలరు.

3. వీరు క్రీస్తుకు తరువాత యోసేపు మరియ లకు జన్మించినవారనునది మూఁడవ యభి ప్రాయము. మ $1^{25}$ లూ $2^{7}$ ను బట్టి క్రీస్తుపుట్టిన పిమ్మట వారు సంసారము చేసియున్నట్లు ఈ యభిప్రాయ మనుసరించువారు చెప్పెదరు. ప్రభువు సహోదరులను మాటకిదే సహజమైన

యర్థమని వాదింతురు. హెల్విడియు (*Helvidius*) అనువాఁడీ యభిప్రాయమును మొదట అనుసరించుటచే దీని కతని పేరుపెట్టిరి.

**ప్రభువు రాత్రిభోజనము (The Lord's Supper).** క్రీస్తు శిష్యులు తన శ్రమ మరణాదులను జ్ఞప్తిచేసికొని తనతో సహవాసులగుటకు తాను శ్రమపడక మునుపటిరాత్రి ఆయన యేర్పాటుచేసిన సంస్కారమునకు పౌలు పెట్టిన పేరు (I కొరి 11$^{20}$). అది యీ సంస్కారమునకు మాత్రమేగాక దానికి సంబంధించిన ప్రేమవిందు పేరునై యుండవచ్చును ప్రభువు బల్ల అనునదియు దీనికి చెందును (I కొరి 10$^{21}$). కార్య 2$^{46}$ 20$^{7}$ నందున్న రొట్టె విరుచుటయు ప్రభు రాత్రిభోజనమునకొక సూచన యనుకొనందగును గాని ఈ పేరంతఁగా వాడుకలోకి రాలేదు. అట్లే ద్రాక్షారసము స్తుతిపాత్ర యనియు (I కొరి 10$^{16}$), ప్రభువు పాత్రయనియు (10$^{21,22}$) అనఁబడును. బైబిలునందు లేకపోయినను, దీని నాచరించునప్పుడు క్రీస్తు శరీర రక్తములలో పాలివారమగుదుము (10$^{16,17}$) గాన పరిశుద్ధ సమభాక్త్వము, క్రీస్తు దాని నియమించునప్పుడు స్తోత్రము చేసెను కావున యూఖరిస్తు (*Eucharist* = స్తోత్రము చేయుట) అను పేరులుకూడ వాడుకలో నున్నవి.

ప్రభు రాత్రిభోజనవిషయమైన సంగతులను మత్తయి (26$^{26-29}$), మార్కు (14$^{22-25}$) లూకా (22$^{15-20}$), పౌలు (I కొరి 11$^{23-26}$) అను నలుగురు వ్రాసిరి. ఇవిగాక దీనిని పుచ్చుకొనువారి విధ్యుక్త ధర్మములనుగూర్చి పౌలు 10$^{14-16}$ నందుదాహరించెను. జీవాహారమునుగుఱించి క్రీస్తు చేసిన ప్రసంగములో ఈ సంస్కారమునకు తగినవి కనఁబడుచున్నను అది ప్రభు రాత్రిభోజనమునుగూర్చిగాక ఆయనలో సహవాసులగుటను గూర్చినదై యున్నది (యోహా 6$^{27-65}$). ఈ సంస్కారమునుగూర్చి తెలిసికొనుటకు ఈ వాక్యములుగాక బైబిలునందు ఇతర యాధారములు లేవు.

ప్రభువు రాత్రిభోజన సంస్కారము పస్కాపండుగ సమయమున నేర్పాటాయెను. ఐగుప్తు దాసత్వమునుండి కలిగిన విడుదలకు జ్ఞాపకార్థపు సూచనయై పస్కా సెలవేర్పు అని చెప్పఁదగి యున్నది. పాపవిముక్తి కలిగించిన దేవుని గొఱ్ఱెపిల్లకు జ్ఞాపకార్థమైన ఆచారమై యున్నది. మత్తయి మార్కులు వ్రాసినదానికిని లూకా పౌలులు వ్రాసినదానికిని పరస్పర సంబంధమున్నట్లు చూడవచ్చును. నన్ను జ్ఞాపకము చేసికొనుటకు దీనిని చేయుఁడను హెచ్చరిక మత్తయి మార్కు సువార్తలయందు లేదు. వీరు ఆ సంస్కార నియమకాలమున క్రీస్తు పలికిన మాటలున్నవి యున్నట్లుగా వ్రాసిరనియు, వారి వ్రాఁతలనుబట్టి ఈ సంస్కారము తాత్కాలికమైనదేగాని నిత్యము నాచరింపవలసినది గాదనియు కొందఱివాదము. క్రొత్త నిబంధన గ్రంథరచనకాల నిర్ణయప్రకారము పౌలు అందఱికన్న ముందు వ్రాసెను. అతఁడును లూకాయును దీని ఏర్పాటునుగూర్చి మత్తయి మార్కులకన్న వివరముగా వ్రాసిరనుట మఱి మంచిది. లూకా వ్రాసిన దానినిబట్టి, క్రీస్తు మొదట పాత్రను, తరువాత రొట్టెను, ఆ తరువాత మఱల పాత్రను ఇచ్చినట్లున్నది (లూ 22$^{17-20}$). ఇందు 20 వ వచనమును లోపింపచేయవలెనని కొందఱి యభిప్రాయము. పౌలుకూడ లూకావలె మొదట పాత్రను తరువాత రొట్టె నిచ్చినట్లు వ్రాసెననుట (I కొరి 10$^{16,17}$) అట్టివారి వాదమున కొక యాధారముగాని మొదటి పాత్ర పస్కాను భుజించునప్పుడు యూదులు త్రాగిన స్తుతి పాత్రలనఁబడినవాటిలో నొకటి యనుట యుక్తము. రొట్టె నిచ్చునప్పుడు 'పుచ్చుకొని తినుడి, ఇది నా శరీరము'నియు, ద్రాక్షారసమిచ్చునప్పుడు 'మీరందఱు త్రాగుడి ఇది క్రొత్త నిబంధన రక్తము' అని చెప్పినమాటలు అందఱును వ్రాసిరి గాన అవి యీ సంస్కారమునందు ముఖ్యములైనవని యెంచవలెను. ఇది 'పాపక్షమ నిమిత్తము' చిందింపఁబడిన రక్తమని మత్తయియును 'మీ కొఱకు' చిందింపఁబడెనని మార్కు లూకాలును వ్రాసిరి. ఇది నిర్గ 24$^{8}$ లో నుదాహరించిన దాని సెలవేర్పు అని యనుకొనుట మంచిది. క్రీస్తు చెప్పిన ఈ పదములు గాక, కొరింథు సంఘమందలి అక్రమములను దిద్దుటకై పౌలింక కొన్ని సంగతులను కలిపెను (I కొరి 11$^{23}$). ప్రభువువలన ఈ బోధను పొందితి

నసెను. అతఁడు దానిని దర్శనముద్వారానా లేక అపొస్తలులద్వారానా పొందెననుదానిగూర్చి తాత్పర్యభేదము గలదు. గాని గల $1^{15,16}$ నందున్న దానినిబట్టి పౌలు దానిని ఇతరులవలనఁ గాక క్రీస్తువలననే పొందినట్లు చెప్పఁదగును. దానిని పొందెడివారు యోగ్యముగా పొందవలెననియు, అయోగ్యముగా నొందెడివారు కీడునకు లోనగుదురనియు అతఁడు వ్రాసెను (I కొరి $11^{26-29}$). ప్రభువు శరీరమని వివేచింపనివారు దానిని యోగ్యముగా పుచ్చుకొనువారుకారు.

ప్రభు రాత్రి భోజన విషయమైన వాక్యముల కర్థములు చెప్పుటలో ననేక తాత్పర్య భేదము లున్నవి అట్టి వాటినిగూర్చి ఆయా వివిధ శాఖలవారి వేదసిద్ధాంతశాస్త్రములను పరిశీలించుట యుక్తము.

**ప్రమాణము, ప్రమాణముచేయుట, ఒట్టు, ఒట్టుబెట్టుకొనుట, ఆనబెట్టుట (Oath).** మనము చెప్పునది సత్యమనుదానికి దేవుఁడు సాక్షిగా నుండవలెనని ఆనబెట్టుటయే ప్రమాణము. అట్టిమాటలు నిజము కాకపోయిన యెడల దేవుఁడది చూచి శిక్షించునను సంగతి స్పష్టముగ చెప్పఁబడక పోయినను, అట్టి భావము ప్రతి ప్రమాణములో నున్నది. ఒకఁడొక నేరము చేసియున్నట్లు వానిమీఁద అనుమానమున్నయెడల ఆ కార్యము జరిగిన సమయమునందెవరును లేనట్లయిన ఈ విధముగా ప్రమాణము చేయుట అత్యవసరముగా నున్నది (నిర్గ $22^{10-11}$). మనుష్యులు దేవుని తోడని మాత్రము ప్రమాణము చేయవలెను (యెష $48^{1}$ యిర్మీ $12^{16}$ ద్వితీ $6^{13}$) గాని విగ్రహముల తోడని యెంత మాత్రము ప్రమాణము చేయరాదు (యెహో $23^{7}$). దేవుని తోడని మాత్రమే కాక ఆకాశము, ఆలయము, తల ఈ మొదలగు వాని తోడనియు ప్రమాణము చేయుట యూదులలో వాడుకగా నుండెను (మ $5^{33-37}$ $23^{16-22}$). ఇట్లు అలవాటుగా ఒట్టుబెట్టుకొనుట దుర్వాడుకయును నిషేధమునై యున్నది. క్రీస్తు దీనిని ఖండితముగా నిషేధించెను. అయితే తగిన యధికారి యొకఁడు క్రీస్తుచేత ప్రమాణము చేయింపగా క్రీస్తు ప్రమాణముచేసి ప్రత్యుత్తర మిచ్చుటచే న్యాయమైన ప్రమాణములుకూడ కలవని ఆయన చూపించెను. గంభీరమైన సమయములలో తాను చెప్పినది సత్యమని స్థిరపఱచుటకు పౌలుకూడ ప్రమాణముచేయఁ దగించెను (II కొరి $11^{31}$ గల $1^{20}$).

నీకును నాకును సర్వకాలము యెహోవాయే సాక్షి (I సమూ $20^{23}$) అని, దేవుఁడే సాక్షియని (II కొరి $1^{23}$ ఫిలి $1^{8}$ గల $1^{20}$) మొదలగు విధములుగా ప్రమాణములు చేసెడివారు. ఏదో యొక సంగతి చేయనియెడల దేవుఁడు నాకు (గొప్ప అపాయము) కలుగఁజేయును గాక అనుటయును ఒక విధమైన ప్రమాణముగా నున్నది (I సమూ $14^{44}$ $25^{22}$ II సమూ $3^{35}$ $15^{21}$). ఇందులో గొప్ప అపాయము అను పదములు అసలులో లేవు గాని దేవుఁడు నాకు అట్లు చేయునుగాక అను ప్రమాణము మాత్రము కలదు. యెహోవా జీవము తోడు అని ప్రమాణము చేయుట సర్వసాధారణమై యున్నది (I సమూ $14^{39}$ $19^{6}$ $3^{17}$). యెహోవా తన వాక్యమును దృఢపఱచుటకు తన జీవముతోడని చెప్పి దాని నిర్ధారణ చేసెను (ఆది $22^{16}$ హెబ్రీ $6^{13-20}$). ఒక ప్రమాణమును స్థిరపఱచుటకు చెయ్యి యెత్తుట (ఆది $14^{22}$ ద్వితీ $32^{40}$), చేయి తొడక్రింద పెట్టుట (ఆది $24^{2}$ $47^{29}$), అర్పించిన మృగములను కోసి ఆ ఖండములను రెండు భాగములుగా చేసి వాటిమధ్య నిలుచుట ($15^{10,17}$ యిర్మీ $34^{18}$), ఆయా యభినయములును ఆయా క్రియలును సూచనలుగా నున్నట్లు కనఁబడును. ఒకనిచే ప్రమాణము చేయించునప్పుడు వాఁడు ఆమేన్, ఆమేన్ అనుట చాలును (ద్వితీ $27^{15-26}$). ప్రమాణము చేయించునప్పుడు దేవాలయములో బలిపీఠము యెదుట దాని చేయింపవలెను (I రాజు $8^{31}$). దేవుని సేవించెద మను నిబంధనలను స్థిరపఱచుటకు జనులు ప్రమాణములను చేయుచు వచ్చిరి. (ఆది $21^{27-31}$ $26^{28}$ $31^{53}$ యెహో $9^{15}$ II రాజు $11^{4}$). ప్రమాణములను చేసినవారు వాటిని మీరకూడదను నియమముండెను (లేవీ $6^{1-7}$ కీర్త $15^{4}$). తండ్రి సెలవు లేనిది కన్యకయు, పెనిమిటి సెలవులేనిది భార్యయు చేసిన ప్రమాణములు మాత్రము రద్దుచేయఁబడవచ్చును (సంఖ్యా 30). అబద్ధ ప్రమాణములను చేసినవారు యెహోవా నామమును దూషించి శిక్షకు పాత్రు

లైరి (లేవీ $6^{3}$ $19^{2}$ యెష $48^{1}$ యిర్మీ $12^{16}$ మలా $3^{5}$).

**ప్రమాణిక గ్రంథములు (Canon).** బైబిలులోని గ్రంథములన్నియు నొకటే కాలమున నొకే పుస్తకముగా రచింపఁబడియుండలేదు. ఇవి ఆయా భక్తులచే ఆత్మప్రేరేపణవలన రచింపఁబడి వేర్వేఱుగా నున్నవి. వీటిని ఏక గ్రంథముగా చేర్చుటయను కార్యము తరువాత జరిగెను. అప్పుడు ఏయే గ్రంథముల నొకటిగా చేర్చవలెనో అది యాలోచింపవలసి వచ్చెను. మన బైబిలులోని గ్రంథములు ఇవ్విధముగ నెట్లు ఒక ప్రమాణిక కూర్పుగ చేర్చియుండిరో అది ప్రమాణిక గ్రంథములను గూర్చిన యీ శీర్షిక క్రింద వివరింపడమగును. పాఁత నిబంధనను క్రొత్త నిబంధనను వేర్వేఱు సమయములయందు సమకూర్చుటచే ఈ రెంటిని గూర్చి వేర్వేఱుగా వివరింపవలెను.

1. పాఁత నిబంధన ప్రమాణిక గ్రంథములు: ఈ భాగమందలి గ్రంథముల గ్రంథకర్తలు వాటిని క్రమక్రమేణ రచియించుచు కాపాడుచునుండిరి. పది యాజ్ఞలను నిబంధన మందసములో నుంచిరి. (నిర్గ $40^{20}$). నిబంధన గ్రంథములో ఇశ్రాయేలీయుల ముఖ్యమైన కట్టడలను వ్రాసియుంచిరి ($20^{23}$ $23^{32}$ $24^{7}$). మోషే వ్రాసిన ధర్మశాస్త్రమును మందసపు ప్రక్కన నుంచిరి (ద్వితీ $31^{24-26}$). యెహోషువ గ్రంథమును దీనితోఁ జేర్చిరి (యెహో $24^{26}$). సమూయేలు రాజ్యాంగ విధులను వ్రాసి వాటిని యెహోవా సన్నిధినుంచెను (I సమూ $10^{25}$). యోషీయా కాలములో దేవాలయమునందు ధర్మశాస్త్రమును కనుగొనిరి (II రాజు $22^{8-20}$). ప్రవక్తలు తమ బోధలను వ్రాసియుంచిరి (యిర్మీ $36^{32}$). వారి మాటలు దేవుని వాక్యముగా నంగీకరింపఁబడెను (జెక $1^{4}$ $7^{7,12}$). ఎజ్రా కాలములో మోషే ధర్మశాస్త్ర గ్రంథముండెను (ఎజ్రా $7^{13}$). దానిని బహిరంగముగా చదివి వివరించిరి (నెహె $8^{1,5,8}$). అప్రమాణిక గ్రంథములనఁబడు సైరాకు్స జ్ఞాన గ్రంథము $49^{10}$ లో పన్నెండు ప్రవక్తల గ్రంథములకు సూచన కలదు. సెప్తుయజింట్ (LXX) అను గ్రీకు తర్జుమా క్రీ॥ పూ॥ 150 సం॥నకు లోఁగా చేయఁబడి యుండుటచే ఆ కాలమునకు లోపుగా ఈ గ్రంథము లన్నియు సమకూర్చఁ బడినవను సంగతి స్పష్టమగును గాని, అందులోని గ్రంథముల క్రమము మన బైబిలులోని గ్రంథముల క్రమమునకు కొంచెము భేదముగా నున్నది. మన బైబిలులో లేని కొన్ని గ్రంథములు LXX నందున్నవి. అవి హెబ్రీ బైబిలులో లేకపోవుటనుబట్టి వాటిని అప్రమాణిక గ్రంథములందు చేర్చిరి (అప్రమాణిక గ్రంథములు చూ 11).

క్రొత్త నిబంధనయందలి అనేక వాక్యములలో పాఁత నిబంధన గ్రంథములలోని వాక్యములను దైవవాక్యమునుగా నెత్తుచున్నారు. ఓబద్యా, నహూము, ఎజ్రా, నెహెమ్యా, ఎస్తేరు, పరమగీతము, ప్రసంగి యను నీ గ్రంథములలోనుండి తప్ప పాఁత నిబంధనలోని యితర గ్రంథములన్నిఁటినుండి యెత్తి వ్రాయఁబడిన వాక్యములు క్రొత్త నిబంధనలో నున్నవి. అవి ప్రమాణములని యెంచుటనుబట్టి వాటన్నిఁటినుండి వాక్యముల నెత్తి పలికియున్నారు.

ఈ పై సంగతులను చూడఁగా నీ గ్రంథములు క్రమక్రమేణ ఒక ప్రమాణిక గ్రంథముగా నేర్పడినవి. ఎజ్రాయను శాస్త్రికాలములో ఈ పని పూర్తియైనదను నొక పారంపర్య వాక్యము కలదు. ఇది చాలమట్టుకు నమ్మఁదగినదే గాని ఎజ్రా కాలమునకుఁ బిమ్మట మఱికొన్ని భాగములు చేర్చఁబడి యుండవచ్చును.

ఇట్లు ఈ గ్రంథము లన్నియు చేర్చఁబడినను అవి యన్నియు నేకరీతిగా గంభీరములైనవై యున్నవని చెప్ప వీలుకాదు. మోషే ధర్మశాస్త్రము అను గ్రంథపంచకమును దాని పురాతనత్వమునుబట్టి మొదటి భాగమునుగా నెంచిరి. దినవృత్తాంతములు, ఎజ్రా, నెహెమ్యా, ఎస్తేరు అను చరిత్రగ్రంథములను తప్ప తక్కిన చరిత్ర గ్రంథములను, దానియేలు, విలాపవాక్యములు తప్ప తక్కిన ప్రవచన గ్రంథములను రెండవ భాగమునుగా నెంచిరి. ఈ చరిత్ర గ్రంథములకు పూర్వప్రవక్తలు అనియు, ప్రవచన గ్రంథములకు తరువాతి ప్రవక్తలు అనియు పేరులు పెట్టిరి. ధర్మశాస్త్రము, పూర్వ ప్రవక్తలు తరువాతి ప్రవక్తలును అను ఈ భాగములు మిగుల గంభీరములైనవిగా నెంచఁబడెను. ఇది కాక తక్కిన గ్రంథము

లను మూడవ భాగములో చేర్చిరి. అవి యెంత గొప్పవైనను, దావీదు కీర్తనలలోని సంగతు లెంత గంభీరములైన వైనను అవి మొదటి రెండు భాగములలోని గ్రంథములందలి విషయములకు సాటి యైనవని యూదు లెంచక పోయినను, దావీదు కీర్తనలలోనుండి క్రీస్తుప్రభువు చాల వాక్యముల నెత్తియుండుటచే అవి క్రైస్తవులమైన మనకు మఱీ గంభీరములైనవని తెలిసికొనవలెను. మఱియు క్రీస్తును అపొస్తలులును పాత నిబంధనలోని యీ గ్రంథముల కూర్పు నంతటిని దైవవాక్యమునుగా నంగీకరించుటచేతను, క్రీస్తు ఈ లోకమునకు రాకపూర్వము మానవులుచేసిన దుష్కార్యము లనేకము లా గ్రంథములలో నున్నను ఈ లోకమందలి గ్రంథము లన్నిటిలో కంటె వీటిలో అపారమైన నీతులును, దేవునిగూర్చినవియు, ముఖ్యముగా ఆయన పరిశుద్ధతను గూర్చినవియునైన నిరుపమానమైన బోధలుండుటచే మనము పాత నిబంధన గ్రంథములను సరియైన ప్రమాణిక గ్రంథములనుగా నెంచవలెను.

2. క్రొత్త నిబంధన: దీనిలోని గ్రంథములను మొదట ఆయా సభలకొఱకును ఆయా వారికిని ఉద్దేశించి వ్రాసిరి. అవి యెవరినిమిత్తము వ్రాసిరో వారియొద్ద మొదటినుండి యుంచఁబడినవని నమ్మఁదగును. అపొస్తలులు ఒకరి తరువాత నొకరు చనిపోవుచుండఁగా వారి సాక్ష్యమును వారి బోధలను తెలుపునట్టి యిట్టి గ్రంథములను సమకూర్చుట ఆవశ్యకమయ్యెను. బోధించుటకు మాత్రమేకాక, తప్పుబోధలను దిద్దుటకు కూడ వీటి నొక కూర్పునుగా సమకూర్చుట అత్యవసరమై యుండెను. క్రొత్త నిబంధన గ్రంథములను వ్రాయుకాలములోనే ఇట్లు సమకూర్చుట ఆరంభమైనదని II పేతు 3[16] వలనఁ దెలియును. హతసాక్షియైన యూస్తిన్ (*Justin Martyr*) 138 వ సం॥ నకు లోపుగానే సువార్తలు సభలలో చదువుచుండిరని వ్రాసెను (1 అపాలోగియ 67). కొంతకాలమైన పిమ్మట అతని శిష్యుఁడైన టేషియన్ (*Tatian*) నాలుగు సువార్తల యను బంధమును (*Harmony*) వ్రాసెను. జ్ఞోస్తికుఁడగు మార్షియన్ (*Marcion*) సుమారుగా 140 సం॥ నందు పుస్తకముల జాబితా నొకదానిని చేసెను. ఆ జాబితాలో సువార్తలయందు లూకా సువార్త మాత్రముండె, అందులో సహా కొన్నిభాగములు లేకపోయినను, పౌలు వ్రాసిన యుత్తరములలో 10 గలవు. సుమారుగా 180 సం॥ లో ఐరేనియస్ (*Irenaeus*) వ్రాసిన గ్రంథములో ప్రస్తుతము మన క్రొత్త నిబంధనలో నున్న గ్రంథములందు హెబ్రీ యుత్తరమునుండి తప్ప తక్కిన గ్రంథము లన్నిటినుండి వాక్యముల నెత్తి వ్రాయుచున్నాఁడు.

ఇవ్విధమున ఈ గ్రంథములు క్రమక్రమేణ ఒక కూర్పుగా చేర్చఁబడినవి. ఆ పుస్తకముల పేరుల జాబితాలలో మురటోరియన్ భాగము (*Muratorian Fragment*) అన్నిఁటిలో పురాతనమైనదై యున్నది. అది మురటోరి యను నతనిచే మిలాను పట్టణమందలి గ్రంథశాలలో కనుకొనఁబడుటవలన దాని కీ పేరు వచ్చెను. ఇది రెండవ శతాబ్దాంతమునకు లోపుగా చేయఁబడినదై యున్నది. ఇందులో నాలుగు సువార్తలు, కార్యములు, పౌలు వ్రాసిన 13 ఉత్తరము (వీటిలో హెబ్రీ యుత్తరములేదు) యూదా యోహాను 1, 2 ఉత్తరములు, ప్రకటన గ్రంథము నున్నవి. హెబ్రీ, పేతురు రెండుత్తరములు, యాకోబు, యోహాను ఉత్తరములలో నొకటియు నిందులో లేవు. అలెక్సంద్రియ పట్టణపు వాడైన క్లెమెంతు (165-220) కూడ ఒక జాబితాను వ్రాసెను. ఇందులో యాకోబు, II పేతురు, III యోహాను అను పుస్తకములులేవు. ఒరిగెను (184-253) వ్రాసిన జాబితాను చూడఁగా, క్రొత్త నిబంధన గ్రంథములన్నియు అందులో నున్నవి గాని II పేతురు, II, III యోహాను అను పత్రికలను అందఱును ప్రమాణికములుగా నంగీకరింప లేదనియు, హెబ్రీ యుత్తరమును వ్రాసినవారెవరో తెలియదనియు ఆ గొప్ప పండితుడు వ్రాసెను. నాల్గవ, ఐదవ శతాబ్దములలో ప్రస్తుతమున మన క్రొత్త నిబంధనలో నున్న గ్రంథము లన్నిఁటిని క్రొత్త నిబంధనలో చేర్చికొనుట ఖాయమయ్యెను గాని, ఔగుస్తీను వీటినిట్లు భాగించెను: (1) మొదటి నుండి అందఱిచేత అంగీకరింపఁబడినవి. (2) సంఘపు మొత్తముమీఁద నంగీకరింపఁబడినను కొందఱిచే నంగీకరింపఁబడనివి. ఇవి వేర్వేఱు సభలలో వేర్వేఱుగా నంగీకరింపఁబడినను వాటిలో

హెబ్రీ, యాకోబు I, II, పేతురు, II, III యోహాను, యూదా, ప్రకటన యను నీ గ్రంథములున్నవి. వీటి నంగీకరింపకుండుటకు కొన్ని కారణములు కలవు గాని చివఱకు వీటిని కూడ చేర్చి యివి ప్రమాణిక గ్రంథములని యంగీకరించిరి.

మన మీ వివరమును చూడఁగా ఆలోచన సఫలనలనఁగాక, గ్రంథముల శ్రేష్ఠతనుబట్టి సభ వారు వీటి నంగీకరించి ప్రమాణిక గ్రంథము లనుగా నంగీకరించిరి. నేటివఱకు వాటి శ్రేష్ఠ తను సభవా రంగీకరించుటను చూడఁగా ఈ పనిఁ జేయుటయందు పరిశుద్ధాత్మ సభవారిని నడిపించె నని మనము రూఢిగా తెలిసికొనవలెను.

**ఇశ్రాయేలీయుల ప్రయాణములు (Wanderings in Wilderness).** ఈ శీర్షిక యందు ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి మోయాబువఱకుఁ జేసిన ప్రయాణములుమాత్రము వివరింపఁబడును.

1. తిరిగిన ప్రదేశము. ఇది సీనాయి అరణ్య మనఁబడెను (అరణ్యము 1 చూ॥). అది త్రికోణాకృతిగా నున్నది. దానికొన దక్షిణ మున ఎఱ్ఱసముద్రము రెండు పాయలగుచోట నున్నది. దాని మట్టము ఉత్తరముగా పలెస్తీను మోయాబుదేశముల దక్షిణ సరిహద్దుగా నుండి 200 మైళ్లవఱకు వ్యాపించుచున్నది. ఇది చాల మట్టుకు నిర్జనమగు ప్రదేశమైయున్నది గాన ఈ ప్రయాణమునందు సూచింపఁబడిన స్థలముల యునికిని కనుగొనుట అసాధ్యముగ నున్నను కొన్ని ముఖ్యస్థానములను శిథిల పరిశోధకులు కనుగొనియున్నారు. ఆ ప్రయాణము నారం భించిన ఐగుప్తులోని సుక్కోతు (నిర్గ $12^{37}$), ప్రయాణాంతమందు దాటిన అర్నోనునది (సంఖ్యా $21^{13}$) అట్టి స్థలములలో నున్నవి (సుక్కోతు, అర్నోను చూ॥). అవిగాక సీనాయిపర్వతము (నిర్గ $19^{11}$) కాదేషు బర్నేయ (సంఖ్యా $32^{8}$), ఎసోన్గెబెరు ($33^{35}$), హోరు పర్వతము ($20^{22}$) అను వాటి యునికిని తెలిసికొని యుండుటవలన వాటి మధ్యమందు స్థలముల నూహింప వీలగుచున్నది. ఆయా పటములలో సాధారణముగా వీటిని గుర్తుపెట్టినను అవి రూఢి యైన ప్రదేశములు కావని తెలిసికొనవలెను.

2. తిరిగిన కాలము. అది 40 సం॥ లకు తక్కువయైనను నలువది సంవత్సరములుగా లెక్కించఁబడెను (సంఖ్యా $14^{33}$ ద్వితీ $2^{7}$ కీర్త $95^{10}$). సంఖ్యా $2^{32}$ నందు 20 సం॥ లకు పై వయస్సుగల పురుషులు 6,03,550 మంది యున్నట్లు కనఁబడుచున్నది. ఈ లెక్కనుబట్టి ఇశ్రాయేలీయులందరు దాదాపు 20 లక్షలకు పైఁగా నుండిరని దోఁచుచున్నది. ఇంతమంది కట్టి యరణ్యమునందు భోజన పానాదులెట్లు దొరికెనని అద్భుతములను నమ్మనివారు సందే హించుచు, ఆ సంఖ్యను ఉన్నదానికన్న నెక్కు వగా వేసియుండురని అభిప్రాయపడుచున్నారు. గాని దేవుఁడు వారిని అద్భుతరీతిగా పోషించెనని లేఖనములయందున్నది. అట్లయినయెడల సందేహ మున కట్టి యాస్పదము నుండదు. వారి పోషణకై మన్నా యనఁబడిన ఆహారము నాయన యనుగ్రహించెను (నిర్గ $16^{1-35}$). ఒకసారి వారు కోరినందున పిట్టలమాంసము ననుగ్రహించెను ($16^{12,13}$ సంఖ్యా $11^{4-6,31}$). వారి పశ్వాదులకు మేఁత దొరుకునట్లు వారొకే దిక్కునఁగాక గొల్లలవలె తిరిగిరి. నీరు కావలసివచ్చినప్పుడు రాతిబండలను చీల్చి ఆయన వారి దప్పిక తీర్చెను (నిర్గ $17^{1-7}$ సంఖ్యా $20^{2-11}$). ఇన్ని అద్భుత ములుచేసి ఆయన వారిని పోషించినను వారి కేమియు ఇబ్బందులు కలుగలేదని బైబిలు చెప్పుట లేదు. వారి అవిశ్వాసమువలన వారెన్నో కష్ట ములను సహించుచు 40 సం॥ ల వఱకు కనానులో ప్రవేశింపఁజాలక పోయిరి (సంఖ్యా 14).

3. మకాము చేసిన స్థలములు. సంఖ్యా 33 నందు వారు సంచరించి మకాముచేసిన స్థలముల జాబితాగలదు. ఆయా స్థలములలో జరిగిన చరిత్రవిషయములు నిర్గ 12; సంఖ్యా 25 వఱకు వ్రాయఁబడినవి. వాటినిగూర్చిన అనేక సూచ నలు ద్వితీయోపదేశ కాండమునందు గలవు. ఆ మూఁటిని సరిపుచ్చి వేదశాస్త్రియగు డేవిస్ (*Davis*) అను ఆయన చేసిన వివరము ననుస రించి ఆ ప్రయాణమందు జరిగిన సంగతులు క్లుప్త వివరము నీ దిగువను చూడవచ్చును:—

| మకాముచేసిన స్థలములు (సంఖ్యా 33 నందున్నట్లు) | ఆ స్థలములలో జరిగిన చరిత్ర సంగతులు నిర్గ 12-సంఖ్యా 25) | ద్వితీయోపదేశ కాండములో దానికి గల సూచనలు. |
|---|---|---|

## ఐగుప్తులోని రామెసేసునుండి సీనాయివఱకు చేసిన ప్రయాణము

| | | |
|---|---|---|
| 1. రామెసేసు సంఖ్యా $33^{3-5}$ | పస్కా నాచరించుట, ప్రథమ పుత్రుల చావు, ఐగుప్తీయులు వెళ్లఁగొట్టఁగా మొదటినెల 15 దినమున బయలుదేరిపోవుట. నిర్గ $12^{16}$-$13^{37}$ | $16^{1}$ |
| 2. సుక్కోతు $33^{5}$ | నిర్గ $13^{37}$ | |
| 3. ఏతాము $33^{6}$ | మేఘస్తంభము వలన నడిపించఁబడుట. $13^{20-22}$ | |
| 4. పీహహీరోతు $33^{7}$ | ఫరోతరుముటను కనుగొనిరి. $14^{1-14}$ | |
| 5. ఎర్ర సముద్రమును దాటుట $33^{8}$ | ప్రజలు భయపడఁగా మోషే ధైర్యపఱచి సముద్రమును పాయలుచేసి వారిని దాటించుట. ఫరోసేన నాశన మగుట. $14^{15-31}$ | $11^{4}$ |
| 6. ఏతాము అరణ్యము గుండా మూఁడు దినములు ప్రయాణము చేసి మారాకువచ్చుట $33^{8}$ | మిర్యాము స్తోత్రగీతము. షూరు అరణ్యములో మూఁడుదినముల ప్రయాణము చేసి మారాకు వచ్చుట. చేదునీళ్లవలన సణఁగఁగా మోషే వాటిని బాగుచేయుట. $15^{1-26}$ | |
| 7. ఏలీము $33^{9}$ | ఇచ్చట 12 ఊటలును 30 ఈఁతచెట్లుండి నందున ఇది మకాముచేయుట కనుకూలమగు తావైయుండెను. $15^{27}$ | |
| 8. ఎర్ర సముద్రముదగ్గర దిగుట. సీను అరణ్యము గుండ పోవుట $33^{10}$ | రెండవ నెల 15 దినమున సీను అరణ్యము చేరు నప్పటికి భోజనము లేనందున సణఁగఁగా మన్నా నిచ్చుట. $16^{1-36}$ | |
| 9. దోపకా $33^{12}$ | | |
| 10. ఆలూషు $33^{13}$ | | |
| 11. రెఫీదీము $33^{14}$ | నీళ్లులేనందున జనులుసణఁగఁగా మోషే బండను కొట్టి నీళ్లురప్పించుట. అమాలేకీయులతోడి యుద్ధమున జయమునొందుట. మోషే మామ వారిని దర్శించి సలహానిచ్చుట $17^{1}$-$18^{27}$ | $6^{16}$ $25^{17}$ |
| 12. సీనాయి అరణ్యము $33^{15}$ | మూఁడవ నెల మొదటి దినమున సీనాయి అరణ్యముచేరుట. అచ్చటనున్న సీనాయికొండ మీఁద దేవుఁడు 10 ఆజ్ఞలను, ఇతర కట్టడలను గుడారవిషయమైన నియమములను ఇచ్చుట. మోషే 40 దినములాకొండమీఁద నుండఁగా ప్రజలు బంగారుదూడను చేసికొని ఆజ్ఞను మీరుట. దేవుఁడు వారిని శిక్షించి, వారిచే | $4^{11}$-$5^{33}$ |

| మకాము చేసిన స్థలములు (సంఖ్యా 33 నందున్నట్లు) | ఆ స్థలములలో జరిగిన చరిత్ర సంగతులు (నిర్గ 12-సంఖ్యా 25) | ద్వితీయోపదేశ కాండములో దానికి గల సూచనలు. |
|---|---|---|
| | తనకొరకు గుడారమును కట్టించుట (నిర్గ 17-40). దానికి సంబంధించిన యాచారములు లేవీయ కాండమునందు గలవు. ఇచ్చటనే జనులు మొదటిసారి లెక్కింపఁబడిరి. సంఖ్యా $10^{11-36}$ | |

## సీనాయినుండి కాదేషు బర్నేయ వరకు ప్రయాణము

| | | |
|---|---|---|
| 13. సీనాయినుండి బయలు దేరుట $33^{16}$ | రెండవ సం॥ రెండవ నెల 20 వ దినమున సీనాయినుండి బయలుదేరుట. ప్రయాణము చేయవలసిన రీతిని గూర్చిన యేర్పాటులు. సంఖ్యా $11^{4-35}$ | |
| | మూఁడు దినముల ప్రయాణమునకుపిదప మార్గాయాసమును గూర్చి సణిగినందున అగ్నిచే దహనమైన స్థలము తబేరా యని పిలువఁబడుట. సంఖ్యా $11^{1-8}$ | |
| 14. కిబ్రోతుహత్తావా $33^{16}$ | మాంసము కొఱకు సణిగి, అది దొరికిన పిదప వెగటు కలుగువఱకు తిని, అనేకులు తెగులు వలన చనిపోవుట. అందువలననే ఈ స్థలమునకు దురాశా సమాధులను ఈ పేరు కలిగెను. ఇచ్చట ఒక నెలవఱకుండిరి. $11^{4-34}$ | |
| 15. హజేరోతు $33^{17}$ | మిర్యాము అహరోనులు మోషేపై సణిగినందున మిర్యాముకు కలిగిన శిక్ష; దాని నివారణ ఇచ్చట దాదాపు 7 దినములుండిరి. $11^{35}$-$12^{15}$ | |
| 16. రిత్మా $33^{18}$ | పారాను అరణ్యములో నున్న కాదేషునుండి కనాను దేశమును వేగు జూచుటకు పంపుట; వారు తెచ్చిన కబురువలన కలిగిన భయము; ప్రజల తిరుగుబాటు, అందువలన ఐగుప్తు నుండి బయలుదేరిన వారిలో 20 సం॥ లకు పై వారందఱిలో ఇద్దరు తప్ప తక్కినవారందఱును చనిపోవు వఱకు అరణ్యమునందు తిరుగవలెనని శిక్షనొందుట. $12^{16}$-$14^{39}$ | $1^{2,19-46}$ ఇచ్చట అనేకదినములుండిరి $1^{46}$ |
| | వారు దీనిని లక్ష్యముచేయక అమాలేకీయుల మీఁదికి వెళ్లి యుద్ధముచేసి వారిచే నోడిపోయి హోర్మావఱకు తరుమబడుట. $14^{40-45}$ | |

| మకాము చేసిన స్థలములు (సంఖ్యా 33 నందున్నట్లు) | ఆ స్థలములలో జరిగిన చరిత్ర సంగతులు (నిర్గ 12-సంఖ్యా 25) | ద్వితీయోపదేశ కాండములో దానికి గల సూచనలు. |
|---|---|---|

## కాదేషునుండి బయలుదేరి మరల అచ్చటికి వచ్చువరకు దాదాపు 36 సం॥లు చేసిన ప్రయాణము

| | | |
|---|---|---|
| 17. రిమ్మోను పారెసు $33^{19}$<br>18. లిబ్నా $33^{20}$<br>19. రీసా $33^{21}$<br>20. కెహేలాతా వ. 22<br>21. షాపెరుకొండ వ. 23<br>22. హారాదా వ. 24<br>23. మకెలోతు వ. 25<br>24. తాహతు వ. 26<br>25. తారహు వ. 27<br>26. మిత్కా వ. 28<br>27. హష్మోనా వ. 29<br>28. మొసేరోతు వ. 30<br>29. బెనేయాకాను వ. 31<br>30. హోర్హగ్గిద్గాదు వ. 32<br>31. యొత్బాతా వ. 33<br>32. ఎబ్రోనా వ. 34<br>33. ఎసోన్గెబెరు వ. 35 | 17 మొదలు 33 వరకున్న స్థలములయందు ఆయా కాలములకు తగిన నియమము లేర్పడెను (సంఖ్యా $15^{1-31, 37-41}$). విశ్రాంతి దినము నతిక్రమించిన వానికి మరణశిక్ష విధింపఁబడెను ($15^{32-36}$). కోరహు దాతాను అబీరాములు అహరోనుకును విరోధముగా తిరుగఁబడి యాజకత్వము చేయఁబోయి నాశనమగుట ($16^{1-39}$). ఈ శిక్ష కఠినమైనదని ప్రజలు సణిగి తెగులుచే నాశనమగుట ($16^{40-50}$). అహరోను యాజకత్వము క్రమమైనదని చిగిర్చిన కర్రవలన రుజువగుట ($17^{1-11}$). యాజకుల విషయమైన కొన్ని విశేష యేర్పాటులు. ($17^{12}$-$19^{22}$) | ఎఱ్ఱసముద్రము వైపు తిరిగి బహు దినములు శేయీరు మన్నెములో సంచరించిరి. $2^{1}$ |
| 34. సీను అరణ్యమందలి కాదేషు వ. 36 (తెనుఁగు బైబిలునందు ఎసోన్గెబెరు కాదేషు అనఁబడుట సరియైన తర్జుమా కాదు.) | నలువదవ సం॥ మొదటి నెలలో వారు సీను అరణ్యము చేరిరి ($20^{1}$). కాదేషులో నీరు లేనందున ప్రజలు సణగఁగా దేవుని యాజ్ఞప్రకారము గాక మోషే బండను కొట్టి ($20^{2-13}$) కనాను దేశములో ప్రవేశించు హక్కును పోఁగొట్టుకొన్నవాఁడగుట.<br>ఎదోముదేశము గుండా పోవుటకు మోషే సెలవడుగఁగా ఆ రాజు సమ్మతించక పోవుటచే చుట్టు తిరిగి వెళ్లవలసివచ్చెను. ($20^{14-21}$) | |

| మకాము చేసిన స్థలములు (సంఖ్యా 33 నందున్నట్లు) | ఆ స్థలములలో జరిగిన చరిత్ర సంగతులు (నిర్గ 12-సంఖ్యా 25) | ద్వితీయోపదేశ కాండములో దానికి గల సూచనలు. |
|---|---|---|
| | **కాదేషునుండి యొర్దాను నది వఱకు చేసిన ప్రయాణము** | |
| 35. హోరు పర్వతము వ. 37-39 | ఎదోమువైపుకు వెళ్లఁగా అహరోను మరణమగుట ఇశ్రాయేలీయులతని విషయమై 30 దినములు అంగలార్చిరి. ఇచ్చట నుండునప్పుడే ఎదోము గుండా వెళ్లరాదని తెలిసికొనిరి. సంఖ్యా 20$^{22-29}$ | ద్వితీ 2$^{7-9}$ 10$^{6}$ 32$^{49}$ |
| 36. కనాను రాజగు అరాదు వీరినిగూర్చి వినుట వ. 40 | అరాదు వీరి నెదుర్కొన్నవాడై వచ్చి అతారీయుల మార్గమున వారితో యుద్ధముచేసెను. ఇశ్రాయేలీయులు వారిని గెల్చిన స్థలమునను హోర్మాయను పేరు కలిగెను. | |
| | ఎదోముచుట్టు పోవుటకు ఎఱ్ఱసముద్రము వైపు వెళ్లుట. 21$^{4}$ | ఈ ప్రయాణమునందు గుద్గోదుకును యొత్బాతాకును వచ్చిరి 10$^{7}$ |
| 37. సల్మోనా వ. 41<br>38. పూనోను వ. 42<br>39. ఓబోతు వ. 43 | ఈ స్థలములలో నొకచోట సాఁగినందున తాపకరములగు సర్పములచే కరువఁబడి, ఇత్తడి సర్పమును చూచి బ్రతుకుట. 21$^{5-9}$ సంఖ్యా 21$^{10}$ | 8$^{15}$ |
| 40. ఈయ్యె అబారీము వ. 44 | మోయాబు పొలిమేర యొద్ద సూర్యోదయ దిక్కునను న్న అరణ్యమందలి ఈయ్యె అబారీమునొద్ద దిగుట 21$^{11}$. ఈ అరణ్యమందలి జెరెదు లోయను (21$^{12}$) అర్నోనునదిని దాటుట. ఈ నది మోయాబు అమ్మోను దేశముల సరిహద్దు. 21$^{13-15}$ | కాదేషులో నుండి మొదటిసారి బయలు దేరిన 38 సం॥లకు జెరెదు నదిని దాటిరి 2$^{13-14}$ 2$^{18-24}$ |
| 41. మోయాబు అరణ్యమందలి దీబోనుగాదు, అల్మోను దిబ్లాతాయిము, అబారీము కొండలు అను మూఁడు స్థలములు వ. 45-47 | కీర్తన పాడిన బావి యను అర్థమిచ్చు బెయేరుకు వచ్చిరి. అచ్చటనుండి అమోరీయుల రాజగు సీహోను వారిని దాటనియ్యక ఇశ్రాయేలీయులమీఁద యుద్ధము చేసి ఓడిపోయెను. ఈ అరణ్యములో వారు మత్తాను నహలీయేలు బామోతు పిస్గాకొండ అను స్థలములకు వచ్చిరి 21$^{19-25}$. ఇవి 33$^{45-47}$ లోని పేరులకు వేఱుగానున్నవి. అవి వాటికి మారుపేరులు గాక వేర్వేఱు స్థలములనుట యుక్తము. | ఈ అరణ్యమందే కెదేమోతు అను పేరును గలదు 2$^{26-37}$ |

| మకాము చేసిన స్థలములు (సంఖ్యా 33 నందున్నట్లు) | ఆ స్థలములలో జరిగిన చరిత్ర సంగతులు (నిర్గ 12-సంఖ్యా 25) | ద్వితీయోపదేశ కాండములో దానికి గల సూచనలు |
|---|---|---|
| 42. యెరికో దగ్గర నున్న మోయాబు మైదానములో బెత్యేషీమోతు నుండి ఆబేలుషిత్తీము దగ్గర దిగిరి ఐ. 44-49. | ఇక్కడనుండఁగా (సంఖ్యా $22^{1}$) బిలాము వారిని శపించుటకై చేసిన యత్నముల భంగపాటు 22-24.<br>షిత్తీము బయెల్పెయోరులో విగ్రహారాధనలో వారితో పాలివారై వ్యభిచరించి హతులగుట. 25<br>ప్రజలు లెక్కింపఁబడుట. 26<br>చేయఁబడిన ఇతర నియమములు. 27-30, 35-36<br>మిద్యానీయులను జయించుట. 31<br>2½ గోత్రములకు తూర్పుప్రాంతముల నిచ్చుట. 32-34<br>యొర్దాను దాటి యెరికోను పట్టుకొనుటతో అరణ్య ప్రయాణములు ముగియుట. యెహో $1^{1}$-$5^{12}$ | $3^{29}$ $4^{46}$ ఐగుప్తును విడిచిన 40 వ. సం॥ పదకొండవ నెలలో జరిగెను.<br>మోయాబు మైదానములో మోషే హెచ్చరికలు జేసి చనిపోవుట (ద్వితీయోపదేశ కాండము). |

ఇశ్రాయేలీయులు చూ॥

**ప్రలాపించుట** దుఃఖమును తెలియజేయుటకు చూ॥

**ప్రవక్తలు, ప్రవచనములు (Prophet, Prophecy).** దేవుని నామమందు ఆయన సంగతులను బోధించెడి వారు ప్రవక్తలనఁబడిరి. రాఁబోవు సంగతులను తెలుపవలసి వచ్చినప్పుడు వాటిని దేవుని పేరట ప్రకటించినందున వారు రాఁబోవు సంగతులను తెలిపెడు వారగు సంగతి వాడుకలోనికి వచ్చెనుగాని, యిప్పటి విషయముల నైనను, రాఁబోవు సంగతులనైనను తెలియఁజేయుటకు దేవునిచే పిలువఁబడి అధికార మొందినవారు బైబిలునందు ప్రవక్తలనఁబడుదురు. యాజకులును ప్రజలు పక్షముగా దేవుని సన్నిధానమందు నిలిచి వారి పక్షమున మాట్లాడిరి. ప్రవక్తలైతే దేవుని పక్షముగా మానవులయెదుట నిలిచి దేవుని చిత్తమును వారికిఁ దెలియజేసిరి. ఇట్లు యాజకులును ప్రవక్తలును ఒకరి పని నొకరు పూర్తిచేయువారుగ నుండిరి.

1. పేరు. వారికి సాధారణముగా పెట్టఁబడిన పేరు ముహమ్మదీయులు వాడెడి నబీ (*Nabi*) అను దానికి సంబంధించినదై ప్రకటించువాఁడని శబ్దార్థమిచ్చును (ద్వితీ $18^{15,18,20,22}$ మొ॥). దర్శనము కలిగినవారు లేక దర్శనము చూచువాడు అని శబ్దార్థమిచ్చు మఱియొక పదమును సాధారణముగా **దర్శకుడు** అని తెనిఁగించిరి (I సమూ $9^{9}$ II రాజు $17^{13}$). వారికి పూర్వము ప్రదర్శకులను పేరుండెడిదని I సమూ $9^{9}$ వలనఁ దెలియుచున్నది. కొన్ని వాక్యములలో **జ్ఞానదృష్టిగల** వాఁడు అనియు (II దిన $9^{39}$ $12^{15}$), ఒకచోట **దర్శనములు చూచువారు** నియు (యెష $30^{10}$) ఆ పదమును తెనిఁగించిరి. వారు చూచినవి **దర్శనము** లనఁబడెను (యెహె $13^{16}$). సర్వసాధారణములగు ఈ బిరుదులుగాక వారి పనిని బట్టి వారికి **కావలివారు** (యెష $21^{11}$ $52^{8}$ $56^{10}$ $62^{6}$ యిర్మీ $6^{17}$ యెహె $3^{17}$ $33^{7}$ మీకా $7^{4}$ హబ $2^{1}$), **దైవజనులు** (I సమూ $2^{27}$ $9^{6}$ I రాజు $12^{22}$ II రాజు $4^{21,25}$), **యెహోవా సేవకులు** (యెష $20^{3}$ యిర్మీ $25^{4}$ $26^{5}$ మొ॥) **యెహోవా దూతలు** (యెష $44^{26}$ హగ్గ $1^{13}$ మలా $3^{1}$) అను బిరుదులు కలిగెను.

2. చరిత్ర. ప్రవక్తలు సమూయేలు కాలము నుండి వెలసిరని సాధారణముగా చెప్పినను (కార్య $3^{24}$), అబ్రాహాము దేవుని సంగతులను తనకు తరువాత వచ్చువారికి తెలుపవలసి యున్నందున (ఆది $15^{1-18}$ $18^{17-19}$) ప్రవక్త యనఁబడెను ($20^{7}$). మిర్యామును ప్రవక్త్రియనియు (నిర్గ $15^{20}$) అహరోను మోషే పక్షమున మాట్లాడినందున అతఁడు మోషే ప్రవక్త యనియు ($7^{1}$) చెప్పిరి. మోషే రాఁబోవు ప్రవక్తకు మాదిరిగా నున్న వాఁడనఁబడెను (ద్వితీ $18^{18}$ కార్య $3^{22}$ $7^{37}$). సమూయేలు కాలమునుండి ఆ యుద్యోగము స్థిరమైన యుద్యోగమాయెను. అప్పటినుండి అనేక మంది ప్రవక్తలు కనఁబడుట మాత్రమేగాక, ప్రవక్తల శిష్యులనఁబడిన ప్రవక్తల కూటములు కూడ నుండెను (I సమూ $10^{5,10}$ $19^{20}$ II రాజు $2^{3,5}$). వీరు సన్యాసుల కూటములవలె నున్నట్లున్నది ($2^{3,5,7,15}$ $4^{34}$ $6^{1}$) గాని వారు సన్యాసులు కాక కుటుంబములు కలిగినవారని $4^{1}$ వలనఁ దెలిసికొనవచ్చును. ఈ కూటములు ఒక విధమైన పాఠశాలలైనట్లు కనఁబడుచున్నది. దేవుఁడు వారిలోనుండి మాత్రమేగాక ఇతరులనుకూడ తన చిత్తమును ప్రకటించుటకై పిలిచెను (I రాజు $19^{19,20}$ యెష 6 ఆమో $7^{15}$ మొ॥). మలాకీ వఱకిట్టి ప్రవక్తలుండిరి. క్రొత్త నిబంధనయందు బాప్తిస్మమిచ్చు యోహాను వీరిలో చేరినవాఁడై పాఁత నిబంధన ప్రవక్తలలో చివరివాఁడును క్రొత్త నిబంధన ప్రవక్తలలో మొదటివాఁడై యుండెను (మ $3^{3}$ $11^{9,13}$). క్రైస్తవసంఘము నందును దేవుని సంగతులను ఆయన యాత్మశక్తిచే లోతుగా గ్రహించి వాటిని బోధించిన ప్రవక్తలుకూడ నుండిరి (I కొరి $12^{28,29}$ $14^{29,32,37}$ ఎఫె $4^{11}$).

3. ప్రవక్తల పిలుపు. విశేష దర్శనము కలుగుటద్వారా ప్రవక్తలు పిలువఁబడిరి. ప్రవక్త పనికి మాత్రమేగాక ప్రజల నాయకుఁడుగా నుండుటకును మండుచున్న పొదద్వారాను, తరువాత దేవుఁడు మాట్లాడిన మాటలద్వారాను మోషే పిలువఁబడెను (నిర్గ $3^{1}$-$4^{17}$). సమూయేలును బాల్యమందే దేవుఁడు పిలిచెను (I సమూ $3^{1-15}$). ఎలీషా ఏలీయా ద్వారా పిలువఁబడెను (I రాజు $19^{19,20}$ II రాజు $2^{13,14}$). ఆమోసు అడవిలో నుండఁగాను (ఆమో $7^{15}$) యెషయా ఆలయమునందుండఁగాను (యెష 6) పిలువఁబడిరి. యిర్మీయా యౌవనుఁడై తన స్వదేశమందుండు నప్పుడును (యిర్మీ $1^{4-10}$) యెహెజ్కేలు విదేశములో నుండునప్పుడు (యెహె 1) కలిగిన దర్శనములచే దేవుని పిలుపు నాలకించి లోఁబడిరి. వీరి పిలుపుతోకూడ ఉద్యోగమును వహించుకొనుటకు కావలసిన ఆత్మశక్తికూడ వారి కనుగ్రహింపఁబడెను. నాతాను ఏలీయా మొదలగు ప్రవక్త లెట్లు పిలువఁబడిరో దానిని గూర్చిన సూచనలులేవు. దేవునిచే పిలువఁబడని వారు కూడ ఈ యుద్యోగమును వహించుకొనినట్లు సూచన లగుపడుచున్నవి. వీరు యెహోవా నామమున బోధించినను అబద్ధ ప్రవక్తలైయుండిరి (యిర్మీ $23^{16-32}$). కొందఱుద్దేశ పూర్వకముగా పైవారివలన ఘనము నొందునట్లుగా ఇచ్చకపు మాటల నాడుచుండిరి (I రాజు $22^{5-28}$ యెహె $13^{17-19}$ మీకా $3^{11}$ జెక $13^{4}$). అట్లే కొందఱు కూటికి నాశించియు (మీకా $3^{5}$), ధనము సంపాదించు నిమిత్తమును ($3^{11}$) మూర్ఖముగా ప్రవచించిరి. ఇతరులను మోసపుచ్చవలెనను ఉద్దేశముతోఁగాక స్వయముగా మోసపోయి ప్రవచించిన వారును గలరు (యిర్మీ $23^{25-37}$ $27^{14-18}$ $28^{1-9}$ మొ॥). నిజమైన ప్రవక్తలను తెలిసికొనుటకు సూచనలు మాత్రమేగాక (యెష $7^{11,14}$), వారి మాటల నెఱవేర్పును (ద్వితీ $18^{9,7,22}$) వారి నీతులు దేవుని నీతులకు సరిపడుటయు ($13^{1,5}$ యెష $8^{20}$) గుఱుతులుగా నుండెను. ప్రజలు కోరినందున యిట్టి ప్రవక్తలు బోధించిరి. కావున ఆ దోషమునకు ప్రజలు కారకులైరి ($30^{10-13}$). వీరికిఁదోడు ఇతర దేవతల పేరట ప్రవచించిన అబద్ధ ప్రవక్తలుండిరి (I రాజు $18^{19}$ యిర్మీ $2^{8}$ $23^{13}$). అబద్ధ ప్రవక్తలకు మరణ శిక్ష విధింపవలెనను నియమము గలదు (ద్వితీ $18^{20}$).

4. సిద్ధపఱచఁబడిన విధము. ప్రవక్తల శిష్యులు ప్రవక్తలయొద్ద నేర్పుఁ బొందినట్లు సూచనలు గలవు (I సమూ $10^{5,10}$ $19^{18}$ II రాజు $2^{3,5}$ $4^{38}$) గాని వారు ఆ పనికొఱకు ఆయత్త పఱచఁబడలేదు. తాము ప్రకటింపవలసియున్న సంగతులు దైవాత్మచే పొంది వాటిని తప్పక ప్రకటింపవలసియున్నదను నిశ్చయత కలుగఁజేసికొనుటయే వారి ముఖ్య సిద్ధపాటుగా నుండెను (మీకా $3^{8}$

యెహె $11^{5}$). దేవుని హస్తము వారినిపట్టి బలవంతము చేసినట్లున్నది ($3^{22}$). వారు పిలువఁబడినప్పుడే శక్తి వారికి విశేషముగా కలిగెను (యెష 6 యిర్మీ 1 యెహె 1 ఆమో $7^{15}$). వారు పని చేయ నిష్టపడకపోయినను (యిర్మీ $1^{6}$) ఆ వార్త వారిలో అగ్నివలె మండుచుండినందున వారు దానిని చెప్పకుండ లేకపోయిరి ($20^{9}$). వారు ప్రకటింపవలసిన సంగతులు వారి కాయా విధములుగాఁ దెలుపఁబడెను. స్వరము వినఁబడియుండును (సంఖ్యా $7^{90}$ I సమూ $3^{4}$). దర్శనము కలిగియుండవచ్చును (యెష 6 యెహె 1). దూతచే బోధింపఁబడి యుందురు (దాని $9^{21}$). దేవునిచిత్తమును దెలిసికొనుటకు వారు కనిపెట్టియుండవలసివచ్చెను (లేవి $24^{12}$). వారిట్లు కనిపెట్టుకొని యుండునప్పుడు ఆయన వారికిఁ దెలిపిన సంగతులు ఒకానొకప్పుడు వారి స్వంత బుద్ధికి భిన్నమైనవిగా నుండవచ్చును (I సమూ $16^{6,7}$ II సమూ $7^{3}$). ప్రవక్తలు దేవునిచిత్తమును దెలిసికొనుటకై ఆయన యాత్మనొందిన వారు కావలసివచ్చెను. వారాత్మావేశముచేత పలికిరి (I రాజు $22^{24}$ II దిన $15^{1}$ $24^{20}$ నెహె $9^{30}$ యెహె $11^{5}$ యోవే $2^{28}$ మీకా $3^{8}$ జెక $7^{12}$ మ $22^{43}$ I పేతు $1^{10,11}$). వారిట్లు సిద్ధపఱచఁబడవలెనను దానికి సూచనగా వారిని తైలముతో నభిషేకింపవచ్చును (I రాజు $19^{16}$) గాని అందఱు నిట్లు అభిషేకింపఁబడిన సూచనలు లేవు. దేవుఁడు తన బోధకు విరుద్ధముగా ప్రవర్తించు వారికి తన యాత్మ ననుగ్రహింపఁడు. కావున శుద్ధులై భక్తితో ప్రవర్తించిన వారినిమాత్ర మిట్టి పనికి ఉపయోగింపవలసివచ్చెను. వారు ఆత్మావేశముగలవారై యెహోవా సెలవిచ్చిన మాటలను ప్రకటించిరి.

5. **జీవించినవిధము.** ప్రవక్తలు జీవించిన విధమునుగూర్చి ఒకటి రెండు సూచనలు మాత్రము కనఁబడుచున్నవి (II రాజు $1^{8}$ జెక $13^{4}$ మ $3^{4}$). ఏలీయా యోహానులు కంబళిగుడ్డలను తోలు దట్టిలను ధరించి ఈ లోక సౌఖ్యములను త్యజించిరి. ప్రజల పాపమువలన తనకు కలిగిన దుఃఖమును దెలుపుటకు యెషయా గోనెపట్టను కట్టుకొనెను (యెష $20^{2}$). అడవిలో దొఱకు తేనె మిడుతలు పండ్లు వారి యాహారమయ్యెను (II రాజు $4^{39}$ మ $3^{4}$). వారి పోషణార్థము ఆయావారలు ధర్మమిచ్చిరి (I సమూ $9^{8}$ I రాజు $14^{2,3}$ II రాజు $4^{42}$). వారి కాతిథ్యము నిచ్చుట ధర్మకార్యముగా నెంచిరి (I రాజు $17^{9}$ $18^{4}$ II రాజు $4^{8,10}$). వారిలోఁ గొందఱు ఆస్తిపరులైనందున యితరులవలన సహాయ మపేక్షింపలేదు. ఎలీషా యిర్మీయా లిట్టివారు (I రాజు $19^{19,21}$ యిర్మీ $32^{8,10}$). కొందఱిని రాజులు పోషించిరి (II సమూ $24^{11}$ I దిన $25^{5}$ II దిన $35^{15}$). సాధారణముగా వీరు ఇతరులవలె గృహస్థులైయుండిరి (I సమూ $7^{17}$ II సమూ $12^{15}$ I రాజు $14^{4}$ II రాజు $4^{1,2}$ $5^{9}$ $22^{14}$ యెహె $8^{1}$).

6. **ప్రవక్తపనులు.** ఇశ్రాయేలీయులు మతభ్రష్టులైన సమయమున కనఁబడి వారు దేవునితట్టు తిరుగవలెనని వారికి ముఖ్యముగా బోధించిరి (ఏలీయా, ఎలీషా చూ॥). దేవుఁడు యజ్ఞములను కాదుగాని నీతినే కోరును గాన ప్రవక్తలు ముఖ్యముగా నీతిబోధకులని చెప్పవలెను (యెష $1^{10,17}$ ఆమో $5^{14,15}$ మీకా $6^{6-8}$ లూ $3^{7-14}$). వారు తమ నీతిబోధలతోపాటు దేశాధికారులు దేశరక్షణార్థమై చేయవలసినవాటిని చేయఁగూడనివాటిని దెలుపుచుండిరి. అన్యరాజులతో సంధిఁ జేసికొనక దేవుని నమ్మినయెడల తమ దేశమును రక్షించుకొనఁగలరని యెషయా బోధించెను (యెష 7, 31). యెరూషలేమువారు బాబెలువారి నెదిరింపక వారికి లోఁబడినపక్షమున తమ పట్టణమును దక్కించుకొందురని యిర్మీయా ప్రకటించెను (యిర్మీ 33). వారీ విధముగా దేశమునకు మేలుచేయ యత్నించిరి. రాజులదగ్గర నున్న ప్రవక్తలు వారి చర్యలను వ్రాసిరి (I దిన $29^{29}$ II దిన $9^{29}$ $12^{15}$ $29^{30}$ $33^{19}$). మనము వీటిని చరిత్ర గ్రంథములుగా నెంచినను హెబ్రీ బైబిలునం దివి పూర్వ ప్రవక్తలు అను పేరుతో పిలువఁబడెను. వారు ఆయావారి చరిత్ర సంగతుల నూరక నేగాక మానవుల చరిత్రయందు దేవుని నడుపును ఆయన తీర్పులను లక్షింపవలెనని వాటిని వ్రాసిరి. ప్రవక్తల యుద్దేశమును ఇదేగాన వాటిని ప్రవక్తల గ్రంథములతో చేర్చుట న్యాయమే. ప్రవక్తలు ఆరంభమున తమ ప్రవచనములను వ్రాయలేదు గాని ప్రజలు వారి హెచ్చరికలను లక్షింపనందున వాటిని వ్రాయవలసి వచ్చెనని ఆయా సూచనలవలనఁ దెలియును

(యెష $8^{1}$ $30^{8}$ యిర్మీ $36^{2-6,28}$ $51^{60}$). వారు వ్రాసినవి కొన్ని గద్యరీతిగను కొన్ని పద్యరీతిగను ఉన్నట్లు చూడవచ్చును. వాటియందు అలంకార ప్రయోగములు పెక్కులు గలవు. మానవులు తాముమఱచిన దేవునితట్టుకుఁ దిరిగి నీతిన్యాయములు చేయుటవలననే వారికిగాని జనాంగములకుగాని క్షేమము కలుగునేగాని మఱియొకరీతిగా కలుగఁజాలదని అవి బోధపఱచుచున్నవి. వారిట్టి సంగతులతోఁగూడ రాఁబోవు శిక్షలను గూర్చియు తెలుపవలసివచ్చెను (ఆమో $7^{11}$ యిర్మీ 33 మొ॥). మానవులు తమ తప్పుత్రోవలనుండి తిరుగవలెననియు అట్లు వారు చేసినయెడల ఆ శిక్షలు తొలఁగిపోవచ్చుననియు వారు బోధించిరి ($26^{13}$ యోనా $3^{4}$). అన్యజనాంగములు మాత్రమేగాక (యెష 13-25 యిర్మీ 47-52 ఆమో 1,2) యూదావారును దేవునికి విరోధముగా చేయు దుష్టకార్యముల వలన నశింతురని తెలుపుచు వారికి కలుగనైయున్న శిక్షలనుగూర్చి ముఖ్యముగా బోధించిరి.

మానవులు వారి మాటలను వినక తమ్మును తమ దేశమును పాడుచేసికొని శిక్షకు పాత్రులైయుండఁగా ప్రవక్తలు క్రుంగిన మనస్సుగల వారిని ఆదరింప మొదలుపెట్టిరి. దేవుఁడే వారి రక్షణకర్తయగును. వారి రక్షణకార్యమును ఆయన స్వయముగా నిర్వహించును అను బోధకు సంబంధముగా యేసుక్రీస్తువలన కలుగురక్షణను గూర్చిన సంగతులను మానవుల ఆదరణలకొఱకు బహుతేటగా బోధించిరి. ఇట్లు ప్రవచన సారము యేసునుగూర్చిన సాక్ష్యమే యైయున్నది (ప్రక $19^{10}$ లూ $24^{44}$).

క్రొత్త నిబంధన ప్రవక్తలు బోధకులతో చేర్చఁబడిరి (కార్య $19^{6}$ $21^{9}$ I కొరి $11^{4,5}$ 14) గాని ప్రక $10^{11}$ నందు రాఁబోవు సంగతులను ప్రవచించుటనుగూర్చి సూచింపఁబడెను. ఇతర వాక్యములవలన వారు దేవుని సంగతులను తక్కిన వారికన్న లోతుగా గ్రహించి విశదపఱచువారని తెలియుచున్నది (I కొరి $14^{4,23,24,31,32}$). వారు బోధించినది సంపూర్ణమైనదియు మఱింత స్పష్టముగా గ్రహింపఁబడ నేరనిదియుగాదు ($13^{9-13}$). వారు తమకు దేవుని సంగతులు బయలుపఱచఁబడినంతమట్టుకు బోధించిరి. బోధపని సంఘమునకు ముఖ్యమైనదై యుండుటచేత ప్రవక్తలు అపొస్తలులకుఁ దరువాతి వారినిగా లెక్కించిరి ($12^{29}$). అపొస్తలుల కాలమునకుఁ దరువాతి ఈ పేరుగల ఉద్యోగస్థులు సంఘమునందు కనఁబడుట బహు అరుదైయున్నది. ప్రస్తుతము బైబిలునందున్న బోధలుగాక ఇంకను క్రొత్తవైన బోధలు బయలు పఱచఁబడుననుకొను ఒక శాఖవారుగాక (ఉదా॥ మొంతానీయులు, మార్మనీయులు) మఱెవ్వరును తమ బోధకులను ప్రవక్తలను పేరుతోఁ బిలువరు. అయినను బోధకులైనవారు ప్రవక్తలు చేసిన పనిలో మిగుల ముఖ్యమైనదాని నింకను జరుపుచున్నారు. (ప్రవక్త్రి, ఆయా ప్రవక్తల పేరులను చూ॥).

ప్రవక్తల శిష్యులు ప్రవక్తలు 2 చూ॥

ప్రవక్త్రి (Prophetess). బైబిలునందీ పదమును కొన్ని భావములతో నుపయోగించిరి.

1. యెషయా భార్యయొక్క బిరుదైయుండెను (యెష$8^{3}$). ఈమె ప్రవక్త ఉద్యోగమును నిర్వహించినందునగాక ప్రవక్తయొక్క భార్య యగుటచే అట్లు పిలువఁబడెను. 2. తుయతైర సభను మోసపుచ్చిన యొక స్త్రీ పెట్టుకొనిన బిరుదము (ప్రక $2^{20}$). ఆ పదము స్త్రీనిగాక ఒకవిధమగు బోధయొక్క మూర్తిని సూచించెను. దేవునికి విరోధముగా పని జరిగించిన దానికి పెట్టిన పేరైయున్నది. 3. దేవునిగూర్చి బోధించిన కొందఱు భక్తిగల స్త్రీలకు ఈ బిరుదును వాడిరి. మిర్యాము (నిర్గ $15^{20}$), దెబోరా (న్యాయా $4^{4}$), హుల్దా (II రాజు $22^{14}$ II దిన $34^{22}$), నోవద్యా (నెహె $6^{14}$) అను వారికీ బిరుదు గలదు. క్రొత్త నిబంధనలో అన్న (లూ $2^{36}$) యను నొక స్త్రీకిమాత్ర మీ బిరుదు వాడఁబడినను మీ కుమార్తెలు ప్రవచించెదరను వాక్యము నెత్తుటయు (కార్య $2^{17}$ యోవే $2^{28}$), సువార్తికుఁడగు ఫిలిప్పు కుమార్తెలు ప్రవచించెడివారని చెప్పుటయు (కార్య $21^{9}$), కొరింథు సంఘములో కొందఱు అమర్యాదగా ముసుకులేకుండ ప్రవచించుటయు (I కొరి $11^{5}$) అను నీ వాక్యములను చూడఁగా ప్రవక్త పనిచేసిన స్త్రీలుకూడ ఉండినట్లు స్పష్టమగుచున్నది (ప్రవక్తలు చూ॥).

**ప్రవర్తన, నడువడి** (Walk, Conversation). ఈ పదముల సాధారణ యర్థము తెలిసినదే. ఇది మానవులుచేయు దానిని అలంకార రీతిగా సూచించును. దేవుఁడు మనకు కలుగు వాటిలో మనలను నడిపించునను దానికి ఆయన మన ప్రవర్తనను మన నడతను సరిచేయునని యున్నది (కీర్త $37^{23}$). మనము దేవునికి విధేయుల మగుట ఆయన నియమించిన కట్టడల ననుసరించి నడుచుకొనుట యనఁబడును (I రాజు $6^{12}$ $8^{61}$). పూర్వీకులవలె చేయుటవారి తండ్రుల పద్ధతులనుబట్టి ప్రవర్తించుట యనఁబడెను (యెహె $20^{18}$). క్రొత్త నిబంధనయందు ఈ భావముతో పౌలు పేతురు అనువారు ఎక్కువగా వాడిరి. క్రైస్తవులు తమ పూర్వ ప్రవర్తనను వదలి వేయవలెను (ఎఫె $4^{22}$ II కొరి $1^{12}$). పౌలు తన పూర్వ చరిత్రనుగూర్చి వ్రాయఁగా అది తన ప్రవర్తన యని చెప్పెను (గల $1^{14}$). తిమోతి తన ప్రవర్తనయందు సభికులకు మాదిరిగా నుండవలెనని వ్రాసెను (I తిమో $4^{12}$). దుష్టులు చేయునవి కామవికార యుక్తమైన నడువడి యనియు (II పేతు $2^{7}$), వ్యర్థ ప్రవర్తనయనియు (I పేతు $1^{18}$) అనఁబడెను. భక్తులు చేయవలసినది పరిశుద్ధమైన ప్రవర్తన యనియు (II పేతు $3^{11}$ I పేతు $1^{15}$), మంచి ప్రవర్తనయనియు ($2^{12}$) పవిత్ర ప్రవర్తనయనియు ($3^{2}$), సత్ప్రవర్తనయనియు ($3^{16}$) అనఁబడెను. పౌలు ఫిలిప్పీయులను క్రీస్తు సువార్తకు తగినట్లుగా ప్రవర్తించుఁడి యని హెచ్చరిక చేసినప్పుడు (ఫిలి $1^{27}$) వాడిన పదము వేఱొకటియై $3^{20}$ లో వాడిన పౌరస్థితియని తెనిఁగింపఁబడినదానికి సంబంధముగా నున్నది. అట్టి స్థితిగలవారివలె ప్రవర్తింపవలెననుట దాని భావమై యున్నది. (మార్గము, దారి, పౌరస్థితి చూ॥).

**ప్రవాసస్థానము** (Colony). కొలోనియ యను మాట రోమనులు వాడినపదమై కార్య $16^{12}$ నందు గ్రీకుభాషలో వ్రాయఁబడియున్నది. ఫిలిప్పయి పట్టణమట్టిదై యున్నట్లు దానివలనఁ దెలియుచున్నది. తమ రాజ్యమును స్థిరపఱచుకొనుటకై రోమనులు తమకు స్వాధీనమైన దేశములలో అట్టి పట్టణములను స్థాపించిరి. ఈ పదము ఫిలిప్పయికి మాత్రము బైబిలులో వాడినను పిసిదియలోని అంతియొకయ, లుస్త్ర, కొరింథు, తొలెమాయి యనునవికూడ ఇట్టి పట్టణములై యుండెను. ఈ పట్టణములయందు రోమను యుద్ధభటులు నివసించిరి. వాటి నొక విధమైన దండు పేటలనుగా నెంచవచ్చును. చుట్టునుండు ప్రదేశములను లోఁబఱచుకొని రోమనువారి నాగరికతను అచ్చట స్థాపించి బలపఱచుటయే వాటిపనియై యుండెను. ఈ పట్టణములు విదేశములయం దుండినను రోమనుల వాడుకలనే యనుసరించినందున వాటికిని విశేష హక్కులు విధులు నుండెను. పనిలేకుండెడి సిపాయిలను కూడ ఇట్టి పట్టణములలో రోమనులుంచుచు వచ్చిరి.

**ప్రవాహజలము** (Flood). నదికిఁగాని యేళ్లకుఁగాని ఉపయోగించఁబడిన పదమని యెష $44^{3}$ వలనఁ దెలియుచున్నది. కొన్ని నదుల నప్పుడప్పుడీ పదముతో బిలిచిరి (కీర్త $78^{44}$ యిర్మీ $46^{7,8}$). ఈ పదము నాశనము కలుగఁజేయు సేనా సమూహములను (యెష $8^{7}$ $17^{12,13}$), దేవుఁడు విధించు శిక్షలవలన కలుగు నాశనమును ($59^{19}$), భక్తులను నాశముచేయుటకై దుష్టులు చేయు గొప్ప ప్రయత్నములను (ప్రక $12^{15,16}$), భక్తులైనవారికి కలుగఁబోవు గొప్ప కష్టములను (కీర్త $32^{6}$ యోనా $2^{3}$) సూచించును. ఇట్టి కష్టములను దేవుఁడు మాత్రమే ఆపఁగలఁడని తెలుపుటకు ఆయన ప్రవాహములను బంధించినట్లు వర్ణించఁబడెను (యెహె $31^{15}$). భూమి సముద్రముచే నావరింపఁబడి యున్నందున సాధారణముగా మానవులనుకొనినట్లు బైబిలు కాలమునం దున్నవారును అది ప్రవాహముమీఁద కట్టఁబడి యున్నట్లు వర్ణించిరి. దానినట్లు స్థిరపఱచుట దేవుని శక్తి ప్రభావములకు సూచనగా నున్నది (కీర్త $24^{2}$).

**ప్రవిష్టులు** మతప్రవిష్టులు చూ॥

**ప్రవేశము** (Access). బైబిలునందీ పదము యొక్క సాధారణార్థమునిచ్చు మాటలు గలవు. I థెస్స $2^{1}$ లో నున్న పదము పౌలు థెస్సలొనీకె పట్టణములో ప్రవేశించుటను మాత్రమే తెలియఁజేయును. ఈ పదముచే తెనిఁగించఁబడిన యొక

విశేషపదము రోమా. 5² ఎఫె 3¹² నందున్నది. ఎఫె 2¹⁸ నందును ఈ పదమే యున్నను తెలుగు బైబిలునందు దానిని చేరఁగలిగి యున్నామని తర్జుమా చేసిరి. పై మూఁడు వాక్యములలో నుండు ఈ పదము క్రైస్తవుల హక్కులలో నొక విశేషమైనదానిని సూచించును. పాపమువలన దూరపఱచఁబడిన మనము క్రీస్తుద్వార దేవుని సన్నిధానమందు చేరుటకు క్రొత్త స్థితిగలవార మైతిమి. ప్రవేశించుటకు మనకు ధైర్యము కలుగును (హెబ్రీ 10²⁰). మూలభాషయందు పై వాక్యములలోనున్న పదములు భిన్నముగా నుండినను ఒక సంగతినే సూచించును. హెబ్రీ 4¹⁴⁻¹⁶ 10¹⁹⁻²⁵ నందు క్రైస్తవహక్కు ఎట్టిదో తేటగా వివరింపఁబడి యున్నది.

**ప్రసంగి (Ecclesiastes).** ఈ పదముచే తెనిఁగించఁబడిన హెబ్రీ పదముయొక్క సరియైన యర్థము తెలియదు. సమాజమును కూర్చువాఁడని కొందఱును, గొప్ప ప్రసంగికుఁడని కొందఱును ఈ పదమున కర్థము చెప్పెదరు.

1. గ్రంథకర్త: తాను యెరూషలేములో రాజైన దావీదు కుమారుఁడనని చెప్పుకొనినను తన పేరునుమాత్ర ముదాహరింపలేదు. పన్నెండు గోత్రికులను ఏలిన దావీదునకు సొలొమోను మాత్రమే సింహాసనమునకు వారసుఁడై అందఱి కన్న భాగ్యవంతుఁడై యుండుటవలన యూదు లందఱు నీ గ్రంథకర్త సొలొమోనని యెంచిరి. అతని యేలుబడియందే ఇశ్రాయేలువారేమి, యూదావారేమి దాను మొదలుకొని బెయేర్షెబా వఱకు తమ తమ ద్రాక్ష చెట్లక్రింద నిర్భయముగా నివసించుచుండిరని I రాజు 4²⁰,²⁵ వలనఁ దెలిసికొనవచ్చును, గాని ఈ గ్రంథము నందు ప్రజలకు కలిగిన కష్టములనుగూర్చియు శ్రమలనుగూర్చియు చదివెదము. అందువలన పై యభిప్రాయమునుగూర్చి కొంచెము ముందు వెనుక లాడవలసి వచ్చుచున్నది.

2. కాలము, ఉద్దేశము: యూదులు బబులోను చెఱనుండి తిరిగివచ్చిన తరువాత పారసీ రాజుచేత దేశాధికారులుగ నియమింపఁబడినవారు దేశమును దోచుకొనిన కాలమున వ్రాయఁబడిన దని చాలమంది పండితుల యభిప్రాయము. యూదులలో ననేకులు తమ చుట్టునున్న అన్య జనుల విషయాసక్తి ననుసరించి పాపములోఁబడి సర్వలోకాధికారియగు నీతిగల దేవుని నమ్మకొనక తత్వశాస్త్ర పారాయణులును భోగాసక్తులును ద్రవ్యార్జనా పరులునై నిజమైన జ్ఞానమును సంపాదింపఁజాలక పోయిరి. అట్టి జ్ఞానము వారికి దేవుఁ డనుగ్రహించు వరములను మితముగా ననుభవించి, కలిగిన కష్టముల నోర్పుతో సహించుచు నిష్కపటముగా దేవుని సేవించి ఆయనయందుంచు దృఢవిశ్వాసమువలన మాత్రమే కలుగునని బోధించుటకు ఈ గ్రంథము వ్రాయఁబడెను

3. ముఖ్యభాగములు, క్లుప్తవివరము:

I. ప్రస్తావన (1¹⁻¹¹). ప్రసంగి తాను యోచించుచుండిన సంగతినిగుఱించి ఈ వచనములలో తెలియఁజేసెను.

II. నిజమైన జ్ఞానసంపాదనము 1. విద్య వలనగాని (1¹²,¹⁸), సుఖభోగములవలనగాని (2¹,²⁶) కలుగదు. 2. లోకవ్యవహారములు సక్రమపుట వలనఁగాని (3¹,²²), దేశపరిపాలనవలనఁగాని (4¹-5²⁰) కలుగదు. 3. ధనార్జనవలనఁగాని, మితానుభవమువలనఁగాని (6¹-8¹⁵) కలుగదు. 4. దేవుఁడనుగ్రహించు దివ్యదానములను శాంతముతోను సమాధానముతోను అనుభవించుచు రాఁబోవు యుగమునందు సమస్తమును మేలుగా సమకూడి జరుగునని దృఢముగా నమ్ముటవలన మాత్రమే కలుగును (8¹⁶-12⁷).

III. ముగింపు 12⁹⁻¹⁴ ఈ వచనములలో నిజమైన జ్ఞానము దేవుని యాజ్ఞలను చక్కఁగాఁ గైకొనుటయే గాక దేవునియందు నమ్మకమును స్థిరపఱచునని నొక్కివక్కాణింపఁబడినది. J. C.

**ప్రళయవాయువు** తుఫాను చూ॥

## ప్రా

**ప్రాకారము** కోట II 3 చూ॥

**ప్రాకారములదేవత (God of fortress).** ఈ పదము దాని 11³⁸ నందున్నది. దీనిలో ప్రాకారములని తెనిఁగించిన పదమునకు

దుర్గము, శక్తి యను శబ్దార్థముగలదు. కనుకనే దేవుడు దుర్గముగా వర్ణింపఁబడెను (కీర్త $31^{4}$ $43^{2}$ మొ॥). దానియేలు ప్రశంసించినది అన్యుల దేవతా యను ప్రశ్నకలుగుచున్నది. దానియేలు గ్రంథమునందున్న ప్రవచనములు అంతియోకస్ ఎపిఫనీసు యూదులమతమును నాశముచేయుటనుగూర్చి ముఖ్యముగా సూచించును. అతఁడు యెరూషలేమునందు గ్రీకుల ముఖ్యదేవతయగు ద్యుపతి విగ్రహమును నిలిపెను. ఆ విగ్రహమే ప్రాకారముల దేవత యని కొందఱి తలంపు. రోమను లా దేవతను హిందువుల ఇంద్రునివలె నెంచుటవలన అట్లనుటకు ఆధారముండినను దానియేలీ పేరును దేవతలలో నొకదాని కుపయోగించెనో లేక విశేషబలమును సూచించు దానికలంకారముగా వాడెనో రూఢిగా చెప్ప వలను పడదు.

**ప్రాకుజంతువులు** కీటకములు సరీసృపములు 24 చూ॥

**ప్రాణము** మనుష్యుడు 2, 4 చూ॥

**ప్రాయశ్చిత్తము** (Atonement). పాఁత నిబంధనయందు కప్పివేయుట అని యర్థ మిచ్చు హెబ్రీపదమునకు తెలుఁగు బైబిలులో వాడిన పదము. అది పాపములను కప్పివేయును గాన నీ పదమును వాడిరి. రక్తమువలనను (లేవీ $1^{17}$), దహనబలివలనను ($5^{10}$), అపరాధ పరిహారార్థ బలివలనను ($5^{6,13}$ $16^{6,11}$ సంఖ్యా $28^{22,30}$ $29^{5}$ నెహె $10^{33}$), సమాధాన బలివలనను (లేవీ $4^{26,31,35}$), ధూపము వేయుట (సంఖ్యా $16^{46}$), అరషెకెలు చెల్లించుట (నిర్గ $30^{16}$), కానుకలర్పించుట (సంఖ్యా $31^{50}$), ప్రార్థించుట (సంఖ్యా $12^{13}$) వలనను, తిరుగఁబడినవారిని లయపఱచుటవలనను (సంఖ్యా $25^{13}$), ఉరితీయుటవలనను (II సమూ $21^{3}$) ప్రాయశ్చిత్తము కలిగినట్లు ఆయా వాక్యములయందున్నను, ముఖ్యముగా పాప పరిహారార్థబలివలననే కలిగినట్లు అనేక సూచనలున్నవి (లేవీ $5^{6,13}$ $16^{6,11,24}$ సంఖ్యా $28^{22,30}$ $29^{5}$ II దిన $29^{24}$ నెహె $10^{33}$). అందువలననే ధర్మశాస్త్రములోని యాచారము లన్నిఁటిలో గంభీరమైన దినము పాపము నిమిత్తమైన **ప్రాయశ్చిత్తార్థ దిన** మనఁబడెను (లేవీ $23^{27}$). దానిగూర్చిన నియమములు లేవీ 16 నందు వివరముగా నున్నవి. యాజకులు తమ కొఱకును ప్రజల కొఱకును పరిశుద్ధ స్థలము కొఱకును ($16^{6,11,17,24}$), బలిపీఠము కొఱకును ($16^{18,33}$), పాపము లన్నిఁటి నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయవలసి యుండెను ($16^{34}$). అది నిత్యమైన కట్టడగా నియమింపఁబడెను కావున యూదులు నేటివఱకు ఆచరించుచున్న ఉపవాస దినములలో నిది ముఖ్యమైనదై యున్నది.

ఆ దినమున అర్పించినదానివలన మాత్రమే గాక అజాజేలు అనఁబడిన మేఁకను విడిపించుటవలనను ప్రాయశ్చిత్తము చేసిరి. వారా మేఁక మీఁద తమ చేతులుంచిన పిమ్మట దానిని వదలివేసిరి (లేవీ $16^{10}$). వధింపఁబడనైయున్న యాగ పశువుమీఁదను చేతులుంచుటవలన దానిమీఁద తమ పాపములుంచినట్లు ఇతర యర్పణములలో కూడ సూచనలు గలవు (లేవీ $1^{4}$ $3^{2,8,13}$ $4^{15}$ $8^{14,22}$).

మోషే (లేవీ $8^{34}$), అహరోను, అతని తరువాత ప్రధాన యాజకులైనవారు ($9^{17}$ $16^{32}$ I దిన $6^{49}$), యాజకులు ($7^{7}$) ప్రాయశ్చిత్త కర్మను జేసిరి. తెలియక పాపముచేసినవారి కొఱకే (లేవీ $4^{20}$ $16^{30,34}$ సంఖ్యా $15^{25,28}$) గాని బుద్ధిపూర్వకముగా మూర్ఖించి పాపము చేసినవారి నిమిత్తము దీనిని చేయలేదు (హెబ్రీ $10^{26}$). మ్రొక్కుబడిచేసి దానిని చెల్లింపనివారును ప్రాయశ్చిత్తము చేయించుకొనవలసి యుండెను. అపవిత్రులని యెంచఁబడినవారు శుద్ధీకరణాచారము చేయించుకొనునప్పుడు దీనిచేయవలసి యుండిరి. ప్రసవించిన స్త్రీయును (లేవీ $12^{7}$), స్వస్థుఁడైన కుష్ఠరోగియు ($14^{19,20,31}$), కుష్ఠమున్న యింటి కొఱకును ($14^{34}$), స్రావరోగియై బాగుపడినందుకును ($15^{15}$), దాసితో వ్యభిచరించిన వాఁడును ($19^{21,22}$), శవము ముట్టినవాఁడును (సంఖ్యా $5^{8}$) ప్రాయశ్చిత్తము చేయవలసి యుండెను.

నిబంధనల మందసపు పైకప్పునకు కరుణాపీఠమను పేరుండెను (నిర్గ $25^{17,18}$ మొ॥) గాని ప్రాయశ్చిత్తార్థ దినమున అచ్చటనే రక్తమును ప్రోక్షించి యందఱి కొఱకు ప్రాయశ్చిత్తము

చేసినందున ప్రాయశ్చిత్తార్థ పీఠమని I దిన $28^{11}$ నందున్నది.

పైనున్న వివరములనుబట్టి ప్రాయశ్చిత్తమును గూర్చిన యీ దిగువ సంగతులను నిరూపించవచ్చును.

1. పాపముల విషయమై ప్రాయశ్చిత్తము చేయుట యాజకుల ముఖ్యవిధులలో నొకటియై యున్నది. దేవుఁడు పరిశుద్ధుఁడు; మానవులు పాపాత్ములు. పాపులగు వీరికి పరిశుద్ధుఁడగు దేవునితో సహవాసము కలుగునట్లు వారి పాపము కప్పఁబడవలసి యున్నది. ప్రతినిత్యమును అర్పణ లర్పించుటవలన పాత నిబంధనయందిది సూచనరీతిగ జరిగెనేగాని యెన్నడును పూర్తికాలేదని స్పష్టమగుచున్నది. పాపముల నిమిత్తము సరిపూర్ణమైన శాంతికరము జరుగనుటకు ఇవి ముందు సూచనలై యుండెనేగాని స్వేచ్ఛావిహీనములగు జంతుజాలముల నర్పించుటచే నిది కలుగలేదు. క్రీస్తు తన్నుతాను ఇష్టపూర్వకముగా నర్పించుకొనుటచేత నిది పూర్ణమయ్యెను (లేవీ $8^{27}$ $9^{12,13}$ కరుణాధారము, శాంతికరము చూ॥).

2. దీనికి సంబంధించిన యాచారములలోఁ గొన్ని అన్యుల యాచారములవంటివి. మోషే కాలమున ఇశ్రాయేలీయులకు చుట్టునున్నవారు సున్నతి నాచరించుట, దేవర పెట్టెలను తమ గృహములందును గుడులయందుంచుకొనుట సాధారణముగ నున్నట్లే ప్రాయశ్చిత్తమునకు సంబంధించిన యాచారములు నుండెను గాని వారి వీరి యాచారములకు ఉద్దేశభేదము గలదు. హిందువులు చేయు యజ్ఞాచారములు మొదలగునవి దేవతలను పోషించుటకుఁగాని, తాము కోరెడి యీవులను పొందుటకుఁగాని యర్పింపఁబడెను. బైబిలునందుదాహరించిన యాచారములు దేవుని పరిశుద్ధతను మానవుల పాపమును ప్రాయశ్చిత్తము లేకుండ పాపి ఆ పరిశుద్ధుఁడగు దేవుని సమీపింపఁజాలఁడనుసంగతిని తెలుపుచున్నవి. "ఋతస్య నఃపథాన యాతి విశ్వాని దురితా" (ఋగ్వేదము 10:31; 6) అనునది తప్ప హిందూమత గ్రంథజాలమున యజ్ఞములు పాప పరిహారార్థమై అర్పింపఁబడినట్లు సూచనలును లేవు.

ప్రాయశ్చిత్తమును గూర్చిన ఆచారమును అన్యులంతగా యెంచకపోయినను బైబిలు దానిని మిగుల ప్రాముఖ్యమైనదిగా బోధించును. ఈ యాచారముల మూలమున పాత నిబంధనకాలపు భక్తులు దేవుని పరిశుద్ధతను తెలిసికొని తమ పాపముల నొప్పుకొని పూర్ణ ప్రాయశ్చిత్తమగు క్రీస్తును నమ్ముటకు సంసిద్ధులైరి. పరిపూర్ణమైనది వచ్చిన పిమ్మట ఈ సూచనలతో నేపనియు లేకపోయెను. పూర్వమిట్టి యాచారములు ఇశ్రాయేలీయులలోను హిందువులలోను లెక్కకు మించియుండునవి. అవియన్నియు మాయ యని హిందువులును, ఆ యాచారములు గొప్ప సత్యములకు సూచనలని బయలుపఱచిన సత్యస్వరూపియగు క్రీస్తు వాటిని నెఱవేర్చిన పిమ్మట నవి ఇఁక నిరుపయోగములని క్రైస్తవులును వాటి నాచరించుట మానిరి. ఆయనే లోక పాపమును మోసికొనిపోవు దేవుని గొఱ్ఱెపిల్ల (యోహా 1[illegible], యేసు క్రీస్తు IV 3 (1), సమాధానపరచుట చూ॥).

**ప్రాయశ్చిత్తార్థ దినము** పండుగులు III 1 (3) (*a*), నేరములు I 7 చూ॥

**ప్రార్థన** (Prayer). ప్రార్థించుట మానవునికి నైజము. దీనినిగూర్చి బైబిలునందు మొదటినుండి (ఆది $4^{26}$) చివరివఱకు (ప్రక $22^{8,9}$) అనేక సూచనలు గలవు.

1. ప్రార్థన చేసిన స్థలములు: బలిపీఠములను కట్టించిన స్థలములందు ప్రార్థించెడి వాడుకయుండెను (ఆది $12^{18}$ $26^{25}$ మొ॥). గుడారమును, దేవాలయమును ప్రార్థనలకుఁగాక, ముఖ్యముగా ఆచారము లనుష్ఠించుటకై ఉపయోగించిరి. అయినప్పటికిని యూదులు దేవాలయముతట్టు తిరిగి ప్రార్థించెడి వాడుకవలన (I రాజు $8^{30,33}$ కీర్త $5^{7}$) అది వారియొక్క ముఖ్య ప్రార్థనాస్థలమై యుండెనని దోఁచుచున్నది.

అది అందఱికిని ప్రార్థన మందిరమనఁబడెను (యెష $56^{7}$ మా $11^{17}$). యాజకు లర్పణలర్పించునప్పుడు ప్రజలు బైటనుండి ప్రార్థించుచుండిరి. (లూకా $1^{10}$). పేతురు యోహాను లనువారు యూదుల ప్రార్థన వేళలను కనిపెట్టి ప్రార్థించుటకు దేవాలయమునకు వెళ్లిరి (కార్య $3^{1}$). చెఱకాలమునకుఁ బిమ్మటనే సమాజ మందిరములు

ప్రార్థనా స్థలములయ్యెను (లూ $4^{16,44}$ మొ॥) సమాజమందిరము లేనిచోట్ల, చెలువుల యొద్దఁగాని, నదీతీరములందుఁగాని కూడుకొని ప్రార్థించెడి వారు (కార్య $16^{13}$). ఆది క్రైస్తవులు ఆయా సభికుల ఇండ్లలో కూడుకొని ప్రార్థించుటలో యూదుల వాడుకల ననుసరించి యుండవచ్చును ($2^{42}$ $6^{4}$ మొ॥). నియమిత స్థలముల యందు కూడి ప్రార్థించుటయే గాక, ఏకాంతముగా ప్రార్థించుకొనఁ గోరినవారు తమ యిండ్లలోఁగాని (ద్వితీ $6^{10}$), మేడల మీఁదఁగాని (కార్య $10^{9}$) ప్రార్థించిరి. క్రీస్తు నిర్మానుష్యములైన అడవులలోనికిని (మా $1^{35}$), కొండల మీఁదకును (యోహా $6^{15}$), వనములలోనికిని (లూ $22^{39-46}$), ఇతర స్థలములకును ప్రార్థించు నిమిత్తము వెళ్లెడివాఁడు. ఎచ్చట నేకాంతముగా దేవునితో సహవాసము చేయుటకు వీలుగా నుండునో అచ్చట ప్రార్థించుట యుక్తమని ఆయనపై నుదాహరింపఁబడిన వాటిద్వారా కనఁబఱచుచున్నాఁడు (మ $6^{6}$). మనుష్యులకు కనఁబడవలెనని పరిసయ్యులు వీధుల మూలలందు నిలిచి ప్రార్థించిరి ($6^{5}$). ప్రార్థించుటకు ప్రత్యేకమైన స్థలములను ప్రతిష్ఠించుకొనుట మంచిదైనను, ఎక్కడనైనను సరే ప్రార్థించవచ్చునని ఈ నిదర్శనముల వలనఁ దెలియుచున్నది.

2. ప్రార్థించవలసిన విధము:—భక్తి మర్యాదలును వినయమును ప్రార్థించునప్పుడు కనఁబఱచుట మిగుల అవసరమై యున్నది గాని ఫలాని రీతిగా ప్రార్థించవలెనను నియమము లేదు. బైబిలునం దుదాహరింపఁబడిన ప్రార్థనలలో అంగీకరింపఁబడిన వాటిని చేసిన వారిలోఁ గొందఱు నిలిచి ప్రార్థించిరి (హన్నా, I సమూ $1^{26}$; సొలొమోను, I రాజు $8^{22}$); (సుంకరి, లూ $18^{13}$); కొందఱు మోకరించిరి (ఎజ్రా, ఎజ్రా $9^{5}$); (క్రీస్తు, లూ $22^{41}$); (స్తెఫను, కార్య $7^{60}$); కొందఱు సాష్టాంగపడిరి (ఎలీయెజరు, ఆది $24^{26}$; ఏలీయా, I రాజు $18^{42}$; (ప్రజలు, నెహె $8^{6}$). వేషధారు లెంత నిలిచి ప్రార్థించినను వారి ప్రార్థనలు వినఁబడవు (లూ $18^{11}$ $6^{5}$) ప్రార్థించు రీతి కాదు గాని భక్తిగల మనస్సే మిగుల ముఖ్యమైనదని దీనివలనఁ దెలియుచున్నది. ప్రార్థించునప్పుడు చేతులెత్తి ప్రార్థించుటయు వాడుకగా నుండెను (కీర్త $141^{2}$ $143^{6}$ I తిమో $2^{8}$).

3. పాఁత నిబంధనలోని ప్రార్థనలు:—ప్రార్థించునప్పుడు విశేషముగ మనవులను చేసిరి. దేవుని యొద్ద విచారణఁజేసిరి (ఆది $24^{12-14}$ న్యాయా $6^{36,37,39}$ I సమూ $23^{10-12}$). అనేక ప్రార్థనలయందు ఆపదలలోనుండి తప్పించవలెనని దేవుని కాపుదల నడిగిరి (ఆది $32^{9-12}$ II రాజు $19^{15-29}$ యెష $37^{6-20}$). యిర్మీయా ప్రార్థనలు చాలమట్టున కట్టివే (యిర్మీ $10^{23-25}$ $12^{1-4}$ $14^{19-22}$). సొలొమోను జ్ఞానమును వరముగా కోరెను (I రాజు $3^{6-9}$ II దిన $1^{8-10}$). మోషే (నిర్గ $32^{11-13,31,32}$), దానియేలు (దాని $2^{20-23}$ $9^{4-19}$) ప్రజలకొఱకు విజ్ఞాపన జేసిరి. ఎజ్రా ($7^{6-15}$), నెహెమ్యా ($1^{5-11}$), ప్రజలు (నెహె $9^{5-38}$), యెషయా ($63^{7}$-$64^{12}$) తమ పాపముల నొప్పుకొని క్షమాపణ కొఱకు వేడుకొనిరి. ఆలయమును ప్రతిష్ఠించినప్పుడు సొలొమోను గొప్ప ప్రార్థనఁ జేసెను (I రాజు $8^{23-60}$ II దిన $6^{6-42}$). అదియుఁగాక కీర్తనగ్రంథమునందలి కీర్తనలలో ననేకములు ప్రార్థనలైయున్నవి (17,51,85,90, 102,142). హబ 3, యోనా 2 ప్రార్థనలే. దేవునివలన కలిగిన మేలులకై స్తోత్ర ప్రార్థనలు కీర్తనల గ్రంథములోను విశేషముగా నున్నవి. హిజ్కియా బాగుపడిన పిమ్మట చేసిన ప్రార్థన యిట్టిదే (యెష $38^{9-20}$ స్తోత్రములు చూ॥).

4. క్రొత్త నిబంధనలోని ప్రార్థనలు:—ప్రార్థన చేయుట క్రీస్తుకు వాడుకయైనను (యేసుక్రీస్తు II 2 చూ॥) ఆయన ప్రార్థనలలో బహుకొద్ది మాత్రము వ్రాయఁబడెను (మ $11^{25-26}$ లూ $10^{21}$ యోహా $11^{41,42}$ యోహా 17 మ $26^{36-44}$ = మా $14^{32-39}$ = లూ $22^{41-44}$, లూ $23^{34,46}$ మ $27^{46}$ మా $15^{34}$). ఆయన ప్రార్థనలు కృతజ్ఞతలతోను విజ్ఞాపనలతోను నిండి దేవునితో ఆయన చేసిన సహవాసమును కనఁబఱచుచున్నవి. ఆయన ప్రార్థించుట మాత్రమేగాక, ప్రార్థనను గూర్చి బోధించెను. ప్రార్థించువారు వేషధారణతోఁ గాక యథార్థ హృదయముతోను (మ $6^{5-8}$), దేవుఁడు తండ్రి యనుభావముతోను ($7^{7-11}$ $21^{22}$ లూ $11^{5-13}$), పట్టుదలతోను (లూ $18^{1-8}$), విన

యముతోను ($18^{9-14}$), ఇతరులతో నేకీభవించి (మ $18^{19}$) ప్రార్థించవలెనని ఆయన బోధించెను. శత్రువులకొఱకు ప్రార్థన చేయవలెననియు (మ $5^{44}$ = లూ $6^{28}$) తన కోత కొఱకై దేవుఁడు పనివారిని పంపుట కాయనను వేడుకొనవలెననియు ఆజ్ఞనిచ్చెను (మ $9^{38}$ = లూ $10^{2}$). ప్రార్థించుటనుగూర్చి ఆయన బోధించిన వన్నియు ప్రభువు ప్రార్థనయందు దృష్టాంత పఱచఁబడెను. (ప్రభువు ప్రార్థన చూ॥). తన పేరట అడుగువారికి దొరుకునని బహు దివ్య వాగ్దానము లిచ్చెను. (మ $7^{7-11}$ = లూ $11^{9-13}$ మ $18^{19}$ యోహా $14^{13,14}$ $15^{7-16}$ $16^{23-25}$).

ప్రార్థించుటకు సంఘము అలవాటు పడెనని అపొస్తలుల వాడుకలవలన మనము తెలిసికొనవచ్చును (కార్య $1^{14,24}$ $2^{42}$ $4^{31}$ $6^{4,6}$ $12^{5,12}$ $13^{3}$ $14^{23}$ $21^{5}$ I కొరి $11^{4-14}$). సంఘములు ప్రార్థించిరి (కార్య $3^{1}$ $6^{4}$ $8^{15}$ $9^{11,40}$ $10^{9}$ $11^{5}$ మొ॥). పౌలు తన సంఘముల విషయమెంత ఆసక్తితోను పట్టుదలతోను ప్రార్థించెనో దానిని గూర్చి ఆయన వ్రాసిన పత్రికలలో అనేక సూచన లున్నవి. (I థెస్స $1^{2,3}$ I కొరి $1^{4-8}$ II కొరి $1^{3,4}$ రోమా $1^{8-10}$ ఫిలి $1^{3-11}$ కొలొ $1^{3-13}$ ఎఫె $1^{15-21}$ $3^{14-21}$ ఫిలె 4-6 I తిమో $1^{12-15}$ II తిమో $1^{3-5}$ మొ॥). ప్రార్థించవలెనని సభికులకుఁ జేయబడిన హెచ్చరికెలు పత్రికలలో ననేకములు గలవు (I థెస్స $5^{17,18}$ II థెస్స $3^{1,2}$ I కొరి $11^{2-16}$ $14^{2-17}$ II కొరి $1^{11}$ రోమా $8^{26,27}$ $12^{12}$ $15^{30-32}$ ఫిలి $4^{6}$ కొలొ $4^{2-4}$ ఎఫె $6^{18-20}$ I తిమో $2^{1,2,8}$ యాకో $1^{5,6}$ $4^{2-8}$ $5^{13-18}$ I యోహా $3^{21,22}$ $5^{14-16}$). ఆది క్రైస్తవులలో ప్రార్థించుట యెంత అవసరమైనదిగా నెంచఁబడెనో అది ఈ సూచనల వలనను ఇతర సూచనలవలనను తేటగా కనఁబడును.

## ప్రి, ప్రే

**ప్రియుడు** ప్రేమ II 4 చూ॥

**ప్రిస్క, ప్రిస్కిల్ల** (Prisca = ముసలమ్మ, **Priscilla** = చిన్న ముసలమ్మ). అకుల యనువాని భార్య (అకుల చూ॥).

**ప్రేతోర్యము, ప్రేతోర్యమను సేన** (Praetorium, Praetorian Guard). తెలుఁగు బైబిలునందు మా $15^{16}$ ఫిలి $1^{13}$ నందు మాత్రము ఈ పదమును తెనిఁగించక మ $27^{27}$ యోహా $18^{28-33}$ $19^{8}$ కార్య $23^{35}$ నందు **అధికారమందిరము** అను మాటతో తర్జుమా చేసిరి. ఆదిమభాషయందు ఈ పదము ప్రేతోరను రోమీయుల ఉద్యోగస్థుని గుడారమును సూచించును. రోమీయులు తమ దండుపాలెము మధ్య నొక విశాలస్థలము నేర్పఱచి అచ్చట తమ సేనాని గుడారమును తాము కొలిచెడి దేవుని వేదిక నుంచిరి. ఈ పద మారంభమున అతని గుడారమును సూచించినను, క్రమక్రమముగా ఆ గుడారమున కూడుకొనిన సైన్యాధిపతుల యాలోచన సభకును వాడిరి. రోమీయుల మండలాధిపతి నివసించు నగరికిని ప్రేతోర్యమని పేరు. ఈ రెంటికి మాత్రమేగాక ఈ పదము రోమను చక్రవర్తియొక్క దేహసంరక్షక పటాలమునకును పెట్టఁబడెను. సువార్తలయందు అక్కడక్కడ ఉపయోగింపఁబడిన ఈ పదము యెరూషలేమునందు రోమీయుల అధిపతి కాపురముండిన శృంగార భవనమును సూచించును. మహా హేరోదు యెరూషలేమునందు కట్టించిన రాజమందిరములో పిలాతు కాపురముండెను.

ఫిలి $1^{13}$ నందున్న ప్రేతోర్యమను సేనయను దానికి వేర్వే అర్థములు చెప్పెదరు. ప్రాఁచీన వ్యాఖ్యాతలలోఁ గొందఱును నవీనులలో గొందఱును ఈ మాఁటకు నగరు అను నర్థము చెప్పి $4^{22}$ లోని కైసరు ఇంటివారు అను మాటల నాధారము చేసికొందురు గాని, ఈ పదము ఏ గ్రంథమందైనను రోమాలోని చక్రవర్తి నగరు విషయమై ఉపయోగింపఁబడనందున వారి యభిప్రాయము సందేహాస్పదముగా నున్నది. చక్రవర్తియొక్క దేహసంరక్షక సైన్య కాపురస్థలముయొక్క పేరని కొందఱి యభిప్రాయముగాని అదియు నందఱి కంగీకార యుక్తముగ లేదు. చక్రవర్తి దేహసంరక్షక పటాలమందలి సైనికులని లైట్ఫుట్ (*Lightfoot*) అను పండితోత్తముఁడు చెప్పు అర్థము సరియైనదని అనేకమంది పండితు లభిప్రాయపడుచున్నారు. వీరు చక్రవర్తి కాపురముండిన నగరి సమీపమున నుండిరి. పౌలు

రోమాకు వెళ్లినప్పుడు అతని యంత్రణనుబట్టి అతనిని వీరి వశమున కప్పగించిరి. అతని కాపాడు నిమిత్తమై వారు పంతుల ప్రకారము పారా యిచ్చు చుండిరి గనుక అతఁడు వారిలో ప్రతివానికి సువార్త బోధించుటవలన అది వారి మూలముగా ప్రేతోర్యమను సేనలోని వారి కందఱికి స్పష్ట మయ్యెను. M.

**ప్రేమ, ప్రేమించువాఁడు, ప్రియుఁడు, ప్రేమించబడినవాఁడు (Love, Lover, Beloved).** బైబిలంతటిలో ప్రేమను గూర్చిన విషయము మిగుల ప్రాముఖ్యమైనదై యున్నది. దానిని గూర్చిన సంపూర్ణమగు బోధ క్రీస్తుచేతనే బయలుపఱచఁబడినను పాత నిబంధనయందు కూడ అది బహు స్పష్టముగా నుండి ముఖ్య ధర్మముగా నెంచఁబడెను.

I. పాఁత నిబంధనయందలి బోధ. ప్రేమించుట యను మాటచే తెనిఁగించిన రెండు హెబ్రీ పదములు పాఁత నిబంధనయందుఁ గలవు. వాటిలో మొదటిది అహేబు (*Ahab*) అనునది. ఇతర భాషలయందున్నట్లే ఈ పదము పవిత్రమగు ప్రేమను మాత్రమేగాక కామమును మఱి యితర ములగు ఆశలను సూచించును. ఇస్సాకు ఏశావు తెచ్చిన వేఁటమాంసమును తిని అతనిని ప్రేమించెను (ఆది $25^{28}$). ఆ పదము దురాశను సూచించుచు మోహమునియు (II సమూ $13^{4}$), కామమనియు (యిర్మీ $2^{33}$) తెనిఁగింపఁబడెను. శరీర సంబంధమగు నిట్టి యాశ కొన్ని వాక్యములలో నీ పదముచే సూచింపఁబడినను అది ముఖ్యముగా కుటుంబమునందును స్నేహితులకును కనఁబఱచెడి ప్రేమను దెలుపును (ఆది $22^{2}$ నిర్గ $21^{5}$ I సమూ $18^{16}$ II సమూ $1^{26}$). గాని దానిని మఱెక్కువగా దేవుఁడు తన ప్రజలయెడల కనఁబఱచు ప్రేమను (ద్వితీ $4^{37}$ $7^{7}$ I రాజు $10^{9}$ హోషే $3^{1}$ $9^{15}$ $11^{4}$ $14^{4}$ యిర్మీ $2^{2}$ యెష $43^{4}$ $48^{14}$ $63^{9}$ మలా $1^{2}$ మొ॥). మానవులు దేవునియందుంచు ప్రేమను (నిర్గ $20^{6}$ ద్వితీ $6^{5}$ నెహె $1^{5}$ I రాజు $3^{3}$ కీర్త $5^{11}$ $31^{23}$ $116^{1}$ మీకా $6^{8}$ మొ॥), మానవులితరులయెడలఁ జూపవలసిన ప్రేమ (ఆమో $5^{15}$ కీర్త $40^{16}$ మొ॥) అను నిట్టి ఆత్మీయ సంబంధమగు ప్రేమను సూచించుటకును వాడిరి. "నా స్నేహితుఁడైన అబ్రాహాము" అను బిరుదునందు (యెష $41^{8}$) ఈ పదమే వాడఁబడెను.

మఱియొక పదమును మోహించుటయని సరిగా తెనిఁగించినను (ద్వితీ $21^{11}$) దానిని సాధారణముగా దేవుఁడు మానవులయెడల చూపిన ప్రేమను (ద్వితీ $7^{7}$ $10^{15}$ యెష $38^{17}$), భక్తుఁడు దేవునికి చూపు ప్రేమనుగూర్చి వాడఁబడెను (కీర్త $91^{14}$).

ప్రియుఁడని తెనిఁగింపఁబడిన ఒక పదము పినతండ్రిని సూచించినను (లేవీ $10^{4}$ I సమూ $10^{14}$), పరమ గీతమునందు అది మిగుల ప్రియమైనవానికి ఉపయోగింపఁబడెను ($1^{13,14,16}$ $2^{3}$ మొ॥). యెష $5^{1}$ లో ఈ పదమే దేవుఁడిశ్రాయేలీయులకు పెట్టిన ముద్దు నామమై యున్నది. దాని $9^{23}$ లోని మఱియొక పదము మిగుల విలువగల దానిని సూచించుచు దానియేలు దేవునికెంత ప్రియుఁడో దానిని తెలియఁజేయును.

ఈ పదములన్నిఁటినిబట్టి మానవులలోని ప్రేమను సూచించు మాటలనే ఆత్మీయ ప్రేమను గూర్చి తెలుపుటకు వాడియున్నట్లు కనఁబడును. భార్యాభర్తలకుండు ప్రేమ దేవుని ప్రజలకును దేవునికిని ఉండవలసిన ప్రేమను అలంకార రీతిగా సూచించును (హోషే $2^{14-23}$ $11^{1-4}$ యెష $62^{3-5}$ $63^{7\ 10}$ మొ॥). ప్రాణస్నేహితులకుండు ప్రేమకూడ యిట్టిదే యని దృష్టాంతపఱచఁబడెను (నిర్గ $33^{11}$). దేవుఁడు ఇట్టి ప్రేమను జనుల యోగ్యతను బట్టియు గొప్పతనమును బట్టియుఁ గాక తన యపరిమితమగు కృపచేతనే వారికి చూపెను (ద్వితీ $7^{7-11}$ $9^{6}$ యెహె $16^{3-14}$). క్రొత్త నిబంధనలోవలె పాత నిబంధనయందును దేవుఁడు తన ప్రజలకు చూపిన ప్రేమయే వారాయనకు లోఁబడుట కొక ముఖ్య కారణమయ్యెను. తన యధిక ప్రేమచేతనే ఐగుప్తులోని దాసత్వమునుండి తప్పించినపిమ్మట వారి ప్రేమను గుర్తింపక వెళ్లి అన్యదేవతలను సేవించుచుండిరి. ఇట్టి విశ్వాస ఘాతకులగుట చేత వారందఱికన్న గొప్ప పాపాత్ములైరి (ఆమో $2^{10}$ $3^{1}$ మీకా $6^{4}$ $11^{1}$ యిర్మీ $2^{6}$). వారిట్లు విశ్వాస ఘాతకులైనను వారి నింకను ప్రేమించుచు వారిని చేర్చుకొనెను (యెష $40^{9-11}$ $41^{8-14}$ మొ॥).

దేవుని ప్రేమ పరిశుద్ధమైనది. అది యట్టి దగుటచే ఆయన రోషముగల దేవుఁడనఁబడును (నిర్గ $20^{5}$). ఆయన అపనమ్మకమును సహింపక దానిని శిక్షించుటవలన తన యుగ్రతను చూపును (ఉగ్రత చూ॥). అది యెంత గొప్పదిగా నున్నను, ఆయన శిక్షలన్నియు వారిని మఱల ప్రేమతోఁ జేర్చుకొన వెదకును (కీర్త $103^{9-13}$). అట్టి ప్రేమ నాయన అన్యులయెడలను కనఁబఱచును (యెష $19^{25}$ $42^{1-6}$ కీర్త 100, $145^{9-12}$ యోనా $4^{11}$ మొ॥).

II. క్రొత్త నిబంధనయందలి బోధ:— క్రొత్త నిబంధనలో నీ బోధ అన్నిఁటికన్న ముఖ్యమైనదిగా నెంచఁదగును. రెండుపదములు ముఖ్యముగా వాడిరి. వాటిలో నొకటి సర్వసాధారణమైన పదమై (మ $10^{37}$ యోహా $5^{20}$ $11^{3,36}$ $15^{19}$ మొ॥) సహోదర ప్రేమను సూచించును. ఫిలదెల్ఫియ (*Philadelphia*) అను సార్థక నామమునందున్న ఫిలియ అనునదే ఆ పదము (రోమా $12^{10}$ I థెస్స 4 హెబ్రీ $13^{1}$ II పేతు $1^{7}$). ఈ పదముయొక్క మఱియొక రూపము ప్రేమకు సూచనగా నుండు ముద్దు అను అర్థమిచ్చును (లూ $7^{45}$ $22^{48}$ రోమా $16^{16}$ I కొరి $16^{20}$ మొ॥). రెండవ పదము అగపె (*Agape*) అనునదియై క్రొత్త నిబంధనయందు విశేష ప్రేమను సూచించును. ఇది మానవులయెడల దేవుఁడును (యోహా $3^{16}$ రోమా $8^{37}$ II థెస్స $2^{16}$ I యోహా $4^{11,19}$), క్రీస్తును (గల $2^{20}$ ఎఫె $5^{2}$), తండ్రి కుమారుని యెడలను (యోహా $3^{35}$ $10^{17}$ $15^{9}$ ఎఫె $1^{6}$), భక్తులు దేవుని యెడలను (మ $22^{37}$ రోమా $8^{28}$ I కొరి $2^{9}$ $8^{3}$ మొ॥), క్రీస్తు శిష్యులొకరి యెడల నొకరును (యోహా $13^{23}$ I యోహా $2^{10}$ $3^{11,14,16}$ మొ॥) చూపించెడి ఆత్మీయ ప్రేమను సూచించును. గ్రీకు భాషయందు కుటుంబ ప్రేమను సూచించు మఱియొక పదము పైనున్న మొదటిదానితో కూడ కలిపి రోమా $12^{10}$ లో ఒకరియెడల నొకరు అనురాగము గలవారై యుండుఁడి యని తెనిఁగించిరి. రోమా $1^{31}$ II తిమో $2^{3}$ నందు దాని వ్యతిరేకపదమును అనురాగ రహితులని తెనిఁగించిరి.

I. దేవుడు మానవులకు కనఁపఱచిన ప్రేమను గూర్చి పాత నిబంధనయందుకూడ ఉండినను, క్రొత్త నిబంధనయందు ఆ విషయమునుగూర్చి కనఁబడు ప్రాముఖ్యత దానిలో లేదనవచ్చును. క్రీస్తు తన బోధలన్నిఁటికి ప్రేమను ఆధార సత్యమునుగా చేసెను. ఆయన దేవుని రొమ్మున నున్న వాఁడై (యోహా $1^{18}$) తండ్రిని మానవులకుఁ గనఁబఱచెను. ఆయన తన జనితైక కుమారుని యీ లోకమునకుఁ బంపుటయే ఆయన లోకమును ప్రేమించెనను దానికి సూచనయై యున్నది (యోహా $3^{16,17}$). ఆయన దుష్టులను సహా ప్రేమించి వారికి తన యీవుల ననుగ్రహించును (మ $5^{48}$ లూ $6^{35}$ 15 రోమా $2^{4}$ $5^{6-11}$ కొలొ $1^{21,22}$ మొ॥). అది దేవునికి స్వతస్సిద్ధమైన లక్షణమై యున్నది. సృష్టి యందును లోక పరిపాలనయందును అది ప్రత్యక్షమగుచున్నది (మ $5^{45}$ $6^{26-33}$ $10^{29-31}$ యాకో $1^{17,18}$ I పేతు $1^{3}$). దేవుఁడు ప్రేమయై యున్నాఁడు (I యోహా $4^{8}$). క్రీస్తు పాపుల కొఱకై చనిపోవుటవలన దీనిని కనఁబఱచెను (యోహా $1^{14}$ $3^{14-19}$ రోమా $5^{5-8}$ $8^{32}$ I యోహా $4^{9,10-14}$ కొలొ $1^{13}$). క్రీస్తు కనఁబఱచిన ప్రేమ యందే దేవుని ప్రేమయు కనఁబడును (రోమా $8^{35,39}$ II కొరి $5^{14}$ గల $2^{20}$ ఎఫె $3^{19}$). బైబిలు నందు దేవుని గూర్చియున్న బోధలన్నిఁటిలో నిది శిఖరమని చెప్పవచ్చును.

దేవుఁడు ప్రేమా స్వరూపియైనవాఁడు అను బోధ బైబిలునందు ముఖ్యమైనదై ఆరంభమునుండి క్రీస్తునందు పూర్ణముగా బయలుపఱచఁబడెను. ఇతర మతములు విశేషముగా దేవునిశక్తి ప్రభావములనుగూర్చి తెలుపునుగాని బైబిలుమాత్రము ఆయన పరిశుద్ధమైన ప్రేమను కనఁబఱచును. దేవుని కిట్టి లక్షణములు లేవని చెప్పెడివారు ప్రేమ నాయన కారోపించుట తగదని యందురు. గాని భక్తి విశ్వాసములు తమ మతమునందు ముఖ్యమైనదిగా నెంచెడి వారందఱును అట్టి వాటిని మనలో రేపుటకు అది మాత్రమే నూటియగు సాధనమని యెఱుఁగుదురు. యేసుక్రీస్తు ద్వారా దేవుఁడు మన తండ్రి యను బోధ మతబోధలన్నిఁటిలో మిగుల ఆదరణ కరమగు బోధయై మనలను ఇహసంబంధమగు వాటినుండి పరసంబంధ

మైన వాటితట్టు త్రిప్పుటకు మిగుల బలముగలిగి యున్నది.

మానవుల స్థితి మిగుల దౌర్భాగ్యకరమైన దగుటచే ఆయన వారియెడల చూపు ప్రేమ కనికరముగా నున్నది (లూ $1^{50}$ ఎఫె $2^{4}$ మొ॥). వారి అయోగ్యతనుబట్టి దానిని కృపయనవలెను (కృప చూ॥). ప్రేమగలవాఁడగుటను బట్టియే ఆయన దీర్ఘ శాంతుఁడై యున్నాఁడు (రోమా $2^{4}$ $9^{22}$ మొ॥ దీర్ఘశాంతము చూ॥).

**2.** రక్షణనొందువారు దేవుని యెడలను క్రీస్తు యెడలను చూపు ప్రేమ దేవుఁడు మనమీఁద చూపిన ప్రేమపై ఆధారపడియున్నది (I యోహా $4^{19}$). మొదటి యాజ్ఞయు ఇదె (మ $22^{38}$). ఇట్టి ప్రేమ స్వభావ సిద్ధమైన ప్రేమ గాక మన తెలివికి మించిన దేవుని ప్రేమచేతనే మనలో పుట్టును (రోమా $5^{17,18}$ ఎఫె $2^{3-5}$ $3^{17-19}$ యోహా $15^{16}$ $17^{23}$). ఇట్టి ప్రేమ విశ్వాస నిరీక్షణలతోకూడ క్రైస్తవుల కుండవలసిన ముఖ్య లక్షణమై యున్నది (I కొరి $13^{13}$ I థెస్స $1^{3}$ I తిమో $1^{14}$ మొ॥). క్రీస్తు మనకొఱకు చేసిన దానిని తెలిసికొని విశ్వసించుటవలననే ఇట్టి ప్రేమ వికసించును (II కొరి $4^{4-6}$ గల $5^{6}$ ఎఫె $5^{1,2}$ మొ॥). ఇది పుత్త్రభావముగల ప్రేమయై పరిశుద్ధాత్మచే మనయందు దుప్పవించును. ఈ యాత్మను పొందినవారు దేవునిచూచి నాయనా, తండ్రీ అని ప్రేమతో ఆయనను పిలుచుచు (రోమా $8^{15}$ గల $4^{6}$) పిల్లలవంటి ప్రేమగలవారై యుందురు. ఇట్టి ప్రేమ మనల నీ లోకేచ్ఛల నుండి విడిపించి మనము దేవుని సహవాసమును ఆశించునట్లు మనలను శుద్ధిచేయును (I పేతు $1^{3-9}$ $1^{18-23}$ ఎఫె $4^{31}$ $5^{5}$ కొలొ $3^{12-15}$ I యోహా $3^{1-3}$ $4^{11}$ ప్రక $21^{7}$ $22^{3,4}$ మొ॥). ఇట్టి ప్రేమ గలిగినవారు క్రీస్తును అనుసరించుచు ఆయన ఉండుచోట్ల తామును ఉండఁగలుగుదుమని నిశ్చయించు కొందురు (యోహా $17^{24,25}$ రోమా $8^{28-30}$). కావున అది నిరీక్షణతో కూడినదై యున్నది.

**3.** ఇట్టి ప్రేమగలవారు ఒకరి నొకరుకూడ ప్రేమింతురు. ఇది మొదటి యాజ్ఞకు సాటియైన రెండవ యాజ్ఞయైయున్నది (మ $22^{38-40}$). ఇట్టి అన్యోన్య ప్రేమలోనే దేవుని ప్రేమ పరిపూర్ణమైన దగును (I యోహా $2^{5}$ $3^{23}$ $4^{11,12}$ $4^{16-21}$). ప్రేమచేత తండ్రి కుమారు లైక్యపఱచఁబడినట్లే శిష్యులును ఈ ప్రేమచే నైక్యమత్యము గలిగియుందురు (యోహా $17^{21-26}$). క్రీస్తు ఇట్టి ప్రేమను తనను నమ్మువారియందు పుట్టించుటవలన అందఱిని ప్రేమతో నైక్యపఱచు రాజ్యమును ప్రేమమీఁదనే స్థాపించెను (I యోహా $3^{12}$ II కొరి $5^{15,16}$ ఎఫె $4^{31}$-$5^{5}$ కొలొ $1^{13}$). క్రీస్తు ఇచ్చిన క్రొత్త యాజ్ఞయు నిదే. ఇది మొదటినుండియు గలదు (I యోహా $2^{7,8}$). మనము క్రీస్తు ప్రేమచే బలవంతపఱచఁబడి ఆయనను సేవించుటకు జీవించుచున్నప్పుడు (II కొరి $5^{14-19}$) ఇతరులను సేవించుటకును ఆ ప్రేమచేతనే రేపబడి బ్రతుకఁగలము (మ $25^{34-46}$ I కొరి $8^{11,12}$ రోమా $1^{14,15}$ I యోహా $3^{16}$). అట్టి సహోదర ప్రేమను చూపనివాఁడు దేవునికూడ ప్రేమించనేరఁడు (I యోహా $2^{9}$ $4^{20,21}$). అట్టి ప్రేమను చూపుట భక్తియొక్క వెలుపటి సూచనయైయున్నది (యాకో $1^{27}$ $2^{15,16}$ I యోహా $3^{17}$). ఈ ప్రేమను అందఱును అనుభవించుకొని దేవుని బిడ్డలుకావలెను (మ $10^{8}$ $28^{28}$ మా $16^{15}$ లూ $24^{46}$ కార్య $1^{8}$ రోమా $5^{12-21}$). మనమట్లు కాఁగలందులకు పరిశుద్ధాత్మ ఇయ్యఁబడును. పరిశుద్ధాత్మ అనుగ్రహింపఁబడుట దీనికి సంచకరువుగా నున్నది (II కొరి $1^{22}$ $5^{5}$ ఎఫె $1^{14}$ గల $3^{14}$). క్రీస్తు యేసునందలి దేవుని ప్రేమ సర్వలోకమునకు వ్యాపించి యుండువఱకు క్రీస్తురాజ్యము పూర్ణముగా స్థాపింపఁబడనేరదు.

**4.** ఒక బోధకునికి తన సభికులకు నిట్టి ప్రేమ సంబంధములు మఱెక్కువగా నున్నవని ఆయా వాక్యములవలన విశదమగుచున్నది (గల $4^{1}$ I యోహా $5^{21}$ II కొరి $6^{11-13}$ ఫిలి $4^{4}$ I థెస్స $2^{8}$ మొ॥). ఇందువలననే అట్టి బోధకులు తమ సభవారికి **ప్రియులను** బిరుదును విశేషముగా వాడుచుండిరి (రోమా $12^{19}$ I కొరి $10^{14}$ II కొరి $7^{1}$ $12^{19}$ II తిమో $1^{2}$ ఫిలె 1 I పేతు $2^{11}$ III యోహా 5 మొ॥).

**ప్రేమవిందులు (Love Feasts).** అది క్రైస్తవులలో నొక సంఘమందున్నవారందఱిచే

పాల్గొనఁబడిన యొక విందు. ఇట్టి విందులను గూర్చిన సూచనలు II పేతు $2^{13}$ యూదా 12 నందు మాత్ర ముదాహరింపఁబడెను. ఇది ప్రభుభోజనమునకు సంబంధించియున్నట్లు సూచనలు గలవు. ఇంటింట రొట్టె విఱుచుట (కార్య $2^{42-46}$) యు దీనిని సూచించును. త్రోయలో పౌలిట్టి విందునుచేసి రాత్రి భోజనమునుకూడ ఆచరించెను (కార్య $20^{7}$). ఇట్టి విందు చేయుటతో కొరింథులోని సంఘస్థులు ప్రభురాత్రి భోజనమును చాల అమర్యాదగా నాచరించిరి (I కొరి $11^{17-34}$). రాను రాను ఈ విందుకాలములో కామసంబంధమగు ఇతరమైన యక్రమములు కొన్ని ప్రవేశమైనట్లు పేతురు యూదాలు వ్రాసిన దానివలనఁ దెలియుచున్నది. ఇట్టి విందులు కొన్ని శతాబ్దముల వఱకుండినట్లు ఆది క్రైస్తవ చరిత్రయందు చూడవచ్చును. క్రైస్తవుల యాచారములను గుఱించి వివరముగాఁ దెలిసికొనిన ప్లిని (*Pliny*) యను రోమను గార్నరు, క్రైస్తవులు ఉదయమున ప్రభు రాత్రి భోజన మాచరించిన పిమ్మట చిన్న భోజనమును కూడ చేసినట్లు చక్రవర్తికి వ్రాసెను. ఇట్టి విందులను ప్రార్థనతో నారంభించి ముగించినట్లుగా తెర్తుల్లియనను గ్రంథకర్త వ్రాసెను. అది యీ దేశమున ఆరాధనకాలమందు ఫలాహారము చేయునట్లున్నది. కొరింథు మొదలగు సంఘములలో నారంభమైనట్టి అక్రమములును ఇతర తొందరలును వృద్ధియగుటచే నిట్టి విందులు క్రమక్రమేణ తగ్గిపోయినవి. అవి రహస్యముగా జరుగుటవలన రోమను అధికారులు వాటి నడ్డగించిరి. అవి ఆలయములయందు జరుగకుండ ఆయా సంఘాధికారులును నిషేధించిరి. అట్టి విందు లింక గ్రీకు కథోలిక్కు సంఘమునందును మొరేవియను సంఘములోను, ఇతర కొన్ని శాఖలలోను జరుగుచునే యున్నవి.

## ప్రొ, ప్లె

**ప్రొకొరు** (Prochorus = నాట్యములను నడిపినవాఁడు?). సంఘ పరిచర్య నిమిత్తమై ఆది సంఘస్థు లేర్పఱచుకొనిన వారిలో నితఁ డొకఁడు (కార్య $6^{5}$). తరువాత నితఁడు నికొమేదియ సంఘాధ్యక్షుఁడై అంతియొకయలో హతసాక్షి యాయెనని పారంపర్య మొకటి గలదు. M.

**ప్లెగొను** (Phlegon = మంట). రోమాపురి క్రైస్తవుఁడు. పౌలితనికి తన వందనముల నంపెను (రోమా $16^{14}$). ఇతనిని గుఱించి మఱేమియుఁ దెలియదు. M.

## ఫ

**ఫరాతు, యూఫ్రటీసు** (Euphrates.) లోకమందలి పెద్దనదులలో నొకటి. ఆసియ ఖండమున పశ్చిమమందున్నది దానిలోకి పారుచున్న రెండు పాయలవలన నిది ఆర్మీనియా పర్వతములలో నుద్భవించును. ఆ రెండుపాయలలో ఉత్తరపు పాయకు ఫ్రాతు అను పేరు కలదు. ఇది చిన్న పాయయైనను దానివలననే ఆ నది యంతటికి ఈ పేరు కలిగెను. ఆ రెండుపాయలొకచోట కలిసిన పిమ్మట అది మొదట నైరృతి దిక్కునకును మధ్యధరా సముద్రమువైపునకును ప్రవహించును. అది యా సముద్రమునకు 50 మైళ్ల దూరమున నుండఁగా తిరిగి మెసపొతేమియ దేశమునకు పశ్చిమహద్దుగా ప్రవహించుచు పారసీ సంయుక్తాగ్ర గుడములో (*Persian Gulf*) పడును. మఱియు పారసీ సంయుక్తాగ్ర గుడమునకు 90 మైళ్ల దూరములో నుండఁగా అది టైగ్రిస్ నదితోఁ గలియును. బాబెలు పట్టణము దానికి దక్షిణ ప్రాంతమున నుండెను. పురాతన కాలములో ఉత్తర మెసపొతేమియా యందు మిగుల ప్రసిద్ధమైనదగు కర్కెమిషు పట్టణము ఈ నదికి సమీపముగా నున్నది. ఈ ఫరాతు నది 1800 మైళ్ల పొడవుగలదై యున్నది

ఈ నది వెంబడి పూర్వకాలములో యిరోపా నుండియు ఆసియనుండియు పారసీ దేశమునకును భరతఖండమునకును మార్గముండెను. బైబిలు చరిత్రలో దీనిపేరు అనేకసార్లు వచ్చును. ఇది ఏదెను వనములోని నాలుగు నదులలో నొకటియై యున్నది (ఆది $2^{14}$). ఇశ్రాయేలీయులకు దేవుఁడు వాగ్దత్తముచేసిన దేశమున కిది యుత్తర ప్రాంతమై యున్నది ($15^{18}$ ద్వితీ $1^{7}$ $11^{24}$ యెహో $1^{4}$). దావీదు సొలొమోను అను రాజులకాలములో వారిదేశము ఇంతవఱకును

వ్యాపించెను (II సమూ 8[3] I దిన 18[3] I రాజు 4[21-24]). మొదట దీనిని అష్షూరు వారి రాజ్యమునకు పశ్చిమ సరిహద్దునుగా నెంచిరి (II సమూ 10[16]). ఈ వాక్యములో దానికి **నది** యను పేరు మాత్రమున్నను అది ఫరాతునదియే యని తలంచవలెను. ఇవ్విధముగా ఈ నది మొదట అష్షూరుకును, తరువాత బబులోనుకును పిమ్మట పారసీ రాజ్యమునకును సహజమైన పశ్చిమ హద్దుగా నెంచబడెను (ఎజ్రా 4[10,11] 5[3] 6[6] నెహె 2[7]). మక్కబీయుల కాలములో అంతియొకయ వారి రాజ్యము పశ్చిమమునుండి యీ నదివఱకు వ్యాపించెను (I మక్క 3[32] 7[8]). తరువాతి కాలములో రోమీయులు దీనిని తమ రాజ్యమునకు తూర్పు హద్దునుగా నెంచిరి. ఇది యొక హద్దుగా నుండుటనుబట్టి దాని సమీపమున యుద్ధములు జరుగుట సహజము. ఐగుప్తీయులు ఫరోనెకో యను చక్రవర్తి క్రింద ఈ నదికి సమీపమునుండు కర్కెమిషు పట్టణమునొద్ద బాబెలు వారితో యుద్ధముచేసిరి (యిర్మీ 46[2]). ఇశ్రాయేలీయులను బాధపఱచి చెఱబట్టిన అష్షూరీయులు బబులోనీయులనువారు ఈ నదీ ప్రాంతములనుండి వచ్చుటచే ప్రకటన గ్రంథములో ఇది అంత్యకాలమున దేవుని రాజ్యమును విరోధించువారి యుత్పత్తి స్థానముగా నెంచబడెను (ప్రక 9[14]). దానికి సంబంధముగా ఒక యుగ్రత పాత్రను ఆ నదిమీఁద పోసినట్లున్నది 16[12]).

**ఫరో** (Pharaoh = మహా వంశము). బైబిలు కాలమందు ఐగుప్తు చక్రవర్తుల బిరుదు. సాధారణముగా ఆ దేశ చక్రవర్తులకీ బిరుదును పెట్టుచు వచ్చిరిగాని వారి పేరుల నీ బిరుదుతో చేర్చలేరి. అయితే కొన్నిచోట్ల వారి స్వంత పేరుతో ఆ బిరుదునుకూడ చేర్చి యున్నారు (II రాజు 23[29] యిర్మీ 44[30]). బైబిలులో సాధారణముగా ఫరో యను బిరుదుమాత్ర ముండుటచేతను, ఈ బిరుదు అనేకుల కుండుటచేతను ఆయా వాక్యములలో అదియే ఫరోను సూచించునో రూఢిగా తెలిసికొనుట కష్టతరముగా నున్నది. ఐగుప్తీయుల లౌకిక చరిత్రను చూడఁగా, క్రీస్తు శకమునకు పూర్వము మూఁడవ శతాబ్దమందు జీవించిన గ్రీకు గ్రంథకర్తయగు మనెతో (*Manetho*) యనువాఁడు పూర్వము నుండి తన కాలమువఱకు జీవించిన చక్రవర్తులను 31 రాజవంశములనుగా విభాగించెను. ఆ రాజవంశముల ప్రకారముగా ఐగుప్తు ఫరోల సంగతులను నేటివఱకు లెక్కింతురుగాని, ఆయా ఫరోల సంగతులను అంత నూటిగా వివరించుటకు వారిలో కొందఱి విషయము ఆధారము లేవియులేవు (ఐగుప్తు చూ॥).

బైబిలులో ఈ దిగువ ఫరోలను గూర్చిన ప్రశంసకలదు.

1. అబ్రాహాము కాలములోని ఫరో (ఆది 12[14-20]). ఇతఁడే ఫరోయో నిశ్చయింప వీలు లేదు.

2. యోసేపుకాలములోని ఫరో (ఆది 39). ఇతనిగూర్చికూడ నిశ్చయము తెలియదుగాని 16 లేక 17 రాజవంశములలో హిక్సస్ (*Hyksos*) అనఁబడు విదేశీయులగు చక్రవర్తులలో నితఁడొకఁడని కొందఱి యభిప్రాయము.

3. ఇశ్రాయేలీయులను బాధపఱచిన ఫరో (నిర్గ 1). ఇతఁడే రెండవ రామెసెస్ (*Ramses* II) అనుకొందురు. ఇది నిజమైన యెడల ఇశ్రాయేలీయులను శ్రమపెట్టి వారిచేత తనకొఱకు పట్టణములను కట్టించుకొనినవాఁడితఁడే (నిర్గ 1[11]). ఇతఁడు 19 వ రాజవంశములోనివాఁడు.

4. ఇశ్రాయేలీయులు ఐగుప్తును విడిచిపెట్టిన కాలమందుండిన ఫరో (నిర్గ 5-14). ఇతఁడు రామెసెస్ కొడుకగు మనెప్తా (*Maneptah* యనువాఁడని సాధారణముగా ననుకొందురు. ఇతఁడిశ్రాయేలీయులను వారి స్వదేశములో నోడించినట్లు ఐగుప్తీయుల శాసనములలో నొక సూచనకలదు. ఆ కాలమందు చరిత్రవిషయములు బహు కొద్దిగా నున్నందున ఇది ఫలాని విషయమును సూచించునని చెప్ప వీలులేదు. అయితే ఇశ్రాయేలీయులు కాదేషు బర్నేయలో నుండఁగా ఈ ఫరో వారిమీఁదికి దండెత్తివచ్చి వారి నోడించెనని కొందఱు ఊహింతురు. సంఖ్యా 14[45] లోను ద్వితీ 1[44-46] లోను అట్టి యపజయమునకు సూచన కలదని అట్లూహించువా రందురు.

5. తన కుమార్తెను సొలొమోను మహారాజున కిచ్చిన ఫరో (I రాజు $2^{46}$ $3^{1}$). ఇతఁడు 21 వ రాజవంశములోని వాఁడని యనుకొందురు.

6. షీషకు (*Shishak*, I రాజు $14^{25}$). ఇతఁడు రాజగు షీషకు అనఁబడును గాని, ఫరో యను బిరుదితనికి బైబిలులోలేదు. ఇతఁడు యూదారాజైన రెహబాము కాలములో యూదా రాజ్యము పైకి దండెత్తివచ్చెను.

7. ఫరోనెకో (*Pharaoh Necho*) (II రాజు $23^{20}$). ఇతఁడు 26 వ రాజవంశములోనివాఁడు. అష్షూరువారిమీఁదికి దండెత్తి వెళ్లునప్పుడు యూదా రాజైన యోషీయా ఇతని నడ్డగించి యోడిపోయి చంపఁబడెను. పిమ్మట నతఁడు యెహోయాహాజును తొలఁగించి యూదా దేశమునకు యెహోయాకీమును రాజునుగా చేసెను ($23^{30}$).

8. యెరూషలేము నెబుకద్నెజరుచే పట్టఁబడిన కాలములో ఐగుప్తు నేలిన హొఫ్రా (*Hophra*) ను గురించి యిర్మీ $44^{30}$ లో నున్నది.

9. దావీదు కాలములో ఎదోము రాజగు హదదుకు తన భార్య సహోదరి నిచ్చిన ఫరో (I రాజు $11^{14-22}$).

10. హిజ్కియా కాలములో అతఁడు యూదావారికి సహాయము చేయునని యూదులు నిరీక్షించిన ఫరో. ఇతనిగూర్చిన సూచన II రాజు $18^{21}$ లో నున్నది.

11. మెరెదు అనువానికి తన కుమార్తె నిచ్చిన ఫరో (I దిన $4^{18}$ ఐగుప్తు చూ॥).

**ఫరోకుమార్తె నగరు** యెరూషలేము B III 3 చూ॥

**ఫరోనెకో** ఫరో 7 చూ॥

**ఫరో హొఫ్రా** ఫరో 8 చూ॥

**ఫర్పరు** (Pharpar = వేగము). దమస్కు దగ్గరనుండు నదులలో నొకటి (II రాజు $5^{12}$). ఇది అబానానదియొక్క యేదు కాలువలలో నొకటి యను వాడుకమాట దమస్కు ప్రాంతములలో నేటివఱకును గలదు (అబానా చూ॥) గాని, హెర్మోను పర్వతమునకుఁ దూర్పున పుట్టి దమస్కుకు దక్షిణముగా పదిమైళ్లదూరమున ప్రవహించు ఆవాజ (*Awaj*) అనునదే ఫర్పరని పండితుల యభిప్రాయము. ఇదియు అబానా నదివలెనే యెడారిప్రక్కనుండు సరస్సులో పడును. యొర్దాను నదికంటె ఇది మంచిదని నయమాను తలంచెను (II రాజు $5^{12}$).

**ఫలములు, పండ్లు** (Fruit). బైబిలునందు అనేకచోట్ల పండ్లనుగూర్చి ప్రశంసింపఁబడియున్నది (ఆది $1^{11,12}$ $3^{2}$ మొ॥ ఆహారము I 3 చూ॥). ఈ పదముయొక్క అలంకార ప్రయోగము లీ శీర్షిక క్రింద వివరింపఁబడును.

1. సంతానమును సూచించును (ద్వితీ $7^{13}$ $28^{4}$ కీర్త $127^{3}$ లూ $1^{42}$ కార్య $2^{30}$ మొ॥). మానవకోటి సంతానమునే గాక పశ్వాదుల సంతానమును సూచించును గాని తెలుఁగు బైబిలునందు దానిని తర్జుమాచేయక పశువులని వ్రాసిరి (ద్వితీ $28^{11}$ $30^{9,10}$).

2. ఆయా బోధలు క్రియలు గుణముల యొక్క ఫలితములను సూచించుటకు వాడిరి (సామె $1^{31}$ $8^{19}$ $11^{30}$ $12^{14}$ $18^{21}$ యెష $3^{10}$ యిర్మీ $17^{8}$ $21^{14}$ మ $7^{16-20}$ $12^{33}$ యోహా $15^{16}$ రోమా $6^{21,22}$ యాకో $3^{17}$ మొ॥). మంచి నడతలవలన కలుగు ఫలితములు **నీతి ఫలము** లనఁబడెను. (ఆమో $6^{13}$ ఫిలి $1^{11}$ యాకో $3^{18}$). నీతి ఫలములు కష్టములు సంప్రాప్తమగుటవలన కలుగునను బోధ హెబ్రీ $12^{11}$ లో నున్నది. క్రైస్తవులు మారుమనస్సుకు తగినఫలములు ఫలింపవలెను (మ $3^{8}$ = లూ $3^{8}$). ఆయా బోధలను వివేచించుటకు ఆ బోధలవలన కలుగు ఫలములే యాధారములై యున్నవి (మ $7^{16-20}$ $12^{33}$ మొ॥). తన శిష్యు లిట్టి ఫలములను ఫలింపవలెనని క్రీస్తు కోరుచున్నాఁడు (యోహా $15^{8}$). మంచి క్రియలు **ఆత్మ ఫలము** లనఁబడెను (గల $5^{22}$). పాపమువలన కలుగు ఫలములు నాశనకరములైనవి (రోమా $6^{21}$). మనము దేవుని కర్పింపవలసిన స్తోత్రములు **పెదవుల ఫలము** లనఁబడును. సంఘస్థులిచ్చు కానుకలు వారి ఔదార్యపు ఫలములుగా నెంచఁబడెను ($15^{28}$). బోధకులు తమకు శిష్యులైన వారిలో జరుగుపనిని తమ ఫలముగా నెంచిరి ($1^{13}$). మనుష్యులు చేయవలసిన క్రియలు మంచి ఫలములవంటివై యుండవలెనను

సంగతినిబట్టి యెషయా (యెష $5^{1-7}$) యేసుక్రీస్తు (మ $7^{15-20}$ $13^{1-30}$ $21^{33-46}$ లూ $13^{6-9}$) ఉపమానములను చెప్పిరి.

**ఫల సంగ్రహాపు పండుగ** పండుగులు III 1 (3) (*c*) చూ॥

**ఫలాహారము** (A mess of food). దావీదు ఊరియాకు ఫలాహారము పంపినట్లు II సమూ $11^{9}$ నందున్నది. మూలభాషయందున్న ఈ పదమునే ఆది $43^{34}$ లో **వంతు** అనియు, ఎస్తే $2^{18}$ యిర్మీ $40^{5}$ లో **బహుమానము** అనియు తెనిగించిరి. దావీదు ఊరియాకు పంపినది మనము ఫలాహారమని చెప్పునది గాక భోజనమే యైయుండినట్లు తోఁచుచున్నది

**ఫిలదెల్ఫియ** (Philadelphia = సహోదర ప్రేమ). లుదియ ప్రదేశమందుండిన సార్దీస్ అను గ్రామమునకు ఆగ్నేయముగా 28 మైళ్ల దూరములో నుండిన యొక ఊరు. రమారమి క్రీ॥ పూ॥ 138 సం॥ మున పెర్గము రాజైన అతలస్ ఫిలదెల్ఫస్ (*Attalus Philadelphus*) చే స్థాపితమైన దానికి జ్ఞాపకార్థముగా నీ పేరు పెట్టఁబడెను. ప్రక $1^{11}$ $3^{7-13}$ చూడఁగా యోహాను పత్రికలు పంపించిన ఏడు సంఘములలో ఫిలదెల్ఫియ సంఘమొకటి యని వెల్లడియగును. ఈ సంఘము ఎవరివలన ఎప్పుడు స్థాపించఁబడెనో చెప్ప వీలుకాకుండినను అక్కడ సంఘముండినదనుట కేలాటి సందేహము లేదు. యోహాను పంపిన పత్రికయందుండు "నీకున్న శక్తి కొంచెమైయుండినను" అను మాటను చూడఁగా ఆ సంఘము అప్పటికి కొన్నాళ్ల క్రిందటనే స్థాపితమైనదని యనుకొనఁదగును ($3^{8}$). మఱియు "ఇదిగో తలుపు నీ యెదుట తీసి యుంచియున్నాను" ను మాటను చుట్టుపట్ల గ్రామములలో సువార్త వ్యాపింపఁ జేయుటకు ఫిలదెల్ఫియ సంఘస్థులకు మంచి వీలుకలిగియుండెనను అర్థము చేసికొన తగునని అనేక వేదవ్యాఖ్యాతల యభిప్రాయము. $3^{9}$ నందు యూదులు కాకయే తాము యూదులమని చెప్పుకొని అబద్ధమాడు సాతాను సమాజపువారను మాటనుబట్టి ఆ పట్టణమందు యూదులుండుట మాత్రముకాక వారు తమ మతాచారముల నుల్లంఘించి అన్యదేశస్థుల వాడుకలను అనుసరించినవారని గ్రహించఁగలుగుదుము. $3^{11}$ నందు నీకు కలిగినదానిని గట్టిగా పట్టుకొనుము అని వారు హెచ్చరించఁబడినను దుష్ప్రవర్తన విషయమైన గద్దింపు కనఁబడదు. మఱియు 12 వచనమందు జయించువానిమీఁద నా దేవుని పేరును పరలోకములో నా దేవుని యొద్దనుండి దిగివచ్చుచున్న నూతనమైన యెరూషలేమను నా దేవుని పట్టణపు పేరును నా క్రొత్త పేరును వ్రాసెదను అను వాక్యముద్వారా ప్రాచీన క్రైస్తవులు బాప్తిస్మాచారమందు ధరించుకొని తరువాత మఱుగుచేసికొనే క్రొత్త నామము ఇందులో సూచించఁబడెనని అనేకుల తాత్పర్యము.

M.

**ఫిలిప్పీయి** (Philippi = ఫిలిప్పు పట్టణము). మాసిదోనియ దేశములోని తూర్పు భాగమున సముద్రపు తీరమునకు 10 మైళ్లు దూరముగానున్న పట్టణము. పంగీయస్ (*Pangaeus*) అను కొండకు తూర్పున అంగైటిస్ (*Angites*) అను నదీ తీరమున నుండెను. మహా అలెక్సందరు తండ్రియగు ఫిలిప్పు అను మాసిదోనియ చక్రవర్తి ఆ కొండలో బంగారు వెండి గనులున్నవని తెలిసికొని క్రీ॥పూ॥ 358 సం॥ దానిని తన రాజ్యములో చేర్చి క్రైనిడిస్ (*Crenides*) అను దాని పేరును మార్చి, తన పేరట దానికి ఫిలిప్పయి అను పేరు పెట్టెను. క్రీ॥ పూ॥ 168 లో రోమీయులు దానిని పట్టుకొని మాసిదోనియ దేశముతో దానిని తన రాజ్యమునఁ జేర్చిరి. రోమా సింహాసనము నాక్రమింపవలెనని కోరిన యిరుపక్షములవారు క్రీ॥ పూ॥ 42 సం॥ లో ఆ పట్టణమునకు సమీపమున ఘోరయుద్ధము చేసినపిమ్మట జయము నొందిన వారచ్చట తమభటులలో ననేకుల నివసింపనిచ్చి వారికి ప్రత్యేక హక్కులను గొన్నింటి నిచ్చిరి. తరువాత కైసరౌగూస్తు తన విరోధుల నందఱిని జయించిన పిమ్మట ఇంక నెక్కువమంది సిపాయీల నచ్చటికిఁ బంపి దానిని ఒక కాలని (ప్రవాసస్థానము చూ॥) గఁజేసెను. ఆ ప్రాంతములకు అంఫిపొలి రాజధానియైయున్నను ఇట్టి హక్కులను బట్టి ఫిలిప్పీయి ముఖ్యపట్టణమను బిరుదును పొందెను (కార్య $16^{12}$). ఈ పట్టణమును గూర్చి బైబిలునందున్న సూచన లన్నియు పౌలు

చరిత్రకు సంబంధించినవే. దర్శనమందు పిలువఁబడినవాఁడై అతఁడు ఇచ్చటికి వెళ్లి బోధించెను. పై నుదాహరించిన నదీతీరమున అతఁడు మొదట బోధించెను ($16^{13}$). లూదియ క్రైస్తవురాలాయెను ($16^{14,15}$). అతడిచ్చట దయ్యము పట్టిన చిన్నదానిని స్వస్థపఱచెను ($16^{16-18}$ పుతోను చూ॥). అందువలన కొందఱికి కడుపు మండి అతఁడు రోమీయుల వాడుకలను మార్చువాఁడను నేరముమీఁద సీలతోకూడ పట్టుకొని కొట్టించి ఖైదులో నుంచిరి. ఆ రాత్రి వారద్భుత రీతిగా విడిపించఁబడుట మాత్రమే గాక చెఱసాల నాయకునికిని అతని కుటుంబమునకును బాప్తిస్మమిచ్చి సంఘమునఁ జేర్చిరి. ($16^{19-34}$). వారు రోమీయులని అధికారులు తెలిసికొని పట్టణమును విడిచి వెళ్లవలెనని బ్రతిమలాడిరి ($16^{35-40}$). అతఁడు వెళ్లవలెనను కబురు తెచ్చిన వేత్రధరులు ($16^{36}$) రోమను అధికారుల యొద్ది నుండు మోతాదుల వంటివారని గ్రీకు పదము వలనఁ దెలియుచున్నది. త్రోయనుండి ఎయులు దేరినది మొదలు ($16^{10}$) చిన్నదానిని స్వస్థపఱచినంతవఱకు మేము అను ఉత్తమ పురుష బహువచన ప్రయోగముచే కార్యముల గ్రంథకర్తయగు లూకా పౌలుతో నుండినట్లూహింపఁ దగును. ఆ సభికులు పౌలునం దెక్కువ అనురాగము గలవారై అతనికి మాటిమాటికి ద్రవ్యసహాయము చేసిరి (ఫిలి $4^{15,16}$). లూకా ఆ సంఘమును చూచుటకచ్చట విడువఁబడెనని యూహింపఁదగును. మూఁడవ ప్రయాణములో పౌలిచ్చట పులియని రొట్టెల పండుగ నాచరించెను (కార్య $20^{6}$). ఇచ్చటనుండి మఱల మేము అను పద ప్రయోగముచే లూకా అతని వెంబడించెనని స్పష్టమగుచున్నది. పౌలు రోమాలో ఖైదిగా నుండునప్పుడీ సంఘపు వారికి మిగుల ప్రేమతో నొక యుత్తరము వ్రాసెను. (ఫిలిప్పీయుల ఉత్తరము చూ॥). చెఱనుండి విడిపింపఁబడిన తరువాత అతఁడీ సంఘపువారిని మఱల దర్శించెను (తిమో $1^{3}$). ఇగ్నేషియసు (*Ignatius*) హతసాక్షియగుటకు రోమాకు తీసికొని పోఁబడునప్పు డీ పట్టణము మీఁదుగా క్రీ॥ శ॥ 177 సం॥లో వెళ్లినట్లు ఆదిక్రైస్తవుల చరిత్రలో చూడవచ్చును. ఇగ్నేషియసు అధ్యక్షుఁడుగా నుండిన అంతియొకయ సంఘమునకు ఈ సంఘస్థులు ఆదరణకరమైన ఒక పత్రికను వ్రాసిరి. ఇగ్నేషియసు ఆసియలో నుండఁగా వ్రాసిన పత్రికలు పంపుఁడని అంతియొకయ సంఘమునకును, స్ముర్న సంఘాధ్యక్షుఁడగు పాలికార్పుకును వారు వ్రాసిరి. పాలికార్పు వారికి వ్రాసిన ఉత్తర మింకను గలదు. నాలుగు ఐదు శతాబ్దములలో అచ్చట అధ్యక్షుఁడుండినట్లు సూచనలుండినను ఈలోఁగా ఫిలిప్పీయి పట్టణపు ప్రాముఖ్యత చాలవఱకు తగ్గిపోయెను. ప్రస్తుత మిచ్చట శిథిలములు గాక మఱేమియు లేవు (పటము V, G 2).

## 1. ఫిలిప్పీయులకు వ్రాసిన పత్రిక (Philippians, Epistle to).

1. గ్రంథకర్త. ఈ పత్రికను వ్రాసినవాఁడు పౌలని మతరక్షణ గ్రంథకర్తలైనను మతవిరుద్ధ గ్రంథకర్తలైనను అంగీకరింతురు. దీనిని గుఱించిన సాక్ష్యము కేవలము బలమైనది గనుక ఈ విషయమునుబట్టి విస్తరించి వివరింప నావశ్యకములేదు.

2. ప్రామాణికత్వము: బహిస్సాక్ష్యము.

ఆదిక్రైస్తవ గ్రంథకర్తలలో పెక్కండ్రు ఫిలిప్పీయులకు వ్రాసిన యుత్తరమునుగుఱించి ప్రస్తావింతురు. ఇగ్నేషియసు అను అంతియొకయ సంఘాధ్యక్షుఁడు తాను రమారమి క్రీ॥ శ॥ 110 సంమున వ్రాసిన యుత్తరములో ఫిలిప్పీ పత్రికలోని మాటలను సూచించెను. పాలికార్పు ఫిలిప్పీ సంఘస్థులకు వ్రాయుచు పౌలంతకు ముందు వారికి వ్రాసిన పత్రికను గుఱించి జ్ఞాపకము చేసెను. రెండవ శతాబ్దముయొక్క అంత్యభాగమున లిఖితమై లీయోను, వియెన్నా సంఘములకు పంపఁబడిన యొక యుత్తరమునందు ఫిలిప్పీ పత్రిక రెండవ అధ్యాయము ఆరవ వచనము అనువాదితమాయెను. ఐరేనియసు $4^{18}$ ని ఎత్తి వ్రాసి యీ మాటలు పౌలు ఫిలిప్పీయులకు వ్రాసిన పత్రికలోనివని దృష్టాంత పఱచెను. ఐరేనియసుకు సమకాలీనుఁడగు అలెక్సంద్రియ పట్టణపు క్లెమెంతుకూడ నీ పత్రికలోని మాట లనేక పర్యాయములు ఉదాహరించెను. అదియును గాక పురాతన తర్జుమ గ్రంథములన్నిఁటిలో నీ పత్రిక చేర్చఁబడినదాయెను.

అంతస్సాక్ష్యము. ఈ పత్రిక యారంభ మందు యేసుక్రీస్తు దాసులైన పౌలును తిమోతి యును శుభమని చెప్పి వ్రాయునది అను వాక్య మునుబట్టి పౌలు వ్రాసిన యుత్తరముగా కనబడు చున్నది. పౌలు వ్రాసెనని యంగీకరించఁబడిన ఇతర గ్రంథములును ఈ పత్రికయును శైలివిష యములోను మత సిద్ధాంతముల విషయములోను కథా సంగ్రహ విషయములోను చాలమట్టుకు నొక విధముగానే యుండును. అదియు గాక ఈ పత్రిక యందుండు పౌలు యొక్క పర్యటనల ప్రసంగము లితర గ్రంథముల యందలి వృత్తాంతములకు చక్కగా పొసగియుండును. అందుకు దృష్టాంతములు: $1^{12,14}$ పౌలు రోమాపురియందు ఖైదిగా నుండుటను తెలియఁ జేసెను. ఫిలిప్పీయులు తనకు సహాయము చేయుటను గూర్చి ఈ పత్రికయందును ($1^{7}$ $2^{25,30}$ $4^{10,18}$), కొరింథీయులకు వ్రాసిన పత్రికయందును (II కొరి $11^{9}$) వివరించెను. $1^{1}$ $2^{19}$ నందు తిమోతియు ఫిలిప్పీయి పట్టణమందు తనతో నుండెనని చెప్పిన సంగతి కార్య $16^{1-3,11,12}$ నందున్న చరిత్రాంశములకు సరిపడును. పై వివరములను బట్టి గ్రంథ పరిశోధనవలన కలుగు సాక్ష్యము బలమైనదని ఒప్పక విధిలేదు.

3. ఎవరి నిమిత్తమై రచించబడెను:

రెండవ ప్రయాణమందు పౌలు త్రోయలో నుండఁగా కలిగిన దర్శనమువలన మాసిదోనియ ప్రదేశమందు సువార్త ప్రకటించుట దైవసంకల్ప మని తెలిసికొని ఫిలిప్పీయి పట్టణము చేరెను. పౌలు ఐరోపా ఖండమందు స్థాపించిన సంఘము లలో ఫిలిప్పీయి సంఘము మొదటిది. పౌలు చేసిన యత్నమేలాగు సఫలమాయెనో కార్య 16 అధ్యాయమందు వర్ణితమాయెను. పౌలు ఆ యూరి సోదకత్తె నావేశించిన దయ్యమును వెళ్లఁగొట్టినందున నామె మూలముగా లాభము సంపాదించువారు మండిపడి పౌలును సీలను బట్టించి చెఱసాలలో నుంచిరిగాని నాటిరాత్రి కలిగిన భూకంపమునుబట్టి చెఱసాల నాయకుఁడును అతని కుటుంబమును క్రీస్తు నంగీకరించిరి. వారివలనను అంతకు పూర్వము క్రీస్తు బోధ నంగీ కరించిన వారివలనను ఫిలిప్పీయి సంఘమేర్పడెను. ఆ సంఘమేర్పడినది మొదలు ఫిలిప్పీయి సంఘ స్థులును పౌలుకును బహు పరిచయము కలిగెను. వారాయన విషయమై అనురాగాభిమానము గల వారై పలుమారు ఆయన యవసరములలో సహాయముచేసి, ఆయన రోమాపురి చెఱసాలయం దుంచఁబడినప్పుడు సహా ఆయనను ఆదరించుటకు గాను తమ ప్రతినిధిచేత ధర్మద్రవ్యము నంపిరి.

మూఁడవ ప్రయాణమందు పౌలు రెండు మార్లు ఫిలిప్పీయి పట్టణమును దర్శించెను. ఆయన ఎఫెసును విడిచిన తరువాత తాను కొరింథికి పంపించిన తీతుకొఱకు ఎదురు చూచుచు మాసిదోనియకు పోయెను. అక్కడ తీతును కలిసికొన్న తరువాత నాయన ఫిలిప్పీయి పట్టణమునకు వచ్చి రెండవ కొరింథీ పత్రికను వ్రాసి పంపెను. మూఁడవ ప్రయాణము ముగించి యెరూషలేమునకు పోవునప్పుడు ఆయన మఱియొకమాఱు ఫిలిప్పీయి సంఘస్థులను దర్శించెను. రోమాపురిలో ఖైదీ యైన తాను శీఘ్రముగా వచ్చెదనని ($2^{24}$) చెప్పిన నిరీక్షణ యాయన విడుదలయైన తరువాత నెఱవేరెనని నిశ్చయించఁదగును. పౌలు స్థాపించిన సంఘములన్నిటిలో ఫిలిప్పీయి సంఘమే ఆయన కానంద ప్రదమైనది.

4. కాలస్థాన నిరూపణము. పౌలీపత్రికను రచించినప్పుడు ఖైదిగా నుండెను. వ్యాఖ్యాతలలో కొందరు ఆయన కైసరయ పట్టణమందు చెఱలో నుండఁగా రచించెనని భావింతురుగాని యెక్కువ మంది యిది రోమాపురిలో రచించఁబడెనని తీర్మానింతురు. $1^{13}$ నందు ప్రేతోర్యమును సేనను గుఱించియు $4^{22}$ నందు కైసరు ఇంటివారిని గుఱించియు ప్రశంసించుటనుబట్టి యీ యభిప్రాయములలో రెండవదే యొప్పితమని తోఁచును.

పౌలు చెఱలోనున్నప్పుడు ఈ పత్రిక గాక ఎఫెసి, కొలొస్సై, ఫిలేమోను పత్రికలను సహా వ్రాసెను గనుక ఈ నాలుగు పత్రికలలో మొదట లిఖించినదేదో యనుదానిని గుఱించి పండితులు అభిప్రాయభేదములు గలవారై యున్నారు. కొందఱిది యీ వరుసలో మొదటి దనుకొని పౌలు రోమాచేరిన కొన్నాళ్లకు రచించెనని దృష్టాంతపఱచ ప్రయత్నింతురు. వారి యభిప్రాయ మంగీకరించనివారు పౌలు రోమాలో ఖైదియై యుండుటను ఫిలిప్పీయి సంఘస్థులు విని

యాయనను పరామర్శించు నిమిత్తము కొంత ధర్మ ద్రవ్యమును సమకూర్చి ఆయనయొద్దకు పంపు వఱకు చాల కాలము గడిచియుండెననియు ఆయన 2[24] యందు నేను శీఘ్రముగా వచ్చెదనను మాటను బట్టి ఆయన విడుదల కెదురు చూచుచుండె ననియు భావించి ఈ పత్రిక ఆయన చెఱలో వ్రాసినవాటిలో చివరిదని నిశ్చయింతురు. ఇందును గుఱించి కచ్చితముగా తీర్మానించుటకు వీలు లేకుండినను ఇది చెఱసమయమందు లిఖితమాయె ననుటకు సందేహములేదు. పౌలు క్రీ॥ శ॥ 61 సం॥ అంత్యమున రోమానుచేరి 64 సం॥ వఱకు చెఱలో నుండెను. కాఁబట్టి యీ పత్రిక రమారమి 63 సం॥ అంత్యమందైనను 64 సం॥ ఆరంభమందైనను రచించఁబడెనని విశదమగును.

5. ఉద్దేశము. పౌలు చెఱలోనుండుట తెలిసి కొని ఫిలిప్పీయి సంఘస్థులు ఆయనను పరా మర్శించుటకై తమతోటి సభికుఁడైన ఎపఫ్రొది తును రోమాకు పంపిరి. వారు పంపిన ద్రవ్య మును ఆయన కప్పగించి పౌలు దగ్గరనే యుప చారము చేయుచుండెను. ఎపఫ్రొదితు మత వ్యాపకమును గుఱించి యత్యాసక్తిగలిగి ప్రయాస పడినందున అతఁడు వ్యాధిగ్రస్థుఁడై మిగుల యవస్థ పడెను గనుక పౌలు అతఁడు తిరిగి స్వగ్రామ మునకు పోవుట యుక్తమని తలంచి సెలవిచ్చి ఫిలిప్పీయి సంఘస్థుల కప్పగించుట కీ పత్రికను వ్రాసి అతని చేతికిచ్చి పంపెను. దీనియందు పౌలు తన స్థితిగతులను, రోమాలోని మతవ్యాపక త్వమును వివరించి తాను విడుదల నిమిత్తము నిరీ క్షించుటను గుఱించి తెలియఁజేసి ఫిలిప్పీయులు వినయ మనస్సుగలవారై ఐకమత్య మనుసరించి ప్రవర్తించవలయునని వారిని ప్రేరేపించి వారు తనయొద్దకు పంపిన ప్రేమగల సహాయము నిమిత్తము వందనములను చెల్లించెను.

M.

6. ముఖ్యభాగములు.

I. పీఠిక 1[1,11] 1. పైవ్రాత, వందన వాక్యము (1[1,2]). 2. ఫిలిప్పీయుల సహవాసము నిమిత్తమై కృతజ్ఞతాస్తుతి వందనములు చెల్లించుట, వారి ప్రేమ విస్తరింపవలెనని ప్రార్థనచేయుట (1[3,11]).

II. పౌలు తననుగూర్చిన సంగతులను వ్రాసి కొనుట 1[12-26]. 1. చెఱలో కష్టములు. వీటివలన సువార్త మఱింత తేటగాను ఎక్కువగాను ప్రక టింపఁబడెను (1[12-18]). 2. ముందుకు విడుదల కలుగునను నిరీక్షణ (1[19-26]).

III. ఫిలిప్పీయులకు చేసిన హెచ్చరికలు 1[27]-2[18]. 1. శ్రమలలో స్థిరముగా నుండుటకు (1[27-30]). 2. క్రీస్తు మనస్సుగలవారై ఐక్య పడుటకు (2[1,11]). క్రీస్తు అగుపడు మహిమలను గూర్చి తెలిపెడి బైబిలు వాక్యములలో నిది ముఖ్యమైనదై యున్నది. 3. తమ స్వరక్షణను కొనసాగించుకొనునట్లు తగిన రీతిగా ప్రవర్తించు టకు (2[12-18]). వారట్లు చేసినయెడల తాను వారి నిమిత్తమై పొందుచున్న శ్రమల విషయము సంతోషించుచు, ప్రాణము పెట్టవలసి వచ్చి నప్పటికి పెట్టెదనని చెప్పెను.

IV. ఉత్తరమును ముగించతలంచి తిమోతి ఎపఫ్రొదితులను గూర్చి సిఫారసు చేయుట 2[19,30].

V. తప్పుడు బోధకులనుగూర్చి హెచ్చరిక చేయనారంభించి వారినిగూర్చి వ్రాయుట (3[1,21]). 1 యూదుల స్వనీతినిగూర్చి వ్రాయుచు తానెట్లు తన స్వనీతిని త్యజించి క్రీస్తు నీతిని పొందు నిమిత్తము ఎడతెగక ప్రయత్నించెనో దానిని తెలిపి సభవారీ విషయములో తనవలె నుండవలెనని హెచ్చరించుట (3[1,16]). 2. తప్పుడు బోధకులవలె యిహలోక సంబంధమైన వాటిని గాక పరసంబంధమైన మేలులనే నిరీక్షించి వెదుక వలెననుట (3[17-21]).

VI. మిగుల ప్రేమతో చేసిన ముగింపు హెచ్చరికలు 4[1-9]. 1. ఐక్యమును గూర్చి (4[1-3]) 2. సంతోషించుటను గూర్చి (4[4-7]) 3. పవిత్ర మైన యోచనలనుగూర్చి (4[8,9]).

VII. ఫిలిప్పీయుల ఔదార్యమును గూర్చి ప్రశంసించుచు తనకుగల సంతుష్టినిగూర్చి వ్రాసి వారి సహాయమునకై సంతోషించుట 4[10-20].

VIII. సలాములు, ఆశీర్వాదము 4[21-23].

**ఫిలిప్పు** (Philip = అశ్వప్రియుఁడు).

1. అపొస్తలుఁడు. క్రీస్తు పిలిచిన మొదటి శిష్యులలో నొకఁడు (యోహా $1^{43-48}$). బేత్సయిదా గ్రామకాపురస్థుఁడు. క్రొత్త నిబంధనయం దితనిగూర్చిన సూచనలు నాలుగుచోట్ల మాత్రమే గలవు. యేసువలన పిలువఁబడిన పిమ్మట ఇతఁడు వెళ్లి నతనయేలుతో మాట్లాడి వచ్చిచూడుమని యతనిఁ బిలుచుకొని వచ్చెను ($1^{45,46}$). క్రీస్తు 5000 మందికి ఆహారము పెట్టఁబోవునప్పుడు ఫిలిప్పు ఇన్నూరు దేనారముల రొట్టెలు సహా చాలవని చెప్పెను ($6^{5-7}$). ఆయనను చూడఁగోరి వచ్చిన హెల్లేనీయులు మొదట ఫిలిప్పుతో మాట్లాడిరి ($21^{21}$). యేసు చివరి రాత్రియందు ఆదరణకరములైన సంగతులను చెప్పుసమయమున ఫిలిప్పు తండ్రిని తమకు కనఁబఱచుమని యడిగెను ($14^{8,9}$). ఫిలిప్పు అను గ్రీకుపదమునుబట్టి అతఁడు హెల్లేనీయుఁడై యుండునని కొందఱి యూహ గాని యూదులలో ననేకులకు గ్రీకు నామము లుండుట సర్వసాధారణమైన సంగతియై యుండినందున అట్టి యూహ కెట్టి ఆస్పదమును కానరాదు. పై నుదాహరించిన నాలుగు సూచనలను బట్టి ఇతఁడు ఆత్మసంబంధమగు సంగతులను గ్రహించుకొనుటకు కొంచెము మందబుద్ధియై యుండినను తన ప్రభువునందు సంపూర్ణ విశ్వాసముగలవాఁడై యున్నట్లు కనఁబడకపోదు.

ఇతఁడు చిన్నాసియలోను ప్రస్తుతము ఫ్రాన్సు అని పిలువఁబడుచున్న గాలు (*Gaul*) దేశమునందు సువార్త ప్రకటించి చివరకు రాళ్లతో కొట్టఁబడి హతసాక్షి యయ్యెనను ఇతిహాస మొకటి గలదు.

2. యెరూషలేము సంఘపు యేడుగురు పరిచారకులలో సువార్తికుఁడను బిరుదును సంపాదించినవాఁడు. ఇతని పేరునుబట్టి హెల్లేనిస్తుఁడై యుండునని దోఁచుచున్నది (కార్య $6^{1,6}$). స్తెఫను మరణమునకుఁ దరువాత కలిగిన గొప్ప హింసవలన శిష్యులు చెదరిపోయినప్పుడు ఫిలిప్పు సమరయకు వెళ్లి అక్కడ బోధించెను ($8^{4-40}$). ప్రభువు దూతచే నడిపింపఁబడినవాఁడై గాజాకు పోవు అరణ్యమార్గమున ఐతియొపీయుఁడగు నపుంసకుని కలసికొని అతనికి బోధించి బాప్తిస్మమిచ్చెను ($8^{26-40}$). తరువాత అజోతులో బోధించెను. తరువాత కైసరయలో నివసించి పౌలు మూఁడవ ప్రయాణాంతమున యెరూషలేముకుఁ బోవునప్పుడతని కాతిథ్యమిచ్చెను (కార్య $21^{8}$). ఇతనికి ప్రవచించు నలుగురు కుమార్తెలుండిరి. వారు కూడ తమ తండ్రివలె సువర్తమానమును బోధించియుందురు. రాష్ట్రికులకొఱకు పనిచేసిన యేడుగురిలో నితఁడు ముఖ్యుఁడై యుండెను.

3. 4. హేరోదు వంశపువారిలో నిద్దరు (హేరోదు 4, 5 చూ॥).

**ఫిలిప్పుదైన కైసరయ** (Cæsarea Philippi). హెర్మోనుకొండ దిగువనున్న పట్టణము. యొర్దానునది యేర్పడు ముఖ్య ప్రవాహములలో నొకటి యిచ్చట పుట్టును. పడమటగాక యితర దిక్కుల కొండలచేఁ జుట్టుకొనఁబడిన చిన్న మైదానమందున్నది. బయల్గాదు ఇదేనని కొందఱి యభిప్రాయము. రోమీయుల దేవతయగు పాను (Pan) ఆరాధన ఇచ్చట చాల కాలమువఱకు వృద్ధియంగుండెను. మహా హేరోదీ పూజాస్థానమున చలువరాళ్లతో నొక సొగసైన ఆలయమును గట్టించెను (పురా 15, 10, 3). తరువాత చతుర్థాధిపతియగు ఫిలిప్పు ఈ పట్టణమును పెంపకము చేసి తిబెరియు కైసరు గౌరవార్థమై దీనికి కైసరయ అను క్రొత్త పేరుపెట్టెను (పురా. 18, 2, 1 యుద్ధ 2. 9, 1). యేసును ఆయన శిష్యులును కనీస పక్షమొకసారియైనను ఇక్కడకు వచ్చిరి. మనుష్యకుమారుఁ డెవఁడని జనులు చెప్పుకొనుచున్నారని ఆయన తన శిష్యులనడిగి వారితో సంభాషించిన దిచ్చటనే (మ $16^{13}$ ·మా $6^{27}$). రెండవ అగ్రిప్పా యనువాఁడీ పట్టణము నింకను అలంకరించి నీరో చక్రవర్తి పేరట దీనికి నిరోనియను అను పేరుపెట్టెను గాని చక్రవర్తి మరణాంతరమున ఆ పేరు నశించిపోయెను (పురా. 22. 9, 4). యెరూషలేము నాశనమునకుఁ బిమ్మట తైటసు అను రోమా సేనాని ఈ పట్టణమున వినోదములు జేయించుచు చెఱపట్టఁబడిన యూదులను అడవిమృగములకు వేయుటయేగాక చనిపోవునంతవఱకు వారొకరితోనొకరు పోరాడునట్లు బలవంతముజేసెను (యుద్ధ 7. 2, 1; 3, 1). దాని ప్రాకారములలో కొన్ని యింకను నిలిచియున్నవి. చుట్టుప్రక్కలనుండు కొండరాళ్లపై గ్రీకువారి వ్రాఁతలింకను కన్పడుచున్నవి. ప్రస్తుత మది

యొక చిన్న ఊరై బానియసు (*Banias*) అను పేరట పిలువఁబడుచున్నది (పటము I, F 2).

**ఫిలిప్పీయ** పత్రికను చూ॥

**ఫిలిష్తీయులు, ఫిలిష్తీయుల దేశము (Philistines, Land of Philistines).** పలెస్తీనుకు దక్షిణ భాగమందు సముద్రతీరమున నుండు దేశము. ఈ ఫిలిష్తీయులు కఫ్తోరు (= క్రేతుద్వీపము) నుండి వచ్చినవారు (ఆమో $9^{7}$ యిర్మీ $47^{4}$ ద్వితీ $2^{23}$). వారు గొప్ప యోధులును బైబిలులోనున్నట్లు ఇశ్రాయేలీయులకు విరోధులునై యుండిరి. దావీదు కాలమువఱకు గాజా అష్కెలోను, అష్డోదు, ఎక్రోను, గాతు అను ఐదు పట్టణముల యధికారులు ఆ దేశమునేలిన పంచాయతివారై యున్నట్లుగా నున్నది. మన తెనుఁగు బైబిలులో నున్నట్లు వారికి సర్దారులు అను బిరుదు పెట్టిరి (యెహో $13^{3}$ న్యాయా $3^{3}$ మొ॥). అది 50 మైళ్ల పొడవును 15 మైళ్ల వెడల్పుఁగల యొక చిన్నదేశమై యుండెను. దానికి హద్దులు: ఉత్తరమున షారోను మైదానము, తూర్పున యూదా షెఫేలా, దక్షిణమున అరణ్యము, పశ్చిమమున మధ్యధరా సముద్రము. అది మన్యదేశమై యున్నను చాల ఫలవంతమైనదై యుండెను (పలెస్తీను, కఫ్తోరు చూ॥).

బైబిలులోని చరిత్రను చూడఁగా ఫిలిష్తీయులు హాము సంతతివాఁడైన మిస్రాయిమువలన పుట్టి వించినట్లు కనఁబడును (ఆది $10^{14}$). పూర్వ మీ దేశములోనుండిన ఆవీయులను జయించి వారి దేశము నపహరించిరి (ద్వితీ $2^{23}$). అబ్రాహాము కాలములో ఫిలిష్తీయులు గెరారులో నుండిరి (ఆది $20^{12}$ $21^{32-34}$ $26^{1}$). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి తిరిగివచ్చినప్పుడు ఫిలిష్తీయు లచట నుండుటచే వారి నిట్లు దగ్గర మార్గమున దేవుడు నడిపింపక చుట్టుమార్గమున కనానుకు నడిపించెను (నిర్గ $13^{17,18}$). యెహోషువ కాలములో ఫిలిష్తీయులకు పైఁజెప్పిన ఐదు పట్టణములు నుండెను (యెహో $13^{3}$ న్యాయా $3^{3}$). యెహోషువ వాటిని జయించుటకు పూనుకొని యుండలేదు గాని న్యాయాధిపతులలో కొందఱు వారికి విరోధముగాఁ బోరాడిరి ($3^{30}$ 14-16 అధ్యా॥) సమూయేలు కాలములో వారు మొదట ఇశ్రాయేలీయులను జయించి వారి నిబంధన మందసమును పట్టుకొనిరి గాని అందువలన వారికి విపత్తులు కలిగినందున ఏడుమాసములలో దానిని తిరిగి పంపివేసిరి (I సమూ 4-6). ఇరువది సంవత్సరములకు తరువాత ఇశ్రాయేలీయులు వారిని గొప్ప జయముతో గెలిచినందున వారు చాల కాలమువఱకే తొందరయుచేయక యుండిరి ($7^{3-12}$). ఫిలిష్తీయులు ముఖ్యముగా సౌలు కాలములో ఇశ్రాయేలీయులను విరోధించిరి ($10^{5}$ $12^{9}$). సౌలును యోనాతానును వారిని జయించియున్నను ($13^{1-23}$ $14^{47-52}$ $23^{27,28}$ $24^{1}$). వారు త్వరలో మఱల యుద్ధమునకువచ్చిరి. వారు యూదాదేశములోనికి వచ్చుచుండఁగా దావీదు గొల్యాతుతో పోరాడి వానిఁ జంపినప్పుడు వారు గొప్ప అపజయము నొందిరి ($17^{1-5}$ $18^{6-6}$ $19^{5}$ $21^{9}$ $22^{10}$). తదనంతర కాలమున దావీదు సౌలు అధికారము క్రింద వారితో పోరాడి వారిని జయించెను ($18^{17-30}$ $19^{8}$ $23^{1-5}$). పిమ్మట సౌలు దావీదును చంప వెదకఁగా దావీదు రెండు సారులు ఫిలిష్తీయుల దేశమునకు వెళ్లి తప్పించుకొనెను ($21^{10-15}$; 27-29). దావీదు ఫిలిష్తీయులవలన సిక్లగు అను పట్టణమునుకూడ ఒక జాగీరుగా పొందెను (I సమూ $27^{6}$). తరువాత కాలములో ఫిలిష్తీయులు సౌలు మీఁద గిల్బోవ పర్వతమునొద్ద గొప్ప జయమును పొందిరి ($28^{4}$ $29^{11}$ $31^{1-13}$ I దిన $10^{1-14}$). దావీదు ఫిలిష్తీయులతో చాల సారులు యుద్ధము చేసి వారిని జయించెను (II సమూ $3^{18}$ $5^{17-25}$ $8^{1-12}$ $19^{9}$ $21^{15-22}$ $23^{9-17}$ I దిన $11^{12-19}$ $14^{8-17}$ $18^{1-11}$ $20^{4,5}$). అతని కాలమునకు తరువాత ఫిలిష్తీయులపేరు కనఁబడుట అరుదు. అందును బట్టి వారి శక్తి తగ్గిపోయినదని యనుకొనఁదగును. ఇశ్రాయేలీయుల రాజులగు నాదాబు, జిమ్రీ యనువారు ఫిలిష్తీయుల పట్టణమగు గిబ్బెతోనును ముట్టడివేసిరి (I రాజు $15^{27}$ $16^{15}$). ఫిలిష్తీయులు యూదా రాజగు యెహోషాపాతునకు పన్నును కానుకలను ఇచ్చుచువచ్చిరి (II దిన $17^{11}$) గాని అతనికి తరువాత ఏలిన యెహోరాము (II దిన $21^{16}$) కాలములో ఫిలిష్తీయులు యూదా రాజ్యముమీఁదికి దండెత్తివచ్చిరి (II దిన $21^{16}$). ఆహాజు కాలములోకూడ అలాగునసే చేసిరి (II దిన $28^{18}$). ఉజ్జియా, హిజ్కియా యను

రాజులు ఫిలిష్తీయుల దేశముమీఁద దండెత్తి యుండిరి (II రాజు $18^{8}$ II దిన $26^{6,7}$). ప్రవక్తలు ఫిలిష్తీయులకు కలుగఁబోవు శిక్షలనుగూర్చి యనేక పర్యాయములు ప్రకటించియుండిరి (యెష $11^{14}$ యిర్మీ $25^{20}$ $47^{1-7}$ యెహె $25^{15-17}$ ఆమో $1^{6-8}$ ఓబ 19 జెఫ $2^{4,5}$ జెక $9^{5-7}$). మక్కబీయుల కాలమందు ఫిలిష్తీయులలో అనేకమంది అంతియొకయవారితో గలసి మక్కబీయులకు విరోధముగ పోరాడిరి (I మక్క $3^{41}$). మక్కబీయుఁడగు యూదా అశోతును (= అష్డోదును) అష్కెలోనును గాజాను జయించి వాటిని దహించెను (I మక్క $5^{68}$ $10^{83-89}$ $11^{60,61}$). క్రొత్త నిబంధనలో ఫిలిష్తీయుల పేరు కనఁబడదు కావున, వారు అంతకుఁ బూర్వమే యూదులలో కలిసి పోయి యుండిరని తెలిసికొనవచ్చును.

**ఫీలేతు** (Philetus = ప్రేమింపఁదగిన వాఁడు). శరీర పునరుత్థానమును గురించి తప్పుడు సిద్ధాంతము బోధించినవారిలో నొకఁడు. తిమోతికి వ్రాయబడిన రెండవ పత్రికయందు పౌలితనిగూర్చి ప్రకంసించెను (II తిమో $2^{17}$). పాపమును విసర్జించి నీతిననుసరించి జీవించుటయే పునరుత్థానమని భావించి అది గతించెనని బోధించిరి. M.

**ఫిలేమోను** (Philemon = ప్రేమించు వాఁడు). పౌలు బోధలమూలముగ క్రైస్తవ భక్తుఁడైనవాఁడు (ఫిలే 19). ఇతఁడు ఘనుఁడును ధనవంతుఁడునై యున్నట్లు పౌలు వ్రాసిన సంగతులనుబట్టి తెలిసికొనవచ్చును. ఇతనిది కొలొస్సయి పట్టణము. కొలొస్సయులకును, ఫిలేమోనుకును పౌలు వ్రాసిన పత్రికలలో ఒనేసిము అర్ఖిప్పులనువారిని గూర్చి వ్రాసినందున వీరందఱును కొలొస్సయి పట్టణవాసులని రూఢిపర్చ వీలగుచున్నది (కొలొ $4^{9-17}$ ఫిలె 10, 24). ఇతఁడు పౌలు బోధలవలన క్రైస్తవుఁడై కొంత కాలమువఱకు అతని సహవాసిగ నుండెను (ఫిలే 19). పౌలు ఎఫెసు పట్టణమునందున్న సమయములో ఫిలేమోను తా నవలంభించిన మతసిద్ధాంతములను కొలొస్సయి పట్టణమునందు బోధించెనని చెప్పవచ్చును. ఈ పత్రికయం దుదాహరించిన అప్ఫియ ఫిలేమోను భార్యయనియు, తోటి యోధుఁడు అని చెప్పఁబడిన అర్ఖిప్పువారి కుమారుఁడనియు కొందఱు పండితుల యభిప్రాయము (2 వచ). కొలొస్సయిలోని క్రైస్తవ భక్తులు ఇతని యింట ఆరాధనకు కూడుకొనిరని 2 వచనములోని నీ యింటనున్న సంఘము అను మాటవలన నూహింపవచ్చును. అర్ఖిప్పు బహుశః ఈ సంఘపు పాలకుఁడై యుండును. ఫిలేమోను దాసులు గలవాఁడనియు, వారిలో ఒనేసిమనువాఁ డొకఁడనియు తెలియుచున్నది. ఇతఁడు భయభక్తులకును సహోదర ప్రేమకును ప్రసిద్ధికెక్కెను. ఈ పత్రికయం దుదాహరింపఁబడినవి గాక ఫిలేమోను గురించిన యితర సంగతు లెవ్వియును తెలియవు. ఇతఁడు కొలొస్సయి సంఘమున కధ్యక్షుఁడై నీరో చక్రవర్తి కాలమున హతసాక్షి యాయెనని ప్రాచీన యితిహాసముల ద్వారా తెలియుచున్నది. M.

**ఫిలేమోనుకు వ్రాసిన పత్రిక** (Philemon, Epistle to) 1. ఈ యుత్తరము పౌలువలన రచింపఁబడిన పత్రిక యని పండితు లందఱూ నంగీకరింతురు. ఈ పత్రిక మిగుల కొంచెముపాటిదైనందునను పౌలువలన రచింపఁబడినది కాకున్నయెడలను దీనిని భద్రపఱచుట కెవరును శ్రద్ధవహింపరు. మొదట ఫిలేమోను కుటుంబమువా రీ పత్రికను ఒక యమోఘమైన నిక్షేపముగా నెంచి భద్రపఱచి అప్పుడప్పుడు తమ యింట కూడుకొన్న క్రైస్తవ సభికులకు చదివి వినిపించియుందురు. ఆమీఁదట ఆ పత్రిక వారి యొద్దనున్న సంగతిని తెలిసికొని యితర సంఘస్థులు దానిని తెప్పించుకొని ప్రతులను వ్రాయించుట వలన నది ఆయా సంఘములలో వ్యాపకమాయెను.

2. ఎవరి నిమిత్తము రచింపఁబడెను? ఫిలేమోను పేరట వ్రాయఁబడి ఆయనయొద్దకు పంపింపఁబడెను.

3. కాలస్థాన నిరూపణము. పౌలు రోమాలో మొదటిసారి చెఱలో నున్నప్పుడు అనఁగ క్రీ॥ శ॥ 60-61 సం॥న రచింపఁబడెను. కొందఱనుకొనునట్లు 62-63 లో వ్రాయఁబడియుండును.

4. ఉద్దేశము. ఫిలేమోనుయొక్క దాసుఁడగు ఒనేసిము బహుశః తన యజమానుని సొత్తు నపహరించి రోమాపురికి పోయెనని 5, 18, 19

వచనములయందు విశదమగును. అతఁడు రోమా చేరినపిదప ఏ విధముననో పౌలును కలిసికొని ఆయన బోధను విని క్రైస్తవుఁడై చెఱలోనున్న అపొస్తలునికి మిగుల నుపయోగకరమైనవాఁడుగా నుండెను (5, 10, 11). పౌలు తన కుపచారమును చేయుటకై అతనిని తనయొద్ద నిలుపుకొన గోరినను అట్లు చేయుట ఫిలేమోనుసెడల ధర్మము కాదని అతనిదగ్గరకు పంప నిశ్చయించెను గనుక తుకికు ఎఫెసీయులకును కొలొస్సయులకును పౌలు వ్రాసిన పత్రికలను తీసికొని పోవనై యుండఁగా నీ మనోరంజకమైన పత్రికను పౌలు రచించి ఒనేసిము చేతికిచ్చి అతని యజమానుని యొద్దకు పంపించెను. ఒనేసిము అను పేరుకు ప్రయోజనకారి యను నర్థము గనుక ఇందులో ఫిలేమోను తన దాసుని మన్నించి అతనిమీద దయఁగలిగి తిరుగ తన సేవలోనుండుట కిప్పుడుపయోగకరమైనవాఁడుగా నున్నాఁడని పౌలు మనవి చేయుచున్నాఁడు.

5. ముఖ్య భాగములు:

I. పైవ్రాఁత వచ 1-3.

II. ఫిలేమోనుయొక్క దృఢవిశ్వాసము సహోదర ప్రేమనుబట్టి పౌలు దేవుని స్తుతించుట 4-7 వ.

III. ఒనేసిమునుగూర్చిన మనవి 8-21 వ.

IV. తనకొఱకు కనిపెట్టుమని వందనములతోను దీవెనలతోను సెలవు పుచ్చుకొనుట 22-25

M.

## ఫ

**ఫీకోలు** (Phicol = సర్వాధికారి). అబ్రాహాము (ఆది $21^{22-32}$), ఇస్సాకు ($26^{26}$) కాలములో గెరారు రాజగు అబీమెలెకుయొక్క సేనాధిపతి. ఈ రెండు చరిత్రలకు మధ్యకాలము దాదాపు 50 సం॥రము లుండుటచే ఈ పేరు గలవా రిద్దరుండినటుల కొంద ఱభిప్రాయపడెదరు.

**ఫీనిక్సు** (Phoenix = ఖర్జూరపు చెట్టు). క్రేతుద్వీపముయొక్క దక్షిణ సరిహద్దులోనున్న యొక రేవుస్థలము (కార్య $27^{12}$). దానికి ప్రస్తుతమున లూట్రో (*Loutro*) అని పేరు. దానికి సమీపముననున్న ఒక యూరును నేటి వఱకు ఫినికియ (*Phinikia*) యని పిలుచుచున్నారు. ఈ రేవు క్రేతుద్వీపపు దక్షిణ భాగమున సంవత్సరము పొడుగున ఓడలు ప్రవేశింపఁగల ఒకటే మంచి రేవై యున్నది. అది నైర్రుతి వాయవ్య దిక్కులతట్టు నున్న రేవు అను మాటలనుగూర్చి మాత్రము కొంచెము సందేహము కలదు. కార్యములలోని యీ వచనమును గూర్చిన వ్యాఖ్యానములలో ఈ సందేహమును తీర్చుటకు వేదశాస్త్రు లెక్కువగా వ్రాయుదురు. ఏలనఁగా, ఆ లూట్రో అను రేవు తూర్పు తట్టునకు వ్యాపించును. ఒకవేళ నావికులు ఆ రేవు వ్యాపించు దిక్కులలోనుండు వారి భాషల వాడుకనుబట్టి యిట్లు పలుకుటచే లూకా వారు పలికినరీతిగానే వ్రాసియుండెను. నావికులిట్లు మాటలను వాటి సాధారణ యర్థములో వాడక విశేషార్థముతో వాడుకొందురను దానికి చాల దృష్టాంతములు కలవు (పటము V, G. 5).

**ఫీనెహాసు** (Phinehas).

1 అహరోను మనుమఁడు ఇతని తండ్రి ఎలియాజరనువాఁడు (నిర్గ $6^{25}$ న్యాయా $20^{28}$ I దిన $6^{4,50}$). ఫీనెహాసు అను పేరునుబట్టి కొంద ఱది యైగుప్తీయుల పేరని యనుకొందురు. ఇతఁడు అన్యాచారములను ఇశ్రాయేలీయులలో నారంభింపఁదలంచినవారిని కఠినముగా శిక్షించెను (సంఖ్యా $25^{7,8}$). ఇందువలన ఇశ్రాయేలీయుల మీఁదికి వచ్చిన తెగులు నిలిచిపోయెను. మఱియు ఈ కార్యమునుబట్టి యితని యాజకత్వము ఖాయపఱచఁబడెను ($25^{9-13}$). ఇతఁడు చేసిన యీ కార్యమువలన ఇతనికి కీర్తి కలిగెను (కీర్త $106^{30}$ సిరాకు $45^{23}$ I మక్క $2^{26,54}$). ఇశ్రాయేలీయులు మిద్యానీయులతో యుద్ధము చేయఁబోయినపుడు ఫీనెహాసు వారితోకూడ వెళ్లి వారికి యాజకుఁడై యుండెను (సంఖ్యా $31^{6}$). యొర్దానుకు తూర్పున నివసించిన ఇశ్రాయేలీయులు ఒక వేదికను కట్టఁగా దీనినిగూర్చి విచారించుటకు పంపఁబడినవారిలో ఫీనెహాసు ఒకఁడై యుండెను (యెహో $22^{13}$). ఇతనికి ఎఫ్రాయిము మన్యప్రదేశమందు స్వాస్థ్యమిచ్చిరి (యెహో $24^{33}$). అతనిని పాతిపెట్టిన స్థలమునకు ఫీనెహాసుగిరి యని పేరు.

2. ఏలీకుమారులలో నొకఁడు. ఇశ్రాయేలీయులకు ఫిలిష్తీయులకు జరిగిన యుద్ధములో నితఁడు మరణము నొందెను (I సమూ 1[3] 2[34] 4[4,11,19,22]).

3. ఎజ్రా కాలములో నుండిన ఎలియాజరు అను నొకని తండ్రి (ఎజ్రా 8[33]).

**ఫీనెహాసుగిరి** (Hill of Phinehas). ఫీనెహాసును సమాధిచేసిన స్థలమునకు పెట్టినపేరు (యెహో 24[33]). ఇది ఎఫ్రాయిము కొండలలో నొకటిగాని దానియునికినిగూర్చి మఱి నూటిగా దెలియదు (ఫీనెహాసు 1 చూ॥).

**ఫీబే** (Phœbe = కాంతిమ్మ). కొరింథు పట్టణమునకు సమీపమందున్న కెంక్రేయ సంఘములోని పరిచారకురాలు. ఈమె తన స్వంతపనిమీఁద రోముకుఁ బోవు చుండఁగా పౌలు రోమీయులకు వ్రాసిన పత్రిక నీమె చేతి కిచ్చి పంపెను. ఈమె చేసిన మంచి పనినిగుఱించి పౌలు సాక్ష్యమిచ్చెను (రోమా 16[1,2]). E.

## ఫు

**ఫుగెల్లు** (Phygelus). పౌలు రెండవ మారు చెఱసాలలో వేయఁబడినప్పుడు ఆసియ నుండి రోమాకువచ్చి పౌలును దర్శించకుండనే వెళ్లిపోయిన క్రైస్తవులలో నొకఁడు (II తిమో 1[15]). ఇతఁడు ఎఫెసు పట్టణస్థుఁడై యుండిన యెడల తిమోతికి తెలిసినవాఁడై యుండును. గనుకనే పౌలు ఈ పత్రికయం దతనిని ప్రశంసించెను. M.

## ఫె, ఫే

**ఫెరేస్** మినే చూ॥

**ఫెలెషెతు** పలెస్తీను చూ॥

**ఫేనీకే దేశము, ఫేనీకేయులు** (Phœnicia = ఖర్జూరపు చెట్ల దేశము, Phœnicians). లెబానోను పర్వతములకును మధ్యధరా సముద్రమునకును మధ్యనున్న ప్రదేశము. అది తూరుకు దక్షిణమున 14 మైళ్ల దూరమునుండి ఉత్తరముగా 125 మైళ్లవఱకు వ్యాపించియున్నది గాని, మధ్యధరాసముద్రము మొదలు లెబానోను పర్వతములవఱకు 15 మైళ్లదూరము మాత్రమే వ్యాపించు ఇఱుకైన ప్రదేశమై యున్నది. ఫేనీకేవారు చాల పురాతనమైన ప్రజలై యున్నారు. తూరు సీదోనులు ఆ దేశమందలి ముఖ్యపట్టణము లగుట చేత ఆ దేశమునకు సాధారణముగా తూరు సీదోనులు అను పేరు కలిగెను (తూరు చూ॥). వీరి స్వంతపారంపర్యములను చూడఁగా వీరు పారసీ సంయుక్తాగ్ర గుడమునుండి వచ్చినట్లు కనఁబడును ఆది 10[15] లో నున్నట్లు వారు హాము సంతతి వారిలో లెక్కింపఁబడిరి. వారి భాషయు షేము సంతతివారి భాషవంటిదే. మఱియు వారు కనానీయులతో చేర్చఁబడిరి (యెష 23[11]). క్రీ॥ పూ॥ 16 వ శతాబ్దము మొదలు ఐగుప్తీయుల చరిత్రలో దీని పట్టణముల పేరులు అనేకసార్లు కనఁబడును. ఐగుప్తీయు లీ దేశమును జయించుటకు ప్రయత్నించి అప్పుడప్పుడు కొన్ని స్థలములను జయించు చుండిరి గాని, 12 వ శతాబ్దమందు చిన్నాసియ నుండి వచ్చినవారు ఐగుప్తీయుల నచటినుండి వెళ్లఁగొట్టిరి. బైబిలునందు వారు మొదట దావీదు కాలములో కనఁబడెదరు. హీరాము అనువాఁడు వారికి రాజైయుండి దావీదు సొలొమోనులతో సంధిచేసికొని యున్నట్లు తెలియును (II సమూ 5[11,12] I రాజు 5). యెరూషలేములోని దేవాలయమును కట్టుటకు హీరాము ఆ దేశమునుండి మ్రాఁకులను పనివారిని పంపించెను. మంచి రేవు స్థలము లుండుటచేతను లెబానోను పర్వతములమీఁద గొప్ప మ్రాఁకులుండుట చేతను సముద్ర వ్యాపారము చేయుట కీ దేశస్థులకు మంచి వీలులు కలిగెను. మఱియు ఫేనీకే వారు ముఖ్యముగా సముద్ర వ్యాపారమునకు ప్రసిద్ధిఁజెంది యుండిరి (యెష 23 యెహె 27, 28). సొలొమోను మహారాజు తన యోడలను నడిపించుటకు ఫేనీకే నావికులను పెట్టుకొనెను (II దిన 8[17,18]). అప్పటి కాలపు నావికులు వారే. ఇందువలననే వారు వ్యాపార నిమిత్తము దూరదేశములలో పట్టణములను స్థాపించుకొని యుండిరి. ఇంగ్లీషు వారు తమ వర్తక వ్యాపారములను జరుపుకొనుటకు మద్రాసు మొదలగు పట్టణముల నేలాగున స్థాపించుకొని యుండిరో ఆలాగు ఫేనీకేవారు ఉత్తర ఆఫ్రికాలోని కార్తేజ

(*Carthage*) పట్టణమును స్థాపించుకొనిరి. అది పూర్వకాలములో ప్రసిద్ధమైనదై రోమాతో గొప్ప యుద్ధములు చేసెను. క్రొత్త నిబంధన కాలములో క్రీస్తు ఈ ప్రాంతములకు వెళ్లి యుండెను (మ 15[24] మా 7[24,31]). హింసలవలన చెదిరిన క్రైస్తవులలో గొంద ఱిచటికి వచ్చియుండిరి (కార్య 11[19]). పౌలు, బర్నబాలు యెరూషలేములోని యాలోచన సభకు వెళ్లునపు డీ దేశము మీఁదుగా వెళ్లిరి. (15[2,3] తూరు, బయలు, యెజబెలు, హీరాము చూ॥).

**ఫేలిక్సు** (Felix = శ్రేయస్కరము). కైసరయ పట్టణమునందు పౌలు క్రీ॥ శ॥ 58 లేక 59 సం॥ నందు చెఱయందుండఁగా యూదయకు అధిపతిగా నున్నవాఁడు. ఇతఁడును పిలాతు వంటి అధిపతియే. మొదట ఫేలిక్సు బానిసగా నుండి, ఆ స్థితినుండి విముక్తుఁడై క్రమక్రమముగా నింత గొప్ప యధికార పదవికి వచ్చెనని యెంతురు. ఈ సమయములో యూదులు తిరుగుబాటు చేతురని చక్రవర్తి భయపడి, మిగుల కఠినుఁడని పేరు వడసిన ఫేలిక్సును యూదయకు అధిపతిగా నియమించి పంపెను. అతఁడంత సామర్థ్యము కలవాఁడు కాఁడు గనుక తన క్రూరత్వము చేతను తప్పుడు ప్రవర్తనల వలనను అక్కడి వ్యవహారములను మఱింత ఆరు మూఁడు జేసెను. ఇతఁడు యాకోబును చంపిన హేరోదు అగ్రిప్ప యొక్క కుమార్తెయగు ద్రుసిల్లను పెండ్లాడెను. ఈమె కిదివఱకే వివాహమై యుండినందున ఇతనిని పెండ్లియాడుటలో వివాహపు చట్టము నతిక్రమించుటయేగాక వ్యభిచారిణియు నాయెను. ఈ వివాహమువలన వారి కొక కుమారుఁడు కలిగెను గాని తల్లి బిడ్డ లిరువురును భూకంపమువలన పాంపే పట్టణము నాశనమైనప్పుడు చంపఁబడిరి.

ఇతఁడు అధిపతిగా నుండుసమయమున పౌలు యెరూషలేమునందు యూదుల చేతులలో పడి చంపఁబడకుండునట్లు ఇతని యొద్దకు పంపఁబడెను (కార్య 22[23,24]). పౌలుమీఁద నేరము మోప వచ్చిన తెర్తుల్లు అనువక్త యితనిని పొగడెను (24[2,3]) గాని పౌలునకు ఫేలిక్సు సంగతి చక్కగాఁ దెలియునుగాన అతనిని పొగడక పోయినను మర్యాదగా మాట్లాడెను. ఫేలిక్సు చాలకాలము నుండి న్యాయాధిపతిగనుండి యూదుల సంగతులను తెలిసినవాఁడై యున్నందున తన విషయములో న్యాయము జరిగించఁగలఁడని తన యభిప్రాయమును వెల్లడించెను (24[10,11]). ఫేలిక్సు క్రైస్తవ మతమును గూర్చియు (24[22]) తన యక్రమ ప్రవర్తనను గూర్చియు (24[25]) యెఱిఁగియున్నను వాటినిగూర్చి యొప్పుకొన నొల్లక పౌలువలన లంచ మేమయినను రాఁబట్టుటకు కనిపెట్టెను (24[26]). రెండు సంవత్సరము లిట్లు కనిపెట్టినను లాభమేమియు లేకపోయినందున అతని హృదయము కఠినమై, మనస్సాక్షి యెంతమాత్రమును పని చేయకపోయెను. అతఁడు రోముకు వెళ్లినప్పుడు అతని యక్రమముల విషయమై యనేకులు నేరము మోపిరిగాని స్నేహితుల సహాయము వలన తప్పించుకొనెను. E.

**ఫేస్తు** (Festus = ఉత్సవము). ఫేలిక్సుకు తరువాత యూదయకు అధిపతి. ఇతఁడు పోర్కియు కుటుంబమునకు చెందినవాఁడు గాన పోర్కియు ఫేస్తు అనఁబడెను. ఫేలిక్సుకన్న బుద్ధిమంతుఁడుగా నగపడుచున్నాఁడు. అతఁడు కైసరయకువచ్చి చార్జి పుచ్చుకొనఁగానే యెరూషలేమునకు వెళ్లెను. పౌలును విచారణ నిమిత్తము యెరూషలేమునకు తెమ్మని యూదులు మనవి చేసినప్పుడు వారతనిని చంప నుద్దేశించుచున్నారని యెఱిఁగి వారి మనవిని నిరాకరించెను (కార్య 25[1-3]). తరువాత యూదులు మెప్పు నొందుటకు పౌలును యెరూషలేమునకు విచారణకై వత్తువాయని యడుగుటనుబట్టి (25[9]) అతఁడు మాట తప్పువాఁడుగా కనఁబడుచున్నాఁడు. అంత స్థిరబుద్ధి గలవాఁడు కాఁడు. పౌలు అగ్రిప్ప యెదుట మాట్లాడునట్లు యేర్పాటులు జేసెను. తరువాత అతనిని రోముకుఁబంపెను. ఫేస్తు జీవితమునుగూర్చి మనకింక తెలియదు. తరువాత కొద్ది కాలముననే అతఁడు మరణమాయెను.

E.

## ఫొ

**ఫోర్తూనాతు** (Fortunatus = అదృష్టవంతుఁడు). పౌలును ఎఫెసులో దర్శించిన కొరింథీయుల ప్రతినిధులలో నొకఁడు (I కొరి 16[18]). పౌలు వారివలన చాల ఆదరణ నొందు

టను చూడఁగా వారా సభలో పలుకుబడిగల వారై యుండిరని కొంద అనుకొందురు. 40 సం॥లకు తరువాత క్లెమెంతు కొరింథీయులకు వ్రాసిన యుత్తరములోని 65 వ పర్వములో ఈ పేరుగలవాఁ డొకఁడుండెను. లైట్ ఫుట్ (*Lightfoot*) అను వేదశాస్త్రి అతఁడే యీ ఫొర్తూనాతు అని యూహించెను. అట్లయిన యెడల అతఁడు పౌలు కాలములో యౌవనుఁడై యుండెనని యనుకొనవలెను. ఇట్లనుకొను వారు ఇతఁడు స్తెఫను కుటుంబములో లేక సేవకులలో నొకఁడుగా నుండెనని యూహింతురు.



**ఫ్రుగియ (Phrygia)** చిన్నాసియలోని యొక పరగణా. దాని సరిహద్దులు ఎల్లప్పుడు నేకరీతిగా నుండలేదు. దాని మొదటి రాజులు చాలసిరిగల వారు. కుబేరుఁడనఁదగు మైదాసు (*Midas*) ఈ దేశపువాఁడే. దాని హద్దులు తగ్గి పోయి ఉత్తరమున బితూనియ, తూర్పున లుకయోనియ గలతియ, దక్షిణమున లుకియ పిసిదియ ఇసౌరియ, పడమట లుడియ మూసియ యనునవి యుండుకాలమున గొప్పవాఁడగు అంతియోకస్ అను నతఁడు 2000 యూదా కుటుంబముల నచటికి దేశాంతరవాసమునకు పంపియున్నట్లు యోసీఫసు అను చరిత్రకారుఁడు తెలిపెను (పురా 12,3,4). పెంతెకొస్తు దినమున ఇచటనుండి వచ్చిన వారు కూడ యెరూషలేములో నుండిరి. (కార్య $2^{10}$). పౌలు తన మొదటి రెండు ప్రయాణములలో ఈ పరగణాకు వెళ్లెను ($16^{6}$ $18^{23}$). ఈ వాక్యములను చూడఁగా ఫ్రుగియ గలతియ యని చదువక గలతియకు సంబంధమగు ఫ్రుగియ యని చదువవలయునని నవీన పండితు లనుకొందురు. అప్పటి కాలమందు రోమావారు దీనిని ఫ్రుగియ పరగణాలో చేర్చినట్లు రోమకవారి చరిత్రవలనఁ దెలియును. పౌలు దర్శించిన యీ పట్టణములు అంతియొకయ ఈకొనియ యనునవి ఫ్రుగియ గలతియలో చేరుటవలన గలతీయ యుత్తరమును పౌలు ఈ సభలకుకూడ వ్రాసెనని యనుకొందురు (గలతియ చూ॥). ఈ పరగణావారు ఆదికాలము ననే క్రైస్తవులైరి. సంఘ చరిత్రలోను మొంతానీయుల తెగను స్థాపించిన మొంతాని అనువాఁడు ఈ పరగణాలోని పై పట్టణములలోనే నొకదాని యందు పుట్టెను.

## బ

**బంగారపు దూడ** దూడ చూ॥

**బంగారపు బలిపీఠము** దేవాలయము I 7 (2) B చూ॥

**బంగారము** లోహములు 1 చూ॥

**బండ, శైలము (Rock).** ఈ మాటలచేఁ దెనిఁగించఁబడిన మూలపదములు పాఁత నిబంధనలోఁ గొన్నియు క్రొత్త నిబంధనయందు ఒకటియు గలవు. వాటి సాధారణ యర్థమును గూర్చి గాక అలంకార ప్రయోగములు మాత్రమీ క్రింద వివరింపఁబడును.

1. నాశనమగు పట్టణమును సూచించెను (యెహె $26^{4-14}$). ఈ పదమే యిర్మీ $5^{3}$ నందు మొండితనమును సూచించునుగాని ఈ వాక్యము నందు దానిని రాయియని తెనిఁగించిరి. 2. స్థిరమైనదాని కిదియొక సూచనయైయున్నది (యోబు $19^{24}$). ఈ పదమును సాధారణముగా దేవుఁడు స్థిరమైన ఆశ్రయమని చూపుటకు వాడినను తెలుఁగు బైబిలునందు దానిని **దుర్గము** అనియు, శైలము (ద్వితీ $32^{4,15,18,30}$ కీర్త $19^{14}$ $27^{5}$ $28^{1}$) ఎక్కలేనంత ఎత్తయిన కొండ ($61^{2}$) అనియు వ్రాసిరి. క్రొత్త నిబంధనయందు వాడఁబడిన పదము నిలుకడగా నిలుచుదానిని సూచించును (మ $7^{24}$ లూ $6^{48}$, మ $16^{18}$). ఆ పదమే **రాతినేల** యని తెనిఁగింపఁబడి నిష్ఫలమగు దానిని సూచించుచున్నది (లూ $8^{6,13}$). 3. జీవజలము లుబుకుబండ (I కొరి $10^{4}$ నిర్గ $17^{6}$) క్రీస్తుకు సూచనగా నున్నది.

**బండి (Cart, Waggon).** యుద్ధసమయములందుఁగాక సాధారణ సమయములందు వాడుకొనిన వాహనము. పలెస్తీనులోని ఈ దేశపు వాటివలె రెండు చక్రములను కలిగియుండెను. రాళ్లమీఁద చెక్కఁబడిన బండ్ల రూపములలోని చక్రములకు కొన్నిఁటికి ఆకులున్నట్లు కనఁబడుచున్నను, అవి లేనివియును గలవు. ఇవి

కొయ్యతోఁగాని రాతితోఁగాని నిర్మింపఁబడెను. వీటిని సాధారణముగా ఎడ్లు లాగెను. కంచరి



సిరియలోని బండి

గాడిదెలును మనుష్యులును లాగినట్లు ఆయా శాసనములవలనఁ దెలియుచున్నది. బైబిలునం దుదాహరింపఁబడినవి కర్రతో చేయఁబడి (I సమూ $6^{14}$) పైకప్పు గలిగి కొన్నియు లేక కొన్నియు (సంఖ్యా $7^{3}$) పశువులచే లాగఁబడి ($7^{7}$ I సమూ $6^{7}$), ధాన్యము నూర్చుటకును (ఆమో $2^{13}$) సరకులు మోయుటకును (II సమూ $6^{3}$) మనుష్యుల నెక్కించుకొని పోవుటకును వాడఁబడినట్లు తెలియుచున్నది. బైబిలు కాలమునందు ఈ దేశమునందున్నట్టి వాహనములను వాడిరని స్పష్టమగుచున్నది.

**బందీ గృహాపు గుమ్మము** యెరూషలేము B III 3 చూ॥.

**బందీ గృహాము** నేరములు శిక్షలు III 3 చూ॥

**బంధించుట** తాళపు చెవి 3 చూ॥

**బంధువులు** (Relatives). భార్యాభర్తలు, తల్లిదండ్రులు పిల్లలు, అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు అను దగ్గరి బంధుత్వమునుగూర్చి వివాహము, కుటుంబము అను శీర్షికలను చూ॥. ఇతర బంధుత్వములను తెలియఁజేయు ప్రత్యేకమగు పదములు బైబిలునందు బహు కొద్ది మాత్రము గలవు. లేవీ $18^{7-18}$ ద్వితీ $27^{20-23}$ లోని నిషిద్ధ వావి వరుసలయందు మనుమరాలు అత్త అనునట్టి సూటియగు మాటలనుగాక కుమారుని కుమార్తె, కుమార్తె కుమార్తె, తండ్రి చెల్లెలు అను నిట్టి పదములను మూలభాషయందు వాడిరి. ఇట్లు సంబంధమును వివరించు పదములేగాక ఆ సంబంధములకు వాడిన ప్రత్యేక పదములును గలవు.

I. బంధుత్వ సంబంధమును వివరించు పదములెవ్వి యనఁగా:

1. పాత నిబంధన.

(1) హత్యకు ప్రతిహత్య చేయవలసిన వానిని, భూమిని విమోచింపవలసిన వానిని సూచించుటకు మూలభాషయందు గోయేలు (*Goe'l*) అను పదమును వాడిరి (సంఖ్యా $5^{8}$ రూతు $4^{1}$ I రాజు $16^{11}$ మొ॥ వివాహము 5, నేరములు శిక్షలు I 3 (1), III చూ॥)

(2) పరిచయమని యర్థమిచ్చు పదమును బంధువులనియు (రూతు $3^{2}$ II రాజు $10^{11}$), చెలికత్తెలనియు (సామె $7^{4}$), వంశపు వాఁడనియు (రూతు $2^{1}$) తెనిగించిరి.

(3) తోడ బుట్టిన వారని యర్థమిచ్చు పదమును బంధువులని తెనిఁగించిరి (ఆ॥ $12^{1}$ $24^{4}$ $31^{3}$ సంఖ్యా $10^{30}$ మొ॥).

(4) దగ్గఱనుండు వారని శబ్దార్థమిచ్చు పదమును సమీప బంధువుఁడనియు (రూతు $2^{20}$) సమీప రక్త సంబంధులనియు (లేవీ $21^{2}$) తెనిఁగించిరి. నిర్గ $32^{27}$ లో ఆ పదమునే పొరుగు వాఁడనితర్జుమా చేసిరి.

(5) ఒకటే శరీరము లేక మాంసము అని యర్థమిచ్చు పదమును సమీప జ్ఞాతియనియు (సంఖ్యా $27^{11}$) రక్త సంబంధి యనియు (లేవీ $18^{12,17}$ $20^{19}$ $21^{2}$ $25^{49}$) తెనిఁగించిరి.

(6) ఒకటే కుటుంబమని శబ్దార్థమగు మఱియొక పదమును వంశములనియు, వంశస్థులనియు (ఆది $12^{3}$ $24^{32}$ మొ॥) తెనిఁగించిరి.

2. క్రొత్త నిబంధన.

(1) ఒకటే కుటుంబములో పుట్టిన వారిని సూచించు గ్రీకు పదమును బంధువులని (లూ $1^{36,58-61}$) తెనిఁగించిరి. కార్య $4^{6}$ లో బంధువులను పదమును దీనికి సంబంధించినదే.

(2) కొలొ $4^{10}$ లోని పదము వేఱొకటియై మేనల్లుని సూచించునని సాధారణముగా అర్థము చెప్పెదరుగాని దానిని సమీప జ్ఞాతియని తెనిఁగించిరి.

(3) ఒకని సంతానమును గాని ఒకే దేశస్థులను గాని సూచించెడి పదమును భూలోక వంశములని కార్య $3^{25}$ లో తెనిఁగించిరి. ప్రక $1^{7}$

లోని భూజనులు అనునది మఱియొక గ్రీకు పదముయొక్క భాషాంతరమై యున్నది.

ఈ పదము లన్నిఁటినిబట్టి ప్రస్తుత మీ దేశములో నున్నట్లు బైబిలులో కూడ ఒక గోత్రపు వారందఱును ఒకరి నొకరు బంధువులనుగా నెంచినట్లు తెలిసికొనవచ్చును. కుటుంబము, క్రింద II 1,4 చూ॥

II. బంధుత్వమును సూచించు ప్రత్యేక పదములు బైబిలునందు బహు కొద్దిమాత్రము గలవు.

1. సహోదరులు (*Brothers, Brethren*). తోడ పుట్టిన వారిని ఈ పదము సూచించును (కుటుంబము చూ॥). ఈ పదమును తోఁబుట్టువులకు మాత్రమేగాక ఒకటే గోత్రమును ఒకటే జనమును సూచించుటకు వాడిరి (లేవీ $10^{6}$ సంఖ్యా $16^{10}$ ఎజ్రా $3^{8}$ మొ॥). ఈ విధముగా అది ఇశ్రాయేలీయులకు పెట్టిన మర్యాదార్థమగు బిరుదులలో నొకటి యయ్యెను (కార్య $2^{29}$ $3^{17}$ $7^{2}$ $13^{26}$ మొ॥). ఆది క్రైస్తవు లొకరి నొకరు మిగుల ప్రేమతో నిట్లు పిలుచుకొనిరి (కార్య $11^{29}$ రోమా $7^{1}$ $12^{1}$ యాకో $1^{2}$ I యోహా $2^{9}$ మొ॥).

2. సహోదరి (*Sister*). ఇంగ్లీషులో నున్నట్లు అప్పచెల్లెండ్రను సూచించుటకు సహోదరి యనునొక మాటను మాత్రమే వాడిరి. తోడ బుట్టిన వారికి మాత్రమేగాక దగ్గర బంధువురాలికని (ఆది $24^{60}$), ప్రియురాలికిని (పర $4^{9}$) అలంకారరీతిగా ప్రియమైనదానికిని (సామె $7^{4}$) ఈ పదము వాడఁబడెను. I కొరి $7^{15}$ $9^{5}$ లో దానిని క్రైస్తవ భార్యకు వాడిరి. క్రైస్తవురాండ్రకు సహోదరియను బిరుదు అరుదుగా వాడఁబడెను గాని రోమా $16^{1}$ యాకో $2^{15}$ లో మాత్రమా పదమిట్లు వాడఁబడెను. II యోహా 13 లో నున్న సహోదరి క్రైస్తవురాలు కావచ్చును గాని అది సంఘమునకు కూడ అలంకార నామమై యుండును.

3. మామ (*Father-in-law*). భార్యాతండ్రిని (నిర్గ $3^{1}$ $4^{18}$ $18^{1}$ న్యాయా $1^{16}$ $19^{4}$ మొ॥). భర్త తండ్రిని (ఆది $38^{13,25}$ I సమూ $4^{19,21}$) సూచించు పదములు హెబ్రీ భాషలో వేఱుగా నున్నవి. ఆ రెండు పదములును వియ్యమందుట చేతకలుగు సంబంధములను కనఁబఱచును. కయప సందర్భమున గాక (యోహా $18^{13}$) క్రొత్త నిబంధనయందు మామయను పదము మఱెచ్చటను లేదు. మామకు విశేష గౌరవము చూపినట్లు బైబిలునందున్న సూచనల వలనఁ దెలియుచున్నది. మేనమామను తల్లి సహోదరుఁడు అని ఆది $28^{2}$ $29^{10}$ లో తెనిఁగించిరి.

4. అత్త (*Mother-in-law*). అత్తను సూచించు పదము మామయను పదముయొక్క స్త్రీలింగ రూపముగాక వేఱుమాటకాదు. ఆ పదము భర్త తల్లినిగాని (రూతు $1^{14}$ $2^{11}$ మొ॥) భార్య తల్లినిగాని (ద్వితీ $27^{23}$) సూచించును. క్రొత్త నిబంధనయందు ఈ రెండు సంబంధములను ప్రత్యేకముగా సూచించు పదములులేవు. క్రీస్తు స్వస్థపఱచిన పేతురు అత్త అతని భార్య తల్లియై యుండెను (మ $8^{14}$ = మా $1^{30}$ = లూ $4^{38}$). మానవులలో కలుగు విరోధమును తెలుపుటకు కోడలు తన అత్తకు విరోధమగుట సూచనగా నున్నది (మీకా $7^{6}$). అదే వాక్యమును క్రీస్తు తనను నమ్మువారికి కలుగనైయున్న విరోధమును సూచించుటకు ఎత్తెను (మ $10^{35}$ = లూ $12^{53}$). మేనత్త యను పదమునకు మాఱుగా బైబిలునందు తండ్రి సహోదరి యను పదమును వాడిరి (లేవీ $18^{12}$).

5. అల్లుఁడు (*Son-in-law*). అల్లుఁడను మాటను సూచించు పదము వియ్యమందుటచే కలుగు సంబంధమును తెలియఁజేయును గాన దానిని ఆయా సందర్భములనుబట్టి మామ యనియు (నిర్గ $3^{1}$ $4^{18}$ మొ॥), రక్త సంబంధియనియు ($4^{25,26}$) తర్జుమాచేసిరి. లోతు కుమార్తెలను వివాహమాడఁ దలంచినవారు లోతుకును (ఆది $19^{12}$), తిమ్నాతు వాఁడగు నొక ఫిలిష్తీయునికి సమ్సోనును (న్యాయా $15^{6}$) బేత్లెహేమీయుఁడగు నొకని కొక లేవీయుఁడును ($19^{5}$), సౌలుకు దావీదును అల్లుండ్రైనట్లు దృష్టాంతములు గలవు. వీరుమాత్రమేగాక ఈ పదము ఇతరుల విషయమును ఉపయోగింపఁబడెను (II రాజు $8^{37}$ నెహె $6^{18}$ $13^{28}$). మేనల్లుఁడు అను పదము కార్య $23^{16}$ లో నుండినను అసలు భాషలో నది

ప్రత్యేక పదముగాక తోఁబుట్టువు కుమారుఁడని యర్థమిచ్చును.

6. కోడలు (*Daughter-in-law*). కోడలు అను పదముచే తెనిఁగించిన పాత నిబంధనలోని మూలభాషాపదము అల్లుఁడని తెనిఁగించిన పదమువలె కోడలిని మాత్రమేగాక వివాహ సంబంధమువలన కలిగిన బంధుత్వమును తెలుపును గాన ఆయా వాక్యసందర్భములనుబట్టి దానిని పెండ్లికుమార్తె యనియు తెనిఁగించిరి (యెష 49[13] 61[10] 62[5] యిర్మీ 2[32] మొ॥). పరమగీతము నందు ఆ పదమునే ప్రాణేశ్వరి యని తెనిఁగించిరి (4[8,10,11,15] 5[1]). ఆయా వాక్యముల సంబంధములనుబట్టి అది పెండ్లి కుమార్తెను సూచించుననుట కే సందేహమునులేదు (ఆది 11[31] 38[11] రూతు 1[6] 2[20] సమూ 4[19]). కోడలు అత్తను విరోధించుట దేవుని మరచుటవలన దేశమునకు కలుగఁబోవు తొందరలను సూచించును (మీకా 7[6]). క్రీస్తు బోధలవలన కుటుంబము నందు కలిగెడు విరోధమును దృష్టాంతపఱచుటకు క్రొత్త నిబంధనలో చెప్పిన వాక్యములో నిది యొకటియైయున్నది (మ 10[35] = లూ 12[53]).

7. అవ్వ (*Grand-mother*). I రాజు 15[13] లో అవ్వకు వాడిన మూలభాషా పదము తల్లిని సూచించుటకు సాధారణముగా నుపయోగించిరి. ఆ పదము పూర్వీకురాలినికూడ సూచించును (ఆది 3[20]). క్రొత్త నిబంధనలో తిమోతి అవ్వనుగూర్చిన సూచనగలదు (II తిమో 1[5]) గాని ఈ సంబంధమును సూచించిన దేదియులేదు.

8. పినతండ్రి (*Uncle*). దీని మూలభాషా పదము ముద్దుపేరై పరమగీతములో ప్రియుఁడని తెనిఁగింపఁబడెను (1[13,14,16] మొ॥). ఆయా వారల తండ్రులనుగూర్చిన వాక్యములున్నవిగాని వారు పినతండ్రులో పెత్తండ్రులో ఆ పదము వలనఁ దెలియదు (లేవీ 10[4] I సమూ 10[14] I దిన 27[32] యిర్మీ 32[7,8] మొ॥).

9. మనుమడు (*Grand-son*). కొన్ని వాక్యములలో వీరిని సూచించుటకు ప్రత్యేకమగు మాటను వాడక కుమారులకుమారుఁడు లేక పిల్లల పిల్లలు అను అర్థమిచ్చు పదములనువాడిరి (నిర్గ 34[7] సామె 13[22] 17[6]). న్యాయా 12[14] లో నున్న మనుమలు అనునదియు అదేరీతిగా నున్నది. యెష 14[22] యోబు 17[17] లో కుమారుని మనుమఁడు అని తెనిఁగించినది జాతీయమై కుమారుఁడు అన్యుఁడు అని శబ్దార్థమిచ్చును. దీనికి ప్రతిగా కుమారుఁడు అను పదమును వాడిరి ఎజ్రా 5[1] ని జెక 1[1] తో సరిపోల్చుము).

**బక్కీయాహూ** (Bukkiah = యెహోవా పంపిన నాశనము). గాయకుల 24 తరగతుల లోని 6 వ తరగతివారి పెద్దయగు లేవీయుఁడు (I దిన 25[4,13]).

**బక్బక్కరు** (Bakbakkar) లేవీయులలో నొకఁడు (I దిన 9[15]). ఇతఁడొక కుటుంబమునకు పెద్దయాయెను.

**బక్బుకీయా** (Bakbukiah = యెహోవాచే కుమ్మరింపఁబడినది).

1. చెఱకాలమునకు తరువాత నుండిన లేవీయులలో నొకఁడు. ఇతఁడు యెరూషలేములో నివసించెను (నెహె 11[17] 12[9]).

2. నెహెమ్యా కాలములోనుండిన ద్వార పాలకులలో నొకఁడు (నెహె 12[25]). వీరు ఇద్దఱుకాక, ఒక్కఁడే లేవీయుఁడని కొంద అను కొందురు. ఇది నిజముకావచ్చును.

**బక్బూకు** (Bakbuk = సీసా కాయ). బాబెలు చెఱనుండి తిరిగివచ్చిన నెతేనీయులలో నొక కుటుంబమునకు పెద్ద (ఎజ్రా 2[51] నెహె 7[53]).

**బజ్లీతు** (Bazlith = దిగంబరత్వము). జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు తిరిగి వచ్చిన నెతినీయులలో నొక కుటుంబపువాడు (నెహె 7[54] ఎజ్రా 2[52]).

**బట్టలు** వస్త్రములు చూ॥

**బత్తెము** (Allowance). బాబెలురాజు తనదగ్గర ఖైదీగానుండిన యెహోయాకీను అను ఇశ్రాయేలువారి రాజునకు దినమున కింతయని ఇచ్చిన భోజనమునకు II రాజు 25[30] లో బత్తెము అను మాటచే తెనిఁగించిన పదము. గాని అ చరిత్రలోని పదమునే యిర్మీ 52[34] లో పోషణ యని తెనిఁగించిరి. యెరూషలేము నాశనము

కాఁగా యిర్మీయాకు అట్టి బత్తెమునిమ్మని బాబెలు రాజు తన సేనాధిపతికి సెలవిచ్చెను గాని యిర్మీయా దానిని పుచ్చుకొనలేదు (యిర్మీ $40^{5}$). ఈ పదమును సామె $15^{17}$ నందు భోజనమని తెనిఁగించిరి. అధికారులు తమ సేవకాళికి దినదినము నిచ్చు భత్యమును సూచించును. ఈ మాట బైబిలునందు పైవాక్యములలో మాత్రము కనఁబడుచున్నది (ఆహారము చూ॥).

**బత్షెబ** (**Bathsheba** = షెబ లేక ప్రమాణమునకు కూతురు). హిత్తీయుఁడగు ఊరియాయొక్క భార్య. దావీదు ఈమెతో ఘోరమైన పాపముచేసి శిక్షనొందెను (II సమూ 11, 12). దావీదు ఊరియాను చంపించినతరువాత ఈమెను వివాహము చేసికొనెను. ఈమె సొలొమోనుకు తల్లి యాయెను. దావీదు కొడుకులలో అదోనీయా యను నొకఁడు దావీదు రాజ్యము నపహరింప యత్నింపఁగా ఈమె చేసిన యుపాయమువలన దావీదు తన వాగ్దత్త ప్రకారము సొలొమోనుకు తన రాజ్యము ననుగ్రహించునట్లు చేసెను (I రాజు $1^{11}$). తన తండ్రియైన దావీదుయొక్క ఉపపత్నియగు అబీషగును తనకు భార్యగా నియ్యవలెనని అదోనియా బత్షెబద్వారా సొలొమోనునకు మనవి చేసెను గాని చేయఁగూడని యిట్టి మనవిని సొలొమోను అంగీకరింపఁడాయెను (I రాజు $2^{13-25}$). II సమూ $11^{3}$ లో నున్నట్లు ఈమె ఏలీయాము కూతురు అనఁబడును. ఈమె తండ్రి పేరు అమ్మీయేలు (I దిన $3^{5}$). అయితే యీ పేరు ఏలీయాము అను పేరునకు మాదిరియభాషారూపమై యున్నదని తెలిసికొనవలెను. దావీదుయొక్క ఆలోచనకర్తయగు అహీతోపెలునకు ఏలీయాము అను పేరుగల కొడుకుండినట్లు II సమూ $23^{34}$ వలనఁ దెలియును. ఈ ఏలీయాము బత్షెబ తండ్రియగు ఏలీయామును ఒకఁడేయై యుండవచ్చును. అట్లయినయెడల అహీతోపెలు బత్షెబకు తాత కావలసి యుండును. తరువాత అహీతోపెలు దావీదును విడిచి అబ్షాలోము చేసిన కుట్రలోఁ జేరుటకు దావీదు బత్షెబాకు చేసిన ద్రోహము కారణమని కొందఱి యభిప్రాయము.

**బదదు** (**Bedad** = వేఱుపడుట). ఎదోము దేశమునకు రాజైన హదదుయొక్క తండ్రి (ఆది $36^{35}$ I దిన $1^{46}$).

**బదరీ** తంగేడు చూ॥

**బదు** మానములు III 6 చూ॥

**బద్దె** వృత్తులు చేతి పనులు III 2 చూ॥

**బబులోను, బాబెలు** (**Babylon**). బబులోను ఈ లోకమందలి పురాతన రాజ్యములలో నొక ముఖ్యరాజ్యమై యున్నది. ఈ దేశముయొక్క చరిత్రకును బైబిలు చరిత్రకును ఎక్కువ సంబంధము కలదు.

I. బాబెలు దేశపు సరిహద్దులు. బాబెలు అనునది ఒక పట్టణమునకును దానికి చుట్టునుండు దేశమునకుఁగల పేరై యున్నది. ఆ పట్టణము ఫరాతు నదియొక్క తూర్పు తీరమున ఫరాతు నది తైగ్రిస్ నదితోఁ గలియు స్థలమునకు ఉత్తరముగా 200 మైళ్ల దూరములో నుండెను. బాబెలు దేశము పారసీ సంయుక్తాగ్రహము నుండి ఉత్తరముగా ప్రస్తుతపు బాగ్దాదు అను పట్టణము వఱకు వ్యాపించెను. అది చాలమట్టుకు ఫరాతు తైగ్రిస్ నదుల మధ్యనుండు ప్రదేశము. దానికి కల్దీయుదేశము (ఆది $11^{28}$) షీనారు దేశము ($10^{10}$ $11^{2}$) అను పేరులుకూడ కలవు. అసలులో ఇదే బబులోను దేశమై యుండెను గాని బబులోను రాజ్యము అనఁబడిన దానిలో ననేక రాజ్యములు చేరియుండెను. అది భరత ఖండమునుండి మధ్యధరా సముద్రమువఱకు వ్యాపించియుండెను.

II. బాబెలు ప్రజలజాతి. వారు అష్షూరీయులవలెను, సిరియ వారివలెను షేముసంతతి వారిలో చేరినవారై యుండిరి గాని, వారు అచ్చముగా షేము సంతతివారు కానట్లు వారి భాషలనుబట్టి పండితులు అభిప్రాయపడెదరు. ఆ షేము సంతతివారికంటె నింకను పూర్వికులగు వారైనట్లు వారు తెలిసికొని వారికి సుమేరియుఁ వారు (*Sumerians*) అను పేరు పెట్టుదురు. ఆది $10^{6,7}$ చూడఁగా వీరు హాము కుమారుఁడగు కూషు అను వాని సంతతివారై యున్నట్లుగా కనఁబడును. ఈ విధముగా బబులోను వారొక తరహా మిశ్రమ జాతివారని తెలిసికొనవలెను.

1. అసలులో బబులోనురాజ్యము వేర్వేరు పట్టణములుగా నుండెను గాని అవి యైక్యపడి యుండలేదు. ఆ పురాతన కాలమును గూర్చి మనము ఇటుకలమీద నున్న శాసనములవలనఁ దెలిసికొనఁగలము గాని ఆ చరిత్రకు బైబిలులో తేటయైన సూచనలు లేవు. అబ్రాహాము ఏ యూరిలోపుట్టెనో (ఆది $11^{28}$) అది ఆ యసలు పట్టణములలో నొకటియై యుండెను. అబ్రాహామునకు పూర్వము చాలకాలము క్రిందట ఆయా పట్టణములకు గొప్ప స్వతంత్ర ముండెను గాని అబ్రాహాము కాలములో అది లేదని తెలిసికొనవలెను. ఈ పట్టణములలో ఎల్లాసరు ($14^{1}$) ఎరెకు అక్కదు కల్నే ($10^{10}$) కూతా (II రాజు $17^{24}$) అను వీటి పేరులు బైబిలులో నున్నవి. టెల్లో (*Telloh*), నిప్పూరు (*Nippur*) అను పట్టణములుకూడ వాటిలో నుండెను గాని ఈ పేరులు బైబిలులో లేవు. నవీన వేదశాస్త్రులు ఈ రెండు స్థలములందును త్రవ్వించి ఆ పాడు శేషములలో దొరికిన ఇటుకలవలన ఆ పూర్వ కాలపు చరిత్రను మఱి తేటగా తెలిసికొనిరి. బబులోను (ఆది $11^{1-9}$) బోర్సిప్పా (*Borsippa*) యను పట్టణములు పైనున్న పట్టణములకు తరువాత స్థాపింపఁబడెను. ఈ పట్టణములను చూడఁగా ప్రతి పట్టణములోను ప్రసిద్ధమైన



బబులోనువారి యిటుకమీఁది వ్రాతలు

దేవత యొకటి యుండెను. ఈ చరిత్రకాల నిరూపణమును జేయుటకు తగిన యాధారములు లేవు గాని అది క్రీ॥ ము॥ 2400 సం॥ లకు పూర్వముండిన కాలమని తెలిసికొనవలెను.

2. పూర్వకాలమందలి బబులోను రాజ్యముండిన కాలము. బబులోను లోని మొదటి రాజవంశము క్రీ॥ ము॥ 2396 సం॥ లో స్థాపింపఁబడినదని పండితులు లెక్కించుచుండిరి. అయితే ఆ దేశము యానత్తు వారిక్రింద నుండినట్లు కినఁబడదు. ఎల్లార్స లేక లార్సయను పట్టణము ఏలామువారిచే పట్టఁబడి ఊరు, నిప్పూరు, ఎరెకు మొదలగు పట్టణములను షుమారుగా 2290 సం॥లో ఏల నారంభించెను. ఆది $14^{1}$ లోని ఎల్లాసరు రాజైన అర్యోకు అనువాఁడు ఈ పట్టణపు రాజే యని కొంద ఱనుకొందురు. ఆ కాలములో షీనారు అను బాబెలుదేశమునకు అమ్రాపేలు (హమ్మురాబి = *Hammurabi*) ఏలాము నకు కదొర్లాయోమెరు గోయీయులకు తిద్యాలును రాజులుగానుండి ఆదికాండములోని ఆ దండయాత్రను ఈ నలుగురును కలిసిచేసిరి. తరువాత అమ్రాపేలు (హమ్మురాబి) ఎల్లాసరునుండి అర్యోకును వెళ్లఁగొట్టి పారసీ సంయుక్తాగ్ర గుడము మొదలు మధ్యధరా సముద్రమువఱకు నున్న దేశము లన్నిఁటిని తానే యేలి పూర్వ కాలములో నుండిన గొప్ప బాబెలు రాజ్యమునకు స్థాపకుఁడయ్యెను. అతని కాలములో బాబెలు దేశము విద్యకును దేశసంబంధపు క్రమమైన యేర్పాటులకును చాల ప్రసిద్ధమైనదయ్యెను. ఆ కాలపు సంగతులను తెలుపు అనేక ఇటుక శాసనములున్నవి. హమ్మురాబి ధర్మశాస్త్రమును చూడఁగా ఈ భరతఖండములో మనుధర్మశాస్త్ర మెంత ప్రసిద్ధమైనదో పూర్వకాలమున ఆ దేశములో హమ్మురాబి ధర్మశాస్త్ర మంత ప్రసిద్ధమైనదై యుండెను. అతనిరాజ్య మెంత గొప్పదియై యుండినను అది నిలువకపోయెను. హమ్మురాబి యనువాఁడు బాబెలు దేశపు మొదటి రాజవంశపు వారిలో నొకఁడై యుండెను. అతని పరిపాలనకుఁ బిమ్మట బాబెలు అన్య రాజులకు లోఁబడవలసివచ్చెను. దానికి రెండవ రాజవంశ ముండినట్లు తెలిసి యున్నను వారి చరిత్ర సంగతులు బొత్తుగా నేమియుఁ దెలియవు.

3. బబులోను అష్షూరు రాజ్యములు ప్రత్యేకముగా నుండిన కాలము. బాబెలు రాజ్యము

నేలిన మూఁడవ రాజవంశపు వారు కస్సీయు (*Kassites*) లను వారై యుండిరి. వీరు షుమారుగా క్రీ॥ పూ॥ 1700 సం॥ నుండి 1350 సం॥ వఱకు ఏలుచుండిరి. వారు బబులోనుకు ఈశాన్యమున నుండు కొండప్రదేశము నుండి వచ్చి బాబెలును జయించి దాని నేలుచుండిరి. ఈ కస్సీయులను వారు ఆది 10[8] లో నున్న కూషు సంతతివారని కొందఱనుకొందురు. ఈ కాలారంభమున బాబెలు రాజ్యము ఆయా దేశముల నేలినను అష్షూరు రాజ్యము క్రమక్రమేణ వృద్ధిలోకి వచ్చి చివఱకు బాబెలు రాజ్యమును స్వాధీనము చేసికొనెను.



బబులోను ఉనికి

4. రాజవంశములనుబట్టి ఆఱు రాజవంశముల వారు క్రీ॥ పూ॥ 1350 సం॥ మొదలు 620 సం॥ వఱకు ఏలుచుండిరి. వీరిలో బైబిలునందు మెరోదక్బలదాను (II రాజు 20[12] యెష 39[1]) అను నొకరాజు పేరుమాత్రముకలదు. అతఁడు తొమ్మిదవ రాచవంశపువాఁడై క్రీ॥ పూ॥ 721-710 సం॥ వఱకు నేలెను (అష్షూరు 3 చూ॥).

5. నవీన బబులోను రాజ్యకాలము. ఈ రాజ్యమునకు బైబిలు చరిత్రకును ఎక్కువ సంబంధము కలదు. ఈ కాలములో బాబెలు కల్దీయుల రాజ్యవంశ మనఁబడిన పదియవ రాజ్యవంశపు వారిచే నేలఁబడుచుండెను. అది క్రీ॥ పూ॥ 625 సం॥ నుండి 539 సం॥ వఱకు నుండెను. ఈ వంశపు వారిలో మొదటివాఁడు నబొపొలాస్సరు (*Nabopolassur* 625-604), అతని కుమారుఁడగు నెబుకద్నెజరు, (*Nabu-Kudnusur*) యెరూషలేమును నాశనము చేసియుండుటచే బైబిలులో చాల ప్రసిద్ధుఁడైనవాఁడుగ నున్నాఁడు (II రాజు 24, 25, II దిన 36, యిర్మీ 21-52 దాని 1-5). అతఁడు చక్రవర్తి కాకమునుపు ఏలామువారు 607 సం॥ లో అష్షూరును జయించిరిగాని ఇతఁడు తన తండ్రి యింకను చక్రవర్తియై యుండఁగా ఏలామువారిని జయించి వారి దేశము నపహరించియుండెను. ఇదే విధముగా నితఁడు 605 సం॥ నందు కర్కెమీషు నొద్ద ఐగుప్తీయులను జయించెను. తదనంతర మతఁడు భరతఖండము మొదలుకొని ఐగుప్తువఱకు నుండిన దేశములన్నిఁటిని ఏలుచుండెను. ఈ నెబుకద్నెజరు బబులోను పట్టణమును బబులోను దేశమందలి ఆలయములన్నిఁటిని ఎక్కువగా నలంకరించెను. ఇతఁడు 561 సం॥ వఱకు ఏలెను.

III. నెబుకద్నెజరు కుమారుఁడగు ఎవిల్మెరోదకు అను నతనినిగూర్చి బైబిలులో ఒక్క సూచన మాత్రము కలదు (II రాజు 25[27] యిర్మీ 52[31]). ఇతఁడు రెండు సంవత్సరములు మాత్రమేలిన పిమ్మట కుట్రచే చంపఁబడెను. ఇతనికిఁ బిమ్మట

ఈ రాజవంశములో మతి ముగ్గురు రాజులేలిరి. ఈ వంశపు వారందఱివలె వీరుకూడ ఆలయముల నలంకరించుటకు చాల ప్రయాసపడిరి. ఈ రాచవంశములో నెబోనిడస్ (*Nabonidus*) అను వాఁడు చివరివాఁడై యుండెను. ఇతఁడు ముఖ్యముగా పురాతన ఆలయములను మరమ్మతుచేసిన వాఁడై యుండెను. ఇట్లు చేయుచుండఁగా, నతఁడు వాటిలో చాల పురాతన లిఖితములను కనుఁగొనెను. అవి పురాతన చరిత్రను తెలిసికొనుటకు చాల సహాయకరములుగా నుండును. అయితే నెబోనిడస్ ఎన్నఁడును బబులోనులో నివసింపక అచటి సేనను ప్రభుత్వమును తన కొమరుఁడగు బెల్షస్సరున కప్పగించెను (దాని 5, 7, 8). ఇతని కాలములో మాదీయులును పారసీకులును వృద్ధిలోకి వచ్చిరి 539 సం॥ లో మాదీయుఁడగు కోరెషు బబులోనును జయించి దానిని లోఁబఱచుకొనెను (యెష 44²⁸ 45¹ II దిన 36²²,²³ ఎజ్రా 1¹⁻⁸ దాని 6²⁸ 10¹ మొ॥). అందువలననే బాబెలు ప్రభుత్వము ఆ పట్టణమునుండి మాత్రమేకాక, ఆ జాతివారి నుండి సహా తొలగిపోయెను. ఇట్లు బాబెలు నాశనమునుగూర్చిన ప్రవచనములు(యెష 13-14²³ 21¹⁻¹⁰ 46¹,² 47¹⁻³ యిర్మీ 50, 51) నెఱవేఱెను. బబులోను పట్టణము నెబుకద్నెజరు కాలములో అన్నిఁటికంటె గొప్ప ప్రాకారపురమాయెను. దానిచుట్టుకొలత 42 మైళ్లు. దాని ప్రాకారములు 112 గజముల యెత్తుగాను 28 గజముల వెడల్పుగా నుండెను. అట్టి ప్రాకారములు ఒక దానిలో నొకటి యుండెను. వాటికి ఇత్తడి ద్వారము లుండెను. అందలి వనములు ప్రసిద్ధములైనవై యుండెను. అచ్చటి వ్రేలాడు వనములు లోకమందలి వింతలన్నిటిలో గొప్ప వింతగా నెంచఁబడెను. ఈ లోకపు మహిమను సూచించుటకు బాబెలు మహాత్మ్యము ఒక మంచి దృష్టాంతమై యున్నది గాని అది యావత్తును వాడిపోయెను. ప్రస్తుతమచట పాడు శేషములు తప్ప మఱేవియులేవు. అచ్చట ప్రస్తుతమున మూఁడుదిబ్బలు మాత్రమున్నట్లు ప్రయాణస్థులందురు. వాటిలో నొకదానికి అరబ్బీయులు బాబెలు అను పేరు పెట్టుదురు. బాబెలునకు పూర్వముండిన గొప్ప మహిమను చూడఁగా అందులోనిది యొకటిమాత్రము నిలిచెనని ప్రస్తుతమున చెప్పవచ్చును.

క్రొత్త నిబంధనలో బబులోను అనుమాట తత్కాలమందు లోకడంబములతో నిండియున్న రోమా పట్టణమునకు అలంకార రీతిగా పెట్టఁబడిన నామమాయెను (ప్రక 14⁸ 16¹⁹ 17¹⁸). I పేతు 5¹³ లోని బబులోనుకూడ అదేరీతిగా రోమాను సూచించుననని కొందఱనుకొందురు.

IV. బబులోను వారి విద్యలు.—బబులోను వారిలో విద్య లెక్కువగా నుండినట్లు అనేక సూచనలవలనఁ దెలియును. వారు పురుషులకు మాత్రమే కాక, స్త్రీలకుకూడ విద్య చెప్పిరి. అన్ని విధములైన వ్రాఁతలు, ఉత్తరములు, దస్తావేజులు, పత్రములు మొదలగునవి ఇటుక శాసనములమీఁద కాన వచ్చుచున్నవి. వారికి మంచి నీతిబోధలు కూడ నుండెను. జ్యోతిశ్శాస్త్రము వారికి బాగుగ తెలిసియుండెను గనుక దానివలన వారు ముహూర్తములనుకూడ చెప్పు చుండిరి. (యెష 2⁶). వైద్యముకూడ వారికి బాగుగ తెలిసియుండెను. వారు గణితశాస్త్రమును చక్కఁగా నభ్యసించిరి మనము దినములను భాగించుచున్న గడియలు, నిమిషములు, సెకండ్లు మొదలగు విభాగక్రమమును వారివలననే పొందియున్నాము. వారి పురాతన గ్రంథములలో సృష్టినిగూర్చియు, జలప్రళయమును గూర్చియు వ్రాయఁబడిన సంగతులు చాలమట్టుకు బైబిలు సంగతులకు సంబంధముగా నున్నవి.

V. బబులోను వారి మతము.—ఆ దేశములో ననేక పట్టణములును ఆ పట్టణములలో ననేక దేవతలునుండెను. బాబెలు వారీ దేవతలన్నిఁటిని కొలిచినట్లుగా నున్నది. దృష్టాంతముగా సూర్యదేవతయగు షామషు (*Shamash*), చంద్రదేవత సీను (*Sin*), కామదేవతయగు ఇష్టారు (*Ishtar*), బబులోను వారి యిష్టదేవతయగు మార్దూకు (*Marduk*), బోర్సిప్పా ఇష్టదేవతయగు నాబూ (*Nabu*), నిప్పూరు ఇష్టదేవతయగు బెల్ (*Bel*), తెగుళ్ల దేవతయగు నెర్గల్, (*Nergel*), అమవాస్య దేవతయైన నుస్కు (*Nusku*), అను నీ మొదలగు దేవతలు లెక్కలేకుండనున్నవి. ఆయా దేవతలను కొలిచినవారు

తమ దేవతలకు భగవంతుని లక్షణములన్నిఁటిని ఆరోపించిరి. ఈ దేవతలకైన స్తోత్రములను తెలుపు కీర్తనలు చాల కలవు. వాటికిని హిందువుల వేదములకును చాల సంబంధము కలదు.

బబులోను వారు మంత్రముల నెక్కువగా నమ్మిరి దయ్యములున్నవనికూడ నమ్మిరి. అవి తమకు హాని చేయకుండునట్లు వారు మంత్రములను ప్రయోగించుచుండిరి. కావున ఆ దేశములో సోదె చెప్పువారును భూతవైద్యులును ఎక్కువమంది యుండిరి. బాబెలు పట్టణములు సాధారణముగా ఆలయముచుట్టు కట్టఁబడెను. అవి యగ్రహారములై యున్నట్లుగానున్నది. ఆ పట్టణమునకు యాజకులు అధికారులై యుండిరి. ఇట్టి యాధిపత్యము రాజులకుకూడ నుండెను. అందుచే పట్టణము యొక్కయు ఆ దేశము యొక్కయు ప్రతిష్ఠగా నెంచఁబడెను. ఇందువలన నీరి మతము అనేక విధములుగా హిందువుల మతము నంటియుండి యున్నదని కనఁబడును.

**బయటి మరియొకగోడ** యెరూషలేము B IV 2 (2) చూ

**బయనా** (Baana, Baanah = విచారము గలవాఁడు)

1. సౌలు కుమారుఁడగు ఇష్బోషెతును కుట్ర చేసి చంపిన యిద్దరిలో నొకఁడు (II సమూ $4^{2-8}$) దావీదు అతనిని శిక్షించి చంపించెను ($4^{12}$).

2. దావీదు యోధులలో నొకఁడు (II సమూ $23^{29}$=I దిన $11^{30}$).

3,4. సొలొమోను కొఱకు ఆహారమును సంగ్రహించుట కేర్పఱచఁబడిన యుద్యోగస్థులలో నిద్దఱు (I రాజు $4^{12,16}$).

5. బాబెలు చెఱనుండి తిరిగి వచ్చిన వారిలో నొక కుటుంబమునకు పెద్ద (ఎజ్రా $2^{2}$ నెహె $7^{6}$ $10^{27}$).

6. నెహెమ్యా కాలములో యెరూషలేము ప్రాకారములను కట్టుటయందు ఒక వంతు తీసికొనిన సాదోకు అనునతని తండ్రి (నెహె $3^{4}$), 5,6 లలో చెప్పఁబడిన వారిద్దఱు ఒకరేయై యుండవచ్చును.

**బయరా** (Baara = మందబుద్ధి). షహరయీము అనునొక బెన్యామీనీయుని భార్యలలో నొకతె (I దిన $8^{8}$).

**బయల్ హానాను,** (Baal-Hanan = ప్రభువు దయ చూపును).

1. ఎదోము రాజులలో 7 వ వాని పేరు (ఆది $36^{38,39}$=I దిన $1^{49,50}$).

2. దావీదు క్రిందనుండిన యుద్యోగస్థులలో నొకఁడు (I దిన $27^{28}$)

**బయలతు** (Baalath = దొరసాని). దాను గోత్ర ప్రదేశమందు గెజెరు దగ్గర యుండిన ఒక గ్రామము (యెహో $19^{44}$). సొలొమోను దానిని కోటగా కట్టించెను (I రాజు $9^{18}$ II దిన $8^{6}$).

**బయలీసు** (Baalis = సంతోషించువాఁడు). నెహెమ్యా కాలములో అమ్మోనీయుల దేశమునకు రాజుగా నుండిన వాని పేరు. ఇఁడు గెదల్యాను చంపుటకై యిష్మాయేలును ప్రేరేపించిన వారిలో నొకఁడు (యిర్మి $40^{14}$).

**బయలు** (Baal ప్రభువు). పాఁత నిబంధన కాలమునందు సిరియా అరేబియాలలోని భాషలలో దేవత జాతియంతటికి చెందిన పేరు. పాఁత నిబంధన ప్రకారము ఈ మాట ఫేనీకేయుల యొక్కయు, ముఖ్యముగా తూరు ప్రజల యొక్కయు విగ్రహమునే సూచించెను. బయలు అష్టారోతుల పూజ సమరయలో హెబ్రీయుల మధ్య నెక్కువ గంభీరముగా నారంభించఁబడెను. సీదోను రాజైన ఎత్బయలు కుమార్తెయు, బయలు దేవతారాధికురాలునునైన యెజెబెలును వివాహమాడిన అహాబు ఏలుబడిలో నిది విస్తారముగా వ్యాపించెను

మోషే కాలమందలి (సంఖ్యా $22^{41}$ $25^{3}$) మోయాబీయులలోను, ఫేనీకేయులలోను, కాల్దీయులలోను బయలు ఆరాధన కనఁబడుటంబట్టి యది ప్రాచీన కాలమునుండియే యున్నట్టును, విస్తారముగా వ్యాపించినట్టును తెలియుచున్నది. ఎత్బయలు (I రాజు $16^{31}$) యెరుబ్బయలు (న్యాయా $6^{32}$) మున్నగు నామములలో బయలు

అను పదము కలిసి యుండుటంబట్టి యది వాస్తవ మని రుజువగుచున్నది. బబులోనీయులలో ఈ దేవత బెల్ అను నామమున ఆరాధించఁబడినట్లు కాన్పించుచున్నది. (యెష $46^{1}$ యిర్మీ $50^{2}$ $51^{44}$).



తూరులో పూజింపబడిన బయలు దేవత

బయలుయొక్క ఆలయములును, బలి పీఠములును ఉన్నత స్థలములందుండెను. ఆకాశ సైన్యమంతటిలో ముఖ్యముగా అష్తారోతుయొక్క ఆరాధనను యెరూషలేములోని యాలయములోకి మనష్షే ప్రవేశపెట్టెను (II రాజు $21^{3}$). ఆహాజు తన నగరపు మిద్దెమీఁద కట్టించిన బలిపీఠములను (II దిన $28^{2}$) యోషీయా నాశనము చేసెను. (II రాజు $23^{4,5}$).

మొలెకు దేవతకు ధూపమును బలిపశువులను, కొన్నిసార్లు మనుష్యుల బిడ్డలను అర్పించిన యాజకులే బయలు దేవతారాధనమును జరిగించిరి. (యిర్మీ $19^{5}$) ఆరాధన సమయములందు యాజకులు బలిపీఠము చుట్టు నాట్యమాడెడివారు లేక హెబ్రీమాట ప్రకారము కుంటెడువారు. వారి ప్రార్థనలకు జవాబు రానప్పుడు రక్తము కారే వఱకు కత్తులతో తమ దేహములను కోసికొనే వారు (I రాజు $18^{28,29}$). అష్తారోతు చంద్ర దేవతయైతే బయలు సూర్యదేవత యని చెప్పవచ్చును.

బయలు ఆరాధన ఇశ్రాయేలీయుల కెక్కువ శోధనకరముగా నుండెను.

బయలు అను మాటతో కలిసియున్న కొన్ని స్థానిక విగ్రహములు గలవు. ఉదా॥ బయల్బెరీతు, బయల్పెయోరు, బయల్జెబూబు (ఆ మాటల క్రింద చూ॥). B.

## బయలుపరచుట, ప్రకటన, ప్రత్యక్షము (Revelation).

1. అర్థము. మానవుఁడు దేవునిగూర్చి తెలిసికొనవలయునన్న దేవుఁడు తానే మానవునికి తెలియపఱచుకొనవలసి యున్నదని బైబిలు బోధించుచున్నది. ఈ పదముగా దేవుఁడు తన్ను బయలుపఱచుకొనుటను గూర్చి ఈ శీర్షిక క్రింద వివరింపఁబడును. పై నుదాహరించిన పదము లన్నియు ఈ యర్థమునే యిచ్చును.

ప్రకటన గ్రంథములోని ప్రకటన యను పదము కూడ దేవుఁడు బయలుపఱచినదానినే సూచించుచున్నది. బైబిలులోని చివర గ్రంథమున కీ రీతిగా ఆ పేరు సార్థకమైనది. బైబిలంతయు గూడ దేవుని ప్రకటన లేక ప్రత్యక్షతయని మనము తెలుచుగ చెప్పెదము.

2. ప్రత్యక్షత కలిగిన రీతులు. ఇవి మానవుని శక్తిసామర్థ్యాదులకుఁ దగినట్లు కలిగెను. అందువలన వీనిలో క్రమాభివృద్ధిని గాంచవచ్చును. ఆరంభమున దేవుఁడుగాని ఆయన దూతలుగాని కనఁబడిరి (ఆది $3^{7-9}$ $19^{1-22}$ $32^{30}$ నిర్గ $3^{2-4}$ $33^{11}$ ద్వితీ $5^{4}$ యెహో $5^{13-15}$ మొ॥).

తరువాత దేవుఁడు తన చిత్తమును స్వప్నముల ద్వారా బయలుపఱచెను (ఆది $28^{12}$ 40-41 దాని $2^{28}$ మ $1^{20}$ $2^{13,20}$ మొ॥). గాని, కలలద్వారా రాఁబోవు సంగతులను తెలుపఁగలమని నటించువారు శిక్షావిధికి లోనైరి (ద్వితీ $13^{1,2}$ యిర్మీ $2^{-9}$).

వీనికిఁ దరువాత దర్శనములను పేర్కొనవచ్చును (యెష $1^{1}$ $21^{2}$ $22^{1}$ మీకా $1^{1}$ హబ $2^{2}$ కార్య $10^{10}$ $22^{17}$ II కొరి $12^{2-4}$).

పాఁత నిబంధన కాలములో దేవుని చిత్తమును తెలిసికొనుటకు ఊరీము తుమ్మీములనునవి ప్రత్యేక సాధనములుగా నెంచఁబడెను (ఊరీము తుమ్మీము చూ॥).

ప్రవక్తలైనవారు ఆత్మావేశముచే మాట్లాడినప్పుడు ప్రత్యక్షత క్రమమునందు గొప్ప యుగ మారంభమాయెనని చెప్పఁడగును. ఇదియు పాఁత నిబంధన కాలములో నారంభమై క్రొత్త నిబంధన

కాలములో పూర్తియయ్యెను (యెష $61^{1}$ II పేతు $1^{21}$ మొ॥ ప్రవచనము చూ॥).

ఈ ప్రత్యక్షత యేసుక్రీస్తునందు అంతమై పరిపూర్తిజెందెను (హెబ్రీ $1^{1-3}$). దేవుని విషయమై మానవులకు కావలసిన పూర్ణ జ్ఞానము తనద్వారా కలిగినదని యేసు చెప్పెను (మ $11^{25-27}$). అది ఆయనద్వారా మాత్రమే కలుగగలదు. దీనికి సంబంధముగా ఆయనకు వాక్యము అను పేరు వచ్చెను (యోహా $1^{1,2}$). నరరూప ధారియగు దేవుడు గాన ఆయన దేవుని బయలుపఱచెను ($14^{9}$ కొలొ $2^{3}$ హెబ్రీ $1^{1\ 3}$). పునరుత్థానుడై పరలోకమున కేగిన పిమ్మట యోహానుకు కలిగిన ప్రత్యక్షతనుగూర్చి ప్రకటన గ్రంథము చూ॥.

3. ప్రత్యక్షత బైబిలునందు మాత్రమే గలదా? ఈ ప్రశ్నకు జవాబు బైబిలులోనే యున్నది (కీర్త $19^{1}$ కార్య $14^{17}$ రోమా $1^{20}$ $2^{14,15}$). సృష్టియందు తాను చేసిన కార్యముల ద్వారాను మానవుని సహజజ్ఞానము, తప్పొప్పులను వివేచించు బుద్ధిద్వారాను మానవులందఱికి ఆయన తన్ను బయలుపఱచుకొనెను. పాపము ప్రవేశించని యెడల మానవుడు తనకున్న సహజ శక్తుల ద్వారా దేవుని తెలిసికొనుటకు వీలుగలుగునదే యని బైబిలు ద్వారా కనుగొనవచ్చును గాని పాపము వచ్చినందున దేవుడు తన్నుగూర్చి ప్రత్యేకముగా ప్రత్యక్షపఱచుకొనుట అవసరమాయెను. అవసరమునకు తగినట్లు దేవుడు తన్ను తాను బయలుపఱచుకొనెను. మానవులందఱు స్వాభావికముగా దేవునిగూర్చిన జ్ఞానము కొద్దియో గొప్పయో కలిగియున్నా రనుటయే దేవుడు తన్నుగూర్చి బయలు పఱచుకొనెనను సంగతిని సూచించుచున్నది. ఆ జ్ఞానమును పరిపూర్ణము చేయుటకే దేవుడు ప్రేమాస్వరూపియగు క్రీస్తును అనుగ్రహించుట ద్వారా, మఱి ముఖ్యముగా సిలువవేయఁబడిన క్రీస్తు ద్వారా లోకమునకు బయలుపఱచెను.

**బయలు హామోను** (Baal-Hamon = సమూహమునకు ప్రభువు). సొలొమోను తోఁటలలో నొకటియున్న స్థలము (పర $8^{11}$). దీని యునికినిగూర్చి తెలియదు.

**బయల్గాదు** (Baal-Gad = ప్రభుసదృష్టము). హెర్మోను కొండ దిగువనున్న యొక స్థలము (యెహో $13^{5}$). లెబానోను లోయలో నున్నది ($11^{17}$ $12^{7}$). యెహోషువ కాలములో ఇశ్రాయేలీయులు స్వతంత్రించుకొనిన దేశమునకు ఉత్తర సరిహద్దయి యుండెనుగాని దాని సరియైన యునికి యేదో రూఢిగాఁ దెలియదు. అదృష్ట దేవతా పూజస్థలమై యుండునని కొందరు దాని పేరునుబట్టి యూహింతురు.

**బయల్జెబూబు, బయల్జెబూలు** (Baal-Zebub = ఈఁగల ప్రభువు, Beel-Zebul = చెత్తకు ప్రభువు, నగరమునకు ప్రభువు). ఫిలిష్తీయులు ఎక్రోనులో పూజించిన యొక దేవత (II రాజు $1^{2,3-6-16}$). ఇది సూర్యదేవత యని కొందఱి యభిప్రాయము. అది యీఁగలను సంహరించుటచే ఈ పేరుకలిగెను. అట్లుకాకున్న యూదులు పరిహాసమునకు ఆ పేరు బయల్జెబూలు అని మార్చియుందురు. నగరమునకు ప్రభువను అర్థమిచ్చు పదమే దీని సరియైన పేరనియు చెత్తకు ప్రభువని యర్థము చెప్పుట అపహాస్యార్థమనియు కొందఱు పండితుల యభిప్రాయము. పేరును బట్టి యిది యొక గృహదేవతయని యూహింపఁదగును. క్రొత్త నిబంధన కాలములో యూదులీ దేవత పేరును దయ్యముల కధిపతియైన వాని కారోపించిరి (మ $10^{25}$ $12^{24}$ మా $3^{22}$ లూ $11^{15-18,19}$). ఇతఁడు సాతానుగా నెంచఁబడినట్లు మ $12^{27}$ మా $3^{22}$ లూ $11^{18}$ వలన స్పష్టమగుచున్నది.

**బయల్పెయోరు** (Baal-Peor = పెయోరుకు ప్రభువు). మోయాబు దేశములో పెయోరు అను పట్టణమందుగాని, కొండమీఁదఁగాని (సంఖ్యా $23^{28}$) పూజింపఁబడిన బయలు దేవత. అచటనుండిన దేవదాసీలు అరణ్య సంచారమందుండిన ఇశ్రాయేలీయులలో ననేకులను శోధించి ఆ దేవతతట్టు త్రిప్పినందున ఇశ్రాయేలీయులకు గొప్ప శిక్ష కలిగెను ($25^{3-9}$ ద్వితి $4^{3}$ కీర్త $106^{28}$). హోషే $9^{16}$ చూడఁగా ఇదియొక దేవతకుగాక ఒక స్థలపు పేరై యున్నట్లున్నది (పెయోరు చూ॥).

**బయల్పెరాజీము** (Baal-Perazim = ప్రాకారములను పడగొట్టుటకు శక్తినిచ్చు ప్రభువు) యెరూషలేము దగ్గరనుండిన యొక స్థలము. దీని సరియైన యునికిని గూర్చి యింక నూటిగా దెలియదు. దావీదు ఈ స్థలమునందు ఫిలిష్తీయుల నోడించెను (II సమూ $5^{18-20}$ I దిన $14^{9-11}$ యెష $28^{21}$).

**బయల్బెరీతు** (Baal-Berith = నిబంధనకు ప్రభువు) గిద్యోను చనిపోయిన పిమ్మట షెకెము పట్టణస్థులు తమ్మును కాపాడి రక్షించుటకుగాను పెట్టుకొని ఆరాధించిన దేవత (న్యాయా $8^{33}$ $9^{4}$). B.

**బయల్మెయోను, బేత్మెయోను** (Baal-Meon = నివాసములకు ప్రభువు, Beth-meon = నివాసపు టిల్లు). మోయాబు అమ్మోను సరి హద్దులకు సమీపమునయుండిన యొక పట్టణము (సంఖ్యా $32^{37}$ యెహె $25^{9}$). దేశమును పంచి పెట్టినప్పుడు దీనిని రూబేనీయుల కిచ్చిరి (సంఖ్యా $32^{37}$ I దిన $5^{8}$). యెహో $13^{17}$ నందు దీనికి బేత్బయల్మెయోను అను మాఱుపేరు గలదు. మోయాబు రాజైన మేషా దానిని మరల జయించుకొనెనని మోయాబు రాతి శాసనమువలనఁ దెలియుచున్నది. క్రీ॥ పూ॥ ఆఱవ శతాబ్దములో అది మోయాబు రాజ్యముతో చేరియుండెనని యెహె $25^{9}$ యిర్మీ $48^{23}$ (బేత్మెయోను) వలనఁ దెలియును. దాని పాడు శేషములు నేటివఱకు నున్నవి. ప్రస్తుతమందు వాటికి మాయీను (*Main*) అని పేరు. అది మృతసముద్రమునకు ఉత్తరపు భాగమునకు 10 మైళ్ల దూరములో నున్నది (పటము II, J 1).

బయల్షాలిషా (Baal-Shalisha = మూఁడవ వంతుకు ప్రభువు). ఎఫ్రాయిములోని యొక స్థలము (II రాజు $4^{42}$). ఒకఁడచ్చటి నుండి ప్రథమ ఫలములను దెచ్చి ఎలీషా కర్పించెను. I సమూ $9^{4}$ లోని షాలిషాయను దేశము దీనికి సంబంధించినదని కొందఱి యభిప్రాయము (పటము III, E 4).

**బయల్సెఫోను** (Baaal-Zephon = సెఫోను లేక జాగరూకతకు ప్రభువు). ఇశ్రాయేలీయులు ఎఱ్ఱసముద్రమును దాటక పూర్వము మకాము చేసిన యొకస్థలము (నిర్గ $14^{2,9}$ సంఖ్యా $33^{7}$). దీని యునికినిగూర్చి ఇంక నూటిగాఁ దెలియదు.

**బయల్హాసోరు** (Baal-Hazor = గ్రామ ప్రభువు). ఎఫ్రాయిములోనున్న యొకస్థలము. అబ్షాలోము అచ్చట తన గొఱ్ఱెల బొచ్చును కత్తిరించెను (II సమూ $13^{23}$). ప్రస్తుతమాపదము టెల్-ఆసూరు (*Tell' Asur* = ఆసూరు కొండ) అను మాటలో నున్నదని యనుకొందురు (పటము III, F 5).

**బయల్హెర్మోను** (Baal-Hermon = హెర్మోను ప్రభువు). యొర్దానునకు తూర్పువైపున నున్న మనష్షే అర్ధ గోత్రపు వాయవ్య సరిహద్దుగానున్న యొక స్థలము (న్యాయా $3^{3}$ I దిన $5^{23}$). యెహో $13^{5}$ ను న్యాయా $3^{3}$ తో సరిపోల్చి అది బయల్గాదుకు మాఱుపేరని యందురు గాని హెర్మోను శిఖరములలో నొకటి యను కొనుట యుక్తము. దీని యునికిని గూర్చి నూటిగాఁ దెలియదు.

**బయశేయా** (Baaseiah = యెహోవా చేసినది). గెర్షోను తెగవారిలోనున్న యొక లేవీయుఁడు. ఇతఁడు గాయకుఁడగు ఆసాపు యొక్క పూర్వీకులలో నొకఁడు (I దిన $6^{40}$).

**బయులా** **యెహోవా** చూడు I వా॥

**బయెషా** (Baasha). ఇశ్రాయేలు వారి రాజ్యము **అను** పది గోత్రముల రాజులలో మూఁడవవాఁడు. ఇతఁడు మొదటి యరొబాము కుమారుఁడగు నాదాబును కుట్రచేఁ జంపించి ఆ రాజ్యము నపహరించి తిర్సాను రాజధానిగాఁ జేసికొనెను (I రాజు $15^{25-34}$). ఇతఁడు యూదా రాజైన ఆసాతో ఎడతెగక యుద్ధము చేయుచుండెను. ఆసా సిరియ రాజగు బెన్హదదుతో సంధి చేసికొనినందున బెన్హదదు ఉత్తరము నుండి బయెషా దేశము మీఁదికి దండెత్తి వచ్చినందున బయెషా తాను యూదా సరిహద్దు దగ్గరనున్న రామాలో ప్రాకారములను కట్టుటను మానుకొనవలసి వచ్చెను ($15^{16,22}$ యిర్మీ $41^{9}$). మొదటి యరొబాము స్థాపించిన దూడ విగ్రహపు పూజను బయెషా యుద్ధరించుచుండెను. అందువలననే అతని సంతతివారు నిర్మూలమగుదురని ఒక ప్రవక్త అతనికిఁ దెలిపెను (I రాజు

$16^{1-5}$). అతడు 24 సంవత్సరము లేలిన పిమ్మట చనిపోయెను. తరువాత ఇతని కొడుకగు ఏలా ప్రభుత్వము చేసెను ($16^{6,7}$).

**బర్** (Bar). కుమారుడు అని యర్థమిచ్చు అరమేయిక్ ఉపసర్గ. ఇది యితర పదములతో కలిసి సమాసమగును. బర్ యేసు (కార్య $13^{6}$) బర్నబా ($4^{36}$) బర్సబ్బా ($1^{23}$) బర్తొలొమై (లూ $6^{14}$) బర్తిమయి (మా $10^{46}$) మొదలగునవి కొన్ని దృష్టాంతములు. హెబ్రీ భాషలోని బెన్ అను దానికి సాటియైనది.

**బర్‌యేసు** (Bar = Jesus = యేసు కుమారుడు) కుప్రకర్తకారియైన సెర్గి పౌలుతో నుండిన యొక గారడీవాడు. ఇతడు పౌలు నెదిరించి కొంతకాలమువరకు గ్రుడ్డివాడగునట్లు శాపము నొందెను (కార్య $13^{6-12}$). అతనికి ఎలుమ యను మారుపేరు కలదు ($13^{8}$). అది అరమేయిక్ పదమై గొప్ప యక్షిణి కాడని యర్థమిచ్చును. గారడి సీమోనువలె ($8^{9}$) యితడును తాను గొప్పవాడని తెలియజేయు నిమిత్తము ఈ బిరుదును పెట్టుకొనెను. E.

**బర్‌యోనా** (Bar = Jonah). సీమోను పేతురుయొక్క మారుపేరు. యోనా కుమారుడని దీని కర్థము (మ $16^{17}$). దీనికి యోహా $1^{42}$ $21^{15,17}$ లోను యోహాను కుమారుడను రూపాంతరమున్నది (పేతురు చూ॥).

**బరకేయులు** (Barachel = దేవుడు దీవించును). యోబు స్నేహితుడగు ఎలీహు తండ్రి (యోబు $32^{26}$). ఇట సార్థక నామమును కొందఱి యభిప్రాయము.

**బరబ్బ** (Barabbas = అబ్బాలేక తండ్రి యొక్క కుమారుడు). యేసుక్రీస్తు విమర్శింపబడిన కాలమున ఖైదులో నుండినవాడు. ఇతడు దొంగయు నరహంతకుడునై యుండెను (లూ $23^{18}$ యోహా $18^{40}$ మా $15^{7}$ మ $27^{15}$). పస్కా పండుగ సమయమున ఒక ఖైదీని విడిపించు వాడుకగలదు (మా $15^{6}$). పిలాతు యేసును విడిపింపగోరి వారి నడిగినప్పుడు యాజకుల ప్రేరేపణచే (మ $27^{20}$) జనులు పిలాతును గోరుకొనిరి. యూదులు నీతిమంతుడగు క్రీస్తును విసర్జించి నరహంతకుడగు వానిని కోరుకొనుట వారి దోషములన్నిటిలో ఘోరమైనదని పేతురు జనులకు ప్రకటించెను (కార్య $3^{14}$). E.

**బరువు** భారము, మానములు చూ॥

**బర్కోసు** (Barkos = రంగుపూయువాడు). జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు వెళ్లిన నెతీనీయులలో నొక కుటుంబికుడు (ఎజ్రా $2^{53}$ నెహె $7^{55}$).

**బర్జిల్లయి** (Barzillai = ఇనుప).

1. గిలాదు దేశములోని స్థితివంతులలో నొకడు. అబ్షాలోము తిరుగుబాటు చేసినపుడు దావీదు ఆ ప్రదేశమునకు పారిపోగా ఇతడు దావీదునకు చాల సహాయము చేసెను (II సమూ $17^{27}$). దావీదు తిరిగి వెళ్లునప్పుడు తన వెంట వచ్చి తన నగరులో నుండుటకు రమ్మని బర్జిల్లయి నడిగెను గాని, బర్జిల్లయి అందుల కొప్పుకొనక తన కొడుకులలో నొకడు దావీదు వెంటవచ్చుటకు సెలవిమ్మని యడుగగా దావీదు అంగీకరించెను ($19^{31-39}$).

2. రాజైన సౌలుయొక్క అల్లుడగు అద్రియేలు తండ్రి (II సమూ $21^{8}$).

3. పైన 1 లోని బర్జిల్లయి కుమార్తెకు పుట్టిన యొక యాజకుడు. చెఱకాలమునకు పిమ్మట అతని సంతతివారు యెరూషలేమునకు తిరిగివచ్చిరి గాని వారు తమ వంశాను క్రమణికలను నిర్ధారణ చేయలేకపోవుట చేత వారిని యాజకులలో చేర్చుకొనరైరి (ఎజ్రా $2^{61}$ నెహె $7^{63}$).

**బర్తిమయి** (Bartimaeus = తీమయి కుమారుడు). యేసు చివరి సారి యెరూషలేమునకు వెళ్లుచుండగా యెరికో పట్టణము యొద్ద బాగు చేసిన యొక గ్రుడ్డి భిక్షకుడు. ఇతనికి ఆయన యందు గొప్ప విశ్వాసము కుదిరెను (మా $10^{46}$). జనసమూహమెంత చెప్పినను ఊరకుండక కేకలు వేసి అడిగెను. అతని విశ్వాసమునుబట్టి ఆయన అతనిని స్వస్థపఱచెను. E.

**బర్తొలొమై** (Bartholomew = తొలొమై కుమారుడు). అపొస్తలులలో నొకడు (మ $10^{3}$ మా $3^{18}$ లూ $6^{14}$ కార్య $1^{13}$). నతనయేలు ఇతడే యని యందురు (నతనయేలు చూ॥). ఇతడు హిందూదేశములోకి సువార్త ప్రకటింపనై

వచ్చినవాఁడను ఐతిహ్యము కలదుగాని దానికి తగినంత ఆధారములేదు. ఇతనిగూర్చి బైబిలునందింకేమియును లేదు. E.

**బర్నబా** (Barnabas = హెచ్చరించువాఁడు) కుప్రలో పుట్టిన లేవీయుఁడగు యోసేపను నొకఁడు. ఇతనికి అపొస్తలులు హెచ్చరిక చేయువాఁడను అర్థమిచ్చు బర్నబాయను పేరు పెట్టిరి (కార్య $4^{36}$). ఇతఁడు తన పొలమమ్మి దానిని క్రైస్తవుల కొఱకిచ్చెను ($4^{37}$). మార్కు సమీప బంధువుఁడని కొలొ $4^{10}$ వలనఁ దెలియుచున్నది. అందువలన ఇతఁడు మార్కు మేనమామయని కొందఱి యభిప్రాయము. మిక్కిలి మంచివాఁడును దయగలవాఁడునై యుండి ఇతరులను గూర్చి మంచి సంగతులను మాత్రము మాట్లాడువాఁడు. ఇతరులు పౌలు విషయము భయపడినప్పుడు బర్నబా అతనిని చేరఁదీసెను (కార్య $9^{27}$). పౌలు మార్కు విషయమై విసికిపోయినను బర్నబా అతనిని చేర్చుకొనెను ($15^{39}$). అప్పటినుండి వారిద్దరు వేరుగా పనిచేసినను ఒకరినిగుఱించి యొకరు గొప్పగా చెప్పుకొనిరి (I కొరి $9^{6}$).

అంతియొకయలో కొందఱు విశ్వసించినపుడు యెరూషలేములోని వారు బర్నబాను అక్కడికి పంపిరి. అతఁడు తరువాత తార్సుకు వెళ్లి పౌలును తెచ్చెను (కార్య $11^{19-26}$). అంతియొకయవారు యెరూషలేముకు చందాలను పంపినప్పుడు బర్నబానుకూడ పంపిరి ($11^{30}$). పౌలుతోఁ గలిసి మొదటి మిషనెరీ ప్రయాణము చేసెను ($13^{3}$-$14^{28}$). యెరూషలేములో కూడిన మొదటి క్రైస్తవ మహాసభలో అన్య క్రైస్తవుల పక్షమున మాట్లాడెను ($15^{1,2,12}$). పౌలునుండి వేరైనపిదప మార్కును వెంటఁ బెట్టుకొని కుప్రకు వెళ్లెను ($15^{36}$). బర్నబానుగూర్చిన తరువాతి చరిత్ర తెలియదు. పౌలు ఎఫెసులోనుండగా అతఁడు స్వంతముగా జీవనము గడుపుకొనుచు సువార్త బోధించుచుండినట్లు I కొరి $9^{6}$ వలనఁ దెలియుచున్నది. E.

**బరసబ్బా** యూస్తు 1, యూదా 13 చూ॥

**బర్హీముడు** ఇశ్రాయేలీయుడు చూ॥

**బర్హుమీయుడు** బహూరీము చూ॥

**బలదాను** (Baladan = కుమారుని యను గ్రహించెను). మెరోదక్బలదాను అను బాబెలు చక్రవర్తియొక్క తండ్రి (II రాజు $20^{12}$ యెష $39^{1}$ మెరోదక్బలదాను చూ॥).

**బలాత్కారము** క్రూరత్వము చూ॥

**బలిపీఠము** (Altar). హెబ్రీ భాషయందు ఈపదమునకు వధాస్థానమని శబ్దార్థము. గుడారమునకు సంబంధించిన నియమములకు పూర్వము నుంచియే బలిపీఠములు కట్టిరి. అవి ఇతరులు కట్టిన బలిపీఠముల వంటివే. వాటిని మట్టితో గాని, చెక్కఁబడని రాతిరాళ్లతో గాని కట్టిరి (నిర్గ $20^{24}$). నోవహు (ఆది $8^{20}$), అబ్రాహాము ($12^{7}$ $13^{4}$ $22^{9}$ మొ॥), ఇస్సాకు ($26^{25}$), యాకోబు ($33^{20}$ $35^{1}$ $35^{7}$), మోషే (నిర్గ $17^{15}$) మొదలగువారు, ధర్మశాస్త్రము నియమింపఁబడక పూర్వమే అట్టి బలిపీఠములను కట్టించిరి. దానిపై నూనెఁ బోసి దాని ప్రతిష్ఠించినట్లు ఆది $28^{18}$ వలన నూహింపఁదగును. రక్తముతో మాంసమును తినకూడదనియు, రక్తమును చిందించి దాని తినవలెనను కఠినమైన యేర్పాటొకటి గలదు (లేవీ $7^{26,27}$). I సమూ $14^{31-35}$ చూడఁగా ఆ నియమమును అమలులోనికి తెచ్చుటకు సౌలు ఒక చోట ప్రత్యేకముగ బలిపీఠమును కట్టించినట్లు కనఁబడును.

కనానీయులు ప్రతి ఉన్నత స్థలమునందును అట్టి పీఠములు కట్టుకొనిరి. అట్టి వేదికలు శిథిలములయందిప్పటికిని కనఁబడుచున్నవి. ఇశ్రాయేలీయులును అట్టి స్థలములలో పీఠములను కట్టించిరి (I సమూ $9^{12}$ I రాజు $3^{2}$ $11^{7}$ మొ॥). మఱి ముఖ్యముగా నెచ్చట దేవుఁడు పూర్వీకులకు ప్రత్యక్షమాయెనో అట్టి స్థలములయందు వారు కట్టించిరి (ఆమో $5^{5}$ హోషే $10^{8}$).

పాత నిబంధన నియమములను జాగ్రత్తగా పరిశీలించిన యెడల, వారు అనేకములైన యట్టి వాడుకలలోని విగ్రహారాధనకు సంబంధించిన వాటిని పూర్తిగా ఖండించి, అవి మానవుల పాపస్థితికిని దేవుని పరిశుద్ధతకును తగిన నేర్పులను సూచించునట్లు వాటిని సవరించిరి. ఇట్లు బలిపీఠమును గుడారమునందును, దేవాలయమునందును వాడిరి (గుడారము 6 (1) (*a*), దేవాలయము

I 7, II 2, III 1 చూ॥). ఒక దేశమునం దొక్క బలిపీఠము మాత్రముండవలెనను నియమము గలదు (ద్వితీ $7^{5}$ $12^{3}$ $12^{27}$). ఏక దేవుని గూర్చిన జ్ఞానము ఇట్లు బోధించుట మాత్రమే గాక యజ్ఞముల నర్పించుటచేత పొందవలసిన నేర్పు నీ విధముగా కూడ వెల్లడి చేయఁగలిగి యున్నారు. ప్రాయశ్చిత్తము లేకుండ క్షమా పణ లేదను బోధ దానిలో మిగుల ముఖ్యమైనది (హెబ్రీ $9^{22}$ అర్పణము చూ॥).

**బలులు** అర్పణములు I చూ॥

**బల్ల** (Table). బైబిలు కాలమునందు ఆహార వస్తువులను బల్లలమీఁద పెట్టుకొని భోజనము చేయుట వాడుకగానున్నట్లు ఆయా వాక్య ములలో కనబడును (న్యాయా $1^{7}$ II సమూ $9^{7,10}$ I రాజు $2^{7}$ $4^{27}$ కీర్త $23^{5}$ యెహె $40^{38}$ మా $7^{28}$ లూ $16^{21}$ మొ॥). ఆహారమును పంచి పెట్టుటను గురించి కూడ బల్లలయొద్ద పరిచర్య చేయుట యనఁబడెను (కార్య $6^{2}$ భాషాంతరము). రూకలు మార్చువారు తమ రూకలను బల్లలమీఁద పెట్టుకొనిరి (మా $11^{15}$). దీనినిబట్టి వ్యాపా రాదులు చేయువారు వీటిని తమ పనులకుపయో గించు కొనిరని కనఁబడుచున్నది. గుడారము లోని దేవాలయమునందును సముఖపు రొట్టెల నుంచిన బల్లలు బంగారపు రేకుతో పొదగఁబడెను. (గుడారము 6 (2) (*a*), దేవాలయము 7 (2) (*a*) చూ॥). యెహెజ్కేలు దేవాలయమును గురించి వివరించుచుండఁగా యజ్ఞములను సిద్ధ పఱచుటకు అందులోనున్న బల్లలనుగూర్చి కూడ నుదాహరించెను (యెహె $40^{39}$). ప్రభు రాత్రి భోజనమును మొదట బల్లయొద్ద తినినందున అది ప్రభువు బల్లయనఁబడెను (ప్రభువు రాత్రి భోజ నము చూ॥).

**బల్ల పరుపు** ఇల్లు I 4 చూ॥

**బల్లి** కీటకములు 25 చూ॥

**బల్లెము** ఆయుధములు I 3 చూ॥

**బవ్వై** (Bavvai). నెహెమ్యా కాలము నందు యెరూషలేము ప్రాకారములో నొక ప్రత్యేక భాగమును కట్టించిన పంతు పెద్దలలో నొకఁడు (నెహె $3^{18}$).

**బహు భార్యాత్వము** వివాహము చూ॥

**బహుమానము** ఈవి, పందెము చూ॥

**బహూరీము, బర్హుమీయుడు** (Bahurim = యౌవనస్థులు, Barhumite). దావీదు తన భార్యయగు మీకాలును తిరిగి రప్పించుకొని నప్పుడు ఆమె మగఁడు పెనిమిటియగు పల్తీయేలు ఏడ్చుచు వచ్చిన స్థలము (II సమూ $3^{16}$). దావీదు అబ్షాలోముకు తిరుగుబాటు సమయమున పారిపోవుచుండఁగా అతనిని శపించిన షిమీయను వానిది ఈ యూరే ($16^{5}$). అబ్షాలోము సంగతిని దావీదుకు తెలుపనై వచ్చిన యిద్దరు దూతలీ స్థలము దగ్గరనున్న బావిలో దాగుకొనిరి ($17^{18,19}$). దావీదు యోధవరులలో అజ్మావెతు అనువానిది కూడ ఈ యూరే. అతఁడు బర్హుమీయుఁ డనఁ బడెను. ($23^{31}$). యెరూషలేమునకు ఈశాన్య మందుండు అనాతోతునకు $1\frac{1}{2}$ మైళ్ల దూర మందుండు అల్మీతు (*Almit*) ఇదేయని పారం పర్య మొకటి గలదు. ఇది నిజమైయుండును.

## బా

**బాకా** సంగీతము 3 (2) (*c*) చూ॥

**బాకాలోయ** (Valley of Baca = అంగ లార్పులోయ). కీర్త $84^{6}$ లో మాత్రము ఈ పేరుగలదు. అది యెరూషలేము దగ్గఱనుండిన యొక లోయకు పేరని కొంద ఱూహింతురు గాని అది యట్లుగాక మనుష్యులకు వారి వ్యవ హారములలో కలుగు కష్టములను సూచించు నొక అలంకారమని సాధారణముగా ననుకొందురు. అదేరీతిగా కీర్త $23^{4}$ లో కూడ అట్టి కష్టములను సూచించుటకై గాఢాంధకారపు లోయ యను మాటను వాడియున్నారు. II సమూ $5^{23,24}$ నందున్న కంబళిచెట్లు అని తెనిఁగించిన అసలు మాట బాకాచెట్లు అగుటచే కొందఱు ఆ చెట్ల వలన దీని కీపేరు వచ్చినదనుకొందురు. అది నిజమైన యెడల ఈ లోయ వేరు లోయగాక రెఫాయీము లోయకు మఱు పేరనుకొన వచ్చును.

**బాకీ** అప్పు చూ॥

**బాణము** ఆయుధములు I 6 చూ॥

**బాదము చెట్టు** (Almond). సిరియా దేశములో మిగుల సాధారణమైన చెట్టు 15—30 అడుగుల ఎత్తు పెరుగును. శీతాకాలములో దీని యాకులన్నియు రాలిపోయిన పిమ్మట హఠాత్తుగా పూమొగ్గలు కనఁబడును. కొద్ది దినములలో చెట్టంతయు పూభరితమై యుండును. పుష్పము లన్నియు రాలి పిందెలేర్పడును. తరువాత ఆకులు వచ్చును. దీని కాయలు ఆ దేశస్థుల కెంతో యిష్టము (ఆది $43^{11}$ నిర్గ $25^{33}$ సంఖ్యా $17^{8}$). యిర్మీ $1^{11}$ లో బాదముయని తెనిఁగించఁబడిన షాకేదు అను పదమునకు కనిపెట్టుట యను అర్థము కూడ కలదు. దేవుఁడు తన వాగ్దానములను నెఱవేర్చుటకు కనిపెట్టునను దానికి సూచనగా ద్వంద్వార్థమిచ్చు ఈ పదమును వాడెను. ప్రసంగి $12^{5}$ లో నున్నట్లు బాదము వృక్షము పూవులు పూయునను వాక్యమునకు వృద్ధుని వెంట్రుకలు బాదము వృక్షమువలె తెల్లగానగునని యర్థము.

J. C.

**బాధించుట** క్రూరత్వము చూ॥

**బానిస, బానిసత్వము** దాసుడు చూ॥

**బానీ** (Bani = కట్టెను). 1. జెరుబ్బా బెలుతోకూడ యెరూషలేమునకు తిరిగివచ్చిన ఇశ్రాయేలు కుటుంబ పెద్దలలో నొకఁడు (ఎజ్రా $2^{10}$ నెహె $9^{4}$).

2. బిన్నూయి 1 చూ॥

**బాప్తిస్మము** (Baptism). బాప్తిస్మమను నది యొక గ్రీకుపదము. దీనికి సంబంధించిన ధాతువు ముంచుట యని యర్థము. ఆ పదమునకే స్నానము చేయుట యనునర్థమును గలదు (లూ $11^{38}$). బైబిలునందు ప్రయోగించునట్టి పదము యోహాను చర్యకు సంబంధించిన యాచారమును (మా $1^{4-9}$ $6^{14\ 24}$ $11^{30}$ లూ $7^{29}$ కార్య $1^{5,22}$ $10^{37}$ $13^{24}$ $18^{25}$ $19^{3,4}$) క్రీస్తును నమ్మి యొప్పుకొన్న వారాచరించిన యాచారమును (కార్య $2^{38-41}$ $8^{12,16,36-38}$ $9^{18}$ $10^{47-48}$ $16^{15,33}$ $18^{8}$ $19^{3-5}$ $22^{16}$ I కొరి $1^{13-17}$ ఎఫె $4^{5}$ I పేతు $3^{21}$) సూచించును.

యోహాను యాచారమును క్రొత్తగా నారంభించెనా అంతకుఁ బూర్వమునుంచి యున్నదా యను దానినిగూర్చి తాత్పర్యభేదము గలదు. పాతనిబంధనయందు శుద్ధివిషయమైన ఆచారములు కొన్ని గలవు (నిర్గ $29^{4}$ $30^{20}$ $40^{12}$ లేవి 15, $16^{26,28}$ $17^{15}$ $22^{4-6}$ సంఖ్యా $19^{18}$). తరువాత అనేకమైన వాటిని యూదులు వాటితోఁ జేర్చినట్లు పారంపర్యమువలనఁ దెలిసికొనవచ్చును (మా $7^{3,4}$ హెబ్రీ $6^{2}$). యూదమతమును స్వీకరించిన యూదమతేతరులను మత ప్రవిష్టులని పిలిచిరి (కార్య $2^{10}$ $6^{5}$ $13^{43}$). అట్టివారిని మతములోనికిఁ జేర్చుకొనునప్పుడు శుద్ధీకరణాచారమునకు సంబంధమగు స్నానాదులకు లోనగునట్లు జేసిరి. యోహాను బాప్తిస్మమిట్టిదేనని కొందరి యభిప్రాయముగాని అది యథార్థము కాదు. యోహానుకు పెట్టిన బిరుదునుబట్టి అది యటువంటిదిగాక ఆతని పనికి సంబంధించిన యొక విశేష యాచారముగా నియమించఁబడినట్లు స్పష్టమగుచున్నది.

యోహాను బాప్తిస్మము మారుమనస్సు విషయమైన బాప్తిస్మము (మ $3^{8}$ మా $1^{4}$ లూ $3^{3}$ కార్య $19^{4}$). రాఁబోవు క్రీస్తు రాజ్యమందుఁ ప్రవేశింపఁ గోరెడివారు మారు మనస్సునొంది నీతిగ నడచెను క్రమపడుము కొనవలెనని కోరెను వారికి అట్టి యొప్పుదలకు సూచనగా బాప్తిస్మమిచ్చి వారిని తన శిష్యులనుగాఁ జేర్చుకొనెను (యోహా $1^{35}$). ఇట్లు యోహానుచే బాప్తిస్మము నొందినవారు ఆయా ప్రదేశములలోఁ దిరుగుచు ఆ బోధ నంగీకరించినవారికి బాప్తిస్మమిచ్చినట్లు కనఁబడుచున్నది (కార్య $18^{25}$ $19^{1-7}$). అది క్రీస్తుపూర్వము దిన స్నానాదులను చేయుచువచ్చిన యొక చిన్న శాఖ (*Hemerobaptists*) వారితోఁ గలిసి సంగతియే స్పష్టమగుచున్నది. యోహాను యాచారము నిత్యము నుండవలసినదని తలంచక, అది సంపూర్ణమైనది కాదనియు, వట్టి బాహ్యాచారమే యనియు క్రీస్తు వచ్చినప్పుడు ఆయన పరిశుద్ధాత్మతోను అగ్నితో నిచ్చు ఆంతర్య బాప్తిస్మమే నిజమైన బాప్తిస్మమనియు చెప్పెను (మ $3^{11}$ మా $1^{8}$ లూ $3^{16}$ యోహా $1^{33}$ కార్య $19^{4}$) యోహాను పని అప్పటికాల యావసరమునుబట్టి దేవునిచే నియమింపఁబడినదై యున్నది (మ $21^{24-31}$ లూ $7^{30}$ యోహా $1^{33}$). అది దేవుని యేర్పాటయినందువలననే యేసు తానుకూడ నీతి యావత్తును నెఱవేర్చుటకు దానిని పొందెను (మ $3^{13-17}$ మా $1^{9-11}$

లూ 3[15,20]). ఆ యాచారమువలన మనము నెరవేర్పవలసిన నీతిని తాను నెరవేర్చుటమాత్రమే గాక తాను చేయవలసియుండిన గొప్పపనికై తన్ను తాను ప్రతిష్ఠించుకొని దాని కాయత్త పఱచఁబడినవాఁడై పరిశుద్ధాత్మను దృశ్యమగు రీతిని పొందెను. దీనిని గొప్పదిగా నెంచిన యోహాను తాను దీని విషయమై సాక్ష్యమిచ్చు నిమిత్తము పంపఁబడితినను ఒక్కటే యుద్దేశముతో బాప్తిస్మ మిచ్చితినని నెను (యోహా 1[33]). మానవులనిట్లు క్రీస్తురాజ్యమున చేరులాగున వారిని సిద్ధపఱచుటకే గాక ఆయన దేవుని కానందము నొసఁగూర్చు ప్రియకుమారుఁడని తెలుపుటకును అతఁడు బాప్తిస్మము నిచ్చెను.

యేసు క్రీస్తు బాప్తిస్మ మిప్పించినట్లు యూదయలో నాయన చర్య ఆరంభమందు ఒక్కసారి మాత్రముగలదు (యోహా 3[26] 4[1,2]). యోహాను పని దేవునిచే నియమింపఁబడినదైనందున ఆయన దాని నిట్లు కొనసాగించినట్లున్నది. గలిలయ చర్య నారంభించినది మొదలు ఆయన ఆ విధముగా చేసిన దాఖలా లేవియును కనఁబడుటలేదు. నేను పొందవలసిన బాప్తిస్మము గలదు. అది నెరవేఱువఱకు నే నెంతో యిబ్బంది పడుచున్నాను (లూ 12[50]) అను వాక్యమును, నేను పొందవలసిన బాప్తిస్మమును మీరు పొందఁగలరా (మా 10[38]) యని యాకోబు యోహానుల నడిగిన ప్రశ్నయు ఆయన పొందనైయుండిన శ్రమలను సూచించునేగాని బాప్తిస్మ ఆచార సంబంధమైన సంగతికాదు. క్రైస్తవ సంఘమందు ఆచారముగా నున్న దానినిగూర్చిన స్పష్టమగు స్థిరమేర్పాటు ఆయన పునరుత్థానమునకుఁ బిమ్మట నే కనఁబడుచున్నది (మ 28[19,20] లూ 24[47] మా 16[16] ను గూర్చి మార్కు 5 చూ॥). పరిశుద్ధాత్మ యనుగ్రహింపఁబడిన పెంతెకొస్తు దినమున క్రైస్తవ బాప్తిస్మ మారంభమాయెను. రక్షణ పొందఁగోరు వారందఱును మాఱుమనస్సునొంది పాపక్షమ నిమిత్తము యేసుక్రీస్తు నామమున బాప్తిస్మము నొందవలెనని పేతురాదినమున ప్రకటింపఁగా (కార్య 2[38]) ఇంచుమించు 3000 మంది బాప్తిస్మము నొందిరి. క్రీస్తు శిష్యులు తాము వెళ్లిన చోట్లలెల్లడల ఆయనను నమ్మినవారికి బాప్తిస్మ మిచ్చిరి. సమరయ పట్టణములో ననేకులకు (8[12-16]), దమస్కులో సౌలుకు (9[18]), కైసరయలో కొర్నేలికి అతని యింటివారికి (10[47]), ఫిలిప్పియిలో లూదియకు ఆమె యింటివారికి (16[15]), చెఱసాల నాయకునికి అతని యింటివారికి (16[33]), కొరింథు పట్టణములోని అనేకులకు (18[8]) ఎఫెసులో 12 మందికి (19[5]) బాప్తిస్మ మిచ్చిరి. ఇతరులచే బాప్తిస్మ మిప్పించుట పౌలుకు వాడుక గాని కొరింథులోని కొందఱికి తానే యిచ్చెను (I కొరి 1[13-17]).

బాప్తిస్మము నీళ్లలోను (మ 3[11] మా 1[8] యోహా 1[31]), నీళ్లతోను (లూ 3[16] కార్య 1[5] 11[16]) యొర్దాను నదిలోను (మా 1[5]), పరిశుద్ధాత్మలోను (మ 3[11] మా 1[8] లూ 3[16] యోహా 1[33] కార్య 1[5] 11[16]), అగ్నితోను (మ 3[11]) ఇయ్యఁబడును. తండ్రి కుమారుఁడు పరిశుద్ధాత్మ నామమునను (మ 28[19]), యేసుక్రీస్తు నామమందును (కార్య 8[16] 10[48] 19[5] 22[16]), పాపముల క్షమ నిమిత్తము (2[38]) యియ్యఁబడెను. ఒకటే శరీరముగా నుండుటకు బాప్తిస్మమునొందిరి (I కొరి 12[13]). బాప్తిస్మము ఒకటే యను వాక్యము (ఎఫె 4[5]) ఎఫెసు సంఘముయొక్క ఐక్యమును సూచించును. దానిని పొందినవారు క్రీస్తును ధరించినవారై (గల 3[27]) ఆయన మరణముతో పోలివారై ఆయనతో నాతిపెట్టఁబడిరి (రోమా 6[3] కొలొ 2[12]). బాప్తిస్మము పునర్జన్మమును గూర్చిన యాచారమై (యోహా 3[1-8] తీతు 3[5-6]) దానిని పొందినవారిని రక్షించునని (I పేతు 3[21]) కొందఱనుకొందురు.

మృతులకొఱకై బాప్తిస్మమునొందు ఆచారము కొరింథు నందుండినట్లు కనఁబడుచున్నది (I కొరి 15[29]). దానినిగూర్చిన యితర సూచన లెవ్వియును గానరావు. అది చిరకాలమున్న అలవాటుగాదు.

క్రైస్తవ బాప్తిస్మమువలన విశ్వాసులు క్రీస్తు సేవకు ప్రత్యేకింపఁబడి దాని నవలంబింతురు. ఇశ్రాయేలీయులు ఎఱ్ఱసముద్రమును దాటగా ఐగుప్తు దాసత్వమును వదలి మోషే యాజ్ఞకు లోనైరి. కావున అచ్చట ఇశ్రాయేలీయు లందఱును మోషేనుబట్టి (మూలభాషాపదము ప్రకారము మోషేలోకి) మేఘములోను సముద్రము

లోను బాప్తిస్మ మొందిరని పౌలు అలంకార రీతిగా వ్రాసెను (I కొరి 10[2]).

బాప్తిస్మము యొక్క ఫలితములను గూర్చియు బాప్తిస్మము నొందవలసినవారిని గూర్చియు, బాప్తిస్మము నిచ్చు రీతినిగూర్చియు తెగ్వర్య భేదములు గలవు. వాటినిగూర్చి పూర్ణముగా దెలిసికొనుటకై ఆయా వేదాంతశాస్త్రములను చూడవలసి యున్నది.

**బాబెలు గోపురము (Tower of Babel).** దీనినిగూర్చిన సంగతి ఆది 11[1-9] లో నున్నది. ఇట్టి గోపురములు రెండు బబులోనులో నున్నవి. ఒకదానిని బబులోను పట్టణములోని మెరోదకు అను దేవతకు ప్రతిష్ఠించిరి. అది షుమారు 325 అడుగుల ఎత్తుగలది. ఇది చాలకాలము వఱకు నుండెను గాని దానిలోని యిటుకలను వారు కొనుటచే ప్రస్తుతము దాని పునాదిమాత్రము గలదు. ఆ గోపురములలో రెండవదానిని నెబో దేవత ఘనత నిమిత్తము కట్టిరి. ఇది బబులోను కుత్తరమున ఆమడదూరములోనున్న బోర్సిప్పాలో నుండెను. వీటిలో మొదటిదే బాబెలు గోపురమని సాధారణాభిప్రాయము.

**బామోతు, బామోత్బయలు** (Bamoth = ఉన్నతస్థలములు, Bamothbaal = బయలుయొక్క ఉన్నతస్థలములు). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి వచ్చునప్పుడు అమోరీయుల దేశమునందు మజిలీచేసిన స్థలములలో నొకటి. ఇది అర్నోను నదికి ఉత్తరముగా నున్నది (సంఖ్యా 21[19,20]). ఇది రూబేనీయుల సరిహద్దు పట్టణములలో నొకటియై బామోత్బయలు అని పిలువబడెను (యెహో 13[17]). సంఖ్యా 22[41] నం బామాటను స్థలముయొక్క పేరుగా నెంచక బయలుయొక్క ఉన్నతస్థలము లని భాషాంతరముచేసిరి. మోయాబు దేశములో బయలుపూజ జరిగిన పర్వతశిఖరముయొక్క పేరని తెలిసికొనవచ్చును గాని దీనిగూర్చి మరెక్కువ దెలియదు.

**బార** మానవులు I I చూ॥

**బారాకు** (Barak = మెఱుపు). నఫ్తాలీ కెదెషు వాడగు ఇశ్రాయేలీయుడు. ప్రవక్త్రియగు దెబోరా యాజ్ఞనొంది పదివేలమంది జెబూలూనీయులను నఫ్తాలీయులను కూర్చుకొని యాబీను సేనాధిపతియగు సీసెరా నోడించి వాని సైన్యమును హతము చేసెను (న్యాయా 4[1-24] 5[1-12] హెబ్రీ 11[32]).

**బారియహు** (Briah = దేవుడు సృష్టించె). వానిమ సంతతివారిలో నొకడు (I దిన 3[22]).

**బారూకు** (Baruch = శ్రేయస్కరము, దీవెన నొందినవాడు).

1. ప్రవక్తయగు యిర్మీయా లేఖకుడును స్నేహితుడునైనవాడు (యిర్మీ 36[26,32]). యెహోయాకీము ఏలుబడి 4 సం॥న యిర్మీయాను అధికారులు బోధింపనీయక పోయినందున బారూకు అతని ప్రవచనములను వ్రాయ మొదలుపెట్టెను (36[1-8]). మరుసటి సంవత్సరమున అతడు వానిని దేవాలయమునందు బహిరంగముగా చదివినప్పుడు అధికారులు విని అతడు వ్రాసిన దానిని తీసికొని వెళ్లి యెహోయాకీమున కప్పగించగా అతడు దానిని చాకుతో కోసి కాల్చివేసెను (36[14-29]) గాని బారూకు మఱి కొన్ని సంగతులను చేర్చి దానిని మఱల వ్రాసెను (36[27-32]). సిద్కియా యేలుబడియందు పదవ సంవత్సరములో యిర్మీయా ఖైదీగానుండు నప్పుడు ఇతడు యిర్మీయా పొలము నతని పేరట రిజష్టరు చేయించెను (32[6-16,43,44]). ఇతడు గొప్ప వాటిని ఆశించరాదను ప్రవచన మొకటితనిగూర్చి ప్రత్యేకముగా గలదు (45[1]). యెరూషలేము నాశనమైన పిమ్మట యిర్మీయాతో కూడ నితడును ఐగుప్తునకు వెళ్లెను (43[1-7]) పాతనిబంధన అప్రమాణిక గ్రంథములలో నొకటి బారూకు కారోపింపబడెను. (అప్రమాణిక గ్రంథములు చూ॥).

2. నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను కట్టినవారిలో నొకడు (నెహె 3[20]). తరువాత నిబంధనను ముద్రించిన వారిలో నున్న బారూకు యితడు కానవచ్చును (10[6]).

3. నెహెమ్యా కాలమునందు వంతుల ప్రకారము యెరూషలేమునందు నివసించవలసిన వారిలో మయసేయా యనువాని తండ్రి (నెహె 11[5]).

**బాలశిక్షకుడు** (Master, Tutor). గల 3[24,25] నందు ఈ పదముచే తెనిగించిన గ్రీకు మాట పెదగాగు (*Pedagogue*) అనునది

యున్నది. బాలురను నడిపించువాఁడనునది ఆ మాటయొక్క శబ్దార్థము. I కొరి $4^{15}$ లో ఆ పదమును ఉపదేశకుఁడని తర్జుమా చేసిరిగాని వారు పాఠశాలలలో బోధించిన వారుగాక స్థితిమంతులగువారి బిడ్డలను బడికి నడిపించుకొని వెళ్లెడి వారును బిడ్డలు తప్పిపోకుండునట్లు వారిని యెడతెగక చూచువారునైన సేవకులని గ్రీసువారి లిఖితములవలనఁ దెలియుచున్నది. ఈ పదము పిల్లలను కొంచెము కఠినముగా చూచువారని సూచించదుగాని తండ్రి వారిని చూచువిధమునకు భిన్నముగా నున్నదని పౌలు I కొరి $4^{15}$ లో దీనిని వాడెను. ధర్మశాస్త్రపు ప్రభుత్వమునకును సూచనగా నున్నది (గల $3^{24,25}$). అది మనలను క్రీస్తుయొద్దకు నడుపునదై నియమింపఁబడిన పక్షమున దానికి చాల ఉపయోగకరముగా నుండును. మన మెల్లప్పుడు ధర్మశాస్త్రము క్రిందనుండుట పిల్లవాఁడట్టి బాలశిక్షకుని యధీనమునందుండుటను సూచించును.

**బాలా, బెయాలోతు, బిల్హా** (Baalah, Baaloth, Bilhah = ప్రభ్వి).

1. యూదా దేశమున కుత్తర భాగమునందున్న యొక పట్టణము (యెహో $15^{9,10}$ I దిన $13^{6}$). II సమూ $6^{2}$ లో బాయిలా యెహూదా యనఁబడెను. దీనికే కిర్యత్బెయలు (యెహో $15^{60}$) కిర్యత్యారీము అను పేరులుకలవు (కిర్యత్బెయలు, కిర్యత్యారీము చూ॥).

2. యూదా దేశమునకు దక్షిణముగానున్న యొక పట్టణము (యెహో $19^{3}$). $15^{24}$ లో నున్నట్లిది బయాలోతు అనఁబడును. I దిన $4^{29}$ నందు దీనికి బిల్హా అను పేరున్నది.

3. యూదాదేశపు ఉత్తర దిక్కునను్న యొక కొండ (యెహో $15^{11}$).

**బాలుడు** కుటుంబము 4, పిల్లలు చూ॥

**బావి** (Well). పాత నిబంధనయందు బావులనుగూర్చిన సూచన లనేకములు గలవు. బావి యని తెనిఁగింపఁబడిన హెబ్రీ పదములు నాలుగున్నవి. (1) వాటిలో నొకటి బెయెరు (*Be'er*) అనునదై బెయేర్షెబా అను మాటలో కనఁబడును. దానిని గుంట (ఆది $14^{10}$ కీర్త $69^{15}$ సామె $5^{15}$), నీటిబుగ్గ (ఆది $16^{14}$), ఊట (ఆది $21^{19}$), కూపము (కీర్త $55^{23}$ పర $4^{15}$) అని తెనిఁగించినను సాధారణముగా బావి యని తర్జుమా చేసిరి (ఆది $21^{25,30}$ $24^{11,20}$ $26^{15,18}$ మొ॥). ఇవి త్రవ్వఁబడిన బావులైయున్నవి. కొన్ని చాలలోతుగానుండి నేటివఱకు గలవు (2) అయిన్ అను పదము సాధారణముగా నేత్రములనుగాని ఊటలనుగాని సూచించినను కొన్ని వాక్యములలో బావులని యర్థమగును ($24^{16,29,30,42,43,45}$ అయిన్ చూ॥). (3) మఱియొక పదము సాధారణముగా ఊటలను, నీటి బుగ్గలను సూచించును (II రాజు $3^{19,25}$). దానిని యెష $12^{3}$ లో బావులని సరిగా తెనిఁగించిరి. (4) ఇంకొక పదమును రాతిలో తొలుచఁబడిన తొట్లను గాని గుంటలను గాని సూచించినను ద్వితీ $6^{11}$ I సమూ $19^{22}$ II సమూ $3^{26}$ $23^{15}$ యెష $36^{16}$ లో బావి యని తెనిఁగించిరి.

క్రొత్త నిబంధనయందున్న రెండు గ్రీకు పదములలో నొకటి ఊటనుగాని బుగ్గనుగాని సూచించినను (యాకో $3^{11}$ ప్రక $7^{17}$ $21^{6}$), అది బావినికూడ సూచించును (II పేతు $2^{17}$). ఈ మాటను, బావినిసూచించు మఱియొక పదమును యాకోబు బావిని గూర్చి వాడిరి (యోహా $4^{6,11}$). రెండవ పదము గుంటయనియు తెనిఁగింపఁబడెను (లూ $14^{5}$).

బావులు బైబిలు కాల మంతటిలో సర్వసాధారణమైనవనియు, ఆదికాలము నుండి యున్నవనియు చాల విలువగలవి యనియు పై వాక్యముల వలన స్పష్టమగుచున్నది. రక్షణయొక్క విలువను సూచించుటకు ఈ పదమును అలంకార రీతిగా వాడిరి (యెష $12^{3}$). జీవజలమును అదే యర్థమిచ్చును.

**బాశెమతు** (Basemath = సుగంధము).

1. ఏశావు భార్యలలో నొకతె (ఆది $26^{34}$). ఈమె హిత్తీయుఁడగు ఏలోనుయొక్క కుమార్తె. ఈమెకు ఆదా యను పేరును గలదు ($36^{2}$).

2. ఏశావు భార్యలలో మఱి యొకతె (ఆది $36^{3,4,13}$). $28^{9}$ లో నున్నట్లు ఈమెకు మహలతు అను మాఱు పేరు గలదు.

3. సొలొమోను కుమార్తెలలో నొకతె. అతఁడీమెను తన యుద్యోగస్థులలో నొకఁడగు అహీమయస్సున కిచ్చెను (I రాజు $4^{15}$).

బాషాను (Bashan = విశాలమైనది). గలిలయ సముద్రమునకు తూర్పుననుండు ఫలవంతమైన ప్రదేశము. దాని హద్దులు నూటిగా తెలియకపోయినను అది పలెస్తీనుకు దక్షిణముననున్న గిలాదు మొదలు ఉత్తరమున హెర్మోనువఱకును, పశ్చిమమున నున్న గలిలయ సముద్రమునుండి తూర్పుననుండిన యెడారి వఱకు వ్యాపించి యుండెనని చెప్పఁదగును. అది చాలవఱకు మన్య ప్రదేశమై సముద్ర మట్టమునకంటె 2000 అడుగుల ఎత్తుగా నుండునదై యున్నది. నేటిదినము వఱకు అచట చాల ధాన్యాదులు పండును. పూర్వకాలమునందీ ప్రదేశము సింధూరవృక్ష వనంబులకును (యెష $2^{13}$ యెహె $27^{6}$), గొప్ప కొండలకును (కీర్త $68^{15}$), సింహములకును (ద్వితీ $33^{22}$), బలమైన పొట్టేళ్లకును, మేఁకలకును ($32^{14}$), పశువులకును (కీర్త $22^{11}$ ఆమో $4^{1}$ యెహె $39^{18}$) ప్రసిద్ధమైనదై యుండెను. ఇది పూర్వము రాజైన ఓగుయొక్క దేశమై యుండి మోషే కాలములో అతనినుండి యపహరింపఁబడెను (సంఖ్యా $21^{33-35}$ ద్వితీ $3^{4,5}$). అందులో 60 పురములుగల అర్గోబు అను ప్రదేశముండెను ($3^{4}$) గాని అది బాషానులో ఏ భాగమున నుండెనో రూఢిగాఁ దెలియదు. ఇశ్రాయేలీయులు దేశమును విభాగించినపుడు బాషాను యావత్తును మనష్షే అర్ధగోత్రమున కిచ్చిరి ($3^{13}$ $4^{43}$ యెహో $13^{30,31}$). అష్తారోతు (ద్వితీ $1^{3}$), ఎద్రెయి ($3^{1}$) సలకా ($3^{10}$), గోలాను ($4^{43}$) అనునవి ఇందులోనున్న ముఖ్యపట్టణములై యుండెను. సొలొమోను కాలములో బాషాను వారతనికి పన్ను చెల్లించుచుండిరి (I రాజు $4^{13}$). దమస్కు రాజైన హజాయేలు దానిని యిశ్రాయేలీయుల చేతినుండి యపహరించెను (II రాజు $10^{33}$) అష్షూరు చక్రవర్తియగు తిగ్లత్పిలెసరు దాని నివాసులను చెఱబట్టెను ($15^{29}$). రోమీయులు తమ ప్రభుత్వకాలమున దానిని అరేబియాతోఁ జేర్చిరి. ప్రస్తుతమున అచట అర్ధనాగరికత గలవారగు ద్రూసీస్ (*Druses*) అను క్రూరులు నివసించుచున్నారు.



రక్షరేకులు

బాసికము (Phylactery = ఒకని కాపాడునది, తాయెత్తు). పాంత నిబంధనయందు ద్వితీ $6^{8}$ $11^{18}$ లోని హెబ్రీ పదమునకును క్రొత్త నిబంధనలోను మ $23^{5}$ నందున్న గ్రీకుపదమునకు తెలుఁగులో వాడిన పదము. ద్వితియోపదేశకాండమందున్న ఈ పదమునే నిర్గ $13^{16}$ లో లలాటపత్రిక యని తెనిఁగించిరి. యూదులు దేవుని వాక్యమును తమ మనస్సులలో నుంచవలెనను సంగతిని చేతులమీఁద నుంచుకొనవలెనని అలంకారరీతిగా నున్న సంగతిని సూచించుటకు $13^{1-10,11-16}$ ద్వితీ $6^{4-9}$ $11^{13-21}$ లోని వాక్యములను వ్రాసి వాటిని తోలు సంచులయందుంచి నొసటిమీఁదను ఎడమచేతికిని కట్టుకొనిరి. ఈ దేశమందు పిల్లలకు తాయెత్తు లే యుద్దేశముతో కట్టుదురో అట్లే వారును చేసిరి. పరిసయ్యులు



తలకుకట్టఁబడు రక్షరేకులు



చేతికికట్టఁబడు రక్షరేకులు

తమ భక్తిని వెల్లడి చేసికొనుటకు వీటిని మఱింత పెద్దవిగా చేయించుకొనిరి (మ $23^{5}$). నేటి వఱకు యూదులు జపము చేయు సమయములందే గాని,



రక్షరేకులు

పండుగు దినములలోనైనను విశ్రాంతి దినమందైనను వాటిని ధరింపరు.

బాహువు చేయి చూ.

## బి

**బింహాలు** (Bimhal = సున్నతి నొందిన వాఁడు). ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన $7^{33}$).

**బిక్రి** (Bichri = యౌవనము). దుర్మార్గుఁడైన షెబాయనువాని తండ్రి (II సమూ $20^{1}$).
H.

**బిగ్తా** (Bigtha). పారసీ చక్రవర్తియగు అహష్వేరోషు సేవకులలో నొకఁడు (ఎస్తే $1^{11}$).

**బిగ్తాను** (Bigthan = అదృష్ట దానము). అహష్వేరోషును చంపుట కాలోచన చేసిన యిద్దరు షండులలో నొకఁడు. మొర్దెకై వారి కుట్రనుగూర్చి తెలియఁజేసినందున వీరు ఉరి దీయింపఁబడిరి (ఎస్తే $2^{21}$ $6^{2}$). ఈ పదము సంస్కృతమునందు భగదాన యను పదమునకు సంబంధించిన దనుకొందురు.

**బిగ్వయి** (Bigvai).

1. ఇశ్రాయేలీయులు బాబెలు చెఱనుండి తిరిగి వచ్చుచుండఁగా జెరుబ్బాబెలుతోఁగూడ వచ్చిన నాయకులలో నొకఁడు (ఎజ్రా $2^{2}$).

2. జెరుబ్బాబెలుతో చెఱనుండి తిరిగి వచ్చిన వారిలో 2 వేల సంఖ్యగల కుటుంబమునకు పెద్ద (ఎజ్రా $2^{14}$ నెహె $7^{19}$). ఆ కుటుంబికులలో నింక 70 మంది ఎజ్రాతో కలిసి వచ్చిరి (ఎజ్రా $8^{14}$). 1, 2 లలోని వారిద్దరుకాక ఒకరేయై యుండవచ్చును.

3. నెహెమ్యా కాలములో సిద్ధపఱచఁబడిన నిబంధనకు సంతకముచేసిన వారిలో నొకఁడు (నెహె $10^{16}$).

**బిజ్తా** (Biztha) పారసీ చక్రవర్తియగు అహష్వేరోషుయొక్క ఏడుగురు షండులలో నొకఁడు (ఎస్తే $1^{11}$).

**బిజోత్యా** (Biziothiah = యెహోవాకు అసహ్యము). ఈ పదము హెబ్రీ భాషయందు యెహో $15^{28}$ నందున్నది గాని LXX నందు దానిని దానికి సంబంధించిన పల్లెలు అను పదములతో తర్జుమా చేసిరి. హెబ్రీ పదముకు కొద్ది మార్పులు చేసిన యెడల ఈ యర్థము వచ్చును. అట్లు తర్జుమా చేయక ఇక్కడ బిజోత్యా యని పొరబాటున వ్రాసిరని సాధారణముగా ననుకొందురు. అట్లయినయెడల యెహో $15^{28}$ లో కూడ బెయేర్షెబా దానికి సంబంధించిన పల్లెలు అని నెహె $11^{27}$ లో నున్నట్లుగా నుండవలెను. ఇట్లు కానిపక్షమున బిజోత్యా యనునది బెయేర్షెబా దగ్గరనుండి మనకుఁ దెలియని యొక యూరు పేరు కావచ్చును.

**బితూనియ** (Bithynia = బితూను జాతి వారు). చిన్నాసియలో వాయవ్యముగా నుండు పరగణా. ఉత్తరమున నల్లసముద్రము, తూర్పున పొంతు పాప్లగోనియ, దక్షిణమున ఫ్రుగియ గలతియ, పడమర మిసియచే చుట్టుకొనఁబడి యున్నది. యూరపునుండి వచ్చినవారు దాని నివాసులుగ నున్నట్లున్నది. క్రీ॥ ము॥ 74 సం॥ రమున రోమనుల యాధీనమై సాధారణముగా పొంతుతో చేరి యొక గొర్నరు క్రింద నుండుచు

వచ్చెను. పౌలు సీలలు అచ్చట బోధింప నెంచిరి గాని అత్మ వారి నచ్చటికి పోనియ్యలేదని క్రొత్త నిబంధనయందున్నది (కార్య 16[6,7]). ఇతరు లచ్చట బోధించిరి. అక్కడ క్రైస్తవు లున్నట్లు పేతురు వ్రాసిన పత్రికవలనఁ దెలియుచున్నది (I పేతు 1[2]). క్రీ॥ శ॥ 111-113 లో అచ్చట గౌర్నరుగా నుండిన ప్లిని (*Pliny*) ఆ పరగణా లోని క్రైస్తవులనుగూర్చి యొక పత్రిక వ్రాసెను. అది నేటివఱకున్నది నిసీయ, కల్సెదోను అను పట్టణములలో కూడిన సార్వత్రిక క్రైస్తవాలోచన సభ లీ పరగణాలోనే జరిగెను (పటము V, J 2).

**బిత్యా** (Bithiah = యెహోవా ను ఆరాధించిన కుమార్తె). యూదావాఁడైన మెరెదు అను వానిని వివాహమాడిన ఫరో కుమార్తె (I దిన 4[18]). ఈమె తన మతమును విడిచి యెహోవా నారాధించినట్లు ఆమె పేరుపట్టి తెలిసికొన వచ్చును.

**బిత్రోను** (Bithron = లోయ). అబ్నేరు మహనయీముకు పారిపోవుచుండఁగా మార్గ మందతనికిఁ దటస్థించిన యొక లోయ (II సమూ 2[29]). అది గిలాదు ప్రదేశములోనున్నది గాని దాని యునికి సరిగాఁ దెలియదు.

**బిద్కారు** (Bidkar). యెహూ యొక్క సేనాధిపతి (II రాజు 9[25]). H.

**బిన్నూయి** (Binnui = కట్టడము).

1. లేవీయులలో నొకఁడు (ఎజ్రా 8[33] నెహె 12[8]). నెహె 8[7] లో నుండు బానీ యును నెహె 9[4] నున్న బున్నీయును ఒకఁడేయై యుండవచ్చును.

2. ఎజ్రా కాలములో అన్యస్త్రీలను వివాహము చేసికొనిన వారిలో నొకఁడు. ఇతఁడు పహత్మోయాబు వంశస్థుఁ డనఁబడును (ఎజ్రా 8[33]).

3. అన్యస్త్రీలను వివాహము చేసికొనిన వారిలో నింకొకఁడు. ఇతఁడు బానీవంశములో పుట్టినవాఁడై యుండెను (ఎజ్రా 10[37]).

పైన నుదాహరింపఁబడినవా రెందఱో రూఢిగాఁ దెలియదు.

**బిన్యా** (Binea). యోనాతాను సంతతి వాఁడు. మోజా కుమారుఁడు (I దిన 8[37] 9[43]).

**బిర్జాయీతు** (Birzaith, Birzavith = గాయములు, సందులు). ఆషేరు గోత్రికుల స్వాస్థ్యములోనున్న యొకస్థలము (I దిన 7[31]) దాని సరియైన యునికి తెలియదు.

**బిర్షా** (Birsha). గొమొఱ్ఱా రాజు. కెదొర్లాయోమెరు ఇతనిని ఓడించెను (ఆది 14[2,8,10]). H.

**బిలాము** (Balaam = పర జయ పతి(?)). ఫరాతు నదీతీరమున నున్న పెతోరు పట్టణస్థుఁ డగు బెయోరుదను యొక సోదకాఁడు (సంఖ్యా 22[5]) మోయాబీయుల రాజగు బాలాకు ఇశ్రాయేలీయులను జూచి వారు మోరీయులను జయించినట్లు తననుకూడ జయింతురని భయపడి జ్ఞాన దృష్టిగలవాఁడని పేరు పొందిన బిలాము వచ్చి వారిని శపించవలెనని చెప్పుటకు దూతలను బంపెను. బిలాము ధనాపేక్షగలవాఁడైనను దేవుని యనుమతిని గోరనవాఁడై ఆయనచేత నడ్యంతరపెట్టఁబడెను. బాలాకు మఱికొందఱిని బంపఁగా బిలాము దేవుని యనుజ్ఞ గోరకయే వారివెంట బయలుదేరెను గాని మార్గమధ్యమున దేవుని దూతచే హెచ్చరింపఁబడినవాఁ డాయెను. ఆ సమయమున బిలాము ఎక్కియుండిన గాడిద మనుష్య భాషణములతో మాట్లాడెను. ఇది వాస్తవముగా జరిగినవిషయము గాని దర్శనము గాదు (సంఖ్యా 22[22-35] II పేతు 2[16]). అతఁడు వచ్చి బాలాకు కోరినట్లు శపించుటకు బదులు అలంకార ప్రభావయుక్తమగు కావ్య రూపముగా వారి నాశీర్వదించునట్లు దేవునాత్మచే బలవంతము చేయఁబడెను. అతఁ డిట్లు ఒకటికి మూఁడు మారులు చేయఁగా బాలాకు మిగుల ఆయాస పడినవాఁడై కోపాతిశయముచే నతని పంపివేసెను. తరువాత బిలాము ఇశ్రాయేలీయులు చుట్టునున్న రాజ్యములవారి కేమి చేసెదరో దానిని ప్రవచించెను. ఇశ్రాయేలీయులు దేవుని కాగ్రహము కలిగించి విసర్జింపఁబడునట్లు వారిని విగ్రహారాధన లోనికిని వ్యభిచారత్వమునకును దింపుమని బాలాకుకు సలహా నిచ్చి తన స్వస్థలమునకు వెళ్లి పోయెను. బిలా మొనర్చిన దుర్బోధ ననుస

రించి యిశ్రాయేలీయులలో ననేకులు మోయాబీయురాండ్రతోఁ గూడి విగ్రహారాధనలోను దానికి సంబంధించిన వ్యభిచారములోను దిగి మోసపోయిరి. అందువలన వారిలో 24,000 మంది చంపఁబడిరి (సంఖ్యా $25^{1-9}$ $31^{16}$).

**బిలాము** షేము వంశస్థుఁడై నిజ దేవునిగూర్చిన సంగతులు తెలిసినవాఁడైనట్లు కనఁబడుచున్నది. అతఁడు దేవుని 'నా దేవుఁడైన యెహోవా' యని పిలిచెను ($22^{18}$) గాని, తరువాత ఇశ్రాయేలు రాజుల కాలమందుండిన యనేకులవలె నితఁడును మాంత్రికుఁడును అబద్ధ ప్రవక్తయై యున్నాఁడు. తన కిష్టములేకపోయినను దేవుని సువర్తమానమును ప్రకటించువాఁడుగా నుండెను. అయినను వాని మనస్సు మారలేదు ($31^{8}$). చివర కతఁడిశ్రాయేలీయులతో యుద్ధముజేసి వారివలన చంపఁబడెను (యెహో $13^{22}$). మనస్సాక్షి గద్దింపుల నలక్ష్యము చేయరాదనియు దేవుని కనిష్టములగు విధుల లాభమును గోరరాదనియు బిలాము మనలను హెచ్చరించుచున్నాఁడు (II పేతు $2^{15}$ యూదా 11 ప్రక $2^{14}$). H.

**బిలియాము** ఇబ్లెయాము చూ॥

**బిల్గా** (Bilgah = సంతోషము).

1. యాజకుల వంతులలో 15 వ వంతునకు పెద్ద (I దిన $24^{14}$).

2. జెరుబ్బాబెలుతో కూడ తిరిగి యెరూషలేమునకు వచ్చిన యాజకులలో నొకఁడు (నెహె $10^{8}$ $12^{5}$).

**బిల్దదు** (Bildad = వాదించువాఁడు). యోబును ఆదరించుటకువచ్చిన ముగ్గురు స్నేహితులలో నొకఁడు. అతఁడు ముమ్మారు యోబుతో మాట్లాడెను (యోబు 8, 18, 25).

**బిల్షాను** (Bilshan = మాట్లాడువాఁడు). జెరుబ్బాబెలుతో కూడ చెఱనుండి తిరిగివచ్చిన వారిలో నొకఁడు (ఎజ్రా $2^{2}$ నెహె $7^{7}$).

**బిల్హా** (Bilhah = సిగ్గు?).

1. రాహేలు దాసి. ఆ కాలపు వాడుకల చొప్పున గొడ్రాలైన రాహేలు ఈమెను యాకోబుకు ఉపపత్నిగాచేసి ఈమె పిల్లలను తన పిల్లలుగా నెంచెను. ఇట్లామె దాను నఫ్తాలి యను వారిని కనెను (ఆది $30^{1-8}$ I దిన $7^{13}$). రూబేను ఈమెతో శయనించి ఘోరపాపము చేసెను (ఆది $35^{22}$).

2. బాలా 2 చూ॥

**బిల్హాను** (Bilhan = సిగ్గు?).

1. పూర్వమున ఎదోము దేశమునందు నివసించిన హోరీయులలో నొకఁడు (ఆది $36^{27}$ = I దిన $1^{42}$).

2. బెన్యామీనీయులలో నొకఁడు. ఇతని యేడుగురు కుమారులు కుటుంబ పెద్దలైరి (I దిన $7^{10}$).

**బిష్లాము** (Bishlam). జెరుబ్బాబెలు కాలములో యూదులు బబులోనునుండి యెరూషలేమునకు తిరిగిరాఁగా పలెస్తీనులో నుండిన పారసీక ఉద్యోగస్థులలో నొకని పేరు. యూదులు యెరూషలేమును తిరిగి కట్టుటకు సెలవియ్యఁగూడదని అహష్వేరోషునకు మనవిఁజేసినవారిలో నితఁడొకఁడు (ఎజ్రా $4^{7}$).

## బీ

**బీజము** (Seed). విత్తువానిని గూర్చిన ఉపమానము ననుసరించి దేవుని వాక్యమును విత్తనమునకుఁ బోల్చిరి (లూ $8^{11}$). ఆ దృష్టాంతము I పేతు $1^{22,23}$ లో కూడ నున్నది గాని అచ్చట దానిని విత్తనమని తర్జుమా చేయక బీజమని తెనిఁగించిరి. ఈ వాక్యము జీవముగలదై ఫలించునని ఈ దృష్టాంతముయొక్క భావమై యున్నది. I యోహా $3^{9}$ లో నదే రీతిగా దేవుని యాత్మచే భక్తులలో నాటఁబడిన నూతనజీవము దేవుని బీజము అనఁబడును. ఆ జీవము మనదిగాక దేవునిచే మనలో నుంచఁబడినదని దీని యర్థము. బైబిలు నందున్న మూలభాషా పదము ఇతర భాషలలో నున్నట్లు సంతానము కూడ బీజమైయున్నది గాని అది తెలుఁగు జాతీయము కానందున సంతానమని భాషాంతరము చేసిరి.

**బీదతనము, బీదరికము బీద (Poverty, Poor).**

1. బీదస్థితి. బైబిలునందుదాహరింపఁబడిన దేశములలో మొదటినుండి ప్రజల పేదరికమును గూర్చిన సూచనలు గలవు. జనములు విస్తరించి, కుటుంబముల ఆస్తి విభాగింపఁబడక పూర్వము బీదలంతమంది ఉండ లేదు. అయినను ఆకాలపు ఏర్పాటులను బట్టి విధవలు దిక్కులేని పిల్లలున్నట్లు కనుగొనవచ్చును (నిర్గ $22^{22}$). జీవనోపాధికి జరగక అప్పులపాలయిన వారు నుండిరి ($22^{25}$) బీదలకు న్యాయము దొరుకుట కష్టముగా నుండెను ($23^{6}$). వీరితోపాటు పరదేశులును (ద్వితీ $10^{18,19}$), లేవీయులును ($14^{29}$) బీదలుగా నెంచఁబడిరి. దేశమందలి ప్రజలు విస్తరించి పట్టణము లేర్పడినప్పుడు స్థితిమంతులు అమిత భాగానుభవులై బీదలను మఱింత బాధపెట్టుచు వచ్చినట్లు ప్రవక్తల గ్రంథములయందు అనేక సూచనలు గలవు (యెష $1^{23}$ $5^{8-10}$ ఆమో $4^{1}$ $6^{1-6}$ మీకా $2^{1-3}$ మొ॥). చెఱకాలమైన పిమ్మట స్థితిగలవారు తిరిగి యెరూషలేమునకు రాక బబులోను ప్రాంతముల లోనే నిలిచిపోయిరి. తిరిగి వచ్చిన వారు బీదలగుటమాత్రమే గాక పాడైపోయిన దేశమునకు వచ్చుటచే మఱింత దరిద్రులైయుండిరి. అట్టి కాలములో అనేకమంది దరిద్రులుండిరి. (నెహె 5). వారికి యెరూషలేమునందు తగిన పనులు లేకపోయినను పట్టణములు కట్టబడెనని కోరి వంతుల ప్రకారము జనుల నచ్చటికి రప్పించి వారిని పోషించిరి (నెహె 11). పలెస్తీను దరిద్రదశకు ఇది మఱియొక కారణమయ్యెను. మలాకీ కాలము మొదలు క్రీస్తుకాలము వఱకు అనేక యుద్ధములు పలెస్తీనులో జరుగుటవలన దేశస్థితి మఱీ విపరీతమయ్యెను. ఆ కాలమునందు యూదులన్యదేశములకు చెదిరిపోయిరి గ్రీసు, మక్కబీయ రోమనువారి ప్రభుత్వ కాలములలో స్థిర ప్రభుత్వమున్న సమయమున దేశమునకుఁ గొంత సౌఖ్యము కలిగెను. సర్వలోకమున చెదరిపోయిన యూదులు తమ కానుకలను పంపుటవలన ప్రధాన యాజకులు మొదలగు పై తరగతులవారు స్థితిమంతులైరి గాని దేశము మొత్తము మీఁద బీదస్థితి యందే యుండెను. క్రొత్త నిబంధన కాలమున అది యట్లుండెను. బీదలను జ్ఞాపకము చేసికొనుట ఆది క్రైస్తవుల యేర్పాటులలో మొదటిదై యున్నది (కార్య $6^{1-7}$ గల $2^{10}$).

2. బీదరికము కలుగుటకు సాధారణ కారణములు గాక కరవులును (II రాజు $8^{17}$ నెహె $5^{3}$), స్థితిమంతులు భూములన్నిఁటిని వశపఱచుకొనుటయు (యెష $5^{8}$), రాజులు అధిపతులు మొదలగువారు తక్కువ జీతమునిచ్చిగాని జీతము లేకుండఁగాని పనులు చేయించుకొనుటయు (యిర్మీ $22^{13,14}$), ఎక్కువ వడ్డీ పుచ్చుకొనుటయు (నెహె $5^{1-6}$) హేతువులుగా నుండెను. ఆది క్రైస్తవులు తమ ఆస్తినమ్మి బీదల కిచ్చుటవలన యెరూషలేము సంఘము మఱింత బీదదైనట్లు కనబడుచున్నది (కార్య $4^{34-37}$). యెరూషలేమునందుండిన క్రైస్తవుల మిన్న హింసలు పొందుట వలన వారింకను దరిద్రులైరి (హెబ్రీ $10^{34}$) భక్తిగలవారై న్యాయముగా జీవించువారికి సాధారణముగా పేదరికము కలుగుటవలన భక్తులకు బీదలు అను పేరు కలిగెను (లూ $1^{52}$ $6^{20}$ యాకో $2^{5,6}$).

3. పేదరికమును నివారించుటకై బైబిలునందనేక యేర్పాటులు మొదటినుండి గలవు. భూములన్నియు స్థితిగలవారి వశమున గాక ఆయా కుటుంబములకు నిత్యముండెడి యేర్పాటు గలదు (లేవీ 25, $27^{23,24}$ ద్వితీ $15^{12-15}$ I రాజు $21^{3,4}$). అప్పిచ్చెడివారు యూదులయొద్ద వడ్డీ పుచ్చుకొనరాదను నియమమును గలదు (ద్వితీ $23^{19,20}$). బీదలకు పదియవవంతును ప్రత్యేకముగా నియ్యవలసినట్లు $14^{28}$ నందున్నది. పరగ నేయుటయు మూలలలో విడువఁబడిన దాని కోయుటయు యూదులకు నిషిద్ధము ($24^{14,21}$ రూతు $2^{15-17}$). ఈ యేర్పాటులే గాక బీదలకిచ్చుట మిగుల ధర్మకార్యముగ నెంచఁబడెను (దాతృత్వము, దీనత్వము చూ॥).

## బు

**బుక్కీ (Bukki = నాశనము).**

1. ఇశ్రాయేలీయు లరణ్యమునందుండఁగా దాను గోత్ర ప్రధాని. కనాను దేశమును భాగములు జేసి ఆయా గోత్రముల వారి కిచ్చుటకై నియమింపఁబడెను (సంఖ్యా $34^{22}$).

2. అహరోను కుమారుఁడగు ఫీనెహాసు వంశస్థుఁడు (I దిన $6^{5,51}$ ఎజ్రా $7^{4}$). H.

**బుగ్గగుమ్మము** యరూషలేము B, V 2 (10) చూ॥

**బుగ్గి** బూడిదె చూ॥

**బుట్టు** గంప చూ॥

**బుట్టా పని** వృత్తులు చేతిపనులు III 4 చూ॥

**బుడుమ** ఓడలు 5 (2) G చూ॥

**బుడుబుడుసరకాయ** (Caper Berry). మధ్యధరా సముద్ర ప్రాంతములయందు పెరుగు ఒక తరహా చెట్టు కాయ. ఈ కాయ ముండ్లు గలది వికారపు వాసన గొట్టును. ఇది ఆకలిని కోరికలను పుట్టించునందురు. మూలభాషా పదమును ఈ మాటచేతఁ గాక కోరిక యని తర్జుమా చేసిన యెడల యుక్తమని అనేకమంది పండితులందురు. ముసలితనము వచ్చినప్పుడు దేహశక్తులన్నియు ఉడిగి పోవుటయే గాక వాంఛలు సహితము కలుగవనుట ప్రసంగియొక్క భావమై యున్నది (ప్రస $12^{5}$). J. C.

**బుడ్డె** వంటసామగ్రి 1 చూ॥

**బుద్ధిహీనత, బుద్ధిహీనుడు** (Foolishness, fool). ఈ మాటలచే తెనిఁగింపఁబడిన వాటిని గూర్చి మూర్ఖత్వము I 4, 5, 6, II 1 చూ. పాత నిబంధనయందు మందబుద్ధిగల వాని సూచించు ఒక హెబ్రీ పదము నీ మాటచే తెనిఁగించిరి (ప్రస $2^{19}$ $10^{3,14}$). ఆ పదమునే I సమూ $26^{21}$ లో వెర్రివాఁడనిరి. ఇవిగాక బుద్ధిహీనుఁడని తెనిఁగించిన ఒక గ్రీకుపదము వెర్రివాఁడని యర్థము ఇచ్చుచు సాధారణముగా అట్లు తర్జుమా చేయఁబడినను (I కొరి $1^{25,27}$ $3^{18}$ $4^{10}$) తమ యిండ్లను ఇసుక మీఁదకట్టుకొనువారిని, నూనె తెచ్చుకొనకనే దివిటీలు పట్టుకొన్న వారిని సూచించుచు బుద్ధిహీనులని తెనిఁగింపఁబడెను (మ $7^{26}$ $25^{2}$) గాని, దానినే అవివేకులనియు ($23^{17,19}$ తీతు $3^{9}$ రోమా $1^{22}$), మూఢులనియు (II తిమో $2^{23}$). వ్యర్థుఁడనియు (మ $5^{22}$) తెనిఁగించిరి. ఎఫె $5^{4}$ నందు బుద్ధిలేని మాటలను సూచించు పదమును పోకిరిమాటలని తెనిఁగించిరి (వెర్రివాడు, మూఢులు చూ॥). మ $15^{16}$ మా $7^{18}$ రోమా $10^{19}$ లో అవివేకులని తెనిఁగించిన మఱియొక పదము బుద్ధిలేనివారిని సూచించుచు రోమా $1^{31}$ నందు వ్యర్థులని తెనిఁగింపఁబడెను. ఎఫె $5^{15}$ లో నున్న పదము జ్ఞానులను మాటకు వ్యతిరేకమగునదై బుద్ధిహీనుని సూచించుచు అజ్ఞానియని తెనిఁగింపఁబడెను.

**బున్నీ** (Bunni = కట్టఁబడినది).

1. నెహెమ్యా కాలమందున్న యొక లేవీయుఁడు (నెహె $9^{4}$). బహుశః ఇతఁడే $10^{15}$ లోను ఉదాహరింపఁబడి యుండును. (బిన్నూవీ చూ॥).

2. నెహెమ్యా కాలమునందున్న మఱియొక లేవీయుఁడు. 1 లోని వానికన్న ముందు జీవించెను (నెహె $11^{15}$). H.

**బురుజు** కోట II 1, 2 చూ॥

**బువ్వా** పూయా చూ॥

## బూ

**బూజీ** (Buzi = బూజు సంతతివాఁడు). ప్రవక్తయైన యెహెజ్కేలు తండ్రి (యెహె $1^{3}$). యాజకుఁడైన సాదోకు వంశస్థుఁడని ఆ వచనము వలనఁ దెలియుచున్నది. W.

**బూజు, బూజీయుడు** (Buz = అలక్ష్యము చేయఁబడిన వాఁడు, Buzite).

1. నాహోరు మిల్కా అనువారి రెండవ కుమారుఁడు (ఆది $22^{20-22}$). ఇతఁడు మెసొపొతేమియ యందును, అరేబియా యెడారియందును నివసించిన బూజీయులను తెగవారి మూల పురుషుఁడు (యోబు $32^{2}$ యిర్మీ $25^{23}$).

2. గాదు తెగలోని యొక కుటుంబపు పెద్దలలో నొకఁడు (I దిన $5^{14}$).

**బూజు** వ్యవసాయము 5 (2) చూ॥

**బూడిదె** (Ashes) మూలభాష యందున్న ఒక పదమునే బుగ్గి (II సమూ $13^{19}$) ధూళి యని వేర్వేఱు మాటలతో తెనిఁగించిరి గాని, అవి యొక దానినే సూచించును. దుఃఖభరితులైన వారు బూడిదెలోఁ గూర్చుండి (యోబు $2^{8}$ యోనా $3^{6}$), దాని తమ మీఁద చల్లుకొనిరి (యిర్మీ $6^{26}$ యెహె $27^{30}$). కొన్నిచోట్ల ఈ పదము

పనికిమాలినదియు వట్టిదియునైన దానిని సూచించును. అబ్రాహాము (ఆది $18^{27}$), యోబు (యోబు $36^{19}$) ఈ మాటనువాడుచు దేవుని యెదుట తమయొక్క వట్టి తనమును సూచించిరి. $13^{12}$ లో నున్న పదము వట్టి మాటలను సూచించును. (దుఃఖమును తెలియజేయు వాడుకలు, ఎర్రని పెయ్య చూ॥).

**బూనా** (Bunah = బుద్ధి). యెరహ్మాయేలు కుమారుఁడు. యూదా దేశపు వాఁడు (I దిన $2^{25}$).

**బూర, బూరగ** సంగీతము 3 (2) d చూ॥

**బూరల పండుగ** పండుగలు III 1 (3) చూ॥

**బూలు** కాలమానము VI 8 చూ॥

## బె

**బెకోరతు** (Becorath = జ్యేష్ఠత్వము). రాజైన సౌలు పూర్వికులలో నుండిన యొక బెన్యామీనీయుఁడు (I సమూ $9^{1}$).

**బెజెకు** (Bezek = నాటుట).

1. యెహోషువ చనిపోయిన పిమ్మట యూదా వారు పట్టుకొనిన యొక పట్టణము (న్యాయా $1^{5}$). యెరూషలేమునకు పశ్చిమమున నుండు షెఫేలాలోని బెజ్కా (*Bezkah*) యను పాడుశేషములిదే పట్టణమని యనుకొందురు.

2. యాబేష్గిలాదు వారిని విడిపించుటకై రాజైన సౌలు తన సేనను పోగుచేసిన యొక పట్టణము (I సమూ $11^{8-11}$). అది షెకెమునకు ఈశాన్య దిక్కున నుండు ఇబ్జీకు (*Ibzik*) అను పాడు శేషములై యుండవచ్చును (పటము III, G 2). ఈ రెండును ఒకేస్థలమునకు చెంగునని కొందరి యభిప్రాయము.

**బెటోనీము** (Betonim = ఒక తెరహా కాయలు). గాదు గోత్రికుల సరిహద్దులోనున్న ఒక యూరు (యెహో $13^{26}$).

**బెతహు** టిబ్హతు చూ॥

**బెతూయేలు, బేతూలు** (Bethuel, Bethul = దేవుని నివాసము).

1. అబ్రాహాము తమ్ముఁడగు నాహోరు కుమారుఁడు. ఇతఁడు ఇస్సాకు భార్యయైన రిబ్కాకును ఆమె యన్నయగు లాబానుకును తండ్రి (ఆది $22^{23}$ $24^{15,24,47,50}$ $25^{20}$ $28^{2,5}$). ఆది $28^{5}$ లో ఇతనికి అరామీయుఁడగు బెతూయేలు అనునొక పేరు కలదు.

2. యూదయ దక్షిణ ప్రాంతములో నుండిన యొక పట్టణము (I దిన $4^{30}$). యెహో $19^{4}$ నందు ఇది బేతూలు అనఁబడెను. $15^{30}$ లోని కెసీలు ఈ స్థలము కావచ్చును (కెసీలు చూ॥). దీని యునికినిగూర్చి తెలియదు.

**బెతెను** (Beten = లోయ, ఉదరము). ఆషేరు గోత్రపు పట్టణములలో నొకటి (యెహో $19^{25}$). యూసేబియస్ (*Eusebius*) అను చరిత్రకారుఁడు అది ప్తొలెమైకి తూర్పుగా ఆమడ దూరములో నున్నట్లు వ్రాసెను (పటము I, E 4).

**బెతేజెలు** (Bethezel = దగ్గఱనున్న స్థలము). యూదయ మన్యభూమియగు షెఫేలాలో నున్న యొకస్థలము (మీకా 1). జెక $14^{5}$ లోని ఆజీలు ఇదే స్థలమని కొందఱనుకొందురు. (ఆజీలు చూ॥). దీని యునికినిగూర్చి తెలియదు.

**బెతేదేను** (Beth-Eden = ఏదెను ఉనికి). దమస్కునకు సంబంధించిన యొక యూరులేక ప్రదేశము (ఆమో $1^{5}$). II రాజు $19^{12}$ లోను యెష $37^{12}$ లో నుండు ఏధనీయులును యెహె $27^{23}$ లో నున్న ఏదెనువారును ఈ దేశనివాసులైయున్నారు. అది లెబానోను పర్వతములలో నున్న ఏదెను (*Edhen*) కావచ్చును. యూఫ్రటీసునది దగ్గఱనున్న ప్రాంతములలో నున్న యొక ప్రదేశమునకు బిట్ - అదిని (*Bit-adini*) యను పేరున్నట్లు అష్షూరువారి శాసనములవలనఁ దెలియును. పేరునుబట్టి సంబంధముండినను ఇది దమస్కునకు సంబంధపడక పోవుటచే ఇది ఆమో $1^{5}$ లో నున్న బెతేదేను కానట్లుగా నున్నది.

**బెత్త** మానములు I 1 చూ॥

**బెత్పెయోరు** (Beth-Peor = పెయోరు దేవతాగృహము). మోయాబు మైదానమందు పిస్గా కొండదగ్గరనున్న ఒక యూరు గాని దీని యునికిని గుఱించి మఱింత నూటిగాఁ దెలియదు.

యొర్దానుకు తూర్పు ప్రాంతముల యందుండు రాజులమీఁద ఇశ్రాయేలీయులు యుద్ధము చేసినప్పుడు దీని దగ్గరనుండు మైదానముమీఁద మకాము చేసిరి (ద్వితీ $3^{29}$ $4^{46}$). మోషే ఈ ప్రాంతములోనే చనిపోయి పాతిపెట్టఁబడెను ($34^{6}$). దేశవిభాగమప్పు డిది రూబేనీయులకు వచ్చెను (యెహో $13^{20}$ పటము III, H 1).

**బెత్మెర్హాకు** (Beth-Merhah = దూరముగా నున్న ఇల్లు). యెరూషలేమునకును ఒలీవ కొండకును మధ్యనున్న ఏదో యొక యింటియొక్క లేక స్థలముయొక్క పేరు (II సమూ $15^{17}$). అబ్షాలోము తిరుగుబాటు చేసినకాలములో దావీదు అచటికివచ్చి బసచేసెను.

**బెత్యేషిమోతు** (Beth-Jeshimoth = ఎడారిస్థలము). ఇశ్రాయేలీయులు చేసిన అరణ్యసంచారములోని చివరిమకాముయొక్క దక్షిణపు సరిహద్దు (సంఖ్యా $33^{49}$). యెహో $12^{3}$ వలన అది మృతసముద్రమునకు తూర్పుగా అరాబాకు పోవుమార్గమున నున్నదని తెలియును. అది రూబేనుగోత్రికుల కియ్యఁబడినను ($13^{20}$) మఱల మోయాబీయులదయ్యెను (యెహె $25^{9}$). యూసేబియుసు అనువాఁడు అది యెరికోకు దక్షిణము నుండు 10 మైళ్లదూరమునందున్నదని వ్రాసెను దీనినిగూర్చిన సూచన కిది సూటిగా సరిపడును (పటము II, H 1).

**బెదాను** (Bedan = దాసుఁడైన).

1. యెరుబ్బయలనఁబడిన గిద్యోనుకును యెఫ్తాకును మధ్యకాలమందు ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతిగా నుండినవాఁడు (I సమూ $12^{11}$). గాని న్యాయాధిపతులయం దీ నామ ముదాహరింపఁబడకుండుటచే నితనినిగూర్చి పలువురు పలువిధముల నాలోచించుచున్నారు. యాయేలను వాని పేరును న్యాయాధిపతుల పట్టీలో లేక పోయినను అట్టివారిలో నొకఁడుగా లెక్కింపఁబడినట్లు (న్యాయా $5^{6}$) ఇతనిగూర్చికూడ చెప్ప వచ్చును. గిద్యోను యెఫ్తా సమూయేలులను వారితో సమముగా లెక్కింపఁబడిన ఇతనిగూర్చి న్యాయాధిపతుల గ్రంథమం దుదాహరింపఁబడక పోవుటయే నితని విషయమైగల యాక్షేపణ. LXX నందును, సిరియక్ అరబ్బీ భాషాంతరములయందును I సమూ $12^{11}$ లో బెదాను అని గాక బారాకు అని చదువవలె నందురు. కొందఱు ఈ పదము అబ్దోను అను పదమునకు సంబంధించి యుండుటచే ఇది అబ్దోను యొక్క మాఱురూపమందురు.

2. గిలాదు పుత్రుఁడగు ఊలాము కుమారుఁడు (I దిన $7^{17}$).

**బెన్** (Ben). ఇది ప్రత్యేకమైన పదము కాక ఉపసర్గయై యున్నది. ఉ॥ బెన్యామీను, బెన్హదాదు మొ॥ దీనికి కుమారుఁడు అని శబ్దార్థము. కొన్నిచోట్ల దాని నిట్లే తర్జుమా చేసిరి (I రాజు $4^{8}$).

**బెన్హిన్నోములోయ** (Valley of Hinnom or Valley of the children). యెరూషలేమునకు పశ్చిమభాగమందున్న యొక లోయ. అచట అన్యుల దేవతయగు మొలెకును ముఖ్యముగా పూజించి దాని ఘనార్థమై తమ బిడ్డలను అగ్నిగుండముల గుండ దాటించిరి (I రాజు $23^{10}$ II దిన $28^{3}$ $33^{6}$ యిర్మీ $7^{31}$ $32^{35}$). ఈ పూజను చెడఁగొట్టుటకై రాజైన యోషీయా అచట శల్యములను కాల్చి పట్టణములోని చెత్తను అచట వేయించి కాల్పించెను (II రాజు $23^{6-10}$). అందుచేతనే అది యెల్లప్పుడు మండుచుండు అపవిత్ర స్థలమును, నరకాగ్నికి సూచనయు నయ్యెను. మ $5^{28,29}$ $10^{20}$ లో నరకాగ్ని, నరకము అను పదములచే తర్జుమా చేసిన అసలు పదము గేహెన్న యనునదే. దానికి హిన్నోము భూమియని యర్థమగును. ఇట్లు యూదులలో హిన్నోము భూమి నరకమును సూచించుట వాడుకయయ్యెను (యెరూషలేము A I 2 చూ॥).

**బెనాయా** (Benaiaah = యెహోవా కట్టెను).

1. ఒక లేవీయుఁడు. యూదాలోని కబ్సెయేలు ఊరివాఁడగు యెహోయాదా కుమారుఁడు (II సమూ $23^{20}$). అతని తండ్రి యాజకుఁడు (I దిన $27^{5}$). ఈ వచనములోని బిరుదు ధూపవేదికకు సంబంధించినయెడల బెనాయా తండ్రి దావీదును సింహాసనముమీఁద నుంచుటకై గొప్ప సైన్య సమేతుఁడై వచ్చిన యాజకుల నాయకుఁడై

యుండును (I దిన $12^{27}$). బెనాయా మిగుల పరాక్రమశాలి. గుహలోనికిఁబోయి సింహమును, సింహ బలాఢ్యులగు ఇద్దరు మోయాబీయులను, సాయుధుఁడై యున్న ఐగుప్తీయుని ఒక్క దుడ్డుకర్రతో మాత్రమే నెదుర్కొని వాని యీటె లాగుకొని దానితోనే వానిని, చంపి సుప్రసిద్ధుఁడయ్యెను (II సమూ $23^{20,21}$ I దిన $11^{22,23}$). దావీదు దేహసంరక్షకులగు కెరేతీయులు పెలెతీయులకు అధిపతియై యుండెను (II సమూ $6^{18}$). మూఁడవ మాసమున ఇతఁడు తన వంతువారగు 24 వేలమందితో రాజుకు సేవ జేసెను (I దిన $27^{5,6}$). అబ్షాలోము తిరుగఁబడి నప్పుడు దేహసంరక్షకు లందఱితో రాజును నమ్మకముగా గొలిచెను (II సమూ $15^{18}$ $20^{23}$). అదోనీయా కుట్రలో చేరలేదు (I రాజు $1^{10}$). దావీదు ఆజ్ఞనొందినవాఁడై సొలొమోనును గిహోనుకు వెంటఁగొనిపోయి అచ్చట సొలొమోనును రాజుగా నభిషేకించనై ఊరేగింపుతో తీసికొని వెళ్లెను ($1^{38}$). దేహసంరక్షకుల ముఖ్య అధికారియై, అదోనీయాను ($2^{25}$), యోవాబును ($2^{29,34}$), షిమీను ($2^{46}$) సంహరించెను. యోవాబు చనిపోయినందున సేనాధిపతిగా నితఁడు నియమింపఁబడెను ($2^{25}$).

2. దావీదు ముప్పదిమంది యనఁబడిన వారిలో నొకఁడగు పిరాతోనీయుడు (II సమూ $23^{30}$ I దిన $11^{31}$). పదకొండవమాసములో నితఁడు తన సైన్యభాగముతో రాజును సేవించెను (I దిన $27^{14}$).

3. దావీదు మందసమును యెరూషలేమునకు దెచ్చుచుండఁగా దానిముందు సంగీతము వాయించిన రెండవ వరుసలోని లేవీయుఁడు. ఇతఁడు తరువాత దావీదు వేయించిన గుడారములోను ఇట్లే సేవజేసెను (I దిన $15^{18,20}$ $16^{5}$).

4. దావీదు మందసమును యెరూషలేమునకుఁ దెచ్చునప్పుడును తరువాత గుడారములోను బూర నూదిన యాజకుఁడు (I దిన $15^{24}$ $16^{6}$).

5. యెహోషాపాతు ఏలుబడికిముందు జీవించిన ఆసాపు సంతతివారిలో నొకఁడు (II దిన $20^{14}$).

6. హిజ్కియా కాలమున జీవించిన షిమ్యోనీయులలో నొకఁడు (I దిన $4^{36}$).

7. హిజ్కియా కాలమునందు అర్పణముల పైవిచారణ కర్తగా నుండిన లేవీయుడు (II దిన $31^{13}$).

8. యెహెజ్కేలు తండ్రి కాలమున జీవించిన పెలట్యా యను ప్రధాని (యెహె $11^{1,13}$) 9-12. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిన వారిలో నలుగురు (ఎజ్రా $10^{25,30,35,43}$).

**బెనీను** (Beninu = మనకొడుకు). నెహెమ్యా కాలములో నిబంధనకు సంతకము చేసిన లేవీయులలో నొకఁడు (నెహె $10^{13}$).

**బెనేబెరకు** (Bene Berak = మెరుపు కొడుకు). దానుగోత్రికుల స్వాస్థ్యములోనున్న ఒక యూరు (యెహో $19^{45}$) అది యొప్పేకు 5 మైళ్లదూరములోనుండు ఇప్పుడు ఇబ్రాఖ అనబడు *Ibn Ibrak* అయి యుండవచ్చును (పటము III, C 4).

**బెనేయాకాను** (Bene-Jaackan = యాహకాను కొడుకులు). ఇశ్రాయేలీయులు అరణ్యములో మకాము చేసిన యొక స్థలము (సంఖ్యా $33^{31,32}$). ద్వితీ $10^{6}$ లో దానికి యాహకానీయులదైన బెయెరోతు (యాహకాను బావులు) అను పేరుకలదు (యాహకాను చూ॥).

**బెనో** (Beno = అతనికొడుకు). లేవీయులలోని మెరారీ తెగకు చేరిన యొకని పేరు (I దిన $24^{26,27}$).

**బెన్జోహేతు** (Ben-zoheth = జోహేతు కొడుకు). యూదా వారిలో నొకఁడు (I దిన $4^{20}$).

**బెన్నమ్మి** (Ben-ammi = నాజనుల కుమారుఁడు). లోతు కుమారుఁడు. ఇతఁడు అమ్మోనీయుల మూల పురుషుఁడై యున్నాఁడు (ఆది $19^{36-38}$ అమ్మోనీయులు చూ॥).

**బెన్యామీను** (Benjamin = కుడిచేతి పుత్రుఁడు).

1. యాకోబు పన్నెండుమంది కుమారులలో కనిష్ఠుఁడు. ఇతఁడును యోసేపును రాహేలు కుమారులుగాన స్వంత అన్నదమ్ములు. యాకోబు బేతేలును సమీపించినప్పుడు రాహేలు లితనిని

కని ఇతని కనుటవలన తనకు మరణమగుచున్నానని యెఱిగి బెనోని (= నా వ్యసన పుత్త్రుఁడు) అను పేరు పెట్టెను గాని యాకోబు అతనిని బెన్యామీను అని పిలిచెను (ఆది $35^{16-20}$). అతఁడు కడగొట్టువాఁడై మిగుల అవస్థయందు పుట్టినందున యాకోబతనిని యోసేపును పోఁగొట్టుకొనినపిదప మిగులఁ బ్రేమించెను. అతఁడు తన యన్నలతో నైగుప్తుకు వెళ్లవలసివచ్చినప్పుడు మిగుల కష్టముతో యాకోబతనిని పంపించెను. అతనికేమైనను సంభవించినపక్షమందు ముదుసలియగు తన తండ్రి దుఃఖపరుఁడై చనిపోవునని యూదా తలంచుట వింతకాదు ($43^{1-17}$). యోసేపుకును బెన్యామీనుపై మిగుల యనురాగముండెను ($43^{29-34}$ $44^{1-34}$). బెన్యామీనుకు పదుగురు కుమారులును ఇద్దరు కుమార్తెలు కలిగిరి గాన అతనికిని ఇశ్రాయేలునందొక గోత్రభాగ మేర్పడెను ($46^{21}$ సంఖ్యా $26^{38-41}$ I దిన 7-$12^{8}$).

2. బెన్యామీను గోత్రము. ఇతనిపేరునుబట్టి యితని వంశపువారికి కలిగిన పేరు. బెన్యామీను చీల్చునట్టి తోఁడేలు, అతఁడు ఉదయమునందు ఎరను తిని అస్తమయమందు దోపుడు సొమ్ము పంచుకొనునని యాకోబు ప్రవచించెను (ఆది $49^{27}$). బెన్యామీను యెహోవాకు ప్రియుఁడు. ఆయన యొద్ద నతఁడు సురక్షితముగా నివసించెను. దినమెల్ల ఆయన అతనికి ఆశ్రయమగును. అతని భుజముల మధ్య నాఁడు నివసించును అని మోషే ప్రవచించెను (ద్వితీ $33^{12}$). షిలోహునొద్ద యెహోషువ చీట్లువేసి భూమిని పంచిపెట్టినప్పుడు యూదా ఎఫ్రాయిములకుఁ దరువాత బెన్యామీనుకు మొదటిచీటి వచ్చెను. అతని యూదా ఎఫ్రాయిములకు మధ్యగాను స్వాస్థ్యమున్నందున అవి దానికి సరిహద్దు లయ్యెను. ఉత్తర సరిహద్దు యొర్దానునుండి బేతేలు గుండా బేత్‌హోరోనుకు దక్షిణముగా నున్న అతారోతు అద్దారువఱకు వ్యాపించెను. పడమటి సరిహద్దు ఇక్కడినుండి కిర్యత్యారీమువఱకుండెను. దక్షిణమున అది కిర్యత్యారీమునుండి బెన్‌హిన్నోము లోయమార్గముగుండా యెరూషలేమునకు దక్షిణముగాను మృతసముద్రమున కుత్తరముగాను వ్యాపించెను (పటము IX) యొర్దాను నదియే దాని తూర్పు సరిహద్దు (యెహో $18^{11-20}$). ఈ ప్రదేశము తూర్పుపడమరలు 28 మైళ్లును ఉత్తర దక్షిణములు 12 మైళ్లు నుండెను. ఇది పర్వతమయమైనను మిగుల సారవంతమై యెరూషలేము యెరికో బేతేలు గిబియోను గెబ మిస్పే యను ముఖ్యపట్టణములతో నిండెను ($18^{21,28}$). విదేశీయుల బారినుండి ఇశ్రాయేలీయుల తప్పించిన విమోచకులలో నొకఁడు ఈ గోత్రికుఁడే (న్యాయా $3^{15}$). ఘోరనేరము జేసిన గిబియా వారిని కాపాడినందున ఇశ్రాయేలీయులీ గోత్రికులను దాదాపుగా నందరిని హతము జేసిరి ($19^{21}$). ఇశ్రాయేలీయుల మొదట రాజీ గోత్రపువాఁడే. ఈ గోత్రికులు మొదటి రాజగు సౌలును చాలకాలమువఱకు వెంబడించిరి (II సమూ $2^{9,15}$ I దిన $12^{29}$). దావీదురాజైనప్పుడీ గోత్రికులకు తృప్తిలేకపోయెను (II సమూ $16^{5}$ $20^{1-22}$ కీర్త 7 పై వ్రాఁత). రాజ్యవిభాగమైనప్పుడు వీరు దావీదు ఇంటివారి ననుసరించిరి (I రాజు $12^{21}$ ఎజ్రా $4^{1}$). అన్యజనుల అపొస్తలుఁడగు పౌలు ఈ గోత్రికుఁడే (ఫిలి $3^{5}$).

యెరూషలేమునందలి రెండు ద్వారములు బెన్యామీను పేరున పిలువఁబడుచున్నవి. బెన్యామీను మీఁదిగుమ్మ మనునది దేవాలయములో నున్నది (యిర్మీ $20^{2}$). బెన్యామీనీయుల రెండవ ద్వారము ఆ గోత్ర స్థానములోనికి నడిపించును ($38^{7}$ జెక $14^{10}$ యెరూషలేము B III 8 (1), దేవాలయము I 3 (2) చూ॥).

3. యెదీయవేలు సంతతివాఁడైన బిల్హాను కుమారుఁడగు నొక బెన్యామీనీయుఁడు (I దిన $7^{10}$).

4. హారీము కుమారుఁడు. అన్యస్త్రీలను పెండ్లియాడి ఎజ్రా ప్రేరేపణవలన వదిలిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{32}$). M.

**బెన్యామీను మీఁది గుమ్మము** యెరూషలేము B III 8 (1), దేవాలయము I 3 (2) చూ॥

**బెన్హదదు** (Benhadad = హదదు కుమారుఁడు).

1. టబ్రిమ్మోను కుమారుఁడు. ఇశ్రాయేలు రాజగు బయెషా యూదాను బాధపఱుచఁగా యూదారాజైన ఆసా, బెన్హదదుకు విశేషద్రవ్యము

నిచ్చి అతనిచే నిశ్రాయేలీయులను శిక్షింపఁజేసెను (I రాజు $15^{18-21}$ II దిన $16^{2-6}$). ఇతఁడు ఇశ్రాయేలీయుల యుత్తరపు హద్దుల నపహరించెను.

2. పైనఁ జెప్పిన వాని కుమారుఁడు. అహాబు ఇశ్రాయేలీయుల దేశము నేలుచుండఁగా ఇతఁడు దమస్కు నేలెను. ఇతఁడు అహాబుమీఁద అనేక పర్యాయములు యుద్ధము చేసెను (II రాజు $5^{2}$ $6^{8}$-$7^{20}$). అయితే అష్షూరురాజగు షల్మ నేసెరు సిరియా చుట్టుపట్లనుండు దేశములన్నిఁటి మీఁదికి దండెత్తిరాఁగా వీరు ఇతరులతో సంధి చేసికొని అష్షూరురాజు నెదిరించిరి. అప్పుడు క్రీ॥ ము॥ 854 సం॥ నందు కర్కారు (*Karkar*) అను పట్టణము యొద్ద గొప్ప యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో తాను గెల్చి యున్నట్లు షల్మనేసెరు రాతి శాసనములలో వ్రాయించినను అతఁడా యుద్ధముతో తన దండయాత్ర నాపివేయుటను చూఁడగా ఆ జయమంత గొప్పదికాదని తెలిసి కొనవచ్చును (అష్షూరు 3 చూ॥). ఈ సంధి కాక మునుపు 855 సం॥లో అహాబు బెన్హదదును గెల్చినట్లుగా నున్నది (I రాజు 20). గాని, 851 లో బెన్హదదు మఱల అహాబును ఓడించెను (I రాజు 22). షుమారు 843 సం॥లో బెన్హదదు హజాయేలు అనువాని కుట్రవలన చంపఁబడెను (II రాజు $8^{15}$).

3. హజాయేలునకుఁ బిమ్మట దమస్కు నేలిన వాఁడు అష్షూరువారి రాతిశాసనములను చూడగా నితనికి మారి (*Mari*) యను మాఱు పేరు కలదు. ఇతఁడు క్రీ॥ ము॥ షుమారు 803 సం॥లో అష్షూరు రాజుచే జయింపఁబడెను. అందుచేతనే ఇశ్రాయేలీయులు తాము హజాయేలు కాలములో పోఁగొట్టుకొనిన దేశములను మఱల నపహరించి స్వాధీనమును చేసికొనిరి (II రాజు $13^{3,5,24}$).

బెన్హదదు నగరములు అనఁబడినవి దమస్కులో నున్న నగరములై యున్నవి (యిర్మీ $49^{27}$ ఆమో $1^{4}$ హదదు చూ॥).

**బెన్హయీలు** (Ben-Hail = బలమునకు కుమారుఁడు). యూదయ యూళ్లలోని ప్రజలకు ధర్మశాస్త్రమును బోధించుటకు రాజైన యెహోషాపాతు పంపిన యొక పెద్ద (II దిన $17^{7}$).

**బెన్హానాను** (Ben-Hanan = దయగలవాని కొడుకు). యూదావారిలో నొకఁడు (I దిన $4^{20}$).

**బెయల్యా** (Bealiah = యెహోవా ప్రభువు). దావీదు సిక్లగులో నుండఁగా నతనికి సహాయము చేయవచ్చిన యొక బెన్యామీనీయుఁడు (I దిన $12^{5}$). H.

**బెయాలోతు** బాలా 2 చూ॥

**బెయెల్యాదా** (Beeliada = ప్రభువు ఎరుగును). దావీదు కుమారులలో నొకఁడు (I దిన $14^{7}$). II సమూ॰ $5^{16}$ I దిన $3^{8}$ లో దేవుఁ డెరుగును అని యర్థమిచ్చు **ఎల్యాదా** అను మాఱుపేరు గలదు

**బయెష్టెరాను** (Be-eshterah = అష్టారోతె ఆలయము). యొర్దాను కవతలనున్న మనష్షే గోత్రమందలి యొక లేవీయ పట్టణము (యెహో $21^{27}$). దీనికి అష్టారోతను మారుపేరు గలదు (I దిన $6^{71}$). ఇది బేతు అష్టారోతు అను పదముయొక్క క్లుప్తరూపమై యుండును (అష్టారోతు చూ॥). B.

**బెయేర్లహాయిరోయి** (Beer-Lahoi-roi = నన్ను చూచువాని జీవపు బావి). హాగరును ఆమె కొమరుఁడగు ఇష్మాయేలును మిక్కిలి దప్పిగొనినప్పుడు మాత కాదేషుకును బెరెదుకును మధ్యనున్న యెడారిలోఁ జూపిన యూఁటకు హాగరు పెట్టిన పేరు (ఆది $16^{10-15}$). ఇస్సాకు ఈ స్థలమునందే తన వధువును సంధించెను ($24^{62}$). అబ్రాహాము మరణానంతరము అతఁడిచ్చోటనే నివసించెను ($25^{11}$). బెయేర్షెబాకు నైర్భతి దిక్కున 20 మైళ్ల దూరముననున్న ఎయిన్ మవేయిలియ (*Ain Muweilch*) అనఁబడు బావి యిదేనని యెంతురు. సిరియానుండి యైగుప్తుకు పోవు బిడారుల మార్గములో నిది ముఖ్యస్థానమై యున్నది. ఇందు పెక్కు బావులు గలవు. H.

**బెయేర** (Beera, Beerah = బావి.)

1. ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన $7^{37}$).

2. అష్షూరు చక్రవర్తియగు తిగ్లత్పిలేసరు చెఱపట్టిన వారిలోనున్న యొక రూబేనీయుఁడు (I దిన $5^{6}$).

**బెయేరి** (Beeri = నుయ్యిగలవాఁడు).

1. హిత్తీయులలో నొకఁడు. ఏశావు ఇతని కుమార్తెయగు యహూదీతును వివాహము చేసికొనెను (ఆది $26^{34}$).

2. ప్రవక్తయైన హోషేయ తండ్రి (హోషే $1^{1}$).

**బెయేరేలీము** (Beer-Elim = యోధుల బావి). మోయాబులోనున్న యొక స్థలము గాని దాని యునికినిగూర్చి మఱి నేటుగా తెలియదు (యెష $15^{8}$). దీని శబ్దార్థ సంబంధమును బట్టి సంఖ్యా $21^{17,18}$ లో దీనిగూర్చిన సూచన కలదని కొందఱనుకొందురు.

**బెయేరు** (Beer = బావి). ఈ ప్రత్యయము ఆయా స్థలముల పేరులలో కనఁబడును. ఉదా॥ బెయేర్షెబా, బెయెరోతు మొ॥ ఇది ప్రదేశముగా పేరై యున్నది.

1. ఇశ్రాయేలీయులు అరణ్యములో మకాము చేసిన స్థలములలో నొకటియై యున్నది (సంఖ్యా $22^{16}$ బెయేరేలీము చూ॥).

2. గిద్యోను కొడుకగు యోతాము పారి పోయిన స్థలము (న్యాయా $9^{21}$). దీని యునికిని గూర్చి నూటిగా తెలియదు.

**బెయెరోతు, బెయెరోతీయుడు** (Beeroth, Beerothite = బావులు).

1. కనాను దేశపు పట్టణములలో నొకటి. ఈ పట్టణస్థులు గిబియోనీయులతో సంధి చేసికొనిన వారగుటచే యెహోషువ వారిని నాశనము చేయక కాపాడినపుడు వారితోపాటు వీరిని కూడ రక్షించెను (యెహో $9^{17}$). తదనంతరమున ఈ పట్టణము బెన్యామీనీయుల స్వాస్థ్యమయ్యెను ($18^{25}$ II సమూ $4^{29}$). చెఱకాలమునకు పిమ్మట కూడ ఈ పట్టణముండెను (ఎజ్రా $2^{25}$ నెహె $7^{29}$). ప్రస్తుతమున యెరూషలేమున కుత్తరముగా ఆమడ దూరములోనున్న బీరె (*Bireh*) అను స్థానమే దాని యునికియని సాధారణముగా నను కొందురు. వారికిగల ఈ బెయేరోతీయుడు అను బిరుదునుబట్టి రేకాబు (II సమూ $4^{2}$), నహరై (II సమూ $23^{37}$ I దిన $11^{39}$) అనువారు ఈ పట్టణస్థులని తెలియును. (రేకాబు, నహరై చూ॥ పటము II, F 5).

2. ఇశ్రాయేలీయులు అరణ్యములో ప్రయాణముచేసిన కాలమునందు వారు మకాముచేసిన యొక స్థలము. అది ఎదోము సరిహద్దుననుండి యహకానీయులదైన బెయేరోతు అనఁబడును (ద్వితీ $10^{6}$).

**బెయేర్షెబా** (Beer-sheba = ప్రమాణపు బావి, ఏడు అనఁబడిన బావి, ఏడు బావులు). హెబ్రోనుకు నైరృతి దిక్కున 28 మైళ్ల దూరమందున్న యొక పట్టణము. అబ్రాహాము ఇస్సాకు యాకోబులు నివసించిన స్థలము (ఆది $21^{31}$ $26^{23}$ $28^{10}$). షిమ్యోను గోత్రికులకు దీని నిచ్చిరి (యెహో $19^{2}$). సమూయేలు కుమారులిచ్చట న్యాయాధిపతులుగా నుండిరి (I సమూ $8^{2}$). ఏలీయా హోరేబుకు పాఱిపోయినప్పుడు దీనిమీఁదుగా వెళ్లెను (II రాజు $12^{1}$). ఇచ్చట నుండిన పూజాస్థానము ఆమోసు కాలములో మిగుల ప్రసిద్ధి కెక్కెను (ఆమో $5^{5}$ $8^{14}$). ఇది పలెస్తీను దేశపు దక్షిణ సరిహద్దగుటచేత "దాను నుండి బెయేర్షెబావఱకు" అను మాటలు ఆ దేశమంతటిని సూచించును (న్యాయా $20^{1}$ I సమూ $3^{20}$). కొన్ని చోట్ల బెయేర్షెబా అరణ్యమనఁబడెను (ఆది $21^{14}$, అరణ్యము 3 (8) చూ॥ పటము II, C 4).

**బెయోను** (Beon). బయల్మెయోనుయొక్క మాఱు పేరు (సంఖ్యా $32^{3}$, బయల్మెయోను చూ॥).

**బెయోరు** (Beor = దివిటీ).

1. బిలాముయొక్క తండ్రి (సంఖ్యా $22^{5}$ $24^{3,15}$ $33^{8}$ యెహో $13^{22}$ $24^{9}$ ద్వితీ $23^{4}$ మీకా $6^{5}$ II పేతు $2^{15}$).

2. ఎదోము దేశమునకు రాజగు బెల యను దాని తండ్రి (ఆది $36^{32}$ I దిన $1^{43}$).

**బెరయ** (Berea). మాసిదోనియలో నున్న యొక పట్టణము. అది థెస్సలొనీకకు నైరృతి దిక్కున 50 మైళ్ల దూరములో నున్నది. గ్రీసు వారి చరిత్రను రోమను వారి చరిత్రను చూడఁగా

కొన్ని యుద్ధములకు సంబంధముగా ఈ పేరు ఆ చరిత్రలలో కనఁబడును. పౌలు తన రెండవ మిషనెరీ ప్రయాణములో నిచట సువార్తను ప్రకటించినపుడు (కార్య $17^{10}$) వారు బాగుగా వినిరి ($17^{12}$). పౌలు సహాయకులలో సోపత్రు అనువాఁడు ఈ యూరువాఁడై యుండెను ($20^{4}$). ప్రస్తుతము దానికి వెరియ (*Verria*) అను పేరు కలదు (పటము V, F 2).

**బెరా** (Bera = శ్రేష్ఠమైనది). సొదొమ రాజు (ఆది $14^{2}$). కదొర్లాయోమెరు చే నోడింపఁబడెను.

**బెరాకా** (Beracah = ఆశీర్వాదము).

1. సిక్లగునొద్దనున్న దావీదుతో చేరుకొనిన నొక బెన్యామీనీయుఁడు (I దిన $12^{1,3}$).

2. అమ్మోనీయులను మోయాబీయులను ఎదోమీయుల నోడించిన పిదప కృతజ్ఞతా స్తుతులను చెల్లించిన లోయ (II దిన $20^{26}$). ప్రస్తుతము తెకోవ దగ్గఱనుండు బెరైకుత్ (*Bereikut*) అనునది దాని యునికియైనట్లు తోఁచుచున్నది (పటము II, E 2).

**బెరాయా** (Beraiah = యెహోవా సృజించును). బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{21}$).

**బెరేతుస్వామి** బయల్బెరీతు చూ॥

**బెరీయా** (Beriah = కీడుతో, కీడు, Berites).

1. ఆషేరు కొడుకులలో నొకఁడు (ఆది $46^{17}$). ఇతనినిబట్టియే ఈ గోత్రపువారిలో నొక తెగకు బెరీయులు అను పేరు వచ్చెను (సంఖ్యా $26^{44}$). II సమూ $20^{14}$ లో నున్న బెరీయులు వేఱువారై యున్నారు. LXX నందున్నట్లు బిఖ్రీయు లనునది అచ్చటి సరియైన పేరై యున్నది.

2. ఎఫ్రాయిముయొక్క నలుగురు కుమారులు గాతీయుల పశువుల నెత్తుకొని పోవవచ్చి వారిచే హతులైనపిదప యతనికి పుట్టినవాని పేరు (I దిన $7^{23}$).

3. గాతీయులను అయ్యాలోను నుండి పారదోలిన యొక బెన్యామీనీయుఁడు (I దిన $8^{13}$).

4. లేవీయుఁడగు షిమీ కుమారులలో నొకఁడు (I దిన $23^{10}$).

**బెరెక్యా** (Berechiah = యెహోవా దీవించును).

1. గాయకుఁడగు ఆసాపు తండ్రి (I దిన $15^{17}$).

2. మందసమునకు కావలివారైన లేవీయులలో నొకఁడు (I దిన $15^{23}$).

3. ఎఫ్రాయిము పెద్దలలో నొకఁడు (II దిన $28^{12}$).

4. జెరుబ్బాబెలు కుమారులలో నొకఁడు (I దిన $3^{20}$).

5. చెఱకాలమునకు తరువాతనుండిన లేవీయులలో నొకఁడు (I దిన $9^{16}$).

6. నెహెమ్యా కాలములో ప్రాకారములను కట్టిన వారింతులలో నొకదాని పెద్దయగు మెషుల్లామునుయొక్క తండ్రి (నెహె $3^{4,30}$ $6^{18}$).

7. జెకర్యా యను ప్రవక్తయొక్క తండ్రి (జెక $1^{1}$).

**బెరెదు** (Bered = వడగండ్లు).

1. బెయేర్షెబాకు దక్షిణముగానుండు నొక స్థలము (ఆది $16^{7,14}$). దీని యునికినిగూర్చి తేటగా తెలియదు.

2. జెకరు అను నతని మాఱుపేరు (I దిన $7^{20}$, జెకరు 1 చూ॥).

**బెరోతీయుఁడు** బెయేరోతు చూ॥

**బెరోదక్బలదాను** మెరోదక్బలదాను చూ॥

**బెర్నీకే** (Bernice, Berenice = దోపుడు నెత్తుకొని పోయిన జయశాలిని). మొదటి హేరోదు అగ్రిప్ప (కార్య $12^{1}$) యొక్క పెద్ద కుమార్తె. కల్సిస్ (*Chalcis*) దేశమునకు రాజును తనకు మేనమామయునగు హేరోదను వానిని పెండ్లియాడెను. ఇతనినిగూర్చి బైబిలునందు ప్రశంసింపఁబడలేదు. ఇతని మరణానంతరము తన సహోదరుఁడగు రెండవ అగ్రిప్ప రాజుతో అక్రమముగా జీవించెను (హేరోదు చూ॥). అగ్రిప్పయెదుట పౌలు సమాధానము చెప్పుకొన్న

ప్పుడు ఈ మెయు ఆ సభలో నుండెను (కార్య 25^{13,23} 26^{30}). E.

**బెల** (Bela = నాశనము).

1. ఎదోము రాజు (I ఆది 36^{32,33} I దిన 1^{43}).

2. బెన్యామీను కుమారులలో జ్యేష్ఠుఁడు (ఆది 46^{21} సంఖ్యా 26^{38}).

3. మోయాబు దేశమునందు నివసించిన యొక లేవీయుఁడు (I దిన 5^{8}). పై నుదాహరింపఁబడిన ఎదోము రాజువలె పరంపరగా యూఫ్రాతు నదీ ప్రాంతముతో సంబంధించినట్లు కనఁబడుచున్నది.

4. మైదానమందలి పట్టణములలో సోయరనఁబడిన దాని మాఱుపేరు (ఆది 14^{2,8} సోయరు చూ॥). H.

**బెలియాలు, బెలియూరు** (Belial = పనికి మాలిన). పాత నిబంధనయందు పనికిమాలిన, లాభములేని, నాశనకరమైన, దుర్మార్గమైన, చెడ్డ, దైవభక్తిలేని మనుష్యులని తెనిగింపఁబడిన పదము. (ద్వితి 13^{13} న్యాయా 19^{22} I సమూ 1^{16} 2^{12} I రాజు 21^{10} II దిన 13^{7} మొ॥). సాతాను సకల దుర్మార్గతకును అపవిత్రతకును పనికిమాలిన తనమునకును కీడుకును స్వరూపిగాన క్రొత్త నిబంధనయందు దిది వానికి సార్థకనామముగా నుపయోగింపఁబడెను (II కొరి 6^{15}). B.

**బెల్తెషజ్జరు** (Belteshazzer = బేలు దేవతా, రాజుయొక్క ప్రాణమును రక్షింపుము). బబులోను చక్రవర్తి దానియేలునకు పెట్టిన క్రొత్త పేరు (దాని 1^{7} 2^{26}. దానియేలు చూ॥).

**బెల్షస్సరు** (Belshazzer, Bel-sharuzur = బేలుదేవత రాజును కాపాడుగాక). బబులోను చక్రవర్తులలో బెల్షస్సరు చివరివాఁడని యెంచఁదగును (దాని 5). పేరునకు ఇతని తండ్రియగు నబోనిదాస్ చక్రవర్తియై యుండినను అతఁడీ బెల్షస్సరునకు చక్రవర్తియొక్క పని యంతయు నప్పగించినట్లున్నది. క్రీ॥ ము॥ 539 వ సం॥ లో కోరెషు బబులోనును పట్టుకొనఁగా బెల్షస్సరు బబులోను సేనలను నడిపించుచుండెను. దాని 5^{18} లో నున్నట్లు నెబుకద్నెజరు అతనికి తండ్రి యనఁబడెను గాని యితఁడు నెబుకద్నెజరు యొక్క మనుమఁడని తెలిసికొనవలెను. అయితే ఒక వంశములో పుట్టినవారు ఎన్నితరముల తరువాత యున్నను ఆ వంశపు పెద్దకు కొడుకులని చెప్పువాడుక కలదు. బబులోను పట్టఁబడిన పిమ్మట అతఁడు హతుఁడాయెనని దాని 5^{30} వలనఁ దెలియును. బబులోను లిఖితములలో ఇంత వఱకు దొరికినవాటియందితని మరణమునుగూర్చి యేమియు కనఁబడలేదు (బబులోను 3, దాని యేలు గ్రంథము చూ॥).

**బెసలేలు** (Bezaleel = దేవుని నీడలో).

1. అరణ్యములో గుడారమును దానియందలి సామగ్రిని చేసినవాఁడు (నిర్గ 31-37 I దిన 2^{20} II దిన 1^{5}). ఈ పని చేయుటకు యెహోవా అతనిని పిలిచి (నిర్గ 31^{2}), అతనికి కావలసిన బుద్ధి కుశలత సామర్థ్యము ననుగ్రహించెను (31^{3-5}) అతఁడితరులకు ఆ పని నేర్పవలెనని అతని కాజ్ఞనిచ్చెను (35^{34}).

2. ఎజ్రా కాలములో అన్యస్త్రీల నుంచుకొని అతని ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా 10^{30})

**బెసోద్యా** (Besodiah = యెహోవాకు సెలవైనవాఁడు). యెరూషలేము ప్రాకారములను కట్టుటలో నెహెమ్యాకు సహాయము చేసిన వారిలో నుండిన మెషుల్లాము తండ్రి (నెహె 3^{6}).

**బెసోరు** (Besor = ఆతురత). I సమూ 30^{9,10,21} లో చెప్పఁబడియున్న ఒక వాగుపేరు. గాజాకు నైరృతి దిక్కుగా సముద్రములోకి ప్రస్తుతము పారుచుండెడి గుజ్జె (*Ghuzzeh*) యను వాగే ఇది యనుకొందురు.

## బే

**బేకరు** (Becher = చిన్న ఒంటె).

1. ఎఫ్రాయిము కుమారులలో నొకఁడు (సంఖ్యా 26^{35}). I దిన 7^{20} లో బెరెదు అను పేరు కలదు. వీని సంతతివారు బేకరీయులనఁబడిరి (సంఖ్యా 26^{35}).

2. బెన్యామీను కొడుకులలో నొకఁడు (ఆది 46^{21} I దిన 7^{6,8}).

**బేజయి** (Bezai).

1. చెఱకాలమునకుఁ బిమ్మట పలెస్తీనుకు తిరిగి వచ్చిన కుటుంబములలో నొక కుటుంబమునకుఁ బెద్ద (ఎజ్రా $2^{17}$ నెహె $7^{23}$).

2. నెహెమ్యా కాలములో నిబంధనను స్థిరపఱచిన వారిలో నొకఁడు (నెహె $10^{18}$). ఈ యిద్దరు నొకఁడే యని కొందఱి యభిప్రాయము.

**బేత్** (Beth = ב అను అక్షరము). హెబ్రీ యక్షరములలో రెండవది. అక్షర మాలికా గీతమనఁబడు 119 వ కీర్తనలోని రెండవ భాగమందలి ప్రతి పంక్తియు ఈ యక్షరముతో నారంభమగుటచే ఈ యక్షరమునుబట్టి ఆ భాగమునకు బేత్ అను పేరుపెట్టిరి.

**బేత్ దిబ్లాతాయిము** (Beth-Diblathaim = అంజూరపు పండ్ల రెండు అడలు). మోయాబులో నున్న యొక స్థలము (యిర్మీ $48^{22}$). ఇది యిశ్రాయేలీయులు అరణ్యములో మకాము చేసిన అల్మోను దిబ్లాతాయిము అని యనుకొందురు (సంఖ్యా $33^{46,47}$ అల్మోను దిబ్లాతాయిము చూ॥).

**బేత్ హక్కెరము** (Beth-Haccherem = ద్రాక్షతోటయున్న స్థలము). యూదయలోని యొక స్థలము (నెహె $3^{14}$ యిర్మీ $6^{1}$). జెరోము (*Jerome*) అనువాఁడు ఇది బేత్లెహేమునకు దక్షిణముగా $3\frac{1}{2}$ మైళ్ల దూరములో నున్నదనెను గాని అది రూఢియైన విలులేదు. యెరూషలేమునకు పడమరగా ద్రాక్షతోటలుండునదే దీని యునికి యని చెప్పెదరు.

**బేత్ హొగ్లా** (Beth-Hoglah = కౌజు పక్షియుండు చోటు). మృత సముద్రమునకు సమీపమున యెరికో మైదానములో నున్న బెన్యామీనీయుల పట్టణములలో నొకటి (యెహో $15^{6}$ $18^{18,21}$). ప్రస్తుతమున అచటనుండు అయిన్ హజ్లా (*Ain Hajlah* = కౌజు ఊట) యనునదే దీని యునికి యనుకొందురు (పటము II, H 1).

**బేత్ హోరోను** (Bethhoron = లోయలోని పట్టణము). ఒక దానికొకటి సమీపముగా నుండు రెండు ఊళ్లు. వాటిలో నొకటి యుత్తరపుది రెండవది దక్షిణపుది యనఁబడును (I దిన $7^{24}$). ఇది యొప్పే చుట్టునుండు మైదానము నుండి ఎఫ్రాయిము మన్యప్రదేశమునకుఁబోవు నొక ముఖ్యలోయ దగ్గఱ నుండుటచేతను శత్రువులు యెరూషలేము మీఁదకు బోవుట కిదియొక మార్గమవుట చేతను, ఇచట యుద్ధము లనేక పర్యాయములు జరిగెను యెహోషువ ఇచ్చట కనానీయుల నోడించెను (యెహో $10^{10-14}$). సొలొమోను ఈ రెండు స్థలములలోను ప్రాకారములను కట్టించెను (II దిన $8^{5}$ I రాజు $9^{17}$) ఐగుప్తురాజైన షీషకు ఈ మార్గముననే యూదా వారిమీఁదికి దండెత్తి వచ్చెనని ఐగుప్తీయుల శాసనములవలనఁ దెలియును మక్కబీయుల యూదా యనువాఁడిచట రెండు మాఱులు అంతియోకస్ ఎపిఫనీస్ అను రాజు నోడించెను (I మక్క $3^{13-24}$ $7^{39-50}$). మఱియు నిచట 200 సం॥లకు తరువాత యూదు లొకసారి రోమీయుల నోడించిరి. రోమీయులు కట్టించిన పురాతనపు రస్తాలు నేటికిని నిచట కనఁబడును. ఈ బేత్ హోరోనులు ఎఫ్రాయిమునకును, బెన్యామీనునకును మధ్యనున్నవి (యెహో $16^{3-5}$ $18^{13,14}$). అవి ఎఫ్రాయిమీయులకు చేరినవై ($21^{22}$), ఇశ్రాయేలు అను పది గోత్రములవారి రాజ్యముతో సంబంధించి యున్నవి. చెఱకాలమునకుఁ బిమ్మట నుండి హోరోనీయుఁడైన సన్బల్లటు ఈ యూరి వాఁడై యున్నట్లున్నది (నెహె $2^{10}$ పటము III, E 5).

బేతజ్మావెతు అజ్మావెతు చూ॥

**బేతనాతు** (Beth-Anath = అనాతు దేవత నివాసము). నఫ్తాలీ గోత్రపు ప్రాకారపు పట్టణములలో నొకటి (యెహో $19^{38}$). నఫ్తాలీ గోత్రికులు పూర్వ మచటనుండిన అన్యుల నందఱిని వెళ్లఁగొట్ట లేదు (న్యాయా $1^{33}$). ఉత్తరపు గలిలయలో ప్రస్తుతముననున్న ఐనాత (*Ainatha*) యనునది దీని యునికి యని సాధారణముగా ననుకొందురు (పటము IV, D 5).

**బేతనియ** (Bethany = ఖర్జూర పండ్ల ఉనికి, బాధనొందిన ఉనికి).

1. ఒలీవ కొండ అంచుననున్న నొక పల్లె (మా $11^{1}$ లూ $19^{29}$). అది యెరూషలేమునకు క్రోసెడుకు తక్కువ దూరమందు యెరికోకుఁ బోవు మార్గముమీఁద నున్నది. యెరూషలేమునకుఁ బోయినప్పుడు సాధారణముగా క్రీ. సీ

గ్రామములో బసచేసెను (మ $21^{17}$ 2,6 మా $11^{1,12}$ $14^{3}$). లాజరు మార్త మరియలను వారి స్వగ్రామము (యోహా $11^{1}$ $12^{1}$). అప్పుడప్పుడాయన వారి యింట బోధించెను (లూ $10^{38-41}$). కుష్ఠరోగ యగు సీమోని యూరివాఁడే (మా $14^{3}$). ఆయన లాజరును మృతులలో నుండి ఇచ్చటనే లేపెను (యోహా 11). మరియ యేసును అభిషేకించిన దితని యింట్లోనే (మ $26^{6-13}$ మా $14^{3}$



బేతనియ

యోహా 12^{1-8}). ఈ ప్రాంతెములోనే క్రీస్తు ఆరోహణమయ్యెను (లూ 24^{50,51}). ప్రస్తుతము యెరూషలేమునకు ఘుమారు 2 మైళ్లు ఆగ్నేయమున నున్న ఎల్-అజరియా (*El-'aziriyeh* = లాజరు ఊరు) అనునదే దీని యునికి యనుకొందురు. ఇప్పుడచ్చట కొన్ని యిండ్లు మాత్రము గలవు. వాటియందు సీమోను, లాజరు అను వారి యిండ్లను చూపెదరుగాని అవి వారి యిండ్లే యని నమ్మ వీలుగాదు. (పటము I, E 8).

2. యొర్దానుకు తూర్పుననుండు ఒక యూరు యోహానీ స్థలము దగ్గర బాప్తిస్మ మిచ్చెను (యోహా 1^{28}). వ్రాత ప్రతులలోనున్న ఈ పేరును చూచి దీనియునికి తెలియక, బేతబారా యని (*Bethabara*) ఊహించి దాని నట్లు మార్చిరి. హెర్మోనుకు తూర్పుగానున్న అబారా (*Abara*) అను రేవుదగ్గర నున్న దనుకొందురు. దీని సరియైన ఉనికి తెలియదు.

**బేతనోతు** (Beth-Anoth = అనాతు దేవతా గృహము). యూదయదేశపు టూళ్లలో నొకటి (యెహో 15^{59}). ప్రస్తుతము హెబ్రోనుకు ఉత్తరమున మూడు క్రోసుల దూరములోనుండు బైత్ అనూను (*Beit Ainun*) అనునదే దీని యునికి యనుకొందురు (పటము II, E 2).

**బేతరాబా** (Beth-Arabah = మైదానపు టిల్లు). యెరికో మైదానములో నుండు నొక స్థలము (యెహో 15^{6,61} 18^{22}). 18^{18} లో నున్న అరాబా యను నదే ఈ స్థలమని యనుకొందురు. అది బేత్ హోగ్లాకు ఉత్తరమున నున్నట్లున్నది గాని దాని యునికిని గూర్చి ఇంక నూటిగా తెలియదు.

**బేతర్బేలు** (Beth-Arbel = అర్బేలు ఇల్లు). షల్మాను అనువాడు దీనిని నాశనము చేసినట్లు హోషే 10^{14} లో నున్నది. ఈయొక్క చోట మాత్ర మీపేరు కలదు. అయితే అర్బేల యను పేరుగల రెండు స్థలములు పలెస్తీనులో నున్నవి. ఒకటి గలిలయ సముద్రమునకు పశ్చిమముగాను ఒకటి యొర్దానుకు తూర్పుగానున్న గిలాదుకు ఉత్తరముగా (పటము I, G 5) నున్నవి. ఈ రెండింటికి ప్రస్తుతము ఇర్బిదు (*Irbid*) అను పేరు కలదు. ఈ బేతర్బేలు ఈ రెండింటిలో నొకటియై యుండవచ్చును గాని ఈ సంగతికూడ రూఢిగా తెలియదు.

**బేతారాము** (Bethharam, Bethharan = ఎత్తయిన స్థలము). యొర్దానుకు తూర్పుగా గాదు గోత్రపు భూమిలోనున్న యొక పట్టణము (సంఖ్యా 32^{36}). యెహో 13^{27} లో అది బేత్హారాను అనబడును. అది యొర్దాను దక్షిణ రేవునకు తూర్పుగా 3 క్రోసుల దూరములో నున్నది (పటము II, H 1). హేరోదు అచట నొక కోటను కట్టించెను (పుర 18^{2,1}). అతడు తన ఘనుల నిమిత్తము విందుచేసిన దిచటనే నని కొంద అనుకొందురు. (మ 14^{6-12} మా 6^{21-28}).

**బేతావెను** (Beth-Aven = శూన్యపుటిల్లు) హాయి దగ్గఱ నున్న ఒక యూరు (యెహో 7^{2}). ఇది అరణ్య సమీపమును (18^{12}) మిక్మషుకు పడమఱగా నున్నది (I సమూ 13^{5}). సౌలు కాలములో ఫిలిష్తీయులతో చేయబడిన ఒక యుద్ధ మిచటనే జరిగెను (14^{23}). ఇది హోషేయ కాలములో కూడ నిలిచియున్నట్లున్నది (హోషే 5^{8}) గాని ఇచట నున్న బేతేలునకు హాస్యపు పేరై యుండవచ్చును. ఎటులనైనను హోషే 10^{5} లో నున్నట్లు బేతావెనులోనున్న దూడ అను పేరును చూడగా అది బేతేలుకు పెట్టబడిన పేరని సాధారణముగా ననుకొందురు. 5^{15} లో కూడ అది బేతేలును సూచించునని ఆమో 4^{5} తో సరి పోల్చుటవలన కనబడును. ఇందునుబట్టి చూడగా హోషే 10^{8} లో నున్న ఆవెను అను పేరుకూడ బేతేలుకు హాస్యపు పేరై యున్నట్లుగా నున్నది (అరణ్యము 3 (9) చూ॥).

**బేతూలు** బెతూయేలు చూ॥

**బేతెస్థ** యెరూషలేము A III 1 చూ॥

**బేతేమెకు** (Beth-Emek = లోయలోని యిల్లు). ఆషేరు గోత్రస్వాస్థ్యపు సరిహద్దులో నున్న ఒక యూరు. ఇది జెబూలూను వారిపైపున నున్నది (యెహో 19^{27}). ప్రస్తుతమున అచ్చట నున్న అమ్కా (*Amuka*) దీని యునికి యనుకొందురు (పటము IV, G 6).

**బేతేలు** (Bethel = దేవుని యిల్లు).

1. యెరూషలేమునకు ఉత్తరమున 12 మైళ్ల దూరములో ప్రస్తుతమున బైటీను (*Beitin*) అను

నొక చిన్న యూరు కలదు. అది పూర్వకాలమున పూజా విషయములలో మిగుల ప్రసిద్ధిఁ జెందిన బేతేలు అను ఊరి పట్టణముయొక్క యునికియని అందఱు నొప్పుకొందురు. దాని యసలు పేరు లూజు (న్యాయా $1^{23}$). యాకోబునకచట దర్శనము గలిగిన పిమ్మట అతఁడు దానికి దేవుని మందిరము అను నర్థము నిచ్చు బేతేలు అను పేరు పెట్టెను (ఆది $28^{22}$). $35^{14,15}$ చూడఁగా యాకోబు పద్దనరాము నుండి తిరిగి వచ్చిన తరువాత రెండవసారి యతనికిఁ కలిగిన దైవదర్శనమునకు జ్ఞాపకార్థముగా కూడ ఈ పేరు పెట్టినట్లు కనఁబడును. అయితే యాకోబు దానికీ పేరు పెట్టకి పూర్వమునసే అబ్రాహా మిచట యజ్ఞముల నర్పించినట్లున్నది ($12^{8}$). ఇతఁడు మున్ను కొండపైనుండియే లోతు యొర్దాను మైదానమును చూచి ఆ ప్రాంతమును తనకొఱకు కేర్పఱచుకొన్నట్లు తెలియును (13). బేతేలు కనానీయుల రాజులలో నొకని రాజధానిగా నుండెను (యెహో $12^{16}$). యెహోషువ కనాను దేశమును విభాగించినపుడు దీనిని బెన్యామీనీయులకు నిచ్చెను ($18^{22}$) గాని వారందుండు అన్యులను జయింపకపోఁగా, ఎఫ్రాయిమీయులు వారిని జయించి బేతేలును స్వాధీనము చేసికొనిరి (న్యాయా $1^{22}$ I దిన $7^{28}$). దేవుని మందసమును గిల్గాలు నుండి తెచ్చి యిచటనే యుంచిరి (న్యాయా $20^{26,27}$) ఇచట ఇశ్రాయేలీయులు అర్పణల నర్పించువారుగ యుండెను (I సమూ $10^{3}$). దెబోరాయను ప్రవక్త్రి బేతేలుకును రామాకును మధ్య నివసించెను (న్యాయా $4^{5}$). ఇది మొదటినుండి పుణ్యక్షేత్రముగ నుండుటచే రాజైన యరోబాము ఉత్తరరాజ్యపు వారి నిమిత్తమేర్పఱచిన రెండు పూజాస్థానములలో దీని నొకదానిగా నేర్పఱచెను (I రాజు $12^{26-32}$). ఇట్లు చేసినందుకై దైవజనుఁ డొకఁడు యరోబామును బేతేలులోనే గద్దించెను (13). యరోబాము చేతినుండి యూదారాజగు అబీయా యపహరించిన పట్టణములలో బేతేలు ఒకటియైయుండెను (II దిన $13^{19}$). ఏలీయా కాలమునందు బేతేలులో ప్రవక్తల శిష్య సమూహముండెను (II రాజు $2^{2,3}$). ఏలీయా బేతేలులో జరిగిన పూజను ఖండించినట్లు సూచనలు లేకపోయినను, ఆమోసు ($3^{14}$ $4^{4}$ $5^{5}$ మొ॥), హోషేయ ($4^{15}$ $5^{8}$ $10^{5,15}$ మొ॥) అను ప్రవక్తలు దానిని బహు ఖండితముగా గద్దించిరి. ఇశ్రాయేలు వారి రాజ్యము అష్షూరు రాజు అచటనుంచిన యన్యులకు యెహోవా మర్యాదను నేర్పుటకై నియమింపఁబడిన యిశ్రాయేలీయుల యాజకుఁడు బేతేలులోనే కాపురముండెను (I రాజు $32^{22,28}$). బబులోను చెఱనుండి తిరిగివచ్చిన వారిలో కొందఱు బేతేలులో నివసించిరి. (ఎజ్రా $2^{28}$) మక్కబీయుల కాలములో యూదావారిని విరోధించి వారు కట్టించిన కోటలలో నొకదానిని బేతేలులో కట్టించిరి (I మక్క $9^{50}$). ఇట్లు రోమను వారి కాలమునందుకూడ, వారి సేనాధిపతియగు వెస్పేషియన్ (*Vespasian*) అను నతఁడు యెరూషలేము మీఁదికి దండెత్తి వెళ్లినపుడు ఆ మార్గము నందున్న బేతేలును పట్టుకొని యున్నట్లు యోసీఫసువలనఁ దెలియును (యుద్ధ 4-9-9) హోషేయ దీనికి బేతావెను అను పేరు పరిహాసార్థము పెట్టెను. (బేతావెను చూ॥ పటము **III, F 5**).

2. I సమూ $30^{27}$ లో నున్నట్లు మరియొక బేతేలు యూదాలోనుండెను. అది బేతూలు (యెహో $19^{3}$), బెతూయేలు (I దిన $4^{30}$) అనఁబడిన స్థలమని కొంద ఱనుకొందురు (బెతూయేలు 2 చూ॥).

**బేత్కారు** (Beth-Car = మేఁతభూమి) సమూయేలు కాలములో ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయులను తఱిమిన స్థలము (I సమూ $7^{11}$). ఇది యొక కొండగాని ఊరుగాని కావచ్చును. యెరూషలేమునకు పడమరగా నున్నదను సంగతి గాక దాని యునికినిగుఱించి యింక నూటిగాఁ దెలియదు.

**బేత్గాదేరు** గెదెరు చూ॥

**బేత్గామూలు** (Beth-Gamul = పరిపూర్ణత గల యిల్లు). మోయాబు దేశములోనున్న ఒక యూరు (యిర్మీ $48^{23}$). అది మేదెబాకు దక్షిణముగా నుండెను. ప్రస్తుతము ఉమ్-ఎల్-జమాలు (*Um-El-Jamail*) అనఁబడు పాడు శేషములే దీని యునికి యనుకొందురు.

**బేత్తపూయు** (Beth-Tappuah = రేఁగు పండ్ల గృహము). హెబ్రోను పర్వతములలో

నున్న ఒక యూరు (యెహో $15^{53}$). తప్పూయహు అను నింటివారిని బట్టి దానికీ పేరు కలిగి యుండును. (I దిన $2^{43}$ తప్పూయహు చూ॥). ప్రస్తుతమున హెబ్రోనుకు పడమరగా నున్న తప్పూ (*Taffuh*) అనునది దాని యునికియై యున్నది (పటము II, E 2).

**బేత్దాగోను** (Beth-Dagon = దాగోను దేవత నివాసము).

1. యూదయలోని షెఫేలాలో నున్న యొక యూరు (యెహో $15^{41}$). దీని యునికినిగూర్చి తెలియదు.

2. ఆషేరు సరిహద్దులోని యూళ్లలో నొకటి (యెహో $19^{27}$). దీని యునికినిగూర్చి తెలియదు.

**బేత్నిమ్రా** (Beth-Nimrah = తేట నీరు గల స్థలము). గాదీయుల స్వాస్థ్యములోనుండిన ఒక యూరు. గాదీయులు దాని నొక ప్రాకారముగల పురముగాఁ జేసిరి (సంఖ్యా $32^{35}$ యెహో $13^{27}$). $32^{3}$ లో నున్నట్లది నిమ్రా యనఁబడును. ప్రస్తుతము టెల్ - నిమ్రీను (*Tell-Nimrin*) అనఁబడునదే దాని యునికి. అది మృతసముద్రమున కుత్తరముగా 10 మైళ్ల దూరములోనున్న నీరుగల స్థలమై యున్నది. (పటము III, H 5).

**బేత్పగే** (Beth-phage = అంజూరపు గృహము). ఒలీవ కొండమీఁదనున్న నొక స్థలము. క్రీస్తు జయోత్సవముతో యెరూషలేములోఁ బ్రవేశింపక పూర్వము గాడిదను తెచ్చుటకై తన శిష్యులను బంపిన స్థలమిదే (మ $21^{1}$ మా $11^{1}$ లూ $19^{29}$). ఇది బేతనియకు సమీపమందుండెను గాని దీని యునికిని గూర్చి మఱింత నూటిగాఁ దెలియదు.

**బేత్పస్సెసు** (Beth-Pazez = చెదరగొట్టు ఇల్లు). ఇశ్శాకారు హద్దులోనున్న యొక యూరు (యెహో $19^{21}$). దీని యునికిగూర్చి తెలియదు.

**బేత్పెలెతు** (Beth-Pelet = తప్పించుకొను గృహము). యూదయలో బెయేర్షెబాకు దక్షిణముగా నుండు నొక యూరు (యెహో $15^{27}$). చెఱకాలమునకుఁ దరువాత యూదులు దీనిలో మఱల నివసించిరి (నెహె $11^{26}$). దీని యునికిని గూర్చి తెలియదు.

బత్బియత్తెయోను బయత్తెయోను చూ॥

**బేత్బారా** (Beth-Barah). యెజ్రెయేలులోయయు యొర్దానులోయయు కలియుచోట నుండు నొక స్థలము. మిద్యానీయులను హతము చేయునట్లు ఎఫ్రాయిమీయులీ స్థలమును పట్టుకొని యెహోషువ యాజ్ఞను లక్ష్యపెట్టిరి (న్యాయా $7^{24}$). ఇది బేతబారాయై యుండవచ్చును. అట్లయినయెడల ఆ పదమునకు రేవు స్థానమని యర్థము. యొర్దానుకు దగ్గరగా నుండెను.

**బేత్బిరీ** (Beth-Biri = నేను కట్టిన యిల్లు). షిమ్యోను స్వాస్థ్యములోనున్న ఒక స్థలము (I దిన $4^{31}$). అది బేత్లెబాయోతు అనియు (యెహో $19^{6}$) లెబాయోతు అనియు ($15^{32}$) పిలువఁబడెను. దాని యునికినిగుఱించి తెలియదు.

**బేత్మయకా** (Beth-Maacka = మయకా యిల్లు). ఆబేలు అను పట్టణముండు ప్రదేశము (II సమూ $20^{14,15}$ ఆబేలు బేత్మయకా చూ॥).

**బేత్మర్కాబోతు** (Beth-Marcaboth = రథముల యిల్లు). షిమ్యోను స్వాస్థ్యములో నుండు నొక యూరు (యెహో $19^{4}$ I దిన $4^{31}$). అది సిక్లగుదగ్గర నుండెనుగాని దాని ఉనికినిగూర్చి నూటిగాఁ దెలియదు దీనికి సాటియగు వాక్యమైన యెహో $15^{31}$ లో మద్మన్నా అను పేరు గలదు. అక్కడ రథముల వ్యాపారము చేసినందున దానికీ సార్థక నామము వచ్చియుండును.

బేత్షెయోను బయత్షెయోను చూ॥

**బేత్రాఫా** (Beth-Rapha = రాక్షసి యిల్లు). యూదావారిలోని యొక కుటుంబమునకుగాని, ఆ కుటుంబము నివసించిన యూరికిగాని పెట్టినపేరు (I దిన $4^{12}$). అది యూరైన పక్షమున దాని యునికి యెచ్చటనో తెలియదు.

**బేత్రెహోబు** (Bethrehob = వీధి స్థలము). తూరు పట్టణమునకు దగ్గఱగా నుండు నొక పట్టణము లేక ప్రదేశము. ఇది ఆరామునకు సంబంధించినది (న్యాయా $18^{28}$) ఇచ్చట నుండు వారు అమ్మోనీయులతో సంధిచేసికొని దావీదుపై యుద్ధమాడిరి (II సమూ $10^{6}$). ఈ ప్రదేశమును గూర్చిన చిహ్నము లెవ్వియును గానరావు.

**బేత్లెబాయోతు** (Bethlebaoth = సింహములయిల్లు). షిమ్యోను గోత్ర స్వాస్థ్యములోనున్న యూరు (యెహో 19[6]) దానికి లెబాయోతు (15[32]), బేత్బీరీ (I దిన 4[31]) అను మాఱు పేరులు గలవు (బేత్బీరీ చూ॥).

**బెత్లెయప్ర** (Bethle-aphrah = అప్ర యిల్లు). యూదాదేశపు పశ్చిమ ప్రాంతములలోనుండు ఫిలిష్తీయుల పట్టణములలో నొకటి (మీకా 1[10]) అప్ర యను పదమునకు సంబంధించిన హెబ్రీ పదమునకు ధూళి యను నర్థమగును కావున మీకా ఈ యూరినిగూర్చి నేను ధూళిలో పడి పొర్లితిని యని శ్లేషగా వ్రాసెను.

**బెత్లెహేము** (Bethlehem = అన్నవరము).

1 యూదయలోని పట్టణము. దీనికి అంతకుం బూర్వము ఎఫ్రాతా అను పేరుకలదు (ఆది 48[7]). అచట రాహేలును పాతిపెట్టిరి (35[19]). న్యాయా



బేత్లెహేము లోయ

17-19 లో చెప్పఁబడియున్న ఇద్దఱు లేవీయులు ఈ యూరినుండి వచ్చినవారై యుండిరి. రూతు మామయగు ఎలీమెలెకు (రూతు $1^{1}$) ఈ యూరి వాఁడే. రూతును వివాహము చేసికొనిన బోయజు ఇచట నివసించెను. అతని వంశములో పుట్టిన దావీదును ఈ యూరివాఁడై యుండినట్లు అనేకచోట్ల ప్రశంసింపఁబడెను (I సమూ $16^{1-8}$ $1^{12}$ $20^{6}$ మొ॥). సౌలు కాలములో ఫిలిష్తీయు లిచట నొక కావలి దండునుంచిరి (II సమూ $23^{14}$ I దిన $11^{16}$). ఇచటనే అశాహేలును పాతి పెట్టిరి (II సమూ $2^{32}$). దావీదు యోధులలో ఎల్హానాను అనువాఁడీ యూరివాఁడే (II సమూ $23^{24}$). రెహబాము ఇచట ప్రాకారములను కట్టించెను (II దిన $11^{6}$). కుట్ర చేసి గెదల్యాను చంపిన వారిచటికే పారిపోయిరి (యిర్మీ $41^{17}$). I దిన $2^{51-54}$ చూడఁగా శల్మాయను నొకఁడు బేత్లెహేము తండ్రి (= అనఁగా స్థాపకుఁడు) అనఁబడెను. ఇతఁడు కాలేబు గోత్రికుఁడై బోయజునకు తండ్రి యయ్యెనని (మత్తయి $4^{20}$) కొందఱనుకొందురు గాని అది రూఢియని చెప్ప వీలులేదు. అది సుదారియునకు తగిన స్థలమని యూదావారనుకొని నట్లుగా కీర్తన 132 వలనఁ దెలియును. మీకా $5^{2}$ లో మెస్సీయ యచట పుట్టునను ప్రవచన మున్నది. ఇది యట్లే నెఱవేరెను (మ $2^{1-6}$ లూ $2^{4,15}$ యోహా $7^{42}$). జ్ఞానులు క్రీస్తును దర్శించుటకు ఇచటికివచ్చిరి (మ 2). హేరోదు ఈ యూరిలోనుండు పిల్లలను హత్యచేయించెను ($2^{8,16}$). ఇది యెరూషలేమునకు దక్షిణమున మూఁడు క్రోసులదూరములో నున్నది. ప్రస్తుతమున దానిలో దాదాపు 4000 మంది జనులు నివసించుచున్నారు. క్రీస్తుపుట్టిన స్థలమిదియని నేటివఱకు ఆ యూరిలో కొన్ని స్థలములను చూపుదురుగాని వాటివిషయము రూఢి ఏమియు లేదు. (పటము II, F 1).



ప్రస్తుతకాలపు బేత్లెహేము

2. జెబూలూను గోత్రస్వాస్థ్యములో నుండిన ఒక యూరు (యెహో $19^{15}$). నజరేతుకు వాయువ్య దిక్కున 7 మైళ్లదూరములో నున్న బైట్‌లాము (*Beitlam*) అను ఊరైయున్నది. న్యాయాధిపతులలో నొకఁడైన ఇబ్సాను ఈ యూరివాఁడని యనుకొందురు (న్యాయా $12^{8-10}$). (పటము IV, C 7).

బేత్షాను బేత్షెయాను చూ॥

**బేత్షిత్తా** (Beth-Shittah = తుమ్మచెట్ల స్థలము). గిద్యోను మిద్యానీయులను తఱిమిన స్థలము (న్యాయా $7^{22}$). ప్రస్తుతము యెజ్రె యేలు లోయలో నున్న షుత్తా (*Shuttah*) దీని యునికి యని సాధారణముగా ననుకొందురు (పటము IV, D 8).

**బేత్షెమెషు, ఇర్షెమెషు** (**Bethshemesh** = సూర్యదేవతగృహము, **Irshemesh** = సూర్యదేవత పట్టణము).

1. యూదయలో యెరూషలేమునకు పడమరగా రెండామడల దూరములో నున్న యొక పట్టణము (యెహో $15^{10}$). $19^{41}$ నందు దీనికి ఇర్షెమెషు అను మారు పేరుగలదు. ప్రస్తుతమున దానిని అయిన్ షెమ్సు (*Ain-shems*) అని పిలుతురు (పటము II, D 1). దీనిని అహరోను సంతతివారగు యాజకుల కిచ్చిరి ($21^{16}$). ఫిలిష్తీయులు దేవుని నిబంధన మందసమును తిరిగి ఇశ్రాయేలీయులయొద్దకు బంపినప్పుడు మొదట అది వచ్చి చేరిన దీ పట్టణమునకే. ఆ పట్టణస్థులు దాని నపవిత్రపఱచినందున శిక్ష పొందిరి (I సమూ 6). యూదారాజగు అమజ్యా ఇశ్రాయేలు వారి రాజైన యెహోయాషుచేత ఇచ్చట నోడింపబడెను (II రాజు $14^{11-13}$). రాజైన ఆహాజు కాలములో ఫిలిష్తీయులు పట్టుకొనిన పట్టణములలో నిదియొకటి (II దిన $28^{18}$).

2. ఇశ్శాకారు గోత్రస్వాస్థ్యములో నున్న యొక పట్టణము (యెహో $19^{22}$). దీని యునికిని గూర్చి తెలియదు.

3 నఫ్తాలీ గోత్రభాగములోని పట్టణము (యెహో $19^{38}$ న్యాయా $1^{33}$). దీని యునికి యెచ్చటనో తెలియదు.

4. ఐగుప్తులోని పట్టణము. ఈ పేరు మూల భాషయందున్నది గాని తెలుగు బైబిలు నందు దానిని సూర్యదేవతా పట్టణమని తర్జుమా చేసిరి (యిర్మీ $43^{13}$). అది సూర్యదేవతయగు ఓనుయొక్క పట్టణము.

**బేత్షెయాను** (**Bethshean, Bethshan** = నిర్భయతగల యిల్లు). యొర్దాను లోయకు పడమరగాను, యెజ్రెయేలు లోయకు తూర్పుగా నుండు నొక కోట. అది ఇశ్శాఖారు గోత్రములో నుండినను దానిని యొర్దానుకు పడమరనుండు మనష్షే అర్ధగోత్రమునకు నిచ్చిరి (యెహో $17^{11}$ న్యాయా $1^{27}$). మనష్షీయులు అందులోని అన్యులను వెళ్లగొట్టక వారిచేత కప్పము పుచ్చుకొనుచుండిరి (యెహో $17^{12-16}$ న్యాయా $1^{28}$). సౌలు గిల్బోవలో ఓడిపోయినపుడు ఫిలిష్తీయులు అతని మొండెమును, అతని కుమారుల దేహములను ఈ పట్టణపు గోడలకు తగిలించిరి (I సమూ $31^{10-13}$ II సమూ $21^{12-14}$). గ్రీసువారు దీనికి స్కూతోపొలి (*Scythopolis*) యను పేరు పెట్టిరి. ఆ పేరు LXX లోను, అప్రమాణిక గ్రంథములలోను (యూదితు $3^{10}$ II మక్క $12^{29}$) యోసీఫసు గ్రంథములలోను కనబడును, యూదులు రోమీయులతో చేసిన యుద్ధములలోను, క్రూసేడుల కాలములోను ఈ స్థలము యొక్క పేరు కనబడును. దానికి ప్రస్తుతమున బైసాను (*Beisan*) అని పేరు (పటము III, G 2)

**బేత్సయిదా** (**Bethsaida** = జాలరులపల్లె). గలిలయ సముద్రమునకు సమీపమున నుండు ఒక యూరు. క్రీస్తు 5000 మందికి ఆహారము పెట్టిన దీ ప్రాంతములలోనే (మా $6^{45}$ లూ $9^{10}$). ఈ సంగతి జరిగిన కొంతకాలమునకు క్రీస్తు అచట నొక గుడ్డివాని బాగుచేసెను (మా $8^{22}$). క్రీస్తు శిష్యులలో ఫిలిప్పు, అంద్రెయ, పేతురు అను వారీ యూరివారే (యోహా $1^{41}$ $12^{21}$). ఈ యూరి వారు క్రీస్తును విశ్వసింపనందున ఆయన వారిని గద్దించియుండెను (మ $11^{21}$ లూ $10^{13}$). హేరోదు ఫిలిప్పు అను రాజు ఈ యూరి నొక పట్టణమునుగా చేసి, కైసరు కుమార్తె గౌరవార్థమై దీనికి జూలియస్ అను పేరు పెట్టెను కావున, సాధారణముగా దీనిని బేత్సయిదా జూలియస్ అని పిలుతురు ప్రస్తుతమునన్న ఎట్-టెల్ (*Et-Tell*) అనునదే దీని యునికి యని సాధారణముగా నంగీకరింతురు ఇది యొర్దానుకు తూర్పుగాను గలిలయ సముద్రమున కీశాన్యముననున్నది. మా $6^{45}$ లో నుండు బేత్సయిదా గలిలయ సముద్రమునకు పడమరగా నుండవలెనని యనుకొందురు. గనుక ఈ పేరు గల రెండూళ్లలో నొకటి యొర్దానుకు తూర్పునను, మఱియొకటి పడమరగా నుండెనని యభిప్రాయ పడెదరు. అయితే నవీన పండితులు రెండు బేత్సయిదాలు లేవుగాని ఒకటే యుండెననియు అది గలిలయ సముద్రమున కీశాన్య దిక్కుల నుండెననియు ననుకొందురు (పటము IV, E 6).

**బేత్సూరు** (Beth-zur = బండయిల్లు). యూదా పట్టణములలో నొకటి (యెహో $15^{58}$ I దిన $2^{45}$). యెరూషలేమునుండి హెబ్రోనుకు పోవు మార్గములోనున్న కోటయై యుండెను. రెహబాము దీని ప్రాకారములను కట్టించెను (II దిన $11^{7}$). చెఱకాలమునకుఁ బిమ్మట చెఱ నుండి తిరిగి వచ్చినవారిలో కొందఱందు నివసించు చుండిరి (నెహె $3^{16}$). మక్కబెయుల కాలములో అచట కొన్ని యుద్ధములు జరిగెను (I మక్క $4^{19,61}$ $6^{7,26,31}$ $9^{52}$ మొ॥). I దిన $2^{45}$లో ఇది మాయోను అనువాని కుమారుని పేరుగా నున్నది. ప్రస్తుతమున హెబ్రోనుకు ఉత్తరముగా 3 (కోసుల) దూరములోనుండు బైత్-సూర్ (*Beit-sure*) అను స్థలమే దీని యునికి పట్టయియున్నది (పటము II, E 2).

**బేద్యా** (Bedeiah = యెహోవా కాపుదిలలో నున్నవాఁడు). అన్య స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రాయొక్క ప్రేరేపణచే వారిని విడనాడిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{35}$).

**బేను** (Ben = కొడుకు). లేవీయులలో నొకఁడు (I దిన $15^{18}$). $15^{20}$ లో $15^{18}$ లోని జాబితా మఱలనుండినను, ఈ బేను అను పదము అచట లోపించిపోయినది. LXX లోని $15^{18}$ లో కూడ ఈ పేరు కనఁబడదు. ([illegible] అను పదమును చూ॥).

**బేబై** (Bebai). ఒక కుటుంబమునకు పెద్ద. ఆ కుటుంబపువారు అనేకులు చెఱనుండి తిరిగి వచ్చిరి (ఎజ్రా $2^{11}$ $8^{11}$ $10^{28}$ నెహె $7^{16}$ $10^{15}$).

**బేయేరీ** (Beeri = వివరించేది).

1. ఏశావు భార్యయగు యహూదీతు తండ్రి. హిత్తీయుఁడు (ఆది $26^{34}$).

2. ప్రవక్తయగు హోషేయ తండ్రి (హోషే $1^{1}$).

**బేరీ** (Beri = బావిగలవాడు). ఆషేరీయులలో నొక తెగవారు (I దిన $7^{36}$).

**బేరోతై** (Berothah, Berothai = బావులు). ఇది సిరియాలోనున్న యొక పట్టణము. దావీదు దీని పట్టుకొని దోచుకొనెను (II సమూ $8^{8}$). దీనికి సాటిగానుండు I దిన $18^{8}$ లో ఈ స్థలమునకు ప్రతిగా "కూను" అను పేరుకలదు. యెహెజ్కేలు పలెస్తీనుయొక్క కుదురుబాటును గూర్చి ప్రవచించినపుడు దీనిని ఆ కుదురుబాటున కొక హద్దునుగాఁ జేసెను (యెహె $47^{16}$). అది హమాతునకును దమస్కుకును మధ్యనున్నట్లు తెలియును గాని దాని యునికినిగూర్చి నూటిగాఁ దెలియదు.

**బేలు** (Bel = ప్రభువు) బబులోను దేవతలలో నొక ముఖ్యమైనది. అను, ఈయా యనఁబడు రెండు దేవతలతోఁ బేలు ఒక ప్రసిద్ధమైన త్రిమూర్తియైయున్నది. ఆరంభమున నది నిప్పూరు అను పట్టణమునకు ఇష్టదేవతగా నుండినట్లు ఈ మధ్యదొరికిన శాసనములలో కనఁబడును. బబులోనుపట్టణమునకు ఇష్టదేవతయగు మెరోదకు ఆ పట్టణము రాజధానియైన పిదప బేలు అనియు పిలువఁబడెను. యూలభాష యందు యెష $46^{1}$ లో అట్లున్నది. బేలు అను ఈ పదము బయలు అనుదానికి సంబంధించినది (బయలు, బబులోను 5 చూ॥)

**బెసాయి** (Besai). నెతీనీయులలో నొక కుటుంబపువారు. వీరు చెఱనుండి జెరుబ్బాబెలుతోఁ గూడ వచ్చిరి (ఎజ్రా $2^{49}$ నెహె $7^{52}$).

**బెసెరు** (Bezer = దుర్గము).

1 ఆషేరీయులలో నొకఁడు (I దిన $7^{37}$)

2 యొర్దానుకు తూర్పుగా నుండిన అరణ్యమందుండిన యొక పట్టణము (ద్వితీ $4^{43}$ యెహో $20^{8}$) ఇది లేవీయులలోని మెరారి తెగవారి కిచ్చిన ఆశ్రయపట్టణమై యుండెను ($21^{36}$ I దిన $6^{78}$). మోయాబీయుల రాతిశాసనములో (*Moabite Stone*) కూడ దీని పేరు కనఁబడును. ఆ దేశపురాజగు మేషా యనువాఁడు ఈ పట్టణము పాడైపోయి యుండఁగా దీని కట్టించి యుండెనని ఆ శాసనములవలనఁ దెలియును. అది మోయాబు దేశములోని తూర్పు భాగమందున్నట్లు పై సూచనలవలనఁ దెలిసికొన వచ్చును గాని దాని యునికినిగూర్చి ఇంక నూటిగాఁ దెలియదు.

## బై

**బైబిలు** (Bible = గ్రంథములు). మన పరిశుద్ధ లేఖనముల గ్రంథపు పేరు. ఇది యస

లలో గ్రీకుపదముయొక్క బహువచనరూపమై పుస్తకములు అను నర్థము నిచ్చును. దీనిని లాటిన్ భాషలో ఏకవచనరూపముగ వాడు చుండిరి. నేటివఱకు దీని నిప్పటిమగా భాష లన్నింటిలోను వాడుకొనుచున్నారు. ఇందులో 66 ప్రత్యేక గ్రంథములులేక పత్రికలు కలవు. అసలు గ్రంథములలో ప్రస్తుతమున మన బైబిలులో నున్నట్లు అధ్యాయములును వచనములును లేవు. క్రీ॥ శ॥ 1555 వ సం॥ లో స్టీవెన్సు అను నతఁడు వల్గేట్ (*Vulgate*) అనఁబడిన లాటిన్ బైబిలు నందు మనమిప్పు డనుసరించుచున్న వచనభాగ ములను చేసెనుగాని అధ్యాయ విభాగములంతకుఁ బూర్వమే క్రీ॥ శ॥ 13 వ శతాబ్దమందే చేయఁ బడినవి ఆదికాలమునుండి బైబిలు నాయా భాషలలోనికి భాషాంతరము చేయుచు వచ్చిరి (భాషాంతరములు చూ॥) బైబిలునందు పాత నిబంధన, క్రొత్త నిబంధన యని రెండుభాగములు గలవు

1 పాత నిబంధన (*Old Testament*) బైబిలులోని రెండు ముఖ్యభాగములలో నిది మొదటిది. II కొరి $3^{14}$ లో నున్నట్లు పౌలు దీనికాపేరు పెట్టెను పాత నిబంధనలో 39 గ్రంథములున్నవి మన బైబిలు ప్రకార మీ భాగమందు మోషే వ్రాసిన గ్రంథములు 5 ను, చరిత్ర గ్రంథములు 12 ను, కావ్య గ్రంథములు 5 ను, ప్రవచన గ్రంథములు 17 ను గలవు ఎజ్రా $4^{8}$-$6^{18}$ $7^{12-26}$ యిర్మీ $10^{11}$ దాని $2^{4}$-$7^{28}$ అను నీ కొద్దిభాగములు అరమేయిక్ భాషలో నున్నవిగాని పాత నిబంధనలోని యితరభాగము లన్నింటిని హెబ్రీలోనే వ్రాసిరి అసలు హెబ్రీలో వారు హల్లులనుమాత్రము వ్రాసిరి. అయితే చదువువారే యచ్చులనెచ్చట నుచ్చరింప వలెనో దానిని తమ గురువుయొద్ద నేర్చికొనవలసి యుండెను గాని ఆ యచ్చులనచట వ్రాయరైరి. క్రీ॥ శ॥ పదియవ శతాబ్దమునకులోఁగా యూద పండితులు ఈ యచ్చులను సూచించుటకును, చదువుటలో హెచ్చుతగ్గు స్వరములను సూచిం చుటకును గురుతులను వేసిరి. వారప్పుడుచేసిన దానిని మస్సొరెటిక్ టెక్స్టు (*Massoretic Text*) అందురు. మస్సొర యనఁగా పారం పర్యము. ఈ మూలవాక్యములలో (*Text*) పారంపర్య యుచ్చారణలను వేసినందున దీనికీ పేరు వచ్చెను. హెబ్రీ బైబిలులో భాగములు ఉపభాగములును కలవు గాని, ప్రస్తుతము మన బైబిలులో నుండు అధ్యాయముల వచనముల విభజన వాటిననుసరించునది కాదు. యూదు లలో లేఖికులుండుటచే పాత నిబంధనలో వ్రాఁతతప్పు లెక్కువగాలేవు. అచ్చువేయు యంత్రమును కనుఁగొనువఱకు (15 వ శతాబ్దము) గ్రంథములన్నియుచే వ్రాఁతలో వ్రాయఁబడవలసి యుండెను కావున, వ్రాఁతతప్పులు కొన్నియైనను రాక తప్పదు. అట్టి తప్పులు ఆయా వారిపేరు లను, ఆయా స్థలములపేళ్లను వ్రాయుటయందును, అంకెలను వ్రాయుటయందును ముఖ్యముగా కనఁబడుచున్నవి. యూదు లీ గ్రంథములకు క్రొత్త ప్రతులు వ్రాసినపుడు పాతదానిని మర్యాదగా పాతిపెట్టుచుండిరి కావున వారిలో మిగుల పురాతన ప్రతులు లేవు. క్రీ॥ శ॥ 9 వ శతాబ్దమునందు వ్రాయఁబడిన కొన్ని భాగము లున్నవి. కాని పాత నిబంధన యావత్తుకు నుండెడు పురాతన ప్రతిని 1010 సం॥ లో చేసి యుండిరి. పండితు లట్టి ప్రతులలో షుమారుగా 2000 ప్రతులను తర్జుమాలను సరిచూచి తప్పులను దిద్దిసవరించిన బైబిలును మనకొఱకు సంపా దించియున్నారు. డేలిట్సు (*Delitsch*), గిం స్బర్గు (*Gins-burg* 1894) అనువారు చేసిన యట్టి సవరణలు అన్నింటిలో బాగుగ నుండునని పండితు లనుకొందురు. 1947 లో కనుగొనిన మృత సముద్రపు ప్రతులు క్రీ॥ ము॥ గాని క్రీ॥ త॥ గాని మొదటి శతాబ్దములో వ్రాయబడెనని చెప్పుదురు. (ప్రతులు I, ప్రమాణిక గ్రంథములు చూ॥).

2. క్రొత్త నిబంధన (*New Testament*). ఇది బైబిలులోని ముఖ్యభాగములలో రెండవది. యేసు ఏ క్రొత్త నిబంధనకు మధ్యవర్తియై యున్నాఁడో, దానివిషయము లిందులో నుండు టచే దీనికీపేరు కలిగెను (హెబ్రీ $9^{15}$ $10^{16,17}$ యిర్మీ $31^{31-34}$).

క్రొత్త నిబంధన గ్రీకుభాషలో వ్రాయఁ బడెను. యేసుయొక్కయు ఆయన శిష్యుల యొక్కయు కాలమునందు రోమన్ రాజ్య మంత టిలో ఈ భాషను వాడుచుండిరి.

క్రొత్త నిబంధనలో 27 గ్రంథములు కలవు. వీటిలో చరిత్ర గ్రంథములు 5 ను, పత్రికలు 21 యు, ప్రవచన గ్రంథము ఒకటియు నున్నవి.

క్రొత్త నిబంధనయొక్క అసలు ప్రతులు లేవు. 15 వ శతాబ్దమువఱకు గ్రంథములన్నిటి వలె ఈ గ్రంథముకూడ చేవ్రాతతో ప్రచురించుచుండిరి. ఇట్టి పురాతన ప్రతులలో క్రొత్త నిబంధనకు 3,500 కు పైన ప్రతులు కలవు.

వీటిని వ్రాయుటలో వ్రాత తప్పులుండక తప్పదు. కొందఱు అసలు ప్రతులలోని వ్యాకరణ ముగులేక బోధను సవరణచేయవలెనని యుద్దేశించి కొన్ని మార్పులుచేసిరి గాని, ఆ మార్పులు సాధారణముగా పొరబాటున కలిగినవని తెలిసికొనవలయును. వేలకొలదిగా నున్న యీ ప్రతులలో కొద్దిని గొప్పవియునైన 1,50,000 మార్పులున్నవని పండితులు లెక్కించిరి. ఇట్టి మార్పు లెన్ని యున్నను అందలి బోధను మార్చునట్టి మార్పులు పదియైనను లేవు. పండితు లీ ప్రతులన్నిటిని పరీక్షించి చూచి వాటిసహాయముచే తప్పులన్నిటిని దిద్ది మూలగ్రంథవాక్యము (*Text*) నెట్టిదో తెలిసికొనిరి. పూర్వమీ పనిని అంత బాగుగా పరీక్షింపరైరి. అందుచేత కొన్నివందల సంవత్సరముల క్రిందట చేయఁబడిన తర్జుమాలలో ఇట్టి తప్పు లనేకము లుండుట కనుగొని యిటీవల దిద్దియున్నారు కావున, పాత తర్జుమాలకును ఇప్పటిమువచ్చు తర్జుమాలకును కొద్ది భేదములు కలవు. దద్దుబాటు కాలములో నుండిన పండితులు సవరింపఁబడిన మూలవాక్యములను (*Text*) సిద్ధముచేసి ప్రచురించిరి. దానికి టెక్సస్ రెసెప్టస్ (*Textus Receptus*) అనఁగా అందఱివలన నంగీకరింపఁబడినది అను పేరు కలదు. దానిని క్రైస్తవులు కొన్నివందల సంవత్సరములవఱకు వాడి యున్నారు. అయితే యీ మధ్య కొన్ని పురాతనమైన ప్రతులను కనుఁగొనుటవలన వాటిని సవరణ చేయవలసి వచ్చెను. టిషెండోర్ఫు (*Tischendorf*), స్క్రీవెనర్ (*Scrivener*), ట్రెగెల్స్ (*Tregelles*), వెస్ట్కాట్ - హోర్ట్ (*Westcott, Hort*) అను వారు ఇటీవల ఈ పనిని చేసిన వారిలో ముఖ్యులు. నెస్లె (*Nestle*) అను వాఁడు వీరిపని యావత్తును చూచి వారిపనియొక్క ఫలితమును ఒక పుస్తకములో సమకూర్చెను. అదే బైబిలు సొసైటీ వారు అచ్చువేయు మూలవాక్యమై (*Text*) యున్నది (ప్రతులు, ప్రమాణిక గ్రంథములు, అప్రమాణిక గ్రంథములు చూ॥).

**బైబిలు చరిత్ర** (Bible History). బైబిలు బోధలు చరిత్రను వేరైనవిగాక చరిత్రతో కూడినవై యున్నవి. దేవుఁడు మానవులను నడిపించిన రీతియు, మానవులు నమ్మువు కవిధేయులై శిక్షను పాత్రులైనవిధమును, భక్తులైన వారనేక బలహీనతలతో కూడినను ఆ నమ్మకము లోనైన వారై దేవుని దీవెనకు పాత్రులైనవిధము మొదలగు విషయములు బైబిలునందున్నవి. ఇవన్నియు చరిత్రను సంబంధించినవే. యేసుక్రీస్తుకూడ చరిత్ర సంగతులను వేఱుగా నున్నవాఁడు కాఁడు. ఆయన పాత నిబంధనను నెఱవేర్చుటయేగాక నూతన యుగమునకు ఆదికారణభూతుఁడగుటను చూడఁగా, ఆయన మానవులలో మానవునివలెగా జీవించెను కావున, ఆయన సంగతులను చరిత్ర సంగతులై యున్నవి. ఆయన స్థాపించినరాజ్యము దినక్రమేణ వృద్ధియగుచు సర్వత్ర వ్యాపించుచున్నది గాన దానివిషయములుకూడ చరిత్ర విషయములే.

అందువలన బైబిలు చరిత్రము చాల ముఖ్య విషయమై యున్నది. బైబిలునందా చరిత్ర వ్రాయఁబడిన రీతిని చూచినపక్షమున నిదిగువ సంగతులు కనఁబడును. దీనితోపాటు కాలక్రమణిక (*Chronology*) ను గూర్చిన వ్యాసము చూడవలెను.

1. జలప్రళయమునకుఁ బూర్వము జరిగిన సంగతులు. ఈ చరిత్ర బహు సంక్షేపముగా నున్నది. వేలకొలఁది సంవత్సరముల సంగతులు ఆది 1-8 అధ్యాయములలో మాత్రముండుట వలన చరిత్రలోని యనేక విషయములు లోపించినవి. ఈ యధ్యాయములలో ప్రపంచ సృష్టి మానవ సృష్టి, మానవుని పాపపతనము, కయీను వంశావళి, నోవహువఱకుఁగల షేతువంశావళి, పాపముచేసి చెడినమానవుల శిక్ష యను ముఖ్య సంగతులున్నవి.

2. నోవహు మొదలు అబ్రాహామువఱకు గల సంగతులు. ఆది 9-11 అధ్యాయములలో మానవజాతి చరిత్రనుగూర్చిన సూచనలు గలవు

మానవులు లోకమంతట చెదిరిపోవుట, దేవుని మఱల మఱచిపోయి విగ్రహారాధికులగుటను గూర్చి యున్నది.

3. అబ్రాహాము మొదలు మోషేవఱకుఁగల సంగతులు. ఇందు దేవుఁడు మానవజాతినుండి యొక కుటుంబమును ప్రత్యేకించి దాని నడుపుటనుగూర్చి గలదు (ఆది 12-50). ఆయా కుటుంబములకు మూలపురుషులగు అబ్రాహాము ఇస్సాకు యాకోబు అనువారి చరిత్రలున్నవి తరువాత ఇశ్రాయేలీయుల గోత్రములకు మూల పురుషులగు యాకోబు కుమారుల చరితయు, వారి కుటుంబము లెట్లు క్షామబాధనొందినవారై ఐగుప్తునకు వెళ్లి ఆ రాజ్యపరిపాలనకు లోనైరో ఆ సంగతులు యోసేపు చరిత్రలో విపులముగా నున్నవి.

4 ఇశ్రాయేలీయులు ఐగుప్తులో నుండఁగా బలమైన జనాంగముగా వృద్ధినొంది మోషే నాయకత్వము క్రింద ఐగుప్తీయుల దాసత్వమునుండి విముక్తులై వాగ్దాన దేశమునకు వచ్చి దాని స్వాధీన పఱచుకొనుటనుగూర్చిన సంగతులు మోషే యెహోషువల చరిత్రకు సంబంధముగా వివరింపఁ బడినవి. దీనికి సంబంధించియే వారు దేవుని జనమగుటవలన వారికి కలిగిన క్రమ శిక్షలను గూర్చియు, దేవునారాధింపవలసిన విధమును గూర్చియు నున్నది. ఇది పాత నిబంధనకు పునాదిగా నెంచవలసిన కాలము (నిర్గమ—యెహోషువ).

5. ఇశ్రాయేలీయులు ఈ కట్టుదిట్టముల నొందిన పిమ్మట వాటి ననుసరించి వృద్ధినొందుచు దేవుఁడుద్దేశించిన గురిని యందుకొనులాగున న్యాయాధిపతులకాలములో వారికి సమయ మియ్యఁబడెను. ఈ కాలములో దేశమంతటిలో నేకచ్ఛత్రాధిపత్యము లేనందున ప్రతివాఁడును తనకు యుక్తమని తోచిన రీతిని నడిచెను. పాత నిబంధన చరిత్రలోనేగాక ఈ లోకచరిత్రయందును మానవులు పాపములో పడుటయు, అందువలన వారికి శిక్షలు కలుగుటయు, వాటిచే వారు బుద్ధితెచ్చుకొనుటయు, దేవుఁడు వారియందు కనికరపడి వారిని విడిపించుట యను కాలచక్రగతి కనఁబడును. ఇశ్రాయేలీయులను నడిపించినవారు న్యాయాధిపతు లనఁబడిరి. అట్టి 14 గురిలో సమూయేలు చివరి న్యాయాధిపతియు మొదటి ప్రవక్తయునై యుండెను (న్యాయా-I సమూ 12).

6. ఏకరాజ్యముగా నేర్పడినకాలము. సౌలుచే నారంభమైన ఈ రాజ్యము దావీదుచే నలు దిక్కుల వ్యాప్తమై, సొలొమోను కాలములో మిగుల ప్రఖ్యాతి కెక్కెను (I సమూ 13-I రాజు 11).

7. రాజ్యవిభాగమైన పిదప రెండు రాజ్యము లుండినకాలము. ఎఫ్రాయిము (పదిగోత్రములు) లేక ఇశ్రాయేలువా రనఁబడిన ఉత్తర రాజ్యము నాశనమగు వఱకు ఈ కాలముండెను (I రాజు 12-II రాజు 17). ఈ కాలములోనే ప్రవక్తలు ప్రవచింప మొదలుపెట్టిరి.

8. యూదావా రనఁబడిన (రెండు గోత్రములు) దక్షిణ రాజ్యము మాత్రమే నిలిచియుండిన కాలము ఇది చెఱకాలమువఱకు వ్యాపించెను (II రాజు 19-25).

9. చెఱకాలము. దీనిగూర్చిన చరిత్ర ప్రత్యేకముగా వ్రాయఁబడలేదు.

10. చెఱకాలము మొదలు క్రీస్తు రాకడ వఱకు జరిగిన చరిత్రలో కొద్దిమాత్రము ఎజ్రా నెహెమ్యాల గ్రంథములలో నున్నది. ఆ కాల చరిత్ర అప్రమాణిక గ్రంథము లనఁబడు మక్కబీయుల గ్రంథమునందు కొంతవఱకు వ్రాయఁబడెను.

11. క్రీస్తు చరిత్ర. నాలుగు సువార్తలలో నున్నది.

12. క్రీస్తు ఆరోహణమైనపిమ్మట పరిశుద్ధాత్మునిచే నడుపఁబడి సువార్త ప్రకటించుటను గురించిన చరిత్ర అపొస్తలుల కార్యములలోను పత్రికలలోను గలదు.

పైనున్న చరిత్రలోని ప్రతి విషయమును దానిలో చక్కగా నమర్చఁబడియున్నది. నవీన కాలమువఱకు ఈ క్రమమును అందఱును అంగీకరించి నమ్మిరి గాని ఇటీవల పండితులైనవారు ఆరంభమునుండి అంగీకరించిన విషయములను పూర్వపక్షముగా నంగీకరించిన ఒక సూత్రము ననుసరించి సవరణచేయుచున్నారు. ఆ సూత్రమునే పరిణామ (*Evolution*) వాదమందురు.

దానిప్రకారము ప్రతిదియు నేదో యొక తత్వమునందుద్భవించి క్రమక్రమేణ వృద్ధిలోకి వచ్చెనందురు. మానవులు సహితము మృగజాతి నుండిగాని హీనదశలోనుండిగాని పుట్టి, ఆరంభకాలమున మృగములను సాటియై ఆ మూర్ఖస్థితిలోనుండి క్రమక్రమేణ అనాగరికతా స్థితినుంచి తప్పించుకొని వృద్ధిలోకి వచ్చిరనియు, ఈ లోకచరిత్రయు ఆరంభమున మూర్ఖుల చరిత్రయై యుండి క్రమక్రమముగా ఇట్లు మారెననుటయే ఆ సూత్రసారమై యున్నది ఈ సూత్రము ఆరంభమందు మానవులు నిర్దోషులై యున్నారను బోధకు భిన్నమై యున్నది. అబ్రాహాము భక్తుఁడు ఏకదేవుని నమ్మి ఆ దేవుని నమ్మువారందరికి మూలపురుషుఁడై యున్నాఁడను సంగతికూడ దానికి భిన్నముగా నున్నది. ద్వితీయోపదేశకాండమందున్నట్లు ఆ యేకదేవుని నారాధించుటకు ఒకటే ఆరాధన స్థలముండవలయునను బోధయు, ఆయన ఆత్మీయ ఆరాధనను కోరువాఁడను బోధయు, ఇశ్రాయేలీయుల ఆరంభదశలోనే మోషేకాలమునందు చేయఁబడెనను సంగతియు దానికి భిన్నముగా నున్నది. ఇట్టి సిద్ధాంతము నవలంబించువారికి చరిత్రను సవరణ చేయుయెడల వారి సూత్ర మెంతమాత్రమును నిలువనేరదు. ఆ చరిత్రను సవరణజేయుటకు బైబిలునందే కొన్ని యాధారము లున్నవని చెప్పుచున్నారు. ఆయా అధ్యాయములందు దేవుని కుపయోగించిన వేర్వేఱు పదములను బట్టియు, భాషాశైలియందలి భేదములను బట్టియు మఱికొన్ని యితర సంగతులను బట్టి అట్లు చేయవచ్చునందురు.

బైబిలు చరిత్ర నిట్లు సవరించవలెనను వారీ దిగువ సంగతుల క్రమమనుసరింతురు. ఇశ్రాయేలీయు లారంభమందు అనాగరికులై యెహోవా అనఁబడిన యుద్ధదేవుని నారాధించెడివారు. ఆయనను మాత్రమేగాక విగ్రహములనుకూడ పూజింపఁగా ప్రవక్తలైనవారు ఏకదేవునిగూర్చి బోధింప నారంభించి యెరూషలేమను పుణ్యక్షేత్రమునందు మాత్రమే ఆయనను ఆరాధింపవలెనని నొక్కి చెప్పిరి. తాము చెప్పెడి బోధను ప్రజలంగీకరింపనై వారిలో నెవరో యొకరు ద్వితీయోపదేశకాండ గ్రంథమును వ్రాసి మోషే వ్రాసెనని వదంతి కలిగించెను. రాజైన యోషీయా కాలమునందు ఆలయములో కనుగొనఁబడిన ధర్మశాస్త్రమదే. మోషే గ్రంథ పంచకములోని కొన్ని విషయములు (ఉదా॥ నిర్గ 21-23) మిగుల పురాతనములైనవైనప్పటికిని ఇశ్రాయేలీయులలోని అభిమానులు తమ జనాంగమును గొప్పచేయుటకై వ్రాసిన సంగతులై యున్నవి. మొదట నీ సంగతులను వ్రాసినవాఁడు "అల్లా" యను పదమునకు సంబంధించిన "ఎలోహీం" అను మాటను దేవునికి వాడెనుగాని, ఆ వ్రాఁతలను సవరించిన వాఁడు "యెహోవా" యను పదమును వాడుట వలన ఆ రెంటిని విభజింపవచ్చునందురు సవరణలు చేయువప్పు డితర సంగతులనుకూడ చేర్చిరి చివరకు ప్రజలు తమ్ము నభిమానించి గొప్ప చేయునట్లు యాజకులు మఱికొన్ని వ్రాఁతలను చేర్చిరి. ఈ విధముగా ఆయా వ్రాఁతలను సూచించుటకు వేర్వేఱు గుఱుతులను వ్రాసెదరు. ద్వితీయోపదేశకాండము వ్రాసినవానికి D అను గుఱుతును పెట్టిరి. అతఁడా గ్రంథమును మాత్రమేగాక దానికి సంబంధించిన యితర సంగతులను ఆయా గ్రంథములలోఁ జేర్చెనట. ఎలోహీము అను పేరుగ దేవునికి పెట్టినవానికి E అను అక్షరమును, యెహోవా అను పదము నుపయోగించినవానికి J అను అక్షరమును, యాజకుల పక్షపాతికి P అను అక్షరమును, గురు వేసిరి. నవీన పండితులలో కొందఱు పాత నిబంధనలోని ప్రతి భాగమును శైలిద్వారా తెలిసికొనఁగలమని తలంచి దానినట్లు విభాగించిరి. వీరిలోను అనేకులు భిన్నాభిప్రాయులై యున్నను, వారు సవరించు ఇశ్రాయేలీయుల చరిత్ర మీ దిగువరీతిగా నుండును.

మొదట ఇశ్రాయేలీయులు ఒకే గోత్రికులు. వారడవి ప్రాంత నివాసులు. వారు కనాను దేశమును జయించిరి. వారు మిగుల మూర్ఖులని న్యాయాధిపతుల గ్రంథములోని 18 21 అధ్యాయములవలనఁ దెలిసికొనవచ్చును. వారితరులవలె యుద్ధదేవతను కొలిచిరి గాని వారిలో బోధకులు లేచి సర్వలోకమునకు దేవుఁ డొక్కఁడేయని బోధింపఁగా వారాయన లక్షణములను యెహోవా కారోపించిరి. ఆ బోధను స్థాపించుటకై గోత్రకర్తల చరిత్రములను కల్పించిరి. రాజుల కాలము నుండియున్న చరిత్రనుగాక దానికి పూర్వమున్న

దానిని పురాణములుగా నెంచవలెనని వారి అభిప్రాయము.

## బొ

**బొంకుట** అబద్ధము చూ॥

**బొండ** నేరములు శిక్షలు III 3 చూ॥

**బొక్కెన** వంటసామగ్రి 2 చూ॥

**బొటనవ్రేలు (Thumb).** బైబిలునందు బొటనవ్రేలినిగూర్చి రెండు సూచనలున్నవి.

1. యూదావారు అదోనీబెజెకు నోడించి అతని చేతులకాళ్ల బొటనవ్రేళ్లను నరికివేసిరి. అతఁడు తనవలన జయింపఁబడిన 70 మంది రాజులకట్లే జేసెను (న్యాయా $1^{5-7}$). బొటనవ్రేళ్లు లేనివాడల యుద్ధమున పోరాడఁజాలరు గాన ఇట్లు చేయుటవలన వారు రాజపదవి నొందకుండునట్లు కట్లు జేసెననవచ్చును.

2. ఆలయమునకు సంబంధించిన యాచారముల ననుష్ఠించినప్పుడు అహరోను తన కుమారులను ప్రతిష్ఠించిన సమయమున రక్తమును కుడిచెవికిని, కుడిబొటనవ్రేలికిని, కుడికాలి బొటనవ్రేలికిని పూయవలెనను నియమముగలదు (నిర్గ $29^{20}$; లేవి $8^{23,24}$). ఆ రీతిగానే శుద్ధినొందిన కుష్ఠరోగికిని రక్తమును నూనెను కుడిచెవికిని, కుడికాళ్లచేతుల బొటనవ్రేళ్లకును పూసిరి దేహమునకు కొనలుగా నీటికి పూయుటవలన దేహమంతటిని దేవునికి ప్రతిష్ఠించినట్లున్నది

**బొడ్డచెట్టు (Sycomore Tree).** మేడిచెట్టని యుండవలెను (I దిన $27^{28}$).

J. C.

**బొమ్మ పూజారులు** (Chemarim = నల్లనివారు). ఉన్నత స్థలములో అర్చకత్వము చేసిన యర్చకుల పేరు (II రాజా $23^{5}$). దీని యసలు పదము హోషే $10^{5}$ లో నున్నట్లు బేతేలు నందున్న దూడ యెదుట అర్చకత్వము చేసిన వారికిని, జెఫ $1^{4}$ లో నున్నట్లు బయలు పూజారులకును గూడ నుపయోగించిరి. అయితే తెలుఁగు బైబిలులో ఈ రెండుచోట్లను ఆ పదమును **అర్చకులు** అను మాటతో తర్జుమా చేసిరి. చేయరాని పూజలు చేయువారికి మాత్రము బైబిలులో ఈ యసలు పేరును పెట్టిరి. ఆ పదమునకు నల్లనిది లేక దుఃఖము అను శబ్దార్థము కలదు. ఇందువలన వారు బైరాగులని తెలిసికొనవలెనని కొందఱనుకొందురు.

**బొరుసు** వంట సామగ్రి 3 చూ॥

**బొస్కతు** (Bozkath = రాళ్లుగల ఉన్నత స్థలము). యూదయలో నున్న యొక పట్టణము (యెహో $15^{39}$ II రాజు $22^{1}$). అది లాకీషు ఎగ్లోను ప్రాంతములయందలి షెఫేలాలోనున్నట్లు పైవాక్యముల సంబంధము వలనఁ దెలియునుగాని దాని యునికినిఁగూర్చి నూటిగా తెలియదు.

**బొస్రా** (Bozrah = గొఱ్ఱెల దొడ్డి).

1. ఎదోములో నున్న యొక ముఖ్యపట్టణము. ఎదోము రాజగు యోబాబు ఈ యూరివాఁడై యుండెను (ఆది $36^{33}$ I దిన $1^{44}$). ఆమోసు ($1^{12}$), యెషయా ($34^{6}$) యిర్మీయా ($49^{22}$) యను ప్రవక్తలు దాని నాశనమునుగూర్చి ప్రవచించిరి.

2. మీకా $2^{12}$ లో దాని గొఱ్ఱెలనుగూర్చి యొక సూచన కలదు. యెష $63^{1}$ లో జయశాలి యచటనుండి వచ్చుచున్నట్లున్నది. అతఁడు రక్తవర్ణ వస్త్రములు ధరించినవాఁడై వచ్చుటచేత బొస్రావారు అట్టి రంగులుగల వస్త్రములను చేసిరని కొందరనుకొనిరి. అది మృతసముద్రమునకు 50 మైళ్లు ఆగ్నేయదిక్కున ప్రస్తుత మున్న ఎల్ బుసైర (*el-Buseira*) అని కొందఱు గొప్ప పండితు లనుకొందురు గాని దాని యునికిని గూర్చి నూటిగాఁ దెలియదు.

3. మోయాబులో నుండు నొక పట్టణము దీని నాశనమును గూర్చి యిర్మీయా తెలిపెను (యిర్మీ $48^{23}$). ఇది రూబేనీయులకు ఆశ్రయ పట్టణముగా నుండు బెసరుకు మాఱుపేరై యుండవచ్చును (ద్వితీ $4^{43}$ యెహో $20^{8}$ బెసరు చూ॥).

**బొస్సేసు** (Bozez = కాంతిగల). మిక్మషు లోయకు ఉత్తరమున నుండు నూదిగట్టునకు పేరు (I సమూ $14^{4}$).

## బో

**బోకీము** (Bochim = ఏడ్చువారు). ఇశ్రాయేలీయులు పలెస్తీను దేశము చేరినపిమ్మట వారు అన్యులతో నిబంధన చేసికొని వారితో కలిసి

నందున యెహోవా దూత వారిని గద్దించిన స్థలము (న్యాయా 2$^{1,5}$). LXX లో న్యాయా 2 లో దీనికి బదులు బేతేలు అను పేరు పెట్టిరి. అది బేతేలునకు సమీపమునందున్నది గాని దాని యునికి సూటిగాఁ దెలియదు.

**బోకెరు** (Bocheru = జ్యేష్ఠ పుత్రుఁడు). యోనాతాను సంతతివారిలో నొకఁడు (I దిన 8$^{38}$ 9$^{44}$).

**బోడి, బోడితనము** (Baldness). బట్టతల, నొసలు కుష్ఠమునకుఁ గాని మేహ సంబంధమగు నితర జబ్బులకుఁగాని సూచనగా నుండెను (లేవీ 13$^{41-44}$, రోగములు చికిత్సలు I 7 చూ॥). గొప్ప కష్టముల వలన బోడితనము కలుగునని తలంచిరి (యెహె 29$^{18}$ యెష 3$^{17}$). బోడితల ముఖ్యముగా ఆఁడువారికి అవమానకరముగా నెంచిరి (3$^{24}$). వెంట్రుకలు గొరిగించుకొనుటయు, స్త్రీలకు అవమానకరముగా నుండెను (I కొరి 11$^{5}$). ప్రవక్తయగు ఎలీషా బోడివాఁడైనందున పిల్లలతని నెగతాళిచేసిన సంగతినిబట్టి (II రాజు 2$^{23}$) పురుషులకును అట్టి బట్టతల యుండుట అవమానముగా నుండెనని కొందఱి యభిప్రాయము గాని వారట్లు చేసినది పిల్లచేష్టలని చెప్పుట యుక్తము. బైబిలు కాలమునందు ప్రస్తుతమీ దేశములో నున్నట్లుగా వెంట్రుకలను దేవుండ్లకు ముడుపుగట్టుట వాడుక (యెష 22$^{12}$). కొందఱు హిందువులలో జుట్టును మాత్రముంచి ప్రక్కలను గొరిగించుకొన్నట్లున్నది (యిర్మీ 9$^{26}$ 25$^{23}$). ఈ వాడుకలన్నియు యూదులకు నిషిద్ధములైనను (ద్వితీ 14$^{1}$ లేవీ 19$^{27}$ 21$^{5}$), నాజీరు వ్రత దీక్షఁ బూనినవారు వ్రతసమాప్తి కాఁగానే తలను గొరిగించుకొని వెంట్రుకల నర్పించినట్లున్నది (సంఖ్యా 6$^{18}$ కార్య 18$^{18}$ 21$^{24}$).

**బోధ** (Teaching, What is Taught). ఈ పదముల సాధారణయర్థ మందరికిని విశదమే గాన అట్టి యర్థముతో బైబిలునందు వాడఁబడిన రీతి నిచట వివరింప నవసరము లేదు. బోధించుట క్రీస్తు పనియందు ముఖ్య భాగముగ నుండెను (మా 1$^{27}$ 12$^{38}$). ఆయన బోధించిన వాటిని సూచించుటకు అసలునందు డిడఖె (*Didache*) యను విశేష పదము నుపయోగించిరి. దాని నిచ్చట వివరింతుము. క్రీస్తు మానవులకుఁ దెలిపిన సంగతులు ఆయన బోధయని చెప్పఁబడెను (మ 7$^{28}$ 22$^{33}$ మా 1$^{27}$ యోహా 18$^{19}$ మొ॥). ఈ పదమునే ఒకసారి పరిసయ్యుల బోధను సూచించుటకు సువార్తలలో వాడిరి గాని సాధారణముగా నది క్రీస్తుబోధను సూచించుటకే ఉపయోగింపఁబడెను. అది ఆయన సిద్ధాంత సమితిని సూచించు పదమని యనఁదగును (7$^{16}$ కార్య 17$^{19}$ రోమా 16$^{17}$ II యోహా 10 ప్రక 2$^{24}$). ఒక వాక్యమునందా బోధ దేవుని బోధ యనియు (యోహా 7$^{17}$), ఒకదానియందు ప్రభువు బోధ యనియు (కార్య 13$^{12}$), ఒక దానిలో క్రీస్తుబోధ యనియు (II యోహా 9), ఒక దానియందు అపొస్తలుల బోధయనియు (కార్య 2$^{42}$) ఉన్నది. తీతు 1$^{9}$ నందీ పదమునే ఉపదేశమని తెనిఁగించిరి. ఈ యసలు పదము (*Didache*) అని క్రైస్తవుల సిద్ధాంతముల సంక్షేప వివరమునకు పెట్టిన పేరాయెను. (ఉపదేశము, ప్రకటించుట చూ॥).

**బోధకుడు, ఉపదేశకుడు** (Teacher) తండ్రి తన కుమారులకు దైవజ్ఞాన ముపదేశించినట్లు పాత నిబంధనయందు కనఁబడుచున్నది (సామె 4$^{4}$ ఉపాధ్యాయుడు చూ॥). సమాజ మందిరమునకు సంబంధించిన బడిని వారు చెప్పుచు వచ్చిరి. వారికి రబ్బీ (= గొప్పవాఁడు) అను బిరుదు గలదు (రబ్బీ చూ॥).

క్రొత్త నిబంధనయందీ పేరును సువార్తలలో వేదశాస్త్రులకు మాత్రమే గాక బాప్తిస్మమిచ్చు యోహానుకును (లూ 3$^{12}$), యేసునకును (మ 8$^{19}$ 12$^{38}$ 17$^{24}$ 19$^{16}$ 22$^{16}$ యోహా 1$^{38}$ 3$^{2}$ 8$^{4}$ 11$^{28}$ 13$^{13}$ 20$^{16}$ మొ॥) పెట్టిరి. రక్షణ మార్గమును బోధించు బోధకుఁడు తానొక్కఁడే యని క్రీస్తు చెప్పుకొనెను (మ 23$^{8}$).

క్రైస్తవ బోధలను బోధింపఁగలిగిన వారును బోధకులనఁబడిరి (కార్య 13$^{1}$ I కొరి 12$^{28}$ రోమా 12$^{6-8}$). ఎఫె 4$^{11}$ లో ఆ పదమునే ఉపదేశకులని తెనిఁగించిరి. ఈ వాక్యములవలన బోధకులు ప్రవక్తలకు తరువాత నెంచఁబడినట్లు తేటగాఁ గనఁబడును. క్రమక్రమేణ బోధకులు సంఘోద్యోగస్థులలో నొకరైరి. వారు బోధింప

వలసిన వాటికి డిడాఖె (*Didache* = ప్రథమ బోధిని) యను పేరు కలిగినట్లున్నది (బోధ చూ॥)

**బోధించుట** (To teach) 1. ఇశ్రాయేలీయుల సంగతులను గూర్చి విచారింపఁగా పిల్లలను బోధించుటను గుఱించి వారెక్కువ శ్రద్ధ పుచ్చుకొనుచు వచ్చినట్లు తెలియును. దైవిక భయ సహితయే వారి బోధలకు ఆధారమై యుండెను (ద్వితీ $6^{20-25}$ $11^{18-21}$ సామె $1^{7}$). అయితే బైబిలు యావత్తులో ఒక్క విద్యాశాలను గూర్చి మాత్రము సూచనకలదు (కార్య $19^{9}$). అది యిశ్రాయేలీయుల విద్యాశాలకాక, గ్రీకువారి విద్యాశాలయై యుండెను. ఇశ్రాయేలీయులలో తల్లిదండ్రులు తమ బిడ్డలకు బోధించువాడుక కలదు. పెద్దకాలము వఱకు ఇశ్రాయేలీయులు బోధించుటకు ఇది యొక్కటే యేర్పాటయి యున్నట్లున్నది. మఱియు ఇశ్రాయేలీయుల గొప్ప చరిత్ర విషయములను వారి బిడ్డలు మఱువక నేర్చుకొనుటకు వారి పండుగలు గొప్ప సాధనములై యుండెను.

2. చెఱకాలము మొదలు ఇశ్రాయేలీయులు బోధించుటకై సమాజమందిరములను స్థాపించిరి. అచట బోధలు చేయుటకై వారు ధర్మోపదేశకులను నియమించుకొనిరి. నెహె $8^{1,8}$ లో నున్నట్లుగా, ప్రజలు ధర్మశాస్త్రమును వినగోరుదుమని ప్రమాణము చేసియుండిరి. ధర్మశాస్త్రమును వారికి బోధించుటకై ఈ కాలము మొదలుకొని విశేష యేర్పాటులు చేయుట యావశ్యకమయ్యెను. కావున, వారు తాము నివసించిన ప్రతి గ్రామములో నొక సమాజ మందిరమును కట్టించుకొనిరి. క్రొత్త నిబంధన కాలమువఱకు ఇట్టి యేర్పాటుండెను (మ $4^{23}$ మా $1^{21}$). క్రైస్తవ సంఘములలో నీ యేర్పాటును వృద్ధిలోకిఁ దెచ్చిరి. మఱియు ఈ సమాజ మందిరములోని బోధలకు పైవిచారణ కర్తలుగా నుండువారు శాస్త్రులై యుండిరి (ఎజ్రా $7^{6}$).

మక్కబేయుల కాలమునకుఁ దరువాత సమాజ మందిరములకు సంబంధముగా ప్రారంభ విద్యాశాలలు (*Elementary Schools*) న్నట్లు యూదుల గ్రంథములలో సూచనలు కలవు. అందులోని బోధకులు ధర్మశాస్త్రోపదేశకులైయుండిరి. క్రొత్త నిబంధన కాలములో యూదయ, గలిలయ జిల్లాలయందలి ప్రతి యూరిలోను ఇట్టి ధర్మశాస్త్రోపదేశకు లుండిరని లూ $5^{17}$ వలనఁ దెలియును. ఆఱేండ్లు గల పిల్లలందఱును అట్టి పాఠశాలలకు వెళ్లవలసియుండిరి. వారు మొదట బైబిలు భాగములను కీర్తనలను కంఠతగా నేర్చికొనిరి. తరువాత చదువ నేర్చుకొనిరి. చదువుటకు వ్రాయుటకును కొన్ని లెక్కలను వేయుటకును తప్ప ఈ బడులలో మఱి దేనిని బోధింపఁబూనుకొనరైరి. మగపిల్లలు మాత్రము అట్టి పాఠశాలలకు వెళ్లినట్లుగా నున్నది. ఆఁడుపిల్లలకు తల్లులే నేర్పుచుండిరి. ఇశ్రాయేలీయులలోని సామాన్య ప్రజలకు ఇంతమట్టునకే విద్యఁజెప్పిరిగాని, శాస్త్రులను తర్ఫీయతు చేయుటకై వారికొఱకు ప్రత్యేకమైన పాఠశాలలుండెను. క్రీస్తుశకారంభ కాలమున హిల్లెలు, షమ్మయి యను నిద్దఱు గొప్ప పండితులు అట్టి పాఠశాలలను స్థాపించి యందు బోధించుచుండిరి. తరువాతి కాలములో హిల్లెలు మనుమఁడగు గమలీయేలు అట్టి పాఠశాలకుఁ బెద్దయై సౌలునకు బోధకుఁడయ్యెను (కార్య $22^{3}$). ఇట్టి పాఠశాలలో ముఖ్యముగా పాతనిబంధనను దానిననుసరించిన ప్రతి చిన్నవిషయమును గూర్చియు సూక్ష్మ విధులను తెలుపు పారంపర్యములను బోధించుచుండిరి.

యేసుక్రీస్తుకూడ సమాజమందిరములో బోధించెను (మ $4^{23}$ మా $1^{21}$ $6^{2}$ యోహా $6^{59}$ $18^{20}$). ఆయన శాస్త్రులవలె గాక, అధికారముగలవానివలె బోధించెనని చెప్పుచు ఆశ్చర్యపడిరి (మా $1^{22}$ ప్రకటించుట చూ॥).

**బోయజు** (Boaz = వేగిరముగాఁ బోవుట).

1. బేత్లెహేము నివాసియగు నొక గొప్ప యాసామి. ఇతఁడు నయోమికి బంధువుఁడై యుండెను (రూతు $2^{1}$). నయోమియు రూతును మోయాబునుండి తిరిగి వచ్చినపుడు ద్వితీ $25^{5-10}$ లో నున్న యేర్పాటు ప్రకారముగా నితఁడు రూతును వివాహము చేసికొనెను (రూతు $4^{1-7}$). ఆమె వలన నితనికి దావీదు తాతయగు ఓబేదు పుట్టెను ($4^{21}$). క్రొత్త నిబంధనలోని వంశావళి క్రమణికలో నితనిపేరు కనఁబడును (మ $1^{5}$).

పాత నిబంధనయందు ఖసీదీము (*Chasidim*) అను పదమును సాధారణముగా భక్తులు అని తెనిగించిరి. ఆ పదమును దేవునిగుఱించి వాడి ఆయన కృపగలవాఁడని తెనిగించిరి (కీర్త $145^{17}$ యిర్మీ $3^{12}$) ఈ పదముయొక్క ధాతువుకు కృపయని యర్థమగును. కావున దాని నట్లు తెనిగించుట న్యాయమే (కృప I 1 చూ). మనుష్యునిగూర్చి వాడఁబడిన సందర్భములో ఒక వాక్యమందు దయగలవారు అని తెనిగించిరి (II సమూ $22^{26}$=కీర్త $18^{25}$). ఈ వాక్యములందు ఆ పదమునకు దయ యని సందర్భమునుబట్టి తర్జుమా చేసిరి. తక్కిన చోట్లలో దానిని భక్తులు అని తెనిగించిరి I సమూ $2^{9}$ II దిన $6^{41}$ కీర్త $4^{3}$ $12^{1}$ $16^{9}$ $30^{4}$ $31^{23}$ $32^{6}$ $37^{28}$ $50^{5}$ $52^{9}$ $79^{2}$ $85^{3}$ $89^{19}$ $97^{10}$ $116^{15}$ $132^{9,16}$ $145^{10,19}$ $148^{14}$ $149^{1,5,9}$ సామె $2^{8}$ మీకా $7^{2}$). దైవభక్తుఁడు దయగలవాఁడుగా నెంచఁబడినట్లు ఆ మాటయొక్క వ్యుత్పత్త్యర్థమును బట్టి తెలియును. యూదులలో ఖసీదీము అనఁబడినవారిలోనుండి పరిసయ్యులనువారు ఉద్భవించినట్లు కనఁబడునుగాని వారు ఈ యసలు భావమును మఱచి వెలుపటి యాచారములు ముఖ్యములైనవిగా నెంచి తప్పిపోయిరి. ఈ మాటలో సూచింపఁబడిన భక్తి మీకా $6^{8}$ యాకో $1^{27}$ లో వివరింపఁబడియున్నది (భక్తి, భయభక్తులు చూ).

**భయభక్తులు, భక్తిపరులు, దేవునికి భయపడుట, దేవునికి భయపడువారు** (Fear, Those who fear God, Devout). దేవునియందు భయభక్తులు కలిగియుండుట బైబిలునందు ఒక ముఖ్య ధర్మమైయున్నది. ఈ ధర్మమును సూచించు పదమును కొన్ని గ్రంథములలో దేవునికి భయపడుటయని తెనిగించిరి (ఆది $22^{12}$ నిర్గ $1^{17,21}$ $14^{31}$ లేవీ $19^{14,32}$ ద్వితీ $4^{10}$ $6^{2,13,24}$ $8^{6}$ యెష $50^{10}$ $59^{19}$ మొ॥). ఇతర గ్రంథములలో నా పదమునే దేవునియందు భయభక్తులు కలిగియుండుట అని మఱింత చక్కగా తెనిగించిరి (యెహో $4^{24}$ $24^{14}$ II రాజు $17^{35,39}$ యోబు $1^{1,9}$ కీర్త $15^{4}$ $22^{23}$ $25^{12,14}$ మొ॥ సామె $13^{13}$ $31^{30}$ ప్రస $12^{13}$ యిర్మీ $26^{19}$ యోనా $1^{9}$ హగ్గ $1^{12}$ మలా $3^{16}$ $4^{2}$ మొ॥). ఈ పదము ద్వితీయోపదేశకాండమునందును కీర్తనల గ్రంథమునందును ఎక్కువగా కనఁబడును. దేవునికి భయపడి పాపముచేయుటకు వెరువవలెను (లేవీ $19^{14,32}$ $25^{17}$). అన్యులదేవతలకు భయపడరాదు (న్యాయా $6^{10}$ II రాజు $17^{35,37,38}$).

కొత్త నిబంధనలోను ఆ రీతిగానే దేవునికి భయపడవలెనను ఆజ్ఞయుండెను (మ $10^{28}$ లూ $1^{50}$ $12^{5}$) దేవునికి భయపడు వారనఁగా విశేష అర్థ మొకటిగలదు. యూదులు కాక పోయినను పాత నిబంధనలో బయలుపఱచఁబడిన దేవుని నమ్మిన అన్యులకుకూడ నీ పదము నుపయోగించిరి (కార్య $10^{2,22}$ $13^{50}$ $17^{4,17}$ మొ॥). పౌలు పనిచేసిన ప్రదేశములయందు అట్టివారిలో నెక్కువమంది క్రైస్తవులైరి. ఈ పదమునే $10^{2}$ నందు భక్తిపరుఁడు అనియు II పేతు $2^{9}$ లో భక్తుడు అనియు తెనిగించిరి.

**భర్త** కుటుంబము 2 చూ.

## భా

**భారము, బరువు** (Burden). మానవులుగాని పశువులుగాని మోసెడి మోతకు ఉపయోగించిన పదము. ఈ శీర్షిక క్రింద ఈ పదముయొక్క అలంకార ప్రయోగములు వివరింపబడును. (1) భారము మానవుల కష్టమును సూచించును (యోబు $7^{20}$ ద్వితీ $1^{12}$). (2) మానవుల పాపమువలన కలిగిన కష్టములను సూచించును (కీర్త $38^{4,9}$ మ $11^{28}$ గల $6^{2}$). (3) మానవులు చేయవలసిన విధులను సూచించుటకును దీని నుపయోగించిరి. ముఖ్యముగా ధర్మశాస్త్రము విధించిన ఆచార సంబంధములగు విధులకీ పదమును వాడిరి (మ $23^{4}$ లూ $11^{46}$ కార్య $15^{28}$ ప్రక $2^{24}$ గల $6^{5}$). సభవారు తమ బోధకులను పోషింపవలసిన విధి నాటిలో నొకటి కావున అదిమోపక యొక భారమని పౌలు దలిచెను (II కొరిం $11^{9}$ $12^{13,14}$ చూ). (4) దేవోక్తి యని సాధారణముగా తెనిగింపఁబడిన పదము. దీని మూలభాషాపదమును దేవాదేశములవలన ప్రవక్తలు పలుకవలసిన శిక్షలనుగూర్చియు వాడిరి. అబద్ధప్రవక్తలు ఈ మాటను వాడినందున ప్రజలు తమ్ము ప్రవక్తలనుగా నెంచు

గని అభిప్రాయపడిరి గాన యిర్మీయా వారాసవము నుపయోగించిన రీతినిగురించి బహు హాస్యముగా మాట్లాడెను. వారీ విధముగా చేయునది దేవునికి గొప్ప భారమని వారిని ఖండించెను (యిర్మీ $23^{33-40}$ దేవోక్తి చూ॥).

**భార్య, భార్యాభర్తలు** కుటుంబము 2 చూ॥

**భాష, క్రీస్తుమాట్లాడిన (Language of Christ).** క్రీస్తు కాలములో పలెస్తీను దేశమునందు, హెబ్రీ ప్రాకృత మనఁదగిన సాధారణమైన ప్రజల భాషయు, ఆకాలమునందు సర్వలోకములో వాడఁబడిన గ్రీకుభాషయు, రోమను అధికారు లుపయోగించిన లాటిన్ భాషయు వాడుకలో నుండెను. పిలాతు యేసు సిలువపై వ్రాయించి కట్టించిన నేరము ఈ మూఁడు భాషలలో వ్రాయఁబడెను (యోహా $19^{20}$). వీటిలో లాటిన్ భాష నెక్కువమంది వాడలేదు. ఆ కాలమునందు గ్రీకు సర్వలోకభాషయగుటచే ఇతర దేశములనుండి వచ్చినవారు సహా ఆ భాషనే సాధారణముగా నుపయోగించిరని చెప్పవచ్చును. క్రీస్తు బోధించినప్పుడు హెబ్రీ ప్రాకృతమును భాషనే వాడెనా లేక గ్రీకుభాషనుగూడ వాడెనా యని యిప్పుడు నిశ్చయింప వీలులేదు. ఆయన జన సామాన్యముతో నుండునప్పుడు వారివలెనే హెబ్రీ ప్రాకృతమునే వాడినట్లు మార్కు సువార్తలోనున్న కొన్ని మూలభాషాపదములవలనఁ దెలియుచున్నది (మా $5^{41}$ $7^{34}$). ఆయన సిలువమీఁద నెత్తి చెప్పిన బైబిలు వాక్యములనుబట్టి ($15^{34}$) దానిని హెబ్రీభాషలో గాక ఆ కాలమునందు ప్రజలలో వాడుకగానున్న భాషలో చెప్పినట్లు చూడవచ్చును. వీటినిబట్టి ఆయన ప్రజలలో వాడఁబడిన భాషలోనె మాట్లాడెనని తెలిసికొనవచ్చును. ఆ భాష అందఱికి గ్రాహ్యమైనది గనుక ఆయన దానిలోనే గొప్ప జనసమూహములకును బోధించెను.

**భాష, క్రొత్త నిబంధనలోని (Language of New Testament).** క్రొత్త నిబంధనను వ్రాసినవారు గ్రీకుభాషలో వ్రాసిరి. పలెస్తీనులోనుండువారు హెబ్రీ ప్రాకృత మనఁదగిన అరమేయిక్ భాషను వాడుచుండినను, తత్కాలమున రోమా రాజ్యమంతటను గ్రీకు భాషను వాడుచుండుటచే దానిని పలెస్తీను వారు కూడ ఎఱిఁగియుండిరి. ప్రస్తుతమున భరతఖండమంతటిలో ఇంగ్లీషుభాష నెట్లుపయోగించుచున్నారో అట్లాకాలమందు సర్వలోకమునందు గ్రీకుభాషను వాడుచుండుటచే సర్వజనులు రక్షణార్థమైన క్రొత్త నిబంధనను గ్రీకుభాషలో వ్రాయుట తగినదై యుండెను. పురాతన పండితులు క్రొత్త నిబంధనలోని గ్రీకుభాష "బైబిలు గ్రీకు" అనియు ఆ కాలమందా భాషను వాడినవారు బైబిలులో నుండిన గ్రీకుభాషరీతిగా మాట్లాడలేదనియు అనుకొనిరి. అయితే అప్పటి ప్రజలు సాధారణముగా వాడుకొనిన భాషలలో వ్రాయఁబడిన యనేక పురాతన శాసనములనిటీవల కనుఁగొని యున్నారు కావున, క్రొత్త నిబంధనలోని గ్రీకు తత్కాలమున వాడుకలో నున్న గ్రీకు అని తెలిసికొనుచున్నాము. క్రొత్త నిబంధన ఆ కాలములో వాడుకయందుండిన గ్రీకులో వ్రాయఁబడిన ముఖ్య గ్రంథమని మనము తెలిసికొనవలసియున్నాము. గ్రీకుభాష సంస్కృత భాషకు సంబంధించినదై, సంగతులను బహు నూటిగాను చక్కఁగాను తెలుపుటకుఁ దగినభాషయై యున్నది. అందునుబట్టి యది క్రొత్త నిబంధనలోని గొప్పవిషయములను సర్వకాలములయందు కాపాడుటకై తగిన సాధనమై యున్నవి (ప్రతులు చూ॥).

**భాష, పాత నిబంధనలోని (Language of Old Testament).** పాత నిబంధన హెబ్రీ భాషలో వ్రాయఁబడెను. ఈ భాష అరబ్బీయుల భాషకు సంబంధించినదైయున్నది. ఇశ్రాయేలీయులు హెబ్రీ భాషను చాల కాలము వఱకు మాట్లాడుచుండిరి. యెషయా కాలములోను (II రాజు $18^{26}$), నెహెమ్యా కాలమందును (నెహె $13^{24}$) వారిభాష చుట్టునుండిన అన్యులు వాడిన భాషకు ప్రత్యేకముగా నుండెనుగాని క్రీస్తు రాకకు పూర్వము ఇశ్రాయేలీయులు హెబ్రీభాష మాట్లాడుటను మాని చుట్టునుండు సిరియా దేశములో వాడుకగా నుండిన అరమేయిక్ భాషను మాటలాడుచుండిరి. దానియేలు గ్రంథములోను ప్రసంగిలోను కొన్ని భాగములు అరమేయిక్‌లో వ్రాయఁబడి

యున్నవి. హెబ్రీ భాషను అసలులో హల్లులను మాత్రము వ్రాసిరి. హెబ్రీ యచ్చులను విద్యార్థులు తమ గురువులయొద్ద నోటిమాటల ద్వార నేర్చుకొనుచుండిరి. అయితే హెబ్రీ పండితులు క్రీ॥ శ॥ పూర్వము 9 వ శతాబ్దమునకును మధ్యకాలమున నెప్పుడో అచ్చులకు గురుతులు పెట్టియున్నారు. అవి హెబ్రీ బైబిలులో నేటివఱకు నున్నవి. వారు సూచించిన యుచ్చారణ క్రీ॥ శ॥ 100 వ సం॥ లో వాడిరనుటకు ఆధారములు కలవు. పైఁజెప్పిన యూద పండితులు ప్రతిదానిని బహు సూక్ష్మముగా పరీక్షించి పాఁత నిబంధనను వ్రాయుటలో తప్పులు కలుగకుండునట్లు బహు జాగ్రతగానుండిరి. వారు సవరణ చేసిన ప్రతి నేటివఱకును కాపాడఁబడుటచే క్రొత్త నిబంధన ప్రతులలో కన్న పాఁత నిబంధన ప్రతులలో తక్కువ మార్పులు కలవు (భాషాంతరములు, ప్రతులు చూ॥).

**భాషల అర్థము చెప్పుట (Interpretation).** ఆత్మవరములను పొందినవారిలో భాషలతో మాటలాడువారు మాత్రము కాకుండ దానికి అర్థము చెప్పువారు కూడకలరు (I కొరి $12^{10,30}$ $14^{5,13,26}$). అర్థము చెప్పువారు లేకపోయిన యెడల భాషలతో మాటలాడుటకు పౌలు సెలవియ్యఁడాయెను. హెబ్రీ బైబిలుకు అర్థము చెప్పువారు కలరు. హెబ్రీ భాష రాక పోవుటచే, ఒకఁడు దాని చదువుచుండఁగా మఱియొకఁడు దానికి అర్థము చెప్పెను (నెహె $8^{7}$) క్రొత్త నిబంధనలో హెబ్రీ మాటలు కనఁబడు చోటులలో వాటికి అర్థము చెప్పుట కొంత మట్టుకు దీనికి సంబంధముగా నున్నది (మ $1^{23}$ $27^{46}$ మా $5^{41}$ $15^{22}$ యోహా $1^{38,42}$ మొ॥ కృపావరములు, భాషావరములు చూ॥).

**భాషలు తారుమారగుట (Confusion of Tongues).** జలప్రళయమునకుఁ బిమ్మట నోవహు సంతతివారందఱును ఒక్క భాషనే మాట్లాడిరి (ఆది $11^{1}$). బాబెలునొద్ద దేవుని తీర్పు ప్రకారము భాషాభేదములు కలిగి అక్కడ నున్నవారందఱును లోక దిగంతములవఱకు చెదరిపోయిరి. ఏబెరు కుటుంబము లేచిన తరువాత భాషలు తారుమారై యుండవచ్చును ($10^{25}$). కొంతకాలమైన తరువాత నోవహు సంతతివారు అనేక భాషలను విశదముగాను అనేక రీతులగాను మాట్లాడిరి. ప్రస్తుతము వాడఁబడు ఇండూ జర్మానిక్ భాషలను యాపెతు సంతతివారు విశేషముగా నుపయోగించిరి ($10^{2-5}$). మాదై యావాను దేశములలోని యిండూ జర్మానిక్ భాషలనుకూడ వారు మాట్లాడిరి ($10^{2}$). షేము సంతతివారు సెమిటిక్ అనఁబడిన వేఱు భాషలను మాట్లాడిరి ($10^{21-31}$). దృష్టాంతముగా, అష్షూరు, అరాము ($10^{22}$), అరబీ ($10^{26-29}$), హెబ్రీ భాషల నుపయోగించిరి. గాని ఎలమీయులును ఫేనీకే దేశపు భాషకు సంబంధించిన భాషను మాట్లాడిరి ($10^{22}$). హాము సంతతిలో ననేకులు షేము సంతానికుల భాషలను మాట్లాడిరి. అష్షూరులో కూషుభాషను ($10^{11}$) అరబీని ($10^{6,7}$), మాట్లాడిరి. పలెస్తీనులోని కనానీయులు ఫేనీకేయులు షేము సంతతివారి భాషను మాట్లాడిరి ($10^{15}$). అయితే మిస్రాయిముయొక్క పూర్వీక నివాసులగు ఐగుప్తీయులు మిశ్రమభాష నుపయోగించిరని ఐగుప్తు దేశచరిత్ర పరిశోధకులు కనుగొనిరి (బాబెలు గోపురము చూ॥). H.

**భాషాంతరములు (Versions).**

1. క్రీస్తు శకారంభమందు మోషే గ్రంథ పంచకమును షోమ్రోనువారి భాషలోకి భాషాంతరము చేసిరి. అది షోమ్రోనువారి హెబ్రీ గ్రంథపంచకము ననుసరించి మన బైబిలులో నున్నదానికి కొంచెము భిన్నముగా నున్నది.

2. క్రీ॥ శ॥ పూర్వము 235-347 సం॥ లలో నేలిన ప్తొలెమి ఫిలదెల్ఫస్ (*Ptolemy Pheladelphus*) అను ఐగుప్తు రాజాజ్ఞానుసరణముగా పాఁత నిబంధనను అప్రమాణ గ్రంథములతో కూడ గ్రీకుభాషలోకి తర్జుమా చేయ నారంభించి 150 సం॥ లలోఁగా పూర్తిచేసిరి. ఈ తర్జుమాను చేయుటయందు డెబ్బదిమంది పండితులు పనిచేసిరను వదంతికలదు. ఇందునుబట్టి దానికి సెప్తుయజింటు (అనగా డెబ్బది) అను పేరు కలిగెను. మఱియు, దీనికి రోమీయులు 70 యను సంఖ్యను వ్రాయురీతి అనఁగా LXX అనునది సాధారణ గురుతుగా నున్నది. ఇది క్రీస్తుకాలములోను, అపొస్తలుల కాలములోను వాడుకలో నుండెను కావున, చాల ముఖ్యమైన తర్జుమా యని యెంచఁ

దగును. ఇదియుఁగాక ఇంక వేర్వేఱు గ్రీకు తర్జుమాలు కొన్నియును క్రీస్తు శకారంభమందు చేసియుండిరి. వాటిలో అక్విల (*Aquela*) తీయొదోటియన్ (*Theodotion*) సుమ్మకస్ (*Symuachus*) అనునవి ముఖ్యములు.

3. క్రొత్త నిబంధనకు పాత సిరియక్ తర్జుమా యొకటి కలదు. క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమునకు లోపుగానే బైబిలు యావత్తును సిరియక్ భాషలోకి తర్జుమా చేసిరి. ఇది యందఱి యుపయోగము నిమిత్తము సులభశైలితో చేసిరి కావున దీనికి పెషిటో (*Peshitto* = సులభము) అను పేరు పెట్టిరి.

4. ఉత్తర ఆఫ్రికాయందు క్రీ॥ శ॥ 200 సం॥ లకు లోపుగా లాటిన్ భాషలోకి పాత లాటిన్ తర్జుమా నొకదానిని చేసిరి. ఇది స్వచ్ఛమైన లాటిన్ భాష కాకుండుటచే నాల్గవ శతాబ్దమందు ఇటలిదేశములో ఇటల (*Itala*) యను తర్జుమాను చేసిరి. 405 సం॥ నకు లోపుగా జెరోమ్ (*Jerome*) అను గొప్ప వేదశాస్త్రి ఈ తర్జుమాను చేసెను. దీనికి వల్గేట్ (*Vulgate* = గ్రామ్యములు) అను పేరు కలదు. అది దిద్దుబాటు కాలమువఱకు క్రైస్తవులందఱిలో వాడుకయందుండుట మాత్రమేకాక, నేటివఱకు రోమన్ కథోలిక్ వారిలో వాడుకయందున్నది.

5. క్రీ॥ శ॥ 4-6 శతాబ్దముల మధ్యకాలములో ఐతియొపియా దేశమందొక తర్జుమాను చేసిరి. దానికి ఐతియొపియ భాషాంతరమని పేరు.

6. నాల్గవ శతాబ్దమందు ఉల్ఫిల యనువాఁడు బైబిలును గోథీయులభాషలోకి తర్జుమా చేసెను. అది యూరోపులో నుండిన యనాగరికుల భాషయై యుండెను.

7. లూథరు ఆరంభించిన దిద్దుబాటుకు తదనంతరము, నమ్మవలసినవాటికిని అనుసరింపవలసిన వాటికిని బైబిలే లోప రహితమగు ఆధారమను మూలసత్యమును ప్రొటెస్టాంటు వారందఱును అంగీకరించుటచే, వారు బైబిలును ప్రతిదేశమందున్న జనసామాన్యపు భాషలోకి తర్జుమా జేసిరి. ఇచ్చట ఇంగ్లీషు తెలుఁగు తర్జుమాలనుగూర్చి మాత్రము కొంత వివరింతుము.

దిద్దుబాటుకు పూర్వము విక్లిఫ్ (*Wigcclitte*) 1388 నందు చేసిన భాషాంతరము ప్రసిద్ధికెక్కినదై, దిద్దుబాటు కలుగుట కొక ముఖ్యకారణమాయెను. తిండేల్ (*Tyndalle*) 1526 నందును కొవడేల్ (*Coverdale*) 1535 నందును, ఇంగ్లీషు భాషలోకి బైబిలును తర్జుమా చేసినవారిలో ముఖ్యులై యుండిరి. 1582 సం॥ లో రోమన్ కథోలిక్ వారు డూయే (*Douay*) యను పేరనొక తర్జుమాను ప్రచురించిరి. ఇది వల్గేటు ననుసరించును రోమన్ కథోలిక్ వారు నేటి వఱకు దీని నుపయోగించుచున్నారు. 1611 సం॥ న ఇంగ్లండుదేశపు రాజైన జేమ్సు (*King James*) ఒక ఇంగ్లీషు తర్జుమాను ప్రచురింపఁ జేసెను. దానికి అథరైజ్డ్ వర్షన్ (*Authorized Version*) అని పేరు. అది నేటివఱకు వాడుకలో నున్నది గాని 1884 సం॥ లో దానిని సవరణ చేసిరి. ఈ సవరణకు ఇంగ్లీషులో రివైజ్డ్ వర్షన్ (*Revised Version*) అని పేరు. 1953 లో రివైజ్డ్ స్టాండర్డ్ వర్షన్ (*Revised Standard Version*) వాడుకలోకి వచ్చినది.

భరతఖండపు భాషలలోకి చేయఁబడిన బైబిలు తర్జుమాలలో మిగుల పురాతనమైనది జీగెంబాల్గు (*Ziegenbalg*), షుల్జె యను (*Schultze*) మిషనెరీలు అరవములోకి తర్జుమా చేసినదై యుండెను గాని, యంతకు పూర్వమే 1688 సం॥ న సింహళ ద్వీపమునందు డచ్చి మిషనెరీలు క్రొత్త నిబంధనను అరవములోకి తర్జుమా చేసియుండిరి.

తెనుఁగు భాషాంతరములనుగూర్చి విచారింపఁగా క్రొత్త నిబంధనయొక్క మొదటి తెనుఁగు తర్జుమాను 1727 సం॥ నందు రెవ. షుల్జె దొరగారు చేసియుండిరి గాని, ఆ ప్రతి యెన్నడును అచ్చుపడి యుండలేదు. దాని వ్రాత ప్రతిని హాలె (*Halle*) యను పట్టణమునకు పంపినట్లు తెలియుచున్నది గాని దానిగూర్చి ప్రస్తుత మేమియును తెలియదు. 1806 సం॥ న సెరంపూరులో నుండిన మిషనెరీలు ఒక క్రొత్త తర్జుమా చేయ నారంభించిరి.

1804 సం॥ లో లండన్ మిషనెరీ సొసైటి వారు క్రాన్ (*Crane*) రెవ. డెస్ గ్రాంజెస్ (*Des Ganges*) అను మిషనెరీలను విశాఖపట్టణమునకుఁ బంపిరి. వారు తెనుఁగు భాషను

చక్కగా నభ్యసించిన పిదప బైబిలు తర్జుమా పని చేయ మొదలు బెట్టిరి. రెవ. క్రాన్ దొరగారు 1809 సం॥ న కాలగతి నొందిరిగాని రెవ. డెస్ గ్రాంజెస్ దొరగారు బ్రాహ్మణులలో నుండి క్రీస్తుమతము స్వీకరించిన ఆనందరాయ యను నౌకరి సాయమువలన ఆ పనిని కొనసాగించిరి. వారు తర్జుమా చేసిన లూకా సువార్తయొక్క 1000 ప్రతులు 1810 సం॥ న అచ్చుపడెను. ఆ సంవత్సరముననే రెవ. డెస్ గ్రాంజెస్‌గా రివ్విధముగా వ్రాసిరి. "మిషనుల ముఖ్యోద్దేశములను కొనసాగించుటకు దేవుని నిర్మలమైన వాక్యమును అవశ్యముగా స్వదేశీయుల కందించుట యను కార్యము మిషన్ సంబంధమైన యితర కార్యములన్నిటికంటె ప్రాముఖ్యమైనదిగా నగుపడు చున్నది. ఈ పని నారంభింపఁ గలిగినందునకు మిగుల సంతోషించుచున్నాను. మఱియు దేవుఁడు తన దివ్యచిత్తము చొప్పున నన్ను పిలువఁ గోరినను దేవుని యాశీర్వాదమునుబట్టి తగిన తరి యందు యీ పనిని కొనసాగించుటకు సంతోషించునట్టి యిద్దరు నలుగురు వారలు నా యొద్ద నున్నందున మిక్కుటముగా నానందించుచున్నాను." పరిశుద్ధమైన యీ తర్జుమా పని చేయుచుండఁగా చనిపోయిన ఘనుఁడైన బెడె (*Bede*) గారివలె ఈయనయు తరువాతి నొకి మాసముననే ప్రభుపు సన్నిధిచేరెను

1811 సం॥ న కలకత్తా బైబిలు సొసైటివారు ముందుగా చేసిన పనులలో నొకటి రెవ. డెస్ గ్రాంజెస్‌గారు మత్తయి, మార్కు, యోహాను సువార్తలను చేసిన తర్జుమాలను ప్రచురించుటన్నియు యుండెను. 1812 సం॥ నందు వచ్చిన ప్రీచెట్ (*Pritchet*) యను పేరుగల క్రొత్త మిషనెరీగారు క్రొత్త నిబంధన తర్జుమాను 1814 సం॥ న ముగించిరి. అది కలకత్తా బైబిల్ సొసైటివారి యధీనమున చెన్నపురి యందు 1817 సం॥ న ముద్రిత మయ్యెను. 1818 సం॥ న సెరంపూరు మిషనెరీలు క్రొత్త నిబంధనకు చేసిన తర్జుమా ముగిసి వేయిప్రతు లచ్చుపడెను. ఇప్పటికి ప్రీచెట్ దొరగారు పాత నిబంధన తర్జుమా పని చేయుచుండెను. గాని 1819 వ సం॥ న ఆయన యదివఱకే కీర్తనల గ్రంథమును తర్జుమా చేసి యున్నను I రాజుల గ్రంథమువఱకు పూర్తిచేయు నప్పటికి మరణము నొందెను.

1820 సం॥ లో చెన్నపురి ఆక్సిలియరీ బైబిల్ సొసైటీవారు ప్రీచెట్ చేసిన తర్జుమాయొక్క వ్రాతప్రతిని విశాఖపట్టణము నుండి తెప్పించుకొని విమర్శనిమిత్త మాయా వారలకు బంపిరి. 1821 వ సం॥ ఈ సొసైటీవారే సెరంపూరు మిషనెరీలు మోషే గ్రంథ పంచకమునకు చేసిన తర్జుమాను ప్రచురించిరి.

1823-24 సం॥ లలో లండన్ మిషన్ మిషనెరీలలో నింకొకరగు రెవ. గోర్డన్ దొరగారు (*Gordon*) యెషయా, ఆదికాండము, యోహాను సువార్త యను గ్రంథములను భాషాంతరము చేసెను. ఈ తర్జుమాను విమర్శ నిమిత్త మాయా వారలకు బంపుటవలన తేలిన ఫలితమేమనిన, ప్రీచెట్ దొరగారి తర్జుమా మిగుల వ్యాకరణ యుక్తముగను, గోర్డన్‌గారి తర్జుమా ఎక్కువ స్పష్టముగాను గ్రాహ్యముగునట్లుగా నుండెను కావున, గోర్డన్ దొరగారు తమ పనిని కొనసాగించునట్లు ప్రేరేపించిరి గాని 1826 సం॥ నందాయన జబ్బుపడి యా మఱుసటి సంవత్సరమునందే మృతినొందెను. అప్పటిలో ఆయన పనిని జరిగించుటకు శక్తిగలవారెవ్వరును లేకయుండిరి. ఆయనచేసిన తర్జుమా నంతటిని చెన్నపురి బైబిల్ సొసైటీవారు ప్రచురించి యుండిరి.

ఇదివఱకే తయారైన తర్జుమాలను సవరించ చేయుటకు 1837 వ సం॥ లో నొక కమిటీ యేర్పడ కొన్ని ఏండ్లకు సవరణయైన తర్జుమాలను ప్రచురించెను. ఈ సవరణ యిట్టుల కొన్ని సంవత్సరములవఱకు జరుగుచుండెను. ఈలోఁగా తయారైన ఆయా భాగములు ప్రచురమగుచు నుండెను. కుదురుగా 1855 సం॥ వఱకు సవరణయైన క్రొత్త నిబంధన అచ్చుపడి యుండలేదు.

కొంతకాలమునకు లండన్ మిషన్ మిషనెరీలలో వార్డ్‌లా (*Wardlaw*), హే (*Hay*) అను వారు ఒక క్రొత్త తర్జుమా చేసిరి గాని, వారిదివరకువలె ఆథరైజ్డ్ వర్షన్ ఇంగ్లీషు తర్జుమా ననుసరించి కాక, అసలు భాషల ననుసరించి తర్జుమా చేసియుండిరి.

వార్డ్‌లా దొరగారు గతించిన వెనుక డాక్టర్ హే దొరగారొక కమిటీ యధీనమున ఈ పని కొనసాగించిరి.

ఈ కమిటీవారు 1873 వ సం॥ న పాత నిబంధన తర్జుమాను నారంభించిరి. దీనికి డాక్టరు హే దొరగారు ముఖ్య సవరణకర్తయై యుండెను.

వారు ద్వితీయోపదేశకాండమువఱకు ఇట్లు పనిచేసిన పిమ్మట ఇంక చాలత్వరగా చేయగల్గిన తప్ప యీ పని యీ కమిటీవారి జీవితకాలములో ముగియ నేఱదని స్పష్టమాయెను కావున డాక్టర్ హే దొరగారు స్వయముగా ఈ పనిని ధారాళముగ చేయఁగల్గునట్లు సెలవు పొందిరి. ఆయన తన మరణమునకు పూర్వము పాత నిబంధనలో విశేషభాగమును తర్జుమా చేయఁగలిగెను. ఆయన చేసిన తర్జుమా విమర్శ నిమిత్త మాయా సంఘములకుఁ బంపిన పిదప కొద్దికొద్ది భాగములుగా ప్రచురము చేసిరి.

చివరి సవరణ 1899-1904 సం॥ ల వఱకు రెవ. బేకన్ (*Bacon*) దొరగారును, ఇంకొక ప్రతినిధి కమిటీవారును చేసియుండిరి. ఈ కమిటీ నిమిత్తము మూలవాక్యములను (*Text*) సిద్ధముచేయుటలో కానన్ అనంతముగారును, బీ. సీనయ్యగారును బేకన్ దొరగారికి సహాయకులుగా పనిచేసిరి.

భారతదేశము నిమిత్తము బైబిలు సంపూర్ణముగా 18 భాషలలోకి తర్జుమా చేయడ మాయెను. క్రొత్త నిబంధన మాత్రము మఱి 11 భాషలలోకి భాషాంతర మయ్యెను. ఈ దేశములో 140 వేర్వేఱు భాషలును, వ్రాతలేని భాషలును కలవనియు, బైబిలులోని ఆయా భాగములను బైబిలు సొసైటీవారు ఇండియా దేశములోని 315,000,000 ప్రజలలో కనీసము 265,000,000 ప్రజల స్వంత భాషలలోకి ప్రచురించి యున్నారనియు, సర్ జార్జి గ్రియర్సన్ (*Sir George Grierson*). గారు చెప్పిరి (పాత నిబంధన, క్రొత్త నిబంధన, ప్రమాణిక గ్రంథములు, అప్రమాణిక గ్రంథములు, ప్రతులు చూ॥).

**భాషావరము** (Gift of Tongues). దీనిగూర్చిన వాక్యములను చూడఁగా, (1) భాషలతో మాటలాడుట, భాషలకు అర్థము చెప్పశక్తి యను రెండు వరము లందులో నున్నట్లు తెలిసికొనఁగలము (I కొరి 12-14). అచట నిది ఆత్మవరములలో (I కొరి 12[10]) నొకటిగా నున్నదిగాని కొరింథి సంఘములో నిది యుపయోగకరముగా నుండక పోవుటచే దానిని ఆ వరములలో తక్కువదానిగా నెంచవలెనని పౌలు బోధించెను. (2) కార్యముల గ్రంథములో దీనిగూర్చిన వాక్యములున్నవి. వాటిలో ముఖ్యమైనవి పెంతెకొస్తు దినమునుగూర్చిన చరిత్రలో కనఁబడును (కార్య 2[1-13]). కొర్నేలి యను శతాధిపతి విశ్వసించినపుడు అతనికిని అతనితో కూడ నున్న వారికిని అదేవర మనుగ్రహింపఁబడెను (10[46]). ఇది పెంతెకొస్తులోని వరము వంటిదని పేతురు చెప్పినదానివలనఁ దెలియును (11[15]) ఎఫెసులోకూడ ఈ వరము విశ్వాసులకనుగ్రహింపఁబడియెను (19[6]). సమరయ పట్టణములోనున్న క్రైస్తవుల కియ్యఁబడిన వరమునుగూర్చి తేటగా తెలుపఁబడక పోయినను అదియు నిదేవరమై యుండవచ్చును.

ఈ భాషావరమెట్టిది అను దానిగూర్చి రెండభిప్రాయములు కలవు. అందులో నొకటి నవీన కాలపు వేదశాస్త్రులలో నెక్కువమందియొక్క అభిప్రాయమై యున్నది. 1. ఈ భాషావరము నొందినవారు ఆత్మావేశముగలవారై ఆత్మసంబంధమైన భావములను గలిగియుండినను సాధారణముగా మానవులకు తెలియని స్వరములలో పలుకుచుండిరి గాని వారు పలికినవి మానవుల వాడుకలో నుండిన భాషలు కావని యనుకొందురు. ఈ యభిప్రాయము కార్య 2[8] కు భిన్నముగా నున్నదని వారొప్పుకొనవచ్చును. అయినను కార్యముల గ్రంథములోని విషయములు చాల వఱకు ఆ యాది క్రైస్తవులు చనిపోయిన పిమ్మట వ్రాయఁబడినవి గనుక ఈ గ్రంథము వ్రాసినపుడు ఆ యాది భాషా వర మెట్టిదో సరిగా గ్రహించుకొనక పొరబాటుగా గ్రహించుకొని వ్రాసిరని యీ నవీనపండితు లభిప్రాయపడెదరు. 2. రెండవ యభిప్రాయము పురాతన కాలము నుండి కలిగియుండు అభిప్రాయమును ప్రస్తుతమున సాధారణముగా భాషా వరమునకు చెప్పు అర్థమునై యున్నది. అదేది యనఁగా, ఆ కాలములో సువార్త సమస్త జనాంగములకు ప్రకటింపఁ

బడవలసియుండెను. కావున ఆ శిష్యులు అన్యుల భాషలను మాటలాడుటకై ఆత్మచే వారికి శక్తి యనుగ్రహింపఁబడెను. ఇది కార్య $2^{8}$ కు చక్కఁగా సరిపడును. మఱియు నిది కొరింథు సంఘములో నున్నట్లు భాషతో ప్రార్థనచేయుట, భాషతో మాటలాడుట అనుదానికిని సరిపడును (I కొరి $14^{13-16}$). ఐరేనియు (*Irenaeus*) అను సంఘ పిత తనకాలములో ననేకులు ఆయా భాషలతో మాటలాడుటను వినియుండినట్లు వ్రాసెను (*Hair* 5: 6: I). అయినను ఇది తత్కాలమునకై ఆయా వారల కియ్యఁబడిన వరమేగాని సంఘమున కెల్లప్పుడునుండు ఆత్మవరము కాదు (I కొరి $13^{8}$ కృపావరములు చూ॥).

## భి, భు

**భిన్నాభిప్రాయములు** భేదములు 5 చూ॥

**భిక్షువు** దాతృత్వము చూ॥

**భుజంగము** సర్పము I 6 చూ॥

**భుజశల్యమూపడుట** రోగములు చికిత్సలు III 2 చూ॥

## భూ

**భూకంపము** (Earth-quake). పూర్వ కాలమునుండి యిప్పటివఱకు అనేక భూకంపములు కలిగినట్లు పలెస్తీను చరిత్రవలనఁ దెలియుచున్నది. అప్పుడు కలిగిన చివరి భూకంపము 1837 సం॥ న సంభవించెను. ఆమోసుకాలమున నొక భూకంపమచ్చట కలిగినట్లు సూచనగలదు (ఆమో $1^{1}$). కిరవులు గాలివానలు మొదలగు విపత్తులు ఈ దేశమున కాలసూచనగా నున్నట్లే పలెస్తీనులోను ఈ భూకంపము కాలసూచనగా నుండెను. ఆమోసు ఆ భూకంపమును తన ప్రవచన కాలమును గుర్తించుటకు వ్రాసెనేగాని దానిని వివరించుటకు కాదు. ఆ భూకంపము వలన కలిగిన నాశనము చాల భయంకరమైనదని కొన్నివందల సంవత్సరములకుఁ దరువాత ప్రవచించిన జెకర్యా యను వాఁడు దీనినిగూర్చి వ్రాసినదానినిబట్టి తెలియును (జెక $14^{5}$). ఉజ్జియారాజు యాజకులకు మాత్రమే ప్రవేశింపనలవియైన దేవాలయ భాగములోకి వెళ్లి దానినపవిత్రపఱచినందుకు శిక్షగా నిది సంభవించెనని యోసీఫసు వ్రాయుచున్నాఁడు (పురా 9. 10. 4. II దిన $26^{16}$ తో సరిపోల్చుము). బైబిలునందద్భుత రీతిగా జరిగిన ఆయా భూకంపములకు సూచనలు గలవు. యోనాతాను ఫిలిష్తీయులను జయింపగా అట్టి కంపము కలిగినట్లున్నది గాని అది ఫిలిష్తీయులకు కలిగిన భయమునకు దృష్టాంతము కావచ్చును (I సమూ $14^{15}$). క్రీస్తు చనిపోయిన సమయమున భూకంపము కలుగఁగా చీఁకటి క్రమ్మి బండలు బ్రద్దలయ్యెను (మ $27^{51-54}$). ఆయన మృతులలోనుండి లేచినప్పుడును అట్టి కంపము కలిగెను ($28^{2}$). ఫిలిప్పీయులో పౌలు సీలలు చెఱసాలయందుండఁగా వారి విడుదలనిమిత్తము భూకంపమొకటి కలిగెను (కార్య $16^{26}$).

దేవుని మహాత్త్వమును సూచించుటకు ఆయన వచ్చునప్పుడు భూమివణకును అని అలంకార రీతిగా చెప్పఁబడెను (నిర్గ $19^{18}$ న్యాయా $5^{4,5}$ I రాజు $19^{11}$ కీర్త $18^{7}$ $68^{8}$). ఇట్లే ఆయన తీర్పు తీర్చుటకై వచ్చునప్పుడు కలుగు విపత్తులలో భూకంపమొకటిగా నున్నది (మ $24^{8}$ ప్రక $8^{5}$ మొ॥).

**భూతము** (Spirit, Ghost). అశరీరులైన ఆత్మలు లేక దయ్యములు అచ్చటచ్చట తిరుగుచున్నవనియు, అప్పుడప్పుడు నరులకగపడి భయమును పుట్టించుచున్నవనియు సకల జనులు తమ చరిత్రయందలి యేదోయొక సమయమున అభిప్రాయపడి యుండిరి. క్రీస్తు కాలమున యూదులలో నిట్టి యభిప్రాయము ప్రబలముగా నుండెనని అక్కాలమున వ్రాయఁబడిన వ్రాఁతలు విస్తారముగా సాక్ష్యమిచ్చుచున్నవి. అట్టి భయము కలుగఁజేయు నసెడి యభిప్రాయము అపొస్తలులలో కూడ నుండెననుటకు రుజువు కలదు (మ $14^{26}$ మా $6^{49}$). క్రీస్తుతోడి మూఁడు సంవత్సరముల సహవాసము కూడ పసితనమునుండి వారిలో పాదుకొనిన ఈ మూఢత్వమును సంపూర్ణముగా తొలగింపలేకపోయెను. అట్టి యభిప్రాయమును ఖండితముగా గద్దింపక పోవుటవలనను వారి మనస్సులలోని పొరపాటును కనపఱచుటలో ఆయన పడిన ప్రయాసవలనను ప్రభుని దీర్ఘ

శాంతమును ఓర్పును కనఁబడుచున్నవి. మ $14^{26}$ మా $6^{49}$ లోని మూలపదమునకు కనఁబడునది యని యర్థము. నిజమైన స్వరూపముగాక మాయా స్వరూపమును ధరించుకొనుట దీని భావముగాఁ దోఁచుచున్నది. అది మనము భూతములని యెంచు దానిపేరైయున్నది లూ $24^{37,39}$ లో భూతమని తెనిఁగించిన మాట పైమాట గాక ఆత్మయని యర్థ మిచ్చును. B.

**భూతములు (Elements).** II పేతు $3^{10-12}$ లో పంక్తి యని శబ్దార్థ మిచ్చు గ్రీకు పదమును భూతములని తెనిఁగించిరి. ఈ పద మునే వేఱు సంబంధములలో మూల పాఠములనిరి (గల $4^{3-9}$ కొలొ $2^{8,9,20}$ మూల పాఠములు చూ॥) II పేతు $3^{10-12}$ లోని పదము ఈ ప్రపంచము నిర్మింపఁబడిన మూల పదార్థములను సూచించును కాఁబట్టి ఆ వాక్యములో మనము సాధారణ ముగా పంచభూతములని చెప్పువాటికి సంబం ధించి యున్నదనవచ్చును. లోకాంతమున అవి గొప్ప వేడిమిచే కఱగి లయమైపోవునని తెలియుచున్నది.

**భూపతులు** రాజు చూ॥

**భూమి, నేల, మన్ను (Earth).** పాత నిబంధనలో భూమిని సూచించెడి యీ దిగువ పదములు గలవు.

1. ఒకటి ఆకాశమునుండి ప్రత్యేకింపఁబడి భూమిని సూచించును. ఇది బైబిలునందు సర్వ సాధారణమైనదై **భూమి**యని తెనిఁగింపఁబడెను (ఆది $1^{1,2,10,11}$ $2^{1,4}$ మొ॥). దానిని భూలోకము ($6^{11,12}$), దేశము (యెష $1^{7}$ $7^{18}$ $9^{1}$ $11^{16}$ మొ॥) అనియు తెనిఁగించిరి.

2. సేద్యము చేయఁదగిన నేలను సూచించు మఱియొక పదమును అనేకమాఱు లుపయోగించిరి. దానిని సాధారణముగా **నేల** యని తెనిఁగించి నను (ఆది $1^{25}$ $2^{5}$ $6^{20}$ మొ॥), భూమి ($5^{29}$ $6^{1,7}$ $7^{4}$ $8^{21}$ మొ॥), దేశము (నిర్గ $20^{2}$ ద్వితీ $4^{1}$), మన్ను (నిర్గ $20^{24}$ II రాజు $5^{17}$ మొ॥), ధూళి (II సమూ $15^{32}$) యనియు తర్జుమాచేసిరి.

3. **మూఁడవ** పదము భూమిని సూచించుచు **దానితోనే** సాధారణముగా తెనిఁగింపఁబడినను మన్ను (ఆది $2^{7}$ $3^{14,19}$ $13^{16}$ కీర్త $103^{14}$ మొ॥), భూమి (యోబు $41^{33}$), నేల (యోబు $30^{6}$ యెష $2^{19}$) అని తర్జుమాచేసిరి.

4. నాలుగవ పదము మానవులున్న ఈ లోక మును సూచించును సాధారణముగా లోకము అను మాటచే తెనిగింపఁబడెను (I సమూ $2^{8}$ కీర్త $9^{8}$ $24^{1}$ $33^{8}$ $50^{12}$ మొ॥). కొన్ని వాక్య ములలో దీనిని భూమియనియు (II సమూ $22^{16}$= కీర్త $18^{15}$ యోబు $34^{13}$), భూగోళమనియు ($37^{12}$) తర్జుమాచేసిరి.

**క్రొత్త** నిబంధనయందు ఒక్కటే పదము భూమియంతటిని (మ $5^{18,34}$ $6^{10}$ $16^{19}$ మొ॥), సేద్యము చేయఁదగిన నేలను (మ $13^{5,8,23}$ మా $4^{1,8}$ మొ॥), మానవులు నివసించెడి ఈ లోకమును (లూ $21^{35}$ అపొ $1^{8}$ $10^{12}$ మొ॥), దేశమును (లూ $4^{25}$ $21^{23}$ రోమా $9^{27}$ యాకో $5^{17}$) సూచిం చును. ఇది ఆకాశమునకు వేఱుగానుండుటచే అలంకారికీలిగా ఆకాశమునకు భిన్నముగా నున్న సౌఖ్యములను నడతనుకూడ సూచించెడి పదమై యున్నది (ఫిలి $3^{19}$ కొలొ $3^{2}$). I కొరి $15^{47-49}$ లో నున్న భూసంబంధమైన మన్ను అను పదము మఱియొకటియు మంటిని సూచించుచు పరలోకమునకు భిన్నముగా నున్నదానిని తెలుపును.

మన్ను ధూళియను పదములు మానవుల బల హీనతలనుకూడ సూచించును (కీర్త $103^{14}$ ఆది $18^{27}$). మన్ను నెత్తిమీఁద పోసికొనుట దుఃఖ మున కొకగుఱుతు (II సమూ $13^{19}$). ఒకఁడు నేలమట్టుపు అణఁచఁబడుట పూర్ణనాశమునకు సూచన (యెష $25^{12}$). అట్లే మన్ను నాకుట గొప్ప అపజయమును దెలుపును.

ఈ పదము నుపయోగించిన విధమును చూచిన యెడల ఆ మాటలు ఇప్పటివలెనే భూమి యను మాటకు వెవ్వేఱు అర్థములిచ్చునని స్పష్టమగు చున్నది (భూమ్యాకాశములు చూ॥).

**భూమ్యాకాశములు (The Heaven and the Earth).** బైబిలు కాలములలో నీ సమాసము సృష్టింపఁబడిన దానినంతటిని సూచిం చెను (ఆది $1^{1}$ $2^{1,4}$). ఇది యావత్తును దేవునిదే (కీర్త $89^{11}$). ఈ సమస్తమును దేవుని స్తోత్రింప

వలసియున్నది (I దిన 16[31] కీర్త 96[11] యెష 49[13]). సృష్టియాపత్తు నిత్యమైనదిగాక తీర్పుదినమున కదలింపఁబడి (యోవే 3[16] హగ్గ 2[6,21]), నాశనమగును (II పేతు 3[7]), గాని తరువాత నీతితో కూడిన నూతన సృష్టికలుగును. అది నూతన ఆకాశమనియు నూతన భూమియనియు పిలువఁబడును (యెష 65[17] [22] II పేతు 3[13] ఆకాశము, భూమి చూ॥).

## భే

**భేదములు, మతభేదములు (Divisions, Heresies).** భేదమనుపదముచే తెనిఁగించిన మాటలు క్రొత్త నిబంధనయందు అయిదు గలవు.

1. లూ 12[51] యందున్న భేదమనుమాటకు వేఱుపడుటయని యర్థము. క్రీస్తు నంగీకరించి ఒప్పుకొనుటవలన ఒక్క కుటుంబములోని వారలే యైనను వారిలోను భేదములు పుట్టి వేఱగుదురు.

2. భేదములు కలిగించు బోధలనుగూర్చి జాగ్రత చెప్పుటలో రోమా 16[17] నందు పౌలు వాడినపదము మఱియొకటియై యున్నది. అది వేఱుపడుటనుమాత్రమేగాక, కలహపడుటను గూడ సూచించును. గల 5[21] నందున్న శరీర కార్యములలో నున్న భేదములను పదమిదే.

3. రోమా 2[8] లో నున్నట్లు భేదములు పుట్టించువారు అని తెనిఁగించినపదము పైనున్న మాటలను సంబంధించక కక్షలను కలిగించు వారిని సూచించును. II కొరి 12[20] గల 5[20] ఫిలి 1[16] 2[3] నందాపదమును కక్షలు అని తెనిఁగించిరిగాని యాకో 3[14,16] నందు వివాదములని తర్జుమాచేసిరి.

4. యోహా 7[43] 9[16] 10[19] లో భేదములని తెనిఁగింపఁబడిన మఱియొక పదమునకు చింపుట యని యర్థము. ఈ పదము వస్త్రముల విషయము మాత్రమేగాక మానవులలో నేర్పడు పార్టీలను గూర్చియు వాడఁబడెను. మ 9[16] మా 2[21] నందీపదమును చిరుగు అనుపదముచే తర్జుమా చేసిరి. ఆ పద బహువచనమును I కొరి 1[10] 11[18] నందు కక్షలని తెనిఁగించిరి. ఈ సిజమ్ (*Schism*) అను మూలపదము నిప్పటికి సంఘము నందేర్పడు భేదములను సూచించుటకు వాడుచున్నారు.

కార్య 24[5,15] నందు మతభేదమని తెనిఁగింపఁబడిన పదము 5[17] నందు సద్దూకయ్యుల తెగను 15[5] 26[5] లో పరిసయ్యుల తెగను సూచించును. గల 5[20] లో దీనిని విమతములు అని తెనిఁగించి శరీరకార్యములలోఁ జేర్చిరి. I కొరి 11[19] II పేతు 2[1] లో నున్న భిన్నాభిప్రాయములను పదమును ఇదే మూలపదముయొక్క తర్జుమాయై అట్టి మతభేదములను తెలుపును. హెరెసీస్ (*Heresies*) అను నీపదము నేటివఱకును సంఘము నందు వాడుకయందుండి విభేదములను కలిగించు తప్పుబోధలను సూచించును.

## భో

**భోగేచ్ఛ** దురాశ చూ॥

**భోజనపదార్థములు** ఆహారము చూ॥

**భోజనము (Meals).** తినుబండారములను గూర్చి ఆహారము అను శీర్షికను చూడనగును. ఈ శీర్షికలో భోజనకాలము రీతులనుగూర్చి ప్రశంసింపఁబడును.

1. భోజనవేళ. బైబిలుకాలమున జీవించిన వారు ప్రస్తుతి మీ దేశమందున్న వారివలెనే భోజనముచేసినట్లు కనఁబడును. ఉదయమున కొద్ది చల్దిపుచ్చుకొనినను పూట కొకసారి వంతున రెండుసారులు మాత్రము భుజంచిరి. పాతనిబంధనయందీ రెండు భోజనములకు ప్రత్యేకమగు పేరులు లేకున్నను క్రొత్త నిబంధనయందున్నట్టు చూడవచ్చును. ఉదయపు భోజనమును సూచించెడి పదము లూ 11[38] 14[12] మ 22[4] యోహా 21[12,15] లోను, మాపటి భోజనమును సూచించు మాట మ 23[6] మా 12[39] లూ 14[12,17,24] 20[46] యోహా 13[2,4] 21[20] I కొరి 11[20,21] ప్రక 19[9,17,18] నందు గలవు. మొదటి భోజనమును మధ్యాహ్నమునకు కొంచెము ముందుగాను (రూతు 2[14]), మాపటి భోజనమును సాయంకాలమున పనియంతయు ముగిసిన తరువాతను చేసిరి (ఆది 19[2,3] న్యాయా 19[16-21] లూ 14[16-24] యోహా 12[2]). ఈ రెండవదే ముఖ్యభోజనమై యున్నది. విందులు చేసినప్పుడు సాధారణముగా ఈ సమయమున పిలిచిరిగాని అప్పుడప్పుడు ఉదయపు భోజన

సమయమునను చేసిన సూచనలున్నవి (ఆది 43[16,25] లూకా 11[37,38] 14[12]).

2. భోజనపు టలవాటులు. పాత నిబంధన కాలమున భోజనముచేయునప్పుడు నేలమీఁదగాని పీటలమీఁదగాని కూర్చుండిరి (ఆది 27[19] I రాజు 13[20] I సమూ 20[25] మొ॥) గాని, ప్రవక్త లెంతగా ఖండించినను స్థితిమంతులైన వారు పాన్పులమీఁద ఆనుకొని కాళ్లు పారఁజాపి భోజనము చేయుటయు వాడుకగా నుండెను (ఆమో 3[12] 6[4] యెహె 23[41]). క్రొత్త నిబంధనకాలమున నిది సర్వసాధారణమాయెను. భోజనమునకు కూర్చుండిరి యనుపదము తెలుఁగు బైబిలునందుండినను (లూ 7[36] 9[14] 14[8] 24[30] మొ ), దాని మూలభాషాపదమునకు పరుండుట యని యర్థమగును. ఈ దేశమున నున్నట్లు పెద్దలకు అగ్రస్థానమిచ్చి మర్యాదజేసిరి (మ 23[6]). స్త్రీలు సాధారణముగా వడ్డించిరి (లూ 10[40] యోహా 12[2]). స్త్రీలు పురుషులతోఁ గలిసి భోజనము చేయుట వాడుకయై యుండినట్లు కొన్ని సూచనలు గలవు (ద్వితీ 16[14] I సమూ 1[4] యోబు 1[4]). వారు పాత్రలను ఎక్కువగా వాడలేదు. చారును ఒకటే పాత్రలోనుంచి దానిలో రొట్టెను ముంచుచువచ్చిరి (మ 26[23] యోహా 13[26]). నేటివఱకు పలెస్తీనులో నున్న వారి కిట్టివాడుక గలదు.

3. విందులు. విశేష సమయములలో వారిప్పటివలెనే విందులుచేసి బంధుమిత్రాదులను బిలుచుకొనిరి. అతిథులు వచ్చినప్పుడును (ఆది 19[3] న్యాయా 13[15]), జన్మదినోత్సవములప్పుడును (ఆది 40[20] యోబు 1[4] మ 14[6]), వివాహ సమయములలోను (ఆది 29[22] ఎస్తే 2[18] మ 22[2]), చనిపోయినవారి బంధువుల నాదరించి అంగలార్పనై వచ్చినప్పుడును (యిర్మీ 16[7]), ఇల్లుగట్ట నారంభించినప్పుడును (సామె 9[1-5]), కోఁతకాలమప్పుడును (న్యాయా 9[27] I సమూ 25[2,39]), పండుగలప్పుడును (ద్వితీ 12[7] 14[23,26,29] 15[20] మొ॥) విందులు చేయుట వాడుకయయ్యెను. విందుకు రమ్మని ముందుగాఁ బిలుచుటయేగాక ఈ దేశమందున్నట్లు విందు సిద్ధముగా నున్నప్పుడు రెండవ మాఱు కబురంపుటయు వాడుకగా నుండెను (ఎస్తే 6[14] లూ 14[17] మ 22[2-14]). విందుకు పిలిచినవాఁడు అతిథులను ముద్దుపెట్టుకొని వారిని చేర్చుకొనుట మర్యాద (లూ 7[45]). వారి పాదములను కడుగుటకు నీళ్లుపోయుట అలవాటు (ఆది 18[4] న్యాయా 19[21] లూ 7[44]). వారి తలనంటుట మఱింత గొప్పమర్యాదగా నుండెను (కీర్త 23[5] ఆమో 6[6] లూ 7[46]). ఈ మర్యాదలను చూపిన పిమ్మట విందుకువచ్చినవారి స్థితిగతులనుబట్టి వారిని పంక్తిని కూర్చుండఁబెట్టిరి (I సమూ 9[22] లూ 14[8]). తరువాత దేవుని దీవెన నడిగిరి (I సమూ 9[23] మ 15[36] లూ 22[17] మొ॥). ఘనుఁడైన అతిథికి భోజనములో శ్రేష్ఠభాగమును పెట్టిరి (ఆది 43[34] I సమూ 9[23,24]). విందుకు రాలేనివారి భాగమును వారికి సంపుటయు వాడుకయైనట్లు సూచనలు గలవు (II సమూ 11[9] నెహె 8[10] ఎస్తే 9[19,22]). భోజనము చేయుచుండువారి విలాసార్థమై సంగీత వాయిద్యములను వాయించిరి (II సమూ 19[35] యెష 5[12] ఆమో 6[5] మ 14[6] లూ 15[25]). ఇతరమైన తమాషాలను జరిపియుందురు. సమ్సోను చేసిన విస్తృతమైన భోజనము సమయమున వేయఁబడినదే (న్యాయా 14[12]). ఒకానొకప్పుడు పనివారిని క్రమముగా జరుపు నిమిత్తము విందు ప్రధానిని నియమించిరి (యోహా 2[9]). గొప్ప విందులు కొన్ని దినములవఱకు జరిగెను (న్యాయా 14[12] ఎస్తే 1[3,4]). ఇట్టి సమయములందు కనఁబడిన అమితత్వమును ప్రవక్తలు గట్టిగా ఖండించుచు వచ్చిరి (ప్రస 10[16,17] యెష 5[11,12] ఆమో 6[1-6]). ఈ వాడుకలన్నిటినిబట్టి అవి ఈ దేశపువాడుకలను చాల సంబంధించియున్నట్లు విశదమగును.

# భ్ర

## భ్రష్టుడు, భ్రష్టమైన (Reprobate).

1. ఈ పదము I కొరి 9[27] II కొరి 13[5-7] రోమా 1[28] II తిమో 3[8] తీతు 1[16] లో నున్నది. గ్రీకు భాషయందిది ఒకటే పదమై యోగ్యము కాని దానిని సూచించును. ఈ పదముయొక్క వ్యతిరేక రూపము రోమా 16[10] లో అపెల్లె యనువాని బిరుదుగా నుపయోగించి యోగ్యుఁడని తెలిసిగించిరి. అయోగ్యమైనందున త్రోసివేయ

వలసిన దానిని పై వాక్యములలో భ్రష్టమైన అను పదము సూచించును. అట్లే భ్రష్టుఁడు అను పదమును అయోగ్యుఁడైనందున త్రోసి వేయ వలసిన వానిని సూచించును. హెబ్రీ 6[8] నందు శాపము నొందదగినది యని తెనిఁగింపఁబడిన పదమును ఇదే. వెండిలోని మష్టు అనుమాటచే సామె 25[4] యెష 1[22] నందు తెనిఁగించిన హెబ్రీ పదమును LXX లో ఈ గ్రీకుపదముతో తర్జుమా చేసిరి.

2. హెబ్రీ 12[16] లో భ్రష్టుఁడని తెనిఁగించిన మాట శుద్ధికి వ్యతిరేకమగు అపవిత్రతను సూచించును. ఈ పదముయొక్క బహు వచన రూపమును I తిమో 1[9] లో అపవిత్రులని తెనిఁగించిరి. 4[7] 6[20] II తిమో 2[16] లో అపవిత్రము అని తర్జుమాచేసిన మూలపదమునిదే. LXX నందున ఇదే గ్రీకుపదమును వాడి దానిని లేవీ 10[10] లో అపవిత్రమనియు, I సమూ 21[4] లో సాధారణమైనదనియు తర్జుమాచేసిరి.

3. యిర్మీ 3[14,22] నందు భ్రష్టులు అని తెనిఁగించిన అసలు పదము తిరుగఁ బడువారు అని శబ్దార్థమగును. ఆ పదమునే 49[4] లో విశ్వాస ఘాతుకురాలు అని తెనిఁగించిరి.

## మ

**మంగలికత్తి (Razor).** పాతనిబంధనలోని రెండు పదములను మంగలికత్తియని తెనిఁగించిరి. మొదటిది సంఖ్యా 6[5] 8[7] యెష 7[20] యెహె 5[1] లో నున్నది. ఇతరచోట్ల దానిని ఖడ్గముయొక్క పదయని తెనిఁగించిరి (I సమూ 17[51] II సమూ 20[8] యెహె 21[3] మొ॥). రెండవది మంగలికత్తికి మాత్రముపయోగింపఁ బడినది న్యాయా 13[5] 16[17] లో నున్నది. ఆ పదమునే I సమూ 1[11] నందు క్షౌరపు కత్తియని తర్జుమాచేసిరి. నాజీరు వ్రత ధారులు (సంఖ్యా 6[5] న్యాయా 13[5] 16[17] I సమూ 1[11]) క్షౌరము చేయించుకొన రాదనియు, లేవీయులను పవిత్రపఱచునపై వారికి క్షౌరముచేయ వలెననియు (సంఖ్యా 8[7]) చెప్పఁబడిన సందర్భములలో మంగలకత్తి పేర్కొనఁబడెను. అష్షూరు దేశపు రాజు పలెస్తీనును నాశము చేయునని సూచించుట కతఁడు దేవుని చేతిలోని మంగల కత్తికి పోల్చఁబడెను (యెష 7[20]). మంగలకత్తితో క్షౌరము చేయఁబడిన వెండ్రుకలు నాశనమున కప్పగింపఁబడునని యెహె 5[1] లో నొక దృష్టాంత మున్నది.

**మంగలకత్తి పిట్ట** పక్షులు 35 చూ॥



హెబ్రీయులు మంచముమీద కూర్చుండి చేతులు కడుగుట

**మంచము (Couch).** ఈ పదము బైబిలు నందు బహు కొన్నిసార్లు మాత్రమే యుదాహరింపఁబడినను (ఆది 49[4] ఆమో 6[4] కార్య 5[15]) సిరియా పలెస్తీను ఐగుప్తు దేశములయందలి గొప్ప వారు తఱచుగా కోళ్ల మంచముల నుపయోగించి రనుటకు సందియములేదు. స్థితిగలవారి యిండ్లలో

నిద్రించుటకు ప్రత్యేకమైన పడక గదులుండెను (నిర్గ $8^{3}$ II సమూ $4^{7}$ II రాజు $11^{2}$). బాషాను రాజైన ఓగుయొక్క యినుప మంచము (ద్వితీ $3^{11}$) గట్టి రాతితో చేయబడిన చావు పెట్టెవంటిదై యుండును. అతడేలిన దేశమునందట్టివి యనేకములు గలవు.

**మంచి రేవులు** (Fair Havens). క్రేతు ద్వీపపు దక్షిణతీరమున లసైయ దగ్గరనున్న యొక రేవు. పౌలు ఖైదీగా రోమాకు వెళ్లిన ప్రయాణములో అతని యోడ ఇచ్చటనే కొంత కాలమాగెను (కార్య $27^{8}$). ఆ రేవు నేటివరకు ఆ పేరుతోనే యున్నది (పటము V, G 5).

**మంచు** (Dew). పలెస్తీనులో మంచు విశేషముగా కురియును. ఆ దేశపు శీతోష్ణస్థితి అట్టిదై యున్నది. దానివలన పైరులు చాలమట్టుకు పండును. అది కురియకపోవుట గొప్ప కరవుకు సూచన (I రాజు $17^{1}$). సౌలు గిల్బోవ కొండ దగ్గర కూలగా దావీదు దానిమీద మంచు పడకుండవలెనని శపించెను (II సమూ $1^{21}$). ఆ రీతిగానే చెఱకాలమైనపిమ్మట యూదులాలయమును కట్టకపోవుటవలన శిక్షగా మంచు కురియుటలేదని హగ్గయి వారిని గద్దించెను (హగ్గ $1^{10}$). మంచు ఏర్పడుట దేవునియొక్క గొప్ప శక్తికిని (యోబు $38^{38}$), ఆయన గొప్పజ్ఞానమునకును (సామె $3^{20}$) సూచనగా నెంచబడెను. బైబిలునందు మంచు ఫలవంతమగు స్థితికిని (ఆది $27^{28}$ ద్వితీ $33^{13}$), దేవుని యాశీర్వాదరసమునకును ($32^{2}$ యెష $18^{4}$), కనిపెట్టకుండ అకస్మాత్తుగా వచ్చుదానికిని (II సమూ $17^{12}$), అస్థిరముగానుండి త్వరగా గతించిపోవుదానికిని (హోషే $13^{3}$), మెస్సీయా కాలములో ఆయన యొద్దకువచ్చు జనబాహుళ్యమునకును (కీర్త $110^{3}$) సూచనగానున్నది.

**మంటు** రోగములు చికిత్సలు II 10 (3) చూ॥

**మంటపము** (Porch). ఈ మాట సాధారణముగా దేవాలయమునుగూర్చిన చరిత్రలో కనబడును (II దిన $8^{12}$ $15^{8}$ యెహె $40^{48,49}$ కార్య $3^{11}$ $5^{12}$ మొ॥). ఇట్లు మందిరపు మంటపము (I రాజు $7^{12}$) పరిశుద్ధస్థలపు మంటపము ($7^{21}$) అను విశేష పేరులు కలవు. సొలొమోను నగరమునకు సంబంధముగాకూడ ఈ మాట కనబడును ($7^{6}$). దావీదు మంటపము (I దిన $28^{11}$), అధికారిమంటపము (I రాజు $7^{7}$) అను విశేషపేరులు అట్టి మంటపములకు గలవు. బేతెస్దకోనేటికి కూడ మంటపము లుండెను (యోహా $5^{2}$).

**మందుమున్న పొద** పొద చూ॥

**మంత్రము, మంత్రవిద్య** (Magic, Divination, Sorcery, Enchantment). మంత్రమును అను తెలుగుమాట సోదె చెప్పుట, సోదె చెప్పువరము, చిల్లంగితనము, గొణుగువాడు, గారడివిద్యచేయువాడు, మాంత్రికుడు, మంత్రకత్తె, జాతకము చెప్పువాడు, ఇంద్రజాలకుడు అని యర్థమిచ్చు వివిధములగు హెబ్రీ పదము లన్నిటికి బదులుగా తర్జుమ చేయబడిన- (నిర్గ $7^{11,22}$ $8^{7}$ సంఖ్యా $23^{23}$ II దిన $33^{6}$ ప్రస $10^{11}$ యెష $57^{3}$ $2^{6}$ యిర్మీ $27^{9}$ $29^{8}$ దాని $2^{2}$ మీకా $5^{12}$). గ్రీకు భాషలోనిది మందులు కలిపి విషము పెట్టువాడు, గారడివాడు, మాంత్రికుడు అని యర్థమిచ్చు ఒక మాటను తెలుగుటకు కూడ నుపయోగింపబడెను (ప్రక $21^{8}$ $22^{15}$).

ఈ మాటయును, దీనికి సంబంధించిన యితర భాగములలో కనబడు మాటలును గారడి సోదె చెప్పుట అను నర్థములను చూపించుటకు ఉపయోగించిన మాటలలోనివై యున్నవి. వాటన్నిటిలో నిది విస్తారముగా వాడబడినందున దీని యొక్క సరియైన యర్థమును తెలిసికొనుట కష్టము. కొన్ని మంత్రపుమాటలనుగాని మాటల సముదాయమునుగాని వల్లించి, ఆ శక్తివలన అమానుషములగు ఫలితములు కలుగజేసి కొనుసట్లును తెలుగునందర్థమగుచున్నది. అమానుష శక్తులు కలవనుకొనుటవలన ఎవనియందు శక్తులన్నియు ఆధారమై యున్నవో ఆ యేక దేవుని విడిచి అబద్ధారాధనతో సంబంధపడుటవలన లేఖనములు ప్రతిచోటను అట్టివాటికి విరోధముగా ఘోషించుచున్నవి. ఇది యొకడు దుష్టశక్తులతో కలిసికొని ఈ లోకాధిపతియైన సాతానుకు రాజభక్తి కనబఱచుటయై యున్నది (కర్ణ పిశాచము, గారడీ, గొణుగువాడు, చిల్లంగితనము, శకునము, సోదె, యక్షిణిగాండ్లు చూ॥).

B.

**మంత్రసాని** రోగములు చికిత్సలు IV 2 (2) చూ॥

**మంత్రి** (Chancellor, Scribe). రాజు దగ్గరనుండు ముఖ్య ఆలోచన కర్త. పాత నిబంధనలోని రెండు పదముల నీ మాటచే తెనిగించిరి.

1. పారసీ చక్రవర్తియొద్ద ఎజ్రా కాలములో నున్న యొక ఉద్యోగస్థుని బిరుదు నీ మాటచే తర్జుమా చేసిరి (ఎజ్రా $4^{8,9,17}$). అది మూల భాషలో రాజాజ్ఞలను చూచువాఁడని శబ్దార్థమగును కావున అదే దానికి సరియైన తర్జుమాయై యున్నది.

2. రెండవ పదము లేఖికుఁడను యర్థమగును. దానిని లేఖికుఁడనియు (II రాజు $25^{19}$ II దిన $34^{13}$ యిర్మీ $36^{10,20}$ ఎజ్రా $4^{8,9,17,23}$), శాస్త్రి యనియు ($7^{6,12}$ నెహె $8^{1,4,9,13}$ $12^{25}$ $13^{13}$ యిర్మీ $36^{26,32}$ $37^{15,20}$), వ్రాతగాండ్రు అనియు (ఎస్తే $3^{12}$ $8^{9}$) తెనిఁగించిరి. రాజుల గ్రంథములలో (II సమూ $8^{17}$ $20^{24}$ I రాజు $4^{3}$ II రాజు $12^{10}$ $18^{18,37}$ $19^{2}$ $22^{3,8}$ I దిన $18^{16}$ $24^{6}$ $27^{32}$ II దిన $24^{11}$ $26^{11}$ $34^{15,18,20}$) ప్రధాన మంత్రి యని తెనిఁగించిరి. ఇది సరియైన తర్జుమా యనుటను గూర్చి కొంచెము సందేహము కలదు. ఇది లేఖికుని పనికి సమమైనటువంటి సెక్రటేరి యనుట మంచిది:

**మంద** గొఱ్ఱెలకాపరి 2, 3, 4 చూ॥

**మందవృష్టి** రోగములు చికిత్సలు II 1 (3) చూ॥

**మందలగోపురము** మిగ్దల్ ఏదెరు చూ॥

**మందసము** (Ark = పెట్టె). దీని వివరము నిర్గ $25^{10-22}$ నందున్నది. ఇది తుమ్మకఱ్ఱతోఁ జేయఁబడెను. అది 2½ × 2½ × 1½ మూరలు కొలతలు గలిగియుండెను. అదియంతయు బంగారముతో పొదగఁబడెను. దానిచుట్టును చక్కని అంచుకట్టి యలంకరించిరి. దాని నొకస్థలమునకు మోసికొని పోవుటకై తగిన యుంగరములును, మోఁత కఱ్ఱలు నుండెను. దానిమీఁద కరుణాపీఠము నుంచఁబడెను. ఆ కరుణాపీఠము మీఁద రెండు కెరూబులు ముఖాముఖిగా నుండెను. దీనియందు ఆజ్ఞలు వ్రాయఁబడిన రెండు రాతి పలక లుండుటచే నిబంధన మందసమనియు (ద్వితీ $10^{8}$), శాసనములు గల మందసమనియు (నిర్గ $25^{22}$), పేరులు గలవు. ఇశ్రాయేలీయు లరణ్యమందు ప్రయాణము చేయుచుండఁగా దానిని వారికి ముందుగా మోసికొని వెళ్లిరి (సంఖ్యా $10^{33}$). యొర్దానును వారు దాటు నప్పుడు దానిని ముందుగాఁ గొనిపోయిరి. తక్కిన వారు నదిని దాటి వెళ్లుచుండఁగా మందసమును మోయు యాజకులు నదిలోనే నిలిచిరి (యెహో 3). యెరికోను పట్టుకొనునప్పుడు అది సైన్యమునకు ముందర కొనిపోఁబడెను. యెహోషువ మొదటిదానిని గిల్గాలులోను ($5^{10}$), పిమ్మట షిలోహులో ($18^{1}$) నుంచెను. సమూయేలు కాలము వరకు నది అచ్చటనే యుండెను (I సమూ $1^{3}$). అది తమతో నున్న పక్షమున శత్రువులను గెలువఁగల మనుకొని ఏలీ కాలమునందు ఇశ్రాయేలీయులు దానిని యుద్ధరంగమునకుఁ గొనిపోయినందున ఫిలిష్తీయులు పట్టుకొని దానిని తమ దేశములోకి తీసికొనిపోయిరి. దానిని తీసికొనిపోయిన పట్టణములలోని జనులు మిగుల బాధల పాలయినందున వారు దానిని తిరిగి ఇశ్రాయేలీయుల యొద్దకుఁ బంపిరి ($4^{1}$-$7^{1}$). దావీదు దానిని యెరూషలేమునకుఁ దెచ్చెను (II సమూ 6). సొలొమోను ఆలయమును గట్టించి అందులో దీని నుంచెను (I రాజు $8^{4-11}$). తరువాత దాని చరిత్ర యేమియు తెలియదు. యిర్మీ $3^{16}$ నందు దానిని గూర్చిన సూచన యొకటి ఉండుటచేత, అది అతని కాలములోకూడ ఉండెనని తెలిసికొన వచ్చును. రెండవ ఆలయమును గూర్చిన చరిత్రలో దాని గూర్చిన సూచనలేమియు లేకుండుటచే అది యంతకుమునుపే శత్రువులచేఁ జిక్కినట్లు ఊహింపఁదగును. అట్లుగాని పక్షమున నెబుకద్నెజరు దేవాలయమును దోచుకొనునప్పుడు దీనినికూడ దోచుకొనియుండును (II రాజు $25^{8-17}$). అది ఉన్నంత వరకు, దానియందు ఆజ్ఞలున్న రాతిపలకలును (నిర్గ $25^{16}$ $40^{20}$), చిగిర్చిన అహరోను కఱ్ఱయును (సంఖ్యా $17^{10}$), మన్నాపాత్రయు (నిర్గ $16^{32,34}$) నుంచఁబడెను (హెబ్రీ $9^{4}$). వీటివలనను, కెరూబులు వీనిని కప్పుటవలనను ఇది దేవుని విశేష ప్రత్యక్షత కొక

సూచన యని తెలిసికొనవలెను. అందువలననే పాపులైనవారు తగిన ప్రాయశ్చిత్తము లేకుండ దానిని సమీపింపకూడదను నియమమున్నది (లేవీ 16) మఱియొక రీతిగా దానిని సమీపించువారికి శిక్ష కలిగెను (II సమూ $6^{3-8}$). దాని మీఁద కరుణాపీఠము గలదు (నిర్గ $25^{17-20}$ చూ॥). అది యీ పెట్టెను కప్పిన ఒక శ్రేష్ఠమైన పలక. దీని ఎదుటనే ప్రాయశ్చిత్తార్థముగా రక్తమును ప్రోక్షించిరి (లేవీ $16^{14}$). అదియు దేవుని ప్రత్యక్షత కొక విశేష గుఱుతు (సంఖ్యా $7^{90}$). ప్రాయశ్చిత్తము చేయుటయం దిదియొక సాధన మగుటచే నీ మందసము దేవుని యాజ్ఞలను మాత్రమే గాక ఆ యాజ్ఞలను మీఱు వారికి దేవుఁడు చూపించు దయకుకూడ సూచనగా నుండెను. (గుడారము 6 (3), దేవాలయము I 7 (3) చూ॥).

**మందిరము** గుడారము 2, దేవాలయము చూ॥

**మందిరములో సంబంధించిన కోట గుమ్మము** యెరూషలేము B V 2 (2) చూ॥

**మంమ** రోగములు చికిత్సలు IV 1 చూ॥

**మకరము** (Leviathan, Crocodile). ఇది రెండు హెబ్రీ పదములకు తర్జుమా.

1. యోబు $41^1$ కీర్త $74^{14}$ $104^{26}$ యెష $27^1$ నందు ఒక పదము గలదు. యోబు $3^8$ నందున్న ఆ పదమునే భుజంగమని తెనిఁగించిరి. ఈ భుజంగము రాహువని కొందఱనుకొందురు.



మొసలి

సూర్యుని మ్రింగుటవలన తన జన్మదినము లేక పోవునట్లు చేయుమని యోబు మనవిచేసినట్లు అనుటఁ జూడఁగలము. కావ్యములయం దిట్టి కల్పిత సంగతులను ప్రయోగపఱచుట క్రొత్త గాదు. $41^1$ లో నున్న పదము మకరమునే సూచించుచున్న దనుటకు సందేహములేదు. అది ఈ పదమునకు సాధారణమగు తర్జుమాయై యున్నది.

2. కీర్త $148^7$ యెష $27^1$ యిర్మీ $51^9$ నందది మఱియొక హెబ్రీ పదమునకు తర్జుమా. దానికి సంబంధముగా యెహె $29^3$ లో ఆ పదమునే మొసలి యనియు, ద్వితీ $32^{33}$ నందు క్రూరసర్ప మనియు, కీర్త $74^{13}$ యిర్మీ $51^{34}$ నందు భుజంగ మనియు, కీర్త $91^{13}$ నందు నాగుపాము అనియు తెనిఁగించిరి (పాము I (6) చూ॥). ఇది నీటి యందుండు భయంకరమైన జంతువేగాని అది ట్టిదో రూఢిగాఁ దెలియదు.

**మకెలోతు** (Makheloth = కూటములు). అరణ్యములో ఇశ్రాయేలీయులు మకాముచేసిన యొక స్థలము (సంఖ్యా $33^{25,26}$). దీని యునికి తెలియదు.

**మక్కబేయుల గ్రంథములు** (The Books of the Maccabees). యూదుల స్మృతులు. ఇవి ఐదు. అపోక్రిఫాలో రెండింటిని మాత్రము అచ్చువేసి యున్నారు. ఈ గ్రంథములలో మొదటి రెండును మక్కబేయుల కాలములో జరిగిన మిగుల ఉపయోగకరమైన చరిత్రలను తెలుపుచున్నవి. మొదటి గ్రంథము నందు క్రీ॥ పూ॥ 175-135 సం॥ లలో జరిగిన చరిత్రము వ్రాయఁబడి యున్నది. రెండవ గ్రంథమందు దీనికి తరువాతి చరిత్ర వ్రాయఁబడక మఱల ఆ కాలములోనే అనఁగా 175-160 సం॥ లలో జరిగిన విషయములున్నవి. మూఁడు నాలుగు మక్కబేయుల గ్రంథములలో వేరే విషయములున్నవి గాని, వానిలో మక్కబేయుల చరిత్ర లేదు. మూఁడవ గ్రంథము ఐగుప్తు రాజులగు తొలమైవారి విషయమైన కల్పనా కథయై, వారు యూదులను బాధపఱచినట్లు గాను, యూదులు వారిని జయించినట్లుగా నున్నది. నాల్గవది చరిత్రకాక జ్ఞానమును గూర్చిన యొక గ్రంథమై యున్నది. ఐదవ గ్రంథములో మొదటి రెండు గ్రంథములలోని విషయములు

ములల వ్రాయఁబడి యున్నవి అవి గాక, యోసీఫసు అను చరిత్రకారుఁడు వ్రాసిన చరిత్ర విషయములు నున్నవి. చివరి మూఁడు గ్రంథములు చరిత్రను తెలిసికొనుట కేమాత్రమును ఉపయోగకరమైనవి కావు గాని మొదటిది మాత్రము చాల ఉపయోగకరమైనదిగా నున్నది మఱియు రెండవది మొదటిదానికి సాటియైనది కాకపోయినను అదికూడ అప్పటి చరిత్రలను తెలిసికొనుటకు పనికివచ్చును (అప్రమాణిక గ్రంథములు చూ॥)

## మక్కబేయుల వంశవృక్షము

- I మత్తతీయ (168-167)
  - యోహాను.
  - IV సీమోను (143-135).
    - యూదా.
    - V యోహాను హిర్కేను (135-105).
      - VI మొదటి అరిస్టొబులు (105-104).
      - అంటిగొనస్.
      - VII అలెక్సందరు జెన్నేయస్ (104-78)
        VIII ఇతని భార్యయగు అలెక్సాంద్ర (78-68)
        - IX రెండవ హిర్కేను (78-69; 63-40).
        - X రెండవ అరిస్టొబులు (69-63).
          - అలెక్సందరు.
            - అరిస్టొబులు
            - మరియామ్మె (మహా హేరోదు భార్య).
              - అలెక్సందరు
              - అరిస్టొబులు
          - అంటిగోనెస్ (40-37)
    - మత్తతీయ.
  - II యూదా (167-161).
  - ఎలీయెజెరు.
  - III యోనాతాను (161-143)

**మక్కబేయులు** (Maccabees = సుత్తెతో కొట్టువారు). ఈ పేరు బైబిలులోని ప్రమాణిక గ్రంథములలో లేదు. వీరు క్రీ॥ ము॥ 1-2 శతాబ్దముల క్రిందట యూదులకు అధికారులై యుండిరి. వారినిగూర్చిన సంగతులు అప్రమాణిక గ్రంథములనఁబడు దానిలో మక్కబేయుల గ్రంథములందును, యోసీఫసు వ్రాసిన చరిత్రయందు నున్నవి. వీరి వంశమునకు హస్మోను అను వాఁడు పూర్వీకుఁడగుటచే వీరికి హస్మోనీయుల వంశము (*Hasmoneans*) అని పేరుకూడ కలదు. పలెస్తీను అంతియోకు రాజ్యము క్రిందనుండఁగా, ఆ రాజ్యము నేలిన అంతియోకు ఎపీఫనీస్ (అంతియోకు 2 చూ॥) యూదుల మతాచారము లన్నిఁటిని మార్పఁ బ్రయత్నించి వారి యాలయమునుకూడ అపవిత్ర పఱచెను. అట్టి సమయమందు మోడీన్ (*Modin*) అను నొక యూదయ యూరిలో నొక యాజకుఁడుండెను. అతని పేరు మత్తతీయ. అతనికి ఐదుగురు కొమరులుండిరి. వారు యోహాను, సీమోను, యూదా, ఎలీయెజరు, యోనాతాను అనువారై యుండిరి. వీరుచేసిన గొప్ప యుద్ధములనుబట్టి మక్కబేయు లనఁబడిరి. తెరువాతి కాలములో

ఈ పేరు వారి వంశమున పుట్టిన యొకనికి కలిగెను. వీరు మొదట తిరుగుబాటు చేసి ఆ అంతియోకు ఉద్యోగస్థుల నెదిరించి వారితో యుద్ధము చేసిరి. ప్రజలు కూడ వారితోఁ గలిసిరి. చాలకాలము యుద్ధము చేసినపిమ్మట వారు అంతియోకు రాజులను జయించి మరల యూదుల యాచారముల నేర్పరచి, క్రీ॥ పూ॥ 165 సం॥ డిసెంబరు మాసములో దేవాలయమును ప్రతిష్ఠించిరి. మొదట వారు సేనాధిపతులుగా మాత్రముండినను, క్రమక్రమేణ దేశాధిపతులైరి. మొత్తమునకు వారు భక్తిగలవారైయేనను తమ స్వలాభము నాశించిన దుర్మార్గులుకూడ వారిలో కొందఱు లేచిరి. వీరి కాలములో పరిసయ్యులు సద్దూకయ్యులు అను యూద మతభేదములు వాడుకలోకి వచ్చియుండిరి. ఈ మక్కబేయులు రోమీయులు పలెస్తీనును జయించు వరకు అనఁగా క్రీ॥ పూ॥ 63 సం॥ వఱకు పలెస్తీనుకు అధికారులై యుండిరి. తదనంతరము హేరోదీయుల వంశమునకు పెద్దయగు అంతిపతేరు (*Antipater*) వంశస్థు లధికారులై యుండినను మక్కబేయుల సంతతివారికను ప్రధాన యాజకులుగా నుండిరి. రోమన్‌వారి ప్రభుత్వ కాలములోకూడ 40-37 సం॥ లలో ఈ వంశపువారిలో అంటిగోనసు అను వాఁడు కొద్దికాలమువఱకు ప్రభుత్వము చేసెను. మఱియు, తరువాత మహా హేరోదను బడిన వాఁడు వివాహము చేసికొనిన మరియామ్నె (*Mariamne*) ఈ సంతతి వారిలోనే పుట్టెను. హేరోదు ఆమెను, ఆమె బిడ్డలను చంపఁగా వీరి వంశ మంతమయ్యెను. ఈ శీర్షికపైనున్న వంశవృక్షములో ఆయా పేరులను ముందున్న I, II మొదలగు సంఖ్యలు మక్కబేయులలో ప్రభుత్వము చేసినవారి వరుసను, వారి పేరులను తరువాత చంద్రవంకలను మధ్యనున్న సంఖ్యలు వారేలినకాలమును తెలియఁజేయును.

**మక్కేదా** (Makkedah = గొల్లలు దిగు స్థలము) ఇశ్రాయేలీయులు కనానును స్వాధీన పఱచుకొనకముందున్న యొక పట్టణము. వారు దానిని కనానీయులయొద్దనుండి జయించి యూదా వారి కిచ్చిరి (యెహో $10^{10-29}$ $12^{16}$ $15^{41}$). ఇది షెఫేలాయందున్నది. ప్రస్తుతము దానిని ఎల్‌ముగారు (*El-Mughar*) అని పిలుతురు.

ను యొప్పేకు దక్షిణమున 15 మైళ్ల దూరమున నున్నది (పటము III, C 5).

**మక్తేషు** (Maktesh = రోలు). యెరూషలేమునందున్న యొక పేట (జెఫ $1^{11}$). జెఫన్యా గ్రంథమందు మాత్రమే ఉదాహరింపఁబడినది. ఈ భాగమందు నివసించినవారు కనానీయులని ఆ వాక్యమువలనఁ దెలియుచున్నది. దానికి రోలు అను నర్థమగుటచేత అది లోయయై యుండునని యెంతురు. టురోపియన్ లోయలో నుండవచ్చును గాని రూఢిగాఁ జెప్ప వీలుకాదు. (యెరూషలేము B IV 3 (*c*) చూ॥).

**మక్నద్బయి** (Machnadbai). అన్య స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణ వలన వారిని విడిచిపెట్టినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{40}$).

**మక్పేలా** (Machpelah = భాగము). హెబ్రోనుకు సమీపమున పొలమును గుహాయు గల స్థలము. అబ్రాహాము తన కుటుంబ సమాధి కొఱకు దీనిని ఎఫ్రోను నొద్ద కొనెను. అందు మొదట శారా పాతిపెట్టఁబడెను (ఆది 23). అబ్రాహాము ఇస్సాకు యాకోబు రిబ్కా లేయా మొదలగువారు నుంచఁబడిరి ($25^{9}$ $49^{31}$ $50^{13}$ హెబ్రోను చూ॥). H.

**మక్బన్నయి** (Machbannai = అంగిని ధరించుకొన్నవాఁడు). గాదీయుడై యుండినవారిలో గాదీయులలో నొకఁడు (I దిన $12^{13}$).

**మక్బేనా** (Machbena = పాశము, దుప్పటి). యూదాలోని పట్టణమైనట్లు సంగతి సందర్భములవలనఁ దెలియుచున్నది (I దిన $2^{49}$ కల్బును చూ॥).

**మఖీరసు** (Machaerus). మృతసముద్రమునకుఁ దూర్పున మోయాబు కొండలలో నున్న యొక దుర్గము. ఇది మహా హేరోదుకుఁ బూర్వమే కట్టించఁబడి, యతనిచే బలపఱచఁబడెను. ఈ స్థలముయొక్క పేరు బైబిలునందు లేకపోయినను బాప్తిస్మ మిచ్చు యోహానును హేరోదు అంతిప ఈ కోటలో ఖైదిగానుంచి తరువాత చంపినట్లు (మ $4^{12}$ $14^{3-10}$ = మా $6^{16-28}$

**లూ** $3^{20}$ $7^{18-28}$ $9^{9}$) **సూచన** లున్నవి. అతఁడీ కోటలోని చెఱలో వేయఁబడినట్లు యోసీఫసు వలనఁ దెలియును (పురా 18. 5. 2, పటము I, F 9).

**మగవాను** దల్మనూతా చూ॥

**మగ్గపు మేకు** వృత్తులు చేతిపనులు III 2 చూ॥

**మగ్దలేనే** మరియ 3 చూ॥

**మగ్దీయేలు** (Magdiel = దేవుని ఘనము). ఎదోమీయుల ప్రధానులలో నొకఁడు (ఆది $36^{43}$ = దిన $1^{54}$).

**మగ్పీయాషు** (Magpiash = చిమ్మెటలను చంపువాఁడు) నెహెమ్యా కాలములో నిబంధనను ముద్రించిన వారిలో నొకఁడు (నెహె $10^{20}$). మగ్బీషు అను నామము దీనికి సంబంధించినదని కొందఱి యభిప్రాయము.

**మగ్బీషు** (Magbish = బలము). చెఱ కాలమునుండి తిరిగివచ్చిన 150 మంది బెన్యామీనీయులు బసచేసిన యొక గ్రామము (ఎజ్రా $2^{30}$). నెహె $7^{33}$ = ఎజ్రా $2^{30}$ కి సమముగా నున్నను అచ్చట నీ పేరు కనఁబడదు.

**మట్టుపు గుండు** వృత్తులు చేతిపనులు I 2 (*b*) చూ॥

**మట్టికీలు** (Bittumen, Slime). కొన్ని ప్రదేశములలో దొరుకు ఒక విధమైన జిగట మన్నును సూచించుటకు వాడఁబడు పదమై యున్నది. అది నిప్పుతగిలిన వెంటనే కాలిపోవును. గట్టిపడిపోయిన కిరోసిను నూనె సంబంధమగు మన్నయి యున్నది. మెసపొతేమియలోను బబులోనుకు 150 మైళ్లు ఉత్తరముగాను బహు విస్తారముగ దొరుకును. పలెస్తీనులో హెర్మోను కొండ ప్రదేశమునందును, మృత సముద్ర ప్రాంతములోను కనఁబడును (ఆది $14^{10}$). నోవహు కట్టించిన నావకు దీనిని పూసిరి ($6^{14}$). బాబెలు గోపురమును కట్టుట యందు వాడినదానిని సూచించుట కుపయోగించిన మాట వేఱయినప్పటికిని దానిని తెలుఁగు బైబిలునందు మట్టికీలు అని తర్జుమా చేసిరి ($11^{3}$).

ఇదియు సైదానివంటి మన్నే. ఆ పదమునే నిర్గ $2^{3}$ నందు జిగటమన్ను అని తెనిఁగించిరి. మోషేనుంచిన జమ్ము పెట్టెలోనికి నీళ్లు రాకుండునట్లు దానికి దీనిని పూసిరి. ఆ వాక్యములోనే కీలు అని తెనిఁగించిన పదము మఱియొకటియై యున్నది. అది కాలిపోవునది కావున ఎదోము నదులు కీలు అగునని (యెష $34^{9}$) ప్రవక్తలు చెప్పుచు ఆ దేశమునకు కలిగెడి సర్వనాశమును సూచించిరి. హిందువులు తమ యిండ్లకు అడుసు పూసినరీతిగా పలస్తీనులోని జనులు తమ యిండ్ల కిట్టి జిగటమట్టిని పూసిరి.

**మడుగు** (Pond). నీటిమడుగు అను పదమును యెషయా సౌఖ్యమునకు అలంకారముగా నుపయోగించెను (యెష $35^{7}$) అట్లే ఒక దేశమునకు కీడు వచ్చునని తెలుపుటకు దాని మడుగులు ఎండిపోవునని వ్రాసెను ($42^{15}$). ఇవి చెఱువులని తెలిసికొనవలెను. ఈ మూల పదమునే నిర్గ $7^{19}$ $8^{5}$ నందు చెఱువులని తెనిఁగించిరి. (కోనేరు చూ॥).

**మడ్డి** (Lees). ద్రాక్షారసములోని మష్టు అంతయు పోయి స్వచ్ఛమైనదియగునట్లు దానిని కదల్పకుండ చాలకాలమువఱకు నిలువనిత్తురు. అట్టిదానిని అడుగున నిలిచినటువంటిది మడ్డిమీఁద ద్రాక్షరస మనఁబడెను దాని త్రాగుట కలవారు రుచిగలవారు అది మంచి రుచిగలదని భావింతురు రుచిగలవారిని సూచించుటకు ఆ పదము అట్టి భావముతో యెష $25^{5,6}$ నం దుపయోగింపఁబడెను. చాలకాలమునుండి ఎట్టి మార్పును లేక ఒకటే స్థితియందున్న వారిని సూచించుటకును మడ్డిమీఁది ద్రాక్షారసము అలంకారరీతిగా వాడఁబడెను. ఇట్లు మోయాబీయులును (యిర్మీ $48^{11}$) యూదావారును (జెఫ $1^{12}$) దీనికి పోల్పఁబడిరి.

**మఱుగు** మానవములు II, III చూ॥

**మతప్రవిష్టులు, ప్రవిష్టులు** (Proselites). యూదులమతముయొక్క శ్రేష్ఠతను తెలిసికొని దాని నొప్పుకొనిన అన్యులను యూదమతప్రవిష్టులు లేక ప్రవిష్టులు అను పేరు కలదు (కార్య $2^{10}$ $6^{5}$ $13^{43}$). యూదులు తమ మతములో నిట్టివారని కలుపుకొనుటకు చాల ఆసక్తి

పరులై యుండిరి (మ $23^{15}$). ఈ పేరు క్రొత్త నిబంధనలో నుదహరింపబడిన వాక్యములలో మాత్రము కనబడునుగాని పాత నిబంధనలో LXX నందు పరదేశులు అను పేరుమాత్రమున్నది (పరదేశి చూ॥). చెఱకాలమునకు ముందు అట్టి పరదేశులుతప్ప మఱి యే యన్యులును యూదిమతములో చేరుటకు అవకాశము లేకపోయెనుగాని చెఱకాలమైన పిమ్మట యూదులు అన్యులదేశములకు చెదిరిపోయి అన్యులమధ్యనే యెక్కువగా నివసించిరి. కావున తమ మత శ్రేష్ఠతను అట్టి యన్యులకు తెలుపుటకు మంచి అవకాశము కలిగెను. అలాగున యూదులు చెదరిపోయి నివసించిన ప్రతి యన్యపట్టణము లోను మతప్రవిష్టు లుండిరి. వీరు యూదుల బోధల నంగీకరించి వారి సమాజమందిరములకు వచ్చిరి గాని వారి యాచారములను (సున్నతి, భోజనవిషయములు మొ॥) ఆచరించరు. క్రొత్త నిబంధనలో వారికి భక్తిపరులు అను క్రొత్త నామమును పెట్టిరి (కార్య $17^{4,17}$ $10^{2}$ $13^{50}$). వీరిలో అనేకులు క్రైస్తవులైరి. వీరు పాత నిబంధన బోధను నమ్మినను దాని యాచారముల నంగీకరింపక పోవుటవలన క్రైస్తవ బోధల నంగీకరించుటకు మఱీ చక్కగా సిద్ధపడినవారై యుండిరి (దేవునికి భయపడువాడు చూ).

**మత భేదములు** భేదములు 5 చూ॥

**మతాభిమానులను తెగవారు** (Hasideans = భక్తిగలవారు) ఈ తెగవారి పేరు అప్రమాణిక గ్రంథములలోని మక్కబేయుల గ్రంథములలోను యోసీఫసు వ్రాసిన గ్రంథములలో నున్నదిగాని ప్రమాణిక గ్రంథములయందుఁ గానరాదు. వారు యూదుల ఆచారములయందు చాల నిష్ఠపరులు (I మక్క $2^{42}$). అన్యులను దేశమునుండి వెళ్లఁగొట్టుటకు వారు మక్కబేయులకు చాల సహాయపడిరి ($2^{42}$ II మక్క $14^{6}$). వారిలో అనేకులు ధర్మశాస్త్రము నిమిత్తము హతసాక్షులైరి. ఈ తెగవారు క్రొత్త నిబంధనలో వేఱుతెగగా నున్నట్లు కనఁబడదు గాని వీరి అభిమానమును పరిసయ్యులు లోకవిధముగాను ఎస్సేనీయులు లోకవిరోధముగాను కాపాడిరి. (పరిసయ్యులు, ఎస్సేనీయులు చూ॥).

**మతూషాయేలు** (Methushael = దేవుని మనుష్యుఁడు). జలప్రళయమునకు పూర్వకాలమందున్న వారిలో నొకఁడు. ఇతఁడు కయీను వంశమందు పుట్టినవాఁడై యుండెను (ఆది $4^{18}$).

**మత్తతా** (Mattatha = దానము). ఇతఁడు దావీదుకు మనుమఁడును క్రీస్తు పూర్వికులలో నొకఁడునై యుండెను (లూ $3^{31}$)

**మత్తతీయ** (Mattathias = యెహోవా దానము). క్రీస్తు పూర్వికులలో నిద్దరి పేరు (లూ $3^{25,26}$).

**మత్తతు** (Matthat = దానము).

1. క్రీస్తు పూర్వికులలో నొకఁడు (లూ $3^{24}$). మ $1^{15}$ లోని మత్తాను ఇతఁడే యని కొందఱి యభిప్రాయము. అట్లయిన యెడల ఇతఁడు యోసేపునకు తాతయగును. లూకా మరియ వంశావళి వ్రాసెనందురు. అట్లయినయెడల నితఁడు మరియకు తాతయై యున్నాఁడు.

2. క్రీస్తు పూర్వికులలో మఱియొకఁడు (లూ $3^{29}$).

**మత్తత్తా** (Mattattah = యెహోవా దానము). అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచి పెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{33}$).

**మత్తన్యా** (Mattaniah = యెహోవా దానము).

1. రాజైన సిద్కియాయొక్క అసలు పేరు (II రాజు $24^{17}$).

2. ఆసాపు సంతతివారిలో నొకఁడు. ఇతఁడు ఆలయమందలి సంగీత నాయకులలో నొకఁడై యుండెను (I దిన $9^{15}$ నెహె $11^{17,22}$ $12^{8}$).

3. యెహోషాపాతు కాలములోనుండిన యొక లేవీయుఁడు (II దిన $20^{14}$).

4, 5, 6, 7. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన విడిచిపెట్టినవారిలో నలుగురు (ఎజ్రా $10^{26,27,30,37}$).

8. నెహెమ్యాకాలమునందు ఆలయములోని యర్పణములకొర్చి జాగ్రత్త పుచ్చుకొనిన యొక లేవీయుఁడు (నెహె $13^{13}$).

9. గాయకుఁడైన హేమాను సంతతివారిలో నొక లేవీయుఁడు (I దిన 25[4,16]).

10. హిజ్కియాకాలములో గుడిని శుభ్రపఱచుటకు సహాయపడిన యొక లేవీయుఁడు. ఇతఁడు ఆసాపు సంతతివారిలో నొకఁడై యుండెను (II దిన 29[13]).

11. నెహెమ్యాకాలమందలి ద్వారపాలకులలో నొకఁడు (నెహె 12[25]).

**మత్తయి** (Matthew = యెహోవాదానము) పన్నెండుమంది యపొస్తలులలో నొకఁడు (మ 10[3] మా 3[18] లూ 6[15] కార్య 1[13]). అపొస్తలుల పేళ్ల జాబితాలలో గాక అతని క్రీస్తు పిలిచిన చరిత్రయందు మాత్రమే అతనిపేరు కనఁబడును (మ 9[9-13] మా 2[13-17] లూ 5[27-32]). మార్కు లూకాలు అతనిని లేవి యని పిలిచిరి. అతఁడు అల్ఫయి కుమారుఁడని మార్కువలనఁ దెలియుచున్నది. ఇతడు కపెర్నహూము కాపురస్థుడని కనఁబడుచున్నది. ఇతఁడు అల్ఫయి కుమారుఁడగుటచేత యాకోబు సహోదరుఁడై యుండునని కొందఱి యభిప్రాయముగాని వీరు సహోదరులని తక్కినవారివలె నెక్కడను సూచింపఁబడకపోవుటచే, ఇతని తండ్రియు, యాకోబు తండ్రియు వేర్వేఱు మనుష్యులను కొనఁదగును. ఇతఁడు యూదుఁడైనను రోమనుల పక్షమున ప్రభుత్వము చేయుచుండిన హేరోదు అంతిపయొక్క కరణములలో నొకడై యుండెను. యూదులుకానివారికి పన్ను చెల్లింప రాదని దురభిమానపడిన యూదులిట్టి సుంకము పోగు జేసినవారినెల్లను తృణీకరించిరి. క్రీస్తు ఇతనిని అపొస్తలుఁడుగ పిలుచుటమాత్రమేగాక, ఇతని యింట చేయఁబడిన విందునకుకూడ వెళ్లి సుంకరులకును పాపులకును బోధించి వారితో స్నేహముచేసెను. అది తగదని పరిసయ్యులనఁగా రోగులకేగాని, ఆరోగ్యముగలవారికి వైద్యుఁడక్కరలేదనియు, నీతిమంతులను కాదుగాని పాపులనే పిలువవచ్చితిననియు వారికి సమాధానము చెప్పెను.

బైబిలునందలి సువార్తలలో మొదటివానిని మత్తయి వ్రాసినట్లు ఆదినుండి దాని నతని పేరుతోఁ బిలుచుచున్నారు. ఇతఁడు యూదులకు బోధించిన అపొస్తలుఁడయ్యెనను పారంపర్యమొకటిగలదు. అతని సువార్త యూదులకొఱకు వ్రాయఁబడినట్లు సూచించు విషయములనుబట్టి ఆ సంగతిని నమ్ముట కాధారమున్నది (మత్తయి సువార్త చూ॥).

**మత్తయి సువార్త** (The Gospel according to Matthew). నాలుగు సువార్తలలో మొదటిది.

I. గ్రంథకర్త. అపొస్తలులలో నొకఁడగు మత్తయి దీని వ్రాసెనని ఆదినుండి ఏకగ్రీవముగ చెప్పెదరు. ఈ దిగువకారణములచే నీ మాట నమ్మఁదగినదై యున్నది. 1. ఈ సువార్తను వ్రాసినవాఁడు యూదుఁడైనను యూదపారంపర్యములను విసర్జించినవాఁడని దీనివలన కనఁబడుచున్నది. సుంకరియగు మత్తయి అట్టివాఁడైనట్లు చూచుచున్నాము. 2. ఈ సువార్తయొక్క ప్రాముఖ్యతనుబట్టి దాని వ్రాసినవాని నెఱుఁగకుండుట అసందర్భమైన సంగతి. దీనిని వ్రాసినవాఁడు మత్తయి యని తెలిసినవారు ఆదినుండి చెప్పుచునే యున్నారు. ఎవరో యొకరు దీనిని వ్రాసి అపొస్తలులలో ప్రధానులైన వారిలో నొకనికి ఆరోపింపక, మత్తయికి ఆరోపించుట అంత సయుక్తముగాలేదు గాన దీనిని మత్తయియే వ్రాసెనుగాక నమ్మదగియున్నది. 3. తన సంగతులను వ్రాసికొనవలసివచ్చినప్పుడు బైబిలు గ్రంథకర్తలు బహు వినయముతో నట్లు చేయుట వాడుకనట్లు కనుగొనవచ్చును. మత్తయి తన పిలుపునుగూర్చి వ్రాసినది అట్లే యున్నది (మ 9[10] లూ 5[29] తో సరిపోల్చుము). 4. ప్రస్తుతము దేశమందున్న కరణములవలె సుంకరులకు వ్రాయుటకు బాగుగా వచ్చియుండెను. పూర్వకాలమున చదువనేర్చిన వారిలో నసేకులకు వ్రాఁత కుదరనేలేదు. మత్తయి ఈ సంగతులను దినచర్యలో వ్రాసి యుంచుకొనెనని అతని పనిని బట్టి యూహింపఁదగును.

II. కాలము. లోగియ (*Logia*) అనఁబడు క్రీస్తు ప్రసంగములను మత్తయి హెబ్రీ భాషలో వ్రాసినట్లు అపొస్తలుల పిలువబడిన పూర్వికపండితులలో పాపియ (*Papius*) అనువాఁడు క్రీ॥ శ॥ 140 సం॥లో వ్రాసిన గ్రంథములందు

మాత్రమేగాక అందఱికిని అక్కఱ యున్నదను సంగతి స్పష్టమగుచున్నది.

IV. ముఖ్యలక్షణములు. యేసు రాజగు మెస్సీయ యనునది దీనియందు ముఖ్యమైన విషయముగా నెంచఁదగును. పరలోకరాజ్యమును గూర్చిన బోధ దానికి సంబంధించినదై యున్నది. ఆ రాజ్యముయొక్క విధులు (5-7), దాని వృద్ధి (13), యూదులు దానిని విసర్జింపఁగా అన్యులు దానికి వారసులగుట (21-25), దాని సర్వలోకమున వ్యాపింపఁజేయుట ($28^{16-20}$) దీని ముఖ్యోద్దేశముగా నెంచఁదగును. దీనినిబట్టియే మత్తయి క్రీస్తు ప్రసంగములను విశదముగా వ్రాసెను. కొండమీఁది ప్రసంగము (5-7), బోధకుల ధర్మ విధులు (10), దేవుని రాజ్యాభివృద్ధినిగూర్చిన ఉపమానములు (13), ఆ రాజ్యస్థుల కుండవలసిన వినయాది సద్గుణములు (18), తీర్పును గూర్చిన ఉపమానములు ఇతర విషయములు ($21^{28}$-25) అను గొప్ప ప్రసంగములను మత్తయి తక్కినవారికన్న విశదముగా వ్రాసెను. ఇవిగాక ఇతర చిన్న ప్రసంగములుకూడ మధ్యమధ్య వచ్చును ($11^{7-19}$ $11^{20-24}$ $11^{25-30}$ $12^{25-36}$ $12^{39-45}$ $15^{3-20}$ $16^{1-4}$ $16^{6-11}$ $16^{21-28}$ $19^{4-12}$ $19^{23-30}$ $20^{16}$ $20^{25-28}$). ప్రసంగములనుమాత్రము వివరముగా వ్రాసెనే గాని అద్భుతములను మార్కుకన్న క్లుప్తముగా నుదాహరించెను. ఆరంభవిషయములను (1-$4^{17}$), గలిలయచర్య ($4^{18}$-$15^{20}$), గలిలయ చుట్టు ప్రదేశములయందు జరిగిన విషయములు ($15^{21}$-$18^{35}$), పెరీయలో జరిగిన సంగతులు ($18^{36}$-20), శ్రమ మరణ పునరుత్థానములను (21-28) మొత్తము మీఁద క్రమముగా వ్రాసినను, వీటితో ననేక విషయములను చేర్చి వ్రాసెను. ఉదాహరణముగా 10 అధ్యాయములోని సంగతులన్నియు ఒక సమయమునందే చెప్పఁబడినవికావు. ఆయా సమయములలోఁ జెప్పఁబడినవాటిని మత్తయి అక్కడఁ జేర్చెను. ఇతర ప్రసంగములలోని వాటి నిట్లే జేర్చియుండును.

V. ముఖ్యభాగములు, విషయములు.

1. యేసుపుట్టుకను గూర్చినవి (1, 2). ఇందు వంశావళిక్రమము, యోసేపునకు యేసు పుట్టుకను గూర్చి తెలుపుట, జ్ఞానులరాక, ఐగుప్తునకు పారిపోవుట నజరేతునకుఁ దిరిగివచ్చుట అను విషయము లున్నవి.

2. ఆయన పనిలోఁ బ్రవేశించుటనుగూర్చినవి ($3^{1}$-$4^{17}$). బాప్తిస్మమిచ్చు యోహాను చర్య, యేసు బాప్తిస్మము, శోధనలు, గలిలయలోని కపెర్నహూముకు వచ్చుట అను సంగతులు గలవు.

3. గలిలయచర్య ($4^{18}$-$15^{20}$). దీనియందలి ముఖ్యసంగతు లెవ్వియనఁగా:—

(1) అపొస్తలులను పనికి పంపకమునుపటి విషయములు ($4^{18}$-$9^{35}$). ఇందు నలుగురు శిష్యులను బిలుచుట ($4^{18-22}$), ఆయన పని బాహుళ్యతను క్లుప్తముగా వివరించుట ($4^{23-25}$), కొండమీఁది ప్రసంగపు సంక్షేపము (5-7), ఆయన బోధలను దృష్టాంతపఱచిన అద్భుతములు ($8^{1}$ $9^{35}$) అనునవి గలవు.

(2) అపొస్తలులు తనపనికి సహాయకులనుగా నియమించి, వారి విధులను దెలిపి, వారికిఁ గలుగనైయున్న హింసలలో వారిని ధైర్యపఱచుట ($9^{36}$-$11^{1}$).

(3) బాప్తిస్మమిచ్చు యోహానుకు కలిగిన సందేహమునుగూర్చియు, యూదులు క్రీస్తును విరోధించుటనుగూర్చియు వివరించుట ($11^{2}$-$12^{50}$). ఇందు యోహాను సందేహమును దీర్చుటయు, యోహానునుగూర్చిన ప్రసంగమును, క్రీస్తును విసర్జించిన పట్టణముల గతితోపాటు పాపులను బిలుచుటయు (11), విశ్రాంతిదినమును మీఱినట్లు పరిసయ్యులు నేరముమోపుట, క్రీస్తు చూపిన శాంతము, బయెల్జెబూలు అని ఆయనను దూషించుట, ఆయన బంధువులాయనను పట్టుకొనవచ్చుట (12) యను విషయములు గలవు.

(4) దేవుని రాజ్యమునుగూర్చిన ఉపమానములు, ఆ రాజ్యముయొక్క లక్షణములను దృష్టాంతపఱచు అద్భుతములు (13, 14); దీనియందు విత్తువాఁడు, గోధుమలు గురుగులు, ఆవగింజ, పులిసినపిండి, దాచఁబడినధనము, విలువగల ముత్యము, వల మొదలగువానినిగూర్చిన ఏడు ఉపమానములు గలవు (13). యోహాను చంపఁబడెనని క్రీస్తు వినుట, జీవపురొట్టెను దృష్టాంతపఱచు 5000 మంది కాహారముపెట్టిన అద్భుతము,

సముద్రమును నిమ్మళింపఁజేయుటను గూర్చిన అద్భుతము, గెన్నెసరెతులో ననేక అద్భుతములను చేయుట (14) యును గలవు.

(5) క్రీస్తు పెద్దల పారంపర్యమును లక్షింపక పోవుటచే పరిసయ్యుల విరోధ మెక్కువైనందున అచ్చట ఇఁకను పనిచేయలేక గలిలయలో తన పనిని ముగించుట (15[1-20]).

4. గలిలయచుట్టునుండు ప్రదేశములలో ముఖ్యముగా తన శిష్యులకు బోధించుట (15[21]-18[35]), తూరు సీదోను ప్రాంతములలో కనాను దేశ స్త్రీ కుమార్తెను స్వస్థపఱచుట (15[21-28]), దెకపొలి ప్రాంతములలో అనేకులను బాగుజేసి 4000 మందికి ఆహారముపెట్టుట (15[29-38]), మగదాను ప్రాంతములలో గురుతులను చూపుమనిన పరిసయ్యులను గద్దించుట (15[39]-16[4]), సముద్రముమీఁది పులిసినపిండి అను దుర్బోధ విషయమై శిష్యులకు బోధించుట (16[5-12]), ఫిలిప్పుదైన కైసరయ ప్రాంతములలో పేతురు యొక్క ఒప్పుదల, ఆయన తన శ్రమలనుగూర్చి తెలుపుట, రూపాంతరము నొందుట మూర్ఛరోగియగు చిన్నదానిని బాగుజేయుట (16[31]-17[20]), గలిలయమీఁదుగా వెళ్లుచు తన శ్రమలనుగూర్చి తెలిపి, చేఁపనోట దొరికిన సొమ్ముతో దేవాలయపుపన్ను చెల్లించి, శిష్యులు గొప్పతనమును గుఱించి వాదింపఁగా వారికి వినయమునుగూర్చి బోధించుట (17[21]-18[35]).

5. పెరీయలోను యెరూషలేమునకును చేసిన చివరి ప్రయాణమందలి సంగతులు (19, 20). ఇందు పరిత్యాగపత్రిక నిచ్చుటనుగూర్చిన బోధలును, చిన్నపిల్లలను దీవించుట, యౌవనుఁడగు నొకఁడు తన ధనమును చూచుకొని ఆయనను వెంబడించకపోయినందున ధనమునుగూర్చినబోధ (19), ద్రాక్షతోఁటలో పనిచేయుటనుగూర్చిన ఉపమానము, తన శ్రమలనుగూర్చి మూఁడవమారు తెలుపుట, యాకోబు యోహానులమనవి, గుడ్డివారిని స్వస్థపఱచుట (20) అను సంగతులున్నవి.

6. చివరివారమునందు జరిగిన సంగతులు; శ్రమ మరణపునరుత్థానములు (21-28), జయోత్సవముగా క్రీస్తు యెరూషలేమునందుఁ బ్రవేశించుట, ఆలయమును శుద్ధిచేయుట, అంజూరపు చెట్టును శపించుట, క్రీస్తు అధికారమునుగూర్చి ప్రశ్న (21[1-28]), ఇద్దఱు కుమారులు, ద్రాక్షతోఁట, పెండ్లివిందులనుగూర్చిన ఉపమానములు చెప్పుటద్వారా యూదులు తమ హక్కును అవిధేయతవలన పోఁగొట్టుకొన్నందున అన్యులకియ్యఁబడునను బోధ (21[29]-22[19]), యూదులాయనను సంహరింపవలెననికోరి ఆయనను చిక్కుపఱచుకొనుటకు పన్నిచ్చుట పునరుత్థానము గొప్ప యాజ్ఞలనుగూర్చి యడుగుట, క్రీస్తెవని కుమారుఁడని ఆయనవారినడుగుట (22[15-46]), శాస్త్రులను పరిసయ్యులను వారి వేషధారణకై ఆయన వారిని ఖండించి యెరూషలేమునుగూర్చి ప్రలాపించి వెళ్లిపోవుట (23), అదియైనపిమ్మట ఒలీవకొండమీఁద కూర్చుండి యెరూషలేము నాశనమును గూర్చియు లోకాంతమునుగూర్చియు తెలిపి (24) కన్యకలు, తలాంతులు, గొఱ్ఱెలు మేఁకలను గూర్చిన ఉపమానములను చెప్పి మెలఁకువపడి వలసినదని వారిని ప్రేరేపించుట (25), మరియు కనుపఱచిన భక్తిమర్యాదలు, యూదా ద్రోహము, చివరిపస్కా, ప్రభురాత్రిభోజన నియమము, గెత్సేమనే వనమున ప్రార్థించుట, యూదా ఆయన నప్పగించుట, యూదులచే పట్టుపడి విమర్శింపఁబడుట, పేతురు బొంకుట (26), సన్హెడ్రిన్ సభవారి తీర్మానము, యూదా ఉరి పెట్టుకొని చనిపోవుట, పిలాతుయెదుట జరిగిన విచారణ, ఆయన సిలువవేయఁబడుట, మరణము భూస్థాపితము, సమాధికి ముద్రవేసి కావలి యుంచుట (27), స్త్రీలు ఆదివారోదయమున సమాధియొద్దకువెళ్లి ఆయనలేచెనను శుభవార్త వినుట, క్రీస్తు స్త్రీలకు కనఁబడుట, యూదు లీ వార్త వ్యాపింపకుండుటకై చేసిన దుష్ప్రయత్నములు, ఆయన గలిలయలో శిష్యులకు దర్శనమిచ్చి, వారు సర్వలోకమునకు రక్షణవార్త ప్రకటింపవలెనను ఆజ్ఞను, తానెల్లకాలము వారిలో నుండునను వాగ్దానమును ఒసంగుట (28). (సువార్తలు, యేసుక్రీస్తు, దేవునిరాజ్యము చూ॥).

**మత్తాను** (Mattan = దానము).

1. బయలు పూజారులలో నొకఁడు (II రాజు 11[18] II దిన 23[17]). యెరూషలేమునం దితడు

బయలు పూజారులకు ప్రధానియై యుండెను. యెహోయాదా కాలములో నితఁడు చంపఁబడెను.

2. యిర్మీయా కాలములో యిర్మీయామీఁద రాజునకు రిపోర్టు జేసిన షెఫట్యయను వాని తండ్రి (యిర్మీ 38[1]).

3. యేసు పెంపుడు తండ్రియగు యోసేపు యొక్క తాత (మ 1[15] మత్తతు చూ॥).

4. (Mattanah = యెహోవా దానము). ఇశ్రాయేలీయులరణ్యమందు దిగిన యొక స్థలము (సంఖ్యా 21[19]). దీనియునికి సరిగాఁ దెలియదు.

**మత్తీయ** (Matthias = యెహోవా దానము). ఇస్కరియోతు యూదాకు బదులుగా పన్నెండు మందితో లెక్కింపుటకు నియమింపఁబడినవాఁడు (కార్య 1[15-26]). అతఁడు మొదటినుండి క్రీస్తు వెంటఁగియుండి ఆయన పునరుత్థానమునకు సాక్షులలో నొకఁడను సంగతి గాక అతనిగూర్చి నుతేమియు తెలియదు. అపొస్తలు లతని నియమించుట తప్పని కొందఱి యభిప్రాయము. పరిశుద్ధాత్మ రాకడకు కని పెట్టక నే పేతురును ఇతర శిష్యులును ఈ పనికి పూనుకొనిరనియు, క్రీస్తు తరువాత అపొస్తలుఁడగు పౌలు నేర్పఱచుకొనెననియు, అట్టి వారి తలంపుగాని అది తప్పుగా నెంచఁబడినట్లు కార్యముల గ్రంథమందెట్టి సూచనలును లేవు. ఇతని గూర్చిన యితర సూచన లెవ్వియును బైబిలునందు లేకున్నను అతఁడు లూ 10 నందు సుదాహరించిన 70 మందిలో నొకఁడనియు, ఐతియోపియ దేశమునందు సువార్తఁ బ్రకటించెననియు పారంపర్యము లున్నవి. అప్రమాణిక గ్రంథములలోఁ గొన్నిఁటిని రచించిన వాఁడితఁడే నను వదంతియుఁ గలదు. వీటిని నమ్ముటకు తగిన యాధారము లెవ్వియును లేవు.

**మత్తెనై** (Mattenai = యెహోవా దానము).

1, 2. అన్యస్త్రీలను వివాహము జేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నిద్దఱు (ఎజ్రా 10[33,37]).

**మత్రేము** (Matred = ముందుకు సాగుట). ఎదోము రాజులలో హదదు అను నొకని యత్త (ఆది 36[39] I దిన 1[50]).

**మత్లబ్బేను** (Muth-Labben). దావీదు కీర్తనలలో తొమ్మిదవ దాని రాగపు పేరు (కీర్త 9[1]). ఆ మాటకు చావు పాలిపోఁ జేయునని యర్థము. ఆ మాట లాకాలమునందు వాడుకలోనున్న యొక కీర్తనయొక్క ఆరంభపు పదములై యుండును గాని ఆ సంగతి రూఢియైన వీలుకాదు.

**మత్సరము, అసూయ** (Envy). మానవులలో నిది సర్వసాధారణమగు పాపము. మొదటినుండి బైబిలునం దుదాహరింపఁబడి యున్నది. కయీను హేబెలు అర్పణ యంగీకరింపఁబడుటను (ఆది 4[5]), ఫిలిష్తీయులు అబ్రాహాము వృద్ధిని (26[14]), రాహేలు లేయాబిడ్డలను (39[1]), యోసేపు సహోదరులు తమ తమ్మునికి తండ్రి జూపిన దయను (37[11] కార్య 7[9]), కోరహు అహరోను ఉద్యోగ ఘనతను (సంఖ్యా 16[1] కీర్త 106[16]), ఇశ్రాయేలు పది గోత్రములవారు యూదాను (యెష 11[13]), ఎదోమీయులు ఇశ్రాయేలీయులను (యెహె 35[11]) చూచి అసూయ పడిరి. లోకు లందఱు అష్షూరువారికి కలిగిన వృద్ధిని జూచి యసూయపరులైరని 31[9] లో నలంకారరీతిగా నున్నది. యూదు లసూయా గ్రస్తులై క్రీస్తును సిలువవేసిరి (మ 27[18] = మా 15[10]). పౌలు పని ఫలితమును జూచి యూదులు మత్సరపడి అతనిని హింసించిరి (కార్య 13[45] 17[5]). క్రైస్తవులలోఁ గొందఱు సహ పౌలు పని ఫలితమును జూచి మత్సరపడి అతనికి శిక్ష కలిగించి తొందఱ పచ్చనలెనను ఉద్దేశముతో సువార్త ప్రకటించిరి (ఫిలి 1[15]).

మత్సరము శరీరకార్యములలో నొకటిగా నెంచఁబడెను (గల 5[20]). పాపముల వివరములలో నిది సాధారణముగా నగపడును (రోమా 1[29] 13[13] I కొరి 3[3] II కొరి 12[20] గల 5[20] తీతు 3[3] I తిమో 6[4] యాకో 3[14,16] I పేతు 2[1]).

దుష్టులు సౌఖ్యముగా నుండుటను జూచి నప్పుడు భక్తులైనవారు ఒకానొకప్పుడు మత్సరపడుట సంభవించును గాని అట్టివారి సౌఖ్యము నిలుకడలేనిది గావున అట్లు వారినిగూర్చి మత్సరముతో నిండుకొనుట బుద్ధిహీనతయని పాతనిబంధన నీతి బోధలయం దనేక హెచ్చరికలు గలవు (కీర్త 37[1] 73[3] సామె 3[31] 28[17] 24[1]).

మత్సరపడువానికి మనోనెమ్మదిలేదు. ఎదుటి పొయ్యి మండితే తన పొయ్యిలో నీళ్లుపోసి కొనినను సామెతే ప్రకారము బుద్ధిలేనివారు అసూయచే చచ్చెదరని ఎలీఫజు చెప్పినది న్యాయమే (యోబు $5^{2}$). ఆరోగ్యము నది చెడఁగొట్టి ఎముకలను కుళ్లఁజేయునని జ్ఞాని చెప్పెను (సామె $14^{30}$). నిరాశా కూపమునఁ బడిన ప్రసంగి చనిపోయినవారి కింతమాత్రము అసూయ యుండదనెను (ప్రస $9^{6}$). ప్రేమ యను గుణసంపన్నులగువారు మత్సరమెట్టిదో యెఱుఁగరు. ప్రేమ మత్సరపడదు (I కొరి $13^{4}$). ప్రేమమూర్తియగు క్రీస్తును ఒప్పుకొనిన వారిలో నిది ప్రేమలేకపోవుటచేతనే యున్నది (గల $5^{26}$) గాని మఱొక్క కారణమువలనఁగాదు.

పై వివరించిన వాక్యములలో మూలభాషల యందు ఒక హెబ్రీ పదమును రెండు గ్రీకు పదములును గలవు. వాటిలో నొక గ్రీకుపదము మత్సరపడుటను మాత్రము సూచించుచు, మత్సరము, అసూయ అను పదములచే తెనిఁగింపఁ బడెను (రోమా $1^{29}$ ఫిలి $1^{15}$ మొ॥). రెండవ గ్రీకు పదమును హెబ్రీ పదమును మత్సరపడుటచే కలుగు రోషమునుకూడ సూచించును గావున అనేక వాక్యములలో వాటిని రోషము అను పదముచే తెనిఁగించిరి. యాకో $4^{5}$ నందు ఆత్మ మత్సరపడుట యను వాక్యముయొక్క భావమును గూర్చి భిన్నాభిప్రాయము లుండినను ఈ పదములలో నది మొదటిదైనను ఆత్మకు కలిగెడి యాసక్తిని సూచించు ననఁదగును. (సంఖ్యా $25^{11}$ లో చూ॥). ఫీనెహాసు మిద్యానీయురాలిని ఒకఁడు ఉంచుకొనుటను చూచి కనఁబఱచిన ఓర్వలేనితనము అట్టి ఆసక్తియై యుండెను. దుష్టత్వమును సహింపలేకపోవుట మంచి లక్షణమై యున్నది. (రోషము చూ॥).

**మత్స్యపు గుమ్మము** యెరూషలేము B IV 3 (*c*) చూ॥.

**మత్రీ** (Matri = వాన). బెన్యామీనీయులలో నొక తెగవారి పూర్వికుఁడు. అతని సంతానీకులకు మత్రీ యింటి కూటము అను పేరు గలదు. రాజైన సౌలు ఈ తెగవాఁడు (I సమూ $10^{21}$).

**మద్దెల** సంగీతము 3 (*l*) (*c*) చూ॥

**మద్మన్నా** (Madmannah = పేఁడదిబ్బ). యూదావారి స్వాస్థ్యములోని దక్షిణభాగమం దున్న నొక యూరు (యెహో $15^{23}$). కాలేబు సంతతివాఁడగు మద్మన్నా యను వానిచే దీనికీ పేరు వచ్చినట్లున్నది (I దిన $2^{49}$). యెహో $19^{5}$ నందు దీనికిబదులు బేత్మర్కాబోతు అను పదముండుటచే అది ఈ యూరికి మాఱుపేరని యను కొందురు (పటము II, D 3).

**మద్మేనా** 1. (Madmen = పేఁడకుప్ప). మోయాబులో నున్న పట్టణములలో నొకటి (యిర్మీ $48^{2}$). ఇది యెష $15^{9}$ లో నున్న దీమోనుకు మాఱు పేరని వేదశాస్త్రుల యభిప్రాయము. సంఖ్యా $21^{30}$ లో నుండు దీబోనుకును మాఱుపేరని తలంచెడివారును గలరు (దీబోను చూ॥).

2. (Madmenah). యెరూషలేమున కుత్తరముగా బెన్యామీనుగోత్ర స్వాస్థ్యములో నున్న యొక స్థలము (యెష $10^{31}$). దీనియునికిని గూర్చి నూటిగాఁ దెలియదు.

**మద్యము** ద్రాక్షారసము, త్రాగుట చూ॥

**మధురము** (Sweet). మనోహరమైన దానిని సూచించుటకు అలంకార రీతిగా నుపయోగించిన పదము (సామె $16^{24}$). దేవుని వాక్యము మధురమైనదిగా నెంచఁబడినది (కీర్త $19^{10}$). దేవుని తీర్పులను సూచించు వాక్యము భక్తుని కెంత యిష్టముగా నుండినను ఆ తీర్పులవలన కలుగు నాశనమును గుఱించి యతఁడు దుఃఖించినను సంగతి మొదట మధురముగాను తరువాత చేదుగా నగునను దృష్టాంతమువలనఁ దెలిసికొనవచ్చును (చేదు చూ॥).

**మధ్యవర్తి** (Mediator). ఈ పదము బైబిలునందు కనఁబడుట బహు అరుదు. యోబు $9^{33}$ నందు ఆ పదము వచ్చునుగాని అది యిద్దరి మధ్య న్యాయము తీర్చువానిని సూచించును. ఇది క్రొత్త నిబంధనపదమై మోషేను గూర్చియు (గల $3^{19,20}$), క్రీస్తును గూర్చియు (I తిమో $2^{5}$ హెబ్రీ $8^{6}$ $9^{15}$ $12^{24}$) వాడఁబడెను. ఈ పదము ఎక్కువగా బైబిలునందు కనఁబడకున్నను, బైబి లంతటిలోనున్న ఒక ముఖ్యమైన సంగతియై

యున్నది. ఇద్దఱికి మధ్య వైరమున్నపుడుగాని, స్థితిగతులయందు దిద్దఱికి గొప్ప భేదముండి వారికి మధ్య స్నేహము కలిగించుటకుగాని, ఇతర పనులు జరుపుటకుగాని మధ్యవర్తి యుండుట అవసరముగా నున్నది. హీనదశయందున్నవాని పక్షముగా గొప్పవానితో మనవిచేయుటయు, గొప్పవాఁడు అట్టి హీనునికి చేయఁదలంచిన మేలును గూర్చి వానికిఁ దెలుపుటయును ఆ మధ్యవర్తి చేయఁగలిగిన పనులైయున్నవి. మన బైబిలు నందు ఆ గొప్పవాఁడే దేవుఁడు, హీనుఁడే నరుఁడు. వారిద్దఱి కుండవలసిన స్నేహము పాపమువలన చెడిపోఁగా, వైరము కలిగెను. గనుకనే మన పక్షముగా విజ్ఞాపనము చేయుటయు, దేవుని పక్షముగా మనకు ప్రకటించుటయు నను రెండు పనులు మధ్యవర్తియైనవాఁడు చేయవలసి యున్నది.

1. విజ్ఞాపనము చేయుట. మానవులయందు ఒకరి పక్షముగా నొకరు విజ్ఞాపనము చేయుదురు. యోనాతాను సౌలుయెదుట దావీదు పక్షముగాను (I సమూ 19[4]), అబీగయీలు దావీదు నెదుట నాబాలుపక్షముగాను (25[18-31]) సిరియారాజు ఇశ్రాయేలురాజును నయమానుకొఱకును (II రాజు 56) విజ్ఞాపనము జేసిరి. మఱి ముఖ్యముగా భక్తు లితరులపక్షముగా దేవునికి విజ్ఞాపనము చేయుదురు. అబ్రాహాము అబీమెలెకు కొఱకును (ఆది 20[7,17]), సొదొమ గొమొఱ్ఱాల కొఱకును (18[23-33]), మోషేఫరో నిమిత్తమును ఐగుప్తీయుల నిమిత్తమును (నిర్గ 8[8-30] 9[28-33] 10[17-18]), ఇశ్రాయేలీయుల కొఱకును (17[11] 33[13] ద్వితీ 9[18]), సమూయేలు ప్రజలనిమిత్తమును (I సమూ 7[5] 12[19,23] యిర్మీ 15[1]) విజ్ఞాపనము చేసిరి. యోబు తనను గద్దించినవారికొఱకు విజ్ఞాపనము చేయునట్లు అతనిని వారు బ్రతిమాలవలయునను ఆజ్ఞ యోబు 42[8] నందున్నది.

ప్రజలనిమిత్తము విజ్ఞాపనముచేయుట యాజకుల ధర్మవిధులలో నొక ముఖ్యధర్మమై యున్నది (నిర్గ 30 లేవీ 16). దూతలు మనుష్యులకొఱకై విజ్ఞాపనము చేయుచున్నట్లు అప్రమాణిక గ్రంథములలోఁ గొన్ని సూచనలు గలవు (టోబీతు 3[26] హనోకు 13[6-7]). ఈ గ్రంథములను ప్రమాణములుగా నంగీకరించు రోమను గ్రీకు సంఘముల వారు పరిశుద్ధుల యొక్కయు, దూతల విజ్ఞాపనల కొఱకు ప్రార్థించెదరుగాని అది బైబిలు బోధలకు భిన్నముగా నున్నది (ప్రక 22[9]). దేవునికిని మానవులకును మధ్యవర్తి యొకఁడే (I తిమో 2[5]). ఆయనే యేసుక్రీస్తు. ఆయన పాపులకొఱకు విజ్ఞాపనము చేయునని ముందుగానే ప్రవచింపఁబడెను (యెష 53[12]). యోహా 17 లోని ప్రార్థన ఆయనచేయు విజ్ఞాపనల కొక దృష్టాంతము. ఆయన దేవుని కుడిపార్శ్వమున నున్నవాఁడై మనకొఱకు విజ్ఞాపన చేయుచున్నాఁడు (రోమా 8[34]). మన యనుభవములలో పాలివాఁడైన ఈయన మనకొఱకిట్టి ప్రధాన యాజక ధర్మమును సంపూర్ణముగా చేయుటకు శక్తిమంతుఁడై యున్నాఁడు (హెబ్రీ 2[17,18] 4[14,16]).

2. దేవుని చిత్తమును ప్రకటించుట. మానవులు స్వయముగా దేవుని చిత్తమును కనుగొనుట అసాధ్యమైన సంగతి. వారి క్రియలు చెడ్డవిగాన దానిని తెలిసికొనవలెనను ఆశయు లేక యున్నది. కావున మధ్యవర్తి యొకఁడుండుట అత్యవసరము. ఇశ్రాయేలీయులకు దేవుని చిత్తమును దెలుపుటకై మోషే మధ్యవర్తిగా నుండెను (నిర్గ 20[19] హెబ్రీ 8[6] గల 3[19,20]). ప్రధాన యాజకులు దేవునియెడల చూపవలసిన ధర్మవిధులను ప్రజలకు బోధించుటచే వారికి మధ్యవర్తులుగ నుండిరి. ప్రవక్తలు ముఖ్యముగా దేవునికిని మానవులకును ఈ విషయములో మధ్యవర్తులుగా నుండిరి. గాని వీరందఱికన్న యేసుక్రీస్తే గొప్ప మధ్యవర్తి. ఆయన క్రొత్త నిబంధనను మనకుఁ దెలుపుటయే గాక (హెబ్రీ 8[6] 9[15] 12[24]) మన నిమిత్తము చనిపోయి దాని నేర్పఱచుటచేత (9[11-15]), దేవుని న్యాయమును కనికరమును, మన రక్షణార్థమై ఆయనకున్న పూర్ణ ఉద్దేశమును వివరపఱచినందున, మనకును దేవునికిని సంపూర్ణుఁడగు మధ్యవర్తి యయ్యెను.

**మనయేను** (Manaen = ఆదరించువాఁడు). అంతియొకయలోని బోధకులు ప్రవక్తలలో నొకఁడు. పౌలును బర్నబాను మిషనుపనికై ప్రత్యేకించినవారిలో నుండెను (కార్య 13[1] ప్రవక్తలు, బోధకులు చూ॥). చతుర్థాధిపతియగు హేరోదు అంతిపతో కూడ పెంచఁబడినవాఁడు.

మూలభాషయందలి పదము హేరోదు స్నేహితుఁడని యర్థమగునందురుగాని అనేకులు తెలుఁగులో నున్నదే సరియైన యర్థముగా నెంతురు. యూదులలో నా కాలమందున్న మనహేము (=మనయేసు) అను సాధువు మహా హేరోదు చిన్నవాఁడై యుండఁగా అతఁడు దేశమునకు రాజగునని ప్రవచించినట్లును, అందువలన హేరోదాతనిని మిగుల దయగాఁ జూచినట్లును యోసీఫసు వ్రాయుచున్నాఁడు (పురా 15. 10. 5). ఇతని కుటుంబికులలో నొకని తన బిడ్డలతో పెంచియుండును గాన అట్లు పెంచఁబడినవాఁ డితఁడైయుండవచ్చును గాని అది రూఢియని చెప్పుటకు తగిన యాధారములు లేవు.

## మనష్షే, మనష్షీయులు (Manasseh = మఱచిపోవునట్లు చేయుట).

1. యోసేపుయొక్క జ్యేష్ఠకుమారుఁడు (ఆది 41[51,52]). యాకోబు యోసేపుయొక్క కుమారుల నిద్దఱిని ఆశీర్వదింపఁగా ఇతనిమీఁద ఎడమచేతి నుంచి యితనికంటె నితని తమ్ముఁడగు ఎఫ్రాయిము గొప్పవాఁ డగునని సూచించెను (48[8-21]).

2. మనష్షే సంతతివారికి మనష్షేగోత్రము, మనష్షీయులు అను పేరు కలదు. ఆ గోత్రములో ఏడుతెగ లుండెను. ఇందులో నొక తెగకు మనష్షే కుమారుఁడగు మాకీరు పూర్వికుఁడై యుండెను. తక్కిన ఆఱు తెగలకు మనష్షే మనుమఁడగు గిలాదు పూర్వికుఁ డయ్యెను (ఆది 50[23] సంఖ్యా 26[28-34] యెహో 17[2]). సంఖ్యా కాండములో నున్నట్లు వారు మొదటిపర్యాయము లెక్కింపఁబడినపుడు 35,200 మంది యోధులును (సంఖ్యా 1[34,35]), రెండవ పర్యాయము లెక్కింపఁబడినపుడు 52,700 మందియు (26[34]) నుండిరి. మోషే యొర్దానుకు తూర్పున నున్న దేశమును జయించినపుడు ఈ గోత్రపు వారిలో సగముమంది రూబేనీయులతోను గాదీయులతోను గలసి యొర్దానుకు తూర్పుభాగమును తమ కియ్యవలసినదిగా మనవిచేసిరి (సంఖ్యా 32[33-42] 34[14,15] ద్వితీ 3[12,13] 29[8] యెహో 12[4-6] 18[7]). అందువలన వారి కా ప్రదేశములో ఉత్తరభాగమునిచ్చిరి (పటము IX). వారప్పు డొప్పుకొనినట్లుగానే పలెస్తీనును స్వాధీనపఱచుకొనుటలో యెహోషువ కాలములో సహాయము చేసియుండిరి. యెహోవా వారికి సెలవిచ్చిన పిమ్మట తూర్పువారితోఁగలసి క్రొత్తమతమును స్థాపింపఁబోవుచున్నారని యొర్దానుకు పశ్చిమమునున్న ఇశ్రాయేలీయు లనుకొని వారిమీఁద యుద్ధము చేయఁబోయిరి గాని సంగతిని విచారింపఁగా క్రొత్త మతమును స్థాపింపవలెనను నుద్దేశము వారికి లేదని తెలిసికొని యుద్ధము చేయకుండ సమాధాన పడిరి (22[1-34]). మనష్షే యొక్క రెండవ యర్థగోత్రమునకు యొర్దానుకు పడమట ఎఫ్రాయిమున కుత్తరమున స్వాస్థ్యమును గ్రహించిరి గాని వారచటనుండు కనానీయులను వెళ్లఁగొట్టక వారిని తమ మధ్య నుండనిచ్చి వారివలన కప్పము పుచ్చుకొనుచుండిరి (17[12,13] న్యాయా 1[27,28]). న్యాయాధిపతియగు గిద్యోను ఈ గోత్రపువాఁడై యుండెను (6[15]). దావీదును సిక్లగులో కలిసికొనినవారిలో ఈ గోత్రపువారు కూడ నుండిరి (I దిన 12[19-20]). దావీదు హెబ్రోనులో నేలుచుండఁగా మనష్షే వారిలో 18,000 మంది అతనికి సహాయము చేయుదుమని మాట నిచ్చిరి (12[30]). వారు ఇశ్రాయేలీయుల రాజ్యములో చేరినను వారిలో కొందఱు యూదా రాజగు ఆసాకు లోఁబడుచుండిరి (II దిన 15[9]). ఈ విధముగా వారు హిజ్కియా యోషీయా యను రాజుల కాలములోకూడ యూదా గోత్రికులు ఆచరించిన పస్కా పండుగలోను పాలు పుచ్చుకొనుచుండిరి (30[1-18] 31[1] 35[6-9]).

3. మోషేయొక్క మాఱుపేరు (న్యాయా 18[30]). తెలుఁగు బైబిలునందు దీనిని మోషే యని వ్రాసిరిగాని హెబ్రీభాషలో మనష్షే అని యున్నది.

4. హిజ్కియా కుమారుఁడు. అతని తద నంతరము యూదావారికి రాజాయెను. క్రీ॥ 698 సం॥మున పన్నెండేండ్ల ప్రాయమప్పుడు సింహాసనాసీనుఁడయ్యెను. తనకుముందు జరిగిన దిద్దుబాటు నంతటిని పాడుచేసెను. ఉన్నతస్థలములను, బయలు దేవతా బలిపీఠములను, దేవతా స్తంభములను తిరిగి కట్టించెను. యెహోవా మందిరమునకు సంబంధించిన రెండు శాలలలో నక్షత్రములకు బలి పీఠములు కట్టించెను. తన

కుమారుని అగ్నిహోత్రమున నడిపించెను. ప్రవక్తలెంత బోధించినను వారి బెదరింపులను లెక్కచేయక పెడచెవిని బెట్టుటయే గాక నిరపరాధుల రక్తమును యెరూషలేము వీధులయందు దెల్లెడలను ప్రవహింపఁజేసెను. యెహోవాయందు భయభక్తులు గలిగి ఇతఁడొనర్చు భక్తిహీనకార్యములను ఎదిరించి నిలిచినవారే ఈ నిరపరాధులై యుండిరనుట కెట్టి సందేహమునులేదు (II రాజు $21^{1-16}$). యెషయా వీరిలో నొకఁడని పారంపర్యముగలదు గాని ఆ సంగతినిగూర్చి రూఢిగాఁ దెలుప వీలుగాదు. ఈ దుష్కార్యముల కన్నిఁటికి శిక్షగా నతఁడు శత్రువులచేతి కప్పగింపఁబడెను. ఏసర్హద్దోను, అషుర్బనిపాల్ అను నిద్దరు అష్షూరురాజులితనివలన కప్పముగొనినట్లు తెలియుచున్నది. తన సహోదరుఁడగు బాబెలు రాజు ఎదురు తిరిగినందున వానిని జయించి బాబెలుకును అష్షూరుకును క్రీ॥ ము॥ 647 సం॥న రాజైన అషుర్బనిపాల్ అనువాఁడే మనష్షేను చెఱగొనిపోయెనని యెంచవచ్చును (II దిన $33^{11}$). మనష్షే పశ్చాత్తాపపడినందున మఱల రాజాయెను. తన నాశనమునకు కారణములైన విగ్రహముల నతఁడు త్రోసివేసి యెహోవా నారాధించుటకు తగిన కట్టుదిట్టము లేర్పఱచెను. యెరూషలేమునందలి కోటగోడలను కట్టించి వాటిని బలపఱచెను ($33^{12-19}$). ఇతఁడేలినంత కాలము మరే రాజు ఇశ్రాయేలీయులలో నుండలేదు. అతఁడు 55 సం॥ లేలి క్రీ॥ ము॥ 642 నందు మృతి నొందెను. ఇతని తరువాత ఆమోను యూదా రాజయ్యెను (II రాజు $21^{17,18}$ II దిన $33^{20}$). మనష్షే చేసిన ప్రార్థనను గుఱించి అప్రమాణిక గ్రంథములు చూ॥

5, 6. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టినవారిలో నిద్దరు (ఎజ్రా $10^{30-33}$).

**మనస్సాక్షి** మనుష్యుడు 5 చూ॥

**మనస్సు** మనుష్యుడు 4 చూ॥

**మనహాతు** (Manahath = విశ్రాంతి).

1. ఎదోమీయులలోని నొక తెగవారి పూర్వికుఁడు (ఆది $36^{23}$ I దిన $1^{40}$).

2. యూదావారి సరిహద్దులలో నుండిన యొకస్థలము. బెన్యామీనీయులలో కొందఱిని చెఱబట్టి కొంచుపోయి యుంచినచోటు (I దిన $8^{7}$). దీని నివాసులకు మానహతీయులని పేరు. వారు కాలేబు సంతతిలో చేరినవారు ($2^{54}$).

**మనుమడు** బంధువుడు 6 చూ॥

**మనుష్యకుమారుడు** యేసుక్రీస్తు IV 3 (1) *d* చూ॥

**మనుష్యహత్య** నేరములు శిక్షలు II 3 (1) చూ॥

**మనుష్యుడు, నరుడు, నరజాతి** (Man.) ఇతర విషయములందువలె మానవుని విషయమును బైబిలు సంగతులన్నిఁటిని వివరింపక అతనికి దేవుని యెడలను, తోటి మానవులయెడల నుండు సంబంధమును గూర్చియు విధులను గూర్చియు మాత్రము తెలుపుచున్నది గాన మానవుని గూర్చి నవీన శాస్త్రజ్ఞులు వ్రాసెడి సంగతులన్నియు బైబిలునందుండక మానవసృష్టి, పాపపతనము, రక్షణ యనునట్టి సంగతులు ముఖ్యముగా నున్నవి.

1. మానవ సృష్టి:—మానవుఁడు దేవునివలన సృష్టింపఁబడెను (ఆది $1^{26-31}$ $2^{8-15}$). వాని దేహము మట్టియైనను ఆత్మమాత్రము దేవుని యాత్మకు సంబంధించినదని నేల మంటితో దేవుఁడు నరుని నిర్మించి వాని నాసికారంధ్రములలో జీవవాయువును ఊదెనను మాటలవలనఁ దెలియుచున్నది ($2^{7}$). నరుఁడు దేవుని పోలికగా సృష్టింపఁబడెను ($1^{26}$ $5^{1}$ $9^{6}$ యాకో $3^{9}$). ఆ పోలిక దేహసంబంధమైనదని కొందఱనుకొనినను అది ఆత్మపోలికయై జ్ఞానము (కొలొ $3^{10}$), నీతి పరిశుద్ధత (ఎఫె $4^{24}$) అను ఆత్మీయగుణ లక్షణముల యందు కనఁబడును. వానికి సృష్టి యంతటి మీఁద నియ్యబడిన అధికారముకూడ ఆ దైవపోలికకు సంబంధించినదనియు (ఆది $1^{28}$ కీర్త $8^{5-9}$) తెలియుచున్నది. ఈ యధికారము మాదిరి మానవుడైన యేసుక్రీస్తునందు పూర్ణముగాఁ బ్రకాశించెను (హెబ్రీ $2^{5-10}$). నరజాతిని పురుషులుగాను స్త్రీలుగాను దేవుఁడు సృజించెను (ఆది $1^{27}$ $2^{18-25}$ I కొరి $11^{9-12}$). సృష్టియందు పురుషునికి పెత్తన ముండినను దేవునియెదుట స్త్రీ పురుషులు సమానులై యున్నారు (గల $3^{28}$). మాన

వుఁడు దేవుని పోలికెగా సృష్టింపఁబడి నిర్దోషియై యుండినను నీతియందు స్థిరపరచఁబడినవాఁడై యుండక శోధనలను స్వయముగా జయించుట చేత అట్టి స్థితినొంద వలసినవాఁడై యుండెనుగాన అట్టి శోధనలు అతఁడు నీతియందు స్థిరపడుటకు అవసరమైనవిగా నుండెనని చెప్పఁదగును. శోధన సమయమున వారు పాపములో పడిపోయినందున పాపముచేయుట మానవుల నైజగుణమాయెను (ఆది 3 రోమా 1[22]). దేవుఁడు సృష్టించిన వాటన్నిఁటియందు మానవుఁడే గొప్పవాఁడైనను, అతఁడు మాత్రమే పాపముగలవాఁడై యున్నాఁడు. ఈ వ్యత్యాసము బైబిలునందు మాత్రమే గాక మానవుల చరిత్ర లన్నిఁటిలో ముఖ్యవిషయముగా నెంచఁదగును. (ఆదాము, పాపపతనము చూ॥).

2. మానవునికుండు భాగములు:—దేహమును బట్టి భూసంబంధియు, ఆత్మనుబట్టి దైవ సంబంధియునై యున్నందున మానవుఁడు రెండు భాగములు గలవాఁడై యున్నాఁడు (ఆది 2[7]). భూసంబంధమైనదానిని శరీరమనినను శరీరమను పదము పాత నిబంధనయందు లేదు. అచ్చట సర్వసాధారణముగా వాడఁబడిన మాంసము అని శబ్దార్థమిచ్చు పదము శరీరమును సూచించుచు అట్లు భాషాంతరము చేయఁబడెను (2[23,24] కీర్త 16[9] మొ॥). బైబిలునందు సమస్త శరీరులు అను పదము జీవరాసి కంతటికి ఉపయోగింపఁబడెను (ఆది 7[21] 9[11] మొ॥). కంటికి కనఁబడెడి భూసంబంధమగు మాంసము వాటి కుండుటచే ఈ పేరు కలిగెను గాని ఇది బైబిలునందు ముఖ్యముగా మానవకోటికి వాడఁబడిన పదమై యున్నది (యెష 40[5] 66[23] కీర్త 65[2] యెహె 20[48]). ఇది మానవుఁడు అనిత్యుఁడై కృశించిపోవు ననుటను సూచించుచున్నది. సమస్త శరీరులు తమ మార్గమును చెఱిపివేసికొని యుండుటచే (ఆది 6[12]) శరీరము (=మాంసము) మానవుల బలహీనతకును దురేచ్ఛలకును సూచనయయ్యెను (శరీరము I 5 చూ॥).

పైన చెప్పినట్లు శరీరమునకు సంబంధించిన పేరులేగాక మానవుని జీవమునకు సంబంధించిన పేరులునుగలవు. మానవుఁడు జీవాత్మయయ్యెను (2[7]). ఈ పదము ప్రాణమని శబ్దార్థమిచ్చుచు పాత నిబంధనయందు మానవులను సూచించు సర్వ సాధారణమగు నామమయ్యెను (లేవీ 2[4,27] 5[1,2,4,15,17] 6[2]). ఈ వాక్యములలో ఒకఁడు అను పదముచే తెనిఁగించిన మూలభాషా పదము ప్రతి ప్రాణి యని యర్థమిచ్చును. ఈ పదమునే మానవుల విషయములోనే గాక మృగముల సంబంధమునందును వాడిరి (17[14,15]). జీవులు అని యర్థమిచ్చు పదము అచ్చటచ్చట మానవులను సూచించినను (ఆది 6[17,19]) సాధారణముగా మానవులు కాని యితరజీవులను సూచించెను (1[24] 2[19,20] మొ॥).

పై నుదాహరించిన పదములు దేహమునుగాని దేహమునకు సంబంధించిన స్వభావసిద్ధమగు ప్రాణమును గాని సూచించినను, మానవుని తెలివెడి మఱియొక పదము ఆత్మయని శబ్దార్థమిచ్చుచు అతనియందుండు శ్రేష్ఠమైన దైవసంబంధమగు దానిని సూచించును (క్రింద 4 (6) చూ॥). అది మానవుల ఆత్మకేగాక దేవుఁడు మానవులలో నుంచు ఆత్మకును పేరైయున్నది (యెహె 11[5] 18[31] 36[26] యోవే 2[28] మొ॥). ఈ పదము వాడఁబడిన సూచనలు చూడఁగా మాంసమును ప్రాణమును జీవమును కాని ఆత్మయున్నట్లు తేటయగుచున్నది. మానవులలో లోపటిభాగమును సూచించు అంతరంగము అను పదము దీనికి సంబంధించియున్నది (కీర్త 5[9] 103[1] యెష 16[11]).

క్రొత్త నిబంధనయందు శరీర ఆత్మల విభేదమును సూచించు మఱి తేటయగు వాక్యములున్నవి (మ 10[28] I పేతు 2[11] ప్రక 6[9] 20[4]). శరీరమును చంపినను ఆత్మను చంపనేరరని వాటి వలనఁ దెలియుచున్నది. మానవుఁడు రెండు భాగములు గలవాఁడైనట్లు దీనివలన కనఁబడును గాని, మఱి కొన్ని వాక్యములలో దేహము, ప్రాణము (జీవాత్మ), ఆత్మ యను మూఁడు భాగములున్నట్లు చూడవచ్చును (I థెస్స 5[23] హెబ్రీ 4[12]). అందువలన మానవుఁడు మూఁడు భాగములు గలవాఁడని కొందఱి యభిప్రాయము. పాత నిబంధనలో నున్నట్లుగానే ప్రాణమును సూచించు పదమొకటే క్రొత్త నిబంధనయందు గలదు. ఆత్మను సూచించునది వేఱొకటియై యున్నది. కావున మానవునికి దేహము ప్రాణము

ఆత్మ యను మూఁడు భాగములున్నవని అట్టివా రందురు గాని పరలోకమునందు నిత్యము జీవించు వారి ఆత్మలు మానవుల ప్రాణములై యున్నట్లు యోహాను తెలిపెను (ప్రక $6^{9}$ $20^{4}$). హెబ్రీ $12^{23}$ నందు అట్లు జీవించువారు నీతిమంతుల ఆత్మలు అనఁబడిరి గాన ప్రాణమును ఆత్మయు రెంటినిఁ గాక క్రొత్త నిబంధన గ్రంథకర్తలు ఒకటిగానే యెంచినట్లున్నది. మానవేతర జీవరాసికిని దేహము ప్రాణము అనునవి గలవుగాని దైవ సంబంధమైన ఆత్మలేదు గాన మానవుఁడు దేహము ప్రాణము ఆత్మయను మూఁడు భాగములు గలవాఁడనఁదగినను దేహము ప్రాణము నశించుననియు, ఆత్మ నశింపనిదియు నైనందున అతఁడు దేహము ఆత్మయను రెండుభాగములు గలవాఁడని చెప్ప వలసియున్నది. ఈ రెండువిధములగు భాగములు బైబిలునందున్నట్లు పై సంగతులవలనఁ దెలిసికొనవచ్చును.

**3**. మానవునిదేహము:—పైన చూచినట్లు శరీరము బలహీనతను సూచించినను బైబిలు శరీరము ఘనమైనదని బోధించుచున్నది. శిథిలమైనదైనను మానవుని యాత్మకు నివాసముగా నున్నది (II కొరి $5^{1}$). దేవుని యాత్మ నివసించు ఆలయముగా నెంచఁబడును (I కొరి $6^{19}$). కావున దీనిని తృణీకరింపక ఘనమైనదిగా నెంచి శుద్ధిగా కాపాడవలెను. శరీరపునరుత్థాన బోధ ప్రకారము, మనలో నున్న దేవుని ఆత్మనుబట్టి మన శరీరము లేపఁబడుననియు (రోమా $8^{11}$), అది అక్షయమును ఆత్మీయమునై మహిమపఱచఁబడిన క్రీస్తు శరీరమువలె నిత్యమైనదిగా నుండునని తెలిసికొనుచున్నాము (I కొరి $15^{35-49}$ ఫిలి $3^{21}$ శరీరాత్మలు చూ॥).

**4**. **మానవులమనస్సు లేక ఆత్మ**:—నవీన శాస్త్రజ్ఞులు మనస్సునుగూర్చి శాస్త్రీయముగా వివరించు విధములు బైబిలునందులేకున్నను మనో శక్తులలో ఆయావాటిని సూచించెడి పదము లక్కడక్కడ గలవు. పైన 2 నందు వివరింపఁబడినవిగాక ఈ దిగువనున్న వాటిని గుర్తించుట యుక్తము.

(1) **హృదయము** అను పదము సాధారణముగా మానవులకోరికలను (II సమూ $7^{3}$ మా $7^{21}$) సూచించినను, తలంపులకును ఊహలకును (ఆది $6^{5}$), జ్ఞానమునకును (I రాజు $4^{29}$ మనస్సు = హృదయము), కోపమునకును (ద్వితీ $19^{6}$ మనస్సు = హృదయము), బాధకును (సామె $14^{10}$), సంతోషమునకును (యెష $30^{29}$ కీర్త $104^{15}$), విరోధమునకును (నిర్గ $14^{5}$), ప్రేమకును (I సమూ $7^{3}$ I రాజు $8^{48}$ మ $22^{37}$ మా $12^{30}$), ఆలోచనకును (ఆది $8^{21}$ లూ $1^{17}$), జ్ఞాపకమునకును (I సమూ $21^{12}$ మనస్సు = హృదయము లూ $2^{19,51}$ $1^{66}$ మనస్సు = హృదయము), ఆత్మీయ సంగతులను గ్రహించుకొను వివేచనాబుద్ధికిని (ఎఫె $1^{17}$) మనోనేత్రములు = హృదయనేత్రములు ఉనికిపట్టయి యున్నట్లు ఆయా వాక్యములలో నున్నది. అయినను అది ముఖ్యముగా మానవులగుణములను సూచించును. ఒకనిగుణము చెడిపోవుట అతని హృదయము కఠినముగుటయైయున్నట్లు కనఁబడును (నిర్గ $4^{21}$ ద్వితీ $2^{30}$ యెహో $11^{20}$ ఎఫె $4^{18}$ మొ॥). ఒకఁడు గుణపడుట నూతనహృదయము గలిగినవాఁడైనట్లున్నది (యెహె $18^{31}$). మంచివాఁడు యథార్థహృదయముగలవాఁడు (ద్వితీ $9^{5}$ I రాజు $11^{4}$). తనకు శుద్ధహృదయముననుగ్రహించుమని భక్తుఁడు ప్రార్థించెను (కీర్త $51^{10}$). హృదయశుద్ధిగలవారు దేవుని చూతురని క్రీస్తు చెప్పెను (మ $5^{8}$). నిష్కపటముగా నొకపనిని చేయువాఁడు దానిని హృదయపూర్వకముగా చేయునట్లు చెప్పఁబడెను (కీర్త $15^{2}$ మ $18^{35}$). దేవుని మనస్సులోని సంగతులన్నిఁటి నెఱిగినవాఁడు ఆయన హృదయమును పరిశోధించువాఁడనఁబడెను (లూ $16^{15}$ ప్రక $2^{23}$). వీటన్నిఁటినిబట్టి హృదయము మనస్సునకు మాఱు పేరని ఆయా వాక్యములలో కనఁబడినను అది ముఖ్యముగా మనస్సులోని నీతివిషయములను వివేచించి వాటిని లక్షించునట్టియు నిర్లక్ష్యముచేయునట్టియు బుద్ధిని సూచించును.

(2) **అంతరింద్రియములని** తెనిఁగించిన పదమనేక వాక్యములలో హృదయమనుదానికి సాటియైనదై యున్నది (కీర్త $7^{9}$ $26^{2}$ $73^{21}$ యిర్మీ $11^{20}$ $20^{12}$ ప్రక $2^{23}$). దీని యసలు పదము ఆంత్రములు లేక మూత్రగ్రంథులు అని యర్థమిచ్చును. ఆ పదము ఆంతర్యబుద్ధికి సూచనగా నున్నది (యిర్మీ $12^{2}$). ఆంత్రములు సంతోషమునకును (సామె $23^{16}$) గొప్ప బాధకును

(యోబు 19[27]) ఉనికియై యున్నట్లున్నది. సరియైన కోరికలు మనలను సరిగా నడిపించును కావున అవి భక్తుని నడిపించునట్లున్నవి (కీర్త 16[7]) గాని వాటిని కలిగించినవాఁడు దేవుఁడను సంగతిని మరువరాదు (139[13]). మానసికమగు ఇట్టివాటన్నిఁటికి మెదడేగాని మూత్రగ్రంథులు ఉనికి కాదని యిప్పటివారెఱిఁగి యున్నందున ఆ పదమును అంతరింద్రియములని తెనిఁగించుట న్యాయమైయున్నది.

(3) **ప్రేగులు** గొప్పదుఃఖమునకును జాలికిని ఉనికిపట్టు అని బైబిలుకాలపువారనుకొని వాటిని సూచించుటకు ఆ పదము నుపయోగించినను తెలుఁగు బైబిలునందు దానిని యోబు 30[27] లో మాత్రముంచిరి. దీనిని ఇతరవాక్యములలో కడుపు అనియు (యిర్మీ 4[19] 31[20]) అంతరంగమనియు (పర 5[4] విలా 1[20] 2[11]), దయారసమనియు (ఫిలి 1[3] 2[1]), జాలిగల మనస్సనియు (కొలా 3[12]), హృదయమనియు (ఫిలి 7), ప్రాణమనియు (12), ఆనందమనియు (20), కనికరమనియు (I యోహా 3[17]) తెనిఁగించిరి. ఈ దేశమునందు కడుపు నీరైపోవుట అను పదములు జాలిని దుఃఖమును సూచించునట్లుగా అవి యర్థమిచ్చెను.

(4) **మనస్సు:** మూలభాషయందలి కొన్ని పదములను మనస్సు అని తెనిఁగించిరి. ప్రాణమని సాధారణముగాఁ దెనిఁగించిన పదమును (పై 2 చూ॥) లూ 10[27] ఫిలి 1[27] I పేతు 1[22] కార్య 14[2] 14[22] 15[24] నందు మనస్సు అనియు, I థెస్స 5[23] జీవము అనియు, ఎఫె 6[6] మనఃపూర్వకముగా అనియు, కొలా 3[23] మనస్ఫూర్తిగా అనియు తెనిఁగించిరి. ఆ పదము మన స్వాభావిక జ్ఞానమును సూచించును ఇంకొక పదము మన యోచనలను సూచించుచు లూ 22[37] హెబ్రీ 8[10] 10[16] I పేతు 1[13] II పేతు 3[2] లో మనస్సు అనియు, మా 12[30] లూ 10[27] I యోహా 5[20] లో వివేకమనియు లూ 1[51] లో ఆలోచన యనియు తెనిఁగించఁబడెను. లోతు కుండిన నీతిగల మనస్సునుగూర్చి II పేతు 2[8] లో ఈ పదమే వాడఁబడెను. మన స్వంత తలంపులు మనలో నున్న దుష్టగుణమువలన చెడిపోవునను సంగతిని సూచించుటకై ఇది అందమైన మనస్సు అనఁబడును (ఎఫె 4[18] కొలా 1[21]). అట్టి దుష్టతలంపులు మనస్సుయొక్క ఇచ్ఛలనఁబడును (ఎఫె 2[3]). LXX నం దీ పదము హృదయమని అర్థమిచ్చుమాటలో భాషాంతరము చేయఁబడిన వాటిలో నొకటియై యున్నది (పైన (1) చూ॥).

మనస్సు అని సాధారణముగా తెనిఁగించిన పదము మఱియొకటియై గ్రీకువారిశాస్త్రములను అనుసరించి మనము మనస్సు అని యెంచు దానిని మఱి చక్కఁగా సూచించును. గ్రీకువిద్యల నభ్యసించిన పౌలు దానిని విశేషముగా వాడెను. అది వివేచించు బుద్ధిని సూచించును (లూ 24[45] I కొరి 14[14,19]). ఈ మనస్సు శరీరమునకు భిన్నముగా నుండు మంచిబుద్ధిని సూచించును (రోమా 7[23,25]). ఆ పదమును తలంపులనియు (ఫిలి 4[7]), బుద్ధియనియు (ప్రక 13[18] 17[17]), ఆత్మ యను పదముతో చేర్చి చిత్తవృత్తియనియు (ఎఫె 4[23]) తెనిఁగించిరి. ఈ పదము ప్రభువునుగూర్చి వాడఁబడెను (I కొరి 2[16] రోమా 11[34]). క్రీస్తునను సరించు వారు క్రీస్తు మనస్సుగలవారై యుందురను వాక్యముగలదు (I కొరి 2[16]).

సరియైన వివేకముగల మనస్సు ఇంత శ్రేష్ఠమైనదిగా నుండినను దేవునికి తమ మనస్సులో చోటునియ్యనొల్లనివారి మనస్సు చెడిపోయి (రోమా 1[28]), మాయకులోనై (ఎఫె 4[18]), శరీరమునకు సంబంధమైన మనస్సు అగును (తీతు 1[15]). తప్పుబోధలను అనుసరించువారు చెడిపోయిన మనస్సుగలిగి (I తిమో 6[5] II తిమో 3[8]), చంచలమనస్కులగుదురు (II థెస్స 2[2]). పౌలు ఈ పదమునుకూడ వాడి సద్వివేక మనస్సుగలవారు కావలెనని వారిని హెచ్చరించెను.

(5) **మనస్సాక్షి:** ఇది తప్పొప్పులను వివేచించు బుద్ధిని సూచించును. దానికి బదులుగా హృదయము జ్ఞానము దేవోక్తి మొ॥ పదములను కూడ వాడిరి. క్రొత్త నిబంధనలో పౌలు ముఖ్యముగా గ్రీకుశాస్త్రజ్ఞులు వాడిన పదము నుపయోగించెను. అట్టి తప్పొప్పులను వివేచించు బుద్ధి అందఱికుండుటచే దేవుఁడు తన ధర్మశాస్త్రమును అందఱికిచ్చెనని వ్రాసెను (రోమా 2[15]). పౌలు తనలో నున్న మనస్సాక్షికి లోఁబడుటకు యథార్థముగా యత్నించితినను సందర్భమునం దీ పదము నే

మఱిమఱి వాడెను (కార్య 23$^{1}$ 24$^{16}$ రోమా 9$^{3}$ II కొరి 1$^{12}$ I తిమో 1$^{5}$ II తిమో 1$^{3}$ హెబ్రీ 13$^{18}$). ఇతరుల మనస్సాక్షికూడ అతఁడు చేసినది న్యాయమని ఒప్పుకొనునట్లు ప్రవర్తించెను (II కొరి 4$^{2}$ 5$^{11}$). తమ మనస్సాక్ష్యమునుబట్టి అధికారులకు లోఁబడవలెనని పౌలును (రోమా 13$^{5}$), ఎదిరింపక శ్రమనొందవలెనని పేతురును (I పేతు 2$^{19}$) హెచ్చరించిరి. కొందఱి మనస్సాక్షి బలహీనమైనది కావున వారిని నొప్పించకుండునట్లు మఱి జాగ్రత్తపడవలెను (I కొరి 8$^{7}$ 10$^{29}$). తప్పు చేసెడివారు తమ మనస్సాక్షిచే గద్దింపఁబడెదరు (యోహా 8$^{9}$ భాషాంతరము). మూర్ఖముగా పాపముచేయువారికి వాఁతవేయఁబడిన మనస్సాక్షి గలదు (I తిమో 4$^{3}$). అట్టిది తప్పొప్పుల నిఁకను గుర్తించక కఠినపఱచఁబడిన హృదయమువలె నుండును (పైన (1) చూ॥). అట్లు వారు పవిత్రమైన మనస్సాక్షిని త్రోసివేయువారగుదురు (I తిమో 1$^{19}$). వారికి సమస్తమును అపవిత్రమగును (తీతు 1$^{15}$). పాపముచేయువారి మనస్సాక్షిని పవిత్రపఱచుట కన్ని యర్పణలైననుగాక క్రీస్తురక్తము మాత్రము చాలియుండును (హెబ్రీ 9$^{14}$ 10$^{2}$). పవిత్రమైన మనస్సాక్షిని దక్కించుకొనుటకు ప్రయత్నించవలెను (I తిమో 3$^{9}$). బాప్తిస్మముయొక్క అంతర్యభావము ఇట్టి మనస్సాక్షి ఒకనిలో పుట్టుటైయున్నది (I పేతు 3$^{21}$ హెబ్రీ 10$^{22}$). మనలోని మనస్సాక్షి దేవుని ధర్మశాస్త్రమై యున్నను అది మన దురాశలచే చెడిపోయినందున నూతన పఱచఁబడవలెనని దీని వలన స్పష్టమగుచున్నది (అమరత్వము చూ॥).

(6) **ఆత్మ.** పైన ప్రాణము అని సాధారణముగా తెనిఁగించిన పదమును ఆయా వాక్యములలో ఆత్మయను పదముచేకూడ తెనిఁగించిరి (మ 10$^{28}$ కార్య 2$^{27}$ 4$^{32}$ II కొరి 12$^{15}$ హెబ్రీ 6$^{19}$ 10$^{38,39}$ 13$^{17}$ యాకో 1$^{21}$ 5$^{20}$ I పేతు 2$^{11}$ 4$^{19}$ 3 యోహా 2 ప్రక 6$^{9}$ 20$^{4}$) గాని, దేవుని సంబంధముకలిగి ఆయనతో సహవాసముచేయు పరమజ్ఞానమును సూచించునది సాధారణముగా బైబిలునందు మఱియొక దివ్యమైన పదమై యున్నది. దాని మూలపదము హెబ్రీ భాషలోను గ్రీకు భాషలోను వాయువు అని శబ్దార్థమిచ్చుచు మనలోనున్న అగోచరమగు దానిని సూచించును. ఇట్టి గొప్పతనము మానవుల ఆత్మకున్నట్లు పాఁత నిబంధనయందు సూచనలున్నవి (ఆది 2$^{7}$ ప్రస 7$^{12}$ కీర్త 31$^{5}$). క్రొత్త నిబంధన వలన ఇది మనలోని సంగతులను తెలిసికొను ఆత్మయై దేవుని ఆత్మకు సంబంధించినదై యుండును (I కొరి 2$^{11}$). శరీర బలహీనతలకు భిన్నముగా నుండు మంచి ఆత్మకు క్రీస్తువాడిన దీ పదమే (మ 26$^{41}$ మా 14$^{38}$). పాఁత నిబంధనలోను క్రొత్త నిబంధనలోను ఇది దేవుని యాత్మ అను పరిశుద్ధాత్మకు కూడ వాడఁబడిన పదమైయున్నది (శరీరాత్మలు, పరిశుద్ధాత్మ చూ॥).

**మనుష్యునిమూర** మానసులు I 1 చూ॥

**మన్నా** (Manna). ఇశ్రాయేలీయులు అరణ్యమందు తినిన ముఖ్యాహారము (నిర్గ 16$^{1-35}$ యెహో 5$^{12}$). ఇదేమి అని యిశ్రాయేలీయులు ఆశ్చర్యముతో నడిగిన మాట ఇదే యని నిర్గ 16$^{15}$ వలనఁ దెలియును మన్నాను గూర్చిన వివరము 16$^{21-31}$ సంఖ్యా 11$^{7,8}$ లలో నున్నది. కొందఱది యొక తరహా చెట్టులోనుండి కారిన బంకవంటి రసమనుకొందురు. ఇది నిజమైనయెడల దేవుఁడేలాగు అద్భుతరీతిగా పూరిటిపిట్టలను పంపించి యిశ్రాయేలీయులకు మాంసము నిచ్చెనో (11$^{31,32}$) ఆలాగే ఆయన ఇట్టి చెట్లరసమును విస్తరింపఁజేసి వారికొఱ కాహారమును సిద్ధపఱచెనని యనుకొనవలసి యుండును. ఆయన యీ రీతిగా నిచ్చినను వేఱొక రీతిగా నిచ్చినను అది యాయన అద్భుతరీతిగా నిచ్చిన యాహారమైయున్నట్లు తెలిసికొనవలెను. ఇది అద్భుతరీతిగా నియ్యఁబడిన ఆహారమైయున్నట్లు బైబిలునందంతట నున్నది (నెహె 9$^{20}$ కీర్త 78$^{24,25}$ 105$^{40}$). దీనికి జ్ఞాపకార్థముగా ఇశ్రాయేలీయులు మన్నాగల ఒక గిన్నెను మందసము నెదుట పెట్టుచుండిరి (నిర్గ 16$^{33,34}$ I రాజు 8$^{9}$). ఇది యద్భుతరీతిగా నియ్యఁబడిన యాహారమగుటచేత క్రీస్తునకు తగిన ముంగుఱుతై యున్నది (యోహా 6$^{31-33}$ I కొరి 10$^{3}$). భక్తులకు దేవుఁడిచ్చు ఆత్మీయ యాహారమును సూచించుటకు ఇది కూడ నొక సూచనయైయున్నది (ప్రక 2$^{17}$).

**మన్ను** జిగటమన్ను, భూమి చూ॥

**మన్నెము, మన్యప్రదేశము, మన్యము** షెఫేలా చూ॥

**మమ్రే** (Mamre = ఓకుసవృక్ష వనము). అబ్రాహాము చరిత్రకు సంబంధముగా నున్న యొక స్థలము. అది హెబ్రోను లేక హెబ్రోనుకు చుట్టుప్రాంతమై యుండెను (ఆది 23[9] 35[27]). 13[18] 14[13] 18[1] లలో మమ్రే దగ్గఱనున్న సింధూర వృక్షవనములను పేరు కలదు. మక్పేలా గుహ మమ్రే యెదుట నున్నట్లు 23[17,19] 25[9] 49[30] 50[13] లలో నున్నది. ఇస్సాకు మమ్రేలో చనిపోయెను (35[27]). అది ప్రస్తుతము హెబ్రోనుకు ఉత్తరముగా క్రోసెడు దూరములో నున్నదని పూర్వమునుండి యొక పారంపర్య వాడుక గలదు. దానికి వాయవ్యమూలను 10 ఫర్లాంగుల దూరములో నున్నదను వదంతికూడ కలదు. దాని యునికినిగూర్చి ఇంక తేటగా తెలియదు (హెబ్రోను చూ॥).

**మయకా** (Maacah = బాధపఱచుట).

1. నాహోరు కొడుకులలో నొకఁడు (ఆది 22[24]).

2. దావీదు భార్యలలో నొకతె. ఈమె అబ్షాలోమునకు తల్లియై యుండెను (II సమూ 3[3] I దిన 3[2]).

3. గాతురాజైన ఆకీషు తండ్రి (I రాజు 2[39]). I సమూ 27[2] లోనున్న మాయోకు అను వాఁడు ఇతఁడేయై యుండవచ్చును.

4. రాజైన రెహబాముయొక్క భార్య (II దిన 11[20]). I రాజు 15[2,10]. II దిన 11[20,21] లలో ఈమె అబ్షాలోము కుమార్తె యనఁబడెను గాని యీమె అబ్షాలోమునకు మనుమరాలై యున్నట్లుగా నున్నది. విగ్రహారాధికురాలగుటచే ఈమె మనుమఁడగు ఆసా తాను రాజుగా నుండుకాలమందు పట్టపుదేవి కాకుండ ఈమెను తొలగించెను (I రాజు 15[13] II దిన 15[16]).

5. కాలేబుయొక్క ఉపపత్ని (I దిన 2[48]).

6. మాకీరు భార్య (I దిన 7[15,16]).

7. గిబియోనుకు తండ్రియైన యెహీయేలు భార్య (I దిన 8[29] 9[35]).

8. దావీదు యోధులలో హానాను అను నొకని తండ్రి (I దిన 11[43]).

9. షిమ్యోనీయుల అధిపతియగు షెఫట్యొ యొక్క తండ్రి (I 27[16]).

10. సిరియా వారుండిన యొక ప్రదేశము (యెహో 13[13]). ఇది గలిలయ సముద్రమునకు ఆగ్నేయదిక్కున నున్నది (ద్వితీ 3[14] యెహో 12[5] 13[11]). దావీదు కాలమువఱకు వారచట నుండి, అతనిమీఁద యుద్ధముచేయుటకు అమ్మోనీయులచే ప్రేరేపింపఁబడిరి గాని యుద్ధమందోడిపోయి నశించిరి (II సమూ 10[6] I దిన 19[6]). వీరి నివాసులు మాయకాతీయులనఁబడిరి (II సమూ 23[34]). తెనుఁగున ద్వితీ 3[14] లో మాయకాతీయులు అను రూపాంతరమున్నను, అది యసలు భాషలో వేఱొక రీతిగా నున్నది.

**మయజు** (Maaz = కోపము). యూదా గోత్రికులలో యెరహ్మెయేలు కుటుంబములో నున్న యొకఁడు (I దిన 2[27]).

**మయజ్యా** (Maaziah = యెహోవా యాదరణ). యాజకులవంతులలో 24 వ వంతు వారికి పూర్వికుఁడు (I దిన 24[1,6,18]). నెహెమ్యా కాలమునందు స్థిరపఱచఁబడిన నిబంధనకు సంతకముచేసినవారిలో వీరికి ప్రతినిధియైనవాఁడొకఁడుండెను (నెహె 10[8]).

**మయతు** (Maath). క్రీస్తు పూర్వికులలో నొకఁడు (లూ 3[26]).

**మయదై** (Maadai = భూషణము). ఎజ్రా కాలములో అన్యస్త్రీలను వివాహము చేసికొని అతని ప్రేరేపణచే వారిని విడిచిపెట్టినవారిలో నొకఁడు (ఎజ్రా 10[34]).

**మయద్యా** (Maadiah = యెహోవాకు అలంకారము). జెరుబ్బాబెలుతోకూడ చెఱ నుండి తిరిగివచ్చిన యాజకుల కుటుంబములలో నొక కుటుంబమునకు పెద్ద (నెహె 12[5,8]). నెహె 12[17] లో మోవద్యాయను మాఱుపేరు కలదు.

**మయశేయా** (Maasiah = యెహోవా పని).

1. దావీదుకాలములో నుండిన యొక లేవీయుఁడు. ఇతఁడు ద్వారపాలకుఁడును (I దిన

15[18]), స్వర్ణమండలము వాయించినవాఁడునై యుండెను (15[20]).

2. అతల్యాను రాజ్యమునుండి తొలఁగించి, యోవాషును రాజునుగా చేసిన యధిపతులలో నొకఁడు (II దిన 23[1]).

3. రాజైన ఉజ్జియాకాలములో నుండిన ఒక యుద్యోగస్థుని పేరు. సైన్యముయొక్క లెక్కలను చూచినవారిలో నితఁ డొకఁడు (II దిన 26[11]).

4. రాజవంశములో నున్న యొకఁడు. పెకహు యూదామీఁద దండెత్తి యుద్ధము చేసినపు డితఁడు చంపఁబడెను (II దిన 28[7]).

5. యోషీయా యేలుబడిలో యెరూషలేమున కధిపతిగా నుండినవాఁడు (II దిన 34[8]).

6. యిర్మీయాకాలములో అబద్ధప్రవక్తయై యుండిన సిద్కియా తండ్రి (యిర్మీ 29[21]).

7. యిర్మీయాకాలములో యాజకులకు పై విచారణకర్తగా నుండిన జెఫన్యా తండ్రి (యిర్మీ 21[1] 29[26] 37[3]).

8. యిర్మీయాకాలములో ద్వారపాలకుఁడుగా నున్న యొక లేవీయుఁడు (యిర్మీ 35[4]).

9. చెఱకాలమునకు తరువాత యెరూషలేములో నివసించిన యొక యూదుని తండ్రి (నెహె 11[5] అశాయా 4 చూ॥).

10. చెఱకాలమునకుఁ బిమ్మట యెరూషలేములో నివసించిన బెన్యామీనీయులలో నొకఁడు (నెహె 11[7]).

11, 12, 13, 14. అన్యస్త్రీలనుంచుకొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన నలుగురు (ఎజ్రా 10[18,21,22,30]).

15. యెరూషలేము గోడలను కట్టుటయందు ఒకవంతు పనిచేసిన అజర్యాయొక్క తండ్రి (నెహె 3[23]).

16. నెహెమ్యాకాలములో నిబంధనను సంతకముచేసిన ప్రధానులలో నొకఁడు (నెహె 10[25]).

17. యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించినపుడు బాకాల నూదినవారిలో నొకఁడు (నెహె 12[41]). ఎజ్రా ధర్మశాస్త్రమును చదివి వినిపించినపుడు అతని కుడిప్రక్కను నిలిచిన యాఱుగురిలో నితఁడొకఁడై యున్నట్లున్నది (8[4]).

18. యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించినపుడు పాటలు పాడిన లేవీయులలో నొకఁడు (నెహె 12[42]). ఎజ్రా ధర్మశాస్త్రమును వినిపించినపు డితఁడు ధర్మశాస్త్రముయొక్క తాత్పర్యమును తెలియఁజేసినవారిలో నొకఁడై యున్నట్లుగా నున్నది (నెహె 8[7]).

మరకతము రత్నములు 10 చూ॥

## మరణము (Death).

I. పాత నిబంధనలోని బోధలు:

1. మరణముయొక్క ఉత్పత్తి. ఈ పదము ఆరంభమునుండి తెలిసినదై యున్నది (ఆది 2[17] 3[3]). నీవు వాటిని (ఫలములను) తిను దినమున నిశ్చయముగా చచ్చెదవని దేవుఁడు నరుని మందలించుటను బట్టి చావెట్టిదో వారికి తెలిసినట్లున్నది గాన మానవులు పాపము చేయుటవలన మరణమునకు లోనగుదురని అందువలన తెలిసికొనవచ్చును. బైబిలుబోధ అదేయై యున్నట్లు ఆది కాండములో మాత్రముగాక రోమా 5[12-21] 6[23] I కొరి 15[22] లోను చూడవచ్చును గాని, యీ వాక్యములలో మానవుఁడు శరీరమరణమును పొందుట మాత్రముగాక దేవునికి దూరముగాఁ బోవుటచే ఆత్మీయ మరణముకూడ నొందెదరను సంగతియు విశదమగుచున్నది. అతఁ డట్టి స్థితిలో నిత్యము నుండకుండునట్లు జీవవృక్షముల నాయన మానవులను తిననియ్యక అచ్చటినుండి వారిని వెళ్లఁగొట్టెను (ఆది 3[22]). ఈ వాక్యములను ఎట్లు గ్రహించుకొనినను ఆదినుండి మరణము జీవము అను వీటికిగల వ్యత్యాసము తెలిసిన సంగతియే యనుట స్పష్టము.

2. నీతిమంతుల మరణము: మరణము అను పదము దుష్టుల కన్నిఁటిలో గొప్ప కీడును సూచించునట్లు ద్వితీ 30[15,19] సామె 15[10] యోహె 18 లోని హెచ్చరికలవలనఁ దెలియును. నీతిమంతుల మరణము మేలుకరమైనట్లు సంఖ్యా 23[10] లో నున్నది. అట్టి సమయములో సహా నీతిమంతునికి ఆశ్రయము కలుగును (సామె 14[32]).

వారికి శరీరమరణము కలిగినను ఆత్మీయమరణ ముండదను సంగతి ఈ వాక్యములవలన సూచింపఁ బడును.

**3.** మరణ మొందినవారి స్థితి. వారింకను ఉండిరను సంగతిని నమ్మినట్లు మృతులద్వారా సోదె చెప్ప చేసిన ప్రయత్నములవలనఁ దెలిసికొనవచ్చును (లేవీ $19^{31}$ $20^{6}$ I సమూ 28 యెష $8^{19}$ $14^{9,10}$ $19^{3}$). ఇతర వాక్యములవలన (కీర్త $16^{10,11}$ మొ॥) మృతులస్థితి కొంతవఱకుఁ దెలియుచున్నది. (అమరత్వము చూ॥).

**4.** మరణమునుగూర్చిన అలంకార ప్రయోగములు. మృతి నొందినవారు మరణశాలలో నుందురు (సామె $8^{27}$). వారు మరణద్వారమున ప్రవేశింతురు (కీర్త $9^{14}$). చనిపోయెడివారు పొందు బాధలు మరణశ్రమయై యున్నది (I సమూ $15^{32}$). మరణ భయము (కీర్త $55^{4}$), మరణబంధములు, పాతాళపు వేదనలు ($116^{3}$) అనువాటిని గూర్చిన సూచన లున్నవి. మరణచ్ఛాయను (యెష $9^{2}$) గాఢాంధకారముగా పరిగ్రంచిరి (యోబు $3^{5}$ $10^{21,22}$ కీర్త $23^{4}$ యిర్మీ $2^{6}$ మొ॥). కీర్త $13^{3}$ లో మరణము నిద్రయనఁ బడినను దానికి క్రొత్త నిబంధనలో నున్నట్లు అది ఆదరణను సూచింపదు.

II. క్రొత్త నిబంధనలోని బోధలు.

1. మరణమునుగూర్చి క్రీస్తు చెప్పిన సంగతులు ఈ శరీర మరణమునుగూర్చి కాదు. దేహమును చంపువానికి గాక ఆత్మను దేహమును నశింపఁ జేయువానికి భయపడుఁడని బోధించెను (లూ $12^{4,5}$). మరణము ఒక నిద్రయనియు (మా $5^{39}$ యోహా $11^{11,18}$), దానినుండి లేపఁబడెద మనియు ($5^{25}$), ఆయన బోధించెను. ఆయన దేహ మరణమును గూర్చి ఎక్కువగా మాట్లాడక నిత్య మరణమును గూర్చి విస్తరించి మాట్లాడి దానికి భయపడవలెనని బోధించెను (లూ $12^{5}$ యోహా $5^{24}$ $6^{50}$ $3^{31,36}$). తన్ను విశ్వసించువారు అట్టి మరణమెన్నడును చూడ రనెను ($11^{25,26}$). అట్టి యాదరణల నాయన తన మరణ పునరుత్థానములచే జయకరముగా స్థిరపఱచె ననఁదగును.

**2.** అపొస్తలులు క్రీస్తు పునరుత్థానమునకు సాక్షులై దాని ధ్యానమందు మరణమును బొత్తుగా మఱచినట్లుండిరి. క్రీస్తు మరణము ఆయన ఈ లోకమునుండి పరలోకమునకు వెళ్లు నిర్గమముగా లూకా సువార్తలో నున్నట్లు ($9^{31}$), పేతురును తన మరణమును గూర్చి యెంచెను (II పేతు $1^{15}$ భాషాంతరము). మరణము నొందుట భక్తునికి శ్రేయస్కరమని పౌలు తేటగా వ్రాసెను (థెస్స $4^{13-18}$ II కొరి $1^{1-10}$ ఫిలి $1^{21-23}$ II తిమో $4^{7,8}$). మరణపు ముల్లు (=భయము) క్రీస్తుచే తీసివేయఁబడెను (I కొరి $15^{50-58}$). అది మనలను క్రీస్తు యేసునందున్న ప్రేమనుండి యెడఁబాపనేరదు (రోమా $8^{31-39}$). క్రీస్తు యందున్నవారి కిది నిత్యభాగ్యమునకు ప్రవేశద్వారమగును (ప్రక $2^{10}$ $7^{14,15}$ $14^{13}$). శరీరమరణ మిట్టి ఆదరణ కలిగింపఁగా ఆత్మీయ మరణము మిగుల భయంకరమైనదని అనేక సూచనలద్వారా తెలియుచున్నది. ప్రస్తుతము మనము పాప స్థితియందుండుట ఆత్మీయ మరణమే (ఎఫె $2^{1,5}$ $5^{14}$ కొలొ $2^{13}$ యాకో $1^{15}$ యూదా 12 ప్రక $3^{1}$). మనము దుష్ట స్వభావమును విడిచివేయుట దాని విషయమై మరణ మొందుటయే యను భావమిచ్చు అలంకారము గలదు (రోమా $6^{2}$). ఈ విషయములో మనము క్రీస్తుతోకూడ చనిపోవువార మగుదుము ($6^{8}$ కొలొ $2^{20}$). నిత్యజీవము అను పదము క్రొత్త నిబంధనలో ననేకమాఱు లుండినను (అమరత్వము, రక్షణ చూ॥) నిత్య మరణమని యర్థమిచ్చు పదములేదు. నాశనము (మ $7^{13}$) నిత్యాగ్ని ($18^{8}$), నిత్య శిక్ష ($25^{46}$) అనునవి నిత్యమరణమునకు ప్రతిగా నున్న పదములై యున్నవి. ప్రకటన గ్రంథములో అది రెండవ మరణ మనఁబడును ($2^{11}$ $21^{8}$ సమాధి, సమాధి క్రియలు చూ॥).

**మరణశాసనము (Testament, Will).** మరణశాసనము అను పదము తెనుఁగు బైబిలునందు హెబ్రీ $9^{16,17}$ లో కనఁబడును. దీని యసలు పదమును సాధారణముగా నిబంధనయను మాటచే తర్జుమా చేసియున్నారు (మ $26^{28}$ మా $14^{48}$ లూ $22^{20}$ I కొరి $11^{25}$ II కొరి $3^{6,14}$ హెబ్రీ $7^{22}$ $8^{6-10,13}$ $9^{1,4}$ గల $4^{24}$ లూ $1^{72}$ కార్య $7^{8}$ రోమా $11^{27}$). గల $3^{15}$ చూడఁగా అది హెబ్రీ $9^{16,17}$ కు ఎక్కువ సంబంధముగా నున్నను అచ్చట మరణశాసనము అను మాటను

వాడక ఒడంబడికె యను మాటను వాడి యున్నారు. హెబ్రీ 9^{16,17} లో ఒకఁడు మరణము కాక మునుపు అతని మరణశాసనము అమలులోకి తేఁబడదనిభావము. గల 3^{15} చూడఁగా అట్టి మరణశాసనము మార్చుటకు వీలులేదను సంగతి యున్నది. క్రీస్తు మరణముయొక్క ఆవశ్యకతయు, దేవుని వాగ్దానముల నిశ్చయతయు ఈ మాటలచే నిర్విధముగా సూచింపఁబడినదని తెలిసికొనవలెను (నిబంధన చూ॥).

**మరణానంతర విషయములు (Eschatology).** ఈ పదము బైబిలునందు లేకపోయినను మరణమునుగూర్చిన సంగతులు, క్రీస్తు రెండవ రాకడనుగూర్చిన సంగతులు, లోకాంతమును గూర్చిన విషయములు, పునరుత్థానము, న్యాయ తీర్పు, క్రీస్తు రాజ్యము, నిత్యజీవము, మృతుల స్థితి, నిత్య దండన మొదలగు వాటినిగూర్చిన బైబిలుబోధలు అందులో చేరియున్నవి. వీటిని గూర్చి ఆయా మాటలక్రింద నున్న సంగతులను ప్రత్యేకముగా చూ॥.

**మరలా (Maralah = వణుకు).** జెబూలూను గోత్రమునకు పశ్చిమముగానున్న యొక స్థలము (యెహో 19^{11}) గాని, దాని యునికినిఁ గూర్చి తేటగా తెలియక పోయినను పటము IV, C 7 చూ॥

**మరియ (Mary).** మిర్యాము అను హెబ్రీ పదముయొక్క గ్రీకు రూపము.

1. కన్యయైన మరియ. ఈమెనుగూర్చిన పారంపర్యము లెన్ని యున్నను, బైబిలునందుదాహరింపఁబడిన సంగతులుగాక యితరమైన సంగతుల వాస్తవ మేమియు తెలియదు. ఆమె దావీదు రాజవంశమున పుట్టినట్లు క్రీస్తు దావీదు సంతతివాఁడని తెలుపు వాక్యములేగాక (రోమా 1^{3} II తిమో 2^{8} కార్య 2^{30}), లూకా వ్రాసిన మరియ వంశావళివలనను తెలిసికొనవచ్చును (లూ 3^{23-38}). ఆమె పూర్వికుల గ్రామము బేత్లెహేము అయినను ఆమె నజరేతు పురవాసియై యుండెను (1^{26} 2^{4}). యూదులు చిరకాలము నుండి యెదురు చూచుచుండిన మెస్సీయ తన గర్భమున పుట్టునను వార్త తెలిసిన వెంటనే యూదా మన్యప్రాంతమున నున్న తన బంధువురాలగు ఎలీసబెతును దర్శించి ఆమెచే మన్ననల నొందెను (1^{39-44}). సర్వోన్నతుఁడగు లోక రక్షకుఁడు తనకు జన్మించునని తెలిసికొని దేవునికి స్తుతి గానము చేసెను (1^{46-55} మరియ స్తోత్ర గీతము చూ॥). ఎలీసబెతు దగ్గర మూఁడు మాసము లుండినపిదప నజరేతుకు తిరిగిరాఁగా ఆమెకు ప్రధానము చేయఁబడిన యోసేపు దూత మరియకుఁ దెలిపిన సంగతి నెఱుఁగనివాఁడై ఆమెను విడనాడఁ దలంచెను గాని దూతచే స్వప్నమందు ప్రబోధితుఁడై ఆమెను చేర్చుకొనెను (మ 1^{18-21}). కైసరాగూస్తు ఆజ్ఞప్రకారము వారు ప్రజా సంఖ్యలో వ్రాయఁబడుటకు తమ పూర్వికుల గ్రామమగు బేత్లెహేమునకు వెళ్లిన సమయమందు నిండు చూలాలై యున్న మరియ కుమారుని కని పొత్తిగుడ్డలలో చుట్టి పశువుల తొట్టియందుంచెను. సత్రములోనైనను స్థలము దొరకనందున వారు పశువులశాలలో బస చేసియున్నను దూతలే ఆయన పుట్టుకనుగూర్చి చాటించిరి (లూ 2^{1-20}). ఆయన కెనిమిదవ దినమున సున్నతి చేయించి యేసు అను పేరు పెట్టిరి (2^{21}). నలుబది దినములైన పిదప ధర్మశాస్త్ర నియమప్రకారము ఆయా ఆచారము లనుసరించుటకై (లేవీ 12^{2-8}) ఆయనను యెరూషలేమునకుఁ గొనితెచ్చి బీదలైనవారు అర్పించు గువ్వలను అర్పించిరి. అట్టి సమయమున సుమెయోను వారిని దీవించెను (లూ 2^{22-35}). పిదప వారు మఱల బేత్లెహేమునకు వచ్చి అచ్చట నొకయింట బసచేసినట్లు మ 2^{11} వలనఁ దెలియుచున్నది. అచ్చట నుండఁగా తూర్పువారైన జ్ఞానులు వచ్చి వారిని దర్శించిరి (2^{1-11}). రాజైన హేరోదు ఆయనను చంప యత్నింపఁగా ఐగుప్తుకు పారిపోయి అతని మరణానంతమున తిరిగివచ్చి బేత్లెహేములోఁ గాక యిదివఱకు తమ స్వగ్రామమైన నజరేతులో నివసించిరి (2^{13-23}). అచ్చట ఆమె యేసును పెంచెను. ఆయన బాల్యముకు సంబంధించిన ఒక సంగతి మాత్రము మనకుఁ దెలియును. స్త్రీలు యెరూషలేమునకు పండుగులకు వెళ్లవలసిన నియమము లేకున్నను మరియ భయభక్తులు గలదైనందున యేఁటేఁట వెళ్లుచుండెడి దను సంగతి దానివలనఁ దెలియుచున్నది (లూ 2^{41}). ఆమె యేసునుగూర్చిన సంగతులను

ఇతరుల కెఱింగింపక, తనకు వాటిని తెలియజేసిన వాఁడే తగిన సమయమున లోకమునకుఁ బ్రకటించునను పూర్ణనమ్మికగలదై ఆ సంగతులను తన మనస్సులో భద్రము చేసికొనెను. ఆమె కింక సంతానము కలిగెనో లేవో దానిగూర్చి తాత్పర్య భేదములగలవు (ప్రభువుయొక్క సహోదరులు చూ॥).

క్రీస్తు తన పని నారంభించునంతవఱకు మరియను గూర్చిన సూచనలు లేవు. తరువాత ఆమె కానాలో జరిగిన వివాహ సమయమున కనఁబడును. తన దైవశక్తిచే అక్కడనుండువారికి ఇబ్బంది సమయములో సహాయముచేయఁగలఁడను నమ్మకము నామె అచ్చట చూపెను గాని అట్టి పని చేయవలసిన సమయమునుగూర్చి చెప్పుట ఆమె వశమున లేదను సంగతినిగూర్చి క్రీస్తామెతో అక్కడ తెలిపెను (యోహా $2^{1-10}$). యేసు ఆమె నెంతగా గౌరవించినను తన పని యందు ఆమెకుఁ గాక తన పరమతండ్రికే లోబడవలసియున్నదని చెప్పెను. ఈమెయు ఇతరుల వలె రక్షింపఁబడవలసి యుండెను. ఆయనకు మతితప్పియున్నదని ఆమె చాల చింతతో ఆయన సహోదరులను వెంటఁబెట్టుకొని ఆయనను పట్టుకొని పోవుటకు రాఁగా, ఈ సంగతినే క్రీస్తు తన చుట్టునుండువారికి బోధించెను (మ $12^{46-50}$ మా $3^{31-35}$ లూ $8^{19-21}$). క్రీస్తు పనిలో మరియ అప్పుడప్పుడు కనఁబడినను యోసేపునుగూర్చిన ఒక్క సూచనయైనను లేకున్నందున యోసే పాయనచర్య ఆరంభమగుటకు ముందఱనే మరణమాయెనని ఊహింపవచ్చును.

పై సంగతులు జరిగిన వెనుక ఆయన సిలువ వేయఁబడు నంతవఱకు ఆమెనుగూర్చిన సంగతులెవ్వియు నుదాహరింపఁబడలేదు. యేసు సిలువ వేయఁబడినప్పుడు ఆమెదగ్గర నుండెను. ఆయనామెను యోహాను కప్పగించెను (యోహా $19^{25-27}$). ఆరోహణమునకుఁ బిమ్మట ఆమె శిష్యులతోకూడ మేడగదిలోఁజేరి ప్రార్థించుచుండెను (కార్య $1^{14}$). ఇదే ఆమెనుగూర్చి బైబిలునందున్న చివరిసూచన. భక్తులైనవారామెనుగూర్చి ఇంక ననేక సంగతులు చెప్పెదరు. ఆమె మరణమగువఱకు యోహాను విడువక యెరూషలేమునందే యుండెనని ఒక వదంతి గలదు. కిద్రోను లోయలో ఆమె సమాధిని నేటివఱకు చూపెదరు. ఈమె యోహానును వెంట ఎఫెసుకువెళ్లి అచ్చట మరణమాయెనని మరి కొందఱి యూహ. ఇవన్నియు పారంపర్యములే గాని నమ్ముట కాధారములున్న సంగతులు కావు. రోమనువారును గ్రీకువారును తక్కినవారికన్న ఈమెకు ప్రత్యేకమగు మర్యాద జూపెదరు. ఈమె భక్తిని బట్టియు, యేసుకు తల్లియగుటను బట్టియు మర్యాద చూపవలసి యున్నను ఈమెను గాక క్రీస్తునే ఆరాధింపవలసినదనునది బైబిలు బోధయై యున్నది.

2. క్లోపాభార్య (యోహా $19^{25}$). ఈమె మరియ (పైన 1 లోని) సహోదరియై యున్నది గాని ఆ వచనమందున్నట్లు మరియసహోదరి క్లోపాభార్య ఒకరే గాక ఇద్దరై యున్నట్లును మూలభాషలోని మాటలను తెనిఁగించవచ్చును. క్లోపా యనునది అల్పయి అను పేరుకు మాఱు రూపమై యుండవచ్చును (మ $10^{3}$ మా $3^{18}$ లూ $6^{15}$ అల్పయి, క్లోపా చూ॥). మ $27^{56}$ (మా $15^{40}$ లూ $24^{10}$) లో ఈమె యాకోబు యోసే (యోసేపు) అను వారికి తల్లి యని కనఁబడును (ప్రభువుయొక్క సహోదరులు చూ॥). ఈమె క్రీస్తు సిలువదగ్గర నుండెను (యోహా $19^{25}$). ఆయనను పాతిపెట్టిన స్థలమును కనిపెట్టెను (మ $27^{61}$ మా $15^{47}$). పునరుత్థాన దినమున ఇతర స్త్రీలతోఁ గలిసి ఆయన సమాధిని చూడవచ్చెను (మ $28^{1}$ మా $16^{1}$ లూ $24^{10}$). ఈమెనుగూర్చిన యితర సూచనలు బైబిలునందు లేవు.

3. మగ్దలేనే మరియ. ఈమె మగ్దలా ఊరిదైనట్లు ఆ బిరుదువలనఁ దెలియుచున్నది. మగ్దలా గలిలయ సముద్రమునకు పడమరగా నుండి తిబెరియ పట్టణమునకు వాయవ్యముగా 3 మైళ్ల దూరములో నున్నది (పటము IV, E 7) ఈమె నుండి క్రీస్తు ఏడు దయ్యములను వెళ్లఁగొట్టెను (లూ $8^{2}$ మా $16^{9}$). లూ $8^{2}$ లో ఈమె పేరు మొదట కనఁబడును. ఇది పాపపు స్త్రీ చరిత్ర వెంట వచ్చుటచే ఈమెయే ఆ పాపపు స్త్రీ యని యనుకొనుట ఆదికాలము నుండి వాడుకగా నున్నదేగాని వేఱు ఆధారము లెవ్వియును లేవు గాన నమ్ముటకు తగినదిగా లేదు.

క్రీస్తుచే స్వస్థత నొందియుండినందున ఆయనయందెక్కువ భక్తినుంచి ఆయనను వెంబడించి ఆయనకు పరిచర్య చేయుటద్వారా తన కృతజ్ఞత నగుపఱచెను (8[1-3]). క్రీస్తు సిలువయొద్ద ఈమెయు నుండెను (మ 27[56] మా 15[40] యోహా 19[25]). ఆయనను పాతిపెట్టిన స్థలమును కనిపెట్టి (మ 27[61] మా 15[47]), ఆయన కళేబరమును అభిషేకించుటకు పెందలకడ క్రీస్తు సమాధియొద్దకు వెళ్లినవారిలో నొకతె. సమాధిరాయి తీసివేయఁబడినదను వార్త తెలుపుటకు శిష్యులయొద్దకు పరుగెత్తుకొని వెళ్లెను (యోహా 20[2]). ఆ తోఁటకు తిరిగివచ్చి సమాధియొద్ద నిలుచుండి ఏడ్చుచు దుఃఖించుచుండఁగా లేచిన క్రీస్తు ఆమెకు ప్రత్యక్షమాయెను (20[11-17] మా 16[9]) తరువాత ఆయన లేచెనని శిష్యులతో ఆమె తెలియఁజేసెను (20[18]). భక్తులందఱికీమె గొప్పమాదిరిగా నున్నది. ఈమెనుగూర్చి యితర సూచనలెవ్వియును లేవు.

**4.** బేతనియ మరియ. ఈమె లాజరు మార్తల సహోదరి. క్రీస్తు వీరింటికి వచ్చినప్పుడాయన బోధలను శ్రద్ధతో నాలించెను (లూ 10[39]). ఆమెది బేతనియ (యోహా 11[1] 12[1]). ఈమె సహోదరుఁడగు లాజరు చనిపోఁగా యేసు అతనిని బ్రతికించెను (11). ఈమె అంతగా మాట్లాడినది కాకపోయినను విశ్వాస భక్తి ప్రేమలను ఎక్కువగా కనుపఱచెనని స్పష్టముగు నున్నది. క్రీస్తు లోకమందుండిన చివరివారములో బేతనియలో ఆయనకొఱకు చేసిన విందు సమయమున ఆమె ఆయన నభిషేకించి ఆయన మెప్పు నొందెను (మ 26[6-13] మా 14[3-9] యోహా 12[1-8]). ఆమె చేసిన దానివలన కలిగిన మేలుకన్న నష్టము గొప్పదని శిష్యులనుకొన్నందున, ఆమె ఆ పనిద్వారా కనుపఱచిన ప్రేమయొక్క సువాసన సువార్త ప్రకటింపఁబడు చోట్లెల్లెడల వ్యాపించునని ఆయన సెలవిచ్చెను. ఈమె భక్తియు మాదిరియైన భక్తియని చెప్పఁదగును.

**5.** మార్కు తల్లియగు మరియ. హేరోదు క్రైస్తవులను హింసించుచు, పేతురును చెఱసాలలో వేసినకాలమందు శిష్యులు ఈమె యింటఁగూడి ప్రార్థించుచుండిరి. అట్టి సమయమున పేతురు దూతచే విడుదల నొందినవాఁడై ఈమె యింటికివచ్చెను (కార్య 12[12]). ఈమె యిల్లు గొప్పదైనట్లు ఈ సూచనవలనఁ దెలియుచున్నది. క్రీస్తు తన శిష్యులతోఁ గలసి చివరి పస్కా భుజించిన దీ యింటనే యని కొందఱి యభిప్రాయము. సువార్తికుఁడగు మార్కు ఈమె కుమారుఁడు. ఆ సంబంధమెట్టిదో రూఢిగాఁ దెలియకపోయినను మార్కు తల్లియగు మరియ బర్నబాకు సహోదరి యని కొందఱి ఊహ.

6. రోమాలోని క్రైస్తవులలో నొకతె (రోమా 16[6]). ఆమె రోమాలోని సంఘస్థుల కొఱకై యెక్కువ ప్రయాసపడినదని పౌలు చెప్పి ఆమెకు తన వందనములు పంపెను. కొన్ని ప్రతులలో రోమావారి కొఱకు అను మాటలకు బదులు మా కొఱకు అని యున్నది. అందువలన ఈమె పౌలుకు అతని సహవాసులకు రోమా క్రైస్తవులు మొదలగువారికి ఎక్కువ పరిచర్య చేసిన భక్తురాలని ఊహింపవచ్చును. ఇంతకు మించి ఈమెను గూర్చి యెక్కువ తెలియదు.

**మరియ స్తోత్రగీతము** (The Magnificat). లూ 1[46-55] లో నున్న స్తుతిగానపు పేరు. మరియ స్తోత్రగీత మనఁబడినను దీని రచించి పాడినది ఎలీసబెతని కొన్ని ప్రతులవలనఁ దెలియుచున్నది. అట్టి ప్రతులు ముఖ్యమైనవి కాక పోవుటచేతను, ఈ గీతము మరియ స్థితిగతులకు మిక్కిలి చక్కగా సరిపడుట చేతను దీని నామె పేరుతోఁ బిలుచుటకు సంశయమును లేదు. దీనికిని హన్నా గీతముయొక్క ఆరంభమునకును (I సమూ 2[1-10]) సంబంధమున్నను, ఇది పాఁత నిబంధన కీర్తనలన్నిటికన్న ఉత్తమమైనదిగా నున్నది. రక్షణ యతి సమీపముగ నున్నందున దీనియందు దేవునికి చేసిన స్తోత్రములు మఱి గంభీరములైనవి. దీనిని నాలుగు చరణములుగా భాగింతురు. దేవుని కటాక్షమునకైన స్తుతి (వచ 46, 47). ఆయన కృపనుబట్టి కల్గిన ధన్యతకై స్తుతించుట (వచ 48-50). గర్విష్ఠుల పాటుకును దీనుల ఉద్ధారణకును దేవుని స్తుతించుట (వచ 51-53). రక్షకుని అనుగ్రహించుటద్వారా ఆయన వాగ్దాన నెఱవేర్పు నిమిత్తము స్తోత్రించుట (వచ 54,55).

**మరుగు మాట** గూఢ వాక్యము చూ॥

**మరులు కొలుపు** నేరములు శిక్షలు II 1 (2) (*a*) చూ॥

**మర్మము, మర్మములు (Secret, Mystery).**

I. పాత నిబంధనయందు గూఢార్థము, గూఢార్థవాక్యము (వాటిని చూ॥) అను పదములే గాక మర్మము అను విశేష భావముతో వాడఁబడిన రెండు పదములు గలవు.

1. వాటిలో నొకటి సభయనియు (కీర్త 89[7] యిర్మీ 23[18,22] యోహె 13[9]), ఆలోచనయనియు (ఆది 49[6] యోబు 15[8] కీర్త 83[3] సామె 15[22]) తెనిఁగింపఁబడి స్నేహితులైన వారితరులకు తెలుపకుండఁ జేయు స్నేహసంబంధమగు ఆలోచనలను సూచించు దానినిబట్టి అది వారికిగల రహస్యములను గూడ తెలియఁజేయును. దేవునికిని మానవులకును అట్టి స్నేహ పూర్వకమగు రహస్యములున్నట్లు అలంకార రీతిగా చెప్పఁబడినది (కీర్త 25[14]). పూర్వము దేవుని రహస్యము తన నివాసస్థానముకు పైఁగా నుండెనని యోబు అలంకారరీతిగా చెప్పి తనకున్న సౌఖ్యమును దానినిబట్టి సూచించెను. దేవుని మర్మము యథార్థవంతులదని జ్ఞాని వ్రాసెనుగాని తెనుఁగు బైబిలునందు వారా సంగతి భావమును యెహోవా యథార్థవంతులకు తోడుగానుండెనని తర్జుమా జేసిరి (సామె 3[32]). ఈ పదమునే ఆమో 3[7] నందు తాను సంకల్పించినది తన సేవకులైన ప్రవక్తలకు బయలు పఱచకుండ దేవుఁడేమియు చేయఁడని తెనిఁగించిరి. ఇట్లు పవిత్రమైన భావముతో నీ పదమును పాత నిబంధనయందు వాడినను రహస్యములను బయలుపఱచుచు చాల కీడు కలిగించు దానిని గూర్చియు నీ పదము వాడఁబడి గల్లత్తు అనియు (కీర్త 64[2]), గుట్టు అనియు (సామె 11[13] 20[19] 25[9]) తెనిఁగింపఁబడెను.

మఱుగైన దానిని సూచించు మఱియొక పదము దానియేలు గ్రంథమునందు మానవుల తెలివికి మించిన దానిని తెలియఁజేయును. అది స్వచ్ఛమైన హెబ్రీయపదముగాక అరమేయిక్ పదమై కలల భావమర్మములను తెలుపును (దాని 2[18,19,27,28,29,30,47,49] 4). క్రొత్త నిబంధనయందున్న తెలివికి మించు రహస్యములు ఇట్టి మర్మములైయున్నవి.

II. క్రొత్త నిబంధనయందు మర్మమను అర్థమిచ్చు విశేష పదమొకటి గలదు. అది మిస్టేరియ (*Mystery*) అనునదియై క్రీస్తు చెప్పిన ఉపమానములలోని ఆత్మీయ బోధలను తెలుపుటకు వాడఁబడిన పదమైయున్నది (మ 13[11] మా 4[11] లూ 8[10]). మానవులు స్వంతబుద్ధిచే క్రీస్తు రాజ్యమునుగూర్చి తెలిసికొనలేని వాటిని క్రీస్తు వీటిలో బయలుపఱచెను గనుక అవి దేవుని రాజ్యములను గూర్చిన మర్మము లనఁబడెను. ప్రకటన గ్రంథములో ఆ పదమే గూఢార్థములుగల రూపములను సూచించెను (1[20] 10[7] 17[5,7]). అది పౌలుచే విశేషముగా పత్రికలయందు వాడఁబడిన మాటయైయున్నది. అతఁడు దాని నీ క్రింది వాక్యములలో నున్నట్లు 21 సారి యుపయోగించెను.

అది దుష్టులు చేయుపనిని సూచించెను. అది ధర్మవిరోధ సంబంధమైన మర్మమై యున్నది (II థెస్స). పాపముయొక్క బలమును దాని శక్తి మనుబట్టి అది వాస్తవముగా గ్రహింప వీలులేని మర్మమై యున్నది. పునరుత్థాన సిద్ధాంతమును (I కొరి 15[51]), అన్యులు విశ్వసించునట్లు యూదులు కొంతకాలమువఱకు తొట్రుపడెదరను సిద్ధాంతమును (రోమా 11[25]), మానవుల తెలివికి మించు సిద్ధాంతములని వీటికి మర్మములను పేరు పెట్టఁబడెను. ఇట్లే క్రైస్తవ మత సిద్ధాంతములు మొత్తముమీఁద మర్మములని (ఎఫె 6[19] I కొరి 2[1]), తిమోతికి రెండు మాఱులు వ్రాసెను (I తిమో 3[9,16]). అన్యులు యూదులతో కూడ దేవుని రాజ్యమునకు వారసులగుదురను సంగతి అన్నివేల సంవత్సరములవఱకు మరుగుగా నున్నందున ఆ బోధనుకూడ మర్మమని కొలొ 1[26] ఎఫె 3[3,5] నందున్నది. సువార్త బోధలు మొత్తముమీఁద అట్టి మర్మమని వ్రాసినను (రోమా 16[25]), వేర్వేఱు జాతులవారు అందులో పాలి భాగరులగుట దానిలో నొక ముఖ్య విషయమై యున్నది. సువార్తయందు బయలు పఱచఁబడిన రక్షణ సంగతులు మర్మమని పిలువఁబడును (I కొరి 2[7] ఎఫె 3[9] కొలొ 1[26,27]). దేవుని సంకల్పము ఆయన చిత్తమునుగూర్చిన మర్మమైయున్నది (ఎఫె 1[9]). దేవుని హృదయమందున్న ఆ మర్మము క్రీస్తే (కొలొ 2[2]). పౌలు తానాలాగు బోధించిన

సువార్త క్రీస్తు మర్మమని వ్రాసెను ($4^{3}$). విశేష సంగతులను తెలిసికొనుటకు ప్రవక్తలకు ఆత్మీయ వర మనుగ్రహింపఁబడెను. దానిని మర్మముల నెఱుఁగు తెలివిగా నెంచిరి (I కొరి $13^{2}$ $14^{2}$). ఈ మాటలను, వెలిఁగింపఁబడుటను గూర్చిన మాటలను (II కొరి $4^{4}$ ఎఫె $1^{18}$ హెబ్రీ $6^{4}$ మొ॥), ముద్రించుటను గూర్చిన మాటలను (II కొరి $1^{22}$ ఎఫె $1^{13}$ ప్రక $7^{3}$ మొ॥), సంపూర్ణతను గూర్చిన పదములను (I కొరి $2^{6}$ ఫిలి $3^{13}$). పౌలు వ్రాయు నప్పుడు మంత్రోపదేశము నొందువారికి మాత్రము గ్రీకు వారి గురువు లుపదేశించిన సంగతులను మనస్సునం దుంచుకొని ఈ పదమును వాడెనని కొందఱి అభిప్రాయము. అది యట్లుండినను వారి మర్మములకును పౌలు సూచించిన మర్మములకును గొప్ప భేదము గలదు. ఆ గురువులు తమ సంగతులను తమ శిష్యులకుగాక యితరుల కుపదేశింపక పోయిరిగాని పౌలైతే వాటిని తా నందఱికి తెలుపుటకు ఇతర బోధకులతో పాటు నియమింపఁబడిన గృహ నిర్వాహకుఁడనని తెలిసికొని వాటిని ప్రకటించెను. ఇవి మఱుఁగుగా నుంచఁబడవలసినందున మర్మములై యుండలేదుగాని మానవులు తమ స్వంత తెలివిచే గ్రహించుకొనలేక పోవుటవలన కలిగిన మర్మములైయున్నవి. దేవుఁడు వాటిని క్రీస్తు ద్వారా తెలిపిన పిమ్మట మనము వాటిని గ్రహించుకొనుట మాత్రముగాక వాటి నందఱికి బయలుపఱచుటకు కూడ బాధ్యులమై యున్నారు.

**మర్సెనా (Marsenah).** పారసీక దేశపు ఏడుగురు ప్రధానులలో ఎస్తేరు కాలమునందు జీవించినవాఁడు (ఎస్తే $1^{14}$).

**మలము, ఎరువు, పేడ, పెంట (Dung).** సర్వలోకములో చేయుచున్నట్లు బైబిలు కాలములోకూడ పశువుల మలమును ఎరువుగా వాడిరి (లూ $13^{8}$). మఱియు మనదేశములో నేటివఱకు పేడను పిడకలుచేసి వంట చెఱకుగా నుపయోగించుచున్నట్లు ఆ కాలములోకూడ వాడుకొనిరి (యెహె $4^{12,15}$). మానవుల మలమునుగూర్చి ద్వితీ $23^{10-14}$ లో నియమము లున్నవి. అదే రీతిగా యాగ పశువుల మలమును పాళెమునకు వెలుపల కాల్చి వేయవలయునను ఆజ్ఞయున్నది (నిర్గ $29^{14}$ లేవీ $4^{11,12}$ $8^{17}$ సంఖ్యా $19^{5}$). ఇవి శుభ్రత విషయమైన చట్టములై యున్నవి. ఈ దిగువ సంగతులను సూచించుటకై మలము అను మాటను బైబిలులో అలంకారరీతిగా వాడిరి: (1) అది అసహ్యకరమైన నాశనమును సూచించును. యెజెబెలుయొక్క కళేబరము యెజ్రెయేలు భూభాగమందున్న పెంట (మలము) వలె నుండును అని యున్నది (II రాజు $9^{37}$). యూదులకు కలుగు నాశనమును కూడ ఇట్టి దృష్టాంతము వలననే సూచించిరి (యిర్మీ $9^{22}$ జెఫ $1^{17}$). ఆయా వారి యిండ్లు పెంట కుప్పలుగా చేయఁబడుట అట్టి నాశనమునకు సూచనలై యుండెను (దాని $2^{5}$). (2) పేడను ముఖము మీఁద వేయుట గొప్ప యవమానమునకు సూచనయై యుండెను (మలా $2^{3}$). (3) బొత్తుగా విలువలేని దానిని సూచించుటకు పౌలు ఆ మాటను వాడెను (ఫిలి $3^{8}$). క్రీస్తు నెదుట ఈ లోక సంబంధమైనవన్నియు నట్టివే.

**మలాకీ (Malachi = నా దూత).**

1. గ్రంథకర్త. ఈ గ్రంథమునకున్న మలాకీ యను పేరు గ్రంథకర్త పేరా లేక $3^{1}$ ననుసరించి దీనిని వ్రాసిన వానికి పెట్టఁబడిన సార్థక నామమా యను దానినిగుఱించి తాత్పర్య భేదము గలదు. LXX లో దీనిని ప్రవక్త నామముగా నుంచిరి. చిన్న ప్రవక్తలని పాత నిబంధన యందు పిలువఁబడిన గ్రంథములలో ప్రతిదానికి దాని దాని గ్రంథకర్త పేరు పెట్టుటచే మలాకీ యనునది కూడ దాని రచించిన ప్రవక్త పేరే యని యూహింపఁవచ్చును.

2. కాలము. ఎజ్రా నెహెమ్యా కాలములో వివాహమును గూర్చియు (ఎజ్రా $9^{2}$ $10^{3,16-44}$ ను మలా $2^{10-16}$ తో సరిపోల్చుము), పదియవ వంతును చెల్లించుటను గూర్చియు (నెహె $10^{13}$ ను మలా $3^{7-12}$ తో సరిపోల్చుము), ఉన్న యక్రమములును మలాకీ కాలములో నుండుటవలన ఈ గ్రంథములన్నియు దాదాపు నొకటే కాలమున వ్రాయఁబడినవని యూహింపవచ్చును. నెహెమ్యా కాలము పారసీ దేశరాజుల కాలమువలనఁ దెలియును గనుక ఈ గ్రంథము క్రీ॥ పూ॥ 460-450 సం॥లో వ్రాయఁబడియుండును. ఎజ్రా నెహెమ్యాలు చేసిన సంఘ సంస్కరణలో మలాకీ సహాయపడి యుండును.

**3.** ముఖ్య లక్షణములు. గ్రంథశైలి క్రీస్తు కాలమునకు ముందు యూదులలో రచింపబడిన గ్రంథముల శైలివలె నున్నది. (1) ఒక అంశమును తెలిపి దాని విషయమై చేయబడు ఆక్షేపణలను వ్రాసి వాటిని ఖండించి మొదటి అంశమును నిర్ధారణచేయుట అట్టి గ్రంథ లక్షణములలో నొకటి. మలాకీ గ్రంథములో అట్టి వనేకములు గలవు (మలా $1^{2,3}$ $2^{17,18}$ $3^{8,9,14,14}$). (2) యెహోవా కఠినమైన తీర్పుచేయుటకు వచ్చునను సంగతి ఆ గ్రంథలక్షణములలో మఱియొకటి. ప్రజలను దానికొఱకై సిద్ధపఱచు నిమిత్తము ఏలీయా ముందుగ వచ్చునని మలాకీ గ్రంథమున నున్నది (4 అధ్యా). మలాకీ మత్తయి గ్రంథములకు మధ్య వ్రాయబడిన అనేక యప్రమాణిక గ్రంథములకు దారి చూపినదీ విషయమే. అందువలననే మనము ప్రస్తుతము వాడు బైబిలులో నున్నట్లు ఈ గ్రంథమును LXX లోను చివర నుంచిరి. హెబ్రీ బైబిలునందట్లుగాక దినవృత్తాంతముల గ్రంథము తరువాత నున్నది.

**4.** ముఖ్యభాగములు మలాకీ గ్రంథమందలి విషయముల నీ దిగువనున్న రీతిగా భాగింపవచ్చును.

**I.** మొదటి ప్రసంగము ($1^1$-$2^{17}$).

**1.** పైవ్రాత ($1^1$). **2.** యెహోవా ఇశ్రాయేలీయులను ప్రేమించి ఏశావును ద్వేషించుట ($1^{2-5}$). **3.** దేవుని నియమములను నిరాకరించిన యాజకులను ఖండించుట. నిరాకరణమువలన వారికి కలుగనైయున్న శిక్షలు ($1^6$ $2^3$). **4.** దీనిననుసరించి యెహోవా యాజకులతో చేసిన నిబంధనను జ్ఞప్తిచేసికొనుట ($5^{1-9}$). **5** వివాహ నియమములను ఆత్మీయముగను అక్షరరీతిగను నిరాకరించినందున ఇశ్రాయేలీయులను గద్దించుట ($2^{10-17}$)

**II.** రెండవ ప్రసంగము ($3^1$ $4^6$).

**1.** యెహోవా తన దూతను పంపగా అతడు వచ్చి చేయుపని తీర్పులనుగూర్చి ($3^{1-6}$). **2.** ఇశ్రాయేలీయుల అక్రమములనుబట్టి ముఖ్యముగా పదియవంతులను చెల్లింపనందున గద్దించుట ($3^{7-15}$). **3.** దేవుని నిరాకరించువారికిని ($3^{16}$-$4^1$). **4.** ఆయనకు భయపడువారికిని ($4^{2,3}$) కలుగు స్థితులు. **5.** అంతయు కుదురుబాటు చేయుటకు తీర్పుదినమునకు ముందే ఏలీయాను పంపుటను గూర్చిన ప్రవచనము ($4^{4-6}$).

**మల్కాము** (Malcam = ఏలుచున్న).

1. బెన్యామీను గోత్రపు కుటుంబములలో నొక కుటుంబమునకు పూర్వికుడు (I దిన $8^9$).

2. అమ్మోనీయుల దేవతలలో నొకటి (యిర్మీ $49^{1-3}$). జెఫ $1^5$ లోని రాజా అను పదము యొక్క మూలభాషా పదమిదే. మిల్కోము అనునది దీని మారురూపము (మిల్కోము చూ॥).

**మల్కీయా** (Malchiah, Malchijah = యెహోవారాజు).

1. యాజకులలో నొకడు. ఇతడు యిర్మీయా కాలమందుండిన పషూరుకు తండ్రియై యుండెను (యిర్మీ $21^1$ $38^1$). I దిన $9^{12}$ నెహె $11^{12}$ లో నున్న మల్కీయా యితడే.

2. రాజకుమారులలో పుట్టిన యొకడు. యిర్మీయాను ఇతని పేరనున్న గోతిలో వేసిరి (యిర్మీ $38^6$).

3. లేవీయులలో గెర్షోను శాఖవారియందొకడు (I దిన $6^{40}$).

4. యాజకులలో నైదవవంతు వారికి పెద్ద (I దిన $24^9$). ఇతడు పైన 1 లోనివాడై యుండవచ్చును.

5, 6, 7. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో ముగ్గురు (ఎజ్రా $10^{25-31}$). వీరిలో చివరివాడు ప్రాకారములను కట్టుటలో నెహెమ్యాకు సహాయము చేసినవాడైనట్లున్నది (నెహె $3^{11}$).

8. ప్రాకారములు కట్టుటకు నెహెమ్యాకు సహాయపడిన మఱియొకడు. ఇతడు రేకాబు సంతతివాడు (నెహె $3^{14}$).

9. ప్రాకారములను కట్టుటకు నెహెమ్యాకు సహాయముచేసిన మఱియొకడు. ఇతడొక కంసాలివాని కొడుకు (నెహె $3^{31}$).

10. ఎజ్రా ధర్మశాస్త్రమును చదివినప్పుడు అతని యెడమప్రక్కన నిలిచినవారిలో నొకడు (నెహె $8^4$).

11. నిబంధనను స్థిరపఱచుకొనినవారిలో నొకఁడు (నెహె 10³). ఇతఁడు పైన 1 లోని వాఁడు కావచ్చును.

12. నెహెమ్యా కాలములో ప్రాకారములను ప్రతిష్ఠించుటయందు సహాయముచేసిన యొకడు (నెహె 12⁴²).

**మల్కీయేలు, మల్కీయేలీయులు** (Malchiel, Malchielites = దేవుఁడు రాజు). ఆషేరు గోత్రికులలో నొక కుటుంబమునకు పూర్వికుఁడు (ఆది 46¹⁷ సంఖ్యా 26⁴⁵ I దిన 7³¹). ఆ కుటుంబికులను మల్కీయేలీయులు అని పిలువబడిరి (సంఖ్యా 26⁴⁵).

**మల్కీరాము** (Malchiram = రాజు హెచ్చింపఁబడును). రాజైన యెకొన్యా కొడుకులలో నొకఁడు (I దిన 3¹⁸).

**మల్కు** (Malchus = రాజు). ప్రధాన యాజకుని సేవకుఁడు. గెత్సేమనే తోటలో పేతురతని చెవి తెగనఱికెను. యోహాను ప్రధానయాజకుని యింటివారికి నెఱిఁగియుండి నందున కాఁబోలు అతడొక్కఁడే యితని పేరు వ్రాసెను (యోహా 18¹⁰⁻¹⁵). తక్కిన సువార్తికు లతని పేరు వ్రాయకపోయినను సంగతిని వ్రాసిరి (మ 26⁵¹ మా 14⁴⁷). వైద్యుఁడగు లూకా ఆయన దానిని బాగుజేసిన సంగతిఁ జెలి పెను (22⁵⁰,⁵¹).

**మల్లూకు, మెలీకూ** (Malluch, Malluchi = ఏలువారు).

1. లేవీయులలోని మెరారీ తెగకుచేరిన యొకఁడు (I దిన 6⁴⁴).

2, 3. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణలవలన వారిని విడిచిపెట్టిన వారిలో నిద్దఱు (ఎజ్రా 10²⁹,³²).

4, 5. నెహెమ్యా కాలములో నిబంధనను సంతకము చేసినవారిలో నిద్దఱు (నెహె 10⁴,²⁷). 4 లో నున్నవానిగూర్చి నెహె 12²,¹⁴ లో కూడ సూచనలుకలవు గాని 12¹⁴ లో దీనికి మెలీకూ యని మాఱురూపము కలదు.

**మల్లోతి** (Mallothi = నేను నెఱవేర్చితిని). పాటకులగు లేవీయులలో నొకఁడు (I దిన 25⁴,²⁶).

**మసై** (Maasai = నాపని). యాజకుల కుటుంబములలో నొకదాని పెద్ద (I దిన 9¹²). నెహె 11¹³ లోని యమష్షయి ఇతఁడే యని కొందఱనుకొందురు.

**మశ్శా** (Massa = భారము). ఇష్మాయేలు కుమారులలో నొకఁడు (ఆది 25¹⁴ = I దిన 1³⁰) ఇతఁడు అరబ్బీయుల తెగవారిలో నొక తెగకు పూర్వికుఁడాయెను. అష్షూరురాజగు అష్షూర్బని పాల్ అనువాఁడు ఈ పేరు గలిగిన అరబ్బీ తెగ వారిమీఁద యుద్ధముచేసి యున్నట్లు అష్షూరు వారి రాతిశాసనములవలనఁ దెలియును.

**మశ్రేకా** (Masrekah). ఎదోమురాజగు శమ్లా యున్నస్థలము (ఆది 36³⁶ = I దిన 1⁴⁷) ఇది ఎదోములో నుండెనుగాని దాని యునికిని గూర్చి మఱి యేమియుఁ దెలియదు.

**మస్తకి** (Mastic). యోసేపును కొనిన ఇష్మాయేలీయులు గిల్యాదునుండి ఐగుప్తునకు తీసికొని పోయిన మందుదినుసులలో నొకటి (ఆది 37²⁵). యోసేపు ఐగుప్తునకు అధికారియైన పిమ్మట యాకోబు అతనికి పంపిన కానుకలలో మస్తకికూడ నుండెను (43¹¹). మన దేశములోనున్న మస్తకి ఇదేయై యుండవచ్చును. ఇతర వాక్యములలో దీనిని గుగ్గిలమని తెనిఁగించిరి (యిర్మీ 8²² 46¹¹ 51⁸ యెహె 27¹⁷). యిర్మీయాలోని వాక్యములవలన ఇది ఔషధముగా వాడఁబడినట్లు స్పష్టముగు చున్నది (రోగములు చికిత్సలు IV 1 (3) చూ॥).

**మస్తిచా వృక్షము** (Oak, Terebinth). ఈ పదముచేఁ దెనిఁగించిన మూల భాషాపదము ఏలా యనునది. ఏలాలోయ అను మాటలో అది కనఁబడును (I సమూ 17²⁻¹⁹ 21⁹). ఈ చెట్టు పలెస్తీనుదేశములో మిగుల సాధారణమైనది (ఆది 35⁴ న్యాయా 7¹¹,¹⁹ 1 రాజు 13¹⁴ యెష 1³⁰ మొ॥). అబ్షాలోము వెంట్రుకలీ చెట్టుకు తగులుకొని అతని యకాలమరణమునకు కారణ మయ్యెను (II సమూ 18⁸,⁹⁻¹⁴). I దిన 10¹² లో నిది సింధూరచెట్టు అనఁబడెను. సాధారణముగా సింధూరచెట్టు అని తెనిఁగించిన పదము దీనికి సంబంధించినదైనను వేరు జాతిదైయున్నది. ఆంగ్ల భాషయందు దానిని ఓకుచెట్టని భాషాంతరము

చేసిరి గాని ఓకుచెట్టు పలెస్తీనునందు కనఁబడుట బహు అరుదు గాన అది ఓకుచెట్టు కానట్లున్నది. న్యాయా 9[7] నందున్న శకునగాండ్ల మస్తిచా వృక్షము కొన్ని భాషాంతరములలో మెయొనెనీము (*Meonenim*) వృక్షమని యున్నది. దానికి మెయొనెనీము శకునమని శబ్దార్థము గనుక నే తెలుఁగున దాని నిట్లు తర్జుమాచేసిరి. ఇది మోరేలోనున్న వృక్షమై యుండవచ్చును.

**మస్తిచా వృక్షము క్రింది పండు పాలెము** (Plain of the Terebinth). షెకెమువారు అబీమెలెకును రాజునుగాఁజేసిన స్థలము (న్యాయా 9[6]). కొంతమంది దీనిని మస్తిచా వృక్షముక్రింది దేవతా స్తంభము అని భాషాంతరము చేయుదురు. అది షెకెము దగ్గఱ నున్నదిగాని దాని యునికినిఁగూర్చి మఱి నూటిగా తెలియదు.

**మస్సా** మెరీబా చూ॥

**మహజీయోతు** (Mahozioth = దర్శనము). దేవాలయపు పాటకులలోని 28 వ వంతు వారికి పెద్ద (I దిన 25[4,30]).



మస్తి వృక్షము

**మహతు** (Mahath = పట్టుకొనుట).

1. లేవీయులలోని కహాతీయుల తెగకు జేరిన కుటుంబములలో నొకదానికి పెద్ద (I దిన 6[35] II దిన 29[12]). I దిన 6[25] లో నున్న అహీమోతు అను పేరు ఇతనికి మాఱుపేరై యుండవచ్చును.

2. రాజైన హిజ్కియా కాలములో నుండిన లేవీయులలో నొకఁడు (II దిన 31[13]).

**మహాత్కార్యము** అద్భుతము చూ॥

**మహనయీము** (Mahanaim = రెండు దండులు). పూర్వకాలమునందు యొర్దానుకు తూర్పుగా నుండిన పట్టణములలో నొక ముఖ్య పట్టణము. అది గాదుగోత్రికుల స్వాస్థ్యమునకు మనష్షేగోత్ర స్వాస్థ్యమునకును సరిహద్దుగా నుండు పట్టణములలో నొకటి (యెహో 3[26,30]) గాయుండెను గాని, దానిని గాదీయుల పట్టణముగా లెక్కించి లేవీయుల కిచ్చిరి (21[38-40]). యాకోబు పద్దనరామునుండి తిరిగివచ్చుచుండఁగా యబ్బోకు నదికి చేరకముందు అచట దిగెను (ఆది 32[2-22]). కావున అది యా నదికి ఉత్తరముగ నుండెనని స్పష్టమగును. ఇచట సౌలు సేనాధిపతి యగు అబ్నేరు అతని కుమారుఁడగు ఇష్బోషెతును రాజునుగాఁ జేసెను (II సమూ 2[8,12,29]). అబ్షాలోము తిరుగుబాటు చేసినకాలములో దావీదు ఇచటికి పారిపోయి బసచేసెను (17[24-27] 19[32]).

సొలొమోను అహీనాదాబు అను నొకనిని ఈ పట్టణమునకు అధికారినిగా నియమించెను (I రాజు $4^{14}$). పర $6^{13}$ చూడఁగా మహనయీము నాటకము అను నొక విశేష నాటకముండినట్లు తెలియును. ఈ పట్టణముయొక్క ఉనికినిగూర్చి ఆయా పండితులు ఆయా రీతులుగా ఊహలు చేసినను దాని సరియైన యునికిపట్టు తెలియదు (పటము III, J 2.)

**మహనెదాను** (Mahanah Dan = దానీయుల దండుపేట). న్యాయా $13^{25}$ లో నున్నట్లిది ఆత్మ సమ్సోనును రేఁప మొదలుపెట్టిన స్థలమనియు, $18^{12}$ లో నున్నట్లు ఇది దానీయులు చివరగా మకాముచేసిన స్థలమనియు కనఁబడును. ఈ చివరివాక్యములో దానీయుల దండు అని తర్జుమా చేసినది అసలులో మహనెదాను అని యున్నది. అది దానీయుల స్వాస్థ్యములో జొర్యా ఇష్టాయోలుకు మధ్య నందు స్థలమై యుండెను గాని దాని సరియైన యునికినిగూర్చి తేటగాఁ దెలియదు.

**మహరై** (Maharai = త్వరపడువాఁడు). దావీదుయొక్క 30 మంది యోధులలో నొకఁడు (II సమూ $23^{28}$ I దిన $11^{30}$). I దిన $27^{13}$ చూడఁగా ఇతఁడు రాజునకు సేవ చేసినవారిలో పదియవవంతువారికి అధికారియైనట్లు తెలియును.

**మహలతు** (Mahalath = పాడుట).

1. ఏశావుయొక్క భార్య (ఆది $28^{9}$).

2. రాజగు రెహబాము భార్య (II దిన $11^{18}$).

**మహలతు లయన్నోతు** (Mahalath Liannoth). హెబ్రీవారి రాగములలో నొక రాగమునకు పేరు (కీర్త 53, 88 పై వ్రాఁతలు చూ॥). దీని శబ్దార్థమునుబట్టి అంగలార్పును సూచించురాగమని యనుకొనఁదగును.

**మహలలేలు** (Mahalalel Mahalaleel = దైవస్తోత్రము).

1. జలప్రళయమునకు పూర్వమున జీవించిన వారిలో నొకఁడు. అతఁడు షేతువంశమునందు పుట్టినవాఁడై యుండెను (ఆది $5^{12-17}$ I దిన $1^{2}$ లూ $3^{37}$).

2. చెఱకాలమునకు తరువాత యెరూషలేములో నివసించిన యూదాగోత్రస్థులలో నొకఁడు (నెహె $11^{4}$).

**మహలా** (Mahlah, Mahalha = వ్యాధి).

1. సెలోపెహాదు కుమార్తెలలో నొకతె (సంఖ్యా $26^{33}$ $27^{1}$).

2. మనష్షే గోత్రికులలో నొకఁడు (I దిన $7^{18}$).

**మహలి** (Malhi = బలహీనుఁడు).

1. మెరారీ తెగకుఁ జేరిన లేవీయులలో నొకఁడు (నిర్గ $6^{19}$ సంఖ్యా $3^{20}$ I దిన $24^{26,28}$). ఇతఁడొక తెగవారికి పూర్వికుఁడయ్యెను. వారు మహలీయులు అనఁబడిరి (సంఖ్యా $3^{33}$ $26^{58}$).

2. మెరారీ తెగకు జేరిన లేవీయులలో నింకొకఁడుగాని యితఁడు మహలితమ్ముఁడగు మూషియొక్క సంతతివాఁడు (I దిన $6^{47}$ $23^{23}$ $24^{30}$).

**మహసేయా** (Mahseiah, Maaseiah = యెహోవా ఆశ్రయము). యిర్మీయా ప్రవక్తకు సహాయకుఁడుగా నుండిన బారూకుకును శెరాయాకును తాత (యిర్మీ $32^{12}$ $51^{59}$).

**మహాతాపము** రోగములు చికిత్సలు II 10 (3) చూ॥

**మహాదూతలు** (Seraphim = మండుచున్నవారు). దూతలలో నొక తరగతి. ఈ పదము యెష $6^{2}$ నందు మాత్రము వచ్చును. వీరికారేసి రెక్కలు గలవు. దేవుని సన్నిధిని మర్యాదగా నిలిచి త్రిశుద్ధి పాడుచు ఆయనను స్తుతించువారై యున్నారు. వీరికి చేతులును మాట్లాడుస్వరములు నున్నట్లు $6^{6}$ వలనఁ దెలియును. అష్షూరువారి యజ్ఞముల దేవతయగు సరప్పు (*Sarappu*), ఐగుప్తీయుల దేవతయగు సెర్రెఫ్ (*Serref*) అనువాటివలన సెరఫీమను పేరీ దూతలకుఁగలిగినదని కొందఱి తాత్పర్యము. యెషయా యిట్టి అన్యమతాభిప్రాయములను దేవుని సింహాసనము చుట్టునుండు దూతల యాకారమును వివరించుటకై వాటిని సవరించి దిద్ది అట్లు వ్రాసెననుటకంటె, ఈ మహాదూతలు అందఱికన్న ప్రత్యేకమైనవారై సేవకుల యాకృతిని గలిగియుండిరిగాన తాను చూచిన

దర్శనరీతిగనే వారినిగూర్చి వర్ణించెనని తలంచుట యుక్తము (గాతలు 1, కెరూబులు చూ॥).

**మహావీయుడు** (The Mahavite). దావీదు యోధులలో నొకడగు ఎలీయేలు అను నొకని బిరుదు (I దిన $11^{16}$). దీని యర్థము తెలియదు. ఈ పదము తప్పుగా వ్రాసిరని కొందఱి యభిప్రాయము.

**మహావృద్ధుడు** (Ancient of days). దేవునికి పెట్టబడిన యలంకారనామములలో నొకటి (దాని $7^{9,13,22}$). దేవుడనాదినుండి యున్నవాడును మహాఘనతగలవాడు నగుటవలన ఈ పేరు సూచించుచున్నది. ఈ పేరు యూదుల అప్రమాణిక గ్రంథములలోను (హనోకు $47^{3}$ $48^{2,6}$) ఇతర గ్రంథములలోను కనబడును.

**మహాసభ** (Sanhedrin = సభ).

1. చరిత్ర. యూదుల ముఖ్య విమర్శసభ (మ $5^{22}$ $26^{59}$ మా $14^{55}$ $15^{1}$ లూ $22^{66}$ కార్య $4^{15}$ $5^{21,27,34,41}$ $6^{12,15}$ $22^{30}$ $23^{1,6,15,20,28}$ $24^{20}$). దీనిని మోషే యేర్పఱచెనని యూదుల పారంపర్యములవలన దెలియుచున్నది (సంఖ్యా $11^{16}$). గాని యెహోషాపాతు యెరూషలేములో నొక విమర్శ సభ నేర్పాటు చేయుటనుబట్టి (II దిన $19^{8}$). ఈ సభ మోషే కాలమునుండి యుండ లేదని నిశ్చయింపవచ్చును. ఎజ్రా గ్రంథము నందు పెద్దలు అనియు ($5^{5,9}$ $6^{7,14}$ $10^{8}$), నెహెమ్యా గ్రంథములో అధికారులనియు ($1^{16}$ $4^{8}$ $5^{7}$ $7^{5}$) చెప్పబడిన పదములు ఈ మహాసభ వంటిదైనను మక్కబీయుల కాలములోనే దీని గూర్చిన స్పష్టమగు మొదటి సూచన లగుపడు చున్నవి (II మక్క $1^{10}$ $4^{44}$). క్రొత్త నిబంధన కాలమునందే సభనుగూర్చిన తేటయగు సూచనలు పై నుదాహరించినట్లు అనేకములు గలవు. ఈ సభలో ముఖ్యముగా మత విషయములగు అక్రమ ములను విమర్శించిరి. క్రీ॥ శ॥ 70 సం న యెరూషలేము నాశనముతో నీ సభ యంత రించెను.

2. సభికులు. ఈ సభయందు డెబ్బది యొక్కరు సభికులుండినట్లు యూదుల గ్రంథ ములవలన దెలియుచున్నది. మోషేచే నేర్పా టయినట్లు 70 మంది సభికులును (సంఖ్యా $11^{16}$) అగ్రాసనాధిపతియగు ప్రధాన యాజకునితోఁ గలిసి సరి సంఖ్య 71 యగుచున్నది. దాని యందు ప్రధానయాజకులు పెద్దలు శాస్త్రులను వారు సభికులైయున్నట్లు మా $14^{53}$ ను బట్టి తెలిసికొనవచ్చును. దీనిలో చేరినవానికి సభికుఁడను బిరుదు కలిగెను. అరిమతయియవాఁడగు యోసేపు అట్టి సభికులలో నొకఁడు (మా $15^{43}$ లూ $23^{50}$). సద్దూకయ్యులును పరిసయ్యులు నా సభలోనుండినట్లు కార్య $23^{6}$ నందగుపడు చున్నది. క్రొత్త నిబంధన కాలమందు రోమను పక్షపాతులగు సద్దూకయ్యులకే సభయందెక్కువ పలుకుబడి గలిగినట్లు కనబడుచున్నది. గాని, మహా హేరోదు దీనిని తగ్గించుకొనుటకు ఎక్కువ మంది పరిసయ్యులను చేర్చుటకు మిగుల ప్రోత్సాహ మిచ్చెను. కొందఱు సభికుల నీ సభవారే నియ మింపఁగలిగియుండిరి.

3 అధికారము. ఇది, ఆయా కాలములకుఁ దగినట్లు మారెను. మత విషయములయందు సర్వ యూదా సంఘముపై యధికారమును చెలా యించెను (కార్య $9^{2}$). మహా హేరోదు ఏలు బడికి పిమ్మట రోమనువారి యనుమతిని వీరు యూదయలోని నేరములను విమర్శించి మరణ శిక్ష విధించునంత యధికారము నొందిరి (మ $26^{3,4}$ కార్య $4^{5}$ $5^{20}$ $22^{30}$ పురా 14. 9. 34). అట్టి యధికారముండుట చేతనే పోలీసువారు వారి యధీనమునందుండిరి (మ $26^{47}$). నేరస్థు లైన వారిని పట్టుకొని విమర్శించుటకు వారి కధి కారమున్నను వారు విధించెడి మరణ శిక్షలను రోమను గౌర్నరు ఖాయపఱచవలసియుండెను (యోహా $18^{31}$). వారి దిగువ సంగతులను విమ ర్శించినట్లు సూచనలున్నవి:- దేవదూషణ చేసినను నేరముమీఁద క్రీస్తుకు మరణశిక్ష విధించిరి (మ $26^{57}$ యోహా $19^{7}$). పునరుత్థానమును గూర్చి ప్రకటించిన పేతురు యోహానులు క్రీస్తును చంపిన దోషమును మహాసభవారిపై మోపిరను నేరము మీఁద వారిని విచారణచేసిరి (కార్య $4^{5,23}$). స్తెఫను దేవదూషణ చేసెనని తీర్మానించిరి ($7^{57,58}$). పౌలు మోషే ధర్మశాస్త్రమును మీఱెనని తీర్పు చేసిరి ($22^{30}$).

4. స్థలము, అనుసరించిన పద్ధతులు. దేవాలయావరణమునందు చలువ రాళ్లతో కట్టఁబడిన ఒక శాలలో కూడిరిగాని క్రీస్తును విమర్శించినప్పుడు ప్రధాన యాజకుని నగరునందు సమావేశమైనట్లు మ $29^{57-72}$ మా $14^{53-72}$ వలనఁ దెలియుచున్నది. సభికులు అర్ధచంద్రాకృతిగా కూర్చుండువారు. నేరస్థుని తమ యెదుట నిలువఁబెట్టిరి. ఒకని విచారించిన పిదప వాఁడు నేరస్థుఁడు కాని యెడల తక్షణమే వానికి తీర్పు చెప్పి వేయవచ్చును గాని నేరస్థుఁడని తీర్మానించుటకు కనీసపక్ష మొక దినమైనను వారు గడుపవలసివచ్చెను. అట్లు నేరస్థుఁడనుటకు సభికులలో మూఁడింట రెండు పాళ్లు తమ సమ్మతి నియ్యవలసియుండెను. క్రీస్తును విచారించినప్పుడిట్టి నియమములలోఁ గొన్నింటిని ఆయనమీఁద తమకున్న గొప్ప ద్వేషమునుబట్టి లక్షించలేదని కనఁబడును.

**మహాసర్పము** (**Dragon**). సప్తర్షి మండలమునకు సమీపముగానున్న నక్షత్రముల రాశియని కొందఱి యభిప్రాయము గాని అది రూఢికాదు. అది సముద్రములోనున్న మహాసర్పమును కూడ సూచింప వచ్చును (యోబు $26^{13}$).

**మహిమ** (**The Glory**). సాధారణముగా దేవునికి చెందుపదము. ఆయన పరిశుద్ధతకును సకల కల్యాణగుణ సంపత్తునకుండు ప్రకాశతయై యున్నది. ఈ పదముయొక్క అర్థము అందఱికిని దెలిసినదే గాన దానిని వివరింప నగత్యము లేదు. గాని కొన్ని వాక్యములలో నీ పదము ఇశ్రాయేలీయులు సీనాయికి ప్రయాణము జేయునప్పుడు మేఘమునందు కనఁబడిన దేవుని మహిమకు పెట్టఁబడిన షెకీనా (*Shekinah*) అను దానిని సూచించును (నిర్గ $13^{21}$ $14^{24}$ $16^{10}$). అది దేవుని సన్నిధి కొక గుఱుతు. $24^{16}$ లో నున్నట్లు యెహోవా మహిమ సీనాయి కొండ మీఁద నిలిచెను ($40^{34}$ సంఖ్యా $16^{49}$). దేవాలయమునందు దేవుని మహిమ యిట్లు మేఘములో కనఁబడి ఆలయమును నింపెను (I రాజు $8^{10,11}$ II దిన $5^{14}$ $7^{1,3}$ యెహె $10^{8,10}$). పాత నిబంధనకును క్రొత్త నిబంధనకును మధ్యకాలములో యూదులీ మహిమకు షెకీనా ( = నివసించుట) అను పేరును సాధారణముగా వాడిరి. ఇదియును వారు దేవుని సన్నిధిని సూచించు అలంకారికములును దీనికి సంబంధించినవే యని విశదమగుచున్నది.

**మహూయాయేలు** (**Mahujael** = దేవునిచే మొత్తఁబడినవాఁడు, దేవుఁడు ప్రాణమిచ్చువాఁడు). కయీను మనిమనుమఁడు (ఆది $4^{18}$).

**మహేరుషాలాల్ హాష్బజ్** (**Maher-Shalal-Hashbaz**). యెషయా కుమారులలో రెండవవాఁడు. ఇది సార్థకనామము (యెష $8^{3}$). త్వరితముగా దోపుడగును ఆతురముగా కొల్లపెట్టఁబడును అని దాని కర్థము. $1^{8}$ లోను ఈ మాటలే కలవు. ఇవి యెరూషలేము నాశనమును సూచించెను.

**మహోన్నతుడు** దేవుడు I 3 (1) చూ॥

**మహ్లోను** (**Mahlon** = వ్యాధి). ఎలీమెలెకు నయోమి అను వారి కుమారుఁడు (రూతు $1^{2}$). మోయాబీయురాలగు రూతు నితఁడు వివాహమాడి ($1^{4}$ $4^{10}$) సంతానము లేకయే చనిపోయెను ($1^{5}$).

## మా

మాంత్రిక విద్యలు మంత్ర విద్య చూ॥

**మాంసము** (**Flesh**). సాధారణముగా మాంసము అను పదమునకు నుండు అర్థమే ఈ పదమునకు బైబిలులోకూడ కలదు. అయితే అట్టి సాధారణ భావము మాత్ర మిచట వివరింపఁబడలేదు. దీని కింక విశేషార్థములును గలవు. దీని అసలు పదమును తెనుఁగు బైబిలులో శరీరము అను పదముచే తర్జుమా చేసియున్నారు (I కొరి $15^{50}$ హెబ్రీ $2^{14}$). ఒకటే వంశమునందు పుట్టినవారు ఒకటే ఎముకయు, ఒకటే మాంసమును గలవారై యున్నట్లు వ్రాయఁబడియున్నది (ఆది $2^{23}$ II సమూ $19^{12}$). ఎముకలును మాంసమును క్రీస్తు దేహములో నుండుటచే ఆయన దేహము మాయదేహము కాక నిజదేహమై యున్నట్లు క్రీస్తు పునరుత్థానమునకు పిమ్మట తన శిష్యులకు చెప్పినదాని వలనఁ గనఁబడును. (మనుష్యుడు 2, శరీరము I 5 చూ॥).

**మాకస్సు** (**Makaz** = అంతము, హద్దు). యూదయదేశపు పశ్చిమ కొండల ప్రక్కనుండు నొక పట్టణము (I రాజు $4^{9}$). రాజైన సొలో

హోను నిమిత్తము ఇతర ప్రదేశములలోనుండి ఆహారము సంగ్రహించినట్లు ఈ పట్టణమునుండియు సంగ్రహించిరి. దాని యునికిని గుఱించి ప్రస్తుతమున సూచనలేవియు లేవు. LXX లో మిక్మషు అను పేరు పై వాక్యమునందు పెట్టిరి గాని మిక్మషు ఈ సంబంధమునకు సరిపడదు గనుక అది అందులో వచ్చిన పొరపాటు అని తెలిసికొనవలెను.

**మాకీ** (Machi). పన్నెండుమంది వేగుల వారిలో గాదు గోత్రమునుండి నియమింపఁబడిన వాఁడగు గూవేలుయొక్క తండ్రి (సంఖ్యా $13^{15}$).

**మాకీరు** (Machir = అమ్మఁబడినవాఁడు).

1. మనష్షేయొక్క కుమారుఁడు (యెహో $17^{1}$). ఆది $50^{23}$ సంఖ్యా $26^{29}$ చూడఁగా, ఇతఁడు మనష్షే యొక్క ఏక పుత్రుఁడై యుండినట్లు కనఁబడును. ఇతని తల్లి అరామీయురాలు అనఁగా సిరియా దేశపు స్త్రీయై యుండెను (I దిన $7^{14}$). ఇట్లు మాకీరు అను పేరు న్యాయా $5^{14}$ లో మనష్షే గోత్ర మంతటిని సూచించును. అయితే రానురాను మనష్షేయులలో వేర్వేఱు తెగలవారేర్పడిరి. మాకీరీయులు అట్టి తెగలలో నొక తెగవారై యుండిరి (సంఖ్యా $26^{29-32}$). మాకీరు తెగవారు గిలాదు దేశమును స్వతంత్రించుకొనిరి ($32^{39,40}$ ద్వితీ $3^{15}$ యెహో $13^{31}$).

2. యొర్దానుకు తూర్పుననుండు లోదబారులో నున్న అమ్మీయేలు అనువాని కుమారుఁడు. ఇతఁడు సౌలు సంతతివారిని హత్తుకొనిన వారిలో నొక ముఖ్యుఁడై యుండెను (II సమూ $9^{5,6}$). అబ్షాలోము తిరుగుబాటు చేయఁగా దావీదు యొర్దాను తూర్పు ప్రాంతములకు పారిపోయి యచట కాపుర ముండఁగా ఈ మాకీరు దావీదునకు తినుబండారములను దెచ్చియిచ్చినవారిలో నొకఁడు ($17^{27}$).

**మాగోగు** (Magog). యాపెతు సంతతిలోని యొక జనాంగము (ఆది $10^{2}$). వారుత్తరము నుండి వచ్చి పలెస్తీనుమీఁద యుద్ధము చేతురని యెహెజ్కేలు ప్రవచించెను (యెహె $38^{2,15}$). అన్యులు దేవుని ప్రజలమీఁద చేయఁబోవు యుద్ధము మాగోగువారు పలెస్తీనుమీఁద చేయనై యున్న యుద్ధమును సూచించునని యెహెజ్కేలు వ్రాసెను. ఈ యలంకార సూచననే ప్రక $20^{8,9}$ నందు నెత్తివ్రాసిరి. మాగోగువారు స్కూథీయులును అనాగరికజనమని యోసీఫసు అభిప్రాయము (పురా 1.6.1). ఇది నిజము కావచ్చును.

**మాచిపత్రి** (Wormwood). ఒక చెట్టు బెరడు. మిగుల చేదైనది. యిర్మీ $23^{15}$ విలా $3^{15}$ ప్రక $8^{11}$ లో నీ పదము నుంచిరి. సామె $5^{4}$ లో దానిని ముసిణి పండనియు యిర్మీ $9^{15}$ లో చేదు కూరలనియు తెనిఁగించిరి. ఇతర వాక్యములలో అది అలంకార రీతిగా సూచించు అన్యాయమును నాశనము అనునటువంటి మాటలతో తెనిఁగించిరి. మరణకరమైనది (ద్వితీ $29^{18}$), అన్యాయము (ఆమో $5^{7}$) అను పదములు ఆ మాటకు తెలుఁగు తర్జుమాయై యున్నవి. పై వాక్యము లన్నిఁటిలో ఈ చెట్టుయొక్క చేదైన బెరడు కష్టములను సూచించును (చేదు చూ॥).

**మాటమాంద్యము** సున్నతి II చూ॥

**మాణిక్యమణి** రత్నములు 11 చూ॥

**మాదయి, మాదీయులు** (Media, Medes). పాఁత నిబంధన కాలములో ముఖ్యముగా క్రీ॥ ము॥ తొమ్మిదవ శతాబ్దము మొదలుకొని ఆఱవ శతాబ్దమువఱకు నుండిన యొక జనాంగము. వారిదేశము కాస్పియన్ (*Caspian*) సముద్రమునకు దక్షిణమున నున్నది. అది అష్షూరుకు ఈశాన్యమున నుండిన కొండ ప్రదేశము. అది యుత్తరమునుండి దక్షిణమునకు 600 మైళ్లు పొడవును, తూర్పునుండి పడమఱకు 250 మైళ్లు పొడవు నుండును. దాని ముఖ్యపట్టణము ఎగ్బతానా (ఎజ్రా $6^{2}$). ప్రస్తుతమందది పారసీ దేశపు టుత్తరభాగమై యున్నది. ఈ దేశస్థులు అష్షూరు, బబులోను వారివలె షేము సంతతివారు కాక యాపెతు సంతతివారై యున్నారు (ఆది $10^{2}$). కావున, ఇచట ఆర్యుల సంబంధులను గూర్చి పాఁత నిబంధన చరిత్ర సంగతులలో మొదట కనఁబడును.

మాదయి వారి చరిత్రలను చూడఁగా, అష్షూరు చక్రవర్తులగు తిగ్లత్పిలేసెరు, సర్గోను అనువారు వారిమీఁద యుద్ధముచేసి యున్నట్లు తెలియును. సర్గోను మాదీయులలో కొందఱిని క్రీ॥ ము॥ 721 లో షోమ్రోనుకు చెఱఁగా

నంపెను (II రాజు 16[6] 18[11]) గాని, మాదీయులు వృద్ధినొంది బబులోనీయులతో సంధి చేసికొని 607 సం॥లో అష్షూరు దేశమును నాశనము చేసిరి. తరువాత వారు ఒడంబడిక చేసికొని చిన్నాసియా వఱకునున్న అష్షూరు పల్లపు ప్రదేశములను బబులోనీయులును, మెట్ట ప్రదేశములను మాదీయులు ఏలుచుండిరి. 550 లో మాదీయ చక్రవర్తియైనవాఁడు తన రాజ్యమును తమతో నేకజాతి వారగు పారసీకులకు నప్పగించియుండి నప్పటికిని తదనంతరమునకూడ ఆ క్రొత్త పారసీక రాజ్యమునకు మాదయివారి పేరు పెట్టియుండిరి (యెష 13[17] 21[2] యిర్మీ 25[25] 51[11]). క్రొత్త నిబంధనలో నున్నట్లు పెంతెకొస్తు దిన మున (కార్య 2[9]) మాదీయులు అచట నుండి నట్లున్నది గాని వారా దేశమునుండి వచ్చిన యూదులని తెలిసికొనవలయును. వారు యెరూషలేములో నుండిరి. పారసీక మతమును స్థాపించిన జొరాస్టర్ లేక జరుష్టు (*Zoroaster*) క్రీ॥ పూ॥ 7 శతాబ్దములో నివసించియున్నట్లనుకొందురు (అష్షూరు, బబులోను, పారసీక దేశము, ఏలాము చూ॥).

**మాదోను** (Madon = కలహ కారణమైనది). కనానీయుల రాజధాని పట్టణములలో నొకటి (యెహో 11[1] 12[19]). ప్రస్తుతము హట్టీన్ దగ్గరనుండు మాదీను (*Madin*) అనునది దాని యునికి యని సాధారణముగా ననుకొందురు. LXX నందు దీనిని మారోను అని వ్రాసి యున్నారు (పటము IV, E 5).

**మానములు, కొలతలు** (Weights, Measures). బైబిలునం దుదాహరించిన మానముల అసలు పేరులను తెలుఁగు బైబిలునం దుంచక, సాధారణముగా వాటికి సమానమగు ప్రస్తుతపు మానముల నుంచుటకు ప్రయత్నించిరి. అట్లు చేయుట తప్పుకాదు గాని, ఒకటే పదమును ఆయా వాక్యములలో వేఱువేఱు మాటలతో తెనిఁగించినందున వాటిని విపులముగా వివరించుట కష్టముగా నున్నది.

I. దైర్ఘ్యమానములు.

1. సాధారణమగు వాటిని కొలుచు కొలతలు:—ఆరంభమున వ్రేళ్లను, చేతులను, అరచేతులను కొలతలుగా నుపయోగించిన సూచన లున్నవి. యిర్మీ 52[21] నందు వ్రేలును కొలతగా నుపయోగించిరి. నాలుగు వ్రేళ్లు ఒక బెత్త. ఇది I రాజు 7[26] లో కలదు. మూఁడు బెత్తలు ఒక జేన. ఇది నిర్గ 28[16] 39[9] నందు గూడవచ్చును. రెండు జేనలు ఒక మూర (అది 6[15] నిర్గ 25[10] మొ॥). యెహె 40[5] నందు ఆలయమును కొలుచుటకు వాడిన మూర సాధారణమైనదిగాక మూరకుపైన బెత్తెడు పొడవు గలది. సాధారణపు మూర మనుష్యుని మూర యనఁబడెను (ద్వితీ 3[11]). ఆలయపు కొలతలు పూర్వపుకొలల ప్రకారమున్నట్లు II దిన 3[3] నందున్నవి. అందువలన ఆలయపు మూర పూర్వమునుంచి వాడుకలోనున్న మూరయేనని తెలిసికొనవచ్చును. ఆఱు మూరలు ఒక కొలకర్ర యనఁబడెను (యెహె 40[3-8] ప్రక 11[1] 21[15,16]). బార (కార్య 27[28]) దాదాపు 6 అడుగు లుండును. ఇట్టి కొలతలను హిందూదేశమునందు చాలవఱకు వాడుచున్నారు. ప్రస్తుతము వాడుకలోనున్న యింగ్లీషు కొలతలతో సరిపోల్చిన పక్షమున అవి యిట్లుండును:—

| | |
|---|---|
| వ్రేలు | = ¾ అంగుళము |
| బెత్త | = 3 అంగుళములు |
| జేన | = 9 ,, |
| (మనుష్యుని) మూర | = 1½ అడుగులు |
| ఆలయమునకు సంబంధించిన లేక పూర్వపు కొలతయగు మూర. | = 1¾ ,, |
| సాధారణపు కొలకర్ర | = 9 ,, |
| ఆలయపు కొలకర్ర | = 10½ ,, |

2. ప్రయాణముల దూరమును కొలుచు కొలత దీనికి వేఱుగా నుండెను. II సమూ 6[13] నందున్న అడుగులు ఒకఁడు నడుచునప్పుడు వేయు అంగలను సూచించును. అయాచోట్ల వేఱువేఱు కొలత లున్నందున అడుగుతో కొలుచుట నియమితమైన స్థిరమానమనఁ జాలము. దినప్రయాణమనునదియు స్థిరమైనది కాదు (సంఖ్యా 11[31] 33[8] యోనా 3[4] మొ॥). అది యొకఁడు 4-8

గంటల వఱకు పోఁగలిగినంత దూరము. విశ్రాంతి దినమున నడువఁదగిన దూరము 2000 మూరలని యెహో $3^{4}$ ననుసరించి యూదులు నియమించు కొనిరి గాని శాస్త్రులు దానిని 4000 మూరల వఱకు పెంచిరి. లూ $24^{13}$ నందున్న ఆమడ మూలభాషయందు 60 ఫర్లాంగులై యున్నది. అదియు, మ $5^{41}$ నందున్న మైలును రోమనుల మానముల ననుసరించును. యోహా $6^{19}$ నందున్న రెండు క్రోసులు గ్రీకు భాషలో 25 లేక 30 ఫర్లాంగులనియు, $11^{18}$ లోని క్రోసెడు 15 ఫర్లాంగులనియు, ప్రక $14^{20}$ లోని 100 క్రోసులు 1600 ఫర్లాంగులనియు, $21^{16}$ లోని యేడునూర్ల యేఁబది క్రోసులు 12000 ఫర్లాంగులని యున్నది. బైబిలును తెనిఁగించినవారు క్రోసు అను పదము వాడిరేగాని మూలభాషయందు దట్టి పదము లేనేలేదు. రోమనుల మైలు దాదాపు 5000 అడుగుల పొడవుగాన అది మన మైలు కన్న 280 అడుగులు తక్కువ అని తెలిసికొనవలెను. ఫర్లాంగు రోమను మైలునందు దాదాపు ఎనిమిదవ భాగమై యున్నది.

3. భూములను కొలుచుటకు ఈ దేశమందు వలె నియమిత కొలతలులేక, ఒక కాడియెద్దులు దినములో దున్నఁగల భూమి యని చెప్పెడివారు (యెష $5^{10}$). I సమూ $14^{14}$ నందున్న అర యెకర మనునది బహుశః అరచాలు (*furrow*) కావచ్చును. ఎట్లయినను ఎకరములచే భూమిని కొలిచిన జాడ బైబిలునందు లేదు.

II. ధాన్యమానము:—బైబిలునందు బాబెలు వారివలె 6 అను సంఖ్య ననుసరించి వచ్చునట్లు తమ మానములను లెక్కించిరి. తెలుఁగు బైబిలునందు కొలతలకు సంబంధించిన తెలుఁగు మానములకు సరిపడునట్లు భాషాంతరము జేసిరి. మన బైబిలునందుదాహరించినవాటికి సంబంధముగు మూలపదములను కూడ ఈ దిగువ కనుగొనవచ్చును.

1 లాగు (*Log* = అర్ధసేరు. లేవీ $14^{14,12,15}$). దీనిని ద్రవ పదార్థములను కొలుచుటకును వాడిరి = అర్ధసేరుకన్న కొంచెము తక్కువ.

4 లాగులు = 1 ఖాబు (*Cab* = 2 సేర్లు). II రాజు $6^{25}$ లో దీనిని అర పావు అని తెనిఁగించిరి. ఈ మానప్రకారము అది అర్ధసేరై యుండ వలెను.

$1\frac{4}{5}$ ఖాబులు = ఓమెరు (*Omer* నిర్గ $16^{36}$). ఇది లేవీ $14^{10}$ లో నున్న పదియవ వంతు అను దానికి సమానము. ఏఫాలో (*Ephah*) లో పదియవ వంతు నిర్గ $16^{36}$ లో ఇంచుమించు $2\frac{1}{3}$ సేరులు కావచ్చునని భాషాంతరముచేసిరి గాని పై లెక్కప్రకారమిది $3\frac{3}{5}$ కు పైగా నుండును.

$3\frac{1}{3}$ ఓమెరులు = 1 సీయా (*Seah*). దీనిని తెలుఁగు బైబిలునందు మానిక యని తర్జుమా చేసిరి. ఆది $18^{6}$ I సమూ $25^{18}$ I రాజు $18^{32}$ II రాజు $7^{1,16,18}$) గాని పై కొలత ప్రకారమది 12 సేర్లకు పైగా నున్నది లేక 6 మానికలు.

3 సీయాలు = 1 ఏఫా (*Ephah* నిర్గ $16^{36}$). యెహె $45^{11}$ లో దీనిని పందుములో పదియవ పాలు అని తెనిఁగించిరి. అది 32 మానికలైనను, పై లెక్కప్రకారము 18 మానికలు మాత్రమగును.

5 ఏఫాలు = లెతెక్ (*Letekh*). హోషే $3^{2}$ నందు దీనిని ఏఁదూము అని తెనిఁగించిరి. ఇది 160 మానికలైనను పై లెక్కప్రకారము 90 మానికలే యగును.

2 లెతెఖులు = 1 కోరు (*Kor*). యెష $5^{10}$ లో దీనిని తూము అనియు యెహె $45^{14}$ నందు 160 మానికలనియు తెనిఁగించిరి. ఇచ్చట తూము అనునది ఏఁదూము అని యుండ వలెను.

క్రొత్త నిబంధనలో లూ $16^{7}$ నందున్న తూముకు పై నుండు కోరుకును, మ $13^{33}$ నందున్న కుంచముకు పై నుండు సీయాకును తర్జుమాలై యున్నవి.

III. ద్రవమానము:—ఈ మానమునందలి పదములు ధాన్యమానమందు కనఁబడినను దీనికిని దానికిని భేదము గలదని తెలిసికొనవలెను.

1 లాగు (*Log*). లేవీ $14^{10}$ లో దీనిని అర్ధసేరు అని తెనిఁగించిరి = 1 అర్ధ సేరు.

4 లాగులు = 1 ఖాబు (*Cab*). ఇది రెండు సేర్లు అగును. ఈ కొలత బైబిలునందు అగుపడుట లేదు.

12 లాగులు = 1 హీను (*Hin*). ఇది 8 పళ్లుగాని 6 సేర్లుగాని కావచ్చును. నిర్గ $29^{40}$ లేవీ $23^{13}$ సంఖ్యా $15^{4,5,6}$ $28^{7}$ లలో హీనులో పావు అని అర్థమిచ్చు మూలపదమును ముప్పావు అనియు, నిర్గ $30^{24}$ యెహె $45^{24}$ లో 3 పళ్లు అనియు, ఈ లెక్క చొప్పుననే $4^{11}$ నందు అరపడి యనియు, $46^{14}$ లో పడి యనియు హీనులోని ఆయా భాగములను తెనిఁగించిరి.

6 హీనులు = 1 బదు (*Bath.*) యెష $5^{10}$ లో మాత్రము ఈ పదముయొక్క అసలు రూపము కనఁబడును గాని యితర స్థలములలో దాని నాయా రీతులుగా తెనిఁగించిరి. 2000 బదులు 9 గరిసెలనియు (I రాజు $7^{26}$), 40 బదులు 720 తూము లనియు ($7^{38}$), 20,000 బదులు 140 పుట్లు అనియు (II దిన $2^{10}$), 4000 బదులు 30 పుట్లనియు ($4^{5}$), 1 బదు తూము అనియు (యెహె $45^{10,11}$), బదులోని పదియవ వంతు $1\frac{4}{5}$ పడి యనియు ($45^{14}$) తెనిఁగించిరి. పైలెక్క ననుసరించి 1 బదు 36 సేర్లు లేక 18 పళ్లకు సమానము.

10 బదులు = కోరు (*Kor*) యెహె $45^{14}$ లో నున్న 180 పళ్లు మూలభాషయందు ఒక కోరు అని యున్నది.

క్రొత్త నిబంధనలో మణుగు అని తెనిఁగించిన మూలపదము (లూ $16^{6}$) పైనున్న బదు అనునదియే గావున అప్పటి మణుగు 18 పళ్లు అవును.

యోహా $2^{6}$ లో నున్న తూము అనునది గ్రీకు కొలతను సూచించు పదమునకు తర్జుమాయై పై నున్న బదుకు సమానముగా నున్నది.

IV. తులామానము:—పూర్వకాలమునందు నాణెములను వాడక సొమ్ము నియ్యవలసి వచ్చి నప్పుడు తూచి యిచ్చుట వాడుకగా నుండెను. బాబెలువారు దీనియందును ఆరు సంఖ్య ననుస రించి 60 షెకెలులు 1 మినా, 60 మినాలు 1 తలాంతు అని లెక్కించువారైనను వారిలో రెండు విధములగు షెకెలులు వాడుకయందుండెను. ఒక దానికన్న ఒకటి 2 రెట్లు అధికముగా నుండెను. చిన్న షెకెలు తులమునకు కొంచెము తక్కువ యైనను, దానిని బైబిలునందు తులమని తెనిఁగించిరి (ఆది $23^{15}$ నిర్గ $21^{32}$ $30^{13}$ మొ॥). మ $17^{27}$ లో మాత్రము షెకెలను పదమునుంచిరి. పెద్ద షెకె లైన యెడల 2 తులములకు కొంచెము తక్కువగా నుండెను. గనుక మన మీ రెండు మానములను ఈ దిగువ నున్నట్లు జూడవచ్చును.

1. చిన్న తులామానము.

20 చిన్నములు (నిర్గ $30^{13}$) = 1 షెకెలు (తులముకన్న $\frac{1}{10}$ తక్కువ).

60 షెకెలులు లేక తులములు = 1 మినా (లూ $19^{13-27}$). దాదాపు 50 తులములు.

60 మినాలు = 1 తలాంతు = 3000 తులములు.

2. పెద్ద తులామానము. ఇది పై దానినే యనుసరించును గాని పైదానికన్న రెండింత లెక్కువగా నున్నది.

పై నుదాహరించిన రెండుగాక వీటికి కొంచె మించుమించుగా $\frac{1}{10}$ వంతు హెచ్చుగా నుండు మఱియొక తులామానము నా కాలమున పడమటి ఆసియాలో వాడుకయం దున్నట్లు ప్రాచీన సంగతులను పరిశోధించు శాస్త్రజ్ఞులు తెలిసి కొనిరి. ఇన్ని మానము లుండుటనుబట్టి అప్పటి కాలపు సొమ్ముయొక్క విలువను పరిష్కారముగాఁ దెలిసికొనుట కష్టతరముగా నున్నది.

షెకెలు (తులము)తో సొమ్మును మాత్రమే గాక ఆయా వస్తువులనుకూడ తూచినట్లు బైబిలు నందు దృష్టాంతము లున్నవి (నిర్గ $30^{23-25}$ సంఖ్యా $7^{13}$ యెహో $7^{21}$ I సమూ $17^{5,7}$ II సమూ $14^{26}$ మొ॥) గాని, దాని బరువు ఏక రీతిగా నుండక భేదముగా నుండెను. పరిశుద్ధ స్థలము యొక్క తులము అను పదము అనేక చోట్ల నున్నది (నిర్గ $30^{13,23,24}$ మొ॥). అది ఫేనీకే వారి తులమువంటిదై పైనున్న మానములోని దాని కన్న $\frac{1}{10}$ వంతు తక్కువ యని తలంచుచున్నారు. అష్షూరీయులు ఏర్పేటు కత్తిరించిన వెంట్రుకలు రాజు తూనికనుబట్టి ఇన్నూరు తులములు అని యున్న (II సమూ $14^{26}$) దీ కొలత కావచ్చును.

మినా యను పదమునకు బదులు పాత నిబంధన మూలభాషయందు మానె యను పదము గలదు. దానిని I రాజు $10^{17}$ నందు 100 తులము

లనియు, ఎజ్రా $2^{69}$ నందు 50 తులములనియు, నెహె $7^{71}$ నందు 700 తులములకన్న కొంచెము తక్కువ యనియు, $7^{72}$ నందు 12000 తులము లైనట్లు లెక్కించిరి గాని, I రాజు $10^{17}$ నం దున్నట్లు మూఁడు మినాలనియు (=150 తులములు), ఎజ్రా $2^{69}$ నందున్న దానిని 5000 మినాలనియు (=250,000 తుల), నెహె $7^{71}$ నందున్న దానిని 2200 మినాలనియు (=110,000 తులములు), నెహె $7^{72}$ నందున్న దానిని 2000 మినాలనియు (=100,000 తులములు) మూల భాషయం దున్నట్లే చదువుట యుక్తము. యెహె $45^{12}$ నందున్న ఈ మూల పదమునే తెలుఁగు బైబిలులో లెక్కించి వేయక అరవీశె యని తెనిఁగించిరి. గ్రీకు భాషయందు దీనికి సమానమైన పదమును యోహా $12^{3}$ నందు శేరున్నరయని తెనిఁగించిరి. అట్టి మాటను $19^{39}$ నందు 150 సేరులు అని తర్జుమా జేసిరి. లూ $19^{13-27}$ నందున్నట్లుగానే బైబిలును తెనిఁగించిన వారీ మాటయొక్క మూల పదమును తర్జుమాచేయక అట్లే యుంచినయెడల చాల యుక్తముగా నుండునదే.

తలాంతు అను మఱియొక పదమును మ $18^{24}$ $25^{15-28}$ నందు మాత్రముగాక తక్కిన చోట్లల్ల తెనిఁగించిరి. నిర్గ $25^{39}$ $37^{24}$ ప్రక $16^{21}$ నందు 40 వీశెలు లేక 5 మణుగులని తెనిఁగించిరి. నిర్గ $38^{24,25,26,29}$ నందు 4 మణుగులు లేక 32 వీశెలని తర్జుమా చేసిరి. ఇతర వాక్యములలో అది రెండు మణుగులై యున్నట్లు తెనిగించి (II సమూ $12^{30}$ I రాజు $9^{14,28}$ $10^{10}$ $16^{24}$ $20^{39}$ II రాజు $5^{5,22,23}$ $15^{19}$ $18^{14}$ I దిన $19^{6}$ $20^{2}$ $22^{14}$ $29^{4,7}$ II దిన $3^{8}$ $8^{18}$ $9^{13}$ $25^{6,9}$ $27^{5}$ $36^{3}$ ఎజ్రా $7^{22}$ $8^{26}$ ఎస్తే $3^{9}$). వీటిలో నున్న మణుగుల సంఖ్యలో సగము మూలభాషయందున్న తలాంతుల సంఖ్య యని తెలిసికొనవచ్చును. అచ్చు వేయుటలో II రాజు $23^{33}$ నందు 200 కు 50 అని మూలభాషయందు జెక $5^{7}$ లో నున్నట్లు సీసపు తలాంతు అనుదానికి ప్రతిగా సీసపుబిళ్ల యని తెనిఁగించిరి గాన తలాంతు అను పద మీ వాక్యములో పూర్తిగా లోపించి పోయెను.

పై నుదాహరించిన మానముల ప్రకారము చిన్న తలాంతు 3 మణుగుల 1 వీశె యగును. తలాంతు పెద్దదైన పక్షమున దానికి రెట్టింపుగా నుండును. పూర్వమున తలాంతు లేక రీతిగా నుండక భేదించియుండినను, తెలుఁగు బైబిలునందు దానిని తర్జుమాచేయక ఆ మూలపదములనే యుంచిన పక్షమున నెంతో మేలుగా నుండును. (సొమ్ము చూ॥).

**మానవహతీయులు** మనహతు 2 చూ॥

**మాను, మ్రాను (Tree).** క్రీస్తు సిలు వకు అలంకార నామము (కార్య $5^{30}$ $10^{39}$ $13^{29}$ I పేతు $2^{24}$ గల $3^{14}$).

**మానోహ (Manoah = విశ్రాంతి).** దాను గోత్రమందలి జొర్యా పట్టణస్థుఁడు. ఇతఁడు సమ్సోనుకు తండ్రి (న్యాయా 13). తన కుమారునికి ఫిలిష్తీయ కన్యను వివాహము చేయుట కిష్టపడక పోయెనుగాని చివరకు సమ్మతించి పెండ్లికి తానుకూడ వచ్చెను ($14^{1-10}$). సమ్సోను కంటె ముందుగానే కాలముచేసినట్లు కనఁబడుచున్నది ($16^{31}$). తన ప్రజలను కాపాడుటలో కునుకకయు నిద్రపోకయు నుండునట్టి దేవుని దూత అబ్రాహాము గిద్యోను మొదలగువారికి ప్రత్యక్షమయి నట్లే మానోహకును ప్రత్యక్షమయి తన నామధేయ మును తెలుపకనే, అతని కొక కుమారుఁడు కలుగునని తెలియఁజేసెను. ($13^{18}$ ని ఆది $32^{29}$ యెష $9^{6}$ లూ $1^{34}$ సరిపోల్చుము). H.

**మాయ (Vanity).** మాయ యను పదమును తెలుఁగు బైబిలులో కొద్దిగా వాడియున్నారు. అదే యర్థము నిచ్చు అసలు పదమును అనేకచోట్ల వ్యర్థము అను పదముచే తర్జుమా చేసియున్నారు (ప్రస $1^{2}$ $12^{8}$ మొ॥). మాయయను మాట రోమా $8^{20}$ లో నున్నది. పాపమువలన సృష్టి పదార్థములు దేవుఁడు వాటి విషయములో నుద్దేశించిన గుఱినందక తప్పిపోవును అను దానిని ఆ పదము సూచించును. ఎఫె $4^{18}$ లోని మాయ యనుదానికి అన్యులు తమ యజ్ఞానమువలన వ్యర్థమైనవాటిని కల్పించుచు, వాటి ననుసరించిరని యర్థమిచ్చును. హిందువులు తమ షడ్దర్శనములలో మాయ యను పదము నే భావముతో వాడెదరో ఆ యర్థము బైబిలులో మాయ యను పదమునకు లేదు.

**మాయకోతులు** మయకా 10 చూ॥

**మాయస్వరూపులు (Idols Vanities).** లేఖనములందంతట విగ్రహారాధన ఖండింపఁబడియున్నది. అదెంతటి తెలివిమాలిన పనియో అనేక భాగములలో వివరించఁబడినది (I సమూ $12^{21}$ $15^{23}$ యెష $45^{19}$ యిర్మీ $10^{14,15}$ $51^{17,18}$). కొన్ని భాగములలో ఆ విగ్రహములే మాయాస్వరూపము లనియు పనికిమాలినవనియు చెప్పఁబడెను. అవి మాయమైపోవుననియు ఎట్టి విలువ లేనివియు ప్రయోజన రహితమైనవియునై యుండెను. వాటి ఫలితము వృథాప్రయాసమును దుఃఖమును మాత్రమే. అవి దేవతలని తలంచుట వట్టి భ్రమయై యున్నది. దేవుఁడొకఁడే గనుక వాటి యారాధన లాభములేనిదియును వాటి యారాధికులు పనికిమాలినవారునై యున్నారు. దేవుని సహాయముమీఁదఁ గాక మరే యితర సహాయముమీఁద గాని ఆనుకొనుట నిష్ప్రయోజనమైనదియు అపాయకరమైనదియునైయున్నది. B.

**మాయి (Maai).** ఆసాపు సంతతివారిలో నొకఁడు. ఇతడు నెహెమ్యా కాలములో యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించినపుడు ఆ పనిలో సహాయపడినవారిలో నొకఁడు (నెహె $12^{36}$).

**మాయోకు (Maoch).** గాతురాజైన ఆకీషు యొక్క తండ్రి (I సమూ $27^{2}$). I రాజు $2^{39}$లో ఇతని పేరునకు మయకా అను మాఱు రూపము కలదు (మయకా 3 చూ॥).

**మాయోను, మెయోనీయులు, మెహూనీయులు (Maon = నివాసము, Maonites, Meunim).**

1. సీదోనీయులు అమాలేకీయులవలె ఇశ్రాయేలీయులను బాధపఱచిన యొక జనాంగము (న్యాయా $10^{12}$). వారు మృత సముద్రమునకు దక్షిణమున నుండు శేయీరు పర్వతము దగ్గఱ నివాసము చేసిరి. రాజైన యెహోషాపాతు కాలములో వారతనిమీఁద యుద్ధము చేసిరి (II దిన $20^{1}$). $26^{7}$ చూడఁగా వారు రాజైన ఉజ్జియా కాలమునఱకు జీవించి అతనిచే జయింపఁబడినట్లు తెలియును. ఈ వాక్యములో వారు మెహూనీయులు అనఁబడిరి.

2. యూదా మన్యప్రదేశములో నున్న ఒక యూరు (యెహో $15^{55}$). దీనికి సంబంధించి యున్న అరణ్యములో నాబాలు నివసించెను (I సమూ $25^{2}$). దావీదు సౌలు యొద్దనుండి పారిపోయినపుడు రెండుమాఱు లీ మాయోను ప్రాంతమునకు వచ్చెను (I సమూ $23^{24-26}$ $25^{2-44}$ అరణ్యము 3 (9) చూ॥ పటము II, E 3).

3. యూదావారిలో నొకఁడు (I దిన $2^{45}$). బేత్సూరు అనువాని తండ్రి. అయితే ఈ పేరు పురుషులకు మాత్రమే కాక, ఊళ్లకుకూడఁ కొంద వచ్చును. అట్లయినయెడల ఇది 2 లో వివరింపఁబడిన యూరు అని తెలిసికొనవలెను.

**మారా (Mara, Marah = చేదు).** ఇశ్రాయేలీయులు ఎఱ్ఱసముద్రమును దాటిన పిమ్మట మకాముచేసిన స్థలములలో మొదటిది (నిర్గ $15^{23}$ సంఖ్యా $33^{8,9}$). అచ్చటి నీరు చేదుగానుండెను గాని మోషే ఒక చెట్టు కొమ్మను అందులో వేయఁగా అవి బాగుపడెను. ప్రస్తుతమున సూయెజుకు (*Suez*) 47 మైళ్లదూరములో నున్న హవార (*Hawarah*) అను బావియే దీని యునికి యనుకొందురు.

నయోమి తనకు సంభవించిన కష్టములను బట్టి తనకు పెట్టుకొనిన సార్థకనామము (రూతు $1^{20}$).

**మారాతు (Maarath = చెట్లు చేమలేని దేశము).** యూదా పట్టణములలో నొకటి (యెహో $15^{59}$). అది ప్రస్తుతము తెకోవకు పశ్చిమముగా నున్న బైట్-ఉమ్మారు (*Biet-Ummar*) అను స్థలమై యుండవచ్చును.

**మారుమనస్సు (Repentance).** పాపియైనవాఁడు తన పాపములను విడిచి దేవునితట్టు తిరుగుటయే మాఱుమనస్సు నొందుట యనఁబడును (మ $3^{2}$ $4^{17}$ కార్య $2^{38}$ $3^{20}$ మొ॥). ఇందులో పాపము విషయమైన దుఃఖమనునది మొదటి విషయమై యున్నది. ఇది సాధారణముగా పశ్చాత్తాప మనఁబడును. పాత నిబంధనలో ఈ పేరు కలదు గాని తెనుఁగున మాఱుమనస్సు అను పదమును వాడలేదు (యోబు $42^{6}$ యిర్మీ $31^{19}$ I రాజు $8^{47}$). ఈ వాక్యములను చూడఁగా పాపము విషయము దుఃఖించుటయే

అందులో ముఖ్యభావమైయున్నది. అదేభావము క్రొత్త నిబంధనలో కూడ మారు మనస్సు అను పదమునకు కలదు (లూ $16^{3,4}$). అయితే దుఃఖము మాత్రముండిన యెడల దాని నింకను మారుమనస్సు అని యనవీలులేదు. నిరీక్షణలేని యట్టి దుఃఖము నిరాశయగును. విశ్వాసముతో దేవునితట్టు తిరుగుటయే మారుమనస్సులోని రెండవ ముఖ్యవిషయమై యున్నది. ఈ రెండును ఒకటే కార్యమునందలి రెండు పక్షము లనఁదగును. ఒకఁడు తూర్పునుండి పడమటికిఁ దిరుగుట ఏలాగు ఒక తిరుగుటయే యగునో అటులనే పాపమునుండి దేవునితట్టు తిరుగుటయు నొకటే కార్యమైయున్నది. ఈ రెండు భాగములు అనఁగా పశ్చాత్తాపమును విశ్వాసమును మారుమనస్సులో చేరియున్నవి (కార్య $20^{21}$). కావున పాత నిబంధనలో దేవునివైపు తిరుగుట, తిరిగి వచ్చుట అను పదములుకూడ మారుమనస్సు అను దానికి సాటియైన పదములైయున్నవి (యిర్మీ $3^{12,22}$ $4^{1}$ యెహె $18^{32}$ $33^{11}$ మొ॥). క్రొత్త నిబంధనలో కూడ ఇట్లు తిరుగుటను గూర్చిన పదములు కలవు (మా $4^{12}$ కార్య $9^{35}$ $15^{3}$ మొ॥). క్రొత్త నిబంధనలో దేవుఁడు పాపులను రక్షించుటకు చూపిన దయ పూర్ణముగా కనఁబడును కావున, అందులో మారుమనస్సును గూర్చిన బోధ మారుమనస్సు, మనస్సు త్రిప్పుకొనుట (మ $13^{15}$) అను నిట్టి మాటలలో మఱీ స్పష్టముగా కనఁబడును. ఆదే బాప్తిస్మమిచ్చిన యోహాను బోధకు ముఖ్యాంశము ($3^{2}$). క్రీస్తుకూడ ఆ బోధనే చేసెను (మా $1^{15}$ లూ $13^{3}$ 15). దీనిని బోధింపవలెనని క్రీస్తు తన శిష్యులకు ఆజ్ఞ నిచ్చెను ($24^{47}$). అపొస్తలులును ఆ రీతిగానే బోధించిరి (మా $6^{12}$ కార్య $2^{38}$ $3^{20}$ $17^{30}$ మొ॥). ఇది రక్షణకు షరతైయున్నది ($2^{38}$ II కొరి $7^{10}$). మారుమనస్సు నొందనివారు నశింతురు (ప్రక $2^{5}$ $2^{22}$ మొ॥). మానవులు ఎడతెగక దేవుని ఆత్మను బుద్ధిపూర్వకముగా వేదిరించుటవలన కఠినపఱచబడినవారై పశ్చాత్తాపము పొందనేరరు (హెబ్రీ $6^{6}$ $12^{17}$).

**మారేషా** (Mareshah = స్వాస్థ్యము).

1. హెబ్రోను అనువాని తండ్రి (I దిన $2^{42}$).

2. యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $4^{21}$).

3. యూదావారికి సంబంధించిన షెఫేలా మన్యములో ఒక ముఖ్యపట్టణము (యెహో $15^{44}$). రెహబాము దానిని ప్రాకారపురముగా కట్టించి బలపరచెను (II దిన $11^{8}$). యోసీఫసు కాలములో దానిని మారిస్సా అని పిలిచిరి (పురా 17. 7. 6) "టెల్ సందాహన్న"యని ప్రస్తుతము పిలువఁబడునదే దీని యునికియని నిశ్చయించిరి.

**మారోతు** (Maroth = చేదు). యూదాలోని యొక గ్రామము (మీకా $1^{12}$). దీని యునికి తెలియదు.

**మార్కు** (Mark = సుత్తె). క్రొత్త నిబంధన సువార్తలలోని రెండవదానిని వ్రాసినవాఁడు. అతని యసలుపేరు యోహాను (కార్య $13^{5,13}$). తల్లిపేరు మరియ ($12^{12-17}$ మరియ 5 చూ॥). మార్కు అనునది లాటీను పేరైయున్నది. అప్పటి కాలపు యూదులు తమపిల్లలకు హెబ్రీ పేరుతో పాటు లాటిను పేరును పెట్టుటయు వాడుకగానుండెను ($1^{23}$ $13^{9}$). మార్కు బర్నబా బంధువుఁడు (కొలొ $4^{10}$) క్రీస్తును యూదులు పట్టుకొనిన రాత్రిలో ఆయనను వెంబడించిన యౌవనుఁడని (మా $14^{51,52}$) కొందఱి యభిప్రాయము మార్కు మాత్రమే దానినిగుఱించి ఉదాహరించుటవలన ఆ యభిప్రాయము సరియని వచ్చును అట్లయిన పక్షమున క్రీస్తు లోకమునందవతరించిన కాలమందు మార్కుయనను చూచి నమ్మియున్నట్లు కనఁబడును గాని ఆ సువార్తయందతనిని గుఱించిన తేటయగు సూచనలు లేవు. బర్నబా సౌలు అనువారు యెరూషలేమునందుండిన క్రైస్తవులకు చందానిచ్చి అంతియొకయకు తిరిగి వెళ్లినప్పుడు మార్కు వారివెంట వెళ్లెను (కార్య $12^{25}$). అతఁడు వారి మొదటి ప్రయాణమునందు వారి కుపచరించుచు ($13^{5}$) పెర్గెవఱకు వెళ్లెను గాని యేదో యొక హేతువుచే వారిని విడిచి యెరూషలేమునకు తిరిగి వెళ్లిపోయెను ($13^{13}$). అందుచేత పౌలు రెండవప్రయాణమునందతనిని వెంటఁబెట్టుకొని వెళ్లుటకు సమ్మతింపనందున బర్నబానుండి వేఱుపడవలసి వచ్చెను. బర్నబా మార్కును తీసికొని కుప్రకు వెళ్లెను ($15^{38-41}$). కార్యముల గ్రంథమందింతవఱకు మాత్రమే మార్కును గూర్చిన సూచనలున్నవి. తరువాత పౌలు రోమాలో ఖైదిగానుండు సమ

యమునందు మార్కు అతనియొద్ద నుండెననియు కొలొస్సయివారి కతఁడు వందనములు పంపె ననియు తెలియుచున్నది (కొలొ $4^{10}$ ఫిలె 24). పౌలు మార్కు నమ్మకమును మరల సంపాదించు కొన్నట్లు దీనివలన స్పష్టమగుచున్నది. పౌలు రెండవమారు చెఱలోనుండఁగా, తనకు పరిచర్య చేయుటకు మార్కు తగినవాఁడని అతని వెంటఁ బెట్టుకొని రమ్మని తిమోతి కతఁడు వ్రాసెను (II తిమో $4^{11}$). ఈ సూచనలవలన అతఁడు చిన్నాసియాలో నుండెనని స్పష్టమగును. పేతురు ప్రాంతములలో చెదరియున్న యూద క్రైస్తవులకు ఉత్తరము వ్రాసినప్పుడు మార్కు అతనితో కూడ నుండి వారికి వందనము లంపెను. ఆ పత్రిక బబులోనునుండి వ్రాసినట్లున్నది గాన అతఁడు పేతురు వెంట బబులోనుకు వెళ్లినట్లు చూడవచ్చును (I పేతు $5^{13}$). పేతురుకు లాటిన్ భాష రానందున మార్కు పేతురుతోఁ గలిసి తిరుగుచు అతఁడు చేసిన ప్రసంగములను బోధలను భాషాంతరముచేసి వ్రాసెనను వదంతి యొకటి గలదు. అతడు పేతురు పౌలులతో రోమానం దుండెనను సంగతి నమ్మఁదగినదై యున్నది. ఇతఁడైగుప్తులోని అలెక్సంద్రియ సంఘమును స్థాపించినట్లు పారంపర్య మొకటి గలదు. పురాతనమైన ఆరాధన క్రమ మొకటి మార్కు ఆరాధనక్రమ మనఁబడుచున్నది. పారంపర్యపు సంగతులన్నియు నిజమని చెప్ప వీలుకాకున్నను, మార్కు అపొస్తలుఁడు కాకపోయినప్పటికిని అతఁడు వారిదగ్గర నుండుటచే సువార్తను వ్రాయుటకు తగినవాఁడని మాత్రము స్పష్టమగుచున్నది (మార్కు సువార్త చూ॥).

**మార్కు సువార్త** (The Gospel according to St. Mark). బైబిలులోని నాలుగు సువార్తలలో రెండవది. దీనితో సువార్తలు, యేసుక్రీస్తు అను వ్యాసములను చూచుట యుక్తము.

I. గ్రంథకర్త. యోహాను మార్కు ఈ సువార్తను వ్రాసెను (మార్కు చూ॥). అతఁడీ సువార్తను వ్రాసినట్లు తేటయైన సూచనలిందు గాన్పింపవు. కొందఱి యభిప్రాయ ప్రకారము $14^{51,52}$ నందున్న యౌవనుఁ డితఁడేయైన పక్షమున అవి కొంచెము గూఢమైన సూచన యనవలసి యుండును. ఈ సువార్తను వ్రాసినది మార్కేనని నిరాక్షేపమైన సూచనలు ఆదినుండి యున్నట్లు ఆయా గ్రంథములయందున్నవి అపొస్తలుఁడగు యోహాను శిష్యుఁడైన పాపియ (*Papias*) అనువాఁ డీ దిగువరీతిగా వ్రాసెను. "పేతురు ప్రసంగములను తెలియఁజేసిన మార్కు క్రీస్తుచెప్పినవాటినిగాని చేసినవాటినిగాని వరుసగా వ్రాయకపోయినను, తాను విని జ్ఞాపకముంచుకొన్న సంగతులను సరిగా వ్రాసెను. అతఁడు క్రీస్తుబోధింపఁగా విన్నవాఁడుగాని, ఆయనను వెంబడించినవాఁడుగాని కాదు. అయినను, క్రీస్తుచెప్పిన బోధలను క్రమముగా చెప్పవలెనను ఉద్దేశముతోఁగాక ఆయా సమయములందు తన ప్రసంగములను వినువారికి తగినట్లుగా చేసిన పేతురు వెంటనుండినవాఁడు గాన మార్కు తాను విన్నసంగతులను వ్రాసినప్పుడు తనకు జ్ఞాపకమున్నంతమట్టుకు దేనిని విడిచిపెట్టకను, దేనిని మార్చకను వ్రాసెను గాన అతఁడెట్టి పొరపాటులను జేసియుండలేదు." ఇందువలనే మార్కు సువార్త పేతురు సువార్త యని చెప్పఁదగును. పేతురు కొర్నేలియింటియందు చేసిన బోధ మార్కు సువార్తయొక్క క్లుప్తవివరమని యెంచవచ్చును (కార్య $10^{37-41}$).

II. కాలము. క్రొత్త నిబంధన గ్రంథమునం దిది రెండవదిగా నున్నను అన్నిఁటికన్న మొదట వ్రాయఁబడినదని దాదాపుగా నందఱును ఒప్పుకొందురు (సువార్తలు చూ॥). క్రీ॥ శ॥ 70 సం॥ న యెరూషలేము నాశనము కాకపూర్వమే వ్రాయఁబడినదని $13^{28-37}$ వలన స్పష్టమగును. మార్కు వ్రాసిన అద్భుతములను మత్తయి తన సువార్తయం దెక్కించుకొనెనని కొందఱి యభిప్రాయము. అట్లయినపక్షమున నిది మత్తయి సువార్తకు పూర్వమే వ్రాయఁబడెను. ఎట్లయినను ఈ సువార్త శైలియు నిర్మలత్వమునుబట్టి దీనిని మొదటిదిగా నెంచఁదగును గాన క్రీ॥ శ॥ 60 కి దగ్గరి సంవత్సరములందు వ్రాయఁబడినట్లు నిశ్చయించుకొనవచ్చును.

III. ఉద్దేశము. ఈ సువార్త అన్యులగు క్రైస్తవులకొఱ కుద్దేశింపఁబడినట్లు నిదర్శనములు దీనియందే గలవు. క్రీస్తుపయోగించిన అరమేయిక్ భాషాపదములు వచ్చినప్పుడెల్ల మార్కు

ఆ మాటలు తన సువార్తను చదివెడివారికి తెలియదనునట్లు వాటి కర్థమునుకూడ వ్రాసెను ($3^{17}$ $5^{41}$ $7^{11,34}$ $10^{46}$ $14^{36}$ $15^{22,34}$). దీనియందు లాటిన్ భాషాపదము లుండుటచే నిది యిటలీలోని వారికొఱకు మొదట ఉద్దేశింపఁబడినట్లు తోచును ($2^{4}$ $6^{27}$ $6^{55}$ $7^{4}$ $15^{15}$). పాఁత నిబంధననుండి యెత్తినవాక్యములు అరుదుగా నుండుటయు, ఉన్న వాటి సందర్భములు వివరింపఁబడక పోవుటయు అట్టి ఊహను బలపఱచును.

IV. ముఖ్యలక్షణములు. మార్కు తన సువార్తయందు క్రీస్తు అద్భుతములనే వివరముగా వ్రాసెను. ఆయన ప్రసంగములలో యెరూషలేము నాశనమునుగూర్చిగాక మఱిదేనిగూర్చియు అంత విపులముగా వ్రాసియుండలేదు. మేలు చేయుచు అపవాదిచేత పీడింపఁబడినవారి నందఱిని స్వస్థపఱచుచు సంచరించుచుండెను (కార్య $10^{38}$) అని పేతురు ప్రసంగించినట్లు క్రీస్తు తన జీవితకాలమునందు విసుకు విరామములేకుండ పని జేసెను. మార్కు సువార్తయందు ఆయనచెప్పిన ఉపమానములు 4 మాత్ర ముదాహరింపఁబడినను 18 అద్భుతములనుగూర్చి యున్నది. ఆయనపని బాహుళ్యతను సూచించుటకును, ఎట్టి విరామమునులేక ఒక పనివెంట ఒకటి జరిగినట్లు తెలుపుటకును వెంటనే యనుపదము పదేపదే వచ్చును (మా $1^{21,30,42}$ మొ॥). క్రీస్తు సర్వశక్తిమంతుఁడగు దేవునికుమారుఁడని ఈ కార్యములవలన దృఢపఱచెను ($1^{11}$ $5^{9}$ $8^{38}$ $9^{7}$ $12^{1-11}$ $13^{32}$ $14^{36,61}$). పైన నుదాహరించినట్లుగా మార్కు క్రీస్తువాడిన అరమేయిక్ భాషాపదములను మాత్రమే గాక ఆయనచేసినకార్యములను కన్నులార చూచినవారు పరిశీలించిన సూక్ష్మవిషయముల నేకములను వ్రాసెను. ఆయన చిన్న పిల్లలనెత్తి కౌగిలించుకొనుట ($10^{16}$) సముద్రమును దాటుచుండఁగా ఆయన తలగడమీఁద తలవాల్చుకొని పరుండుట ($4^{38}$), యౌవనస్థుఁ డొకఁడు పరుగెత్తుకొనివచ్చి ఆయనయెదుట మోకాళ్లూనుట ($10^{17}$) మొదలగునవి ఉదాహరింపఁబడెను. క్రీస్తు ముఖవైఖరిని కనపఱచు సూచనలును గలవు. ఆయన ఖండితముగా చెప్పుట ($1^{43}$), హృదయ కాఠిన్యమునుబట్టి దుఃఖపడి కోపముతో వారిని కలయ చూచుట ($3^{5}$), ఆత్మయందు పెద్ద నిట్టూర్పు విడుచుట ($8^{12}$) మొదలగునవి అట్టి సూచనలైయున్నవి. ఇట్టి సూక్ష్మసంగతులనుబట్టి మార్కు స్వయముగా చూచినవాఁడు గాకున్నను, అట్లు చూచినవానిని బాగుగా నెఱుఁగునను సంగతి రూఢియగుచున్నది.

V. అనుబంధవచనములు ($16^{9-20}$). ఇవి ఆది ప్రతులయందున్నట్లు కనఁబడదు. అది గ్రంథములలోని యొక అకు పోయినట్లుగా నున్నది. కొన్ని ప్రతులలో ఈ దిగువనున్న ముగింపువాక్యములున్నవి: "(స్త్రీలు) పేతురుకు సంబంధించిన వాటినన్నిఁటిని తమకు ఆజ్ఞాపింపఁబడిన వాటినన్నిఁటిని తెలిపిరి. తరువాత యేసు తానే వారికి ప్రత్యక్షమై, నిత్యరక్షణనుగూర్చిన పరిశుద్ధమును నిష్కళంకమునునగు బోధను తూర్పునుండి పడమటివఱకు వారిచేత పంపించెను." ఇందుచేతనే ఈ చివరి 12 వచనములు మార్కు సువార్తయందుండుటనుగూర్చి అభిప్రాయభేదముగలదు. గాని ఈ వచనములలోని సంగతు లితర సువార్తయందు నుండుటను బట్టి అవి వాస్తవమా యనుటనుగూర్చి యెట్టి సందేహమునులేదు. ఈ వచనములు మిగుల పురాతనకాలమునందే చేర్చఁబడెను.

VI. ముఖ్యభాగములు, విషయములు. 1. పీఠిక ($1^{1-13}$), 2. గలిలయ చర్య ($1^{14}$-$9^{50}$), 3. పెరీయలోఁ దిరుగుచు యెరూషలేముకు చివరగా వెళ్లుట ($10^{1-52}$), 4. చివరివారములో జరిగిన సంగతులు ($11^{1}$-$16^{20}$) అను ముఖ్యభాగములీ సువార్తయందుగలవు.

1. పీఠిక. సువార్తకు ఆరంభవిషయములు అనఁగా, యోహాను చర్య, క్రీస్తుబాప్తిస్మము, శోధనలు, $1^{1-13}$.

2. (1) గలిలయ చర్య ఆరంభము: బోధించుచు నలుగురు శిష్యులను పిలుచుట, కపెర్నహూము సమాజమందిరములో దయ్యముపట్టిన వానిని బాగుచేయుట, పేతురు అత్తను ఇంక నేకరోగులను స్వస్థపఱచుట, $1^{14-34}$. (2) ప్రార్థనతో సిద్ధపడి గలిలయ యావత్తు తిరిగి సమాజమందిరములలో బోధించుచు అనేక యద్భుతములనుచేయుట. ఆ యద్భుతములలో నొకటిమాత్ర ముదాహరింపఁబడినది. అందు

వలన ఆయనకీర్తి ప్రబలమగుటచే ఆయన వేరుపడ వలసివచ్చెను $1^{35-45}$. (3) నీ పాపములు క్షమింపఁబడినవని పక్షవాయువు గలవానితో చెప్పినందుకును, లేవిని పిలుచుకొని సుంకరులతో సాంగత్యము చేసినందుకును, ఉపవాసము చేయ నందుకును, విశ్రాంతిదినమున వెన్నులు త్రుంచి తినిన శిష్యులను గద్దింపనందుకును, ఊచచెయ్యి గలవాని విశ్రాంతిదినమునందే బాగుచేసినందు కును, పరిసయ్యులు ఆయనను విరోధించుటవలన ఆయన వారినుండి వేరుపడి అపొస్తలులను నియ మించుకొనుట, $2^{1}$-$3^{19}$. (4) కపెర్నహూముకు తిరిగివచ్చినప్పుడు విరోధులాయన సాతాను సంబంధియనియు బంధువులైనవారు ఆయనకు మతి తప్పినదనియు చెప్పఁగా $3^{20-35}$, ఆయన తన సంగతులను ఊరకనే వినుచుండువారినుండి నిజమైన శిష్యులను ప్రత్యేకించనై ఉపమానముల రీతిగా దేవునిరాజ్యమునుగూర్చి బోధించుట, $4^{1-34}$. (5) గలిలయ సముద్రమునుదాటి తిరిగి వచ్చుచు దేవునిరాజ్యమును దృష్టాంతపఱచెడి అద్భుతములను (సముద్రముమీఁద తుఫానును నిమ్మళింపచేయుట, సేన దయ్యములనుపట్టినవాని స్వస్థపఱచుట, విశ్వాసముయొక్క అవసరమును చూపుటకు యాయీరు కుమార్తెను బ్రతికించి రక్తస్రావరోగముగల స్త్రీని స్వస్థపరచుట) $4^{36}$-$5^{43}$. (6) గలిలయలో మఱియొక ప్రయాణముచేసి నజరేతులో నిరాకరింపఁ బడుట, $6^{1-6}$. (7) అపొస్తలుల నిద్దరిద్దరినిగా పనికిఁబంపి, వారు తిరిగివచ్చినపిమ్మట యోహాను మరణవార్తను విని, వారిని ఏకాంతముగా గలిలయ సముద్రమునకు ఈశాన్యముగాఁ దీసికొనివెళ్లి, 5000 మంది కాహారముపెట్టి, సముద్రముమీఁద నడిచి తిరిగి కపెర్నహూమునకు వచ్చి గెన్నేసరెతులో అనేక యద్భుతములను చేయుట, $6^{7-56}$. (8) శిష్యులు కడుగనిచేతులతో భోజ నము చేయుటనుగూర్చి వినియు క్రీస్తుపెద్దల పారంపర్యబోధలను లక్షింపనందుచేత పరిసయ్యు లాయన నింక ఎక్కువగా విరోధించినందున $7^{1-23}$, ఆయన గలిలయలో నిఁక బోధింపఁజాలక దానిచుట్టునుండు ప్రాంతములలోఁ దిరుగుచు శిష్యులకు బోధించుట. (9) తూరు సీదోను ప్రాంతములలో సురోఫెనికయ స్త్రీ కుమార్తెను $7^{24-30}$, దెకపొలి ప్రాంతములలో చెవిటి మూగ వానిని $7^{31-37}$ బాగుజేసి, 4000 మంది కాహారము పెట్టి $8^{1-10}$, దల్మనూతాలో గురుతు నడిగినవారికి బుద్ధిచెప్పి $8^{11-13}$, పులిసినపిండి దృష్టాంతము ద్వారా శిష్యులకు బోధించి $8^{14-21}$, బేత్సయిదా ప్రాంతములలో గుడ్డివాని బాగుజేసి $8^{22-26}$, ఫిలిప్పుదైన కైసరయ ప్రాంతమందు మార్గమున తననుగూర్చి లోకులేమనుకొనుచున్నారని యడిగి తనకును శిష్యులకును కలుగఁబోవు శ్రమలను గూర్చి తెలుపునప్పుడడ్డమువచ్చిన పేతురును గద్దించి $8^{27-38}$, రూపాంతరము పొందినపిమ్మట $9^{1-8}$, కొండ దిగివచ్చి చాంద్రరోగియగు నొక బాలుని బాగుచేయుట, $9^{9-32}$. (10) కపెర్న హూముమీఁదుగా వెళ్లినప్పుడు మార్గమున శిష్యులు గొప్పతనమునుగూర్చి వాదించుకొన్నం దున వారికి వినయమునుగూర్చి బోధించుట $9^{33-37}$. (11) తమవెంటరానివారిని శిష్యులు ఆటంకపఱచఁగా వారికి బుద్ధిచెప్పి అభ్యంతర ములు పెట్టకుండ జాగ్రత్త పడుఁడని హెచ్చరిం చుటతో గలిలయ చర్యను ముగించుట $9^{38-50}$.

3. పెరీయగుండ యెరూషలేమునకుఁ బోవు నప్పుడు జరిగినసంగతులు: పరిత్యాగపత్రిక నిచ్చు టనుగూర్చినబోధ, చిన్నపిల్లలను దీవించుట, స్థితి గల యౌవనుఁడు వెనుకకుఁబోవుట $10^{1-31}$, తన శ్రమలనుగూర్చి రెండవమారు తెలుపుట $10^{32-34}$, యాకోబు యోహానుల కోరిక $10^{35-45}$, యెరి కోలో బర్తీమయికి దృష్టి ననుగ్రహించుట $10^{46-52}$.

4. చివరివారమునందు జరిగిన సంగతులు: ఆదివారమున, జయోత్సవముతో యెరూషలే ములోఁ బ్రవేశించుట $11^{1-11}$; సోమవారమున, అంజూరపుచెట్టును శపించుట, దేవాలయమును శుద్ధిచేసినందున విరోధులాయనను జంపుటకు నిశ్చయించుకొనుట $11^{12-19}$; మంగళవారము నాఁడు, ఎండిన అంజూరపుచెట్టునుగూర్చి శిష్యు లకు బోధించుట $11^{20-25}$, యూదులు క్రీస్తు అధి కారమునుగూర్చి ఆయనను ప్రశ్నించుట $11^{26-33}$, వారి హెచ్చరిక నిమిత్తము గుత్తదారులకిచ్చిన ద్రాక్షతోఁట ఉపమానమును చెప్పుట, పన్ని చ్చుట పునరుత్థానము ప్రధానమైన ఆజ్ఞలను గూర్చిన ప్రశ్నలు, క్రీస్తు దావీదుకుమారుఁ డనుటనుగూర్చి ఆయన ప్రశ్నించుట, శాస్త్రులను

పరిచర్యలను గద్దించి బీదవిధవరాలిని మెచ్చుకొనుట $12^{1-44}$, సాయంకాలమప్పుడు ఒలీవల కొండమీఁద కూర్చుండి యెరూషలేము నాశనము లోకాంతములనుగూర్చి తెలుపుట $13^{1-37}$, ఆ దినమునందే ఆయనవిరోధులు చేసినకుట్ర $14^{1-2}$, స్నేహితు లాదరించినవిందు సమయమున మరియ ఆయన నభిషేకించుట $14^{3-9}$; బుధవారమున, క్రీస్తు బేతనియలో నుండఁగా యూదా ఆయన నప్పగించుటకై ప్రధానయాజకులతో బేరమాడుట $14^{10,11}$; గురువారమున పస్కాకు సిద్ధపడుట దానిని భుజించుట, ప్రభురాత్రి భోజన సంస్కార నియమము, శిష్యులకు జాగ్రత చెప్పుట, గెత్సేమనే తోటలో ప్రార్థించుట, శత్రువులచే పట్టఁబడుట, ఆయనను వెంబడించిన యొక యౌవనుఁడు వారిచేతఁబడి దిగంబరియై పారిపోవుట $14^{12-52}$; శుక్రవారమున, ప్రధానయాజకునియొద్ద విచారించుట, పేతురు బొంకుట $14^{53-72}$, ఉదయమున సన్హెడ్రిన్ సభవారాయనను విచారించి పిలాతునొద్ద కంపఁగా అతఁడు సిలువ వేయ నప్పగించుట $15^{1-20}$, ఆయనను సిలువ వేయుట, మరణము, అరిమతయియ యోసేపు పాతిపెట్టుట $15^{21-47}$; తరువాతి ఆదివారమున, ఆయన పునరుత్థానుఁడగుట దూతలావార్త స్త్రీలకుఁ దెలుపుట $16^{1-8}$, చివరి పన్నెండువచనములలో ఆయన మగ్దలేనే మరియకును, ఎమ్మాయుకుఁబోవు ఇద్దరికిని, పదునొకొండుమందికిని ప్రత్యక్షమగుట $16^{9-18}$. ఆరోహణుఁడై తన వాక్యమును స్థిరపరచుటకై ఇంకను పనిచేయుటనుగూర్చి యున్నది $16^{19-20}$.

**మార్గము, త్రోవ, దారి (Way).** మార్గమునుగూర్చిన సాధారణ సూచన లనేకములు పాత నిబంధనయందును క్రొత్త నిబంధనయందును కనఁబడుచున్నవి (I సమూ $6^{9}$ II రాజు $3^{20}$ యిర్మీ $2^{18}$ మ $10^{5}$ కార్య $8^{26}$ మొ॥). ఈ పదము లందరికి తేటగాఁ దెలిసినవగుటచే నీ శీర్షిక క్రింద వాటి యలంకారార్థములనుగూర్చి మాత్రము వివరింపఁబడును.

1. మార్గమనుపదము మానవుల నడతను సూచించును. వారు మంచివారైన పక్షమున వారి మార్గము మంచిదియు దేవుని కనుకూలమైనదియునై యున్నది (ద్వితీ $31^{29}$ కీర్త $1^{6}$ మ $21^{32}$). వారి ప్రవర్తన చెడ్డదైనపక్షమున అది దుష్టమార్గమనఁబడును (కీర్త $139^{24}$ యెష $65^{2}$ కార్య $14^{16}$ యాకో $5^{20}$ మొ॥).

2. దేవుఁడు మానవులయెడల చేసెడి నీతి కార్యములు ఆయన మార్గమని అలంకారరీతిగా చెప్పఁబడును (యోబు $21^{14}$ సామె $8^{22}$ కీర్త $25^{9}$ $37^{34}$ $67^{1}$ $86^{9}$ యెష $55^{11}$). మానవులు గుణపడుట ఆయన మార్గములలో నడుచుకొనుట యనఁబడును. వారు యెహోవాకొఱకు మార్గము సిద్ధపఱచవలెనని $40^{3}$ $57^{14}$ లో ప్రేరేపణలున్నవి. వారు నడువఁగలుగు మార్గమునే ఆయన యేర్పరచునను హెచ్చరికయు యెషయా గ్రంథమున నెక్కువ మాఱులు కనఁబడును ($42^{16}$ $43^{19}$ $49^{11}$ మొ॥). దేవుఁడు చేసిన బోధల ప్రకారము మానవులు నడువకపోవుట, ఆయన మార్గములో నుండి తొలగుట యనిగాని, ఆయన త్రోవ తప్పుట యనిగాని యనఁబడును ($63^{17}$ మొ॥).

3. క్రీస్తుచేసిన బోధలలో మార్గమను పదమునకు మఱింత గంభీరమైన భావము కనఁబడుచున్నది. ఆయనయందు విశ్వసింపనివారు సహా ఆయన దేవుని మార్గమునుగూర్చి సత్యముగా బోధించెనని యొప్పుకొనవలసి వచ్చెను (మ $22^{16}$). తానే మార్గము సత్యము జీవమునై యున్నానని ఆయన చెప్పెను (యోహా $14^{6}$). క్రీస్తును చూచుటవలనే దేవుని నెఱుఁగుదుము. క్రీస్తును వెంబడించుటయే దేవుని మార్గమందు నడుచుట యని ఈ వాక్యమువలన స్పష్టమగుచున్నది. తన పనివలనను, మరణ పునరుత్థానములవలనను మనము దేవుని సమీపింపఁగలుగునట్లు ఆయన మార్గము నొకటి తెరిచెనని హెబ్రీ $9^{8}$ $10^{20}$ లో నున్నది. ఆదిక్రైస్తవులు క్రైస్తవ బోధను ఒక మార్గమని యెంచిరి (కార్య $9^{2}$ $19^{9,23}$ $24^{22}$). క్రైస్తవ మతమున కిదియొక పురాతనమగు సార్థకనామమై యున్నది. అది రక్షణ మార్గమనియు ($16^{17}$), దేవుని మార్గమనియు ($18^{25,26}$) పిలువఁబడును. క్రీస్తు జీవమునకు పోవు మార్గమునుగూర్చియు నాశనమునకు పోవు దారినిగూర్చియు బోధించెను (మ $7^{13,14}$). ఇట్టి మార్గములు రెండు గలవు. బైబిలునకు సంబంధించని మిగుల పురాతనమైన పత్రికలలో ఈ రెండు మార్గముల (*The Two*

*Ways*) ను గూర్చిన పత్రిక యొకటి ఆదిక్రైస్తవులలో మిగుల వాడుకయందుండెను.

హైవాక్యముల ననుసరించి క్రైస్తవులు రక్షణ మార్గమునుగూర్చి బోధించెదరు దీనికి సంబంధముగా జీవమార్గము (కార్య 2[28]), శాంతిమార్గము (రోమా 3[17]), సత్యమార్గము (II పేతు 2[2]), తిన్నని మార్గము (2[15]), నీతి మార్గము (2[21]) లను గూర్చి ఉదాహరింపఁబడి యున్నది.

**మార్త** (Martha = ఇల్లాలు). లాజరు మరియల సహోదరి. యెరూషలేముదగ్గరనున్న బేతనియ వీరి కాపురస్థలము. మార్త ఆ యింటికి పెద్ద. వీరిది స్థితిగల కుటుంబముగ కనఁబడుచున్నది. యేసు యెరూషలేముకు వచ్చినప్పుడు తరుచుగా వీరి యింట బసచేయువాఁడు. తన జీవితములోని చివరివారము వీరియింటనే గడిపి యుండును (మ 21[17] మా 11[19]). క్రొత్త నిబంధనయందు మార్త మూఁడు సందర్భములలో నగపడుచున్నది. యేసు బేతనియలోని వీరియింట దిగినప్పుడు మరియ ఆయన బోధలను వినుటయు, మార్త విస్తారమైన పనిపెట్టుకొని తొందరపడుటయు సంభవించెను. మార్త మంచి ఇల్లాలైనను త్వరగా కోపపడు స్వభావము గలదనియు, యేసు మరియను గద్దింపకోరినదనియు తెలియుచున్నది (లూ 10[38-42]). తన సహోదరుఁడగు లాజరు చనిపోయినప్పుడు యేసు బేతనియకు వచ్చెనని విని ఆయన సెదుర్కొనఁ వెళ్లి ఆయనయందు తన కున్న గొప్ప విశ్వాసము నగపఱచెను (యోహా 11[20 27]). యేసు మరణమున కారుదినములకు ముందు ఆయన నిమిత్తమై చేయఁబడిన విందులో పరిచర్య చేయుపని ఆమెమీఁద పడినందున యిట్టి పనులలో నామె గొప్ప యనుభవముగలదని తెలియుచున్నది. ఈసారి అందఱు మరియకు విరోధముగా మాట్లాడుచుండినను ఆమె యేమియు చెప్పలేదు. ఆమెయు మరియవలె ఆ మంచి భాగము నేర్పఱచుకొనుటకు నేర్చుకొనెను (12[1-3]). E.

**మాషాలు** మిష్పియలు చూ॥

**మాషు** (Mash). అరాము కుమారులలో నొకఁడు (ఆది 10[23]). I దిన 1[17] నందితనికి మెషెకు అను మాఱుపేరు గలదు. ఇది LXX లోని ఆది 10[2] ( = I దిన 1[17]) నందు మోసఖ్ అని యున్నది. అట్లయినపక్షమున నిది అచ్చు తప్పయి యున్నది. అది మెషెకుకు సంబంధించినదై యున్నది. ఈ రూప మెట్టిదైనను అది 10[2] లో నున్న మెషెకుకు వేఱయిన వాఁడు. అతఁడు యాపెతు సంతతివాఁడు. ఇతఁడు ( = మాషు) షేము సంతతివాఁడై యున్నాఁడు. ఇతని సంతతి వారు పలెస్తీనుకు తూర్పుననున్న యెడారిలో నివసించి యుందురు.

**మాసచర్య చెప్పువాడు** (Prognosticator). మూలభాషాపదమునకు నెలల విషయము తెలియఁజేయుట యని యర్థము. కల్దీయుల యొక్క జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన మూఢాభిప్రాయములు గలవారితోకూడ కలిపి యెషయా వీరినిగూర్చి చెప్పెను (యెష 47[13]). వీరు అమావాస్యనాడు రాఁబోవు నెలలో జరుగఁబోవు కార్యములన్నియు తెలుపువారని సూచించిరి. నక్షత్రములయొక్క స్థానములను రూపములను జాగ్రత్తగా గమనించుటద్వారా రాఁబోవు సంగతులను తెలిసికొను జ్ఞానము కలదని వారు చెప్పుకొనిరి. ఇశ్రాయేలీయు లనేక సంవత్సరముల వఱకు కల్దీయులతో సహవాసము చేయుట ద్వారా వారిలోకికూడ నీ మూఢనమ్మిక ప్రవేశించెను (జ్యోతిష్కుఁడు చూ॥). B.

**మాసిదోనియ** (Macedonia). గ్రీసుకు ఉత్తరముననున్న దేశము. తూర్పున ఈజియన్ సముద్రమువఱకు అది వ్యాపించెను. మహా అలెక్సందరు తండ్రియగు ఫిలిప్పు దానికి రాజగునంతవఱకు దానికేమియు ప్రసిద్ధి లేకపోయెను. క్రీ॥ పూ॥ 359-336 లో నతఁడు చుట్టుపట్లనుండు దేశములను జయించి దానిని గొప్ప రాజ్యముగాఁ జేసెను. ఆ దేశస్థులు చుట్టునుండు ప్రాంతములలోని గ్రీకువారై యుండిరి. క్రీ॥ పూ॥ 168 నందు రోమనులాదేశమును జయించి 142 సం॥నందు తమ సామ్రాజ్యమందలి భాగములలో నొకదానిగఁ జేసిరి.

పాఁత నిబంధనయందు మాసిదోనియ పేరు లేకున్నను ఆ రాజ్యమునుగూర్చిన సూచనలు గలవు (దాని 2[39] 7[6] 8[5,8]). పౌలు తన దర్శనమందు కనఁబడి పిలిచిన మాసిదోనియ దేశస్థుని

ఆహ్వాన ప్రకారము అక్కడికి క్రీస్తునుగూర్చిన సువార్తను గొనిపోయెను నెయపొలి అంఫిపొలి అపొల్లోనియల మీఁదుగా వెళ్లినను ఫిలిప్పయి థెస్సలొనీక బెరయ పట్టణములలో మాత్రము బోధించెను (కార్య $16^{9}$-$17^{4}$). ఈ పట్టణము లన్నియు రోమానుండి ఆసియకుఁ బోవు ఎగ్నేషియన్ (*Egnatian*) రాచబాటమీఁద నున్నవి. ఆ బాట తూర్పు పడమరలుగా మాసిదోనియ దేశమంతటిగుండా వ్యాపించెను. పౌలు మాసిదోనియను విడిచిపెట్టిన పిదప తిమోతిని సీలను అచ్చటనే యింక కొంతకాలమువఱ కుంచెను ($17^{14,15}$ $18^{5}$). పౌలు చెఱలో వేయఁబడక పూర్వము గ్రీసుకు వెళ్లుచుండఁగా నొక మాఱును ($19^{21,22}$ II కొరి $2^{13}$ $7^{5}$), తిరిగి వచ్చునప్పు డొకమాఱును (కార్య $20^{1-3}$) దానిని దర్శించెను. చెఱనుండి విడుదల నొందిన పిదప మఱియొకమా ఱచ్చటకు వెళ్లెను (I తిమో $1^{3}$). పౌలు సహచరులును ఎఫెసునందు జరిగిన గలిబిలిలో అతనితో కూడ ఆపదయందుండిన గాయు అరిస్తర్కు అను వారును (కార్య $19^{29}$) మూఁడవ ప్రయాణము నందు పౌలుకొఱకు త్రోయలో కనిపెట్టుచుండిన వారిలో సెకుందు అనువాఁడును ($20^{4}$) ఈ దేశస్థులైయున్నారు. యెరూషలేమందున్న బీదలకుకొఱకు పౌలెత్తిన చందాలో వారెక్కువ సహాయము చేసిరి (రోమా $15^{26}$ II కొరి $8^{1-4}$ ఫిలిప్పయి, బెరయ, అంఫిపొలి, అపొల్లోనియ చూ॥).

**మాహోలు** (Mahol = నాట్యము). సొలొమోనుకు ముందు అందఱిలో జ్ఞానియని పేరుపొందిన నలుగురికి తండ్రి (I రాజు $4^{31}$). ఈ మూలభాషాపదమునే కీర్త $149^{3}$ $150^{4}$ లో నాట్యము అను మాటచే తెనిఁగించిరి. ఇది సార్థకపదమగుటచే ఆ నలుగురును ముఖ్యముగా కీర్తనలను రచించుటయందు ప్రసిద్ధులైనవారని కొందఱి యూహ.

## మి

**మిక్నేయాహు** (Mikneiah = యెహోవా స్వాస్థ్యము). లేవీయులలో నొకఁడు. ఇతఁడు దావీదు కాలములోనుండి సితారాలను వాయించిన వారిలోను (I దిన $15^{21}$) ద్వారపాలకులలో నొకఁడై యుండెను (I దిన $15^{18}$).

**మిక్మషు** (Michmash, Michmas = చాటుగా నున్నది). బేతేలు దగ్గరనుండు స్థలము (I సమూ $13^{2}$). ఇది బేతావెనుకు తూర్పున నుండెను ($14^{5}$). ఇచట ఫిలిష్తీయులు సౌలు మీఁద యుద్ధముచేయఁగా, యోనాతాను పరాక్రమమువలన వారోడిపోయిరి ($13^{5-15}$ $14^{7-23}$). యెషయా ప్రవచనము ప్రకారము అష్షూరీయులు దండెత్తివచ్చిన యూళ్లలో నిది యొకటై యుండెను (యెష $10^{28,29}$). చెఱకాలమునకు పిమ్మట మిక్మషువారిలో 123 రు తిరిగివచ్చిరి (ఎజ్రా $2^{27}$ నెహె $7^{31}$). వారు బెన్యామీనీయులై యుండిరి ($11^{31}$). మక్కబీయులకాలములో మక్కబీయుఁడగు యోనాతాను ఇచ్చటనుండి ప్రభుత్వముచేసెను (I మక్క $9^{73}$). నేటివఱకు నున్న ముక్మాస్ (*Mukhmas*) అను కనుమయే దీనియునికి యనుకొందురు. బొస్సేసు సెనా అను రెండు సూదిగట్టులు (I సమూ $14^{4}$) ఈ కనుమ ప్రక్కలనుండు రెండు రాళ్లుగల కొండశిఖరములై యుండెను. యెరూషలేమునకు ఉత్తరముగా $7\frac{1}{2}$ మైళ్ల దూరముపోయి తూర్పుకు సాగిపోయిన యెడల ఇప్పుడున్న ముక్మాస్‌లో చేరఁగలము. (పటము III, F 5).

**మిక్మెతా, మిక్మెతాతు** (Michmethah = దాగుకొను చోటు). ఈ స్థలముయొక్క పేరు యెహో $16^{6}$ $17^{7}$ లో తప్ప మఱియెచటను లేదు. అది మనష్షే గోత్రమునకు సరిహద్దుగా నుండిన స్థలమేకాని, అదియొక ఊరుకాక, ఒక బయలును లేక కనుమను సూచించు పదమని యసలు భాషను బట్టి తెలిసికొనవచ్చును. ప్రస్తుతము నాబ్లూస్ (*Nablus*) అను నూరికి తూర్పుగా నుండు ఎల్-ముక్నె (*El-Mukneh*) అనునది మిక్మెతో యను పేరునకు సంబంధముగా నుండవచ్చును.

**మిక్రి** (Michri = కొనఁబడిన). బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $9^{8}$).

**మిక్లోతు** (Mikloth).

1. దావీదు కాలములో నుండు నొక సేనాధిపతి (I దిన $27^{4}$).

2. బెన్యామీనీయులలో నొకఁడు. యెహీయేలు సంతతివాఁడు (I దిన $8^{32}$ $9^{35-38}$).

**మిఖాయేలు, మీఖాయేలు** (Michael = దేవునివంటి వారెవరు?).

1. గాదీయుఁడు. బూజు సంతతివాఁడు. గిలాదులో నొక కుటుంబమునకు పెద్ద (I దిన 5[13,14]).

2. దావీదు కాలములో ఇశ్శాకారు గోత్రీకుల నేలిన ఒమ్రీ తండ్రి (I దిన 27[18]).

3. కనాను దేశమును వేగు చూచుటకు పంపఁబడినవారిలో ఆషేరుగోత్ర ప్రతినిధి (సంఖ్యా 13[13]).

4. గాదు గోత్రీకుఁడు. బూజు సంతతి వాఁడు (I దిన 5[14]).

5. లేవి గోత్రమందలి గెర్షోను సంతతివాఁడు. ఆసాపు పూర్వీకుఁడు (I దిన 6[40]).

6. ఇశ్శాఖారు గోత్రములోని టోలా వంశమునందలి ఉజ్జీ యింటికి ముఖ్యుఁడు (I దిన 7[3]).

7. బెన్యామీనీయుఁడు. బెరియా కుటుంబికుఁడు (I దిన 8[16]).

8. సిక్లగులోనున్న దావీదుతోఁ జేరుకొనిన మనష్షేగోత్ర నాయకుఁడు (I దిన 12[20]).

9. రాజైన యెహోషాపాతు కుమారుఁడు (II దిన 21[2]).

10. షెఫట్యా వంశస్థుఁడగు జెబద్యా తండ్రి (ఎజ్రా 8[8]).

11. ప్రధాన దూత (యూదా 9). పారసీక రాజ్యాధిపతి యనఁబడినవాఁ డెదిరింపఁగా నార బట్టలు ధరించుకొన్న దూతకు సహాయము చేయ వచ్చిన ప్రధాన దూతలైయుండెను (దాని 10[13]). ఇశ్రాయేలీయుల పక్షముగా పోరాడెను (10[21] 12[1]). దేవుని జనులకు విరోధులైన వారితో తన దూత సైన్యములతోకూడి పోరాడి జయ మొందును (ప్రక 12[7]). యూదులు చెఱనుండి తిరిగివచ్చిన పిదప దూతలనుగూర్చిన సిద్ధాంతముల నేర్పాటు జేసినప్పుడు మిఖాయేలును ఏడుగురు ప్రధాన దూతలలో చేర్చిరి (టోబీతు 12[15]). గబ్రియేలును వారిలో నొకఁడై యుండెను (దాని 8[16] 9[21]). రాఫయేలు (టోబీతు 3[17]) ఊరియేలు (II ఎస్డ్రా 4[1]) ఫాముయేలు, జోఫీయేలు జాడికియేలు అను ఐదుగురు వారిలో చేరినవారు. మోషే దేహమువిషయమై సాతానుతో పోట్లాడినది మిఖాయేలని సాధారణముగా నమ్మెదరు (యూదా 9, II పేతు 2[11]). దీని నాధారము చేసికొని ద్వితీ 34[6] లోని సంగతినిగూర్చి మిఖాయేలును వాని దూతలును మోషే దేహమును పూడ్చిపెట్టిరని చెప్పెదరు. ఇక్కడ అది మోషే దేహమునుగాక ఇశ్రాయేలు సంఘమును సూచించును కావున ఆ వాదము మోషే శవమునుగూర్చినదిగాక జెక 3[1,2] లో నున్నట్లు ఇశ్రాయేలు సంఘమునుగూర్చినదని కొందఱు దీనిని అలంకార రీతిగా గ్రహింతురు (దూత 3 చూ॥). H.

**మిగ్దల్ ఏదెరు** (Migdal-Eder = మందల గోపురము). యాకోబు పద్దనరామునుండి తిరిగి వచ్చునపుడు బసచేసిన యొక స్థలమునకు పేరు (ఆది 35[21]). ఇచట గొఱ్ఱెలకాపరులు తమ మందలను కాపాడుకొనుటకై ప్రాకారములను కట్టిరి (II రాజు 18[8] II దిన 26[9]). అందును బట్టియే ఈ స్థలమున కీ సార్థకనామము వచ్చినట్లుగా నున్నది. మీకా 4[8] లో ఈ పేరుగల స్థలమును మందల గోపురము అను మాటలచే తర్జుమాచేసిరి. అది 35[19-27] ను దీనితో సరిపోల్చి చూచినయెడల యాకోబు దిగిన ఈ మిగ్దల్ ఏదెరు బేత్లెహేమునకును హెబ్రోనుకు మధ్య నెచ్చటనో యుండెనని స్పష్టమగును గాని దాని యునికినిగూర్చి మఱి తేటగా తెలియదు.

**మిగ్దలేలు** (Migdal-El = దేవుని గోపురము). నఫ్తాలీగోత్ర స్వాస్థ్యములో నుండిన ఒక యూరు (యెహో 19[38]). అది ఇరోను, హొరేము అను రెండు స్థలములకు మధ్యనున్నట్లు ఆ వాక్యములోని పేరుల వరుసవలనఁ దెలియును గాని దాని యునికినిగూర్చి మఱి తేటగా తెలియదు.

**మిగ్దోలు** (Migdol = గోపురము). ఐగుప్తునకు సంబంధమైన చరిత్రలో కనఁబడు స్థలమునకు లేక స్థలములకు పేరు. ఇది సార్థకనామమై యుండుటచే గోపురముగల వేర్వేఱు స్థలములకు పేరై యుండవచ్చును. ఐగుప్తీయుల భాషలో అట్టి స్థలమునకు మక్తాలు అను పేరును పెట్టిరి. బైబిలులో దీనికి సంబంధించియున్న స్థలము లెవ్వి

యనఁగా, (*1*) ఇశ్రాయేలీయులు ఎఱ్ఱసముద్రమును దాటకపూర్వము మకాముచేసిన యొక స్థలము (నిర్గ $14^{2}$ సంఖ్యా $33^{7}$). (2) యెహె $29^{10}$, $30^{6}$ లో ఇది ఐగుప్తుదేశపు ఉత్తరపు కొన యందున్న యొక స్థలమును సూచించుటకు వాడిన పేరై యున్నది. మిగ్దోలు మొదలుకొని సెవేనే వఱకు అనఁగా ఉత్తరమునుండి దక్షిణము వఱకు గల దేశమునంతటిని సూచించును. అది (1) లో నున్నదానికింక నుత్తరముగా నుండినట్లును కొనవలెను. ఐగుప్తునకు ఈశాన్యదిక్కున నుండు పెలూసియం (*Pelusium*) అనుదానికి దక్షిణముగా 12 మైళ్ల దూరములో మిగ్దోలు ఒకటి యున్నట్లు చరిత్రకారులు వ్రాసినదానివలనఁ దెలియును. ఇదే దాని యునికియై యుండ వచ్చును. (3) యిర్మీయా కాలమందు యెరూషలేము నాశనమైన పిమ్మట మిగిలిన యూదులు పారిపోయిన ఐగుప్తులోని స్థలములలో నొకటి (యిర్మీ $44^{1}$ $46^{14}$). ఇది (2) లోనిదై యుండ వచ్చును.

**మిగ్దోల్గాదు** (**Migdal-Gad** = గాదు గోపురము). షెఫేలాలో నుండు యూదా పట్టణములలో నొకటి (యెహో $15^{37}$). ప్రస్తుతమున అష్కెలోనుకు ఈశాన్యదిక్కున 2½ మైళ్ల దూరములో నుండు మెజ్దెల్ (*Mejdel*) దీని యునికి యని కొంద ఱూహింతురు గాని అది రూఢికాదు.

**మిగ్రోను** (**Migron** = కొండ అంచు).

1. రాజైన సౌలు ఫిలిష్తీయులమీఁద యుద్ధము చేసినపుడు దండుపేటవేసిన యొక స్థలము (I సమూ $14^{2}$). ఇది స్థలమునకు పేరు కాక, బహుశః కళ్లము అని యర్థమగునని కొందఱను కొందురు. ఇది గిబా దగ్గఱ నున్నది.

2. అష్షూరీయులు యెరూషలేము మీఁదికి దండెత్తిరాఁగా వారు ఈ యూరిమీఁద కూడ పడిరి (యెష $10^{28}$). అది మిక్మషుకు ఉత్తరముగా నున్నట్లు ఆ స్థలముల పేరుల వరుసనుబట్టి తెలియును. ప్రస్తుతమందున్న మక్రూను (*Makrun*) అనునది దీని యునికియై యుండవచ్చును (పటము III, F 5).

**మిజ్జ** (**Mizzah** = భయము). ఎదోము ప్రధానులలో నొకఁడు (ఆది $36^{13-17}$ I దిన $1^{37}$).

**మిడతలు** (**Locusts**). పాలస్తీనునందు 40 రకముల మిడుత లున్నవని శాస్త్రజ్ఞులు లెక్కించి యున్నారు. అవి ఒకచోటి త్రోవున నుండక గుంపులు గుంపులుగ తిరుగుచుండు కీటకములై యున్నవి. అవి వ్రాలిన చోట్లయందున్న పచ్చని గడ్డి, చెట్లయాకులును మాయమగును. పాఁత నిబంధనయందు మిడతలకు తొమ్మిది ప్రత్యేకమైన పేరులును, క్రొత్త నిబంధనలో నొక గ్రీకు పదమున్నది. గాని వాటిలో నేది యే రకమును సూచించునో గుర్తించుట కష్టసాధ్యముగ నున్నది. తెలుఁగు బైబిలునందు ఆయా రకముల మిడుతలను ప్రత్యేక పదములచే వివరించినను, అవి సరిగా అసలు రకములను సూచించునని చెప్ప వీలుకాదు. ఆ తొమ్మిదింటిలో మిగుల సాధారణమైన పదమునకు విస్తరించునది యని యర్థము. ఈ పదమును మిడత యని తెనిఁగించిరి (నిర్గ $10^{4,12,14}$ యోవే $1^{4}$ మొ॥). కీర్త $105^{34}$ నం దీ మాటనే పెద్ద మిడతలు అను పదముచే భాషాంతరముజేసిరి. ద్వితీ $28^{42}$ నందు గణగణలాడునది యని అర్థమిచ్చు అసలు పదమును, యెష $33^{4}$ నందు భూమిలోకి దూరి, అందులోనుండి వచ్చునది యని అర్థమిచ్చు పదమును మిడతలు అని తెనిఁగించిరి. లేవీ $11^{22}$ నందున్న యొక పదమును నేత మిడత యనియు, ఒకటి చిన్న మిడత యనియు, మఱియొకటి ఆకు మిడత అనియు తర్జుమాజేసిరి. యోవే $1^{4}$ నందు అసలు భాషలో మూఁడు ప్రత్యేక నామములు గలవు. ఒకదానిని పసరు పురుగులు, ఒకదానిని చీడ పురుగులు అని తెనిఁగించిరి. ఇందు పసరు పురుగు అని తర్జుమాజేసిన అసలు మాటను నహూ $3^{15}$ లో గొంగళి పురుగనియు, కీర్త $105^{34}$ నందు చీడ పురుగులనియు తెనిఁగించిరి. ఇవన్నియు మిడతలలో ఆ యా రకములని తెలిసికొనవలెను.

వీటియందు కొన్నిఁటిని ఆహారముగాఁ దినిరి (లేవీ $11^{22}$). బాప్తిస్మమిచ్చు యోహాను ఆహారము అదే (మ $3^{4}$). ఇవి శిక్షగా పంపఁబడుటచే (నిర్గ $10^{4-6}$) తీర్పుకు సూచనలై యున్నట్లు ప్రవక్తలు ప్రవచించిరి (యోవే $1^{4}$ నహూ $3^{15}$ యిర్మీ $51^{14,27}$). ఇందుచేతనే ప్రకటనలోని గొప్ప అంత్య తీర్పునందు శిక్షాసాధనములై యున్నట్లు అలంకారరీతిగా నున్నది (ప్రక $9^{3-11}$)

గాని అవి సాధారణమైన మిడతలుగాక బలమును భయంకరత్వము సూచించు గుఱ్ఱములు, గుఱ్ఱపు రౌతులు, సింహముల రూపములు వాటికున్నట్లు వర్ణింపఁబడెను (వ్యవసాయము 5 (4) చూ॥).

**మిడినాగు, మిడునాగు** పాము 2 చూ॥

**మితముగానుండుట** ఆశ చూ॥

**మితులేనే** (Mitylene). పౌలు తన మూఁడవ మిషనెరి ప్రయాణమునుండి తిరిగివచ్చుచుండఁగా దిగిన యొక రేవుస్థలము (కార్య $20^{13-15}$). ఇది యీజియన్ (*Aegean*) సముద్రమునకు ఈశాన్య దిక్కున నుండు లెస్బస్ (*Lesbos*) అను ద్వీపమునకు ముఖ్య పట్టణమై యున్నది. ప్రస్తుతమున దానికి మితులీం (*Mitylim*) అను పేరు కలదు (పటము V, H 4).

**మిత్కా** (Mithkah = మధురము). ఇశ్రాయేలీయులు అరణ్యములో మకాముచేసిన స్థలములలో నొకటి (సంఖ్యా $33^{28,29}$).

**మిత్నీయుడు** (Mithnite = మితేను ఊరి వాఁడు). దావీదు యోధులలో యెహోషాపాతు అను నొకనికి గల బిరుదు I దిన $11^{43}$. ఈ బిరుదును చూడఁగా అతఁడు మితేను అను ఊరివాఁడైనందున ఈ బిరుదును పొందెనని యూహింపవచ్చును గాని అట్టి యూరొకటి యున్నట్లు సూచనలేవియు లేవు.

**మిత్రిదాతు** (Mithredath = మిత్ర అను సూర్య దేవత నిచ్చెను).

1. కోరెషు యొక్క ఖజానాదారుఁడు. నెబుకద్నెజరు దోచుకొని యెరూషలేము గుడి సామానులను ఇతఁడు ఎజ్రాకు అప్పగింపవలెనని కోరెషు ఇతనికి నాజ్ఞాపించెను (ఎజ్రా $1^{8}$).

2. షోమ్రోనులోనుండిన యొకఁడు. ఇతఁడొక యుద్యోగస్థుఁడై యున్నట్లుగా నున్నది. ఇతరులతోఁ గలిసి చక్రవర్తియగు అహష్వేరోషుకు ఉత్తరమును వ్రాసి, యూదులు తమ ప్రాకారములను కట్టుకొనుటకు సెలవియ్య కూడదని మనవి చేసెను (ఎజ్రా $4^{7}$).

**మిద్దీను** (Middin = కొలత). యూదా అరణ్యములో నుండు నొక యూరు (యెహో $15^{61}$). దీని యునికినిగూర్చి తెలియదు.

**మిద్యాను, మిద్యానీయులు** (Midian = కలహము, Midianites). కెతూరావలన అబ్రాహామునకు పుట్టిన వారిలో నొకఁడు (ఆది $25^{2}$ = I దిన $1^{32}$). మిద్యానీయులు వీని సంతతి వారై అరేబియా దేశపు పశ్చిమోత్తర ప్రాంతములలో నివసించినవారై యుండిరి (నిర్గ $2^{15,16}$). యొర్దానుకు తూర్పుననుండు గిలాదు దేశపు తూర్పు ప్రాంతముల వఱకును (సంఖ్యా 22, న్యాయా $6^{1-7}$), ఈ జనాంగములోని ఆయా తెగలవారు చెదరియుండిరి. వారొక చోట స్థిర నివాసముచేయక తిరిగెడువారగుటచే పైఁ చెప్పిన హద్దులలోఁగా ఆయా కాలములయందు వేర్వేఱు స్థలములలో నివాసము చేసినట్లుగా నున్నది. మోషే ఫరో యెదుటనుండి పారిపోయి వీరియొద్ద ఆశ్రయ మొందెను. తరువాత వీరి యాజకుని కుమార్తెను వివాహము చేసికొనెను (నిర్గ $2^{16-25}$). సంఖ్యా $10^{29-32}$ లలో మిద్యానీయు లనఁబడిన యిత్రో కుటుంబికులు న్యాయా $1^{16}$ $4^{11}$ లలో కేయిను (= కెయినీ) కుమారు లనఁబడుదురు. దీనినిఁబట్టి చూడఁగా కేయినీయులు మిద్యానీయులలో నొక తెగవారని తెలిసికొనవలెను. ఈ తెగవారు యూదా గోత్రముతో కలిసినవారైరి (న్యాయా $1^{16}$ I సమూ $15^{6}$). ఆది $36^{35}$ చూడఁగా మిద్యానీయులు మోయాబీయులకు ఓడిపోయి నట్లున్నది గాని అది మోషే కాలమునకు పూర్వమునందై యుండెను. ఇశ్రాయేలీయులను శపించుటకు బిలామును పిలిచినవారిలో మిద్యానీయులుకూడ నుండిరి (సంఖ్యా $22^{4,7}$). వీరును కేయినీయుల తెగవారును వేఱుగా నున్నారు. మోషే కాలమందు వారు ఇశ్రాయేలీయులను శత్రువులనుగా నెంచి మోయాబీయులతో నైక్యపడి యుండిరి (సంఖ్యా $25^{15-18}$ $31^{1-18}$). న్యాయాధిపతుల కాలములో వారిశ్రాయేలీయులను మిగులఁ బాధపఱచఁగా గిద్యోను వారి నోడించి వారి రాజులను చంపించెను (న్యాయా 6-8). అందువలన మిద్యానీయులు ఇఁకను వృద్ధిలోకి రాకపోవునంతగా కృశించిరి. ఈ జయము ఇశ్రాయేలీయుల చరిత్రలో నొక గొప్ప జయముగా నెంచఁబడినట్లు యెష $9^{4}$ $10^{26}$ కీర్త $83^{9}$ లలోని సూచనలవలనఁ దెలియును. అది మొదలు బైబిలు

చరిత్రలో వారి పేరు కనఁబడదు. అయితే యెఱ్ఱ సముద్రమున కుత్తరమున నుండుదాని తూర్పుపాయకు తూర్పుగా మద్యాను (*Madyan*) అను స్థల ముండినట్లు పూర్వకాలపు భూగోళ శాస్త్రజ్ఞులు వ్రాసిరి. ఇది యా జనమునకు నొక సూచన యని యనుకొనఁదగును.

**మిద్రాషు** పారంపర్యములు చూ॥

**మినా** మానములు IV, నాణెములు I చూ॥

**మిన్నల్లి** కీటకములు 27 చూ॥

**మిన్నీ** (Minni). యిర్మీ $51^{27}$ లో మిన్నీ అను జనులు అరరాతు అష్కనజు అనువారితోఁ గలిసి బబులోను మీఁద యుద్ధము జేసెదరని యున్నది. ఈ మిన్నీయులు ఆర్మీనియా దేశములోని వాను (*Van*) అను సరస్సు దగ్గఱ నివసించిరి. అష్షూరు ప్రభుత్వము నెదిరించుచుండిరి.

**మిన్నీతు** (Minnith). యెఫ్తా యను న్యాయాధిపతి ఈ యూరివఱకు అమ్మోనీయులను హతముచేసెను (న్యాయా $11^{33}$). యెహె $27^{17}$ చూడఁగా అది శ్రేష్ఠమైన గోధుమలకు ప్రసిద్ధమైన స్థలమనియు, II దిన $27^{5}$ చూడఁగా అమ్మోనీయుల దేశము గోధుమలకుఁ బ్రసిద్ధమైనదనియు కనఁబడును. ఇది యొర్దానుకు తూర్పున నుండెను గాని దీని యునికినిగూర్చి మఱి నూటిగా తెలియదు.

**మివ్యామీపు** మీయామీను 1 చూ॥

**మిష్కాదు** యెరూషలేము B V 2 (1[illegible]) చూ॥

**మిబ్సాము** (Mibsam = సుగంధము).

1. ఇష్మాయేలీయులలో నొక తెగవారు (ఆది $25^{13}$ I దిన $1^{29}$).

2. షిమ్యోను గోత్రికులలో నొకఁడు (I దిన $4^{25}$).

**మిబ్సారు** (Mibzar = ప్రాకారము). ఎదోము ప్రధానులలో నొకఁడు (ఆది $36^{42}$ I దిన $1^{53}$).

**మిభారు** (Mibhar = శ్రేష్ఠమైన). దావీదు యోధులలో నొకనికి పేరు. ఈ వాక్యమునకు సమముగానుండు II సమూ $23^{36}$ లో నితని పేరు సోబా అని యున్నది. ఇతని కిది సరియైన పేరై యుండవచ్చును. తెనుఁగున ఈ రెండు పేరులకు సంబంధమేమియు లేకపోయినను, అసలు హెబ్రీ యక్షరముల రూపములను చూడఁగా ఈ రెండు పేరులును చాలవఱకు ఏకరీతిగా నున్నవి.

**మిర్మా** (Mirmah = మోసము). బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{10}$).

**మిర్యాము** (Miriam = తిరుగుబాటు చేయు).

1. అహరోను మోషేల సహోదరి (నిర్గ $15^{20}$ సంఖ్యా $26^{59}$). పసిబిడ్డఁడగు మోషే జమ్ము పెట్టెలో నున్నప్పుడు నైలునదీ తీరమున దాని కనిపెట్టుచుండిన దీమెయై యుండును (నిర్గ $2^{4-8}$). ఇశ్రాయేలీయులు ఎఱ్ఱ సముద్రమును దాటిన తర్వాత మిర్యాము తంబుర చేతపట్టుకొని ఇశ్రాయేలీయురాండ్రను బూరలతోను నాట్యములతోను నడుపుచు "యెహోవాను గానము చేయుఁడి. ఆయన మిగుల అతిశయించి జయించెను. గుఱ్ఱమును దాని రౌతును సముద్రములో నాయన పడద్రోసెను" అని పాడెను ($15^{20,21}$). ఆమె యొక ప్రవక్త్రి. ఇశ్రాయేలీయులను నడిపించుటకు దేవుఁడామెను ఆమె సహోదరుల నేర్పఱచుకొనెను ($4^{15,29,30}$ మీకా $6^{4}$). మోషే కూషు దేశస్థురాలిని వివాహమాడినందున ఆమె అహరోనుతో కలిసి మోషేనుగుఱించి సణిగెను అందువలన నామె దేవుని కవిధేయురాలై కుష్ఠరోగి యయ్యెను గాని మోషే ప్రార్థనవలన స్వస్థత నొందెను (సంఖ్యా $12^{1-16}$ ద్వితీ $24^{9}$) ఆమె మృతినొంది కాదేషులో సమాధి చేయఁబడెను (సంఖ్యా $20^{1}$).

2. యూదావాఁడును ఎజ్రా సంతానీకుఁడగు నొకని భార్య (I దిన $4^{17}$). H.

**మిలలై** (Milalai = వాక్చాతుర్యము గలవాఁడు). లేవీయులలోని సంగీత నాయకులలో నొకఁడు. యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించిన సమయమం దితడు సంగీతములను వాయించిన వారిలో నొకఁడై యుండెను (నెహె $12^{36}$)

**మిలేతు** (Miletus). మహా అలెక్సందరు జయించుమట్టుకు ఇది చిన్నాసియాయొక్క పశ్చిమ

పట్టణములలో నొక ముఖ్య పట్టణము. అది మొదలు దాని ప్రాముఖ్యత చాల తగ్గిపోయెను. క్రొత్త నిబంధన కాలములో అదియొక రేవు స్థలమై యుండెను. అది ఎఫెసుకు దక్షిణమున 36 మైళ్ల దూరములో నున్నది. పౌలు తన మూఁడవ మిషనెరీ ప్రయాణాంతమున తిరిగి యెరూషలేమునకు వెళ్లునపు డతఁడు ప్రయాణము చేసిన యోడ ఇచట నిలువఁగా అతఁడు ఎఫెసు పెద్దల నిచటికి పిలిపించుకొని వారికి తన చివఱి హెచ్చరికలను చేసెను (కార్య $20^{15-38}$). పౌలు మొదటి చెఱనుండి విడిపింపఁబడిన పిమ్మట మఱల నిచటికిరాఁగా అతని సహాయకులలో నొకఁడగు త్రోఫీము ఇచట జబ్బుపడెను (II తిమో $4^{20}$). క్రీ॥ శ॥ ఐదవ శతాబ్దమందిదియొక బిషపు యొక్క స్థానమును, తదనంతరము అర్చిబిషపు ఉండు స్థానము నయ్యెను. ప్రస్తుతమున కొన్ని పాడు శేషములు తప్ప మఱేమియు నచట లేదు (పటము V, H 4)

**మిల్కా (Milcah = రాణి).**

1. అబ్రాహాము తోఁబుట్టువగు హారాను కుమార్తె. ఈమె అబ్రాహాము తోఁబుట్టువగు నాహోరుకు భార్యయయ్యెను (ఆది $11^{29}$). ఈమెకుఁబుట్టిన పిల్లలపేరులు $22^{20-22}$ లో కనఁబడును. రిబ్కా ఈమెకు మనుమరాలు (ఆది $22^{21}$ $24^{15,24,47}$).

2. సెలోపెహాదు కుమార్తెలలో నొకతె (సంఖ్యా $26^{33}$ $27^{1}$ $36^{11}$ యెహో $17^{3}$).

**మిల్కోము (Milcom = రాజు).** అమ్మోనీయుల దేవత పేరు. మల్కోము మొలెకు అనునవి దీనికి సంబంధించిన పేరులై యున్నవి. (I రాజు $11^{7}$ మల్కోము, మొలెకు చూ॥). ఈ దేవతకు సొలొమోను ఒలీవ కొండమీఁద నొక గుడిని కట్టించెను. అది యోషీయా కాలము వఱకు నున్నట్లుగా నున్నది ($11^{5,33}$).

**మిల్లో (Millo = పూడ్చఁబడినది).**

1. యెరూషలేములోని యొక స్థలము. దావీదు దానిని పట్టుకొనక పూర్వము అది యెబూసీయుల ప్రాకారములలో నొక భాగమైనట్లున్నది (II సమూ $5^{9}$ = I దిన $11^{8}$). అది పట్టణమును కాపాడుటకు వేయఁబడిన యొక దిబ్బయై యుండవచ్చును. అట్లయినయెడల దావీదు సొలొమోను అను రాజులు దాని నింకను పెంపకము చేసిరి ($5^{9}$ I రాజు $9^{15}$ యెరూషలేము B, II 1 చూ॥).

2. రాజైన యెహోయాషు చంపఁబడిన స్థలము (II రాజు $12^{20}$). ఇది 1 లోని దానికి సంబంధించి యున్నట్లు తోఁచుచున్నది.

3. షెకెము దగ్గరనుండిన యొక స్థలము. (న్యాయా $9^{6,20}$). ఇక్కడివారు అబీమెలెకును న్యాయాధిపతినిగా చేయుటలో సహాయపడిరి. షెకెము గోపురమనఁబడినది దీనికి సాటియైనదై యుండవచ్చునని కొందఱి యభిప్రాయము. దీని యునికినిగూర్చి యింక తేటగా తెలియదు.

**మిశ్రితజనము, మిశ్రితజనులు (Mixed Multitude).**

1. ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి బయలుదేరి వచ్చినప్పుడు అరణ్యమునందు ఇశ్రాయేలీయులతోఁ జేరిన కొందఱు అన్యులకు పెట్టిన పేరు (సంఖ్యా $11^{4}$) గాని నిర్గ $12^{38}$ నందున్న ఆ యసలు పదమును తెలుఁగు బైబిలులో అన్యజనుల సమూహము అను మాటచే తర్జుమాజేసిరి. యిర్మీ $25^{20}$ యెహె $30^{5}$ లలో నున్న మిశ్రితజనము అనునది వేఱొక అసలు పదముయొక్క భాషాంతరమై అరబ్బీయులకు చెందునని యనేకుల అభిప్రాయము. యిర్మీ $50^{37}$ నందు అదే యసలు మాటను పరదేశులని తర్జుమా జేసిరి.

2. చెఱకాలమైన పిమ్మట యూదులు తమ యొద్దనుండి వేఱుపఱచిన వారికి పెట్టిన పేరు (నెహె $13^{3}$). ఇశ్రాయేలీయులు వారితో వియ్యమందుటవలన వారికిని, వారి పిల్లలకు నీ పేరు పెట్టిరి. ఈ యక్రమమును దిద్దుటకు ఎజ్రా నెహెమ్యాలు చాల ప్రయాస పడిరి (ఎజ్రా 10 నెహె $13^{1-3}$).

**మిశ్రెఫోత్మాయిము (Misrephotmaim = నీటి ప్రవాహములు).** సీదోనీయుల హద్దులో నుండిన యొక స్థలము (యెహో $11^{8}$). యెహోషువ తాను మేరోము సరస్సుదగ్గఱ నోడించిన రాజులను ఈ స్థలమువఱకు తరిమెను ($13^{6}$). ప్రస్తుతమున ప్టొలెమైకి ఉత్తరముగా 11 మైళ్ల

దూరములోనుండు ముష్పైరిఫె (*Musheiriph*) దీని యునికియై యుండవచ్చును.

మిషాము (Misham = వారు పవిత్రపఱచఁబడెదరు). బెన్యామీనీయులలో నొకఁడు (I దిన 8[12]).

మిషాయేలు (Mishael, Misael = దేవుని వంటివాఁ డెవఁడు).

1. లేవీయులలోని కహాతు తెగవారిలోనున్న కుటుంబములలో నొక దానికి పెద్ద (నిర్గ 6[22] లేవీ 10[4]).

2. ఎజ్రా ధర్మశాస్త్రమును ప్రజలకు చదివి వినిపించినపుడు అతనికి సహాయము చేసినవారిలో నొకఁడు (నెహె 8[4]).

3. దానియేలు ముగ్గురు సహవాసులలో మేషాకు అని పిలువఁబడిన వాని హెబ్రీ పేరు (దాని 1[6,7,11,19] 2[17] మేషాకు చూ॥).

మిషాలు, మిషెయులు, (Mishal = ప్రార్థన). ఆషేరు గోత్రికుల స్వాస్థ్యములో నున్న ఒక యూరు (యెహో 19[26]). అది లేవీయుల కిచ్చిన పట్టణములలో నొకటియై యున్నది (21[30]). I దిన 6[74] లో ఈ పేరునకు మాషాలు అను మాఱు రూపముకలదు. దీని యునికినిగూర్చి తెలియదు.

మిష్నా పారంపర్యములు చూ॥

మిష్మన్నా (Mishmannah = క్రొవ్వు పట్టిన). గాదీయులలోని పరాక్రమశాలురలో నొకఁడు. ఇతఁడు ఇతరులతోకూడ సిక్లగులో దావీదునొద్ద చేరెను (I దిన 12[10]).

మిశ్రాయీయులు (Mishraites). కిర్యత్యారీము అను పట్టణమునకు సంబంధించిన యొక కుటుంబము (I దిన 2[53]). వీరు మిస్రా ఊరివారై యున్నట్లు ఈ పేరువలనఁ దెలియును గాని అట్టి ఊరును గూర్చిన సూచన లెవ్వియును లేవు.

మిసారు (Mizar = చిన్నది). కీర్త 42[6] లో నున్నట్లిది హెర్మోను పర్వతముతోకూడ చెప్పఁబడిన యొక పర్వతమునకు పేరు. హెర్మోనుకు సమీపమువనుండు నొక కొండయై యున్నట్లున్నది. అచట ఈ పేరునకు కొన్ని సూచనలు కలవని డాక్టర్ జీ. ఏ. స్మిత్ అను వేదశాస్త్రి యనుకొనును. అయితే కొందఱు ఈ పేరుగల కొండనుగూర్చి తేటయైన సూచనలు లేకపోవుట వలన ఇదియొక కొండయొక్క పేరు కాదుగాని, దానికి చిన్నకొండ అని యర్థముగునని యను కొందురు. దీనిని కొంచెము సవరించినయెడల ఇది ఓ చిన్నకొండాయను సంబోధనార్థ మిచ్చి సీయోను కొండను సూచించుననియు నను కొందురు. అట్లయినయెడల ఆ వాక్యమునకు "ఓ చిన్నకొండా! సీయోనా! హెర్మోను పర్వతముమీఁద నుండి నిన్ను జ్ఞాపకము చేసికొను చున్నాను అని యర్థమగును.

మిస్పా, మిస్పే, రామత్మిత్పె (Mizpah, Mizpeh = కావలి గోపురము). ఇదియొక సార్థక నామము. ఇట్టి గోపురములు కొండలమీఁదను దిబ్బలమీఁదను కట్టఁబడినందున అది యట్టి కొండలకును, దిబ్బలకును వాటి సమీపమున నుండిన యూళ్లకును పేరయ్యెను. యెహ 21[8] లో నున్నట్లు ఆ మాటను కావలి బురుజు అను మాటలచే తర్జుమా చేసియున్నారు. ఈ వాక్యములలో మాత్రమేకాక ఈ పేరు ఈ దిగువనుండు రీతిగా ప్రత్యేకమైన స్థలములకు పెట్టబడి యున్నది:

1. బైబిలులో ఇది మొట్టమొదట యాకోబు లాబాను అనువారలు సంధిచేసికొనిన స్థలమునకు పెట్టఁబడిన పేరు (ఆది 31[44-49]). అది యబ్బోకు నదికి ఉత్తరముగాను, యొర్దానుకు తూర్పున నున్నదని యాకోబు చరిత్రవలన దెలియును (పటము III, K 3).

2. హెర్మోను కొండ దిగువనుండు నొక స్థలమునకు పేరు. ఇది యెహోషువకు విరోధముగా యుద్ధముచేసిన హివ్వీయులు నివసించిన దేశములో నున్నది (యెహో 11[3]). ఇది హెర్మోనుకు పశ్చిమముననున్న దనుకొందురు. యెహోషువ వారిని, వారితో సంధిచేసికొనిన యితరులను ఓడించిన పిమ్మట ఓడిపోయినవారు పారిపోయిన మిస్పే లోయ ఈ ప్రాంతములో నుండెను గాని, దానికి సంబంధించిన యితర స్థలముల పేరులను చూడఁగా అది దాని కింకను పశ్చిమముగా నున్నట్లున్నది.

3. షెఫేలాలోనున్న యొక స్థలము (యెహో 15[38]). ఇది యెరూషలేమునకు నైరృతి దిక్కున సుమారు 10 క్రోసుల దూరములో నున్నదని కొందురు (పటము II, D 3).

4. గిలాదులో యెఫ్తా నివాసముచేసిన యొక స్థలము (న్యాయా 11[29,34]). ఇది 1 టిలో నున్నదేయని కొంద అనుకొందురు. యెహో 13[26] లో రామత్మిజ్పె అని యున్నది.

5. బెన్యామీను స్వాస్థ్యములలోనున్న మిస్పే (యెహో 18[26]). బైబిలులో దీనిగూర్చిన సూచన లెక్కువగా నున్నవి. ఇది ఇశ్రాయేలీయులు సభలుచేయుటకు కూడుకొనిన స్థలమై యుండెను (న్యాయా 20[1-3] 21[1] I సమూ 7[5] 10[17]). సమూయేలు న్యాయము తీర్చిన స్థలములలో నిది యొకటియై యుండెను (7[16]). పలెస్తీను రెండు రాజ్యములుగా విభాగమైన పిమ్మట ఇది ఆ రాజ్యములకు హద్దుగానుండిన స్థలములలో నొకటిగా నుండెను. ఆసా ఇచట ప్రాకారములను కట్టించెను (I రాజు 15[22] II దిన 16[6]). యెరూషలేము నాశనమైనపిమ్మట యూదావారి గొర్నరుగా నుండిన గెదల్యా యిచట నివసించెను (యిర్మీ 40[6,13,15] II రాజు 25[25]). చెఱకాలమునకు పిమ్మట ఇది యొక పరగణాకు ముఖ్యస్థానమై యుండెను (నెహె 3[15]). మక్కబేయులు అంతియోఖు రాజులపై తిరుగఁబడిన కాలములో వారిచట తమ ముఖ్యమైన దండుపేటను వేసిరి (I మక్క 3[46]). ప్రస్తుతమున నుండు నెబీసంవీల్ (*Sebisamvil* ప్రవక్తయగు సమూయేలు) అను స్థలమే దాని యునికి యనుకొందురు. క్రూసేడు యుద్ధములు చేసినవా రిచటనున్న సమూయేలు సమాధి స్థలము అని పారంపర్యముగా నెంచఁబడిన చోట నొక గుడిని కట్టించిరి (పటము III, F 5).

6. మోయాబులో నున్న యొక స్థలము. దావీదు సౌలునొద్దనుండి పారిపోయినపుడు తన తలిదండ్రుల నుంచిన స్థానమిదే (I సమూ 22[3]). దీని యునికినిగూర్చి తెలియదు.

**మిస్పెరేతు** (Mispereth, Mispar = లెక్క). జెరుబ్బాబెలుతో కూడ బాబెలునుండి తిరిగి వచ్చినవారిలో నొకఁడు (ఎజ్రా 2[2] నెహె 7[7]).

మిస్పేలోయ యిస్పా 3 చూ॥

**మిస్రాయిము** (Mizraim).

1. ఐగుప్తునకు ముఖ్యముగా ఉత్తర ఐగుప్తునకు పెట్టఁబడిన హెబ్రీనామము (ఐగుప్తు చూ॥).

2. హాము కుమారులలో రెండవవాని పేరు (ఆది 10[6,13]).

## మీ

**మీకా, మీకాయు** (Micah, Micaiah = యెహోవావంటివాఁ డెవఁడు?)

1. ఎఫ్రాయిము కొండసీమలో కాపుర ముండిన యొక మనుష్యుడు (న్యాయా 17,18). తన తల్లిసొమ్ములో 1200 షెకెలుల వెండిని దొంగిలించెను. తల్లి శాపమునకు భయపడి దాని నిచ్చివేసెను. తల్లి ఆ వెండితో నొక పోఁత విగ్రహమును చేయించి అతనికిచ్చెను. అతఁడు దాని కొక మందిరమునుగట్టి దాని నందు నిలిపి తన కుమారులలో నొకని యాజకునిగా నేర్పఱిచెను. దాను గోత్రికులలోని యొక లేవీయుఁడు దానిని దొంగిలించి దాను గోత్రికుల వెంట వలసపోయెను (దాను చూ॥). ఆ విగ్రహము మీకాయకు దొరకనే లేదు.

2. యోనాతాను మనమఁడు. మెఫీబోషెతు కుమారుఁడు (II సమూ 9[12] I దిన 8[34,35] 9[40,41]).

3. కహాతు వంశములో ఉజ్జీయేలు కుటుంబపు పెద్ద (I దిన 23[19,20] 24[24,25]).

4. తిగ్లత్పిలేసెరు చెఱకుఁ గొనిపోయిన బెయేర యనువాని పితరుఁడు (I దిన 5[5]).

5. అబ్దోను తండ్రియగు యోషీయా యను వాని సమకాలీనుఁడు (II రాజు 22[12] II దిన 34[20]).

6. అహాబును అరామీయులమీఁదికి యుద్ధము చేయ వెళ్లునట్లు ప్రేరేపించిన సిద్కియా యను అబద్ధ ప్రవక్త నెదిరించినవాఁడు (I రాజు 22[8,9] II దిన 18[7,23]).

7. రాణియైన అబీయాయొక్క తల్లి (II దిన 13[2]). ఈ పేరునకు మయకా అను మాఱు రూపమును గలదు (11[22]).

8. యిర్మీయా కాలమునందున్న ఘనులలో నొకఁడు. గెమర్యా యనువాని కుమారుఁడు. యెహోయాకీము కాలములో దేవాలయపు గదులలో నొకదానినుండి బారూకు యిర్మీయా ప్రవచనములను ప్రజలకు వినిపించుచుండఁగా విని తనతోఁటి ఘనులకు రిపోర్టు జేసెను (యిర్మీ 36[11,13]). ఇట్లు మొదట ఘనులకును తరువాత రాజుకును వీటినిగూర్చి తెలుపుట కితఁడు సహాయపడెను. ప్రవక్త్రియగు హుల్దాయొద్దకు పంపఁబడిన వారిలో నొకఁడగు అక్బోరుయొక్క తండ్రి కావచ్చును (II రాజు 22[12]).

9. యెరూషలేము గోడలను ప్రతిష్ఠించుటలో సహాయముచేసిన యాజకులలో నొకఁడు. జక్కూరు అనువాని కుమారుఁడు (నెహె 12[35] 11[17,22] I దిన 9[15]).

10. నెహెమ్యా కాలమందుండిన యెరూషలేము గోడలను ప్రతిష్ఠించుటలో సహాయపడిన మతిరొకఁడు (నెహె 12[41]).

11. యెహోషాపాతు ప్రజలకు బోధింప నియమించిన వారిలో నొకఁడు (II దిన 17[7]).

12. జిఖ్రీ యనువాని కుమారుఁడు (I దిన 9[15]).

13. మీకా గ్రంథమును వ్రాసిన ప్రవక్త (మీకా 1[1]). మీకా గ్రంథము చూ॥ W.

## మీకా గ్రంథము (Book of Micah).

1. గ్రంథకర్త: ఇతనినిగురించి యీ గ్రంథముననున్న సంగతులుగాక మరేమియుఁ దెలియదు. ఈ పదమునకు యెహోవావంటివాఁ డెవఁడు అని శబ్దార్థము. యోతాము ఆహాజు హిజ్కియా యను యూదారాజుల కాలములో ప్రవచించెను. ఈ మాటలే యెషయా గ్రంథ పీఠికయందును గలవు. దీనినిబట్టియు, యెషయా గ్రంథమునకుగల ఇతర సంబంధములను బట్టియు ఇతఁడు యెషయాకు సమకాలీనుఁడని తెలియుచున్నది. వీరిలో యెషయా యెరూషలేము నివాసియై ఆ బస్తీకి సంబంధమగు సంగతులను దప్ప యూదాదేశమునుగూర్చి మరే యితర సంగతులను ప్రవచించి యుండలేదని మనము చెప్పఁదగి యున్నను మీకా యూదయలోని పల్లెటూరివాఁడు గాన పల్లెటూరికి సంబంధించిన విషయములనే ముఖ్యముగాఁ దెలిపెనని చెప్పవచ్చును. మీకా యూరిపేరు మోరెషెతు. అది ఫిలిష్తీయదేశపు సరిహద్దు దగ్గఱ నుండుటచే వారి ముఖ్యపట్టణములలో నొకటియగు గాతు అను దానికి సంబంధముగా మోరెషెత్గాతు అను పేరు గలిగి యుండెను (1[14]). మీకా ఈ యూరివాఁ డగుటచేత నతనికి మోరష్తీయుఁడు అను పేరు గలిగెను (1[1]). యిర్మీ 26[18] లోను ఇతని కిదే బిరుదుగలదు. సాధారణముగా ప్రవక్తల పేరుతోకూడ వారి తండ్రుల పేరును కూడ నుపయోగించిరి. యెషయా ఆమోజు కుమారుడని చెప్పఁబడెను గాని మీకానుగూర్చి అట్టిదేమియు లేదు. ఇందువలన నితని కుటుంబమంత కులీనమైనది కాదని యూహింపఁదగును. అల్ప కుటుంబమునకు చేరినవాఁడును, పల్లెటూరివాఁడునై యుండెను. ఇంతటి తక్కువస్థితిలోని వానిని సహా దేవుఁడు తన ప్రవక్తగాఁ బిలిచి అతనిద్వారా పాఁత నిబంధన బోధన లన్నిఁటిలో మిగుల దివ్యములైన కొన్ని బోధలను తెలియఁ జేసెను.

2. కాలము: మీకా యోతాము ఆహాజు హిజ్కియా యను రాజులకాలములో ప్రవచించెనని పైనఁజెప్పినట్లు పీఠిక వాక్యములవలనఁ దెలియుచున్నది. ప్రవక్తల గ్రంథమందలి యిట్టి పీఠిక వాక్యములు అసలు గ్రంథములలో నివి గాక దావీదు కీర్తనల గ్రంథములో నాయా కీర్తనల పీఠిక వాక్యములవలెనే ఈ గ్రంథముల నన్నింటిని నొక ప్రత్యేక గ్రంథముగ సమకూర్చిన వారు వ్రాసినవై యుండవచ్చును. గాన ఈ గ్రంథపీఠికను కొంత సవరించవలెనని కొందఱు పండితుల యభిప్రాయము. మీకా హిజ్కియా దినములలో ప్రవచించినట్లు యిర్మీ 26[18] నందున్నది గాన నితఁడు యోతాము ఆహాజు అను వారి కాలములో జీవించియున్నను ముఖ్యముగా హిజ్కియా కాలములో ప్రవచించి యుండెనని ఆ వాక్యమువలనఁ దెలిసికొనవచ్చును. హిజ్కియా క్రీ॥ ము॥ 727-698 వఱకు రాజ్యమేలెను. అందువలన ఈ గ్రంథములోని సంగతులు ఈ కాలములోనే రచింపఁబడినట్లు తెలుచున్నది. షోమ్రోను అప్పటి కింకను అష్షూరువారిచే చెఱ

పట్టఁబడి యుండలేదని మీకా 1[6] వలన స్పష్టమగు చున్నది. షోమ్రోను క్రీ॥ ము॥ 722 సం॥ నందు నాశనమగుటచేత ఈ గ్రంథమందలి మొదటి భాగములోని సంగతులను ప్రవక్త అంతకు మునుపే వ్రాసియుండె ననఁదగును. అయితే అష్షూరు రాజుయొక్క సేనలు ఆ దేశముమీఁదికి రాసై యుండినట్లు 1[10-16] వలనఁ దెలియుచున్నది. 2[12,13] 7[7-20] ని బట్టి ఇశ్రాయేలీయులును యూదావారును చెఱపట్టఁబడినట్లుగా నున్నది కావున, నిట్టి సూచనలచే ఈ భాగము లా చెఱ కాలమునకుఁ బిమ్మట చేర్చఁబడినవని నవీన పండితులలో ననేకు లనుకొందురు గాని మొదటి నుండియు ప్రవక్తలు ఇశ్రాయేలీయులను గద్దించి నప్పుడెల్ల వారి పాపములకు శిక్షగా వారు చెఱ పట్టఁబడెదరని ప్రవచించుచుండిరి (ఆమో 5[27] హోషే 11[1,5] యెష 5[13] మొ॥). కావున వారి వలె మీకాకూడ అట్టి సంగతులను ప్రవచించుట ఆశ్చర్యకరము కానేరదు. మఱియు క్రీ॥ ము॥ 725-700 సం॥ లకు మధ్యకాలములో మీకా ఈ గ్రంథములోని ప్రవచనములను చెప్పెనని దాదాపుగా నందఱు ఒప్పుకొందురు.

3. దేశ స్థితిగతులు. హిజ్కియా కాలము నందు యూదావారి రాజ్యము బాహ్యవిషయములలో మంచి అభివృద్ధియందుండెను. ఇట్టి అభివృద్ధియందుండు దేశపు జనములలో సహజముగా కనఁబడు పాపములు వారిలోకూడ కనఁబడెను. వారు దేవుని విసర్జించిరి. స్థితివంతు లధిక భాగ్యముఁ గలిగినవారై అమిత భోగము లనుభవించుచు బీదలను బాధించుచుండిరి. ఇట్టి స్థితి గతులలో చాలకాలమునుండి క్రమక్రమాభివృద్ధిఁ గాంచుచుండిన అష్షూరువారు దండయాత్రకు వెడలిరి. క్రీ॥ ము॥ 722 సం॥ న షోమ్రోనును జయించి అందలి ప్రజలను చెఱఁ బట్టిరి. తరువాతిదెబ్బ యెరూషలేముకుఁ గలుగునని అందఱును నిరీక్షించిరి. ఈ రీతిగా దేశము లోపల పాపములును, వెలుపల శత్రువులును విస్తరించు సమయములో మీకా ప్రవచించెను. ఆమోసు హోషేయలు ప్రత్యేకముగా ఇశ్రాయేలువా రనబడిన పదిగోత్రముల వారికే ప్రవచించిరిగాని మీకా యెషయావలె యూదావారికి మాత్రమేగాక పది గోత్రములవారికిగూడ బోధించెను. ఇతఁడు షోమ్రోనుయొక్క నాశనమునుగూర్చి చెప్పిన సంగతి (1[6]) యూదావారి నాశనమునకు ముందు సంభవించునని కాల సూచనకు మాత్రమే తెలిపెను గాని అంతకన్న వేఱుగాదు. యూదావారందఱిమీఁదకు రాసై యున్న నాశనమునుగూర్చి తెలిపినను ముఖ్యముగా ఫిలిష్తీయుల దేశమువైపున నున్న పల్లెటూళ్లగతిని వివరించెను (1[10-16]). అష్షూరీయులు దండెత్తివచ్చినప్పుడు మొదట ఆవైపుగా వచ్చి వాటిని నాశనము జేసినమీఁదట యెరూషలేముమీఁదికి వచ్చియుందురని అందువలనఁ దెలిసికొనవచ్చును. ఇశ్రాయేలువారు విగ్రహారాధికులై మొదట నశించిరి. యూదావారు వారి గతిని చూచినను ఆ పాపము విడిచిపెట్టక ఆ రీతిగనే విగ్రహారాధికులై విశ్వాసఘాతకులైరి. కావున ప్రవక్తలు యూదావారికిఁగూడ బుద్ధి చెప్పి గద్దించి వారిని గుణపఱచుటకు యత్నములు చేయుచుండిరి. ఈ విధముగా మీకా యెషయా యిర్మీయా యెహెజ్కేలు అనువారొకరి తరువాత నొకరు దేశక్షేమమునకై ప్రయత్నించిరి. యెషయాతోకూడ ఈ పనికిఁ బూనుకొన్నవారిలో మీకా మొదటివాఁడై యుండెను.

4. ఇతర గ్రంథసంబంధము: మీకా కాలమునకుఁ బిమ్మట షుమారు నూరు సంవత్సరములకు యూదుల పెద్దలు ఇతని గ్రంథములోని విషయములను తెలిసికొని యున్నట్లు తేటగా కనఁబడును (యిర్మీ 26[18,19]). వారప్పు డెత్తుకొనిన వాక్యము మీకా 3[12] నందున్నది. మీకా సమకాలికుఁడగు యెషయా గ్రంథమునకును మీకా గ్రంథమునకును ఎక్కువ సంబంధము గలదు. ఈ గ్రంథమును మొత్తముమీఁద చూడఁగా దీనిలోని వార్తకును యెషయా గ్రంథములోని వార్తకును దగ్గరి సంబంధమున్నట్లు తెలిసికొనఁగలము. యెషయావలెనే ఇతఁడును గద్దించెను. అతని వలె రక్షకునిగుఱించి బోధించెను. సంగతిలో మాత్రమే గాక ఆయా వాక్యములలోఁ గూడ ఈ రెండు గ్రంథములయందును గొప్ప సంబంధమున్నది. ఇట్టి సంబంధ వాక్యములు రెండు గ్రంథములలో ననేకములు గలవు. ముఖ్యముగా 4[1-5] వచనములు యెష 2[1-5] కు సమానముగా

నున్నవి. ఈ దిగువ వచనములలోను కొద్ది గొప్ప సంబంధము గలదు. మీకా $2^{1,2}$ = యెష $5^{8}$; $2^{6,11}$ = $30^{10,11}$; $2^{11}$ = $28^{7}$; $2^{12}$-$4^{7}$ = $10^{20-23}$; $3^{5-7}$ = $29^{9-12}$; $4^{10}$ = $32^{11}$; $5^{5}$ = $9^{6}$; $5^{9-14}$ = $2^{6-17}$; $6^{6-8}$ = $1^{11-17}$; $7^{7}$ = $8^{17}$; $7^{12}$ = $11^{11}$.

5. శైలి: సులభగ్రాహ్యము. ఇతఁడెంతో చక్కఁగా రచించెననుటకు సందేహములేదు. పాపమును గద్దించుటలో బహు కఠినపదముల నుపయోగించెను ($1^{6}$ $2^{1,2,12}$ మొ॥). సంగతులను ప్రశ్నార్థరీతిగా నెక్కువగా చెప్పుచున్నట్లు చూడవచ్చును ($1^{5}$ $2^{7}$ $4^{9}$ మొ॥). పరిహాసముగా నొక సంగతి వ్రాసెను ($2^{11}$). దృష్టాంతముల నుపయోగించి వాటిని వివరించెను ($1^{6}$ $3^{2,3,6}$ $4^{6-8}$ $6^{10-15}$) గాని అతఁ డుపయోగించిన ఈ పదముల తమాషా యర్థము తెనుగున కనఁబడదు. బాహ్యాచారములను గాక నీతి ననుసరించి దేవుని నమ్ముఁడని బోధించెను.

6. ముఖ్య భాగములు: ఈ గ్రంథమును సాధారణముగా మూఁడు ముఖ్య భాగములుగా భాగింతురు గాని ప్రతి భాగమం దుండవలసిన అధ్యాయములనుగూర్చి భిన్నాభిప్రాయము లున్నవి. ఒకఁడీ గ్రంథమందలి మొదటి మూఁడధ్యాయములను మొదటి భాగముగాను, నాలుగైదధ్యాయములను రెండవ భాగముగాను ఆరు ఏ డధ్యాయములను మూఁడవ భాగముగాను చేసెను. ఇట్లుచేసినయెడల మొదటి భాగములో గద్దింపులు ముఖ్యములైనవిగాను, రెండవదానిలో రక్షణనుగూర్చిన వాగ్దానములు ఆనరణలు ముఖ్యమైనవిగాను, మూఁడవదానిలో మొదటి రెండు భాగములలోని సంగతులును మొత్తముమీఁద కలిసియుండును. ఈ గ్రంథమును సాధారణముగా నిట్లు భాగించుచున్నను దీని నీ దిగువ చెప్పినట్లు విభజించుట యుక్తముగఁ దోచును. $1^{2}$ $3^{1}$ $6^{1}$ లో ఆలకించుఁడి అను హెచ్చరిక పదములు గానవచ్చును.

ఈ పదముతో నారంభమగు భాగములు మూఁడు ప్రసంగములని చెప్పవచ్చును.

I. పై వ్రాఁత $1^{1}$.

II. మొదటి ప్రసంగము $1^{2}$-$2^{13}$: 1. యూదావారు దేవునిమీఁద తిరుగబాటు చేయుటనుబట్టి ఆయన వారిమీఁద వ్యాజ్యము వేయుట ($1^{2-4}$); 2. వారి పాపమునుబట్టి దేవుఁడు వారిని శిక్షించినందున ప్రవక్తలకు కలిగిన దుఃఖము ($1^{5-16}$); 3. ఇశ్రాయేలువారు ఇతరులకు చేసిన అన్యాయమునుబట్టి వారిని గద్దించుట ($2^{1-11}$); 4. యూదావారి కుదురుబాటు ($2^{12,13}$).

III. రెండవ ప్రసంగము $3^{1}$-$5^{15}$: 1. యూదావారి పాపములనుబట్టి వారిని గద్దించి పశ్చాత్తాపపడవలెనని హెచ్చరిక చేయుట ($3^{1-11}$); 2. వారి పాపములవలన యెరూషలేమునకు కలుగు నాశనము ($3^{12}$); 3. (i) అంత్యకాలమున యెరూషలేమునకు కలుగు కుదురుబాటు ($4^{1-5}$), (ii) చెఱయను శ్రమలవలన శుద్ధిచేయఁబడుటచేతనే ఈ ఘనస్థితి కలుగును ($4^{6-13}$); 4. (i) ఇట్టి ఘనస్థితి మిగుల హీనపర్చఁబడిన యూదావారికి ($5^{1}$) తమవలనఁగాక ఒక రక్షకుని ద్వారా కలుగును ($5^{2-5}$); (ii) కుదురుబాటు స్థితియొక్క లక్షణములను వివరించుట ($5^{5-15}$).

IV. మూఁడవ ప్రసంగము $6^{1}$-$7^{20}$: 1. తమ్మును ప్రేమించిన వానిని విసర్జించిరని దేవుఁడు వారిపై వ్యాజ్యము వేయుట ($6^{1-5}$); 2. వారి యాచారములను నీతి న్యాయ కనికరములు చూపుటయే దేవుఁడు కోరుచున్నాఁడని తెలుపుట ($6^{6-8}$); 3. దానికి భిన్నముగా మఱల వారి పాపములనుగూర్చి తెలుపుట, వారు స్వయముగా వాటినొప్పుకొనుట ($6^{9}$-$7^{6}$); 4. వారు పశ్చాత్తాప పడుట ($7^{7-11}$); 5. ఇట్లు పశ్చాత్తాపపడినవారికి దేవుఁ డనుగ్రహింపఁబోవు క్షేమము ($7^{12-20}$).

**మీకాలు** (Michal = దేవుని వంటివాఁడెవఁడు). సౌలు కుమార్తెలలో నొకతె ఫిలిష్తీయులలో నూరుమందిని చంపినయెడల నీమె నిత్తునని అతఁడు దావీదుకు వాగ్దత్తము జేసెను. జనులందఱి యభిమానమునకు పాత్రుఁడైన దావీదు ప్రాణము తీయఁగోరి సౌలు అతనికొఱకు కాపుపెట్టిన సంగతిఁ దెలిసికొని ఈమె దావీదును కిటికీగుండా దింపి పంపివేసెను (I సమూ $19^{11-17}$). అంతట సౌలీమెను ఫల్తీయేలునకిచ్చి పెండ్లిజేసెను. ఇశ్రాయేలు వారిని దావీదుతట్టు త్రిప్పుటకు వచ్చిన అబ్నేరు ఆమెను దావీదుయొద్దకు మఱలఁ

దెచ్చెను. అప్పుడీమె పెనిమిటియగు పల్తీయేలు యేడ్చుచు బహూరీమువఱకు వచ్చెనుగాని అబ్నేరతనిని వెనుకకుఁ బంపివేసెను (II సమూ 3[12-16]). దేవుని నిబంధన మందసమును యెరూషలేమునకుఁ దెచ్చునప్పుడు దావీదు భక్త్యావేశముచే దాని యెదుట నాట్యమాడుట నామెచూచి తన మనస్సులో నతని హీనపఱచుట మాత్రమేగాక అతనిగూర్చి హేళనగా మాట్లాడి దావీదు కోపమునకు పాత్రురాలయ్యెను. ఆమె సంతానహీనురాలయ్యెననుదానికి అతఁడామె పరిత్యజించెనని చెప్పవచ్చును (6[16,20,23]). దావీదుకున్న బహుమంది భార్యలు ఈ మిత్రభేదము పుట్టించియుందురు. H.

**మీఖాయేలు** మిఖాయేలు చూ॥

**మీమకిట్టుట** శాపము చూ॥

**మీయామీను, మిన్యామీను** (Mijamin = కుడిచేతినుండి).

1. అహరోను సంతతివారైన యాజకులలో ఆఱవవంతువారికి పూర్వికుఁడు (I దిన 24[1,6,8]). ఈ తెగవారు చెఱకాలమునకు పిమ్మట బాబెలు నుండి తిరిగివచ్చి (నెహె 12[5]) నిబంధనకు సంతకము చేసినవారిలో నుండిరి (10[7]). 12[41] లో దీనికి మిన్యామీను అను మాఱురూపము కలదు.

2 అన్య స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా 10[25])

## ము

**ముంగిలి** ఇల్లు II 4 చూ॥

**ముండ్లకంప, ముండ్లు** ముళ్లు చూ॥

**ముందుగా నిర్ణయించుట** ముందెరుగుట 3 చూ॥

**ముందుగా పంపబడినవాఁడు** (Fore runner). బాప్తిస్మమిచ్చిన యోహాను తనకు పెట్టుకొనిన బిరుదు (యోహా 3[28]). గొప్ప రాజగు క్రీస్తుమార్గము సరాళము చేయుటకు పంపఁబడినదూతగాని రాయబారిగాని అయ్యుండెను (యెష 40[3,4] మలా 3[1] మ 11[10] మా 1[2] లూ 7[27]). రాజు లివ్విధముగా తమరాకడను గూర్చి తెలుపుటకును ప్రయాణములోఁ బలకు అంతయు సిద్ధపఱచుటకును దూతలనంపుచు వచ్చిరి (దూత, యోహాను 1 చూ॥).

**ముందెఱుఁగుట, సంకల్పము, నిర్ణయించుట, ఏర్పాటు, ఏర్పరచుకొనుట, పిలుచుట** (Foreknowledge, Purpose, Predestinate, Election, Chosen called). పై మాటలన్నియు ఒకదానికొకటి సంబంధించినవై యుండుటచేత వాటి నన్నిఁటిని యొకచోటనే వివరింతుము.

మన రక్షణకార్యము నెఱవేఱుటకు దేవుఁడు చేయవలసిన దొకటియు మనము చేయవలసిన దొకటియు రెండువిధములగు పనులు జరుగవలసినవి యున్నవి. లేనియెడల రక్షణ మనకు సిద్ధింపనేరదు (ఫిలి 2[12,13]) దేవుఁడు మనకొఱకై మనలో చేయు పనులు పై నుదాహరించిన పదములు సూచించుచున్నవి. అవెవ్వియనగా:—

1. ముందెఱుఁగుట (*Foreknowledge* = రోమా 8[29] 11[2] I పేతు 1[2]). దేవుని భవిష్యత్ జ్ఞానము ననుసరించి క్రీస్తును సిలువవేసిరను వాక్యమునందు (కార్య 2[23]) ఈ పదమే కనఁబడుచున్నది. ఎవరు రక్షణ నొందెదరో ఆ సంగతిని దేవుఁడు ముందుగా ఎఱిఁగి వారికొఱకు పని జేసెనను అర్థము వచ్చునట్లు తక్కిన వాక్యములలో ఆ పదమును వాడిరి.

2. సంకల్పము (*Purpose* = రోమా 8[28] 9[11] ఎఫె 1[11] 3[11] II తిమో 1[9]). దేవుని సంకల్పము చొప్పున క్రీస్తు శ్రమపడెనని కార్య 2[23] వలనఁ దెలియుచున్నది గాని సంకల్పమను ఈ పదము మన రక్షణార్థమై దేవుఁ డుద్దేశించిన దానిని తెలియఁజేయును (మర్మము చూ॥).

3. నిర్ణయించుట, ముందుగా నిర్ణయించుట. క్రీస్తుకు సంబంధించిన వన్నియు ముందుగా నిర్ణయింపఁబడినవని కార్య 4[28] లో నున్నది. రోమా 8[29,30] నందు రక్షణ పొందఁబోవువారిని దేవుఁడట్లు రక్షణ పొందులాగున ముందుగా నిర్ణయించెనని వ్రాయఁబడినది. దేవుఁడు మనలను కుమారులనుగాను (ఎఫె 1[5]), దేవుని మహిమకు

క్తి కలిగించువారినిగాను (1[11]) ముందుగా నిర్ణయించెనని పౌలు వ్రాయుచున్నాఁడు. దీనికిని తరువాతి మాటకును భావ మొక్కటే.

4. ఏర్పాటు, ఏర్పఱచుకొనుట, ఏర్పఱచఁబడినవారు (*Election, Predestinate, Chosen*). ఈ పదములు తక్కిన పదములకన్న బైబిలునందెక్కువగా వాడఁబడినవి. దేవుఁడిశ్రాయేలీయులను తన ప్రజలనుగా నియమించుటనుగూర్చి ఈ పదమును వాడిరి (I దిన 16[13] కీర్త 89[3] 105[6,43] యెష 43[20] 45[4] 65[9-22] మొ॥). తన పనిని చేయుటకు, మోషే (కీర్త 106[23]), పౌలు (కార్య 9[15]), రూఫు (రోమా 16[13]) లు నియమింపఁబడినందున వారిని ఏర్పఱచఁబడినవారని పిలిచిరి. ఈ పదము క్రీస్తుకు మఱింత నూటిగా సరిపడును (లూ 9[35] 23[35]). ఆయనను సూచించిన మూలరాతికి నీ పేరు గలదు (I పేతు 2[6]). దూతలకు ఏర్పఱచఁబడిన దూతలు అను పేరు గలదు (I తిమో 5[21]). ఇది విశ్వసించువారికి క్రొత్త నిబంధనయందు పెట్టఁబడిన యొక విశేషమైన పేరు (మ 24[22,24,31] = మా 13[20,21,27] లూ 18[7] రోమా 8[33] కొలొ 3[12] II తిమో 2[10] తీతు 1[1] I పేతు 1[2] 5[13] II యోహా 1,13). ఇందుచేతనే వారు ఏర్పఱచఁబడిన వంశము అనఁబడిరి (I పేతు 2[9]). ఇట్లు దేవుఁడు మునుపు ఇశ్రాయేలీయులను గాని, ఇప్పుడు విశ్వాసులను గాని నియమించుట ఆయన ఏర్పాటు అనఁబడును (రోమా 9[11] 11[5,7,28] I థెస్స 1[4] II పేతు 1[10]). అనేకులు పిలువఁబడినను, ఏర్పఱచఁబడినవారు కొందఱే యని క్రీస్తు చెప్పెను (మ 22[14]). రోమా 9-11 లో యూదుల ఏర్పాటునుగూర్చి పౌలు ఎక్కువగా వ్రాసెను. యూదుల ఆక్షేపణలను ఖండించుటకు, దేవుఁడు సర్వాధికారియై అంతయు తన సంకల్పము చొప్పున నేర్పాటు చేయునని వ్రాసిన పిమ్మట (9[6-29]), యూదులు దేవుని రక్షణ మార్గములను త్యజించి తమ రక్షణను పోఁగొట్టుకొనిరని (9[30] 10[20]) దెలిపెను. ఈ రెండు సంగతులు భిన్నములుగా నున్నట్లు మన స్వల్పబుద్ధికిఁ దోఁచినను, ఆ రెండును సత్యములని మనము దెలిసికొని దేవుని ఏర్పాటులను గూర్చిన బోధను గ్రహించుకొనవలెను.

5. పిలుచుట (*Call*). మానవులను పిలువక పోయినయెడల దేవుని సంకల్పము నెఱవేఱక పోవును. ఈ పిలుపు మానవుల మూలముగా ప్రచురింపఁబడినను (రోమా 10[14,15]) అది దేవుని పిలుపే. దేవుఁడు మానవుల నొక విశేషమైన పనిని చేయుటకు పిలుచును (1[1] I కొరి 1[1]) గాని, నమ్మువారికి ఈ పేరు విశేషముగా పెట్టఁబడియున్నది (రోమా 1[6,7] 8[28] I కొరి 1[2,24] ప్రక 17[14] మొ॥).

సువార్త యెవరికి ప్రకటింపఁబడునో వారందఱును పిలువఁబడినవారని మ 22[14] నందున్నవి. రోమా 8[27] చూడఁగా ఆ పిలుపునకు లోఁబడువారు మాత్రమే పిలువఁబడినట్లున్నది. ఈ రెండు అర్థములతో మాత్రమే ఈ పదము బైబిలునందు వాడఁబడినది (పిలుపు చూ.).

పై వాక్యములనుబట్టి క్రైస్తవ వేదశాస్త్రము నందు వివిధబోధలు వెలసినవి. హిందూశాస్త్రము నందున్న మార్జాలన్యాయమును, మర్కటన్యాయమును అను రెండువిధములైన బోధలవలె, క్రైస్తవ వేదశాస్త్రులలోఁ గొందఱు మన రక్షణ దేవుని సంకల్పముచొప్పున జరుగును గనుక ఎవరాయనచే నేర్పఱచఁబడిరో వారు మాత్రమే రక్షణపొందెదరనియు, వారి రక్షణనుగూర్చిన భారమంతయు ఆయనదేననియు బోధింతురు. మఱికొందరు ఈ రక్షణ మనము చేయుదానిని బట్టియే కలుగును గాన ఆ భారమంతయు మనమీఁద నున్నదని యందురు. పైనున్న వాక్యములను చూడఁగా దేవుఁడు ఫలానివారు నశింపవలెనని సంకల్పించినట్లున్న బోధ ఎక్కడను లేదు గాని, రక్షణ పొందవలెననియే సంకల్పించెను. అది సంకల్పము మాత్రమేగాక, ఆయన ముందెఱిఁగినవారిలో ఆ సంకల్పము సాఫల్యమగునట్లు ఆయన వారిని నిర్ణయించి వారిని పిలుచునుగాని ఆయన యెంతపనిఁ జేసినను మనము రక్షణను యూదుల వలె తృణీకరించినయెడల (రోమా 9[30]-10[20]) అది మన విషయమును నిష్ఫలమగును. మనము ఆ రక్షణను స్వయముగా నంగీకరించి దానిని మన స్వంత రక్షణగా చేసికొనవలెను (ఫిలి 2[12,13] II పేతు 1[10]). రక్షణ పొందఁబోవువారు తమ రక్షణయంతయు దేవునిపనియై యున్నదని యొప్పుకొనవలసివచ్చును. పై నుదాహరింపఁబడిన పదములన్నియు అదే సత్యమును బోధించును. నశించు

చున్నవారు ఆ రీతిగానే తమ నాశనమునకు తామే కారకులని యెప్పుకొనవలసివచ్చును (రోమా 6[23]).

**ముక్కర** ఆభరణములు 22 చూ॥

**ముక్కిడితనము** రోగములు చికిత్సలు I 8 చూ॥

**ముక్కు, నాసికారంధ్రములు** (Nose, Nostrils). ముక్కుతో శ్వాసింతుము. అట్టి శ్వాసప్రాణమునకు సూచనయైయున్నది. కావున దేవుఁడు మానవులను సృష్టింపఁగా వారికి ప్రాణము నిచ్చుటనుగూర్చి నాసికారంధ్రములలో నూదినట్లు అలంకారరీతిగా చెప్పఁబడినది (ఆది 2[7]). అట్లే మానవులప్రాణము స్థిరమైనది కాదనుసంగతిని సూచించుటకు యెషయా అది నాసికారంధ్రములలోని ప్రాణమనెను (యెష 2[22]). భారతీయులవలె బైబిలుకాలములోని వారును ముక్కుకు భూషణములు పెట్టుకొనిరి (ఆభరణములు 19, 22 చూ॥). ముక్కుమీఁద కోపమున్నదని మనము తెలుగుగా వాడునట్లు హెబ్రీయులుకూడ కోపమును సూచించుటకు ముక్కుకు సంబంధించిన పదమును సాధారణముగా వాడిరిగాని తెనుఁగు బైబిలునందు దానిని కోపమను పదముతో తర్జుమా చేసిరి (ఆది 30[2] 39[19] 44[18] మొ॥). యెహె 8[17] లో విగ్రహారాధన చేసినవారు ముక్కుకు ద్రాక్షాతీగ పెట్టుకొన్నట్లున్నది. దాని భావమేమిటో మనకు తెలియకపోయినను అది విగ్రహారాధనకు సంబంధించినదనిమాత్రము స్పష్టముగు చున్నది. ముక్కిడియైనవాఁడు యాజకత్వమునకు పనికిరాఁడను నియమముగలదు (లేవీ 21[18] రోగములు చికిత్సలు I 8 చూ॥).

**ముక్కు కమ్మలు** ఆభరణములు 20 చూ॥

**ముఖము** (Face). బైబిలునందీ దిగువ సూచనలు ముఖమునుగుఱించి యున్నవి. ముఖమును కప్పుకొనుట దుఃఖమును (II సమూ 19[4]), భియభక్తులను (నిర్గ 3[6] I రాజు 19[13] యెష 6[2]) సూచించెను. ముఖముమీఁద నుమ్మివేయుట లోకమంతటిలో నున్నట్లు గొప్ప అవమానమునకు గుర్తుగా నుండెను (సంఖ్యా 12[14] ద్వితీ 25[9] మ 26[67]). ముఖవర్చస్సునుబట్టి హృదయములో నున్న సంగతులను చెప్పవచ్చును. కయీను ముఖము చిన్నబుచ్చుకొనుట అతని కోపమును అసూయను కనఁబఱచెను (ఆది 4[5]). ముఖమును కఠినముగా చేసికొనుట మూర్ఖమగు అవిధేయతను కనఁబఱుచును (యిర్మీ 2[27]). ఉపవాసము చేసిన వారు తమ దుఃఖము నందఱు గుర్తించునట్లు ముఖములను వికారము చేసికొనిరి (మ 6[16]). దేవుని నిరాకరించుట ఆయనవైపు ముఖమునుగాక వీపు త్రిప్పినట్లుదాహరింపఁబడెను (యిర్మీ 2[27]). ఆ సంగతినే వారు దేవునికి విముఖులైరని 32[33] నందు తెలిఁగించిరి. దేవుఁడు మనయెడల తన ముఖ కాంతిని చూపుట ఆయన దయను సూచించును (కీర్త 31[16]). సంఖ్యా 5[25] లో ఆ పదమునే ఆయన సన్నిధియని తెలిఁగించిరి. దేవుఁడు ప్రజల పట్ల దయచూపక వారిని శిక్షించుటకు అభిముఖుఁడగునని యిర్మీ 21[9] నందున్నది. ఒకని ముఖమును చూచుట అతని యనుగ్రహమును సంపాదించుకొనుట సూచనగా నున్నది (ఆది 33[10]). ఒకని ముఖమును కనఁబఱచకపోవుట వాని నిర్దయకు గుఱుతు (43[3,5]). ఇట్లు ముఖమును చూచుట అంగీకారమునకును (కీర్త 84[9]), విముఖుఁడగుట అంగీకరింపకపోవుటకును (132[10]) సూచనలై యున్నవి. దేవునితో సహవాసము చేయఁ గోరెడివారు ఆయన ముఖమును చూడవలెనని మూలభాషయందుండఁగా దానిని ఆయన సన్నిధిలో చేరుటయని తెలిఁగించిరి (24[6] 27[8] 42[2]). దేవునిని ముఖాముఖిగ చూచుట అట్టి తీక్ష్ణ సహవాసమునకు గుఱుతుగా నున్నది (ఆది 32[30]). మందిరమునందున్న సన్నిధిరొట్టెలు (నిర్గ 25[30] I రాజు 7[48]) మూలభాషలో సముఖపురొట్టెలని శబ్దార్థమగుచు దేవునితో చేయు సహవాసమును సూచించెను. వృద్ధుని ముఖమును ఘనపఱచుట (లేవీ 19[32]) అతనిని మర్యాదచేయుటయే. శ్రమ పడువారి ముఖములను నూరుట (యెష 3[15]) దీనలను బాధపఱచుటయని అర్థమగును. పక్షపాతము లేకుండుట (ద్వితీ 1[17]) మూలభాషలో ముఖము నెఱుఁగక తీర్పానించుట యని యర్థమిచ్చును.

**ముట్టడి కోట** II చూ॥

**ముట్టడి దిబ్బ కోట** II 1 చూ॥

**ముత్యము** రత్నములు 12 చూ॥

**ముద్దు** (Kiss). 1. ప్రస్తుతకాలమందువలె బైబిలుకాలములోను ముద్దు ప్రేమకు సూచనగా నున్నది. బంధువులు (ఆది $27^{26,27}$ $29^{13}$ $45^{15}$ రూతు $1^{9}$ I రాజు $19^{20}$ మొ॥), స్నేహితులు (II సమూ $20^{9}$ కార్య $20^{38}$) ఇట్లు తమ ప్రేమను కనఁబఱచిరి. ఆతిథ్యము చేసినవాఁడు తన చుట్టమును ముద్దుపెట్టుకొనుట మర్యాదయైనట్లు లూకా $7^{45}$ వలనఁ దెలియుచున్నది. యూదా ఇస్కరియోతు ప్రేమగల యిట్టి సూచనతో క్రీస్తును శత్రులకప్పగించుట గొప్ప ద్రోహమైయున్నది (మ $26^{49}$). 2. వినయ విధేయతలను చూపుటకు ప్రస్తుతమందున్నట్టుగానే చేతిని ముద్దుపెట్టుకొనిరి (యోబు $31^{27}$ కీర్త $2^{12}$). 3. విగ్రహారాధనచేయువారు తమ విగ్రహమునకు ముద్దుపెట్టుటద్వారా భక్తిని గనఁబఱచినట్లు సూచనలున్నవి (I రాజు $19^{18}$ హోషే $13^{2}$). 4. ఆది క్రైస్తవులు పరిశుద్ధమైన ముద్దుతో ఒకరికొకరు వందనములు చెప్పుకొనవలెనను వాడుకనుబట్టి అది ముఖ్యముగా క్రైస్తవ ప్రేమకు సూచనగా నున్నది (I కొరి $16^{20}$ I పేతు $5^{14}$).

**ముద్ర** (Seal). ఆయావారిని గుర్తించుటకును, పత్రములు దగాపిగాక సరియైనవని సూచించుటకును బైబిలుకాలమునందు ఆదినుండి ముద్రలు వాడుకయందుండెను (ఆది $38^{18}$ I రాజు $21^{8}$ యిర్మీ $32^{10-12}$ నెహె $10^{1,2}$ ఎస్తే $3^{12}$ ప్రక $5^{9}$). ఆయా వస్తువులను భద్రపఱచునప్పుడుకూడ వాటికి ముద్రలువేసిరి (దాని $6^{17}$ మ $27^{66}$ ప్రక $7^{3}$). ఇటీవల పలెస్తీనులో కనుగొనఁబడిన మట్టి, లోహపాత్రలకు వివిధములగు ముద్రలున్నట్టు తెలిసినది. వాటి నిర్మాతలెవరో తెలిసికొనుట కీ ముద్రలువేసినట్లు కనఁబడుచున్నది. బైబిలునందీ దిగువనున్నట్లు ముద్రలు అనుపదము అలంకార రీతిగా ప్రయోగింపఁబడెను. 1. మఱుగుగా దాచఁబడినవాటిని ముద్రలు సూచించెను (ప్రక $6^{3}$). ఇట్లు భద్రపర్చఁబడిన గ్రంథములను చదువక పూర్వము ఆ ముద్రలను విప్పవలసియున్నది గనుక దానినట్లు దాచిపెట్టక బాహాటముగా ప్రకటింపవలసినదనుదానికి సూచనగా ముద్ర వేయఁబడకూడదను ఆజ్ఞ అట్టి అలంకారమునందున్నది ($22^{10}$). 2. బోధించువాఁడు తప్పుడు బోధకుఁడు కాఁడను సంగతిని సూచించుటకు అట్టివారు ముద్రింపఁబడినట్లు బైబిలునందున్నది. తాను చేయునట్లు తండ్రి తనకిచ్చిన కార్యములు తన్ను ముద్రించినట్లు యేసును (యోహా $6^{27}$), తనపని ఫలితముగా నున్న సభికులచే తాను ముద్రింపఁబడినట్లుగా పౌలును (I కొరి $9^{2}$) అలంకారరీతిగా చెప్పుకొనిరి. 3. విశ్వాసులు రక్షణను నిశ్చయముగా నొందెదరు అను సంగతి పరిశుద్ధాత్మను పొందుటవలన దృఢపడునుగాన పరిశుద్ధాత్మవారిని ముద్రించెనను అలంకారము గలదు (ఎఫె $4^{30}$ II కొరి $1^{22}$). 4. ప్రవక్తలు ప్రవచించినది తప్పక నెఱవేఱునను సంగతిని సూచించుటకు వారు దానిని ముద్రించవలెనని యున్నది (యెష $8^{16}$ దాని $9^{24}$ $12^{4,9}$).

గల $6^{17}$ లో తనకున్న ముద్రలనుగుఱించి పౌలు అలంకారరీతిగా వ్రాసెను. నిర్గ $21^{6}$ ను అనుసరించి తాను క్రీస్తుకు దాసుఁడైయున్నట్లు అవి సూచనలుగా నున్నవి. కావున ఇతరు లిఁకను తన్ను తొందరపెట్టఁగూడదని వ్రాసెను. ఈ ముద్రలు లుస్త్రలో రాళ్లప్రహారములవలన అతనికి కలిగిన గుఱుతులను సూచింపవచ్చును. అవి ఆ గాయములు కానియెడల పౌలు ఇంకి దేనినిగూర్చి వ్రాసెనో నుహింప వీలుగాదు.

**మునికోల, మునుకోలకర్ర** (Goad). పొలములను దున్నునప్పుడు ఎద్దును తోలుటకై మనదేశమందువలె వాడెడు సన్నని మేకు చివర నున్న పొడుగాటికర్ర (I సమూ $13^{21}$). ఇది పాఁత నిబంధనలో ఒకసారి మాత్రము కనఁబడును. న్యాయా $3^{31}$ నందున్న మఱియొక పదమును ఈ యర్థమునే యిచ్చును. షమ్గరు అనువాఁడు అట్టి మునుకోలకర్రతో 600 మంది ఫిలిష్తీయులను చంపెను. ఆ కర్ర చక్కఁగా అమర్చఁబడుట జ్ఞానులైనవారు పొందికగా మాటలాడుటను సూచించును (ప్రస $12^{11}$). ఒకఁడు తన మనస్సాక్షిని దేవుని యాజ్ఞకును భిన్నముగా ప్రవర్తించుట పశువు మునికోల కర్రను తన్నునట్లుగా నున్నది. అందువలన మఱెక్కువ హాని కలుగును (కార్య $26^{14}$).

**ముప్పీము** (Muppim). బెన్యామీను కుమారులలో నొకఁడు (ఆది $46^{21}$). దీనికి I దిన $7^{12}$ $26^{16}$ లో షుప్పీము అనియు, సంఖ్యా

$26^{40}$ లో షూపాము అనియు, I దిన $8^{4}$ లో షెపూపాను అనియు మూఁడు రూపములు గలవు.

**మునిణిచెట్టు** (Worm wood). సామె $5^{4}$ లో ఇది మాచిపత్రి అని యుండవలెను (మాచిపత్రి చూ॥). J. C.

**మూసియ** (Mysia). చిన్నాసియాకు వాయవ్యదిక్కుననుండు పరగణా. పౌలు తన రెండవ మిషనెరీ ప్రయాణములో దానిగుండ వెళ్లినట్లు కార్య $16^{6-10}$ లో కనఁబడును. ఈ పరగణాలో నుండు త్రోయ, అస్సు, అద్ర ముత్తియ అను పట్టణములనుగూర్చికూడ కొన్ని వాక్యములలో సూచనలు గలవు

**ముసుకు** (Veil). సిరియ పలెస్తీను ఐగుప్తు దేశములలో నున్న స్త్రీలు తమ ఇండ్లలోనుండి బయటకు వెళ్లవలసివచ్చినప్పుడు నొసటిని కన్నులనుమాత్రము కనఁబడనిచ్చి ముఖముయొక్క తక్కిన భాగమంతయు కప్పఁబడునట్లు ముసుకు వేసికొందురు. మర్యాదస్థులైనవారందఱును ఇట్లు చేసెదరు. మహమ్మదీయమతము రాకముందట్టి యాచారముండలేదు ముఖ్యముగా ప్రధానపు పెండ్లి కుమార్తెలు తమకు భర్తలు కాఁబోవువారి యెదుట నున్నప్పు తమ ముఖములు బొత్తుగా కనఁబడకుండునట్లు ముసుకు వేసికొనుట పూర్వమందు ఆచారమై యుండెను (ఆది $24^{65}$ $29^{22,23}$). ముఖమంతటిని కప్పుటకుఁ గాక ముఖమును అలంకరించుకొనుటకును తెల్లని మస్లినుబట్టతో చేసిన ముసుకులనుకూడ ధరించిరి (ఆభరణములు 23 చూ॥ పర $4^{1,3}$ $6^{7}$). ముసుకు స్త్రీల అధికారమునకును బలమునకును గుఱుతైయున్నది. ముసుకు వేసికొనిన స్త్రీ సిరియదేశములోని వీధులయందు తన యిష్టప్రకారము నడువఁగలదు. ఆమె జోలికెవ్వరును వెళ్లఁ జగింపరు.

ఆది క్రైస్తవులలో కొరింథు సభయందు సర్వసాధారణముగా మర్యాదస్థులకుండు ఈ వాడుకను స్త్రీలలో కొందఱు వెంటనే ఆపివేసి దానిని మార్చవలెనని ప్రయత్నింపఁగా, అట్లు చేయుట వలన క్రైస్తవమతమునకు చాల ఆక్షేపణ కలుగునని పౌలెఱిగి దానిని మార్చరాదని అట్లు బోధించెను (I కొరి $11^{10}$). ఇట్టి చట్టములు నీతిచట్టములకు సమమైనవి కాకపోయినను ఇట్టి వాడుకల విషయములోకూడ సువార్తబోధకు ఆక్షేపణ కలుగకుండునట్లు చూచుకొనవలెను. J. C.

**ముళ్లు, ముండ్లచెట్లు** (Thorns).

I. ముండ్లచెట్ల రకములు, వాటి పేరులు: ఈ దేశమునందున్నట్లు పలెస్తీనులోను అనేక రకముల ముండ్లచెట్లు గలవు. అందుచేతనే వాటిని సూచించు అనేక పదములు బైబిలునందున్నవి. పదునేడు హెబ్రీ పదములకును, మూఁడు గ్రీకు పదములకు తెలుఁగునందు పద్దెనిమిది వివిధ పదములుపయోగించుటయే గాక వాటిలో నొక్కొక్క పదము నొక్కొక్కదానితో గాక వేఱు పదములతో తెనిఁగించినందున వాటిని వేర్వేఱుగా వివరించుటకు వీలుగాకున్నది. తెలుఁగు అక్షరముల ననుసరించి వాటి నీ దిగువ రీతిగాఁ జూడవచ్చును.

**1.** కంప అను పదము న్యాయా $8^{7}$ లోని యొక పదమును తెనిఁగించుటకు వాడిరి గాని దానిని $8^{16}$ లో బొమ్మజెముడు అనిరి. అట్లే హోషే $10^{8}$ లో కంపయనిన మఱియొక పదమును ఆది $3^{18}$ లో గచ్చపొదలని తెనిఁగించిరి.

**2.** గచ్చలు క్రింద 14 చూ॥

**3.** గచ్చతీగెలు హెబ్రీ $6^{8}$ లో నీ పదము నిట్లు తెనిఁగించినను మ $7^{16}$ లో దానిని పల్లేరుచెట్లు అని తర్జుమచేసిరి.

**4.** గచ్చపొదలు పైన 1 లో నున్నది మాత్రమేగాక యెష $5^{6}$ $7^{23,24}$ $9^{18}$ $10^{17}$ $27^{4}$ లో నున్న మఱియొక పదమును ఈ మాటతో తెనిఁగించిరి. అది ఆ వాక్యములలో ప్రతిదానియందు బలురక్కసిచెట్లు అని తెనిఁగించిన మఱియొక పదమునకు జతగా నున్నది (క్రింద II చూ॥)

**5** **గోక్షురవృక్షము** న్యాయా $9^{14,15}$ నందు యోతాము చెప్పిన ఉపమానమునందతఁడు అబీమెలెకు హీనస్థితిని సూచించుటకు వాడిన పదమునకు తర్జుమాయైయున్నది గాని కీర్త $58^{9}$ లో దానిని ముళ్లకంపలని తెనిఁగించిరి. దీని మూలభాషాపదమగు ఆతదు ఒక స్థలమునకు కూడ పేరైయున్నది (ఆతదు చూ॥).

**6. మురవగొండ్లు, మురవగొండి చెట్లు.** ఇది యెష $34^{13}$ హోషే $9^{6}$ లోని ఒక పదమున కును, యెష $55^{13}$ లో నున్న మఱియొక పదమున కును భాషాంతరము.

**7. పల్లేరుచెట్లు** పైన 3 చూ॥

**8. పొవలు** క్రింద 13 చూ॥

**9. బలురక్కసిచెట్లు** పైన 4, క్రింద 13 చూ॥

**10. బొమ్మజెముడు** పైన 1 చూ॥

**11. బ్రహ్మదండిచెట్లు.** దీని యసలుపదము యెహె $2^{6}$ లో మాత్రము గలదు. ముండ్ల తుప్పలు అని తెనిఁగింపఁబడిన మఱియొక పద ముతోఁ గలిపి వాడఁబడి యెహెజ్కేలూ అట్టి వాటి నడుమ నివసించుచున్నాఁడని యున్నది. ఇది అతని చుట్టునుండు దుష్టులను సూచించును.

**12. ముండ్లకంచె, ముళ్లకంచె.** సామె $15^{19}$ నందు ముండ్లకంచె యన్న పదమును మీకా $7^{4}$ లో ముళ్లచెట్టు అని తెనిఁగించిరి. హోషే $2^{6}$ లో ముండ్లకంచె అని తెనిఁగించినపదము మఱియొకటియై మార్గములో కలుగు ఆటంకములను సూచనగా నున్నది (క్రింద 13 చూ॥).

**13. ముండ్ల చెట్లు.** హోషే $10^{8}$ లో ముండ్లచెట్లు అని తెనిఁగించిన పదము సర్వ సాధారణమైనదై పాఁత నిబంధనలో ఆయా పదములచే తెనిఁగింపఁబడెను. ఆది $3^{18}$ యెష $32^{13}$ లో దానిని ముండ్లతుప్పలనియు నిర్గ $22^{6}$ లో ముండ్లకంపలనియు, యెహె $28^{24}$ లో కంప యనియు యిర్మీ $4^{3}$ లో ముండ్లపొదలనియు తెనిఁగించిరి. మఱియొక పదమును II రాజు $14^{9}$ II దిన $25^{18}$ లో ముండ్లచెట్లనిరి. దానినే ముళ్లు (యోబు $31^{40}$ సామె $26^{9}$), గచ్చలు (యెష $34^{13}$), ముండ్లకంప (హోషే $9^{6}$) అనియు తెనిఁగించిరి. ఆ పదము రహస్య స్థానములను సూచించుచు పర $2^{2}$ నందు బలురక్కసి చెట్లనియు, దాగుకొను చోటును సూచించుచు I సమూ $13^{6}$ నందు పొదలనియు, సుక్కోతువారిని శిక్షించుటకు గిద్యోను వాడిన కర్రలను సూచించుచు న్యాయా $8^{7,16}$ లో నూర్చుకొయ్యలనియు, మృగములను లోఁబఱచుకొనుటకు వాటి ముక్కులకు తగిలించు వాటిని సూచించుచు యోబు $41^{2}$ నందు గాల మనియు తెనిఁగింపఁబడెను. యెష $34^{13}$ లో ముళ్లచెట్లు అని తెనిఁగించినది మూఁడవ మాటయై యున్నది. మీకా $7^{4}$ యెష $55^{13}$ లో నున్నది నాల్గవపదమై ముండ్లచెట్లు అని తర్జుమా చేయఁ బడెను. దానిని యెష $7^{19}$ లో ముండ్లపొద లనియు తెనిఁగించిరి. యోబు $5^{5}$ లో ముండ్ల చెట్లు అని తెనిఁగించిన ఐదవ పదమునుగూర్చి పైన 12 చూ॥

**14. ముండ్లతుప్పలు** పైన 11, 12, 13, క్రింద 15 చూ॥.

**15. ముండ్లపొదలు** (పైన 13 చూ॥). క్రొత్త నిబంధనయందలి ఒక పదము నీ మాటచే తఱుచుగా తెనిఁగించిరి (మ $7^{16}$ $13^{7}$ మా $4^{7-18}$ లూ $6^{44}$ $8^{14}$). హెబ్రీ $6^{8}$ లో ఆ పదమునే ముండ్లతుప్పలనిరి. క్రీస్తుశిరస్సుపై పెట్టిన కిరీటము నట్టి ముండ్లతో చేసిరి (మ $27^{29}$ యోహా $19^{2}$).

**16. ముళ్లకంపలు** (పైన 5, 13 చూ॥) మీకా $7^{4}$ లోని మాట బైబిలునందీ చోట మాత్రమే గలదు.

**17. ముళ్లు** పైన 13 చూ॥

**18. శూలములు** పైన 13 చూ॥

II. మానవుఁ డొనర్చిన పాపమువలన భూమి శాపగ్రస్తమైనప్పుడు అది ముండ్లతుప్పలను గచ్చ పొదలను మొలిపించునని దేవుఁడు చెప్పెను (ఆది $3^{18}$). ఆ మాటలే హోషే $10^{8}$ లో నాశనమును సూచించుటకు వాడినను అచ్చట ముండ్లచెట్లు, కంప యను మాట లుపయోగించుటచే దాని సంబంధమంత తేటగా కనఁబడదు. LXX లోని ఆది $3^{18}$ లో నున్న గ్రీకుపదములనే హెబ్రీ $6^{8}$ లో కూడ వాడినను వాటిని ముండ్లతుప్పలు గచ్చపొదలు అని తెనిఁగించిరి. ఆ పదములనే మ $7^{16}$ లో ముండ్లపొదలు పల్లేరుచెట్లు అని తర్జుమాచేసిరి. బైబిలునందలి యితర ముండ్లకు ఆయా పేరులు పెట్టినను పైనున్న ఈ నాలుగు వాక్యములను చదివెడివారు గుర్తించునట్లు వాటి నేక రీతిగా తెనిఁగించిన యెడల మేలుగా నుండును.

**III.** ఈ దేశమందువలె ముండ్లను కంచెలుగా వేసినను (నిర్గ $22^{6}$) సాధారణముగా బైబిలునందలి

సూచనలుగా నున్నవి. ముండ్లచెట్లు పాపము వలన కలిగిన శిక్షను సూచించును (ఆది $3^{18}$ యోబు $3^{10}$ హెబ్రీ $6^{8}$). ఒక దేశములో ముండ్లచెట్లు విస్తరించుట ఆ దేశనాశమునకు సూచనగా నున్నది (యెష $7^{23,24}$ $9^{18}$ $34^{13}$ హోషే $9^{6}$ మొ॥). కొన్ని వాక్యములలో ముండ్లు కాలిపోవుటయే అట్టి నాశనమునకు సూచనయై యున్నది (యెష $33^{12}$ నహూ $1^{10}$). మార్గమందు ముండ్లుంచె యుండుట అభ్యంతరములను గుఱుతు (హోషే $2^{6}$). సోమరికి కలుగు తొందరలు మార్గమున ముండ్లకంచెవలె నున్నవి (సామె $15^{19}$). ముండ్లు పనికిరానివాటిని సూచించును (II సమూ $23^{6}$ యోబు $31^{40}$ మీకా $7^{4}$). పనికిరానివారిని సూచించుటకు యోతాము (న్యాయా $8^{7-16}$), యెహోయాషు (II రాజు $14^{9}$ II దిన $25^{18}$)లు వాటిని దృష్టాంతములుగా నెత్తిరి. అవి బాధను సూచనలై యున్నవి (యెహో $23^{13}$ సంఖ్యా $33^{55}$ సామె $26^{9}$). నాశనమైన దేశము తిరిగి ప్రబలుటను ముండ్లచెట్లను ప్రతిగా మంచి చెట్లు పెరుగుట సూచించును (యెష $55^{13}$). ముండ్లవిత్తనములు చల్లుట నిష్ప్రయోజనమైన కష్టమునకు సూచన (యిర్మీ $4^{3}$). మంచి పైరును పెరుగనియ్యని ముండ్లతుప్పలను క్రీస్తు శోధనలకు దృష్టాంతముగా వాడెను (మ $13^{7}$ మా $4^{7-18}$ లూ $8^{14}$). విత్తనములు వేసిన పిమ్మట ముండ్లను కోయవలసివచ్చుట దేవుని దీవెన లేక పోవుటకును వృథాప్రయాసకును సూచనయై యున్నది (యిర్మీ $12^{13}$).

## మూ

**మూకత్వము, మూగితనము** రోగములు చికిత్సలు II 3 (1) చూ॥

**మూడు** సంఖ్యలు II 3 చూ॥

**మూఢులు (Ignorant).** రోమా $1^{14}$లో ఇది అజ్ఞానులను సూచించు పదమునకు భాషాంతరమై యున్నది దానిని సాధారణముగా అవివేకులని తెనిఁగించిరి (లూ $24^{25}$ గల $3^{1-3}$ తీతు $3^{3}$ I తిమో $6^{9}$ మూర్ఖత్వము I 4, 6 చూ॥).

**మూత్రగ్రంథులు (Kidneys).** యజ్ఞములలో దేవుని కర్పింపవలసిన శ్రేష్ఠమైన భాగములలో క్రొవ్వుతో కప్పఁబడిన మూత్రగ్రంథులు నున్నవి (నిర్గ $29^{13,22}$ లేవీ $3^{4,10,15}$ $4^{9}$ $7^{4}$ మొ॥). బైబిలు కాలమునందు సుఖదుఃఖములను వివేచించు బుద్ధికి మూత్రగ్రంథులు ఉనికియని తలంచిరి కావున ఆ పదమును అనేక చోట్ల అంతరింద్రియమను మాటచే తెనిఁగించిరి (మనుష్యుడు 4 (2) చూ॥).

**మూర** మానములు కొలతలు I 1 చూ॥

**మూర (Myra).** చిన్నాసియాయొక్క నైరృతి దిక్కునందు లుకియలో నున్న ముఖ్యపట్టణము. అది రేవుపట్టణమయ్యెను. పూర్వము ఐగుప్తునుండి రోమాకు వెళ్లిన యోడలు గాలి అనుకూలముగా నుండునప్పుడు మొదట ఇచ్చటికివచ్చి, ఇచ్చటినుండి రోమాకు వెళ్లునవి. అందువలననె పౌలును రోమాకు ఖైదీగా కొనిపోవునప్పుడు ఇక్కడ రోమాకువెళ్లు ఓడను కనుగొని దాని నెక్కించిరి (కార్య $27^{5,6}$). నేటివఱకు ఆ పట్టణపు శిథిలములను చూడవచ్చును (పటము V, J 4).

**మూర్ఖత్వము, మూర్ఖుడు (Frowardness, Froward).** ఈ మాటలచే తెనిఁగింపఁబడిన మూలభాషాపదములు కనీసము ఆరు పాఁత నిబంధనయందును రెండు క్రొత్త నిబంధనయందును గలవు. ఆ పదములను వేఱువేఱు తెలుఁగు పదములచేత తర్జుమాచేసిరి.

I. పాఁత నిబంధనలోని పదములు.

1. మూర్ఖులని తెనిఁగించిన యొక హెబ్రీ పదమును అనేక వాక్యములలో అట్లు తర్జుమా జేసినను (ద్వితీ $32^{5}$ II సమూ $22^{7}$ కీర్త $18^{26}$ $101^{4}$ సామె $4^{24}$ $11^{20}$ $22^{5}$) దానిని కుటిలవర్తనుఁడనియు ($17^{20}$), వంచకుఁడనియు (సామె $28^{6}$) తెనిఁగించిరి. దానిని మార్గమును గుఱించి వాడినప్పుడు వంకర మార్గమని తెనిఁగించిరి ($2^{15}$).

2. ఆ యర్థమునే యిచ్చు మఱియొక పదము మూర్ఖపు మాటలను సూచించును. దాని నట్లనేక వాక్యములలో తెనిఁగించినను (ద్వితీ $32^{20}$ సామె $2^{12,14}$ $6^{14}$ $10^{32}$), కుటిలమైన మాటలనియు (సామె $8^{13}$), కృత్రిమములనియు ($16^{30}$), కొత్త మాటలనియు ($28^{33}$) తెనిఁగించిరి.

3. సామె $17^{20}$ నందు మూర్ఖముగా మాట్లాడు వాఁడని తెనిఁగించిన పదము మఱియొకటిరెయి మూర్ఖముగా నెమరాడు నాలుకనుకూర్చి ఆ యొక్క వాక్యములోనే వాడఁబడెను.

4. వెఱ్ఱియని యర్థమిచ్చు మఱియొక మూల భాషాపదమును సామె $1^{7}$ $20^{3}$ $24^{7}$ లో మూర్ఖులని తెనిఁగించిరను, దానిని బుద్ధిహీనుఁడని యొక చోటను (కీర్త $107^{17}$), మూఢులని అనేకచోట్లను తెనిఁగించిరి (యోబు $5^{2,3}$ సామె $10^{14,21}$ $11^{29}$ $12^{15,16}$ యెష $35^{8}$ యిర్మీ $4^{22}$).

5. మూర్ఖధార్ష్ట్యముగల వాని సూచించు మఱియొక పదమును మూఢులని తెనిఁగించినను (కీర్త $49^{10}$ సామె $13^{19,20}$ మొ.) ఒకానొకప్పుడు అవివేకులనియు (కీర్త $92^{6}$ సామె $12^{23}$ యిర్మీ $10^{8}$), సాధారణముగా బుద్ధిహీనులనియు (కీర్త $94^{8}$ సామె $1^{22,32}$ $3^{35}$ $8^{5}$ $10^{1}$ మొ.) తెనిఁగించిరి.

6. మఱియొక పదము నాబాలు అను పేరునందుండి (I సమూ $25^{25}$) మోటుతనమని యర్థమగుచు మూఢులనియు (యోబు $2^{10}$ సామె $30^{22}$), నీచుఁడనియు (II సమూ $3^{33}$ కీర్త $39^{8}$), బుద్ధిహీనుఁడనియు (కీర్త $14^{1}$ $53^{1}$), బుద్ధిలేనివారనియు (ద్వితీ $32^{6}$), అవివేకియనియు (కీర్త $32^{21}$ $74^{18}$), దుర్మార్గుఁడనియు (II సమూ $13^{13}$), మోటువాఁడనియు (యోబు $30^{8}$) ఆయా సంబంధమునుబట్టి తెనిఁగించిరి.

II. క్రొత్త నిబంధనయందలి పదములు.

1. I పేతు $2^{15}$ లో మూర్ఖులని తెనిఁగించిన పదము అజ్ఞానులని యర్థమిచ్చును. దానిని సాధారణముగా అవివేకులని తెనిఁగించిరి (లూ $11^{40}$ I కొరి $15^{36}$ II కొరి $11^{16,19}$ మొ॥). లూ $12^{20}$ లో దానిని వెఱ్ఱివాఁడనియు రోమా $2^{20}$ లో బుద్ధిహీనుఁడనియు తర్జుమాచేసిరి.

2. II తిమో $3^{4}$ లో మూర్ఖులని తెనిఁగించిన పదము ఆలోచనలేకుండ తొందరపడి అక్రమములనుచేయుట యని యర్థమిచ్చును. దానిని కార్య $19^{36}$ లో ఆతురపడిచేయుట యని తెనిఁగించిరి.

పైపదములన్నిఁటినిబట్టి మూర్ఖత్వము అని తెనిఁగించిన పదములను ముఖ్యముగా సామెతల గ్రంథమున వాడినట్లు స్పష్టమగును. అది తెలివిలేక పోవుటనుగాక ముఖ్యముగా దుర్మార్గతను సూచించెను. దేవునికి విధేయులు కానివారు మూర్ఖులుగా నెంచఁబడెదరు (బుద్ధిహీనుడు చూ॥).

**మూర్ఛ, మూర్ఛిల్లుట** రోగములు చికిత్సలు II 9 (2) చూ॥

**మూలగుమ్మము** యెరూషలేము B III 8 (3) చూ॥

**మూలపాఠములు** (Elements).

1. గల $4^{3,9}$ కొలొ $2^{8,20}$ లలో ఈ మాటకు ఒకటే యర్థముకలదు. అసలులో ఈ పదమునకు పంక్తులు అను నర్థముకలదు మఱియు దీని యసలు భావమును చూడఁగా ఇది సమస్తమును కలిగియుండు పంచ భూతములనుకూడ సూచించును. II పేతు $3^{10,12}$ లో అదే యసలు మాటను భూతములు అను మాటనే తర్జుమాచేసిరి గలతీయులును, కొలొస్సయివారును ఆత్మీయమైన వాటిని విడిచి ప్రకృతి సంబంధమైన వాటితట్టు తిరిగియుండిరనునది పైవాక్యముల భావమని కొందఱనుకొందురు. అట్టి ప్రకృతి సంబంధమైన విషయములపై ప్రత్యేకమైన యధికారులుండుటచే ఈ మూలపాఠములు అను పదము వాటి ప్రభుత్వమునుకూడ సూచించునని వారనుకొందురు. అయితే మూలపాఠములు వాటినిగాక, పాతనిబంధన యాచారములను సూచించునని కొందఱనుకొందురు. అవి మానవుల బాల్యదశకు ఉపయోగకరములుగా నుండు వెలుపలి యాచారములైనను ఆత్మీయ సంగతులను తెలిసికొను దశవచ్చిన పిమ్మట ఆ మూలపాఠములు నిష్ప్రయోజనములు మాత్రమేకాక, ఆ యాత్మీయ సంగతులను కోరక వీటిని కోరువారికి అవి గొప్ప ఆటంకములుగాకూడ నుండును. రక్షణ పొందుటకై వీటి ననుసరించువారు క్రీస్తును విసర్జించినట్లుగా నున్నది గనుక పౌలు అట్టివారిని కఠినముగా ఖండించెను (భూతములు చూ॥).

2. హెబ్రీ $5^{12}$ లో ఈ మాటకు వేఱొక భావము కలదు. అచట అది క్రైస్తవులు మొట్టమొదట నేర్చికొనవలసిన సంగతులను సూచించును. ఆ హెబ్రీ క్రైస్తవులు వాటిని సహ

మఱచి యుండిరి కావున వాటిని మఱల చేర్చికొన వలసినదని ఆ గ్రంథకర్త వారిని గద్దించెను.

**మూలపురుషుడు** గోత్రకర్త చూ॥

**మూలరాయి (Corner Stone).** అయా జనాంగములలో నున్నట్లు హెబ్రీయులలోకూడ ఒక కట్టడమునకు మూలరాతి నెత్తుటను ఆచార ప్రకారము జరిగించిరి. ఆ మూలరాతి ననుసరించియే కట్టడమంతటికి అమర్చవలసి యుండెను. కావున అది కట్టడపు రాళ్లన్నిటిలో ముఖ్య రాయిగా నెంచఁబడెను. యిర్మీ $51^{26}$ యోబు $38^{6}$ లోను ఈ మూలరాయి పునాదికి సూచనగా నున్నది (పునాది చూ॥). ఈ రాయియొక్క ప్రాముఖ్యతనుబట్టి అది దేవుఁడు తన సంఘమును స్థిరపఱచుటకు చేయఁబోవు పనికి సూచనగా నున్నది. యెష $28^{16}$ లో అది దేవునియందలి యథార్థమైన నమ్మకమును సూచించును. కీర్త $118^{22}$ నందు దేవుఁడు తానే రక్షణకు ఉద్ధారకుఁడగుటచే ఆయన రక్షణకు మూలరాతిని వేసినట్లున్నది. దేవుఁడు తన రాజ్యము నీ లోకములో స్థాపించుటకు యేసు క్రీస్తును పంపుటద్వారా పైవాక్యముల లోని భావమును నెఱవేర్చెను. యేసు ఈ రాజ్యమును కట్టడమునకు ముఖ్యుఁడగుటచేతను అది అంతయు ఆయనతో అమర్చఁబడుటచేతను ఆయన అన్నిటికిని పునాదిగా నుండుటచేతను యెష $28^{16}$ లో నున్నట్లు ఈ రాజ్యము కట్టఁబడవలసినదగు యూదులచే తిరస్కరింపఁబడుట వలనను ఆయన పై వాక్యములను పూర్ణముగా నెఱవేర్చిన వాఁడాయెను (మా $12^{10}$ కార్య $4^{11}$ ఎఫె $2^{20}$ I పేతు $2^{6}$ తలరాయి చూ॥).

**మూలవ్యాధి** రోగములు చికిత్సలు II 9 (1) చూ॥

**మూషి, మూషీయులు** (Mushi, Mushites = శోధింపఁబడెను). లేవీయులలో నొకఁడు. ఇతఁడు మెరారీ కుమారుఁడు. మెరారీ తెగవారి కుటుంబములలో నొక కుటుంబమునకు పెద్దయాయెను (నిర్గ $6^{19}$ సంఖ్యా $3^{20}$ I దిన $6^{19,47}$ $23^{21,23}$ $24^{26,30}$). ఈ కుటుంబికులకు సంఖ్యా $3^{33}$ $26^{58}$ లో మూషీయుల వంశము అను పేరుకలదు.

# మృ

**మృగములు (Animals).** పలెస్తీనుదేశము పలువిధములగు శీతోష్ణస్థితుల కునికి పట్టు గావున శీతల ప్రదేశమందలి మృగజాతులేగాక ఉష్ణ ప్రాంత మృగములుండుటవలన అక్కడ యనేక మృగములు గలవు. తెలుఁగు బైబిలునందు ఒకటే మూలభాషాపదమునకు వెవ్వేఱు తెలుఁగుమాటలను, వెవ్వేరు మూలభాషాపదములకు ఒక్కటే తెలుఁగుపదము నుపయోగించుటచేత ఈ పదములు కొంతవఱకు తారుమారుగా నుండుట తప్పక పోయినను, తెలుఁగు ఓనమాల ననుసరించి వాని నీ దిగువ రీతిగా వివరింపవచ్చును.

1. **అడవికుక్క** కుక్క చూ॥

2. **అడవిగాడిదె** గాడిదె చూ॥

3. **అడవిపంది** పంది చూ॥

4. **అడవిపిల్లి.** యెష $34^{14}$ నం దీపదము కనఁబడును. దాని మూలభాషాపదము బహు అరుదుగా వాడఁబడెను. అది ఎండిన దేశమందలి మృగమని యర్థమిచ్చును. యెష $13^{21}$ లో నక్కలు అని తెనిఁగించిరి.

5. **అడవిమేక** మేక 2 చూ॥

6. **అడవి లేడి** లేడి చూ॥

7. **ఆవు** ఆవు చూ॥

8. **ఎర్రజింక** లేడి చూ॥

9. **ఎలుక.** దీని మూలాభాషాపదము యెష $2^{20}$ లో మాత్రముండుటవలన దాని భావమంత నూటిగాఁ దెలియదు. త్రవ్వమన్న జంతువను నది దీని శబ్దార్థము గాన ఎలుకయని యెంచెదరు.

10. **ఎలుగుబంటి.** సిరియదేశ మందున్న ఈ జంతువు ఎలుఁగుబంటి జాతిలో విశేషమైనదిగా నెంచఁబడుచున్నది. దీనిని గూర్చిన సూచనలు బైబిలునందనేకములు గలవు (I సమూ $17^{34,36,37}$ II సమూ $17^{8}$ సామె $17^{12}$ $28^{15}$ యెష $11^{7}$ $59^{11}$ మొ॥). అది సింహముకన్న భయంకరమైనదై యున్నట్లు వీటివలనఁ దెలియుచున్నది.



ఎలుఁగుబంటి

**11.** ఎద్దు ఆవు 2 చూ॥

**12.** ఒంటె ఒంటె చూ॥

**13.** కంచరగాడిదె గాడిద చూ॥

**14.** కారుజింక లేడి చూ॥

**15.** కారుమేక మేక 2 చూ॥

**16. కుందేలు.** ఈ జంతువును సూచించెడి పదము మూలభాషలో నొక్కటి మాత్రమే గలదు. నిషిద్ధ యాహార పదార్థముల జాబితాలో నిది కనఁబడును (లేవి $11^{6}$ ద్వితీ $14^{7}$ క్రింద 43 చూ॥)

**17.** కుక్క కుక్క చూ॥

**18.** కొండగొఱ్ఱె గొఱ్ఱె చూ॥

**19.** కొండమేక మేక చూ॥

**20.** కోడె ఆవు 2 చూ॥.

**21. కోతి** పలెస్తీను జంతువులలోనిది కాదు. సొలొమోను విదేశములనుండి దీనిని తెప్పించెను (I రాజు $10^{22}$ II దిన $9^{21}$). దీని మూలాభాషా పదము కోపు అనునది కపియను సంస్కృత పదమువలె నున్నందున దీని నీ భరతఖండమునుండి తెచ్చినట్లు కొందఱి యభిప్రాయము. పేరేదియైనను వీటిని అరబ్బీ దేశమునుండి తెచ్చియుండ వచ్చును.

**22. గబ్బిలము.** నిషిద్ధ యాహారపు జాబితాలోను (లేవి $11^{19}$ ద్వితీ $14^{18}$), పాడు స్థలములను సూచనగాను (యెష $2^{20}$) ఈ పేరు కనఁబడును.

**23. గాడిదె, గాడిదెపిల్ల, గార్దభము** గాడిద చూ॥

**24. గుఱ్ఱము** గుఱ్ఱము చూ॥

**25. గురుపోతు.** ఒక భయంకరమగు మృగమును సూచించు పదము. ఇది బైబిలునందలి కావ్యములలో మాత్రము కాన్పించును (సంఖ్యా $23^{22}$ ద్వితీ $33^{17}$ యోబు $39^{9,10}$ కీర్త $22^{21}$ $29^{6}$). మూలభాషాపదము సూచించెడి మృగమునుగూర్చి కొంత సందేహము గలదు. దీనిని గురుపోతు అని తెనిఁగించిరి గాని అట్టిది ప్రస్తుతము పలెస్తీనులో లేదు.

**26. గురుపోతు.** యెష $13^{21}$ లో మాత్రము కనఁబడు పదము. ఈ పదము మూల భాషలో అరచుచున్న దానిని సూచించును. గురుపోతు అట్టి జంతువగుటచే ఆ పదము నిట్లు తెనిఁగించిరి. గాని కొందఱు అది అరచు గుడ్లగూబ యని యెంచురు.

**27.** గొఱ్ఱె గొఱ్ఱె చూ॥

**28.** చిన్నదుప్పి లేడి చూ॥

**29.** చిన్నపంది కొక్కు చూ॥

**30. చిన్నముంగిసు.** ఈ పదము లేవి $11^{29}$ నందున్న నిషిద్ధ ఆహార జాబితాలో కనఁబడును. అది ముంగిసవంటి ఒక తరహా చిన్న జంతువేగాని ముంగిసయని చెప్ప వీలుకాదు.



చిరుతపులి

**31. చిరుతపులి.** ఈ పదము పాత నిబంధనలోను (యెష $11^{6}$ యిర్మీ $5^{6}$ మొ॥) క్రొత్త నిబంధనలోను (ప్రక $13^{2}$) కనఁబడును. దాని $7^{6}$ లోను ప్రక $13^{2}$ లోను అది బలాఢ్యుఁడగు

వానిని సూచించుటకు అలంకారరీతిగా వాడఁబడెను.

**32. చుంచులు.** I సమూ $6^{5}$ లో చుంచులు అని తెనిఁగించిన హెబ్రీపదమును ఇతర వాక్యములలో పందికొక్కులని తెనిఁగించిరి (39 చూ॥).

**33. జింక** లేడి చూ॥

**34. తోడేలు** తోడేలు చూ॥

**35. దుప్పి** లేడి చూ॥

**36. నక్క** నక్క చూ॥

**37. నీటిగుఱ్ఱము.** యోబు $40^{15}$ లో మాత్రము ఈ పదమున్నది. సృష్టింపఁబడిన మృగములన్నిటిలో నది యొక బలమైనదని ఆ వాక్యమువలనఁ దెలియుచున్నది.

**38. పంది** పంది చూ॥

**39. పందికొక్కు.** ఈ పదము I సమూ $6^{4,5,11,18}$ యెష $66^{17}$ లలో నున్నది. లేవీ $11^{29}$ నందీ పదమునే చిన్నపందికొక్కు అని తర్జుమా చేసిరి. అసలు భాషాపదము దేనిని సూచించునో పండితులకును రూఢిగాఁ దెలియదు గాని అది పొలమెలుకయని సాధారణ యభిప్రాయము.

**40. పశువులు.** ఇది యొక మృగజాతికి గాక తెలుఁగునందున్నట్లు ఆవులు ఎద్దులు గొఱ్ఱెలు మేఁకలు మొదలగువాటన్నిటికి పెట్టు సర్వ సాధారణమగు పేరు. నిర్గ $9^{3}$ లో గుఱ్ఱములు గాడిదలు ఒంటెలు కూడ ఇందు చేరి యున్నట్లు చూడవచ్చును. పశువుల మందలు ఆస్తికి సూచనలైయున్నవి (యోబు $1^{3}$ ప్రస $2^{7}$).

**41. పాటుపడు పశువులు.** ఈ పదము I రాజు $4^{28}$ లో నున్నది గాని మీకా $1^{13}$ నందు ఆ పదమునే యుద్ధపు గుఱ్ఱములని తెనిఁగించిరి. వేగముగా పోవునది యని మూలభాషాపదము యొక్క శబ్దార్థము గావున మీకాలోనున్న తర్జుమా సరియైనదిగా కనఁబడుచున్నది.

**42. పెయ్య** ఆవు 1 చూ॥

**43. పొట్టకుందేలు.** ఇది అపవిత్ర జంతువుగా ఎంచఁబడెను (లేవీ $11^{5}$ ద్వితీ $14^{7}$). కీర్త $104^{18}$ లో ఆ యసలు పదమును కుందేళ్లు అనియు, సామె $30^{26}$ లో చిన్నకుందేళ్లు అనియు తెనిఁగించిరి. ఆ వాక్యములు అది యుక్తిగల చిన్నజంతువని తెలుపుచున్నవి.

**44. మేక** మేక చూ॥

**45. లేడి** లేడి చూ॥

**46. శోణఁగికుక్క.** ఈ పదము సామె $30^{31}$ లో మాత్రమున్నది. దీని యర్థము రూఢిగా తెలియదు. కొందఱిది గుఱ్ఱమును సూచించు నందురు.

**47. సింహము** సింహము చూ॥

**మృగశీర్షము** (Orion). దేవుని శక్తిప్రభావములకు చూపుటకు సూచనగా ఆమో $5^{8}$ యోబు $9^{9}$ లో నుదాహరించిన నక్షత్రరాశి. పూర్వికులీ నక్షత్రరాశిని జూచి అది బంధింపఁబడిన రాక్షసుని రూపమును పోలియున్నదని తలంచిరి. దేవుని మహాత్మ్యము నెదుట మానవుని శక్తిహీనతను చూపుటకు మృగశీర్షకు కట్లను విప్పఁగలవాయను ప్రశ్న గలదు (యోబు $38^{31}$).

**మృతసముద్రము** ఉప్పుసముద్రము చూ॥

**మృతసముద్రపు ప్రతులు** ప్రతులు I చూ।

**మృతులలోకము** పాతాళము చూ॥

**మృతులస్థితి** (State of the Dead). చనిపోయిన మానవుల స్థితి యెట్టిది యను విషయమునుగూర్చి పాతనిబంధన బోధలకును క్రొత్త నిబంధన బోధలకును భేదము కలదు. పాతనిబంధన వాక్యములను చూడఁగా, రాఁబోవు జీవమొకటి యున్నదనుట వాస్తవమేయైనను, ఆ జీవము ఈ లోకజీవమునకు సాటియైనది కాదని స్పష్టమగును. మృతులు భూమియొక్క క్రింది భాగములలోనుండు నొక విధమైన ప్రేతలై ఒక తరహా నిద్రావస్థలో నున్నట్లుగానున్నది (యోబు $26^{5}$ యెష $14^{9}$ కీర్త $94^{17}$ $88^{19}$ ప్రస $9^{5}$). మఱియు మంచివారును చెడ్డవారును అందఱు నొక చోటనే యుండునట్లుగా నున్నది (యోబు $3^{17}$ ప్రస $9^{5}$ I సమూ $28^{19}$). అయినను అచట సహా కొందఱికి గొప్ప యవమానమును (యెష $14^{5}$), కొందఱికి మఱెక్కువ శిక్షయు ($66^{24}$) కలుగుచున్నట్లు తెలియును. భక్తులైయుండి మృతులగువారికి సౌఖ్యము కలుగుననికూడ కొన్ని వాక్యములలో నున్నది (కీర్త $16^{9-11}$ $17^{15}$ 22

దాని $12^{3}$). మృతులకును ఈ లోకములో జీవించువారికిని ఇంక నే సంబంధమును లేనట్లు ఆయా పాత నిబంధన వాక్యములలో కనబడును (యోబు $7^{9}$ $14^{12}$ ప్రస $9^{5}$). అయినను దీనికి భిన్నముగా మృతులయొద్ద ఆలోచన పుచ్చుకొను వారు కూడ కలరు (యెష $8^{19}$ I సమూ 28) గాని యిట్టి యాలోచన చేయుటయే నిషేధమై యున్నది.

క్రొత్త నిబంధనలో మృతులస్థితిని గూర్చిన బోధలు తేటగానున్నవి. ధనవంతుడు లాజరు లను గూర్చిన యుపమానములో దుష్టులకు కలుగు దండనయు భక్తులకు కలుగు సౌఖ్యమును సూచింపఁ బడియెను (లూ $16^{19-33}$). మ $25^{31-46}$ లో తీర్పు దినమునకు సంబంధముగా అదే బోధ కలదు. చనిపోయిన భక్తులు ప్రభువునొద్ద నుందురని అనేక వాక్యములలో నున్నది (యోహా $14^{1-4}$ II కొరి $5^{1-10}$ ఫిలి $1^{23}$ పాతాళము, పరదైసు చూ॥).

**మృదంగము** సంగీతము 3 (1) (*c*) చూ॥

## మె

**మెకేరాతీయుడు** (Mecherathite). దావీదు యోధులలో అహీయాము అను నొకనికి గల బిరుదు (I దిన $11^{36}$). ఇది II సమూ $23^{34}$ లో నుండు మాయకాతీయులు అనుదానికి మారురూపమై యుండవచ్చును (మయకా చూ॥).

**మెకోనా** (Mekonah). చెఱకాలము నుండి తిరిగివచ్చిన యూదులు నివసించిన యూళ్లలో నొకటి (నెహె $11^{28}$). దీని యునికిని గూర్చి తెలియదు.

**మెగిద్దో, మెగిద్దోను** (Megiddo, Megiddon = గుంపులుకూడు స్థలము?). పలెస్తీను దేశపు కోటలలో నొక ముఖ్యమైనకోట. ఇశ్రాయేలీయులు కనాను దేశమును స్వాధీనము చేసి కొనకమునుపు ఇది కనానీయుల కోటయై యున్నట్లు ఐగుప్తీయుల రాతిశాసనములవలనఁ దెలియుచున్నది. ఆ రాజులలో మూఁడవ తత్మస్ (*Thotmes* III) అనువాఁడు దానిని జయించి, దోచుకొనెను. యెహోషువ కాలములో ఇశ్రాయేలీయులు కనాను దేశమును జయించినను, అప్పుడు వారు మెగిద్దోనుండి కనానీయులను వెళ్లఁగొట్టియుండలేదు (యెహో $17^{12,13}$ న్యాయా $1^{27,28}$). న్యాయాధిపతుల కాలములో బారాకు, దెబోరా యనువారు కనానీయులకు రాజైన సీసెరాను ఇచట ఓడించిరి ($5^{19,21}$). సొలొమోను ఇచట ప్రాకారమును కట్టించెను (I రాజు $9^{15}$). రాజైన అహజ్యా యిచట చనిపోయెను (II రాజు $9^{27}$). మంచి రాజైన యోషీయా ఇచట ఐగుప్తీయులచే నోటువడి చంపఁబడెను ($23^{29,30}$ II దిన $35^{22}$). అందువలన ఇశ్రాయేలీయులకుఁ గలిగిన దుఃఖము చెఱకాలమునకు పిమ్మట సహా గొప్ప దుఃఖమునకు సామెతగా నుండెను (జెక $12^{11}$). మఱియు ప్రక $16^{16}$ చూడఁగా, లోకాంతమునకు ముందు భక్తులకును దుష్టులకును గొప్ప పోరాటముగలుగు చోటునకు హార్మగెదోను (హార్ = భూమి, మగెదోను = మెగిద్దో) అను అలంకారమును పెట్టిరి. మెగిద్దో పలెస్తీను దేశపు కురుక్షేత్రమనంబడును.

ఇది షారోను బయలునుండి ఎస్డ్రేలన్ బయలు నకు పోవు మార్గము దగ్గఱనుండుటచే చాలముఖ్యమైన కోట యయ్యెను. అష్షూరునుండి ఐగుప్తుకు దండయాత్ర చేయువారందఱును ఈ మార్గముననే పోవలసియుండెను. కీషోను నదిలోపడు నొక యేరు దాని దగ్గరగా నుండెను. న్యాయా $5^{19}$ లో ఆ నది మెగిద్దో కాలువలు అనఁబడెను ఇటీవల పండితులీ కోటను కనుఁగొని అచట త్రవ్వించి చాల పాడు శేషములను కనుఁగొనిరి. ప్రస్తుతము దానికి టెల్ ఎల్ ముటెసెల్లీము (*Tell-El-Mutesellim* = గొర్నెసు కొండ) అను పేరుకలదు. అది కైసరయ పట్టణమునకు తూర్పున 20 మైళ్ల దూరములో నున్నది (పటము IV, C 8).

**మెజోబాయా** (Mezobaite). దావీదు యోధులలో నొకఁడగు యహశీయేలు బిరుదు (I దిన $11^{47}$). ఈ పేరును వ్రాయుటలో పొరబాటు వచ్చెనని సాధారణముగా నను కొందురు.

**మెట్లు** యెరూషలేము B, V 2 (12) చూ॥

**మెడ** (Neck). ప్రస్తుతకాలమున నున్నట్లే బైబిలుకాలములోకూడ మెడలో భూషణములు ధరించుట వాడుకయైయుండెను (ఆభరణములు 6 చూ॥). స్నేహితులయందు గల అనురాగమును వారి మెడమీఁద పడుటవలనఁ జూపిరి (ఆది $33^4$ $45^{14}$ $46^{29}$ మొ॥). మెడను కాడి క్రింద నుంచుట దాసత్వమున కొక సూచన (ద్వితీ $28^{48}$ యిర్మీ $27^2$). మెడమీఁదనుండి కాడిని విఱుచుట విడుదలను సూచించెను (ఆది $27^{40}$ యిర్మీ $30^8$). మెడను వంచక బిగపట్టుకొనుట తిరుగుబాటు తనమునకు మంకు బుద్ధికి గుఱుతుగా నుండెను. సాధారణముగా ఆ పదము లోఁబడనొల్లక పోవుటయని తెనిఁగించినను (నిర్గ $32^9$ $33^3$ ద్వితీ $9^6$), క్రొత్త నిబంధనలో ముష్కరులని (కార్య $7^{51}$) గాని దానికి చివరి వాక్యములలోని భాషాం తరమునందున్నట్లు మెడవంచనివారని యర్థము. మెడమీఁద పాదములుంచుట (యెహో $10^{24}$ యెహె $21^{29}$) పూర్ణ అపజయమునకు సూచనయై యున్నది.

**మెతూషెల** (Methuselah = ఈఁటె గలవాఁడు). జలప్రళయమునకు పూర్వమున నున్న యొకఁడు. ఇతఁడు సేతువంశములో పుట్టిన వాఁడై యుండెను (ఆది $5^{26}$ I దిన $1^3$ లూ $3^{37}$). ఇతని కారోపింపఁబడిన 969 సం॥ ఆయుస్సు ఇతని సంతతివారి జీవితకాలముంటెటికిఁ కెందక, ఇతని స్వంత జీవితకాలమేయైనయెడల ఇతఁ డందఱిలో నెక్కువకాలము జీవించినవాఁడని చెప్పవలయును.

**మెతెగమ్మా** (Metheg Ammah = తల్లి పట్టణమునకు కళ్లెము). గాతు పట్టణపు సార్థక నామమని కొందఱి యభిప్రాయము. దావీదు మెతెగమ్మాను ఫిలిష్తీయుల యొద్దనుండి పట్టుకొనె నని II సమూ $8^1$ నందున్నది. పైనున్నట్లు దాని శబ్దార్థమునుబట్టి అది ఫిలిష్తీయుల దేశమందున్న ముఖ్యపట్టణములలో నొకటియగు గాతుకు చక్కగా సరిపడును. ప్రస్తుత మక్కడనున్న పట్టణమునకుకూడ ఈ యర్థమే చెప్పినను, ఈ పదమునందు వ్రాఁత తప్పులుండుటనుబట్టి ఆ స్థలమేదియో రూఢిగా చెప్పుటకు వీలుగాదందురు.

**మెదాను** (Medan). అబ్రాహాము కెతూ రాలకు పుట్టినవాఁడు (ఆది $25^2$ I దిన $1^{32}$). ఇతఁడు మిద్యానువలె నొక జనాంగమునకు మూల పురుషుఁ డాయెనందురు. దిదాను పట్టణపు శిథిలములకు దగ్గరగా నున్న వాడి మెదాను (*Wady Medan*) అను స్థలము వీరి యునికి కావచ్చునని కొందఱి తలంపు.

**మెనహేము** (Menahem = ఆదరణకర్త). గాదీయును వాని కుమారుఁడు. రాజైన జెక ర్యాను షల్లూము చంపెనను వార్తను తిర్సాలో విని షోమ్రోనుకు వెళ్లి షల్లూమును సంహరించి అతనికి బదులు రాజాయెను (II రాజు $15^{14}$). తిప్సహు పట్టణమువారు తనను లోనికి చేర్చు కొనక తిరస్కరించినందున దానిని పట్టుకొని దాని నివాసులను ఘోరపుఫల పాలుజేసెను ($15^{15}$). చాలకాలముదనుక అతని యేలుబడి స్థిరపడక పోయెను. తిగ్లత్పిలేసెరనఁబడిన పూలు దేశము మీఁదికి దండెత్తివచ్చినప్పుడు మెనహేము తన దేశమునకు నాశము కలుగకుండునట్లు వెయ్యి తలాంతులవెండి (దాదాపు 60 లక్షలరూపాయలు) నిచ్చి సంధి జేసికొనెను. ఆ కాలమున కది యెంతో మొత్తముగ పరిగణింపఁబడెను. ఈ సొమ్ము నతఁడు తన దేశమందున్న ధనికులపై నొక్కొక్కనికి ఏఁబదేసి తులముల (దాదాపు రూ. 100) చొప్పున పన్ను విధించి జమచేసెను. దీనినంతటిని బలవంతముగా వసూలు చేయుటకు ఈ లెక్కప్రకారము ఇశ్రాయేలువారిలో 60,000 మంది ధనికు లుండిరని కనబడుచున్నది. షోమ్రోను వాఁడగు మినిహిమ్ము (*Minihimmu*) తనకు కప్పము కట్టినవారిలో నొకఁడని తిగ్లత్పి లేసెరు వ్రాయించుకొనినట్లు అష్షూరు శాసన ములవలనఁ దెలియుచున్నది. ఇతఁడుకూడ యరొబాము చేసిన పాపక్రియలను వదలలేదు. ఇతఁడు పది సంవత్సరములు (క్రీ॥ పూ॥ 746-738) రాజ్యమేలెను. ఇతని కుమారుఁడగు పెకహ్యా తరువాత రాజయ్యెను.

**మెనేమెనే, టెకేల్, ఉఫార్సీన్** (Mene Mene, Tekel, Upharsin). బెల్షస్సరుయొక్క నగరములో విందు సమయమున గోడమీఁద వ్రాయఁబడిన గూఢార్థముగల మాటలు (దాని $5^{25}$). ఆ మాటల యర్థము $5^{26,27}$ లో నున్నది. ఇవి హెబ్రీ ప్రాకృతమగు అరమేయిక్ (*Aramaic*) భాషకు సంబంధించిన మాటలై

యున్నవి. హెబ్రీలోవలె దానిలో అచ్చులను వ్రాయక హల్లులను మాత్రము వ్రాసిరి కావున వాటిని చదువుట చాల కష్టతరముగా నుండును. ఈ నాలుగు మాటలు తూనికకు సంబంధించినవని కొందరి యభిప్రాయము. మెనే యనఁగా లెక్కించుట, టెకేల్ అనఁగా తూచుట, ఫర్సీన్ అనఁగా విభాగించుట యని యర్థము. చివరి మాటలో పారసీకులుకూడ సూచింపఁబడియుండ వచ్చును.

**మెన్నా** (Menna). క్రీస్తు పూర్వికులలో నొకఁడు (లూ $3^{13}$).

**మెఫీబోషెతు** (Mephibosheth) = నాశనకరమైన అవమానము). 1. రిస్పాయను ఉపపత్నివలన రాజైన సౌలుకు పుట్టిన కుమారు లలో నొకఁడు, గిబియోనువారతనిని చంపించిరి (II సమూ $21^{8,9}$).

2. యోనాతాను కుమారుఁడు (II సమూ $4^{4}$). I దిన $8^{34}$ $9^{40}$ లో నితనికి మెరీబ్బయలు అను మారుపేరు కలదు. ఇది యతని అసలు పేరైయుండవచ్చును. బయలు అను పేరు అసహ్యమైన దగుటచే దానిని బోషెతు (=అవ మానము) అను రూపముగా మార్చియుండ వచ్చును. యోనాతాను గిల్బోవ యుద్ధములో కూలిపోయినపు డితనికి ఐదేండ్ల వయస్సు. అతని దాది అతని నెత్తుకొని పరుగున పారిపోవు చుండఁగా అతఁడు క్రిందపడినందున అతని రెండుకాళ్లును కుంటివయ్యెను (II సమూ $4^{4}$). యోనాతానుకు తనకుండు స్నేహమునుబట్టి దావీదు అతనియెడల దయగలవాఁడై తనయొద్దకు పిలిపించు కొని అతనికి రావలసిన ఆస్తినంతయు నిప్పించి పోషించెను (9). అబ్షాలోము తిరుగుబాటు చేసినపుడు దావీదు పారిపోయియుండఁగా మెఫీ బోషెతు నౌకరగు సీబా దావీదు నొద్దకు వచ్చి మెఫీబోషెతు అతని రాజ్యము నపహరింపవలెనను నుద్దేశముగలవాఁడైయున్నాఁడు అని చెప్పఁగా దావీదు నమ్మి మెఫీబోషెతు ఆస్తి యావత్తును సీబాకు నిచ్చెను ($16^{1-4}$). అయితే అబ్షాలోము ఓడిపోయినతరువాత దావీదు తిరిగి యెరూష లేమునకు తిరిగివచ్చినపుడు మెఫీబోషెతు దావీదు నొద్దకు వచ్చి తన సేవకుఁడు తనమీఁద అబద్ధములు చెప్పెనని మనవి చేసికొనఁగా దావీదు అతనికి మరల సగము ఆస్తి నిచ్చెను ($19^{24-30}$). ఈ మెఫీ బోషెతుకు మీకా యను కుమారుఁడుండెనని $9^{12}$ వలనఁ దెలియును. ఇతఁడు యోధులగు నొక కుటుంబపువారికి పెద్దయాయెను (I దిన $8^{36}$ $9^{41}$).

**మెబున్నయి** (Mebunnai). దావీదు యోధులలో నొకని పేరు (II సమూ $23^{27}$). I దిన $11^{29}$ $27^{11}$ లో ఇతనికి సిబ్బెకై అను మారు పేరు కలదు. ఇది సరియైన రూపమై యుండ వచ్చును. వ్రాఁతలోని తప్పువలన మెబున్నయి యను పేరు వచ్చినట్లున్నది.

**మెమూకాను** (Memucan). ఎస్తేరు కాలమునందు పారసీ రాజ్యములో ఏడుగురు ప్రధానులలో నొకఁడు (ఎస్తే $1^{14,16,21}$).

**మెయోనొతై** (Meonotha). యూదా వారిలో నొకఁడు. ఇతఁడు ఒత్నీయేలు కుమారుఁ డును ఒఫ్రా వారికి పూర్వికుఁడునై యుండెను (I దిన $4^{13,14}$).

**మెయోనీయులు మెహూనీయులు** (Minaeans, Meunim). అరేబియా దేశము నకు నైరృతి దిక్కున క్రీ॥ పూ॥ 9 శతాబ్దములలో నివసించిన ఒక తెగవారు. వారు విస్తరించి సీనాయిపరకు వ్యాపించియుండిరని అరబ్బీయుల చరిత్రవలనఁ దెలియును. II దిన $20^{1}$ $26^{7}$ లలో నున్నట్లు యూదావారితో యుద్ధము చేసిన మెహూనీయులు (మెయోనీయులు) వీరేయని కొందరనుకొందురు (మాయోను చూ॥).

**మెరపమొలకలు** (Rice, Rye). ఈ మాటచే తెనిఁగింపఁబడిన మూలభాషాపదము (నిర్గ $9^{32}$ యెష $28^{25}$) చాలవఱకు గోధుమ గింజవలె కనఁబడు నొక ధాన్యపు పేరైయున్నది. ఆ పదమునే యెహె $4^{9}$ లో సజ్జలు అని తెనిఁ గించిరి. ఈ ధాన్యము రూపుకు నల్లగను రుచికి చప్పగ నుండును. గోధుమలను కొనఁజాలని పేదలు ఈ ధాన్యమును తిందురు. పాలస్తీను అరేబియా దేశములయందు ఈ గింజలను గర్ద భాలాగాను మందదినుసుగా నుపయోగింతురు. రొట్టెలు కాల్చకముందు వాటిపై ఈ గింజలను చల్లెదరు. J. C.

**మెరాతయీయులు** (Merathaim). యిర్మీ 50[21] లో నున్నట్లిది యొక జనమునకు పేరు. వారు బబులోనీయులే యని సాధారణముగా ననుకొందురు. అట్లయినయెడల ఇది వారికి సార్థకనామమగును. దానికి కొట్టింపు తిరుగు బాటు లేక కట్టింపు చేదు అని యర్థము కావున ఈ పేరు వారికి సార్థకమనఁదగును.

**మెరాయా** అమర్యా 10 చూ॥

**మెరాయోతు** (Meraoth = తిరుగు బాటులు).

1. యాజకులలో నొకడు (I దిన 6[6,7,52] ఎజ్రా 7[3]).

2. యాజకులలో మఱియొకడు. ఇతఁడు అహీటూబు కొడుకైన సాదోకుకు తండ్రి (I దిన 9[11] నెహె 11[11]).

3. నెహె 12[15] లో నున్నట్లిది 12[3] లోని మెరేమోతు మాఱు పేరైయున్నది (మెరేమోతు చూ॥).

**మెరారీ, మెరారీయులు** (Merari = కష్టజీవి, Merarites). లేవి కొమరులలో మూఁడవవాఁడు. లేవీయులలో నొక తెగవారు ఇతని పేరునుబట్టి పిలువఁబడిరి (ఆది 46[11] నిర్గ 6[16] సంఖ్యా 3[17] I దిన 6[1,16] 23[6]). ఆ తెగవారికి ఒక్కవాక్యములో మాత్రమే (సంఖ్యా 26[57]) మెరారీయులు అను అసలు పేరు కలదు. తక్కిన వాక్యములలో (నిర్గ 6[14] సంఖ్యా 3[20] 4[29,33,42,45] మొ॥) మెరారీ కుమారులు అను పేరు కలదు. మెరారీయొక్క ఇద్దరు కుమారులనుబట్టి మహలీయులు, మూషీయులు అను రెండు తెగ లుద్భవించెను (సంఖ్యా 3[20,23] 26[58] నిర్గ 6[19] I దిన 6[19,29,47] 23[21]). ఈ మెరారీయులు ఇశ్రాయేలీయులు అరణ్యములో ప్రయాణము చేయుకాలమున వారి దండుపేటలో నుత్తరదిక్కున నుండువారు (సంఖ్యా 3[35]). వారు యెహోవా గుడారముయొక్క చెక్కలు పలకలు స్తంభములు దిమ్మలు మొదలైన వాటివిషయమై జాగ్రత పుచ్చుకొనవలసియుండెను (3[36] 4[29-33]). వాటిని మోయుటకై 4 బండ్లును 8 ఎద్దులు నియ్యఁబడెను. వానియంతునకు అహరోను చిన్న కుమారుఁడగు ఈతామారు పెద్దయైయుండెను (4[34]). వారిని మొదటిసారి లెక్కించినపుడు వారిలో 6200 మంది మగవారుండిరి (3[33,34]). ఈ సంఖ్యవలన వారు లేవీయుల తెగలలో కొద్ది సంఖ్యగలవారని కనఁబడును. యెహోషువ కాలమునందు వీరికి పలెస్తీనులో 12 పట్టణముల నిచ్చియుండిరి. వీటిలో జెబూలూను, రూబేను, గాదు అను నీ మూఁడు గోత్రముల స్వాస్థ్యము లలోనుండి నాలుగేసిపట్టణముల నిచ్చియుండిరి (యెహో 21[34-40] I దిన 6[63,77-81]). దావీదు వారిని ప్రత్యేకముగా లెక్కించి ఆలయము విషయమైన పనులలో వారికి ప్రత్యేకమైన యేర్పాటులు చేసెను (23[6,23,21]). ఆలయపు పాటకులలోని 24 వంతులలో వీరికి 6 వంతు లుండెను (6[31,44] 25[3]). హిజ్కియా ఆలయ మును పవిత్రపఱచినపుడు అతనికి సహాయము చేసినవారిలో ఈ తెగవారుండిరి (II దిన 29[12]). వీరిలో కొందఱు చెఱకాలమునకు పిమ్మట ఎజ్రాతో కూడ తిరిగి యెరూషలేమునకు వెళ్లి యుండిరి (ఎజ్రా 8[18,19]).

**మెరీబా మస్సా, మెరీబా, కాదేషు యొద్దనున్న మెరీబా** (Meribah Massah = శోధన, Meribah = పోరాటము, Kadesh-Meribah). మస్సా మెరీబా అనునవి సార్థక నామములై యున్నవి. అవి రెండు స్థలములకు పెట్టఁబడినపేర్లు (నిర్గ 17[1-7] సంఖ్యా 20[1-13]). ఇశ్రాయేలీయులు సీనాయికి చేరకపూర్వము నిర్గ 17[1-7] లో నుండు చరిత్ర సంగతులు జరిగెను. తరువాతి 37 సం॥ లకు కాదేషు దగ్గఱనుండఁగా సంఖ్యా 20[1-13] లోని చరిత్ర సంగతు జరిగెను. ఈ రెండు స్థలములలో జరిగినది చాలమట్టున కొక్కటే సంగతియై యుండెను. నీళ్లులేనందున ప్రజలు సణగఁగా దేవుఁడు మోషేద్వారా వారికి అద్భుతరీతిగా నీళ్లనిచ్చెను. ప్రజలు సణుగుటనుబట్టియే ఆ స్థలములకు మస్సా మెరీబా యను సార్థకనామములు కలిగెను. ఈ రెండు స్థలములలో జరిగిన చరిత సంబంధమును బట్టి చూడఁగా ఇవి రెండు వేర్వేఱు చరిత్రలు కాక, ఒకటే చరిత్రను రెండువిధములుగా చెప్పి రెండు స్థలములకు ఆరోపించుటయై యున్నది యని తెలిసికొనవలెనని కొందఱందురుగాని ఈ

చరిత్రలోని భేదములనుబట్టి ఇది రెండు స్థలములలో జరిగిన రెండు సంగతులని యనుకొనుట మఱి మంచిది. ఇట్లు సూచింపఁబడిన రెండు స్థలము లెవ్వియనఁగా:

1. సీనాయికి నుత్తరముగా నుండు హోరేబు కొండదగ్గఱనున్న యొక స్థలము (నిర్గ 17[1-7]). దీనికి మస్సా మెరీబా యను రెండు పేరులను పెట్టిరి (17[7]). ద్వితీ 6[16] 9[22] లలో దీనికి మస్సా యను నొక్క పేరు మాత్రము కలదు. ద్వితీయోపదేశ కాండములోని ఈ వాక్యములలో నుండు ఈ రెండుస్థలములును కాదేషు దగ్గఱనుండు స్థలమునకుకూడ నరిపడవచ్చును. అయితే యిది హోరేబుదగ్గఱ జరిగిన చరిత్రను తెలుపుటచే ఈ వాక్యములు దీనికి మఱి చక్కఁగా సరిపడును.

2. కాదేషుయొద్దనుండు నొకస్థలము (సంఖ్యా 20[1-13] 27[14] ద్వితీ 32[51]). కీర్త 95[8] 106[1] లలో కూడ దీనిగూర్చిన సూచనలు కలవు. యెహె 47[19] లో దీనికి కాదేషు యొద్దనున్న మెరీబా యను పేరు కలదు. ద్వితీ 33[8] లో నున్నట్లు దేవుఁడు లేవీని ప్రత్యేకముగా పరీక్షించినది దీని యొద్దనే యని చెప్పఁబడి యున్నది. ప్రస్తుతము కాదేషు దగ్గఱనున్న ఐన్ కాదీస్ (*Ain-kades* = కాదేషు ఊట) అను స్థలమే దీని యునికిమై యున్నది.

**మెరీబ్బరసులు** మెఫీబోషెతు చూ॥

**మెరుపు** (Lightning). దేవుని మహాత్మ్యములను తెలుపుటకు ఉఱుములు మెఱుములు సూచనలుగా నున్నవి (నిర్గ 16[16] కీర్త 77[18] 97[4] ప్రక 4[5] 8[5]). ఆ మెఱుములు ఆయనకుఁగాక మఱెవరికిని లోఁబడవు (యోబు 38[35] కీర్త 18[14]). ఆయన మెరుపులను బాణములుగా నుపయోగించి తనను విరోధించువారిని ఓడించును (కీర్త 18[14] 144[6] జెక 9[14]). ఇది హిందువుల ఇంద్రుఁడు చేసిన దానికి సంబంధముగా నున్నట్లు కనఁబడుచున్నది గాని బైబిలులోని సంగతి అలంకారముగ చెప్పఁబడిన విషయము మాత్రమయియున్నది. అధికముగా ప్రకాశించుచున్న వాని ముఖము మెఱుపువలె నున్నట్లు దృష్టాంతము కలదు (దాని 10[6]). మృతులలోనుండి లేచిన క్రీస్తు మహిమాప్రభావములను సూచించుటకు ఆయన వస్త్రములు మెఱుపువలె ప్రకాశించినట్లున్నది.

సాతాను మెఱుపువలె ఆకాశమునుండి పడుటనుగూర్చిన దృష్టాంతమును చూడఁగా (లూ 10[18]). అతఁ డెంత హఠాత్తుగాను వింతగాను నాశనమయ్యెనో ఆ సంగతి సూచింపఁబడును.

**మెరెదు** (Merid). యూదా వారిలో నొకఁడు. ఇతఁ డొక కుటుంబమునకు పెద్దయయ్యెను (I దిన 4[17]).

**మెరేమోతు** (Meremoth = దిబ్బలు).

1. యాజకులలో నెహెమ్యాకు వారికి పెద్ద (ఎజ్రా 8[33] నెహె 3[4,21] 10[5]).

2 ఎజ్రాకాలమున అన్యస్త్రీలను వివాహము చేసికొని ఆయన ప్రేరణచే వారిని విడిచిన వారిలో నొకఁడు (ఎజ్రా 10[36]).

**మెరెసు** (Meres). అహష్వేరోషుయొద్ద నుండిన యేడుగురు ప్రధానులలో నొకఁడు (ఎస్తే 1[14]).

**మెరోదకు** (Merodach). బబులోను పట్టణముయొక్క ముఖ్యదేవత. యిర్మీ 50[2] లో ఈ దేవత పేరు బేలు దేవత పేరుతోకూడ నున్నదిగాని యెష 46[1] లో ఈ మెరోదకుకు బేలు అను పేరు కలదు (బేలు చూ॥). ఈ దేవత పేరు ఒక పిగ్రహమునకు కూడ కలదు. బబులోను పట్టణముయొక్క ప్రాముఖ్యతనుబట్టి ఇదియొక ముఖ్యదేవతయయ్యెను. ఇట్టిది చాల ముఖ్యమైన ఇంద్రునివంటి దేవత యాయెను. అష్షూరువారును కోరేషును ఈ దేవతను మన్నన జూపినట్లు కనఁబడును. మెరోదక్బలదాను, ఎవిల్మెరోదకు అను చక్రవర్తుల పేరులలో ఈ పేరు కనఁబడును (బబులోను 5 చూ॥).

**మెరోదక్బలదాను** (Merodachbala-dan, *Chaldee*, Marduk-bal-iddin = మెరోదాకు అను దేవత కొడుకు నిచ్చెను). II రాజు 20[12] లో దీనికి బదులుగా 'బెరోదక్బలదాను' అను పేరు గలదు. అసలు హెబ్రీలో ఈ రూపమే ఉండినను అందులోని పొరబాటును LXX తర్జుమా చేసినవారు సరిగాదిద్ది మెరోద

క్కులదాను అని వ్రాసిరి. ఇతఁడు క్రీ॥ ము॥ 721-709 వఱకును, 702 సం॥ లో అఱుమాసముల వఱకును బబులోనుకు చక్రవర్తిగా నుండెను. అతని యసలు రాజ్యము పారసీ సంయుక్తాగ్ర గుడమునకు సమీపముగా నుండెను. ఇతఁడు అష్షూరు వారితో యుద్ధముచేసి వారిచేతిలోనుండి బబులోనుపట్టణము నపహరించి 12 సం॥ ల వఱకు దాని నేలెను. ఈ కాలములో నితఁడు అష్షూరువారికి లోఁబడువారిని తన పక్షము చేసికొనవలయునని హిజ్కియాయొద్దకు దూతల నంపెను (యెష 39=II రాజు 20[12-21]). క్రీ॥ ము॥ 709 సం॥ లో అష్షూరు రాజగు సర్గోను ఇతని నోడింపఁగా ఇతఁడు ఏలామునకు పారి పోయెను గాని 702 లో సన్హెరీబు అను చక్రవర్తి అష్షూరు నేలుచుండఁగా మరల బబులోను నపహరించి దానిని అఱుమాసములవఱకు నేలెను. అయినను దానిని దక్కించుకొనఁజాలక మరల పారిపోయెను. అతని తరువాతి చరిత్రనుగూర్చి యేమియు తెలియదు (బబులోను 5 చూ.).

**మెలట్యా** (Melatia = యెహోవా రక్షించును). నెహెమ్యాకాలములో యెరూషలేము ప్రాకారములను కట్ట సహాయపడిన గిబియోనీయులలో నొకఁడు (నెహె 3[7]).

**మెలితే** (Melita). పౌలు రోమాకు ప్రయాణము చేసిన యోడ బద్దలైన ద్వీపము (కార్య 28[1]). అది సిసిలీ ద్వీపమునకు దక్షిణముగా 60 మైళ్ల దూరములోనుండు నొక చిన్న లంకయైయున్నది. అది 95 చ॥ మైళ్ల వైశాల్యము మాత్రము కలిగియున్నది. అడ్రియాటిక్ (*Adriatic*) సముద్రములో మఱియొక ద్వీపమునకు మెలితే యను పేరుకలదు. పౌలుచేరిన ద్వీపమిదే యని బహు కొద్దిమంది యనుకొందురు గాని అప్పటిగాలి (27[14]) వలన కొట్టుకొని పోఁబడిన యోడ ఈ రెండవ ద్వీపమునకు పోవుట యసాధ్యముగాని ఆ గాలి యాయోడను ఆ మొదటి ద్వీపమునకు (28[1]) కొంచుపోవుటను గూర్చి యే సందేహమును లేదు. మఱియు మొదటినుండి యున్న పారంపర్య వాదుకను చూడఁగా అది యా మెలితే ద్వీపమని తెలియును. మెలితేలో ముఖ్యముగా ఫేనీకేవారు పురాతనకాలమందు వ్యాపారములు చేసియుండిరి. కార్తాగో (*Carthage*) లో వలె. వారు ఈ ద్వీపమందు మొదట నివసించినవారై యుండిరి. గ్రీకువారు తరువాత ఇచటికి వచ్చి యుండినను పౌలును చేర్చికొనినవారు గ్రీకువారు కాక, ఆ యాదిమ నివాసులని లూకా వారికి అనాగరికులు అను పేరుపెట్టుటచే తెలిసికొనవచ్చును (28[2]). ప్రస్తుతమందా ద్వీపములో సర్పములులేవు. అందుచేత కొందఱు 28[3,4] లో నున్న సంగతి ఆ ద్వీపమునకు సరిపడదని యనుకొందురు. అయితే పౌలు అచటచేరిన కాలమునకును ఇప్పటికాలమునకు మధ్యను అచ్చటి జనులు బహుగా విస్తరించిరి. గనుక పూర్వము అచట సర్పములుండినను ఇప్పుడు లేకపోవుట ఆశ్చర్యము కాదు. పౌలు మూఁడుమాసములవఱకు నచట నుండెను. పౌలును అతనితోనున్న వారును అప్పుడు చేరిన స్థలమును నేటివఱకు పౌలు అఖాతము (*St. Paul's Bay*) అందురు. క్రీ॥ శ॥ 451 వ సం॥ లో కల్సెదోను (*Chalcedon*) పట్టణమునందు కూడిన సార్వత్రికసభలో మెలితే యధ్యక్షుఁ డొకఁడుండెను. పౌలుకాలములో ఈ ద్వీపము రోమీయుల క్రింద నుండెను. రోమా రాజ్యనాశనమైన తరువాత అది దానిని జయించినవారి దయ్యెను. 1530 లో దానిని క్రూసేడుల వారి కిచ్చిరి. 1800 లో ఇంగ్లీషు వారివశమై నేటివఱకు వారియధీనమున నున్నది. దాని ప్రస్తుతపుపేరు మాల్టా (*Malta*).

**మెలీకూ** మల్లూకు చూ॥

**మెలెకు** (Melech = రాజు). రాజైన సౌలు కొడుకగు యోనాతాను యొక్క మునిమనుమఁడు (I దిన 8[35] 9[41]).

**మెలెయా** (Melea). క్రీస్తు పూర్వికులలో నొకడు (లూ 3[13]).

**మెల్కీ** (Melchi = యెహోవా రాజు). క్రీస్తు పూర్వికులలో నిద్దఱు (లూ 3[24,28]).

**మెల్కీషూవ** (Malchishua = రాజు రక్షణ). రాజైన సౌలుయొక్క కొడుకులలో నొకఁడు (I సమూ 14[49]). ఇతఁడు గిల్బోవ యుద్ధములో ఫిలిష్తీయులచే హతమయ్యెను (31[2] I దిన 10[2]).

**మెల్కీసెదెకు** (Melchizedek = నీతి రాజు). ఆది $14^{18}$ లో చూడఁగా మెల్కీసెదెకు అబ్రాహాము నెదురుకొని అతని నాశీర్వదించినట్లుగా నున్నదిగాని, అతనినిగూర్చి బైబిలులో మఱి యే సూచనలును లేవు. ఇతఁడు షాలేముకు రాజు అనియు, సర్వోన్నతుఁడగు దేవునికి యాజకుఁడు అనియు నందులో నున్నది. ఇతఁడు అబ్రాహాము నాశీర్వదించఁగా అబ్రాహాము అతనికి దశమభాగము నిచ్చెను ($14^{19}$). ఇతఁడు రాజు యాజకుఁడు అను రెండుద్యోగములు గలవాఁడగుటచే మెస్సీయకు ముంగుర్తుగ నెంచఁబడెను (కీర్త $110^{4}$). క్రీస్తు ఆ ముంగుర్తు నెట్లు నెఱవేర్చెనో హెబ్రీ 5, 6, 7 అధ్యాయములలో బహు వివరముగా నున్నది. ఆ ముంగుర్తుకు సంబంధముగా లేవీయుల యాజకత్వముకంటె క్రీస్తు యాజకత్వమెంత యున్నతమైనదో దాని నా గ్రంథకర్త యందులో వివరించెను (షాలేము చూ॥).

**మెషిల్లేమోతు** (Meshillemeth = బహుమానము).

1. ఎఫ్రాయిమీయులలో నొకఁడు. పెకహు సైనికులు పట్టుకొనిన యూదులను విడిపింపవలెనని చెప్పిన బెరక్యా తండ్రి (II దిన $28^{12}$).

2. యాజకులలో నొకఁడు (నెహె $11^{13}$). I దిన $9^{12}$ లో ఇతనికి మెషిల్లేమోతు అను పేరు కలదు. అసలుభాష చూడఁగా అచ్చటకూడ ఆ వాక్యములో గుణింతము కొంచెము భేదముగా నుండి మెషిల్లెమీతు అని యున్నది.

**మెషుల్లాము** (Meshullam = స్నేహితుఁడు).

1. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{17}$).

2 రాజైన యోతాము కాలములోనుండిన గాదీయులలో నొక ముఖ్యుఁడు (I దిన $5^{13}$).

3. ప్రధాన మంత్రియగు షాఫానుయొక్క పూర్వికుఁడు (II రాజు $22^{3}$).

4. యోషీయాకాలములో నుండిన ప్రధాన యాజకుఁడగు హిల్కీయాయొక్క తండ్రి (I దిన $9^{11}$ నెహె $11^{11}$ షల్లూము 8 చూ॥).

5. యోషీయాకాలమందు దేవాలయమును మరమ్మతుచేసిన లేవీయులలో నొకఁడు (II దిన $34^{12}$).

6. యాజకులలో నొకఁడు (I దిన $9^{12}$).

7. జెరుబ్బాబెలు కొడుకు (I దిన $3^{19}$).

8. బెన్యామీనీయులలో మఱియొకఁడు (I దిన $9^{7}$ నెహె $11^{7}$).

9. బెన్యామీనీయులలో నింకొకఁడు (I దిన $9^{8}$).

10. లేవీయులు యెరూషలేమునకు తిరిగి వెళ్లవలెనని వారిని ప్రేరేపించుటకు ఎజ్రా పంపిన ప్రధానులలో నొకఁడు (ఎజ్రా $8^{16,17}$).

11. తమ అన్యభార్యలను విడిచిపెట్టుట కష్టమని కొందఱనఁగా ఎజ్రాకు సహాయముచేసిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{15}$) గాని, కొందఱితఁడు ఎజ్రాకు అడ్డుపడినవారిలో నొకఁడని అర్థము చెప్పవలెనందురు.

12. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{29}$).

13. నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను తిరిగి కట్టినవారిలో నొకఁడు (నెహె $3^{4,30}$). ఇతఁడు తన కుమార్తెను అమ్మోనీయుఁడగు టోబీయా కుమారునికి నిచ్చెను ($6^{18}$)

14. నెహెమ్యా కాలమునందు యెరూషలేములోని పాతగుమ్మమును మఱియొకనితో కలిసి బాగుచేసినవారిలో నొకఁడు (నెహె $3^{6}$).

15. ఎజ్రా ధర్మశాస్త్రమును చదువుచుండఁగా అతని యెడమప్రక్కన నిలిచినవారిలో నొకఁడు (నెహె $8^{4}$).

16. నెహెమ్యా కాలమునందు నిబంధనను ముద్రించినవారిలో నొకఁడు (నెహె $10^{7}$).

17. ప్రజల ప్రధానులలో ఆ నిబంధనను ముద్రించినవారిలో నొకఁడు (నెహె $10^{20}$).

18. నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించఁగా ఊరేగింపుచేసిన వారిలో నొకఁడు. ఇతఁడు యూదుఁడై యుండెను (నెహె $12^{33}$).

19. యోయాకీము ప్రధాన యాజకుఁడై యుండఁగా నున్న యాజకులలో నొకఁడు (నెహె $12^{13}$).

20. అదే కాలములో నుండిన మఱియొక యాజకుఁడు (నెహె $12^{16}$).

21. ఆ కాలములోనే (19) యుండిన ద్వార పాలకులలో నొకఁడు (నెహె $12^{25}$). నెహె $12^{25}$ లో నున్న పైన నుదాహరించిన పేరులలో కొన్ని ఒకే మనుష్యునికి చెందినవై యుండును.

**మెషుల్లెమెతు** (Meshuellemeth = ఒక స్నేహితురాలు). రాజైన మనష్షేయొక్క భార్య పేరు (II రాజు $21^{19}$). ఆమె రాజైన ఆమోనుకు తల్లియై యుండెను.

**మెషెకు** (Meshech).

1. యాపెతు కుమారులలో నొకఁడు (ఆది $10^{2}$). ఇతఁడు మెషెకు తెగవారికి మూల పురుషుఁడయ్యెను. వారు తూరువారితో వ్యాపారము చేయుచు, దాసులను ఇత్తడివస్తువులను వారికి నమ్ముచుండిరి (యెహె $27^{13}$). వారు తూబలువారికి సంబంధులై వారితోకూడ నొక జతవారై యుండిరి ($32^{26}$). గోగు అను రాజు ఈ రెండు జనాంగములకు మాత్రమేకాక, రోషు అను జనమునకుఁగూడ రాజైయుండినట్లున్నది ($38^{2,3}$ $39^{1}$). ఈ వాక్యములనుబట్టి చూడఁగా, మెషెకువారు అనాగరిక స్థితిలో నుండినట్లున్నది. బైబిలులోవలె అష్షూరువారి రాతిశాసనములలో కూడ మెషెకువారును తూబలువారును ఒక జతి జనముగా చేర్చఁబడియున్నవి. అవి క్రీ॥ శ॥ 12-వ శతాబ్దమునకు పూర్వముననున్న శాసనములై యున్నవి. అప్పుడు వారు కిలికియాకు ఈశాన్య దిక్కున యుఫ్రాతునదికి పడమరగా నుండిరి. యెహెజ్కేలు కాలమునకు లోఁగా వారు మరీ యుత్తరమునకు తరుమఁబడి నల్లసముద్రమునకు ఆగ్నేయదిక్కున నుండిరని యనుకొందురు.

2. I దిన $1^{17}$ లోని మెషెకు అను పేరు ఆది $10^{23}$ లో నుండు మాషు అను పేరునకు మాఱురూపమై యున్నది (మాషు చూ॥).

**మెషేజబెయేలు** (Meshezebel = దేవుఁడు రక్షించువాఁడు).

1. ప్రాకారములను కట్టుటయందు నెహెమ్యాకు సహాయము చేసినవారిలో నొకఁడు (నెహె $3^{4}$).

2. నిబంధనను ముద్రించినవారిలో నొకఁడు (నెహె $10^{21}$).

3. పెతహయా యనువాని తండ్రి. ఇతఁడు యూదుఁడు (నెహె $11^{24}$). ఈ మూఁడు పేరులు ముగ్గురికికాదుగాని ఒకటే తెగకుండిన పేరని అనుకొనువారు కలరు.

**మెషెలెమ్యా** (Meshelemiah = దేవుఁడు ప్రతిఫలమిచ్చెను). లేవీయులలోని కహాతీయుల కుటుంబములలో నొక కుటుంబమునకు మూలపురుషుఁడు. ఈ కుటుంబికులు దేవాలయమునకు ద్వారపాలకులై యుండిరి (I దిన $9^{21}$ $26^{1,2,9}$). $9^{17,19,31}$ లో ఇతనికి షల్లూము అనియు, $26^{14}$ లో షెలెమ్యా అనియు, నెహె $12^{25}$ లో మెషుల్లాము అనియు మాఱుపేరులు కలవు

**మెషోబాబు** (Meshobab = తిరిగి చేర్చఁబడుట) షిమ్యోను గోత్ర ప్రధానులలో నొకఁడు. ఈ ప్రధానులు గెదోరు దగ్గరనున్న మేఁతభూములను పట్టుకొనిరి (I దిన $4^{34-41}$).

**మెసపొతేమియ** అరాము 1 చూ॥

**మెస్సీయ** (Messiah = అభిషిక్తుఁడు). క్రీస్తు అను గ్రీకు పదముయొక్క హెబ్రీ రూపము. ఈ పదము దాని $9^{25,26}$ యోహా $1^{41}$ $4^{25}$ లలో అగుపడును. అభిషిక్తుఁడనుమాట యాజకులకును లేవీయులకును (లేవీ $4^{3,5}$ $6^{22}$) రాజులకును (I సమూ $2^{10}$ $12^{3}$ $24^{6}$ II సమూ $1^{14,16}$ కీర్త $2^{2}$ $18^{50}$ $89^{20}$) వాడఁబడినది. దేవుఁడు అన్యజనుల రాజగు కోరెషుకును అభిషిక్తుఁడనుపేరు పెట్టెను (యెష $45^{1}$). యేసుక్రీస్తు జననకాలము నందు యూదులందఱును దేవుని అభిషిక్తుని యొక్క పుట్టుకనిమిత్తము ఎదురు చూచుచుండిరి (లూ $2^{25,26}$). ఈ నిరీక్షణకు ప్రవక్తల లేఖనములే యాధారములు ($24^{25-27}$). దేవుఁడు అబ్రాహాముతో నీయందు భూమియొక్క సమస్త వంశ

ములు ఆశీర్వదింపఁబడునని వాగ్దానము చేసెను (ఆది $12^{1-3}$). ఈ వాగ్దానము ఒక నిబంధనరూపమై యుండెను ($17^{1-8}$). అబ్రాహాముయొక్క వంశస్థులు దీనిని తరుచుగా మఱచిపోయి తమ్ము నేర్పరచుకొనిన వానికి అపనమ్మకముగా నుండినను వారిలో భక్తులైనవారు ఈ నిబంధనను ఎల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొనిరి. దావీదు యెరూషలేమునందు సింహాసన మెక్కినప్పుడు అతని సంతతివారు నిరంతరము దానిమీఁద ఆసీనులగుదురని అతనితో నిబంధనపూర్వకమగు వాగ్దానము జేసెను (II సమూ $7^{5,17}$ I రాజు $11^{36}$). ఈ రెండు వాగ్దానములనుబట్టి ఇశ్రాయేలీయులు నిరంతరముందురనియు, దావీదుయొక్క సింహాసనము తరతరములవఱకు నిలిచియుండుననియు స్పష్టమగుచున్నది (కీర్త $2^{2}$ $18^{5}$ $84^{9}$ $89^{38,51}$ $132^{10,17}$ విలా $4^{20}$ హబ $3^{13}$). అయితే కాలక్రమేణ దేవుఁడేర్పఱచుకొనిన జనులు ఆయనయందు విశ్వాసముంచకపోయినందున వారి అవిశ్వాసమునుబట్టి వారిని చెఱలోకి పంపెదనని ఆయన హెచ్చరించవలసి వచ్చెను. ఇశ్రాయేలీయులందఱును ఆయనను తిరస్కరించరుగాని ఒక శేషము ఆయనయందు విశ్వాసముంచును. ఆయన వారిని చెఱలోనుండి తిరిగి తీసికొనివచ్చి వారితో మఱియొక క్రొత్త నిబంధనచేసికొని నీతిమీఁద పునాది వేయఁబడిన యొక క్రొత్త రాజ్యమును స్థాపించును (యిర్మీ $23^{5,6}$ మీకా $5^{2,5}$ యెష $9^{6}$ దాని $9^{25,26}$). ఈ క్రొత్త నిబంధనకు విధేయులైన వారి మూలముగా భూమిమీఁద నుండు సమస్త జనములు ఆయననుగూర్చి తెలిసికొని ఆయనను ఆరాధింతురు. భూలోకమంతటిలోను యెరూషలేము దేవునికి ముఖ్యపీఠముగా నుండును. మన ప్రభువు కాలమునందుండిన యూదులు ఈ వాగ్దానమును సరిగా గ్రహించుకొనక తాము భూలోకమంతటిని ఇనుప దండముతో నేలుదుమని భావించిరి. దావీదు రాజు జన్మస్థానమందు పుట్టు అభిషిక్తుఁడగు నొకఁడు దావీదు సింహాసనముమీఁద నాసీనుఁడు కావలసి యుండెను (మీకా $5^{2-4}$). ఆమోసు హోషేయ మీకా యెషయా యిర్మీయా యెహెజ్కేలు అను ప్రవక్తలందఱును యూదులు పలెస్తీనుకు తిరిగి వచ్చెదరనియు దావీదు వంశజుఁడొకఁడు వారి నేలుననియు ముందుగానే చెప్పియుండిరి. యూదులను దేవుఁడు చెఱనుండి రప్పించి సమకూర్చిన పిదప వారిని తానే నడిపెదననియు వారికి ఖ్యాతిని మంచి పేరును కలుగఁజేతుననియు వాగ్దానము చేసెను (జెఫ $3^{20}$). వారు చెఱలోనుండి తిరిగి వచ్చిన తరువాత హగ్గయి ఈ సంగతిని వారికి జ్ఞప్తిచేసి వారు కట్టుచుండిన దేవాలయము మొదటిదానికన్న మహిమగలదిగాఁ జేతునని తెలిపెను (హగ్గ $2^{6-9}$). ఆ రాజు జయోత్సవముతో యెరూషలేమునందు • ప్రవేశించుటనుగూర్చి జెకర్యా ప్రవచించెను (జెక $9^{9,10}$). మలాకీ తన కాలమందున్న అక్రమములను గద్దించి యెహోవాయే తన యాలయమునకు వచ్చి తన జనులను పరిశోధించి వారిని నిర్మూలము చేయునని తెలియఁజేసెను (మలా $3^{1-3}$). మెస్సీయ రాజరికమునుగూర్చిగాక, ఆయన సేవకత్వమునుగూర్చి యెషయా తెలిపెను (యెష 40-66). 40-49 అధ్యాయములలో దేవుఁడు ఇశ్రాయేలీయులను తన సేవకుఁడని పిలుచుచున్నాఁడు. ఆయన ఇశ్రాయేలీయులద్వారా తనను లోకమునకు తెలియపఱచుకొనవలెనని యుండెను. $42^{1-7}$ $52^{12}$-53 లందు తన స్వకీయులవలన తృణీకరింపఁబడి చంపఁబడిన వాఁడే యెహోవా సేవకుఁడని యున్నది. ఆయన మరణముద్వారా నూతన జీవము కలుగును. ఈ ప్రవచనములు యేసుక్రీస్తునందు మాత్రమే నెఱవేఱినవి (లూ $24^{27}$ కార్య $8^{30-35}$ I పేతు $1^{10-12}$). శిష్యులు దానిని గ్రహించుకొనిరి (యేసుక్రీస్తు VI 3 (*i*) (*b*), దేవుని రాజ్యము I చూ॥)

J. C.

**మెహీదా** (**Mehida** = సంగమము). జెరుబ్బాబెలుతోకూడ తిరిగివచ్చిన నెతీనీయుల కుటుంబములలో నొకదానికి మూలపురుషుఁడు (ఎజ్రా $2^{52}$ = నెహె $7^{54}$).

**మెహీరు** (**Mehir** = ఖరీదు). యూదా వారిలో నొకఁడు. ఇతని సంతతివారు ఎష్తోను వారు అనఁబడిరి (I దిన $4^{11}$).

**మెహూనీయులు** మాయోను చూ॥

**మెహూమాను** (**Mehuman**). చక్రవర్తి యగు అహష్వేరోషు నెదుట ఉపచారముచేసిన ఏడుగురు షండులలో నొకఁడు (ఎస్తే $1^{11}$).

**మెహేతబేలు** (Mehetabel = దేవుఁడు ఆశీర్వదించును).

1. నెహెమ్యాను శోధించుటకు పంపఁబడిన షెమెయా యొక్క తాత (నెహె $6^{10}$).

2. ఎదోమురాజైన హదదుయొక్క భార్య (ఆది $36^{39}$ I దిన $1^{51}$).

**మెహోలతీయుడు** (Meholathite). సౌలు అల్లుఁడగు అద్రీయేలు బిరుదు (I సమూ $18^{19}$). అతఁడు మెహోలా యను నూరివాఁడగుటచే ఈ బిరుదు వచ్చినట్లుగా నున్నది. అది ఆబేల్మెహోలా యను ఊరుకావచ్చును (అబేల్మెహోలా చూ॥).

## మే

**మేక, అడవిమేక, కారుమేక, కొండమేక, మేకపిల్ల, మేకపోతు** (Goat, Wild Goat, Satyr, Hegoat).

1. పెంపుడు మేఁకలు పలెస్తీను దేశములో విస్తారముగ నున్నవి. వీటికి పాత నిబంధన యందు ఆరు హెబ్రీ పదములును, క్రొత్త నిబంధనయందు రెండు గ్రీకు పదములును గలవు. బైబిలునందు మేఁకలను చరాస్తిలో నొక ముఖ్య సంపదగా నెంచిరి (ఆది $30^{33,35}$ $32^{14}$ I సమూ $25^{2}$ మొ॥). గొల్లవారు మేఁకలను గొఱ్ఱెలను ఒకటే మందయందుంచి మేపిరి. (ఆది $30^{32}$). వాటిని వేరుచేయుట, లోకాంతమున మనుష్యులను వేరుచేయుటకు దృష్టాంతముగా క్రీస్తు ఉపయోగించెను (మ $25^{32,33}$). మేఁకలను ఇప్పటివలె పాలకొఱకును పెంచిరి (సామె $27^{27}$). వాటి మాంసమును తినిరి (ఆది $27^{9}$ న్యాయా $6^{19}$ $13^{15}$ మొ॥). వాటి వెండ్రుకలతో కంబళ్లు నేసిరి (నిర్గ $25^{4}$ $35^{26}$ మొ॥). అతి దరిద్రులు వీటిచర్మమును వస్త్రములుగా ధరించిరి (హెబ్రీ $11^{37}$). యజ్ఞములందు వీటి వధించిరి. అవి పాపపరిహారార్థ బలిగాను హోమార్పణముగాను అర్పింపఁబడెను (ఆది $15^{9}$ నిర్గ $12^{5}$ లేవీ $1^{10}$ $4^{24}$ సంఖ్యా $7^{17}$ ఎజ్రా $6^{17}$ హెబ్రీ $79^{9,13}$ అజాజేలు చూ॥).

2. అడవిమేఁకలును పలెస్తీనునందు గలవు. కొండప్రదేశమున నివసించుటచే దీనిని సూచించు పదమును కొండమేఁక యని తెనిగించి (కీర్త $104^{18}$ యోబు $39^{1}$). ద్వితీ $14^{5}$ లో నుండు కారుమేఁక అసలులో వేరు పదమైనను దీనినే సూచించు నట్లున్నది. ఇది అడవిలో నివసించును గాన అది



మేక

యుండు స్థలము పాడు స్థలమని యర్థమగును (యెష $13^{21}$ $34^{14}$).

3. అలంకార రీతిగా దాని $8^{5}$ లో మేఁకపోతు బలాఢ్యుఁడైన రాజును సూచించును. అతఁడు మహా అలెక్సందరు అని సాధారణముగా నంగీకరింతురు (అలెక్సందరు 1 చూ). లేవీ $17^{17}$ II దిన $11^{15}$ లోని దయ్యము లనుమాటకు అసలు పదము మేఁకలు అనునదైయుండి మేఁక రూపముగానున్న విగ్రహమునుగాని, అడవిమేఁకలవలె అడవిలో నివసించు దయ్యమునుగాని సూచించును (దయ్యములు చూ॥).

**మేఘము** (Cloud). బైబిలునందు మేఘములను పదము ఈ దిగువనున్నట్లు అలంకార రీతిగా నుపయోగింపఁబడెను.

1. మన దేశములోనున్న రీతిగనే మేఘములు అస్థిరతను (హోషే $6^{4}$), కష్టములను (విలా $2^{1}$ ప్రస $12^{2}$), ఎత్తైనవాటిని (యోబు $20^{6}$), గొప్ప సముదాయమును (హెబ్రీ $12^{1}$), గుప్తమగు వాటిని (యోబు $36^{29}$ $39^{16}$ $38^{36}$) సూచించెను. 2. కాంతిగల మేఘము దేవుని ప్రత్యక్షతకు విశేష సూచనగా నున్నది. ఇది దేవుని ప్రత్యక్షతనే గాక ఆయన అగోచరుఁడనియు అర్థమిచ్చును (కీర్త $97^{2}$ మహిమ చూ॥). 3. మేఘములు దేవుని వాహనములై యున్నట్లు సూచనలున్నవి (యెష $19^{1}$). కీర్త $18^{10}$ లో మేఘములను ప్రతిగా కెరూబులు వాహనములుగా నుండుటచే అవి

మేఘములవంటివని కొందరు అనుకొందురు. మెస్సీయ మేఘములమీఁద నెక్కివచ్చునను అలంకారము ఆ రీతిగానే యున్నది (దాని 7[13] మ 26[64] మా 14[62] ప్రక 1[7]). మెస్సీయ సింహాసనము తెల్లని మేఘమైయున్నది (14[14]). అంత్యదినమున భక్తులు క్రీస్తు నెదుర్కొనుటకు మేఘములమీఁద కొంచుపోఁబడుదురు (I థెస్స 4[17]).

**మేఘములను చూచువారు** (Soothsayers). రాఁబోవు సంగతులను గాని దూరస్థలములందు జరుగు సంగతులనుగాని వేఱు విధముగాఁ దెలిసికొనలేక పోయినప్పుడు మేఘములను గమనించి వాటి లక్షణముల ద్వారా, అవి వెళ్లు మార్గముద్వారా కనుగొని చెప్పుట ఒక విధమైన మంత్రవిద్యయై యుండెను. ఇట్లు అదృష్ట దురాదృష్టములను కనుగొనవచ్చునని జనులు నమ్మెడివారు (మీకా 5[12]). B.

**మేజాహాబు** (Mezahab = బంగారు నీరు). ఎదోము రాజైన హదరు భార్యయగు మెహేతబేలు యొక్క తాత పేరు (ఆది 36[39] I దిన 1[30]). ఇది యొక ప్రదేశపు పేరును కావచ్చును (దీజాహాబు చూ.).

**మేడగది** (Upper Storey). పలెస్తీనులోని యిండ్లు సాధారణముగా నొక యంతస్తు మాత్రమే గలవైయుండును గాని స్థితివంతులు మేడలను కట్టించుకొనిరి (న్యాయా 3[20] II రాజు 1[2]). ఎలీషా కొఱకు షూనమ్మీయురాలు కట్టించినది ఈ దేశమందనేకులు కట్టించుకొను గది వంటిదై యున్నది (II రాజు 4[10]). గ్రీకువారు రెంటి కక్కువైన అంతస్తులు గల గృహములను కట్టించుకొనినట్లున్నది (కార్య 20[9]). క్రీస్తు తన శిష్యులతో కలిసి చివరి పస్కాను భుజించిన మేడగదినిగూర్చి యెరూషలేము B VII 2 చూ॥

**మేడిచెట్టు** (Sycamore Tree). పలెస్తీను దేశమునందీ చెట్లను నీడకొఱకు దారుల ప్రక్కలందు తరుచుగా నాటిరి. దీని కొమ్మలు విశాలముగా వ్యాపించును గనుకనే దారిని వెళ్లుచుండిన యేసును చూడఁగోరిన జక్కయ్యకు అట్టి చెట్టు మీఁదికెక్కి కోరికను దీర్చుకొనుటకు వీలుగ నుండెను (లూకా 19[4]). ఈ చెట్లు పూర్వము పలెస్తీనుయొక్క అన్ని భాగములలోను పెరిగెడివి (I రాజు 10[27] II దిన 1[15] 9[27] కీర్త 78[47]). మూల భాషయందు ఈ చెట్టుకు వాడిన పదమునే I దిన 27[28] లో బొడ్డచెట్టనియు యెష 9[10] లో రావి కఱ్ఱ యనియు తెనిఁగించిరి. ఐగుప్తు దేశమునందీ చెట్టు పలకలను సమాధిపెట్టెల కుపయోగించిరి. యూదయ దేశమునందు ఆమోసు ప్రవక్త గొఱ్ఱెలను కాయుచు ఈ చెట్ల పండ్లను సమకూర్చెను (ఆమో 7[14]).

J. C.

**మేదాదు** (Medad = ప్రేమ). ప్రవచించుటకు శక్తిని పొందిన పెద్దలలో నొకఁడు (సంఖ్యా 11[26,27] ఎల్దాదు చూ.).

**మేదెబా** (Medeba = శాంతజలములు). యొర్దాను నదికి తూర్పు ప్రదేశములోనుండు నొక పట్టణము. అది హెష్బోను అను పట్టణమునకు దక్షిణముగా 6 మైళ్ల దూరమున యొర్దాను మృతసముద్రములో పాఱునట్టి స్థలమునకు దక్షిణమున 16 మైళ్లు తూర్పుగా ప్రస్తుతముండు మదాబా (*Madaba*) అను స్థలమైయున్నది. రాజైన సీహోను దానిని మోయాబీయుల యొద్దనుండి యపహరించెను. తరువాత ఇశ్రాయేలీయులు దానిని జయించి (సంఖ్యా 21[24-26]) రూబేనీయులకు నిచ్చిరి (యెహో 13[9-16]). దావీదు కాలములో అమ్మోనీయులకు సహాయము చేయుటకై సిరియవారువచ్చి ఈ మేదెబాలో తమ దండును వేసిరి (I దిన 19[6-15]). కావున అది యీ కాలములో వారి స్వాధీనమున నుండెనని తెలిసికొనవచ్చును. ఆ యుద్ధములో దావీదు దానిని తన స్వాధీనము చేసికొనెను. బైబిలులో నున్నదానినే గాక, మోయాబీయుల రాతిశాసనములను చూడఁగా, మేదెబా మఱల మోయాబీయుల వశమై ఇశ్రాయేలు రాజగు ఒమ్రీచే వారియొద్దనుండి యపహరింపఁబడినట్లును, అటు వెనుక మఱల మోయాబు రాజగు మేషా యిశ్రాయేలీయుల యొద్దనుండి దాని నపహరించెననియు తెలిసికొనఁ గలము (రాతి శాసనములను చూ॥). ఇశ్రాయేలు రాజైన యెహోరామును యూదా రాజగు యెహోషాపాతును ఈ పట్టణములను పట్టుకొనుటకు మఱల ప్రయత్నముచేసిరి గాని వారివలనఁ గాకపోయెను (II రాజు 3). ఇశ్రాయేలు రాజైన రెండవ యరొబాము వారిని

మోయాబీయులను అందులోనుండి వెళ్లఁగొట్టెను ($14^{25}$). యెషయా కాలమునందు మేదెబా మఱల మోయాబీయుల వశమయ్యెను (యెష $15^{2}$). యిర్మీ $48^{2}$ లోని మద్మేనాయును ఈ మేదెబాయును ఒక్కటేయైన యెడల అది యిర్మీయా కాలమువఱకు వారి యాధీనములో నుండినట్లు ఆ వాక్యమువలనఁ దెలియును. మక్కబేయుల కాలమునందు ఈ మేదెబా మక్కబేయుల నెదిరించిన కోటలలో నొక ముఖ్యమైన కోటయై యుండెను (I మక్క $9^{36-42}$). క్రీ॥ శ॥ లో తురకవారు ఆ దేశములన్నిఁటిని జయింపక మునుపు మేదెబాలో నొక ఓషపు ఉండెనని సంఘ చరిత్ర వలనఁ దెలియును. 1880 సం॥లో అచట త్రవ్విచూడఁగా ఒక క్రైస్తవాలయముయొక్క చక్కని పాదుశేషములు దొరికెను. వాటిలో నొకటి రాళ్లతో బహు చిత్రముగా చేయఁబడిన పలెస్తీను పటమై యున్నది (పటము II, J 1).

**మేఫాతు** (Mephaath = సౌందర్యము). రూబేనీయుల స్వాస్థ్యములోనుండి లేవీయుల కియ్యఁబడిన (యెహో $13^{18}$) పట్టణములలో నొకటి ($21^{37}$ I దిన $6^{79}$). యిర్మీయా కాలములో ఇది మఱల మోయాబీయుల వశమయ్యెను (యిర్మీ $48^{21}$). అది మోయాబీయుల ప్రదేశములో నున్నదిగాని దాని యునికినిగూర్చి మఱి నూటిగా తెలియదు.

**మేమ్** (Mem = מ అను అక్షరము). హెబ్రీ యక్షరములలో పదమూఁడవది. అక్షర మాలికా గీతమగు 119 వ కీర్తనలో 13 వ భాగమునకు ఈ పేరు కలదు. ఆ భాగములోని ప్రతి పంక్తియు ఈ యక్షరముతోనే యారంభమగును.

**మేయర్కోను** (Majarkaon = పచ్చని నీరు). దాను గోత్రికుల స్వాస్థ్యములో నున్న యొక స్థలము (యెహో $19^{46}$). అది యొప్పేకు ఉత్తరముగా రెండు క్రోసుల దూరములో నున్నట్టియు, పచ్చని నీరు గలిగినట్టియు ఔజా (*Aujah*) యను నది దగ్గఱనుండు నొక స్థలమని కొందఱూహింతురు గాని దాని యునికినిగూర్చి నూటిగా తెలియదు.

**మేయాగోపురము** యెరూషలేము B V 2 (2) చూ॥

**మేరబు** (Merab = వృద్ధి). సౌలుయొక్క పెద్దకుమార్తె (I సమూ $14^{49}$). సౌలు ఈమెను దావీదున కిత్తునని మాటనిచ్చినను తన మాట తప్పి ఈమెను అద్రీయేలున కిచ్చెను ($18^{18-19}$). ఈమెయొక్క ఐదుగురు కొడుకులను చంపఁబడుటకై దావీదు వారిని గిబియోనీయులకు అప్పగించెను (II సమూ $21^{8}$). అసలు భాషలో ఈ వాక్యమునందు మేరబు అను పేరుకు బదులు మీకాలు అను పేరు గలదు. అది వ్రాఁతలోవచ్చిన పొరబాటు.

**మేరా** (Merah = గుహ). సీదోనీయుల ప్రదేశములో నున్నట్టియు, యెహోషువ కాలములో జయింపఁబడనట్టియు స్థలములలో నొకటి (యెహో $13^{4}$). అది సీదోనుకు తూర్పుగా లెబానోను ప్రాంతములలో నున్నదిగాని దాని యునికినిగూర్చి మఱి నూటిగా తెలియదు.

**మేరోజు** (Meroz = ఆశ్రయ స్థానము). దెబోరా కాలములో సీసెరాకు విరోధముగా పోరాడుటకై రాని యూళ్లలో నొకటి (న్యాయా $5^{23}$). ఈ యూరివారు సీసెరా పారిపోవుచుండఁగా నతనికి సహాయముచేయుటచే వారీ శాపమునకు లోనైరని కొందఱనుకొందురు. ప్రస్తుతమున బేత్షెయానుకు వాయవ్యదిక్కున నుండు ఎల్ మురుస్సస్ (*El Murussus*) దాని యునికియై యున్నదని సాధారణముగా ననుకొందురు.

**మేరోనోతీయుడు** (Meronothite = మేరోనోతువాఁడు). ఈ బిరుదు యెహెద్యాహు (I దిన $27^{30}$) యాదోను (నెహె $3^{7}$) అను నిద్దఱికిఁ గలదు. వీరు మేరోనోతు అను ఊరివారగుటచే ఈ బిరుదు వీరికిఁ గలిగెననుటకు ఏ సంశయమును లేదుగాని ఆ యూరినిగూర్చి యీ వాక్యములలో తప్ప మఱి యెచ్చటను సూచనలు లేవు. అది గిబియోను దగ్గఱ నున్నదని యూహింతురు.

**మేరోము నీళ్ళు, మేరోము నది** (Waters of Merom = ఎత్తయిన స్థలము). పలెస్తీనుకు ఉత్తర భాగమందున్న కనానీయులను

యెహోషువ జయించిన స్థలము (యెహో $11^{5,7}$). సాధారణముగా ఇది మేరోము సరస్సునకు పేరని యనుకొందురు. ఇది గలిలయ సముద్రమున కుత్తరముగా 11 మైళ్ల దూరములో నున్నది. అది 4 మైళ్ల పొడవును 3½ మైళ్ల వెడల్పును గల సరస్సు. దానికి ప్రస్తుతమున హూలే (*Huleh*) యను పేరు పెట్టుదురు. సాధారణముగా అదే స్థలము మేరోము నీళ్లచే సూచింపఁబడునని కొందరు అనుకొనినను మఱికొందఱది యీ స్థలము కాదు గాని వేఱొకటి యని యనుకొందురు. అది మేరోము సరస్సు అయినయెడల దానికి మేరోము సముద్రము అను పేరును పెట్టుదురు గాని మేరోమునీళ్లు అను పేరు పెట్టరని అట్టివారు వాదింతురు. మఱియు ఆ మేరోము సరస్సునకు సమీపమున నుండు ప్రదేశము యెహోషువ గ్రంథములోనుండు యుద్ధరంగమునకు సరిపడదని కూడ అట్టివారు వాదింతురు. అయితే ఈ యుద్ధము మేరోము సరస్సు తీరముననగాక దానికి పశ్చిమముగా నుండు స్థలములో జరిగెననుటచే అట్టివారికి సమాధానము చెప్పవచ్చును (పటము I, F 4).

మేషా (Mesha). మూలభాషయందు ఈ పదము గుణితము రెండు విధములుగా నున్నది. ఈ దిగువనున్న మొదటి రెండు పదములలో తిరిగి పోవుట యనియు, చివరి రెండు పదములలో రక్షణయనియు అర్థమిచ్చును.

1. యొక్తాను సంతతివారి దేశపు సరిహద్దులలో నొకటి (ఆది $10^{30}$). దాని యునికిని గూర్చి నూటిగా తెలియదుగాని అది యరబ్బీ దేశములో నున్నదని సాధారణముగా ననుకొందురు.

2. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{9}$).

3. కాలేబుయొక్క జ్యేష్ఠ పుత్త్రుఁడు (I దిన $2^{42}$).

4. క్రీ॥ పూ॥ 9-వ శతాబ్దములో జీవించిన మోయాబీయుల రాజులలో నొకఁడు (II రాజు $3^{4-27}$). ఈ రాజునుగూర్చిన చరిత్ర సంగతులు బైబిలులో మాత్రమే కాక, మోయాబు రాతి శాసనము (*Moabite Stone*) అను దానియందలి చరిత్రలోకూడ కనఁబడును. ఈ రెండింటిని చూడఁగా నితని సంగతి యీ దిగువరీతిగా నున్నట్లు తెలిసికొనఁగలము. మొదట ఇశ్రాయేలీయుల రాజగు ఒమ్రీ మోయాబు నోడించెను. తరువాతి కొన్ని సంవత్సరములదాక మోయాబు ఇశ్రాయేలీయులకు లోఁబడి యుండెను. అటు పిమ్మట ఒమ్రీ కుమారుని కాలములో మేషా యిశ్రాయేలీయుల నోడించి తన దేశమును విడిపించుకొని ఆ దేశమునుండి యిశ్రాయేలీయులను వెళ్లఁగొట్టెను. ఇంతవఱకు ఈ రాజును గూర్చిన సంగతులు మోయాబీయుల రాతిశాసనములవలనఁ దెలియును. దీనికి మించిన సంగతులు II రాజు 3 వలనఁ దెలియును. అహాబునకు పిమ్మట రాజైన యెహోరాము తిరుగఁబడిన మేషాను మఱల లోఁబఱచుకొనుటకై మోయాబుపై దండెత్తి యుద్ధముచేయఁగా యూదారాజైన యెహోషాపాతును ఎదోము రాజును అతనికి సహాయము చేసిరి. బయలులో చేసిన యుద్ధములో వారు అద్భుతరీతిగా గెలిచినందున మోయాబీయులు ప్రాకారములుగల యొక కోటలోఁ జేరిరి. అచట మోయాబు రాజు వారి యెదుట మూర్ఖముగా తన జ్యేష్ఠకుమారుని బలినర్పించినందున యెహోరామునకు సహాయపడిన యూదావారును ఎదోమువారును చాలించుకొని తిరిగి వెళ్లిరి. అందువలన యెహోరాముకూడ యుద్ధము చేయుట మాని తిరిగి వెళ్లవలసివచ్చెను. ఈ రాతి శాసనములో నున్నదానికిని రాజుల గ్రంథములో నుండు దానికిని ఒక్క విషయములో మాత్రము వ్యత్యాసమున్నట్లుగా కనఁబడును. ఒమ్రీ కుమారుని కాలములో మేషా యిశ్రాయేలీయుల నోడించినట్లు శాసనములో నున్నది. రాజుల గ్రంథము చూడఁగా మేషా ఒమ్రీ కొమరుఁడగు అహాబు కాలములోఁ గాక అతని మనుమఁడగు యెహోరాము కాలములో ఆ తిరుగుబాటు జరిగినట్లుగా నున్నది. దీని నైక్యపఱచుటకు అహాబు ప్రభుత్వకాలమునందు మేషా తిరుగుబాటు చేయఁగా ఆ సంగతి మోయాబును మఱల లోఁబఱచుటకై యత్నముచేసిన యెహోరాము చరిత్రకు సంబంధముగా ఆ తిరుగుబాటు కూడ రాజుల గ్రంథములో వ్రాయఁబడినట్లుగా నున్నది లేదా, రాతి శాసనము మీఁదనుండు ఒమ్రీ కొడుకు అను మాటలు అతని మనుమఁడగు

యెహోరామునకు కూడ చెందవచ్చును. అట్లయిన యెడల నేమియు వ్యత్యాసములేక పూర్ణయైక్య ముండును. (రాతి శాసనములు I చూ॥).

**మేషాకు (Meshach).** బబులోను రాజైన నెబుకద్నెజరు నగరులో పెంచఁబడిన యూదా గోత్రీకులగు దానియేలు సహచరులలో మిషా యేలుకు నపుంసకుల యధిపతి పెట్టినపేరు (దాని 1[1-7]). ఇతఁడును తన స్నేహితులతోఁ గలిసి రాజభోజనమునకు ప్రతిగా శాక ధాన్యాదుల నడిగి పుచ్చుకొని చివరకు అందరికన్న ఆరోగ్య వంతులనియు తెలివిగలవారనియు పేరు నొందిన వారిలో నొకఁడయ్యెను (1[8-20]). రాజు నిలిపిన విగ్రహమునకు మ్రొక్కనందున అగ్నిగుండమున పడఁద్రోయఁబడియు దేవుని కృపచే రక్షింపఁ బడెను. రాజు ఇతనిని ఇతని స్నేహితులను మిగుల ఘనపఱచెను (3[1-30]). W.

# మై

**మైదానమందున్న పట్టణములు (Cities of the Plain).** సొదొమ గొమొఱ్ఱా అద్మా సెబోయిము బెలా లేక సోయరు అను ఐదు పట్టణములకు పెట్టబఁడిన పేరు. ఇవి యొర్దాను మైదానమం దుండెను. వీటి నివాసులు మిగుల దుష్టులైనందున మొదటి నాలుగు పట్టణములు అగ్నిచే నాశనమయ్యెను. అబ్రాహాము సహోదరుని కుమారుఁడగు లోతు ఆ పట్టణము నాశనము కాకముందే అతఁడు దానిని విడిచిపెట్టవలెనని దేవుఁడు తెలియఁజేసెను. లోతు దూతలచే కాపాడఁబడి సోయరుకు పారిపోయెను (ఆది 19[23]).

ఈ ఐదు పట్టణములును మృతసముద్రమునకు ఉత్తర ప్రాంతములలో నున్నవి. ఈ పట్టణముల నాశనమునుగూర్చి బైబిలునం దుదాహరించిన సంగతు లీ యభిప్రాయమునకు నూటిగా సరి పడును. I ద్వితీ 34[3] నందున్నట్లు యొర్దాను మైదానమును రెరికో లోయచుట్టు మైదానమని పిలుచుట యొర్దాను మృతసముద్రములో పడు చోటి చుట్టునున్న ప్రదేశమునకు చక్కగా సరిపడును. 2. దానిని బేతేలునుండి చూడ వచ్చును (ఆది 13[3-10]). 3. ఆ పట్టణములు హాససోన్తామారు కుత్తరమం దున్నవి. అందు చేత అమ్రాపేలును అతనితోటివారును సొదొమ రాజు మీఁదికి దండెత్తి పోవునప్పుడు ఈ స్థలము మీఁదుగా వెళ్లిరి (14[7-8]) గాని; ఈ పట్టణములకు కలిగిన విపత్తు స్థితినిబట్టి మఱికొంద ఱీ పట్టణములు దక్షిణమందే యుండె ననుచున్నారు. మృత సముద్రమునకు దక్షిణమందే కనఁబడు మట్టి తైలము మెరుపువలన ముట్టుకొని విస్తారమగు పెనుమంట లెగయుటకు వీలుగానుండె ననియు, అందువలననే ఈ పట్టణములు నాశనమాయె ననియు ఎంతురు. H.

**మైదానము (Plain).** ఈ పదముచే తెనిఁగింపఁబడిన హెబ్రీ పదములు పాఁత నిబంధనయందు అనేకములు గలవు. వాటిలో ముఖ్యములైన మూఁటినిగూర్చి మాత్రమీ దిగువ వివరింతుము.

1. షెఫేలా అను పదమునకు పల్లపుభూమి యని అర్థము. పలెస్తీను దక్షిణ జిల్లాలలో కొన్నియు, మధ్య పలెస్తీనులో కొంత భాగమును, తూర్పువనుండు పర్వతభూమికిని మధ్యధరా సముద్రమునకు మధ్యనుండు పల్లపుప్రదేశమునకు ఈ పేరు పెట్టఁబడియున్నది. యెహో 15[33-47] నందున్న యూదాలోని నలుబదిరెండు పట్టణము లును వాటి పల్లెలతోకూడ దీని సరిహద్దులలో నున్నట్లు చెప్పఁబడెను. వీటిలోఁ గొన్ని ఫిలిష్తీయుల దేశమని యున్నది (షెఫేలా చూ॥). 2. కిక్కారు అను పదమునకు వలయము అని యర్థము. దీనిని యొర్దాను మైదానమునకు ఉత్తర మందున్న సుక్కోతు మొదలుకొని దక్షిణమందు సొదొమ గొమొఱ్ఱావఱకున్న దేశమున కుపయోగించిరి (ఆది 13[10,11,12] 19[17,28] ద్వితీ 34[3] II సమూ 19[23] II దిన 4[17]). గలిలయ సముద్ర తీరము వఱకున్న లోయ దీనిలోఁ జేరియుండును (యుద్ధ 4,8,2) 3. అరాబా యను పదమునకు మైదానమని యర్థము గాని ఈ పదమును తెనిఁగించక అట్లే ఉంచిరి (ద్వితీ 1[8] 3[17] అరాబా చూ॥). H.

**మైమఱువు** ఆయుధములు II 3 చూ॥

**మైలు** మానములు I 2 చూ॥

# మొ

**మొగ్గ (Knob).** గుడారమందుండిన దీప వృక్షమునకు గల ఒక విధమైన అలంకారమును సూచించు పదము (నిర్గ 25[31,33,34,35,36] 37[17,19,20,21,22]). ఇది దానిమ్మపండువంటి ఆకారమని యోసీఫసు వ్రాసెను (పురా 3.6.7) అది పువ్వు కాదుగాని పువ్వుయొక్క కాడయని కొందరందురు. ఈ మాటచే తెనిగింపబడిన మూల భాషాపదము ఆమో 9[1] జెఫ 2[14] లో అట్టి అలంకారములను గాక తలుపు పైకమ్ములను సూచించును కావున అట్లు చెప్పుట సరియైయుండును.

**మొదటి గుమ్మము** యెరూషలేము BV 2 (5) చూ॥

**మొర్దెకై (Mordecai = కొద్దిపాటి మనుష్యుడు, అంగారకుని ఆరాధించువాడు).**

రాణియైన ఎస్తేరు సంరక్షకుడు (ఎస్తే 2[5,6]) యాయీరు అను వాని కుమారుడు. క్రీ॥ ము॥ 599 సం॥ యెహోయాకీనుతో కూడ బబులోనుకు ఖైదీగా కొనిపోబడిన కీషు అనునొక బెన్యామీనీయుని మునిమనుమడు ఇతని చరిత్ర ఎస్తేరు గ్రంథమందున్నది (ఎస్తేరు, హామాను చూ॥).

2. జెరుబ్బాబెలుతో కూడ తిరిగివచ్చిన వారిలో నొక సుప్రసిద్ధపురుషుడు (ఎజ్రా 2[2] నెహె 7[7]). H.

**మొలచిన చోటనే విస్తరించిన చెట్టు (Green Bay Tree).** కీర్తనల గ్రంథమునందుదాహరింపబడిన యొకానొక చెట్టు (కీర్త 37[35]). జన్మభూమియందు పచ్చని చెట్టు అని యుండవలయును. విస్తరించిన అను పదమునకు బదులు పెరిగిన అని యుండుట యుక్తము. J. C.

**మొలత్రాడు** దట్టీ చూ॥

**మొలీదు (Molid = కన్నవాడు).** యూదా వారిలోని యెరహ్మెయేలు కుటుంబములో నుండు వారియందొకడు (I దిన 2[29]).

**మొలెకు (Molech, Moloch = రాజు).** అమ్మోనీయుల జనాంగపుదేవతయైనట్లు పాతనిబంధనయందు కనబడుచున్నది. మోలోకు, మొలెకు, మిల్కోము, మల్కాము అను పదములన్నియు ఒక విగ్రహమునే సూచించును. ఇది ఇశ్రాయేలీయులలోకి ఎప్పుడు ప్రవేశపెట్టబడెనో సరిగా తెలియదుగాని సొలొమోను ఏలుబడికి ముందయి యుండును. సొలొమోను ఒలీవల పర్వతముమీద మొలెకునకొక ఉన్నత స్థలమును నిర్మించెను (I రాజు 11[7]). అప్పటినుండి ఆ దేవతపూజ ఆ స్థలమునందో లేక హిన్నోము లోయలోని తోఫెతునందో, యోషీయా ఆ రెండు స్థలములను అపవిత్రపరచువరకు ఎడతెగక జరిగెను (II రాజు 23[10,13]). అయితే ఈ పూజ యెహోయాహాజు, యెహోయాకీము, యెహోయాకీను, సిద్కియా అను రాజుల కాలమందు తిరిగి ఉన్నతస్థితికి తేబడెను.



మొలెకు

ఈ విగ్రహమును ఇత్తడితోచేసి ఇత్తడి సింహాసనముమీద కూర్చుండబెట్టిరి. దానికి దూడతలయు తలమీద కిరీటమునుండెను. దాని ఆసనమును ప్రతిమను బోలుగాచేసి లోపల నిప్పుతో తీక్షమైన మంటబెట్టినందున మంటలు విగ్రహముయొక్క అన్ని భాగములకు చేరుటచేత అదంతయు నిప్పువలె యెర్రగా నుండువవి. అట్లు దానిచేతులు బాగుగా కాలినప్పుడు ఆ దేవతకు బలినిచ్చు బిడ్డలను వాటియందుంచువారు ఆ బిడ్డలు తక్షణమే కాలి చచ్చువారు. వారి

చావుకేకలు వినఁబడకుండునట్లు వాయిద్యములు వాయించెడివారు.

**మొనేరోతు** మోసేరు చూ॥

# మో

**మోకాలు, మోకాళ్లూనుట, మోకరించుట (Knee, Kneel).** గొప్ప దిగులు వలన మోకాళ్లువణికి బలహీనము లగుననుట అందఱికి తెలియును. దీనిగూర్చి యోబు $4^{4}$ దాని $5^{6}$ లో సూచనలు కలవు. ఉపవాసముచేత కూడ వాటికి బలహీనత కలుగునట్లు కీర్త $109^{24}$ లో నున్నది.

ప్రార్థించుటకై మోకాళ్లూనుటను గూర్చిన సూచనలు బైబిలులో ననేకములు కలవు. మోకాళ్లు వంగుట భయభక్తులకు సూచనగా నున్నది (యెష $45^{23}$ రోమా $14^{11}$ ఫిలి $2^{10}$). బయలుదేవత నారాధించువారివిధముగా ఆ దేవతకు మ్రొక్కియుండిరి (I రాజు $19^{18}$ రోమా $11^{4}$). మోకాళ్లూని ప్రార్థించుట సర్వసాధారణమైన అభ్యాసమై యుండెను (I రాజు $8^{54}$ II దిన $6^{13}$ ఎజ్రా $9^{5}$ దాని $6^{10}$ లూ $22^{41}$ కార్య $7^{60}$ $7^{40}$ $20^{36}$ $21^{5}$). మోకాళ్లూనుటచే గొప్పవారికికూడ ఘనము చూపించిరి (రూతు $2^{10}$ లూ $5^{8}$ మ $1^{40}$ $10^{17}$). క్రీస్తును అవమానపఱచుటకై రాణువవారు అపహాస్యముగా ఆయనయెదుట మోకరించిరి (మా $15^{19}$).

**మోజా** (Moza = బయలు వెడలుట, Mozah).

1. కాలేబు కుమారులలో నొకఁడు (I దిన $2^{46}$).

2. సౌలు సంతతివారిలో నొకఁడు (I దిన $8^{36,37}$ $9^{42,43}$).

3. బెన్యామీనీయుల పట్టణములలో నొకటి (యెహో $18^{26}$). ప్రస్తుతమందు యెరూషలేమునకు పశ్చిమమందుండు బైట్ - మిజ్జె (*Beit-Mizzeh*) అనునది దానియునికియై యున్నది.

**మోయాబీయుల రాతిశాసనము** రాతిశాసనములు 1 చూ॥

**మోయాబు, మోయాబు దేశము, మోయాబీయులు (Moab, Moabites).**

1. లోతుకు అతని కుమార్తెవలన పుట్టినవాఁడు (ఆది $19^{37}$).

2. మృత సముద్రమునకు తూర్పుననుండు నొక చిన్న మన్యప్రదేశము. మోయాబు దేశము మిగుల వృద్ధిలోకి వచ్చినపుడు సహా దాని పొడవు 60 మైళ్లకంటె వెడల్పు 30 మైళ్లకంటె ఎక్కువయై యుండలేదు. దానికి తూర్పున అరేబియా యెడారికలదు (సంఖ్యా $21^{17}$). దానికి దక్షిణమున ఎదోముదేశ మున్నది. అర్నోను దాని యుత్తర సరిహద్దని యిశ్రాయేలీయు లనుకొనిరి ($21^{13}$ $2^{36}$ మొ॥) గాని మోయాబీయులు ఆ హద్దును దాటి యింక నుత్తరమునకు తమ దేశమును వ్యాపింపఁజేసిరి. ఇది సముద్ర మట్టమున కంటె 3000 అడుగుల ఎత్తుగల మన్యప్రదేశము. దానిలో తూర్పునుండి పడమఱకు వ్యాపించునట్టి మూఁడు గొప్ప లోయ లున్నవి. వాటిలో ముఖ్యమైనది అర్నోను లోయ. ఈ చిన్న ప్రదేశములో పూర్వము చాల పట్టణము లుండెను (యెష 15). ద్రాక్షతోఁటలును అందెక్కువగా నుండెను ($16^{8}$). ఆ కొండల మీఁద మేఁత యెక్కువగా నుండుటచే అచట పూర్వము చాల మందలుండెను (II రాజు $3^{4}$). బాప్తిస్మమిచ్చు యోహాను చెఱఁబెట్టఁబడిన మఖీరు అను కోట ఈ మోయాబు ప్రాంతములో నున్నది. ప్రస్తుతమున అది చాల పాడైపోయిన దేశమై యున్నది.

3. మోయాబు అను వాని సంతతివారు. (ఆది $19^{37,38}$). వీరు చాల పురాతన జనులై 1000 సం॥ ల దాక ఒక ప్రత్యేకజనాంగముగ నుండిరి. నిర్గమ కాండములోని కాలమునకు పూర్వము ఐగుప్తు రాజగు రెండవ రామెసెసు (*Rameses II*) వారిని జయించి యున్నట్లుగా ఐగుప్తువారి రాతిశాసనములవలనఁ దెలియును. ఇశ్రాయేలీయులు ఐగుప్తును విడువక పూర్వము వీరు మృతసముద్రమునను తూర్పుగా నుండిన ఏమీయులను వెళ్లఁగొట్టి వారిదేశము నపహరించి అచట గొప్ప జనాంగ మయిరి (ద్వితీ $2^{11,19,19\text{-}21}$). ఇశ్రాయేలీయులు అరణ్యములో నివసించిన 40 సంవత్సరముల యంతమందు అచటికింకను రాకముందు అమోరీయుల రాజైన సీహోను వారి దేశములోని యుత్తరభాగమును

అపహరించెను. తత్కాలమున అర్నోనునది వారికి ఉత్తర సరిహద్దుగా నుండెను (సంఖ్యా 21[13-15,26-30]). మోయాబీయులు వ్యాపారముల విషయములందు ఇశ్రాయేలీయులతో స్నేహపడియుండినను తమదేశమును దాటుటకై వారికి సెలవియ్యకుండిరి (ద్వితీ 2[28,29] 33[4] న్యాయా 11[17]). ఇశ్రాయేలీయులకును మోయాబీయులకును దగ్గఱి సంబంధముండుటచే వారిమీద యుద్ధముచేయుటకై దేవుఁ డిశ్రాయేలీయులకు మొదట సెలవియ్యఁడాయెను (ద్వితీ 2[9,19]). అయితే మోయాబు రాజు ఇశ్రాయేలీయులను శపించుటకై బిలామును పిలిపించెను (సంఖ్యా 22-24 యెహో 24[9]). వాఁడిది చేసియున్నందున పది తరములమట్టుకు తమ సంఘములోనికి మోయాబీయులను చేర్చుకొనఁగూడదని ఇశ్రాయేలీయుల కాజ్ఞయయ్యెను (ద్వితీ 23[3-6] నెహె 13[1]). ఇశ్రాయేలీయులు పురాతనమైన మోయాబు మైదానములో చివరిమకాము చేసియుండిరి (సంఖ్యా 22[1] యెహో 3[1]). వారచట నుండఁగా కామదేవత నారాధించుటకై మోయాబుస్త్రీలును ఎదోముస్త్రీలును వారిని శోధించిరి (సంఖ్యా 25 హోషే 9[10]). మోషే వీరి దేశమును రూబేనీయులకు నిచ్చెను గాని అందులోనుండు కొన్ని పట్టణములు గాదు వశమైనట్లు కనఁబడును (సంఖ్యా 32[1-5,34-42] యెహో 13[15-28]). వీరు ఆ దేశము యావత్తు నెన్నఁడును వశపఱచుకొననట్లుగా నున్నది. న్యాయాధిపతుల కాలములో మోయాబు రాజైన ఎగ్లోను పలెస్తీనుమీఁద యుద్ధముచేసి అందులో నొకభాగమును లోఁబఱచుకొని యెరికోపట్టణమందు తనకొఱకొక రాజనగరమును కట్టించుకొని 18 సం॥ల వఱకు నచటనుండి మిగుల కఠిన ప్రభుత్వము చేసెనుగాని, ఏహూదు అనువాఁడు కుట్రచేసి యతనిని చంపించి అందునుండి మోయాబీయులను వెళ్లఁగొట్టెను (న్యాయా 3[12-30] I సమూ 12[9]). ఎలీమెలెకు అను నతఁడు కుటుంబసమేతముగా మోయాబు దేశమునకు పోయి అచటనే చనిపోయెను. అతని కోడలగు రూతు మోయాబుదేశస్థురాలైయుండెను తన యత్తయగు నయోమితో గలసి బేత్లెహేముకు వెళ్లి బోయజును వివాహముచేసికొని దావీదుకు పూర్వికురాలయ్యెను (రూతు 1[22] 4[3,5,10,13-17] మ 1[5-16]). రాజైన సౌలు మోయాబీయులమీఁద యుద్ధము చేసెను (I సమూ 14[47]). సౌలు యొద్దనుండి దావీదు పారిపోవుచు తన తలిదండ్రులను కాపాడుటకై వారిని మోయాబురాజున కప్పగించెను (22[3,4]). దావీదు రాజైన పిమ్మట మోయాబీయులను జయించి, వారిలో ననేకులను చంపించి మోయాబు రాజుదగ్గఱ పన్ను పుచ్చుకొనెను (II సమూ 8[2,12] I దిన 18[2,11]). సొలొమోను రాజు మోయాబు స్త్రీలను తన యుపపత్నులనుగా నుంచుకొని వారి దేవతకు ఒక గుడిని కట్టించెను (I రాజు 11[1-7]). ఇశ్రాయేలు రాజగు ఒమ్రీ మోయాబును జయించెను గాని అతని కొడుకగు అహాబు కాలములోను మనమఁడగు యెహోరాము కాలములోను మోయాబీయులకు మఱల స్వతంత్రము కలిగెను (మేషా 3 చూ॥ II రాజు 3[4-27]). యెహోషాపాతు కాలములో మోయాబీయులు అమ్మోనీయులతోను, ఎదోమీయులతోను గలసి యూదావారిమీఁదికి దండెత్తివచ్చిరి గాని యీ మిత్రసైన్యములవారొకరితో నొకరు పోట్లాడుకొనుటవలన ఆ దండయాత్ర నిష్ఫలమయ్యెను (II దిన 20[1-30]). ఎలీషా చనిపోయిన సంవత్సరమందు మోయాబీయులలో నుండి వచ్చినవారు అప్పటప్పటికి ఇశ్రాయేలీయుల మీఁదపడి వారిని దోచుకొనిరి (II రాజు 13[20]). మోయాబీయులు అష్షూరు చక్రవర్తులగు తిగ్లత్పిలేసెరుకును సన్హెరీబుకును పన్ను చెల్లించియున్నట్లుగా అష్షూరీయుల చరిత్రవలనఁ దెలియును. యెషయా కాలములో వారిదేశము విశాలమైనట్లు యెష 15 లో నున్న పట్టణముల పేరులచేఁ దెలియును. యూదారాజగు యెహోయాకీము కాలమందు వారు మఱల యూదా రాజ్యముపైఁబడిరి (II రాజు 24[2]). మోయాబీయులు దేవుని ప్రజలకు విరోధులని ప్రవక్తలెంచి వారి ననేక సమయములలో ఖండించిరి (యెష 15, 16, 25[10] యిర్మీ 9[26] 25[21] 27[3] 48, యెహె 25[8-11] ఆమో 2[1-3] జెఫ 2[8-11]). నెబుకద్నెజరు యెరూషలేమును కొల్లపెట్టినప్పుడు యూదావారిలో ననేకులు మోయాబునకు పారిపోయిరి గాని గెదల్యా అధిపతిగా నియమింపఁబడఁగానే వారు తిరిగి వచ్చిరి

(యిర్మీ $40^{11}$). నెబుకద్నెజరు మోయాబీయులను లోఁబఱచుకొనెనని యోసీఫస్ అను చరిత్రకారుఁడు వ్రాసెను (పురా 10.9.7). దీనికి తరువాత వారు ప్రత్యేకమైన రాజ్యమైనట్లు సూచనలేవియు లేవుగాని మోయాబీయుల జాతికిఁ జేరినవారింక నుండినట్లు ఎజ్రా $9^{1}$ నెహె $13^{1,23}$ వలనను యోసీఫసువలనను (పురా 1.11.5, 13.13.5) తెలియును.

మోయాబీయుల దేవతలలో కెమోషు అను దేవత ముఖ్యమైనదిగా కనఁబడును (I రాజు $11^{7}$ = II రాజు $23^{13}$ యిర్మీ $48^{13}$). ఇదియుఁగాక బయల్పెయోరుకూడ వారి దేవతలలో నొక ముఖ్య దేవతయై యుండెను (సంఖ్యా $25^{3}$) నెబో యను కొండ వారి ప్రదేశములో నుండుటచే వారు కల్దీయుల దేవతయగు నెబోనుకూడ పూజించి యుండిరని నమ్మఁదగును (కెమోషు, బయల్పెయోరు, నెబో చూ॥).

**మోరష్తీయుఁడు** (Morashthite) ప్రవక్తయైన మీకాయొక్క బిరుదు. అతఁడు మోరెషెత్ గాతు ఊరివాఁడగుటచే ఈ బిరుదు అతనికి వచ్చెను (మీకా చూ॥).

**మోరీయా** (Moriah).

I. అబ్రాహాము ఇస్సాకును అర్పింపఁబోయిన దేశముయొక్క పేరు (ఆది $22^{2}$). షోమ్రోను వారు అది గెరిజీము దగ్గరనుండు మోరె అని యందురు. ఇట్లు గెరిజీము ప్రతిష్ఠింపఁబడిన స్థలమని వాదించి అలాగు చెప్పెదరే గాని మోరె అనునది మోరీయాకు వేఱుగా నున్నదని తెలిసికొనవలెను (మోరె చూ॥).

2. అరౌనాయొద్ద దావీదుకొన్న కళ్లమున్న కొండ (II సమూ $24^{18}$ II దిన $3^{1}$). యెరూషలేమును కట్టుటలో ఆ కొండ చాల మాఱిపోయినను అది సొలొమోను దేవాలయమును కట్టిన కొండయై యున్నది (యెరూషలేము A IV 4 చూ॥).

**మోరే** (Moreh = బోధించెడివాఁడు)

1. షెకెము దగ్గఱనున్న ఒక వృక్షము లేక వనముయొక్క పేరు. ఈ వనములో నొక గుడి యుండెను. దానిలో ప్రవచనములు చెప్పెడివారుండిరి గనుక దీనికి మోరే (= బోధ చెప్పువాఁడు) అను పేరు వచ్చెనని కొందఱూహింతురు. అయితే అచట అబ్రాహామునకు కలిగిన దర్శనము వలన దీని కీ పేరు కలిగియుండవచ్చును (ఆది $12^{6,7}$). ద్వితీ $11^{29,30}$ చూడఁగా మోరే యను స్థలము గెరిజీము ఏబాలు అను కొండలకు తూర్పున నున్నట్లు కనఁబడును. ఇచట యాకోబు తన వారు హారానునుండి తెచ్చిన విగ్రహములను పూడ్చివేసెను (ఆది $35^{4}$). ఆ వృక్షముయొక్క పేరు అచటను తరువాతి వాక్యములలోను కొంచెము వేఱుగా నుండినను స్థలము ఒకటే యనుకొందురు. ఇచటనే షెకెమువారు అబీమెలెకును రాజునుగా చేసిరి (న్యాయా $9^{6}$). న్యాయా $9^{37}$ లో నున్న శకునగాండ్ల మస్తిచావృక్షపుతోపు ఇదే యని కొందఱనుకొందురు గాని అది రూఢికాదు. ద్వితీ $11^{29,30}$ లో గిల్గాలుకు సంబంధముగా నుండుటచే కొందఱీది గిల్గాలు అను పూజాస్థలములోనుండు వృక్షముల పేరుగాని వేఱే స్థలముకాదని యనుకొందురు. అట్టివారిది ప్రస్తుతమున యాకోబు నూతికి తూర్పున 1½ మైలు దూరములోనున్న కిర్బెట్-జులైజెల్ (*Khirbet-Juleijel*) అనునదే దీని యునికి యనుకొందురు. ఇదియునదియు నొకటే స్థలము అను సంగతి రూఢికాదు.

2. గిద్యోనుచేసిన యుద్ధమునకు సంబంధించిన చరిత్రలో కనఁబడు నొక కొండ పేరు (న్యాయా $7^{1}$). అది హరోదుబావి (= ఊట) దగ్గఱనున్నట్లు ఈ వచనములో కనఁబడును. గిల్బోవ పర్వతమునకు వాయవ్యమున 8 మైళ్ల దూరములో నుండు చిన్న హెర్మోనుకొండ దీని యునికి యని సాధారణముగా ననుకొందురు.

**మోరే, మోరేషెత్గాతు** (Moresheth-Gath = గాతు స్వాస్థ్యము). యూదాలోని యొక పట్టణము (మీకా $1^{14}$) దాని పేరునుబట్టి అది గాతుకు సమీపమందున్నదని తెలిసికొనవచ్చును. అది ప్రవక్తయగు మీకాయొక్క జన్మస్థానమని అతనికిఁగల బిరుదువలన యూహింపఁదగును ($1^{1}$ యిర్మీ $26^{8}$). ఇది గాతుకు సమీపముగా తూర్పున నున్నది గాని దాని యునికిని గూర్చి నూటిగాఁ దెలియదు

(మోరష్తీయుడు చూ॥). మోరెషెత్గాతు అను పదము తెలుఁగు బైబిలునందు లేదు.

**మోలాదా** (Moladah = జన్మము). యూదాలో దక్షిణ భాగమందున్న యొక పట్టణము (యెహో $15^{26}$). అది షిమ్యోను గోత్రమున కియ్యఁబడినట్లు $19^{2}$ (= I దిన $4^{28}$) లో నున్నది. బెయేర్షెబా యను పట్టణపు పేరులో నిది వాడఁబడినందున దీనికి సమీపమున నున్నట్లూహింపవచ్చును. చెఱకాలమునకుఁ బిమ్మట కూడ ఇది యున్నట్లు నెహె $11^{26}$ వలనఁ దెలియును.

**మోవద్యా** మయద్యా చూ॥

**మోషే** (Moses). హెబ్రీయుల పరిశుద్ధ ప్రవక్తయు ధర్మశాస్త్రకర్తయునై వారిని ఐగుప్తు నుండి వాగ్దానభూమిలోనికి నడిపించినవాఁడు. ఐగుప్తుదేశపు రాచకుమార్తె యితనిని పెంచుకొని యితనికి పెట్టినపేరు ఐగుప్తీయ నామమనుటకు సందేహములేదు. ఈ పదము మో ( = నీళ్లు), యూస్ =(రక్షించ.బడెను) అను రెండు ఐగుప్తు మాటలనుండివచ్చెనని యోసీఫసు చెప్పుచున్నాఁడు. LXX లోని మోయూసస్ అను మాట పైదానికి సరిపడును. హెబ్రీయులు ఆ పదమును కొంచెము మార్చి తమ భాషకు సరిపడునట్లు మాషాయను ధాతువునుండి వచ్చిన మోషే యని పిలిచిరి (నిర్గ $2^{10}$). మోషే క్రీ॥ ము॥ 1571 సం॥ జన్మించెను. లేవీయులగు అమ్రాము యోకెబెదు లను వారి కుమారుఁడు. ఇతనికి అహరోను అను అన్నయు మిర్యాము అను అక్కయు గలరు.

ఇతని చరిత్రను నలువదేసి సం॥ లు గల మూఁడు భాగములుగ చేయవచ్చును (కార్య $7^{23,30,36}$). మొదటి భాగమునందు తలిదండ్రులచే నైలువదిలో పారవేయఁబడి ఫరోకుమార్తె తీసికొనిపోయి పెంచుకొనినది మొదలు మిద్యానుకు పాఱిపోవునంతవఱకున్న చరిత్ర గలదు. ఈ మొదటి నలువది సంవత్సరములలో అతఁడు ఐగుప్తు రాజనగరునందుండి వారి సకల విద్యల నభ్యసించి మాటలయందును కార్యములయందును గట్టివాఁడై యుండెను ($7^{22}$). ఆకాలమునందు ఐగుప్తీయుల జ్ఞానము, ముఖ్యముగా ఐగుప్తీయ గురువుల జ్ఞానము లోకప్రసిద్ధమైనదై యుండినందున, వారి విద్యలలో ప్రవీణుఁడని చెప్పఁబడుట సాధారణమైన సంగతికాదు. రెండవ కాలములో మిద్యానుకు పారిపోయి తిరిగి ఐగుప్తుకు వచ్చునంతవఱకుగల చరిత్ర జరిగెను ($7^{30}$). ప్రస్తుతమున అరబ్బీ దేశములో షేకులని పిలువఁబడు కులీనులవలె నితఁడును ఈకాలమంతయు మిద్యానులో జీవించి యుండును. అతఁడిక్కడ నుండఁగా భక్తిజ్ఞానములుగల ఇత్రోయనువాని కుమార్తెయగు సిప్పోరాను వివాహమాడి అరణ్య జీవితమునకు అలవాటుపడెను. సంఖ్యా $12^{1}$ చూడఁగా మోషే కూషు ద్వీపస్థురాలగు నొక స్త్రీని వివాహము చేసికొనినట్లున్నది. అతఁడామెను సిప్పోరా కాలము చేసిన పిమ్మట వివాహమాడెనా లేక ఆకాలపు వాడుకల ననుసరించి ఇతర భార్యలను వివాహమాడెనా యనుసంగతినిగూర్చి రూఢిగా చెప్ప వీలుపడదు. ఈమెను వివాహమాడినందున మిర్యాము మోషేను దూషించి శిక్షకు పాత్రురాలయ్యెను ($12^{1-15}$). మొదటి నలువది సంవత్సరములలో రాజనగరునందు వైభవముతో బ్రతికిన జీవితమునకును ఈ నలువది సంవత్సరములు ఒక్కచోట నిలువకుండ ఒంటరిగా బ్రతికిన జీవితమునకును ఎంత వ్యత్యాసమైనను గలదు. అతఁడిట్లు సంచరించుచు మామయొక్క మందలను కాయుచుండఁగా యెహోవాదూత మండుచున్న పొదలో మోషేకు ప్రత్యక్షమై ఇశ్రాయేలీయులను విడిపించుటకై అతఁడు సాధనముగా నెన్నుకొనఁబడనని తెలియఁజేసెను. మూఁడవ కాలములో మోషే ఇశ్రాయేలీయులను ఐగుప్తునుండి విడిపించిన మొదలు నెబో పర్వతముమీఁద మృతినొందు వఱకుగల చరిత్ర సంగతులు జరిగెను. ఈ కాలములో అతఁడు దేవునియొక్క కార్యనియామకుఁడుగనుండి ఆయన పనిని తన శక్తివంచనలేకుండ కొనసాగించెను.

దేవుని సేవకుఁడైన ఇతని పేరు సీనాయి అరణ్యమండలి అనేక స్థలములలో శాశ్వతముగా నున్నది. ఇటీవల కనుగొనఁబడిన ఐగుప్తు పురాతన వ్రాఁతలయందు మెను అనువాఁడు ఐగుప్తునందు పరదేశీయులుగనున్న వారిపై విశేషాధికారము చెలాయించినట్లున్న వ్రాఁతలు కనుగొనఁబడినవి. గ్రీకు లాటిన్ భాషలయందున్న వ్రాఁతలలోను, ముఖ్యముగా మహమ్మదీయుల మతగ్రంథమునందు మూసా

అని యున్నది. అరబ్బీయులలోను, మఱి ముఖ్యముగా యూదయ అరబ్బీయులలో ఈ పేరు వాడుకలోనున్నది. వారు చెప్పు సంగతులలో ననేకములు పుక్కిటి పురాణములుగ గాని, బైబిలు యొక్క అభిప్రాయములకు భిన్నములుగ గాని కనఁబడును. చరిత్రను క్రమముగ వ్రాసిన వారిలో మోషే చెప్పినంత యథార్థముగ చెప్పిన వాఁడు లేఁడనియు, తమచట్టములను ధర్మశాస్త్రమును వ్రాసినవాఁడైనందునను యూదు లతనిని చాల గౌరవింతురు పాఁత క్రొత్త నిబంధనలలో ఆయనను వారెంత ఘనునిగ నెంచినది కనఁబడును (కీర్త $103^{7}$ $105^{26}$ $106^{16}$ యెష $63^{12}$ యిర్మీ $15^{1}$ దాని $9^{11}$ మత్త $8^{4}$ యోహా $5^{45}$ $7^{22}$ $9^{23}$ కార్య $7^{20-38}$ రోమా $10^{5,19}$ II తిమో $3^{8,9}$ హెబ్రీ 3, $11^{23-28}$ యూదా 9).

మోషే దేవుని పనులను నిర్వహించి వాటి ప్రకారముచేసి ఇతరులకు వాటిని నేర్పెను. తన ప్రవర్తనయంతటిలో నమ్మకమైనవాఁడను బిరుదు నొందెను. దైవభక్తుఁడనియు దేవుని సేవకుఁడనియు పిలువఁబడెను. లోకసంబంధమైన బ్రతుకునందు గొప్పవాఁడను కాఁగలనను శోధనను జయించి దేవుని సేవను ఏర్పఱచుకొనెను. తానింక యౌవనుఁడుగ నుండఁగానే ఇశ్రాయేలీయులను విమోచింపఁగోరి అన్యాయము చేయుచున్న ఐగుప్తీయుని చంపెను (కార్య $7^{23}$). అతని నిరీక్షణకు భంగము కలిగిన పిమ్మట యెనుబది సంవత్సరముల వయస్సు గలిగినప్పుడు దేవుఁడతనిని పిలువఁగా దానికతఁడు సమ్మతింపక పోయెను. స్వాభావికముగా నతఁడు ముక్కోపియు, ఓర్పు లేనివాఁడు అయినను తన్నుతాను లోఁబఱచుకొనుటచేత సాత్వికుఁడను బిరుదు నొందెను (సంఖ్యా $12^{3}$). అతని యందగుపడిన విశ్వాసము విధేయత ఓర్పు జ్ఞానము చుఱుకుదనముతోఁ గూడిన అధికార స్వభావము త్యాగబుద్ధి దేశాభిమానము అనుకరింపఁదగినవి (నిర్గ $32^{11-14}$ సంఖ్యా $11^{29}$). తన కుమారులకు లాభకరములగు ఉద్యోగములను ఇప్పించలేదు. అతఁడు విమోచన న్యాయబుద్ధి మార్గము చూపుట నిరాకరింపఁబడుట ఓర్పు రక్షించుట మధ్యవర్తిత్వము మొదలగు అనేక విషయములలో క్రీస్తును పోలినవాఁడై తన బ్రతుకునందును నడువడియందును మన కనేకములైన ఆదర్శములను కనఁబఱచుచున్నాఁడు. అతఁడేర్పఱచిన మతసంబంధ చట్టము లన్నియు క్రీస్తుకు ముంగుర్తుగా నున్నవి. తాను మృతి నొందిన రెండువేల సంవత్సరములకు తరువాత క్రీస్తు రూపాంతరమునొందు సమయమున తాను బ్రతికియుండఁగా చూడఁగోరిన దేశమును చూచి, ఆయన మరణమునుగూర్చి మాటలాడుటకు ఏలీయా ప్రవక్తతోఁ గలిసివచ్చెను (లూకా $9^{31}$). తనకు నూటయిరువది సంవత్సరముల వయస్సు గలవాఁడై నప్పుడు వాగ్దత్తభూమియొక్క సరిహద్దులలోకి వచ్చి మోయాబు మైదానములో పండ్రెండు గోత్రములవారికి చివరి సలహాలనిచ్చి (ద్వితీ $1^{3,5}$) పిస్గా కొండమీఁద మృతినొందెను ($34^{5-8}$).

బైబిలునందు గ్రంథపంచకము అని పిలువఁబడు మొదటి ఐదుగ్రంథములకు మోషే గ్రంథకర్తయైయున్నాఁడు. అనేక విషయములలో మోషేకు సహాయకుఁడుగా నుండిన అహరోనీ గ్రంథరచనకెంతయు తోడ్పడియుండును (నిర్గ $17^{13}$ $24^{4,7}$ $31^{27}$ సంఖ్యా $33^{1,2}$ ద్వితీ $31^{24}$). వీటిలోని కొన్నిభాగములు తరువాత దైవావేశము గల మఱియొకనిద్వారా వ్రాయఁబడెను. కీర్తన గ్రంథమందలి తొంబదవది మోషే విరచితమని యందురు. అది అతని చిరకాలమందు వ్రాయఁబడెనని యెంచినయెడల దానియందలి అనేకసంగతులభావము మఱింత స్పష్టమగును. యోబుగ్రంథముకూడ మోషేవలన రచింపఁబడెనని కొందఱి యభిప్రాయము. నిర్గ 15 ద్వితీ 32, 33 లలోని జయకీర్తనలు పరసంబంధమైన మోషేయను గొఱ్ఱెపిల్లయొక్క జయకీర్తనను సూచించును (ప్రక $15^{3}$). అతఁడు కన్నులార చూచిన సంగతులు వ్రాసెనని అతని గ్రంథములు స్పష్టపఱచుచున్నవి. ప్రస్తుతమునందు ఐగుప్తునందు దొఱుకు శిథిలములలోని సంగతులు అతఁడు వ్రాసిన అనేకసంగతులను రూఢిపఱచుచున్నవి (గ్రంథ పంచకము చూ॥). H

**మోసేరు, మొసేరోతు** (Moserah, Moseroth = బంధకములు). అరణ్యములో ఇశ్రాయేలీయులు మకాముచేసిన స్థలములలో నొకటి. అహరోను ఇచ్చట చనిపోయి సమాధి చేయఁబడెను (ద్వితీ $10^{6}$). సంఖ్యా $33^{30}$ లో నున్న మొసేరోతు అనుపదము మోసేరయొక్క

బహువచనరూపమై ఆ స్థలమునే సూచించును. అది హోరు అను కొండకు దగ్గరగానుండు ఎదోము సరిహద్దయియున్నదని ($20^{23}$ $33^{37}$ ద్వితీ $10^{6}$ వలన తెలియునుగాని దానియునికినిగూర్చి ఇంక నూటిగా తెలియదు.

మోహాము దురాశ చూ॥

## మ్నా, మ్రా, మ్రొ

**మ్నాసోను** (Mnason). ఆదికాలపు క్రైస్తవులలో నొకఁడు. పౌలు చివరిపర్యాయము యెరూషలేమునకు వెళ్లఁగా, నితఁడు కైసరయనుండి యెరూషలేమునకుఁబోయి అచ్చట పౌలుకు బస కుదిర్చెనని తెలియుచున్నది (కార్య $21^{16}$) గాని కొన్ని ప్రతుల ప్రకారము కైసరయకును యెరూషలేమునకును మధ్యనేదో యొక స్థలమున అతఁడు పౌలుకు బసచూపినట్లున్నది.

**మ్రాను** (Tree). కలపను సూచించు మాటల నీ క్రింద వివరింపక సిలువమ్రానును సూచించు పదమునుమాత్రము వివరింతుము (కార్య $5^{30}$ $10^{39}$ $13^{29}$ I పేతు $2^{24}$). గల $3^{13}$ లోని మాట ద్వితీ $21^{23}$ లో నున్న వాక్యమును అనుసరించి యెత్తినట్లు స్పష్టమగును. అచ్చట ఆ పదము సిలువనుగాక ఉరికొయ్యను సూచించును. అయినను దానిని సిలువకును వాడఁదగును (సిలువ, నేరములు శిక్షలు III 7 (2) చూ॥).

**మ్రొక్కుట** నమస్కారము చూ॥

**మ్రొక్కుబడులు** (Vows). దేవుని కేదో యొకటి అర్పించెదననిమాట నిచ్చుటకే మ్రొక్కుబడి యందురు. ఇట్టి మ్రొక్కుబళ్లు చేయువారు సాధారణముగా నేదో ఒక దీవెన కోరి అట్లుచేతురు. ఇట్లుచేయుట బైబిలులో మాత్రముగాక అన్యజనులలోను వాడుకరై యున్నది (యోనా $1^{16}$). బైబిలునందు, యాకోబు అభయముకొఱకును (ఆది $28^{20-22}$), యెఫ్తా జయముకొఱకును (న్యాయా $11^{30,31}$), హన్నా కుమారుని నిమిత్తమును (I సమూ $1^{11}$), సౌలు శత్రునాశముకొఱకును (I సమూ $14^{24,25,36,37}$), అబ్షాలోము యెరూషలేమునకు తిరిగి వచ్చుటకొఱకును (II సమూ $15^{8}$), మ్రొక్కుబడులు చేసిరి. క్రొత్త నిబంధనలోని కార్య $18^{18}$ $21^{23-26}$ నందున్న మ్రొక్కుబళ్లు నాజీరు వ్రతమునకు సంబంధించినవి (నాజీరు వ్రతము చూ॥).

ఈ వాడుక సర్వసాధారణమైనదైనను, వాటిని చేయవలెనను నియమము బైబిలునందు లేదుగాని చేసినయెడల యెట్లు చేయవలెనో ఎటుల చేయరాదో అది చెప్పఁబడినది. మ్రొక్కుబళ్లు స్వేచ్ఛార్పణములతోకూడ లెక్కింపఁబడినట్లు ద్వితీ $12^{6}$ వలనఁ దెలియును. ఒకఁడు మ్రొక్కుబడి చేసికొనిన యెడల దానినెట్లు తీర్చుకొనవలెనో అది లేవీ $22^{18-23}$ నందు విధింపఁబడియున్నది. ఇశ్రాయేలీయులు మలాకీ కాలమునందు ఈ చట్టమును నిర్లక్ష్యముచేసినందున ప్రవక్త వారిని గద్దించెను (మలా $1^{13,14}$). మ్రొక్కుబడిచేసిన పిమ్మట తప్పక అర్పింపవలసినదేగాని దానిని విమోచింపఁ గోరినపక్షమున నియమిత రేట్లప్రకారము దానిని విమోచింపవచ్చును. గాని ఇంక అయిదవ వంతు నెక్కువగా కట్టి దానిని విమోచించుకొనవలెను (లేవీ $27^{1-13}$). ఇట్లు మనుష్యులను అవశ్యముగా విమోచించవలసిన నియమముగలదు. పురుషుని 50 తులముల వెండికిని, స్త్రీని 30 తులములకును, బాలుని 5 తులములకును బాలికను 3 తులములకును విమోచింపవలెను. స్త్రీ తన తండ్రి లేక పెనిమిటి అనుమతిచొప్పునఁ జేసిన మ్రొక్కుబడిని తీర్చుకొనవలెను గాని వారను మతించని యెడలఁ తీర్చుకొన బద్ధురాలుకాదు (సంఖ్యా $30^{3-16}$). ఇష్టపూర్వకముగా మ్రొక్కుబళ్లు చేయవచ్చునుగాని, అవి పాపముచేయుటకు హేతుభూతములుకానియెడల వాటినితప్పక తీర్చుకొనవలెను. చేసిన మ్రొక్కుబడులను తీర్చుకొనుట దేవుని సేవకులనుటకు చిహ్నమైయున్నది (యెష $19^{21}$ నహూ $1^{15}$ సామె $20^{25}$ కీర్త $22^{25}$ $50^{14}$ $56^{13}$).

## య

**యంత్రే**, యన్నే చూ॥

**యకాను** (Jacan = తొందరచేయువాఁడు). గాదుగోత్రపు పెద్దలలో నొకఁడు (I దిన $5^{13}$).

**యక్షిణిగాడు** (Enchanter). కర్ణపిశాచమను నర్థమిచ్చు పదము. మృతులతో సాంగత్యము చేయవచ్చుననియు అదృశ్యలోకములో ప్రవేశించినవారి యాత్మలద్వారా రాబోవు సంగతులు తెలిసికొనవచ్చుననియు నటించెడి తెగవారికి చెందునదైయున్నది (II రాజు 21[6] కర్ణపిశాచము చూ॥). B.

**యగర్ శాహదూతా** (Jagar-sahadutha = సాక్షి దిబ్బ). యాకోబు లాబానులు నిబంధనచేసికొనిన స్థలములో సాక్షిగా పెట్టుకొనినరాళ్ల దిబ్బ. దానిని యాకోబు గలేదు యని పిలిచెను. లాబాను యగర్ శాహదూతా యని పేరుబెట్టుకొనెను (ఆది 31[47]). ఈ రెండుపదముల యర్థము నొకటే. గలేదు హెబ్రీపదమును యగర్ శాహదూతా అరామిపదమునై యున్నది.

**యజన్యా** (Jaazaniah = యెహోవా ఆలకించును).

1. యెరూషలేము నాశనమైన కాలములో ఆ దేశములోనుండిన గుంపులలో నొక గుంపునకు అధిపతిగా నుండినవాడు. ఇతడొక మాయకాతీయుడు. యెరూషలేము నాశనమైన పిమ్మట గెదల్యాయను గొర్నరునకు విధేయులము గుదుమని చెప్పుకొనినవారిలో నితడొకడు (II రాజు 25[23]=యిర్మీ 40[8]).

2. రేకాబీయుల తెగలలో నొక తెగకు ప్రధాని (యిర్మీ 35[3]).

3 యెహెజ్కేలు తన దర్శనమందు చూచిన వారిలో నొకడు రహస్యముగా విగ్రహారాధన చేసిన డెబ్బదిమందిలో నితడు పెద్ద (యెహె 8[11]). ఇతడు షాఫాను కుమారుడై యుండెను.

4. అజ్జూరు అను నొకనికి కుమారుడు. ఇతడు యెహెజ్కేలు కాలమందు అబద్ధ ప్రవచనములను ప్రవచించిన యిద్దరిలో నొకడు. యెహెజ్కేలు వీరికి విరోధముగా ప్రవచింపవలెనని దేవుడు అతనికి ఆజ్ఞ నిచ్చెను (యెహె 11[1-14]).

**యతేతు** (Jatheth). ఎదోమీయుల తెగలలోని యొక తెగకు పూర్వికుడు (ఆది 36[40] I దిన 1[51]).

**యత్తీరు** (Jathir = శ్రేష్ఠత). యూదా మన్యప్రదేశములో నుండు నొక పట్టణము (యెహో 15[48] 21[14] I దిన 6[57] I సమూ 30[27]). దావీదు సిక్లగును దోచుకొన్న పిమ్మట దోపుడు సొమ్మునే యూళ్లకు బంపెనో ఆ యూళ్లలో నొకటి (I సమూ 30[27]). ప్రస్తుతమున బెయేర్షెబాకు ఈశాన్యదిక్కున 15 మైళ్లదూరములో నుండు అత్తీరు (*Athir*) అను స్థలము దాని యునికియని సాధారణముగా ననుకొందురు (పటము II, E 3).

**యత్నీయేలు** (Jathniel = దేవుడు దానము లిచ్చును). లేవీయులలోని కోరహు తెగవారిలో నుండు నొక ద్వారపాలకుడు (I దిన 26[2]).

**యథార్థత** సత్యము చూ॥

**యదీద్యా** (Jadidiah = ప్రభువునకు ప్రియుడు). ప్రవక్తయగు నాతాను దావీదు కుమారుడగు సొలొమోనుకు దేవుని యాజ్ఞ ప్రకారము పెట్టిన పేరు (II సమూ 12[25]). W.

**యద్దయి** (Jadau). అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టినవారిలో నొకడు (ఎజ్రా 10[43]). అది అసలులో ఇద్దో యనుపదమునకు సంబంధించినది.

**యద్దూవా** (Jaddua = పరిచయుడు).

1. బబులోను చెఱనుండి తిరిగివచ్చి నిబంధనను ముద్రించిన వారిలో నొక ప్రధాని (నెహె 10[21]).

2. ప్రధాన యాజకులలో నొకడు (నెహె 12[11]). ఈ వాక్యములలోని జాబితాను చూడగా ఇతడు నెహెమ్యాకాలమునకు తరువాత మూడవ తరము వారిలో చేరినట్లుగా నున్నది. యోసీఫస్ (పురా 11·7·12; 8=4·7) అను చరిత్రకారుడు మహా అలెక్సందరు కాలములో ఈ ప్రధాన యాజకుడు బ్రతికియుండి అలెక్సందరుకు విజ్ఞాపనము చేసెనని వ్రాసెను. ఆ విజ్ఞాపన చేసిన వాడితడేయని యనుకొనదగును. అట్లయిన యెడల ఇతడు క్రీ॥ ము॥ 350-300 సం॥ లలో

ప్రధానయాజకుఁడై యుండెనని తెలిసికొనఁ గలము.

**యన్నై** (Jannai). క్రీస్తు వంశానుక్రమణికలో నున్నట్లు క్రీస్తు పూర్వికులలో నొకఁడు (లూ $3^{25}$).

**యన్నే, యంబ్రే** (Jannes & Jambres) మోషేను ఎదిరించిన మంత్రగాండ్రు (II తిమో $3^{8}$). నిర్గ $7^{11,22}$ లో వారు మోషేను ఎదిరించిన చరిత్ర సంగతు లున్నవి గాని పేరులు మాత్రము లేవు. యూదుల పురాణగ్రంథములలో వారి పేరులు కనఁబడును. అది క్రైస్తవుల గ్రంథములలోను తత్కాలమందలి అన్యుల గ్రంథములలో సహా ఈ పేరులు గలవు. యన్నే యనునది యోహాను అను పేరునకు సంబంధమైనది. అయితే అది హెబ్రీలో అడ్డగించునది యను నర్థము నిచ్చు యానీ అను పదమువంటిది కావున, ఇదె దీని భావమని కొందఱనుకొందురు. యంబ్రే యనఁగా ఎదిరించుట అను నర్థమిచ్చు హెబ్రీ పదమై యున్నది. దానికి యంబ్రే యను మాఱు రూపము కలదు. ఈ పదమునకును ఎదిరించుట యని యర్థము.

**యప్లేతీయులు** (Japhlethites). ఎఫ్రాయిమునకు నైరృతిదిక్కున నివసించిన యొక తెగవారు (యెహో $16^{3}$). వారి విషయములో నింక వేఱు సూచనలు లేవు. వారు యప్లేటు అను పేరు గలవారై యుండవచ్చును గాని I దిన $7^{32,33}$ లో నున్న పేరుగల సంతతివారు కానట్లున్నది.

**యప్లేటు** (Japhlet = ఆయన రక్షించు గాక). ఆషేరు గోత్రపు వారిలో నొకఁడు. అతఁడు వారిలోనున్న యొక తెగవారికి పెద్ద యయ్యెను (I దిన $6^{32,33}$).

**యబ్నెయేలు, యబ్నె** (Jabniel = దేవుఁడు కట్టువాఁడు).

1. యూదయ సరిహద్దులలో వాయవ్య దిక్కునందు ఒక రేవు పట్టణము (యెహో $15^{5-11}$). యూదా రాజైన ఉజ్జియా ఫిలిష్తీయుల యొద్దనుండి యపహరించిన యబ్నె ఇదే పట్టణమునకు మాఱుపేరై యున్నది (II దిన $26^{6}$). మక్కబేయుల కాలములో దీని పేరు యమ్నీయా (*Jammia*) అనునదైయుండెను (I మక్క $4^{15}$ $5^{58}$ II మక్క $12^{8,9}$). మక్కబేయులు దీని జయించిరి. ఆ క్రొత్త నిబంధనకాలము వఱకు ప్రసిద్ధమైన పట్టణమై యుండెను. క్రీ॥ శ॥ 70 సం॥ లో కలిగిన యెరూషలేము నాశనమునకు పూర్వము యెరూషలేమునందలి మహాసభవారగు సన్‌హెడ్రిన్‌వారు అచటికి పారిపోయి తమ పనుల నచట జరిపిరను పారంపర్యము కలదు. క్రూసేడుల కాలములో కూడ ఇది యిబెలెను (*Ibelen*) అను రూపముతో కనఁబడును. ప్రస్తుతమందు యెబ్నా (*Yebna*) అను నూరు దాని యునికియై యున్నది. ఇది అష్టోదుకు ఉత్తరమున 9 మైళ్ల దూరములోను సముద్ర తీరమునకు 4 మైళ్ల దూరముగానున్నది (పటము I, B 8).

2. నఫ్తాలీ గోత్రపు ఉత్తర సరిహద్దులోనుండు నొక స్థలము (యెహో $19^{33}$). అది యొర్దాను దగ్గఱ నున్నది గాని దాని యునికినిగూర్చి మఱి నూటిగా తెలియదు.

**యబ్బేజు** (Jabez = దుఃఖమును కలిగించువాఁడు).

1. యూదాలో నున్న యొక పట్టణము. అందులో శేఖరులు నివసించిరి. దాని నివాసులు కాలేబు సంతతివారికి సంబంధులై యున్నారు (I దిన $2^{55}$). దీని యునికినిగూర్చి తెలియదు.

2. యూదా సంతతివారిలో నొకఁడు. తల్లి తనకు కలిగిన దుఃఖముచేతనే ఈ పేరు నతనికిఁ బెట్టెను. ఇతఁడు ఘనము పొందినవాఁడై యూదా సరిహద్దును విశాలపఱచుటకు ప్రార్థన చేసెను. దేవుఁడతని ప్రార్థన నాలకించెను (I దిన $4^{8,10}$).

**యబ్బోకు** (Jabbok = పోయుట). యొర్దానుకు తూర్పుగా నుండి దానిలోనికి ప్రవహించుచున్న యొక నది. అది యొర్దానుకు తూర్పున 20 మైళ్ల దూరమున నుద్భవించి మొదట ఈశాన్యమున 12 మైళ్ల దూరము వఱకును తరువాత 15 మైళ్లవఱకు వాయవ్యమునను, అటుపిమ్మట 17 మైళ్ల వఱకు పశ్చిమమునను ప్రవహించి గిలాదు కొండల లోయలగుండఁ బోయి పిమ్మట 15 మైళ్ల వఱకు నైరృతి దిక్కుగాను, మృతసముద్రమున కుత్తరముగా 25 మైళ్ల వఱకుఁ బ్రవహించి యొర్దానునదిలోఁ బడును. దానికి ప్రస్తుతమున నీలివర్ణపు

నదియను నర్థమిచ్చు నార్ - ఎస్ - సర్కా (*Nahr-Es-Zerka*) పేరు కలదు. నీటి రంగును బట్టి దాని కీపేరు వచ్చెను. అది పూర్వమున ఆయా దేశములకు హద్దుగా నుండెడిది. సంఖ్యా $21^{24}$ యెహో $12^{2}$ న్యాయా $11^{22}$ లో నున్నట్లది అమోరీయుల దేశమునకు ఉత్తరపు సరిహద్దయి యుండెను. యాకోబు దానితీరమున దూతతో పెనుగులాడినందున ఈ నది పేరు ప్రసిద్ధముగా నున్నది (ఆది $32^{24,25}$).

**యమునారాయి** రత్నములు 13 చూ॥

**యమ్లేకు** (Jamlech = రాజు నేర్పఱచుమీ). షిమ్యోను ప్రధానులలో నొకఁడు (I దిన $4^{34}$).

**యరా** (Jarah = తేనె). రాజగు సౌలు సంతతివారిలో నొకఁడు (I దిన $9^{42}$). $8^{36}$ లో నితనికి యెహోయాదా అను మాఱుపేరు కలదు (యెహోయాదా 6 చూ.).

**యరొబాము** (Jeroboam = ప్రజలు విస్తరింతురు).

1. ఇశ్రాయేలు నారనఁబడిన పదిగోత్రముల రాజ్య స్థాపకుఁడగు ఎఫ్రాయిమీయుఁడు. యొర్దానులోయ యందలి జెరేదాయను ఊరివాఁడగు నెబాతు అను పేరుగల సొలొమోను ఉద్యోగస్థులలో నొకని కుమారుఁడు. తల్లిపేరు జెరూహా. యరొబాము పుట్టినప్పటి కామె వైధవ్యము ధరించెను (I రాజు $11^{26}$). ఇతఁడింక యౌవనుఁడుగ నుండునప్పుడే పనియందు శ్రద్ధా బుద్ధులును, శక్తి సామర్థ్యములను కనఁబఱచెను. అప్పుడు యెరూషలేమునందు విస్తారముగ కట్టడములను గట్టించుచుండిన సొలొమోను ఇతనిని యోసేపు ఇంటివారు చేయవలసిన భారమైన పనిమీఁద అధికారిగా నియమించెను ($11^{27,28}$). ఒక నాడితఁడు యెరూషలేమునకు వెలుపలఁ దిరుగుచుండఁగా ప్రవక్తయగు అహీయా క్రొత్త వస్త్రము నొకదానిని ధరించి యతని నెదుర్కొని తన వస్త్రమును పండ్రెండు ముక్కలు జేసి, ఇశ్రాయేలీయుల పది గోత్రములమీఁద అతఁడు రాజగు ననుదానిని సూచించుటకు అందు పది ముక్కల నతనికిచ్చెను. ఇది సొలొమోను చెవికెక్కినందున అతఁడు తనను చంప యత్నించు సంగతిని గ్రహించి యరొబాము ఐగుప్తునకు పారిపోయి అక్కడ రాజగు షీషకువలన మిగుల ఆదరింపఁబడెను ($11^{29-40}$). సొలొమోను మరణవార్తను, పది గోత్రములవారు రాజకుమారుఁడగు రెహబామును సంధించకూడదనియున్నారనువార్తను విని, ఆ సమయమున జరుగఁబోవు కూటమునకు హాజరాయెను. అతఁడు జనుల పక్షముగ మాటలాడుచు వారిపైనున్న భారములను తగ్గించవలసినదని యడిగెను. రెహబాము మూర్ఖుఁడై వారి మనవి నాలకించక తిరస్కరించినందున, పది గోత్రములవారు వేఱుపడి యరొబామును తమకు రాజుగా నియమించుకొనిరి. అహీయాయొక్క ప్రవచన మిట్లు నెఱవేఱెను. అతఁడు యెహోవాను యథార్థముగా సేవించిన యెడల అతని సంతానమువారు స్థిరముగా సింహాసనముమీఁద నుందురని ప్రవక్త యతనికొన్ని హెచ్చరికలను జేసెను ($11^{37,38}$). కాని ప్రజలు ఏఁటేఁట ఆరాధనకై యెరూషలేమునకు వెళ్లుచుండిన పక్షమున వారి హృదయములు దావీదు సంతతివారి వైపునకు తిప్పక తిరుగుననియు, అందువలన వారు తనపై తిరుగఁబడి చంపెదరనియు భయపడెను గనుక తన రాజ్యముయొక్క ఉత్తరమున దానును, దక్షిణమున బేతేలును రెండు మత పీఠములుగా నేర్పాటు జేసెను. విగ్రహారాధన చేయవలదను దేవునియొక్క కఠినమైన ఆజ్ఞకు భిన్నముగా రెండు బంగారు దూడలను చేయించి రెండు చోట్ల రెంటిని నిలిపి ($12^{28-30}$ II దిన $13^{8}$) సీనాయి పర్వతము దగ్గఱ అహరోను జేసినట్లు గానె (నిర్గ $32^{4}$) వాటిని పూజించుఁడని ప్రజలను పురికొలిపెను. దూడ యాకృతిగల విగ్రహములను పెట్టుకొనినను ప్రజలు యెహోవానే ఆరాధించవలెనని అతఁడు కోరినట్లగుపడుచున్నది. నిబంధన మందసమును కరుణాపీఠమును లేని ఉన్నత స్థలములను ఆరాధన స్థలములుగా నేర్పాటు జేయుట మాత్రమేగాక, లేవీగోత్రికులైన యాజకులు విగ్రహారాధనఁజేయ సమ్మతించనందున ఇతర గోత్రికులను యాజకులనుగా ప్రతిష్ఠించుటకు వెనుకఁదీయకపోయెను (I రాజు $12^{31}$ II దిన $11^{13-15}$ $13^{9}$). యూదాదేశమున ఏడవ మాసము 14 వ దినమున ఆచరింపవలసిన కోఁతపండుగను తన రాజ్యమున యెనిమిదవ

మాసము 15 దినమునందు చేయవలసినదని యేర్పాటు జేసెను (I రాజు $12^{32,33}$). జనసామాన్యమిందుల కొడఁబడిరి. ఇట్లు యరొబాము ఇశ్రాయేలువారిచే పాపము జేయించెను. మిగుల యేహ్యకారణమగు నీయారాధన ఈ రాజ్యము వినాశమగువఱకు నిలిచెను. అతని యనంతరమున హోషేయ యనువాఁడు తప్ప ఈ రాజ్యము నేలిన వారందఱును దీని నవలంభించి యరొబాము దేనిచేత ఇశ్రాయేలు వారు పాపము చేయుటకు కారకుఁడాయెనో దాని నంతటిని ననుసరించి ప్రవర్తించిన వారైనట్లు చెప్పఁబడెను ($15^{26,34}$ $16^{19,31}$ $22^{52}$ II రాజు $3^{3}$ $10^{29}$ $13^{2,11}$ $14^{24}$ $15^{9,18,24,28}$). యరొబాము స్థాపించిన ఈ విగ్రహారాధన అష్షూరీయులు ఇశ్రాయేలీయులను చెఱఁగొని పోవుట కొక కారణమయ్యెను ($17^{16}$). ఈ విగ్రహారాధనవలన ఇశ్రాయేలీయులందఱును బలమైన యేక జనాంగముగా నుండఁజాలక చీలిపోయిరి. సత్యదేవుని యారాధన అడుగంటుటచేత ఉత్తరమునందున్న ప్రజలు ఏహ్యమగు ఆచారములచే భ్రష్టులై కృశించి, ఊరుపేరు లేకుండ పోయిరి. ఇట్టి మతభ్రష్టత గావించినందులకై యరొబాము మొదట ఒక ప్రవక్తచేతను, తరువాత తనకు రాజ్యప్రాప్తి కలుగునని తెలిపిన షీలోనీయుఁడగు అహీయా చేతను గద్దింపఁబడెను గాని, అతఁడు వారి హెచ్చరికల నన్నిఁటిని పెడచెవిని బెట్టెను (I రాజు $13^{1}$-$14^{18}$). ఇదివఱకు ఇశ్రాయేలీయులు పూజాస్థానములుగ నెంచిన షెకెమును పెనూయేలును ప్రాకారములుగఁ జేసెను. షెకెమతని రాజధాని యయ్యెను గాని కొలఁది కాలములోనే యది సుందరపురమగు తిర్సాకు మార్చఁబడెను ($12^{25}$ $14^{17}$ పర $6^{4}$). రెహబామును అతని కుమారుఁడగు అబీయామును యరొబాముతో యుద్ధములు జేసిరి (I రాజు $15^{6}$). అబీయాము యరొబాము నోడించి యెరూషలేమునకు 10 మైళ్ల దూరమందు మాత్రమేగల బేతేలును పట్టుకొనెను ($15^{7}$ II దిన $13^{1-20}$ అబీయాము చూ॥). యరొబాము క్రీ॥ ము॥ 931 సం॥న రాజై 22 సం॥ము లేలెను (I రాజు $14^{20}$). అతని కుమారుఁడొకఁడు బాల్యమందే చనిపోయెను ($14^{1-17}$). నాదాబు అను వాఁడతని తరువాత ఇశ్రాయేలు వారికి రాజయ్యెను ($14^{20}$).

2. ఇశ్రాయేలువారి రాజైన యెహోయాషు కుమారుఁడు. ఇతనిని రెండవ యరొబాము అని పిలుతురు. యెహూ సంతతి వారిలో అతనికి తరువాత మూఁడవ తరమువాఁడు. క్రీ॥ ము॥ దాదాపు 790 సం॥న షోమ్రోనునందు రాజై 41 సం॥ లేలెను. అతఁడు రాజ్యమునకు వచ్చినప్పుడు దేశము బహు క్షీణదశయందుండెను గాని ఇతఁడు సిరియనుల రాజధానియగు దమస్కును, హిత్తీయుల పురములలో నొకటియగు హమాతును జయించి, హమాతునుండి మృతసముద్రము వఱకున్న దేశమంతటిని మరల ఇశ్రాయేలువారి వశముచేసి దానిని బహు గొప్ప స్థితికి గొని తెచ్చెను. ఈ జయములనుగూర్చి యోనా ప్రవచించెను (II రాజు $14^{13-28}$ దీనితో ద్వితీ $3^{17}$ ను సరిపోల్చుము). ఆమోసు ఇతని కాలమునందు ప్రవచించెను (ఆమో $1^{1}$). ఆ కాలమున ఇశ్రాయేలువారి భక్తి నీతి స్థితిగతులెంత హీనదశయందుండెనో స్పష్టముగా విశదపఱచి ($2^{6}$ $5^{27}$ $8^{4-6}$ మొ॥), దేవుని తీర్పునుగూర్చి తెలిపెను ($7^{1-9}$ $8^{7-10}$). నాశకరములగు ఈ ప్రవచనములను గూర్చి వినిన బేతేలు నందలి విగ్రహారాధికుఁడగు గురువు అతనిమీఁద యరొబామునకు ఫిర్యాదు జేసెనుగాని అందువలన ప్రవక్తకెట్టి శిక్షయు కలిగినట్లుగానరాదు ($7^{10-17}$). యరొబాము కాలమునందే ఉత్తర ప్రాంతములయందు హోషేయకూడ ప్రవచింప నారంభించెను. హోషే 1-3 అధ్యా. ఈ యేలుబడికి సంబంధించినవి. యరొబాము మృతినొందిన వెనుక అతని కుమారుఁడగు జెకర్యా సింహాసన మధిష్ఠించెను (II రాజు $14^{29}$).

**యర్మూతు** (Jarmuth = ఎత్తయిన స్థలము).

1. షెఫేలా ప్రదేశములోనున్న యొక పట్టణము. యెహోషువ దాని రాజును జయించి చంపించెను (యెహో $10^{3-27}$ $12^{11}$). దానిని యూదావారికిచ్చిరి ($15^{35}$). బబులోను చెఱ అయిన పిమ్మట ఈ పట్టణపు కాపురస్థులలో మిగిలిన వారక్కడికి తిరిగివచ్చి నివసించిరి (నెహె $11^{29}$). యెరూషలేమునుండి గాజాకు పోవు మార్గమున యెరూషలేముకు 15 మైళ్ల దూరము

నందు ప్రస్తుతమున్న యార్ముకు (*Yarmuk*) దీని యునికి యని అందరును తలంతురు (పటము II, D 1).

2. లేవీయులకిచ్చిన ఇశ్శాఖారు పట్టణము లలో నొకటి (యెహో 21[28]). I దిన 6[73] లో దీనికి రామోతు అను మారుపేరుగలదు. యెహో 19[21] లోని రెమెతు దినికి మఱియొక పేరని యను కొందురు. దీని యునికి తెలియదు.

**యర్హా** (Jarha). ఐగుప్తీయుఁడగు దాసుఁడు. ఇతని యజమానుఁడగు షేషాను ఇతనికి తన కుమార్తెనిచ్చెను (I దిన 2[34,35]). ఇతని సంతతివారి పేరులు 2[35-42] లో నున్నవి.

**యవలు** (Barley). పలెస్తీను దేశపు అన్ని భాగములలో పైరు చేయఁబడు నొక ధాన్య విశేషము. గుర్రములకును గాడిదెలకును దీనిని మేతగా నుపయోగించిరి (I రాజు 4[28]). పేద సాదలు పిండితో రొట్టెలు కాల్చుకొని తిందురు (న్యాయ 7[13] యోహా 6[9]). తినుటకు యవల రొట్టెయైనను లేదనుట కడు పేదరికమునకు సూచన. గిద్యోను ప్రధానులలో నొకఁడుగ నెంచఁబడనందున అతని యవల రొట్టెకు పోల్చిరి (న్యాయా 7[13]). యవల కోఁత గోధుమ కన్న ముందుగ వచ్చును (నిర్గ 9[31,32] రూతు 1[22] II సమూ 21[9]). J. C.

**యష్మూరాయి** రత్నములు 14 చూ॥

**యహకాను** (Jaakan). ఎదోమీయు లలోనొక తెగ (I దిన 1[42]). ఆది 36[27] లో వారికి అకాను అను పేరుగలదు. సంఖ్యా 33[31] లో వీరికి బెనేయాకాను (=యాకాను కొడుకులు) అను పేరుగలదు (బెనేయాకాను చూ॥).

**యహకోబా** (Jaakobah = మోసము చేయువాఁడు). షిమ్యోను ప్రధానులలో నొకఁడు (I దిన 4[36]).

**యహజా** యాహసు చూ॥

**యహజీయేలు** (Jaaziah =యెహోవా బలపఱచును). లేవీయుల మెరారీ తెగవారిలో నొకఁడు (I దిన 24[26,27]).

**యహజీయేలు** (Jahaziel = దేవుఁడు చూచును).

1. దావీదును సిక్లగులో కలిసికొనిన యొక బెన్యామీనీయుఁడు (I దిన 12[4]).

2. దావీదు మందసమును యెరూషలేమునకు తెచ్చుచుండఁగా దాని ముందర బూరల నూదిన యిద్దఱిలో నొకఁడు (I దిన 16[6]).

3. కహాతు తెగవారిలోని యొక లేవీయుఁడు (I దిన 23[19] 24[23]).

4. ఆసాపు కుటుంబములో చేరిన యొక లేవీయుఁడు. మోయాబీయులును అమ్మోనీయు లును యూదా మీఁద యుద్ధము చేయఁగా ఇతఁడు రాజైన యెహోషాపాతును ధైర్యపఱచి నారి యపజయమునుగూర్చి తెలిపెను (II దిన 20[14-17]).

5. చెఱకాలమునకు తరువాత బబులోను నుండి తిరిగివచ్చిన వారి కుటుంబములలో నొక కుటుంబమునకు పూర్వికుఁడు (ఎజ్రా 8[5]).

**యహజేరా** (Jahzerah = అతఁడు మళ్లించునుగాక). యాజకులలో నొకఁడు (I దిన 9[12]). నెహె 11[3] లో నితనికి అహజై అను పేరుగలదు (అహజై చూ॥).

**యహజ్యా** (Jahzeiah = యెహోవా చూచును). అన్య స్త్రీలను వివాహము చేసికొనిన వారు అట్టి స్త్రీలను విడిచిపెట్టవలెనని ప్రకటించుటలో ఎజ్రాకు సహాయము చేసిన నలుగురిలో నొకఁడు. అయితే ఆ నలుగురును ఎజ్రాకు సహాయము చేయక అతనిపని నడ్డగించి నట్లు మూలభాషలోని పదముకు సాధారణముగా అర్థము చెప్పెదరు (ఎజ్రా 10[15]).

**యహతు** (Jahath = ఒడిసిపట్టుకొనుట).

1. యూదా మనుమఁడు (I దిన 4[2]).

2. లేవీ మనుమఁడు (I దిన 6[20,43]).

3. గెర్షోము తెగలోనున్న షిమ్యా అను లేవీయుని కుమారుఁడు (I దిన 23[10]).

4. లేవీయులలో షెలోమోతు అనువాని కొడుకు (I దిన 24[22]).

5. రాజైన యోషీయా కాలములో ఆలయ మును మరమ్మతును చేయుటలో సహాయపడిన

యొక్క లేవీయుఁడు. ఇతఁడు మెరారీ తెగవాఁడై యుండెను (II దిన $34^{12}$).

**యహదీయేలు** (Jahdiel = దేవుఁడు సంతోషపఱచును). మనష్షే గోత్రపు వారిలోని పెద్దలలో నొకఁడు. అతని సంతతివారు యొర్దానుకు తూర్పున నివసించిరి (I దిన $5^{24}$).

**యహదో** (Jahdo = ఐక్యము). గాదు గోత్రీకులలో నొకఁడు (I దిన $5^{14}$).

**యహనై** (Janai). గాదు గోత్రపు ప్రధానులలో నొకఁడు (I దిన $5^{12}$).

**యహరెష్యా** (Jaareshiah = యెహోవా ఉద్ధరించును). బెన్యామీనీయుల పెద్దలలో నొకఁడు (I దిన $8^{27}$).

**యహరేయోరెగీము** (Jaare Oregim = యహరే నేఁతగాండ్రు). II సమూ $21^{19}$ లో ఇది దావీదు యోధులలో నొకఁడగు ఎల్హానాను యొక్క తండ్రి పేరు. ఈ వాక్యమునకు సంబంధముగా నుండు I దిన $20^{5}$ లో ఇతనికి యాయీరు (=యహరే) యను పేరు కలదు. ఇదే సరియై యుండవచ్చును. యోరెగీము అనుమాట ఇందులో లోపించియున్నది. ఇది నేతఁగాండ్రు అను నర్థము నిచ్చు పదమైయున్నది. ఎల్హానాను ఈఁటె నేఁతగాని కోసువలె నున్నదని II సమూ $21^{19}$ లో నున్నది కావున, ఈ యహరేయను పేరు వ్రాయుచు నేతఁగాఁడు అనునర్థము నిచ్చు యోరెగీము అను మాటనుకూడ లేఖకుడు పొరబాటుగా చేర్చెనని సాధారణముగా సనుకొందురు.

**యహలా** (Jaala, Jahalah = లేడి). జెరుబ్బాబెలుతో కూడ చెఱనుండి తిరిగివచ్చిన కుటుంబములలో నొక కుటుంబమునకు పూర్వికుఁడు (ఎజ్రా $2^{56}$ నెహె $7^{58}$). పిమ్మట ఇది ఆ కుటుంబమునకు పేరయ్యెను. వారు సొలొమోను సేవకుల సంతతి వారిలో చేర్చఁబడిరి.

**యహలేలు, యహలెయెలీయులు** (Jahleel = దేవుఁడు కఠినముగా బాధపఱచును, Jahleeites). జెబూలూను గోత్రికులలో నొక పెద్దకు పేరు. అతనినిఁబట్టి అది యతని కుటుంబమునకు పేరయ్యెను (ఆది $46^{14}$ సంఖ్యా $26^{26}$). ఈ కుటుంబికులకు యహలెయెలీయులు అను పేరు కలదు (సంఖ్యా $26^{26}$).

**యహశావు** (Jaasu, Jaasai = యెహోవా చేయును?). అన్య స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచి పెట్టినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{37}$).

**యహశీయేలు** (Jaaziel = దేవుఁడు చేయును). బెన్యామీనీయులకు అధిపతిగా నుండినవాఁడు. ఇతఁడు అబ్నేరు కుమారుఁడు (I దిన $27^{21}$). దావీదు యోధులలో నున్న మెసోబా యూరివాఁడను యహసీయేలు ఇతఁడై యుండవచ్చును ($11^{47}$).

**యహసయేలు** (Jahzeel = దేవుఁడు పంచిపెట్టును). నఫ్తాలీ పెద్దకుమారుఁడు (ఆది $46^{24}$). I దిన $7^{13}$ లో దీనికి యహనయేలు అను రూపము కలదు. ఇతఁడు నఫ్తాలీగోత్రికులలో నొక తెగవారికి పూర్వికుఁడై యుండెను. ఆ తెగవారికి యహసయేలీయులు లేక యహసయేలు సంతతి అను పేరు కలదు (సంఖ్యా $26^{48}$).

**యహిజ్కియా** (Jehizkiah = యెహోవా బలపఱచును). ఇశ్రాయేలు వారి రాజగు పెకహు కాలమందున్న పెద్దలలో నొకఁడు. ఇతఁడు ఎఫ్రాయిమీయుఁడు. యూదులలో పట్టఁబడినవారిని విడిపించుటకు ఇతఁడు సహాయపడెను (II దిన $28^{12}$).

**యహూదీతు** (Judith = యూదురాలు). ఏశావు భార్యలలో నొకతె. ఈమె హిత్తీయుఁడగు బేయేరీకుమార్తె (ఆది $26^{34}$).

**యహ్మాయి** (Jahmai = పుష్పించినవాఁడు?). ఇశ్శాఖారు గోత్రికులలో నొకఁడు (I దిన $7^{2}$).

# యా

**యాకీను, యాకీనీయులు** (Jachin = ఆయన స్థిరపఱచును, Jachinites).

1. షిమ్యోను కుమారులలో నాలుగవవాఁడు (ఆది $46^{10}$ నిర్గ $6^{15}$). I దిన $4^{24}$ లో నితనికి యారీబు అను మాఱుపేరుగలదు. ఇతని సంతతివారు యాకీనీయులు అనఁబడిరి (సంఖ్యా $26^{12}$).

2. అహరోను సంతతివారిలో నొకపెద్ద. దావీదు కాలములో అతని కుటుంబమునకు 21 వ

వంతు నిచ్చిరి (I దిన 24[17]). 9[10] నెహె 11[1] లో నీ కుటుంబమునుగూర్చిన సూచనలుగలవు.

3. దేవాలయము I 7 (1) (d) చూ॥.

**యాకీము** (Jakim = ఆయన లేవనెత్తును).

1. అహరోను సంతతివారిలో నొక పెద్ద. ఇతని కుటుంబికులు యాజకుల వంతులలో 12 వ వంతువారై యుండిరి (I దిన 24[12]).

2. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన 8[19]).

**యాకె** (Jakeh = భక్తిగల). సామెతల గ్రంథములో 30 అధ్యాయమును రచించిన ఆగూరు అనువాని తండ్రి (సామె 30[1]).

**యాకోబు** (Jacob = మోసపుచ్చువాఁడు, James).

1. ఇస్సాకు రిబ్కాల పుత్రుఁడు. ఏశావుకు కవల సోదరుఁడు. అతనికి తరువాత కొంచెము సేపటికి జన్మించినందున చిన్నవాఁడుగా నెంచఁబడెను (ఆది 25[26]). ఇస్సాకునకు అరువదియేండ్ల ప్రాయమున నితఁడు పుట్టెను (25[26]). ఇతఁడు సాధువై గుడారములలో నివసించుచు తల్లిని కనిపెట్టుకొనియుండెను (25[27]). ఇస్సాకు ఏశావును, రిబ్కా యాకోబును ప్రేమించిరి (25[28]). వేఁటకు వెళ్లి అలసి సొలసి వచ్చుచు మార్గమున కలుగూరవంటకమును వండుకొనుచున్న యాకోబు నది తనకు కొంచెము పెట్టుమని యడిగిన తన యన్న యేశావుపై జాలిఁదలంచక అతఁడు తన జ్యేష్ఠత్వపు హక్కు వదలుకొందునని ప్రమాణము చేసిన తరువాతనే వానికా వంటకముఁ దిననిచ్చెను (25[29-34]). ఇస్సాకు 137 సం॥ ప్రాయము గలిగి వృద్ధాప్యమువలన మందదృష్టి గలవాఁడైనప్పుడు తన మరణ మాసన్నమైనదని తెలిసికొని యేశావును దీవింపఁగోరి వేఁటమాంసము తెమ్మని పంపఁగా రిబ్కా ఆ సంగతిని తెలిసికొని యాకోబునకు ఏశావు వేషము ధరింపఁజేసి అతని దీవన ఇతనికి వచ్చునట్లు యుక్తిఁబన్ని ఇస్సాకును తల్లి కుమారు లిద్దరు మోసపుచ్చిరి. ఇట్లు కుయుక్తిచే జ్యేష్ఠునికి రావలసిన దీవనను పోఁగొట్టుకొనిన యేశావు రెండవమారు తమ్మునిచే మోసపోవుట నెఱిఁగిన వాఁడై తండ్రి చనిపోయినవెనుక తన తమ్ముని చంప నిశ్చయించుకొనెను (27[1-41]). ఈ సంగతిని రిబ్కా విని అతని కోపము చల్లారునందాక దూరపఱచఁ గోరి తన యన్న కుమార్తెలలో నొక దాని వివాహమాడుమను నెపమున యాకోబును హారానుకుఁ బంపెను. అతఁడు వెళ్లుచు బేతేలు సమీపమున రాత్రి గడపి నిద్రలో ఆకాశమునంటు నిచ్చెనను దేవదూతలు దిగుచు ఎక్కుచు నుండుటయు, దేవుఁడు ఆ నిచ్చెనకు పైఁగా నిలిచి తనతో నిబంధన జేసి దీవించుటను గూర్చిన దర్శనము చూచెను (27[42-46] 28[1,22]). యాకోబు పద్దనరాములో కనీసము ఇరువది సంవత్సరములు పరదేశిగా నివసించెను. అందు పదునాల్గు సంవత్సరములు లాబాను ఇద్దరు కుమార్తెలగు లేయా రాహేలుల కొఱకును, మఱి యాఱేండ్లు జీతమునకును కొలువు చేసెను. అతఁడు హారానునందుండఁగా లేయావలన రూబేను షిమ్యోను లేవీ యూదా ఇశ్శాఖారు జెబూలూను అను ఆరుగురు కుమారులను దీనాయను నొక్క కూతును, రాహేలు దాసియగు బిల్హావలన దాను నఫ్తాలీ యను కుమారులను లేయా దాసియగు జిల్పావలన గాదు ఆషేరులను కుమారులను రాహేలువలన యోసేపును మొత్తముమీఁద పదునొకండుమంది కుమారులను ఒక కుమార్తెను పడసెను (ఆది 29,30). చివరివాఁడు యాకోబునకు 90 లేక 91 సం॥ ల ప్రాయమప్పుడు గలిగెను (47[9] తో 41[46,47,54] 45[11] సరిపోల్చుము). ఆరు సంవత్సరములైన పిదప లాబానును అతని కుమారులును తనకు కలుగుచున్న యభివృద్ధిని చూచి అసూయాగ్రస్తులగుచున్నారని కనిపెట్టి తొందరపడినవాఁడై హారానుకు దాదాపు మూఁడు దినములంత దూరముగా తన మందలను యుఫ్రాతు నదియొద్దున మేపునప్పుడు (30[36] 31[22]) తన భార్యలను పిలిపించుకొని (31[4]) నదిని దాటి తన కుటుంబము వారితోను, తనకు కలిగినన్నిఁటితోను కనానుకు పారిపోయెను (31[21]). మూఁడు దినములకు తరువాత లాబాను గొఱ్ఱెబొచ్చు కత్తిరించుచు యాకోబు పారిపోయిన సంగతినిగూర్చి వినెను. అతఁడు తన బంధువులలోని పురుషులను కూర్చుకొని యాకోబును తరిమి కలిసికొనవలెనని బయలుదేరి వారము దినములు దీర్ఘప్రయాణములు చేసి చివరకు యుఫ్రాతుకు 300 మైళ్లు దూరమందున్న గిలాదు కొండమీఁద అతనిని కలిసికొనెను. దేవుఁడు

యాకోబుకు తోడైనందున లాబా నతని కీడు చేయనేరక అతనితో సమాధానము చేసికొనెను. వారచ్చట నొక రాళ్ల కుప్పను వేసి దానియొద్ద భోజనముచేసి దాని దాటి యెవరును రాకుండునట్లు నిబంధనచేసికొనిరి (31). దేవుని యనుగ్రహము పొందినవాఁడని మాపుటకు యాకోబుకు మహనయీము యబ్బోకులయొద్ద దైవదర్శనములు కలిగెను. యబ్బోకు నదియొద్ద అతనితో నొక నరుఁడు రాత్రి యంతయు పెనుగు లాడుచు అతని యాధిక్యము చూచి అతని తొడ గూటి యెముకను విఱుగఁగొట్టి చివర కతనిని నీవు దేవునితోను మనుష్యులతోను పోరాడి గెలిచితివి గనుక నికమీఁదట నీపేరు ఇశ్రాయేలే గాని యాకోబనఁబడదని చెప్పి అతని నాశీర్వదించి వెళ్లిపోయెను. యాకోబు—నేను ముఖాముఖిగా దేవుని చూచితిని అయినను నా ప్రాణము దక్కినదని ఆ స్థలమునకు దేవుని సన్నిధియని యర్థమిచ్చు పెనూయేలు అను పేరుపెట్టెను ($32^{22-32}$ పేరును $30^{20}$ హోషే $12^{4}$ తో సరిపోల్చుము). ఈ విషయము యాకోబు జీవితమునందు మిగుల ప్రాముఖ్యమైనదై యున్నది. ఇదివఱకతఁడేదైన నొక పనిని సాధించుటకు తన శక్తి సామర్థ్యము లను నమ్ముకొనెడివాఁడు గాని యిప్పటినుండి దేవునితో పోరాడుటకు తన కించిన్మాత్రము శక్తి లేదనియు, దేవుని దయలేనిది తానేమియు చేయఁజాలననియు, దాని పొందుటకు ఆయనను ప్రార్థించుటయే తగిన సాధనమనియుఁ దెలిసి కొనెను. కనుకనే యప్పటినుండి అతఁడు దేవుని నారాధించుటను గూర్చిన ప్రస్తావనలు తరుచుగ నుదాహరింపఁబడెను. యొర్దానును దాటక పూర్వము అతఁడు తన సోదరుఁడగు ఏశావును కలిసికొని తన నంతకాలము ఇంటికి దూరస్థునిగఁ జేసిన తన యపరాధములకై మన్నింపు నొందెను. తరువాత అన్నదమ్ము లిద్దరును వేరై ఏశావు శేయీరుకొండకును యాకోబు కనానుకును పోయిరి ($33^{1-18}$). కనానులో యాకోబు షెకెమునొద్ద దిగి షెకెము అధికారియొద్ద కొంత భూమిని కొని అచ్చట తన శిబిరమును వేసి బలి పీఠమును కట్టెను ($33^{18-20}$). ఇక్కడనుండు నప్పుడే అతని కుమార్తెయగు దీనా ఆ పట్టణపు అధికారి కుమారుఁడగు షెకెమువలన పరాభవింపఁ బడెను. అందువలన షిమ్యోను లేవియనువారు వారిపై కసిదీర్చుకొనిరి. అంతట యాకోబు కుమారులందఱును వచ్చి షెకెము పట్టణమును దోచుకొనిరి దానివలన తొందర కలుగునని యాకోబు మిగుల భయపడెను గాని అతని కుమారులా పట్టణము పట్టుకొని పురుషులనందఱిని చంపి వారి యాస్తిని దోచుకొని వారి స్త్రీలను పిల్లలను చెఱపట్టినందున ఆ పట్టణమును తాము జయించినట్లు యాకోబు ఒప్పుకొని అది తన జాతివారికిది నట్లెంచెను ($48^{22}$ దీనిని $37^{12}$ తో సరిపోల్చుము). యాకోబా స్థలమును వదలి దేవు నాజ్ఞప్రకారము బేతేలుకు వచ్చెను. అక్కడ అతని తల్లి దాదియగు దెబోరా చనిపోయి పాతి పెట్టఁబడెను (దెబోరా 1 చూ॥). అతఁడు పద్దనరామును వెళ్లక పూర్వము దేవుఁడతనికి కనఁ బడినట్లు అతఁడు తిరిగి వచ్చిన తరువాతను కనఁ బడెను ($36^{9}$ $27^{10-22}$). అప్పుడు అతనికి పెట్టిన క్రొత్త పేరును జ్ఞప్తిచేసి అబ్రాహాముతో తాను చేసిన నిబంధనను స్థిరపఱచెను. హెబ్రోనుకుఁ బోవుచు మార్గమధ్యమున బేత్లెహేమును సమీ పించుచుండఁగా అతని కడసారపు పుత్త్రుఁడగు బెన్యామీనును కనలేక అతని ప్రియ భార్యయగు రాహేలు చనిపోయెను ($35^{19-20}$). చివరకు యాకోబు మమ్రేయొద్దనున్న తన తండ్రియగు ఇస్సాకు నొద్దకు వచ్చెను ($35^{27}$). తరువాత 23 యేండ్లకు ఇస్సాకు మరణ మొందఁగా యాకోబు ఏశావు లిద్దరు అతనిని పాతిపెట్టిరి ($35^{28-29}$). యాకోబు మమ్రేయొద్ద ముప్పది మూఁడేండ్లుండి నట్లు కనఁబడుచున్నది. యాకోబు తిరిగి వచ్చిన పిదప పదేండ్లు హెబ్రోనులో నుండెను ($37^{34}$). ($37^{2}$ తో సరిపోల్చుము) ఐగుప్తునకు వెళ్లినప్పుడు 130 యేండ్లు గలవాఁడైయుండెను ($47^{9}$). అత డచ్చట 17 సం॥లు బ్రతికెను. అతఁడు యోసేపు కుమారులను ప్రత్యేకముగాను, తన కుమారులను దీవించిన పిమ్మట 147 సం॥ ప్రాయమప్పుడు ($47^{28}$ 48,49) మరణమయ్యెను. అతని శవమును సుగంధ ద్రవ్యములతో సిద్ధపఱచి గొప్ప యాడంబరముతో కనానుకు దీసికొనివెళ్లి మక్పేలా గుహలోనుంచిరి ($50^{1-14}$). యాకోబునందు గొప్ప లోపములను గుర్తింపవచ్చును. అతని యక్రమము లకై అతఁడు చాల శిక్షననుభవించెను. ముసలి

తనమందు యోసేపునుగూర్చి మఱింత దుఃఖించెను. తన యౌవనకాలపు పాపములనుగూర్చియు, దేవుని యెదుట తన హీనబ్రతుకునుగూర్చియు అతఁడు తరువాత మృదుభావముతో వెలిపుచ్చినను, దేవుని కృపనుగూర్చి స్పష్టముగా దెలిపెను ($48^{15,16}$). చివరకు దేవునియందు తనకుండిన విశ్వాసమును గూర్చి ఉత్సాహవంతుఁడయ్యెను ($48^{21}$ హెబ్రీ $11^{21}$). యాకోబు సంతానీకులు బైబిలునందు ఇశ్రాయేలీయులని పిలువఁబడిరి (నిర్గ $14^{12,29}$ $15^{1}$ మొ॥). ప్రవక్తలు తమ ప్రవచన కావ్యమునందు యాకోబు ఇశ్రాయేలు అను పదములను జంటగా వాడిరి (ద్వితీ $38^{10}$ యెష $43^{1,22}$ $44^{1}$ ఇశ్రాయేలు చూ॥). W.

2. జెబెదయికుమారుఁడు (మ $10^{2}$ మా $3^{17}$ లూ $6^{14}$). పన్నెండుగురి అపొస్తలులలో నొకఁడు అపొస్తలుఁడగు యోహానుయొక్క అన్న. వారు జాలరుల వృత్తివలన జీవనము చేసికొని జీతగాండ్రు గలవారై యుండిరి గనుక వారు కొంత స్థితిగలిగి జీవించినవారని కనఁబడుచున్నది (మా $1^{20}$) వీరి తల్లిపేరు సలోమే ($15^{40}$). యాకోబు యోహానులు వ్యాపారమందు పేతురు, అంద్రెయలతో భాగస్థులైయుండిరి (లూ $5^{10}$). యేసు వారిని పిలిచినప్పుడు వారందఱు కలిసి పిగిలిపోయిన తమ వలలను బాగుచేయుచుండిరి (మ $4^{21,22}$ మా $1^{19,20}$), అపొస్తలుల నామ జాబితాలలో అన్నదమ్ములైనందున యాకోబు పేరు వెంబడి యోహాను పేరెల్లప్పుడు వ్రాయఁబడి యుండును (మ $10^{2}$ మా $3^{17}$ లూ $6^{14}$). వీరి యొక్క ఉద్రేక స్వభావమునుబట్టి వీరికి యేసు బోయనేర్గెసు అనగా ఉఱుమువంటి వారను పేరు పెట్టెను (మా $3^{17}$). యాకోబు, యోహాను, పేతురు కడమ అపొస్తలులందఱికంటె ముఖ్య సమయములయందు యేసుతో కలిసియుండిన వారు గనుక వారే ఆయనకు ప్రియులని కనఁబడుచున్నది (మ $17^{1}$ మా $9^{2}$ లూ $9^{28}$). యాకోబు క్రీ॥ శ॥ 44 సం॥ మున రాజైన హేరోదు అగ్రిప్పవలన హతసాక్షియాయెను (కార్య $12^{2}$).

3. అల్ఫయికుమారుఁడు. ఇతనిని జెబెదయి కుమారుఁడైన యాకోబును వేఱుపఱచుటకై పొట్టి వాఁడయిన యాకోబను బిరుదు పేరు పెట్టఁబడెను. యోహా $19^{25}$ లో చెప్పఁబడిన క్లోపా అను పేరు ఇతని తండ్రియైన అల్ఫయియొక్క మాఱు పేరని కొందఱి యభిప్రాయముగాని అందుకు అంగీకరించఁదగిన ఆస్పదములు లేవు. ఇతని తల్లి పేరు మరియ. ఈమె యేసు మరణసమయమున ఆయన సిలువదగ్గర నిలిచి తరువాత ఆయన సమాధిని దర్శించెను (మ $27^{56}$ మా $15^{40}$ లూ $23^{49}$ $24^{18}$). పారంపర్య సాంప్రదాయముల యందీ యాకోబు శిష్యుఁడు కాకమునుపు సుంకరియై యుండెనని సూచించఁబడెను.

4. ప్రభువు సహోదరుఁడు (మా $6^{3}$). యేసు బ్రతికియున్నంతవఱకును ఆయన సహోదరులు కూడ ఆయనయందు విశ్వసించినవారుకారు (యోహా $7^{5}$). గనుక ఆయన సహోదరుఁడగు యాకోబు అపొస్తలుఁడను అభిప్రాయ మంగీకరించఁదగదు. I కొరి $15^{7}$ నందు యేసు మృతులలోనుండి లేచినతరువాత ఆయన యాకోబుకు ప్రత్యక్షమాయెనను మాటనుబట్టి ఇతఁడును ఆయన భక్తుఁడాయెనని తలంచఁదగును. అతఁడు భక్తుఁడైన తరువాత అందఱివలన మిగుల ఘనపఱచఁబడినవాఁడయి యెరూషలేము నగరపు సంఘమునకు అధ్యక్షుఁడాయెను. క్రొత్త నిబంధనయందు వివరింపఁబడినట్లు ఆ సంఘములో జరిగిన మూఁడు ముఖ్యకార్యములందు నితఁడు ప్రధానుఁడుగా కనఁబడుచున్నాఁడు. పౌలు భక్తుఁడైన తరువాత 3 సం॥లకు యెరూషలేమునకుపోయి అక్కడ పదిహేను దినములు సీమోను ఇంటియందు బసచేసి యాకోబునుగాక మఱెవరిని చూడలేదని గల $1^{18,19}$ యందు తెలియఁజేయుచున్నాఁడు. అమీఁదట 14 సం॥లు అయిన తరువాత పౌలు తిరిగి యెరూషలేమునకు పోఁగా ($2^{1-10}$) అక్కడ జనులు సున్నతి పొందుట అవసరమో కాదో యను తర్కమునుగురించి జరిగిన సభకు ఈ యాకోబు అగ్రాసనాధిపతియై యుండెను. ఇది కార్య 15 నందు వివరింపఁబడిన సభ. పౌలు తన మూఁడవ సువార్త యాత్ర ముగించి యెరూషలేముకువచ్చి తన పనివిషయమై తెలియఁజేయుటకు యాకోబును దర్శించెను (కార్య $21^{18-19}$). క్రొత్త నిబంధనయందు యాకోబు వ్రాసిన పత్రికయని చెప్పఁబడిన ఉత్తరమును రచించినవాఁడీయనే. అందులో తాను ప్రభువు సహోదరుఁడనని చెప్పక తానా ప్రభు

యేసుకు దాసుఁడనని చెప్పుటవలన మిగుల వినయ స్వభావముగలవాఁడని వెల్లడియగును.

ఇతనిని గుఱించి చెప్పఁబడిన ఇతిహాసములను చూడఁగా నితఁడెంత ఘనుఁడైయుండెనో తేటపడును. అప్పటి కాలపు యూదులు ఆయన యథార్థ ప్రవర్తననుబట్టి ఆయనకు నీతి నిష్ఠాపరుఁడను బిరుదాంకమును పెట్టిరి. అతఁడు పుట్టినది మొదలుకొని నాజరీయుల వ్రత మనుసరించి మద్యపానమును మాంసభక్షణను విసర్జించి ఆ తెగవారి వాడుక ప్రకారమెల్లప్పుడును నారబట్టలను మాత్రము ధరించుకొనినవాఁడఁట. అతఁడు యెరూషలేము దేవాలయమందు తన జనులక్షేమము కొఱకు ఎడతెగని ప్రార్థన జేయుచుండుటవలన అతని మోకాళ్లు ఒంటె మోకాళ్లవలె కాయలు కాచియుండెనఁట. శాస్త్రులును పరిసయ్యులును ఇతనిమీఁద అసూయ వహించి దేవాలయము యొక్క మంటపము మీదనుండి అగడ్తలోకి త్రోసివేసిరిగాని వెంటనే మరణము కాకున్నందున వారతనిమీద రాళ్లు రువ్వి కడకు ఆ దేశపు చాకలివాండ్లుపయోగించిన యొక చిన్న మొద్దు తునకతో అతని కొట్టి చంపిరఁట.

M.

**యాకోబు బావి (Jacob's well).** సమరయ స్త్రీతో సంభాషించినప్పుడు యేసు కూర్చుండి యున్నబావి. ఈ చరిత్ర సంబంధములో తప్ప (యోహా $4^{5-12}$), ఈ పేరు బైబిలునందు మరెచ్చటను గానరాదు. ఈ ప్రదేశమునందు యాకోబు నివసించెనని ఆది $33^{13-20}$ $37^{12}$ వలనఁ దెలియుచున్నది. బిర్ యాకోబు (*Bir y'kub*=యాకోబు బావి) అని ప్రస్తుతము చెప్పఁబడునదీ బావియే యని 4 వ శతాబ్దము నుండి తలంచుచున్నారు. అది గెరిజీము ఏబాలు కొండలకు మధ్య ప్రస్తుతముండు నబ్లూస్ (*Nablous*) అను ఊరికి తూర్పున ఒక క్రోసెడు దూరముననున్నది. అది 100 అడుగులకన్న నెక్కువలోతు గలదైనను 1875 సం॥ న 75 అడుగుల లోతుమాత్రముండెను. గచ్చుతో కట్టఁబడియున్నది. దానికిపైఁగా నొక దేవాలయపు శిథిలములున్నవి. ఆ బావినీరు చుట్టుప్రక్కల నుండు నీటికన్న మంచిది (సుకారు, షెకెము చూ॥).

**యాకోబు వ్రాసిన పత్రిక (James Epistle of).**

1. ప్రామాణికత్వము. యాకోబు వ్రాసినట్టు చెప్పఁబడిన ఈ పత్రిక చాలకాలమువఱకు వివాదాస్పదములైన పత్రికలలో చేర్చఁబడినందున ప్రాచీన క్రైస్తవులు దాని ప్రామాణికత్వమును గుఱించి సంశయించిరని తెలియుచున్నది. క్రీ॥ శ॥ 230 సం॥ మందుండిన ఒరిగెను (*Origen*) కాలమునకు ముందు జీవించిన గ్రంథకర్తలలో నెవరును ఆ పత్రికలో దీనిమాటలను ప్రశంసింపకపోయిరి. ఒరిగెను తాను దాని సంగతిని చెప్పినను అనుమానించినట్టు చెప్పియుండెను. అయినను క్రీ॥ శ॥ 95-96 సం॥మున రోమాపురి సంఘాధ్యక్షుఁడుగా నుండిన క్లెమెంటును (*Clement*), క్రీ॥ శ॥ 178 సం॥మున జీవించిన ఐరేనియసును (*Ireneus*) ఈ పత్రికలోని మాటల నెత్తి చెప్పిరి. అదియునుగాక రెండవ శతాబ్దమందు తర్జుమచేయఁబడిన సిరియభాష బైబిలులో నీ పత్రిక చేర్చఁబడి యుండెను గనుక అప్పటి కది చాలమట్టుకు ప్రమాణ గ్రంథముగా నంగీకరించఁబడెనని నిస్సందేహముగా చెప్పఁగలుగుదుము.

పత్రికయొక్క లక్షణములను పరిశీలించుట వలన నది నిజముగా యాకోబుచే రచింపఁబడినదే గాని కల్పనాయుక్తిముకాదని స్పష్టమగును ఎట్లనిన:—(1) గ్రంథకర్త తాను యేసుక్రీస్తు యొక్క దాసుఁడనని బహు వినయముగా చెప్పుచున్నాఁడు. ఇది కల్పనా పత్రికలక్షణము కాదు. (2) గ్రంథకర్త తాను యూద క్రైస్తవుఁడై తనవంటి క్రైస్తవుల నిమిత్తమై వ్రాసెనని పత్రికలోని దృష్టాంతములవలన విశదమగును. అబ్రాహామునుగుఱించి మన పితరుఁడనియు పత్రిక చదువువారు ఆరాధనకు కూడుకొను స్థలమునకు మీ మందిరమనియు, దేవునికి యూదులలో వాడుకయుండిన సైన్యములకు అధిపతియగు యెహోవాయనియు చెప్పుటవలన పత్రిక రచించినవాఁడు యూదుఁడని స్పష్టమగును.

(3) పత్రికయందు పలెస్తీనుదేశపు వృత్తులను ధాన్య ఫలాదులను గుఱించిన వివరము లుండుట వలన గ్రంథకర్త యాదేశవాసియని నిస్సందేహ

ముగా తెలియును. ఇందు కీ దిగువ వచనముల లోని వివరములు దృష్టాంతములగును. వడగాలి ($1^{11}$), తియ్యని నీరు చేదునీరు ($3^{11}$), అంజూరపు చెట్టున ఒలీవపండ్లును ద్రాక్షతీగె ($3^{12}$), తొలకరి వర్షము కడవరివర్షము ($5^{7}$) అనునవి. ఈ వివరములు పలెస్తీను దేశ నివాసికి మాత్రమే బాగుగా తెలిసియుండును.

2. గ్రంథకర్త. బహిస్సాక్ష్యమును అంతస్సాక్ష్యమునుబట్టి యీ పత్రిక నిశ్చయముగా యేసు సహోదరుడగు యాకోబువలన రచింపబడెనని నమ్ముటకు చాలినన్ని యాస్పదములు గలవు (యాకోబు 4 చూ॥).

3. ఈ పత్రిక యెవరియొద్దకు పంపబడెను. $1^{1}$ యందు యాకోబు అన్యదేశములయందు చెదరియున్న పన్నెండు గోత్రములవారికి వ్రాయునది యనుమాటనుగూర్చి వ్యాఖ్యాతలు వెవ్వేరు విధముల నర్థము చెప్పుదురు. మొట్టుకు యాకోబు పలెస్తీను దేశమునకు దూరముగానుండిన యితర దేశములయందలి క్రైస్తవుల నిమిత్తము వ్రాసెనను నభిప్రాయము పెక్కండ్రంగీకరింతురు. ఈ అన్యదేశములయందలివారు ఐగుప్తు, బబులోను సిరియదేశములలో కాపురముండిన భక్తులని ఒప్పుకొనతగును. యాకోబు ముఖ్యముగా క్రైస్తవుల నిమిత్తము వ్రాసియుండినను వారిమూలమున యూదులు సత్యమును తెలిసికొని అవలంబింప వలెనను కోరిక గలిగి వ్రాసెను.

4. కాలస్థాననిరూపణము క్రీ॥ శ॥ 44-49 సం॥ ముల మధ్యను యెరూషలేము పట్టణమం దీ పత్రిక రచింపబడెను.

5. ఉద్దేశము. సత్ప్రవర్తనయే విశ్వాసమునకు నిదర్శనము అనునది యీ పత్రికయొక్క ముఖ్య విషయము గనుక గ్రంథకర్త తన పత్రిక మూలముగా హింసవలన బాధపడువారిని ఆదరించి సత్ప్రవర్తనకు ప్రేరేపించి, మాటలను, సంపదను, కలహములను, ఐహికచింతను వీటన్నిటినిగూర్చి వారిని హెచ్చరించి యథార్థవిశ్వాసము, ప్రార్థన, జ్ఞానము, వీటివలన కలుగు మేలులను వివరింప నుద్దేశించెను.

6. ముఖ్యభాగములు:

I. వందనములు, హింసలవలని ఫలితము; ఐశ్వర్యమశాశ్వతము; శోధన మానవ దుష్ట స్వభావ జనితముగాని దైవకృతముకాదు; సంపూర్ణమైన దైవభక్తి క్రియాసాధకమైనది.

II. మానవ సన్మానము; క్రియలేని విశ్వాసమువట్టిది; ఇందుకు అబ్రాహాము రాహాబుల చరిత్రము లుదాహరణములు.

III. నోరును భద్రపరచుట, పరమజ్ఞానము సమాధాన దాయకమైనది.

IV. శరీరేచ్ఛలు కలహములకు మూలము: దీనత్వమును, పశ్చాత్తాపమును శ్రేయస్కరము; తానొకటి తలచిన దైవమొకటి తలచును.

V. అన్యాయ సంపాద ఖండనము; దీర్ఘ సహనము; వ్యాధిగ్రస్థులకు నూనె రాచుట; ప్రార్థన; పాపులను గుణపరచుటవలని ఫలితము.

M.

**యాగూరు** (Jagur = సత్రము). యూదా గోత్రపు దక్షిణ సరిహద్దు దగ్గఱనుండు నొక యూరు (యెహో $15^{21}$). దీని సరియైన యునికి తెలియదు.

**యాజకుల వస్త్రములు** (Priest's-Vestments).

I. యాజకులైన వారు తమ విధ్యుక్త ధర్మములాచరించునప్పుడు నార గుడ్డతో నేయబడిన యీ దిగువవాటిని ధరింపవలెను.

1. నారలాగులు (నిర్గ $28^{42,43}$).

2. చొక్కాయిలు (నిర్గ $28^{8}$ లేవీ $8^{13}$). ఇవి నిలువుటంగీలు (నిర్గ $28^{4}$). వీటిని సన్నానారతో బుటేదారు పనిగా జేయించిరి ($28^{39}$).

3. దట్టీ (నిర్గ $29^{9}$). దీనికి బుటేదారు పని జేసిరి.

4. పాగా లేక కుళ్లాయి ($29^{9}$) ఇదియు పైవాటివలె బుటేదారు పనియై యుండెను ($28^{39}$).

5. నారబట్టతో జేసిన ఏఫోదునుకూడ ధరించుకొన్నట్లున్నది (I సమూ $22^{18}$). బాలుడైన సమూయేలును ($2^{18}$), దావీదును (II సమూ $6^{14}$ I దిన $15^{27}$) అట్టివాటిని ధరించుకొనిరి. యాజ

కులుగాక యితరులు ఇట్టివి వేసికొనరాదను శాస్త్ర నియమ మేదియుఁ గానరాదు.

యాజకులిట్లు సన్నని తెల్లనారవస్త్రములను ధరించుకొనుట, దేవునియెదుట సేవజేయు వారి కుండవలసిన శుద్ధికి యొక గురుతుగా నున్నది.

II. ప్రధాన యాజకుని వస్త్రములు. వీటి వివరము బైబిలునందు మఱీ తేటగా నున్నది. వారు ఆరువిధములగు ఉడుపులను ధరించిరి. యాజకులు ధరించునవి మాత్రమేగాక, ప్రధాన యాజకులు తమ యుద్యోగ ధర్మము జరుపునప్పుడు ఈ దిగువవాటిని ధరించవలసి యుండెను.

1. పతకము. చతురముగా నుండు నొక విలువైన యలంకారము. దానిని బంగారుతోను నీలి ధూమ్రరక్త వర్ణపునూలుతోను పేనిన సన్న నారతోను చేసిరి. వరుసకు మూఁడేసి రత్నముల చొప్పున నాలుగు వరుసల రత్నములు దాని కుండెను (రత్నములు చూ.). ఒక్కొక్క రత్నముపై నొక్కొక గోత్రపుపేరు చెక్కఁబడెను (నిర్గ $28^{16-28}$ $39^{8-21}$). అదెంత విలువ గలదైనను దానియందు ఊరీము తుమ్మీము లనునవి యుండుటవలననే దానిని ఘనముగ నెంచిరి. ఈ పతకము ప్రధానయాజకుఁడు ప్రజలకొఱకై



ప్రధానయాజకుఁడు

చేయవలసిన విజ్ఞాపనను సూచించినను, దేవుని యొద్ద విచారణ చేయుటలో నుపయోగించిన ఊరీము తుమ్మీము లందు దానియందుండుటచేత న్యాయవిధాన పతకమనుపేరు దానికిఁ గలిగెను (ఊరీము తుమ్మీము చూ॥).

2. ఏఫోదు. ఇదియు పతకమువలె బంగారు తోను నీలి ధూమ్రరక్త వర్ణపు నూలుతోను పేనిన సన్ననారతోను బుటేదారు పనిగాఁ జేయఁ బడినదైయుండెను (నిర్గ $28^{6-12}$ $39^{2-7}$). అది భుజములమీఁదనుండి వ్రేలాడుచుండెను. భుజ ములమీఁద బంగారపు కడియములుండెను. పతక మును గొలుసులతో దానికి తగిలించిరి. భుజ ములపైనున్న రెండు పచ్చలు అను రత్నముల మీఁద చెఱియారు గోత్రములపేర్లు చెక్కిరి. ఏఫోదుకు పతకమును, ఊరీము తుమ్మీమును తగిలించుటవలన దానికి అంత ప్రాముఖ్యత గలి గెను. దావీదు దేవుని చిత్తమును తెలిసికొనఁగోరి నప్పుడు ఏఫోదును తెప్పించుకొనెను (I సమూ $23^{9,10}$ $30^{7,8}$). దాని నీకారణముచేత విగ్రహ ముగా నెంచిరి (న్యాయా $8^{27}$ $17^{5}$).

3. ఏఫోదు నిలువుటంగీ. అతఁడు ఏఫోదు క్రింద ధరింపవలసిన మఱియొకటి చొక్కాయై యుండెను (నిర్గ $28^{31-35}$ $29^{5}$ $39^{22-26}$). దీని నీలిదారముతో చేసిరి. దీనికి చేతులు లేవు. ఇది రొమ్మును వీపును కప్పి మోకాళ్ల క్రిందికి వచ్చెను. దీని అంచుచుట్టు బంగారు గంటలను దానిమ్మ పండ్లను కట్టిరి. ఏఫోదు దీనిపై ధరింపఁబడుట వలన దీని ఘనముగా నెంచిరి. తక్కిన యాజ కులు ధరించిన యేఫోదులు వేఱైనవి (పైన I 5 చూ॥).

4. పాగా. దీనిని సన్ననారబట్టతోఁ జేసిరి. యెహోవా పరిశుద్ధుఁడను మాటలుగల యొక బంగారు రేకు దానికిఁ గట్టఁబడెను (నిర్గ $28^{36,39}$). తరువాతి కాలమునందీ పాగాను నీలిగుడ్డతోను బంగారముతో నలంకరించి కిరీటమువంటి భూషణ ముగాఁ జేసినటుల కనఁబడుచున్నది (పురా 3,7, 1-6 సైరాక్సు $45^{8-13}$ I మక్క $10^{20}$). ప్రధాన యాజకుఁడు పాపాచ్ఛాదన దినమున తప్ప (లేవీ $16^{4}$) తక్కిన సమయములలో తన యుద్యోగ ధర్మములను ఆచరించు నప్పుడెల్ల దీనిని ధరించు వాఁడు.

5. దట్టి. దీనిని బుటేదారు పనిగాఁ జేసిరి (నిర్గ $28^{39}$).

సన్నని నారతో జేసిన లాగులు చొక్కాయిలు అన్నిటికన్న క్రింద ధరింపవలెను (నిర్గ $28^{40,42}$). ఇవన్నియు పాత నిబంధన గుఱుతులన్నిటివలె దేవుని సేవ గంభీరమైనది కావున దానిని చేయువారు పవిత్రులైయుండి ఇట్టి ఘనమైన సేవకు తగినవాటితో ఆయన సన్నిధానమునకు రావలెనని సూచించుచున్నది.

### యాజకులు (Priests).

1. పేరు. యాజకులని తెనిఁగించిన హెబ్రీ పదమునకు పరిచారకులని శబ్దార్థము. ఆ పదము సాధారణముగా దేవాలయముయొద్ద పనిచేయు వారిని మాత్రమేగాక రాజులదగ్గర పనిచేయు వారిని కూడ సూచించును. ఇట్లాపదమును సభాముఖ్యులు (II సమూ $8^{18}$ $20^{24}$) మంత్రి (I రాజు $4^{5}$) యని తెనిఁగించిరి. మతాచారములను జరుపువారు అహరోను సంతానికులై యుండిరి గాన వారిని యాజకులైన లేవీయులనియు (యెహో $3^{3}$), పరిచర్య చేయు (= యాజక ధర్మము జరిగించు) లేవీయులనియు (యెహె $44^{15}$) పిలిచిరి. యిర్మీ $33^{21}$ నందు లేవీయులు పరిచారకులైన లేవీయులగు యాజకులనఁబడిరి. చెఱకాలమునకుఁ పిమ్మట వ్రాయఁబడిన గ్రంథములలో ననేకచోట్ల యాజకులును లేవీయులును జతపనివారుగా నున్నట్లు కనఁబడును (I దిన $9^{2}$ $13^{2}$ $15^{14}$ II దిన $11^{14}$ ఎజ్రా $1^{5}$ నెహె $7^{73}$ మొ॥). యాజకులు అహరోను సంతతివారనఁబడినట్లు స్పష్టముగా నున్నది (లేవీ $1^{5}$ II దిన $26^{18}$ $29^{21}$ $35^{14}$ యెహో $21^{19}$ నెహె $10^{38}$) అహరోనుకూడ లేవీ వంశస్థుఁడగుటచే అతని సంతతివారినికూడ లేవీయులనవచ్చునుగాని, లేవీయులు అను పదము సాధారణముగా దేవాలయమునకు సంబంధించిన ఇతరమైన పనులను జేసిన వారికి వాడఁబడెను (లేవీయులు చూ॥).

2. చరిత్ర, సూచనలు. ఇశ్రాయేలీయులలో మాత్రమేగాక వారికి చుట్టునుండు ఇతర దేశములలో నున్న యాజకులను గూర్చియు బైబిలునందు సూచనలున్నవి. ఇట్లు మెల్కీసెదెకు (ఆది $14^{18}$), ఐగుప్తులోని ఓను యాజకుఁడగు పోతీపెర (ఆది $41^{45}$ $46^{20}$), యిత్రో (నిర్గ $2^{16}$), మీకా అను వాఁడు (న్యాయా $17^{5,6}$), ఫిలిష్తీయుల యాజకులు (I సమూ $5^{5}$) మొదలగు వారికిని ఈ బిరుదు గలదు. కార్య $14^{13}$ గ్రీకు దేవతలకు అర్పణము లర్పించిన వారికిని ఈ బిరుదున్నను దానిని పూజారి యని తెనిఁగించిరి. యాజకులను నియమింపక పూర్వము కుటుంబ పెద్దలే ఈ ధర్మము నాచరించుచు వచ్చిరి. కయీను, హేబెలు (ఆది $4^{3,4}$), నోవహు ($8^{20}$), అబ్రాహాము ($12^{8}$), ఇస్సాకు ($26^{25}$), యాకోబు ($35^{1}$), యోబు (యోబు $1^{5}$) మొదలగువారు ఆ ధర్మము జరిగించిరి గాని మోషే ధర్మశాస్త్ర మాచరణలోకి వచ్చినప్పటినుండి అహరోను సంతతివారే పనికి ప్రత్యేకింపఁబడిరి. వారి యాజకత్వము యెరూషలేము నశించినందాక నిలిచెను (ప్రధానయాజకుడు చూ॥). క్రీస్తు దానిని నెఱవేర్చెను. ప్రస్తుత మాయనను నమ్ముకొనువారందఱు ఆత్మీయ అర్పణముల నర్పించుటకై నియమింపఁబడిన యాజకులై యున్నారు (I పేతురు $2^{9}$).

3. యాజకుల పనులు, విధులు. ఆచారములను జరుపుట, దేవుని చిత్తమును ఊరీము తుమ్మీములద్వారా తెలిసికొనుట, దానిని ప్రజలకుఁ దెలుపుట అను మూఁడునైయుండెను (నిర్గ $28^{30}$ ఎజ్రా $2^{63}$ సంఖ్యా $16^{40}$ $18^{5}$ యిర్మీ $18^{18}$ యెహె $8^{26}$ మీకా $3^{11}$). వారికి కొన్ని విశేష చట్టములుండెను. విధవరాలినిగాని విడనాడఁబడిన దానినిగాని, భ్రష్టురాలినిగాని గాక ఇశ్రాయేలీయులలోని కన్యకనే వివాహమాడవలెను (లేవీ $21^{7,12,13}$ ఎజ్రా $10^{8,9}$). ఈ హేతువుచేత పురుషుల వంశమును నిరూపణ జేసినట్లే యాజకులలో స్త్రీలకును వంశావళులు వ్రాయవలసిన అవసరముండెను. వారు తమ యాజక ధర్మముల నాచరించునప్పుడు వారికి నియమింపఁబడిన విశేష వస్త్రములను ధరింపవలెను (యాజకుల వస్త్రములు II చూ॥). వారికి 13 పట్టణములను స్వాస్థ్యముగా నిచ్చిరి (యెహో $21^{10-19}$). ఈ పట్టణములలోను ఇతర స్థలములలోను వారు నివసించుచుండిరిగాని అందఱు యెరూషలేమునందు నివసింపలేదు. వారు వంతుల ప్రకారము పరిచర్య చేయవలెనని దావీదు వారికి 24 వంతులను నియమించెను. గొప్ప పండుగులలో అందఱును యెరూషలేములో సేవజేసినను తతిమ్మా

సమయములలో అప్పటికి నియమింపబడిన వంతులు మాత్రము తిరిగి పలెస్తీనుకు వెళ్లినట్లున్నది (ఎజ్రా $2^{36-38}$) గాని లూకా $1^{5,9}$ ని బట్టి మరల 24 వంతు లేర్పాటైనట్లూహింపవచ్చును. యాజకులలోని ఈ వంతులకు పెద్దలుండిరి. అదియుం గాక ప్రధానయాజకునికి తరువాత రెండవ యాజకుడనబడిన పెద్ద యాజకుడొకడుండెను (II రాజు $25^{18}$). దేవుని మందిరమున కధిపతి యను మరియొక బిరుదు నతనికుండెను (II దిన $31^{13}$ నెహె $11^{11}$). కార్య $4^{1}$ $5^{24}$ లో నున్న దేవాలయపు అధిపతి ఇతడే యని కొందరి యభిప్రాయము (ప్రధాన యాజకుడు, లేవీయులు చూ॥).

**యాజీజు** (Jaziz = తిరిగి గడించువాడు). దావీదు మందల కాపరులలో ప్రధాన కాపరి (I దిన $27^{31}$).

**యాజేరు, యాజెరు** (Jazer = సహాయకరము). యొర్దానుకు తూర్పున గిలాదులోనున్న యొక పట్టణము (II సమూ $24^{5}$ I దిన $26^{31}$). ఇశ్రాయేలీయులు దానిని పట్టుకొని అమోరీయుల యొద్దనుండి దాని నపహరించిరి (సంఖ్యా $21^{32}$). దీనిని పంపకములో గాదు గోత్రమున కిచ్చిరి (యెహో $13^{25}$ II సమూ $24^{5}$ I దిన $26^{31}$). గాదీయులు ప్రాకారములుగా కట్టిన పట్టణములలో నిది యొకటియై యుండెను (సంఖ్యా $32^{35}$). మరియు ఇశ్రాయేలీయులు లేవీయులకు నిచ్చిన 48 పట్టణములలో నొకటి (యెహో $21^{39}$ I దిన $6^{81}$). పశువులను మేపుటకు దానిచుట్టును మంచి బీడులుండెను (సంఖ్యా $32^{1,3}$). అది ద్రాక్షతోటలకు ప్రసిద్ధికెక్కియుండెను (యెష $16^{8,9}$ యిర్మీ $48^{32}$). అది యెషయా కాలమునకు లోగా మోయాబీయుల వశమయ్యెను (యెష $16^{8,9}$). మక్కబీయుల కాలములో అది అమ్మోనీయుల వశమున నుండెను (I మక్క $5^{8}$). ప్రస్తుతమున హెష్బోనుకు ఉత్తరమున 15 మైళ్లదూరములో నుండు కుర్బెట్ సార్ (*Kurbet-sar*) అను పాడు శేషముల స్థలమే దానియునికి యని సాధారణముగా నను కొందురుగాని అది రూఢికాదు (పటము I, G 8).

**యాత్ర కీర్తనలు** (Songs of Ascents). ఈ కీర్తనలను సూచించు మూలపదమునకు ఎక్కి-కీర్తనలని శబ్దార్థము. 120-134 కీర్తనలపై వ్రాతలలో నీ పేరుగలదు. యాత్రికులు యెరూషలేమునకు పండుగకొఱకై వెళ్లుచుండగా ప్రయాణమునందీ కీర్తనలను పాడుచువచ్చిరి. యెరూషలేము కొండలమీద కట్టబడినందున వీటికీ పేరు వచ్చెనని సాధారణముగా నను కొందురు. స్త్రీల యావరణములోనుండి పురుషుల ఆవరణమునకు పోవుటకు 15 మెట్లున్నవి. ఈ పదిహేను కీర్తనలు ఆ మెట్లెక్కుచుండగా ఒక్కొక్క మెట్టుమీద నొక్కొక్క కీర్తనను పాడుచు వచ్చిరి కావున వాటికీ పేరు గలిగినదను నొక పారంపర్యముగాని అది యంత నమ్మదగినది కాదు.

**యాదా** (Jada = ఆయన యెఱుగును). యూదా గోత్రికులలో నొకడు. ఇతడు యెరహ్మేయేలు తెగవారిలో చేరినవాడై యుండెను (I దిన $2^{28,32}$).

**యాదోను** (Jadon = ఆయన పరిపాలన చేయును). నెహెమ్యా కాలములో యెరూషలేము ప్రాకారములను కట్టుటయందు సహాయపడినవారిలో నొకడు (నెహె $3^{7}$). ఇతడు మెరోనోతీయుడు అనబడుటచే ఇతని యూరి పేరు మెరోనోతు అని తెలిసికొనవచ్చును గాని దానియునికినిగూర్చి తెలియదు.

**యానీము** (Janim = నిద్ర). హెబ్రోను దాపునుండు కొండప్రదేశములోనున్న ఒక యూరు (యెహో $15^{53}$). దీనియునికి ఇంకను స్పష్టముగా తెలియదు.

**యానోహ** (Janohah = విశ్రాంతి). ఎఫ్రాయిము సరిహద్దులోనున్న ఒక యూరు (యెహో $16^{6,7}$). ప్రస్తుతమునమున్న యానూను (*Yanun*) దానియునికియై యున్నది. అది షెకెమునకు ఆగ్నేయదిక్కున 7 మైళ్లదూరములో నున్నది (పటము III, G 4).

**యానోయహు** (Janoah = విశ్రాంతి). నఫ్తాలి గోత్రమందలి యొక ఊరు. అష్షూరు రాజగు తిగ్లత్పిలేసరు దానిని పట్టుకొనెను (II రాజు $15^{29}$). దీనియునికి తెలియదు.

**యాపెతు** (Japheth = సౌందర్యము). నోవహుకుమారుడు. పెద్దకుమారు లిద్దరిలో

నొకఁడు (ఆది 10[1,2] 9[18]). నోవహునకు 500 యేండ్ల ప్రాయమప్పుడు జన్మించెను (5[32] 10[21]). జలప్రళయమునకు ముందే వివాహమాడెను. వారు నావలో నుండఁగా ఇతనికి సంతానముండ లేదు (7[7] I పేతు 3[20]). తండ్రి ద్రాక్షారసము త్రాగిమత్తుఁడై యుండినప్పుడు అతడు నోవహు సిగ్గుకాపాడి తండ్రి దీవనల నందెను. అతఁడు విశాలదేశమునకు వారసుఁడై స్వతంత్ర జీవనము గలిగి తన సహోదరులగు షేమువంశస్థులతో సమాధానముగా జీవించుచువారి యాధిక్యతల యందు పాలివాఁడై యుండుననుటయే (ఆది 9[20-27]). ఆ దీవనయొక్క అర్థము. గోమెరు మాగోగు మాదయి యావాను తుబాలు మెషెకు తీరసు అనువారికి పూర్వికుడయ్యెను (10[2]).
H.

యాపో యొప్పే చూ॥

**యాఫీయ** (Japhia = ప్రకాశించుచున్న).

1. లాకీషురాజు. యెహోషువ యితని ఓడించి చంపించెను (యెహో 10[3,23-26]).

2. దావీదు కుమారులలో నొకఁడు (II సమూ 5[14-16] I దిన 3[5-8] 14[4-7]).

3. జెబూలూను దక్షిణ సరిహద్దులోనున్న యొక గ్రామము (యెహో 19[12]). ప్రస్తుతము నజరేతునకు క్రోసెడు దూరమున ఆగ్నేయముగా నుండు యాఫా (*Yafa*) దీనియునికి యను కొందురు (పటము IV, C 7).

**యాబాలు** (Jabal = నది). కయీను సంతతివాఁడు. లెమెకు కొడుకు. ఇతఁడు పశువులకాపరులకు మూలపురుషుఁడయ్యెను (ఆది 4[20]).

**యాబీను** (Jabin = అతఁడు కనుగొనును, తెలివిగలవాఁడు).

1. యెహోషువచే మూఁడవ దండయాత్రలో నోడింపఁబడిన హాసోరురాజు. కనానీయుఁడు. గలిలయలోని పట్టణములకు రాజు. యెహోషువను దేశమునుండి వెళ్లగొట్టుటకు పనిచేసిన వాఁడు. యెహోషువచేత మేరోము దగ్గర నోడింపఁబడెను. యుద్ధానంతరము హాసోరును స్వాధీనపఱచుకొని ఇతనిని కత్తితోఁ జంపిరి (యెహో 11[1-14]).

2. దెబోరా బారాకుల కాలములో హాసోరు నేలిన మఱియొకరాజు. ఇతఁడు 1 లోని వాని సంతతివాఁడై యుండును (న్యాయా 4[2]). ఇతఁడు ఇశ్రాయేలీయులను 20 సంవత్సరములు బాధించెను. వీని సేనాధిపతియగు సీసెరా కీషోనునది యొద్ద బారాకుచే నోడింపఁబడెను. ఇతడు ఇంక కొంతకాలము యుద్ధము చేసెనుగాని చివరకు ఇశ్రాయేలీయులచేత చంపఁబడెను (4[2-24]).
H.

**యాబేషు** (Jabesh = నీళ్లులేనిది).

1. ఇశ్రాయేలీయుల రాజగు షల్లూము తండ్రి (II రాజు 15[10,13,14]).

2. యాబేష్గిలాదు చూ॥

**యాబేష్గిలాదు, యాబేషు** (Jabesh-Gilead = గిలాదులోని నీళ్లులేని ప్రదేశము) గిలాదులోని యొక పట్టణము. దీనికి యాబేషు అను పేరుగలదు (I సమూ 11[1,3,9,10] 31[12] I దిన 10[12]). ఇది మిగుల పురాతనపట్టణము. న్యాయా 21[9,10,12] లో దీనిపేరు మొదట కనఁబడును. బెన్యామీనీయులు చేసిన ఘోరపాపమునకై వారిని శిక్షించుటకు ఈ పట్టణస్థులు సహాయము చేయకపోయినందున ఇశ్రాయేలీయులు వారి పట్టణమును నాశనముజేసి యందఱిని సంహరించిరి గాని, బెన్యామీనీయులలో మిగిలినవారికి భార్యలుగా నుండుటకై, ఆ పట్టణములోని 400 మంది కన్యకలను మాత్రము రక్షించి వారికిచ్చిరి (21[8-15]). తరువాత ఈ పట్టణము తిరిగి కట్టఁబడెను. సౌలును రాజుగా నియమించిన కాలములో అమ్మోనీయుల రాజగు నాహాషు దీనిని ముట్టడించి దీనిలోని పురుషుల కుడికన్నుల నూడఁదీయఁబోగా సౌలిశ్రాయేలీయులను సమకూర్చుకొనివచ్చి, ఈ పట్టణస్థులను రక్షించెను (I సమూ 11[1-11]). వీరా యుపకారమును మఱువక, సౌలును అతని కుమారులును ఫిలిష్తీయులచే హతులయినపిదప, అవమానింపఁబడినవారి కళేబరములను బేత్షెయానునుండి తెప్పించి మర్యాదగా సమాధిజేసిరి (I సమూ 31[11-13] I దిన 10[11,12]). వారిది చేసినందున దావీదు వారికి తన యభివందనములను పంపెను (II సమూ 2[4]).

లోఁబడఁబోయెడి దేశములలో నొకటిగా నుదాహరింపఁబడినది. యోవే $3^{6}$ యెహె $27^{13}$ నందు వారు చేసిన వ్యాపారముల సూచనలు గలవు. $27^{19}$ లో దానికే యింకొక సూచన కలదు. తెలుఁగు బైబిలులో నిచ్చటకూడ గ్రేకు వారైనట్లు తర్జుమా చేసినను, సంబంధమునుబట్టి ఈ వాక్యములోనివారు అరబ్బీ దేశములో నొక తెగవారని సాధారణముగా వేదశాస్త్రుల యభిప్రాయము. దాని $8^{21}$ $10^{20}$ $11^{2}$ లో గ్రేకు వారి అధిపతినిగూర్చిన సూచనలు గలవు.

**యాషాబాము** (Jashobeam = ప్రజలు తిరిగి వత్తురు). దావీదు యోధులలో నొక ముఖ్యుఁడు (I దిన $11^{11}$ $12^{6}$ $27^{2}$). II సమూ $23^{8}$ లోని యోషెబెష్షెబెతు ఇతఁడే యనుకొందురు. LXX లో నితని పేరు ఇష్బోషెతను మాటచేత తర్జుమ జేసిరి.

**యాషారు గ్రంథము** (Book of Jashar = యథార్థవంతుల గ్రంథము). పూర్వకాలములో హెబ్రీయులకున్న ఒక గ్రంథము. అది చాలకాలము క్రిందటనే పోయినను, యెహో $10^{13}$ II సమూ $1^{18}$ వలన అట్టి గ్రంథములోనుండి కొన్ని కావ్యములను పాఁత నిబంధనయందు ఎత్తి వ్రాసిరని తెలిసికొనవచ్చును. LXX లో I రాజు $8^{53}$ నందున్నదికూడ ఆ గ్రంథము నుండియే యెత్తినట్లున్నది. వీటినిబట్టి, హెబ్రీయుల చరిత్రలోని గొప్పవారిని గూర్చియు, గొప్ప చరిత్ర విషయములనుగూర్చియు ఈ గ్రంథమునందు కావ్యరీతిగా వ్రాయఁబడినట్లు తెలిసికొనఁగలము.

**యాషూబిలెహెము** (Jashubilehem = రొట్టె తిరిగి వచ్చును!). ఈ పదమునందు అచ్చు తప్పులున్నట్లు దాని రూపమువలన చెప్పెదరు. కొంద ఱిది స్థలము పేరనుకొందురు గాని, సాధారణముగా నిది యూదా సంతతిలోని యొకని పేరనియు, అతని సంతతివారు యాషూబిలెహెము వారనియు తలంతురు (I దిన $4^{22}$).

**యాషూబు, యాషూబీయులు** (Jashub = అతఁడు తిరిగివచ్చును).

1. ఇశ్శాఖారీయులలో నొకఁడు (సంఖ్యా $26^{23}$ I దిన $7^{1}$). ఆది $46^{13}$ లో ష అను అక్షరము లోపించుటచేత ఇతనికి యోబు అని అచ్చట నున్నది. ఇతని సంతతివారు యాషూబీయులని పిలువఁబడిరి (సంఖ్యా $26^{23}$).

2. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{29}$).

**యాషేను** (Jashen = నిద్రించుట). దావీదు యోధులలో యాషేను కుమారులుండిరి (II సమూ $23^{32}$) దీనికి సంబంధముగా నున్న I దిన $11^{34}$ లో వారికి గిజోనీయుడగు హాషేము కుమారులు అను పేరు కలదు.

**యాసోను** (Jason = స్వస్థత). థెస్సలోనీకయ పట్టణమందు పౌలును తన యింటఁజేర్చుకొనిన యొక క్రైస్తవుఁడు (కార్య $17^{5-9}$). ఆ పట్టణమునందు పౌలుకు సంబంధించిన అల్లరులు కలుగకుండునట్లు ఇతనియొద్ద జామీను పుచ్చుకొనిరి. రోమా $16^{21}$ లో తన బంధువుఁడని పౌలుదాహరించి వందనము లంపినవాఁడితఁడే కావచ్చును. అట్లయిన పక్షమున నితఁడు యూదుఁడైయుండి వ్యాపారపు పనులమీఁద రోమాకు వెళ్లినట్లున్నది.

**యాహసు, యాహజు, యహజా** (Jahaz, Jahasu, Jahazah, Jahzah = విశాల స్థలము, బయలు). మోషే కాలమునందు అమోరీయుల రాజగు సీహోను పట్టణములలో నొకటి. ఇశ్రాయేలీయు లిచ్చటనే సీహోనును జంపిరి (సంఖ్యా $21^{23}$ ద్వితీ $2^{32}$ న్యాయా $11^{20,21}$). తరువాత దానిని రూబేనీయులకిచ్చిరి (యెహో $13^{18}$). వారు దానిని లేవీయుల పట్టణములలో నొకటిగాఁ జేసిరి ($21^{36}$ I దిన $6^{78}$). మోయాబీయుల రాతిశాసనములలో (*Moabite Stone*) దీని పేరు గలదు. ఇశ్రాయేలీయులు దానిని ప్రాకారపురముగా కట్టుకొనినను మోయాబు రాజగు మేషా దాని వారియొద్దనుండి యపహరించెనని అందులోనున్నది యెషయా ($15^{4}$), యిర్మీయా ($48^{21-34}$) అనువారి కాలములో అది మోయాబీయుల వశమున నుండెను. అది హెష్బోనుకు దక్షిణముననున్నట్లు యిర్మీ $48^{21}$ వలన నూహింపవచ్చునుగాని దాని యునికినిగూర్చి యింక నూటిగాఁ దెలియదు.

## యి

**యిగ్దల్యా** (Igdaliah = యెహోవా గొప్ప వాఁడు). ప్రవక్తయగు హానాను తండ్రి (యిర్మీ $35^{4}$).

**యిజ్జీయా** (Izziah = యెహోవా ఉల్లసించును?). ఎజ్రా కాలములో అన్యస్త్రీలను వివాహమాడి అతని ప్రేరేపణచే వారిని విడిచి పెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{25}$).

**యిజ్రి** (Izri = కల్పించువాఁడు). లేవీయులలో నొకఁడు. ఇతఁడాలయమందలి సంగీత పాఠకులలో నాలుగవవంతు వారికి పెద్దగా యుండెను (I దిన $25^{11}$). I దిన $25^{3}$ లో నితనికి జెరీ యను మాఱుపేరు గలదు.

**యిత్నాను** (Ithnan = ఎడతెగని?). యూదా దక్షిణ సీమందుండు నొకయూరు దానియునికి సరిగాఁ దెలియదు (యెహో $15^{20-32}$).

**యిత్రో, రగూయేలు, హోబాబు** Jethro = అధిక ఘనము, Reguel = ప్రియుఁడు, Hobab). మోషే మామ. మిద్యాను యాజకుఁడు (నిర్గ $3^{1}$). ఇతనికి రగూయేలు (నిర్గ $2^{18}$), హోబాబు (సంఖ్యా $10^{29}$) అను మాఱు పేరులు గలవు. మోషే ఫరోకు భయపడి పారిపోయినప్పుడు ఇతఁడు మోషేను తనయింటఁ జేర్చుకొని తనకూతురగు సిప్పోరా నిచ్చి వివాహము జేసెను (నిర్గ $2^{15-22}$). నలుబదియేండ్లవఱకు మోషే యితని యింటనుండి గొఱ్ఱెలను గాచెను. తరువాత ఇశ్రాయేలీయులను విడిపించుటకు దేవుఁడు మోషేను బిలువఁగా యిత్రో మోషేను సమాధానముగా వెళ్లనంపెను (నిర్గ $4^{18}$). యిత్రో నిజమైన దేవుని ననుసరించి, మోషే యిశ్రాయేలీయులను ఐగుప్తునుండి ఆ దేశ మార్గము మీఁదుగాఁ దీసికొని వచ్చినప్పుడు, అతని భార్యా బిడ్డలను తెచ్చి అతని కప్పగించెను (నిర్గ $18^{1-7}$). మోషే తమ సంగతులన్నియుఁ దెలిపినప్పుడు అతఁడు దేవుని కొనియాడి దహన బలి నొకదానిని తెచ్చి యర్పించి ఇశ్రాయేలు పెద్దలతో విందుఁ గుడిచెను (నిర్గ $18^{7-12}$). తరువాత జనులకు న్యాయము తీర్చువిషయము మంచియోచన మోషేకుఁ దెలిపి కొంతకాలమునకు స్వదేశమునకు సమాధానముతో వెళ్లెను (నిర్గ $18^{13-27}$). తరువాత అతని సంతతివారు కనానులో ఇశ్రాయేలీయులతో కలిసికొనిరి (న్యాయా $4^{11}$). H.

**యిప్తా** (Iphtah = విడిపించును). యూదాలోని యూళ్లలో నొకటి (యెహో $15^{42}$). అది షేలా యను మన్యప్రదేశములో నుండెను గాని దాని సరియైనయునికి దెలియదు.

**యిప్తాయేలు** (Iphtahel = దేవుఁడు తెఱవఁజేయును). జెబూలూనుకును ఆషేరుకును మధ్య నుండెడి యొక లోయ (యెహో $19^{14,27}$). యోసీఫసను చరిత్రకారుఁడు యోటపట (*Jotapata*) అనునది ఈ స్థలమేనని అభిప్రాయపడెను. అట్లయినయెడల ఇది నజరేతుకు ప్రస్తుతము 9 మైళ్లు కొంచెముత్తరముగా నుండు టెల్ యెఫట్ (*Tell-Jefat*) కావచ్చును. (పటము VI, C 6).

**యిబ్శాము** (Ibsam = సువాసనగలది). ఇశ్శాఖారు గోత్రపువారిలో నొకఁడు (I దిన $7^{2}$).

**యిమ్నా** ఇమ్నా 2 చూ॥

**యిర్మీయా** (Jeremiah = యెహోవా స్థాపించును).

1. దావీదును సిక్లగులో కలిసికొనిన యొక బెన్యామీనీయుఁడు (I దిన $12^{4}$).

2, 3. సిక్లగులోనున్న దావీదు యొద్దకు వచ్చిన ఇద్దరు గాదీయులు (I దిన $12^{10,13}$).

4. యొర్దానుకు తూర్పుగానున్న మనష్షే వారిలో నొక కుటుంబపు పెద్ద (I దిన $5^{24}$).

5. రాణైన యోషీయా భార్యయొక్క తండ్రి (II రాజు $23^{30,31}$).

6. రేకాబీయులలో నొకఁడు (యిర్మీ $35^{3}$).

7. జెరుబ్బాబెలుతోకూడ తిరిగివచ్చిన యాజకులలో నొకఁడు (నెహె $12^{1,7}$).

8.. నెహెమ్యాకాలములో నిబంధనకు ముద్రవేసిన వారిలో నొకఁడు (నెహె $10^{2}$).

9. గొప్ప ప్రవక్తలనఁబడిన వారిలో రెండవ వాఁడు. యెరూషలేమునకు 2 క్రోసుల ఉత్తర

ముగానున్న అనాతోతు అను గ్రామనివాసి (యిర్మీ $1^{1}$). అతఁడు యాజకవంశములోనివాఁడగుటచే సొలొమోనుచే ఉద్యోగమునుండి దీసివేయఁబడిన అబ్యాతారు సంతతివారిలో నొకఁడై యుండవచ్చును (I రాజు $2^{26}$). వారి కుటుంబమునకు పిత్రార్జితముగా వచ్చిన భూములుండెను (యిర్మీ $32^{8}$). అతఁడింక యౌవనుఁడైయుండునప్పుడే ప్రవక్తయనికి దేవునివలనఁ బిలుపునొందెను ($1^{6}$). అతని పనియందతని నెదిరించువారనేకులుండినను దేవుఁ డతనిని కాపాడెదనను వాగ్దానము ఆ పిలుపునందు కనఁబడుచున్నను ($1^{7-19}$). యూదారాజగు యోషీయా యేలుబడిలో 13 సం॥ మొదలు ($1^{2}$ $25^{3}$) యెరూషలేము నాశనమైనదాక, అనగా క్రీ॥ పూ 627-587 వఱకు యెరూషలేములోను తరువాత కొన్ని సంవత్సరములవఱకు ఐగుప్తుకు పారిపోయిన యూదుల మధ్యను ప్రవచించెను (41-44). అతని చరిత్ర అతని ప్రవచనములకు సంబంధముగా నుండుటచేత ఇతర ప్రవక్తలకన్న యిర్మీయాను గురించి బహు వివరముగా మనకుఁ దెలియుచున్నది.

యిర్మీయా యోషీయా యేలుబడిలో చివరి 18 సం॥ లును యెహోయాహాజు ఏలిన మూఁడు మాసములును ప్రవచించినను, అతనికి హింసలు కలిగినందున అతఁడు చెప్పిన సంగతులు కొన్ని తెలిసినను అతని చరిత్రనుగూర్చిన విశేషము లెవ్వియును లేవు. ప్రజలతనిమాట లెంతమాత్రమును వినకపోవుటచేత నతనికి మిగుల విచారము కలిగినదని చూపెడి సూచన లెన్నియున్నను ($8^{18-23}$), అతని స్వంతయూరివారగు అనాతోతువారే ఈ కాలములో నతనిని చంపఁ జూచిరి ($11^{18-23}$). యెరూషలేమువారును అతనిని విరోధించిరి ($18^{18-23}$) గాని, యివన్నియు ప్రజల ప్రయత్నములేగాని రాజువలన కలిగినవి కాదు. రాజైన యోషీయా అతనిపక్షమున నున్నట్లున్నది. యెహోయాకీము కాలములో మతాధికారులు మాత్రమేగాక రాజుకూడ యిర్మీయాను హింసింప మొదలు బెట్టెను. యెహోయాకీము ఏలుబడిలో నాలుగవ సంవత్సరమునందు బహిరంగముగా బోధింపరాదని అధికారు లాజ్ఞనియ్యఁగా అతఁడు తన ప్రవచనములను తన సహాయుఁడగు బారూకుచే వ్రాయించి ఆలయ యావరణములో చదివించెను. వాటిని విన్న ప్రజలు రాజుకుఁ దెలుపఁగా అతఁ డా పుస్తకమును తెప్పించి చాకుతో కోసి తగలఁబెట్టెను ($36^{1-26}$). దేవుని యాజ్ఞ ప్రకారము యిర్మీయా ఇంకొక గ్రంథమును రచించి మొదటిదానియందున్న సంగతులకన్న నెక్కువ కలిపెను (27-32). పషూరు అను యాజకుఁడు యిర్మీయాకు ఈ సమయమందే బొండకొయ్య వేసి, మరుసటిదినమున మఱల విడిపించెను ($20^{1-3}$). యిర్మీయాకు మిగుల కఠినములగు హింసలు నెబుకద్నెజరు యెరూషలేమును ముట్టడించినకాలములో కలిగెను. నెబుకద్నెజరు నెదిరించక అతనికిలోఁబడి తమ్మును తాము రక్షించుకొనుట యుక్తమని అతఁడు బోధించినందున అతఁడు దేశద్రోహియని యూదుల పెద్దలు చెప్పి యతనిని చెఱసాలలో వేసి ($37^{1-15}$), అతనిని చంపఁదలంచి ($38^{1-6}$) ఒక గోతిలో వేసిరిగాని యెబెద్మెలెకు అను దాసునిచేత రక్షింపఁబడి కోటలో ఖైదీగా నుండెను ($38^{7-28}$). నెబుకద్నెజరు యెరూషలేమును పట్టుకొనినప్పుడు యిర్మీయాకు ఎట్టి హానియు చేయరాదని తన యధిపతికాజ్ఞాపించెను. అతఁడు బాబెలు చెఱకు వెళ్లక మిగిలియున్న బీదలలో నుండ నిశ్చయించుకొనెను. నెబుకద్నెజరు అతని కాహారమును నియమించి దేశమునకు క్షేత్రగా నియమింపఁబడిన గొర్నరగు గెదల్యా యొద్ద అతఁడుండునట్లు యేర్పాటు జేసెను ($39^{11-14}$ $40^{1-6}$). గెదల్యా చంపఁబడిన పిమ్మట ఐగుప్తుకు పాఱిపోవుచున్న యూదులు పలెస్తీనాలోనే యుండుట మంచిదని అతఁ డెంతగా చెప్పినను వారు వినక అతనికూడ వెంటఁబెట్టుకొని వెళ్లిరి ($43^{8}$-$44^{30}$). ఐగుప్తునందుండఁగా వారు విగ్రహారాధన చేయరాదని యతఁడు గద్దించినందున వారతనిమాటలు పెడచెవిని బెట్టుటయే గాక (44), తరువాత కొంతకాలమున కతనిని రాళ్లతోఁగొట్టి చంపిరని యొక పారంపర్యము గలదుగాని అదెంతవఱకు నిజమో నిశ్చయింపలేదుగాదు. యిర్మీయా ప్రవచన గ్రంథమును మాత్రమేగాక విలాప వాక్యములను, కొన్ని కీర్తనలను (కీర్త 69) రచించెనని కొందరు. యెషయా గ్రంథములోని 40-66 అధ్యాయములను వ్రాసిన దితఁడే యని మఱికొందఱి యభి

ప్రాయము ఇతఁడు ప్రజలచే నిరాకరింపఁబడినను వారియెడల మిగుల జాలిగలవాఁడై యుండి, తాను త్రిప్పలేకపోయినవారి విషయమెంతయో అంగలార్చెను. కావున ఇతఁడు అంగలార్పు ప్రవక్త యనఁబడును.

**యిర్మీయా గ్రంథము (Jeremiah, The Book of).**

1. గ్రంథకర్త. యిర్మీయా 9 చూ॥

**2.** కాలము. ఇతర ప్రవక్తలవలెనే యిర్మీయాయును తాను చెప్పిన ప్రవచనములను చెప్పినప్పుడే వ్రాసియుండలేదు. యెహోయాకీము అను రాజుకాలములో మాట్లాడరాదను ఆజ్ఞ కలిగినందున అతఁడు వాటిని వ్రాయ నారంభించెను గాని అంతకుఁ బూర్వము వ్రాసినట్లు ఏ సూచనలు లేవు. అతఁడంతకుమునుపు చెప్పిన ప్రవచనములను వ్రాయించఁగా ప్రవచించిన సమయములను సూటిగా ననుసరింపక ప్రవచన సంబంధములను కనిపెట్టి వ్రాసెననుటకు తేటయగు వీలులున్నవి. సమయముల ననుసరించి ఈ ప్రవచనములను ఈ దిగువరీతిగా సవరింపవలసియుండును.

(1) యోషీయా యేలుబడి (30 సం॥).

*a.* 13 సం॥ న మొదటి అధ్యాయము.

*b.* 13-31 సం॥ మధ్య అధ్యా 2-6 ($3^{6}$ చూ॥). వీటితో బహుశః 7-12, 14-20 అధ్యా. చేర్చవచ్చును.

(2) యెహోయాహాజు యొక్క 3 మాసముల ఏలుబడిలో ప్రవచనములు లేవు.

(3) యెహోయాకీము ఏలుబడి (11 సం॥).

*a.* ఆరంభమున అధ్యా 26. తరువాత బహుశః $22^{1-19}$.

*b.* 4 సం॥ న అధ్యా 25, 36, 45, $46^{1-12}$.

*c.* 4 సం॥ తరువాత అధ్యా 35.

(4) యెహోయాకీను ఏలుబడిలోని 3 నెలలలో బహుశః 13, $22^{20-30}$.

(5) సిద్కియా యేలుబడి (11 సం॥).

*a.* ఆరంభమున అధ్యా $24\text{-}49^{34-39}$.

*b.* 4 సం॥న అధ్యా 27, 28, $51^{59-64}$.

*c.* యెరూషలేము ముట్టడికిముందు అధ్యా 21, 29.

*d* యెరూషలేము ముట్టడి నారంభించినప్పుడు అధ్యా 34.

*e.* ముట్టడిని కొంతకాలము వఱకు మానినప్పుడు అధ్యా 37.

*f.* ముట్టడి మఱల ఆరంభమై యిర్మీయా ఖైదులో నుండఁగా అధ్యా 32, 33, 38, $39^{15-18}$.

(6) యెరూషలేము నాశనమైన పిమ్మట యూదయలో చెప్పిన ప్రవచనములు అధ్యా $39^{1-14}$ $40^{1}$-43.

(7) ఐగుప్తులో నుండఁగా చెప్పఁబడినవి అధ్యా $43^{8-13}$ 44.

(8) సమయమును గూర్చిన సూచనలు లేనివి అధ్యా 23,30,31,45. $46^{13}$-48, $49\text{-}51^{58}$.

(9) చరిత్రకు సంబంధించిన అనుబంధము అధ్యా 52

ప్రవచింపఁబడిన కాలము ననుసరింపక సంగతుల సందర్భమునుబట్టి ఈ దిగువ రీతిగా యిర్మీయా గ్రంథమును భాగింపవచ్చును.

I. పీఠిక: యిర్మీయా పిలుపు 1.

II. నాలుగు విధములగు ప్రవచనములు 2-51.

(1) యూదా నాశనము, కుదురుబాటు 2-33. దీనియందు (*a*) యూదా వారి పాపము, శిక్ష 2-20; (*b*) మతాధికారుల, దేశాధికారుల పాపము, శిక్ష 21-23; (*c*) ఆ శిక్షల ఉద్దేశము, వాటి పరిమితి 24-29; (*d*) శిక్షలకు పిదప కలుగనైయున్న దీవెనలు 30-33 అను ముఖ్య సంగతులున్నవి.

(2) యూదావారి శిక్ష వివరము 34-44. దీనియందు (*a*) యెరూషలేములోని వారి పాపములను ఖండించుట 34-38; (*b*) దాని నాశనము 39; (*c*) మిగిలినవారి దౌర్భాగ్యదశ, వారితో చెప్పిన ప్రవచనములు 40-44 గలవు.

(3) బారూకును గూర్చిన ప్రత్యేకమగు ప్రవచనము 45.

(4) చుట్టునుండు అన్యదేశములను గూర్చిన ప్రవచనములు 46-51; (*a*) ఐగుప్తు 46; (*b*) ఫిలిష్తీయుల దేశము 47; (*c*) మోయాబు 48; (*d*) అమ్మోను 49, 1-6; (*e*) ఎదోము 49[7-22]; (*f*) దమస్కు 49[23-27]; (*g*) కేదారు, హాసోరు దేశములు 49[28-33]; (*h*) ఏలాము 49[34-39]; (*i*) బబులోను 50-51.

III. అనుబంధము. 52 అధ్యా. పై ప్రవచనముల నెఱవేర్పు విధమును చూపుటకు చేర్చఁబడినది. ఇది రాజుల గ్రంథము 24[18]-25 ను అనుసరించును.

3. యిర్మీయా గ్రంథమందలి విశేషములు: ఇతఁడు ముఖ్యముగా యెరూషలేము నాశనమును గురించి ప్రవచించెను. వారేమి చేసినను ఆ గతి నుండి తప్పించుకొనఁ జాలరని చెప్పెను. ప్రజలకు ఇష్టములేనివాటిని గూర్చి చెప్పఁగా వారతనిని విరోధించిరి. వారిట్లు తనను విరోధించినందు వలన ప్రవక్త మిగుల దుఃఖించెను (15[10] 20[14-18]). అందఱు అతనిని విరోధించినందున తన యాదరణ కొఱకు దేవుని మాత్రమే యాశ్రయించెను. ఇశ్రాయేలీయులు మొత్తముమీఁద దేవుని ప్రజలై యుండి ఆయనతోడి సహవాస భాగ్యమొందెదరను బోధ పాత నిబంధనయందున్నది. గాని భక్తులైనవారు అందఱివలన విసర్జింపఁబడినను వారు ప్రత్యేకముగా ఒక్కొక్కరే ఆయనతో సహవాసము చేయఁగలరను బోధ యిర్మీయా గ్రంథమునందున్న యొక విశేషమైన బోధయై యున్నది (17[9] 31[29,30]). దేవుఁడు అంతరంగమునందు విధేయతను కోరునని అతఁడు దృఢముగా బోధించెను. అర్పణలుగాక విధేయత చూపుట దేవుని కిష్టమైనట్లు తక్కిన ప్రవక్తలవలెనే యితఁడును బోధించెను (1[11-8] I సమూ 15[22] యెష 1[11-17] ఆమో 5[21-24] మీకా 6[6-8]). యిర్మీ 7[21-28] వలన యజ్ఞము లవసరము లేదని బోధించినట్లుగా కొందఱి యభిప్రాయముగా నున్నదిగాని విధేయులైన వారి యాచారములు దేవుని కనుకూలమైనవని యిర్మీయా ఉద్దేశమైనట్లు 17[24-26] 27[19-22] 33[10,11,18] వలనఁ దెలియును. ఇట్టి విధేయత చూపనివారి యర్పణ లాయనకు అంగీకారములు కావు (14[10-12]). దేవాలయ మొక పట్టణములో నున్నంతమాత్రమున దేవుఁడచ్చట నివసించునను అభిప్రాయము తప్పనియు యిర్మీయా బోధించెను (7[1-15]). దేవుని ధర్మశాస్త్రమును (8[7-9]), ఆయన మందసమును (3[16]) ఈ విధముగానే ఆయనయందు భయభక్తులు లేనియెడల అన్నియు వ్యర్థాయని తెలియఁజేసెను. అవి పనికివచ్చునట్లు మానవులు తమ దురాశలను విసర్జించి (44) దుర్మార్గతలను వదలివేసి (4[14]) హృదయపూర్వకముగా దేవునితట్టు తిరుగవలెను (3[10] 17[5]). దేవునిచే నియమింపఁబడిన ఒక కాలము వచ్చును. అది దేవుఁడు తన ప్రజలతో నూతననిబంధనను స్థిరపఱచు కాల మనఁబడును. అప్పుడు దేవుని యాజ్ఞలు మానవుల హృదయములమీఁద వ్రాయఁబడును (24[7] 31[33] 32[39,40]). యిర్మీయా కాలము నుండి ప్రవక్తలు దానిని తమ బోధలలో నొక ముఖ్య విషయముగా నెంచిరి కావున అతఁడు దీనిని తేటగా బోధించుట కారంభించినవాఁడని చెప్పఁదగును. మెస్సీయను గూర్చిన ప్రవచనములు 23[5-8] 30[4-11] 33[14-26] లో నున్నవి. దేవుఁడిశ్రాయేలీయులతో చేసిన నిత్యనిబంధన దానికి సంబంధమైనదై 31[31-40] 32[36-44] 33 లలో నున్నది.

4. యిర్మీయా వ్రాఁతశైలి బహు దివ్యమైనది. అది యెషయాశైలి యంతటి శ్రేష్ఠము కాకపోయినను మధురమైనదై జాలిఁగొల్పునదిగా నున్నది. అతఁడు ఉద్రేకపూరితుఁడై వాటిని వ్రాసెను. ఇశ్రాయేలీయుల ప్రవక్తలందఱిలో నితఁడు పొరుగు జనాంగముల యెడలను ఇశ్రాయేలీయుల యెడలను జాలి గలిగినవాఁడైనట్లు అతని వ్రాఁతలవలనఁ జెప్పవచ్చును. అన్నిటి కన్న దేవునియెడల మక్కువ అభిమానము గలవాఁడని చెప్పఁదగును. ఇతఁడు యెష 43-53 లో నుదాహరింపఁబడిన శ్రమపడుచున్న సేవకుని పాత నిబంధన రూపమని కొందఱి యభిప్రాయము. ఎట్లయినను ప్రజలు నశింపఁగా వారి విషయమై ప్రలాపించిన క్రీస్తుకు ముంగుఱుతుగా నెంచఁదగును.

ఆయా ప్రతులలో కొన్ని భేదము లగుపడుచున్నవి. హెబ్రీ ప్రతులన్నియు నేకరీతిగా నున్నను (ప్రతులు చూ॥), LXX నందు 46-51 అధ్యాయములలోని అన్యదేశముల క్రమము హెబ్రీ ప్రతుల ననుసరింపక వేఱుగా నుండుటయేగాక ఆ భాగము యావత్తును 25[13] కు

తరువాత వచ్చును. హెబ్రీ ప్రతులలోని $29^{16-29}$ $30^{14-26}$ $30^{4-13}$ $52^{28-30}$ భాగములు LXX లో చాల క్లుప్తముగ నున్నవి. యిర్మీయాకు బిరుదుగా నుండు ప్రవక్త యను పదమును కొన్నిచోట్ల లోపించి పోయినది ($28^{5,11,15}$). అట్లే రాజు అను పదమును లోపించెను ($30^{32}$ $37^{17}$) కాని మఱికొన్ని స్థలములలో హెబ్రీ ప్రతులలో లేని చోట్లనుంచిరి ($26^{22,23}$ $27^{18,21}$). అట్లే సైన్యముల కధిపతియను బిరుదును కొన్ని వాక్యములలో లోపించెను ($6^{6,9}$). $7^{21}$ $19^{15}$ లో ఇశ్రాయేలీయులకు ప్రభువగు సైన్యముల కధిపతియను పదములు LXX లో లేవు. ఇది ప్రభువగు యెహోవా వాక్కు అను పదములు LXX లో కొన్ని వాక్యములందు గానరావు $2^{9}$ $3^{10}$ $7^{13}$). దీనినిబట్టి LXX తర్జుమా చేసినవారు ప్రస్తుతము లేని యొక హెబ్రీ ప్రతిని అనుసరించినట్లున్నది. అట్లు గానియెడల వారు అక్షరరీతిగా, భాషాంతరము చేయక దానిని కొద్దిగా సవరించియుందురు.

## యా, యు

**యాత్త్రైలహు** (City of salt). యూదా అరణ్యమందలి పట్టణములలో నొకటి. యెహో $15^{61,62}$ నందున్న ఆరు పట్టణములలో నైదవది. కొన్ని తర్జుమాలలో దీనిని ఉప్పుపట్టణమని పిలిచిరి. అది మృతసముద్రమునకు సమీపముగా నున్నట్లు ఆ యూళ్ల జాబితావలన నూహింపఁదగును గాని దాని యునికినిగూర్చిన యితర సూచన లెవ్వియును లేవు. H.

**యుగము** (Age or Aeon). బైబిలునందున్న యీ పదమునకు హిందూశాస్త్రములలో నుదాహరింపఁబడిన నాలుగుయుగములకు చెప్పఁబడెడి యర్థములేదు. బైబిలునం దాపదమున కీ దిగువ అర్థములున్నవి.

1. ఈ లోకపు ప్రస్తుత స్థితియంతయు ఒక యుగముగా నెంచఁబడును. ఈ స్థితియొక్క అంతము మ $12^{32}$ నందు యుగ మనఁబడెను. అదేమాటను $13^{40}$ $24^{3}$ నందు యుగసమాప్తి అను మాటచే తెనిఁగించిరి. అదేరీతిగా ఈ లోకము గతించినపిమ్మట కలుగఁబోవు మోక్షస్థితి మఱియొక యుగమై యున్నట్లు లూ $18^{30}$ మా $10^{30}$ హెబ్రీ $2^{5}$ లో అసలు భాషయందు జూడ వచ్చునుగాని తెనుఁగు భాషయందు యుగమను అర్థమిచ్చు పదమును రాఁబోవు లోకమనియు (లూ $18^{30}$ హెబ్రీ $2^{5}$), పరము అనియు (మా $18^{30}$) తర్జుమా జేసిరి. ఈ వాక్యము లన్నిఁటి వలన, ఈ లోకమం దుండఁగా కలుగు స్థితి యొక యుగముగాను, పరలోకమునందుండు స్థితి మఱియొక యుగముగా నెంచఁబడునని స్పష్టమగుచున్నది.

2. దీనికి సంబంధముగానే, ఈ లోకము ప్రత్యేకమైన యొక యుగముగా నెంచఁబడి సాతాను ప్రభుత్వమునకు లోఁగు కాలమై యున్నట్లుగా అర్థమిచ్చెడి వాక్యములును గలవు. ఇట్లు దేవుని నెఱుఁగనివారు ఈ యుగపు కుమారులనియు (లూ $16^{8}$ $20^{34}$ భాషాంతరము), ఈ యుగమర్యాద యనియు (రోమా $12^{2}$ భాషాంతరము), లోకజ్ఞానులు ఈ యుగ తర్కవాదులు అనియు (I కొరి $1^{20}$ భాషాంతరము), లోకజ్ఞానము ఈ యుగజ్ఞానమనియు ($2^{6}$ భాషాంతరము), సాతాను ఈ యుగసంబంధ దేవత యనియు (II కొరి $4^{4}$), ప్రస్తుతకాలము దుష్టయుగమనియు (గల $1^{4}$) అనఁబడెను. హెబ్రీ $1^{2}$ లోని ప్రపంచములు, II తిమో $4^{10}$ తీతు $2^{12}$ లో నుండు ఇహలోకము అను పదములు అసలులో యుగమనుమాటయై అదే యర్థము నిచ్చును. అట్లే మ $13^{22}$ లో నున్న ఐహిక విచారము ఈ యుగ విచారమని అసలులో అర్థమగును.

3. దీనికి సంబంధముగానే, క్రీస్తు సువార్త ప్రకటింపఁబడని పూర్వకాలము ఒకవిధమైన యుగము లేక యుగముగాను, అది ప్రకటింపఁబడిన తరువాతి కాలము మఱియొక విధమగు యుగముగాను ఎంచఁబడును (దృష్టాంతముగా కొలొ $1^{26}$ లో నున్నట్లు యుగములలో మరుగు చేయఁబడియున్న మర్మమును, ఎఫె $2^{6}$లో నున్నట్లు దేవుఁడు తన కృపా మహదైశ్వర్యము రాఁబోవు యుగములలో కనుపఱచును అను వాక్యముతో సరిపోల్చుఁడి). ఎఫె $3^{9}$ నందు అదే యర్థము నిచ్చు పూర్వయుగములను అసలు మాటను పూర్వకాలము అను మాటచే తెనిఁగించిరి. I కొరి $10^{11}$ లో నుండు యుగాంతము అను పదమును

అదే రీతిగా క్రీస్తు సువార్తవలని శక్తిని సూచించును. ఈ చివరి రెండువాక్యములు పైనున్న 3 తో సంబంధించిన వాక్యములుగా నున్నట్లు వాటికి అర్థము చెప్పవచ్చును. ప్రస్తుతమున్న ప్రపంచము నిత్యమైనది కాదనియు అంతమై పోవుననియు బైబిలునందు సూచన లనేకములు గలవు (మ 13$^{39,40,49}$ 24$^{3}$ 28$^{20}$ I యోహా 2$^{18}$ మొ॥). ఈ ప్రపంచము అగ్నిచేత లయమగునునది బైబిలు బోధయై యున్నది (II పేతు 3$^{10}$). క్రీస్తు యెరూషలేము నాశనమునకు సంబంధముగా ఈ లోకాంతమును గూర్చికూడ తెలిపియుండెను (మ 24 మా 13 లూ 21). అట్టి యుగాంతము బహు త్వరగా వచ్చునని అపొస్తలులు అనుకొనినట్లు కొన్ని వాక్యములలో సూచనలున్నవి (I థెస్స 4$^{16}$-5$^{3}$ I యోహా 2$^{18}$). గాని ఆ కాలము ఎప్పుడో తెలియదనికూడ బహు తేటగా బోధించిరి (II థెస్స 2$^{1-8}$ II పేతు 3$^{8}$ మా 13$^{32}$). ప్రస్తుతమున్న భూమ్యాకాశములు గతించినపిమ్మట వాటిలోనుండి క్రొత్త ఆకాశమును క్రొత్త భూమియు ఏర్పడును (యెష 65$^{17}$ 66$^{22}$ II పేతు 3$^{13}$ ప్రక 21$^{1\ 27}$).

(4) యుగమను పద మనేకవాక్యములలో దీర్ఘకాలమును సూచించును. దీని సూచించుటకు సాధారణముగా ఈ పదముయొక్క బహువచన రూపమును వాడిరి. యుగయుగములలో కలుగఁబోవునవి అనుమాట గాని, యుగముల పర్యంతము నున్నవి అను మాటగాని అదే యర్థము నిచ్చును (లూ 1$^{50}$ రోమా 1$^{25}$ 11$^{36}$ గల 1$^{5}$ ఫిలి 4$^{20}$ హెబ్రీ 1$^{28}$). రోమా 9$^{5}$ II కొరి 11$^{31}$ లో నుండు **నిరంతరము** అను పదమును, ఎఫె 3$^{21}$ లోని **తరతరములు** అను మాటయు అసలులో యుగయుగములు అను పదమై యున్నది.

**యుట్ట** (Juttah, Jutah = విశాలమైనది). యూదయ కొండప్రదేశమందలి యొక గ్రామము (యెహో 15$^{55}$). దీనిని చుట్టు బీళ్లను లేవీయుల కిచ్చిరి (21$^{16}$). ఇది జెకర్యా యెలీసబెతుల కాపురస్థలమని కొందరి యభిప్రాయము (లూ 1$^{39}$). అట్లయినయెడల 1$^{39}$లో యూదా అను మాటకు ప్రతిగా యుట్టయని చదువవలసి యుండును. ప్రస్తుతము హెబ్రోనుకు 5½ మైళ్లు దక్షిణముగా నుండు యుట్ట (*Jutta*) దీని యునికియై యున్నది (పటము II, E 3).

**యుద్ధము** (War, warfare).

1. చరిత్ర. బైబిలునం దుదాహరింపఁబడిన యుద్ధములలో మొదటివి అరబ్బీ యెడారులలో తిరుగుచుండు గోత్రములవారు చేయు యుద్ధముల వంటివని చెప్పవచ్చును. అబ్రాహాము తన పరివారముతో వచ్చి లోతును మొదలగువారిని పట్టుకొనిపోవుచుండిన వారిమీఁద అకస్మాత్తుగా పడి వారినోడించెను (ఆది 14$^{14-16}$). అరణ్యమందు ఇశ్రాయేలీయులు అమాలేకీయులతో చేసిన యుద్ధములును అట్టివే (నిర్గ 17$^{8-16}$). కనానును స్వాధీనపఱచుకొనుటకు చేసిన యుద్ధములు ప్రాకారములుగల పట్టణములమీఁద చేయు యుద్ధములై యుండినను ఇశ్రాయేలీయులు తమ యుద్ధములలో ప్రవీణులైనందునఁగాక దేవుని సహాయమువలననే జయించితిమని యొప్పుకొనిరి (ద్వితీ 2$^{26-37}$ 3, యెహో 6-12). న్యాయాధిపతుల కాలములలో తత్కాలపు కష్టములనుండి తప్పించుకొనుటకు ప్రజలను సమకూర్చి యుద్ధముచేసిరి (న్యాయా 4, 7, 8, 9, 10) గాని యుద్ధ మభ్యసించినసేన లా కాలమునందుండలేదు. అట్టి సేనలు రాజులకాలములో నారంభమయ్యెను. సేనలను సిద్ధము చేయుటకు సేనాధిపతులను నియమించుకొనిరి. అప్పటినుండి చుట్టునుండువారివలె ప్రాకారములను కట్టించి గాతులను కొల్లలముల నేర్పఱచుకొనిరి. సౌలు కాలము ముఖ్యముగా ఫిలిష్తీయులతోను, దావీదు సొలొమోనుల కాలములో చుట్టునుండు ఆయా జనములతోను ఇతర రాజులకాలములలో సిరియవారితోను, యూదా వా రిశ్రాయేలువారితోను యుద్ధములు చేసిరి. క్రీ॥ పూ॥ 8 శతాబ్దము మొదలుకొని లోకరాజ్యములుగ నుండిన అష్షూరు బాబెలు, పారసీకము గ్రీకు, రోమా రాజ్యములకులోనై వారికివిరుద్ధముగా తిరుగఁబడి నప్పుడెల్ల వారితో పోరాడవలసివచ్చెను. రెండవ శతాబ్దమందు మక్కబీయుల నాయకత్వముక్రింద కలిగిన జయములు గాక వేఱుకాలములలో వారు ఓడిపోయి క్రీ॥ పూ॥ 487 బాబెలువారిచేతను, క్రీ॥ శ॥ 70 లో రోమనులచేతను తమ ముఖ్యపట్టణముకు నాశము కలిగించుకొని, వేలకొలఁదిగ చెఱలోనికిఁబోయిరి.

2. యుద్ధమునకు సిద్ధపడుట. యుద్ధమారంభింపక పూర్వము యజ్ఞము లర్పించుట వాడుకగా నుండెను. యుద్ధము ప్రతిష్ఠించుట (యిర్మీ $6^{4}$ యోవే $3^{9}$) అను మూలభాషాపదమునకు యుద్ధమారంభించుటకు యజ్ఞము నర్పించుట యని యర్థమగును. ఆ పదమునే మీకా $3^{5}$ లో యుద్ధము ప్రకటించుటయని తెనిఁగించిరి. యుద్ధమునకు పూనుకొనకపూర్వము ఊరీము తుమ్మీముల ద్వారాను, ప్రవక్తలద్వారాను దేవుని చిత్తమును తెలిసికొనుటకు తగిన ప్రయత్నములను చేసిరి (న్యాయా $1^{1-7}$ I సమూ $14^{37}$ $23^{2-5}$ $28^{6}$ $30^{7,8}$ II సమూ $5^{19,23}$ I రాజు $22^{5-17}$ II రాజు $19^{2-7}$). ఇతర సూచనలవలనను దేవునిచిత్తమును తెలిసికొనుటకుకూడ ప్రయత్నించిరి (I సమూ $14^{8-10}$ న్యాయా $6^{36-40}$). యుద్ధముచేయ రాదని వారికిఁ దెలుపఁబడినయెడల దానిచేయకుండిరి. ఒకానొకప్పుడు యుద్ధమునకుఁబూర్వమే సంధిషరతులు శత్రువులకుఁ బంపించిరి (I సమూ $11^{1-3}$ I రాజు $20^{1-6}$). తాము యుద్ధముచేయుట న్యాయము కాదని శత్రువు [illegible] వాదించిరి (న్యాయా $11^{12-16}$). ఇట్లొకరితో నొకరు మాట్లాడుకొనకఁ బూర్వముకూడ హఠాత్తుగా యుద్ధములు ప్రతిష్ఠించెను (I సమూ $15^{5-9}$).

3. సేనాంగములు. కాల్బలములుమాత్రమే గాక బైబిలునందు గుఱ్ఱపురౌతులును (యెష $22^{7}$ కార్య $23^{32}$ మొ॥), గుర్రములు రథములు (నిర్గ $14^{17}$ I రాజు $10^{26}$) అనువాటిని గూర్చిన సూచనలున్నవి. కాల్బలములందు విల్లు నుపయోగించినవారును, వడిశెలలను ఈఁటెలను వాడినవారున్నట్లున్నది. రథములమీఁద యుద్ధముచేసిన వారు విండ్లనువాడినవారై యున్నట్లు I రాజు $22^{33,34}$ వలనఁ దెలియును. ఆయా బలముల నెట్లు వ్యూహముగాఁ బన్నిరో బైబిలునందు లేకున్నను, ఈఁటెలను విసరువారిని ముందఱను, విల్లుల నుపయోగించినవారిని తరువాతను, వడిశెలలను ప్రయోగించినవారిని తరువాతను నిలిపిరని నమ్మవచ్చును. పలెస్తీను కొండప్రదేశమగుటచే వారు రథములను ఎక్కువగా వాడలేదు. వాటిని వాడినవారు మైదానప్రాంతములలోనున్న కనానీయులై యుండిరి (న్యాయా $4^{3}$). గాని రాజుల కాలములలో వారు మైదానములమీఁదను యుద్ధములు చేయవలసినందున వాటినికూడ వాడ మొదలుబెట్టిరి (I రాజు $1^{5}$ $9^{19}$ $10^{26}$ మొ॥).

4. దండు పేటలు. వీటినిగూర్చిన సూచనలనేకములు లేవు. మూలభాషా శబ్దార్థమును బట్టి అవి గుండ్రముగా నుండెనని యందురు (I సమూ $17^{20}$ $26^{5-7}$). సైనికులు గుడారములందు నివసించిరి (II సమూ $11^{11}$). పేటచుట్టు కావలివారి నుంచిరి. రాత్రులలో వారు మూఁడు సారులు మారిరి (న్యాయా $7^{19}$ I మక్క $12^{27}$). యుద్ధమునకు వెళ్లినప్పుడు దండు పేటను కాయుటకు కొందఱినుంచిరి (I సమూ $30^{24}$).

5. యుద్ధము చేసినవిధము. వ్యూహములు పన్నిరి (I సమూ $17^{20}$) గాని పంక్తులలో నెట్టి క్రమప్రకారము నిలిపిరో తెలియదు. బహుశః ఈఁటెలు ధరించినవారిని ముందరను, తరువాత విలుకాండ్రను, తరువాత వడిసెల విసరువారి నుంచి యుందురు. అష్షూరీయులు ఇశ్రాయేలీయులపై దండెత్తి వచ్చువఱకు వీరు గుర్రములను రథములను అంతగా వాడియుండలేదు. బూరల నూదుట యుద్ధమారంభించుటకు గుఱుతుగా నుండెను (న్యాయా $7^{18}$). మానవలసినకాలమును అట్లే తెలిపిరి (II సమూ $2^{28}$ $18^{16}$ $20^{22}$). ఆర్భటించి కేకలు వేయుటతో యుద్ధమారంభించిరి (ఆమో $1^{14}$ యిర్మీ $49^{2}$). అప్పుడప్పుడొక విశేషసంగతిని యెత్తి కేకలువేసిరి (న్యాయా $7^{18,20}$). సైన్యమందలి యొకభాగము ముట్టడించుటయు ఒక భాగము పొంచియుండుటయు మిగుల పురాతనమగు వాడుకయైయుండెను (యెహో $8^{12,13}$). అప్పుడప్పుడు సైన్యములను మూఁడు భాగములు చేసిరి (న్యాయా $7^{16-18}$ I సమూ $13^{2}$ I మక్క $5^{33}$). పారిపోవుచున్నట్లుగా నటించి శత్రుసైన్యమును పట్టణము వెలుపలికి నడిపించి పొంచియున్న వారికి చిక్కునట్లు చేయుటయు యుద్ధపు యుక్తులలో నొకటియై యుండెను (యెహో $8^{2}$ న్యాయా $20^{29-35}$ I సమూ $15^{5}$). ఇట్లు శత్రువులను వెనుకనుండియు తరిమిరి (II సమూ $5^{23}$). అబ్షాలోముతో యోవాబు పోరాడినప్పు డీ విధముగా సైన్యమును విభజించి తన సైనికులను అరణ్యమందుంచెను (II సమూ $18^{6-18}$).

యుద్ధమైన తరువాత చేసిన పనులు. చంపఁబడిన వారిని పాతిపెట్టుట విధిగా నెంచిరి (I రాజు 11[5]). గొప్పవారు కూలినప్పుడు బహుగా అంగలార్చిరి (II సమూ 3[31]). శత్రువులలోని మృతులనుకూడ పాతిపెట్టిరి (యెహె 39[11-16]) గాని ఒకానొకప్పుడు జయమునకు సూచనగా గొప్పవాని తలను నరికించి ప్రజలు దాని చూడఁగలిగినచోట తగిలించిరి (I సమూ 17[51-54] II సమూ 20[22]). కూలినవారి ముంగోళ్లను కోయుట పురాతన వాడుకయై యుండెను (I సమూ 18[25,27]). ప్రాణములతో చిక్కిన వారిని మిగుల క్రూరముగా చూచిరి. వారు రాజులైనయెడల వారి మెడలమీఁద జయశీలురు తమ పాదముల నుంచినపిదప వారిని చంపివేసిరి (యెహో 10[24]). పట్టఁబడిన వారిలో అనేకులను చంపియుందురు (II దిన 25[12]) లేదా వారిని అంగవిహీనులుగాఁ జేసియుందురు (న్యాయా 1[6,7] II సమూ 12[31]). ఒకానొకప్పుడు పట్టుకొన్నవారిని దాసులుఁగా నమ్మివేసిరి (ఆమో 1[6,9]). గుఱ్ఱములిఁక పనికిరాకుండునట్లు వాటి చీలమండల నరములను తెగ వేసిరి (యెహో 11[6,9] II సమూ 8[4]). జయింపఁబడిన వారి దేశమును పాడుజేసిరి (II రాజు 3[19] న్యాయా 6[4-6]). ఓడిపోయినవారు జయశీలురకు కప్పము కట్టవలసి వచ్చెను (II రాజు 18[14] యెష 33[18]). సంధి షరతులను మీఱకుండునట్లు ఆయా గొప్పవారిని జామీనుగా నుంచిరి (II రాజు 14[14]). ఓడిపోయినవారి పట్టణములలో జయించినవారు తమ పటాలముల నుంచిరి (II సమూ 8[6,13]). దోపుడు సొమ్మును యుద్ధమునకుఁ బోయినవారును దండుపేట యొద్ద కావలియున్నవారును సమముగాఁ పంచుకొనవలెనన్న నియమముగలదు (I సమూ 30[24,25]) గాని వెండి బంగారములను దేవుని కర్పితములుగా నెంచిరి (II సమూ 8[11]). విలువగల యితర వస్తువులను జయసూచకమైన గుఱుతులుగా ప్రజలు కూడుకొనుచోట్ల నుంచిరి (I సమూ 21[8,9] II రాజు 11[10]).

యుద్ధమునకు వెళ్లినవారు తిరిగి రాఁగానే పవిత్రపఱచఁబడవలసి యుండిరి (సంఖ్యా 31[19-24]). వారిని ఘనపఱచుటకు పాటలతోను సంగీతములతోను మంగళహారతులతోను ఎదురొక్కొన వెళ్లిరి (న్యాయా 11[34] I సమూ 18[6-9]). తమ జయముల జ్ఞాపకార్థమై జయశాలురు ధ్వజస్తంభములను నిలిపిరి (15[12]). జయము కలిగినందులకై దేవునికి స్తుతులను చెల్లించు నిమిత్తము ఆరాధనలు జరిగించిన సూచనలును గలవు (II దిన 20[26-27] I మక్క 4[24]).

ఇశ్రాయేలీయులు తమ చుట్టునుండువారివలెనే యుద్ధము చేసినారని పై సంగతులనుబట్టి నిస్సందేహముగాఁ దెలియుచున్నది. ద్వితీ 20[19,20] నందు శత్రువుల ఫలవృక్షములను పాడుచేయరాదను నియమముండెను. వారు శత్రువులను త్రోలివేసిన పక్షమున సాయంకాలములోఁగా వాటిని తీసివేయవలసియుండెను. క్రొత్తగా యిండ్లు కట్టుకొనిన వారిని ద్రాక్షతోఁటలను నాటిన వారిని, వివాహమాడిన వారిని, పిఱికి వారిని యుద్ధమునకు పంపకూడదను నియమములును (ద్వితీ 20[5-8] II దిన 20[14-20]). యుద్ధము చేయునప్పుడు ఘాతకములు మొదలైన రాబడి కనఁబడుచున్నది. యేసుక్రీస్తు చెప్పిన బోధల ననుసరించుటవలన యుద్ధములు మానిపోవును. పాతనిబంధన ప్రవక్తలు సహా యుద్ధములు మానుకొనుట మెస్సీయ రాజ్యములోని ముఖ్యసూచనలలో నొకటిగాని యెంచిరి (యెష 2[4] 9[5] కీర్త 46).

యుబూలు (Eubulus = మంచి ఆలోచనకర్త). రోమాలోని క్రైస్తవుఁడు. పౌలితనిద్వారా తిమోతికి సలాములు పంపెను (II తిమో 4[21]) ఇతనిది గ్రీకు పేరు. ఇతనిగూర్చి ఇంకేమియు తెలియదు.

యువొదియ (Euodia = సువాసన). ఫిలిప్పీయు సంఘములోని యొక స్త్రీ. ఈమెయు సుంటికే యను మఱియొక తెయు కలహపడఁగా వారిద్దరు ఐక్యపడవలెనని పౌలు వారిని ప్రేరేపించెను (ఫిలి 4[2,3]). వీరిద్దరు ఆ సంఘమందలి పరిచారకు రాండ్రైనట్లున్నది.

# యూ

యూకరిస్తు ప్రభువు రాత్రిభోజనము చూ॥

యూకలు యెహోశాలు చూ॥

**యూదమతము** యూదులు చూ॥

**యూదయ** యూదా దేశము చూ॥

**యూదా** (**Judah** = స్తుతించుట).

1. యాకోబు లేయాల నాలుగవ కుమారుఁడు. పద్దనరాములో పుట్టెను (ఆది $29^{35}$). యోసేపును ఇష్మాయేలీయుల కమ్ముదమని సలహా నిచ్చెను ($37^{26}$). బెన్యామీనును ఐగుప్తులోని యోసేపు నొద్దకు పంపవలసివచ్చినప్పుడు ఇతఁడు తన తండ్రితోను సహోదరులతోను వాదించి, అతనిని ఐగుప్తునకుఁ దీసికొని వెళ్లి క్షేమముగఁ దెత్తునని పూచీ పడెను ($43^{8}$). యోసేపు వారి బుద్ధిని కనుగొనవలెనని బెన్యామీనును చెఱఁబట్టినప్పుడు యితఁడు తన తమ్మునికొఱకు మనవి జేసెను ($44^{18-34}$). రూబేను దుష్ప్రవర్తనవలనను ($35^{22}$ $49^{4}$), షిమ్యోను లేవీ యనువారు ఘోర బలాత్కారమువలనను తమ జ్యేష్ఠత్వపు హక్కును పోఁగొట్టుకొనినందువలన యూదా దానికి వారసుఁడాయెను (34, $49^{3}$ $44^{9}$). అదుల్లాములోని షూయయను కనానీయుని కుమార్తెవలన ముగ్గురు కుమారులను కనెను. వారిలోని మొదటి ఇద్దఱు ఒకరి తరువాతనొకరు తామారును వివాహమాడి సంతానము లేకనే చనిపోఁగా కడపటివాఁడైన షేలా చిన్నవాఁడైనందున యూదా ఆమెను వానికి వివాహము చేయనొల్లకపోయెను. అందువలన తామారు యుక్తియున్ని యూదావలననే పెరెసు జెరహు అను కుమారులను కనెను (38). యాకోబు తన కుమారులను ఆశీర్వదించునప్పుడు చెప్పినట్లుగానే ($49^{10}$) యూదా సంతతివారు మెస్సీయ వచ్చువఱకు ప్రఖ్యాతి వహించిరి. యూదాగోత్రమువారు మొదట రెండు గోత్రముల వారికి ముఖ్యులుగా నుండి చెఱకు తరువాత ఇశ్రాయేలీయులనందఱిని సూచించిరి.

W.

2. లేవీయులలో నొకఁడు (ఎజ్రా $3^{9}$).

3. జెరుబ్బాబెలుతోకూడ చెఱనుండి తిరిగి వచ్చిన లేవీయులలో మఱియొకఁడు (నెహె $12^{8}$).

4. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{10,23}$).

5. నెహెమ్యాకాలములో యెరూషలేమునకు ప్రధానుఁడగు నొక బెన్యామీనీయుఁడు (నెహె $11^{9}$).

6. నెహెమ్యాకాలములో ప్రాకారములను ప్రతిష్ఠించిన ప్రధానులలో నొకఁడు (నెహె $12^{34}$).

7. క్రీస్తు పూర్వికులలో నొకఁడు (లూ $3^{30}$).

8. సీమోను ఇస్కరియోతు కుమారుఁడు. పన్నెండుమంది అపొస్తలులలో నొకఁడు. ఇస్కరియోతు అనఁగా కెరియోతువాఁడని యర్థము. ఇది యూదా దేశమందలి యొక గ్రామముగాన పన్నెండుమందిలో నితఁడు మాత్రము యూదయనుండి వచ్చినవాఁడని చెప్పవలసియుండును. ఇతఁడు శిష్యులకు ఖజానాదారుఁడై యుండెను (యోహా $12^{6}$). ఇతఁడు ప్రభువునప్పగించి ద్రోహముచేసినందుననే ఎక్కువగా ఆతనినిగూర్చి వినవలసివచ్చుచున్నది. ఆయన నప్పగించుటకు ధనాపేక్ష మొదటికారణమైనను ఆయన గద్దింపువలన మఱింత అలిగియుండవచ్చును ($12^{7,8}$). సాతాను తన్ను శోధించుట కింతకు ముందే యెడమిచ్చియుండెను గాన యిప్పుడు పూర్ణముగా సాతానువశమందుండెను ($13^{27}$). పస్కా భోజనమాచరించి ప్రభువు రాత్రిభోజన మేర్పాటుజేయక మునుపే అతఁడు వారిని విడిచి యేసుక్రీస్తును యూదుల కప్పగించుటకు ఏర్పాటు చేసియుండవచ్చును.

యేసును విమర్శించి ఆయనను సిలువవేయవలెనని తీర్మానించునది యూదా కనుగొని సిగ్గుతో నింపఁబడినవాఁడై తాను నిరపరాధ రక్తమును వారి కప్పగించితినని చెప్పుచు తాను వారియొద్దనుండి తీసికొన్న పైకమును తిరిగి యియ్యఁబోయెను. అయితే వారా పైకమును పుచ్చుకొననందున దానిని గుడిలో విసిరివేసి ఉరిపెట్టుకొనెను. ప్రధానయాజకులా పైకముతో పరదేశులను పాతిపెట్టుటకై కుమ్మరివాని పొలమును కొనిరి (మ $27^{3-10}$). కార్య $1^{18,19}$లో యూదా ఆ పొలమును తానే కొని దానిలోపడి చచ్చినట్లున్నది. ఈ రెంటికిని విశేషభేదములేదు. ఇక్కడ "కొనెను" అనుమాట తానే కొనెననిగాక, తనను బట్టికొనఁబడినదను అర్థము నియ్యవచ్చును. తాను

ఉరిపెట్టుకొన్నప్పుడు లూకా వివరించినప్రకారము బోర్లపడియుండవచ్చును.

యూదానుగూర్చి సాధారణముగా అనేక ప్రశ్నలనడిగెదరు. యూదా తన్నప్పగించునని ఆయనకు తెలిసియుండియు అతని నెందుకు కేర్పఱచుకొనెననునది ముఖ్యమైనది (యోహా $6^{64}$). దేవుని యేర్పాటునుగుఱించి తెలుపునది ఇది యొక్కటే దృష్టాంతముగాదు. ఆయన యేర్పాటులయందు ఇటువంటివి సాధారణముగా నగుచున్నవి. దేవుడు సౌలునెందుకు రాజుగా నేర్పఱచుకొనెననికూడా మనమడుగవచ్చును. దుర్మార్గుడు కాబోవువానిని ఆయనపుట్టించనేల అను ప్రశ్నయు ఇట్టిదే. దేవుడు మానవుని స్వేచ్ఛావర్తనకు అడ్డమురాడు. ప్రతివానికిని బాగుపడుటకు అవకాశమునిచ్చును. సంఘమొక మనుష్యుడు బాగుగా అగుపడుచున్నందున నేర్పఱచుకొనుచున్నట్లే యూదానుకూడ యేసు ఏర్పఱచుకొనెను.

యూదాయొక్క నేరముకు సంబంధముగా మఱియొక ప్రశ్ననడిగెదరు. యేసును సిలువ వేయుటకప్పగించితినని తెలిసికొని విచారపడెననియు అందువలన క్షమాపణ నొందియుండువనియు కొందఱి తలంపు. యోహా $17^{12}$ ను బట్టియు, కార్య $1^{25}$ ను బట్టియు రక్షణార్థమైన పశ్చాత్తాపము యూదాకు కలుగలేదని తెలిసికొనవలసియున్నది. E.

9. గలిలయుడగు యూదా. జనసంఖ్యా దినములలో ఇతడు ప్రజలను తిరుగబడునట్లు ప్రేరేపించెను (కార్య $5^{37}$). యూదులు యెహోవాయే తమ రాజనియు, పరరాజులకు పన్నిచ్చుట పాపమనియు నెంచి తిరుగబడిరి. ఆ తిరుగుబాటులలో వారు యెహోవా గాక మాకు ప్రభువులేడనుచు ఒకని నొకడు యుద్ధమునకు పురికొలుపుకొనుచుండెడివారు. ఈ సందర్భమందుగాక ఇతనిగూర్చి బైబిలునందు నెక్కడను ప్రశంసించియుండలేదు. యోసీపసు అను చరిత్రకారుని గ్రంథములయందు అతనిగూర్చిన కొన్నిసూచనలున్నవి (పురా 18.1.1; 18.1.6; 20.5.2; యుద్ధ 2.8.1). M.

10. దమస్కువాడగు యూదా. సౌలు దమస్కుదగ్గర దర్శనము కలిగి దృష్టిలేనివాడై పట్టణములోకిపోయి ఇతనియింట మూడు దినములుండెను. తరువాత ప్రభువు ఇతని యింటికి అననీయను పంపెను (కార్య $9^{11}$). ఇతనిని గుఱించి దీనికిమించిన సంగతులేవియును తెలియవు. దమస్కువారిప్పటికిని అతడు కాపురముండిన యింటిని చూపెదరుగాని అది నమ్మ సాధ్యముకానిమాటయై యున్నది. M.

11. ప్రభువు సహోదరుడగు యూదా. యోహా $14^{22}$ నందు వర్ణించబడిన ఇస్కరియోతు కాని యూదా యని వేదపండితులలో కొందఱి యభిప్రాయముగాని యూదా $1^{1}$ నందు యాకోబు సహోదరుడని చెప్పుటవలన ఆయన ప్రభువైన యేసు సహోదరుడని తెలియబడును. యేసుయొక్క సహోదరులలో నెవరును అపొస్తలులై యుండలేదు (యోహా $7^{5}$ కార్య $1^{13}$). గనుక పత్రిక 17 వ. యూదా అపొస్తలులలో నుండి తన్ను వేరుపఱచుకొనుచున్నాడు. అందువలన పత్రిక వ్రాసిన యూదా, అపొస్తలుడైన యూదా యను అభిప్రాయము అంగీకారము కాదు. గ్రంథకర్త తాను యేసుక్రీస్తు దాసుడు అని చెప్పినందువలనమాత్రము అతడు యేసుయొక్క సహోదరుడు కాడని తీర్మానించతగదు. మ $12^{46-50}$ మా $3^{31-35}$ లూ $8^{19-21}$ నందు యేసు తన భక్తుల లక్షణములను చెప్పి తన శిష్యులను చూచి వీరే నా సహోదరులని చెప్పినమాటను జ్ఞాపకము చేసికొని యూదా విశ్వాసముతోటి బంధుత్వము ప్రధానముగాని శరీరసంబంధమైన బంధుత్వము ప్రధానముకాదని ఎఱిగి తాను యేసు సహోదరుడనని చెప్పక యేసుయొక్క దాసుడనని చెప్పుచున్నాడు. పారంపర్య సాంప్రదాయములలో డొమిషన్ చక్రవర్తి క్రైస్తవులు యేసుక్రీస్తు జగత్కర్తయని బోధించుట తెలిసికొని తన రాజ్యవిషయమై భయపడి యేసుయొక్క వంశీకులనందఱిని రోమాకు రప్పించి వారినందఱిని సంహరింపవలెనని యుత్తరువిచ్చెను. ఆ యాజ్ఞననుసరించి యుద్యోగస్థులు యేసుయొక్క సహోదరుడని చెప్పబడిన యూదాయొక్క మనుమలను రోమాకు తెప్పించి చక్రవర్తియెదుట నిలువబెట్టిరి. వారు తాము క్రీస్తుబంధువులమని

ఒప్పుకొనిరిగాని వారందఱికిని పొత్తుగా తొమ్మిది యొకరముల భూమిమాత్ర మున్నట్టును తాము చేతికష్టముచేసి బ్రతుకువారమనియు తా మెదురు చూచుచున్న రాజ్యము పారమార్థికసంబంధమైన దనియు చెప్పఁగా చక్రవర్తివారిని విడిపించెనని యుదాహరింపఁబడెను. **H.**

12. అపొస్తలులలో నొకఁడు. ఇతఁడు ఇస్కరియోతు యూదాకు వేరైనవాఁడు అని యోహా $14^{22}$ వలన స్పష్టమగును. ఇతఁడు యాకోబు సహోదరుఁడు (లూ $6^{16}$ కార్య $1^{13}$) గాని, కొందఱు ఆ వాక్యమునందు కుమారుఁడని యుండవలెనందురు. ఇట్లనుకొనువారు ఇతఁడు పైన 11 లోని వాఁడని తలంతురు. మ $10^{3}$ మా $3^{18}$ లలో నున్న అపొస్తలుల జాబితాలలో నితని పేరులేదు. దీనికి బదులుగా తద్దయి అనఁబడిన లెబ్బయి అను పేరున్నది గనుక అవి యితని మాఱుపేరులని తెలిసికొనవలెను (తద్దయి చూ॥). **M.**

13. యూదాబర్సబా. ఇతని పేరు కార్య $15^{22,29,32,33}$ లో నున్నది. ఈయన యెరూషలేము సంఘమునకొక ముఖ్యుఁడై అంతియొకయ సంఘమునకు సున్నతినిగూర్చియు నితర యాచారములను గూర్చియు జరిగిన వివాదములను పరిష్కరించిన సభవారి నిర్ధారణను తెలియచేయుటకై పౌలుతోను సీలతోను అంతియొకయ పంపఁబడెను. తనకు నియమింపఁబడిన పనిముగిసిన తరువాత నతఁడు తిరిగి యెరూషలేము చేరెను. ఇతనివిషయమై యింతకు మించిన సంగతి తెలియదు. **M.**

14. యూదా మక్కబీయుసు. యెరూషలేమునకును యొప్పేకును మధ్యనుండిన మోదీను అను గ్రామమున యాజకుల వంశీకుఁడగు మటాతియసను వృద్ధుఁడు క్రీ॥ పూ॥ 167 సం॥ మున నివసించుచుండెను. అతనికి యోహాను, సీమోను యూదా, ఎలీయజరు, యోనాతాను పేళ్లుగల అయిదుగురు కుమారులుండిరి. ఆ కాలమున సిరియదేశపు రాజులు పలెస్తీను దేశమును వశపఱచుకొని యూదుల నేలుచుండిరి. సిరియ రాజులలోని ఎపిఫనీసను బిరుదాంకమును వహించిన నైదవ అంతియోకసు యూదుల మతమును సమూలనాశముచేయ నుద్దేశించి యా దేశమం దంతట వారు సిరియమతాచారముల ననుష్ఠించి ఆ మతదేవతలకు బల్యర్పణలను చెల్లించ నుత్తరు విచ్చెను. ప్రజలు రాజాజ్ఞకు లోఁబడునట్లు అఫీలసను యుద్యోగస్థుఁడు గ్రామసంచారము చేయుచు మోదీనుకువచ్చి బలిపీఠమును కట్టించి బలినర్పించ ప్రజలను భీతిపఱచఁగా నొక మత భ్రష్టుఁడర్పించఁ బూనుట మటాతియసు చూచి ఆగ్రహ మణచుకొనలేక రౌద్రుఁడై యా ద్రోహిని చావఁగొట్టి అఫీలసును అతని సేవకుని సంహరించి తన యైదుగురు కుమారులతో కొండలకు పారిపోయి అక్కడ దాగియుండెను. అక్కడ మోషే ధర్మశాస్త్ర నిష్ఠులైన హసిడీయను లనఁబడిన వా రాయనను కలిసికొనిరి. వీరు కొన్ని మాసములు సిరియసైన్యముతో యుద్ధమాడిన తరువాత వృద్ధుఁడగు మటాతియసు కష్టప్రయాసముల నోర్చలేక మరణమాయెను. ఆయన కుమారులలో ఎలీయెజరును యోహానును కొంతకాలము లోపల మృతినొందినందున యూదా సైన్యాధిపతి యాయెను. ఇతఁడు యూదా మక్కబీయుసను బిరుదాంకముచే వెలసిన వీరుఁడు. మక్కబీయను పేరుకు పండితులు వెవ్వేరర్థములు చెప్పుదురు. యూదా నిర్గ $15^{11}$ లోని యెహోవా వేల్పులలో నీవంటివా డెవఁడను వాక్యము తన యుద్ధపు నిషానమీఁద వ్రాసినందున నా పేరేర్పడెనని కొందఱి తాత్పర్యము. హెబ్రీ భాషలో నా వాక్యము "మికామొకాబాయెలీం యెహోవా" యని వ్రాయఁబడి యున్నది గనుక ఆ మూఁడు పదములలోని మొదటి యక్షరమును తీసి యూదా మక్కబీయను నామధేయమును కల్పించెనని వారి యభిప్రాయము. మఱి కొందఱు సమ్మెటగాఁడను నర్థమిచ్చు యూదా యొక్క స్వంత పేరని యెంతురు. యూదా మతాభిమానమును దేశాభిమానమును గలవాఁడై యూదా మతాచారములను తిరుగ స్థిరపఱచుటకు మాత్రముకాక తన ప్రజలను సిరియరాజుల పాలనలో నుండి విడిపించి స్వతంత్రరాజ్యమును స్థాపింప యత్నించెను. కొంతకాలములోపల నతఁడు అపొలోనియసు సీరను అను సిరియ సైన్యాధిపతుల నోడించెను. అందుకు అంతియోకసు గొప్పదండును సమకూర్చి లూసియసను సేనానాయకుని కప్పగించి యూదామీఁదికి

పంపెను. లూసియసు తన సైన్యమును మూఁడు భాగములను జేసి, టాలమి నికానరు గార్జియసు అను నాయకుల నొక్కొక్కభాగమున కధికారు లనుగా జేసెను. గార్జియసు నికానరులు ఎమ్మాయు అను గ్రామముదగ్గర పాలెము చేసిరి. యూదా తన దండుతో కొండలమధ్య దాగి యుండుట విని గార్జియసు ఆయనను వెదకుటకై పోఁగా యూదా కొండదిగి యర్థరాత్రమున నికానరుని శిబిరముమీఁద పడి యతని సైన్యమును నఖముఖాల చెదరఁగొట్టెను.

మైదానమున జరిగిన సంగతి గార్జియసు ఎఱుఁగక యూదాను వెతుకుటమాని దిగువకు రాఁగా నికానరుని శిబిరమంతయు కాలుచుండుట చూచి యతఁడును అతని సైన్య మంతయును మూల కొకనివంతున చెల్లాచెదరై పోయిరి. ఆ మీఁదట క్రీ॥ ము॥ 165 సం॥ మున లూసియసు గొప్ప సైన్యమును సమకూర్చి బేత్జురు అను గ్రామము దగ్గర యూదాను సంధించి పరాభవము నొందెను. ఈలాగున శత్రువులను జయించి యూదా యెరూషలేముకు వచ్చి సిరియ సైనికులు భ్రష్టపఱచిన దేవాలయము పవిత్రపఱచి తిరిగి మతాచారములను స్థాపించి ఎనిమిది దినములు ఉత్సవము జేసెను. ఆ తరువాత యూదా సిరియ దేశపు సైన్యములను దేశమునుండి వెళ్లఁదరిమి వా రాక్రమించిన పట్టణములను పట్టుకొనుటకై దాదాపు యొకటిన్నర సంవత్సరము వఱకు యుద్ధమాడుచు వచ్చెను గాని అతనిని కలిసికొన్న హసిడీయనులు మతస్థాపకముతో తృప్తిపడి అతఁడుచేయు రాజ్యము నిమిత్తమైన యత్నమునకు సమ్మతించక అతని సహవాసమును వదలిపెట్టిరి. ఆ మధ్యన అంతియోకసు మరణమైనందున న్యాయాధిపతి యగు టూసియసు వాని కుమారుఁడైన అంతియోకసు యూఫేటరుకు పట్టాభిషేకముచేసి బ్రహ్మాండమైన దండు తీసికొని యూదా మీఁదికి వచ్చెను. బేత్జకరీయను గ్రామసమీపమున జరిగిన యుద్ధమందు టూసియసు యూదా నోడించి యెరూషలేమును పట్టుకొని అల్కిమసును ప్రధాన యాజకునిగా నియమించి సిరియకు వెళ్లిపోయెను. యూదా మానక అల్కిమసుమీఁదను సిరియనుల మీఁదను యుద్ధమాడుచుండఁగా నూతనముగా సింహాసన మెక్కిన మొదటి డెమిత్రియసను సిరియ రాజు నికానరను సేనానాయకుని క్రింద గొప్ప సైన్యమును పంపెను. నికానరు యూదాను చిక్కించుకొనుటకు పన్నిన యుపాయము లన్నియు తప్పినందున కడకు కేపర్సలామా యను నూరిదగ్గర జరిగిన యుద్ధమందు యపజయము నొందెను. నికానరు యెరూషలేముచేరి యూదా నప్పగించని పక్షమున దేవాలయమును ధ్వంసము చేయుదుమని యా కోటలోని యూదులను బెదిరింపఁగా హసిడీయు లనువారు తిరిగి యూదా పక్ష మవలంబించిరి గనుక కొన్నాళ్లయిన తరువాత బేత్ హారోనుకు నాల్గుమైళ్లలోనున్న ఆడేసా యొద్ద జరిగిన యుద్ధమందు నికానరు సైన్యమంతయు నోడిపోవుట మాత్రముకాక యతఁడును మరణమాయెను. యూదా తన శత్రువులను పూర్తిగా జయించి రాజ్యమును సంపాదించుకొని యుండెను గనుక తన యధికారమును స్థిరపఱచుకొనుటకై రోమాపురియొద్ద కిద్దరు రాయభారులను పంపి రోమా దొరతనము వారి సహాయము కోరెను. అందుకు రోమీయులు సమ్మతించి డెమిత్రిని యుద్ధము మానుమని వర్తమానమును పంపిరి గాని, యా రాయభారులు డెమిత్రి యొద్దకు చేరకమునుపే యతడు బక్కైడిసు అను సైన్యాధిపతిని తన యావత్తు సైన్యముతో యూదా మీఁదికి పంపెను. జనులు బహు కాలమునుండి పోరాడుచున్నందున అలసి బక్కైడిసుయొక్క దండు నెదిరించలేక అష్డోదు సమీపములోనున్న ఎలీసాదగ్గర నపజయ మొందిరి. యూదా యా సమయమున హతమాయెనని జనులందఱు విని ప్రలాపించి మోదీను పట్టణమందు సమాధిచేసిరి (మక్కబీయులు చూ॥). M.

**యూదా అరణ్యము.** అరణ్యము 2, పలెస్తీను III 3 చూ॥

**యూదాదేశము, యూదయ** (Judea). పాతనిబంధనయందు యూదయదేశమను పదము ఎజ్రా 5[8] దాని 5[13] లో మాత్రమున్నది. పారసీకులు మొదట ఆ పేరును వాడినట్లున్నది తమ రాజ్యమందున్న యెరూషలేము చుట్టుగల ప్రదేశమునకు వారా పేరును వాడిరి. అప్రమాణిక గ్రంథములగు 1 ఎస్డ్రాసు (1[33,39]) I మక్కబీయులు (5[45] 7[10]) లో ఈ పేరా ప్రదేశమునకు

వాడిరి. క్రొత్త నిబంధనయం దీ పేరు తరుచుగా కనఁబడును (మ $2^{1,5}$ మా $1^{5}$ లూ $3^{1}$ యోహా $3^{22}$ కార్య $1^{8}$ రోమా $15^{30}$ II కొరి $1^{16}$ గల $1^{22}$ I థెస్స $2^{14}$ మొ॥). పారసీక రాజులకుఁ తరువాత వచ్చిన గ్రీకులును రోమనులును దాని నొక ప్రత్యేక పరగణాగా భావించి ఈ పేరుతోనే దాని బిలిచిరని పై వాక్యములవలనఁ దెలియుచున్నది. మహా హేరోదు మరణమైనపిదప దాని నతని కుమారుఁడగు అర్కెలాయునకిచ్చిరి (మ $2^{23}$) గాని రోమీయు లతనిని త్రోసివేసి తమ స్వంత గౌర్నరును ఏర్పాటు చేసిరి. పొంతి పిలాతు అట్టి అధిపతులలో నొకఁడు (లూ $3^{1}$). మొదటి హేరోదు అగ్రిప్పా (క్రీ॥ శ॥ 41-44) యెరూషలేము నాశమునకు ముందేలిన వారందఱును రోమను గౌర్నరులే. వారు కైసరయలో నివసించిరి గాని, యెరూషలేమునందు నివసించుటకును తగిన నగరులచ్చట గలవు. ఈ గౌర్నరు అంతియొకయలోనున్న యధిపతికి లోనైనవాఁడు (లూ $3^{1}$ పురా 17 13. 5; 18, 1.1). ఈ దేశమునకు ఉత్తరమున మృతసముద్రమున కుత్తరముగా 5 క్రోసులు యొర్దానునదినుండి మధ్యధరాసముద్రము వఱకుండు సమరయయును, దక్షిణమున మృతసముద్రపు దక్షిణకొననుండి బెయేర్షెబా మీఁదుగా మధ్యధరాసముద్రము దనుక వ్యాపించు ఎడారియు, తూర్పున యొర్దాను దక్షిణభాగమును మృతసముద్రమును, పడమట మధ్యధరాసముద్రమును సరిహద్దులుగానున్నవి. ఆది ఉత్తరమునుండి దక్షిణమునకును, తూర్పునుండి పడమటకును దాదాపు 55 మైళ్లు పొడవున్నది. (పలెస్తీను V చూ॥).

### యూదా పత్రిక (Jude, Epistle of).

1. గ్రంథకర్త. ఈ పత్రికను రచించినవాఁడు మొదటి వచనమందు తాను యేసుక్రీస్తు దాసుఁడనియు యాకోబు సహోదరుఁడనియు తెలియచేసెను. ఆ మాటనుబట్టి ఆయనను గుర్తించుట సులభసాధ్యమగును. ఆయన తాను అపొస్తలుఁడైనట్టు చెప్పకయుండుట మాత్రము కాక 18 వచనమందు తాను అపొస్తలులలో కలిసినవాఁడు కాఁడని యగుపఱచెను. కాఁబట్టి యితఁడు లూ $6^{16}$ కార్య $1^{13}$ నందు చెప్పఁబడిన అపొస్తలుఁడగు యూదా యను నభిప్రాయ మంగీకారము కాదు. యాకోబు పత్రిక వ్రాసినవాని కితఁడు సహోదరుఁడు గనుక మా $6^{3}$ నందు పేర్కొనఁబడిన యేసు సహోదరుఁడైన యూదాయని నిశ్చయించ వలయును. (యూదా 11 చూ॥).

2. ప్రామాణికత్వము. బహిస్సాక్ష్యము: రెండవ శతాబ్దము అంత్యము కాకమునుపు ఆదిక్రైస్తవ పెద్దలందఱు ఈ పత్రిక నెఱిఁగియుండిరనియు యూదాచే రచించఁబడినట్టు అంగీకరించిరనియు ప్రాచీన క్రైస్తవమత సంరక్షణ గ్రంథముల మూలముగా సిద్ధాంతమగును. టెర్టలియాను అలెక్సంద్రియ పట్టణపు క్లెమెంతు ఇది యూదా పత్రికయని సమ్మతించిరి. అదియుఁగాక రెండవ శతాబ్దమున వ్రాయఁబడిన పురాతన లాటినను భాష తర్జుమ గ్రంథమందు ఇది యున్నది. ఇందునుబట్టి యీ యుత్తరము రెండవ శతాబ్దమందు వెల్లడియాయెననుట నిస్సందేహము.

అయినను ఇది ప్రమాణ గ్రంథముగా నంగీకరించుటనుగూర్చి యనేకులు సంశయించుచుండిరి. భక్త శ్రేష్ఠుఁడగు ఒరిగెను దాని ప్రామాణికత్వము నొప్పుకొని యొప్పుకొననట్లుండెను. యుసీబియసు అను చరిత్రకారుఁడు దాని గుఱించిన సందేహమునుబట్టి వివాదాస్పద గ్రంథముల వరుసలో వ్రాసెను. పెషీటోయను సిరియ భాష తర్జుమ గ్రంథమున నిదిలేదు. తూర్పుదేశ సంఘస్థులు మూఁడు నాలుగు శతాబ్దములవఱకు నీ పత్రికను లేఖనముగా నంగీకరించరైరి. క్రీ॥ శ॥ 341-420 సం॥ ముల మధ్యన జీవించిన జెరోమను పండితోత్తముఁడు తనకు సమకాలీనులైన వారనేకు లీ పత్రికయొక్క ప్రామాణికత్వమునకు సమ్మతించకుండిరని సూచించియుండెను. దీనినిగుఱించిన సంశయమునను రెండు హేతువులు గలవు. అవేవనిన (1) ఈ పత్రిక మిగుల సంక్షేపమైనది గనుక ఇతర పత్రికలతో పాటుగా నిది యారాధనయం దుపయోగించఁబడకుండెను. (2) దీనియందు రెండు మూఁడు పర్యాయములు ఇతిహాస గ్రంథముల ప్రశంసలు తటస్థించును గనుక అది ప్రమాణ గ్రంథముగా నెంచఁబడతగదని పెక్కండ్ర యభిప్రాయము.

అంతస్సాక్ష్యము: గ్రంథపరిశోధన చేయఁగా నీ పత్రిక సంఘస్థాపితమై బహు సంవత్సరములు

గడచిన తరువాత రచించఁబడెనని పరిష్కారమగును. అందుకు దృష్టాంతముగా 17 వ. మందు అపొస్తులులమాట జ్ఞాపకము చేయుఁడి యను మాటనుబట్టి అప్పటి నపొస్తలులు మృతి నొంది చాలకాలమాయెననియు వారి బోధయొక్క యుపదేశ సంగ్రహము నేర్పడి యుండెననియు తెలియును. అదియుఁగాక, అప్పటికి అంత్య కాలమందు బయలుదేరుదురని అపొస్తులులు ముందు చెప్పిన పరిహాసకులు బయలుదేరి యుండిరి. కాఁబట్టి యపొస్తులులు చాలయేండ్లకు ముందు పలికిన సూచనలు నెఱవేఱిన కాలమందీ పత్రిక రచించఁబడెననుకొనతగును.

3. కాలస్థాన నిరూపణము.

క్రీస్తుమత బోధకులు యేసు ఈ లోకమందు దేవుని రాజ్యము స్థాపింప నవతరించెననియు ఆ రాజ్యమున కాయనే రాజనియు ప్రకటించుటను విని రోమా చక్రవర్తియగు డొమిషన్ తన దొరతనమును గుఱించి భయపడి యేసుయొక్క బంధువులుండిన పక్షమున తన యెదుటికి తెమ్మని ఆజ్ఞాపించఁగా యూదాయొక్క మనుమలిద్దరు రోమాపురికి తేఁబడిరి. చక్రవర్తి వారు బీద వ్యవసాయకులని తెలిసికొని వారు రాజద్రోహులు కారని వారిని విడిపించెను. అది క్రీ॥ శ॥ 81 సం॥ మున జరిగిన సంగతి గనుక అప్పటికి యూదా మనుమలు వ్యవసాయము చేయునంతటి పెద్దవారైనందున నాయన యంతకుముందు మరణమాయెనని తలంచవచ్చును కాఁబట్టి, క్రీ॥ శ॥ 81 సం॥ నకు ముందుగానీ పత్రిక రచించఁబడెనని విశదమగును. అయినను దీనియందు ప్రస్తాపమైన తప్పు సిద్ధాంతములు కేవలము ప్రాచీన కాలమందేర్పడలేదు గనుక ఈ యుత్తరము రమారమి క్రీ॥ శ॥ 64-70 సం॥ మధ్య కాలమందు లిఖితమాయెనని తేటపడును.

వేదవేత్తలలో కొందఱీ యూదా పత్రికయు, రెండవ పేతురు పత్రికయు అనేక విషయములయందు పోలియుండుటనుబట్టియు నిందులో హనోకు గ్రంథమను ఇతిహాసగ్రంథ విషయములు సూచించఁబడుటనుబట్టియు నిది ఐగుప్తు దేశమందు లిఖితమాయెనని తలంచుచుదురుగాని వారి యభిప్రాయము నిరాస్పదమైనది. యూదా యొక్క సహోదరుఁడగు యాకోబు యెరూషలేము సంఘాధ్యక్షుఁడై యుండఁగా ఆయన సహోదరులును సంఘ నిర్వాహకులై యెరూషలేములో నివాసముండిరను నభిప్రాయము నిరాక్షేపణీయము.

4. ఎవరి నిమిత్తమై వ్రాయఁబడెను: మొదటి వచనమున దేవునియందు ప్రేమించఁబడి యేసు క్రీస్తునందు భద్రము చేయఁబడినవారై పిలువఁబడిన వారికి వ్రాయునదియని యుదాహరించఁబడెను. ఈ మాటవలన పత్రిక యెవరికి చెందవలెనో వారిని గుర్తింప సాధ్యము కానుగాని గ్రంథకర్త యేదో యొక సంఘమును తలఁచి వ్రాసియుండెను. ఆ సంఘము చిన్నాసియలోని దని కొందఱును అంతియొకయ సంఘమని కొందఱును కొరింథు సంఘమని కొందఱును పండితులలో భిన్న తాత్పర్యములు గలవారై యున్నారు.

5. ఉద్దేశము: 3,4 వచనములను చదువఁగా గ్రంథకర్తయొక్క యోచన వెల్లడి యగును. ఇందులో ఆయన తాను పెద్దలద్వారా తెలిసికొన్న సత్యోపదేశమును భద్రపఱచి మిథ్యోపదేశమును విసర్జించి దైవచిత్తమునకు ప్రతికూలమగు దుష్ప్రవర్తనను త్యజించవలయునని యూ భక్తులను ప్రేరేపించ వ్రాసెను.

6 ముఖ్యభాగములు.

I. వందనములు (1, 2)

II. వ్రాయుటకు హేతువులు (3).

III. దుష్టులకు కలుగు దుర్గతిని పురాతన చరిత్రమువలన దృష్టాంతపఱచి దుష్ప్రవర్తనుల యక్రమములను వివరించుట. (4-19).

IV. హెచ్చరికలు (20-23).

V. స్తవవచనములు (24-25). M.

**యూదావారు, యూదులు** (**Tribe of Judah, Jews**). యాకోబు నాలుగవ కుమారుఁడగు యూదా సంతతివారు. అరణ్యమందుఁ దిరుగుచుండు సమయములో నయస్సోను వారికి ప్రధానియైయుండెను (సంఖ్యా $1^{7}$ $2^{3}$ మొ॥). కాలేబుకూడ ఆ గోత్రపు పెద్దలలో నొకఁడు ($13^{6}$ $34^{19}$). మొదటిసారి లెక్కింపఁబడినపుడు వారు 74,600 మందియు ($1^{26,27}$)

రెండవసారు 76,500 మందియు ($26^{22}$) ఉండిరి. కనానులోఁ బ్రవేశించినపిదప షెకెముదగ్గిర ధర్మశాస్త్రమును వినిపించినప్పుడు గెరిజీము పర్వతముపై నిలిచి ఆశీర్వాదమును విని ఆమేన్ చెప్పిన వారిలో వీరునుండిరి (ద్వితీ $27^{11}$). దోపుడు సొమ్ము విషయములో పాపము చేసినవాఁడగు ఆకాను ఈ గోత్రపువాఁడే (యెహో $7^{1,17,18}$). కనానుదేశమునందు యూదావారికి స్వాస్థ్యమును ముందుగా నిచ్చిరి ($14^{6}$-$15^{63}$ పటము IX). యెహోషువ కాలముచేసినపిమ్మట తమ స్వాస్థ్యము నుండి అన్యులను తోలివేయుటకు మొదట పూనుకొనినవారు వీరే (న్యాయా $1^{1-20}$). వారిదేశము మృతసముద్రపు ఉత్తరకొననుండి పడమటనున్న మధ్యధరాసముద్రమువఱకు వ్యాపించియుండినను సముద్రతీరముననున్న ఫిలిష్తీయులదేశము దావీదు కాలమువఱకును జయింపఁబడకయుండెను. వీరి భాగమునుండి పశ్చిమమునందును వాయవ్యమునందుండు భాగములను షిమ్యోను దాను గోత్రముల కిచ్చిరి (యెహో $19^{1-9,40-48}$). అది దక్షిణమున యెడారివఱకు వ్యాపించియుండెను. దానికి దక్షిణమందున్న దేశమును నెగెబు (= దక్కను) అని బిలిచిరి.

తమ దేశమును స్వాధీనపఱచుకొనుటలో యూదావారికి పెక్కు కష్టములు సంప్రాప్తమయ్యెను. మెసపొతేమియ రాజు ఇశ్రాయేలీయుల దేశమంతటిని బాధింపఁగా యూదా



ఐగుప్తులోకి చెఱపట్టబడిన యూదులు

గోత్రీకుఁడగు ఒత్నీయేలు దానిని రక్షించెను (న్యాయా $3^{8-11}$). ఫిలిష్తీయులు వారి నెడతెగక బాధించిరి ($3^{30}$, $10^{7}$ $13^{1}$). తక్కిన గోత్రములతో పాటు వారు బెన్యామీనీయుఁడగు సౌలుకు లోఁబడిరిగాని అతఁడు చంపఁబడినపిమ్మట తమ స్వంత గోత్రపువాఁడగు దావీదుకు లోఁబడిన వారై అతని వంశమును రాజులుగా నంగీకరించిన వారిలో ముఖ్యులైయుండిరి. సొలొమోనుకు తరువాత రాజ్యవిభాగమైనప్పుడు బెన్యామీనీయులతోకూడి దక్షిణరాజ్యపు వారైరి. అప్పటి నుండి వీని యూదావారని బిలిచిరి. ఆ రాజ్యము క్రీ॥ ము॥ 931-587 వఱకు నిలిచెను. ఆ కాలములోని మొదటి 60 సం॥లు ఇశ్రాయేలు వారనఁబడిన పదిగోత్రముల వారితో పరస్పర కలహములు సంభవించెను (I రాజు $14^{30}$ $15^{7,16}$ II దిన $12^{16}$ $13^{2-20}$). గాని తరువాత యెహోషాపాతు ఇశ్రాయేలువారి రాజగు అహాబుతో సంధిజేసి కొని తన కుమారునికి అతనికూతును వివాహమొనర్చినందున రెండురాజ్యములు కొంతకాలము సమాధానముగా నుండెను గాని దానితోపాటు బయలుపూజ యూదాదేశమునందు వ్యాపించెను. అప్పటినుండి యూదారాజ్యము నాశమయినదాక యెహోవాను పూజజేసినవారికిని ఇతరదేవతల ననుసరించిన వారికిని నిత్యపోరాటము కలిగెను.

హిజ్కియా యోషీయాలనువారు యెహోవా పూజనుద్ధరించిన ముఖ్యరాజులై యుండిరి గాని ఆహాజు మనష్షే యను వారు బయలుపూజ నతి విస్తారముగా జేసిరి (కాలక్రమణిక చూ॥). ఆహాజుకాలములో దమస్కువారును ఇశ్రాయేలు వారును సంధిజేసికొని వీరిమీఁదకురాఁగా ఆహాజు అష్షూరువారి సహాయ మపేక్షించినవాఁడై వారికి కప్పము చెల్లించువాఁడాయెను. కొంతకాలమునకు అష్షూరువారి బాధలను పడలేక ఐగుప్తీయుల చెలిమి గోరిరి. ఇట్లు ఈ రాజ్యము ఆ రెండు లౌకిక మహారాజ్యముల మధ్య నిఱుకునఁబడి అష్ట కష్టముల కాస్పదమయ్యెను. యోషీయా ఐగుప్తు రాజగు ఫరోనెకోకు నోడిపోయినందున యూదా రాజ్యము కొంతకాలము దనుక ఐగుప్తుకు లోఁబడవలసి వచ్చెనుగాని తరుచుగా అష్షూరువారికిని క్రీ॥ పూ॥ 605 నుండి బాబెలువారికిని లోఁబడెను (కాలక్రమణిక చూ॥). క్రీ॥ పూ॥ 587 లో యెరూషలేము నెబుకద్నెజరుచే పట్టఁబడినపిమ్మట బాబెలువారు వీరిలో నెక్కువమందిని చెఱపట్టినను, కొందఱినచ్చట నిలిపి వారికి గెదల్యా యనువానిని అధిపతిగా నియమించిరి. అతఁడు చంపఁబడినపిమ్మట మిగిలియున్నవారు ఐగుప్తుకు పారిపోఁగా యూదారాజ్యమున కంతము కలిగినట్లున్నది. అన్యదేవతలను నమ్ముకొనుటయు, యెహోవానుగాక అన్యరాజుల సహాయము నపేక్షించుటయు ఈ రాజ్యనాశనమునకు ముఖ్య కారణములై యున్నవి.

ఇట్లుండఁగా చెఱలో నుండుటనుబట్టి యూదులను పదమునకు విశేషయర్థము వచ్చెను. ఇంతకు పూర్వమది ఒక గోత్రమునకును ఒక రాజ్యమునకును పేరుగా నుండెనుగాని యిప్పటినుండి అది మతపు పేరుగా వాడుకలోనికి వచ్చెను. చెఱలో నుండు సమయమునందే వారు తమ పరిశుద్ధలేఖనముల విలువను తెలిసికొన నేర్చుకొనిరి. విగ్రహారాధనమే తమ కష్టముల కన్నిఁటికి మూలమని యెఱిఁగి దానిని విసర్జించిరి. మాదై చక్రవర్తియగు కోరెషువారికి వారి స్వదేశముకుఁ బోవనై క్రీ॥ పూ॥ 537 లో సెలవియ్యఁగా, తిరిగి వెళ్లినవారిలో ఇతర గోత్రికులు నుండినను, యూదుల ప్రాముఖ్యతనుబట్టి వారు యూదులనఁబడిరి. పారసీకుల యేలుబడిలో వారి దేశము యూదయదేశమనఁబడెను (యూదాదేశము చూ॥). జెరుబ్బాబెలు దావీదు వంశమున జన్మించినవాఁడగుటనుబట్టి పారసీకుల అధికారముక్రింద దేశము నేలెను. ఇట్లు వారు మహా అలెక్సందరు కాలము వఱకు (క్రీ॥ పూ॥ 332) పారసీకుల అధికారము క్రింద నుండిరి. మహా అలెక్సందరు 323 లో చనిపోయినపిదప అతనిరాజ్యము నాలుగు భాగములైనందున యూదయనుగూర్చి ఐగుప్తులోని తొలమీయులకును, అంతియొకయలోని సెలూకిడ్ వారికిని ఎడతెగని పోరాటములు కలిగెను. క్రీ॥ పూ॥ 200 వఱకు తొలమీవారు దాని నేలినను, అప్పటినుండి అంతియొకయవారు ఏలనారంభించిరి. వారు యూదుల మతాచారములను మార్చఁదలంచఁగా యూదులు తిరుగఁబడి మక్కబేయులనువారి నాయకత్వముక్రింద కొంతకాలమువఱకు స్వతంత్రులైరి (అంతియోకస్ ఎఫిఫనీసు, మక్కబేయులు చూ॥). ఈ కాలములో యూదులు చిన్నాసియ ఐగుప్తు రోమా రాజ్యములలోకి చెదరిపోయిరి. రోమనులు దీనిని క్రీ॥ పూ॥ 63 సం॥ మందు లోఁబఱచుకొనిరి. అప్పటినుండి యెరూషలేము నాశనము వఱకు వారికి వేర్వేఱు ప్రభుత్వములుండెను (కాలక్రమణిక చూ॥). వారి ఆలయము లోకప్రసిద్ధిపడసెను. అది క్రీ॥ శ॥ 70 సం॥ లో పాడైపోఁగా వారికి స్వంతదేశము లేకపోయినను వారు మతవిషయమునందు మఱింత నిష్ఠగలవారైరి. దానికిపిమ్మట దాదాపు 1900 సం॥ లు గతించినను వారింకను స్వదేశమని చెప్పుకొనుటకు లేనివారై అన్నిదేశములలోను చెదరినవారై తమ మతాచారములవలనను బోధలవలనను ఇంకను ఒక ప్రత్యేక జనముగానే యుండిరి గాని 1947 లో వారొక స్వతంత్ర రాజ్యము సంపాదించినవారై దానిని భద్రముగ కాపాడుకొనుచున్నారు. మఱి ముఖ్యముగా యూదావంశములో నుండివచ్చిన యేసుద్వారా (హెబ్రీ $7^{14}$) వారిలోనుండి యుద్భవించిన ఆత్మీయజనులు నిజమైన యూదులై యున్నారు (రోమా $2^{29}$). యూదులైనవారిప్పుడు విశ్వాసమువలన తొలఁగిపోయినను లోకాంతమునకు పూర్వము వారును విశ్వాసులై దేవునితట్టు తిరిగెదరను వాగ్దానములు బైబిలునందు గలవు ($11^{13-32}$).

**యూనీకే** (Eunice = జయశాలినియగు భాగ్యవతి). తిమోతి తల్లి, యూదురాలు. ఒక గ్రీకువానిని వివాహమాడి చిన్నాసియలోని లుస్త్రలో కాపురముండెను. తిమోతికి బాల్యము నుండి లేఖనములను నేర్పించెను. పౌలు మొదటి సారి లుస్త్రను దర్శించినప్పుడు క్రైస్తవురాలైనట్లు అగపడుచున్నది (కార్య 14⁸·²³ 16¹ II తిమో 1⁵ 3¹⁵). E.

**యూనీయ** (Junias or Junia). రోమా పట్టణమందలి క్రైస్తవులలో నొకఁడు. పౌలితనికి తన వందనములను బంపెను. ఇతఁడు పౌలుకు బంధువునుతోటి ఖైదీయునైయుండెను. పౌలును అతఁడును యూదులై యున్నారను బంధుత్వము గాక మరేట్టి సంబంధములేదని కొందఱంచు చున్నారు (రోమా 16⁷). పౌలుకన్న ముందు క్రైస్తవుఁడగుటవలన ఆది క్రైస్తవులలో నొకఁడని స్పష్టమగుచున్నది. ఇతఁడపొస్తలులలో పేరు పొందినవాఁడని కనఁబడుచున్నది. తెలుఁగు బైబిలునం దీతని సంగతి వివరముగా నున్నను, అసలు భాషాపదమును జూచినయెడల ఈ పదము పురుషుని పేరా లేక స్త్రీ పేరా యని సందేహము పొడముచున్నది కొందఱీ పేరు స్త్రీ వాచకమని తలంచుచున్నారు.

**యూఫ్రటీసు** ఫరాతు చూ॥

**యూబాలు** (Jubal = సంగీత ప్రవాహము?). జలప్రళయమునకు పూర్వమున్న వారిలో నొకఁడు. కయీనుసంతతివాఁడు. లెమెకుయొక్క చిన్నకుమారుఁడు. సంగీతము చేయునప్పు డుపయోగించుటకై సితారాను సానికను మొదట నిర్మించెను (ఆది 4²¹).

**యూలి** (Julius). పౌలును రోమాకు ఖైదీగాఁ గొనిపోయిన ఔగుస్తు పటాలపు శతాధిపతి. ఇతఁడు పౌలునందు దయగా నుండెను (కార్య 27¹·³). పౌలు చెప్పినట్లు గాక ఓడయజమానుని అభిప్రాయము ప్రకారము మొదట చేసినను (27¹¹) ఓడ పగిలిపోయిన సమయమందు పౌలుమాట కెదురాడక వినెను (27³¹·³²). ఖైదీలు తప్పించుకొందురేమోనని రాణువవారు భయపడి వారిని చంప యత్నింపఁగా పౌలును రక్షింపఁగోరి యితఁడు వారికి సెలవియ్యలేదు (27⁴²·⁴³). E.

**యూలియా** (Julia). రోమాలోని క్రైస్తవురాలు. పౌలీమెకు తన వందనములను బంపించెను (రోమా 16¹⁵). ఫిలొలొగు అను వాని భార్యయు నేరియ యనువాని తల్లియని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల పౌలీవచనములో ఆ కుటుంబపువారి కందఱికి వందనములు వ్రాసెను.

**యూషు, యెహూషు, యెయూషు** (Jeush = సహాయము చేయవచ్చును).

1. ఏశావు కుమారుఁడు. ఇతని తల్లి అహలీబామా. ఇతఁడు ఎదోము వారిలో నొక తెగకు మూల పురుషుఁడాయెను (ఆది 36⁵·¹⁴·¹⁸ I దిన 1³⁵).

2. బెన్యామీనీయులలో నొక ప్రధాని (I దిన 7¹⁰).

3. రాజగు సౌలు సంతతివారిలో నొకఁడు (I దిన 8³⁹).

4. ఒక లేవీయుఁడు. ఇతఁడొక కుటుంబమునకు పెద్దయగుటచే ఆ కుటుంబమున కితని పేరు పెట్టిరి (I దిన 23¹⁰·¹¹).

5. రాజైన రెహబాము కొడుకులలో నొకఁడు (II దిన 11¹⁹).

**యూషెబెస్సెదు** (Jushab-Hesed = దయ తిరిగి పుట్టును). జెరుబ్బాబెలు కొడుకులలో నొకఁడు (I దిన 3²⁰).

**యూస్తు** (Justus = న్యాయస్థుఁడు).

1. బర్సబ్బా యోసేపుయొక్క మాఱుపేరు (కార్య 1²³). ఇస్కరియోతు యూదాకు బదులుగా నుండ నిలుపఁబడిన యిద్దరిలో నొకఁడు.

2. తీతియు యూస్తు (కార్య 18⁷ తీతియు చూ॥).

3. యేసు లేక యెహోషువ యని పిలువఁబడిన యొక యూదుడు. పౌలు రోమాలో మొదటిసారి ఖైదీగా నుండినప్పుడు అతనితో పని వాఁడుగ నున్న యతఁడు (కొలొ 4¹¹). E.

# యె

**యెకబ్సెయేలు** కబ్సెయేలు చూ॥

**యెకమ్యా** (Jekamiah = యెహోవా సమకూర్చును).

1. యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $2^{41}$).

2. రాజైన యెకొన్యా కొడుకులలో నొకఁడు (I దిన $3^{18}$).

**యెకూతీయేలు** (Jekuthiel = దైవభక్తి). యూదా సంతతివారిలో నొకఁడు. కాలేబు కుటుంబికుఁడు (I దిన $4^{18}$).

**యెకొన్యా** యెహోయాకీను చూ॥

**యెకొల్యా** (Jechiliah, Jecoliah = యెహోవాకు జయము). రాజగు ఉజ్జియాతల్లి (II రాజు $15^{2}$ II దిన $26^{3}$).

**యెక్మెయాము** (Jekameam = ప్రజలను సమకూర్చువాఁడు). లేవీయులలోని యొక పెద్ద. కహాతీయులతెగకు సంబంధించినవాఁడు (I దిన $23^{19}$ $24^{23}$).

**యెజీయేలు** (Jeziel = దేవుఁడు చూచును). దావీదు సేనలో చేరిన యొక బెన్యామీనీయుఁడు (I దిన $12^{3}$).

**యెజెబెలు** (Jezebel = పెండ్లికాని లేక, స్వచ్ఛమైన). 1. అష్తారోతుయొక్క యాజకుఁడును సీదోనీయులకు రాజైన ఏత్బయలు కుమార్తె. ఇశ్రాయేలువారి రాజగు అహాబు ఈమెను వివాహమాడెను (I రాజు $16^{31}$). ఈమె పురుషస్వభావముగల స్త్రీయై తన పెనిమిటి మెత్తనిస్వభావముగలవాఁడు గాన అతనిని లోఁబఱచుకొని తన దుష్టసలహాలద్వారా అతనిని నాశనమునకు నడిపించెను. బయలు దేవతయందతి శ్రద్ధయు భక్తియు గలది. ఇతర దేవుండ్లను బహుగా ద్వేషించెను. ఈమె సంతోషార్థమై అహాబు షోమ్రోనులో నొక మందిరమును కట్టించి బలిపీఠమును అషేరాను నిలిపెను ($16^{32,33}$). ఈమె కంకణము కట్టుకొని యెహోవా భక్తులను దొరికినంతమట్టుకు చంపించెను ($18^{4-13}$). ఏలీయా బయలు ప్రవక్తలను చంపించినప్పు డామె అతనిని సంహరింప సమకట్టుటలోను ($19^{1,2}$), నాబోతును చంపించుటలోను ($21^{1-22}$) రాజు అజ్ఞ నెంతమాత్రము లక్ష్యపెట్టినదికాదు. వీరిని చంపించినందునను నీతిచట్టముల నతిక్రమించినందునను యెజ్రెయేలు ప్రాకారముల సమీపమున యెజెబెలు కుక్కల కాహారమగునని దేవుఁడు తెలియఁ జేసెను ($21^{23}$). అహాబు చనిపోయిన పదునొకండు సంవత్సరములకు యెహూ రాచకుటుంబపు వారి నంతఱిని దయాదాక్షిణ్యములేకుండ పగతీర్చుకొని చంపుటవలన పైఁజెప్పిన ప్రవచనము నెఱవేఱెను (II రాజు $9^{7,30-37}$).

2. తుయతైర పట్టణస్థురాలు. ఈమె తానొక ప్రవక్త్రినని చెప్పుకొని క్రైస్తవ సంఘములో కొందఱిని వ్యభిచరించుమనియు విగ్రహార్పితమైన వాటినితినుమనియు ప్రోత్సాహపఱచి వారిని చెఱిపెను. ఈ పేరు బహుశః అలంకార పదమై యుండవచ్చును. అట్లయినయెడల దుష్టురాలును విగ్రహారాధికురాలును అగు అహాబు భార్యనగు ఈమెనుగల సమాన గుణలక్షణములనుబట్టి ఈలాగు పిలువఁబడెను (ప్రక $2^{20,23}$).

H.

**యెజ్రెయేలు** (Jezreel = దేవుఁడు విత్తును).

1. ఎస్డ్రేలను లోయకు తూర్పున ప్రాకారములుగల పట్టణము (I రాజు $21^{23}$ II రాజు $9^{17}$ $10^{7,8}$). ఇశ్శాఖారీయుల గోత్రపుభాగమునందున్న (యెహో $19^{17}$) గిల్బోవకొండ ప్రాంతములలో నున్నది (I సమూ $31^{1-5}$ $29^{1}$ II సమూ $4^{4}$). గిల్బోవలో సౌలుకాలమున జరిగిన యుద్ధమునకు పూర్వము, ఇశ్రాయేలీయులదండు ఈ పట్టణమునకు సమీపమునునుండు ఒక జెలదగ్గర దిగియుండెను (I సమూ $29^{1}$ II సమూ $4^{4}$). వారు ఫిలిష్తీయులను కలిసికొనిన దిక్కడనే (I సమూ $29^{11}$). సౌలు మరణమైన పిదప, ఇష్బోషెతుకు లోఁబడిన పట్టణములలో నిది యొకటి (II సమూ $2^{9}$). ఇశ్రాయేలీయుల రాజగు అహాబు దానిని తన రాచనగరులలో నొకటిగాఁ జేసికొనెను (I రాజు $18^{45}$). అతని కుమారుఁడగు యెహోరాము ప్రభుత్వకాలమునందును అది రాజధానిగానే యుండెను (II రాజు

$8^{39}$). అహాబన్యాయముగా నాక్రమించుకొనిన నాబోతు ద్రాక్షతోఁట ఈ పట్టణమునందున్న రాజనగరునకు సమీపముగా నుండెను. నాబోతును రాళ్లతోఁ గొట్టి చంపిన దీపట్టణమునకు వెలపటనే (I రాజు $21^{1-13}$). ఇచ్చటనే యెజెబెలు భయంకరమగు మరణము నొందెను (II రాజు $9^{10,30-35}$). అహాబు కుమారులగు 70 మందిని జంపించి యెహూ ఈ పట్టణద్వారమున కిరుప్రక్కల రెండు కుప్పలుగాఁ బోయించెను ($10^{1-11}$). ఇచ్చట జరిగిన ఇట్టి క్రూరకార్యములబట్టి ఆ పట్టణమునకు ప్రతీకారము జరుగుననుదానికి సూచనగా ప్రవక్తయగు హోషేయ ప్రకటించి, తన కుమారునికి యెజ్రెయేలు అను పేరుఁబెట్టెను (హోషే $1^4$). ఈ పట్టణమున్న లోయ పడమరగాఁ బోయి, కర్మెలుకొండకు ఉత్తరముగా వచ్చి, మధ్యధరాసముద్రము దనుక వ్యాపించును. బైబిలునందు యెజ్రెయేలులోయ యనఁబడినది ఇదిగాక, యెజ్రెయేలు పట్టణము నుండి తూర్పుగా యొర్దానునదివఱకు వ్యాపించునదై యున్నది (యెహో $17^{16}$ హోషే $1^5$). గిద్యోనుకాలమున మిద్యానీయు లిచ్చట తమ దండును విడిసిరి (న్యాయా $6^{33}$). యెజ్రెయేలు చుట్టును తూర్పు పడమరలనుండు లోయప్రదేశమంతయు గ్రీకువారిచే ఎస్డ్రేలన్ అనఁబడెను



యెజ్రెయేలు

(యూదీతు $1^8$ $4^6$ $7^3$). ఇది యీ దేశపు కురుక్షేత్ర మనవచ్చును. ఐగుప్తునుండి అష్షూరునకుఁ బోవుమార్గ మీ లోయగుండా వేయఁబడుటచే గొప్పసేన లిచ్చట కలిసికొనుటకు తగినతావుగ నుండెను (II రాజు $23^{29}$). ఈ లోయ మిగుల ఫలవంతమైనది గాన, హోషేయ దాని యిశ్రాయేలు జనులపాలములకు సూచనగా నెంచి, అలంకార రీతిగా దానిగూర్చి వ్రాసెను (హోషే $2^{22}$). ప్రస్తుత మీ ప్రదేశమున జెరీను (*Jerin*) అనఁబడునదే దీని యునికియై యున్నది (పటము VI C 8).

2. యూదా మన్యప్రదేశమందున్న యొక గ్రామము (యెహో $15^{56}$). హెబ్రోనుకు ఆగ్నేయదిక్కునందు కర్మెలు కొండసమీపముగా నున్నదిగాని దాని యునికినిగూర్చి యింక తేటగాఁ దెలియదు. దావీదు భార్యలలో యెజ్రెయేలీయురాలగు అహీనోయము అనఁబడిన యామె ఈ యూరి కాపురస్తురాలని యనుకొందురు (I సమూ $25^{43}$ $27^3$ $30^5$ II సమూ $2^2$ పటము II, E 3).

3. యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $4^3$).

4. ప్రవక్తయగు హోషేయ కుమారుఁడు (హోషే $1^{4,5}$). కొందఱీపేరు హోషేయ కుమారునిదనిగాక, ఒక గొప్ప సత్యమును బోధిం

చుటకై కల్పించఁబడిన ఉపమానమందలి పేరని భావింతురు (పైన 1 చూ॥).

**యెత్రెయేలు గోపురము** కోట I చూ॥

**యెతెరు** (Jether = ప్రముఖుడు).

1. గిద్యోను జ్యేష్ఠకుమారుఁడు (న్యాయా $8^{20}$).

2. దావీదు అక్కయగు అబీగయీలు కుమారుఁడైన అమాశా తండ్రి. ఇతఁడు ఇష్మాయేలీయుఁడు (I రాజు $2^{5,32}$ I దిన $2^{17}$). (ఇత్రా చూ॥).

3. యూదావారిలో యాదా అనువాని కుమారుఁడు (I దిన $2^{32}$).

4. యూదావారిలో ఎజ్రా అను నొకని కుమారుఁడు (I దిన $4^{17}$).

5. ఆషేరు గోత్రికుఁడు (I దిన $7^{38}$). ఇతనికి ఇత్రాను అను మారుపేరుగలదు (ఇత్రాను చూ॥).

**యెత్నాను** (Ethnan = దానము). యూదావారిలో నొకఁడు (I దిన $4^{7}$).

**యెత్లా** (Ithlah = ఎత్తయిన స్థలము. దానీయుల పట్టణములలో నొకటి (యెహో $19^{40-46}$). అది అయ్యాలోనుకు సమీపమున నున్నదని వాక్య సంబంధములవలనఁ దెలియునుగాని దాని యునికిని గూర్చి ఇంకేమియుఁ దెలియదు.

**యెదాయా** (Jedaiah = దేవుఁడు మెచ్చును లేక దేవుఁడు తెలిసికొనును). హెబ్రీభాషయందీ పేరు రెండు రూపములుగా నున్నది. పైనుదాహరింపఁబడిన రెండర్థము లా రెంటిని సూచించును. ఈ దిగువనున్న పేరులలో మొదటి రెండు మొదటి యర్థము నిచ్చు రూపము గలవి. మిగతవి రెండవ యర్థమునకు సంబంధించినవి.

1. షిమ్యోను గోత్రికుల ప్రధానులలో నొకఁడు (I దిన $4^{37}$).

2. నెహెమ్యా కాలమున యెరూషలేము గోడలను కట్టుటకు సహాయము చేసినవారిలో నొకఁడు (నెహె $3^{10}$).

3. యాజకులలోని రెండవ వంతుకు మూల పురుషుఁడు (I దిన $9^{10}$ $24^{7}$ ఎజ్రా $2^{36}$ నెహె $7^{39}$ $11^{10}$ $12^{6,19}$).

4, 5. ఇద్దరు యాజకులు (నెహె $12^{6,7,21}$).

6. చెఱనుండి తిరిగివచ్చినవారిలో నొకఁడు (జెక $6^{9,14}$).

7. ఇద్దో 6 చూ॥

**యెదీదా** (Jedidah = ప్రియురాలు). రాజగు యోషీయా తల్లి (II రాజు $22^{1}$).

**యెదీయయేలు** (Jediael = దేవుఁడు ఎఱుఁగును).

1. బెన్యామీను గోత్రపువారి కుటుంబములలో నొక కుటుంబమునకు మూలపురుషుఁడు (I దిన $7^{6,10,11}$).

2. దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{45}$). దావీదును సిక్లగులో కలిసికొనినవాఁడితఁడే యని సాధారణముగా ననుకొందురు ($12^{20}$).

3. దావీదు కాలమునందు ఆలయపు ద్వారపాలకులలో నొకఁడు (I దిన $26^{2}$). ఇతఁడు లేవీయులలో కోరే తరగతికి చేరినవాఁడు.

**యెదూతూను** (Jeduthun = స్తోత్రము). దావీదుకాలములో సంగీతము నడిపించుటకు నియమింపఁబడిన ముగ్గురిలో నొకఁడు (I దిన $25^{1,6}$). ఇతని సంతతివారాలయములో గాయక సమూహమునందుండిరి ($16^{41}$ II దిన $5^{12}$ $35^{15}$ నెహె $11^{17}$). ఈ పేరు 39, 62, 77 కీర్తనల పై వ్రాతలోను కనఁబడును. ఇవి యెదూతూను వారి రాగముల ననుసరించి పాడవలసినదని యర్థము కావచ్చును. యెదూతూను యొక్క అసలు పేరు ఏతాను అని I దిన $6^{44}$ $15^{17,19}$ నందు కనఁబడును. ద్వారపాలకుఁడగు ఓబేదెదోముయొక్క తండ్రి ($16^{38}$) వేఱొకఁడని కొందఱి యభిప్రాయముగాని అట్లుకాదని తోచుచున్నది. ఇది ఆరంభమున నొకనికి పేరయినను తరువాత అది యతని సంతానీకులకు పేరయినట్లు కనఁబడుచున్నది. ఈ పేరునుగూర్చిన సూచనలు కొంచెము తారుమారుగా నుండుటచే సంగతుల నంత స్పష్టముగఁ జెప్పవీలుకాదు.

**యెఫున్నె** (Jephunneh = సిద్ధపఱచఁబడును).

1. కాలేబు తండ్రియొక్క పేరు (సంఖ్యా $13^{6}$).

2. ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన $7^{38}$).

**యెఫ్తా** (Jephthah = తెఱచువాఁడు). యాయీరుకును ఇబ్సానుకును మధ్యకాలములో నుండిన తొమ్మిదవ న్యాయాధిపతి. ఇతఁడు ఉపపత్ని కుమారుఁడగుటచే గిలాదుయొక్క యితర కుమారులు వానిని తమ యింటనుండి వెళ్లఁగొట్టిరి. అతఁడు గిలాదుకు తూర్పుదేశమునందొక గుంపును కూర్చుకొనెను. దేవునిచే పిలువఁబడినప్పు డా తరుణమును పోఁగొట్టకొనక, గిలాదీయులపై నాయకత్వము వహించి అమ్మోనీయుల నోడించి వారి యిరువది పట్టణములను స్వాధీనపఱచుకొని అమ్మోనీయుల దాస్యమునుండి తన దేశమును విడిపించెను. తనకు విరోధులై దండెత్తివచ్చిన ఎఫ్రాయిమీయులను శిక్షించి యొర్దానునది యవతలి భాగమునకుకూడ ఆరు సంవత్సరములు (క్రీ॥ పూ॥ 1188-1182) న్యాయాధిపతియై యుండెను. అతని చరిత్ర న్యాయా 11,12 అధ్యాయములం దున్నది. అతఁడు తన ప్రమాణ ప్రకారము కుమార్తె నర్పించుటయే ఆ చరిత్ర యందలి ముఖ్య సంగతిగా నున్నది

యెఫ్తా కుమార్తె వాస్తవముగనే బలిగా నర్పింపఁబడెనా లేదా యను సంశయమునుగూర్చి చర్చించుట కిది స్థలముగాదు. అతఁడు వాస్తవమగు బల్యర్పణనే యుద్దేశించినట్లు న్యాయా $11^{31}$ నందు స్పష్టముగ నున్నది. అతఁడు తాను మ్రొక్కుకొనిన మ్రొక్కుబడి చొప్పున ఆమెకు చేసెను అని $11^{39}$ నందున్నది. ఇట్టి సమర్పణ జనుల స్వభావమునకు వ్యతిరిక్తమైన దగుటచే కొందఱా ప్రమాణము శబ్దార్థముగ నెఱవేఱలేదని చెప్పెదరు. ఆమె మందిరసేవకొఱకు మాత్రమే ప్రతిష్ఠింపఁబడెనని కొందఱును, వివాహమాడకయే జీవించి చనిపోయెనని కొందఱును ఇట్లు దీని నెఱవేర్పును గూర్చి వ్యాఖ్యాతలు పలువిధములగు ఊహల నెలకొల్పిరి. ఈ ప్రమాణ మెట్టిదైనను దేవుఁడు దాని నంగీకరించినట్లు సత్యవేదమునం దొకింతయు కనుపింపదు. హెబ్రీ $11^{32}$ నందున్న విశ్వాసుల జాబితాలో నితని పేరును గలదు.

H.

**యెబూసు, యెబూసీయులు** (Jebus = త్రొక్కఁబడు స్థలము, కళ్లము, Jebusites). యెబూసు యెరూషలేమునకు అసలు పేళ్లలో నొకటియని యెహో $15^{63}$ న్యాయా $19^{10}$ I దిన $11^{4}$ వలనఁ దెలియుచున్నది. దావీదు కాలము వఱకు దీనికి యెరూషలేము పేరు లేదని పూర్వ మనుకొనిరి గాని టెల్-ఎల్-అమార్న రాతి శాసనములవలన క్రీ॥ శ॥ 1400 సం॥లకు పూర్వమే దానికి ఉరు-సలీము (*Uru-Salim*) అను పేరు నట్లు స్పష్టమగుచున్నది. ఆ మొదటి పట్టణము తరువాతి యెరూషలేమంత విశాలమైనది గాక సీయోను కొండమీఁద నుండునది మాత్రమే యయ్యుండెను. దాని కోట సీయోనుమీఁద కట్టఁబడెను (II సమూ $5^{7}$ I దిన $11^{5}$).

దీని ఆదిమనివాసులు యెబూసీయులనఁబడిరి. ఇశ్రాయేలీయులు కనానుదేశమును స్వతంత్రించుకొనకపూర్వమే వీరా దేశజనములలో నొకరై యుండిరి (ఆది $10^{16}$ $15^{21}$ నిర్గ $3^{8}$). ఇశ్రాయేలీయులు కనానుకు వచ్చినప్పుడు వీరు కొండ నివాసులుగ నెంచఁబడిరి (సంఖ్యా $13^{29}$ యెహో $11^{3}$). యెహోషువ వారి రాజు నోడించెను ($10^{23-26}$). వారి దేశమును బెన్యామీనీయుల కిచ్చిరి ($18^{16-28}$) గాని, వీరా దేశీయులను దానిలోనుండి వెళ్లఁగొట్టలేదు. ఇది యూదా వారి హద్దు ప్రాంతములలో నుండుటచే వారు దానిమీఁద యుద్ధముజేసి పట్టుకొని తగలఁబెట్టిరి (న్యాయా $1^{8}$ యెహో $15^{8}$) గాని, వారా ముఖ్య కోటను పట్టుకొనక పోవుటచేతనో, లేక యెబూసీయులు దాని మఱల స్వాధీనపఱచుకొనుట చేతనో యెబూసీయులు యూదా బెన్యామీనీయుల మధ్య ఇంక చాలకాలమువఱకు నివసించిరి ($15^{63}$ న్యాయా $1^{21}$ $19^{11}$). దావీదు కాలమువఱకు ఆ కోట యెబూసీయుల వంశమందే యుండెను (II సమూ $5^{6,7}$). దావీ దా కోటను పట్టుకొని యెరూషలేమును తన రాజధానిగఁ జేసికొనిన పిదపకూడ యెబూసీయులలోఁ గొందఱచటనే నివసించుచుండినటుల II సమూ $24^{16-18}$ II దిన $3^{1}$ వలన దెలియుచున్నది. తరువాత

దేవాలయము కట్టఁబడిన స్థలమును దావీదుకు అమ్మిన అరౌనా యెబూసీయుఁడే. సొలొమోను తన దేశమందున్న యెబూసీయులను దాసులనుగాఁ జేసెను (I రాజు $9^{20,21}$). అందువలన ఇతరులతోఁ గలిసి ప్రత్యేక జనముగా నుండుట యాగి పోయెను.

**యెబెరెకీయా** (Jeberechiah = యెహోవా దీవించును). యెషయా కాలమందు అతనిచే సాక్షిగా నుంచఁబడిన జెకర్యాయొక్క తండ్రి (యెష $8^{2}$).

**యెమీమా** (Zemimah = పావురము). యోబు శ్రమలకుఁ బిమ్మట అతనికి కలిగిన పెద్ద కుమార్తె పేరు (యోబు $42^{14}$).

**యెమూయేలు** నెమూయేలు 1 చూ.

**యెమెక్కేసీసు** (Emek-Keziz = కెసీసు లోయ). యెరికోయొద్ద యొర్దాను లోయలో నున్న యొక ఊరు. ప్రస్తుతమున దీని యునికిని తెలియఁజేయు సూచన లెవ్వియు లేవు (యెహో $18^{21}$).

**యెయతిరయి** (Jeatherai). గెర్షోను తెగ వారిలో యొక లేవియుఁడు (I దిన $6^{21}$). $6^{41}$ లో ఇతనికి ఎత్నీయను మాఱుపేరు గలదు.

**యెయూషు** యూషు చూ॥

**యెరహు** (Jerah = చంద్రుఁడు). ఆది $10^{26}$ I దిన $1^{20}$ లో ఇతఁడు యొక్తాను కుమారుఁడుగా నెంచఁబడెను. ఇతఁ డరబ్బీయులలో నొక తెగవారికి పూర్వికుఁ డగుటచే ఇది యా తెగకు పేరాయెను. అరబ్బీయుల తెగలలో దీనికి సంబంధమగు వారాక్ (*Warakh*), యురలిక్ (*Yuralik*), యరక్ (*Yarach*) అను మూఁడు పేరులు కలవు.

**యెరహ్మేయేలు, యెరహ్మేయేలీయులు** (Jerahmeel = దేవుఁడు కనికరపడునుగాక! Jerahmeelites).

1. యూదయ దేశపు దక్షిణ భాగమందున్న యెరహ్మేయేలీయుల పూర్వికుఁడు (I సమూ $27^{10}$ $30^{29}$). దిన వృత్తాంతముల గ్రంథములోని వంశావళుల ప్రకారముగా నితఁడు యూదా సంతతి వారిలోని వాఁడే (I దిన $2^{9,25-27,33,42}$). వీరు యూదా గోత్రమునకు చేరినవారు కారనియు యూదులతో చేర్చఁబడిన పిమ్మట వారిలోని వారే నని చూపుటకొఱకె వరో దినవృత్తాంత గ్రంథమందలి వంశావళులతో వీరిని గలిపిరనియు కొందఱు నవీన పండితుల యభిప్రాయము.

2. ఒక లేవీయుఁడు. అతని పేరు నొక లేవీయ కుటుంబమునకు పెట్టినట్లున్నది (I దిన $24^{29}$).

3. యిర్మీయా బారూకులను పట్టుకొను నిమిత్తము రాజగు యెహోయాకీము పంపిన ముగ్గురిలో నొకఁడు (యిర్మీ $36^{26}$). ఇతఁడు రాజవంశస్థుఁ డనఁబడుటచే యెహోయాముకీ కొడుకేమోనని కొందఱి తలంపుగాని రాజవంశమునకు చేరిన యొకఁడని యితరుల యభిప్రాయము.

**యెరికో** (Jericho = సువాసనగల పట్టణము). యొర్దాను లోయలో (ద్వితీ $34^{1-3}$) మృతసముద్రమునకు 5 మైళ్లు పడమరిగానుండు పట్టణము. పూర్వమున నిది మిగుల ప్రసిద్ధమైనది. ఖర్జూరచెట్ల పట్టణమనియు (న్యాయా $1^{16}$), ఈత చెట్లు గల యెరికో యనియు (ద్వితీ $34^{3}$) దీనికి నామాంతరములు గలవు. మధ్యధరాసముద్రమట్టమునకు 825 అడుగులు పల్లమున నుండుటచేత, ఇది సమశీతోష్ణ స్థితిగలదై యున్నది. పైరు పచ్చలలోను ఇది ఉష్ణమండల ప్రాంతముల వలెనే యున్నది. ఈ పట్టణమున్న లోయ మిగుల ఫలవంతమైనది. ఇచ్చట ప్రజలును ఉష్ణదేశ ప్రజలవలె అంత ధైర్యశాలురుగాక యుద్ధసమయములయందు శత్రుధాటికాగఁజాలక పారిపోవుట కద్దు. తూర్పుప్రాంతములనుండి వచ్చు శత్రువులు యొర్దానును దాటఁగానే ప్రథమమున పట్టుకొనవలసిన కోట యిదే గాన, అనేకమారులు ఇది శత్రువులకు లొంగెను. ఇశ్రాయేలీయులు మోయాబు మైదానములో మకాము చేసినప్పుడు దాని పేరు బైబిలునందు మొదట కనఁబడును (సంఖ్యా $22^{1}$ $26^{3,4}$). దాని సంగతులను దెలిసికొనుటకై యెహోషువ వేగులవారి నంపెను (యెహో $2^{1-24}$) ఈ పట్టణస్థురాలగు రాహాబు వారిని రక్షించి, తరువాత తన్నుతాను రక్షించుకొనెను. ఇశ్రాయేలీయులు యొర్దానును దాటిన పిమ్మట ఈ పట్టణము నద్భుతరీతిగా జయించిరి

(6). దానిని తిరిగి కట్టరాదని యెహోషువ దానిని శపించెను (6[26,27]). దేశమును విభాగించినప్పుడు దానిని బెన్యామీనీయులకిచ్చిరి గాని అది ఎఫ్రాయిము బెన్యామీనీయుల దేశములకు సరిహద్దుగా నుండెను (16[1,6] 18[12,21]). మోయాబు రాజగు ఎగ్లోను ఇశ్రాయేలీయులను బాధపఱచినప్పుడు అతఁడీ పట్టణమును తనకు ముఖ్యస్థానముగా జేసికొనెను (న్యాయా 3[13]). అమ్మోనీయుల రాజు చేత అవమానితులగు రాయబారులకు దావీదీ పట్టణమున కొంతకాలమువఱకు ఉండుఁడని సెలవిచ్చెను (II సమూ 10[5] I దిన 19[5]). యెహోషువవలన నాశనము చేయఁబడినది మొదలింతవఱకిది యొక చిన్న పల్లెగా నున్నట్లు ఈ చరిత్ర వలన నూహింపఁదగును గాని అహాబు ఇశ్రాయేలు వారికి రాజయినప్పుడు బేతేలువాఁడగు హీయేలు దానిని మరల మునుపటివలె బలమైన గొప్ప కోటగా కట్టింపఁబూనుకొనెను. తెనుఁగున నున్నట్లు యెహో 6[26,27] లోని శపథప్రకారము అతని యిద్దఱు కుమారులు చనిపోయిరి (I రాజు 16[34]) గాని అసలు భాషను జూచినయెడల దాని నివారణఁజేయుటకై అతఁడు తన యిద్దఱు కుమారులను నరబలిగా నర్పించినట్లు దాని కర్థము చెప్పవచ్చును. ఏలీయా ప్రవక్త కాలమున అక్కడ ప్రవక్తల మఠమొకటి యుండెను (II రాజు 2[5]).



పశ్చిమమునుండి కనఁబడు యెరికో సమభూమి

అతడు ఆరోహణము కాకపూర్వము తన శిష్యుఁడగు ఎలీషాతో కూడ ఈ పట్టణము మీఁదుగా బోయెను. ఎలీషా యొర్దానునుండి తిరిగివచ్చునప్పుడీ పట్టణమునకు వచ్చెను (2[4,15,18]). ఇశ్రాయేలు రాజగు పెకహు యూదులను జయించి అనేకులను పట్టుకొనఁగా ఒక ప్రవక్త వచ్చి యిచ్చిన సలహాకు లోఁబడి వారిని యెరికోలో మఱల విడిచెను (II దిన 28[15]). ఈ పట్టణమునకు సమీపముననే యూదుల రాజగు సిద్కియా బాబెలు వారిచే పట్టఁబడెను (II రాజు 25[5] యిర్మీ 39[5] 52[8]). చెరకాలమునకు పిమ్మట యెరికో వారిలోను వాని సంతతివారిలోను 345 గురు తిరిగి వచ్చిరి (ఎజ్రా 2[34] నెహె 7[36]). వారిలో కొందఱు యెరూషలేము ప్రాకారములను తిరిగి కట్టుటలో సహాయపడిరి (3[2]) మక్కబీయుల కాలములో అంతియొకయవారి సేనాధిపతియగు బక్కైడీసు యెరికో ప్రాకారములను తిరిగి కట్టించెను (I మక్క 9[50]). మహా హేరోదుకాలమున రోమీయులు దానిని పట్టుకొని దోఁచుకొనిరి (పురా. 16,5,2; 17,13,1 యుద్ధ. 1,21; 4,9). యెరికోకు పోవు మార్గమున దొంగలు కొట్టిన బాటసారిని సమరయుఁడు పరామర్శించుటను గూర్చిన ఉపమానమును యేసు చెప్పెను (లూ 10[30]). ఆయన బర్తిమయికిని యెరికోలో

దృష్టి ననుగ్రహించెను (మ $20^{29}$ లూ $18^{35}$). ఈ పట్టణ నివాసియగు జక్కయ్య యను సుంకరి యింటికి వెళ్లి, అతనికి రక్షణ కలిగినదని ఆయన చెప్పెను ($19^{1-10}$). మినాలను గూర్చిన ఉపమాన మీ ప్రాంతముల యందే చెప్పినట్లున్నది ($19^{11-28}$).

ప్రస్తుత మక్కడనుండు ఎర్-రీఖ (*Er-Riha*) అనునది చిన్న పల్లెయై యున్నది. అదెంత చిన్నదైనను యెరికో పేరును అందింకను స్పష్టముగా చూడవచ్చును (పటము I, E 8).

**యెరీబై** (Jeribai = జగడములు). దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{46}$).

**యెరీమోతు** (Jerimoth = ఎత్తయిన స్థలములు).

1. బెన్యామీనీయులలో నొక కుటుంబము (I దిన $7^{7}$).

2. దావీదు యోధులలో నొకఁడు (I దిన $12^{5}$).

3. దావీదు కుమారులలో నొకఁడు (II దిన $11^{18}$). ఇతని కూతురగు మహలతు రెహబాము నకు భార్యయయ్యెను.

4. సంగీతనాయకుఁడుగానుండు హేమాను తెగవారిలోని యొక లేవీయుఁడు (I దిన $25^{4}$).

5. రాజగు హిజ్కియా కాలములో ఆలయమునకు విచారణకర్తలుగా నున్నవారిలో నొకఁడు (II దిన $31^{13}$ యెరెమోతు 7 చూ॥).

6. బెన్యామీనీయుల కుటుంబములలో నొకదానికి పూర్వికుఁడు (I దిన $7^{8}$).

7. లేవి కుటుంబములలో నొకదాని పూర్వికుఁడు (I దిన $23^{23}$ $24^{30}$).

8. సంగీతము చేయువారిలో 15 వ వంతు వారికి పెద్ద (I దిన $25^{4}$).

9. దావీదు కాలములో నఫ్తాలీ గోత్ర ప్రధాని (I దిన $27^{19}$).

ఇట్టి గుణింతముగల పేరులింక బైబిలునందుండినను అసలులో నవి యెరేమోతు అని వ్రాయఁబడినందున ఆ పదమును చూడవలసియున్నది.

**యెరీయా** (Jeriah, Jerijah = యెహోవా చూచును). లేవీయుల వంతులలో నొకదానికి మూలపురుషుఁడు (I దిన $23^{19}$ $24^{23}$ $26^{31}$).

**యెరీయేలు** (Jeriel = దేవుఁడు చూచును). ఇశ్శాఖారు సంతతివారిలో నొకఁడు (I దిన $7^{2}$).

**యెరీయోతు** (Jerioth = పరదాలు). కాలేబు భార్యలలో నొకతె (I దిన $2^{18}$). ఈ వాక్యమునందు కొంచెము పొరపాటువచ్చినందున కొందరీమె కాలేబుకూతురై యున్నట్లును కొందరీ పేరు ఒక స్థలమై యున్నట్లు అభిప్రాయ పడుచున్నారు.

**యెరుబ్బయలు** (Jerubbaal = బయలు పోరాడును). గిద్యోనుకు పెట్టఁబడిన మారుపేరు (న్యాయా $6^{32}$ $8^{29,35}$ మొ॥). II సమూ $11^{21}$ నందున్న ఎరుబ్బెషెతు (= సిగ్గుమాలిన బయలు పోరాడును) అనునది దీనికి మారుగానున్నది. (గిద్యోను చూ॥).

**యెరూవేలు** (Jeruel = దేవునిచే స్థాపింపఁబడినది. ఏన్గెదీకి దక్షిణముగాను మృత సముద్రమునకు పడమరగానుండు యూదయ అరణ్యము. రాజగు యెహోషాపాతు ఇచ్చటనే మోయాబీయులతోను అమ్మోనీయులతోను ఇతర అరణ్యవాసులతోను యుద్ధముచేసెను (II దిన $20^{16}$ అరణ్యము 3 (11) చూ॥).

**యెరూషలేము** (Jerusalem = శాంతి నిలయము).

**A.** ఉనికిపట్టు:—నవీన యెరూషలేమును పురాతన యెరూషలేమును దాదాపు ఒకటే స్థలమునఁగట్టఁబడినవని పురాతన వస్తుశాస్త్రజ్ఞులు పరిశోధించిన శిథిలములవలన రూఢియగుచున్నది. పట్టణముమాత్రమేగాక ఆలయము కట్టఁబడిన స్థలమును మొదటినుండి నేటివఱకు నొకటియేనని చెప్పుటకు సందేహము కించిత్తయినను లేదు (దేవాలయము చూ॥). ఈ పట్టణము మధ్యధరా సముద్రమునకు 33 మైళ్లు తూర్పునను, మృత సముద్రపు టుత్తరభాగమునకు 14 మైళ్లు పడమరగా నున్నది. సముద్రమట్టమునకు 2500 అడుగుల యెత్తుననున్న రాతిమయమగు కొండలమీఁద కట్టఁబడినను, దానిచుట్టును వివిధలోఁయలలోను



యెరూషలేము ఒలీవ కొండమీఁదనుండి కనఁబడురీతి

పొలములతోను విలసిల్లు లోయలు గలవు. చలి కాలమున హిమము కురిసినను, అది త్వరితముగనే కఱఁగి, నీరగును. పట్టణము కొండమీఁదనుండుటచే, వేసవికాలమున సహితము సాధారణముగా చల్లగనే యుండును గాని మే మొదలు అక్టోబరు మాసమువఱకు ఎడారి ప్రదేశములనుండి వచ్చు

వడగాడ్పులవలన వేడిమి కొంచెము హెచ్చుగ నుండును. నవెంబరు మొదలు మార్చివఱకు వర్షములు మితముగాఁ గురియును.

I. లోయలు:—యెరూషలేమునందు 5 లోయ లున్నవి. వాటిలో మొదటి నాలుగు లోయ లనుగూర్చి మాత్రము బైబిలునందు సూచనలు గలవు.

**1. కిద్రోను లోయ:**—దీనికి కిద్రోను లోయ, కిద్రోనువాగు అని రెండు పేరు లున్నవి. ఇది యెరూషలేమునకును, తూర్పుననున్న ఒలీవల కొండకును మధ్యనున్నది. దావీదు అబ్షాలోముకు భయపడి పారిపోవునప్పుడు దీనిని దాటెను (II సమూ $15^{23}$). సొలొమోను షిమీని యెరూషలేమునందు విడి ఖైదీగానుంచి, దీనిని దాటనియ్యలేదు (I రాజు $2^{37}$) రాజగు ఆసా తన యవ్వ చేయించిన దేవతా స్తంభములను కాల్పించి, ఈ లోయలో పారవేయించెను ($15^{13}$=II దిన $15^{16}$). రాజైన యోషీయా విగ్రహముల నదేవిధముగా నీ లోయలో కాల్చి,



యెహోషాపాతు లోయ

వాటి బూడిదను ఈ వాగునందు వేయించెను (II రాజు $23^{4,6,12}$). ఈ లోయ అంచుననే దేవాలయము కట్టఁబడినందున, హిజ్కియా కాలమున యాజకులు ఆలయమును పవిత్రపఱచి, చెత్త యంతయు నెత్తి ఈ లోయలో పారవేసిరి (II దిన $29^{16}$). యిర్మీ $31^{40}$ లో అది తిరిగి కట్టఁబడు యెరూషలేమునకుండఁబోవు సరిహద్దులలో నొకటిగా నుదాహరించఁబడెను. కిద్రోను పదమును లోపించి, దానిని కాలువ అనియు (II దిన $32^{4}$) లోయ అనియు (నెహె $2^{15}$) పిలిచిరి. అది దేశమధ్యముగుండ పారుచున్నట్లు II దిన $32^{4}$, నందున్నది. క్రీస్తు ఒలీవకొండకు వెళ్లునప్పుడు దానిని „ దాటెను (యోహా $18^{1}$ మా $14^{26}$). దేవుఁడు అన్యజనములను యెహోషాపాతు లోయలో తీర్పుచేయుటకు వచ్చునని యోవే $3^{12}$ నందున్నది. అది యీ కిద్రోను లోయకు మాఱుపేరని పురాతన కాలమునుండి యనుకొనుట సాధారణము కావున, అంత్యతీర్పు ఈ లోయలో జరుగునని కొందఱి తలంపుగాని, యెహోషాపాతు అను పదమునకు యెహోవా తీర్పు చేయుస్థలమని శబ్దార్థము. అది యెహోవా తీర్పు చేయుస్థలమునకు సార్థకనామముగాని ఫలాని లోయను సూచించుననుకొనరాదు.

**2. హిన్నోములోయ.** యెరూషలేమునకు పడమరగాను దక్షిణముగా నుండు లోయ. ఇది యూదా బెన్యామీనీయుల గోత్రములకు సరిహద్దుగా నున్నట్లు యెహో $15^{8}$ $18^{16}$ నందున్నది. యూదు లీ లోయలోనే అన్యదేవతలకు గుళ్లను కట్టించి, మొలెకు దేవతకు తమ పిల్లల నర్పించిరి (II రాజు $23^{10}$ యిర్మీ $2^{23}$ $7^{31,32}$ $19^{2,6}$ $32^{35}$). అందుచేత రాజగు

యోషీయా దాని నపవిత్రపఱచి, పట్టణము యొక్క చెత్త నచ్చట పారవేసి దానిని తగలఁ బెట్టించెను. ఈ స్థలము యేహ్యమైన దగుటచే యూదులు **గేహాన్న** (అనగా హిన్నోము భూమి) అను పదమును నరకమునకు వాడుచు వచ్చిరి. మ 5[22,29] 10[28] మొ॥ వాక్యములలో అది నరకమునకు అసలు గ్రీకుపదమై యున్నది.

**3.** రెఫాయీయులలోయ. యెరూష లేమునకు నైర్భతిగా నున్నది. ఇదికూడ యూదా బెన్యామీను గోత్రీకుల స్వాస్థ్యములకు హద్దుగా నున్నట్లు యెహో 15[8] 18[16] వలనఁ దెలియు చున్నది. ప్రస్తుతము రైలుమార్గము ఈ లోయ గుండా యెరూషలేమునకుఁ బోవుచున్నది.

**4.** షావేలోయ. మెల్కీసెదకు ఈ లోయలో అబ్రాహామును సెదుర్కొనెను (ఆది 14[17,18]). అతనిది యెరూషలేము పట్టణమని సాధారణముగా తలంచుచున్నారు గాని ఇది యెరూషలేమునకు సమీపమునఁ యుండు లోయలలో నొకటియని అభిప్రాయపడుచున్నారు. II సమూ 18[18] లో అబ్షాలోము **రాజు లోయలో** తనకొఱకొక జ్ఞాపకార్థపు స్తంభ మును కట్టించుకొన్నట్లున్నది. అది యెరూష లేమునకు రెండుఫర్లాంగుల దూరమునయున్నట్లు యోసీఫసు వ్రాసెను (పురా 7.10.3). ఈ రెండు పేరులు ఒకటే లోయకు పేరులై యుండ వచ్చును. హిన్నోములోయ యెరూషలేమున కెంటఱకు పడమరగా నున్నదో ఆ ప్రదేశమంత టికి షావేలోయయని పేరుపెటినట్టు కొందురు గాని అది రూఢియని చెప్పవీలులేదు.

**5.** టుర్రోపియను లోయ (*Tyropeon* = జున్ను చేయువారిలోయ). ఈ పేరు బైబిలు నందులేదు. యోసీఫసు దీని నుదాహరించెను (యుద్ధ 5.4.1). అది ఇంతకుముందు వివరించిన లోయల మధ్యనుండి యెరూషలేమును రెండుగా భాగించుచున్నది. సిలోయమను కోనేరు అందు గలదు (యోహా 9[7]). జెఫ 1[11] లో నున్న **మక్తేషులోయ** ఇదే కావచ్చును. మక్తేషనగా రోలు అని శబ్దార్థము.

II. ఊటలు:—

**1.** ఏన్‌రోగేలు (***En-Rogel*** = చాకలివారి యూఁట). ఊఁటలు లోయలలో కలుగుట సహజము గాన వీటికి సంబంధముగా వాటిని గూర్చి తెలిసికొనవలసియున్నది. బైబిలునందు రెండు మాత్రము ప్రశంసింపఁబడినవి. ఏన్‌ రోగేలు మొదటిది. అది యూదా బెన్యామీను వారల సరిహద్దులలోనున్నది (యెహో 15[7] 18[16]). అబ్షాలోము తిరుగఁబడినప్పుడు దావీదు పాఱి పోవుచు తన వేగులవారి నచ్చట నుంచెను (II సమూ 17[17]). అదోనీయాయు రాజ్య



ఏన్‌రోగేలు

ముపహరింపఁదలంచి తన పక్షమునున్న వారినంద జేని దీనికి సమీపముగానున్న యొక స్థలమునందు పోగుజేసెను (I రాజు 1[9]). ప్రస్తుతము దానిని కన్యఊఁట యని కొందఱు పిలుతురు. అది యెరూషలేమున కాగ్నేయ దిక్కుగా కిద్రోను లోయలోనున్నది. నీళ్లకొఱకును, బట్టలుదుకుట కొఱకును, నేటివఱకు స్త్రీలు అచ్చట కూడుకొం దురు. గాని అనేకలు యెరూషలేమునకు నైర్భతి గానుండి యోబు బావి (*Bir Eiyub*) యని పిలుఁబడునదే ఏన్‌రోగేలని తలంచుచున్నారు. కన్యయూఁటయు గిహోను ఊఁటయు ఒకటేయని తలంచుచున్నందున ఆ యభిప్రాయమే సరియన వచ్చును.

**2.** గిహోను యూట లేక కాలువ (***Gihon***). ప్రస్తుతము కన్యయూఁట (***Virgin's Fountain***) అనునది ఇదే. దీనిని

ఏన్‌రోగేలని తలంచ వీలుగాదు. అదోనియా తన వారిని ఏన్‌రోగేలు దగ్గర సమకూర్చఁగా (I రాజు $1^{9}$) ప్రజలు సొలొమోనును అదే సమయమున గిహోను దగ్గిర పట్టాభిషేకము జేసిరి ($1^{33,38,45}$). రాజగు హిజ్కియా అచ్చటినుండి యెరూషలేమునకు పడమరగా ఒక కాలువ కట్టించి నీటిని పట్టణములోనికిఁ దెప్పించెను (II దిన $32^{30}$). అతని కుమారుఁడగు మనష్షే కట్టించిన ప్రాకారములకు ఈ యూఁట ఒక హద్దుగా నున్నది.

III. కోనేరులు, చెఱువులు.

1. బేతెస్ద కోనేరు (*Pool of Bethesda*). అది గొఱ్ఱెలద్వారము దగ్గరనున్నదని యోహా $5^{2}$ నందుండుటచేత, ఈ కోనేరు దేవాలయమున కుత్తరముగానున్న గొఱ్ఱెల ద్వారము దగ్గరనున్నదని యనుకొనఁదగును గాని అచ్చట బావులే కనఁబడుచున్నవి గాని ఊఁటలుండక పోవుటచేపైన నుదాహరింపఁబడిన కన్యయూఁటకు మాఱుపేరని సాధారణముగా ననుకొనుచున్నారు (పైన II 2 చూ॥).

2. సిలోయము మడుగు (నెహె $3^{15}$), షిలోహునీళ్లు (యెష $8^{6}$), సిలోయము కోనెరు (యోహా $9^{7}$). ఇవన్నియు ఒకటే కోనేటియొక్క రూపాంతరములు. వీటి ప్రస్తుతపు పేరు అయిన్ సిల్వాను (*Ain Silwan*). ఇది ఊఁటకాదు. దీనికి నీళ్లు కన్యయూఁటనుండి భూమిలోనుండి తొలఁచబడిన యొక కాలువ



సిలోయము కోనేరు

గుండావచ్చును. అది టురోపియన్ కిద్రోను లోయలు కలియు చోటనున్నది (పైన I 1,5, చూ.). హిజ్కియా కాలమున అష్షూరువారు పట్టణమును ముట్టడింపఁగా, అతఁడు కాలువలను త్రవ్వించి నీటిని పట్టణములోనికి తెప్పించెను (II రాజు $20^{20}$ II దిన $32^{4,30}$ యెష $22^{9,11}$). అనఁగా ఆ నీరు ప్రాకారపు గోడలచే నావరింపఁబడిన పట్టణములో నిలుచునట్లు అట్టి కాలువలను త్రవ్వించెను II రాజు $18^{17}$ (=యెష $7^{3}$). యెష $36^{2}$ నందు ఈ కాలువ చాకిరేవుమార్గమందున్న మెరకకొలను కాలువ యనఁబడెను. నెహె $2^{14}$ నందు అది రాజు కోనేరు అనఁబడెను. రాజైన హిజ్కియా దీనిని కట్టించినందున దీనికీ పేరు వచ్చినట్లున్నది.



యెరూషలేము షేలనియనుండి కనఁబడురీతి

IV. కొండలు.

తూర్పుననున్న కిద్రోనులోయయు, పడమటను దక్షిణముననున్న హిన్నోములోయయు ఆగ్నేయ దిక్కున కలియుటచే యెరూషలేము వీటి మధ్య త్రికోణాకారముగానున్న పీఠభూమియై యున్నదనవచ్చును. ఈ పీఠభూమి సహా టురోపియన్ లోయచే రెండుగా భాగింపఁబడుచున్నది. దాని పశ్చిమభాగము తూర్పు భాగముకన్న మూఁడు రెట్లు విశాలముగా నున్నది. ఈ భాగములైనను ఒకటే యెత్తుగలవిగాక, టురోపియన్ లోయయొక్క శాఖలచే మరల విభాగింపఁబడినవి. ఇట్లు పడమటి భాగమున (1) వాయవ్య కొండ (2) నైరృత కొండ (3) ఉత్తరపు కొండ (4) మధ్య కొండ అను నాలుగును, దేవాలయము కట్టఁబడిన తూర్పు భాగమున (5) ఈశాన్యపు కొండ (6) తూర్పు కొండ (7) ఆగ్నేయపు కొండ అను మూఁడును కలిసి యెరూషలేము ఏడు కొండలమీఁద కట్టఁబడినది. బైబిలునందున్న ఆయా పేరులీ యేడుకొండలలో దేనికి సరిపడునో ఈ దిగువ వివరింతుము.

1. దావీదుపురము (*City of David*). దావీదు యెబూసీయుల నోడించి పట్టుకొనిన కోట యిదే (II సమూ 5[6-8]=I దిన 11[5,6]). ఈ కోట తప్పక నీటివసతిగల స్థలముందుండి తీరవలెను. కన్యయూటకు (II 2 చూ॥) సమీపమున ఆగ్నేయ దిక్కుగానున్న కొండ యిదేనని నమ్మఁదగును (పైనున్న 7 వ కొండ). నెహె 3[15] చూచినయెడల దావీదు పట్టణము సిలోయము మడుగునకు (పైన III 2 చూ॥). సమీపముగా నున్నట్లు స్పష్టము. II దిన 32[30] 33[14] దానికి సూటిగా సరిపడును. కావున దావీదుపురము పైన నుదాహరించిన (7) వదియై ఆలయమునకు దక్షిణమున నున్నది. అది పైనున్న కొండలలో (2) వదియై యెరూషలేమునకు నైరృతి దిక్కున నున్నదని యెరూషలేము నాశనమునకు పిమ్మట యొక పారంపర్య మాటపుట్టెను. తురకవారు ప్రస్తుతము దావీదు సమాధి నచ్చట చూపింతురు గాని పైన నుదాహరింపఁబడిన వాక్యములచే తేటయగు సూచనలు నమ్మఁదగునుగాని క్రీస్తు శకము 4 వ శతాబ్దమున నుద్భవించిన పారంపర్యములను నమ్మవీలులేదు.

2. సీయోను కొండ (*Zion*). యెరూషలేమునకు దక్షిణముగానున్న హిన్నోము లోయకు దక్షిణమందున్న కొండయని పారంపర్యమువలనఁ దెలియుచున్నది గాని అవి బైబిలునందలి వాక్యములకు సరిపడకపోవుటచే నమ్మ వీలులేదు. కొండఅది పై నుదాహరింపఁబడిన వాటిలో (2) వదియని తలంచుచున్నారు గాని బైబిలు వాక్యము



సీయోను

లన్నిఁటిని సరిచూచి అది టుర్‌రోపియన్ లోయకు తూర్పుననున్న కొండయంతటికి (పైన 5,6,7 కొండలకు) పెట్టఁబడిన పేరని నవీన పండితు లభిప్రాయపడుచున్నారు. అట్లనుకొనుటకీ దిగువ సూచనలు కనఁబడుచున్నవి:—(*a*) దావీదు పురమును సీయోనును ఒకటే కొండకు పేరులై నట్లు II సమూ $5^{7}$ ను I దిన $11^{5}$ తోను, I రాజు $8^{1}$ ని II దిన $5^{2}$ తోను సరిపోల్చి చూచుటవలనఁ దెలియును. (*b*) ప్రవక్తల గ్రంథములలో దేవాలయమునకును సీయోనుకొండకును సంబంధ మున్నట్లు అనేక వాక్యములవలన కనఁబడును (ఆమో $1^{2}$ యెష $2^{3}$ $4^{5}$ జెక $2^{10}$ $8^{2,3}$ మొ॥). (*c*) కీర్తనలలోను ఇదే సంబంధము అనేకమారులు కనఁబడుచున్నది ($20^{2}$ $78^{68,69}$ $87^{2,5}$ $48^{2}$ $74^{2}$ $76^{2}$ మొ॥). (*d*) సొలొమోను తన నగరమును తూర్పు కొండలమీఁద కట్టినందున సీయోను కొండరాజుల నివాసమని ప్రవక్తలు వ్రాసిరి (ఆమో $6^{1}$ యెష $3^{16,17}$ $16^{1}$ $28^{16}$ మొ॥). (*e*) యూదుల అప్రమాణిక గ్రంథములలోను (I మక్క $4^{37,38}$ $5^{54}$ మొ॥) సీయోను కొండయు ఆలయము కట్టఁబడిన కొండయు ఒకటేనని సూచింపఁబడెను.

**3. ఓపెలు కొండ** (*Ophol*). నెహె $3^{26,27}$ $11^{21}$ II దిన $27^{3}$ $33^{14}$ నం దీ కొండ పేరును చూడఁవచ్చును. అది ఆలయమునకు దక్షిణముగా నున్న యొక దిబ్బయని ఆ వాక్యములవలనఁ దెలియును. అది పైనున్న (17)



యెరూషలేము దక్షిణమునుండి కనఁబడురీతి

దానికి సంబంధించినదని యోసీఫసులోని సూచనల వలన తేలుచున్నది (యుద్ధ 5 4.2; 5.6.1). మీకా $4^{8}$ లో ఓపెలు అను పేరు నుంచక దానిని పర్వతము అని తెనిఁగించిరి. అచట యది సీయోనుకుమార్తె యనఁబడెను. అది తూర్పు కొండలకు సంబంధించినదని దానివలన స్పష్టమగుచున్నది.

**4. మోరీయాకొండ.** II దిన $3^{1}$ లో మాత్రమే ఈ కొండమీఁద ఆలయము కట్టఁబడెనని స్పష్టముగా నున్నది. అది పైన నుదాహరింపఁబడిన కొండలలో (6) వదియై, సాధారణముగా సీయోను అనఁబడెను. ఆది $22^{2,14}$ లో నున్నట్లు, అబ్రాహాము ఇస్సాకును అర్పించుటకు వెళ్లిన కొండమీఁదనే ఆలయము కట్టఁబడెనని యూదులలో నొక వదంతి గలదు. అందువలన ఈ కొండకు మోరీయాయను పేరు పెట్టఁగన వచ్చును.

B. చరిత్ర.

I. కనానీయుల కాలము.

యెరూషలేము మిగుల పురాతనపట్టణమని బైబిలువలన మాత్రమేగాక రాతిశాసనములవలనను దెలియుచున్నది. మెల్కీసెదెకు షాలేమునకు

రాజు (ఆది $14^{18}$). ఇది యెరూషలేమే యని కీర్త $76^{2}$ వలన స్పష్టమగును. దీని ననుసరించియే యూదులు ఆది $14^{18}$ లో నున్న షాలేము యెరూషలేమని తలంచిరి. అది యట్లుండవచ్చును గాని రూఢియని చెప్పఁజాలము. టెల్ ఎల్ అమార్నా రాతిశాసనములలో దానికి ఉరుసలీము (*Urusalim*) అను పేరు కలదు (రాతిశాసనములు 2 చూ॥). క్రీ॥ శ॥ 14 శతాబ్దములకు పూర్వము దాని రాజులలో నొకఁడు, హెబ్రీయులను జనాంగము తన పట్టణము నపహరింప నుంచునట్లు ఫరోకు మనవిజేసికొనినట్లు వాటివలనఁ దెలియుచున్నది. క్రీ॥ శ॥ సుమారు 12 శతాబ్దములకు పూర్వము యెరూషలేమురాజు, ఇతరులతోఁ గలిసి యెహోషువమీఁద యుద్ధము జేసినట్లు యెహో $10^{1-3}$ నందున్నది. ఆ రాజు ఓడిపోయినను ఆ పట్టణమును యెహోషువ స్వాధీనపఱచుకొనినట్లు కనఁబడదు (న్యాయా $1^{1-7}$). దాని నివాసులు యెబూసీయు లనఁబడిరి (ఆది $10^{16}$ $15^{21}$ యెహో $9^{1}$ I రాజు $9^{20}$ మొ॥). వారు కనానీయులలో నొక తెగవారుగాన దావీదు యెబూసీయులను జయించునంతవఱకు, ఇది కనానీయుల ముఖ్యమైన కోటలలో నొకటియై యుండెను (I రాజు $9^{20}$ = II దిన $8^{7}$).

II. దావీదుకాలము.

దావీదు యెరూషలేమును పట్టుకొని దానికి దావీదుపురమని పేరుపెట్టెను (II సమూ $5^{6,7}$ = I దిన $11^{4,5}$). అతఁడు దానిని జయించినపిదప దానిలో నీ దిగువవాటిని కట్టించెను.

**1. మిల్లో** (*Millo* = నింపఁబడినది). దావీదు ఈ పట్టణమును జయించినప్పు డిది దాని సరిహద్దులలో నొకటియై యుండెను. మొదట దావీదును (II సమూ $5^{9}$), తరువాత సొలొమోనును (I రాజు $9^{15,24}$ $11^{27}$), హిజ్కియాయును (II దిన $32^{5}$) దీని మరమ్మతు జేయించి పెంపకము చేసిరి. వీటినన్నిఁటిని జూడఁగా మిల్లో యొక కోట యని తెలియవచ్చుచున్నది. అది A IV నందున్న (7) వ కొండకు ఉత్తరవైపున నున్న ప్రాకారమని యనుకొందురు. మిల్లో యను పదమునకు నింపఁబడినది యని శబ్దార్థమగుటచే, ఈ కోటకు బైటను లోపటనున్న రెండుగోడల మధ్యసందును మట్టితో నింపిరని యూహింపఁదగును. పూర్వకాలమున ప్రాకారములనట్లు కట్టినట్లు అచ్చటి శిథిలములవలనఁ దెలియుచున్నది.

**2.** II సమూ $5^{9}$ నందు దావీదొక ప్రాకారమును కట్టించినట్లు కనఁబడును. మిల్లో అంతకు పూర్వమే కనానీయులవలన కట్టఁబడిన ప్రాకారములలో నొకటియని దానివలన నూహింపఁదగును. దావీదు దీనిని మరమ్మతు చేయించుటయే గాక దావీదుపురము (A IV 1 చూ॥) అను దాని చుట్టునున్న యావత్తు ప్రాకారమును కట్టించెను. ఆ స్థలమునందు శిథిలములను పరిశోధించినవారట్టి గోడను కనుగొనిరి ఆ ప్రాకారములలో నొక చోట **దావీదు కట్టించిన గోపురము** (పర $4^{4}$) ఉన్నది. ప్రస్తుతము యెరూషలేమునందున్న దావీదు గోపురము మఱియొకటియై హేరోదుచేఁ గట్టించఁబడినది.

**3. దావీదునగరము** దావీదు ఒక నగరము కట్టించుకొనెను (II సమూ $5^{11}$). అది దావీదుపురమున కుత్తరముగా నున్నది (నెహె $12^{37}$). ఫేనీకే రాజగు హీరాము పనివాండ్రు, ఆ దేశమునుండి తెప్పించిన కలపచే దానిని కట్టిరి (II సమూ $5^{11}$ $7^{2}$ $11^{8,9,27}$ $15^{16}$ $19^{11,30}$ $20^{3}$).

**4. పరాక్రమశాలుర యిండ్లు** అను కట్టడములు నెహె $3^{16}$ నందు పేర్కొనఁబడినవి. ఇవి రాజదేహ సంరక్షకులకొఱకైన నివాసస్థానములై యున్నట్లున్నవి. దావీదు కాలమునమున్న అట్టి దేహసంరక్షకుల జాబితా II సమూ $23^{8-39}$ నందున్నది.

**5. దావీదు సమాధి, రాజుల సమాధులు.** పట్టణములో నున్న సమాధిలో దావీదును పాతిపెట్టిరి (I రాజు $2^{10}$). అందులోనే ఆయా యూదులరాజులను సమాధిచేసిరి (I రాజు $11^{43}$ $14^{31}$ $22^{50}$ మొ॥). ఆ స్థలము దేవాలయమునకు సమీపమున నున్నది (యెహె $43^{7}$). నెహె $3^{16}$ వలన దావీదు సమాధి సిలోయమను కోనేటిదగ్గరనున్నట్లు తెలియుచున్నది (A III 2 చూ॥). ప్రస్తుతమున దావీదు సమాధిని తూర్పు కొండమీఁదగాక, పై నుదాహరింపఁబడిన (2) వ కొండమీఁద (IV చూ॥) నున్నట్లు చూపుచున్నారుగాని అది పొరబాటని పై వాక్యముల వలన స్పష్టమగుచున్నది.

III. సొలొమోనుకాలము.

సొలొమోను ఈ దిగువ కట్టడములను గట్టించెను.

1. **దేవాలయము.** అతఁడు దీనిని తూర్పు కొండ అనగా పైని సుదాహరింపఁబడిన (6) వ కొండమీఁదఁగట్టెను (A IV 6, దేవాలయము చూ॥).

2. **సొలొమోనునగరు.** ఆలయమును కట్టించునప్పుడే, అతఁడు తనకొఱకొక నగరును కూడ కట్టించుకొనెను (I రాజు $3^{1}$ $7^{1}$ $9^{1}$ $10^{4,5}$). సొలొమోనుకు తరువాతికాలమున నిది **రాజ నగరు** అనఁబడెను (II రాజు $12^{18}$ $14^{14}$). అది దావీదుపురమునకు పైఁగాను, ఆలయమునకు దిగువనున్నట్లు ఆయా వాక్యములవలనఁ దెలియును (I రాజు $8^{1}$ $9^{24}$ $10^{5}$ II రాజు $11^{10}$ యిర్మీ $22^{1}$ $26^{10}$ మీకా $4^{8}$). ఆలయమునకు దక్షిణమున మిగుల సమీపముగా నున్నస్థలము దీనికి సరిపడును.

3. **ఫరోకుమార్తెనగరు.** సొలొమోను నగరమనఁబడినదానికి సమీపముననే, దానికి పశ్చిమముగా, అతఁడు ఫరోకుమార్తె కొఱకొక నగరును కట్టించెను (I రాజు $7^{8}$ $9^{24}$). ఇది అతని నగరులోని **అంతఃపురమని** చెప్పఁదగును. ఈ నగరులచుట్టుకొని **లోపలియావరణమనఁ** బడిన యొక యావరణము గలదు. II రాజు $20^{4}$ నందున్న **నడిమిశాల** అనునది ఇదేనని సంగతి సందర్భమువలన నూహింపవచ్చును యిర్మీ $32^{2}$ లో నున్న **చెఱసాల అంగణమిదే.** ఈ యావరణములోనికిఁ బోవుటకు కావుకాయు వారిగుమ్మమనఁబడు ద్వారమును దాటవలసి యున్నది (II రాజు $11^{19}$). ఈ పదముచే నెహె $3^{25}$ లో **చెఱసాల** యనియు, $12^{39}$ నందు **బందీగృహపు గుమ్మమనియు** తెనిఁగించిరి. ఇది చెఱసాలకాదుగాని, చుట్టును ప్రాకారము లుండుటచే అచ్చట నెవరినైనను కావుదలలో నుంచుటకు మంచి వీలులుండెను.

4. **అధికార మంటపము.** దీనిని నగరుకు దక్షిణముగా కట్టినట్లున్నది (I రాజు $7^{7}$). బంగారుమయమైన దంతపు సింహాసన మిందే యుంచిరి ($10^{18-20}$). ప్రజల సంగతులను సొలొమోను నిచ్చట విచారించుచు వచ్చెను.

5. **స్తంభములుగల మంటపము.** ఇది 50×30 మూరల విరివిగలది ($7^{6}$). ప్రజలు అధికారమంటపమునకు రాఁగా ఇది వారుండుటకు అనుకూలమైన స్థలముగా నున్నది. ఇది యా అధికారమంటపమునకు దక్షిణముననున్నట్లు తోఁచుచున్నది.

6. **లెబానోను అరణ్యపు మందిరము.** ($10^{17}$). $7^{2}$ నందు ఇది లెబానోను అరణ్యమందు కట్టించిన మందిరమయ్యున్నట్లు తెనిఁగించిరి గాని అది పొరబాటైయున్నది. లెబానోనులో నుండక పైన వివరింపఁబడిన కట్టడములకు దక్షిణముగా నున్న ఒక విశాలమగు (100×50 మూరలు) మందిరము. లెబానోను నుండి తెచ్చిన మ్రానుతో దీనిని కట్టుటచే దానికి లెబానోను అరణ్యపుమందిరము అను పేరు పెట్టిరే గాని యితెరముకాదు. బంగారముతో కప్పఁబడిన డాళ్లను సొలొమోను ఈ మందిరమునందుంచెను ($10^{16,17}$ యెష $22^{8}$ యెష $39^{2}$=II రాజు $20^{13}$). ఈ చివరి మూఁడు కట్టడములు **గొప్ప ఆవరణమన**ఁబడిన యావరణమందు కట్టఁబడెను (I రాజు $7^{12}$ పైన 3 చూ॥).

7. **సొలొమోను కట్టించిన ప్రాకారములు.** దావీదుపురముచుట్టు దావీదు ప్రాకారములను కట్టించెను (పైన II 2 చూ॥). సొలొమోనా ప్రాకారములను పెంచుట మాత్రమేగాక, వ్యాపించియున్న పట్టణపు క్రొత్తభాగముల చుట్టును వాటిని కట్టించెను (I రాజు $3^{1}$ $9^{15}$). ఈ కాలమునందే పశ్చిమకొండలలో కొంత భాగముచుట్టును ప్రాకారములు కట్టింపఁబడినవని యెంచెదరు. పట్టణమందలి దావీదుపురమనఁబడిన సీయోనుకును ఈ క్రొత్తభాగముగల యెరూషలేమునకును భేదములుండినటుల ఆయా వాక్యములలోఁ గనఁబడును. పట్టణమందలి ముఖ్యభాగమును దావీదుపురములేక సీయోను అని పిలిచిరి. పట్టణమంతటిని యెరూషలేమనిరి (I రాజు $8^{1}$=II దిన $5^{2}$; II రాజు $9^{28}$ $14^{20}$ యెష $10^{12,32}$ $22^{10}$ $30^{19}$ యిర్మీ $51^{35}$ జెక $1^{14}$ నెహె $3^{15}$ $12^{36}$). సొలొమోను కట్టించిన ప్రాకారములు ఉత్తరమందును పశ్చిమమందు నున్నవని యభిప్రాయపడుచున్నారు.

**8. గుమ్మములు.** సొలొమోను కట్టించిన ప్రాకారములలోని గుమ్మములకు పేర్లు పెట్టిరి.

**(1) బెన్యామీను గుమ్మము.** ఇది బెన్యామీను మీది గుమ్మమనియు (యిర్మీ $20^{2}$ జెక $14^{10}$), **ఉత్తరవైపుననున్న ఆవరణద్వార** మనియు (యెహె $8^{3}$), యెహోవా మందిరపు **ఉత్తరద్వార**మనియు ($8^{14}$), **ఉత్తర దిక్కుననున్న పైగవని**యనియు (యెహె $9^{2}$), **ఎత్తయిన ద్వార**మనియు (II దిన $23^{20}$) పిలువబడెను. వీటినిబట్టి ఈ గుమ్మము ఆలయమున కుత్తరముగానున్న ప్రాకారపు గుమ్మమనుకొందురు.

**(2) ఎఫ్రాయిము గుమ్మము** (II రాజు $14^{13}$=II దిన $25^{23}$; నెహె $8^{16}$ $12^{39}$). ఇది ఉత్తరప్రాకారపు గోడలో వాయవ్యదిక్కున నున్న గుమ్మమునకు 400 మూరల దూరముగా నున్నది (II రాజు $14^{13}$).

**(3) మూలగుమ్మము** (II రాజు $4^{13}$= II దిన $25^{23}$, $26^{9}$ యిర్మీ $31^{38}$). ఇది పట్టణముకు వాయవ్యదిక్కుననున్న గుమ్మము. ప్రస్తుతపు యెరూషలేములోని జాఫా (*Jaffa*) గుమ్మమే గనియుండిక.

**(4) లోయ ద్వారము** (II దిన $26^{9}$ నెహె $2^{13\ 15}$ $3^{13}$). అది పశ్చిమకొండలకు నైరృతిదిక్కునుండి హిన్నోము లోయలోని గుమ్మమై యున్నది. యిర్మీ $19^{2}$ నందున్న **హర్సీతు గుమ్మ**మిదేనని కొందరి యభిప్రాయము. దానికి కుమ్మరివాని వీధియని అర్థము.

**(5) గుఱ్ఱపు గుమ్మము** (II దిన $23^{15}$). II రాజు $11^{16}$ నందది **గుఱ్ఱములువచ్చు మార్గ**మనియు, యిర్మీ $31^{40}$ నందు **గుఱ్ఱముల గవని**యనియు పిలువబడెను. ఇది తూర్పున నున్నది. ఆలయమునకు ఆగ్నేయదిక్కుననుండు గుమ్మమై యున్నది.

**IV.** రాజులకాలము.

**1. ఉజ్జియా కట్టడములు.** సొలొమోను కాలమునకు పిమ్మట 200 సంవత్సరములవఱకు యెరూషలేము ప్రాకారములను నగరములను కట్టిన సూచనలగుపడుటలేదు. ఉజ్జియాయను రాజట్టి ప్రాకారములను కట్టించినట్లు II దిన $26^{9}$ వలన తెలియుచున్నది. అతడు దుర్గములను గట్టించి గుమ్మములను దిట్టపఱచెను. అతని కుమారుడగు యోతాము యెహోవామందిరపు ఎత్తుద్వారమును, ఓపెలుదగ్గరనున్న గోడను చాల మట్టుకు కట్టించెను (II దిన $27^{3}$).

**2. హిజ్కియా కట్టడములు.** ఉజ్జియా మనుమడగు నితడు తన తాతకన్న యెక్కువ కట్టడములను కట్టించెను. (1) ఒక **కొలను త్రవ్వించి, కాలువను వేయించి** పట్టణములోకి నీళ్లు రప్పించెను (II రాజు $20^{20}$ = యెష $36^{2}$; II దిన $32^{4,30}$ యెష $7^{3}$ $21^{9,11}$). ఈ కాలువ యెరూషలేము శిథిలములలో నున్నట్లు రాతిశాసన పరిశోధకులు కనుగొనిరి. ఇది యెరూషలేములోని రాతిశాసనము లన్నిటిలో పురాతనమైనది. గిహోనులోనుండి (A II 2 చూ॥) సిలోయము కోనేటికి (A III 2 చూ॥) నీళ్లను రప్పించుటకై ఈ కాలువను కట్టించెను. ఈ కాలువనీటికి ఉత్పత్తిగా నున్న దానికిని II దిన $32^{30}$ లో నున్న గిహోనుకును ఒకటే పదము (*Motsa*) నుపయోగించుటచేత, హిజ్కియా కట్టించినకాలువ యిదేనని రూఢిగా తెలిసికొనవచ్చును. (2) ప్రాకారములను అతడు కట్టించెను. **పాడైనగోడను** యెత్తు కట్టించి, గోపురములంత యెత్తుగా దానినిలేపి, **బయట మఱియొక గోడను** కట్టించెను (II దిన $32^{5}$). అట్టి గోడలు పట్టణమున కుత్తరమునను దక్షిణమునను శిథిలపరిశోధకులు కనుగొనిరి. యెష $22^{10,11}$ నందు ఆ **రెండు గోడల మధ్య** (అనగా పాత గోడకును హిజ్కియా కట్టించిన క్రొత్త గోడకును మధ్య) నీళ్లచెఱువు కట్టియున్నట్లున్నది. అట్టి కోనేరులు దక్షిణముగా నుండుటచే హిజ్కియా కట్టించిన ఆ క్రొత్తగోడ దక్షిణముగా నున్నదని యూహింపదగును. నెహె $3^{13-15}$ $12^{31-37}$ నందు సూచింపబడిన గోడ యిదే. బ్లిస్ (*Bliss*) అను పండితుడు దానిని కనుగొనెను. అది పశ్చిమకొండయొక్క దక్షిణభాగమునుచుట్టి (A IV 1 (2) చూ॥), టురోపియను లోయనుదాటి (A I 5 చూ॥), దావీదుపురము చుట్టునుండు గోడను కలిసికొనెను (A IV 2 చూ॥).



హిజ్కియా త్రవ్వించిన కొలను

3. మనష్షే కట్టడములు. ఇతేడు బహు లున్నవి (1) అది దావీదుపట్టణము (A IV 2) యొత్తయిన గోడ నొకదానిని కట్టించెను (II దిన బయట నుండెను (2) గిహోనుకు (A II 2) $33^{14}$). ఈ వాక్యమునం దీ దిగువ సంగతు పడమరగా నున్నది. (3) ఓపెలును చుట్టి

(A IV 4), **మత్స్యపు గుమ్మము** వఱకు వ్యాపించెను. ఈ మత్స్యపు గుమ్మము యెరూషలేముచుట్టునుండు గోడలో ఉత్తరముగా నుండెడి గుమ్మములో నొకటియని నెహె $3^{3}$ $12^{39}$ వలనఁ దెలియుచున్నది. హుల్దాయను ప్రవక్త్రి యెరూషలేములోని **రెండవభాగ** మనఁబడినదానియందు కాపురముండెనని II రాజు $22^{14}$ నందున్నది. ఆ వాక్యమునకు సాటియైన II దిన $34^{22}$ లో అదే యసలుపదమును **ఉపభాగ**మనియు, జెఫ $1^{10}$ లో **పట్టణపు దిగువ భాగ**మనియు తెనిఁగించిరి. ఈ యసలుమాట మనష్షేకాలమునకుఁ బూర్వము కనఁబడకపోవుటచే, అది మనష్షే గోడను పెంపకము చేయుటవలన యెరూషలేమునకు చేర్చఁబడిన క్రొత్తభాగమునను పేరై యున్నట్లూహింపఁదగును. అది దావీదుపట్టణమునకు (A IV 2) వాయవ్యదిక్కున నుండుభాగము [A IV 1 (1)]. మనష్షేకాలమునుండి యూదుల రాజులు అంతకు ముచుపున్నట్లు దావీదుపురములోఁ గాక, ఈ క్రొత్తభాగమునందు పాతిపెట్టఁబడిరి (II రాజు $21^{18}$ II దిన $33^{20}$ II రాజు $21^{26}$ $23^{30}$=II దిన $35^{24}$). ఈ భాగమునందే కనానీయులింకను నివసించుచుండిన మక్తేషులోయ (జెఫ $1^{11}$) కూడ నున్నది (I 5 చూ.).

యెరూషలేమున కుత్తరముగా నున్న ప్రాకారములలో రెంటి పాదుశేషములను శిథిలపరిశోధకులు కనుగొనిరి. వాటిలో నొకటి మనష్షే గోడ. రెండవది హేరోదుగోడ. ఇది మరీ విశాలమైనది. మనష్షే కట్టించిన గోడనుగూర్చి మాత్రము కొంచెము సందేహముగా నున్నది.

V. చెఱకాలము మొదలు క్రొత్త నిబంధన కాలమువఱకు.—అష్షూరీయులు యెరూషలేమును ముట్టడించినను (II రాజు 18, 19=యెష 38, 39). బాబేలు చక్రవర్తియగు నెబుకద్నెజరు చేతనే మొదట క్రీ॥ పూ॥ 587 సం॥ న పూర్ణముగా నాశనము చేయఁబడెను (II రాజు 24, 25=యిర్మీ $51^{59}$-$52^{34}$). అదిమొదలు నేటివఱకు మధ్య మక్కబేయుల కాలములో కొన్ని సంవత్సరములు గాక మెన్నడును యూదులు స్వపరిపాలన కలిగియుండలేదు. క్రొత్త నిబంధనకాలమువఱకు వారి చరిత్ర నీ దిగువరీతిగా విభాగింపఁదగును.

1. బాబెలువారి కాలము.—ఇది చెఱకాలము. క్రీ॥ పూ॥ 538 లో బాబెలు నాశనమగువఱకుండెను. ఈ కాలమున **యెరూషలేము శిథిలమై** యుండెను.

2. పారసీకుల కాలము.—కోరెషు బాబెలును నాశనముచేసినపిమ్మట (ఎజ్రా 1) యెరూషలేమును తిరిగికట్టుటకు సెలవిచ్చెను. 538 లో జెరుబ్బాబెలుతో వెళ్లినవారు కొన్ని యిండ్లను కట్టుకొనినను ప్రాకారములను కట్టలేకపోయిరి. నెహెమ్యా వచ్చి ఆ పనిఁజేయించెను. అతఁడు దావీదు సొలొమోనులు తూర్పు పడమరలఁ గట్టించిన గోడలను, దక్షిణమున హిజ్కియా కట్టించిన గోడలను ఉత్తరమున మనష్షే కట్టించిన గోడల ననుసరించి పట్టణపు ప్రాకారములను తిరిగి కట్టించెను. దీని వివరము నెహె $2^{9,15}$ 3, $12^{27-40}$ నందు చూడవచ్చును. తరువాత పెంపకము చేయఁబడిన ఉత్తరపు ప్రాకారములు గాక తక్కిన వన్నియు క్రీస్తుకాలమున నున్నట్లే యుండెను. నెహెమ్యా కట్టించిన ప్రాకారములలోని గుమ్మము లెవ్వియనగా:—

(1) **గొఱ్ఱెల గుమ్మము** (నెహె $3^{1-32}$ $12^{39}$) ఇది ఆలయమునకు ఉత్తరముగా నున్నది. అది సొలొమోను కాలమున **బెన్యామీను గుమ్మము** (=మీఁది గుమ్మము) ఉన్నతావునందే కట్టఁబడెను B III 7 (1) చూ॥

(**2**) దానికి సమీపమునందే **వాయవ్య**దిక్కుగా **హమ్మేయా గోపురము** గలదు (నెహె $3^{1}$). దీనికి **మేయా గోపురము** ($12^{39}$), **మందిరముతో సంబంధించిన కోట గుమ్మము** ($2^{8}$), **కోట** ($7^{2}$) యను పేరులు గలవు. దీని యసలుపదము హెబ్రీపదముగాక పారసీకపదమై యున్నది. పారసీక **గార్నరు** నివసించిన మందిరమిదే. మక్కబీయుల కాలమున అది వారి నగరమాయెను. యోసీఫసు దానిని బారిస్ (*Baris*) అని పిలిచెను (పురా 15.11.4; 28.4.3). ఈ పదమునకును ఈ నగరు యొక్క పారసీకపదమగు బీరా (*Birah*) అను దానికిని సంబంధమున్నది. హేరోదు దానినింకను కట్టించి రోమను అధికారియగు అంటోని జ్ఞాపకార్థము దానికి **అంటోనియా కోట**

యను పేరుఁ బెట్టెను. దీనినుండి ఆలయమునకు పోవు మంటపమొకటి హేరోదు కాలమున నుండెను. యెరూషలేము రోమనుల స్వాధీనమందున్న కాలములో వారొక పటాలము నీ కోటయందుంచిరి పౌలిచ్చట కొన్నిదినములు చెఱలో నుండెను (కార్య $21^{30-40}$ $23^{10,16,32}$).

(**3**) దీనికి సమీపముగా నింక వాయవ్య దిక్కున **హననేలు గోపురముండెను** (నెహె $3^{1}$ $12^{39}$ యిర్మీ $31^{38}$). అది నవీన యెరూషలేము కుత్తరవైపుననున్న దమస్కు గుమ్మమనఁబడుదానికి కొంచెము తూర్పుగా నున్నది.

(**4**) దానికి కొంచెము పడమరగా **మత్స్యపు గుమ్మము** గలదు (నెహె $3^{3}$ $12^{39}$ II దిన $33^{14}$ జెఫ $1^{10}$). ఇదే నవీన యెరూషలేముయొక్క దమస్కు గుమ్మము. పట్టణ ప్రాకారములలో ఉత్తరపు కొనయందున్నది. యిర్మీ $39^{3}$ లోని **మధ్యగుమ్మము** ఇదే స్థలములోని దనుకొనుచున్నారు.

(**5**) **పాత గుమ్మము** (నెహె $3^{6}$ $12^{39}$). జెక $14^{10}$ లో నిది మొదటిగుమ్మ మనఁబడెను. పాఁత, మొదటి అనువాటి అసలుపదములు గుణింతమునందు కొద్దిగా భేదించినను ఉచ్చారణ దాదాపు ఒకటే యైనందున తెనిఁగించుటలో నిట్టి భేదము కలిగె ననవచ్చును. ఇదియు సొలొమోను కట్టించిన గోడలోనున్న **మూల గుమ్మము** ఒకటే [B III 7 (3) చూ॥].

(**6**) **వెడల్పుగోడ** (నెహె $3^{8}$). దీనికే **వెడల్పు ప్రాకార** మను పేరు గలదు (నెహె $12^{38}$). ఈ రెంటికిని అసలు భాషలో నొకటే పదమున్నది. ఇది మూలగుమ్మమునకు [III 7 (3)] దక్షిణముగా కట్టఁబడిన పడమటి గోడయై యున్నది.

(**7**) **అగ్నిగుండముల గోపురము** (నెహె $3^{11}$), **కొలిముల గోపురము** ($12^{38}$). వీటి రెంటికి అసలు భాషలో నొక్కపదమే గలదు. ప్రాకారములకు నైరృతి దిక్కున ఒక పెద్దబండ ఈ గోపురమునకు పునాదిగా సమర్చఁబడినట్లు శిథిలపరిశోధకులు కనుగొనిరి. ఇదే యా గోపురపు ఉనికియని యభిప్రాయపడుచున్నారు.

(**8**) **లోయద్వారము** (నెహె $2^{13}$ $3^{13}$). [పైన B III 7 (4) చూ॥].

(**9**) **పెంటద్వారము** (నెహె $2^{13}$ $3^{13}$ $12^{31}$). ప్రాకారములకు దక్షిణపుకొననుండు పురాతన ద్వారము బ్లిస్ (*Bliss*) అను పండితుఁడు దానిని పట్టణపు శిథిలములందు కనుగొనియున్నాఁడు.

(**10**) **బుగ్గగుమ్మము** (నెహె $2^{14}$), **ధారయొక్క గుమ్మము** ($3^{15}$), **ఊట గుమ్మము** ($13^{37}$). వీటన్నిఁటికి అసలు భాషలో నొకటే పదమున్నది. ఇది సీలోయము కోనేటికి సమీపమున నుండి (నెహె $2^{14}$ $3^{15}$), పట్టణమున కాగ్నేయదిక్కున నున్న గుమ్మమై యున్నది. II రాజు $25^{4}$ యిర్మీ $52^{7}$ నందు **రెండు గోడల మధ్యమున్న ద్వారము** ప్రశంసింపఁబడెను. $39^{4}$ నందు ద్వారమునకు ప్రతిగా గుమ్మమను పదము తెలుఁగులో నున్నది. ఈ ద్వారము బుగ్గద్వారమునకు మాఱుపేరేగాని వేఱొక ద్వారముకాదు.

(**11**) **రాజుతోఁట** (నెహె $3^{15}$). ఇది సీలోయము కోనేటికి దగ్గరను, టురోపియను లోయ (I 5) కొననున్న యొక తోఁట. సిద్కియా రాజీ మార్గమున పారిపోయెను (II రాజు $25^{4}$ యిర్మీ $39^{4}$ $52^{7}$). **రాజు గానుగలు** (జెక $14^{10}$) ఆ తోఁటలోనే యున్నవి.

(**12**) **దావీదు పట్టణమునుండి క్రిందకు పోవు మెట్లు** (నెహె $3^{15}$ $12^{37}$). ఆగ్నేయ దిక్కున నున్న శిథిలములలో దక్షిణపుకొండమీఁద నుండి దిగువపుటకు అట్టి మెట్లు కనఁబడినవి.

(**13**) **గొప్ప గోపురము** (నెహె $3^{27}$ ఆగ్నేయ దిక్కున నున్న గోపురము.

(**14**) **నీటిగుమ్మము** (నెహె $3^{26}$ $8^{1}$ $12^{37}$) ఇది గొప్ప గోపురమునకు సమీపముగా నుండి గిహోను ఊటకు (A II 2) పోవుమార్గమై యుండెను. కావున అదిగూడ యెరూషలేమునకు ఆగ్నేయదిక్కున నున్నది.

(**15**) **గుఱ్ఱపు గుమ్మము** (నెహె $3^{28}$). పైన B III 7 (5) చూ॥

**(16)** మిప్కాదు ద్వారము (*Hammiphkad* = లెక్కింపఁబడు లేక నియమింపఁబడు) ఇదియు దేవాలయమునకు తూర్పుననున్న ద్వారమును ఒక్కటే. ఇది ప్రాకారములకు తూర్పుననున్నది (నెహె $3^{31}$).

పట్టణముయొక్క. ఈ గుమ్మములు గాక, దేవాలయము చుట్టునున్న ప్రాకారములలో **సూరుగుమ్మము** (II రాజు $11^{6}$) గలదు.

**3.** గ్రీకులు, మక్కబీయులకాలము (క్రీ॥ పూ॥ 330-63). ఈ కాలమునందే సర్వత్ర చెదరియున్న యూదులకు యెరూషలేము పుణ్యక్షేత్రమాయెను. పట్టణపు జనసంఖ్యయు నీ కాలమునందే విస్తరించెను. అంతియొకియలో రాజ్యమేలిన గ్రీకురాజులు అన్యజనుల వాడుకలను నెమ్మదిగా నిచ్చుట నెలకొలుపనెంచి నాటకశాలలు మొదలగు కట్టడములు కట్టింప పూనుకొనిరి. గాని యూదు లెంతమాత్రమును వాటికి సమ్మతింపక మక్కబేయుల నాయకత్వము నంగీకరించి తిరుగఁబడి కొంతకాలము దనుక స్వతంత్రులైరి. మక్కబేయు లంతకుఁబూర్వమున్న ప్రాకారములను చాల దిట్టపఱచిరి. యెరూషలేమునందలి పడమటి కొండలమీఁద తమ నగరులను కట్టించిరి. ఎన్నికట్టడములను కట్టించినను యెరూషలేము హద్దులు దాటలేదు.

**4.** రోమనులు. హేరోదుకాలము (క్రీ॥ పూ॥ 63 క్రొత్త నిబంధన కాలమువఱకు). యెరూషలేమును మిగుల నలంకరించిన కాలమిదే. ఆ పట్టణప్రాకారములను హేరోదు దిట్టపఱచుటమాత్రమే గాక ఉత్తరమునకు వాటిని పెంచెను. పడమటిదిక్కునందు మూఁడు గొప్ప గుమ్మములను కట్టించెను. దేవాలయమునుకూడ పెద్దదిగ కట్టించెను (దేవాలయము IV చూ॥). అతఁడు రోమనుల వాడుకల ననుసరించి నాటకశాలలను కట్టించెను. మిగిలిన కట్టడములను పెంచి యలంకరించుటచే పట్టణమును నూతనమైనదిగాఁ జేసె ననవచ్చును.

**VI. క్రొత్త నిబంధన కాలము:**—యెరూషలేము చుట్టునున్న ప్రాకారములు నెహెమ్యా కాలమందుండిన వాటి ననుసరించి యున్నవి. ఉత్తరవైపున క్రొత్త ప్రాకారములను కట్టించి ఆ భాగమును హేరోదు అగ్రిప్పా పట్టణమునకుఁ జేర్చెను గాని యిది క్రీస్తు సిలువ వేయఁబడిన పిమ్మట జరిగెను. క్రీస్తుకాలమునందనేకులు ప్రాకారములకు వెలుపల నున్నట్లు కనఁబడుచున్నది. గాని ఆ ప్రాకారములను కట్టడములను ఇదివఱకే వివరింపఁబడినవి. క్రొత్త నిబంధన చరిత్రలో నీ దిగువ స్థలములు కనఁబడును.

**1.** క్రీస్తు యెరూషలేమునందు గడిపిన కాలము:—ఆయన యెరూషలేము కాపురస్థుఁడుగా నుండలేదు. పండుగల కప్పుడప్పుడు వెళ్లెడివాఁడు. నలుబదవ దినమున ప్రతిష్ఠింపఁబడుట (లూ $2^{22-39}$), పన్నెండేండ్ల ప్రాయమున పస్కాకు వచ్చుట ($2^{41-50}$) పని నారంభించిన పిదప ఆలయమును పవిత్రపరచుట (యోహా $2^{13-22}$) అను మొదటి మూఁడు సూచనలు దేవాలయమునకు సంబంధించినవి. నాలుగవది బేతెస్ద కోనేటికి (A III I యోహా 5), అయిదవది ఆలయమునకును (యోహా 7), ఆరవది సిలోయము కోనేటికిని (A III 2, యోహా 9) సంబంధముగా నున్నవి. ఆయన ఏడవమారచ్చటికి శ్రమలవారమున వెళ్లినను పగటివేళమాత్రము అచ్చటనుండి రాత్రులయందు సమీపమందుండిన బేతనియలో గడిపెను (మ 21-28 మా 11-16 లూ $19^{29-24}$ యోహా 13-22).

**2.** శ్రమల వారములోని గురువారము సాయంకాలము మేడగదిలో తన శిష్యులతోకూడ పస్కా నాచరించెను (మా $14^{15}$). ఇది మార్కు తల్లియైన మరియ యిల్లనుటకు సూచనలు గలవు. క్రీస్తు ఆరోహణమునకుఁ బిమ్మట శిష్యులు ఆ యింటినే తమ యారాధన స్థలముగా చేసినట్లు కార్య $12^{12-17}$ వలన నూహింపవచ్చును. ఆది సంఘ చరిత్రకారుఁడగు ఎపిఫనియును (*Epiphanius*) ఆ యిల్లు 135 సంవత్సరమువఱకు నిలిచియున్నట్లు వ్రాయుచున్నాఁడు. ప్రస్తుతము తురకవారు దావీదు మసీదుగా నెంచుచున్న స్థలమే ఆ యింటి యునికియని అభిప్రాయపడుచున్నారు. అది పడమటికొండకు [A IV 1 (2)] దక్షిణముగా నున్నది. అచ్చట ఆది క్రైస్తవుల కాలమునుండి ఒక గుడియున్నది.

**3.** ప్రధానయాజకుఁడగు కయపనగరము (యోహా $18^{15}$). యేసు తన శిష్యులతో మేడ

గదిని విడిచి, మొదట యెరూషలేమునకుఁ దూర్పుననున్న ఒలీవ కొండయొక్క పడమటి వైపుననున్న గెత్సేమనె వనమునకువెళ్లి యచ్చట శత్రువులచే పట్టఁబడెను (గెత్సేమనె చూ॥). తరువాత ఆయనను అన్నయింటికిని కయఫ యింటికిని కొంచుపోయిరి (యోహా 18[12,24]). ఈ నగరమును పడమటికొండ [A IV 1 (2)] మీఁదనున్నట్లు పురాతన వదంతి యొకటి గలదు. ఈ కొండమీఁదనే స్థితిమంతుల నగరములున్నందున నీ వదంతికి యాధారము లేకపోలేదు.

4. రోమను గొర్నరుయొక్క అధికారి మందిరము (యోహా 18[28]). ఇది అంతోనియా కోట [B V 2 (1)] యని మొదటినుండి ఒక పారంపర్యముండినను, గొర్నరు సాధారణముగా నిఘాయిలుండిన చోట నివసింపకపోవుటచే దానిని నమ్ముటకు వీలులేదని నవీనుల యభిప్రాయము. ఈ యధికారమందిరము మూల గుమ్మము *Jofa Gate* (B III 7) (3)] దగ్గరనున్న హేరోదు క్రొత్తనగరమని సాధారణముగా ననుకొందురు. దాని యావరణము **రాళ్లుపఱచిన స్థలము** (*Pavement*) అనఁబడెను (యోహా 19[13]). హేరోదుల పాఁత నగరము పడమటి కొండ తూర్పు వైపునముండెనని యోసీఫసువలనఁ దెలియుచున్నది (పురా 14 1; 2; 18. 4 3 మొ॥). అసలు హెబ్రీభాషలోనిది గబ్బతా యనఁబడెను. హేరోదు దీనిలో నుండునప్పుడు పిలాతు క్రీస్తును అతనియొద్దకు పంపెను. క్రీస్తు హేరోదు కట్టించిన ఆ క్రొత్త నగరములోనే పిలాతుచే సిలువమరణ మొందుట కప్పగింపఁబడెను.

5. గొల్గొతా (*Golgotha* = కపాల స్థలము). క్రీస్తు సిలువవేయఁబడిన స్థలము నవీన యెరూషలేమునకు వాయవ్యముగా నున్నదను పారంపర్యముగలదు. అచ్చట పరిశుద్ధ సమాధి (*Holy Sepulchre*) అనఁబడు యొక గుడిని కట్టించిరిగాని ఈ స్థలమునుగూర్చి సందేహమున్నది. ఇది యింతకుమునుపు వివరించిన ప్రాకారములకు లోపటనున్నది. అయితే క్రీస్తు ప్రాకారములకు వెలుపట సిలువవేయఁబడెను (మ 27[33] మా 15[20] యోహా 19[17,20,41] హెబ్రీ 13[12]). ఆయన సిలువవేయఁబడిన స్థలము పుర్రె యాకారముగా నున్నదని దాని శబ్దార్థమువలనఁ దెలియుచున్నది. ఇది గాక దానిని గుర్తించుటకు వీలయిన యితర సూచనలులేవు. దమస్కు గుమ్మమునకు బయట అట్టి యాకృతిగల దిబ్బ యొకటి గలదు. అదే గొల్గతా యని కొందఱభిప్రాయపడుచున్నారు.

6. **కుమ్మరివాని పొలము, రక్తపు పొలము, రక్తభూమి** (మ 27[3-9] కార్య 1[18,19]). ఇస్కరియోతు యూదా యాజకులకు తిరిగి యిచ్చిన సొమ్ముతో వారు పేదలను పాతిపెట్టుటకు కొనిన పొలము. అది సీలోయము కోనేటికి నైరృతిగా నున్నదని యొక స్థలమును చూపెదరు. ఆ పొలము [illegible] నున్నదని యనుకొనఁదగును గాని దాని సరియైన యునికి తెలియదు.

VII. క్రొత్త నిబంధనకుఁ దరువాతికాలము. క్రీ॥ శ॥ 70 సం॥న తీతు (*Titus*) అను రోమను సేనాధిపతి యెరూషలేమును సమూలముగా నాశము చేసెను. క్రీ. శ 132-135 లో హాద్రియను (*Hadrian*) అను రోమా చక్రవర్తి దానిని తిరిగి కట్టించి తన దేవతలలో నొకదానికి జ్ఞాపకార్థముగా దీనికి ఈలియ కపాటొలీన (*Aelia Capitolina*) అని పేరు పెట్టెను. యూదులందులో ప్రవేశించుటకు వీలుకాక పోయినను క్రైస్తవులు కాపురముండుటకు సెలవియ్యఁబడెను. కొంస్తాంతీను 321 లో చక్రవర్తి యైనప్పుడు యూదులకు మరల ఆ పట్టణమున ప్రవేశింప నిచ్చెను. అతని తల్లియగు హెలీన (*Helena*) అచ్చట క్రీస్తు చరిత్రకు సంబంధించిన స్థలములో గుడులు కట్టించెను. ఆ కాలమునుండియే క్రీస్తు పుట్టుక మరణ పునరుత్థానములకు సంబంధముగానున్న స్థలములను ఫలానివని మొదట స్థిరపఱచిరి. కావున అందులో పొరపాటులుండుట ఆశ్చర్యముకాదు. 637 నందు అరబ్బీయుఁడగు ఓమారు (*Omar*) చే యెరూషలేము పట్టుకొనఁబడెను. తరువాత 1077 లో తురకవారు దానిని స్వాధీన పఱచుకొనిరి. దానిని స్వాధీనపఱచుకొనుటకు 1099-1187 వఱకు క్రూసేడు లనఁబడిన సిలువ దండయాత్రలు జరిగెను. అప్పటి నుండి 1918 వఱకు అది తురకల వశమువందే యుండెను. వారు దాని కట్టడము లన్నిఁటిని మహమ్మదీయ కట్టడములుగా మార్చిరి. సిలువ యుద్ధముల కాలమునందు క్రీస్తు శ్రమ మరణా



యెరూషలేము దుఃఖపువీధి

దులకు సంబంధముగా గుళ్లు ఎక్కువగా కట్టఁబడెను. 1918 లో అది బ్రిటిషువారి యాధీనమయ్యెను. వారు తురకల కట్టడములను పడఁగొట్టకపోయినను, పట్టణమును యూదులకు మరల నిప్పించవలయునను ఉద్దేశముతో నుండిరి. రెండవ ప్రపంచ యుద్ధానంతరము యూదులు పలెస్తీనులో స్థిరస్థావరము నేర్పరచుకొనవచ్చి నప్పటినుండి వీరికిని అరబీయులకును కలహములు వచ్చి, ఐక్యరాజ్య సమితివారి సలహా ననుసరించి దేశమును పంచుకొనినప్పుడు ఉభయుల సమ్మతిపై యెరూషలేమును తటస్థ ప్రదేశముగ నుంచిరి. గాని పాత యెరూషలేము జార్డానువారును, క్రొత్త యెరూషలేము ఇశ్రాయేలువారును ఆక్రమించుకొనియున్నారు.

**యెరూషా** (Jerusha, Jerushah = స్వాస్థ్యము). యూదారాజగు యోతాము తల్లి (II రాజు $15^{33}$ II దిన $27^{1}$).

**యెరెదు** (Jared = సంతతివాఁడు).

1. హనోకు తండ్రి (ఆది $5^{15-20}$). క్రీస్తు పూర్వికుఁడు (లూ $3^{37}$).

2. యూదా సంతతివారిలో నొకఁడు (I దిన $4^{18}$).

**యెరేమై** (Jeremai = ఎత్తు). అన్య స్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణచే వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{33}$).

**యెరేమోతు** (Jeremoth = ఎత్తయిన స్థలములు).

1. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{14}$).

2, 3. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిన వారిలో నిద్దఱు (ఎజ్రా $10^{26,27}$).

4. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో నొకఁడు (ఎజ్రా $10^{29}$). అసలుభాషలో రామోతు అని యున్నది (రామోతు 1 చూ॥). ఇచ్చట రామోతు అని యున్నను యెరేమోతు అని చదువవలెను.

**యెరోహాము** (Jeroham = ఆయన కని కరించును). ఇది యెరహ్మెయేలుకు క్లుప్తపదమైన ట్లున్నది.

1. సమూయేలు తాత. ఎల్కానా తండ్రి (I సమూ $1^{1}$).

2. దావీదు యోధులలో ఇద్దరికి తండ్రి (I దిన $12^{7}$).

3. బెన్యామీనీయుల కుటుంబములలో నొక దాని మూలపురుషుఁడు (I దిన $8^{27}$ $9^{8}$).

4. దానుసంతతి వారిలో నొకఁడు (I దిన $27^{22}$).

5. అతల్యాను రాజ్యమునుండి తొలగించు టకు సహాయముచేసిన అజర్యాతండ్రి (II దిన $23^{1}$).

6. ఒక యాజకుఁడు (I దిన $9^{12}$ నెహె $11^{12}$).

**యెవుయేలు, యెహీయేలు** (Jeuel, Jeiel = దేవుని ధనము?).

1. యూదావారిలో నొకఁడు. ఇతఁడు తన తెగవారిలో 690 తో కూడ ఒకప్పుడు యెరూష లేములో నివసించెను (I దిన $9^{6}$).

2. హిజ్కియా కాలమందుండిన ఒక లేవీ యుఁడు (II దిన $29^{13}$).

3. ఎజ్రావెంట బబులోనునుండి తిరిగి వచ్చిన వారిలో నొక ముఖ్యుఁడు (ఎజ్రా $8^{13}$).

**యెవూజు** (Jeuz = ఆలోచన చేయును). ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{10}$).

**యెశీమీయేలు** (Jesimiel = దేవుఁడు వేయును). షిమ్యోను సంతతివారిలో నొక పెద్ద (I దిన $4^{36}$).

**యెషయా** (Isaiah = యెహోవా రక్షణ). ఒక ప్రవక్త. ఇతనినిగుఱించిన చరిత్రము బహు కొద్దిగా మాత్రము తెలియును. మంచి గొప్ప వంశములో జన్మించినవాఁడు. యూదావారి రాజును అతని ప్రధానులును ఇతనిని మిగుల గౌరవముతోఁ జూచిరి. ఇతఁడు వివాహము చేసికొనెను. ఇతని భార్య ప్రవక్త్రి యనఁ బడెను (యెష $8^{3}$). ఆమెకు ప్రవచించు వరి ముండెనని నమ్మవచ్చును. యెషయా తన ప్రథమ కొమరునకు దేవునాజ్ఞప్రకారము షెయర్యా షూబు (= శేషము తిరిగి వచ్చును) అనియు, రెండవకుమారునికి మహేరు షాలాల్ హాష్ బాజ్ (= త్వరితముగా దోపుడగును, ఆతురముగా కొల్ల పెట్టఁబడును) అనియు పేర్లు పెట్టెను ($7^{3}$ $8^{3}$). యెషయా ఉజ్జియారాజు పరిపాలించు కాలమున జన్మించెను. అతఁడు న్యాయమునను సరించి జ్ఞాన ముతో ప్రజాపరిపాలన చేయుటవలన యూదా వారి రాజ్యము ధనబల సంపదలచే తులతూగు చుండెను. అయితే ప్రజలు విషయాసక్తులై ధనార్జనమును చేయఁగోరి, ఒకరియెడల నొకరు అన్యాయ వర్తనమునకు లోనై ధనవంతులు బీద లను ఒత్తుడు పెట్టుచుండిరి. అయినను వారంద రును సైన్యముల ప్రభువగు యెహోవాను అత్యా

శక్తితో నారాధించుచుండుట యెషయా చూచు చుండెను. ఉజ్జియా చనిపోయిన సంవత్సరమున అనఁగా క్రీ॥ పూ॥ 740 సం॥ న యెషయా యెహోవాయొక్క మహిమగల దర్శనమును జూచెను. ఆ దర్శనమందు అతఁడు తాను యెహోవా కొఱకైన రాయబారిగా నియమింపఁ బడెనను సంగతిని వినెను ($6^{1-13}$). ప్రవక్తో ద్యోగములో ప్రవేశించిన పిదప అష్షూరు రాజ యిన సన్హెరీబు యెరూషలేమును ముట్టడించిన సంవత్సరమువఱకు అనఁగా క్రీ॥ పూ॥ 701 సం॥ దనుక ప్రవచించుచుండెను (36-37). ఇట్లీతఁడు ఉజ్జియా యోతాము ఆహాజు హిజ్కియా యను రాజుల దినములలో యెహోవాయొక్క రాయ బారియై యుండెను. దుర్బలుఁడగు ఆహాజు సిరియ ఎఫ్రాయిములనుండి కాపాడఁబడునని అతఁడు అభయము చెప్పెను. హిజ్కియా తన సంరక్షణార్థము ఐగుప్తుయొక్క సహాయమున కోరకూడదనియు, దేవుఁడు యెరూషలేమును బలిష్ఠులగు అష్షూరు రాజుల చేతులలో పడకుండ కాపాడుననియు హెచ్చరించెను. యెహోవా యందు మాత్రము నమ్మకముంచవలయునని యూదావారిని హెచ్చరించుటయే అతనియొక్క ముఖ్యమైన పనియై యుండెను. విశ్వసించు వాఁడు కలవరపడఁడని బోధించుటయే అతని ముఖ్య ఉపదేశము ($28^{16}$). అతని మరణమును గూర్చి మనకంతగా తెలియదు. J. C.

**యెషయా ఆరోహణము (Isaiah, Ascension of).** అప్రమాణిక గ్రంథములలో నొకటి. దీనియందలి మొదటి భాగమునందు హిజ్కియా కుమారుఁడగు మనష్షేకాలములో తాను రంపముతో కోయఁబడెదనని యెషయా హిజ్కియాతో చెప్పినట్లున్నది. హెబ్రీ $11^{37}$ లో నున్న సంగతి దీనికి సంబంధించి అతఁడా రీతిగనే చంపఁబడెననుటకు ఆధారముగా నున్నది. రెండవ భాగమునందు యెషయా ఆకాశమునకు కొంచుపోఁబడి మెస్సీయను గూర్చిన సంగతులను నేర్చుకొనియున్నట్లుగా వివరించును. ఇది క్రీస్తుకాలమునకుఁ దరువాత రచింపఁబడిన కల్పితగ్రంథము. అదెంతో కాలము నిలువలేదు. క్రీ॥ శ॥ 1819 సంవత్సరములో దీని ఐతియొపియభాషలోని తర్జుమాను కనుగొనిరి.

**యెషయా గ్రంథము (Isaiah, Book of).** ఈ గ్రంథమును రెండు ముఖ్యభాగములుగ విభజింపవచ్చును. మొదటి ముప్పది తొమ్మిది అధ్యాయములయందు యూదా ఎఫ్రాయిము రాజ్యములను గూర్చిన ప్రవచనములు గలవు. 40-66 అధ్యాయములలో బబులోను చెఱయందుండినవారికి చెప్పఁబడిన ప్రసంగము లున్నవి. మొదటిభాగమునందు (1-39 అధ్యా.) ఆరు అంతర్భాగములు గలవు.

1. జనుల పాపములను గూర్చిన అధిక్షేప ములు, యెషయాను ప్రవక్తోద్యోగమునకు ప్రతి ష్ఠించుట (1-6).

2. షోమ్రోను అష్షూరు రాజ్యముల ఏలికలు యూదారాజ్యము మీఁదకు దండెత్తి వచ్చినను దేవుఁడు వారికి తోడై యున్నాడను సంగతిని జనులు మరువరాదు (7-12). ఈ భాగమునకు ఇమ్మానుయేలు పుస్తకమని పేరు. ఇమ్మానుయేలు అనునది పుట్టఁబోవు ఒక శిశువుయొక్క నామ ధేయము. ఇమ్మానుయేలు అనఁగా దేవుఁడు మనకు తోడు అని అర్థము.

3. ఆయా జనములకును, రాజగృహ నిర్వా హకుఁడగు షెబ్నాకును కలుగనైయున్న శ్రమ లను గూర్చిన దేవోక్తులు (13-23).

4. దేవుఁడు లోకమును పరిపాలించు విధాన మునుగూర్చిన యుపదేశము (24-27).

5. రాజైన హిజ్కియా యేలుబడిలో చెప్పఁ బడిన ప్రవచనములు. యెషయా యూదా ఎఫ్రాయిముల పాపములనుగూర్చి వారి నధిక్షే పించుచు వారికి రానైయున్న కఠినశిక్షనుగూర్చి వారితో ముందుగనే చెప్పెను. దేవుఁ డట్టి భయంకరమయిన తీర్పులోకూడ తన కనికరమును చూపును (28-35).

6. అష్షూరు రాజగు సన్హెరీబుయొక్క దండ యాత్రయు అతని పాటును, హిజ్కియా వ్యర్థుఁ డైన విధమును; అతని పిల్లలు బబులోనుకు చెఱకుఁ దీసికొని పోఁబడుటనుగూర్చి అతనికి తెలుపుట అను సంగతు లీ యంతర్భాగమునందున్నవి (36-39).

సన్హెరీబుయొక్క సైన్యము నాశనమైన షుమారు నూరు సంవత్సరములకు బాబెలు రాజైన

నెబుకద్నెజరు యూదయమీఁదికి దండెత్తి, యూదయ యెరూషలేములలోనుండు జనులలో శ్రేష్ఠులైనవారిని బాబెలును చెఱదీసికొని పోయెను. ఇట్లు చెఱకు వెళ్లినవారిలో యెహెజ్కేలు దానియేలు అనువారు గలరు. తరువాత పదునొకండు సంవత్సరములకు అతఁడు తిరిగి యెరూషలేముమీఁదికివచ్చి దానిని ముట్టడించి ఇంక ననేకమంది యూదులను చెఱగొనిపోయెను. వారా చెఱలో డెబ్బదియేండ్లుండిరి. 40-66 అధ్యాయములయందు దేవుఁడు చెఱలోనున్న వారివిషయమై తన వాగ్దానప్రకారముగా వారిని మరల తమ దేశములోకి తీసికొనివచ్చెదనన్న సంగతిని వారు గట్టిగా నమ్మునట్లు వారి నేలాగు ఆదరించి ప్రోత్సాహపఱచెనో ఆ సంగతి దీనియందు వ్రాయఁబడియున్నది. వారు చెఱదీసికొనిపోఁబడుటకు నూరు సంవత్సరములకు ముందు యెషయాయే ఈ ప్రవచనములను వ్రాసెనో లేక వారు చెఱలోనున్న కాలములో మనము పేరెఱుఁగని ఒకానొక ప్రవక్త దైవావేశమునొంది వ్రాసెనో చెప్పుటకు వీలుకాదు. పండితులలో నభిప్రాయ భేదముగలదు.

రెండవభాగమునందు 40-66 అధ్యాయము లున్నవి. వీటియందు ముఖ్యముగా బబులోను చెఱలోనుండి కలుగు విడుదలనుగూర్చి దేవుఁడు చేసిన వాగ్దానమున్నది.

1. యెహోవాయొక్క సర్వశక్తినిగూర్చియు సర్వజ్ఞానమునుగూర్చియు ప్రకటించుచు జనముల విగ్రహములయొక్క వ్యర్థతనుగూర్చి తెలియఁజేసి యెహోవా తన జనులను చెఱలోనుండి విడిపించనై యున్నాఁడని వివరపఱచుట. ఆయన తన జనులకు నీతిగల రక్షకుఁడనై యుండుననని తెలుపుచున్నాఁడు (40-50).

2. దేవుఁడు తన ప్రజలను ఆదరించి విమోచించనై యున్నాఁడనియు, యెహోవా సేవకుఁడగు మెస్సీయ తనవారిని రక్షించి యేలుటకు శ్రమపడవలసి యున్నదనియు ప్రవక్త తెలుపుట (51-56[7]).

3. జనుల అక్రమముల విషయమయిన దేవుని గద్దింపులును, చెఱనుండి కలుగు విమోచనము వరదానముల విషయమై ఆయనచేసిన ఆశ్చర్యకరమగు వాగ్దానములును, తమయెడల అంత దయను కనఁబఱచిన యెహోవాను సంపూర్ణముగా సేవింపని వారికి కలుగఁబోవు కఠినశిక్షలవిషయమై ఆయనయొక్క హెచ్చరింపులు (56[8]-66).

యెహోవా పరిశుద్ధ దేవుఁడై యున్నాఁడు గనుక శిక్షకు తగినవారిని శిక్షింపక మానఁడనియు తన జనులలో నమ్మకముగానున్న శేషముయెడల కనికరముచూపి వారిని క్షమించుననియు యెషయా స్పష్టముగా నుపదేశించెను. యెషయా గ్రంథమునందు దేవునియొక్క క్షమాపణ కనికరములనుగూర్చి అంత స్పష్టముగా నుపదేశింపఁబడియుండుటనుబట్టి యెషయాకు సువార్తికుఁడైన ప్రవక్త అను నామము కలిగెను. అనఁగా దేవుని కనికరమును బయలుపఱచెడు ప్రవక్తయని యర్థము.

J. C

**యెషర్యేలా** అషర్యేలా చూ॥

**యెషానా** (Jeshanan = పాతది). ఎఫ్రాయిము మన్యమందలి యొక పట్టణము. యూదారాజగు అబీయా, ఇశ్రాయేలురాజగు యరొబాము నోడించి దీనిని తీసికొనెను (II దిన 13[19]). ప్రస్తుతము బేతేలుకు 3½ మైళ్లదూరమందున్న అయిన్ సీనియా (*Ain Senia*) దీని యునికి.

**యెషీమోను** (Jeshimon = ఎడారి). సంఖ్యా 21[20] 23[28] లో దీని మూలభాషా పదము ఒక స్థలమునకు పేరుగా నెంచక ఎడారి యను మాటచే తెనిఁగించిరి. ఈ యరణ్యములో దావీదు దాగుకొనెను (I సమూ 23[19]) జీఫును దగ్గరగా (23[24]) హెబ్రోనుకు దక్షిణముందున్నది. మృతసముద్రమునకు పడమరగానుండు యూదయ అరణ్యము ఆ సముద్రముయొక్క ఉత్తరభాగమునుండి దక్షిణమువఱకు వ్యాపించును. అదే ఆ యరణ్యమని సాధారణముగా నను కొందురు. దాగుకొనుటకు వీలైన అనేక గుహలును మఱుగు స్థలములును అందుగలవు.

**యెషీయా** ఇష్షీయా 3 చూ॥

**యెషీషై** (Jeshishai = ముసలివానికి సంబంధించినది). గాదీయులలో నొకఁడు (I దిన 5[14]).

**యెషూరూను** (Jeshurun = యథార్థవంతుడు). కావ్యములందు ఇశ్రాయేలీయులకు పెట్టిన సార్థకనామము (ద్వితీ 32$^{15}$ 33$^{5,26}$ యెష 44$^{2}$). ద్వితీ 32$^{15}$ లో నిది వారిని గద్దించుటకు వాడబడెను. వారికి ఈ పేరు కలిగినను యథార్థవంతులు కారన్నట్టి పదమును ఇచ్చట వాడిరి. తక్కినచోట్ల దానిని మెప్పుకోలుకే నుపయోగించిరి.

**యెషెబెయాబు** (Jeshebeab = తండ్రి నివాసస్థానము). అహరోను సంతతివాడు. యాజకులలో 14 వ వంతుకు పూర్వికుడు (I దిన 24$^{13}$).

**యెషోహాయా** (Jeshohaiah = దేవుడు తగ్గించును?) షిమ్యోనీయులలో నొక పెద్ద (I దిన 4$^{36}$)

**యెష్షయి** (Jesse). దావీదు తండ్రి. బోయజు మనుమడు (రూతు 4$^{21}$ I దిన 2$^{12}$ మ 1$^{5}$ లూ 3$^{32}$). బేత్లెహేములోని ముఖ్యులలో నొకడు (I సమూ 16$^{4}$). ఆ గ్రామమునందతనికి గల్గు ఖ్యాతినిబట్టియే బేత్లెహేమీయుడనియు (16$^{1-18}$) బేత్లెహేమువాడగు ఎఫ్రాతీయుడనియు (17$^{12}$) అతనిని పిలిచిరి. ఇతడు వృద్ధుడు (17$^{12}$) గనుక దావీదు రాజగునప్పటికి మృతినొంది యుండునని ఊహింపవచ్చును. దావీదు తన వంశస్థురాలగు రూతునుబట్టి తన తల్లిదండ్రులను మోయాబు రాజు సంరక్షణలో నుంచిన సంగతియే యెష్షయినిగూర్చి మనము చివరిగా చూతుము (22$^{3,4}$). యెష్షయి కుమారుడని దావీదును తృణీకారభావముతో పిలిచినట్లున్నది (20$^{27,30,31}$ 27$^{7,8,9}$ 25$^{10}$ II సమూ 20$^{1}$ I రాజు 12$^{16}$). కాని ప్రవక్తయగు యెషయా మెస్సీయనుగూర్చి ప్రవచించినప్పుడా పేరును మిక్కిలి ఘనముగనెంచి వాడెను (యెష 11$^{1-10}$). తరువాత వచ్చిన ప్రవక్తలుకూడ ఆ రీతిగనే వాడిరి (I దిన 10$^{14}$ 29$^{26}$ కీర్త 72$^{20}$ కార్య 13$^{22}$).

**W.**

**యెష్షీయా** ఇష్షీయా 4 చూ॥

**యెహాల్లెలేలు** (Jehallelel = దేవుడు లేక దేవుని స్తుతించును).

1. యూదాసంతతివారిలో నొకడు (I దిన 4$^{16}$).

2. లేవీయులలో నొకడు. మెరారీసంతతివాడు (II దిన 29$^{12}$).

**యెహీయా** (Jehiah = యెహోవా జీవించును). దావీదు కాలమునందు దేవుని మందసమును కనిపెట్టినవారిలో నొకడు (I దిన 15$^{24}$).

**యెహీయేలు** (Jehiel = దేవుడు జీవించును, Jiel).

1 దావీదు సంగీతనాయకులలోనుండు ఒక లేవీయుడు (I దిన 15$^{18,20}$ 16$^{5}$).

2. లేవీయులలో నొక ప్రధాని (I దిన 23$^{8}$ 29$^{8}$).

3. దావీదు కుమారుల దగ్గరనుండుటకు నియమింపబడిన యొకడు (I దిన 27$^{32}$). ఇతడు దావీదు కుమారులకు ఉపాధ్యాయుడైనట్లు కనబడుచున్నది.

4. రాజగు యెహోషాపాతు కుమారులలో నొకడు (II దిన 21$^{2}$).

5. రాజగు హిజ్కియా నియమించిన విచారణ కర్తలలో నొకడు (II దిన 31$^{13}$).

6 యోషీయారాజు దినములలో యెహోవా మందిరపు అధికారులలో నొకడు (II దిన 35$^{8}$).

7. చెరనుండి తిరిగివచ్చిన ఓబద్యాయను నొకనికి తండ్రి (ఎజ్రా 8$^{9}$).

8. దిద్దుబాటు చేయవలెనని ఎజ్రాను ప్రేరేపించిన షెకన్యాకు తండ్రి (ఎజ్రా 10$^{2}$).

9. అన్యస్త్రీలను వివాహము చేసికొని, ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిన వారిలో నొకడు (ఎజ్రా 10$^{26}$).

10. అన్యస్త్రీలను వివాహముచేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన ఒక యాజకుడు (ఎజ్రా 10$^{21}$).

11. యెవుయేలు 2 చూ॥

**యెహూకలు** (Jehucal = యెహోవా శక్తిమంతుడు). రాజైన హిజ్కియా క్రింద

నున్న నొక యుద్యోగస్థుడు యిర్మీ $37^{3}$ $38^{3}$ నందు ఇతనికి యూకలు అను మారు రూపము కలదు.

**యెహుదు** (Jehud = స్తోత్రము). దాను లోని ఒక పట్టణము. ఇది బాలాతా బెనే బెరకు లకు మధ్యనున్నది (యెహో $19^{45}$). యొప్పేకు తూర్పున 8 మైళ్లదూరమందున్న ప్రస్తుతపు ఎల్ ఎహుద్యా (*El-Yehudiyeh*) యై యుండును (పటము III, D 4).

**యెహుబ్బా** (Jehubbah = మరుగుగా నున్నవాఁడు). ఆషేరీయులలో నొకఁడు (I దిన $7^{34}$).

**యెహూ** (Jehu = ఆయనే యెహోవా!)

1. దావీదు సిక్లగులో నుండఁగా అతనిని జేరుకొనిన అనాతోతువాఁడైన ఒక బెన్యామీనీయుఁడు (I దిన $12^{3}$).

2. ఒక ప్రవక్త. హనానీ యనువాని కుమారుఁడు. యరొబాము చేసిన పాపముల ననుసరించుచున్నందున బయెషాకును అతని కుటుంబమునకును కలుగనైయున్న గొప్పశిక్షను తెలిపిన వాఁడు (I రాజు $16^{1-4,7}$). అహాబుకు సహాయపడినందుకై యెహోషాపాతునుకూడ ఇతఁడే గద్దించి (II దిన $19^{2}$), అతని కార్యము లన్నిఁటిని తెలియఁజేయు గ్రంథ మొకదానిని రచించెను ($20^{34}$).

3. ఇశ్రాయేలువారి రాజకుటుంబములలో నాలుగవ దాని స్థాపకుఁడు. ఇతని తండ్రి పేరు యెహోషాపాతు. నింషీ యనువాఁ డితని తాత. ఇతఁడు తఱుచుగా నింషీ కుమారుఁడనఁబడెను (I రాజు $19^{16}$ II రాజు $9^{2}$). క్రీ॥ పూ॥ 854 సం॥ కు ముందే ఇతఁడు అహాబుయొక్క సైన్యమున నొక యధిపతిగ నుండెను ($9^{25}$). యెహోవా సేవకులను ప్రవక్తల నందఱిని జంపి, ఉత్తర రాజ్యమున బయలు దేవతాపూజను స్థాపించిన పాపము పండినమీఁదట, ఇశ్రాయేలు వారిమీఁద యెహూను రాజుగా నభిషేకింపవలసినదను ఆజ్ఞ ఏలీయాకు వచ్చెను. ఈ యాజ్ఞప్రకారము ఏలీయా శిష్యుఁడగు ఎలీషా కాలమునందు జరిగెను. ఇశ్రాయేలువారప్పుడు ముట్టడించుచుండిన రామోత్గిలాదుకు యెహూ నభిషేకించు నిమిత్తము ఒక ప్రవక్త పంపఁబడెను. యెహూ ఇతర యధిపతులతోఁ గలిసి కూర్చుండుటను అతఁడు చూచి, వానిని ప్రత్యేకముగా నింటిలోనికిఁ దీసికొనిపోయి తాఁదెచ్చిన కబురును దెలిపి, ఇశ్రాయేలువారిపై రాజుగా నభిషేకించి, అహాబు ఇంటివారిని సంహరించవలసినదను ఆజ్ఞను చెప్పి అక్కడ నుండకుండ పారిపోయెను. జరిగిన సంగతిని యెహూ తక్కినవారికి దెలిపినప్పుడు వా రతనిపక్షము వహింతుమని ప్రమాణము చేసిరి. అంతటవారు అప్పుడిశ్రాయేలువారి రాజుండిన యెజ్రెయేలునకు వెళ్లిరి. యెజ్రెయేలు గోపురముమీఁదనున్న కావలివాఁడు దూరమునుండి రథముతోలుటను గుర్తించి వచ్చువాఁడు యెహూ యని తెలిపెను. యూదా రాజగు అహజ్యా ఆ కాలమున యెహోరామును దర్శించుటకై యెజ్రెయేలునకు వచ్చియుండెను. యెహూ వచ్చుచున్న వార్తను విని రాజులిద్దరును తమతమ రథముల నారోహించి అతని నెదుర్కొని సంగతి కనుగొననై వెళ్లిరి. అహాబు అన్యాయముజేసి నాబోతు యొద్దనుండి యపహరించిన ద్రాక్షతోఁటయొద్ద వారు కలిసికొనిరి జరిగిన పోరాటములో యెహోరాముకు బాణము తగిలి నాబోతు ద్రాక్షతోఁటలో పడెను అహాబు మేనల్లుఁడగు అహజ్యాయును యెహూ నాజ్ఞచే కొట్టఁబడి గాయములు పొందెను యెహూ సమ్మతిమీఁదనే అహాబుయొక్క అన్య భార్యయు రాజమాతయు దుష్టత్వపు అవతారమూర్తియునగు యెజెబెలు కిటికీలోనుండి క్రిందికి పడఁద్రోయఁబడి చంపఁబడెను ($9^{1-37}$). అహాబు యొక్క 70 మంది కుమారుల సంరక్షకులగు వారు ఆ డెబ్బదిమందిని చంపి వారి శిరస్సులను యెజ్రెయేలు గుమ్మము నెదుట రెండు కుప్పలుగ వేయునట్లు జేసెను. అహాబుయొక్క ముఖ్యులును బంధువులును హతము చేయఁబడిరి. పిదప అహజ్యాయొక్క నలుబది యిద్దరు సహోదరులు చంపఁబడిరి. చివరగా యెహూ తాను బయలు దేవతను ఆరాధింపఁబోవుచున్నానని ఆ దేవాలయమునకు బయలు పూజారులనందఱిని బిలువనంపి వారిని కత్తివాతను జంపించెను. యెహూ ఈ విధముగ అహాబు ఇంటివారిని దేవుని యాజ్ఞ ప్రకారము శిక్షించి బయలు పూజారులను పరి

మార్చినప్పటికిని ధర్మశాస్త్ర యుక్తముగ నడువక దూడలను పూజించుట మానకపోయెను ($10^{29-31}$). అతఁడు క్రీ॥ పూ॥ 842 సం॥ న సింహాసనాసీనుం డయ్యెను. అదే సంవత్సరమున హజాయేలుతో యుద్ధముజేయవచ్చిన అష్షూరు రాజగు షల్మనేజరునకు యెహూ కప్పముకట్టినట్లు అష్షూరుశాసనములవలనఁ దెలియుచున్నది. అతఁడు 28 సం॥ లు రాజ్యముచేసెను ($10^{36}$). వృద్ధాప్యము వలన శక్తి సామర్థ్యము లుడుగుటచే అతని కుమారుఁ డగు యెహోయాహాజు అతనితో కలిసి 821 సం॥ నుండి రాజ్యముచేయ నారంభించినట్లు కనఁబడుచున్నది. అయినప్పటికిని అతని చివరి దినములలో ఇశ్రాయేలువారి రాజ్యమునకు కష్టములు కలుగకుండలేదు. హజాయేలు ఇశ్రాయేలువారిని బాధపఱచెను ($10^{32}$). యెహూ సంతతివారు నాలుగుతరము లేలెదరను వాగ్దత్త ప్రకారము జరిగెను. అతని సంతతిలో యెహోయాహాజు, యెహోయాషు, యరొబాము II, జెకర్యా అను నలుగురు ఒకరి తరువాత నొకరు రాజ్యము నేలిరి ($10^{30}$ $15^{8-12}$).

4. యెరహ్మెయేలు అనువాని సంతానీకుఁ డగు నొక యూదాగోత్రికుఁడు (I దిన $2^{38}$).

5. షిమ్యోను గోత్రికులలో నొకఁడు (I దిన $4^{35}$).

**యెహూది** (Jehudi = యూదుఁడు). యిర్మీయా ప్రవచనములను తెచ్చుటకు రాజగు యెహోయాకీము బారూకు నొద్దకు పంపిన వాఁడు. అతఁడు దానిని తెచ్చి రాజునెదుట కొంతవఱకు చదివెను గాని రాజు కోపపడి ఆ పుస్తకము నతని చేతిలోనుండి తీసికొని చించి కుంపటిలోవేసి తగలఁబెట్టెను (యిర్మీ $36^{14-24}$).

**యెహూదీయా** (Jehudijah, Hahe-Judijah = యూదురాలు). I దిన $4^{18}$ లో ఇది యొక స్త్రీ పేరైనట్లుగా తెనిఁగించిరి గాని కొందఱిది యూదురాలు అని భాషాంతరము చేయవలె నందురు. ఆమె మెరెదు అను వాని భార్య. ఇతనికి ఐగుప్తీయురాలొకతె యు భార్యగా నుండెను గాన ఇద్దరికి వ్యత్యాసము కనుపఱచుటకు ఈమె కీ పేరు పెట్టినట్లున్నది.

**యెహూయాషు** యోయాషు చూ॥

**యెహెజ్కేలు** (Ezekiel, Jehezkel = దేవుఁడు బలపఱచును).

1. యాజకులలో 20 వ వంతుకు పెద్ద (I దిన $24^{16}$).

2. చెఱకాలమునందు ప్రవచించిన యొక ప్రవక్త. క్రీ॥ పూ॥ 597 సం॥ నెబుకద్నెజరు యెరూషలేమునుండి చెఱకుఁ దీసికొనిపోయిన వారిలో యాయనుఁడును యాజకుఁడునై యుండెను. ఇతఁడు యిర్మీయాయొక్క యుపదేశములను హెచ్చరికలను బహుశః విని యుండును. కల్దీయుల దేశములో నితఁ డైదేండ్లుండిన పిదప దేవుఁడతనిని చెఱలోనున్న వారి కొఱకై ప్రవక్తగా నియమించుకొనెనని ఆశ్చర్యకరములగు దర్శనములమూలముగా అతనికి బయలుపఱచెను. అతఁడక్కడ వారికి ఇరువదిరెండు సంవత్సరములు ప్రవచించి జనుల విగ్రహారాధనను బట్టి వారిని బహు ధైర్యముతో గద్దించెను. అతఁడు జనులనంత ఖండితముగా గద్దించినను జనుల పెద్ద లతని యుపదేశములను సంతోషముతో నాలకించిరి ($33^{30,33}$). అతఁడు తన పని చేయ నారంభించిన నాలుగేండ్లకు అతనిభార్య చనిపోయెను. జనుల కతఁడు సూచనగా నుండునట్లు ఎంతమాత్రము నంగలార్చకూడదని దేవుఁ డతనితో చెప్పినరీతిగా నతఁడు చేసెను ($24^{15-27}$). ఒకప్పుడతఁడు ప్రవచించుచుండఁగా ప్రజల అధిపతియగు పెలట్యా యనువాఁడు చనిపోయెను. అప్పుడు యెహెజ్కేలు దుఃఖాక్రాంతుఁ డాయెను ($11^{1-13}$). అతఁడు సూచనలతోడను ($4^{1-5}$ $6^{11}$ $12^{1-20}$ $37^{15-28}$) ఉపమానములతోడను జనుల కుపదేశించెను. చెఱలోనున్న వారికి పశ్చాత్తాపపడుట మిక్కిలి అవశ్యమనియు వారు చెఱలోనుండి తిరిగివచ్చుట అంతలో జరుగదనియు వారితోను యెరూషలేములో నిలిచిపోయిన వారితోను చెప్పి వారిని హెచ్చరించుట యనునది అతని విధాయకమైన పనియై యుండెను ($11^{14-17}$ $33^{23-29}$). జనులలో ప్రతివాఁడును తన పాపముల విషయమై తానే జవాబుదారుఁడై యుండునట్లు అతఁడు ప్రతివానితోను ఎంతో స్పష్టముగా మాట్లాడి హెచ్చరించెను (18). దేవుఁడు తన నామ మహిమ నిమిత్తము యూదులను తిరిగి తమ దేశములో

ప్రవేశపెట్టనై యున్నాఁడని అతఁడు ప్రకటించెను ($20^{9,22,41}$) మఱియు నతఁడు దేవుఁడు వారిని వారి స్వదేశములోనికి తీసికొని వచ్చుట మాత్రమేగాక వారు మఱియొక నూతనజనమగునట్లు వారిమీఁద తన పరిశుద్ధాత్మను ధారాళముగా కుమ్మరించుననియు బోధించెను ($36^{24-28}$ $37^{14}$). అతని మరణమునుగూర్చి మనకేమియు తెలియదు.

J. C.

**యెహెజ్కేలు ఆలయము** దేవాలయము II చూ॥

**యెహెజ్కేలు గ్రంథము (The Book of Ezekiel).** గొప్ప ప్రవక్త గ్రంథము లనబడిన వాటిలో నొకటి. ఇంగ్లీషు మొదలగు బైబిలులో విలాప వాక్యములకును దానియేలుకును మధ్యనున్నను హెబ్రీ బైబిలునందు యిర్మీయా హోషేయలకు నడుమనున్నది.

I. యెహెజ్కేలునకును, యిర్మీయాకునుగల సంబంధములు. యెహెజ్కేలు యౌవనుఁడుగా నుండు కాలములో యిర్మీయా బోధలను విని యుండును లేదా అతఁడు చెఱపట్టఁబడిన పిమ్మట యిర్మీయా గ్రంథమును చదివియైన నుండవచ్చును (యిర్మీయా, యెహెజ్కేలు చూ॥). ఎట్లయినను అతని గ్రంథమునకును యిర్మీయా గ్రంథమునకును సంబంధములున్నవి. యిర్మీయా సూచనగా నెత్తిన అనేక యుపమానములు యెహెజ్కేలు వివరముగా వ్రాసెను. ఇట్లు యిర్మీ $1^{13-15}$ యెహె $24^{3-14}$ లో నున్న బానలను, యిర్మీ $3^{7-10}$ యెహె $33^{1-49}$ లో నున్న అప్పసెల్లెండ్రను, యిర్మీ $33^{12,13}$ యెహె $34^{1-24}$ లో నున్న గొఱ్ఱెల కాపరులను, యిర్మీ $31^{29,30}$ యెహె $18^{2-31}$ లోని పులుపు ద్రాక్షపండ్లను తినుటనుగూర్చిన సామెతలను, యిర్మీ $31^{33,34}$ యెహె $11^{11,20}$ $36^{25-29}$ లో నున్న నూతన హృదయములను గూర్చిన బోధలకును సంబంధములున్నవి. ఇంకను ఇతరములగు బోధలలోను ఈ రెండు గ్రంథములకు సంబంధమున్నది. యెహెజ్కేలు యిర్మీయాకన్న చిన్నవాఁడైనను యెరూషలేము నాశనము సమీపమై యుండఁగా యిర్మీయా యెరూషలేమునందును యెహెజ్కేలు బాబెలు దేశములోను ఒకటేకాలమునందు ప్రవచించుట చేత ఇట్టి సంబంధము ఉపమానములలో మాత్రమే గాక యితర విషయములందును గానవచ్చుచున్నది.

II. యెహెజ్కేలు గ్రంథమునందలి విషయములు. యెహెజ్కేలు గ్రంథమందలి సంగతులు చాలమట్టుకు కాలక్రమము ననుసరించి వ్రాయఁబడినవి. వాటి నీ దిగువరీతిగా విభాగింపవచ్చును:—

1. యెరూషలేము నాశనము చేయఁబడక పూర్వము చెప్పిన ప్రవచనములు (1-24). యెహెజ్కేలు యెహోయాకీను అను రాజుతో పాటు చెఱపట్టఁబడినవాఁడై ఆ చెఱ ననుసరించి ఈ ప్రవచనములను వ్రాసెను. ఇట్లు అతఁడు 5 సం॥ లు కెబారు నదయొద్ద దర్శనమును చూచి ప్రవక్త యగునట్లు పిలుపునొందిన పిమ్మట (1-$3^{21}$), తాను ప్రవచింపవలసినవాటిని గూర్చి ఉపమాన రీతిగా బోధింప సాగెను ($3^{22}$-7).

6 సం॥ లో యూదులు దేవునివిడిచి విగ్రహారాధన చేసినవారైనందున వారిని ఖండించి (8) యెహోవా వారి దేవాలయమును విడిచి వెళ్లి యున్నట్లుగా ప్రవచించెను (9-$11^{13}$). ప్రజలు చెఱపట్టఁబడినను తనను నమ్మువారిని దేవుఁడు విడువక వారికి తోడుగా నుండి నూతన హృదయము ననుగ్రహించుననియు ($11^{14-25}$), యూదావారు దేవుని నమ్మక అబద్ధప్రవక్తలను నమ్మినందున దేవుఁడు వారిని విడిచి వారి పట్టణమును నాశనమునకు అప్పగించుననియు (12-14), వారి శిక్ష ఎంత న్యాయమైనదను (15-17) మారుమనస్సునొందువారికి రక్షణ కలుగుననియు (18) వ్రాసి ఈ సం॥ న చెప్పిన ప్రవచనములను ఇశ్రాయేలీయుల రాజునుగూర్చిన విలాపములతో ముగించెను (19).

7 సం॥ నందు అదేరీతిగా యూదులు దేవుని నామమును అపవిత్రపఱచినందున వారు తప్పక శిక్షనొందెదరు గాని దేవుఁడు తన నామఘనతను బట్టి వారిని రక్షించుననియు ($20^{1-40}$), వారికి శిక్ష కలుగుననియు మఱల ప్రకటించెను ($20^{45}$-$23^{1}$).

9 సం॥ న మసలుచున్న కుండ దృష్టాంతముచే యెరూషలేము ముట్టడిని, ప్రజలు చెదరిపోవుటను సూచించుచు ప్రవచించెను (24).

**2.** అన్యజనములను గూర్చిన ప్రవచనములు (**25-32**). అమ్మోనీయులు (**$25^{1-7}$**), మోయాబీయులు (**$25^{8-11}$**), ఎదోమీయులు (**$25^{12-14}$**), ఫిలిష్తీయులు (**$25^{15-17}$**), తూరు సీదోనులవారు (**26-28**), ఐగుప్తీయులను (**29-32**) గూర్చి ప్రవచించెను. ఇవి 9-11 సం॥ లో ప్రవచించెను గాని ఐగుప్తును గూర్చిన యొక కొద్ది ప్రవచనమును (**$29^{17-19}$**) 27 సం॥ నందు చెప్పెను.

**3.** యెరూషలేము నాశనమైన పిమ్మట యెరూషలేము పాలస్తీనుల కుదురుబాటును గూర్చి ప్రవచించుట (**33-48**).

12 సం॥ లో యెరూషలేము నాశనమై పోవుచుండగా తిరిగి ప్రవచించునట్లు యెహెజ్కేలునకు పిలుపు వచ్చెను (**$33^{1-22}$**). అది నాశనమైన పిమ్మట అతఁడు నిజమైన ప్రవక్తయై యున్నట్లు చెప్పెను (**23**). ఇదివఱకు దేశమును పాడుచేసిన దొంగకాపరులకు ప్రతిగా నిజమైన కాపరిని లేపి (**34**), విరోధులను శిక్షించఁగా (**35**) ప్రజలు పవిత్రపరచఁబడినవారై తమ దేశమునకు మరల చేర్చఁబడి (**36**), మృతులలోనుండి లేపఁబడునట్లు తిరిగి యొక జనాంగము కాఁగా (**37**) వారి విరోధులందఱు నాశనము పొందెదరు (**38-39**).

**25** సం॥ లో ఆలయమును దాని నియమములను తిరిగి స్థిరపఱచుటను గూర్చి ప్రవచించెను (**40-48**). ఆలయము పవిత్రపఱచఁబడి పెంపకము చేయఁబడునట్లు అలంకారరీతిగాఁ దెలిపిన పిమ్మట (**40-43**), దాని అర్చనములు మరల క్రమముగా జరుగును (**44-46**). ఒక నది ఆలయములోనుండి యుబికి దేశము నంతటిని ఫల పుష్ప భరితమైనదిగా చేయునట్లుండును (**47**). చివరకు దేశము బహు క్రమముగా జనములకు విభాగింపఁబడును (**48**). ఈ కుదురుబాటునందు ప్రతిదియు లోపములేని దానిని సూచించుచు రాఁబోవు ఆ కాలముయొక్క సంపూర్ణతను తెలియఁజేయును. మొదటి భాగమునందు దేవుఁడు ప్రజలభ్రష్టత్వముచే నాలయమునువిడిచి వెళ్లఁగా ఈ భాగములో ఆయన మరల వారి మధ్యనుండును (**$43^{1-7}$**). యెహోవా అచ్చటనే నివసించును (**$48^{35}$**). ఇదే కుదురుబాటును గూర్చిన దృష్టాంతము లన్నిఁటియొక్క సారమై యున్నది (దేవాలయము **II** చూ॥).

**III.** యెహెజ్కేలు బైబిలులోని బోధలలో వేటిని క్రొత్తగా బోధించెను అను ప్రశ్నకు నవీన పండితులలోఁ గొందఱు అతఁడాలయమునుగూర్చి వ్రాసిన వివరమే నిర్గమకాండములోని గుడారమునకును రాజుల గ్రంథమునందలి దేవాలయమున కాధారమని యందురు. అట్టివారీ వివరము తక్కినవాటికన్న పురాతనమైనదైనందున ఆయా వారలు తాము వ్రాసిన వివరములను దీనినిబట్టి కల్పించి రనుకొందురు (బైబిలు చరిత్ర చూ॥). ఇది బైబిలులోని సంగతులు సత్యమని యంగీకరించువారి యభిప్రాయము కాదు. యెహెజ్కేలు వ్రాసినది లోపరహితమగు ఆలయమును సూచించును. అదెన్నడును కట్టఁబడి యుండలేదు. దాని కొలతలన్నియు చతురముగాను చచ్చౌకముగా నున్నవి. అతఁడు వర్ణించిన దేశముసహా అట్టి కొలతలు గలదై యుండెను. దీనిని అక్షర రీతిగా గాక అలంకార రీతిగా గ్రహించుకొనవలెను. ఇట్లు యెహెజ్కేలు బోధలు ప్రకటన గ్రంథమునకు సంబంధించినవై వర్ణనములుగల అట్టి గ్రంథమునకు మార్గసర్శి యనుకొనఁదగును (యెహె 42 ప్రక $21^{10}$, యెహె $37^{27}$ ప్రక $21^{3}$, యెహె $43^{2-5}$ ప్రక $21^{11}$, యెహె $48^{16}$ ప్రక $21^{16}$, యెహె $48^{30-34}$ ప్రక $22^{1}$, యెహె $47^{1-12}$ ప్రక $22^{2}$, సరిపోల్చుఁడి). అతఁడుచేసిన యితర విశేష బోధ లెవ్వియనఁగా—మంచికాపరియగు దేవుఁడు (కీర్త 23, యెష $40^{11}$ యిర్మీ $23^{3}$ మొ॥) తప్పిన గొఱ్ఱెల నాశనమును గోరక వారిని రక్షించుటకు వెదకుచున్నట్లుగా యెహెజ్కేలు తేటగా వ్రాసి (**$34^{11-16}$**), క్రీస్తు చెప్పిన ఉపమానములబోధను ముందుగనే సూచించెను (మ $18^{12-14}$ లూ $19^{10}$). మఱి ముఖ్యముగా యెరూషలేము కుదురుబాటు దేశసంబంధమైనది గాక ఆత్మసంబంధమైనదై యున్నదని యెహెజ్కేలు బోధించెను. దానికి సంబంధముగా దేశముయొక్క ఫలవంతమును సూచనగా నెంచినను (**$36^{29,30}$**) అతఁడు ముఖ్యముగా ప్రజలయొక్క శుద్ధిని, వారు దేవునిరాజ్యమగుట అను నీ గొప్ప ఆత్మీయ సత్యములను వివరించెను (**$11^{19,20}$ $36^{24-29}$**). దేవుని ప్రజలు

నూతన పఱచఁబడిన జనముగా నుండుదనను సంగతి అతఁడు ప్రవక్తలలో ఇతరులకన్న తేటగా బోధించెను. ఇట్లు క్రొత్త నిబంధనలో దేవుని రాజ్యమును గూర్చిన బోధలను చేయుటకుకూడ ముందుగా మార్గదర్శకుఁడై యుండెనని చెప్పఁదగును.

**యెహెద్యాహు** (Jehdeiah = యెహోవా సంతోషపరచును).

1. దావీదు గాడిదెలను కాచిన పై విచారణకర్త (I దిన $27^{30}$).

2. ఒక లేవీయుఁడు (I దిన $24^{20}$).

**యెహోజాదాకు** (Jehozadak, Jozadak = యెహోవా నీతిమంతుఁడు). చెఱబాబెలు కాలములో నున్న ప్రధాన యాజకుఁడగు యేషూవ తండ్రి (I దిన $6^{14,15}$ హగ్గ $1^{1,1,14}$ $2^{2,4}$ జెక $6^{11}$). ఈ పేరు ఎజ్రా $3^{7,8}$ $5^{2}$ $10^{18}$ నెహె $12^{26}$ లో కూడ ఉన్నది గాని ఈ వాక్యములందు మూలభాషలో **యోజావాకు** అని యున్నది.

**యెహోజాబాదు** (Jehozabad = యెహోవా ఇచ్చును).

1. రాజగు యోవాషు సేవకులలో నొకఁడు ఇతరులతోఁ గలిసి కుట్రచేసి యోవాషును చంపెను (II రాజు $12^{21}$). ఇతని తల్లి మోయాబీయురాలు (II దిన $24^{26}$). యోవాషు కొడుకగు అమజ్యా ఇతనికి మరణశిక్ష విధించెను (II రాజు $14^{5}$, II దిన $24^{26}$ $25^{34}$) గాని అప్పటి కాలపు వాడుకల ప్రకార మితనితోపాటు ఇతని కుమారులను చంపలేదు (II రాజు $14^{6}$).

2. ఓబేదెదోము కుమారులలో నొకఁడు (I దిన $26^{4}$).

3. రాజగు యెహోషాపాతు ఉద్యోగస్థుఁడు (II దిన $17^{18}$).

**యెహోనాతాను** యోనాతాను 16, 17, 18 చూ॥

**యెహోనాదాబు** (Jehonadab, Jonadab = యెహోవా ఘనుఁడు).

1. దావీదు అన్న కుమారుఁడు. బహు కుయుక్తిగలవాఁడు. తామారును చెరుపవలెనని యుద్దేశించిన అమ్నోనుకు ఉపాయము చెప్పి అతని దుష్టాలోచనలో తోడ్పడెను (II సమూ $13^{3-22}$). అబ్షాలోము అందువలన అమ్నోనును జంపిన పిదప ఇతఁడు దావీదు నాదరించెను (II సమూ $13^{33-35}$).

2. రేకాబు కుమారుఁడు (II రాజు $10^{15}$). అతఁడు రేకాబీయులకు విశేషమైన చట్టముల నేర్పాటుజేసెను (యిర్మీ 35). వారు డేరాలలోనే నివసింపవలెననునదియు, ద్రాక్షారసమును త్రాగకూడదనునది వాటిలో ముఖ్యములైనవి. వారీ చట్టముల విషయము బహు నిష్ఠపరులైనందున వీరిని దృష్టాంతముగా గొని యిర్మీయా దేవునియాజ్ఞలను నిర్లక్ష్యపెట్టిన యిశ్రాయేలీయులను గద్దించెను. యెహోనాదాబు దేవునియందు బహు నిష్ఠపరుఁడై, బయలుఁపూజలు చేసినవారికి విరోధిగానున్న సంగతి, అతఁడు యెహూకు తోడుగా నున్నదానివలన స్పష్టమగుచున్నది (II రాజు $10^{15,23}$).

**యెహోయద్దాను** (Jehoaddan = యెహోవా సంతోషపఱచును). యూదా రాజగు అమజ్యా తల్లి (II రాజు $14^{2}$ II దిన $25^{1}$).

**యెహోయాకీను** (Jehoiachin = యెహోవా స్థాపించును) యూదా రాజగు యెహోయాకీము కుమారుఁడు. క్రీ॥ పూ॥ 598 లేక 597 నందు తన తండ్రికి తరువాత రాజాయెను. అప్పటికి 18 యేండ్ల ప్రాయము గలవాఁడైనట్లు II రాజు $24^{8}$ నందున్నది గాని II దిన $36^{9}$ నందు ఎనిమిదేండ్ల ప్రాయమే యని కనఁబడుచున్నది. ఈ లోపము LXX లోను హెబ్రీ భాషలోను ఉన్నది. ఈ రెంటిలో నేదో యొకటి తప్పక తప్పయి యున్నది. ఏది సరియో నిశ్చయించుటకు వీలుగాదు. ఇతఁడు తన తండ్రివలెనే దేవుని దృష్టికి కీడైనది చేసెను. అతఁ డేలినది మూఁడు మాసముల 10 దినములు మాత్రమే. ఇతని పరిపాలనమందే బాబెలు రాజగు నెబుకద్నెజరు తన సైన్యాధిపతులనంపి యెరూషలేమును ముట్టడించెను. నెబుకద్నెజరు ఏలుబడిలో నెనిమిదవ సంవత్సరారంభమున అది

పట్టుకొనెను (II రాజు $24^{12}$ యిర్మీ $52^{28}$). యెహోయాకీను, అతని భార్యలు, తల్లి, రాజనగరి సేవకులు పట్టణపు ప్రధానులు నిపుణులును చెఱకుఁ గొని పోఁబడిరి (II రాజు $24^{8-16}$ II దిన $36^{9,10}$). చాలకాలము నతఁడు చెఱసాలలో నే యుండెను. 37 సం॥ల చెఱయైన పిదప అనఁగా క్రీ॥ పూ॥ 562 సం॥న ఎవిల్మెరోదకు బాబెలు సింహాసన మెక్కిన పిమ్మట అతనిని విడుదలచేసి అతఁడు జీవించినంతకాలము అతనికి దినభత్యము నేర్పాటుజేసెను (II రాజు $25^{27-30}$ యిర్మీ $52^{31-34}$). ఇతని కాలమందును తరువాతను ప్రవచించిన యిర్మీయా యితనిని యెకొన్యా యనియు, కొన్యా యనియు తన ప్రవచనములయం దుదాహరించెను.

**యెహోయాకీము** (Jehoiakim = యెహోవా స్థిరపఱచును). రాజైన యోషీయా కుమారుఁడు. ఇతని తల్లి పేరు జెబూదా (II రాజు $23^{34,36}$). యెహోవా స్థాపించునని యర్థమిచ్చు ఎల్యాకీము అనునది ఇతని మొదటి పేరు. యోషీయా మరణానంతరమున ప్రజలు అతని మూఁడవ కుమారుఁడును యుక్తవయస్కుఁడునగు యెహోయాహాజును రాజును జేసిరి. గాని ఫరోనెకో మూఁడు మాసములలో అతనికి సంకెళ్లు వేసి ఐగుప్తునకు చెఱపట్టుకొనిపోవుచు అతని పెద్దన్నయగు ఎల్యాకీమునకు యెహోయాకీము అని పేరుపెట్టి రాజుగా నియమించి మఱలిపోయెను. క్రీ॥ పూ॥ 608 సం॥న 25 యేండ్ల ప్రాయమప్పుడు ఇతఁడు ఏల నారంభించెను. ఫరోకు చెల్లింపను జనులమీఁద భారమైన పన్నులు వేయవలసి వచ్చెను. తన తండ్రి అంత భయభక్తులతో ననుసరించిన యెహోవామార్గము నితఁడు విసర్జించి విగ్రహారాధనవైపు మళ్లెను. పశ్చాత్తాపపడని పక్షమున కలుగనైయున్న శ్రమలను దెలుపు నొక గ్రంథమును యిర్మీయా వ్రాసెను గాని యెహోయాకీము ఆ గద్దింపులను తృణీకరించి మూఁడు నాలుగు పుటలు విన్నమీఁదట ఆ గ్రంథమును ముక్కలుగ కోసి కుంపటిలో వేసి తగులబెట్టెను (యిర్మీ 36). ఈ కాలమున బాబెలు మిగుల ఉన్నతదశయందుండెను. యెహోయాకీము ఏలుబడి నాలుగవ సంవత్సరమున బబులోను రాజకుమారుఁడగు నెబుకద్నెజరు కర్కెమీషుపద్ద ఫరోనెకోను ఓడించి తరువాత యెరూషలేముమీఁదకుఁ బోయెను. అప్పుడు యెహోయాకీము అతనికి దాసుఁడయ్యెను (II రాజు $24^{1}$ యిర్మీ $46^{2}$ దాని $1^{1,2}$, కాలక్రమణిక చూ॥). మూఁడు సంవత్సరములైన పిమ్మట అతఁడు బహు మూర్ఖుఁడై తిరుగఁబడెను. ఆ కాలమునందే యూదారాజ్యమునకు పీడాకరములుగ సిరియనులు మోయాబీయులు అమ్మోనీయులు దేశమందుఁ జొచ్చిరి. నెబుకద్నెజరు తిరుగుబాటును గూర్చి విని పంపిన సైన్యములవలె ఆ దేశమును మిగుల దోఁచి హింసించిరి (II రాజు $24^{2}$). పిదపకు బాబెలురాజే స్వయముగా సైన్యసమేతుఁడై యెరూషలేమును ముట్టడించి ద్రోహియగు రాజును బాబెలుకు పట్టుకొని పోవుటకు బంధించెను (II దిన $36^{6}$). అప్పుడు యెరూషలేమునందో లేక బాబిలోనో దండు విడిసి యున్న బాబెలురాజునొద్దకు అతనిని బోనులో పెట్టి గాలము లతనికి తగిలించి తీసికొనిపోయిరి (యెహె $19^{5-9}$). 9 వచనములోని సంగతి అతని కుమారునికి సంబంధించినదై యుండును. అతనిని బాబెలునకు దీసికొనిపోవు నుద్దేశమును మానుకొనిరి. అతఁడు చంపఁబడి యెరూషలేము ద్వారముల వెలుపటికి ఈడ్చి పారవేయఁబడెనందున గాడిదె పాతిపెట్టఁబడు రీతిగా సమాధి చేయఁబడెను (యిర్మీ $22^{19}$ $26^{30}$ పురా 10.6.3). అతఁడు 11 సం॥ము లేలెను. అతని కుమారుఁడగు యెహోయాకీను అతనికి బదులుగా రాజాయెను (II రాజు $23^{36}$ $24^{6}$).

**యెహోయాదా, యోయాదా** (Jehoiada = యెహోవా యెఱిఁగెను).

1. దావీదు సొలొమోను కాలములలో సేనాధిపతిగా నుండిన బెనాయా తండ్రి (II సమూ $23^{22}$ I రాజు $4^{4}$). ఇతఁడు దావీదుయొక్క సభాముఖ్యుఁ డయ్యెను. దావీదింకను సిక్లగులో నుండఁగా ఇతఁడు అహరోనీయులకును పెద్దయై దావీదునొద్దకు 3700 మందిని వెంటఁబెట్టుకొని వచ్చినట్లున్నది (I దిన $12^{27}$).

2. బెనాయా కొడుకు. ఇతఁడు దావీదు ఆలోచన కర్తలలో నొకఁడు (I దిన $27^{34}$). ఇతనికిని ఇతని తాతకును ఇట్లు ఒకటే పేరుండెను.

3. అతల్యా యూదుల రాజ్యము నపహరింపఁగా ఆమెను విరోధించి అహజ్యాకొడుకగు యోవాషును రాజునుగా చేయుటకు ప్రయత్నించిన నాయకుఁడు. యోవాషు చిన్నవాఁడై యుండఁగా నితఁడు రాజ్యపరిపాలన జేసెను. ఇతఁడు బ్రతికియున్నంతవఱకు యోవాషు మంచి వాఁడుగా నుండి తన రాజ్యమును దేవుని కిష్టమైన రీతిగా నేలినను అతని మరణానంతరము మతి భ్రష్టుఁడై దానిని విగ్రహారాధనతో నింపివేసెను. అతఁడు 130 యేండ్లవాఁడై చనిపోయెను. అతని కుమారుఁడు ప్రజలను గద్దింపఁగా యోవాషు అతనిని చంపించెను (II రాజు $11^{1}$-$12^{16}$ II దిన $22^{10}$-$24^{20}$).

4. యిర్మీయా కాలములో నున్న యాజకుఁడు (యిర్మీ $29^{26}$).

5. నెహెమ్యా కాలములో గోడలను కట్టిన వారిలో హసెయహు యనువాని తండ్రి (నెహె $3^{6}$).

6. యరా యనువాని మాఱుపేరు (I దిన $8^{36}$). మూలభాషలో పైనున్న పేరులకును దీనికిని గుణింతములో కొంచెము భేదము గలదు (యరా చూ.).

**యెహోయారీబు, యోయారీబు** (Jehoarib, Joiarib = యెహోవా వాదించును). దావీదు కాలమునం దితని సంతతివారిని యాజకుల తరగతులలో మొదటిదిగా నెంచిరి (I దిన $24^{7}$) గాని జెరుబ్బాబెలు కాలములో 17 వ సంతతిగా లెక్కించిరి (నెహె $12^{6}$). నెహెమ్యా దినములయందు వారు యెరూషలేములో నివసించిరి (I దిన $9^{10}$ నెహె $11^{10}$).

**యెహోయాహాజు** (Jehoahaz = యెహోవా పట్టుకొనెను).

1. యూదారాజైన యెహోరాము కనిష్ఠ పుత్త్రుఁడగు అహజ్యాయొక్క సంక్షిప్తనామము (II దిన $21^{17}$ = $22^{1}$).

2. ఇశ్రాయేలువారి రాజగు యెహూయొక్క కుమారుఁడు. అతని తరువాత 10 గోత్రముల వారి రాజాయెను. అతఁడు క్రీ॥ పూ॥ 821 సం॥ తన తండ్రితోఁ గలిసి యేల నారంభించి 17 సం॥ యేలెను (II రాజు $10^{35}$ $13^{1}$). యరొబాము చేయించిన దూడల నారాధించుట మానక పోయెను. దానికి ఫలితముగా సిరియనులు హజాయేలు బెన్హదదు అనువారి నాయకత్వము క్రింద అతనిమీఁద యుద్ధములుచేసి క్రమక్రమముగా దేశమంతటిని జయించి చివరకు 50 మంది రౌతులు 10 రథములు 10 వేల కాల్బలమునుతప్ప మిగత సైన్యమంతటిని హరిమార్చిరి. అతఁడు శ్రమలు గల్గినప్పుడు దేవునితట్టు తిరిగి ఆయనను వేడుకొనెను. ఆయన వారికొక విమోచకుని పంపెను. ఆ విమోచకుఁడు అతని మరణానంతరము దేశము నుద్ధరించిన అతని కుమారుఁడగు యెహోయాషును, అతని తరువాత యెహోయాహాజు మనుమఁడగు రెండవ యరొబామునై యుండెను. యెహోయాషు ఇశ్రాయేలీయుల దేశమును శత్రువులచేతినుండి విడిపించెను. యరొబాము ఇశ్రాయేలు దేశపుపూర్వ సరిహద్దులవరకు రాజ్యమును వ్యాపింపఁజేసెను. యెహోయాషుకాలమున అష్షూరురాజు సిరియనుల దేశముమీఁదను దండెత్తుటవలన ఇశ్రాయేలు వారికి అదృష్టవశాత్తున సహాయము కలిగెను. యెహోయాహాజు తరువాత యెహోయాషు రాజాయెను (II రాజు $13^{2-9,22-25}$).

3. యూదారాజగు యోషీయా చిన్న కుమారుఁడు. తండ్రి మరణమైన పిదప ప్రజలితనిని రాజుగాఁ జేసిరి. అప్పటి కతనికి 23 యేండ్ల ప్రాయము. ఇతఁడు మూఁడుమాసములైనను ఏలియేలక మునుపే దుష్టాంకురము లతని యందు పొడకట్టెను. ఫరోనెకో వానిని రాజ్య పదభ్రష్టునొనర్చి రిబ్లాకును తరువాత ఐగుప్తునకును ఖైదీగాఁ గొంచుపోయెను. యోషీయాను జయించినందున నెకో యూదారాజ్యమునకు రాజు నేర్పరచు నధికారము తనకున్నట్లు యెహోయాహాజు పెద్దన్నయగు యెహోయాకీమును రాజుగాఁజేసెను (II రాజు $23^{30-34}$ II దిన $36^{1-4}$). ఇతఁడు షల్లూము అనియు పిలువఁబడెను (I దిన $3^{15}$ యిర్మీ $22^{10-12}$). యెహెజ్కేలులో చెప్పఁబడిన మొదటి కొదమ సింహ మితఁడే (యెహె $19^{1-9}$). యోషీయా కుమారులలో వయస్సున మూఁడవవాఁడును రాజ్యమునకు వచ్చుటలో మొదటివాఁడైనను I దిన $3^{15}$ నందు

నాలుగవవాఁడుగా చెప్పఁబడుట కతని దుష్టత్వమే కారణముగ కనఁబడుచున్నది.

**యెహోరాము, యోరాము** (Jehoram, Joram = యెహోవా ఎత్తైనవాఁడు).

1. ఇశ్రాయేలు వారి రాజగు అహాబు కుమారుఁడు. ఇతఁడు తన అన్నయగు అహజ్యాకుఁ బిమ్మట క్రీ॥ పూ॥ 853 సం॥ లో సింహాసన మధిష్ఠించెను. తన తండ్రియగు అహాబు నిలిపిన బయలు విగ్రహమును తీసివేసినను యరొబాము చేయించిన దూడల నారాధించుటను మానక పోయెను. అహాబు మరణమునకుఁ దరువాత మోయాబురాజగు మేషా యెదురుతిరిగి కప్పము కట్టుట మానివేసెను. అతనిని లోపఱచుకొనుటకై యెహోరాము యూదారాజైన యెహోషాపాతు సహాయమునడిగినవాఁడై ఎదోమురాజుతోఁ గూడుకొని ఆ దేశముపై దాడి వెడల బయలుదేరి మృతసముద్రపు దక్షిణ ప్రాంతములను సమీపించు నప్పటికి త్రాగుటకును నీరు దొరకక సైన్య మంతయు నశింప సిద్ధమాయెను. సైన్యము వెంట వచ్చిన ఎలీషా అచ్చటచ్చట కందకములను త్రవ్వింపఁగా ఉదయమగునప్పటికి కాలోయగుండ నీరు వచ్చి కందకములను నీటితో నింపెను. ఈ నీరు వారి దాహములను దీర్చుటయేగాక ఉదయకాలపు సూర్యకాంతిచే నెర్రగా ప్రతి ఫలించినందున మోయాబీయులు అది తముపై దండెత్తి వచ్చిన వారు తమలోతాము కలహించఁగా ప్రవహించిన రక్తమని భావించి, దోఁచుకొన త్వరపడివచ్చి సంసిద్ధులై యున్న సైన్యములఁ గనుగొని పారిపోయిరి. ఇశ్రాయేలీయులు వారిని దరిమి దేశమును జయించిరిగాని దానిని పూర్ణముగా స్వాధీనపఱచుకొనఁజాలక పోయిరి (II రాజు 3¹⁻²⁷ రాతిశాసనములు 1 చూ॥). నయమానుయొక్క కుష్ఠరోగమును బాగుచేయవలసినదని సిరియా రాజు కోరిపంపిన ఇశ్రాయేలురాజు యెహోరామనుట కెట్టి సందియమునులేదు (II రాజు 5¹⁻²⁷). ఎలీషా సిరియా రాజుయొక్క సైన్య రహస్యముల నెఱిఁగించిన దితనికే. ఇతఁడు వారిని షోమ్రోనులో పట్టుకొని ఎలీషా సలహానను సరించి వారిని భోజనమజ్జనాదులచే సత్కరించి విడిచి పుచ్చెను (6⁸⁻²³). బెన్హదదు షోమ్రోనును ముట్టడించినందున కలిగిన కరవుబాధమువలన ఎలీషావలన అది వచ్చెనని అతనిపై కసి దీర్చుకొనఁదలంచెను (6²⁴⁻³¹). 6³² నందు ఎలీషా అతనిని నరహంతకుని కుమారుఁడని పిలిచెను. ఇతని అంతము విచారకరము. రామోత్గిలాదుపై యుద్ధము చేయుచుండఁగాఁ దగిలిన గాయములను మాన్పుకొనుటకు యెజ్రెయేలునకు వచ్చియున్న సమయమున ప్రవక్తచే ఇశ్రాయేలు వారిపై రాజుగా నభిషేకింపఁబడిన యెహూచేత చంపఁబడెను (9¹⁴⁻²⁶). యెహోరాముతో ఒమ్రియొక్క వంశమంతరించి యెహూవంశ మారంభమాయెను.

2. యూదారాజగు యెహోషాపాతు కుమారుఁడు. క్రీ॥ పూ॥ 854 నుండి యితఁడు తన తండ్రితోఁ గలిసి రాజ్యమేలెను. 849 సం॥ న ఇశ్రాయేలువారి రాజగు యెహోరాము ఏలుబడి 5 వ సం॥ మున సంపూర్ణాధికారము వహించెను (II రాజు 8¹⁶=1¹⁷, 3¹). సింహాసనముమీఁద తాను స్థిరుఁడయిన వెంటనే తన సహోదరులను ఇశ్రాయేలు అధిపతులలోఁ గొందఱిని చంపించెను (II దిన 21¹⁻⁴). అహాబు యెజెబెలుల కూతురగు అతల్యా ఇతని భార్య. ఈమె అతనిచే అసహ్యకరములగు అన్యాచారములఁ జేయించెను (II రాజు 8¹⁸ II దిన 21⁶⁻¹¹). అందువలన అతనిమీఁదకు దేవుఁడు కష్టములను శిక్షగా రప్పించెను. ఎదోమీయులు ఎదురు తిరిగిరి. అతఁడు వారిని జయించినను వారు కొద్ది కాలములో స్వతంత్రులైపోయిరి. లిబ్నా పట్టణమును తిరుగబడి స్వతంత్రత నొందెను (II రాజు 28²⁰⁻²⁵ II దిన 21⁸⁻¹⁰). ఫిలిష్తీయులును అరబ్బీయులును యూదామీఁద నెగఁబడి రాజనగరును దోఁచుకొని రాజుభార్యలను అతని బిడ్డలలో యెహోయాహాజు లేక అహజ్యా అను పేరుగల పసివానిని తప్ప మిగతవారి నందఱిని ఎత్తుకొని పోయిరి (II దిన 21¹⁶,¹⁷ 22¹).

అతని భ్రష్టత్వమునుబట్టియు దుష్టత్వమును బట్టియు అతనికి వేదనకరమగు రోగమును బాధయును కలుగునని ఏలీయా అతనికొక పత్రికను వ్రాసి యంపెను (II దిన 21¹²⁻¹⁵). త్వరలోనే యతనికి జిగట విరేచనములుపట్టి రెండు సంవత్సరములవఱకు వ్యాధి బలమగుచుండెను (21¹⁸,¹⁹).

ఈ సమయమునందే **అహజ్యా** అతనికి మారుగా నేలెను (II రాజు $9^{29}$ $8^{25,26}$). అతఁడు మరణమైనప్పుడు ప్రజలెవ్వరును దుఃఖించిన జాడలేదు. అతఁడేలినది 8 సం॥ లు మాత్రమే. అతఁడు క్రీ॥ పూ॥ **342** నందు చనిపోయెను. అతని కుమారుఁడగు అహజ్యా అతనికి బదులు రాజాయెను ($8^{24}$ II దిన $21^{12}$ $22^{1}$).

**3.** దావీదు సిరియావారిని జయించినపిమ్మట తన సంతోషమును కనపఱచుటకు హామాతు రాజు పంపిన రాజకుమారుఁడు (II సమూ $8^{10}$). I దిన $18^{10}$ లో ఇతనికి హదోరాము అను మాఱు పేరుగలదు.

**4.** ఒక లేవీయుఁడు. ఇతఁడు మోషే సంతతివాఁడు (I దిన $26^{25}$).

**5.** ప్రజలను బోధింపనై యెహోషాపాతు పంపిన బోధకులలో నొకఁడు (II దిన $17^{8}$).

**యెహోవా** దేవుడు II 1 చూ

**యెహోవా కోపము** కోపము 2 చూ॥

**యెహోవా దినము** అంత్యదినము చూ॥

**యెహోవా దూత** దేవదూత 2 చూ॥

**యెహోవా నిస్సీ** (Jehovah Nissi = యెహోవా నా ధ్వజము). అమాలేకీయులపై కలిగిన జయమునకు జ్ఞాపకార్థముగా మోషే కట్టించిన బలిపీఠము (నిర్గ $17^{15}$).

**యెహోవా మందిరపు ఉత్తర ద్వారము** యెరూషలేము B III 8 (1) చూ॥

**యెహోవా యీరే** (Jehovah-Jireh = యెహోవా చూచును). అబ్రాహాము ఇస్సాకును అర్పింపఁబోయిన స్థలమునకు పెట్టఁబడిన సార్థకనామము (ఆది $22^{14}$).

**యెహోవా యుద్ధముల గ్రంథము** (Book of the Wars of the Lord). అట్టి గ్రంథమొకటి యున్నట్లు సంఖ్యా $21^{14}$ వలన మాత్రమే తెలియుచున్నది. మోయాబు అమ్మోనీయుల సరిహద్దును తీర్మానించుటకై ఈ గ్రంథమునుండి యొక సంగతినెత్తి అచ్చట వ్రాసిరి. ఇశ్రాయేలీయులు చేసిన యుద్ధములనుగూర్చి యందు వ్రాయఁబడినట్లు, గ్రంథపు పేరువలన స్పష్టమగుచున్నది. ఇశ్రాయేలీయుల యుద్ధములు యెహోవా యుద్ధములుగా నెంచఁబడినవి (I సమూ $18^{17}$ $25^{28}$). సంఖ్యా $21^{17-19}$ లో నున్న వాక్యము లీ గ్రంథము నుండియే యెత్తిన కావ్యమని కొందఱి యభిమతము గాని, మఱి కొందఱు యాషారు గ్రంథము అనఁబడినదే యిది యని అభిప్రాయపడుచున్నారు (యాషారు గ్రంథము చూ॥). ఇది వేఱుగ్రంథ మనుకొనుటయే మేలని తోచుచున్నది. అది ప్రస్తుతమున కానరాదు.

**యెహోవావాక్కు** దేవోక్తి చూ॥

**యెహోవా సమాధానకర్త** (Jehovah-Shalom = యెహోవా సమాధానము). గిద్యోను తనకు దేవదూత ప్రత్యక్షమైన పిదప కట్టిన బలిపీఠముయొక్క పేరు (న్యాయా $6^{24}$). న్యాయాధిపతుల గ్రంథము వ్రాయబడునంతవఱకు ఆ బలిపీఠము నిలిచియుండెను.

**యెహోవా సేవకుడు** సేవకుడు చూ॥

**యెహోషబెతు, యెహోషెబ** (Jehoshabeath, Jehosheba = యెహోవా ప్రమాణము). యూదారాజగు యెహోరాము కుమార్తె. ప్రధాన యాజకుఁడగు యెహోయాదా భార్య (II దిన $22^{11}$). అతల్యా తన కుమారుడగు అహజ్యా బిడ్డలనందఱిని హత్యచేసి చంపినప్పుడామె అతని పుత్రుఁడగు యోవాషును దాచిపెట్టి వానిని రక్షించెను. అందువలన రాజవంశము బొత్తుగా నిర్మూలము కాలేదు (II రాజు $11^{2}$).

**యెహోషాపాతు** (Jehoshaphat Josaphat = యెహోవా న్యాయము తీర్చెను).

1. దావీదు సొలొమోనుల యేలుబడియందు రాజ్యపు దస్తావేజుల మీఁదనున్న మంత్రి. ఇతని తండ్రి పేరు అహీలూదు (II సమూ $8^{16}$ $20^{24}$ I రాజు $4^{3}$).

**2.** ఓబేదెదోము ఇంటినుంచి మందసమును దావీదుపురమునకుఁ దెచ్చునపుడు దానియెదుట బూరల నూదుటకు నియమింపఁబడిన యాజకులలో నొకఁడు (I దిన $15^{24}$).

**3.** ఇశ్శాఖారు గోత్రమునుండి సొలొమోనుకు ఆహారము సప్లయిచేయుటకై నియమింపఁబడినవాఁడు. ఇతఁడు పరూయహు అనువాని కుమారుఁడు (I రాజు $4^{17}$).

**4.** యూదా రాజైన ఆసా కుమారుఁడు. తండ్రి చివరికాలమున అనఁగా ఆసా యేలుబడిలో 37 వ సం॥ నుండియు ఒమ్రీ యేలుబడిలో 11 వ సం॥ నుండియు (I రాజు $16^{28,29}$ LXX) తండ్రికి రాజ్యపరిపాలనయందు 5 సం॥ ల వఱకు సహాయుఁడై అతని మరణాంతమున క్రీ॥ పూ॥ 871 సం॥ నుండి స్వతంత్రముగా నేల నారంభించెను (I రాజు $22^{41,42}$). సింహాసనాసీనుఁడైనప్పుడు అతఁడు 35 యేండ్లవాఁడు షిల్హీ కుమార్తెయగు అజూబా ఇతని తల్లి (I రాజు $22^{41,42}$ II దిన $17^{1}$). ప్రజలింకను ఉన్నత స్థలములలో బలుల నర్పించుచుండినను ఇతఁడు మాత్రము మంచివాఁడై యుండెను. యెహోవానే యాశ్రయించి విగ్రహములను విసర్జించెను (I రాజు $22^{43}$ II దిన $17^{3}$). అందువలన దేవుఁడితనిని యాశీర్వదించెను. రాజ్యమేల నారంభించిన మూఁడవ సంవత్సరమునందే యూదాయందు పట్టణములలో దేవుని ధర్మశాస్త్రమును నేర్పుటకై అధికారులను లేవీయులను ఇతఁడు పంపుట కారంభించెను ($17^{7-9}$). యెహోవా భయము చుట్టుపట్లనున్న రాజ్యములకు కలిగెను. ఫిలిష్తీయులును అరబీయులును కప్పము కట్టిరి ($17^{10,11}$). తన దేశమందు ప్రాకారములున్న ప్రతి పట్టణమందును సైన్యముల నుంచెను. రెహబాము కాలమునుండి యూదావారికిని ఇశ్రాయేలు వారికిని ఎడతెగక జరుగుచుండిన కలహములను మాన్పెను. అతఁడిశ్రాయేలు వారితో సంధిచేసికొని వారి రాజుకుమార్తెయగు అతల్యాను తన కుమారునికిచ్చి పెండ్లిచేసెను (I రాజు $22^{44}$ II రాజు $8^{18,26}$). యెహోవా తనకు సహాయము చేయుట నతఁడు గ్రహించుకొని ఉన్నత స్థలములను అషేరాలను తీసివేయుటకు ధైర్యము తెచ్చుకొనెను (II దిన $17^{5,6}$). పురుషగాములలో మిగిలినవారిని తన దేశమునందుండి నియ్యక తరిమివేసెను (I రాజు $22^{46}$).

క్రీ॥ పూ॥ 853 సం॥ నందు రాజైన అహాబును దర్శింపఁబోఁగా నతఁడు రామోత్గిలాదును సిరియనుల చేతినుండి మరల పట్టుకొనుటకై సైన్యముతో తనకు సహాయపడునట్లు యెహోషాపాతును పురిగొల్పెను. అహాబుయొక్క రాజవస్త్రములను తాను ధరించి యుద్ధముచేయ వెళ్లెను. అహాబు మరణకరమైన గాయము నొందినవెనుక యెహోషాపాతు ప్రాణముతో తప్పించుకొని పోవలఁబడుట ప్రయాసకరమయ్యెను (I రాజు $22^{1-38}$ II దిన $18^{1-34}$). తన రాజ్యమునకుఁ దిరిగివచ్చినపిదప హనానీ కుమారుఁడగు యెహూవలన అహాబువంటి వానితో స్నేహముచేసినందుకు గద్దింపఁబడెను (II దిన $19^{1,2}$). తరువాత అతఁడిదివఱకే మొదలుపెట్టియుండిన దిద్దుబాటును కొనసాగించి యెహోవా యారాధనను దేశమున నెలకొల్పి ప్రాకారములుగల పట్టణములలో న్యాయాధిపతులను నియమించి లేవీయులు యాజకులు స్థితిమంతులగు ఇతరులుగల యొక ప్రధాన న్యాయసభను యెరూషలేమునందు స్థాపించెను (II దిన $19^{4-11}$). ఈ దిద్దుబాటు ముగియు నప్పటికి అమ్మోనీయులు మోయాబీయులు ఎదోమీయులేకమై ఆగ్నేయముగా దేశముపై దండెత్తివచ్చి మృతసముద్రమునకు పడమరనున్న ఏన్గెదీ దగ్గర దండువిడిసిరి. సొలొమోను మనవిచేసిన రీతిగా యెహోషాపాతు విమోచనకొఱకు వేడుకొనెను (II దిన $6^{24-30}=20^{9}$). యహజీయేలు ఆ విమోచన కలుగునని ప్రవచించినమీఁదట యెహోషాపాతు దేవునికి కృతజ్ఞతాస్తుతులను చెల్లించుచు శత్రువులను జయించుటకు బయలువెళ్లి, ఆయనకు స్తోత్రగీతములు పాడుటకై సైన్యమునకు ముందుగా సంగీతపాటకుల నుంచెను. పోరాటమేమియు లేకనే జయము సులభముగా లభించెను. శత్రుసైన్యమున కలతలుపడి అమ్మోనీయులును మోయాబీయులును కలిసి ఎదోమీయులను నాశముచేసిరి. తరువాత వారిలో వారే పోట్లాడుకొని చీలిపోయిరి (II దిన $20^{1-30}$). ఇది జరిగినపిదప దేశము నెమ్మదిగా నుండుకాలమున యెహోషాపాతు ఎసోన్గెబరునందు ఓడలను కట్టించుకొనుచు వాణిజ్యము చేయుటలో తనతో కలియవలసినదని ఇశ్రాయేలువారి రాజగు అహజ్యాతో రాయబారము నడిపెను. అహజ్యాతో కలిసినందున ప్రవక్తయగు ఎలీయెజెరు యెహోషాపాతును గద్దించెను. ఆ

రోడలు బ్రద్దలయ్యెను. అహజ్యా మరియొక సారి ఆ ప్రయత్నమునే కలిసి చేయఁదలంచెను గాని యెహోషాపాతు దానికి సమ్మతించక పోయెను (II దిన $20^{30-37}$ I రాజు $22^{48,49}$). దాదాపు క్రీ॥ ము॥ 852 సం॥ న ఇశ్రాయేలు వారి రాజైన యెహోరాము మోయాబీయులను తిరిగి తన స్వాధీనమందుంచుకొనఁ గోరి ఇతని సహాయమును గోరెను. యెహోరాము దిద్దుబాటులు చేయుచు భక్తి కనఁబఱచినందున యెహోషాపాతు అతనికి సహాయము చేయ నిష్టపడెను (II రాజు $3^{2}$). ఈ సంధివలన చాల మట్టుకు జయమే సిద్ధించెను ($3^{4-27}$). 60 సం॥ల వయస్కుఁడై క్రీ॥ ము॥ 850 సం॥ న మరణమై దావీదుపురమున పాతిపెట్టఁబడెను. అతని కుమారుఁడగు యెహోరాము సింహాసనమెక్కెను (I రాజు $22^{50}$).

5. నింషీ కుమారుఁడు. ఇశ్రాయేలు రాజగు యెహూయొక్క తండ్రి (II రాజు $9^{2,14}$).

**యెహోషాపాతు లోయ** యెరూషలేము A I 1 చూ॥

**యెహోషువ, యేషూవ, హోషేయ**(Joshua, Jeshua=యెహోవా రక్షణ).

1. ఎఫ్రాయిమీయుఁడగు నూను అనువాని కుమారుఁడు (సంఖ్యా $13^{8,16}$). $13^{16}$ నందితనికి హోషేయ యను పేరున్నది. రెఫీదీములో ఇశ్రాయేలీయులు అమాలేకీయులతో యుద్ధము జేసినప్పు డితఁడు ఇశ్రాయేలీయుల సేనాధిపతిగా నుండి మోషే ప్రార్థన సహాయమువలన విజయము నొందెను (నిర్గ $17^{8-16}$). మోషే పరిచారకుఁడై యుండి బంగారు దూడను ప్రజలు చేసికొన్నపుడు సీనాయి పర్వతముమీఁద అతనితో నుండెను. పాలెమునందలి విగ్రహారాధనోత్సవ సంభ్రమ ధ్వని యుద్ధధ్వనియని పొరబడి మోషేకు తెలిపెను ($24^{13}$ $32^{17,18}$). మొదటి ప్రత్యక్షపు గుడారము నితఁడు భద్రపఱచెను ($33^{11}$). కనాను దేశమును జూచి దానిని జయించువిధమును తెలిసికొనుటకు పంపఁబడిన వేగులవాండ్రలో నితఁడు ఎఫ్రాయిము గోత్ర ప్రతినిధియై యుండెను (సంఖ్యా $13^{8}$). మొదట కనాను దేశమునఁ బ్రవేశించి దానిని స్వతంత్రించుకొనుటకు ప్రజలను ప్రేరేపించిన యిద్దరిలో నితఁడొకఁడు ($13^{18}$-$14^{9}$). అట్టి ప్రేరేపణ జేసినందులకు ప్రజలతని రాళ్లతోఁ గొట్ట యత్నించిరి గాని అతఁడు రవంతలో తన ప్రాణమును దక్కించుకొనెను ($14^{9}$). తమ కన్నకాలములలోఁ దోడ్పడు మహా బలుండగు యెహోవా యెడల నవిశ్వాసము కనపర్చిన పదిమంది పిఱికిపందలు తెగులుచే హతులైనప్పుడు విశ్వాస పూరితులగు కాలేబు యెహోషువలు ఆ యాపదను దొలఁగించుకొని కాపాడఁబడిరి ($14^{30-38}$). నలువది సంవత్సరము లరణ్యసంచారానంతరము దైవాజ్ఞానుసారముగ షిత్తీములో మోషే అతనిని ప్రధానయాజకుని యెదుటను సర్వసమాజము నెదుటను నిలువఁబెట్టి తదనంతరము ఇశ్రాయేలీయులకు నాయకునిగ అతనిని బహిరంగముగా నియమించెను ($27^{18,23}$ ద్వితీ $1^{38}$). తానింక కొద్దికాలములో మరణమగుననగా మోషే అతఁడా యుద్యోగము యెహోవా నుండి పొందునట్లు గుడారమునకుఁ దీసికొనివెళ్లెను ($31^{14,23}$). మోషే మరణమైనతరువాత యెహోషువ ప్రజలు యొర్దానునదదాటు నుపాయముల నేర్పాటు జేసెను. అందులకు వారు మూఁడు దినములు తమ భోజనసామగ్రి సిద్ధపఱచుకొనిరి (యెహో $1^{10,11}$). రెండున్నర గోత్రికులు ఆయుధపాణులై తమ సహోదరులకు తోడ్పడవలసినదను దేవునాజ్ఞను అతఁడు వారికి జ్ఞాపకము చేసెను ($1^{12-18}$). యెరికో పట్టణమును చూచి వచ్చుటకు వేగులవారినంపెను ($2^{1}$). దండు పాలెము నచ్చటనుండి యొర్దానుకుఁ జేర్చి సాగి పోవలసిన క్రమమును విస్పష్టముగా బోధించెను ($3^{1-6}$). కనానుదేశమును జయించుటకు యుద్ధక్రమపద్ధతి నేర్పఱచుటలో నతఁడు తన సేనా బుద్ధి కౌశల్యమును చూపెను. దండుపాలెమును అనుకూల స్థలమునందుంచెను. పట్టణములను ముట్టడించుటకు దండును సాగిపోనిచ్చెను. మహా దండయాత్రలను జయప్రదముగ సాగనిచ్చెను. గిబియోనీయులతో సంధి చేసికొనుటలోను యెబూసీయులకోటలో దండునుంచక పోవుటలోను పొరబడెను. ఈ రెండు పొరబాటుల వలన యూదాగోత్ర ముత్తర గోత్రములనుండి యొకమెట్టు తగ్గిపోయెను. అతఁడు ప్రజలను

ఏబాలు గెరిజీము పర్వతములమీఁద సమకూర్చి ఆశీర్వచనములను శాపవచనములను వినునట్లుజేసి దేవునాజ్ఞను శిరసావహించెను (8[30-35]). ప్రధాన యాజకుని సహాయముతో గిల్గాలులో నుండఁగనే జయింపఁబడిన దేశమును విభాగించి గోత్రములకు పంచిపెట్టెను (14[6] 17). గుడారము షిలోహుకు మార్చిన పిమ్మట ఆశ్రయపట్టణములను లేవీయులపట్టణములను నియమించెను (18-21). ఎఫ్రాయిమునందలి **తిమ్నత్సెరహు**ను తన కొఱకడిగి పుచ్చుకొనెను (19[50]) అతఁడు వృద్ధుడైనపిమ్మట షెకెములో ప్రజలనందఱిని సమకూర్చెను. యెహోవాదేవుని విసర్జింపకూడదని వారికొక గంభీరోపన్యాసమును జేసెను (24[1-28]). నూటపదేండ్ల వయస్సుగలవాఁడై చనిపోయి తానేర్పఱచుకొనిన తిమ్నత్సెరహులో పాతిపెట్టఁబడెను (24[29,30]).

2. దావీదుకాలమందున్న యాజకులవంతులలో తొమ్మిదవ వంతువాఁడు (I దిన 24[11] ఎజ్రా 2[36]).

3. హిజ్కియా కాలమందుండిన యథార్థవంతుఁడగు నొక లేవీయుఁడు (II దిన 31[15]).

4. క్రీస్తు పూర్వీకులలో నొకఁడు (లూ 3[29]).

5. యెహోజాదాకు కుమారుఁడు. యూదులు చెఱనుండి తిరిగివచ్చినప్పుడు ప్రధాన యాజకుఁడై యుండెను. సమరయుల కుయుక్తులకు లోనుగాక పట్టణమును, దేవాలయమును దానిలోని యారాధననుగూర్చిన పునర్నిర్మాణమునందు శక్తికొలఁది పాటుపడెను (ఎజ్రా 4[3] 5[2]) ఇతనిపేరు హగ్గ 1[1,12] 2[2] జెక 3, 6[11 15] 5[2] లోని ప్రవచనములయందు గలదు.

6. బాబెలు చెఱనుండి తిరిగివచ్చినవారిలోఁ గొందఱికీ నామము గలదు (ఎజ్రా 2[6,40] 8[33] నెహె 3[19] 7[11,43] 8[7] 9[4,5] 10[9] 12[8,24]).

7. చెఱనుండి తిరిగివచ్చినతరువాత కట్టఁబడిన పట్టణము (నెహె 11[26]). అది ప్రస్తుతపు యేషూవ కావచ్చును. యెహోషువ చరిత్రయందువచ్చు బేత్‌హోరోనుకును శోకోకును మధ్యనున్న ప్రదేశముయొక్క జ్ఞాపకార్థక నామమైయుండును (యెహో 10[11-14]). అది ఎక్రోనుకు తూర్పున 6 మైళ్లదూరమునం దున్నది.

H.

**యెహోషువ గ్రంథము** (The Book of Joshua). హెబ్రీ లేఖనములయందిది ద్వితీయోపదేశకాండమునకు తర్వాత నున్నది. మోషే మరణమును తరువాతి చరిత్రమిందుండుటచే దీనితరువాతి గ్రంథములకంటె ద్వితీయోపదేశ కాండముతో నెక్కువ సంబంధమున్నది. ఈ గ్రంథమునందు షుమారిరువదియాఱు సంవత్సరముల చరితముగలదు.

1. గ్రంథకర్త. ఇది యెహోషువ గ్రంథమని పేర్కొనఁబడుచున్నను దీని వ్రాసినవారెవరైనది నిశ్చయింపవీలులేదు. అయిన నీ గ్రంథ చరిత్రయం దితఁడే ధీరోదాత్తుఁడుగ నుండుటచే ఈ పేరు మిగుల తగియున్నది. మోషే యుద్యోగమునందు ప్రవేశించిన యెహోషువ తన జనులచరితమును వ్రాయుటలోను అతని ననుసరించియుండును. పాత నిబంధనలోని రెండవ గొప్పభాగ మీ గ్రంథముతో నారంభమగుచున్నది.

2. ఉద్దేశము, ముంగుర్తులు. దేవుఁడు తన ప్రజలను అరణ్యమునందు సురక్షితముగ నడిపించి వారి పితరులకు వాగ్దత్తముచేసిన దేశమునకు వారిని తోడ్కొనివచ్చి అందలి శత్రువులను బొరఁదోలి వారికాదేశమును స్వాధీనముగా నిచ్చుటను గుఱించియు, దేవుఁడు కరుణాహృదయుఁడయ్యును తన్ను విరోధించిన జనాంగములను నాశము చేయుఁడని యాజ్ఞాపించుటవలన న్యాయస్థుఁడని తెలుపుట కీయది వ్రాయఁబడెను. తన సంకల్పమాత్రమున వారిని తెగులుచేఁ గాని భూకంపము వలనఁగాని అగ్నివలనఁగాని నాశమొనర్పవచ్చును గాని ఇశ్రాయేలీయులచే నీ దండనకార్యము జరిగించుటవలన ఆ కాలమునందు ఇశ్రాయేలీయుల దేవునిశక్తి బహు స్పష్టముగ కనఁబడుటకును, ఇశ్రాయేలీయులకే హెచ్చరికగాను జాగ్రత్తసూచకముగా నుండవలెనని నేర్పుటకై యుండవచ్చును.

ఈ గ్రంథమునందు, యెహోషువ ఆశ్రయపురములు క్రీస్తునకును; కనాను పరలోకమునకును;

యొర్దానునది దాటుట మరణనదిని దాటుటకును ముంగుర్తులుగ నున్నవి.

3. ముఖ్యభాగములు.

I. దేశమును జయించుట 1-12 అధ్యా. ఇందు, సేనలను సిద్ధపర్చుట (1, 2), సేనలు సాగిపోవుట (3-5), యుద్ధములు (6-11) అనగా యెరికో (6) హాయి (7, 8) బేత్‌హోరోను (9, 10), మేరోము (11) విశేషజయములు (12) అను సంగతులుగలవు.

II. జనులు స్థావరము లేర్పఱచుకొనుట 13-21 అధ్యా. ఇందు, మొదట రెండున్నర గోత్రములవారు (15-19) స్థావరము లేర్పఱచుకొనిరి. తరువాత ఆశ్రయపురములను, లేవీయుల పట్టణములను నియమించుట (20, 21) అను విషయములున్నవి.

III. యెహోషువ కడవరిమాటలు 22-24 అధ్యా. రెండున్నరగోత్రికులకును కడమవారికిని నడచిన సంభాషణలు (22), కడపటి ప్రసంగములు ($23^{1}$-$24^{15}$), చివరిసంగతులు ($24^{16-33}$) ఇందున్నవి. (యెహోషువ, గ్రంథపంచకము, షడ్గ్రంథములు చూ॥).
H.

**యెహోషాషెబ** యెహోషెబతు చూ॥

**యెహోహానాను** (Jehohanan, Jehonan = యెహోవా కనికరముగలవాడు. ఇది యోహాను అను పదముయొక్క అసలు రూపము).

1. దావీదుకాలమున గుడారపు ద్వారపాలకులలో నొకడు (I దిన $26^{3}$).

2. ప్రధానయాజకుడగు యెహోయాదా అతల్యాను సింహాసనాపద భ్రష్టురాలినిగా చేయనై సహాయపడిన వారిలో ఇష్మాయేలను వాని తండ్రి (II దిన $23^{1}$).

3. రాజగు యెహోషాపాతు నియమించిన అధిపతులలో నొకడు (II దిన $17^{15}$ $23^{1}$).

4. అన్యస్త్రీలను వివాహముచేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో నొకడు (ఎజ్రా $10^{28}$).

5. అమ్మోనీయుడగు టోబీయా కుమారుడు (నెహె $6^{18}$). తెలుగులో యోహానాను అని పొరపాటున వ్రాసిరి.

6. ప్రధానయాజకుడగు యోయాకీము కాలమందలి యాజకుడు (నెహె $12^{13}$).

7. నెహెమ్యాకాలపు యాజకులలో నొకడు (నెహె $12^{42}$).

**యెహ్దాయి** (Jahdai = ఆయన నడిపించును?). కాలేబు సంతతివారిలో నొకడు (I దిన $2^{47}$).

## యే

**యేషూవ** యెహోషువ చూ॥

**యేషెరు** (Jesher = యథార్థత). కాలేబు కొడుకులలో నొకడు (I దిన $2^{18}$).

**యేసుక్రీస్తు** (Jesus Christ = అభిషిక్తుడగు రక్షకుడు).

I. చరిత్ర.

1. క్రీస్తుచరిత్ర కాధారములు. నాలుగు సువార్తలే దీని కాధారములు. వాటియందు వ్రాయబడక పోయినను, ఆయన చెప్పిన బోధలు కొన్ని అక్కడక్కడ వ్రాయబడి యున్నవి. వాటికి అగ్రఫా (*Agrapha*) యని పేరు అనగా వ్రాయబడనిమాటలని యర్థము. కా[illegible] $20^{35}$ లో అట్టివాక్య మొకటి గలదు. అట్టి వాక్యము లీ మధ్య ఐగుప్తుదేశమునందు ఒక పట్టణ శిథిలములలో కనుగొనిరి. వాటిని (*Oxyrrhincus Tablets Logia*) అని యింగ్లీషునందు చెప్పెదరు. వాటినిగూర్చి ఏకాభిప్రాయము లేకపోయినను, క్రీస్తు అంతటనున్నవాడై, కష్టములన్నిటిలో తన ప్రజలకు సహాయుడై యున్నాడనునది దాని భావమని సాధారణముగా నను కొందురు. ఇట్టి వాక్యములవలన మనము క్రీస్తు చరిత్రలో క్రొత్త సంగతులు తెలిసికొనగలమని చెప్ప వీలుగాదు. అప్రమాణిక సువార్తలును కొన్నిగలవు గాని అవి ఆయనచరిత్ర కాధారము లెంతమాత్రమును గావు. నాలుగు సువార్తలు మాత్రమే ఆయననుగూర్చి తెలిసికొనుటకు మనకుగల యొక్కటే ఆధారమై యున్నవి. (మత్తయి మార్కు లూకా యోహాను సువార్తలను చూ॥).

**2. క్రీస్తు చరిత్రకాలము.** క్రీస్తు తన పని నారంభించిన కాలమును తెలిసికొనుటకు లూకా $3^{1}$ ముఖ్యాధారమై యున్నది. అది తిబెరికైసరు ఏలుబడిలో పదునైదవ సంవత్సరము. అతఁడు క్రీ॥ శ॥ 14 వ సం॥ నందు ఏకఛత్రాధిపతిగ నేల నారంభించెను. గాన క్రీస్తు తన పనిని క్రీ॥ శ॥ 29 వ సం॥ మందు ఆరంభించెనని కొందఱనుకొనుచున్నారు. తిబెరి స్వయముగా నేల నారంభింపక పూర్వము ఔగూస్తుతోఁ గలసి క్రీ॥ శ॥ 11 సం॥ చివరనో లేక 12 సంవత్సరారంభమునందో యేలెను. నవీన శాస్త్రజ్ఞులు సాధారణముగా నీ కాలమునుండి లెక్కించి, ఆయన క్రీ॥ శ॥ 26 వ సంవత్సరమున తన పని నారంభించెనని అభిప్రాయపడుచున్నారు. యోహా $2^{20}$ సం లో నున్న సూచన కిది చక్కగా సరిపడును. హేరోదు క్రీ॥ ము॥ 20 సం॥ నందు ఆలయమును గట్టింప మొదలు పెట్టెను. దానిని 46 సంవత్సరములవఱకుఁ గట్టుచున్నట్లు యోహా $2^{20}$ వలనఁ దెలియుచున్నది. అట్లయినయెడల అది క్రీ॥ శ॥ 26 సం॥ మగును. క్రీస్తు తన పని నారంభించినప్పుడు దాదాపు 30 యేండ్ల యీడుగలవాఁడు (లూ $3^{23}$). సరిగా 30 యని చెప్పుట లేదు. ఈ సూచనలన్నిఁటిని బట్టియు, మహా హేరోదు చావకమునుపు క్రీస్తు పుట్టెనని మత్తయి వ్రాసిన దానిని బట్టియు (మత్త 2), ఆయన క్రీ॥ ము॥ 6 సం॥ న జన్మించెనని కాలనిరూపణము చేసెదరు.

క్రీస్తు పనిజేసిన కాలమును నిర్ణయించుటకు ఆయన చరిత్రమందు చెప్పబడు పండుగలు మాత్రమే మనకాధారములు. మత్తయి, మార్కు, లూకా సువార్తలయందు ఆయన సిలువవేయఁబడినప్పటిది గాక ఇతర పస్కా పండుగలను గూర్చిన సూచన లెవ్వియును గానరావు (మ $26^{1}$=మా $14^{1}$- లూ $22^{1}$). అందువలన ఆయన ఒక సంవత్సరము పాటు పనిజేసియుండునని ఆదికాలపు వేదశాస్త్రులు కొందఱు వ్రాసిరి. లూ $4^{19}$ నందున్న 'హితవత్సరము' అదే యని వారి యభిప్రాయమై యుండెను. అయితే యోహాను సువార్తయందు ఆయన పనిఁజేసిన కాలములో 3 పస్కా పండుగ లుదాహరింపఁబడినట్లు స్పష్టమగు సూచనలున్నవి (యోహా $2^{13}$ $6^{4}$ $13^{1}$). ఆయన యెరూషలేమునకు వెళ్లకపూర్వమే పని నారంభించెను కావున ఆయన దాదాపు 2½ సం॥ లు పనిఁ జేసెననుకొనుచున్నారు. యోహాను ఒక పస్కాను గుఱించి వ్రాసియుండక పోవచ్చును (క్రింద III 10 చూ॥). దీనిని కలుపుకొనినయెడల 3½ సం॥ ములగుచున్నది. ఆయన క్రీ॥ శ॥ 26 సం॥ న పని నారంభించినయెడల 27, 28 సం॥ ములలోను, 29 సం॥ లో పస్కా (ఏప్రిల్ మాసము) వఱకు పనిఁజేసి, అప్పుడు సిలువవేయఁబడెనని ఈ లెక్క ననుసరించువారి యభిప్రాయమై యున్నది. అట్లుగాక ఆయన 29 సం॥ నందు పని నారంభించియుండిన పక్షమున ఆయన పనికాలము రెండు లేక మూఁడు సం॥ లు వెనుక యని తెలిసికొనవలెను.

**3. క్రీస్తుకాలమునందు దేశస్థితి:**—క్రీస్తు జన్మకాలమున మహా హేరోదు పలెస్తీనుకు రాజై యుండెను (మ 2). అతని తదనంతర మాతని కుమారుఁడగు అర్కెలాయు క్రీ॥ శ॥ 6 సం॥ వఱకు పరిపాలించెను గాని అప్పటినుండి రోమీయులు దాని నేలుటకై గవర్నరుల నియమించిరి. వారి రాజధాని కైసరయ పట్టణము. క్రీస్తును విచారణ చేసి మరణమున కప్పగించిన పొంతియు పిలాతు అట్టి గవర్నరులలో నొకఁడు. అతని కాలమునందు గలిలయ పెరీయ అను ప్రదేశములు మహా హేరోదు కుమారుఁడగు హేరోదు అంతిపా యనువానిచే పాలింపఁబడుచుండెను. క్రీస్తు చరిత్రలో నచ్చు హేరోదితఁడే (మా $6^{14-29}$ లూ $13^{31}$ $23^{8}$).

యూదులలోని పరిసయ్యుల శాఖవారు దేశాభిమాన పూరితులై యుండిరి. వారిలోఁ గొందఱు విదేశీయులు తమ్ము నేలుట కెంతమాత్రము సహించక ప్రభుత్వమువారి నెదిరించిరి. వీరికి ప్రతిపక్షులుగ సద్దూకయ్యుల తెగయొకటి గలదు. వీరు పరిపాలకులగు రోమీయులపక్షము వహించినవారు. ఎస్సెనీయులను మఱియొక తెగవారు లోకమును త్యజించిన విరాగులై యుండిరి. యూద మతాధికారులగు ప్రధానయాజకులు చాలమట్టునకు లౌకికులుగా నుండిరి. వీరికిని యూదుల మహాసభికులగు సన్హెడ్రిన్ సభవారికిని పరిపాలకులగు రోమీయులు విశేషాధికారము నిచ్చుచువచ్చిరి. ఇట్టి కాలమున

క్రీస్తు పుట్టి జీవించినను, ఈ శాఖలలో దేని యందును జిక్కుకొనక తన రాజ్యము పరలోక సంబంధమైనదని బోధించెను. గాని ఆ కాలమునం దున్న వా రాయనకుఁ జేసినదానిని గ్రహించుకొనుటకు మనమా కాల స్థితిగతులను తెలిసికొనుట మిగుల యవసరమై యున్నది. దేశమం దున్న గొప్పవారిట్టివారై యుండఁగా, జన సామాన్యమునందు జెకర్యా, ఎలీశబెతు, సుమెయోను అన్న యనునట్టి దీనులును గలరని లూకా 1, 2 అధ్యాయములలో మనము చూడవచ్చును. వారు భక్తిపరులైయుండి క్రీస్తురాకడకొఱకు కనిపెట్టుచుండిరి.

II. క్రీస్తు పని నారంభింపక పూర్వము జరిగిన సంగతులు:—

1. క్రీస్తు పుట్టుక, బాల్యము:—ఆయన ఆది నుండి యున్నను (యోహా $1^{1-5}$) మానవుఁడై ఈ లోకమున అవతరించుటయే ఆయన పుట్టుక యనఁబడుచున్నది. మత్తయి లూకా యనువారు దీనిని గుఱించి వ్రాసిరి (మ 2 లూ 1,2,$3^{23-38}$). ఆయన పరిశుద్ధాత్మశక్తిచే కన్యయైన మరియకు పుట్టెనని దీనిలో తేటగా నున్నది (మ $1^{20,21}$ లూ $1^{35}$). మహానుభావుఁడగు ఆయన పాపరహితుఁడై, ఇంత దివ్యమగు రీతిగా మానవులలో నొకఁడాయెను. పాపమందు తప్ప మన యనుభవము లన్నింటిలో పాలివాఁడాయెను (హెబ్రీ $4^{15}$). ఆయన పుట్టుకనుగూర్చి దూత మరియకును (లూ $1^{26-38}$), యోసేపునకును (మ $1^{18-25}$) తెలిపి, ఆయనకు రక్షకుఁడను అర్థమిచ్చు యేసు అను పేరు పెట్టవలెనని వారిద్దరికిని జెప్పెను. బేత్లెహేమునందలి సత్రమునొద్ద వా రుండఁగా ఆయన పుట్టినందున, ఆయనను పశువుల తొట్టిలో పరుండఁబెట్టవలసి వచ్చెను. జన్మించినప్పు డంత హీనదశయం దాయన ఉండినను దేవదూత లాయన జన్మమునుగూర్చిన వార్తను ప్రకటింపఁగా వా రాయన నారాధించిన వారిలో ప్రథములైరి (లూ $2^{1-20}$). యూదుల యాచార ప్రకార మాయనకు ఎనిమిదవ దినమున సున్నతి చేసిరి ($2^{21}$). నలుబదవ దినమునం దాయనను ధర్మశాస్త్ర నియమము చొప్పున ఆలయమునం దర్పించినప్పుడు, సుమెయోను అన్న యను భక్తపరులు ఆయనను గుర్తించినవారై దేవుని స్తోత్రించిరి ($2^{22-39}$). తదనంతరము జ్ఞానులు తూర్పు నుండి వచ్చి ఆయన నారాధించిరి. వారి ద్వారా మహా హేరోదాయన జన్మమునుగుఱించి తెలిసికొని ఆయనను చంప వెదకఁగా యోసేపు దూతచే నా వార్తవిని, ఆయనను తల్లితోపాటు ఐగుప్తు దేశమునకుఁ దోడుకొనిపోయెను. హేరోదు మరణమైన పిదప వారు తిరిగివచ్చినను బేత్లెహేమునకు వెళ్లక, తమ స్వగ్రామమగు నజరేతునకు ఆయనను గొనిపోయిరి (మ $2^{23}$).

ఆయన జన్మమునకు సంబంధించిన వంశావళులు రెండుగలవు (మ $1^{1-17}$ లూ $3^{23-38}$). ఈయన దావీదు కుమారుఁడని నిరూపించుటకు ఇవి యూదులకు మిగుల యవసరము. మత్తయి యూదులకొఱకు వ్రాసి, క్రీస్తు అబ్రాహాము వంశములోనుండి యుద్భవించెనని చూపెను. లూకా అన్యులకొఱకు వ్రాసి, ఆదాము అను ఆదిపురుషునినుండి యుద్భవించి దేవునికుమారుఁడని చూపుటకు వ్రాసెను. ఈ రెండు జాబితాలలోని పేరులలో అనేక భేదములున్నవి. మత్తయి యోసేపు పూర్వికులను, లూకా మరియ పూర్వికుల పేరుల నుదాహరించెనని కొందరి యభిప్రాయము. లూకా వ్రాసినవిధమునుబట్టి అది యట్లున్నదనుట న్యాయముగనే యున్నది.

ఇవిగాక, క్రీస్తు బాల్యమును గూర్చినది ఇంకొక్క సంగతి మాత్రము గలదు. అది లూ $2^{40-52}$ నందున్నది. ఆయనకు 12 ఏండ్ల ప్రాయము వచ్చినప్పుడు యూదుల వాడుకల ప్రకారము 'ధర్మశాస్త్రపుత్రుఁడు'గా నెంచఁబడెను. ఆయన అట్లెంచఁబడినపు డెంతటి యాసక్తితో నిండి యుండెనో ఆ చరిత్రవలన కనుగొనవచ్చును. ఆ సమయమున తన తల్లితో చెప్పిన—నేను నా తండ్రి పనులమీఁద నుండవలెనను మాటలు బాల్యము నుండి ఆయనకున్న స్థిరమైన ముఖ్యోద్దేశమై యుండెను. తన జీవితకాలమంతయు ఆయన అట్లే నెఱవేర్చెను. ఆయన ఇతరమైన గొప్పవాటియందు మనస్సుంచి వాటిని వెదుకక, దాదాపు 30 యేండ్ల ప్రాయము వచ్చువఱకు యోసేపు మరియలకు లోఁబడి, కష్టపడి పనిజేసి, యోసేపువలె వడ్రంగియై (మా $6^{3}$) విధేయుఁడుగా నుండెను (లూ $2^{51}$). ఇట్టి

దీనస్థితియందున్నను ఆయన జ్ఞానమందును, వయస్సునందును, దేవుని దయయందును మనుష్యుల దయయందును వర్ధిల్లుచు ($2^{52}$) అన్నిటిలో మాదిరిగా నుండెను.

2. క్రీస్తుపనిలోఁ బ్రవేశించుట. ప్రజలు మారుమనస్సు నొందవలెనని బోధించుటవలనను (మ $3^{1-12}$=మా $1^{1-13}$=$3^{1-14}$), యేసుయొక్క గొప్పతనమునుగూర్చి సాక్ష్యము చెప్పుటవలనను (లూ $3^{15-17}$ యోహా $1^{6-36}$) ఆయన రాకడకొఱకు యోహాను ప్రజలను సిద్ధపఱచెను. ఇట్టి గొప్ప పనిఁ జేయవలసియుండిన యోహాను పుట్టుకను గూర్చియు సువార్తయం దుదాహరింపఁబడినది (లూ $1^{5-23, 57-80}$). యోహాను ఆరంభించినది తనపనికి సంబంధించి యుండుటచేత, ఆయన అతనియొక్క పనిలోఁ బ్రవేశించి దానిని సంపూర్ణమైనదానిగాఁ జేసెననుట సువార్తల బోధయైయున్నది (యోహా $1^{35-41}$ $3^{22-36}$). అంత మాత్రమే గాక యేసు యోహానువలన బాప్తిస్మ మొందుటచేత, తనపనికి ప్రత్యేకింపఁబడెనని యగును. యేసు పాపరహితుఁడు గదా. ఆయన మారుమనస్సు విషయమైన బాప్తిస్మమేల పొందెనను దానికి సమాధానముచెప్పుట కొంచెము కష్టముగా కనఁబడవచ్చును. యోహానే అది తగదని యాక్షేపించెను (మ $3^{14,15}$). యోహాను ఆక్షేపణకాయన చెప్పినదే మన సందేహమును నివృత్తిచేయఁగలిగిన సమాధానముగ నున్నది. క్రీస్తు అన్నివిషయములలో మనవలెనుండి దేవుని యేర్పాటులన్నిటికి విధేయుఁడు కావలసివచ్చెను. సర్వాధికారియగు ఆయన మనవలె అయినప్పుడు తన్ను తాను రిక్తునిగాఁ జేసికొన్న సంగతులన్నియు (ఫిలి $2^{4-8}$) గొప్ప మర్మములుగా నున్నవి గాని ఆ సంగతులను తేటగాఁ దెలిసికొన వీలులేదు. అయినప్పటికిని ఆయన మానవుడగుటవలన దైవయేర్పాటు లన్నిటిప్రకారము చేయుటకు మనవలె విధాయకముగలవాఁ డగుటమాత్రమే గాక, దైవసహాయముచే బలపర్చఁబడి తనపనిని చేయవలసియున్నదను సంగతికూడ ఆయన బాప్తిస్మ మొందిన చరిత్రవలన స్పష్టముగా కనఁబడుచున్నది. ఆయన బాప్తిస్మము పొందిన సమయమందు, యోహా నాయననుగూర్చి సాక్ష్యమిచ్చుటకు మాత్రమే గాక (యోహా $1^{31-34}$), ఆయనను పనికొఱకు సిద్ధపఱచుటకును పరిశుద్ధాత్మ పావురాకారముగా ఆయనమీఁదకు వచ్చెను. దేవుఁడు "ఈయన నా ప్రియకుమారుఁడు; ఈయనయందే నేనానందించుచున్నా"నని పలుకుట ద్వారా, తా నాయనయం దనుకూలించిన సంగతి నిట్లు కనఁబఱచెను (మ $3^{13-17}$=మా $1^{9-11}$=లూ $3^{21-22}$). క్రీస్తు బాప్తిస్మము నొందు సమయమున ప్రార్థించుచుండినట్లు లూకా దెలుపుచున్నాఁడు (లూ $3^{21}$). ఇట్లు చేయుట ఆయనయొక్క వాడుకయైనట్లు అనేక సూచనలు గలవు. (మా $1^{35}$ లూ $6^{12}$ మ $11^{25-27}$ లూ $9^{18}$ $11^{1}$ యోహా $11^{41}$ $12^{27}$ మ $26^{36-44}$ మొ||). ఇప్పటినుండి ఆయన పరిశుద్ధాత్మచే నింపఁబడినవాఁడాయెను. అట్టివాఁడై ఆయన శోధింపఁబడెను (లూ $4^{1}$); బోధించెను ($4^{13,14}$); అద్భుతముల నొనరించెను ($6^{17}$); తన ప్రాణమును బలిగా నర్పించెను (హెబ్రీ $9^{14}$).

3. శోధింపఁబడుట. ఇట్లు దైవశక్తినొందిన క్రీస్తుకు శోధనలు కలుగకమానవు. ఈ శోధనలను ఆయన తన పనికి సిద్ధపడుటనుగూర్చిన సంగతితో చేర్చవచ్చును. మత్తయి లూకాలు వాటిని గూర్చి వివరముగా వ్రాసిరి (మ $4^{1-11}$ లూ $4^{1-13}$ వీటితో మా $1^{12,13}$ ను సరిపోల్చుము). పైన నుదాహరింపఁబడిన రీతిగా క్రీస్తు దేవునివలన మెప్పును, శక్తిని బొందినపిమ్మట ఆ శక్తిని ఇతరుల కొఱకుఁగాక తనకొఱకే యుపయోగించుకొనవలెననియు, ఆత్మీయమైనదానినిగాక శరీరపోషణను మాత్రము ముఖ్యమైనదిగా నెంచవలె ననునది మొదటి శోధనయై యుండెను. నిజముగా తన కట్టి గొప్ప శక్తి కలదో లేదో తెలిసికొనుటకు దేవుని పరీక్షించవలెనను రెండవశోధనయు, దేవునిచే నియమింపఁబడినరీతిగా బోధించుటవలనను శ్రమపడుటవలననుగాక, సాతాను కోరు రీతిగా తన శక్తి నుపయోగించి లోకమును స్వాధీనపఱచుకొనవలెనను మూఁడవ శోధనయు ఆయనకుఁ గలిగెను. ఇట్టి శోధన లాయన మరణము వఱకు కలుగుచుండెనని అనేక సూచనలవలనఁ దెలిసికొనవచ్చును. ప్రజలాయనను రాజుగా చేయఁ గోరినప్పుడు (యోహా $6^{15}$) ఆయన శ్రమలు పొందరాదని పేతురు చెప్పినప్పుడును (మ $16^{22,23}$), తనకు కలుగనైయున్న శ్రమలను

తప్పించుకొనవలెనను కోరిక గెత్సేమనే వనమునందు పుట్టినప్పుడును ($26^{36-46}$), అట్టి శోధనలే కలిగినవి. దేవుని సంగతులను మాత్రము లక్ష్యపెట్టి, ఆశించి, వాటిని మాత్రమే చేయుటవలన ఆ శోధనలన్నింటిని జయించి, తన పనిని చేయుటకును, శోధింపఁబడినవారికి సహాయము చేయుటకు నుద్యుక్తుఁడాయెను.

III. క్రీస్తుపని.

1. ఆరంభవిషయములు. శోధన అయిన పిదప, క్రీస్తు యోహాను బాప్తిస్మమిచ్చుచుండిన చోటికి తిరిగిరాఁగా అతని శిష్యులలో కొందఱాయనను వెంబడించిరి (యోహా $1^{29-51}$). తరువాత ఆయన తన స్వంతపట్టణమగు నజరేతునకు వచ్చి అచ్చటినుండి తన శిష్యులతోకూడ కానా అను ఊరిలో జరిగిన వివాహమునకు వెళ్లి, అక్కడ తన మొదటి అద్భుతమును చేసెను ($2^{1-11}$). తదనంతరము శిష్యులతోఁగూడ కపెర్నహూమునకు పోయి అచ్చట కొంతకాలముండెను ($2^{12}$)

2. యూదయ చర్య. దీనినిగూర్చి సువార్తికుఁడగు యోహానుమాత్రము వ్రాసెను ($2^{13}$-$4^{1}$). పస్కాపండుగకు ఆయన యెరూషలేము వెళ్లి, దేవాలయమును పవిత్రపఱచెను. ఏ యధికారముచేత అట్లు చేసితివని తన నడిగినవారితో "ఈ దేవాలయమును పడఁగొట్టుఁడి. దానిని మూఁడు దినములలో లేపుదు"నని ప్రత్యుత్తరమిచ్చి తన పునరుత్థానమును సూచించెను. రెండు సంవత్సరములకుఁ దరువాత సహితము యూదు లీ మాటను మఱవక, ఆయన దేవాలయమును దూషించినట్లు నేరము మోపిరి (మ $26^{61}$). ఈ సమయమునందే ఆయన అనేక అద్భుతములను యెరూషలేమునందు చేసినందున అనేకులు నమ్మిరి గాని ఆయన మానవబుద్ధి చాపల్యమునుగూర్చి చక్కఁగాఁ దెలిసినవాఁడైనందున వారిని నమ్మియుండలేకపోయెను (యోహా $2^{13-25}$). ఆయనను యథార్థముగా నమ్మినవారిలో నీకొదేము పరిసయ్యుఁడు ఒకఁడు. అతఁడు రాత్రివేళ యేసునొద్దకు రాఁగా ఆయన అతనితో నూతన జన్మనుగూర్చి మాటలాడెను. అతనితోఁ జేసిన ప్రసంగమునందు తన మరణము గూర్చియు, తనను నమ్మువారికి కలిగెడి నిత్యజీవమును గూర్చియు ప్రశంసించెను ($3^{1-21}$). పిమ్మట యెరూషలేమును విడిచి యొర్దాను ప్రాంతములకుఁబోయి, యోహాను బోధించి యుండిన స్థలములలో ననేకమందిని శిష్యులనుగాఁ జేసికొనెను. యోహాను శిష్యు లిది చూచి అసూయాపూరితులు కాఁగా, యోహాను, ఆయననుగూర్చి మఱల సాక్ష్యమిచ్చి తన శిష్యులను గద్దించెను ($3^{22-36}$). అనేకులు యేసుయొద్దకువచ్చి బాప్తిస్మము పొందుచున్నారని పరిసయ్యులు అసూయపడుచున్నారని విని ఆయన అక్కడినుండిలేచి గలిలయకు వచ్చెను ($4^{1}$). తన మార్గమందాయన సమరయనుదాటి సుకారను ఊరిదగ్గర సమరయ స్త్రీతో మాట్లాడి, తానే మెస్సీయనని ఆమెతోఁ జెప్పి, అక్కడ మూఁడు దినములుండెను. అనేకులు ఆయనను నమ్మిరి ($4^{2-42}$). ఆయన యూదయలో ఈసారి యెంత కాలము గడిపెనో నిశ్చయింప వీలులేదు. ఈ చర్య పస్కాతో నారంభమయ్యెను గాన ఏప్రిల్ మాసమని తెలిసికొనవచ్చును. సుకారులో నున్నప్పుడాయన "ఇంక నాలుగు నెలలలో కోఁత కాలము వచ్చునని మీరు చెప్పుదురుకదా" యని ఆయన చెప్పిన మాటలనుబట్టి, ఆయన అక్కడ డిసెంబరు లేక జనువరి మాసములలో నుండెనని యూహింపఁదగును గనుక, ఆ కాలము ఎనిమిది లేక తొమ్మిది నెలలని చెప్పవచ్చును.

3. గలిలయ చర్య. దీనినిగూర్చి ముఖ్యముగా మత్తయి, మార్కు లూకా సువార్తలలో నున్నది. ఈ కాలములో వచ్చిన పండుగకు ఆయన యెరూషలేమునకు వెళ్లినప్పుడు జరిగిన సంగతులను యోహానును వ్రాసెను. సువార్తికు లీ చరిత్రను ఎంతవఱకు కాలక్రమము ననుసరించి వ్రాసిరో దాని నిశ్చయించుట కష్టతరముగా నున్నది. కొందఱు మత్తయి ననుసరించి మార్కు లూకాలు వ్రాసినవాటిని దానికి సరిపడునట్లు సవరింతురు. మత్తయి కాలవరుసనుగాక విషయములనే ముఖ్యముగా ననుసరించినట్లు కనఁబడుచున్నది గాన, మార్కు లూకాల ననుసరించి మిక్కిన ముగ్గురు సువార్తికులు వ్రాసినవాటిని, వారి సంగతులకు సరిపడునట్లు సవరించి ఈ దిగువ నుదాహరింతుము. దాని ననుసరించి గలిలయ చర్య నిట్లు క్లుప్తపఱచవచ్చును.

(1) ఆరంభవిషయములు: క్రీస్తు మొదట గలిలయలోని నజరేతునకు రాఁగా, అక్కడివా

రాయన యూదయలోఁ జేసిన పనులనుగూర్చి విని యుండిరి గాన, అట్టి వింతలు తామును చూడఁగోరిరి (యోహా $4^{43-45}$) గాని, ఆయన వారి కోరికప్రకారము చేయకపోయినందున అలిగి ఆయనను సంహరింప యత్నించిరి (లూ $4^{14-30}$ మ $4^{12-25}$ మా $1^{14,15}$). తరువాత ఆయన కపెర్నహూమునకు వెళ్లి దాని తనకు నివాసస్థానముగాఁ జేసికొనెను (లూ $4^{31}$). కపెర్నహూమునకు వెళ్లుమార్గమున ఆయన ఘనుని కుమారుని బాగుజేసియుండవచ్చును (యోహా $4^{46-54}$).

(2) కపెర్నహూమునందు చేసిన పనులు: అప్పటినుండి ఆయన ఈ పట్టణమును తనకు ముఖ్యస్థానముగా నెంచుకొని, గలిలయ యంతటిలో పనిచేయుటకు కిచ్చటినుండి బయలుదేరుచు, ప్రయాణములైన పిమ్మట మరల తిరిగి యిచ్చటికే వచ్చుచుండెను. మ $9^{1}$ లోని ఇది ఆయన పట్టణము అనఁబడెను. ఆయన కపెర్నహూములో మొట్టమొదట ఒకదినమున చేసిన పనులను సువార్తికు లుదాహరించిరి (మా $1^{16-34}$ లూ $4^{31}$-$5^{11}$ మ $4^{18-22}$ $8^{14-16}$). ఆయన అనేకదినము లిచ్చటనే గడిపెను.

(3) గలిలయలో చేసిన మొదటి ప్రయాణము:—(మా $1^{35-45}$ లూ $4^{42-44}$ $5^{12-16}$ మ $8^{1-4}$). ఈ ప్రయాణమునం దాయన వారి సమాజ మందిరములలో బోధించెను. ఆయన ఎన్నో యద్భుతములను చేసినను కుష్ఠరోగి నొకని శుద్ధిచేయుటను గూర్చినదిమాత్ర, ముదాహరింపఁబడెను. ఆయన కీర్తి అధికముగ వ్యాపించుటచేత ఆయన ఊళ్లలో నుండలేక ఏకాంతముగా నుండవలసివచ్చెను ప్రజలు సంతోషముతో నాయనను తమ సమాజ మందిరములలో బోధింప నిచ్చుటవలనను, విరోధము లేశమైననున్నట్లు కనఁబడకపోవుటవలనను, ఇది ప్రజలాయనను అంగీకరించినకాలమని చెప్పవచ్చును

(4) క్రీస్తును విరోధింపసాగిన కాలము:

(*a*) ఈ విరోధము యూద మతాధికారుల వలన నారంభమయ్యెను. ఆయన యేదో యొక పండుగకు యెరూషలేమునకువెళ్లి అచ్చట 38 యేండ్లనుండి జబ్బుగా నుండిన యొకని విశ్రాంతి దినమున బాగుచేయుటతో నిది యారంభమాయెను (యోహా 5). ఆయన విశ్రాంతి దినమును మీఱినవాఁడనియు, దేవునితో సమానుఁడనని చెప్పుకొన్నందున దేవదూషకుఁడనియు ఆయనమీఁద నేరములను మోపిరి.

(*b*) కపెర్నహూమునందు నలుగురిచేత మోయఁబడివచ్చిన పక్షవాయువు గలవానిని బాగుజేయఁగా, ఆయన వాని పాపములు క్షమించినందున, ఆయన దేవదూషణఁ జేయుచున్నాఁడని మఱల అదేరీతిగా నేరము మోపిరి (మా $2^{1-12}$= లూ $5^{17-26}$=మ $9^{1-8}$). యెరూషలేము నుండి వచ్చిన కొందఱు పరిసయ్యులును ధర్మశాస్త్రోపదేశకులును అచ్చట నుండుటచేత (లూ $5^{17}$) వారాయనయందు నేరము కనుగొనుటకు వెంటఁబడియున్నట్లు దోచుచున్నది.

(*c*) ఆయన సుంకరు లనఁబడిన హీనకులస్థుల నుద్ధరింపనై వారియందు తన పని నారంభించి, లేవియను మత్తయిని పిలువఁగా, ఆయన కులభ్రష్టుఁడని మఱింతవిరోధించిరి (మా $2^{13-17}$ లూ $5^{26-29}$ మ $9^{9-13}$).

(*d*) క్రీస్తు శిష్యు లుపవాసము చేయకపోవుటచేత వారు పెద్దల యాచారములను లక్ష్యపెట్టకున్నను వారి నాయన మందలించుట లేదని ఆయనపై తప్పుమోపిరి (మా $2^{18-22}$ లూ $5^{30-39}$ మ $9^{14-17}$).

(*e*) ఒక విశ్రాంతి దినమున శిష్యులు ఆకలిగొన్నవారై వెన్నులు త్రుంచి తినినందునను, మఱియొక విశ్రాంతిదినమున ఆయన ఊచచెయ్యి గలవాని బాగుచేసినందువలనను, ఆయన విశ్రాంతి దినమును గైకొనక దానిని మీఱుచున్నాఁడని చంప నాలోచించిరి (మా $2^{23}$-$3^{6}$ లూ $6^{1-11}$ మ $12^{1-14}$).

(*f*) విరోధ మింతగా వృద్ధియగుటవలన ఆయన కపెర్నహూమును విడిచి ఒక కొండకువెళ్లి, అక్కడ పన్నెండుమంది అపొస్తలులను ఏర్పఱచుకొని, ఆ కొండమీఁద ప్రసంగమును జేసెను (మా $3^{7-19}$ లూ $6^{12-49}$ మ $12^{15-21}$ 5, 6, 7).

(*g*) ఆయన తిరిగి కపెర్నహూమునకువచ్చి కొన్ని యద్భుతములను జేయుచు మూగవాని

నొకని స్వస్థపఱచఁగా, విరోధులు ఆయన సాతాను అధికారమువలన వీటిని చేయుచున్నాఁడని నింద మోపిరి. ఆయన యెడతెగక పనిచేయుటను గుర్తించిన ఆయన బంధువు లదేసమయమున ఆయనకు మతి తప్పియున్నదని పట్టుకొన వచ్చిరి (మా $3^{19(a)-35}$ మ $12^{22-34}$ $12^{46-50}$ లూ $8^{19-21}$).

(5) క్రీస్తు గలిలయలోఁ జేసిన రెండవ ప్రయాణము:—కపెర్నహూమునందు శతాధిపతి సేవకుని బాగుజేసి (లూ $7^{1,10}$), నాయీను ఊరి విధవరాలి కుమారుని బ్రతికించిన దీ ప్రయాణము లోనే (లూ $7^{11-17}$). రాఁబోవు మెస్సీయను గుఱించి తెలిసికొనుటకు యోహాను శిష్యులను పంపెను ($7^{18-35}$ మ $11^{1-19}$). ఒక పరిసయ్యుని ఇంట్లో భోజనము చేయునప్పుడు పాపపు స్త్రీ ఆయన నభిషేకించెను (లూ $7^{36-50}$). ధనురాండ్రైన స్త్రీ లాయన కుపచరించిరి ($8^{1-3}$).

(6) క్రీస్తు తరువాత కపెర్నహూమునకు మరలవచ్చి దేవుని రాజ్యమర్మములను తన శిష్యులకు ఉపదేశించుటకు ఉపమానరీతిగా బోధించెను (మా $4^{1-33}$ లూ $8^{4-19}$ మ $13^{1-51}$).

(7) ఆయన గలిలయ సముద్రమును దాటి తుఫానును నిమ్మళింపఁజేసి (మా $4^{35-41}$ లూ $8^{22-25}$ మ $8^{23-25}$), గెరాసీనీయుల దేశమునందు సేన దయ్యముపట్టినవానిని బాగుజేసి (మా $5^{1-20}$ లూ $8^{26-39}$ మ $8^{28-34}$), తిరిగి కపెర్నహూమునకు వచ్చి, రక్తస్రావముగల స్త్రీని స్వస్థపఱచి యాయీరు కుమార్తెను బ్రతికించెను (మా $5^{21,43}$ లూ $8^{40-56}$ మ $9^{18-26}$). క్రీస్తు రాజ్యమునందు చేరువారికి విశ్వాసము బహు అవసరముగా నుండవలెనని ఆయన ఈ యద్భుతములవలన బోధించెను. ఆ విశ్వాసము సాతానుపనులను అణఁచుటకును నెమ్మదిని క్షేమమును పొందుటకును ముఖ్యలక్షణ మని వీటిలో తేటగా చూపెను.

(8) క్రీస్తు గలిలయలో చేసిన మూఁడవ ప్రయాణము. ఈ ప్రయాణమునం దాయన నజరేతుకువచ్చి రెండవమారు నిరాకరింపఁబడెను (మా $6^{1-6}$ మ $13^{53-58}$). తరువాత తన శిష్యులను ఇద్దరిద్దరినిగా బోధించుటకై పంపెను (మా $6^{7-12}$ లూ $9^{1-6}$ మ $9^{35}$-$10^{42}$). వారు అద్భుతములను విస్తారముగాఁ జేసినందున హేరోదు తాను జంపించిన యోహాను మరల బ్రతికెనని తలంచెను. దీనికి సంబంధముగా యోహాను మరణమును గూర్చిన సంగతులు సువార్తయందు కలవు (మా $6^{14,29}$ లూ $9^{7-9}$ మ $14^{1-12}$). అంతలో శిష్యులు తిరిగి ఆయన యొద్దకు రాఁగా ఆయన వారు విశ్రమించునట్లు వారి నేకాంతముగా బేత్సయిదాకుఁ దీసికొని వెళ్లెను. అక్కడ తమ్మును వెంబడించిన 5000 మంది కాహారము బెట్టెను (మా $6^{30,44}$ లూ $9^{10-17}$ మ $14^{13,21}$ యోహా $6^{1-14}$). ఈ యాహారపు మహిమ చూచినవారు ఆయనను పట్టుకొని బలవంతముగా రాజును చేయ నుద్దేశించినప్పుడు ఆయన వారి యుద్దేశమును భంగపఱచి, యేకాంతముగా ప్రార్థించ కొండెక్కెను (యోహా $6^{15}$) ఆ రాత్రి సముద్రముమీఁద పోవుచున్న శిష్యులు తుఫానునందుఁ జిక్కుకొనఁగా, సముద్రముపై నడుచుచు వారియొద్దకు వచ్చెను. తెల్లవారిన పిదప గెన్నేసరెతు దగ్గర అనేకులను బాగుజేసి (మా $6^{45,56}$ మ $14^{22-36}$) కపెర్నహూములోని సమాజమందిరములో జీవాహారమును గూర్చి బోధించినప్పు డనేకులు అలిగి వెళ్లిపోయిరి. తన శిష్యులను చూచి మీరుకూడ వెళ్లిపోదురా యని యడిగినప్పుడు వా రాయన నిత్యజీవపు మాటలు గలవాఁడని యొప్పుకొనిరి (యోహా $6^{15-71}$). 5000 మంది కాహారము పెట్టుట పస్కాపండుగ సమీపించినప్పుడని యోహా $6^{4}$ వలనఁ దెలియుచున్నది. ఇది ఆయన సుకారుకు వెళ్లినకాలమునకు తరువాత 4 మాసములకు వచ్చిన పస్కా యనుటకు వీలులేదు. ఆ నాలుగు మాసములలో పై నుదాహరింపఁబడిన వన్నియు జరిగియుండ నేరవు. గాన నిది యా పస్కాగాక దానికి తరువాతి సంవత్సరములోని పస్కాయని యెంచవలెను.

(9) చేతులు కడుగుకొనకుండ భోజనముచేసి పెద్దల పారంపర్య బోధలను నిరాకరించుచున్నారని పరిసయ్యులు నేరము మోపఁగా (మా $7^{1-23}$ మ $15^{1-20}$), ఆయన ఇంకను గలిలయలో పని విశేషముగా చేయఁజాలక, దాని చుట్టుప్రాంతములలోఁ దిరిగి బోధించుచు, ముఖ్యముగా తన

శిష్యులకుల కుపదేశించుచుండెను. ఇట్లాయన తిరిగిన ప్రదేశములో చేసినపను లెవ్వి యనఁగా:—

(*a*) తూరు సీదోను ప్రాంతములలో కనానీయురాలైన ఒక స్త్రీ కుమార్తెకుపట్టిన దయ్యమును వెళ్లఁగొట్టెను (మా $8^{24-30}$ మ $15^{21-28}$).

(*b*) దెకపొలి ప్రాంతములకు వచ్చుచు, చెవిటి నత్తివాని నొకనిమార్గమునందు స్వస్థపఱచి (మా $7^{31-37}$), దెకపొలిలో ననేకులను బాగుజేసి, 4000 మందికి ఆహారముపెట్టెను ($8^{1-9}$ మ $15^{29,38}$).

(*c*) దల్మనూతా లేక మగదాను ప్రాంతములకు వెళ్లి, అచ్చట వా రాయనను గుఱుతు నొకటి చూపుమని యడుగఁగా, ఆయన దానిని చూపకయే వారిని గద్దించి (మా $8^{10-13}$ మ $15^{39}$-$16^{4}$), బేత్సయిదాకు వెళ్లుటకు మరల సముద్రమును దాటి, మార్గములో శిష్యులకు పరిసయ్యుల పులిసినపిండినిగూర్చి హెచ్చరించెను (మా $8^{14-21}$ మ $16^{5-12}$). బేత్సయిదాలో నొక గుడ్డివానిని బాగుజేసెను (మా $8^{22-26}$).

(*d*) ఫిలిప్పుదైన కైసరయకు వెళ్లుచు, మార్గములో పేతురు ఆయనను క్రీస్తు అని యొప్పుకొనఁగా, ఆయన ఆ యొప్పుదలను గూర్చియు, తనకు కలుగఁబోవు శ్రమలను గూర్చియు మొదట విశదముగా మాట్లాడి, వారు శ్రమపడువిషయము నందు తన యడుగు జాడలలో నడుచుకొనవలెనని వారికి బోధించెను (మా $8^{27}$-$9^{1}$ లూ $9^{18-27}$ మ $16^{13,28}$).

(*e*) హెర్మోనుకొండ ప్రాంతములయందు రూపాంతరము నొంది, తన పునరుత్థానమును గూర్చి తిరిగి మాట్లాడి, కొండ దిగివచ్చి చాంద్ర రోగియైన యొక చిన్నవానిని బాగుజేసెను (మా $9^{2-29}$ లూ $9^{28-43}$ మ $17^{1-21}$).

(10) గలిలయమీఁదుగా యెరూషలేమునకుఁ బోవుచు తన శ్రమలనుగూర్చి రెండవసారి వివరము దెలిపి (మా $9^{30-32}$ లూ $9^{43(b)-45}$ మ $17^{22-23}$), వారికి వినయమును గూర్చియు (మా $9^{33-37}$ లో $9^{46-48}$ మ $18^{1-5}$), ఇతరుల నాటంకపఱచుటనుగూర్చియు (మా $9^{38-50}$ లూ $9^{49-50}$) బోధించి, కపెర్నహూములో పన్ను చెల్లించుటకు నోట షెకెలుగల చేఁప నద్భుతరీతిగా పట్టించెను (మ $17^{24-27}$). సమరయుల ఊళ్లలో నొక దానియం దాయనకు చేర్చుకొనక పోఁగా శిష్యులలోఁ గొందఱు వారినిశిక్షింప సెలవిమ్మని మనవి చేసినప్పు డాయన వారిని గద్దించి మఱియొక గ్రామమునకు వెళ్లెను (లూ $9^{51-56}$). ఈ కాలమునందే పర్ణశాల పండుగ నాచరించుటకు యెరూషలేమునకు వెళ్లియుండవచ్చును. అచ్చట జీవజలమును గూర్చియు, లోకపు వెలుఁగును గూర్చియు బోధింపఁగా, యూదు లాయనతో వాదించి ఆయనను పట్టుకొనుటకు బంటులను పంపిరి. చివఱ కాయనను కొట్టుటకు రాళ్లనెత్తిరి (యోహా 7,8 వ్యభిచారమందు పట్టఁబడిన స్త్రీని క్షమించి ఆదరించుటను గూర్చిన సంగతి ఈ భాగమునందుంచినను అది మఱియొక సమయములో జరిగెనని అసలు ప్రతుల సూచనలవలనఁ దెలిసికొనఁగలము). ఆయన ఇంక ఆఱు మాసములలో చంపఁబడుననఁగా ఇది జరిగెను.

4. పెరీయచర్య. దీనిని లూకా వివరముగా వ్రాసెను (లూ $9^{57}$-$18^{34}$) గాని మత్తయి మార్కులు బహు క్లుప్తముగ వ్రాసిరి (మ $19^{1}$-$20^{28}$ మా $10^{1-45}$). ఈ చర్యలో నిదివఱకు వచ్చిన కొన్ని విషయములుగలవు (లూ $12^{22-34}$ ను మ $6^{19-34}$ తోను, లూ $13^{22-27}$ ను మ $7^{21-23}$ తోను, లూ $11^{14-26}$ ను మా $3^{20-30}$ తోను సరిపోల్చుము). ఇదివఱకు జరిగినవే మఱల మఱల జరుగునను లోకోక్తి ప్రకారము, ఆయన ఇదివఱకు గలిలయలో బోధించినవాటిని పెరీయలోను బోధించెను. ఇదివఱకు గలిలయలో చూపఁబడిన విరోధము ఇచ్చటకూడ కనఁబడినట్లు స్పష్టముగు చున్నది. ఇవిగాక అనేకమగు నూతన సంగతులును పెరీయచర్యలో కనఁబడుచున్నవి.

(1) పెరీయచర్య మొదలు ప్రతిష్ఠపండుగ వఱకు జరిగిన సంగతులు:—ఇందు గలిలయచర్యలో జరిగిన చివరిసంగతులను, పెరీయయందు ఆరంభమున జరిగినవియును గలవు. ఆయన గలిలయను విడిచి వెళ్లఁబోవుచుండగా కొందఱు ఆయన వెంట వత్తుమని చెప్పుకొనినందున ఆయన వారికితగు బుద్ధిజెప్పెను (లూ $9^{57-62}$ మ $8^{19-22}$). పెరీయలో తాను గడుపగలిగిన కాలము బహు కొద్దియేనని యెఱిఁగినవాఁడై, తన రాకకొఱకు ఆయా ఊళ్లను

సిద్ధపఱచుటకై 70 మందిని పంపించెను. వారు తిరిగివచ్చి తమ పనినిగూర్చి చెప్పుకొనఁగా ఆయన వారికి తగిన హెచ్చరికలనుజేసి గలిలయ చర్యను ముగించి, దాని ఫలితమును దెలిపెను. తా నెక్కువపనులను జేసిన పట్టణములగు కపెర్నహూము కొరాజీను, బేత్సయిదా యను పట్టణములు తమమీఁదకు శాపమును దెచ్చుకొనినను, దీనులైనవారు ఆయనను నమ్మినందున సంతోషించి దేవుని స్తుతించిరి దీనినిబట్టి దేవుఁడు పనిచేయు రీతి యిదేనని, తండ్రికిని తనకునుగల పూర్ణ ఐక్యమును గుఱించి గంభీరమైన వాక్కులతోఁ దెలిపి, అట్టి దీనులు విశ్రాంతికొఱకు తనయొద్దకు రావలెనని మిగుల ప్రేమతోఁ బిలిచెను (లూ $10^{1-24}$ మ $11^{20-30}$). అట్టి సమయమున ధర్మశాస్త్రోపదేశకుఁ డొకఁడు నిత్యజీవమునుగూర్చి యడుగఁగా అతని స్వనీతిని గద్దించి సరియైన మార్గము నతనికిఁ జూపుటకు మంచి సమరయుని గూర్చిన యుపమానమును జెప్పెను (లూ $10^{23-37}$). ఈ కాలమునందే మరియు మార్థలను వారియింట దిగి వారికిని బోధించెను ($10^{38-42}$). వారి గ్రామము బేతనియ (యోహా $12^{1}$) కావున, ఈ సమయమున ఆయన యెరూషలేమునకేదో యొక పండుగకు వెళ్లెనని యూహింపఁదగును. అచ్చట పుట్టుగ్రుడ్డియైన వానిని స్వస్థపఱచి, అతఁడు క్రీస్తును ఒప్పుకొనఁగా, యూద మతాధికారులతనిని వెలివేసిరి. వారు దొంగకాపరులనియు, తానే నిజమైన కాపరిగాన వారి వెలికి భయపడ నవసరములేదని ఆయన అతనివంటివారి నాదరించిన దీ ప్రతిష్ఠ పండుగుకాలమునం దని యూహింపవచ్చును (యోహా 9,10).

(2) ప్రతిష్ఠపండుగు మొదలుకొని లాజరును లేపునంతవఱకు జరిగిన విషయములు (లూ $11^{1}$-$17^{10}$). శిష్యులకు ప్రార్థనను గుఱించి బోధించి ($11^{1-13}$), సాతాను అధికారమువలన అద్భుతములు చేయుచున్నాఁడని తనను గూర్చి యనిన వారిని ఖండించెను ($11^{14-26}$). దేవుని వాక్యమును వినుట అన్నిఁటికన్న గొప్ప ధన్యత యని యొక స్త్రీకి నేర్పి ($11^{27,28}$), గుఱుతు నడిగిన వారికి తగిన బుద్ధిచెప్పెను ($11^{29-32}$). సరియైన బోధ యేదియో దానిని వివేచించి, దానిని దాచిపెట్టకూడదని దీపమును దృష్టాంతముగాఁ దీసికొని బోధించెను ($11^{33-36}$). తనను భోజనమునకుఁ బిలిచిన పరిసయ్యుఁడు తాను స్నానము చేయలేదని యాశ్చర్యపడినప్పుడు ఆయన వారి వేషధారణను ఖండించెను. అందువలన వారు ఆయన మీఁద పగబట్టి ఆయనయందు నేరము కనుగొనుటకు పొంచి వెదకుచుండిరి ($11^{37-54}$). అప్పుడాయన గుంపులు గుంపులుగా తనయొద్దకు వచ్చిన జనసామాన్యము నందున్న శిష్య బృందమునకు పరిసయ్యుల వేషధారణకు భయపడక దేవుని నమ్మవలెననియు, ఆయన వారిని కాపాడుననియు బోధించెను ($12^{1-12}$). తమ పిత్రార్జితమును పంచిపెట్టుమని ఒకఁడు మనవి చేసినప్పుడు వెఱ్ఱివాఁడగు ధనవంతునిగూర్చిన యుపమానమును జెప్పి లోక ధనము విషయమైన శోధనలో పడకుండునట్లు వారు మెలకువగా నుండవలెనని తన శిష్యులకు బోధంచెను ($12^{13-54}$). పిలాతు ఆలయపు ఆవరణములోఁ గొందఱిని చంపెనను వార్త విని, అందఱును పశ్చాత్తాపపడవలెనని బోధించి, అంజూరపు చెట్టునుగూర్చిన యుపమానమును చెప్పెను ($13^{1-9}$). పద్దెనిమిదేండ్లనుండి జబ్బుపడి వంగిన నడుముగల స్త్రీని విశ్రాంతి దినమున బాగుచేయఁగా యూదులు ఆక్షేపించినందున వారిని గద్దించెను ($13^{10-17}$). పెకీయలోకూడ దేవుని రాజ్యమును గూర్చిన యుపమానములను జెప్పెను ($13^{18-21}$). రక్షణ పొందువారు కొందరేనా యని ఒకఁ డడుగఁగా ఆ విషయము ప్రయాసపడనివారు రక్షణ పొందనేరరని బోధించెను ($13^{22-30}$). ఆయన యూదయకుఁ బోయినయెడల ఆయనను పట్టుకొనఁగలమను తలంపుతో యుక్తిపన్ని, నీ విచటనుండినయెడల హేరోదు నిన్ను పట్టుకొనునని చెప్పఁగా ఆయనెంతమాత్రమును భయపడక, తాను యెరూషలేమునందే చంపఁబడెదనని చెప్పి, ఆ పట్టణమును గూర్చి మొదటిసారి యంగలార్చెను ($13^{31,35}$). ఒక విశ్రాంతిదినమున పరిసయ్యులలో నొకని యింట భోజనముచేయుచు, అచ్చట నున్న జలోదరరోగిని బాగుజేసినప్పు డక్కడ కలిగిన సణుగులకు సమాధానము చెప్పెను ($14^{1-6}$). విందునకు వచ్చువారి గర్వమును చూచి వారికి వినయమును బోధించెను ($14^{7-11}$). విందునకు వచ్చిన వారినందఱిని జూచి, బీదలను అంగ

హీనులను బిలుచుట మంచిదని హెచ్చరికలు జేసెను ($14^{12-14}$). దేవుని రాజ్యమునందు భోజనము చేయువాఁడు ధన్యుడని యొకఁడనఁగా, మానవులు పరమవిందు నెట్లు నిరాకరింతురో దాని దృష్టాంతపఱచి ($14^{15-24}$), అట్టి రక్షణను కోరువారు యేమిచేయవలెనో అది వారికి బోధించెను ($14^{25-35}$). పెరీయలోకూడ సుంకరుల మధ్య పనిచేయుచుండఁగా పరిసయ్యు లాక్షేపించిరి. ఆయన తప్పిపోయిన గొఱ్ఱె, పోఁగొట్టఁబడిన రూక, తప్పిపోయిన కుమారునిగూర్చిన మూఁడు దివ్యములగు ఉపమానములను చెప్పెను (15). స్థితిమంతులగు ఇట్టి సుంకరులు శిష్యులగుటను జూచి వారు తమ ధనము నెట్లు వాడవలెనో అది అన్యాయస్థుఁడగు గృహనిర్వాహకునిగూర్చిన యుపమానమువలనను ($16^{1-13}$) ఎట్లు వాడుకొనరాదో ధనవంతుఁడు లాజరునుగూర్చిన ఉపమానమువలనను ($16^{19-31}$) వారికి బోధించెను. ఇట్టి బోధలు జేయునప్పుడు పరిసయ్యు లెగతాళి జేయఁగా ఆయన వారిని ఖండించెను. అప్పుడు జరిగినవాదములో పరిత్యాగపత్రిక నిచ్చుటనుగూర్చి యడిగినట్లుగా $16^{18}$ వలన ఊహింపఁదగును ($16^{14-18}$ మ $19^{3-12}$ = మా $10^{1-12}$).

ఈ పెరీయచర్యలో క్రీస్తు తన శిష్యులకు విశేషబోధలను జేసెను. ఇతరులను ఆటంకపఱచుటనుగూర్చియు క్షమించుటనుగూర్చియు విశ్వాసమునుగూర్చియు వినయమునుగూర్చియు వారికి బోధించెను (లూ $17^{1-10}$). దీనికిపిమ్మట ఆయన మఱల గలిలయ సమరయల మధ్యనుండుటచేత ఈ కాలమునందు లాజరును లేపుటకు వెళ్లెనని యూహింపఁదగును (యోహా $11^{1-46}$).

(3) లాజరును లేపుట మొదలుకొని శ్రమలవారమువఱకు జరిగిన సంగతులు: లాజరును లేపినందున ఆయనను చంపవలెనని సన్హెడ్రిన్ సభికులు మొదట తీర్మానించిరి ($11^{47-53}$). అప్పటికాయన కాలమింకనురాలేదు గాన ఆయన ఎఫ్రాయిము అనఁబడిన ఊరి ప్రాంతములలో తన శిష్యులతోఁగూడ దాగుకొనెను (యోహా $11^{54-57}$). అది సమరయ యందుండుటచేత యెరూషలేమునకు చివరిపర్యాయము వెళ్లినప్పుడు, ఆయనచుట్టుఁ దిరిగి గలిలయ సమరయుల మధ్యగా పెరీయ మీఁదుగా వెళ్లెనని ఊహించవచ్చును (లూ $17^{11}$).

ఆ సమయమందే 10 మంది కుష్ఠరోగులను బాగుజేసి ($17^{11-19}$), రక్షణపొందెడివారు కొందరేనా యని యడిగిన ప్రశ్నకు జవాబు చెప్పి ($17^{20,21}$), దానినిబట్టి తన శిష్యులకు హెచ్చరికలు జేసెను ($17^{22-37}$). వారు ఎడతెగక ప్రార్థించవలెనని అన్యాయస్థుఁడగు న్యాయాధిపతినిగూర్చిన ఉపమానమును ($18^{1-8}$), వినయముగలవారి ప్రార్థనను దేవుఁ డాలకించునని పరిసయ్యుఁడు సుంకరి అను ఉపమానమువలనను ($13^{9-14}$), తరువాత ఎచ్చటనో తనయొద్దకుఁ దెచ్చిన పిల్లలను దీవించి ($18^{13-17}$ మా $10^{13-16}$ మ $19^{13-15}$), నిత్యజీవమునుగూర్చి యడిగిన యౌవనస్థునికిని, వాని ద్వారా శిష్యులకును బోధించెను (లూ $18^{18-30}$ మా $10^{17-22}$ మ $19^{16}$-$20^{16}$). తన శ్రమలనుగూర్చి మూఁడవసాఱి వివరముగాఁ దెలిపి (లూ $18^{31,34}$ మా $10^{32-34}$ మ $20^{17-19}$), కుడియెడమస్థానముల నడిగిన యోహాను యాకోబులను గద్దించి, శిష్యులకు మఱల వినయమునుగూర్చి బోధించెను (మా $10^{35-45}$ మ $20^{20-28}$).

5. క్రీస్తుమరణ పునరుత్థానములను గూర్చిన విషయములు.

(1) యెరూషలేమునకుఁ బోవుమార్గమున ఆయన యెరికోలో ఇద్దఱు గుడ్డివారిని బాగుజేసి (మా $4^{52}$ = లూ $18^{35-43}$ మ $20^{29-34}$), జక్కయ్య యను సుంకరియింట బసజేసెను (లూ $19^{1-10}$). దేవునిరాజ్యము వెంటనే కనఁబడుననుకొనిన శిష్యుల తప్పు అభిప్రాయములను దిద్దుటకై మీనాలనుగూర్చిన యుపమానమును జెప్పెను (లూ $19^{11-28}$).

(2) యెరూషలేమునందు జరిగిన విషయములు. యెరూషలేమునందు యూదులాయనను చంపుటకు కనిపెట్టుచుండిరి (యోహా $11^{54-57}$). క్రీస్తు పస్కాకు ఆఱు దినములకుఁ బూర్వము (శుక్రవారమున) యెరూషలేమునకు జేరినదగు బేతనియకు వచ్చెను ($12^{1}$). మరుసటిదినము విశ్రాంతిదినము గాన ఆయన యేమియుఁ జేసిన సూచనలులేవు. ఆ దినమున విందు జరిగెననియు, మరియు ఆయన నభిషేకించెనని కొందఱనుకొనుచున్నారు. గాని అది మంగళవారమున జరిగెనని తోఁచుచున్నది. తరువాత యెరూషలేము

నందు జరిగిన విషయములను మన మీ దిగువరీతిగా నుదాహరింపవచ్చును:—

(*a*) ఆదివారమున ఆయన జయోత్సవముతో యెరూషలేమునందు ప్రవేశించెను (మా $11^{1-11}$ లూ $19^{29-44}$ మ $21^{1-11}$ యోహా $12^{9-19}$). ఆ సమయమునందే హెల్లేనీయులు గొందఱాయనను చూడఁగోరిరి ($12^{20-36}$).

(*b*) సోమవారమున ఆయన మార్గమందున్న అంజూరపుచెట్టును శపించి (మా $11^{12-14}$ మ $21^{18,19}$), దేవాలయమును శుద్ధిజేసెను (మా $11^{15-19}$ మ $21^{12-17}$ లూ $19^{45,46}$).

(*c*) మంగళవారమునా డాయన ఎండిపోయిన అంజూరపుచెట్టునుబట్టి శిష్యులకు విశ్వాసమును గూర్చి బోధించెను (మా $11^{20-25}$ మ $21^{20-22}$). పట్టణములోనికి వచ్చిన పిదప యూదులాయన యధికారమునుగూర్చి ప్రశ్నించఁగా, ఆయన యోహానను అధికారమునుగూర్చి యడిగి వారికి తగిన ప్రత్యుత్తరము నిచ్చెను (మా $11^{26-33}$ మ $21^{23-27}$ లూ $20^{18}$). తన్ను నిరాకరించుటవలన యూదులుజేసిన పాపమును అందువలన వారు తమమీఁదకుఁ దెచ్చుకొనసైయున్న శిక్షను, ఇద్దరు కుమారులు (మ $21^{28-32}$), ద్రాక్షతోఁట గుత్తదారులు (మా $12^{1-12}$ మ $21^{33-46}$ లూ $20^{9-18}$), రాజకుమారుని పెండ్లివిందు (మ $22^{1-14}$) అను ఉపమానములద్వారా వారికి బోధించినందున, వారలిగి యుక్తిగల ప్రశ్నలద్వారా ఆయనను చిక్కించుకొన యత్నించిరి (మా $12^{13-34}$ మ $22^{15-40}$ లూ $20^{19-39}$). మెస్సీయ యెట్లు దేవుని కుమారుఁడని వారిని ప్రశ్నించి (మా $12^{35-37}$ లూ $20^{41-44}$ మ $22^{41-46}$), వారి వేషధారణనుబట్టి వారిని గద్దించెను (మ 23 మా $12^{38-40}$ లూ $20^{46,47}$). దేవాలయమునందు రెండు కాసులు మాత్రమే కానుకవేసిన విధవను మెచ్చుకొనెను (మా $12^{21-44}$ లూ $21^{1-4}$). దేవాలయమును విడిచి, ఒలీవల కొండకుఁబోయి, దాని మీఁద తన శిష్యులతోఁ గూర్చుండి యెరూషలేము నాశనముగూర్చియు, లోకాంతమును గూర్చియు వారికి బోధించి (మా 13 లూ $21^{5-38}$ మ 24), శిష్యులు సిద్ధపడియుండునట్లు పదిమంది కన్యకలు (మ $25^{1-13}$), తలాంతులు (మ $25^{14-30}$), గొఱ్ఱెలు మేఁకలు (మ $25^{31-46}$) ఉపమానములను జెప్పి ఆ దినపు బోధలను ముగించెను. ఆ సాయంకాలమునందే ఆయన విరోధులు చంప యత్నములు జేసిరి ($26^{1-5}$ మా $14^{1,2}$ లూ $22^{1,2}$) గాని ఆయన స్నేహితులు బేతనియలో ఆయనకొఱకొక గొప్పవిందును సిద్ధపఱచిరి. ఆ సమయమున మరియ ఆయన నభిషేకించెను (మ $26^{6-13}$ మా $14^{3-9}$).

(*d*) బుధవారమునాడు క్రీస్తు బేతనియలోనే యుండి నెమ్మదిగా తన కాలమును గడుపుకొనెను గాని యూదా ఇస్కరియోతు ఆయన నప్పగించుటకై విరోధులచెంతకుఁజని బేరము జేసెను (మా $14^{10,11}$ లూ $22^{3-6}$ మ $26^{14-16}$).

(*e*) గురువారమునాడు పస్కాను సిద్ధపఱచుట కిద్దఱిని పంపించెను. వారు దానిని సిద్ధపఱచిన పిమ్మట, ఆయన తన శిష్యులందఱితోఁ రాత్రిభోజన నియమము నేర్పఱచెను (మా $14^{3-26}$ లూ $22^{7,23}$ మ $26^{17-30}$). శిష్యులకు వినయమునుగూర్చి బోధించెను (యోహా $13^{1-16}$). శిష్యులనందఱిని, ముఖ్యముగా పేతురును జాగ్రత్తగా నుండుఁడని హెచ్చరికలజేసి వారి నాదరించెను (మ $26^{31-35}$ మా $14^{27-31}$ లూ $22^{31-38}$ యోహా $13^{17}$-$16^{33}$). వారికొఱకు విజ్ఞాపనము జేసెను (యోహా 17). గెత్సెమనే వనమునందు మిగుల వేదనపడుచు ప్రార్థించెను (మ $26^{36-46}$ మా $14^{32-42}$ లూ $22^{39-46}$). పిమ్మట యూదా వచ్చి ఆయనను శత్రువుల కప్పగించఁగా శిష్యులందఱును ఆయనను విడిచి చెదఱిపోయిరి (మ $26^{47-56}$ మా $14^{43-51}$ లూ $22^{47-53}$ యోహా $18^{1-11}$).

(*f*) శుక్రవారమునాడు క్రీస్తును విచారణజేసి, శిక్షవిధించి, సిలువవేసి పాతిపెట్టిరి. ఆ విచారణలు అన్నా (యోహా $18^{12-27}$), కయప (మ $26^{57-75}$ మా $14^{53-72}$ లూ $22^{54-71}$) ల యెదుట జరిగెను. అవి జరుగునప్పుడు పేతురాయన నెఱుఁగనని బొంకెను. ఉదయమున సన్హెడ్రిన్ సభయెదుట ఒకవిధమైన క్రమవిచారణ జరిగినపిదప (మ $27^{1,2}$ లూ $22^{66-70}$), ఆయనను రోమన్ గొర్నరగు పిలాతున కప్పగించిరి. పిలాతాయనను విచారించి నిర్దోషియని యెన్నిమారులు చెప్పినను వారు వినక

మూర్ఖముగా నున్నందున, వారిని శాంతిపఱచుటకై ఆయనను సిలువవేయనప్పగించెను. అంతకు పూర్వమే ఆయన గలిలయుఁడని హేరోదునొద్దకు పిలాతాయనను బంపెనుగాని, అదియొక విచారణయన వీలులేదు (మ $27^{11-26}$ మా $15^{1-15}$ లూ $23^{1-25}$ యోహా $18^{28}$-$19^{16}$). ఆయనను ఉదయము 9 గంటలకు సిలువవేయఁగా, 12 గంటలకు చీఁకటి గ్రమ్మెను. ఆయన 3 గంటలప్పుడు చనిపోయెను. ఆయన గొఱ్ఱెవలె మౌనియై తనను సిలువవేయువారికొఱకు క్షమాపణ నడిగెను. మాఱుమనస్సునొందిన దొంగ నాదరించెను. తల్లిని యోహానుకు కప్పగించెను. దేవుఁడు తన ముఖమును దాచుకొనఁగా దానిని సహింపలేక మొఱబెట్టెను. లేఖనము నెఱవేరునట్లు దాహమున కడిగెను. తనపని పూర్తియాయెననెను. చివరగా తన ప్రాణమును తండ్రి కప్పగించెను. ఈ యేడు సమయములలోమాత్రమే మాయన సిలువ మీఁద నుండఁగా మాటలాడెను (మ $27^{27-56}$ మా $15^{16,41}$ లూ $23^{14,49}$ యోహా $19^{17-39}$). అరిమతయియవాఁడగు యోసేపు తన స్నేహితులతోఁ గలసి ఆ దినమే ఆయనను మర్యాదగా సమాధియందుంచెను. విశ్రాంతిదినమైన పిదప ఆయనకు సుగంధద్రవ్యములను పూయవలెనని స్త్రీలాలోచించుకొనిరి (మ $27^{57,61}$ మా $15^{42-47}$ లూ $23^{40,56}$ యోహా $19^{38-42}$).

(*g*) విశ్రాంతిదినమగు శనివారమునాఁడు ఆయన విరోధులుమాత్రము పిలాతుతో మనవిజేసి, ఆయన సమాధికి ముద్రవేయించి కావలి పెట్టిరి (మ $27^{62-66}$).

(*h*) ఆదివారమున ఆయన మృతులలో నుండి లేచెను. దూతలు పునరుత్థానమును ప్రకటించిన పిమ్మట (మ $28^{1-8}$ మా $16^{1-8}$ లూ $24^{1-12}$), క్రీస్తు మొదట మగ్దలేనే మరియకు అగుపడెను (యోహా $20^{1-18}$). తరువాత కొందఱు స్త్రీలకు ప్రత్యక్షమాయెను (మ $28^{9,10}$). పిమ్మట ఎమ్మాయుకు వెళ్లు ఇద్దఱికిని (లూ $24^{13\ 33,35}$), పేతురునకును (లూ $24^{34}$ I కొరి $15^{5}$) తరువాత 10 మంది అపొస్తులులకును కనఁబడెను (యోహా $20^{19-23}$ లూ $24^{36-49}$). ఈ దర్శనములన్నియు ఆ దినమునందే జరిగెను. ఒక వారమునకుఁ దరువాత ఆయన వారికి మఱల కనఁబడి తోమా నాదరించెను (యోహా $20^{24-29}$). గలిలయ సముద్రముదగ్గిర ఏడుగురుశిష్యులకు కనఁబడిన పిమ్మట (21), గలిలయలో శిష్యులకు నియమించిన స్థలమునందు 500 మందికంటె ఎక్కువమందికి కనఁబడెను (I కొరి $15^{6}$). యాకోబుకు ప్రత్యేకముగా కనఁబడినపిమ్మట ఆయన ఆరోహణదినమునందు శిష్యులకు దర్శనమిచ్చి, వారాయన సువార్తను లోకమంతటను ప్రకటింపవలెనను ఆజ్ఞనిచ్చి, పరలోకమునకు వెళ్లెను (మ $28^{16-20}$ లూ $24^{50-53}$ కార్య $1^{6-11}$). ఆయన ఆకాశమున కెక్కకపూర్వము పరిశుద్ధాత్మరాకడకొఱకు కనిపెట్టవలెననియు, ఆయన వచ్చినపిమ్మట సర్వలోకములో సువార్తను ప్రకటింపవలెననియుఁ ఆజ్ఞనిచ్చి వారు చూచుచుండఁగా పరలోకమున కారోహణు డయ్యెను (కార్య $1^{6-12}$). ఈ యారోహణమునుగూర్చి సువార్తలలో కొన్ని సూచనలు గలవు (లూ $9^{15}$ యోహా $12^{32}$). ఆయన ఆరోహణమునుగూర్చిన సూచనలే ఆయన రెండవ రాకడనుగూర్చి స్ఫురింపఁజేయుచున్నవి. రెండవ రాకడనుగూర్చి తేటయగు సూచనలు సువార్తలలోఁ గలవు (మ $24^{30}$ $25^{31}$ $26^{64}$). యోహాను సువార్తలోను అపొస్తలులు వ్రాసిన పత్రికలును దీనిగూర్చి చెప్పుచున్నవి (యోహా $7^{33}$ $14^{12}$ $16^{28}$ $20^{17}$ ఎఫె $4^{8}$ హెబ్రీ $4^{14}$ మొ॥). క్రైస్తవుల కీర్తనలన్నిఁటిలో మిగుల పురాతనమైన దానిలోను ఆయన యీ మహిమలోకి చేర్చఁబడుటనుగూర్చిన సూచనగలదు (I తిమో $3^{16}$) ఆయన దేవుని కుడిపార్శ్వమున నున్నాఁడు అని తెలుపు వాక్యములన్నియు ఆయన ఆరోహణమునకు నిదర్శనములుగా నెంచవచ్చును (రోమా $8^{34}$ ఎఫె $1^{20}$ హెబ్రీ $10^{13}$). ఆరోహణము ఆయన ప్రధానయాజకుఁడై అతి పరిశుద్ధ స్థలములో చేరి మన నిమిత్తము విజ్ఞాపనము చేయుటను సూచించునని హెబ్రీ గ్రంథకర్త తేటగా వ్రాసెను (హెబ్రీ $10^{11-14,\ 19-22}$). ఆయన ఆరోహణమునుగూర్చినది బైబిలులో బహు తేటగా నున్న బోధగా నుండుటమాత్రమేగాక క్రీస్తు మనకు పూర్ణరక్షకుఁడనుటను గూర్చిన గొప్ప బోధగా నున్నదనియు తెలిసికొనవలెను.

సువార్తలలో నున్న యీ చరిత్రకుఁ బిమ్మట, ఆయన హతసాక్షియగు స్తెఫనుకును (కార్య $7^{55}$),

ఆరంభమున ఆయనను నమ్మినవారిని హింసించిన సౌలునకును ($9^{5}$), పత్మాసు ద్వీపమం దుండిన యోహానుకును (ప్రక $1^{9-19}$) కనఁబడెను. ఇవన్నియు చారిత్రక విషయములు. ఆయన గుణలక్షణములనుగూర్చియు, బోధనుగూర్చియు, పనినిగూర్చియు తెలిసికొనుటకు, పైనున్న క్లుప్త వివరమునుబట్టి విచారించవలసి యుండును.

IV. క్రీస్తుపని, బోధ, గుణలక్షణములను గూర్చిన సంగతులు:—

1. ఆయన పనులు. ఆయన మేలుచేయుచు అపవాదిచేత పీడించఁబడినవారినందఱిని స్వస్థపఱచుచు సంచరించుచుండెను అని పేతురాయన పనులనుగూర్చి క్లుప్తముగ వివరించెను (కార్య $10^{38}$). క్రీస్తు డంబముకొఱకే యద్భుతములను చేయక అక్కఱలోను ఇబ్బందిలో నున్నవారికి సహాయము చేయుటకై వాటి నొనర్చెను గాన ఆయనచేసిన అద్భుతము లనేకములై యుండెను (మ $4^{23}$ $9^{35}$ $19^{2}$ $21^{14}$). తనపనిలో సహాయపడిన శిష్యవర్గమునకు నట్టి యద్భుతములను చేయ శక్తి నొసంగెను ($10^{1}$). స్వస్థత కోరివచ్చినవారి యందుగాని, అట్టివారిని తెచ్చినవారియందు గాని విశ్వాసమున్నయెడలనే ఆయన స్వస్థపఱచెను (మా $6^{5}$ $2^{5}$ $5^{36}$ మొ॥). ఆయనకును స్వస్థత నొందినవారికిని ఈ విధముగా ఆత్మీయ సంబంధమున్నదనవచ్చును. ఆయన మానవుల ఆత్మీయ స్వస్థతను మిగుల యపేక్షించినందున దయ్యములచే పట్టఁబడినవారిని బాగుచేయుట ఆయన పనులలో నొక ముఖ్యమైన పనియని ఆయనయు (మ $12^{28}$ లూ $11^{20}$), ఆయన శిష్యులును అనుకొనిరి (కార్య $10^{38}$). మానవుల శరీరాత్మల యక్కఱలను దీర్చుటకేగాక, దేవుని మహిమార్థము వాటిని చేసెను (యోహా $2^{11}$ $11^{4}$). ఈ యద్భుతములు దైవశక్తిమాత్రమే గాక, ఆయన ప్రేమనుగూడ కనుపఱచుటచే నవి ఆయన మహిమను వెల్లడిపఱచుచున్నవి. పైన చెప్పినట్లు ఈ మేలులనొందుటకు విశ్వాసమవసరము. ఆ విశ్వాసము ఇట్టి అద్భుతకార్యములను చూచుటవలన బలపఱచఁబడెను. ఆ కార్యములను చూచియు నమ్మకపోవుట గొప్ప పాపము (లూ $10^{13-16}$ యోహా $12^{37-43}$). క్రీస్తు పునరుత్థానము ఆయన చేసిన యద్భుతములను ఉపదేశించిన బోధలను బలపఱచునట్టి ముఖ్య అద్భుతమై యున్నది. ఆయన సజీవుఁడనిమాత్రమే గాక శక్తిప్రభావములతో కూడి నిరంతరముండు దేవునికుమారుఁడని నిరూపించుట కిది మంచి నిదర్శనమై యున్నది (రోమా $1^{4}$ కార్య $13^{38,39}$ మొ॥). క్రీస్తుపనుల యుద్దేశమును వాటి గుణలక్షణములను గుర్తించినపక్షమున, అవి దైవావతారియగు వానికి తగినవై, ఆయన శక్తిప్రభావములను, దయాదాక్షిణ్యములను కనపఱచఁజాలినవై యున్నవి కావున, ఆయనను నమ్ముట కివి సరియైన సాదృశ్యములని క్రీస్తును (యోహా $5^{36}$), అపొస్తలులును (కార్య $2^{22}$) బోధించిరి (అద్భుతములు చూ॥).

అయినప్పటికిని, క్రీస్తుపనులన్నియు అద్భుతకార్యములేయని తలంపరాదు. ఆయన మానవుల మధ్యనుండి దేవునిచిత్తము నెఱవేర్చు నిమిత్తము ప్రతిపనిని చేయుటయు (యోహా $4^{34}$), మానవుల రక్షణకోరి అన్ని సమయములలోను ప్రయాసపడుటయు (మ $9^{36}$ మా $2^{13-17}$ మొ॥), ఆయన పనులన్నియును పాప రహితములును (యోహా $8^{46}$), శత్రువులను సహా దగ్గరదీసెడి ప్రేమసహితములునై యుండుటయు (లూ $23^{34}$), చూడఁగా అవి నరమాత్రుల పనులు గాక దైవమూర్తియగు వాని పనులని యొప్పుకొనక తప్పదు.

2. క్రీస్తు బోధలు:—ఆయన ఇతరులవలె బోధింపక (మా $1^{22}$ యోహా $7^{46}$) మనలను నమ్మించుటకు కావలసిన యధికారముతో బోధించెనని ఆయన బోధలను విన్నవారు ఒప్పుకొనిరి. ఆయన బోధలను పరిశీలన చేయువారు నేటికిని అవి యట్టివే యని యొప్పుకొనుచున్నారు. ఆయన దేవునిగూర్చి ప్రత్యేకముగా నెన్నడును బోధించి యుండలేదని, దేవునిగూర్చి ఆయనచేసిన బోధలను విచారించి తెలిసికొనవచ్చును. పాతనిబంధనయందు దేవునిగూర్చి యుండిన దివ్యబోధలను అంగీకరించి, ఆయన సర్వాధికారమును, పరిశుద్ధత నొప్పుకొని మనము సంపూర్ణముగా నమ్మవలసిన పరలోకపు తండ్రి (మ $6^{9,32}$ లూ $12^{32}$ మొ॥) యని బోధించి ప్రజలయం దాయనను గూర్చి యుండిన తప్పుడభిప్రాయములను దిద్ది, ఆయననుగూర్చి తన బోధలలో పూర్ణముగా బయలుపఱచెను. అట్లే మానవులనుగూర్చి ప్రత్యేకముగు ప్రసంగము చేయకపోయినను వారి

పాపములను గూర్చియు, అయోగ్యతలను గూర్చియు దాచక, వాటిని వెళ్లడిపఱచి, ఖండించి, (లూ $13^{1-5}$ మ 23 మొ॥), పశ్చాత్తప్తులను ఎంతో ప్రేమతో దగ్గర తీసి యాదరించెనో అది సువార్త యంతటిలో గణగణ మ్రోగు నాదమైయున్నది (లూ $7^{36-50}$ $15^{11-32}$ మొ॥). మానవ విధ్యుక్త ధర్మమంతటిని ప్రేమయను నొక్కటే సూత్రము క్రింద చేర్చెను ($6^{27-38}$ $10^{25-37}$ మ $25^{31-46}$ మొ॥). ఇట్టివారమగుటకు నూతనజన్మము అవసరమని బోధింపఁగా ఆయన తన కృపచే, మన కేర్పఱచిన బాప్తిస్మమువలనను ఆత్మవలనను దీని పొందవచ్చునని తెలిపెను (యోహా॰ $3^{1-15}$). ఆయన బోధల నాలకించువాఁ డెవఁడును అతిశయ పడుటకు గాని, నిరాశ పడుటకుగాని వీలులేదు.

దేవునిగూర్చి మానవునిగూర్చి నట్టి యీ బోధలు దేవుని రాజ్యమునకు సంబంధించిన బోధలలో చేరియున్నవని చెప్పఁదగును. ఆ రాజ్యము సమీపముగా నున్నదను వాక్యముతో తన బోధపని నాయన ప్రారంభించెను (మా $1^{15}$). ఆ రాజ్య సువార్తను ప్రకటింపవలెననునది ఆయన చిట్టచివరి యాజ్ఞయై యుండెను (లూ $24^{46-49}$). పాఁత నిబంధనయందు దేవుని ప్రభుత్వమును గూర్చిన సూచనలు పెక్కు లుండినను, అవి చాల వఱకు ఇశ్రాయేలీయులను ఒక జనమునకు మాత్రమే సంబంధించినవై, ఈ లోకరాజ్యమును సూచించును గాని క్రీస్తు బోధించిన సంగతులు ఆత్మసంబంధమైన ప్రభుత్వమును గూర్చినవై (యోహా॰ $18^{36-38}$) భక్తులంతటి కొఱకైన రాజ్యమును సూచించును (మ $8^{11-13}$ $22^{1-14}$ మొ॥). ఇది దేవుని రాజ్యమగుటచే దేవుఁడందులో చేరువారికి అధికారియగుచున్నాఁడు. ఆ రాజ్యము యొక్క వారసులగుటకన్న పరమమేలు మఱి యొకటిలేదు (మ $6^{33}$ లూ $12^{31}$). అహంకారులు గాక శుద్ధహృదయులును, దీనులును, వినయమనస్కులును అందులో చేరఁగలరు (మ 5-7, 18, $20^{25-28}$ మొ॥). దేవునిరాజ్యము విత్తనమురీతిగా అంతట చల్లఁబడినను అందఱును దానిని అంగీకరించెడివారు కారు అయినను అది విస్తరించుచు క్రమక్రమేణ వృద్ధియగుచు సర్వలోకమునందు వ్యాపించును (మ 13). ఈ లోకమున నుండఁగా మంచివారును చెడ్డవారును అందు కలిసియుండినను, అది పరలోకమునందు పూర్తియై, ఆ రాజ్యవారసు లనుభవించెడి సౌఖ్యము లన్నిఁటి నిధియగును (మ $7^{14}$ $18^{8,9}$ $19^{16,29}$ $25^{46}$ మొ॥). ఇది యంతయు అనేకు లనుకొనునట్లు కలియుగము గాక, క్రమక్రమేణ వృద్ధియగుచున్న రక్షణ యుగమనునది క్రీస్తు బోధయై యున్నది (దేవుని రాజ్యము చూ॥).

3. క్రీస్తు గుణలక్షణములు. సువార్తలయందివి క్రీస్తువలన వెల్లడియయ్యెను. పిమ్మట అపొస్తలులు తాము వాటిని గ్రహించుకొనిన రీతిగా తాము వ్రాసిన పత్రికలయం దుదాహరించిరి.

(1) సువార్తలయందు క్రీస్తు గుణలక్షణములను గూర్చిన బోధలు.

(*a*) దేవుని రాజ్యమును గూర్చిన బోధలయందు క్రీస్తుకుఁగాక ఇతరులలో మఱెవ్వరికైనను లేని యధికారము ఆయనకున్నట్లు సువార్తలు ఆరోపించుచున్నవి. క్రీస్తు పరలోకసంబంధి యని నమ్మనివాఁడు ఆ రాజ్యమునందు చేరక, తమ పాపములలోనే చనిపోవునని యోహా॰ $8^{24}$ నందు చూడవచ్చును. ఈ సువార్తయందే, ఆయన నిత్యజీవమును కలిగించెడివాఁడని యనేక వాక్యములయందున్నది ($3^{14-17,36}$ $6^{48-51,57}$ మొ॥). తక్కిన సువార్తలలో పరలోకరాజ్యమెట్టి దీవెనను సూచించునో అది, యోహాను సువార్తయందు నిత్యజీవమును సూచించును. పరలోకరాజ్యములో చేరువారు తనకు చేసిన దానిని బట్టియే, అట్టి హక్కును సంపాదించుకొందురేగాని మఱి దేనిచేతను పొందలేరను సంగతి ఇతర సువార్తలయందున్నది (మ $25^{31,46}$ మా $8^{35-38}$). పరలోకరాజ్యములోకి చేర్చుకొనుటకును, దూరపఱచుటకును క్రీస్తుకు అధికారముగలదు (మ $7^{21-23}$ $16^{27}$). దేవునికి మాత్రము చూపవలసిన ప్రేమ ఆయనకును చూపుటకు బద్ధులమై యున్నామని ఆయన బోధించెను ($10^{37}$). దేవుని రాజ్యము ఆయన ప్రభుత్వమును సూచించును. పైనున్న వాక్యములను చూచినయెడల అది క్రీస్తు ప్రభుత్వమనియు చెప్పఁదగును. ఆయన మనుష్యమాత్రుఁడైన

మొదల అట్టి సంగతుల నాయన విషయ మెంత మాత్రమును చెప్పుటకు వీలులేదు.

(*b*) ఆయనకు క్రీస్తు అను బిరుదు సువార్తలలో గలదు (మ $1^{1}$ మా $1^{1}$ లూ $2^{11}$ యోహా $20^{31}$ మొ॥). ఆయన క్రీస్తు అనునది అన్నిటిలో మొదటి విశ్వాస ప్రమాణమై యున్నదని యెంచ దగును (మా $8^{29}$). ఆయన సజీవుడగు దేవుని కుమారుడైన క్రీస్తు అను పదము లా యొప్పుదల యొక్క భావమును కనబఱచుచున్నవి (మ $16^{17}$). అట్టి విశ్వాసమును కనుపఱచిన వారిని క్రీస్తు మెచ్చుకొనుటచేత అది సత్యమని ఆయన యొప్పుకొనెను. ఈ విషయమును గూర్చి ఆయన ఈ సమయమునందే గాక సమరయదేశపు స్త్రీతో మాట్లాడినప్పుడును (యోహా $4^{25,26}$), జయోత్సవముతో యెరూషలేమునందు ప్రవేశించినప్పుడును (మా $11^{9,10}$) ఆయన యొప్పుకొనినట్లు చూడగలము. ఆయనను సిలువవేయించునంతవఱకు ఊరకొనినది ఈ కారణముచేతనే యని ఆయనపై మోపబడిన నేరములవలనను (మా $15^{2}$), ఆయన సిలువకు గొట్టిన పై వ్రాతవలనను తెలియుచున్నది ($15^{26}$) ప్రవక్తలు ప్రవచించిన రక్షకుడు (యెష $11^{1-9}$ $61^{1-9}$ మొ॥) ఆయనే యని యిట్టి సూచనలవలన తేటపడును. తా నట్టివాడనని ఆయనకు మొదటినుండి తెలిసియుండినను, మెస్సీయయొక్క రాచరికమును గూర్చి యూదులు లోకసంబంధమగు అభిప్రాయములు గలవారగుటచే దానిని బయలుపఱచనియ్యలేదు (మ $16^{20}$). తన తండ్రి తన శిష్యులకు బయలుపఱచినట్లుగానే, హృదయశుద్ధిగల యితరులకును బయలుపఱచునని ఆయన తెలిసికొని తన్ను గుఱించి ప్రకటన చేయనియ్యక, ఈ విషయమునందును తన సంగతిని దేవుని కప్పగించుకొనెను. ఆయన బిరుదులలో దావీదు కుమారుడనునది క్రీస్తుకు సంబంధించినదిగా నెంచవలెను (మ $1^{1}$ $22^{42,43}$ రోమా $1^{3}$ II తిమో $2^{8}$ మొ॥). క్రీస్తును గూర్చిన ప్రవచనములు దావీదుకు సంబంధముగా నుండుటచే దీనిని ఆయన కారోపించిరి (యెష $11^{1}$ $32^{1}$ మొ॥).

(*c*) ఆయనకు కుమారుడు, దేవుని కుమారుడు అను బిరుదులు గలవు. ఇతరులు వీటి నాయన కారోపించిరి. దయ్యముపట్టినవారు (మా $3^{11}$ $5^{7}$ మ $8^{29}$), శిష్యులు (మ $14^{33}$), సిలువచెంత నుండిన శతాధిపతి ($27^{54}$) ఈ పేరు నాయనకు వాడిరి. మా $1^{1}$ నందీపే రాయనకు గలదు గాని కొన్ని మాతృకలలో నిది కనబడదు. ఇతరు లీ పేరును ఆయనకు వివిధభావములతో వాడియుందురు గాని, క్రీస్తు స్వయముగా నా పేరును వాడుకొనినప్పుడది మానవుల కెంత మాత్రము నుండని దైవసంబంధమును గుర్తించునని ఆయా వాక్యములవలన తేటపడుచున్నది. మొదటి మూడు సువార్తలయందలి యీ దిగువ సూచనలు దానిని దృష్టాంతపఱచుచున్నవి.

అ. దుష్టులగు ద్రాక్షతోట గుత్తదారులను గూర్చిన యుపమానమునందు (మ $21^{33-46}$ = మా $12^{1-12}$ = లూ $20^{9-19}$), దేవుడు వారియొద్దకు ప్రవక్తలకు పిమ్మట తన కుమారుని చివరగా పంపెను. ఈయన క్రీస్తు అని వినినవారందఱును గ్రహించిరి. ఆయన ప్రవక్తలందఱికన్న గొప్పవాడు మాత్రమే గాక (మ $12^{6,41,42}$) దేవునితో తీక్ష్ణమగు సంబంధము గలవాడైనట్లు దీనియందు తేటపడుచున్నది.

ఆ. కుమారుడనుపేరు తనకు పెట్టుకొనుట మాత్రమే గాక, పరలోకమందలి దూతలకన్న యధికుడై, తండ్రితో సాటివాడను సూచనలు గలవు (మ $24^{36}$ మా $13^{32}$). యోహాను సువార్తయం దిట్టి వాక్యములు లనేకములు కలవు. వాటియం దీ తీక్ష్ణసంబంధమును సూచించుటకై ఆయనకు అద్వితీయ కుమారుడు అను పేరు గలదు ($1^{14}$ $1^{18}$ $3^{16,18}$).

ఇ. మ $11^{25-27}$ లూ $10^{21,22}$ నందిది మఱింత స్పష్టముగ నున్నది. దేవుడు నా తండ్రి యని యితరు లెవ్వరికిని ఆయనతో లేని సంబంధము తనకును ఆయనకు నుండినట్లు అందులో సూచింపబడుచున్నది (యోహా $10^{29}$ $14^{1,7}$ $20^{17}$ మొ॥ పరిపోల్చుము). అది మాత్రమే గాక తండ్రి చేత తనకు సమస్తమును అప్పగింపబడెనని అందున్నది ($5^{9}$ $7^{16}$ మొ॥ చూ॥). తండ్రి యొక్కడే కుమారుని యెఱుగును. కుమారుడు మాత్రమే తండ్రి నెఱుగును అని అక్కడ గలదు. తండ్రికిని కుమారునికిని పూర్ణమగు

ఐక్యమున్నట్లు యోహాను సువార్తయందు స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును ($10^{30}$ $14^{6}$ మొ॥).

ఈ. తన కుమారస్థితిని బట్టి, దేవాలయపు పన్నును తాను చెల్లించుటకు బద్ధుఁడను కానని మ $17^{24-27}$ నందును అట్టి సంబంధము నే సూచించెను.

ఉ. ఆయనను దూషించిన విరోధులు ఆయన దేవుని కుమారుఁడని చెప్పుకొనినట్లు సాక్ష్యమిచ్చిరి (మ $27^{43}$ యోహా $19^{7}$).

మనమందఱ మెట్లు దేవుని బిడ్డలమో, అట్లే తానును దేవుని కుమారుఁడనని మాత్రమే ఆయన చెప్పుకొనెనని కొందఱభిప్రాయ పడుచున్నారు గాని పైవాక్యము లట్టిభావము నెంతమాత్రమును గనపర్చవు. ఆయన మానవులవలెగాక తన స్వభావ లక్షణములనుబట్టి మనకు గోచరము గాని ప్రత్యేకమగు రీతిగా దేవుని కుమారుఁడని ఆ వాక్యముల బోధయై యున్నది.

(*d*) **మనుష్యకుమారుడను** బిరుదును ఆయనే పెట్టుకొనెను. ఇది ఆయన జీవితారంభము నుండి అంతమువరకు ఆయన వాడుకొనినట్లు జూడవచ్చును. (మ $8^{20}$ $26^{64}$ మా $2^{10}$ $14^{62}$ లూ $5^{24}$ $22^{69}$ యోహా $1^{51}$ $13^{31}$ మొ॥ సువార్తలలో ఈ పేరితరులవలన పెట్టఁబడలేదు. సువార్తలలోఁ గాక కార్య $7^{56}$ ప్రక $1^{13}$ $14^{14}$ నందు మాత్రము ఈ పేరు క్రొత్త నిబంధనలో గానవచ్చును. యెహెజ్కేలు గ్రంథమునం దీపదము విశేషముగా వాడఁబడెను ($2^{1,3,8}$ మొ॥). కీర్త $8^{4}$ లో దేవుని యెదుట మానవుఁడెంత హీనుఁడో అది ఈ వాక్యపు భావమైయున్నది. క్రీస్తు ఈ పేరును వాడుటలో అట్టిభావములో వాడెనని చెప్పుటకు బొత్తుగా వీలుగాదు. ఆయన యుద్దేశము దాని $7^{13,14}$ కు మరింత బాగుగా సరిపడును. అచ్చట ఒక నూతన రాజ్యములో మనుష్యకుమారునివంటి వాఁడొకఁడు అధికారియగును అని యున్నది. మ $25^{31}$ దీనికి నూటిగా సరిపడును. ఈ బిరుదు క్రీస్తు మానవులలో నొకఁడని సూచించును ఆయన వారి యనుభవములలో పాలివాఁడాయెను. ఆయన మాదిరియైన మానవుఁడనియు సూచించును దాని $7^{13,14}$ నం దాయన యొక క్రొత్త యుగమున కధికారియనికూడ సూచించును. అట్టి యుగమునందు బలాత్కారమును, అన్యాయమును, పాపులగు మానవులు తృణీకరింపఁబడుటయు ఆగిపోయి, వారిని రక్షించి మేలు చేయుట యనునవి ముఖ్య విషయములై యుండును (లూ $19^{10}$). శ్రమల చేతనే ఇట్టి రాజ్యము స్థాపింపఁబడినను (మా $10^{45}$). అది మహిమగలదై యుండును. ఇది దైవప్రభుత్వమైనను సంపూర్ణముగా మానవుల మేలుకొఱకైనదై యున్నది ($2^{28}$). ఆయన యివ్విధముగా మానవులకు సుఖదుఃఖములలో చేరినవారికి మాదిరి పురుషుఁడగుటచేత ఆయన వారికి తీర్పు తీర్చును (మ $25^{31}$ యోహా $5^{27}$). ఇట్లీ నామమును దేవుని కుమారుఁడను దానివలె ఘనమైన బిరుదుగా నున్నది.

(*e*) రక్షకుఁడను బిరుదు సువార్తలయందు గలదు. దూతలు గొల్లవారికి క్రీస్తు పుట్టుకను గూర్చి తెలుపఁగా, ఈ పేరును వాడిరి (లూ $2^{11}$ దీనితో మ $1^{21}$ సరిపోల్చుము). సువార్తలయందు రక్షించుట యనుమాట ఆత్మరక్షణను మాత్రమే గాక శరీర స్వస్థతనుకూడ సూచించును ($9^{21,22}$ $14^{30}$ మొ॥) గాని, స్వస్థత నొందుటకు విశ్వాసమవసరమగుటచే అది యాత్మీయ రక్షణను సూచించుచున్నది. క్రీస్తు నశించినదానిని వెదకి రక్షించుటకు వచ్చెనను (లూ $19^{10}$) వాక్యము, ఆయన చేసెడి రక్షణ కార్యమును తేటగా కనపఱచును. ఈ రక్షణను గూర్చి యోహాను సువార్తయందు మఱింత తేటగా నున్నది ($3^{17}$ $5^{34}$ $10^{9}$ $12^{47}$). బాప్తిస్మమిచ్చు యోహాను ఆయన లోకపాపము మోయు గొఱ్ఱెపిల్ల యని చెప్పినప్పుడీపనిని గూర్చియే ఉద్దేశించెను ($1^{29,36}$) (దేవుని గొఱ్ఱెపిల్ల చూ॥). సమరయులాయన లోకరక్షకుఁడని యొప్పుకొనిరి ($4^{42}$). ఆయన నిత్యజీవమిచ్చు దాతయైయున్నాఁడు ($10^{28}$). ఈ రక్షణ కార్యము క్రీస్తు మరణమునకు సంబంధించి యున్నది (మా $10^{45}$ $14^{22-24}$). ఆయన తన ప్రాణమును విమోచన క్రయధనముగా నిచ్చెననియు, అనేకులకొఱకు తన రక్తమును ధారపోసెననియు దానివలన స్పష్టమగుచున్నది. మంచి కాపరియైన క్రీస్తు గొఱ్ఱెలకొఱకు తన ప్రాణము పెట్టుటలోను ఇదే భావము స్పష్టమగుచున్నది (యోహా $10^{15}$). క్రీస్తు మరణమువలని ఫలితములు మొదటి పత్రికలలో వివరముగా నుండినను సువార్త

లలో దీనినిగూర్చిన ఈ బోధలును తేటగా నున్నవి.

(2) పత్రికలలో క్రీస్తు గుణలక్షణములను గూర్చిన బోధలు. ఆయన ఈ లోకములో నున్నంతవఱకు ఆయన పని పూర్తికాకపోవుటచేత ఆయనను గూర్చిన పూర్ణమైన బోధలుచేయ వీలు లేదు. ఆయన ఆరోహణమైన పిమ్మట పరిశుద్ధాత్మను పంపినప్పుడు ఆయన సంగతు లన్నింటిని బట్టి క్రీస్తును గూర్చిన బోధలు పూర్తి చేయ వీలు జిక్కెను. సువార్తలయందుండువాటి కివి భిన్నములుకాక, వాటిని సంపూర్ణమైన వాటినిగా జేయుచున్నవి. ఆయనకు క్రీస్తు అను బిరుదు సర్వసాధారణమైనదై యున్నది (కార్య $2^{36}$ $17^{3}$ రోమా $5^{1,6}$ మొ॥). ఆయన దేవుని కుమారుఁడు. లోకములో అవతరించి మానవునివలె పుట్టెను (రోమా $1^{4}$ గల $4^{4}$ హెబ్రీ $2^{14}$ ఫిలి $2^{5-8}$ మొ॥). ఇట్లు తన్నుతాను తగ్గించుకొని మరణమునొంది పాపులందఱికొఱకు ప్రాయశ్చిత్తము జేసెను (రోమా $3^{23-25}$ $5^{6}$ కొలొ $1^{19}$ యోహా $2^{2}$ మొ॥). దైవమానవుఁడగు ఆ క్రీస్తు హెచ్చింపఁబడి అందఱిచేత పూజింపఁబడుట కర్హుఁడైయున్నాఁడు (ఫిలి $2^{9-13}$ ఎఫె $1^{15-23}$ కొలొ $1^{9-22}$). ప్రభువు అను బిరుదు పత్రికలలో నొక ముఖ్యమైనదై యున్నది (కార్య $2^{36}$ రోమా $5^{1}$ గల $1^{3}$ II కొరి $13^{13}$ మొ॥). ఆయనను ప్రార్థించుట ఆది క్రైస్తవులకు మొదటినుండి వాడుకయై యుండెను (కార్య $9^{14}$). ప్రతి యోచనను ఆయనకు లోపఱచవలసినది (II కొరి $10^{5}$). ఆయనే రక్షకుఁడు (కార్య $5^{31}$ I తిమో $4^{21}$). ప్రతిది ఆయనద్వారా కలిగెను (కొలొ $1^{16}$). మన మిఁక మీఁదట ఆయన వారమైయున్నాము (II కొరి $5^{14}$). ఆయన అన్నిఁటికి నధికారి (కొలొ $1^{18}$). ఆయన చివరకు అందఱికి తీర్పు చేయును (రోమా $14^{10}$ II కొరి $5^{10}$). ఇదంతయు ఆయన దేవుఁడే గాని మానవమాత్రుఁడు కాఁడని కనపఱచుచున్నది (హెబ్రీ $1^{1-3}$).

ఇట్లు క్రొత్త నిబంధన బోధ యంతయు నేకగ్రీవముగా నున్నను, ఆయన దేవునికి సమానుఁడుగాక, కొంచెము తక్కువ వాఁడైయున్నట్లు కొన్ని వాక్యములం దగుపడుచున్నది. (మా $1^{18}$ $18^{16}$ I కొరి $15^{58}$ మొ॥). కొందఱి వాక్యములలో నున్నట్లే ఆయనను గూర్చి భావింతురుగాని ఈ కొద్దివాక్యములను వేఱుచేయక పైవాటితోఁ గలిపి చూడవలెను. అట్లయినయెడల త్రియేక దేవునిలోఁకూడ ఫలానివాఁడు మొదటి వాఁడనియు, ఫలానివాఁడు రెండవవాఁడనియు నొక క్రమమున్నట్లు స్పష్టమగును. స్థితినిబట్టి తండ్రి మొదటివాఁడుగా నున్నను, స్వభావగుణలక్షణములనుబట్టి ఎట్టి భేదములును లేవనునది ఈ బోధలన్నింటిని సారమైనట్లు తెలియుచున్నది. సంఘము యొక్క విశ్వాసప్రమాణములలో సంక్షేపముగా దేవుఁడు తండ్రి కుమారుఁడు పరిశుద్ధాత్మ యను త్రైక దేవుఁడనియు, క్రీస్తు దైవమానవుఁడై పాపులను రక్షించుట కీలోకమున కవతరించెననియు, ఆయనకా విమోచనకార్యము విశేషమైనదనియు పై వివరములవలన తేటగా కనఁబడును (దేవుడు, పరిశుద్ధాత్మ చూ॥).

**యెసెరు, యెసెరీయులు** (Jezer = నిర్మాణము, Jezerites). నఫ్తాలీ కుమారులలో నొకఁడు ఇతఁడా గోత్రములోని యొక తెగకు పూర్వికుఁడయ్యెను (ఆది $46^{24}$ సంఖ్యా $26^{49}$ I దిన $7^{13}$). ఇతని సంతతివారు ఎసెరీయులనఁబడిన (సంఖ్యా $26^{49}$).

## యొ

**యొక్తయేలు** (Joktheel = దేవునికి లోఁబడును)

1. యూదాలోని షెఫేలా ప్రదేశమున నున్న యొక గ్రామము (యెహో $15^{33-38}$). దీని యునికినిగూర్చి సరిగా తెలియదు.

2. యూదారాజగు అమజ్యా ఎదోమీయుల రాజధానియగు సెలను పట్టుకొని దానికి పెట్టిన క్రొత్త పేరు (II రాజు $14^{7}$).

**యొక్తాను** (Joktan = చిన్న). షేము సంతతివాఁడగు ఏబెరు కుమారుఁడు. ఇతఁడు అరబ్బీదేశములో నుండు 13 తెగలవారికి మూల పురుషుఁడయ్యెను (ఆది $10^{25-30}$ I దిన $1^{19-23}$). అరబ్బీయు లీ పదము అరబ్బీదేశములో నున్న కహ్తాను (*Kahtan*) గోత్రపు పేరుకు సమానమనుకొందురు గాని అది సందేహాస్పదముగా నున్నది.

**యొక్దెయాము** యొర్క్యాము చూ॥

**యొక్నెయాము** (Jokneam = ప్రజలు స్వతంత్రించుకొనవచ్చును). కర్మెలు పర్వత ప్రాంతములలో కనానీయులకు రాజ నగరముగా నున్న పట్టణము (యెహో $12^{22}$). జెబూలూను వారి స్వాస్థ్యమునకు దక్షిణహద్దుగా నున్నది ($19^{11}$). దానిని లేవీయుల కిచ్చిరి ($21^{34}$) యూదీతు $7^{5}$ లో అది కియామోను అనఁబడును. ఎస్డ్రేలను బయలుకు దక్షిణమందును, కర్మెలు పర్వతపు తూర్పుకొనకు ఉత్తరముగా నున్నది. ప్రస్తుతము దానిని టెల్ - కైమూను (*Tell-kaimun*) అని పిలుచుచున్నారు. అచ్చట నేటివఱకు పాడు శేషములు కలవు. (యొక్మెయాము చూ॥ పటము III, E 1).

**యొక్మెయాము** (Jokmeam = జనము సమకూర్చఁబడును). ఎఫ్రాయిములోని ఒక పట్టణము (I దిన $6^{68}$). దానిని లేవీయులకిచ్చిరి. యెహో $21^{22}$ లో దీనికి ప్రతిగా కిబ్సాయీము అను పేరుండుటచే అది దీనికి మాఱుపేరని కొందురు. I రాజు $4^{12}$ లో నున్న యొక్నెయాము దీనికి అచ్చు పొరబాటైయున్నది. ఈ పొరబాటు 1611 సం॥న జేసిన ఇంగ్లీషు తర్జుమాలో కూడ నున్నది. ప్రస్తుత మా యూరిని గూర్చిన చిహ్నము లేవియు గానరావు.

**యొక్షాను** (Jokshan = వేఁటకాఁడు!). అబ్రాహాము కెతురాల కుమారుఁడు (ఆది $25^{2}$). ఇతని కుమారులగు షబాను, దదాను అనువారు ఆ పేరుగల అరబ్బీ గోత్రములకు పూర్వికులైరి ($25^{3}$).

**యొగ్బెహా** (Jogbehah = ఎత్తుగానుండునది). గాదులోనుండు ఒక పట్టణము (సంఖ్యా $32^{35}$ న్యాయా $8^{11}$). ప్రస్తుతముండు ఎల్ - యుబైహాతు (*El Jubeihat*) దీని యునికి. అది రబ్బోతు అమ్మోనుకు 6 మైళ్లు వాయవ్యముగా నున్నది (పటము III, J 4).

**యొగ్లి** (Jogli = చెఱపట్టఁబడినవాఁడు). దాను గోత్రములలోని బుక్కి అను ప్రధాని తండ్రి (సంఖ్యా $34^{22}$).

**యొట్బ** (Jotbah = రమ్యమైనది). యూదా రాజగు ఆమోను తాతయైన హారూసు అనువాని దేశము. దాని యునికి తెలియదు (II రాజు $21^{19}$).

**యొత్బాతా** (Jotbathah = రమ్యమైనది). ఇశ్రాయేలీయులు అరణ్యములో ప్రయాణము చేయుచుండఁగా మఖాము చేసిన యొకస్థలము (సంఖ్యా $33^{33}$). అచ్చట చాల నీటివాగులు గలవు (ద్వితీ $10^{7}$) గాని యీ స్థలమునుగూర్చి యింకేమియుఁ దెలియదు.

**యొప్పే, యాఫో** (Joppa, Japho = సుందరమైనది). పలెస్తీనుదేశపు ముఖ్య రేవు పట్టణము. ఈ పేరుయొక్క హెబ్రీరూపము యాఫో. యెహో $19^{46}$ నందీరూపమును చూడ వచ్చును. యొప్పే అనునది గ్రీకు భాషా రూపము. అరబీయులు దీనికి యాఫా (*Yafa*) అను పేరుపెట్టిరి. ప్రస్తుతమున దాని యప్ప (*Jaffa*) యని పిలుచుచున్నారు. ఇది దాను గోత్రికుల కియ్యఁబడెను ($19^{46}$) గాని, వారు దాని నెన్నడైనను స్వాధీనపఱచుకొనినట్లు కనఁబడదు. పాఁత నిబంధన కాలమంతయు ఫిలిష్తీయుల యధీనమున నొకప్పుడును, ఫేనీకేయుల యధీనమున మఱియొకప్పుడు నుండెను. సొలొమోను పరిపాలనయందు ఫేనీకేరాజగు హీరాము ఈ రేవుకు లెబానోను మ్రానులను పంపెను (II దిన $2^{16}$). జెరుబ్బాబెలుకాలమున ఆలయము తిరిగి కట్టించినప్పుడు డీవిధముగానే కలపను తెప్పించిరి (ఎజ్రా $3^{7}$). ప్రవక్తయగు యోనా ఈ రేవుపట్టణములోనే పారిపోవు నిమిత్తము ఓడనెక్కెను (యోనా $1^{3}$). ఈ పట్టణమును పారసీకులును ఐగుప్తీయులును, అంతియొకయలో ప్రభుత్వముచేసిన గ్రీకువారును స్వాధీనపఱచుకొనిరి. మక్కబీయుల కాలములో యూదులు దానిని పట్టుకొనిరి (I మక్క $10^{75}$ $12^{33}$ $13^{11}$) తరువాత అది కొంతకాలమువఱకు ఐగుప్తు గ్రీసు దేశములకు లోఁబడినను, యూదయదేశమునకు చేరియుండెను (యోసీ $14^{4,4}$; $14^{10,6}$). రోమీయులు పలెస్తీనును జయించినప్పుడు దీనికి స్వతంత్ర మిచ్చినను, వారును దానిని యూదయలో జేర్చిరి. ఇచ్చటనే పేతురు తబితా అను నామెను బ్రదికించెను (కార్య $9^{39-43}$). ఆ పట్టణమందుండునప్పుడే దర్శనము కలిగెను



గోడలతో చుట్టబడిన యొప్పే పట్టణము

($9^{43}$-$10^{48}$). అతఁడిక్కడచేసిన పనివలన అనేకులు క్రైస్తవులైరి. తరువాత యెరూషలేమును నాశముచేయకపూర్వము (క్రీ॥ శ॥ 70 సం॥) రోమీయులు దీనిని ధ్వంసముచేసి, దాని నివాసులలో 8400 మందిని జంపిరి. క్రూసేడులను సిలువయుద్ధముల కాలములో (1126-1196) క్రైస్తవులు దీనిని పలుమారు పట్టుకొనిరి గాని చివరకు అరబ్బీయుల కది స్వాధీనమాయెను. 1799 సంవత్సరమునందు నెపోలియను (*Napolean*) దానిని జయించెను. గాని 1919 వఱకు తురుష్కుల యధీనమున నుండెను. అప్పటినుండి అది బ్రిటిషువారి సంరక్షణక్రింద నున్నది.



యొప్పే

ప్రస్తుతమున నది 40,000 మందిగల పట్టణమై యున్నది. యెరూషలేమున కది 34 మైళ్లు వాయవ్యదిక్కున నున్నది. ఇక్కడనుండి యెరూషలేమునకు రైలుమార్గము వేసిరి. ఇది అంతమంచి రేవుగల పట్టణముకాదు. దానిచుట్టు నుండు నారింజతోపులు లోకప్రసిద్ధిపడసినవి. తబితాగోరీని, చర్మకారుఁడగు సీమోను ఇంటిని నేటివఱకు చూపింతురు గాని, అవి నిజముగా ఆ స్థలములే యని నమ్ముటకు తగిన యాధారములు లేవు. (పటము I, C 7).

**యొర్దాను** (Jordan = దిగునది). పలెస్తీను దేశములోని ముఖ్యనది. ఆ దేశమును తూర్పు పడమరలుగా భాగించును (సంఖ్యా $34^{12}$ యెహో $22^{25}$). లెబానోను పర్వతములనుండి మృతసముద్రముదనుక పాఱును. వాటికి మధ్య నున్నదూరము 135 మైళ్లుమాత్రమేయైనను ఈ నది 250 మైళ్లు ప్రవహించును.

1. ఉత్పత్తి:—లెబానోను పర్వతములయం దుద్భవించు నాలుగు సెలయేళ్ల సంగమమే యొర్దాను నదియయ్యెను. వాటియందు మిగుల తూర్పున నుండునది బానియస్ (*Banias*) అని పిలువఁబడును. ఫిలిప్పుదైన కైసరియయొక్క నవీన నామమగు బానియస్ వలన దీనికీ పేరు కలిగెను. ఇది సముద్రమట్టమునకు 1200 అడుగుల యెత్తున నున్నది. దీనికి పడమరగా, పూర్వము దాను పట్టణమున్నస్థలమున లెద్దాను (*Leddan*) అను యేరు పుట్టి ప్రవహించుచున్నది. దీనికి పడమరగా హాస్బాని (*Hasbani*) అనెడి యేరుగలదు. ఇది నాలుగు యేళ్లలో పెద్దదై 40 మైళ్లు పాఱుచున్నది. తక్కిన మూఁడును దీనిలోకి పాఱునట్లున్నవి. ఇది సముద్రమట్టమునకు 1700 అడుగుల యెత్తున నున్నది. నాలుగవది అన్నిఁటికన్న పశ్చిమముగాను చిన్నదిగా నున్నది. దానిపేరు బారైట్

(*Bareight*). ఇది మేరోము చెరువుకు 5 మైళ్లు ఉత్తరముగా కలియుచున్నది. అచ్చటనుండి సముద్రమట్టమునకు 8 అడుగులయెత్తుమాత్రమే యున్న మేరోము చెరువులోకి యొర్దాను బహు వడిగా పాఱును. 4 మైళ్లకు తరువాత అది యా చెఱువునుండి దక్షిణముగా వెలువడి 10½ మైళ్లు ప్రవహించి 12½ మైళ్లపొడవుగల గలిలయ సముద్రములో పడును ఇది సముద్రపు మట్టమునకు 682 అడుగులు దిగువనున్నది గాన నది ఈ 10½ మైళ్ల దూరములో 690 అడుగులు దిగిపోవును. అది గలిలయ సముద్రపు దక్షిణమున మరల వెలువడి 65 మైళ్ల దూరమున నున్న మృతసముద్రమున కలియుచున్నది. ఈ యరువదియైదు మైళ్ల దూరములో వంకరటింకరలుగా అది ప్రవహించుటవలన నది పొడవు 200 మైళ్లగుచున్నది. మృతసముద్రము చేరునప్పటి కది యింకను 610 అడుగులు దిగును గాన మొత్తముమీఁద అది సముద్రమట్టమునకు 1292 అడుగులు లోతుగా నున్నది. సముద్రమట్టమున కింతదిగువగా నుండు లోయలో ప్రవహించు నట్టియొకనది లోకమున నింకెచ్చటను లేదు. పలెస్తీనునందు పశ్చిమమున పర్వతములుండి మధ్యధరాసముద్రములోని నీరు రాకుండ అడ్డుగోడవలె నున్నవి. లేనియెడల మేరోము చెఱువునుండి మృతసముద్రము దక్షిణమువఱకున్న లోయ యంతటిని నీటిచే నింపవీలగును.



యొర్దాను

2. ఉపనదులు:—పడమటి దిక్కునుండి పాఱున వన్నియు చిన్నవి. యెజ్రెయేలు లోయనుండి ప్రవహించెడి యాలూదు (*Jalud*), షెకెము నుండివచ్చు ఫారా (*Farah*) ముఖ్యములైనవి. తూర్పుదిక్కునుండి వచ్చువానిలో యర్మూకు (*Jarmuk*), యబ్బోకు (*Jabbok*) నదులు ముఖ్యములైనవి. (యర్మూకు, యబ్బోకు చూ॥).

3. రేవులు:-అనేకములు గలవుగాని బైబిలునందుదాహరింపఁబడినవి కొన్ని మాత్రమే. గలిలయ సముద్రమునుండి మృతసముద్రమువఱకు ఈ నది 2-12 మైళ్ల వెడల్పుగునట్టి మిగుల లోతైన లోయగుండ ప్రవహించును. ఈ నది 80-1[illegible] అడుగుల వెడల్పున నున్నది. దానియందలి నీ[illegible] లోతు 5-12 అడుగులు. వరదలులేనిసమ[illegible] మున దీనిని దాటుట అంతకష్టముకాదుగాని న[illegible] తీరములు మిగుల యెత్తగుటచేత, దిగుటయు ఎక్కు[illegible] టయు చాల కష్టముగ నుండును. మేరో[illegible] చెఱువునకును గలిలయసముద్రమునకు మధ్య రేవులున్నవి. గలిలయ మృతసముద్రము[illegible] మధ్య 54 గలవు గాని అవి యబ్బోకునదికి ఉ[illegible] మునను, యెరికోకు దక్షిణమున నున్నవి. వీ[illegible] మధ్య నొకటియు లేదు. రోమీయు లీ న[illegible]

దాటుటకు గలిలయసముద్రమునకు దక్షిణముగా వంతెనలను కట్టించిరిగాని అవి నేటికి శిథిలములైనవి. వాటి పాలకులవయే గానము. మొట్టమొదటి దానిని రేవులయొద్దనే దాటుచువచ్చిరి (I సమూ $13^{7}$ II సమూ $10^{17}$). యెరికో పట్టణము దగ్గరనున్న రేవును దాటుటకు దావీదు రాజుకాలమున నొక పడవ నుపయోగించినట్లు II సమూ $19^{18}$ లో నున్నది.

4. అరణ్యము:—యొర్దాను నదీతీరమున దట్టమైన అరణ్యమున్నది. అందు అడవిమృగము లతివిస్తారము. పూర్వమందు సింహములుండినట్లు యిర్మీ $49^{19}$ $50^{44}$ లో నున్నది. ప్రస్తుత మట్టి భయంకరమృగము లచ్చటలేకున్నను అడవి పందులు జింకలు నక్కలు లెక్కకు పెక్కులుగా గలవు. జెక $11^{3}$ నందు నదీతీరమున నున్న ఈ యడవులకు యొర్దానుయొక్క మహా రణ్యము అను పేరు తెలుగు బైబిలునందు కనబడును గాని అది యొర్దాను అతిశయాస్పదము అని యర్థమిచ్చుపదము అసలునందున్నది. ఇది యా ప్రాంతమందలి అరణ్యపు పుష్టిని తెలియజేయును.

5. చరిత్ర సంగతులు:—ఈ నదినిగూర్చిన బైబిలుసూచనలు ముఖ్యముగా గలిలయ మృత సముద్రముల మధ్యనున్న దానిగూర్చినవై యున్నవి. ఈ నదీప్రాంతముల ఫలవంతదశ లోతును ఆ ప్రదేశమున కాకర్షించెను (ఆది $13^{8-13}$). యాకోబు దీనిని యబ్బోకు సమీపమున దాటెను ($32^{10,22}$ $33^{18}$). ఇశ్రాయేలీయులు అద్భుతరీతిగా దాటి కనానులో ప్రవేశించిరి (యెహో $3^{1-17}$ $4^{1-24}$ కీర్త $114^{3,5}$). ఎండాకాల మారంభమగునప్పుడు హెర్మోనుమీది హిమము కరుగును గాన ప్రతి సంవత్సరము వరదలు కాలక్రమము తప్పక వచ్చుచుండును. యెహో $3^{14}$ నందు దీనివిషయమైన సూచన యొకటి గలదు. మిద్యానీయులు గిద్యోనుచే తరమబడినప్పుడు యొర్దానును యబ్బోకుకు ఉత్తరమున దాటిరి (న్యాయా $7^{24}$ $8^{4,5}$). దావీదు అబ్షాలోము తిరుగుబాటుచేసిన సమయమందు పారిపోవునప్పుడును, తిరిగి యెరూషలేమునకు వచ్చునప్పుడును యెరికోపట్టణముదగ్గర దీనిని దాటెను (II సమూ $17^{22-22}$ $19^{16-18}$). ఏలీయా తాను పరలోకమునకు సుడిగాలిలో తీసికొనిపోబడక పూర్వము తన శిష్యుడగు ఎలీషాతో దానిని అద్భుతరీతిగా పాయలుచేసి దాటెను (II రాజు $2^{5-8}$). తరువాత ఎలీషా తిరిగివచ్చునప్పుడు అదే రీతిగా యెరికోకు వచ్చెను ($2^{13-15}$). కుష్ఠరోగియగు నయమాను దీనిలో స్నానముచేసి స్వస్థుడయ్యెను ($5^{14}$). బాప్తిస్మమిచ్చు యోహాను దీని ప్రాంతములయందే బోధించి యేసుకును ఇతరులకును బాప్తిస్మమిచ్చెను (మ $3^{6,13-17}$). యేసు క్రీస్తు దీనిలో బాప్తిస్మము పొందినందున దీని నొక పుణ్యతీర్థముగా నెంచి క్రైస్తవ యాత్రికులలో కొందరు దీనిని దర్శింపవెళ్లుట పుణ్యమని యెంచెదరుగాని దాని నిట్లెంచుట క్రీస్తుబోధకు భిన్నమైనది (యోహా $4^{22,23}$). క్రైస్తవ కీర్తనల లోను కావ్యములలోను యొర్దాను మరణమునకు అలంకారరీతిగా నుపయోగింపబడుచున్నది. ఇశ్రాయేలీయులు యొర్దాను దాటుటద్వారా వాగ్దానభూమిలో ప్రవేశించినటుల, భక్తులు మరణముద్వారా పరమ కనాను అనబడు మోక్షమునందు చేరెదరనుటలో నా యలంకారము వాడుకలోకి వచ్చియున్నది.

**యొష్బెకాషా** (Joshbekashah = అయన మరల దుర్గతి కలిగించును?). హేమాను కుమారుడు (I దిన $25^{4}$). పాటకులలో నొకడై, 17 వ వంతువారికి పెద్దయాయెను ($25^{24}$). ఈ పేరును, ఆ జాబితాలో నుండి మరి 5 పేరులును ఒక కీర్తనలోని వాక్యములేగాని పేరులు కావని కొందరి యభిప్రాయము.

## యో

**యోకీమీయులు** (Jokim). యూదా సంతతివారిలో నొకడగు యోకీము సంతతివారు (I దిన $4^{22}$).

**యోకెబెదు** (Jochebed = యెహోవా మహాత్మ్యముగలవాడు). అమ్రాముయొక్క భార్య. అహరోను మోషే మిర్యాము అను వారి తల్లి (నిర్గ $6^{20}$ సంఖ్యా $26^{59}$). నిర్గ $2^{1}$ లో ఆమె లేవీ వంశములో పుట్టినట్లున్నది.

**యోజాకారు** (Jozacar = యెహోవా జ్ఞాపకముచేసికొనును). రాజగు యోవాషును

చంపించిన ఇద్దరిలో నొకఁడు (II రాజు $12^{21}$). II దిన $24^{26}$ లో నితనికి **జాబాదు** అను మాఱు పేరు కలదు (జాబాదు చూ॥). ఇతనితల్లి అమ్మోనీయురాలు.

**యోజాదాకు** యెహోజాదాకు చూ॥

**యోజాబాదు** (Jozabad = యెహోవా ఇచ్చెను).

1. సిక్లగులో దావీదును కలిసికొన్న యొక యూదుఁడు. అతనిది యూదాలోని గెదేరా అను గ్రామము (I దిన $12^{4}$).

2, 3. సిక్లగును పట్టుకొనిన అమా లేకీయులను తరుముటకు సహాయముచేసిన యిద్దఱు మనష్షీయులు (I దిన $12^{20}$).

4. రాజగు హిజ్కియా కాలములో ఆలయ విచారణకర్తలలో నొక లేవీయుఁడు (II దిన $31^{13}$).

5. రాజగు యోషీయా కాలములోని లేవీయుల ప్రధానులలో నొకఁడు (II దిన $35^{9}$).

6. ఎజ్రా కాలమున నున్న యొక లేవీయుఁడు (ఎజ్రా $8^{33}$). ఇతఁడు దిగువనున్న 7, 8 లోని వారిలో నొకఁడని కొందఱి తలంపు.

7, 8. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో నిద్దఱు (ఎజ్రా $10^{22,23}$).

9. ప్రజలకు ధర్మశాస్త్రము బోధించుటలో ఎజ్రాకు సహాయముచేసిన యొకఁడు (నెహె $8^{7}$).

10. దేవునిమందిరమును బాగుచేయుటకు ఏర్పఱచఁబడినవారిలో నొకఁడు (నెహె $11^{16}$). 9, 10 లోని వారు ఒకరే యని కొందఱి యభిప్రాయము.

**యోతాము** (Jotham, Joatham = యెహోవా యథార్థవంతుఁడు).

1. గిద్యోను 70 మంది కుమారులలో కనిష్ఠుఁడు. అబీమెలెకు పెదినందఱిని చంపి షెకెములో తనను రాజుగాఁ జేసికొనుటకై కుట్ర జేయుఁగా ఇతఁడు తప్పించుకొనెను. తరువాత షెకెము నివాసులకు చెట్లనుగూర్చి ఉపమాన మొకటి యొత్తి తగినబుద్ధి చెప్పెను (న్యాయా $9^{1-21}$).

2. యూదారాజులలో నొకఁడు. ఉజ్జియా కుమారుఁడు. క్రీ॥ పు॥ 750-734 సం॥ వఱకు నేలెను. తన తండ్రియగు ఉజ్జియా కుష్ఠరోగి యైనప్పుడే యోతాము అతనితోకూడ నేలెను (II రాజు $15^{5}$). ఉజ్జియా రెండవ యరొబాముకన్న నెక్కువకాలము జీవించినను, యోతాము తన తండ్రితోకూడా నేలుచుండఁగా (క్రీ॥ పు॥ 750-745), ఒకటేకాలమునందు యరొబాము ఇశ్రాయేలీయులను యోతాము యూదావారిని పరిపాలించిరి. దీనినిగూర్చి I దిన $5^{17}$ నందు కొంచెము సూచన గలదు. యోతాము 740 లో చక్రవర్తియై ఒంటరిగా యూదాదేశమును ఏలెను. అతఁ డమ్మోనీయులను జయించి వారి రాజ్యమును స్వతంత్రించుకొనెను (II దిన $27^{5}$). దేవాలయమునకు ఎత్తు ద్వారమును కట్టించెను ($27^{3-6}$). ఇతని యేలుబడిలో హోషేయ యెషయా యను ప్రవక్తలు జీవించిరి (హోషే $1^{1}$ యెష $1^{1}$). ఇతని కుమారుఁడగు ఆహాజుకాలమునందు ఇశ్రాయేలు దమస్కు రాజ్యములవారుచేసిన దండయాత్ర యోతాము కాలముచేయకపూర్వమే ఆరంభమైనట్లుగా నున్నది (II రాజు $15^{37-38}$). $15^{30}$ లో ఇశ్రాయేలీయులరాజగు హోషేయ యోతాము ప్రభుత్వములో నిరువదవ సంవత్సరమందు ఏలనారంభించెనని యున్నది. యోతాము అంతకాలము దనుక జీవించియుండెనా యనుదానిగూర్చి సందేహము కలుగుచున్నది. ఎట్లయినను II రాజు $15^{33}$ నందున్నట్లు అతఁడు 16 సంవత్సరములు మాత్ర మేలెను. ఈ $15^{30}$ లో నున్న 20 సంవత్సరములు, యోతాము అంతవఱకు జీవించియున్నవాఁడైనయెడల అది యతని 20 వ సంవత్సరమగును అట్లుకానియెడల లెక్కలను వేయుటలో ఎక్కడనో పొరపాటు వచ్చియుండవచ్చును. యోతాము మొత్తముమీఁద మంచివాఁడనియే చెప్పవచ్చునుగాని అతఁడు ఉన్నతస్థలములను తీసివేయకపోవుటచే విగ్రహారాధన చేయుటలో సహాయుఁ డయ్యెనని చెప్పవలెను (II రాజు $15^{34,35}$).

3. కాలేబు సంతతివారిలో నొకఁడు (I దిన $2^{47}$).

**యోద్** (Jod = [ఈ] అను అక్షరము). హెబ్రీ అక్షరములలో పదవది. 119 కీర్తనలో 73-80 వచనములలో ప్రతి పంక్తి ఈ యక్షరముతోనే యారంభమగును కావున ఈ భాగమునకు యోద్ అను పేరు పెట్టిరి.

**యోదా** (Joda). క్రీస్తు వంశావళిలో నొకఁడు (లూ 3[26]).

**యోనతేలెమ్ రెహోకీమ్** (Jonath-Elem Rehokim). 56 వ కీర్తన రాగమునకు పేరు. దూరమునందుండి మౌనముగా నుండువారి పావురము అనునది దీని శబ్దార్థము.

**యోనా** (Jonah = గువ్వ). గలిలయయందలి జెబూలూనులో నున్న గత్హెపెరు ఊరివాఁడయిన అమిత్తయియొక్క కుమారుఁడు (II రాజు 14[25]). రెండవ యరొబామునియొక్క యేలుబడియందో లేక దానికిముందో ఈ ప్రవక్త ఇశ్రాయేలుయొక్క సరిహద్దులు ఉత్తరమున హామాతుదిక్కు మొదలుకొని దక్షిణమున మైదానపు సముద్రమువఱకు వ్యాపించునని ప్రవచించియుండెను (14[25]). ఈ ప్రవచనము రెండవ యరొబాము కాలములో నెఱవేరెను. యోనా నీనెవె మహాపురమునకువెళ్లి ఆ పురవాసులు పశ్చాత్తాపపడనియెడల వారికి సమూలనాశనము కలుగునని వారికి ప్రకటించి హెచ్చరించవలయునని దేవుఁడు అతనికి సెలవిచ్చిన సంగతి యోనా గ్రంథమందు వ్రాయఁబడి యున్నది. ఆ పురవాసులు నాశనములో నుండి తప్పించుకొనుటకు అతని కిష్టములేదు గనుక అతఁడొక యోడనెక్కి మరియొకమార్గమున వెళ్లిపోయెను. అంతట నొక గొప్ప తుఫాను రాఁగా తుదకు నావికులు అతని నెత్తి సముద్రములో పడవేసిరి. అప్పు డొక గొప్ప చేపవచ్చి అతనిని మ్రింగెను. అప్పుడతఁడు పశ్చాత్తాపపడఁగా ఆ చేప అతనిని ఒడ్డున కక్కివేసెను. అతఁడు వెంటనే వెళ్లి దేవుని సెలవుప్రకారము జరిగించెను. నీనెవె పురవాసులు పశ్చాత్తాపపడి మాఱుమనస్సు పొందిరి గనుక దేవుఁడు వారియెడల కనికరించెను. దానిబట్టి యోనా అత్యుగ్రుఁడాయెను. అతనిలో దయాదాక్షిణ్య కనికరమును లేనందుకు దేవుఁడు అతనిని గద్దించెను. దేవుఁడు యూదులయెడల యెట్టి కటాక్షము జాలియును శాంతమును కలిగియున్నాఁడో ఇతర జనములయెడలకూడ అట్లే శాంతికటాక్షము కనికరములు గలవాఁడైయున్నాఁడను సంగతి యోనాకు తెలియకయుండెను (యోనా గ్రంథము). J. C.

**యోనా గ్రంథము** (The Book of Jonah). చిన్న ప్రవక్త లనఁబడిన వాటిలో 5 వ గ్రంథము.

I. భాగములు.

1. నీనెవెకుఁబోయి ఆ పట్టణస్థులకు బోధింపుమని దేవుఁడు యోనాకు ఆజ్ఞనియ్యఁగా అతఁడవిధేయుఁడై పారిపోవుచు అడ్డగింపఁబడుట (1). అతఁడు ప్రయాణము చేయుచున్న సముద్రముమీఁద అతని యవిధేయతవలన గొప్ప తుఫాను రేగినందున నావికులతని సముద్రములో పారవేసినప్పుడా తుఫాను నిమ్మళించుటయు యోనాను రక్షించుటకు దేవుఁ డొక మత్స్యము సిద్ధపఱచఁగా అది యాతని మ్రింగి రక్షించుటయు అనునవి ఈ గ్రంథములోని వింతలై యున్నవి.

2. యోనా మత్స్యగర్భమందుండి చేసిన ప్రార్థన (2). యోనా తన రక్షణనిమిత్తము దేవునికి చేసిన స్తుతి ప్రార్థనయై యున్నది. తరువాత మత్స్యమాతనిని కక్కివేసెను.

3. యోనా నీనెవెకు వెళ్లి అచ్చట బోధింపఁగా వారు విని పశ్చాత్తాపపడి దేవుని క్షమాపణ నొందినవారైనందున యోనా తన మాట తప్పినదని సణుగఁగా దేవుఁ డొక దృష్టాంతముచే నతనికి బుద్ధిచెప్పుట (3, 4).

II. బోధలు. మానవు లందఱును మళ్లుకొని రక్షణ నొందవలెనని దేవుఁ డాశించువాఁడనునది దీని ముఖ్య బోధయై యున్నది. తమ వారు మాత్రము రక్షింపఁబడి ఇతరులు నశింపఁగా సంతోషించెడి వారి మూర్ఖాభిమానములనుబట్టి వారి గ్రంథమందలి బోధవలన ఖండింపఁబడెదరు. తరుచుగా అన్యులు దేవుని ప్రజలకన్న త్వరగా గుణపడి నమ్మెదరనియు, యూదులైనవారు దేవుని సంగతుల నన్యులకు బోధింప నియమింపఁబడినవారనియు, దేవుని నియమములను అడ్డగించువారు తప్పించుకొనలేరను గొప్ప

బోధలుకూడ ఈ గ్రంథమునందున్నది. తన కాలమునందు జీవించిన వారి అవిశ్వాసమును గద్దించుటకు యేసుక్రీస్తు నీనెవెవారు దేవునితట్టు తిరుగుటను దృష్టాంతముగా నెత్తి చెప్పెను (మ 12[41] లూ 11[29-32]). అతఁడు మత్స్యగర్భమందు మూఁడు దినము లుండినపిదప దానిలోనుండి వచ్చుట తన పునరుత్థానమునకు ముంగుఱుతుగా నున్నదని చెప్పి గుఱుతులనుకోరిన యూదులను ఖండించుటకును ఈ గ్రంథమునుండి దృష్టాంతముల నెత్తి చెప్పెను.

III. ఈ గ్రంథమునకు అర్థము చెప్పెడి విధము: దీనినిగూర్చి తాత్పర్యభేదము లున్నవి. ఈ గ్రంథములోని సంగతులు అక్షరరీతిగా జరిగినవి యని మొదటినుండి నమ్ముచుండినట్లు ఇప్పుడు కూడ ఒక పక్షపువారు ఇది నిజముగా జరిగిన చరిత్ర యని యెంతురు. గొప్ప బోధలను చేయుటకు దేవుఁ డద్భుతములను చేయునని వారు నమ్మెదరు గాన ఇదియు నట్లే యద్భుతరీతిగా జరిగెనని వారి అభిప్రాయము. క్రీస్తు దీనిని చరిత్రగా నెంచినట్లే (మ 12[41] లూ 11[29-32]) మనమును దాని నెంచవలెనని వారు దృఢముగా బోధింతురు. నవీనశాస్త్రులలో ననేకులు దీని నొక యుపమానముగా భావింతురు. తాము మాత్రము దేవుని ప్రజలమనియు, ఇతరులు నశించినను వారి రక్షణకొఱకు తాము పాటుపడ నవసరము లేదను అభిప్రాయముతో నున్నందున దానిని ఖండించుటకు ఎవఁడో ఒక భక్తుఁడు యోనాను గూర్చిన యీ కథను కల్పించి ఆ కథ వలన ఈ బోధను నేర్పించెనని వా రనుకొందురు. దీనిలోని యద్భుతములను నమ్మకపోవుటవలన ముఖ్యముగా నిట్లు అభిప్రాయపడినను, యోనా గ్రంథములో నీనెవె పట్టణమునుగూర్చి చెప్పఁబడినదికూడ యోనా గ్రంథమునకు సరిపడక పోవుటచే ఇట్లు నమ్ముట యుక్తమని యందురు.

IV. గ్రంథరచనకాలము: పైనున్న రెండు భిన్నాభిప్రాయముల ననుసరించి ఈ గ్రంథ రచనను గూర్చియు, భిన్నాభిప్రాయములు కలవు. ఇది చరిత్రయని యభిప్రాయపడువారు అది ప్రవచన గ్రంథములలో మిగుల పురాతనమైన వాటియందొకటియని యెంతురు. యోనా రెండవ యరొబాము కాలములో జీవించెను (II రాజు 14[25]) కావున అది క్రీ॥ ము॥ 740 సం॥కు లోపల యోనాచేత రచింపఁబడెనని యనుకొనవలసినదిగాని యీ గ్రంథమును ఉపమానముగా నెంచెడివారు అది చెఱకాలమునకుఁ బిమ్మట యూదుల మూర్ఖాభిమానము వృద్ధియైన కాలములో నెప్పుడో ఒకానొకనిచే రచితమాయె నందురు.

## యోనాతాను, యెహోనాతాను
(Jonathan = యెహోవా యనుగ్రహించెను).

1. మోషే కుమారుఁడగు గేర్షోము సంతతివాఁడైన యొక లేవీయుఁడు (న్యాయా 18[30]). యూదా బేత్లెహేమునుండి బయలుదేరి తనకు స్థలము దొరికినచోట నివసింపవలెనని ప్రయాణము చేయుచు నితఁడు ఎఫ్రాయిమీయుల మన్యదేశమున నున్న మీకాను కలిసికొని యెహోవాకు ప్రతిష్ఠింపఁబడిన పోఁత విగ్రహమునకు పూజారి యయ్యెను (17[7-13]). తామున్న ప్రదేశమునుండి వలసఁ బోవుచుండిన దానీయులు మీకాచేయించిన విగ్రహమును దొంగిలించి అతఁడు పెట్టుకొన్న పూజారియగు నీ లేవీయునికి ఆశఁగొలిపి తమ గోత్రమంతటికి పూజారివిగా నుందువు రమ్మని వెంటఁబెట్టుకొని వెళ్లిరి. షిలోహులో మందిర మున్నంతకాలము దానీయు లా విగ్రహమును ఆరాధించిరి. యోనాతాను అను ఇతఁడు వారి యాజకులలో మొదటివాఁడుగ నుండి వారి పూజను సాగించెను (18[3-6,14-31]). మోషే సంతానపువాఁ డొకఁ డీ విధముగా తన వంశమంతటిని విగ్రహారాధికులకు పూజారిగా నుండుట ధర్మశాస్త్ర కర్తయైన మోషేకు అవమానముగా నెంచి దాని తొలగించుటకై హెబ్రీభాషలో నకారమును మాటకుపైఁగా వ్రాసి దానిని మనష్షే యని చదువుచు వచ్చిరి.

2. రాజైన సౌలుయొక్క జ్యేష్ఠపుత్త్రుఁడు (I సమూ 14[49] ని 20[31] తో సరిపోల్చుము). అతఁడొక వెయ్యిమందికి మొనగాఁడై యున్నట్లు మొదట అతనిగుఱించి చదివెదము. అప్పుడతని తండ్రియొద్ద రెండువేలమంది యోధులు గలరు. యోనాతాను గెబాలోనున్న ఫిలిష్తీయుల దండును హతము చేసెను (13[3]). తరువాత కొద్ది రోజులలో నీ యౌవనుఁడు తన ఆయుధముల మోయు

వాని సాయముతో మిక్మషుకు ఎదురుగా నున్న నొక ఎత్తయిన రాతికొండపై నెక్కి దానిమీద నున్న ఫిలిష్తీయులపైఁబడి వారి దండులో కలవరము పుట్టించెను. ఆ మార్గమున నరమాత్రు లెవరును రానేరరని దృఢముగా నమ్మియున్న ఫిలిష్తీయులు వీ రిద్దరిని బహుళః భూతములుగ భావించి పలాయనులై శత్రులను మిత్రులను పోల్చఁజాలక తమ్మును తామే చంపుకొనిరి (14$^{1-23}$). ఆ దినమందే తన తండ్రియగు సౌలుపెట్టిన శాపమును, చేయించిన ప్రమాణము నెఱుఁగనివాఁడై అసహాయ వీరుడగు యోనాతాను ఆకలిబాధను తీర్చుకొనుటకు మార్గమున దొరికిన తేనెను కొంచెము తినినవాఁడై సౌలుచే సంహరింపఁబడఁబోయెను గాని జనులు సౌలును ఆ క్రూర కార్యము చేయనియ్యక పోయిరి (14$^{24-46}$). దావీదు గొల్యాతుపై గొప్ప జయముగాంచినప్పుడు యోనాతాను అతనిని యథార్థహృదయముతో గాఢముగా ప్రేమించి యతని తన స్నేహితునిగా చేసికొనెను (18$^{1}$). ఒకానొక దినమున అతని మిత్రుఁడగు దావీదే యోనాతానుకు రాఁగలసిన రాజ్యమును పొందవచ్చునని సౌలెంతగా జెప్పినను పెడచెవిని బెట్టెను. సౌలు దావీదును హింసించి ఆతనిని చంపనై తరుముచుండఁగా యోనాతాను తనకు సాధ్యమైనంతమట్టు కతని తప్పించుటయే గాక అతనిని కలిసికొన వీలుగానప్పుడు తన తండ్రి చేయు రహస్య యత్నము లెప్పటికప్పుడు దావీదుకు తెలుపుచు అతనికెంతో ఉపకారము చేసెను. సౌలీ సంగతి నెఱిఁగినవాఁడై కుమారుఁడని యైనను చూడక దావీదుపై విసరినట్లు యోనాతానుమీఁదను ఈఁటెను విసరెను (18-20). సౌలును దావీదును సమాధానపఱచుట కేమైన వీలుగలుగునేమో యని యత్నించునప్పుడే యోనాతాను కిట్టి అపాయకరమగు పరాభవము సంభవించెను. దావీ దా సమయమున పొలములలో దాగుకొని కబురుకొఱ కెదురుచూచుచుండెను. సౌలు దావీదుకు కీడుచేయ నుద్దేశించి యున్నయెడల రెండవసారి తన ప్రయత్నము నిష్ఫలము కాకుండ తమ్ము నతిజాగ్రతతో అతఁడును అతని పక్షపాతులును కనిపెట్టియుందురని దావీదు యోనాతానులు ముందుగనే జాగ్రతపడి అట్టి సందేహమేమియు నెవరికిని కలుగకుండునట్లు యోనాతాను బాణములు ప్రయోగించుట ద్వారా సంకేత మేర్పరచియుండెను. అనుకొనిన సమయము వచ్చినప్పుడు యోనాతాను తన యేర్పాటుప్రకారముచేసి తన్ను కనిపెట్టుచున్న వారి కండ్లలో దుమ్ముగొట్టి, దావీదును రహస్యముగా కలిసికొని మాట్లాడెను. దీనికి తరువాత నీ మిత్రద్వయము మఱియొకసారి జీపు అరణ్యమున కలిసికొనిరి (I సమూ 23$^{16-18}$). యోనాతాను తన తమ్ములిద్దరితోను తండ్రితోను గిల్బోవ యుద్ధమున హతుఁడయ్యెను. శత్రువులు వారి శవములను బేత్షాను గోడలకు తగిలించిరి గాని యాబేష్గిలాదువారు వాటిని తొలఁగించి మిగుల గౌరవముగ భూస్థాపితము చేసిరి (31$^{1,11-13}$ I దిన 10$^{2,8-12}$). దావీదు యోనాతాను మరణమునుగూర్చి విని బహుగా దుఃఖించెను (II సమూ 1$^{17-27}$). యోనాతానుకు మెఫీబోషెతు లేక మెరీబ్బయలు అను కుంటికుమారుఁడొకఁడుండెను (4$^{4}$). యోనాతానును జ్ఞప్తి చేసికొని దావీదు ఇతనికెంతో దయచూపి ఉపకారము చేసెను. అతని సంతతివా రనేకతరములు ఎట్టి అపాయములేకుండ జీవించిరి (9$^{1-13}$ I దిన 8$^{33-40}$ 9$^{39-44}$).

3. దావీదు సహోదరుని కుమారుఁడు. ఇతఁడు గాతువాఁడైన ఒక రాక్షసుని చంపెను (II సమూ 21$^{21}$).

4. యాజకుఁడగు అబ్యాతారు కుమారుఁడు. అబ్షాలోము తిరుగుబాటు సమయమున దావీదు నొద్దనుండి కబురులు తీసికొని వెళ్లుచు వచ్చుచు నుండువాఁడు (II సమూ 15$^{27-36}$ 17$^{17-20}$). సొలొమోను రాజయ్యెనని అదోనియాకు వర్తమానముఁ దెచ్చెను (I రాజు 1$^{43}$).

5. ఒక శాస్త్రి. యిర్మీయాను ఇతని యింటనే ఖైదుజేసిరి (యిర్మీ 37$^{15,20}$ 38$^{26}$).

6. క్రీ॥ ము॥ అయిదవ శతాబ్దమందుండిన ప్రధాన యాజకుల వంశములోని యొకఁడు (నెహె 12$^{11}$).

7. దావీదుయొక్క యుద్ధశూరులలో నొకఁడు (II సమూ 23$^{32}$).

8. దావీదుయొక్క బొక్కసములమీఁది యధికారులలో నొకఁడు (I దిన 27$^{25}$).

9. ఒక లేవీయుడు (నెహె $12^{35}$).

10. యూదావాడగు కారేయా కుమారుడు. యెరూషలేము పట్టుపడిన తరువాత ఉండిన యొక శతాధిపతి (యిర్మీ $40^{8}$).

11. ఎబెదు అను నొకని తండ్రి (ఎజ్రా $8^{6}$).

12. అన్యస్త్రీలను పెండ్లాడినవారి విషయము తెలిసికొనుటకు నియమింపబడినవాడు (ఎజ్రా $10^{15}$).

13. ఒక యాజకుడు (నెహె $12^{14}$).

14. యూదా గోత్రములోని యెరహ్మెయేలీయులలో నొకడు (I దిన $2^{32}$)

15 మక్కాబీయులలో నొకడు (మక్కాబీయులు చూ.).

16. యూదా పట్టణములలో ధర్మశాస్త్రముపదేశించిన లేవీయుడు (II దిన $17^{8}$)

17. యెహోయాకీము కాలములోని మెలీకూ యింటివారిలోని యాజకపెద్ద (నెహె $12^{14}$).

18. దావీదుకాలమున ఆస్తిమీద నియమింపబడిన యొక పెద్ద (I దిన $27^{25}$). W.

**యోనాము** (Jonam = యెహోవా దయచూపెను) యోహాను అను పదమునకు మాఱురూపమైనట్లు కనబడుచున్నది. క్రీస్తు వంశావళిలోని యొకని పేరు (లూ $3^{30}$).

**యోబాబు** (Jobab = బూరధ్వని).

1 షేముసంతతివాడగు యొక్తాను కుమారుడు (ఆది $10^{29}$ I దిన $1^{23}$). ఇతడు అరబీదేశములోని తెగలలో నొకదానికి మూల పురుషుడు. అరబీయుల ప్రాతిశాసనములలోని యూహైబాబు (*Yuhaibab*) అనునది ఈ పేరు కావచ్చును.

2. ఎదోము రాజులలో రెండవవాడు (ఆది $36^{33}$ I దిన $1^{45}$).

3. యెహోషువకు విరోధముగా పోరాడిన యాబీనుకు సహాయుడై, ఓడిపోయిన మాదోను దేశపు రాజు (యెహో $11^{1}$ $12^{19}$).

4, 5. ఇద్దరు బెన్యామీనీయులు (I దిన $8^{9,18}$).

**యోబు** (Job = దేవునితట్టు తిరుగువాడు).

1. ఇశ్శాఖారు గోత్రములోని యొక కుటుంబమునకు పెద్ద (ఆది $46^{13}$). సంఖ్యా $26^{23}$ I దిన $7^{1}$ నందితనికి యాషూబు అను మాఱు పేరు గలదు. హెబ్రీ భాషయందీ పదమునకును తరువాతి పదమునకును గుణింతము వేఱువేఱుగా నున్నది.

2. పాత నిబంధనయం దుదాహరించిన భక్తశ్రేష్ఠులలో నొకడు. అతనిది ఊజుదేశము (యోబు $1^{1}$, ఊజు చూ.). యెహెజ్కేలితనిని భక్తపరులలో నొకనిగా ప్రశంసించెను (యెహె $14^{14,16,20}$). యోబు గ్రంథమునందితని సహనమునుగూర్చిన సంగతులుతప్ప ఇతనిగూర్చి మఱేమియు దెలియదు. ఇతడు బైబిలులోను (యాకో $5^{11}$) లోకోక్తులలోను సహనమునకు సూచనగా నెంచబడును

**యోబు గ్రంథము** (The Book of Job). పాత నిబంధన కావ్యగ్రంథములలో మొదటిది గాని హెబ్రీ బైబిలునందు అది కీర్తనలకును సామెతలకును తరువాతనున్న మూడవదిగా నున్న కావ్యగ్రంథమగును

I. గ్రంథరచన. ఇది యోబునుగూర్చిన గ్రంథముగాని అది యతనిచే రచింపబడినదనుటకే సూచనయు నీ గ్రంథమున లేదు. యోబు గాక మఱియొకడీ గ్రంథమును వ్రాసినట్లు గ్రంథపఠనవలన దెలియును ($1^{1-5}$ చూ.). ఇది యోబుకాలమున రచింపబడెనో లేక తరువాతి కాలమున రచింపబడెనో దానినిగూర్చికూడ చెప్ప వీలుగాదు గాన దాని రచనకాలము తెలియదు. ఇది యొకని రచితముగాక పలువుర రచితమని కొందఱు నవీనపండితుల యభిప్రాయముగాని ఈ గ్రంథముయొక్క ఉద్దేశము ఒక్కటియై, దాని నాధారముచేసికొని రచనక్రమ ముండుటనుబట్టి ఒకనిచేతనే రచింపబడినదని యెంచుట యుక్తము.

II. ఉద్దేశము. యోబు చాల గొప్పవాడైనను అతని కనేక శ్రమలు కలిగెను. దేవుడు తనవారి కిట్టి శ్రమలెందుకు రానిచ్చినను సంశయములకు సమాధానము చెప్పుట ఈ గ్రంథమునకు ముఖ్యోద్దేశమై యున్నది. ఈ దేశమునందు తలంచురీతిగనే యోబు స్నేహితులుకూడ ఇట్టి

కష్టములు పాపమువలననే కలిగినవని వాదించిరి. పూర్వజన్మ పాపమువలనఁ గాక అతఁడు తన జీవిత కాలమునందుచేసిన వాటివలన కలిగెనని చెప్పిరి. వారి యుద్దేశము సరికాదని యోబు ఎంత దృఢముగా వాదించినను సరియైన యుద్దేశమును తెలుపఁజాలక పోయెను. భక్తులవిశ్వాసమును పరీక్షించి దానిని స్థిరపఱచుటకే దేవుఁ డిట్టి కష్టములను వారికి రానిచ్చునని దీని గ్రంథకర్త తన యభిప్రాయమును తెలియఁజేసెను.

III. ఈ గ్రంథమందలి ముఖ్య బోధలు: మొత్తముమీఁద ఈ లోకమునందు కష్టములు పాపమువలన కలిగినను, చేసినపాపము కొలఁది ప్రతిదాని కిచ్చుటనే శిక్షలు కలుగుననుకొనరాదను బోధ దీనియందున్నది. గొప్ప మహిమ ప్రభావములచే నగోచరుడుగా నున్న దేవుడు చేయు ప్రతిదానిని మితజ్ఞులమగు మనము తెలిసికొనఁజాలము గాని మన మాయన మహాత్మ్యముల నెఱిఁగి ఆయనను నమ్మఁగలము. ఇట్లు నమ్మినయెడల ఇప్పటి శ్రమ లెన్నతగినవి కావనునది (రోమా $8^{18}$) దీని బోధయై యున్నది. సాతాను దేవుని పరివారములో నున్నట్లు చెప్పబడిన దృష్టాంతమును జూచి ($1^{6}$) ఆక్షేపింతురు గాని ఇట్టి కావ్యగ్రంథములో అట్టి దృష్టాంతములలో ప్రతిదానిని అక్షరరీతిగా గ్రహించుకొనవసరములేదు. సాతానుకూడ దేవుఁడుపెట్టు పరిమితి ననుసరించియే గాని దానికిమించి శోధింపనేరఁ డనునది యిట్టి దృష్టాంతములచే సూచింపఁబడును. యోబు చెప్పిన మాటలలోఁ గొన్ని అతఁడు తన నిర్దోషత్వమును రుజావుచేసికొనుటలో దేవునిమీఁద నేరస్థాపన చేయుచున్నట్లున్నది గాని అది యోబు ఉద్దేశముకాదు. అన్యాయములగు వాదముల చేతనైనను దేవుని న్యాయమును స్థాపింప యత్నముచేయకపోయిన యోబు అసత్యపుసంగతులను చెప్పుటచే దానిని స్థాపింపఁబూనుకొనిన స్నేహితులకన్న శ్రేష్ఠుఁడై దేవునిచేత నంగీకరింపఁబడినవాఁడై యుండెననునది దీని బోధయై యున్నది. ఈ లోకమునందు తన నిర్దోషత్వమును రుజావు పఱుపఁజాలనని యోబు తలంచినను దేవుఁడే దానిని స్థాపించుననునమ్మకమును కనఁబఱచి రాఁబోవు జీవమునుగూర్చి పాఁత నిబంధన భక్తులందఱికన్న గొప్ప నిరీక్షణను చేటగా కనఁబఱచెను ($19^{25,26}$). ఈ లోకమునందు భక్తులైనవారికి సంభవించు ఇట్టి కష్టముల వలన కలుగు స్థితి రాఁబోవు లోకములో క్రమపఱచఁబడును అనునది ఈ గ్రంథములోని బోధలలో నొక దివ్యబోధనుగా నెంచవలెను.

IV. గ్రంథ క్రమము, ముఖ్యభాగములు. ఇది కావ్యగ్రంథమైనను దీని పీఠికయు ($1\text{-}3^{2}$) ఆయావారల ఉపన్యాసపు ముందు మాటలును ($3^{1}$ $4^{1}$ $6^{1}$ $8^{1}$ $32^{1\text{-}5}$) దీని ముగింపు సంగతులు ($42^{7\text{-}17}$) వచన రీతిగా నున్నవి. ఈ విషయములో అది యితిహాసముల క్రమము ననుసరించును. పీఠికయందు యోబుకున్న మొదటి సౌఖ్యమును భక్తియు తరువాత అతనికి కలిగిన కష్టములున్నవి. మొదట అతఁడు ఆస్తిని బిడ్డలను పోఁగొట్టు కొనెను. తరువాత అతని శరీరమునకు చెప్ప శక్యముగాని కష్టములు కలిగెను. అతని ముగ్గురు స్నేహితులగు ఎలీఫజు బిల్దాదు జోఫరు అనువారు (ఆ పదములను చూ॥) అతని నాదరించుటకు వచ్చిన సంగతియు దానియందు గలదు ($1\text{-}3^{2}$).

$3^{2}$-$42^{7}$ వఱకు ఈ గ్రంథమునందున్న యోబు కష్టములకు కారణమేది యను విషయమును గూర్చిన చర్చ వివరింపఁబడి యున్నది. ఇది యంతయు కావ్యరీతిగా అనేక యలంకారములతో నున్నది. దీనిలోని ముఖ్యవిషయము లెవ్వి యనఁగా,

1. యోబుకును అతని స్నేహితులకును కలిగిన వాదము $3^{2}$-$31^{40}$. ఈ వాదమునందు యోబు తన జన్మదినమునుగూర్చి యంగలార్చి దానిని శపించిన పిమ్మట (3) ఎలీఫజు బిల్దాదు జోఫరు అను ముగ్గురుస్నేహితు లతనితో నొకరి తరువాత నొకరు మూఁడేసి మారులు వాదించిరి గాని మూఁడవసారి మాత్రము జోఫరు అనువాఁడు వాదించలేదు. అతఁడు మాట్లాడక పోవుటయే వారు యోబు కెదురుచెప్పఁజాలక పోయిరనుదానికి సూచనగా నున్నది. ఈ కష్టముల కన్నిఁటికి యోబుచేసిన దుష్టకార్యములే కారణమని వారు మొదట సూచనరీతిగను తరువాత క్రమక్రమమున స్పష్టముగా చెప్పి వాదించినందున యోబు తన నిర్దోషత్వమును వదలక అది తన కష్టములకు కారణము కానే కాదని తర్కించెను.

2. వారి వాదములో ఓడిపోయిరని ఎలీహు అను నొకఁడు చూచి ఈ కష్టమునకు పాపమునకు శిక్షలుగాక దేవుఁడు తన భక్తుల మేలు నిమిత్తము పరీక్షార్థముగా పంపించుచున్నవియై యున్నవని వాదించెను (32-37). ఇట్లతఁడు వాదించుచుండఁగా యోబు అతఁడు చెప్పిన దానిని అంగీకరించి తరువాత దేవుఁడు ప్రత్యక్షుఁడై చేయనైయున్న బోధనుకూడ అంగీకరించుట కుద్యుక్తుఁడయ్యెను.

3. యెహోవా స్వయముగా యోబుతో మాట్లాడుచు దేవుని మహాత్మ్యము నెదుట నిలిచి మానవుఁడు తన పక్షముగా వాదించుకొనుటకు తగినవాఁడు కానందున అతఁడు దేవుని సన్నిధిని మానియై ఆయనను నమ్మవలెనని బోధింపఁగా యోబు తన్నుతాను తగ్గించుకొని యట్లు చేసెను.

పైనున్న 2, 3 భాగములు అసలు గ్రంథములోనివిగాక తరువాత చేర్చఁబడినవని కొందఱనుకొందురు గాని వారీ గ్రంథ క్రమమును చెరుపుట మాత్రమే గాక తగిన ముగింపులేని గ్రంథముగ చేసెదరు.

$42^{7-16}$ నం దిట్టి కష్టములలో దేవుని నమ్మి ఆయన నెంతమాత్రము విసర్జింపని యోబు మునుపటికన్న నెక్కువగ నాశీర్వదింపఁబడినవాఁడై యున్నాఁడని వివరించి, ఇది యట్టి పరీక్షకు ఫలితమని కనఁబఱచి ఈ గ్రంథమును ముగించెను.

**యోబు బావి** యెరూషలేము A II, చూ॥

**యోబేలు కొమ్ములు** సంగీతము 3 (2) (*c*) చూ॥

**యోబేలు బూరలు** సంగీతము 3 (2) (*d*) చూ॥

**యోయాకీము** (Joakim = యెహోవా స్థిరపఱచును). చెఱకాలమునకుఁ దరువాత ప్రధానయాజకుఁడుగా నున్న యేషూవ కుమారుఁడు. అతని తరువాత ప్రధాన యాజకుఁడయ్యెను (నెహె $12^{10,12,26}$).

**యోయారీబు** యెహోయారీబు చూ॥

**యోరా** (Jorah). జెరుబ్బాబెలుతో కూడ బబులోనుకు తిరిగివచ్చిన యొక కుటుంబపు పేరు (ఎజ్రా $2^{17}$). నెహె $7^{24}$ లో దానికి హారీపు అను మాఱుపేరు గలదు.

**యోరాము** యెహోరాము చూ॥

**యోరీము** (Jorim). క్రీస్తు వంశావళిలోని యొకఁడు (లూ $3^{29}$).

**యోరై** (Jorai). గాదీయుల పెద్దలలో నొకఁడు (I దిన $5^{13}$).

**యోర్కెయాము** (Jorkeam = స్థిరతి, భయము). కాలేబు సంతతివారిలో కొందఱు నివసించిన యొక స్థలము (I దిన $2^{44}$). యెహో $15^{56}$ లో నున్న యొక్దెయాము ఆ స్థలమై యుండవచ్చును. అది యూదా దక్షిణ భాగమందున్నది. దాని యునికిని గూర్చి నూటిగాఁ దెలియదు.

**యోవాబు** (Joab = యెహోవా అతని తండ్రి).

1. దావీదు సోదరియగు సెరూయా కుమారుఁడు. అబీషై అశాహేలు అనువారి సహోదరుఁడు. దావీదు రాజ్యపరిపాలన కాలములో సైన్యాధిపతి (II సమూ $2^{13,29}$ $10^{7}$ I రాజు $11^{15}$ I దిన $27^{34}$). యుద్ధశూరుఁడును పరాక్రమశాలియైన నాయకుఁడు. వివేకముగల రాచకార్య నిర్వాహకుఁడు. అబ్షాలోము తిరుగుబాటు, ఇశ్రాయేలీయులను లెక్కించుట మున్నగు రాజ్యాంగ విషయములో తన బుద్ధిబలమును చక్కఁగా నుపయోగించెను II సమూ $18^{19}$ 24) కాని, దురహంకారియు ఈర్ష్యాళువును పాపభీతి లేనివాఁడునై యుండెను. తన సాటివాఁడగు అబ్నేరును, జ్ఞాతియగు అమాశాను విశ్వాసఘాతకుఁడై రహస్యముగా చంపుట ($3^{27}$ $20^{9,10}$), దావీదతనియెడల కనఁబఱచిన క్షమ ($8^{39}$ $19^{5}$), ఊరియా విషయములో నతఁడగుపరచిన యుపేక్షాభావము, అబ్షాలోముహత్య, అదోనీయాకుట్ర మున్నగువాని నిమిత్తము యోవాబు బలిపీఠము నాశ్రయించినను సొలొమోను ఆజ్ఞానుసారముగా చంపఁబడెను (I రాజు 2).

2. శెరాయా అనువాని కుమారుఁడు. ఇతని పూర్వికులు యెరూషలేమున కుత్తరముగా నున్న

లోయలో నివసించినపనివారై యుండిరి (I దిన 4[13,14]).

8. చెఱనుండి తిరిగివచ్చిన యొక కుటుంబపు పెద్ద (ఎజ్రా 2[8] 8[9] నెహె 7[11]). H.

**యోవాషు, యెహోయాషు** (Joash, Jehoash = హెబ్రీ భాషలో ఈ పదములు మూఁడువిధములుగ వ్రాయఁబడినవి. తెనుఁగునందు రెండువిధములుగా గుణింతము చేసినను అవి అసలుపదములకు సరిపడక తారుమారుగా నున్నవి. యోవాషు అను రూపముగల అసలుమాట రెండు అర్థములిచ్చును. వాటి రెంటిని విడివిడిగా నుదాహరింతుము).

I. యెహోవా బలముగలవాఁడు అని అర్థమిచ్చుపదములు.

1. యూదులలో నొకఁడు (I దిన 4[22]).

2. గిద్యోను తండ్రి, (న్యాయా 6[11-31]). మనష్షే గోత్రికుఁడు. ఒఫ్రా కాపురస్థుఁడు. స్థితిపరుఁడని కనఁబడుచున్నది. స్వయముగా బయలుకు వేదికను కట్టించెను. గిద్యోను దానిని నాశము చేయఁగా, ఆ యూరివా రతనిమీఁదకు వచ్చినప్పుడు అతఁడు గిద్యోను పక్షమవలంభించి బయలు తనసంగతి తాను చూచుకొనలేదా యని, గిద్యోనుకు యెరుబ్బయలను పేరు పెట్టెను (6[32]).

3. గిబియానుండివచ్చిన యొక బెన్యామీనీయుఁడు. దావీదు సిక్లగులో నుండఁగా వచ్చి అతనితోఁ జేరుకొనెను (I దిన 12[3]).

4. ఇశ్రాయేలురాజగు అహాబు కుమారుఁడు. అహాబితనియొద్దకు ప్రవక్తయైన మీకాయాను పంపి చెఱలో వేయించెను కాన నితఁడు రాజ్యమందలి ఉద్యోగస్థులలో నొకఁడనియు కనఁబడుచున్నది (I రాజు 22[26] II దిన 18[25]).

5. యూదారాజులలో నొకఁడు. అహజ్యా కుమారుఁడు. ఇతని అవ్వయు యెజెబెలు కుమార్తెయునగు అతల్యా తన కుమారుఁడగు అహజ్యా మరణాంతరమున రాజవంశస్థులనందఱిని కుట్రజేసి చంపి రాణికాఁగా, యోవాషు అను నితఁడొకఁడే తన మేనత్తగారివలన తప్పింపఁబడెను. అప్పటికితఁడు పసివాఁడు (II రాజు 11[1-3]). ఇతనిని ఆలయములో దాచిపెట్టిరి. ఏడేండ్ల ప్రాయమువచ్చినప్పుడు ప్రధానయాజకుఁడు తగిన యేర్పాటులుజేసి, యోవాషును రాజుగా నభిషేకించెను. తరువాత అతల్యాను చంపించి, (11[4-16]), రాజు, చిన్నవాఁడై యున్నంతకాలము తానే రాజ్యభారమును వహించెను. ప్రజలందఱును యోవాషును రాజుగా నంగీకరించి యెహోవాను సేవించునట్లు నిబంధనఁ జేయించెను. ఈ కాలములోనే బయలు విగ్రహములను తీసివేసి వాటి పూజారిని చంపించిరి (11[17-20] II దిన 23[10-21]). యోవాషు క్రీ॥ ము॥ 837 లో రాజయ్యెను. అతల్యా రాజ్యము నపహరించినందున ఆమె ప్రభుత్వకాలమును ఇతని కాలముగానే లెక్కింపఁబడినదని కొందఱి యభిప్రాయము. అతఁడు రాజ్యమేలినది 40 సంవత్సరములు (II రాజు 12[1] II దిన 24[1]). కావున అతని ప్రభుత్వము 798 సం॥ వఱకు నుండెను. అతని పెంచి పెద్దవానిగాఁ జేసిన ప్రధానయాజకుఁడగు యెహోయాదా బ్రతికినంతవఱకు అతఁడు మంచివాఁడుగానే యుండెను. ఈ కాలమునందే యతఁడు దేవాలయమును మరమ్మతు జేసెను (II రాజు 12[1-16]). అయితే యెహోయాదా మరణాంతరమున అతఁడును ప్రజలును భ్రష్టులై విగ్రహములను సేవించువారైరి. ప్రవక్తయగు జెకర్యా దీనినిమిత్తము రాజును ప్రజలను గద్దించఁగా, అతని చంపుటకు రాజు సెలవిచ్చినందున రాళ్లతో కొట్టి దేవాలయ ప్రాంగణములలోనే యతని చంపిరి (II దిన 24[16-22] మ 23[35]). తరువాత సిరియనులు యెరూషలేముమీఁదికి దండెత్తివచ్చి యోవాషును బాధపఱచిరి (II దిన 24[23,24]). యోవాషు సేవకులే అతనిమీఁద కుట్రజేసి చంపివేసిరి (24[25,26]).

6. ఇశ్రాయేలురాజగు యెహోయాహాజు కుమారుఁడు. ఇతఁడును ఇశ్రాయేలువారికి రాజై క్రీ॥ ము॥ 799-784 వఱకు నేలెను. ఇశ్రాయేలీయులలో విగ్రహారాధన నుండనిచ్చినను, ప్రవక్తయగు ఎలీషాను ఘనపఱచెను. ఆ ప్రవక్త సూచించినరీతిఁగా నతఁడు దమస్కువారిని ఓడించెనుగాని, అంత ఆసక్తిగలవాఁడు కానందున సంపూర్ణజయము నొందఁజాలక పోయెను (II రాజు 13[14-25]). యూదారాజగు అమజ్యా యితని సేనలో కొందఱిని తనకు సహాయముగాఁ

తీసికొని ఎదోమీయులపైకి వెళ్లవలెనని యుండి, తరువాత వారి నూరకయే పంపినందున వారు యూదాదేశములో కొన్ని యూళ్లను దోచు కొనిరి (II దిన $25^{6-10,13}$). ఇతఁడు అమజ్యాతో యుద్ధముచేసి, అతని నోడించి, యెరూషలేము ప్రాకారమును కొంత పడఁగొట్టి, దేవాలయమును రాజనగరును కొల్లఁబెట్టి, కొందటిని జామీనుగా పట్టుకొనిపోయెను (II రాజ $14^{8-16}$ II దిన $25^{17-24}$).

II. యెహోవా సహాయపడుటకు త్వరపడు నను పదము.

1. ఒక బెన్యామీనీయుఁడు (I దిన $7^{8}$).

2. దావీదు నూనెకొట్ల పైవిచారణకర్త (I దిన $27^{28}$).

**యోవాహు** (Joah = యెహోవా సహోదరుఁడు).

1. రాజగు హిజ్కియా యుద్యోగస్థులలో నొకఁడు (II రాజ $18^{18,26}$ యెష $36^{3}$).

2. ఒక లేవీయుఁడు. ఇతఁడొక కుటుంబ మునకు పెద్ద (I దిన $6^{21}$ II దిన $29^{12}$). I దిన $6^{42}$ లోని ఏతాను ఇతఁడేయై యున్నట్లున్నది.

3. ద్వారపాలకులుగా నున్న లేవీయులలో నొకఁడు (I దిన $26^{4}$).

4. రాజగు యోషీయా యుద్యోగస్థులలో నొకఁడు (II దిన $34^{8}$).

**యోవేదు** (Joed = యెహోవా సాక్షి). ఒక బెన్యామీనీయుఁడు (నెహె $11^{7}$).

**యోవేలు** (Joel = యెహోవా దేవుఁడు.)

1. చిన్న ప్రవక్తల గ్రంథము లనఁబడిన వాటిలో రెండవదాని గ్రంథకర్త. అతని తండ్రి పేరు పెతూయేలు. అతఁడు యెరూషలేము యూదయలలో ప్రవచించినవాఁడని అతని గ్రంథమును పరిశీలించుటవలనఁ దెలియునుగాని అతని చరిత్రనుగూర్చిన యితర సంగతు లెవ్వి యును తెలియవు.

2. సమూయేలు కుమారులలో నొకఁడు (I సమూ $8^{2}$ I దిన $6^{33}$). I దిన $6^{28}$ లో ఇతనికి వష్నీ యను మాఱుపేరు కలదు.

3. సమూయేలు పూర్వికులలో నొకఁడు (I దిన $6^{36}$). I దిన $6^{24}$ లో ఇతనికి షావూలు అను మాఱుపేరు కలదు.

4. షిమ్యోను కుటుంబ ప్రధానులలో నొకఁడు (I దిన $4^{35}$).

5. రూబేను సంతతివారిలో నొకఁడు (I దిన $5^{4,8}$).

6. గాదుగోత్రపు ప్రధానులలో నొకఁడు (I దిన $5^{12}$).

7. ఇశ్శాఖారు ప్రధానులలో నొకఁడు (I దిన $7^{3}$).

8. దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{38}$ ఇగాలు 2 చూ॥).

9. ఒక లేవీయుఁడు (I దిన $15^{7,11,17}$).

10. లేవీయులలో నింకొకఁడు (II దిన $29^{12}$).

11. లేవీయులలో మఱియొకఁడు (I దిన $23^{8}$ $26^{22}$).

12. మనష్షే గోత్రపు ప్రధానులలో నొకఁడు (I దిన $27^{20}$).

13. అన్యస్త్రీలను వివాహముచేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{43}$).

14. చెఱకాలమునకు తరువాత బెన్యామీనీయులకు పెద్దగా నుండినవాఁడు (నెహె $11^{9}$).

**యోవేలు గ్రంథము** (The Book of Joel). చిన్న ప్రవచన గ్రంథములనఁబడిన వాటిలో రెండవది.

I. యోవేలు ప్రవచించిన కాలము: యూదా దేశము మిడుతల దండ్లచే తినివేయఁబడిన కాలమున యోవేలు ప్రవచించెను ($1^{4-12,17-20}$) మిడుతలని ఆ వాక్యములందు చెప్పఁబడినవి మిడుతలుగాక ఆ దేశముపై విస్తారముగా దండెత్తి వచ్చిన సేనల సమూహములని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల దేశము శత్రు సమూహములచే లయపఱచఁబడిన కాలమున యోవేలు ప్రవచించెనని చెప్పవలెను గాని పలెస్తీనులో మిడుతలు దేశమందలి పంటలన్నిఁటిని పాడుచేయుట అరుదైన సంగతి కాదు (ఆమో $7^{1-4}$). అవి ఉత్తరదిక్కు నుండివచ్చి

పడమటి సముద్రములో పడుట ఇతర సమయములలోను కనఁబడెను కావున, వీటినిగూర్చిన సంగతులు యోవేలు వ్రాసిన దానికి చక్కఁగా సరిపడును (2²⁰). అవి యొక సైన్యవ్యూహము వలె వచ్చినట్లు 2 వ అధ్యాయమందు వర్ణింపఁబడినది. అదియు మిడుతలువచ్చు క్రమమును సూచించును. కావున ఇవి సేనలుకాక మిడుతలే యని అనుకొనుట మంచిది.

II. యోవేలు గ్రంథమును రచించిన కాలము:

యూదు లీ గ్రంథమును చిన్న ప్రవక్తలలో రెండవదానినిగా పెట్టుటనుబట్టి మొదట వ్రాయఁబడిన ప్రవచన గ్రంథములలో నొకటి యని వారు యెంచినట్లు స్పష్టమగును. దానిని వ్రాసిన కాలమున ఆలయమండలి యాచారములు క్రమముగా జరిగెను (1⁹,¹³ 2¹⁴,¹⁷). దేవాలయమింక నిలిచియుండెను (1¹⁴). యెరూషలేము గోడలు నిలిచియున్నట్లు కనఁబడుచున్నది (2⁹). అందువలన హోషేయ ఆమోసు అనువారివలె నితఁడును క్రీ॥ పూ॥ 9 వ శతాబ్దమున రచియించెనని మొదటి నుండి నవీనకాలమువఱకు అనుకొనుచు వచ్చిరి. ప్రస్తుతమును అట్లనుకొనుటకు తగిన యాధారములున్నవని అనేకుల అభిప్రాయము గాని చెఱనుండి తిరిగివచ్చిన పిదప దేవాలయమును తిరిగి కట్టిన తరువాత ఇది రచింపఁబడెనని నవీన పండితులలో ననేకులు తలంచుచున్నారు. ఇశ్రాయేలీయులు చెఱయందున్నట్లు సూచించు వాక్యములును (3¹,²), హెల్లేనీయులకు బానిసలుగా వారిని అమ్మినట్లున్న వాక్యములును (3⁶) ఈ యభిప్రాయమున కాధారములని యెంచెదరు. హెల్లేనీయులు 9 వ శతాబ్దమునం దింక వృద్ధిలోనికి వచ్చియుండలేదు గాన ఇది నాలుగవ శతాబ్దమున కొక సూచన యని వారి తలంపు గాని, 9 వ శతాబ్దమునందు వ్రాయఁబడిన దను వారు హెల్లేనీయులను గూర్చిన సంగతి హెల్లేనీయులకుఁగాక దూరదేశస్థులైనవారిని గూర్చిన సూచన యని వాదింతురు. దీనినిబట్టి యోవేలు గ్రంథము పురాతన ప్రవచనములలో నొకటియై 9 వ శతాబ్దమున ప్రవచింపఁబడి 4 వ శతాబ్దమున వ్రాయఁబడినట్లు చెప్పఁదగును.

III. ముఖ్యోద్దేశము, ముఖ్య బోధలు:

మిడుతలవలన కలిగిన నాశనము ప్రజల పాపములకైన దేవుని శిక్షగా ఎంచి దానినిబట్టియే ప్రజలు గుణపడవలెనని హెచ్చరించుట కే తీర్పు యెహోవా దినము అనఁబడు అంత్య దినమున కలుగఁబోవు గొప్ప తీర్పుకు సూచనగా నున్నది. కావున దానివలన మనుష్యులకు హెచ్చరిక కలుగునట్లిది వ్రాయఁబడెను. అన్యులకు తీర్పు చేసి యెరూషలేమును విమోచించి, ప్రజలందఱి మీఁద కుమ్మరించుటవలన దేవుఁడు తన రాజ్యమును చిరకు స్థాపించుననునది దాని ముగింపువిషయమై యున్నది. ఆత్మను కుమ్మరించుటను గూర్చిన ప్రవచనము (2²⁸⁻³²) పరిశుద్ధాత్మ రాకడవలన నెఱవేఱెనని పేతురు చెప్పెను (కార్య 2¹⁶⁻²¹). ఆ వాక్యములో నుండియే పౌలు కొక భాగముసెత్తి అన్యులుకూడ దేవుని రాజ్యములోఁ జేరెదరని బోధించెను (రోమా 11¹³).

IV. ముఖ్యవిషయములు, భాగములు:

1. పై వ్రాఁత 1¹.

2. యోవేలు ప్రవచనములు.

(1) దేశమునకు కలిగిన కష్టములను వివరించి వారు దుఃఖించి పశ్చాత్తాపపడి దేవుని బ్రతిమలాడవలెనని ప్రవక్త హెచ్చరించుట (2¹⁻¹⁴).

(2) రానైయున్న యెహోవా దినమును దాని కష్టములను వివరించి (1¹⁵-2¹¹) మానవులు తప్పించుకొనునట్లు నిజమైన ఉపవాసమును చాటింపఁజేసి దేవునితట్టు తిరుగవలెనని బోధించుట (2¹²⁻¹⁷).

(3) ఇట్లు పశ్చాత్తాపపడు ఇశ్రాయేలీయుల దేశమునకు యెహోవా కుదురుబాటు కలుగఁజేయును (2¹⁸⁻²⁷).

(4) ఆ కుదురుబాటు ననుసరించి దేవుఁడందఱిమీఁద ఆత్మను కుమ్మరించి (2²⁸⁻³²), తన వారిని వారి చెఱనుండి విడిపించి వారిని బాధపఱచిన వారికి తీర్పుచేసి సీయోనును నిత్యముగా స్థాపించును (3¹⁻²¹).

**యోశేఖు** (Josech). క్రీస్తు వంశావళి క్రమణికలో నున్న యొకఁడు (లూ 3²⁶).

**యోషవ్యా** (Joshaviah = యెహోవా యథార్థవంతునిగా చేయును!). దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{46}$).

**యోషా** (Joshah = యథార్థత!). షిమ్యోను ప్రధానులలో నొకఁడు (I దిన $4^{34}$).

**యోషిబ్యా** (Joshibiah = యెహోవా నివసింపఁజేయును). షిమ్యోను గోత్రపు కుటుంబములలో నొకదానికి పెద్ద (I దిన $4^{35}$).

**యోషీయా** (Josiah = యెహోవా బాగుచేయును).

1. క్రీస్తు శకమునకు ముందు 638 సం॥ నుండి 609 సం॥ వఱకు యూదా రాజ్యమునకు రాజుగా నుండినవాఁడు. ఇతఁడు రాజైన ఆమోను కుమారుఁడు. 8 యేండ్లు గలవాఁడైనప్పుడు రాజయ్యెను ప్రధాన యాజకుఁడగు హిల్కీయాయొక్క హితబోధలకు లోఁబడి మంచివాఁడయ్యెను (II రాజు $22^{1,2}$ II దిన $34^{1-7,33}$). తన ప్రభుత్వపు 18 వ సం॥ న ఆలయమును మరమ్మతు చేయఁబూనుకొనెను. ఈ కార్యము చేయుచుండఁగా ప్రధానయాజకుఁడగు హిల్కీయా యెహోవా మందిరమందు ధర్మశాస్త్రమును కనుగొనెను. ఈ ధర్మశాస్త్రమును వినినప్పుడు యోషీయా తన ప్రజలు దేవుని ధర్మశాస్త్రమును నిర్లక్ష్యము చేసినందున దుఃఖించి పశ్చాత్తాపపడె (II రాజు $22^{8-20}$ II దిన $34^{15-28}$), వారు ఆ ధర్మశాస్త్రములోని శాపములన్నిటికి (ద్వితీ 28-30) పాత్రులని యొప్పుకొనెను. ఆ ధర్మశాస్త్రమును ప్రజలకు వినిపించఁగా వారును రాజునకువలె పశ్చాత్తాపపడిరి. అందువలన యోషీయా తన దేశమందు విగ్రహారాధనమును బొత్తుగా తీసివేసి యెరూషలేమును ఏకదేవునికైన ఒకే ఆరాధన స్థలమునుగా నియమించి సంస్కరణ చేయుటలో చాల నిష్ఠపరుఁడయ్యెను. ఇందునుబట్టి రాజును ప్రజలును దేవుని ధర్మశాస్త్రమును నెఱవేర్చెదమని యొక నిబంధనను స్థిరపఱచుకొనిరి (II రాజు $23^{1-3}$ II దిన $34^{29-33}$). మఱియు విగ్రహము లన్నిఁటిని పగులఁగొట్టించి కాల్చివేసి వాటి పూజా స్థానములను అపవిత్రపఱచి వాటిపూజారులను చంపించెను (II రాజు $23^{6-20,23-26}$). తరువాత మిగుల గంభీరముగ పస్కాపండుగు నాచరింపఁజేసెను ($23^{21,22}$ II దిన $35^{1-19}$). ఇట్లు దేశ సంబంధమైన సంస్కరణ లెన్ని చేసియుండినను యూదావారు బాగుపడ లేదు కావున, వారికి తప్పక శిక్ష కలుగునను సంగతిని ఈ కాలములో యిర్మీయా ప్రవచించెను (యిర్మీ $3^{6-25}$). యోషీయా యేలుబడి 31 వ సంవత్సరములో ఐగుప్తురాజైన ఫరోనెకో యనువాఁడు అష్షూరువారిమీఁద యుద్ధముచేయుటకు దండయాత్ర వెడలి పలెస్తీను దేశమును దాటఁబోఁగా యోషీయా అతని నడ్డగించి తన దేశముగుండ దాటనియ్యకుండుటకు యత్నము చేసెను. తాను అష్షూరు రాజునకు లోఁబడుట తన విధియని తలంచి యిట్లు చేసియుండవచ్చును. ఎట్టులనైనను మెగిద్దోలో యోషీయా ఓడిపోయి మరణించెను. ప్రజలు తమ రాజువిషయము చాల అంగలార్చిరి (II రాజు $23^{29,30}$ II దిన $35^{20-27}$ జెక $12^{11}$). యోషీయా కాలములో ప్రవక్తలగు యిర్మీయా జెఫన్యా యను నిద్దఱు జీవించి యుండిరి (యిర్మీ $1^{2}$ జెఫ $1^{1}$). అప్రమాణిక గ్రంథములో కూడ ఇతనినిగూర్చిన సూచనలు కలవు (ఎస్ద్రాసు $1^{1-34}$ బారూకు $1^{8}$).

2. ప్రవక్తయగు జెకర్యా కాలములో జీవించిన యొకఁడు (జెక $6^{10}$).

**యోషెబ్బష్షెబెతు** (Josheb-Basshebeth = నెమ్మదిగా జీవించువాఁడు). దావీదు యోధులలో నొక ముఖ్యుఁడు (II సమూ $23^{8}$). I దిన $11^{11}$ $12^{6}$ $27^{2}$ లలో ఇతనికి యాషాబాము అను మాఱుపేరు కలదు (యాషాబాము చూ॥). గ్రీకు తర్జుమ చేసినవారు ఇష్బోషెతు అను మాఱుపేరు నిచట వాడిరి (ఇష్బోషెతు 2 చూ॥).

**యోసిప్యా** (Josiphiah = యెహోవా కలుపును). ఎజ్రాకు తోడుగా నుండిన షెలోమీతు తండ్రి (ఎజ్రా $8^{10}$).

**యోసీఫసు** (Josephus).

క్రీ॥ శ॥ 37-38 సం॥ న జన్మించి రెండవ శతాబ్దముయొక్క ఆరంభమందు మృతినొందిన యోసీఫసు యూదుల చరిత్రకారియును సైన్యాధిపతియునై యుండెను. అతఁడు మక్కబీయ వంశస్థుఁడు గనుక రాజరికమునకును యాజకత్వమునకును వారసుఁడు. అతఁడు తన బాల్య కాలమున బహు చురుకును తెలివితేటలును గలవాఁ

డైనందున ఆ కాలమందలి విద్వాంసులు తమ తర్కములయందు తన యభిప్రాయమును తెలిసికొనఁ గోరిరని యాయన తన చర్యగ్రంథమున వ్రాసెను. ఆతడు ఎస్సెనీయుల తెగవారి యొద్దను పరిసయ్యులయొద్దను సద్దూకయ్యుల యొద్దను విద్యాభ్యాసము చేసెను. అతఁడిరువదియారు సంవత్సరముల ఈడుగలవాఁడయి యుండగ దేశాధిపతియగు ఫేలిక్సు యాజకులలో కొందఱికి శిక్షను విధించి రోమాపురికి పంపించినందున యూదుల పెద్దలు వారిని గుఱించి సిఫారసుచేయుటకు యోసీఫసును రోమాకు పంపిరి. అతఁడా యత్నమందు కృతార్థుఁడగుట మాత్రముకాక నీరో చక్రవర్తి పత్నియగు పొప్పేయ చక్రవర్తిని యాదరణను సంపాదించుకొనెను.

క్రీ॥ శ॥ 66 సం॥ మున యూదులు రోమా దొరతనము వారిపై తిరుగఁబడుటచే దేశమంతయు నల్లకల్లోలమాయెను. ఇదివఱకును రోమీయుల కనుకూలుఁడై యుండిన ఈ యోసీఫసు అల్లరిని రేపినవారిలో నొక ముఖ్యుఁడాయెను. సైన్యమును సమకూర్చి, కోటలను బలపఱచి ప్రజలను యుద్ధసన్నద్ధులగునటుల నతఁడు మిగుల పరిశ్రమ తీసికొనెను. అయినను దేశములోని ముఖ్యపట్టణనివాసు లొండొరులను గురించి దురభిమానులగుటచే నతఁడు వహించిన కార్యము బహు దుర్లభమాయెను. సామాన్యజనులును యుద్ధమునుగుఱించి భిన్నాభిప్రాయములుగలవారై కొందఱు వీరావేశమును వహించుకొనఁగా కొందఱు సర్కారువారి అధికారము నెదిరించ నొల్లకుండిరి. కాలక్రమేణ ఆ తిరుగుబాటు రేగి దేశములోని దంపుకు మించిపోవుట చక్రవర్తియైన నీరో చూచి తన సైన్యాధిపతులలో వెస్పేషియన్ అను నాయకుని నేర్పఱచి యా యల్లరిని అణచుటకై పలెస్తీను దేశమున కంపెను. వెస్పేషియన్ సిరియా దేశమునుంచి దండును తీసికొని గలిలయ ప్రాంతముమీఁదకు రాఁగా తిరుగుబాటుకు సమ్మతించని వారనేకు లతనిపక్షము చేరిరి. ఇక్కడి ముఖ్యపట్టణములు లోఁబడుటవలనను రెండు మూఁడు గొప్ప యుద్ధములయందు జయము కలిగినందువలనను వెస్పేషియన్ గలిలయ ప్రదేశమంతటిని స్వాధీనపఱచుకొనెనుగాని యోసీఫసు తనకు మిగిలిన దండుతోఁ గలిలయ సముద్రము యొక్క తూర్పు తీరమునందలి యొటపట (*Jotapata*) యను కోటలో దాగుకొని రోమీయుల సైన్యము నెదిరించెను. వెస్పేషియన్ బహు బలముగా నా కోటను ముట్టడివేసినను యోసీఫసు తెగువతో నెదిరించి 42 దినములవఱకా కోటను కాపాడెను. అంతట వెస్పేషియన్ ఆ కోటను జయించి యోసీఫసును పట్టుకొనెను. అయినను యోసీఫసు మిగుల చమత్కారము గలవాఁడై వెస్పేషియన్ ఎదుటికి తేఁబడగానే అతనికి చక్రవర్తియను బిరుదాంకమును పెట్టి కొన్నాళ్లయినమీఁదట నతఁడు గద్దెనెక్కునని ప్రవచించి యతని బుజ్జగించెను. కొద్దికాలములోనే యోసీఫసు చెప్పినమాట నెఱవేఱినందున వెస్పేషియన్ అందుకు కృతజ్ఞతగా నతనికి విడుదలననుగ్రహించెను. యోసీఫసు తాను పొందిన యనుగ్రహమునకు జ్ఞాపకార్థముగా వెస్పేషియన్ యొక్క నామధేయములలో ఫ్లావియస్ యను పేరు పెట్టుకొనెను. కాఁబట్టి యితఁడు ఫ్లావియస్ యోసీఫసు అని పేర్కొనఁబడును.

క్రీ॥ శ॥ 69 సం॥న వెస్పేషియన్ సింహాసనమెక్కి రాజ్యభారమును వహించుకొనుటచే నతఁడు తన కుమారుఁడైన తైటసు చేతికి సైన్యము నప్పగించి రోమాపురికి వెళ్లిపోయెను. యోసీఫసు రోమీయుల పక్షముచేరి తైటసు యెరూషలేముకు ముట్టడివేసినప్పుడు రోమీయులకును యూదులకును మధ్యవర్తిగ నతనితో కూడ పోయెను. అయిన నతని స్వదేశస్థు లతని ద్రోహిగ నెంచి యతని సలహాను పెడచెవిని పెట్టిరి. తైటసు యెరూషలేమును పట్టుకొన్నప్పుడు యోసీఫసు అతని యనుగ్రహము నొందినవాఁడైనందున యూదులకు సహాయము చేయఁగలిగి యుండెను. యుద్ధమాగిన తరువాత యోసీఫసు చక్రవర్తివలన మాన్యములనుపొంది యూదయప్రదేశమందు నివసించి గ్రంథములను రచించుటయందు కాలక్షేపము చేయుచుండెను.

యోసీఫసు రచించిన గ్రంథములు బైబిలు పఠనమందు మిగుల సహాయకరములైనవి. అతఁడు యూదుల చరిత్రమును వివరించి వారి మతాచారములను దేశపద్ధతులను తెలియఁజేయుటవలన పాత నిబంధనయందలి విషయము లనేకములను

మఱింత చక్కఁగా గ్రహించుకొనఁ గలుగుదుము. అంతకంటె ముఖ్యముగ యేసుయొక్క జీవిత కాలములో జరిగిన సమాచారముల నప్పుడుండిన దేశాధికారులను గుఱించిన వృత్తాంతములను జెప్పుట వలన సువార్తలు నిజముగ జరిగిన చరిత్ర గ్రంథము లని నిస్సందేహముగఁ జెప్పఁగలుగుదుము. ఆయన గ్రంథముల మూలముగ దేశస్థితియు ప్రజల సుఖదుఃఖములను అధికారుల గుణలక్షణములను తద్రూపముగ నెఱుఁగ సాధ్యమగును.

యోసీఫసు నాలుగు విశ్రుత రచనలను లిఖించి ప్రసిద్ధిగాంచిన వాఁడాయెను.

1. యూదుల యుద్ధచరిత్ర గ్రంథము (యుద్ధములు).

ఈ గ్రంథమందాయన అంతియొకుకాలము మొదలుకొని వెస్పేషియను చేసిన యుద్ధము వఱకును జరిగిన యూదుల చరిత్రమును వివరించి యేసుకాలమందలి జనులస్థితిని వివరించుటచే నది మిగుల యుపయోగమైనది.

2. యూదుల పురాతన చరిత్ర.

ఇందునుగుఱించి యతఁడిరువది గ్రంథములను రచించి వానియందు ప్రపంచ సృష్టి మొదలు క్రీ॥ శ॥ 66 సం॥ జరిగిన తిరుగుబాటువఱకును గల యూదుల చరిత్ర వృత్తాంతములను వివరించెను. పాఁత నిబంధనయందలి కథలను గుఱించి యనేక యితిహాసములను పారంపర్య సాంప్రదాయముల నెఱింగించుట మాత్రము కాక ఆయా కాలీనరాజులు విధించిన నియమములను శిలాశాసనములను తెలియఁజేయుటవలన పాఁత నిబంధన చరిత్ర కాలస్థానములను గుర్తెఱుఁగుట యందది సహాయకరమైనది. మక్కబీయుల చరిత్రమును హేరోదు మహారాజు జీవిత చరిత్రయు నిందు సవివరముగ వర్ణితమాయెను.

3. స్వీయచరిత్ర.

యోసీఫసు తానే రోమీయులపై యూదులు చేసిన తిరుగుబాటుకు కారకుఁడని కొందఱు చెప్పఁగా నతఁడానిందను ఖండించి తాను రోమీయులకు మిత్రుఁడని కనుపఱుచ యత్నించెను.

4. ఏపియోనుకు ప్రత్యుత్తరము.

అలెక్సంద్రియ పట్టణస్థుడగు ఏపియోను యూదుల మతమును వారి ప్రవర్తనను నిందించఁగా అందునుగుఱించి సమాధానము చెప్పుటకు యోసీఫసు దీనిని రచించెను. M.

**యోసే (Joses).** యేసుక్రీస్తు సహోదరులలో నొకఁడు (మార్కు $6^{3}$). E.

**యోసేపు (Joseph = అభివృద్ధి నొందించుగాక).**

1. యాకోబుయొక్క పండ్రెండుగురు కుమాళ్లలో పదునొకండవవాఁడు. రాహేలుయొక్క జ్యేష్ఠపుత్త్రుఁడు ఇతనికనఁగానే ఆమె "యెహోవా మరియొక కుమారుని నాకు దయచేయు న"నుకొని అతనికి యోసేపు అను పేరు పెట్టెను (ఆది $30^{22-24}$). యాకోబింక ఆరు సంవత్సరములకు కనాను దేశమునకు వచ్చుననఁగా నితఁడు పద్దనరాములో జన్మించెను ($30^{25}$ ను $31^{41}$ తో సరిపోల్చుము). అప్పటికి యాకోబు 90 లేక 91 సం॥ల ప్రాయముగలవాఁడు. తండ్రి వృద్ధాప్యమందు పుట్టినవాఁడును, ప్రియురాలగు భార్య కుమారుఁడునగుటచే యాకోబితనిని మిగులఁ ప్రేమించెను. కులీనులగు వారి బిడ్డలు ధరించెడి రంగుల చొక్కా నితనికి కుట్టించెను ($37^{3}$). తండ్రి అతనియెడల కనఁబఱచు పక్షపాతబుద్ధి తక్కిన కుమారుల కసూయ కలిగించుటలో నాశ్చర్యము లేదు. దీనికి తోడు యోసేపు కనిన రెండు కలలు ఆతని భవిష్యద్ స్థితిని తెలుపుటయేగాక వారి ద్వేషమును ఇనుమడించెను. యోసేపు పదునేడేండ్ల వయస్సుఁ గలవాఁడైనప్పుడు షెకెము దగ్గర మందలఁ గాయుచున్న తన యన్నల క్షేమ మరసివచ్చునట్లు తండ్రియాజ్ఞఁగొని యతఁడు బయలుదేరి వెళ్లెను. షెకెముకు వచ్చినప్పుడు వారు దోతానుకు వెళ్లిరని విని వారిని వెంబడించెను. అతఁడింక దూరమున నుండఁగానే వాని యన్నలు చూచి వాని సంహరించి యే యడవి మృగమో భక్షించెనని తండ్రికి చెప్పుదమని యాలోచనలు చేయసాగిరి గాని రూబేను వారి యత్నములు సాగనియ్యక వాని నొక పాడుగుంటను పడఁద్రోయించి, తరువాత వాని ఇతరుల కెవ్వరికిని తెలియకుండ తండ్రి యొద్దకుఁ బంపవలెనని తలంచెను. రూబే నేదియో పని మీఁదఁ బోయియున్న సమయమున ఆ మార్గమున ఐగుప్తునకు వెళ్లు ఇష్మాయేలీయుల వర్తకపు బిడారము సమీపించుట తటస్థించెను. వారిలో నున్న

మిద్యానీయుల తండాకు వారు యోసేపును అమ్మివేసిరి. ఒక మేకపిల్లను చంపి దాని రక్తములో వాని రంగుల యంగీ తడిపి తండ్రియొద్దకుఁ గొనిపోఁగా అతడు తన కుమారుఁడేదో ఘాతుక మృగము వాతఁబడెనని నమ్మెను ($37^{1-35}$). ఈ లోఁగా నా బానిసవర్తకులు యోసేపును ఐగుప్తుకుఁ దీసికొని వెళ్లి ఫరోయొక్క రాజ సంరక్షక సేనాధిపతియగు పోతీఫరను నొకనికి అమ్మివేసిరి. కొలఁది దినములలోనే నీ యౌవనుని తెలివితేటలును సామర్థ్యమును దెలియవచ్చినందున పోతీఫరు అతనికి తన యింటినంతటి నప్పగించెను. అతనిపై అన్యాయముగా దోష మారోపింపఁబడినందున చెఱసాలలో వేయించిరి. అక్కడతఁడు కొన్నియేండ్లుండెను. అక్కడ నుండఁగా నతఁడు చెఱసాల యధికారి దయను పొందినవాఁడై ఖైదీలందఱి విషయమై చూచుటకు నియమింపఁబడెను. ఫరోయొక్క పానదాయకుల అధిపతియు, భక్ష్యకారుఁడును కనిన కలలకు అర్థము దేవుని సహాయముచే చెప్పి కలలకు అర్థము చెప్పఁగలవాఁడను ఖ్యాతినొందెను. రెండేండ్లు గడచిన పిమ్మట భవిష్యత్తును గూర్చి ఫరో కనిన రెండు స్వప్నములకు అర్థము చెప్పఁగలిగినవాఁడు రాజ్యమందు నొకఁడుని కతిమున పానదాయకుఁడు తనకు సంభవించినది జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని ఫరోకుఁ దెలిపినందున యోసేపు నతని సమక్షమునకుఁ దెచ్చిరి ఆ రెండు కలలకు నొకటే భావమనియు మహా సమృద్ధిగల యేడు సంవత్సరములును తరువాత ఘోరకాటక సంవత్సరములు ఏడును వచ్చుననియు యోసేపు వాటికి అర్థము చెప్పి, సమృద్ధిగల యేండ్లలో మిగిలిన ధాన్యము పోగుజేసి యుంచి, కఱవుకాలములో దాని నుపయోగించుట యుక్తమని ధైర్యముతో సలహా నిచ్చెను. ఫరో ఆ సలహా మంచిదని యొప్పుకొనెను. యోసేపు ఇంత జ్ఞానముఁ గనపఱచినందున ($41^{29-43}$), అతనినే రాజుయొక్క ధాన్యపుకొట్లమీఁద నియమించుటయే గాక రాజుకు తరువాతి అధిపతిగా రాజ్యములో నియమించెను ($41^{39-44}$). యోసేపున కిప్పటికి ముప్పదియేండ్ల వయస్సు ($41^{46}$). పదమూఁడేండ్ల వఱకు అనుభవించిన కష్టములవలన నతఁడు సుశిక్షితుఁడై వినయమనస్సు గలిగియుండెను. ఓను యాజకుని కుమార్తెయగు ఆసెనతును అతని కిప్పించి ఫరో వివాహము చేయించెను. కఱవు కాలమునకు పూర్వమే యతని కిరువురు పుత్రులు-మనష్షే ఎఫ్రాయిము అనువారు జన్మించిరి ($41^{50-52}$). అతఁడు ప్రవచించిన రీతిగనే కఱవారంభమాయెను. దానివలన మధ్యధరా సముద్రమునకు చుట్టునుండు దేశములన్నియు, ముఖ్యముగా పడమటి దేశములు మిగుల బాధ ననుభవించిరి ($41^{54,56,57}$). ఐగుప్తులో ధాన్యమున్నదని విని యోసేపు సహోదరులు ధాన్యముకొనుటకు ఐగుప్తుకు వచ్చిరి. వారతని గుర్తుపట్టఁజాలకపోయిరి గాని అతఁడు వారిని చూచి వెంటనే పోల్చఁగలిగెను. వారు తనకు సాగిలపడి మ్రొక్కఁగా చిన్నవాఁడు తాను కని, చెప్పకొని ముప్పు కలిగించుకొనిన కలలు నెఱవేఱుచున్నట్లతఁడు తెలిసికొనెను. పలువిధముల నతఁడు వారి ప్రవర్తనను పరిశోధించి రెండవసారి వారు వచ్చినప్పుడు తన్నుతాను వారికెఱిఁగించుకొని తనకు వారు కలిగించిన అపరాధములను మన్నించి, తండ్రితోఁ గలిసికొని ఐగుప్తుకువచ్చి అక్కడ నివసింపవలసినదని వారిని ప్రేరేపించెను. ఫరోకూడ వారిని సంతోషముతో నాహ్వానించెను. వారు వచ్చినపిమ్మట యోసేపు సిఫారసుపై అతఁడు వారికి గోషెను దేశము నిచ్చెను. యోసేపు 110 సం॥ లు జీవించి మృతినొందఁగా నతని శవమును సుగంధద్రవ్యములతో సిద్ధపఱచి ఒక పెట్టెలో నుంచిరి. అతఁడు చనిపోవక పూర్వము తన శవమును ఇశ్రాయేలీయులు కనానుకు వెళ్లునప్పుడు తప్పక తీసికొని వెళ్లవలసినదని ప్రమాణము చేయించుకొనెను (42-50 హెబ్రీ $11^{22}$). అతని కోరికప్రకారము చేసి అతని శవమును కనానులోకిఁ దెచ్చి వాగ్దానభూమి మధ్యనున్న షెకెములో భూస్థాపితము జేసిరి (నిర్గ $13^{19}$ యెహో $24^{32}$). W.

2, 3. క్రీస్తు పూర్వికులలో నిద్దరు (లూ $3^{24,30}$).

4. మరియ పెనిమిటి. యేసు పెంపుడు తండ్రి. దావీదు మహారాజ వంశస్థుఁడు (మ $1^{20}$). బేత్లెహే మితని పూర్వికుల గ్రామమైనను ఇతఁడు నజరేతుకు వెళ్లి (లూ $2^{4}$) అచ్చట వడ్రంగము జేసికొని జీవించెను (మ $13^{55}$).

అతఁడు నజరేతులో నున్న మరియ యను కన్యకను ప్రధానము చేసికొనెను. వయస్సున అతఁడు అప్పటికి చాల పెద్దవాఁడైనట్లు బైబిలుకు సంబంధించిన పారంపర్యములవలనఁ దెలియుచున్నది. దానినిబట్టి అతఁడు వైధవ్యుఁడనియు బిడ్డలు గలిగినవాఁడనియు కొందఱు చెప్పెదరు. ఈ పారంపర్యములు మరియ నిత్య కన్యకగా నున్నదని చెప్పుటకు కల్పించఁబడినవని ప్రొటస్టాంటు వారిలో ననేకుల అభిప్రాయము గనుక వీటిని నమ్ముటకు వీలుగాదని అట్టివారందురు. బైబిలులో యోసేపును గూర్చి చెప్పఁబడిన విషయములు కొన్ని మాత్రముగలవు. ఆ కొన్నియైనను అతఁడు శ్రేష్ఠుఁడని చాటుచున్నవి. అతఁడు భక్తిగలవాఁడై యూదుల యాచారముల శ్రద్ధగా నాచరించువాఁడు (లూ $2^{22-24,41-42}$). దయార్ద్ర హృదయుఁడు గాన మరియకు నిందరాకుండ కాపాడుటకు ప్రయత్నించెను (మ $1^{18-25}$ లూ $2^{1-7}$). యేసును బాల్యమందు జాగ్రత్తగా చూచుకొన్నవాఁడు ($2^{33-41,48}$ మ 2). అతఁడిట్లు యేసును చూచుకొన్నందుననే ఇతఁడు ఆయన తండ్రియని పిలువఁబడెను ($13^{55}$ లూ $2^{48}$ $3^{23}$ యోహా $1^{45}$ $6^{42}$). యేసు 12 యేండ్ల ప్రాయముగలవాఁడై యుండఁగా సువార్తలలో యోసేపును గూర్చిన చివరి ప్రశంస గలదు (లూ $2^{41-51}$). క్రీస్తు పరిచర్యలో మరియు ఆయన సహోదరులను గురించిన సూచన లెన్ని యుండినను యోసేపును గూర్చిన సూచన యొక్కటైనను లేనందున అతఁడంతకుఁ బూర్వమే కాలముచేసినట్లు విశదమగుచున్నది. క్రీస్తు 18 యేండ్లవాఁడైనప్పుడు యోసేపు 111 సం॥ ప్రాయముగలవాఁడై మృతినొందెనను పారంపర్యము గలదు.

5. అరిమతయియ యూరివాఁడు (మ $27^{57}$). ధనవంతుఁడు ($27^{57}$). సజ్జనుఁడును నీతిమంతుఁడై దేవుని రాజ్యముకొఱకు కనిపెట్టుచుండినవాఁడు (లూ $23^{51}$). యూదుల మహా సభలో నొక మెంబరు ($23^{50}$ మా $15^{43}$). యూదులకు భయపడి రహస్యముగా యేసు శిష్యుఁడయ్యెను (యోహా $19^{38}$). యూదుల ఆలోచనకును వారు చేసిన పనికిని ఎంతమాత్రము సమ్మతింపలేదు (లూ $23^{51}$). వారాయనను మహాసభలో విమర్శించినప్పుడితఁడు హాజరై యుండలేదనవచ్చును. ఆయన సిలువ వేయఁబడినప్పుడితఁడు తన పిరికితనమునకు సిగ్గుపడి ధైర్యముతో ఆయన దేహమును తనకిమ్మని పిలాతును అడిగి నీకొదేము సహాయమునకు రాఁగా తన క్రొత్త సమాధిలో ఆయనను పాతిపెట్టెను (అరిమతయియ చూ॥)

**E.**

6. బర్నబా అసలు పేరు యోసేపు. బర్నబా చూ॥

7. యూస్తు బర్సబా అను మాఱుపేరు గలవాఁడు (యూస్తు 1 చూ॥). **E.**

## యోహన్న

1. (**Joanna** = యెహోవా కృప చూపెను). హేరోదుయొక్క గృహనిర్వాహకుఁడగు కూజా యొక్క భార్య. యేసుకు పరిచర్యచేసిన స్త్రీలలో నీమె యొకతె (లూ $8^{2,3}$). ఆయన చనిపోయిన పిమ్మట ఆయన దేహమునకు సుగంధ ద్రవ్యములను పూయుటకు సమాధియొద్దకు వెళ్లెను ($24^{10}$). ఈమెయు నీమె పెనిమిటియు ధైర్యము గలవారని చెప్పవచ్చును. వారు యేసుకు పరిచర్య చేయుటలో హేరోదుకు భయపడి వెనుకఁదీసిన సూచనలు కనఁబడుటలేదు.

2. (**Joanan**). క్రీస్తు వంశావళిలోని యొకఁడు (లూ $3^{27}$). **E.**

## యోహా (Joha).

1. బెన్యామీను సంతతివారిలో నొకఁడు (I దిన $8^{16}$).

2. దావీదు యోధులలో నొకఁడు (I దిన $11^{45}$).

## యోహానాను, యోహాను (Johanan= యెహోవా దయగలవాఁడు).

1. సిక్లగులో దావీదుతో కలిసికొన్న యొక బెన్యామీనీయుఁడు (I దిన $12^{4}$).

2. దావీదుతోఁ జేరుకొన్న గాదీయులలో నెనిమిదవవాఁడు (I దిన $12^{12}$). ఇతఁ డొక సైన్యమున కధిపతి ($12^{14}$).

3. ప్రధాన యాజకుల వంశమందున్న ఒకఁడు (I దిన $6^{10}$).

4. ఎఫ్రాయిము సంతతివారిలో నొకఁడు (II దిన $28^{12}$).

5. రాజగు యోషీయా కుమారులలో పెద్ద వాఁడు (I దిన $3^{15}$). ఇతడు రాజుకాలేదు గాన యోషీయాకు పూర్వమే చనిపోయి యుండును.

6. ఒక సేనాధిపతి. ఇతఁడు కారేయా యను వాని కుమారుఁడు. నెబుకద్నెజరు గెదల్యాను యూదులకధికారిగా నియమించిన పిదప ఇతఁడు తన సేనతోపాటు గెదల్యాకు లోఁబడెదనని చెప్పి అతని ఆశ్రయించి యుండెను (II రాజు $25^{22,23}$ యిర్మీ $40^{8,9}$). గెదల్యామీఁద నితరులు చేయు కుట్రను దెలిసికొని అతనికిఁ జెప్పెను గాని గెదల్యా యతనిమాట లక్ష్యపెట్టక పోయెను ($40^{13,14}$). గెదల్యా చంపఁబడిన పిమ్మట ఇతఁడు శత్రువులమీఁద యుద్ధము జేసెను ($41^{11-15}$). తరువాత అతఁడు యిర్మీయా వద్దని యెంత చెప్పినను వినక యూదుల నైగుప్తునకుఁ దీసికొని వెళ్లెను ($41^{16}$-$43^{13}$).

7. చెఱకాలమునకుఁ దరువాత దావీదు వంశమున జన్మించినవాఁడు (I దిన $3^{24}$).

8. ఎజ్రాతోఁగూడ యెరూషలేమునకు వెళ్లిన ప్రధానులలో నొకఁడు (ఎజ్రా $8^{12}$).

9. ప్రధానయాజకులలో నొకఁడు (నెహె $12^{22}$). నెహె $12^{11}$ నం దితనికి యోనాతాను అను పేరు గలదు.

10. ఎజ్రాకాలములో నున్న యొకఁడు. ఎజ్రా యితని గదిలోకి వెళ్లి యూదుల పాపములను గూర్చి దుఃఖించెను (ఎజ్రా $10^{6}$).

11 అమ్మోనీయుఁడగు టోబియా యనువాని కుమారుఁడు. ఇతఁడు ఒక యూదురాలిని పెండ్లి చేసికొనఁగా అది తగదని యూదుల అధికారులు అభిప్రాయపడిరి (నెహె $6^{18}$). అసలు భాషలో యోహానాను అని యున్నది.

**యోహాను** (John = యెహోవా దానము). పాత నిబంధనయందున్న యోహానాను అను పేరుకు క్రొత్త నిబంధనయందలి రూపము.

1. బాప్తిస్మమిచ్చు యోహాను. క్రీస్తుకు ముందుగా వచ్చి ఆయన రాకడకు మార్గమును సిద్ధపఱచినవాఁడు. ఇతని తల్లిదండ్రులగు ఎలీసబెతు జెకర్యాలు భక్తిపరులని ప్రసిద్ధిగాంచిన వారు (లూా $1^{6}$). ఎలీసబెతు యేసు తల్లియగు మరియకు బంధువురాలైనట్లు $1^{36}$ వలనఁ దెలియు చున్నది. అది యెట్టి బంధుత్వమో స్పష్టము గాకున్నను, వారిద్దరును తోఁబుట్టువులగు వారి పిల్లలని కొందఱి యభిప్రాయము. యోహాను తల్లిదండ్రులు యూదా అరణ్యమందలి యుట్ట (*Juttah*) అను పల్లెలో నివసించిరి. యోహాను పుట్టుకనుగూర్చి గబ్రియేలు దూత జెకర్యాకుఁ దెలిపెను ($1^{8-17}$). అతఁడు క్రీస్తుకన్న ఆరు మాసములు పెద్ద ($1^{26}$). తల్లిగర్భమున పుట్టినది మొదలు పరిశుద్ధాత్మతో నిండినవాఁడై యుండెను ($1^{15,41}$). ఎనిమిదవదినమున సున్నతినొంది ($1^{59}$) యోహానను పేరునొందినప్పుడు అంతకుఁ బూర్వము మూగవాఁడై యుండిన జెకర్యా స్తోత్ర గీత మొకటి రచించెను. అతఁ డెదిగి ఆత్మయందు బలముపొందుచు అరణ్యములో నుండెను ($1^{80}$) గాని అతని బాల్యమునుగూర్చి యింకేమియు తెలియదు.

క్రీ॥ శ॥ 26 సం॥ నం దితఁడు తన పని నారంభించెను (లూా $3^{1,2}$). దేవునిరాజ్యము సమీపముగా నున్నది గావున అందఱు మాఱు మనస్సునొంది, ఆ రాజ్యమునందు పాలిభాగరులగు నిమిత్తము సిద్ధపడవలెనని యొర్దానుదగ్గర నున్న అరణ్యములో నితఁడు ప్రకటించుచు వచ్చెను (మ $3^{1-12}$ మా $1^{1-9}$ లూా $3^{3-17}$). తన బోధకు లోనైనవారి కందఱికి మాఱుమనస్సు విషయమగు బాప్తిస్మము నిచ్చెను. అందఱును అతనియొద్దకు వచ్చి బాప్తిస్మము నొందునప్పుడు యేసునురాఁగా, యోహాను మొదట ఆయన కియ్య నిష్టపడలేదు గాని, ఆయన నీతి యావత్తును, నెఱవేర్చుటకట్లు పొందనై యున్నానని చెప్పినప్పుడు, అతడు సమ్మతించెను. ఆయనకు బాప్తిస్మమిచ్చినప్పు డాయన పరిశుద్ధాత్మనొందుటను చూచి ఆయనే మెస్సీయా యని పూర్ణముగాఁ దెలిసికొనినవాఁడై ఆ సంగతిని ప్రకటించెను. అందఱు యోహానుచే బాప్తిస్మ మొందుచున్నారని యూదులు చూచి, అతఁడే రావలసిన మెస్సీయా యని చెప్పఁగా అతఁడు దాని కొప్పక మిగుల వినయముతో క్రీస్తును గూర్చి తేటగా సాక్ష్యమిచ్చెను (యోహా $1^{19-29}$). అతఁడు ఏలీయావా యని ప్రశ్నించినప్పుడును అతఁడు కానని చెప్పెనుగాని రాఁబోవు ఏలీయా

యితఁడేనని క్రీస్తు అతనిగూర్చి సాక్ష్యమిచ్చెను (మలా $4^{5,6}$ మ $11^{10-14}$ $17^{12,13}$). తిని ధరించిన అన్నవస్త్రాదులయందు వారికి గొప్ప సంబంధమున్నట్లు కనఁబడుచున్నది (II రాజు $1^{8}$ మ $3^{4}$ మా $1^{6}$). తాను ప్రవక్తను కానని యొప్పుకొనుట మాత్రమే గాక అరణ్యమునందు కంఠమెత్తిపలుకు ఊరుపేరులేని యొక శబ్దమునని (యెష $40^{3}$) చెప్పుకొనుటచే అతని వినయబుద్ధి మఱింత స్పష్టమగుచున్నది.

యేసు మెస్సీయా యని స్పష్టముగాఁ దెలిసికొనిన పిదప అతఁడు తన స్వంత శిష్యులను ఆయనను వెంబడించునట్లు చేసెను (యోహా $1^{29-42}$). లోకపాపములను మోసికొనిపోవు దేవుని గొఱ్ఱెపిల్లయను బిరుదు నాయన కారోపించి, ఆయన పాఁత నిబంధనయందలి యజ్ఞముల నెఱవేర్చినవాఁడని సూచించెను. జనులందఱు యేసుయొద్దకు వెళ్లుటను గుర్తించిన అతని శిష్యులసూయపడినప్పుడు, అది దేవుని యేర్పాటని సంతోషించి ఆయన హెచ్చవలెను, నేను తగ్గవలెను అని చెప్పి తన వినయమును చూపినవాఁడాయెను ($3^{22-26}$). ఇట్లతఁడు తన శిష్యులు క్రీస్తును విశ్వసించునట్లు వారిని సిద్ధపఱచెను. యోహాను పనిచేసినకాలము కొద్దిదైనను, అతని కనేకమంది శిష్యులైరి. పలెస్తీను దేశములోనే గాక, యూదులపండుగుల నాచరించుటకు వచ్చిన యితర దేశములలోని యూదులును అతని శిష్యులైరి. అపొల్లో (కార్య $18^{25}$), ఎఫెసులో పండ్రెండుగురు పురుషులు ($19^{2-7}$), పాతిక సంవత్సరములకుఁ బిమ్మటకూడ యోహాను శిష్యులమని చెప్పుకొనిరి.

యోహాను వినయమనస్కుఁడు మాత్రమే గాదు. నీతియందత్యంతాసక్తి గలవాఁడు. అతఁడు పరిసయ్యులను గద్దించుటయందది కనఁబడును (మ $3^{7-10}$). అది కారణముగ వారు యోహానుకు ప్రబలవిరోధులైరి ($11^{18}$ $21^{25,26}$). హేరోదు అంతిపయను రాజు తన తమ్ముని భార్యనుంచుకొనఁగా, యోహాను మోమాటమేమియుఁ జూపక అతనిని సహా గద్దించి బుద్ధిఁ జెప్పినందులకుఁ వాడు కినిసి మఖేరసు అను కోటలో అతనిని ఖైదుచేసెను (లూ $3^{19,20}$ మఖేరసు చూ॥). అచ్చట నుండునప్పుడే యతఁడు యేసు రాఁబోవు మెస్సీయా యేమోనని తెలిసికొనుటకు తన శిష్యులలో నిద్దరిని ఆయనయొద్ద కంపెను. తాను చేయుచున్న కార్యములనుగూర్చి వారు యోహానుకుఁ దెలుపుఁడని ఆయన వారిని పంపినతరువాత యోహానును మెచ్చుకొనెను (మ $11^{2-15}$). యోహాను తన శిష్యుల విశ్వాసమును బలపఱచుటకిట్లు చేసెనని కొందఱి యభిప్రాయముగాని, క్రీస్తు తన పనిని యోహాను కోరినట్లు ఆతురతతో చేయక శాంతముగా చేయుచుండినందున, ఆయన పనిచేయు రీతి అతని కాటంకముగా నుండుటచే నిట్లు కబురు పంపెనని తలంచుట యుక్తము. ఇది జరిగిన కొద్దిదినములకే హేరోదు యోహానును చంపించెను (మ $14^{3-12}$ మా $6^{16-29}$). అతని చంపించినపిమ్మట తాను తప్పుచేసితినని యెఱిఁగి హేరోదు భయపడెను (మ $14^{1,2}$). ఈ భక్తుని చంపినందువలననే దమస్కు గవర్నరగు అరెతాతో చేసిన యుద్ధమున నోడిపోయెనని యోసీఫసు వ్రాయుచున్నాఁడు (పురా 18. 15,3). పాఁత నిబంధన ప్రవక్తలలో యోహాను చివరివాఁడును క్రొత్త నిబంధన బోధకులలో మొదటివాఁడునై యుండెను. అతని సద్గుణములనుబట్టి నరులలో అతనికన్న గొప్పవాఁడు పుట్టలేదని యేసు చెప్పెను గాని క్రీస్తుయేసునందలి కృప అప్పటి కింక పూర్ణముగా బయలుపఱచఁబడక పోవుటచే పరలోకరాజ్యములో అల్పుఁడైనవాఁడు అతనికంటె గొప్పవాఁడనికూడఁ దెలిపెను.

2. సీమోను పేతురుతండ్రి (యోహా $21^{15-17}$). మ $16^{17}$ నందు పేతురు బర్ యోనా (= యోనా కొడుకు) అనఁబడెను (బర్ యోనా చూ॥).

3. అపొస్తలులలో నొకఁడు. జెబెదయి కుమారుఁడు. యాకోబు తమ్ముఁడు (మ $4^{21}$ కార్య $12^{2}$). అతని తల్లిపేరు సలోమె యనుకొందురు (మ $27^{56}$ మా $15^{40}$ తో సరి పోల్చుము). ఇతని తండ్రి జాలరి. యోహానును అదే వృత్తి గలవాఁడు (మా $1^{19,20}$). బాప్తిస్మమిచ్చు యోహాను శిష్యులలో నొకఁడై అతనిచే బోధింపఁబడి క్రీస్తును వెంబడించినట్లు పేరు ప్రస్తావింపఁబడకపోయినను యోహా $1^{35-40}$ వలనఁ దెలియుచున్నది. అట్లయినపక్షమున ఇతఁడు క్రీస్తు వెంట గలిలయకువచ్చి కానా యూరిలో నున్న వివాహమున ఆయనచేసిన మొదటి యద్భుతమును

చూచెను ($2^{1-11}$). అయినను అప్పటి కతఁడు సమస్తమును విడిచి ఆయనను వెంబడింపవలెనని పిలువఁబడనందున తిరిగివెళ్లి తన వృత్తిప్రకారము చేఁపలను పట్టుకొనుచుండఁగా క్రీస్తు పిలువఁగానే తన తండ్రిని సమస్తమును వదలి తన సహోదరుఁడగు యాకోబుతోకూడ ఆయనను వెంబడించెను (మ $4^{21,22}$ మా $1^{19,20}$). కొంత కాలమున కపొస్తలులలో నొకఁడుగా నియమింపఁబడెను (మా $3^{17}$ లూ $6^{14}$). ఈ యిద్దరన్నదమ్ములకు ఉరిమెడివారను నర్థమిచ్చు బోయనేర్గెసు అను బిరుదు నిచ్చెను (బోయనేర్గెసు చూ॥). క్రీస్తును వెంబడింపని కొందఱు ఆయన పేరట దయ్యములను వెళ్లఁగొట్టఁగా వారిని గద్దించుటలోను (లూ $9^{49}$), ఆయనను చేర్చుకొననొల్లక పోయిన యొక సమరయ ఊరివారిని నాశనము చేయఁగోరుటలోను ($9^{52-56}$), వీరు ఆయనయం దెక్కుడు అభిమాన ముంచినవారని తెలియుచున్నది గాని వారాయన చేయవచ్చిన పనిని సరిగా గ్రహించినట్లు కనఁబడదు. క్రీస్తు రాజ్యమునందు కుడియెడమల స్థానముల నడుగుట వలన వారి స్వార్థప్రియత్వము బైలుపడినను, ఆయనకు కలుగనైయుండిన శ్రమలలో పాలివారగుటకు సంసిద్ధులమై యున్నామని తెలుపుట వారి యాసక్తిని బయలుపఱచుచున్నది (మ $20^{20-24}$ మా $10^{35-41}$). యోహాను క్రీస్తు సంగతులను పూర్ణముగా నెఱిఁగిన తరువాత ఆయనయం దందఱికన్న నెక్కుడు అనురాగముగలవాఁడయ్యెను. అందువలననే క్రీస్తు ప్రేమించిన శిష్యుఁడనఁబడెను (యోహా $19^{26}$ $21^{7}$ $21^{20}$). యాయీరు కుమార్తెను బ్రతికించినప్పుడును (మా $5^{37}$ లూ $8^{51}$), రూపాంతర మొందినప్పుడును (మ $17^{1}$ మా $9^{2}$ లూ $9^{28}$). గెత్సేమనే వనమున మిగుల వేదననొందినప్పుడును (మ $26^{37}$ మా $14^{33}$) యాకోబు పేతురులతోఁగూడ నితనిని ఆయన తన దగ్గరనుంచుకొనెను. చివరి పస్కాను భుజించినప్పుడితఁ డాయన చెంతను గూర్చుండి ఆయన రొమ్ముమీఁద నానుకొనెను (యోహా $13^{23}$). ప్రధానయాజకుని ఆవరణముదనుక క్రీస్తును వెంబడించెను. యోహా $18^{15}$ లో నున్న ఆ మఱి యొక శిష్యుఁడు ఇతఁడే కావున ప్రధానయాజకునికిని అతని నౌకర్లకును బాగుగాఁ దెలిసిన వాఁడై యుండెను. క్రీస్తును సిలువవేసినప్పుడితఁ డాయనదగ్గర నున్నందున ఆయన తన తల్లిని యోహాను కప్పగించెను ($19^{27}$). క్రీస్తు సమాధిలో లేఁడని స్త్రీలు దెచ్చిన కబురు విని సమాధి యొద్దకు పరుగెత్తుచున్న పేతురుకన్న ముందు వెళ్లి, పేతురువెంట సమాధిలో ప్రవేశించెను (యోహా $20^{1-10}$). క్రీస్తు లేచిననాటి సాయంకాలమునందును తరువాతి ఆదివారపు సాయంకాలమునందును ఆయనను చూచిన శిష్యులలో నితఁడొకఁడు (లూ $24^{33-43}$ యోహా $20^{19-30}$ I కొరి $15^{5}$). తక్కిన శిష్యులతోపాటు ఇతఁడును గలిలయకు వెళ్లి అచ్చట సముద్రతీరమునందును (యోహా 21) ఆయనను చూచి యుండెను. ఆ సమయమున ఇతనితో నాయన చెప్పిన యొకమాటను ఆదికాలపు క్రైస్తవులు పొరబాటుగా గ్రహించుకొనిరి ($21^{22}$). క్రీస్తు గలిలయకొండలమీఁదను (మ $26^{32}$ $28^{10}$ I కొరి $15^{6}$), ఆయన ఆరోహణుఁడైనప్పుడు ఒలీవల కొండమీఁద (కార్య $1^{6-12}$) కనఁబడినప్పుడును పరిశుద్ధాత్మకొఱకు శిష్యులు కనిపెట్టుచుండినప్పుడు ($1^{13}$) నున్నవారిలో నితఁడు నుండెను. తక్కిన వారివలె పెంతెకొస్తుదినమున పరిశుద్ధాత్మవరమును పొందెను (2). తరువాత పేతురుతోఁ గలసి కొంతకాలము పనిజేసెను. వా రిద్దరును కలిసి దేవాలయమునకు వెళ్లుచుండఁగా పేతురు ఒక కుంటివానిని బాగుజేసెను (3). వీ రిద్దరు చెఱసాలయందుంచఁబడిరి ($4^{19}$). సమరయలోని క్రైస్తవులను స్థిరపఱచునిమిత్తము అచ్చటికి పంపఁబడిరి ($8^{14}$). సౌలు మాఱుమనస్సు నొంది దమస్కునుండి తిరిగివచ్చినప్పుడు యోహాను యెరూషలేమునందుండెను (గల $2^{9}$) గాన, హింసలు కలిగినసమయమునందు యెరూషలేమును విడిచివెళ్లినట్లు కనఁబడుచున్నది. మరియు జీవించినంతదనుక ఇతఁడు యెరూషలేమును వదలి యుండలేదను నొక వదంతిగలదు (మరియ 1 చూ॥). కార్యముల గ్రంథమునం దితనిని గుఱించి యింక వ్రాయఁబడలేదు. అతఁడు ప్రకటన గ్రంథమును యోహాను మూఁడు పత్రికలను యోహాను సువార్తను వ్రాసెనని మొదటి నుండి యనుకొనుచున్నారు. ఇతఁడు ఆసియలోని 7 సంఘములను చూచినవాఁడని ప్రక $1^{11}$ వలన నూహింపఁ

దగును. అతఁడా గ్రంథమును వ్రాసిన సమయమున పత్మాసను ద్వీపమున ఖైదీగా నుండెను (1[9]). పాలికార్పు (*Polycarp*), పాపియ (*Papias*), ఇగ్నేషియస్ (*Ignatius*) అతని శిష్యులై యుండిరి. పాలికార్పు శిష్యుఁడగు ఐరేనియు (*Ireneaus*), యోహాను తన మరణకాలపర్యంతము ఎఫెసునందుండెనని వ్రాసెను (యాకోబు, యోహాను సువార్త, యోహాను పత్రికలు, ప్రకటన గ్రంథము చూ॥).

**4.** మార్కుయొక్క మాఱుపేరు (కార్య $12^{12,25}$ మార్కు చూ॥).

**5.** పేతురు యోహానులను విమర్శించిన సభికులలో నొకఁడు (కార్య $4^{6}$). ఇతఁడు ప్రధాన యాజకుని బంధువుఁడనుట తప్ప మఱేమియు ఇతనినిగూర్చి తెలియదు.

**యోహాను వ్రాసిన పత్రికలు (John, Epistles of).**

నూతన నిబంధనయందు యోహానుచే లిఖితమైనట్టు చెప్పఁబడిన పత్రికలు మూఁడు. ఈ పత్రికలను గుఱించి ప్రాచీన క్రైస్తవ గ్రంథకర్తలు తెలియజేసిన వివరములనుబట్టి యివి మొదటనుంచి క్రైస్తవులందఱివలన సర్వాంగీకారమైనవి యని వెల్లడియగును. రెండవ శతాబ్దముయొక్క మధ్యభాగమున మొదటి పత్రికయును మూఁడవ శతాబ్దారంభమున కడమ రెండును సర్వత్ర ప్రచురమై యుండెను. నాల్గవ శతాబ్దముయొక్క మధ్యకాలమున ఈ పత్రికలు ప్రమాణ గ్రంథములుగా నెంచఁబడి సంఘారాధనయందుపయోగించఁబడెను. ప్రాచీనకాలము మొదలుకొని నేటివఱకు నుండు క్రైస్తవ భక్తకోటి యీ పత్రికలు యేసు ప్రేమించిన శిష్యుఁడు సంఘ సముదాయముల కప్పగించిపోయిన గొప్పభాగ్యమని భావించిరి. ఈ మూఁడు పత్రికలు శైలినిబట్టియు ఉద్దేశమునుబట్టియు ఒకదానికొకటి సంబంధించి, ఒక దానిలోని మాటలు వాక్యములు మఱియొక దానియందు తరుచుగ నగుపడుటవలన నివి యన్నియు నొక గ్రంథకర్తయొక్క హస్తకృతములని వేద్యమగును. అయినను పండితోత్తములలో కొందఱు మొదటిపత్రిక యోహానుయొక్క రచనమని యంగీకరించినను, రెండు మూఁడు పత్రికలను ఆయన వ్రాసెనో లేదో యని సంశయించెదరుగాని పై వివరములనుబట్టి మొదటిపత్రిక యోహాను రచనమని అంగీకరించిన యెడల, రెండుమూఁడు పత్రికలు సహా ఆయనవేనని ఒప్పుకొనక తీరదు.

## I. మొదటి పత్రిక.

1. గ్రంథకర్త:

ఈ పత్రిక వ్రాసినవాఁడు దీనియందెక్కడను తన పేరునుగాని, తా నెవరికి వ్రాసెనో వారి పేరునుగాని కనపరచకపోయెను. అయినను విషయ సంగ్రహమునుబట్టియు ఇతరాంశములను బట్టియు ఈ పత్రిక నాల్గవసువార్తకు మిగుల సంబంధించియున్నందున ఆ సువార్తయు నీ పత్రికయు నొక గ్రంథకర్తవలననే లిఖితమైనవి యని దృష్టాంతమగును. నాల్గవసువార్తను రచించినవాఁడు కొన్ని ముఖ్యపదములను పలుమారు నుపయోగించఁగా నీ పత్రిక వ్రాసిన గ్రంథకర్త ఆ మాటలనే అనేక పర్యాయములు ప్రస్తాపించును. అందుకు ఉదాహరణముగా నాల్గవ సువార్తయందు లోకము అను పదము 78 పర్యాయములు తటస్థము కాఁగా పత్రికలయందు 23 పర్యాయములు కనిపించును. అలాగే సత్యము అను పదము సువార్తయందు 25 పర్యాయములును పత్రికలయందు 20 పర్యాయములును, ప్రేమ అను పదము సువార్తయందు 36 పర్యాయములును పత్రికలయందు 31 పర్యాయములును, జీవము అను పదము సువార్తయందు 41 మార్లును, పత్రికలయందు 13 మార్లును తటస్థమగును. మఱియు నాల్గవసువార్తను రచించిన గ్రంథకర్తకూడ అదేవిధముగా విశదపఱచును. ఎట్లనిన సువార్తను రచించిన గ్రంథకర్త తా నుపదేశించు అంశములను అర్థవైపరీత్యముగా వివరించును. అందు కుదాహరణముగా వెలుఁగు చీఁకటి, జీవము మరణము, ప్రేమ ద్వేషము అనునవి కనఁబడును. పత్రికలను రచించిన గ్రంథకర్తకూడ అదే పద్ధతి ననుసరించెను. సువార్తయందు యేసుక్రీస్తుకు ఉపయోగింపఁబడిన బిరుదాంకములు పత్రికలయందుకూడ నుపయోగించఁబడెను. అందు కుదాహరణము దేవుని కుమారుఁడు, అద్వితీయ కుమారుఁడు, కుమారుఁడు అనునవి.

మఱియొక విషయమందు నాల్గవ సువార్తయును పత్రికలును సంబంధించి యున్నవి.

ఎట్లనిన, నాల్గవ సువార్తను వ్రాసిన గ్రంథకర్త పాఁత నిబంధన వాక్యములను సంగతులను ఎత్తి చెప్పుట బహు అరుదు. ఇతర సువార్తలయందు పాఁత నిబంధనలోని అంశములను ప్రస్తాపించఁబడుటకంటె నాల్గవ సువార్తయందు మిగుల తక్కువగా ప్రస్తాపించఁబడును. ఈ విషయమందు సువార్తను పత్రికలను పోల్చిచూడఁగా పత్రికలయందు పాఁత నిబంధన ప్రశంశ బహు అపురూపముగా నుండును. ఈ వివరము లన్నిఁటిని గమనించఁగా నాల్గవ సువార్తయును ఈ పత్రికయును ఒకే గ్రంథకర్తచే రచించఁబడెనని భావించుటావశ్యకము.

ప్రాచీన క్రైస్తవమత గ్రంథములను పరిశోధించఁగా పైనఁ జెప్పిన యభిప్రాయము స్థిరపడును. పాలికార్పును, పాపియయును $4^{2,3}$ వ లోని వాక్యమును తమ గ్రంథములయందు ప్రస్తాపించిరి. అనఁగా "యేసుక్రీస్తు శరీరధారియై వచ్చెనని యే ఆత్మ ఒప్పుకొనునో అది దేవుని సంబంధమైనది. ఏ ఆత్మ యేసును ఒప్పుకొనదో అది దేవుని సంబంధమయినదికాదు. దీనినిబట్టియే దేవుని ఆత్మను మీ రెఱుఁగుదురు. క్రీస్తు విరోధి (ఆత్మ) వచ్చునని మీరు వినిన సంగతి యిదే. ఇదివఱకే అది లోకములో నున్నది." ఐరేనియసును, అలెక్సంద్రియా పట్టణస్థుఁడైన క్లెమెంతును టర్టలియనును ఒరిగెను మొదలగువారి మొదటి పత్రిక యోహాను రచనమని తమ గ్రంథములయందు ప్రస్తాపించిరి. మ్యూరటోరియొక్క గ్రంథశేషమందును ఈ మొదటిపత్రిక యోహానుయొక్క రచనమని తెలుపఁబడును.

2. కాలస్థాన నిరూపణము.

ఐరేనియసు అను గ్రంథకర్త నాల్గవ సువార్తను యోహాను ఎఫెసు పట్టణమందుండఁగా వ్రాసెనని తెలియఁజేయుచున్నాఁడు. సువార్త లిఖితమైన తరువాత ఈ పత్రిక లిఖితమాయెనని అనుకొనుటకు ఆస్పదముండును గనుక ఇదియును ఆ పట్టణమందు రచించఁబడెనని నిశ్చయింపవలయును. అట్లయినయెడల నిది క్రీ॥ శ॥ 84-90 సం॥ముల మధ్యను లిఖితమై యుండును.

3. ఎవరినిమిత్తమై వ్రాయఁబడెను.

ఇదియొక ప్రత్యేక సంఘము నిమిత్తమైగాని ఒక ప్రాంత్యములోని భక్తులనిమిత్తమైగాని రచించఁబడినట్లు పత్రికయందెక్కడను కనఁబడదుగాని పూర్వికులైన క్రైస్తవు లిది చిన్నాసియలోని క్రైస్తవభక్తులయొద్దకు పంపించఁబడెనని ఏకగ్రీవముగా సాక్ష్యమిచ్చుచున్నారు.

4. ముఖ్యభాగములు.

i. క్రీస్తు సువార్త నిశ్చయమైన చరిత్రాధారము గలది (1 అధ్యా.).

ii. దేవునితోను, క్రీస్తుతోను గల సహవాసము పాపక్షమాపణకును, పాపవిముక్తికిని మూలము. దైవసహవాసము చేయువారు ఐహిక విచారములను విసర్జింతురు (2 అధ్యా.).

iii. క్రైస్తవుఁడు అనివార్యపారమార్థిక భాగ్యమునకు వారసుఁడగును గనుక పాపకార్యములను త్యజించి సహోదరప్రేమగల జీవితము జీవించ బాధ్యుఁడు (3 అధ్యా.).

iv. క్రీస్తునెడల నిశ్చల దృఢచిత్తముగల భక్తుని నడవడికయందు సహోదరప్రేమ ప్రకాశించును (4 అధ్యా.).

v. భక్తి, విధేయత, దేవునియెడల ప్రేమయు, మనుష్యులయెడల ప్రేమయు వేఱుచేయ సాధ్యముకానివి.

దేవునిగుఱించి క్రైస్తవునకుగల ధైర్యము.

## II. రెండవ పత్రిక.

1. గ్రంథకర్త.

ఈ పత్రిక యెవరివలన వ్రాయఁబడెనో పత్రికమూలముగాఁ దెలియదు. 1 వ. మందు గ్రంథకర్త తన్నుగుఱించి పెద్దనైన నేను అని చెప్పుచున్నాఁడుగాని తా నెవరైనదియు బయలుపరచఁడు. ఇచ్చట పెద్దనను బిరుదాంకము వహించుకొన్న ఘనునిగుఱించి వేదాంతులు ప్రాచీనకాలము మొదలుకొని నేటివఱకును వెవ్వేఱభిప్రాయములను చెప్పిరి. ఇతఁడు అపొస్తలుఁడగు యోహానని కొందఱి తాత్పర్యము. మఱికొందఱాయన ఎఫెసు పట్టణమందు అపొస్తలుఁడగు యోహాను సమకాలీనుఁడగు యోహానను పేరుగల సంఘపెద్ద యని భావింతురు. మొదటి పత్రికవలె నిదియు నాల్గవ సువార్తకు అనేక విషయములయందు సంబంధించిన రచనము. సువార్తయందనేకపర్యాయము లుపయోగించఁబడిన ప్రేమ యను పదమును సత్యమనుపదమును

ఈ చిన్న పత్రికయందును 4, 5 పర్యాయము లుపయోగించఁబడెను. ఈ సందర్భములనుబట్టి నాల్గవ సువార్తను మొదటి పత్రికను రచించినవాఁడే దీనినికూడ వ్రాసెనని సిద్ధాంతమగును.

ప్రాచీన గ్రంథకర్తలగు ఐరేనియసును, అలెక్సంద్రియ పట్టణస్థుఁడైన క్లెమెంతును ఈ రెండవ పత్రిక అపొస్తలుఁడగు యోహాను వ్రాసిన యుత్తరమని చెప్పుదురు. మ్యూరటోరి గ్రంథశేషమందు యోహాను పత్రికలు బహువచన రూపముగా గణించఁబడినందున నా గ్రంథములను రచించినవాఁడు రెండవ పత్రిక నెఱిఁగి యుండెననక విధిలేదు. మెట్టుకు రెండవ శతాబ్దముయొక్క అంత్యకాలమున నీ పత్రిక యోహానుయొక్క రచనమని పూర్ణాంగీకార మాయెను. అయినను అందఱు దానిని ప్రమాణగ్రంథముగా నంగీకరించక దానివిషయమై సంశయించినవారైరి. ఒరిగెను దానికి ప్రమాణగ్రంథముయొక్క యోగ్యత లేదనుకొనెను. యుసూబియసు ఈ పత్రికను వివాదాస్పదమైన గ్రంథవర్గమందు చేర్చెను. జెరోము ఇది తరుచుగా పెద్దమనుష్యుఁడగు యోహానుయొక్క యుత్తరమనఁబడెనని తెలియఁజేసెను.

ఈ పత్రిక ప్రమాణగ్రంథముగా నంగీకరింపఁబడని కారణములేవనిన, ఇది కేవలము క్లుప్తమైన యుత్తరము. ఇది సంఘస్థులనిమిత్తము కాకుండ ఏర్పరచఁబడిన అమ్మగారి నిమిత్తము రచించఁబడెను. ప్రాచీన గ్రంథకర్తలలో కొందఱుమాత్రమే దీని ప్రశంసమెత్తిరి. అయినను సాధకబాధకములను విచారించఁగా నీ రెండవ పత్రికను వ్రాసినవాఁడు అపొస్తలుఁడగు యోహానని తీర్మానించుట యుక్తము.

2. కాలస్థాన నిరూపణము.

గ్రంథపరిశోధనవలన నీ పత్రిక రచించఁబడిన స్థలమును గుర్తెఱుఁగ సాధ్యముకాదుగాని సువార్తకును మొదటిపత్రికకును గల సంబంధమునుబట్టి యిది ఎఫెసు పట్టణమందు లిఖిత మాయెనను అభిప్రాయము నిరాక్షేపమైనది.

3. ఎవరినిమిత్తమై వ్రాయఁబడెను.

1 వ. మందు ఇది ఏర్పరచఁబడినదైన అమ్మగారికి అని సూచించఁబడును. ఆ మాటకు శబ్దార్థముచేసినయెడల నిది యెవతెయో యొక క్రైస్తవ స్త్రీరత్నమునకు వ్రాసిన పత్రిక యని భావించవలయును. ఆమె పేరైనను నివాసస్థలమైనను ప్రశంసింపఁబడకుండుటవలన నీమె యెవరైనది చెప్పవీలుపడదు. ఇచ్చటనుండు ఏర్పరచఁబడిన యను మాట ఆ కాలమందు కొందఱి స్త్రీలవిషయమున ఉపయోగించఁబడిన ముద్దుపదము గనుక ఈ పత్రిక యొక ఘనత పొందిన స్త్రీకి వ్రాయఁబడెనని పెక్కండ్ర యభిప్రాయము. ఈమె ప్రిస్కిల్ల, ఫీబె, మొదలగు వారివలె సత్ప్రవర్తనకు పేరొందిన క్రైస్తవ సహోదరి యని అనుకొనఁదగును. 4 వ. మందు ప్రశంసించఁబడిన పిల్లలు ఈమె సంతానమునకు మాత్రముగాక ఆమె యింటిలో నేర్పడిన సంఘస్థులకును చెల్లునట్లు తోచును.

పై చెప్పిన తీర్మానమందఱికిని పూర్ణాంగీకారము కాదుగాని వారు ఏర్పరచఁబడిన అమ్మగారనుమాట సంఘమున కలంకారార్థ పదమని భావించి పత్రికలోని హెచ్చరికలు ఒక కుటుంబమునకు కాదుగాని యొక సంఘమునకు చెప్పతగునని యని యూహింతురు. ఆ యభిప్రాయమనుసరించువారు అపొస్తలుఁడగు యోహాను చిన్నాసియలోని యేదో యొక సంఘము నిమిత్తము వ్రాసెనని నిర్ధారణచేయుదురు.

4. ఉద్దేశము.

ఒక పట్టణములోని భక్తసముదాయము తప్పుడు బోధవలన గుణభ్రష్టులగుదురని భయపడి యట్టి మిథ్యబోధకు లా సంఘమును దర్శించినయెడల వారిని చేర్చుకొనకయును వారి సిద్ధాంతముల నంగీకరింపకయు నుండవలెనని యోహాను వారి హెచ్చరికనిమిత్తము ఈ పత్రికను రచించెనని నిశ్చయించతగును.

5. ముఖ్యభాగములు.

I. అభివందనములు.

II. పత్రికచదువువారిని సహోదరప్రేమను గైకొని జీవించుఁడని ప్రేరేపించుట.

ప్రభువిచ్చిన ఆజ్ఞ ననుసరించవలెనని హెచ్చరించుట.

III. మొదట అంగీకరించిన సిద్ధాంతములను గట్టిగా నమ్మవలెనని జాగ్రత చెప్పుట. తప్పుడు బోధకులవిషయమై భద్రము చెప్పుట.

ముగింపు.

## III. మూఁడవ పత్రిక.

1. గ్రంథకర్త.

మొదటి, రెండు పత్రికలవలె నీ మూఁడవ పత్రికయు అనామధేయమైనది. 1 వ. మందు పెద్దనైన నేను అనుమాట అపొస్తలుఁడగు యోహానుకు చెల్లునని కొందఱును, దానివలన పెద్దయైన యోహానను నొకఁడు సూచించఁబడునని కొందఱును తలఁచెదరు. మొదటిపత్రికను గుఱించిన చర్చవలన నీ సంగతి స్పష్టమగును.

2. ప్రామాణికత్వము.

ప్రాచీన గ్రంథములవలన నీ పత్రికకుఁగలుఁగు సాక్ష్యము కేవలము బలహీనమైనది. పూర్వికులైన క్రైస్తవమత గ్రంథకర్తలయొక్క గ్రంథములలో దీని ప్రశంస బహు తక్కువ. ప్రమాణ గ్రంథముల నుదాహరించు గ్రంథకర్తలు సర్వాంగీకార గ్రంథములవర్గమందు దీనిని సూచించనివారైరి. కాఁబట్టి మూఁడవ శతాబ్దమువఱకు నీ పత్రిక ప్రమాణగ్రంథముగా నంగీకరించఁబడకయుండెను. అయినను ఈ పత్రికవిషయసంగ్రహమును దీనియందు దుపయోగింపఁబడిన పదములను చూడఁగా నిది సువార్తకును 1, 2 పత్రికలకును సంబంధించినందున నిదియు అపొస్తలుఁడగు యోహానుయొక్క రచనమని తీర్మానించతగును.

3. కాలస్థాన నిరూపణము.

1,2పత్రికలవలె నిదియుబహుశః ఎఫెసు పట్టణములో రచించఁబడి అక్కడనుంచి పంపించబడెను.

4. ఎవరినిమిత్తమై వ్రాయఁబడెను.

1 వ. వలన ఇది ప్రియుఁడైన గాయియుకు వ్రాయునది అని చెప్పఁబడెను. ఈ గాయియును గుర్తించ సాధ్యముకాదు. రోమీయులలో నిది సర్వసాధారణమైన పేరు. ఈ పేరుగలవారీ పత్రికయందుగాక కార్య 19[29] 20[4] రోమా 16[23] I కొరిం 1[14] యందును గలరు. కాఁబట్టి యితఁడు ఫలాని గాయియు అని కచ్చితముగా చెప్పవీలుండదు. ప్రాచీన యితిహాస గ్రంథములలో అపొస్తలుఁడగు యోహాను పెర్గము సంఘముమీఁద గాయియు అను పేరుగల ఒక పెద్దను అధ్యక్షునిగా నియమించెనను ప్రశంస గలదుగాని అది సంశయాస్పదమైనది.

5. ఉద్దేశము.

యోహానుకు బాగుగా తెలిసిన క్రైస్తవ బోధకులు దేశసంచారముచేసి గాయియు సభికుఁడుగా నుండిన సంఘమును దర్శించఁగా దియొత్రెఫే యను సభికుఁడు తోటిసంఘస్థుల మనస్సులను చెఱిచి యీ బోధకులను చేర్చుకొనకుండ వారిని ప్రేరేపించిరి గనుక సంఘస్థులు వారిని విసర్జించినందున గాయియుమాత్రము వారి కుపచారము చేసెను. ఆ క్రైస్తవబోధకులు యోహాను వ్రాసిన పత్రికను తెచ్చియియ్యఁగా నీ దియొత్రెఫే దుష్ప్రేరణవలన నా యుత్తరమును వారు నిర్లక్ష్యముచేసిరి. గాయియు అగుపఱచిన ఔదార్యబుద్ధికి మెచ్చుకొని అందును గుఱించి వందనములను చెల్లించుటకై యోహాను ఈ పత్రికను రచించెను.

6. ముఖ్యభాగములు.

I. ఉత్తరమందవలసిన గాయియుకు, శుభమని చెప్పుట.

II. గాయియుయొక్క సత్యప్రవర్తనను గుఱించి సంతోషించుట.

III. దియొత్రెఫే యను వానిని గద్దించుట.

IV. దేమేత్రియును మెచ్చుకొనుట. దీవెనలు. M.

**యోహాను సువార్త** (The Gospel according to St. John). సువార్తలలో నాలుగవది. మొదటి మూఁడు సువార్తలు క్రీస్తు చర్యలను ఏకరీతిగా చూపునుగాని యిది ఆయన దైవత్వమును ముఖ్యముగా చూపుచున్నది. (సువార్తలు, యేసుక్రీస్తు చూ॥).

1. గ్రంథకర్త:—అపొస్తలుఁడగు యోహానే దీని వ్రాసినవాఁడను పారంపర్యము ఆదినుండి గలదు. అతని శిష్యులగు పాపియ (*Papius*), పాలికార్పు (*Polycarp*) లనువారు దీనిగూర్చి సాక్ష్యమిచ్చుచున్నారు. యోహాను ఎఫెసునందుండునప్పుడు తక్కిన సువార్తలు రచింపఁ

బడిన పిమ్మటనే దీనిని వ్రాసినట్లు పాలికార్పు శిష్యుడగు ఐరేనియు (*Irenaeus*) చెప్పెను. తక్కిన సువార్తలవలెనే దీనియందును గ్రంథకర్త పేరు గానవచ్చుటలేదుగాని గ్రంథమందలి కొన్ని సూచనలు యోహానుకు సూటిగా సరిపడును. (1) గ్రంథశైలినిబట్టియు, యూదుల మట్టు మర్యాదలను చక్కగా నెఱిగియుండుటను బట్టియు గ్రంథకర్త యూదుడని స్పష్టమగు చున్నది ($1^{21,38,46}$ $2^{6}$ $3^{23}$ $4^{5,27}$ $5^{2,3}$ $7^{40-52}$ $9^{7}$ $10^{22,23}$ $11^{18}$ $18^{28}$ $19^{31}$) (2) గ్రంథకర్త అపొస్తలులలో నొకడై యుండెను. క్రీస్తు మహిమను చూచినవారిలో తానొకడైయున్నట్లు $1^{14}$ వలన దెలియుచున్నది. ఆయనను వెంబడించినవారు స్వయముగా చూచి విన్న సంగతులు దీనియందుండుటవలన ($1^{37}$ $2^{17}$ $4^{27}$ $9^{2}$ $11^{8-16}$ $18^{15}$ $19^{26,35}$) ఆయనయొద్ద మొదటినుండి యున్న వారిలో నొకడీ గ్రంథకర్త కావచ్చునని నిస్సందేహముగ జెప్పవచ్చును. ఆయన శిష్యులలో యేసు ప్రేమించిన యొకడు అను బిరుదుగల వాడు దీని వ్రాసినట్లు $21^{7,20-24}$ వలన దెలియు చున్నది. ఆ బిరుదు యోహానుకే సూటిగా సరిపడును. అతడపొస్తలులలో నొకడని $13^{23}$ $19^{26}$ $20^{2}$ వలన తేటగా కనబడును. నవీనపండితులలో కొందఱీ బిరుదు మఱియొకనికి చెందునందురుగాని ఆదికాలమునుండి యోహానుకే ఈ బిరుదు ఆరోపింపబడియున్నది. మఱి కొందఱు సువార్తను వ్రాసినది ఈ యోహాను గాక పెద్ద యని పిలువబడిన మఱియొక యోహానో, మఱి యెవడో వ్రాసెనందురు. యోహాను సువార్తయందలి చరిత్రలోని సూచనలు ఆదినుండి క్రైస్తవులవలన నంగీకరింపబడినట్లు అపొస్తలుడగు యోహాను వ్రాసెనని కనబడుచు చున్నవి.

2. కాలస్థానములు:—సువార్తలన్నియు వ్రాయబడినపిమ్మట క్రీ॥ శ॥ 90-100 సం॥ మధ్య నెప్పుడో ఎఫెసునందు వ్రాయబడినట్లు పాపియ, పాలికార్పు, ఐరేనియులు వ్రాసిన సంగతులవలన నూహింపవచ్చును. అందుకు తార్కాణముగా నీ గ్రంథమందలి సూచనలు కొన్ని సరిపడుచున్నవి. (1) పీఠికయందున్న వాక్యము (*Logos*) అను పదమునుబట్టి గ్రీకు వారి తత్వశాస్త్రజ్ఞానము వ్యాపించుచు యుండిన ప్రాంతములలో నొకటియైయున్న దేశములో నిది రచింపబడెననవచ్చును. (2) గలిలయసముద్రపు పేరును రోమనుగ్రీకు ప్రజలలో వాడుకగా నున్నట్లు తిబెరియ సముద్రమని వ్రాయుట ($6^{1}$ $21^{1}$) మఱియొక సూచన. (3) యూదుల పండుగలనుగూర్చిన వివరములనుబట్టి ($6^{4}$ $7^{2}$ $11^{55}$ $19^{31}$) అది యూదులకు కాక యితరుల కొఱకని స్పష్టమగును.

3. ముఖ్యోద్దేశము:—యేసు దేవుని కుమారుడైన క్రీస్తు అని నమ్మునట్లును, నమ్మి ఆయన నామమందు జీవించునట్లు ఇది వ్రాయబడెనని $20^{31}$ వలన దెలియుచున్నది. యేసు దేవుని కుమారుడని నమ్మునట్లు ఈ గ్రంథకర్త ఆయన మహిమను సూచించు అద్భుతములను ఆయనను విరోధించిన వారితో ఆయనచేసిన వాదములను వ్రాసి, ఆయన శ్రమలవలన ఆ మహిమ కొంతవఱకు మఱుగుపడినను ఆయన మృతులలోనుండి తిరిగి లేచుటవలన మఱల స్థాపింపబడినదను సంగతికి సంబంధించిన గొప్ప విషయములను వ్రాసెను. అవిశ్వాసపడిన తోమా సహా నా ప్రభువా నా దేవా యని యొప్పుకొనిన సంగతిని చూపి తన యుద్దేశము పూర్తియైనట్లు సువార్తను ముగించెను. యోహాను మరణము నొందడని యనుకొన్న వారి యభిప్రాయమును దిద్దుటకు 21 వ అధ్యాయము వ్రాయబడి అనుబంధముగా చేర్చబడెను.

4. ముఖ్యలక్షణములు:—పైన చెప్పిన రీతిగా క్రీస్తుయొక్క దైవ మహిమను సూచించెడి విషయము లిందు ముఖ్యముగా నున్నవి. ఆ కారణముచేత ఆయన దైవత్వమును గూర్చిన ఉపన్యాసములును వాదములును ఇతర సువార్తలలో నున్నట్లు గాక (మ $11^{25-27}$ లూ $10^{21,22}$ మ $17^{2-8}$ $25^{31}$ మా $14^{62}$ లూ $22^{69}$ మొ॥) మిగుల వివరముగా నున్నవి. ఈ సువార్తయందు వాదము లెక్కువగా నుదాహరించినందున ఆయన తక్కిన సువార్తలలో నున్నట్లు సాధువైన వానివలె గాక (మ $12^{15-21}$) తర్కవాదివలె కనబడును గాన ఇది క్రైస్తవమత మితర మతములలోను ఖండింపవలసివచ్చిన సమయమున క్రీస్తుబోధల ననుసరించి చేసినవాదముల వివరమేగాని క్రీస్తు స్వయముగా వాదించిన వాదములుకావని కొందఱి

యభిప్రాయము. యోహాను ముఖ్యముగా యెరూషలేమునందు జరిగినవాటిని వ్రాసెను. క్రీస్తు అచ్చట యూదుల అధికారులచేఁ దిరస్కరింపఁబడెను. అవసరమునుబట్టి వారితో వాదింపవలసి వచ్చెనే గాని ఆయన తర్కవాదియగుటచేత అట్లు చేయలేదు. మొదటి మూఁడు సువార్తలలోను ఈ సువార్తలోను ఉదాహరించిన క్రీస్తు ఒకటే విధమగు లక్షణములుగలవాఁడని ఆయన చరిత్రయందలి కొన్ని విషయములనుమాత్రమే వ్రాయుటచేత ఇట్టి భేదమగుపడుచున్నది. క్రీస్తునుగూర్చిన తప్పుడుబోధలు చిన్నాసియలో వ్యాపించుటవలన (I యోహా $2^{22}$) యోహాను వాటిని ఖండించుటకై ప్రసంగములను వాదములను వ్రాయవలసివచ్చెను.

5. ముఖ్యభాగములు, సంగతులు:—

I. పీఠిక. ఆదినుండియున్న దేవుఁడై, నరావతారమెత్తివచ్చి మనమధ్య నివసించెనను సంగతి దీనిలో ముఖ్యమైనది ($1^{1-18}$).

II. ఆయన తన మహిమను కార్యములద్వారాను, ప్రసంగములద్వారాను కనఁబఱచుట ($1^{19}$-$12^{50}$):—దీనియందలి సంగతులు ముఖ్యముగా యూదయలోనే జరిగినవిగాని కొన్ని గలిలయలోను ($2^{1-12}$ $4^{43-54}$ 6), ఒకటి సమరయలోను ($4^{1-42}$) జరిగెను.

1. తనను నమ్మినవారికి:—(1) యోహాను సాక్ష్యము చెప్పఁగా విని ఆయనను వెంబడించుట ($1^{19-51}$). (2) కానాలో మొదటి యద్భుతమును చేసినప్పుడు శిష్యులాయనయందు విశ్వాసముంచుట ($2^{1-12}$). (3) యెరూషలేమునం దాలయమును పవిత్రపఱచి అనేక యద్భుతములను జేయఁగా అనేకులాక విధముగాను ($2^{13-25}$), నీకొదేము రహస్యముగాను నమ్ముట ($3^{1-21}$). (4) యోహాను శిష్యులు అనూయపరులగునంతమంది యొర్దాను ప్రాంతములలో నాయనయొద్దకు వచ్చి వినుట ($3^{22-36}$). (5) సమరయదేశపుస్త్రీయు సమరయులలో ననేకులును ఆయనను నమ్ముట ($4^{1-42}$). (6) గలిలయలో ననేకులును, ఒక ఘనుఁడును ఆయనయందు విశ్వసించుట ($4^{43-54}$).

2. ఆయనను విరోధించినవారికి:—(1) బేతెస్థలోనేటియొద్ద 38 సం॥ నుండి పక్షవాతముతో పడియున్న యొకని స్వస్థపఱచిన పిమ్మట తన్ను దేవునితో సమానునిగాఁ జేసికొన్నప్పుడు ($5^{1-47}$); (2) గలిలయలో 5000 మంది కాహారము పెట్టిన తరువాత సముద్రముమీఁద నడిచి కపెర్నహూముకు వచ్చి సముద్రతీరమున తానే జీవాహారమునని బోధించినప్పుడు ($6^{1-71}$); (3) పర్ణశాలపండుగ సమయమునందు తాను జీవజలమును, లోకమునకు వెలుగునై యున్నానని చెప్పుకొనినప్పుడు ($7^{1-52}$ $8^{12-59}$), [వ్యభిచారమందు పట్టఁబడిన స్త్రీనిగూర్చి యిక్కడున్న సంగతి ($8^{1-11}$) ఆ సందర్భముగా నుండుటచే మఱియొకచోట నుంచవలసియున్నది] (4) విశ్రాంతిదినమున బాగుజేసిన పుట్టుగుడ్డివాఁడు పరుపెత్తుకొని పోవుచున్నందున పరిసయ్యులు వానితో తర్కించి వెలివేయఁగా క్రీస్తు తాను నిజమైనకాపరిని గూర్చి చెప్పినదానివలన వారు విరోధించినప్పుడు ($9^{1}$-$10^{42}$); (5) లాజరును మృతులలో నుండి లేపినప్పుడు ($11^{1-57}$); (6) పస్కాకు ఆరుదినములు ముందుగా బేతనియలో ఆయనను గౌరవించనై చేసిన విందుసమయమున మరియ ఆయననభిషేకించి, శిష్యులాయనను జయోత్సవముగా యెరూషలేములోనికి గొనిపోఁగా గ్రీకువారాయనను చూడవచ్చినప్పుడు, యూదుల అధికారులు ఆయన నింక నెక్కువగా విరోధించి తిరస్కరించిరి (12).

III. ఆయన తన మహిమను శ్రమమరణ పునరుత్థానములవలన కనఁబఱచుట ($13^{1}$-$20^{29}$).

1. పస్కా విందుసమయమున యేసుచేసిన హెచ్చరికలు పలికిన ఆదరణలు వారికొఱకుచేసిన ప్రార్థన (13-17). 2. క్రీస్తునుపట్టుకొని అన్నా కయప, పిలాతులయెదుట విచారించి సిలువవేసి పాతిపెట్టుట (18, 19) 3. ఆయనలేచి మగ్దలేనే మరియకు పదిమందికిని, పదునొకొండుమందికిని కనఁబడుట ($20^{1-29}$).

IV. సువార్తకు ముగింపు ($20^{30,31}$).

V. సువార్త యనుబంధము. గలిలయ సముద్రతీరమున కనఁబడి పేతురు యోహానుల భవిష్యద్ స్థితినిగూర్చి తెలుపుట. యోహానునుగూర్చి పేతురడిగినందు కాయన నేను వచ్చువఱకు అతఁడుండుట నా కిష్టమైతే అది నీకేమి యన్న మాటను పొరబాటుగా గ్రహించుకొన్నవారివలన

కలిగిన వదంతిని దిద్దుటకై యనుబంధము వ్రాయఁబడెను (21).

పైన వివరించిన సంగతులు బైబిలులోని క్రమము ననుసరించినను నవీన పండితులు దానిని మఱియొకరీతిగా సవరింతురు. అట్టివారు 7[23] లో నున్న పక్షవాయువుగలవాని సందర్భమునబట్టి 5 వ అధ్యాయమందలి సంగతులు 6 వ అధ్యాయము తరువాత నుండవలెనందురు. అట్లు చేసిన చేయవచ్చునుగాని, కొందఱెంచినట్లు ఈ సువార్త యోహానుచేగాక చిన్నాసియలోని మఱియొకనిచే వ్రాయఁబడినదనియు ఈ కార్యములు క్రీస్తు కార్యములవంటివేగాని అవి జరిగియుండలేదను యుద్దేశముతో అట్లు చేయరాదు. క్రీస్తు బోధించిన సంగతులను యోహాను చక్కఁగా గమనించి ఆయా సంగతుల ననుసరించి యీ బోధలను లోతుగా గ్రహించుకొని వ్రాసెను. దేవునిగూర్చిన తగు ఎఱుకను కలిగి విశ్వసించి నిత్యజీవము నొందవలెనను ఉద్దేశముకు సంబంధించిన ప్రాముఖ్యములగు విషయము లిందున్నందున ఆదినుండి క్రైస్తవు లెంచుచుండినట్లు గంభీరముగా నెంచుట న్యాయమై యున్నది.

**యోహాన్న** 1. (Joanna = యెహోవా కృప చూపెను). హేరోదుయొక్క గృహనిర్వాహకుఁడగు కూజాయొక్క భార్య. యేసుకు పరిచర్యఁజేసిన స్త్రీలలో నీమె యొకతె (లూ 8[2,3]). ఆయన చనిపోయిన పిమ్మట ఆయన దేహమునకు సుగంధ ద్రవ్యములను పూయుటకు సమాధియొద్దకు వెళ్లెను (24[10]). ఈమెయు నీమె పెనిమిటియు ధైర్యము గలవారని చెప్పవచ్చును. వారు యేసుకు పరిచర్య చేయుటలో హేరోదుకు భయపడి వెనుకఁదీసిన సూచనలు కనఁబడుట లేదు. E.

2. (Joanan). క్రీస్తు వంశావళి క్రమణికలోని యొకఁడు (లూ 3[27]).

**యోహేజెరు** (Joezer = యెహోవా సహాయము చేయును). సిక్లగులో దావీదుతోఁ గలిసికొన్నవారిలో నొకఁడు (I దిన 12[6]).

**యోహేలా** (Joelah = ఆయన సహాయము చేయుగాక!). సిక్లగులో దావీదుతోఁ గలిసికొన్నవారిలో నొకఁడు (I దిన 12[7]).

# ర

**రంగులు, వర్ణములు** (Colours). ప్రస్తుతమున రంగులలోని సూక్ష్మభేదములను గుర్తింపఁగలిగినట్లు బైబిలు కాలమునందున్నవారికి చేతఁగాలేదు. గుడారమందలి పైకప్పు తెరలు యాజకుల వస్త్రములను వివరించునప్పుడును (నిర్గ 25-28, 35-39, సంఖ్యా 4, 15; II దిన 2, 3), కుష్ఠరోగ వివరమునందును (లేవీ 13, 14), దైవదర్శనములందు కనఁబడిన గుఱ్ఱములనుగూర్చిన వివరమునందును (జెక 6 ప్రక 6[1-9]), చలువరాతి రంగుల వివరమునందు (ఎస్తే 1[6]) తప్ప ఆయా రంగులను గూర్చిన సంగతులు బైబిలునందు లేవు. గుణమును స్థితిని సూచించుటకు కొన్ని రంగులను అలంకారరీతిగా వాడిరి.

1. తెలుపు. ఇది శుద్ధిని సూచించు గుఱుతు. హిమము అన్నిఁటిలో తెల్లనిదిగా నెంచిరి. దానితోఁ గప్పఁబడిన లెబానోను కొండలకు తెలుపుకొండలని యర్థము. శుద్ధి హిమముకన్న మఱింత తెల్లనిదిగా నెంచిరి (కీర్త 51[7] యెష 1[18]). దూతల శుద్ధిని సూచించుటకు వారి వస్త్రములు తెల్లని రంగు గలిగి యున్నట్లు వర్ణించిరి (దాని 7[9] 12[10] మ 28[3] మా 16[1] యోహా 20[12] కార్య 1[10] ప్రక 3[4,5,18] 4[4] 6[11] 19[8,14]). క్రీస్తు రూపాంతరము నొందినప్పుడు ఇట్టి మహిమను సూచించుటకు ఆయన వస్త్రములు ఏ చాకలివాఁడును చలువచేయ లేనంత తెల్లనివాయెను (మ 17[2]=మా 9[3]=లూ 9[29]) అని వ్రాయఁబడెను. దీనికి సూచనగా రక్షణ నొందెడివారి పేరు తెల్లని రాతిమీఁద వ్రాయఁబడినట్లుగాను (ప్రక 2[17] 20[11]) వారి వస్త్రములు తెల్లనివై యున్నట్లుగాను (7[9,13,14]) చెప్పఁబడెను.

ఘనులైనవారు తెల్లని వస్త్రములను ధరించుట వారి పరువునకుఁ దగినదని యెంచిరి (ఎస్తే 8[15] విలా 4[7]). అట్టివారు తెల్లని వాహనములపై స్వారి చేసిరి (న్యాయా 5[10] ప్రక 19[11,14]). తెల్లని వస్త్రములను ధరించుట సంతోషమునకు సూచనగా నెంచిరి (ప్రస 9[8]).

సుందరుఁడగువాని ముఖవర్చస్సు (పరమ 5[10]), గొఱ్ఱె బొచ్చు (యెహె 27[18] ప్రక 1[14]), పాలు

(విలా $4^{7}$), చలువరాళ్లు (ఎస్తే $1^{6}$), ముదిరిన పైరు (యోహా $4^{35}$), పిండి వంటలు (ఆది $40^{16}$), గోడలు (మ $23^{27}$ కార్య $23^{3}$) మొదలగునవి తెల్లనివైనట్లు వర్ణింపఁబడెను. చర్మమును వెండ్రుకలును తెల్ల బారుట కుష్ఠరోగ లక్షణము (నిర్గ $4^{6}$ లేవీ 13-14 సంఖ్యా $12^{10}$ II రాజు $5^{27}$). ముఖము తెల్ల బారుట భయమునకు గురుతుగా నెంచిరి (యెష $29^{22}$ మొ॥).

**2. నలుపు.** ఇదియు దీనికి సంబంధించిన రంగులును ఉపద్రవమును దుఃఖమును సూచించెను (యోబు $30^{30}$ విలా $4^{8}$ $5^{10}$). యిర్మీ $8^{21}$ నందున్న వ్యాకుల పడుచున్నాను అను పదములకు మూలభాషయందు నేను నల్లబడుచున్నాను అని యర్థమిచ్చు మాట లున్నవి. దుఃఖాక్రాంతులు నల్లటి వస్త్రములను ధరించుకొనిరి. యిర్మీ $4^{2}$ నందున్న "విచారగ్రస్తులై జనులు నేలకు వంగెదరు" అను వాక్యము మూలభాషయందు వారు నల్లని వస్త్రములను ధరించినవారై నేలపై వంగుదురను అర్థమిచ్చును. రాత్రి యగుటవలనఁగాని తుఫానువలనఁగాని అంతయు కాఱు కమ్మునట్లు వర్ణింపఁబడును (I రాజు $18^{45}$ యోబు $3^{5}$ యెష $50^{3}$ యిర్మీ $4^{28}$). కాకపక్షులు నల్లని (కృష్ణ) వర్ణమునకు గురుతు (పర $5^{11}$). చలువ రాళ్లలోను నల్లనివి గలవు (ఎస్తే $1^{6}$). దైవదర్శనములయందు నల్లని గుఱ్ఱములు కనఁబడినటులున్నది (జెక 6 ప్రక 6).

**3.** ఆది $30^{37-40}$ నందున్న **చారలు** నలుపు తెలుపు చారలై యున్నవి.

**4. నీలధూమ్ర రక్తవర్ణములు.** ఇవి యొక రంగుగాక మూఁడు రంగులను సూచించెను. గుడారపు తెర, యాజకుల వస్త్రము ఈ రంగులవై యుండెను (నిర్గ $25^{21}$ $26^{26-36}$ $28^{5}$ $35^{6}$ $39^{1}$ మొ॥). I దిన $2^{7,14}$ $3^{14}$ నందు రక్తవర్ణమను పదమునకు ప్రతిగా ఎఱ్ఱని వర్ణము అని వ్రాసిరి.

అనేక వాక్యములలో ధూమ్రరక్త వర్ణములను నవి మాత్రము గలవు. గొప్పవారును, అధికారులైనవారు ధరించిన వస్త్రము ఈ రంగువై యుండెను. కీర్త $31^{21,23}$ నందీ రెండు పదములను రక్తవర్ణము అను నొక పదముచేత తెనిఁగించిరి. ప్రక $18^{12}$ నందు **ఊదా, రక్తవర్ణము** లుదాహరింపఁబడెను. ధూమ్రవర్ణ మనునది ఊదారంగు గాని, ప్రక $17^{3}$ నందున్నట్లు ఎఱ్ఱని రంగు గాని అయ్యుండును.

ధూమ్రమను పదమును సమాసములలో మాత్రమేగాక ప్రత్యేకముగాను ఆయా వాక్యములలో నుపయోగించిరి (న్యాయా $8^{26}$ పర $3^{10}$ $7^{5}$ యిర్మీ $10^{9}$ యెహె $27^{7,6}$ దాని $5^{7,16,29}$).

ఈ పదమునే ఎస్తే $1^{6}$ $8^{15}$ మా $15^{17,20}$ యోహా $19^{3,6}$ లూ $16^{19}$ నందు ఊదారంగు అని తెనిఁగించిరి.

ఇట్లే రక్తవర్ణమను పదమునుకూడా ప్రత్యేకముగా నుపయోగించినట్లు జూడవచ్చును (లేవీ $14^{5}$ సంఖ్యా $19^{6}$ II సమూ $1^{24}$ యెష $1^{18}$ యిర్మీ $4^{30}$ హెబ్రీ $9^{40}$). సంఖ్యా $4^{7}$ మ $27^{28}$ నందు దానిని ఎఱ్ఱని యను మాటతో తెనిఁగించిరి. ఆది $38^{28-30}$ యెహె $2^{18,21}$ లో నున్న తొగరు ఇట్టి రంగుగల దారమై యుండెను.

ధూమ్రవర్ణము నొక విధమగు గుల్లనుండి తీసిరి. అది మిగుల విలువగలది. రక్తవర్ణ మొక తరహా పురుగునుండి దొరకును.

నీలిరంగు ధూమ్రవర్ణమునకు సంబంధించినది. ఈ పదము సమాసములయందేగాక ప్రత్యేకముగను ప్రయోగింపఁబడెను. ఇశ్రాయేలీయుల వస్త్రపుకుచ్చులు నీలిరంగువి (సంఖ్యా $15^{38}$). యెహె $23^{6}$, $27^{24}$ లలో ధూమ్రవర్ణ మని యున్న మూలపదమును ఇతర వాక్యములలో నీలిరంగు అని తెనిఁగించిరి.

**5. ఎరుపు.** పైన నుదాహరించినట్లు రక్తవర్ణమునకు ప్రతిగా నుపయోగించిన తెనుఁగు పదము (సంఖ్యా $4^{7}$ I దిన $2^{17}$ మొ॥). ప్రక $9^{17}$ నందిది యొక ప్రశస్తమైన రాతియొక్క రంగు అని తెలియుచున్నది. గుడారమునందు వాడిన చర్మములకు ఎఱ్ఱని రంగువేసిరి (నిర్గ $25^{5}$ $26^{14}$ $35^{7-23}$ $39^{34}$) ద్రాక్షారసమును ఇట్టి రంగుగలదై యున్నది (సామె $23^{31}$). యాకోబు ఏశావున కమ్మిన కలగూర వంటకమును ఎఱ్ఱగా నుండెను (ఆది $25^{30}$). శుద్ధి నీళ్లు చేయుటకు ఎఱ్ఱని పెయ్యను కోసి కాల్చి దాని బూడిదెను నీళ్లతో కలిపిరి (సంఖ్యా 19). కొన్ని చలువ

రాళ్లు ఎర్రనివని ఎస్తే 1[6] వలనఁ దెలియుచున్నది. గోడలకును సరంబీకిని వేసిన చెక్కలకు రంగును ఇంగిలీకముతోను (యిర్మీ 22[14]) సింధూరముతోను (యెహె 23[15]) వేసినట్లున్నది. డాళ్లకును ఇట్టి రంగు వేసిరి (నహూ 2[3]). దైవదర్శనములలో కనఁబడిన గుర్రములలో నొకటి ఎర్రనిది (జెక 1[8] 6[2] ప్రక 6[4] 9[14]). ఎదోమును జయించు యోధుని వస్త్రములు ఎర్రగానుండెను (యెష 63[2]). అగ్ని మయమని దానికి అర్థము. ఆకాశము ఎర్రగా నున్నదని మ 16[2,3] నందున్న దానికి నిదే యర్థమై యున్నది. ఎర్రటివారు ఆరోగ్యవంతు లనియు సుందరులనియు నెంచఁబడెదరు (పర 5[10] విలా 4[7]). దావీదు అట్టి వాఁడు (I సమూ 16[12] 17[42]). ఏశావుయొక్క ముఖవర్చస్సు ఎర్రనిది (ఆది 20[25]). ఎర్రని పెదవులు సౌందర్యమునకు గుఱుతు (పర 4[3]).

౬. పచ్చ, పసుపు. పచ్చనిరంగు అన్ని విధములగు చెట్లు చేమలను సూచించును (కీర్త 52[8] యిర్మీ 17[8] హోషే 14[8] ప్రక 9[4] మొ॥). ఎస్తే 1[6] లోని చలువరాళ్లలో నొకటి పసుపుగా నున్నట్లు చూడవచ్చును. కుష్ఠరోగము వచ్చినదేమో చూచుటకు యాజకుఁడు ఆ రోగి వెండ్రుకలు పచ్చగా నున్నవేమో చూడవలెను (లేవీ 13[33-36,49] 14[37]). కీర్త 68[13] నందు పచ్చని బంగారును గూర్చి చెప్పఁబడినది.

మఱింత చక్కఁదనము కలుగునట్లు ఆయా రంగులను సర్దుటను గూర్చిన సూచనలు ప్రధాన యాజకుని పతకమందలి రాళ్లను గూర్చియు, పరమ యెరూషలేము పునాదులను గూర్చియుఁ గాక మరి యితరములైన వాటినిగూర్చి అంతగా లక్ష్యపెట్టినట్లు గానరాదు

**రంగు వేయుట** వృత్తులు చేతిపనులు III 5 చూ॥

**రంపము** వృత్తులు చేతిపనులు I 2 (2) (*a*) చూ॥

**రక్కతు** (Rakkath = సముద్రము). నఫ్తాలీ గోత్రభాగమునందు ప్రాకారములుగల పట్టణములలో నొకటి (యెహో 19[35]). యూదుల పురాతన పండితులది తిబెరియ పట్టణమున్నచోటు అని తలంచిరి. అది నిజము కావచ్చును.

**రక్కోను** (Rakkon = సన్నని, తీరము?). దాను పట్టణములలో నొకటి (యెహో 19[46]). దీని యునికి సరిగా తెలియదు. ఇట్టి స్థలము లేదనియు, ఈ పదముకు ముందున్న మేయర్కోను అను పదములోని చివరిభాగములు పొరపాటున రెండుసారులు వ్రాయుటవలన నీ పేరు వచ్చినదని కొందఱి యూహ.

**రక్తపు పొలము, రక్తభూమి** యెరూషలేము B VI 6 చూ॥

**రక్త ప్రతీకారము చేయువాడు** ప్రతిహత్య చేయువాడు చూ॥

**రక్త భేది** రోగములు చికిత్సలు II 7 చూ॥

**రక్తము** (Blood). ఈ వ్యాసమునందు రక్తమునుగూర్చి గాక బైబిలునం దది సూచించిన వాటిని మాత్రము వివరింతుము. రక్తము జీవమునకు సూచన (లేవీ 17[11,14] ద్వితీ 12[23]). కయీను హేబెలును చంపిన పిదప అతని రక్తమింకిన నేల ఆ ప్రాణము తీసినవానిని శిక్షింపవలెనని మొఱపెట్టినట్లున్నది (ఆది 4[10]). రక్తము ప్రాణమును సూచించుటచే అప్పటి కాలములో అన్యులందు వాడుకగా నుండినట్లు దానిని తినుటను నిషేధముగా నెంచిరి. యూదులు దానిని నేటివఱకు స్థిరమైన చట్టముగా నెంతురు (9[3,4] కార్య 15[20-29]). ఒకని రక్తమును చిందించువాని రక్తమును చిందింపవలెనని మొదటినుండి నియమము కలదు (ఆది 9[6]). రక్తము ప్రాణమును సూచించుచున్నందున యజ్ఞములలో దానిని ముఖ్యముగా నర్పించిరి (లేవీ 1[5,11,15] 3[2-8] మొ॥). దానితోనే పాపాచ్ఛాదనము చేయవలసిన నియమము గలదు (17[10-14] ద్వితీ 12[15,16]). రక్తము చిందింపఁబడక క్షమాపణలేదనునది బైబిలు బోధల సారమైయున్నది (హెబ్రీ 9[22]). క్రీస్తు రక్తము గొఱ్ఱెపిల్ల రక్తమువలె గాక ఆయన తన ప్రాణము పెట్టుటవలన సంపాదించిన విమోచనమును సూచించును (I కొరి 10[16] ఎఫె 2[13] హెబ్రీ 10[19] I పేతు 1[2,19] I యోహా 1[7] ప్రక 7[14] 12[11] అర్పణలు, ప్రతి హత్యచేయువాడు చూ॥).

**రక్తవర్ణపురాయి** రత్నము 15 చూ॥

**రక్తవర్ణము** రంగులు 3 చూ॥

**రక్తసంబంధి** ప్రతిహత్య చేయువాడు, నేరములు శిక్షలు III, బంధువులు చూ॥

**రక్తస్రావరోగము** రోగములు చికిత్సలు II 9 (3) చూ॥

**రక్షకభటులు** కావలివారు చూ॥

**రక్షకుడు** యేసుక్రీస్తు చూ॥

**రక్షణ (Salvation).** ఆపదలో నుండి తప్పించుట యను నర్థమిచ్చు ఈ పదమును ఇతర చోట్లవలె బైబిలునందు వాడినను, పాపమునుండి మానవులను రక్షించుటనుగూర్చి ముఖ్యముగా నుపయోగించిరి. ఆ రక్షణ పాత నిబంధనయందు సూచనరీతిగా నున్నను క్రొత్త నిబంధనయందు తేటగా బయలుపఱచఁబడినవి.

1. పాత నిబంధనయందు శత్రువులచేతిలో నుండి తప్పించుకొనుట రక్షణ యనఁబడెను (నిర్గ $14^{13}$ $15^{2}$). న్యాయాధిపతుల కాలములో ఇశ్రాయేలీయులను విడిపించిన వారిని రక్షకులని పిలిచిరి (నెహె $9^{27}$). యుద్ధమందు కలిగిన జయమునకును ఆ మాటనే వాడిరి (నిర్గ $14^{14}$ I సమూ $14^{45}$ కీర్త $20^{5}$ మొ॥). ఇది దేశ సంబంధమైనదైనను ఆయా వారలను వారి వారి యాపదలలో నుండి విడిపించుటకూడ రక్షణ యనఁబడును (II సమూ 22 = కీర్త 18, $34^{6}$). ఈ రక్షణ వెలుపటిదై ఆత్మసంబంధమైన రక్షణ కాక పోయినను దానిని పొందఁగోరెడివారు గుణపడి దేవునితట్టు తిరుగక పోయినయెడల దానిని పొందఁజాలరు. కావున ఈ రక్షణను గూర్చిన షరతులు మొదటినుండి ఆత్మీయమైనవై యున్నట్లు తెలిసికొనఁగలము. ప్రజలు భ్రష్టులై దేవునిని విసర్జింపఁగా దేవుఁడు వారిని ఆపదలలో నుండి రక్షింపక తమ భ్రష్టత్వమువలన కలిగిన ఆపదలలో వారి నుండ నిచ్చెను. ఇది వారు చెఱకు పంపఁబడుటకు గొప్ప కారణమయ్యెను. ఆ చెఱలో నుండి వారిని విడిపించుట ఆత్మరక్షణ కొక గొప్ప సూచనగా నున్నది. దాని పొందఁగోరినవారు దేవునితట్టుకు తిరుగవలెను (యెష $40^{3-8}$ 55). మెస్సీయవలన కలుగనైయున్న రక్షణనుగూర్చిన ప్రవచనములు ముఖ్యముగా ఆత్మీయ రక్షణను గూర్చినవై యున్నవి (యిర్మీ $31^{31-34}$ యెహె $36^{26-28}$ హోషే 14 మొ॥). ఇది యాత్మీయమైన దగుటమాత్రమే గాక అందఱి కొఱకు నుద్దేశింపఁబడి సార్వత్రిక రక్షణయయ్యెను (యెష $45^{23,24}$ $49^{8-12}$ $60^{1-12}$). క్రీస్తు రాక పూర్వమే నీతియుక్తమగు మోక్షమునుగూర్చియు పునరుత్థానమును గూర్చియు, ఆత్మరక్షణను గూర్చిన బోధలు యూదులలో వెలసియుండెను. యూదుల మతబోధకులు నీతిక్రియలవలన ఆచారానుష్ఠానములవలన పొందఁగలమని పొరబడినను, కొందఱు దేవుఁడు తన వారికి ఉచితముగా ననుగ్రహించు విమోచనము కొఱకు కనిపెట్టుచుండిరి (లూ $2^{25}$).

2. క్రొత్త నిబంధనయందు జబ్బునుండి బాగుపడుట రక్షింపఁబడుట యనఁబడినను (లూ $7^{50}$) రక్షణ యను పదము సాధారణముగా క్రీస్తుచే మానవులకు కలుగు ఆత్మీయ నిత్యమేలులను సూచించును. క్రీస్తు పాపమునుండి ప్రజలను రక్షించును గనుక ఆయనకు యేసు అను పేరు పెట్టిరి (మ $1^{21}$). ఆయన నశించినదానిని వెదకి రక్షించుటకు వచ్చెను (లూ $19^{10}$). మానవులను రక్షించుటకు ఆయన మరణ పునరుత్థానములే ముఖ్యసాధనములు (రోమా $5^{9,10}$). అందువలననే ఆయన రక్షకుఁడనఁబడును (లూ $2^{11}$). ఆయన రక్షకుఁడుగాను అధిపతిగాను హెచ్చింపఁబడెను (కార్య $5^{31}$). రక్షణ ఆయనవలనఁ గాక మఱెవ్వరివలనను గాదు (${4}^{12}$). సువార్తయందు రక్షణకు సంబంధించిన పనులుండుటచే అది రక్షణసువార్త యనియు (ఎఫె $1^{13}$), రక్షణ వాక్యమనియు (కార్య $13^{26}$) అనఁబడును. మాఱుమనస్సు నొందినవారికే రక్షణ కలుగుటచే మాఱుమనస్సు రక్షణకరమైనదిగా నున్నది (II కొరి $7^{10}$). ఈ రక్షణను వివరించుటకు క్రొత్త నిబంధన వ్రాయఁబడినది. పాపములో నుండి విడిపింపఁబడుటయు ఆత్మీయ దీవెనలు పొందుటయు దానియందు చేరియున్నవి (ఎఫె $1^{3-14}$). ఈ లోకములో దేవుఁడు మన పాపములను పరిహరించి మనలను శుద్ధిచేయుటతో నారంభమై పరలోకములో మనము దేవుని మహిమలో పాలివార మగుటచే ఆ రక్షణ పూర్తి

యగును. ఈ గొప్ప భాగ్యము క్రీస్తు శ్రమ మరణ పునరుత్థానములవలన కలుగును (ప్రక $5^{8}$). (యేసుక్రీస్తు IV 3 (1) (e), విమోచనము చూ॥).

**రత్నశృంగము** కొమ్ము చూ॥

**రత్నరేకులు** బాసికము చూ॥

**రగూయేలు** (Reuel = దేవుని మిత్రుఁడు).

1. ఏశావు కుమారులలో నొకఁడు (ఆది $36^{4,10,13,17}$ I దిన $1^{35,37}$).

2. మోషే మామయగు ఇత్రోయొక్క మాఱుపేరు (నిర్గ $2^{18}$). తెలుఁగు బైబిలునందు రెగూయేలు (సంఖ్యా $10^{29}$) అను పేరున్నను హెబ్రీభాషయందది రూయేలు అని యున్నది.

3. గాదుగోత్రపు ప్రధానియగు ఎలీయాసాపు తండ్రి (సంఖ్యా $2^{14}$). సంఖ్యా $1^{14}$ $7^{42-47}$ $10^{20}$ నందు ఇతనికి **దెయూవేలు** అను పేరు గలదు. హెబ్రీభాషయందు ద, ర అను అక్షరములు చాలమట్టుకు ఒకటే రీతిగా నుండుటచే నిట్టి పొరపాటు కలిగెను.

4. ఒక బెన్యామీనీయుఁడు (I దిన $9^{8}$).

**రత్నములు** (Precious Stones). బైబిలునందీ దిగువ నుదాహరింపఁబడిన రత్నముల జాబితాలు 4 గలవు. (1) ప్రధానయాజకుని పతకములోని రత్నములు (నిర్గ $28^{17-20}$ $39^{10-13}$); (2) రత్నములకన్న జ్ఞానము విలువగలదని చెప్పిన యోబు వివరము (యోబు $28^{16-19}$); (3) తూరు వారు తమ ఐశ్వర్యమును కనుపఱచుకొనుటకు అలంకరించుకొనిన రత్నముల వివరము (యెహె $28^{13}$); (4) నూతన యెరూషలేముయొక్క ఘనమును సూచించుటకై దాని కలంకారములుగా నుదాహరింపఁబడిన రత్నములు (ప్రక $21^{19-21}$). ఇతర వాక్యములందును ఆయా పేరు లున్నను (మ $13^{45}$ ప్రక $4^{6}$ మొ॥) పైఁ జెప్పిన నాలుగు జాబితాలలో నుండియే రత్నములనుగూర్చి యెక్కువగాఁ దెలిసికొనఁగలము. అయినప్పటికిని మూలభాషయందున్న పదములు నూటిగా నెట్టి రత్నములను సూచించునో రూఢిగాక పోవుటచేత, ఆ పదములను సరిగా తెనిఁగించిరో లేదో చెప్ప వీలుగాదు. మూలపదములను వెవ్వేరు తెనుఁగు పదములతో తర్జుమా చేయుట వలన వాటినిగూర్చి వివరించుట మఱింత కష్టముగ నున్నది. గాన నీ దిగువ వివరములలో నేదైన పొరపాటు లుండవచ్చునని ముందుగనే హెచ్చరించుచున్నాము.

**1. రత్నములు, విలువగల రత్నములు, వెలగలరాళ్లు.** ఈ మాటలు విలువగల రాళ్లకు కట్టఁబడిన సాధారణపు పేరు. ఫలానివని విశదపఱచ వీలుగాదు (నిర్గ $28^{17}$ II సమూ $12^{30}$ I రాజు $10^{10}$ ప్రక $21^{19}$ I కొరి $3^{12}$ మొ॥).

**2. ఇంద్రనీలము** (*Amethyst*). ఇది ప్రధానయాజకుని పతకమునందున్న రత్నములలో తొమ్మిదవది (నిర్గ $28^{19}$). ప్రక $21^{21}$ నందున్న మూలపదమును ఇంగ్లీషునందు వాడినను తెనుఁగు బైబిలునందు దానిని **సుగంధము** అని తెనిఁగించిరి. అది ఇంద్రనీలమని యుండవలెను.

**3. కెంపులు** (*Rubies*). ఈ పదము బైబిలునందు బహువచనమందే వాడఁబడెను. అది ఎఱ్ఱనిరాయి. యోబు $28^{18}$ నందు వీని మూలపదమును **కెంపులు** అని తర్జుమాజేసినను సామె $3^{15}$ విలా $4^{7}$ నందు **పగడము** లనియు సామె $8^{11}$ $20^{15}$ $31^{10}$ లో **ముత్యము** లనియు తెనిఁగించిరి. ఇట్టి అభిప్రాయభేదములు పండితుల కుండినను తెలుఁగునందు ఒక మాటనే వాడియుండిన మేలుగ నుండును.

**4. గారుత్మతము** (*Ligure or Jacinth*). దీని పేరు నిర్గ $28^{10}$ (=$39^{12}$) నందు మాత్ర మున్నది. తెలుఁగునందది పచ్చ యనఁబడినను అది ఫలానిదని నూటిగా చెప్ప వీలుగాదు.

**5. గోమేధికము** (*Topaz or Ceryl*). నిర్గ $28^{17}$ యెహె $28^{13}$ నందున్న ఒకే మూలపదము నిట్లు తెనిఁగించినను యోబు $28^{19}$ మఱియొక మూలపదముకు భాషాంతరమై యున్నది. ప్రక $21^{20}$ లో నున్న గ్రీకు పదము యోబులోని హెబ్రీ పదము వంటిదే. అది $2^{12}$ యోబు $28^{6}$ నందును క్రింద 16 నందున్న అసలు పదమును గోమేధికమని తెనిఁగించిరి (క్రింద 16 చూ॥). ఈ రెండును కొంచెము పచ్చగా నుండు ఒక రత్నమును సూచించును. అది

నిర్గ $25^{7}$ లో లేతపచ్చ యనఁబడెను గాని అదెట్టి రత్నమో రూఢిగాఁ దెలియదు.

**6. నీలము, నీలరత్నము** (*Sapphire*). నిర్గ $28^{18}$ యోబు $28^{16}$ యెహె $28^{13}$ నందిది సప్పీరు అను హెబ్రీ పదముయొక్క తర్జుమా. దీనికి సంబంధించిన గ్రీకు పదము ప్రక $21^{19}$ నందును ఇట్లే తెనిఁగించిరి. ఈ మూలపదములు నీలమును సూచించుననుట కేమియు సందేహము లేదు.

**7. పగడము** (*Coral*). ఈ పదము యోబు $28^{18}$ నందున్నది. ఈ పదమునకు ఎఱ్ఱనిది యని శబ్దార్థము. సామె $3^{15}$ విలా $4^{7}$ నందున్న కెంపులని యర్థమిచ్చు పదమును పగడములని తెనిఁగించిరి (పైన 8 చూ॥).

**8. పచ్చ** (*Emerald*). ఈ పేరు ప్రక $21^{19}$ నందున్నది. ఇది పచ్చయని అందఱును ఒప్పుకొనరు. యెహె $27^{16}$ నందు పచ్చరాళ్లు అని తర్జుమా చేయఁబడిన పదమును $28^{13}$ నందు పద్మరాగ మని తెనిఁగించిరి.

**9. పద్మరాగము** (*Emerald, Jacinth*). నిర్గ $28^{18}$ $39^{11}$ యెహె $28^{13}$ నందుండు రత్నముయొక్క పేరు గాని ఆ యసలుమాట యే రత్నమును సూచించునో అది పండితులైనవారి యూహకే యింకను అందలేదు. ప్రక $21^{20}$ నందు ఇంగ్లీషులో వాడుచున్న హయసింతస్ (= *Jacinth*) అను మాట నీ పదముచే తెనిఁగించిరి. దానిని పద్మరాగమని యన్నను, నీల వర్ణముగల రత్నమును సూచించునని యభిప్రాయ పడుచున్నారు.

**10. మరకతము** (*Carbuncle*). దీని యసలు పదము ప్రకాశించుచున్నదానిని సూచించును. ఈ పదము నిర్గ $28^{17}$ యెహె $28^{13}$ నందున్నది గాని యెహెజ్కేలునందు దానిని మాణిక్యమనియు క్రిందనున్న 19 వ రత్నమును మరకతమనియు తెనిఁగించిరి. పైనున్న పచ్చ (6 చూ॥) యిదేనని కొందఱి భావము.

**11. మాణిక్యము** (*Sardius*). దీని యసలు పదమునకు ఎఱ్ఱని రత్నమని యర్థము (నిర్గ $28^{17}$ $39^{10}$ యెష $54^{12}$ యెహె $28^{13}$). ఆ పదమునకు మాణిక్యమనునది సరియైన తర్జుమా. పైన 9 లో నున్నట్లు మఱియొక అసలుపదమును ఈ మాటతో తెనిఁగించిరి.

**12. ముత్యములు** (*Pearls*). ఇది నూతన నిబంధనలోని రత్నముయొక్క పేరు. మ $7^{6}$ $13^{45,46}$ I తిమో $2^{9}$ ప్రక $17^{4}$ $18^{12,16}$ $21^{21}$ నందు కనఁబడును. దీని యసలు పదము ముత్యములనే సూచించుననుట కే సందియమును లేదు.

**13. యమునారాయి** (*Chalcedony*). ప్రక $21^{19}$ నందు మాత్ర మీ పదము వచ్చును. దీని అసలు పదమును ఇంగ్లీషునందు వాడుచున్నారు.

**14. యష్మురాయి** (*Agate*). నిర్గ $28^{19}$ $39^{12}$ నందున్న రత్నముల జాబితాలోనిది. అసలు పదమే రత్నమును సూచించునో రూఢిగా తెలియదు.

**15. రక్తవర్ణపు రాయి** (*Chrysolite*). ఈ యసలు పదము తర్షీషుకు సంబంధముగుటచే నిది, అచ్చటనుండి తెచ్చిన రత్నమని యూహింపఁదగును. పర $5^{14}$ నందు ఈ పదమును తెనిఁగించక తార్షీషు రత్నము అను పదము నుంచిరి. దీనిపేరు నిర్గ $28^{20}$ $39^{13}$ యెహె $1^{16}$ $10^{9}$ $28^{13}$ గాని $10^{6}$ నందు కనఁబడును.

**16. వైడూర్యము** (*Sardonyx*). ప్రక $21^{20}$ నందు మాత్రము ఈ రత్నముయొక్క పేరున్నది. ఇంగ్లీషునందు దీని యసలుపదమునే ఉంచిరి.

**17. సులిమానిరాయి** (*Onyx*). ఇది నిర్గ $28^{20}$ $39^{13}$ యెహె $28^{13}$ నందున్న యొక రత్నమునకు పెట్టిన తెనుఁగుపేరు. అది $2^{12}$ యోబు $28^{16}$ నందున్న ఈ పదమునే గోమేధికమని తెనిఁగించిరి (పైన 4 చూ॥).

**18. సువర్ణరత్నము** (*Chrysolite*). దీని అసలు పదము ఇంగ్లీషునం దున్నది. సువర్ణరత్నమనునది దాని శబ్దార్థము. అది ప్రక $21^{20}$ నందు మాత్రము బైబిలులో నున్నది గాని LXX నందు ఆ మాటనే నిర్గ $28^{20}$ $39^{13}$ లో పై 14 వ. రత్నపు

పేరుగా తర్జుమా జేసిరి. అది బంగారు రంగు గల రత్నమని దాని పేరువలనఁ దెలియుచున్నది.

**19. సువర్ణలశునీయము** (*Chrysoprase*). చిన్న ఉల్లిపాయల ఆకారమును బంగారు వర్ణమునుగల రాయి. దీని అసలు పదమును ఇంగ్లీషునందుంచిరి గాని మన బైబిలునందు దానిని తర్జుమా జేసిరి. ఇది ప్రక 21[20] నందు మాత్రమున్నది.

**20. సూర్యకాంతము** (*Jasper*). నిర్గ 28[17-20] లో నున్న జాబితాలో నున్న రెండు వెవ్వేరుపదములకు తర్జుమాయై యున్నది. దాని లోని మొదటి పదమును యెహె 28[13] నందు సూర్యకాంతమణి యని తెనిఁగించిరి. రెండవ దానిని అచ్చటనే మరకత మనిరి. ప్రక 4[3] 21[11,18,19] నందున్న గ్రీకు పదము ఇంగ్లీషునందున్నది. అది సూర్యకాంతము గాక మఱియొకటై యున్నది.

**21. స్ఫటికము** (*Crystal*). శుద్ధి యని యోబు 29[17] నందు అర్థమిచ్చు యొక రత్నమునకీ పేరు తెనుఁగునందు పెట్టిరి. 28[18] లో మంచుగడ్డ లని యర్థమిచ్చు మఱియొక పదమును ఈ మాటతోనే తెనిఁగించిరి. యెహె 1[22] నందు మఱియొక హెబ్రీ మాటకు నిదే యర్థము గలదు. స్ఫటికము మంచుగడ్డవలె తేటగా నుండుటచే ఇది సరియైన పేరుగా నున్నది. ప్రక 21[18,21] లో నున్న స్ఫటికము అనుమాట అద్దమువంటి రాతిని సూచించును. దేవుని సింహాసనమునకు ముందరనున్న సముద్రమును (ప్రక 4[6]), దేవుని సింహాసనమునుండి బయలుదేరు నదీ జలమును (22[1]) దీనివలె తేటగా నున్నవని దృష్టాంతములు వాడఁబడెను.

**రథము (Chariot).** బైబిలు కాలమునందు రథములను యుద్ధమునందే కాక (నిర్గ 14[9] I సమూ 13[5]) తక్కిన సమయములందును గొప్ప వారును (ఆది 41[43] II సమూ 15[1] I రాజు 1[5] కార్య 8[28]), ఇతరులును (ఆది 46[29] II రాజు 5[9]) వాహనములుగా నుపయోగించిరి. యుద్ధ రథముల చక్రములను ఇనుముతో చేసిరి (I రాజు 7[32-33]). పలెస్తీను కొండప్రదేశమగుటచేత అ దేశస్థులు రథములను వాడుకొనుటకు వీలుకాక పోయెనుగాని సముద్ర తీర మైదానములయందున్న కనానీయులు ఆదినుండియు వాటి నెక్కువగా వాడుచు వచ్చిరి (యెహో 17[16] న్యాయా 4[3]). ఐగుప్తీయులును (యెహ 31[1]), ఐతియోపీయులును



రథము

(II దిన 16[8]), దమస్కువారును (II రాజు 5[9]), హిత్తీయులును (7[6]), అష్షూరువారును (నహూ 2[3,4] 3[2]) వాటిని వాడినట్లు సూచనలు గలవు. రథములో యుద్ధము చేయువాఁడు మాత్రమే గాక సారథియు నుండెను (II దిన 18[33]). కేడెము పట్టువాఁడును దానిమీఁదనున్నట్లు II రాజు 9[25] వలనఁ దెలియుచున్నది. రథములను గుఱ్ఱములు లాగెను (II సమూ 8[4]). యుద్ధ రథములను ఇనుముతో చేసిరి లేక ఇనుపరేకులతో పొదిగిరి (యెహో 17[16,18] న్యాయా 1[19] 4[3]). పారసీకులు చక్రముయొక్క యిరుసుకు కత్తులను కట్టిరి. మక్కబీయుల కాలములో అంతియొకయ రాజులు పలెస్తీనునందు చేసిన యుద్ధములో నిట్టివాటిని వాడిరి. ప్రక 18[13] నందు రోమా వారితో వ్యాపారము చేసినవారి సరకులలో రథములు నుండెను. అచ్చటనున్న పదము బైబిలులో ఒకసారిమాత్రము వాఁడబడి అన్య దేశీయమై నాలుగు చక్రములుగల బండిని సూచించెను.

**రద్దయి (Raddai = లోఁబఱచుకొనుట).** దావీదు అన్నలలో నొకఁడు. యెష్షయి కుమారులలో నైదవవాఁడు (I దిన 2[14]).

**రబ్బా (Rabbah = గొప్ప).**

1. యబ్బోకునదికి దక్షిణమునుండి వచ్చు ఉపనది పుట్టు స్థలమునన్న యొక పట్టణము.

అది రబ్బోతు అమ్మోను అను పేరుగలదై అమ్మో నీయుల రాజధానియై యుండెను. అది యొర్దాను నదికి 23 మైళ్లు తూర్పుగానున్న దిబ్బమీఁద కట్టఁబడిన బలమైన కోట. అక్కడ బాషాను రాజగు ఓగుయొక్క ఇనుప మంచమున్నది (ద్వితీ 3[11]). కొందఱిది యతని సమాధి యని తలంతురు. ఆ ప్రాంతములలో నేటివఱకు అట్టి రూపముగల రాళ్లను చూపెదరు. ఇది గాదీ యులదేశమునకు సరిహద్దు పట్టణము (యెహో 13[25]). అమ్మోను రాజగు హానూను దావీదు పంపిన రాయబారుల నవమాన పఱచుటవలన యుద్ధము సంప్రాప్తమై (II సమూ 10[1-6]), అబీషై అమ్మోనీయులను మేదేబా వఱకుఁ దఱి మెను (I దిన 19[7-15]). తరువాతి సంవత్సరము యోవాబు ఆ పట్టణమును ముట్టడించి ఆ కోటలో ఊటలున్న భాగమును జయించిన పిమ్మట దావీదు స్వయముగా వచ్చి ఆ కోట యావత్తును పట్టు కొని, ఆ పట్టణస్థులను చాల క్రూరముగా శిక్షించెను (II సమూ 11[1] 12[26-31] I దిన 20[1-3]). తరువాత అమ్మోనీయు లా పట్టణమును క్రమ క్రమముగా కట్టుకొనిరి. యిర్మీయా (49[2-6]) యెహెజ్కేలు (21[20]) దాని నాశనమునుగూర్చి ప్రవచించిరి. పాఁత నిబంధన చరిత్రకాల ములకుఁ దరువాత ఐగుప్తు రాజగు తొలెమై ఫిలడెల్ఫస్ (క్రీ॥ పూ॥ 285-246) దానిని పెంప కముజేసి చక్కగా నలంకరించినందున దానికి ఫిలదెల్ఫియా యను పేరు కలిగెను గాని ఆ పేరు వాడుకలోనికి రాలేదు. అమ్మోను పెరీయకు తూర్పు హద్దయినట్లు యోసీఫసువలనఁ దెలియు చున్నది (యుద్ధ 3. 3. 3). దెకపొలి (= పది పట్టణములు) లో అది అన్నిఁటికన్న దక్షిణపుదై యుండెను సిరియానుండి అరబ్బీకి పోవుమార్గము దీనిమీఁదుగనే వెళ్లును. దీని ప్రస్తుతపు పేరు అమ్మాను. దమస్కునుండి మక్కాకుఁబోవు రైలు మార్గము దీని సమీపముగాఁ బోవును. ఆదిక్రైస్త వుల కాలమునందిది యొక క్రైస్తవ గురు పీఠ ముగా నుండినట్లు తెలియుచున్నది. (పటము 1, G 8).

2. యూదామన్య ప్రదేశములో నున్న యొక పట్టణము (యెహో 15[60]). దాని యునికి ఇంక నూటిగాఁ దెలియదు.

**రబ్బీ, రబ్బూనీ** (Rabbi, Rabboni = బోధకుఁడు). యూదులు తమ పండితులకు పెట్టిన బిరుదు. హెబ్రీభాషయం దీ పదమునకు గొప్పవాఁడని శబ్దార్థము. క్రీస్తు శిష్యులు ఆయన నీపేరటఁ బిలిచిరి (యోహా 1[38]). మూలభాషయం దీ పదమే యున్నను దానిని బోధకుఁడని తెనిఁ గించిరి (మ 26[25,49] మా 9[5] 11[21] యోహా 1[49] 4[31] 9[2] 11[8]). నీకొదేమును (3[2]) ఆయనను వెదకిన యితరులును (6[25]) ఈ బిరుదాయన కారోపించిరి. యోహాను శిష్యులు యోహానును నీ బిరుదుచే పిలిచిరి (3[26]). తా నొకఁడే బోధకుఁడైనందున శిష్యులొకరి కొక రీ పేరును పెట్టుకొనరాదనెను (మ 23[8]). హెబ్రీ ప్రాకృత మనఁదగు అరమేయిక్ భాషయం దీ పదరూపము రబ్బాని లేక రబ్బోను అయ్యున్నది. రబ్బూనీ యనుమాట దీనిరూపమై నా బోధకుఁడని యర్థ మిచ్చును. పునరుత్థానుఁడైన ప్రభువును మరియ రబ్బూనీ యని బిలిచెను (యోహా 20[16], బోధ కుడు చూ॥).

**రబ్బీతు** (Rabbith = సమూహములు). ఇశ్శాఖారుగోత్ర భాగమునందుండు ఒక గ్రామము (యెహో 19[20]). ప్రస్తుతము గిల్బోవకొండకు దక్షిణముగా నుండు రాబా (*Raba*) దీని యునికి యనుకొందురు.

**రబ్షాకే** (Rabshakeh = ప్రధానులలో పెద్ద). అష్షూరువారి యుద్యోగస్థులలో నిది యొక యుద్యోగమునకు పేరు. ఈ యుద్యో గస్థుఁడు ఇంక నిద్దరితోకూడ అష్షూరు రాజుచే హిజ్కియా యొద్దకు నంపఁబడి హిజ్కియా యెరూషలేము నప్పగింపవలెనని యడిగెను (II రాజు 18[17-35] = యెష 36[1-20]). ఇతఁడు తర్తాను అను నుద్యోగిస్థుని తరువాతివాఁడై యున్నట్లు కనఁబడును. ఇతఁడును హిజ్కి యాతో మాటలాడినవాఁడై యుండెను గనుక ఒక విధమైన మంత్రి యని అనుకొనఁదగును (తర్తాను, రబ్సారీసు చూ॥).

**రబ్సారీసు** (Rabsaris). యెరూషలేము నప్పగింపవలెనని యడుగుటకు సన్హెరీబు హిజ్కియాయొద్దకు నంపిన యుద్యోగస్థులలో నొకఁడు .(II రాజు 18[17]). ఇతఁడు అష్షూరు వారి యుద్యోగస్థుఁడు. తర్తాను, రబ్షాకే యను

పేరులవలె రబ్సారీసు అనునదికూడ స్వంత పేరు కాక, ఉద్యోగముయొక్క పేరై యుండెను. అష్షూరు వారికిని బబులోను వారికిని చాల సంబంధముండుటచే బబులోను వారిలోకూడ ఈ యుద్యోగమున్నట్లు యిర్మీ $39^{3,13}$ వలనఁ దెలియును గాని ఆ వాక్యములలో అది యిద్దఱికి పెట్టఁబడినను అచట రబ్సారీసు అను పేరునుంచక శబ్దార్థమునుబట్టి షండుల కధిపతి అను మాటచే దానిని భాషాంతరము చేసిరి. పైఁ జెప్పిన యిద్దఱిలో నొకఁడు మొట్టమొదట యెరూషలేము పట్టణములో ప్రవేశించిన వారిలో నొకఁడు. రెండవవాఁడు యిర్మీయాను రక్షించినవారిలో నొకఁడై యుండెను (తర్తాను, రబ్షాకే చూ॥).

**రమ్యా** (Remiah = యెహోవా యెత్తియున వాఁడు). అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచి పెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{25}$).

**రయమ్యా** (Raamiah = యెహోవా ఉఱుమును). జెరుబ్బాబెలుతోకూడ చెఱనుండి తిరిగివచ్చిన ప్రధానులలో నొకఁడు (నెహె $7^{6}$). ఈ వాక్యమునకు సాటిగా నుండు ఎజ్రా $2^{2}$ లో నితనికి రెయేలాయా అను మాఱు పేరున్నది.

**రసికకావ్యము** (Mictam). కీర్తనల గ్రంథమందలి 16, 56, 57, 58, 59, 60 కీర్తనల రచనకు పెట్టినపేరు. 16 వ కీర్తనకు తప్ప తక్కిన వాటిలో నీ పదమును అనుపదగీతము అను మాటచే తెనిఁగించిరి యెష $38^{9}$ లో నున్న హిజ్కియా కీర్తనకు నిదే పేరు మూల భాషయందున్నను ఆ పదమును రచించినది యని తెనిఁగించిరి. ఆ పదమునకు ధ్యానమనిగాని చిత్రగాన మనిగాని సువర్ణకావ్యమనిగాని యర్థమగునని భిన్నాభిప్రాయము లగుపఱచుచున్నారు గాని దాని భావము రూఢిగాఁ దెలియదు.

**రహాము** (Raham = దయ). కాలేబు సంతతి వారిలో నొకఁడు (I దిన $2^{44}$).

**రహెబోతు** (Rehoboth = విశాలమైన స్థలములు, వీధులు).

1. ఇస్సాకు త్రవ్వించిన యొక బావి పేరు. చుట్టునుండు వారెవరును దీనివిషయమై కలహించనందున ఇబ్బంది లేవియులేవని దీని కీ పేరు పెట్టెను (ఆది $26^{22}$). బెయేర్షెబాకు నైరృతి దిక్కున 17 మైళ్ల దూరమందున్న రుహైబా (*Ruheibah*) వాగు దగ్గర ప్రస్తుతముండు. పురాతనమైన బావి యిదేనని కొందఱి యభిప్రాయము.

2. ఎదోమురాజులలో నొకనికి నదీతీరమందలి రహెబోతువాఁడు అను బిరుదు కలదు (ఆది $36^{37}$ I దిన $1^{48}$). అతఁ డీ పట్టణస్థుఁడై యుండుట వలన నీ బిరుదతనికి కలిగియుండవచ్చును. బైబిలు నందు నది యని యుదాహరింపఁబడునది సాధారణముగా యూఫ్రాతు నదిని సూచించునుగాని ఇచ్చట అది ఎదోము దేశమందలి యొక నది యని దోచుచున్నది. గాన యిది పలెస్తీనుకు దక్షిణముగా నుండు ఐగుప్తునదిదగ్గర నున్నట్టి ఒక స్థలమని యనుకొనఁదగును. ఆ స్థలమునుగూర్చిన చిహ్నము లేవియూ కనఁబడుటలేదు.

**రహెబోతీరు** (Rehobothir = పట్టణములోని విశాల స్థలములు). అష్షూరు దేశములో నిమ్రోదు కట్టించిన 4 పట్టణములలో నొకటి (ఆది $10^{11}$). దాని పేరు నీనెవెకు తరువాత వచ్చుటవలన అది యా పట్టణమునకు సంబంధించి యుండును. అష్షూరు చక్రవర్తియగు ఏసర్హద్దోను రాతిశాసనములలో రెబీత్ నినా (*Rebitnina* = నీనెవె విశాల స్థలములు) అని పేరు కలదు. అది ఈ మాటయొక్క మాఱు రూపమని యెంచుచున్నారు.

## రా

**రాకాలు** (Racal = వ్యాపారము). దావీదు సిక్లగులో నున్నప్పుడు దోపుడు సొమ్మును పంపిన ఊళ్లలో నొకటి (I సమూ $30^{29}$). LXX నందు దీనికి బదులు కర్మెలు అను పదమున్నది. యూదాగోత్ర ప్రాంతములో నున్న కర్మెలు ఇదేనని ఈ కారణముచే ననుకొనవచ్చును. అది కర్మెలు కానిపక్షమున దాని యునికి తెలియదు (కర్మెలు 2 చూ॥).

**రాకెము** (Rakem = నానా విధములగు). మనష్షే మనుమఁడగు పెరెషు కుమారుఁడు (I దిన $7^{16}$).

**రాగి** లోహములు 8 చూ॥

**రాజదండము** దండము చూ॥

**రాజనగరు** యెరూషలేము B III 2 కోట I చూ॥

**రాజమార్గము, రాజవీధి** (Road). పాత నిబంధనలో రాజమార్గమని సాధారణముగాఁ దెనిఁగించిన పదము మూలభాషలో వేయుట అని యర్థమిచ్చును. రోడ్లనువేయుట వలన వాటి కీ పేరు వచ్చినది. పూర్వీకులు వేయించిన రాజమార్గములు మిగుల ప్రసిద్ధములైనవై అన్ని దేశములకు వ్యాపించెను. భరత ఖండమునుండి గ్రేటుబ్రిటనువఱకు అట్టి రోడ్లు వ్యాపించెను. ప్రస్తుతము రోడ్లను వేయుటకు వాడెడి గులకరాళ్లువేసి వాటిపై పెద్దరాళ్ల పఱచెడివారు. పౌలు సువార్త వ్యాపకత్వము కొఱకై చేసిన గొప్ప ప్రయాణములలో నిట్టి రాజమార్గములమీఁద అనేక పర్యాయములు ప్రయాణము చేసెను (కార్య 14, 16, 17). రాజమార్గములలో ఆపదలు సంభవించుట ఆ దేశములు గందరగోళ స్థితియందున్నదనుటకు సూచనగా నున్నది (న్యాయా $20^{31}$). బబులోను నుండి కనానుకు ఇశ్రాయేలీయులు పోవుట దేవుని నడుపును సూచించుచున్నది (యెష 43, 49 మొ॥). నివాసములులేక చెట్లక్రింద నుండవలసినవారు రాజమార్గములలో నుండువారైనట్లు మ $22^{10}$ లూ $14^{23}$ నందున్నది గాని ఆ మాటను మా $10^{46}$ లో త్రోవ యని తెనిఁగించిరి. అది సంతవీధులను సూచించును (మార్గము చూ॥).

యిర్మీ $5^{1}$ లో రాజవీధి యని తెనిఁగించిన పదమును ఇతరమైనచోట్ల వీధి యని భాషాంతరీకరించిరి ($7^{17,34}$ మొ॥). నెహె $8^{1}$ లో దానిని మైదానమనిరి.

**రాజు కోనేరు** యెరూషలేము A, III 2 చూ॥

**రాజుగుమ్మము** దేవాలయము I 3 (3) చూ॥

**రాజుతోట** యెరూషలేము B, V 2 (11) చూ॥

**రాజు దస్తావేజులమీద నుండువాడు** దస్తావేజులు చూ॥

**రాజుల గోరీలు** యెరూషలేము B, II 5 చూ॥

**రాజుల గ్రంథములు** (The Books of the Kings). యిర్మీయా గ్రంథపు చివరి యధ్యాయమును II రాజు $24^{18}$-$25^{30}$ ను భేదమేమియులేక ఒకటిగానే యుండుటనుబట్టి వీటిని యిర్మీయా వ్రాసెనను వాడుక గలదు గాని దావీదు సొలొమోను హిజ్కియా యను రాజులు తమ ప్రభుత్వకాలపు చరిత్రమును వ్రాయించి యుందురు. నాతాను గాదు యెషయా ఇద్దో అను ప్రవక్తలు తమకాలపు చరిత్రలను అట్లే వ్రాసి యుందురనుటకు సందేహములేదు. బహుశః ఎజ్రా అను యాజకుఁడు దైవాత్మ ప్రేరితుఁడై యీ చరిత్రలన్నిఁటిని సమకూర్చి ప్రస్తుతముండు క్రమముచొప్పున నేర్పఱచి యుండును. ఇది బబులోను చెఱనుండి యూదులు స్వదేశముచేరిన తరువాత జరిగి యుండును.

రాజులను గూర్చిన రెండు గ్రంథములు పూర్వము హెబ్రీభాషయందు ఏక గ్రంథము గనే యుండెను. అయితే దానిని గ్రీకుభాషలోకి తర్జుమా చేసినప్పుడు రెండుగా విభజించి రాజులనుగూర్చిన మూఁడవ నాల్గవ గ్రంథములని పిలిచిరి. అటుఁగా సమూయేలు రెండు గ్రంథములను రాజుల మొదటి రెండు గ్రంథములనియు మనమిప్పుడు రాజుల గ్రంథములని పిలుచువాటిని మూఁడవ నాలుగవ గ్రంథములనియు చెప్పిరి. రాజుల గ్రంథమందలి సంగతులు సమూయేలు గ్రంథములలో నుదాహరించిన సంగతులను కాలవరుస ననుసరించును.

ఇశ్రాయేలీయులు రాజుల పరిపాలనయందుండు నప్పటివారి స్థితిగతులును ప్రవక్తల పనులును ఈ గ్రంథములయందు వివరింపఁబడినవి. సొలొమోను మహారాజుయొక్క ఐశ్వర్యభాగ్యములును అతని తదనంతరము రాజ్యము పాడగుటకు కారణమును వీనిలో మనకుఁ గనఁబడును. ఏలీయా ఎలీషాల యద్భుత చరిత్రలును, వీరును వీరివంటి యితర ప్రవక్తలనేకులును ఎన్ని ప్రయత్న

ములు చేసినను అన్నియు నిష్ఫలములై దేశమునకుఁ గల్గిన నాశనమునుగూర్చి ఈ గ్రంథములయందు చదువవచ్చును. రాజ్యము రెండు భాగములైన పిమ్మట పది గోత్రములు కలిసి యేర్పడిన ఇశ్రాయేలువారికి పందొమ్మిదిమంది రాజులేలిరి. వారలందఱును భక్తిహీనులును దుర్మార్గులునై యుండిరి. వారి దుష్పరిపాలనవలన ప్రజల పాపము పండిపోయి తుదకు సర్వనాశనమైరి. యూదారాజ్యములో ననేకులగు దుష్టరాజులుండిరి గాని కొందరైనను భక్తిగలవారు లేకపోలేదు వారి సత్ప్రయత్నములవలన దేవుని కోపము వారిమీఁదికి చాలకాలమువఱకు రాకుండెనుగాని ప్రజల పాపము వృద్ధియైనందున కల్దీయులరాజగు నెబుకద్నెజరు వచ్చి వారిని చెఱలోనికిఁ గొనిపోయెను.

యూదారాజులనుగూర్చి రాజుల గ్రంథమునందును, దినవృత్తాంతముల గ్రంథమునందును గలదుగాని యిశ్రాయేలువారి రాజులనుగూర్చి రాజుల గ్రంథమందు మాత్రమున్నది.

## యూదా యిశ్రాయేలురాజుల కాల నిరూపణ పట్టీ*

దావీదు మరణమును తరువాత రాజ్యమేలిన యిశ్రాయేలు రాజుల చరిత్రమును ఈ గ్రంథములందు వివరింపఁబడియున్నది. వీనియందు సొలొమోను పట్టాభిషేకము మొదలుకొని యెరూషలేము నాశనమువఱకు అనఁగా 426 సంవత్సరముల చరిత్రము వ్రాయఁబడి యున్నది.

## రాజ్యవిభాగమునకుఁ బూర్వము

| సంఖ్య | రాజులు | ఏలనారంభించిన సంవత్సరము | ఏలిన కాలము |
|---|---|---|---|
| | | క్రీ॥ పూ॥ | |
| 1. | సౌలు కార్యములు I సమూ 13[1,2] | 1095 | 40 సం॥ |
| 2. | దావీదు I రాజు 2[11] | 1056 | 40 ,, |
| 3. | సొలొమోను I రాజు 11[42] | 1015 | 40 ,, |
| | సొలొమోను మరణము | 975 | |

* వ్యాసకర్తలు వివిధపండితుల కాలనిర్ణయ పట్టికల ననుసరించినందున ఈ వ్యాసమునందున్న కాలమునకును, కాలక్రమణిక అను వ్యాసమందున్న కాలమునకును భేదము కనఁబడును గాని అది యంత ముఖ్యమైనది కాదు (Ed).

## రాజ్యవిభాగమునకుఁ బిమ్మట

| సంఖ్య | యూదా రాజులు (ఏకకుటుంబము) | | ఏలనారంభించిన సంవత్సరము | ఏలిన కాలము |
|---|---|---|---|---|
| | | | క్రీ॥ ము॥ | |
| 1. | రెహబాము | I రాజు $14^{21,31}$ | 975 | 17 సం॥ |
| 2. | అబీయా | ,, $15^{2,8}$ | 961 | 3 ,, |
| 3. | ఆసా | ,, $15^{10,24}$ | 958 | 41 ,, |
| 4. | యెహోషాపాతు | ,, $22^{41,44}$ | 917 | 25 ,, |
| 5. | యెహోరాము | II రాజు $9^{15,24}$ | 892 | 8 ,, |
| 6. | అహజ్యా | ,, $8^{25}$ $9^{27}$ | 885 | 1 ,, |
| 7. | అతల్యా (రాణి) | ,, $11^{3,16}$ | 884 | 6 ,, |
| 8. | యోవాషు | ,, $12^{1,20}$ | 878 | 40 ,, |
| 9. | అమజ్యా | ,, $14^{2,3,19}$ | 839 | 29 ,, |
| 10. | ఉజ్జియా | ,, $15^{1,2,7}$ | 811 | 52 ,, |
| 11. | యోతాము | ,, $15^{32-34}$ | 759 | 16 ,, |
| 12. | ఆహాజు | ,, $16^{1-3}$ | 743 | 16 ,, |
| 13. | హిజ్కియా | ,, $18^{1-3}$ | 727 | 29 ,, |
| 14. | మనష్షే | ,, $21^{1,2,18}$ | 698 | 55 ,, |
| 15. | ఆమోను | ,, $21^{19,29}$ | 649 | 2 ,, |
| 16. | యోషీయా | ,, $22^{1,2}$ | 643 | 31 ,, |
| 17. | యెహోయాహాజు | ,, $23^{3,32}$ | 611 | 3 మాస |
| 18. | యెహోయాకీము | ,, $23^{36}$ | 600 | 11 సం॥ |
| 19. | యెహోయాకీను | ,, $24^{6,9,15}$ | 596 | 3 మాస |
| 20. | సిద్కియా | ,, $24^{18,20}$ | 588 | 11 సం॥ |

| కుటుంబ సంఖ్య | సంఖ్య | ఇశ్రాయేలువారి రాజులు (తొమ్మిది కుటుంబములు) | | ఏలనారంభించిన సంవత్సరము | ఏలిన కాలము |
|---|---|---|---|---|---|
| | | | | క్రీ॥ ము॥ | |
| 1. | 1. | యరొబాము | I రాజు $14^{20}$ | 975 | 22 సం॥ |
| | 2. | నాదాబు | ,, $15^{25,28}$ | 956 | 2 ,, |
| 2. | 3. | బయెషా | ,, $15^{33}$ $16^{6}$ | 955 | 24 ,, |
| | 4. | ఏలా | ,, $16^{8,10,13}$ | 932 | 2 ,, |
| 3. | 5. | జిమ్రీ | ,, $16^{15,18}$ | 931 | 7 దిన |
| 4. | 6. | ఒమ్రీ | ,, $16^{23,28}$ | 927 | 6 సం॥ |

| కుటుంబ సంఖ్య | సంఖ్య | ఇశ్రాయేలువారి రాజులు (తొమ్మిది కుటుంబములు) | | ఏలనారంభించిన సంవత్సరము | ఏలిన కాలము |
|---|---|---|---|---|---|
| | | | | క్రీ॥ ము॥ | |
| | 7. | అహాబు | I రాజు $16^{29}$ | 920 | 22 సం॥ |
| | 8. | అహజ్యా | II రాజు $1^{2,18}$ | 897 | 2 ,, |
| | 9. | యెహోరాము | ,, $3^{1}$ $9^{24}$ | 896 | 12 ,, |
| 5. | 10. | యెహూ | ,, $10^{35,36}$ | 884 | 28 ,, |
| | 11. | యెహోయాహాజు | ,, $13^{2,39}$ | 856 | 17 ,, |
| | 12. | యెహోయాషు | ,, $13^{10,13}$ | 840 | 16 ,, |
| | 13. | II యరొబాము | ,, $14^{23,24,29}$ | 825 | 41 ,, |
| | 14. | జెకర్యా | ,, $15^{8-10}$ | 774 | 6 మాస |
| 6. | 15. | షల్లూము | ,, $15^{13,14}$ | 773 | 1 ,, |
| 7. | 16. | మెనహేము | ,, $15^{17}$ | ,, | 10 సం॥ |
| | 17. | పెకహ్యా | ,, $15^{22,25}$ | 762 | 2 ,, |
| 8. | 18. | పెకహు | ,, $15^{27,30}$ | 760 | 20 ,, |
| 9. | 19. | హోషేయ | ,, $17^{1}$ | 721 | 9 ,, |

ఈ రెండు గ్రంథములందును మూడుకాలముల చరిత్ర కలదు.

I. సొలొమోను ఏలుబడికాలము (I రాజు 1-11 అధ్యా.). దావీదు రాజ్యాంతము, సొలొమోను పరిపాలన సంగతులున్నవి.

II. రాజ్యవిభాగము మొదలు ఇశ్రాయేలువారు చెఱకుఁ బోవువఱకున్న కాలము (I రాజు 12-II రాజు 17). ఏలీయా ఎలీషాల చరిత్ర గలదు.

III. యూదావారు చెఱకుఁబోవువఱకున్న కాలము (II రాజు 18-25). H.

**రాజులు, భూపతులు (Kings).** అన్ని దేశములలోను రాజులుండువాడుక చాల పురాతనమునుండి వచ్చునదై యున్నది. ఈ శీర్షికయందు బైబిలులో రాజులనుగూర్చి చెప్పినది మాత్రము క్లుప్తముగా వివరింపఁబడును.

1. రాజులను సూచించుటకు బైబిలునందు వాడిన సర్వసాధారణమగు పదము ఆలోచించుట, ఏలుట యని శబ్దార్థమిచ్చుపదమై యున్నది. మెలెకు, మిల్కాము అను దేవతల పేరులలో ఆ పదము కనఁబడుచు, ఆ దేవతలు రాజులుగా ఎంచఁబడినట్లు సూచించును. పూర్వము కదొర్లాయోమెరు అమ్రాపేలు (ఆది $14^{1-5}$), ఫరో ($40^{1,2}$) దేశములను ఏలినను ఆయా పట్టణముల పెద్దలకును రాజు అను బిరుదును వాడిరి. ఎదోమురాజులు అట్టివారు ($36^{15-42}$). వారి కుపయోగించిన పదము పై నుదాహరింపఁబడిన దానివంటిదిగాక నాయకుఁడని యర్థమిచ్చునదై యున్నది. యెహోషువ జయించిన 31 రాజు లిట్టివారే (యెహో 12). ఆరంభమున ప్రతి కుటుంబమునకును ప్రతి గోత్రమునకును పెద్దలుండిరి (కుటుంబము చూ॥). కుటుంబములు విస్తరింపఁగా వాటికి రాజులేర్పడుట సహజమైన సంగతియేగాని వా రింకను విస్తరించి బలమైన శత్రువులచే నావరింపఁబడఁగా ఆయా పట్టణములు కలిసి యొక దేశమై ఆ దేశముమీఁద నొక యధిపతిని నియమించుట సాధారణమగు విషయమై యున్నది. యుద్ధము చేయుటకును ఇతరములైన పట్టణములను దేశములను స్వాధీనపఱచుకొనుటకును అట్టివారు సాధారణముగా

చేరియుండుటచే ఒక గోత్రపువారు మాత్రమే గాక అనేకదేశము లొక రాజ్యమునందు చేరుట వలన రాజ్యములు స్థాపింపఁబడి యున్నవి. వాటి నేలు రాజులు చక్రవర్తులైరి.

దేవుఁడేర్పఱచుకొనిన జనాంగము ఈ లోక మర్యాదల ననుసరింపక అన్ని విషయములలో తన నియమముల ననుసరించి తననే రాజునుగా నొప్పుకొనవలసినదని దేవుఁడు కోరుచు, ఆయా యవసరములనుబట్టి తత్కాలమునకై నాయకులను (మోషే, యెహోషువ మొ॥) లేపినను స్థిరమైన రాజోద్యోగమును నియమింపలేదు. ఆ కాలములో సహా ప్రజలు తమకు రాజుగా నుండుమని గిద్యోనును మనవి జేసిరిగాని అతఁడు దాని కెంతమాత్ర మొప్పక పోయెను (న్యాయా $8^{22}$). అయితే అతని కుమారుఁడగు అబీమెలెకు తన్నుతాను రాజుగాఁ జేసికొన యత్నించెను గాని అతని యత్నములు కొనసాగలేదు (9). సమూయేలు వృద్ధుఁడైన పిమ్మటనే ప్రజలు స్వయముగా రాజును కోరిరి. అందువలన వారు దేవుని యేర్పాటును నిర్లక్ష్యముచేసి ఆయనను విసర్జించి ఈ లోకవాడుకలను అనుసరించువారగుదురని సమూయేలునకు తెలిసియుండినను దేవుని యనుమతి చొప్పున వారి మనవి నంగీకరించెను. అప్పటినుండి చివరిదాక ఇశ్రాయేలీయులు స్వంత రాజులక్రిందగాని అన్యరాజుల క్రిందగాని జీవించుచుండిరి.

2. రాజులనియమము: సౌలు దావీదులను దేవుఁడు నియమించినమీఁదట (I సమూ $9^{16}$ $16^{1,13}$) ప్రజలు దాని కామోదించిరి ($10^{24}$ $11^{14}$ II సమూ $2^{4}$ $5^{1-3}$). దావీదు కాలమునుండి అతని వంశములోనివారు రాజులుగానే యేర్పఱచఁబడిరి. సాధారణముగా పెద్దకుమారుని రాజుగా నియమించినను వానినే నియమింపవలసిన యేర్పాటులేనట్లు దావీదు తన ప్రియభార్యయగు బత్షెబ కుమారుఁడైన సొలొమోనును నియమించుట వలన స్పష్టమగుచున్నది (I రాజు 1). ఇశ్రాయేలువా రనఁబడిన పదిగోత్రములు రెహబామును తమ యేలికగా నంగీకరింపనొల్లక మఱియొకని తమకు రాజుగా నియమించుకొనిరి ($12^{20}$). యోషీయా చంపఁబడిన పిమ్మట యూదావారుకూడ అతని సంతతివారిలో యెహోయాహాజు అను నొకని నియమించిరి (II రాజు $23^{30}$). ఇశ్రాయేలు వారిలో బయెషా (I రాజు $15^{27}$), జిమ్రీ ($16^{15}$) యెహూ (II రాజు $10^{11}$), షల్లూము ($15^{10}$) మెనహేము ($15^{14}$), పెకహు ($15^{25}$), హోషేయ ($15^{30}$) అనువారు కుట్రజేసి రాజులను చంపి రాజ్యము నపహరించిరి. ఒమ్రీ యనువాఁడు యుద్ధమునందు శత్రువులనోడించి దాని నాక్రమించుకొనెను ($16^{10-15}$). ఇట్లు రాజ్యమును ఆక్రమించుకొనిన ప్రతివాఁడును తన వంశమును స్థాపింప నుద్దేశించెనుగాని, రాజ్యము మఱొకనిచే నపహరింపఁబడు నంతవఱకు మాత్రమే అది యా వంశస్థులక్రింద నుండెను. యూదావారిలో అతల్యా యను నామెమాత్రము ఆ రాజ్యము నపహరింప యత్నించెనుగాని యది ఎంతోకాలము నిలువలేదు (II రాజు 11, 12). చెఱకాలమునకుఁ బూర్వమును దరువాతను యూదులు ఐగుప్తు బాబెలు వారికి లోఁబడినప్పుడా దేశముల చక్రవర్తుల యనుమతిని రాజులు నియమింపఁబడిరి (II రాజు $23^{33,34}$ $24^{17}$). పారసీకులచేతను రోమనులచేతను నియమింపఁబడినవారు రాజు అను బిరుదును సాధారణముగా వహింపక గొర్నరులని పిలువఁబడినను హేరోదు వంశస్థులకుమాత్ర మా పదమును వాడినట్లున్నది (మ $2^{1}$ కార్య $12^{1}$ $25^{13}$). ఇట్లు రాజులు దేవునిచేతను ప్రజలచేతను చక్రవర్తులచేతను నియమింపఁబడిరి. మఱికొందఱు రాజ్యమును అపహరించి యేలిరి (కాలక్రమణిక చూ॥).

3. రాజుల ఉద్యోగప్రవేశము: రాజును సింహాసనముమీఁద నాసీనునిజేసి అతని శిరముపై కిరీటము ధరింపఁజేసి, తైలముతో నతని తల నభిషేకించి, అంతటను అతఁడు రాజని చాటించుటతో అతనిని ఉద్యోగమునఁ బ్రవేశపెట్టిరి (I సమూ $10^{24}$ II సమూ $2^{4}$ $5^{3}$ I రాజు $1^{34}$ II రాజు $23^{30}$). అట్టి సమయములలో యజ్ఞములనుకూడ అర్పించినట్లు I సమూ $16^{2,5}$ I రాజు $1^{25,43-46}$ వలనఁ దెలియును.

4. రాజులవిధులు, పనులు: రాజుయొక్క విధులు ద్వితీ $17^{14-20}$ నం దుదాహరింపఁబడి యున్నవి. ధర్మశాస్త్రమును లక్షించి న్యాయము జరిగించి సేనలను కూర్చుకొని, నిర్గర్వియై రాజ్య

పరిపాలన చేయవలెనని దానివలనఁ దెలియు చున్నది. ఇట్లు చేయుటకు వారు తప్పినందున ప్రవక్తలు వారిని గద్దించి వారికి బుద్ధి చెప్పి కలుగనైయున్న శిక్షలనుకూడఁ దెలిపిరి. (ఏలీయా, ఎలీషా చూ॥). వారి దిగువపనులను జేయవలసి యుండిరి. 1. యుద్ధమున తమ సైన్యములను నడిపించిరి (సౌలు-I సమూ $31^{9}$; అహాబు, యెహోషాపాతు I రాజు $22^{29-34}$). 2. దేశమున న్యాయమును జరిగించిరి (II సమూ $14^{5}$ $15^{2}$ I రాజు $3^{6}$). వారు న్యాయాధిపతులను నియమించినను (II దిన $19^{5-11}$) గొప్ప విషయములను రాజున కప్పగించుచు వచ్చిరి కావున రాజుకు న్యాయాధిపతియను బిరుదు గలదు (ఆమో $2^{3}$). 3. యాజకుల ధర్మవిధులలో రాజునకట్టి జోక్యములేకపోయినను (I సమూ $13^{10-14}$ II దిన $26^{16-21}$) మతవిషయములందును పై యధికారమును చెలాయించువాఁడై యుండెను. దావీదు బలులను అర్పించెను (II సమూ $6^{13,17}$ $24^{15}$). దావీదు సొలొమోనులు యాజకులను నియమించి, కొందఱిని త్రోసివేసిరి (II సమూ $8^{17}$ I రాజు $2^{26-35}$). ఇశ్రాయేలువారి రాజులలో యరొబాము బలులర్పించెను. యూదారాజులలో భ్రష్టుఁడైన ఆహాజు క్రొత్తవిధమగు వేదికను కట్టించి దానిని శిలయ యావరణములో నిలిపెను (II రాజు $16^{12}$) గాని సాధారణముగా ఆరాధనకు సంబంధించిన యిట్టి పనులు ఉద్యోగస్థుల కప్పగించిరి (II సమూ $20^{24}$).

5. రాజుల ఆదాయము: ఆరంభమున రాజులు తమ స్వంత ఆదాయమువలనను యుద్ధమున పట్టుకొన్న దోపుడు సొమ్మువలనను జీవించి తమ నౌకరులను సేనలను పోషించినట్లున్నది. వారికి లోఁబడివారు కానుకలను దెచ్చి యిచ్చిరి (I సమూ $10^{27}$ $16^{20}$). బహుశః అట్టి కానుకలను దెచ్చుటకు వారు బలవంతపెట్టఁబడి యుందురు. అప్పుడది యొకవిధమగు పన్ను అయ్యెను. తనకు కావలసినవాటిని సప్లయి జేయుటకు సొలొమోను దేశమును 12 భాగములుగాఁ జేసి, ప్రతిదానిపై యుద్యోగస్థులను నియమించెను (I రాజు $4^{7}$). యెహె $45^{7,8}$ $48^{21}$ నందు రాజులకు భూములున్న సూచనలున్నవి. దావీదు కట్టి భూములుండెను (I దిన $27^{26-31}$). ఆమో $7^{1}$ వలన మొదటి గడ్డికోఁత రాజుకు భుక్తమైనట్లు కనఁబడుచున్నది. వర్తకుల యొద్ద చౌకీ వసూలుచేసిరి (I రాజు $10^{15}$). సొలొమోను స్వంతముగా సముద్రవ్యాపారము జరిపి చాల ఆదాయము గడించెను ($10^{15}$). క్రమమైన పన్నులు విధించిన సూచనలులేకపోయినను, అవి క్రమక్రమేణ వాడుకలోనికి వచ్చెనని నమ్మఁదగును.

6. రాజపరివారము: ప్రజలకు రాజునందు గల యభిమానమే రాజుల అధికారమునకు ముఖ్యయాధారమైనను తమ రాజ్య సంరక్షణకొఱకు మాత్రమే గాక తమ స్వరక్షణకొఱకును సేనలను, దేహసంరక్షక భటవర్గము నుంచుకొనిరి (II సమూ $15^{18}$ $20^{23}$). ఈ విషయమునందు సొలొమోను మిగుల కీర్తనీయుఁడై గొప్పవైభవమునకు సామెతయయ్యెను (మ $6^{29}$)

7. రాజులనుగూర్చిన యలంకార ప్రయోగములు: రాజు లనుపదము గొప్పశక్తి మహాత్మ్యములను సూచించును. రాజులు క్రీస్తు రాజ్యమును విరోధించినను (కార్య $3^{27}$) దానిని మఱి ముఖ్యముగా విరోధించువారి గొప్పశక్తి కొక సూచనగా నున్నది (కీర్త 2 ప్రక $19^{19}$ మొ॥). దేవుని రాజ్యము ప్రబలుట యనునది రాజులు దానికి పరిచర్య చేతురనుటతో దృష్టాంతపఱచఁబడెను (యెష $49^{7}$ $60^{3,11,16}$). దేవుఁడు సర్వాధికారియై యుండుటచే నాయనకు రాజు అను బిరుదు పెట్టుట కీర్తనల గ్రంథమందు సర్వసాధారణ విషయము ($24^{10}$ $95^{3}$ $98^{6}$ $99^{4}$ మొ॥). మెస్సీయ రాజధర్మములను పూర్ణముగా వహించునని సూచించుటకు ఆయన రాజుగా వచ్చునను ప్రవచనములున్నవి (యెష $9^{6-17}$ $11^{1-5}$ $32^{1-4}$ యిర్మీ $23^{6}$ యెహె $32^{22-24}$ మొ॥). దేవుఁడు సర్వాధికారియై యుండుటచేత ఆయన రారాజు అనఁబడును. ఈ బిరుదే క్రీస్తుకును ఆరోపించిరి (ప్రక $19^{16}$ దేవుని రాజ్యము చూ॥).

**రాజులోయ** యెరూషలేము A I 4 చూ॥

**రాజ్యదండము** దండము చూ॥

**రాణి (Queen).** రాజ్యముల నేలిన రాణులు ముగ్గురు మాత్రము బైబిలునం దుదాహ

రింపఁబడిరి. షేబరాణి (I రాజు 10 మ $12^{42}$), యూదారాజ్య మపహరించి దాని నెనిమిది సం॥ల మట్టు కేలిన అతల్యా (II రాజు 11), ఐతియోపీయుల రాణియగు కందాకే (కార్య $8^{27}$). వీరుగాక రాజుల పెద్దభార్య లనిపించుకొన్న వారిలో వష్తి (ఎస్తే $1^{9}$), ఇష్టభార్యలలో ఎస్తేరు ($2^{22}$), బాబెలు రాజుభార్య (దాని $5^{10}$) లకు రాణి యను బిరుదుండెను. II రాజు $10^{13}$ నందు అహాబు భార్యయగు యెజెబెలుకును రాణి యను పద ముపయోగింపఁబడినను ఇశ్రాయేలు వారిలోగాని, యూదావారిలోగాని అట్టి బిరుదును రాజులు తమ భార్యల కారోపించిన సూచనలు లేవు. రాజు తల్లి యెక్కువగా గౌరవింపఁబడుటచే ఆమెకు రాణియను బిరుదు పెట్టినట్లు యిర్మీ $13^{18}$ వలనఁ దెలియును. కావ్య గ్రంథమగు పరమగీతములో మాత్రము రాజు భార్యలందఱు రాణులై యున్నట్లుదాహరింపఁబడినది. ఆకాశరాణి యని బిరుదు నొక దేవతకు వాడిరి (ఆకాశరాణి చూ॥).

**రాతిశాసనములు** (Inscriptions). ఈ పదముగాని, ఆయా రాతిశాసనముల పేరులుగాని బైబిలునందు లేకపోయినను, వాటివలన బైబిలు చరిత్రలోని అనేక సంగతులు రూఢియని రుజువు అగుచున్నవిగాన వాటినిగూర్చి కొంత వివరింపఁబడును. ఆయా దేశములలో జరిగిన ముఖ్యవిషయములు రాళ్లమీఁద చెక్కించుట రాజులకు సర్వసాధారణ విషయము. పలెస్తీనుకు సంబంధించిన కొన్ని దేశములలోని రాతిశాసనములవలన అనేక సంగతు లిటీవల రూఢిపడెను. అట్టి శాసనములు ముఖ్యములైనవి రెండు గలవు.

1. మోయాబు రాతిశాసము (*Moabite Stone*). అన్నిఁటిలో నిది మిగుల ముఖ్యమైనది. దీనిని చర్చిమిషనెరియగు క్లైన (*Rev. F. Klein*) దొరగారు 1868 సంవత్సరమున మోయాబుదేశములోని దీబోనుదగ్గిర కనుగొనిరి. అరబ్బియు లా రాతిని పగులఁగొట్టించుటచే ముక్కలన్నియు దొరకలేదు గాని దాదాపు 1100 అక్షరములలో 669 దొరికినవి. ఇవి 34 పంక్తులలో చెక్కఁబడెను. మోయాబురాజగు మేషా (II రాజు $3^{4}$) తన ప్రభుత్వకాలమున తనకు కలిగిన జయముల ప్రభావమును ప్రచురించుటకై చెక్కిన శాసనమై యున్నది. దానియం దీ దిగువ విషయము లున్నవి. (1) ఇశ్రాయేలు రాజగు ఒమ్రీ మోయాబును జయించుట (క్రీ॥ పూ॥ 880). (2) అహాబుకాలమున మోయాబీయులు ఇశ్రాయేలువారిని తమ దేశములోనుండి వెళ్లఁగొట్టుట (క్రీ॥ పూ॥ 855). (3) అప్పటినుండి మేషా ఇశ్రాయేలీయులకు కప్పము కట్టక ఎదురుతిరుగుట (II రాజు $3^{5}$). (4) మోయాబీయులను తిరిగి లోపఱచుకొనుటకు రాజగు యెహోరామును అతని మిత్రులును చేసిన నిష్ప్రయోజనమగు యత్నములు (II రాజు $3^{6-27}$). కాపాడఁబడిన శాసనపు తర్జుమా దానిలోని పంక్తులను అనుసరించి యీ దిగువ రీతిగా నున్నది:—

(1) నేను మోయాబురాజును దీబోనీయుఁడునైన కెమోషు మెలెఖు కుమారుఁడనగు మెషా యనువాఁడను.

(2) నా తండ్రి 30 సం॥ల వఱకు మోయాబు దేశమును పాలించెను.

(3) నా తండ్రికిఁ బిమ్మట నేను పరిపాలించితిని. మేషా అను వాని విడుదలనుబట్టి క్రహ్ (*Krhh*) అను చోట కెమోషుకొఱకీ యున్నత స్థలమును నేనే చేసియున్నాను.

(4) ఎందుకనఁగా రాజులందఱినుండి అతఁడు నన్ను విడుదలచేసెను. మఱియు నన్ను అసహ్యించుకొనినవా రందఱిమీఁద నా యిష్టము చొప్పున ఆనందించునట్లు చేసెను.

(5) ఒమ్రీ ఇశ్రాయేలీయుల రాజై యుండెను. కెమోషు (మోయాబు) దేశము మీఁద కోపగించియున్నందున అతఁడు (ఒమ్రీ) మోయాబును చాలకాలము బాధించెను.

(6) అతనికిఁ బిమ్మట అతని కుమారుఁడు రాజ్యమునకు వచ్చెను. మఱియు అతఁడును "నేను మోయాబును బాధపఱతును"ని పలికెను. నా దినములలో అతఁ డీలాగు పలికెను.

(7) గాని నేను అతనిని అతని వంశమును జయించితిని. ఇశ్రాయేలు నిత్య నాశనము పొందెను.

(8) ఒమ్రీ మేదబా దేశమంతటిని స్వాధీనపఱచుకొని తన కాలములోను తన కుమారుని (శేక

కుమాళ్లు) సగము ఏలుబడిలోను 40 సం॥ల వఱకు అచట నివసించెనుగాని,

(9) నా కాలములో దానిని కెమోషునకు విడిచిపెట్టెను. నేను బయల్మెయోనును కట్టించి దానిలో కోనేఁటిని చేసియుంటిని.

(10) నేను కిరియాతెనును కట్టించితిని. గాదు గోత్రికులు పురాతనకాలము మొదలుకొని అతారోతు భూమిలో నివసించిరి.

(11) ఇశ్రాయేలు రాజు తనకొఱకు అతారోతును కట్టించుకొనెను. నేను ఆ పట్టణమునకు విరోధముగా యుద్ధమాడి దానిని జయించి,

(12) కెమోషుకు మోయాబుకు అర్పణగా ఆ పట్టణవాసులందఱిని చంపితిని. మఱియు నే నచటినుండి దవ్దోహ్ (*Daudoh*) యొక్క బలిపీఠమును పట్టుకొని తీసికొనివచ్చి,

(13) దానిని కెరియోతులోని కెమోషు దేవత యెదుటికి నీడ్చితిని. మఱియు నేను దానిలో స్రన్ (*Srn*) యొక్క జనులను మ్రహ్త్ (*Mrhth*) లోని జనులను నివసింపజేసితిని.

(14) అప్పుడు కెమోషు "ఇశ్రాయేలుకు విరోధముగా వెళ్లి పోరాడి నెబోను పట్టుకొనుము"ని చెప్పెను.

(15) నేను రాత్రిలో వెళ్లి తెల్లవారుజాము మొదలు మధ్యాహ్నమువఱకు యుద్ధముచేసి దానిని పట్టుకొని,

(16) అందున్న 7000 మంది పురుషులను బాలురను స్త్రీలను బాలికలను పనికత్తెలను కత్తివాత హతముచేసితిని.

(17) ఏమనిన నేనా పట్టణమును అష్టోరు కెమోషుకు సమర్పించితిని. మఱియు నే నచటినుండి యావె (యెహోవా) బలిపీఠపు సామగ్రులను తీసికొనివచ్చి,

(18) వాటిని కెమోషు ఎదుటికీడ్చితిని. ఇశ్రాయేలు రాజు యాహాజు పట్టణమును కట్టించెను.

(19) అతఁడు నాతో యుద్ధముచేయునపుడు అచటనే నివసించెను. అయితే కెమోషు నా ముందఱనుండి యతని తఱిమివేసెను.

(20) నేను మోయాబీయులలో 200 మంది మనుష్యులను దానిముఖ్యుల నందఱిని తీసికొని వెళ్లి యాహాజును పట్టుకొని,

(21) దీబోనుతో దానిని కలిపితిని. నేను అరణ్యముయొక్క గోడ దిబ్బయొక్క గోడయగు క్రహ్ (*Krhh*) ను కట్టితిని.

(22) దానిద్వారమును దానికోటలను కూడ కట్టితిని.

(23) రాజనగరునుకట్టి పట్టణపుమధ్యనున్న జలములకు చుట్టుగోడలను కట్టితిని.

(24) క్రహ్ (*Krhh*) లో పట్టణమధ్యమందు కొళాయిలు లేకుండెను. కావున నేను జనులందఱితో,

(25) "మీలో ప్రతివాఁడును మీమీ యిండ్లలో కొళాయిలను కట్టుకొనుఁడని" చెప్పితిని. మఱియు ఇశ్రాయేలీయులలో పట్టఁబడిన ఖైదీల సాయమువలన నేను క్రహ్కొఱకు ఒక కాలువ త్రవ్వించితిని.

(26) నేను అరోయేరును కట్టించి అర్నోను మీఁదనున్న రాజబాటను చేయించితిని.

(27) బేత్ బామోతు పడఁగొట్టఁబడినందున నేను దానిని కట్టించితిని. బేసెరు పాడైనందున దానికట్టించితిని.

(28) దీబోను అధిపతులు 50 మందియుండిరి ......దీబోను పట్టణమంతయు లోఁబడెను.

(29) నేను దేశమునకుచేర్చిన నూటికంటె ఎక్కువ సంఖ్యగల పట్టణములను పరిపాలించితిని.

(30) నేను మేదబాను, బేత్ దిబ్లాతేనును బేత్ బయల్మెయోనును కట్టించి ఆ దేశపు... ...గొఱ్ఱెలను గొఱ్ఱెలకాపరులను అచటికి తీసికొని వెళ్లితిని.

(31) హోరోనులో......నివసించిరి... ......

(32) కెమోషు నాతో "వెళ్లి హోరోనెనుతో యుద్ధమాడుము"నెను. అలాగు నేను వెళ్లితిని.

(33) నా దినములలో కెమోషు దానిని తిరిగి యిచ్చెను.........నేనైతే

(34)

బైబిలులో నున్నట్లు ఇశ్రాయేలీయుల చరిత్ర నిజముగా జరిగియుండెననుటకు దీనియందు తేట తైన నిదర్శనములుండుటచేత ఈ రాతిశాసనము చాల విలువగలదై యున్నది. ఇదిమాత్రమే గాక ఈ శాసనమువలన మోయాబీయుల భాష యెట్టిదో అదికూడఁ దెలిసికొనఁగలము. దీని యక్షరముల పోలికనుబట్టియు వ్యాకరణాది లక్షణములనుబట్టియు హెబ్రీభాషకు చాల సంబంధముగలదై యున్నదని పండితులు తెలిసి కొనిరి (మేషా చూ॥).

2. టెల్ - ఎల్ - అమార్న శాసనములు (*Tell-el-Amarna Tablets*). ఇవి యిటుకల మీఁద వ్రాయఁబడినవి. ఇటుక పచ్చిగా నున్న ప్పుడే దానిమీఁదవ్రాసి కాల్చెడివారు. అవి కాలినప్పుడు దానిమీఁది వ్రాఁతలు స్థిరపడి పోవునవి. టెల్ - ఎల్ - అమార్న యను నది ఐగుప్తులోని యొక స్థలము. అది నైలునదీతీరమున దాని ముఖద్వారమునకు దాదాపు 500 మైళ్ల దూరమందున్నవి. 1887 సం॥న దాని శిథిల ములలో నిట్టి యిటుకరాతి శాసనములను చాల కనుగొనిరి. వాటిలో ననేకములు బాబెలురాజు లును ఫేనీకే యధిపతులును పలెస్తీను అధికారు లును ఐగుప్తులోని ఫరోలకు వ్రాసిన పత్రికలై యున్నవి. అవి యించుమించు క్రీ॥ పూ॥ 1500 సం॥లకు పూర్వము వ్రాయఁబడెను. ఆ కాలపు చరిత్రను దెలిసికొనుటకు కివి మిగుల ప్రయోజక ములుగా నుండుటచే నివి మిగుల ప్రసిద్ధిలోకి వచ్చెను. ఇవి ప్రస్తుతమున బర్లిన్ (*Berlin*) లోను, లండన్ (*London*) లోను, కైరో (*Cairo*) లో నున్నవి. వాటిలోఁ గొన్నిఁటిని పండితులింకను చదివి అర్థము చేసికొనలేకున్నారు.

3. అక్సిరిక్స్ (*Oxyrrhincus Tablets*) శాసనములు (యేసుక్రీస్తు I 1 చూ॥).

4. పైన చెప్పఁబడినవేగాక పలెస్తీను బబు లోను చిన్నాసియా ఐగుప్తు నీనెవే మొదలగు దేశములలోని శిథిలములయందు ఇట్టి రాతిశాస నము లనేకములు కనుగొని వాటిని చదివి పురా తన చరిత్రలను కనుగొన యత్నించుచున్నారు. ఇట్టివాటివలనఁ దెలిసికొనఁగలుగు విషయములను బైబిలుకు సంబంధించిన పురాతనసంగతులను గూర్చిన శాస్త్రము (*Biblical Archæology*) అని పిలుతురు. రాతి శాసనములనుగూర్చి మఱింతఁ దెలిసికొనఁగోరువారు ఈ శాస్త్రమును చదువవలెను.

**రాత్రి** కాలమానము I చూ॥

**రాత్రిభోజనము** ప్రభువు రాత్రిభోజనము చూ॥

**రాఫా** (Rapha, Raphah = స్వస్థపఱ చెను).

1. బెన్యామీను సంతతివారిలో నొకఁడు (I దిన 8[2]).

2. యోనాతాను సంతతివారిలో నొకఁడు (I దిన 8[37]). 9[43] నందితనికి రెఫాయా అను మాఱు పేరు గలదు.

**రాఫు** (Raphu = స్వస్థతనొందినవాఁడు). బెన్యామీను గోత్రికుఁడు. మోషే కనానుదేశ మును వేగుచూడఁబంపిన పన్నెండుమందిలో పల్తీయను బెన్యామీనీయుని తండ్రి (సంఖ్యా 13[9]).

**రామతయీమ్సోఫీము** రామా 4 చూ॥

**రామత్మిస్పే** మిస్పె 4 చూ॥

**రామత్లెహీ** (Ramath-Lehi = రామా దవడ). సమ్సోను ఫిలిష్తీయులను జయించిన స్థలము (న్యాయా 15[17]). దీనియునికి తెలి యదు (లేహీ చూ॥).

**రామా** (Ramah = ఉన్నత స్థలము).

1. నఫ్తాలీ స్వాస్థ్యములోనున్న యొక పట్ట ణము (యెహో 19[36]). అది ప్రస్తుతము కపెర్న హూముకు 12 మైళ్లు వాయవ్య దిక్కునుండు రామె (*Rameh*) యను పట్టణమనుకొందురు (పటము I E, 4).

2. ఆషేరుగోత్ర స్వాస్థ్యమందలి యొక పట్టణము (యెహో 19[29]). ప్రస్తుతము తూరుకు 10 మైళ్లు ఆగ్నేయముకు కొంచెము దక్షిణముగా నున్న రామియ (*Ramia*) యని తలంచు చున్నారు (పటము IV, C 5).

3. బెన్యామీను గోత్రమందలి యొక పట్ట ణము (యెహో 18[25]). దీనికిని బేతేలుకును మధ్యనుండు ఒక వృక్షము క్రింద దెబోరా న్యాయము తీర్చెను (న్యాయా 4[5]). గిబియాలో

తన భార్యను కోలుపోయిన లేవీయుఁ డీ పట్టణమునందు మొదట బసచేయుటకుఁ దలచెను (న్యాయా $19^{13}$). చెఱకాలమునకుఁ బిమ్మట రామావారును గెబావారును కలిసి 621 మంది పురుషులు తిరిగివచ్చిరి (ఎజ్రా $2^{26}$). బెన్యామీనీయు లీ పట్టణమున నివాసముండిరి (నెహె $11^{33}$). అష్షూరువారు యెరూషలేము మీఁదకు దండెత్తి వచ్చుటనుగూర్చిన వివరమునం దీ పట్టణము మిక్మషు గిబాలకు మధ్యవచ్చును (యెష $10^{28,29}$). యూదుల పారంపర్యమును బట్టి యాకోబు భార్యయగు రాహేలు సమాధి యిచ్చటనున్నట్లుఁ దెలియుచున్నది. ఆ సంగతి I సమూ $10^{2}$ తో చక్కగా సరిపడును. రామాలో రాహేలు తన బిడ్డలకొఱకై అంగలార్చుచున్నట్లు యిర్మీ $31^{15}$ వలన స్పష్టమగుచున్నది (మ $2^{18}$ సరిపోల్చుము). నెబుకద్నెజరు సేనాధిపతి ఇచ్చటనే యిర్మీయాను విడిపించెను (యిర్మీ $40^{1}$). యెరూషలేమున కుత్తరముగా ప్రస్తుతము 5 మైళ్ల దూరముగా నున్న ఎర్-రాము (*Er-Ram*) అను చిన్నపల్లెయే. ఈ పట్టణపు ఉనికి యని యెంచుచున్నారు. అచ్చట నేటివఱకు యిశ్రాయేలీయుల సమాధులను జూపెదరు. వాటిలో రాహేలు సమాధి యుండవచ్చును. దావీదు సేవకుఁడగు రామాతీయుఁడగు షిమీ (I దిన $27^{27}$) ఈ పట్టణపువాఁడు కావచ్చును (పటము III, F 5).

4. ఎఫ్రాయిము మన్యమందలి యొక పట్టణము. I సమూ $1^{1}$ లో అది రామాతయీమ్సోఫీ మనఁబడెను. ఈ పదమునందు రామా, మిస్పా అను రెండు పదములు కలిసినట్లున్నది. సమూయేలు తండ్రియగు ఎల్కానా ఈ యూరివాఁడు. ఇది సమూయేలు నివాసస్థలము (I సమూ $1^{19}$ $2^{11}$ $7^{17}$ $8^{4}$ $15^{34}$ మొ॥). ఇశ్రాయేలు రాజగు బయెషా దీనిని కట్టించి కోటగాఁ జేసెను (I రాజు $15^{17}$ II దిన $16^{1}$). I మక్క $11^{34}$ లో దీనికి రామాతెము అను మాఱుపేరు గలదు. దీని యునికి తెలియదు. పైన 3 లో చెప్పఁబడినది ఇది ఒకటే కావచ్చును.

5. రామోత్గిలాదును సూచించెడి యొక స్థలము (II రాజు $8^{29}$ II దిన $22^{6}$ రామోత్గిలాదు చూ॥).

6. యూదా దక్షిణమందుండు ఒక పట్టణము. దానిని షిమ్యోను గోత్రికుల కిచ్చిరి (యెహో $19^{8}$). దానికి I సమూ $30^{27}$ లో దక్షిణ రామోతు అను మాఱుపేరు గలదు. సిక్లగునుండి దావీదు ఆయా ఊళ్లకు దోపుడుసొమ్మునంపఁగా ఈ యూరివారికి నొక భాగము నంపెను. దీని యునికి తెలియదు.

**రాము** (Ram = ఎత్తఁబడినది).

1. యూదా సంతతివారిలో నొకఁడు. దావీదు వంశావళి క్రమణికయందు ఇతని పేరు వచ్చును (రూతు $4^{19}$). మ $1^{3,4}$ లూ $3^{33}$ నందితనికి అరాము అను మాఱుపేరు గలదు. I దిన $2^{9}$ లో ఇతఁడు యెరహ్మెయేలు తమ్ముఁడై యున్నట్లును $2^{25,27}$ నందు కుమారుఁడై యున్నట్లును కనఁబడుచున్నది. అతని కీ పేరుగల తమ్ముఁడును కొడుకున్నారని కొందఱి యభిప్రాయము. ఇది నిజమై యుండును.

2. యోబుతో వాదించిన ఎలీహుయొక్క పూర్వికుఁడు (యోబు $32^{2}$). ఇది అరాముకు క్లుప్తపేరని కొందఱి యభిప్రాయము.

**రామెసేసు** (Rameses). ఫరో ధాన్యాదులు నిలువచేయుటకై అతనికొఱకు ఇశ్రాయేలీయులైగుప్తులో కట్టిన పట్టణములలో నిదియొకటి (నిర్గ $1^{11}$). ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి విడుదల నొందినపు డిచటినుండియే బయలుదేరిరి (నిర్గ $12^{37}$ సంఖ్యా $33^{3-5}$). ఐగుప్తీయుల శాసనములలో పి-రామెస్సె (*P-Ramessa* = రామెసేసు నగరము) అనునది యీ పట్టణమే యని యనుకొందురు. అది II రామ్సేసుకు జ్ఞాపకార్థముగా ఆ పేరు నొందెను (ఐగుప్తు 3 చూ॥). ఆది $47^{11}$ చూడఁగా రామెసేసు ఒక దేశమునకు పేరయి యున్నది. అది గోషెను ప్రదేశమై యుండెనని $47^{27}$ వలన స్పష్టమగును. అందువలన రామెసేసు అను పట్టణముకూడ గోషెనులో నుండెనని సాధారణముగా ననుకొందురు అట్లనుకొనువారు అది గోషెనుయొక్క ఆగ్నేయ దిక్కున నున్నదని యభిప్రాయపడుచున్నారు.

**రామోతు** (Ramoth = ఉన్నతమైన స్థలములు).

1. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచి పెట్టిన వారిలో నొకఁడు (ఎజ్రా $10^{29}$). హెబ్రీభాషయం దీ పదమును యెరేమోతు అని వ్రాసిరి గాని ఆ బైబిలును సవరించినవారు దానిని రామోతు అని చదువవలసినదని సవరణజేసిరి (యెరేమోతు 15 చూ॥).

2. ఇశ్శాఖారులో నున్న యొక పట్టణము. అది లేవీయుల స్వాస్థ్యమయ్యెను. (I దిన $6^{58.73}$). యెహో $19^{21}$ లోని రెమెతు $21^{28}$ లోని యర్మూతు ఈ యూరిపేరులే యని కొందఱి యభిప్రాయము. దాని యునికిని గూర్చిన సూచనలగుపడుటలేదు (యర్మూతు 2 చూ॥).

3. గిలాదు దేశములోని యొక పట్టణము (ద్వితీ $4^{43}$ యెహో $20^{8}$ $21^{38}$ మొ॥ రామోత్గిలాదు చూ॥).

4. యూదాదేశములో దక్షిణదేశమనఁబడిన దానిలోని ఒక పట్టణము (I సమూ $30^{27}$ రామా 6 చూ॥).

**రామోత్గిలాదు** (Ramoth-Gilead = గిలాదులోని ఉన్నత స్థలములు). యొర్దానునదికి తూర్పున నున్న గిలాదు పట్టణములలో నొక ముఖ్యపట్టణము. ఆశ్రయపట్టణముగా ప్రత్యేకించిరి (ద్వితీ $4^{43}$ యెహో $20^{8}$). గాదు గోత్రములో నుండినను లేవీయులలో మెరారీయులకియ్యఁబడెను ($21^{38}$ I దిన $6^{80}$). సొలొమోను ఉద్యోగస్థులలో నొకఁ డిచ్చట నుండెను (I రాజు $4^{13}$). ఇశ్రాయేలీయుల రాజులగు అహాబు యెహోరాము లిచ్చట సిరియనులతో యుద్ధము చేసి గాయము లొందిరి (I రాజు 22, II దిన $22^{5}$ II రాజు $8^{28,29}$). యెహూ ఇచ్చటనే ఇశ్రాయేలువారికి రాజుగా నభిషేకించఁబడెను (II రాజు $9^{1-28}$). గిలాదుకు మధ్య యర్మూతు నదికి సుమారు 10 మైళ్లు ఉత్తరముగా రెండుచోట్లను, దక్షిణముగా నొకచోటను దీని యునికిని గనపఱచుచున్నారు. ఇది చాల ముఖ్యస్థానమగుటచే దాని శిథిలము లెచ్చటనో యుండక తప్పదు. పై నుదాహరించిన మిస్పా, గెరాసా, ఎస్ - సాయిల్ (*Es-Sail*) అను మూఁడు స్థలములలో పాడు దిబ్బలు గలవు. వాటిలో నేది రామోత్గిలాదో ఆ శిథిలములను పరిశోధించ నారంభించినప్పుడు మాత్రమే తెలిసికొన వీలగును (పటము I, G 6).

**రాయబారి, రాయబారము** (Ambassador, Embassage). దూతలని సాధారణముగా కొన్ని వాక్యములలో వాడిన మాటను రాయబారులని తెనిఁగించిరి (II దిన $35^{21}$ యెష $30^{4}$ $33^{7}$ యెహె $17^{15}$ మొ॥). II దిన $32^{31}$ లో నున్న పదము మఱియొకటియై తమ భాష నెఱుఁగని వారికి అర్థము చెప్పువారని శబ్దార్థమగును. ఇట్టి రాయబారులు రాజుల పక్షముగా పంపఁబడిన దూతలై యున్నారు (దూత చూ॥).

క్రొత్త నిబంధనలో రాయబారులనియు, రాయబారమనియు తెనిఁగించిన మూలపదము దూత యని తెనిఁగింపఁబడినది గాక వేఱుపదమై పెద్దలని శబ్దార్థమగును. ఈ పదము గ్రీకు గ్రంథకర్తలు తమ రచనలలో వాడిన పదమై యున్నది. రాయబారులు పెద్దలగుటచే వారికీ పేరు కలిగెను. లూ $14^{32}$ $19^{19}$ లో రాయబారమను పదము సాధారణ అర్థముతో నుపయోగించిరి. II కొరి $5^{20}$ ఎఫె $6^{20}$ లో బోధకులు రాయబారు లనఁబడిరి. రారాజగు దేవుని పేరట మానవులకు సమాధాన వార్త తెలుపుటకు పంపఁబడిరి కావున వారి కిట్టి పేరు సార్థకమగుచున్నది (దూత, బోధకుడు చూ॥).

**రాయమా** (Raamah = వణుకుట అదురుట). కూషు కుమారుఁడు (ఆది 10 I దిన $1^{9}$). షేబ దెదానుల తండ్రి (ఆది $10^{28}$) ఇచ్చటనున్న సంబంధమునుబట్టి ఇతఁ డరబ్బీయుల లోని తెగవారికి పూర్వికుఁడని తెలిసికొనవచ్చును. పారసీక సంయుక్తాగ్రగుడము దగ్గర రెగ్మా (*Regma*) అను వారు పూర్వముండిరి. వీరు వారేనని కొందఱి యభిప్రాయము. గాని దక్షిణ అరబ్బీలో పూర్వముండిన రమ్మనీటే (*Rammanitae*) అను వారు వీరని మఱికొందఱి అభిప్రాయమై యున్నది. వారు బంగారుతో వర్తకము చేసెడివారు (యెహె $27^{22}$). గాన వారు అరబ్బీయులు అని చెప్పుటకు సందేహము లేదు గాని వారుండిన తావునుగూర్చి అంతగా తెలియదు.

రాయి (Stone). పలెస్తీను రాతిప్రదేశమై యున్నది. కావున రాళ్లను అనేక పనుల కుపయోగించుకొనిరి. ఆ పదమునకు అలంకారార్థ ప్రయోగము లనేకములు కానవచ్చుచున్నవి.

యాకోబు ఒక రాతిని తలగడగా వాడుకొనెను (ఆది 28[11-18]). అచ్చట యతని కొక దర్శనము కలిగినందున దానిని గుడిగా ప్రతిష్ఠించెను (28[13-22] 35[14]). ఏదైన నొక గొప్ప సంగతి జరిగినప్పుడు జ్ఞాపకార్థముగా రాళ్లను నిలిపిరి (యెహో 4 I సమూ 7[13]). ఒడంబడికెలకు సాక్షిగాను అట్టి స్తంభములను నిలువఁబెట్టిరి (ఆది 31[36] యెహె 26[27]). కూర్చుండుటకు తగిన అరుగులుగా నమర్చిరి (నిర్గ 17[10]). బావులను కట్టిరి (ఆది 29[2,3,9]). చనిపోయినవారి కవమానము కలుగునట్లు వారి శవములపై రాళ్లతో కుప్పవేసిరి (I సమూ 18[17]). రాళ్లతో సమాధులకు మూతలు వేసిరి (మ 27[60] 28[2] యోహా 11[38,39]). పాఁత నిబంధనలోని పదియాజ్ఞలను రాతిమీఁద చెక్కిరి (ద్వితీ 27[2,4] యెహో 8[32]). మలచని రాళ్లతో వేదికలను కట్టిరి (నిర్గ 20[25] యెహో 8[31] ద్వితీ 27[35]). భూమిమీఁద రాళ్లుండినయెడల పంటకు నష్టముగా నెంచిరి (II రాజు 3[19,25] మా 4[16] మొ॥). మార్గములో నున్న రాళ్లు ప్రయాణీకులకు తొట్రిల్ల కారణమగుటచే అవి ఆటంకములకు సూచనగా నుండెను (యెష 8[14] 62[10] కీర్త 91[12] మ 4[6] I పేతు 2[8]). రాళ్లను ఆయుధములుగా వాడిరి (నిర్గ 21[18] సంఖ్యా 35[17,23]). వడిసెలలో పెట్టి కొట్టిరి (న్యాయా 20[16] I సమూ 17[40,41] I దిన 12[2,3] యోబు 41[28]). యుద్ధములందు యంత్రసహాయముచే శత్రువులపై ప్రయోగించిరి (II దిన 26[15]) ద్వేషము కనఁబఱచుటకు రాళ్లను రువ్విరి (II సమూ 16[6] యోహా 8[59] 10[31]). విగ్రహారాధికులను (ద్వితీ 13[10] 17[5]) మంత్రముల నుపయోగించువారిని (లేవీ 20[27]), దేవుని నామమును దూషించువారిని (24[23]), మూర్ఖవ్యభిచారులను (ద్వితీ 22[21,24] యోహా 8[7]) రాళ్లతోఁ గొట్టి చంపిరి. నాబోతును రాజద్రోహిగా నెంచి రాళ్లతోఁ గొట్టి చంపిరి (I రాజు 21[13]). ప్రజలు దొమ్మిగా గూడి తమ కయిష్టులైన వారినిట్లు సంహరించిరి (12[18]), తొట్లను (నిర్గ 7[19]), బలిపీఠములను (యెహె 40[42]), రాతిపలకలను (నిర్గ 24[12] ద్వితీ 4[13] I రాజు 8[9] మొ॥), విగ్రహములను (ద్వితీ 4[28]) రాళ్లతో చేసిరి. వీధులమీఁద పఱచుటకు రాళ్ల నుపయోగించిరి (II రాజు 16[17]). వాటితో గోడలను కట్టిరి (సామె 24[31]). గొప్ప కట్టడముల పునాదులలోను (యెష 28[16]), గోడలకును (I రాజు 5[17,18] 6[7] మొ॥) చెక్కిన గొప్పరాళ్లను వాడిరి. అట్టి కట్టడములకు ఒక విశేషరాతిని తలరాయిగా పెట్టిరి (జెక 4[7]). మూలరాతిని విశేష ఆచారములతో నెత్తిరి (యోబు 38[6]). అది గొప్ప ఘనులకును (యిర్మీ 51[26]), మఱి ముఖ్యముగా మెస్సీయకును (కీర్త 118[22] మ 21[42]) సార్థకనామముగా వాడిరి. హద్దులకు రాళ్లు వేయుట మొదటినుంచియు వాడుకయై యున్నది (ద్వితీ 27[17]). చరిత్రసంబంధమగు గొప్ప కార్యము జరిగిన స్థలములు గుర్తించుటకు రాళ్లను నిలిపిరి (యెహో 15[6] 18[7]). రాళ్లు స్థిరతను (యోహా 1[42] యోబు 41[24]), బరువైనదానినిఁ (యిర్మీ 51[63]), విలువలేనిదానిని (I రాజు 10[27] II దిన 9[27]), మాటలాడలేనిదానిని (హబ 2[19] ని లూ 19[40]) సూచించును. గొప్ప భయముచే మానవులు రాతివంటివారగుదురు అను దృష్టాంతమును (I సమూ 25[37] నిర్గ 15[16]) గలదు.

రావిచెట్టు మేడిచెట్టు చూ॥

## రాహాబు.

1. (Rahab = విశాలత). యెహోషువ పంపించిన వేగులవారిని యెరికోలో దాచిపెట్టిన వేశ్యయొక్క పేరు (యెహో 2). ఈ కార్యము చేసినందున ఇశ్రాయేలీయులు ఈమెను ఈమె యింటివారిని రక్షించిరి (6[17,18]). మ 1[5] లో ఈమె పేరు క్రీస్తునుగూర్చిన వంశావళిలో కనఁబడును. అచటనుండు గ్రీకు పేరును చూడఁగా అది LXX లో ఈ రాహాబు అను పేరునకు కొంచెము భేదముగా నున్నది. మఱియు హెబ్రీ 11[31] లోను యాకో 2[25] లో నున్న యీ పేరు కూడ మ 1[5] లో నున్న రాహాబు అను పేరునకు భిన్నముగా నున్నది. అయితే యోసీఫసు అను చరిత్రకారుఁడు దానిని మ 1[5] లో వలె గుణింతము చేసియుండెను. ఇది యంతయు చూడఁగా

మ $1^{5}$ లోని రాహాబు ఈ రాహాబు అయ్యుండ వచ్చును లేదా వేఱొకతెయై యుండవచ్చును. రాహాబు విశ్వాసముగలవారిలో నొక ముఖ్య దృష్టాంతమై యుండెను (హెబ్రీ $11^{31}$ యాకో $2^{25}$).

2. (Rahab = బలాతిశయము). ఐగుప్తు దేశమునకు పెట్టిన యొక యలంకారనామము (కీర్త $87^{4}$ $89^{10}$). యెష $51^{9,10}$ లోని ఐగుప్తు అను పేరుకు అసలులో రాహాబు అని యున్నది. యోబు $26^{12}$ $9^{13}$ లలో ఇది యేదో యొక భయంకరమైన మృగమునకు పేరై యున్నది. యోబు $26^{12}$ చూడఁగా ఆ మృగము సముద్రములో నుండునదై యున్నట్లు కనఁబడును. ఈ రాహాబు అనునది షేము సంతతివారి పురాణములలో నున్నట్లు దేవునికి విరోధముగా పోరాడుచున్న దురాత్మ కొక పేరని కొందఱనుకొందురు. ఆ దురాత్మ తియమత్ (*Tiamat*) అను పేరు కలదై, భయంకరాకారముతో సముద్రములో నివసించుచు సృష్టిక్రమమును చెడఁగొట్టుటకు పని చేయుచున్నట్లుగా ఆ పురాణములలో నున్నది. అది యిట్లిదైనయెడల సముద్రములో నున్న భయంకరమైన దానిని సూచించుటకు యోబు ఈ పేరు వాడెనను కొందురు. మఱియు ఐగుప్తుదేశము సాధారణముగా దేవుని ప్రజలను విరోధించు భయంకరమైన జనులుగల దేశమైయుండుటచే ఆ దేశమునకిది యలంకార రీతిగా పెట్టఁబడెనని యను కొందురు. ఇది నిజము కావచ్చును కాకపోవచ్చును. ఎటులనైనను సరే ఇది ఐగుప్తు దేశమునకు అలంకారరీతిగా పెట్టిన పేరైయున్నది. యెష $30^{7}$ లో ఈ పదమును గప్పాలమారియను మాటతో తెనిఁగించి యున్నారు. బహుశః ఐగుప్తీయుల గర్వాతిశయమువలన ఈ పేరు వచ్చి యుండవచ్చును.

**రాహేలు** (Rachel = ఆఁడు గొఱ్ఱె). లాబానుయొక్క రెండవకుమార్తె. యాకోబు హారానుదేశమునకు వచ్చినప్పుడు ఈమె తన తండ్రిమందలను మేపుచు ఒక నూతియొద్ద అతనిని కలిసికొనెను (అది $29^{1-6}$). ఈమె మిగుల సౌందర్యవతి యాకోబీమెను చూచినతక్షణమే ప్రేమపాశమునఁ జిక్కెను ($29^{17-20}$). ఆమెను తనకిచ్చి వివాహము చేసినయెడల ఏడు సంవత్సరములు కొలువుచేతునని లాబానుతో యాకోబు ఒప్పందపడెను. లాబాను అందుకు సమ్మతించి యేడేండ్లు కడచినపిమ్మట రాహేలుకు బదులు తన పెద్దకుమార్తెయైన లేయా నిచ్చి పెండ్లిజేసెను ($29^{21-30}$). మఱి యేడేండ్లు కొలువు జేసిన పక్షమున రాహేలునుకూడ నిత్తునని చెప్పెను. లేయాకు నలుగురు కుమారులు కలుగుటయు తనకు సంతానము లేకపోవుటయుఁ జూచి మిగుల అసూయపడెను. అక్కయందలి అసూయచే తన దాసియగు బిల్హాను యాకోబున కుపపత్నిగా నిచ్చి ఆమెకనిన యిద్దరు కుమారులను తన బిడ్డలుగ నెంచుకొనెను. దేవుఁడు తనకు తీర్పుజేసి తన మొరను విని కుమారుని దయచేసెనని ఒకనికి దాను అనియు దేవుని కృపవిషయమై తన యక్కతో పోరాడి గెలిచితినని ఒకనికి నఫ్తాలి యనియు నామకరణ మొనర్చెను. రూబేను పొలమునుండి తెచ్చిన పుత్త్రదాత వృక్షపుపండ్లను ఆశతో సంపాదించుకొనుటకై చేసినదానినిబట్టి బిడ్డలను కనవలెనను కోరిక యెంత బలముగ ఆమె కుండెనో తెలియుచున్నది ($30^{14}$). చాల యేండ్లకు ఆమె కోరిక ప్రకారము యోసేపు అను కుమారుఁడు కలిగెను (30). తరువాత ఆరేండ్లకు ($31^{41}$) యాకోబు తన మామయగు లాబానుయొద్ద నుండి వెళ్లిపోవుట కాలోచించుచుండఁగా రాహేలును తన అక్కతోఁగలిసి వెళ్లిపోవ సమ్మతించెను ($31^{1-3,4,14-16}$). మూఢభక్తిగల రాహేలు వెళ్లునప్పుడు తనకును తన భర్తకును క్షేమాభివృద్ధి కలుగునను తలంపుతో తన తండ్రి గృహదేవతలను దొంగిలించెను ($31^{33-35}$). లాబాను వాటిని వెదుకవచ్చినప్పుడు యుక్తిగా వాటిని దాచి అతఁడు తీసికొనిపోవుటకు వీలుగాకుండ చేసెను. ఏశావు యెదుర్కొన వచ్చినప్పుడు అతఁడు రాహేలును యోసేపును ఉంచిన స్థానమునుబట్టి ఆమెయెడల యెట్టిప్రేమ అతని కుండెనో తెలియుచున్నది ($33^{1-15}$). యాకోబు బేతేలును విడిచి వెళ్లుచుండఁగా మార్గములో రాహేలు బెన్యామీనునుకని మరణమాయెను. ఆమెను రామాలో సమాధిచేసిరి ($35^{16-20}$ $48^{7}$). ఇశ్రాయేలీయుల వంశములను

వర్ధిల్లజేసినవారిలో లేయాయును రాహేలు నున్నట్లు రూతు గ్రంథమున నొక సూచనకలదు. రూతు (4[11]) రిబ్కావలెనే రాహేలును రూపము నందు మాత్రమేగాక మట్టు మర్యాదలలోను మాటలలోను మనుష్యుల నాకర్షించునదై యున్నది (24, 29). ఆమె మరణమువలన అతని యాశ లన్నియు అడుగంటినట్లతఁడు తలంచెను. అన్ని విషయములలోను రాహేలు తన అత్తగారి ప్రతిబింబ మనవచ్చును. W.

**రాళ్లతో కొట్టుట** నేరములు శిక్షలు III 7 (1) చూ॥

**రాళ్లను ప్రయోగించు యంత్రములు** కోట III 5 చూ॥

**రాళ్లను మలచువారు** వృత్తులు చేతిపనులు I (1) చూ॥

**రాళ్లు పరచిన స్థలము** గబ్బతా, యెరూషలేము B, VI 4 చూ॥

## రి

**రిక్తునిగా చేసికొనుట** (Kenosis). ఈ పదము ఫిలి 2[7] నందు కనఁబడును. యేసుక్రీస్తు ఈ లోకమునం దవతరింపఁగా ఆయన తన్ను తాను రిక్తునిగాఁ జేసికొనెను. ఆయన ధనవంతుఁడైనను మన నిమిత్తము దరిద్రుఁడాయెనను (II కొరి 8[9]) మాటలలోను ఈ సంగతియే కనఁబడును. ఆయన తన మహిమను వదలివేసి తన్ను తాను తగ్గించు కొనెనను సంగతి ఈ మాటలలో సూచింపఁ బడెను గాని వేదశాస్త్రమునందు దీని గ్రీకుపద మైన కెనోసిస్ ఒక విశేష సిద్ధాంతపు పేరయ్యెను. క్రీస్తు ఈ లోకమునం దుండఁగా తన సర్వశక్తి సర్వజ్ఞత్వము అను దైవలక్షణములను ఉపయోగించలేక పోవునంతగా వదలివేసెనని కొందఱును, ఆ లక్షణముల నాయన నరావతారధారిగా నుండు నప్పుడు కలిగియున్నను వాటి నుపయోగించు కొనలేదని మఱికొందఱును అభిప్రాయపడు చున్నారు. ఇట్టి యభిప్రాయభేదము లుండు టచే నవీన వేదశాస్త్రములలో కెనోసిస్ అను ఈ విషయమై ఎక్కువగా చర్చింతురు.

**రిజియా** (Rizia = ఆనందము). ఆషేరు గోత్రికులలో నొకఁడు (I దిన 7[39]).

**రిత్మా** (Rithmah = ఒక తరహా చెట్టు). ఇశ్రాయేలీయు లరణ్యసంచారమునందు దిగిన యొక స్థలము (సంఖ్యా 33[18,19]). అచ్చటనున్న పేరుల వరుసనుబట్టి అది కాదేషుకు సమీపముగా నున్నట్లున్నదిగాని దాని యునికి ఇంక నూటిగాఁ దెలియదు.

**రిన్నా** (Rinnah = కేక). యూదా సంతతివారిలో నొకఁడు (I దిన 4[20]).

**రిబ్కా** (Rebekah = ఉచ్చు త్రాడు). బతూయేలు కుమార్తె. మెసపొతేమియలోని నాహోరుపట్టణపు బయటనున్న బావికి నీటి నిమిత్త మామె వచ్చినప్పుడు ఇస్సాకు నిమిత్తమై మనువుచూడ బయలుదేరిన అబ్రాహాము సేవకుఁ డామెదగ్గరకువచ్చి తనకు త్రాగుటకు నీళ్లిమ్మని యడిగెను. ఆమె అతనికి దాహము ఇచ్చుటయే గాక అతని యొంటెలకును కావలసిన నీరులోడి పెట్ట సమ్మతించెను. తా నదివఱకు దేవునడిగిన గుర్తు అదే. ఆమెయొక్క దయార్ద్ర హృదయము వెల్లడియయ్యెను. ఆమె సౌందర్యవతి యని అతఁడు కనుగొనెను. తన యజమానుని కుమారునికి తగిన వధువనియెంచి అతఁ డామెకు విలువగల ఆభరణము లిచ్చెను. ఆమె పేరు తెలియనందున అడిగి తెలిసికొని ఆ రాత్రి తాను బసచేయుటకు వారియింట వీలుగలదేమో కనుగొనెను. ఆమె యందుల కంగీకరించి తన అన్నయగు లాబాను కూడ యిష్టపడునట్లు చేసెను. అందువలన ఆ సేవకుఁ డా రాత్రి వారియింట బసచేసి చివరకు తాను వచ్చిన పనినికూడ తెలిపెను. రిబ్కా తనవెంట కనానుకు వచ్చి ఇస్సాకును వివాహ మాడవలసియున్నదనికూడ మనవిజేసెను. లాబాను దానికి సమ్మతించెను. రిబ్కా వెనుకఁదీయలేదు. ఆమె సేవకుని వెంబడించివెళ్లి ఇస్సాకును వివాహ మాడెను. ఏశావు యాకోబులను కనెను (ఆది 24[1-67]). ఆమె యాకోబును ఎక్కువగా ప్రేమించెను. ఏశావుకన్న యాకోబు గొప్పవాఁడగునను ప్రవచనము వెలిఁగియున్నను, ఆ సంగతిని దేవుని కప్పగించక జ్యేష్ఠుఁడైనవానికి రావలసిన దీవన, మోసముద్వారా యాకోబునకు వచ్చునట్లు యుక్తిఁబన్నెను (25[23] 27[1]-28[5]). బహుశః ఆమె యాకోబు మెసపొతేమియ యందుండఁగనే

మరణమై మక్పేలా గుహలో పాతిపెట్టఁబడెను ($49^{31}$). W.

**రిబ్లా** (Riblah = సారవంతము).

1. నెబుకద్నెజరుయొక్క సైన్యము మకాము చేసిన యొక స్థలము. అతఁ డిచ్చటనుండి తన పటాలముల నాయా దిక్కులకుఁ బంపెను. యెరూషలేమును పట్టుకొనినపిమ్మట రాజైన సిద్కియాను ఇచ్చటనున్న నెబుకద్నెజరునొద్దకు తేఁగా అతఁడు సిద్కియాను శిక్షించెను (II రాజు $25^{6,20,21}$ యిర్మీ $39^{5,6}$ $52^{9-11}$). దీనికిపూర్వము ఐగుప్తురాజగు ఫరోనెకో యూదారాజగు యెహోయాహాజును ఇచ్చటికిఁ దెచ్చినట్లున్నది (II రాజు $23^{33}$) గాని, II దిన $36^{3}$ లో అది యెరూషలేమునందు జరిగినట్లు కనఁబడుచున్నది. ఫరోనెకో రిబ్లాలో నుండఁగా అతని పటాలములలో నొకటి యెహోయాహాజును పట్టుకొని అతనియొద్దకు వచ్చెను గాని కొందఱు II రాజు $23^{33}$ లో నున్నది పొరపాటున వ్రాయఁబడినట్లు తలంచెదరు. ఈ పట్టణము లెబానోను, ప్రతి లెబానోనులకు మధ్యనున్న లోయయందు ప్రవహించు ఒరాంటీసునదీతీరమున హామాతుకు 50 మైళ్ల దూరమందున్నది. ప్రస్తుతమచ్చట చాల పాడు శేషములును, రిబ్లె (*Ribleh*) అను ఊరును గలవు. యెహె $6^{14}$ లో నున్న దిబ్లాతును బదులు రిబ్లా యని చదువుట యుక్తమని కొందఱి తలంపు (దిబ్లాతు చూ॥, పటము VIII, C 2).

2. ఉత్తరపలెస్తీనునందు తూర్పుహద్దుగా నుండు నొక స్థలము (సంఖ్యా $34^{11}$). ఇది గలిలైయ సముద్రమునకు ఈశాన్యముగా నున్న యొక స్థలముగాని దాని యునికినిగూర్చి యింక తేటగా తెలియదు.

**రిమ్మోను** (Rimmon = దానిమ్మపండు, ఉఱుమువాఁడు).

1. సౌలు కుమారుఁడగు ఇష్బోషెతును చంపిన వారి తండ్రి. ఇతఁడు బెన్యామీనీయుఁడు (II సమూ $4^{2,5,9}$).

2. బెన్యామీనీయులు తక్కిన గోత్రికులతో యుద్ధముచేసి ఓడి పారిపోయి దాగుకొనిన యొక బండ (న్యాయా $20^{45-47}$ $21^{13}$). ప్రస్తుతమున బేతేలుకు తూర్పుగా మూఁడుమైళ్లదూరమున నున్న దిబ్బపైనుండు రుమ్మోను (*Rummon*) అను ఊరే దీనియునికి యని తలంచుచున్నారు (పటము III F 5).

3. యూదయ దక్షిణమునందుండు ఒక పట్టణము (యెహో $15^{32}$ I దిన $4^{32}$ జెక $14^{10}$). యెహో $19^{7}$ లో అది అయీను అను ఊరికి సమీపముననున్నట్లు తెలియుచున్నది. గనుకనే, కాఁబోలు నెహె $11^{29}$ నం దీ రెండు ఊళ్లను కలిపి ఎన్రిమ్మోను (అయీను+రిమ్మోను) అని వ్రాసిరి. అట్లుకానియెడల యెహో $15^{32}$ I దిన $4^{32}$ లోని అయీను అను దానిని వేరు స్థలముగా నెంచక రిమ్మోను అను పదముయొక్క భాగముగా నెంచవలెను (ఎన్రిమ్మోను చూ॥, పటము II, D 3).

4. జెబూలూను గోత్రపుహద్దులలో నొకటి (యెహో $19^{13}$). యెహో $21^{35}$ లో దీనిని పొరపాటుగా దిమ్నా అని వ్రాసిరి.

5. బాబెలు దేవతలలో రమ్మాను (*Ramman*) అను దేవతయొక్క హెబ్రూపదరూపము. ఈ దేవత హిందువుల ఇంద్రునిబోలి వర్షమునకును, ఉఱుములు, గాలివానల కధిదేవతగా నెంచఁబడెను. దమస్కువారి దేవతలలో నిది ముఖ్యమైనది (II రాజు $5^{18}$). ఈ దేవతపూజ బబులోను నుండి దమస్కుకు వచ్చినట్లు దీనివలనఁ దెలియుచున్నది. వర్షములు పంపునుగాన మంచి దేవత యనియు, తుఫానులు కలిగించునుగాన లయము చేయు దేవత యనియు నెంచఁబడును. శివునికి నందివాహనసూచకమైనట్లు ఈ దేవతకు అది యొక ముఖ్యసూచనగా నున్నది. హదద్రిమ్మోను (జెక $12^{11}$) అను స్థలము పేరునందును టబ్రిమ్మోను (I రాజు $15^{18}$) అను మనుష్యుని పేరులోను ఈ దేవతపేరు గానవచ్చును.

**రిమ్మోను పారెసు** (Rimmon-Perez = దానిమ్మకాయ సందు). ఇశ్రాయేలీయు లరణ్యమునందు దిగిన స్థలములలో నొకటి (సంఖ్యా $33^{19,20}$). దీని యునికి తెలియదు.

**రిస్పా** (Rizpah = వేడెక్కిన రాయి). రాజైన సౌలు ఉపపత్నులలో నొకతె. సౌలు చనిపోయినపిమ్మట అతని సేనాధిపతియగు అబ్నేరు

మొదటి అధ్యాయమందు ఎలీమెలెకును ఆయన కుమారులను గుఱించియు నయోమిని ఆమె కోడండ్రను గుఱించియు కలదు. తరువాతి రెండు అధ్యాయములలో బోయజు, రూతు, నయోమినిగూర్చి కలదు. ఆఖరు అధ్యాయములో బంధుత్వము, వివాహము, సంతానమును గుఱించి కలదు. H.

**రూపాంతరము (Transfiguration).** పేతురు యేసుదేవుని కుమారుఁడని ఫిలిప్పుదైన కైసరయ ప్రాంతములో నొప్పుకొన్నమీఁదట ఆయన పేతురు యాకోబు యోహాను అను ముగ్గురిని కొండమీఁదికి ఏకాంతముగా వెంటఁ బెట్టుకొని వెళ్లి అచ్చట కాంతితోఁ గూడిన మాఱు రూపము నొందెను. ఆ చరిత్ర మ $17^{1-13}$ మా $9^{2-13}$ లూ $9^{28-36}$ లందున్నది. II పేతు $1^{16-18}$ నందు గాక మఱి యితర సూచనలు బైబిలునందు లేవు. ఆదికాలమునం దీ రూపాంతరము ఒలీవకొండమీఁద జరిగినట్లు తలంచిరి గాని ఆ యూహ చరిత్రసంబంధమున కెంత మాత్రమును సరిపడదు. జెరోము (*Jerome*) అనువాఁ డిది తాబోరు కొండమీఁద జరిగెననెను గాని అదియు చరిత్రకు చక్కఁగా పొసగుట లేదు. హెర్మోను కొండ శిఖరములలో నొక దానిమీఁద జరిగెను. ఆ శిఖరమేదియో తెలియకున్నది. ఆయన ప్రార్థించుచుండఁగా ఆయన వస్త్రములును ముఖవర్చస్సును సూర్యునికన్న కాంతిగల వయ్యెను. దేవుని సన్నిధానమునకు గుఱుతుగా నున్న మేఘము వారిని క్రమ్మెను. మోషే ఏలీయా యనువారు కనఁబడి ఆయన మరణమునుగూర్చి సంభాషించిరి. ఈయన నా ప్రియ కుమారుఁడు ఈయనమాట వినుఁడను స్వరము ఆ మేఘములో నుండి వినఁబడెను. అది రాత్రివేళ గాన శిష్యులు నిద్రమత్తులో నుండిరి. పేతురు మేలుకొని తామక్కడనే కాపురముండునట్లు ఆయనకొఱ కొకటి మోషే కొకటి ఏలీయా కొకటి మూఁడు పర్ణశాలలు కట్టుదుమని పలికెను. తాను మృతులలోనుండి లేచువఱకు దానినిగూర్చి యెవరికిని చెప్పకూడదని ఆయన వారికి ఆజ్ఞాపించెను.

ఈ రూపాంతరమాయనను ఆయన పొందనైయుండిన శ్రమలకొఱకు సిద్ధపఱచి బలపఱచెను. ఇప్పటినుండి ఆయన చర్యయందు శ్రమలు ముఖ్య విషయముగా నున్నది. ఆయన శిష్యులు ఆయన శ్రమలనుబట్టి ఆటంకపఱచఁబడకుండున ట్లిది జరిగెను.

రూపాంతరమొందుట యను పదమే రోమా $12^{2}$ నందుండి మనము పొందవలసిన ఆత్మీయ మార్పును సూచించును. దానిని II కొరి $3^{18}$ లో పోలికగా మార్చబడుదుము అని తెనిఁగించిరి. దానిని ఆయన పోలికగా రూపాంతరము నొందుదుమని తెనిఁగించిన యెడల పై నున్న వాక్యములకును దీనికినిగల సంబంధము తేటపడును.

**రూఫు (Rufus = ఎఱ్ఱని).**

1. యేసుయొక్క సిలువను మోసిన కురేనీయుఁడైన సీమోనుయొక్క కుమారుఁడు. మార్కు అతని పేరు వ్రాసినందున ఆ కాలమందుండిన వారందఱును బాగుగా నెఱిఁగియున్నవాఁడని తెలిసికొనవచ్చును (మా $15^{21}$).

2. పౌలు తన సలాములు పంపిన రోమాలోని యొకానొక క్రైస్తవుఁడు (రోమా $16^{13}$). కురేనీయుఁడగు సీమోనుయొక్క కుటుంబము రోమాకు వెళ్లి యుండవచ్చుననియు, మార్కు సువార్తయం దుదాహరింపఁబడినవాఁడును ఇతఁడును ఒక్కరేయై యుండవచ్చుననియు కొందఱి తలంపు. E.

**రూబేను (Reuben = కుమారుని చూడుము).**

1. యాకోబు జ్యేష్ఠపుత్రుఁడు. తల్లి లాబాను కుమార్తెయగు లేయా (ఆది $29^{31,32}$ $35^{23}$ $46^{8}$ I దిన $2^{1}$ $5^{1}$). ఇతఁడు ఘోర పాపమునకు లోనాయెను (ఆది $35^{22}$). అతని తమ్ముళ్లు యోసేపును చంప యత్నించినప్పుడు, వానిని రక్షింపఁగోరి, ఒక లోతైన గోతిలో వేయుడని సలహా నిచ్చెను. తరువాత తండ్రి యొద్దకు వానిని పంపవలెనని యుద్దేశించెను. వారు యోసేపును మిద్యానీయుల కమ్మినప్పుడు అతఁడు దగ్గరలేఁడు. గోయి వట్టిదిగా నుండుట కనుగొని చాల విచారపడెను ($37^{21-30}$). 20 సంవత్సరములకుఁ బిదప వారు ఐగుప్తులో చిక్కులో పడఁగా రూబేను వెంటనే యోసేపు మరణముతో తన కేమియు జోక్యములేదని

వారికి జ్ఞాపకము చేసెను (42[22-24]). బెన్యామీనును ఐగుప్తులోనికి పంపుటకు యాకోబు విముఖత జూపఁగా రూబేను, తాను బెన్యామీనును సురక్షితముగాఁ దెచ్చునంత దనుక తన కుమారులలో నిద్దరిని జామీనుగా నుంచుకొనుమనెను (42[37]). రూబేనుకు అంతా నలుగురు కుమారులు (46[8,9] నిర్గ 6[14] I దిన 5[3]). యాకోబు తన మరణశయ్యమీఁద నుండఁగా రూబేను నీళ్లవలె చంచలుఁ డయ్యెననియు, వృద్ధిలోకి రాఁడని తెలిపెను. అతని ఏహ్యాప్రవర్తననుబట్టి, అతని జ్యేష్ఠత్వపు హక్కుకు దూరస్థుఁ డాయెను (ఆది 49[3,4]).

2. రూబేను సంతానపువారిచే నేర్పడిన గోత్రమును, వారి స్వాస్థ్యభాగమును, రూబేను నలుగురు కుమారులు నాలుగు గొప్ప వంశకర్తలైరి (సంఖ్యా 26[5-11]). అరణ్య ప్రయాణారంభమున ఈ గోత్రమునకు ప్రధాని ఏలీసూరు (1[5] 2[10] 7[30-35] 10[18]). అప్పుడీ గోత్రములో 46,500 సైనికులుండిరి. 38 సం॥ లకు తరువాత వేసిన జనాభాలో 43,730 మంది మాత్ర ముండిరి (26[7]). రూబేను షిమ్యోను గాదుగోత్రముల వారి కందరికి రూబేనీయుల ప్రధాని నాయకుఁడు, ఇతని క్రింద 1,51,450 సైనికు లుండి (2[10,16]). జక్కూరు కుమారుడగు షమ్మూయ 12 మంది వేగులవారిలో ఈ గోత్ర ప్రతినిధి (13[4]). మోషే అహరోనులమీద తిరుగుబాటు చేసిన కోరహుతో చేరినవారిలో దాతాను అబీరాము ఓనులు రూబేనీయులు (16[1-50] 26[9] ద్వితీ 11[6]). కోరహు 4 చూ॥ సీహోను ఓగు అను రాజులతో యుద్ధములయిన తరువాత, తమకు మందలు అమితముగా నున్నందున రూబేను, గాదు, మనష్షే అర్ధగోత్రములవారు తమకు మిగుల అనుకూలముగా నున్న యొర్దాను తూర్పు ప్రాంతము తమ కిమ్మని మనవిజేసికొనిరి (పటము IX). వారు తమ సహోదరులు కనాను జయించువరకు వారిలో యుద్ధశాలురైనవారు వచ్చి సహాయపడు షరతుపై మోషేవారి కుటుంబము లక్కడ నివాసము లేర్పరచుకొనవచ్చునని సెలవిచ్చెను (సంఖ్యా 32[1-42] యెహో 18[7]). వా రాలాగుచేసి యెహోషువకు అన్ని యుద్ధములలో తోడ్పడి అవి ముగిసిన పిదప గౌరవ మర్యాదలతో సాగనంపఁబడిరి. వారు యొర్దాను కివతల జ్ఞాపకార్థముగ నిర్మించిన బలిపీఠము అనుమానాస్పదమై వారిని అంతర్యుద్ధమునకు నడుపునదేగాని అది జరుగలేదు (22[1-34]). సీసెరాతో జరిగిన యుద్ధమున రూబేనీయులు తోడ్పడనందున దెబోరా తన పాటలో వారిని మందలించెను (న్యాయా 5[15,16]). వీరు హగ్రీయులతో పోరాడి వారిదేశమును, పురములను స్వాధీనపరచుకొని చెఱకాలమువరకు వానిలో నివసించిరి (I దిన 5[18-22]). యెహెజ్కేలు ఉదాహరించిన కనానుదేశములో రూబేనీయులకు ఒక ప్రదేశ మేర్పాటాయెను (యెహె 48[6,7]). యెరూషలేము ద్వారములలో నొకటి వీరిపేరిట నున్నది (48[31]). ప్రకటన గ్రంథములోని ముద్ర నొందిన లక్ష నలభైనాలుగు వేల రూబేనీయులు 12,000 మంది గలరు (ప్రక 7[5]). వీరి గోత్ర ప్రదేశమునకు తూర్పున అమ్మోనీయుల దేశమును, దక్షిణమున అర్నోను నదియు (సంఖ్యా 21[24]), పడమట మృతసముద్రము యొర్దాను నదియు (యెహో 13[23]), ఉత్తరమున జెత్నిమ్రాకు దక్షిణముగా యొర్దాను నుండి హెష్బోనుకు వెళ్లుమార్గమును సరిహద్దులుగా నుండెను (యెహో 13[17,26] 21[37] సంఖ్యా 32[36] యెహో 13[27]). అమోరీయుల రాజైన సీహోను నుండి జయించుకొన్న పట్టణములనేకములు గలవు (13[15-23]). వీరి దేశము శత్రువారికి సులభముగా లోనాయెను.

**రూమా** (Rumah = ఉన్నత స్థలము). రాజగు యెహోయాకీము తల్లిపుట్టిన యూరు (II రాజు 23[36]). దీనిని అబూమా (*Abumah*) యని చదువవలెనని యోసీఫను తలంపు (పురా 10.5.2). ఇది **అరూమా** యను పదమునకు పొరపాటుగా వ్రాసిరని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల అది షెకెమునకు దగ్గరగా నుండునదై యున్నది (న్యాయా 9[41]). ప్రస్తుతము నజరేతుకు సమీపముగా నుండు రూమె (*Rumeh*) యనున దిదే యని మఱి కొందఱి యభిప్రాయము.



**రెండు** సంఖ్య II 2 చూ॥

**రెండుగోడల మధ్యనున్న ద్వారము** యెరూషలేము B IV 2 (2); V 5 2 (10) చూ॥

**రెండు స్తంభములు** దేవాలయము I (7) (15) (*d*) చూ॥

**రెగెము** (Regem = మిత్రుడు). కాలేబు సంతతివారిలో నొకడు. ఇతడొక కుటుంబమునకు పెద్దయయ్యెను (I దిన $2^{47}$).

**రెగెమ్మెలెకు** (Regem-Melech = రాజు స్నేహితుడు). ఉపవాసమును గూర్చి ప్రవక్తయగు జెకర్యా నడుగుటకు బేతేలు నుండి పంపబడినవారిలో నొకడు (జెక $7^{2}$).

**రెజీను** (Rezin).

1. దమస్కుయొక్క స్వతంత్ర రాజులలో చివరివాడు (క్రీ॥ పూ॥ 740-732). 738 వ సం॥ లో ఇతడు అష్షూరు చక్రవర్తికి కప్పమును చెల్లించినట్లు అష్షూరువారి రాతిశాసనములవలన దెలియుచుగాని తదనంతరము ఇశ్రాయేలీయుల రాజైన పెకహుతో సంధిచేసికొని అష్షూరువారికి విరోధముగా తిరుగుబాటు చేసెను. యూదా రాజగు ఆహాజుకూడ తమతో సంధిచేసికొని అష్షూరువారికి విరోధముగా తిరుగబడవలెనని రెజీను చెప్పెను గాని ఆహాజు ఆలాగు చేయనందున రెజీను పెకహు అనువారు ఆహాజుమీద యుద్ధముచేసి అతనిని రాజ్యమునుండి తొలగించి తమపక్షముగా నుండిన యొకనిని యూదాదేశమునకు రాజునుగా నియమింపవలెనని యుద్దేశించిరి (యెష $7^{1-9}$). II రాజు $16^{6}$ చూడగా అతడు ఎఱ్ఱసముద్రపు తూర్పుపాయకు ఉత్తరముగా నుండిన ఏలతును పట్టుకొనియున్నట్లుగా కనబడునుగాని, కొంద ఱది ఎదోము రాజు జేసిన దానిని సూచించుననుకొందురు (II దిన $28^{17}$). రెజీను పెకహు అనువారలు యూదామీద యుద్ధముచేయ బోగా ఆహాజు అష్షూరువారి సహాయమును వేడుకొనెను. పెకహు స్వంతవారిలో కొందఱు కుట్రచేసి యతనిని జంపిరి. అష్షూరు చక్రవర్తియగు తిగ్లత్పిలేసెరు దమస్కును ముట్టడివేసి సంవత్సరమునకు పిమ్మట దానిని పట్టుకొని రెజీనును చంపించెను (II రాజు $16^{9}$). అది మొదలు దమస్కునకు స్వాతంత్ర్య ముండ లేదు.

2. యూదావారు బాబెలు చెఱనుండి తిరిగి వచ్చుచుండగా నెతీనీయులలో నుండిన యొక తెగవారు (ఎజ్రా $2^{48}$ నెహె $7^{50}$ నెతీనీయులు చూ॥).

**రెజెపు** (Rezeph). సన్హెరీబు రాయబారి యగు రబ్షాకే చెప్పినట్లు అష్షూరు చక్రవర్తిచే జయింపబడిన గొప్ప కోటలలో నొకటి (II రాజు $19^{12}$ = యెష $37^{12}$). యుఫ్రాతునదికి పడమట దమస్కుదిక్కున పూర్వము రాసప్ప (*Rasappa*) యను గొప్ప పట్టణముండినట్లు రాతిశాసనముల వలన దెలియుచున్నది. అది యీ పట్టణమే యని అందఱి యభిప్రాయమై యున్నది (పటము VIII, C 1).

**రెజోను** (Rezon = ప్రాముఖ్యత). దమస్కుకు దక్షిణముగా నుండు సోబారాజైన హదదెజరుయొక్క సైన్యాధిపతి (I రాజు $11^{23-25}$). దావీదు హదదెజరును జయించి అతని దేశమును స్వాధీనపఱచుకొనగా (II సమూ $8^{3-8}$) రెజోను కొంతమందితో పారిపోయి, దమస్కును పట్టుకొని అక్కడ రాజై ఒక నూతన వంశము నారంభించెను. ఇతని సంతతివారు క్రీ॥ పూ॥ దాదాపు 950-732 వఱకు రాజ్యమేలిరి. వీరు ఇశ్రాయేలీయులకు గర్వ శత్రువులు. బెన్హదదు, హజాయేలు, రెజీను అనువారలీ వంశమునందు ముఖ్యులు.

**రెఫహు** (Rephah = ధనము). ఎఫ్రాయిమీయుడగు యెహోషువ పూర్వీకులలో నొకడు (I దిన $7^{25}$).

**రెప్పపాటు** కాలమానము I చూ॥

**రెఫాయా** (Rephaiah, Raphah = యెహోవా స్వస్థపఱచెను.)

1. దావీదు సంతతివారిలో నొకడు (I దిన $3^{21}$).

2. షిమ్యోను ప్రధానులలో నొకడు (I దిన $4^{42}$).

3. ఇశ్శాఖారు సంతతివారిలో నొకడు (I దిన $7^{2}$).

4. సౌలు కుటుంబికులలో నొకఁడు (I దిన 9[43]). రాఫా 2 చూ॥

5. యెరూషలేము ప్రాకారములు కట్టుటకు సహాయము జేసినవారిలో నొకఁడు (నెహె 3[9]).

రెఫాయీయాములోయ, రెఫాయీయులు (Rephaim = రాక్షసులు).

1. దీర్ఘదేహులగు నొక జనాంగము. అబ్రాహాము కనానుకు రాకపూర్వము యొర్దానుకు తూర్పు పడమరల నుండిరి. వారు అష్తారోతు కర్నాయిములో నివసించిరి (ఆది 14[5]). హిత్తీయులు పెరిజ్జీయులను వారివలె కనానులో పూర్వమందుండిన జనములలో నొకరైనట్లున్నది (ఆది 15[20] యెహో 17[15]) వారికి ఏమీయులు, జంజుమ్మీయులు అను పేరు లుండెను (ద్వితీ 2[11,20]). బాషానురాజగు ఓగు ఈ వంశస్థులలో చివరివాఁడు (3[11] యెహో 12[4] 13[12]). అర్గోబు వీరి నివాసస్థానము (ద్వితీ 3[13]). ఈ జనాంగము నశించిన పిమ్మట వీరి సంతానీకులు ఫిలిష్తీయులలో నున్నట్లు గానవచ్చుచున్న (II సమూ 21[16-21]). గొల్యాతు వీరి వంశస్థుఁడే.

2. యెరూషలేమునకు సమీపమందుండు లోయలలో నొకటి (II సమూ 5[18,22] 23[13] I దిన 11[15] 14[9] యెష 17[5]). ఇది యెరూషలేము నైర్ఋతి దిక్కునుండి బేత్లెహేమువఱకు వ్యాపించును. రెఫాయీయు లిచ్చట నివసించుటచే దాని కీ పేరు వచ్చిన దనుకొనవచ్చును. లేదా, రెఫాయీయు లంతరించిపోయినను, ఈ లోయయందు బలాఢ్యులు నివసించుటచే దానికీ పేరు వచ్చి యుండును. దావీదు ఈ లోయలో ఫిలిష్తీయులను రెండుమాఱు లోడించెను. (II సమూ 5[18-22] 23[13] I దిన 11[15] 14[9] యెరూషలేము A I 3 చూ॥)

రెఫాయేలు (Raphael = దేవుఁడు స్వస్థపఱచును). కెరుబ్బాబెలు ఆలయ ద్వారపాలకులగు కుటుంబములలో నొక కుటుంబపు పేరు (I దిన 26[7]).

రెఫీదీము (Rephidim = విశాలమైన స్థలములు). ఎఱ్ఱసముద్రమునుండి సీనాయి వఱకుఁ జేసిన ప్రయాణములో ఇశ్రాయేలీయులు దిగిన యొక స్థలము (నిర్గ 17[1] 19[2] సంఖ్యా 33[12-15]). బండలో నుండి నీరువచ్చునట్లు ఇచ్చట మోషే చేసెను (నిర్గ 17[5,6]). యూదుల పారంపర్యములు ఈ నీటి ప్రవాహము సీనాయి వఱకు వారివెంట ప్రవహించెనని తెలుపుచున్నవి (I కొరి 10[4]). అమాలేకీయులపై యుద్ధమాడి యెహోషువ జయము నొందెను (నిర్గ 17[8-16]). దీని యునికి రూఢిగ తెలియకపోయినను అది సీనాయిపర్వతమునకు 24 మైళ్లు వాయవ్యముగా నున్న ఫైరాను (*Feiran*) అని యనేకుల అభిప్రాయము. అది క్రైస్తవులకాలమునం దిచ్చట అనేక గుళ్లుండినట్లు అచ్చట నున్న శిథిలముల వలనఁ దెలియుచున్నది. ఆ కాలమున ఇది యొక బిషపుయొక్క పీఠమనియు చరిత్రవలన కనఁబడుచున్నది (పటము VIII, B 3).

రెమల్యా (Remaliah = యెహోవా అలంకరించెను). ఇశ్రాయేలువారి రాజైన పెకహుయొక్క తండ్రి (II రాజు 15[25-32] 16[1,5] II దిన 28[6] యెష 7[1-9] 8[6]).

రెమెతు రామోతు 2 చూ॥

రెల్లు (Flag, Calamus). యొర్దాను నైలు మున్నగు నదుల తీరములయందు పెరుగు నొక జమ్ము విశేషము. దీనియం దనేక జాతులున్నవి. కొన్ని మిగుల యెత్తుగాఁ బెరుగును గాని అవి చాల సన్నమైనందున గాలికి బహు సులువుగ వంగును (మ 11[7]). అనేకములు బోలుగా నుండును కాడలుగలిగి ఏ మాత్రపు దెబ్బతగిలినను పుటుక్కున విఱుగును (యెష 42[3] మ 12[20]). కొన్ని గట్టిగా నుండును గాన నవి చేతికఱ్ఱలుగా వాడుకొందురు (యెహె 29[6] యెష 36[6]). కొన్నిఁటిని ఇప్పటికిని కొలకఱ్ఱలుగా వాడెదరు (యెహె 40[3-5]). అవి 6 అడుగుకంటె నెక్కువ పొడవుండును. J. C.

రెల్లుపడవలు ఓడలు 3 చూ॥

రేవాయా (Reaiah = యెహోవా చూచును).

1. యూదా సంతతివారిలో నొకఁడు. ఇతఁ డొక కుటుంబమునకు పెద్ద (I దిన 4[2]). ఇతనికి హారోయే యను మాఱు పేరు గలదు.

(3$^{33}$). ఈ రెండు పదము లొకటే యర్థ మిచ్చును.

2. రూబేను గోత్ర కుటుంబములలో నొక దాని పేరు (I దిన $5^{5}$).

3. నెతేనీయుల కుటుంబములలో నొకటి (ఎజ్రా $2^{47}$ నెహె $7^{50}$).

**రెషెపు (Resheph** = మంట). ఎఫ్రాయిము కుటుంబములలో నొక కుటుంబము (I దిన $7^{25}$).

**రెసెను (Resen).** అష్షూరు దేశపు పట్టణము. నీనెవెకు 20 మైళ్లు దక్షిణముగా నుండు నిమ్రోదుకు మధ్యనెచ్చటనో యున్నదిగాని దాని యునికి ఇంక నూటిగా తెలియదు. ఇది అష్షూరు కట్టించిన నాలుగు పట్టణములలో నొకటి (ఆది $10^{11,12}$).

**రెహబాము (Rehoboam** = ప్రజలు విస్తరింతురు). సొలొమోను కుమారుఁడు. అమ్మోనీయురాలగు నయమా అను నామె కనెను. జ్ఞానవంతుఁడగు తండ్రికడుపునఁ బుట్టినను మతి లేనివాఁడు. క్రీ॥ ము॥ దాదాపు 931 సం॥ న సొలొమోను మరణమైనపిదప పన్నెండుగోత్ర ప్రధానులు మధ్యపట్టణమగు షెకెములోఁ గూడుకొని రాజ్యమునకు వారసుఁడగు రెహబామును రాజుగా నభిషేకించనై యుండిరి. చాలకాలమునుండి ఆయా గోత్రములలో అణగి యుండిన విభేదము లచ్చట బయటపడెను (ఇశ్రాయేలు 3 చూ॥). రాజ్యవైభవముకై సొలొమోను విధించిన కఠినములగు పన్నులవలన నిదివఱకే ప్రజలు విసికి యుండిరి గాన, వాని విషయమై తమ యసంతుష్టిని నూతన రాజుకుఁ దెలుపుటకు తగిన తరుణము తటస్థించెను. ఇదివఱకు సొలొమోను పనులను చేయించుచు, అహీయా యను ప్రవక్తచే 10 గోత్రముల వారికి రాజగునని ప్రబోధింపఁబడిన యరొబాము ప్రజలపక్షమున మాటలాడెను. భరింప నశక్యములగు పన్నులను తీసివేయవలసినదని ప్రజలేకగ్రీవముగఁ గోరిరి. దానినిగుఱించి యాలోచించుటకు రెహబాము మూఁడుదినముల వ్యవధిఁగోరెను. తన తండ్రి కాలమునుండి యాలోచనకర్తలుగ నుండినవారితో విచారించినప్పుడు వారు ప్రజలమనవి నాలకించుట యుక్తమనియు, అందువలన ప్రజలతనిని వినయముగా సేవింతురనియు సలహా నిచ్చిరిగాని అతఁడు తన వయస్కులగువారి యాలోచన విని పెద్దలుచెప్పిన బుద్ధిమాటలను పెడచెవిని బెట్టినందున నితని తెలివితేట లెట్టివో గ్రహింపుకొన వచ్చును. తనతోటివా రిచ్చిన సలహా ప్రకారమతఁడు మూఁడవదినమున కూడిన ప్రజా సంఘము నెదుట "నా చిటికెనవ్రేలు నా తండ్రినడుము కన్న పెద్దది. నా తండ్రి మీమీఁద బరువైన కాడిపెట్టెను. సరే, నేను దాని నింక బరువుగాఁ జేసెదను. నా తండ్రి మిమ్మును చబుకులతో శిక్షించెను. సరే, నేను మిమ్మును కొరడాలతో శిక్షించెదన" చెప్పినమాటలు విన్న వెంటనే, 10 గోత్రములవారు వేఱుపడి తమతమ యిండ్లకువెళ్లి దావీదు ఇంటివారితోఁగల సంబంధమును త్రెంపుకొనిరి. అతఁడు పన్నువసూలు చేయు అధిపతియగు అదోరామును వారియొద్దకుఁ బంపఁగా వారతనిని రాళ్లతోఁ గొట్టి చంపిరి. తన నెక్కడ కొట్టి చంపెదరో యని రథము నెక్కి రెహబాము యెరూషలేమునకు పారిపోయెను (I రాజు $12^{1-20}$ II దిన $10^{1-19}$). యూదాగోత్రికులును బెన్యామీనీయులలో చాలమందియు షిమ్యోనీయులుమాత్ర మతనిని వెంబడించిరి. అతఁడు తన సైన్యమంతటిని కూర్చుకొని వెళ్లి తిరుగఁబడిన గోత్రములను జయించ యత్నించెను గాని షెమయా యను ప్రవక్త యతని వారించెను (I రాజు $12^{21-24}$ II దిన $11^{1-4}$). అతఁడప్పటికి యూదా బెన్యామీనులలోని కొన్ని పట్టణములకు ప్రాకారములు కట్టించి, భటులనక్కడ కాపుంచి వాటిని బలపఱచెను (II దిన $11^{5-12}$). యరొబాము బేతేలులోను దానులోను బంగారుదూడల నుంచుటవలన యాజకులును లేవీయులును ఆ ప్రాంతములలో నుండి లేచివచ్చినందున రెహబాము రాజ్యమింకను బలపడెను గాని, మూఁడు సంవత్సరములలోనే అతఁడును విగ్రహారాధనకు పాల్పడెను (I రాజు $14^{21-24}$ II దిన $11^{13-17}$ $12^{1}$). ఇతనియేలుబడి అయిదవ సంవత్సరమందు ఐగుప్తు రాజగు షీషకు దండెత్తివచ్చి ప్రాకారపట్టణములలోఁ గొన్నిఁటిని జయించి చివరకు యెరూష

లేమును సహా పట్టుకొని దేవాలయమును రాజ నగరును దోచుకొనెను (I రాజు $14^{25-28}$ II దిన $12^{2-12}$ ఫరో చూ॥). రెహబాముకు 18 మంది భార్యలును 60 మంది ఉంపుడు గత్తెలు నుండిరి. వారివలన నతనికి 28 మంది కుమారులును 60 మంది కుమార్తెలును కలిగిరి (II దిన $12^{21}$). రాజ్యమిట్లు చీలిపోయినప్పుడు తన తండ్రి బాల్యదశయందుండెనని అబీయా చెప్పెను ($13^{7}$), గాని అప్పటికి రెహబాము 41 యేండ్లవాఁడు. అతఁడు 17 సం॥ లేలి క్రీ॥ పూ॥ 915 సం॥ లో మృతినొందెను. అతని కుమారుఁడైన అబీయా అతని తరువాత యూదావారినేలెను (I రాజు $14^{21,31}$ II దిన $12^{13,16}$).

**రెహబ్యా** (Rehabiah = యెహోవా వృద్ధి నొందించెను). లేవీయులలో నొక కుటుంబపు పేరు. మోషే మనుమఁడగు రెహబ్యా దీనిపెద్ద (I దిన $23^{17}$ $24^{21}$ $26^{25}$).

**రెహూము** (Rehum = జాలి).

1. జెరుబ్బాబెలుతోకూడ తిరిగివచ్చిన 12 మంది ప్రధానులలో నొకఁడు (ఎజ్రా $2^{2}$). నెహె $7^{6}$ నం దితని పేరు పొరపాటున **నెహూము** అని మూలభాషలో వ్రాసిరి.

2. సిరియలోనుండిన పారసీకుల ఉద్యోగి. ఇతఁడు మంత్రి యను బిరుదువహించెను. యూదులు దేవాలయమును కట్టుకొనుచుండఁగా వారి నడ్డగించనై పారసీక చక్రవర్తికి ఉత్తరమును వ్రాసిన వారిలో నితఁ డొకఁడు (ఎజ్రా $4^{8,9,17,23}$).

3. యెరూషలేము ప్రాకారములను కట్టుటకు నెహెమ్యాకు సహాయముచేసిన యొక లేవీయుఁడు (నెహె $3^{17}$).

4. నెహెమ్యాకాలములో ఇశ్రాయేలీయులు చేసిన నిబంధనను ముద్రించినవారిలో నొకఁడు (నెహె $10^{25}$).

5. జెరుబ్బాబెలులోకూడ తిరిగి చెఱనుండి వచ్చిన యొక యాజకుఁడు (నెహె $12^{3-7}$). ఇతఁ డొక కుటుంబమునకు పెద్దయయ్యెను. నెహె $12^{15}$ లో దీనికి **హారీము** అను పేరున్నది. ఈ పదములో మొదటి రెండక్షరములను మార్చుటచే నిట్లు సంభవించియుండును (హారీము 2 చూ॥).

**రెహోబు** (Rehob = విశాలమగు వీధి).

1. యొర్దాను లోయలోని యుత్తర ప్రాంతములలో నుండు ఒక పట్టణము (సంఖ్యా $13^{21}$ II సమూ $10^{8}$). ఇదియు బేత్రెహోబును ఒకటేయై యుండవచ్చును (బేత్రెహోబు చూ॥).

2. ఆషేరుగోత్ర మందలి ఒకటి లేక రెండు పట్టణములు (యెహో $19^{28}$ $21^{31}$ I దిన $6^{75}$ యెహో $19^{30}$ న్యాయా $1^{31}$). దీని యునికి తెలియదు.

3. సోబా రాజైన హదదెజెరు తండ్రి (II సమూ $8^{3,12}$).

4. నెహెమ్యాకాలమున నిబంధనను ముద్రించిన వారిలో నొకఁడు (నెహె $10^{11}$).

## రే

**రేకా** (Recah). యూదా ప్రాంతములలో నుండు నొక పట్టణము (I దిన $4^{12}$). దీని యునికి తెలియదు.

**రేకాబు, రేకాబీయులు** (Rechab = సవారిచేయువాఁడు, Rechabites).

1. సౌలు కుమారుఁడగు ఇష్బోషెతును చంపిన యిద్దరిలో నొకఁడు. దావీదితనికి మరణశిక్ష విధించెను (II సమూ $4^{2,3,12}$).

2. కేనీయుల సంబంధులగు హామాతుకు పుట్టిన వారిలో నొకఁడు (I దిన $2^{55}$). ఇతఁడు యెహోనాదాబుకు (II రాజు $10^{15}$), ప్రాకారములు కట్టుటలో నెహెమ్యాకు సహాయముచేసిన మల్కీయాకు (నెహె $3^{14}$) పూర్వికుఁడు. తన సంతతివారైన రేకాబీయుల కితఁడు మద్యపానమును, కట్టిన యిండ్లలో నివసించుట యను సౌఖ్యములు త్యజింపవలెనని నియమించి మిగుల కీర్తనీయుఁడయ్యెను (యిర్మీ $35^{6}$). ఈ నియమములను మొదట యెహోనాదాబు యేర్పఱచినట్లు $35^{6-9}$ వలనఁ దెలియును. II రాజు $10^{15}$ నందు యెహోనాదాబు యెహోవా సేవ చేయుటయందు ఆత్యాశగలవాఁడై యున్నట్లు

కనఁబడును. తన సంతతివారగు రేకాబీయులు ఈ లోకభోగములచే చెడిపోకుండునట్లు అన్ని విషయములలోను తమ పితరులవలె సరళస్థితియందుండవలెనని నియమించెను. రేకాబీయులు ఆ యేర్పాటులయందు నిష్ఠపరులగుట యిర్మీయా చూచి తమ పితరుల ధర్మములను బొత్తుగా నిర్లక్ష్య పెట్టిన యెరూషలేమువారిని ఖండించుటకు వీరిని దృష్టాంతముగా నెత్తెను. వీరు తమ పూర్వికుల నేర్పాటుల నెంతో శ్రద్ధగా లక్షించి యెహోవాయందు భక్తికలిగియున్నందున వారికి నిత్యమును సంతానముండునని వారికి వాగ్దానము ననుగ్రహించెను ($35^{1-12}$). మెసపొతేమియలో అరబ్బీయులలో నేటివఱకు వారి సంతతివారమని చెప్పుకొనువారు కలరు.

రేకెము (Rekem, Rakem = నానా విధములగు).

1. మోషే చంపించిన మిద్యాను రాజులలో నొకఁడు (సంఖ్యా $31^{8}$ యెహో $13^{21}$).

2. కాలేబు సంతతివారిలో నొకఁడు (I దిన $2^{43}$).

3. బెన్యామీను పట్టణములలో నొకటి (యెహో $18^{27}$). దాని యునికి తెలియదు.

రేగియు (Rhegium). ఇటలీదేశమునకు దక్షిణపుకొనయందు సిసిలీదీవి కెదురుగా నున్న పట్టణము. అది సిసిలీని ఇటలీనుండి వేఱుపఱచు జలసంధి దగ్గరనున్నది. ఆ జలసంధి గ్రీకువారి చరిత్రలో గొప్ప ఆపదలకు సూచనగా నుండెను. దానిగుండ ఓడలను నడిపించుట కష్టతరము. ఈ వైపుకుపోయినను ఆ వైపుకుపోయినను ఓడకు నష్టము కలుగును. అట్టి స్థలమునకు సమీపముగా నుండు రేగియుకు చాల ఓడలు వచ్చెననుట కెట్టి సందేహమునులేదు. పౌలు మెలితే నుండి రోమాకుఁ బోవునప్పుడు అతఁ డెక్కిన యోడ ఇచ్చట ఒకదినమువఱ కాగెను (కార్య $28^{13}$). అది నేటివఱకుండి రెగ్గియో (*Reggio*) అను పేరిట పిలువఁబడు రేవుపట్టణమై యున్నది (పటము V, B 3).

రేబ (Reba = నాల్గవవంతు?). మోషే చంపించిన ఐదుగురు మిద్యానీయుల రాజులలో నొకఁడు (సంఖ్యా $31^{8}$ యెహో $13^{21}$).

రేయీ (Rei = స్నేహముగల). అదోనీయా దావీదు రాజ్యము నపహరించుటకు యత్నముచేయఁగా సొలొమోను పక్షముగా నుండిన వారిలో నొకనిపేరు (I రాజు $1^{8}$). ఇది షిమీయొక్క బిరుదైనట్లు యోసీఫసు వ్రాయుచున్నాఁడు. దీనివలన షిమీ దావీదు మిత్రుఁడని యర్థమగుచున్నది.

రేవు (Ford). బైబిలునందు మూఁడు నదులకు సంబంధించిన రేవులనుగూర్చిన సూచనలున్నవి. 1. యబ్బోకు నదిరేవు (ఆది $32^{22}$). 2. అర్నోనునది రేవు (యెష $16^{2}$). 3. యొర్దాను రేవులు (యెహో $2^{7}$ న్యాయా $3^{28}$). పూర్వమందు వంతెనలు లేకపోవుటచే నదులు దాటుటకు ఇట్టి రేవులు చాల అవసరముగా నుండెను. యొర్దాను నదికి అనేక రేవులు గలవు (యొర్దాను 3 చూ॥).

రేవుపడవ ఓడలు 2 చూ॥

రేష్ (Resh = ר అను అక్షరము). హెబ్రీ యక్షరములలో ఇరువదవ యక్షరము. అక్షరమాలికగా రచింపఁబడిన 119 కీర్తనలోని యిరువదవ భాగమందలి ప్రతి పంక్తియు నీ యక్షరముతో నారంభమగునుగాన ఆ భాగమునకు రేష్ అను పేరు పెట్టిరి.

రేసా (Rhesa). జెరుబ్బాబెలు కుమారుఁడు. ఇతఁడు క్రీస్తు పూర్వీకులలో నొకఁడు (లూ $3^{27}$).

## రొ

రొంఫా (Remphan, Rephan). ఐగుప్తీయుల దేవతయైన సేటు దేవతయొక్క నామమై యుండును. సేటును శనిగ్రహమును రెండును ఒకటేయై యుండును. దీనిని రెఫాను అనియుఁ బిలుతురు. ఇదే చియ్యూ (*Chiun*) లేక సిక్కూత్ కూడ అయియుండును. శని దేవత బలులద్వార శాంతిపఱచఁబడవలసిన చెడ్డ దయ్యమని షేమువంశపు జనాంగములవారు దానినారాధించెడివారు. స్తెఫను తన ప్రసంగములో దీని పేర్కొనెను (కార్య $7^{43}$). B.

రొట్టె, అప్పము (Bread). ప్రస్తుతము భరతఖండమున నున్నట్లే పలెస్తీనులోను గోదుమలను

యవలను తిరగట విసరి పిండిచేసి దానితో రొట్టెలను చేసిరి. దానిని వెంటనే తినవలెనని యెడల పొంగనియ్యలేదు (ఆది $19^{3}$ I సమూ $28^{24}$). పొంగిన రొట్టెలను చేయుటయు వారి కప్పుడప్పుడు వాడుకగా నుండెను (మ $13^{33}$). సముఖపు రొట్టెలు ఎనిమిది రోజులైన పిమ్మట తినఁదగినవై యుండెను. ఆఁడువారు సాధారణముగా రొట్టెలను చేసిరి (ఆది $18^{6}$ I సమూ $8^{13}$ లేవీ $26^{26}$). పురుషులును చేసినట్లు సూచనలున్నవి (న్యాయా $6^{19}$). గొప్పవారి యిండ్లలో నా పనిని జూచుటకు ప్రత్యేకమైన నౌకరు లుండిరి (ఆది 42). రొట్టెలుచేసి అమ్ముటయు వాడుక (యిర్మీ $37^{21}$ హోషే $7^{4-6}$). రొట్టెలను పొయ్యిమీఁద కాల్చిరి. ఆ పొయ్యిలోనున్న బూడిదెను ఊడ్చివేసిన పిమ్మటను కాల్చిరి (I రాజు $19^{6}$). నేటివఱకు అరబ్బీయులు గుంట త్రవ్వి దానిలో నిప్పువేసి అది బాగుగా వేడెక్కినపిదప ఆ నిప్పులను తీసివేసి తమ రొట్టెల నందులో కాల్తురు. ఇట్లు పొయిలో వేయఁబడిన రొట్టెలుగాక పెనముమీఁదను రొట్టెలు కాల్చెడివారు (లేవీ $2^{4}$). గోదుమ రొట్టెలు సాధారణమైనవైనను పేదలు యవల రొట్టెలను తినిరి (యోహా $6^{9}$). దేవుని కర్పణముగా నర్పింపవలసిన రొట్టెలను గూర్చిన నియమములు లేవీ 2 లో నున్నది (అర్పణములు III చూ॥).

**రొదు** (Rhodes = గులాబిపొద). చిన్నాసియా నైరృతి దిక్కునకు 12 మైళ్లు దూరమందుండిన ద్వీపమై యున్నది. అది పొడవు 40 మైళ్లు, వెడల్పు 25 మైళ్లు. దాని ముఖ్యపట్టణము రొదు. ఐరోపాతో జేసిన వ్యాపార వాణిజ్యాదులు దీనిమీఁదుగాఁ బోవుటవలన అది పూర్వమందు మిగుల ప్రసిద్ధికెందినదై యుండెను. ప్రపంచమందలి ఏడు వింతలలో నొకటిగా పరిగణింపఁబడిన వాటిలో 105 అడుగుల ఎత్తుగల సూర్యవిగ్రహ మొకటి యిచ్చట నుండెను. రోమనులు ఈ దీవిని క్రీ॥ ము॥ 168 సం॥ లో జయించిన పిమ్మట దాని ప్రాముఖ్యత తగ్గిపోయెను. పౌలు తన మూఁడవ ప్రయాణము నుండి యెరూషలేమునకుఁ బోవునప్పుడు దీని మీఁదుగా వెళ్లెను (కార్య $21^{1}$ దెదాను, దోదానీము చూ॥ పటము V, H I, 4, 5).

**రొదె** (Rhoda = గులాబి పుష్పగుచ్ఛము). యెరూషలేము నందుండిన మార్కు తల్లియైన మరియ యింటిలోని పనికత్తె. పేతురు ఖైదులో నుంచి విడిపింపఁబడి తలుపుయొద్ద నిలిచి తట్టినప్పుడు ఈమె తలుపుయొద్దకు వచ్చెను. ఆమె క్రైస్తవురాలైనట్లు అగపడుచున్నది. పేతురు విడుదలయైనందు కీమెయు సంతోషించెను (కార్య $12^{13}$). E.

## రో

**రోగములు, చికిత్సలు** (Diseases and Medicines). బైబిలునం దుదాహరింపఁబడు రోగములును చికిత్సలును ఆసియాఖండమునకు సంబంధించినవి. ముఖ్యముగా అరబ్బీయులలో వ్యాపించి యున్న వాటివంటివి. హెబ్రీయులు బాబెలు ఐగుప్తుల యధీనమునం దుండుటవలన ఆయా దేశముల రోగములను తెలిసికొని వాటికి తగు చికిత్సల నెఱిఁగియుండిరి. భారతీయులు బాబెలు పారసీక ప్రాంతములయందలి వారితోడను, మహమ్మదీయులతోడను, సంబంధము గలిగియుండుటచే వైద్యవిషయములలో బైబిలునం దుదాహరింపఁబడిన రోగములనుగూర్చిన యభిప్రాయములకును, ఈ దేశస్థుల యభిప్రాయములకును చాల సంబంధమున్నది. పలెస్తీను దేశము చిన్నదైనను అందు వివిధ శీతోష్ణస్థితులు గలవు. ఉన్నతములగు కొండమీఁద చలి యెక్కువగ నుండుటచే అట్టి ప్రాంతములలో చలిదేశములకు సంబంధించిన జబ్బులున్నవి. యొర్దానులోయ అత్యుష్ణమండల ప్రాంతముగ నుండుటచే నచట ఉష్ణప్రదేశములలో తరుచుగఁ గానవచ్చు రోగములను కనుగొనవచ్చును.

మిగుల ప్రాచీన కాలమునందు వైద్యులుండినట్లు బైబిలునందు సూచనలున్నవి. తనను ఆదరించుటకు వచ్చినవారు పనికిమాలిన వైద్యులని యోబు చెప్పెను (యోబు $13^{4}$). గిలాదులోని వైద్యులు ప్రసిద్ధికెక్కిన వారని యిర్మీ $8^{22}$ లోని ప్రశ్నలవలనఁ దెలియును. ఆసా యెహోవాయొద్ద విచారణచేయక వైద్యులను పట్టుకొనెను (II దిన $16^{12}$). సువార్తలయందును వైద్యులను గూర్చిన సూచనలున్నవి (లూ $4^{23}$ మ $9^{12}$

మా 5[26]). లూకా వైద్యుఁడు (కొలొ 4[14]). బైబిలు కాలములో వైద్యులుండినను వైద్యమును గూర్చిన సూచనలు మాత్రము అచ్చటచ్చట సమయానుకూలముగా కనఁబడునుగాని, వైద్య శాస్త్ర సంగతులు వివరింపఁబడ నేలేదు. అం దుదాహరింపఁబడిన జబ్బు లీ దిగువ రీతిగా నున్నవి:—

I. అంగవైకల్యములు, దేహమందలి యితర కురూపములు.

యాజకులకుండవలసిన నిష్కళంకమైన దేహ మును గూర్చిన వివరమునందు ఇట్టి జబ్బుల ప్రశంస గలదు (లేవీ 21). ఈ దిగువ నుదాహ రింపఁబడిన లోపము లున్నవారు యాజకులుగా నుండరాదను నియమము గలదు.

**1. కంటిలో పువ్వు** (లేవీ 21[20]). ఇది స్ఫోటకమువలనఁగాని ఇతర జబ్బులవలనఁగాని కలిగిన వికారము.

**2. కళంకములు** (లేవీ 21[17]). ఇవి దేహములోని మచ్చలు, మొర్రిపెదవి, పుట్టు పాపలు మొదలగునవి.

**3. కుంటితనము** (లేవీ 21[18]). పుట్టుక లోనే యిది యుండవచ్చును. దెబ్బగాని పక్ష వాతముగాని దీనికి కారణములుగా వచ్చును. ఈ జబ్బు గలిగినవారిని అపొస్తలులును స్వస్థ పఱచిరి (కార్య 3[2] 14[8]).

**4. కాలైనను చేయియైనను విఱుగుట** (లేవీ 21[19]). ఈ యవయవములు విఱిగినపిమ్మట ఆ యెముకలు మఱల సరిగా కట్టుకొనకపోవుట వలన కలుగు కురూపము దీనిచే సూచింపఁబడును.

**5. గుజ్జుతనము** (లేవీ 21[20]). దేహము గాని, కాలు సేతులు మాత్రముగాని పెఱుగక గిటకపాటిపోయిన శరీర రుగ్మత నిది సూచించును.

**6. గూని** (లేవీ 21[20]). క్షయ సంబంధ మగు జబ్బువలనగాని, దేహమునకు తగిలిన గొప్ప దెబ్బవలనగాని నిది సంభవించును.

**7. బోడితనము** (లేవీ 21[5]). తలమీఁద నున్న చర్మమందున్న జబ్బువలనఁగాని భార తీయులవలె పెడతెగక తలక్షౌరము చేయించు కొనుటవలనఁగాని ఘోరమైన ఔషధములు తలకు పూసికొనుటవలనఁగాని యేర్పడవచ్చును.

**8. ముక్కిడితనము** (లేవీ 21[18]). దెబ్బ తగులుటవలనఁగాని కుష్ఠు మొదలగు జబ్బువలనఁ గాని ముక్కునందున్న యెముక వికారమైపోవుట వలన నిది సంభవించును.

**9. విపరీతమైన అవయవములు** (లేవీ 21[18]). ఆఱేసి వ్రేళ్లుగలవారు ఇట్టి జబ్బు గలవారు (II సమూ 21[21]). పక్షిగోళ్ల (దాని 4[33]) వంటి గోళ్లు గలవారును ఇట్టి జబ్బుగల వారనవచ్చును.

పై నుదాహరించిన 9 లోపములలో నేది యున్నను అతఁడు యాజక పనికి అర్హుఁడుకాఁడను నియమము గలదు. ఇట్టికొఱత లింకను గలవు:—

**10. అంగహీనము** ఏదైన నొక అవ యవము కోయుటచేతఁ గలిగిన కురూపము దీని వలన సూచింపఁబడును (మ 8[8]). అదోనీ బెజెకు అను రాజు 70 మంది బొటనవ్రేళ్లను నరికించెను. తరువాత అతనివికూడ నరకఁబడెను (న్యాయా 1[6,7]).

**11. ఊచచెయ్యి** (మ 12[10]). ఇతర అవ యవములుకూడ నిట్టివై యుండవచ్చును. ఇది నరములకు సంబంధించిన జబ్బు.

II. జబ్బులు, రోగములు, బలహీనతలు.

1. కండ్ల జబ్బులు. పలెస్తీనునందు కండ్ల జబ్బులు విశేషముగ నున్నవి. (1) **గుడ్డితనము** గుడ్డివారినిగూర్చిన సూచన లనేకము లున్నవి (లేవీ 19[14] ద్వితీ 27[18] మ 12[22] మా 10[46] యోహా 9[1] మొ॥). పుట్టుగుడ్డివారినిగూర్చి యొక్కచోట నుదాహరింపఁబడెను (యోహా 9[1]). మనుష్యుల కండ్లను తీయుట మిగుల క్రూరమైన శిక్షలలో నొకటి (II రాజు 25[7]). వృద్ధాప్యము చేతను ఇది సంభవించెను. యాకోబీరీతిగా చూడఁజాలక పోయెను (ఆది 48[10]) గాని ఆ కాలమున అద్దములుండిన పక్షమున చూడఁగలి గెడి వాఁడేమో. (2) **నేత్రక్షీణత** యను నది దేవుని ప్రజలనఁబడిన ఇశ్రాయేలీయులు ధర్మశాస్త్రమున కవిధేయులగుటచే కలుగఁబోవు జబ్బులలో నొకటి (ద్వితీ 28[65]). ఇది ఫలాని

 రోగములు

జబ్బు అని చెప్పఁజాలము గాని దేహబలహీనతచే కలుగు కండ్ల జబ్బు అని తోచును. (3) మంద దృష్టి. త్రాగుబోతులకు కలుగు జబ్బయి యున్నది (సామె $23^{29}$). తత్కాలమునకైన శిక్షగా బరియేసు గుడ్డివాఁడాయెను (కార్య $13^{11}$). (4) లేయాకున్న జబ్బుకండ్లు కండ్ల కలక కావచ్చును (ఆది $29^{17}$). క్రీస్తును చూచుటవలన సౌలు గుడ్డివాఁడాయెను (కార్య $9^{8}$). అతడు బాగుపడినప్పుడు అతని కండ్ల నుండి పొరలవంటివి రాలెను (కార్య $9^{18}$).

2. చెవికి సంబంధించిన జబ్బులు. వీటిలో చెవుడు తప్ప యితరమైన జబ్బులేవియు బైబిలునం దుదాహరింపఁబడినటులఁ దోఁచదు (క్రింద 3 చూ॥) క్రీస్తు చెవిటివారిని బాగుజేసెను (మ $11^{5}$ మా $7^{32}$). దేవుని వాక్యమును విన నొల్లనివారు చెవిటివారని అలంకార రీతిగా చెప్పఁబడును (యెష $29^{18}$ $42^{19}$). అట్లే విన నొల్లనివారు తమ చెవులను మూసికొన్నట్లుగా నున్నది (జెక $7^{11}$). కుదురుబాటు కాలములో చెవిటివారి చెవులు విప్పఁబడును (యెష $35^{5}$) అను దానినికూడ ఆత్మీయార్థముగా గ్రహించు కొనవలెను.

3. గొంతుక, నాలుకలకు తగులు జబ్బులు. (1) మూగవారిని గూర్చిన సూచనలు క్రొత్త నిబంధనయందు పెక్కులు గలవు (మా $7^{32-35}$ $9^{25}$ లూ $1^{20}$ మొ॥). చెవిటివారికి మూఁగతన మును రావచ్చును (పైన 2 చూ॥). మూఁగతనము ప్రత్యేకమైన జబ్బుగా నెంచఁబడును. జెకర్యా కొంతకాలమువఱకు మూఁగవాఁడుగా నుండినను చెవిటివాఁడు కాలేదు (లూ $1^{20}$). కుదురుబాటు కాలమున మూఁగవారు పాడెదరని ప్రవచింపఁ బడెను (యెష $35^{5,6}$). (2) నత్తివారి నాలు కకు జబ్బు తగిలినందున నత్తి యేర్పడెనని యెష $32^{4}$ వలన స్ఫురించుచున్నది గాని ఆ జబ్బు నాలుకదిగాక నరములకు సంబంధించినదని తెలియు చున్నది. యెష $28^{11}$ నందు నత్తివారి పెద వులు అను పదమున్నది. మోటువారు అన్ని స్వరముల నుచ్చరింపఁజాలరు. వారికి ఉచ్చా రణలు అభ్యాసమువలన పట్టుపడును. అవి వారికి రాకపోవుట జబ్బువలనకాదు. న్యాయా $12^{6}$ నందు షిబ్బోలెతు అనలేకపోయినవారి లోప మిట్టిదే. (3) గొంతుక ఎండిపోవుట కీర్త $69^{3}$ నందు గొప్ప బాధకు సూచనగా నున్నది. విశేష దాహబాధచేఁగాని, ఎక్కువగా మూలుగు టచేఁగాని గొంతుకు కలుగుబాధయై యున్నది.

4. పాదములకు సంబంధమగు జబ్బులు. రాజైన ఆసా వృద్ధాప్యమున నతనికి పాదములలో జబ్బుపుట్టి బహు బాధపడెను (II దిన $16^{12}$). ఇది కొరుకుడుపుండుగాని, ఏనుగుకాలు రోగము గాని అయ్యుండును.

5. చర్మవ్యాధులు. ఈ వ్యాధులను గూర్చిన విశేషసూచనలు బైబిలునందున్నవి. వీటియందు కొన్ని రక్తసంబంధమైనవైనను అవి చర్మమందు కనఁబడుటచే నిచ్చటనే ఉదాహరింతుము.

(1) కుష్ఠు. లేవీ 13 లో కుష్ఠునుగూర్చిన వివరమునందు, దీనినిగూర్చిమాత్రమేగాక, చర్మము నందు పుట్టెడి పొడలనుగూర్చియు నున్నది. అట్టి జబ్బులున్నవారందఱును అపవిత్రులుగా నెంచఁబడిరి. బోదకాలు రోగమును ఇందు జేరును. అసలు కుష్ఠుకాకున్నను బొల్లి దేహ మంతయు పాకినయెడల, ఆ జబ్బున్నవారు పుట్టుపాపవలె నుందురు. అట్టివారు పవిత్రులని తీర్మానించిరి (లేవీ $13^{13}$). లేవీ 13 లో నున్నట్లు మచ్చలుండినయెడల వాటినికూడ కుష్ఠుగానే యెంచిరి. అట్టివారందఱు అపవిత్రులై, ఇత రులకు వేఱుగా నుండవలసిన ఏర్పాటున్నది. గొప్పవారు సహా ఈ రోగపీడితులుగా నుండిరి (II రాజు 5, నయమాను చూ॥ II దిన $26^{21}$ ఉజ్జీయా చూ॥). ఇట్టి కుష్ఠరోగులను క్రీస్తు స్వస్థపఱచెను (మా $1^{40-45}$ లూ $17^{11-19}$). వారు బాగైనపిమ్మట పవిత్రులు కావలసియుండిరి (పవిత్రపఱచుట 4 చూ॥). లేవీ $13^{51,52}$ నందు కొరుకుడు కుష్ఠము అను మాటచే తర్జుమ చేసిన రోగము బట్టలను సహా తినివేసిన జబ్బయి నట్లున్నది. అది యొకవిధమగు పుండును సూచించెను గాని యెట్టి పుండో చెప్పుటకు వీలుగాదు. ద్వితీ $28^{27}$ లో నున్న కుష్ఠు ఒక విధమైన చెల్లి లేక నుసిమిరియై యున్నది. లేవీ $13^{39}$ లోని నిగనిగలాడు మచ్చలు దేహ మంతట వ్యాపించు పొడలని యూహింపఁ దగును.

(2) **గజ్జి.** పైన వివరింపఁబడినవాటిలో చివరివానికి సంబంధించినది. ద్వితీ $28^{27}$ వలన నీ జబ్బు పూర్వకాలమునుండి యున్నటులఁ దెలియుచున్నది.

(3) **కురుపులు, గడ్డలు, పొక్కులు, పుండ్లు** వీటి యసలుపదమునకు మంట యని యర్థమిచ్చును. యోబు దేహమున పొక్కిన విట్టివే (యోబు $2^{7}$). ఐగుప్తు తెగుళ్లలోని (నిర్గ $9^{8-12}$) విట్టివేయైనను వాటిని పొక్కులు అని తెలిగించిరి. వాటికి సంబంధముగా **పొక్కు దద్దురులు** అను నవియును గలవు. ద్వితీ $28^{27}$ లోని **ఐగుప్తుపుండు** ఒకవిధమైన కురుపుగా నున్నది. హిజ్కియాకు వచ్చినది (యెష $38^{21}$) రాచపుండు అని యనుకొన వచ్చును. II తిమో $2^{17}$ లో నుండు **కొరుకుడు పుండు** మాంసమును ఎముకలను కుళ్లఁ జేయు పుండై యున్నది. దుర్బోధలట్టి పుండ్లకు సరిపోల్పఁబడినవి.

యెష $1^{6}$ లోని **పచ్చిపుండ్లు** మేహపు పుండ్లై దేహమంతయు వ్యాపించి అసహ్యమును కలిగించునవై యున్నవి. పాపము అట్టిదే యని యెషయా బోధించెను. **స్రావములను** ఇందు జేర్చినను, కొన్నిమాత్రము చర్మమునకు సంబంధించినవి. ఇవి మానని పుండ్లవలన కలుగునవి. ఈ జబ్బుగలవారు స్రావము ఆగిపోవువఱకు అపవిత్రులే (లేవీ $15^{2}$). అది మానినపిమ్మట తగిన ఆచారములతో శుద్ధిచేయవలసిన నియమమున్నది (పవిత్రపఱచుట 2 చూ||).

6. నరములకు సంబంధించిన జబ్బులు. ఇవి నరములకేగాక వాటికి ముఖ్యస్థానమగు మెదడునకును సంబంధించిన జబ్బులై యున్నవి.

(1) **చాంద్రరోగము.** చంద్రుని వృద్ధిక్షయముల ననుసరించి యీ రోగము ఎక్కువగుచుగాని, తగ్గుచుగాని యుండుటవలన దీని కీ పేరును పెట్టిరి. మూర్ఛయును, ఒక తరహా పిచ్చియు ఇట్టివై యున్నవి. మ $17^{15}$ లో నుదాహరించిన చాంద్రరోగికి మూర్ఛలున్నవనుట స్పష్టము. మ $4^{24}$ నందున్న చాంద్రరోగమును అట్టిదే యని ఊహింపఁదగును.

(2) **పక్షవాయువు.** ఇది నరముల జబ్బు. అందువలన జబ్బు స్థితియందున్న నరములుగల అవయవములను బొత్తుగా కదలింపఁజాలక పోవుదురు. ఇట్టి జబ్బున కనేక సూచనలు గలవు (మ $4^{24}$ $8^{6}$ $9^{2}$ కార్య $8^{7}$ $9^{33}$ మొ||). యిర్మీయాకు కలిగిన గొప్ప భయముచేత అతని ఎముకలన్నియు కదలుట యిట్టి జబ్బని తెలియుచున్నది (యిర్మీ $23^{9}$).

(3) **వెఱ్ఱి, పిచ్చి.** ఇదియును నరములకు సంబంధించినదే. శత్రుసముఖమునుండి తప్పించుకొనుటకు దావీదు వెఱ్ఱివానివలె నటించెను. అది వట్టినటనయేగాని జబ్బుకాదు (I సమూ $21^{10-15}$). పౌలు వెఱ్ఱివాఁడని ఫేస్తు చెప్పెను గాని అతని ఆసక్తివిషయము చెప్పఁబడినమాట (కార్య $26^{24}$). దేవుని యాజ్ఞలను మీఱు వారికి కలుగు శాపములలో నిది యొకటి (ద్వితీ $28^{34}$). మృగముల రీతిగా తిరిగెడు పిచ్చియొకటి గలదు. నెబుకద్నెజరున కిట్టిది యుండెను (దాని $4^{33}$).

7. కడుపు జబ్బులు. **రక్తభేదులు, భేదులు** మొదలగునవి యిట్టివై యున్నవి. పొప్లి అను వాని తండ్రి కిట్టి జబ్బుకలిగినప్పుడు పౌలతని స్వస్థపఱచెను (కార్య $28^{7-10}$). యూదారాజగు యెహోరామున కిట్టి వ్యాధి సంభవించెనని కొందఱి యభిప్రాయము (II దిన $21^{19}$).

8. ఎముక జబ్బులు. పైన వివరించిన అంగవిహీనతలలో నిట్టి జబ్బులనుగూర్చి ఉదాహరింపఁబడెను (పై I 2, 4, 5, 6, 8). ఇవిగాక బైబిలునందు ఇట్టి జబ్బు లనేకములు కలవు. అవి యన్నియు గొప్ప బాధలను సూచించుటకు అలంకారరీతిగా నుపయోగింపఁబడుటచే, ఆ కాలమున నున్నవారికి, ఆ జబ్బులు తెలిసి యుండునని స్పష్టమగుచున్నది. అవెవ్వియనః—

(1) **అగ్నివలె మండుచు నా యెముకలలో మూయఁబడి యున్నట్లున్నది** అని యిర్మీ $20^{9}$ నందున్నది. అది గొప్ప వేదనను సూచించును.

(2) **ఎముకలు కుళ్లిపోవుట** (హబ $3^{16}$).

(3) **ఎముకలు క్షీణించుట** (కీర్త $31^{10}$ $32^{3}$). ఈ రెండును ఒకటేవిధమగు జబ్బును సూచించును.

**(4) ఎముకలు విఱువబడుట** (యెష 38[13]).

**(5) ఎముకలు స్థానము తప్పుట** (కీర్త 22[14]). ఇది కాలుసేతులు బెణుకుటను సూచించును.

9. గుండెకును రక్తనాళములకును సంబంధించిన జబ్బులు:—

**(1) మూలవ్యాధి** రక్తనాళముల జబ్బు. ఇది అవిధేయులకు కలుగు శిక్షలలో నొకటి (ద్వితీ 28[27]). (2) రక్తము కారిపోవుటచే **మూర్ఛిల్లుట** గుండెకు సంబంధించిన జబ్బయి యున్నది (విలా 2[12]). (3) **రక్తస్రావ రోగము** స్త్రీలవ్యాధులలో నొకటి (మ 9[20]). ఈ పై మూఁడును రక్తనాళములకు సంబంధించినవై యున్నవి. (4) **హృదయకంపము** అను నొక్క గుండె జబ్బుమాత్రము బైబిలునం దుదాహరింపఁబడియున్నది (ద్వితీ 28[65]). అది గుండెయదరుటను సూచించును. ఇదియును అవిధేయతకు శిక్షగా చెప్పఁబడెను. (5) **గుండె పగులుట, రాతివలె బిగిసికొనిపోవుట** వలన నాబాలు చనిపోయినట్లు I సమూ 25[37] నందు చూడవచ్చును. అది పక్షవాతముకు సంబంధించినదిగా నుండి అధికముగా త్రాగుట వలనఁగాని భయమువలనఁగాని కలుగును.

10. దేహమంతటికి కలుగు జబ్బులు:—

**(1) క్షయ.** సాధారణముగా నిది యూపిరితిత్తులకు సంబంధించినదైనను కడుపు, ఎముకలు, గొంతు మొదలగువాటికి తగలవచ్చునుగాన దీనిని నిచ్చటఁ జేర్చతగును. ఇశ్రాయేలీయుల అవిధేయతవలన వారికి కలుగఁబోవు శిక్షలలో నొక ముఖ్యమైనదిగా నున్నది. తురకవారిలోవలె యూదులలోను ఇది మిగుల సాధారణమగు రోగమై యున్నది. దగ్గిరబంధువులు వియ్యమందుటవలనను శుభ్రమైన వాయు వింటిలోనికి వచ్చుటకు తగినమార్గములు లేనందున, అంతఃపురములలో నుండు స్త్రీజనమునకు ఈ జబ్బు మఱింతవచ్చును. లేవీ 26[39] లో నున్నట్లు వారు క్షీణించిపోవుటను గూర్చిన పదమిదేయైనను అది వారి జనసంఖ్య తగ్గుటను సూచించును.

**(2) జలోదరరోగము, వాపు.** ఇది సాధారణముగా మూత్రపిండములకు సంబంధించిన జబ్బయినను, గుండె రక్తనాళముల జబ్బులు దేహబలహీనతలనను కలుగవచ్చును. ఇట్టి జబ్బులవలన దేహములో నుండి తీసివేయఁబడవలసిన విషసంబంధమైన పదార్థములు తీసివేయఁబడక దేహమందే నిలుచుటవలన అపాయకరమగును (లూ 14[2]=సంఖ్యా 5[27,28]).

**(3) జ్వరము, తాపజ్వరము** (లేవీ 26[16]), **మంట, మహాతాపము** (ద్వితీ 28[22]). ఇవన్నియు జ్వరమునకు సంబంధించినవి. ఇవియును అవిధేయులగు ఇశ్రాయేలీయులకు కలుగఁబోవు శిక్షలలో చేరినవి. లేవీ 26[16] లోని తాపజ్వరము విషజ్వరముకావచ్చును. మంట యనునది దేహమందేదో యొక భాగమున పుట్టిన పుండుచేత వచ్చిన జ్వరమై యున్నది. పేతురు అత్తకును (లూ 4[38]), పొప్లి తండ్రికిని (కార్య 28[7]) జ్వరము తగిలినట్లు చూడవచ్చును. ఈ చివరిదానివలన కడుపున మంట పుట్టియుండును.

**(4) తెగులు, గడ్డలరోగము.** కీర్త 91[6,10] లో తెగులునుగూర్చిన సూచనలు కలవు. పలెస్తీనునందు స్ఫోటకమును, వాంతిభ్రాంతి యను అంటుజాడ్యము లున్నవనుసంగతి చరిత్రవలనఁ దెలియుచున్నను, వాటినిగూర్చిన తేటయైన సూచనలు బైబిలునందు లేవు. I సమూ 5[6,9] లోని **గడ్డలరోగము** బొబ్బలరోగమని కొందఱి యభిప్రాయము. ఐగుప్తు పలెస్తీనులకు మధ్యగానున్న ఈ ప్రదేశము అట్టి జబ్బుకు ఉత్పత్తిస్థానమని వైద్యశాస్త్రుల ఉద్దేశమైయున్నది. ఫిలిష్తీయులు దీనికి ప్రాయశ్చిత్తముగా బంగారపు ఎలుకలను (పందికొక్కులను I సమూ 6[4]) పంపుట దీనికి మఱియొక సూచనగా నుండవచ్చును. బొబ్బలరోగము మొదట ఎలుకలకు తగులును కావున అది యీ రోగమును సూచించును.

**(5) పురుగులు.** హేరోదు పురుగులు పడి ప్రాణము విడిచెనని కార్య 12[23] నందు చదువుచున్నాము. ఇది మిగుల అసహ్యకరమగు జబ్బులలో నొకటి. ఇవి అశుభ్రముగా నుండు పుండ్లలో పడునట్టి క్రిములై యున్నవి.

III. గాయములు దెబ్బలు మొదలగువాటిచే కలుగు బాధలు.

**1. ఎండదెబ్బ** (కీర్త $121^{6}$). షూనేము పట్టణమందలి ఘనురాలైన యొక స్త్రీ కుమారుఁడు ఎండదెబ్బ తగిలి చనిపోఁగా ఎలీషా వానిని బ్రదికించెను (II రాజు $4^{29-37}$). యోనా మూర్ఛిల్లినది గొప్ప యెండచేతనేగాని, అతనికి యెండదెబ్బ తగలలేదు (యోనా $4^{8}$). కీర్త $121^{6}$ నందు **వెన్నెలదెబ్బ**కును సూచన గలదు. వెన్నెలకాలమున, వెన్నెల దేహమునకు తగులునట్లు నిద్రించుటవలన కొందఱికి ఒక విధమగు పక్షవాయువు తగులును. దానినే వెన్నెలదెబ్బ యందురు.

**2. ఎముకలు వసలుట.** పెనూయేలు నొద్ద పెనుగులాడిన యాకోబు తొడయెముక వసిలెను (ఆది $32^{25}$). విశ్వాసఘాతకుఁడు కీలు వసిలినకాలుకు సరిపోలునని సామె $25^{19}$ నందున్నది. అవసరము వచ్చినప్పుడట్టి కాలెట్లు పనికిరాదో, అటులనే శ్రమకాలమున నమ్మకద్రోహియు నుండును. యోబు తన నిర్దోషత్వమును స్థాపించుకొనునప్పుడు తాను నేరస్థుఁడైన పక్షమున తన **భుజశల్యము దాని గూటినుండి పడును** గాక యని శపించుకొనెను (యోబు $31^{21}$). భక్తునికి కలుగు గొప్ప శ్రమలు **ఎముకలు స్థానము తప్పుటకు** పోల్చఁబడెను (కీర్త $22^{14}$). ఇవి యన్నియు యెముకలు వసలుటను సూచించువాక్యములై యున్నవి (పైన II 8 చూ॥).

**3. ఎముకలు విరుగుట.** అన్యాయము చేసినవాఁడనైనయెడల నా బాహువు విఱుగును గాక అని యోబు శపించుకొనెను (యోబు $31^{22}$). షెకెము స్త్రీలలో నొకతె అబీమెలెకు తలమీఁద తిరుగటిరాతిని పడవేసి వాని **కపాలము వగలగొట్టెను** (న్యాయా $9^{53}$). సిలువ వేయఁబడిన క్రీస్తు మఱింత త్వరగా చచ్చునట్లు బంటులు ఆయన **కాళ్లు విఱుగగొట్టఁ**దలంచిరి గాని ఆయన అంతకు పూర్వమే చనిపోయెను కావున వారట్లు చేయలేదుగాని, ఆయనతో కూడ సిలువవేయఁబడిన దొంగలకాళ్లను విఱుగఁగొట్టిరి (యోహా $19^{31-36}$). **దుష్టులపళ్లు విఱుగఁగొట్టుట** వారి యపజయమునకు సూచనగా నున్నది (కీర్త $3^{7}$). అపనమ్మకస్థుఁడగు స్నేహితుఁడు **విఱిగినపళ్లవలె** ఒకనికి మోసము చేయును (సామె $25^{19}$). ఎముకలు మాత్రమే గాక హృదయము విఱుగుటయు అలంకారముగ నుపయోగింపఁబడినది. **విఱిగిన హృదయము** క్రుంగిన మనస్సును సూచించును (కీర్త $34^{18}$).

**4. గర్భపాతము** దెబ్బవలన గర్భపాతమైన పక్షమున, ఆ దెబ్బకొట్టినవానికి వేయవలసిన శిక్షనుగూర్చి నిర్గ $21^{23}$ నందున్నది.

**5. గాయములు.** యుద్ధమునందు తగిలిన గాయములనుగూర్చిన సూచనలనేకములు గలవు (న్యాయా $9^{40}$ I సమూ $17^{52}$ I రాజు $22^{34}$ II రాజు $8^{29}$ మొ॥). లెమెకు తనకు కలిగిన గాయమునకు కసితీర్చుకొనెను (ఆది $4^{23}$). గాయమునకు గాయము అను శిక్షయేర్పాటు ధర్మశాస్త్రమునందున్నది (నిర్గ $21^{25}$). మోహతప్తుఁడగువానిబాధ **గుండెను అంబుచే చీల్చు** బాధవంటిదను అలంకారము గలదు (సామె $7^{23}$). అసలునందు గుండె యను పదమునకు ప్రతిగా **కాలేయము** అను పదమున్నది. దేవునిశిక్షలు గాయములుగా ఎంచఁబడును (యిర్మీ $15^{18}$ $30^{17}$ మొ॥).

**6. నలగగొట్టుట.** గొప్పబాధను సూచించుటకీ పదమును అలంకారరీతిగా వాడిరి (యెష $53^{5,10}$). నలిగినవారిని విడిపించుట రక్షకుని పనులలో నొక ముఖ్యమగుపనిగా నుండెను. దెబ్బలచే నలఁగఁగొట్టఁబడుట అను అర్థమిచ్చు మాట లూ $9^{39}$ నందు గాయపఱచుట అను పదముచే తర్జుమా చేసిరి. దెబ్బలవలన కలుగుబాధలనుగూర్చిన సూచనలు బైబిలునందు పెక్కులున్నవి (మ $21^{35}$ మా $12^{3}$ లూ $10^{30}$ $20^{10}$ మొ॥).

IV. ఔషధములు, చికిత్సలు.

**ఔషధములు.** వీటినిగూర్చిన సూచనలు చాలగలవు (సామె $17^{22}$ యిర్మీ $30^{13}$ $46^{11}$ యెహె $47^{12}$ మొ॥). ఐగుప్తీయులకు మంచి మందులు తెలియును. వారి విద్యలన్నిఁటిని నేర్చిన మోషే (కార్య $7^{22}$) ఔషధములను

గూర్చియు నెఱిఁగియుండెననవచ్చును. హెబ్రీయులు, ఔషధ విషయములలో మిగుల నారితేరియుండిన ఐగుప్తీయులు (?) బాబెలువారికి లోఁబడియున్న కాలములో వారి వైద్యములను బాగుగ నేర్చికొని రనుటలో నాశ్చర్యముండదు. ఈ దిగువ యౌషధములు బైబిలునం దుదాహరింపఁబడెను:—

(1) **అంజూరపు పండ్లముద్ద** (II రాజు 20[7]). గడ్డలు పగులుటకు వీటిని ఉడకఁబెట్టి వాటికి కట్టిరి. **ఆకులను కూడ** అట్లే వాడిరి (యెహె 47[12] ప్రక 22[2]).

(2) **కాటుక** (ప్రక 3[18]). దీనిని కండ్లకు వాడిరి.

(3) **గుగ్గిలము** ఇది గాయములను మాన్పుటకు వాడినట్లు కనఁబడుచున్నది. గిలాదు దీనికిని, ఇతర మందులకును మిగుల ప్రసిద్ధము (యిర్మీ 8[22] మస్తికము చూ॥).

(4) **తైలము** దీనిని గాయములకును పుండ్లకును వాడిరి (యెష 1[6]).

(5) **ద్రాక్షారసము** ఆకలి పుట్టించుటకును, బలము కలిగించుటకును మాత్రమేగాక (I తిమో 5[23]), గాయములను మాన్పుటకు, వాటి మీఁద దీనినిపోసిరి (లూ 10[34]). గాని ద్రాక్షారసమును ముఖ్యముగా పానీయముగా వాడిరి. అందువలన ఇది అనేక జబ్బులకు కారణమాయెను (సామె 23[31-35]).

(6) **నూనె.** దీనిని గాయములకు మాత్రమేగాక (లూ 10[34]), దేహమునకు పూయుటకును వాడిరి (యెహె 16[9]). అది దేహమునకు చాల మేలుగ నుండును. రోగులకు దీనిని పూసి ప్రార్థించిరి (యాకో 5[14]).

(7) **పుత్రదాత వృక్షపుపండు** (ఆది 30[14] పర 7[13]), **ఖుద్ద ఖుదుసరకాయ** (ప్రస 12[5]). ఇవి మోహమును పుట్టించుకాయలని నమ్మినట్లు ఈ సూచనలవలన నూహింపవచ్చును.

2. వైద్యులు, రోగులను పరామర్శించు వారు.

(1) ఔషధములనిచ్చు వైద్యులుమాత్రమేగాక (పైన పీఠిక చూ॥), **గాయములను బాగుచేసినవారు** (*Surgeons*) కూడ నున్నట్లు కనఁబడును. ఆసా తన పాదముల జబ్బును కుదుర్చుకొనుట కట్టివారియొద్దకుఁ బోయెను (II దిన 16[12]). గాయములను బాగుచేయించుకొనుట కవసరమగు విశ్రాంతినిగూర్చి నిర్గ 21[19] నందున్నది.

(2) **మంత్రసానులు** మొదటి నుంచి గలరు (ఆది 35[17] నిర్గ 1[15]). వారి దేశపు మంత్రసానుల వంటివారు.

V. ఆరోగ్య శాస్త్రమునకు సంబంధించిన బోధలు దీనికి సంబంధించిన ఈ దిగువ బోధలు ధర్మశాస్త్రమునం దున్నవి:—

1. పవిత్రాపవిత్రములగు భోజనపదార్థములనుగూర్చి లేవీ 11 ద్వితీ 14 నందున్నవి. వాటిలో కొన్ని ఆచారములకు సంబంధించినను, చాలమట్టుకు ఆరోగ్యమున కవసరమైనవని ఆ జాబితావలన స్పష్టమగుచున్నది.

2. బహిర్భూమి విషయమగు ఏర్పాటులు (ద్వితీ 23[13]), ప్రస్తుతము వ్యాపించు ఎన్నో జబ్బులకు నివారణగా నుండును.

3. వివాహపుటేర్పాటులు. దగ్గరబంధువులతో వియ్యమందకపోవుట ఆరోగ్యమునకు గొప్ప సాధనముగా నెంచవలెను (లేవీ 18, 20).

4. విశ్రాంతిదినము నాచరించుట ఆరోగ్యమున కెంత యవసరమో ఇప్పుడందఱును ఎఱిఁగిన విషయమే (నిర్గ 20[8-11]).

5. సున్నతి మతసంబంధమగు ఏర్పాటైనను (ఆది 17), అది ఆరోగ్యమునకు సహాయకరమని నవీనవైద్యులు ఒప్పుకొనుచున్నారు.

ఇంత పురాతనకాలమునందు ఆరోగ్యమునకు సంబంధించిన ఇన్ని యేర్పాటు లుండుటను చూడఁగా ధర్మశాస్త్రమెంత సహేతుకమైనదో తేటగా కనఁబడుచున్నది.

**రోగా** (Rohgah = అల్లరి). ఆషేరు సంతతివారిలో నొకఁడు (I దిన 7[34]).

**రోగెలీము** (Rogelim = చాకలివారు, వేగులవారు). గిలాదులోని యొక పట్టణము. బర్జిల్లయి ఈ పురనివాసి (II సమూ 17[27] 19[31]). దీని యునికి తెలియదు.

**రోమమ్తీయెజెరు** (Romamti-Ezer = సహాయమును గొప్పచేసితిని). హేమాను కుమారులలో నొకఁడు. ఇతని కుటుంబికులు సంగీతనాయకులలో 24 వ వంతువారైరి (I దిన 25[4,31]). కొందఱు దీనిని పేరుగా నెంచక అది కనఁబడుచోట్లనెల్ల దేవుఁడతని గొప్పచేసెనని తర్జుమాచేతురు.

**రోమా పట్టణము** (Rome). రోమాపురము టైబర్ యను నది యొడ్డునను దాని యొక్క ముఖద్వారమునకు పదునైదు మైళ్ల దూరమునను కట్టఁబడిన యొక నగరము. ఈ పట్టణము మిగుల పురాతనమైనదియై క్రీ॥ ము॥ 753 సం॥ మందు రోములస్ (*Romulus*) యను కులనాయకునిచే మొదట స్థాపితమాయెను. మొదట నా యూరు ఒక గుట్టమీఁద కట్టఁబడిన కోట మాత్రమై యుండినను కాలము గడువఁగా నది యా ప్రాంతమున నుండు నేడు గుట్టలమీఁద వ్యాపించిన యొక గొప్ప పట్టణమాయెను. ఇందువలన ఆ పట్టణము ఏడు పర్వతముల (మీఁద కట్టఁబడిన) పట్టణమను పేరుచే ప్రసిద్ధమాయెను. ప్రభువైన యేసు కాలమున రోమాపురి దాదాపు 12 లక్షల జనసంఖ్యగలదై యుండెను. రోమాపురము మొదటి నుంచి రోమారాజ్యమునకు ప్రధానపట్టణము గనుక ఆ రాజ్యమేలిన రాజులక్కడనే నివాసము చేసినవారు. ప్రస్తుత మది ఇటలీ దేశమునకు ముఖ్యపట్టణమును ఆ దేశపు రాజుయొక్క యాస్థానమునై యున్నది. రోమారాజ్యము స్థాపించినది మొదలుకొని చాలకాలము వఱకు రాజులవలన పరిపాలించఁబడెను గాని క్రీ॥ ము॥ 510-31 సం॥ వఱకు ప్రజలు తామేర్పఱచినయుద్యోగస్థుల మూలమున ప్రజా పరిపాలన స్థాపనచేసిరి. ఆ మీఁదట రాజ్యము నిర్మూలమగువఱకు అనఁగా క్రీ॥ శ॥ 476 సం॥ వఱకు చక్రవర్తులు ప్రభుత్వమును చేయుచుండిరి. డియోక్లేషన్ అను చక్రవర్తి ప్రభుత్వ కాలమందు 296 సం॥ మున రోమారాజ్య మప్పటికి లోకమందంతటను తెలిసి వ్యాపించినదాయెను.



కొలోసియమ్

ఇచ్చట రోమాపురి చరిత్ర వృత్తాంతములను సంపూర్ణముగా వివరింప సాధ్యము కాదు కాఁబట్టి అది యెంతమట్టుకు క్రొత్త నిబంధనకు సంబంధించినదో యంతమట్టుకు వివరింతుము.

పౌలు రోమాపురియందు రెండేండ్లు ఖైదీగా నుండి యా కాలమందు తన పత్రికలలో కొన్ని ముఖ్యమైనవి ప్రస్తావించెను గనుక ఆ పట్టణమాయన చరిత్రయందు పలుమారు ప్రశంసించఁ

బడును. అయినను పౌలు చూచిన పురమిప్పుడు లేదు. ఆయన కాలములో నీరో చక్రవర్తి యా యూరిని తగులఁబెట్టి ధ్వంసము చేసినందున అప్పుడుండిన కట్టడములలో నిప్పు డొకటియు లేదు. అలాగు కాలిపోయిన పురమును వారు తిరిగి కట్టి బహు సుందరమైన కట్టడములతో చక్కఁగ నలంకరించిరి. ఆ శృంగార కట్టడములలో కొన్ని నేటివఱకున్నవి. వానిలో అన్నిఁటికంటె గొప్పది నాటకశాల. ఈ నాటకశాలయందే జనులు వేడుకనిమిత్తము క్రైస్తవు లనేకులు దుష్ట మృగముల మధ్య వేయఁబడి హతసాక్షులైరి. వెస్పేషియన్ చక్రవర్తి క్రీ॥ శ॥ 70 సం॥న మొదలు పెట్టిన యా నాటకశాల 80 సం॥ మందు ముగిసి పోయెను. అందులో జరుగు వేడుకలు జన స్తోమమునకు బాగుగా కనఁబడునట్లు నొకదాని మీఁద నొకటి మెట్లు మెట్లుగా 80 అరుగులను కట్టి దాదాపు 87,000 మంది జనులు కూర్చుండు నంత విశాలము నేర్పఱచిరి. ఇట్టి పురాతనమైన కట్టడములవలనను ఇటీవల నేర్పడిన కట్టడముల వలనను రోమా పట్టణ మలంకరించఁబడినదై యున్నది. పౌలు కాలమున రోమాపురమం దనేకమంది యూదులు కాపురముండిరని కార్య ముల గ్రంథమువలన వేద్యమగుచున్నది. క్రీ॥ శ॥ ముందు 63 సం॥ మందు పాంపే యను రోమా సేనానాయకుఁడు యెరూషలేమును పట్టుకొని యూదులరాజైన అరిస్టోబ్యులసును అతని కుమారులను రోమాకు తీసికొనివచ్చెను. వారితో కూడ నింక ననేకమంది యూదులను తీసికొని వచ్చి పట్టణమం దొక భాగమును వారికి ప్రవాస స్థలముగా నిచ్చెను. వారా నగరమందుండి వర్తకము చేయుచు వృద్ధిచెందిరి. వారు విస్తరించిన కొలఁదిని పలుమారు అల్లరిచేయుచు వచ్చినందున క్రీ॥ శ॥ 49 సం॥ మున చక్రవర్తియైన క్లాదియ వారిని పట్టణములలో నుండి తరిమెను. ఆ సమయమందే కార్య 18:2 నందు చెప్పఁబడిన అకుల ప్రిస్కిల్లయనను దంపతులు రోమాపురిని విడిచి కొరింథుకు వచ్చిరి. క్రీ॥ శ॥ 61 సం॥ పౌలు కైసరునెదుటనే నేను చెప్పుకొందునన్నందున రోమాపురికి ఖైదీగా పంపఁబడి అక్కడ రెండు సంవత్సరములు చెఱయందుండెను. పౌలు కాలమున జీవించి అతని విమర్శించిన నీరో చక్రవర్తి యేలుబడిలోనే రోమాపురము కాలి ధ్వంసమాయెను. ఆ నాశమునకు నీరోచక్రవర్తియే కారకుఁడని చరిత్రకారు లనేకు లందురు. అతఁడు మిగుల ఘాతకుఁడై తనకు వినోదార్థముగా ఊరును తగులఁబెట్టించి యది కాలు




యెరూషలేమును పట్టుకొనిన రోమారాజగు వెస్పేషియను ముద్రించిన నాణెము

చుండఁగా దూరమునుంచి చూచి యుల్లసించె నని వారు తెలుపుచున్నారు. నీరోచక్రవర్తియు నతనికి తదనంతర రాజులును రోమాపురమును తిరిగి కట్టించి మునుపటికంటె బహు గొప్పవియు సుందరమైనవియునైన భవనములతో శృంగారించిరి. అవి బహుకాలము క్రిందట శిథిలమై యుండినను వానిలో శేషించిన భాగములు నేటివఱకు నున్నవి. పౌలుకాలమున రోమాపురి జనసంఖ్యలో సగమునకు పైఁగా దాసులై యుండిరి. వారు గాక పూర్వము బానిసవారై యుండి స్వతంత్రము నొందినవా రనేకు లుండిరి. జనాభాలో మిగిలిన భాగము ఐశ్వర్యవంతులును, సర్కారు యుద్యోగస్థులును సైన్యాధిపతులునై యుండిరి.

పౌలు, పేతురు రోమాపురియందే క్రీస్తు నిమిత్తము ప్రాణములు ధారపోసిరి గనుక ప్రాచీన క్రైస్తవులలో వారి చరిత్రములకు సంబంధించిన స్థలముల విషయమై పలువిధములగు ఇతిహాసము లుత్పత్తియాయెను. పౌలు రెండు సంవత్సరములవఱకు మమర్తినను చెరసాలలో బంధింపఁబడెననియు, 9 నెలలమట్టుకు పేతురు ఆయనతోకూడ నీ బందీ గృహములో నుండె ననియు తరువాత శిథిలమైన యా చెరసాలమీఁద నొక దేవాలయము కట్టఁబడెననియు ఆ గ్రంథ

ములు దృష్టాంతపరచును. రోమాపురికి 5 మైళ్ల దూరముగా నుండు స్థలమందు పౌలు శిరచ్ఛేదము నొందెనను జనవాడుక కలదు గాని అచ్చోట మృతినొందెనని నిశ్చయముగా చెప్ప వీలుపడదు. పూర్వము నుంచియు పేతురు సమాధి యని చెప్పఁబడిన స్థలమందు 16 వ శతాబ్దమం దాయనకు జ్ఞాపకార్థముగా బహు దివ్యమైన దేవాలయము కట్టఁబడెను. ఆ దేవాలయము రోమాపురికి భూషణమైనదియై యుండుట మాత్రముగాక అది లోకప్రసిద్ధ శృంగార భవనములలో నొకటియై యున్నది.

రోమాపురి సంఘస్థాపనము విషయమై నిశ్చయమైన సంగతి చెప్పవీలుపడదు. పేతురు రోమాలో క్రీస్తుమతము స్థాపించి 25 సం॥ వఱకు నా మొదటి సంఘమును పరిపాలించెనను నభిప్రాయమునకు లేశమైనను ఆధారములేదు.

M.

## రోమీయులకు వ్రాసిన పత్రిక (Romans, Epistle to the).

I. గ్రంథకర్త:—రోమాపురి సంఘస్థుల పేరట వ్రాయఁబడిన యీ పత్రిక అపొస్తలుఁడగు పౌలు రచించిన యుత్తరమని మతపక్షులైనను మత విరోధులైనను అందఱు సందేహించక నొప్పుకొందురు. మొదటినుంచి నేటివఱకు నా పత్రిక పౌలుయొక్క రచనమని సర్వాంగీకారమాయెను.

II. ప్రామాణికత్వము:—1. బహిస్సాక్ష్యము. ఆది క్రైస్తవ పెద్దలనేకు లీ పత్రికలోని మాటలను పలుమారు ఎత్తివ్రాసి యా పత్రిక పౌలు రచించిన యుత్తరములన్నిఁటిలో ముఖ్యమైనది యును విశ్రుతమైనది యని యేకగ్రీవముగా సమ్మతింతురు. క్రైస్తవ సంఘ చరిత్రకారియగు యూసీబియసు (*Eusebieus*) క్రొత్త నిబంధన గ్రంథములయొక్క ప్రామాణికత్వము విషయమై వ్రాయుచు పౌలు తాను రోమీయులకు వ్రాసిన పత్రిక చివర హెర్మే మొదలగు వారిపేళ్లను ప్రశంసించెనని చెప్పెను. మూఁడవ శతాబ్దారంభమందు వెలసిన ఒరిగెనను (*Origen*) భక్తవరుఁడు ఈ పత్రికమీఁద నొక వ్యాఖ్యానము రచించెను. రెండవ శతాబ్ద మధ్యకాలమున టెర్టులియాను (*Tertullian*)· మార్సియోనను (*Marcion*) నొక విమతస్థుఁడు రచించిన గ్రంథములలోని తప్పు సిద్ధాంతములకు పూర్వపక్షముగా వ్రాయుచు ముప్పయి పర్యాయము లీ రోమీయుల పత్రికలోని మాటలనెత్తి యుదాహరించెను. మరియు మార్సియోను రోమీయుల పత్రిక పౌలు వ్రాసినదని యంగీకరించినను అందులోని బోధాంశములు కొన్ని తన యుద్దేశమునకు వ్యతిరిక్తమైనవి యైనందున అతఁడా పత్రికను తన మనస్సునకు వచ్చినట్లు దిద్దుటవలన టెర్టులియాను అతని ఖండించెను. అలెక్సంద్రియ పట్టణపు క్లెమెంతును (*Clement*), ఐరేనియసును (*Ireneus*) రోమీయుల పేరట పంపఁబడిన యుత్తరము పౌలు వ్రాసిన పత్రిక యని విశదముగా చెప్పుదురు.

క్రీ॥ శ॥ 170 సం॥ మందు రచించఁబడి 1738 సం॥ మున మిలాను పట్టణమందు మ్యూరటోరి యను పండితునివలన కనుగొనఁబడిన యొక గ్రంథ శేషమున పౌలు వ్రాసిన పత్రికల పేళ్లు వివరించు పట్టీ సూచించఁబడెను. ఆ పట్టీలో నుదాహరించఁబడిన యుత్తరములలో రోమీయులకు వ్రాసిన పత్రిక యొకటియై యున్నది.

అపొస్తలులకాలపు ఆచార్యు లనిపించుకొనఁబడిన జస్టీను (*Justin*), పాలికార్పు (*Polycarp*), ఇగ్నేషియసు (*Ignatius*) మొదలగువారు తమ గ్రంథములయం దీ పత్రిక నుదాహరించి యందులోని వాక్యముల నెత్తి వ్రాసిరి. జస్టీను ఏడు పర్యాయములును, పాలికార్పు ఆరు పర్యాయములును ఇగ్నేషియసు పండ్రెండు పర్యాయములును ఈ పత్రికలో నుండు నాయా వచనములను ప్రశంసించిరి.

పై వివరించిన గ్రంథములవలన మాత్రము కాక పాఁత నిబంధనలోని గ్రంథములవలనను ఈ పత్రికను గుఱించిన ప్రశంసము కలదు. మొదటి పేతురు, హెబ్రీయుల పత్రికలలో తటస్థించు కొన్ని మాటలను చూడఁగా నా పత్రికలను రచించిన గ్రంథకర్త లీ రోమీయుల పత్రికను చదివి దానిలోని యోచన ననుసరించి వ్రాసి రనుటకు సందేహములేదు. ఈ దిగువ వచనములను పోల్చి చూచినచో నీ సంగతి పరిష్కారమగును. రోమా $9^{32,33}$=I పేతు $2^{6-8}$; రోమా

13[1-7]=I పేతు 2[13-17]; రోమా 4[17-21]=హెబ్రీ 11[11,12]; రోమా 12[19]=హెబ్రీ 10[30].

పైన నుదాహరింపఁబడిన వివరములన్నియు పరిశీలించఁగా మనమిప్పుడు విచారించుచున్న పత్రిక క్రీస్తు సంఘము స్థాపింపఁబడినది మొదలు కొని ఇప్పటివఱకునుండు క్రైస్తవ భక్తకోటిచే పౌలు రచించిన గ్రంథముగా నంగీకరింపఁ బడెనని సిద్ధాంతమగును.

**2. అంతస్సాక్ష్యము.** గ్రంథ పరిశోధన చేయఁగా పై నిర్ధారణకు ఎక్కువ ఆధారము కలుగును. 1[1] నందు పౌలు తానే రోమాలో నున్న సంఘస్థులకు శుభమని చెప్పి వ్రాసినట్టు వివరింపఁబడెను. 1[9-15] లోని వృత్తాంతముల మూలమున ఆయన తత్కాలమున సువార్త వ్యాపకత్వము విషయమై ప్రయాసపడు చుండెననియు అప్పటికిని ఆయన రోమాపురిని దర్శించి యుండ లేదనియు స్పష్టమగును.

**III. కాలస్థాన నిరూపణము.** పౌలీ పత్రిక నెప్పుడు ఎక్కడ వ్రాసెనో కార్యముల గ్రంథ మందలి చరిత్ర వృత్తాంతములను విచారించి నిశ్చయింపఁ గలుగుదుము. పౌలు తానీ పత్రికను రచించిన సమయమున రోమా పట్టణమును చూచి యుండలేదనియు త్వరలో దర్శింప నెదురు చూచుచుండెననియు 1[13] 15[23] నందు వివరించి, తా నప్పుడు యెరూషలేముకు పోవలసినది యవసరమైనందున వెంటనే రాను సాధ్యముకాదని తెలియఁజేసెను. పౌలా మధ్యను మాసిదోనియ అకయ ప్రదేశములయందు యెరూషలేములోని బీద క్రైస్తవుల సహాయార్థముగా చందా వసూలు చేయుచుండెనని I కొరి 16, II కొరి 8, 9, అధ్యాయములయం దుదాహరింపఁబడెను. పౌలా సమయమున చందా వసూలు చేయుటను గుఱించి కార్యముల గ్రంథమందు నేరుగా ప్రశంసించకుండినను ఆయన మూఁడవ సువార్త ప్రయాణము ముగించి యెరూషలేములో జరిగిన యల్లరియందు పట్టఁబడి కైసరయయందు చెరలో నున్నప్పుడు ఫేలిక్సు నెదుట సమాధానము పలుకఁగా దానిని గుఱించి సూచించెను (కార్య 24[17]). మఱియు మూఁడవ ప్రయాణమందు పౌలు ఎఫెసు పట్టణమందు దాదాపు మూఁడేండ్లుండిన పిమ్మట మాసిదోనియ అకయదేశముల ననుసరించి రోమానుకూడ చూడవలెనని అనుకొనెను (కార్య 19[21] I కొరి 16[1-6]). పౌలు మాసిదోనియ అకయ ప్రాంతములలో చేయ నుద్దేశించిన ప్రయాణమందే యీ పత్రిక రచించెను. అలాగుండఁగా నాయన యీ పత్రికను కొరింథుపట్టణమందు వ్రాసియుండునని తలంచెదము. ఆయన యీ యుత్తరమును వ్రాసి కెంక్రెయలో నున్న సంఘపరిచారకురాలగు ఫీబెచేతికి నప్పగించెనని రోమా 16[1] వలనఁ దెలియనగును కెంక్రెయగ్రామము కొరింథుపట్టణమునకు 8 మైళ్లదూరమై దానికి రేవుస్థలమై యుండెను. కాఁబట్టి పౌలా సమయమున కొరింథు సమీపములో నుండెనని తోఁచక మానదు. అదియుఁగాక పౌలీ పత్రికను వ్రాయునప్పుడు గాయియు అనఁబడిన యొకని యింటిలో బసచేయుచుండెను (రోమా 16[23]). కొరింథు సంఘస్థులకు పౌలు వ్రాయఁగా తాను వారి మధ్యనున్నప్పుడు గాయియు అను నొకనికి బాప్తిస్మమిచ్చితినని చెప్పెను. I కొరి 1[15] రోమా 16[23] యందు ఈ పట్టణపు ఖజానా దారుఁడగు ఎరస్తు మీకు వందనములు చెప్పు చున్నాఁడని పౌలు సూచించుటనుబట్టియు, II తిమో 4[20] నందు ఎరస్తు కొరింథులో నిలిచి పోయెనని చెప్పుటనుబట్టియు అపొస్తలుఁడా సమయమున కొరింథుపట్టణస్థుఁడగు ఎరస్తు ఇంటిలో బసచేయుచుండెనని దృష్టాంతమగును. పై వివరములన్నియు యోచించఁగా పౌలు మూఁడవ ప్రయాణములో కొరింథుపట్టణమందుండుసమయమున నీ పత్రికను రచించెనను అభిప్రాయమునకు సమ్మతింపవలసి యుండును. అట్లుండఁగా నీ రోమీయులకు వ్రాసిన యుత్తరము క్రీ॥ శ॥ 57 లేక 58 సం॥ లిఖిత మాయెను.

**VI. కారణము, ఉద్దేశము.** పౌలు తానీ పత్రికను వ్రాసిన హేతువును 1[10-15] 15[22 23] లలో వివరించును. 1[10-15] నందు తాను చాల కాలమునుంచి వారిని చూడనపేక్షించిన సంగతిని తెలియఁజేసి, ఇప్పుడు వచ్చుటకు వీలు కలిగి నందున తన దర్శనము నిమిత్తము వారెదురు చూచునట్లుగా వారిని హెచ్చరించెను. తిరిగి 15[22,23] యందు తాను యెరూషలేములోని బీద

సంఘస్థుల నిమిత్తము పనులు చేసిన ద్రవ్యసహాయము వారి కప్పగించినమీఁదట తాను స్పానియా దేశమునకు పోవునప్పుడు రోమలో వారిని చూడ నిశ్చయించి యుండెనని తెలియఁజేసెను. ఇచ్చట పౌలుగుపఱచిన యుద్దేశము కడకు నెఱవేరెను గాని ఆయన నిశ్చయించిన ప్రకారము జరుగక బహు విపరీతముగా నీడేరెను. రోమీయులకు తెలియఁజేసినట్టు ఆయన యెరూషలేమునకు పోయినతరువాత రోమాపురిని దర్శించెనుగాని మధ్యన కైసరయలో రెండేండ్లు చెఱలో నుండిన పిదప ఖైదీగా రోమాకు కొనిపోఁబడెను. ఇందు వలన ఆయన యుద్దేశమునకు కేవలము వ్యతిరిక్త ముగ జరిగెను.

పౌలీ పత్రికను వ్రాసిన యుద్దేశమును తెలిసికొనుటకై రెండు అంశములను విచారించుట యావశ్యకము. అవేవనిన ఆయన యెవరి నిమిత్తము వ్రాసెననియు, వారికేమి యుపదేశింపఁ దలఁచెననియు అనునవి.

ఈ పత్రిక లిఖితమైన తరుణమున రోమా సంఘము నూతనముగా స్థాపితమైనదికాక యనేక సంవత్సరములనుంచి నెలకొనియుండెనని అందులోని ప్రస్తాపములమూలమున విశదమగును (ఇందుకు 1[8-13] 15[23] 16[7] చూ॥). రోమాపురి సంఘ మేవిధముగాను ఎవరివలనను స్థాపించఁబడెనో నిశ్చయమైన తీర్మానము చేయవల్లపడదు. క్రీ॥ ము॥ ఆ నగరమందనేకమంది యూదులుండిరని యా రాజ్యచరిత్ర గ్రంథములద్వారా వెల్లడియగును. వారక్కడ సమాజమందిరములనుకట్టి నిరభ్యంతరముగా తమ మతాచారముల ననుష్ఠించుట చూచియు, యూలియసు, ఔగూస్తు, తిబెరియసు అను రోమాచక్రవర్తులు స్వమతపద్ధతుల ప్రకారము దేవుని నారాధించుటకు వారికి సెలవిచ్చుటను చూచియు, వారిజనసంఖ్య గొప్పదని స్పష్టమగును. ఫైలో (*Philo*) అను విద్వాంసుఁడు వారా పట్టణమునకు సమీపముగా నొక మజరాయందు నివాసముండిరని తెలియచేసెను. ఒక సమయమందు యూదయదేశపు యూదులు తమ రాజైన అర్కెలాయు క్రూరప్రభుత్వమును గుఱించి చక్రవర్తియొద్దకు ఒక మహజరును పంపఁగా రోమాపురి యూదులలో 8000 మంది దానిపై సంతకములుచేసి ఆహా దించిరని యోసీఫసను చరిత్రకారి తెలియఁజేసెను. ఈ వివరములనుబట్టి వారు రోమాపురిలో గొప్ప స్తోమముగ నుండిరని సిద్ధాంతమగును. పెంతెకొస్తు పండుగనాడు రోమాపురి యూదులనేకులు యెరూషలేమునకు వచ్చియుండిరి (కార్య 2[10]). గనుక ఆ సమయమున సువార్తను విన్నవారిలో కొందఱు తాము భక్తులై రోమాపురి చేరినమీఁద నక్కడ క్రైస్తవసంఘము స్థాపించి యుందురనుకొనఁదగును. ఈ పత్రికయందు పౌలు తానా యూరిని చూడనిసంగతిని ప్రశంసించుచున్నందున నా సంఘమునకు పునాది వేసినవాఁ డాయనకాఁడని చెప్పక తప్పదు. అదియుఁగాక పౌలు ఇతరులపనిలో జోక్యము కలుగఁజేసికొనువాఁడు కాఁడని నిరూపించుటకై ఆయన నేను మరియొకఁడువేసిన పునాదిమీఁద కట్టువాఁడనుకానను (రోమా 15[20]) మాటచే స్పష్టమగును. ఇందునుబట్టి పేతురైనను మరియే యపొస్తలుఁడైనను ఆ సంఘమును స్థాపించలేదని నిస్సందేహముగా తీర్మానించఁగలుగుదుము. పేతురు రోమాపురిసంఘమును స్థాపించి, 25 యేండ్లు దాని పరిపాలించెనను ఇతిహాసమునకు లేశమైనను ఆస్పదములేదు. మెట్టుకు ఆ సంఘ స్థాపకుఁ డెవఁడైనది చెప్పసాధ్యముకాదు.

ఆ సంఘోత్పత్తి తెలియనిదియై యుండినను పౌలీ పత్రికను వ్రాసిన సమయమునందు భక్తులు పెక్కురు గలరనియు, అందులో యూదులైన క్రైస్తవులును అన్యులైన క్రైస్తవులు నుండిరనియు కనఁబడుచున్నది. పత్రికను పరిశోధించఁగా పౌలు యూదులైన క్రైస్తవులను మాత్రముగాక అనేక పర్యాయములు అన్యులైన క్రైస్తవులను హెచ్చరించెనని స్పష్టమగును. ఆ సంఘస్థులు మొదట అన్యులైయుండినను వారిలో ననేకులు యూదమతాచారముల ననుసరించినవారై యుండిరి. కాఁబట్టి వారు క్రైస్తవులు కాకమునుపు యూదమతప్రవిష్టులను తెగవారైనట్టున్నది. ఈ మతప్రవిష్టులే రోమా సంఘములో ముఖ్యులని తెలిసికొనుటవలన నీ పత్రిక ముఖ్యోద్దేశమును దానిమూలమున పౌలు ఉపదేశింప చూచిన మూలసిద్ధాంతములును మనము గ్రహించఁగలము. ఆయన యా సంఘస్థుల యభిప్రాయములను ప్రవర్తనరీతిఁగి రోమారాజ్య

మందు క్రీస్తుమత వ్యాపకమునకు దాని రాజధాని యగు రోమాపురి సంఘత్వేమాభివృద్ధి చెంది యుండుట యావశ్యకమని యెఱిఁగియు వారి భక్త్యాభివృద్ధినిమిత్త మీ యుత్తరమును లిఖించెను. దీనిమూలముగా మొదట తనరాకను గుఱించి ప్రస్తాపించి తా ననుభవపూర్వకముగా తెలిసి కొన్న సత్యమును వారికి బోధించి వారా సత్యమనుసరించి యేసునందు దృఢవిశ్వాసముగలిగి పరిశుద్ధమును దేవుని కనుకూలముసైన సజీవయాగముగా తమ శరీరములను దేవునికి సమర్పించుకొనుఁడని వారిని బ్రతిమాలుకొనెను.

V. ముఖ్య భాగములు.

1. పీఠిక. ఉభయ కుశలప్రశంస $1^{1-15}$.

2. సిద్ధాంతబోధన $1^{16}$-11.

(1) దేవుఁడు యేసును నమ్మిన పాపులను నీతిమంతులుగా తీర్చుట $1^{16,17}$.

మనుష్యులు తమంతట తామే నీతిమంతులుగా కానేరరు. ఇందుకు అన్యజనుల గుణభ్రష్టత్వమును యూదుల గుణభ్రష్టత్వమును దృష్టాంతము $1^{18}$-$2^{29}$.

ఇందు కాధారము వేదవాక్యములెత్తి వివరించుట.

(2) ప్రారంభమున ప్రస్తాపించిన సిద్ధాంతబోధనను పునః విశదపరచుట. క్రీస్తు యొక్క మరణ ముఖాంతరముగా ఆయనను నమ్మిన పాపులను దేవుఁడు నీతిమంతులనుగా భావించుట $3^{1-26}$.

ఈ భాగ్యము క్రీస్తుమూలముగానే కలుగును గనుక ఎవరును అతిశయించుటకు ఆస్పదములేదు $3^{27-31}$.

ఆ భాగ్యము అబ్రాహాముకుండెను $4^{1-25}$.

దేవుని అమూల్యవరమువలన గలుగు ఐశ్వర్యము $5^{1-11}$.

ప్రథమ మూలపురుషుడగు ఆదాము, ద్వితీయ మూలపురుషుఁడగు యేసు $5^{12-21}$.

(3) క్రీస్తు సహవాసమువలన భక్తునినీతి అతిశయిల్లుట $6^{1-14}$ భక్తులకు గలిగెడి పాపవిమోచన $6^{15}$-$7^{5}$.

పరిశుద్ధాత్ముని సమేతమైన జీవనము $8^{1-17}$.

ప్రపంచవేదన, క్రైస్తవుని నిరీక్షణ $8^{18-39}$.

(4) దేవుఁడు ఇశ్రాయేలీయులను నిరాకరించుట $9^{1}$-$11^{36}$.

3. ప్రేరణములు $12^{1}$-$14^{13}$.

క్రైస్తవ విధులు $12^{1-21}$.

సంఘవిధులును, రాజకీయవిధులును $13^{1-7}$.

క్రైస్తవ పరస్పర ప్రేమన్యాయము $13^{8-14}$.

పరోపకారచింత $14^{1}$-$15^{3}$.

యూదులును, అన్యజనులును ఐక్యమగుట $15^{4-13}$.

4. అపొస్తలుఁడగు పౌలు తన స్వంత సమాచారము వివరించుట $5^{14}$-$16^{15}$.

సెలవుపుచ్చుకొని ఆశీర్వదించుట $16^{16-27}$. M.

**రోలు, రోకలి** (Mortar and Pestle). ఈ దేశమునందున్నట్లు పలెస్తీనులోకూడ భోజన పదార్థములను సిద్ధపఱచుటకు వీటిని వాడుట సాధారణమై యుండెను. గెజెరులో శిథిల పరిశోధకులు త్రవ్వికనుగొన్న అనేకమైనవి ఇప్పటి రోళ్లవంటివై యున్నవి. అరణ్యములో తినిన మన్నాను దంచినట్లు సూచన కలదు (సంఖ్యా $11^{8}$). ధూపద్రవ్యములను రాళ్లతో దంచి పొడుముకొట్టిరని నిర్గ $30^{36}$ వలనఁ దెలియును. గింజలనుకూడ నీ విధముగనే పొడుముచేసిరి (లేవి $2^{14}$). రోఁకళ్లతో కొట్టుట అధిక దెబ్బలకు సూచనగా సామెతల గ్రంథమున వాడిరి (సామె $27^{22}$).

**రోషము** (Jealousy). దీని మూలభాషా పదము గొప్ప ఆసక్తిని, దానికి విరుద్ధమైన ఓర్వజాలనిబుద్ధిని సూచించును. ఆ పదము కీ యర్థముండుటచే దానిని ఆసక్తి యనియు (యెష $42^{13}$ జెక $1^{14}$ $8^{2}$ II కొరి $11^{2}$), ఓర్వమి, ఓర్వలేక పోవుట యనియు (సంఖ్యా $25^{11}$ ద్వితీ $29^{20}$) తర్జుమాజేసిరి. ఇతరుల శాశించు భార్యవిష

యమై భర్తకు పుట్టురోషము మహా రౌద్రము గలది (సామె $6^{34}$). అట్టి రోషము గలదాని విషయమైన యేర్పాటులు సంఖ్యా $5^{14-30}$ లో నున్నవి. దేవునియాత్మ యిశ్రాయేలీయుల పెద్దల మీఁదికి వచ్చినప్పుడు, మోషేమీఁద మాత్రమే ఆ యాత్మ ఉంపవలెనని కోరిన యావనస్థున కిట్టి రోషమే కలిగెను (సంఖ్యా $11^{29}$). దేవుని విడిచి అన్యుల విగ్రహములను ఆరాధించిన వారి విషయము ఏలీయా కిట్టి రోషము పుట్టెను (I రాజు $19^{10,14}$). తన సంఘములం దుండిన క్రైస్తవులు క్రీస్తునుండి తొలఁగి పోదురేమో నని వారి విషయ మిట్టి యాసక్తి పౌలుకు కలిగెను (II కొరి $11^{2}$). అన్యులు దేవుని భక్తులగుట జూచి రోషము కలిగి యూదులు తమంతట తామే దేవునితట్టు తిరిగెదరని పౌలు నిరీక్షించెను. అన్యులను క్రైస్తవ సంఘమునఁ జేర్చుటకు మరింత యాసక్తితో పనిజేసెను (రోమా $10^{19}$ $11^{11}$). మానవుల సందర్భమునం దిట్లు ఈ మాటను వాడినను, విగ్రహములను దేవుఁడు సహింపఁజాలఁ డను సంగతిని సూచించుటకు నిది మఱింతగా నుపయోగింపఁబడి యున్నది (నిర్గ $20^{5}$ సంఖ్యా $25^{11}$ ద్వితీ $32^{16,21}$ I రాజు $14^{22}$ కీర్త $78^{58}$ యెహె $8^{3}$ $36^{6}$ జెఫ $1^{18}$ $3^{8}$). ఒకానొకప్పు డట్టి రోషము మిగుల దౌర్భాగ్యస్థితిలో నున్న వారిని రక్షించుటలో కనఁబడును మిగుల దురవస్థలోనున్న తన దేశమును రక్షించుటలో ఆయన యిట్టి యాసక్తిని కనఁబఱచెను (యోవే $2^{18}$ యెష $26^{11}$). తిరుగఁబడువారిని శిక్షించుట కొకానొకప్పుడు దీని కనబఱచును (యెహె $16^{42}$ $23^{25}$). ఇట్టి రోషము తన భక్తులను హింసించు వారందఱి యెడలను చూపును (3ప $1^{19}$).

**రోషు** (Rosh = శిరస్సు, ప్రధాని).

1. బెన్యామీను సంతతివారిలో నొకఁడు (ఆది $46^{21}$). దీనికి సంబంధించిన సంఖ్యా $26^{38,39}$ I దిన $8^{1-4}$ లో ఈ పదము లేకపోవుటచే వానికి సంతానము లేనట్లుగా కనఁబడును.

2. మెషెకు తుబాలు అను జనాంగములతో పాటు ఉదాహరింపఁబడిన ఉత్తరదేశపు జనాంగము (యెహె $38^{2,3}$ $39^{1}$). ఈ వాక్యములందా పదమొక జనమును సూచింపక ప్రధాని యను నర్థమిచ్చును గాన అట్లు తెనిఁగింపవలెనని యభిప్రాయపడుచున్నారు. ఇది యొక జనమైన యెడల ప్రాచీన చరిత్రయందు దీనిని గూర్చిన వేఱు సూచన లెవ్వియును లేవు.

## రౌ

**రౌద్రము** కోపము చూ॥

## ల

**లంగరు** ఓడలు 5 (2) (*a*) చూ॥

**లంచము తీసికొనుట** నేరములు శిక్షలు II 4 (2), ఈవి చూ॥

**లక్కూము** (Lakkum = అభ్యంతరము). నఫ్తాలీ గోత్రమందలి యొక పట్టణము (యెహో $19^{33}$). దీని యునికి తెలియదు.

**లద్దా** (Laadah = క్రమము). యూదా సంతతిలో నొక కుటుంబము. మారేషా యను పట్టణమందు నివసించినవారు (I దిన $4^{21}$).

**లద్దాను** (Ladan = చక్కఁగా నమర్చఁబడినది).

1. యెహోషువ పూర్వీకులలో నొకఁడు (I దిన $7^{26}$).

2. గెర్షోను తెగవారిలో నొక కుటుంబపు మూలపురుషుఁడు (I దిన $23^{7-9}$ $26^{21}$). $6^{17}$ లో నీ పేరునకు మాఱుగా లిబ్నీ యను పదము గలదు (లిబ్నీ చూ॥).

**లప్పీదోతు** (Lappidoth = దివిటీలు లేక మెరుపులు). న్యాయాధిపతియగు దెబోరా యొక్క పెనిమిటి (న్యాయా $4^{4}$).

**లయిషు** (Laish = సింహము). దాను పట్టణపు మొదటిపేరు (న్యాయా $18^{7,14,27}$). యెహో $19^{47}$ నందు దానికి లెషెము అను మాఱు పేరు గలదు.

**లలాట పత్రిక** బాసికము చూ॥

**లలాటము** నొసలు చూ॥

**లవంగి పట్ట** (Cinnamon). గుడారమునందుపయోగించిన పరిశుద్ధతైలమును సిద్ధపఱచుటలో వాడిన నొక సుగంధద్రవ్యము (నిర్గ $30^{23-25}$). పరుపులు పరిమళవాసనకొట్టు నిమిత్తము దీని

నుపయోగించిరి (సామె 7[17]). ఇక్కడ దానిని **కాపురపుచెక్క** యని తెనిగించిరి. ప్రస్తుత మీ చెట్టు సింహళము చీనా మొదలగు దేశముల యందు సమృద్ధిగాఁ బెఱుగును. ఈ చెక్కను రోమాపురికి ఎగుమతిచేసిరి. ప్రక 18[13,14] నందున్న వర్తకపు సరకులలో దీనిని దాల్చిని **చెక్క** యనిరి. దీని పండ్లను వండుటవలన శ్రేష్ఠమైన నూనె దొరకును (గంధ వర్గము I 4 (5) చూ॥).

**లవణ సముద్రము** ఉప్పు సముద్రము చూ॥ J. C.

**లవొదికయ** (Laodicea). ఈ పేరుగల పట్టణము చిన్నాసియా పశ్చిమ ప్రదేశమందు ప్రవహించు లైకసను చిన్న యేటియొద్దున కట్టఁ బడెను. క్రీ॥ ము॥ మూఁడవ శతాబ్దమందది రెండవ అంతియోఖసు మహారాజువలన స్థాపించఁ బడెను. లవొదికయ ఎఫెసు పట్టణమునుంచి యుఫ్రాతు నదియొద్దకు రోమీయులు వేసిన రాజమార్గముమీఁదనే కట్టఁబడినందున నది వర్తక మున కనుకూలమైన గ్రామము గనుక ఆ యూరి నివాసులు స్థితిమంతులై యుండిరి. అది మొదట గ్రేకు ప్రభుత్వములో నుండినంతకాలము నంతగ వృద్ధిచెందలేదు గాని రోమీయుల వశమైన తరువాత గొప్పస్థితికి వచ్చెను. లవొదికయ పట్టణము రెండు విషయములకు ప్రసిద్ధి. 1. ఆ యూరివారు ఒకవిధమైన రోమాపట్టణపు నూలును వడికి అమ్ముచుండిరి. 2. అక్కడి వైద్యులు బహు నైపుణ్యముగలవారై చెవులవ్యాధిని స్వస్థ పఱచు జటామాంసి అత్తరును, కంటివ్యాధి నివారణ కొక చూర్ణమును చేయుచుండిరి (ప్రక 3[18]) ప్రకటన గ్రంథమందు వివరించఁబడిన యేడు సంఘములలో నీ లవొదికయ యొకటి. ఆ సంఘము పౌలుయొక్క సహచరులలో నొకఁడై యుండిన ఎపఫ్రాలవ స్థాపితమాయెను (కొలా 4[13]). పౌలు వ్రాసిన ఎఫెసీయుల పత్రిక వీరి యొద్దకు పంపఁబడుట (4[16]) మాత్రము కాక కొలొస్సై పత్రికను సహా వీరు చదువ వలెనని 4[16] నందు చూచి తెలిసికొనవచ్చును. క్రీ॥ శ॥ 60 సం॥ మందు సంభవించిన భూకం పమువలన నా పట్టణము శిథిలమాయెను గాని కొన్నాళ్లైన వెనుక దాని కాపురస్థులు దానిని తిరిగి కట్టిరి. మహమ్మదీయు లా ప్రదేశము నాక్ర మించి వశపరచుకొనఁగా లవొదికయ ధ్వంసమయి యప్పటినుండి పాడుపడియున్నది. M.

**లష్షారోను** (Lassharon = షారోను వైపుకు). యెహోషువ జయించిన కనాను పట్టణ ములలో నొకటి (యెహో 12[18]). అది షారోనుకు సంబంధించినదని దాని పేరునుబట్టి చెప్పవచ్చును. షారోనను పేరు కర్మెలు పర్వతమునకు దక్షిణమున నుండు బయలునకు మాత్రమే గాక తిబెరియ పట్టణము తాబోరు కొండలమధ్య నుండు బయ లునకును వాడినట్లు సూచన లున్నవి. తిబెరి యకు దాదాపు 6 మైళ్లు పడమరగా నుండు సారోను (*Sarona*) యను పురాతన స్థానమే దీని యునికిగా భావించుచున్నారు.

**లసైయ** (Lasea). క్రేతుద్వీపపు దక్షిణ తీరమందలి రేవు పట్టణము. అది మంచిరేవులు అనఁబడిన రేవుకు సమీపముగా నుండెను. పౌలు కైసరయనుండి రోమాకు వెళ్లఁగా దీనిమీఁదుగా వెళ్లెను (కార్య 27[8]). అచ్చట నేటివఱకు అదే పేరుగల పాడుదిబ్బలున్నవి (పటము V, G 5).

**లహదు** (Lahad = బాధపఱచఁబడిన). యూదా సంబంధులలోని సొరాతీయుల వంశ ములో నొకదానికి మూలపురుషుఁడు (I దిన 4[2]).

**లహ్మాసు** (Lahmas, Lahmam). యూదాలోని షెఫేలాలో నుండు ఒక పట్టణము (యెహో 15[40]). ప్రస్తుతము హెబ్రోనుకు దాదాపు 12 మైళ్లు వాయవ్యముగా నుండు ఎల్ లాహ్ము (*el-Lahm*) దీని యునికి యను కొనుచున్నారు (పటము II, D 2).

**లహ్మీ** (Lahmi). గిత్తీయుఁడగు గొల్యాతు సహోదరుఁడు. ఇతఁడు ఎల్హానానుచే చంపఁ బడెను (I దిన 20[5]). II సమూ 21[19] నందును ఇదే సంగతి యున్నది గాని హెబ్రీభాషలో ఎల్హానాను గొల్యాతు సహోదరుని గాక గొల్యా తునే చంపినట్లున్నది. ఇది వ్రాఁతలో వచ్చిన పొరబాటు గాన తెలుఁగు భాషలో దానిని సవరించిరి (ఎల్హానాను చూ॥).

## లా

**లాకీషు** (Lachish = పట్టుకొనుటకు కష్ట తరమైన). యూదా గోత్రపు వాయువ్య

దిక్కున ఫిలిష్తీయదేశపు సరిహద్దుకు సమీపముగా నుండు ఒక పట్టణము. మిగుల పురాతనమైన ఐగుప్తు రాతి శాసనములలో (*Tell-el-Amarna*) ఈ పేరు కొన్నిమారులు కన్పించును. బైబిలు నందీ పేరు మొదట యెహోషువ కాలములో కనఁబడును. గిబోనీయులు యెహోషువతో సంధిఁజేసికొన్న పిమ్మట వారితో యుద్ధముచేసిన అయిదుగురు రాజులలో లాకీషురాజు ముఖ్యుఁడు (యెహో $10^{3}$). యెహోషువ అతని నోడించి అతని పట్టణమును జయించెను ($10^{31}$ $12^{11}$). యూదావారి పట్టణములో నిది లెక్కింపఁబడెను ($15^{39}$). రాజగు రెహబాము ఇచ్చట ప్రాకారములను కట్టించెను (II దిన $11^{9}$). తనపై కుట్ర జేసినవారికి చిక్కకుండ రాజైన అమజ్యా పారిపోయి ఇచ్చటికి వచ్చెను గాని తప్పించుకొనలేక ఇక్కడనే చంపఁబడెను (II రాజు $14^{19}$ II దిన $25^{27}$). ఈ పట్టణస్థులను మీకా గద్దించి వారికి కలుగనైయున్న శిక్షను ప్రకటించెను (మీకా $1^{13}$). హిజ్కియా కాలములో అష్షూరు రాజగు సన్హెరీబు దీనిని పట్టుకొని, తనకు యెరూషలేము నప్పగింపవలెనను కబురును రబ్షాకే యను వాని ద్వారా ఇక్కడ నుండి పంపెను (II రాజు $18^{13-17}$ II దిన $32^{9}$ యెష $36^{2-8}$). నెబుకద్నెజరు దీనిని జయించెను (యిర్మీ $34^{7}$). చెఱకాలమునకుఁ బిదప యూదు లిందులోనే మఱల నివసించిరి (నెహె $11^{30}$).

ఇటీవల ఈ పట్టణ శిథిలములను త్రవ్వించి దాని సంగతులను తేటగాఁ దెలిసికొనిరి ప్రస్తుతము దానిని టెల్-ఎల్-హెసి (*Tel-el-Hasy*) యని పిలుతురు. అది గాజాకు 16 మైళ్ల దూరమున తూర్పు దిక్కునకు కొంచెముత్తరముగా నున్నది. అచ్చట పది పట్టణములు ఒకదాని తరువాత నొకటి కట్టఁబడినట్లు కనుగొనిరి. ఇది చాల పురాతనమైన పట్టణమని తెలియుచున్నది. దానికి సమీపమునందే ఉం-లాకిస్ (*Umm Lakis*) అను శిథిలములును గలవు. ఇది రోమీయుల కాలములో కట్టఁబడిన పట్టణమని ఆ శిథిలములవలనఁ దెలియును. లాకీషు అను పేరీ పదమునందు కనఁబడుచున్నందున దీనిని లాకీషు వారు కట్టినట్లూహింపవచ్చును. (పటము II C 2).

లాగు వస్త్రము 3 చూ॥

**లాజరు** (Lazarus = దేవసహాయము). ఎలియాజరు అను పదముయొక్క మాఱురూపము.

1. మరియమార్తల సహోదరుఁడు. వీరి పేరులు లూకా సువార్తలోను (లూ $10^{38-41}$), మరియు చేసిన కార్యము మత్తయి మార్కు సువార్తలలోను (మ $26^{6-13}$ మా $14^{3-9}$) ఉన్నను, ఈ మూఁడు సువార్తలలో దేనియందైనను ఈ లాజరు పేరు కనఁబడుటలేదు. అతని సంగతి యోహానువలన మాత్రమే తెలుపఁబడెను అతఁడు జబ్బుపడియున్న సమయములో మరియమార్తలు ఆయనచేత ప్రేమింపఁబడినవాఁడు జబ్బుపడెనని అతనిగూర్చి క్రీస్తుకు కబురంపిరి (యోహా $11^{3}$). అందువలన ఇతనిని క్రీస్తు విశేషముగా ప్రేమించెనని తెలియుచున్నది. ఇతఁడు జబ్బువలన చనిపోయిన నాలుగుదినములకు క్రీస్తు బేతనియకు వెళ్లి అతనిని బ్రదికించెను ($11^{1-44}$). దీని విషయమై కృతజ్ఞత చూపుటకు క్రీస్తు చనిపోయిన వారములో ఆయనకు విందుచేసిరి. అప్పుడు పంక్తియందు కూర్చుండిన వారిలో లాజరొకఁడు ($12^{1-8}$). క్రీస్తు ఇతనిని లేపినందున అనేకులు వచ్చి చూచి ఆయనయందు విశ్వసించుచుండఁగా యూదుల అధికారులు ఆయనతోకూడ ఇతనిని చంప నుద్దేశించిరి ($12^{9-11}$). ఇతని చర్యలను గూర్చి ఇంక నేమియు తెలియకపోయినను నేటి వఱకు యెరూషలేమునకు ఆగ్నేయదిక్కున నున్న ఎల్-అజరీయ (*El-Azariah*) అను పేరుగల ఊరిపేరునందు అతనిపేరు కనఁబడును.

2. క్రీస్తు చెప్పిన ఉపమానములోని ఒక పేదవాఁడు (లూ $16^{19-31}$). క్రీస్తు చెప్పిన ఉపమానములన్నిఁటిలో ఈయొక్క పేరు మాత్రమే కనఁబడుచున్నది గాన ఆ కాలము నందు జీవించిన వారిలో నొకఁడని కొందఱను కొందురు. అది యట్లుండవచ్చును, ఉండక పోవచ్చును. భక్తులకుండు ఇప్పటి స్థితికిని తరువాత కలుగఁబోవు సౌఖ్యమునకునుగల వ్యత్యాసము క్రీస్తు యుపమానమునందు తేటగా చూపెను.

**లాటిన్ భాష** (Latin). క్రీస్తుకాలమున పలెస్తీను దేశము నేలిన రోమనులు మాట్లాడిన

భాష. న్యాయస్థానములలో నుపయోగించిన కొన్ని లాటిన్ పదములు (క్రొత్త నిబంధన గ్రీకు భాషలో కనఁబడుచున్నవి. ప్రేతోర్యము (మా $15^{16}$), లిబెర్తీనులు (కార్య $6^{9}$), దేనారము (మ $18^{28}$) మొదలగు లాటిన్ భాషా పదములు తెలుఁగు బైబిలునందును చూడనగును. భాషాంతరము చేసిన పదములు ఇరువదికన్న నెక్కువగా నున్నవి. అది ఆ కాలపు ప్రభుత్వమువారి భాషయగుటచేత, క్రీస్తుమీఁద మోపఁబడిన దోషారోపణను వాడుకలోనున్న హెబ్రీ, గ్రీకు భాషలలో మాత్రమే గాక లాటిన్ (=రోమాయి) భాషలోకూడ వ్రాసిరి (యోహా $19^{20}$).

లాటిన్ భాషాంతర ప్రతులు భాషాంతరములు 4 చూ॥

లాబాను (Laban = తెల్లని).

1. మెసపొతేమియలో పశువుల మందలు గలిగిన యొక భాగ్యవంతుఁడు. అబ్రాహాము సోదరుఁడైన నాహోరుకు మనుమఁడు. బెతూయేలు కుమారుఁడు (ఆది $24^{28-31}$). తన సహోదరి యగు రిబ్కాను ధనికుఁడగు తన మామయొక్క ఒకఁడే కుమారుఁడగు ఇస్సాకున కిచ్చుటలో చూపిన సంతోషమును బట్టియు ($24^{30,50}$), తన మేనల్లుఁడగు యాకోబు నెడల కనుపఱచిన మోస బుద్ధిని బట్టియు లాబాను గుణలక్షణములను కనుగొనవచ్చును. ఒక కుటుంబము వర్ధిల్లుటవలన మఱియొక కుటుంబమునకు అసూయ కలుగుటచే సమాధాన ముండుట అసాధ్య మాయెను. గనుక యాకోబు దేవుని యాజ్ఞవలన కనానుకు వెళ్లనై రహస్యముగా కదలెను. లాబాను యాకోబును వెంటాడెను. అయితే యాకోబున కేహానియు చేయకూడదని దేవునివలన హెచ్చరింపఁబడినందున యాకోబుతో సమాధానపడి సంధిజేసికొని తిరిగి వచ్చెను. లాబాను దేవుని నెఱిఁగి ఆరాధించినట్లు కనఁబడుచున్నది ($24^{50}$ $30^{27}$ $31^{53}$). రాహేలు తన తండ్రియింట దొంగిలించిన దేవతలనుబట్టి విగ్రహారాధికుఁడని తెలియుచున్నది.

2. ఒక పట్టణము (ద్వితీ $1^{1}$). దీనినిగుఱించి ఏమియు తెలియదు. సంఖ్యా $33^{20}$ లో నున్న లిబ్నా యిదేనని కొందఱెంచెదరు (లిబ్నా చూ॥). H.

లామా ఎలోయి చూ॥

లామెద్ (Lamed = ל అను అక్షరము). హెబ్రీ యక్షరములలో పండ్రెండవది. అక్షరమాలికగా వ్రాయఁబడిన 119-వ కీర్తనలోని 12 వ భాగమునకు పేరు (కీర్త $119^{89-96}$). మూలభాషయం దాభాగములోని ప్రతి పంక్తియు నీ యక్షరముతోనే యారంభమగును.

లాయిషా (Laishah = సింహము). బెన్యామీను గోత్రమందలి యొక గ్రామము. ఇది అనాతోతుకు ఉత్తరమున నున్నట్లు యెష $10^{30}$ లోని క్రమమువలనఁ దెలిసికొనఁగలము గాని, దాని యునికిని గూర్చిన మరే సూచనలు లేవు.

లాయీషు (Laish = సింహము).

సౌలు తన కుమార్తెయు దావీదు భార్యయు నగు మీకాలును ఇచ్చి వివాహముచేసిన పల్తీయేలను వాని తండ్రి (I సమూ $25^{44}$ II సమూ $3^{15}$).

లాయేలు (Lael = దేవునికి ప్రతిష్ఠితము). లేవీయులలోని గెర్షోను తెగవారిలో నొకఁడు (సంఖ్యా $3^{24}$).

లాషా (Lasha = సందు). ఆదికాలమందు కనానుదేశమునకు ఆగ్నేయదిక్కున నుండు సరిహద్దు పట్టణములలో నొకటి (ఆది $10^{19}$). దీని యునికి తెలియదు.

## లి

లిఖీ (Likhi = జ్ఞానముగల). మనష్షేగోత్రమందలి యొక కుటుంబ ప్రధాని (I దిన $7^{19}$).

లినుు (Linus). తిమోతికి వందనములు పంపించిన పౌలుతోటి వారిలో నొకఁడు (II తిమో $4^{21}$). బైబిలునందు ఇతనిగూర్చి మరేమియు తెలియక పోయినను ఇతఁడు రోమాలోని మొదటి అధ్యక్షుఁడని ఐరేనియును (*Irenaeus*) యూసేబియసును (*Eusebius*) వ్రాసిరి. ఈ పేరు బహు అరుదుగా కనఁబడుటచే వారు వ్రాసినది నిజము కావచ్చును.

ఆదికాలములో రచించిన అపొస్తలుల మూల చట్టములు (*Apostolic Constitutions* VII 46) చూడఁగా నితఁడు II తిమో 4[21] లో నుదాహరింపఁబడిన భర్తగాని కొడుకుగాని యైనట్లున్నది.

**లిబియ, లూబీయులు, లుబీయులు** (Libya, Libyans). రోమనుల కాలములో ఉత్తరాఫ్రికాయందు ఐగుప్తు కార్తేజ్ (*Carthage*) లకు మధ్యనున్న దేశము. దానిపడమటి భాగము కురేనే యనఁబడెను. ఇచ్చట నుండి వచ్చిన యూదులు పెంతెకొస్తునాడు జరిగిన వింతైన కార్యములు చూచిరి (కార్య 2[10]). ఈ లిబియ ప్రాంతములం దుండువారు లూబీయులు (నహూ 3[9]), లుబీయులు (దాని 11[43] II దిన 12[3]). అని పిలువఁబడిరి.

**లిబెర్తీనులు** (Libertines = స్వతంత్రత నొందినవారు). దాసులై యుండి స్వతంత్రత నొందినవారికి పెట్టఁబడిన పేరు. రోమీయులచే యుద్ధములో పట్టఁబడిన యూదులు చక్రవర్తి దయచే విడుదల నొందిన పిదప వారికి కలిగిన పేరని కొందఱి యభిప్రాయము. అట్టి యూదులు తమకొఱకొక సమాజమందిరమును యెరూషలేములో కట్టించుకొనిరి. ఈ సమాజ మందిరము నందుండిన వారును తక్కిన వారివలె స్తెఫనుతో తర్కించిరి (కార్య 6[9]).

**లిబ్నా** (Libnah = తెల్లనిది).

1. ఇశ్రాయేలీయులు అరణ్య సంచారము చేయునప్పుడు దిగిన యొక స్థలము (సంఖ్యా 33[20]). దీని యునికి తెలియదు (లాబాను 2 చూ॥).

2. మక్కేదా లాకీషులకు మధ్యనుండు నొక పట్టణము. యెహోషువ దీనిని పట్టుకొనెను (యెహో 10[29,30] 12[15]). కనాను దేశము భాగించినప్పుడది యూదా గోత్రికులకు వచ్చెను (15[42]). ఇది తరువాత యాజకుల కియ్యఁబడెను (21[13] I దిన 6[57]). రాజగు యెహోరాము కాలములో నిది తిరుగఁబడెను (II రాజు 8[22] II దిన 21[10]). అష్షూరు చక్రవర్తి యగు సన్హెరీబు దానికి విరోధముగా యుద్ధము చేసెను (II రాజు 19[8] యెష 37[8]). రాజైన యోషీయా భార్యయొక్క జన్మస్థాన మిదే (II రాజు 23[31] 24[18] యిర్మీ 52[1]). అది షెఫేలా ప్రాంతములో నున్నది (పటము I, C 9).

**లిబ్నీ, లిబ్నీయులు** (Libni = తెల్లనిది, శుద్ధిది, Libnites).

1. లేవి కుమారుఁడగు గెర్షోను జ్యేష్ఠ పుత్రుఁడు, గెర్షోనీయులలోని యొక కుటుంబమున కితఁడు పెద్దయయ్యెను (నిర్గ 6[17] సంఖ్యా 3[18,21] 26[58]). ఈ కుటుంబికులకు లిబ్నీయులను పేరు గలదు (సంఖ్యా 3[21] 26[58]).

2. లేవి కుమారుఁడగు మెరారియొక్క మనుమఁడు (I దిన 6[29]). ఇతఁడు మెరారి తెగలో చేరినవాఁడు. వెవ్వేఱు తెగలలో చేరినట్లున్నను వీ రిద్దఱును ఒకఁడే యని కొందఱి యభిప్రాయము అట్లయిన పక్షమున ఈ పేరుల జాబితా వ్రాయునప్పుడు పొరపాటు వచ్చియుండును. ఇద్ద ఱనుకొనుటయే యుక్తముగ కన్పడుచున్నది.

## లు

**లుకయొనియ** (Lycaonia = లుకయోను రాజు దేశము. తోఁడేళ్లుగల దేశము). చిన్నాసియాలో ఆగ్నేయ దిక్కునయున్న యొక పరగణా. మిగుల పర్వతమయము. దీనికి ఉత్తరముగ గలతీయ, తూర్పున కప్పదొకియ, దక్షిణమున కిలికియ, పడమట ఫ్రుగియ యను పరగణాలు సరిహద్దులుగా నున్నవి. పౌలీ ప్రాంతములోని ఈకొనియ, లుస్త్ర, దెర్బే యను మూఁడు పట్టణములను దర్శించి అచ్చట సభలు స్థాపించెను (కార్య 13[51]-14[23]). లుస్త్రలోని వారు లుకయొనియ భాషను వాడినట్లు 14[11] వలనఁ దెలియుచున్నది. అది గ్రీకుభాష కాదను సంగతి గాక మఱేమియు దానిగూర్చి తెలియదు. రెండవ ప్రయాణములో పౌలు ఈ దేశమునకు వచ్చి అచ్చటనున్న తిమోతిని తన పనివారిలో నొకనిగఁ జేర్చుకొనెను (16[1-3]). మూఁడవ ప్రయాణములో కూడ అతఁడీ దేశము గుండా ప్రయాణము చేసెను (18[23]). ఆ దేశస్థులు కొండవాసులు గాన చాలకాలమువఱకు లోఁబడకపోయినను, మాసిదోనియ రాజ్యమును మొదట స్థాపించిన చక్రవర్తులును, తరువాత

వచ్చిన రోమనులును దీనిని జయించి గలతీయకుఁ జేర్చిరని నవీన పండితులు రాతిశాసనముల ద్వారా తెలిసికొనిరి. గలతీయ సంఘములని పిలువఁ బడిన వాటిలో లుకయోనియలోని సంఘము లుండెనని నవీనపండితు లభిప్రాయపడుచున్నారు (పటము V, K 4).

**లుకియ** (Lycia = లుకుస్ అను వాని దేశము). చిన్నాసియాలో నైరృతిగా నుండు పరగణా. దానికి ఉత్తరమున పంఫూలియ పిసిదియ కేరియా యను పరగణాలును తక్కిన దిక్కులందు మధ్యధరా సముద్రము నున్నవి. ఇది కొండ ప్రదేశమైనను సముద్రముచే చాలవఱకు ఆవరింపఁబడినందున రేవుపట్టణము లనేకములు గలవు. వాటిలో రెండుమాత్రము బైబిలునం దుదాహరింపఁబడినవి. పౌలు మూఁడవ ప్రయాణాంతమున తిరిగి యెరూషలేమునకు వెళ్లు చుండఁగా పతర యను చోటను (కార్య $21^{1,2}$), రోమాకు ఖైదీగాఁ బోవునప్పుడు మూర యను చోటను ($27^{5,6}$) దిగెను. (పతెర, మూర చూ॥ పటము V, J 4).

**లుద్ద** (Lydda). యొప్పేదగ్గరనున్న యొక పట్టణము. అది మక్కబేయుల కాలములో ప్రసిద్ధి కెక్కెను. క్రీ॥ పూ॥ 145 సం॥ నకు పూర్వమే స్వతంత్ర పట్టణములలో నొకటియై షోమ్రోనుకు సంబంధించిన దయ్యెను. 145 సం॥ దానిని యూదయకుఁ జేర్చిరి (I మక్క $10^{30-38}$ $11^{28-34}$). పేతురు పట్టణమును దర్శించి అచ్చట ఐనెయను బాగుచేసెను (కార్య $9^{33-35}$). దాని పురాతనపు పేరు లోదు (లోదు చూ॥).

**లుబీయులు** లిబియ చూ॥

**లుసానియ** (Lysanias = దుఃఖనివారణ). తిబెరియ చక్రవర్తి కాలములో అబిలేనే దేశమునకు అధిపతిగా నున్నవాఁడు (లూ $3^{1}$). ఇతనిని రెండవ లుసానియ యని పిలుతురు. మొదటి లుసానియ క్రీ॥ పూ॥ 40-36 సం॥ లలో ఏలినట్లున్నందున అతఁడు క్రీ॥ శ॥ 27 సం॥ నం దేలినట్లు వ్రాయుట పొరపాటని కొందఱి మధ్య యభిప్రాయపడిరి గాని రెండవ లుసానియను గూర్చిన సూచనలు ఆయా శాసనములయందు కనబడుచున్నందున లూకా వ్రాసిన దానిలో నే పొరపాటును లేదని స్పష్టమగుచున్నది (అబిలేనే చూ॥).

**లుస్త్ర** (Lystra). లుకయోనియ పరగణాలోని పట్టణము. లౌకిక చరిత్రలో ఆ పట్టణమున కెట్టి ప్రసిద్ధియులేదు. అక్కడ పుట్టుక నుంచి కుంటివాఁడైన నొకని బాగుచేసినందున ఆ పట్టణస్థులు పౌలు బర్నబాలను దేవతలనుగా భావించి పూజించఁబోవుటవలనను, పౌలు అచ్చట యూదుల కుట్రాలోచనకు లోనై రాళ్లతోఁ గొట్టఁబడుటవలనను బైబిలు చరిత్రయందు ముఖ్యమైన దయ్యెను (కార్య $14^{5,21}$ II తిమో $3^{11}$). పౌలు సహవాసియగు తిమోతి లుస్త్రవాఁడై యుండవచ్చునని కొందఱి యభిప్రాయము (కార్య $16^{1,2}$). ఆ పట్టణ శిథిలము లీ మధ్య కనుగొనఁబడినవి. వాటిని ప్రస్తుతము జోల్డెరా (*Zoldera*) యందురు. అది ఈకొనియకు 11 క్రోసుల దూరమందు కొంచెము నైరృతిగా నున్నది. (పటము V, K 4).

## లూ

**లూకా** (Luke). పౌలు సహచరులలో నొకఁడు. ఇతని పేరు కొలొ $4^{14}$ ఫిలే 24 II తిమో $4^{11}$ నందు మాత్రము బైబిలులోఁ గనఁబడుచున్నది. ఇతఁడు వృత్తినిబట్టి వైద్యుఁడు (కొలొ $4^{14}$). పౌలితనిని ప్రియుఁడైన వైద్యుఁడని పిలిచెను. పౌలు కఠినపరికపు చెఱయం దుండఁగా అందఱుతని విడిచి పోయినను లూకా మాత్ర మతనితో నుండెనని II తిమో $4^{11}$ వలనఁ దెలియుచున్నది. ఇతఁడు లూకా సువార్తను అపొస్తలుల కార్యములను వ్రాసినవాఁడని నేటి వఱకును అంగీకరింపఁబడుచున్నది గావున ఆ గ్రంథముల యందలి (ముఖ్యముగా కార్యముల గ్రంథమందున్న దినచర్యలోని) కొన్ని సూచనల వలన మఱికొన్ని సంగతులు తెలియును. పౌలు చేసిన రెండవ మిషనెరీ ప్రయాణమునం దితఁడు త్రోయలో అతనిని గలిసికొని ఫిలిప్పీయివఱకు వెంబడించెను (కార్య $16^{10-17}$). మూఁడవ ప్రయాణమందు ఫిలిప్పీయిలో నతనిఁ గలిసికొని యెరూషలేముకు వెళ్లెను ($20^{5}$-$21^{18}$). దీనినిబట్టి ఈ మధ్యకాలమునం దితఁడు ఫిలిప్పీయిలో బోధ

కుఁడుగా నున్నట్లు కొందఱి యభిప్రాయము. అతని కాపురస్థలము ఫిలిప్పీయి యని కొందఱి యూహ గాని అతనిది అంతియొకయ యని పారంపర్యమువలనఁ దెలియుచున్నది. అంతియొకయ సంఘపు సంగతులు ఈ గ్రంథమున స్పష్టముగా నుదాహరింపఁబడుట యిట్టి యభిప్రాయమున కొక నిదర్శనముగా నున్నది ($6^{3}$ $11^{19-27}$ $13^{1-3}$ $14^{26-28}$ $15^{1,2-30-40}$ $18^{22,23}$) గాని, నవీన పండితులలో నొకరగు రెమ్సే (*Ramsay*) యనువాఁడీయన ఫిలిప్పీయి పట్టణస్థుఁడని అభిప్రాయ పడుచున్నాఁడు, పౌలు కైసరయయందు చెఱలో నుండఁగా లూకా అతనిదగ్గర ఉన్నట్లు కనఁబడుచున్నది. పౌలు రోమాకుఁ బోవుచుండఁగా లూకా అతనితో ప్రయాణము చేయుటయే ($27^{1}$-$28^{16}$) యిట్లనుకొనుటకు ఆస్పదము కలిగించుచున్నది. ఇతఁడు యూదుఁడు కాడని పౌ లితనిని వారితోఁ చేర్చక పోవుటవలనఁ దెలియుచున్నవి (కొలొ $4^{11}$). లూకా సువార్తలోని సూచనలును దీనికి చక్కగా సరిపడును. సువార్త విషయము సంఘము లన్నిటిలో ప్రసిద్ధిచెందిన సహోదరుఁడని కొరింథీయులకు పౌలు వ్రాసిన వాఁడితఁడే యని తలంతురు (II కొరి $8^{18}$). హెబ్రీ పత్రిక గ్రంథకర్తయు నితఁడని మఱి కొందఱి యభిప్రాయము (లూకా సువా, అపొస్తలుల కార్యములు చూ॥).

**లూకా సువార్త** (Gospel according to St. Luke). బైబిలులోని సువార్తలలో మూఁడవది. (సువార్తలు, యేసుక్రీస్తు చూ॥).

1. గ్రంథకర్త:—దీనిని లూకా వ్రాసెను (లూకా చూ॥). ఈ గ్రంథమునం దతనిపేరు లేకున్నను దీని నతఁడే వ్రాసినట్లు ఆరంభకాలము నుండి ఒప్పుకొనుచున్నారు. ఈ సువార్త పీఠికకును అపొస్తలుల కార్యములను గ్రంథపీఠికకును, ఈ రెండు గ్రంథముల శైలికినిగల సంబంధమును బట్టి ఒకఁడే వీటిని రచించెనని అందఱు అంగీకరింతురు. క్రీ॥ శ॥ 100 సం॥ న రోమావాఁడగు క్లెమెంటు కొరింథీయులకు వ్రాసిన ఉత్తరములోను, అందఱిలో మొదటి విమతస్థుఁడగు మార్షియన్ (*Marcion*) 140 సం॥ న వ్రాసిన వాటిలోను 170 సం॥ న కూర్చఁబడిన మిగుల పురాతనమగు క్రొత్త నిబంధన గ్రంథపు జాబితా యగు మ్యూరటోరియన్ శాసనములలోను (*Muratorian Canon*) ఈ సువార్తను లూకా వ్రాసినట్లే కనఁబడుచున్నది. నవీనపండితులు ఇతఁడే దీని గ్రంథకర్త యని యేకగ్రీవముగా నొప్పుకొందురు.

2 కృతిపతి:—థెయొఫిల యను ఘనుని కిది కృతి యీయఁబడెను (లూ $1^{1}$ థెయొఫిల చూ॥). ఇది అతనిపేరిట వ్రాయఁబడినను ఇతరులకొఱకు నుద్దేశింపఁబడినదని కొందఱి యభిప్రాయము. క్రీస్తును గూర్చిన యేయే విషయములలో నతఁడు నేర్పుకొనెనో వాటి యథార్థతను తెలిసికొను నిమిత్తము లూకా థెయొఫిలాకు వ్రాసెనని పీఠిక వలనఁ దెలియుచున్నది (లూ $1^{1-4}$).

లూకా వ్రాసిన వాటి కాధారభూతములగు సంగతులును ఈ పీఠికవలన స్పష్టమగుచున్నవి. లూకా వ్రాయుటకు పూర్వమే అనేకులు ఆ సంగతులను వ్రాయఁ బూనుకొనిరి. వీటికిఁ దోడు లూకా తాను వ్రాయఁదలంచుకొన్న సంగతులు పరిష్కారముగాఁ దెలిసికొనెను కావున అతనికిఁ బూర్వము ఆయననుగూర్చి వ్రాయఁబడినవియును, క్రీస్తును కన్నులార చూచి ఆయన చెప్పినవాటిని చెవులార విన్నవారును చెప్పఁగాఁ దెలిసికొనిన సంగతులే లూకా సువార్త కాధారములని తేటపడును.

3. కాలము:—యెరూషలేము నాశనము గూర్చి లూకా వ్రాసిన సంగతులు ($19^{41-44}$ $21^{20-24}$) మత్తయి ($24^{15-28}$), మార్కు ($13^{14-23}$) లు వ్రాసినవాటికన్న చాల తేటఁగా వ్రాసెను గాన, అతఁడు క్రీ॥ శ॥ 70 సం॥ న రోమనులచే కలిగిన ఆ నాశనమునకు తరువాత తన సువార్తను వ్రాయుచు మత్తయి మార్కులు వ్రాసినవాటిని సవరించెనని కొంద ఱభిప్రాయపడుచున్నారు. వారి యభిప్రాయప్రకారము లూకా దీనిని 70-80 సం॥ లోపల రచించినట్లు కనఁబడుచున్నది గాని పౌలు రోమాలో 65 సం॥ నందు చంపఁబడక పూర్వమే కార్యముల గ్రంథమును లూకా వ్రాసినట్లు కార్య $28^{30,31}$ వలనఁ దెలియును. మఱియు సువార్తను కార్యములకు మునుపే వ్రాసెను (కార్య $1^{1}$) గాన, లూకా దీనిని 66 సం॥ నకు ముందు వ్రాసెనని నిశ్చయింప

వచ్చును. లూకా తన సువార్త నొక అన్యునికి వ్రాయవలసి వచ్చుటచే అతఁడు క్రీస్తు ప్రవచనముల భావమును మఱింత స్పష్టముగాఁ దెలిసికొను నిమిత్తము యెరూషలేము నాశనమును గుఱించి అంత వివరముగా వ్రాసెనేగాని ఆ నాశనము జరిగిన పిమ్మట దీనిని వ్రాసియుండలేదు.

4. ముఖ్యలక్షణములు:—(1) ఈ గ్రంథ శైలినిఁబట్టి గ్రంథకర్త కడునేర్పరి యని కనఁబడుచున్నది. పీఠిక పండితుల శైలిని బోలియున్నది. లూకా చాలసార్లు తన కాధారముగా నుండిన ప్రతులలోని సంగతుల ననుసరించి వాటిని సవరించకయే ఉన్నపాటుగా తన గ్రంథములోఁ జేర్చినట్లున్నను అన్ని సువార్తలలోను ఈ గ్రంథశైలి చాల శ్రేష్ఠమైనదై యున్నది. ఈ గ్రంథమునందున్న రోగముల వివరమువలన దీని వ్రాసినవాఁడు వైద్యుఁడై యుండునని తోఁచుచున్నది ($4^{38}$ $5^{18}$ $8^{44}$ $10^{34}$). చరిత్రకారులవలె లూకా సువార్త సంగతులు జరిగిన చరిత్రకాలము నుదాహరించెను ($3^{1,2}$). (2) ఈ సువార్త అన్యుల కొఱకైనదని దీనిలోని సంగతులవలనను తెలియును. తక్కిన సువార్తలందీ యుద్దేశమున్నను, దీనియందు మఱింత యెక్కువగా దృష్టాంతపఱచఁబడెను ($7^{36-50}$ $13^{24-30}$ 15, $17^{7-10}$). అన్యుల కపొస్తలుఁడగు పౌలు బోధలను దృష్టాంతపఱచు సంగతు లీ సువార్తలో నెక్కువగా నున్నవి. ఈ సువార్త మానవులందఱికొఱకైన దనునది, క్రీస్తు వంశావళిని ఆదాము మొదలుకొని వ్రాయుట వలన తేటపడుచున్నది ($3^{23-38}$). (3) క్రీస్తును గూర్చి లూకా వ్రాసిన సంగతులనుబట్టి ఆయన ప్రార్థనచేయుచుండువాఁడు గలవాఁడనియు ($3^{21}$ $5^{16}$ $6^{12}$ $9^{18}$ $9^{28}$ $9^{29}$ $10^{21}$ $22^{39-46}$), పరిశుద్ధాత్మతో బలపఱచఁబడిన వాఁడనియు ($1^{35}$ $3^{22}$ $4^{1-14}$) తెలిసికొనవచ్చును. దేవదూతలుచేసిన పరిచర్యను గూర్చిన సూచనలు ఎక్కువగాఁ గలవు ($1^{11-19,26-38}$ $2^{9-15}$ $16^{23}$ $22^{43}$ $24^{23}$). ఆయా భక్తుల దర్శనములం దగుపడిన రూపములలో (యెహె $1^{10}$ ప్రక $4^{7}$ మొ॥) మానవరూపము, ఈ సువార్తకు సూచనగా నుండినట్లు చెప్పెదరు. క్రీస్తు మానవుఁడై ఈ లోకమునందు తన పనులన్నిఁటిని చేసెననియు, మానవులందఱికొఱకై వచ్చెననను సంగతి ఆ సూచన వలనఁ దెలియును. ఆయన బాల్యసంగతుల వివరమును (లూకా 1,2) పెరీయచర్యయు ($10^{1}$-$18^{34}$) లూకా మాత్రమే వ్రాసెను. (4) ఈ సువార్త ముగింపు ($24^{47-53}$) అసంపూర్ణముగా కనఁబడుచు కార్యముల గ్రంథముయొక్క ఆరంభ చరిత్రను (కార్య $1^{4-11}$) సరిపడుచున్నందున ఆ రెంటిను ఒకే చరిత్రయొక్క రెండు భాగములను కొనుట యుక్తము.

5. ముఖ్య భాగములు సంగతులు:—

I. పీఠిక:—దీనియందు కృతిపతిని గూర్చియు, ఈ గ్రంథమున కాధారములైన వాటినిగూర్చిన ప్రశంస ($1^{1-4}$) కలదు.

II. క్రీస్తు జన్మము, బాల్యము:—యోహాను పుట్టుకనుగూర్చి తెలుపుట, క్రీస్తు పుట్టుకను గూర్చి మరియకు తెలుపుట, మరియ ఎలీశబెతును దర్శించి స్తుతిగానము చేయుట, యోహాను జన్మము, జెకర్యా స్తుతిగీతము, క్రీస్తు జన్మము, సున్నతి, ఆలయమందు అర్పింపఁబడుట, సుమెయోను అన్నాలు ఆయనను దర్శించుట, పన్నెండేండ్ల వయస్సున క్రీస్తు దేవాలయమునందు బోధకుల మధ్యనుండుట ($1^{5}$-$2^{52}$).

III. ఆయన పనిలో ప్రవేశించుట:—ఇందు ఆయన పనిలో ప్రవేశించిన కాలసూచనలు, యోహాను చర్య, క్రీస్తు బాప్తిస్మము, క్రీస్తు వంశావళి, ఆయన శోధనలనుగూర్చి యున్నది ($3^{1}$-$4^{13}$).

IV. గలిలయ చర్య ($4^{14}$-$9^{50}$). ఇది చాల మట్టుకు మార్కు సువార్త ననుసరించును గాని నజరేతులో తిరస్కరింపఁబడుట ($4^{16-30}$), శిష్యులను పిలుచుట ($4^{31-37}$), విత్తువానిగూర్చిన ఉపమానము ($8^{4-18}$) లను విషయముల వేరు క్రమము ననుసరించినట్లు కనఁబడుచున్నది. ఆయన నజరేతుకు వచ్చి తిరస్కరింపఁబడినమీఁదట ($4^{14-30}$) కపెర్నహూమునకు వచ్చి బోధించి దయ్యము పట్టినవానిని, సీమోను అత్తను రోగములచే పీడించఁబడిన యనేకులను స్వస్థపఱచెను ($4^{31-41}$). గలిలయలో చేసిన మొదటి ప్రయాణమును మార్కువలెనే వ్రాసెను గాని దాని మధ్యను శిష్యులను పిలుచుటను గూర్చిన విషయమున్నది. క్రీస్తును విరోధించినందున ఆయన వేఱుపడి

అపొస్తలుల నేర్పఱచుకొనుటను గూర్చి ($5^{17}$ $6^{19}$) వ్రాసెను గాని దానికి సంబంధముగా కొండ మీఁది ప్రసంగమును గూర్చి క్లుప్తముగా నుదాహరించెను ($6^{20-49}$). అటుపిమ్మట ఆయన కపెర్నహూమునకు తిరిగివచ్చి శతాధిపతి సేవకుని స్వస్థపఱచెను. దీనినిగూర్చి మత్తయికూడ వ్రాసెను. తరువాత నాయీను ఊరి విధవరాలి కుమారుని బ్రదికించుటను గుఱించి లూకా మాత్రమే వ్రాసెను. అటుపిమ్మట యోహాను ఆయన యొద్దకుఁ దన శిష్యులను పంపుటనుగూర్చి మత్తయి ననుసరించి వ్రాసెను. పాపపుస్త్రీ ఆయన నభిషేకించుటయు, ఆ ప్రయాణమునం దాయనకు పరిచర్యచేసిన స్త్రీలను గుఱించియు లూకా మాత్రమే తరువాత ఉదాహరించెను ($7^{1}$-$8^{3}$). మార్కు ననుసరించి విత్తువాని ఉపమానము నుదాహరించెను గాని మధ్య ఆయన తల్లియు సహోదరులును, మతితప్పి యున్నాఁడని ఆయనను పట్టుకొనవచ్చిన సంగతి నుదాహరించెను. తరువాత మార్కు వ్రాసినట్లే గలిలయ సముద్రమును దాటుచు తుఫానును నిమ్మళింపఁజేయుటను సేనదయ్యములు పట్టినవాని స్వస్థతను తిరిగి కపెర్నహూమునకు వచ్చి యాయీరు కుమార్తెను బ్రతికించుటను, రక్తస్రావరోగియగు స్త్రీని బాగుచేయుటను గూర్చి ప్రస్తాపించెను ($8^{4-56}$). అపొస్తలుల నిద్దరిద్దరినిగా పంపుట హేరోదుకు కలిగిన భయము, ఐదువేలమంది కాహారము పెట్టుటను గుఱించి వ్రాసెను ($9^{1-17}$). అప్పటి నుండి మత్తయి మార్కులలో నున్నట్లు 4000 మంది కాహారము పెట్టుటవఱకు జరిగిన సంగతులను వదలివేసి, ఫిలిప్పుదైన కైసరయ ప్రాంతములలో పేతురు చేసిన ఒప్పుదల, రూపాంతరము, మూర్ఛరోగము గలవానిని బాగుచేయుటను గూర్చియు, తనకు కలుగనైయున్న శ్రమలను దెలిపి, శిష్యులితరుల నాటంకపెట్టి తమలో తాము గొప్పతనము విషయమై పోట్లాడుకొన్నందున గద్దించి ($9^{18-50}$) గలిలయలోని చర్యను ముగించుటగూర్చి వ్రాసెను.

V. యెరూషలేమునకుఁ బోవుచు పెరీయలో జరిపిన చర్య. దీనిలో లూకా యితర సువార్తికులు వ్రాయని సంగతు లనేకములు వ్రాసెను, గాని కొన్ని మత్తయి సువార్తలో మాత్రము కనఁబడుచున్నవి. ఈ భాగమునందీ దిగువ సంగతులున్నవి. సమరయులు క్రీస్తును చేర్చుకొనక పోవుట* తనను వెంబడింపవలెనని కోరిన కొందఱికాయన బుద్ధిచెప్పుట ($9^{51-57}$) డెబ్బది మందిని పనికి పంపుట* ఆ సమయమందే కపెర్నహూము దాని చుట్టుప్రక్కలనుండు కొన్ని యూళ్లగతులను దెలుపుట, డెబ్బదిమంది తిరిగివచ్చి తమ పని ఫలితమును రిపోర్టు చేయుట* దానినిబట్టి క్రీస్తు దేవుని స్తుతించి, తండ్రికిని తనకునుగల ఐక్యమును గూర్చి తెలుపుటను గూర్చిన సంగతులు ($10^{1-24}$), గొప్ప యాజ్ఞను గూర్చి యడిగినవానికి మంచి సమరయునిగూర్చిన ఉపమానమును దెలుపుట,* మరియ మార్తలయింట బోధించుట* ($10^{25-42}$) ప్రార్థించుటకు నేర్పుమని యడిగిన శిష్యులకు ప్రభువు ప్రార్థనను చెప్పి అర్ధరాత్రివేళ వచ్చిన స్నేహితుని గూర్చిన ఉపమానము* ద్వారా ప్రార్థించవలసిన రీతిని తెలుపుట ($11^{1-13}$). మూఁగవాని స్వస్థపఱచినప్పుడు బయెల్జెబూలు శక్తివలన నిట్లు చేయుచున్నాఁడని విరోధులనఁగా వారిని ఖండించుట, క్రీస్తుతల్లి ధన్యురాలనియన్న యామెకును* గుఱుతులడిగిన వారికిని,* పరిసయ్యుని యింట భోజనమును చేయునప్పుడు స్నానము చేయకనే భుజించుచున్నాఁడని యాక్షేపించిన వారికిని బుద్ధిచెప్పుట,* శాస్త్రులను పరిసయ్యులను గద్దింపఁగా వారు మిగుల విరోధభావముతో నాయనను పట్టుకొనుటకై పొంచి యుండుట* ($11^{14-53}$), తరువాత గొప్ప సమూహమొకటి కూడుకొనఁగా పులిసిన పిండిని గూర్చియు, మానవులకు భయపడకుండుటను గూర్చియు తన శిష్యులకు బోధించిన పిమ్మట ఆస్తిని భాగించుమని మనవిచేసిన యొకని ద్వారా లోకధనమును గూర్చియు, మెలకువ పడుటను గూర్చియు, నమ్మకమును గూర్చియు శ్రమలయందు స్థిరముగా నుండుటను గూర్చియు శిష్యులకు బోధించుట (12), పిలాతు గలిలయులలోఁ గొందఱిని హత్యచేయుటనుగూర్చి విని అందఱును పశ్చాత్తాపపడవలెనని బోధించి,*

* ఈ గుర్తుగల సంగతులు లూకా మాత్రమే వ్రాసెను.

ఫలించని అంజూరపుచెట్టును గూర్చిన ఉపమానము చెప్పుట* ($13^{1-9}$). విశ్రాంతిదినమున బలహీనురాలగు నొక స్త్రీని స్వస్థపఱచఁగా పరిసయ్యులు తప్పు మోపినందున వారికి బుద్ధి చెప్పుట* ($13^{10-17}$). దేవుని రాజ్యమునుగూర్చి ఆవగింజ పులిసినపిండి యను ఉపమానములను జెప్పుట ($13^{18-21}$), రక్షింపఁబడువారు కొందఱేనా యను ప్రశ్నకు జవాబు చెప్పుట* ($13^{22-30}$) హేరోదాయనను చంప యత్నించుచున్నాఁడన్న వారికి సమాధానముఁ జెప్పి* యెరూషలేమును గూర్చి ప్రలాపించుట ($13^{31-35}$), పరిసయ్యుని యింట భోజనముచేయు సమయమున జలోదర రోగముగలవాని స్వస్థపఱచి విందుకు వచ్చినవారికి బుద్ధిచెప్పి పరమవిందును గూర్చిన ఉపమానము బోధించుట,* తనను వెంబడించువారు గైకొనవలసిన షరతులను దెలుపుట* (14), సుంకరులతోను పాపులతోను భోజనము చేయుచున్నాఁడనువారికి సమాధానము చెప్పు నిమిత్తము తప్పిపోయిన గొఱ్ఱె, పోఁగొట్టుకొనిన రూక* తప్పిపోయిన కుమారుఁడు* అను ఉపమానములను చెప్పుట (15). తన శిష్యులైన సుంకరులకు బోధించుచు అన్యాయస్థుఁడగు గృహనిర్వాహకుఁడు* ధనవంతుఁడు లాజరు అను వారిని* గూర్చిన ఉపమానములను చెప్పుచు మధ్య నాక్షేపించిన పరిసయ్యులను ఖండించుట (16) ఆటంకములు, విశ్వాసము, అయోగ్యతలను గుఱించి తన శిష్యులకు బోధించుట ($17^{1-10}$), పదిమంది కుష్ఠరోగులను బాగుచేయుట* ($17^{11-18}$). దేవుని రాజ్య మెప్పుడువచ్చునని అడిగిన వారికి ప్రత్యుత్తర మిచ్చుట* ($17^{19-37}$). ప్రార్థనను గుఱించి బోధించుచు అన్యాయస్థుఁడగు న్యాయాధిపతి పరిసయ్యుఁడు సుంకరి* యను ఉపమానములను జెప్పుట ($18^{1-14}$). తరువాత మత్తయి మార్కులు వ్రాసినట్లు వాటి ననుసరించి పెరీయలో పిల్లలను ఆశీర్వదించుట, ధనవంతుఁడగు యౌవనుఁడడిగిన ప్రశ్నకు జవాబిచ్చుట, యెరికోలో గ్రుడ్డివానిని బాగుచేయుటను గూర్చి వ్రాసి, వారు తెలుపని జక్కయ్యను గూర్చియు మినాలనుగూర్చి* యుదాహరించుట ($19^{1-28}$).

VI. శ్రమమరణ పునరుత్థానములు:–లూకా వీటిని చాలమట్టుకు మత్తయి మార్కులు వ్రాసిన వాటినే యనుసరించినను, పిలాతు క్రీస్తును హేరోదు యొద్దకుఁ బంపుట ($23^{6-12}$) స్త్రీలు క్రీస్తుకు కలిగిన శ్రమలనుగూర్చి ప్రలాపింపఁగా ఆయన యెరూషలేము గతినిగూర్చి దెలుపుట ($23^{27-31}$) క్రీస్తు తనను సిలువవేయుచున్నవారిని క్షమించుమని వేడుట ($23^{34}$) ఆయనతో సిలువ వేయఁబడిన దొంగలలో నొకఁడు గుణపడుట ($23^{39-43}$) ఎమ్మాయికి వెళ్లు ఇద్దరి కాయన కనఁబడుట ($24^{13-35}$) శిష్యులు తనకు సాక్షులై యుండుఁడని తెలిపి జేతనియయొద్ద ఆరోహణుఁడగుట ($24^{44-53}$) అను విషయములు లూకా మాత్రమే వ్రాసెను.

## లూకియ (Lucius).

1. రోమా $16^{21}$ లో పౌలుయొక్క బంధువుఁడగు లూకియ రోమాపురి క్రైస్తవులకు వందనములను పంపినట్టు వ్రాసి యున్నది. ఇతఁడును కార్య $13^{1}$ నందు చెప్పఁబడిన కురేనీయుఁడైన లూకియును నొకఁడని కొందఱికి తోఁచును గాని వారి యభిప్రాయమున కాధారము లేదు. పారంపర్య సాంప్రదాయములయం దితనిని పౌలు కెంక్రియ సంఘమున కధ్యక్షునిగా నియమించెనని యుదాహరించఁబడెను.

2. కురేనీయుఁడగు లూకియ. ఇతఁడు కార్య $13^{1}$ యందు ప్రస్తాపింపఁబడిన ప్రవక్తలును బోధకులునగు వారిలో నొకఁడు. ఆ ప్రవక్తల మూలముగ దేవుఁడు పౌలు బర్నబాలు చేయవలసిన పని సంఘమునకు నెఱింగించెను. సువార్తికుఁడగు లూకా యితఁడే యనియు, ఇతఁడు యేసు ఏర్పఱిచిన 70 మంది శిష్యులలో నొకఁడనియు పరంపరా గతమైన మాటయై యుండినను నది యనుమానాస్పదమైనది. **M.**

## లూజు (Luz = బాదామి చెట్టు).

1. ఇశ్రాయేలీయులు కనాను దేశమును జయించకపూర్వము ప్రసిద్ధికెక్కిన యొక పట్టణము (ఆది $35^{6}$ $48^{3}$). వారు దానికి బేతేలు అను క్రొత్త పేరు పెట్టిరి. దానికాపేరు

* ఈ గుర్తుగల సంగతులు లూకా మాత్రమే వ్రాసెను.

మొదట పెట్టినవాఁడు యాకోబు (28[19] న్యాయా 1[23]). ఎఫ్రాయిము బెన్యామీను గోత్రస్థాన ముల మధ్యనుండు సరిహద్దు పట్టణము (యెహో 16[2] 18[13]). 16[2] నందున్న లూజు బేతేలు అను రెండు పేరులనుబట్టి అవి ఒక పట్టణముయొక్క రెండు పేరులు గాక రెండు వేర్వేరు పట్టణములని కొందఱి యభిప్రాయము. ఆరంభమున బేతేలు లూజుకు సమీపమున నుండు పూజాస్థానముగా నుండెను గాని, రాఁగా రాఁగా అది లూజు పట్టణమునకు క్రొత్తపేరాయెనని యూహింపఁ దగును (బేతేలు చూ॥).

2. కనాను ఉత్తర ప్రాంతములలోని యొక పట్టణము. ఎఫ్రాయిము గోత్రికులు పైనున్న లూజును పట్టుకొనఁబోవునప్పుడు వారికిఁ దోవ జూపిన యొకనిని వారు రక్షించి స్వాతంత్ర్య మియ్యఁగా వాఁడు ఉత్తర దిక్కుకు వెళ్లి దీనిని కట్టించెను (న్యాయా 1[26]). అది కనాను ఉత్తర ప్రాంతముల యందుండు హిత్తీయుల ప్రదేశ ములో నుండెను. గాని దాని యునికి సరిగాఁ దెలియదు.

లూదియ (Lydia). 1. ఫిలిప్పీయిలో కాపురముండిన తుయతైరస్త్రీ. ఆమె తుయ తైరలో చేసిన ధూమ్రవర్ణ వస్త్రములను విక్ర యించెను. భక్తిపరురాలు (కార్య 16[14]) అను మాటనుబట్టి ఆమె అన్యురాలైనను యూదుల లేఖన ములను నమ్మిన యూదమత ప్రవిష్టురాలని తెలి యుచున్నది. పౌలు ఫిలిప్పీయికి వచ్చినప్పుడీమె మొదటి శిష్యురాలయి పౌలునకును అతని సహ వాసులకును ఆతిథ్యమిచ్చెను (16[15,40]). ఈమె పేరు ఫిలిప్పీయుల ఉత్తరమునందు లేదు. కొందఱు లూదియ యనునది ఆమె స్వంత పేరు గాక ఆమె వచ్చిన దేశపు పేరునుబట్టి ఆమెకు వచ్చిన పేరని యందురు. అట్లయిన యెడల ఫిలిప్పీ యిలో నున్న సుంటుకే, ఎవొదియ, సహకారి యని తెనిఁగింపఁబడిన సుంజుగే (ఫిలి 4[2,3]) అనఁ బడిన స్త్రీలలో నొకతెయై యుండవచ్చును. గాని అది రూఢి యనుటకు వీలులేదు. ఆమె వర్తకురాలయినందున ఈలోఁగా వేఱొక స్థల మునకు పోయి యుండుట ఆశ్చర్యము కాదు.

2. చిన్నాసియాలోని పశ్చిమభాగమందలి యొక పరగణా. ఈ పేరు బైబిలునందు లేక పోయినను ఆ పరగణాలోని ఎఫెసు స్ముర్న సార్దిస్ తుయతైరు ఫిలదెల్ఫియ అను పట్టణముల పేరులున్నవి. కుబేరుని యంతవాఁడగు క్రీసను (*Craesus*) ఆ పరగణా నేలిన స్వతంత్రరాజు లలో చివరివాఁడు. పారసీకు లాదేశమును క్రీ॥ పూ॥ 549 నందు జయించిరి. తరువాత మాసిదోనియవారు, అంతియొకయవారు, రోమ నులు దానిని వరుసగా స్వాధీనపఱచుకొనిరి. గాని అదెన్నడును మఱల స్వతంత్రరాజ్యము కాలేదు. దానిలో యూదు లనేకులుండిరి. ఆది క్రైస్తవ సంఘములలోఁ గొన్ని యిచ్చట నుండెను. (పటము V, H 3).

లూదీయులు, లూదు చూ॥

**లూదు, లూదీయులు, లూదువారు (Lud, Ludim, Lydians).**

1. షేము సంతానములోని యొక జనము (ఆది 10[22]). చిన్నాసియాలోని లూదియ పర గణాకు సంబంధించినవారై యుందురని కొందఱి తాత్పర్యము. అష్షూరీయులీ లూదియ రాజ్య మును స్థాపించిరని గ్రీకు చరిత్రకారుఁడగు హెరోడోటసు (*Herodotus*) వ్రాసినదే ఇట్లను టకు ఆస్పదముగా నున్నది (హెరోడోటసు 1:7). ఈ లూదియ పరగణాలోని వారు యాపెతు వంశస్థులైనందున మఱియొకరుగా నెంచఁబడుచున్నారు. అట్లయినయెడల వీరు ఉత్తర సిరియలో పూర్వముండి అనామకులుగా నశించిన జనములలో నొకరై యుందురు.

2. ఐగుప్తీయులకు సంబంధించిన యొక జనము. వీరున్న దేశమునకును ఇదే పేరు (ఆది 10[13]). క్రీ॥ పూ॥ 7-5 శతాబ్దములలో వీరు నేర్పరులైన విలుకాండ్రున్న సేనలు గలిగి యుండిరని యెష 66[19] యిర్మీ 43[9] యెహె 27[10] 30[5] వలనఁ దెలియుచున్నది. వీరు నైలునదికి పడమరగా ఉత్తర ఆఫ్రికాలో నుండిరని తలంచుచున్నారు గాని, ఆ దేశపు సరియైన యునికి తెలియదు. కొందఱీ పదమును లిబ్యే యని చదివెదరు (కార్య 2[10]) గాని అట్లు మార్చి చదువుట కాధార మెద్దియు లేదు.

లూబీయులు లిబియ చూ॥

లూసీయ క్లాదియలూసియ చూ॥

**లూహీతు** (Luhith = చెక్కలతో చేయఁబడినవి). మోయాబు దేశమందలి యొక ఊరు (యెష $15^{5}$ యిర్మీ $48^{5}$). ఈ పట్టణమును చేరుటకు ఎక్కి వెళ్లవలసినట్లున్నది. దాని యునికిని గూర్చిన సూచన లెవ్వియును లేవు. యుసూబియస్ (*Eusebius*) జెరోము (*Jerome*) అను క్రైస్తవ పండితులది రబ్బాకును సోయరుకును మధ్యనున్నట్లు వ్రాయుచున్నారు.

## లె

**లెతూషీయులు** (Letushim). అబ్రాహాము కుమారుఁడగు దదాను సంతతివారగు అరబీయులలో నొక తెగ (ఆది $25^{3}$). వీరితో అష్షూరీయులు లెయుమీయులు అను మఱిరెండు తెగలు పేర్కొనఁబడినవి. $25^{3}$ కు సంబంధించిన I దిన $1^{32}$ నందు ఈ మూఁడు పేరులు కనఁబడవు. అరబీయుల పూర్వచరిత్రయందును వీటినిగూర్చిన సూచనలు బొత్తుగా లేవు.

**లెబానా** (Lebana, Lebanah = తెల్లనిది, చంద్రుఁడు). చెఱనుండి తిరిగివచ్చిన నెతీనీయులలో నొక కుటుంబముయొక్క పూర్వికుఁడు. అతనివలన ఆ కుటుంబమునకిదే పేరు గలిగెను (ఎజ్రా $2^{45}$ నెహె $7^{48}$).

**లెబానోను** (Lebanon = తెల్లనివి). పలెస్తీనుకు ఉత్తరముగా నున్న రెండు పర్వత పంక్తులు. ఇవి హిమముచే కప్పఁబడి యుండుటచే (యిర్మీ $18^{14}$) వీటికీ పేరు వచ్చెను. ఇది పలెస్తీను ఉత్తరపు సరిహద్దునుండి 95 మైళ్ల వఱకు ఉత్తర దిక్కుగా వ్యాపించును. ఈ రెండు పంక్తులలో పడమరగా నుండునది సముద్రమునకు సమీపమందుండి దక్షిణమున 6000 అడుగులును ఉత్తరమున 10,000 అడుగులు ఎత్తు గలిగి యున్నది. దీనికి తూర్పున సమానాంతరముగా నుండు రెండవ వరుస గలదు. దానికి అంటి లిబానిస్ (*Anti-Libanus*) అనగా, ప్రతి (=యెదుటి) లెబానోను అను పేరు రోమీయులు పెట్టిరి గాని ఈ పేరు బైబిలునందు గానరాదు. దీని దక్షిణమున హెర్మోను శిఖరమున్నది. అది అన్నిఁటికన్న ఎత్తయిన శిఖరము. ఈ తూర్పు పంక్తి ఉత్తరమునకుఁ బోవు కొలఁది క్రమక్రమేణ తగ్గిపోవును. ఈ రెండు వరుసలకు మధ్య 3-6 మైళ్ల వెడల్పుగల లోయ యొకటి గలదు. దానికి రోమనులు సీల సిరియ (*Coele Syria* = లోయలోని సిరియ) యని నామకరణము జేసిరి. దీనికి లెబానోను లోయ యని పేరు (యెహో $11^{17}$ $12^{7}$). హెబ్రీ భాషలో దీనిని **బిఖా** యనిరి. నేటివఱకు ఆ దేశీయులు దాని బుఖా (*Buq'a*) యని పిలుతురు. దీనియందు లిటనీ యను నది ఉత్తరము నుండి దక్షిణమునకును, ఒరాంటీసు అనెడి నది దక్షిణము నుండి ఉత్తరమునకు పాఱుచున్నవి. ఈ పర్వతములను గూర్చిన సూచనలు కొన్ని బైబిలునందు గలవు.

లెబానోను మిగుల నీటియూఁటలుగల పర్వతము (పర $4^{15}$) గాన, మిగుల ఫలవంతమైనది (హోషే $14^{5-7}$). దాని వనములు సుప్రసిద్ధములు (I రాజు $5^{6-10}$ II రాజు $19^{23}$ యెష $40^{16}$ $60^{13}$ జెక $11^{1}$). అవి అడవి మృగములతో నిండి యున్నవి (II రాజు $14^{9}$ పర $4^{8}$). ఈ పర్వతములందు దొరుకు కలపతో ఓడలను కట్టిరి (ఎజ్రా $3^{7}$ యెహె $27^{5}$). యెరూషలేము నందలి ఆలయమును నగరులను గట్టుటకిక్కడనుంచి మ్రానులను దెప్పించిరి (I రాజు $5^{6-10}$). ఈ పర్వతములు పలెస్తీను దేశపు సరిహద్దులని చెప్పఁబడెను (ద్వితీ $1^{7}$ $11^{24}$ యెహో $1^{4}$ $11^{17}$ $12^{7}$ $13^{5}$).

లెబానోను వాగ్దత్త భూమిలో నొక భాగముగా నెంచఁబడినను (యెహో $13^{5}$ ద్వితీ $11^{24}$), ఇశ్రాయేలీయులు దాని నెన్నడైనను స్వాధీన పఱచుకొనక పోయిరి (న్యాయా $3^{3}$). యెహోషువ కాలములో వారి దేశము లెబానోను లోయలోని బయల్గాదు వఱకు వ్యాపించెను (యెహో $11^{17}$). ఈ కొండలు అలంకార రీతిగా ననేకచోట్ల ప్రశంసింపఁబడెను. ఈ పర్వతములపై గొట్టు సువాసన మిగుల మధురమైన దానికిని (పర $4^{11}$ హోషే $14^{6}$), దాని వృక్షములు గొప్ప వైభవమునకును (యెష $35^{2}$ $60^{13}$) సూచనలుగా నున్నవి. దాని పుష్పములు సౌందర్యమునకును (నహూ $1^{4}$), దాని వనవృక్షములను నరుకుట దేవుఁడు జనములకు చేయు తీర్పునకును (హబ $2^{17}$) సూచనలై యున్నవి.

సొలొమోనుకు **లెబానోను అరణ్యమందు ఒక నగరు** కట్టించెనని I రాజు $7^{2}$ నందున్నది. ఇది యెరూషలేమునందు సొలొమోను కట్టించిన ఒక నగరముయొక్క పేరని కొందఱి యభిప్రాయము. బైబిలులోని యితర సూచన లీ యభిప్రాయమునకు సరిపడుచున్నవి (I రాజు $10^{16,17}$ యెష $22^{8}$ $39^{2}$ = II రాజు $20^{13}$ యెరూషలేము B III 3 (6) చూ॥).

ఈ పర్వతము లిప్పటికిని మిగుల ప్రసిద్ధములైనవైనను వాటి వచనములు చాల మట్టునకు అంతరించినవి. ఆ ప్రదేశము చాలకాలము వఱకు తురుష్క ప్రభుత్వము క్రింద నుండెను. గాని, 1860 సం॥ నుండి దాని కొక క్రైస్తవ గొర్నరు నియమింపఁబడెను. 1919 సం॥ మొదలు అది బ్రిటిషువారి సంరక్షణక్రింద నుండి, ప్రస్తుతము స్వతంత్ర రాజ్యముగ నున్నది. బైరూట్ నుండి దమస్కుకుఁబోవు రైలుమార్గము ఈ పర్వతములను దాటి పోవును. ప్రస్తుత మా ప్రదేశమునందు దాదాపు 13,03,000 మంది యుందురు. వారందఱు పర్వతప్రాంతవాసులు.

**లెబాయోతు** బేత్బిరీ, బేత్లెబాయోతు చూ॥

**లెబోనా** (Lebonah = సాంబ్రాణి). షిలోహుకు సమీపముగా షెకెముకు పోవు దోవలోనున్న యొక స్థలము (న్యాయా $21^{19}$). ప్రస్తుతము షిలోహుకు 3 మైళ్లు కొంచెము వాయువ్యముగా నుండు లుబ్బాను (*Lubban*) దీని యునికిస్థలమై యుండవచ్చునని కొందఱి యభిప్రాయము (పటము III, F 4).

**లెబ్బయి** తద్దయి చూ॥

**లెమూయేలు** (Lemuel = యెహోవాకు సమర్పింపఁబడెను). నీతిబోధల నొందిన రాజు (సామె $31^{1-9}$). ఈ నామము సొలొమోను యొక్క గూఢభావార్థమగు పేరని కొందఱి యభిప్రాయము. H.

**లెమెకు** (Lamech = బలముగల).

1. మతూషాయేలు కుమారుఁడు. కయీను సంతతిలో నైదవతరమువాఁడు. వ్యవసాయము సంగీతము, ఆయా యంత్రములు చేయుటలో పాండిత్యము గల సంతతి వారిలో ననేకులకు లెమెకు ఆది పురుషుఁడు (ఆది $4^{18-24}$) బహు భార్యాత్వ మితనితో నారంభమయ్యెను. తన భార్యలను పేరు పెట్టి పిలుచుట కావ్యముల యందు పురాతనమగు మాదిరియై యున్నది. ఈ పదసముదాయము హెబ్రీయుల కావ్యములకు మంచి దృష్టాంతముగా నున్నది.

"ఓ ఆదా ఓ సిల్లా,
నా పలుకు వినుఁడి
లెమెకుభార్యలారా,
నామాట నాలకించుఁడి
నన్ను గాయపరచినందుకై
ఒక మనుష్యుని చంపితిని
నన్ను దెబ్బ కొట్టినందుకై
ఒక పడుచువాని చంపితిని
ఏడంతలు ప్రతిదండన
కయీనుకొరకు వచ్చినయెడల
లెమెకు కొరకు
డెబ్బది యేడంతలు వచ్చును"

పై పద్యమునకు నానారీతులుగా అర్థము చెప్పెదరు. లెమెకు అకస్మాత్తుగానో లేక తన్ను తాను రక్షించుకొనుటలోనో నొకని చంపెను గనుక, రక్తాపరాధి యయ్యెను. హేబెలును చంపిన కయీనును కథయిచ్చిన (ఆది $5^{15}$) దేవుఁడు నిర్దోషియగు తన్ను మరింత జాగ్రత్తగా కాపాడునని తన భార్యలకు ధైర్యము చెప్పె ననునది తృప్తికరమైన జవాబుగా కనఁబడు చున్నది.

2. మెతూషెల కుమారుఁడు. నోవహు తండ్రి. ఇతఁడు 777 సం॥ లు బ్రతికి జలప్రళయమునకు 5 సం॥ లు ముందు చనిపోయెను (ఆది $5^{25-31}$ I దిన $1^{3}$ లూ $3^{36}$). H.

**లెయుమ్మీయులు** (Leummim = జనములు). అబ్రాహాము కుమారుఁడగు దదాను సంతతిలోని యొక అరబీ గోత్రము (ఆది $25^{3}$ లెతూషీయులు చూ॥).

**లెషెము** లయిషు I చూ॥

**లెహాబీయులు** (Lehabim). ఒక జనాంగపు పేరు. ఈ పదము ఆది $10^{13}$ I దిన $1^{11}$

నందు తప్ప మఱెచ్చటను కనఁబడదు. ఆది 10 అధ్యాయమందలి జనములలో లుబ్బీములను పదము లేకపోవుటచే ఇది దానికి ప్రతిగా నున్నదని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల వారు లిబియదేశ సంబంధు లగుదురు (లిబియ చూ॥). ఆ జాబితా యందున్న వరుస ప్రకారము వారు ఐగుప్తీయులకు సంబంధులని స్పష్టమగుచున్నది.

## లే

**లేకా** (Lecah = ప్రయాణము). యూదా గోత్రీకుఁడగు ఏరుయొక్క వంశస్థులు నివసించిన యూరు (I దిన $4^{21}$). దీనియునికి సరిగా తెలియదు.

**లేఖనము, లేఖనములు** (Scripture, Scriptures). తెనుఁగున నీమాట వ్రాయఁబడినదానిని సూచించును. అయితే సాధారణముగా బైబిలులో వ్రాయఁబడినదానికి మాత్రము ఈ పేరు పెట్టుదురు. కొన్ని గ్రంథములలోని ప్రత్యేకమైన వచనములకు లేఖనము అను పేరు పెట్టిరి (మా $12^{10}$ $15^{28}$ లూ $4^{21}$ యోహా $19^{37}$). పాఁత నిబంధన యావత్తును ఒక గ్రంథముగా నెంచఁబడినప్పుడు లేఖనము అనఁబడును (యోహా $7^{42}$ $10^{35}$ $17^{12}$ $19^{28}$ గల $3^{22}$). అయితే అనేక వాక్యములలో నున్నట్లు పాఁత నిబంధనను ఒక గ్రంథముగా నెంచక ఆయా వారలు వ్రాసినవి వేర్వేఱు గ్రంథములని యెంచి లేఖనములు అను బహువచనరూపమును వాడిరి (మ $21^{42}$ లూ $24^{27}$, యోహా $5^{39}$ రోమా $1^{2}$). క్రొత్త నిబంధనలోని లేఖనము, లేఖనములు అను పదములు సాధారణముగా పాఁత నిబంధనను సూచించినను, II పేతు $3^{14}$ లో నున్నట్లు పౌలు వ్రాసిన పత్రికలు లేఖనములలో చేర్చఁబడినవి. ప్రస్తుతము ఇది బైబిలు యావత్తును సూచించు నొక వాడుక పదమై యున్నది. సాధారణముగా బైబిలుకు మనము పరిశుద్ధలేఖనములు అను పేరు పెట్టుచున్నాము. రోమా $1^{2}$ లో మాత్రము ఈ పేరు కలదు (పాఁత నిబంధన ప్రమాణ గ్రంథములు, క్రొత్త నిబంధన ప్రమాణ గ్రంథములు, బైబిలు చూ॥).

**లేఖకుఁడు** (Scribe). ప్రస్తుతమున భరత ఖండమునం దున్నట్లే పూర్వము పలెస్తీనులో అందఱికిని వ్రాయుటకు చేతయగునది కాదు గాన, కొంద ఱాపనినే ప్రత్యేకముగాఁ జేయువారని శబ్దార్థమిచ్చు బిరుదు నొందిరి తెలుఁగు బైబిలునందు దానికి లేఖకుఁడు అను మాటను కొన్ని వాక్యములలో నుపయోగించినను (యెహె $9^{2}$ యిర్మీ $36^{32}$ ఎజ్రా $4^{8}$ II దిన $34^{13}$), సర్కారుద్యోగమునకు సంబంధముగా ఈ మాటను వాడిన వాక్యములలో దానిని **ప్రధాన మంత్రి** యని తెనిఁగించిరి (II రాజు $12^{10}$ II దిన $24^{11}$ $26^{11}$ మంత్రి చూ॥). శాస్త్రములు వ్రాసి దాని భావము చెప్పువారిని సూచించుటకు ఆ పదమునే శాస్త్రి అని తెనిఁగించిరి (యిర్మీ $8^{8}$ ఎజ్రా $7^{6,10}$ మొ॥). క్రొత్త నిబంధనలోని శాస్త్రులు (మ $16^{21}$ $26^{3}$ మా $8^{19}$ మొ॥) ఇట్టివారే (దస్తావేజులమీద నున్నవాడు చూ॥).

**లేడి, అడవిలేడి, జింక, ఎఱ్ఱని జింక, దుప్పి** (Deer). ఈ మృగమును సూచించెడి



అడవి లేడి

అయిదు హెబ్రీపదములును ఒక గ్రీకుపదమును బైబిలునందు గలవు. వీటిలో ప్రతి దానికి వేర్వేఱు తెలుఁగు పదములను వాడినందున వీటిని వేఱుచేయుటకు వీలులేదు. ఒక పదమును II సమూ $2^{18}$ లో అడవిలేడి, పర $2^{9}$ లో లేడి, ద్వితీ $12^{15}$ లో ఎఱ్ఱజింక, $15^{4}$ లో ఎఱ్ఱ చిన్న జింక, $12^{22}$ లో జింక, I రాజు $4^{23}$ లో దుప్పి



జింక

యని తెనిఁగించిరి. దుప్పి యని దీనికి మాత్రమే గాక ద్వితీ $14^{5}$ లోని మఱియొక హెబ్రీ పదమునకును వాడిరి. ఆ పదమునే I రాజు



ఆడుజింక

$4^{23}$ లో జింక యనిరి. యెష $51^{20}$ నందు దుప్పి యనఁబడినది ద్వితీ $14^{5}$ నందు లేడి యనఁబడెను. సామె $5^{19}$ నందు దుప్పి యనిన దానిని I సమూ $24^{2}$ లో కొండమేక యని వ్రాసిరి (మేక 2 చూ॥). ద్వితీ $14^{5}$ $15^{22}$ కీర్త $42^{1}$ లోనున్న యొక పదమును దుప్పి యని తెనిఁగించిరి గాని ద్వితీ $12^{15}$ లోని ఆ పదమునే చిన్న దుప్పి యనిరి. ఇవన్నియు ఈ దేశమందున్న వాటివంటివై అందమునకు సూచనలుగా నుండెను (పర $2^{9}$ $4^{5}$ $7^{3}$). అందువలన లేడి యనే యర్థమిచ్చు పదములను స్త్రీలకు నామములుగా పెట్టిరి (కార్య $9^{36}$).

లేతపచ్చ రత్నములు 5 చూ॥

లేనివార్త అబద్ధము చూ॥

**లేయా** (**Leah** = అడవియావు). లాబాను పెద్దకుమార్తె. జబ్బుకండ్లు గలది. రాహేలంత సుందరి కాదు. యాకోబు రాహేలును పెండ్లాడ నేడేండ్లు కొలువు చేయఁగా లాబాను యుక్తిచేసి నీమెను యాకోబున కిచ్చి పెండ్లిజేసెను. రూబేను షిమ్యోను లేవి యూదా ఇశ్శాఖారు జెబూలూను అను వారిని వారి సహోదరియగు దీనాను కనెను (ఆది $29^{16-35}$ $30^{17-21}$). H.

**లేవి** (**Levi** = హత్తుకొనుట).

1. యాకోబునకు లేయావలన కలిగిన మూఁడవ కుమారుఁడు (ఆది $29^{34}$). తన చెల్లెలగు దీనాను షెకెము చెఱిపినందున షిమ్యోనుతోఁ గలిసి హామోరును, షెకెమును, వారి పట్టణస్థులను చంపి పగతీర్చుకొనెను ($34^{25-31}$) యాకోబు వీరిద్దరిని ఇందు నిమిత్తము చాల గద్దించెను గాని, వారు తాము మంచి పనిని జేసితిమని తృప్తినొందిరి ($34^{31}$). యాకోబు తన మరణ శయ్యమీఁద నుండఁగా తన కుమారుల నాశీర్వదించు నప్పుడు "యాకోబులో వారిని విభజించెదను. ఇశ్రాయేలులో వారిని చెదరఁగొట్టెదను" అని చెప్పెను ($49^{5-7}$).

2. మత్తయి చూ॥

3, 4. క్రీస్తు పూర్వికులలో నిద్దరు (లూ $3^{24-29,30}$). W.

**లేవీయకాండము** (**Leviticus**). మోషే వ్రాసిన గ్రంథ పంచకములోని మూఁడవ గ్రంథము. లేవీయకాండ మనఁగా లేవిగోత్రికులయొక్క, వారిలోఁ జేరిన అర్చకులయొక్క విధులను తెలుపు భాగము. దేవుని సమీపించుట ఆయనవలన నంగీకరించఁబడుట యెట్లో దానిని నేర్పించు ఈ గ్రంథమునందు దైవారాధనను జరిగించవలసిన యాజకుల ఉద్యోగ ధర్మములు వివరముగా నున్నవి. దీనియందు ఇశ్రాయేలీయులు ఐగుప్తునుండి వెడలివచ్చిన

తరువాత రెండవ సంవత్సరము మొదటినెలలో జరిగిన చరిత్ర కలదు. అనగా గుడారమును నిలువబెట్టినది మొదలుకొని జనులను లెక్కించు వఱకున్నది. ఈ గ్రంథము ఆత్మీయవరము లిమిడియున్న మతాచార దీపికయై యున్నది. క్రైస్తవవేదము ఆరాధన నీతివిధులు నిదర్శనములు మొదలగు వానికి సంపూర్ణ సారసంగ్రహము గాను, సర్వకాలములందలి క్రైస్తవుల ప్రవర్తనకు సూత్ర గ్రంథముగాను, ప్రార్థన పుస్తకముగాను, ముంగురుతుల రూపకమైన విశ్వాస సూత్రము గాను ఎంచవచ్చును. ఈ యంశములన్నియు క్రైస్తవ మతమునకు మూలాధారమైన క్రీస్తు యొక్క ఏకప్రాయశ్చిత్తమును సూచించుచు దానియందు ఒక్కటిగా కూడి నెఱవేఱియున్నవి (హెబ్రీ పత్రిక చూ॥). దేవుడు ఇశ్రాయేలీయుల హృదయములలో ముద్రించగోరిన ముఖ్య విషయము లెవ్వి యనగా: 1. పాపము భయంకరమైనది; దానికి శిక్ష తప్పక కలుగును. 2. దేవుడు పరిశుద్ధుడును న్యాయస్థుడును, పాపమును సహింపలేనివాడునై పాపమును శిక్షించినను పాపిని ప్రేమించి వాడు తన యొద్దకు వచ్చుమార్గము నేర్పఱచి యున్నాడు. 3. తమ్మును తాము దేవునివశము చేసికొని ఆయనను తమ యజమానునిగా నంగీకరించవలెను.

ఈ గ్రంథమువలన నేర్చుకొనవలసిన అంశము లెవ్వియనగా: (1) నరులు దేవునియొద్దకు పోవు మార్గమునకు పరిశుద్ధతయే మొదలును తుదయునై యున్నవి. గుడారము, పాత్రలు అర్పణలు వస్త్రములు పరిశుద్ధములై యుండెను. పరిశుద్ధుడు అను పేరుగలవాని సన్నిధికి చేరువారు యాజకులైనను ప్రజలైనను పరిశుద్ధులుగా నుండవలసి యుండిరి. కాబట్టి ఇశ్రాయేలీయుల యొక్క పాళెమునందేమి గుడారమునందేమి పరిశుద్ధము పరిశుద్ధము పరిశుద్ధమని పరలోకమందు వినబడు దూతల స్వరముయొక్క ప్రతి ధ్వని నిత్య వినబడుచుండెనని తెలిసికొనవచ్చును. (2 రక్తము చిందింపకుండ క్షమాపణలేదు. అయితే జంతువులయొక్క రక్తము క్రీస్తుయొక్క విలువగల రక్తమునకు గుఱుతు. (3) ప్రధాన యాజకుడు రక్తముతో దేవునికిని ఇశ్రాయేలీయులకును మధ్యవర్తిగా అతి పరిశుద్ధ స్థలములోకి వెళ్లినలాగున నిజమైన మధ్యవర్తియగు యేసుక్రీస్తు తన స్వరక్తముతో మనకును దేవునికిని మధ్యవర్తిగా మఱి గొప్ప పరిశుద్ధ స్థలములోకి వెళ్లి యున్నాడు గాన ఆయనద్వారా మాత్రమే రక్షణగలదు.

ఈ గ్రంథమునందు మూడు ముఖ్యభాగము లున్నవి.

I. యాగములు (1-16). దీనియందు ఐదు అర్పణములు; 1. దహనబలి ($1^{1-17}$) 2. నైవేద్యము ($2^{1-16}$) 3. సమాధానబలి ($3^{1-17}$) 4. పాపపరిహారార్థబలి ($4^{1-35}$) 5. అపరాధ పరిహారార్థబలి ($5^{1}$-$6^{7}$): వాటి నర్పించవలసిన పద్ధతులు ($6^{8}$-$7^{38}$): యాజకుల పిలుపు ఏర్పాటు, ప్రతిష్ఠ, ఉడుపులు, గుణలక్షణములు ($8^{1}$-$10^{20}$) యాజకుల పవిత్రసంబంధము (11), పవిత్రదేహము, గృహము (12 15), పరిశుద్ధ జనాంగము (16) గలిగియుండుటను గూర్చియు, అవిధేయతవలన కలుగు శిక్షకు దృష్టాంతమును ($10^{1-7}$) ఉన్నవి.

II. ప్రత్యేకింపబడుట (17-22). దీనియందు యాజకులు స్వయముగ తమ్మును తాము ప్రత్యేకపఱచుకొని యుండవలసినదనియు (17), కుటుంబములందు అవిధేయతగాని, చట్టములకు విరోధమైన వివాహములుగాని ఉండరాదనియు (18), జనులలో నీతి విషయములగు చట్టములును (19,20), యాజకుల పరిశుద్ధత, వివాహము సర్వాంగ సంపూర్ణత కలిగి యుండవలయునను సంగతులున్నవి.

III. పండుగలు (23-27). దీనియందు విశ్రాంతిదినము ($23^{1-3}$), పస్కా ($23^{4-8}$), పెంతెకొస్తు ($23^{9-22}$), బూరలపండుగు ($23^{23-25}$), మహా ప్రాయశ్చిత్తదినము ($23^{26-32}$), గుడారముల పండుగ ($23^{33}$-$4^{4}$), దేవదూషణ చేసిన వానికి కలిగిన శిక్ష (24), విశ్రాంతి సంవత్సరము ($25^{1-7}$), సునాద సంవత్సరము ($25^{8-55}$), ఆశీర్వాదములు శాపములు (26), మ్రొక్కుబడులు దశమాంశములను గూర్చిన నియమములు (27) గలవు (మోషే, గ్రంథపంచకము, షడ్గ్రంథములు చూ॥).

H.

**లేవీయుల పురములు (Levitical Cities).** లేవీయులును యాజకులును లేవి

గోత్రపువారే నివసించు పట్టణములు (యాజకులు, లేవీయులు చూ॥). వీరికి వాగ్దానభూమిలో ప్రత్యేకభాగమును మోషే యిచ్చి యుండలేదు. వీరును వీరి పశువులును నివసించునట్లు నలుబది యెనిమిది పట్టణములును వాటి చుట్టునుండెడి పచ్చిక బయళ్లును వీరికిచ్చిరి (సంఖ్యా $35^{1-11}$). వీరి పట్టణములలో దేనినైనను శాశ్వతముగా విక్రయింపరాదు. అట్లెవరైనను చేసినయెడల సునాద సంవత్సరమునకు ముందుగా వారికి దాని నిచ్చివేయునప్పుడుగాని అంతకుముందుగాఁ గాని దాని విడిపించవలెను (లేవీ $25^{23-34}$). యెహోషువ యీ యేర్పాటు ప్రకారము లేవీయుల కొఱకు 48 పట్టణముల నిచ్చెను గాని వీటిలో 13 పట్టణములను యాజకులకొఱకు ప్రత్యేకించిరి. అవన్నియు యెహో 21 లో నుదాహరింపఁబడినవి. W.

**లేవీయులు (Levites).**

1. వంశము: యాకోబు మూఁడవ కుమారుఁడగు లేవి సంతతివారు. అతని ముగ్గురు కుమారులనుబట్టి అతని సంతానీకులు గెర్షోనీయులు, కహాతీయులు మెరారీయులను మూఁడు తెగలవారైరి (ఆది $46^{11}$ నిర్గ $6^{16}$ సంఖ్యా $3^{17}$ I దిన $6^{16-48}$). వీరియందింకను ఉపభాగము లుండెను. మోషే అహరోనులు కహాతీయులలోని అమ్రాము కుటుంబికులై యుండిరి (నిర్గ $6^{16-20-26}$).

2. పనులు: అహరోను సంతతివారగు యాజకుల పనులను గాక (ప్రధానయాజకుడు, యాజకుడు చూ॥) తక్కినవారి పనులీ దిగువ వివరింపఁబడును. అరణ్యమందుండఁగా వీరు గుడారమును చూచుకొనుచు దానిని దాని సామగ్రులను విప్పి, బండ్లమీఁదఁగాని భుజములమీఁదఁగాని పెట్టుకొని వెళ్లెడివారు. మకాము చేయవలసిన స్థలముదగ్గర వాటిని దింపి గుడారమును వేసి కనిపెట్టెడువారు (సంఖ్యా $1^{50-53}$ $3^{6-37}$ $4^{1-33}$. I సమూ $6^{15}$ II సమూ $15^{24}$). వారు దేవుని నామఘనతను దక్కించుటకై విశేషాసక్తిని కనపఱచినందున (లేవీ $32^{26-29}$ సంఖ్యా $3^{9-13}$ $9^{40-45}$ మొ॥) వారీ సేవకు ప్రతిష్ఠితులైరి (నిర్గ $13^{11-16}$). జ్యేష్ఠపుత్రులను దేవుని కర్పింపక వారికి ప్రతిగా లేవీయులను ప్రతిష్ఠింపవలసినదని నియమ మేర్పడెను. ఇశ్రాయేలీయుల జ్యేష్ఠపుత్రులందరు 22, 273 రును, పరిచర్యఁ జేయఁగలిగిన లేవీయులు 22,000 మందియు నున్నందున ఎక్కువగా నుండిన 273 రు జ్యేష్ఠపుత్రులను ఒక్కొక్కని కైదేసి షెకెలుల చొప్పున పైకము చెల్లించి వారిని విమోచించుకొనిరి (సంఖ్యా $3^{43-46}$). గుడారమునకు ప్రతిగా ఆలయము కట్టఁబడిన పిమ్మట వారికి మోఁతపని తప్పెనుగాని ద్వారపాలకత్వము, సంగీతనాయకత్వము మొదలగు పనులు నిర్వహింపవలసివచ్చెను (I దిన $15^{16,23,24}$ II దిన $23^{13}$ మొ॥).

3. పనులను నిర్వహించవలసిన ప్రాయము: వారు పనిలో ప్రవేశింపవలసిన ప్రాయమును గూర్చి వేర్వేరుగా నున్నది 30 యేండ్లని (సంఖ్యా $4^{3}$ I దిన $23^{35}$ లోను, 25 యేండ్లని సంఖ్యా $8^{24}$ లోను, 20 యేండ్లని I దిన $23^{24-27}$ లో నున్నది). వీటినిబట్టి ముప్పదియేండ్ల ప్రాయము వచ్చిన తరువాతనే పనులన్నిఁటిని చేయుటకు వారికి సంపూర్ణహక్కు కలిగెను గాని దానికి పూర్వము మోఁతకు సంబంధించిన పనులను చేయుటకు మాత్రము సెలవిచ్చిరని తెలిసికొనవచ్చును. వారు 50 యేండ్ల ప్రాయముగల వారగువఱకు ఆ పనులను చేయుచువచ్చిరి (సంఖ్యా $23^{47}$) గాని, తరువాతకూడ పనులన్నిఁటిని చేయకపోయినను సహాయకులుగా నుండుచు వచ్చిరి ($8^{25,26}$). దావీదుకాలమున వారిని 24 వంతులుగా విభాగించినప్పుడు వారు (1) యాజకులకు సహాయకులుగాను (2) విచారణ కర్తలును లేఖికులును (3) ద్వారపాలకులును (4) సంగీతనాయకులునైరి. ప్రతి పనిని చేయుటకు 24 వంతులున్నట్లు కనఁబడును (I దిన 24-26 II దిన $19^{8-11}$ $30^{16,17}$ ఎజ్రా $6^{18}$ నెహె $13^{5}$).

4. ఇతర యేర్పాటులు: వారు ఉత్సవ దినములలో యాజకులవలె నారబట్టలను ధరించుకొని యున్నట్లు కనఁబడుచున్నది (I దిన $15^{27}$ II దిన $5^{12}$). యాజకులవికూడ కలుపుకొని లేవీయులకు 48 పట్టణముల నిచ్చిరి. గాన వీరికి 35 మాత్రమే యుండెను (యెహో $21^{20-40}$). వారిలో కొందఱు హీనులై కూటికిలేక ఇతర దేవతల సేవజేసినట్లు న్యాయా $17^{8-13}$ $18^{18-31}$ వలనఁ దెలియుచున్నది గాని యరొబాము బేతేలులోను దానులోను మూఢపూజ స్థాపిం

పఁగా అనేకు లా దేశమునువిడిచి యూదా దేశములోకి వచ్చిరి (II దిన 11[13-15] యాజకులు, ప్రధానయాజకులు చూ॥).

**లేహీ** (Lehi = దవడ). యూదాగోత్ర షెఫేలా ప్రాంతమునందుండు ఒక స్థలము. దీనియునికి సరిగాఁ దెలియదు. సమ్సోను గాడిద దవడయెముకతో వేయిమంది ఫిలిష్తీయులను చంపిన స్థలమిదే (న్యాయా 15[9-19] రామత్లేహీ చూ॥).

# లో

**లోకము, లోకులు, లోకనివాసులు** (World). పాత నిబంధనలోని మూడు హెబ్రీ పదములకును, క్రొత్త నిబంధనలోని రెండు గ్రీకు పదములకును ఈ మాటల నుపయోగించిరి. భూమి, జగత్తు, భూలోకము ప్రపంచము, ప్రపంచములు, యుగము, ఇహపరములు అనెడి యితర పదములచేతను వాటి నచ్చటచ్చట తెనిఁగించిరి. లోకమును పదమును మనము ప్రపంచములో మనమున్న భాగమునకు సాధారణముగా వాడుచున్నను, పరలోకమునకును, నరకమునకును అప్పుడప్పుడు దానిని వాడుచునే యున్నాము. కాలభాగమును సూచించుటకును బైబిలునందీ పదము వాడఁబడియున్నది. పూర్వ కాలమందున్న లోకము (II పేతు 2[5]). ప్రస్తుత లోకము (II తిమో 4[10]), రాఁబోవు లోకము (మా 10[30]) అను వాటినిగూర్చిన సూచనలున్నవి గాని యిట్టి వాక్యములను తెనిఁగించినప్పుడు సాధారణముగా **యుగము** అను పదమును వాడిరి (మ 12[32] ఎఫె 1[21] మొ॥).

ఈ పదము మనముండు ప్రపంచభాగమును ప్రస్తుతకాలమును సూచించిన పక్షమున మానవ **కోటి** యని యర్థమిచ్చును. పాత నిబంధన లోను (కీర్త 9[8] 24[1] 33[8] 96[13] 98[7] యెష 13[11] 24[4] 26[9]) క్రొత్త నిబంధనలోను (మ 4[8] 26[13] యోహా 3[16,17] రోమా 1[8] I కొరి 1[21] మొ॥), ఈ పదము మానవులనందఱిని సూచించును. మనుష్యులను మాత్రమే గాక సర్వసంపదనుకూడ సూచించును (మ 16[26] మా 8[36]=లూ 9[25] I కొరి 7[31]).

మానవులు పాపులగుటవలనను, సంపద నాశించుటచే యనేక శోధనలు కలుగుటవలనను, లోకమను పదమునకు నీతిసంబంధమగు ఒక విశేషయర్థము గలదు. అది దేవుని విరోధించెడి విషయేచ్ఛలను సూచించును. పాత నిబంధన యందీ యర్థ మంతగా కనఁబడకున్నను క్రొత్త నిబంధనయందు ముఖ్యముగా యోహాను సువార్త లోను పత్రికలలోను ఎక్కువగా కనఁబడును (యోహా 1[10] 7[7] 14[7] 15[18] I కొరి 1[20] II కొరి 5[19] గల 6[14] కొలొ 2[20] యాకో 1[27] 4[4] II పేతు 1[4] I యోహా 2[15,16] 3[1,13] 4[5] 5[5] 5[19] మొ॥). లోకము దేవుని విరోధించునదియను నిట్టి యర్థమిచ్చుటవలన సాతాను లోకమున కధికారి యని కొన్నిచోట్ల ప్రశంసింపఁబడెను (యోహా 12[31] 16[11] II కొరి 4[4] ఎఫె 2[2]).

**లోకాంతము** యుగము 3 చూ॥

**లోకాధికారి** సాతాను చూ॥

**లోతాను** (Lotan). శేయీరు కొండ ప్రాంతములలో నివసించిన హోరీయులలోని యొక తెగ (ఆది 36[20-29] I దిన 1[38] హూరు చూ॥).

**లోతు** (Lot = బిగువుగా చుట్టుకొనుట). అబ్రాహాము సహోదరుఁడగు హారాను కుమారుఁడు. ఇతని జీవిత చరిత్ర ఆది 11[27]-14[16], 19 లో నున్నది. ఇతఁడు ఊరు పట్టణములో జన్మించెను. అబ్రాహాము వెంట హారానుకు, తరువాత కనానుకు వెళ్లెను. అబ్రాహాము చేసిన దేశయాత్రలలో ఎక్కువ భాగము అతనితోనే ఉండెను. వా రిద్దరికిని ప్రత్యేకముగా పెద్దపెద్ద మందలున్నందున, వారి కాపరుల మధ్య కలిగిన కలహ కారణముగా వేరు పడవలసి వచ్చెను (13). లోతు మైదానపు పట్టణములతట్టు వెళ్లి, కొంతకాలమునకు సొదొమ పట్టణ పౌరుఁడాయెను. కదొర్లాయోమెరు వలన తక్కిన వారితోఁబాటు నితఁడును చెఱ పట్టఁబడెను. గాని అబ్రాహాము వారినందరిని విడిపించెను (14). 19 వ అధ్యాయమునందు లోతును అతని కుమార్తెలును ఆ ప్రాంతములకు జరిగిన వినాశమునుండి తప్పింపబడుటయు, తరువాత జరిగిన సంగతులున్నవి. వారు కొంత

కాలమువరకుండిన సోయరు పట్టణము మృత సముద్రమునకు ఆగ్నేయదిక్కున నున్నదని యోసీఫసు వ్రాయుచున్నాఁడు. జోఆరా (*Zoara*) లేక జూర్ (*Zoor*) అదే కావచ్చును. మంచినీటి వసతి కలిగియున్న ప్రస్తుతపు ఎస్ సఫియె (*Es-Salia*) అదే. తరువాత అతఁడు వెళ్లి నివసించిన పర్వతము మోయాబు పర్వత ప్రాంతమై యుండవచ్చును. లోతు కుమార్తెలను గురించిన యుదంతము చరిత్రగాక, మోయాబు అమ్మోను అను జనాంగముల ఆరంభమును కనబరచు పారంపర్యములని ప్రస్తుత పండితుల యభిప్రాయము

లోతుభార్య అగ్నిగంధకములలో చిక్కుబడి ఉప్పుస్తంభమైన విషాదగాథ యూదులు చాల శతాబ్దములవఱకు జ్ఞప్తియందుంచుకొనిరి. యేసు ప్రభువు ఆ సంగతినిగూర్చి ప్రస్తావించెను (లూ 17[32]). పేతురు పత్రికలలోకూడ అది ఎత్తఁబడినది (II పేతు 2[6-8]). అరబ్బులు ఇప్పటికిని మృతసముద్రమును బార్ లుట్ (*Bahr Lut* = లోతుయొక్క సముద్రము) అనియందురు.

**లోదెబారు** (Lodebar = మేఁతలేని స్థలము?). గిలాదులోనుండు ఒక ఊరు (II సమూ 9[4,5]). యోనాతాను కుమారుఁడగు మెఫీబోషెతు ఇచ్చట దాగుకొనెను. ఈ యూరివాఁడగు మాఖీరు దావీదు అబ్షాలోముకు జడిసి పారిపోయిన సమయమున అతని దర్శించుటకై వచ్చినవారిలో నొకఁడు (17[27]). యెహో 13[26] లో నుండు దెబీరు అను సరిహద్దు పట్టణ మిదేనని సాధారణాభిప్రాయము. దీని యునికి తెలియదు.

**లోపలి యావరణము** యెరూషలేము III 8 చూ॥

**లోభిత్వము, లోభము** ధనాపేక్ష చూ॥

**లోయ** (Valley). లోయలను సూచించెడి పదములు పాఁత నిబంధనయందు ఐదు గలవు.

1. పర్వతప్రదేశములో నుండు ఇఱుకైన సందులు. దీనిని సూచించెడి పదము ఈ దిగువ వాక్యములలో కనఁబడును (యెహో 15[8] 18[16] 19[14,27] I సమూ 13[18] II సమూ 8[13] II రాజు 14[7] I దిన 4[14] 18[12] II దిన 14[10] 25[11] నెహె 11[30,35] కీర్త 60 పై వ్రాఁత, యెహె 39[11,15] మొ॥). దర్శనపు లోయ (యెష 22[1,5]), వధ లోయ (యిర్మీ 7[32] 19[6]) అను మాటలలో నీ పదమును అలంకార రీతిగా వాడిరి.

2. కొండ ప్రదేశములలోని పల్లపు భూములు (ఆది 13[17] 37[14] యెహో 7[24] 15[18] 17[16] 18[21] మొ॥ II సమూ 5[18] కీర్త 84[6] 60[6] II దిన 20[26] యోవే 3[2,12,14] I సమూ 17[2] మొ॥).

3. ఫలవంత ప్రదేశములగు మైదానములు (ద్వితీ 34[3] యెహో 11[8,17] II దిన 35[22]).

4. నదులుగాని ఏర్లుగాని పారెడి స్థలము (ఆది 26[17] సంఖ్యా 21[12] 32[9] ద్వితీ 1[42] న్యాయా 16[4] యోవే 3[18])

5. షెఫేలా చూ॥

**లోయద్వారము** యెరూషలేము B III 4 (4) చూ॥

**లోయి** (Lois). తిమోతియొక్క అవ్వ (II తిమో 1[5]). అతని తల్లియైన యూనీకే యొక్క తల్లి. లోయి యనునది గ్రీకు దేశపు పేరు. కార్య 16[1] వలన వీరందఱు లుస్త్రగ్రామ నివాసులని తెలియనగును. లోయి బహు నిష్ఠగల యూదా మతస్థురాలైన తన కుటుంబమువారికి దైవగ్రంథ సత్యమును బోధించుట విషయమయి మిగుల పరిశ్రమ చేసెను.

M.

**లోహములు** (Metals). పలెస్తీనునందు లోహపుగనులు లేవు. ఇనుము తప్ప మఱేదియు నచ్చట దొఱకదు. కావున లోహములన్నిఁటిని విదేశములనుండి తెప్పించుకొనిరి. బైబిలునందీ దిగువలోహములను గూర్చి యుదాహరించినట్లు చూడవచ్చును.

1. బంగారము. ఆరంభమునుండి దీని గూర్చిన పెక్కు సూచనలు బైబిలునందు గలవు (ఆది 2[11,12] 13[2] 24[22] మొ॥). ముఖ్యముగా ఫేనీకే వర్తకులు దీనిని తెచ్చినట్లు సూచన గలదు (యెహె 27[22]). సొలొమోను స్వయముగా నోడలను గట్టించుకొని ఓఫీరు వఱకు వాటి నంపి

బంగారమును దెప్పించుకొనెను (I రాజు $10^{10,11,14}$). అతని కాలమునందు కట్టిన దేవాలయములోని అతి పరిశుద్ధ స్థలమును పరిశుద్ధ స్థలమందలి వస్తువులను బంగారు రేకులతోఁ గప్పుటయే గాక, దేవాలయమం దుపయోగించిన పాత్రలు గిన్నెలు మొదలగు వాటి నన్నిఁటిని బంగారుతోఁ జేసిరి (I రాజు $6^{14-38}$ $7^{48-50}$). అన్యులును తమ విగ్రహములను బంగారుతోఁ జేయించిరి (ప్రక $9^{20}$). చెఱకు పూర్వము బంగారపు నాణెము లుపయోగించక పోయినను, బంగారపు కమ్ములను నాణెములకు ప్రతిగా ఉపయోగించినటుల కనఁబడుచున్నది దానిని విశేషముగా నగల కుపయోగించుచు వచ్చిరి (ఆది $24^{22,53}$ $41^{42}$ I సమూ $6^{8}$ II సమూ $1^{24}$ మొ॥). అదెంత విలువగలదైనను దేవుని వాక్యము (కీర్త $19^{10}$ $119^{127}$), దైవజ్ఞానము (యోబు $28^{17}$) దాని కన్న నెంతో శ్రేష్ఠమైనవై యున్నది. మోక్షమందలి ప్రకాశమును సూచించుటకు దాని బంగారముతో సరిపోల్చిరి (ప్రక $21^{18,21}$).

బంగారుతో కంసాలులు నేర్పరితనమును కనఁబఱచెడి పనులను జేసిరి. దానిని శుద్ధిజేయుటకును (యెష $1^{25}$ మలా $3^{3}$), దాని నతుకుటకును (యెష $41^{7}$) దానితో పొదుగుటకును (నిర్గ $26^{29}$) దానిని సన్నని తీగెగా తీసి అల్లుటకును (నిర్గ $28^{6,7}$) వారికి బాగుగాఁ దెలిసియుండెను.

**2. వెండి.** ఇదియు నారంభకాలమున నుండి యున్నట్లు బైబిలునం దగుపడుచున్నది (ఆది $13^{2}$ $20^{16}$ $23^{15}$ మొ॥). ఫేనీకే వర్తకులు దీనిని తర్షీషునుండి దెచ్చిరి (యెహె $27^{12}$). ఇది సాధారణముగా బంగారుతోఁ గలిపి యుదాహరింపఁబడినను (నిర్గ $3^{22}$ ద్వితీ $7^{25}$ కార్య $3^{6}$ మొ॥) బంగారుకన్న నెక్కువగా వాడుకలోకి వచ్చెను. దీనితోను నగలు జేయించుకొనిరి (నిర్గ $3^{22}$ $11^{2}$). మందిరపు దిమ్మెలకు దీనిని వాడిరి (నిర్గ $26^{19}$ $27^{10}$ మొ॥) అన్యదేవతల విగ్రహములను దీనితో జేసిరి (నిర్గ $20^{23}$ న్యాయా $17^{4}$ యెష $2^{20}$ కీర్త $135^{15}$). దీనితో పాత్రలను జేసికొని వాడిరి (II దిన $9^{24}$ $24^{14}$ మొ॥). దీనిని సొమ్ముగా వాడినను చెఱకు ముందు నాణెములను చేయక దానిని తూఁచిరి. కంసాలులు వెండిపనియందును నేర్పరులై యుండిరి. జ్ఞానము వెండి కన్న మంచిదను హెచ్చరికలును బైబిలునందు గలవు (సామె $3^{14}$ $8^{10}$).

**3. రాగి, ఇత్తడి.** దీనిని కుప్ర నుండి దెప్పించిరి. రాతిని కఱిగించి రాగిని దీసినట్లు యోబు $28^{2}$ నందున్నది. రాగిని వేఱుగా వాడక దానిని తగరముతోఁ గలిపి యిత్తడిని జేసిరి. ఇత్తడిని చేయువిధము ఆదికాలమునుండి తెలిసియున్న సూచన లున్నవి (ఆది $4^{22}$). గుడారము, దేవాలయముల యావరణములందున్న వాటి నన్నిఁటిని యిత్తడితోనే చేసిరి (నిర్గ 28, I రాజు $7^{14-47}$ II దిన 4). ఈ లోహములతో తాళములను (I దిన $15^{19}$), కేడెములను (II దిన $12^{10}$), గుమ్మములను (కీర్త $107^{16}$), విగ్రహములను (ప్రక $9^{20}$), పాత్రలను (యెహె $27^{13}$), ఆయుధములను (I సమూ $17^{5,6,38}$; II సమూ $21^{16}$ $22^{35}$), అద్దములను (నిర్గ $38^{8}$ యోబు $37^{18}$) జేసిరి. ఇత్తడి పనులనుచేసెడి నేర్పరులు ఇశ్రాయేలీయులలో లేనందున సొలొమోను ఫేనీకే నుండి హూరామను వానిని దేవాలయపు పనులను జేయుటకు రప్పించెను (II దిన $4^{11,16}$).

**4. ఇనుము, ఉక్కు.** ఇదియు ఆది కాలమునుండి తెలిసిన లోహమే (ఆది $4^{22}$). అది లెబానోను ప్రాంతములలో దొరికినను ఫేనీకే వారు దానిని తర్షీషునుండి తెచ్చిరి (యెహె $27^{12}$). వారు తెచ్చినది ఇనుము గాక ఇనుమును దీసెడి రాళ్లను దెచ్చిరని ఇశ్రాయేలీయులకున్న ట్లుదాహరింపఁబడిన ఇనుపకొలుములనుబట్టి యూహింపవచ్చును (ద్వితీ $4^{20}$ $8^{9}$, I రాజు $8^{51}$ యిర్మీ $11^{4}$). ఇట్టి కొలుములు గొప్పబాధలకు సూచనలై యున్నవి. కమ్మరివారిపముతో అన్నివిధములగు పనిముట్లను జేసిరి (ద్వితీ $19^{5}$ II రాజు $6^{5}$, I సమూ $17^{7}$ యిర్మీ $17^{1}$ యోబు $19^{24}$). వ్యవసాయమునకు గావలసిన నాఁగళ్లు, దంతెలు దీనితోఁ జేసిరి (ఆమో $1^{3}$ I సమూ $13^{20}$, II సమూ $12^{31}$), గొలుసులు (కీర్త $105^{18}$ $107^{10}$), గడియలు (యెష $45^{2}$), గుమ్మములు (కార్య $12^{10}$), ఆయుధములు (యెష $10^{34}$ ప్రక $10^{10}$), రథములు (న్యాయా $1^{19}$) దీనితోఁ

జేసిరి. ఇనుపదండముతో నేలుట కఠిన ప్రభుత్వ మునకు సూచనరైయి యున్నది (ప్రక 2[27] 12[5] 19[15]) ఇట్టి గట్టితనము ఇనుప స్తంభములచేతను సూచింపఁబడెను (యిర్మీ 1[18]).

**5. తగరము.** దీనిని ఫేనీకేవారు తర్షీషు నుండి దెచ్చిరి (యెహె 27[12]). పైన నుదాహరించినట్లు దీనిని రాగితో కలిపి వాడిరేగాని ప్రత్యేకముగా వాడలేదు. యెష 1[25] నందు అది కలుపఁబడిన లోహములలో తక్కువ విలువ గలది గాన, మంచిదానిని చెరుపుటకు వాడిన దానికి సూచనయైన ట్లున్నది.

**6. సీసము.** ఫేనీకేవారు దెచ్చిన లోహములలో నిదియు నొకటియై యుండెను (యెహె 27[12]). తర్షీషు నుండి యను మాట లున్నను దీనిని తగరమును వా రింగ్లాండుదేశము నుండి దెచ్చి రనుకొనుచున్నారు. రాతిశాసనములను చెక్కి, చెక్కిన సందులను సీసముతో నింపుట బైబిలు కాలమునందు జేసిరి (యోబు 19[23]). సీసముతో గుండ్లను జేసి వాడిరి (ఆమో 7[7]). దీనిని ఇతర లోహములతో నెట్లు కలుపవలెనో బైబిలు కాలమున నున్నవారికిని తెలిసియుండెను (యెహె 22[19]).

## వ

**వంకి (Hook).** గుడారములోని తెరలను తగిలించుటకు వేసినవంకులకు మూలభాషలో నొక ప్రత్యేకమగు పదము కలదు (నిర్గ 27[10,11,17] 38[10,11] మొ॥). గుడారములో వాడిన వంకులు బంగారపువి (26[32-37] 36[36]). తక్కినవి వెండితోఁ జేసిరి.

**వంట, వంటసామగ్రి (Cooking and Cooking utensils).** ప్రస్తుతమున ఈ దేశమం దున్నట్లుగానే బైబిలు కాలమున పలెస్తీను ప్రదేశములలో వంటపనులు చేసికొనిరి. వారు వంటకు వాడుకొనిన సామగ్రి ఈ దిగువ నుదాహరింపఁబడినది:—

1. ఇంటిపనులకు సంబంధించిన కుండలలో (II సమూ 17[28]), నూతులయొద్ద నుండి నీళ్లు తోడి నెత్తిమీఁదగాని భుజములమీఁదగాని పెట్టుకొని తెచ్చు కడవలును (ఆది 24[15]), ఆ నీటిని పోసి యుంచుకొను బానలును (యోహా 2[6]) ఉదాహరింపఁబడెను. ఆది 24[15] లో నున్న మూలభాషా పదమునే I రాజు 18[33] నందు



ఐగుప్తీయులు తెల్లరాతితోఁ జేసిన పాత్రలు

తొట్లు అనియు మా 14[13] నందు నీళ్లకుండ యనియు తెనిఁగించిరి. బానలను ఈ దేశమందు వలె గోదుమలు యవలు మొదలగు ధాన్యరాసిని పోసి యుంచుటకును, ఒలీవలు మొదలగు ఫలములను దాఁచుటకు నుపయోగించిరి. పాత్రలు ఐగుప్తీయులు తెల్లరాతితో జేసిన వీనిలో నొక తరహా బానలు మనుష్యుఁడు పట్టునంత పెద్దవిగా నుండెను. ప్రయాణమై వెళ్లునప్పుడు వెంట తీసికొని వెళ్లు బుడ్లను ఒకటి లేక రెండుకాడ లుండునవి. వీనియందు నీటినిగాని (I సమూ 26[11-16] I రాజు 19[6]), నూనెనుగాని (I రాజు 17[12]) పోసి యుంచెడివారు.

2. బావులనుండి నీరు తోడుకొనుటకు బొక్కెనను (సంఖ్యా 24[7]), చేదను (యోహా 4[11]) ఇప్పటివలెనే వాడుకొనిరి. ద్రాక్షారసము మొదలగు పానీయములను దాఁచియుంచుటకు తోలుతోఁ జేయఁబడిన సిద్దెలను (యెహో 9[4,13]), తిత్తులను (మ 9[17]) వాడిరి. పిండి విసరుకొను తిరగలి ప్రతియింట నుండవలసిన అవసరమైన పనిముట్టయి యుండెను (నిర్గ 11[5] సంఖ్యా 11[8] ద్వితీ 24[6] మ 24[41]). వివిధ రకముల గంపలు తప్పని సరిగ ప్రతి గృహమునం దుండెను. వీటియందు భక్ష్యములను (నిర్గ 29[3]) పండ్లను (ద్వితీ 26[2]) మాంసము (న్యాయా 6[19]) నుంచిరి. లేవీ 15[12] నం దుదాహరించిన దారు (చెక్క) పాత్రలలో పిండిపిసుకు తొట్టియు

(నిర్గ 12[34]), సీసెరాకు యాయేలు తెచ్చి యిచ్చిన సర్దారులకు తగిన పాత్రయు (న్యాయా 5[25]), గిద్యోను గొఱ్ఱెబొచ్చు పిండి నీరు దీసిన పాత్రయు (న్యాయా 6[38]) ముఖ్యము లైనవి.

3. భోజనమును పొయిమీఁద (నిర్గ 8[3] లేవీ 2[4] హోషే 7[7]), బొరుసులోఁ గాని, తపేలలోఁ గాని, గూనలోఁ గాని, కుండలోఁ గాని వండుకొనిరి (I సమూ 2[14]). నిర్గ 16[3] నందుదాహరించిన మాంసము వండు కొను కుండయు, II రాజు 4[38] నందున్న పెద్ద కుండయు యిర్మీ 1[13] లో నున్న బాన అను వీటి వ్యత్యాసమును నిశ్చయింప వీలుగాదు. మూలభాషయందున్న పదములను పైనున్న తెలుఁగు మాటలచే తర్జుమా జేసినను అవి సరియైన మాటలని చెప్ప వీలులేదు.

4. ఇవుప సామగ్రులలో ఇసుపరేకుతో (యెహె 4[3]) చేసిన పెనమును (లేవీ 2[5]), కుండయు (2[7]), మాంసమును కోయుట కుపయోగించిన కత్తియు (ఆది 22[6-10] న్యాయా 19[29]), కుండలో నుడుకుచున్నదానిని గ్రుచ్చి యెత్తు కొంకియు (I సమూ 2[13]) ముఖ్యము లైనవి. కత్తులను ఆరంభకాలమున రాతితోను (యెహో 5[2]), తరువాత ఇత్తడితోను జేసికొనిరి.

5. భోజనమును వడ్డించుకొనుట కుపయోగించువానిలో పాత్రలును (సామె 19[24]), గిన్నెలు (సంఖ్యా 7[13]) ముఖ్యమైనవి. త్రాగుటకు గిన్నెలను (ఆది 40[11] II సమూ 12[3] మ 10[42] మొ॥), పాత్రలను (యెష 51[17] యిర్మీ 16[7] I కొరి 10[16] 11[26] మొ॥) వాడిరి. గాని వీని భేదమును గూర్చి అంత బాగుగాఁ దెలియదు. వీనిని మొదట మట్టితోఁ జేసిరి (లేవీ 6[28]), గాని క్రమక్రమేణ ఇత్తడితోను (6[28]), వెండితోను (సంఖ్యా 7[13] యూదీతు 12[1]) బంగారుతోను (I రాజు 10[21] ఎస్తే 1[7]) వారి వారి యంతస్థుకుఁ దగినట్లు చేయించుకొనిరి.

**వంతు, వంతులు లేవీయులు III, యాజకులు III చూ॥**

**వందనములు, కుశలప్రశ్న లడుగుట, శుభవచనము (Salutation).**

1. బైబిలుకాలము నందున్నవారు వాడిన వందన వాక్యములు గాని, వందనాచారములు గాని చాలమట్టుకు ఈ దేశమునందు వాడుకలో నున్నటు వంటివే. ఈ దిగువ వందనవాక్యములు బైబిలునందు కనఁబడుచున్నవి. (1) దేవుఁడు నిన్ను కరుణించు గాక (ఆది 43[29]). I సమూ 15[13] లో నున్న "యెహోవా వలన నీకు ఆశీర్వాదము కలుగుగాక" యను శుభవచనమును రూతు 3[10] లో నున్న "యెహోవాచేత నీవు దీవెన నొందిన దానవు" అను శుభవచనమును దాని వంటివై యున్నవి. (2) యెహోవా మీకు తోడై యుండుగాక అను శుభవాక్యమునకు యెహోవా నిన్ను ఆశీర్వదించుగాక యని బదులు చెప్పుట వాడుకయై యున్నది (రూతు 2[4]). (3) యూదులలో సాధారణముగా సమాధానమని అర్థమిచ్చు షాలోము అను శుభవాక్యమును వాడిరి (I సమూ 1[17] న్యాయా 4[17] I దిన 12[18] మ 10[13] లూ 24[36] యోహా 20[21] మొ॥). ఈ పదమునకు క్షేమము అని యర్థము. క్షేమము కలుగును గాక అను భావమిచ్చును. నేటివఱకు సిరియా ఐగుప్తు అరబ్బీ భరతఖండము మొదలగు దేశములలో వాడుచున్న సలాము అను పదము ఇదే. సిరియాలోని ఒకే మతస్థులు వందనము చేసికొనుటకు వాడిరి గాని అన్యులకు దీనిని వాడ లేదు. యూదులు తమతోటి యూదులకు మాత్రము వందనములు చెప్పినట్లు మ 5[47] వలనఁ దెలియుచున్నది. క్రీస్తు ఆ వాడుకను దిద్ద యత్నించెను. తప్పు బోధను చేయువారి బోధలో పాలివారు కాకుండుటకు వారికి వందనములు చెప్పరాదని II యోహా 11 వ నందున్నది. ఆతురతతో చేయునప్పుడు ఆలస్యము కలుగకుండునట్లు మార్గమధ్యమందు ఎవరికైనను కుశలప్రశ్నల నడుగ కూడదని అక్కడక్కడ కనఁబడును (II రాజు 4[29] లూ 10[5]). (4) నీకు శుభము అని తర్జుమచేసిన పదము (మ 26[49] 27[29] 28[9] లూ 1[28]) మరియొక వందనవాక్యముగా నున్నది. ఇది మూలభాషయందలి మాటకు సూటిగా సరిపడును. (5) రాజు చిరంజీవియగు గాక యని రాజులైన వారిని బహూకరించిరి

(I రాజు $1^{31}$). బాబెలు పారసీకరాజులకు కూడ నిట్లే వందనము లాచరించిరి (నెహె $2^{3}$ దాని $2^{4}$ $3^{9}$ మొ॥).

ఒకరినొకరు కలిసికొనినప్పుడు మాత్రమే గాక వదలిపెట్టి వెళ్లినప్పుడును అట్లే యొక శుభవచనముతో సెలవు పుచ్చుకొనిరి (ఆది $24^{60}$ $28^{1}$ $47^{10}$ యెహో $22^{6}$). సమాధానముతో వెళ్లుడి యను వాడుకమాటగా నిది పరిణమించెను దాని యందును షాలోము అను పదముగలదు (I సమూ $1^{17}$ $24^{9}$ II సమూ $15^{9}$ మా $9^{34}$ కార్య $16^{36}$). ఈ దేశమునందున్న రీతిగా వెళ్లఁబోవువారు "దయయుంచండి" అను మనవితో సెలవు పుచ్చుకొనినట్లు I సమూ $1^{18}$ వలనఁ దెలియును. ఆ వచనమునందున్న నీ దృష్టికి కృప నొందెదను గాక అను మనవి ఆ యర్థమునే యిచ్చును.

ఇట్లు వందనములు చెప్పువారు చేయు అభినయములుకూడ చాలమట్టుకు ఈ దేశపువంటివే. సాష్టాంగపడిరి (ఆది $18^{2}$ $19^{1}$). వాహనము మీఁద నున్నవాఁడు దానినుండి దిగి వందన మాచరించెను (I సమూ $25^{23}$ II రాజు $5^{21}$). గొప్పవారి కాళ్లను పట్టుకొనిరి (కార్య $10^{25}$). మానవుల కట్లు చేయఁదగదని పేతురు వారించినట్లు చూడవచ్చును.

బోయజు తన పనివారిని బహూకరించెను (రూతు $2^{4}$). బంధువు లొకరికొకరు వందనము లాచరించుకొనిరి. దారిని పోవువారును ఒకరినొకరు పలుకరించుకొని సలాములు చేసికొనిరి (కీర్త $129^{8}$). ఉత్తరములలో వ్రాసిన వందనములును పైవానివంటివి. ఉత్తర మారంభించినప్పుడును (రోమా $1^{1-7}$ I కొరి $1^{1}$ మొ॥), ముగించినప్పుడును (I థెస్స $5^{26-28}$ కార్య $15^{29}$ మొ॥) ఇట్టి వందనవాక్యములను వ్రాసిరి.

**వంశావళి** (Geneology). బైబిలునందుదాహరింపఁబడినవారు తమ వంశావళులను బహు జాగ్రతగా కాపాడెడి వారు. రాజులు ప్రధానయాజకులు మాత్రమే గాక, గోత్రప్రపెత్తనమును, వారసత్వమును, ఆలయములోని హక్కులును ఆయా వారలు పొందు నిమిత్తము వంశావళిక్రమము ననుసరించి లెక్కించిరి. తమ వంశావళి క్రమమును తెలుపలేకపోయినందున యాజకత్వమునుండి తొలగింపఁబడిరి (నెహె $7^{63,64}$). అట్టి అవసరమునుబట్టి మొదటి నుండి తమ వంశావళి క్రమణికలను బహు జాగ్రత్తగా నుంచిరి (సంఖ్యా $1^{2-18}$ I దిన $5^{7-17}$ మొ॥). I తిమో $1^{4}$ తీతు $3^{9}$ లోని మితములేని వంశావళులు ఇట్టివిగాక జ్ఞోస్తికులు అను విమతస్థులు నమ్మిన యుగాధిపతుల జాబితాలను సూచించు ననుకొందురు.

క్రీస్తు పూర్వీకులను దెలుపు రెండు వంశావళులు గలవు (మ $1^{1-16}$ లూ $3^{23-28}$). మత్తయి అబ్రాహాముతో నారంభించి దానిని వ్రాసెను. లూకా క్రీస్తు నుండి ఆదామువఱకు దానిని క్రింద నుండి వ్రాసెను. మత్తయి వ్రాసిన జాబితాలో పదునాలుగేసి తరములుగల మూఁడు భాగము లున్నవి. అబ్రాహాము మొదలు దావీదువఱకు, దావీదు మొదలు చెఱవఱకు, చెఱనుండి క్రీస్తు వఱకు ఆ భాగములందు చెప్పఁబడినవి. అతఁడిట్లు ప్రతిభాగములో 14 తరము లుండునట్లు సవరించినందున కొన్ని పేరులు లోపించెను. దావీదు మొదలు క్రీస్తువఱకు లూకా 41 పేరులను వ్రాసెను గాని, మత్తయిలో 28 మాత్ర మున్నవి. మత్తయి దావీదు కుమారులలో సొలొమోను సంతతివారిని, లూకా నాతాను సంతతి వారిని వ్రాసెను. ఈ పేరులలో షెయల్తీయేలు జెరుబ్బాబెలు పేరులు గాక తక్కిన వన్నియు భేదములుగా నున్నవి. అందున కనేక కారణములు చెప్పెదరు.

1. యోసేపు తండ్రియు తాతయు, సంతానహీనులై చనిపోయిన తమ సహోదరుల భార్యలకు ధర్మశాస్త్రానుకూలముగా సంతానము కలిగించిరని మిగుల పురాతనమగు నొక వాడుక కలదు. మత్తయి మరియ పెనిమిటియగు యోసేపును మత్తానుయొక్క చనిపోయిన కుమారుఁడగు యాకోబుయొక్క పుత్రునిగా నెంచెనుగాని లూకా అతని భార్యకు సంతానమును కలిగించిన హేలీ యొక్క పేరు వ్రాసెనని వారి యభిప్రాయము.

2. క్రీస్తు దావీదు సింహాసనమునకు వారసుఁడగుటచే దావీదుకు తరువాత రాజ్యము నేలిన వారి పేరులు మత్తయి వ్రాసెను గాని లూకా ఆట్లేలినవారి పేరులుగాక కన్నవారిని సూటిగా

వ్రాయుటచే నిట్టి భేదము లా జాబితాలయందుఁ గనఁబడుచున్నవని మఱికొందఱి యభిప్రాయము.

3. మత్తయి, యోసేపు పూర్వికులను లూకా మరియ పూర్వికుల పేరులను వ్రాసినందున ఇట్టి భేదములు వచ్చినవని యెంచువారును గలరు. యేసు యోసేపు కుమారుఁడని యెంచఁబడెనని లూకా వ్రాసిన మాటలకీ యభిప్రాయము సూటిగా సరిపడును. ఆయన యోసేపు కుమారుఁడు కాఁడని ఆ మాట స్పష్టపఱచుచున్నది. తెలుఁగులో నున్నట్లు (లూ $2^{22-24}$) మూలభాష యందు యోసేపు పేరు రెండుమారులు గాక ఒకసారి మాత్రము గలదు. క్రీస్తు యోసేపు కుమారుఁడని యెంచఁబడెనని తెనిఁగించఁబడినను మూలభాషయందు హేలీ నుండియు, మత్తతు నుండియు అని యుండుటచే లూకా యోసేపు పూర్వీకులను వదలి మరియ తండ్రియగు హేలీ పూర్వీకుల పేరులను వ్రాసెనని యెంతురు. హేలీ మరియ తండ్రి యని యూదుల పారంపర్యములలోఁ గూడ సూచనలున్నవి. ఇది యన్నిఁటిలో నమ్మఁదగిన యభిప్రాయము. అయినను షెయల్తీయేలుయొక్క తండ్రి మత్తయిలో యెకొన్యా యనియు, లూకాలో నేరియనియు పిలువఁబడుట మఱియొక కష్టముగా నున్నది. గాని ఈ భేదముపైన 2 ను అనుసరించి వచ్చి యుండవచ్చును.

4. నవీన పండితులలోఁ గొందఱు వీని నేకీభవించుటకు యత్నము చేయక మత్తయి లూకాలు వేర్వేఱు జాబితాల ననుసరించిరని యభిప్రాయపడుచున్నారు.

యూదులు తమ వంశావళుల నుంచిన విధమును చూడఁగా ఇట్టి భేదము లుండుటలో నాశ్చర్యము లేదు. వారు మనుమలను, మునిమనుమలను కుమారులనుగా లెక్కించిరి (ఆది $46^{12}$ ను $46^{15-18-25}$ తోను, $46^{12}$ ను $46^{21,22}$ తోను సరిపోల్చుఁడు). సహోదరుని పేరటను, వారసత్వము ననుసరించియు సంతానమును లెక్కించుటవలన భేదములు రాకతప్పదు. ఈ సంగతులను మనస్సులో నుంచుకొనిన యెడల కష్టము లన్నియు తీరిపోవును.

**వక్త** (Orator). తెర్తుల్లు అను నొకని బిరుదు (కార్య $24^{1}$). వాక్చాతుర్యమును నేర్పుటకు గ్రీకువారును రోమీయులును గొప్ప శ్రద్ధ పుచ్చుకొనిరి. అట్టి వక్తలు ఇచ్ఛకపు మాటలాడుటవలనను యుక్తిగా మాటలాడుటవలనను తమ మాటలను వినువారు తమ్మును నమ్మునట్లు జేసెడివారు. వకీలైన తెర్తుల్లు ఇట్టి వాక్చాతుర్యము గలవాఁడు. ఇట్టి వక్తలు కోర్టులలో మాత్రమే గాక బజారులలోను ప్రజల సభలలోను తమ పనులను జరిపెడివారు. ఆ కాలములో ప్రతి యూరియందు నట్టివా రుండినట్లు పురాతన చరిత్రలవలనఁ దెలియుచున్నది.

వడగండ్లు వ్యవసాయము 5 (5) చూ॥

వడిసెల ఆయుధములు I 7 చూ॥

వడుకుట, నేయుట వృత్తులు చేతిపనులు III 1 చూ॥

**వడ్డీ** (Interest). పాఁత నిబంధన కాలములో అక్కఱ నిమిత్తము అప్పులు పుచ్చుకొనిరి గాని, వ్యాపారములు చేయుటకు పుచ్చుకొనలేదు. కావున అట్టి అక్కఱలలోనున్న తమ స్వంతవారియొద్ద వడ్డీ పుచ్చుకొనరాదను నియమమున్నది (నిర్గ $22^{25}$ ద్వితీ $23^{19,20}$ లేవీ $25^{35}$ $25^{38}$) గాని అన్యులయొద్ద పుచ్చుకొనుట నిషిద్ధము కాదు (ద్వితీ $23^{20}$). అట్టి పద్ధతి ప్రజలు విస్తరించని కాలములో సరిపోయెను గాని, ప్రజలు విస్తరించినప్పుడు అట్లు చేయుట కసాధ్యమయ్యెను. తగిన వడ్డీ పుచ్చుకొనుట విషయమే యాక్షేపణ లేనట్లు ప్రభువు చెప్పిన తలాంతుల ఉపమానము వలనఁ దెలియుచున్నది (మ $25^{27}$ లూ $19^{23}$). ప్రజలు ఎక్కువ వడ్డీ పుచ్చుకొనుటవలన జనసామాన్యమునకు నష్టము కలిగెను. బాబెలు దేశములో నెలకు రూపాయికి రూ. 0-1-4 చొప్పున వడ్డీ పుచ్చుకొన్నట్లు రాతిశాసనముల వలనఁ దెలియును (అప్పు 1 చూ॥).

వడ్లవాఁడు, వడ్రంగి వృత్తులు చేతిపనులు I 3 చూ॥

**వదరుబోతు** (Babbler). ఏథెన్సు పట్టణములోని జ్ఞానులు పౌలుకుపెట్టిన అపహాస్యపు పేరు (కార్య $17^{18}$). దాని మూలభాషాపదము యొక్క అర్థము ముక్కలను ఏరుకొని తిను పక్షి

చేయుదానిని సూచించును. పౌలు వంటివారు అక్కడక్కడ వార్తల నీ విధముగా చేరుకొనిరి. దానివలన జీవనము జరుపుకొనుచున్నట్లున్నదే గాని వారు చెప్పు సంగతు లెన్నఁదగినవి కావు అని వారన్న దృష్టాంతము సూచించుచున్నది గాని కొందఱు పౌలుచెప్పిన సంగతులను గాక అతని వైఖరినే పరిహసించినట్లు తలంచుచున్నారు.

**వన్యా** (Vaniah = బాధ?). అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచినవారిలో నొకరు (ఎజ్రా $10^{36}$).

**వప** (Calu). క్రింద కడుపులో బొడ్డున నుండెడి ఉల్లిపొరవంటి క్రొవ్వు. బైబిలునందిది కాలేజముకు సంబంధించియున్న క్రొవ్వును సూచించును. దానిని యజ్ఞములలో అర్పింపవలెనను నియమములున్నవి (నిర్గ $29^{13}$ లేవీ $3^{4,10,15}$ $4^{9}$ $7^{4}$ $8^{16,25}$ $9^{10,19}$). నేటివఱకు యజ్ఞములు చేయునప్పుడు సోమయాజులు ఈ వపను అగ్నిహోత్రమునందు దహింతురు (అర్పణములు చూ॥).

**వర** ఆయుధములు I 4 చూ॥

**వరములు** కృపావరములు, ఈవి చూ॥

**వర్ణములు** రంగులు చూ॥

**వర్తకము, వర్తకులు, వర్తకపు సరకులు** (Trade, Merchants, Merchandise).

1. చరిత్ర: బైబిలునం దుదాహరించినవారు ఆదికాలమునుండి రాజులకాలమువఱకు వర్తకము చేసెడివారుగా మందలను కాయువారును, వ్యవసాయకులునై యుండిరి. వారు కనాను దేశములో స్థావరముగా నిలిచినప్పుడు అచ్చటనుండిన కనానీయులు వర్తకము చేయుచుండిరి. కనానీయుల పట్టణములో నొకటియగు తూరులోనివారు చాలకాలమువఱకు నిలిచి సరకులను ఎగుమతి దిగుమతులను చేయుచుండిన వారైరను (యెహె 27) బైబిలునందు కనానీయులను నది సాధారణమగు పేరుగాక వర్తకులను అర్థము నిచ్చును (హోషే $12^{1}$ యెహె $17^{4}$ మొ॥). రాజులకాలము మొదలు ఇశ్రాయేలీయులుకూడ కొద్దిదో గొప్పదో వర్తకమును చేసిరి. సొలొమోను ఓఫీరు అను దూరదేశమునకు తన ఓడలను పంపి అచ్చటినుండి బంగారమును చందనపు మ్రానులను కోతులను నెమళ్లను తెప్పించెను (I రాజు $9^{26-28}$ $10^{11,12}$). షేబరాణియు సొలొమోను చేసిన వ్యాపారముల విస్తీర్ణతను సూచించును ($10^{1-13}$). ఆ కాలమునం దితరులు కూడ అట్టి వర్తకమును విశేషముగా చేయుచుండిరి ($10^{15}$). సొలొమోను కాలమునందు గుఱ్ఱముల వర్తకము విశేషముగ నుండెను ($10^{28,29}$). అప్పటినుండి రాజులు ఇట్టి వర్తక వ్యాపారాదుల విషయమై శ్రద్ధ పుచ్చుకొన్నట్లుగా నున్నది. ఇశ్రాయేలీయుల రాజగు ఒమ్రీ షోమ్రోనులో దమస్కు వర్తకులకు బజారువీధుల నిచ్చెను ($20^{34}$). అతని కుమారుఁడగు అహాబు ఏలుబడిలో ఇశ్రాయేలీయుల వర్తకులకు అదేరీతిగా దమస్కు బజారులో నొక వీధి నిచ్చిరి ($20^{34}$). యెహోషాపాతు సొలొమోనువలె సముద్ర వ్యాపారములను చేయ యత్నించెను ($22^{48}$). ఈ సూచనలనుబట్టి రాజులు వ్యాపారముల విషయము ఎక్కువ శ్రద్ధఁ బుచ్చుకొన్నట్లు కనఁబడును (పన్ను చూ॥).

దేశమునందు యెరూషలేము షోమ్రోను మొదలగు గొప్ప పట్టణములు స్థాపింపఁబడినది మొదలుకొని వర్తకము వృద్ధిలోకి వచ్చినదనుటలో నాశ్చర్యము లేదు. ఆ పట్టణవాసులకు కావలసిన వాటిని సప్లయి చేయుటకు వర్తకులు తప్పని సరిగ నుండవలసినదే. ప్రస్తుత మీ దేశములో నున్నట్లు అప్పుడుకూడ తిరునాళ్ల జరుగు సమయములలో సరకులను ఎక్కువగా సమకూర్చి వ్యాపారములు చేయుచుండిరి (మ $21^{12-17}$). అట్టి సమయములలో ఆమోసు బేతేలులో బోధించినట్లుగా నున్నది (ఆమో 8).

ఇశ్రాయేలీయు లాయా జనాంగములతో సంబంధపడి యుండుటవలనను వర్తకము వృద్ధిలోకి వచ్చెను. సొలొమోను కాలమునందు తూరు సీదోనులతోను, అప్పటినుండి 8 వ శతాబ్దము వఱకు దమస్కు వారితోను, 8, 7 శతాబ్దములలో అష్షూరువారితోను ఇశ్రాయేలీయుల కిట్టి సంబంధముండెను. ఇశ్రాయేలీయులు చెఱపట్టఁబడఁగా ఆ కాలమున అందరికన్న నెక్కువ వర్తకముచేసిన బాబెలు వారితో వారు సంబంధించినవారై వారి మధ్యనే నివసించుచు, అనేకులు తిరిగి యెరూష

లేమునకు వెళ్లక చెదరిపోయి మంచి వర్తకులైరి. తిరిగి తమ స్వదేశమునకు వెళ్లిన వారిలోను వర్తకము వృద్ధియైనట్లు నెహె 3[8,11,31] 5[1-5] 13[15-22] వలనఁ దెలియుచున్నది. పారసీకులు, గ్రీకులు, రోమనులు సర్వలోకములో సంచరించుటకు వీలగు మార్గములను వేయించినందున దూరదేశములందుండు వారితో వ్యాపారములు చేయుటకు వీలాయెను. ఇట్లు యెరూషలేము నాశనము వఱకు సాధారణములగు వ్యాపారాదులు చేసి, వానియందుండు సర్వసాధారణ మోసములను చేయ నలవాటుపడిరి (యెష 2[7] 3[17-26] 5[8] ఆమో 2[6] 4[1] 8[4,5] మీకా 2[1,2] హోషే 12[7] మొ॥). ప్రస్తుతమున్నరీతిగా యూదులు కోమటులై ఆ పనినే విశేషముగా జరిపినట్లు సూచనలేవియును లేవు. వారి పట్టణము నాశనమై వారు చెఱకుఁ గొంచుపోఁబడిన పిమ్మటనే వారు వర్తకము నారంభించిరి. గ్రీకువారు వారిని ఐగుప్తు చిన్నాసియా మొదలగు దేశములలో చెదరఁగొట్టిన పిమ్మట అది యెక్కువ యయ్యెను గాని క్రీ॥ శ॥ 70 సం॥ లో వారి పట్టణము నాశనమైన పిదప వారు సర్వలోకములో చెదరి దానిని ముఖ్యవృత్తిగా నవలంబించినట్లు లౌకిక చరిత్రవలనఁ దెలియుచున్నది.

2. వర్తకపు మార్గములు: లోక మంతటిలోకి వెళ్లు బాటలు ఇశ్రాయేలీయుల దేశమునకు సమీపముగా నుండెను. రైలుమార్గము లేర్పడక పూర్వమీ మార్గములమీఁదుగనే వర్తకము నడచెను. ఒంటెలమీఁద తమ సరకులనెత్తి గొప్ప సమూహములుగా వర్తకులు ప్రయాణము చేసెడివారు. అట్టి వర్తకపు బిడారులకు **సమూహముగా ప్రయాణముచేయు వర్తకులనియు,** (యోబు 6[19]) **సార్థవాహులనియు,** (యెష 21[13]), **బండ్లు** అనియు (యెహె 27[25]) పేరుఁ బెట్టిరి. వీరావర్తకపు మార్గము లనుసరించి ప్రయాణము జేసిరి. దమస్కునుండి తూరుకును తూరునుండి సముద్రతీరమునఁబడి గాజామీఁదుగా ఐగుప్తునకుఁ బోవునదియు, దమస్కునుండి ఎస్ద్రేలను బయలు మీఁదుగా ఐగుప్తునకు బోవునదియు, దమస్కునుండి యొర్దానునదికి తూర్పుగా మోయాబు మీఁదుగా అరబీదేశమునకుఁ బోవునదియు, అరబీదేశమునుండి గాజాకు వెళ్లునదియు పలెస్తీనులోనుండి వెళ్లు ముఖ్యవర్తకపుబాటలై యున్నవి. పూర్వకాలమున పలెస్తీను గొప్ప రాజ్యములకు మధ్యనున్నందున వర్తకు లనేకులు ఈ బాటల మీఁదుగా ప్రయాణము చేయుచు వచ్చిరి. అవి గాక దక్షిణమందున్న హెబ్రోనునుండి యెరూషలేము షోమ్రోనులమీఁదుగా వానిలో నొకటి పోవుటచే పలెస్తీనునందు సరకుల యెగుమతి దిగుమతులకు మంచి వీలుగా నుండెను.

3. వర్తకపు సరకులు: ధాన్యములను నూనెను ఇశ్రాయేలీయులు ఎగుమతి జేసిరి (I రాజు 5[11] కార్య 21[2,3]). సుగంధ ద్రవ్యములను ఔషధములను గిలాదునుండి పంపిరి (ఆది 37[25] 43[11]). గొఱ్ఱెబొచ్చును నారబట్టలను అమ్మిరి (సామె 31[13-24]). చెఱనుండి తిరిగి వచ్చిన పిమ్మట గలిలయ సముద్రములోను ఇతర స్థలములలోను చేఁపల వర్తకముండినట్లు దెలియుచున్నది (నెహె 13[16]). స్థితిమంతులైనవారు దంతమును పట్టు వస్త్రములను ఆభరణాదులను కొనిరి (ఆమో 8[12] యెష 3[16-22]). బానిసల వర్తకమును గూర్చిన సూచనలును గలవు. పలెస్తీనులోనే గాక ఇతర దేశములలోను అమ్మఁబడిన సరకుల జాబితా యెహె 27, ప్రక 18 లో చూడవచ్చును.

4. వర్తకపు విధము: ప్రతిదేశములో నున్నట్లు ఇశ్రాయేలీయులు కూడ సరకులకు మాఱుసరకులను మొదట యిచ్చిరి గాని సొమ్ము నియ్యలేదని నమ్మఁదగును. అయినను యాకోబు గింజలకొఱకు తన కుమారులను ఐగుప్తునకుఁ బంపినప్పుడు వారితో సొమ్మును పంపెను. ప్రస్తుతము వీధులవెంటఁ దిరుగుచు అమ్మెడి వారివలె వర్తకులు తిరుగుచు తమ సరకులనమ్మిరి (II దిన 9[14]) దూరదేశములతో వ్యాపారము చేయుటకు వారు ఒంటెలను గాడిదెలను వాహనములుగాఁ గొని బిడారులతో వెళ్లెడివారు (ఆది 37[25] యోబు 6[18,19] యెష 21[13]). సొమ్ము మార్చువారు తమ దుకాణములను బజారులలో పెట్టిరి (యోహా 2[14]). లూ 19[23] నందు వారు తమయొద్ద సొమ్ము దాఁచినవారికి వడ్డీ కట్టెడివారని కనఁబడుచున్నది. సరకులకు రొక్కము నియ్యనివారియొద్ద పత్రము లిచ్చినట్లు లూ 16[6] వలనఁ దెలియును. బయానాగా కొంత సొమ్మిచ్చుటయు అలవాటైనట్లు సూచనలున్నవి (ఎఫె 1[14]). పేదలు తమ వస్తువులను తాకట్టు

పెట్టి తమకు కావలసిన వాటిని కొనుక్కొనిరి (నెహె $5^{3}$). వీనినన్నిటినిబట్టి బైబిలు కాలమం దుండిన వారిప్పటి వర్తకులవలె వ్యాపారములు చేసిరని తెలియుచున్నది.

**వర్షము** పలెస్తీను IV, వ్యవసాయము 53 చూ॥

**వల** వేట చూ॥

**వవ్** (Vau or Waw = ו అను అక్షరము). హెబ్రీ యక్షరములలో నాఱవది: అక్షరమాలికగా వ్రాసిన 119 వ కీర్తనలోని 6 వ భాగములోని ప్రతిపంక్తియు నీ యక్షరముతో నారంభమగుటచే నా భాగమున కీపేరు పెట్టిరి.

**వష్తి** (Vashti). పారసీక చక్రవర్తి యగు అహష్వేరోషుయొక్క భార్య. అతఁడు తన సామంతులకు విందుఁజేసి ద్రాక్షారసముచే మత్తుగొనినవాఁడై తన రాజ్ఞియగు వష్తియొక్క సౌందర్యమును వారికిఁ జూపు నిమిత్తము వారి యెదుటకుఁ బిలువఁగా నామె రానొల్లనందున ఆ పదవినుండి తొలగింపఁబడెను (ఎస్తే $1^{3-9}$ $2^{14}$ ఎస్తేరు గ్రంథము చూ॥).

**వష్ని** (Vashni = రెండవవాఁడు) సమూయేలు పెద్దకుమారుఁడు (I దిన $6^{28}$). I సమూ $8^{2}$ నందితనికి యోవేలు అను పేరుగలదు. I దిన $6^{28}$ నందు యోవేలను పేరు లోపించినట్లున్నది. ఈ పదముయొక్క అర్థప్రకారము I సమూ $8^{2}$ లో నున్నట్లు రెండవవాడు అబీయా అని ఇక్కడ యర్థమిచ్చును.

**వస్త్రములు** (Clothing).

**1. నారబట్ట** అడుగున నేమియులేక దిగంబర శరీరముమీఁద ధరింపఁబడునది. ఒకప్పుడది పెద్దదిగా నుండును (మా $14^{51}$). కొన్నిసారులది నడుముచుట్టునకే యుండును. దీనిని ధరించినవాఁడు దిగంబరిగా నెంచఁబడును.

**2. చెంగు** పైవస్త్రమనఁబడు దానికి నాలుగు మూలలను నాలుగు కుచ్చులు వ్రేలాడుచుండును (ద్వితీ $22^{12}$ మ $9^{21}$ $23^{5}$). సంఖ్యా $15^{38}$ లో నీ పదమునే అంచులు అని తెనిఁగించిరి. ఇశ్రాయేలీయు లీ కుచ్చులను చూచినప్పుడెల్ల దేవుని కనికరములను ఆయన మహోపకారములను జ్ఞాపకము చేసికొనవలసి యుండెను.

**3 లాగు.** యాజకులు బలిపీఠము నొద్ద సేవచేయునప్పుడు ధరించవలసినవి (నిర్గ $28^{42}$).

**4. పై వస్త్రము.** మిక్కిలి పెద్దదియైన పెద్ద యంగీ. దీని చేతులు చాల వెడల్పుగాను వదలుగా నుండును. భాగ్యవంతులును మర్యాదస్తులు మాత్రమే దీనిని ధరింతురు. సౌలు దీనిని ధరించెను (I సమూ $24^{5}$). యోనాతాను తన ప్రేమకు గుఱుతుగా దావీదుకు ఇట్టి దాని



పై వస్త్రము

నొకటి నిచ్చెను ($18^{4}$). పరిసయ్యులు వీనిని ధరించిరి (లూ $20^{45}$). యోసేపుకు యాకోబిచ్చిన రంగుల యంగీ యిట్టిది కావచ్చును (ఆది



దుప్పటి

$37^{3}$). గొఱ్ఱెల కాపరులు ప్రయాణికులు చలి వాన తమ శరీరములకు తగులక యుండునట్లు

ఇట్టి దానిపై మఱియొక మోటువస్త్రమును ధరించిరి. ఈ మోటువస్త్రము ఒంటె వెండ్రుకలతో అప్పుడప్పుడు నేసిరి.

**5. దుస్తుల బట్టలు.** ఇవి ఇంగ్లీషువారి దుస్తులలో గౌనుమోస్తరు చొక్కాయియు, దానిమీఁద నడుముకు బిగించెడు దట్టీయును, వీటి మీఁద ధరించెడి పెద్ద చొక్కాయియునై యుండును (II రాజు $5^{6-23}$).



ముసుకు

**6. చెప్పులు.** పూర్వకాలమందు పలెస్తీను సిరియా దేశస్థులు తొడిగిన చెప్పులయొక్క క్రింది అట్టలు చదునుగా నుండెడివి. దాని కిరు ప్రక్కలను ఉంగరము లుండెను. వానిగుండ




నడికట్టు

వారులను దూర్చి పాదములకు కట్టెడివారు. ప్రకృతమందు ఆ దేశములయందంతట ఎఱుపు నలుపు పసుపు రంగులు వేయఁబడిన చెప్పులను ముచ్చెలను వాడుచున్నారు. ఒకఁడు తన ఆస్తిని అమ్మినప్పుడు గాని తన వారసత్వమును వదలుకొన్నప్పుడు గాని తన కాలిచెప్పు నూడఁదీసి కొన్నవాని కిచ్చుట యూదులలో మర్యాదయు ప్రమాణము చేయుటయునై యుండెను (ద్వితీ $25^{9}$ రూతు $4^{7,8}$). చెప్పులను తీసి విసరివేయుట మోసికొని రమ్మని చెప్పుటను సూచించును (కీర్త $108^{9}$). ఆ దేశములలోనివారు "నీవు నా



పాదరక్ష

చెప్పువు" "నా చెప్పుక్రింద నున్నావు" అని తిట్టుట వాడుక. పుణ్యస్థలములను రక్షించు నిమిత్తము చెప్పుల నూడఁదీసి వేసిరి (నిర్గ $3^{5}$



పాదరక్ష

**7. తుల్లాయి.** ఇశ్రాయేలీయుల తల వస్త్రము ప్రస్తుతము అరబీయులు వాడునటు వంటిదై యుండెను. వానిని నారతోఁగాని

నూలుతోఁ గాని పట్టుతోఁగాని చేసిరి. దాని వైశాల్య మొక చదరపు గజముండునది. దానిని ఒక మూలనుండి యెదురుమూలకు మడచి వెనుక మెడను, యెదుట చెంప ఎముకలను క్రమ్మునట్లుగా కన్నులమీఁదుగా నొక తెర యేర్పడునట్లు చుట్టి దారముతో తలకు కట్టిరి (ఆది $38^{18}$). పారసీకులతోను ఇతర తూర్పుదేశస్థులతోను కలిసియున్న వారు అప్పుడప్పుడు పాగాలను ధరించిరి (యెహె $23^{14}$). తన ముఖము కనఁబడకుండ పాగాను కట్టుకొన్న ప్రవక్త (I రాజు $20^{38}$) అరబీయులలో దొంగలు ధరించురీతిగా నుండెను.

J. C.

వాక్కు దేవవాక్కు చూ॥

**వాక్యము (Word, Logos).** ఇది క్రీస్తు యొక్క సార్థకనామములలో నొకటి (యోహా $1^{1,14}$, యోహా $1^{1}$ ప్రక $19^{3}$). యోహాను వ్రాఁతలలో గాక మరెచ్చటను ఆయన కిట్టిపేరు గానరాదు. దాని మూలభాషాపదమును గ్రీకు వారు తమ తత్వశాస్త్రములలో విశేషముగా వాడి యుండిరి. గ్రీకుశాస్త్రియగు ఫైలో (*Phillo*) ముఖ్యముగా దైవజ్ఞానమును సూచించుటకు దానిని వాడెను. గ్రీకులీ దైవజ్ఞానమును ఒక మూర్తిగా నెంచినట్లు అతని వ్రాఁతలవలనఁ దెలియుచున్నది. యోహాను ఎఫెసునందున్న గ్రీకువారి మధ్య పనిఁజేయుచు, వారికిఁ దెలిసియున్న ఈ పదమును క్రీస్తుయొక్క పేరుగా వాడెను గాని ఆ పదమును యోహాను వ్రాఁతలలో సూచించెడి భావము గ్రీకువారి శాస్త్రములందు సంబంధించినదిగా ముఖ్యముగా పాఁత నిబంధనను సంబంధించియున్నట్లు కనఁబడుచున్నది. జ్ఞాన మొక మూర్తియైయున్నట్లు యోబు $12^{12,28}$ సామె $1^{20}$ 8, సైరాకున్ 24-29 నందున్నది. పాఁత నిబంధనయందున్న 'దేవుని వాక్యము' అను పదము నిట్లే యొక మూర్తిగా నెంచినట్లున్నది. అది దేవునికిని మానవులకు నొక విధమైన మధ్యవర్తియై యున్నట్లుగా యూదుల పారంపర్య బోధలయందగుపడును. వాక్యమను నీ పేరుగల క్రీస్తు కిట్టి ముంగురుతులున్నను యోహాను వ్రాఁతలయందు మాత్రము దీనికొక విశేషయర్థముగలదు. క్రీస్తు అవతరించుటచే దీనిని నూతనముగా కనుగొనిరి. పై నుదాహరింపఁబడిన వన్నియు అలంకారరీతిగా దైవమూర్తులుగా నెంచఁబడినను, క్రీస్తు దేవునిని బయలుపఱచు ఈ లోకమునకు వచ్చిన అవతారమూర్తిగాను, అలంకార రీతిగా గాక ఆయన నిజముగానే త్రైక దేవునియందలి మూర్తిగాన ఆయన కీ నామము తగినదై యున్నది.

వాగు యెరూషలేము A I 1 చూ॥

**వాగ్దానము, వాగ్దత్తము (Promise).** పాఁత నిబంధనలో అబ్రాహామునకును (ఆది 12), దావీదుకును (II సమూ $7^{12-16}$), ఇశ్రాయేలీయులకును (యెష 42-66) దేవుఁడెంత గొప్ప మేలులను చేసెదననినను, ఆ వాగ్దానములను సూచించుటకు ప్రత్యేకమైన పదము హెబ్రీభాషయందు కనఁబడుటలేదు. తెలుఁగులో నున్నట్లుగా దేవుఁడుమాటనిచ్చెను అను సమాసమును దానికి బదులుగా వాడిరి. I రాజు $8^{56}$ కీర్త $105^{42}$ నందు వాగ్దానమని తెనిఁగించిన అసలు పదములు మాటయని శబ్దార్థమిచ్చును. క్రొత్త నిబంధనయందు వాగ్దానములను సూచించు ప్రత్యేకమగు పదమున్నది. అందులో వాగ్దానము దేవుఁడు మానవులను రక్షించుటకు తెలిపిన సువార్తను సూచించును (గల $3^{14,16,17,18,21,22}$). ఇట్లు రక్షణ క్రీస్తుద్వారా కలుగఁబోవు కాలము వాగ్దానకాలమనఁబడెను (కార్య $7^{17}$). ఆ రక్షణ విషయములన్నియు పితరులకు చేయఁబడి వారి పిల్లలగు తమకాలములో నెఱవేఱియున్నట్లు పౌలు ప్రకటించెను ($13^{32}$). దీనికి సంబంధముగా దేవుఁడు తన వాగ్దానమునుబట్టి క్రీస్తును లేపెను ($13^{33}$). క్రీస్తురాకడను గూర్చిన నిరీక్షణ పితరులకుచేసిన వాగ్దాన విషయమైన నిరీక్షణ యని ఆ రీతిగా చెప్పెను ($26^{6}$). అట్లే రెండవ రాకడనుగూర్చిన ప్రవచనములుకూడ వాగ్దానములుగా నెంచఁబడును (II పేతు $3^{4,9}$). అబ్రాహాముకు విశ్వాసమూలముగా కలిగినమేలులను చేతుననినది ఆయన వాగ్దానములనఁబడెను (రోమా $4^{13,20}$ హెబ్రీ $11^{9-17}$). అందుచేతనే అబ్రాహాము సంతానమున కియ్యఁబడినదేశము వాగ్దత్తదేశమనఁబడును. భూసంబంధమైన యీ మేలులు విశ్వాసుల ఆత్మీయస్వాస్థ్యమును కూడ సూచించును కావున, అట్టి స్వాస్థ్యము కూడ బహు రూఢిగా కలుగునను సంగతిని

సూచించుటకు అది నిత్యమైన స్వాస్థ్యమును గూర్చిన నిబంధన యనఁబడును (హెబ్రీ $9^{15}$). ఇట్లు దేవునిచే వాగ్దానమైనది మన నిత్యరక్షణను సూచించును. ఆ రక్షణ బహు దివ్యమైనదగుటచే అది అమూల్యములును అత్యధికములునైన వాగ్దానములనఁబడెను (II పేతు $1^{4}$). ఇవి యన్నియు క్రీస్తుద్వారా రూఢిగా నెఱవేఱును (II కొరి $1^{20}$).

పరిశుద్ధాత్మ నిత్తుననుటనుబట్టి ఆయన తండ్రియొక్క వాగ్దానమనఁబడెను (కార్య $1^{4}$ $2^{33}$ $2^{39}$).

**వాత్సల్యత** కృప చూ॥

**వాదము** తర్కములు చూ॥

**వాద్యము** సంగీతము చూ॥

**వాద్యములతో పాడదగిన గీతము** వీణనాద సహిత గీతము చూ॥

**వానకోవెల** పక్షులు 36 చూ॥

**వాపెసీ (Vophsi)** కనానుదేశమును వేగు జూచుటకు మోషేపంపిన 12 మంది వేగుల వారిలో నఫ్తాలీగోత్ర ప్రతినిధి (సంఖ్యా $13^{14}$).

**వాయువ్యవిశేషములు** సంగీతము చూ॥

**వాయుమండల సంబంధమైన అధికారి** సాతాను (1) చూ॥

**వారము** కాలమానము V చూ॥

**వారముల పండుగ** పండుగ III 1 (2) చూ॥

**వారసుడు, వారసత్వము (Heir, Inheritance).** వారసత్వము ఆరంభమునుండి యున్నవాడుకయై యున్నది. అబ్రాహామునకిది తెలిసియుండెను (ఆది $15^{3,4}$). పెండ్లి భార్యకుమారులకేగాని ఉంపుడుగత్తెల బిడ్డలకు వారసత్వపు హక్కు లేకపోయెను. దాసి దాని కుమారుఁడగు ఇష్మాయేలు స్వతంత్రురాలి కుమారుఁడగు ఇస్సాకుతో పాలివాఁడుకాలేదు ($21^{10}$). అబ్రాహాము ఉపపత్నుల బిడ్డలకు బహుమానములిచ్చి వారిని పంపివేసెను ($25^{5,6}$). గాని యాకోబు కుమారుల కందఱికి ఒకటే హక్కు కలిగెను. అప్పుడప్పుడు కుమార్తెలకును కుమారులతోపాటు స్వాస్థ్యమిచ్చిరి (యోబు $42^{15}$). ఒకని మరణానంతరమున వాని యాస్తిని వాని కుమారులకు భాగించి పెద్దవానికి తక్కిన వారిలో నొక్కొక్కనికి వచ్చుదానికి రెండింతలిచ్చునట్లు మోషే ధర్మశాస్త్ర నియమమేర్పడెను (ద్వితీ $21^{15-17}$). కుమారులులేనిపక్షమున ఆస్తి కుమార్తెలదయ్యెను (సంఖ్యా $27^{1-8}$) గాని, వారు తమ గోత్రమునకు చేరనివారిని వివాహమాడరాదు ($36^{1-12}$ తోబీతు $6^{10-12}$). ఒకవేళ మఱియొక కుటుంబికుఁ డిట్టి వారసు రాలిని వివాహమాడిన పక్షమున వాని బిడ్డల కామె తండ్రికుటుంబపు పేరు పెట్టఁబడెను (I దిన $2^{34-41}$ ఎజ్రా $2^{61}$). కుమారులైనను కుమార్తెలైనను లేనిపక్షమున ఆస్తి తండ్రి సహోదరునికి చెందెను. అతఁడుకూడ లేనిపక్షమున ఉన్నవారిలో సమీప బంధువుఁడు వారసుఁడుగా నెంచఁబడెను (సంఖ్యా $27^{9-11}$). గ్రీకు రోమనుల వాడుకల ననుసరించి మరణ శాసనము వ్రాయుటయు, దాని వ్రాసినవాని మరణమును రుజువుపఱచుటయు యూదుల కల వాటయ్యెను (హెబ్రీ $9^{16,17}$). విశ్వాసులు దేవునివారసులనియు క్రీస్తుతోటి వారసులనియు అలంకార రీతిగా ప్రస్తాపింపఁబడెను (రోమా $8^{17}$).

**వాహేబు (Vaheb).** ఎఱ్ఱసముద్రమునకు తూర్పుగా నుండు ఒక స్థలము. ఇది అర్నోను నదికి సమీపమున నున్నది (సంఖ్యా $21^{14}$). దీని యునికి సరిగాఁ దెలియదు.

## వి

**విందు, విందుప్రధాని** భోజనము 3 చూ॥

**విగ్రహములు, విగ్రహారాధన (Idols, Idolatry).** విగ్రహములనుగూర్చియు, విగ్రహారాధననుగూర్చియు బైబిలు నందంతట విస్తారముగా చెప్పఁబడినది. విగ్రహములనుగూర్చి మాట్లాడునప్పుడు హెబ్రీభాషలో ఉపయోగించిన మాటలు విగ్రహముయొక్క భయంకరత్వము లేక ఆరాధనయొక్క ఘోరత, దానిలో పాలు పుచ్చుకొనుటవలని వ్యర్థత, బుద్ధిహీనత, నైతికదుర్మార్గత, ఆ పూజవలనకలుగు దుఃఖము,

తొందర, ఆరాధింపఁబడు దేవత కారోపించిన సంపూర్ణ సిగ్గుకరమైన స్వభావము, సిగ్గుకరమైన ఆరాధనలోఁ గూడిన ఆచారములు, ఆరాధికులకు దానిద్వార కలిగిన అనివార్యమైన ముద్రమున్నగు వానిని సూచించునవై యుండెను.

విగ్రహము లనేకరూపములుగాను, అనేక పదార్థములతోను చేయఁబడునవి. కొన్ని చిత్రములుగా వ్రాయఁబడినవి; గోడలమీదను, జ్ఞాపకార్థక శిలలమీఁదను చెక్కఁబడినవి. మఱికొన్ని ఆరాధికుఁడు తన మనస్సులో ననుకొనిన యాకారమందు రాతితోఁగాని, మట్టితోఁగాని, ఏదోయొక లోహముతోఁగాని చేయఁబడినవి.

నిజదేవునికి బదులు తప్పుగా నారాధింపఁబడిన వానిలో ఆకాశమందలి నక్షత్రములు, మృగములు, వృక్షములు మున్నగునవి కలసియున్నవి. మక్కాలో నున్నట్టియు, మహమ్మదీయు లిప్పటికిని భక్తి చెల్లింపవలసినట్టియు ప్రాచీన అరబ్బుల నల్లరాయి ఒక దృష్టాంతము.

ప్రతిమారాధన ఆదిమకాలమందే యారంభమైనదనుటకే సందియములేకపోయినను, ఫలాని సమయమం దారంభించెనని చెప్పుటయసాధ్యము. అబ్రాహాము విగ్రహారాధనలోనే పుట్టి పెరిగెను. దానిని విడిచి ఆత్మీయారాధన ననుసరించి, దానికి సంరక్షకుఁడుగా నుండి, దానిని లోకమునకందించవలెనని దేవుఁడాతనిని పిలిచెను. అబ్రాహాము వంశస్థులైన హెబ్రీయులకు స్వంత విగ్రహారాధన ఏలాటిదైననులేదు. అయితే తాము సహవాసముచేసిన ప్రజలలో ఏలాటి విగ్రహారాధనయైనను ఉండినచో దాని నాశతో నంగీకరించ నిష్టముగలవారై యుండిరి. కనానీయుల నుండియు, మోయాబీయుల నుండియు, అమ్మోనీయులనుండియు, ఫిలిష్తీయుల నుండియు, అష్షూరు బబులోనీయుల నుండియు, తూరు ప్రజలనుండియు, ఐగుప్తునుండియు విగ్రహారాధనకు సలహాలను ప్రేరేపణలను పొంది, వాని నంగీకరించి, వెంటనే వాని నభ్యసించిరి. తన భర్తకపనమ్మకముగా నుండు వ్యభిచారిణిరైన స్త్రీవలె వా రాయన కపనమ్మకస్థులుగా నుండిరని దేవుఁడు వారినెల్లప్పుడు గద్దించుచుండెను. చెఱకు పోవుటకు వారిట్టి విగ్రహారాధనలో నుండిరి. చెఱలో వారు అన్యులతో సహవాసము చేయుట ద్వారను, వారు యెహోవా కపనమ్మకస్థులైయుండినందుననే వారికీశిక్ష కలిగెనని తలంచుటవలనను ప్రతిమారాధనవిషయమై వారికి క్రొత్త అభిప్రాయము కలిగెను గాన, చెఱనుండి వచ్చిన తర్వాత వారు జనాంగముగా ఇట్టి చెడ్డ సంగతులలో చిక్కుకొనకపోయిరి. అయితే కొందఱు అంతియోకస్ ఎపిఫనీస్ అనువాని కాలములో స్వేచ్ఛగాఁ గాని, బలవంతముగాఁ గాని విగ్రహారాధనలో ప్రవేశించిరి. యూదులలో మహాదేశాభిమానియైన యూదా మక్కబీయస్ అను వాని సైన్యములో కూడను కొందఱు విగ్రహారాధికు లుండిరి.

విగ్రహారాధన విషయమై లేవీయుల ధర్మశాస్త్రము మహా కఠినముగా నుండెను. పది యాజ్ఞలలోని మొదటి రెండు యాజ్ఞ లీపాపము విషయమైనవే (నిర్గ 20[1-3] 29[46]). విగ్రహారాధికుఁడు రాళ్లతో కొట్టి చంపఁబడెను. ఇశ్రాయేలీయులు త్వరగా పడఁగలిగిన పాపములలో నిదియే మొదటిదై యుండెను. విగ్రహారాధన యనునది వారి జీవాధిపతియైన వాని కపనమ్మకముగా నుండుటం బట్టి దానినిగూర్చి దేవుఁడు తన ప్రవక్తలద్వారను, యాజకులద్వారను విస్తారముగా నొక్కి బోధించెను. ఆయన ఇశ్రాయేలీయులను పిలిచి, వారివిషయమై జాగ్రత్త తీసికొని, వారిని కాపాడుటంబట్టి వా రితరదేవతల ననుసరించి తన కపనమ్మకస్థులైనందున తాళఁజాలక పోయెను. విగ్రహారాధనలోని కీడులలోఁ గొన్ని యేవనఁగా దానివిషయమై పునాది అభిప్రాయమును దానివలన ఫలితమును తామారాధించు దేవతమీఁదనే తమ చలించు తలంపులు నిలుపుకొనునట్లు సహాయముగా మాత్రమే విగ్రహమును నిలుపుచున్నామని విగ్రహారాధికులు వాదింతురు. అయితే ఇది తప్పక దేవతకు బదులుగా చేసిన విగ్రహమునే ఆరాధించునట్లు చేయును. మఱియు ఈ బొమ్మయే తప్పకుండ ఆరాధింపఁబడు దేవత యగును. మఱియు మనుష్యు లీలాగు తాము చేసిన విగ్రహమునే యారాధింప మొదలు బెట్టినప్పుడు ఆత్మీయారాధనమునకు బదులు పదార్థ సంబంధమైన ఆరాధనను జరిగింతురు. "దేవుఁడు

ఆత్మ గనుక ఆయనను ఆరాధించువారు ఆత్మతోను, సత్యముతోను ఆరాధించవలెను." తమ్మును చేసిన దేవునికి బదులుగా మనుష్యులు తాము చేసిన దానినే ఆరాధింతురు. కనుక ఇది నిజమైన దేవుని విసర్జించుటయై యున్నది. ఇది మనుష్యుఁడు ఆరాధింపఁబడవలసిన విధిని నెఱవేర్చుటకు చేయు ప్రయత్నమే గాని, ఆరాధింపవలసిన నిజమైన దేవుఁడు కోరు విధము కాదు. ఇది దేవునియొక్కయు, మనుష్యునియొక్కయు బద్ధవిరోధియైన సాతానుతో కలిసికొనుటయై యున్నది. ఇవ్విధమున వాఁడు దేవునికిని, నరునికిని మధ్య విరోధము పుట్టించుటకు మనుష్యుని మోసపుచ్చుచున్నాఁడు. ఇంతియేగాక ఇది మనుష్యుఁడు తానారాధించు దానివలె తానే యగునట్లు చేయును. నరుఁడు తానారాధించుటకు పెట్టుకొనిన మాదిరిదేవతకంటె తానెక్కువ శ్రేష్ఠుఁడై యుండలేదు. ఆ మాదిరి దేవత పదార్థమైనను, నరుఁడు తానే కల్పించుకొనిన దేవతయైనను అయినచో, అది తప్పక ఆ మనుష్యుని చెఱుపును (కీర్త $115^{8}$). అది అపవిత్రపఱచును.

విగ్రహారాధన ఎల్లప్పుడును, ప్రతియుగమందును దుర్నీతితోను, దుర్మార్గతతోను సంబంధించి యుండెను. ఇది నరుని వాని సృష్టికర్త నుండి సంపూర్ణముగా వేఱుచేయుచున్నది గాన నది ఆత్మీయమరణమే.

విగ్రహారాధన చేయువారికి శిక్షలు కలుగునని హెచ్చరిక గలదు (నేరములు శిక్షలు I 1 (2) చూ॥). B.

**విచారములు, విచారపడుట** చింత చూ॥

**విచిత్రమైన పనిగల వస్త్రము** వృత్తులు, చేతిపనులు III 4 చూ॥

**విజ్ఞాపనము** ప్రార్థన చూ॥

**విడనాడుట** వివాహము 6 చూ॥

**విడిచిపెట్టు మేక** అజాజేలు చూ॥

**విడిదిగది** (Guest chamber). ఆతిథ్యము చూపుట యూదుల కొక విశేషధర్మము. అందు నిమిత్తము యెరూషలేములో నివసించిన అనేకులు పండుగలకు వచ్చినవారు బసచేయునట్లు ప్రత్యేకమగు గదుల నేర్పఱచిరి. క్రీస్తు తన శిష్యులతో పస్కాను భుజించిన విడిదిగది (మా $14^{14}$ లూ $22^{11}$) అట్టిదే. లూ $2^{7}$ లో సత్రమనఁబడిన అసలు మాట ప్రస్తుతమున్న సత్రములవంటిది గాక యిట్టి విడిదిగదిని లేక గదులను సూచించునని కొందఱనుకొందురు (ఆతిథ్యము చూ॥).

**విడుదల సంవత్సరము** పండుగలు 4 చూ॥

**వితర్కము** తర్కము చూ॥

**విత్తనము** బీజము చూ॥

**విత్తుట** వ్యవసాయము 4 చూ॥

**విద్య, విద్యాశాల** బోధించుట చూ॥

**విధవ, విధవరాలు** (Widow). ఆరంభకాలమునుండి విధవరాలు తనకు తగిన వస్త్రములను ధరించెను (ఆది $38^{14-19}$). ఆమె తన ఆభరణాదులను తీసివేసి గోనెపట్ట కట్టుకొని వెండ్రుకలను ముడివేయకను, ముఖమునకు నూనె రాయక నుండెడిది (యూదీతు $10^{3,4}$ $16^{8}$). దేవుఁడు విశేషదయ చూపించెడి వారిలో దిక్కులేని విధవలు నుండిరి (ద్వితీ $10^{18}$ కీర్త $68^{5}$ $146^{9}$ సామె $15^{25}$ యిర్మీ $49^{11}$). మోషే ధర్మశాస్త్ర నియమకాలమునందును తరువాతను విధవలయెడల న్యాయము జూపి వారిని దయగాఁ జూడవలెననియు, అట్లు గానియెడల వారికి శిక్ష కలుగుననియు ఇశ్రాయేలీయులకు కట్టడ లియ్యఁబడెను (నిర్గ $22^{22}$ ద్వితీ $14^{29}$ $16^{11,14}$ $24^{17,21}$ $26^{12,13}$ యెష $1^{17}$ యిర్మీ $7^{6}$ $22^{3}$ జెక $7^{10}$ మలా $3^{5}$). యేసుక్రీస్తును ఆ సంగతినే నొక్కి చెప్పెను (మా $12^{40}$). అపొస్తలుల కాలమందున్న సంఘము విధవరాండ్రనుగూర్చి శ్రద్ధపుచ్చుకొనిరి (కార్య $6^{1}$ యాకో $1^{27}$). తిమోతి కప్పగింపఁబడిన సంఘములలో పిల్లలు గాని మనుమలుగాని లేని విధవరాండ్రు నిజముగా దిక్కులేనివారై యున్న పక్షమున (I తిమో $5^{4}$) అట్టివారిని విధవరాండ్ర లెక్కలోఁ జేర్చుకొని వారికి తగు సహాయము జేయవలెనని పౌలతనిని హెచ్చరించెను ($5^{16}$). వారి నట్టి విధవరాండ్ర లెక్కలోఁ జేర్చుట కామె అరువది యేండ్లకంటె తక్కువ వయస్సులేక, ఒక్క పురుషునికే భార్యయై యుండి సత్క్రియలకు పేరు నొందినదై యుండ

వలెను ($5^{9,10}$). ఇది అట్టి అనాథాశ్రయ స్థానమునకు ఆరంభమై యున్నది. రెండవ శతాబ్దాంతము మొదలు నాలుగవ శతాబ్దమువఱకు ఇట్టి వారు భక్తిగల విధవరాండ్రుగా పరిగణింపఁబడిరి. వారు సంఘములో సేవచేయుచు సంఘమందున్న స్త్రీలకు ముఖ్యముగా యౌవనురాండ్రగు విధవలకు విచారణకర్తలై, తలిదండ్రులులేని బిడ్డలను చూచుట వారి విధియై యుండెను. సంఘమందుండిన యిట్టి ఉద్యోగము లవొదికైయలో జరిగిన సభయందు క్రీ॥ శ॥ 364 లో రద్దుచేయఁబడెను.

భర్త చనిపోయిన యామె తమ్ముని వివాహమాడు విధినిగూర్చి వివాహము 2, 5 చూ॥

**విధి, విధులు** ధర్మశాస్త్రము చూ॥

**విధేయత** (Obedience). దేవునికి విధేయత కనఁబఱచుట అన్నింటిలో ముఖ్య విధాయకము (I సమూ $15^{22}$ యిర్మీ $11^{7}$ యోహా $14^{15-24}$). అట్టి విధేయత లేనిది దేవునిని సంతోషపఱచఁజాలము. దేవుని కుమారుఁడైన క్రీస్తు సహా విధేయతద్వారా పరిపూర్ణుఁడయ్యెను (హెబ్రీ $5^{8}$). అర్పణములు యజ్ఞములు ముఖ్యములైనవని యెంచిన యూదులకు విధేయత కనఁబఱచుటయే ముఖ్యమైనదని చూపుటకు, నీ చిత్తమును నెఱవేర్చుటకే వచ్చియున్నానని క్రీస్తును గూర్చి చెప్పఁబడెను ($10^{7}$). ఆయన పూర్ణ విధేయుఁడై మనుష్యులకు రక్షకుఁడయ్యెను ($5^{9}$). ఆయన శిష్యులును అట్టి విధేయతను చూపవలెను (I పేతు $2^{13}$ మ $7^{21}$ $12^{50}$ మొ॥).

దేవునికి మాత్రమే గాక మానవులకును విధేయత చూపవలెను. కుటుంబమునందు తలిదండ్రులకును (ద్వితీ $21^{18,19}$ ఎఫె $6^{1}$) భార్య భర్తకును ($5^{22}$), ప్రజలు అధికారులకును (రోమా $13^{1,2}$ I పేతు $2^{14}$), పెద్దలకును ($5^{5}$), దాసులు తమ యజమానులకును (ఎఫె $6^{5}$) లోఁబడవలెను. బోధకులకును లోఁబడవలెనను హెచ్చరిక గలదు (హెబ్రీ $13^{17}$). ప్రభువును ఘనపఱచుటకై మానవులలోనున్న ప్రతి కట్టడకు లోఁబడవలెను (I పేతు $2^{13}$).

**వినయము** దీనత్వము చూ॥

**విపంచిక** సంగీతము 3 (3) (ఛ) చూ॥

**విపరీతమైన అవయవములు** రోగములు చికిత్సలు I 9 చూ॥

**విప్పుడు కథ** గూఢవాక్యము చూ॥

**విమతములు** భేదములు 5 చూ॥

**విమర్శ** తీర్పు చూ॥

**విమోచకుడు, విమోచనము** (Redeemer, Redemption). ఈ పదములతో తర్జుమాచేయఁబడిన రెండు హెబ్రీపదములును రెండు గ్రీకు పదములును గలవు. క్రయధనము చెల్లించిగాని యజ్ఞము నర్పించిగాని ఒకని దాసత్వమునుండి విడిపించుటయని ఈ పదముల కర్థమగును. పాపమునుండి మాత్రమేగాక బలాత్కారము జబ్బులు చెఱ చావు మొదలగు వానినుండియు విడిపించుదానికి ఈ పదములు ద్వితీయోపదేశకాండము కీర్తనలు యెషయా గ్రంథములలో నుపయోగింపఁబడెను. ఐగుప్తు దాసత్వమునుండి కలిగిన విమోచనమే అన్నింటిలో గొప్పదిగా నెంచిరి (యెష $51^{9-11}$).

పాత నిబంధనయందలి యొక పదమునకు, బంధువునికి కలిగిన అన్యాయమునుగాని ఋణమునుగాని తీర్చువాఁడని యర్థము (ప్రతి హత్య చేయువాడు చూ॥). ఈ పదమును యోబు $19^{25}$ కీర్త $19^{14}$ యెష $41^{14}$ $43^{14}$ మొ॥ వాక్యములలో విమోచకుఁడు అను పదముచే తెనిఁగించిరి. రెండవ పదము క్రయధనమిచ్చి విడిపించుట యని యర్థమిచ్చును (ద్వితీ $9^{26}$ $15^{14}$ $21^{8}$ కీర్త $25^{22}$ $26^{11}$ $31^{5}$ మొ॥) ఈ పదమును అనేక వాక్యములలో విడిపించుట యని తెనిఁగించిరి (నిర్గ $13^{13}$ లేవీ $27^{27}$ ద్వితీ $7^{8}$ $13^{5}$ మొ॥). క్రొత్త నిబంధనలో నొక పదము కొని సంపాదించుట యని యర్థమిచ్చును. ఈ పదమును వెవ్వేఱు మాటలచే తెనిఁగించినను I కొరి $6^{20}$ $7^{23}$ II పేతు $2^{1}$ ప్రక $5^{9}$ $14^{3,4}$ నందీ యర్థము స్పష్టముగా కనఁబడును. రెండవ మాట క్రయధనమిచ్చుటచేత ఒకని విడిపించుటను సూచించును. ఇది క్రొత్త నిబంధనయందు సర్వసాధారణమైన పదము (మ $20^{28}$ మార్కు $20^{28}$ రోమా $3^{24}$ $8^{23}$ I కొరి $1^{31}$ ఎఫె $1^{7}$ మొ॥).

ఈ పదములు పాత నిబంధనయందు సాధారణముగా చెఱనుండిగాని అప్పులనుండిగాని విడిపించుటను సూచించును. పాపమునుండి విడిపించుటను గూర్చిన సూచన లక్కడక్కడ ఉండినను, పాపవిమోచన మా వచనములలో ముఖ్య విషయము కాదు (కీర్త $103^{3,4}$ యెష $53^{4,5}$). క్రొత్త నిబంధన కాలపువారు దేశసంబంధమైన విడుదలకొఱకు నిరీక్షించుచుండఁగా (లూ $2^{38}$ కార్య $1^{6}$), క్రీస్తును ఆయన అపొస్తలులును పాపవిమోచనమును గూర్చి ప్రకటించిరి. అట్టి విమోచనము తన మరణమువలననే కలుగునని క్రీస్తు బోధించెను (యోహా $3^{14-16}$ $6^{51-56}$ మ $20^{28}$ $26^{28}$ మొ॥) అపొస్తలులు వ్రాసిన గ్రంథములయందు దీ బోధ మఱింత తేటగా నున్నది (కార్య $20^{28}$ I కొరి $6^{20}$ ఎఫె $1^{7}$ I తిమో $2^{6}$ I పేతు $1^{18,19}$ ప్రక $5^{9}$ మొ॥). లోకపాప ప్రాయశ్చిత్తార్థమై క్రీస్తు తన ప్రాణము పెట్టెనను బోధ ఈ వాక్యములవలన స్పష్టమగుచున్నది. ఈ విమోచనమును విశ్వాసముతో నంగీకరించువారు పాపమువలన కలుగు శిక్షలనుండి (రోమా $8^{1,33,34}$) మాత్రమేగాక, పాపేచ్ఛలనుండియు పాపముయొక్క శక్తినుండియు (రోమా 6 గల $1^{4}$ తీతు $2^{14}$ హెబ్రీ $2^{14}$ మొ॥) విడిపింపఁబడెదరు. అది మనలను మరణము నుండియు విడిపించును (రోమా $8^{23}$). ఇట్లిది సర్వకీడులనుండి విడిపించుటయేగాక సర్వమేళ్లసంపదయగు నిత్యజీవము నిచ్చి ($6^{23}$ ఎఫె $1^{3}$ మొ॥), పరిపూర్ణ విముక్తిని గలిగించును. (ప్రాయశ్చిత్తము, శాంతికరము, కరుణాధారము, సమాధానపఱచుట, రక్షణ చూ॥).

**విరిగినపళ్లు** రోగములు చికిత్సలు III 3 చూ॥

**విరిగిన హృదయము** రోగములు చికిత్సలు III 8 చూ॥

**విలాపముచేయుట** ప్రలాపించుట చూ॥

**విలాప వాక్యములు (Lamentations).**

1. బైబిలునందలి ప్రవచన గ్రంథములలో నొకటి. దీనియందు అక్షరమాలికగా నున్న అయిదు కావ్యములున్నవి. ప్రతి కావ్యములో హెబ్రీ యక్షరముల ననుసరించి మూఁడేసి పంక్తులుగల 22 వచనములున్నవి. అందులోని ప్రతిపంక్తియు ఒకటే యక్షరముతో నారంభించును. హెబ్రీ యక్షరములు 22 అగుటచేనివి ఇరువదిరెండు వచనములగును గాని మూఁడవ అధ్యాయములో మనవారు ఒక్కొక్క వచనమును మూఁడు వాక్యములుగా భాగించినందున దానియందు 66 వచనములున్నవి. 5 వ అధ్యాయము అక్షరమాలికగా వ్రాయఁబడలేదు. మొదటి కావ్యములో పాడుపడిన యెరూషలేము నగరముయొక్క దుర్దశ విపరముగా నున్నది. ఆ పురముయొక్క పాపమును అందువలన కలిగిన శిక్ష న్యాయమైనదే యని స్పష్టముగ చెప్పఁబడియున్నది. రెండవ దానిలో దాని దుర్దశ మఱింత స్పష్టముగ వివరింపఁబడినది. మూఁడవ దానియందు విలాపవాక్యములును దేవుని దయాదాక్షిణ్య న్యాయములను గూర్చిన యొప్పుదలయు, ఆయన దయకొఱకైన ప్రార్థనయు నున్నది. నాలుగవ కావ్యమునందు పాపములయొక్క ఒప్పుకోలు వ్రాయఁబడినది. అయిదవ దానిలో జనులనుభవించిన దుర్దశ యెట్టిదో అది మఱల వివరింపఁబడినది. మఱియు దీనియందు దేవుని కనికరముకొఱకు ఒక ప్రార్థన గలదు.

J. C.

2. ఇది తెలుఁగు బైబిలులో ప్రవచన గ్రంథములలో నుండి యిర్మీయాకు తరువాత నున్నను హెబ్రీ బైబిలులో అది ప్రవచనములలో గాక రూతుకు ప్రసంగికి మధ్యనుండి పరిశుద్ధలేఖనములనఁబడినవానిలో నుంచఁబడెను. యెరూషలేము నాశనమునుగూర్చి ప్రలాపించుట దీనియందు ముఖ్యవిషయమై యున్నది. ఆ నాశనము ఎంత గొప్పదైనను అది పాపమువలన వచ్చినదని ఈ కీర్తనను రచించినవాఁడు ఒప్పుకొనెను.

3. దీనియందు గ్రంథకర్త పేరులేదు. LXX లో యెరూషలేము పట్టఁబడిన పిమ్మట యిర్మీయా యేడ్చుచు దానినిగూర్చి ఈ ప్రలాపగీతమును రచించెననుమాట గలదు. కావున ఆ పూర్వకాలమునుండి యిర్మీయా దీనిని వ్రాసెనను పారంపర్యమున్నది. అది రూఢి కాకపోయినను ఈ వాక్యములు యెరూషలేము నశించిన సమయములో వ్రాయఁబడియున్నదను సంగతి రూఢి

యగుచున్నది గావున యిర్మీయాయే దీనిని వ్రాసి యుండవచ్చును.

**విల్లు** ఆయుధములు I 6 చూ॥

**వివాదములు** భేదములు 3, 4 చూ॥

**వివాహము, పరిత్యాగము (Marriage and Divorce).** బైబిలునందు వివాహమును గూర్చిన సూచనల నీ దిగువరీతిగా వివరింపవచ్చును.

1. వివాహనియమము. ఇది దేవుని నియమము. మానవులను పురుషులుగాను స్త్రీలుగాను సృష్టించుటచేతనే యిట్టి నియమమేర్పడినది (ఆది $1^{27,28}$). నరుఁడు ఒంటరియై యుండుట మంచిది గాదని సంసారస్థితియే అందఱికి తగినదని ఆయన దీని నేర్పఱచెను ($2^{18}$). ఒక పురుషునికై ఒక స్త్రీని సృష్టించుటవలన ఏకపత్నీవ్రతము ఆయన నియమించినదే యని చెప్పఁదగును ($2^{18-24}$ మ $19^{5}$ I కొరి $6^{16}$). పురుషుల సంఖ్యయు స్త్రీల సంఖ్యయు దాదాపు సమముగా నుండుటవలనను ఇది నిత్యమైన యేర్పాటని చెప్పవచ్చును. ఏదైన నొక శ్రేష్ఠమైన మేలుకార్యము నొనర్చుట కొకానొకఁడు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించుట నిరాక్షేపణీయమగు సత్కార్యముగా నెంచినను (మ $19^{12}$ I కొరి $7^{8,26}$) మానవులు వివాహమాడ కూడదను బోధ బైబిలు బోధకు భిన్నమైనదై నిషిద్ధముగా నున్నది (I తిమో $4^{3}$).

2. వివాహపు చరిత్ర. జలప్రళయమునకు ముందుండినవారు ఏకపత్నీవ్రతులుగ నుండినను లెమెకు అనువాఁడు ఇద్దఱిని వివాహమాడి ఈ నియమమును దప్పెను (ఆది $4^{19}$). ఆ కాలమునందున్నవారు సద్గుణములను జూడక కామసంబంధమగు దురాశలచే నిండినవారై పిల్లలను కోరుకొన్నట్లు ఆది $6^{2}$ వలనఁ దెలియుచున్నది. అబ్రాహామెంత గొప్ప విశ్వాసియైనను, అప్పటి కాలపు దుర్వాడుకల ననుసరించి పలుభార్యలను వివాహమాడెను ($16^{4}$). ఇస్సాకును ఏకపత్నీవ్రతులగు వారికి మాదిరిగా నెంచుకొనవచ్చును ($24^{6,7}$) గాని అతని కుమారులగు యాకోబు ($29^{23-30}$), ఏశావు ($26^{34}$ $28^{9}$) లు అనేకమందిని వివాహమాడిరి. గోత్రమూలకర్తలుగా నెంచఁబడిన వారిట్లు పలువురను వివాహమాడుటనుబట్టి వారి సంతతివారి కిదియొక వాడుకయగుట ఆశ్చర్యముకాదు. ఇశ్రాయేలీయులు తమ హృదయకాఠిన్యమునుబట్టి యిట్టి వాడుకనుండి తొలఁగుట దుష్కరమని భావించి (మ $19^{8}$ మా $10^{5}$), ఆ దురలవాటును బొత్తుగా కొట్టివేయక దానికి సంబంధించిన అనేక కీడులను తొలగించు నుద్దేశముతో మోషే కొన్ని నియమము లేర్పాటు జేసెను. అనేకమంది స్త్రీలను వివాహమాడ కూడదను స్పష్టమగు సలహా ధర్మశాస్త్రమునందు లేకపోలేదు (ద్వితీ $17^{17}$). భార్య జీవించి యుండఁగనే ఆమె సహోదరిని వివాహమాడరాదను నియమమును (లేవీ $18^{18}$), పలుభార్యలను చేసికొనరాదనుటకైన హెచ్చరికగా నెంచవలెను. మోషే ధర్మశాస్త్రమునందున్న వివాహము చేసికొనుటయందు నిషేధింపవలసిన వరుసలును (లేవీ 18); ఇష్టురాలుకాని భార్యకు అన్యాయము కలుగకుండునట్లేర్పఱచిన నియమములును (నిర్గ $21^{9-11}$ ద్వితీ $21^{10-17}$); భార్యాభర్త లొకరి యెడల నొకరు నమ్మకస్థులై యుండవలెననుటకైన విధులును శిక్షలును (లేవీ $20^{10}$ ద్వితీ $22^{22}$); నిష్కారణముగా భార్యను పరిత్యజింపకుండునట్లు చేయఁబడిన ఏర్పాటులును (ద్వితీ $22^{19-29}$ $24^{1}$) బహుభార్యాత్వమువలన కలుగు అనేక కీడులను తొలఁగించెననుటకు సందేహము లేకపోయినను, అట్లనేకమందిని వివాహమాడుటను మాత్రము మానినట్లు తదనంతరపు చరిత్రయందు కనఁబడదు. గిద్యోను (న్యాయా $8^{30}$), ఎల్కానా (I సమూ $1^{2}$), దావీదు (II సమూ $5^{13}$ $12^{8}$ $21^{8}$), సొలొమోను (I రాజు $11^{3}$) అనువారు అనేకమందిని వివాహమాడిరి. అందువలన కలిగిన కీడులు వారి చరిత్రలయందు స్పష్టముగ కనఁబడుచున్నవి. క్రీస్తే విషయమునందు మోషే ధర్మశాస్త్రమునందు చూపఁబడిన అనుమతులను రద్దుపఱచి ఆరంభమునందున్నట్లుగా దేవుని యేర్పాటగు ఏకపత్నీవ్రతమును గట్టిగా స్థిరపఱచెను (మ $19^{5,6}$). క్రైస్తవులలో నిది ఆదినుండి యున్న స్థిరమగు ఏర్పాటైయున్నది (కొరి $6^{16}$ ఎఫె $5^{31}$).

3. నిషిద్ధమగు వావివరుసలు. అబ్రాహాము మాఱు చెల్లెలిని (ఆది $20^{12}$), యాకోబు ఇద్దఱక్క చెల్లెండ్రను ($29^{26}$) వివాహమాడిరి గాని యిట్టి వరుసలు నిషిద్ధములు (లేవీ $18^{6-18}$). నిషేధింపఁ

బడిన వావివరుసల నీ దిగువ చూడవచ్చును. తండ్రి భార్య (ద్వితీ 22[30] 27[20] లేవీ 18[8] 20[11]); తోఁబుట్టువు, మాఱుచెల్లెలు (ద్వితీ 27[22] లేవీ 18[9-11] 20[17]); అత్త (ద్వితీ 27[23]); తోఁబుట్టువు బిడ్డ (లేవీ 18[10]); తల్లిదండ్రుల సహోదరీలు (లేవీ 18[12,13] 20[19]), తండ్రి సహోదరుని భార్య (లేవీ 18[14] 20[20]); కోడలు (లేవీ 18[15] 20[12]); సహోదరుని భార్య (లేవీ 18[16] 20[21]); తల్లిని కూతురును ఏకకాలమున (18[17] 20[14]); అప్ప చెల్లెండ్రను ఏకకాలమున (లేవీ 18[18]). ఇవిగాక ఇశ్రాయేలీయులు విగ్రహారాధనలో పడిపోకుండునట్లు అన్యులను వివాహమాడరాదని నియమము లున్నవి (ద్వితీ 7[1-4] 23[4-7] నిర్గ 34[15,16]), గాని వారీ నియమమును లక్ష్యించినట్లు కనఁబడదు (న్యాయా 3[5,6] II సమూ 11[3] 23[34] I రాజు 7[14] మొ॥). చెఱకాలమైన పిదప నీ యాజ్ఞను మీఱుట గొప్ప యక్రమముగా నెంచిరి (నెహె 13[23-31] ఎజ్రా 9,10).

4. వివాహపు వాడుకలు. ఇవి చాలమట్టున కీ దేశపు వాడుకలవంటివి. తండ్రిగాని దగ్గర బంధువులుగాని పిల్లను విచారించుట అలవాటయి నను (ఆది 21[21] 24,38[6]), కుమారుని యిష్టప్రకారము ఏర్పాటులు చేయుటయు జరిగెను (ఆది 34[4-8] న్యాయా 14[1-10]). తండ్రి స్వయముగా వెళ్లి మాట్లాడుటకు వీలుగాని యెడల నమ్మకస్థులగు ఇతరుల ద్వారా ఆ పని జరుపుకొనిరి (ఆది 24). యాకోబువలె (ఆది 29[18]) అట్టి విషయములు స్వయముగా విచారించుకొనుట బహు అరుదు. పిల్లయొక్క తండ్రి అన్న మొదలగు వారి సమ్మతి నడిగిరేగాని పిల్ల సమ్మతి నడుగలేదు (ఆది 24[51] 34[11]). కుమార్తె నిమిత్తము తగిన వరుని నిమిత్తము అప్పుడప్పుడు తండ్రి విచారించుటను గూర్చిన నిదర్శనములు గలవు (నిర్గ 2[21] యెహో 15[17] రూతు 3[1,2] I సమూ 18[27]). పిల్లను కుదుర్చుకొన్న పిమ్మట ఆమెకును ఆమె తల్లిదండ్రులకును నగనట్ర పెట్టుటకలదు (ఆది 24[22-53] 29[18-27] 34[12] I సమూ 18[25]). ఇట్టి వాడుకలవలననే ప్రధానము చేయుటు అను నేర్పాటు కలిగెను. ప్రధానముచేసిన పిమ్మట ఆమె పెండ్లికుమారుని పాత్రయి అతనియెడల నమ్మకమునకు సూచనగా నున్నది (II కొరి 11[2]).

వివాహకాలమునందు పెండ్లికుమార్తె ఆభరణములతోను చక్కని వస్త్రములతోను తన్నుతా నలంకరించుకొనెను (యెష 3[24] 49[18] 61[10] కీర్త 45[13,14] యిర్మీ 2[32] ప్రక 19[8] 21[2]). ఆమె ముసుకును ధరించెను (ఆది 24[65]). పెండ్లికుమారుఁడును తన్నుతా నలంకరించుకొని (యెష 61[10] పర 3[11]) బంధు సమేతుఁడై సన్నాయి వాయిద్యములతోను మేళతాళములతోను, రాత్రియైన పక్షమున దివిటీలతోను పెండ్లికుమార్తె యింటికి వెళ్లెను (న్యాయా 14[11] మత్త 9[15] 25[4-7]). అచ్చటనుండు బంధువులు దీవెనల నొంది వారిచే సెలవుగైకొని ముసుకు ధరించియున్న పెండ్లికుమార్తెను వెంటఁగొని సంభ్రమములతో ఇంటికిఁ గొనితెచ్చుచుండఁగా (కీర్త 45[15] పర 3[6-11]), అతని స్నేహితులతని నెదుర్కొనవెళ్లి (మత్త 25[6]), వారిని పెండ్లికుమారుని యింటికి తోడుకొనివచ్చి అచ్చట పెండ్లి విందారగించిరి (మత్త 22[1-10] యోహా 2[1-9]). గాని ఒకానొకప్పు డీ విందు పెండ్లికుమార్తె యింట జరిగినట్లున్నది (ఆది 29[22] న్యాయా 14[10] మత్త 25[1]). ఇంతకుఁ బూర్వము పెండ్లికుమారుఁడు పెండ్లికూతును చూచియుండలేదు గాని ఆ సాయంకాలమునందు మాత్రము చూచెను (ఆది 29[23] న్యాయా 15[1] యోహా 3[29]). పెండ్లివిందలు వినోదము లింక ఒకటి రెండు వారములవఱకు జరిగియుండును (ఆది 29[27] న్యాయా 14[12]). వివాహము జరిగినప్పుడు ప్రార్థనలుగాని ఆరాధనలుగాని జరిగినట్లే సూచనలు బైబిలునందు లేక పోయినను, సామె 2[17] యెహె 16[8] మలా 2[14] నందు ప్రమాణపూర్వకముగా నిబంధన చేసికొన్నట్లు తేటగా నున్నది. దానికి సంబంధముగా ఆరాధన జేయుట సర్వసాధారణమగు వాడుక గాన వారుకూడ చేసియుండవచ్చును.

5. దేవరుని ధర్మము. సంతానహీనుఁడై మరణమొందిన సహోదరుని భార్యకు సంతానము కలిగించుట పాతనిబంధన నియమములలో నొక విశేషమగు వివాహపు టేర్పాటై యున్నది. బైబిలునం దిట్టి వివాహమునకు మొదటి సూచన యూదా కోడలగు తామారు చరిత్రయందు వచ్చును (ఆది 38[6-30]). ధర్మశాస్త్ర మేర్పాటు కాకమునుపే అది వాడుకయందుండెను. ధర్మశాస్త్రమునందు దీని విషయమైన నియమము

లున్నను అట్లు చేయుట కొకని బలవంతపరుపరాదను ఏర్పాటు గలదు (ద్వితీ $25^{5-10}$). ఈ ధర్మమును జరిగింపనివాఁడు అధర్మకార్య మొనర్చినవాఁడను దానికి సూచనగా అతని చెప్పు నూడఁదీసి అతని ముఖముయెదుట ఉమ్మివేయవలెను. చనిపోయినవానికి సహోదరుఁడు లేనియెడల అతని దగ్గర బంధువుఁడీ ధర్మమును జరిగింపవలసినట్లు చూడవచ్చును (రూతు $4^{1-11}$). మగపిల్లలు మాత్రమే గాక, వారు లేనప్పుడు ఆఁడుపిల్లలు సహా పిత్రార్జితమునకు వారసులగుటవలన (సంఖ్యా 27) ఇట్టి వివాహము లెక్కువ జరిగియుండవని నమ్మవచ్చును గాని క్రొత్త నిబంధన కాలమునందు సహితమిది జరిగియుండవచ్చునని సద్దూకయ్యులు క్రీస్తునడిగిన ప్రశ్నలవలనఁ దెలియుచున్నది (మ $22^{23-33}$ = మా $12^{18-27}$ లూ $20^{27-40}$).

6. పరిత్యాగ పత్రిక. మహమ్మదీయులలో నున్నట్లిది యూదులలో నుండెను. స్త్రీ అక్రమము చేసినపక్షమందే అట్లియ్యవలెను గాని, ఊరకనే పరిత్యాగపత్రిక నియ్యరాదని దీనికాధారముగానుండు ద్వితీ $24^{1}$ వలన నూహింపవచ్చును. యూదులలో షమ్మై అను శాస్త్రి ఈలాగు దీనికి అర్థము చెప్పినను, హిల్లెలు అనువాఁడు భార్య మాడ్చించి కొంచె మవిధేయత కనఁబఱచిన పక్షమున విడనాడవచ్చు ననెను. పరిత్యజింపఁబడినది మఱియొకని వివాహమాడిన పిదప మొదటి పెనిమిటి ఆమెను మఱల వివాహమాడరాదనియు (ద్వితీ $24^{2-4}$ యిర్మీ $3^{1}$), విడనాడఁబడిన దానిని యాజకులు వివాహమాడకూడదనియు (లేవీ $21^{7}$) నియమములున్నవి. రెండు సందర్భములలో పరిత్యాగపత్రిక నిచ్చుట ధర్మము కాదు. (1) ఒకఁడు తాను వివాహమాడినదాని మీఁద లేనిపోని నేరములు మోపినవాఁడైన యెడలను (ద్వితీ $22^{13-19}$), (2) కన్యక నొకఁడు చెఱిపిన పిమ్మట ఆమెను వివాహమాడిన యెడలను ($22^{28-30}$) ఆమెకు పరిత్యాగపత్రిక నిచ్చుటకు వీలులేదు. పరిత్యాగ పత్రమిచ్చుట దేవుని దృష్టికి హేయ్యమైనదని ప్రవక్తలు ఖండించిరి (మలా $2^{16}$). క్రీస్తుకాలమునం దట్టి వాడుక సర్వసాధారణమైనదని పరిసయ్యులు ఆయన నడిగిన ప్రశ్నవలనఁ దెలియును (మ $19^{3}$ = మా $10^{2}$). వ్యభిచార కారణముచేఁ గాక మఱే హేతువువలననైనను పరిత్యాగపత్రిక నియ్యరాదను ధర్మమును క్రీస్తు విధించెను (మ $19^{4-9}$ = మా $10^{3-9}$).

7. అలంకార ప్రయోగములు. దేవునికిని ఆయన ప్రజలకుగల సంబంధమును ప్రధానముచేతఁ గాని వివాహముచేతఁ గాని దృష్టాంతపఱచుటనుగూర్చి పాఁత నిబంధనయందు సూచనలు గలవు (హోషే $2^{19}$ యెష $62^{4,5}$). క్రొత్త నిబంధనయందు క్రీస్తుకును సంఘమునకును గల సంబంధమును దీనిచే సూచించిరి. క్రీస్తు పెండ్లికుమారుఁడనియు (మ $9^{15}$ యోహా $3^{29}$), సంఘము పెండ్లికూతురనియు (II కొరి $11^{2}$ ప్రక $19^{7}$ $21^{2}$ $22^{17}$) వ్యవహరింపఁబడెను. క్రీస్తు సంఘము కొఱకు చూపిన ప్రేమ భార్యాభర్తల కుండవలసిన యనురాగమునకు సూచనగానుండుట మాత్రమే గాక భార్యాభర్తలకు మాదిరిగా కూడ నున్నది (ఎఫె $5^{23-32}$). దేవుని ప్రజ లాయనయెడల అపనమ్మకముగా నుండుట జారత్వమునకు సాటియగు పాపముగా నెంచఁబడెను (యెష $1^{21}$ యిర్మీ $1^{20}$ హోషే $4^{12}$). దేవుఁడు తమ్మును మఱచిపోయెనని క్రుంగిన మనస్సుతో నుండిన యిశ్రాయేలీయులకు ఆదరణ చెప్పి విడిచిపెట్టలేదని వారిని ధైర్యపఱచుటకు మీ తల్లిని విడనాడిన పరిత్యాగపత్రిక యేదియని వారి నడిగినట్లున్నది (యెష $50^{1}$).

వివేంచిచుట తీర్పు తీర్చుట చూ॥

**విశ్రాంతి, విశ్రమము, నెమ్మది (Rest).** విశ్రాంతినిగూర్చి బైబిలునందనేక చోట్ల ఉదాహరింపఁబడి యున్నది. ఈ పదము సోమరితనముగాక ఆత్మీయ నెమ్మదిని సమాధానమును సూచించును. ఇట్టి నెమ్మదిగలవారు ఎంతమాత్రము సోమరులుగా నుండఁజాలరు. ఇశ్రాయేలీయులు కనాను దేశములోఁ జేరినపిమ్మట వారికి విశ్రాంతి కలుగునను వాగ్దానమున్నది (నిర్గ $33^{14}$ ద్వితీ $3^{20}$). సీయోను యెహోవాకు విశ్రమస్థాన మనఁబడును (కీర్త $132^{8-14}$ I దిన $22^{9}$). ఆలయము గుడారమువలె అక్కడక్కడకు తిరుగక ఒక స్థానమునందే నిలిచియుండునని దాని భావము. గాని ఏ ఆలయ

మును దేవుఁడు విశ్రమింపఁగల స్థానము కాసేరదు (యెష 66[1] కార్య 7[47]). దేవుఁడు సృష్టిని కలిగించిన పిమ్మట విశ్రమించుటయే మానవుల విశ్రాంతికి యాధారమై యున్నది (ఆది 2[2] నిర్గ 20[11] లేవీ 25[4]). విశ్రాంతినిగోరి ఇశ్శాఖారు సోమరియై దాసుఁడయ్యెను (ఆది 49[15]). అది విశ్రాంతియని చెప్ప వీలుకాదు. నిజమైన విశ్రాంతి దేవుని సేవించుటయందు దొఱకును (కీర్త 37[7] యిర్మీ 6[16] = నెమ్మది). అది క్రీస్తు దానమైయున్నది (మ 11[28]). ఇశ్రాయేలీయులు తమ అవిశ్వాసమువలన ఈ దానమును పోఁగొట్టుకొనిరి (కీర్త 95[11]). ఇట్లు పాపులు దీనిని పోఁగొట్టుకొందురు (యెష 28[12] 57[20]). ఇశ్రాయేలీయులీ దానము నింకను పొందకపోవుటవలన, దానిని గూర్చిన వాగ్దాన మిఁక నెఱవేఱునని హెబ్రీ 4 వలనఁ దెలియుచున్నది. పాత నిబంధనయందు విశ్రాంతి పనిని చేయకపోవుటను సూచించును గాని క్రొత్త నిబంధనయందు ఇంక చేయవలసిన పనిగలవారమని తెలిసికొందుము (ప్రక 14[13]).

**విశ్రాంతి దినము** పండుగలు I 1 చూ॥

**విశ్రాంతి దినమున నడువదగిన మార్గము** మానములు కొలతలు I 2 చూ॥

**విశ్రాంతిసంవత్సరము** పండుగలు IV చూ॥

**విశ్వాస ప్రమాణము** (Creed). విశ్వాస ప్రమాణమను పదముగాని, విశ్వాస ప్రమాణము గాని బైబిలునందు లేకపోయినను దాని ఉత్పత్తిని మ 16[16] 28[19] రోమా 10[9-10] I కొరి 8[6] 12[3] ఎఫె 4[4-6] I తిమో 3[16] I యోహా 4[2] నందు చూడ వచ్చును. ద్వితీ 6[4] లో సహా దీని యారంభమును చూడఁగలము.

సార్వత్రిక క్రైస్తవ విశ్వాసప్రమాణములు మూఁడుగా నెంచఁబడును. వీనిని ఆదిక్రైస్తవులేర్పాటుచేసిరి. అపొస్తల విశ్వాసప్రమాణము, నికేయ విశ్వాసప్రమాణము, అథనేసియ విశ్వాస ప్రమాణము అనుపేరిట అవి పేర్కొనఁబడుచున్నవి. క్రైస్తవులైనవారును, ముఖ్యముగా బాప్తిస్మము నొందఁబోవువారు త్రియేక దేవుని యందు తమకుఁగల విశ్వాసము నొప్పుకొను నిమిత్తము అపొస్తలుల విశ్వాసప్రమాణమేర్పడినది. దాని నేర్పఱచినవారినిగూర్చిగాని, కాలమునుగూర్చిగాని తేటగాఁ దెలియదు. తక్కిన రెండు త్రియేక దేవునిగూర్చిన తప్పుడుబోధలను ఖండించుటకును సరియైన బోధలను విశదపఱచుటకును ఏర్పడినవి.

**విశ్వాసము, విశ్వసించుట, నమ్మిక, నమ్ముట** (Faith). విశ్వాసమునుగూర్చిన బోధ బైబిలు బోధలలో మిగుల ముఖ్యమైనదై యున్నది. ప్రేమ నిరీక్షణయను గొప్ప క్రైస్తవ లక్షణములలోను ముఖ్యలక్షణమై యున్నది (I కొరి 13[13]).

1. పాతనిబంధనలో విశ్వాసమునుగూర్చి యున్న బోధ: విశ్వాసమని తెనిఁగించిన హెబ్రీ పదము ఆమేన్ అనునదియై స్థిరతయనిగాని నమ్మకమనిగాని శబ్దార్థమిచ్చును. దేవుని విశ్వాస్యతయనియున్న వాక్యమునందు అది ఆయన మాట తప్పనివాఁడని యర్థమగును (కీర్త 96[12]). ఆ భావముతోనే యెష 1[15] లో దానిని విశ్వాస్యత యని తెనిఁగింపక సత్యమను పదమును వాడిరి. మానవులు దేవునియందు నమ్మికయుంచుటనుగూర్చిన గొప్ప దృష్టాంతము అబ్రాహామును గూర్చినదై యున్నది (ఆది 15[6]). అతఁడు దేవుని నమ్ముట అతనికి నీతి గా నెంచఁబడెను అను వాక్యము విశ్వాసమునుగూర్చిన క్రొత్తనిబంధనలోని బోధకు అధారముగా నున్నది (రోమా 4[9-22] గల 3[6] యాకో 2[23]). దేవుని వాగ్దానమును నమ్ముటచేత అబ్రాహాము భక్తుఁడై ఆయనను నమ్మువారికందఱికి తండ్రియయ్యెను (గల 3[3-6]). తరువాత మోషే ధర్మశాస్త్రమును నియమించి ఇశ్రాయేలీయులు దేవుని పరిశుద్ధతను తమ పాపస్థితిని యెఱిఁగి అవతరించిపచ్చిన క్రీస్తును నమ్మునట్లు ధర్మశాస్త్రము ఒక క్రమశిక్షయై యుండెను (గల 3[24]). ఆ క్రమశిక్ష విశ్వాసమునుగూర్చిన యీ మొదటి యేర్పాటును రద్దుపఱచలేదు (3[17]). ఆత్మీయ ధర్మశాస్త్రముగా నెంచఁదగిన ద్వితీయోపదేశకాండమందు దేవునికి లోఁబడనివారు విశ్వాసములేని వారనఁబడిరి (ద్వితీ 32[20]). సువార్తికుఁడగు యెషయా అదేరీతిగా ఆహాజుయొక్క అపనమ్మకమును గద్దించుచు, అతఁడు నమ్మకుండిన యెడల స్థిరపఱచఁబడఁడని చెప్పెను (యెష 7[9]). విశ్వసించువాఁడు కలవరపడఁడని బోధించుచు

క్రొత్త నిబంధన బోధకు మార్గదర్శకుఁడయ్యెను (రోమా $9^{33}$ I పేతు $2^{6-8}$). అట్లే తొందరకాలమున ప్రవచించిన హబక్కూకు నీతిమంతుఁడు విశ్వాసము చేతనే బ్రతుకునని విశ్వాసమే రక్షణకు సాధనమని ముందుఁగనే తేటపఱచెను (రోమా $1^{17}$ గల $3^{11}$). దేవుని మాటను నమ్మకపోవుట ఇశ్రాయేలీయుల ముఖ్యపాపమై యుండెను (హెబ $1^{5}$ కార్య $13^{41}$ యెష $53^{1}$ యోహా $12^{38}$ రోమా $10^{16}$ సరిపోల్చుఁడు). శ్రమపడుచున్న సేవకుని నమ్మకపోవుట క్రీస్తును నమ్మకపోవుట యను గొప్ప పాపమునకు సమానమై యున్నది.

తేటయగు ఇట్టి సూచనలు పాఁతనిబంధనయందుండినను దేవుని విశ్వసించుట యను పదమును అచ్చట 20 సారులకన్న యెక్కువగా వాడక దానికి ప్రతిగా ఆశ్రయించుట (కీర్త $46^{1}$ $57^{1}$ మొ॥), ఆయనకొఱకు కనిపెట్టుట ($33^{20}$ యెష $8^{7}$ మొ॥) అనునట్టి పదములను వాడిరి: ఆయన తన భక్తులకు కేడెమును, దుర్గమును, ఆశ్రయమును అయ్యున్నాఁడను మాటలు అట్టి నమ్మకమును సూచించును. పాఁతనిబంధనలోని భక్తుల విశ్వాసమునందు ఇట్లు కనిపెట్టుట ఒక ముఖ్య చిహ్నమైయున్నట్లు హెబ్రీ 11 లో నున్న విశ్వాసుల దృష్టాంతములవలనఁ దెలియుచున్నది.

2. క్రొత్తనిబంధనయందు ఒక సంగతిని సత్యము అని నమ్ముటకు (యోహా $2^{22}$ $4^{50}$ $5^{47}$ మొ॥) ఈ పదము నుపయోగించిరి. దేవుఁడున్నాఁడను సంగతి నమ్ముట అట్టి విషయమై యున్నది. దయ్యములు సహా అట్లు నమ్ముచున్నవి (యాకో $2^{19}$). అట్టి విశ్వాసముమాత్రమే రక్షింపఁజాలదు. దేవుఁడు సత్యవంతుఁడని నమ్మి ఆయనకు మనలను మన మప్పగించుకొని ఆయన మీఁదనే యానుకొని ఆయన నాశ్రయించుటయే రక్షణకరమగు విశ్వాసమై యున్నది (మా $5^{36}$ యోహా $3^{16}$ $6^{69}$ మొ). అదే దేవునియందు భక్తిని నిలుపుటయని దీనివలన కనఁబడుచున్నది. కనఁబడుచున్నవానినిగాక భక్తులైనవారు అదృశ్యుఁడైనవానిని విశ్వాసముచే చూచియే నడుచుకొందురు (హెబ్రీ $11^{1}$ II కొరి $4^{18}$ $5^{7}$). అవి యున్నవని నమ్ముటమాత్రమేగాక వాని నాశించి వెంటాడుట అట్టి విశ్వాసముయొక్క ముఖ్య లక్షణమై యున్నది. దేవుఁడు నమ్మఁదగినవాఁడు. ఇట్లు అదృశ్యమైనవానియందు ఆశయుంచి జీవించుట ఆయన కనుకూలము కావున భక్తులు ఆయనయందు నమ్మకముంచి ఆయనను విశ్వసించెదరే గాని వేఱుకారణములేదు. విశ్వాసము అట్టిదగుటచే దాని కలిగియుండువారు ఒకవిధముగా నమ్మి వేఱొకవిధముగా ప్రవర్తింపక తాము నమ్ము దేవుని సంతోషపఱచునట్టివానినే జేసెదరు. ఈ రీతిగా నీతికలుగునట్లు మనుష్యుఁడు హృదయమునందు విశ్వసించును.

యేసు క్రీస్తును నమ్ముటనుగూర్చిన వాక్యముల వలన విశ్వాసమునుగూర్చిన ఈ బోధ మఱింత తేటగా కనఁబడును. దేవునియందు విశ్వసించుటయే అన్నిఁటికన్న మిగుల యవసరమని ఆయన బోధించెను. మాఱుమనస్సు నొంది సువార్తను నమ్ముఁడి యను బోధతోనే ఆయనయు యోహానువలె తన పని నారంభించెను (మా $1^{15}$). మానవులు నమ్మునట్లు ఆయన సూచకక్రియలను చేసినను (యోహా $2^{11-23}$ $3^{2}$ $5^{36}$ మొ॥) అట్టి క్రియలను మాత్రమే నమ్మినవారి విశ్వాసము సరియైనది కాదని ఆయన కొందఱిని గద్దించెను ($2^{18}$ $6^{30}$ $20^{29}$ మా $8^{11-13}$). ఇతరులు ఆయనను నమ్ముటకు సూచకక్రియలెంత ఉపయోగకరములుగా నున్నను వారాయన నాశ్రయించుటకుగాక తమ ఆశ్చర్యమును తృప్తిపఱచుకొనుటకుమాత్రము కోరినందున అట్టివారి కవి యాటంకములుగ నుండెను. ఆయనను ఆశ్రయించుకొనుటమాత్రమే ముఖ్య విషయమై యున్నదనుసంగతి దానివలన కనఁబడుచున్నది. ఇతరులు విశ్వాసము చూపని యెడల ఆయన అద్భుతకార్యములు చేయలేదు (మా $6^{5,6}$). విశ్వసించువారికి అసాధ్యమైనదేదియు లేదని ($9^{23}$) ఆయన బోధించెను. శిష్యులొకని స్వస్థపఱచఁజాలకపోవుటకు కారణము వారి యల్పవిశ్వాసమే యనెను (మ $17^{20}$). క్రీస్తు పరలోకమున కారోహణమైనపిదప వారు చేసిన అద్భుతకార్యములు క్రీస్తునందున్న విశ్వాసమువలననే గాని మఱొకరీతిగా జరుగలేదని వారొప్పుకొనిరి (కార్య $3^{16}$). దేవునియందు విశ్వాసముంచుటవలననే (మా $11^{22}$) యిట్టి యసాధ్యమైనకార్యములు జరుగునని తెలిపి శిష్యులు దేవునియందును తనయందును విశ్వాస

ముంచవలెనని క్రమక్రమేణ బోధించెను (యోహా $6^{33-69}$ $8^{12}$ $11^{25}$ $14^{6}$ మొ॥ మ $16^{15-17}$). ఆయన శిష్యులలో మిగుల సందేహపడువాఁడగు తోమా సహితము నా ప్రభువా, నా దేవా యనుటతో సువార్త ముగిసెను. క్రీస్తు అట్టి విశ్వాసమును కూడ అంగీకరించి చూడక విశ్వసించువారు ధన్యులని చెప్పి అందఱును అటువంటి విశ్వాసము గలవారు గావలెనని బోధించెను (యోహా $20^{29}$).

క్రీస్తు మరణమునకు సంబంధించిన బోధలు ఈ విశ్వాసము మననిమిత్తము చనిపోయిన క్రీస్తునందలి విశ్వాసమై యుండవలెనని స్పష్టపఱచుచున్నవి. తన మరణమున కిట్టి యాధిక్యత యున్నట్లు క్రీస్తు మొదటినుండి బోధించెను. యోహానాయననుగూర్చి లోకపాపమును మోసికొని పోవు దేవుని గొఱ్ఱెపిల్ల యనుటలో నిది సూచింపఁబడెను (యోహా $1^{29}$) క్రీస్తు బోధలయందు ఆయన మరణ ప్రాముఖ్యతనుగూర్చి యనేక సూచనలున్నవి ($2^{19-22}$ $3^{14,15}$ $12^{23-25}$ మ $16^{16-26}$ $20^{28}$ లూ $9^{31}$ $12^{50}$). మఱీ ముఖ్యముగా ప్రభువు రాత్రిభోజనమను సంస్కారమునందు ఇది నా రక్తము అనఁగా పాపక్షమాపణ నిమిత్తము అనేకులకొఱకు చిందింపఁబడుచున్న నిబంధన రక్తము (మ $26^{28}$) అను మాటలయందది సూచింపఁబడుచున్నది. శిష్యులీ మరణముద్వారా రాష్ట్రము లన్నిఁటికి మాఱుమనస్సును పాపక్షమాపణను ప్రకటించిరి (లూ $24^{46-48}$ కార్య $2^{22-38}$). ఈ బోధను చక్కఁగా గ్రహించినవారగు అపొస్తలులు క్రీస్తు సిలువపై తన ప్రాణము పెట్టియున్నాఁడను సంగతిని నమ్ముటయే రక్షణకరమైన విశ్వాసమని బోధించిరి (కార్య $3^{18,19}$ $20^{28}$ I కొరి $1^{18-25}$ II కొరి $5^{14-21}$ I పేతు $3^{18}$ ప్రక $1^{4-6}$ మొ॥). క్రీస్తు మరణము ద్వారా రక్షింపఁబడఁగలమను విశ్వాసము క్రీస్తు పునరుత్థానముమీఁదనే ఆనియున్నది (కార్య $4^{10-12}$). క్రీస్తు పునరుత్థానమునుబట్టి ఆయన మరణము పాపపరిహారము నిమిత్తమైన ప్రాయశ్చిత్తమని నమ్ముటకు తగిన యాధారముగల దగుచున్నది. పునరుత్థానమే ఆయన దేవుని కుమారుఁడని నిరూపించును (రోమా $1^{4}$ కార్య $2^{36}$ I పేతు $1^{21}$). దానినిబట్టి మనయొక్క రక్షణ నిశ్చయమనియు దేవుని రాజ్యము జయకరముగా ప్రబలి వృద్ధియగుననియు నమ్ముటకు అదే హేతువై యున్నది (I కొరి $15^{12-28}$ రోమా $8^{17-23}$ ఎఫె $1^{17-23}$ కార్య $17^{31}$ ప్రక $1^{5-17,18}$). ఇట్లు క్రీస్తు చనిపోయి తిరిగిలేచెనని నమ్ముట క్రైస్తవ విశ్వాసమునందు ముఖ్యవిషయమై యున్నది (రోమా $10^{9}$). క్రీస్తు తన మరణపునరుత్థానమువలన మన రక్షణను సంపాదించి దానిని దృఢపఱచెను. విశ్వాసమువలన మనము దాని నొంది మన స్వంతదిగా చేసికొనువారమగుదుము. అట్లు విశ్వసించుట సహా దేవుని దానమే (ఎఫె $2^{5-10}$). నీతిమంతుడని తీర్చబడుట, ప్రాయశ్చిత్తము, విమోచకుడు, కృప మా॥).

**విషము** (Poison.) విషపుకూరలు (II రాజా $4^{39}$), విషసర్పము (ద్వితీ $33^{24-33}$ కీర్త $68^{4}$ రోమా $3^{13}$) లనుగూర్చి బైబిలునందు సూచనలు గలవు. విషసర్పములు, విషమునకు వాడిన హెబ్రీభాషాపదము వేడిని సూచించును. దానికి వాడిన మఱియొక పదము పైత్యమును కూడ సూచించును. పూర్వకాలములో యుద్ధము చేసినవారు శత్రువులు తప్పక చనిపోవునట్లు బాణములకొనలకు విషముపూయుట వాడుకగా నుండెను. యోబు $6^{4}$ లో అట్టి వాడుకకు ఒక సూచన గలదు. రోమీయులలోను అరబ్బీయులలోను శత్రువులకు విషమిచ్చి చంపుట అలవాటు. ఇట్టి విషమును తయారుచేయుటలో అరబ్బీయురాండ్రతి నిపుణులై యుండిరని II మక్క $10^{13}$ పురా 17,4,1 వలనఁ దెలియును. తాము చంపఁగోరినవారికి విషముపెట్టుట పలెస్తీనులో వాడుకగా నున్నదని మా $16^{18}$ లో నొక సూచనగలదు.

**విషసర్పము** పాము 5 చూ॥

## వీ

**వీణానాదసహిత గీతము** (Shiggaion). కీర్త 7 రాగమునకు పేరుగానున్న షిగ్గాయోను అను పదముయొక్క భాషాంతరము. దాని బహువచనము హబ $3^{1}$ లో వాద్యములతో పాడదగినది అని తెనిఁగించిరి. దానికి తూలుట యని శబ్దార్థము కావున ఇది గొప్ప ఉద్రేకమును కలిగించు రాగమని యెంచెదరు గాని అది యూహ యనఁజాలము.

వీణె సంగీతము III 3 (3) చూ॥

వీథి పట్టణము చూ॥

# వృ

**వృత్తులు, చేతిపనులు** (Occupations and Arts). ఇశ్రాయేలీయులలో ప్రతివాఁడు నేదో యొక పని నేర్చుకొనియుండు వాడుక గలదు. వారు తమ యవసరములకుఁ గావలసిన వానిని చేయుటకే వానిని నేర్చుకొనిరి. చిత్తరువులను వేయుటయు చిత్రపుబొమ్మలను చేయుటయు నిషిద్ధములని పది యాజ్ఞలనుబట్టి యనుకొని అట్టి వాని నభ్యసించక పోయిరి. వ్యవసాయము గృహోపకరణములను సిద్ధపఱచుట, వస్త్రముల నేఁత, కుట్టుట, నగలను చేయుట మొదలగువాని నభ్యసించిరి. అవే వారి ముఖ్య వృత్తులై యుండెను. అన్నిఁటికన్న వ్యవసాయమును పశువులను మేపుటను ముఖ్యముగా నెంచిరి (వ్యవసాయము, గొల్ల చూ॥). మిగిలిన వృత్తు లీ దిగువ నుదాహరింపఁబడినవి.

I. ఇండ్లకు సంబంధించిన వృత్తులు, పనులు.

**1.** నివాస స్థలములలో గుడారము లన్నిఁటి కన్న పురాతనమైనవి (ఆది 4[20]). అందుకుఁ గావలసిన **డేరాగుడ్డలను నేసికుట్టుట** ఆరంభమునుండి క్రొత్త నిబంధనకాలము వఱకుండెను. పౌలు, అకుల ప్రిస్కిల్ల అనువారి వృత్తి డేరాలు కుట్టుటయే (కార్య 18[3]). ఆరంభకాలములలో డేరా తెరలను చర్మములతో చేసినట్లు నిర్గ 35[23] వలనఁ దెలియుచున్నది. అటుపిమ్మట వానిని ఒంటె రోమములతో నేసిన కంబళ్లతోఁ జేసిరి. అవి నల్లగా నుండి చాల చక్కఁగా నుండినటుల పర 1[5] లోని యలంకారములవలన కనుగొనవచ్చును. పౌలుకాలమున రోమను సేనా శిబిరమునం దుపయోగించిన డేరాలిట్టివే. డేరాలు కుట్టువృత్తి యనఁగా ఈ ముతకగుడ్డల నొకదానితో నొకటి కలిపికుట్టుట మాత్రమేగాక దానికిఁ గావలసిన త్రాళ్లు మొదలగువాని నన్నిఁటి డేరాల కమర్చి, దాని వేయుటై సిద్ధపఱచుటకు చేయవలసినదాని నంతటిని చేయుటయై యున్నది.

**2.** ఇండ్లను కట్టుటలో తాపీ పని చేయువారును **వడ్రంగము** చేయువారును ముఖ్యులు.

(1) ఇటుకలతో పనిఁజేయుటకు ఇశ్రాయేలీయులకు చక్కఁగా దెలిసియుండెను (నిర్గ 1[14]). క్రొత్త నిబంధన కాలమునందు ఇండ్లకు కన్నము వేయుటనుగూర్చి ఉదాహరింపఁబడుటచే వారు తమ యిండ్లను మట్టితోఁ గట్టుకొనిరని యూహింపవచ్చును (మ 6[19]). పలెస్తీనునందు ముఖ్యముగా రాళ్లతో నిండ్లను గట్టిరి. అట్టి పని వారికి II సమూ 5[11] నందు **కాశెపనివారు** అను పేరు గలదు. దీని మూలపదమునకు రాళ్లను మలచువారని యర్థము. గాని I దిన 14[1] నందున్న కాశెపనివారను పదమునకు గోడలను కట్టువారని శబ్దార్థము. ఇట్టి పనివారిని దావీదు సొలొమోనులు ఫేనీకే దేశమునుండి పిలిపించిరి (II సమూ 5[11] I రాజు 5[18]). ఇట్టి మంచి పనులు చేయుటలో ఇశ్రాయేలీయులంత నేర్పరులు కారని తెలియుచున్నది. కాశెపనివారీ దిగువ నుదాహరించిన పనిముట్లను వాడినట్లు బైబిలునందు సూచనలు గలవు.

(*a*) **సుత్తె** (I రాజు 6[7]). దేవుని వాక్యము బండలను పగలఁగొట్టుటకు వాడిన సుత్తెకుఁ బోల్చఁబడెను (యిర్మీ 23[29]). యెష 41[7] నందును ఇదే పదమున్నది గాని I రాజు 6[7] లో నున్న సుత్తెయను పదము మఱియొక మూలపదమునకు భాషాంతరమై యున్నది.

(*b*) మట్టపు **గుండు** (ఆమో 7[7-8]). II రాజు 21[13] నందదే యర్థమిచ్చు మఱియొక మూలపదము గలదు. జెక 4[10] లో మఱియొక పదమును గుండుసూలు అని తెనిఁగించిరి గోడ సరిగా నున్నదో లేదో దెలిసికొనుటకు దీనిని వాడినందున పై నుదాహరించిన ప్రతి వాక్యము లోను అది అలంకారరీతిగా దేవుని విమర్శను సూచించుటకు వాడిన దృష్టాంతమై యున్నది.

(*c*) **కొలనూలు** (యిర్మీ 31[39] జెక 2[1]) **కొలకర్ర** (యెహె 40[3]). వీనిని సూచించుటకు మూలభాషయందొక పదమునే వాడిరి. ఒక క్రొత్త కట్టడమునుగాని క్రొత్త పట్టణమునుగాని కట్టఁబోవునపుడు వాని హద్దులను ఏర్పఱచుట కుపయోగించినందున కుదురుబాటు కలిగిన పిమ్మట

ఉండు యెరూషలేము లేక నూతన యెరూష లేములను గూర్చిన యేర్పాటులను దెలుపుటకు అలంకారరీతిగా దీనిని ప్రశంసించిరి (ప్రక 11[1] 21[15,16]).

**3. శిల్పకారులు, వడ్రంగులు.** కాసెపని వారితోఁ గూడ వీరిని సాధారణముగాఁ జేర్చిరి (II సమూ 5[11]). II రాజు 22[6] నందు వడ్లవాండ్లు శిల్పకారులు అను రెండు పదములున్నవి. అందులోని రెండవ పదముకు కట్టెడివారని యర్థము వడ్రంగులకు మాత్రమేగాక కాసెపని వారికిని ఆ పదము నుపయోగింపవచ్చును. మొదటి పదముచు వడ్రంగులను సూచించుటకు వాడిరి. ఫేనీకేవారికి చెక్కకు సంబంధించిన పని చక్కగాఁ దెలిసియున్నందున దావీదు సాలొమోనులు తమ కట్టడములను గట్టుటకు వీరిని బిలిపించుకొనిరి (II సమూ 5[11] I రాజు 5[18]). క్రొత్త నిబంధన యందు యోసేపు ఈ పనినే జేసెను (మ 13[55]) క్రీస్తును ఈ పనిని నేర్చుకొని జేసినట్లు సూచనలు గలవు (మా 6[3]).

వడ్రంగులు కట్టడపు పనులను మాత్రమే గాక వ్యవసాయమునకును గృహములయందును గావలసిన వస్తుసామగ్రినికూడఁ జేసిరి అవి చాల వఱకు మోటుగానుండినను క్రమక్రమేణ వానిని చక్కపఱచ నేర్చుకొనిరి. చెక్కతో మాత్రమే గాక దంతముతోను మంచములను (ఆమో 6[4]) సింహాసనములను (I రాజు 10[18]), ఇండ్లను సహా జేసిరి. ఇది చాలమట్టుకు తాపడపు పనియై యుండెను. దేవాలయపు గోడలకు వేసిన చెక్కల మీఁద పువ్వులను కెరూబులను చెక్కి దాని నలంకరించిరి (I రాజు 6[29]). వారు తమ పనులు జేయుటలో నీ దిగువ పనిముట్లను వాడిరి.

(a) **రంపము** (యెష 10[15] I రాజు 7[9] హెబ్రీ 11[37]).

(b) **చిత్రిక** (యెష 44[13]).

(c) **కర్కాటకములు** (యెష 44[13]).

(d) **కొలనూలు** (యిర్మీ 31[39]). పైన 2 (c) చూ॥).

(e) **సుత్తె** (యెష 41[7]).

(f) **గొడ్డలి** (యిర్మీ 10[3] I రాజు 6[7] యెష 10[15] మ 3[10] మొ॥).

గీతలను గీయుటకు చీర్ణము వాడినట్లు యెష 44[13] వలనఁ దెలియుచున్నది గాని అది చీర్ణము వంటిదిగాక కదురువంటిదని కొందఱి యభిప్రాయము. ఈ సాధారణమైన పనిముట్లు వారికున్నను ఈ పనియందు యూదులంత నేర్పు గలవారైనట్లు కనఁబడదు. మంచి పని చేయవలసియున్న పక్షమున వారట్టి పని చేయఁగల వారిని ఫేనీకేనుండి బిలిపించుకొనిరి (I రాజు 5[6] ఎజ్రా 3[7]).

**4. కుమ్మరివారు.** కూజాలు చట్లు బానలు కుండలు మొదలగునవి యింటిసామగ్రిలోనివి (లేవీ 6[28] 11[33]). వీనిని కుమ్మరివాఁడు చేయు రీతిని ఆయా వాక్యములందు చూడవచ్చును. మొదట మంటిని దెచ్చి కాళ్లతోఁ ద్రొక్కును (యెష 41[25]). దానిని సారెమీఁదనుంచి (యిర్మీ 18[3]) తన యిష్టముచొప్పున ఆయావానిని నిర్మించును. మానవులలో దేవుఁడుచేయు పనిని సూచించుటకు ఇది యలంకారముగా వాడఁబడెను (యిర్మీ 18[6] రోమా 9[21]). యూదావారిలో నొక కుటుంబపు వారందఱు నీవృత్తి నవలంబించి రాజు ఇంటికిఁ గావలసిన వానిని చేయుటకై



కుమ్మరివాడు

నియమింపఁబడినటుల I దిన 4[23] నందు చూడవచ్చును. యెరూషలేములోని పొలములలో నొకటి కుమ్మరివాని పొలమనఁబడెను (మ 27[7]). శిథిలపరిశోధకులు పలెస్తీనులో అనేక విధములగు కుమ్మరి పనులను కనుగొనిరి. అవి చాలమట్టున కీదేశపు పనులవంటివై యున్నవి.

కమ్మరులు వాడిన పనిముట్లలో కమ్మరిసాలె గాక మరియొకటి బైబిలునందు గానరాదు (యిర్మీ 18[3]).

II. పంచలోహపు పనివాండ్రు. వీరును ఆదినుండి యున్నట్లు బైబిలునందు సూచనలు గలవు. వీరు బంగారు వెండి రాగి ఇత్తడి ఇనుము అను లోహపు పనులను జేసిరి.

1. కమ్మరవారు. తూబల్కయీను ఈ పనివారికి పూర్వికుఁడు (ఆది 4[22]). ఆ దినముల యందు ముఖ్యముగా యుద్ధోపకరణములు చేయ వలసి యుండుటచే పదనుగల పనిముట్లనుజేయుట త్వరలో వృద్ధియయ్యెనని తెలియుచున్నది. న్యాయాధిపతులకాలమునందు అట్టి యుద్ధోప కరణములను వారు చేయకుండునట్లు ఫిలిష్తీయులు ఇశ్రాయేలుదేశమందు కమ్మరులులేకుండ జేసిరి (I సమూ 13[19]). వారు ఇతర పనిముట్లనుజేసిరి (యెష 44[12]). బాబెలువారు యెరూషలేమును పట్టుకొనినప్పుడు ఇతర పనివారితోఁబాటు వీరిని గూడ బాబెలులో తమకొఱకు పనులను చేయించు కొనుటకొరకుఁ దీసికొని వెళ్లిరి (II రాజు 24[14]). వీరీదిగువ పనిముట్లను వాడుకొనినట్లు సూచనలుగలవు.

(1) సుత్తె (యెష 44[12]).

(2) నాగలి (యెష 41[7]).

(3) ఆకురాళ్లు (I సమూ 13[21]).

(4) కొలిమితిత్తులు (యిర్మీ 6[29]). యెష 54[16] నందున్న నిప్పులూదుట అదే పనిముట్టును సూచించును.

2. రాగితోను, ఇత్తడితోను పనిజేసిన కంసాలులు. (లోహములు 3 చూ॥). రాగి మొదటి నుండి తెలిసియున్నను, దానిని తగరముతోఁ గలిపి యిత్తడిజేసికొని, దానితో ఆయా ఉపకరణములను జేసిరి. ఈ పనికికూడ తూబల్కయీనే మూల పురుషుఁడు (ఆది 4[22]). పళ్లెములు బిందెలు మొదలగువానిని ఇత్తడితోఁ జేసినట్లు గుడారము దేవాలయమందు వాడిన సామగ్రులవలనఁ తెలియుచున్నది (నిర్గ 27[3] I రాజు 7[45]). ఈఁటెలు డాళ్లు కవచములు శిరస్త్రాణములనుగూడ దీనితోఁజేసిరి (I సమూ 17[5,6] II సమూ 22[35]). II తిమో 3[14] నందు కంచరివాడగు అలెక్సందరు పౌలుకు చాల కీడుచేసినట్లున్నది. ఆ మాట వలన ఆ కాలమునందు వారు రాగితోమాత్రమే పనులనుజేసిరని తెలియుచున్నది. అట్టివారు నేటి వఱకు ఈ దేశమునందు గలరు. కంసాలులు యెహోవా శత్రువులనుకొట్టి లయపఱచిరని దర్శనరీతిగా జెకర్యాకు కనఁబడెను (జెక 1[18-21]). వీరు వాడిన పనిముట్లు చాలమట్టుకు కమ్మరవారి వంటివై యున్నవిగాని వానినిగూర్చిన సూచనలు లేవు.

3. వెండిబంగారులతో పనిజేసిన కంసాలులు (లోహములు 1, 2 చూ॥). ఈ లోహములను కొలిమిలోపెట్టి కరిగించి వానిమష్టుఁ దీసివేసి దానిశుద్ధిచేయుట బైబిలుకాలమునందు తెలిసి యుండెను (సామె 17[3] 25[4] 26[27] యెష 1[25]). వానిని కరిగించి పోఁతపోసి విగ్రహములుగా నిర్మించిరి (సంఖ్యా 33[52] న్యాయా 17[9] హోషే 13[2]). సుత్తెతో నీ లోహములను సాగఁగొట్టి నకషీపని చేయుటకును వారికిఁ దెలియును (నిర్గ 25[18,31]). వానిని రేకులుగా సాగఁగొట్టి ఆయావానికి పొదిగించిరి. దేవాలయమునం దిట్టిపని యెక్కువగా జరిగెను (నిర్గ 25[11] I రాజు 6[20-35]). వీనిని అతుకుట యెట్టిదో ఆ సంగ తియు తెలిసియుండెను (యెష 41[7]). ఇట్టి రేకులను బహు సన్నగాచేసి వానిని దారములంత సన్నగా కత్తిరించిరి (నిర్గ 28[6] 39[3]). ఈ దేశ మందువలె విలువగల బట్టలను నేయుటకు వాని నుపయోగించిరి.

III. వస్త్రములను నేయుట

1. వడకుట. జనుమును పండించి జనప నారను దీసిరి (యెహో 2[6] యెష 19[9] హోషే 2[5,9]). గొఱ్ఱెబొచ్చును వడకి నూలును సిద్ధ పఱచిరి (సామె 31[13]) ఒంటె రోమములతో ముతకనూలువడకి దానితో డేరాలకొఱకైన కంబ ళ్లను నేసిరి (మ 3[4]). పంటె, కదురు అను వానిని గూర్చిన సూచనలు గలవు (సామె 31[19]). వడకుట స్త్రీలపనియైయున్నట్లు ఈ వాక్యముల వలనఁ దెలియును.

2. నేత. మగ్గములమీద బట్టలను నేసిరి. నేతగాండ్రు వాడిన నాడె మన ఆయుష్కా-

లను బహు త్వరగా గతించిపోవుటకు దృష్టాంతముగా వాడిరి (యోబు 7[6]). అట్లా కాలము ముగియుట బద్దె నుండి వస్త్రమును కత్తిరించుటను పోలును (యెష 38[12]). గొల్యాతుయొక్క ఈటెను నేతగాని దోనెతో సరిపోల్చిరి (I సమూ 17 II సమూ 21[19]) గాని, ఈ వాక్యములో వాడెయని తెనిఁగించిన హెబ్రీపదమును న్యాయా 16[14] లో మగ్గపుమేకు అని తెనిఁగించిరి. అది మగ్గమంతటిని సూచించునని ఆ సంబంధమునుబట్టి తెలిసికొనవచ్చును.

3. చలువచేయుట. ఇది చాకలివారి పని (మా 9[3]). యెరూషలేమునం దీపనిచేయుట కొక ప్రత్యేకమగు స్థలము గలదు. అది చాకి రేవు అనఁబడెను (II రాజు 18[17] యెష 7[3] 36[2]). వీరు బట్టలనుదుకుట మాత్రమే గాక, మందులను వాడి వానిని బహు తెల్లగాఁ జేయుటకును నేర్చియుండిరి.

4. కుట్టుట. ఈ దేశమునందు చాలకాలము క్రిందట చేసినట్లు వస్త్రములను కట్టకయే ధరించుట పరెస్తీనులో వాడుక. నేయఁబడినవానిని అట్లే ధరించిరి. మానికలు వేయునప్పుడును (ప్రస 3[7] మా 2[21]), ఒకదానికొకటి కలుపునప్పుడు మాత్రమే (యోహా 13[18] ఆది 3[7]) వారు కుట్టిరి. I సమూ 2[19] లో హన్నా సమూయేలు నిమిత్తము ఏఁటేట నొక వస్త్రమున కుట్టినట్లున్నది గాని, ఆమె ఆ వస్త్రమును చేసినదని మూలభాషలో యర్థమిచ్చును. అది కుట్టుటను గాక నేయుటను సూచించును. అలంకారముకొఱకు ధరించుకొను వస్త్రములను సూదులతో కుట్టి చిత్రకారునిపని జేసినట్లు ఆయా వాక్యములలో కనఁబడును (నిర్గ 26[36] 27[16] న్యాయా 5[30] కీర్త 45[14]). ఈ విషయములోను వారి పని ఈ దేశపు పనివంటిదై యున్నది. నిర్గ 28[39] లో దీనిని బుట్టాపని యనియు ఇతర వాక్యములలో విచిత్రమైన పనిగల వస్త్రము అనియు (కీర్త 45[14] యెహె 16[10,33] 27[7]) తెనిఁగించిరి.

5. రంగులువేయుట. దీనినిగూర్చిన సూచనలంతగా లేవు. గుడారముకొఱకు వాడిన చర్మములకు నీలి ధూమ్ర రక్తవర్ణములు వేసినట్లు నిర్గ 25[5] 26[14] వలనఁ దెలియుచున్నది. ఇట్టి రంగుల వస్త్రములను స్థితిమంతులుమాత్రమే వేసికొనిరి. కావున వస్త్రములకుఁగూడ రంగులు వేసినట్లు ఊహించవచ్చును (రంగులు, బట్టలు చూ॥).

IV. చర్మకారులపని. దీనినిగూర్చిన సూచనలును బైబిలునందెక్కువ ఉన్నట్లు కనఁబడదు. ఏలీయా (II రాజు 1[8]), బాప్తిస్మమిచ్చు యోహాను (మ 3[4]) తోలుదట్టీలు ధరించుకొనిరి. చెప్పులు తొడుగు అలవాటును గలదు (మా 6[9] కార్య 1[8]) నీళ్లను ద్రాక్షారసము నుంచుటకు తోలుతిత్తులను వాడిరి (మ 9[17]). ఇవియన్నియు చర్మకారులవలన చేయఁబడినవేగాన అట్టి పనివారున్నారని స్పష్టమగును. కైసరయలోని సీమోనుగాక మఱే చర్మకారునిగూర్చిన సూచన బైబిలునందు లేదు (కార్య 9[43] 10[6]). చచ్చినవానిని ముట్టుటవలన అంటు తగులునని హిందువులవలె యూదులును ఎంచిరి కాన నట్టివారు ప్రత్యేకస్థలములలో నివసించినట్లు యూదుల ఆచారమువలనఁ దెలిసికొనవచ్చును.

వృషభము ఆవు 2 చూ॥

## వె

వెండి లోహములు 2 చూ॥

వెడల్పు గోడ, వెడల్పు ప్రాకారము యెరూషలేము B V 2 (6) చూ॥

వేపకాలపు వ్యవసాయము 3 చూ॥

వెదాను (Vedan) ఇది పొరపాటున తెనుఁగులో దదాను అని యున్న తూరు పట్టణపు వర్తకస్థానములలో నొకటి (యెహె 27[19]). అది దేశమైనది మఱేమైనది సరిగా చెప్ప వీలుకాదు. అరబీదేశములో మెక్కా మెదీనాలకు మధ్యనుండు అదీను లేక వెదాను అనఁబడు స్థలమిది కావచ్చునని కొందఱి యభిప్రాయము గాని అది యైనను రూఢిగా చెప్ప వలనుపడదు. LXX లో ఈ పదము లోపించినది కావున ఈ పదము నిక్కడ ఉంచుటనుగూర్చియు సందేహాస్పదముగా నున్నది.

వెన్న పాలు చూ॥

వెన్నెలదెబ్బ రోగములు చికిత్సలు III 1 చూ॥

**వెయ్యి** సంఖ్య 10 చూ॥

**వెఱ్ఱి** రోగములు చికిత్సలు II 6 (3) చూ॥

**వెఱ్ఱివాడు, వెఱ్ఱితనము** బుద్ధిహీనత, మూర్ఖత్వము II చూ॥

**వెలగలరాళ్లు** రత్నములు చూ॥

**వెలి (Excommunication).** సంఘములోనుండి వెలివేయుటనుగూర్చిన విషయమును మాత్రము ఇచట వివరింతుము. ఆయాపాపములు చేయువారిని దేవుఁడు తన జనులలోనుండి కొట్టివేయుదునని సెను (లేవీ 17$^{10}$ 20$^{3}$ I రాజు 9$^{7}$ మొ॥). అయితే ఇవ్విధముగా నెవరినైనను వెలివేయుటనుగూర్చిన మొట్టమొదటి సూచన ఎజ్రా 10$^{8}$ లో నున్నది. యూదుల పెద్దలు తమ యన్యభార్యలను విడిచిపెట్టనివారి యాస్తిని జప్తిచేసి వారిని సమాజములోనుండి వెలివేసిరి. క్రీస్తు కాలమందు వెలి యాచారము యూదులలో మూఁడు విధములుగా నున్నట్లు శాస్త్రులు యూదుల గ్రంథములవలన తెలిసికొనిరి. ఎట్లనఁగా, వెలిశిక్షకు తగిన యొకనిని (1) ఒక నియమితకాల పర్యంతము (సాధారణముగా 30 దినములు) వెలివేయుట; (2) చాలకాలమువఱకు ఒకనిని సమాజమునుండి దూరపఱచినను ఆ కాలమైన తరువాత వాఁడు సమాజములో చేరవచ్చునను నట్టి వెలి; (3) అట్టి వానిని సమాజమునుండి బొత్తిగా తీసివేయుట. అయితే యీ చివరిది వాడుకలో నుండినట్లు తగిన నిదర్శనములు లేవు. యూదులు క్రీస్తును నమ్మినందున వారిని వెలివేసియున్నట్లు క్రొత్త నిబంధనలో కొన్ని సూచనలు కలవు (యోహా 9$^{22}$ 12$^{42}$ 16$^{2}$ లూ 6$^{22}$). మ 18$^{15-17}$ లో సంఘమందుండవలసిన క్రమశిక్షనుగూర్చి కొన్ని సూచనలు కలవు. అది యూదుల క్రమశిక్ష ననుసరించి యుండవచ్చును. దానిని చూచినయెడల అది యిట్లున్నది. తప్పు చేసిన నేరస్థునికి మొదట రహస్యముగా బుద్ధి చెప్పవలెను. అతఁడు వారి మాట విని తన తప్పు దిద్దుకొనక పోయినయెడల, సాక్షులయెదుట వానికి బుద్ధి చెప్పవలెను. వాఁడు వారి మాటను వినకపోయినట్లయిన, ఆ సంగతిని సంఘమునకు తెలుపవలెను. అతఁడు సంఘస్థుల సలహాలను కూడ విననొల్లని యెడల అతనిని వెలివేయవలెను. ఆ తరువాత అతఁడు సంఘస్థుఁడు కాక, అన్యుఁడుగా యెంచఁబడెను. I కొరి 5$^{4}$ చూడఁగా ఆ సభలోని యొక నేరస్థుని శిక్షించుటకు సభ చేయవలెనని పౌలు ఆజ్ఞ నిచ్చుచున్నాఁడు. ఆ శిక్ష నేరస్థుని సాతాను కప్పగించుట యనఁబడెను గాని, నేరస్థుని రక్షించుటకే ఇట్టి శిక్షను విధింపవలెననునది పౌలుయొక్క యుద్దేశమని తేటపడును. 5$^{13}$ లో వెలివేయవలెనను ఆజ్ఞ తేటగా నున్నది. ఈ విధముగా I తిమో 1$^{20}$ లో హుమెనైయు అలెక్సంద్రు అను నిద్దరిని వెలివేసిరి. II కొరి 2$^{6-11}$ లో వెలివేయఁబడినవారు పశ్చాత్తాపపడిన పిమ్మట వారిని మఱల చేర్చుకొనవలెనను ఆజ్ఞ కలదు. ఆ వెలివేయఁబడినవాఁడు I కొరి 5 లోని వాఁడా లేక మఱియొకఁడా అనుదానిగూర్చి రూఢిలేదు గాని, ఎక్కువమందివలన కలిగిన శిక్ష అను మాటలను చూడఁగా సంఘపువారి సమ్మతివలన ఇతనిని వెలివేసినట్లు స్పష్టమగును. అట్టివాఁడు పశ్చాత్తప్తుఁడైనపుడు తిరిగి చేర్చఁబడవలెను లేదా, అతఁడు క్రుంగినవాఁడై నశించునేమో. ఇట్టి కఠిన శిక్షలవలన సాతాను మనలను మోసపుచ్చి (I కొరి 2$^{11}$) నేరస్థులను నాశనము చేయవచ్చును గనుక జాగ్రతగా నుండవలెనని పౌలు హెచ్చరించెను. మన మిది చూడఁగా వెలియుద్దేశము నేరస్థులను గుణపఱచుట యనునదే యని తేటపడును (II థెస్స 3$^{14,15}$). పనిచేయనివారి విషయమై పౌలు ఇచ్చిన యాజ్ఞను లక్ష్యింపనివారిని సభవారు కొంతమట్టునకు తమ సహవాసములో నుండి దూరపఱచవలెనని యున్నది. II యోహా 10 లో నున్న ఆజ్ఞయు నట్టిదే. III యోహా 9, 10 చూడఁగా ఆ సభ పెద్దయగు దియొత్రెఫే యోహాను పక్షముగా నున్న తన సభవారిని వెలివేసినట్లు సూచన కలదు. ఈ వెలియాచారమును దుర్వినియోగపఱచుటను గూర్చిన సూచనలలో ఇది మొదటిది (శాపము చూ॥).

**వెలుగు** తేజము చూ॥

**వెళ్లగొట్టుట** నేరములు శిక్షలు III 6, వెలి చూ॥

## వే

**వేకువ చుక్క (Day Star, Morning Star).** రెండు గ్రీకుపదముల తర్జుమా.

II పేతు 1[19] నందుండి వెలుఁగిచ్చునది యని శబ్దార్థ మిచ్చును. రెండవది ప్రక 22[16] లో నుండి ఉదయమున కనఁబడునది యని యర్థ మగును. ఈ రెండును క్రీస్తును సూచించును. క్రీస్తు మానవులకు వెలుఁగిచ్చువాఁ డనుటచేత ఈ పేరాయనకు బిరుదుగా నున్నది (తేజో నక్షత్రము, నక్షత్రము చూ॥).

వేగులవారు (Spies). సర్వత్ర సాధారణమైనట్లు విరోధుల సంగతులను దెలిసికొనుటకు వేగులవారుండినట్లు బైబిలునందు సూచనలు కలవు (ఆది 42[9] సంఖ్యా 13, 21[32] యెహో 2, న్యాయా 1[23] 18[2] I సమూ 26[4] II సమూ 10[3]). కనానుదేశ స్థితిని దెలిసికొనుటకు మోషే పంపించిన పన్నెండుగురు వేగులవారి సంగతి వీనియన్నిఁటిలో మిగుల ముఖ్యమైనది (సంఖ్యా 13 ద్వితీ 1[22]). వాఁకి తరువాత యెహోషువ పంపిన సంగతి మిగుల ప్రసిద్ధమైనది (యెహో 2). మొదటిదానిలో గోత్రమున కొక్కరి చొప్పున 12 గురిని నియమించిరి వారు నలుభై దినము లాదేశమంతయు తిరిగిరి. దాని ఫలవంత స్థితినిగూర్చి మంచి సాక్ష్యము చెప్పిరి గాని యెహోషువ కాలేబులుతప్ప తక్కిన వారందఱు ఆ దేశమును జయింపలేమని భయము చెప్పిన వారిని ధైర్యపఱచిరి. రెండవ దాని యందు ఇద్దఱుమాత్ర ముండిరి. రాహాబువారిని రక్షించినందున ఆమెకు రక్షణ కలిగెను (యెహో 6[22,23]).

వేట, వేటాడుట (Hunting). వేఁటాడుటను గూర్చిన సూచనలు బైబిలునం దెక్కువ లేకున్నను ఆ పని ఆరంభమునుండి యున్నట్లు చూడవచ్చును. నిమ్రోదు పరాక్రమశాలియగు వేఁటకాఁడు (ఆది 10[9]). ఏశావు వేఁటాడెను (25[27] 27[3,5]). ద్వితీ 14 నందు తినఁదగిన అడవి మృగముల జాబితా గలదు. వాని నాహారముగా నుపయోగించుటకు రక్తము చిందించి, వానిని చంపవలెనను నియమముగలదు (లేవీ 17[13]). రాజులు వేఁటాడి మాంసమును దిన్నట్లున్నది (I రాజు 4[23]). అష్షూరు రాజులు సింహములను వేఁటాడినట్లు వారి రాతిశాసనములలో ననేక సూచనలున్నవి. ఇశ్రాయేలీయులు అట్టి ప్రాణహానికరములగు మెకములను వేఁటాడిన సూచనలు లేవు. నీటి గుఱ్ఱమును వేఁటాడుట ప్రాణహానికరముగా నెంచిరి (యోబు 41[26,29]). వేఁటాడుటలో విండ్లను బాణములను (ఆది 27[3]), ఖడ్గములను ఈఁటెలను పంట్రకోలలను (యోబు 41[26]), ఉరులను (హబ 1[15] కీర్త 124[7] సామె 7[23] ఆమో 3[5] మొ॥), వలలను (మీకా 7[2] కీర్త 9[15] 10[9] సామె 1[17] యెహె 12[13] మొ॥) ఉపయోగించిరి. వలలు జింకలను పట్టునంత పెద్దవి. యోబు 18[10] లో నుండు ఉచ్చు మఱి యొక పదమై త్రాడును సూచించును. వారు మృగములను పట్టుటకు గోతులను త్రవ్విరి (II సమూ 23[20] కీర్త 35[7]). వేఁటకాండ్రు తమ పనులను చాల యుక్తిగా చేయుటవలన వారి పని దుష్టులు మంచివారిని సంహరించుటకు చేయు యత్నములకు అలంకారముగా వాడఁబడును (కీర్త 91[3] 124[7] సామె 6[5] హోషే 9[8]).

వేత్రధరులు (Sergeant). దీనిమూల భాషాపదము బెత్తములు ధరించినవారు అని యర్థ మిచ్చును. రోమను అధికారుల పరివారములో ఇట్టి వారు ఇద్దఱు ఎల్లప్పుడుండి శిక్షించుటకు తమకు కలిగిన అధికారమును చూపుటకు అట్టి బెత్తములకట్ట మోసిరి. వారు దేహసంరక్షకులు మాత్ర మేగాక దండ ధరులవంటివారై యున్నారు. ఫిలిప్పీయిలో పౌలును సీలను శిక్షించినవారు అట్టి వారై యుండిరి (కార్య 16[22-35]).

వేదిక కొమ్ము, బలిపీఠము చూ॥

వేయి సంవత్సరముల పరిపాలన (Millennium). సాతాను వెయ్యి సంవత్సరములు బంధింపఁబడునను సంగతి (ప్రక 20[2-7]) వెయ్యి సంవత్సరముల పరిపాలననుగూర్చిన సిద్ధాంతమున కాధారమై యున్నది. ఇట్టి బోధలు బైబిలునందు మఱెచ్చటనైనను లేటగా నుండకపోయినను యూదుల అప్రమాణిక గ్రంథములలోని హనోకు (*Slavonic Enoch*) గ్రంథ మందు ఈ యుగము ఏడువారములైనట్లును ప్రతి వారము వెయ్యి సంవత్సరములైనట్లును ఇట్టి వారములైన పిమ్మట (=6000 సం॥) తీర్పు వచ్చుననియు తదనంతరము మరియొకవారము అనఁగా వెయ్యి సంవత్సరములు విశ్రాంతి అయిన పిమ్మట కాలము లెక్కింపఁబడిన యుగ మారంభమగునని

యున్నది. యూదుల టాల్మూడులో (*Talmud*) కూడ దీనినిగూర్చిన సూచనలు కలవు.

క్రైస్తవ బోధలనుబట్టి ప్రక $20^{2,7}$ ననుసరించి కొందఱు అక్షరరీతిగా క్రీస్తు వచ్చి సాతానును బంధించి, నీతిమంతులను లేపి వేయి సంవత్సరములదాక పరిశుద్ధులతోకూడ ఈ లోకములో పరిపాలన చేయునని బోధింతురు. మఱి కొందఱు ప్రకటన గ్రంథమునందు అలంకార ప్రయోగములు పెక్కు లుండుటచేత దీనికి అక్షర రీతిగాఁ గాక ఉపమానరీతిగా అర్థము చెప్పవలెనని యనుకొందురు. అట్టివారు ప్రస్తుతము సువార్త పనికి కలుగు జయమును సూచించు ననుకొందురు. బైబిలునందీ యొక్క వాక్యము మాత్రము ఈ బోధ కాధారముగా నుండుటచే దాని సరియైన భావమును దెలుపుట మిగుల కష్టమైన సంగతియై యున్నది.

**వేశ్య, వేశ్యాగమనము** (Harlot, Harlotry). వేశ్యాగమన మను పాపము ఆదినుండి యున్న పాపమని బైబిలునం దగుపడుచున్నది (ఆది 38). వేగులవారిని దాచిన రాహాబుకు వేశ్య అను పేరుండుటచే అది యామె పూర్వ వృత్తి యని యూహింపఁదగును (యెహో 2). ఇట్టి వారికి పరస్త్రీలు అను పదమును సామెతల గ్రంథములో వాడుటచే యూదులు కానివారు సాధారణముగా నీ వృత్తి నవలంబించినట్లు తెలిసికొనవచ్చును (సామె $6^{24}$ $23^{27}$ మొ॥). వారు భోగమువారివలె పాటలు పాడుచు (యెష $23^{16}$), మోహపు మాటలు అభినయములచే అనుభవము లేనివారిని శోధించుచు (సామె $6^{24}$), ప్రస్తుత కాలపు వారివలె చాల సొమ్ము గడించిరి (యోహా $16^{33-39}$ లూ $15^{30}$). పాఁత నిబంధన కాలములో అన్యులు తమ మతారాధనలలో కూడ దేవదాసీలవంటి వారిని ఉంచిరి (హోషే $4^{14}$).

వేశ్యాగమనమును కఠినముగా నిషేధించిరి (ద్వితీ $23^{17}$). వారి పనివలన కలుగు ఆదాయమును ఆలయమునం దర్పింప నీయలేదు ($23^{8}$). వేశ్యల పిల్లలను సంఘములో చేరనియ్యలేదు ($23^{2}$ న్యాయా $11^{1-3}$). క్రొత్త నిబంధనలో ఈ పాపము శరీర పాపములలో నొకటియై (రోమా $1^{24}$ గల $5^{19}$ I కొరి $6^{16-18}$), దేవుని శిక్షకు మరింత లోనయి దాని చేయువారిని దేవుని రాజ్యమునుండి దూరపఱచును ($6^{9}$). ఇశ్రాయేలీయులు యెహోవాను విడిచి అన్యదేవతలను కొలుచుట భర్తను విడిచి వేశ్యావృత్తిని జీవించుచున్న ట్లెంచఁబడును (యిర్మీ $2^{20}$ $3^{1}$ యెహె $15^{16}$ $23^{5}$ మొ॥ నేరములు శిక్షలు II 1 (2) (*b*) చూ॥).

**వేషధారణ, వేషధారులు** (Hypocrisy, hypocrites). ఈ మాటలచే తెనిఁగించిన మూలభాషాపదములు నాటకములలో వేషములను ధరించుకొనువారిని సూచించును. నిజమైన భక్తి లేకున్నను అట్టివారివలె నటించువారికి యేసుక్రీస్తు పేరును అనేకమారు లుపయోగించెను (మ $6^{2,5,16}$ $7^{5}$ = లూ $6^{42}$ మ $28^{13,14,15,23,25,27,29}$). వెలపటి యాచారములను మాత్రమాచరించుచు వాని యాత్మీయ భావమును లక్ష్యపెట్టని వారును ఈ పేరుచేఁ పిలువఁబడిరి (మ $15^{7}$ = మా $7^{6}$). అట్లే ప్రకృతియందలి గుఱుతులను వివేచింప ప్రవీణులై ఆత్మీయ సంగతులను కొంచెమైనను వివేచింపఁజాలకున్న వారికీ నీ బిరుదు ఆరోపింపఁబడెను (లూ $12^{56}$). తాము చేయువానిని తప్పులుగా పరిగణింపక, వానినే యితరులు చేసినప్పుడు దోషారోపణ చేసినవారికిని ఈ పేరు కలిగెను ($13^{15}$). క్రీస్తును మోసపుచ్చవలెనని గోరి నక్కవినయము కొంగభక్తిని జూప యత్నించిన వారి నటనను ఆయన వేషధారణ యనెను (మ $22^{18}$ = మా $12^{15}$). ఈ పదమునకు సంబంధించిన క్రియను లూ $20^{20}$ తాము నీతిమంతుల మని అనుపించుకొను వారులై అని తెనిఁగించిరి. ఈ మాటలు మూలభాషయందు వారు వేషము ధరించిన సంగతిని మాత్రమే గాక ఆ పదముకు వేషధారణతో గల సంబంధమును తెలియఁజేయును. తన శిష్యులిట్టి వేషధారణలో పడకుండునట్లు ఆయన వారికి తగిన హెచ్చరికలు జేసెను ($12^{1}$). అంతియొకయలోని యూద క్రైస్తవులు పేతురు బర్నబాలతో పాటు కులాభిమాన విషయములో నిట్టి మాయవేషము (= వేషధారణ) లో పడిరి (గల $2^{13}$). క్రైస్తవులు బొత్తుగా విసర్జింపవలసిన పాపమైనను, అంత్యదినములయందు వారిలో ననేకులు ఈ పాపమునకు లోనగుదురు (నిష్కాపట్యము చూ॥).

# వై, వ్యా

**వైజాతా** (Vaizatha). హామాను 10 మంది కుమారులలో నొకఁడు (ఎస్తే 9[9]).

**వైడూర్యము** రత్నములు 16 చూ॥

**వైద్యుఁడు** రోగములు చికిత్సలు పీఠిక చూ॥

**వ్యభిచారము** నేరములు శిక్షలు I 1 (2) *b* చూ॥

**వ్యర్థము** మాయ చూ॥

**వ్యర్థుఁడు** (Raca = వట్టివాఁడు, vain fellow). మనుష్యులు వచింపరాని దూషణ పదములలో నొకటి (మ 5[22]). యాకో 2[20] లో ఈ పదముచేతనే తెనిఁగించిన మూలభాషాపదము మఱొకటియై ఆత్మీయసంపద లేనివానిని సూచించును. మ 5[22] లో నుండునది వట్టి దూషణపదమై మొద్దు మొదలగు మాటలచే సూచింపఁబడు బుద్ధిహీనుఁడని యర్థమిచ్చును.

**వ్యవసాయము** (Agriculture). ఇశ్రాయేలీయు లారంభమునందు గుడారములలో నివసించుచు పశువులమందలను పెంచి, వానిని గాయుచు జీవయాత్ర నడుపుకొనిరి (ఆది 13[5] 33[13-23] 47[6]). వారిట్టివారై తాము కొద్దికాలము వఱకు మాత్రమే నిలిచిన ప్రాంతములలోని భూమిని గొంతమట్టుకు సేద్యపఱచినను (ఆది 26[12] 37[7]), కనానుదేశమును జయించి స్వాధీనపఱచుకొనిన పిదప మాత్రమే వ్యవసాయము నొక వృత్తిగా నవలంబించిరి.

1. ఇశ్రాయేలీయులకు భూములు దొరికిన విధము. కనానుదేశము జయించుటవలన వారు మోషే యెహోషువల ద్వార ఇదివఱకే యితరులచేత సాగుచేయఁబడిన ప్రదేశములకు హక్కుదారులైరి (సంఖ్యా 32[4,5] యెహో 12). అట్టి ప్రదేశములలో కూడ వారు తమ పశ్వాదులను మేపుకొనుటకై మేతఁభూములను ప్రత్యేకించిరి (సంఖ్యా 32[4]). వారు తమ భూములను గోత్రముల చొప్పునను కుటుంబముల ప్రకారము విభాగించిరి (యెహో 14:21). వారిట్లు స్వాధీనపఱచుకొనిన దేశమునందు సాగుచేయవలసిన ప్రదేశమెంతో గలదు (17[15-18]). ఆయావారల కియ్యఁబడిన భూములు వారికి నిత్యస్వాస్థ్యములై యుండెను (లేవీ 25[13-17]). వారు తమ భూములను ఎకరముల చొప్పునగాక ఈ దేశమందు సాధారణముగా నున్నట్లు ఒక కాడియెద్దులు రోజుకు దున్నఁగలుగుదాని చొప్పున లెక్కించిరి (I సమూ 14[14] యెష 5[10]). ఆ భూములలో పండిన ధాన్యమును దానిలో చల్లఁబడు విత్తనముల ప్రకారము లెక్కించినట్లు లేవీ 27[16] నందొక దృష్టాంతము గలదు. మూలరాళ్లు వేసి ఆయావారి పొలములను ప్రత్యేకించుకొనిరి. వానిని మార్చుట గొప్ప పాపములలో నొకటిగా నెంచఁబడెను (ద్వితీ 19[14] 27[17] హోషే 5[10] సామె 22[28]). వారి పొలములు మాగాణిగాక మెట్టభూములై యుండెను (ద్వితీ 11[10-12]).

2. పొలములకు వాడిన ఎరువు. ఇశ్రాయేలీయులు భూమిని సాగుబడిచేయుటకై ఎరువునంతగా వాడినట్లు కనఁబడదు. గాని ప్రతియేడు సంవత్సరముల కొక మారు భూమిని సేద్యముచేయక ఊరకనే విడిచిరి (నిర్గ 23[10,11]). అన్ని భూముల నొకే సంవత్సరమున నిట్లు వదలవలెనను ఆజ్ఞ అచ్చట నున్నట్లు కనఁబడును. గాని అట్లుగాక వానిని సాగుచేయ నారంభించినది మొదలు ఆరు సంవత్సరములైన పిదప అట్లు చేయువలెను. ఆ ప్రకారమైన పక్షమున ప్రతి సంవత్సరమున ఏవో కొన్నిమాత్రమే విశ్రాంతిగా నుండునవి. ఇట్లు వారు చేయుటవలన ఆ పొలములు చాలమట్టుకు బాగుపడినను, ఎరువును కూడ అప్పుడప్పుడు వాడినట్లు సూచనలున్నవి (యెష 25[10] లూ 13[8]). చెత్తను కొయ్యకాలును అందునిమిత్తమే కాల్చివేసిరి (నిర్గ 15[7] యెష 5[24] 47[14]). గాని ప్రస్తుతము నాగరికులు భూములను ఫలవంతములుగాఁ జేయుటకు చేసెడి యత్నము లెవ్వియును జరిగినట్లు కానఁబడదు. ఈ విషయమునందు వారి దేశస్థులను బోలిరి.

3. సేద్యముచేసిన కాలము. సాధారణముగా అన్ని దేశములవలెనే ఆ దేశపు శీతోష్ణస్థితి భేదములను గుర్తించి వర్షాకాలముల ననుసరించి సేద్యమారంభించిరి. చలికాలము ఆరంభింపక పూర్వమే అక్టోబరు నవెంబరు మాసములలో వారు భూమిని దున్నిరి. గాని గోధుమలు యవలు మొదలగు



ఐగుప్తీయులు దున్నుట విత్తుట

ధాన్యములపైరు తప్ప అప్పుడేమియు విత్తలేదు. చలికాలము గతించిన పిమ్మట ఫెబ్రువరి మాసములో మరల సేద్యమారంభించిరి. మార్చి మొదలు మే వఱకు కడవరి వర్షాకాలమగుటచేత (యాకో $5^{7}$) అప్పుడు మంచి పంటలు పండెను. కోఁతలు సాధారణముగా ఏప్రిల్ నెలనుండి యారంభమాయెను (పలెస్తీను VI చూ.).

4. సేద్యముచేసెడి పనిముట్లు. నాగలి సర్వసాధారణముగాదున్న పనిముట్టుగా నుపయోగించినను (I రాజు $10^{19}$ యెష $25^{24}$ మొ॥) పారలతోడను భూమిని త్రవ్వినట్లు కనఁబడుచున్నదని యెష $7^{25}$ వలనఁ దెలియును. వారు పూర్వము వాడిన నాగలి ప్రస్తుత మీ దేశములో వాడు నటువంటిదే. విత్తనములు చల్లుట వారిలో సాధారణమైన విషయము (మ $16^{4\text{-}25}$). నేటివఱకు పలెస్తీనులో మొదట గింజలను చల్లి పిదప దున్నెదరు. ఒకొక్కప్పుడు దున్నిన చాళ్లలో గింజలను చల్లి పైన మరల కప్పుటకు దున్నెదరు. బైబిలు కాలమునందును బహుశః యిట్లే చేసియుందురు. దున్నుటకై వారు ఎడ్ల నుపయోగించిరి (I రాజు $10^{19}$). గాడిదెలతోను దున్నుట మామూలుగాని వీని రెంటిని జతచేసి దున్నుట నిషిద్ధముగా నెంచఁబడెను (ద్వితీ $22^{10}$). తొలకరి వానలలో నొకమారును, కడవరి వానలలో నొకమారును దున్ని వసంతకాలములో పైరులను గోసిరి. ఆయా పైరులను వేయుటకు ఇంక ఒకటి లేక రెండుమారులు దున్నియుందురు. భూమిని చదునుచేయుటకు (యెష $28^{25}$) పాపటము నుపయోగించిరేమో తెలియదు.

5. పైరులను పాడుచేసినవి.

(1) **వాన కురియకపోవుట.** కడవరి వర్షములు (పైన 3 చూ॥) తప్పిపోవుట పైరు లెండుటకు ముఖ్య కారణమాయెను (యిర్మీ $3^{3}$ ఆమో $4^{7}$) ఇందువలన కరవులు కలిగెననుటలో నాశ్చర్యములేదు.

(2) అధిక వర్షము కురియుటవలన **చిత్త**, బూజు, కాటుక పట్టుటచేతకూడ పంటలు పాడైపోయెను (ద్వితీ $28^{39}$ I రాజు $8^{37}$ ఆమో $4^{8}$ హగ్గ $2^{17}$).

(3) తూర్పునుండి వచ్చిన **వడగాలి** చేతను పైరులు మాడి పంట నష్టమాయెను. పై నాలుగు వాక్యములలోను మూల భాషయందున్న పదమొకటేయైనను తెలుఁగునందు కాటుక యను పదముతోగాని లేక అదే యర్థమిచ్చు మఱియొక పదముతోగాని తర్జుమాజేసిరి. ద్వితీ $28^{39}$ నందీ పదమును పొరపాటుగా **కాటుక** యనియు, I రాజు $8^{37}$ నందు **గాడ్పు దెబ్బ** యనియు, ఆమో $4^{9}$ నందు **ఎండు తెగులని** సరిగాను, హగ్గ $2^{17}$ నందు **తెగులు** అనియు తెనిఁగించిరి.

(4) మిడుతలు పైరులను చెరిపినవానిలో ముఖ్యములైనవి (నిర్గ $10^{12\text{-}19}$ I రాజు $8^{37}$ ఆమో $7^{2}$ యోవే $1^{4}$).

(5) **వడగండ్ల** వలనను పంటలు నష్టమాయెను (నిర్గ $9^{18\text{-}34}$ కీర్త $78^{47}$ హగ్గ $2^{17}$).

పక్షులువచ్చి ధాన్యమును తినకుండునట్లు ఈ దేశమందువలె **చేనికాపరులు** వానిని కాయుచుండిరి (యిర్మీ $4^{17}$).

(6) కోఁత. ఏప్రిల్ మాసమున యవలను కోయుటతో కోఁతలారంభమయ్యెను. మరికొంత కాలములో గోధుమకోఁతబట్టిరి. ఈ కోఁత దాదాపు యేడువారముల వఱకుండునది. పస్కా-

మొదలు పెంతెకొస్తు మధ్యనున్న యేడు వారము లీకాలమేరైయున్నది. పైరును కొడవండ్లతోఁ గోసిరి (ద్వితీ $16^{9}$ $23^{25}$). బాగుగా పండిన పంటను కోయుటకు సాధనముగా వాడిన కొడవలి బైబిలునందు అలంకారరీతిగా పూర్ణ పక్వము చెందినపిమ్మట లోకమున కలుగఁబోయెడి న్యాయ తీర్పున కొక గురుతైయున్నది (యోవే $3^{13}$ మా $4^{29}$ ప్రక $14^{14-19}$). పైరుగోసి దాని పనలుగా గట్టిరి (ఆది $37^{7}$ ద్వితీ $24^{19}$ రూతు $2^{7-15}$). తరువాత వానిని పంట కుప్పలుగా చేర్చిరి (నిర్గ $22^{6}$). చేల మూలలయందుండు వానిని కోయక బీదలకొఱకు విడువవలసినదను నియమము గలదు (లేవీ $19^{9}$ $23^{22}$). వారి నిమిత్తమే పరిగ నేరక విడువవలెనను ఆజ్ఞయు కలిగెను. రూతు $2^{7-17}$ నందు కోఁతగాండ్రు చేయు పని యావత్తును చక్కఁగా వర్ణింపఁబడియున్నది ఈ కాలము సంతోషకాలమునకు సూచనగానున్నది (యెష $9^{3}$).



నూర్చు కళ్లము

(7) నూర్పిడి. ఈ దేశమందున్న రీతిగానే పలెస్తీనులోను ధాన్యము నూర్చిరి. కళ్లము నొక దానిని సిద్ధపఱచి పనలన్నిఁటిని ఆ కళ్లములో పఱచి, పశువులచే త్రొక్కించి గాని (ద్వితీ $25^{4}$ I కొరి $9^{9}$), ఆ పనలమీఁదుగా నొక కొయ్య మొద్దును లాగించుటచేఁగాని (II సమూ $24^{22}$ యెష $28^{27}$) ధాన్యమును నూర్చిరి. సాధారణముగా నీ పని రాత్రివేళలందు జరిగెను. అప్పుడప్పుడా నూర్పుకొయ్యకు క్రింద ఇనుపదంతములవంటి మేకులను తగిలించిరి కావున అది భయంకరమగు శిక్షను సూచించెను. ధాన్యాదుల నిట్లు నూర్చినను ఈ దేశమున కాయధాన్యముల నెట్లు దుళ్లఁగొట్టెదరో అట్లే పలెస్తీను నందును ఆయా విధములగువానిని నూర్చుటకు వివిధసాధనములు వాడిరి (యెష $28^{27}$).

నూర్చినపిదప గాలి బాగుగా కొట్టునప్పుడా ధాన్యమును తూర్పారబట్టి పొట్టును గట్టిగింజలను వేఱుచేసిరి. పలెస్తీనులో సముద్రపుగాలి సాయంకాలములందు బాగుగా వీచును గాన అట్టి సమయమున తూర్పారఁబట్టిరి (రూతు $3^{2}$). ధాన్యము నింక శుభ్రపఱచుటకై జల్లెడను (ఆమో $9^{9}$ యెష $30^{24}$), చేటలను (మ $3^{12}$) వాడిరి. ఇట్లు ధాన్యమును సిద్ధపఱచినపిమ్మట దానిని పాతరలోఁగాని (యిర్మీ $41^{8}$) కొట్లలోఁగాని (II దిన $32^{28}$ సామె $3^{10}$ యిర్మీ $50^{26}$ యోవే $1^{17}$ లూ $12^{18}$) పోసి భద్రపఱచి పొట్టును కాల్చివేసిరి. ఇది దుష్టులకును శిష్టులకును కలుగఁబోవు స్థితిగతులను సూచించెను (మ $3^{12}$ $13^{30}$ పలెస్తీను చూ॥).

వ్యాపారము వర్తకము చూ॥



ఐగుప్తీయుల ధాన్యపు కొట్టు

## వ్ర, వ్రా

వ్రతదినము సమాజము 2 చూ॥

వ్రతము చేయువాడు నాజీరు చూ॥.



హెబ్రీయులయొక్క పుస్తకపుచుట్టయు, సిరాబుడ్డి

వ్రాత (Writing). అబ్రాహాము కల్దీయుల ఊరుపురమును విడిచి కనానుకు వెళ్లక మునుపే కల్దీయులకు వ్రాఁత తెలిసియున్నట్లు వారి శాసనములవలనఁ దెలియును. వారు పచ్చియిటుకలమీఁద వ్రాసి వానిని కాల్చిరి. ఇట్టి యిటుకలనేకము నేటివఱకు కాపాడఁబడియున్నవి. మఱియు ఇశ్రాయేలీయులు ఐగుప్తులో నివసింపక పూర్వమే ఐగుప్తీయులు వ్రాఁత నెఱిఁగి యుండిరని అచటి రాతిశాసనములవలనఁ దెలియును. ఇశ్రాయేలీయులు కనాను దేశమును స్వతంత్రించుకొనక పూర్వము కనానీయులు వ్రాఁత నెఱిఁగి యున్నట్లు రాతి శాసనములవలనఁ దెలియుచున్నది. ఇశ్రాయేలీయులుకూడ మొదటినుండి వ్రాఁత నెఱిఁగియుండిరనుట ఆశ్చర్యము కాదు (నిర్గ $17^{14}$ $24^{4}$ సంఖ్యా $33^{2}$ ద్వితీ $31^{24}$). వారు కనాను దేశమును జయించినపుడు రాళ్లకు సున్నముపూసి దానిమీఁద అక్షరలను వ్రాసిరి



ధర్మశాస్త్రపుచుట్ట ఉంచఁబడు విచిత్రపు ఓఱ

(ద్వితీ 27⁴⁸ యెహో 8³²). రత్నములమీఁదను (నిర్గ 39¹⁴) బంగారము మీఁదను (నిర్గ 39¹⁴) అక్షరములను చెక్కుట వారికి తెలిసియుండెను (పుస్తకములు, హెబ్రీభాష చూ॥).

**వ్రాతపలక** పలక చూ॥

**వ్రేలు (Finger).** అలంకార రీతిగా దేవుని వ్రేలు ఆయన శక్తికి సూచనగా నున్నది (ద్వితీ 9¹⁰ లూ 11²⁰). అది నిర్గ 8¹⁰ లో దేవుని శక్తి యనియు కీర్త 8³ లో ఆయన చేయి యనియు తెనిఁగించిరి. యిర్మీ 52²¹ లో వ్రేళ్లు కొలతగా నుపయోగింపఁబడెను (మానములు కొలతలు I 1 చూ॥).

## శ

**శకునము, శకునగాండ్రు (Sooth-saying, Magic, Charm, Sooth sayers).** సోదె, దాని బహుమానము, చిల్లంగితనము, గుసగుస మాటలాడువాఁడు, గారడిచేయువాఁడు, మంత్రకాడు, సోదెకాఁడు లేక సోదెకత్తె, జాతకము చెప్పువాఁడు లేక మాయగీతలు గీయువాఁడు, ఇంద్రజాలకుఁడు, మోసచర్య చెప్పు వాఁడు, మాయకాఁడు మున్నగు నర్థములిచ్చు వేరువేరు స్థలములలో వాడిన నాలుగు హెబ్రీపదములను ఆంధ్రీకరించుటకు ఈ తెలుఁగు పదము ఉపయోగింపఁబడినది. తెలుఁగులో దీని మొదటి అర్థము పక్షి. దాని నుండి ముఖ్యముగా పక్షులు ఎగిరిపోవుటనుండి శకునము లేక సోదె అనునది ఉత్పత్తియయ్యెను.

ఇచ్చటిమాట మఱుగైన వానిని తెలిసికొనుటకు గాను చరిత్రయందంతటఅన్ని జనాంగముల వారు ఉపయోగించిన ఏదో యొక విఫమైన ప్రయత్న మును చూపించుచున్నది. ఇది అమానుష సహాయము కలిగియున్నామని నటించువారు ఆ సహాయముద్వార మనుష్యులకు సాధారణముగా మఱుగైయున్న సంగతులను రాఁబోవు సంగతు లను చెప్పుటయైయున్నది.

ఇట్టి జ్ఞానము కలదని నటించుటద్వార అనేక విధములైన శకునములు బైలుదేరెను. ఈ శక్తి కలదనుకొనిన స్త్రీ పురుషులు మంత్రకాండ్రు, మంత్రకత్తెలను పేరఁబరగుచుండిరి. వారి వృత్తి చిల్లంగితన మనఁబడెను.

వారు కలలభావమును చెప్పి, రహస్యములను బైలుపఱచి, మనుష్యులు పోఁగొట్టుకొనిన వస్తువు లను కనుగొనిరి. వారు పక్షులు ఎగిరిపోవుటను కనిపెట్టిరి. లేక చీట్లు వేయుటను వాడుకొనిరి. వారు మేఘములను వాని చలనములను గమనించి వానివలన తమ తీర్మానములను చేసిరి. శకునము చెప్పుటలో గ్రహణములను, గ్రహముల సంధిని వాడుకొనిరి. వారు చచ్చిన వారి యాత్మలతోను, దయ్యములతోను అన్యోన్య సంబంధము కలిగి యుండఁగల మనియు, వానిద్వార కావలసిన సంగతి తెలిసికొనఁగలమనియు నటించిరి. వారు అప్పుడే చంపఁబడిన మృగములయొక్క ప్రేగు లను, మనుష్యుల శవములను తనిఖీచేసి రాఁబోవు సంగతులను తెలియఁజేయుటకు కావలసిన చిహ్నములను వీనిలో కనుగొనిరి. ఇందుకై వారు బాణములు వేసిరి. అంబుపోవు విధమును జాగ్రత్తగా కనిపెట్టు నిమిత్తము వాని నెక్కుపెగా మెరుగు పెట్టిరి. అనేకమైన బాణములువేసి, ఎక్కువ బాణములు పోవు దిక్కునుబట్టి తాము కొనిన పనియొక్క దురదృష్ట అదృష్టములను చెప్పిరి. వారెదిరింపవలెనని యున్న పట్టణముల యొక్క పేళ్లలో ఒక్కొక్క పేరును ఒక్కొక్క బాణముమీఁద చెక్కి అన్నియును అమ్ముల పొదిలో పెట్టి, ఒక్కొక్క దానిని బయటికి తీయునప్పుడు ఏ పేరుగలది వచ్చునో ఆ వరుస ప్రకారము పట్టణములను ఎదిరించిరి. ఇది ఒక విధముగా చీట్లు వేయుటయై యున్నది. కర్రల ద్వార శకునములను చెప్పు వాడుకకూడ నుండెను. (హోషే 4¹²). కర్రను చక్కగా నిలువఁబెట్టి అది పడుదిక్కునుబట్టి తాము కనుగొనఁగోరిన దానిని చెప్పిరి. శకునపుగిన్నె ఒకవిధమైన మూఢభక్తియై యుండెను. ఫరో మంత్రగాండ్ర సంగతినిబట్టి చూచిన (ఆది 41⁸ నిర్గ 7¹¹⁻²²) శకునగాండ్రెక్కువ మోసగాండ్రని లేఖనములు చక్కగా తెలుపుచున్నవి. హిందూదేశములోని సాధారణమైన గారడి వానియొక్క అత్యాశ్చర్య కరమైన నిపుణతను గాంచునప్పుడు అట్టి పని చేయువారు తమ్మును చూచువారిని సులభముగా లోపఱచుకొనఁగలరనియు, వారి మాట మనుష్యు లలో పలుకుబడి గలదై యుండుననియు, వారి యాశీర్వాదము లన్నియు ఎవరియొద్దనుండి వచ్చు

చున్నవో, రాఁబోవుకాలపు వానిని మన కవసరమైనంతమట్టుకు ఎవరు తెలియఁజేయుచున్నారో, జరుగఁబోవు సంగతులు మొదట తెలిసిన మన మెడతెగని భయములో నుందుమని ఎవరెరిఁగి వానిని మనకు దయతో మరుగుచేసెనో ఆ దేవుని మరచిపోవునట్లు చేయుటకు కారణమగుదురనియు తెలిసికొనుచున్నాము.

ఇశ్రాయేలీయు లేయే జనాంగములవారితో సహవాసముచేసిరో ఆయా జనాంగములవారు శకునములం దెక్కువ నమ్మకము గలవారై యుండిరి. కనుక ఇశ్రాయేలీయులు యెహోవాను మరచుట కిది ఎల్లప్పుడొక శోధనగా నుండెను (నిర్గ $22^{18}$ లేవీ $19^{26}$ సంఖ్యా $23^{23}$ ద్వితీ $18^{10}$ I సమూ $6^{2}$ $15^{23}$ $28^{8}$ II రాజు $17^{17}$ $21^{6}$ యిర్మీ $14^{14}$ యెహె $21^{21-23,29}$ దాని $1^{20}$ $2^{2-27}$ $4^{7-9}$ $5^{11}$).

కల్దీయుల దేశము శకునమునకు పుట్టిల్లని చెప్పవచ్చును. జ్ఞానులను పేరఁబరగిన తెగవారు మొదట శాస్త్రజ్ఞులును, ప్రకృతిని గమనించువారును, భూగోళశాస్త్రజ్ఞులునై యుండిరి. ఈ జ్ఞానముతో కొన్ని శకునములను, అమానుష శక్తి తమకు కలదను నటనమును కలిపినచో పైకము సంపాదించుకొనుటకు సాధ్యమగునని వారు కనుగొనిరి. ఇక్కాలమందు భరతఖండములో విస్తారముగా నగపడు జ్యోతిషము అనేక శతాబ్దముల నుండి ఈ విధముగా వృద్ధినొందెను. ప్రతివాఁడును ఒక నక్షత్రమందు పుట్టినాఁడనియు, వాని జీవితమంతయు దాని స్వాధీనములో నున్నదనియు వారు తలచెడివారు. నక్షత్రములను జాగ్రత్తగా గమనించి, ప్రతివాని యొక్క జాతకము వ్రాయుట కల్దీయదేశపు జ్ఞానుల యొక్కయు, పారంపర్యముగా వారినుండి వచ్చిన ఇతర దేశస్థులయొక్కయు పనియై యుండెను.

ఇవ్విధమైన శకునము కల్దీయ, ఐగుప్తు అను దేశములనుండి ఇశ్రాయేలీయులలోనికి కడపటి రాజులకాలమందు వ్యాపించెను. వారు విగ్రహారాధనను సంపూర్ణముగా విడిచిన తర్వాతకూడను ఇది వారిలో నుండెను.

లేవీయుల ధర్మశాస్త్రము ఈ విధమైన శకునములన్నిఁటికి ఎక్కువ విరోధముగా నుండెను. ఎందుకనఁగా రాఁబోవు సంగతులను తెలిసికొనవలెననెడి యాశ, తెలియని సంగతులను అమానుష శక్తిద్వార తెలిసికొనగలమనెడి నటన అను నీ రెంటికంటె నరజాతి నెక్కువ భ్రష్టము చేయగలవి లేవు.

శకునమును, దానికి సంబంధించిన దంతటి యొక్క పాపమును ఈ క్రిందివానిలో నిమిడి యున్నది.

(1) విగ్రహారాధనతో దానికి గల సంబంధము. అది ఎల్లప్పుడును విగ్రహారాధన చేయు మతములకు సంబంధించి యుండెను. ఇది మనుష్యులకు మరుగైన సంగతులను అదృష్టవశమునన్నో, పదార్థసంబంధమైన వానిలో కనఁబడు గురుతుల వలననో తెలిసికొనవచ్చునని చెప్పుటయైయున్నది. తెలిసికొనవలసినవానిని దేవుఁడు బైలుపఱచును. మనకు గోచరమైన సంగతుల నాలోచించుట ఆయన కిష్టములేదు.

(2) అది జ్ఞానమునకు మూలమైన దేవునికి బదులు హస్తకృతిమైన పదార్థమును నిలుపుటయై యున్నది.

(3) స్వలాభము నిమిత్తము ఉపయోగించుచున్నందున నది మిక్కిలి మోసమునకు నడుపుచున్నది. ఎక్కువ లాభము కలుగునట్లు ఎక్కువ మోసకరమైన పనులు చేయుదురు. అల్పజ్ఞాను లట్టి శక్తి తమ యాధీనమందున్నదని చెప్పుకొందురు. ఇది అబద్ధమే.

(4) చాలమట్టుకు నమ్మకము అందఱిలో వ్యాపించెను. శకునములలో నేమైన వాస్తవముండిన నది స్త్రీ పురుషులు సాతానుతో సహవాసము చేయుటవలననే కలిగెననవచ్చును. అనేక సందర్భములం దిది వాస్తవము.

(5) ఇది స్త్రీ పురుషులలో విస్తారమైన భయము పుట్టించును. అది వారికొక దాసత్వమగును. మూఢాచారము లత్యధిక భయమును పుట్టించును. ఇది వాస్తవమని ఇండియాలో ఇక్కాలమందు విస్తారముగ రుజువగుచున్నది. మంత్రశక్తిచే కలుగునెడి గుఱుతులు, శకునములు మున్నగు వాని దాసత్వపు కాడిక్రింద ఇండియా దేశస్థులు భయంకర బాధ ననుభవించుచున్నారు.

సాతానుయొక్కయు, దయ్యములయొక్కయు ఆధీనమున కప్పగించుకొను స్త్రీ పురుషులు చేసెడి నటనలయందు విస్తారముగా సత్యమున్నదని ఆదిమ క్రైస్తవ పితరులు నమ్మిరి. ఇక్కాలపు స్పిరిటిజమ్ (*Spiritism*) కును, ఈ విషయమునకును సమీప సంబంధమున్నట్టు గాన్పించెడిది. శాస్త్రజ్ఞులైన ప్రముఖులనేకులు దీనిలో వాస్తవమున్నదని నమ్ముచున్నారు. అయినను ఇదివఱకును, ఇప్పటికిని దీనిలో నెక్కువ మోసమున్నది. మఱియు ఈ విద్యలు, పద్ధతులు, నమ్మకములు మున్నగునవన్నియు దేవునికి కోపమును పుట్టించునవై నందునను, ఆయన వానినన్నిటిని ఖండించుచున్నందునను మన మిట్టివానికి దూరముగా నుండుట మిక్కిలి ప్రయోజనకరము.

ఈ విషయమునకు సంబంధించిన మాట లనేకములు లేఖనములందంతట కనబడుచున్నవి. వానిలో కొన్ని ఏవనగా: సోదె, మంత్రము, కర్ణపిశాచము, చిల్లంగితనము, యక్షిణిగాడు, గొణుగువాడు, గారడము. ఈ మాటలలో ప్రతి దానికి మఱొకదానితో సంబంధమున్నది.

B.

**శతాధిపతి** (Centurion = నూఱుమందికి అధిపతి). రోమీయవారు తమ పటాలమును 10 భాగములుగా భాగించిరి. అందొక్కొక్క భాగమునకు అధిపతిగా నుండువాడు శతాధిపతి యనబడెను. క్రొత్త నిబంధనలో కొర్నేలి (కార్య 10), యూలి ($27^{1,3,43}$) అను నిద్దఱు శతాధిపతుల పేరులును మఱి యిద్దరిని గూర్చిన సంగతులును (మ $8^{5-13}$ $27^{54}$) కలవు. ఈ నలుగురు శతాధిపతులును మహా శ్రేష్ఠులని కనబడును. మ $8^{5-13}$ లోను, కార్య 10 లో నుండువారు మిగుల భక్తిపరులై యుండిరని తెలియును.

**శపితము, శాపము, శాపగ్రస్తుడు** (Curse, Accursed, Devoted). బైబిలులో శాపము అను నర్థమునిచ్చు అసలు పదమునకు శాపము అను పదమునకుగల యర్థమే యుండును. మనుష్యులకు దేవుడు ఆయా కీడులు కలిగించునట్లు కోరి ఆ కీడులు వారికి గలిగింపవలెనని దేవుని పేరట చెప్పుటయే (యెష $65^{15}$) శాపము పెట్టుటయై యున్నది. ఇట్లు కొందఱు ఆయా మనుష్యులను మాత్రమే కాక, ఆయా వస్తువులను కూడ శపించియున్నట్లు దృష్టాంతము లున్నవి. దృ॥ యోబు తన జన్మదినమును శపించెను ($3^{8}$).

పైనున్న దానికి సంబంధముగా దేవుడు ఏదో యొక జనమునుగాని, వారి యాస్తినిగాని నాశనమునకు విధింపగా అట్టి జనాంగమును వారి యాస్తిపాస్తులును శాపమునకు లోనైనవగుటచే శపితమైనవి కావున, వాని నెవ్వరును ముట్టకుండ నుండవలెనని తెలిసికొనిరి. అట్టివానిని ఎవ్వరును స్వంతమునకుపయోగించుకొనరాదు (ద్వితీ $20^{12-14}$ యెహో $6^{17}$ $6^{25-27}$ $7^{12}$). ఈ విధముగా యుద్ధములో ప్రతిదానిని నాశనమునకు విధించుట తటస్థమగుచుండెను. ఇది దీని యుద్దేశమగుటచే **శపింపబడినదని** తర్జుమ చేయక నిర్మూలము చేయబడవలసినదని సాధారణముగా తర్జుమా చేసిరి (సంఖ్యా $21^{2}$ యెహో $2^{10}$ $8^{26}$ I సమూ $15^{3}$ II దిన $32^{14}$ మొ॥). యెహో 6 లో నున్నట్లే విధముగా చేసిరి. జనులు కన్యకలను, పిల్లలను ఈ విధముగ విమోచించియున్నట్లు సూచనలు కొన్ని చోట్ల నున్నవి (సంఖ్యా 31, ద్వితీ 21). శపితములైన వానిలో కాల్చివేయదగు వానినన్నిటిని కాల్చివేసిరి (ద్వితీ $7^{25}$). కాల్చ వీలుగాని లోహములు మొదలగువానిని దేవాలయములో నుంచిరి (యెహో $6^{25}$). దీని భావము ననుసరించి దానిని **ప్రతిష్ఠితమైన** దని తెనిగించిరి (లేవీ $27^{21-28,29}$ యెహె $44^{29}$ మొ॥). శపితమైనదానిని ఒకడు తన స్వంత మేలునిమిత్త ముపయోగించుకొనిన యెడల వాడు శాపగ్రస్తుడాయెను. ఈ విధముగ ఆకాను అనువాడు శాపగ్రాహియయ్యెను (యెహో $6^{18-25}$ 7). అమాలేకీయులు కూడ ఇదేవిధముగా శాపమునకు లోనైరి (I సమూ $15^{18}$). దీని అసలుమాటను **వధకు అప్పగించుట** (యెష $34^{2}$), **నశింపచేయుట** (యెష $37^{11}$), **హతముచేయుట** (I దిన $4^{41}$), **మీదు కట్టుట** (సంఖ్యా $18^{14}$) అనికూడ భాషాంతరము చేసిరి.

అక్రమము చేసినవారి యాస్తికూడ శపితమయ్యెననుటకు ఎజ్రా $10^{8}$ లో నొక సూచన కలదు. అట్టివారి యాస్తి వారియొద్దనుండి తీసివేసి దానిని జప్తిచేసిరి కావున, అది ప్రతిష్ఠితమైనదనబడెను.

ఇట్టి శాపము ఇశ్రాయేలీయుల పాపముచే అందరికి కలుగునేమో యని ప్రవక్తలు జనులను మందలించిరి (మలా $4^{6}$). ప్రజలు గుణపడిన యెడల వారికి ఇట్టి శాపము కలుగక సౌఖ్యమే కలుగునని కూడ ఆ ప్రవక్తలు పలికిరి (జెక $14^{11}$).

నాశనమునకు విధించు నిట్టి శాపమునకు సంబంధించిన మాట (*Anathema*) క్రొత్త నిబంధనలో కొన్నిచోట్ల కనబడును (గల $1^{8,9}$ రోమా $9^{3}$ I కొరి $12^{3}$ $16^{22}$). క్రీస్తు మనకొఱకు శాపగ్రాహి యయ్యెనను మాటను చూడఁగా అది అసలులో వేఱుగా నుండినను సంగతి యొకటేయై యున్నది (గల $3^{14}$). మనకు కలుగ వలసిన శాపకరమగు మరణము అను నాశనము (ద్వితీ $21^{23}$) క్రీస్తు మీఁద పడెననునదే దీని భావమై యున్నది.

**శమ్లా** (Samlah = వస్త్రము). ఎదోము రాజులలో నైదవవాఁడు (ఆది $36^{17}$ I దిన $1^{47,48}$).

**శరీరము, శరీరులు (Flesh).** శరీరము అను పదము బైబిలులోని రెండు ప్రత్యేకమైన మాటలకైన ఒకటే తర్జుమాయై యున్నది అయితే ఇచట మాంసము అను భావముగల పదము సంగతి మాత్రము వివరింపఁబడును. వేఱే మాటలకు సంబంధించియున్న వివరము తరువాత వ్యాసమును చూడుఁడు. బైబిలులో శరీరము అను పదముచే తర్జుమా చేయఁబడిన మాంసము అను పదమునకు ఈ దిగువ యర్థములు కలవు:—

1. మానవుల దేహమంతటిని తెలుపుటకు దీనిని వాడిరి (నిర్గ $4^{7}$).

2. వివాహమువలనఁ గాని పుట్టుకచేతఁ గాని కలుగు సంబంధమును చూపుటకు దీనిని వాడిరి. భార్యాభర్తలు, బిడ్డలు ఏకశరీరముగా నెంచఁబడిరి (ఆది $2^{24}$ $37^{27}$).

3. అది సర్వశక్తిగల దేవుని యెదుట మానవులకుండు బలహీనతను కనఁబఱచు పదమైయున్నది (యెష $31^{3}$ $40^{6-8}$ ఆది $7^{21}$ యోబు $34^{15}$ యోవే $2^{28}$). ఇందులో మానవులకుండు తక్కువ స్థితి సూచింపఁబడియున్నది గాని పాపము ఏమాత్రమును సూచింపఁబడలేదు గనుక, క్రీస్తు తన్ను తాను తగ్గించుకొని యీ లోకములో నవతరించియుండగా ఆయన శరీరధారియయ్యెనని ఆయనను గూర్చి సహా వ్రాసియుండిరి (యోహా $1^{14}$ రోమా $1^{3}$).

4. మానవులు శరీరాత్మలు గలవారైయున్నారు కావున, కంటికిఁ గనఁబడు భాగమును సూచించుటకై ఈ మాటను వాడియున్నారు. అట్లు దానిని వాడుటలో అనేక చోట్ల ఆత్మ (= ప్రాణము) యను పదముతోకూడ నుపయోగించిరి (కీర్త $63^{1}$ $73^{26}$ $84^{2}$ మ $26^{41}$ I కొరి $5^{5}$ గల $2^{20}$). ఈ వాక్యములలో శరీరము పాపమునకు ఉనికియైయున్నట్లుగా దానిని వాడియుండలేదు గాని మనుష్యుఁడు రెండు భాగములు గలవాఁడని యెంచినయెడల పాపము అతని శరీరమునకు మాత్రమే కాక, అతని మనస్సునకును ఆత్మకునుకూడ అంటునను అర్థము వచ్చునట్లుపయోగించిరి (II కొరి $7^{1}$ ఎఫె $2^{3}$).

5. శరీరము (= మాంసము) అను పదమునకు పై యర్థములు మాత్రమేకాక, మఱియొక అర్థము కూడ కలదు. అది మనలోనుండు పాపస్వభావమును సూచించును. ఈ భావములోనే పౌలు దానిని ముఖ్యముగా వాడెను. ఈ యర్థమును బట్టి చూడఁగా శరీరము ఆత్మకు భిన్నముగా నున్నది. శరీరము మనలోని నైజబుద్ధిని, ఆత్మ దేవుని యాత్మచే మనలో పుట్టిన నూతనమైన మంచి బుద్ధిని సూచించును (రోమా $7^{25}$ $8^{4-11}$ గల $5^{16-26}$). ఈ విధముగా మనలో నుండు దుష్టగుణములను సూచించుటకై మనము శరీరసంబంధులమని (రోమా $7^{3}$ I కొరి $3^{1}$ కొలొ $2^{18}$) యున్నది. ఇందులో మనము శరీరావయవముల వలన చేయు పాపములు మాత్రమే కాక, విగ్రహారాధన అసూయయను నిట్టి పాపములును గలవు (గల $5^{20}$). ఇట్టి పాపములు శరీర సంబంధమైనవని చెప్పఁబడును (రోమా $8^{6}$). శరీరములోనే ఈ పాపము లున్నవిగాని మనస్సులోనివి లేవనునది దీని భావముకాదు. మనలో నున్న భాగములలో శరీరము అధమమైన దగుటచే దానికి అలంకార రీతిగా శరీరము మాంసము అను పేరులను పెట్టిరని తెలిసికొనవలెను.

**శరీరము, దేహము (Body).** మానవుల దేహములను సూచించుటకు వాడునట్టి పదములై

యున్నవి. రోమా 6$^{6}$ 7$^{24}$ లో నున్నట్లు ఈ శరీరముకూడ పాపేచ్ఛల కునికిపట్టయినట్లున్నది. ఈ వాక్యములలోని శరీరము అను పదముయొక్క భావము పైనున్న శరీరము (=మాంసము) అను పదమునకు 5 వ భాగములలో నున్నదాని భావమును చాలవఱకు ఏకముగా నున్నది. శరీరమును చెఱుపక కాపాడుకొనవలెనను బోధలును గలవు (I కొరి 6$^{13-19}$). మఱియు మనము దానిని యజ్ఞముగా దేవునికి సమర్పింపవలెను (రోమా 12$^{1}$). ఈ మన శరీరము అంత్యదినమున లేపఁబడి, మహిమపఱచఁబడును (ఫిలి 3$^{21}$ రోమా 8$^{11}$). కావున, ఇది మన విమోచనములోఁగూడ పాల్గొనును (రోమా 8$^{23}$). సంఘముయొక్క ఐక్యమును సూచించుటకు శరీరము అనుదాని పౌలు అలంకారరీతిగా నుపయోగించెను (I కొరి 12$^{12-17}$ రోమా 12$^{3-7}$). సంఘము క్రీస్తుయొక్క ఆధిపత్యముక్రింద నుండుటచే అది ఆయన శరీరమనియు, ఆయన దానికి శిరస్సనియు ననఁబడును (ఎఫె 1$^{22}$ కొలో 1$^{18}$)

**శరీరహాని** నేరములు శిక్షలు II 3 (2) చూ॥

**శరీరాత్మలు** శరీరము శరీరులు I 5 చూ॥

**శర్సెకీము** (Sarsechim). నెబుకద్నెజరు యెరూషలేమును జయించి దానిలో ప్రవేశించినప్పుడు అతనితోకూడ నున్న బాబెలు ఘనులలో నొకఁడు (యిర్మీ 39$^{3}$).

**శల్మాను, శల్మా** (Salmon, Salma). బోయజు తండ్రి (రూతు 4$^{20}$ I దిన 2$^{11}$). ఇతని పేరును క్రీస్తు వంశావళి క్రమణికలో కనఁబడును (మ 1$^{4,5}$ లూ 3$^{32}$). I దిన 2$^{51,54}$ లో నుండు శల్మా యితఁడైనయెడల బేత్లెహేమును కట్టించినవాఁ డితఁడే యగును గాని ఈ సల్మోను రాము సంతతివాఁ డగుటవలనను 2$^{50,54}$ లో నున్నవాఁడు కాలేబు సంతతివాఁ డగుటచేతను ఇట్టి సంబంధమున్నదా లేదా యను సందేహము కలుగుచున్నది. అయినను వియ్యమందుటవలన అట్టి సంబంధము కలుగవచ్చును.

**శస్త్రము** ఆయుధములు I 5 చూ॥

## శా

**శాంతము** సాత్వికము చూ॥

**శాంతికరము** కరుణాధారము చూ॥

**శాకారు, షారారు** (Sacar, Sharar = సరకులు).

1. దావీదు యోధులలో నొకఁడగు అహీయాము తండ్రి (I దిన 11$^{35}$). II సమూ 23$^{33}$ నందితనికి షారారు అను మాఱుపేరు గలదు.

2. ఓబేదెదోము కొడుకులలో నొకఁడు (I దిన 26$^{4}$). ఇతని కుటుంబికులు ద్వారపాలకులై యుండిరి.

**శాఖధాన్యములు** (Pulse). దానియేలును అతని సహచరులును విగ్రహార్పితమగు రాజభోజనమును మానుకొని శాఖాధాన్యముల పానమునకు నీళ్లు తమ కియ్యఁబడవలసినదని యడుగుకొనిన ఆహారవిశేషము. ఇవి ముఖ్యముగా కాయధాన్యములై యున్నవి (దాని 1$^{12-16}$). J. C.

**శాపగ్రస్థుడు, శాపము** శపితము చూ॥

**శారా, శారయి** (Sarah = యువరాజ్ఞి, Sarai = కులీనమగు లేక కలహప్రియ). అబ్రాహాము భార్య. అతనికన్న పదేండ్లు చిన్నది. కల్దీయుల ఊరు అను పట్టణములో వీరి వివాహము జరిగెను (ఆది 11$^{28-31}$ 17$^{17}$). ఆమె యతని తండ్రికుమార్తెగాని తల్లికుమార్తెగానందున అతని మాఱుచెల్లెలై యుండెను (20$^{12}$). ఆమె మొదటిపేరు శారయి. అబ్రాహాము హారానును నుండి కనానుకు బయలుదేరినప్పుడామె అరువది యైదేండ్ల ప్రాయముగలది (12$^{4}$). ఆమె నూట యిరువదియేడేండ్లు జీవించుటనుబట్టి మంచి ఆరోగ్యవతి యని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. వారు హారానును విడిచిన కొంతకాలమునకు వచ్చిన కరవునుబట్టి ఐగుప్తుకు వెళ్లుచు ఆ దేశస్థులు శారయి సౌందర్యమును జూచి తన్ను జంపెదరేమో యని భయపడి అబ్రాహాము ఆమె తన భార్యయను సంగతిని మఱుగుపఱచి ఆమె తన సహోదరియైనట్లు నటించెను (12$^{10-20}$). కొన్నియేండ్లకుఁ దరువాత గెరారు రాజగు అబీమెలెకుయొద్దను అట్లే జేసెను (20$^{1-18}$). అబ్రాహామట్లు జేసినందులకు కారణము తోఁచుటలేదు. అబీమెలెకైనను శారయి చక్కదనమునుబట్టి ఆమెను తన యింటఁ జేర్చెనని చెప్పఁబడలేదు. బలపరాక్రమ సమన్వితుఁడగు నీ హెబ్రీ ప్రముఖునితో వియ్యమొందవలెనను

తాత్పర్యముతో అతని కుటుంబమునందలి యేయొక స్త్రీనైనను తన యంతఃపురమునఁ జేర్చుకొన నిశ్చయించుకొని అట్లు జేసియుండును. ఆ కాలమునందుండిన రాజులు ఈలాటి చుట్టరికము జేసికొనెడివారు. శారయికి హాగరను నొక దాసియున్నను తన గృహకృత్యపుపనులను తానే స్వయముగా చేసికొనునది (18[6]). శారయి గొడ్రాలు. డెబ్బదియేండ్ల ప్రాయమప్పుడు దేవుఁడు తన పెనిమిటితో చేసిన వాగ్దానము యొక్క నెఱవేర్పుకు తానే యాటంకముగా నుంటినని నిశ్చయించుకొని తన దాసియగు హాగరును ఉపపత్నిగ జేసికొమ్మని అబ్రాహాముకు మనవిజేసెను. అతఁడు దేవుని యనుమతిని బొందకయే నట్లుజేయఁగా వారికి ఇష్మాయేలను కుమారుఁడు జన్మించెను (16[1-16]). శారా సుమారు ఎనుబదితొమ్మిదేండ్ల ప్రాయమప్పుడు దైవవాగ్దానప్రకారము గర్భము ధరించినదై (హెబ్రీ 11[11,12]) వాగ్దానపుత్రుఁడగు ఇస్సాకును కనెను. దేవుఁడామెకీ వాగ్దానము చేసినప్పుడు ఆమె పేరును శారా అని మార్చెను (ఆది 17[15-22] 18[9-15] 21[1-5]). ఇస్సాకు పాలు మానినప్పుడు అబ్రాహాము చేయించిన గొప్ప విందుసమయమున హాగరు కుమారుఁడగు ఇష్మాయేలు నవ్వుట శారా చూచి వానిని వాని తల్లితో కూడ ఇల్లువెడలఁ గొట్టించెను (21[9-21]). శారా 127 సంవత్సరముల ప్రాయముగలదై హెబ్రోను అను కిర్యతార్బాలో మృతినొందెను (23[1,2]). అబ్రాహాము తన కుటుంబ సమాధికొఱకు ఆ కాలమందు కొనిన మక్పేలా గుహయందు ఆమెను పాతిపెట్టెను. H.

**శారాపీయులు** (Saraph = ప్రకాశించెడి). శారాపు అనువాని సంతానపువారు (I దిన 4[22]). తెలుఁగునందున్నట్లు మూల భాషలో నిదియొక జనమునకుకాక ఒక మూల పురుషుని పేరై యున్నది. ఇతఁడు యూదా గోత్రీకుఁడు. ఈ వంశపువారొకానొకప్పుడు మోయాబులో ప్రభుత్వముచేసినట్లున్నది గాని దానినిగూర్చి సూచనలింకేమియును లేకపోవుటచే ఆ ప్రభుత్వమెట్టిదో సరిగాఁ దెలియదు.

**శారీదు** (Sarid = తప్పించుకొనువాఁడు). జెబూలూను దక్షిణ హద్దులోనుండు ఒక యూరు (యెహో 19[10,12]). శారీదు అను మాటను పొరపాటుగా నిట్లు వ్రాసిరని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల నజరేతుకు 5 మైళ్లు నైర్ఋతిగా నుండి టెల్‌షాదూదు (*Tell-Shadud*) ఇదే కావచ్చును (పటము I, D 5).

**శాసనము** ధర్మశాస్త్రము చూ॥

**శాసనములుగల మందసము** మందసము చూ॥

**శాస్త్రి, శాస్త్రులు** (Scribe, Scribes). క్రొత్త నిబంధనలో శాస్త్రులు అను పదము వేద శాస్త్రులకే చెందెను. ఎజ్రా కాలమునకు పిమ్మట వారు వేదముయొక్క ప్రతులను వ్రాసి వానికి భావము చెప్పువారై యుండిరి. అందుచేత వారికి ధర్మశాస్త్రోపదేశకులు అను బిరుదుకూడ కలిగెను (మ 22[35] లూ 7[30] 10[25] 11[40,46,52] 14[3]). శాస్త్రులకును పరిసయ్యులకును ఎక్కువ సంబంధముండెను. మా 2[16] లో పరిసయ్యులలో నున్న శాస్త్రులు అను పదములు ఆ సంబంధమును తేటగా తెలుపును. ఇతర వచనములలో పరిసయ్యులు శాస్త్రులు అను మాటలను ఒక జతనుగా నెంచదగును (మ 12[38] లూ 6[7] మా 7[5] మొ॥).

చెఱకాలమైన తరువాత చెదరిపోయిన యూదులను ఒకటే జనముగా నుంచుటకు ధర్మశాస్త్ర మొక్కటే సాధనమైయుండెను. ధర్మశాస్త్రము అట్టిదై యున్నందువలన దాని నెత్తి శాస్త్రులు వ్రాయుటకును బోధించుటకును దాని భావము చెప్పుటకును తగినవారుండుట అత్యవసరమాయెను. కావున శాస్త్రులకిట్లు ఘనమైన స్థితి కలిగెను. సన్హెడ్రిన్ అను దేశపంచాయతీలో శాస్త్రులు సభికులైయుండిరి. నీకొదేము (యోహా 3[10] 7[50]), గమలీయేలు (కార్య 5[34]) అనువారిట్లు ఆ సభలోని సభికులై యుండిరి. వారు మోషేపీఠమందు కూర్చుండువారు అనియు ఆ స్థితినిఁబట్టియే వారు బోధించు బోధలను లక్షింపవలెననియు క్రీస్తు తన శిష్యులతో చెప్పెను (మ 23[1,2]).

ఇట్టి ఘనమైన యుద్యోగమును సద్వినియోగపఱచియుండినయెడల వారు నిజముగా ఘనత నొందఁదగినవారే. గమలీయేలు అట్టి ఘనుఁడై యుండెను (కార్య 5[34-42]). అయితే యొక్కువ


శాస్త్రులు

పొంది తమ విద్యనుబట్టి అతిశయించి తామె గొప్పవార మనుకొని యితరులను తృణీకరించు చుండిరి (యోహా 7[49]). వారికిట్టి గర్వముండి నందున మీరు బోధకులని పిలువబడవద్దు (మ 23[7]) అని క్రీస్తు తన శిష్యులతో చెప్పెను. వారు పాత నిబంధన వాక్యముకంటె తమలో నాయకులుగ నుండు శాస్త్రుల బోధలను మఱీ గొప్పగా నెంచి దేవుని వాక్యమును నిరాకరించిరి (మా 7[8]). వారిలో హిల్లెలు, షమ్మయి అను నిద్దఱును గొప్ప శాస్త్రులయి శాస్త్రులలో రెండు శాఖల స్థాపించిరి. వీరిలో ననేకులు బోధించిరి గాని బోధించిన దానిని తామే యనుసరింపకపోయిరి (లూ 11[48 52]). మఱి ముఖ్యముగా వీరు తమ పారంపర్యములయందభిమానపడి యుండుటచే క్రొత్త బోధలను గ్రహింపకపోయిరి. ఇవ్విధముగా క్రీస్తుబోధలెంత దివ్యములైనను వానిని తిరస్కరించు వారైరి (మ 23).

శాస్త్రులను గూర్చిన సూచనలు సువార్తలలో ననేకము లున్నవి. సాధారణముగా వీరు పరిసయ్యులకు సంబంధించి యుండుటచే పరిసయ్యులను గూర్చిన వాక్యములే వీరిని గూర్చిన సూచనలై యున్నవి (పరిసయ్యులు చూ॥). ఇవిగాక శాస్త్రులను గూర్చిన ప్రత్యేకమైన సూచనలుకూడ కొన్ని యున్నవి. ఒక శాస్త్రి క్రీస్తునొద్దకు వచ్చి ఆయనను వెంబడింతునని నెను (మ 8[19]). ముఖ్యమైన యాజ్ఞనుగూర్చి క్రీస్తును ప్రశ్నించిన వాడు ఒక శాస్త్రియే (మా 12[28]). వేదములోని సంగతులను చెప్పినవారు శాస్త్రులనుటకు సూచనలు కలవు (మ 17[10] మా 12[35]). శాస్త్రులడిగిన ప్రశ్నల ననుసరించి క్రీస్తు వారిని ప్రత్యేకముగా గద్దించెను (లూ 20[37-47]). క్రీస్తు మరణమును గూర్చిన చరిత్ర విషయములను చూడగా


వేదపారాయణము

శాస్త్రులు ముఖ్యముగా ప్రధాన యాజకులతోను పెద్దలతోను కలసి యీ ఘోరకృత్యమును జరిగించి యుండిరి (మ 21[15] మా 14[43-53] 15[1] లూ 22[2] 22[66] 23[10]) అపొస్తలులను హింసించిన వారిలోకూడ శాస్త్రులు చేరియుండిరని తెలియును (కార్య 4[5] 6[12] లేఖకుడు చూ॥).

## శి

శిక్ష నేరములు చూ॥

శిఖరము దేవాలయము IV 3 (6) చూ॥

**శిఖాయుంగరము** ఆభరణములు 2 చూ॥

**శిత్నా** (Sitnah = కక్షలు). గెరారు ప్రాంతములలో ఇస్సాకు సేవకులు త్రవ్విన యొక్క బావి పేరు (ఆది $26^{21}$). దాని యునికి తెలియదు.

**శిబ్మా** షిబామా చూ॥

**శిరఃకేశములు** తలవెండ్రుకలు చూ॥

**శిరచ్ఛేదనము** నేరములు శిక్షలు III 7 (5) చూ॥

**శిరస్త్రాణము** ఆయుధములు II 2 చూ॥

**శిరస్సు** తల చూ॥

**శిరోభూషణము** (Headtire). యెహె $24^{17}$ లో శిరోభూషణ మనఁబడినది తలగుడ్డ లేక టోపీని సూచించును (ఆభరణములు 13, 16, 17 చూ॥)

**శిలాభరణి** (Alabaster). నూనె అత్తరు మొదలగు వానికొఱకు ఉపయోగించిన బుడ్ల విశేషము (యెష $3^{20}$). అట్టివానిని ఇప్పటికిని వాడుచున్నారు. శ్రేష్ఠమయిన తైలములను వానిలో పోసి ముద్రలు వేతురు. మరియు ఆ శిలాభరణిని పగలఁగొట్టక దాని ముఖమందున్న ముద్రను పగలఁగొట్టవని తెలిసికొనవచ్చును (మా $14^{3}$ లూ $7^{37}$). J. C.

**శిల్పము, శిల్పిపనివాఁడు** వృత్తులు చేతి పనులు I 1, 2 చూ॥

**శిష్యులు** (Disciples). ఈ దేశమునం దిప్పటివఱకు నున్నట్లు పలెస్తీను గ్రీసుదేశముల యందు గురువులైనవారికి శిష్యులుండిరి. వారు తమ గురువుల నాశ్రయించియుండి వారివలన నేర్చుకొనిరి. గ్రీకు తత్వ శాస్త్రవేత్తల శిష్య బృందములు సుప్రసిద్ధములైనవి. యెషయా కాలమునందు ప్రవక్తలైన వారికిని శిష్యులుండిరి (యెష $8^{16}$). సేవక బిరుదాంకితుఁడగు వానికి శిష్యుని కుండవలసిన బుద్ధి యుండినట్లు కనఁబడు చున్నది ($50^{4}$) బాప్తిస్మమిచ్చు యోహానుకును పరిసయ్యులకును శిష్యులుండిరి (మా $2^{18}$ మ $14^{12}$ యోహా $1^{35}$). క్రీస్తును వెంబడించినవారు శిష్యులనఁబడినను (లూ $6^{13}$ $19^{37}$ యోహా $4^{1}$ $6^{60,66,67}$), ముఖ్యముగా ఆయనదగ్గఱ నుండి ఆయన బోధలను నేర్చుకొనిన పండ్రెండుమంది కిది బిరుదయ్యెను (మ $10^{1}$ $12^{1\text{-}49}$ $15^{23,32}$ మా $8^{27}$ లూ $6^{9}$ యోహా $11^{7}$ $12^{4}$ $16^{17\text{-}29}$).

# శు, శూ, శృ

**శుద్ధి** పరిశుద్ధత, పవిత్రపఱచబడుట, పవిత్రా పవిత్రములు చూ॥

**శుభము** వందనము చూ॥

**శూకాతీయులు** శోకో 1 చూ॥

**శూలము** ఆయుధములు I 3 చూ॥

**శృంగధ్వని దినము** పండుగలు ఉపవాసములు III 1 (3) (*a*) చూ॥

**శృంగము** కొమ్ము చూ॥

**శృంగారమను ద్వారము** దేవాలయము IV 3 (2) చూ॥

**శృంగార వనము** పరదైసు చూ॥

# శె

**శెనీరు, షిర్యోను** (Senir, Sirion = కవచము). హెర్మోను పర్వతమునకు అమ్మోనీయులు పెట్టిన పేరు (ద్వితీ $3^{9}$). ఎదోమీయులు దీనిని షిర్యోను అని పిలిచిరి. అది హెర్మోనుకు వేఱయినదని I దిన $5^{23}$ పర $4^{8}$ వలనఁ దెలియు చున్నది. అరబ్బీయులు లెబానోను యెదుటి పంక్తిని (లెబానోను చూ॥) శానీరు (*Sanir*) అని పిలిచిరి కావున, ఇది హెర్మోనుకు ఉత్తరముగా నుండు లెబానోను ఎదుటి పంక్తి పేరనుకొనఁ దగును. ఆ మనష్షే గోత్రపు సరిహద్దులలో నొకటి (I దిన $5^{23}$). ఇది గొప్ప వృక్షములకు ప్రసిద్ధికెక్కినది (యెహె $27^{5}$).

**శెబాటు** కాలమానము VI 11 చూ॥

**శెయీరా** (Seirah = మేఁక). ఏహూదు మోయాబు రాజగు ఎగ్లోనును చంపిన పిమ్మట పారిపోయిన స్థలము (న్యాయా $3^{26}$). అది ఎఫ్రాయిము మన్య ప్రదేశమందలిదని సాధా

రణముగా ననుకొందురు గాని దాని యునికి తెలియదు.

**శెయొరీము** (Seorim = యవలధాన్యము). అహరోను సంతతివారిలో నొకఁడు. దావీదు ఇతని సంతతివారిని యాజకుల వంతులలో నాలుగవ వంతు వారినిగా నియమించెను (దిన $24^{8}$).

**శెరహు** (Serah, Sarah = సమృద్ధి). ఆషేరు కుమార్తె (ఆది $46^{17}$ సంఖ్యా $26^{46}$ I దిన $7^{30}$).

**శెరాయా** (Seriah = యెహోవా మానక పని చేయును).

1. కెనజు కొడుకులలో రెండవవాఁడు (I దిన $4^{13,14}$).

2. దావీదు యుద్యోగస్థులలో నొకఁడు (II సమూ $8^{17}$). I దిన $18^{16}$ నందితనికి షవ్షా యను పేరున్నది (షవ్షా చూ॥).

3. షిమ్యోను గోత్రికులలో నొకఁడు. యెహూ యను ఈ గోత్ర ప్రధానులలో నొకనికి తాత (I దిన $4^{35}$).

4. యిర్మీయాను బారూకును పట్టుకొనుటకు రాజగు యెహోయాకీము పంపినవారిలో నొకఁడు (యిర్మీ $36^{26}$).

5. నెబుకద్నెజరు యెరూషలేమును పట్టుకొన్నప్పుడు దానికి ప్రధానయాజకుఁడుగా నున్న వాఁడు. తక్కిన ఘనులతోపాటి నితఁడును రిబ్లాలో చంపఁబడెను (II రాజు $25^{18-21}$ యిర్మీ $52^{24-27}$). I దిన $6^{14}$ లోనున్న ప్రధానయాజకుల పేర్ల జాబితాలో ఇతని పేరుకూడ కలదు. ఎజ్రా ఇతని వంశములో జన్మించెను (I దిన $6^{14,15}$ ఎజ్రా $3^{2}$ $7^{1}$).

6. సిద్కియా కాలములో సైన్యపు భోజన సామగ్రిని చూచు అధికారి. బాబెలు నాశనమును గూర్చిన వార్తను ఇతనిచేతనే యిర్మీయా చెఱలో నున్నవారికి పంపెను (యిర్మీ $51^{59-64}$).

7. మిస్పాలో గెదల్యాయొద్దకు కూడివచ్చిన సైన్యాధిపతులలో నొకఁడు (II రాజు $25^{23}$ యిర్మీ $40^{8}$).

8. జెరుబ్బాబెలుతో కూడ తిరిగివచ్చిన పన్నెండుమంది పెద్దలలో నొకఁడు (ఎజ్రా $2^{2}$). నెహె $7^{7}$ లో ఈ పేరుకు ప్రతిగా అజర్యా (*Azariah*) అను పేరు గలదు.

9. చెఱకాలమునకుఁ బిమ్మటనున్న యాజకుల తెగలలో నొకటి (నెహె $10^{2}$ $11^{11}$ $12^{1,2,11,12}$). I దిన $9^{11}$ నందితనికి అజర్యా (*Azariah*) అను పేరు గలదు. వీరి పెద్ద నిబంధనకు సంతకము చేసినవారిలో నొకఁడు.

**శెరెత్షహరు** (Zereth-Shahar = తెల్లవారుజామున కలుగు కాంతి). రూబేనీయుల పట్టణములలో నొక పట్టణము (యెహో $13^{19}$). అది తూర్పు పలెస్తీనులో నున్నది గాని దాని యునికి తెలియదు.

## శే, శో

**శేయీరు** (Seir = రోమముగల).

1. మృతసముద్రపు దక్షిణ భాగమునుండి యెఱ్ఱసముద్రపు తూర్పుపాయ యగు అకాబా సంయుక్తాగ్ర గుడమువఱకు వ్యాపించెడి కొండ వరుస (ఆది $36^{21}$ సంఖ్యా $24^{18}$ యెహె $35^{15}$). దాని యాదిమనివాసులకు హోరీయులు ( = బిలములలో నివసించెడివారు) అని పేరు (ఆది $14^{6}$ $36^{20}$). ఎదోము దేశమందలి ముఖ్య పర్వత పంక్తి యగుటచే ఆ దేశమునకు శేయీరు అను పేరు పెట్టిరి (యెహె $25^{8}$). ఈ వాక్యమందున్న పట్టణమను పదము మూలభాషయందు కనఁబడదు గాన శేయీరు వారనునది ఎదోమీయులకు చెందును. ఏశావు ఇచ్చటనున్న హోరీయులను వెళ్లఁగొట్టి దానిని స్వతంత్రించుకొనెను (ఆది $32^{3}$ ద్వితీ $2^{12}$ యెహో $24^{4}$). అమాలేకీయులలో మిగిలినవారీ కొండప్రదేశములో నివసించిరి గాని వారును చివరకు నశించిరి (I సమూ $14^{48}$ $15^{7}$ II సమూ $8^{12}$ I దిన $4^{42,43}$).

2. యూదాగోత్రపు ఉత్తర సరిహద్దు దగ్గిర నున్న యొక కొండ. అది కిర్యత్యారీమునకు పడమరగా నున్నది (యెహో $15^{9,10}$). ఆ ప్రాంతములలో ప్రస్తుతమున్న సారిస్ (*Saris*) అనునది ఈ పేరైయుండవచ్చును. అది యెరూషలేమునకు దాదాపు 10 మైళ్లు పడమరగా నున్నది (పటము II, E 1).

**శేరు** మానములు II 3 చూ॥

**శేషము** (Remnant). పాపము వలన కలిగిన శిక్షలలోనుండి తప్పించుకొనువారికి పాత నిబంధనలో శేషము అను పేరు గలదు (యెష $1^{26}$). వీరు శిక్షలవలన పవిత్రపఱచఁబడి దేవునికి భయపడువారగుటచే ఈ పదము భక్తిగల వారి సమూహమును కూడ సూచించును ($4^{2-6}$ $6^{13}$ $10^{20-23}$ $11^{11-26}$ యిర్మీ $23^{3}$ $32^{36-44}$ ఆమో $9^{8-15}$ మీకా $4^{6-8}$ $5^{7,8}$ జెఫ $3^{13}$ జెక $8^{12}$ $13^{9}$ $14^{2}$). అది ఆత్మరక్షణ పొందఁబోవువారి సంఖ్యను కూడ సూచించును (రోమా $9^{27}$ $11^{5}$). ఇశ్రాయేలీయు లందఱు దేవుని ప్రజలుగా నెంచఁబడక ఈ నిజ మైన భక్తుల సమూహమే ఆయన ప్రజలుగా నెంచఁబడుటచే ఈ శేషము అదృశ్యసంఘ మనఁ బడినదానికి నామాంతర మనవచ్చును.

**శోకో** (Soco, Socoh = కంచె).

1. యూదా గోత్రమందలి షెఫేలాలో నుండు ఒక పట్టణము (యెహో $15^{35}$). అది ఏలా లోయలోని యొక కోట. ఫిలిష్తీయులలో మిగుల బలాఢ్యుఁడుగా నెంచఁబడిన గొల్యాతు దినములలో వారు దీనికిని అజేకాకును మధ్య నున్న స్థలము నాక్రమించుకొనిరి (I సమూ $17^{1}$). ఇది తరువాత సొలొమోను ఉద్యోగస్థుఁడగు హెసెదు కుమారుని యిలాకాలో నుండెను (I రాజు $4^{10}$). రెహబాము కోటను తిరిగి కట్టించెను (II దిన $11^{7}$). ఆహాజు కాలములో ఫిలిష్తీయులు దీని నపహరించిరి (II దిన $28^{18}$). బేత్లెహేమునుంచి యెరూషలేమునకుఁ బోవు మార్గమం దుండుటచే దీనిని ప్రాకారములుగల పట్టణముగా కట్టించుట మిగుల అవసరమైయుండెను. ప్రస్తుతము బేత్లెహేమునకు 13 మైళ్లు కొంచెము నైర్బృతిగా నుండు షువైక (*Shuweikeh*) అనఁ బడిన శిథిలములే దాని యునికి. అది యొక కొండమీఁద నున్నది. దాని చుట్టు మూఁడు వైపుల లోతైన లోయలు గలవు. నాల్గవ ప్రక్కను మాత్రమే పైకెక్కుటకు వీలుగనున్నది. అదియైనను ఇఱుకుగా నుండుటచే శత్రువుల నడ్డగించుట అంత కష్టముకాదు. I దిన $2^{55}$ లో నుండు శూకాతీయు (*Suchathites*) ఈ శోకోవారు గావచ్చును (పటము I, C 9).

2. యూదా మన్యమందలి మఱియొక పట్టణము. ప్రస్తుతము హెబ్రోనుకు 10 మైళ్లు నైర్బృతిగానుండు ఎష్-షువైక (*esh-Shuweikeh*) దీని యునికియై యుండును. I దిన $4^{18}$ లో నుండు శోకో ఈ రెంటిలో నేదో నిశ్చయించుటకు వీలుగాదు (పటము II, D 3).

**శోధన** (Temptation). శోధన యని తెనిగింపఁబడిన మాటకు సాధారణముగా పాపము చేయుటకై ప్రేరేపించుట యను అర్థముండినను బైబిలునందు మానవుల విధేయతను పరీక్షించుటకు కలుగు కష్టములనుకూడ సూచించును. దేవుఁడు తన్ను నమ్మువారిని శోధించును (ఆది $22^{1}$ నిర్గ $16^{4}$ $20^{20}$ ద్వితీ $8^{2}$ $13^{4}$ న్యాయా $2^{22}$ $3^{4}$ కీర్త $26^{2}$ I కొరి $10^{13}$ యాకో $1^{2-4}$ ప్రక $3^{10}$). దేవుఁడు తన వాగ్దానములను నెఱవేర్చునో లేదో యని తెలిసికొనుటకు ఆయనను కూడ మనుష్యులు శోధించినట్లు ఆయా వాక్యములలో నున్నది (నిర్గ $17^{2-7}$ కీర్త $95^{9}$), ఇట్లు చేయుట మానవులకు తగదు (మ $4^{7}$) గనుక, తమ అవిధేయతవలన దేవుని విసికించుట కూడ ఆయనను పరిశోధించుట యనఁబడును (సంఖ్యా $14^{22}$ ద్వితీ $6^{16}$ యెష $7^{12}$ మ $16^{1}$ మొ॥).

కీడుచేయుటకు లేక పాపము చేయుటకై యొకనిని ప్రేరేపించుటకును శోధన యను ఈ పదము సాధారణముగా వాడఁబడును (లూ $22^{40}$ I కొరి $7^{5}$ యాకో $1^{13}$). ఇట్టి శోధనలలోకి దేవుఁడు మనలను రానియ్యకూడదని ప్రభువు నేర్పిన ప్రార్థనలో మనవి చేయుచున్నాము (మ $6^{13}$). క్రీస్తు పాపముచేయునట్లు సాతానాయన నెంత ప్రేరేపించినను ($4^{1-11}$), ఆయన శోధనలన్నిఁటిని యెదిరించి వానిని జయించి శోధింపఁబడు వారికి సహాయము చేయుటకు శక్తిమంతుఁడై యున్నాఁడు (హెబ్రీ $2^{18}$). ఇట్టి శోధనలకు సాతాను (ఆది 3 II కొరి $11^{3}$), మన స్వంత దురాశలు (యాకో $1^{14,15}$), ఈ లోకము (I యోహా $2^{16}$) కారకులై యున్నారు. వానిని జయించుటకు మెలకువపడుటయు ప్రార్థించుటయు ముఖ్య సాధనములై యున్నవి (లూ $22^{40}$ ఎఫె $6^{10-18}$).

**శోధకుడు** సాతాను చూ॥

**శోబాలు** (Shobal = పాలుచున్న).

1. హోరీయుడగు శేయీరు కొడుకులలో నొకడు. అతడు వారికి నాయకుడైనవాడు (ఆది 36[20-23,29] = I దిన 1[38-40]). హోరీయులలో నొక తెగకును ఇది పేరైయున్నది.

2. యూదాసంబంధులలో కాలేబు కుటుంబములో నొకడు (I దిన 4[1,2] 2[50]). కిర్యత్యారీమువా రితని సంతానీకులు.

**శోరేకు లోయ** (Valley of Sorek = శ్రేష్ఠమైన ద్రాక్షల లోయ). యెరూషలేము వాయవ్య దిక్కునుండి ఫిలిష్తీయుల దేశపు ఉత్తర భాగమువఱకు వ్యాపించెడి లోయ. ఈ లోయగుండా ప్రవహించెడి వాగు యొప్పేకు దక్షిణముగా 9 మైళ్ల దూరమున మధ్యధరా సముద్రములో పడును. ఆ వాగును నేటివఱకు శూరారు (*Surar*) వాగు అని పిలుతురు. గాని ఫిలిష్తీయ బయలునందు దానికి రూబీను (*Rubin*) అను పేరు గలదు. యొప్పేనుండి యెరూషలేమునకు బోవు రైలుమార్గము నీ లోయ ప్రక్కను వేసిరి. అచ్చట నేటివఱకు నూరీకు అను శిథిలములు కనబడుచున్నవి. అది సోరాకు 2 మైళ్లు ఉత్తరమున నున్నది (సోరా చూ॥).

ఈ లోయలో నెచ్చటనో దెలీలా నివసించెను (న్యాయా 16[4]). I సమూ 4-7 అధ్యా. లోని యుద్ధము లీ లోయలోనే జరిగెను. న్యాయా 13[25] లో నుదాహరింపబడిన మహనెదాను ఈ లోయలోనే యున్నది (పటము II, C 1).

## ష

**షండుడు** నపుంసకుడు చూ॥

**షంషెరై** (Shamsherai). బెన్యామీను సంతతివారిలో నొకడు (I దిన 8[26]).

**షడ్గ్రంథములు** (Hexateuch). ఈ పదము పాత నిబంధనలోని మొదటి యాఱు గ్రంథములకు పెట్టబడిన పేరు. మొదటి యైదు గ్రంథములను యూదులు "ధర్మశాస్త్ర పంచభాగములు" ని పిలిచిరి. తెర్తులియను (*Tertullian*), ఒరిగెను (*Origen*) అను ఆదిక్రైస్తవ విద్వాంసులు యూదనామమునకు తుల్యమగు "గ్రంథ పంచకము" (*Pentateuch*) అను అనుకూలమగు పేరు బెట్టిరి. ఇశ్రాయేలీయులు ప్రత్యేకముగను ఒండొరులతో ననుసరింపవలసిన జీవిత సూత్రములను దెలుపు ఈ "ధర్మశాస్త్రము" అద్వితీయమగు ప్రమాణిక గ్రంథముగా నెంచబడెను. వీనికిని యెహోషువ గ్రంథమునకును మధ్య విశాలాగాధమున్నట్లు కన్పించుచున్నది. అంత్య ప్రవక్తలు (*Latter Prophets*) అని పిలువబడు చరిత్ర గ్రంథపరంపర దీనితో ప్రారంభమగుచున్నది. ఈ విభజనమానవ కల్పితమే. చదువరికి శాస్త్రోక్తపద్ధతినిగూర్చి తెలుపుటకు కాదుగాని ఇశ్రాయేలీయుల ప్రాచీనత్వము ఉత్పత్తులను గూర్చిన కొంత వృత్తాంతమును అనగా వారి మతారాధనమును రాజ్య పరిపాలనా స్థితిని అన్యోన్య సంబంధమగు నేర్పాటులనుగూర్చి తెలుపుటకే యీ ధర్మశాస్త్రముయొక్క పంచ గ్రంథములు ముఖ్యముగా నుద్దేశింపబడియున్నవి. ఈ యాధారమువలన యెహోషువ గ్రంథము కేవలము నూతన గ్రంథ పరంపర యొక్క ఆరంభమని చెప్పుట సరికాదు. దాని యందలి విషయములును మఱి విశేషముగా దాని రచనక్రమమును అది గ్రంథపంచకముతో అన్యోన్యముగా సంబంధించియున్నదని చూపుచు హెబ్రీయుల రాజ్యచరిత్రోత్పత్తియొక్క అంత్య దశను వివరించుచున్నది. విమర్శకు లీ యైక్యతను బలపఱచుటకు దానికి "షడ్గ్రంథములు" (*Hexateuch*) అను పేరును కల్పించిరి. ప్రకృతమా నామము సర్వజన సమ్మతమై పాత నిబంధన యందలి మొదటి యాఱు గ్రంథములను చక్కగ వివరించుచున్నది (గ్రంథ పంచకమును చూ॥).

H.

**షద్రకు** (Shadrach = చంద్ర దేవతా నియమము?). బాబెలు నపుంసకుల యధిపతి హనన్యాకుపెట్టిన మాఱుపేరు (దాని 1[7]). తమ నిష్ఠనుబట్టి అగ్నికొలిమిలో వేయబడి దేవుని దయవలన దానినుండి యద్భుతరీతిగా రక్షింపబడిన వారిలో నొకడు (దాని 3[12-30]).

**షెపో** (Shephi, Shepho = నునుపు). హోరీయులలో నొకప్రధాని (ఆది 36[23]).

**షబ్బెతై** (Shabbethai = సబ్బాతు దినమునకు సంబంధి). అన్యస్త్రీలను విడిచి పెట్టునట్లు చేసిన ఏర్పాటులలోను ఇతర దిద్దుబాటు పనులలోను ఎజ్రాకు తోడ్పడిన ముఖ్యులలో నొకఁడు (ఎజ్రా $10^{15}$ నెహె $8^{7}$ $11^{16}$).

**షమెము** షెమెరు చూ॥

**షమ్గరు** (Shamgar). న్యాయాధిపతులలో మూఁడవవాఁడు (న్యాయా $3^{30}$). అతఁడు ముసుకోల కఱ్ఱతో 600 మంది ఫిలిష్తీయులను జంపి ఇశ్రాయేలీయులను శత్రువుల చేతినుండి విడిపించెను. II సమూ $23^{11}$ లో నుదాహరింపఁబడిన షమ్మా చేసిన సాహసకృత్యమునకును దీనికిని చాలమట్టుకు సంబంధముండుటవలనను, షమ్గరను పదమును, అతని తండ్రి పేరగు అనాతు అను పదమును అన్య పేరులగుటవలనను, న్యాయా $3^{29}$ $4^{1}$ లోని సంగతులు సంబంధముగా నుండుటవలనను, షమ్గరు సంగతి న్యాయాధిపతుల గ్రంథమునకు తరువాతి కాలములో చేర్పఁబడియుండునని కొందఱి యభిప్రాయము.

**షమ్మయి** (Shammai = పాడైనది).

1. యెరహ్మెయేలు కుటుంబపు వాఁడగు నొక యూదుఁడు (I దిన $2^{28}$).

2. కాలేబు సంతతివారిలో రేకెము అను వాని కుమారుఁడు (I దిన $2^{44,45}$).

3. ఒక యూదుఁడు (I దిన $4^{17}$).

**షమ్మా** (Shamma, Shammah = నాశనము).

1. ఆషేరుగోత్రీకుఁడు (I దిన $7^{37}$).

2. ఏశావు మనుమఁడు. తల్లివరుసనుబట్టి ఇష్మాయేలుకును మనుమఁడైనట్లు కనఁబడుచున్నది (ఆది $36^{3,4,13}$). ఇతఁ డెదోము ప్రధానులలో నొకఁడు ($36^{17}$).

3. దావీదు అన్నలలో మూఁడవవాఁడు (I సమూ $16^{9}$). ఇతఁడు ఫిలిష్తీయులతోడి యుద్ధములందు పాల్గొనెను ($17^{13}$). ఇతనికి షిమ్యా (II సమూ $13^{3}$ $21^{21}$), షిమ్మి (I దిన $2^{13}$) అను మాఱుపేరులు గలవు. ఇతఁడు యెహోనాదాబు యోనాతాను అను వారికి తండ్రి యని ఆ వాక్యములవలనఁ దెలియుచున్నది.

4. దావీదుయొక్క అసహాయ శూరులగు ముగ్గురు యోధులలో నొకఁడు. ఇతఁ డొక్కఁడే ఫిలిష్తీయులను రణరంగమునుండి వెళ్లఁదరిమెను (II సమూ $23^{11,25}$). దీనికి సాటియగు I దిన $11^{12}$ లో నితనికి ఎలియాజరు అను మాఱుపేరు గలదు. దావీదుయొక్క ముప్పదిమంది వీరులలో నితనిపేరు వచ్చును (II సమూ $23^{33}$). I దిన $11^{34}$ లో నున్నట్లు హరారీయుఁడైన షమ్మా కుమారుఁడగు యోనాతానని అక్కడ సవరించి చదువవలెనని అందఱు నెంచుచున్నారు.

5. దావీదు యోధులలో మఱియొకఁడు (II సమూ $23^{25}$). I దిన $11^{27}$ లో ఈ పదము యొక్క బహువచనరూపమగు షమ్మోతు.

**షమ్మూయ** (Shammua = వినఁబడినది).

1. కనానుదేశమును జూచివచ్చుటకు మోషే పంపిన పన్నెండుమంది వేగులవారిలో రూబేను గోత్రి ప్రతినిధి (సంఖ్యా $13^{4}$).

2. దావీదు కుమారులలో నొకఁడు. బత్షెబ యితని తల్లి (II సమూ $5^{14}$ I దిన $14^{4}$). I దిన $3^{5}$ లో నితనికి షిమ్యా యను మాఱుపేరు గలదు.

3. ఒక లేవీయుఁడు (నెహె $11^{17}$). I దిన $9^{16}$ నందితనికి షెమయా అను మాఱుపేరు గలదు.

4. యాజకులలోని యొకవంశమువారికి పెద్ద (నెహె $12^{18}$).

**షమ్మోతు** షమ్మా 5 చూ॥

**షమ్మూతు** షమ్మా 5 చూ॥

**షయపు** (Shaaph).

1. యెహ్దాయి కుమారుఁడు. ఇతఁడు కాలేబు సంతతివాఁడు (I దిన $2^{47}$).

2. కాలేబు ఉపపత్నియగు మయకాకు పుట్టినవాఁడు (I దిన $2^{49}$).

**షయలీము** (Shaalim = నక్కలు). సౌలు తన తండ్రి గాడిదెలను వెదకుచుండఁగా

దాటివెళ్లిన యొక స్థలము (I సమూ $9^{4}$). దాని యునికి తెలియదు. **షయల్బీము** అను దానికి అచ్చు తప్పయియుండు నని కొందరనుచున్నారు (షయల్బీము చూ॥). I సమూ $13^{17}$ లో నున్న **షూయాలు** దేశమై యుండునని మఱికొందఱి యభిప్రాయముగా నున్నది (షూయాలు చూ॥).

**షయల్తీయేలు** (Shealtiel, Salatiel = దేవుని నడిగితిని). చెఱకుఁగొని పోఁబడిన రాజైన యెకొన్యా కుమారుఁడు. జెరుబ్బాబెలు తండ్రి (ఎజ్రా $3^{2,8}$ $5^{2}$ నెహె $12^{1}$ హగ్గ $1^{1,12,14}$ $2^{2}$). I దిన $3^{18}$ నందు జెరుబ్బాబెలు పెదాయా కుమారుఁడని యున్నది (జెరుబ్బాబెలు చూ॥). ఇతఁడు తరువాత యూదుల కధికారిగా నియమింపఁబడినందున షయల్తీయేలు కుమారుఁడు గాకున్నను రాజ్యవారసుఁడగు అతని కుమారుఁడుగా నెంచఁబడెనని కొందఱి యభిప్రాయము. మ $1^{12}$ లూ $3^{27}$ నందితనికి సలతియేలు అను పేరుగలదు.

**షయల్బీము, షెయల్బీను, షయలోనీయుడు** (Shaalbim, Shaalabbim = నక్కలు, Shaalbonite). దానీయులకు వచ్చిన అమోరీయుల పట్టణము (యెహో $19^{42}$). ఇశ్రాయేలీయులు పలెస్తీనులో బ్రవేశించిన తరువాత చాలకాలమువఱకు ఈ పట్టణమును అన్యుల స్వాధీనమునందే ఉండనిచ్చిరి (న్యాయా $1^{35}$). సొలొమోను కాలమునందు అతని దివాణమునకు కావలసిన వస్తు సంచయముచేసిన యొకని యధీనమందుండెను (I రాజు $4^{9}$). దావీదు యోధవర్గమందలి ఎల్యాహ్బా యనువాఁడు **షయల్బోనీయు**డనఁబడెను (II సమూ $23^{32}$ I దిన $11^{33}$). అతఁడీ ప్రాంత్యవాసుఁడగుటచే నీపేరు వచ్చియుండును. I సమూ $9^{4}$ లోని **షయలీము** దీని మాఱుపేరని కొందఱి యభిప్రాయము (షయలీము చూ॥). ప్రస్తుతము యెరూషలేమునకు దాదాపు 15 మైళ్లు వాయవ్య దిక్కున నుండు షెల్బీట్ (*Shelbit*) దీని యునికి యను కొందురు (పటము III D 5).

**షయష్గజు** (Shaashgaz). అహష్వేరోషు రాజుయొక్క ఉపపత్నులను కాయుషండుల యధిపతి (ఎస్తే $2^{14}$).

**షరాయిము** (Shaaraim = రెండు ద్వారములు).

1. యూదాదేశమునందు షెఫేలా యను ప్రదేశమందలి యొక ఊరు (యెహో $15^{36}$ I సమూ $17^{52}$) ప్రస్తుతము ఎక్రోనుకు తూర్పుగా నుండు కుర్బెట్ సైరే (*Khurbet S'aireh*) యని కొందఱును, జకరీయ (*Zakariya*) అని మఱికొందఱు దీని యునికి యని చెప్పుచున్నారు గాని రూఢిగా తెలియదు.

2. షిమ్యోను గోత్రమందలి యొక ఊరు (I దిన $4^{31}$). యెహో $19^{6}$ నందు షారూహెను, $15^{32}$ నందు షిల్హిము అను మాఱుపేరులు గలవు. ఇది ప్రస్తుతము బెయేర్షెబాకు షుమారు 12 మైళ్లు వాయవ్యముగా నుండు టెల్ - ఎష్ - షెరీయా (*Tell-esh-Sheriah*) అని తలంచుచున్నారు (పటము II, C 3).

**షరెజెరు, షెరెజెరు** (Sharezer = రాజును కాయుము).

1. అష్షూరు చక్రవర్తియగు సన్హెరీబు కొడుకులలో నొకఁడు (II రాజు $19^{37}$ = యెష $37^{38}$). ఇతఁడు తన సహోదరుఁడగు అద్రమ్మెలెకుతో కలిసి తన తండ్రిని చంపెను. సన్హెరీబొకనిచే హతుఁడాయెనని అష్షూరు రాతిశాసనములయందుదాహరింపఁబడెను గాని చంపినవాని పేరు గానరాదు. ఆ శాసనములయందు షర్-ఎటిర్-అష్షూరు (*Shar-etir-Ashur*) అను పేరు గలదు. ఇతనికి చక్రవర్తియను బిరుదు ఒక యుత్తరమునఁగానవచ్చుచున్నది. అది ఈ షరెజెరుయొక్క పూర్తి పేరు కావచ్చును.

2. ప్రవక్తయగు జెకర్యా కాలమందున్న యొకఁడు. యెరూషలేము నాశనమునకు సంబంధించిన ఉపవాసములను చేయుట ఇంకను అవసరమేమో కనుగొనుటకు జెకర్యా యొద్దకు బేతేలు నుండి పంపఁబడినవారిలో నొకఁడు (జెక $7^{1}$).

**షల్మనేసెరు** (Shalmaneser = షుల్మాను దేవత ముఖ్యదేవత). ఈ పేరుగల అష్షూరు చక్రవర్తులు నలుగురు గలరు. వారిలో రెండవ షల్మనేసెరు క్రీ॥ ము॥ 860-825 లో ప్రభుత్వము చేసిన సమయమందు అహాబు నోడించి, యెహూ

వలన కష్టముఁ బుచ్చుకొనెను (అష్షూరు 3 చూ॥). నాల్గవ షల్మనేసెరు 727-722 లో ప్రభుత్వము చేసినవాఁడై షోమ్రోనును మూఁడు సంవత్సరములు ముట్టడించిన పిమ్మట (II రాజు $17^{3-5}$) అది కూలిపోయెను (సర్గోను చూ॥ II రాజు $17^{3}$ $18^{9}$ అష్షూరు 3 చూ॥). ఈ నాల్గవ షల్మనేసెరు గొప్ప చక్రవర్తియైనను ఇతని చరిత్రను దెలుపు రాతిశాసనములు లేవు. అతఁడు షోమ్రోను మీఁదచేసిన దండయాత్రలోనే ఇతఁడు చనిపోయెను గాని, ఎట్లు చనిపోయెనో తెలియదు.

**షల్మయి** (Salmai). నెతేనీయులలోని యొక కుటుంబము (నెహె $7^{48}$).

**షల్మాను** (Shalman = ఒక దేవత పేరు) హోషే $10^{14}$ లో నున్నట్లుగా బేతర్బేలు అను పట్టణమును పాడుచేసిన యొక రాజు పేరు.. ఇది అష్షూరు చక్రవర్తి యగు షల్మనేసెరు యొక్క మాఱుపేరని సాధారణముగా ననుకొందురు (షల్మనేసెరు చూ॥). మూఁడవ తిగ్లత్పిలేసెరు అను అష్షూరు చక్రవర్తి తన జయములను వివరించు రాతిశాసనములో, అతఁడు మోయాబు రాజగు సలమాను (*Salaman*) ను జయించినట్లుగా నున్నది. ఈ షల్మాను ఆ మోయాబురాజే యని కొందఱనుకొందురు.

**షల్లూను** (Shallun = పాడగుట?). యెరూషలేము ప్రాకారములను గట్టుటకు నెహెమ్యాకు సహాయము చేసినవారిలో నొకఁడు (నెహె $3^{15}$).

**షల్లూము** (Shallum = ప్రతిదండన).

1. ఇశ్రాయేలువారి రాజులలో నొకఁడు. యాబేషు పట్టణస్థుఁడు గాని తెలుఁగులో నితఁడు యాబేషనువాని కుమారుఁడైనట్లు తర్జుమాచేసిరి. పది గోత్రములవారి రాజ్యనాశనమునకు పూర్వము దేశమంతయు నల్లకల్లోలముగానున్న సమయమున నితఁడు రాజైన జెకర్యాను సంహరించి రాజ్యము నపహరించెను గాని యొక నెలకే ఇతఁడును మెనహేమనువానిచే చంపఁబడెను (II రాజు $15^{10-15}$).

2. యూదా రాజగు యెహోయాహాజు యొక్క మాఱుపేరు (I దిన $3^{15}$ యిర్మీ $22^{11}$). (యెహోయాహాజు చూ॥).

3. ప్రవక్త్రియగు హుల్దాయొక్క పెనిమిటి (II రాజు $22^{14}$ II దిన $34^{22}$). LXX లోని II రాజు $22^{14}$ నందితఁడు హుల్దాయొక్క కుమారుఁడైనట్లున్నది.

4. యెరహ్మెయేలు సంతానీకులలో నొకఁడు (I దిన $2^{40,41}$).

5. షిమ్యోనీయులలోని యొకడు (I దిన $4^{25}$).

6. చెఱకు పూర్వముండిన ప్రధాన యాజకులలో నొకఁడు. ఇతఁడు ఎజ్రా పూర్వికుఁడు (I దిన $6^{12,13}$ ఎజ్రా $7^{2}$).

7. ద్వారపాలకుల కుటుంబములలో నొకదాని ప్రధాని. ఇతని పేరట కుటుంబము పిలువఁబడెను (I దిన $9^{17}$ ఎజ్రా $2^{42}$ = నెహె $7^{45}$). ఇతనికి మెషుల్లాము (నెహె $12^{25}$) అను మాఱుపేరు గలదు.

8. లేవీయులలోని కోరహు తెగవారిలోని యొక ద్వారపాలకుఁడు (I దిన $9^{19,31}$). ఇతనికి మెషెలెమ్యా (I దిన $26^{1,2-9}$), షెలెమ్యా ($26^{14}$) అను మారుపేర్లు గలవు. 8,9 లోనివారు ఒకరే గావచ్చును.

9. ఎఫ్రాయిము పెద్దలలో నొకఁడగు యహిజ్కియా తండ్రి (II దిన $28^{12}$).

10. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టినవారిలో నొక్కఁడు. ఇతఁడు ద్వారపాలకుఁడై యుండెను (ఎజ్రా $10^{24}$).

11. పైనచెప్పిన వానివంటివాఁడు గాని ఇతఁడు బానిసయై యుండెను (ఎజ్రా $10^{42}$).

12. యెరూషలేము ప్రాకారములను గట్టుటలో నెహెమ్యాకు సహాయము చేసినవారిలో నొకఁడు (నెహె $3^{12}$).

13. ప్రవక్తయగు యిర్మీయాయొక్క పినతండ్రి (యిర్మీ $32^{7}$).

14. యిర్మీయా కాలమునందు ద్వారపాలకుఁడుగా నుండిన మయశేయా తండ్రి (యిర్మీ $35^{4}$).

**షల్లెకెతు** (Shallecheth = వెళ్లఁగొట్టుట). సొలొమోను కట్టించిన దేవాలయమందలి ద్వార

ములలో నొకదాని పేరు (I దిన $26^{16}$ దేవాలయము I 3 (5) చూ॥).

షవ్షా (Shavsha). దావీదు ప్రధాన మంత్రులలో నొకఁడు (I దిన $18^{16}$). మూల భాషయందలి పదమునకు దావీదుకు సెక్రటరీ వంటివాఁడని తెలియుచున్నది. ఇతఁడు ముఖ్యముగా విదేశీయ కార్యములను చక్కపెట్టిన వాఁడుగా కనఁబడుచున్నాఁడు. ఇది హెబ్రీ పదము కాకపోవుటచే నితఁడన్యుఁడనియు, దావీదుచే నీ పనికి నియమింపఁబడెననియు కొందఱి యభిప్రాయము. ఇతనికి షెవా (II సమూ $20^{24}$), శెరాయా ($8^{18}$), షీషా (I రాజు $4^{3}$) అను మాఱుపేరులు గలవు. ఇతని కుమారు లిద్దఱు సొలొమోనుకు కార్యదర్శులుగా నుండినట్లీ చివరి వాక్యమువలనఁ దెలియుచున్నది (శెరాయా 2 చూ॥).

షహాజీమా (Shahazumah = ఉన్నత స్థలములు?). ఇశ్శాఖారు సరిహద్దులోని యొక స్థలము (యెహో $19^{22}$). దీని యునికి తెలియదు.

షహరయీము (Shaharaim = తెల్ల వాఱుట). ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{8}$).

## షా

షాక్యా (Shachia). ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{10}$).

షాపాతు (Shaphat = తీర్పుచేసెను).

1. కనానుదేశమును వేగుజూడనై మోషే పంపిన పన్నెండు మందిలో షిమ్యోను గోత్ర ప్రతినిధి (సంఖ్యా $13^{5}$).

2. ప్రవక్తయగు ఎలీషా తండ్రి (I రాజు $19^{16-19}$ II రాజు $3^{11}$ $6^{31}$).

3. దావీదు సంతతివారిలో లెక్కింపఁబడిన యొకఁడు (I దిన $3^{22}$).

4. గాదీయులలో నొకఁడు (I దిన $5^{12}$).

5. దావీదు మందకాపరులపై విచారణకర్తలలో నొకఁడు (I దిన $27^{29}$).

షాపాము (Shapham). గాదు గోత్రికులలో నొకఁడు (I దిన $5^{12}$).

షాపెరు (Shepher = సొగసు). ఇశ్రాయేలీయు లరణ్య సంచారమునందు దిగిన యొక కొండ (సంఖ్యా $33^{23,24}$). దీని యునికి తెలియదు.

షాఫాను (Shaphan = ఒక విధమైన జంతువు).

1. యోషీయా ప్రభుత్వమందు సెక్రటరీ ( = ప్రధానమంత్రి) గా నున్న యొకఁడు. హిల్కీయా ధర్మశాస్త్ర గ్రంథమును కనుగొనినప్పుడితఁడు దానిని రాజునొద్దకుఁ దెచ్చెను (II రాజు $22^{3-11}$ = II దిన $34^{8-18}$). తరువాత రాజు దేశమందుఁజేసిన సంస్కరణలో సహాయముచేయుట యందితఁడు మిగుల శ్రద్ధపుచ్చుకొనెను. ఇతని కుటుంబికులును యెహోవా సేవయందలి నిష్ఠాపరులు. ధర్మశాస్త్రమును ప్రచురించుటయందును (II రాజు $22^{12-14}$ = II దిన $34^{20-22}$), యిర్మీయాను కాపాడుటయందు (యిర్మీ $26^{24}$) సహాయముచేసిన అహీకామును, యిర్మీయా వ్రాసిన గ్రంథమును కాల్చవద్దని యెహోయాకీముకు బుద్ధిఁజెప్పిన గెమర్యాయును (యిర్మీ $36^{12-25}$), యిర్మీయా వ్రాసినదానిని బాబెలు చెఱయందున్నవారికిఁ గొనిపోయిన ఎల్యాసాయును (యిర్మీ $29^{3}$) ఇతని కుమారులు. యిర్మీయా వ్రాసిన ప్రవచనములను లక్షించిన మీకాయా (యిర్మీ $36^{11,12}$), యెరూషలేము నాశమునకుఁ బిమ్మట యూదాదేశమున కధిపతిగా నియమింపఁబడిన గెదల్యా ($40^{7}$) ఇతని మనుమలై యుండిరి. ఇతని కుటుంబికులాకొందరకాలములో దేశమునకు గొప్ప మేలు జేసిరని స్పష్టమగుచున్నది.

2. యెహెజ్కేలు కాలములో విగ్రహారాధన చేసినవారిలో యాజన్యా తండ్రి (యెహె $8^{11}$). బహుశః ఇతఁడు 1 లోని షాఫానై యుండును. అట్లయినయెడల అంత మంచి కుటుంబమునందును దుష్టుఁడొకఁ డుండినట్లు చెప్పవలెను.

షాఫీరు (Shaphir = సొగసైనది). యూదా గోత్రమందలి యొక పట్టణము (మీకా $1^{11}$). అది ఫిలిష్తీయుల ప్రాంతములలో నున్నది గాని దాని యునికి ఇంక నూటిగాఁ దెలియదు. యెహో $15^{48}$ లో నుండు షామీరు ఇదే కావచ్చునని కొందఱి యభిప్రాయము (షామీరు 2 చూ॥).

షామా (Shama = ఆలకించుట). దావీదు యోధులలో నొకఁడు (I దిన 11[44]).

షామీరు (Shamir = ఒక ముల్లు).

1. లేవీయులలో మీకా యనువాని కుమారుఁడు (I దిన 24[24]).

2. యూదామన్య ప్రదేశమందుండు ఒక పట్టణము (యెహో 15[48]). ప్రస్తుతము హెబ్రోనుకు 13 మైళ్లు నైరృతిగానుండు కుర్బెట్ సామేర (*Khurbet Somerah*) దీని యునికియని తలంచెదరు (షాఫీరు చూ॥).

3. న్యాయాధిపతియగు తోలా యనువాని నివాసస్థలము (న్యాయా 10[1,2]). అతని ఇచ్చటనే పాతిపెట్టిరి. అది ఎఫ్రాయిము మన్యమందుండెను. దాని యునికినిగూర్చి ఇంక తేటగా తెలియదు.

షామెరు షెమెరు చూ॥

షారాయి (Sharai = స్వతంత్రత?). అన్య స్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణచే వారిని విడిచినవారిలో నొకఁడు. ఇతఁడు బానీ సంతతివాఁడు (ఎజ్రా 10[40]).

షారారు శాకారు చూ॥

షారూహెను షరాయిము 2 చూ॥

షారోను (Sharon = బయలు).

1. యొప్పేనుండి కర్మెలు పర్వతమువఱకు సముద్రతీరమున వ్యాపించిన బయలు. ఇది దాదాపు 50 మైళ్లు పొడవుగల్గి 5-12 మైళ్లు వెడల్పున నున్నది. యెషయా కాలమందున్నట్లు (యెష 35[2]) నేటివఱ కిచ్చట సొగసైన ఓకు వృక్షవనము లున్నవి. ఆ బయలంతయు మిగుల ఫలవంత ప్రదేశమై యున్నది (యెష 65[10]). షారోను పుష్పములు సుప్రసిద్ధములు (పర 2[1]). పశ్వాదుల కిచ్చట మంచి మేత దొరకును గనుకనే దావీదు మందలలో నొకటి షారోనీయుఁడగు షిట్రయివశమున నీ ప్రాంతములో నుండెను (I దిన 27[29]). కనానుదేశముపై దేవుఁడు పంపఁబోవు గొప్ప శిక్షలలో నొకటి షారోను యెడారి యగుట యని తెలుపఁబడెను (యెష 33[9]). పాఁత నిబంధన కాలమునందు దోరు అనునది దీని ముఖ్య పట్టణమై యుండెను. క్రొత్త నిబంధన కాలమున నీ పట్టణమున్నచోట కైసరయ కట్టఁబడి ముఖ్య పట్టణ మాయెను (దోరు, కైసరయ, పలెస్తీను చూ॥).

2. యొర్దానుకు తూర్పున గిలాదుదేశములో హెష్బోను అర్నోనులకు మధ్యనుండు మైదానము (I దిన 5[16]). ద్వితీ 3[10] లోని మైదానము అనునది కావచ్చును.

3. లష్షారోను చూ॥

షాలీషా (Shalisha = మూఁడింతలు). సౌలు తన తండ్రి గాడిదెలను వెదకుచుండఁగా వచ్చిన యొక ప్రదేశము (I సమూ 9[4]). షిలోహుకు పడమరగానుండు ఎఫ్రాయిము కొండ ప్రదేశమై యుండవచ్చును. II రాజు 4[42] లో నుండు బయల్షాలిషా ఈ ప్రదేశమేనని కొందఱి యభిప్రాయము (బయల్షాలిషా చూ॥).

షాలేము యెరూషలేము B I చూ॥

షావూలీయులు షావూలు 2 చూ॥

షావూలు (Shaul అడుగఁబడినవాఁడు)

1. ఎదోము రాజులలో నొకఁడు (ఆది 36[37,38]=I దిన 1[48,49]).

2. షిమ్యోను కుమారుఁడు. ఇతని తల్లి కనానీయురాలు (ఆది 46[10]). ఇతని సంతతి వారు షావూలీయులనఁబడిరి (సంఖ్యా 27[13]).

3. లేవీయులలో నొకడు. సమూయేలు పూర్వికుఁడు (I దిన 6[24]). 6[31] లో నితనికి యోవేలు అను మాఱుపేరు గలదు (యోవేలు 3 చూ॥).

షావే కిర్యతాయిము (Shaveh Kiriathaim = కిర్యతాయిము బయలు). కదొర్లాయోమెరును అతనితో కూడనున్న రాజులును ఏమీయులను జనము నోడించిన స్థలమునకు పేరు (ఆది 14[5]). ఇది మోయాబుదేశములోని కిర్యతాయిము అని కొందఱి యభిప్రాయము (సంఖ్యా 32[37] యెహో 13[19] కిర్యతాయిము చూ॥).

షావేలోయు యెరూషలేము A 4 చూ॥

**షాషకు** (**Shashak**). బెన్యామీనీయులలో నొకఁడు. ఇతని సంతతివా రితని పేరున బిలువఁబడిరి (I దిన $8^{14-25}$).

**షాషై** (**Shashai** = పాలిపోయినది). అన్య స్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిన వారిలో నొకడు. ఇతఁడు బానీ సంతానీకుఁడు (ఎజ్రా $10^{40}$).

## షి

**షిక్కెరోను** (**Shikkeron** = త్రాగుబోతు తనము). యూదా స్వాస్థ్యములో ఉత్తర సరిహద్దు ప్రాంత్యమందలి యొక స్థలము (యెహో $15^{11}$). దాని యునికి తెలియదు.

**షిట్రాయి** (**Shitrai**). దావీదు మందలపై విచారణ కర్తలలో నొకఁడు. ఇతఁడు షారోనులో వానిని మేపుటవలన షారోనీయు డనఁబడెను (I దిన $27^{29}$).

**షిత్తీము షిత్తీములోయ** (**Shittim** = తుమ్మచెట్లు, **Vale of Shittim**).

1. ఇశ్రాయేలీయులు అరణ్య సంచారమునందు యొర్దానుకు తూర్పున దిగిన స్థలములలో చివరిది (సంఖ్యా $21^{20}$ $22^{1}$ $25^{1}$ $33^{47,48}$). బిలాముకు సంబంధించిన సంగతులు జరిగిన దిచ్చటనే (22-24). ఇశ్రాయేలీయు లిచ్చట మోయాబీయులతోఁ గలిసి వారి విగ్రహ సంబంధమగు ఉత్సవములలోఁ జేరినందున 24,000 చంపఁబడిరి (25) ఇశ్రాయేలీయులు రెండవమారు లెక్కింపఁబడిరి (26). మోషే తన చివరి ప్రసంగములను హెచ్చరికలను చేసిన దీ స్థలమునందే (ద్వితీయోపదేశకాండము). మోషేకుఁ దరువాతి నాయకుఁడైన యెహోషువను నియమించుటను గూర్చిన సంగతులును ఇక్కడ జరిగెను (ద్వితీ 27-36). యెహోషువ వేగులవారి నిక్కడనుండి బంపెను (యెహో $2^{1}$). ఇశ్రాయేలీయు లిక్కడి నుండి బయలుదేరి యొర్దానును దాటిరి ($3^{1}$).

సంఖ్యా $33^{49}$ నందు ఆబేలు షిత్తీము అను పేరుగలదు. దానికి షిత్తీము బయలు అని శబ్దార్థము. అది యెరికో యెదుట యొర్దానుకు 7½ మైళ్లు తూర్పున నున్నదని యోసీఫసు వ్రాసెను (పురా 4.8.1, 5.1.1). మోయాబు పర్వతములకు దిగువను ప్రస్తుతమున్న కెఫ్రేన్ (*Kefren*) దీని యునికి యని కొందఱి యభిప్రాయము.

2. యెహోవా మందిరములోనుండి ఒక నీటి యూటఁ యునికి షిత్తీములోయను తడుపునని యోవే $3^{18}$ నందున్నది. యెహె 47 నందీ లోయపేరు లేకున్నను యెహోవా మందిరము నుండి ప్రవహించెడి నదీ ప్రవాహ వివరముగలదు. అది కిద్రోను లోయగుండా మృతసముద్రము లోనికిఁ బ్రవహించునని దానివలనఁ దెలిసికొనవచ్చును. యోవేలునందున్న షిత్తీములోయ యను నదీ కిద్రోను లోయలో మృత సముద్రమునకు సమీపమున నున్నదని కొందఱి యభిప్రాయము.

**షినాబు** (**Shinab**). మైదాన మందలి పట్టణములలో నొకటియగు అద్మాయొక్క రాజు (ఆది $19^{2,8,10}$).

**షిఫీ** (**Shiphi** = విస్తారమైనది) షిమ్యోను సంతతివారిలో నొకఁడు (I దిన $4^{37}$).

**షిఫ్తాను** (**Shiphtan**. = న్యాయ విమర్శకు సంబంధమైన). ఎఫ్రాయిమీయుల ప్రధానియగు కెమూయేలు తండ్రి (సంఖ్యా $34^{24}$).

**షిప్మీయుడు** (**Shipmite**). దావీదు ద్రాక్షారసపు కొట్లమీఁద నధికారియగు జబ్దీయను వాని బిరుదు (I దిన $27^{27}$). షెపాము లేక షిప్మోతు ఊరివాఁడగుటచే నితని కీ బిరుదు వచ్చెను (షెపాము, షిప్మోతు చూ.).

**షిప్మోతు** (**Siphmoth**). దావీదు దోపుడు సొమ్మును పంపిన యూదా యూళ్లలో నొకటి (I సమూ $30^{28}$). తరువాత ద్రాక్షారసపు కొట్ల మీఁద విచారణకర్తగానున్న జబ్ది షిప్మీయు డనఁబడెను (I దిన $27^{27}$). అతఁడీ యూరివాఁడు కావచ్చును. దీని యునికి సరిగా తెలియదు.

**షిఫ్రా** (**Shiphrah** = సౌందర్యము). ఐగుప్తీయ మంత్రసానులలో నొకతె. ఈమె హెబ్రీయుల మగబిడ్డలను చంప సమ్మతింపలేదు (నిర్గ $1^{15}$).

**షిబ్బోలెతు, సిబ్బోలెతు** (**Shibboleth** = కంకి లేక నది). యెఫ్తా కాలమునందు గిలాదు

వారికి ఎఫ్రాయిమీయులతో విరోధము కలిగి నప్పుడు గిలాదువారు యొర్దాను రేవుల దగ్గరనుండి వానిని దాటుచుండిన వారు ఎఫ్రాయిమీయులో కారో తెలిసికొనుటకు వారు చెప్పించిన మాట. ఎఫ్రాయిము వారు ష అను అక్షరము నుచ్చరింపఁ జాలక స అనిరి గాన దానిచే వారిని గిలాదువారు కనుగొనఁగలిగిరి (న్యాయా 12[6]).

షిబ్నా షెబాము చూ॥

**షిమాతు** (Shimeath = వదంతి). ఒక అమ్మోనీయురాలు. రాజగు యోవాషును కుట్ర జేసి చంపినవారిలో యోజాకారు అనువాని తల్లి (II రాజు 12[21]). II దిన 24[26] నందితనికి జాబాదు అను పేరుగలదు. ఈమె అమ్మోనీయు రాలను సంగతి II దిన 24[26] నందే గలదు. కొందఱిది పొరపాటున వచ్చినదని తలంతురు. అట్టి వారి షిమాతు యోజాకారు తండ్రియనియు I దిన 2[55] నందున్న షిమ్యాతీయులు ఇతని సంతతివారనియు తలంతురు.

**షిమీ** (Shemei = ప్రఖ్యాతిగల).

1. అబ్షాలోము తిరుగఁబడినప్పుడు దావీదు పారిపోవుచుండఁగా అతనిని శపించిన ఒక బెన్యామీనీయుఁడు. ఇతఁడు సౌలు తెగలో చేరిన వాఁడు. దావీదు మఱల వచ్చినప్పుడు అతఁడు బహువినయము చూపినవాఁడై దావీదును క్షమా పణ వేడుకొనెను (II సమూ 16[5-12] 19[17-22]). అప్పటికి దావీదతనిని క్షమించినను తన చివరిదిన ములలో అతనిగూర్చి సొలొమోనుకు ఆజ్ఞనిచ్చెను (I రాజు 2[8,9]). సొలొమో నితనికి మొదట విడిఖైదును విధించెను గాని అతఁ డొకమారు విధింపఁబడిన హద్దుమీరఁగా అతనిని చంపించెను (I రాజు 2[36-46]).

2. దావీదు కుమారుఁడగు అదోనియా రాజ్యము నపహరించుటకు కుట్రచేయఁగా సొలొమోను పక్షముగా నున్నవారిలోని యొకఁడు (I రాజు 1[8]). తరువాత బెన్యామీను దేశము మీఁద అధికారిగా సొలొమోనుచే నియమింపఁ బడినవాఁ డితఁడే యని తలంతురు (I రాజు 4[18]).

3. దావీదు తన ద్రాక్షతోఁటలమీఁద విచారణకర్తగా నియమించినవాఁడు (I దిన 27[27]).

4. జెరుబ్బాబెలు తోడ పుట్టినవాఁడు (I దిన 3[19]).

5. షిమ్యోను సంతతివారిలో నొకఁడు (I దిన 4[26,27]).

6. రూబేనీయులలో నొకఁడు (I దిన 5[4]). I దిన 5[8] లో నితనికి షెమ అను మాఱుపేరు గలదు.

7. లేవి మనుమలలో నొకఁడు (నిర్గ 6[17] సంఖ్యా 3[18,21] I దిన 6[17] 23[7,9]).

8. లేవీయులలో మెరారి తెగవారిలో నొఁకడు (I దిన 6[29]).

9. లేవీయులలోని ఆసాపు సంతతివారిలో నొకఁడు (I దిన 6[42]).

10. దావీదేర్పఱచిన సంగీత నాయకులలో 10 వ వంతువాఁడు (I దిన 25[17]).

11. హిజ్కియా కాలమున దేవాలయమును పవిత్రపఱచినప్పుడు సహాయపడిన యొక లేవీయుఁడు (II దిన 29[14]). తరువాత ఇతఁడు కానుకలను భద్రపఱచుటకు నియమింపఁబడిన వారిలో నొకఁడయ్యెను (II దిన 31[12,13]).

12, 13, 14. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచి పెట్టినవారిలో ముగ్గురు (ఎజ్రా 10[23,33,38]).

15. ఇశ్రాయేలీయుల పాపముల నిమిత్తము ఏడ్చుచున్న యొక కుటుంబపువారి పెద్ద (జెక 12[13]). ఇది లేవీయుల కుటుంబములలో నొకటి. పై నుదాహరింపఁబడిన వారిలో నొకని కుటుంబికులై యుందురు.

16. మొర్దెకై పూర్వీకులలో నొకఁడు (ఎస్తే 2[5]).

17. దావీదు అన్నయగు షమ్మాకు మాఱుపేరు (II సమూ 21[21] షమా చూ॥).

18. గెర్షోను తెగవారగు లేవీయులలో నొకఁడు (I దిన 23[7]).

**షిమీయులు** (Shimites). లేవీగోత్రము లోని గెర్షోనీయులలో నొక కుటుంబము (సంఖ్యా 3[21]).

షిమ్యా హెబ్రీభాషయందీ పదమునకు వేఱువేఱు రూపములున్నను తెలుఁగునందు దానిని లక్ష్యపెట్టకయే పైమాట తెనిఁగించిరి.

1. (Shim'ah = షిమా). ఒక బెన్యామీనీయుఁడు (I దిన 8[32] 9[38]).

2. (Shim'ah). దావీదు అన్నలలో నొకఁడు (II సమూ 13[3] 21[21] I దిన 20[7]). ఇతనికి షమ్మా అను పేరును గలదు (షమా 3 చూ॥).

3. (Shim'a'). లేవీయులలోని మెరారీ తెగవారిలో నొకఁడు (I దిన 6[30]).

4. లేవీయులలోని కహాతు తెగవారిలో నొకఁడు (I దిన 6[39]).

5. షమూయ 2 చూ॥

**షిమ్యాతీయులు (Shimeathites).** షిమాతు సంతతివారు (I దిన 2[55] షిమాతు చూ॥).

**షిమ్యోను, సుమెయోను (Simeon = ఆలకించుట).**

1. యాకోబు లేయాల రెండవ కుమారుఁడు (ఆది 29[33]). తన తమ్ముఁడగు లేవీతోఁగలిసి తమ సహోదరిని బలాత్కారముచేసిన షెకెము నివాసులగు హివ్వీయులను హతము జేసెను (ఆది 34[24,31] దీనా చూ॥). యాకోబు కుమారులు ధాన్యము కొనుటకై ఐగుప్తునకు వెళ్లినప్పుడు వారు తమ తమ్ముఁడగు బెన్యామీనును తెచ్చునందాక యోసేపితనిని జామీనుగా పెట్టుకొని విడిచియుదునందుంచెను (42[24]). యాకోబు తన కుమారులను దీవించునప్పుడు షిమ్యోను లేవీలుచేసిన వధ నిమిత్తము వారి సంతతివారు ఇశ్రాయేలీయులలో చెదరిపోయెదరని చెప్పెను (49[5,7]).

2. షిమ్యోను సంతతివారి పేరు. అతనికి యెమూయేలు (= నెమూయేలు) యామీను, ఓహదు, యాకీను, సోహరు (= జెరహు) షావూలు అను ఆరుగురు కుమారులు కలిగిరి ఆది 46[10] సంఖ్యా 26[12-14] I దిన 4[24]). ఓహదుగాక మిగిలిన వారందఱు తలాయొక వంశమునకు మూలపురుషులైరి. ఇశ్రాయేలీయు లరణ్యసంచారము చేయునప్పుడు సూరీషదాయి కుమారుఁడగు షెలుమీయేలును (సంఖ్యా 1[6] 2[12] 7[36,41] 10[19]) తరువాతి కాలములో అమీహూదు కుమారుఁడగు షెమూయేలును (34[20]) ప్రధానులై యుండిరి. అరణ్యమునందు వేసిన జనసంఖ్యలో మొదట 59,300 మందియు (1[23] 2[13]) రెండవసారి 22,200 మందియు (26[12,14]) యోధులీ గోత్రమున లెక్కింపఁబడిరి కనానుదేశమును వేగు జూడ పంపఁబడిన పన్నెండుమందిలో నీ గోత్రపువాఁడగు హోరీ కుమారుఁడగు షాపాతు గలఁడు (13[5]). మోషే ఇశ్రాయేలు గోత్రములను దీవించినప్పుడు షిమ్యోను గోత్రమును వదలివేసినట్లు స్పష్టమగుచున్నది (ద్వితీ 33). ఆ కావ్యము రచింపఁబడినరీతియే దీనికి కారణమై యుండును. మోషే పన్నెండు గోత్రములకు సరిగా పన్నెండు మంది పేరులను మాత్రమే చెప్ప నెంచియుండును. వారి జన్మకాలవరుస ననుసరింపక అతఁడు వారిని భార్యల క్రమము ననుసరించి రెండుగ విభజించెను. మొదటి భాగమున పెండ్లి భార్యల 8 మంది కుమారులను, రెండవ భాగమున ఉపపత్నుల కుమారులను కూర్చెను. అది ఈ దిగువ నున్నట్లు చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| లేయా | 3 | లేయా దాసి | 1 |
| రాహేలు | 3 | రాహేలు దాసి | 2 |
| లేయా | 2 | లేయా దాసి | 1 |

ఆ కావ్యమునందు పైనున్నట్లు మొదటి భాగమునందు లేయా ముగ్గురు కుమారులతో నారంభమై ఆమె యిద్దరు కనిష్ఠపుత్త్రులతో నంత్యమగును. రాహేలు సంతతివారిని మధ్య ఇమిడ్చెను. రెండవ భాగమునందు లేయాదాసి యొక్క ప్రథమ కుమారునితో నారంభించి రెండవవానితో ముగించెను. మధ్య రాహేలు దాసియొక్క యిద్దరు కుమారులను గూర్చియున్నది. వీరి నాశీర్వదించుటకు పూర్వమును (33[2-5]), తరువాతను (33[25,29]) ఇశ్రాయేలీయుల నందరిని మొత్తముమీఁద దీవించెను. షిమ్యోను గోత్రము ఆది 49[5-7] లలో నున్నట్లు చెదరిపోవును గాన ఇచ్చట వదలివేయఁబడినదని చెప్పును. లేవి గోత్రమునకును అట్టి శాపము గలిగినను, ఆ గోత్రికులు తరువాత దేవుని విషయమై కలిగియుండిన ఆసక్తినిబట్టి వారికి కొంత వఱకు శుభకరమనము కలిగినదని యెంచవచ్చును

(నిర్గ 32[26-29] సంఖ్యా 25). మోషే మరణము నకుఁ దరువాత షిమ్యోను గోత్రికుల కొక ప్రత్యేక స్వాస్థ్యమునుగాక యూదా గోత్రముతోఁ గలిపిన భాగము నిచ్చిరి. షిమ్యోను గోత్రికుల పేరు ప్రత్యేకముగా చెప్పఁబడక పోయినను వారు ఇశ్రాయేలీయు లందఱిని మొత్తముమీఁద దీవించిన దానిలో నుండక పోలేదు. దీవెనలను చెప్పుటకై గెరిజీము పర్వతము దగ్గర నిలిచిన వారిలో షిమ్యోను గోత్రికు లుండిరి (ద్వితీ 27[12]).

దేశమును భాగించునప్పుడు వచ్చిన రెండవ చీటి షిమ్యోనీయులదై యుండెను (పటము IX). దాని ప్రకారము వారికి యూదాగోత్ర స్వాస్థ్యముతోఁ జేరిన దక్షిణభాగము వచ్చెను (యెహో 19[1,2-9]). ఈ రెండు గోత్రములవారును కలిసి కనానీయులపై యుద్ధము చేసిరి (న్యాయా 1[1,3,17]). బెయేర్షెబా సిక్లగు హొర్మాయనునవి ఈ భాగములోని ముఖ్యపట్టణములు (యెహో 19[2-9]). రాజైన హిజ్కియా దినములలో వీరు గెదోరు లోయలో నివసించుచున్న హాము సంతానీకులను జయించి ఆ ప్రదేశము నాక్రమించుకొనిరి. వారిలో 500 మంది శేయీరు మన్నె మందలి అమాలేకీయుల నోడించి వారి పట్టణములను పట్టుకొనిరి (I దిన 4[24-43]). ఈ గోత్రికులలో ననేకులు రూపు మాసిపోయిరని నమ్మెదరు, గాని యెహెజ్కేలుకు రాఁబోవు కనానును గూర్చిన దర్శనమందు వీరికి భాగముండినటులను (యెహె 48[24,25,33]), ప్రకటనలోని రక్షణకై ముద్రింపబడిన వారిలో ఈ గోత్రికులు 12,000 మంది యుండినటులను (ప్రక 7[7]) కనఁబడుచున్నది.

3. జెరుబ్బాబెలుకు ముందు జీవించిన క్రీస్తు పూర్వీకులలో నొకఁడు (లూా 3[30]).

4. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా త్రోసివేయుటచే వారిని విడిచిపెట్టినవారిలో నొకఁడు (ఎజ్రా 10[32]).

5. క్రీస్తు రాకడనిమిత్తము కనిపెట్టుచుండిన భక్తిపరుఁడు. ఇతఁడు అభిషిక్తుని చూడకమునుపు చనిపోవఁడని పరిశుద్ధాత్మ యతనికి బయలుపఱచెను. ఆలయమునందు యేసును అర్పించుటకు యోసేపు మరియులు ఆయనను దెచ్చిన సమయమునందే ఇతఁడు వచ్చి ఆయనను గుర్తించి, తాను ఇఁకను మరణముపొందుటకుగల అశను కనఁబఱచి ఆమెకును ఆయనకును కలుగనై యున్నవానిని మరియకు స్పష్టపఱచెను (లూా 2[25-35]).

6. సీమోను పేతురు (పేతురు చూ॥).

7. అంతియొకయలోని క్రైస్తవులలో నీగెరనఁబడిన బోధకుఁడు. ఇతఁడు బహుశః ఆఫ్రికా ఖండపువాఁడు గావచ్చును (కార్య 13[1]).

## షిమ్రాతు, షోమేరు (Shimrath, Somer = కావలి).

1. రాజైన యోవాషును కుట్రచేసి చంపిన యొకని తల్లి (II రాజు 12[21] = షోమేరు, II దిన 24[26] = షిమ్రాతు). ఈమె మోయాబీయురాలై నట్లు II దిన 24[26] వలనఁ దెలియుచున్నది. ఇది ఒక పొరపాటనియు, ఈ పదమును షిమ్రాతును రెండుపేరులుగాక ఒకే కుటుంబపు పేరనియు తలంచువారుగలరు.

2. ఒక బెన్యామీనీయుఁడు (I దిన 8[21]).

## షిమ్రి (Shimri = మెలకువగా నుండుట).

1. షిమ్యోను సంతతివారిలో నొకఁడు (I దిన 4[37]).

2. దావీదు యోధులలోని యెదీయయేలు తండ్రి (I దిన 11[45]).

3. లేవీయులలో మెరారి తెగవారిలో నొకఁడు. ఇతని కుటుంబికులు ద్వారపాలకులై యుండిరి (I దిన 26[10]).

4. హిజ్కియా కాలములో ఆలయమును శుభ్రపఱచుటకు సహాయముచేసిన లేవీయులలో నొకఁడు (II దిన 29[13]).

## షిమ్రోను, షిమ్రోనీయులు (Shimron = కావలి, Shimronites).

1. ఇశ్శాఖారు కుమారులలో నాల్గవవాఁడు (ఆది 46[13] సంఖ్యా 26[24] I దిన 7[1]). ఇతని వంశస్థులకు షిమ్రోనీయులు అను పేరు కలదు (సంఖ్యా 26[23]).

2. కనానీయులరాజగు యాబీను యెహోషువతో యుద్ధముచేయ బిలిచిన రాజులలో నొకని ముఖ్యపట్టణము (యెహో 11[1] 19[15]).

**షిమ్రోన్మెరోను** (Shimron-Meron). యెహోషువ పట్టుకొనిన పట్టణములలో నొకటి (యెహో 12[20]). ఇది షిమ్రోను యొక్క 'పూర్ణమైనపేరు' అని యెంచుదురు. (షిమ్రోను 2 చూ॥).

**షిమ్షయి** (Shimshai = ఎండగల). పారసీకుల ఉద్యోగియగు రెహూముయొక్క లేఖకుడు. యూదులాలయమును తిరిగి కట్టుకొనఁబోగా వారిమీఁద నేరము మోపిన వారిలో నొకఁడు (ఎజ్రా 4[8,9,17,23]).

**షిర్యోను** సీయోను చూ॥

**షిలోని** (Shiloni = షిలోహు నివాసి). నెహె 11[5] నందిది యొక యూదా సంతానీకుని పేరైనట్లున్నది. దానికి షిలోనీయుఁడని అర్థమగునని సాధారణముగా నందురు (షిలోనీయుడు చూ॥).

**షిలోనీయుడు, షిలోనీయులు** (Shilonite).

1. ప్రవక్తయగు అహీయాబిరుదు (I రాజు 11[29]). షిలోహు పట్టణస్థుఁడగుటచే అతని కీ బిరుదు వచ్చెను (షిలోహు 1 చూ॥).

2. షేలహు సంతతివారికి పెట్టఁబడినపేరు (I దిన 9[5] షేలా చూ॥).

**షిలోహు** (Shiloh = నెమ్మది, విశ్రాంతి).

1. ఇశ్రాయేలీయులు కనాను దేశములోఁ బ్రవేశించినమీఁదట ప్రత్యక్షపు గుడారమును స్థిరముగా నుంచిన మొదటిస్థానము (యెహో 18[1]). కొంతకాలమునఁటకిది ముఖ్యస్థానమయ్యెను. దీనియునికినిగూర్చి న్యాయా 21[19] నందు తేటగా నున్నది. కనానుదేశమును విభాగించుటకు ఇశ్రాయేలీయు లిచ్చట సమావేశమైరి (యెహో 18[8-10] 19[51]). యొర్దానుకుఁ దూర్పుననుండినవారు తమ ప్రాంతములకు వెళ్లుటకై ఇతరులవలన సెలవు దీసికొనిన దిచ్చటనే (22[9]). వారు తమ ప్రాంతములకుఁ బోయి అచ్చట నొక వేదికనుకట్టఁగా దానినిగూర్చి విన్న తక్కినవారాలోచన నిమిత్తము ఇచ్చట కూడిరి (22[12]). న్యాయాధిపతుల కాలమునం దిచ్చట యేఁటేఁట పండుగు జరిగెను (న్యాయా 21[19] I సమూ 1[3]). బెన్యామీనీ



షిలోహు

యులగోత్రము సమూల నాశముగాకుండునట్లు వారి పట్టణపు కన్యకలను పట్టుకొనివెళ్లి వారిని వివాహమాడిరి (న్యాయా $21^{16-23}$). దేవుని నిబంధనమందసము ఏలీకాలమున ఇచ్చట నుండెను (న్యాయా $18^{31}$ I సమూ $1^{9,24}$ $3^{13-20}$ $4^{3,4}$ $2^{14,22}$ $14^{18}$). ఫిలిష్తీయులు మందసమును పట్టుకొనిన పిమ్మట (I సమూ $4^{11-22}$), దాని ప్రాముఖ్యత తగ్గిపోయెను. షిలోహు ఇఁకను పూజాస్థానముగా నుండక విడువఁబడుటచే యెరూషలేముకూడ తన దుర్మార్గతలచే విడువఁబడునను బోధను దృష్టాంతపఱచుటకు ప్రవక్తలు దీని నాశనమును గూర్చిన చరిత్రనెత్తి చెప్పిరి (కీర్త $78^{60}$ యిర్మీ $7^{12-14}$ $26^{6-9}$). ఆ పెట్టెను తిరిగి ఫిలిష్తీయుల దేశము నుండి తెచ్చినపిదప దానిని మఱల షిలోహుకు తీసికొనిపోక అక్కడక్కడ నిలిపి చివఱకు యెరూషలేమునందుంచిరి (I సమూ $6^{21}$ $7^{1,2}$ II సమూ $6^{2,11,17}$). దానికి తరువాత షిలోహునుగూర్చి యెక్కువ సూచనలగుపడుటలేదు. యరొబాము రాజగునని తెలిపిన అహీయా యను ప్రవక్త ఈ యూరివాఁడే (I రాజు $11^{29}$). తన కుమారుఁడు జబ్బుపడఁగా అతని స్వస్థతనుగుఱించి తెలిసికొనుటకు యరొబాము తన భార్యను ఇచ్చటనున్న అహీయాయొద్ద కంపెను (I రాజు $14^{2,4}$). యెరూషలేము నాశనమైనపిమ్మట కొందఱిచ్చటి నుండి వచ్చుటచే అది యంతవఱకు నిలిచియుండెనని తెలిసికొనవచ్చును (యిర్మీ $41^{5}$). ప్రస్తుతము బేతేలునకు 9 మైళ్లు ఉత్తరమునకు కొంచెము తూర్పుగా నున్న సైలూను (*Seilun*) అను కొండయే దీనియునికి యనుకొందురు. దీని మీఁద నున్న శిథిలములలో నేటివఱకు మట్టము చేయఁబడినట్లుగా నున్న 400×80 అడుగుల స్థలము పూర్వము మందిరమున్న స్థలమని యూహించుచున్నారు.

2. షిలోహు అని ఆది $49^{10}$ లో నున్నది సార్థకనామమై మెస్సీయను సూచించునని మిగుల పురాతనకాలమునుండి దీనికి అర్థము చెప్పెదరు. దాని శబ్దార్థమునుబట్టి అది మెస్సీయకు తగిన బిరుదు అని చెప్పఁదగును. తెనుఁగు బైబిలులోని భాషాంతరమును జూడఁగా అది మెస్సీయనుగాక పైన 1 లో చెప్పఁబడిన స్థలమని యర్థమగును. ఈ పదమును విడఁదీసి చెప్పినయెడల ఉన్నవాఁడు (ఉన్నది) వచ్చువఱకు యూదా యొద్ద నుండి దండము తొలగదు అను మూఁడవ యర్థము వచ్చును. వీనిలో మొదటిది మూఁడవది మెస్సీయను సూచించును. రెండవది యూదా షిలోహు వఱకు తన ప్రభుత్వము వ్యాపింపఁజేయుటను సూచించును గాని అట్టిది యెన్నడును కలుగకపోవుటచే ఈ రెండవ యర్థమును అనుసరింప వీలుకాదు గాన పై రెండర్థములలో నేదో యొకదాని ననుసరింపవలసి యున్నది.

**షిలోహు నీళ్లు** యెరూషలేము A III 2 చూ॥.

**షిల్లేము, షిల్లేమీయులు** (**Shillum, Shillemites**), నఫ్తాలీ కుమారులలో నొకఁడు (I దిన $7^{13}$). ఆది $46^{24}$ సంఖ్యా $26^{49}$ నందీ పేరుకు బదులు షిల్లేము అని యున్నది. ఇతని సంతతివారికి సంఖ్యా $26^{49}$ లో షిల్లేమీయులు అను పేరుగలదు.

**షిల్షా** (**Shilsha** = మూఁడవవాఁడు). ఆషేరు సంతతివారిలో నొకఁడు (I దిన $7^{37}$).

**షిల్హిము** (**Shilhim** = ఈఁటెలు లేక చిగుళ్లు). యూదాలో వాయవ్యదిక్కున నుండు ఒక యూరు (యెహో $15^{32}$). దీనికి షారూహెను ($19^{6}$) షరాయిము (I దిన $4^{31}$) అను మాఱు పేరులు కలవు (షారయీము చూ॥).

**షిల్హీ** (**Shilhi** = ఈఁటె గలవాఁడు). రాజైన ఆసాయొక్క మామ (I రాజు $22^{42}$).

## షీ

**షీజా** (**Shiza** = తీవ్రమగు మక్కువ). రూబేనీయులలో పెద్దయగు అదీనా యనువాని తండ్రి (I దిన $11^{42}$).

**షీన్** (**Shin or Sin** = ש అను అక్షరము). హెబ్రీ యక్షరములలో నిరువైయొకటవది. అక్షరమాలికగా రచింపఁబడిన 119 కీర్తన 21-వ భాగమందలి ప్రతి పంక్తియు ఈ యక్షరముతో ఆరంభమగుటచే దానికీ పేరు పెట్టిరి.

**షీనారు** (**Shinar**). బబులోను దేశము యొక్క మాఱుపేరు (ఆది $10^{10}$ $11^{2}$ $14^{1,9}$ యెహో $7^{21}$ యెష $11^{11}$ జెక $5^{11}$ దాని $1^{2}$). బబులోను దేశమునకు దక్షిణ భాగమున సూమరు

(*Sumer*) అను పట్టణముండెను. దానిని బట్టి బబులోనుదేశపు ఆదిమనివాసులు సూమరు వారనఁబడిరి. ఈ సూమరు అను పేరునకు బదులుగా హెబ్రీయులు షీనారు అని వ్రాయుదురని కొందఱనుకొందురు గాని అట్లనుకొనుటకు తగిన యాధారములు లేవు. షీనారు అను పేరు ఆ దేశమున కెట్లు వచ్చెనో దాని యుత్పత్తిని గూర్చి మనకు తెలియదు.

**షీనారు వస్త్రము** (Babylonish garment). ఆకాను యెరికోలో దొంగిలించిన వానిలో నొక వస్త్రము (యెహో 7[21]). అది షీనారు బుట్టాపనిగా నేయఁబడిన విలువగల వస్త్రమైయున్నట్లు తోఁచుచున్నది. అట్టి వస్త్రములు బబులోనులో నెక్కువగానున్నట్లు రాతిశాసనముల వలనఁ దెలియుచున్నది.

**షిమోను** (Shimeon, Shimon = ఆలకించుట). యూదా సంబంధులలో నొక కుటుంబపు పేరు (I దిన 4[20]).

**షియోను** (Shion = నాశనము). ఇశ్శాఖారు గోత్రములోని యూరు (యెహో 19[19]). ప్రస్తుతము నజరేతుకు 3 మైళ్లు తూర్పుగానుండు ఆయూర్-ఎష్-షాయిను (*Ayiur-esh-Shain*) అనునదే దీని ఉనికిస్థలమైయున్నది (పటము VI, D 7).

**షీషకు** (Shishak). ఐగుప్తీయులయొక్క 22 వ రాజవంశమునకు స్థాపకుఁడు. ఐగుప్తు భాషలో నితనికి షీషన్కు అని పేరు. ఇతఁడు మొదట సొలొమోను మహారాజుకాలములో యరొబాామున కాశ్రయమిచ్చెను (I రాజు 11[40]). తరువాత కాలములో యరొబాము ఇశ్రాయేలీయుల యుత్తర రాజ్యమునకు రాజైన పిమ్మట సుమారుగా క్రీ॥ పూ॥ 926 లో ఈ షీషకు యరొబాము రాజ్యము మీఁదికిని యూదా రాజ్యము మీఁదికిని దండెత్తి వెళ్లెను. అతఁడు యెరూషలేమును జయించి (I రాజు 14[25] II దిన 12[2-9]) పలెస్తీను దేశమంతటిని దోచుకొనెను. నో-అమ్మోను (*Thebes*) అను పట్టణములో ఇతఁడొక గుడికి గొప్ప మంటపమును కట్టించెను. అతనికి పలెస్తీను దేశములోని 156 పట్టణములు పన్ను చెల్లించియున్నట్లుగా రాతిశాసనములవలనఁ దెలియును (ఐగుప్తు III ఫరో 6 చూ॥).

షీషా షవ్షా చూ॥

**షీహోరు** (Shihor = నల్లనిది). యెష 23[3] యిర్మీ 2[18] నందిది ఐగుప్తుదేశమును గాని నైలునదిని గాని, ఆ దేశమందలి మఱియొక నదిని గాని సూచించుచున్నది. I దిన 13[5] యెహో 13[3] చూడఁగా అది కనానుదేశమునకు నైరృతి దిక్కునుండు సరిహద్దుగానున్నది. నైలునది నీటిరంగుచేత దానికీ పేరు తగియున్నది. లేదా అది ఐగుప్తులోనుండు రేగడి భూమికి పేరు కావచ్చును. ఐగుప్తీయులీ పేరును ఐగుప్తులో తూర్పుకాలువకు గాని నైలునది తూర్పు పాయకు గాని వాడియుందురు. అది గాని ఐగుప్తు రేగడి భూమి గాని పలెస్తీను హద్దుగా నెంచఁబడియుండును. అయితే యితర వాక్యములలో దాని హద్దు ఐగుప్తునది యైనట్లున్నది (ఐగుప్తు నది చూ॥).

**షీహోరు లిబ్నాతు** (Shihor-Libnath = లిబ్నాతు నల్ల ప్రవాహము). ఆషేరుకు నైరృతిగానుండు ఒక చిన్నయేరు (యెహో 19[26]). అది కర్మెలు పర్వతమునకు దక్షిణముగా వాగు అని యనుకొందురు. దానికి ప్రస్తుతమున జెర్కా (*Zerka*) యను పేరుగలదు (పటము IV, A 8).

## షు

షుపాము హుప్పీము చూ॥

**షుప్పీము** (Shupphium).

1. బెన్యామీను సంతతివారిలో నొకఁడు (I దిన 7[12]). అది 46[21] నందితనికి ముప్పీము అను మాఱుపేరు గలదు (ముప్పీము చూ॥).

2. మనష్షే సంతతివాఁడు (I దిన 7[15]).

3. పడమటి తట్టుననున్న రాజమార్గమును కాచిన ద్వారపాలకుఁడు (I దిన 26[16]).

**షుమ్మాతీయులు** (Shummathites). కిర్యత్యారీములో కాపురమున్న కుటుంబములలో నొక ముఖ్య కుటుంబమునకు పేరు (I దిన 2[53]).

## షూ

**షూతెలహు, షూతెలహీయులు** (Shutelah, Shutelaites).

1. ఎఫ్రాయిము కుమారుఁడు. ఎఫ్రాయిమీయులలోని మూఁడు గొప్ప తెగలలో షూతెలహీయులు అనఁబడిన వారిపూర్వికుఁడు (సంఖ్యా $26^{35,36}$ I దిన $7^{20}$).

2. మఱియొక ఎఫ్రాయిమీయుఁడు (I దిన $7^{21}$). ఇతఁడును 1 లోని వాఁడును ఒక్కరే యని కొందఱి యభిప్రాయము.

**షూనీ, షూనీయులు** (Shuni = విశ్రాంతి, Shunites). గాదు కుమారులలో నొకఁడు (ఆది $46^{16}$). ఇతని సంతతివారికి **షూనీయులని** పేరు (సంఖ్యా $26^{15}$).

**షూనేమీయురాలు** (Shunamite = షూనేము ఊరి స్త్రీ).

1. దావీదు వృద్ధాప్యమునందు అతని కుపచారముచేసిన అబీషగు బిరుదు. అతఁడీమెను తన భార్యలలో చేర్చెను (I రాజు $1^{3-15}$). ఆమెను తనకు భార్యనుగా నిమ్మని అదోనీయా అడిగినందున సొలొమోను నతనిని చంపించెను ($2^{21-24}$).

2. ప్రవక్తయగు ఎలీషాయెడల చాల దయ చూపిన యొక స్థితిమంతురాలు. ఆమె పేరేదియో తెలియదు. ఎలీషాయొక్క విజ్ఞాపనవలన దేవుఁడామెకొక కుమారు నను గ్రహించెను. ఆ బిడ్డ యెండదెబ్బ తగిలి చనిపోఁగా ఎలీషా వానిని బ్రదికించెను (II రాజు $4^{8-31}$). తరువాత వచ్చిన కఱవుకాలమున ఆమె ఫిలిష్తీయుల దేశమునకు వెళ్లినందున ఇతరు లామె యాస్తి నపహరించిరి గాని ఆమె తిరిగివచ్చిన పిమ్మట రాజు దానినంతటిని మఱల ఆమె కిప్పించెను ($8^{1-6}$).

**షూనేము** (Shunem = రెండు విశ్రాంతి స్థలములు). ఇశ్శాఖారు సరిహద్దు పట్టణములలో నొకటి (యెహో $19^{18}$). ఇచ్చట సౌలు చేసిన చివరి యుద్ధమునందు ఫిలిష్తీయులు దండు దిగిరి (I సమూ $28^{4}$). ప్రస్తుతము సోలాము (*Solam*) అనునదే దాని యునికియైయున్నది. అది తాబోరు కొండకు 5 మైళ్లు దక్షిణముగాను యెజ్రెయేలుకు 3 మైళ్లు ఉత్తరముగాను గిల్బోవ కొండ యెదుట నున్నది. ప్రవక్తయగు ఎలీషాను పరామర్శించిన స్త్రీ ఈ యూరి కాపురస్థురా లనుకొందురు గాని అది షోమ్రోనుకును కర్మెలుకు మధ్య నుండిన స్థలమని మఱికొంద ఱనుకొందురు. [illegible] గూర్చిన సూచనలేవియు లేవు. దావీదు కుపచారముచేసిన అబీషగుకూడ ఈ యూరిదే (I రాజు $1^{3}$). పరమగీతమందున్న షూలమ్మీతికూడ ఈ యూరిదై నట్లున్నది ($6^{3}$ షూనేమీయురాలు, షూలమ్మీతి చూ॥ పటము IV, C 8).

**షూపాము, షూపామీయులు** ముప్పీము చూ॥

**షూయా, షూయ** (Shua = ధనము).

1. ఒక కనానీయుఁడు. యూదా యితని కుమార్తెను వివాహమాడెను (ఆది $38^{2-12}$ I దిన $2^{3}$).

2. ఆషేరు సంతానీకురాలు (I దిన $7^{32}$).

**షూయాలు** (Shual = నక్క).

1. ఆషేరు సంతతివారిలో నొకఁడు (I దిన $7^{36}$).

2. ఒక దేశము (I సమూ $13^{17}$). మిక్మషుకు ఉత్తరముగానున్న ఒఫ్రాకుపోవు మార్గమునందున్న దని ఈ వాక్యమందున్న సంగతిగాక దానిని గూర్చి యింకేమియుఁ దెలియదు.

**షూరు** (Shur = గోడ). ఐగుప్తున కీశాన్య దిక్కునందు అడవిప్రదేశము (I సమూ $15^{7}$ $27^{8}$). దూత ఇచ్చట హాగరుకు కనఁబడెను (ఆది $16^{7}$). అబ్రాహాము కాదేషుకును దీనికిని మధ్య నివసించెను ($20^{1}$). ఇష్మాయేలీయుల ప్రదేశము దీనివఱకు వ్యాపించెను ($25^{18}$). ఇశ్రాయేలీయులు ఎఱ్ఱసముద్రమును దాటిన పిమ్మట ఈ యరణ్యములోకి వచ్చిరి (నిర్గ $15^{22}$). ఈ పదము యొక్క అర్థమునుబట్టి చాలకాలము క్రిందట ఐగుప్తీయులు ఎఱ్ఱసముద్రమునుండి మధ్యధరా సముద్రమువఱకు కట్టిన గోడవలన ఆ ప్రదేశమునకీ పేరు వచ్చినదని కొందఱి యభిప్రాయము. ఎడారినుండి శత్రువులు తమమీఁదికి రాకుండునట్లు ఐగుప్తీయు లీ యడ్డుగోడను కట్టించిరి (అరణ్యము 3 (12) చూ॥).

**షూలమ్మీతి** (Shulamite). పరమగీతమునందు ప్రశంసింపఁబడిన యొక యువతి పేరు (పర $6^{13}$). ఈమె షూలేమునుండి వచ్చినట్లున్నది గాని సాధారణముగా **ల, న,** అను అక్షరములు అనేకపదములలో మాఱునట్లు ఇచ్చటను మాఱు

టచే నిది షూనేము అని యనుకొందురు. షూనేము స్త్రీలు సౌందర్యమునకు ప్రసిద్ధికెక్కిన వారగుటచే (I రాజు $1^{3}$ సరిపోల్చుము) ఈ పేరు పరమగీతమునందు వాడినట్లున్నది.

**షూవహు** (Shuah = పల్లము).

1. అబ్రాహాముకు కెతూరావలన కలిగిన వారిలో నొకఁడు (ఆది $25^{2}$). యుఫ్రాతు నదికి పడమరగా శుఖు (*Suchu*) అనువార లుండినట్లు రాతిశాసనములవలనఁ దెలియుచున్నది. ఆ పదము షూవహుకు సంబంధముగా నుండుటవలన అతని సంతతివారు నివసించిన స్థానమును సూచించునని కొందఱనుకొందురు. షూహీయుఁడైన బిల్దదు ఈ దేశపువాఁడై యుండును (యోబు $2^{11}$ $8^{1}$ $18^{1}$ $25^{1}$ $42^{9}$).

2. షూయా చూ॥

3. (Shuhah = పల్లము). యూదా సంతతి వారిలో నొకఁడు (I దిన $26^{42}$).

**షూషను** (Shushan). ప్రాచీన రాజ్యమగు ఏలామురొక్క రాజధాని పట్టణము. పారసీకదేశపు రాజగు కోరెషు దీనిని జయించి పారసీకరాజ్యపు మూఁడు రాచనగరులలో నొకటిగాఁ జేసెను. దాని $8^{2}$ నందుదాహరింపఁబడిన ప్రసిద్ధమగు షూషను రాజనగరము ఇదే. ఎస్తేరు గ్రంథమందలి సంగతు లిచ్చటనే జరిగెను (ఎస్తే $1^{2}$). ఇచ్చట నుండునప్పుడే నెహెమ్యా రాజు సెలవునొంది వెళ్లి యెరూషలేము గోడలు కట్టించెను (నెహె $1^{1}$). ఎజ్రా $4^{9}$ లోని షూషంకీయులు (*Shushanchites*) ఈ దేశస్థులై అష్నూరు చక్రవర్తిచే షోమ్రోనుకు పంపఁబడిరి. గ్రీకువారు దీనికి సూసా (*Susa*) యను పేరుపెట్టిరి. ప్రస్తుతము పర్షియా దేశములో నైరృతి దిక్కునందు సూస్ (*Sus*) అనునదే దీని యునికి (పటము VIII, E 2).

**షూషనేదూతు** షోషన్నీము చూ॥

**షూషన్కాయులు** (Shushanchites). వీరు షూషనువారు. అష్నూరు చక్రవర్తి వీరిలో గొందఱిని షోమ్రోనుకు పంపివేసెను (ఎజ్రా $4^{9}$ షూషను చూ॥).



**షూహాము** (Shuham = పల్లము). దాను కుమారులలో నొకఁడు (సంఖ్యా $26^{42}$). ఇతని సంతానీకులు షూహామీయులు (*Shuhamites*) అనఁబడిరి (సంఖ్యా $26^{42}$). ఆది $46^{23}$ నందు ఇతనికి హూషీము (*Hushim*) అనుపేరు మొదటి రెండక్షరములను మార్చుటవలన వచ్చెను.

**షూహీయుఁడు** షూవహు, బిల్దదు చూ॥

## షె

**షెకన్యా** (Shecaniah = దేవుఁడు నివసించును).

1. జెరుబ్బాబెలు సంతతివారిలో నొకఁడు (I దిన $3^{21,22}$ ఎజ్రా $8^{3}$).

2. బాబెలు చెఱనుండి తిరిగివచ్చినవారిలో నొకఁడు (ఎజ్రా $8^{5}$).

3. యాజకులలో 10 వ వంతుకు పెద్ద (I దిన $24^{11}$).

4. ఒక యాజకుఁడు (II దిన $31^{15}$).

5. ఎజ్రా కాలములో నున్న యొకఁడు (ఎజ్రా $10^{2}$).

6. యెరూషలేము ప్రాకారములను కట్టుటలో నెహెమ్యాకు సహాయముచేసిన షెమయా తండ్రి (నెహె $3^{29}$). ఇతఁడు 1 లోని వాఁడై యుండును.

7. అమ్మోనీయుఁడగు టోబీయా మామ (నెహె $6^{18}$).

8. జెరుబ్బాబెలుతో కూడ తిరిగివచ్చిన కుటుంబములలో నొకదాని పేరు (నెహె $12^{3}$). $10^{4}$ $12^{14}$ లో షెబన్యా అని యున్నది (షెబన్యా 1 చూ॥).

**షెకెము** (Shechem = భుజము).

1. ఎఫ్రాయిము స్వాస్థ్యమందు పురాతన కాలమునుండి యున్న యొక ప్రసిద్ధమగు పట్టణము. ఇది ఏబాలు గెరిజీము అను కొండల మధ్య నున్న లోయలో భుజమువలెనుండు మిట్టమీఁద నుండుటచే నీ పేరు కలిగెను. యుసుబియను (*Eusebius*) అను చరిత్రకారుఁ డిది షెకెము

అనువానివలన కలిగెనని చెప్పుచున్నాఁడు (ఆది $34^{2}$ $33^{18,19}$ క్రింద 2 చూ॥). దానికి మబోర్త (*Maborta*) యను పేరును కలదు గాని యది బైబిలునందు లేదు. యోసీఫను ఈ పదమును వాడెను. రోమీయులు పలెస్తీను నేలునప్పుడు దానికి నెయపొలి ( = క్రొత్తపేట) యను పేరు పెట్టిరి. వారు పెట్టిన పేరులు పలెస్తీనులో సాధారణముగా నిలువకపోయినను ఈ పేరు నేటి వఱకు నిలిచియున్నది. ప్రస్తుతము దానిని నబ్లూసు (*Nablus*) అని యందురు. దాదాపు 24,000 మంది ప్రస్తుతము దానిలో నున్నారు. వారిలో దాదాపు 700 మంది క్రైస్తవులును, 150 మంది గెరిజీము పర్వతముపై ఆరాధించు సమరయులును కొద్దిమంది యూదులును, మిగతవారందరు మహమ్మదీయులై యున్నారు. అచ్చట చాల ఊటలుండుటచే దాని చుట్టునుండు ప్రదేశము చాల ఫలవంతమైనదై యున్నది.

బైబిలునందు దీనిగూర్చిన సూచన లనేకములు గలవు. అబ్రాహాము పలెస్తీనుదేశములో మొట్ట మొదట మకాముచేసి దేవుని వాగ్దానములను నూతనముగా నొందెను (ఆది $12^{6}$). ఇచ్చట నున్న పొలము నొకదానిని యాకోబు హామోరు కుమారులయొద్ద కొనెను ($33^{18-19}$). యోసేపు నిచ్చట పాతిపెట్టిరి (యెహో $24^{32}$). స్తెఫను చేసిన ప్రసంగములో యాకోబును అతని కుమారులందఱును ఇచ్చటనే పాతిపెట్టఁబడినట్లు చెప్పెను (కార్య $7^{16}$) గాని యితర వాక్యములలో యాకోబును మక్పేలా గుహలో పాతిపెట్టినట్లున్నది (ఆది $49^{30}$ $50^{13}$). షెకెమనువాఁడిచ్చట తమ చెల్లెలైన దీనాను బలాత్కారము చేసినందున షిమ్యోను లేవియనువారు యుక్తిచేసి ఆ యూరి పురుషులనందఱిని చంపిరి (ఆది $34^{24-30}$ $37^{12,13}$). దేవుని యాజ్ఞలను ఇచ్చట ప్రచురించిరి (ద్వితీ $27^{12-14}$ యెహో $8^{33-35}$). ఎఫ్రాయిము



ఏబాలు, గెరిజీయు, షెకెము

మనష్షే గోత్రముల సరిహద్దులు దీనికి సమీపమందుండెను (యెహో $17^{7}$). లేవీయుల కియ్యఁబడిన 48 పట్టణములలోను ప్రత్యేకింపఁబడిన 6 ఆశ్రయపురములలో నొకటియై యున్నది ($20^{7}$ $21^{21}$). యెహోషువ ఇచ్చటనే తన చివరి ప్రసంగమును చేసెను ($24^{1}$). ఈ పట్టణమునందు

కనానీయులు చాల కాలమువఱకు నివసించిరి. బయల్బెరీతు అను అన్యదేవత నిచ్చట పూజించిరి (న్యాయా $9^{4}$). గిద్యోను ఉపపత్నులలో నొకతె ఈ పట్టణస్థురాలై యుండెను గాన ఆ పట్టణస్థులు ఆమె కుమారుఁడగు అబీమెలెకును తమకు రాజుగా నియమించుకొనిరి (న్యాయా $9^{1-6}$) గాని, తరు

వారి వారతనిపై నెదురుతిరిగినందున అతఁడు షెకెమును నాశనము చేసెను ($9^{23,24}$). షెకెము లోనే ఇశ్రాయేలీయులు రెహబాముకు మనవి చేయుటకై కూడిరి గాని అతఁడు తమ మనవిని విననందున యరొబాము నిచ్చటనే రాజుగా నియమించుకొని యూదావారినుండి వేఱుపడిరి (I రాజు $12^{1-19}$ II దిన $10^{1-19}$) యరొబాము దానిని తనకు రాజధానిగఁ జేసికొనెను (I రాజు $12^{25}$). ఇది దేవుఁడు పంచిపెట్టు స్థలమని కీర్త $60^{6}$ $108^{7}$ లో నున్నది. యెరూషలేము నశించిన పిమ్మట ఈ పట్టణమింక నిలిచియుండెను (యిర్మీ $41^{5}$). ఇది షోమ్రోనువారి ముఖ్య స్థానమైనటుల యోసీఫసువలనఁ దెలియును (పురా 11.8.6). మక్కబీయుల కాలములో యూదులు దానిని పట్టుకొనిరి (పురా 13 9.1). యోహా $4^{5}$ లో నుండు సుకారు ఇదేనని కొందఱి యభిప్రాయము గాని ఇవి దగ్గర దగ్గరగానుండు రెండు వెవ్వేఱు స్థలములై యున్నవి. యాకోబుబావి (యోహా $4^{6}$) అనునది నేటివఱకు నున్నది. అది షెకెము తూర్పు దిక్కుకు కొంచెము దక్షిణముగా క్రోసెడు దూరమున నున్నది. యోసేపు గోరీ కూడ తూర్పున క్రోసెడు దూరములో చూపె దరు, గాని దానిగూర్చి సందేహము గలదు.

2. యాకోబుకాలమున షెకెము పట్టణమం దున్న హమోరు అనువాని కుమారుఁడు. అతఁడు కనానీయుఁడు. ఆ దేశము నేలినవాఁడు (ఆది $34^{2}$). అతఁడు యాకోబు కుమార్తెయగు దీనాను బలాత్కారముచేసినందున షిమ్యోను లేవి యను వారు కుట్రచేసి షెకెములోని పురుషులతోపాటు ఇతనిని హతముచేసిరి ($34^{2-31}$ యాకోబు, హమోరు చూ॥).

3. మనష్షే కుటుంబములలో నొకదాని పెద్ద (సంఖ్యా $26^{31}$). ఆ కుటుంబమునకు షెకెమీయులను పేరుపెట్టిరి (సంఖ్యా $26^{31}$ యెహో $17^{2}$). I దిన $7^{19}$ లో నుండు షెకెము ఇతఁడే యని కొందఱును మఱియొకఁడని కొందఱభిప్రాయ పడుచున్నారు.

షెకెలు మానములు VI, నాణెములు III చూ॥.

షెతర్బోజ్నయి (Shether-Boznai) చెఱకాలమునకుఁ బిదప పలెస్తీనులో నున్న యొక పారసీక ఉద్యోగస్థుఁడు. ఇతరులతోకూడ ఇతఁడు యూదులు ఆలయమును కట్టకుండునట్లు వారి నాటంకపఱచెను (ఎజ్రా $5^{3,6}$ $6^{6}$).

షెతారు (Shethar). పారసీకదేశపు ఏడుగురు ప్రధానులలో నొకఁడు (ఎస్తే $1^{15}$).

షెదేయూరు (Shedeur = సర్వశక్తుఁడు వెలుఁగును). అరణ్యములో రూబేనీయులకు ప్రధానిగా నున్న ఏలీసూరు తండ్రి (సంఖ్యా $1^{5}$ $2^{10}$ $7^{30}$ $10^{18}$).

షెనజ్జరు (Shenazzar = చంద్ర దేవతా, రక్షింపుము). బాబెలువారిచే పట్టఁబడిన యూదా రాజగు యెకొన్యా కుమారులలో నొకఁడు (I దిన $3^{18}$). ఇచట కుమారుఁడను పదమునకు సంతతి వాఁడని యర్థముకావచ్చును. కొందఱిది ఎజ్రా $1^{8,11}$ లో నుండు షేష్బజ్జరు అను పేరుకు మాఱు రూపమనుకొందురు (షేష్బజ్జరు చూ॥).

షెపాము (Shepham). కనాను ఉత్తరపు హద్దులో రిబ్లాదగ్గరనున్న యొకస్థలము (సంఖ్యా $34^{10,11}$). దానియునికి తెలియదు. I దిన $27^{27}$ లో షిప్మీయుఁడగు జబ్ది ఈ యూరివాఁడు కావచ్చును (షిప్మీయుడు చూ॥).

షెపూపాను (Shephuphan = ఒక విధమైన పాము?). బెన్యామీనీయులలో నొక కుటుంబపుపెద్ద (I దిన $8^{5}$). ఆది $46^{21}$ లో నితనికి ముప్పీము, I దిన $7^{12}$ $26^{16}$ లో షుప్పీము, సంఖ్యా $26^{40}$ లో షూఫాము అను పేరులు గలవు. ఆ కుటుంబికులకు షూఫామీయులు అను పేరుగలదు (ముప్పీము చూ॥).

షెఫట్యా (Shephetiah = దేవుఁడు తీర్పు చేసెను).

1. దావీదు కుమారులలో నొకఁడు (II సమూ $3^{4}$ I దిన $3^{3}$).

2. దావీదును సిక్లగులో కలిసికొనిన యొక బెన్యామీనీయుఁడగు యోధుఁడు (I దిన $12^{5}$).

3. సొలొమోను సేవకుల వంశస్థులలో నొక కుటుంబము (ఎజ్రా $2^{57}$ = నెహె $7^{59}$).

4. యెహోషాపాతు కుమారులలో నొకఁడు (II దిన 21[2]).

5. యిర్మీయా కాలములో జీవించిన యొకఁడు (యిర్మీ 38[9]).

6. షిమ్యోను వారిలో నొక ప్రధాని (I దిన 27[16]).

7. బెరుబ్బాబెలుతోను ఎజ్రాతోను తిరిగి వచ్చిన వారిలో నొక కుటుంబము (ఎజ్రా 2[4] = నెహె 7[9] ఎజ్రా 8[8]).

8. యూదావారి సంబంధులలో నొక కుటుంబము (నెహె 11[4]).

9. బెన్యామీనీయులలో నొక కుటుంబము (I దిన 9[8]). 8, 9 లలో నున్న యేదో యొక కుటుంబము 7-వ దానికి సంబంధించియుండును.

షెఫేలా (Shephelah = పల్లపు భూమి). యూదయ మన్యప్రాంతమునకు ఫిలిష్తీయుల బయలునకును మధ్యనున్న గుట్టల ప్రదేశము. ఇవి అంత ఎత్తయినవి గాక 500—800 అడుగులు మాత్రముండుటచే యూదా కొండ ప్రాంతము నుండి చూచువారికి పల్లపుభూములవలె కనఁబడును. ఈ రెండు ప్రదేశములకు మధ్యగా ఉత్తరమున నున్న అయ్యాలోను నుండి దక్షిణమందున్న బెయేర్షెబావఱకు ఒక లోయ వ్యాపించును. ఈ ప్రదేశముగుండా శోరేకు ఏలా అను లోయలు సముద్రతీరమునకు వ్యాపించును. అదుల్లాము, బేత్షెమెషు, గెదెరు ఎగ్లోను లాకీషు అను పట్టణములీ ప్రాంతమున గలవు. ఈ ప్రదేశపు పేరును తెనుఁగు బైబిలునందు యెహో 10[40] I రాజు 10[27] I దిన 27[28] II దిన 9[27] లో మాత్రముంచిరిగాని యిర్మీ 17[26] ఓబ 19 జెక 7[7] లో మైదానమనియు, ద్వితీ 1[7] లో మన్నెము అనియు తెనిఁగించిరి (పలెస్తీను III 2 చూ॥).

షెబ (Sheba = ప్రమాణము)

1. ఒక బెన్యామీనీయుఁడు. ఇతఁడు పది గోత్రములవారిని దావీదురాజ్యమునుండి వేఱు పఱచుటకై యత్నించి దావీదుమీఁద యుద్ధము చేసెను. ఇతఁడున్న కోటవారొక స్త్రీచే ప్రేరేపింపఁబడి ఇతనిచంపి తలను దావీదు సైన్యాధిపతియగు యోవాబున కప్పగించిరి (II సమూ 20[1-22]).

2. గాదు సంతతివారిలో నొకఁడు (I దిన 5[13]).

3. షిమ్యోను పట్టణములతోఁగూడ నుదాహరింపఁబడిన యొక పట్టణము. యెహో 19[2] నందు 13 పట్టణములకు మాఱు 14 పట్టణము లుండుటవలన ఇది పొరబాటుగా వచ్చినదని చెప్ప వచ్చును. దీనికి పూర్వపదమగు బెయేర్షెబాలోని చివరి రెండక్షరములను రెండుమారులు వ్రాయుట వలన ఈ పొరబాటు కలిగినదనుకొందురు. కొన్ని హెబ్రీప్రతులయందీ పదము కనఁబడదు. దీనికి సంబంధించిన I దిన 4[28] లో నున్న జాబితాయందును లేదు. కొన్ని ప్రతులలో షెమ యని యున్న పదము సరియని కొందఱి యభిప్రాయము.

షెబన్యా (Shebeniah = యెహోవా నన్ను తిరిగి రప్పించెను).

1. లేవీయుల కుటుంబములలో నొకటి (నెహె 9[4] 10[10]).

2. ఎజ్రా కాలములో నిబంధనను ముద్రించిన వారిలో నొక యాజకుఁడు (నెహె 10[4] 12[14]). ఇతనికి షెకన్యా అను పేరుగలదు (షెకన్యా 8 చూ॥).

3. నిబంధనను ముద్రించినవారిలో నొక లేవీయుఁడు (నెహె 10[12]).

4. ఒక యాజకుఁడు (I దిన 15[24]).

షెబాయీయులు షెబా I చూ॥

షెబారీము (Shebarim = ముక్కలు, గనులు). హాయిపట్టణస్థులు ఇశ్రాయేలీయులను తరిమిన యొక స్థలము (యెహో 7[5]). ఈ పదమును గనులు అని తర్జుమాచేయుట యుక్తమని కొందఱి యభిప్రాయము. ఇది హాయిదగ్గరనున్నదనుటగాక దీని ఉనికినిగూర్చి యేమియు తెలియదు.

షెబూయేలు, షూబాయేలు (Shebuel, Shubael = దేవునిచే పట్టఁబడినవాఁడు).

1. మోషే కుమారుఁడగు గెర్షోముయొక్క పుత్రుఁడు. లేవీయుల తెగలలో నొకదానికి పెద్ద (I దిన 23[16] 26[24]). I దిన 24[20] లో ఇతనికి షూబాయేలు అను పేరుగలదు.

2. హేమాను సంతతివారిలో నొక కుటుంబము వీరు దావీదుకాలమందున్న పాటకులై యుండిరి (I దిన $25^{4}$).

షెబెరు (Sheber = విఱుగఁగొట్టుట). కాలేబుకొడుకులలో నొకఁడు (I దిన $2^{48}$).

షెబ్నా (Shebna = సాత్వికము). రాజైన హిజ్కియా కాలమందుండిన యొక గొప్ప ఉద్యోగి. ఇతఁడు మొదట హిజ్కియాయొక్క గృహనిర్వాహకుఁడై యుండి తనకొఱకొక గొప్ప సమాధిని యెరూషలేమునందు డంబార్థమై కట్టించుకొనెను. అతఁడా యుద్యోగమునుండి తొలగింపఁబడునని యెషయా ప్రవచించెను (యెష $22^{15-25}$). అతనికి ప్రతిగా ఎల్యాకీము గృహనిర్వాహకుఁడయ్యెను. తరువాత అతఁడు ఎల్యాకీమునకు తరువాతివాఁడైనట్లు ప్రధానమంత్రిగా తెలుఁగున పేర్కొనఁబడెను (II రాజు $18^{18-26,37}$ $19^{2}$ యెష $36^{3,11,22}$ $37^{2}$). ఈ పదమునకు లేఖకుఁడనికూడ అర్థముకావచ్చును. షెబ్నా యూదుఁడు కాఁడని యందురు.

షెమ (Shema = కీర్తి).

1. ఒక రూబేనీయుఁడు (I దిన $5^{8}$ షిమీ 6 చూ॥).

2. గాతువారిని తరిమిన ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{13,21}$).

3. ఎజ్రా ధర్మశాస్త్రమును చదువఁగా అతని కుడిప్రక్కను నిలిచినవారిలో నొకఁడు (నెహె $8^{4}$).

4. యూదా దక్షిణభాగమందుండిన యొక ఊరు (యెహో $15^{26}$). I దిన $2^{44}$ లో హెబ్రోను కుమారులలో షెమ యను పేరు ఇది కావచ్చును.

షెమయా (Shemaiah = యెహోవా ఆలకించెను).

1. రెహబాము కాలమందున్న యొక ప్రవక్త. రెహబాము 10 గోత్రములవారిమీఁద యుద్ధము చేసి వారిని మఱల లోఁబఱచుకొన యత్నించుచుండఁగా ఇతఁడాపని నడ్డగించెను (I రాజు $12^{22-24}$ II దిన $11^{2}$). షీషకు రెహబాముపై యుద్ధమునకు వచ్చినప్పు డితఁడు అది యూదా వారి పాపమునకు శిక్షగా కలిగినదని ప్రకటించెను. యూదులు పశ్చాత్తాపపడఁగా ఆ శిక్ష తొలఁగిపోయెను ($12^{5-8}$). ఇతఁడు రెహబాము యేలుబడినిగూర్చిన చరిత్రను వ్రాసెను (II దిన $12^{15}$).

2. జెరుబ్బాబెలు సంతతివాఁడగు షెకన్యా కుమారుఁడు (I దిన $3^{22}$).

3. యెరూషలేము ప్రాకారములను కట్టుటకు సహాయముచేసినవారిలో నొకఁడు (నెహె $3^{29}$). 2, 3 లో నుదాహరించిన వారిద్దరు నొకరే కావచ్చును.

4. షిమ్యోను సంతతివారిలో నొకఁడు (I దిన $4^{37}$). $4^{26,27}$ లో నుండు షిమీ ఇతఁడై యుండును (షిమీ 5 చూ॥).

5. రూబేను సంతతివారిలో నొకఁడు (I దిన $5^{4}$). $5^{8}$ లో నున్న షెమ యితఁడు కావచ్చును (షెమ 1 చూ॥).

6. యెరూషలేమునందు నివసించిన మెరారీ తెగవారిలో నొకఁడు (I దిన $9^{14}$).

7. ఒక లేవీయుఁడు (I దిన $9^{16}$). నెహె $11^{17}$ లో నితనికి షమ్మూయ అను మాఱుపేరు గలదు (షమూయా 3 చూ॥).

8. దావీదుకాలమందు యాజకుల పేరులను వంతులప్రకారము దాఖలు చేసినవాఁడు (I దిన $24^{6}$).

9. దావీదుకాలమునందు కహాతీయులకు పెద్దయైన వాఁడు. ఇతఁడు ఎలీసాపాను కుటుంబికుఁడు (I దిన $15^{8,11}$). 8, 9 లోని వారొకరే కావచ్చును.

10. కోరహు తెగకు సంబంధించిన యొక లేవీయుఁడు. ఇతఁడు ఓబేదెదోము కుమారుఁడు (I దిన $26^{4,6,7}$).

11. రాజగు యెహోషాపాతు ధర్మశాస్త్రమును బోధించ నియమించిన యొక లేవీయుఁడు (II దిన $17^{8}$).

12. హిజ్కియా కాలమున దేవాలయమును పవిత్రపఱచుటకై సహాయపడిన లేవీయులలో నొకఁడు (II దిన $29^{14}$).

13. యూదుల స్వేచ్ఛార్పణములమీఁద నియమింపఁబడిన వారిలో నొక లేవీయుఁడు (II దిన $31^{15}$).

14. లేవీయులలో నొక యధికారి (II దిన $35^{9}$).

15. ఎజ్రా క్రిందనున్న ఒక పెద్ద (ఎజ్రా $8^{16}$). ఎజ్రా ఇతనిని లేవీయులను గొనితెచ్చుటకు బంపెను.

16. అదోనీకాము కుమారులలో నొకఁడు (ఎజ్రా $8^{13}$).

17. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టినవారిలో నొక యాజకుఁడు (ఎజ్రా $10^{21}$).

18. అదేపనిచేసిన యాజకుఁడుకాని యొకఁడు (ఎజ్రా $10^{31}$).

19. నెహెమ్యా పారిపోవునట్లు శత్రువులచే లంచముదిని అతని బెదరించినవాఁడు (నెహె $6^{10-14}$).

20. యాజకులలోని 24 వంతులలో నొక వంతు పెద్ద (నెహె $10^{8}$ $12^{6,18}$).

21. యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించిన సమయమున అచ్చటనున్న వారిలో నొకఁడు (నెహె $12^{34}$).

22. ఆసాపు సంతతివాఁడగు ఒక యాజకుఁడు (నెహె $12^{35}$).

23. యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠించినప్పుడున్న పాటకులలో నొకఁడు (నెహె $12^{36}$).

24. అదేపనిజేసిన మఱియొకఁడు (నెహె $12^{42}$). 23, 24 లోని వారొకరే గావచ్చును.

25. ఊరియా యను ప్రవక్తతండ్రి (యిర్మీ $26^{20}$).

26. యెహోయాకీను కాలములో చెఱపట్టఁబడిన యొక ప్రవక్త. ఇతఁడు యిర్మీయాను విరోధించినవాఁడు (యిర్మీ $29^{24-32}$). ఇతని కుటుంబము నాశనమగునని యిర్మీయా ప్రవచించెను.

27. రాజైన సిద్కియాకాలమందుండిన యొక ఘనుఁడు (యిర్మీ $36^{12}$).

28. దావీదును సిక్లగులో కలిసికొనిన యొక బెన్యామీనీయుఁడు (I దిన $12^{3}$).

**షెమర్యా** (Shemariah = దేవుఁడు కాపాడెను).

1. దావీదును సిక్లగులో కలిసికొనిన యొక బెన్యామీను యోధుఁడు (I దిన $12^{5}$).

2. రెహబాము కుమారులలో నొకఁడు (II దిన $11^{19}$).

3. అన్యస్త్రీలను వివాహముచేసికొని ఎజ్రా ప్రేరేపణలవలన వారిని విడిచినవారిలో నొకఁడు. ఇతఁడు హారీము సంతతివాఁడు (ఎజ్రా $10^{32}$).

4. అదే పనిజేసిన బానీ సంతతివాఁడు (ఎజ్రా $10^{41}$).

**షెమీదా, షెమీదాయీయులు,** (Shemida = జ్ఞానమునకు కీర్తి, Shemidites). గిలాదులో నున్న కుటుంబమునకు పెద్ద (సంఖ్యా $26^{32}$). గిలాదులో నున్న యితరులవలె వీరును మనష్షేగోత్రికులు (యెహో $17^{2}$). అతని సంతతి వారిపేరులు I దిన $7^{19}$ లో నున్నవి. ఆ సంతతి వారిని షెమీదాయీయులు (సంఖ్యా $26^{32}$) షెమీదీయులు (యెహో $17^{2}$) అని పిలిచిరి.

**షెమీరామోతు** (Shemiramoth = ఎత్తయిన నామము).

1. దావీదుకాలమునందు లేవీయులలో సంగీత నాయకుఁడు (I దిన $15^{18-20}$ $16^{5}$).

2. ప్రజలకు ధర్మశాస్త్రమును బోధించుటకు రాజగు యెహోషాపాతు ఏర్పఱచిన వారిలో నొకఁడు (II దిన $17^{8}$).

**షెమూయేలు** (Shemuel = దేవుని నామము). సమూయేలు అను పదమునకు సాటియైనది.

1. పలెస్తీనుదేశమును భాగించుటకు నియమింపఁబడినవారిలో నొకడు. ఇతఁడు షిమ్యోనీయుల ప్రతినిధి (సంఖ్యా $34^{20}$). ఇది సంఖ్యా $1^{6}$ $2^{12}$ $7^{36,41}$ $10^{19}$ లో నుండు షెలుమీయేలు అను పేరుకు మాఱురూపమై యుండవచ్చును.

2. ఇశ్బాఖారు కుమారుఁడు. ఇతఁడొక తెగ వారికి పెద్దయయ్యెను (I దిన $7^{9}$).

షెమెదు షెమెరు చూ॥

షెమెరు, షమెరు, షామేరు, షెమెదు (Shemer = ద్రాక్షారసపుమడ్డి).

1. షోమ్రోనుపట్టణము కట్టఁబడినకొండ యజమాని. ఒమ్రీ యితనియొద్ద ఆ కొండను కొని పట్టణమును కట్టించి యితని పేరట దానికి షోమ్రోను అనుపేరు పెట్టెను (I రాజు $16^{24}$). (షోమ్రోను చూ॥).

2. లేవిగోత్రములోని మెరారి తెగవారి యందలివాఁడు (I దిన $6^{46}$).

3. ఆషేరు సంతతివారిలో నొకఁడు (I దిన $7^{34}$).

4. బెన్యామీనీయులలో నొకఁడు (I దిన $8^{12}$). ఇచ్చట షెమెదు అనురూపము హెబ్రీ భాషలోని ర, ద అను అక్షరముల సమపోలిక వలన వచ్చినది.

షెమేబరు (Shemeber). సబోయీముల రాజు. ఇతఁడు కాదెలు ప్రాంతమునుండి వచ్చిన నలుగురురాజులచేత నోడిపోయిన వారిలో నొకఁడు (ఆది $14^{2,8,10}$).

షెయెరా (Sheerah = బంధువురాలు). ఎఫ్రాయిము కుమార్తె లేక మనుమరాలు (I దిన $7^{24}$). ఈమె సంతతివారు బేత్హోరోనులను రెంటిని ఉజ్జెన్షెయెరను (= షెయెరాభాగము) కట్టించిరి.

షెయర్యా (Sheariah = యెహోవా ఘనపరచును). సౌలు కుమారుఁడగు యోనాతాను సంతతివారిలో నొకఁడు (I దిన $8^{38}$).

షెయార్యాషూబు (Shear-Jashub = కొంతశేషము మరలును). యెషయా తన కుమారులలో నొకనికిపెట్టిన సార్థకనామము (యెష $7^{3}$). అష్షూరీయులచే చెరపట్టఁబడఁబోవు ఇశ్రాయేలీయులలో నొక శేషము తిరిగి స్వదేశమునకు వచ్చునని ఈ నామముచే అతఁడు సూచించెను. ఇది సూచనరీతిగానే గాక వాస్తవరీతిగను యెష $7^{14}$ $8^{1-4,18}$ $10^{20,21}$ లోను గలదు (యెషయా చూ॥).

షెయాలు (Sheal = అడుగుట). అన్య స్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలనవారిని విడిచినవారిలో బానీ సంతతివాఁడు (ఎజ్రా $10^{29}$).

షెరెషు (Sheresh = వేరు!) మనష్షేయులలో మాకీరు తెగయం దొక కుటుంబపు పెద్ద. ఇతనివలన ఆ కుటుంబమునకు షెరెషు అను పేరు కలిగినది (I దిన $7^{16}$).

షెలపు (Sheleph = ఉత్పత్తి). షేము సంతతివారిలో యొక్తాను కుటుంబమునందు పుట్టిన యొకఁడు (ఆది $10^{26}$ 1 దిన $1^{20}$). యొక్తాను సంబంధు లందఱివలె వీరును. అరబ్బీదేశపు దక్షిణ భాగమునందు నివసించినవారు. అచ్చట షల్ఫ (*Shalf*) అను పేరు సర్వసాధారణమైనది గాని ఈ కుటుంబపు ఉనికేదియో తెలియదు.

షెలహు - షేలహు చూ॥

షెలుమీయేలు (Shelumiel = దేవుఁడు శాంతపఱచఁబడెను). ఇశ్రాయేలీయులు అరణ్యమందుండఁగా షిమ్యోనీయుల ప్రధాని (సంఖ్యా $1^{6}$ $2^{12}$ $7^{36,41}$ $10^{19}$). షెమూయేలు. అను నది దీనికి మాఱురూపము కావచ్చును (సంఖ్యా $34^{20}$ షెమూయేలు చూ॥).

షెలెమ్యా (Shelemiah = యెహోవా ప్రతిఫల మిచ్చును).

1. దావీదుకాలమున నున్న ఒక ద్వారపాలకుఁడు I దిన $26^{14}$).

2. యెహూది తాత (యిర్మీ $36^{14}$).

3. అబ్దెయేలు కుమారుఁడు (యిర్మీ $36^{26}$).

4. యెహోకాలు అనువాని తండ్రి (యిర్మీ $37,^{3}$ $38^{3}$).

5. యిరీయా యనువాని తండ్రి (యిర్మీ $37^{13}$).

6, 7. అన్యస్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణలవలన వారిని విడిచిపెట్టి వారిలో బానీసంతతివార లిద్దఱు (ఎజ్రా $10^{39,41}$).

8. నెహెమ్యాకు సహాయముచేసిన హనన్యా తండ్రి (నెహె $3^{30}$).

9. నెహెమ్యా కాలమందున్న ఒక యాజకుఁడు. లేవీయులకు ఆహారము పంచిపెట్టుటకు నియమింపఁబడిన వారిలో నితఁ డొకఁడు (నెహె $13^{13}$).

షెలెషు (Shelesh = మూఁడింతలు). ఆషేరు సంతతివారిలో నొకఁడు (I దిన $7^{35}$).

షెలోమి (Shelomi = శమ్మదిగల). అరణ్యము నందుండఁగా ఆషేరు గోత్ర ప్రధానియైన అహీహూదు తండ్రి (సంఖ్యా $34^{27}$).

షెలోమీతు, షెలోమోతు (Shelomith, Shelomoth = సమాధానము).

1. ఇశ్రాయేలీయు లరణ్యమందుండఁగా దేవుని నామమును దూషించినందున రాళ్లతో కొట్టఁబడి చంపఁబడినవాని తల్లి (లేవీ $24^{11}$).

2. లేవీయులలోని కహాతు సంతతివారియందు యిస్హారనువాని కొడుకు (I దిన $23^{18}$). I దిన $24^{22}$ నందితనికి షెలోమోతు అను పేరు గలదు.

3. మోషే సంతతివారిలో నొకఁడు (I దిన $26^{25}$).

4. లేవీయులలో గెర్షోను తెగవారిలో నొకఁడు (I దిన $23^{9}$).

5. రాజగు రెహబాము కుమారులలో నొకఁడు (II దిన $11^{20}$).

6. చెఱకాలమునకుఁ దరువాత ఎజ్రాతో కూడ యెరూషలేమునకు తిరిగి వచ్చిన వారిలో నొక కుటుంబము (ఎజ్రా $8^{10}$).

7. జెరుబ్బాబెలు కూతురు (I దిన $3^{19}$).

షెవా (Sheva = డంబము).

1. కాలేబు కొడుకులలో నొకఁడు (I దిన $2^{49}$).

2. షవ్షాయొక్క మాఱుపేరు (షవ్షా చూ॥).

షెహర్యా (Shehariah = యెహోవా అరుణోదయమువలె వచ్చెను). బెన్యామీను సంతతి వారిలో నొకఁడు (I దిన $8^{26}$).

## షే

షేతు (Seth = నియమింపఁబడినవాఁడు). ఆదాము కుమారులలో మూఁడవవాఁడు (ఆది $4^{25}$ $5^{3}$ I దిన $1^{1}$ లూ $3^{38}$). హేబెలు చంపఁబడిన పిమ్మట అతనికి ప్రతిగా ఇతనిని పొందితినని హవ్వ యాతని కీ సార్థకనామము పెట్టెను. సైరాక్సు $49^{16}$ లో నితఁడు షేముతో కూడ ఘనులలో నొకఁడుగా ఎంచఁబడినట్లుగా నున్నది.

షేను (Shen = పల్లు లేక పల్లువంటి బండ). ఫిలిష్తీయులపై కలిగిన జయసూచనగా సమూయేలు నిలువఁబెట్టిన స్థలమును గుర్తించుటకు మిస్పాతో కూడ చెప్పఁబడిన యొక స్థలము (I సమూ $7^{12}$). అది యీ రాతిని నిలిపిన ఎబెనెజరునకు సమీపమున నున్నది గాని దాని ఉనికిని గూర్చి మరేమియు తెలియదు. LXX నందు దీనికి యెషానాసు అను పేరుబెట్టిరి. ఆ పేరు మన బైబిలులో II దిన $13^{19}$ లో నున్నది. అదే ఈ స్థలమై యుండవచ్చును. (యెషానాను చూ॥).

షేబ, సెబా (Sheba = ప్రమాణము). 1. అరబ్బీదేశమునందు నైరృతి దిక్కునందు ఒక ప్రాచీనరాజ్యము. ప్రస్తుతమునం దాభాగమునకు యెమెన్ (*Yemen*) అను పేరుగలదు. ఆ ప్రాంతములందుండువారు హాము సంతతివారై నట్లున్నది (ఆది $10^{7}$ I దిన $1^{9}$) గాని ఆది $10^{28}$ I దిన $1^{32}$ ను బట్టి వారు షేము సంతానమని చెప్పవలసివచ్చును. ఆ భాగమునందే రెండు జాతుల వారు కలిసియుండినట్లు దీనివలనను ఇంక నితర సూచనవలనను అనుకొనవచ్చును. ఈ దేశమును గూర్చి యనేక సూచనలు బైబిలునందు గలవు. అచ్చట బంగారు మిక్కుటముగా నున్నది (కీర్త $72^{15}$). సాంబ్రాణియు అచ్చటనుండి వచ్చును (యిర్మీ $6^{20}$). ఆ జనులు గొప్ప వర్తకులు (యెహె $27^{22,23}$ $39^{13}$). వారి వర్తకపు బిడారులనుగూర్చి యోబు గ్రంథమునందొక సూచనగలదు (యోబు $6^{19}$). ఆ కాలమునందున్నవారు చేసినట్లు వీరును ఇతరుల ఆస్తిని దోచుకొని ఆ దోపుడు సొమ్ముపెట్టి వ్యాపారములు చేసినట్లు యోబు $1^{15}$ వలన నూహింపవచ్చును. అక్కడను యోవే $3^{8}$ లో నుదాహరింపఁబడిన షెబాయీయులు వీరే. యెష $45^{14}$ లోని సెబాయీయులును వీరే యని సాధారణముగా నందురుగాని వారు ఐతియోపీయులని కొందఱి తాత్పర్యము. వారు బానిస వర్తకముకూడ చేసినట్లు యోవే $3^{8}$ వలనఁ దెలియును. ఈ దేశస్థు లెంతస్థితిగలవారైనను చివరకు ఇశ్రాయేలీయులకు లోఁబడి తమ ధనమును యెహోవా కర్పింతురను భావమిచ్చు ప్రవచన

ములు గలవు (యెష. 60$^{6}$ కీర్త 72$^{10}$). బైబిలు నందు చెప్పఁబడిన సంగతు లీ జనాంగమునకు చక్కఁగా సరిపడును. అష్షూరువారి రాతిశాసనములలోను గ్రీకువారి గ్రంథములలోను వీరి వర్తకమునుగూర్చిన సంగతులు గలవు. వానికిని బైబిలు నందున్నవానికిని చాల సంబంధమున్నది. ఈ దేశపు రాణినిగూర్చియు బైబిలునందు ప్రస్తావ మొకటి గలదు (షేబదేశపురాణి చూ॥).

**షేబ దేశపు రాణి** (Queen of Sheba). అరబ్బీదేశములో నున్న షెబా అను రాజ్యము నేలినరాణి. ఈమె సొలొమోను వైభవమును గూర్చి విని అతని దర్శించి కానుక లర్పించెను (I రాజు 10$^{1-10}$ II దిన 9$^{1-12}$). మ 12$^{42}$ నందీమె **దక్షిణదేశపు రాణి** యనఁబడెను. బైబిలునందున్నదిగాక ఈమెనుగూర్చి మరే వాస్తవసంగతులు తెలియవు (షేబ చూ॥).

**షేము** (Shem = పేరు). నోవహు కుమారుఁడు (ఆది 5$^{32}$ 6$^{10}$). నోవహు పెద్ద కుమారుఁడని సూచించుటలో లేక హెబ్రీయుల పూర్వీకుఁడని సూచించుటలో నితని పేరు హాము యాపెతు పేరులకు ముందు కనఁబడును. ఆది 10$^{21}$ లో పెద్దవాడయిన అను మాట యాపెతుకు గాక షేముకు చెందును. జలప్రళయము వచ్చినప్పటికి ఇతఁడు 98 సంవత్సరముల ప్రాయము గలవాఁడు (7$^{13}$). జలప్రళయము కలిగిన రెండు సంవత్సరములకు షేము అర్పక్షదును కనెను. హెబ్రీయులు అర్పక్షదు మనుమఁడైన ఏబెరు, ఏబెరు కుమారుఁడైన పెలెగు సంతతివారై యున్నారు (ఆది 11$^{12-16,\ 18-26}$). అరబ్బీయుల లోని యనేక తెగలవారు ఏబెరు కుమారుఁడగు పెలెగు సంతతివారు (10$^{15-30}$). షేము కుమారులగు ఏలాము అష్షూరు లూదు అరాము అను వారాయా జనాంగముల మూలపురుషులై యున్నారు (10$^{22}$). షేము ఏనూరేండ్లు బ్రతికి చనిపోయెను (11$^{10,11}$). హెబ్రీయుల కాలక్రమణిక ప్రకారము షేము జీవించిన మొదటి నూరేండ్లలో మెతూషెలను, మెతూషెల 243 యేండ్లవాఁడై యుండఁగా ఆదామును బ్రతికి యుండిరని కనఁబడుచున్నది. షేము చనిపోయి నప్పుడు అబ్రాహాముకు 148 సం॥ల వయస్సు గలవాఁడు. షేము తన తండ్రివలన ఆశీర్వాదము నొందెను (9$^{26}$). ఈ యాశీర్వాదము యెహోవాకు స్తుతివాక్యముగాను తరువాత షేముయొక్క దేవుఁడని బయలుపర్చునదిగా నున్నది. షేము వంశములనుండి ఇశ్రాయేలీయుల మూలపురుషులును చివరకు మెస్సీయయును పుట్టిరి (లూ 3$^{23-36}$). యూదులలోను క్రైస్తవులలోనున్న పండితులనేకులు ఆది 9$^{27}$ లో కనఁబడు ఆశీర్వాదములో దేవుఁడు షేము గుడారములో నివసించును అనియున్న భాగమును హెబ్రీయులు నమ్మెదరని తెలుపుచున్నారు (నిర్గ 25$^{8}$ సంఖ్యా 5$^{3}$). యాపెతు షేము గుడారములో నివసించుననియు దేవుని సంఘమందు రాష్ట్రికులు ప్రవేశించుట ఆత్మీయార్థముగా సిద్ధించెనని మఱికొందఱు నమ్మెదరు (ఎఫె 2$^{13,14}$ 3$^{6}$). కనానీయులు షేముకు దాసులగుదురనునది (ఆది 9$^{26}$) వారు ఇశ్రాయేలీయులకు లోఁబడుటలో కొంతవఱకు సిద్ధించెను (యెహో 23$^{4}$ II దిన 8$^{4,7,8}$ ఆది 10$^{15-18}$ 15$^{18-21}$). షేము సంతతివారు నివసించు భాగములు యాపెతు హాము సంతతివారి భాగములు కలిసియుండును. సెమిటిక్ భాష మాట్లాడువారు షేము సంతానికులని తెలియుచున్నది. వీరిలో హెబ్రీయులు, కల్దీయులు, సిరియనులు, అరబీయులు, ఐతియోపీయులు మొదలగువారు గలరు, గాని హాము సంతతిలోని వారనేకులు సెమిటిక్ భాషలను వాడిరి. H.

**షేరేబ్యా** (Sherebiah = యెహోవా వణుకు పుట్టించును).

1. జెరుబ్బాబెలుతో కూడ తిరిగి వచ్చిన లేవీయుల పెద్దలలో నొకఁడు (నెహె 12$^{8}$). ఈ కుటుంబ పెద్ద నిబంధనకు ముద్ర వేసిన వారిలో నొకఁడు (10$^{12}$). ఆ కుటుంబికులు గాయకులై యుండిరి (12$^{24}$).

2. ఎజ్రాతోకూడ తిరిగివచ్చిన లేవీయుల పెద్దలలో నొక కుటుంబికుఁడు (ఎజ్రా 8$^{18}$). ఇతఁడుపై 1 లోని కుటుంబికులలో నొకఁడు కావచ్చును. అట్లయిన యెడల ఆయన మొదట వెళ్లిన యూదులతో వెళ్లక వెనుక నిలిచిపోయెను గాని ఎజ్రా వెళ్లినప్పు డతనితో కలిసి వెళ్లెను. ఈ కుటుంబికులలో నొకఁడు ఎజ్రా ధర్మశాస్త్రమును వినిపింపఁగా దానిని వివరించినవారిలో

మండెను (నెహె $8^{7}$). తాముచేసిన పాపమును ఒప్పుకొన్నవారిలోను ఇతడుండెను ($9^{4}$).

**షేలా, షేలహు (Shelah).**

I. ( = చిగురు).

1. అర్పక్షదు కుమారులలో నొకఁడు (ఆది $10^{24}$ $11^{12-15}$ I దిన $1^{18}$). ఇతఁడు అర్పక్షదు మనుమఁడైనట్లు ఆ వంశావళి క్రమణికవలనఁ దెలియును.

2. యెరూషలేమునందున్న యొక మడుగు (యెరూషలేము A III 3 చూ॥).

II. ( = ప్రార్థన). కనానీయుఁడగు షూయ కుమార్తెవలన యూదాకు పుట్టిన కుమారులలో చివరివాఁడు (ఆది $38^{5,11,14,26}$ $46^{12}$ సంఖ్యా $26^{20}$ I దిన $2^{3}$ $4^{21}$). ఇతని సంతతివారు షేలాహీయు లనఁబడిరి (సంఖ్యా $26^{20}$). నెహె $11^{5}$ I దిన $9^{5}$ లో నున్న షిలోనీయుడు ఈ కుటుంబికులలో నొకఁడగుటచే ఆ బిరుదు వచ్చియుండును.

**షేషయి (Sheshai = తెల్లని).** అనాకు వంశపు వారనఁబడిన దీర్ఘదేహులలో నొక తెగ వారు. వీరు హెబ్రోనులో నివసించిరి. కాలేబు వారి నచ్చటనుండి వెళ్లఁగొట్టెను (సంఖ్యా $13^{22}$ యెహో $15^{14}$ న్యాయా $1^{10}$).

**షేషాకు (Sheshach).** బబులోనుకు ఒక గూఢ నామము (యిర్మీ $25^{26}$ $51^{41}$). హెబ్రీ భాషలోని అక్షరములను ఒక విధముగా మార్చుట వలన ఈ పేరు వచ్చునని అనుకొందురు గాని కొందఱట్లుగాక, ఆ కాలమున బబులోనుకు వాడుకగానున్న మాఱుపేరని యెంతురు.

**షేషాను (Sheshan).** యూదా వంశస్థు లలో యెరహ్మెయేలు కుటుంబకులలో నొకఁడు. ఇతనికి కుమార్తెలేగాని కుమారులు లేకపోయిరి. తన కుమార్తెలలో నొకతెను ఐగుప్తీయుఁడగు తన దాసుని కిచ్చి వివాహము చేసెను (I దిన $2^{31,34,35}$).

**షేష్బజ్జరు (Sheshbazzar).** చెఱలో నున్న యూదుల పెద్దలలో నొకఁడు. కోరెషు చెఱపట్టఁబడిన యూదులకు విడుదల ననుగ్రహింపఁగా యెరూషలేము మందిరోపకరణముల నితనికి నప్పగించెను (ఎజ్రా $1^{8,11}$). ఇతఁడు యెరూషలేములో క్రొత్త ఆలయమునకు పునాది వేయించెను (ఎజ్రా $5^{14-16}$). ఎజ్రా $5^{16}$ లో కోరెషు అతనిని అధికారినిగాఁ జేసెనను మాట కలదు. అందుచేఁత కొందఱిది జెరుబ్బాబెలుకు మాఱుపేరనుకొందురు. అలాగు కాదు, వీరు వేర్వేఱు పురుషులని మఱికొంద అనుకొందురు. ఇతఁడు యెకొన్యా కుమారుఁడగు షెనజ్జరు అని అట్టివారిలో మఱికొంద అనుకొందురు (షెనజ్జరు చూ॥). ఇతఁడు రాజవంశపువాఁడును పెద్దవాఁడు నగుటచే మొట్టమొదట అధిపతిగా నుండెను గాని జెరుబ్బాబెలు యౌవనస్థుఁడై యుండినందున చాల మట్టునకు పనిచేసి, షేష్బజ్జరునకు పిమ్మట తానే అధిపతియయ్యెనని అట్టివా రనుకొందురు. ఇది నిజము కావచ్చునుగాని రూఢియని నిర్ధారణ చేయుటకు తగిన యాధారములు లేవు.

## షో

షోనంగి కుక్క మృగములు 46 చూ॥

**షోవకు, షోబకు (Shobach = కుమ్మరించు వాఁడు).** రాజగు హదదెజరు సైన్యాధిపతి. అమ్మోనీయులు దావీదునకు విరోధముగా యుద్ధము చేయగాఁ నితఁడు వారికి సహాయకుఁడయ్యెను గాని అందఱును ఓడిపోయిరి (II సమూ $10^{16-18}$). I దిన $19^{16}$ నందు ఇతనికి షోవకు అను నామాంతరము గలదు.

**షోబయి (Shobai = చెఱపట్టువాఁడు).** చెఱ కాలమునకు తరువాత మందిర ద్వారపాలకులలో నొక లేవీ కుటుంబపువారు (ఎజ్రా $2^{42}$ నెహె $7^{45}$).

**షోబాబు (Shobab = తప్పింపఁబడిన).**

1. దావీదు కొడుకులలో నొకఁడు (I దిన $3^{5}$ $14^{4}$ II సమూ $5^{14}$).

2. యూదా సంబంధులలో కాలేబు తెగ వారిలో నొకఁడు (I దిన $2^{18}$).

**షోబీ (Shobi = చెఱపట్టువాఁడు).** అమ్మోను రాజగు నాహాషుకు కొడుకు (II సమూ $17^{27}$). అబ్షాలోము తిరుగుబాటు చేసినప్పుడు దావీదు పారిపోఁగా, దావీదుకు సహాయపడిన వారిలో నొకఁడు ($17^{27}$).

**షోబేకు** (Shobek = వైరాగి). నెహెమ్యా కాలమున నిబంధనకు ముద్రవేసిన వారిలో నొకఁడు (నెహె $10^{24}$).

**షోమేరు** (Shomer = కావలి).

1. ఆషేరు గోత్ర కుటుంబములలో నొక దానికి పెద్ద (I దిన $7^{32}$).

2. రాజగు యోవాషుకు విరోధముగా కుట్ర చేసినవారిలో యెహోజా యనువానితల్లి (II రాజు $12^{21}$). II దిన $24^{26}$ నందామె పేరు **షిమ్రాతు** అని యున్నది. ఆమె మోయాబీయురాలని ఆ వాక్యమువలనఁ దెలియును (షిమ్రాతు చూ॥).

**షోమ్రోను** సమరయ చూ॥

**షోషన్నీము, షోషన్నీముల రాగము, షూషనేదూతు** (Shoshannim = తామర పుష్పములు). దీనికి సంబంధించిన పదములు 45, 60, 69, 80 కీర్తనలపై వ్రాతయందు కనఁబడును. ఇది యా కీర్తనలు పాడవలసిన రాగమునకు పేరు. తెనుఁగు రాగముల పేరుల అర్థములు తెలిసికొనుట కెట్లు అసాధ్యమో అదేరీతిగా ఈ కీర్తనల రాగముల పేరులుకూడ నున్నవి.

**షోహాము** (Shoham = రత్నము). లేవీయులలోని మెరారి తెగవారిలో నొకఁడు (I దిన $24^{27}$). ఇక్కడ బెనో షోహాము అని యున్నది.

## స

**సంకల్పము** ముందెఱుఁగుట చూ॥

**సంకుబుడి కొంగ** పక్షులు 18 చూ॥

**సంకెళ్లు** (Chains). ఖైదీలను బంధించుటకు వాడిన వీనిని గూర్చిన సూచనలు చాల గలవు (II సమూ $3^{34}$ II దిన $33^{11}$ $36^{6}$ కార్య $12^{6,7}$). అలంకారరీతిగా న్యాయతీర్పు శిక్ష విధింపఁబడిన వారును అదేరీతిగా కట్టఁబడియున్నట్లు దృష్టాంతము లున్నవి (యూదా 6, II పేతు $2^{4}$). ఎక్కువపిచ్చి పట్టినవారిని ఇప్పటివలె సంకెళ్లతో బంధించిరి (మా $5^{4}$ లూ $8^{29}$).

**సంఖ్య** (**Number, including Symbolical Figures**).

I. సాధారణ వివరము. బైబిలు గ్రంథకర్తలు మనవలెనే లెక్కించినట్లుగా నున్నది. హెబ్రీయులు ఒకటినుండి పదివఱకును, తరువాత పదుల రీతిగా నూఱువఱకును, నూర్లతో వేలవఱకును లెక్కించిరి గాని లక్షలును కోట్లును లెక్కించినట్లు సూచనలు లేవు. వేలను హెచ్చించుటవలన పై సంఖ్యలను దెలిపిరి. పదివేలును సూచించిన యొక మాటగలదు. దాని ద్వివచనము నుపయోగించి నెహె $7^{71,72}$ నందు 20,000 సూచించిరి. కీర్త $68^{17}$ లో పదివేలును సహస్ర సహస్రములను మాటచే కనఁబఱచిరి. ఆది $24^{60}$ లోని **వేల వేలకు** (=1,000,000) అనుమాట లెక్కలేని సంఖ్యను తెలియఁజేయును గాని కొందఱా సంఖ్యను 10 పదివేలు అని భాషాంతరీకరింతురు. బైబిలంతటిలో గొప్ప సంఖ్య I దిన $21^{5}$ నందున్నది. అది 11,00,000 అనునదియై యున్నది. అసలులో అది వేయి వేలు నూఱువేలు అని యున్నట్లున్నది. దాని $7^{10}$ లోని కోట్లకొలఁది మనుష్యులను పదము అసలులో పదివేల పదివేలు అనఁబడి లెక్కించ వీలుగాని సంఖ్యను తెలుపును. క్రొత్త నిబంధన కాలములో గ్రీకు భాష నుపయోగించుచు వారి సంఖ్యలను వాడిరి గాని, ప్రక $5^{11}$ లో నుండు కోట్లకొలది యను మాట సరిగా దాని $7^{10}$ లో నున్నదాని వంటిదే.

బైబిలునందు అంకెలను వ్రాయలేదు. సంఖ్యలను అక్షరములతో వ్రాసి తెలిపిరి. అంకెలు వేయు సూచనలు పాఁత నిబంధనయందు లేనే లేవు. అంకెలను తెలుపుటకు వేఱుగుఱుతు లేవియునువాడక, హెబ్రీ ఓనమాలలోని మొదటి అక్షరము ఒకటిని రెండవది రెండును, ఇట్లు పదివఱకును, తరువాతి అక్షరములు వరుసగా ఇరవై, ముప్పై మొదలగు వానిని సూచించునట్లు వాడెడువారు గ్రీకువారు చేసినవియును ఇదేరీతిగ నుండెను.

సంఖ్యలు వ్రాయుటలో పొరపాటులు బహు సులభముగా పడును. ఒక వాక్యములో నేదైన తప్పు వ్రాసినయెడల సరియైన అర్థము రాదు గాన తరువాత దానిని చదివెడివారు దానిని చదివిన వెంటనే కనుగొని దిద్ద వీలున్నది. గాని సంఖ్యలెట్లున్నను వాక్యమందలి అర్థము మాత్రము సరిగానే యుండును గాన చదువరులు దానిని గమనింపఁజాలరు. ఈ హేతువుచేత ఆయా

పురాతనములగు హెబ్రీ, సమరయ గ్రీకు ప్రతులలో జలప్రళయమునకు పూర్వము జీవించినవారి వయస్సునందు భేదములు కనిపించును. అట్లే రాజుల గ్రంథములలోను దినవృత్తాంతముల గ్రంథములలోను చరిత్ర యేకరీతిగ నున్నను సంఖ్యలయం దనేక భేదములు గానవచ్చుచున్నవి. అనేక శతాబ్దములవఱకు చేతితో వ్రాయఁబడిన ప్రతులయందు అట్టి భేదములుండుటలో ఆశ్చర్యము లేదు.

ఈ సంఖ్యలలోఁ గొన్ని సరిగా అదే సంఖ్యను సూచింపక, షుమారుగా అంత సంఖ్యను తెలియఁ జేయునట్లు కనఁబడును. ఇట్లు నలభై అను సంఖ్య సరిగా నలభైనేగాక కొంచె మించుమించుగా నున్నదానిని సూచించును. మోషే జీవితకాలము మూఁడు నలభైలను, సమూయేలు సౌలు దావీదు సొలొమోను మొదలగువారు ఒక్కొక్కరు 40 సం॥లు ఏలుటను చూడఁగా, అది షుమారుగా నుండు కాలమును సూచించు ననుకొనఁదగును. ఇట్లే లేవీ 26[8] లో నున్న అయిదుగురు నూరు మందిని తరుముదురనఁగా కొద్దిమంది అనేకులను తఱిమెదరను సంగతి స్పష్టమగుచున్నది. వేయి మందికిని, నూరుమందికిని, పదిమందికిని అధికారులను నియమించుటలో (ద్వితీ 1[15]) కూడ, అదే రీతిగా అర్థము చేసికొనఁదగును. న్యాయా 6[15] I సమూ 10[19]లో నుండు గోత్రము అను పదము ఆసలులో వేయి లేక వేలు అని యర్థమగును.

సంఖ్యలను చిత్రమగు రీతిగా వాడుట సామెతల గ్రంథము 30 నందుఁ జూడవచ్చును. ఒకసారి చెప్పిన సంఖ్యను మార్చి చెప్పుట సంగతిని మరీ దృఢపర్చుటకు శైలియందు కనఁబడిన మార్పే గాని యితర మేమియును కాదు.

II. సంఖ్యల గూఢార్థము.

**1. ఒకటి.** ఐక్యమును సూచించును. ముఖ్యముగా దేవునిగూర్చి వాడిరి (ద్వితీ 6[4]). అట్లే ప్రభువు ఆత్మ విశ్వాసము బాప్తిస్మములను గూర్చియు వాడఁబడెను (ఎఫె 4[5,6]).

**2. రెండు.** అనునది యనేకసారులు కనఁబడును. రెండు గొప్ప జ్యోతులు గలవు (ఆది 1[16]). మృగములు తమతమ జాతులప్రకారము జతలు జతలుగ కాపాడఁబడెను (7[15]). క్రొత్త నిబంధనలో 12 మంది శిష్యులను 70 మందిని అదేరీతిగా యేసు బోధింపనై పంపెను (మా 6[7] లూ 10[1]).

**3. మూఁడు.** సాధారణముగా దేవునికి సంబంధించిన సంఖ్య. పాఁతనిబంధన ఆశీర్వాదమును (సంఖ్యా 6[22-26]), త్రిశుద్ధియు (యెష 6[3]), బాప్తిస్మపు ఏర్పాటును (మ 28[19]), క్రొత్త నిబంధన యాశీర్వాదమును (II కొరి 13[14]) త్రిత్వమును గూర్చినవై యున్నవి. ఒక సంగతిని దృఢపఱచుటకై మాటను ముమ్మారు చెప్పుటయు కలదు (యిర్మీ 7[4] 22[29]). దావీదు మూఁడు శిక్షలలో నేదో యొకటి నేర్పాటు చేసికొనవలసి వచ్చెను. ప్రతిదానియందు మూఁడు అను సంఖ్య కనఁబడును (I దిన 21[12]). క్రీస్తు మూఁడు దివారాత్రులు భూగర్భమున నుండెను (మ 12[40] యోహా 2[19]). ఇంక ననేక సూచనలున్నవి.

**4. నాలుగు.** దిక్కులను సూచించుట వలన ఇది సర్వసృష్టికి సంబంధించిన దనవచ్చును. (దాని 7[2] జెక 6[1-5] ప్రక 4[7]). ఆరంభమున నాలుగు నదులుండెను (ఆది 2[10]).

**5. ఐదు.** అను సంఖ్యకు విశేష సూచన యేదియు లేదు. అపరాధ పరిహారార్థ బలిని అర్పించునప్పుడు నష్టమును భరించి, దానితో ఐదవ వంతును యాజకుని కియ్యవలెను (లేవీ 5[16]).

**6. ఆరు.** అసంపూర్ణతను సూచించును. సర్వసంఘమును సూచించు 12 అను సంఖ్యలో సగముగాన ఈ లోకాధికారమునకు గుఱుతు మఱియు సంపూర్ణతకు గుఱుతగు 7 అను సంఖ్యకు తక్కువగా నున్నందునను లోకాధిపత్యమునకు గుఱుతుగా నున్నది (ప్రక 13[18]). ఇచటనుండు 666 (*Neron Caesar*) అను పేరులోని అక్షరములను సూచించు సంఖ్యల మొత్తమని సాధారణముగా ననుకొందురు. అందు సుర్తింపఁబడిన *n* అనుదానిని తీసివేసినయెడల ఆ మొత్తము 616 అగును. కొన్ని ప్రతులలో ప్రక 13[18] నందు ఈ సంఖ్యనే వేసిరి.

**7. ఏడు.** సంపూర్ణతను సూచించును. వారములో 7 దినములున్నవి. యూదుల పండుగ

లన్నియు ఈ సంఖ్య ననుసరించియే వచ్చును. ఏడవదినము, ఏడవవారము, ఏడవనెల, ఏడవ సంవత్సరము, ఏడేళ్లు నలుశైతొమ్మిది సంవత్సరములు గడచిన పిదప 50 వ సంవత్సరము యూదుల పండుగలై యున్నవి. ఆత్మ 7 ఆత్మలు గల వాడనబడెను (ప్రక $1^{4}$). దీపస్తంభము 7 కొమ్మలు గలది. శుద్ధికొఱకు 7 మారులు రక్తమును ప్రోక్షించిరి (లేవీ $4^{6}$). ఏడు గొఱ్ఱెలను అర్పించిరి (సంఖ్యా $28^{11}$ మొ॥). క్రొత్త నిబంధనలో 7 సంఘములున్నవి (ప్రక 2, 3). ఏడు నక్షత్రములున్నవి (ప్రక $1^{20}$). ఐగుప్తుకు వెళ్లిన యాకోబు సంతతివారు డెబ్బది (7×10) మంది (నిర్గ $1^{5}$). చెఱకాలము 70 సంవత్సరములు (యిర్మీ $25^{11}$ దాని $9^{2}$ జెక $7^{5}$). అబ్రాహామునుండి క్రీస్తువఱకు పదునాలుగు (2×7) తరముల చొప్పున 3 ఉన్నట్లు ఉదాహరింపబడెను (మ 1). అన్యులమధ్య పనిచేయుటకు క్రీస్తు డెబ్బదిమందిని పంపెను (లూ 10) ఒకడు తన సహోదరుని 70×7 మారులు క్షమింపవలెను (మ $18^{21-23}$).

**8.** దీనిలోని సగము ( = 3½) అసంపూర్ణతను సూచించును (దాని $7^{25}$ $12^{7}$ ప్రక $12^{14}$). ప్రక $11^{3}$ $12^{6}$ లోని 1260 దినములు 3½ సంవత్సరములగును. 42 నెలలును అదే సంఖ్య (3½ సం॥) ను సూచించును (ప్రక $11^{2}$ $13^{5}$). సాధారణముగా నిది శ్రమకాలమునకు సూచనగా నున్నది.

**9. ఎనిమిది.** అను సంఖ్యకు విశేషమైన అర్థము లేదు. జలప్రళయము వచ్చినప్పుడు నావలో ఎనిమిదిమంది రక్షింపబడిరి. మగపిల్లలకు 8వ దినమున ఛేదనసంస్కారము చేసిరి. గాని వీనియందు రెట్టి అంతరార్థమును కనబడదు. యెహెజ్కేలు గ్రంథములో ఎనిమిదియను సంఖ్యను ఎక్కువగా చూడవచ్చును ($40^{9,31,34,37,41}$). నాలుగుకు రెట్టింపు గాన ఇట్లు వాడియుండవచ్చును.

**10. పది.** ఒకట్లు దీనితో ముగియును గాన ఇది యొక విశేషసంఖ్యగా నెంచబడినట్లున్నది. ఇది సుడారపు కొలతలలో ముఖ్యమైనదిగా నున్నది (నిర్గ $26^{1-16}$ $27^{12}$ $36^{21}$ మొ॥). సొలొమోను కట్టించిన ఆలయము విషయమందును కనబడెను (I రాజు $6^{2,23-26}$ $7^{23,24-27}$). యెహెజ్కేలు ప్రవచించిన ఆలయము ($40^{11}$ $41^{2}$ $42^{4}$) దేశముల ($45^{3-5}$ $78^{9,10-18}$) విషయమును ఈ కొలత యెక్కువగా ఉపయోగింపబడెను. దేవుడిచ్చిన యాజ్ఞలు పది (నిర్గ $34^{28}$). భక్తుల కష్టకాలము 10 దినములు (ప్రక $2^{10}$). క్రీస్తు విరోధి కొమ్ములు కిరీటముల సంఖ్య 10 రై యున్నది (ప్రక $13^{1}$ $17^{12}$ మొ॥). సాతాను బంధింపబడు కాలము వేయి (10×10×10) సంవత్సరములు (ప్రక $20^{2-7}$). వీని నన్నిటిని చూడగా ఈ సంఖ్య సంపూర్తిని సూచించును.

**11. పన్నెండు.** గంటలు నెలలు పన్నెండు గాన, ఇది కాలభాగమును తెలిపెడి ముఖ్య సంఖ్యయై యున్నది. ఇది కల్దీయులవలన వాడుక లోనికి వచ్చియుండవచ్చును. ఇశ్రాయేలు గోత్రములు 12. అపొస్తలులు 12 మంది. ఇట్లు 12 సర్వసంఘమునకు గుఱుతయ్యెను. పాత నిబంధన క్రొత్త నిబంధన సంఘముల పెద్దల సంఖ్యను కలిపినయెడల 24 అగును. అది ప్రక $4^{4}$ $5^{8}$ లో నున్నట్లు రెండు నిబంధనలలోని సర్వసంఘమును సూచించును. ఇదేరీతిగా $7^{4}$ లోనుండు 144000 (12×12×1000) యూదులలో రక్షింపబడు వారి యందలి సంఖ్యను తెలుపును.

**12. నలుబై.** ఒక తరమువారి వయఃకాల మగుటచే దీనికి విశేషభావమున్నట్లు ఎంచవచ్చును. ఏలీ (I సమూ $4^{18}$). సౌలు (కార్య $13^{21}$), దావీదు (I రాజు $2^{11}$), సొలొమోను (I రాజు $11^{42}$) మొ॥ వారు ప్రభుత్వముచేసిన కాలము 40 దేసి సంవత్సరములు. ఇశ్రాయేలీయులు 40 సం॥లు అరణ్యములో నుండిరి (సంఖ్యా $33^{13}$). మోషే కొండమీద నలువది దినము లుండెను (నిర్గ $24^{18}$ $34^{28}$). వేగులవారు నలువది దినముల వఱకు దేశమును వేగుజూచిరి (సంఖ్యా $14^{34}$). ఏలీయా 40 దినములు ప్రయాణము చేసెను (I రాజు $19^{8}$). యెహెజ్కేలు ప్రవచించిన చెఱకాలము 40 సం॥లు (యెహె $29^{11-13}$). యోనా నీనెవె వారికిచ్చిన గడువుకాలము 40 దినములు (యోనా $3^{4}$). క్రీస్తు ఉపవాసము చేసినది 40 దినములు (మ $4^{2}$). ఇశ్రాయేలీయులు అరణ్యములో చేసిన సంచారమునకు సంబంధముగా బైబిలునం దచ్చటచ్చట సూచనలు గలవు (కీర్త $95^{10}$ కార్య $7^{36-42}$ హెబ్రీ $3^{8-17}$).

దీనినిబట్టియే ఇది శోధనకాలమునకు సూచనగా నెంచఁబడవచ్చును.

**సంఖ్యాకాండము (Numbers).** మోషే గ్రంథ పంచకములోని నాలుగవ గ్రంథము. హెబ్రీ లేఖనములలో దీనికి "అరణ్యములో" అని పేరు. గ్రీకుభాషలో దీనిని సంఖ్యలు అనిరి. ఇశ్రాయేలీయులను 2 సార్లు లెక్కించినట్లు దీనియందున్నది. ఐగుప్తునుంచి వచ్చిన రెండవ సంవత్సరమున సీనాయి అరణ్యమందు మొదటిసారియు, ముప్పది యెనిమిది సంవత్సరముల తరువాత వారు కనాను దేశమునకు సమీపించినప్పుడు మోయాబు దేశములో రెండవసారియు లెక్కించఁబడిరి. ఇట్లు వేయఁబడిన లెక్కద్వారా మెస్సీయయొక్క వంశావళి తెలిసికొనుటకు మిగుల సహాయకరముగ నుండెను. ఈ గ్రంథము ఇశ్రాయేలీయుల అరణ్యసంచార చరిత్రను ముఖ్యముగఁ దెలుపుచున్నది. తన స్వజనములైన ఇశ్రాయేలీయులకు దేవుఁడు వారిని వాగ్దానదేశమునకుఁ దెచ్చుటలో కనఁబఱచిన మహా కృపను దయను, వారు ఆయనయెడలఁ గనఁబఱచిన కృతఘ్నతను చూపుటకై యీ గ్రంథము వ్రాయఁబడెను. ఇశ్రాయేలీయుల కున్నట్లు దేవునియందు భయభక్తు లుంచువారికిని విశ్రాంతి గలదనియు, వారు దానియందు ప్రవేశించక పూర్వము చాల పరీక్షలను శోధనలను పొందవలసి యున్నారని దీనివలన నేర్చుకొనవచ్చును. పరమ కనానుకు యాత్ర చేయఁ గోరువారెల్లరును ఇహలోకమను అరణ్యముగుండ ప్రయాణము చేయవలసియున్నది. ఇప్పుడు అందఱును పరదేశులును పరవాసులునైయున్నారు. ఈ ప్రయాణమునందనేక మార్పులు అనఁగా పడుటలు లేచుటలు, సంతోషభయములు మొదలగునవెన్నియో సంభవించును. అవిధేయతవలనను అవిశ్వాసము పిరికితనమువలనను కలిగిన ఫలము రెండవసారి లెక్కలో తగ్గిపోవుటయందు కనుగొనవచ్చును. వారు వాగ్దానదేశములో ప్రవేశించకుండ శపించఁబడుటయే గాక దేవునిచేత అనేక సారులు శిక్షింపఁబడుచు వచ్చిరి.

ఈ గ్రంథమునందు మూఁడు ముఖ్య భాగము లున్నవి.

I. కనాను సరిహద్దులకు మొదటిసారి వచ్చుట (1–10). దీనియందు, ప్రజలను క్రమపఱచుట (1-4), ప్రజలయొక్క పరిశుద్ధత (5,6), ప్రజల ఆరాధన ($7^{1}$ $9^{14}$), ప్రజలు బైలుదేరుట ($9^{15}$-10) ను గుఱించి కలదు. ఈ భాగమునందు జ్ఞప్తికి యుంచుకొనఁదగిన సంగతులు జనాభా లెక్క, చట్టములు, మేఘస్తంభము.

II. ప్రవేశించకనే ప్రయాణము చేయుట (11-25). దీనియందు దేవునియెడల జనులును ($11^{1-3}$), భోజన విషయమై మిశ్రితజనమును ($11^{4-35}$), మోషేయెడల మిర్యాము అహరోనులును (12) సణుగుటయు, వేగులవారి నంపి భయపడి తిరుగుబాటు చేసి (13,14) శిక్ష నొందుటను (15-25) గూర్చి కలదు.

III. కనాను సరిహద్దులకు రెండవసారి వచ్చుట (26-36). దీనియందు ప్రజలను రెండవసారి లెక్కించుట (26), స్త్రీల స్వాస్థ్యము, మోషేను కొండమీఁదికి పిలుచుట (27), ధర్మశాస్త్రమును తిరిగిచెప్పుట (28-30), మిద్యానీయులతో యుద్ధము (31) రెండున్నర గోత్రికుల స్థావరము (32), ప్రయాణ స్థలముల పట్టీ ($33^{1-49}$), ధర్మశాస్త్రమును తిరిగి చెప్పుట ($33^{50-56}$) ను గుఱించి కలదు (గ్రంథపంచకము, షడ్గ్రంథములు చూ॥).

H.

## సంగీతము, వాయిద్య విశేషములు (Music, Musical Instruments).

సంగీతముగూర్చిన సూచనలు బైబిలునందనేకములు గలవు. పలువిధములగు వాద్యములలో దాదాపు ఇరువదిపలుకు ఉదాహరింపఁబడెను. గాని సంగీతమునుగూర్చి వివరమిచ్చుటను గానఁబడమింజేసి ఆ కాలమునందుండినవారెట్టి సంగీతము నభ్యసించిరో, ఎట్టి వాయిద్యములను వాడిరో దానినిగూర్చి రూఢిగాఁ జెప్పవీలులేకున్నది. అయినప్పటికి దిగువ సంగతులననుసరించి వానిని వివరింపఁదగును.

1. సంగీత సమయములు:—

(1) శుభకార్యము లప్పుడును శత్రువులపై జయము నొందినప్పుడును నాట్యముచేయుచు గానములు చేసిరి. ఇట్లు చేయుట ఆదినుండి యున్న వాడుక యని ఆది $4^{21}$ వలనఁ దెలిసికొనుచున్నాము. యాకోబు తన మామయగు లాబానుకుఁ దెలుపకయే పారిపోయినప్పుడు

లాబానతనిఁ గలిసికొని నిష్ఠురమాడుచు, మేళతాళములతోను సంభ్రమముతోను నిన్ను సాగనంపక పోయెడివాఁడనా యని తన యాశను కనఁబఱచెను ($31^{27}$). ఎఱ్ఱసముద్రమునందు ఫరో ఓడి నశించఁగా మిర్యామును, ఆమెతోనున్న స్త్రీలోకమును నాట్యమాడుచు కీర్తనలు పాడిరి (నిర్గ 15). సీనాయి యొద్ద ఇశ్రాయేలీయులు సంభ్రమపడు సమయమున సంగీతము చేసిరి (నిర్గ $32^{6-18}$). యెఫ్తా (న్యాయా $11^{34}$) దావీదు (I సమూ $18^{6}$)లు జయమునొందిన సమయమున ప్రజలుత్సాహముతో జయకీర్తనలు పాడిరి. త్రాగుబోతులు దుష్టులును సంభ్రమపడు కాలమున సంగీతము లేకుండ సంతృప్తులు కాలేదు (యోబు $21^{12}$ పర $2^{8}$ $7^{5}$ యెష $5^{12}$ $14^{11}$ $23^{16}$ ఆమో $5^{23}$ $6^{5}$ యెహె $26^{13}$ $28^{13}$). యుద్ధము



ఐగుప్తీయుల స్వరమండలము

నకుఁ బోవువారికి రోషమును పుట్టించి ఉత్సాహవంతులనుగాఁ జేయుటకై సంగీతమును జేసినట్లు కనఁబడును. యుద్ధమాసన్నమైనదని తెలుపుటకు బూరల నూదుటయు సాధారణమైన వాడుకయై యుండెను (సంఖ్యా $10^{9}$ న్యాయా $3^{27}$ యిర్మీ $4^{19}$ మొ॥).

(2) ప్రవక్తలకావేశము పుట్టించుటకుఁ గాని వారికి కలిగిన ఆవేశమును శాంతిపఱచుటకుఁగాని సంగీతమును వాడిరి గాని దీనినిగూర్చిన సూచనలు మిగుల అరుదుగానున్నవి (II రాజు $3^{15}$ కీర్త $49^{4}$).

(3) క్రుంగిన మనస్సుగలవారి కూఱట కలిగించుటకును, అసూయా పిశాచప్రేరితులగువారిని శాంతిపఱచుటకును సంగీతమొక సాధనమయ్యెను (I సమూ $16^{16-23}$).

(4) దైవారాధనలో సంగీతము ప్రాముఖ్యమైనదయ్యెను. దావీదు దేవుని మందసమును యెరూషలేమునకుఁ గొనితెచ్చునప్పుడు సంగీతము చేసినట్లు చూడవచ్చును (II సమూ $6^{5-15}$). ఆలయమును ప్రతిష్ఠించిన దాదిగ సంగీతము ఆరాధనలయందు ప్రాముఖ్యత వహించినట్లు గానఁబడుచున్నది (I రాజు $10^{12}$). దేవుని మందిరమునందు గానము చేసిన సూచనలు ప్రవక్తల గ్రంథములందును గలవు (ఆమో $8^{3-10}$ యెష $30^{29}$ యెహె $40^{44}$). దినవృత్తాంతములలో దానిని గూర్చిన విశేషపు టేర్పాటుల వివరమున్నది (I దిన $6^{31-47}$ $9^{33}$ $13^{8}$ $15^{16-28}$). కీర్తనల గ్రంథమునందు కూడ ఇట్టి యేర్పాటులున్న సూచనలగపడును (కీర్త $33^{2,3}$ $43^{4}$ $57^{8}$ $68^{24,25}$ $71^{22}$ మొ॥).

2. సంగీతగాండ్రు. వీరిది యొక ప్రత్యేకమగు వృత్తియని చెప్పవచ్చును. వీరు సంభ్రములయందు ముఖ్యులు (ప్రస $2^{8}$ II సమూ $19^{35}$). శుభాశుభ కార్యములయందు వీరినిఁ బిలిపించుకొనిరి (ప్రస $12^{5}$ మ $9^{23}$). ఆలయమునందీ పనికొఱకు ప్రత్యేకింపఁబడినవారుండిరి (II రాజు $12^{13}$ ఆమో $8^{3-10}$ యెహె $40^{44}$). వీరినిగూర్చిన యేర్పాటుల విషయము దినవృత్తాంతముల గ్రంథములో వివరముగా నున్నది (I దిన 6, 15, 16, 25, II దిన 5, 20, 29 మొ॥). గాదు, నాతాను అను ప్రవక్తల సలహా ప్రకారము దావీదు వీరిని నియమించెను (II దిన $29^{25}$). వారిని మూఁడు భాగములుచేసి ఆసాపు, హేమాను, ఏతాను అను వారి వశమున నప్పగించిరి (I దిన $6^{31-48}$). పాటకుల సంఖ్య 288. వీరిని 24 వంతులుగా చేసిరి (25). వీరు సేనకుముందు మాత్రమే నడువవలెనను ఏర్పాటును గలదు (II దిన $20^{21,22-28}$). చెఱకుఁ బిమ్మట వీరి మొత్తము 200 లేక 245 మాత్రమై యుండెను (ఎజ్రా $2^{65}$ నెహె $7^{67}$). వీరిలో ఆసాపు తెగవారే 128 లేక 148 మంది గలరు (ఎజ్రా $2^{41}$ నెహె $7^{44}$). యాజకులను లేవీయులను పోషించుట కేర్పాటు లుండినట్లే ఈ గాయకులను పోషించుటకు నేర్పాటులు గావించిరి (ఎజ్రా $7^{24}$ నెహె $11^{23}$ $12^{47}$ $13^{5,10-13}$).

3. వాయిద్యములు. మూలభాషలో వీని యందుఁ గొన్నిఁటి యర్థమునుగూర్చి చాలమట్టుకు సందేహము గలుగుచున్నది. బైబిలును తెనిఁగించిన

వారు ఒక్కొ పదమును ఆయా తెలుఁగు మాటలచే తర్జుమాచేసినందున వీనిని వివరించుటకు కష్టతరముగా నున్నది. కొన్నిఁటిని గూర్చి సందేహమున్నను వాని నీ దిగువరీతిగాఁ జూడవచ్చును.

(1) తట్టుడు వాయిద్యములు:—

*a.* **తంబుర** యను పదముచే తెనిగించినది సాధారణమైనది (I సమూ 18$^{6}$ II దిన 9$^{11}$ కీర్త 150$^{3}$ యిర్మీ 31$^{4}$ యెష 30$^{32}$ మొ॥). ఆది 31$^{27}$ నందు దానిని **మద్దెల** అనియు, కీర్త 81$^{2}$ లో **గిలక తప్పెట** అనియు తెనిఁగించిరి. అది యీ దేశమందుండు మద్దెలవంటిదని కొందఱి యభిప్రాయము. ఆ మూలపదమునే యెష 24$^{8}$ నందు **సితార** యనియు, యెహె 28$^{13}$ నందు **పిల్లనగ్రోవి** యనియు పొరపాటుగా తర్జుమాచేసిరి. ఇది తంబుర గాని మద్దెలగాని కావచ్చును. ఈ పదము బైబిలునందు 17 మాఱులు కనఁబడును. తరుచుగా సితారాతో కూడకలిపి ఉపయోగింపఁబడెను. సంభ్రమకాలమున నాట్యమాడునప్పుడు దీనిని వాయించిరి (ఆది 31$^{27}$ న్యాయా 11$^{34}$ యెష 5$^{12}$ యిర్మీ 31$^{4}$). ప్రవక్తలును (I సమూ 10$^{5}$) ఆలయమునం దారాధికులును (కీర్త 68$^{25}$ 150$^{4}$) దీని నుపయోగించిరి.

*b.* **తాళములు.** పంచలోహపుతాళములను గూర్చి II దిన 15$^{19}$ నందు సూచన గలదు. ఒకే ధాతువునుండి వచ్చు రెండు పదములను హెబ్రీ బైబిలునం దుపయోగించిరి. ఒక దానిని



తాళములు

**పెద్దతాళములు** అని తెనిఁగించిరి. కీర్త 150$^{5}$ వందీ పదము రెండు మారు లుపయోగించి మ్రోగునదని యొకసారియు, గంభీరధ్వని గలదని యొకసారియు తర్జుమాచేసిరి. రెండవ పదము ద్వివచన రూపముగా ప్రయోగించుటవలన అది జతగానున్నదని స్ఫురించుచున్నది (I దిన 15$^{28}$ 25$^{1}$ II దిన 5$^{12}$ 25$^{6}$ నెహె 12$^{2}$). ఈ రెండు పదములకు మ్రోగుచున్నదని శబ్దార్థము. ఇవి ఈ దేశమునందు వాడెడు తాళమువంటి వనుటకే సందేహమునులేదు. ఈ పదములు సాధారణముగా సితారా స్వరమండలము బూర మొదలగు వానితో ఆలయములో చేయు సంగీతమునందు మాత్రమే వాడినట్లు కనఁబడుచున్నది. అట్టి సూచనలు బైబిలునందు 10 గలవు. క్రొత్త నిబంధనయం దీ పదము పట్టి ధ్వనిని సూచించును (I కొరి 13$^{1}$).

*c.* **మృదంగములు** అని II సమూ 6$^{5}$ నందు తెనిఁగించిన మూలపదము మఱియొక చోట కనఁబడదు. అది మద్దెల కాదు. జలతరంగిణి వంటిదై ఆయా లోహములను తట్టుటవలన నేర్పడు వాద్యవిశేషమై యున్నది.

*d.* **గంటలు** గుఱ్ఱముల కళ్లెములకుకట్టినట్లు జెక 14$^{10}$ లో నున్న మూలభాషా పదమువలనఁ దెలియుచున్నది. అట్లు చేయుట యీ దేశమునందును వాడుకగానున్నది. అవి సంగీత వాద్యములు కాక పోయినను ఇంపైన ధ్వనిని పుట్టించునవిగాన ఇచ్చట చేర్పవచ్చును.

(2) ఊదెడి వాద్యములు:—



ఊదెడు వాద్యములు

*a.* **పిల్లనగ్రోవి** (I రాజు 1$^{40}$ యెష 30$^{29}$ యిర్మీ 48$^{36}$), **సన్నాయి** (యెష 5$^{12}$) అనునవి వాద్యములలో చేరినవి. దాని 3$^{5,7,10-15}$ లో పిల్లనగ్రోవి యను పదము మూలభాషలో మఱియొకటిరైయున్నది. యెహె 28$^{13}$ లో పిల్లనగ్రోవులని తెనిఁగించినది ఇంకనొక వేఱుపదమైన తంబుర యని భాషాంతరము చేయఁబడవలసి యున్నది (పైన తంబుర చూ॥). యోబు 30$^{31}$ కీర్త 150$^{4}$ లో పిల్లనగ్రోవి యని యున్నది మఱియొక మాటరై ఇతర వాక్యములలో **సానిక నాదమని** తెనిఁగింపఁబడెను. క్రొత్త నిబంధనలో I కొరి 14$^{7}$ నందు పిల్లనగ్రోవి యని తెనిఁగింపఁబడినది యొక గ్రీకుపదమై యున్నది. దీనికి సంబంధించిన క్రియారూపమునే మ 11$^{17}$ లూ 7$^{32}$ లో **పిల్లనగ్రోవి ఊదితిమి** అని తెనిఁగించిరి. దీనిని ప్రవక్తలును (I సమూ 10$^{5}$) విగ్రహారాధికులును (దాని 3$^{5}$ మొ॥) వాడినను, ముఖ్యముగా ఉల్లాసార్థముగా దీనిని వాయించినట్లు పైనున్న వాక్యములవలనఁ దెలియుచున్నది.

*b.* **సానిక నాదము.** ఆది 4$^{21}$ యోబు 21$^{12}$ లో సానిక నాదమనిన మూల భాషా పదమును 30$^{31}$ కీర్త 150$^{4}$ నందు పిల్లనగ్రోవి యని తెనిఁగించిరి. ఈ వాయిద్యము సితారాతో కలిపి వాయించినట్లు ప్రతి వాక్యమువలనఁ దెలియుచున్నది. కఱ్ఱతోఁ జేసి నోటితో నూది వాయించువారికి యూబాలు మూలపురుషుఁడైనట్లు ఆది 4$^{21}$ వలన నూహింప వీలగుచున్నది. ఇది ఏడు గొట్టములుండు తిత్తినిబోలు పిల్లనగ్రోవి వంటిదని కొంద ఱభిప్రాయ పడుచున్నారు.



తప్పెట మొదలగు వాద్యములు

*c.* **కొమ్ము, బాకా.** దాని 3$^{5-7,10-15}$ నందు బాకా యని తెనిఁగించిన మూలపదము కొమ్ము అని యర్థమగును. యెహో 6$^{5}$ లో సునాదము అని యర్థమిచ్చు యోబేలు అను పదముతో చేర్చి **యోబేలు కొమ్ములు** అని భాషాంతరము చేసిరి. ఇతర వాక్యములలో నా మాట వాయిద్యములను సూచింపక, కొమ్ములను నర్థము నిచ్చును (కొమ్ము చూ॥). ఇది బూరవంటిదై యుద్ధభయమును చాటుటకును, తమాషాలు జేయునప్పుడు గొప్ప యార్భాటమును జేయుటకును వాడిరి. దీనిపేరు బైబిలునందు బహు అరుదుగా నున్నది (బూర చూ॥).

*d.* **బూరలు, బూరగలు.** వీనిచే తెనిఁగించిన రెండు హెబ్రీ పదములు గలవు. వానిలో నొకటి కొమ్ములవలె వంకరగా నుండువానిని సూచించును. యెహో 6$^{4-6-8\ 13}$ లో నుండు యోబేలు బూరలు పైన నుదాహరించిన యోబేలు కొమ్ములకు సంబంధించినవిగాని వీనిని కొమ్ములతోఁ గాని కఱ్ఱతోఁగాని చేసిరి. ఈ పదము బైబిలునందు 40 మారులు వచ్చును. అక్కడక్కడ వీనిని కొమ్ములని తెనిఁగించిరి (I దిన 15$^{28}$ కీర్త 81$^{3}$ 150$^{3}$). II సమూ 6$^{15}$ లో బాకాయని తెనిఁగించిన దానిని ఆరాధనకు గాని, యుద్ధమునకు గాని జనులను సమకూర్చుటకు ఊదు నిమిత్త ముపయోగించిరి (న్యాయా 3$^{27}$ 6$^{34}$ I సమూ 13$^{3}$ II సమూ 2$^{28}$). యెరికో గోడలు పడుటకును (యెహో 6) గిద్యోను మిద్యానీయులపైకి వెళ్లినప్పుడును (న్యాయా 7$^{8-22}$) బాకానూదిరి. యుద్ధము సాపుటకును దాని నూదిరి (II సమూ 18$^{16}$). నేటి వఱకు యుద్ధకాలములో ఆయా సంగతులను సూచించుటకై దాని నూఁదెదరు. ఇట్లది విపత్తును సూచించెను (I కొరి 14$^{8}$ ప్రక 8$^{2-6-13}$ 9$^{14}$). గొప్ప ధ్వనినికూడ అది సూచించెను. (ప్రక 1$^{10}$ 4$^{1}$). మానవులందఱిని తీర్పునకై పిలుచుట కదియొక సూచనరై యున్నది. (మ 24$^{31}$ I కొరి 15$^{52}$ I థెస్స 4$^{16}$ హెబ్రీ 12$^{19}$). దేవునిని స్తోత్రించుటకును దాని నుపయోగించిరి. (II సమూ 6$^{15}$ I దిన 15$^{28}$ II దిన 15$^{14}$ కీర్త 47$^{5}$ 81$^{3}$ 98$^{6}$ 150$^{3}$).

రెండవపదము లోహముతోఁ జేయఁబడిన తిన్నని బూరలను సూచించెను. ఈ పదమును సాధారణముగా బూర లేక బూరగ యని తెనిఁగించినను (సంఖ్యా 10$^{2,8}$ 31$^{6}$ I దిన 13$^{8}$

$15^{24,28}$ మొ॥) కొన్ని వాక్యములలో బాకా యనిరి) II రాజు $11^{14}$ $12^{13}$ ఎజ్రా $3^{10}$ నెహె $12^{35,41}$). దానిని సాధారణముగా ఆరాధనలలో వాడినను ఆపదలాసన్నమై యున్నదని చాటించుటకు నుపయోగించిరి (హోషే $5^{8}$). యాజకులు దీనిని విశేషముగా వాడిరి (II దిన $5^{12,13}$ $13^{12,14}$ $15^{14}$ $20^{28}$ $23^{13}$ $29^{26-28}$ మొ॥).

(3) మీటెడి వాయిద్యములు. ఇవన్నియు తీగలుగలవి.

*a.* **సితారా** యని తెనిఁగించిన కిన్నోరు (*Kinnor*) అను పదము పాఁత నిబంధనలో 35 మారు లున్నది (ఆది $4^{21}$ $31^{27}$ I సమూ $16^{16}$ II సమూ $6^{1}$ II దిన $5^{12}$ కీర్త $33^{2}$ మొ॥). ఈ సూచనలలో మూఁడింట రెండుపాళ్లు ఈ వాయిద్యము స్వరమండలముతోను ఒక పాలు తాళములతోను మఱియొకపాలు బూరలు, బాకాలతోను ప్రయోగింపఁబడినట్లు చూడవచ్చును. దీనిని సాధారణముగా ఆరాధన సమయములోను శుభకార్యాదులలోను వాడిరి. యెష $24^{7}$ లో తంబుర యనియు I రాజు $10^{12}$ II దిన $29^{25}$ నెహె $12^{27}$ కీర్త $92^{3}$ నందు స్వరమండలమని తెనిఁగించినపదమును సాధారణముగా సితారా యనిరి (పైన 3 (1) (*a*) చూ॥).

*b.* **స్వరమండలము.** ఇదియు తీగెలతో కూడినదేగాని ఫలానిదానివంటిదని రూఢిగాఁ జెప్పుటకు వీలులేదు. త్రికోణాకారముకలిగి



స్వరమండలము

తీగెలచే నిండి కొట్టుటచే వాయింపఁబడునట్టిదని కొందఱి యభిప్రాయము. దాదాపు 25 వాక్యములలో సితారాతో కూడ వాడఁబడెను (II సమూ $6^{1}$ యెష $5^{12}$ కీర్త $150^{3}$ మొ॥). దీని ముఖ్యముగా నారాధన సమయములలో (I సమూ $10^{5}$ I దిన $13^{8}$ $16^{5}$ $25^{6}$ కీర్త $57^{8}$ $108^{2}$ మొ॥) వాడిరి. కీర్త $33^{2}$ నందున్న **పదితంతుల స్వరమండలము** అనఁబడిన వాయిద్యమునకు పదితీగలుండెననుటలో సందేహములేదు. హెబ్రీభాషలో కీర్త $92^{3}$ నందు పదితంతులతో అని మాత్రముండఁగా **పదితంతుల సితార** యని తెలుఁగున వ్రాసిరి. $32^{2}$ నందున్నదియు ఇదియు నొక్కటే యని యూహింపఁదగును. కీర్త $45^{8}$ $150^{3}$ లో నున్న **తంతివాద్యము** లనునది మఱియొక హెబ్రీ పదముకు తర్జుమాలైనను అదియు పైదానివంటిదేనని తలంపవచ్చును. సాధారణముగా సితారా యని తెనిఁగించిన హెబ్రీపదమును యోబు $21^{12}$ కీర్త $81^{2}$ నందు స్వరమండలములని తర్జుమాచేసిరి.

*c.* **వీణె, విపంచిక, సుంఫోనియ.** బాబెలు చక్రవర్తియగు నెబుకద్నెజరు నిలిపిన బంగారు విగ్రహమునెదుట సాగిలపడి యారాధించుటకు సమయమైనదని తెలుపుట కతనిచే నేర్పాటయిన వాయిద్యములలో రెంటిని వీణెయను పదముచే తెనిఁగించిరిగాని అది సరియైన తర్జుమా కానట్లున్నది. వానియందు పెద్ద వీణె యనఁబడినది గ్రీకుపదమగు కితర యనుదానికి సంబంధించినదై పైనున్న సితారావంటిదని తోచుచున్నది. ఆ పదమునే ప్రక $5^{8}$ $14^{2}$ $15^{2}$ నందు వీణెయనిరి.

వీణె యనుపదముతో తెనిఁగించినది పైగ్రీకు మాటకు సంబంధించినదై పై నుదాహరించిన స్వరమండలమువంటిదిగా నున్నది. దానియేలు గ్రంథమునందున్న విపంచిక త్రికోణాకారము గల సితారా వంటిదని దానికి సరియైన గ్రీకు పదమునుబట్టి యూహింతురు. సుంఫోనియ యనునది తెలుఁగుపదముగాక గ్రీకు పదమై సునాదమను నర్థమిచ్చును. హెబ్రీ బైబిలు నందును గ్రీకుపదమే గలదు గాని తెలుఁగు బైబిలునందు క్రమము కొంచెము తప్పినట్లున్నది. ఇవి వీణెలవంటివిగాని వీణెలు మాత్రముకావు.

బైబిలునం దుదాహరించిన యీ వాయిద్యము లన్నియు ఆసియాఖండమునం దుపయోగించెడు నవేగాని వానికన్న కొంచెము మోటువని చెప్పవలెను. దానియేలు కాలము నాటికి జనులు గ్రీకువాయిద్యముల నుపయోగింప నేర్చుకొన్నట్లు

వా రుపయోగించిన గ్రీకుపేరులనుబట్టి తెలిసికొన వచ్చును. అవిగాక మిగతవన్నియు ఈ దేశము నందు నేటివఱకు వాడుచున్న వాయిద్యముల వంటివై యున్నవి. ఆయా కీర్తనలు పాడు నప్పుడే యే వాయిద్యముల నుపయోగించిరో ఆ కీర్తనల రాగములను దెలుపు మాటలు పై వ్రాత లుగా వ్రాయఁబడెను (45, 57, 60, 80 మొ॥). వాని యర్థముకొఱ కాయా పదములను చూచిన యెడల తెలియును.

4. క్రొత్త నిబంధనకాలమునందు ఆదిక్రైస్తవులు యూదుల కీర్తనలను పాడినట్లున్నది (మ $26^{30}$ మా $14^{26}$). కీర్త 113-118 హల్లెల్ (=స్తుతి కీర్తనలు) అనఁబడెను. యూదులు వాటిని పస్కాపండుగ సమయమున పాడిరి. అట్లే క్రీస్తును తన శిష్యులతోఁ గలిసి వానిని పాడెను.



అష్షూరీయుల వీణె

ఆదిక్రైస్తవులు తమ యారాధనలో కీర్తనలను పాడినట్లు పెక్కుసూచనలు గలవు (కార్య $16^{25}$ I కొరి $14^{15,25}$ ఎఫె $5^{19}$ కొలొ $3^{16}$ యాకో $5^{13}$). అంత్యదినమునకు సూచనగా బూరను (మ $24^{31}$ I థెస్స $14^{16}$ మొ॥), పరలోక సంతోషములకు సూచనగా వీణెను (ప్రక $5^{8}$ $14^{2}$ మొ॥) అలంకారముగా నుపయోగించిరి. పిల్లనగ్రోవిని హర్షించిన సూచనలును గలవు (మ $9^{23}$ $11^{17}$ మొ॥). వీనినిబట్టి పాఁత నిబంధనకాలపు వాయిద్యములనే క్రొత్త నిబంధనకాలమునందును వాడిన ట్లూహింపవచ్చును. ఎఫె $5^{19}$ (=కొలొ $3^{17}$) లో నున్న కీర్తనలు, పాఁత నిబంధన కీర్తన లనియు, సంగీతములు నూతనముగా రచించిన క్రైస్తవ పాటలనియు, ఆత్మ సంబంధమైన పాటలు పద్యముల వంటివై యుండవచ్చునని తోఁచుచున్నది. క్రొత్త నిబంధనయందు లూ $1^{46-55,\ 68-71}$ $2^{14,\ 28-32}$ లో కీర్తనలను, ఎఫె $5^{14}$ I తిమో $3^{16}$ II తిమో $2^{11-13}$ ప్రక $4^{8,11}$ $5^{9,10,12,13}$ $7^{12}$ $11^{15-18}$ $15^{3,4}$ $19^{1,2,5-8}$ లో పద్యములు గాని వానిలోని భాగ ములుగాని యున్నట్లు చూడవచ్చును.

**సంఘపుదూత** దూత చూ॥

**సంఘము, సంఘపుకేర్పాటులు, సంఘ పరిపాలన** (Church, Church-Government). పాఁత నిబంధన కాలములో ఇశ్రాయేలీయులందఱు దేవుని జనముగా నుండిరి (సమాజము చూ॥). క్రైస్తవసంఘము కొన్ని విషయములలో దాని ననుసరించినను అదియొక జాతిగాక ఆత్మసంబంధులగువారి కూటమగుటచే క్రొత్త నిబంధన కాలమునుండి అదియొక నూతన మగు ఏర్పాటైయున్నది. పాఁత నిబంధనయం దుదాహరింపఁబడిన 'శేషము' అను భక్తులసమూహ మున కది సంబంధించినదై యున్నదని చెప్పుట మఱీ న్యాయము (శేషము చూ॥).

1. పేరు. ఇంగ్లీషు మొదలగు భాషలలో వాడుచున్న చర్చ్ (*Church*) అను పదము మూల భాషలో ప్రభువు అని యర్థమిచ్చు గ్రీకుపద విశేషణమై ప్రభువుది యని అర్థమగును గాని ఆ పేరు క్రొత్త నిబంధనయందు సంఘమునకు వాడఁబడలేదు. అచ్చట అది ఎక్లేసియ (*Ecclesia*) యనఁబడెను. గ్రీకులు తమ దేశ సంబంధమైన సంగతులను విచారించుట కేర్పఱచు కొనిన సభల కిట్టి పదమును వాడిరి. సువార్త లలో నీ పదము రెండుమారులు మాత్రమున్నది (మ $16^{18}$ $18^{17}$). గాని పరలోకరాజ్యము దేవుని రాజ్యము అను పదములు సాధారణముగా వచ్చును (దేవుని రాజ్యము చూ॥). ఈ రెండు వాక్య ములలో కూడ సంఘము క్రీస్తును విశ్వసించిన వారి సమూహమై, ఆయన నారాధించుచు క్రమ శిక్ష జరుపు కూటమై యున్నట్లు కనఁబడును. కార్యములలోను పత్రికలలోను ఈ బోధ మఱి తేటగా కనఁబడును. సంఘమును పేరు అచ్చట ఆయా పట్టణములలో నున్న క్రైస్తవ సమూహ ములకు పేరుగా వాడిరి (కార్య $8^{3}$ I కొరి $4^{17}$ $6^{4}$ ఫిలి $4^{15}$ III యోహా 6 మొ॥). అది సర్వత్ర యున్న విశ్వాసులందఱి సమూహమునకును

పేరుగా నుపయోగింపఁబడెను. (I కొరి 12[28] ఎఫె 1[22] 3[10] 5[23-32] ఫిలి 3[6] మొ॥). ఇట్టి భావముగల సంఘము క్రీస్తు శరీరమనఁబడెను (ఎఫె 1[23] కొలొ 1[24]). ఈ సర్వసంఘము క్రీస్తుకు లోఁబడుట మాత్రముగాక క్రైస్తవ సమూహపు వారు ఆయన లక్షణములను ఈ లోకమునందు కనఁబఱచి ఆయన నియమించిన పనిని చేయవలసిన బాధ్యతనుకూడ ఇది సూచించును. I తిమో 3[6] నందది దేవుని సంఘమనియు, 3[15] లో జీవముగల సంఘమనియు సత్యమునకు స్తంభమును ఆధారమునై యున్నదనియు అనఁబడును. హెబ్రీ 12[23] నందుదాహరించిన జ్యేష్ఠుల సంఘము పరలోకమునందు విముక్తి నొందినవారై యున్నారు.

2. సంఘమును గూర్చిన బోధ. ఈ బోధ చాలమట్టుకు పైనున్న పేరులలో కనఁబడును. ఈ సంఘము లోకములో నుండి పిలువఁబడి పునర్జన్మము నొంది క్రీస్తును ప్రభువుగాను రక్షకునిగాను అంగీకరించినవారి సమూహమై యున్నది. ఆయా స్థలములలో నున్న సంఘములలో ఇట్టి గుణములుగాక వేషధారులుండుటచే ప్రొటెస్టాంటువారు ఈ లోకములో నుండి క్రైస్తవులని లెక్కింపఁబడినవారిని దృశ్యమైన సంఘమనియు నిజముగా భక్తులగువారి సమూహమును అదృశ్యమైన సంఘమనియుఁ బిలుతురు. ఈ పేరులు బైబిలునందు లేకపోయినను ఆ బోధమాత్రము గలదు (కార్య 20[30] రోమీ 2[28,29] ఫిలి 1[15] 3[18,19] మొ॥ I కొరి 1[2] 12[12] కొలొ 1[24] I పేతు 2[9,10] తో పరిపోల్చిరి). సంఘము క్రీస్తుచే స్థాపింపఁబడినదై ఇతర సమాజములకు వేఱుగా నున్నది (మ 16[18] 28[20]). అది దేవుని వాక్యమును బోధించుచు కనఁబడు కూటమగుటచే (కార్య 20[7] కొరి 14[19-26,36]) సత్యమునకు స్తంభమును ఆధారమునై యున్నది (I తిమో 3[15]). సంఘము క్రీస్తు శరీర మనఁబడుటవలన ఆయనకును సంఘమునకును తీక్ష్ణమగు సంబంధమున్నదని తెలిసికొనవచ్చును (ఎఫె 1[23] కొలొ 1[24]). ఈ సంఘమున కెన్ని గండములు వచ్చినను క్రీస్తు దానికి తోడుగా నుండుటచే అది నశింపక నిత్యముగా నిలుచును (మ 16[18]).

3. సంఘపు పనులు. సమాజమందిరములలో యూదులు జరిపిన ఆరాధనల ననుసరించి ఆది క్రైస్తవులు తమ సంఘములో దేవునివాక్యమును చదివి (యాకో 1[22] కొలొ 4[16] I థెస్స 5[27]), దానిని ప్రకటించిరి (కార్య 20[9] I కొరి 14[19-26-36]). ప్రార్థించిరి (కార్య 4[23-31] I కొరి 14[14-16]). కీర్తనలను పాడిరి (ఎఫె 5[14] I తిమో 3[6]). I తిమో 3[16] వారు పాడిన కీర్తనలోని యొక చరణమై యుండును. బాప్తిస్మము ప్రభువు భోజనము అను సంస్కారముల నాచరించిరి (కార్య 2[41], I కొరి 11[18-34]). బీదల పోషణార్థమై విశేష యేర్పాటులను జేసిరి. (కార్య 6, 11[27-30] I కొరి 16[1,2] II కొరి 8, 9). సువార్తను వ్యాపింపఁజేసిరి (కార్య 13[1-3]). క్రమశిక్షయందు అక్రమస్థుల నుంచిరి (I కొరి 5[1-8] II కొరి 2[6]). నేటివఱకును ఈ పనులన్నిఁటిని చేయవలసియున్నట్లు వీనివలన విశదమగుచున్నది.

4. సంఘపు టేర్పాటు, పరిపాలన. మొదట అపొస్తలులే యన్ని పనులను నిర్వహించిరి. బోధపనిని మాత్రమేగాక (కార్య 2) క్రమశిక్షను (5[1-11]) ధర్మమును పంచిపెట్టుటను (4[37] 6[2]) జరిపిరిగాని, ఆయా అవసరములనుబట్టి ఆ పనులకు ఇతరులను నియమించిరి. ఇట్లు ధర్మమును పంచిపెట్టుటకు ఏడుగురిని నియమించిరి (6[1-6]). వీరికి పరిచారకులను (*Deacons*) పేరు కొందఱు పెట్టెదరుగాని, ఆ పేరు వారికి క్రొత్త నిబంధనయందు వాడలేదు. వారిలో నొకఁడగు ఫిలిప్పు అను వారికి తరువాత సువార్తికుఁడను బిరుదు కలిగెను (21[8]). సంఘము క్రమక్రమేణ వ్యాపింపఁగా క్రొత్త సంఘములను దర్శించి వారిని స్థిరపఱచుటకు ఆయావారల నేర్పఱచినట్లు (8[14-16]) వలనఁ దెలియును. పేతురు సమరయ వారిలో విశ్వసించిన వారిమీఁద చేతులుంచఁగా వారు పరిశుద్ధాత్మను పొందుట నిర్ధారణ (*Confirmation*) అని కొందఱును, అపొస్తలుల కాలములో విశేష వరముల నిచ్చుటయను విశేషమైన కార్యమని కొందఱును అభిప్రాయపడుచున్నారు (హస్త నిక్షేపణము చూ॥). మిషనుపనిని సంఘమారంభించినప్పుడు సంఘపువారు ఆ పనికై మిషనరీల నేర్పఱచిరి (13[1-3]). ఇటుల ఆది సంఘపువారు పరిశుద్ధాత్మచే నడిపింపఁబడి సంఘాభివృద్ధి కెట్టి

యుద్యోగస్థులుండుట అవసరమో అట్టివారి నేర్పఱచిరి. పౌలు రెండు చోట్ల అట్టి ఉద్యోగస్థుల జాబితాలను వ్రాసెను. I కొరి $12^{28}$ నందున్న వేవియనఁగా: (1) అపొస్తలులు (2) ప్రవక్తలు (3) బోధకులు (4) అద్భుతములు చేయువారు (5) స్వస్థపఱచువారు (6) ఉపకారులు (7) ప్రభుత్వము చేయువారు (8) నానాభాషలు మాట్లాడువారు. ఎఫె $4^{11}$ లోను (1) అపొస్తలులు (2) ప్రవక్తలు (3) సువార్తికులు (4) కాపరులు (5) ఉపదేశకులు అని వ్రాయుచు ఆత్మీయ పనులను చేయువారి ఉద్యోగములను మాత్రమెత్తెను. రోమా $12^{7,8}$ లో ఉద్యోగస్థుల పనుల పేరులు మాత్రము లేకపోయినను ఆ పనులు సూచింపఁబడెను. అవెవ్వి యనఁగా:—(1) ప్రవచించుట (2) పరిచర్య చేయుట (3) బోధించుట (4) హెచ్చరించుట (5) పంచిపెట్టుట (6) పై విచారణ చేయుట (7) కరుణించుట అనునవి. ఈ జాబితాలు చూడఁగా స్థిరమైన ఉద్యోగములను ఏర్పఱచినట్లు సూచనలు లేకపోయినను అపొస్తలులు మొదటివారనియు, బోధపని ముఖ్యమైనదనియు పరిచర్య చేయుట తరువాతి పనియనియు అద్భుత కార్యములు చేయుట చివరిదనియు మొత్తము మీఁదకనఁబడును. అపొస్తలులతో కూడ పెద్దలు (*Presbyters*) సంఘపు పనిలో కనఁబడుచున్నారు (కార్య $11^{30}$). వారు అపొస్తలులతో కూడ ఆదిక్రైస్తవ ఆలోచన సభలో ముఖ్యులైరి ($15^{2}$). ఇట్టి పెద్దలనే పౌలు మిలేతునకుఁ బిలిపించి ($20^{17}$) దేవుఁడు వారిని సంఘముమీఁద అధ్యక్షులనుగా నియమించెనని వారితోఁ జెప్పెను ($20^{28}$). యెరూషలేము సంఘమును చూడఁగా క్రీస్తు సహోదరుఁడగు యాకోబు ఆ సంఘముపై అట్టి పెత్తనమును అధ్యక్షతను కలిగి యుండినట్లు కనఁబడుచున్నది (కార్య $15^{13,21}$ $21^{17-26}$ గల $2^{12}$). ఆది చరిత్రకారుఁడగు హెగిసిప్పస్ (*Hegesippus*) కూడ యాకోబట్టివాఁడై యున్నట్లు వ్రాసెను. క్రమక్రమేణ సంఘమునందు అధ్యక్షులును, పెద్దలును, పరిచారకులును పరిచారకురాండ్రులు మున్నగువారేర్పడిరి గాని క్రొత్త నిబంధన కాలములో నీ యుద్యోగముల యుత్పత్తి కొంతవఱకు సూచింపఁబడినను అవి ఛాయ పఱచఁబడిన క్రమమైన యుద్యోగములైనట్లు కనఁబడదు.

ఆది సంఘపువారు కొంతవఱకు యూదుల సమాజ మందిరములలోని యేర్పాటులను, కొంతవఱకు తమ స్వంతపనుల అవసరమును అనుసరించి, సంఘము వారు పరిశుద్ధులును సంపూర్ణులును అగునట్లును, క్రీస్తు శరీరము (= సంఘము) అభివృద్ధిచెందుటకును తగిన నియమములను చేసిరి (అపొస్తలులు, అధ్యక్షులు, పెద్దలు, పరిచారకులు, కృపావరములు చూ॥).

**సంచకరవు** (Earnest). ఇది వ్యాపారమునకు సంబంధించిన పదము. తనది అని యనిపించుకొనుట కియ్యఁబడు బయానాయై యున్నది. అలంకార రీతిగా బైబిలునందిది పరిశుద్ధాత్మకు సార్థక నామమయ్యెను (II కొరి $1^{22}$ $5^{5}$ ఎఫె $1^{14}$). ఆయనను మన కనుగ్రహించుట, ఇక ముందుకు మనకు అనుగ్రహింపఁబడనైయున్న వానికి బయనాగానున్నది. దీనివలన పూర్ణరక్షణ మనకిఁకను దొరకునని మనకు నిశ్చయము కలుగుచున్నది (పరిశుద్ధాత్మ చూ॥).

**సంచి** (Bag, Purse). నాలుగు హెబ్రీ పదములకును రెండు గ్రీకుపదములకును తర్జుమా.

1. ఒక తలాంతు వెండి పట్టునంతది (II రాజు $5^{23}$). దీనిని చర్మముతో చేసినట్లున్నది. ఆ పదమే యెష $3^{22}$ లో ఆభరణముల నుంచుటకు వాడుకొను చిన్న సంచిని సూచించును.

2. ఏదైన వస్తువుల నుంచుకొనుట కుపయోగించు పాత్రలుగాని సంచులుగాని సూచించు పదము. గొల్లలు తమ చల్దిని తీసికొనిపోవు చిక్కము సూచించును (I సమూ $17^{40}$). $17^{40}$ లో దానిని చిక్కమని సరిగా తెనిఁగించిరి.

3. కట్టుటయని శబ్దార్థమిచ్చు మఱియొక పదమును II రాజు $12^{10}$ యోబు $14^{17}$ హగ్గ $1^{6}$ లో సంచులు అను మాటచే తెనిఁగించిరి. ఆ పదమునే ఆది $42^{35}$ లో గోనె యనియు సామె $7^{20}$ లో సొమ్ము సంచియనియు తర్జుమాచేసిరి.

4. సొమ్ము నుంచుకొనుటకై బైబిలుకాలమునందున్నవారు వాడిన విశేషపదము (యెష $46^{6}$ సామె $1^{14}$ $16^{11}$). ఆ మాట తూనికెరాళ్ల నుంచుటకై వాడెడి సంచికిని ఉపయోగింపఁబడెను (ద్వితీ $25^{13}$ మీకా $6^{11}$).

5. క్రొత్త నిబంధనలో సంచియని తెనిఁగించిన గ్రీకు పదము. పైన 4 లోని హెబ్రీ పదమునకు సాటియైనది (లూకా $12^{33}$).

6. యోహా $12^{6}$ $13^{29}$ లో సొమ్ము సంచియని తెనిఁగించిన పదము సంచినిగాక చిన్న పెట్టెను సూచించునదై యున్నది. ఆ పెట్టెకు వాడిన పదమునకు వాయిద్యములలో ఊదెడి భాగములను దాచుటకు వాడెడి సంచియని శబ్దార్థమగును.

సాధారణముగా తమకు ప్రియమైన వస్తువులను సంచులలోవేసి యుంచినందున, అవి ధనమును సూచించుటకు అలంకారరీతిగా ప్రయోగింపఁబడెను (హగ్గ $1^{6}$ లూ $12^{33}$).

**సంతానము (Seed, Offspring).** దీనిని గూర్చిన వివరములకొఱకు కుటుంబము, వంశావళి క్రమణిక, బీజము అను శీర్షికలు చూ॥. ఈ పదముయొక్క సాధారణార్థము అనేక వచనములలోనున్నది (ఆది $3^{15}$ $9^{9}$ $12^{7}$ మొ॥). ఈ శీర్షికలో దాని విశేషార్థములు వివరింపఁబడును.

ఇశ్రాయేలీయులు అబ్రాహాము సంతానమనఁబడిరి (రోమా $11^{1}$ II కొరి $11^{22}$). అబ్రాహాము సంతానమునకు చేయఁబడిన వాగ్దానములు (ఆది $12^{7}$ $17^{7}$) అతని సంతానపు వారందఱిచేఁ గాక క్రీస్తు అను ఒకనిచే మాత్రము నెఱవేరినట్లు పౌలు ఆ పదముయొక్క ఏకవచన రూపమువలన దృష్టాంతపఱచెను (గల $3^{16}$). అదియుఁగాక అబ్రాహాము సంతతివారు శరీర ప్రకారముగా అబ్రాహాము వంశములో పుట్టినవారుగాక విశ్వాసముచేత క్రీస్తుతో చేర్చఁబడిన వారిని సూచించును ($3^{7,29}$ రోమా $2^{29}$ గల $6^{16}$).

**సంతులేనితనము** పిల్లలు 1 చూ॥

**సంతోషము** ఆనందము చూ॥

**సంతృప్తి, తృప్తి (Contentment).** పాఁత నిబంధనయందు సంతృప్తియను పదము లేకపోయినను దాని సంగతి కలదు. ఆశ తీరిపోవుట తృప్తి యనవచ్చును. దేవుని ముఖదర్శనమువలన అట్టి తృప్తికలుగునుగాని మఱిదేనివలననైనను అది కలుగనేరదు (కీర్త $17^{15}$). ప్రసంగి గ్రంథమంతయు ఈ లోక సంబంధమైన దేదియు తృప్తి కలిగించఁజాలదను సంగతిని బోధించును. దేవుని నాశ్రయించుటవలన దేహమున కెన్ని కష్టములు కలిగినను ఆత్మకు కలుగు తృప్తినిగుఱించి హబ $3^{17-19}$ నందు దివ్యముగా నున్నది.

క్రొత్త నిబంధనయందు సంతుష్టి, తృప్తి యను పదములున్న చోట్లనెల్ల ఒకటే గ్రీకు పదమునకు సంబంధించిన మాటలున్నవి. ఫిలి $4^{11-13}$ నందున్న ఆ పదము గ్రీకుల నీతిశాస్త్రమునం దుపయోగింపఁబడినదై ఒకనికి కావలసినదంత యున్నదను శబ్దార్థమగును. తృప్తిపడుట మనస్సుకు సంబంధించినట్లు గ్రీకుశాస్త్రులు అదియంతయు మనస్సులో నున్నదని యనుకొనువారుగాని పౌలు దానినట్టి భావముతో వాడలేదు. దేవుఁడు చెప్పిన నా కృప నీకు చాలును అను వాక్యమే పౌలు తృప్తికి ఆధారమై యుండెను. అట్టి తృప్తికి భిన్నముగా నున్న ధనాశనుకూడ త్యజింపవలెనని క్రీస్తును (లూ $12^{15-21}$), ఆయన శిష్యులును (I తిమో $6^{6}$ హెబ్రీ $13^{5}$) బోధించిరి. దేవుఁడు మనకు తండ్రి యగుటచే మనకు అవసరమైన వానినన్నిఁటిని ఇచ్చునను విశ్వాసము గలవారమై చింత మాని తృప్తి నొందవలెను (మ $6^{25\ 32}$).

**సందేహము, సంశయము (Doubt).** ఇవి కనీసము ఆరు గ్రీకు పదములకు తర్జుమయై యున్నవి. వానికి సర్వ సాధారణముగా ఏమియు తోఁచక పోవుట యని యర్థము. ఆ యర్థము బైబిలునందును గలదు (యోహా $13^{22}$). దానిని ఎక్కువ వాక్యములలో ఏమియుతోఁచక పోవుట యని తెనిఁగించిరి (కార్య $2^{12}$ $5^{24}$ $10^{17}$ $25^{20}$ గల $4^{20}$). ఒక పనిని చేయవచ్చునా చేయ రాదా యని వెనుకముందాడుటను సందేహింపక యని కార్య $10^{20}$ నందును దానికి సంబంధించిన $11^{12}$ లో ఆ పదమునే భేదముచేయక యనియు తెనిఁగించిరి. ఈ పదముకు సాధారణ యర్థము మాత్రమేగాక దేవుని నమ్మకపోవుట యను విశేష యర్థమును గలదు. రోమా $14^{23}$ నందు విశ్వాసము లేకుండుట యని తెలుఁగులో నున్నదానికి మూలభాషలో సందేహపడుట యని యర్థము. సందేహము విశ్వాసమునకు భిన్నముగానున్నది (మ $21^{21}$ మా $11^{23}$). కొన్ని పదములిట్టి సందేహములను పుట్టించును కావున అవి సందేహాస్పద

ములగు పదము లనఁబడును (రోమా 14[1]). పేతురు సందేహించినందున సముద్రములో మునుగ నారంభించెను (మ 14[31]). క్రీస్తు లేచిన పిమ్మట కొందఱు నమ్మక సందేహపడిరి (28[17]). ఇట్లు సందేహపడరాదని వానివెంటనే కలిగిన గద్దింపుల వలన స్పష్టమగుచున్నవి. క్రీస్తు విషయమై తమకు కలిగిన సందేహమునకు ఆయన స్పష్టముగా చెప్పక పోవుటయే కారణమని కొందఱు విరోధులనఁగా, ఆయన వారు తన సంబంధులుకాక ఇతరమైనవాని నాశించుటయే కారణమని జవాబిచ్చెను (యోహా 10[24-26]). ప్రార్థించునప్పుడు సందేహింపరాదు (I తిమో 2[8] యాకో 1[5,6]). ఇట్లు సందేహించెడివారు ద్విమనస్కు లనఁబడెదరు (యాకో 1[7,8]).

సంధి (Alliance). ఆయావారలు ఒకరితో నొకరు సంధిచేసికొను వాడుక యుండినట్లు పాఁత నిబంధన చరిత్రను చూడఁగా తెలియుచున్నది. అబ్రాహాము అబీమెలెకుతో సంధి చేసికొనెను (ఆది 21[22-34]). రాజులకాలములో జరిగిన అనేక సంధులనుగూర్చి చదువవచ్చును. సొలొమోను హీరాముతో సంధిజేసికొనెను. (I రాజు 5[1,9]). అతఁడు ఫరోకూతురును వివాహమాడుట ఐగుప్తుతో చేసికొన్న సంధికి గురుతుగానున్నది (3[1] 9[16]). ఇశ్రాయేలు వారి రాజగు ఒమ్రీ ఫేనీకే రాజు కూతురును తన కుమారుఁడగు అహాబుకు ఆడుగుట ఆ రాజులు చేసికొన్న సంధికి సూచనగా నున్నది (16[31]). ఆమోసు ఆ సంధిని సూచించుచు దానికి సహోదర నిబంధన యను పేరు పెట్టెను (ఆమో 1[9]). క్రొత్త నిబంధనలో తూరువారు హేరోదుతో చేసికొన్న సంధి వ్యాపారమునకు సంబంధించినదై యుండవచ్చును. యూదారాజగు ఆసా దమస్కురాజగు బెన్హదదుతో సంధి చేసికొన యత్నించెను (I రాజు 15[18]). దానివలన అంతకుమునుపు ఇశ్రాయేలు వారి రాజుకును దమస్కు రాజులకును సంధి యున్నట్లు తెలియుచున్నది (15[19]). యెహోషాపాతు కాలములో యూదావారు ఇశ్రాయేలు వారితో సంధి చేసికొనిరి (22[1-40]). ఈ సంధివలన యూదావారు బయలు పూజను అభ్యసించిన వారై చాల కీడు లనుభవించిరి (II దిన 21). యెషయా కాలములో దమస్కువారును ఇశ్రాయేలువారును సంధిచేసికొని యూదావారిమీద యుద్ధము చేసిరి (యెష 7[1] = II రాజు 16[5]). అష్షూరురాజ్యము వృద్ధిలోకి వచ్చినది మొదలుకొని అట్టి గొప్ప లోకరాజ్యములతో సంధి చేసికొనుట వాడుకయయ్యెను (II రాజు 16[7,8]). వారు యూదావారిని కఠినముగా చూచినందున వారి బాధలను తప్పించుకొనుటకై అష్షూరు వారిని విరోధించి ఐగుప్తీయులతో సంధిచేసికొనిరి (18[21-24] యెష 31). వారిట్టి సంధులను చేసికొనక తమ ఆపదలలో నుండి తప్పించుకొనుటకు దేవునిని ఆశ్రయించుకొనవలెనని ప్రవక్తలు వారి నెంత మందలించినను (హోషే 8[9] యెష 20, 30 యిర్మీ 2[18,36]) వారు వినక తమ స్వతంత్ర తను పోఁగొట్టుకొనిరి (II రాజు 16[7]). చెఱ కాలమునకుఁ దరువాత ఎజ్రా నెహెమ్యాలు చుట్టునున్న అన్యులతో సంధిచేసికొనుటకు ఒప్పుకొనలేదు (ఎజ్రా 10[3]). మక్కబీయుల కాలములో వారు రోమావారితో మరల కొద్దికాలము వరకు సంధిచేసికొనిరి (I మక్క 8[17] 15[16]) గాని అప్పటినుండి సాధారణముగా అస్వతంత్రులై ఆయా గొప్ప సామ్రాజ్యములకు లోనైరి.

సంపద ధనము చూ॥

సంపూర్ణత పరిపూర్ణత చూ॥

సంవత్సరము కాలమానము VII చూ॥

సంస్కారములు (Sacrements). ఈ పదము బైబిలునందు లేకపోయినను బాప్తిస్మము ప్రభువు భోజనము అనునవి సంస్కారములగుటచే దాని భావమిచ్చట వివరింపఁబడును (బాప్తిస్మము, ప్రభువు రాత్రిభోజనము చూ॥). రోమా సంఘపు వారు సంస్కారములు ఏడని పదిహేనవశతాబ్దము నందు జరిగిన ఆలోచన సభలలో తీర్మానించిరి. అవి బాప్తిస్మము, నిర్ధారణ, ప్రభువు రాత్రి భోజనము, పాపసంకీర్తనము ఉత్తరక్రియలు, గురుపట్టము, వివాహము అనునవి. ఏ యాచారములు కంటికి కనఁబడని విశేష వరములను సూచించి వాని నాచరించు వారికా వరములననుగ్రహించునో అవే సంస్కారములని తలంచి వానిని ఏడుగా లెక్కింతురు. గాని ప్రాటస్టాంటువారు ఈ యాచారములలో క్రీస్తు స్వయముగా తేటయైన నియమములచే నేర్పాటుచేసెనో వానిని

మాత్రము సంస్కారములుగా నెంతురు. ఇవి బాప్తిస్మము (మ $28^{19}$ మా $16^{16}$), ప్రభువు రాత్రి భోజనము (మ $26^{26-29}$ మా $14^{22-25}$ లూ $22^{19,20}$ I కొరి $11^{23-25}$) అను రెండే. ఆదిక్రైస్తవులు ఈ రెండు ఆచారములను తక్కిన యాచారము లన్నింటినుండి ప్రత్యేకపఱచినట్లు వారి వాడుక లనుబట్టి తెలియుచున్నది (కార్య $2^{41,42}$ I కొరి $10^{1-4}$). కొలొ $2^{11}$ వలన బాప్తిస్మము ఆత్మీయ సున్నతియనియు, I కొరి $5^{7}$ $11^{26}$ వలన ప్రభువు రాత్రిభోజనము ఆత్మీయ పస్కాయనియు తెలియు చున్నది. పాత నిబంధనలోని సున్నతి పస్కా యను రెండు ఆచారములు బాప్తిస్మము ప్రభువు రాత్రిభోజనము అనువానిచే పూర్తియైనవని పై రెండు వాక్యములచే స్పష్టమగును. కావున ఈ రెండు ఆచారములకు అట్టి యౌన్నత్యస్థితి నారో పించుట కూడ తగినదై యుండును.

రోమా సంఘమువారు విశ్వాసము లేకపోయి నను ఈ యాచారములు వానియంతట యవే దేవుని కృపను మనకిచ్చు దేవుని సాధనములందురు గాని ప్రొటస్టాంటువారు విశ్వాసములేనిది అవి వట్టి యాచారములే గాని దేవుని కృపనిచ్చునవి కావని బోధింతురు (బాప్తిస్మము, ప్రభువు రాత్రి భోజనము, హస్తనిక్షేపణము చూ॥).

**సజ్జలు (Millet).** సజ్జలను పదము యెహె $4^{9}$ నందు మాత్రమున్నది గాని అదెట్టి ధాన్యమో రూఢిగాఁ దెలియదు. J.C.

**సటీక గ్రంథము (Commentary).** ఇది II దిన $13^{22}$ నందున్నది. హెబ్రీ భాషలో మిద్రాషు (*Midrash*) అను మాటయొక్క భాషాంతరము. నీతితోఁగూడిన చరిత్ర విషయ ములనుగాని, ఏదో యొక అంశమునుగూర్చి ఉపన్యాసముల రీతిగా వివరింపఁబడిన బోధలను గాని సూచించును. పైనున్న వాక్యములలో నది ఇశ్రాయేలీయుల చరిత్రను నీతిబోధలతో కూడ వివరించు గ్రంథమును సూచించునట్లుగా నున్నది (పారంపర్యములు చూ॥).

**సత్యము, నిజము, యథార్థత (Truth).** దీని యసలు పదము పాత నిబంధనయందు స్థిరతను సూచించును.

I. పాత నిబంధనయం దీ మాట కీ దిగువ యర్థములు కనఁబడుచున్నవి.

1. సత్యమను పదము మనము వాడినట్లే నిజము పలుకుట యను అర్థము నిచ్చుచున్నది (ద్వితీ $13^{14}$ సామె $12^{17}$). పూర్వికు లీ విషయమునందంతగా లక్ష్యముంచినటుల కనఁబడదు (ఆది $12^{11-20}$ $20^{2-18}$ $26^{7-15}$ $27^{18-27}$ మొ॥) గాని, పదియాజ్ఞ లియ్యఁబడినప్పుడు అబద్ధ సాక్ష్యము పలుకుట నిషేధింపఁబడెను (నిర్గ $20^{16}$). అబద్ధమాడుటను ప్రవక్తలు బహుగా ఖండించిరి (హోషే $4^{2}$ కీర్త $59^{12}$ సామె $12^{22}$ అబద్ధము చూ॥). దానిని ఖండించు ప్రతిది సత్యమాడుటను బోధించును.

2. న్యాయము చేయుటను ఈ పదము సూచించుచున్నది. ప్రజాపరిపాలకులు సత్యా సక్తులై (నిర్గ $18^{21}$), కృపాసత్యములను చూపు వారై (సామె $20^{28}$) యుండవలెను. ఇట్టి భావ ముతో దీని రాబోవు మెస్సీయను గూర్చి వాడిరి (కీర్త $45^{4}$ యెష $42^{3}$).

3. మానవులు దేవునియెడల కనఁబఱచు నమ్మక మును (II రాజు $20^{3}$), దేవుఁడు మానవులయెడలఁ జూపు విశ్వాస్యతను కూడ సూచించును.

4. దేవుఁడు **సత్యదేవుడు** అనగా తన వాగ్దానములను తప్పక నెఱవేర్చువాఁడు అను అర్థమిచ్చినను (కీర్త $31^{5}$), విగ్రహములవంటి మాయాస్వరూపి కాఁడను అర్థము కూడ నిచ్చును ($31^{6}$). ద్వితీ $32^{4}$ లో నున్న **నమ్మదగిన దేవుడు** అనునదియు ఇదే యర్థమిచ్చును.

5. సత్యమను పదమునకు పైనున్న యర్థములు మాత్రమేగాక, మనము ప్రమాణములుగ నెంచ వలసినవానిని కూడ పాత నిబంధన చివరి కాల మున వ్రాసినవారు తమ గ్రంథములలో సూచిం చిరి (దాని $8^{12,13}$). అది పరమజ్ఞానమునకు పాటియైన మాటయై యున్నది (సామె $23^{23}$). అప్రమాణిక గ్రంథములలోను ఆ మాట కిదే యర్థముగలదు (I ఎస్ద్రా $4^{33-40}$ సైరాక్సు $4^{28}$).

II. క్రొత్త నిబంధనలోని గ్రీకుమాట పాత నిబంధనయొక్క LXX భాషాంతరము ననుసరించి, మాయకానిదియు, నిజమైన స్వరూపము గల దానిని సూచించుచున్నది. సత్యము అనుకాని

గూర్చిన విశేష బోధలలో నీ దిగువ విషయము లను గుర్తింపవలెను.

1. అన్ని సంగతులలోను ప్రతివాఁడును తన పొరుగువానితో సత్యమునే మాట్లాడవలెను అను వాజ్ఞ గలదు (ఎఫె 4[25] కొలొ 3[9]). ప్రేమ గలిగిన హృదయులమై సత్యమాడవలెను (ఎఫె 4[15]) గాని, సత్యమాడుటకు సంబంధముగా మఱి యితర పరతు లేవియును లేవు. దీని గూర్చిన దృష్టాంతములును (కార్య 26[25] II కొరి 7[14] 12[6] ఫిలి 1[8]), హెచ్చరికలును (I కొరి 5[8] 13[6] ఎఫె 5[9]) చాల గలవు.

2. ఇది సువార్తబోధకు ఒక ముఖ్యపదమై, పైన నుదాహరించిన 5 లోని సంగతిని ఇంక తేటగా వివరించుచున్నది. పౌలీ పదమును వాడిన విధమును జూడఁగా సువార్తబోధకు మాత్రమే గాక దేవుఁడు మానవుల కందజేకిని బయలుపఱచిన నీతివిషయముల తెలియఁజేయును (రోమా 1[18-25] 2[2,8]), గాని దీనిని ముఖ్యముగా సువార్తబోధకే వాడిరి (II కొరి 13[8] గల 2[5-14] 5[7] ఎఫె 1[13] 4[21] 6[14] కొలొ 1[5,6] II థెస్స 2[11-13]). ఈ యర్థము తిమోతి తీతులకు వ్రాసిన పత్రికలలో మరింత వివరముగ నున్నది (I తిమో 2[4-7] 3[15] 4[3] 6[3-5] II తిమో 2[15-18,24-26] 3[8] 4[4] తీతు 1[4-14]). పౌలు మాత్రమేగాక హెబ్రీ గ్రంథకర్తయు (10[26]), యాకోబును (1[18] 5[19]), పేతురును (I పేతు 1[22] II పేతు 1[12] 2[2]) ఈ యుద్దేశముతోనే సత్యమను మాట నుపయోగించిరి. యోహాను సువార్తను, పత్రికలను జూచిన పక్షమున పైన నుదాహరింపఁ బడిన రెండవదానికి సంబంధముగా నున్నను, మొత్తముమీఁద దైవసంబంధమైనవానిని సూచించు టకు వాడఁబడినటుల కనఁబడుచున్నది. క్రీస్తు బయలుపఱచిన ఆ దైవసంబంధమగు సంగతులు సువార్తబోధలని తెలిసికొనవలెను (యోహా 17[17-19] యోహా 2[4,21] II యోహా 2; III యోహా 3, 4, 8, 12) గాని యోహానులో ఈ బోధ ముఖ్య మైనది కాదు. అతని వ్రాఁతలు సత్యమూర్తియగు క్రీస్తును సూచించును. ఆయనే సత్యము (యోహా 14[6]). క్రీస్తునుగూర్చి సాక్ష్యమిచ్చు పరిశుద్ధాత్మ సత్యస్వరూపియగు ఆత్మ యనఁబడును (యోహా 14[16] 16[13]). క్రీస్తు సత్యమునుగూర్చి సాక్ష్యము చెప్పెను (18[37,38]). పరిశుద్ధాత్మ సత్యమునుగూర్చి సాక్ష్యమిచ్చును (16[13]). దైవారాధన సత్యము ననుసరించునదై యుండవలెను (4[23,24]). ఈ సత్యము మనలను శుద్ధిచేయును (17[17]). మనలను స్వతంత్రులనుగా జేయును (8[32]). యోహాను వ్రాసిన నిదర్శనములన్నియు ఈ సత్యము, సత్య మూర్తియగు క్రీస్తును, సత్యస్వరూపియగు పరి శుద్ధాత్మయు బయలుపఱచినదియు, దైవసంబంధ మగు జీవమును శక్తియును గలదైనట్లు స్పష్టపఱచు చున్నవి. ఈ బోధ రోమా 1[16] I కొరి 1[24,25] యాకో 1[21] లో నుండినను, ఈ సత్యము క్రీస్తే యని మరింత తేటగా బోధించుచు, ఇంక లోతుగా వివరించినవాఁడు యోహానే యని చెప్పవలెను.

**సత్రము (Inn).** ఈ దేశమందున్నట్లు పలెస్తీనులోకూడ ప్రయాణస్థులు బసచేయు నిమిత్తము సత్రము లుండెను. లూ 2[7] లో నున్న స్థలమిట్టిదే. 10[34] లో పూటకూళ్లవాని యిల్లు అని తెనిఁగించిన మాట అసలు భాషలో వేఱొక పదమైనను అదియు సత్రమునే సూచించును.

**సదాప (Rue).** ఇవి సిరియా దేశమం దల్లెడల పెఱుగును. ఈ గింజల నెల్లవారును వాడుకొందురు. ఇది దట్టమైన ఆకులు గల్గి మందుదినుసుగా వాడఁబడిన మొక్క (లూ 11[42]).

J. C.

## సద్దూకయ్యులు (Sadducees).

1. ఉత్పత్తి, చరిత్ర.

సద్దూకయ్యులు అను పేరు సాదోకు అను నామమునుబట్టి కలిగెను. యూదుల శాస్త్రులు సాదోకు అను నొకఁడు తమ మతోద్ధారకుఁడై క్రీ॥ పూ॥ 300 సం॥ ల క్రిందట జీవించియుండె నని యందురు గాని సద్దూకయ్యులు మొదటి నుండి కులీనులును యాజకుల కక్షిలోనివారునై యుండుటచే ప్రస్తుతపు పండితులు యూద శాస్త్రుల మాటను నమ్మక, దావీదు కాలమందుండిన యాజకుఁడగు సాదోకు (I సమూ 15[25]) వలన వచ్చినదని యనుకొందురు. ఈ శాఖవారు దావీదుకాలము మొదలుకొని యుండిన ట్లను కొనరాదు గాని వా రుద్భవించినప్పుడు ప్రసిద్ధుఁ డైన ఆ యాజకుని పేరునుబట్టి పిలువఁబడిరని తెలిసికొనవలెను. వారెన్నఁడును ఎక్కువ

సంఖ్యగల వారుగా నుండకైరి గాని యున్న కొద్దిమందియైనను స్థితివంతులును గొప్ప యుద్యోగస్థులునై యుండిరి. యూదులు అన్యుల ప్రభుత్వములో నుండఁగా వారికి స్వంతరాజు లేకున్నను యాజకులు వారిలో పైయుద్యోగస్థులై యుండిరి. వారు తమ యన్యప్రభువుల దయ వలన తమ యుద్యోగములను నిలుపుకొనఁగల్గుటచే అట్టి యన్యుల పక్షపువారైరి. మక్కబీయుల కాలములో యూదప్రజలు జయించినందున అన్యులపక్షముగా నుండు నీ సద్దూకయ్యుల నుద్యోగములనుండి తొలగించి మక్కబీయుల వారిని యాజకులనుగా చేసికొనిరి. అయినను సద్దూకయ్యులు మఱల పైవారి యనుగ్రహమును పొంది ప్రధాన యాజకులైరి. క్రొత్త నిబంధన కాలములో ఈలాగుననున్నట్లు కార్య 4 వలనఁ దెలియును.

2. బోధలు. సద్దూకయ్యులు పరిసయ్యులకు ప్రతిపక్షులై యుండిరి. వారు పరిసయ్యుల పారంపర్యముల నంగీకరింపక పాఁత నిబంధన లేఖనములను మాత్ర మంగీకరించిరి. పునరుత్థానమును దూతలును లేవని బోధించిరి (కార్య $23^8$ మ $22^{23-33}$). మఱియు వారు దేవుఁడు మానవులు చేసిన మేలు కీడులను లక్షింపఁడని బోధించి యున్నట్లు యోసీఫసువలనఁ దెలియును (పురా 13: 5, 9; యుద్ధ 2: 8, 14). దీనినిబట్టి చూడఁగా వారు గ్రీకువారితో స్నేహపడి క్రమక్రమేణ బైబిలులోని నీతిబోధల ననుసరింపక గ్రీకువారి నీతిబోధల ననుసరించినట్లుగా నున్నది.

3. బైబిలు సూచనలు. పాఁత నిబంధన పూర్తియైన పిమ్మట వా రుద్భవించియుండుటచే పాఁత నిబంధనలో వారి విషయమైన సూచనలు లేవు. క్రొత్త నిబంధనయందు సువార్తలలో వారిని గూర్చిన సూచనలు ఎక్కువగా లేవు. క్రీస్తు సామాన్య ప్రజలలో నెక్కువగా పనిచేసి యుండెను కావున, సద్దూకయ్యుల జోలికి పెళ్లి యుండినట్లు కనఁబడదు. బాప్తిస్మ మిచ్చు యోహానునొద్దకు వెళ్లినవారిలో సద్దూకయ్యులు కొందఱుండిరి (మ $3^7$). ఆకాశమునుండి యొక సూచన నడుగుటకు పరిసయ్యులతో కూడ సద్దూకయ్యులు కొందఱు క్రీస్తునొద్దకు వచ్చిరి ($16^{1-4}$). క్రీస్తు తన శిష్యులను చూచి పరిసయ్యులనుగూర్చి జాగ్రతపడుఁడి యన్నట్లు సద్దూకయ్యులనుగూర్చి కూడ జాగ్రతపడుఁడనెను ($16^{6-12}$). క్రీస్తును చిక్కుపఱచుటకు ప్రశ్నలడిగినవారిలో వీరుకూడ నుండిరి ($22^{23-33}$). అపొస్తలులు పునరుత్థానమును గూర్చి బోధించినందున వారు యాజకులతోఁ గలసి అపొస్తలులను హింసించిరి (కార్య $4^{1-22}$). పౌలును విచారణ చేసిన సన్హెడ్రిన్ సభలో సద్దూకయ్యులు కూడ నుండిరి. పౌలు అది యెఱిఁగి పునరుత్థానము విషయము తాను విచారింపఁబడుచున్నట్లు చెప్పెను ($23^{6-10}$).

**సన్నిధి దూత** దేవదూతలు 2 చూ॥

**సన్నిధి రొట్టె** (Shew Bread). నిత్యమును గుడారములోను దేవాలయములోను ఉంచఁబడిన రొట్టెలను పెట్టెను. ప్రతి విశ్రాంతి దినమున పాఁత రొట్టెలను దీసివేసి క్రొత్తవాని నుంచిరి. పాఁతవానిని యాజకులు తినిరి (నిర్గ $25^{30}$ లేవీ $24^{5,9}$, సమూ $21^6$ మ $12^4$). ఈ రొట్టెలకు సంఖ్యా $4^7$ లో నిత్యముగా నుంచవలసిన రొట్టెలను పేరు గలదు. ఆ రొట్టె పులియనిదై యుండెనని యోసీఫసు వ్రాసెను (పురా 3. 6. 6.). ప్రతిది ఏఫాలో ⅕ వంతు పిండితోఁ జేయఁబడెను. అవి పండ్రెండును, 12 గోత్రములను సూచించెను (లేవీ $24^7$ నిర్గ $28^{10-12}$). ఈ రొట్టెలు దేవుని సన్నిధిలో నుంచుట దేవునితో ఆయన యనుగ్రహించు దానములద్వారా నిత్యసహవాసము కలుగునను సంగతిని సూచింపవచ్చును. లేవీయులలో కహాతీయుల తెగవారికి రొట్టెనుగూర్చి చూచెడివారు (I దిన $9^{32}$ గుడారము 6 (1), దేవాలయము I 7 (2) (a) చూ॥).

**సన్బల్లటు** (Sanballat = సీను దేవతా, అతని ప్రాణమును రక్షించుము). చెఱకాలమునకుఁ దరువాత యూదులను కష్టపెట్టిన సమరయుఁడు. బేత్హోరోను ఊరివాఁడైనందున ఇతఁడు హోరోనీయుఁ డనఁబడును (నెహె $2^{10,19}$ మొ॥). బబులోనునుండి పలెస్తీను దేశము నేలుటకై పంపిన యుద్యోగస్థులలో నొకని వంశమందు ఇతఁడు

పుట్టినట్లున్నది. నెహెమ్యా యెరూషలేము ప్రాకారమును తిరిగి కట్టుటకు పూనుకొనఁగా ఆ పని నడ్డగించినవారిలో నితఁడొక ముఖ్యుఁడు. ఆ పని జరుగ నేరదని యితఁడు మొదట అపహాస్యము చేసి ($2^{19}$), తరువాత ఆ పని కొనసాగు చుండఁగాఁ జూచి దానిని చెడఁగొట్టుటకై నెహెమ్యా మీఁదికి దండెత్తివచ్చెను (4). నెహెమ్యాయొక్క జాగరూకతవలన ఆ విరోధుల పని నిష్ఫలమయ్యెను. పిమ్మట అతఁడు కుట్రతో నెహెమ్యాను చంప నాలోచించి, అతఁడు తనను ఓనోలో కలిసికొని యీ కట్టడముల విషయమై ఆలోచన చేయవలెనని మనవి చేసెను ($6^{1-4}$). అలాగు నెహెమ్యా వెళ్లనందున అతనిని బెదరించుటకు సన్బల్లటు వేతీ యుక్తులను చేసెను గాని దేవుఁడు నెహెమ్యాను కాపాడెను ($6^{5-14}$). రెండవసారి నెహెమ్యా యెరూషలేమునకు వెళ్లినపుడు నెహెమ్యా ఈ సన్బల్లటు యొక్క అల్లుని యెరూషలేములో నుండి వెళ్లఁగొట్టెను ($13^{28}$). సన్బల్లటుయొక్క అల్లుని పేరు మనష్షే యని యోసీఫసు అను చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. ఈ మనష్షే షోమ్రోనువారి మతాచారములను గెరిజీము కొండమీఁద స్థాపించినట్లుగా ఆ చరిత్రకారుఁడు వ్రాసెను.

**సన్హెరీబు** (**Sennacherib** = చంద్రదేవత సహోదరులను విస్తరింపఁజేసెను). క్రీ॥ పూ॥ 705-681 సం॥లలో అష్షూరు దేశమునకు చక్రవర్తిగా నుండినవాఁడు (అష్షూరు చూ॥). అతని తండ్రియగు సర్గోను చనిపోఁగానే, పూర్వరాజ్యముల కాలమునందు వాడుకలో నున్నట్లు ఆ రాజ్యములోని యువరాజులలో నసేకులు తిరుగుబాటు చేసిరి. వారిలో మెరోదక్బలదాను (చూ॥) ముఖ్యుఁడు. సన్హెరీబు అతనిని బాబెలు నుండి తొలఁగించి బెలిబ్నీ (*Bel-Ibni*) అను వానిని అతనికి బదులు రాజునుగా నియమించెను. అతఁడు తూర్పున బాబెలును ఇంక నితర దేశములను లోఁబఱచుకొనిన పిమ్మట పశ్చిమముననున్న దేశములను లోఁబఱచుకొనుట కొక దండయాత్రి చేసెను. 701 వ సం॥లో ఫేనీకే దేశముమీఁద పడి తూరునుతప్ప తక్కిన పట్టణములన్నిఁటిని దోచుకొనెను. తూరురాజు సహా ఇతని ధాటి కాగలేక కుప్రకు పారిపోఁగా అతఁడు ఏత్బయలు అనునతనిని ఫేనీకేకు రాజునుగా నియమించెను. ఫేనీకేను జయించిన పిమ్మట సన్హెరీబు ఇంక దక్షిణమునకు వెళ్లఁగా అమ్మోను, మోయాబు, ఎదోము అష్దోదువారు అతనికి కప్పమునంపి తమ విధేయతను చూపించిరి. సన్హెరీబు ఫిలిష్తీయుల దేశములోని లాకీషుకు వచ్చిన పిమ్మట, యూదారాజగు హిజ్కియా అతనికి విశేష వెండిబంగారముల నంపి అతఁడు యెరూషలేమునకు హాని చేయకుండునట్లు ప్రయత్నము చేసెను (II రాజు $18^{13-16}$) గాని, అతఁడీ లంచమును బుచ్చుకొనినను దానితో తృప్తినొందక యూదాదేశముమీఁద యుద్ధము చేయుట కొక సైన్యమును పంపెను. అష్షూరివారి రాతి శాసనములను చూడఁగా అతఁడు యూదయ దేశములోని 46 కోటలను జయించి, 2,00,150 మంది జనులను చెఱఁబట్టెను. ఈ కాలములోనే యితఁడు యెరూషలేమును ముట్టడించి ఆ పట్టణము నప్పగింపవలెనని హిజ్కియా యొద్దకు రెండుమాఱులు మాతల నంపెను (II రాజు $18^{13}$-$19^{34}$=యెష $36^{1}$-$37^{35}$). ఆ కాలములోనే ఐగుప్తు రాజైన తిర్హాకా (ఐగుప్తు (3) చూ॥) సన్హెరీబు నెదిరించుటకు రాఁగా అల్టెకె (*Elletekeh*) లో అతఁ డితనిపై యుద్ధము చేసెను. దీనికై సన్హెరీబు సాధ్యమైనంతవఱకు తన సేనవారి నందఱిని పోగుచేసెను. అష్షూరివారి రాతిశాసనములను చూడఁగా సన్హెరీబునకు జయము కలిగినట్లున్నది గాని, అది అంత గొప్ప జయము కానట్లుగా నున్నది. ఎందుకనఁగా సన్హెరీబు ఇంక ముందుకు వెళ్లక అచ్చటినుండి తిరిగి వెళ్లెను II రాజు $19^{35-37}$ = యెష $37^{36-38}$ లో నున్నట్లు యెరూషలేమును ముట్టడించిన సేన తెగుళ్లవలన క్షీణించెను. ఆ దండయాత్రనుగూర్చి అష్షూరువారు తమ శాసనములలో తేటగా వ్రాయక అస్పష్టముగా వ్రాసిరి. ఆ గొప్ప దండయాత్రయొక్క ముగింపునందు వారికి అపజయము కలిగెనని యందువలన అనుమానింపవచ్చును. దాని యంతమున సన్హెరీబు హిజ్కియాను ముట్టడించి అతనివలనను, చుట్టుపట్లనుండు అన్యరాజుల వలనను కప్పము పుచ్చుకొనినట్లుగా వ్రాయించెను. గాని ఇది పైనమన్నట్లు లాకీషును ముట్టడించినయ

మునుపు జరిగినదై యున్నది. సన్హెరీబు తరువాత 20 సం॥ వఱకు ప్రభుత్వము చేసినను పాలెస్తీను ప్రాంతముల మీఁదికి మఱియొకసారి దండెత్తి యుండలేదు గనుక, రాజుల గ్రంథములో నున్నట్లు ఈ దండయాత్రయొక్క ముగింపునందు గొప్ప యపజయము కలిగనని తెలిసికొనఁగలము. ఆ చివరి 20 సంవత్సరములలో నతఁడు ఏలాము వారిమీఁదను బాబెలు మీఁదను మాత్రము యుద్ధము చేసెను. 689 వ సంవత్సరములో అతఁడు బబులోను పట్టణమును బహు క్రూరముగా నాశనము చేసెను. తన ప్రభుత్వకాలపు చివరి 8 సంవత్సరములలో తనకొఱకు నీనెవె పట్టణమున గొప్ప నగరములను కట్టించుకొని ఆ పట్టణమును మిక్కిలి చక్కఁగా నలంకరించెను. అతఁడనేక విషయములలో కఠినముగా ప్రభుత్వము చేసినట్లు సూచనలు కలవు. మఱియు నతఁడు తన దేవత యగు నిస్రోకు గుడిలోనుండఁగా నతని యిద్దఱు కొడుకులు కుట్రచే నతని చంపుటను చూచిన యెడల అతఁడు తాను కొలిచిన కొలతచొప్పున కొలువఁబడె ననఁదగును (II రాజు $19^{37}$ = యెష $37^{38}$). అయితే అతనిఁ జంపిన కొడుకు లిద్దఱిలో నొకరైనను అతని తరువాత చక్రవర్తులు కాకపోయిరి గాని ఏసర్హద్దోనను వాఁడు అతనికి తరువాతి చక్రవర్తియాయెను.



సన్హెరీబు హెబ్రీయులను హింసించుట

**సఫారా** (Sephar = లెక్కించుట). అరబ్బీయుల తెగలలో కొన్నిఁటికి పెద్దయగు యొక్తాను సంతతివారు నివసించిన దేశమునకు హద్దుగానుండు స్థలము. (ఆది $10^{30}$) జాఫరు (*Zafra*) అనఁబడు స్థలమిదేనని సాధారణము ననుకొందురు. ఈ పేరుగల స్థలములు రెండు దక్షిణ అరేబియాలో నున్నవి.

**సప్తర్షి నక్షత్రము** (The Bear). ఇది సప్తర్షి రాశికి సంబంధించిన యొక నక్షత్రము. లేదా ఆ రాశి యంతయై యుండును. యోబు $38^{32}$ నందీ రాశికి పేరుపెట్టినను $9^{9}$ నందు ఆ మూలపదముచే స్వాతి యని తెనిఁగించిరి. అది స్వాతి నక్షత్రమైనయెడల ఈ రాశికి సమీపమున నున్నదేగాని ఆ రాశికి చేరినది కాదని తెలిసికొనవలెను.

**సఫు** (Saph = గంగాళము). ఒక ఫిలిష్తీయ యోధుఁడు. దావీదు అనుచరులలో సిబ్బెకై అనువాఁడితనిని చంపెను. (II సమూ $21^{18}$). I దిన $20^{4}$ నం దితనికి సిప్పయి అను మాఱుపేరు గలదు.

**సప఼్ీరా** (Sapphira = నీలకాంతము, సొగసు). పేతురుతో అబద్ధము చెప్పి అకస్మాత్తుగా చనిపోయి అననీయాభార్య (అననీయా 1 చూ॥).

**సబక్తాన** ఎలోయి చూ॥

**సబ్తకా** (Sabteca). కూషుయొక్క చిన్న కుమారుఁడు (ఆది $10^{7}$ I దిన $1^{9}$). సబ్తాయను పేరునకు సంబంధించి యుండవచ్చును. ఇతని సంతతివారి యునికి యెచ్చటనో తెలియదు.

సబ్తా (Sabta) కూషు కుమారులలో నొకఁడు. (ఆది 10[7] I దిన 1[9]). హవీలా రాయమా అను పేరులకు మధ్యనుండుటచే ఇతని సంతతివారు అరబ్బీదేశమునకు తూర్పుగా నుండిరని కొందఱి యభిప్రాయముగాని వాని యునికిని గూర్చిన సూచన లెవ్వియును లేవు.

సబ్బు (Soap). ప్రస్తుతము వాడుచున్న సబ్బు పలెస్తీను దేశములో బైబిలు కాలమందుండ లేదు. ఈ దేశమునందు సబ్బుకు ప్రతిగా నేలాగు కుంకుడుగాయ సీకాయ వాడెదరో ఆ రీతిగనే పలెస్తీనులోను అట్టి రసముగల వ్రేళ్లను సబ్బుకు ప్రతిగా వాడిరి. యిర్మీ 2[22] మలా 3[2] నున్నట్లు బట్టల నుదుకుటలో వాడిన సబ్బు అట్టిదే. యోబు 9[30] నున్నమాట యొక్క మూలభాషా పదము మఱియొకటియై శుభ్రతను సూచించుచు ఆ యర్థమునే యిచ్చును. ఆ వ్రేళ్లను రసమును లోహములనుకూడ శుద్ధిచేయుటకు వాడిరి. దానిని యెష 1[25] లో క్షారము అని తెనిఁగించిరి.

సభ (Council). మహాసభ చూ॥. ఆలోచన చేయుటకు కూడిన ఆయా సభలను గూర్చిన సూచనలు బైబిలునందు గలవు. 1. కార్య 19[39] నందున్న క్రమమైన సభ గ్రీకువారి పట్టణములలో నున్నట్లుగా పౌరస్థితి నొందినవారందఱి సంఘమైయున్నది. అట్టి సభలలో వారు గొప్ప విషయములను గూర్చి తీర్మానము చేయుటకద్దు. 2. కార్య 25[12] లోని సభవారు గొర్నరుకు సలహా చెప్పుటకైన ఉద్యోగస్థుల పెద్దల సమూహమైయున్నది. ఫేస్తు పౌలు చేసికొనిన అప్పీలు నంగీకరించకముందు వారి సలహాను మొదట యడిగెను. 3. కార్య 15 లో నున్నటి విషయమై ఆలోచన చేయుటకు ఒక విశేష క్రైస్తవసభ కూడెను. దానియందు యెరూషలేమునందలి అపొస్తలులును పెద్దలును చేరిరి. ఈ సభయు గల 2[1-10] లో నుదాహరింపఁబడినదియు నొకటేనని కొందఱి యభిప్రాయము గాని గలతీయ పత్రికలో నున్నది అంతపెద్ద సభకానట్లుగా నున్నది. యెరూషలేములోని మొదటి క్రైస్తవ సంఘపువారి సభవలన వారు తమ సభను జరిపినరీతిని దెలిసికొనవచ్చును. అక్కడ కూడినవారు తమతమ యభిప్రాయములు చెప్పిన పిమ్మట అగ్రాసనాధిపతిగా నున్న యాకోబు వారి చర్చలవలన తేలిన సత్యమును ఒక తీర్మానముగా చేర్చెను. అది ఆ సభ యొక్క తీర్మానమయ్యెను. సంఘపు చరిత్ర యందు ఇట్టి క్రైస్తవ సభలగు సార్వత్రిక సభల తీర్మానములు చాల అధికారముగలవిగా నెంచఁబడును.

సభాపర్వతము (Mount of Congregation). ఉత్తరదిక్కునయున్న పర్వతములలో నొకటి. యెష 14[13] నందీపదము వచ్చును. బాబెలు రాజు అతిశయమునకు సంబంధముగా నీపేరువచ్చెను. హిందువులవలెనే బాబెలు వారును తమ దేశమున కుత్తరముగానున్న పర్వతములు దేవతల కునికిపట్టని భావించిరి గాన ఈ రాజు ఆ పర్వతముమీఁద సహా కూర్చుండెదనని అతిశయపడెను.

సమరయ, షోమ్రోను (Samaria).

1. పట్టణము. దీని అసలు పేరు షోమ్రోను. ఇశ్రాయేలీయుల రాజగు ఒమ్రీ షెమెరు అను వానిదగ్గర ఒక కొండను కొని దానిమీఁద తన నగరును కట్టించెను. షెమెరు పేరునుబట్టి దీనికి షోమ్రోనను పేరు కలిగెను. (I రాజు 16[24]). గాని షెమెరు అను పేరునకు కావలి యని అర్థము గాన దీనిచుట్టునుండు ప్రదేశమును కాపాడుటకు ఇది తగిన కోటయని తలంచి దీనికీ పేరుపెట్టి యుండవచ్చును. ఇది కొండమీఁద కట్టఁబడుటచే దీనికి షోమ్రోను పర్వతము అను పేరుకూడ కలదు (ఆమో 4[1] 6[1]). దీని చుట్టును ఫలవంతములగు లోయలు గలవు (యెష 28[1]). ఒమ్రీకాలము మొదలుకొని (క్రీ॥ ము॥ 880) పది గోత్రములు అష్షూరు వారిచే పట్టఁబడునంతవఱకు (II రాజు 17, 18) క్రీ॥ ము॥ 22 సం॥ వఱకు ఇది యా దేశమునకు రాజధానిగా నుండెను. ఈ కాలమునందు చనిపోయిన ఇశ్రాయేలు రాజుల నిచ్చటనే పాతిపెట్టిరి (I రాజు 16[28] 22[37] మొ॥). ఇది కట్టఁబడినతోడనే సిరియారాజగు బెన్హదదు దాని మీఁద యుద్ధముచేసి, గెల్చి, సిరియా వర్తకుల కా పట్టణపు వీధులలో కొన్ని ప్రత్యేకించుకొనట్లు చేసెనని I రాజు 20[34] వలనఁ దెలియుచున్నది. గాని ఒమ్రీ కుమారుఁడగు అహాబు కాలమునందు వారు దీనిని ముట్టడించినను జయింపలేక పోయిరి.

($20^{1-21}$). అహాబు చంపఁబడినపిదప దీనికి సమీపమున నుండిన కోనేటిలో నతని రథమును కడిగిరి ($22^{38}$). ఇతని మనుమఁడగు యెహోరాము కాలమునందు సిరియావారు దీనిని ముట్టడించి యుద్ధముచేసిరి గాని జయింపలేకపోయిరి (II రాజు $6^{8}$ $7^{20}$). ఈ పట్టణపు పెద్దలు యెహూకు భయపడి అహాబు సంతతివారైన 70 మందిని చంపించిరి ($10^{1-10}$). విగ్రహపూజ ఆరంభమునుండి ఈ పట్టణమున మెండుగా నుండెను. అహాబు బయలు దేవతకొక గుడిని కట్టించి ప్రతిష్ఠించెను (I రాజు $16^{32}$). ఇతని రాణియైన యెజెబెలు 400 మంది బయలు పూజారులను పోషించెను ($18^{19}$) గాన, ఈ పూజ యెహూ కాలముదనుక నిలిచియుండెనని తెలిసికొనవచ్చును (II రాజు $13^{6}$). ఈ పూజ చేయువారు చాల దుర్మార్గులై యున్నట్లు హోషే $7^{1-8}$ $13^{14}$ వలనఁ దెలియుచున్నది. వారి దుష్కార్యములను ఖండించుటకు ప్రవక్తయగు ఏలీయా బహు ప్రయాసపడెను (I రాజు 18). ఈ పట్టణమందు ఎలీషా ప్రవక్త నివసించినట్లున్నది (II రాజు $5^{8-9}$ $6^{32}$). దీనికి నాశనము సంభవించునని ప్రవక్తలనేకమారులు ప్రవచించిరి (యెష $7^{8,9}$ $8^{4}$ యిర్మీ $31^{5}$ యెహె $16^{46,51\ 53,55}$ $23^{33}$ హోషే $8^{5,6}$ $13^{16}$ ఆమో $3^{12}$ మీకా $1^{5-9}$). అష్షూరు చక్రవర్తియగు షల్మనేసెరు దీనిని క్రీ॥ పూ॥ 724 లో ముట్టడివేసి 722 నందు పట్టుకొని నాశనము చేయుట ద్వారా నీ ప్రవచనము నెఱవేరెను (II రాజు $17^{3-6}$). 722 నందు సర్గోను అష్షూరు రాజ్యమునకు చక్రవర్తియైనందున తానే దీనిని జయించినటుల రాతి శాసనములయందు వ్రాయించుకొనెను. వారి దేశస్థులను చెఱపట్టుకొనిపోయి, అన్య జనులను దెచ్చి యీ దేశమున నుంచిరి ($17^{24}$). చెఱకాలమునకుఁ బిమ్మట షోమ్రోనువారు యూదులను విరోధించుచుండిరి. (ఎజ్రా $4^{10,17}$ నెహె $4^{2}$) గాని వారు సమరయ దేశపువారు గాని ఈ పట్టణస్థులుగారు. మహా అలెక్సందరు దీనిని 331 సం॥న జయించెను. జాను హర్కేనసనువాఁడు దీనిని మక్కబీయుల కాలమునందు క్రీ॥ పూ॥ 120 సం॥న స్వాధీనపఱచుకొనెనని యోసీఫసు వ్రాఁతలవలనఁ దెలియుచున్నది (పురా 13.10.2,3. యుద్ధ 1.2.7,8). తరువాత రోమీయులు దానిని జయించి సిరియాతోఁ జేర్చిరి (పురా 13.15.4; 14.4.4; 5.3). మహా హేరోదు దాని ప్రాకారములను తిరిగి కట్టించి, కైసరాగూస్తు పేరట సెబెస్తె (*Sebaste*=ఔగూస్తు పదమునకు గ్రీకు రూపము) అని పిలిచెను (పురా 15.8.5).

క్రొత్త నిబంధనకాలములో సువార్తికుఁడగు ఫిలిప్పు పట్టణమునందు ప్రకటించెను (కార్య $8^{5-8}$). గారడీవాఁడగు సీమోను పట్టణమునందా సమయమునందుండెను ($8^{9-13}$). పేతురు యోహానులు దీనిని దర్శించిరి ($8^{14-25}$).

ప్రస్తుతమున దీనిని ఎస్ సెబుస్తియె (*es-Sebustieh*) అని పిలుచుచున్నారు. ఇది ప్రస్తుత కాలమున నొక చిన్న పల్లెయైయున్నది గాని ఇచ్చట పాడు శేషముల మితముగా నున్నవి. అది షెకెమునకు మూఁడు క్రోసులు వాయవ్యముగానుండు కొండమీఁద నున్నది. దీనిలోని ఒక ముఖ్యవీధికి రెండువైపులను హేరోదు కట్టించిన స్థంభముల వరుసలు నేటివఱకును గలవు. అక్కడి శిథిలములన్నియు ఇంకను పరిశోధింపఁబడియుండలేదు. (పటము I, D 7).

2. దేశము. పైన నుదాహరింపఁబడినట్లు షోమ్రోను పట్టణము పది గోత్రములకు రాజధానిగా నున్నంతకాలము ఈ పేరా దేశమునకంతటికి నుపయోగింపఁబడెను. ఇట్లాపదము పది గోత్రములవారిని సూచించెను (I రాజు $13^{32}$ $21^{1}$ II రాజు $17^{24}$ ఎజ్రా $4^{17}$ నెహె $4^{2}$ యెష $7^{9}$ యిర్మీ $31^{5}$ యెహె $16^{46}$ ఆమో $3^{9}$ ఇశ్రాయేలు 3 చూ॥).

**సమరయులు, షోమ్రోను దేశస్థులు** (Samaritans) = సమరయ అనునది పది గోత్రములవారి దేశమునకు పేరయినను, వారికే పేరును పెట్టక, అష్షూరు చక్రవర్తియగు సర్గోను 722 సం॥ లో దానిని జయించిన పిమ్మట, అచ్చట నివసించునట్లు తెచ్చియుంచిన అన్యుల సంతానీకులకు పెట్టిన పేరైయున్నది. వీరా ప్రదేశములయందు మిగిలియుండిన యిశ్రాయేలీయులతో కలిసిపోయి మిశ్రమజాతిగా నేర్పడిరి. అందువలన వారి మతమును మిశ్రమ మతమాయెను (II రాజు $17^{24-41}$). అష్షూరు చక్రవర్తులు

ఏసర్హద్దోనును, అస్నప్పరును ఇంక సెక్కువమంది యన్యుల నచ్చటి కంపిరి (ఎజ్రా 4[2,9,10]). ఆ దేశము అష్షూరువారి వశమున నున్న కాలమునందు యూదా రాజగు యోషీయా, అక్కడనున్న విగ్రహపూజా స్థానముల నొకమాఱు పడఁగొట్టెను (II దిన 34[6,7]). ఆ దేశస్థులు వానిని మఱల కట్టుకొనిరని నమ్మఁదగును. యిర్మీయా కాలమునందు కొందఱు సమరయులు ఆరాధించుటకై యెరూషలేమునకు వచ్చిరి (యిర్మీ 41[5]). చక్రవర్తియగు ఏసర్హద్దోను కాలమునుండి తామిశ్రాయేలు దేవుని నాశ్రయించి యున్నట్లు ఎజ్రా కాలమున సమరయులు చెప్పుకొనిరి. (ఎజ్రా 4[2]). యూదులు చెఱనుండి తిరిగి వచ్చినది మొదలుకొని వీరికిని వారికిని విరోధ మారంభమయ్యెను (ఎజ్రా 4[7] నెహె 4[7]). యూదులు ఆలయమును కట్టుకొనకుండునట్లు సమరయులు వారి నాటంకపఱచిరి. ఈ విరోధ మింతట నాగక దినక్రమేణ వృద్ధియైనట్లు యోసీఫసు వ్రాసిన సంగతులవలన స్పష్టమగుచున్నది (పురా 9.14.3; 11.8.7). మహా అలెక్సందరు దేశమును జయించినపిమ్మట గెరిజీము కొండమీఁద నొక యాలయము కట్టుకొనుటకు వీరు సెలవు నొందిరి. అంతియోకస్ ఎపిఫానిస్ (*Antiochus Epiphanes*) దేశము నేలినప్పుడు వీ రతని దయను పొందుటకు దానినిఁకను ఒక అన్య దేవతకు ప్రతిష్ఠించుట కొప్పుకొనిరి (II మక్క 6[2]). పిదప జాణ హర్కేనసు దానిని పాడుచేసినను (క్రీ॥ ము॥ 129), వారింకను ఆ పర్వతముపై తమ యారాధనను జరుపుచుండిరి. క్రీస్తు కాలము వఱకిట్లుండినట్లు మనము జూడవచ్చును (యోహా 20,[21] 4). క్రొత్త నిబంధనకాలము వఱకును యూదులకు సమరయులకు పరస్పర విరోధము లున్నట్లు సూచనలున్నవి (లూ 9[52] యోహా 4[9]). గాని క్రీస్తు వారికి బోధించెను (యోహా 4). వారిలోనున్న మంచివారిని మెచ్చుకొనెను (లూ 10[33-37] 17[16]). ఇట్లాయన ఈ విరోధమును ఖండించెను. మొదట సమరయులకు బోధించుటకు శిష్యులను వారి గ్రామములలోనికిఁ బంపకున్నను (మ 10[5]), కాలము సంపూర్ణమైనప్పుడు, ఆయన తన శిష్యులు అచ్చటికి వెళ్లవలెనని యాజ్ఞనొసంగెను (కార్య 1[8]). వారా యాజ్ఞను నెఱవేర్చిన విధమును కార్య 8[1-25] నందు జూడవచ్చును.

బైబిలు చరిత్రకుఁ దరువాత, యెరూషలేము నాశనముచేయఁబడక పూర్వము రోమకవారు వీరిని జయించి వీరిలో 11,600 మందిని జంపించిరి. తరువాత చక్రవర్తులును వారిని మిగుల బాధపఱచిరి. ఇట్లు వారు చాలవఱకు నాశనమైరి గాని ఇటీవల దాదాపు 150 మంది ఇంకను ఈ మతస్థులైయున్నట్లు కనఁబడుచున్నది. వారు మోషే అయిదు గ్రంథములను మాత్రము ప్రమాణములనుగా నెంచి దాని యాచారములను గైకొనుటకు యత్నించుచున్నారు.

**సమర్పించుకొనుట** (Self-surrender). అర్పణములు చూ॥. ఇచ్చట క్రైస్తవులు తమ్మును తాము దేవునికి సమర్పించుకొనుటను గూర్చి వివరింతుము. దేవుని గొప్ప కృపచేత మనలను మనము అర్పించుకొనుట మన విధియై యున్నది (రోమా 12[1]). మన అవయవములను అనీతికిగాక నీతికి సాధనములుగా అర్పించుకొనవలయునను హెచ్చరికె అట్టిదై యున్నది (6[13]). ఇఁకను జీవించునది తానుగాక క్రీస్తే తనయందు జీవించుచున్నాఁడను సంగతిని పౌలు గల 2[20] నందు మఱియొక రీతిగాఁ దెలిపెను. మనలను మనమే యిట్లు సమర్పించుకొనుటవలన మన మేమియు పోఁగొట్టుకొనువారము గాక దేవుఁడు మనమెట్లు జీవింపవలెనని కోరుచున్నాఁడో అట్టి గురిని అందుకొనినవార మగుదుము. తన ప్రాణమును పోఁగొట్టుకొనువాఁడు దానిని దక్కించుకొనునని క్రీస్తు చెప్పినది నెఱవేఱును (మ 16[25]).

**సమష్టి, సమష్టిగా నుంచుకొనుట** (Community of Goods) = ఆది క్రైస్తవులు తమ ఆస్తిని అమ్మివేసి దానిని అపొస్తలుల ద్వారా ఆయా అవసరములలో నున్నవారికి పంచిపెట్టిరి (కార్య 2[44,45] 4[32-36]). క్రైస్తవు లీ విధముగా చేయవలెనని అప్పుడప్పుడు కొన్ని శాఖలవారు బోధించి ఆచరణలోనికిఁ దెచ్చుటకు యత్నించిరి గాని అదియొక విధియని క్రైస్తవు లెన్నడును మొత్తముగా నంగీకరింపలేదు. ఆది క్రైస్తవులు సహా ప్రేమపూర్ణులై ఆ విధముగా చేసిరి గాని అప్పుడైనను వారట్లు చేయవలెనను నియమము

లేదు ($5^{4}$). బీదల అవసరమును గుర్తించినవారై వారు స్వయముగా అట్టి యేర్పాటులను వేఱుగా జేసికొనిరి ($6^{1-6}$ $11^{27-30}$ II కొరి 8,9). అట్టి ఔదార్యబుద్ధి మాత్రము తప్పక ఉండవలయును. అట్టి బుద్ధిగలవారై ఆయా అవసరములను గుర్తించి వానిని తీర్చుటవలన కలుగు మేలుకీడులను గుర్తించి బీదలకు సహాయముచేయవలెను గాని అది క్రైస్తవులు చేసిన యేర్పాటుల ననుసరించి తప్పక చేయవలెనను నియమములేదు.

**సమాజమందిరము (Synagogue).** యూదులు తమ యారాధన స్థలములకొఱకు కట్టించిన మందిరముల పేరు. మొదట గుడారము తరువాత ఆలయముమండెను గాని యిట్టి సమాజమందిరము లుండినట్లు పాత నిబంధనలో నెట్టి సూచనలును లేవు. దేవాలయము పాడై పోయి ప్రజలు చెఱయందుండినప్పుడు వీనిని కట్ట నారంభించినట్లున్నది. క్రొత్త నిబంధన కాలములో నివి యూదులున్న ప్రతిచోట కనఁబడును. ఇట్లు క్రీస్తు ఊళ్లలో ప్రయాణము చేయుచుండఁగా వారి సమాజమందిరములలో బోధించెను (లూ $4^{15,33,44}$ మొ॥). తన కూతురును బాగుచేయుమని క్రీస్తుయొద్దకు వచ్చిన యయీరు సమాజమందిరపు అధికారియై యుండెను (మా $5^{22}$). యూదులు తాము చెదరిపోయిన అన్యుల దేశములలోకూడ నిట్టి సమాజమందిరములు కట్టిరి. ఇట్లు కుప్రలోని సలమిలోను (కార్య $13^{5}$), పిసిదియలోని అంతియొకయలోను ($13^{14}$), ఈకొనియలోను ($14^{1}$), థెస్సలొనీకయలోను ($17^{1}$), బెరయలోను ($17^{10}$), కొరింథులోను ($18^{4}$), సమాజమందిరము లుండినట్లు సూచనలు కలవు. గొప్ప పట్టణములలో అనేక సమాజమందిరము లుండెను ($6^{9}$).

సమాజమందిరములలో బోధించుటకు వారు ప్రత్యేకమైన శాస్త్రులను నియమించక, బోధించుటకైన యేర్పాటులను చేయు నిమిత్తమును క్రమశిక్షలను విధించుటకును పెద్దలను నియమించుచు వచ్చిరి. వారిలో నొకనికి సమాజమందిరపు అధికారియను బిరుదు పెట్టియుందురు (కార్య $18^{8}$). లేక యీ బిరుదు పంచాయతీదారులకు పెట్టఁబడి యుండును ($18^{15}$ మా $5^{22}$). వీరు ఆరాధనలు జరిపిరి గాని దేవుని వాక్యమును చదువుటకును (లూ $4^{16}$), హెచ్చరికలు చేయుటకును (కార్య $13^{15}$), ఆయావారిని నియమించి యుండవచ్చును. వారుగాక గ్రంథపుచుట్టలను బోధకునికి అందించుటకును వాని విషయమై తగు జాగ్రత పుచ్చుకొనుటకును కావలసిన సేవకులుండిరి (లూ $4^{20}$). పెద్దలవలన శిక్ష విధింపఁబడినవారిని శిక్షించుట ఈ సేవకుల విధియైయుండెను. అట్టివారిని సమాజమందిరములలోగాని దాని దగ్గరనున్న గదిలోగాని శిక్షించిరి (మ $10^{17}$ కార్య $22^{19}$). గొప్ప నేరస్థులను సమాజమందిరములలోకి బొత్తుగా రానియ్యక వెలివేసిరి (యోహా $16^{2}$). బీదలకు సహాయము పంచిపెట్టువారుకూడ వీనిలో నుండిరి (మ $6^{2}$).

ఆ మందిరములలో గ్రంథపుచుట్టలను పెట్టి చదువుటకు ఒక పీఠమును, చదివినతరువాత జాగ్రత చేయుటకు ఒక పెట్టెయు, పెద్దలును స్థితిమంతులైనవారు కూర్చుండుటకై బల్లలు మొదలగునవి (మ $23^{6}$ యాకో $2^{2,3}$) కనీసపక్ష ముండునవి.

ప్రతి విశ్రాంతిదినమున ఆరాధన చేయుటకు కూడిరి. ప్రతి వారములోని రెండవ దినమున ఐదవదినమున దేవుని వాక్యమును వినుటకు అట్లు కూడిరి. స్త్రీలు పురుషులు ప్రత్యేకముగా కూర్చుండిరి. సభవారిలో నెవరో యొకరు ప్రార్థించిరి. అవి ముఖ్యముగా ద్వితీ $6^{4-9}$ $11^{13-21}$ సంఖ్యా $15^{37-41}$ లో నున్న వానిని యూదులకున్న 18 ప్రార్థనలను స్తుతివాక్యములను అప్పుడు వాడిరి. ప్రార్థించునప్పుడు సభికులు నిలువఁబడియుండి (మ $6^{5}$ $11^{25}$) దాని చివర ఆమేన్ అనిరి. మోషే ధర్మశాస్త్రములోనుండి ఒక పాఠమును (కార్య $15^{21}$) చదువఁగా దానికిని ముందుగాను తరువాతను స్తుతివాక్యములను చెప్పిరి. తరువాత ప్రవక్తలనుండి ఒక పాఠము చదివిరి (లూ $4^{16,19}$). అటుతరువాత దానిని చదివినవాఁడుగాని యితరులుగాని ప్రజలకు తగిన హెచ్చరికలను జేసిరి ($4^{16-22}$ కార్య $13^{15}$). ఆరాధనను ఆశీర్వాదములతో ముగించిరి. ఒక యాజకుఁడు ఆ సభయందుండిన యెడల అతఁడు వారి నాశీర్వదించెను. క్రైస్తవులు తమ దేవాలయములలోను దాని యారాధనలలోను అనుసరించు

వాడుకలు చాలమట్టునకు ఈ సమాజమందిరపు వాడుకలై యున్నట్లు పై సంగతులవలన స్పష్ట మగుచున్నది. నేటివఱకు సర్వలోకములో చెదరి పోయియున్న యూదులలో నిట్టి సమాజమందిర ములు గలవు.

ఎజ్రా నెహెమ్యాల కాలములో గొప్ప సమాజము (*Great Synagogue*) అనఁబడినది ఏర్పడినట్లు యూదుల పారంపర్య గ్రంథముల వలనఁ దెలియును. ఆ సమాజ మందిరములో 120 మంది సభికులుండిరి. ఎజ్రా దానికి అగ్రాస నాధిపతిగా నుండెను. మోషే ధర్మశాస్త్రములను ప్రవక్తలను కాపాడుట వారి విధిగ నుండెను. వీని భావమును తీర్మానించుటకు వారి సభ శాస్త్రుల పరిషత్తుగా నుండెను గాని క్రీ॥ పూ॥ 275 సం॥ ఇది ప్రత్యేక సభగానుండక వీగిపోయి యూదుల మహాసభయగు సన్హెడ్రిన్ యేర్పడి ఆ పనులను చూచిరి (మహాసభ చూ॥).

**సమాజము, సభ (Congregation, Assembly).**

1. పాఁత నిబంధనయందిది ఇశ్రాయేలీయుల నందఱిని సూచించును. మూలభాషలో దీనికి ముఖ్యముగా రెండు పదముల నుపయోగించిరి. వానిలో ప్రతిది నూటికన్న నెక్కువ మారులు కనఁబడును. వానియం దొకదానిని సాధారణ ముగా సమాజమని తెనిఁగించిరి (నిర్గ 12^3,6,19,47 మొ॥) గాని కీర్త 1^5 లో సభయనిరి. ఆ పదమునే **నియామక కాలమనియు** (సంఖ్యా 15^3 లేవీ 1^4), **నియమింపఁబడిన గడువు** అనియు (ద్వితీ 31^10), **ఉత్సవకాలములు** అనియు (యెష 33^20) తెనిఁగించిరి. రెండవ పదమును కూడ సాధారణ ముగా సమాజమని తర్జుమాజేసినను (లేవీ 16^17,33 సంఖ్యా 10^7 మొ॥) **సంఘమనియు** తెనిఁగించిరి (లేవీ 4^13-21 సంఖ్యా 15^5 16^3). గుడారమును సమాజపు గుడారమని తెనిఁగించిన వాక్యములలో (I దిన 6^32 9^21 23^31 II దిన 1^3,6,13) ఈ మూల భాషాపదమునే వాడిరిగాని దాని సాధారణముగా **ప్రత్యక్షపు** గుడారమని తెనిఁగించిరి (నిర్గ 27^21 28^43 29^4 I సమూ 2^22 మొ॥ గుడారము చూ॥). **క్రొత్త** నిబంధనలోని గ్రీకుపదము **వేఱుగా** **నుండినను దీనిని సమాజమందిరమునకును సంఘము** నకు ఆధారములగు వాక్యములుగా నెంచఁదగును (సమాజమందిరములు చూ॥).

2. మఱియొక హెబ్రీపదము ప్రజలు తమ్మును తాముపేక్షించుకొను సమయమని యర్థమిచ్చు నదై, యెష 1^13 నందు **ఉత్సవసమాజ మనియు**, లేవీ 23^36 నందు **పరిశుద్ధ సంఘ మని** యున్నను సాధారణముగా దానిని **వ్రత దినమని** తెనిఁగించిరి (సంఖ్యా 29^35 ద్వితీ 16^18 యోహె 8^18 ఆమో 5^21 యోవే 1^14 2^15). ఇది ప్రజలు తమ్మును తాము తగ్గించుకొను దినమున చేసిన కూటమనుకొనఁదగును. (మహాసభ, సభ చూ॥).

**సమాధానపఱచుట, సమాధానము (Reconciliation).** ఈ పదములకు బైబిలు నందు సర్వసాధారణమగు అర్థమేగాక (మ 5^24 I కొరి 7^11), మానవుల రక్షణకు సంబంధించిన లక్షణార్థమును గలదు. దానినిగుఱించి ఈ శీర్షికయందు ప్రస్తావింతుము.

పరిశుద్ధుఁడగు దేవునికిని పాపాత్ములగు మాన వులకును సమాధానములేక, ఎడబాపు కలిగినట్లు అనేక నిదర్శనములు గలవు. మానవులకు విరోధ బుద్ధియున్నను, దేవుఁడు సహా పరిశుద్ధులైనవారిని పాపులను సమభావముతోఁ జూడఁజాలఁడనువది వేఱుగఁ జెప్ప నవసరములేదు. పవిత్రా పవిత్రత లకు స్వభావసిద్ధమగు విరుద్ధముండునట్లు, పరిశుద్ధుఁ డగు దేవునికిని అపరిశుద్ధులగు మానవులకును అట్టి భేదభావముండుట సహజమై యున్నదని చెప్పఁ దగును. స్వాభావికమగు నిట్టి విరుద్ధ నివార ణార్థమై దేవుఁడు యేసుక్రీస్తుద్వార చేసిన పనియే మానవులను సమాధానపఱచుట యనఁ బడును (II కొరి 5^18,19 రోమా 5^10,11). ఈ (సమాధానము క్రీస్తు మరణమువలననే కలిగెను 5^10) సర్వమును క్రీస్తుద్వార ఐక్యపర్చఁ బడునను బోధ ఎఫె 2^16 కొలొ 1^20,21 నందు గలదు. ఎఫె 2^16 నందు క్రీస్తు అన్యులను యూదులను ఐక్యపఱచినట్లున్నది. ఈ యిరు పక్షములవారును దేవునితో సమాధానపడుటచే నొకరితో నొకరు సమాధానపర్చఁబడిరి. ఇది తండ్రి కుమారునిద్వార చేయుపనియై యున్న ట్లున్నది (కొలొ 1^20,21). ఇట్లు మానవులను

సమాధానపఱచుట దేవునిపనియైనట్లు పైవాక్యము లన్నిఁటిద్వారా కనఁబడుచున్నది. ఆ హేతువు చేత దేవుని రక్షణార్థమగు కృపను మానవులకుఁ దెలుపుట ఆయన **సమాధానవాక్యము ప్రకటించుట** యనఁబడును (II కొరి $5^{19}$). సువార్త బోధపని **సమాధానవిషయమైన పరిచర్య** యనఁబడెను (II కొరి $5^{18}$ ప్రాయశ్చిత్తము చూ॥).

**సమాధానబలి, సమాధానార్పణము** అర్పణములు I 3 చూ॥

**సమాధానము, నెమ్మది (Peace).** పాత నిబంధనలో సమాధానమని తెనిఁగించిన హెబ్రీ పదము మనలో వాడుకగానున్న సలాము అను పదమునకు సంబంధించినదై క్షేమమని యర్థమగును. ఆ పదమునే (షాలోము) వందనపు వాక్యముగా వాడి క్షేమమని తెనిఁగించిరి (ఆది $43^{23}$ I సమూ $1^{17}$ కీర్త $122^{7}$ మొ॥). అట్టి క్షేమము దేవుని ఆశీర్వాదమువలన కలుగును (సంఖ్యా $6^{26}$ కీర్త $29^{11}$ యిర్మీ $16^{5}$ మొ॥). యాజకులకును వారిద్వారా యితరులకును క్షేమము కలుగుటవలన వారితో సమాధాన నిబంధన కలిగి యున్నదను వాక్యములు కలవు (సంఖ్యా $25^{12}$ మలా $2^{4,5}$).

మెస్సీయ రాజ్యమును గూర్చిన ప్రవచనములలో సమాధానము ముఖ్య దీవనయైయున్నది (యెష $9^{5-17}$ $11^{6-9}$ జెక $9^{10}$ మొ॥). పాత నిబంధనయందున్న వాక్యములలో సమాధానమను పదము ఇహసంబంధమగు క్షేమమును మాత్రము కాక ఆత్మసంబంధమగు క్షేమమునుకూడ సూచించునను సంగతి పై వాక్యములలో తేటగా కనఁబడును. క్రొత్త నిబంధనయందు ఈ పదము 90 సార్లు కనఁబడును. 8 లేక 9 వాక్యములలోఁగాక తక్కిన వాని యన్నిఁటిలో ఆత్మీయ క్షేమమే సూచింపఁబడెను. క్రీస్తు తన శిష్యుల కిచ్చిన గొప్పదానము సమాధానమే (మా $5^{34}$ లూ $7^{50}$ $24^{36}$ యోహా $14^{27}$). అపొస్తలులు తమ సంఘములకు సమాధానము కలుగవలెనని వారి నాశీర్వదించిరి (రోమా $1^{1-7}$ I కొరి $1^{3}$ I పేతు $1^{2}$ మొ॥). ఇచ్చట సమాధానము సర్వాశీర్వాదవచనములను సూచించును. క్రీస్తుద్వారా ఈ సమాధానము కలుగును (లూ $1^{79}$ $2^{14}$) ఆయన ఇచ్చునది లోకసంబంధమైన సమాధానము కాదు (మ $10^{34}$). అది దేవునితో సైక్యపడుటయై యున్నది (యోహా $16^{33}$ కార్య $10^{36}$ రోమా $8^{6}$ $15^{33}$ మొ॥). క్రీస్తు మరణముద్వారా పాపక్షమను పొంది కుమారస్థితిలో చేర్చఁబడి దేవునితో సైక్యపఱచఁబడినవారు ఇట్టి సమాధానమును పొందిరి (II కొరి $5^{18-21}$ ఎఫె $2^{13-18}$ కొలొ $1^{20}$). క్రీస్తునందలి విశ్వాసమువలన నిట్టి సమాధాన స్థితిలో చేరఁగలము కావున విశ్వాసమువలన సమాధానము కలుగును (రోమా $5^{1}$ నీతిమంతులుగా తీర్చబడుట చూ॥).

**సమాధి, సమాధిక్రియలు (Burial Burial Customs).** మృతులను సమాధచేయుట బైబిలు కాలమునందు సర్వసాధారణమగు వాడుకయై యున్నది. సమాధిచేయుటను గూర్చిన వాడుకల నీదిగువవాని ననుసరించి వివరింపవచ్చును.

1. సమాధిచేయుటకై శవమును సిద్ధపఱచుట. గతించిపోయినవారి విషయమై తమకున్న దుఃఖమును ప్రేమను ఇప్పటివలెనే పూర్వమును కనఁబఱచిరి (ఆది $50^{1}$). ఐగుప్తీయులు చేసినట్లు ఇశ్రాయేలీయులు తమవారి శవములను సుగంధద్రవ్యములచే పదిలముచేయలేదు. యాకోబు యోసేపుల శవముల నిట్లు భద్రపఱచిరిగాని అది ఐగుప్తీయులవాడుకయై యున్నది. I సమూ $28^{14}$ యెష $14^{9-19}$ యెహె $32^{27}$ నందు సాధారణముగా వారు ధరించియున్న వస్త్రములతోనే పాతిపెట్టిరి. సమాధిచేయకమునుపు ఇప్పటివలెనే శవమును కడిగి (కార్య $9^{37}$), దానిని పరిమళద్రవ్యములతో నభిషేకించిరి (మా $16^{1}$ లూ $24^{1}$ యోహా $12^{7}$ $19^{40}$). ఆ శవమును పిదప నారబట్టతో చుట్టిరి (మా $15^{46}$). దాని చేతులను పాదములను కట్టిరి (యోహా $19^{40}$ $11^{44}$). ముఖమునుకూడ ఒకరుమాలుతో కట్టిరి (యోహా $19^{40}$). ఇవి క్రొత్త నిబంధన వాడుకలుగా కనఁబడుచున్నను అవి యంతకుఁబూర్వము నుండి యున్నవని నమ్మవచ్చును.

2. సమాధిచేయుట. చనిపోయినవారిని ఆ దినమందే పాతిపెట్టుట ఈ దేశమందు అలవా

టయినట్లు పలెస్తీనులోకూడ నుండెను. వారు శవమును పెట్టెలో నుంచక పైన నుదాహరించినట్లు బట్టలతో చుట్టి దానిని పాతిపెట్టిరి. శవమును మంచముమీఁదగాని, పాడెమీఁదగాని



కొండదగ్గిర చెక్కఁబడిన సమాధులు

పెట్టి సమాధిస్థలమున కెత్తుకొనివెళ్లిరి ($2^{31}$ లూ $7^{14}$ పాడె చూ॥). త్రవ్వీన సమాధులలో వారినుంచిరి. స్థితిగలవారు బండలలో తొలిపించిన సమాధులను సిద్ధపఱచి వానిలోనే తమ మృతులను పాతిపెట్టిరి (యెష $22^{16}$ II రాజు $23^{16}$ మ $27^{60}$). పాతిపెట్టక ఒక శవమును నూఱకనే పాఱవేయుట గొప్ప అవమానముగ నెంచఁబడెను (ఆమో $2^{1}$ యెష $33^{12}$ యిర్మీ $16^{4}$ యెహె $29^{5}$ II రాజు $9^{10}$). అదేవిధముగా మృతుల శవములను కాల్చివేయుట అవమానకరముగ నెంచుటచే నేరస్థులను మాత్రము అట్లు కాల్చివేసిరి (లేవీ $20^{14}$ $21^{9}$ యెహో $7^{25,26}$).

3. సమాధిస్థలములు కుటుంబముల ప్రకారము తమకొఱకు ప్రత్యేకమగు సమాధిస్థలములను సంపాదించుకొనుట వాడుకయై యుండెను. (ఆది $15^{15}$ $25^{8,17}$ $35^{29}$ మొ॥). ఆరంభకాలమున చెట్లక్రిందఁగాని వనములలోఁగాని అట్టి సమాధిస్థానముల నేర్పఱచుకొనిరి (ఆది $35^{8}$ I సమూ $31^{13}$ II రాజు $21^{18,26}$). జనులు విస్తరింపఁగా కొండప్రక్కలయందున్న గుహలలోఁ గాని, వానిలో తొలిపించిన సమాధులలోఁ గాని వారిని పాతిపెట్టుట వాడుక



పూర్వకాలమున ఐగుప్తులో అలంకరించబడిన శవమును కొనిపోవు బండి

యయ్యెను. (యెష $22^{16}$ II రాజు $23^{16}$). యూదారాజులకొఱకు ప్రత్యేకమగు సమాధిస్థలమొకటి యుండెను (II దిన $21^{20}$) గాని, వారిలో కొందఱు తమకొఱకు ప్రత్యేకమైన సమాధులను కట్టించుకొనిరి (II దిన $16^{14}$). కొందఱిని అవమానపఱచునిమిత్తమచ్చట పాతిపెట్టలేదు (II దిన $24^{25}$ $28^{27}$). ఇశ్రాయేలీయులు ఆదికాలము నుండియే తమ పితరుల సమాధులలో పాతిపెట్టఁబడవలెనని బహుగా నాశించిరి (ఆది $50^{13,25}$). వారు సమాధులను కట్టించుకొని వాని నలంకరించిరి (మ $23^{29}$). అట్టి సమాధులు శిథిలమగుట వారికి గొప్ప విచారకరముగ నుండెను (నెహె $2^{3}$ $2^{5}$ $3^{16}$). గొప్పవారి సమాధుల నిట్లు చాలకాలమువఱకు కాపాడి దానిని మసీదుగా నెంచువాడుకయు కద్దు (ఆది $35^{20}$ కార్య $2^{29}$). పరదేశులకొఱకును, దిక్కుమాలినవారికొఱకును, నేరస్థులకొఱకును ప్రత్యేకములగు సమాధిస్థలముల నేర్పఱచి వాని నలంకరించకుండనే విడిచి పెట్టిరి (మ $27^{7}$ II రాజు $23^{6}$ యిర్మీ $26^{23}$ యెష $53^{9}$ I రాజు $13^{22}$). బైబిలు

కాలమందుండిన సమాధివాడుకలు ప్రస్తుత మీ దేశమందున్న మహమ్మదీయుల వాడుకలవంటివే యని పై సూచనలవలన తేటగా కనఁబడును (మరణము, ప్రలాపించుట చూ॥).

**సమీప బంధువుడు** ప్రతిహత్య చేయువాడు 2 చూ॥

**సముఖపు రొట్టెలు** సన్నిధి రొట్టెలు చూ॥

**సముద్రతీరము** ద్వీపము చూ॥

**సముద్రము** (Sea).

1. ఈ పదము ప్రత్యేకముగా నుదాహరింపఁబడిన చోట్ల సాధారణముగా బైబిలునందు మధ్యధరా సముద్రమును సూచించును (సంఖ్యా 33[8] యెహో 24[6] మొ॥). అట్లే మహాసముద్రమును (సంఖ్యా 34[6] యెహె 47[10]), పడమటి సముద్రము (జెక 14[8]) ను, ఫిలిష్తీయుల సముద్రము (నిర్గ 23[31]) ను, అను పదములు మధ్యధరా సముద్రమునకుఁ బెట్టినపేర్లయి యున్నవి. మైదానపు సముద్రము అరాబా (=మైదానము) సముద్రమును (ద్వితీ 3[17] యెహో 3[16] 12 II రాజు 14[25]), ఉప్పు సముద్రమును (సంఖ్యా 34[4] ద్వితీ 3[17]), మృతసముద్రమునకు పేర్లైయున్నవి. కిన్నెరతు సముద్రము అనునది గలిలయ సముద్రపుపేరు (సంఖ్యా 34[11] ద్వితీ 3[17] యెహో 12[3] 13[27]). ఎఱ్ఱ సముద్రపుపేరు అనేకసారులు కనఁబడును (నిర్గ 10[19] 13[18] 14[4] మొ॥). యెష 18[2] లో నున్న సముద్రము నైలునదిని సూచించును. నవీన అరబ్బులు ఈ నదిని సముద్రమను పేరఁ బిలుతురు. యిర్మీ 48[32] లో నుండు యాజెరు సముద్రము అను పేరు పొరపాటువ వచ్చినట్లున్నది (యాజెరు చూ॥). హెబ్రీ భాషలో పడమర అను మాట సముద్రమను మాటయేగాని మరియొకటిగాదు (ఆది 12[8] 13[14] 28[14] మొ॥). ఈ సముద్రమునుండి ఆ సముద్రమువఱకు అను మాటలు దేశము యావత్తును సూచించును (ఆమో 8[12] కీర్త 72[8] మొ॥). సముద్రమును గూర్చి బాబెలువారికున్న పురాణ సంబంధపు సూచన యోబు 7[12] 41[1] కీర్త 74[14] 104[26] లో నున్నదనుకొందురు (ఘటసర్పము చూ॥). సముద్రకల్లోలములు గొప్ప యూదులకు సూచనలుగా నున్నవి (కీర్త 46[3] 89[9] యెష 17[12] యిర్మీ 49[23] మొ॥). దానియేలు చూచిన నాలుగు మిక్కిలి గొప్ప జంతువులు (దాని 7[3]) ను, యోహాను జూచిన క్రూరమృగమును (ప్రక 13[1]) మహాసముద్రమునుండి వచ్చెను. సముద్రము భయంకరమైనదిగా బైబిలునందు సాధారణముగా నెంచిరి. ఈ సందర్భమున మోక్షమును గూర్చిన వివరమునందు సముద్రము ఇఁకనులేదు అని యున్నది (ప్రక 21[1]).

2. **ఇత్తడి సముద్రము, పోతపోయఁబడిన సముద్రము.** దేవాలయము I 7 (1) (*b*) చూ॥

**సముద్రవత్సలతోళ్లు** (Seal Skins). ఇట్టి తోళ్లతో గుడారములను కప్పిరి (నిర్గ 25[5] 26[14] మొ॥). దాని నిట్లు తెనిఁగించినను అది శివి చర్మమో రూఢిగాఁజెప్ప వీలుగాదు. యెహె 16[10] లో దీని మూలభాషాపదమును సన్నని ఎఱ్ఱచర్మము అని తెనిఁగించిరి. ఈ పదము హెబ్రీభాషలో నిదిగాక ఐగుప్తీయుల మాటయై చర్మమును మాత్రము సూచించునని కొందఱి యభిప్రాయము.

**సమూయేలు** (Samuel = దేవుని నామము). మోషేకుఁ దరువాత హెబ్రీ ప్రవక్తలలో మొదటివాఁడు. న్యాయాధిపతులలో చివరివాఁడు. ఇతనితండ్రియగు ఎల్కానా అస్సీరు కుటుంబమునందలి కహాతు వంశస్థుడగు నొకలేవీయుఁడు (నిర్గ 6[24] I దిన 6[23,25]). అతఁడు సూపులేక సోపై వంశసంబంధిగాన సూపీయుఁడై యుండెను (I సమూ 1[1] I దిన 6[26,35]). పర్వత ప్రదేశమగు ఎఫ్రాయిమునందు నివసించెను (యెహో 21[5] I దిన 6[26]). ఎల్కానా రామాయను గ్రామనివాసి. రామా యను పేరుగల యితర పట్టణములనుండి భేదించునట్లు ఇది రామతయీమ్సోఫీము అనఁబడెను (I సమూ 1[1,19] 2[11]). అతనికి పెనిన్నా హన్నా లను నిరువురు భార్యలుండిరి. హన్నా తనకు సంతులేకుండుటచే దేవుని ప్రార్థించి తనకు పుత్త్రుఁడు కల్గినయెడల వతనిని దేవునికి సమర్పించెదననియు అతఁడు నజీరుఁడై యుండునని యు (సంఖ్యా 6[1-5]), అతని తలమీఁదికి మంగల

కత్తి రాదనియు మ్రొక్కుకొనెను. ఆమె మనవి యంగీకరింపఁబడెను. ఆమె కుమారుని కని సమూయేలని పేరుపెట్టి అతఁడు పాలు విడువఁగానే షిలోహునందలి మందిరమున కతనిఁ దోడ్కొనిపోయి అందలి సేవాధర్మములు నేర్చుకొను నిమిత్తము ప్రధాన యాజకుఁడగు ఏలీ కప్పగించెను (I సమూ $1^{1}$-$2^{17}$). బాలుఁడగు సమూయేలు నారతోఁజేసిన ఏఫోదును ధరించుకొని మందిర పరిశుద్ధ స్థలములో పరిచర్య చేయుచుండెను ($2^{18}$). అతఁడా మందిరమునందే నివసించి తత్సంబంధమగు నొక గదిలో నిద్రించుచు, ఉదయమున మందిరపు తలుపులఁ దెఱచుచు ఏలీకి మందిరసేవయందు తోడ్పడుచుండెను ($3^{1,3-15}$). ఏలీ తన కుమారులయెడల చూపిన చేనవునకుఁగాను అతని కుటుంబముమీఁదికి రానైయున్న దుర్గతినిగూర్చి సమూయేలుకు దేవుడు తెలిపినపుడు సమూయేలు బాల్యదశయందుండెను ($3^{1-18}$). అప్పటి కతనికి 12 సంవత్సరముల ప్రాయముండునని యోసీఫను వ్రాసిన సంగతి సరి కానచ్చును. అతఁడు దేవుఁ డేర్పఱచుకొనిన ప్రవక్తయని అప్పటినుండి దాను మొదలు బెయేర్షెబావఱకున్న ఇశ్రాయేలీయు లందఱు తెలిసికొనిరి ($3^{20,21}$). ఏలీ యిద్దఱు కుమారులు యుద్ధమునందు హతులగుటవలనను, నిబంధన మందసము ఫిలిష్తీయులచే చిక్కుపడుటవలనను, ఈ వార్త విని మరణమగుటవలనను అతని కుటుంబమంతయు నశించెనని తెలియుచున్నది ($4^{1-22}$) శీఘ్రకాలములోనే నిబంధన మందస మిశ్రాయేలీయులయొద్దకు వచ్చెను గాని అది యొకరియింట నుండెను. ప్రజలు తగిన రీతి సిద్ధపడునంతదనుక అది కిర్యత్యారీమునందు ఒక విచారణకర్త కాపుదలయందుండెను. ఏలీ మరణమునకుఁ దరువాత సమూయేలు దేశమునందు మతగురువై నమ్మకముగా తన పనిని కొనసాగించెను. దేవుని మందసము తిరిగివచ్చిన 20 సంవత్సరములకు తన జనాంగము నీతివిషయమునందు మిగుల పెంపారినదని యతఁడు గ్రహించి పాపముల నొప్పుకొనుటకును ప్రభువు సన్నిధియం దుపవసించుటకును దేవునిప్రేమను తిరిగి సంపాదించుకొనుటకును పూర్వము మందసముండిన స్థలమునకు సమీపమున నున్న మిస్పేలో ప్రజలనందఱిని సమకూర్చెను. ఫిలిష్తీయు లీ సంగతిఁ దెలిసికొని తమ సైన్యములతో వారిమీఁదికి యుద్ధమునకు వచ్చిరి కాని సమూయేలు దేవుని ప్రార్థించుటకు ప్రజలను ప్రేరేపించి తద్విషయమై తానును వేఁడుకొనెను. అంతట ప్రచండవర్షము ఫిలిష్తీయులను తారుమారు చేయఁగా అది దేవుని కృపాకార్యమని యిశ్రాయేలీయులు గ్రహించి సమూయేలు నాయకత్వము క్రింద సమయము జూచుకొని శత్రుసమూహమును లోఁబఱచుకొని తమదేశముపై మఱియొకసారి దండెత్తకుండ వారిని పూర్తిగా జయించిరి ($7^{3-14}$). ఈ గొప్ప విడుదలవలన దేవుఁడు సమూయేలును జనాంగమునకు సంరక్షకునిగాను నాయకునిగాను నియమించెనని తెలియుచున్నది. దెబోరావలెను మఱి విశేషముగా మోషేవలెను సమూయేలు న్యాయాధిపతిగను ప్రవక్తగను అంగీకరింపఁబడెను. అతఁడు ఏఁటేఁట బేతేలుకును గిల్గాలుకును మిస్పేకును సంచారము చేయుచు తన సేవాధర్మమును జరిగించుచుండెను గాని అతని స్థిరవాసము రామాలోనై యుండెను. అచ్చటను ప్రవక్తల పాఠశాలలయొకటి గలదు ($7^{15-17}$ $19^{18-20}$). ఇచ్చట నతఁ డొక బలిపీఠమును గట్టెను. అప్పటికే షిలోహుపురము విసర్జితమై నిబంధన మందస మొకరియింట నుండెను. ఇశ్రాయేలీయులు విగ్రహారాధనా తత్పరులును దేవద్రోహులునై నిబంధన నుల్లంఘించి దానిని నిష్ప్రయోజనమైనదిగా నొనర్చిరి. సమూయేలు యెహోవాదేవుని ప్రతినిధియై యుండెను. అతని బలపరాక్రమ పరిపాలనా కాలమున విదేశ ప్రభుత్వమునుండి విడుదలనొంది దేశము స్వతంత్రత ననుభవించెను. అతఁడు వృద్ధుఁడైనపుడు తన యిరువురు పుత్త్రులను బెయేర్షెబాలో న్యాయాధిపతులనుగాఁ జేసెను. వారు లంచగొండులై న్యాయమును త్రిప్పివేయుచు తమ ప్రవర్తనవలన దుర్మార్గులుగా నిరూపింపఁబడిరి. వారి దుష్ప్రవర్తనయు చుట్టునున్న అన్యరాజ్యముల బెదరింపులును ఇశ్రాయేలీయులును వారి పెద్దలును రాజ్యాధిపత్యస్థాపనకొఱకు వేడుటకు కారణములయ్యెను. ప్రథమమున సౌలును, అతఁడు విసర్జింపఁబడిన తరువాత దావీదును అభిషేకింపు

టకు సమూయేలు దేవునిచే నియమితుఁడయ్యెను. దావీదు సౌలునొద్దనుండి పారిపోయి ఏన్గెదీ అరణ్యములో నున్నపుడు సమూయేలు మరణమయ్యెను. ప్రజలందఱు అతనికొఱకు ప్రలాపించుచు రామాలో నున్న అతని యింటి నివేశనములో అతని సమాధిచేసిరి (I సమూ $25^{1}$). గిల్బోవ యుద్ధమునకు ముందటిరాత్రి ఏన్దోరులో సమూయేలును పాతాళమునుండి పిలువుమని సౌలు కర్ణపిశాచముగల యొకస్త్రీ నడిగెను ($28^{3-25}$). దావీదు గాయకులలో నొకఁడగు హేమాను సమూయేలు మనుమఁడు (I దిన $6^{33}$). సమూయేలు పాత నిబంధనయందలి విశ్వాసవరులగు శూరులలో నొకఁడుగా లెక్కింపఁబడి యున్నాఁడు (హెబ్రీ $11^{32}$). H.

## సమూయేలు రెండు గ్రంథములు (The two books of Samuel).

1. గ్రంథకర్త:—వీని నెవరు వ్రాసిరో తెలియదు గాని 1-16 అ. సమూయేలువలనను మిగత భాగము నాతాను, గాదు అను ప్రవక్తలవలనను వ్రాయఁబడి యుండునని తలంచెదరు. సమూయేలు గ్రంథములు రెండును పూర్వము ఏక గ్రంథముగానే ఉండి "సమూయేలు గ్రంథమని" పిలువఁబడెను. అయితే పాత నిబంధనను గ్రీకు భాషలోకి భాషాంతరము చేసినవారు సౌలు మరణమువఱకు మొదటి పుస్తకమనియు, దావీదు రాజ్యమునకు వచ్చుటనుంచి రెండవ పుస్తకమనియు రెండుగా భాగించి వానికి రాజులయొక్క మొదటి గ్రంథములని పేరుపెట్టిరి. అయితే వీనిలో సమూయేలు పుట్టుకయును, ఆయన కార్యములును ఆయనచేత అభిషేకించఁబడిన రాజుల చరిత్రములును వ్రాయఁబడి యుండుటచేత సమూయేలు గ్రంథములని పిలువఁబడుచున్నవి. సమూయేలు మొదటి గ్రంథము ఆ ప్రవక్తయొక్క పుట్టుకయు, ఆయన బాల్యమందు దేవుని మందిరములో సేవచేయుటను గుఱించిన సంగతులతో ఆరంభమగుచున్నది. మఱియు ఆ కాలమందు ఇశ్రాయేలు పుత్రులకుండిన కఠినమైన క్షీణదశను గుఱించియు ఈ గ్రంథారంభమందు వ్రాయఁబడియున్నది. అట్టి తరుణమందు సమూయేలు వారికి అధిపతిగా నియమించఁబడి ప్రవక్తగాను అధికారిగాను ఉండి జరిగించిన గొప్ప కార్యములును ఆయన కుమారులు ధనాపేక్షులై జరిగించిన అపరాధములును తెలియచేయఁబడి ఉన్నవి. ఈ గ్రంథములను ఎవరివలన వ్రాయఁబడెనో నిశ్చయముగా తెలియదు. అయితే దినవృత్తాంతముల గ్రంథములందు కనఁబడిన నానావాక్యముల వలన ఇవి పూర్వమందున్న ప్రవక్తలవలన వ్రాయఁబడెననే అభిప్రాయము కొందఱికుండెను గాని మొదటినుంచి పదహారు అధ్యాయములు సమూయేలువలనను మిగతభాగము నాతాను గాదు అనే ప్రవక్తలవలనను వ్రాయఁబడినట్లు సాధారణముగా తలంచెదరు.

## సమూయేలు మొదటి గ్రంథము

2. కాలము:—సమూయేలు మొదటి గ్రంథము, యూదా, ఇశ్రాయేలు రాజ్యములు విభాగించఁబడిన తరువాత వ్రాయఁబడెను. (I సమూ $27^{6}$ II సమూ $8^{7}$). మొదటి భాగము (1-16 అ) దాదాపు 1050 సం॥ రెండవ భాగము (17-31 అ) దాదాపు 1050 సం॥.

3. ముఖ్యవిషయము:—ఇశ్రాయేలులో రాజులను నియమించుట, ఆ రాజరికము దావీదుయొక్క కుటుంబమందు స్థాపించఁబడుటను గుఱించి దీనియందున్నది. మఱియు సౌలు ఇతర జనాంగముల రాజులవలె తన స్వంతమేలు నిమిత్తము కాక దేవుని ప్రజలమేలు నిమిత్తమై వారిని ఏలవలెనని తెలుపఁబడుటకును ఇది వ్రాయఁబడెను. ఇందులో సమూయేలు పుట్టుకనుంచి సౌలు మరణమువఱకు సుమారు 126 సంవత్సరముల చరిత్రమున్నది.

ఈ గ్రంథమందు రాజులు నియమించఁబడుటయును అధికారమందు కలిగిన మార్పును గుఱించియు వ్రాయఁబడియున్నది. ఈ సంగతిని గుఱించి మోషే 400 సంవత్సరముల క్రిందట ప్రవచించెను (ద్వితీ $17^{14}$). దేవుని ఆజ్ఞచేత సౌలును రాజుగా నియమించినప్పుడు అతఁడు దేవుని ఆజ్ఞ చొప్పున రాజ్యపాలన చేయనందున దేవుఁడు అతనిని తీసివేసి యెష్షయి కుమారుఁడైన దావీదును రాజుగా నియమించెను. కాఁబట్టి దావీదు దేవుని యేర్పాటువలనను జనులవలనను గొప్ప కీర్తి పొందుటయును సౌలుకు బంధువుఁడగుటయును, దాని సౌలు చూచి ఓర్వలేక

దావీదును పట్టణమునుంచి అరణ్యమునకు తరిమి అతని ప్రాణము తీయ వెదకి నానావిధముల హింసించడము మొదలైనవానిని గురించియు వ్రాయఁబడి యున్నది. సౌలుచేత దావీదు పొందిన హింసలవలన రాజుగానుండునప్పుడు తాను తన శత్రువులనుంచి ఎట్లు కాపాడుకొన వలెనో దానిగురించి నేర్చుకొనెను. దావీదు యొక్క చరిత్రవలన మనము చాల గొప్ప పాఠములను నేర్చుకొనుట మాత్రమేకాక దావీదు కీర్తనలును ముఖ్యముగా క్రొత్త నిబంధనను గ్రహించుటకు మిగుల సహాయకారిగా నుండును.

4. ముఖ్య భాగములు:—గ్రంథమును సమూయేలు (1-7), సౌలు (8-15), దావీదు (16-31) అను వీరి చరిత్రలతో మూఁడుగ భాగింపవచ్చును.

I. సమూయేలు పుట్టుక (1,2); పిలుపు (3,4); నిబంధన మందసము (5-8) ను గురించి కలదు.

II. సౌలు యేర్పరచఁబడి (8-10); రాజ్యము చేసి (11-14), విసర్జింపఁబడుటయు (15) కలదు.

III. దావీదు అభిషేకింపఁబడి (16-20); స్వదేశమునుండి వెళ్లగొట్టఁబడి (21-30); తిరిగి వచ్చిన సంగతియు సౌలు యోనాతానుల మరణమును కలదు.

## సమూయేలు రెండవ గ్రంథము

ఇశ్రాయేలీయులు రాజుద్వారా దేవునివలన నడిపింపఁబడిరి గాని రాజు దేవుని అధికారముతో పని జరిగింపవలెనని తెలుపుటకు వ్రాయఁబడెను. ఈ గ్రంథమందంతటను దావీదు యేలుబడియొక్క 40 సంవత్సరములలో జరిగిన చరిత్రమున్నది. దావీదు రాజుగా చేయఁబడిన చరిత్రతో ఆరంభమైన వెనుక క్రమక్రమముగా ఆయన అధికారము ఇశ్రాయేలంతటిమీఁద స్థాపించుటకు జరిగిన సంగతులున్నవి. దావీదు తన రాజ్యమునకు రాజధానిగా చేసికొని దైవసంబంధమైనటువంటిదియు అధికార సంబంధమైనటువంటిదియునైన సమస్త కార్యములను జరిగించిన యెరూషలేమును పట్టుకొనుట; వాగ్దత్తదేశమును దానితో సంబంధించిన ఇశ్రాయేలీయులను చాల మట్టుకు తొందరపెట్టిన తూర్పు దక్షిణములందున్న జనాంగములను జయించుటను గురించి యున్నది. ఆ విధముగానే దేవుఁడు అబ్రాహామునకు వాగ్దత్తముచేసిన దేశముయొక్క సరిహద్దులమట్టుకు దావీదు రాజ్యపాలన చేయుటను, భయభక్తి గలిగినట్టియు జయకరమైనట్టియు పని వలన తన జనులకు కలిగించిన సౌఖ్యమును అభివృద్ధిని దానితోకూడ ఆయన దేవుని ఆరాధనను స్థాపించి మతోద్ధారణ చేసెను. ఇంకను ఆయనకు కలిగిన కష్టములను దుఃఖములను గురించియు వ్రాయఁబడియున్నది.

దావీదుయొక్క చరిత్రయందు యాకోబు యూదాను ఆశీర్వదించినప్పుడు చెప్పిన ప్రవచనము బాగుగా నెఱవేరినట్లు కనఁబడుచున్నది (ఆది 49:8). చేల్లేహేము గోత్రికులపై హెచ్చింపఁబడి సింహాసన మెక్కినందువలన ఆయన గొప్పతనమును కుటుంబమును గోత్రమును ప్రసిద్ధిజెందెను. అంతేకాక ముఖ్యమైన కార్యములన్నిఁటియందును యూదా జనులు ప్రసిద్ధులుగా నుండిరి. కాఁబట్టి ఈ గోత్రమును గురించి కొన్ని ప్రవచనములు నెఱవేర్చఁబడుటను చూచి భక్తులు కడమ ప్రవచనములన్నియు ఈ విధముగానే నెరవేర్చఁబడునని నిరీక్షించుటకు ఇది మిగుల సహాయకారిగా నున్నది. ఈ గ్రంథమందు దావీదుకు కలిగిన విజయములు (1-10), విపత్తులు (11-24) కలవు.

I. విజయములు:—దావీదు యూదా అంతటిమీఁద రాజై (1-2[4]) యుండఁగా అంతఃకలహములు కలిగెను (2[5]-4). తరువాత ఇశ్రాయేలు అంతటిమీఁద రాజుగ నభిషేకించిన వెనుక (5-10) యుద్ధములు జరిగించెను (8). మెఫీబోషెతును (9) ఆదరించెను.

II. విపత్తులు:—మొదటిది — పాపములో పడుట పశ్చాత్తాపపడుటయు; తీర్పును (11-18) దీనిలో తిరుగుటయు (19-21) కలదు.

రెండవది—కీర్తన (22-32) జనులను లెక్కించుట (24). H.

**సమొత్రాకే** (Samothrace = త్రాకేదేశమునకు సంబంధించిన సామొ). త్రాకేదేశమునకు సమీపముగా ఈజియన్ సముద్రపు ఉత్తర దిక్కునందున్న యొక దీవి. అది 30 చతురపుమైళ్లు వైశాల్యమును గలిగి 5000 అడుగుల

యొత్తుగల కొండను కలిగియున్నది. పౌలు త్రోయనుండి ఫిలిప్పీయికి ప్రయాణము చేయు నప్పుడు దీనిమీఁదుగా వెళ్లెను (కార్య 16[11] పటము V, G 2).

**సమోసు** (Samos = సముద్రము దగ్గర నుండు ఎత్తయిన చోటు). ఎఫెసుకు నైరృతి దిక్కుగా ఈజియన్ సముద్రములోనుండు నొక చిన్నద్వీపము. సిరియా రాజగు మహా అంతియోఖస్ క్రీ॥ శ॥ పూర్వము 190 సం॥లో ఓడిపోయిన పిమ్మట ఈ ద్వీపమునకు స్వతంత్రము కలిగెను. అచ్చట యూదు లనేకులుండిరి. కావున రోమను వారా యూదుల పక్షముగా వ్రాసినప్పుడు ఆ ద్వీపముయొక్క పేరు తమ తాఖీదులలో నెక్కించిరి (I మక్క 15[15-23]). పౌలు తన మూఁడవ ప్రయాణాంతమందు దీనిమీఁదుగాఁ బ్రయాణము చేసెను (కార్య 20[15], పటము V, H 4).

**సమ్గర్నెబో** (Samgar-Nebo = నెబో దేవతా దయచూపుము లేక నెబోదేవత పూజారి). నెబుకద్నెజరు యెరూషలేమును పట్టుకొనఁగా, అతనితో పట్టణమునందు ప్రవేశించిన బాబెలు ఘనులలో నొకనిపేరు (యిర్మీ 39[3]). 39[13] నందీ పేరు కనఁబడక పోవుటచేత ఇచ్చట కొంత పొరపాటు కలిగినదని కొందఱి యభిప్రాయము.

**సమ్మెట** ఆయుధములు I 2 చూ॥

**సమ్ముఖపు రొట్టెల బల్ల** దేవాలయము I 7 (2) (a) గుడారము 6 (2) (a) చూ॥

**సమ్సోను** (Samson = ఎండగల లేక నాశకుఁడు?). హెబ్రీయుల న్యాయాధిపతులలో నొక ముఖ్యుఁడు. దానువంశస్థుఁడగు మానోహ అను వాని కుమారుఁడు. దానుగోత్ర స్వాస్థ్యములో దక్షిణ భాగమునందున్న సొరహు పట్టణమునందు జన్మించెను. దేవునిదూత ఇతని పుట్టుకను గూర్చియు తదనంతరపు బ్రదుకును గూర్చియు ముందుగనే ఇతని తల్లిదండ్రులకు తెలిపెను. పుట్టినది మొద లితఁడు నాజరీయ వ్రతస్థుఁడై క్షౌరము చేసికొనకను ద్రాక్షారసము గాని మద్యమునుగాని త్రాగక యుండెను. ఈ నియమములకు బద్ధుఁడుగా నున్నంత కాలము మహా శూరకార్యముల నొనరించి ఫిలిష్తీయులపై జయమునొందెను (న్యాయా 13[1-24]). ఈ కాలమున కొన్ని కారణములచే యూదా దానుగోత్రములు తక్కిన హెబ్రీయుల నుండి వేరై తమ స్థావరము నిమిత్తము ప్రత్యేకముగా పోరాడ వలసి వచ్చెను. వీరా కాలమున ఫిలిష్తీయుల చేతఁబడిరి. వారైనను సందు దొరికినంతనే హెబ్రీయులను హింసింప నారంభించిరి. ఈ విధముగా ప్రత్యేకింపఁబడినవారై తమమీఁదికి మాటిమాటికి వచ్చుచున్న శత్రువుల నాశ నిమిత్తము ఉపాయములను పన్నుచు సాహస కృత్యము లొనరించుచుండిరి. చిఱుత ప్రాయముననే యెహోవా ఆత్మ దానులో అతఁడొనరింపవలసిన పని నారంభించుట కతనిని రేప మొదలు బెట్టెను (1[25]) గాని, మొదటి నుండి అతనిలో నొక బలహీనత కనఁబడుచునే యుండెను. ఇతఁడు కామాతురుఁడు. తిమ్నాతులోని యొక చిన్నదానిని ప్రధానము చేసికొనెను గాని ఆమె మఱియొకనిని వివాహమాడెను. అందువలన సమ్సోను మిగుల కుపితుఁడై పగ తీర్చుకొను నిమిత్తము స్నేహితుల సహాయముతో 300 నక్కలను పట్టుకొని తోఁకతట్టు తోఁకను త్రిప్పి రెండేసి తోఁకలమధ్య నొక్కొక్క దివిటీని కట్టి, వానికి నిప్పు ముట్టించి ఫిలిష్తీయుల పంట చేలలో విడిచిపెట్టెను (14[1]-15[5]). ఫిలిష్తీయులు యూదాపై దండెత్తివచ్చి సమ్సోనును తమ కప్పగింపుఁడని యడిగిరి. అతఁడే తమ్ముద్ధరింపఁ బోవువాఁడను సంగతిని వారెఱుఁగక ఫిలిష్తీయులకు భయపడి అతనియొద్దకు రాఁగా అతఁడు తన్ను వారి కప్పగించుటకు ఇయ్యకొనెను. వారు వీనిని ఫిలిష్తీయుల కప్పగించుచుండఁగా, దేవుని ఆత్మచే రేపఁబడినవాఁడై తన్ను బంధించిన త్రాళ్లను కాలిన జనపనార పీచును తెంపినట్లు తెంపివేయఁగా చూచి మున్నతి పొందని ఫిలిష్తీయులు ఆశ్చర్యపడి మిగుల భయపడిరి. చచ్చి పడియున్న యొక గాడిద దవడ యెముకచేత పట్టుకొని ప్రాణరక్షణార్థమై పరుగిడుచున్న వారిలో వెయ్యమంది ఫిలిష్తీయులను హతమొనర్చెను. వారు కుప్పలు తిప్పలుగా పడిరి. అదియంతయు దేవుని సహాయమువలననే తాను చేయఁగలిగితిననియు ఆయన తోడులేని పక్షమున దాహమువలన చనిపోయెడివాఁడననియు తెలిపెను. ఆయన అతనికొక ఊటను

కనుపరచఁగా నీటిని త్రాగి దప్పిక తీర్చుకొనెను. యూదు లతనిని తమ రక్షకుఁడని యొప్పుకొనిరి ($14^{6-20}$). తరువాత సమ్సోను మిగుల ధైర్యముతో గాజాకువెళ్లి అక్కడ పాపములో పడెను. గాజావారు అతఁడు తమచేతఁ జిక్కెను గదా యని పట్టణపు గవునులను మూసివేసిరి గాని, మధ్యరాత్రిలో నతఁడు లేచి గవనియొద్దకు వచ్చి తలుపులు వేయఁబడియుండుట కనుగొని ద్వార బంధములతో వాని నూడఁదీసి హెబ్రోను తట్టుండిన యొక కొండమీఁదకుఁ గొనిపోయి నిలిపెను. శోరేకు లోయలో నుండిన దెలీలా యను స్త్రీ సాంగత్యమే యతని నాశనమునకు కారణమయ్యెను. తన జనుల ప్రేరేపణచే ఆమె సమ్సోను బలమున కాధారమేదియో కనుగొను నిమిత్తము అతనిని పీడింపసాగెను. మొదట మొదట అతఁ డామెను టక్కరిమాటలచే మోసగించెను గాని చివరకా రహస్యమామెకు వెల్లడించెను. తన తల క్షౌరము చేయఁబడినయెడల తాను తక్కినవారివలె బలహీనుఁడ నగుదునని చెప్పెను. ఫిలిష్తీయు లతని తలను గొరిగించి అతని బలము అతని విడిచెనని కనుగొనిరి. వారతనిని పట్టుకొని కండ్లూడఁబెరికి గాజాలోని చెఱసాలయందు తిరుగలి విసరు పనికి పెట్టిరి. దాగోను దేవత ఉత్సవమునాఁడు బలి నర్పించు సమయమున అతనిని బహిరంగముగా ప్రజలకు కనఁబఱచుఁ దెచ్చిరి. ఈలోఁగా అతని వెంట్రుకలు పెఱుగుట కారంభించెను. అందువలన అతఁడు మరల నాజీరు వ్రతము నాచరింపఁ గలిగెను. వారప్పు డతనిని దెచ్చి యుంచిన దేవాలయము చాల గొప్పది. అనేకులచే నది నిండియుండెను. దాదాపు 3000 మంది మిద్దెమీఁద నెక్కి తమాషా చూచుచుండిరి. సమ్సోను దృష్టిగలిగినకాలములో గాజాకువచ్చి యుండినందున ఆ దేవాలయపు కట్టడ మెట్టిదో చక్కగా నెఱిఁగియుండెను గాన తన దగ్గర నున్న యువకునితో ఆ మందిర మధ్యమందుండి కప్పుకు ఆధార భూతములుగా నున్న రెండు స్తంభముల నానుకొననిమ్మని యడిగెను. ఆ స్తంభములను పట్టుకొని తనయెడల చివరిసారి ... గనుపరచుమనియు, ఫిలిష్తీయులపై పగ ...నుటకు కావలసిన బలము నిమ్మనియు ప్రార్థించి వానిని తన యావచ్ఛక్తితో నూడలాగెను. అవి స్థానము తప్పినందున కప్పు క్రిందకు కూలిపడి అతఁడును వేలకొలఁదిగ అతని శత్రువులును మడిసిరి ($16^{1-31}$). ఇతని జీవితము అనేక గొప్ప లోపములతో గూడుకొని యున్నను, ఇతఁడు హెబ్రీ పత్రికయం దుదాహరింపఁబడిన విశ్వాసవీరుల లెక్కలలోఁ జేర్చఁబడినట్లు కనుగొనవచ్చును (హెబ్రీ $11^{32}$).

W.

**సరంబీ వేయుట** ఇల్లు II 2 చూ॥

**సరకులు** వర్తకము చూ॥

**సరటము** కీటకములు 28 చూ॥

**సరళత (Simplicity).** ఈ పదము II కొరి $11^{3}$ లో మడతలు లేనిదానిని సూచించు అసలు పదమునకు తర్జుమాయై యున్నది. ఈ గుణము ద్విమనస్సుకు భిన్నమైనది. కంటికి సంబంధముగా నీ పదమును మ $6^{22}$ లో తేట యనియు రోమా $16^{19}$ లో నిష్కాపట్యము అనియు తెనిఁగించిరి. అది నిష్కాపట్యమును సూచించును (నిష్కాపట్యము చూ॥).

**సరళవృక్షము (Cypress and Pine).** లెబానోను పర్వతములమీఁది వృక్షవర్గములో నొకటి (I రాజు $5^{10}$ II దిన $2^{8}$). దీని మ్రానును ఆలయమును సొలొమోను నగరములను కట్టుటయందు వాడిరి. కొన్ని వాక్యములలో దానిని తమాల వృక్షమని తెనిఁగించిరి (యెష $14^{8}$ $41^{19}$). కొన్నివాక్యములలో సరకుచెట్టువంటి యొక చెట్టును ఈ పదముచే తెనిఁగించిరి (యెష $41^{18}$ $60^{13}$). $60^{13}$ లో సాధారణముగా సరళవృక్షము అని తెనిఁగించిన చెట్టును దేవదారు వృక్షమనిరి (వృక్షములు చూ॥). J. C.

**సరిహద్దు రాయి (Land Mark).** సరిహద్దులను మార్చుట బైబిలునం దనేక వాక్యములలో నిషేధింపఁబడిన పాపమగుటచే సర్వే చేయక మునుపున్న పూర్వదినములలో ఇట్లన్యాయము చేయుట సర్వసాధారణమైనదని ఊహింపఁదగును (ద్వితీ $19^{14}$ $27^{17}$ హోషే $5^{10}$ సామె $22^{28}$ $23^{10}$ యోబు $24^{2}$). ఈ వాక్యములలో నున్న అసలుమాటనుబట్టి హద్దు మార్చుటయని యున్నది గాని హద్దురాతిని అను మాటలేదు.

అందువలన వారు మూలలకు వేసిన రాళ్లను మాత్రమేగాక హద్దులకు గుర్తుగా వేయువానిని కూడ మార్చినట్లున్నది. నేటివఱకు పలెస్తీనులో చేలమూలలకు రాళ్లువేసి ఆ రాళ్లను కలుపుటకు చిన్నకాలువ వచ్చునట్లు దున్నిరి. ఈ తప్పితమును చేయువారిని శపింపఁబడినవారినిగా నెంచిరి (ద్వితీ 27[17]).

**సర్గోను** (Sargon = స్థిరపఱచఁబడిన రాజు). క్రీ॥ ము॥ 722-705 సం॥లో అష్షూరు రాజ్యమునకు చక్రవర్తి (అష్షూరు 3 చూ॥). ఇతఁడు అష్షూరు రాజ్యము నపహరించినట్లుగా నున్నది. ఎటులైనను ఇతఁడు క్రొత్త రాజవంశమును స్థాపించియుండెను. ఇతని రాజవంశపువారి ప్రభుత్వకాలము చాల ప్రఖ్యాతిగలది. అతని ప్రభుత్వకాలమునుగూర్చి మనకు తెలిసిన మొదటి చరిత్రవిషయము షోమ్రోను పట్టఁబడుటయై యున్నది. షల్మనేసెరు 724 సం॥ లో దానిని ముట్టడి వేసియున్నను, అది కూలిపోకపూర్వమే చనిపోయి యుండెను. కావున, అది సర్గోను కాలములోనే 722 న పట్టఁబడెను (II రాజు 17[1-6]). II రాజు 17[6], 18[9,10] చూడఁగా షోమ్రోనుకు ముట్టడివేసిన చక్రవర్తియగు షల్మనేసెరు దానిని పట్టుకొనినట్లుగా నున్నది గాని రాజుల గ్రంథములోని చరిత్ర క్లుప్తముగా నుండుటవలన అది యీ విధముగ నున్నది. 720 సం॥ నందు సర్గోను అన్యులను షోమ్రోను దేశములో నుంచెను. హమాతునుండి వచ్చిన వారు కూడ వారిలోనుండిరి కావున, అతఁడా పట్టణమును జయించెనని అందువలన తెలిసికొనవచ్చును. 715 లో అతఁడు మఱికొంద ఱన్యులను తెచ్చి యిచట నుంచినట్లు రాతి శాసనముల వలనఁ దెలిసికొనవచ్చును. ఆ కాలములో నతఁడు ఐగుప్తు రాజు నొద్ద కప్పముఁ బుచ్చుకొనెను. మఱియు అదే కాలములో యూదా దేశమును కూడ పట్టుకొనినట్లుగా నున్నది. గాని యెందువలననో బైబిలు చరిత్రకారులేమియు చెప్పకున్నారు. 711 లో బాబెలు రాజగు మెరోదక్బలదాను (యెష 39) అష్షూరు వారికి విరోధముగా తిరుగుబాటు చేయుటకు యూదావారిని రేపుచుండఁగా ఇట్లు కుట్రచేయుఁ దలఁచినవారి నడ్డగించుటకు సర్గోను తన సేనాధిపతియైన తర్తానును అష్డోదు మీఁదికి నంపెను (యెష 20). 710 లో అతఁడు బబులోను మీఁదపడి దానిని జయించి, బబులోను రాజు అను బిరుదు నొందెను. నీనెవెకు ఉత్తరమున 10 మైళ్ల దూరములో కొర్సబాదు అను గొప్ప నగరమును అతఁడు కట్టింపఁ బూనుకొనెను గాని, అది పూర్తియైనతోడనే అతని సిపాయిలలో నొకఁడు కుట్రచేసి అతని చంపివేసెను. అతని కొమరుఁడగు సన్హెరీబు అతనికి తరువాత చక్రవర్తియాయెను (అష్షూరు 3 చూ॥).

**సర్దారులకు తగిన పాత్ర** వంట సామగ్రి 2 చూ॥

**సర్దారులు** (Lords of the Philistine). ఫిలిష్తీయ దేశములోనున్న గాజా అష్కెలోను, అష్డోదు, ఎక్రోను, గాతు అను పట్టణముల అధికారులకు హెబ్రీ భాషలోని ప్రత్యేకమగు బిరుదుకు భాషాంతరము. ఆ పదముకు ఇరుసు అని యర్థము. ఆ పదమును తెలుఁగు బైబిలునందు ఫిలిష్తీయుల సర్దారులని తెనిఁగించిరి (యెహో 13[3] న్యాయా 3[3] 16[5,3] I సమూ 5[8,11] 6[4-18] 7[7] 18[30] 29[2-7] I దిన 12[19]). వారికి పెట్టఁబడిన పేరు ఒకవేళ హెబ్రీ పదముగాక ఫిలిష్తీయపదమై యుండవచ్చును. వారు తమతమ పట్టణములకు రాజులైయుండి రాజుల పనిని చేసిరి. గాని దేశము యావత్తు నేలుటకు వారికొక విధమగు పంచాయతి యుండినట్లున్నది (I సమూ 29[1-9]).

**సర్పము, పాము** (Serpent). ఆయా పాములను సూచించిన హెబ్రీ పదములు తొమ్మిదియు, గ్రీకు పదములు మూఁడును బైబిలునందు గలవు. పలెస్తీనునందు 33 రకముల పాములున్నట్లు ఒకఁడు లెక్కించెను. గాని వీని యన్నిఁటిని గూర్చిన సూచనలు బైబిలునందు లేవు. పై నుదాహరించిన పదములు చాలమట్టుకు సర్పజాతిని సూచించునవే గాని వివిధములగు సర్పములను సూచింపవు (ఆది 3[1,2,4] మ 3[7] 12[13] మొ॥). తెలుఁగు బైబిలునందు వాడిన పదములు సరిగా అసలు భాషయందలి వానినే సూచించునని చెప్ప వీలుకాదు. అసలు పదమునకు ప్రత్యేకమైన తెలుఁగు పేరులను వాడక ఆయా పదములు నుపయోగించుటచేత వానిని వివరించుట కష్టముగా నున్నది. తెలుఁగు బైబిలునం దుదాహ

తించిన పాములను ఈ దిగువ నున్నట్లు అకారాది వరుసగా వివరించవచ్చును.



విష సర్పము

I. **1. ఎగురు సర్పము** (యెష $14^{29}$). క్రింద (4) లో నున్న సర్పము పేరేగాని అది యెగురుచున్నట్లును ఇచ్చట నున్నది. యెష యాలో అది అందఱిలో భయంకరుఁడగు రాజును సూచించుచున్నది.

**2. కట్లపాము.** ఆది $49^{17}$ లో నొక పదమునకును, సామె $23^{32}$ నందున్న మఱియొక పదమునకును తర్జుమాయై యున్నది. ఈ రెండవ మాటను సాధారణముగా **మిడునాగు** అని తెనిఁగించిరి.

**3. ఘటసర్పము.** ప్రకటన గ్రంథమునం దిది క్రీస్తు విరోధికి అలంకార రూపముగా నున్నది (ప్రక $12^{3-17}$ $13^{2-11}$ $16^{13}$ $20^{2}$).

**4. తాపకరమైన సర్పము.** (సంఖ్యా $21^{6-8}$ ద్వితీ $8^{15}$). యెష $30^{6}$ లో దీనిని తాపకరమైన మిడునాగులని తెనిఁగించిరి. దీని అసలు పదము ప్రకాశించునది యని యర్థమగును. పైన 1 లోని అసలు పదమిదే. అరణ్యమం దిశ్రాయేలీయులను కఱచిన పాము లిట్టివే.

**5. నాగుపాము.** ద్వితీ $32^{33}$ కీర్త $58^{4}$ యోబు $20^{14}$ మొ॥ వాక్యములలో నొక మాటకును యోబు $20^{16}$ నందున్న ఇంకొక మాటకును తర్జుమాయై యున్నది.

**6. భుజంగము.** దీని యసలు పదమును యోబు $7^{12}$ కీర్త $74^{13}$ $91^{13}$ యిర్మీ $51^{34}$ నెహె $2^{13}$ మొ॥ చోట్ల నీ విధముగా తెనిఁగించివను యెష $27^{1}$ నందు మకరమనియు, యెహె $29^{3}$ $32^{2}$ నందు మొసలి యనియు, ఆది $1^{21}$ నందు మహా మత్స్యము లనియు నిర్గ $7^{9}$ నందు సర్పము లనియు తర్జుమాచేసిరి. అది సముద్రము నందు నివసించునదని ఈ వాక్యములవలనఁ దెలియును (మకరము 2 చూ॥) యోబు $3^{8}$ నందిది మఱియొక పదమునకు భాషాంతరమై యున్నది (మకరము 1 చూ॥).

**7. మిడునాగు** పైన 2 చూ॥

**8. విషసర్పము** పైన 5 చూ॥

**9. క్రూరసర్పము** మకరము చూ॥

**10. సర్పము** ఇది సర్పజాతి నంతటిని సూచించుటకు వాడఁబడిన పదము.



నాగు పాము

II. పైనుదాహరించిన వానిలో (9) వది ఏదేను తోఁటలో ఆదాము హవ్వలను శోధించిన సర్పమునకు వాడఁబడిన పదము (ఆది $3^{1}$). ఆ చరిత్రను బట్టియే ప్రక $12^{9}$ $20^{2}$ నందు సాతానుకు **ఆది సర్పము** అను పేరు వాడిరి.

III. సర్పపూజ లోకమునందెంత సర్వసాధారణముగ నున్నను బైబిలునందు దానికి సూచనలు లేవు గాని మోషే అరణ్యమునందు చేసిన ఇత్తడి సర్పమును (సంఖ్యా $21^{8}$), తరువాతి కాలములో పూజించినట్లు II రాజు $18^{4}$ వలనఁ దెలియును గాన దానిని ఛిన్నాభిన్నములుగఁ జేసిరి.

**సర్వశక్తుడు** దేవుడు I 3 (2), II 4, 5 చూ॥

**సర్వ సంఘముల కొరకైన పత్రికలు** (Catholic Epistles). ఈ పేరుగొందిన పత్రికలు ఏడు. ఆ లేవనిన యాకోబు పత్రికయు, పేతురు మొదటి రెండు పత్రికలును, యోహా

పత్రికయు, యోహాను మొదటి రెండు మూడు పత్రికలును. ఈ పత్రికలను రచించిన గ్రంథ కర్తలు ఏయొక సంఘము నిమిత్తమై ప్రత్యేకముగ వ్రాయక సర్వత్రయుండు సంఘము నిమిత్తము వ్రాసినందున నా పేరేర్పడెనని పండిత ప్రకాండుల యభిప్రాయము. ఆయా పత్రికలను గురించి తెలిసికొనుటకై వాని పేరుల క్రింద చూ॥ M.

**సర్వోన్నతుడు** దేవుడు I 3 (1) చూ॥

**సలమీ** (Salamis). కుప్రద్వీపమునం దాగ్నేయముగా నున్న యొక రేవుపట్టణము. పౌలు బర్నబా లిచ్చటికి తమ మొదటి మిషనెరి ప్రయాణము చేయునప్పుడు వచ్చిరి (కార్య 13[5]). ఇచ్చట సమాజమందిరము లుండుటచే ననేకమంది యూదులు గలరని తెలిసికొనవచ్చును. ఈ పట్టణము క్రీ॥ శ॥ పూర్వము 6 వ శతాబ్దమునందు నున్నట్లు సూచన లగుపడుచున్నవి. రోమకా వారి పరిపాలన కాలములో అది కుప్రదీవియందు తూర్పు భాగమునకు రాజధానిగా నుండెను. ప్రస్తుతమునందు దానికి ఫామగుస్త (*Famagusta*) అను పేరు గలదు (పటము V, K 5).

**సలీము** (Salim = పూర్తియైన). యోహాను బాప్తిస్మమిచ్చిన ఐనోనను స్థలముదగ్గర నుండెను (యోహా 3[23] ఐనోను చూ॥).

**సలోమే** (Solome = సమాధానము).

1. హేరోదు నెదుట నాట్యమాడి, బాప్తిస్మమిచ్చు యోహానును చంపించిన హేరోదియ కుమార్తె (మ 14[3-11] మా 6[17-29]). ఈ పేరు బైబిలునందు లేదు.

2. క్రీస్తు సిలువ వేయఁబడినప్పుడు సిలువ దగ్గిరనుండిన స్త్రీలలో నొకతె (మా 15[40]). ఆమె సమాధికివచ్చిన స్త్రీలలోనుండెను (16[1]). మ 27[56] లో ఆమె పేరు లేకున్నను **జెబెదయి కుమారులతల్లి** యను పదములున్నవి. ఇందు చేతనే ఈ సలోమే యోహాను యాకోబు అను వారి తల్లియని అనుకొనఁదగును. అట్లయిన పక్షమున మ 20[20-23] లో మనవిజేసిన దీమెయేనని తెలిసికొనవచ్చును. ఈమె కన్యయైన మరియ తోడబుట్టువను నొక వాడుకమాట కలదు గాని యట్లనుటకు బైబిలులో తగిన సూచనలు లేవు.

**సల్కా** (Salecah = బాట). కనాను దేశ మంతటిలో మిగుల తూర్పుగానున్న యొక పట్టణము (ద్వితీ 3[10] యెహో 12[4] 13[11] I దిన 5[11]). దానిని గాదీయులకిచ్చిరి. అది బాషాను తూర్పు సరిహద్దయినట్లున్నది (ద్వితీ 3[10]). అరబ్బీవారు నివసించిన ఎడారికిని హద్దుగా నుండుటచే పూర్వ కాలములోను రోమకావారి కాలమునందును ప్రాకారములుగల పట్టణముగా నుండెను. ఇశ్రాయేలీయులు దానిలో నివసించి దానిని తమ పట్టణములలో నొకదానిగా చేసికొనినట్లు కనఁబడదు. అది గలిలయ సముద్రమునకు 15 మైళ్లు దక్షిణముగాను యొర్దాను నదికి 66 మైళ్లు తూర్పుగా నున్నది. ఆ ప్రాంతములలో ప్రస్తుతమున్న సల్కాదు (*Salkhad*) దాని యునికి యని తలంచుచున్నారు (పటము VIII, C 2).

**సల్మోనా** (Zalmonah = నీడగల). ఇశ్రాయేలీయులు అరణ్యసంచారములో మకాముజేసిన యొక స్థలము (సంఖ్యా 33[41,42]). అది ఎదోము ప్రాంతములలో నున్నది గాని దాని యునికిని గూర్చి ఇంకను నూటిగాఁ దెలియదు.

**సల్మున్నా** (Zalmunnah = నీడలేని). గిద్యోనువలన నోడింపఁబడి హతమయిన మిద్యాను ఇద్దరు రాజులలో నొకఁడు (న్యాయా 8[5-21] కీర్త 83[11]).

**సల్మోను** (Zalmon = నీడగల).

1. షెకెము దగ్గరనుండు యొక కొండ (న్యాయా 9[48]). బయల్బెరీతును తగలఁబెట్టుటకు అబీమెలెకు అచ్చటనుండి కట్టెలను కొట్టి తెచ్చెను. కీర్త 68[14] లో నిదే పేరుగలదు. అచట హిమమువలన శత్రువులు చెదరఁగొట్టఁబడినట్లుగా నున్నది. తుఫాను అను సిరియా సేనాధిపతి హిమము అధికముగా కురిసినందున పొందిన యపజయమునకు (I మక్క 13[22]) ఈ కీర్తన యందలి వాక్యము సూచనగా నున్నదని కొందఱి అభిప్రాయము. అట్లయినయెడల 68 వ కీర్తన క్రీ॥ పూ॥ 143 సం॥న రచింపఁబడెనని చెప్పవలసియుండును. కొందఱు 15 దాని సంబంధ వాక్యమునుబట్టి (కీర్త 68[15]) అది బాషాను పర్వతముల ప్రాంతములో నున్నదని భావించుచున్నారు.

2. దావీదు యోధులలో నొకఁడు (II సమూ $23^{28}$). I దిన $11^{29}$ లో ఇతనికి ఈలై అను మాఱుపేరు గలదు.

**సల్మోనే** (Salmone = క్రేతు ద్వీపమందు ఈశాన్యముగానుండు కొనకు కార్య $27^7$ లో పెట్టఁబడిన పేరు. ఇది గ్రీకు గ్రంథకర్తల వ్రాఁతలలోను కనఁబడును. దానికి ప్రస్తుతము సిదెరో (*Sidero*) యను పేరుగలదు. (పటము V, H 5).

**సల్లయి** (Sallai = ఎత్తఁబడిన).

1. నెహెమ్యా కాలమునందు యెరూషలేములో నివసించిన బెన్యామీనీయులకు పెద్ద (నెహె $11^8$).

2. చెఱకాలమునకుఁ దరువాత యాజకుల కుటుంబములలో నొక కుటుంబము (నెహె $12^{20}$). $12^7$ లో వీరికి సల్లూ అను పేరు కలదు.

**సల్లు** (Sallu = ఎత్తఁబడిన).

1. బెన్యామీనీయుల కుటుంబములలో (I దిన $9^7$ నెహె $11^7$).

**సహకారి** (Yoke-Fellow = Syngygus). పౌలు ఫిలిప్పీయి సంఘమునందు ఒకనికి పెట్టిన పేరు (ఫిలి $4^3$). సువార్త పనిలో సహాయపడిన యొకని సార్థకనామముగాని, యొకని అసలుపేరు కాదని తోఁచుచున్నది. ఇతఁడెవఁడో ఊహించుటకు మిగుల ప్రయత్నించిరి గాని ఫలానివారని రూఢిగా చెప్పఁజాలకపోయిరి. ఎపఫ్రొదీతు లూకా, బర్నబా, సీల, తిమోతి అనువారిలో నొకఁడు అని వారి యభిప్రాయము. పౌలుయొక్క భార్యకు సార్థకనామమని ఆది కాలమునుండి యొక వదంతి కలదు గాని I కొరి $7^8$ ఈ యభిప్రాయమును ఖండించును.

**సహవాసము** (Communion, Fellowship). ఇచ్చుట యందుగాని పుచ్చుకొనుట యందుగాని పాలివారగుట సహవాసము అనఁబడును. సహవాసము అని యర్థమిచ్చు అసలు పదమును ఈ మాటతో మాత్రముగాక (కార్య $2^{42}$ ఫిలి $2^1$ I కొరి $1^9$ II కొరి $13^{13}$ I యోహా $1^{3-7}$), పౌలు పుచ్చుకొనుట (I కొరి $10^{16}$), పాలివాఁడగుట (గల $2^9$ ఫిలి $3^{10}$ ఫిలె 6 I పేతు $5^1$), పాలుపొందుట (II కొరిం $8^4$), సాంగత్యము (II కొరి $6^{14}$), చందా (రోమా $15^{26}$), ధర్మము (హెబ్రీ $13^{16}$) అను ఈ పదములచే ఆయా వాక్యములతో దానిని తెనిఁగించిరి.

కార్య $2^{14}$ నందలి ఆరాధనలో ముఖ్యముగా ప్రభువు రాత్రిభోజనములో పాలు పుచ్చుకొనుటను సూచించునని కొందరనుకొందురు గాని అది అంతటిని సమష్టిగా నుంచుకొనుటను ముఖ్యముగా సూచించు రనుకొందురు. బీదలకు సహాయార్థముగా జమ చేసినవానిని ఆ రీతిగనే సహవాసముగా నెంచుటనే దానికిని ఆ పదము నుపయోగించిరి (రోమా $15^{26}$ II కొరిం $8^4$ హెబ్రీ $13^{16}$ ఫిలి $4^{14}$).

ద్రవ్యము నిచ్చి పుచ్చుకొను విషయము మాత్రమే గాక ఆత్మీయ విషయములో పాల్గొనుట మరి ముఖ్యముగా సహవాస మనఁబడును. ఇట్లు పరిశుద్ధాత్మను బొందుట ఆత్మయందలి సహవాసమనియు (ఫిలి $2^1$ II కొరి $13^{13}$), క్రైస్తవులు ఏకరీతిగా విశ్వసించుటచేత వారు విశ్వాసమందు పాలివారనియు (ఫిలె 6), ప్రభువు రాత్రిభోజనమును పుచ్చుకొనువారు ఆయన శరీర రక్తములలో సహవాసులనియు (I కొరి $10^{16}$) తెలుపఁబడెను. పాత నిబంధన యాచారముల నాచరించినవారు వేదికతోనే పాలివారైనట్లు పౌలు వ్రాసెను (I కొరి $9^{23}$). ప్రేమానుబంధముచే విశ్వాసులు దేవునితో సహవాసులగుదురు. అందువలన ఒకరితో నొకరుకూడ సహవాసులై యుందురు (I యోహా $1^{3-7}$). ఈ విధముగనే వారు దేవుని స్వభావమునందును పాలివారగుదురు (II పేతు $1^4$). తాను క్రీస్తు శ్రమలలో పాలివాఁడు కావలెనని పౌలు అపేక్షించెను (ఫిలి $3^{10}$). ఇట్లు చేయువారు ఆయన మహిమలోకూడ పాలివారు కాఁగలరు (I పేతు $4^{1,13}$). సువార్త పనియందును విశ్వాసులతో పాలివాఁడు కావలెనని ఆశించెను (I కొరి $9^{23}$).

ఇట్టి పరిశుద్ధమైన సహవాసము కలవారు విగ్రహములతోను (I కొరి $10^{21}$ II కొరి $6^{14}$) దుష్క్రియలతోను (ఎఫె $5^7$ ప్రక $18^4$) పాలివారై యుండ నేరరు.

సహవాసమను పదము ఆత్మీయ వాక్కులలోను వరములలో పాలు నొందుటను సూచించుటచే (ఎఫె $4^{1-6}$) సహవాసమను నీ పదము సంఘ చరిత్రలో క్రైస్తవ సంఘమునకుకూడ పేరుగా వాడుచు వచ్చిరి.

**సహస్రాధిపతి** (Chiliarch = వేయిమంది కధిపతి). ఒక పటాలమునకు సేనానిగా నుండు వాని కీ పేరు పెట్టిరి. యోహా $18^{12}$ లోను, కార్య $21^{31}$ లోను ఈ పేరు గలదు (పటాలము చూ॥).

**సహోదర ప్రేమ, సహోదరులు** (Brotherly love, Brethren). సహోదర ప్రేమయను అర్థమిచ్చు మూలభాషాపదము ఫిల దెల్ఫియ (*Philadelphia*) అనునదై యున్నది. ఫిలదెల్ఫియ అను పై పదము సువార్త లలో నుండకపోయినను "మీరందఱు సహో దరులు" అని క్రీస్తు చెప్పినప్పుడు (మ $23^{8}$) వారట్టి సహోదరప్రేమ కలిగినవారై యుండవలెనని సూచించెను. సహోదరప్రేమ యను పదము పత్రికలను వ్రాసినవారు ఉపయోగించిరి (రోమా $12^{10}$ I థెస్స $4^{9}$ హెబ్రీ $13^{1}$ I పేతు $1^{22}$ II పేతు $1^{7}$). I యోహా $5^{1}$ లో నీ పదము లేకపోయినను దాని సంగతి గలదు.

ఇట్టి సహోదరప్రేమను బట్టియే ఆదిక్రైస్త వులకు సహోదరులు అను పేరు పెట్టుచువచ్చిరి. యూదులు సహ తమ జాతివారికి సహోదరులను పేరు పెట్టినట్లు కార్య $2^{29}$ $13^{26}$ వలనఁ దెలి యును. తన శిష్యులు తన సహోదరులని క్రీస్తు చెప్పెను (యోహా $20^{17}$). పత్రికలయందిది క్రైస్తవులకు సర్వసాధారణమైన బిరుదుగా నున్నది (కార్య $15^{23-36}$ $16^{40}$ రోమా $1^{13}$ మొ॥). వారే తండ్రి పుత్రులగుటచే నీ బిరుదు మిగుల తగినది (ప్రేమ చూ॥).

## సా

**సాంబ్రాణీ, సాంబ్రాణీ పర్వతము** గంధ వర్గము I 2 చూ॥

**సాక్షి, సాక్ష్యము** (Witness, Testimony). పాతనిబంధనయందు ఏదు (*Ed*) అను హెబ్రీ పదమునకు భాషాంతరము. యొర్దానునది కవతల రూబేను గాదు మనష్షే గోత్రికులు సాక్ష్యార్థమై కట్టిన వేదికకు ఏదు అను పేరుఁబెట్టిరి (యెహో $22^{34}$). క్రొత్త నిబంధనలో సంఘ చరిత్రయందు హతసాక్షుల సందర్భములో వాడిన పదమునకు గ్రీకు భాషయందు మార్టర్ (*Martyr*) అను మాటను వ్రాసిరి. ఒక సంగ తిని దృఢపఱచుటకు ఆ రీతిగనే రాళ్లకుప్పను (ఆది $31^{44}$), రాతిని (యెహో $24^{27}$) సాక్ష్య ముగా పెట్టినట్లు సూచన లగుపడుచున్నవి. యోబు తన దౌర్భాగ్యమును దేవుఁడు చేసిన దానికి సాక్షిగా నెంచెను (యోబు $16^{8}$). ఆ రీతిగనే క్రొత్త నిబంధనయందు పాదధూళిని దులుపుట ఎదిరించెడివారికి విరోధముగా సాక్ష్యము నిచ్చును (మా $6^{11}$). సత్యమును దృఢపఱచుటకై భూమ్యాకాశములను సాక్ష్య ముగా నుంచిరి (ద్వితీ $4^{26}$). దేవుఁడు తమ మధ్య నున్నాఁడను సంగతికి సూచనగానున్న గుడా రము సాక్ష్యపు గుడార మనఁబడెను (సంఖ్యా $17^{1}$ $18^{2}$ మొ॥). పై సూచనలనుబట్టి మనుష్యులు మాత్రమేగాక అయా వస్తువులుకూడ సాక్ష్య ములై యున్నట్లు తెలియుచున్నది.

అన్నిటికన్న ముఖ్యముగా మానవులు సాక్షులైయుండి సాక్ష్యము నిచ్చిరి. యిర్మీయా పొలమును కొనినప్పుడు సాక్షులను పెట్టుకొనెను (యిర్మీ $32^{10}$). బోయజు రూతును తాను వివా హము చేసికొన్నట్లు సాక్షులను పెట్టెను (రూతు $4^{9}$). నేరమును స్థాపించుటకై కనీసము ఇద్దరైనను సాక్షులు కావలసియుండిరి (ద్వితీ $17^{6}$). సత్య మును దృఢపఱచుటకు దేవుఁడే సాక్షి యని ఒక విధమగు ప్రమాణమును వాడిరి (ఆది $31^{50}$ రోమా $1^{9}$ II కొరి $1^{23}$ మొ॥). చెప్పినది నిజమని దృఢపఱచుటకు వినువారినికూడ సాక్షులుగా పెట్టెడివారు (I సమూ $12^{5}$ I తిమో $2^{10}$).

సత్యమును దృఢపఱచువారు మాత్రమేగాక సత్యమును బోధించువారుకూడ సాక్షులై సాక్ష్యము నిచ్చువారుగా నెంచఁబడిరి. బాప్తిస్మ మిచ్చు యోహాను క్రీస్తునుగూర్చిన సాక్షిగా నుండెను (యోహా $1^{7,19}$). అపొస్తలులు క్రీస్తు పనినిగూర్చియు ఆయన మరణ పునరుత్థాన ములను గూర్చియు సాక్షులైరి (లూ $24^{48}$ కార్య $1^{8}$ $2^{32}$ $3^{15}$ మొ॥). విశ్వాసుల సముదాయము

సాక్షి సమూహ మనఁబడును (హెబ్రీ $12^{1}$). యేసుక్రీస్తు పరమసత్యమును బయలుపరచెను కావున నమ్మకమైన సాక్షి అను బిరుదు (ప్రక $1^{5}$ $3^{14}$) ఆయన బిరుదులలో నొకటిగా నున్నది.

**సాక్ష్యపు గుడారము** గుడారము I 2 చూ॥

**సాగిల పడుట** నమస్కారము చూ॥

**సాతాను** (Satan = విరోధి).

1. సాతానుయొక్క పేరులు. ఈ పదము యొక్క అసలు అర్థము విరోధియనునది I రాజు $11^{25}$ నందున్నది. కీర్త $108^{6}$ నందున్న ఈ పదమునే అపవాది యని తెనిఁగించిరి. ఈ రెంటిలో నది సాతానును గాక మానవులలోని విరోధులను సూచించును. ఈ బిరుదును యోబు $1^{6,7,9,12}$ $2^{1,2,3,6,7}$ I దిన $21^{1}$ జెక $3^{1}$ నందు చూడవచ్చును. ఈ హెబ్రీ పదమునే క్రొత్త నిబంధనలో అట్లే వ్రాసిరి (మ $4^{10}$ $12^{26}$ $16^{23}$ యోహా $13^{27}$ కార్య $5^{3}$ $26^{18}$ మొ॥). అపవాది యను అర్థమిచ్చు గ్రీకు పదమొకటి క్రొత్త నిబంధనయందు గలదు (మ $4^{1,5}$ $13^{3}$ $9^{1}$ $25^{41}$ I తిమో $2^{6,7}$ మొ॥). ప్రక $12^{10}$ లో నున్న అసలు పదము వేఱుపదమైనను అదే యర్థమిచ్చును. సాతానుకు శోధకుఁడు (మ $4^{3}$ I థెస్స $3^{5}$), దుష్టుఁడు (మ $6^{13}$ $13^{19}$ ఎఫె $6^{16}$), దయ్యముల యధిపతి (మ $3^{22}$), లోకాధికారి (యోహా $12^{31}$), వాయుమండల సంబంధమైన అధిపతి (ఎఫె $2^{2}$), ఆది సర్పము (ప్రక $12^{9}$ దీనితో II కొరి $11^{3}$ ఆది $1^{3}$ సరిపోల్చుము), బయెల్జెబూలు (మ $10^{25}$ $12^{24-27}$ మా $3^{22}$ లూ $11^{15-19}$), బెలియాలు (II కొరి $6^{15}$) అను పేరులు గలవు.

ఈ పేరులలో నీ దిగువవానిని మాత్రము వివరింతుము:—

(1) **వాయుమండల సంబంధమైన యధిపతి** (ఎఫె $2^{2}$). యూదుల అభిప్రాయము చొప్పున వాయుమండలము దయ్యముల కునికిపట్టు. దానినిబట్టియే పౌలు సాతానుకీ పేరు పెట్టెను.

(2) **ఆది సర్పము** (ప్రక $12^{9}$). ఆది తల్లిదండ్రులను శోధించుటచేతనే సాతానుకీ పేరు గలదు (ఆది $3^{1}$). సాతానుపే రా చరిత్రయందు లేకపోయినను అందులోని సర్పము శోధకుని సూచించునని దానివలనఁ దెలియుచున్నది.

(3) **బయెల్జెబూలు** బయెల్జెబూబ్ అనునది ఫిలిష్తీయుల దేవత (I రాజు $1^{2,3,6,16}$). ఆ పదమునకు ఈఁగల దేవత యని యర్థమని సాధారణముగా ననుకొందురు గాని కొందఱది సూర్యకిరణములను సూచించునని యభిప్రాయపడుచున్నారు గాన దీని వైద్యదేవతగా నెంచవచ్చును. యూదులు ఈ పదమును బయెల్జెబూలుగా మార్చిరి (మ $10^{25}$ మొ॥). దానికి చెత్తదేవత యని యర్థము. వారీ పేరును క్రీస్తుకు పెట్టి దూషించిరి.

(4) **బెలియాలు** (*Beliar* = పనికిరానిది). దుష్టులకు పాత నిబంధనయందు పెట్టఁబడిన పేరు. అసలునందు బెలియాలు కుమారులు అని యున్నది. ఆ పదమును పనికిమాలినవారు, దుష్టులు, పోకిరులు, చెడుది, చెడ్డవారు, దుర్మార్గులు మొదలగు మాటలచేఁ దెనిఁగించిరి (ద్వితీ $13^{13}$ న్యాయా $19^{22}$ I సమూ $1^{16}$ $10^{27}$ $25^{25}$ మొ॥). యూదుల అప్రమాణిక గ్రంథములలో బెలియాలు అను పదమును సాతానుకు వాడిరి. II కొరి $6^{15}$ లో పౌలీపదము నిట్లే వాడెను.

(5) **అబద్దోను, అపొల్లుయోను** ఈ పదమునకు నాశనము చేయువాఁడు అని యర్థమగును. అబద్దోను అనునది హెబ్రూ పదమును, అపొల్లుయోను గ్రీకుపదమునై యున్నవి.

2. సాతాను మానవులకన్న అధికశక్తిగలవాఁడు. యుక్తిపరుఁడు. మానవులను శోధించువాఁడు. వారిని పాపమున చిక్కునట్లు జేసి, శిక్ష కలిగించును. అతఁడు దయ్యములకన్న బలముగలవాఁడై వాని కధిపతియై యున్నాఁడు.

3. పాత నిబంధనయందు సాతానునుగూర్చిన బోధలంత తేటగా లేవు. వాఁడు హవ్వయొద్దకు సర్పరూపముతో వచ్చి శోధించెను (ఆది 3). దానిని గూర్చిన వివరమునందు సాతానుపేరు లేకపోయినను, తరువాతి సూచనలవలన వాఁడేనని తెలిసికొనుచున్నాము. దురాత్మలను గూర్చిన సూచన లచ్చటచ్చటఁ గలవు (న్యాయా $9^{23}$

I సమూ $16^{14}$ I రాజు $22^{22}$) గాని, వానికి ప్రత్యేకమగు అధికారము లున్నట్లు సూచన లేమియు కనఁబడుటలేదు. అవిధేయులైన వారిని శిక్షించుటకై, వానిని వారికి తీర్పుగాఁ బంపినట్లున్నది. జెక $3^{1}$ యోబు $1^{6,7}$ మొ॥ వాని యందు ప్రత్యేకమగు దూతగా కనఁబడినను, దేవుని సెలవులేని దేమియు చేయనేరనట్లు కనఁబడుచున్నది. I దిన $21^{1}$ లో వాఁడు శోధకుఁడుగా నున్నట్లున్నది గాని దానికి సంబంధించిన II సమూ $24^{1}$ లో దేవుఁడే దావీదును శోధించినట్లున్నది కావున సాతాను కీడు చేయుటకు మనుష్యులను శోధించువాఁడైనట్లు ఇందులో అంత తేటగా లేదు. దూతలనుగూర్చిన బోధవలెనే సాతానును గూర్చిన బోధకూడ చెఱకాలముకు పిమ్మటనే స్పష్టముగ నున్నది. యూదులు చెఱలో నుండఁగా, తమ చుట్టునుండు బబులోను పారసీకులయొక్క శాస్త్రములలో సాతానును గూర్చియు, దురాత్మలను గూర్చియు విని, వానిని తమ అప్రమాణిక గ్రంథములలో నుదాహరించిరి. సాతానును ప్రత్యేకమగు మూర్తిగాను దేవునికి గర్భశత్రునిగా నెంచి వివరింప మొదలు బెట్టిరి. టోబీతు $3^{8-17}$ లో నున్న అస్మోదియస్ (*Asmodeus*) అట్టివాఁడై యున్నాఁడు. ఆ గ్రంథములలోనే, దయ్యములు పూర్వము మంచిదూతలై యుండి చెడిపోయిరను సంగతియుఁ గలదు.

4. క్రొత్త నిబంధనలో సాతానును గూర్చిన బోధ. యేసుక్రీస్తు అపవాదిని నశింపజేయుటకు వచ్చి పనిజేసెను (హెబ్రీ $2^{14,15}$). కావున సాతానును గూర్చిన బోధ క్రొత్త నిబంధనలోని సూచనలవలన మఱింత తేటగా కనఁబడును. క్రీస్తు సాతానును లయపఱచుటకు పనిచేయఁగా సాతా నెక్కువగా ఆయనను విరోధించి, ఆయన పనిని చెఱపుటకు పనిజేసెను. క్రీస్తును శోధించెను (మ $4^{1-4}$). అందువలననే బహుశః క్రీస్తు కాలమునందు దయ్యముపట్టిన వారంతమంది యుండిరి (లూ $4^{33-41}$ $8^{2-27-33}$ మొ॥). క్రీస్తు జేసిన బోధలను మనుష్యులు నమ్మకుండునట్లు సాతాను విశేష యత్నములను జేసెను (మా $4^{1}$). వాఁడు హంతకుఁడును అబద్ధికుఁడునై (యోహా $8^{44}$), అబద్ధమాడునట్లు మనుష్యులను రేపును (కార్య $5^{3}$ ప్రక $12^{9}$). క్రీస్తు నప్పగించుటకు యూదాను ప్రేరేపించెను (యోహా $18^{27}$). మనుష్యులను నాశనము చేయుటకు ఎడతెగని ప్రయత్నములు చేయును (I పేతు $5^{8}$ ఎఫె $6^{11}$). వాని ప్రేరేపణలకు లోనగువారు వాని బిడ్డలగుదురు (యోహా $8^{44}$ కార్య $13^{8}$). అట్టి వారి సమూహము సాతాను సమాజపువారనఁబడుదురు (ప్రక $2^{9}$). అట్టి దుష్టులను సంఘమునుండి వెలివేయుట, వారిని సాతాను కప్పగించినట్లుండును (I కొరి $5^{5}$ I తిమో $1^{20}$). వాని బుద్ధిగలవారికి వాని పేరు పెట్టఁబడును (యోహా $6^{70}$ మా $8^{33}$). అతని ప్రభుత్వమునకు లోఁబడువారు ఒక రాజ్యమునందలి వారనఁదగును. దానికి సాతాను అధికారి (ఎఫె $2^{2}$). ఆ రాజ్యము మిగుల బలముగలదైనను ($6^{12}$) వాని నెదిరించువాని కట్టి హానియు కలుగనేరదు (యాకో $4^{7}$). అది నిలువక పడి నశించును. క్రీస్తు కాలములోనే సాతానుయొక్క శక్తి యధికారము తగ్గిపోయి వాఁడు మెరుపువలె ఆకాశమునుండి పడినట్లుగా నున్నది (లూ $10^{18}$). చివరకు వాఁడు పూర్ణముగా నోడింపఁబడును (మ $25^{47}$ ప్రక $20^{10}$).

**సాత్వికము** (Meekness, gentleness). బైబిలునందు బోధింపఁబడిన యొక ముఖ్యధర్మమై యున్నది. సాత్వికమను పదముచే తెనిఁగింపఁబడిన వేర్వేఱు పదములు గలవు. ఒక పదము దీనత్వమును వినయమును సూచించును (మ $5^{5}$ $11^{29}$ $21^{5}$ I కొరి $4^{21}$ మొ॥). మఱియొకటి పిల్లలను చూచువారు వారియెదుట కనఁబఱచు ఓర్పును సూచించును (I థెస్స $2^{7}$ II తిమో $2^{24}$ దీనత్వము చూ॥).

**సాదె** (Szade = צ అను నక్షరము); హెబ్రీ యక్షరములలో 18 వ 119 వ కీర్తనలోని 18 వ భాగమందలి ప్రతి పంక్తి ఈ యక్షరముతో నారంభమగుటవలన ఆ భాగమున కీ పేరుఁ బెట్టిరి (కీర్త $119^{137-144}$ చూ॥).

**సాదోకు** (Zadok = నీతిమంతుఁడు).

1. యెరూషలేములోని యాజక కుటుంబములలో నొక ముఖ్యమైనదానికి పూర్వికుఁడు. I దిన $6^{4-15,50-53}$ $24^{6}$ వలన ఇతఁడు అహరోను కుమారుఁడగు ఎలియాజరు వంశపువాఁడని కనఁ

బడుచున్నది. గాని ఇతని పక్షపువారు ప్రధాన యాజకత్వ మితనిదని రుజువు చేయుటకై కల్పించిన వంశావళి యని కొందరి యభిప్రాయము. చరిత్రయం దితని పేరు మొదట II సమూ $8^{17}$ నందు కనబడును. అప్పు డితడు అబ్యాతారుతో కూడ దావీదు కాలమునందు యాజకుడై యుండెను. అబ్యాతారుకన్న చిన్నవాడై యాజక ధర్మముల నెఱవేర్చుటయందు సహాయము చేసినట్లు ఆయా వచనములయందు కనబడును (II సమూ $15^{24-29}$ $17^{15}$ $18^{19,27}$ $19^{11}$ $20^{25}$). అయినను ఈ వాక్యము లన్నిటిలో సాదోకు పేరు మొదట వచ్చుటను జూడగా సొలొమోను కాలమునందతని కుటుంబమునకు పెత్తనము కలిగినపిమ్మట సమూయేలు గ్రంథమును సవరించిరని తెలిసికొనవచ్చును. అబ్షాలోము తిరుగుబాటు జేసినప్పుడు అబ్యాతారు సాదోకులు దావీదు పక్షముననుండి అతనికి సహాయపడిరి (II సమూ $15^{24-29}$). దావీదు వృద్ధుడైనప్పుడు అబ్యాతారు రాజ్యము నపహరించుటకై యత్నపడిన అదోనియాపక్షము వహింపగా (I రాజు $1^{7,8}$), సొలొమోనును అభిషేకించుటకు దావీదు సాదోకును నియమించెను (I రాజు $1^{32-45}$). సొలొమోను రాజైనపిమ్మట అబ్యాతారును పూర్ణముగా యాజకత్వమునుండి తొలగించి, సాదోకును ప్రధాన యాజకత్వమునకు నియమించెను (I రాజు $2^{26,27,35}$). సొలొమోను కాలము మొదలుకొని మక్కబీయుల కాలము దనుక సాదోకు వంశస్థులు యాజకులలో ముఖ్యులుగా నెంచబడిరి. యెహెజ్కేలు వీరిలో నొకడు. సాదోకు సంతతివారికి మాత్రమే యాజకత్వము భుక్తమైయున్నట్లు అతడు వ్రాసెను (యెహె $40^{46}$ $43^{19}$ $44^{15}$ $48^{11}$). సద్దూకయ్యులను పేరితనివలననే గలిగినట్లు కొందరి యభిప్రాయము (యాజకులు చూ॥).

2. దావీదు యోధులలో నొకడు సౌలు రాజ్యమును దావీదున కప్పగించుటలో సహాయపడెను (I దిన $12^{28}$). ఇతడును 1 లో నుదాహరింపబడిన వాడును ఒకరే యని యోసీఫను వ్రాసెను (పురా 7. 2. 2). గాని అది సందేహాస్పదముగా నున్నది.

3. రాజైన యోతాముయొక్క తాత (II రాజు $15^{33}$ II దిన $27^{1}$).

4. యెరూషలేము ప్రాకారములు కట్టుటయందు నెహెమ్యాకు సహాయము చేసినవారిలో నొకడు (నెహె $3^{4}$). ఇతడు బయానా కుమారుడు ($7^{6}$ ఎజ్రా $2^{2}$).

5. అదే పనిలో సహాయముచేసిన ఇంకొకడు. ఇతడు ఇమ్మేరు అనువాని కొడుకు (నెహె $3^{29}$).

6. నెహెమ్యా కాలమున శాస్త్రిగా నున్నవాడు (నెహె $13^{13}$). ఇతడును 5 లోని వాడును ఒక్కడు కావచ్చును.

7. నిబంధనను ముద్రించిన ప్రధానులలో నొకడు (నెహె $10^{21}$).

8. పైన 1 లో చెప్పబడినవాడు గాక మరియొక ప్రధాన యాజకుడు (I దిన $6^{12}$).

9. క్రీస్తు వంశావళి క్రమణికలో నొకని పేరు (మ $1^{14}$).

**సాధుత్వము, సాధువు** సాత్వికము చూ॥

**సానికనాదము** సంగీతము 3 (2) (*b*) చూ॥

**సాఫోను** (Zaphon = ఉత్తరము). యొర్దానుకు తూర్పుగానున్న గాదు వారి స్వాస్థ్యములోని యొక పట్టణము (యెహో $13^{27}$). న్యాయా $12^{1}$ లోని ఉత్తరదిక్కునకు పోయి అను పదములు సాఫోనుకు పోయి యని తర్జుమా చేయబడవలెనని కొందరనుకొందురు. ఆది $46^{16}$ లో నుండు సిప్యోను దీనికి సంబంధించి యున్నట్లున్నది (సిప్యోను చూ॥). సంఖ్యా $26^{15}$ లోని సెఫోను, ఆ పట్టణపు మాఱుపేరనియు, సెఫోనీయులు అనునది యా పట్టణస్థుల పేరనియు అనుకొనదగును. యూదుల పురాణగ్రంథముల ప్రకారముగా అమాథస్ (*Amathus*) అనునది దీని యునికియై యున్నది. అట్లయిన పక్షమున ప్రస్తుతము యబ్బోకు నదీ ముఖద్వారమునకు ఈశాన్య దిక్కుగా అమడదూరమున నుండు అమాతె (*Amateh*) దీని యునికి యని అనుకొనవచ్చును (పటము III, H 8).

**సామెతల గ్రంథము** (**Book of Proverbs**). ప్రతి జనమును ప్రతి జాతియును

తమ పూర్వికుల నాటనుండి వాడుకలోనుండు సామెతలను వాడుకొనుచున్నారు. గ్రంథ సంచయముగల జనములలో వారు అట్టి సామెతలను ఏకముగా కూర్చి వ్రాసి నిలువఁజేసి యుంతురు. ఐగుప్తు దేశములో సాలొమోను కాలమునకు 2500 సంవత్సరములకు మునుపు జీవించియుండిన యొక జ్ఞాని మిగుల ప్రాఁచీనకాలము నుండి వాడుకలోనుండిన సామెతలను సమకూర్చియుంచెను. అవి మిక్కిలి ప్రసిద్ధములై యుండెను. ఇతఁడు సమకూర్చి రెల్లుతో చేయఁబడిన పత్రములమీఁద వ్రాసిన పుస్తకముయొక్క ప్రతులు ఒక ఐగుప్తు దేశపు సమాధిలో దొరకెను. బహుశః సాలొమోనుకీ పుస్తకము తెలిసియుండును. సాలొమోను మృగములను పక్షులను నేలప్రాకు జంతువులను చెట్లను కనిపెట్టి చూచి సామెతలు వ్రాసెనని చెప్పుదురు (I రాజు 32,33). మఱియు నతఁడు మనుష్యులకు ఒకరితో నొకరికుండు వ్యవహారములను కూడ కనిపెట్టి చూచెను. సాలొమోను సామెతల పుస్తకమందు వ్రాయఁబడియున్న సామెతలు మాత్రము గాక వ్రాఁతలో చేర్పని యనేక సామెతలను చెప్పియుండెను. సామెతల పుస్తకము యావత్తును, సాలొమోను చేతనే వ్రాయఁబడలేదు. ఇతరులు కూడ అనేకములు వ్రాసిరి.

సామెతల పుస్తకమును ఎనిమిది ముఖ్య భాగములుగా విభాగింపవచ్చును.

(1) 1-9 జ్ఞానము ఒక మనిషి మాట్లాడినట్టు మాటలాడుచున్నది. అది యావనస్థులకు అవివేకమునుండి తొలఁగి జ్ఞానమును వెంబడించవలయునని హెచ్చరించుచున్నది. ఎనిమిదవ తొమ్మిదవ అధ్యాయములయందు జ్ఞానమును బుద్ధిహీనతయు ఉత్తమ పురుషయందు పేర్కొనఁబడియున్నది. అవివేకము ననుసరించుటవలన కలుగు శూన్యత వెల్లడిచేయఁబడి యున్నది.

(2) 10-22[16] సాలొమోను చెప్పిన వనఁబడిన చిన్న చిన్న సామెతలు వ్రాయఁబడియున్నవి.

(3) 22[17]-24[22] జ్ఞానోపదేశ మనఁబడునది సామెతలయొక్క రెండవ సంచికయై యున్నది.

(4) 24[23-34] పై సంచికకు అనుబంధము.

(5) 25, 29 సాలొమోను చెప్పిన సామెతలు. వీనిని హిజ్కియా యొక్క మనుష్యులు ఎత్తి వ్రాసిరి. బహుశః హిజ్కియా అష్షూరు బబులోను దేశముల రాజులవలె యెరూషలేము నందు పుస్తకశాల నొకటి ఉంచియుండును.

(6) 30.అధ్యాయము యాకె కుమారుఁడయిన ఆగూరు తన శిష్యులయిన ఈతీయేలునకును, ఉక్కాలుకును చెప్పిన హితోపదేశము. ఈ ముగ్గు రెవరో మనకు తెలియదు.

(7) 31[1-9] లెమూయేలు తల్లి అతనికి ఉపదేశించిన దేవోక్తులు. రాజయిన ఈ లెమూయే లెవరో మనకు తెలియదు.

(8) 31[10-31] వచనములయందు పతివ్రత యొక్క గుణాతిశయములు వర్ణింపఁబడి యున్నవి. ఈ లేఖరి పతివ్రతయైన స్త్రీని భార్య యనియు, మాత యనియు ఒక గొప్ప యింటి యిల్లాలనియు చెప్పి వర్ణించుచున్నాడు.

యూదులు ఈ సామెతల గ్రంథమును ధర్మశాస్త్రము ప్రవక్తలు అను గ్రంథవర్గముతో సమమైనదానిగా యెంచక దానిని పరిశుద్ధ లేఖనములు అను భాగముతో చేర్చిరి. అప్రమాణిక గ్రంథములో సాలొమోను జ్ఞానము, సైరాక్సు రచించిన జ్ఞానము అనునవి దీనివంటివై యున్నవి.

J. C.

**సామెహ్** = (Samech = ס అను నక్షరము). హెబ్రీ యక్షరములలో 15 వది. అక్షర మాలికగా వ్రాయఁబడిన 119 కీర్తనలోని 15 వ భాగమునకు (వ 113-120) ఈ పేరు పెట్టిరి.

**సారసపక్షి** పక్షులు 38 చూ॥

**సారెతాను** (Zarathan). యొర్దాను లోయలో ఆదాముపురము దగ్గరనుండు ఒక పట్టణము (యెహో 3[16]). సాలొమోను నీ పట్టణముపై నొక యధికారిని నియమించెను (I రాజు 4[12]). దీనికిని సుక్కోతుకును మధ్యనుండు జిగట భూమిమీఁద అతఁడు ఆలయమునకు కావలసిన వస్తువులను పోఁతపోయించెను (I రాజు 7[46]). అందువలన ఇది సుక్కోతుకు పోవు రేవుదగ్గర యబ్బోకు నదీ ముఖద్వారమునకు సమీపముగా నుండు స్థలమనియు యొర్దానుకు పడమరగానుండు

స్థలమనియు అనుకొనఁదగును. న్యాయా $7^{22}$ లో నుండు సెరేరాతు I రాజు $11^{26}$ లో నుండు జెరేదా అను పేరులు ఈ స్థలమునకు మాఱు పేరు లనుకొందురు.

**సారెపతు** (Sarepta or Zarephath = ఫేనీకే దేశమందున్న యొక పట్టణము). అది సీదోనీయుల పట్టణ మనఁబడెను (I రాజు $17^{8}$ లూ $4^{26}$). అచ్చటనున్న యొక విధవరాలి యింటియందు ఏలీయా బసజేసి ఆమె కుమారుఁడు చనిపోఁగా నతనిని బ్రదికించెను (I రాజు $17^{9-24}$). ఓబద్యా 20 నందది ఇశ్రాయేలీయులకు కలుగఁబోవు సరిహద్దుగా నెంచఁబడెను. క్రీ॥ శ॥ ముందు 701 సం॥లో అష్షూరు చక్రవర్తియగు సన్హెరీబు జయించిన పట్టణములలో నిది యొకటియై యున్నట్లు అష్షూరువారి శాసనములవలనఁ దెలియును. ప్రస్తుతము సీదోనుకు 8 మైళ్లు దక్షిణముగా నుండు సారఫెందు (*Sarefend*) అను పేరులో దీని రూపమింకను గనఁబడుచున్నది. ఆ యూరికిని సముద్రతీరమునకును మధ్యనుండు పాడు శేషములే దాని యునికి. క్రూసేడులను యుద్ధములు చేసినవారు సరెప్త యూరి విధవరాలి యిల్లుండిన స్థలముగా నెంచఁబడిన చోట కట్టించిన ఒక దేవాలయపు శేషము లింకను చూపెదరు (పటము IV, C 3).

**సార్దీస్** (Sardis). చిన్నాసియలోని పడమటి పరగణాలలో మధ్యనుండు లూదియయొక్క రాజధాని. క్రీ॥ ము॥ ఆరవశతాబ్దము మధ్యవఱకు ఇది యా కాలమందున్న రాజ్యములన్నింటిలో మిగుల స్థితివంతమైనదిగా నుండెను. 1500 అడుగులు ఎత్తుగానుండు త్మోలస్ (*Tmolos*) అను కొండపై దీని కోటను కట్టియున్నారు. కోరెషు రాజు దీనిపై యుద్ధముజేయుచు, సార్దిస్ పట్టణపు వారికి తెలియకుండిన యొక మార్గమును కనుగొని, దానిద్వారా కోటలో బ్రవేశించి, క్రీ॥ ము॥ 546 సం॥మున జయించెను. అదేరీతిగా సిరియ రాజగు మహా అంతియొకస్ క్రీ॥ ము॥ 214 నందు దానిని పట్టుకొనెను. ప్రక $3^{3}$ నందుదాహరింపఁబడిన జాగరూకత ఈ చరిత్ర సంబంధము వలన మఱింత స్పష్టపఱచఁబడుచున్నది. ఇది యూరోపు ఆసియల మీఁదుగాఁ బోవు పెద్ద రస్తాకు సమీపమున నుండి, ఆరంభమునందు వ్యాపారాదులకును చేతిపనులకును మిగుల ప్రసిద్ధిఁ జెందిన పట్టణమై యుండెను. చిన్నాసియలోని ఏడు సంఘములలో నొకటిగా లెక్కించఁబడెను



సార్దీస్ శిథిలములు

(ప్రక $1^{11}$ $3^{1-6}$). ఈ పట్టణమందలి సంఘము లౌకికవిషయములలోఁ జిక్కుకొని విశ్వాసమునందు మృతమైనట్లుండెను. ఈ సంగతులా పట్టణమునకు బాగుగా సరిపడెను. లుదియ పరగణా యొక్క ప్రధాన బిషపు ఈ పట్టణమున నున్నట్లు సంఘచరిత్ర వలనఁ దెలియుచున్నది. అతఁడు కన్‌స్టాంటినోపిలు పట్టణమందుండిన ప్రధానాధ్యక్షుని క్రింద నుండువారిలో ఆరవవాఁడుగా లెక్కింపఁబడెను. కన్‌స్టాంటినోపిలు వృద్ధిలోకి వచ్చినప్పుడు యూరోపు ఆసియల మీఁదుగా వెళ్లిన రస్తాలు ఈ పట్టణముమీఁదుగాఁ బోవుట ఆగినందున దీని ప్రాముఖ్యత తగ్గిపోయెను. ప్రస్తుత మచ్చట నుండునది చాల చిన్న పల్లెయై సెర్తుకలెస్సి (*Sert kalesi*) పిలువఁబడుచున్నది (పటము V, I 3).

**సాలు** అక్షోటము చూ॥

**సాలూ** (Salu = ఎత్తుగానున్న). షిమ్యోను గోత్రికుఁడు. ఫీనెహాసు చంపిన జిమ్రీ యొక్క తండ్రి (సంఖ్యా $25^{14}$).

**సాలెపురుగు** కీటకములు 29 చూ॥

**సాష్టాంగపడుట** నమస్కారము చూ॥

## సి

**సిందూర వృక్షము (Teel Tree).** ఆలమాను (యెహె $27^{6}$) లేక ఎలోమాను (ఆది $12^{6}$) అను హెబ్రీ పదముయొక్క భాషాంతరము. సింధూరవృక్ష మనుటకన్న మూలభాషాపదమును తెలుఁగు అక్షరములతో వ్రాయుట మరి బాగుగా నుండును. ఇట్టి వృక్షములు భరత వర్షమున హిమాలయ పర్వతములకు దక్షిణమునందు లేనే లేవు. దీనిని ఇంగ్లీషు భాషలో ఓకు వృక్ష మందురు. ఇది పలెస్తీనులో లెస్సగాఁ బెరుగును. ఈ వృక్షజాతులలో నొకజాతి చెట్లు మిక్కిలి యెత్తుగాఁ బెఱిగి నలుతట్ల వ్యాపించిన కొమ్మలు గలవగును. హెబ్రోను పట్టణ సమీపమున నిట్టి చెట్టొకటి గలదు. అరబ్బీయులు దానిని అబ్రాహాముయొక్క చెట్టు అందురు గాని అది 400 సం॥లకన్న నెక్కుడు వయస్సులేదు. ఈ జాతి చెట్ల కలప మిగుల గట్టిది. గాన ఇండ్లను ఓడలను కట్టుట కుపయోగింతురు. సమాధుల దగ్గర ఈ చెట్లను నాటు అలవాటు వేలకొలఁది సంవత్సరములనుండి గలదు (ఆది $35^{8}$). J. C.

**సింధూరము** ఇంగిలీకము చూ॥

**సింహము (Lion).** ఆఫ్రికా ఖండము దీని ముఖ్య నివాసస్థానమైనను, ఆసియ ఖండమునందు భారత దేశము దనుక కనఁబడుచునే బైబిలు కాలమునం దివి పలెస్తీను దేశమున నెక్కువగా నుండెను. బైబిలునందు దీనికి ఆరు హెబ్రీ పదములును, ఒక గ్రీకు పదము నుపయోగింపఁబడెను. వీనిలో మిగుల సాధారణమగు హెబ్రీ భాషాపదము పాఁత నిబంధనయందు 80 సారులు కప్పించును. సింహముయొక్క బలము (II సమూ $1^{23}$ సామె $30^{30}$), దాని ధైర్యము (II సమూ $17^{10}$ సామె $28^{1}$), దాని కోరలు (యోవే $1^{6}$), ఎఱను పట్టుకొనుటకై దుముకక పూర్వము పొంచియుండుట (ఆది $49^{9}$), గొఱ్ఱెలను దూడలను పట్టుకొనుట (I సమూ $17^{34}$ యెష $11^{6,7}$), మనుష్యులను పట్టుకొనుట (I రాజు $13^{24}$ $20^{36}$), దాని గర్జన (యోబు $4^{10}$ సామె $20^{2}$ I పేతు $5^{8}$) లను గూర్చిన సూచనలు పెక్కులు గలవు. అది పొదలలోను (యిర్మీ $4^{7}$), అరణ్యమందును ($5^{6}$) ఇతర మఱుగు చోట్లను ($25^{38}$) దాగుకొనును. యొర్దాను నదీ తీరమునందు వృక్షాదులలో ముఖ్యముగా దాగుకొనియుండునని $49^{19}$ వలనఁ దెలియుచున్నది.



సింహము

యెహెజ్కేలుకు గలిగిన దర్శనమందును (యెహె $1^{10}$ $10^{14}$) యోహానుకు పత్మసులంకయందు కలిగిన దర్శనమందును (ప్రక $4^{7}$), ఇవి అలంకారరీతిగా కనఁబడెను. వీనియందది దేవుని సృష్టియందలి మహిమను సూచించుచు ఆ సృష్టికి సూచనగా నున్నది. ప్రభువైన యేసుక్రీస్తుకు **యూదాగోత్రపు సింహము** అను బిరుదు గలదు (ప్రక $5^{5}$ ఆది $49^{9}$). ఇది ఆయన పరాక్రమమును జూపెడి యలంకారమై యున్నది.

**సింహాసనము, ఆసనము, పీఠము (Throne).** మూల భాషయందు సింహాసనమని తెనిఁగించిన పదము ఘనులైనవారు కూర్చుండు ఎట్టి పీఠమునైనను సూచించును. ఆ పదమునే ప్రధాన యాజకుఁడు కూర్చుండు పీఠమునకువాడి దానిని **ఆసనమనియు** (I సమూ $1^{9}$) **పీఠమనియు** ($4^{13-18}$) తెనిఁగించిరి. యిర్మీ $1^{15}$ లో అది సేనాధిపతులు కూర్చుండు పీఠమును సూచించును. అయినను సాధారణముగా నీ పదమును రాజులు కూర్చుండుదానికి వాడెదరు. ఫరో సింహాసనము (నిర్గ $11^{5}$) దావీదు సింహాసనము (I రాజు $2^{12}$) లను గూర్చిన సూచన లగుపడుచున్నవి. సొలొమోను కట్టించిన సింహాసనపు వివరము I రాజు $10^{18-20}$ II రాజు $9^{17-19}$ లో నున్నది. దేవుఁడు రాజగుటచే ఆయనకు సింహాసన ముండినట్లు అలంకారరీతిగా నున్నది (కీర్త $9^{7}$ యెష $6^{1}$ మ $5^{34}$

కార్య 2[30] హెబ్రీ 1[8] ప్రక 3[21] మొ॥). అదియుఁగాక తీర్పు చేయుటయందు సహాయులైన వారుకూడ సింహాసనముల మీఁద కూర్చున్నట్లుగా అలంకార రీతిగా నున్నది (మ 19[28] లూ 22[30] ప్రక 20[4]).

సింహాసన మీ విధముగా ఘనమునకును బల మునకును సూచనగా నున్నది. దావీదు సింహాసనము ఆయన శక్తి ప్రభావములకు సూచనయై యున్నది (II సమూ 7[16]). ఆ రీతిగనే దేవుని సింహాసనము ఆయన శక్తి ప్రభావములకు సూచనగానున్నది (కీర్త 45[6] 95[2]). ఇట్లు సింహాసనములు ప్రతివిధమైన ప్రభుత్వమునకు సూచనగా నెంచఁబడెను (కొలొ 1[16]).

**సిక్లగు** (Ziklag). యూదా గోత్రపు దక్షిణ సరిహద్దు పట్టణములలో నొకటి (యెహో 15[31]), దానిని షిమ్యోను గోత్రికుల కిచ్చిరి (యెహో 19[4] I దిన 4[30]). సౌలు రాజుగానున్న కాలము నందది ఫిలిష్తీయుల యాధీనమందుండెను. దావీదు సౌలుకు భయపడి పారిపోయినప్పుడు ఫిలిష్తీయులలో గాతుపట్టణపు రాజైన ఆకీషు దావీదునకు దాని నిచ్చెను (I సమూ 27[6] I దిన 12[1-22]). అమాలేకీయులు దానిని దోఁచుకొనినప్పుడు, దావీదు వారిని తరిమి, జయించి, దోపుడును మరల పట్టుకొని ఇతర పట్టణస్థులతో పంచుకొనెను (I సమూ 30[1-31] II సమూ 1[1] 4[10]) అప్పటి నుండి యది ఫిలిష్తీయులది గాక యూదుల స్వాధీనమయ్యెను (I సమూ 27[6]). చెఱకాల మునకు పిమ్మట తిరిగివచ్చినవా రిక్కడ కాపుర ముండిరి (నెహె 11[28]). గాజాకు 11 మైళ్లు ఆగ్నేయముగా నున్న సుహైలీఖ (*Zuheiliqa*) దీని యునికి యని సాధారణముగా ననుకొందురు (పటము II, B 3).

**సిగ్గు** (Shame).

1. పాపమువలన మానవులు సిగ్గుపడిన వారైనట్లు బైబిలునం దున్నది (ఆది 2[25] రోమా 6[21] ఎఫె 5[12] మొ॥). పాపము చేయువారు సిగ్గునొందెదరు. విగ్రహారాధన గొప్ప పాపమగుటచే దాని చేయువారు దానిచేతనే సిగ్గు నొందువారగుదురు (యిర్మీ 2[26] యెష 41[11] 42[17]). ఇట్లు సిగ్గు నొందుటవలన తమ తప్పును తా మెఱిఁగి యుండినట్లు స్పష్టమగుచున్నది (యెహె 16[61] ఎజ్రా 9[6]). బొత్తుగా సిగ్గునొందకుండుట మఱి కఠినమనస్సునకు సూచనయైయున్నది (యిర్మీ 6[15] 8[12] జెఫ 3[5,11]). కొందరు పాపము విషయము అతిశయపడెదరు (ఫిలి 3[19]). వారి గతి మఱి భయంకరమైనది. లూ 11[8] లోని సిగ్గుమాలిన వారు తప్పు చేసినవారు కాదుగాని పట్టువదలక యడిగినవారు.

2. పాపము చేయుటవలన మాత్రమేగాక తమ అలవాటులను తప్పెడివారికిని సిగ్గు కలుగునని బైబిలునం దున్నది. పురుషులు తలవెండ్రుకలు పెంచుకొనుటయు, స్త్రీలు వానిని కత్తిరించుకొనుటయు అట్టివానిలో చేరినవి (I కొరి 11[6,14]). సంతానము లేకపోవుట (యెష 54[4]) తప్పు కాక పోయినను, గొప్ప దౌర్భాగ్యదశయని యెంచఁబడుటచే సిగ్గుపడిరి. అపనిందలును సాధారణముగా సిగ్గు నొందుటకు కారణ భూతములుగాని క్రీస్తు మంచిదానిని బట్టి నిందలు పొందినందున సిగ్గు నొందక దానిని సహించెను (హెబ్రీ 12[3]). అటులనే ఆయన శిష్యులుకూడ నిందలు కలిగినందుకు సిగ్గుపడక వాని విషయము అతిశయపడిరి (I పేతు 4[16] కార్య 5[41] రోమా 5[3]). లోకులు సువార్తను గూర్చి ఎంత హీనముగా నెంచినను శిష్యులా విషయమును లెక్కసేయక దానిగూర్చి అతిశయపడిరి (రోమా 1[16]). వీనిని సహించఁజాలక సిగ్గుపడువారెవరో వారు మోక్షమునకు పాత్రులుకారు (మా 8[38] లూ 9[26]).

3. నిజభక్తులైనవారికి సిగ్గునొంద నవకాశముండదు (కీర్త 25[3] యెష 45[16,17] యిర్మీ 17[13] రోమా 5[5] 9[33] మొ॥). అట్టివారికి క్రీస్తు ఆగమనమందుకూడ సిగ్గు కలుగక ధైర్యము కలుగును (I యోహా 2[28]). దేవుఁడు అట్టివారి విషయము సిగ్గుపడక (హెబ్రీ 2[11] 11[16]). వారియం దనుకూలించుటచే వారికి నిట్టి యతిశయము కలుగఁగలదు.

**సితారా** సంగీతము 3 (1), (8) చూ॥

**సిత్రీ** (Sithri = నా ఆశ్రయము). లేవీ కుమారుఁడగు కహాతు మనుమలలో నొకఁడు (నిర్గ 6[22]).

**సిథియనుడు** (Scythian). ఐరోపా ఖండముయొక్క ఆగ్నేయదిక్కున నుండు నల్ల సముద్రముయొక్క యుత్తరపు తీరమున నివసించుచుండిన కిరాతక జనాంగము. వారు మృగప్రాయులును క్రూరులునైన పొడుగాటి మనుష్యులు. పూర్వీకులు లోకనివాసులందఱిలో వీరిని యనాగరికులనుగా నెంచిరి (కొలొ 3[11]).
M.

**సిద్కియా** (Zedekiah = యెహోవా నీతి).

1. కెనయనా కుమారుఁడు, అహాబు రామోత్గిలాదు మీఁదకు వెళ్లనై ప్రేరేపించు అబద్ధ ప్రవక్తలలోఁ జేరి, ఇనుప కొమ్ములను జేయించుకొని, సిరియనులను వీనితో పొడిచి నాశనము జేతువని ప్రవచించెను. యెహోవా ప్రవక్తయగు మీకాయా వారు చెప్పినదానికి వ్యతిరిక్తముగా పలికినందున నితఁడు కోపావేశుఁడై వానిని చెంపమీఁదఁ గొట్టి తిట్టెను మీకాయా అతఁడు చేసినదానికి ప్రతిఫల మనుభవించునని తెలిపెను (I రాజు 22[11-25]).

2. మయశేయా కుమారుఁడు. వీఁడు అబద్ధ ప్రవక్తయు వ్యభిచారియునై యుండెను. నెబుకద్నెజరు ఇతనిని కొలిమిలోవేసి మాడ్చునని యిర్మీయా ప్రవచించెను (యిర్మీ 29[21-23]).

3. హనన్యా కుమారుఁడు. యెహోయాకీము ఏలుబడినందుండిన యూదా ప్రధానులలో నొకఁడు (యిర్మీ 36[12]).

4. యూదారాజైన యోషీయా కుమారులలో నొకఁడు. వీని యసలుపేరు మత్తన్యా. సిద్కియా అనునది నెబుకద్నెజరు యెహోయాకీనుకు ప్రతిగా నితనిని యూదాకు సామంతరాజుగా నియమించినప్పుడు పెట్టినపేరు (II రాజు 24[17] I దిన 3[15]). II దిన 36[10] లో నున్న సహోదరుఁడను పదము బంధువుఁడని యర్థమిచ్చును. యోషీయాకు హమూటలువలన కలిగిన యిద్దరు కుమారులలో నితఁడు చిన్నవాఁడు (II రాజు 23[31] 24[18]). రాజ్యమునకు వచ్చినప్పు డితఁడు 21 సం॥ ముల వయస్కుఁడు. క్రీ॥ పూ॥ 598-587 వఱకు పదునొకండు సంవత్సరములు రాజ్యము చేసెను. అతఁడుగాని అతని ప్రజలుగాని యిర్మీయా చెప్పిన బోధల నెంతమాత్రమును వినినవారు కారు (II దిన 36[1] యిర్మీ 37[2]). విగ్రహములను నిలిపి దేవాలయమును అపవిత్రపఱిచి (II దిన 36[14]). న్యాయము తీర్చుట అనునదియే దేశమున లేకపోయెను (యిర్మీ 21[11,12]). రాజు సభికులలో ముఖ్యులు అబద్ధ ప్రవక్తలతోఁ జేరుకొని పరాయి పరిపాలన కంతమొందింప పట్టుబట్టిరి (27[12-22]). సిద్కియా యేలుబడి యారంభింపఁగనే ఎదోము, మోయాబు, అమ్మోను, తూరు సీదోనులనుండి రాయబారులు యెరూషలేమునకు వచ్చి బాబెలు వారిపై ఒక్కుమ్మడిగా తిరుగఁబడు నేర్పాటులఁ జేసికొనిరిగాని దేవునిచే ప్రబోధితుఁడగు యిర్మీయా ఈ ఉద్దేశమును కఠినముగా ఖండించెను (27[1-11]). తన యేలుబడిలో మూఁడవ సంవత్సరమున నెబుకద్నెజరునకు తన రాజభక్తిని గనపఱచుటకై రాయభారము నంపి (29[3]) తరువాతి సంవత్సరమునందు తానే బాబెలును స్వయముగా దర్శించెను (51[59]) గాని చివరికాలమునందు బహు మూర్ఖుఁడై తిరుగఁబడెను. సిద్కియా యేలుబడియందు తొమ్మిదవ సంవత్సరము పదవ మాసము పదవ దినమున బాబెలురాజు యెరూషలేమును ముట్టడించి దాని కెదురుగా ముట్టడి దిబ్బలను గట్ట నారంభించెను. యెరూషలేము దొమ్మిచేసి పట్టుకొనుటకు వీలైనపట్టణము కాదు గాన నెబుకద్నెజరు దానిచుట్టు తన సైన్యములను నిలిపి రాకపోకల నాపివేసెను. ఐగుప్తీయులు వచ్చుటవలన బాబెలువారు కొంతకాలమువఱకు పట్టణమును వదలినను (37[5]) కొలఁది దినములకే మరల వచ్చిరి. సిద్కియా యేలుబడి 11 వ సం॥ నాలుగవ మాసము 9 వ దినమునకు పట్టణమునందు తినుబండార మేమియు దొరకక పోయెను. ఆ రాత్రి సిద్కియాయును అతని సైనికులును రహస్యముగా లేచి సందడి యేమియు చేయక బాబెలువారి ముట్టడి దిబ్బలమీఁదుగా యొర్దాను వైపు పారిపోయిరి. రాజు పారిపోవుచున్నాఁడని విని బాబెలు పటాలములలో నొకటి వానిని వెన్నంటి తరిమి యెరికో మైదానమం దతనిని కలిసికొనిరి. వానితో నున్నవారందఱును పటాపంచలై పారిపోఁగా సిద్కియా శత్రువులచేతఁ జిక్కెను. అప్పటికి నెబుకద్నెజరు పలెస్తీనుకు కొంచెము ఉత్తరముగా నున్న రిబ్లా పట్టణమునకు

వెళ్లియున్నందున అచ్చటికి ఖైదీగాఁ గొనిపోయిరి. అచ్చటతనిని విచారించి దోషియని తీర్పు జెప్పి, అతని కండ్లముందఱనే యతని బిడ్డలను జంపించిన మీఁదట అతని కండ్లూడఁ బెఱికించెను. తరువాత అతనికి సంకెళ్లు వేయించి బాబెలునకుఁ గొనిపోయెను (II రాజు 24[17-20] 25[1-7] II దిన 36[11-21] యిర్మీ 39[1-14]). అచ్చట నతఁడు తన మరణమువఱకు ఖైదీగా నుండెను (యిర్మీ 52[11]). సిద్కియా యేలుబడి యింతటిలో యిర్మీయా ప్రవచించుచుండెను.

5. యెకొన్యా కుమారుఁడు (I దిన 3[16]). ఇతఁడు కుమారుఁడుగాక యెకొన్యాకుఁ బిదప రాజ్యమునకు వచ్చినవాఁడని కొందఱి యభిప్రాయము. అట్లయినయెడల నితఁడు పైనున్న 4 లోని వాఁడు.

6. నెహెమ్యాకుఁ దరువాత నిబంధనకు ముద్రవేసినవారిలో నొక ప్రధాని (నెహె 10[1]).

**సిద్దీములోయ** (Vale of Siddim = బయళ్లుగల లోయ). ఈ పేరు ఆది 14[3-10] నందు మాత్రము కనఁబడును. ఇది ఉప్పుసముద్రమనఁబడెను (14[3]). అచ్చట మట్టి కీలు గుంటలు పెక్కులు గలవు (14[10]). ఈ ప్రాంత నివాసులు బాబెలునుండి వచ్చినవారితో యుద్ధము జేసి ఓడిపోయిరి (14[8,9,11]). మృతసముద్రము దక్షిణభాగమునందు దాదాపు 20 మైళ్ల వఱకు 11 అడుగులకన్న యెక్కువలోతు లేదు. అబ్రాహాము కాలమున నది మెట్టయై యుండవచ్చును. అదే ఈ లోయ యని సాధారణముగా నను కొందురు.

**సిద్దె** వంటసామగ్రి 2 చూ॥

**సిద్ధపరచు దినము** (Day of Preparation). యూదులు విశ్రాంతి దినమునకు పూర్వపు దినమున కీ పేరు పెట్టిరి (మా 15[42] పురా 16.6.2). పస్కా వారములోని విశ్రాంతి దినము మఱి పరిశుద్ధమైన దినముగా నెంచుటచే ఆ వారములోని సిద్ధపఱచుదినమును మఱి గంభీరమైనదిగా నెంచిరి (యోహా 19[14,31]). ఈ పేరును విశ్రాంతి దినమునకు పూర్వపు దినమునకే గాక గొప్ప పండుగుల పూర్వపు దినములకును పెట్టిరి ఇది హిందువుల భోగి దినమువంటి దన వచ్చును. అట్లయినయెడల యోహా 19[14,31] లో నున్న వాక్యములు విశ్రాంతి దినముకు ముందు దినమును గాక పస్కాను భుజించిన దినమునకు ముందు దినమును సూచించును. ఇట్లు తలంచువారు క్రీస్తు పస్కాదినమున సిలువ వేయఁబడెనని యనుకొందురు. వీరి యభిప్రాయ ప్రకారము ఆయన తన శిష్యులతో పస్కాను భుజించినది నియమిత దినమునకు ముందని తెలుచున్నది గాని ఇది సందేహాస్పదముగా నున్నది.

**సినీయులు, సీనీయులు** (Sinites). కనానీయులలో నొక జనము (ఆది 10[17] I దిన 1[15]). వారినిగూర్చి రూఢిగాఁ దెలియకపోయినను వారిపేరు అర్కీయులకును, అర్వాదీయులకును మధ్య వచ్చుటచే, ఫేనీకేలో నున్న యొక జనమని భావింతురు. అచ్చట పూర్వము సియన్ను (*Siannu*) అను వారుండినట్లు అష్షూరు శాసనములవలనఁ దెలియుచున్నది. అది సీదోనుకు దాదాపు 50 మైళ్లు ఉత్తరముగా నుండెను.

**సిప్పయి** సపు చూ॥

**సిప్పోరా** (Zipporah = పిచ్చుక). మిద్యానీయుఁడగు యిత్రో కుమార్తె. మోషేకు భార్య యాయెను (నిర్గ 2[21] 4[25,26] 18[2]). ఈమె తన కుమారులకు సున్నతి చేయించుటకు మొదట సమ్మతించలేదు. గాని అందువలన మోషేకు ప్రాణాపాయము సంభవింపఁగా దానిని చేయించెను (4[24-26]). ఆమె మోషేతోకూడ ఐగుప్తుకు వెళ్లనట్లుగా నున్నది (18[1-2]). ఒకవేళ వెళ్లియుండిన పక్షమున 18[1,2] నందలి సంగతులు జరుగక పూర్వమే తిరిగి తన తల్లిగారియింటికి వచ్చియుండును. సంఖ్యా 12[1,2] లో నుదాహరింపఁబడిన కూషదేశపు స్త్రీ ఈమె అయ్యుండవచ్చును (కూషీ చూ॥).

**సిప్పోరు** (Zippor = పిచ్చుక). మోయాబు రాజగు బాలాకుయొక్క తండ్రి (సంఖ్యా 22[2,4,10,17] 23[18] యెహో 24[9] న్యాయా 11[25]).

**సిప్పోను** సెపోను చూ॥

**సిబ్బెకై** (Sibbecai = చిక్కు పడుట?). దావీదు యోధులలో నొకఁడు (II సమూ 21[18] I దిన 11[29] 20[4]). ఇతఁడు దావీదు సేనాధిపతులలోని వాఁడు (27[11]). II సమూ 23[27] లో

నితనికి మెబున్నయి అను మాఱుపేరు గలదు (మెబున్నయి చూ॥).

**సిబ్బోలెతు** షిబ్బోలెతు చూ॥

**సిబ్మా షిబ్మా,** (Sibmah, Sebam = చలి). రూబేను గోత్రికుల కిచ్చిన యొక మోయాబు పట్టణము (సంఖ్యా 32[33]). ఇది మంచి ద్రాక్ష పండ్లకు ప్రసిద్ధికెక్కెను (యెష 16[8,9] యిర్మీ 48[32]). అచ్చటను యెహో 13[19] లోను సిబ్మా యని మాఱు పేరులు గలదు. ఇది హెష్బోను దగ్గర నుండెనుగాని దాని యునికి ఇంక నూటిగాఁ దెలియదు.

**సిబ్యోను** (Zibeon = సింగి). ఎదోము లోని యొక మూలపురుషునకును, అతనివలన నేర్పడిన యొక పురాతన గోత్రమునకును పెట్టిన పేరు. అది 36[2] లోని హివ్వీయుఁడను దానికి మాఱుగా హోరీయుఁడని యుండుట సరియని తోఁచుచున్నది (36[20,24,29]). ఏశావు భార్య యగు అహోలీబామా ఈ గోత్రికు రాలే (అనా చూ॥)

**సిబ్రయీము** (Sibraim = నిరీక్షణ?). యెహెజ్కేలు వివరించినట్లు కుదురుబాటు కలిగిన పిమ్మట పలెస్తీనుకు ఉత్తర సరిహద్దుగానుండు ఒక స్థలము (యెహె 47[16]). దాని యునికి తెలియదు గాని కొందఱది సంఖ్యా 34[9] లో నుండు జిప్రోను అని భావింతురు.

**సిమియు** (Semein). షిమీయను హెబ్రూ పదమునకు గ్రీకు రూపమైయున్నది. క్రీస్తు వంశావళిలో నున్న యొకనిపేరు (లూ 3[26]). ఇతఁడు జెరుబ్బాబెలు కాలమున జీవించినవాఁడు.

**సిరా, సిరాబుడ్డి** (Ink, Ink-horn) పాఁత నిబంధనయందు సిరాయను పదము యిర్మీ 36[18] నందు మాత్రమున్నది. క్రొత్త నిబంధన యందు సిరాయని తెనిఁగించినపదము II కొరి 3[3] II యోహా 12, III యోహా 13 నందు నల్లనిది యని శబ్దార్థమగును. పూర్వీకులు మంచి సిరా గింజల నుండియు ఒక తరహా చేపలనుండియుఁ దీసిరి గాని, అదెట్లు చేసిరో దానినిగూర్చిన సూచనలు లేవు. యెహె 9[2,3,11] లో సిరాబుడ్డి యని తెనిఁగించినపదము సిరాను మాత్రమేగాక కలములనుకూడ ఉంచుటకు వాడిన కొమ్ములను సూచించును. వానిని తమ దట్టీలకు కట్టుకొనెడి వారు.

**సిరాయను బావి** (Sirah, the well of = ఉబుకుచున్న బావి). అబ్నేరు దావీదును విడిచి వెళ్లినప్పుడు, యోవాబు దీనినిగూర్చి విని అతనిని చంపు నిమిత్తము పిలిపింపఁగా, ఆ దూతలు వెళ్లి అబ్నేరును కలిసికొనిన స్థలము (II సమూ 3[26]). ప్రస్తుతము హెబ్రోనుకు మైలున్నర వాయవ్య దిక్కునానుండు అయిన్ సారా (*Ayin Sarah*) యే దీని యునికియై యున్నదనుకొందురు.

**సిరి** (Mammon) ధనమును ఒక దేవతగా నెంచి, దానిని దేవునిని ఒకే సమయమున నారా ధింపలేమని అసలులో వాడిన మమ్మోను అను సిరియక్ మాటను ఈ పదముచే భాషాంతరీక రించిరి (మ 6[24] లూ 16[9,11,13]). కొందఱు మమ్మోను అను పదమును అట్లు అలంకారార్థమను దేవతగాక పూర్వకాలమున సిరియదేశములో నున్న యొక దేవత పేరుగా నెంచవలెనని తలంతురు గాని అట్టి దేవత యుండినట్లేవిధ సూచనలును లేవు.

**సిరియక్ తర్జుమా** భాషాంతరములు చూ॥

**సిరియా** (Syria). ఈ పదము ఇంగ్లీషు బైబిలునందు పాఁత నిబంధనలోనే గాని అసలు భాషలో లేనేలేదు. పాఁత నిబంధనయందు దానికి ప్రతిగా అరాము అను పదము గలదు (అరాము చూ॥). సిరియా యను నీ క్రొత్త నిబంధన పేరు ఉత్తరముననున్న తౌరసు పర్వత ములు యుఫ్రాతు నదినుండి దక్షిణమున ఐగుప్తు వఱకును, పడమరనున్న మధ్యధరా సముద్రము నుండి తూర్పుననున్న యెడారివఱకు వ్యాపించిన దేశము పేరై యున్నది. ఈ దేశములోని వారంద ఱును జాతినిబట్టి భాషనుబట్టి ఒకరితో నొకరు సంబంధమగు జనములైనను, అవి ఎన్నడైనను తమ స్వంత యేర్పాటులవలన ఒక ప్రభుత్వము క్రిందనున్నవారు కారు. దమస్కు, ఫేనీకే, పలెస్తీను, ఫిలిష్తీయ, మోయాబు, అమ్మోను, ఎదోము మొదలగు దేశములన్నియు అష్షూరు వారిచే జయింపఁబడి ఒకటే ప్రభుత్వముం దుంచఁబడిరి. సిరియా అను నీ పదము అష్షూరు

అను మాటనుండి వచ్చినట్లున్నది. వీరికి తరువాత వచ్చిన బబులోనీయులు, గ్రీకులు, రోమనులు దాని నొక్కటే ప్రభుత్వముక్రింద నుంచిరి. మహా అలెక్సందరు చనిపోయిన పిమ్మట నాలుగు భాగములైన అతని రాజ్యమునందు అంతియొకయ ముఖ్యపట్టణముగా నుండిన భాగమే సిరియా రాజ్య మనఁబడెను. దీనియందింకను వేలువేలు దేశము లుండెను. అంతియొకయవారి ప్రభుత్వముకు ఈ దేశము క్రీ॥ ము॥ 300 నుండి రోమావారు దానిని 64 సం॥లో జయించునంతవఱకు లోఁబడి యుండెనుగాని ఐగుప్తీయులు, మక్కబీయులు ఆయా భాగముల నప్పుడప్పుడు అపహరించి వేర్వే ఱుగా నేలుచుండిరి. 64 వ సం॥ లో రోమనులు దీనిని జయించి దీనికి ప్రత్యేకమగు నొక గొర్నరును నియమించిరి. క్రొత్త నిబంధన కాలములో ఈ దేశపు ఆయా భాగములకు ప్రత్యేకమైన యధిపతు లుండినను సిరియా ప్రభుత్వము వారికి వీరు లోఁబడియుండిరని లూ $2^{2}$ నందు సూచన కలదు. క్రీస్తు కీర్తి దీనియం దంతటను వ్యాపించెను (మ $4^{24}$). పౌలు చరిత్రలో సిరియా ఈ ప్రదేశమునకంతటికి పెట్టఁబడిన పేరై యున్నది (కార్య $15^{23,41}$ $18^{18}$ $20^{3}$ $1^{3}$ గల $21^{21}$) మొదటి ప్రపంచ యుద్ధమునకుఁ బిమ్మట 1941 వరకు ఫ్రెంచివారి యధీనమందుండి తరువాత ప్రజాపరిపాలిత రాజ్యముగ ప్రకటించు కొనెను. 1943 నుండి ఫ్రెంచివారు పూర్తిగ దేశము నుండి వైదొలగిరి. (అంతియొకయ, దమస్కు, సురోఫెనికయ, అరాము చూ॥).

**సిలువ (Cross).** సిలువ రూపములు T × † అను మూఁడు రూపములుగ నున్నవి. క్రీస్తు వేయఁబడిన సిలువ మూఁడవ రూపమై నట్లు సాధారణముగా నమకొందురు. దానియెత్తు 9 అడుగులకన్న నెక్కువ యుండదు. దాని నిలువు కొయ్యను సిలువ వేయఁబడిన స్థలములోనే యుంచి, అడ్డకొయ్యనుమాత్రము నేరస్థునిచే ఆ స్థలమునకు మోయించిరని కొందఱి యభిప్రాయము గాని ఆ రెండు కర్రలును కొంచెము బలముగల వాడు మోయఁగలిగినంతకన్న నెక్కువ బరువు గలవి కావు. సిలువ వేయఁబడువారు దానిని సిలువవేయు స్థలమువఱకు మోసికొని వెళ్లవలసి వచ్చెను (మ $27^{32}$ మా $15^{21}$ లూ $23^{26}$ యోహా $19^{17}$). దానిపైన వాఁడు చేసిన నేరమును వ్రాయుటకొక చెక్కను తగిలించిరి (మ $27^{37}$ మా $15^{26}$ లూ $23^{38}$ యోహా $19^{19}$ నేరములు శిక్షలు III చూ॥).

నాలుగవ శతాబ్దములో కణ్స్టంటైను తల్లి యగు హెలీనా యెరూషలేములో మూఁడు సిలువలను కనుగొన్నట్లును, రోగిని బాగుచేయుట వలన నేది క్రీస్తు సిలువయో దానిని గుర్తించి నట్లును ఒక పారంపర్యము గలదు గాని, అది సంఘ చరిత్రకారులైనవారు దానిని గుఱించి యేమియు నుదాహరించలేదు. కావున నమ్మతగి నదిగా నుండలేదు. రోమనువారు ఆ మ్రాను కర్రను ఆయా గుళ్లలో నుంచుచున్నట్లు నమ్మి నను నేరస్థులు వేయఁబడిన సిలువలను ఆదియందు పూజనీయమైన వానినిగా నెంచక అవమానకర మైనవిగా నెంచిరి. కావున వానిని కాపాడక తగలఁబెట్టుచువచ్చిరి. క్రీస్తు సిలువను ఆ రీతిగనే కాపాడియుండరను సంగతి స్పష్టమగుచున్నది.

ఆది క్రైస్తవులు మ్రానుతోఁ జేయఁబడిన సిలువను ముఖ్యమైనదిగా నెంచక సిలువ సూచించు చున్న ప్రేమను స్వార్థత్యాగ బుద్ధిని ముఖ్యమగు వానిగా దలఁచి వానిని సూచించుటకు సిలువను దృష్టాంతముగా నెంచిరి. ఈ విధముగా క్రీస్తు తన సిలువను స్వార్థత్యాగమునకు అలంకారముగా నెంచెను (మ $10^{38}$ $16^{24}$). అపొస్తలులు క్రీస్తు వినయమునకు గుఱుతు అని దానిని గొప్ప జేసిరి (ఫిలి $2^{8}$ హెబ్రీ $12^{2}$). అట్టి నిందలలో పాలివా రగుట గొప్ప ఘనముగా నెంచిరి (గల $6^{14}$). దానిమీఁద క్రీస్తు అర్పించిన అర్పణముద్వారా రక్షణ కలిగినదని వారు చూచి తెలిసికొని దానిని బట్టియే ఘనపఱచిరి (కొలొ $2^{14}$). అది పాప మును తీసివేయుట మాత్రమే గాక మానవులు ఒకరితో నొకరు సమాధానపడు సాధనమై యున్నది ($1^{20}$ ఎఫె $2^{16}$). ఇటుల అది రక్షణ కార్యములలో ముఖ్యమై యుండఁగా, దానిని ప్రకటించుట బోధకుల ముఖ్యపనిగా నున్నది (I కొరి $1^{17-23}$ $2^{2}$ గల $3^{1}$). ఆత్మీయముగా శిష్యులు కూడ లోకవిషయము క్రీస్తుతోపాటు చనిపోయినవారు గనుక వారు కూడ సిలువ వేయఁబడెదరను బోధ గలదు (గల $2^{20}$ $5^{24}$ $6^{14}$ రోమా $6^{6}$).

**సిలోయము** యెరూషలేము A II 3 చూ॥

**సిల్లా** 1. (Zillah = నీడ). లెమెకు ఇద్దరు భార్యలలో నొకతె (ఆది 4[19-22,23]).

2. (Sillah = చువ్వ, బుట్ట). యెరూషలేములోని మిల్లో దగ్గిరనున్న యొక స్థలము (II రాజు 12[20]). దీని యునికి నూటిగాఁ దెలియదు.

**సిల్వాను** సీల చూ॥

**సిస్మాయీ** (Sismai). యూదా వారిలోఁ జేరినవారియం దొకఁడు. ఇతఁడు యెరహ్మెయేలు సంతతివాఁడు (I దిన 2[40]).

## సీ

**సీదోను** (Sidon, Zidon = చేఁపలుపట్టు స్థలము). కనానీయుల పురాతన పట్టణములలో నొక ముఖ్యమైనది. ఫేనికే దేశమునందున్నది. తూరుకు 20 మైళ్లు ఉత్తరముగానుండి దానికన్న ప్రధానమైనదై, రేవు పట్టణముగా నున్నది. క్రీ॥ ము॥ 15 వ శతాబ్దమున ఐగుప్తీయులు దానిని లోపఱచుకొనుటకు ప్రయత్నించినటుల టెల్-ఎల్-అమార్నా శాసనములవలనఁ దెలియుచున్నది. ఈ పట్టణమందుండిన చిత్రపు పనులను గూర్చి క్రీ॥ ము॥ 12 శతాబ్దమున జీవించిన గ్రీకు కవీశ్వరుఁడగు హోమరు (*Homer*) వ్రాసెను. ఇది కనానుదేశమునకు ఉత్తరపు సరిహద్దుగా నుండెను (ఆది 10[19]). జెబూలూను గోత్రపు హద్దులలో నొకటి (49[13]) యై యుండెను గాని దానిని ఆషేరు గోత్రమున కిచ్చిరి. ఆషేరీయులు దాని నెప్పుడైనను లోపఱచుకొనిన జాడలు లేవు (యెహో 19[28] న్యాయా 1[31]). సీదోనీయులు ఇశ్రాయేలీయులను న్యాయాధిపతుల కాలములో బాధపఱచిరి (10[12]). ఇశ్రాయేలీయులు వారి దేవతలగు బయలు (I రాజు 16[31]), అష్తారోతు (11[5-33] II రాజు 23[13]) దేవతలను పూజింప మొదలుబెట్టిరి (న్యాయా 10[6]). యెజెబెలు సీదోను రాజగు ఏత్బయలు కుమార్తెయై యుండెను (I రాజు 16[31]). అందువలన ఇశ్రాయేలీయులలో బయలుపూజ విశేషముగా వ్యాపించెను (16[31-33] 10[18,19, 25-28,40]). రాజుల కాలమునందు సీదోను పట్టణపు ప్రాముఖ్యత గతించి నట్లుగ కనఁబడుచున్నది. అప్పటినుండి కొన్ని శతాబ్దములవఱకు తూరుపట్టణము ఫేనీకే దేశమునందు ప్రధాన పట్టణమైనట్లున్నది. ఆయా దేశముల నాశనమునుగూర్చి యెషయా ప్రవచించినప్పుడు తూరుపట్టణముతో దీనిని చేర్చి ప్రవచించెను (యెష 23[12]). క్రీ॥ ము॥ 701 లో దానిని అష్షూరు చక్రవర్తియగు సన్హెరీబును, 678 లో అతని కుమారుఁడగు ఏసర్హద్దోనును పట్టుకొనిరని అష్షూరు రాతిశాసనముల వలనఁ దెలియుచున్నది. దానిని నెబుకద్నెజరు జయించునని యిర్మీయా ప్రవచించెను (యిర్మీ 27[3,6]). దీనికి కలుగఁబోవు శిక్షలను గుఱించి యెహెజ్కేలు తెలియఁజేసెను (యెహె 28[20-24]). సీదోనీయులు యెరూషలేమును దోచుకొని దాని నివాసులను గ్రీకువారికి దాసులనుగా అమ్మివేసినందున దేవుఁడు వారిని శిక్షించునని యోవేలు ప్రకటించెను (యోవే 3[4-6]). క్రీ॥ ము॥ దాదాపు 527 నందు ఈ పట్టణమును పారసీకులు పట్టుకొనిరి. ఇది పారసీకుల యధీనమందున్న కాలములోనే, యెరూషలేము నందలి దేవాలయమును తిరిగి కట్టుటకు కావలసిన దేవదారు కలపను సప్లయిచేసిరి (ఎజ్రా 3[7]). 333 సం॥ నందు మహా అలెక్సందరునకు తమ పట్టణమును తామే యప్పగించుకొనిరి. 64 సం॥లో అది రోమీయుల వశమయ్యెను.

క్రొత్త నిబంధనకాలమందు క్రీస్తు జేసిన అద్భుతములను జూచుటకు, ఆయన బోధలను వినుటకును సీదోను ప్రాంతములనుండి జనులు వచ్చినట్లు సూచనలు కలవు (మా 3[8] లూ 6[17]). క్రీస్తు ఒకమారు ఆ ప్రాంతములకుఁ బోయెను (మ 15[21] మా 7[24-31]). ఈ పట్టణపు రాయబారులకు మొదటి హేరోదు అగ్రిప్ప ఉపన్యసించెను (కార్య 12[20]). పౌలు ఈ పట్టణము నందు దిగి ఇచ్చటి క్రైస్తవులను దర్శించెను (27[3]).

క్రూసేడులను సిలువ యుద్ధముల కాలమునందీ పట్టణ ప్రాంతములలో కొన్ని పోరాటములు జరిగెను. ఆ పట్టణ మీ మధ్య తురుష్కుల యధీనమందుండినను 1918 లో వారి చేతినుండి విడిపింపఁబడెను (పటము I, E 1).

**సీనాయి** (Sinai = చంద్రదేవతకు సంబంధించినది). సీనాయి ద్వీపకల్పమునందు దక్షిణ

మున నుండెడి యొక పర్వతము. ఎఱ్ఱసముద్రపు ఉత్తర భాగముననున్న రెండు పాయలకు మధ్య నున్నది. సీనాయి పర్వతమునకు హోరేబు అను నామాంతరము గలదు (నిర్గ $3^{1}$ $17^{6}$ $33^{6}$ ద్వితీ $1^{6}$ $4^{10}$). సీనాయి అను పదమును నిర్గ $19^{11}$ $16^{1}$ $24^{16}$ $34^{4}$ లేవీ $25^{1}$ నందు కనుగొనవచ్చును. ఇశ్రాయేలీయులు ఐగుప్తును విడిచిన మూఁడవ మాసమునం దిచ్చటికి వచ్చిరి (నిర్గ $19^{1}$). ఇది కాదేషుకు 11 దినముల ప్రయాణములో నున్నది (ద్వితీ $1^{2}$). ఆ కొండకు దిగువను ఇశ్రాయేలీయుల దండు పేటకు తగిన మైదానముండెను (నిర్గ $19^{2}$). అక్కడనుండి ఆ కొండయొక్క అంచును చేతితో తాకఁగలిగియుండిరి ($19^{12}$). దాని శిఖరము అక్కడికి కనఁబడెను ($19^{16-18,20}$). ఇచ్చటనే దేవుఁడు పది యాజ్ఞలను (20), దేశ సంబంధమగు చట్టములను ($20^{22}$-$24^{8}$) ఇచ్చెను.



సీనాయి కొండ

నిర్గ 20 మొదలు సంఖ్యా 10 వఱకుండు నియమములన్నియు ఇచటనే యేర్పడినట్లున్నది (నిర్గ $24^{12}$ $31^{18}$ $34^{2}$ లేవీ $1^{1}$ $16^{1}$ $25^{1}$ $26^{46}$ సంఖ్యా $1^{1}$ $9^{1}$). యెజెబెలుకు భయపడి పారిపోయిన ఏలీయా ఇచ్చటికి వచ్చెను (I రాజు $19^{8}$). క్రొత్త నిబంధనయందిది అలంకారరీతిగా గల $4^{25}$ లో కనఁబడును. సీనాయిదగ్గర ధర్మశాస్త్ర మియ్యఁబడుటచే అది గలతియ పత్రికలో ధర్మశాస్త్రమును సూచించుటకు వాడఁబడిన అలంకార పదమై యున్నది.

ప్రస్తుతమున సీనాయి పర్వతపు ఉనికినిగూర్చి సందేహములున్నవి. జెబెల్ మూస = మోషే కొండ దాని యునికియని ఆదిక్రైస్తవులలో నొక వదంతి గలదు. అది సీనాయి ద్వీపకల్పమునకు దక్షిణ భాగమునందు రెండు మైళ్లవఱకు వ్యాపించి రెండు శిఖరములు గలిగిన యొక పర్వతమై యున్నది. ఒక శిఖరము 6540 అడుగులును రెండవది 7363 అడుగులును ఎత్తుగలిగి యున్నవి. దానికి తూర్పున కత్రేనమఠము అను మిగుల పురాతనమైన దొకటి నేటివఱకు నున్నది. దీనియందు మిగుల విలువగల పురాతన ప్రతులున్నవి. సీనైటికస్ అను క్రొత్త నిబంధన ప్రతిని 1844, 1859 లో కనుగొనిరి. 1892 నందు పాఁత సిరియక్ సువార్తల ప్రతిని కనుగొనిరి. చాల కాలమునుండి యిదే సీనాయి కొండ యని అనుకొనినను, ఆది క్రైస్తవులలో యుసుబియసను పండితుఁడును, నవీన పండితులలో కొందఱును దీనికి అమడ దూరములో వాయవ్యముగా నుండు జెబెల్ సర్బల్ (*Jebel Serbal*) అనునది దీని యునికి యని తలంచుచున్నారు. మఱికొందఱు సీనాయి ద్వీపకల్పమునకు ఈశాన్యముగా నుండు అరేబియాలో నున్నదని అభిప్రాయపడుచున్నారు

గాని వారిట్లనుకొనుటకు నిర్గ 3[1] లో నుండు వాక్యము తప్ప మఱియే యాధారమును లేదు. అచట నుండువారు మిద్యానీయులై యున్నట్లు ఆ వాక్యమువలనఁ దెలియుచున్నది. మిద్యాను దేశము పలెస్తీనుకు తూర్పుననుండు అరబీ యెడారి యని సాధారణ యభిప్రాయము (మిద్యాను చూ॥). అయితే మిద్యానీయులు తిరుగుడు ప్రజలు గాన మోషేకాలమున వారిలోఁ గొందఱు సీనాయి ద్వీపకల్పములో నివసించి యుండిరని చెప్పుటకు తగిన ఆధారము కలదు (పటము VI, E F 4).

**సీనీయులు** (Sinim). దేవుని ప్రజలు చెదిరి పోయి యుండిన దేశములలో నొకటి. ఈ సీనీయుల దేశములోనుండియు ఆయన ప్రజలు తిరిగి వత్తురు (యెష 49[12]). ఉత్తరమును, పడమరయు ఈ వాక్యమునం దుదాహరింపఁబడుట వలన ఇది పలెస్తీనుకు తూర్పుననైనను దక్షిణమున నైన నుండవలెనని యూహింపఁదగును. దక్షిణమునందున్న సీను (యెహె 30[15,16] సీను చూ॥), సెవేనే (యెహె 29[10] 30[6] సెవేనే చూ॥) అను పేరుల కిది సంబంధించి యున్నందున సీనీయుల దేశము వీనిలో నొకటియని కొందఱి యభిప్రాయము. కొందఱిది తూర్పుగా నున్నదని తలంచుచున్నారు. వారి యభిప్రాయము LXX తర్జుమా ననుసరించును. అచ్చట పారసీక దేశమునుండి వత్తురని తర్జుమాజేసిరి. హిందూకుషు పర్వతముల దగ్గర నుండు సీనా గోత్రపువారని మఱి కొందఱి తలంపు. చీనాదేశమును సూచించు ననుకొను వారును గలరు.

**సీను** (Sin). "ఐగుప్తుకు కోటగా" నుండు ఒక స్థలము (యెహె 30[15,16]). ఐగుప్తుకు ఈశాన్యముగానుండు పెలూసియమ్ (*Pelusium* పటము VI, G 2 చూ॥) అని సాధారణముగా ననుకొందురు. వల్గేటు అనఁబడిన లాటిను తర్జుమాలో దీనిని ఈ పేరుచే భాషాంతరముచేసిరి. ఫిలిష్తీయుల దేశమునుండి వచ్చెడి సేనలు మొదట ఈ కోటను జయింపవలసివచ్చును. ఇది ఐగుప్తుకు ప్రవేశ ద్వారమగుటచేత అష్షూరు చక్రవర్తులగు ఏసర్హద్దోను అష్షూరు బానిపలు అనువారు ఐగుప్తును జయించి, ఈ పట్టణము మీఁద మాత్రము అష్షూరీయు నొకని గొర్నరుగా నియమించినట్లు అష్షూరు రాతి శాసనములవలనఁ దెలియుచున్నది. ప్రస్తుతము దాని యునికి సముద్రమునకు సమీపముగానున్న యొక ఉప్పు పర్రను చూపెదరు గాని అచ్చట పట్టణమున్న పోలికయయే గానరాదు.

**సీను అరణ్యము** (Wilderness of Sin). ఇశ్రాయేలీయులు ఏలీము నుండి రెఫీదీముకు ప్రయాణము చేసినప్పుడు వారు దాటివచ్చిన అరణ్యము (నిర్గ 16[1] 17[1] సంఖ్యా 33[11,12]). సీనాయి ద్వీపకల్పమునకు నైరృతి దిక్కుననున్నది. దాని యునికిని గూర్చిన సూచనలింక యెక్కువ లేవు. ఇశ్రాయేలీయులు తిన్నగా ఐగుప్తునుండి దక్షిణ పలెస్తీనుకు వచ్చిరనువారు గలరు. అట్టి వారు ఇది పలెస్తీను దక్షిణ సరిహద్దులో నున్న దనుకొందురు (అరణ్యము 3 (13) చూ॥).

**సీపు** కాలమానము VI 2 చూ॥

**సీబా** (Ziba). రాజగు సౌలు సేవకులలో నొకఁడు. సౌలు చనిపోయినపిదప స్వతంత్రుఁడై ఆస్తిని స్వాధీనపరచుకొని అనుభవించెను. దావీదు రాజైనపిదప ఇతఁడు రాజాజ్ఞచే సౌలు కుటుంబమును గూర్చిన సమాచారము తెలియఁజేసెను. దావీదా పిమ్మట సౌలు భూములను మెఫీబోషెతున కిప్పించి సీబాను పై విచారణకర్తగా నియమించెను (II సమూ 9[1-11]). అబ్షాలోము తిరుగుబాటునకు పిదప వీఁడు మెఫీబోషెతుపై చాడీలు చెప్పి రాజును నమ్మించి మెఫీబోషెతు భూములన్నియు మరల పొందెను (16[1-4]). గాని దావీదు తిరిగి యెరూషలేమునకు వచ్చి యథార్థము కనుగొని ఆ భూములను సీబాకును మెఫీబోషెతునకును చెరి సగము పంచెను (19[24-30]).

**సీమోను** (Simon).

1. పేతురు చూ॥

2. గారడీవాఁడగు సీమోను చూ॥

3. ఇస్కరియోతు వాఁడనఁబడిన యూదా తండ్రి (యోహా 6[71]). ఇతని స్వగ్రామమునుబట్టి ఇస్కరియోతు అను పేరు కలిగెను.

4. అపొస్తలులలో కనానీయుఁడగు సీమోననఁబడినవాఁడు (మ 10[4] మా 3[18]). మతాభిమాని యగుటచే మతాభిమానియగు సీమోనని పిలిచిరి

(కార్య 1[13]). ఆ యర్థమునే యిచ్చు గ్రీకు పదమైన జెలోతే అని లూ 6[15] నందు వ్రాసిరి. అతనిని గూర్చిన యితర సూచనలు మరేవియును లేవు.

5. క్రీస్తు సహోదరులలో నొకని పేరు (మ 13[55] మా 6[3] ప్రభువుయొక్క సహోదరులు చూ॥).

6. ప్రభువును తన యింటికి పిలిచి ఆయనకు భోజనముచేసిన పరిసయ్యులలో నొకఁడు. అతని యింట నుండఁగా పాపాత్మురాలగు స్త్రీ క్రీస్తును అభిషేకించినప్పుడు ఇతఁడు అది తగిన పనికాదను కొనుచుండఁగా ఆయన ఇతనికి బోధించెను (లూ 7[36-50])

7. బేతనియ నివాసి. అతఁడు కుష్ఠరోగియైన సీమో నఁనబడుటచే పూర్వమందు కుష్ఠరోగియై యుండి ఆయనచే స్వస్థతనొందెనని యూహింపఁ దగును. క్రీస్తును ఘనపఱచుటకు ఇతని యింటనే విందొనర్చిరి (మ 26[6-13] మా 14[3-9] యోహా 12[1-8]). ఆ సమయములో మరియ మార్త లాజరు అను వారచ్చట నుండుటవలన ఈ సీమోను వారికి బంధువుఁడని యనుకొనఁ దగును. ఎట్లయినను అతఁడు వారికి కావలసినవాఁడై యుండెను. కొందఱతఁడు వారి పెంపుడు తండ్రి యని భావింతురు గాని దానికి తగిన యాధారములు లేవు.

8. క్రీస్తు సిలువను మోసినవాఁడు (మ 27[32] లూ 23[26]). ఇతఁడు ఆఫ్రికాలోని కురేనేవాఁడగు యూదుఁడు. ఆదిక్రైస్తవ సంఘస్థులకు బాగుగా తెలిసియుండిన అలెక్సంద్రుకును రూపుకును తండ్రి (మా 15[21]).

9. యొప్పేలోని చర్మకారుఁడు. పేతురుకు దర్శనము కలిగినప్పుడు ఇతని యింటియందే బస జేయుచుండెను (కార్య 9[43] 10[6-17,32]).

10. మక్కబీయు లనఁబడిన సహోదరులలో నొకఁడు (మక్కబీయులు, సుమెయోను చూ॥).

**సీయహా** (Sia, Siaha = సభ). జెరుబ్బాబెలుతో కూడ తిరిగివచ్చిన నెతెనీయుల కుటుంబములలో నొకటి (నెహె 7[47] ఎజ్రా 2[44]).

**సీయోను** (Sion = ఎత్తయిన). ద్వితీ 4[48] లో నిది హెర్మోను కొండకు మాఱుపేరై యున్నది. ఇది యిచట షిర్యోను (3[9]) అను పేరుకు వ్రాఁత పొరబాటని కొందఱి యభిప్రాయము.

**సీయోను, సీయోను కుమార్తె** యెరూషలేము A IV 1 (3), కోట I, చూ॥

**సీయోరు** (Zior = చిన్నది). యూదా మన్యప్రదేశమందలి ఒక యూరు (యెహో 15[54]). అది హెబ్రోనుకు 2 క్రోసులు ఉత్తరముగా నున్న సియాయీరు (*Sia'r*) అని కొందఱనుకొందురు (పటము II, ED).

**సీల, సిల్వాను** (Silas, Silvanus).

సీల, సిల్వాను యనునవి యొకే మనిషి పేర్లని సాధారణముగా నమ్ముదురు. యెరూషలేము లోని సంఘములో ఈయన ముఖ్య సభికుఁడును ప్రవక్తయునై యుండెను. ఈయన రోమా పౌరత్వము గలవాఁడై యుండవచ్చును (కార్య 16[37]). యెరూషలేములో జరిగిన మహాసభ యొక్క తీర్మానములు తెలియఁజేయుటకు అంతియొకయకు రాయభారిగా పంపఁబడెను (కార్య 15). ఆయన యెరూషలేమునకు తిరిగి వచ్చెను గాని త్వరలోనే అంతియొకయకు పోయి నట్లు కనఁబడుచున్నది. ఎందుకనఁగా పౌలు తన రెండవ మిషనెరి ప్రయాణమందు ఈయనను వెంటఁబెట్టుకొని పోయెను. ఫిలిప్పీయిలో పౌలుతో ఖైదులో నుండెను. ఈయన నమ్మకమైన పనివాఁడు. పౌలు ఏథెన్సుయకు వెళ్లినప్పుడు సీలయును తిమోతియును థెస్సలొనీకయలో విడువఁబడిరి. సీల కొరింథులో పౌలును తిరిగి కలిసికొనెను. థెస్సలొనీకయులకు వ్రాయఁబడిన ఉత్తరములో ఆయన పేరు, పౌలు తిమోతితో కూడ చెప్పఁబడియున్నది (I థెస్స 1[1] II థెస్స 1[1]). II కొరి 1[19] లో పౌలు కొరింథులో సీల చేసిన మంచి పని విషయము వ్రాయుచున్నాఁడు.

పౌలు కొరింథు విడిచినప్పుడు సీల ఆయనతో కూడ వెళ్లలేదు. ఆయన తరువాత చేసిన పని విషయమును పేతురుతో కొంత కాలమువఱకు యున్నాఁడనుట గాక మరేమియు నెఱుగము (I పేతు 5[12]). ఆయన పేతురుయొక్క ఉత్తరము తీసికొనివెళ్లెను. ఇది ఆసియలో చెదిరిపోయిన

క్రీస్తువులకు వ్రాయఁబడినందున ఆయన తిరుగుచు సువార్త ప్రకటించి యుండవచ్చును.

E.

**సీవాను** కాలమానము VI 3 చూ॥

**సీసము** లోహములు VI చూ॥

**సీసెరా** (Sisera = వ్యూహము).

1. కనానీయుల రాజగు యాబీనుయొక్క సేనాధిపతి (న్యాయా 4$^{2}$). ఇశ్రాయేలీయుఁడగు బారాకు వీని నోడించెను యుద్ధమున నోడి పారిపోయి యాయేలు గుడారమున గాఢనిద్రా వశుఁడై యుండఁగా యాయేలుచేఁ జంపఁబడెను. న్యాయా 5 నందు యాబీను పేరు సీసెరాకు సంబంధముగా నుపయోగింపఁబడనందున కొందఱు సీసెరా స్వతంత్రుఁడగు రాజని యెంతురు. ఈ రెండు చోట్లను కొన్ని సంగతులు వ్యతిరేకముగా నున్నను ముఖ్యాంశములలో నొకటిగా నే యున్నవి. సీసెరా ఓడిపోవుటను, అతని దుర్మరణమును గూర్చి ఐక్యత గలదు.

2. నెతీనీయుల కుటుంబములలో నొకటి (ఎజ్రా 2$^{53}$ నెహె 7$^{55}$).

H.

**సీహోను** (Sihon = కుంచె). మోషే కాలమునందుండిన అమోరీయుల రాజు. హెష్బోను అతని రాజధాని. అతఁడు మోయాబీయులను అర్నోనువఱకుఁ దఱిమి వారి దేశము నంతవఱకు అపహరించెను (సంఖ్యా 21$^{26-30}$). మిద్యానీయులలోని 5 గోత్రములు అతనికి లోఁబడిరి (యెహో 13$^{21}$). అతని దేశమును దాటిపోవుటకు మోషే అతనిని సెలవడిగినప్పుడు (సంఖ్యా 21$^{21,22}$ ద్వితీ 2$^{26}$). అతఁడొప్పక పోయినందున వారిమీఁద యుద్ధము చేయవలసి వచ్చెను. ఈ యుద్ధమునం దతఁడు ఓడిపోయి (సంఖ్యా 21$^{21-32}$ కీర్త 135$^{11}$) దేశమును కోలుపోయెను. ఇట్లు ఇశ్రాయేలీయులు యబ్బోకు అర్నోను నదుల మధ్య దేశమును ఇశ్రాయేలీయులు జయించుకొనిరి (సంఖ్యా 21$^{24-32}$ ద్వితీ 2$^{36}$ న్యాయా 11$^{22}$). సీహోను దేశమును రూబేనీయులకును గాదీయులకు నిచ్చిరి (సంఖ్యా 32$^{1-4, 33-38}$). సీహోను ఓడిపోవుటను గూర్చిన సూచనలనేకములు గలవు (ద్వితీ 1$^{3}$ 3$^{2-6}$ 4$^{46,47}$ 29$^{7}$ 31$^{4}$ యెహో 2$^{10}$ 9$^{10}$ 12$^{2}$ 13$^{10,21-27}$ I రాజు 4$^{19}$ నెహె 9$^{22}$ కీర్త 136$^{19}$). యిర్మీ 48$^{45}$ లో సీహోను అను పేరును అలంకార రీతిగా హెష్బోనుకు పెట్టిరి.

## సు

**సుంకపు మెట్టు, సుంకము** పన్ను చూ॥

**సుంకరి** (Publican). పన్ను వసూలుచేసిన వారి పేరు. ప్రస్తుతమున మన దేశమందు చౌకీ పన్ను వసూలుచేయుట కెట్లు ప్రభుత్వమువారు వేలము పాడెదరో అట్లే రోమీయులును దేశమందలి పన్నులన్నిఁటిని వసూలుచేయు పనిని గుత్తదారులకిచ్చిరి. వీరు స్థితిమంతులును ఘనులునై యుండిరి అప్పుడప్పుడీ పనిని ఆయా సంఘములవారు (*Companies*) పుచ్చుకొనిరి. వీరు గాని, సంఘములవారు గాని స్వయముగా పన్నులను పోగుచేయక వానిని ఆ దేశమందలి ఆయా భాగములందున్న యితరులకు గుత్తకిచ్చిరి. ఈ గుత్తదారులు తమకు నియమింపఁబడిన దానికన్న నెక్కువ వసూలుచేసి తమ స్వంత ఉపయోగమున కుంచుకొనిరి. దేశప్రభువులు లంచగొండులైన పక్షమున, ఈ గుత్తదారులు చేయు అన్యాయమును పాటింపక వారి అన్యాయ సంపాద్యమునందు తాము పాలిభాగరులై ప్రజలను మఱింత కష్టముల పాలుజేసిరి. ఈ కారణమునుబట్టి సుంకరులకు గొప్ప అపకీర్తి కలిగెను. రోమను వారికి పన్ను చెల్లింపరాదను దురభిమానపరులగు యూదులు పెక్కండ్రుండుటవలన, యూదులలో సుంకరులగువారుండిన పక్షమున వారిని తమ సమాజమందిరములకుఁ జేరనియ్యక వెలివేసి, వారి వృత్తినిబట్టి దుర్మార్గులగువారితో సములనుగా భావించిరి. అందఱిలో మిగుల పాపులగువారిని సూచించుటకు సుంకరులు పాపులు అను సమాసమొకటి వాడుకలోనికి వచ్చెను (మ 9$^{10,11}$ 11$^{19}$ 18$^{17}$ మా 2$^{15,16}$ లూ 7$^{34}$ 15$^{1,2}$) వీరిని వేశ్యలతోఁగలిపి పిలిచినట్లును సూచన గలదు (మ 21$^{31,32}$).

వీరట్టి అపకీర్తి పాలయినను క్రీస్తు వీరిని త్రోసివేయక దేవుని రాజ్యమునఁ జేరుటకు వారికిని పిలుపు కనఁబఱచెను. వారిలో లేవియను మాఱు పేరు గల మత్తయి యనువాఁడాయన అపొస్తలు

లలో నొకఁడుగానుండఁ బిలిచెను (5[27]). ఇతని ద్వారా ఆయన సుంకరులతో స్నేహము కలిగించు కొని వారికి బోధించెను (లూ 5[29]). గలిలయలో మాత్రమేగాక పెరీయలోను ఆయన అట్లు చేసెను (15[1,2]). స్వనీతిపరులగు పరిసయ్యు లాయనను విరోధించుట కిది యొక ముఖ్య కారణమైనను ఆయన వీరికి అందరికన్న రక్షణ మఱియవసర ముగా నున్నదని వదలక ఈ పనియందు దీక్ష వహించియుండెను (మ 9[12,13] మా 2[17] లూ 5[31,32]). సుంకరులలో ననేకులు అట్టి స్నేహభావముచే మాత్రముగాక తమ దుస్థితిని గుర్తించి ప్రేరేపింపఁ బడినవారై దేవుని రాజ్యమునఁ జేరిరి. బాప్తిస్మ మిచ్చు యోహాను నొద్దకు సహ వచ్చి మారు మనస్సు నొందఁగోరిరి (లూ 3[12] 7[29]). జక్కయ్య యను మఱియొకని పేరుకూడ గుణపడి రక్షణ నొందినవారిలో నున్నట్లు మనకుఁ దెలియుచున్నది. కపెర్నహూములో మత్తయి చేసినట్లే యెరికోలో జక్కయ్య పన్ను వసూలుచేసెను (లూ 19[1-10]). వారిలో నింక ననేకులాయనను నమ్మినట్లున్నది (మ 21[31,32] లూ 15[1]). పరిసయ్యుఁడు సుంకరి యనువారిని గూర్చిన ఉపమానమునందు సుంకరి వినయపూర్వకమగు పశ్చాత్తాపమునకు సూచనగా నున్నాఁడు (లూ 18[9-14]). అట్టి పశ్చాత్తప్తులగు హృదయము గలవారే—వారు సుంకరులుగాని ఇతరులుగాని, దేవుని రాజ్యములో చేరుటకు అర్హత గల్గినవారు.

**సుంటుకే** (Syntyche = సౌభాగ్యవతి). ఫిలిప్పీయి సంఘమునందుండిన యొక స్త్రీ (ఫిలి 4[2]). ఎవొదియయు, ఈమెయు ఆ సంఘము నందు పరిచారకురాండ్రై యున్నట్లున్నది.

**సుంపోనియ** సంగీతము 3 (3) (*c*) చూ॥

**సుక్కీయులు** (Sukkiim = గుడిసెలలో నివసించువారు). రాజగు రెహబాము కాలములో ఐగుప్తీయుల రాజగు షీషకు యూదయ దేశము మీఁదకు రాఁగా అతనికి సహాయముచేసిన జనము లలో నొకటి (II దిన 12[3]). వీరు ఐగుప్తు దేశములోనివారు గాని వీరినిగూర్చి దీనికి మంచి సంగతులు తెలియవు. వీరు సుక్కోతు నివాసు లని కొందఱి యభిప్రాయము.

**సుక్కోతు** (Succoth = పర్ణశాలలు). ఈ పేరుగల స్థలములు రెండున్నవి.

1. యొర్దాను నదికి తూర్పునను యబ్బోకు నదికి దక్షిణముగానుండు స్థలము. యాకోబు పద్దనరామునుండి వచ్చునప్పుడు ఇచ్చట దిగి తన పశువులకొరకు పాకలను వేసినందువలన ఈ పేరు కలిగినట్లున్నది (ఆది 33[17]). ఇశ్రాయేలీయులు ఆ దేశమును స్వాధీనపఱచుకొనినప్పుడు దానిని గాదీయుల కిచ్చిరి (యెహో 13[27]). గిద్యోను కాలమున ఈ యూరి పెద్దలు అతని సైనికులకు ఆహారము నిచ్చుటకు నిరాకరించినందున అతఁడు వారిని శిక్షించెను (న్యాయా 8[5-16]). అది యొర్దాను లోయలో సారెతానుకు సమీపముగా నున్నట్లు I రాజు 7[46] వలనఁ దెలియుచున్నది. అది యొర్దానుకు పడమరగా నున్నదని కొందఱి యభిప్రాయము గాని, తూర్పుగానే యున్నట్లు న్యాయా 8[4,5] వలన స్పష్టమగుచున్నది. ప్రస్తుత మచ్చట దాని సూచనలేవియు గానరావు.

2. ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి బయలు దేరినప్పుడు మొట్టమొదట మకాముచేసి స్థలమున (నిర్గ 12[37] సంఖ్యా 33[5]). ఐగుప్తున ఈశాన్య మున రామ్సేస్ సమీపమున నున్నది. అది హెబ్రీ పేరయినను, పూర్వము ఐగుప్తునందుండిన తుకు లేక తుకెమ్ అను పదముయొక్క మారు రూపమని కొందఱి తలంపు.

**సుక్కోతు-బెనోతు** (Succoth-benoth = బెనోతు గుడారములు). షోమ్రోను నాశనమైన పిమ్మట బాబెలువారు ఆ దేశమునందు నివాసము చేయుచుండఁగా అచట నిలుపుకొనిన ఒక దేవత (II రాజు 17[30]). ఇది బాబెలువారి ముఖ్య దేవతయగు మర్దుకు భార్యయని కొందఱెంచు చున్నారు. జర్బనితు (*Zar-Banitu*) అను ఈమె పేరిట్లు సుక్కోతు-బెనోతుగా మాఱి పోయినదని అందురు. మఱికొందఱు లోకము నకు న్యాయాధిపతియగు సుక్కుతు బెనూతి (*Sukkut-benuti*) అను దేవతయని తలంచు చున్నారు. ఈ పేరు శబ్దార్థముబట్టి ఆమో 5[26] నందుండు 'మీ రాజుకు చేయఁబడిన గుడారము' అనునది ఈ దేవతకు సూచనయని మఱి కొందఱి యభిప్రాయము.

**సుఖారు** షెకెము చూ॥

**సుగంధ ద్రవ్యము** గంధవర్గము I 1 చూ॥

**సుగంధ ద్రవ్యములతో శవమును సిద్ధపఱచుట** సమాధి 1 చూ॥

**సుగంధ ద్రవ్యమేళకుడు** గంధవర్గము III చూ॥

**సుగంధ నిర్యాసము** (Tragacanth or Spices). యాకోబు కుమారులు యోసేపునకు కానుకగా దీసికొనిపోయిన వస్తువులలో నొకటి (ఆది 43[11]). 37[25] లోని ఆ యసలు మాటనే గుగ్గిలమని తర్జుమా చేసిరి. అది గుగ్గిలమువంటి సుగంధ ద్రవ్యమై యున్నది (రోగములు చికిత్సలు IV 1 (3) చూ॥).

**సుగంధ వర్గము** గంధవర్గము చూ॥

**సుగంధ సంభారము** గంధవర్గము I చూ॥

**సుడిగాలి** తుఫాను చూ॥

**సుత్తె** వృత్తులు చేతిపనులు I 2 (1) (a) 3 (c); II 1 (1) చూ॥

**సునాద సంవత్సరము** పండుగలు IV చూ॥

**సునాయి** సంగీతము 3 (2) (a) చూ॥

**సున్న** పొల్లు చూ॥

**సున్నతి** (Circumcision). దేవుఁడు అబ్రాహాముతో చేసిన నిబంధనకు సున్నతి సూచనగా నున్నది (ఆది 17[1-10,21]). అతఁడును, అతని సంతానమును అతని యింటనున్న మగవారందఱును దీనిని పొందవలసినదను నియమమున్నది. అతఁడు 99 యేండ్లవాఁడై యుండునప్పుడు తన పరివారములోని పురుషులందఱితో కూడ దీనిని పొందెను (ఆది 17[11-27]). మోషే అన్యురాలిని వివాహమాడినందున తన కుమారులకు దానిని చేయక నిర్లక్ష్య పెట్టినట్లుండెను. గాని దేవుఁడతనికి శిక్షగా గొప్ప జబ్బు కలిగించినందున అతని భార్య స్వయముగా తన కుమారునికి సున్నతి చేసెను (నిర్గ 4[25]). సాధారణముగా తండ్రులే కర్తను చేసెడివారు. ఐగుప్తునందును అరణ్య సంచారమునందును ఇశ్రాయేలీయులు దీని విషయమంత జాగ్రత్తగా నుండినట్లు లేదుగాని వారు కనానులోఁ బ్రవేశింపఁగానే అందఱికి నా కర్మ చేయించిరి (యెహో 5[2-9]). ఇశ్రాయేలీయులతోఁ జేరఁగోరిన యితరు లీ సంస్కారమును పొందవలసిన నియమమున్నది (ఆది 34[14-17,22] నిర్గ 12[48]). క్రీస్తు రాకకు కొంత కాలము పూర్వము ఎదోమీయులును ఇతూరైయవారును దానిని పొందుటకు బలవంత పెట్టఁబడిరని యోసీఫసువలనఁ దెలియుచున్నది (పురా 13. 9. 1; 11. 3). ఐగుప్తీయులు మొదలగు కొన్ని యితర జనాంగముల వారిలోను ఈ యాచారమున్నదని లోకచరిత్రవలనఁ దెలియుచున్నను పలెస్తీను చుట్టుపట్లనున్న జనాంగములలో నిది లేకపోవుటచేత సున్నతి లేనివారని అన్యుల కొక తిరస్కార నామమును పెట్టిరి (ఆది 34[14] న్యాయా 14[3] 15[18] I సమూ 17[26-36] 31[4] II సమూ 1[20] I దిన 10[4] యెహె 28[10] 31[18] 32[19-32]). అదే రీతిగా సున్నతి నొందినవారు అనునది ఇశ్రాయేలీయుల సంఘమున కొక మాఱుపేరై యున్నది (గల 2[8] కొలొ 4[11]). సున్నతి దేవునికి ప్రాణమును ప్రతిష్ఠించుటను సూచించుచు, శరీరేచ్ఛలను త్యజించుటకు గుఱుతుగా నున్నది (రోమా 2[27-29] కొలొ 2[11]). బైబిలునందుదాహరించిన హృదయసున్నతి యను పదము మాఱుమనస్సునకు సమానమగు పదమై యున్నది (ద్వితీ 10[16] 30[6]). హృదయములకు మాత్రమే గాక చెవులనుగూర్చియు ఈ పదము అలంకార రీతిగా నుపయోగింపఁబడెను (కార్య 7[51] భాషాంతరము).

నేటివఱకు సున్నతి యూదులలోను మహమ్మదీయులలోను ఆచరణలో నున్నది. క్రైస్తవులును దాని నవశ్యముగా నాచరింపవలెనని యూదా క్రైస్తవులు వాదించినను (కార్య 15) అది పాత నిబంధన యాచారములలో నొకటియై క్రీస్తు వానిని నెఱవేర్చిన పిమ్మట క్రైస్తవుల కట్టి జోక్యము లేనివానిలో నొకటి యాయెను (గల 3).

**సున్నతి గిరి** (Hill of the foreskins). గిల్గాలుదగ్గర యెహోషువ ఇశ్రాయేలీయుల కందఱికి సున్నతి చేయించి, ఆ స్థలమునకు గిబెయత్-హ-అరలోతు ( = సున్నతిగిరి) అను పేరుపెట్టెను (యెహో 5[3]). ప్రస్తుతమున దాని సూచన లెవ్వియును లేవు.

**సున్నపు రాళ్లు** (Chalk Stones). మెత్తని రాతిని సూచించుటకు వాడిన పదము (యెష 27[9]). దానిని పొడిచేయుట దేవుని శిక్షలకు సూచనగా నున్నది. అది కాల్చఁబడిన సున్నపురాతిని సూచించును. దాని 5[5]లో ఆ పదమునే **గోడ పూఁత** యని తెనిఁగించిరి. ఈ మాటను వాడుటను బట్టి గోడపూఁత యనునది చెక్క సున్నమని తెలిసి కొనవచ్చును.

**సున్నము** (Lime). యజ్ఞవేదికను రాళ్ల తోను సున్నముతోను కట్టవలసిన నియమము గలదు (ద్వితీ 27[2-4]). సున్నపు బట్టీ గొప్ప శిక్షలకు సూచనగా నున్నది (యెష 33[12]). ఎదోమీయులను మోయాబీయులు ద్వేషించి తమ కోపమును కనపఱచుటకు చనిపోయిన ఎదోము రాజు ఎముకలను సహా కాల్చి సున్నము చేసిరి. ఇది వారి మూర్ఖకోపమునకు సూచనగా నున్నది (ఆమో 2[1]). క్రొత్త నిబంధనలో సున్నము వేయుట ముఖ్యముగా వేషధారణలకు అలంకారముగా నున్నది. క్రీస్తు దాని నట్లు వాడెను (మ 23[27]). పౌలుకూడ న్యాయము నన్యాయముగా మార్చిన ప్రధానయాజకుని కా పదమును వాడెను (కార్య 23[3] సున్నపురాళ్లు చూ॥).

**సుమెయోను** షిమ్యోను చూ॥

**సురకూసై** (Syracuse). సిసిలీ ద్వీపమందలి తూర్పు హద్దునందుండు ఒక పట్టణము. రోమీయుల ప్రభుత్వకాలమున మిగుల ప్రసిద్ధి జెందినదై యుండెను. పౌలు మెలీతేనుండి రోమాకు వెళ్లునపుడు ఇచ్చట దిగెనుగాని బోధించినట్లు సూచనలేవియును లేవు (కార్య 28[12] పటము V. B 4).

**సురేకారము** క్షారము చూ॥

**సురోఫెనికయ** (Syrophoenicia). క్రీస్తు సురోఫెనికయ దేశస్థురాలి కుమార్తెను బాగు జేసెను (మా 7[26]). ఇది యామె దేశమును సూచించును. అది సిరియా అను దేశములోని (సిరియా చూ॥) ఫేనీకే అను భాగమునందున్నది. జాతినిబట్టి ఆమె కనానీయురాలు (మ 15[22]); గ్రీకుభాషను మాట్లాడిన హెల్లేనీయురాలు (మా 7[26]). ఇట్లామె దేశమును భాషయు జాతియు తెలియుచున్నవి (ఫేనీకే చూ॥).

**సులిమానిరాయి** రత్నములు 17 చూ॥

**సువర్ణ గోళము** ఆభరణములు 2 చూ॥

**సువర్ణ రత్నము** రత్నములు 18 చూ॥

**సువర్ణ లశునీయము** రత్నములు 19 చూ॥

**సువార్త** (Gospel). మంచి వర్తమాన మని యర్థమిచ్చు పదము. గ్రీకు భాషయందు దీనిని యూయంగెలియన్ (*Euangelion*) అందురు. మహమ్మదీయులు దీని మాఱురూపమగు ఇంజిల్ యను పదమును అదే యర్థముతో వాడెదరు. LXX నందీ పదము మంచి వర్తమానమును దెచ్చినందుల కియ్యఁబడు బహుమానమును సూచించును (II సమూ 4[11]). క్రొత్త నిబంధనలోని మొదటి నాలుగు పుస్తకములు రక్షణవార్తను తెలుపుచున్నందున వానిని సువార్త లందుము గాని ఈ పదము క్రొత్త నిబంధనయందు ఒక పుస్తకమును గాక ఒక వార్తను సూచించుచున్నది. ప్రవక్తయైన యెషయా చేసిన బోధ కీ పేరు రోమా 10[16] నందు పెట్టఁబడియున్నది. ఇది (దేవుని) రాజ్యమునుగూర్చిన సువార్త యనియు (మ 4[23]) రాజ్యసువార్త యనియు (9[35] 24[14]), దేవుని కుమారుఁడైన యేసుక్రీస్తు సువార్త యనియు (మా 1[1]), దేవుని సువార్త యనియు (రోమా 1[1] 15[16] I థెస్స 2[2,8,9] I పేతు 4[17]), దేవుని కృపా సువార్త యనియు (కార్య 20[24]), క్రీస్తుసువార్త యనియు (రోమా 1[16] 15[19] I కొరి 9[12-18] II కొరి 2[12] 4[4] 9[13] 10[14] గల 1[7] ఫిలి 1[27] I థెస్స 3[2] II థెస్స 1[8]), రక్షణసువార్త యనియు (ఎఫె 1[13]), సమాధాన సువార్త యనియు (6[15]) నిత్యసువార్త యనియు (ప్రక 14[6]) ఆయా వాక్యములలో కనఁబడును. పౌలు తాను బోధించిన దానిని నా సువార్త యనియు (రోమా 2[16] 16[25-27]), మా సువార్త యనియు (II కొరి 4[3]) పిలిచెను. ఇతర బోధకులు దానిని మఱియొక రీతిగా బోధించినట్లు ఈ పేరు సూచించుచున్నది (గల 1[6-10]). ఎట్టి విశేషణము లేకయే సువార్త యని మాత్రము ఉదాహరింపఁబడెను (మా 1[15] 8[35] 14[9] 16[15] కార్య 15[7] రోమా 11[28] II కొరి 8[18]). ఈ పదముయొక్క నామవచన రూపము లూకా, సువార్త, హెబ్రీ, యాకోబు, యోహాను, పేతురు యూదా పత్రికలలో కనఁబడదు. క్రీస్తు (మ 4[23]

11$^{5}$ మా 1$^{15}$ లూ 4$^{18}$ 7$^{22}$) అపొస్తలులు (కార్య 16$^{10}$ రోమా 1$^{15}$ 2$^{16}$ I కొరి 9$^{16}$ మొ॥), సువార్తికులు (కార్య 8$^{25}$) సువార్తఁ బ్రకటించినట్లు ఆయా వాక్యములలో చూడవచ్చును. క్రొత్త నిబంధన సువార్త ప్రతులలో మత్తయి మార్కు లూకా యోహాను అను పదములతో చొప్పున అను అర్థమిచ్చు ప్రత్యయమును చేర్చి ఉపయోగించిరే గాని మత్తయి సువార్త మార్కు సువార్త అని వ్రాయలేదు. హతసాక్షియైన యుస్తీను (*Justin*) ఈ పదముతో క్రీ॥ శ॥ 150 సం॥ లోపుగా వ్రాసిన ప్రాఁచీన గ్రంథములలో ఈ నలుగురు వ్రాసిన గ్రంథములను మొదలుపెట్టినట్లు తెలియుచున్నది.

**సువార్తల యనుబంధములు** (Harmonies of the Gospels) క్రీస్తు చరిత్ర నాలుగు గ్రంథములలో నున్నది. వీనిని ఐక్యపఱచి యొక చరిత్రగా వ్రాయుటకు మొదటినుండి యత్నములు చేసిరి. ఒక చరిత్రగా దానిని వ్రాయక నాలుగు సువార్తికులు వ్రాసినదానిని ప్రత్యేకమైన వరుసలలో వ్రాయఁబడిన గ్రంథములు సువార్తల యనుబంధము లనఁబడును. క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమందు తేషియన్ (*Tatian*) వ్రాసిన దియతెస్సరన్ (*Diatessaron* = నాలుగు సువార్తల మూలము) అనునది వీనిలో మిగుల పురాతనమైనది. మూఁడవ శతాబ్దమందు అమ్మోనియస్ (*Ammonius*), నాలుగవ శతాబ్దమందు యుసూబియస్ (*Eusebius*) అట్టివానిని వ్రాసిరి. నవీనకాలమునందు వేర్వేఱు భాషలలో అట్టివానిని సిద్ధపఱచియున్నారు. ట్రాక్టు సొసైటీవారు, బాప్టిస్టు బుక్ డిపో వారును తెలుఁగునందును వాటిని ప్రచురించియున్నారు.

**సువార్తలు** (The Gospels). మత్తయి మార్కు లూకా యోహానను వారు సువార్తలను వ్రాసిరి (ఆయా సువార్తలను చూ॥). వారు వ్రాసిన సువార్తలనుండి యేసుక్రీస్తు చరిత్రనంతటిని దెలిసికొనవచ్చును (యేసుక్రీస్తు చూ॥). ఈ శీర్షక క్రింద మొదటి మూఁడు సువార్తల సంబంధము, యోహాను సువార్తయందలి ప్రత్యేక సంగతులు, సువార్తలు వ్రాయఁబడిన కాలము అను మూఁడు సంగతులను గూర్చి వివరింతుము.

I. మత్తయి మార్కు లూకా సువార్తలకుండు సంబంధము, అది వచ్చినవిధము, ఈ మూఁడు సువార్తల కెక్కువ సంబంధ ముండుటచేత అవి క్రీస్తు చరిత్రను ఏకదృష్టితో చూచునవి యని అర్థమిచ్చు సునప్టిస్టులు (*Synoptists*) అనఁబడును. ఈ మూఁటియందు క్రీస్తు దైవత్వమును గూర్చిన సూచనలుండినను (మా 1$^{2,3}$ 8$^{30}$ 14$^{61,62}$ మొ॥), ఆ సువార్తికులు ముఖ్యముగా ఆయన దైవత్వమునుగూర్చి గాక ఈ లోకమునందుండఁగా ఆయన చేసిన కార్యములను బోధలను వివరించిరి. వా రాయన గలిలయలోఁ జేసిన పనులనేగాని యూదయలోఁ జేసినవానిని వ్రాసియుండలేదు. లూకా గలిలయ చర్యతో పెరీయయందు జరిగిన సంగతులను వ్రాసినను (10$^{1}$-18$^{34}$), వానిని గలిలయ చర్యను వ్రాసిన రీతిగనే వివరించెను. ఈ మూఁడు సువార్తలయందున్న సంతులనుబట్టియే ఆయన యెరూషలేమునకు వెళ్లినది ఒక్కమారే యైనట్లును, ఆ సారే వా రాయనను సిలువవేసినట్లును తెలియుచున్నది. గాని ఆయన యేఁటేఁట పండుగలకు యెరూషలేము వెళ్లినట్లు యోహాను వలన స్పష్టమగుచున్నను వారు చివరి పర్యాయమును గూర్చి మాత్రము ఉదాహరించిరి. వీనిననిఁటినిబట్టి మత్తయి మార్కు లూకా సువార్తలు ఏకవిధముగా వ్రాయఁబడిన సువార్తలని తేటయగును.

ఇట్లుండినను దీనియందు భేదము లెట్లువచ్చినవా యనుదానిని గుఱించి విచారింపవలసి యున్నది. మార్కు క్రీస్తు చేసిన యద్భుతములను వివరముగా వ్రాసెను. మత్తయి అద్భుతములను క్లుప్తముగాను ప్రసంగములను వివరముగాను వ్రాసెను. లూకా అద్భుతములను ప్రసంగములను రెంటిని సమముగా వ్రాసెను. ఇట్లు అనేక విషయములను గూర్చి ముగ్గురు వ్రాసినను వానిలోను కొద్ది గొప్ప తారతమ్యము లగుపడుచున్నవి. అందువలన అవి రచింపఁబడుటను గూర్చి తెలిసికొనవలసి యున్నాము. సాధారణముగా వాని రచనను గుఱించి రెండు అభిప్రాయములను దెల్పెదరు.

1. సువార్తలను వ్రాయక పూర్వము సుమారు 25 లేక 30 సం॥ల వఱకు ఆ సంగతులను నోటితో బోధించిరి. తరువాత వానిని వ్రాయఁబూను

కొనిరి. క్రీస్తు మాటలను నోటితో నెంత నూటిగా చెప్పినను, ఆయన చరిత్రను ఒకటే రీతిగా చెప్పుటకు వీలుపడదను సంగతి సహజమై యున్నది. అందువలన ఆయన చెప్పిన మాటలలో నెక్కువ ఐక్యమున్నట్లు ఈ మూఁడు సువార్తలలో కనఁబడినను, చరిత్రయందు మాత్రము కొద్ది భేదము లుండుట అసందర్భము కాదు. క్రీ॥ శ॥ నందు దాదాపు 60 సం॥ లోగా ఆయా అపొస్తలులు పరలోక గతులగుటనుబట్టి సువార్త కాపాడఁబడునట్లు దానిని వ్రాయఁ బూనుకొనినవారు అప్పటివఱకు నోటితో బోధింపఁబడిన వానిని వ్రాయుటలో నిట్టి స్వల్ప తారతమ్యములు వచ్చుట సహజమని కొందఱి యభిప్రాయమై యున్నది.

2. నోటితో చేయఁబడిన బోధలతోకూడ క్రీస్తు సంగతులను వివరించిన ఆయా పత్రికలును గలవు (లూ $1^{1}$). వీనినికూడ పరిశీలించి వ్రాయుటచే నీ మూఁడు సువార్తలలో తారతమ్యములు వచ్చినవని నవీన పండితులు సాధారణముగా నొప్పుకొందురు. ఇట్లు తలంచువారు అన్నిఁటిలో పురాతన గ్రంథములు రెండుండెననియు, వానిలో నొకటి మనకిప్పుడున్న మార్కు సువార్త లేదా ఆ సువార్తకు ఆధారముగా దానికి సంబంధించియున్న మఱియొక పత్రిక యని యెంచెదరు. అది పేతురు బోధల సంక్షేపమని వారి యభిప్రాయము. రెండవది క్రీస్తు ప్రసంగముల వివరమని యోహాను శిష్యుఁడగు పాపియ (*Papius*) అనువాఁడు వాడినపేరు ననుసరించి దానిని లోగియ (*Logia* = మాటలు) అనుపేరట పిలుతురు. దీనియందున్న ఆయా సంగతులుగాక, యోహాను ప్రసంగములు, క్రీస్తు శోధనలు, కొండమీఁది ప్రసంగము, శతాధిపతి దాసుని స్వస్థపఱచుట, యోహాను శిష్యులను క్రీస్తునొద్దకుఁ బంపుట, శిష్యులకు చేసిన బోధలు, ప్రభువు ప్రార్థన, బయెల్జెబూలని ఆయన నన్నప్పుడు చేసిన బోధ, పరిసయ్యులను గద్దించుట అను సంగతులున్నవి. ఇవి మత్తయి లూకాలలో నున్నవి గాని మార్కులో లేవు. అందు క్రీస్తును సిలువ వేయుట పునరుత్థానమును గూర్చియు ఉండవచ్చును. మత్తయి లూకాలలో నుండి మార్కులో లేని సంగతులు బహుళః దీనిద్వారా వచ్చియుండును. అట్టి పత్రిక నేటివఱకు కాపాడఁబడకపోయినను మత్తయి లూకాలలో నున్న ప్రసంగములు దానినుండి యెత్తిరను కొందురు. ఈ రెంటి యాధారములోను అప్పటివఱకు నోటితో చేయఁబడుచుండిన బోధలను ఆయా పత్రికలలో వ్రాయఁబడిన ప్రత్యేకపు సంగతులను వ్రాయుటవలన ప్రస్తుతమున్న మత్తయి లూకా సువార్తలు వ్రాయఁబడినవి. మత్తయి ఆయా అంశముల ననుసరించి వ్రాసినందువలన మార్కులో నున్న క్రమమును వదలిపెట్టెను. లూకా మొత్తముమీఁద మార్కు ననుసరించినను మధ్యమధ్య ప్రసంగములను అతఁడు వ్రాయని చరిత్రసంగతులను ఉదాహరించెను.

II. యోహాను సువార్తయందలి ప్రత్యేక విషయములు, అవి వచ్చినవిధము: (యోహాను సువార్త చూ॥). మొదటి మూఁడు సువార్తలకును దీనికిని గల భేద మీ దిగువఁజూపఁబడును. యోహాను ముఖ్యముగా యూదయ చర్యను, క్రీస్తు పండుగ సమయములందు యెరూషలేములో చేసిన పనులను, చెప్పిన బోధలను వ్రాసెను. ఇందుచేతనే ఆయన ఒక పస్కాను గుఱించి మాత్రమేగాక $2^{23}$ $6^{4}$ $13^{1}$ లలో నున్నట్లు పస్కాలనుగుఱించి వ్రాసెను. కొన్ని ప్రతులలో నున్నట్లు $5^{1}$ కూడ పస్కా అయిన యెడల ఈ సువార్తయందు నాలుగు పస్కాలను ఆయన ఆచరించినట్లు చెప్పవచ్చును. ఇట్లు ఆయన బహిరంగ పరిచర్య 2½ లేక 3½ సంవత్సరములగును. ఈ యూదయ చర్యను, పండుగుల కాలమునందు యెరూషలేములో జరిగిన వానిని మొదటి ముగ్గురు సువార్తికు లుదాహరింపకున్నను, యూదయవారగు యూదా ఇస్కరియోతు (యోహా $6^{71}$), అరిమతయియ ఊరివాఁడగు యోసేపు (లూ $23^{50}$), మరియమార్తలు ($10^{38-41}$), కుష్ఠరోగియగు సీమోను (మా $14^{3}$), శిష్యులైనట్లు వారు వ్రాసిరి గనుకను, యెరూషలేమువారిని ఆయన యెన్నోమాఱులు చేర్చుకొనవలెనని చెప్పినట్లు మత్తయి వ్రాసెను (మ $23^{37}$) గనుకను వారు వ్రాసినదానిలో యూదయ చరిత్రయు సూచింపఁబడినట్లు చెప్పవచ్చును. ఆయన తాను మెస్సీయయై యున్నట్లు చెప్పక వారే దానిని స్వయముగా కనుగొనవలెనని కోరి

వట్లు మొదటి మూఁడు సువార్తలలో నున్నది (మా $1^{2,3}$ $8^{30}$) గాని ఆయన ధారాళముగా వారికట్లు చెప్పెనని యోహాను సువార్తయందు చూడఁగలము ($1^{29-34,41-49}$ $4^{9}$). సమరయలోను యూదయలోను కొద్దికాలముమాత్రము బోధింప వీలు కలుగుటచేత అచ్చటివారికి తాను మెస్సీయ నని చెప్పుకొనవలసి వచ్చెను. తన దైవత్వమును గూర్చి యోహాను సువార్తలో నున్నంత ధారాళముగా ($5^{19-29}$ $8^{12-59}$ $10^{22-38}$) మొదటి మూఁడు సువార్తలలో లేకున్నను అట్టి సూచనలు వానిలో లేకపోలేదు (మా $2^{2-8}$ మ $5^{17,21,22}$ మా $8^{35}$ $14^{62}$ మ $25^{31-46}$ $11^{28-30}$ లూ $10^{21-24}$ మా $10^{45}$ $14^{24}$). యోహాను క్రీస్తును విరోధించినవారికి వ్రాయవలసి వచ్చుటచేత పై నుదాహరించిన భేదమువచ్చుట సహజమై యున్నది.

ఐదువేలమందికి ఆహారము పెట్టుట సముద్రము మీఁద నడుచుట అను వానినిగాక యితర సువార్తికులు వ్రాసినవానిని యోహాను వ్రాయలేదు. వానినైనను జీవాహారమును గూర్చిన ప్రసంగమునకు సంబంధముగా వ్రాసెను. అతఁడు వ్రాసిన బోధలును తక్కిన సువార్తికులు వ్రాయ నటువంటివై యున్నవి ఆదరణ కర్తనుగూర్చిన బోధను లూకా కొద్దిగా సూచించినను (లూ $24^{49}$ కార్య $1^{5}$), యోహాను బహు వివరముగా వ్రాసెను (యోహా 14-17). ఈ భేదములన్నిఁటినిబట్టి అలెక్సంద్రియవాఁడగు క్లెమెంతు చెప్పినట్లు క్రీస్తు చర్యలను తక్కిన సువార్తికులు వ్రాసిరి గనుక యోహాను వానిని తాను మరల వ్రాయక వాని అంతరార్థములను వ్రాసెను. మత్తయి మార్కు లూకాలు వ్రాసినవానియందు లోపించిన సంగతులను యోహాను పూర్తిచేసెనని పురాతనకాలమునుండి యున్న యొక పారంపర్యమునెత్తి యుసేబియసు అను చరిత్రకారుఁడు వ్రాసెను. యోహాను క్రీస్తుతో గొప్ప సహవాసము చేయుటచేతను చాల వృద్ధుఁడగువఱకు జీవించినందున ఆయన సంగతులను మఱింత లోతుగా అనుభవించుకొనుటచేతను ఇంత గంభీరములగు ఆత్మీయబోధలను వ్రాసెనని తెలిసికొనుట యుక్తము.

III. సువార్తలు వ్రాయఁబడిన కాలము. అన్నిఁటికన్న చివర వ్రాయఁబడినదగు యోహాను సువార్త క్రీ॥ శ॥ 100 సం॥ నకు లోపుగనే వ్రాయఁబడెనని చూచి యుంటిమి (యోహాను సువార్త 2 చూ॥). లూకా సువార్త 80 సం॥ లోఁగాను మత్తయి మార్కు సువార్తలు 66 సం॥ లోఁగాను వ్రాయఁబడినట్లు అందఱును ఒప్పుకొందురు. క్రీ॥ శ॥ 120 సం॥ లోఁగా హతసాక్షియైన యుస్తీను వ్రాసిన వ్రాఁతలలో సువార్తలన్నిఁటిని గూర్చియు, యోహాను శిష్యులలో పాపియ, పాలికార్పులు వ్రాసినవానిలో మార్కు యోహాను సువార్తలను గూర్చియు తేటయైన సూచనలగుపడుచున్నవి. క్రీ॥ శ॥ 160 సం॥ నందు తేషియన్ (*Tatian*) అనువాఁడు నాలుగు సువార్తలను ఏకచరిత్రగా చేర్చెను. వీని రచననుగూర్చి ఆ కాలమునందున్న విరోధులు ఏమియు ఆక్షేపించియుండలేదు. వీని నన్నిఁటిని బట్టి, క్రీస్తునుగూర్చి యివి బోధించెడి సంగతులు నమ్మఁదగినవని నిస్సందేహముగా చెప్పవచ్చును.

**సువార్తికుడు** (Evangelist = మంచి వర్తమానము ప్రకటించువాఁడు). క్రైస్తవ సువర్తమానమును తెలుపు సందర్భమున క్రొత్త నిబంధనయందు మూఁడుసార్లు కనఁబడు పదము (కార్య $21^{8}$ ఎఫె $4^{11}$ II తిమో $4^{5}$).

ఈ పదముయొక్క అసలు అర్థము కార్య $21^{8}$ నందున్నది. ఏడుగురు పరిచారకులలో నొకఁడగు ఫిలిప్పు ($6^{1-6}$) ఇక్కడ సువార్తికుఁడని పిలువఁబడెను ($21^{8}$). ఈ బిరుదాయనకు పెట్టఁబడినందుకు కారణములేక పోలేదు. స్తెఫను చంపఁబడిన వెంటనే ఆయన యెరూషలేమునుండి బయలుదేరి సమరయలోను అరణ్యములోను అజోతు కైసరయలకు మధ్యనున్న పట్టణములలో సువార్త ప్రకటించి, బాప్తిస్మ మిచ్చినందుచేత ($8^{4,5,12,25,35,40}$). ఆ బిరుదునకు పాత్రుఁడయ్యెను. మొట్టమొదటి సువార్తికుఁడగు నితఁడు క్రీస్తును గుఱించి వినని తావులలో ఆయన సువార్తను ప్రకటించిన క్రైస్తవ మిషనేరి యయ్యెను.

ఆకాశమండలము లన్నిఁటికంటె మఱిపైకి ఆరోహణమైనవాఁడగు క్రీస్తు అపొస్తలులను ప్రవక్తలను సువార్తికులను కాపరులను ఉపదేశకు

లను నియమించెనని ఎఫె $4^{11}$ వలనఁ దెలియుచున్నది. పైన చెప్పఁబడిన యైదు పేరులును మత సంబంధమైన అయిదు ప్రత్యేక ఉద్యోగములకు చెందునని చెప్పుట అసంభవము. అనఁగా ఆది సంఘమున కాపరులును, వారికి వేఱైన తరగతివారగు ఉపదేశకులు నుండిరని తలంచుటకు ఆస్పదములేదు. పౌలు అపొస్తలత్వమును వహించుకొనుచుండఁగా సువార్తికులలో ముఖ్యుఁడును క్రైస్తవోపదేశకులలో పెద్దవాఁడు నైనట్లుండెను. అందువలన సువార్తికుఁడైన వాఁడు ఒక ప్రత్యేకమగు ఉద్యోగస్థుఁడుగాక అపొస్తలులకును ప్రవక్తలకును కలిగిన గొప్పవరములు లేకుండనే, ఉపదేశించుట ప్రత్యేకవరమునుగాని సంఘ కాపరికిగల ఆసక్తిగాని లేకపోయినను ఫిలిప్పువలె ఒకచోటనుండి మఱియొకచోటికి పోవుచు రక్షింప శక్తిగల సువర్తమానమును ప్రకటించువాఁడని తీర్మానించవలసి యున్నాము.

సువార్తికుఁడు సంఘమందొక యుద్యోగమునుగాక ప్రత్యేకమగు పనిచేసినవాఁడైనట్లు II తిమో $4^{5}$ వలన రుజావు పర్చఁబడుచున్నది. తిమోతి సువార్తికుని పని చేయుటకును, బుద్ధి చెప్పుటకును హితబోధ చేయుటకును ప్రేరేపించఁబడెను ($4^{2-3}$). ఈ ప్రేరేపణవలన అతఁడు సంచరించు మిషనేరియై యుండుటయే గాక నిలుకడగా నుండు సంఘాధ్యక్షుఁడుగాను ఉపదేశకుఁడుగా నుండెనన్నుటకే సందేహమునులేదు. అతఁడు తన యౌవనకాలమందు పౌలుతోటి పనివాఁడై యుండి ఆ సంచారములయందు సువార్తికుఁడుగా నుండెను (కార్య $16^{1}$ $19^{22}$ $20^{4}$ రోమా $16^{21}$). సువార్తికుఁడైనవాఁడు సంఘమందును, వెలుపలను క్రీస్తుయొక్క నమ్మకమైన సేవకుఁడుగా నుండి తన మందయొక్క గుణలక్షణములను కనిపెట్టుచు, స్థిరమైన సిద్ధాంతములను నేర్పుట మాత్రమేగాక, ఆయనయొక్క కృపా వర్తమానమును వెలుపలివారికిఁ జెప్పి సంఘములోనికిఁ జేర్చుటలో తన సేవయొక్క ఫలితమును దృఢపఱచుటకు అవకాశముగలిగి యున్నవాఁడని పై వాక్యములవలనఁ దెలియుచున్నది.

మొదటి శతాబ్దములలో నాలుగు సువార్తలను వ్రాసినవారికి సువార్తికులను పేరు పెట్టఁబడలేదు. ఆ పేరు మూఁడవ శతాబ్దమున వారి విషయము వాడుకలోనికి వచ్చినది (సువార్త, సువార్తలు చూ॥). **H.**

# సూ

**సూచకక్రియలు** అద్భుతములు చూ॥

**సూచనలు** (Signs). సాధారణమైనదిగాని, అద్భుతముగాని, ఏది దేవునివాక్యమును స్థిరపఱచుటకు నిదర్శనముగా నుండునో అది సూచన యని యెంతురు. ఇంద్రధనస్సు దేవుఁడు నోవహుతో జేసిన నిబంధనకు గుఱుతుగానున్నది (ఆది $9^{12}$). సున్నతి దేవుఁ డబ్రాహాముతో జేసిన వాగ్దానమునకు సూచనయై యున్నది ($17^{11}$). ఐగుప్తులో కలిగిన తెగుళ్లు దేవుఁ డిశ్రాయేలీయులకు తోడుగా నున్నట్లు నిదర్శనములుగా నున్నవి (నిర్గ $10^{1}$). దేవుఁడు తాను చెప్పిన చొప్పున జరుగుననుదానికి గుఱుతుగా గిద్యోనుకు సూచనలను గ్రహించెను (న్యాయా $6^{17}$). సమూయేలు మాట నెఱవేఱుననుటకు సౌలుకును సూచనలను గ్రహింపఁబడెను (I సమూ $10^{7}$). ప్రవక్తలు తమ మాటలను స్థిరపఱచుటకు ఈ విధముగా సూచనలను వాడిరి (యెష $7^{14}$ $38^{7}$ యిర్మీ $44^{29}$ యెహె $14^{8}$). ఇట్టి సూచనలు అద్భుతములుకాక సాధారణ విషయములుగా నుండవచ్చును (I సమూ $2^{34}$ యెష $8^{18}$ $20^{3}$). క్రీస్తు కాలమునందు యూదులు ఆయన నిట్టి సూచనలనడుగుచుండిరి (మ $12^{38}$ $16^{1}$ యోహా $4^{48}$ I కొరి $1^{22}$). ఇట్లడిగినవారిని క్రీస్తు గద్దించెను. బాప్తిస్మమిచ్చు యోహాను సూచనలను చూపనట్లు యోహా $10^{41}$ వలనఁ దెలియును. క్రీస్తు కాలముననున్న తరమువారికి యోనా సూచనగాక మఱియొకటి లేదని క్రీస్తు చెప్పెను (మ $12^{39}$). గొల్లలు క్రీస్తును కనుగొనుటకు పొత్తిగుడ్డలు వారికి ఆనవాలుగా నుండెను (లూ $2^{12}$). క్రీస్తు వివాదాస్పదమైన గుఱుతుగా నుండునని సుమెయోను అనెను (లూ $2^{34}$). యోహాను సువార్తలో క్రీస్తు అద్భుతములు సాధారణము సూచకక్రియలనఁబడెను. (యోహా $3^{2}$ $4^{54}$ $6^{2}$ $9^{6,13}$ $15^{12}$ II కొరి $12^{12}$). అంత్యదినము వచ్చుననుటకు సూచనలు ముందుగా కలుగును (మ $24^{30}$ లూ $21^{25}$ II థెస్స $2^{9}$).

ఇట్టి సూచనలు కొన్ని సాతానుశక్తిచే కలిగి ప్రజలను మోసపుచ్చును (ప్రక 12[1] 13[13]). సూచనలను నమ్మవలెనని క్రీస్తు బోధించినను (యోహా 6[26]), వానిని జూడకపోయినను నమ్మని వారిని ఆయన గద్దించెను (4[48] అద్భుతములు, సంఖ్యలు, గురుతులు చూ॥).

**సూదిబెజ్జము** (Needle's Eye). ధనమును ప్రేమించువారు దేవుని రాజ్యములో ప్రవేశించుట యెట్టి యసాధ్యకృత్యమో దానిని ఈ మాటచే క్రీస్తు సూచించెను (మ 19[24]=మా 10[25]=లూ 18[25]). కోటల ముఖ్యద్వారము మూసియున్నను మనుష్యులలోపలికి జేరునట్లు దాని యందుండు ఒక చిన్నతలుపును సూదిబెజ్జమను ఈ మాట సూచించునని కొందఱి యభిప్రాయము గాని అట్లనుకొనవలసిన యవసరములేదు. ఇది అన్నిటిలో చిన్నరంధ్రమగు సూదిబెజ్జమునే సూచించుచు సామెతరీతిగా చెప్పఁబడినది.

**సూపు** (Zuph = తేనెతుట్టె).

1. సమూయేలు పూర్వికులలో నొకఁడు (I దిన 6[35]). అతడు కహాతు తెగలోనివాఁడు.

2. ఒక ప్రదేశపుపేరు (I సమూ 9[5]). సూపుసంతతివా రచ్చట నివసించుటవలన ఈ పేరు దానికి కలిగియుండవచ్చును. I సమూ 1[1] లో నుండు రామతయీమ్సోఫీము (రామతయిమ్+సోఫీము) అను పేరులోకూడ ఈ పదము గుప్తమై యున్నట్లున్నది.

**సూయ** (Suah = చెత్త). ఆషేరు సంతతిలో నొకఁడు (I దిన 7[36]).

**సూయారు** (Zuar = చిన్నతనము). ఇశ్రాయేలీయులు అరణ్యమున నుండఁగా ఇశ్శాఖారీయులకు పెద్దగా నున్న నతనయేలుకు తండ్రి (సంఖ్యా 1[8] 2[5] 7[18-23] 10[15]).

**సూరీయేలు** (Zuriel = దేవుఁడు బండయై యున్నాఁడు). ఇశ్రాయేలీయులు అరణ్యములో నుండఁగా మెరారీ తెగలోని లేవీయులకు ప్రధానిగా నున్నవాఁడు (సంఖ్యా 3[35]).

**సూరీషద్దాయి** (Zurishaddai = సర్వశక్తుఁడు బండయై యున్నాఁడు). ఇశ్రాయేలీయులు అరణ్యములో నుండఁగా షిమ్యోను గోత్రికులకు ప్రధానిగా నున్న షెలూమీయేలు తండ్రి (సంఖ్యా 1[6] 2[12] 7[36-41] 10[19]).

**సూరు**

I. (Sur). యెరూషలేము ద్వారములలో నొకటి (II రాజు 11[6] యెరూష A V 2 (16) చూ॥).

II. (Zur = బండ).

1. మోషేకాలమునందు ఇశ్రాయేలీయులచే నోడింపఁబడి హతమయిన మిద్యానురాజు (సంఖ్యా 25[15] 31[8] యెహో 13[21]).

2. గిబోనులోనున్న యొక మిద్యానీయుఁడు. ఇతని కుటుంబము యెరూషలేములో నివసించెను (I దిన 8[30] 9[36]).

**సూర్తిసు** (Syrtes or Quick Sands). ఉత్తర ఆఫ్రికాలోని త్రిపొలికి తూర్పుగా నుండు అపాయకరమైన ఒక సముద్రభాగపు పేరు. దొంగయిసుకవలన ఓడలు అచట చిక్కుపడి బద్ధలగుట సర్వసాధారణమైన విషయము కావున పౌలు వెళ్లుచున్న ఓడను నడిపినవారు దానిలో చిక్కుకొనకుండునట్లు విశేష యత్నములు చేసిరి (కార్య 27[17]).

**సూర్యకాంతము** రత్నములు 27 చూ॥

**సూర్యపట్టణము, నాశనపురము** (The City of Destruction or Heres or Sun). అంత్యకాలమునందు ఐగుప్తులోనుండఁబోవు ఐదు పట్టణములలో నొకటి (యెష 19[18]). భాషాంతరము హెబ్రీభాషయందు నాశనము, సూర్యుఁడు అను పదములు చాలమట్టున కొక్కటే రూపముగలవిగా నుండుటచేత ఇంగ్లీషు బైబిలునందున్నట్లు కొందఱు దీనిని నాశనపురమని భాషాంతరము చేయుదురు. LXX లో దీనిని నీతిపట్టణమని తర్జుమాచేసిరి. సూర్యపట్టణమని భాషాంతరము చేసినయెడల, ఇది ఓనుకు మఱియొక పేరగును (ఓను 2 చూ॥).

**సూర్యబింబ భూషణము** ఆభరణములు 13 చూ॥

**సూర్యుడు** (Sun). పగటినేలుటకు దేవుఁడు సృజించిన పెద్దజ్యోతి (ఆది 1[16] కీర్త 74[16] 136[8]). ఆయనే దానిని నియమించి సమస్త జీవరాసులపై

ఉదయింపఁజేయుచున్నాఁడు (యిర్మీ 31[35] మ 5[45]). దాని రశ్మివలన ప్రతిది మొలచి పండును (ద్వితీ 33[14] II సమూ 23[4]). మొలచినది దానికాకచే ఎండిపోవును (యోనా 4[8]). సూర్యుఁడు పెండ్లికుమారునికి పోల్చఁబడి, ఉల్లాసముతో పరుగెత్తునట్లు సూచింపఁబడినది (కీర్త 19[4-6]). అకాల మరణము నొందెడివారు మధ్యాహ్నమం దస్తమించు సూర్యుని పోలినవారని దృష్టాంతపఱచఁబడెను (యిర్మీ 15[9] ఆమో 8[9] మీకా 3[6]). పలెస్తీను చుట్టునున్న అన్యులు సూర్యునారాధించిరి. ఫేనీకేవారు సూర్య దేవతకు బయలనియు, అష్షూరీయులు షామసనియు ఐగుప్తీయులు రా అనియు పేర్లు పెట్టిరి. ఈ యారాధనెంత ఖండితముగా నిషేధింపఁబడినను (నిర్గ 20[4]). ఇశ్రాయేలీయులను దీనిలో పడనై యుండినట్లు చూడవచ్చును (II రాజు 21[5] 23[5-11]). సూర్యుని తట్టు చూచి ముద్దుపెట్టుకొనుట ఆ యారాధనలో నొక విశేషమై యుండెను (యోబు 31[26,27]). సూర్యుఁడు కనఁబడక చీకఁటి క్రమ్ముట గొప్ప విపత్తుకు సూచనగా భావించిరి (యోవే 2[31]=కార్య 2[20] యెష 13[10]). అది లోకాంతమున కొక గుఱుతుగా నుండెను.

సూర్యుఁడు అయ్యాలోను లోయలో నిలుచుట (యెహో 10[12]), ఎండ గడియారముమీఁద దిగిన నీడ పదిమెట్లుపైకి యెక్కుట (యెష 38[8]) అనునవి బైబిలునందు సూర్యునికి సంబంధముగా నుదాహరింపఁబడిన రెండు వింతలు. యెహోషువలో నున్నది మిగుల పురాతన కావ్యమునుండి యెత్తఁబడినది కావున దానికి అలంకారార్థమును చెప్పవలెనని అనేకుల అభిప్రాయము. జనులు తమ శత్రువులమీఁద పగతీర్చుకొనువఱకు సూర్యుఁడు నిలిచెననఁగా, ఆ దినమునందే సంపూర్ణ జయము కలుగునట్లు యుద్ధముచేసిరని దానిని గ్రహించుకొందురు. దేవుఁడెన్నటికిని అనావసరములగు అద్భుతములను జేయఁడు. కావున యెష 38[8] లో నున్నట్లు నీడ 10 మెట్లు ఎక్కుట సూర్యకిరణములను త్రిప్పుటచేతనే కలిగినదిగాని సూర్య ప్రదక్షిణమందేమి మార్పు కలుగలేదని అనేకుల అభిప్రాయము.

**సూసీ** (Susi=గుర్రపురౌతు). మనష్షే గోత్రికులలో నొకఁడు (సంఖ్యా 13[11]).

## సృ

**సృష్టి** (Creation). బైబిలునందు సృష్టిని గూర్చిన సూచనలు వేర్వేఱు వాక్యములలో నుండినను (యోబు 26[38] కీర్త 24[2] 104 ఆమో 4[13] హెబ్రీ 11[3] మొ॥), సృష్టినిగూర్చిన వివరము ముఖ్యముగా ఆది 1, 2 లలో నున్నది. నవీన శాస్త్రజ్ఞులు ఇవి ఇద్దఱు వ్రాసిన వివరములని యెంచుచున్నారు. వానిలో నొకటి ఆది 1,2[4] (*a*) లోను రెండవది 2[4] (*b*)—2[25] నందున్నదని యనుకొందురు. బబులోనువారి వేదములలోను సృష్టినిగూర్చిన వివరముగలదు. దీనికిని ఆది కాండమందున్న వివరమునకును కొంత సంబంధమున్నది.

ఈ రెండింటిలోను, సృష్టింపఁబడిన పంచభూతములు (ఆది 1[1]) నిరాకారముగా నున్నవి; సూర్యచంద్ర నక్షత్రముల సృష్టికి పూర్వమే వెలుఁగు సృష్టించఁబడెను (1[8]); మానవసృష్టి చివరిదై యున్నది. ఇట్టి సంబంధములుండినను, దేవునిగూర్చిన బోధలలో గొప్ప భేదముగలదు. బబులోను వారిదేవత ప్రకృతికి సంబంధించిన దానిని విభాగించుటచేత సమస్తమును సృజించెనని వారి శాస్త్రములయందున్నది. గాని, సర్వశక్తిమంతుఁడగు ఏకదేవుఁడు సమస్తమును తన వాక్కుచేతనే సృజించెనని ఆదికాండమునందు కనఁబడుచున్నది.

ఆదికాండమునందున్న వివరము సృష్టి సంగతుల నన్నిఁటిని స్పష్టముగాఁ దెలుపుచున్న దనుకొనరాదు. అందుదాహరింపఁబడిన దినములు యుగములని సాధారణముగా ననుకొనుచున్నారు. మొదట వెలుఁగును, తరువాత జలములు ఆరిన నేలను వేఱుపఱచుటయు, అటు తరువాత వృక్షాదులును పిదప సూర్యచంద్ర నక్షత్రాదులును, అటుపిదప చేప పక్షులరాసులును, చివరకు మృగములును మనుష్యుఁడును సృజింపఁబడినట్లే వివరమునందున్నది. ఈ క్రమము మొత్తముమీఁద సృష్టిక్రమము ననుసరించును. ఇది యంతయు

దేవునిపనియై సృష్టి వివరములన్నిఁటిలో మిగుల దివ్యముగా నున్నది.

హిందూదేశపు సృష్టిక్రమములలో ప్రతిది 'నవస్తు నోవస్తు సిద్ధిః' అను మూలవాక్యముపై నాధారపడియున్నవి. అద్వైత బోధకులు ఈ ప్రపంచము మాయయని బోధింతురు. ఆత్మయు ప్రకృతియు అనాదినుండియున్నవని ద్వైతులు చెప్పుచున్నారు. బైబిలుబోధ ఈ రెంటికిని వేఱుగా నున్నది. ఆత్మస్వరూపియగు భగవంతుఁడు ఒక్కఁడే అనాదినుండి స్వయంభువుఁడై యున్నాఁడని అద్వైతులవలె బోధించినను, ఆయన తన మాటచేతనే తనకు వేఱైయున్న ఈ ప్రపంచమును సృజించెనని స్పష్టముగాఁ దెలుపుచున్నది అది ఆయన కార్యమై ఆయన మహిమను చూపుచున్నదిగాని అదియు దేవుఁడనిగాని, దేవునితత్వమనిగాని యెంతమాత్రమును చెప్పుటలేదు. ఇది దేవునిచే సృష్టింపఁబడి, ఆయనకు లోనయి యున్నది గాన ఎంత గంభీరమైనదైనను (కీర్త $19^{1}$ రోమా $1^{20}$) దేవుఁడు దానికన్న మహాత్మ్యముగలవాఁడై, తా నొక్కఁడే అన్నిఁటికి అధిపతిగా నున్నాఁడని బైబిలు బోధించుచున్నది (మానవుడు చూ॥).

సృష్టియనుపదము ఆత్మీయపనినిగూడ సూచించును (II కొరి $5^{17}$). క్రీస్తు యేసునందున్న వారికి మార్పుకలుగును. అది మానవులపనిగాక దేవుని పనియైయున్నది గాన, అది నూతన సృష్టి యనఁబడును.

## సె

**సెకాకా** (Secacah = కంచె). యూదా అరణ్యములోని యొక గ్రామము (యెహో $15^{61}$). అది మృతసముద్రమునకు పడమరగానున్న అరణ్య ప్రదేశమందున్నది గాని, దాని యునికి నూటిగాఁ దెలియదు.

**సెకుందు** (Secundus = రెండవవాఁడు). థెస్సలోనీక పట్టణస్థుఁడు (కార్య $20^{4}$). పౌలు మూఁడవ ప్రయాణమునుండి తిరిగి యెరూషలేమునకు వెళ్లఁగా ఇతఁడు ఇతరులతోఁ గలసి పౌలు వెంట వెళ్లెను. ఇతఁడు సంఘపువారికి చందా నప్పగించుటకు నియమింపఁబడిన వారిలో నొకఁడై యుండవచ్చును (II కొరి $8^{23}$).

**సెగూబు** (Segub = ఎత్తఁబడినవాఁడు).

1. యెరికో పట్టణమును తిరిగి కట్టిన హీయేలు అను నతని కొడుకులలో చిన్నవాఁడు. యెహోషువ శాపప్రకారము (యెహో $6^{26}$) దాని ద్వారములు నిలిపినప్పుడు ఇతఁడు చనిపోయెను, గాని ఇతఁడప్పుడు ఆ శాప నివారణార్థము నరబలిగా అర్పింపఁబడియుండ వచ్చునని కొందఱి యభిప్రాయము (I రాజు $16^{34}$).

2. యూదా సంబంధుఁడగు హెస్రోను సంతతివారిలో నొకఁడు (I దిన $2^{21,22}$).

**సెతూరు** (Sethur = మఱుగైన). మోషే పంపిన వేగులవారిలో నొకఁడు. ఆషేరు గోత్ర ప్రతినిధియై యుండెను (సంఖ్యా $13^{13}$).

**సెదాదు** (Zedad). పలెస్తీను ఉత్తర హద్దు దగ్గరనుండు నొక స్థలము (సంఖ్యా $34^{8}$ యెహె $47^{15}$). దీని యునికి నూటిగాఁ దెలియదు.

**సెనాను** జయనాను చూ॥

**సెనూయా** (Senuah = ముండ్లుగల).

1. హోదవ్యా యను బెన్యామీనీయుని తండ్రి (I దిన $9^{7}$).

2. యూదా అను నొకని తండ్రి (నెహె $11^{9}$). హెబ్రీభాషలో ఈ పదము హస్సెనూయా యని యున్నది.

**సెనే** (Seneh = ముల్లు). యోనాతాను ఫిలిష్తీయులను జయించిన మిక్మషు దగ్గరనుండు కనమలోని రెండు నూదిగట్టులలో నొకటి (I సమూ $14^{4}$ మిక్మషు, బొస్సేసు చూ॥).

**సెపర్వయిము, సెపర్వయీములు** (Sepharvaim, Sephar).

1. అష్షూరు చక్రవర్తిచే పట్టఁబడిన పట్టణములలో నొకటి (II రాజు $18^{34}$ యెష $36^{19}$ II రాజు $19^{13}$=యెష $37^{13}$). అతనిచే జయింపఁబడిన పట్టణముల జాబితావలన ఇది సిరియాలో నున్నట్లు ఊహింపఁదగును. అట్లయినయెడల ఇది అష్షూరువారి రాతి శాసనములలో కనఁబడు షబరయీను (*Shabarain*) కు మాఱురూప మనవచ్చును. యెహె $47^{16}$ నందు సిబ్రయీము కూడ ఇదే కావచ్చును (సిబ్రయీము చూ॥).

2. అష్షూరు చక్రవర్తి షోమ్రోను దేశమును జయించి షోమ్రోనువారి నచ్చటి నుంచి చెఱకు కొంచుపోయిన పిమ్మట సెపర్వయీము వారిని ఇతర అన్యులతోపాటు షోమ్రోనునందు కాపుర ముండ నిచ్చెను (II రాజు $17^{24-31}$). ఇది ఉత్తర బబులోనులో నుండు సిప్పారు అను పట్టణమునకు మాఱుపేరని కొందఱి తలంపు. సెపర్వయీము అనునది సిప్పారుకు ద్వివచన రూపమై యున్నది కావున అది రెండు సిప్పారులు అని యర్థ మిచ్చును (పటము VIII, D 2 చూ॥).

**సెఫో** (Zepho, Zephi = కావలికాయుట). ఏశావు మనుమఁడు. ఎదోమీయులలో ప్రధానియై వారిలోని తెగలలో నొకదానికి పూర్వీకుఁడయ్యెను (ఆది $36^{11,15}$ I దిన $1^{36}$).

**సెఫోను, సెఫోనీయులు** (Zephon = కాచుకొనుట, Zephonites). గాదీయులలో నొకఁడు (సంఖ్యా $26^{15}$). ఇతని వంశస్థులు సెఫోనీయు లనఁబడిరి. ఆది $46^{16}$ లో నితనికి సిప్యోను అను మాఱురూపము కలదు. యెహో $13^{27}$ లోని సాఫోను ఈ పేరుకు సంబంధించినదై యుండవచ్చును (సాఫోను చూ॥).

**సెప్తుయజింటు** భాషాంతరములు 2 చూ॥

**సెఫారదు** (Sepharad). యూదావారు చెఱపట్టుకొని తీసుకపోఁబడిన దేశములలో నొకటి (ఓబ 20). దాని ఉనికినిగూర్చి తాత్పర్య భేదము గలదు. పారశీక శాసనములలో స్పార్ద (*Sparda*) చిన్నాసియకు పేరగుటచే ఇది దాని మాఱుపేరై చిన్నాసియలోని ఒక భాగమును సూచించు ననుకొందురు. మఱికొందఱు ఇది మాదైలోనున్న సపర్ద (*Saparda*) ను సూచించు నని తలంచెదరు.

**సెబా** షెబా చూ॥

**సెబోయీము, సెబోయీయులు** (Zeboim = జింకలు). సొదొమ గొమొఱ్ఱా పట్టణములతో నున్న 5 మైదానపు పట్టణములలో నొకటి (ఆది $10^{19}$). ఇది తతిమ్మా పట్టణములలో కలిసి షీనారునుండి వచ్చిన రాజులమీఁద యుద్ధముచేసి ఓడిపోయెను ($14^{2-8}$). అబ్రాహాము దినములలో సొదొమ గొమొఱ్ఱాలతోపాటు నాశనమయ్యెను (ద్వితీ $29^{23}$ హోషే $11^{8}$ సొదొమ చూ॥). దీని నివాసులు సెబోయీయు లనఁబడిరి (ఆది $14^{2}$).

**సెమక్యా** (Semachia = యెహోవా ఉద్ధరించెను). ఓబేదెదోము సంతతివారిలో నొకఁడు. కోరహు తెగలోచేరిన లేవీయుఁడు. ఇతని సంతానీకులు మందిర ద్వారపాలకులైరి (I దిన $26^{7}$). II దిన $31^{13}$ లోని ఇష్మక్యాహు అను పేరుకు ప్రతిగా ఈ పేరుండవలెనని కొందఱి యభిప్రాయము.

**సెమరాయిము** (Zemaraim = రెండు మాఱులు కోయుట).

1. బెన్యామీను గోత్ర భాగమందలి యొక పట్టణము (యెహో $18^{22}$). ప్రస్తుత మచ్చట నున్న ఎస్-సుమ్రా (*es-Sumra*) యే దీని యునికి యని తలంతురు. అది యెరికోకు ఉత్తరమున రెండు క్రోసుల దూరమున నున్నది (పటము III, G 5).

2. ఎఫ్రాయిమునందున్న యొక కొండ (II దిన $13^{4}$). అది పైనున్న యూరికి సమీపముగా నున్నదని యూహించుట గాక దాని యునికిని గూర్చిన యితర సూచనలు లేవు.

**సెమారీయులు** (Zemarites) = కనానీయుల తెగలలో నొకటి (ఆది $10^{18}$ I దిన $1^{16}$). అర్వాదీయులు, హమాతీయులను పేరుల మధ్య నిది వచ్చుటచేత వారు ఫేనీకే యుత్తర భాగమందున్నారని కొందఱి యభిప్రాయము. అష్షూరు వారి శాసనములలోని సిమిర్ర (*Simirra*) అను స్థలము పేరును, అమార్నా (*Amarna*) శాసనములలోని సుమూరు (*Sumur*) అను పేరును, ప్రస్తుతమున సుమ్రా (*Sumra*) అని పిలువఁబడు స్థలపు పేరును, ఈ సమారీయులు పూర్వముండిన స్థలము పేర్లై యుండవచ్చును.

**సెరాపులు** దేవదూతలు 1 చూ॥

**సెరారాతు** సారతాను చూ॥

**సెరూగు** (Serug, Saruch = చిగురు). అబ్రాహాము పూర్వీకులలో నొకఁడు. రయూ కుమారుఁడు (ఆది $11^{20,22,23}$ లూకా $3^{35}$). అష్షూ

రీయుల రాతిశాసనములలో శారూగు (*Sarug*) అను పరగణా కలదు. అది యీ పేరుకు సంబంధించినది కావచ్చును.

**సెరూయా** (Zeruiah = చీలిన). దావీదు సైన్యాధిపతులలో యోవాబు అబీషై అశాహేలు అనువారి తల్లి (I సమూ $26^{6}$ II సమూ $2^{13-18}$ I రాజా $1^{7}$ I దిన $2^{16}$ మొ॥). వీరిని తండ్రి పేరుచేఁగాక తల్లిపేరుచే గుర్తింపఁబడుట వలన తల్లి ముఖ్యురాలుగ కనఁబడుచున్నది. ఈమె దావీదు తోడబుట్టువని I దిన $2^{16}$ వలనఁ దెలియుచున్నది. II సమూ $17^{25}$ నందీమె తండ్రి నాహాషు అని యున్నదిగాని అది I దిన $2^{16}$ లో నున్నట్లు యెష్షయి అనుమాటగా మార్చి సవరించవలెనని సాధారణముగా ననుకొందురు.

**సెరెదు, సెరెదీయులు** (Sered, Sardites). జెబూలూను కుమారులలో నొకడు (ఆది $46^{14}$ సంఖ్యా $26^{26}$). ఇతని సంతతివారు సెరెదీయులు అనఁబడిరి ($26^{26}$).

**సెరేరాతు** సారెతాను చూ॥

**సెరోరు** (Zeror = ఒక కట్ట). సౌలు పూర్వీకులలో నొకఁడు. బెన్యామీనీయుఁడు (I సమూ $9^{1}$).

**సెర్గిపౌలు** (Sergius Paulus). కుప్ర అను ద్వీపమందు పౌలును బర్నబాయు తమ మొదటి సువార్త సంచారముచేసినప్పుడు అక్కడ అధిపతియై యున్నవాఁడు. అతఁడు రోమీయుఁడని ఈ పేరుచేత తెలిసికొనఁగలము అతఁడు వివేకమును మతాసక్తిగలవాఁడై యుండి దేవుని వాక్యము వినఁగోరెను. ఆ వాక్యము వినిన పిమ్మట గారడీవాఁడును అబద్ధ ప్రవక్తయునైన బర్ యేసు చెప్పినమాటలు విసర్జించి యేసుక్రీస్తునందు నమ్మెను (కార్య $13^{7,8}$) ఆయన పేరు రోమీయుల చరిత్రమందుఁ గనఁబడుచున్నది గాని ఆయనచేసినపని విషయము మనకు ఎక్కువ తెలియదు. E.

**సెల** (Sela = బండ). ఇదియొక పట్టణపు పేరుగా II రాజా $14^{7}$ యెష $16^{1}$ $42^{11}$ నందు కనఁబడును. న్యాయా $1^{36}$ లోని హాస్సెలా (హా = అదే, + సెలా = బండ) అనునది దీనినే సూచించును. ఈ పదమునకు దుర్గము అను అర్థము నుండుటచేత, ఇది యేదో యొక స్థలమును మాత్రమేగాక వేర్వేఱు స్థలములను సూచించునని కొందఱనుకొందురు. అది అవశ్యముగా నొక పట్టణమునేగాక బండనుకూడ సూచింపవచ్చును. ఈ మాటనే, ఓబ 3 యిర్మీ $49^{16}$



సెలలోయలో నుండు కొండలలో చెక్కబడిన ఆలయములు

నందు కొండ అను పదముచేత భాషాంతరము చేసిరి. ఇదే రీతిగా పైనుండు వాక్యములును వెళ్వేరు ఎత్తయిన స్థలములను సూచింపవచ్చును. గాని, ఇది మృతసముద్రమునకు 50 మైళ్లు దక్షిణముగా నున్న పెట్రా అను పట్టణమని సాధారణముగా ననుకొందురు. పెట్రా అను గ్రీకు పదమును సెలా అను హెబ్రీ పదమువలె బండ యని అర్థమగును అది అరబ్బులలో నబతీయులను తెగవారికి (I మక్క $5^{25}$ $9^{53}$) క్రీ॥ ము। 4 వ శతాబ్దము మొదలుకొని క్రీ॥ శ॥ 2 శతాబ్దమువఱకు రాజధానిగా నుండెను. అంతట రోమీయులు దానిని స్వాధీనపఱచుకొనిరి ప్రస్తుత మచ్చట రాతి శాసనములును గోరీలును అనేకములున్నవి గాని పట్టణములేదు (పటము VIII, C 2)

**సెలహమ్మలెకోతు** (Sela-Hammah-lekoth = విభాగింపఁబడిన బండ లేక, తెలుఁగు బైబిలునందున్నట్లు భయవిముక్తి శిల) సౌలుచేతి నుండి దావీదు తప్పించుకొన్న యొక కొండకు పెట్టఁబడినపేరు (I సమూ $23^{28}$) అది యూదా దేశ దక్షిణభాగమందు మాయోను అరణ్యములో నుండెను ($23^{25}$). దీని యునికిని గూర్చి యింత కూటిగా తెలియదు.

**సెలా** (Selah = ఎత్తఁబడిన). కీర్తనల గ్రంథమందు 71 సార్లు కనఁబడుపదము (కీర్త $3^{2-4}$ 8 $4^{2-4}$ మొ॥). హబ $3^{3,19,13}$ లో కూడ కనఁబడును. ఇది సంగీతమునకు సంబంధించిన యొక గుఱుతు అని అందఱును అంగీకరించినను అది దేనిని సూచించునో రూఢిగా నెవరికిని తెలియదు (1) విరామస్థలమనియు (2) రెండవ సారి పాడవలెననియు (3) వచనమునకు అంతమనియు (4) వాద్యములను వాయించువారు వాయించవలసినదను సూచనయనియు (5) నమస్కారము చేయవలసినదనుటకు గుఱుతనియు (6) పాడుటను ఆపగానే సంగీతగాండ్రు వాయిద్యమును వాయించుటకైన గుఱుతనియు పలువిధములుగ చెప్పెదరు వీనిలో చివరిది సరికావచ్చును

**సెలూకయ** (Selucia). సిరియాలోని అంతియొకయకు రేవు పట్టణము. ప్రాకార



సెలలోయలోనుండు కొండలో చెక్కబడిన ఆలయములు

ములు గలిగినది. ఒరాంటీసు నదీముఖద్వారము నకు ఉత్తరమున నున్నది గ్రీకుల సిరియా రాజ్య మును స్థాపించిన సెల్యూకస్ నికేటోరు అను రాజునుబట్టి దీనికి పేరువచ్చెను. ఆ రాజ్యమున్న కాలములో ఐగుప్తీయులు దీని నొకసారి జయిం చిరి (I మక్క 11⁸) గాని, అంతియొకయవారు క్రీ॥ ము॥ 210 సం॥ మఱల వారిని వెళ్లఁదరిమిరి రోమనువారి కాలమున నిది మెసపొతేమియ ఇండియా దేశములకు పోవుమార్గమున నున్నందున చాల ప్రసిద్ధికెక్కిన పట్టణమాయెను. పౌలు బర్నబాలిచ్చట ఓడనెక్కి తమ మొదటి మిషనేరి ప్రయాణముచేసిరి (కార్య 13⁴). నేటివఱకు అచ్చట పాడు శేషములు గలవు. దాని రేవులో నుండు రెండు గోడలను వా రిప్పటికిని పౌలు బర్నబాలని పేర్లుపెట్టి పిలుచుచున్నారు (పటము V, L 4).

సెల్లోపెహాదు (Zelpehaod). మనష్షే గోత్రీకుఁడు. ఇతఁడు అరణ్యములో కాలము చేసెను. ఇతనికి 5 గురు కుమార్తెలుండిరిగాని కొడుకులు లేరు (సంఖ్యా 26³³). అందువలన ఆ కుమార్తెలు తమ తండ్రి స్వాస్థ్యమునకు వారసులని తీర్మానించిరి (27¹⁻¹¹). అప్పటినుండి కుమారులు లేక కుమార్తెలు మాత్రముండు కుటుం బముల కిది యొక పద్ధతి యాయెను. గాని ఆ యాస్తి ఆ గోత్రములోనే నిత్యము నిలుచునట్లు వారితర గోత్రీకులను వివాహమాడరాదను నియమ మును తరువాతఁజేసి వారివిషయమైన యేర్పాటు పూర్తిజేసిరి (36¹⁻¹²). వారి స్వాస్థ్యము యొర్దా నుకు తూర్పున నున్నది (యెహో 17¹⁻⁶).

సెల్యూకసు (Seleucus). ఇతనిపేరు బైబిలునందు లేదు. గాని పాఁత నిబంధనకును క్రొత్త నిబంధనకును మధ్యకాలమున పలెస్తీనుతో చాల సంబంధపడుటచేత వీని సంగతి నిచ్చట ఉదాహరించుట తగును. సెల్యూకసు మహా అలెక్సందరు సేనాధిపతులలో నొకఁడు. అతని మరణానంతరమున నితఁడు ఆ సామ్రాజ్య మందలి తూర్పు భాగమున కధిపతియై క్రీ॥ ము॥ 301 లో సిరియాకు రాజయ్యెను. ఇతఁడు అంతియొక యను రాజధానిగాను, సెలూకయను దానికి రేవు పట్టణముగాను కట్టించుకొనెను (I మక్క 11⁸). ఇతఁడు యూదులకు తన రాజ్యమున పౌరస్థితి నను గ్రహించెనని యోసీఫసువలనఁ దెలియు చున్నది (పురా 12. 3. 1. 3. 1). ఈ కాల మునుగూర్చి దానియేలు గ్రంథము వ్రాయఁ బడెననుకొనువారు దాని 11⁵ లో నుండు 'అతని (అనగా ఐగుప్తురాజుయొక్క) అధిపతులలో నొకఁడు' అను మాటలు ఇతనిని సూచించు ననుకొనుచున్నారు.

ఈ సెల్యూకసునకు తరువాత అంతియొకయ రాజులలో ఇంక నైదుగురికి సెల్యూకసు అను బిరుదు కలదు. రెండవ సెల్యూకసుకు (క్రీ॥ ము॥ 240-226) దాని 11⁷⁻⁹ లో 'ఉత్తరదేశపు రాజని'యు, మూఁడవ సెల్యూకసుకు (226-223), 11¹⁰ లో అతని కుమారుఁడనియు, నాల్గవ సెల్యూ కసు (187-176) యెరూషలేము ఆలయమును దోచుటకు తన ఖజానదారుఁడగు హేలియొ దోరును పంపించెననియు (II మక్క 3¹⁻⁴⁰) చెప్పెదరు. పై నుదాహరింపఁబడిన నలుగురు రాజులు దాని 7²⁴ లోని పదికొమ్ములలో నుండు వారు. ఐదవ సెల్యూకసుకును (125-124) ఆఱవ సెల్యూకసుకును బైబిలునం దేమియు సూచ నలు లేవు.

సెల్సాహు (Zelzah = ఎండలోని నీడ?) బెన్యామీను ఎఫ్రాయిముల సరిహద్దులో రాహేలు సమాధిదగ్గరనుండు యొక పట్టణమై నట్లున్నది (I సమూ 10²). ఇట్టి పట్టణపు పేరుకు బైబిలులోను, పలెస్తీనులోని పేరులలోను మఱి యే సూచనలును లేవు. LXX తర్జుమ వల్గేటు అను లాటీను తర్జుమవలన దీనిని పేరుగా నెంచకనే భాషాంతరము చేసిరి. అందువలన దీనిని స్థలముగా నెంచుట పొరబాటని కొందఱి యభి ప్రాయము.

సెవేనే (Syene = ప్రవేశము). ఈ పేరు యెహె 29¹⁰ 30⁶ నందు మాత్రము గలదు. అచ్చట అది ఐగుప్తు దక్షిణహద్దును సూచించును. నైలునదిలో ఈ స్థలముదగ్గిర ఒక ఎత్తిపోఁత గలదు గాన, నావలు ఆ నదిలో అంతవఱకు మాత్రము పోఁగలవు. అక్కడ ఒక కోట యుండుట స్వాభావికము. సెవేనే అట్టి కోటయై యున్నది. అది నైలునదికి తూర్పున నున్నది. ప్రస్తుతము దానికి అస్సువాను

(*Assuan*) అను పేరుగలదు. పూర్వకాలమందు ఇచట యెరూషలేములో నున్నట్టి దేవాలయము వంటిదాని నొకటి యెహోవాకు కట్టించినట్లు, దీనిదగ్గరనున్న యొుక ద్వీపములో కనుగొనఁబడిన పురాతన శాసనములవలనఁ దెలియును. దీనికి ఎలఫంటీన్ (*Elaphantene*) అని పేరు. దీని వలననే ఈ శాసనములకు ఎలఫంటీన్ శాసనములని పేరు కలిగెను. అచ్చట యూదులుండుట యెష 19[19] లో నున్నదానికి ఒక సూచనగా నెంచఁదగును.

## సే

**సేఖూ** (Secu = ఎత్తయిన స్థలము). సౌలు గిబియానుండి రామాకు వెళ్లఁగా దిగిన యొుక స్థలముపేరు (I సమూ 19[22]). అది ప్రత్యేకమైన పేరుగాక, శబ్దార్థమునుబట్టి, అది రామాలో నొక యెత్తయిన ప్రదేశముగా కొందరెంచుచున్నారు.

**సేద్యగాడు, సేద్యము** వ్యవసాయము చూ॥

**సేన, సైన్యవ్యూహము** (Legion). గొప్ప సమూహమును సూచించుటకు క్రొత్త నిబంధనలో సేన యను నీ మాటను వాడియున్నారు గాని ఇంత సంఖ్య యని సూచించుటకు కాదు (మ 26[53] మా 5[9-15] లూ 8[30]). తత్కాలమున రోమన్ సేనగా నెంచఁబడిన యొుక సేనలో 6000 కాల్బలముండెను. ఇదియుఁగాక అందులో రథములును రౌతులుకూడ నుండిరి. (పటాలము, యుద్ధము చూ॥).

**సేనాధిపతి, సైన్యాధిపతి** (Captain). ఇశ్రాయేలీయులు ప్రస్తుతమందు వాడుకలో నున్నట్లు సైన్యమందలి ఉద్యోగస్థులకు ప్రత్యేకమగు పేరులు పెట్టక, ఇతర ఉద్యోగస్థులకుండు బిరుదులనే వాడిరిగాని పారసీకులును (దాని 3[2,3-27] 6[7]) రోమనులును (యోహా 18[12] ప్రక 19[18]) తమ సేనాధిపతులకు ప్రత్యేకమైన బిరుదులుగల పదములను వాడిరి. బైబిలునందు సాధారణముగా సేనాధిపతియని తెనిఁగించిన పదము శారా అను పదముయొక్క మహాద్వాచకమై యువరాజును సూచించును. పోతీఫరుకు (ఆది 39[1]), యోసేపుభైదులో వేయఁబడినప్పుడు అతనిపైనున్న వానికి (40[3]) ఈ బిరుదు గలదు. ఆ బిరుదే ఆ చరిత్రయందు వచ్చు పానదాయకుల అధిపతికిని భక్ష్యకారుల యధిపతికిని వాడఁబడెను గాని దాని నక్కడ **అధిపతి** యని తెనిఁగించిరి. ఇతరమైన అనేక వాక్యములలో దాని నధిపతులనియు **అధికారులనియు** తెనిఁగించిరి (47[6] సంఖ్యా 21[18] 22[8]). సేనలో నున్న ఉద్యోగస్థులకును అదే బిరుదు గలదు. న్యాయాధిపతుల కాలములో సీసెరా కనానీయుల సైన్యాధిపతియై యుండెను (న్యాయా 4[2]). ఇశ్రాయేలీయులలో సౌలుకాలము మొదలుకొని రాజుల ఉద్యోగములలో నిది ఖాయపఱచఁబడిన ఉద్యోగమై యున్నది. అబ్నేరు సౌలుకును, యోవాబు దావీదుకును సేనాధిపతులుగా నుండిరి. దావీదు కాలములో షోబకు సిరియనులకు సైన్యాధిపతి (II సమూ 10[16]). శతాధిపతులు వేయి ఉద్యోగస్థులుగా లెక్కింపఁబడిరి (I రాజు 22[32]). యెహోషువకు కనఁబడిన యెహోవా దూతకును అదే బిరుదుండెను (యెహో 5[14] అధికారులు, సహస్రాధిపతి, కావలివాడు చూ॥).

**సేలా** (Zelah = ప్రక్క). బెన్యామీనీయుల పట్టణములలో నొకటి (యెహో 18[28]). ఇచ్చట సౌలు కుటుంబికుల సమాధి స్థలముండెను (II సమూ 21[14]). దీనియునికిని గూర్చి యింక నూటిదైన సూచనలు లేవు.

**సేవకుడు, యెహోవా సేవకుడు** (Servant of the Lord).

1. కుటుంబము చూ॥

2. బైబిలులో నున్నట్లనేకులు యెహోవా సేవకులనఁబడిరి. యెహోవా తాను మాటలాడుచున్నట్లుగా నున్న వాక్యములలో అది "యెహోవా సేవకుఁడు" అని యుండక 'నా సేవకుఁడు' అను మాటగా నున్నది. మఱియు తెనుఁగు బైబిలులో నున్నట్లుదానిని **దాసుడు** అను పదముచే తర్జుమాచేసిరి. ఇట్లు ఆయా రూపములతోనున్న "సేవకుఁడు" అను బిరుదు బైబిలులో "అబ్రాహామునకు" (ఆది 26[24] కీర్తన 105[6]), మోషేకును (నిర్గ 14[31] సంఖ్యా 12[7,8] మొ॥), యెహోషువకును (యెహో 24[29])

కాలేబుకును (సంఖ్యా $14^{24}$), యోబుకును (యోబు $1^{8}$), దావీదుకును (II సమూ $3^{18}$ మొ॥), యెషయాకును (యెష $20^{3}$) హిల్కీయాకును $22^{20}$), జెరుబ్బాబెలుకును (హగ్గ $2^{23}$), చిగురు అనఁబడిన వానికిని (జెక $3^{8}$) పెట్టఁబడియున్నది. ఓబద్యా యను పేరునకు యెహోవా సేవకుఁడు అను శబ్దార్థము కలదు.

ఇట్లు ఆయా వారలకీ బిరుదుండినను, యెహోవా సేవకుఁడు అను మాట ఒక విశేష వ్యక్తిని సూచించుటకు యెష $41^{8-10}$ $42^{1-4,6,7-19,20}$ $43^{10}$ $44^{1-4-21-23}$ $45^{4}$ $49^{1-6}$ $50^{4-9}$ $52^{13}$-$53^{12}$ లలో విశేషార్థముతో వాడియున్నారు. వీనిలో $41^{8-10}$ $42^{1-4}$ $49^{1-6}$ $50^{4-9}$ $52^{13}$-$53^{12}$ వచనములు యెహోవా సేవకుని గూర్చిన సంగతులను తెలిసికొనుటకైన ముఖ్యాధారములై యున్నవి. $41^{8-10}$ లో నున్నట్లు ఇశ్రాయేలీయులలో భక్తులైనవారు యెహోవా యేర్పఱచుకొన్న స్నేహితులుగా నెంచఁబడి యున్నారు. లేదా, ఇశ్రాయేలీయులందఱు భక్తులైయున్నట్లును వారందఱు మొత్తముమీఁద ఒక విశేష వ్యక్తిగాను యెహోవా సేవకుఁడుగా నెంచఁబడిరి. $42^{1-4}$ చూడఁగా యెహోవా సేవకుఁడు అనువాఁడు యెహోవా వలన సహాయమునొంది యేర్పఱచఁబడినవాఁడును, దేవుని యాత్మ నొందినవాఁడును, ఏ మాత్రము డంబములేనివాఁడునై ఇశ్రాయేలీయుల రక్షణ నిమిత్తమొక గొప్ప పని చేయును. ఇచట "ఆయన యిశ్రాయేలీయుల నిమిత్తము పని చేయును" అని యుండుటచే ఆయన ఇశ్రాయేలీయుఁడని చెప్ప వీలు లేనందున ఆయనను వేఱొక వ్యక్తినిగా నెంచవలెను. $42^{19,20}$ $43^{8-14}$ $44^{1-4,21-23}$, $45^{4}$ లలో సేవకుఁడు అను పదము భక్తులైన యిశ్రాయేలీయులకుకాక, ఇతర యిశ్రాయేలీయులకుకూడ చెందును కావున, ఈ సేవకుఁడు యెహోవాను నమ్మనివాఁడుగా కూడ ఎంచఁబడును ($42^{19,20}$). అయితే $49^{1-6}$ లో భక్తులగు ఇశ్రాయేలీయులకు మాత్ర మీ బిరుదున్నట్లు మిగుల తేటగా కనఁబడును. ఇందులో ఇశ్రాయేలీయులు అను సేవకుఁడు తాను చేయవలసి యుండిన గొప్ప పని నెఱఁగియుండియు, తా నాపనిని చేయలేదని యొప్పుకొని, ఇకమీఁదట దానిని పూనుకొని చేసెనన్నట్లుగా నున్నది. ఇట్లు ఇశ్రాయేలీయులు తమ శ్రమలచే నేర్చుకొని ఇతరులకు బోధించుటకే ఈ శ్రమలు వారికి కలిగెననఁదగును. సేవకుఁడు అను పదముచే ఇశ్రాయేలీయులలోని భక్తుల సమూహమును సూచించు ఈ వాక్యములను చూడఁగా ఇచట కూడ ఆ భక్తులలోని భక్తిగల మనస్సు యావత్తు ఒకనియందే యున్నట్లుగా నున్నదనియు, ఆయన భక్తులగు ఇశ్రాయేలీయులలోనున్న శ్రేష్ఠగుణముల సంపన్నుఁడనియు చెప్పఁదగును. $52^{13}$-$53^{12}$ లో ఈ సంగతి మఱీ తేటగా కనఁబడును. ఈ వాక్యములో సేవకుఁడు హెచ్చింపఁబడుట ($52^{13-15}$), ఆయన శ్రమలు ($53^{1-9}$), ఆ శ్రమల వలన గలుగు రక్షణ ఫలములు ($53^{10-12}$) అను విషయములున్నవి. మనము దీనిని చూడఁగా ఇశ్రాయేలీయుల యనుభవములేక వారియందలి భక్తుల యనుభవము దీనికి ఎంతవఱకు ఆధారముగా నుండినను ఇది యట్టి యనుభవము లన్నిఁటిని మించు మఱీ గొప్పవానిని గూర్చి మనకు తెలుపునని యొప్పుకొనక తీరదు. ఇశ్రాయేలీయుల చరిత్రనుగాని, ఆయా భక్తుల చరిత్రనుగాని చూడఁగా శ్రేష్ఠులైనవారు శ్రమ నొందుట వలననే మానవులు రక్షింపఁబడవలెనని సూచనగా నేర్చుకొనవలసిన విషయము లిందులో సూచనగా కనఁబడినను క్రీస్తువలననే ఇట్టి సూచనలన్నియు బహు తేటగా నెఱవేఱి యున్నవి. ఆయన యొక్కఁడే యెషయా వివరించిన ఆ సేవకుని శ్రేష్ఠతవంటి శ్రేష్ఠతనుగలవాఁడై శ్రమల నొందినవాఁడును, శ్రమలనొంది తినను నమ్ము వారిని రక్షించువాఁడునై యున్నాఁడు.

యెషయాలోని వాక్యములకు సంబంధముగా యెహోవా సేవకుఁడు అను బిరుదు క్రొత్త నిబంధనలో క్రీస్తునకు చెందును (మ $8^{17}$ $12^{18-21}$ లూ $22^{37}$ కార్య $8^{32,33}$). యెషయా వాడిన యీ మాటలు మెస్సీయకు వాడుకరైన బిరుదయ్యెనని యీ వాక్యములవలనఁ దెలియును.

## సై

**సైన్యముల కధిపతియగు యెహోవా** దేవుడు II 4 (5) చూ॥

**సైన్యవ్యూహము** సేన చూ॥

## సో

**సొటయి** (Sotai = తొలఁగినవాఁడు). సొలొమోను సేవకుల వంశస్థులుగా లెక్కింపఁ బడినవారిలో నొక తెగవారు. ఆ కుటుంబి కులలోఁ గొందఱు చెఱనుండి తిరిగి వచ్చిరి (ఎజ్రా 2[55]=నెహె 7[57]).

**సొదొమ గొమొఱ్ఱా** (Sodom and Gomorrah). యొర్దాను ప్రాంతమునందలి యైదు పట్టణములలోనివి (ఆది 13[10] మైదాన మందున్న పట్టణములు చూ॥). అప్పటికాల మందవి దుర్మార్గతయందుండినను లోతు అబ్రా హామునుండి వేఱయినపుడు సొదొమను తనకు నివాసస్థలముగ నేర్పర్చుకొనెను (13[11,12]). అది కదొర్లాయోమెరుచే కొల్లపెట్టఁబడెను (14[11]). గాని ఆస్తియును చెఱబోయినవారును అబ్రా హామువలన తిరిగి తీసికొనిరాఁబడిరి (14[21-24]). తరువాత అదియు ఆ మైదానమునందలి మఱి మూఁడు పురములును వాని దుర్మార్గతనుబట్టి దేవు నిచే లయము చేయఁబడెను. దేవుఁడు ఆకాశ ములోనుండి బహుశః మెఱుపువలన అగ్ని నంపి అందలి గంధకమును మట్టికీలును కఱుగునట్లు చేయుటచే ఆ పురములను భస్మముచేసి తన చిత్త మును నెఱవేర్చియుండును. లోతును అతని యిరువురు కుమార్తెలును రక్షింపఁబడిరి (ఆది 19[1-29] ద్వితీ 29[23] యెష 1[9,10] 3[9] 13[19] యిర్మీ 49[18] 50[40] విలా 4[6] యెహె 16[46-56] ఆమో 4[11] జెఫ 2[9] మ 10[15] 11[24] లూ 10[12] 17[29] రోమా 9[29] II పేతు 2[6] యూదా [21]). పాప భూయిష్టమైన మహాపట్టణమగు యెరూషలేము ప్రకటన గ్రంథమునందు సొదొమ యనియు ఐగుప్తు అనియు పిలువఁబడెను (ప్రక 11[8]) సొదొమయొక్క ఉనికిని వాస్తవముగ నిశ్చ యించుటకు వీలగుటలేదు. రెండు స్థలములు చూపఁబడుచున్నవి. మృత సముద్రపు ఉత్తరపు కొనదగ్గరనని ఈ కారణములచే చెప్పవచ్చును.

1. బేతేలుకు సమీపమునందున్న యొక స్థలమునుండి లోతు అబ్రాహాములు యొర్దాను ప్రాంతమంతటిని జూడఁగలిగిరి (ఆది 13[3-10]). 'అంతటిని' అను పదముకు వ్యాఖ్యానము చేయు టలో మిగుల జాగ్రతగలిగి యుండవలెను. 2. కదొర్లాయోమెరు దక్షిణమునుండివచ్చి సొదొమ రాజావలనను అతని సహాయకులవలనను ఎదిరింపఁబడక ముందు (14[7,8]) అష్షరోత్ కర్నాయిమను ఏర్దెదీయందలి అమోరీయుల నోడించెను. ఇది ఏర్దెదీకిని మృతసముద్రపు ఉత్తరకొనకును మధ్య జరిగెనని తెలియుచున్నది. మఱొకపక్షమున సొదొమ పట్టణము మృత సముద్ర దక్షిణాగ్రమున నున్నదనుటకు మూఁడు ముఖ్యహేతువులు గలవు. 1. మృతసముద్రపు దక్షిణాగ్ర సమీపమునందు మాత్రమే విస్తార మగు మట్టి కీలు దొరకును (14[10]). 2. ఆ స్థలము సముద్ర జలముతో నేకమగుటవలన (14[3]) ఆ పట్టణములు దక్షిణాగ్రమున కట్టఁబడి యుండ వచ్చును. ఏలననఁగా అక్కడ సముద్రము 2-20 అడుగుల లోతుమాత్రమున్నది. ఉత్త రాగ్రము దగ్గర 600-1000 అడుగుల లోతున్నది. భూశాస్త్ర సంబంధముగా విచారించిన దక్షి ణాగ్రము ఇటీవల యేర్పడినట్లున్నది. 3. ఆ పట్టణములలో నొకటియగు సోయరు మృత సముద్రపు దక్షిణాగ్రమున నున్నది (13[10]).

గొమొఱ్ఱా సొదొమకు సమీపముగా నుండి దీనితోనే నాశనము చేయఁబడుటనుబట్టి సొదొమ సంగతులన్నియు గొమొఱ్ఱాకును సంబంధించినవని తెలిసికొనవలెను (మృతసముద్రము చూ॥).

H.

**సొమ్ము** రూకలు చూ॥

**సొరచెట్టు** (Gourd). యోనాకు నీడ కలుగఁజేసిన చెట్టును సూచించుటకు వాడినమాట (యోనా 4[6,7,9,10]). సొరతీగె బహు త్వరగా పెరుగును. కావున అది యీ విషయములో ఈ చెట్టుకు సంబంధపడును గాని, కొందఱిది ఆముదపుచెట్టు అని తలంతురు.

**సొరాతీయులు** జొర్యా చూ॥

**సొలొమోను** (Solomon = సమాధాన కరుఁడు). దావీదుకు బత్షెబ కనిన కుమారులలో కనిష్ఠుఁడు. దావీదు కుమారులందఱిలోను కని ష్ఠుఁడు కావచ్చును (II సమూ 12[24] I దిన 3[5] పురా 7.14.2). ఇతఁడు యెరూషలేమునందు జన్మించెను. పోరాటములలోఁ గూడుకొనిన తన జీవితమును జ్ఞప్తిజేసికొని దావీదు ఇతనికైనను

సమాధానముతోను నెమ్మదితోను జీవించుకాలము వచ్చెనుగదా యనుకొని సమాధానకరుఁడు అను నర్థమిచ్చు సొలొమోనను పేరుపెట్టెను (I దిన $22^{9}$) గాని ప్రవక్తయైన నాతానుద్వారా దేవుఁడీతనికి యెహోవాకు ప్రియుఁడని యర్థమిచ్చు యెదీద్యాయని నామకరణ మొనరించెను (II సమూ $12^{25}$). హెబ్రోనునందు జన్మించిన వారిలో అదోనియా యనువాఁడు అమ్నోను అబ్షాలోమను వారికిఁదరువాత సింహాసనమునకు వారసుఁడై యుండి, దావీదు వృద్ధాప్యముచే బల ముడిగియున్న సమయమున తండ్రి యనుమతి లేకుండనే స్వయముగా పరిపాలించు యత్నములు సలుపసాగెను. వాని ప్రయత్నములన్నియు ప్రవక్తయగు నాతాను ప్రధానయాజకుఁడగు సాదోకు, సేనానాయకుఁడగు బెనాయా, దావీదుయొక్క దేహసంరక్షలగు వారివలన నిష్ఫలములై పోయెను. వారు సొలొమోనును రాజుగా ప్రకటించిరి (I రాజు $1^{5-40}$). అదోనీయా కుట్ర పటాపంచలాయెను. కొద్దికాలములోనే దావీదు మృతినొందఁగా క్రీ॥ పూ॥ 970 సం॥ న ఇరువదియేండ్ల ప్రాయముగల సొలొమోను ఏలనారంభించెను. అతఁడు తన తండ్రి యాజ్ఞానువర్తియై అబ్యాతారు షిమీ యనువారికి న్యాయము తీర్చెను. అదోనీయా మరల కుట్రాలోచనల నారంభించినందున, అతఁడును యోవాబును శిక్షపాలైరి ($2^{1-46}$). కొంఁదికాలములోనే యితఁడు తన భార్యయగు ఫరో కుమార్తెను యెరూషలేమునకుఁ దెచ్చెను ($3^{1}$). షిలోహు నాశనమైనప్పటినుంచి ప్రత్యక్షపు గుడార మొకచోటను, మందస మొకచోట నుండుచు వచ్చెను. ఈ కాలమున గిబియోనులో గుడారమును యెరూషలేమునందు మందసమునుండెను. సొలొమోను ఆరాధింపనై గిబియోనుకు రాఁగా దేవుఁడతనికచట స్వప్నమందు ప్రత్యక్షమై, యతని కిష్టమగు వరము నడుగుకొన సెలవిచ్చెను. అతఁడు దేవుని ప్రజలగువారికి న్యాయము చేయుటకు కావలసిన వివేచనగల హృదయము నడుగుకొనెను. కలహపడి న్యాయమునిమిత్తమై తనయొద్దకు వచ్చిన యిద్దరు స్త్రీల సంగతియందే యతని జ్ఞానము వెల్లడియాయెను (I రాజు $3^{7-28}$ II దిన $1^{3,12}$). ఇరువది సంవత్సరములు గతించినపిమ్మట ఆయన మరల ప్రత్యక్షమై అతఁడు యుక్తముగా ప్రవర్తించిన పక్షమునందే అతని సంతతివారికి రాజ్యముండ నిత్తుననుచు హెచ్చరించెను (I రాజు $9^{1,10}$ II దిన $7^{12,22}$).

అతని తండ్రియగు దావీదే చుట్టుప్రక్కల నున్న జనాంగములన్నిఁటిని జయించెను. హమాతు దేశముమీఁదికి మాత్రము సొలొమోను దండెత్తివెళ్లినట్లు తెలియుచున్నది. తన రాజ్యము నందలి ఈశాన్య ప్రాంతములను తన స్వాధీనమందుంచుకొనుటకై అతఁ డీ పట్టణములను పట్టుకొనవలసివచ్చెను. ఎదోమీయుఁడగు హదదును దమస్కు రాజగు రెజోనును సొలొమోను రాజైన పిదప ఎదురుతిరిగిరిగాని యతఁడు వారి నంతగా పాటించినట్లు కనఁబడదు. యొర్దానుకు ఉత్తరమున నొకరేవుదగ్గరనున్న హాసోరు నతఁడు కట్టించి దమస్కులోని వారిని వృద్ధిలోనికి రానియ్యక అణచునట్లు లెబానోనునం దొక బలమైన గోపురమును గట్టించెను. అందువలన ఎదోముమీఁదుగా ఎసోన్గెబెరుకువెళ్లు మార్గమున కట్టి యడ్డంకులు లేకుండఁజేసి రాకపోకలకు వీలు కలిగించెను. ఇతర రాజులతో నతఁడు స్నేహముగానే యున్నందున తొందరలేమియు లేకనే తన రాజ్యమును స్థిరపఱచుకొని, నెమ్మదిగా నాయా పనులను జరుపుకొనగలిగెను.

దావీదు యెహోవాకు గొప్ప ఆలయమును గట్టుటకై ఆశించి విస్తారమైన ప్రశస్త లోహములను సేకరించి యుంచెను. తూరువారి సహాయముతో సొలొమో నీపని నారంభించి ఏడు సంవత్సరములలో ముగించెను (I రాజు 5, 6; II దిన 2). దానికిఁగావలసిన సామగ్రిని సిద్ధపఱచినపిదప అతఁడు దానిని ప్రతిష్ఠించెను (I రాజు $7^{13}$-$8^{66}$ II దిన 2-7). తరువాత అతఁడు తన కొఱకొక నగరును కట్టించుకొనెను. అది ముగియునప్పటికి 13 సం॥ లు పట్టెను (I రాజు $7^{1,12}$ నగరు చూ॥). దేశముయొక్క నలుదిశలను చక్కనితోఁటలను వనములను వేయించెను. తద్మోరు, బయలతు బయలుహామోను అనునవి వీనిలో ముఖ్యమైనవి (I రాజు $9^{19}$ II దిన $8^{6}$ ప్రస $2^{5,6}$ పర $7^{11}$).

రాజ్యమును పరిపాలించుటయందు సొలొమోను జ్ఞానము బయలుపడెను. తన సభికులుగా నుండుటకై అతఁడు మిగుల ప్రవీణులగువారిని నియమించుకొనెను. అందు ప్రధానయాజకుని కుమారుఁడు ముఖ్యుఁడై యుండెను (I రాజు $4^{2-6}$). గొప్ప సైన్యమును నిలిపెను. గోత్ర విభాగముల ననుసరింపకయే న్యాయపరిపాలనకు వీలుగా నుండునట్లు దేశమును పండ్రెండుభాగములుగఁ జేసెను (I రాజు $4^{7,19}$). మతవిషయములలో మిగుల శ్రద్ధపుచ్చుకొని తగిన యేర్పాటులను జేయుటలో నేమరి యుండలేదు. దేవాలయమును ప్రతిష్ఠించినప్పుడు తానే ప్రార్థించి వచ్చినవారినందఱిని ఆశీర్వదించి పంపివేసెను.

ఇతని కాలమునందు వర్తకవ్యాపారాదులు విస్తరిల్లి దేశమును భాగ్యవంతమైనదిగఁ జేసెను. (I రాజు $10^{14,21}$ II దిన $9^{13,14-21-27}$). సముద్రముమీఁదుగా ఓఫీరుదేశముతోను మెట్ట మీఁదుగా ఇండియాదేశముతోను వర్తకము నడపెను (I రాజు $10^{22,23}$ II దిన $9^{10-32}$). వర్తకము నభివృద్ధిపఱచుట కతఁడు గిడ్డంగి పట్టణములను కట్టించెను. వానిలో యుఫ్రాతునదికిని దమస్కుకును మధ్యనున్న యెడారిలోని తద్మోరు మిగుల ప్రసిద్ధిఁజెందినది (I రాజు $9^{18,19}$).

సొలొమోను తనదేశపు వాఙ్మయమును మిగుల ఉన్నతస్థితికిఁ దెచ్చినవాఁడు. అతఁడు ప్రకృతి శాస్త్రజ్ఞుఁడు. లెబానోను పర్వతములపైనున్న దేవదారువృక్షములు మొదలుకొని గోడలోనుండి మొలచు హిస్సోపుమొక్క వఱకున్న చెట్లన్నింటినిగూర్చియు, మృగములు పక్షులు ప్రాకెడి పురుగులు జలచరములన్నిఁటిని గూర్చియు అతఁడు వ్రాసెను (I రాజు $4^{33}$). అనేక సామెతలను ప్రోగుచేసెను. వానిలో నెక్కువభాగము అతఁడు చెప్పినవే. పాత నిబంధనలోనివి యొకభాగమై యున్నవి (సామెతలు చూ॥). కీర్త 72, 127 అతని విరచితములని పైవ్రాఁతవలనఁ దెలియుచున్నది (ప్రసంగి, పరమ గీతము చూ॥).

అతని సభాభవనవైభవము, భోజనపదార్థ సంచయము, దిగ్విజయ యాత్రాశీవియు నతని యైశ్వర్యమునకుఁ దగినటులనే యుండెను (I రాజు $10^{4,5-20}$ పర $3^{7,11}$). అతని జ్ఞానవాక్సుధారసమును గ్రోలుటకు భూదిగంత నివాసు లేతెంచిరి (I రాజు $4^{34}$ $10^{23,25}$). అతని జ్ఞానవాక్య వ్యాప్తి అరేబియా దక్షిణ ప్రాంత్యములవఱకు ప్రసరించెను. షేబదేశపు రాజ్ఞి కీవార్త దెలిసి సొలొమోనును పరీక్షించి యతని వైభవమును కన్నులారఁగాంచనై దీర్ఘప్రయాణము సలిపి యెరూషలేమునకు వచ్చెను ($10^{1-13}$).



రెండు విషయములలో సొలొమోను జారిపడె ననవచ్చును. తనకొఱకు జనానా నొకటి నేర్పఱచెను. అందతనికి వేయిమంది భార్యలుండిరి. వీరిలోఁ గొందఱు భార్యలుకాక రాజ్య సంబంధములో జామీనుగానున్న రాజకుమార్తెలనుటలో సందేహములేదు. అయినను అతనికి పెక్కుమంది భార్యలుండిరని నమ్మవచ్చును. వారియందనేకులు అన్యదేశీయులై విగ్రహారాధికులుగా నుండిరి. సొలొమోను స్త్రీలోలుఁడై వారిని తృప్తిపఱచుటకు వా రారాధించు విగ్రహాములకు గుళ్లను కట్టించెను (I రాజు $11^{1-8}$). ఇందుకై యతనికి తగినశాస్తి కలిగెను. అతని కాలమున మిగుల వైభవముతో నుండిన గొప్ప రాజ్యమతని సంతానమునకు దక్కలేదు. దేవుఁడు దావీదుకుచేసిన ప్రమాణప్రకార మొక భాగముమాత్రము సొలొమోను సంతతికి నిలిచెను ($11^{9-13}$). యెహోవాకు చూపవలసిన భయభక్తుల నతఁడు చూపనందున ఇది యతనికి శిక్షగా పరిణమించెను. అహీయా యను ప్రవక్త యరొబాముకు పండ్రెండు ముక్కలుగా చింపి నతని పైవస్త్రములోని పదిముక్కలనిచ్చి యిశ్రాయేలీయులలోని 10 గోత్రములవారి కతనిని అధిపతిగాఁ చేయఁబోవుచున్నాఁడనుట ఈ శిక్షకు సంబంధించినదే (I రాజు $11^{28-39}$). అప్పటి నుండి సొలొమోను యరొబామును ద్వేషించి వానిని చంపఁజూచెను. సొలొమోను మరణమై రెహబాము రాజ్యమునకు వచ్చునంత దనుక యరొబాము పారిపోయి పరాయిదేశములలో బ్రదుకవలసివచ్చెను.

సొలొమోనుచేసిన రెండవ పొరపాటంత గొప్పదిగా కనఁబడకున్నను చాల ముఖ్యమైనది. తాను వైభవముగా జీవించు నిమిత్తము ప్రజలు మోయఁజాలని పన్నులను వారిపై విధించుటకై యున్నది. అందువలన వారు తరుణముఁ జిక్కిన

వెంటనే యెదురుతిరిగి వేఱుపడుటకు వీలయ్యెను (రెహబాము చూ॥).

సొలొమోను 40 సం॥ లేలి (I రాజు 11[43] II దిన 9[30,31]), క్రీ॥ పూ॥ 931 సం॥ న మృతి నొందెను. అతని జీవితమును పనులును సొలొమోను కార్యములనుగూర్చిన గ్రంథమందును (I రాజు 11[41]), ప్రవక్తయైన నాతాను రచించిన గ్రంథమందును, నెబాతు కుమారుడైన యరొబామునుగూర్చి షిలోనీయుడైన అహీయా రచించిన ప్రవచన గ్రంథమందును, జ్ఞానదృష్టిగల ఇద్దోకు కలిగిన దర్శనముల గ్రంథమందును లిఖితమై యున్నవి (II దిన 9[29]).

సొలొమోనుయొక్క గొప్పజ్ఞానము వైభవములనుబట్టి జ్ఞానమును (మ 12[42] లూ 11[31]), వైభవమును (మ 6[29] లూ 12[27]) గూర్చిన ప్రశంసలలో అతనిపేరుసెత్తి చెప్పుట వాడుకయ్యెను.

**సొలొమోను నగరు** యెరూషలేము B III 2 చూ॥.

**సొలొమోను కట్టించిన ప్రాకారము** యెరూషలేము B III 7 చూ॥

**సొలొమోను మంటపము** దేవాలయము IV 3 (3) చూ॥

**సొలొమోను సేవకులు, దాసులు** (Solomon's Servants). నెతీనీయులతో చేర్చబడిన యొకతెగవారికి సొలొమోను సేవకులు లేక సొలొమోను దాసులు అను పేరు పెట్టిరి. జెరుబ్బాబెలుతోకూడ వారు చెఱనుండి తిరిగివచ్చిరి (ఎజ్రా 2[55-58] నెహె 7[57-60]). అచ్చట వారిపేర్లు కొన్నిగలవు. ఆ పేళ్లనుబట్టి అవి హెబ్రీయుల పేరులుగాక అన్యపేరులకు సంబంధించినవని శాస్త్రజ్ఞులుగుర్తించిరి. అందుచేత తన కూలిపనిచేయుటకు సొలొమోను నియమించిన (I రాజు 13[18] 9[21]) కనానీయుల సంతతివారై యుండవచ్చునని తోచును (నెతీనీయులు చూ॥).

## సో

**సో** (So). ఐగుప్తురాజులలో నొకడు. క్రీ॥ పూ॥ 724 లో ఇశ్రాయేలువారగు పదిగోత్రములవారు, అష్షూరువారిని ఎదిరించుటకు ఈ రాజు సహాయమును కోరిరి (II రాజు 17[4]). అష్షూరు చక్రవర్తి దీనిని తెలిసికొని ఇశ్రాయేలుమీఁద యుద్ధముజేసి షోమ్రోనును జయించి నాశము జేసెను. సో అను ఈ రాజుపేరు ఐగుప్తురాజుల జాబితాలలో కనఁబడదు. అయితే ఐగుప్తులో ఆ కాలమునందు "శిబి" (సి వి హెబ్రీ భాషయం దీరెండు హల్లులును సో అను పేరులో కనఁబడును) అనువాఁడు సైన్యాధిపతిగా నుండెనని అష్షూరు రాతి శాసనములలో కనఁబడును. ఇతఁడే సో అనువాఁడని సాధారణముగా నభిప్రాయపడుచున్నారు.

**సోదీ** (Sodi = నెశ్చైనవాఁడు). మోషే పంపిన వేఁగులవారిలో నొకఁడు. జెబూలూను గోత్ర ప్రతినిధి (సంఖ్యా 13[10]).

**సోదె** (Divination). హెబ్రీభాషలో శకునమను అర్థమిచ్చు మాటలకు భాషాంతరముగా నుపయోగింపఁబడిన పదము (లేవీ 20[27] సంఖ్యా 22[7] ద్వితీ 18[10] యెహో 13[22] II దిన 33[6] యెష 44[25] యిర్మీ 27[9] I సమూ 15[23] యెహె 12[24] మీకా 3[6,7-11] జెక 10[2] కార్య 16[16]). శకునమును దాని ఫలమును అనఁగా చిల్లంగితనము గారడము కర్ణపిశాచము అను మాటలకును ఈ మాటకును ఒకటే యర్థము. ఈ పదమునకు తెలుఁగులో అదృష్టము చెప్పుటయని భావము (చిల్లంగితనము, మంత్రవిద్య, నేరములు శిక్షలు I 6, 7 చూ॥). B.

**సోపత్రు** (Sopater = కులీనుఁడు). బెరయ క్రైస్తవులలో నొకఁడు. పౌలు తన మూఁడవ ప్రయాణమునుండి తిరిగివచ్చునప్పుడు ఇతఁడు ఆసియ మట్టుకు వెళ్లెను. బహుశః యెరూషలేము దనుక వెళ్లియుండును (కార్య 20[4]). ఇతఁడు పుర్రుకుమారుఁ డనఁబడుటచే గొప్ప కుటుంబమున పుట్టినవాఁడని కొందఱును కొందురు. రోమా 16[21] లో నుండు సోసిపత్రు ఇతఁడై యుండవచ్చును. (సోసిపత్రు చూ॥).

**సోపు** (Anise). పరిసయ్యులు శాస్త్రులు పదియవవంతును చెల్లించిన (మ 23[23]) స్వల్పమైన వానిలో నొకదానికి తెనుఁగు తర్జుమదైయున్నది. అది సోపుగింజయో లేక వాముగింజయో దాని

గూర్చి సందేహముకలదు. ఎటులనైనను ఆ రెండును కొద్ది విలువగలవానిని సూచించును.

**సోపెరెతు** (Sophereth = వ్రాయువారికి సంబంధించినది). సెలీనీయులలో నొకతెగవారు. వీరిలోఁ గొందఱు చెరనుండి తిరిగి వచ్చిరి (ఎజ్రా $2^{55}$ = నెహె $7^{57}$).

**సోబా** (Zobah = మకాము? **Aram-zoba**).

సిరియదేశములో నొకభాగము. సౌలు నెదిరించినవారిలో సోబా రాజులు నుండిరి. (I సమూ $14^{47}$). అమ్మోనీయులు దావీదుతో యుద్ధమాడినప్పుడు వారు సోబావారిని ఇతరు లనేకులను జీతమునకు పిలిపించుకొని పోరాడిరి గాని లాభములేక ఓడిపోయిరి (II సమూ $10^{6-8}$). దావీదు మఱియొకసారి సోబారాజగు హదదెజెరును ఓడించెను (II సమూ $8^{3}$). దావీదు యోధవర్గములోని ఇగాలు సోబావాఁడే (II సమూ $23^{36}$). ఈ దేశము దమస్కునకు దక్షిణమున నున్నదని కొందఱి యభిప్రాయము. అష్షూరు రాతి శాసనములలో సుబితి (*Subiti*) యను దేశమున్నది. అదే సోబాయని వారి తలంపు. గాని లెబానోను పర్వతప్రాంతములయందున్నదను అభిప్రాయము సాధారణమైనది.

**సోయను** (Zoan). ఐగుప్తులోని పురాతన పట్టణములలో నొక ముఖ్యమైనది. అది ఐగుప్తుదేశమునందు ఈశాన్యముగా నుండెను. ఐగుప్తీయులు దానికి జాని (*Zani*) యనియు, గ్రీకులు తాని (*Tani*) యనియు పిలిచిరి. అది ఐగుప్తుదేశపు సరిహద్దు దగ్గరనుండుటచేత అచ్చట గొప్పకోట నొకదానిని కట్టించిరి. ఈ పట్టణము హెబ్రోనుకన్న యేడేండ్లుముందు కట్టఁబడెను (సంఖ్యా $13^{22}$). మోషే కాలమునం దిది మిగుల ప్రసిద్ధికెక్కినది. రెండవ రామెస్సు ఈ పట్టణమందలి గొప్ప దేవాలయమునందు, చెక్కుతో తన ప్రతిమను చేయించి నిలిపెను. మోషే ఫరోయెదుట జేసిన యద్భుతకార్యములు ఈ పట్టణమునందు చేసినట్లు కనఁబడుచున్నది (కీర్త $78^{12-43}$). యెషయా కాలమునందును (యెష $19^{11-13}$ $30^{4}$), యెహెజ్కేలు కాలమునందును (యెహె $30^{14}$) ఇది ప్రసిద్ధిగనే యుండెను. దీని శిథిలములకు సాన్ (*San*), సాన్ ఎల్ హాగరు (*San-el-hagar*) అని పేరు. అక్కడ త్రవ్వగా గొప్ప ఆలయమును రామెస్సు చెక్కు ప్రతిమను కనుగొనిరి (పటము **VIII, B 2**).

**సోయరు** (Zoar = చిన్నది). మైదానపు పట్టణములలో నొకటి (ఆది $19^{20-22}$). లోతు తన కన్నులెత్తి దీనివఱకు వ్యాపించియున్న యొర్దాను బయలును జూచెను ($13^{10}$). దీని అసలుపేరు బెలా ($14^{28}$). కదొర్లాయోమెరు సొదొమ గొమొఱ్ఱాలతోపాటు దీనినికూడ పట్టుకొనెను. తక్కిన పట్టణములు నాశనమైనప్పుడు సోయరు రక్షింపఁబడెను. లోతు దాని ప్రాంతములలోనికి పోవుటకు సెలవు పొందెను ($19^{20-23}$). అతఁడీ పట్టణమునందుండలేక వెలుపలనుండు ఒక కొండగుహలో నివసించెను ($19^{30}$). యెషయా యిర్మీయాల కాలమువఱకు ఇది నిలిచియుండి మోయాబీయులకు సంబంధించి యుండెను (యెష $15^{5}$ యిర్మీ $48^{34}$). మక్కబీయుల కాలమునందది అరేబియా పెత్రకు చేరియుండెను (పురా 13. 15. 4; 14. 1. 4). మృతసముద్రపు దక్షిణకొనకు తూర్పుగా నుండెనని సాధారణముగా ననుకొందురు.

**సోరు** తూరు చూ॥

**సోసిపత్రు** (Sosipater = తండ్రిని రక్షించువాఁడు). రోమాలోని క్రైస్తవులకు వందనములు పంపినవారిలో నొకఁడు (రోమా $16^{21}$). ఇతఁడు పౌలు బంధువుడనఁబడినను, యూదుల జాతివాఁడనునదే ఆ బంధురికమని కొందఱి యభిప్రాయము. రోమా $9^{3,10}$ ఈ యభిప్రాయమున కొక సాదృశ్యమని యెంచఁదగును. ఇది సోపత్రు అను పేరుయొక్క మారురూపముగాన అతఁడును ఇతఁడును ఒక్కఁడే కావచ్చునందురు గాని అట్లు రూఢిగాఁ జెప్ప వీలుకాదు.

**సోస్తెనేసు** (Sosthenes = మంచి బలశాలి).

1. కొరింథులోని సమాజమందిరపు అధికారి. యూదులు పౌలుమీఁద తెచ్చిన వ్యాజ్యెమును.

గల్లియో కొట్టివేసిన పిమ్మట పౌలుపక్షమున నున్న వారితనిని పట్టుకొని కొట్టిరి (కార్య 18[17]).

2. పౌలుతోకలిసి కొరింథీయులకు మొదటి ఉత్తరమును వ్రాసినవాఁడు (I కొరి 1[1]). ఇతఁడు కొరింథు పట్టణస్థుఁడని దీనివలన నూహింపఁదగును. ఇతఁడు 1 లో జెప్పఁబడినవాఁడై యుండును. అట్లయినయెడల కార్య 18 లోని సంగతులు జరిగినపిమ్మట క్రైస్తవుఁడై యుండును. గాని ఇతఁడు మఱియొకఁడనియు తలంచువారును గలరు.

**సోహరు** (Zohar = ప్రకాశమైనది, Zezoar).

1. హిత్తీయుఁడగు ఎఫ్రోను తండ్రి (ఆది 23[8] 25[9]).

2. షిమ్యోను గోత్ర కుటుంబములలో నొకటి (ఆది 46[10] నిర్గ 6[15]). సంఖ్యా 26[13] I దిన 4[24] లోని జెరహు ఈ పేరుకు ప్రతిగా వాడఁబడినవి.

3. యూదావారి సంబంధికులగు కుటుంబములలో నొకటి (I దిన 4[7]).

## సౌ

**సౌలు** (Saul = దేవునివలన అడుగఁబడినవాఁడు).

1. ఇశ్రాయేలీయుల మొదటిరాజు. తండ్రి పేరు కీషు. బెన్యామీను గోత్రీకుఁడు (కీషు చూ॥). మిగుల ఎత్తరి. ఇశ్రాయేలీయులు వృద్ధుఁడైన సమూయేలు కుమారులుచేయు అన్యాయముల కోర్చలేక, చుట్టుపట్లనున్న జనాంగములను జూచి వారివలె తమకు నొకరాజుండుట మంచిదని కోరుకొని సమూయేలుతో మనవి జేయఁగా, అతఁడు మిగుల దుఃఖితుఁడై, రాజు వలన వారికి కలుగఁబోవు కీడులను దెలిపినను వారు విననొల్లక పోయినందున, దేవునిచే ప్రబోధితుఁడై కొన్ని నాళ్లలోనే వారికోరిక ప్రకారము చేతునని చెప్పిపంపెను. అట్టి సమయమున తనతండ్రి గార్దభములలో మూఁడు తప్పిపోయినందున వానిని వెదుకబయలుదేరి, వెదకివెదకి వేసారి, తిరుగ తన తండ్రియొద్దకు వెళ్లనై యుండఁగా, అతని వెంట నున్న సేవకుఁడింకొకమారు యత్నించి చూతమనెను. వారికి కనఁబడిన వారిలో నొకరు సమీప గ్రామమందున్న దైవజనుఁ డొకఁడు కావలసిన ఏ సంగతిని గుఱించియైనను తెలుపునవఁగా వీరిద్దరును కలిసి అతనియొద్దకు వెళ్లిరి. ఆ దైవజనుఁడు సమూయేలే. ఇశ్రాయేలీయులకు రాజు కాఁబోవు బెన్యామీనీయుఁ డొకఁడతనియొద్దకు వచ్చునవియు, వాని నిశ్రాయేలీయులపై రాజుగా నభిషేకించుమనియు దేవుఁడతని కిదివఱకే దెలిపియుండెను. సౌలును అతని యింటివారును సమూయేలునుగూర్చి యిది వఱకే వినియుండిరిగాని చూచి యున్నట్లు కనఁబడదు (I సమూ 10[14-16]). దైవజనునికి కనపర్చవలసిన మర్యాదనుగూర్చి సౌలు చెప్పినను, అతనిని కలిసికొన్నప్పుడు గుర్తు పట్టఁజాలకపోయెను (9[18,19]). సమూయేలతనితో గార్దభములు దొరికినవని చెప్పినమీఁదట, అతఁ డిశ్రాయేలీయుల రాజగునని సూచాయగాఁదెలిపి బల్యర్పణ జరిగినపిమ్మట చేసినవిందులో ప్రధానస్థలమున నతనికూర్చుండ బెట్టెను. అతఁడప్పటికి దాదాపు 35 సం॥ ల ప్రాయము గలిగినవాఁడు. మరుసటి ఉదయమున అతఁడు వెళ్లనైయుండఁగా సమూయేలతని శిరస్సుపై నూనెఁబోసి అతని నభిషేకించి "యెహోవా నిన్ను అభిషేకించి తన స్వాస్థ్యముమీఁద అధిపతిగా నిన్ను నియమించి యున్నాఁడు" అని చెప్పెను. దీని నెవరితోడను చెప్పవద్దనియు, తగిన కాలమునందు గిల్గాలుకు పోయి తాను వచ్చువఱకు 7 దినములు కనిపెట్టి యుండవలసినదనియు, తానువచ్చి బలులర్పించి చేయవలసి కర్తవ్యము నుపదేశించెదననియు తెలిపెను (I సమూ 9[20]-10[16]). త్వరలోనే సమూయేలు మిస్పాకు ప్రజలను బిలువనంపి చీట్లు వేయఁగా సౌలు ఏర్పఱచఁబడెను గాని, ఎంతకును అతఁడు కనఁబడఁడాయెను. అతనిని వెదకి పట్టుకొనివచ్చి నిలువఁబెట్టినప్పుడు భుజములు మొదలుకొని పైకి ఇతరులకంటె యెత్తయినవాఁడుగ కనఁబడెను. జనులతనిజూచి, ఉత్సాహపూరితులై "రాజు చిరంజీవియగుగాక" యని కేకలువేసిరి. ప్రజలందఱును చూచి మెచ్చునట్టి ఆకారముగలవాఁడు రాజుగ నియమింపఁబడెను. ఉత్తర దక్షిణ ప్రాంతములయందుండు వారందఱును

సమ్మతిపడునట్లుగా యూదా ఎఫ్రాయిము గోత్ర సరిహద్దులలో నుండు భాగమగు బెన్యామీను ప్రాంతములయందలివాఁడు దేవునిచే నేర్పాటు అయ్యెను. దైవభక్తిగలవారందఱును వచ్చి చేర నట్లు సమూయేలీ యేర్పాటునంతయు దేవుని చేతులకే యప్పగించెను. దేవునియందు భయ భక్తులు గలవారిలో ననేకులు ఆయనమాటకు విధేయులై సౌలును అతని యింటివఱకు సాగ నంపిరిగాని దుర్మార్గులలోఁ గొందఱు దీనికింత మాత్రమును సమ్మతించక అతనిని నిర్లక్ష్యముచేసిరి. సౌలీ కలతలెల్లను అణగిపోవువఱకు తన ఇంటనే యుండి యెప్పటివలె పనిపాటులు చేసికొను చుండెను. ఒక మాసమైనపిదప యాబేష్గిలాదను పట్టణము అమ్మోనీయులచే ముట్టడింపఁబడి మిగుల దీనావస్థయందుండెను. ఆ పట్టణస్థులు బహు దీనముగ బ్రతిమలాడినందున శత్రువులు వారు వెళ్లి సహాయము దెచ్చుకొనుటకు వారముదిన ములు గడువిచ్చిరి. వారిలోఁ గొందఱు గిబి యాకు వచ్చి తమ దురవస్థను జెప్పుకొనిరి. పొలమునుండివచ్చిన సౌలీవార్తను వినెను. దేవుని యాత్మచే నతఁడు పురికొల్పబడి తమ సహోదరు లకు సహాయపడనై తనను సమూయేలును వెంబ డించుఁడని గోత్రగోత్రమునకు కబురు చేసెను. యాబేషుపట్టణము సకాలమున రక్షింపఁబడెను. ప్రజలప్పుడు సౌలును రాజుగా నియమించు కొనుటకు సమ్మతింపని వారెక్కడనని విచా రించిరి. అక్కడికి సమీపముగానున్న బలు లర్పించు స్థలమగు గిల్గాలున కతనిని గొనిపోయి అతనిని పనిలో ప్రవేశపెట్టిరి. సమూయేలు తన పనినుండి చాలించుకొని సెలవు పుచ్చుకొనెను. (I సమూ $11^{1}$-$12^{25}$ సమూయేలు గ్రంథములు చూ॥).

సౌలు ఏలుబడి:—హెబ్రీ బైబిలునందు I సమూ $13^{1}$ నందు సంఖ్యవేయఁబడనందున రాజ్యమేల నారంభించునప్పటికి సౌలు వయ స్సెంతయో చెప్పుటకు వీలులేకున్నది. LXX వలన అప్పటి కతనికి 30 సంవత్సరముల వయస్సని తెలియుచున్నది. ఏ దెట్లున్నను అప్పటికి యుద్ధములయందు సైన్యములను నడిపించుటకుఁ దగిన ప్రాయముగల కుమారుఁడతని కుండెను. 3000 మంది శూరులగు స్థిరమగు సైన్యము నొక దానిని సౌలేర్పాటు చేసికొనెను. వీరిలో 2000 మంది అతనియొద్దనుండి మిక్మషు బేతేలులలో సంచరించిరి. మిగిలిన 1000 మంది యోనా తాను అధిపత్యముక్రింద గిబియాలో నుండిరి (I సమూ $13^{2}$). యోనాతాను ఒకనాడు గిబా లోని ఫిలిష్తీయుల దండును హతము చేసెను ($13^{3}$). ఫిలిష్తీయు లీ సంగతినిగూర్చి వినిరి. వారి దృష్టిలో నిశ్రాయేలీయులు హేయులైరి. ఇశ్రాయేలీయులు తమ యిబ్బందిని గుర్తించిన వారై సౌలు సైన్యమున జేరవలసినదను వార్త విని వెంటనే గిల్గాలునందు అతనిని కలిసికొనవెళ్లిరి ($13^{3,4}$). ఇచ్చటికే తాను వచ్చి వారి నిమిత్తము దేవుని వేడుకొందునని సమూయేలు సౌలునకుఁ దెలియజేసియుండెను ($10^{8}$ $13^{8-11,12}$). ఫిలిష్తీ యుల సైన్యమొకటి దేశముమీఁదకువచ్చి మిక్మ షులో దండు విడిసెను. ఇశ్రాయేలీయులు భయాక్రాంతులైరి. సమూయేలు రాకుండ ఉద్దేశపూర్వకముగానే జాగుచేసెను. అందు వలన ప్రజలు రాజును విడిచిపెట్టి చెల్లాచెదురగు చుండిరి. ఫిలిష్తీయులు మీఁదఁ బడునట్లుండిరి ($13^{8,11,12}$). సౌలు ఓపికపట్టి యుండఁజాలక బలులర్పించెను. అతఁడు బలులర్పించుటను ముగించకమునుపే సమూయేలు వచ్చెను. జరిగినది చూచి దేవునియాజ్ఞ ($10^{8}$) మీఱినందులకు గద్దించి అతని సంతతివారికి రాజ్యము దక్కఁ దనియు, వారసులు కానేరరనియుఁ దెలిపెను. ($13^{9,14}$). అటుపిమ్మట రాజుకు దగ్గరగా నుండ వలెనను ఉద్దేశముతో సమూయేలు గిబియాకు వెళ్లెను. సౌలు యోనాతానులు తమ సైన్యము లతో బెన్యామీను గిబాయొద్ద నుండిరి. ఫిలి ష్తీయు లింకను మిక్మషునుండి కదలనేలేదు. ఆ దినములలో యోనాతాను చేసిన యొక పరా క్రమ కార్యము ఫిలిష్తీయుల దండును కళవళ పఱచి వారి సైన్యమంతటికిని, వారి దోపుడు గాండ్రకును భయము గలిగించెను. సౌలీతరుణ మును వృథాగాఁ బోనియ్యక శత్రువులఁ దఱిమి సంహరించి విజయమును గైకొనెను ($13^{15}$ $14^{46}$). తరువాత సమూయేలు అమాలేకీయుల నందఱిని సమూల ధ్వంసము చేయుమని దేవు నాజ్ఞను తెలియఁబఱచెను. సౌలీ పనిఁ బూనుకొని వెళ్లి యుద్ధము చేసెనుగాని యెహోవా యర్పణకని

శ్రేష్ఠమైన పశ్వాదులను చంపక వానిని గిల్గాలుకుఁ దెచ్చెను. అమాలేకీయుల రాజగు అగగును కూడ సంహరింపలేదు. రెండవమారిట్లతఁడు అవిధేయుఁడై దేవుని సాధనముగా నుపయోగింపఁబడుటకు తగనివాఁడైనట్లు కనఁబఱచుకొనుటయే గాక దేవుని రాజ్యమునందు తన స్వంత యిష్టప్రకారము ప్రవర్తింపఁదలఁచినందున రాజుగాకుండ త్రోసివేయఁబడెను (15[1,35] సమూయేలు గ్రంథములు చూ॥). తరువాత. సమూయేలు దావీదును రాజుగా నభిషేకించునట్లు దేవుఁడతనిని బేత్లెహేమునకుఁ బంపెను (16[1,13]). దేవుని యాత్మ సౌలును విడిచినందున అతఁడొక దురాత్మచే పీడించఁబడెను. రాజునకుఁ గలిగిన యీ దురవస్థను దొలగించుటకై వీణెను చమత్కారముగా వాయించి పాడఁగలిగినవాఁడొకఁడు కావలసి వచ్చినందున సౌలు సేవకులు దావీదు నీ పనికై గొనితెచ్చిరి (16[14,23]). గొల్యాతును జంపిన పిదప జనులు దావీదును కొనియాడుట విని సౌను అనూయాగ్రహావేశుఁడైనందున కొలఁదికాలములోనే నీ యౌవనుఁడు దేశభ్రష్టుఁడు కావలసివచ్చెను. సౌలతని నొక దిక్కున నుండనియ్యక చెప్ప శక్యముగాని క్రోధముతో దరిమెను (I సమూ 17-30, దావీదు చూ॥). చివరకు అంతము సమీపించెను. ఫిలిష్తీయులు తమ సైన్యములన్నిఁటిని కూర్చుకొని దేశముపై దండెత్తివచ్చి యెజ్రెయేలు లోయ సమీపమందున్న షూనేమునందు దిగిరి. సౌలు వారితో యుద్ధము జేయఁదలంచి తన సైన్యమును దీసికొని వెళ్లి గిల్బోవ కొండదగ్గర విడిసెను. అతనికన్నియు అపశకునములుగనే దోఁచెను. అందువలన నా రాత్రియే లేచి ఫిలిష్తీయుల దండుమీఁదుగా వెళ్లి ఎన్దోరులోని కర్ణపిశాచము గల యొక స్త్రీయొద్ద విచారించెను. అతఁడును అతని ముగ్గురు కుమారులును మరుసటి దినమే యుద్ధభూమినందు కూలెదరనువార్త నతఁడు దెలిసికొనెను (28[1,25]). ఆ దుర్దినమే తెంచెను. యుద్ధమారంభమయ్యెను. ఫిలిష్తీయులలోని విలుకాండ్రు ఇశ్రాయేలీయులలో బహుమందిని హతముజేసిరి. సౌలుయొక్క ముగ్గురు కుమారులను చంపిరి. వారిలో శౌర్యనిధియు స్వార్థత్యాగియునగు యోనాథా నొకఁడు, సౌలు కూడ సహస్రగాయముల నొందినవాఁడై ఫిలిష్తీయుల చేతఁబడుట కిష్టములేక తనను పొడిచి చంపుమని ఆయుధములను మోయువానిఁ గోరెను గాని వాఁడొప్పనందున తనను తాను పొడుచుకొని మరణమయ్యెను. జయశాలురగు ఫిలిష్తీయులతని శవమును కనుగొని శిరస్సును ఛేదించి శరీరమును అతని కుమారుల శరీరములలోఁ గలిపి బేత్షెయాను పట్టణపు గోడలకు వ్రేలాడఁగట్టిరి. అతని కవచములను ఆయుధములను అష్తారోతుదేవి గుడిలో జయసూచకములుగా నుంచిరి. యాబేష్గిలాదువారు అతని యేలుబడి ఆరంభమున తామతనివలన పొందిన మేలును జ్ఞప్తిజేసికొని కృతజ్ఞతతో నిండినవారై రాత్రియంతయు నడచి యొర్దానునదిని దాటి బేత్షెయానులో తగిలింపఁబడియున్న శవములను దింపి మర్యాదగా భూస్థాపితము జేసిరి. ఈ కఠోరవార్త విన్న దావీదు దుఃఖాక్రాంతుఁడై యెహోవావలన నభిషేకింపఁబడిన వాఁడగు సౌలు తన ప్రియమిత్రుఁడగు యోనాతానుల విషయమై నొక పద్యమును రచించెను (I సమూ 3[1], II సమూ 1). సౌలు రాజ్యపరిపాలనకాలము పాఁత నిబంధనయందుదాహరింపఁబడక పోయినను పౌలును యోసీఫసును అది 40 సంవత్సరములని దెలుపుచున్నారు (కార్య 13[21] పురా 6. 14. 9).

సౌలు, ఎన్దోరు స్త్రీ:— I సమూ 28[3,19] లో నున్నట్లు సౌలు, ఎన్దోరులోని స్త్రీ యొద్ద తన గతిని గుఱించి విచారించుటకై వెళ్లిన సందర్భమందుదాహరింపఁబడిన దుప్పటి కప్పుకొనిన ముసలివానినిగూర్చి మూఁడు విధములుగా చెప్పెదరు. వాడు ఆమెతో చేరికైనవాఁడనునది యొక అభిప్రాయము. వాఁడు కనఁబడినప్పు డామె కేక వేసి తనయొద్ద విచారణచేయుటకు వచ్చినవాఁడు సౌలు అని చెప్పెను. ఆ కేక సహజముగా నితరులను మోసగించుటకు వేయునట్టిది. సౌలా ప్రాంతములలోనే యున్నాఁడని ఆమె అప్పటి స్థితిగతులనుబట్టి యొఱిఁగియుండెను. అతఁడు తన యింటికి వచ్చినప్పుడే అతని ముఖవర్చస్సును, కీవిని, మాటను అతనివెంట వచ్చిన సేవకులను గుర్తించి వెంటనే అతఁడు సౌలని యామె నిశ్చయించుకొనెను,

అట్లు గానియెడల, ఆమె తలంచనిరీతిగా ఆ కనఁబడినది నిజముగానే ఆత్మయై యుండును. అందువలన ఆమె భయపడి అట్టి కేకనువేసెను. అది యామె అనుకొనని విధమున కనఁబడినదైన యెడల దయ్యమైనను గావచ్చును లేక సమూయేలే తరువాత మోషే ఏలీయాలు రూపాంతర సమయమున కనఁబడిన రీతిగా వచ్చియుండ వచ్చునని అనేకుల యభిప్రాయము. కనఁబడినది సమూయేలేనని గ్రంథకర్త వ్రాయుటయు (I సమూ $28^{14,15,16,20}$), ఆ మాటలు నెఱవేఱుటయు అట్టి యభిప్రాయమునకు ఆధారములుగ నున్నవి. ఈ సంగతిని వ్రాసినవాఁడు జరిగినదేమో వ్రాసెను. ఆ స్త్రీ ధర్మశాస్త్రమునకు భిన్నముగా ప్రవర్తించునదను సంగతి మఱువరాదు. ఆమెమాత్రమే ఆ దర్శనమును చూచి దుప్పటి కప్పుకొనిన యొక ముసలివాఁడు భూమిలోనుండి పైకి వచ్చుచున్నాఁడని ఆమె యతనిని యొకమాదిరిగా వర్ణించెను. ఎట్టి ముసలివాఁడైనను ఇదే యాకారముగ నుండును గాని సౌలుమాత్రము అది సమూయేలే యని తలంచెను. బట్ట కప్పుకొనిన యితఁడు చెప్పిన మాటలు అదృష్టము చెప్పెడివారు చెప్పు మాటల వలె ధైర్యముగా చెప్పఁబడెను. ఈ మాటల ప్రకారముగానే జరిగెను గాని చాలమట్టునకవి సౌలుచేసిన కార్యములకు ఫలితములై యుండెను. సమూయేలు కనఁబడుటయే నిజమైన పక్షమున చనిపోయినవారి యాత్మలు వచ్చి మానవులతో మాట్లాడిన దీ యొక్కటిమాత్రమే బైబిలునందుదాహరింపఁబడినది. రూపాంతర సమయమున మోషే ఏలీయాలు క్రీస్తుతో మాట్లాడినది దీనికి సంబంధించినది కాదు. సౌలుకు ప్రవక్తల ద్వారాగాని స్వప్నములద్వారాగాని ప్రత్యుత్తర మీయక ఉన్నకాలమునందు దేవునియాజ్ఞకు వ్యతిరిక్తముగాను, ధర్మశాస్త్రమువలనను దేశచట్టములవలనను నిషేధింపఁబడినరీతిగా కర్ణపిశాచములుగల స్త్రీ ప్రోద్బలమువలన సమూయేలు వచ్చి సౌలుకు దర్శనమిచ్చి మాటలాడుట విపరీతముగాఁ దోఁచుచున్నది (నిర్గ $22^{18}$ లేవీ $20^{27}$ ద్వితీ $18^{10,14}$ I సమూ $28^{3,9}$ I దిన $10^{13}$).

2. అపొస్తలుఁడగు సౌలుయొక్క మొదటి పేరు (కార్య $7^{58}$ $13^{9}$, పౌలు చూ॥).

# స్కె

**స్కేవ** (Scava). ఎఫెసు పట్టణమందు దయ్యములను వెళ్లఁగొట్టుచుండిన యేడుగురి తండ్రి (కార్య $19^{14,15}$). ఎలుమ ($13^{8,9}$) గారడీ సీమోనుల ($8^{18,19}$) వంటి నరులు. స్కేవ ప్రధాన యాజకుఁడనఁబడెను. అతఁడు ప్రధాన యాజకుని బంధువర్గమునఁ జేరియుండును. మంత్రముల నుపయోగించిన యూదులా కాలమున ననేకులుండిరి. పౌలు క్రీస్తుపేరట వానిని వెళ్లఁగొట్టుచుండఁగా స్కేవ కుమారులు అతఁడుపయోగించు మంత్రము చాల బలమైనదనుకొని అట్లు చేయఁబోయి భంగపడిరి. క్రీస్తును విశ్వసించుట వలననేగాని మంత్రబలమున అట్టి పనులు సాగవని దీనివలన కనఁబడుచున్నది.

# స్ట, స్త

**స్టకు** (Stachys = కంకి). పౌలు తన వందనములంపిన రోమా క్రైస్తవులలో నొకఁడు (రోమా $16^{9}$).

**స్తంభము** (Pillar). ఒక స్థలము పరిశుద్ధమైనదని సూచించుటకు ఆదికాలమునుండి దానికి జ్ఞాపకార్థముగా రాళ్లు కట్టుచువచ్చిరి. అట్టి రాళ్లకు స్తంభములను పేరు పెట్టిరి (ఆది $28^{18}$). ఆ రీతిగనే యెహోవాకు జ్ఞాపకార్థముగా ఐగుప్తులో స్తంభములను కట్టుదురని యెషయా ప్రవచించి ($19^{19}$), ఆ దేశము యెహోవా పూజ నవలంబించునని తెలియజేసెను. అన్యుల గుళ్లలో నిట్టి స్తంభములు విశేషముగా నున్నవి. వానిని పడఁగొట్టవలెనని ఇశ్రాయేలీయులకు ఆజ్ఞయయ్యెను (నిర్గ $23^{24}$. ఇందులో విగ్రహములు అట్టి స్తంభములను సూచించెనని అసలుపదము వలనఁ దెలియును). ఇది నిషేధమైనను పది గోత్రములవారును (హోషే $3^{4}$ $10^{1,2}$), యూదావారును (మీకా $5^{13}$) వానిని కట్టి పూజించినట్లుగా ప్రవక్తలు వారిని గద్దించిన దానినిబట్టి తెలియుచున్నది (అషేరా చూ॥).

గొప్ప చరిత్ర సంగతులకు జ్ఞాపకార్థముగా నిట్టి స్తంభములను నిలుపుట ఆదినుండియు వాడు

కర్రైయున్నది (ఆది $31^{45}$ II సమూ $18^{18}$). యెహో $4^{58}$ I సమూ $7^{12}$ లో రాళ్లతో కట్టినవి ఇట్టి స్తంభములైయున్నవి. ఈ విధముగా మోషే 12 గోత్రములకు జ్ఞాపకార్థముగా సీనాయి దగ్గర కట్టిన వేదికకు 12 స్తంభముల నుంచెను (నిర్గ $24^{4}$).

ఇండ్లను కట్టునప్పుడు స్తంభములను పెట్టుకొనుటయు సర్వసాధారణ విషయము. కమానులను వాడని యిండ్లలో స్తంభములను నిలిపితీరవలెను. గుడారమునందు స్తంభములు గలవు (నిర్గ $26^{32}$). సమ్సోను పడఁగొట్టిన ఫిలిష్తీయుల పెద్దకట్టడము స్తంభములమీఁద నిలిచెను (న్యాయా $16^{26}$).

స్తంభములు స్థిరతను సూచించును. ఈ భూమి స్థిరమైనదని సూచించుటకు అది స్తంభములమీఁద కట్టఁబడినట్లుగా దృష్టాంతములున్నవి (I సమూ $2^{8}$ యోబు $9^{6}$ $36^{11}$). సంఘమును స్థిరపఱచువారు ఆ రీతిగనే సంఘమునకు స్తంభములనఁబడెదరు (గల $2^{9}$ ప్రక $3^{4}$). సంఘము సత్యము నుద్ధరించుటచే అది సత్యమునకు స్తంభమును ఆధారమునై యున్నది.

**స్తంభములుగల మంటపము** యెరూషలేము B, III 5 చూ॥

## స్తు, స్తె, స్తో

**స్తుతి, స్తుతించుట** స్తోత్రము చూ॥

**స్తెఫనా** (Stephanus = కిరీటి).

కొంచెము స్థితిమంతుఁడైన కొరింథీయుఁడు. ఇతఁడును ఇతని కుటుంబమువారును పౌలుచే బాప్తిస్మము నొందిరి. అకయయొక్క ప్రథమ ఫలమనఁబడిరి (I కొరి $16^{15}$). పౌలు కొరింథీయులకు వ్రాసినప్పు డితఁడు పౌలు దగ్గరనుండి సువార్తసేవయందు సహాయము చేయుచుండెను.

M.

**స్తెఫను** (Stephen = కిరీటము *Stephanus* = కిరీటి). ఆదిక్రైస్తవ సంఘమందలి యేడుగురు పరిచారకులలో నొకఁడు (కార్య $6^{5,6}$). అతని పేరునుబట్టి గ్రీకు దేశములలో నేదో యొకదానియందు నివసించిన యూదుఁడని యూహింపఁదగును. ఆత్మ పరిపూర్ణుఁడై ($6^{5-8}$). తాను ధర్మ ద్రవ్యమును పంచిపెట్టుటకు నియమింపఁబడినవాఁడైనను అన్యదేశములనుండి వచ్చిన యూదులు కూడుకొనిన సమాజమందిరములలో ముఖ్యముగా బోధింప నారంభించెను ($6^{9}$). అతఁడెట్లు బోధించెనో వ్రాయఁబడక పోయినను, మోషే నియమితాచారములు మాఱుననియు, దేవాలయము నిత్యము నిలువదని తెలిపినట్లు యూదు లతనిపై మోపిన నేరములవలనను ($6^{11-14}$) అతఁడు మహాసభయెదుట చెప్పుకొనిన సమాధానము ($7^{1,53}$) వలన నూహింపవచ్చును. ఈ నేరములనుబట్టి యూదులతనిని రాళ్లతోఁ గొట్టి చంపిరి. ఇతఁడే మొదటి క్రైస్తవ హతసాక్షియాయెను. తన ప్రభువువలె తనను చంపిన వానిని దేవుఁడు క్షమింపవలెనని వేఁడుచు పరలోకగతుఁడయ్యెను ($7^{54-58}$). రోమీయులు యూదులు విధించిన శిక్షను ఖాయముచేయని యెడల వారొకని చంపకూడదను నియమమున్నను (యోహా $18^{31}$). వారట్లు చేసినందున స్తెఫనును చంపినది అల్లరి మూకయేగాని క్రమమగు సభ కాదని చెప్పవచ్చును. క్రీస్తుమతము అందఱికొఱకైనది కావున యూదుల ఆచారములును, ఆరాధనస్థలమును అవసరములు కావని తేటగా బోధించిన వారిలో స్తెఫను మొదటివాఁడు. అతని చంపువారిబట్టలకు కావలి కూర్చున్న యౌవనుఁడగు పౌలు ఆ బోధనే తరువాత ధారాళముగా బోధించుటమాత్రమేగాక సంఘమును అన్యులలో స్థాపించుటచే దానిని బలపఱచెను. ఆ పనికి స్తెఫను మార్గదర్శకుఁడగుటచే లూకా అతని చరిత్రనంత వివరముగా వ్రాసెను. పౌలతనిని చంపుటలో పాలివాఁడైనందున తాను క్రైస్తవుఁడైన పిమ్మట అది అతనికి గొప్ప చింత ($22^{20}$) యైనను, ఆ సమయమున కది సౌలును విజృంభింపజేసి, క్రైస్తవులైనవారిని అన్యదేశములకు చెదరగొట్టి అట్లు దాని వ్యాపింప చేయుటకును దైవికముగా నొక కారణమయ్యెను ($8^{1-4}$ $11^{19}$).

**స్తోత్రము, స్తుతి** (Praise). దేవుని స్తోత్రించుట ప్రార్థించుటయు నొక ముఖ్య విషయము (ప్రార్థన చూ॥). కీర్తనలను పాడుచు దేవుని స్తోత్రించుటనుగూర్చి విశేషముగా బైబిలునందు కనఁబడును. పాఁత నిబంధనయందును,

క్రొ్త్త నిబంధనయందును అట్టి స్తోత్రములను సూచించెడి పదములు కనీసము 12 గలవు. హాలాల్ (*Hala'l*) అనునదొక ముఖ్యమైన పదమైయున్నది. కీర్తనల గ్రంథమునకు మూల భాషయందు తెహిల్లీమ్ (*Tehillim*) స్తోత్రములు అను పేరును పెట్టిరి. హల్లెలూయా (=యెహోవాకు స్తోత్రము) అను పదమునందును మన మీ మాటను చూడవచ్చును. దాదాపుగా అన్ని కీర్తనలలో స్తోత్రములుండినను ముఖ్యముగా 24[7-10] 26[6,7] 47, 67, 92, 93, 99,100, 113, 116-118, 145, 148, 150 కీర్తనలు స్తోత్రగీతములనఁదగును. పాఁత నిబంధనలోని యితర స్తోత్ర గీతము లెవ్వియనఁగా:—ఎఱ్ఱసముద్రమును దాటిన పిమ్మట మిర్యాము పాడినగీతము (నిర్గ 15), దెబోరా, సీసెరా నోడించిన పిమ్మట రచించినది (న్యాయా 5). కుమారుఁడు కల్గినపిదప హన్నా పాడిన గీతము (I సమూ 2). కష్టములలో నుండి తప్పింపఁబడిన పిమ్మట దావీదు రచించినది (II సమూ 22=కీర్త 18). యోనా విడుదల నొందినందున చేసిన గీతము (యోనా 2). హబక్కూకు స్తోత్రగీతము (హబ 3). యెషయా లోని గీతములు (యెష 12, 25, 26 మొ॥) ముఖ్యములైనవి.

క్రొ్త్త నిబంధన అట్టి స్తోత్రగీతములతో నారంభమగును (లూ 1[46-55,68-79], 2[14,29,32]) ఇవి చాలవఱకు పాఁత నిబంధనలోని స్తోత్రగీతముల ననుసరించును. ఇవిగాక క్రొ్త్త నిబంధనయందనేక స్తోత్రవాక్యములు గలవు. (గల 1[5] రోమా 1[25] 9[5] 11[33-36] 16[25-27] II కొరి 11[31] ఫిలి 4[20] ఎఫె 3[20,21] I తిమో 1[17] 6[15,16] II తిమో 4[18] I పేతు 4[11] 5[11] II పేతు 3[18] యూదా [24,25] హెబ్రీ 13[21] ప్రక 1[5,6] 4[8-11] 5[9,10], [12,13] 7[1-012] 11[17] 15[3,4] 16[6,7] 19[1,2,6,7] మొ॥).

దేవుని మహాత్మ్యమును, ఆయన కనికరమును, ఆయన రక్షణకార్యములను గూర్చిన స్తోత్రములే ఈ గీతములయందలి ముఖ్యాంశములై యున్నవి. వీనిని నేటివఱకును క్రైస్తవులు తమ యారాధనలో నుపయోగించుచున్నారు.

స్తోమము పటాలము చూ॥

స్తోయికులు (Stoics). షడ్దర్శనములలో నొకదాని నవలంబించిన గ్రీకువారిపేరు. వారు జీనో (*Zeno*) యను స్థాపకుని వెంబడించిన వారు. క్రీ॥ పూ॥ 4 వ శతాబ్దమునందు జీవించి ఒక మంటపమునందు బోధించెను. గ్రీకు భాషయందు మంటపమును స్తోయ (*Stoa*) యనుటచే ఆ పదమునుబట్టి వాని శిష్యులకు స్తోయికులను పేరు కలిగెను. వారు బోధించిన తత్త్వములలో గొన్ని కపిల ముని సిద్ధాంతముల వంటివి. వారు ప్రకృతి నిత్యమని బోధించిరి. ఆత్మవిషయముల యందు వారిబోధ వేదాంతబోధ ననుసరించును. మానవుల యాత్మలు పరమాత్మయందలి బిందువుల వంటివనియు, చివర కా యాత్మలు పరమాత్మలో లీనమగుననియు బోధించిరి. వీరు చేసిన నీతి బోధలు మఱి ప్రసిద్ధికెక్కినవి. ఎట్టి పుణ్యము నాశింపకనే నీతి ననుసరింపవలెనని బోధించిరి. సుఖదుఃఖములను సమభావముతోఁ జూచిరి. ఈ విషయమునుగూర్చిన బోధలు భగవద్గీతలోని బోధలవంటివై యుండెను. వారిట్టి సిద్ధాంతముల ననుసరించినందున ఒకతరహాగా స్థిరచిత్తులైరి. స్తోయికులను పదము నేటివఱకట్టి స్థిరమనస్సునకు సూచనగా నున్నది. సెనెక (*Seneca*), ఎపిక్టీటస్ (*Epictetus*), మార్కస్ ఔరీలియస్ (*Marcus Aurelius*) అను ప్రసిద్ధ నీతి బోధకులు వీరినుండి వెలసినవారే. ఈ బోధల ననుసరించినవారు పౌలు ఏథెన్సులో సువార్త ప్రకటించు సమయమున అతనితో వాదించిరి (కార్య 17[18]). వీరు తమ బోధకన్న శ్రేష్ఠమైన దేదియు లేదను దురభిమానపరులైనందున క్రీస్తుమతము నెక్కువగా విరోధించిరి.

# స్త్రీ, స్నా, స్వ

స్త్రీలకాంక్షితాదేవి (The Desire of Women). తెలుఁగులో నున్నట్లు కొందఱు ఇది కామదేవతను సూచించుననుకొందురు గాని ఇతరులు ఇంగ్లీషునందున్నట్లు అది స్త్రీలకాంక్షను సూచించునని చెప్పెదరు (దాని 11[37]). కామదేవతలు అష్తారోతె తమ్మూజు అను పేరులచే పిలువఁబడెను (అష్తారోతె చూ॥).

**స్త్రీలు (Women).** పాతనిబంధనయందు స్త్రీలు పురుషులకు లోబడవలసినదను బోధ యున్నను (ఆది $3^{16}$) వారు పురుషులకు సహాయులై యుండిరి ($2^{18-24}$). ఇశ్రాయేలీయుల మూల పురుషులగు అబ్రాహాము ఇస్సాకు యాకోబులను వారితోపాటు వారి భార్యలగు శారా, రిబ్కా, రాహేలులు సమాన గౌరవమునకు పాత్రులై యుండిరి. తరువాతి కాలములో దెబోరా న్యాయాధిపతినియు, ప్రవక్త్రియునై యుండెను (న్యాయా $4^{4}$). రాజులకాలములో యెజెబెలు అతల్యా యనువారు ఇశ్రాయేలు యూదా రాజ్యములలో వహించిన అధికారమునుబట్టి స్త్రీలట్టి యధికారమును వహించుటకు తగిన శక్తి గలిగినవారైనట్లు కనబడుచున్నది. మత వైరాగ్యమునందును పురుషులతో సమానులుగ స్త్రీలుండినట్లు హన్నా చరిత్రవలన స్పష్టమగును (I సమూ 1). మానోహ యను వాని భార్య తన పెనిమిటితో కూడ అర్పణ నర్పించెను (న్యాయా $13^{20-23}$). ఆలయమందలి పాటకులలో స్త్రీలు నుండిరి (ఎజ్రా $2^{65}$). భార్య భర్తయొక్క సొత్తు అయినట్లు పది యాజ్ఞలలో నున్నను (నిర్గ $20^{17}$). మానవుల హృదయ కాఠిన్యమునుబట్టి భార్యలను విడనాడుటకు మోషే సెలవిచ్చినను (మా $10^{5}$), వారిలోని దాసురాండ్రకు సహా అన్యాయము కలుగకుండునట్లు నియమము లేర్పరచిరి (నిర్గ $21^{7-11}$). తమ పెండ్లిభార్యలను విడనాడినవారిని ప్రవక్త కఠినముగా గద్దించెను (యెహె $2^{16}$. వివాహము చూ॥). పాతనిబంధనకాలమునందు స్త్రీలను కొంచెము తక్కువగా చూచినను వారికి పురుషులతో సమాన హక్కులుండెనను బోధకు ఆధారము లుండినట్లు చెప్పవచ్చును.

క్రొత్త నిబంధనయందలి సూచనలవలన స్త్రీలతో మాట్లాడుట ఆ కాలపువాడుకలకు భిన్నముగా నుండినట్లు యోహా $4^{27}$ వలన దెలియుచున్నది. ఆ సందర్భమున మాత్రమే గాక క్రీస్తు తన బోధలన్నిటిలోను స్త్రీ పురుషుల కీ లోకమునందుండు భేదములు తా నేర్పరచిన క్రొత్త రాజ్యములో పనికిరావని తెలిపెను. పరిత్యాగ పత్రికలిచ్చుటను గూర్చిన బోధలో మాత్రమేగాక (మా $10^{1-9}$), స్త్రీలనుకూడ తన శిష్యవర్గమునందు చేర్చుకొనుటవలన గూడ (లూ $7^{37-50}$ $8^{2}$ $10^{38-42}$) దేవునియెదుట స్త్రీ పురుషులు సమానహక్కుదారులని బోధించెను. ఆది సంఘపువారీ బోధను అనుసరించిరి. స్త్రీలలో గొందఱు ఆది సంఘమునచేరి (కార్య $1^{14}$ $2^{1}$) సంఘపరిచారకులుగ నుండిరి (రోమా $15^{1,2}$ ఫిలి $4^{2,3}$). స్త్రీలు సంఘమునందు మాట్లాడనియ్యకపోవుటను గూర్చిన సంగతి (కొరి $14^{34-36}$) వారు ముసుకువేసికొను మర్యాదను గూర్చినదే ($11^{1-16}$). స్త్రీ పురుషులకు క్రీస్తు యేసునందు ఏ భేదమును లేదను బోధ తేటగా నున్నది (గల $3^{28}$).

స్నానపు గంగాళము దేవాలయము I 7 (1) (*c*).

**స్నానము, స్నానముచేయుట (Bath, Bathe).** బైబిలునం దుదాహరించిన స్నానాదులు దాదాపుగా అన్నియు మతాచారములకు సంబంధించినవై యున్నవి (లేవీ $16^{26-28}$ $17^{15,16}$ సంఖ్యా $19^{8-19}$). కడుగుట పాపమును తుడిచివేయుటకు సూచనగా నున్నది (కీర్త $51^{7}$ యెష $1^{16}$). పాతనిబంధనయందు నియమితము లగువానికన్న పరిసయ్యులింక నెక్కువగా స్నానములు నియమించుకొనిరి (మా $7^{1-4}$).

పాదములను కడుగుటనుగూర్చిన సూచనలు బైబిలునందు పెక్కులుండినను (ఆది $18^{4}$ $19^{2}$ $24^{32}$ $43^{24}$ మొ॥), సాధారణములగు స్నానాదులను గూర్చినవి బహు కొద్దివై యున్నవి (నిర్గ $2^{5}$ II సమూ $11^{2}$ I రాజు $22^{38}$).

**స్పంజీ (Sponge).** మ $27^{48}$ (=మా $15^{36}$ యోహా $19^{29}$) లో కనబడు పదము. ఇది మఱెచ్చటను బైబిలునందగపడదు. దానిని చిరకలో ముంచి రెల్లుకు తగిలించి క్రీస్తు పెదవులను తడుపుట కిచ్చిరి. స్పంజీ మధ్యధరా సముద్ర తీరమునందు ఎక్కువగా దొరకును. వానిని పురాతనకాలమునుండి వాడుచున్నారు.

**స్పెయిను (Spain).** ఈ పేరు రోమా $15^{24-28}$ లో మాత్రము కనబడును. పౌలు దీనిని దర్శింపదలచెనని దానివలన దెలియుచున్నది. అప్రమాణిక గ్రంథములందును ఇది యుదాహరింపబడినది (I మక్క $8^{3}$). అచ్చట వెండి

బంగారు గనులున్నట్లు దానివలనఁ దెలియు చున్నది. ప్రస్తుతమున ఈ పేరుచేఁ బిలువఁ బడునది ఆ దేశమే. అది రోమాపాఖండమునకు నైరృతిదిక్కున నున్నది. రోమనులు, దానిని క్రీ॥ పూ॥ 219-20 వఱకు సంపూర్ణ స్వాధీనమునం దుంచుకొనిరి. పౌలు పనిఁజేసిన కాలమున అది రోమక సామ్రాజ్యమునం దొక భాగమై యుండెను. రోమనుల విద్యలయందు సుప్రసిద్ధులైనవారిలోఁ గొందఱికి దేశము జన్మభూమియై యుండెను. సెనెక (*Seneca*) అను గొప్ప నీతి శాస్త్రి వారిలో నొకఁడు. సర్వలోకమునకు సువార్త ప్రకటింప నుద్దేశించిన పౌలు దానిని ముఖ్యముగా రోమన్ సామ్రాజ్య మంతటిలో ప్రకటింప నాశపడెను గాన అతఁడు స్పెయినుకుఁ బో నుద్దేశించుట స్వాభావికమే. అతని కోరిక తీరెనో లేదో తెలిసికొనుటకు పౌలు అను శీర్షిక క్రింద చూ॥. ఈ స్పెయినులో పూర్వము జరిగిన వ్యాపారాదులను గూర్చి తర్షీషు చూ॥

స్ఫటికపు సముద్రము గాజువంటి సముద్రము చూ॥

స్ఫటికము రత్నములు 21 చూ॥

## స్మ

**స్మశానావృక్షము** (Cypress Tree). ఈ చెట్టు యెష 44[14] లో మాత్రమున్నది. దానికఱ్ఱ గట్టిదిగా నుండి దేవతా ప్రతిమలను చెక్కుట కనుకూలముగా నుండునదని ఆ వాక్యము వలనఁ దెలియును గాని, ఆ చెట్టు ఎట్టిదో తెలియదు. తెలుఁగు బైబిలు తర్జుమాచేసినవారు స్మశానావృక్షమని తెనిఁగించక తిర్జా వృక్షమను అసలుపదము నుంచినయెడల యుక్తముగా నుండును.

**స్ముర్న** (Smyrna). చిన్నాసియ పశ్చిమ భాగమునకు చేరికయై ఐయోనియ ప్రదేశమందలి ముఖ్యపట్టణము. అదియొక సముద్ర శాఖా



స్ముర్న

తీరమునను ఒక నదీ ముఖద్వారము సమీపమునను కట్టఁబడినందున వర్తకమున కనుకూలమైనది గనుక అది జనబాహుళ్యమైన రేవుస్థలముగా నున్నది. ఆ పట్టణము క్రీ॥ పూ॥ 1000 సం॥ మున మొదట స్థాపితమాయెను గాని యా పురాతనపురము శిథిల మాయెను. ఆ తరువాత నూతనముగా స్థాపించఁ బడిన పట్టణము వృద్ధికెక్కి యొక రాజ్యమునకు ప్రధాన పట్టణమాయెను. కాలక్రమేణ యది క్షీణ దశకువచ్చి క్రీ॥ పూ॥ 600 సం॥ మున లుదియ రాజైన అల్యటీసువలన సమూల నాశనమాయెను. క్రీ॥ పూ॥ 290 సం॥ మున గ్రీకుదేశ సైన్యాధి పతియగు లుసిమాకసు దానిని పునహ కట్టి స్థాపిం చెను. అప్పటినుండి యుత్తమదశకువచ్చి వర్తక మునకు ప్రసిద్ధికెక్కెను. ఇంతకాలమని గ్రీసు వారి రాజ్యమందుండినను క్రీ॥ పూ॥ 195 సం॥ మున స్మూర్న పట్టణస్థులు రోమీయులతో స్నేహము చేసి వారి ప్రభుత్వ మంగీకరించినందుకు సూచ నగా రోమా చక్రవర్తిపేరట నొక దేవాలయము కట్టిరి. అది బహుకాలమువఱకు రోమీయుల పరిపాలనయందుండి తుదకు క్రీ॥ శ॥ 1402 సం॥ మున తామలానువలన పట్టఁబడి తురుష్కరాజ్య మునకు చేర్చఁబడెను. అయిన నా గ్రామ జనభాలో నిప్పటికిని క్రైస్తవులే యెక్కువభాగమై యున్నారు. నాలుగు భాగములలో క్రైస్తవులు మూఁడు భాగములు గలరు. యోహాను పత్రిక లను పంపిన యేడుసంఘములలో స్మూర్నసంఘ మొకటి (ప్రక $1^{11}$ $2^{8-12}$). ఆ సంఘమునకు క్రీ॥ శ॥ 155 సం॥ మందు హతసాక్షియైన పాలి కార్పు అధ్యక్షుఁడై యుండెను. స్మూర్న పట్టణము నేటివఱకును వృద్ధిచెందిన పెద్ద పట్టణముగా నిలిచియున్నది. M.

## స్రా

**స్రావము** రోగములు చికిత్సలు II 5 (3) చూ॥

## స్వ

**స్వతంత్రము, స్వతంత్రుడు** (Free, Freeman). బైబిలు కాలమునందు మనుష్యులు స్వతంత్రులుగాను దాసులుగాను విభాగింపఁబడి యుండిరి (గల $3^{28}$). రోమకు సామ్రాజ్యము నందు స్వతంత్రులకన్న దాసు లెక్కువమంది యున్నట్లు దాని చరిత్రవలనఁ దెలియును. స్వతంత్రులకు కొన్ని విశేష హక్కులు గలవు (పౌరత్వము చూ॥). క్రీస్తు పన్నును గురించి పేతురుతో మాట్లాడినప్పుడు కుమారులకున్నదని చెప్పిన స్వతంత్రమిట్టిదే (మ $17^{26}$). పౌలు పుట్టుకవలననే అట్టి స్వతంత్రుఁడయ్యెను.

స్వతంత్రము సాధారణముగా బైబిలునందు ఆత్మీయ విడుదలను సూచించును. ఇది సత్యము వలన కలుగు స్వతంత్రము (యోహా $8^{32}$). సత్య స్వరూపియగు క్రీస్తు అట్టి స్వతంత్రత నిచ్చునను మాట దీనికి సాటియైనదై యున్నది ($8^{36}$). పాప మునకు దాసులైనవారు క్రీస్తుద్వారా అందులో నుండి విమోచింపఁబడుట దీనివలన సూచింపఁ బడెను. అదియుఁగాక క్రీస్తుద్వారా కుమార స్థితి నొందుటచే వారికి స్వతంత్రత కలుగును (గల $4^{6,7}$). అట్టివారు ధర్మశాస్త్రములోని ఆచారములనుండియు దాని గైకొనకపోవుటచే కలుగు శాపము నుండియు విడుదల నొందినవారై స్వతంత్రులగుదురు (గల $3^{10}$ $4^{8-11}$ $4^{21}$-$5^{1}$). ఇట్టి స్వతంత్రమును ప్రేమచే ఇతరులను సేవిం చుటయం దుపయోగించవలెను గాని శరీరాశలను తృప్తిపఱచుకొనుట కుపయోగించకూడదు అను హెచ్చరికను చూడఁగా (గల $5^{13}$ I పేతు $2^{16}$), ఈ స్వతంత్రమును దుర్వినియోగపఱచుట మొదటి నుండి తటస్థమయ్యెనని తెలిసికొనఁగలము.

**స్వదేశత్యాగము** నేరములు శిక్షలు III 6 చూ॥

**స్వప్నము** కల చూ॥

**స్వభావము, స్వాభావికమైన** (Nature, Natural). క్రొత్త నిబంధనలో ఈ పద మీ దిగువ భావములలో నుపయోగించిరి. 1. సృష్టి క్రమము (రోమా $11^{21-24}$). 2. మానవులకు సహజముగా నుండు నీతి (రోమా $1^{26}$ $2^{14}$ I కొరి $11^{14}$). 3. మానవుల జన్మము లేక జాతి (రోమా $2^{27}$). ఆ పదమునే గల $2^{15}$ లో జన్మము అని తెనిఁగించిరి. 4. మనుష్యుల గుణములు (యాకో $14^{15}$). ఎఫె 2 చూడఁగా అది పాప లక్షణమై యున్నది. మానవులు ఇట్టి పాప

స్వభావము గలవారగుటచే దుష్టత్వము చేయు వారు దానిని స్వాభావికముగా చేసెదరని యూదా వ్రాసెను (యూదా 10). 5. బైబిలులో స్వభావము దేవుని గుణసంపన్నతను సూచించును (II పేతు 1[4]). దేవుని కృపచేత మానవులు అందులో పాలివారు కాఁగలరు (ప్రకృతి సంబంధమైనది చూ॥).

**స్వరమండలము** సంగీతము 3 (3) (*b*) చూ॥

**స్వస్థబుద్ధి** (Sober minded). బైబిలునందిది రెండుమూఁడు భావములను దెలుపుటకు వాడినపదమై యున్నది. కార్య 26[25] నందు అది వెఱ్ఱితనమునకు వ్యతిరేకపదమై సత్యమైన మాటలను సూచించుచున్నది. II కొరి 5[13] నందును అదేభావముతో వాడఁబడినది. మా 5[15] (= లూ 8[35]) నందు ఈ పదమే అసలునందీ భావమునే యిచ్చును. దయ్యము పట్టినవాఁడు పిచ్చినుండి బాగుపడి స్వస్థబుద్ధిగలవాఁ డయ్యెను. తెనుఁగున ఈ మాటకు ప్రతిగా స్వస్థచిత్తుఁడాయెనను మాటనువాడిరి. రోమా 12[3] నం దీ పదము గర్వము అతివినయములగు మాటలకు వ్యతిరేక పదమై తగిన వినయమును సూచించుచున్నది. I తిమో 2[9-15] నం దది అట్టి వినయమును సూచించును. వినయమును చూపుటయందు మనమెట్లు స్వాతిశయమును త్యజింపవలసి యున్నామో, అట్లే గర్వమునుమాత్రమే గాక శరీరేచ్ఛలన్నిఁటిని త్యజింపవలసి యున్నాము. అట్టి ఇచ్ఛలకు లోఁబడక వానిని విడిచిపెట్టుటయే ఈ పదముచేత సూచింపఁబడు ముఖ్యభావమని చెప్పఁదగును (I తిమో 3[2] తీతు 1[8] 2[4-6-12], I పేతు 4[7]). ఈ పదమునే II తిమో 1[7] నందు ఇంద్రియ నిగ్రహముగల బుద్ధియని తర్జుమాజేసిరి గాని భాషాంతరమున స్వస్థబుద్ధి యను పదమును జూడవచ్చును. పైనున్న వానివలన ఇది తిమోతి తీతు పత్రికలలో ఎక్కువ వాడుకయందున్నట్లు కనఁబడును.

## స్వా

**స్వాతి** (Arcturus). పదిహేనవ నక్షత్రరాశియందున్న యొక ప్రకాశమానమైన నక్షత్రము (యోబు 9[9]). దీని మూలపదమును స్వాతి యనక సప్తర్షి యని తెనిఁగించవలె ననుకొను వారు గలరు.

**స్వాధీనము** స్వాస్థ్యము చూ॥

**స్వాభావికమైన** ప్రకృతి సంబంధమైనది, స్వభావము చూ॥

**స్వాస్థ్యము** (Inheritance). మొదటఁ జేయఁబడిన యేర్పాటుల ప్రకారము ఏ భూమియును ఒక గోత్రమునుండి గాని, కుటుంబమునుండి గాని వేఱుపఱచ వీలులేకపోయెను. ఒక కుటుంబమునందు కుమార్తెలుమాత్రమే యున్నయెడల, ఆ కుటుంబపు ఆస్తి యితర గోత్రముల వారికి చెందకుండునట్లు వా రితరగోత్రికులను వివాహమాడరాదను నియమమును సహితమేర్పాటయ్యెను (సంఖ్యా 26).

వారసత్వపు ఏర్పాటుల ననుసరించి జ్యేష్ఠపుత్రునికి రెట్టింపుభాగ మిచ్చిరి (ద్వితీ 21[17]). జ్యేష్ఠత్వమును గూర్చిన ఈ విశేషహక్కును మార్చుటకు తండ్రికి అధికారమున్నట్లు ఏశావు యాకోబుల చరిత్రవలన దెలియుచున్నను (ఆది 27[37]), ద్వితీయోపదేశకాండమునం దా హక్కును జ్యేష్ఠునినుండి తీసివేయఁబడకుండునట్లు మఱి కఠినమైన నియమములను జేసిరి (21[15-17]). ఈ దేశములో నున్నట్లు, పెనిమిటి ఆస్తి భార్యకు స్వాస్థ్యముగా నియ్యఁబడలేదు. సంతానము లేనియెడల పెనిమిటి మరణాంతరమున, అతని సహోదరుఁడుగాని, దగ్గరబంధువుఁడు గాని ఆమెను పెండ్లాడవలెను. వారికి కలిగిన జ్యేష్ఠపుత్రుఁడు, ఆమె మొదటి పెనిమిటి యాస్తికి వారసుఁడయ్యెను (ద్వితీ 25[6]). కొడుకులు లేని వాని ఆస్తికి వారసులెవ్వరో సంఖ్యా 27[8-11] నందు చూడవచ్చును. కూతురులున్నయెడల వారికిని, వారు లేనిపక్షమున తండ్రి అన్నదమ్ములకును, వారు లేనియెడల తండ్రి సమీపబంధువులకును అది చెందవలెనను నియమము గలదు.

స్వాస్థ్యము విషయమైన ఆత్మీయ యేర్పాటులు. ఇశ్రాయేలీయుల దేశమును వారి గోత్రముల ప్రకారమును, కుటుంబముల ప్రకారమును ఇచ్చినట్లు వారి చరిత్రలవలనఁ దెలిసికొనవచ్చును.

వారి భూములే వారి స్వాస్థ్యము (యెహో $11^{23}$ $13^{6,7,8,14}$ మొ॥). ఇది యెహోవా వారికిచ్చిన భూమియగుటచే, ఆయనవలన వారీ స్వాస్థ్యము నొందిరి (ద్వితీ $18^{2}$ $19^{10}$ $20^{16}$ $21^{23}$ మొ॥). లేవీయులకే భూమియు నిచ్చియుండలేదు. వారు దేవుని సేవకు ప్రత్యేకింపఁబడుటచేత, యెహోవాయే వారి స్వాస్థ్యమై యుండెను (సంఖ్యా $18^{20}$ ద్వితీ $10^{9}$ యెహో $13^{33}$). అదేరీతిగా ఇశ్రాయేలీయులును దేవుని స్వాస్థ్యముగా నెంచఁబడిరి (I రాజు $8^{51-53}$=కీర్త $28^{9}$ $33^{12}$ యెష $19^{24}$ మొ॥). దేవుడు తన ప్రజలయందు అధికానురాగము గలవాఁడగుటచే, పరిశుద్ధులలో ఆయనకు స్వాస్థ్యము కలిగియున్నట్లును, ఆ స్వాస్థ్యము చాల మహిమకలదియై యున్నట్లును క్రీస్తుయేసుద్వారా కలిగిన దీవెనలు అలంకారరీతిగా వర్ణింపఁబడినవి (ఎఫె $1^{18}$). దేవు డీ లోకమున తన ప్రజలగు ఇశ్రాయేలీయులకు కనానుదేశమును స్వాస్థ్యముగా నిచ్చినట్లు, తన భక్తులైన వారికి పరమ కనాను అనుగ్రహించును కావున మోక్షము భక్తుల స్వాస్థ్యమై యున్నది అను అలంకారమును బైబిలునందున్నది (ఎఫె $1^{14}$ హెబ్రీ $9^{15}$ I పేతు $1^{4}$ మొ॥). అన్యులు మెస్సీయకు స్వాస్థ్యముగా నియ్యఁబడెదరను వాగ్దానమున్నది (కీర్త $2^{7}$).

## స్వీ, స్వే

**స్వీకృతము (Adoption).** బైబిలునందు పౌలు ఒక్కఁడుమాత్రమే యీ పదమును 5 మారులు వాడెను (రోమా $8^{15,23}$ $9^{4}$ గల $4^{5}$ ఎఫె $1^{5}$). రోమా $9^{4}$ లో అది దేవుఁ డిశ్రాయేలీయులను తన స్వంత జనముగా నేర్పఱచుకొనుటను సూచించుటకు వాడినపదమై యున్నది. దేవుఁడు వారి నట్లేర్పఱచుకొనుటవలన వారు కుమారస్థితిని బొందిరి. తక్కిన వాక్యములలో యేసుక్రీస్తు నందున్నవారికి కలిగిన ఆత్మీయ హక్కులు సూచింపఁబడును. పాపమువలన అన్యులై యుండినను క్రీస్తును విశ్వసించుటవలన వారు కుమారస్థితి పొందుటనుగూర్చి ఈ పదమును వాడెను. ఈ దృష్టాంతమునందు రోమీయులు చేసికొను దత్తునుగుఱించి పౌలు సూచించెనని శాస్త్రజ్ఞుల యభిప్రాయము (కుమారస్థితి చూ॥).

**స్వేచ్ఛ, స్వాతంత్ర్యము (Free-will).** మానవునికి స్వాతంత్ర్యమున్నదా లేదా యను దానిని గుఱించి శాస్త్రులు నేటివఱకు వాదించుచునే యున్నారు. అట్టి వాదములకు బైబిలునందట్టి సూచనలును లేవు. ఆరంభమునుండి (ఆది $4^{7}$), చివరివఱకు (ప్రక $22^{17}$) మానవులకు స్వేచ్ఛగలదని బైబిలు చెప్పకయే చెప్పుచున్నది. మానవులకు సహజబుద్ధి స్వేచ్ఛయనునవి గలవని యొప్పుకొనును. సువార్తను నమ్మి దాని ద్వారా రక్షణ పొందుటకు కావలసినంత స్వాతంత్ర్యము లేక శక్తి పాపములోపడిన మానవులకున్నదో లేదో యనుదానినిగూర్చి కూడ తాత్పర్యభేదము గలదు (ఏర్పాటు చూ॥).

## హా

**హంస** పక్షులు 39 చూ॥

**హకల్యా (Hacaliah** = యెహోవా విముఖుఁడు). నెహెమ్యా తండ్రి (నెహె $1^{1}$ $10^{1}$).

**హాకీలా (Hachilah** = చీఁకటిగా). హెబ్రోనుకు దక్షిణముగా నుండు జీఫు అరణ్యమందున్న ఒక కొండ. దావీదు సౌలుచేత తరమఁబడినప్పుడు ఇచ్చట దాగుకొనెను (I సమూ $23^{19}$ $26^{1,3}$). అది పలెస్తీనుకు దక్షిణముగానున్న అరణ్యప్రాంతములలో నున్నదని చరిత్రవలనఁ దెలియును ($23^{24-26}$) గాని ప్రస్తుత మా ప్రదేశమున నుండు కొండల పేరులలో దీని పేరును గూర్చిన సూచన యేమియు లేకపోవుటచే దాని యునికినిగూర్చి ఇంకను నూటిగాఁ దెలియదు.

**హాకూపా (Hakupha** = వంగి పోయినది). నెతీనీయులలోని యొక కుటుంబమునకు పెద్ద (ఎజ్రా $2^{51}$=నెహె $7^{53}$).

**హాక్కాటాను (Hakkatan** = అన్నిఁటిలో చిన్నది). బాబెలు చెఱల్లోనుండి తిరిగివచ్చిన కుటుంబములలో నొకదానికి పెద్ద (ఎజ్రా $8^{12}$).

**హాక్కోజు (Hakkoz** = ముల్లు).

1. యూదా సంబంధులలో నొకఁడు (I దిన $4^{8}$). ఇక్కడ కోజు అని మాత్రమున్నది.

2. ఒక యాజక కుటుంబమునకు పెద్ద. ఇతని వలన ఈ కుటుంబమునకును అదే పేరు కలిగెను (I దిన 24[10] ఎజ్రా 2[61] నెహె 3[4,21] 6[63]). వీరు 'తమ వంశావళి క్రమణికలు చూపఁజాల నందున యాజకత్వము జరుపుటకు సెలవు లేక పోయెను.

**హాక్మోనీ (Hachmoni = జ్ఞాని).** దావీదు పరాక్రమశాలురలో ముఖ్యుఁడగు యాషాబాము తండ్రి (I దిన 11[11]) యొక్క పూర్వికుఁడని కొందఱి తలంపు. ఇతని కుమారునికి II సమూ 23[8] నందీ పేరు వాడక, కుటుంబమునుబట్టి ఇతనిని తక్మోనీయుఁడు (=హాక్మోనీ) అను పేరు పెట్టిరి. రాజకుమారుల సహవాసియగు యెహీయేలను మఱియొకఁడును ఇతని కుమారుఁడై యుండెను (I దిన 27[32]). ఈ కుటుంబమును గూర్చిన మఱి యేసూచనలు లేవు.

**హాగాబా (Hagabah, Hagaba = మిడుత).** నెతీనీయులలోని యొక కుటుంబ మునకు పెద్ద. ఆ కుటుంబమునకును ఈ పేరు గలదు (ఎజ్రా 2[45] నెహె 7[48]). ఇంగ్లీషునం దున్నట్లుగా అసలునందును ఈ పదముయొక్క గుణింతమునందు కొద్ది భేదము కలదు. ఎజ్రాలో మొదటి విధముగాను, నెహెమ్యాలో రెండవ విధముగాను ఉన్నది.

**హాగ్గయి (Haggai = ఉత్సవకరము).** బబులోను నుండి క్రీ॥ పూ॥ 537 సం॥ న తిరిగి వచ్చిన వారిలో నొక ప్రవక్త. యూదులు యెరూష లేమునకు బబులోను నుండి రావేగమే దేవాలయ మును తిరిగి కట్ట నారంభించిరి గాని సమ రయులును మఱికొందఱును వారి పని సాగకుండ నాటంకపఱచినందున ఆ పని పదునాఱు సంవత్సర ములవఱకు ఆగిపోయెను (ఎజ్రా 3, 4). క్రీ॥ పూ॥ 520 సం॥ వృద్ధుడైన హాగ్గయి ప్రవక్త దేవునిచే ప్రేరేపింపఁబడి అధిపతియైన జెరుబ్బాబెలును ప్రధానయాజకుఁడగు యెహోషువను దేవాలయ మును తిరిగి కట్టుటయను పనిని మఱల నారంభించి ముగించుఁడని హెచ్చరించెను (జెక 5[1]-6[14]). హాగ్గయి గ్రంథమునందు నాలుగు మాసములలో చెప్పఁబడిన నాలుగు వర్తమానము లున్నవి.

1. అధ్యాయమునందు హాగ్గయి అధిపతులను జనులను ప్రేరేపించవలసినంతమట్టుకు ప్రేరేపిం చుటవలన వారు వెంటనే దేవాలయమును తిరిగి కట్ట నారంభించినట్లు చదువుచున్నాము.

2[1-9] నందు మొదటి మాసమైన తరువాత దేవాలయమును తిరిగి కట్టవలసిన సమయము ఇంకను వచ్చినదో లేదో యని జనులు సందేహించుచునట్లు కనఁబడుచున్నది. దానినిబట్టి హాగ్గయి యెహోవా వారితోకూడ నున్నాఁడనియు ఈ నూతన దేవా లయముయొక్క మహిమ సొలొమోను కట్టించిన దేవాలయముయొక్క మహిమకంటె నధికమై యుండుననియు, యెహోవా పేరట వారికిఁ దెలిపి వారికి నిశ్చయము కలుగజేసెను.

2[10-19] నందు రెండు మాసములకుఁ దరువాత ప్రవక్తయైన హాగ్గయి వారు చేయవలసిన పనిని నమ్మకముగా చేసినట్లయిన దేవుఁడు వారిని ఆశీర్వ దించునని దృఢముగాఁ దెలిపెను.

2[20-23] నందు ఆ దినముననే ప్రవక్తయైన హాగ్గయి దేవుఁడు లోకరాజ్యములన్నిఁటిని క్రింద పడవేయనున్నను ఆయన తన జనులను కాపాడు నని వాగ్దానము చేసినట్లు యెహోవా నామమందు జెరుబ్బాబెలుతో చెప్పెను. J. C.

**హాగ్గీ, హాగ్గీయులు (Haggi = పండుగు కాలములో పుట్టినవాఁడు, *Haggites*).** గాదు కుమారులలో నొకఁడు (ఆది 46[16] సంఖ్యా 26[15]). అతని సంతతివారు హాగ్గీయులు అనఁబడిరి (26[15]).

**హాగ్గీతు (Haggith = పండుగకు సంబం ధించినది).** దావీదు భార్యలలో నొకతె. అదో నీయా తల్లి (II సమూ 3[4] I రాజు 1[5] 2[13]).

**హాగ్గీయా (Haggiah = యెహోవా పండుగు).** మెరారీతెగవారిలోని యొక లేవీ యుఁడు (I దిన 6[30]).

హాగ్గీయులు హాగ్గీ చూ॥

**హాగ్రీయుడు (Hagrite).** దావీదు మందల కాపరియగు యాజీజుయొక్క బిరుదు (I దిన 27[31]).

**హాగ్రీయులు (Hagrites, Hagarites, Hagerenes).** గిలాదు దేశమునకు తూర్పుగా

నున్న అరబ్బీదేశనివాసులలో ఒక జాతివారు. యొర్దానుకు తూర్పుననున్న ఇశ్రాయేలీయులు వీరిని రెండుమారులు ఓడించిరి (I దిన 5[5,19,20]). దావీదు కాపరులలో నొక హగ్రీయుఁడుండెను (I దిన 27[31]). అతఁడీ జాతివాఁడైయుండును. గ్రీకువారు వీరిని అగ్రయోయ్ (*Agraioi*) అని పిలిచిరి. అష్షూరువారి రాతి శాసనములలో కూడ ఈ పేరు కనఁబడును. వీరు హాగరు సంతానమని కొందఱి తలంపుగాని ఇష్మాయేలీయులకు వేరైనవారని వారిపేరు కనఁబడు జాబితావలనఁ దెలియుచున్నది. వారి యుత్పత్తిని గూర్చి యేమియును తెలియదు. అప్రమాణిక గ్రంథములోని బారూకు 3[23] లో నుండు అగరు సంతతివారు వీరే.

**హాజర్షువలు** (Hazar-Shual = నక్క ఊరు). యూదా దక్షిణభాగమున నున్న గ్రామము (యెహో 15[28]=I దిన 4[28]). షిమ్యోను గోత్రికుల కియ్యఁబడెను (యెహో 19[3]). చెఱ కాలమునకు తరువాత యూదులు నివసించిన ఊళ్లలో నిదియొకటిగా నుండెను (నెహె 11[27]). ప్రస్తుతము బెయేర్షెబాకు తూర్పుగా ఒక దిబ్బ మీఁద నుండు సావె (*Saweh*) అను శిథిలములు దీనియునికియై యుండవచ్చును.

**హాజర్సూసా** (Hazar-Susim, Hazar-Susah = అఁడు గుఱ్ఱము లేక గుఱ్ఱముల ఊరు). షిమ్యోనీయుల యూళ్లలో నొకటి (యెహో 19[5]=I దిన 4[31]). బెయేర్షెబాకు పడమరగా నున్న సూసీను (*Susin*) అను శిథిలములే దీని యునికి కావచ్చును.

**హజాయా** (Hazaiah = యెహోవా చూచెను). యూదా సంతతివారిలో నొకఁడు (నెహె 11[5]).

**హజాయేలు** (Hazael = దేవుఁడు చూచెను). సిరియ రాజు ఇశ్రాయేలీయుల లోని బయలు పూజారుల నెల్లరిని శిక్షించుట కితఁడు సాధనమగునని ఏలీయా పరలోకగతుఁడు కాక పూర్వమే యతనిని దమస్కుకు రాజుగా నభిషేకించెను (I రాజు 19[15-18]) గాని, అతఁడు చాలకాలమువఱకు రాజ్యమును స్వాధీనపఱచు కొనక బెన్హదదుకు సేవకుఁడుగా నుండెను. సుమారు క్రీ॥ ము॥ 844 నందితఁడు బెన్హదదును చంపి, అతనిరాజ్యము నపహరించి దాని నేలెను. దాని నపహరింపక పూర్వము బెన్హదదు జబ్బు పడినప్పుడు ఎలీషాయొద్దకు, ఆ జబ్బునుండి బెన్హదదు బాగుపడునది. లేనిది కనుగొనుటకు పంపఁబడెను. ఎలీషా బెన్హదదు మరణమగునని దెలిపెను (8[7-10]). ఇశ్రాయేలీయులను చాల బాధపఱచువాఁడ వగుదువని ఎలీషా కన్నీళ్లతోఁ జెప్పఁగా (8[11,12]) హజాయేలు అట్లెంతమాత్రమును చేయనని నుడివెను. తరువాత బెన్హదదును చంపెను (8[13,15]). యెహూూ ఇశ్రాయేలును ఏలునప్పుడితఁడు యొర్దానుకు తూర్పుభాగముపై దండెత్తి దానిని జయించెను (10[32]). ఇశ్రాయేలు రాజగు యెహోయాహాజు కాలమున యొర్దాను పడమట నుండు దేశమును ఇతఁడును, ఇతని తరువాత వచ్చిన III-వ. బెన్హదదును మఱెక్కువగా బాధపఱచి నాశము జేసిరి (II రాజు 13[4-7]). అతఁడీ దండ యాత్రలో ఫిలిష్తీయుల పట్టణమగు గాతును పట్టుకొని యెరూషలేముమీఁదనే యుద్ధము జేయబోయెను. యూదా రాజగు యోవాషు లంచము లిచ్చి అతనిని వెనుకకుఁ బంపివేసెను (II రాజు 12[17,18]) ఆమో 1[4] లో నున్న హజాయేలు మందిరమను పదములు దమస్కుకు పెట్టఁబడిన పేరై యున్నది. అష్షూరు చక్రవర్తియగు షల్మనేసెరు హజాయేలు దేశముమీఁద దాడి వెడలినట్లు అష్షూరు రాతిశాసనములవలనఁ దెలియును. హజాయేలు ఏలినంతవఱకు ఇశ్రాయేలీయులకు అపజయములే కలిగెను. అతని తరువాత వచ్చిన బెన్హదదు III కాలమున మొదట జయము నొందినను తరువాత ఓడిపోయిరి.

**హజీయేలు** (Haziel = దైవదర్శనము). గెర్షోను తెగవారిలో నున్న యొక లేవీయుఁడు (I దిన 23[9]).

**హాజేరోతు** (Hazeroth = దండు పేటలు). ఇశ్రాయేలీయులు సీనాయినుండి బయలుదేరిన పిమ్మట మకాముచేసిన రెండవ స్థలము (సంఖ్యా 11[35] 12[16] 33[17,18] ద్వితీ 1[1]). ఇచ్చట అహరోను మిర్యాములు మోషేమీద సణిగిరి (సంఖ్యా 11[35]-12[16]). సీనాయికి 36 మైళ్లు ఈశాన్యముగా నుండు అయిన్-ఎల్-హద్రా

(*Aiyin-el-Hudera*) దీనియొనికి యని సాధారణముగా నొప్పుకొందురు.

**హాజో** (Hazo = దర్శనము?). అబ్రాహాము తోడబుట్టినవాడగు నాహోరు కుమారులలో నొకఁడు (ఆది 22[22]). ఇదే పేరుగల నొక తెగకు పూర్వికుఁడు. హరానాను దగ్గర నుండు హాజూ అను దేశముగుండా అష్షూరు చక్రవర్తియగు ఏసర్హద్దోను ఒక దండయాత్రలో దాటివెళ్లినట్లు అష్షూరు రాతిశాసనములవలనఁ దెలియుచున్నది. అది ఈ జనమునకు సూచనగా నున్నదని తలంచుచున్నారు.

**హజ్జెలెల్పోని** (Hazzelelponi = నాతట్టు తిరుగువాఁడు ఆశ్రయమిచ్చుగాక). యూదావారి వంశావళి క్రమణికలో కనఁబడు ఒక స్త్రీ పేరు (I దిన 4[3]).

**హటీటా** (Hatita = చెక్కుట). చెఱ కాలమునకుఁ దరువాత ద్వారపాలకులుగా నున్నవారిలో నొకతెగకు పూర్వికుఁడు. అతనినిబట్టి ఆ తెగవారికి నిదేపేరు కలిగెను (ఎజ్రా 2[42]=నెహె 7[45]).

**హటీపా** (Hatipha = పట్టఁబడువాఁడు). నెతీనీయులలో నొకతెగకు పూర్వికుఁడు. ఆ తెగవారికిని ఈ పేరే కలిగెను. జెరుబ్బాబెలుతోకూడ తిరిగివచ్చినవారిలో ఈ తెగవారు గలరు (ఎజ్రా 2[54]=నెహె 7[56]).

**హట్టీలు** (Hattil = అదురుచున్న). సొలొమోను సేవకులనఁబడిన వారిలో నొక తెగకు వారి గోత్రకర్తవలన కలిగినపేరు (ఎజ్రా 2[57]=నెహె 7[59]).

**హట్టూషు** (Hattush = సభగా సమకూర్చఁబడినవారు).

1. యాజకులలో నొక కుటుంబమునకు పేరు. వీరు చెఱనుండి జెరుబ్బాబెలుతోకూడ తిరిగివచ్చి (నెహె 12[2]), నిబంధనను ముద్రించినవారిలో నుండిరి (10[4]).

2. దావీదు సంతతివారిలో నొకఁడు (I దిన 3[22]). ఎజ్రా 8[2] నందు ఇతఁడు ఎజ్రాతో కూడ యెరూషలేమునకు వచ్చినట్లున్నది. అయితే ఈ రెండు వాక్యములు పూర్ణముగా నేకీభవింపక పోవుటవలన ఈ రెండు వచనములలోనున్న పేరు ఇద్దఱిని సూచింపవచ్చును.

3. నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను కట్టుటకు సహాయము చేసినవారిలో నొకఁడు (నెహె 3[10]).

**హతతు** (Hathath = భీతి). ఒత్నీయేలు కొడుకులలో నొకఁడు (I దిన 4[13]).

**హతసాక్షి** (Martyr). ఈ పదము బైబిలునందు లేదు. దానికి ప్రతిగా సాక్షి అను పదమున్నది. అయినను సత్యము నొప్పుకొని దాని దృఢపఱచుటకు తమ ప్రాణమును పెట్టిన వారు బైబిలునందు మొదటినుండి అనఁగా హేబెలు కాలము మొదలుకొనియున్నట్లు దృష్టాంతము లున్నవి. ప్రవక్తల ప్రాణములు వెదకుట సర్వసాధారణమైన విషయమై యున్నది. గాని క్రీస్తు సిలువవేయఁబడిన తరువాత క్రొత్త నిబంధనలో హతసాక్షులైనవారు ముఖ్యముగా ఆయన మాదిరిని జూచి మరణమునకు సహా తెగించునంత ధైర్యముగలవారైరి. స్తెఫను మొదటి క్రైస్తవ హతసాక్షియయ్యెను (కార్య 7, 8). అపొస్తలులలో జెబెదయి కుమారుఁడగు యాకోబు మొదటివాఁడు (12[7]). పెర్గము సభలో అంతిప యనువాఁడు హతసాక్షి యయ్యెను (ప్రక 2[13]). బైబిలునందు పేరు లుదాహరింపకపోయినను అనేకులట్టివారై యున్నట్లు సూచనలు కలవు (6[9,11] సాక్షి చూ॥).

**హతాకు** (Hattaach). ఎస్తేరును సేవించుటకై చక్రవర్తియగు అహష్వేరోషువలన నియమింపఁబడిన నపుంసకులలో నొకఁడు. హామాను యూదులపైఁ జేసిన కుట్రను మొర్దెకైవలనఁ దెలిసికొనుటకు ఇతఁడే ఎస్తేరుకు మిగుల సహాయపడెను (ఎస్తే 4[5,6,9,10]).

**హాదదు, హాదరు** (Hadad = నలుగఁగొట్టుట, *Hadar*).

1. షేముకు సంబంధించిన జనములలో నొకదాని దేవత. ఈ దేవతపేరు బైబిలునందు లేక పోయినను, బెన్హదదు, హదదెజెరు, బహుశః అద్రమెలెకు (=అదదు+మెలెకు) అను సమాసపదములలో కనఁబడుచున్నది. అది రిమ్మోను దేవతకు

సంబంధించినదై ఇంద్రునివలె ఉరుము మెరుము లకు అధిదేవతయై యున్నది (రిమ్మోను చూ॥).

**2.** ఇశ్రాయేలు కుమారులలో 8 వ వాని పేరు (I దిన $1^{30}$). ఆది $25^{15}$ నందు వీనికి బదులు **హదరు** అను పేరు గలదు. హెబ్రీ భాష యందు ద ర అను అక్షరములు చాలమట్టుకు ఒకటేరీతిగా నుండుటచే నీ పొరపాటు వచ్చినది.

**3.** ఎదోమునందు పూర్వకాలమునం దుండిన 8 మంది రాజులలో నాల్గవవాఁడు (ఆది $36^{35}$, I దిన $1^{46}$).

**4.** ఆ రాజులలోనే 8 వ వాఁడు (I దిన $1^{50}$). పైన 2 లో నున్నట్లు ఆది $36^{39}$ నం దిత నికి హదరు అను పేరున్నది.

**5.** క్రీ॥ పూ॥ 10 వ శతాబ్దమునందు ఎదోము రాజులలో నొకని కుమారుఁడు (I రాజు $11^{14,22}$). దావీదు సేనాధిపతియగు యోవాబు ఎదోమీయు లను జయించి నాశనము చేయఁగా, ఇతఁడు తప్పించుకొని ఐగుప్తుకు పారిపోయి ఐగుప్తురాణి చెల్లెలిని పెండ్లియాడి, దావీదు కాలముచేసిన పిదప ఎదోముకు తిరిగి వచ్చి, సొలొమోనుమీఁద తిరుగఁబడి తన దేశమును విడిపించుకొనెను.

**హదదెజెరు, హదరెజెరు** (Hada-dezer = హదదు సహాయము చేయును). దమ స్కుకు సమీపమునయున్న సోబారాజు (II సమూ $8^3$ I దిన $18^{3-3}$). హదదెజెరు దావీదుచే నోడింపఁబడిన పిమ్మట దమస్కు వా రాతనికి సహాయము జేయవచ్చి వారును ఓడిపోయి దావీ దుకు లోఁబడిరి (II సమూ $8^{3-13}$ I దిన $18^{3-10}$). తరువాత హదదెజెరు అమ్మోనీయులతోను సిరియ నులతోను సంధిజేసికొని, దావీదు నెదిరించుటకు వారికి తోడ్పడెను గాని హేలాములో వారు మరల ఓడిపోయిరి (II సమూ $10^{16}$). సోబాకు లోనైన వారు పిమ్మట దావీదుతో సమాధానపడిరి (II సమూ $10^{6-19}$ I దిన $19^{16-19}$ సోబా) చూ॥

**హదద్రిమ్మోను** (Hadadrimmon = హదదు+రిమ్మోను. ఈ రెండును సిరియనుల దేవ తల పేరులు. ఆ పేరులక్రింద చూ॥). ఈ పేరు జెక $12^{11}$ నందు మాత్రము కనఁబడును. ఇది యెత్రెయేలు మైదానమందున్న యొక స్థలముగా నెంచుట సాధారణమైన విషయము. యోషీయా నిమిత్త మచ్చట విశేషముగా ప్రలాపించినట్లు తెలుపుటయే జెకర్యా యుద్దేశమని అట్టివా రనుకొందురు. జెరోము అను ప్రాచీన పండితుని అభిప్రాయప్రకారము ఇది మెగిద్దోకు మారు పేరని యెంచవలసియున్నది. అయితే నవీనపండి తులలో కొందఱది యొక స్థలముగాక దేవతయే యని తలంచుచున్నారు. అట్టివారు హద ద్రిమ్మోను దేవతకొఱకు ప్రలాపించినట్లు తెలుపుట జెకర్యా యుద్దేశమని చెప్పుచున్నారు.

**హదస్సా** (Hadassah = గొంజి చెట్టు). ఎస్తేరు మొదటిపేరు. అహష్వేరోషు చక్రవర్తి ఆ పేరును ఎస్తేరు అని మార్చెను (ఎస్తే $2^7$).

**హాదాషా** (Hadashah = క్రొత్త యూరు). యూదాదేశములో షెఫేలా యను ప్రాంతములోనున్న యొక గ్రామము (యెహో $15^{37}$). దాని యునికినిగూర్చి యింక నూటిగాఁ దెలియదు.

**హాదీదు** (Hadid = ఒక కొన). చెఱకాల మునకు పిమ్మట బెన్యామీనీయులు నివసించిన యొక ఊరు (ఎజ్రా $2^{33}$-నెహె $7^{37}$ $11^{34}$). ఈ పేరుతోకూడ లోదు (=లుద్ద) అను గ్రామ మును కనఁబడును. I మక్క $12^8$ $13^{13}$ పురా 13 6, 5 లందున్న అదీదా (*Adida*) యని సాధారణముగా ననుకొందురు. అది యూదా దేశమందలి షెఫేలాలో లుద్దకు 3 మైళ్లు తూర్పుగా నున్నది. దాని ప్రస్తుతపుపేరు హదీతె (*Hadithch*, పటము III, D 5).

**హదోరము, అదోరాము** (Hadoram, Adoram = ఉన్నతమైనవాని ప్రియుఁడు).

1. యొక్తాను ఐదవకుమారుఁడు. అరబీ గోత్రములలో నొకదాని పూర్వికుఁడు (ఆది $10^{27}$ I దిన $1^{21}$).

2. హమాతురాజగు తోహు కుమారుఁడు. దావీదు హదదెజెరును జయించిన పిమ్మట తోహు తన సంతోషమును కనఁబఱచుటకు ఇతనిని దావీదుయొద్దకుఁ బంపెను (I దిన $18^{10}$). II సమూ $8^{9,10}$ లో ఇతనిని పొరబాటుగా **యోరాము** అని వ్రాసిరి (యోరాము 1 చూ॥).

8. రాజగు రెహబాము క్రిందనున్న యధ్యక్షులలో నొకడు (II దిన 10[18]). I రాజు 12[18] లో నితనికి అదోరాము అను పేరు కలదు (అదోనీరాము చూ॥).

**హద్దురాళ్లు తీసివేయుట** నేరములు శిక్షలు II 2 (2) చూ॥

**హద్లాయి** (Hadlai = బలహీనుడు). ఎఫ్రాయిమీయులలో నొకడు (II దిన 28[12]).

**హద్రాకు** (Hadrach). ఒక ప్రదేశపు పేరు. జెకర్యా దీనికి విరోధముగా ప్రవచించెను (జెక 9[1]). ఈ పేరిచ్చటమాత్రము గలదు. అది సిరియాలో నున్నట్లు దాని సంబంధ వాక్యమువలన స్పష్టమగుచున్నది. అష్షూరు రాతి శాసనములలో హతెరిక్క (*Hatarikka*) యను దేశమే యిది యని తలంచుచున్నారు. దీనిని గూర్చిన వేఱు సూచన లెవ్వియును గానరావు.

**హనన్యా** (Hananiah = యెహోవా కృపగలవాడు).

1. బెన్యామీనీయులలో నొకడు (I దిన 8[24]).

2. హేమాను సంతానీకుడు. దావీదు నియమించిన 24 సంగీతవంతులలో 16 వ దానికి నాయకుడు (I దిన 25[4,23]).

3. రాజగు ఉజ్జియా క్రిందనున్న యధ్యక్షులలో నొకడు (II దిన 26[11]).

4. యిర్మీయా కాలమునందు ప్రధానులుగా నున్నవారిలో సిద్కియా యనువాని తండ్రి (యిర్మీ 36[12]).

5. యిర్మీయాను విరోధించిన అబద్ధ ప్రవక్తలలో నొకడు. యూదులచెఱ దీర్ఘకాలముండునని రాజైన సిద్కియా యేలుబడియందు 4 సం॥ న యిర్మీయా ప్రవచింపగా, ఇతడు ఆ చెఱ రెండు సం॥ ల లోపుగా తీరిపోవునని దానికి గుఱుతుగా యిర్మీయా వేసికొనియున్న కాడిని విఱుగగొట్టెను. యిర్మీయా తరువాత తన ప్రవచనమును మఱింత దృఢముగా దెలిపి హనన్యా ఒక సం॥ రము లోపుగా చచ్చునని ప్రవచించెను. అట్లే తరువాత సెలవైతెను (యిర్మీ 28[1-17]).

6. యిర్మీయాను పట్టుకొన్న కావలివారి యధిపతియగు ఇరీయా తాత (యిర్మీ 37[13-15]).

7. షద్రాకుయొక్క హెబ్రీపేరు (దాని 1[6,7] I మక్క 2[59]).

8. జెరుబ్బాబెలు కుమారులలో నొకడు (I దిన 3[19,21]).

9. అన్యస్త్రీలను వివాహము జేసికొని, ఎజ్రా ప్రేరేపణవలన విడిచిపెట్టినవారిలో నొకడు (ఎజ్రా 10[28]).

10. నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను కట్టుటకు సహాయము చేసిన వారిలో నొకడు. ఇతడు ఔషధజ్ఞాని యనబడెను (నెహె 3[8]).

11. నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠింపగా బాకాలను ఊదిన యాజకులలో నొకడు (నెహె 12[41]).

12. నెహెమ్యా కాలములో నిబంధనను ముద్రించిన పెద్దలలో నొకడు (నెహె 10[23]).

13. నెహెమ్యా సహోదరుడు. ఇతడు కోటకు అధిపతిగా నుండెను. ఇతడు హనానీతోకూడా యెరూషలేమునకు అధిపతిగా నుండెను (నెహె 7[2]).

14. చెఱకాలమునకు తరువాత యోయాకీము దినములలో నున్న ఒక యాజకుడు (నెహె 12[12]).

**హనన్యేలు** యెరూషలేము B V 2 (3) చూ॥

**హనమేలు** (Hanamel = దేవుడు జాలిపడెను). యిర్మీయా పినతండ్రియగు షల్లూము కుమారుడు (యిర్మీ 32[7,9,12,44]).

**హనానీ** (Hanani = కృపగల).

1. దావీదు నియమించిన 24 సంగీతవంతులలో 18 వ దానికి నాయకుడు. హేమాను సంతానీకుడు (I దిన 25[4,25]).

2. యెహూ అను ప్రవక్తయొక్క తండ్రి (I రాజు 16[1]). ఇతడు దీర్ఘదర్శియై రాజగు ఆసా సిరియావారితో సంధి చేసికొన్నందున

గద్దింపఁగా ఆసా యితనిని చెఱసాలలో వేయించెను (II దిన 16[7]).

3. నెహెమ్యా సహోదరుఁ డనఁబడినవాఁడు. ఇతఁడు నెహెమ్యా బంధువుఁడై యుండును (నెహె 1[2]). ఇతఁడు హనన్యాతో కూడ యెరూషలేముకు అధిపతిగా నుండెను (7[2] హనన్యా 13 చూ॥).

4. అన్యస్త్రీలను వివాహమాడి ఎజ్రా ప్రేరేపణవలన వారిని విడిచిపెట్టినవారిలో నొకఁడు. ఇతఁడొక యాజకుఁడు (ఎజ్రా 10[20]).

5. నెహెమ్యా యెరూషలేము ప్రాకారములను ప్రతిష్ఠింపఁగా వాద్యములను వాయించిన వారిలో నొకఁడు (నెహె 12[36]).

**హనోకు, హనోకు వంశస్థులు, హనోకీయులు** (Hanoch = ప్రతిష్ఠింపఁబడిన, Enoch, Honochites).

1. కయీను పెద్దకుమారుఁడు. కయీనితని పేరట హనోకు అను ఊరిని కట్టెను (ఆది 4[17,18]).

2. షేతు సంతతివారిలో ఆదాము తరువాత ఏడవవాఁడు. యెరెదు ఇతని తండ్రి. మెతూషెల ఇతని కుమారుఁడు (ఆది 5[18-23]). హనోకు దేవునితో నడిచిన తరువాత దేవుఁ డతనిని తీసికొనిపోయెను గనుక అతఁడు లేక పోయెను (5[24]) అను వాక్యమునుబట్టి ఇతఁడు భక్తి పరుఁడనియు చావకుండనే పరలోకగతుఁ డాయెననియు తెలిసికొనవలెనని సాధారణముగా ననుకొందురు. ఈ వాక్యము నాధారముజేసికొని ఇతని సద్గుణములనుగూర్చి యూదుల పురాణములయం దితనిని యెక్కువగా శ్లాఘించిరి (సైరాక్సు 44[16] 44[19]). క్రొత్త నిబంధనయందలి భక్తుల జాబితాలో నితని పేరును చూడవచ్చును (హెబ్రీ 11[5]). ఇతనిపేరట నొక కల్పనా గ్రంథము గలదు. దానిని క్రీ॥ ము॥ 105-64 మధ్యకాలమునందు రచించిరని తలతురు. యూదా 14, 15 నందు యెత్తఁబడినది ఆ గ్రంథమునం దున్నది (1[9] 5[4] 27[2]). హనోకునుగూర్చిన చరిత్ర బహు కొద్దియే. దానిని విశేషముగ వివరించి, దానితోనే కల్పనా సంగతులను చేర్చిరి. కొందఱు నవీనపండితులు బాబెలు పురాణములలో నున్నవానికిని వీనికినిగల సంబంధమును జూచి యూదులు బాబెలువారి పురాణములను దెలిసికొన్నందున నిట్టివానిని కల్పించిరని యనుకొనుచున్నారు.

3. కెతూరావలన అబ్రాహాముకు పుట్టిన మిద్యానుయొక్క కొడుకు (ఆది 25[4]).

4. రూబేనుయొక్క జ్యేష్ఠపుత్త్రుఁడు (ఆది 46[9] నిర్గ 6[14] సంఖ్యా 26[5] I దిన 5[3]). ఇతని సంతతివారు **హనోకు వంశస్థులు,** అనియు **హనోకీయులు** అనియు పిలువఁబడిరి.

**హన్నా** (Hannah = కృప). రామాతయీ సోఫీము పట్టణస్థుఁడగు ఎఫ్రాయిమీయుఁడైన ఎల్కానా యనువాని భార్యలలో నొకతె (I సమూ 1[2]). పిల్లలులేనందున ఆమె చాల దుఃఖించుచుండి షిలోహులోని దేవునిమందసమున్న గుడారము నొద్దకు మామూలు ప్రకారము వెళ్లి దేవుఁడు తనకొక కుమారుని నిచ్చినయెడల వాని నాయనసేవకు ప్రతిష్ఠింతునని మ్రొక్కుకొనెను. దేవుఁడామె మొఱ నాలకించినందున నామె యొక కుమారుని కని వానికి సమూయేలను పేరుపెట్టి వాఁడు పాలు వదలఁగానే వానిని షిలోహులోని యాజకుల కప్పగించెను (1[3-28]). ఆ సమయమునందే ఆమె యొక చక్కని స్తోత్ర గీతము బాడి తన కృతజ్ఞతను వెల్లడి జేసెను (2[1-10]). కన్యయైన మరియ పాడిన గీతము చాలమట్టుకు దీని ననుసరించినదిగా నున్నది (లూ 1[46-55]). ప్రతి సంవత్సరమును దేవాలయమునకు వచ్చునప్పుడెల్ల ఆ చిన్నవానికి ఒక చిన్న యంగీనికుట్టి తెచ్చునది (I సమూ 2[19]). సమూయేలుగాక ఆమెకు ముగ్గురు కుమారులును ఇద్దరు కుమార్తెలును గలిగిరి (2[21]). W.

**హన్నాతోను** (Hannathon = దయతో చూడఁబడినది). జెబూలూను ఉత్తర సరిహద్దుగా నుండు నొకస్థలము (యెహో 19[14]). దానియునికినిగూర్చిన సూచన లేవియును లేవు.

**హన్నీయేలు** (Hanniel = దేవుని కృప).

1. యెహోషువ కనానును విభాగించునప్పుడు సహాయపడిన మనష్షే వారి ప్రతినిధి (సంఖ్యా 34[23]).

2. ఆషేరీయుల పరాక్రమశాలురలో నొకఁడు (I దిన 7[39]).

**హాపరాయిము** (Hapharaim = రెండు గోతులు). ఇశ్శాఖారు సరిహద్దులోని యొక స్థలము (యెహో 19[19]). యుసూబియస్ అను పురాతన చరిత్రకారుఁడు తెలిపినట్లు ప్రస్తుతమది కర్మేలుకు దక్షిణముగా నుండు ఎల్ - ఫరీయ (*el-Ferriyyeh*) అని యనుకొనుచున్నారు గాని అది షునేముకు పడమరగా నుండు ఎల్ - అఫూలె (*el-Afuleh*) యని ఇతరుల యభిప్రాయము.

**హాప్పిస్సేసు** (Happizzez = చెదరిన వారు). యాజకులలోని 18 వ వంతుకు పెద్ద (I దిన 24[15]).

**హబక్కూకు** (Habakkuk = కౌగిలింత అష్షూరు భాషయందు దిదియొక కూరచెట్టును సూచింపవచ్చును). చిన్న ప్రవచన గ్రంథములనఁబడినవాని గ్రంథకర్తలలో నెనిమిదవవాఁడు. దానియందొక కీర్తనయుండుటచే ఇతఁడు లేవీయులలోని గాయకులలో నొకఁడని యూహింపఁదగును. అప్రమాణిక గ్రంథములలో బేలు దేవత భుజంగము అను దానియం దితనినిగూర్చిన సూచనయొకటిగలదు (33-39). గాని అందులో నితనికి LXX లో నున్న అంబకూము అను గ్రీకు రూపముగలదు. అతఁడొక దూతచే నెత్తఁబడి దానియేలు కాలములో బాబెలుకు కొనిపోఁబడినట్లు అందుదాహరింపఁబడినది. యూదుల పారంపర్యములయం దితఁడు ఎలీషా బ్రదికించిన విధవ కుమారుఁడనియు (II రాజు 4[16]), యెషయా గ్రంథమందు సూచింపఁబడిన కావలివాఁడనియు (యెష 21[6]) వదంతులున్నవి గాని అవన్నియు కల్పింపఁబడిన విషయములై నమ్మఁదగినవిగా నుండుటలేదు.

**హబక్కూకు గ్రంథము** (The Book of Habakkuk). చిన్న ప్రవక్తల గ్రంథములనఁబడినవానిలో నెనిమిదవది.

I. రచింపఁబడిన కాలము: కల్దీయులు వృద్ధిలోనికివచ్చి లోకరాజ్యము కావలెనైయున్న కాలమున ఇది రచింపఁబడెను. కల్దీయ యనునది బాబెలునకు మాఱుపేరు. ఇంతకుమునుపు అష్షూరు లోకరాజ్యమై బాబెలు నేలుచుండెను, గాని క్రీ॥ ము॥ 625 సం॥ లో దానికి రాజధానిగ నుండిన నీనెవె పట్టణమును బబులోనీయులు 607 లో జయించి నాశనముచేసిరి. 605 నందు కర్కెమెషునొద్ద ఫరోనెకోను జయించుటవలన అతని పక్షముననున్న యెహోయాకీమునుకూడ జయించినట్లున్నది (యిర్మీ 46[2]). అప్పుడు వారు సర్వలోకమున కేలికలైనట్లుండెను. బాబెలువారు వృద్ధిలోనికి వచ్చుచుండఁగా యూదులదేశమును వారిచే నాశనమగునని హబక్కూకు చూచి ఈ ప్రవచనగ్రంథమును వ్రాసెను. ఇట్లు అది క్రీ॥ ము॥ 625-600 సం॥ మధ్య నెప్పుడో రచింపఁబడెను. హబక్కూకు యిర్మీయా కాలములో ప్రవచించెనని దీనివలనఁ దెలియును. అది యూదుల దేశమునకు బహు అపాయకరమైన కాలము.

II. ముఖ్యవిషయము: ప్రవచనగ్రంథమునందు మాత్రమే ప్రవక్త దేవునితో వాదమాడినట్లున్నది. యూదాదేశమును క్రూరులును భక్తిహీనులును అగు జనముచే నాశముచేయుట న్యాయమా యని ప్రవక్త వాదింపఁగా దేవుఁడు దాని ననుసరించి యూదావారి విషయము తన యుద్దేశమును దెలిపెను.

III. ముఖ్యబోధ: పాపమువలననే యూదులు నశింతురని ఇతర ప్రవక్తలవలెనే బోధించిన పిమ్మట వారిని నాశనముచేసిన కల్దీయులనుకూడ శిక్షించునని దానినిబట్టి దేవుఁడు సర్వలోకమున కధికారియై అందఱియెడల బహు న్యాయముగా నశించునని దీని ముఖ్యబోధయై యున్నది. దానితోకూడ భక్తులు అట్టి శిక్షకాలములో భయపడక తమ విశ్వాసముచేతనే రక్షింపఁబడెదరను సంగతిని దెలుపుటకు నీతిమంతుఁడు విశ్వాసముచేతనే బ్రదుకును అను గొప్ప సత్యమును తేటగాఁ జెప్పెను. అది విశ్వాసమూలముగా రక్షణకలుగునను దానికి మూలవాక్యమాయెను.

IV. ముఖ్య భాగములు:

1. పీఠిక 1[1].

2. ప్రవచనములు 1[2]-2[20].

(1) దుర్మార్గులకు కలుగు జయమును చూచి ప్రవక్త యెహోవాకు మొఱ్ఱపెట్టగా (1[2-4]).

యూదావారిని శిక్షించుటకు దేవుఁడు వారిని సాధనముగా నుపయోగించినను, పిమ్మట వారును శిక్షనొందెదరని దేవుఁడు దానికి ప్రత్యుత్తర మిచ్చుట ($1^{4-12}$).

(2) కల్దీయులు తమకంటె నీతిమంతులుగా నున్నవారిని శిక్షింపనిచ్చుట న్యాయమా యని ప్రవక్త మఱల మొఱపెట్టఁగా ($1^{13-17}$), కల్దీయులు గర్వాంధులైన దుష్టులే (గాన వారు నశించుట సహజమైన సంగతియే యని చెప్పక) యనియు, నీతిమంతులైనవారు విశ్వాసమువలననే బ్రదికెదరనియు చెప్పిన పిమ్మట ($2^{1-4}$), కల్దీయులు చేసిన 5 విధములగు దోషములనుబట్టి శిక్ష కలుగునని చెప్పుట ($2^{5-20}$).

(3) స్తుతిగానము ($3^{1-19}$). దేవుని కనికరమును వేడుకొనిన పిమ్మట ($3^{2}$), దేవుఁడు గొప్ప మహిమా ప్రభావములతో కనఁబడుటను అందువలన కలిగిన భయమును అలంకారరీతిగా వివరించిన పిమ్మట ($3^{3-16}$) ప్రవక్త తనకు దేవునియందు కలిగిన నమ్మకమును బహు దివ్యముగాఁ దెలిపి గ్రంథమును ముగించెను.

మూఁడవ యధ్యాయమునందలి యీ కీర్తన ఆరంభమున నీ గ్రంథములో నుండక తరువాత దానికి చేర్చఁబడెనని కొందఱి యభిప్రాయము గాని దానిలోని సంగతులు రెండు అధ్యాయములలోని సంగతులతో నేకీభవించి వానికి తగిన ముగింపై యున్నది.

**హాబజ్జిన్యా (Habazzaniah).** దేవుని మందిరపు గదులలో నొకదానియొద్దకు యిర్మీయా వెంటఁబెట్టుకొని పోయిన రేకాబీయుఁడగు యజన్యాకు తాత (యిర్మీ $35^{7}$). ఈ వచనమునందు యజన్యా హాబజ్జిన్యా అను మాటలు క్రమము తప్పియున్నవి.

**హాబాయ్యా (Habaiah** = యెహోవా దాచిపెట్టెను). జెరుబ్బాబెలుతో తిరిగి యెరూషలేమునకు వెళ్లిన యాజకులలో నొక కుటుంబపువారు. వీరు తమ వంశావళి క్రమ మణిక చూపలేకపోయిరి గాన తమ యాజకత్వ ధర్మము నిలుపుకొనలేకపోయిరి (ఎజ్రా $2^{61}$= నెహె $7^{63}$).

**హామాతు, హామాతీయులు (Hamath** = కోట లేక ఆవరణము, **Hamethites).**

1. **హామాతీయులు** కనాను కొడుకగు హామాతు సంతతివారు (ఆది $10^{18}$ I దిన $1^{16}$).

2. దమస్కుకు ఉత్తరముగా 120 మైళ్ల దూరమున ఒరాంటీసు నది దగ్గరనున్న యొక ప్రసిద్ధ పట్టణము. దావీదు కాలమున తోయి యను రాజు దీని నేలెను. ఇతఁడు దావీదుతో స్నేహముగా నుండి, హదదెజరతనిచే నోడింపఁబడినప్పుడు తన సంతోషము నగుపరచుటకు రాయబారులను బంపెను (II సమూ $8^{9,10}$ I దిన $18^{3-9,10}$). సొలొమోను రాజయినప్పుడు తన రాజ్యము నింతవఱకు పెంపకముజేసి (I రాజు $8^{65}$), అచ్చట ఖజానానుంచు ప్రాకారములను గట్టించెను (II దిన $8^{4}$). ఇది త్వరలో ఇశ్రాయేలీయుల స్వాధీనమునుండి తొలఁగిపోయినను 2 వ యరొబాము ఆ పట్టణము వఱకున్న ప్రదేశమును మఱల పట్టుకొనెను (II $14^{25-28}$). మొదటి నుండి ఇది ఇశ్రాయేలీయుల రాజ్యమునకు ఉత్తర హద్దుగా నెంచఁబడెను (సంఖ్యా $13^{21}$ $34^{8}$ యెహో $13^{5}$ న్యాయా $3^{3}$). ఈ కాలమునందు ప్రవచించిన ఆమోసు దీనిని **హామాతు మహాపురమని** పిలిచెను (ఆమో $6^{2}$). జెకర్యా దీనిని దమస్కు, తూరు, సీదోను అను గొప్ప పట్టణమునకు సమానమైనదానిగా నెంచినట్లు జెక $9^{1,2}$ వలనఁ దెలియును. అష్షూరు చక్రవర్తులు దీనిని జయించి, దాని నివాసులను దేశాంతరము బంపిరి. ప్రవక్తలు దీని నాశమునుగూర్చి ప్రవచించిరి (యెష $10^{9}$). దీనిని జయించుకొంటిమని అష్షూరీయులు బతిశయించిరి (II రాజు $18^{34}$= యెష $36^{19}$ II రాజు $19^{13}$). చెఱపట్టఁబడిన ఇశ్రాయేలీయులు కొందఱు హామాతుకు కొంచుపోఁబడిరి (యెష $11^{11}$). పది గోత్రములు పాడయినప్పుడు షోమ్రోనులో నుండుటకు కొందఱు హామాతువారు పంపఁబడిరి. అషీమా అనునది వీరిదేవతయై యుండెను (అషీమా చూ॥). తరువాత దీని ప్రాముఖ్యత తగ్గినట్లున్నది. యిర్మీ $49^{23}$ నందు అది దమస్కుకులోనైనట్లు కనఁబడుచున్నది. యెహెజ్కేలు ఇది మరల పరిశుద్ధదేశమునకు ఉత్తరహద్దగునని ప్రవచించెను ($47^{16,17,20}$ $48^{1}$). దాని పేరు నేటివఱకు అచట

నున్న హమా (*Hamah*) యను ఊరిపేరులో కనఁబడును (పటము VIII, C 1).

**హమాతుసోబా** (Hamath zobah = సోబాలోని హమాతు లేక సోబా ప్రాకారములు). ఇది సొలొమోనుచే పట్టఁబడిన యొక పట్టణము (II దిన 8³). కొందఱిది హమాతుకు మాఱుపేరని యనుకొందురు (హమాతు చూ॥). గాని సోబా రాజ్యములోనున్న మఱియొక హమాతు అనుకొనుట యుక్తము. ఈ వాక్యములో తప్ప మఱి యెచటనైనను అట్టి స్థలమునకు సూచనలు లేవు.

**హమూటలు** (Hamutal = మంచువలె). రాజగు యోషీయా భార్య. యెహోయాహాజును సిద్కియాయు ఈమె కుమారులు (II రాజు 23³¹ 24¹⁸ యిర్మీ 52¹).

**హమోనా** (Hamonah = సమూహము). గోగు అపజయము నొందఁబోవు స్థలమునకు అలంకారనామము (యెహె 39¹⁶).

**హమోన్గోగు** (Hamon=gog). గోగు జయింపఁబడునప్పుడు అతఁడును అతని సేనా సమూహములును పాతిపెట్టఁబడబోవు లోయకు అలంకారనామము (యెహె 39¹¹⁻¹⁵).

**హమోరు** (Hamor = మగ గాడిద). యాకోబు కాలమునందు షెకెము పట్టణపు పెద్ద (ఆది 34²⁰ యెహో 24³² న్యాయా 9²⁸). అతఁడు హివ్వీయ జనాంగములో చేరినవాఁడు. అతఁడు షెకెము తండ్రి యనఁబడెనుగాన దానిని మొదట కట్టించినవాఁడై యుండవచ్చును. ఇతని కుమారుఁడు దీనాను చెఱపినందున యాకోబు కుమారు లితనినికూడ చంపిరి (ఆది 34²). ఇతని యొద్దనుండి యాకోబుకొనిన భూమిలో గోత్రకర్తలను పాతిపెట్టిరని స్తెఫను చెప్పెను (కార్య 7³⁵) గాని యోసేపు మాత్రమే అచ్చట పాతిపెట్టఁబడెను.

**హమ్మాతు, హమ్మోను, హమ్మోత్దోరు** (Hammath = వేడినీళ్ల యూట).

1. రేకాబు ఇంటివారి తండ్రి (I దిన 2⁵⁵).

2. నఫ్తాలీలో ప్రాకారములుగల యొక పట్టణము (యెహో 19³⁵). I దిన 6⁷⁶ లో నున్న హమ్మోను, యెహో 21³² నందున్న హమ్మోత్దోరు ఈ స్థలమే యైయుండవచ్చును తిబెరియ పట్టణమునకు 2 మైళ్లు దక్షిణముగా నున్న హమ్మాము (*Hammam*) దీని యునికియై యున్నది. అచట ప్రసిద్ధికెక్కిన వేడినీళ్ల ఊట గలదు.

**హమ్మురాబి** బబులోను III 2 చూ॥

**హమ్మూయేలు** (Hammuel = దేవుని వేడిమి). షిమ్యోను గోత్రికులలో నొకడు (I దిన 4²⁶).

**హమ్మెదాతా** (Hammedatha చంద్ర కుమారుఁడు?). హామాను తండ్రి (ఎస్తే 3¹⁻¹⁰ 8⁵ 9¹⁰⁻²⁴).

**హమ్మేయా గోపురము** యెరూషలేము B V 2 (2) చూ॥

**హమ్మోత్దోరు** హమ్మాతు చూ॥

**హమ్మోను** హమ్మాతు చూ॥

**హమ్మోలెకెతు** (Hammolecheth = రాణి). మనష్షే కుమారుఁడగు మాకీరుయొక్క కుమార్తె. గిలాదుకు సహోదరి. ఈమె మనష్షే కుటుంబములలోఁ గొన్నిఁటికి పూర్వికురాలు (I దిన 7¹⁷,¹⁸).

**హమ్రాము** అమ్రాము 3 చూ॥

**హారాదా** (Haradah = భయము). సీనాయికిని కాదేషుకును మధ్య ఇశ్రాయేలీయులు మకాముచేసిన స్థలములలో నొకటి (సంఖ్యా 33²⁴,²⁵). దాని యునికి తెలియదు.

**హారారీయుడు** (Hararite = కొండ నివాసి లేక హారారు నివాసి). దావీదు యోధులలో నిద్దఱి బిరుదై యున్నది.

1. ఆగే కుమారుఁడగు షమ్మా. (II సమూ 23¹¹⁻³³). I దిన 11³⁴ లో షమ్మాకు ప్రతిగా షాగే అను పేరున్నది.

2. షారారుకు పుట్టిన అహీయాము (II సమూ 23³³ I దిన 11³⁵). వీరు కొండ నివాసులగుటచే ఈ బిరుదు వారికి వచ్చియుండవచ్చును. గాని వారు హారారు అను ఊరి నివాసులగుటచే అట్లు పిలువఁబడినదని సాధారణముగా నన్ను

కొందురు. అట్టి ఊరున్న యెడల దానినిగూర్చిన సూచన లింక కనఁబడుటలేదు.

హరూమపు (Harumaph = చట్టిముక్కు). నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను కట్టుటకు సహాయము చేసిన యెదాయా తండ్రి (నెహె 3[10]).

హరోదీయుడు, హరోరీయుడు (Harodite, Harorite). దావీదు యోధులలో షమ్మా, ఎలీకా అను ఇద్దరికి పెట్టిన బిరుదులు (II సమూ 23[25]). ఈ వాక్యమునకు పాటియగు I దిన 11[27] నందు రెండు పేర్లలో మొదటిది మాత్రమున్నది. LXX నందు II సమూ 23[25] లో కూడ ఎలీకా అను వాని పేరు లేదు. హెబ్రీ భాషయందు ర, ద యను అక్షరముల చాలమట్టుకు ఒకేరీతిగా నున్నందున I దిన 11[27] నం దిది హరోరీయుడు అనునట్లున్నది. హరోదు నివాసియగుటచే వీరికి బిరుదువచ్చె ననవచ్చును (హరోదు చూ॥).

హరోదు (Harod = భయము). గిద్యోను తన సైనికులను పరీక్షించిన ఊట (న్యాయా 7[1]). యెజ్రెయేలు లోయకు పడమరగా గిల్బోవ పర్వతపు టడుగున ప్రస్తుతమున్న అయిన్ జాలూదు (*Ain Jalud*) దీని యునికి యని తలంచుచున్నారు. (పటము IV, D 8).

హరోషెతు (Harosheth = చెక్కుడు పని). ఇది సీసెరా చరిత్రయందు మాత్రము కనఁబడు నొక స్థలముయొక్క పేరు. అతఁ డీ స్థలమున నివసించెను. యుద్ధముచేయుట కిచ్చటి నుండియే బయలుదేరి, యుద్ధానంతరము ఇంత వరకు దఱుమఁబడెను (న్యాయా 4[2-13-16]). అది గోయీయుల హరోషెతు (=అన్య జనాంగముల హరోషెతు) అనఁబడెను. కీషోను నదికి సమీపమునను, మెగిద్దోకు 16 మైళ్లు వాయవ్యదిక్కున ప్రస్తుతముండు టెల్-ఎల్-హారతీయె (*Tell-el-Harathiyeh*) దీనియునికియై యున్న దను కొందురు (పటము IV, B 7).

హర్నెపెరు (Harnepher = రొప్పు?). ఆషేరీయులలో నొకఁడు (I దిన 7[36]).

హర్బోనా (Harbonah = గాడిదెలను తోలువాఁడు), అహష్వేరోషు దగ్గరనున్న 7 గురు నపుంసకులలో మూఁడవవాఁడు (ఎస్తే 1[11]). హామానును ఉరితీయుంచవలెనని సలహా నిచ్చినవాఁ డితఁడే (7[9]).

హర్షా (Harsha = చిత్రపుపని). నెతీనీయులలో నొక కుటుంబమునకు మూలపురుషుఁడు. ఈ కుటుంబపువారిలో గొందఱు జెరుబ్బాబెలుతోకూడ బాబెలునుండి యెరూషలేమునకు తిరిగివచ్చిరి (ఎజ్రా 2[52] నెహె 7[54]).

హర్సీతు యెరూషలేము B III 8 (4) చూ॥

హర్హయా (Harhaiah). నెహెమ్యా కాలమునందు యెరూషలేము ప్రాకారములను కట్టుటకు సహాయముచేసిన ఉజ్జీయేలు తండ్రి (నెహె 3[8]).

హర్హసు (Harhas). ప్రవక్త్రియైన హుల్దాకు భర్తయగు షల్లూముయొక్క పూర్వీకుఁడు (II రాజు 22[14] II దిన 34[22]) గలదు.

హర్హూరు (Harhur = జ్వరము). నెతీనీయులలో నొక కుటుంబమునకు మూలపురుషుఁడు. వీరిలోఁ గొందఱు జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకు తిరిగివచ్చిరి (ఎజ్రా 2[51]= నెహె 7[53]).

హలి (Hali = హారము). ఆషేరు గోత్రమునకు సరిహద్దుగా నున్న పట్టణములలో నొకటి (యెహో 19[25]). ప్రస్తుతము తోలెమాయికి 13 మైళ్లు ఈశాన్యముగానున్న అలియ (*Alia*) దీనియునికై యుండవచ్చును గాని రూఢిగా చెప్పుటకు వీలులేదు (పటము IV, C 5).

హల్లెల్ సంగీతము 4 చూ॥

హల్లెలూయ (Hallelujah, Alleluia = యెహోవాను స్తుతించుట). తెలుఁగు బైబిలునందీ పదము నట్లే యుంచక దానిని తెనిఁగించిరి గాని యీ పదము ఆది క్రైస్తవులలో వాడుక మాట యగుటచే దాని నిచ్చట చూడఁదగును. అది హెబ్రీపదము. దానికి యెహోవాను స్తుతించుట యని శబ్దార్థము. దాని గ్రీకు రూపమగు అల్లెలూయా యను దానిని ప్రక 19[1] యొక్క భాషాంతరముగ నుంచిరి. ఈ పదము అనేక కీర్తనలలో నున్నది (104[35] 105[45] 106[1]

$111^{1}$ $112^{1}$ $113^{1-9}$ $115^{18}$ $116^{19}$ $117^{2}$ $135^{1-21}$). 146 వ కీర్తన మొదలు 150 వఱకు హల్లెలూయా యను మాటతో ప్రతిదియు నారంభమై ఆ మాటతోనే ముగియును. రక్షింపఁబడిన సమూహము ఈ మాటనే తమ స్తుతిగానములలో వాడెదరని యోహాను వ్రాసెను (ప్రక $19^{1,3-4-6}$).

**హల్లోహేషు** (**Hallohesh** = గుసగుసలాడువాఁడు). నెహెమ్యాకాలమున యెరూషలేము ప్రాకారములను బాగుచేయుటలో సహాయపడిన వారిలో షల్లూము అనువాని తండ్రి లేక మూలపురుషుఁడు (నెహె $3^{12}$). నిబంధనను ముద్రించినవారిలో నితఁడుండెను. ఇతఁడు లేని పక్షమున ఇతని కుటుంబపు వారుండిరి ($10^{24}$).

**హల్హూలు** (**Halhul** = సందు!). యూదాలోని యొక యూరు (యెహో $15^{58}$). హెబ్రోనుకు నాలుగుమైళ్లు ఉత్తరముగా ప్రస్తుతముండు హల్హూలు దీనియునికియై యున్నది. ఇది ప్రవక్తయగు గాదుయొక్క జన్మస్థానమని యొక వదంతి గలదు (పటము II, E 2).

**హవీలా** (**Havilah** = ఇసుకభూమి!). ఆది $10^{7}$ I దిన $1^{9}$ లో హవిలా కూషు కుమారుఁడని యున్నది. ఆది $10^{29}$ I దిన $1^{23}$ లో యొక్తాను కుమారుఁడని కనఁబడుచున్నది. ఆది $2^{10,11}$ నందు ఏదేను నదులలో పీషోను హవీలా చుట్టు పారుచున్నదని చూడవచ్చును. $25^{18}$ నందు ఇది ఇష్మాయేలు సంతతివారు నివసించిన తూర్పు లేక ఈశాన్యదిక్కునందు దేశముగానున్నది. ఈ హద్దులే I సమూ $15^{7}$ నందు, సౌలు అమాలేకీయులను సంహరించిన ప్రదేశమును సూచించును గాని అది బహుశః ఆది $25^{18}$ నుండి యెత్తిన వాడుకమాటయే గాని, సూటిగా ఆ హద్దులను సూచించుటలేదు. ఇది అరేబియలో నున్నది గాని యే దిక్కున నున్నదో సరిగాఁ దెలియదు. బైబిలునందలి సూచనలను బట్టి అది అరేబియాకు ఈశాన్యమున నున్నదనవచ్చును గాని అట్టి సూచనలకొఱకు ఆ దేశమును పరీక్షించినయెడల ఇది మధ్య అరేబియాలోని దక్షిణభాగముగా తేలుచున్నది. గ్రీకువారు అయిలా యని పేరు పెట్టిన యొక ప్రదేశము అబిస్సీనియాలో కనఁబడుచున్నది. వీని నన్నిఁటిని చూడఁగా, ఇది యొక స్థిరప్రదేశముసుగాక, దేశ సంచారముచేయు ఒక జనముండు ప్రదేశమును సూచించుచున్నదని అనుకొనఁదగును.

**హవ్రాను** (**Hauran** = పల్లపు ప్రదేశము). ఇది యెహె $47^{16,18}$ నందు మాత్ర ముదాహరింపఁబడినది. అచ్చట కుదురుబాటు కలిగిన పిమ్మట పలెస్తీనుకు అది తూర్పు హద్దుగా నెంచఁబడెను. బైబిలునం దీయొక్క చోటమాత్రమే ఈ పేరు కనఁబడినను, అష్షూరు రాతిశాసనముల యందును గ్రీకు రోమనువారి గ్రంథములయందును అరబీయుల పేరులలోను కనఁబడు ప్రసిద్ధ ప్రదేశమై యున్నది. నేటివఱకు అరబీయు లా ప్రదేశమును ఎల్-హవ్రాను (=హవ్రాను) అని పిలుచుచున్నారు. అది దమస్కుకు ఈశాన్యమునందు ఫలవంతమైన ప్రదేశమై 50 మైళ్ల చతురము నాక్రమించి యున్నది. సముద్రపు మట్టమునకు 2 వేల అడుగుల ఎత్తున్నను బాషాను, హెర్మోను పర్వతముల ముందు పల్లపు భూమిగా కనఁబడును. వివిధ ధాన్యములే యిచ్చట విశేషముగ పండును. క్రొత్త నిబంధనయందు దీనిపేరు కనఁబడకున్నను, అది త్రకోనీతికి (లూ $3^{1}$) దక్షిణముననుండి హేరోదు ఫిలిప్పు రాజ్యమున చేరియుండెను. అంతకుపూర్వ మది మహా హేరోదురాజ్యమున నొక భాగమై యుండెను.

**హవ్వ** (**Eve** = జీవము). మొదటి స్త్రీ. ఆదాము భార్యయు కయీను హేబెలు షేతు అను వారి తల్లి (ఆది $4^{1,2,25}$ $5^{1-5}$). ఆమె యితరులనుకూడ కనెను. ఆమె సృజింపఁబడిన విధమునుగూర్చియు పాపములో పడుటనుగుఱించియు (ఆదాము చూ॥). కయీనును కనినప్పుడు ఆమె చెప్పినమాటలు ($4^{1}$) మెస్సీయనుగూర్చిన ప్రవచనములలో నొకటి యని కొందఱి తలంపు. ఆమెకు కలిగిన శోధననుగుఱించి పౌలుదాహరించెను (II కొరి $11^{3}$) గాని, బైబిలునందు ఆమెనుగూర్చిన సూచనలంతగా లేవు. W.

**హశూపా** (**Hasupha** = బైలుపర్చఁబడినది). నెతీనీయుల కుటుంబములలో నొకదాని మూలపురుషుఁడు, అతనివలన ఈ పేరు ఆ కుటుంబమునకును కలిగెను. వారిలోఁ గొందఱు

జెరుబ్బాబెలుతోకూడ యెరూషలేమునకుఁ దిరిగి వచ్చిరి (ఎజ్రా 2[43]= నెహె 7[46]).

హూషబ్నా (Hushuhna). నెహెమ్యాతో కూడ నిబంధనను ముద్రించినవారిలో నొకఁడు (నెహె 10[25]).

హషబ్నెయా (Hashabneiah).

1. నెహెమ్యాకాలమున పట్టణప్రాకారములను కట్టుటకు సహాయపడిన హట్టూషు తండ్రి (నెహె 3[10]).

2. ఒక లేవీయుఁడు (నెహె 9[5]). ఇతఁడు హషబ్యా 10 లోనివాఁడు కావచ్చును.

హషబ్యా (Heshabiah = యెహోవా నియమించెను).

1, 2. మెరారీ తెగవారిలో ఇద్దఱు లేవీయులు (I దిన 6[45] 9[14] నెహె 11[15]).

3. యెదూతూను సంతానీకుఁడు. దావీదు నియమించిన 24 సంగీతవంతులలో 12 వ దాని నాయకుఁడు (I దిన 25[3-19]).

4. హెబ్రోనీయులలో నొకఁడు. దావీదు ఇతని యింటివారిని యెహోవా సేవనుగూర్చిన అన్నిఁటి విషయములో పై విచారణకర్తలుగా యొర్దాను పడమటి ప్రదేశపువారిపై నియమించెను (I దిన 26[30]). 23[12] చూడఁగా వీరు కహాతు తెగలోచేరిన లేవీయులై యున్నట్లు తెలియును.

5. దావీదుకాలమున లేవీయులపై అధిపతిగా నున్నవాఁడు (I దిన 27[17]).

6. యోషీయా కాలములో లేవీయులమీఁద అధిపతులుగా నున్నవారిలో నొకఁడు (II దిన 35[9]).

7. ఎజ్రాతోకూడ తిరిగి యెరూషలేమునకు వెళ్లినవారిలో నొకఁడు (ఎజ్రా 8[19]).

8. చెఱనుండి ఇశ్రాయేలీయులు తిరిగి వచ్చుచుండఁగా ఆలయసంబంధమైన పరిశుద్ధ వస్తువులను కాపాడుటకు ఎజ్రాచేత నియమింపఁబడిన 12 మంది యాజకులలో నొకఁడు (ఎజ్రా 8[24]).

9. నెహెమ్యాకాలమునందు పట్టణప్రాకారములను కట్టుటకు సహాయపడినవారిలో నొకఁడు (నెహె 3[17]). అతఁడు నిబంధన ముద్రించినవారిలో నుండెను (10[11] 12[24-26]). కెయిలా యొక్క సగము భాగమున కధిపతియై యుండెను (3[17]).

10. ఒక లేవీయుఁడు (నెహె 11[22]).

11. ఒక యాజకుఁడు (నెహె 12[21]).

పై జాబితాలోని వారందఱును వేఱువేఱు వారై యున్నారని రూఢిగాఁ జెప్పుటకు వీలులేదు. చాలమంది యాజకులగుటచే ఒకరిని యొకరినుండి ప్రత్యేకించుట కష్టము.

హషూబా (Hashubah = ఘనత నొందు). జెరుబ్బాబెలు కుమారులలో నొకఁడు (I దిన 3[20]).

హష్బద్దానా (Hashbadaanah). ఎజ్రా ప్రజలకు ధర్మశాస్త్రమును వినిపింపఁగా అతని యెడమప్రక్క నిలిచిన పెద్దలలో నొకఁడు (నెహె 8[4]).

హష్షూబు (Hasshub = యోచించువాఁడు).

1, 2. నెహెమ్యాకాలములో యెరూషలేము ప్రాకారములను కట్టుటకు సహాయము చేసిన వారిలో నిద్దరు (నెహె 3[11-23]).

3. నెహెమ్యాతోకూడ నిబంధనను ముద్రించిన వారిలో నొకఁడు (నెహె 10[23]). ఇతఁడు పైనున్న యిద్దఱిలో నొకఁడు కావచ్చును.

4. మెరారీ తెగవారిలోని యొక లేవీయుఁడు (I దిన 9[14] నెహె 11[15]).

హష్మోనా (Hashmonah = ఫలవంతమైన స్థలము). అరణ్యమందు ఇశ్రాయేలీయులు ప్రయాణములో మకాముచేసిన యొక స్థలము (సంఖ్యా 33[29,30]).

హసద్యా (Hasadiah = యెహోవా దయగలవాఁడు). జెరుబ్బాబెలు కుమారులలో నొకఁడు (I దిన 3[20]).

హాసరద్దారు (Hazar Adar = అద్దారు ఊరు). కనాను దేశమునకు దక్షిణమునను, కాదేషు బర్నేయకు పడమరగా నుండు ఒక స్థలము (సంఖ్యా 34[4]). యెహోషు 15[3] లో

నుండు అద్దారు దీనికి సంబంధించిన స్థలముగాని ఆ వాక్యములోని హెబ్రోను ఇదే యైనట్లున్నది (అద్దారు చూ॥).

**హాసరేనాను** (Hazar Enan = ఊటలు గల యూరు). పలస్తీను ఉత్తరహద్దులలో నొకటి (సంఖ్యా 34[9,10]). యెహెజ్కేలు కుదురుబాటు కలిగిన పిదప పలస్తీనుకు కలుగఁబోవు సంగతులను గూర్చి అలంకారరీతిగా వ్రాసినప్పుడు దీనిని పలస్తీను హద్దులలో నొకటిగా వ్రాసెను (యెహె 47[17] 48[1]). ఒరాంటీసు నదియొక్క ఉత్పత్తి యొద్ద నున్న ఊటలు దీని యునికి గావచ్చును.

**హాసర్గద్దా** (Hazar-Gaddah = అదృష్టపు ఊరు). యూదా గోత్రమున దక్షిణమందుండు ఒక గ్రామము (యెహో 15[27]). దీని యునికి తెలియదు.

**హాసర్మావెతు** (Hazar-Maveth = మరణపు ఊరు). యొక్తాను కుమారులలో మూఁడవ వాఁడు (ఆది 10[26]=I దిన 1[20]). ఇతఁ డరబ్బీ గోత్రములలో నొకదానికి మూలపురుషుఁ డయ్యెను. ప్రస్తుతము దక్షిణ అరబ్బీలో నున్న హద్రామాత (*Hadramauth*) అను పేరు వీరి వలన వచ్చినదై వీరి నివాసస్థానమును సూచించును.

**హాసస్సోను తామారు** (Hazazon-Tamar = ఈఁత చెట్లను శుద్ధిచేయుట). ఇది ఏన్గెదీ యని II దిన 20[2] వలనఁ దెలియుచున్నది (ఏన్గెదీ చూ॥). కదొర్లాయోమెరు చేసిన యుద్ధములో ఈ స్థలములోని వారినికూడ కొట్టుటను బట్టి ఇది దాని పురాతనపు పేరని కనఁబడుచున్నది (ఆది 14[7]).

**హాసీదియులు** మతాభిమానులను తెగ వారు చూ॥

**హస్తకంకణము** ఆభరణములు 5 చూ॥

**హస్తనిక్షేపణము** (Laying on of Hands). బైబిలునందు అయా ఆచారములకు సంబంధముగా చేయఁబడు నొక వాడుక. దీనిని హస్త నిక్షేపణ మని పిలిచిరి. పాఁత నిబంధనలో ఆయావారి నాశీర్వదించుటకు (ఆది 48[13,14]) చేతుల నుంచువాడుక యుండెను. మోషే చేతులుంచుటవలన యెహోషువను తన పనికి ప్రత్యేకించెను (సంఖ్యా 27[23] ద్వితీ 34[9]). యజ్ఞముల నర్పించుచుండఁగా అర్పించినవాఁడు అర్పించుదానిమీఁద తన చేతులుంచుటవలన తన పాపభారమును దానిమీఁద మోపినట్లున్న సూచనలు గలవు (లేవీ 1[4] 4[3,4,24] 16[21,22] మొ॥). ఈ వాడుక క్రొత్త నిబంధనలో కనఁబడక పోయినను ఆశీర్వదించుటకును ప్రత్యేకించుటకును హస్తనిక్షేపణము చేయుటనుగూర్చి క్రొత్త నిబంధనలో అయా చోట్ల నుదాహరించిరి.

1. క్రీస్తువిధముగా చిన్నపిల్లల నాశీర్వదించెను (మ 19[13,15]).

2. క్రీస్తు అనేకులను బాగుచేయుచుండఁగా వారిపై చేతులుంచి వారిని బాగుజేసెను (మా 6[5] లూ 4[40] 13[13] మ 9[18] మా 7[32]). స్వస్థపఱచు నీ వరమునొందిన అపొస్తలులు రోగులపై చేతులుంచి వారిని బాగుచేసిరి (కార్య 9[12,17] 28[8]).

3. బాప్తిస్మము నొందినవారిమీఁద అపొస్తలులు చేతుల నుంచిరి. పేతురు సమరయుల మీఁద చేతులుంచఁగా వారు పరిశుద్ధాత్మ నొందిరి (కార్య 8[17,18]). సౌలు వరము నొందునట్లు అననీయ అతనిమీఁద చేతులుంచెను (9[17,18]). ఇందువలన అపొస్తలులు మాత్రమేగాక ఇతరులు కూడ ఆత్మీయవరములను ఇచ్చుటకు శక్తిగలవారై యుండినట్లు కనఁబడును. బాప్తిస్మము నొందిన పిమ్మట హస్తనిక్షేపణముచేసిన సంగతి ప్రస్తుతము సంఘములో ననేకులు అవలంబించుచున్న నిర్ధారణ (*Confirmation*) అను నాచారమునకు ఉత్పత్తి యని కొందఱి యభిప్రాయము.

4. నాలుగు వాక్యములలో నది గురుపట్టమునకు (*Ordination*) సంబంధించినదై సంఘములలో నాయావారిని ప్రత్యేక పనులకు నియమించుటకు సూచనగా నున్నది. ధర్మమును పంచిపెట్టుట కేడుగురిని నియమింపఁగా అపొస్తలులు ప్రార్థించి వారిపై చేతులుంచిరి (కార్య 6[6]). అంతియొకయ సంఘములోని ప్రవక్తలు బోధకులు సౌలును బర్నబాను సువార్త పనిచేయుటకు ప్రత్యేకించిరి (13[3]). పౌలుతోకూడ కలిసి సంఘపుపెద్దలు తిమోతిని అట్టి పనికి ప్రత్యేకించిరి (I తిమో 4[14] II తిమో 1[6]). గురువు అభిషేకమున కుత్పత్తి యిదేనని సాధారణముగా

I దిన 2[5]). ఇతని సంతతివారు **హామూలీయు** లనబడిరి (సంఖ్యా 26[21]).

**హాయహష్తారీ** (Haah-hashtari = అహస్తారీవాఁడు). యూదా సంతతి వారిలో నొకఁడు (I దిన 4[6]).

**హాయి** (Ai = పాడుదిబ్బ).

1. కనానీయుల పట్టణములలో నొకటి (యెహో 8[23,29] 10[1] 12[9]). అబ్రాహాము కాలమునుండి యున్నది. దానికప్పుడు హాయి యని పేరు (ఆది 12[8]). బేతేలుకు తూర్పున బేతావెనుకు దగ్గర నున్నది (యెహో 7[2] 8[9]). ఇశ్రాయేలీయులు యెరికోను పట్టుకొనిన తరువాత హాయి మీఁదకుఁ బోయి పరాజితులైరి. అటువెనుక దాని పట్టుకొని పర్వనాశముఁజేసిరి (7[3] 9[3] 10[1,2] 12[9]). యెష 10[28] లోని **అయాతు** ఇదే స్థలపు పేరుగ కనుబడుచున్నది. (పటము III, F 5).

2. అమ్మోనీయుల పట్టణము. హెష్బోనుకు సంబంధించినదై యుండవచ్చును (యిర్మీ 49[2,3]). ఆయాతు చూ॥ H.

**హార్మెగిద్దోను** (Armageddon = మెగిద్దోగ్రామము, మెగిద్దోపర్వతము). కర్మెలు పర్వతమునకును గిల్బోవ పర్వతమునకు మధ్యనుండు ప్రదేశములో నుండిన యొక స్థలము పాఁత నిబంధన చరిత్రయందు ఆ మైదానము మిగుల ప్రఖ్యాతిగల రణరంగమై జయాపజయములకు పేరెక్కినదై యుండెను. ఇక్కడ బారాకు కనాను రాజైన యాబీనును సంహరించెను (న్యాయా 5). ఇక్కడనే గిద్యోను మిద్యానీయుల నోడించెను (7) ఇశ్రాయేలీయుల, ప్రథమరాజగు సౌలు ఆ మైదానమం దోడిపోయి ప్రాణత్యాగము చేసికొనెను (Iసమూ 31[8]). యూదారాజగు అహజ్యా చంపఁబడిన యుద్ధమిచ్చటనే జరిగెను (II రాజు 9[27]). తరువాత కాలమున ఇశ్రాయేలు రాజైన యోషీయా ఐగుప్తు రాజువలన నోడించఁబడెను (23[24]). ఈ పేరుగల నొకచోటున ఘటసర్పమువలనను క్రూర మృగములవలనను అబద్ధ ప్రవక్తలవలనను పంపించఁబడిన దయ్యములు దేవునితో యుద్ధమాడుటకై లోకమందంతట నున్న రాజులను పోగుచేయునని ప్రక 16[16] నం దుదాహరించఁబడెను. అయినను ఈ మాట గూఢార్థమైనది గనుక దీనివలన సూచించఁబడిన స్థలమును గుర్తించ సాధ్యముకాదు గాని కడకు దుర్నీతియణఁగి దైవనీతి జయప్రదమగునని దీనిమూలముగ విశదమగును. M.

**హారము** ఆభరణములు 7 చూ॥

**హారా** (Hara = కొండప్రదేశము). పది గోత్రములవారు చెఱపట్టఁబడిన పిమ్మట అష్షూరు వారి చెఱఁగొనిపోఁబడిన దేశములలో నొకటి (I దిన 5[26]). దీనికి సాటియైన చరిత్రగల II రాజు 17[6] 18[11] నందు హారాయను నీ పదము కనఁబడదు. LXX లో మాదైకొండలు అను పదమును వ్రాసిరి. ఈ పదముయొక్క అర్థమునుబట్టి ఇది మాదై ప్రదేశమును సూచింపవచ్చును.

**హారాను** (Haran). తెలుఁగు బైబిలు నందు దిగువనున్న నాలుగింటిలో నొకటే రూపము నుపయోగించినను హెబ్రీ భాషయందు మొదటి రెంటికి హారాను అనియు, చివరి రెంటికి ఖారాను అనియు గుణింతమున్నది. హారాను అను పదమున కర్థము తెలియదు. ఖారాను అనఁగా వీధి లేక పని యని యర్థము.

1. తెరహు కుమారుఁడు. అబ్రాహాము సహోదరుఁడు. లోతుయొక్క తండ్రి (ఆది 11[26]). మిల్కా ఇస్కా అను కుమార్తె లిద్దరు వీనికుండిరి (11[29]).

2. లేవీయులలో గెర్షోను తెగవారిలో నొకఁడు (I దిన 23[9]).

3. కాలేబు కుమారులలో నొకఁడు (I దిన 2[46]).

4. మెసపొతేమియలో వాయవ్య దిక్కున నున్న యొక పట్టణము. ఊర్ నగరమునుండి తెరహు తన ఇంటిల్లిపాదితో నిక్కడకు వచ్చెను (ఆది 11[31] 12[4,5] కార్య 7[2]). ఇచ్చటనే తెరహు మృతినొందెను (ఆది 11[32] కార్య 7[4]). అబ్రాహాము సహోదరుఁడగు నాహోరు ఇచట కాపురముండెను గాన, దీనికి నాహోరు పట్టణమను పేరును గలిగెను (ఆది 24[10] 27[43]). అబ్రా

హాము ఇక్కడనుండి బయలుదేరి వెళ్లెను (12[1]). యాకోబిక్కడ కొంతకాలము జీవించెను (24[24] 28[10] 29[5]). బాబెలునకును ఐగుప్తునకును వెళ్లు మార్గమధ్యమం దుండుటచేత నిది వ్యాపారమునకు మిగుల ప్రసిద్ధికెంచెను (యెహె 27[23]). ఈ పట్టణము సీను అను చంద్రదేవతా పూజకు ముఖ్య స్థానమాయెను. అష్షూరువారు దీనిని పట్టు కొన్నట్లే II రాజు 19[12] నందున్నది. ప్రస్తుత మిక్కడనున్న హర్రాను (*Harran*) అను పల్లె దీని యునికిరైయి యున్నది (పటము VIII, C I).

**హారిము** (Harim = ప్రతిష్ఠించిన).

1. యాజకుల కుటుంబములలో నొకటి. దావీదు నియమించిన వంతులలో వీరిది 3 వ వంతు (I దిన 24[1,6,8]). బాబెలు చెఱనుండి వచ్చిన వారు వీరైనట్లున్నది (ఎజ్రా 2[39] నెహె 7[42]). కొంతకాలమునకు తరువాత యోయా కీము దినములలో వారి పేరు మరల కనబడును (నెహె 12[15]). నెహె 12[3] నందు వీరి పేరు పొరబాటుగా రెహూము అని యున్నది. గోడ లను కట్టుటలో సహాయపడిన మల్కీయ హాము కుమారుడనబడెను. అనగా అతడీ కుటుం బపు వారిలో నొకడని యర్థము (నెహె 3[11]).

2. యాజకులు కాని యొక కుటుంబము. వీరిలో గొందఱు జెరుబ్బాబెలుతో కూడ తిరిగి వచ్చిరి (ఎజ్రా 2[32] = నెహె 7[35]). అన్య స్త్రీలను వివాహము చేసికొని ఎజ్రా ప్రేరేపణ వలన వారిని విడిచిపెట్టి (ఎజ్రా 10[31]) నిబంధనను ముద్రించిరి (నెహె 10[27]).

**హారీపు, హారీపీయుడు** (Hariph = తొలకరి వర్షములు, Hariphite). జెరుబ్బా బెలుతో కూడ తిరిగి వచ్చిన కుటుంబములలో నొకదాని పూర్వీకుడు. ఇతనివలన ఆ కుటుంబ మున కీ పేరు కలిగెను (నెహె 7[24]). నిబంధన ముద్రించినవారిలో వీరు నుండిరి (10[19]). ఎజ్రా 2[18] నందీ పేరునకు ప్రతిగా యోరా అను పదముగలదు. I దిన 12[5] నందు దావీదు యోధులలో నొకనికి హారీపీయుడను బిరుదు గలదు. అతడీ కుటుంబమునందు చేరుటచే ఈ బిరుదితనికి కలిగియుండవచ్చును.

**హారుము** (Harum = ఉన్నతమైన). యూదా సంబంధులలో నొకడు (I దిన 4[8]).

**హారూసు** (Haruz = శ్రద్ధగల). రాజగు మనష్షే మామ (I రాజు 21[19]).

**హారెతు** (Hareth). దావీదు దేశభ్రష్టుడై నప్పుడు దాగుకొన్న యొక యరణ్యము (I సమూ 22[5]). యూదాలో నున్నది. అదు ల్లాముకు తూర్పుగా నుండు ప్రదేశమే దీనియునికి కావచ్చును. అచ్చట ప్రస్తుతము ఖారాసు (*Charas*) అను ఊరు కలదు. అది ఈ పేరుకు సంబంధించినట్లున్నది.

**హారేపు** (Hareph = పీకివేయుట). యూదా సంబంధులలో నొకడు. కాలేబు కుమారుడు. బేత్గాదేరు అను ఊరి పూర్వీకుడు (I దిన 2[51]).

**హారోయె** (Haroeh = దీర్ఘదర్శి). యూదా సంబంధులలో నొకడు (I దిన 2[51]). 4[2] నం దితనికి రెవాయా యను పేరు గలదు. (రెవాయా 1 చూ॥).

**హార్హూరు** (Harhur = జ్వరము). నెతీనీ యులలో నొక కుటుంబము. వీరిలో గొందఱు జెరుబ్బాబెలుతో కూడ తిరిగి యెరూషలేమునకు వచ్చిరి (ఎజ్రా 2[51] = నెహె 7[53]).

**హాలహు** (Halah). అష్షూరు రాజ్యము లోని యొక ప్రదేశము. అష్షూరు చక్రవర్తి పదిగోత్రములవారిని జయించినపిదప, వారిలో గొందఱి నిచ్చటికి చెఱపట్టుకొని వచ్చెను (II రాజు 17[6] 18[12] I దిన 5[26]). అది గోజానునది దగ్గర నున్నది గాని, దాని యునికిని గూర్చి ఇంక తేటగా తెలియదు.

**హాలాకు** (Halak = నున్నని కొండ). దక్షిణ పలెస్తీనులో శేయీరుకొండకు పోవు మార్గము దగ్గరనుండు కొండ. యెహోషువ యింతమట్టుకు పలెస్తీనును జయించెను (యెహో 11[17] 12[7]). దాని యునికి తెలియదు.

**హాషుము** (Hashum = స్థితిగల).

1. జెరుబ్బాబెలుతో కూడ తిరిగివచ్చిన కుటుంబములలో నొకదాని మూలపురుషుడు.

ఇతనివలన ఆ కుటుంబమునకు ఆ పేరు కలిగెను (ఎజ్రా $2^{19}$ $10^{33}$ నెహె $7^{33}$ $10^{18}$).

2. ఎజ్రా ధర్మశాస్త్రమును చదువఁగా అతని యెడమవైపున నిలిచిన వారిలో నొకఁడు (నెహె $8^{4}$). పై నున్న ఈ రెండును ఇద్దరిని గాక ఒకరినే సూచించునని కొందఱనుకొందురు.

హాషేము (Hashem = పాడుచేయుట). దావీదు యోధులలోఁ గొందఱి తండ్రి (I దిన $11^{34}$). ఇతఁడు గిజోనీయుఁడు డనఁబడెను. అతఁడు గిజో యనువాని సంతతివాఁడు గాని, గిజోపట్టణ నివాసిగాని కావచ్చును. అట్టి స్థల మేదియు లేకపోవుటచేత, LXX లోని యొక ప్రతి ననుసరించి గూనీయుఁడని దీని చదువుట యుక్తమని కొంద ఱెంచుచున్నారు. ఈ పేరు గలవారు కొందఱున్నట్లు సంఖ్యా $26^{48}$ వలనఁ దెలియును. II సమూ $23^{32}$ లో హాషేము అను పేరుకు ప్రతిగా యాషేను అను పదము కలదు (యాషేను చూ॥).

హాసోరు (Hazor = కంచె లేక దొడ్డి).

1. కనాను రాజులలో యాబీనను వాని రాజధాని (యెహో $11^{1}$). యెహోషువ దీనిని పట్టుకొని తగలఁబెట్టించెను ($11^{1-13}$ $12^{19}$). తరువాత దానిని తిరిగి కట్టించి నఫ్తాలీ గోత్రికుల కిచ్చిరి ($19^{36}$). దెబోరా బారాకుల కాలములో మఱియొక యాబీను దీని నేలెను (న్యాయా $4^{1-24}$ I సమూ $12^{9}$). సొలొమోను దీని ప్రాకారములను కట్టించెను (I రాజు $9^{5}$). అష్షూరు చక్రవర్తియగు తిగ్లత్పిలేసెరు దానిని పట్టుకొనెను (II రాజు $15^{29}$). అది కెదెషుకు దక్షిణముగా నున్నట్లు I మక్క $11^{63,67}$ వలనఁ దెలియు చున్నది. టోబీతు $1^{2}$ నందు దీనికి అసేరు అను మాఱుపేరు కనఁబడుచున్నది. ప్రస్తుతము మెరోము చెఱువుకు మూఁడు క్రోసులు పడమరగా నున్న హాదీరె (*Hadireh*) అనుదానిలో ఆ పేరున్నట్లున్నది (పటము IV, M 5).

2. యూదా దక్షిణభాగమందున్న యొక ఊరు (యెహో $15^{23}$). దీనియునికి దెలియదు.

3. యూదా దక్షిణభాగమందున్న మఱియొక ఊరు (యెహో $15^{25}$). దీనికి కెరియోతు హెస్రోను అను మాఱుపేరు గలదు (కెరియోతు హెస్రోను చూ॥).

4. యూదాకు దక్షిణమందున్న ఒక స్థలము. దానిని క్రొత్త హాసోరు అని పిలిచిరి (యెహో $15^{25}$). దీనియునికి తెలియదు.

5. యెరూషలేమునకు ఉత్తరముగా నుండు ఒక స్థలము. అది బెన్యామీనులో నున్నది (నెహె $11^{33}$ పటము II, F 1).

6. అరబ్బీలోని ఒక రాజ్యమునకు పేరు. ఆ పేరు కెదారు అను పదమునందును వచ్చును. యిర్మీయా దాని నాశమునుగూర్చి ప్రవచించెను (యిర్మీ $49^{28-33}$).

## హి

**హింస, హింసించుట (Persecution)** ప్రవక్తలను హింసించుటనుగూర్చి పాత నిబంధన యందు సూచనలున్నవి (యిర్మీ $18^{18}$ $38^{11}$ II దిన $24^{20,21}$ మ $24^{35}$ మొ॥), దీనినిగూర్చిన విశేష బోధ క్రొత్త నిబంధనలో నున్నది. క్రీస్తు శిష్యులకు హింసలు కలుగునని వారికి ముందుగా తెలియఁజేసెను (యోహా $15^{18-20}$). వారట్టి హింసలకు బెదరక ఇది దైవజనులయొక్క గతియని సంతోషించవలసి యున్నదని క్రీస్తు వారికి బోధించెను (మ $5^{11,12}$). క్రీస్తు చెప్పినట్లు ఆదిసంఘములో హింసలు బహు త్వరలో వచ్చెను. ఆ రీతిగనే అపొస్తలులను కొట్టిరి (కార్య $5^{40}$). స్తెఫనును చంపిరి ($7^{54-60}$). పౌలనఁబడిన సౌలు క్రైస్తవులను యెరూషలేములోను ($8^{3,4}$) ఇతర పట్టణములలోను ($9^{1,2}$) హింసించెను. అతఁడు మాఱుమనస్సు నొందినప్పుడు మతాధికారులు వారిని హింసించుట కొంత కాలమువఱకు ఆగిపోయినట్లుగా నున్నది గాని, దేశాధికారియైన హేరోదు యూదులను సంతోషపఱచుటకు యాకోబును తలఁగొట్టించి పేతురును ఖైదులో వేయించెను ($12^{1-6}$). పౌలును హింసించుటతో ($21^{30-32}$ మొ॥) మతాధికారులచే కలిగిన హింసలు మఱింత వృద్ధియైనట్లున్నది. ఆదిక్రైస్తవులకు హింసలు కలిగినట్లు పత్రికలలో నసేక సూచనలున్నవి (I థెస్స $2^{14-16}$ గల $6^{12}$ II తిమో $3^{12}$ హెబ్రీ $13^{13}$ I పేతు $3^{16-18}$

మె॥). రోమాచక్రవర్తులు నీరో కాలమునుండి సంఘమును హింసింప మొదలు బెట్టిరి. వారు పెట్టిన హింసలలో క్రైస్తవుల నాదరించుటకు ప్రకటన గ్రంథము వ్రాయఁబడెను. ఆ హింసలు మొదటి కాన్స్టాంటైను చక్రవర్తి యగువఱకు ఆయా చక్రవర్తుల యనుమతిమీఁద కలిగెను. హింసలచే సంఘమునకు మేలులు కలుగుటవలన హతసాక్షుల రక్తము సంఘమునకు విత్తనమాయెనను లోకోక్తి పుట్టెను.

భారతదేశమున జీవహింస యనఁబడునది బైబిలునందు నిషేధము కాకుండుటను జూచి కొందఱాక్షేపింతురు. భూతదయ బైబిలు బోధయే (సామె 12[10]). అయితే మానవుల నిమిత్తము సృష్టి యావత్తును ఏర్పడియున్నది (కీర్త 8[6-9]). అదియంతయు మానవుల ఉపయోగము నిమిత్తము ఏర్పడియున్నది. కావున వానిని తమ బరువులను మోయుటకును పని చేయించుకొనుటకును ఇంక పవిత్రములైనవానిని ఆహారముగా నుపయోగించుకొనుటకును మానవజాతి యంతయు చేయుచున్నట్లుగా బైబిలులోకూడ సెలవనుగ్రహింపఁబడినట్లు చూడవచ్చును (ఆది 6[21] 9[3]). ఈ విధముగా నీ సృష్టిలో నిది యావత్తు మానవుల యక్కరలను తీర్చుటకు దేవునిచే నేర్పడియున్నది గాని యీ యేర్పాటు ననుసరించుటకు సెలవుండినను మానవుల గొప్పతనమునుబట్టి మానవులకు అధికారముండినను వారే జీవికైనను అనావసరములగు కష్టమెంత మాత్రమును పెట్టకూడదు.

**హిగ్గాయోన్** (Higgaion= గంభీరధ్వని). సంగీత వాయిద్యమునకు సంబంధించిన పదమై (కీర్త 9[16]) యున్నది గాని దాని యర్థమెట్టిదో రూఢిగాఁ దెలియదు. 92[4] నందు ఆ పదమునే అతి గంభీరములు అని తెనిఁగించిరి. అది 10 తంతులుగల యొకతరహా వీణెలో చేయఁబడిన స్వరమగుటచే హిగ్గాయోన్ అను పదము ఆ వీణానాదమును సూచించునని కొందఱూహింతురుగాని యీ యసలు పదమునకు సంబంధించిన మాటకు 19[14] లో **ధ్యానము** అనియు విలా 3[62] నందు **ఆలోచన** యనియు అర్థమగును గనుక ఆ పదము వాయిద్యములలో దేనిని సూచించునో రూఢిగాఁ దెలియదు.

**హిజ్కి** (Hizki = నా బలము). ఒక బెన్యామీనీయుఁడు (I దిన 8[17]).

**హిజ్కియా** (Hezekiah, Hizkiah = యెహోవా నా బలము).

1. యూదారాజులలో నొకఁడు. ఇతని తండ్రి పేరు ఆహాజు. ఇతఁడు క్రీ॥ ము॥ 719-690 సం॥ యేలెను. తాను రాజు గాక పూర్వమే తన తండ్రికి రాజ్యవిషయములలో సహాయుఁడుగా నుండెనని కొందఱి యభిప్రాయము. II రాజు 18[10,13] నందున్నట్లు హిజ్కియా యేలుబడిలో ఆఱవ సంవత్సరమున షోమ్రోను నాశనము చేయఁబడెనను మాటలను బట్టి ఇతఁడు 728 సం॥ మొదలుకొని ఈ విధముగా ఆహాజుతోకూడ ప్రభుత్వము చేసెనని అట్టివారనుచున్నారు. గాని ఆ వాక్యములు పొరబాటుగా వ్రాయఁబడినవని కొందఱి తలంపు.

హిజ్కియా కాలమునందు దేశసంబంధమగు గొప్ప ఇక్కట్టు లుండెను. ఇతని తండ్రియగు ఆహాజు అష్షూరువారి సహాయమును గోరెను గాని హిజ్కియా కాలమునాటికి వారు యూదా రాజ్యమునకు ప్రభువులై, బహు కఠినముగా ప్రభుత్వము జేసిరి. దానివలన యూదావారిలో నొక పక్షమువారు అష్షూరువారిపై తిరుగబడి ఐగుప్తీయుల సహాయమువలన తమ కాడిని తొలఁగించుకొనవలెనని యుద్దేశించిరి. హిజ్కియా కూడ మొదట అష్షూరువారికి లోఁబడెను. ఈ కాలమునందే మతవిషయమైన మంచి సంస్కరణము జేసెను (II దిన 29[1]-31[21] II రాజు 18[1-6]). ఇట్టి సంస్కరణము జరుగుచుండునప్పుడే జబ్బుపడి యద్భుతరీతిగా బాగుపడెను (II రాజు 20[12-18] యెష 38). బాబెలురాజు దీనినిగూర్చి విని, హిజ్కియాను కపటోపాయముతో తన పక్షము చేసికొనెడి యుద్దేశముతో అతని నాదరించుటకై నొక రాయభారి నంపెను (II రాజు 20[12-18] యెష 39). చరిత్రయందలి చివరి విషయములుగ వ్రాయఁబడినను, సన్హెరీబు యెరూషలేమును ముట్టడించుటకు పూర్వము జరిగినవని తెలిసికొనవలెను. ఇట్టి ప్రేరేపణల వలన చుట్టునుండువారితో నేకీభవించి అష్షూరు వారి ప్రభుత్వమునకు విరుద్ధముగా తిరుగుబాటు

చేసినట్లున్నది. ఈ తిరుగుబాటు సఫలమగునట్లు చేయుటకై ఐగుప్తీయులతో సంధియత్నములు నడుపసెంచెను గాని యెషయా వానిని **30-32** అధ్యాయములయందు ఖండించెను. ఫిలిష్తీయులలో ఎక్రోనురాజు మాత్రము దీనికి సమ్మతింపనందున హిజ్కియా యితనిమీఁద యుద్ధమాడి ఇతని దేశము నపహరించెనని (II రాజు $18^{8}$) కొందఱి యూహయై యున్నది. ఈ దేశములన్నిఁటిని లోఁబఱచుకొనుటకు సన్హెరీబు దండెత్తివచ్చెను. అతడు యూదావారి కోటలలో **46** పట్టుకొని, 2 లక్షలమందిని చెఱపట్టినటుల అష్షూరువారి రాతిశాసనములవలనఁ దెలియుచున్నది. గాని సన్హెరీబునకు కలిగిన అపజయమును గూర్చిన సంగతులుమాత్ర మేమియు నగపడవు. దీనిగూర్చి II రాజు 18, 19 (=యెష 36, 37) అధ్యాయములలో నున్నది. మొదట హిజ్కియా తన తప్పు చెప్పుకొని అష్షూరురాజుకు లోఁబడెదనని యొప్పుకొనెను (II రాజు $18^{14}$) గాన 300 తలాంతుల వెండిని, 30 తలాంతుల బంగారమును జరిమానాగా చెల్లింపవలసి వచ్చెను. దానిని చెల్లించుటకై యతఁడు ఆలయములోని వెండి బంగారమును తీసికొనవలసి వచ్చెను (II రాజు $18^{16}$).

తరువాత సన్హెరీబు మఱియొకమారు హిజ్కియా మీఁదకు వచ్చెను. అప్పుడతఁడు దేవుని ప్రార్థించఁగా ఆయన సన్హెరీబు సైన్యమును నాశనము జేసెను (సన్హెరీబు చూ॥). దీనితో హిజ్కియా చరిత్ర ముగియును. యెషయా ($1^{1}$), హోషేయా ($1^{1}$), మీకా ($1^{1}$) ఇతని కాలమునందు జీవించిరి. ఇతఁడు దాదాపు 690 సం॥ న కాలము చేసెను.

2. జెఫన్యా యను ప్రవక్తయొక్క పూర్వికుఁడు (జెఫ $1^{1}$). ఇతఁడు పై రాజు కావచ్చును.

3. చెఱనుండి తిరిగి వచ్చినవారిలో నొక కుటుంబమునకు మూలపురుషుఁడు (ఎజ్రా $2^{16}$=నెహె $7^{21}$). వీరి ప్రతినిధి నిబంధనను ముద్రించిన వారిలో నుండెను ($10^{17}$).

4. నెయర్యా కుమారులలో నొకఁడు. అతఁడు యూదుఁడును రాజకుటుంబమునకు సంబంధించిన వాఁడునై యున్నాఁడు (I దిన $3^{23}$).

**హిజ్కియా కట్టడములు** యెరూషలేము B, IV 2 చూ॥

**హితవత్సరము** పండుగలు IV చూ॥

**హిత్తీయులు, హిత్తీయుడు (Hittites, Hittite).** పూర్వమున మిగుల ప్రసిద్ధులగు జనము. వారు చిన్నాసియనుండి వచ్చినటుల కనఁబడుచున్నది. అచ్చటనుండి యూఫ్రాతునది వఱకును దక్షిణమున పలెస్తీనువఱకును వ్యాపించిరి. క్రీ॥ ము॥ 1500-1100 వఱకు ఐగుప్తీయులు వారితో చాల యుద్ధములఁ జేసిరి. 1100-700 వఱకు అష్షూరు వారు వీరితో పోరాడి చివరకు కర్కెమీషులో నోడించిరి. అప్పటినుండి వారి చరిత్రనుగూర్చిన సూచనలేవియును అగపడుటలేదు. వీరిపేరు ఐగుప్తీయుల వ్రాతలలో ఖెట (*Kheta*) యందును. అష్షూరీయుల ఖట్టయి (*Khattai*) యందును, గ్రీకుల కెటైవై (*Keteivi*) నందును కనఁబడును. హిత్తీయులకు స్వంతశాసనములును చాలఁ గలవుగాని వారిభాష తెలియకపోవుటచే, వాని యర్థము నింతవఱకు తెలిసికొనలేక పోయిరి.

బైబిలునందీ జనాంగమున కనేక సూచనలున్నవి. వీరు కనానుకుమారుఁడగు హేతు సంతానీకులు (ఆది $10^{15}$ $23^{3}$). వారిదేశము యూఫ్రాతు నదివఱకు వ్యాపించినట్లు యెహో $1^{4}$ నందున్నది. వారు యుద్ధప్రవీణులు (I రాజు $10^{29}$). వీరిలోఁ గొందఱు అబ్రాహాము కాలమునందు పలెస్తీనులో నివసించిరి. అతఁడొక హిత్తీయునిదగ్గర మక్పేలా గుహను కొనెను (ఆది $23^{1-20}$ $25^{9}$). ఏశావు హిత్తీయురాండ్రలో నిద్దఱిని పెండ్లియాడెను ($26^{34,35}$ $36^{2}$). యెహోషువ నెదిరించినవారిలో వీరుకూడ గలరు (యెహో $9^{2}$). యాబీనను కనానురాజుతోగూడి యెహోషువతో యుద్ధమాడి యోడిపోయిరి ($11^{3}$). బేతేలును లూజును ఎఫ్రాయిమీయుల కప్పగించినవాఁడు తరువాత హిత్తీయుల దేశమునందు మఱియొక లూజు పట్టణమును కట్టించెను (న్యాయా $1^{26}$). యెహోషువ కాలమునకు తరువాత, ఇశ్రాయేలీయులు హిత్తీయులతోకూడ వియ్యమందిరి (న్యాయా $3^{5,6}$). దావీదు అనుచరులలో అహీమెలెకు అను హిత్తీయుఁ డొకఁడు గలఁడు (I సమూ $26^{6}$). దావీదు చంపించిన ఊరియా

యును ఈ జాతివాఁడే (II సమూ 11[3,17,21]). సొలొమోనుకాలమునం దితరులతోపాటు వీరిని కూఁడ దాసుల తరగతిలోఁ జేర్చిరి (I రాజు 9[20,21] II దిన 8[7,8]). సొలొమోను ఉపపత్నులలో హిత్తీయ స్త్రీలునుండిరి (I రాజు 11[1]). ఇంతటితో వీరినిగూర్చిన బైబిలు సూచన లంత రించినవి. పూర్వమున బహు గొప్పజనమై పిదప బొత్తుగా నిర్మూలమైనట్లు లోకచరిత్ర వలనను బైబిలు చరిత్రవలనను కనఁబడుచున్నది.

**హిద్దయి** (Hiddai = సంతోషముగల). దావీదు ముప్పదిమంది యోధులలో నొకఁడు (II సమూ 23[30]). I దిన 11[32] నందు ఇతనికి హూరై యను పేరుగలదు.

**హిద్దెకెలు** (Hiddekel = టైగ్రీసు నది పేరు). ఇది ఏదెనులోనున్న నదులలో నొకటి యైనట్లున్నది (ఆది 2[14]). దానియేలు తన దర్శనమునందు చూచిన గొప్పనదికిని పేరుగా నున్నది (దాని 10[4]). ఆర్మీనియాలోని టౌరస్ (*Anti-Tauras*) పర్వత ప్రతిపంక్తియం దుద్భవించి, 1150 మైళ్లు ప్రవహించి పారసీక సముద్రమునకు సమీపమున యుఫ్రాతునదిలో సంగమించుచున్నది. తూర్పుగా నుండు పర్వతములనుండి యనేక ఉపనదులువచ్చి దీనియందు కలియుచున్నవి. పూర్వమున నీనెవెపురమును, ప్రస్తుతమున బాగ్దాదును ఈ నదీతీరమున నుండు పట్టణములు. ఆ దేశస్థు లిప్పటికిని హిద్దెకెలు అను పేరునే వాడుదురుగాని గ్రీకువారి వాడుకల ననుసరించి ఇతరులు సాధారణముగా దానిని టైగ్రీసు అని పిలుతురు.

**హిన్నోములోయ** యెరూషలేము A 2 చూ॥

**హిమము** (Snow). పలెస్తీనులో ప్రతి చలికాలమునందు హిమము దేశమంతయు కురియును గాని యది బహుత్వరగా నీరైపోవును. హెర్మోను కొండపైన యెక్కువ చలియుండుటచే హిమము అక్కడ నిత్యముండును. బైబిలునందు హిమము తెల్లనిదానిని పవిత్రమైనదానిని సూచించును (నిర్గ 4[6] కీర్త 51[7] యెష 1[18] మ 28[3] మొ॥). అది చలికికూడ సూచనగా నున్నది. సామె 31[21] లో చలియని తెనిఁగించిన పదముకు హిమమని యర్థము. వర్షమువలెనే హిమముకూడ భూమిని తడిపి దానిని ఫలవంతము చేయును (యెష 55[10]). అది వానవలె దేవుని వాక్యము యొక్క సారమును, తప్పని సరిగ జరుగు దానిని సూచించును (యిర్మీ 18[14]). ఆ కాలమందు జరుగునది ఎండాకాలమున కురియు మంచుకు పోల్చఁబడెను (సామె 26[1]).

**హియెరాపొలి** (Hierapolis = పరిశుద్ధ పట్టణము). ఇది బైబిలునందు కొలొ 4[13] నందు మాత్రమే వచ్చును. లవొదికయ కొలొస్సయి పట్టణములవలె లూకస్ (*Lycus*) నదికి సమీపమున నుండెను. ఇచ్చట ఔషధ మిశ్రితజలము గల ఊటలుండుటచే దీనికిట్టి పేరు కలిగియుండ వచ్చును. కొలొ 2[1] వలన పౌలచ్చటికి వెళ్లలేదని యూహింపఁదగును. అపొస్తలులగు ఫిలిప్పు యోహానులు అక్కడి సంఘమును స్థాపించినట్లు పారంపర్యముగా నొకమాట వచ్చుచున్నది గాని దాని నమ్ముటకు తగిన యాధారములు లేవు. ప్రస్తుతమున దానిని పంబుక్ కలాసి (*Pambuk-Kalahsi*) అను పేరు గలదు (పటము V I I 14).

**హిల్కీ-యా** (Hilkiah, Hilkias = యెహోవా నా స్వాస్థ్యము).

1. రాజగు హిజ్కి-యా గృహనిర్వాహకుఁడగు ఎల్యాకీము తండ్రి (II రాజు 18[18] మొ = యెష 36[3], యెష 22[20-25]).

2. అనాతోతు యాజకులలో నొకఁడు. ఇతఁడు ఏలీ వంశస్థుఁడును (I రాజు 2[26,27]). యిర్మీయా తండ్రియునై యుండెను (యిర్మీ 1[1]).

3. యోషీయా కాలమునందు ధర్మశాస్త్ర గ్రంథమును కనుగొనిన ప్రధాన యాజకుఁడు (II రాజు 22[3-11] = II దిన 34[8-19]). అది యోషీయా చేసిన గొప్ప సంస్కరణకు కారణమాయెను (II రాజు 23[1-24] = II దిన 34[29]-35[19]). ఆ గొప్ప సంస్కరణకై ద్రవ్యసహాయ మితఁడిచ్చినట్లు 1 ఎస్ద్రా 1[8] నందున్నది. హుల్దా యను ప్రవక్త్రియొద్ద విచారించుటకు యోషీయా పంపినవారిలో నితఁడు ముఖ్యుఁడు (II రాజు 22[12-20]=II దిన 34[20-28]). ఆలయమును శుద్ధి చేయుటకు పనిచేసినవారిలో నితఁడు ప్రధానిదై

యుండెను. అప్పుడు వారు కనుగొన్న గ్రంథము ద్వితీయోపదేశ కాండము. I ఎస్డ్రా 8[1] నం దితఁడు ఎజ్రాకు ముత్తాతయై యున్నట్లున్నది గాని అచ్చట అతనిపేరు ఖెల్కీయ అని యున్నది. సిద్కీయా కాలమునందు ఆలయమునకు అధి పతిగానున్న యోయాకీమున కితఁడు తండ్రియై యున్నట్లు బారూకు 1[7] నందున్నది.

4. సిద్కీయా దూతలను బాబెలునకంపి నప్పుడు యిర్మీయాయొక్క ఉత్తరమును వ్రాసి పంపిన గెమర్యా యనువాని తండ్రి (యిర్మీ 29[3]).

5, 6. మెరారీ తెగవారిలో నున్న లేవీ యులలో నిద్దఱు (I దిన 6[45] 26[11]).

7. చెఱలోనుండి తిరిగివచ్చిన యాజకులలో ప్రధానిగా నున్న యొకఁడు (నెహె 12[7,21]).

8. ఎజ్రా ధర్మశాస్త్రమును వినిపింపఁగా అతని దగ్గరనున్నవారిలో నొకఁడు (నెహె 8[4]).

**హిల్లేలు** (Hillel = స్తుతించెను). న్యాయాధి పతియగు అబ్దోను తండ్రి (న్యాయా 12[13,15]).

**హివ్వీయులు** (Hivites). ఇశ్రాయేలీ యులు పలెస్తీనును జయించుకొనక పూర్వమందు నివసించిన జాతులలో నొకటి (ఆది 10[17] నిర్గ 3[17] యెహో 9[1]). వారిపేరు యెబూసీయులకు ముందు ఆ జనముల జాబితాలో వచ్చుటచే వారి నివాసస్థలము యెరూషలేమునకు సమీపముగా నున్నదని ఊహింపఁదగును. గిబియోను చుట్టు నుండు ఊళ్ల నివాసులు హివ్వీయులని తెలియును (యెహో 9[17]). ఆది 34[2] నందు షెకెము నివాసులు వీరే యైనట్లుగా కనఁబడుచున్నది. దీనివలన వారు పలెస్తీను మధ్య నివసించినవారని తెలియుచున్నది గాని యెహో 11[3] న్యాయా 3[3] నందు వీరు లెబానోను ప్రాంతములం దున్న ట్లుగా నున్నది గాన వీరిలో కొందఱంతవఱకు చెదిరియుండవచ్చును. అచ్చట హిత్తీయులకు మాఱుగా హివ్వీయులను పేరు పొరపాటున నున్నట్లు కొందఱు నవీన పండితుల అభి ప్రాయమై యున్నది. సొలొమోను వీరిని తన పరిపాలనయందు దాసులుగాఁ జేసివేసెను (I రాజు 9[20-22]). హివ్వీయులు ఏదోయొక జాతియొక్క ప్రత్యేకమగు పేరుగాక గుడిసెలయందు నివసిం చెడివారికి పెట్టఁబడు సాధారణపు పేరని మఱి కొందఱి అభిప్రాయము. చాలకాలము క్రింద టనే వీరు నిర్మూలమగుటచే వారి జాతియేదియో గుర్తించుటకు వీలు బొత్తుగాలేదు.

**హిస్సోపు** (Hyssop). ఒకవిధమైన మొక్క. అది మొక్కలన్నిఁటిలో చిన్నదై నట్లు I దిన 4[33] నందున్నది. అది గోడలలో మొలచుననియు తెలియుచున్నది. ప్రోక్షించి శుద్ధిచేయు సాధనముగా పాఁత నిబంధనకాలము నందు దీని కుచ్చుగాఁ జేసి వాడిరి (నిర్గ 12[22] లేవీ 14[6,48] సంఖ్యా 16[6] హెబ్రీ 9[19]). ఇందు వలననే హిస్సోపు శుద్ధిచేయునదని అలంకార రీతిగా వాడిరి (కీర్త 51[7]). సిలువమీద క్రీస్తు దప్పిగొనుచున్నానని యరచినప్పుడు చిరకతో ముంచిన స్పంజి హిస్సోపు కర్రకు తగిలించి యందించిరి (యోహా 19[29] మ 27[48] మా 15[36]).

## హీ

**హీయేలు** (Hiel = దేవుఁడు జీవించును). బేతేలు పట్టణస్థుఁడు. యెరికో పట్టణమును కట్టువానిని యెహోషువ శపించినను (యెహో 6[26]), ఇతఁడా పట్టణమును తిరిగి కట్టించెను (I రాజు 16[34]). ఆ శపథ ప్రకారము ఇతని జ్యేష్ఠ కుమారుఁడును, కనిష్ఠుఁడును చనిపోయిరి. ఇతఁడు వారి నర్పించినట్లు కొందఱనుకొందురు.

**హీరా** (Hirah = ఘనత వహించిన). యాకోబు కుమారుఁడగు యూదాయొక్క స్నేహి తుఁడు. అదుల్లామీయుఁడు (ఆది 38[1]). మంద లను చూచుటకు యూదాతో కలిసి వెళ్లెను (38[12]). యూదా తన కోడలగు తామారును కూడిన పిదప ఇతనిచేతనే ఆమెకు కట్నము పంపించెను.

**హీరాము, హూరాము** (Hiram, Huram).

1. దావీదు సొలొమోనుల కాలమందు తూరు రాజు (II సమూ 5[11] I దిన 14[1]). దావీదు యెరూషలేమును జయించిన పిమ్మట ఇతఁడు దావీదుతో సంధిజేసికొనెను. దేవ దారు మ్రానులను వడ్రంగులను కాశెపనివారిని పంపెను (II సమూ 5[11]). సొలొమోను రాజై

నప్పుడుకూడ అతనియొద్దకు మనుష్యులను బంపి సంధి జేసికొనెను (I రాజు 5[1-6]). ఈ సంధి ప్రకారము ఇతఁడు లెబానోనునుండి దేవదారు మ్రానులను సరళవృక్షపు మ్రానులను సొలొమోనుకు పంపుటమాత్రమేగాక దేవాలయమును గట్టు నిమిత్తము ఆరితేరిన పనివారినికూడ పంపించెను. దీనికి ప్రతిగా సొలొమోను ప్రతి సంవత్సరమును హీరాముకు 2 లక్షల తూముల గోధుమలను, 3800 పళ్ల స్వచ్ఛమైన నూనెను పంపుచుండువాఁడు (5[6-11]). ఇది II దిన 2[15,16] నందున్న సంఖ్యలతో కొద్దిగా భేదించును. మందిరములును దేవాలయమును ముగించి పిమ్మట సొలొమోను హీరాముకు గలిలయలోని 20 పట్టణములను బహుమానముగ నిచ్చెను గాని, అవి హీరామునకంతె యిష్టముగ నుండలేదు. అతఁడు సొలొమోనుకు తిరుగ 200 మణుగుల బంగారము నంపించెను (I రాజు 9[10-14]). వీరిద్దరును కలిసి వర్తకము చేసినందున వీరి స్నేహము మఱింత స్థిరపడెను (10[22] II దిన 9[21]). ఎసోన్గెబెరునకును ఓఫీరునకును మధ్య తిరుగుచుండెడి సొలొమోను ఓడలమీఁద హీరాము రాజు సేవకులుకూడ నుండిరి. వీరు సముద్రప్రయాణము చేయుటలో మిగుల గట్టివారు (I రాజు 9[26,28] II దిన 8[17,18]). గనుక వీరందఱికిని దక్షిణ భాగమందున్న ఓఫీరను దేశమువఱకు బాగుగఁ దెలియును (I రాజు 10[11]).

2. తూరు పట్టణపు విధవరాలి కుమారుఁడు. దేవాలయములో పనిచేయుటకు దానిని కట్టించు సమయములో సొలొమోను ఇతనిని బిలువనంపించుకొనెను (I రాజు 7[13] II దిన 2[13]). బంగారము, వెండి, ఇనుము, వెలగల రాళ్లు కర్ర ఊదారంగు నీలిరంగులుగల సొగసైన నారబట్టలు మున్నగువానితో చిత్రపు పనులు చేయుటలో నితఁడు కడు చమత్కారి. దేవాలయమందలి రెండు ఇత్తడి స్తంభములును, పోఁత పోయఁబడిన ఇత్తడి సముద్రమును, దాని క్రిందనుండిన పదిరెండు యెద్దులను పది స్తంభములును, పది ఇత్తడి తొట్లను ఇతఁడు చేసినవే (II దిన 2[13,14]). వీని తల్లి నఫ్తాలీ గోత్రికురాలు (I రాజు 7 II దిన 2[13]). వీని తండ్రియు తూరు పట్టణస్థుఁడును ఇత్తడి పనివాఁడునై యుండెను.

హీలేము హోలోను చూ॥

## హు

**హుక్కోకు** (Hakkok = నొసటివ్రాఁత). నఫ్తాలీ గోత్రపు పడమట హద్దునందున్న యూళ్లలో నొకటి (యెహో 19[34]). ప్రస్తుతము టెల్ - హూము (*Tell-Hum* = కపెర్నహూము) కు 6 మైళ్లు పడమటగా నుండు యాకూకు (*Yakuk*) దీని యునికియని చెప్పెదరు (పటము I, E 4).

**హుప్పా** (Huppah = కప్పుకొనునది). అహరోను సంతతివారిలో నొకఁడు. దావీదు కాలమున నియమింపఁబడిన వంతులలో 13 వ దాని కితఁడు పెద్దయయ్యెను (I దిన 24[13]).

**హుప్పీము** (Huppim).

1. బెన్యామీనీయులలో నొక కుటుంబమునకు మూలపురుషుఁడు (I దిన 7[12]). సంఖ్యా 26[39] నందు ఇతనికి హూపాము అను పేరు కలదు.

2. మనష్షే గోత్రికులలో నొకఁడు (I దిన 7[15]).

**హుమనై** (Hymenaeus = వివాహ దేవతకు సంబంధము). ఆది క్రైస్తవులలో నొక విమతస్థుఁడు. I తిమో 1[19,20] నందితనికి అలెక్సంద్రు అను నొకఁడు తోడుగా నుండెను. II తిమో 2[17] లో ఫిలేతు అనువాఁడు సహకారిగా నుండెను. ఈ రెండు స్థలములయందుదాహరింపఁబడినది ఇద్దరు గాని ఒకఁడు కాదని కొందఱి యభిప్రాయము. ఒకఁడై యున్నట్లు తోఁచుచున్నది. పునరుత్థాన మిది వఱకే గతించి పోయినట్లు ఇతఁడు బోధించెను (II తిమో 2[17]). పౌలితనిని వెలివేసెను (1[19,20]).

**హుమ్తా** (Hummtah = బల్లుల ఉనికి). యూదయ మన్యమునందున్న యొక గ్రామము (యెహో 15[54]). దీని యునికి తెలియదు.

**హుల్దా** (Huldah = ముంగిస). ఒక ప్రవక్త్రి. రాజైన యోషీయా కాలమునందు యెరూషలేములో రెండవ భాగమున కాపుర

4. ఒక బెన్యామీనీయుఁడు (I దిన $8^{17}$).

5. ఏబెరు చూ॥

**హెబ్రీ భాష** (Hebrew). యూదుల భాష. పాతనిబంధనను హెబ్రీభాషలో వ్రాసిరి గాని ఆ భాష పేరచ్చట కనుపించుట లేదు. అది II రాజు $18^{26,28}$ (=యెష $36^{11-13}$) నందు **యూదులభాష**, యెష $19^{18}$ నందు **కనాను భాష** యనఁబడెను. పాతనిబంధన భాష ఫేనికే భాషకు సంబంధించినదై, కనాను దేశములో ఇశ్రాయేలీయులు నివసింపక పూర్వము, అచ్చట నివసించినవారి భాషకు సంబంధించి యున్నదని రాతిశాసనములవలనఁ దెలియు చున్నది. (రాతిశాసనములు చూ॥). ఉర్దూ భాషవలె అది కుడితట్టు నుండి యెడమతట్టుకు వ్రాతురు. హల్లులను మాత్రము ప్రత్యేకముగా వ్రాసెడివారు. కీర్తనలు 119 లో అక్షరమాలిక వలెనున్న 22 భాగములలో ఈ భాషయొక్క 22 హల్లులను చూడవచ్చును. అచ్చులను వ్రాయక, శబ్దములను నోటిపాటగా నేర్పించిరి. హెబ్రీభాష వాడుకలో నున్నంత కాలము అట్లున్నను, క్రీ॥ శ॥ 6 వ శతాబ్దమునందు ఆ యచ్చులు, వత్తులు మొదలగువానిని సూచించుటకు అయా విధములగు చుక్కలను కల్పించిరి. ప్రస్తుతము హెబ్రీ బైబిలునందా రీతిగా అచ్చులతోఁ గూడిన వ్రాఁతను చూడవచ్చును. దానియేలు, ఎజ్రా గ్రంథములలోని కొన్నిభాగములు హెబ్రీ ప్రాకృతమనఁదగిన అరమేయిక్ భాషలో వ్రాసి దానికాపేరు బెట్టిరి. అది అరాము భాషయై యుండెను. చెఱకాలము [...]కుఁ బిమ్మట హెబ్రీభాష కీ రీతిగా మార్పు [...]లిగినట్లున్నది. యూదు[...]లీ అరమేయిక్ [...]షలోనే తమ బైబిలునకు అర్థము జెప్పిరి. [...]ప్పిన అర్థమునుకూడ వ్రాసి, ఆ గ్రంథములకు [...]కములను (*Targum*) లను పేరుఁబెట్టిరి. [...]స్తును అపొస్తలులును వాడినభాష అదే. క్రీస్తు [...]ని వాడినట్లు మా $5^{41}$ లో నొక దృష్టాంత[...] చూడవచ్చును. అయితే క్రొత్త నిబంధ[...] ఈ భాషతో వ్రాయక అప్పటి కాలము సర్వలోకమున వాడుకగా నుండిన గ్రీకు [...]న వ్రాసిరి.

**హెబ్రీయులకు వ్రాసిన పత్రిక** (Hebrews, Epistle to the).

I. పేరు, గ్రంథకర్త. నూతననిబంధన గ్రంథములపై నున్న సూచనపదములు అనఁగా మత్తయి సువార్త లేక అపొస్తలుఁడైన పౌలు రోమీయులకు వ్రాసిన పత్రికయనునవి యా గ్రంథముల వ్రాసిన వారివలన నేర్పడలేదుగాని, ఆ గ్రంథములనుగుఱించి మూఁడు నాలుగు శతాబ్దములయందుండిన సంఘసముదాయమునకు కలిగిన యభిప్రాయమును కనుపఱచుటకై యా సూచన పదము లుపయోగించఁబడెను. ఆలాగుండఁగ నీ పత్రిక పౌలు హెబ్రీయులకు వ్రాసిన పత్రిక యని పిలువఁబడినను దాని మూలమున నూతన నిబంధనలోని గ్రంథములను కట్టగ సమకూర్చిన వారి యుద్దేశము తెలియఁబడును గాని దానిని బట్టి నిశ్చయముగా పౌలే దీని రచించెనను నిర్ధారణ కాస్పదము కలుగదు. ఇందునుగుఱించి పురాతన క్రైస్తవగ్రంథ లేఖకులిచ్చిన సాక్ష్యము విచారించుట యుక్తము. క్రీ॥ శ॥ 95 సం॥ జీవించిన రోమాపురి సంఘాధ్యక్షుఁడగు క్లెమెంతు ఈ పత్రికయందలి వాక్యముల ననేక పర్యాయములనెత్తి చెప్పినను దాని రచించిన గ్రంథకర్త యెవ్వరైనదియు ప్రస్తావించ లేదు. మొదటి, రెండు, మూఁడు శతాబ్దములయందు జీవించిన పశ్చిమదేశ క్రైస్తవ గ్రంథకర్తలలో నెవరును నీ పత్రికను పౌలు రచించినట్టు చెప్పరు. క్రీ॥ శ॥ 170 సం॥ మందు లిఖితమై 1740 సం॥ మందు మ్యూరటోరి యను పండితునివలన కనుగొనఁబడిన గ్రంథశేషమం దీ పత్రిక సూచించఁబడదు. క్రీ॥ శ॥ 240 సం॥ మందుండిన టెర్టులియాను ఇది బర్నబా వ్రాసిన యుత్తరమని చెప్పుచున్నాఁడు. తూర్పుదేశముల గ్రంథకర్తలలో కొందఱు హెబ్రీయుల పత్రిక రచించిన గ్రంథకర్త పౌలని యూహించినను తమ యభిప్రాయమునకు తగిన హేతువులను కనపఱచరైరి. అలెక్సంద్రియా పట్టణస్థుఁడగు పంతేనను ఈ పత్రిక పౌలుదని తనకు తోఁచినట్టు చెప్పునేగాని యా సంగతి తన కేలాగు తెలిసెనో విశదపఱచుటలేదు. ఆ తరువాత నదే యూరి సంఘాధ్యక్షుఁడగు క్లెమెంతు, పంతేనను హెబ్రీయుల పత్రికకు పౌలు పేరులేకుండ పోవుటకుగాను చెప్పినకారణ

ములను తెలియఁజేసెను. అదేవనిన పౌలు హెబ్రీయులకు యేసుక్రీస్తే యపొస్తలుఁడని (3[1]) యెఱిగి తనకాబిరుదాంకము పెట్టుకొన నొల్లక పోయెను. (2) పౌలు తాను రాష్ట్రములకు అపొస్తలుఁడని యెఱిగి యూదులైన క్రైస్తవులకు వ్రాయుటకు తన కధికారము లేదనుకొని తన పేరును కనపఱచలేదు. క్లెమెంతు అందును గూర్చి తన స్వకీయోద్దేశమును తెలిపి యూదులైన క్రైస్తవులు పౌలుచేసిన బోధవిషయమై భిన్నాభిప్రాయముగలవారై యాయనను విరోధించి నందున అపొస్తలుఁడా గ్రంథమందు తన పేరు ప్రస్తాపించినయెడల యూదులగు క్రైస్తవులా పత్రిక నిర్లక్ష్యము చేతురనుకొని పేరులేకుండ రచించెనని యూహించినవాఁడాయెను. మఱియు క్లెమెంతు పౌలు ఆ గ్రంథమును మొదట హెబ్రీ భాషలో రచించఁగా లూకా దానిని గ్రీకుభాషలోనికి భాషాంతరముచేసెనని ప్రస్తాపించెను. అయినను క్లెమెంతు బయలుపఱచిన యుద్దేశము నిదర్శనములేనిదని చెప్పక తీరదు. క్రీ॥ శ॥ 185-253 సం॥ వఱకు జీవించిన ఒరిగెను తన గ్రంథములయందీ పత్రికను కొన్ని పర్యాయములు పేర్కొని జనవాడుకలో నది పౌలు రచించిన పత్రిక యనఁబడునని సూచించెనుగాని యందును గుఱించి తన యోచన తెలియఁజేయుచు పత్రిక మూలోద్దేశము పౌలుయొక్క బోధాంశముగా తోఁచినను దాని పాకము చూడఁగా పౌలుబోధ నెఱిగి వ్రాసినలేఖకునిదిగా నున్నదని చెప్పి మెట్టుకా పత్రికను లిఖించినవాఁడెవఁడో దేవునికి తప్ప మఱెవరికిని తెలియదనెను. ఆయా కాలములలో నుండిన క్రైస్తవ గ్రంథకర్తలు కొందఱీ యుత్తరము పౌలు లిఖించినదని యనుకొనుచుండినను ఏడవ శతాబ్దమువఱకు దానివిషయమై పెక్కండ్రు సంశయించిరి. పశ్చిమదేశ సంఘములలో కీర్తనీయులుగా నుండిన జెరోము, అగస్తీను అను గ్రంథకర్తలు జనవాడుక ప్రకారమది పౌలు వ్రాసిన పత్రిక యని చెప్పుటవలన వారికి తదనంతరముగా జీవించినవారనేకులు ఆ యభిప్రాయము ననుసరించిరిగాని యిటీవల వేదవేత్తలు దీనిగుఱించి పదిలముగా చర్చించుటవలన నది సాధారణముగ పౌలు వ్రాసిన పత్రిక యనఁబడదు.

పై జెప్పిన తీర్మానము సర్వసమ్మతమైనదయినను నా పత్రిక వ్రాసినవానినిగుఱించి పండితులు పలువిధములైన యభిప్రాయముల ననుసరించుచున్నారు. గ్రంథపరిశీలనవలన దానిని రచించినవానిగుఱించి కొన్ని ముఖ్యాంశములు వేద్యమగును.

(1) గ్రంథకర్త తానే యూదుఁడై యుండి తన గ్రంథమం దన్యజనుల ప్రశంసనెత్తక యూదుల నిమిత్తమైయే వ్రాసినవాఁడాయెను.

(2) అతఁడు పాఁత నిబంధన గ్రంథములోని వాక్యముల నెత్తి వ్రాయునప్పుడెల్ల LXX అను గ్రీకు భాషాంతర గ్రంథములోని మాటలను దృష్టాంతపఱచును.

(3) అతఁడు తానపొస్తలుఁడని చెప్పక యపొస్తలుల మూలముగా సువార్తను తెలిసికొన్నవాఁడనని చెప్పెను 2[4].

(4) ఈ పత్రికయందలి మూలోద్దేశములన యోచనపరంపరమును చూడఁగ నితఁడు పౌల వ్రాసిన పత్రికలను చదివి ఆయన యుపదేసారమును చక్కఁగా గ్రహించినవాఁడని విశమగును.

(5) అతఁడు తిమోతికి స్నేహితుఁడు. పౌవలె తిమోతిని కుమారుఁడని చెప్పక సహోదఁడని పిలుచుచున్నాఁడు (13[23]).

(6) అతఁడీ పత్రికను యెరూషలేము న నము కాకమునుపు లిఖించెను.

పై లక్షణములనుబట్టి వేదపండితులీ పత్రి రచించిన గ్రంథకర్తను గుర్తించుటకు పూను పలువురకీ గ్రంథము నారోపింతురు ఆయా ప్రాయము ననుసరించిన పండితులీ దిగువప కనపఱచినవారిలో తమకు తోఁచినవారు గ్ర నట్టు నిదర్శనము లుదాహరింతురు.

అకుల బర్నబా తిమోతి ప్రిస్కిల్ల
మార్కు అపొల్లో సీల లూకా రో
క్లెమెంతు.

ఇందువలన నీ పత్రిక లిఖించిన గ్రంథ గుఱించి కచ్చితముగా చెప్ప సాధ్యము పరిష్కారమగును.

II. ఎవరినిమిత్తము వ్రాయఁబడెను.

సూచనపదమందలి హెబ్రీయులకను మాట మొదటనుండి దీనిగురించి కలిగియున్న సామాన్య యుద్దేశమును బయలుపఱచును. ప్రాచీన కాలము మొదలుకొని నేటివఱకు పండితుల పరంపరము ఈ గ్రంథము యూదులగు క్రైస్తవుల నిమిత్తమై వ్రాయఁబడెనని తాత్పర్యపడిరి. అయినను సామాన్య ఉద్దేశమట్లుండినను గ్రంథకర్త తలఁచిన క్రైస్తవులుండిన స్థలమునుగురించి పలువిధములైన యభిప్రాయములు కలవు. ఆ యభిప్రాయములను రెండు తెగలుగా నేర్పఱచుట యుక్తము. ఎట్లనిన నొకతెగవారీ పత్రిక యూదులైన క్రైస్తవులుమాత్ర ముండిన సంఘము యొద్దకు పంపఁబడెనందురు. రెండవతెగవారీ పత్రిక యూదులైన క్రైస్తవుల నిమిత్తను రచింపఁబడినను వారుండిన సంఘమందితరు లుండిరని నిశ్చయించుకొందురు. మొదటితెగవా రుద్దేశించిన సంఘములు పలెస్తీనుదేశమందు గాక మరెక్కడ నుండలేదు గనుక వారీపత్రిక యెరూషలేములోనైనను పలెస్తీను ప్రాంతమందైననుండిన సంఘస్థుల నిమిత్తమిది వ్రాయఁబడెనని తీర్మానింతురు. రెండవ తెగవారందుకు భేదపడి యూదులైన క్రైస్తవులనేకులుండిన స్థలముల నుదాహరించి కొందఱీ పత్రిక ముట్టవలసిన సంఘస్థులు అలెక్సంద్రియలోను, కొందఱు ఎఫెసులోను, కొందఱు కొరింథులోను కొందఱు అంతియొకయలోను కొందఱు రోమాలో నుండువారని యెవరి యభిప్రాయము వారనుసరింతురు.

III. కాలస్థాన నిరూపణము.

క్రీ॥ శ॥ 95 సం॥ రోమాపురి సంఘాగ్రేసరుఁడగు క్లెమెంతు దీనియందలి వాక్యములను పలుమారెత్తి వ్రాసినవాఁడని పైనుదాహరించుట వలన నంతకుపూర్వ మీ పత్రిక రోమాలో బాగుగఁ దెలిసినదని తెలియును. సహోదరుఁడైన తిమోతికి విడుదల కలిగినదని తెలిసికొనుఁడి అని 13²³ నందలి మాటనుబట్టి పౌలప్పటికి తన పరుగు కడముట్టించి తన యజమానుని సంతోషములో పాలుపొంది యుండెనని నిశ్చయించినయెడల నీ పత్రిక క్రీ॥ శ॥ 68 సం॥ నకు వెనుక లిఖితమాయెనను కొనవలెను. గ్రంథకర్త యూదామతమును క్రీస్తుమతమునుపోల్చి యూదామతము అసంపూర్ణమైనదై పరిపూర్ణమైన క్రీస్తుమతమునకు సూచనసాధనము గనుక కాలపరిపూర్ణత వచ్చినప్పుడు నది యంతరించిపోవుట దైవసంకల్పమని సిద్ధాంతపఱచఁ గోరినందున నతఁ డీ పత్రికను వ్రాయు సమయమున యెరూషలేము దేవాలయము శిథిలమై యుండిన పక్షమున దానివలన తన బోధకు కలుగు సాక్ష్యము దృష్టాంతపఱచక మానఁడని నిస్సందేహముగ చెప్పఁగలము. అతఁడా సంగతిని వివరించకపోవుటచే యెరూషలేము నిర్మూలము కాకమునుపు అనఁగ క్రీ॥ శ॥ 68,69 వ సం॥ వ్రాసినవాఁడని కరతలామలకమగును.

హెబ్రీయులకు పంపిన యుత్తరము ఎక్కడ వ్రాయఁబడెనో చెప్ప సాధ్యముకాదు. 13²⁴ నందలి ఇటలీవారు మీకు వందనములు చెప్పుచున్నారనుమాటను చూడఁగా నిది ఇటలీదేశమందు లిఖితమాయెనని తోఁచినను నాలాగు తీర్మానించ వీలుపడదు. పూర్వము ఇటలీదేశమందుండి గ్రంథకర్త వ్రాసినప్పుడు వేఱుస్థలమునకు పోయినవారు ఇటలీవారనఁబడిరి. గనుక ఆ మాటనుబట్టి నిర్ధారణచేయ సాధ్యముకాదు. తిమోతినిగురించిన సమాచారమువలనకూడ స్థలనిరూపణ మేర్పడదు. తిమోతి సంఘసముదాయమునకు బాగుగఁ దెలిసినవాఁడు గనుక గ్రంథకర్త యీ పత్రికను లిఖించినప్పుడు రోమాలో న
నను నిర్ధారణకు చాలినంత యాస్పదమ
ఇందునుగురించి పలువిధములుగా
గలము గాని కడ కా విషయము ఎమని యొప్పుకొనక విధిలేదు.

IV. ఉద్దేశము.

ఈ పత్రికనుగురించి యనేకవిధముల ననుమానించవలసియున్నను గ్రంథకర్తయొక్క యుద్దేశమువిషయమై లేశమైనను సందేహము లేదు. ఏ స్థలమందుండిన క్రైస్తవులనిమిత్త మాయన వ్రాసెనో చెప్ప వీలుపడకున్నను వారు యూదులైన క్రైస్తవులని విశదమగును. వారు క్రైస్తవమత మవలంభించినందున పడిన ప్రయాసములవలనను వారింకను తమ పితరుల మతముమీఁద యభిమానము గలిగియుండుటవలనను వారిలో ననేకులు క్రీస్తుమతమును విసర్జించి యూదమతమునకు తిరిగి పోవుచుండిరి. గ్రంథకర్త వారి మనస్సెఱిఁగి

వారికి కలిగిన తాపత్రయములయందు వారిని నాదరించుటకును యూదమతముకంటె క్రీస్తు మతము సర్వోత్తమమైనదని వారికి కనుపఱచుటకును వ్రాసెను. మోషే ధర్మశాస్త్రము శాశ్వత నియమము కాదుగాని క్రీస్తుమతమునకు సూచన యనియు దేవుఁడు నియమించినకాలము పరిపూర్ణమైనప్పుడు యూదామతము గడచిపోయి క్రీస్తుమతము స్థిరపడుననియు వారికి బోధించఁదలఁచెను. పూర్వము యూదామతస్థులై యుండిన క్రైస్తవులనేకులు పూర్వమతాభిమానమును వదలక దాని పద్ధతులను గైకొన చూచుచుండిరి గనుక, యెరూషలేములో కూడుకొన్న సభానాయకులు వారా మతాచారములు రక్షణ సాధనములని నమ్మకుండను, అన్యమతములను వదలి క్రైస్తవులైన వారా యాచారములను గైకొనవలెనని వారు బలవంతము చేయకుండ, నుండినయెడల తమమట్టుకు తామా మతాభ్యాసములను గైకొనవచ్చునని తీర్మానించిరి. అందువలన వీరు యూదామతమును హత్తుకొని క్రీస్తుమతానుభవమం దభివృద్ధినొందక క్రీస్తునెదుట విశ్వాసమువదలి యూదా మతములోనికి తిరిగి పోఁదలఁచుచుండిరి. ఇట్టి యభిప్రాయము ననుసరించినవారు క్రీస్తుమతశ్రేష్ఠతయును అనంతాధికారమును గ్రహించి యది దేవుఁ డేర్పఱచిన రక్షణసాధనమని యెఱిఁగి విశ్వాసమునకు కర్తయు దాని కొనసాగించువాఁడునైన యేసువైపు చూచుచు తమయెదుట నుంచఁబడిన పందెములో నోపికగలిగి పరుగెత్తుఁడని ప్రేరేపించెను. M.

V. ముఖ్యభాగములు.

I. పీఠిక $1^{1-3}$. ఇందు క్రీస్తుమహాత్మ్యము బహు గంభీరముగా వివరింపఁబడినది.

II పాఁత నిబంధన మధ్యవర్తులకంటె క్రొత్త నిబంధన మధ్యవర్తి మఱీ శ్రేష్ఠమైనవాఁడని నిరూపించుట. మధ్యమధ్య దానికి సంబంధముగా హెచ్చరికలు చేయుట $1^4$-$8^6$.

1. దూతలకంటె క్రీస్తు గొప్పవాఁడు $1^4$-$2^{18}$.
   - (*a*) పాఁత నిబంధన వాక్యములవలన నిరూపించుట $1^{4-1,3}$.
   - (*b*) క్రీస్తుమాటలు లక్షింపవలెనను
   - (*c*) క్రీస్తు మనుష్యుఁడై శ్రమపడుటచే ఆ గొప్పతనమును పోఁగొట్టుకొనక మఱీ పూర్ణరక్షకుఁడును ప్రధాన యాజకుఁడునై యున్నాఁడని వాదించుట $2^{5-18}$.
2. మోషేకంటె క్రీస్తు గొప్పఁవాడు $3^1$-$4^{13}$.
   - (*a*) ఆ యంశమును స్థాపించుట $3^{1-6}$.
   - (*b*) మోషేమాట విననివారు విశ్రాంతి పొందలేక పోయినందున మనము మన అవిధేయత అవిశ్వాసములవలన అట్టి విశ్రాంతిని పోఁగొట్టుకొన కుండునట్లు మఱి జాగ్రత్తగా చూచుకొనవలెను $3^6$-$4^{13}$.
3. పాఁత నిబంధనలోని ప్రధానయాజకుని కంటె క్రీస్తు గొప్ప ప్రధానయాజకుఁడై యున్నాఁడు $4^{14}$ $8^6$.
   - (*a*) ఆ సంగతి సంక్షేపముగాఁ దెలుపుట $4^{14-16}$.
   - (*b*) క్రీస్తుకు ప్రధానయాజకుని కుండవలసిన లక్షణములున్నవి $5^{1-10}$.
     - (i) ఆయన మన యనుభవములో చేరినవాఁడు $5^{1-3}$.
     - (ii) ఆయన దేవునిచే నియమింపఁబడినవాఁడు $5^{4-6}$.
     - (iii) ఆయన తన భక్తి విధేయతల నిమిత్తము దేవునిచే నిర్ణయించఁబడినవాఁడు $5^{7-10}$.
   - (*c*) వారి కొద్ది యనుభవమునుబట్టి దీనిని పూర్ణముగా వివరింపలేనని, దానినిబట్టి హెచ్చరించుట $5^{11}$-$6^{20}$.
     - (i) వారి కొద్ది యనుభవవిషయమై తన యాశ్చర్యమును తెలుపుట $5^{11}$-$6^3$.
     - (ii) వెలిగింపఁబడినవాఁడు వెనుక పడినయెడల క్షమింపఁబడని పాపమునకు పాత్రుఁడగును $6^{4-8}$.
     - (iii) వారు వెనుకబడక స్థిరులై దేవుని

అబ్రాహాముతోకూడ పాలివారగుదురని తననమ్మకమును దెలుపుట $6^{9-20}$.

(*d*) పాత నిబంధన యాజకత్వముకంటె క్రీస్తు యాజకత్వము గొప్పది $7^{1-28}$. ఎందుకనగా

(i) అది తత్కాలమునకైనది గాక నిత్యమైనది $7^{1-3}$.

(ii) అబ్రాహాము దాని నొప్పుకొని దశమాంశము నిచ్చి సేవింపబడెను $7^{4-7}$.

(iii) పాత నిబంధన యాజకులు మర్త్యులు గాని, క్రీస్తు చిరంజీవి $7^{8}$.

(iv) పాత నిబంధన యాజకులుసహా ఆయునకు దశమాంశము నిచ్చిరి $7^{9,10}$.

(v) పాత నిబంధన యాజకత్వము ప్రమాణపూర్వకమైనది కాదు గాని ఇది ప్రమాణపూర్వకమైనది $7^{20-22}$.

(vi) లేవీయులు చనిపోవుటచే అనేకులగు ప్రధాన యాజకులు $7^{23-25}$.

(vii) క్రీస్తు పాపరహితుడు $7^{26-28}$.

క్రీస్తు ప్రధానయాజకత్వమును గూర్చిన క్లుప్త పునర్వివరము $8^{5-6}$.

పై యంశము ననుసరించి పాత నియమములకంటె క్రొత్త నిబంధనలు గొప్పవని నిరూపించుట $8^{7}-10^{18}$.

్రొత్త నిబంధన నేర్పఱతునని దేవుడు ్దానము చేయుటవలన పాత నిబంధన పములతో కూడినదని తెలిసికొనవలెను 13.

ాత నిబంధన గుడారము ఘనము గలదైనను దాని తెరల వలనను ఎడతెగకుండ ్యంపవలసిన యర్పణల వలనను అది సంపూర్ణమైనదని తెలిసికొనగలము.

అయితే క్రీస్తు ఒక్కటే పర్యాయము బలి నర్పించి నిజమగు పరిశుద్ధస్థలములో అనగా మోక్షములో చేరుటకు మార్గమును తెలియజేసెను గనుక క్రొత్త నిబంధన నియమములు గొప్పవి $9^{1-28}$.

3. పాత నిబంధన యజ్ఞములు మనలను శుద్ధి చేయనేరవు గాని క్రీస్తు తన విధేయత వలన ఆ బలులను కొట్టివేసి మనలను శుద్ధి చేసి మన పాపములను క్షమించును కావున ఇకను పాత నిబంధన బలులతో నేమియు పనిలేదు $10^{1-18}$.

IV. క్రీస్తు పూర్ణతనుబట్టి హెబ్రీయుల సభవారిని ప్రేరేపించుట $10^{9}-13^{17}$.

1. ఆయా నీతులు $10^{19}$ $12^{17}$.

(*a*) వారు స్థిరులై యుండవలెను $10^{19-23}$.

(*b*) ఆరాధనకు వచ్చుటనుగూర్చి నిర్లక్ష్యము చేయరాదు $10^{24,25}$.

(*c*) వెనుకబడుట భయంకరమైనది గాన అట్లు చేయకూడదు $10^{26-31}$.

(*d*) వారి మొదటి స్థిరతను జ్ఞప్తిచేసి విశ్వాసమును వదలక పాత నిబంధన భక్తులవలెనే అంతమువఱకు స్థిరముగా నుండవలెనని చాల గంభీరముగా ప్రేరేపించుట $10^{32}-11^{40}$.

(*e*) ఓపిక గలవారమై తుదమట్టుకు నిలువవలెను $12^{1-13}$.

(i) ఇట్లు చేయుటకు క్రీస్తు మాదిరి మనలను రేపును $12^{1-4}$.

(ii) శ్రమలవలన కలుగు మేలులు మనలను రేపును $12^{5-13}$.

(*f*) సమాధానము శుద్ధిని అనుసరించువారై ఇప్పటి మేలుకొఱకు రాబోవు సౌఖ్యమును పోగొట్టుకొనకూడదు $12^{14-17}$.

2. మనము క్రొత్త నిబంధన గొప్ప వాక్కులను పొందినవారమగుటచే ఇట్టి స్థిరతను క్రైస్తవ నూతన నడతను అవలంబించవలెను $12^{18-29}$.